# విషయానుక్రమణిక

## జనవరి 1972

# స్వ వి ష య ము

"భారతి"కి 49 వ సంవత్సరము ఆరంభమైనది. నాలుగు దశాబ్దములు పైగా నిరాఘాటముగా సాహిత్యసేవ చేయగలిగినందుకు "భారతి" గర్విస్తున్నది. ఆనందిస్తున్నది. ఇక ముందుకూడా ఇతోధికముగా సాహిత్యసేవ చేయగలనను దృఢనిశ్చయముతోను. దృఢసంకల్పముతోను వున్నది. ఆ సంకల్ప సాధనకు రచయితల సహకారము పూర్తిగా లభించగలదని ఆశిస్తున్నది. సహకరించిన వారందరికి కృతజ్ఞత తెలుపుతున్నది.

# జ్యోతిర్గీతం

శ్రీ వక్కలంక వెంకట కృష్ణారావు

దీపాలు
సజీవదీపాలు,
అధోతలంనుంచి
వియద్వలయంవరకు
పొంగుతూ పొరలుతూ
అలలమిలమిలలతో
మిలమిలల అలలతో
ఉవ్వెత్తుగా ఉప్పొంగుతూ
దీపాల మహాసముద్రం;
దీపాలు
హసిస్తాయి చరిస్తాయి
మనోహరంగా మెరుస్తాయి
నర్తిస్తాయి జ్వలిస్తాయి
ఆర్ద్రతతో చలిస్తాయి
సంధ్యారాగ నివీతం
ఒంటినిండా కప్పుకొని
కాలపరివాదినిమీద
భావశారికతో
కాంతిగీతాలు
గాంధర్వరాగాలు
మనోజ్ఞంగా వాయిస్తాయి
విశ్వవేదికమీద
వినయంగా కూర్చొని:

పాషాణాభ్యంతరాలని ఛేదిస్తూ
ఊహాక్షీరపారావారవేలాశార్కరం
ఉపరితలాన్ని చుంబిస్తూ
మృదువుగా తేలివస్తాయి
దీపాల గళాలలో నుంచి
వెలుగులు విరియబూసే అమరగీతాలు
ప్రాచ్యంనుంచి ప్రతీచినుంచి
ఊర్ధ్వంనుంచి ఉదీచినుంచి
అధరంనుంచి అవాచినుంచి
అఖిల దిక్కుల నుంచి
దీపాల మృదుమధుర కంఠస్వనాలు
ప్రతిధ్వనిస్తూ ప్రజ్వరిల్లుతూ,
ఇలాతలంమీాద
వలాహకాలని
సంజీవ సుధారసాలు
సౌందర్య ధారలు
సంతతమూ వర్షించాలని,
హిమాంశువుని
అమర తరు సుమాల
పరిమళాల వుప్పొదులు
నిరంతరం
విరివిగా వెదజల్లాలని
సౌమ్యంగా శాశిస్తూ.

అప్పుడు
అవనిని
అన్నివైపులనుండి
ఆక్రమించ యత్నిస్తూన్న
వ్యోమధూమాల
కరాళదీర్ఘవక్రకకరశాఖలు

## జ్యోతిర్గీతం

ఖండఖండాలుగా తెగిపోతాయి
శూన్యంలోకి రాలిపోతాయి,
నిర్వీర్యంగా పాలిపోతాయి
నీలిమబ్బులు;
ఆ పవిత్రక్షణంలో
ఉర్వి ఒంటినిండా
అణువణువునా పెనవేసుకొంటాయి
అగణిత శతసహస్ర విద్యుద్వలయాలు
అఖండదీప్తిదీధితులను ప్రసరిస్తూ
అద్భుతవేగంతో పరిభ్రమిస్తూ :

ఆ దివ్యోద్ధర్ష సుముహూర్తంలో
అనిదంపూర్వస్వప్నసమూహాలు
శరన్నీరంజనైందవదుకూలాలు ధరించి
కనుల ఎదుట కదలాడుతాయి
కమనీయస్వనాలతో కలకల నవ్వుతాయి,
ఉత్కర్షానుతర్షవిహంగాలు
పుడమి ముంగిట వాలుతాయి
దుమ్మని ధూళిని
రెక్కల విసురులతో అణచివేస్తూ
కలధ్వనులు చేస్తూ,
సురభేరీ నినాదాలు
నలుదెసలా మారుమ్రోగుతాయి
నక్తంచరులని నిర్మూలంగా నశింపజేస్తాయి.

ఆ పవిత్రసమయంలో
పాలాశాంకురాల శిరాలపై విరుస్తాయి
వసివాడని
కల్పతరుకుసుమకిరీటాలు
పాలాశాంకురాల ఎదలలో వెలుస్తాయి
కామధేను క్షీర స్వర్ణ కలశాలు
అవి

కింశుకాలకి సౌరభాలు చేరుస్తాయి
చాంపేయాలకి సౌందర్యాలు కూరుస్తాయి,
అనంగగంగాంతరంగసంగీతతరంగాలలోనుంచి
నక్షత్రాల నందివర్ధనాలు
స్వర్గహిమాంబుపరిమళాలు కురుస్తాయి
శ్మశానాలని మరుభూములని
చైత్రరథాలుగా మారుస్తాయి
అప్పుడు
విషకీటకాలు
భీకరమృగాలు
తిరిగి రాలేని చీకటి లోకంలోకి
పారిపోతాయి.

ఆ మహోద్భవ దివసాన
శిశువసుమతి
విశ్వమాత ఒడిలో
అవకుంఠిత తమోఽవగుంఠనాలని భేదించుకొని
అప్పుడే జనించిన
పసిపాపలాగ
చిర్నగవులు
చిందిస్తుంది;
అది పరికించి
హర్షాతిరేకంలో
వర్షిస్తాయి
దీపాల నయనాల
దివ్యకిరణాశ్రువులు,
ఆనందంతో
ఆశీర్వదిస్తాయి
అఖిలధాత్రిని
అమృతదీపాలు
అనవరతము జ్వలిస్తూ
అనఘముగా హసిస్తూ.

# రాయలసీమ జానపద సంస్కృతి :
# చౌడమ్మ పాటలు

డా. తంగిరాల వేంకటసుబ్బారావు

'చౌడమ్మ' లేక చౌడేశ్వరి' రాయలసీమలో 'తొగట వీర క్షత్రియు' లనఁబడు వారిచే గొలువబడుచున్న శక్తి. 'చండి, చాముండి, చౌడేశ్వరి, త్రిపురసుందరి, భగళాముఖి, దుర్గేశ్వరి, మహిషాసుర మర్దని, చాముండేశ్వరి' – మున్నగు నామము లన్నియు నీమెకు వర్తించును.

**చౌడమ్మ పుట్టుక :**

రాక్షసులను సంహరించుటకై ఆదిశక్తి యోగ మాయచే విష్ణ్వంశమున మహిషాసురునకుఁ గుమార్తెగా జన్మించినది. పితృగండమున నుద్భవించుటచే నామె నొక శిలామందసమున బంధించి భూస్థాపితము చేసిరి. శివుఁడు త్రిపురాసుర సంహారముచేయఁగా, రాక్షసులు విజృంభించి శివునిఁ జీకాకుపఱిచిరి. ఆ యుద్ధమున మిక్కిలి యలసిపోయిన శివుఁడు, ఆదిశక్తి భూస్థాపితము చేయఁబడిన ప్రదేశమునకువచ్చి, తన నుదుటిచెమటను వ్రేలితో నూడ్చి యచట విదిపెను. అప్పుడా చెమటబిందువులచే శిలామందసము బద్దలై, యందుండి ఘోరభీకరస్వరూపంబున శ్రీ వీర చౌడేశ్వరి యుద్భవించెను. శివుఁ డామెను రాక్షససంహారిణి యగుఁ దన పుత్రికగా నెంచి, యామెకు ఖడ్గ డమరుక భిండివాల చక్ర త్రిశూల పాశంబు మొదలుగాఁ గల యాయుధముల నొసఁగి, యాశీర్వదించెను.

**తొగటవీరుల జననము :**

అటనుండి వీరచౌడేశ్వరి తనకొఱకుఁ దపస్సు చేయుచున్న పుష్పాండజుని కడకువచ్చి యతనికిఁ బ్రత్యక్షమయ్యెను. అతఁడు పుత్రులను వేఁడఁగా నొక యగ్ని



'చౌడమ్మ'

(కాటనుపేట—బెంగుళూరు)

కుండమును నిర్మించి, యందు వేయుమని కొన్ని యక్షత లిచ్చెను. పుష్పాండజుఁ డట్లుచేయఁగా, నా యగ్నికుండమునుండి మున్నూటయఱువది యేకాంగ వీరు లుద్భవించిరి. వీరే తొగటవీరులు. చౌడేశ్వరి యా వీరులను దనవెంటఁ దీసికొని, రాక్షసుల పై దండెత్తి, యంధకాసుర మహిషాసురులను సంహరించి, దేవతల బాధలను బాపెను. పిమ్మట చౌడేశ్వరి పుష్పాండజుని పుత్రులైన మున్నూటయఱువది యేకాంగ వీరులకును దేవకన్యలనిచ్చి వివాహముచేసి, వారి కనేక సంపదలను బిరుదులను నిచ్చెను. ఎల్లవేళల వారి

కోర్కెలను దీర్చుటకై శ్రీ వీరచౌడేశ్వరీ నామంబున వారి కులదేవతగానుండి, యాచంద్రార్కము రక్షింతు నని వారికి వరమొసఁగి, యదృశ్యయై కాశీపురంబును జేరెను. అంతట తొగటవీరులు చౌడమ్మ నారాధించుచు సకల శుభంబు లనుభవించుచుండిరి.

**చౌడమ్మ రాయలసీమకు వచ్చుట :**

కాశీక్షేత్రమున వెలసియున్న యీ చౌడేశ్వరి రాయలసీమకు వచ్చుటను దెలుపు చక్కని కథయొకటి గలదు. దీనిని 'పెదరాయ భూపతి పాట' అందురు. కాశిలోని బ్రాహ్మణులచే చౌడేశ్వరి కర్నూలు మండలములోని నందవరమునకుఁ గొనితేఁబడినది. ఆ నందవరమును బాలించురాజు దాని నా కాశీబ్రాహ్మణులకు దానముచేసెను. అప్పటినుండియు నా బ్రాహ్మణులు 'నందవరీక బ్రాహ్మణు'లైరి. ఈ కథను రాయలసీమ గ్రామ వృద్ధులీ క్రిందివిధముగా వివరింతురు :—

'భూలోకమునఁ బుణ్యక్షేత్రములగు నహోబిల క్షేత్రమునకును, శ్రీశైల క్షేత్రమున కాదర్శమై వెలయు మహానందిక్షేత్రమునకును సమీపంబున నందివర్ధన పురంబను పట్టణంబును (నందవరమును) చంద్రవంశీయులగు నందివర్ధనుఁడును, నతని పుత్రుండగు నుత్తుంగభుజుండును రాజ్యపాలన మొనర్చిరి. వీరిలో నుత్తుంగభుజుండు సంతానములేక, యనేక పుణ్యక్షేత్రములు సేవించి, యా దేవతల యనుగ్రహమువలన నొక పుత్రుని బడసెను. అతఁడే 'నందభూపాలుఁడు'. ఆ బాలుఁడు దిన దిన ప్రవర్ధమానుఁడై సకల విద్యలునేర్చి, శౌర్య ధైర్య గాంభీర్య పరాక్రమ ధీరుఁడై, నందవరపట్టణంబును రాజధానిగాఁ జేసికొని, సత్యశీలుండై; ప్రజలనెల్ల కన్న బిడ్డల చందంబునఁ బోషింపుచు రాజ్యపాలన చేయుచుండెను.

ఇట్లుండఁ గొన్నిదినంబులకు నందభూపాలుండు రాజాస్థానములోనున్న సమయంబున నీశ్వరాంశ సంభూతుండైన యొక సిద్ధుండు సభా మధ్యంబునకువచ్చి, నందభూపాలుని ధర్మపాలనంబున కెంతయు మెచ్చి, యా భూపాలుని సత్యశీలత కెంతయు సంతసించి, యాతనిచే సేవలంది యుత్సాహుఁడై తనయొద్దఁగల యోగాతీతమాహాత్మ్యముగల పావుకోళ్లను బహూకరించి, 'వీనిమహిమచే నీవు పరోపకారమైన దైవారాధన కార్యము సాధించగలవు. దానిచే నీకీర్తి నలుదిశలు వ్యాపించి ప్రకాశించును. కాన నీవీ పాదుకలను ధరించి, పరమేశ్వరునిధ్యానించి, నీవెం దేఁగ వలయునని తలంచెదవో యందేఁగ ప్రార్థించిన క్షణమాత్రంబునఁ జేరగల'వని యీరహస్యము నుపదేశించి యరిగెను. అంత నందభూపాలుం డుత్సాహభరితుఁడై, వానిని బరీక్షించి యథార్థమును దెలిసికొని, యానందభరితుఁడై తన కులదైవమగు కాశీనాథుని నిత్యారాధనజేయ, నాటినుండి వేకువఝామున, నెవ్వరికిని దెలియకుండఁ, బాదుకల మహిమచేఁ గాశీపురంబుజేరి, గంగానదిలో స్నానమాడి, విశ్వేశ్వరుని సేవించి, తెల్లవారునంతలో మరల నందవరముఁజేరి, యథాప్రకారము రాజ్యపాలన మొనరించుచు నిత్యారాధనలు సలుపుచుండెను.

ఇట్లు నందభూపాలుడు ప్రజల నేలుచుఁ, దన సతీమణియగు సునందనయం దమిత ప్రేమానుబంధుఁడై యామె కోర్కెలఁ దీర్చుచుఁ, దన యభీష్టముల నెఱవేర్చుకొనుచుండెను. కాని సునందనాదేవి తన భర్త వేకువజామున, గనపడకుండుట కెంతయు యోచించెను. ఆమె కతఁ డెందుఁబోగలఁడో ప్రయత్నించి కనుగొనవలయుననెడి కుతూహలము కలిగెను. ఈ ప్రకార మాదేవి శ్రమపడుచుండ, దైవవశమున నొకదినము భర్తలేచిపోవు సమయమును గనుగొని, యాతఁడెట కేఁగునదియుఁ దెలిసికొని, తానుగూడ కాశీవిశ్వేశ్వరుని జూడవత్తునని భర్త ననేక విధముల ప్రార్థించెను. భూపాలుఁడు భార్యావ్యామోహంబున నివారింపలేక వెంటనిడుకొని కాశికిఁ బోయెను. అచ్చట నా దంపతులు గంగానదియందు స్నానమాచరించి, నారికేళ నీరాజనంబులతో నీశ్వరు నారాధించి, కొంత విశ్రాంతిఁజెంది, ప్రయాణమగునంతలో నామె బహిష్ఠయ్యెను. ఆ సమాచార మెఱుఁగక భూపాలుఁడు పావుకోళ్లను సమీపించి, తన పురంబుఁజేరఁ బ్రార్థింపఁగా నవియేమియుఁ జేయఁజాలక మిన్నకుండెను. ఇట్లగుటకుఁ గారణమేమాయని విచారించుచుండ

సునందనాదేవి తన పరిస్థితిని దెలియజేసెను. రాజు చేయునదిలేక తెల్లవారునంతలోఁ దన పురంబుఁజేరు పెట్లాయని యాలోచించుచుండెను. ఇంతలో శ్రీ చౌడేశ్వరి ఆరాధనాతత్పరులైన బ్రాహ్మణులచటికేతెంచి, ఆ రాజన్యునిచే సమాచారమంతయు నెఱిఁగి, దయాదరణ హృదయులై రాజునుజూచి యీ విధముగ నుడివిరి. 'ఈమె రజస్వలదోషమునుబాపి, మఱునాడరుణోదయంబునకుఁ బూర్వమే మీ యిరువురిని మీ గ్రామంబునకుఁ జేర్చెదము గాన మాకేమి బహూకరించెద'వని ప్రశ్నించిరి. అంత నందనచక్రవర్తి సంతసించి, మీ కృపచే నటులొనరించిన నా రాజ్యమునం దర్ధరాజ్యమిచ్చెదను; లేక మీ రేమి యడిగిన దాని నెఱవేర్తునని యొప్పుకొనెను. అందులకు బ్రాహ్మణులు చౌడేశ్వరిని సాక్షిగానుంచి, రాణిని బవిత్రురాలిగా నొనర్చి, సతిపతిసహితముగా నందవరపట్టణంబుఁ జేర్చి, వారి నివాసంబునకుం బోయిరి.

ఇట్లుండఁ గొంతకాలంబునకుఁ గాశియందు క్షామ మేతెంచెను. అంత నా బ్రాహ్మణులు సేయునది లేక, యెటుపోయి జీవించుటకుఁ దోఁచక, చింతాక్రాంతులై యాలోచించుచుండిరి. ఇంతలో నందవరాధీశుఁడు జ్ఞప్తికి వచ్చెను. వెంటనే యా బ్రాహ్మణులు నందవరము సమీపించి, నందన చక్రవర్తిని దర్శించి, తాఁ జెప్పినరీతి 'మా యభీష్టము నెఱవేర్పు'మని యడిగిరి. అప్పుడా రాజేంద్రుఁడా బ్రాహ్మణులఁజూచి. 'నన్నిటఁ జేర్చినవారు మీరగుదురో కారో నే నమ్మఁజాల. మీ యీప్సితంబుల నెఱవేర్చు కొనఁదలఁచినచో మీ కులదేవతయగు శ్రీ చౌడేశ్వరీదేవిచే మీరు నాకు సహాయమొనరించినది నిక్కువమని చెప్పించిన, మీ యిష్టప్రకారము నెఱవేర్తు' ననియెను. అపుడు బ్రాహ్మణులు చేయునదిలేక, వారణాసికేఁగి, యాదేవి ననేకవిధంబుల స్తోత్రముచేసి, సమాచార మెఱింగించిరి. భక్తాభీష్టప్రదాయినియగు చౌడేశ్వరి వారి మనోరథము నీడేర్ప వారితో నిట్లనియెను: 'మీరీ బిల్వవృక్షంబువెంట నిడుకొని ముం దరుగుచుండుఁడు. నే నదృశ్యరూపిణినై మీ వెనువెంటనే వచ్చుచుందును. రాజు సన్నిధికేఁగు వఱకును మీరు వెనుదిరిగి చూడకుఁడు. ఒకవేళ మీరటు చూచిన నేనందే నిచిలిపోవుదును. తరువాత మీరెంత వేఁడినను బ్రయోజన ముండ'దనిచెప్పి, వారిని బ్రయాణ మొనరించి, తాను వారివెన్నంటి వచ్చుచుండెను. ఇట్లా బ్రాహ్మణులు నందవరము సమీపించి, వెనుకశబ్దము లేకుండుటచే సందేహమున నొకఁడు వెనుదిరిగి చూచెను. వెంటనే జగదీశ్వరి బ్రహ్మాండ మదరునట్లు ధ్వనింపఁజేసి, ప్రతిమయై శిలాకారమున నచట నిలిచెను. అ సంగతి భూపాలుఁడెఱింగి, యనేక వాద్యంబులచే నాదేవిని సమీపించి, యనేక విధంబుల నారాధించి, బ్రాహ్మణుల కొనియాడెను. అంత బ్రాహ్మణులు దేవి సాక్ష్యమీయకున్నచో బ్రయత్నమంతయు వ్యర్థమగునని నిరుత్సాహులైయుండ, శ్రీవీరచౌడేశ్వరీదేవి భక్తుల నుద్దేశించి: నేని నందవరమున స్థిర నివాసముఁజేసి, భక్తశిఖామణులైన తొగటవీరక్షత్రియుల కులదేవతనై, వారి జ్యోతి హోమగుండారాధనలు గైకొని, వారిని రక్షింపవలయును. మీరును నా భక్తులై నందనచక్రవర్తి యొసంగు నగ్రహారములు గైకొని నన్నుఁ బూజించుచు, నందవరీకులను నామంబున నెలయుఁడని దీవించెను. అంత నందనచక్రవర్తి దేవి యానతి చొప్పున బ్రాహ్మణుల కగ్రహారంబు లొసంగి, నందవరము నా దేవి కర్పించి, నంద్యాల యను పట్టణంబు నిర్మించుకొని, రాజధాని నందుంచి, రాజ్యపాలన మొనర్చుచు, శ్రీ వీర చౌడేశ్వరి నారాధించుచు, నామె భక్తుఁడై యనలేని కీర్తి గడించెను.'[1]

(రాయల యష్టదిగ్గజములలోఁ బ్రసిద్ధికెక్కిన అల్లసాని పెద్దనామాత్యుఁడు నందవరీక బ్రాహ్మణుఁడే; రాయలసీమవాసియే. ఇతని మనుచరిత్రములో ప్రవరాఖ్యుని పాదలేపన వృత్తాంతమునకుఁ,

---

1. చూ. 'శ్రీ చౌడేశ్వరీ పూజావిధానము' అను గ్రంథమునకు శ్రీ లక్ష్మీనాథరాజుగారు రచించిన 'తొగట వీరక్షత్రియుల చరిత్రము' అను పీఠిక, పుటలు xxxii—xxxvi.

పైన దెల్పిన 'నందభూపాలునికథ'లోని పావుకోళ్ల మహిమ పోషకమైయుండునని నా యభిప్రాయము. ఈ రెండు సంఘటనలకును మిక్కిలి సాన్నిహిత్య ముండుట గమనింపఁదగ్గది. పెద్దన నందవరీక బ్రాహ్మణుఁడగుటచే నందభూపాలుని కథలోని వృత్తాంతమును దన ప్రబంధప్రారంభమున భక్తిశ్రద్ధలతోఁ బ్రవేశపెట్టి, యతిలోకసుందరముగాఁ జిత్రించి. యభిమాన పురస్సరముగాఁ దీర్చిదిద్దినాఁడు.)

**చౌడమ్మ జాతర :**

రాయలసీమలో నీ చౌడమ్మ ప్రధానాలయము నేఁటికిని కర్నూలు మండలమున నందవరగ్రామమునఁ (నంద్యాలకు దగ్గఱలోఁ) గలదు. ఇచ్చట ప్రతిసంవత్సరమును కార్తికమాసమునఁ, గడ సోమవారము నాఁడు చౌడమ్మ జాతర బ్రహ్మాండముగా జరుగును. ఈ జాతరలోఁ దొగటవీరులు చౌడమ్మ పాటలు పాడుచు, నెత్తిపై జ్యోతులనుబెట్టుకొని, వీరావేశమున నృత్యము చెయుదురు. అగ్నికుండమున నడచెదరు.

కడప మండలమున పులివెందల తాలూకా 'బొజ్జాయిపల్లె'యను గ్రామములోను, అనంతపుర మండలమున 'పెద్దకోట్ల' గ్రామములోను, ఇతర గ్రామములందును చౌడమ్మగుడులు కలవు.[2] చౌడమ్మ జాతర అన్నిచోట్లను కార్తికమాసమునఁ గడ సోమవారము నాఁడు జరుగుచుండఁగా, నొక్క బొజ్జాయి పల్లెలోమాత్రము చైత్ర వైశాఖమాసములలో జరుగు చున్నది. ఈ బొజ్జాయిపల్లెలో జరుగు చౌడమ్మ జాతరనుగుఱించి, యా గ్రామవాసులును, నా ప్రియ మిత్రులునునగు శ్రీ దుంపా రామిరెడ్డిగారు పెక్కు సంగతులను దెల్పిరి. అవి ఆంధ్రుల యమూల్య జానపద సంస్కృతికిఁజెందిన విషయములగుటచే, వాని నీ క్రిఁద పొందుపఱచుచున్నాను.

**జ్యోతిని తయారుచేయుట :**

(మద్రాసు శేరుతో) అయిదుశేర్ల బియ్యము మెత్తగాఁ బిండికొట్టి, జల్లించి, బెల్లముతోఁ బాకము గట్టి. ముద్దగాఁ జేయుదురు. ఆ ముద్దను నాలుగు పలకలుగాఁ గుదురు కట్టెదరు. ఈ కుదురు $1\frac{1}{2}$ అడుగు ఎత్తుండును. క్రింద వెడల్పు 11 అంగుళములుండఁగా, పైనవెడల్పు 8 అంగుళములు మాత్ర ముండును. కాగితములతోఁ డెక్కెములు తయారు చేసి, యా కుదురునకు గ్రుచ్చెదరు. ఊలు, నక్కి (ముత్య బంగారము) మున్నగు వానితోఁగూడ నీ కుదురు నలంకరింతురు. ఒక యడుగు పొడవు ఇనుపకడ్డికి గుడ్డచుట్టి, వత్తిగాఁజేసి, యా కుదురుమధ్య గ్రుచ్చెదరు. కుదురులో నేయి పోయుదురు.

జ్యోతిని తయారుచేసిన ప్రదేశములో మఱల దాని నార్పుటకు వీలులేదు. అందుచే దీనిని గుడిలోఁ జేయరు. అట్లు చేసినచో దీనిని మరల గుడిలో నార్పుట కవకాశముండదు. గుడిలోఁజేసిన జ్యోతిని చౌడమ్మ వేపచెట్టు దగ్గఱ నార్పవలసి వచ్చును. అప్పుడు గుడెదగ్గఱ జరుగవలసిన వేడుకకు భంగము కలుగును. కావున గుడిలో జ్యోతిని చేయరు. వేఱుగా నొక యింటిలోఁ జేయుదురు. అట్లు చేసిన దానిని గుడిదగ్గఱ నార్పుట కభ్యంతరముండదు.

జ్యోతిని తయారుచేయునప్పుడు రెడ్డి (గ్రామ మునసబు) కరణము రావలెను. ఈ కరణము నందవరీక బ్రాహ్మణుఁడు. బొజ్జాయిపల్లెలో నందవరీక బ్రాహ్మణులు లేరు. ప్రక్కనున్న 'బలపనూరు' గ్రామమునుండి యీ కరణము వచ్చును. ఊరి పొలిమేర వఱకును నెదురువెళ్లి, యీ కరణమును గడు భక్తితోఁ దప్పెట్లను మ్రోగించుచు నాహ్వానింతురు.

**'బలి' :**

ఇంటిలో జ్యోతిని తయారుచేయుట పూర్తి కాఁగానే, దానిని వెలిగించి,గడప యీవలకుఁ దీసికొనివచ్చి దించెదరు. అప్పుడు జ్యోతికి బలినిత్తురు. ఈ బలి నిచ్చుటలోఁగూడ ప్రత్యేకపద్ధతి కలదు. బలిని (మేక పిల్లను) నేలపై నఱుకరు; భుజముపైఁ బెట్టు

2. బెంగుళూరులోఁగూడ చౌడమ్మ గుడులు మూఁడున్నవి—ఎవెన్యూరోడ్డు, కాటనుపేట, శ్రీరామపురము.

కొ నఱకెదరు. ముందరికాళ్లు ముందఱకును, వెనుకకాళ్లు వెనుకకును నుండునట్లుగా బలి నొక వ్యక్తి తన యెడమభుజముపై వేసికొని, యెడమ చేతితో మెడను వెనుకకు విఱిచి పట్టుకొని, కుడి చేతితో దానికుత్తుక నుత్తరించును. కాఱెడి రక్తము నన్నముంచిన యొక చేటలోనికిఁ బట్టుదురు. (ఈ రక్తము సుమారు పదిగజముల వఱకును జిమ్మును).

ఈ బలినిచ్చునప్పుడు సందవరీక బ్రాహ్మణుఁ డెదురుగనే యుండవలెను. పిమ్మట నా జ్యోతిని గుడి దగ్గఱకుఁ దీసికొనిపోయి, నెత్తి కెత్తుకొందురు. దారి పొడుగునను జ్యోతికి బలులిచ్చుచునే యుందురు.

**ఊరేఁగింపు** :

జ్యోతి నెత్తికొనిన తొగట వీరుని చుట్టును దాళములు వాయించువారు గుండ్రముగాఁ బరివేష్టించి యుందురు. వీరు చౌడమ్మపాటలు పాడుచు, నడుగు వేయుదురు. ఈ పాటలలోఁ గేవలము తాళములు మాత్రమే యుపయోగింపఁ బడును. ఇతర వాద్యము లేవియు నుండవు. ఉత్సవమునకు ముందుభాగమున దూరముగా వివిధవాద్యము లుండవచ్చును.

జ్యోతిని నెత్తికెత్తుకొను వ్యక్తి గొప్పనృత్యము చేయఁగల సమర్థుఁడై యుండవలెను. నెత్తిపైనున్న జ్యో చెంపపైకి, చెంపపైనుండి భుజముపైకి, భుజముపైనుండి మఱల దానిని శిరసుపైకి మార్చుచుఁ, గన్నుల పండువుగా నృత్యము చేయు చుండును. ఈ జ్యోతిర్నృత్యము చేయుటకుఁ జాల కాలము శిక్షణ పొందెదరు. మట్టితోఁజేసిన జ్యోతితో నీ శిక్షణకాలమున నృత్యము నభ్యసింతురు.

జ్యోతిని బుట్టలోఁ బెట్టుకొని నర్తకుఁడు ముందున కేఁగుచుండఁగా, దాని వెనుక 'బండారు తట్ట' (పసుపు కుంకుమలు కలిపి ఉంచిన తట్ట), గొడుగులు, 'బోనం కడవ' వెడలును.

**'బోనం కడవ'** :

రెండుశేర్ల బియ్యము, ఒక శేరు పెసలు కలిపి, యొక కడవలోఁబోసి వండెదరు. ఆ కడవను నెత్తి కెత్తుకొని, జ్యోతివెంబడి నూరేఁగి, జ్యోతి గుడి దగ్గఱ నార్పివేయఁబడిన తరువాత నీ ప్రసాదమును బంచెదరు. అంతవఱకును దీనిని దాకరు.

**'నడ్డిసేవ': 'ఱొమ్ముసేవ'**

ఉపవాసముచేసి, జ్యోతితోఁబాటుగా నూరేఁగెడి తొగటవీరులు చౌడమ్మను స్తుతించుచు, వీరావేశముతో నర్తించుచుఁ, బెద్దపెద్ద కత్తులతోఁ దమ తమ నడుములు చీలుకొందురు. నడుమునుండి రక్తముకాఱి, కాలిగుండా ప్రవహించి నేలపైఁ బడును. దీనిని 'నడ్డిసేవ' అందురు. 'జాండ్లవారు'[3] అనెడి మఱియొక తెగకుఁజెందిన చౌడమ్మ భక్తులు పిడిబాకులతో ఱొమ్ములపై చీలుకొందురు. దీనిని 'ఱొమ్ము సేవ' అందురు. ఈ రెండు విధముల సేవలకును గలిపి 'ఖడ్గసేవ' యనిపేరు. ఇట్టి ఖడ్గ సేవ చేయుచుఁ జదివెడి పద్యములకు 'ఖడ్గపద్యము' లనిపేరు. (ఈ ఖడ్గసేవనే 'అలుగుసేవ' అనియుఁ బిలుతురు.)

ఈ విధముగా చౌడమ్మకు సేవలుచేసిన వీరులకు నడుములపైనను, ఱొమ్ములపైనను మచ్చ లుండును. వీనిని 'నఱుకుమచ్చలు' అందురు. ఈ నఱుకుమచ్చలున్న తొగట వీరులును జాండ్లవీరులును రాయలసీమ పల్లెలలో మనకు దఱచుఁ బ్రత్యక్షమగు చుందురు. చౌడమ్మ మహాశక్తి యనుటకును, తొగట వీరులు వీరాచారవంతులనుటకును నీ సేవలు ప్రబల తార్కాణములు. పల్నాటి వీరాచారమునఁ గూడ నిట్టి సేవలున్నవి.

**'నాజ్యము'** :

'జ్యో నెత్తుకొని యూరేఁగునప్పుడు తొగట రులు, గోతములు కుట్టు దబ్బనముతో, గోరిన క్తులకు బుగ్గలో రంధ్రము చేయుదురు. ఇట్లు తొగటవీరునిచే బుగలో రంధ్రము పొడిపించు కొనుటను 'నాజ్యము' అందురు. బుగ్గలో

3. 'తొగలు'—'జాండ్లు' : ఈ రెండు శాఖ లును బట్టలునేయు వృత్తిగలవారే!

నీ ప్రక్కనుండి యా ప్రక్కకు రంధ్రము చేసినను రక్తమురాదు; నొప్పి పెట్టదు. తొగట వీరుఁడు ముందు బుగ్గను గట్టిగా నలుపును. ఆ తరువాత దబ్బనము నోటిలోపలిభాగమునుండి (గుచ్చి), బుగ్గ గుండా బయటకులాగివేసి, యా రంధ్రమునకు బండారుతట్టలోనుండి పసుపుతీసి నొక్కివేయును. రంధ్రము కనఁబడదు; రక్తమురాదు. రాయలసీమ పల్లెలలో బాలబాలికలుకూడ నిర్భయముగా నీ నాజ్యమును వేయించుకొందురు. ఇవన్నియుఁ బ్రాచీనకాలము నుండియు భారతదేశమునఁగల శక్తిపూజలోని వీరాచారములు.

**'రతి' :**

జ్యోతినిచేయు గదిలో చౌడమ్మ యాకృతిలో నొక బొమ్మను వేయుదురు. ఈ బొమ్మకు 'రతి' యనిపేరు. ఈ రతిని వేయుటలో ముగ్గుపొడి, పసుపు కుంకుమ ఉపయోగింతురు. ఈ రతిదగ్గఱ నిమ్మకాయలు కోసి వప్పులువేయుదురు. టెంకాయలు కొట్టెదరు. జ్యోతి నెత్తుకొనివెళ్లినతరువాత నా గది తలుపులు మూసివేయుదురు. జ్యోతి యూరేగింపు ముగిసి, గుడిలో దాని నార్పునంతవఱకును నా గది తలుపులు తీయరాదు; అందెవ్వరును బ్రవేశింపరాదు. గుడిలో జ్యోతి నార్పినతరువాత, తిరిగివచ్చి, యా గది తలుపులు తెఱచి, రతిని చెఱిపివేయుదురు.

రాత్రి పండ్రెండుగంటలప్రాంతములో చౌడమ్మ గుడిదగ్గర జ్యోతి నెత్తుకొనుట జరుగును. (ఈ గుడి బొజ్జాయిపల్లె కుత్తరముగా నున్నది.) జ్యోతితో నాట్యముచేయుచుఁ, బాటలుపాడుచుఁ, దూర్పుదిశగా వంద గజములువచ్చి, యక్కడనుండి దక్షిణదిశగా 400 గజములు వెళ్లెదరు. ఆ ప్రదేశమున నొక వేపచెట్టున్నది. దీనిని 'చౌడమ్మ వేపచెట్టు'అని పిలుతురు. ఆ వేపచెట్టుకడ జ్యోతిని దించెదరు. (అక్కడతప్ప మార్గమధ్యమున మఱెచ్చటను జ్యోతిని దింపరాదు.) ఈ వేపచెట్టుదగ్గఱ చౌడమ్మ పాటలు పాడి, ఖడ్గపద్యములు[4] చదివి, తిరిగి జ్యోతి నెత్తుకొని యూరేగుచు గుడికి వత్తురు. ఇట్లు జ్యోతి, నిర్ణీతప్రదేశమందూరేగి, గుడిదగ్గఱకు వచ్చుసరికి ఉదయము 7 గంటలగును. ఈ గుడిదగ్గఱ జ్యోతి నార్పివేయుదురు.

గుడిలో జ్యోతి నార్పినతరువాత, జ్యోతి చేయబడిన పిండిని, టెంకాయవప్పును ముందుగా నందవరీక బ్రాహ్మణుఁడగు కరణమున కిత్తురు. తరువాత రెడ్డికిచ్చెదరు. పిమ్మట నక్కడున్నవారికిఁ బంచెదరు. ఆటనుండి బయలుదేరి యింటింటికినిబోయి, ప్రసాదమిచ్చి, బహుమానము తీసికొందురు. ప్రఖ్యాతములైన కొన్ని కుటుంబములకు—అనఁగా మాన్యకాపుల వంటివారికి జ్యోతిపిండి, టెంకాయవప్పు నిచ్చెదరు. మిగిలినవారికి వట్టి పిండిమాత్రమే యిత్తురు. ఈ మాన్యకాపులు దేవికి టెంకాయ కొట్టినచో రెండు వప్పులను నిచ్చివేయుదురు. తక్కినవా రెవరైనను టెంకాయ కొట్టినచో నొక్క చెక్కను మాత్రమే యిత్తురు. ఈ మాన్యకాపులు గ్రామమును నిర్మించిన కాపులఁట. వీరికి మాన్యము చేలుండును. వీనికి పన్నుతక్కువ. ఊరిలో జరగెడి యుత్సవాది కార్యములలో నీ మాన్యకాపులకు బాధ్యత లెక్కువ.

ఇట్లు చౌడమ్మ జాతరలో నొక జ్యోతి నెత్తవలె నన్నచో సుమారు రెండువందల రూపాయలకు పైగా ఖర్చగును. బొజ్జాయపల్లెలో నిట్టి జ్యోతి నొక్కటిమాత్రమే యెత్తెదరు. నందవరమున జరగెడి చౌడమ్మ జాతరలో మూఁడు నాలుగు జ్యోతుల నెత్తెదరు !

**'హోమగుండ జ్యోతి' :**

చౌడమ్మ జాతరలో తొగటవీరులు చండ్రనిప్పులపైఁ జిందులు ద్రొక్కుటకూడఁ గలదు. ఇట్లు

---

4. ఇవి ఛందోబద్ధమైన పద్యములుకావు. ఎక్కువభాగము లయాత్మకవచనముగా సాగిన స్తోత్రములు మంత్రములు, పాటలు. శిథిలములైన సీసపద్యములును గొన్ని కలవు.

నిప్పులగుండములో నడచునప్పుడు నెత్తిపైఁ బెట్టు కొను జ్యోతిని 'హోమగుండజ్యోతి' అందురు. పెద్ద గుండము త్రవ్వి, యందు నిప్పులు రగుల్కొల్పి జ్యోతిని ధరించిన తొగటవీరు లా నిప్పులపై నడచెదరు. వారివెనుక ప్రజలు నడతురు. ఈ యగ్నికుండము మూఁడడుగుల వెడల్పు, పదునైదడుగుల పొడవు, నాలు గడుగుల లోతు నుండును. పొడవులో గుండమున కటు నిటు తావలు (మెట్లు) ఉండును. పదునైదడు గుల పొడవులో నీమెట్లుపోగా తొమ్మిది యడుగుల అగ్నియుండును. ఎక్కడ జ్యోతివీరుని యడుగులు పడునో యక్కడ ముందుగాఁ బేరిననేతిని వేసెదరు. ఆ తరువాత పెరుగుపోసెదరు. జ్యోతిని నెత్తిపైఁ బెట్టుకొనిన తొగటవీరుఁ డాయా తావులయం దడు గులు వేయుచు ముందునకు వెడలును. ప్రజ లాతని ననుసరింతురు. జాతర రోజునకుముందు రాత్రి 8 గంటల నుండి తెల్లవారు వఱకును రెండుబండ్ల కట్టెలను గాల్చెదరు. ఉదయము తొమ్మిది లేక పది గంటల సమయములో గుండములో నడచెదరు.

**'స్వరశాస్త్రము':**

జాతరలోఁ గొందఱు భక్తులకు చౌడమ్మ పూనును. వారా పూనకములో జ్యోతిషమును జెప్పు దురు. ముఖ్యముగా నా సంవత్సరమునఁ గురియఁ బోవు వర్షపాతమునుగూర్చి చెప్పుదురు. ఇట్లు భావి కాలమునుగూర్చి చెప్పుటను 'స్వరశాస్త్రము'[5] అందురు.

**చౌడమ్మ మహిమలు:**

చౌడమ్మ గొప్పమహిమగల శక్తిగా రాయల సీమలోఁ గొలువఁబడుచున్నది. అనంతపుర మండ లములోని 'పెదకోట్ల' గ్రామములో నీ చౌడమ్మ యనేకాద్భుత కార్యములను జేసిన దేవతగా ప్రజలు కథలు చెప్పుకొందురు. ఒకప్పుడొక పగడాలసెట్టి యా గ్రామ మునకు వచ్చెను. పగడము లమ్ముకొనుచుండెను. మట్టమధ్యాహ్నవేళ నాతని దగ్గఱకొక పండ్రెండేండ్ల బాలికవచ్చి, పది రూపాయల పగడములుకొని, 'నేను ఈ యూరి రెడ్డి బిడ్డను; దుడ్లు (డబ్బు) మా నాయన నడిగి తీసికొనుము!' అని పగడాలసెట్టితో జెప్పి వెడలిపోయినది. ఆ సెట్టి కొంతసేపయిన తరువాత రెడ్డి యింటికివెళ్ళి డబ్బు నడుగఁగా, రెడ్డి కసలు బిడ్డలులేరని తేలినది. రెడ్డి భార్య వెంటనే చౌడమ్మ గుడికేఁగి చూడఁగా నాదేవి మెడలోఁ బగడాల హారమున్నదఁట! శక్తిమాహాత్మ్యమున కచ్చెరువంది, రెడ్డి యా సెట్టికిఁ బదిరూపాయల నీయబోయెను. సెట్టివలదని, ప్రతిసంవత్సరమును చౌడమ్మ వేడుక నాఁడు తానాదేవికొక పగడాలహారమును సమర్పించు కొందుననియు, నందుల కనుమతి నీయుమనియు రెడ్డిని గోరెను. రెడ్డి యంగీకరించెను. ఈ సంఘటన జరిగి రెండుమూఁడు తరములకన్న నెక్కువకాలేదు. అప్పటి నుండి యిప్పటివఱకును నా సెట్టివంశస్థు లేటేట పగడాలహారమును చౌడమ్మకు బహూకరించుచునే యున్నారు.

**పాటలు - పద్యములు:**

చౌడమ్మపైఁ బాటలు పద్యములు తరతరము లుగా రాయలసీమలోఁ దొగటవీరులచేఁ బాడఁబడు చున్నవి. చౌడమ్మ పుట్టుక, తొగటవీరుల పుట్టుక, మహిషాసురవధ, కాశీక్షేత్రమునుండి చౌడమ్మ నంద వరమునకువచ్చిన కథ (పెద్దరాయభూపతిపాట) మున్న గునవన్నియు నీ పాటలలోఁ గలవు. ఈ పాటలలో

---

5. ఈ పేరెట్లు వచ్చినదో తెలియకున్నది. క్రీ. శ. పదునాల్గవ శతాబ్ది ప్రారంభముననున్న గణపనారాధ్యుఁడనుకవి 'స్వరశాస్త్రము' అను మంజరీ ద్విపద కావ్యమును రచించెను. ఇది కేవలము వేదాంత గ్రంథము. దీనిలో భావికాలమునుగూర్చి తెలిసికొనుట వంటి వేవియును లేవు. కాని 14 వ శతాబ్ది మధ్య భాగముననున్న గోనయామాత్యకవి రచించిన 'సస్యా నందము' మాత్రము చౌడమ్మ భక్తులు చెప్పు స్వరశాస్త్రమువలెనే యున్నది. అందుపంటలు పండు టనుగూర్చి, వర్షపాతమునుగూర్చి ముందుగాఁ దెలిసి కొనుట యెట్లో వివరింపఁబడినది. ఈ సస్యానంద మంతయు జానపదులనుగూర్చి వ్రాయఁబడినట్టిదే.

నెక్కువభాగము గుఱ్ఱము సర్వయ్యయను కవిచే రచింపఁబడినవని తెలియుచున్నది. ఇతఁడు ప్రాచీనుఁడుగఁ దోఁచుచున్నాఁడు.

చౌడమ్మ పాటలు కొన్ని ముద్రింపఁబడినవి. రాయలసీమ జనపదములలో నాకు రెండు ముద్రిత గ్రంథములు లభించినవి : (1) శ్రీ చౌడేశ్వరీ పూజా విధానము. (2) శ్రీ చౌడేశ్వరి పాటలు—పద్యములు. ఇందు మొదటిది మిక్కిలి ప్రాచీనమైన ప్రతి. దీనిలో 116 పాటలు, 55 ఖడ్గపద్యములు, చౌడమ్మ దండకములు, చౌడేశ్వరి అష్టోత్తరశతనామావళి, అగ్నిగుండ పూజావిధానము, చౌడేశ్వరి పూజామంత్రములు, మంగళహారతులు, దానపత్రము, స్వరశాస్త్రము—మున్నగునవి కలవు. ఇందలి పాటలలో శుద్ధగేయములు—కథాగేయములు — రెండును గలవు. 'ఖడ్గపద్యము' అనునవి నిజమునకు స్వచ్ఛమైన పద్యములు కావు. ఇందెక్కువభాగము లయాత్మక వచనములుగా సాగిన స్తోత్రములు, మంత్రములు, పాటలు మాత్రమే. కొన్ని ఖడ్గపద్యములు జానపదుల నోళ్లలో శిథిలములైన సీసపద్యములుగాఁ గానవచ్చుచున్నవి. ఉదాహరణమున కీ గ్రంథములోని పదియవఖడ్గ పద్యమిట్లు సాగినది :

'జాలువాబంగారు సరిగెచీరెయు ధరించి
కుంకుమా గంధంబు పొంకపరచి
వరుసగంటలనూలు వడ్డాణ మమరించి
ప్రమజుల కమ్మలే పదిలపరచి
ఆణిముత్యమపేరు అందముగా దాల్చి
సొగసైన వజ్రాంగి జోడు తొడగి
గుండు మల్లెలదండ పొసగకొప్పున వుంచి
పాలుపైన బండారు బొట్టుబెట్టి
అభయ అ(హ)స్తంబు కరుణ కటాక్షమమర
వెలసితివి గదమ్మ భక్తులపాలికొమ్మా
నందవరమందు నెలకొన్న నైకదాంబ
సరస సద్గుణ నికురాంబ శ్రీవీరచౌడమాంబా॥'6

తొగటవీరులు చౌడమ్మయెదుట ఖడ్గముతో ఱొమ్ము నడుము చీల్చుకొనుచుఁ జదివెడి పద్యములు కావున వీనికి 'ఖడ్గపద్యము'లని పేరువచ్చినది. ఈ గ్రంథమున నాద్యంతములలోఁ గొన్ని పుటలు చినిగి పోవుటచే రచయిత, ప్రకాశకులు, ప్రకటన సంవత్సరము—మున్నగు వివరములు తెలియుటలేదు. కాని మూఁడవ ప్రకరణము చివర నిది 'శ్రీ సింధురాజు లక్ష్మీనాథరాజు'గారిచే 'లిఖింపబడిన'దని యున్నది.6-A.

'శ్రీ చౌడేశ్వరి పాటలు — పద్యములు' అను రెండవ పుస్తకము మొదటిదానికి సంక్షిప్త రచనము. 'శ్రీ చౌడేశ్వరీ పూజా విధానము'లోని కొన్ని పాటల నెన్నుకొని యిందు ముద్రించిరి. ఇది 1959 లోఁ బ్రకటింపఁబడినది. ప్రకాశకుఁడు: పప్పూరు చిన్న చౌడప్ప, సింహాద్రిపురము, పులివెందలతాలూకా. కడప మండలము. 'శ్రీ పుష్పాండజాముని తపోబలముచే జన్మించిన మున్నూటరువది వీరుల సంప్రదాయకులగు శ్రీ నిత్యానంద భక్తాగ్రేసరుడగు గుఱ్ఱము సర్వయచే రచింపబడిన శ్రీ చౌడేశ్వరీ ఆనందపాటలు, పద్యములు' అని యీ గ్రంథ ముఖపత్రమున నుండుటచే, మొదటి గ్రంథకర్తకూడ గుఱ్ఱము సర్వయయేయని యూహింపనగును. 'తిరువెంగళప్పయ్య'వంటి యితర కవుల పేర్లుకూడ కొన్నిపాటల చివర కాన్పించుచున్నవి. [సశేషం]

---

6. శ్రీ చౌడేశ్వరీ పూజా విధానము, పుటలు 159 - 160.

6—A. 'శ్రీ సింధురాజ లక్ష్మీనాథరాజుగారిచే లిఖింపబడిన శ్రీ చౌడేశ్వరీ పూజా విధానమునందు ప్రథమ, ద్వితీయ, తృతీయ ప్రకరణములు సమాప్తము. ఓం శాంతిః'—పుట 222.

# ప్రబంధ పరమేశుఁడు - సూక్తి వైచిత్రి

శ్రీ నాగళ్ల గురుప్రసాదరావు

ఎఱ్ఱాప్రెగ్గడ నాచన సోమనాథుని మాదిరిగాఁ దిక్కన సోమయాజి మహాభారత రచనానంతరము తాను వనకావ్యములను రచించుచున్నట్లు చెప్పుకొనలేదు. అంతదూరము పోవుట యాయనకుఁ జేతనయినది గాదు. ప్రోలయవేమారెడ్డి యెఱ్ఱాప్రెగ్గడను 'సకల భాషా కవిత్వ విశారదుఁడవు, సాధుసమ్మతుఁడవు, నిత్యసౌమ్యమతివి, భవ్యుఁడ'వని పొగడెను. ఇట్టి వ్యక్తి కవిబ్రహ్మ సరసను గూర్చుండుట కారాటపడఁడని చెప్ప వచ్చును. ఎఱ్ఱన నన్నయ తిక్కనలను గురువులఁగా సంభావించినవాఁడు. 'నన్నయభట్ట తిక్కకవినాథులు చూపిన త్రోవ పావనం' బని ముమ్మాటికి నమ్మిన వాఁడు. వా రీతని పాలిటికి 'అబ్జాసన కల్పులు.' 'భాసుర భారతార్థముల భంగుల నిక్కమెఱుంగ నేరమిన్, గాసటబీసటే చదివి గాథలు త్రవ్వ తెలుంగు వారికిన్, వ్యాసమునిప్రణీతపరమార్థము తేటతెల్లము సేసినట్టి'వారు.

నన్నయ తిక్కనల ప్రక్కనే యెఱ్ఱనను జేర్చు నాచారము ప్రాచీన కాలమునందే కలదు. ఖిలపురాణమనఁదగిన హరివంశమును నాచన సోమనాథుఁడును రచించెను. కాని కవిత్రయములో నతనికిఁ జోటు చూపు నౌదార్యము తెలుఁగువారికి లేకపోయినది. లేకపోవుట వింతగాదు. ప్రాచీనులు నన్నయను, తిక్కనను, ఎఱ్ఱనను కవిత్రయముగా గుర్తించుటకు హేతువు వారు మువ్వురును ఆంధ్రసంస్కృతికి ఆంధ్రకవితకు పుట్టకొట్టుగా నుండునట్లు భారతమును దెలిఁగించుటయే. మొన్న మొన్నటివాఁడయిన బహుజనపల్లి సీతారామాచార్యులు చిన్నయసూరి శిష్యుఁడు శబ్దరత్నాకరకర్త యిట్లు వ్రాసెను.

'ఈ భాష (ఆంధ్రభాష) ప్రయోగమే శరణముగాఁ గలది. ఆ ప్రయోగంబులకెల్లఁ గవిత్రయము వారి సమ్మతి యుండవలయును. వారు నన్నయభట్టు, తిక్కన సోమయాజి, ఎఱ్ఱాప్రెగ్గడ అను వీరు మువ్వురు. వీ రిప్పు డాంధ్రలక్ష్యములకెల్ల ముఖ్యముగా నుండు భారతమును తెనిఁగించినవారు. వ్యాకరణములయందుఁ గనఁబడని లక్షణంబు లందుఁ బెక్కులు గానఁబడుటంజేసి యది ముఖ్యలక్ష్య మగుటయేగాక లక్షణముగాను బరిగ్రహింపఁ బడుచున్నది.'

ఆచార్యులు సంప్రదాయమును లెస్సగా గుర్తించిరి.

నన్నయ తిక్కనలు పట్టినబాటనే పోయి, కవిత్రయములో నొకఁడయిన యెఱ్ఱాప్రెగ్గడ కవితాతత్త్వ మెట్టిది? 'ఈ త్రయి దాఁ బ్రబంధపరమేశ్వరుఁడై విరచించె శబ్దవైచిత్రి...'అని జక్కన యెఱ్ఱనను స్తుతించెను. శ్రీనాథుఁడు 'పరిఢవింతు ప్రబంధ పరమేశ్వరుని తేవ, సూక్తి వైచి[illegible] నొక్కొక్కమాటు' అని పేర్కొనెను. ఇందు 'సూక్తి వైచిత్రి' యనునది ముఖ్యము. శ్రీనాథునకు నెఱ్ఱాప్రెగ్గడ కవిత్వము 'సూక్తివైచిత్రి' మయముగాఁ గనఁబడినది. సూక్తి యనుదానిని 'సు+ఉక్తి' యని విడఁగొట్టవలయును. ఆ పద్యములోని యతినిబట్టి యిట్లు విడఁగొట్టుటయే సమంజసము. సూక్తి యనుదానికి మంచిమాట—హితోక్తి, నీతివాక్కు — అని యర్థము. దీనినిబట్టి యెఱ్ఱన కవిత్వములో హితోక్తుల వైచిత్రి యెక్కువయని చెప్పుకొనవలయునా? అట్లయినచో నాయన కవిత్వమును నీతికవిత్వము (Didactic Poetry) గనే లెక్కింపవలయును. ఆ విధముగా లెక్కించుట యెఱ్ఱన కవితాతత్త్వమును గుర్తింపక పోవుటయే. ఎఱ్ఱనకంటె నెన్నియో రెట్లెక్కువగా సోమయాజి మహాభారతమున నీతి కవిత్వము వ్రాసెను. మఱి శ్రీనాథుఁడే తిక్కన కవి

త్వము 'రసాభ్యుచితబంధ' మని సమ్మానించెను. కావున సూక్తికి నీతి వాక్యమను నర్థమును జెప్పికొనుట యిట కుదురదు. అయిన సూక్తియనఁగా నేమి ?

దీనికి సమాధానము ఎఱ్ఱనరచించిన 'లక్ష్మీనరసింహావతారము' నందుఁ గలదు. ఎఱ్ఱన పితామహుఁడు ఎఱపోతసూరి. ఆయన మనుమని 'భావంబున నావిర్భావంబు నొంది సదయానంద మధుర వాక్యంబుల' నిట్లనెను.

'ఉన్నత సంస్కృతాది చతురోక్తి
పథంబులఁ గావ్యకర్తనై
యెన్నికమైఁ ప్రబంధ పరమేశుఁ
డనంగ నరణ్యపర్వ శే
షోన్నయ మంధ్రభాష సుజ
నోత్సవ మొప్పఁగ నిర్వహించి తా
నన్నయభట్ట తిక్కకవినాథుల
కెక్కిన భక్తి పెంపునన్.'

ఈ పద్యమునందలి 'చతురోక్తి' జక్కన చెప్పిన శబ్దవైచిత్రి, శ్రీనాథుఁడుచెప్పిన 'సూక్తి' తుల్యములని నా యభిప్రాయము. చతురోక్తి భాషా ప్రయోగమునకు సంబంధించియుండును. భావానుభూతులను వెల్లడించునపుడు మేలిమాటలను వాడి యెఱ్ఱన తన కైవాడమును జూపును. ఒక్కొక్క కవి పలుకుబడి యొక్కొక్కతీరుగా నుండును. నన్నయ తిక్కనలు ఎఱ్ఱనకంటె ముందున్నవారు. శ్రీనాథుఁడు చెప్పినట్లు వారిలో నొకరి కవిత్వము 'ఉభయా వాక్ప్రౌఢి' కలది. మఱియొకరి కవిత్వము 'రసాభ్యుచిత బంధము'. ఇక నెఱ్ఱనకవిత్వ మందురా? అది శబ్దవైచిత్రి—సూక్తివైచిత్రి— చతురోక్తివైచిత్రి— కలది. ఎఱ్ఱనవాక్కు నన్నయ తిక్కనల పలుకుబడి కంటె వేఱుగా నుండును. ఎట్లు ?

ఎఱ్ఱాప్రెగ్గడ నన్నయ తిక్కనలపట్ల భక్తి గలవాఁడు. వారు చూపినత్రోవ పావనమని నమ్మిన వాఁడు. ఇట్టివాఁడైనను కవితాప్రపంచమున వారిని మక్కికి మక్కిగా ననుసరించినవాఁడు గాఁడు. ఆరణ్యపర్వశేషము నన్నయ తిక్కనల కవితాకళలకు సేతువు. ఆ పర్వమున వారుపోయిన త్రోవనే పోయెను ఇది నిజమే. మఱి యెఱ్ఱన యంతటితో నాఁగినవాఁడుగాఁడు. ఒకడుగు ముందునకు వెళ్లెను. ఈ వెళ్లుటకు ఆయన సూక్తివైచిత్రి కారణము. ఆ సూక్తి వైచిత్రినిగూర్చి వ్రాయుటకు ముందొకమాట చెప్పవలయును.

చదలువాడ మల్లన్న మాటలనుబట్టి యెఱ్ఱన్న ఆరణ్యపర్వము, రామాయణము, లక్ష్మీనరసింహావతారము హరివంశము గచించెనని తెలియుచున్నది. కవిసర్పగారుడమును ఎఱ్ఱన రచించెనని నమ్ముట చిమ్మచీకటిలోఁ దారాడుట. లక్ష్మీనరసింహావతారమున ఆరణ్యపర్వ రచనా ప్రస్తావన యున్నది. హరివంశమున రామాయణ ప్రస్తావన యున్నది. ఆరణ్యపర్వము, లక్ష్మీనరసింహావతారము—రామాయణము, హరివంశము ననువాని ముందువెనుకల విషయమునఁ బరిశోధకులలో నైక్యము లేదు. వారి చర్చల జోలికిఁ బోవుట యిప్పటి నా పనిగాదు. రామాయణము లభింపలేదు. అది కూచిమంచి తిమ్మకవి కాలమునాఁడుండి, తరువాత దెలుఁగువారి చేతికి నందకపోవుట కాలమహిమ గాకమఱేమి? ఆరణ్యపర్వశేషము తరువాత ఎఱ్ఱన లక్ష్మీనరసింహావతార హరివంశములను రచించెనను మాట నెవ్వరు కాదందురు? అది నాకుఁ జాలును

నన్నయ తిక్కనల భారత భాగములకు నడుమ నున్న స్వల్పభాగమును రచించుట కత్తిమీఁదిసాము. ఆ యిరువురు సామాన్యులుగారు. వారి భారత భాగములను జదివి, కవితారీతులను వశపఱుచుకొని యెఱ్ఱన ఆరణ్యపర్వ రచనమున కుపక్రమించెననియే చెప్పవలయును. అప్పటికే నన్నయ తిక్కనల తేజస్సు ఎఱ్ఱనలో నుదయించినది. కావుననే యారణ్యపర్వశేషరచనమున నన్నయగా బయలుదేరిన యెఱ్ఱన తుదకు తిక్కన సోమయాజి యయ్యెను. నన్నయ 'రచన యకా' నారణ్యపర్వశేషమును రచించితినని యెఱ్ఱాప్రెగ్గడ చెప్పుకొనినమాట ఆయన 'నిత్య సౌమ్యమతి'కి నుదాహరణము మాత్రమే. విమర్శకులు ఆరణ్యపర్వ కవితా పరిణామమును గుర్తించిరి. తార్కాణములు చూపిరి. ఇట్లు చెప్పుకొనవలయునే కాని, యొకానొక విమర్శకుఁడు రాద్ధాంతములు చేసినట్లుగా నన్నయయే యారణ్యపర్వమంతయు రచించెననియు, ఆ పర్వమునందలి గద్య పద్యములలో పదములు, సమాసములు లుప్తములుకాఁగా నెఱ్ఱన కేవ

లము వానిని జక్కఁజేసెననియు, నిదియే పూరీణ మనియు ననుకొనుట నేలవిడిచి సాము చేయుటయే. అక్షరములను నడుమ నడుమ మెత్తుటయే యెఱ్ఱన చేసిన పనియయినచో, అరణ్య పర్వమునందలి విభిన్న కవితారీతుల ముద్దులొలుకు కలయికకుఁ గారణ మేమి?

ఈ యారణ్య పర్వశేష పూరణము ఎఱ్ఱన కవితాసృష్టిలో నాదిమఘట్టము. దీని తరువాత లక్ష్మీనరసింహావతార హరివంశముల రచనము సాగినది. ఒకానొకకవి యెంతగా కొమ్ములు తిరిగినవాఁడైనప్పటికి, నతఁడు తనకంటె ముందున్న కవుల సాహిత్యమును కాదనలేఁడు. అట్లని యతఁడు పరసాహిత్యోపజీవియుఁ గాఁడు. తనకంటె ముందున్న కవులబాటలు తెలిసికొనిన ప్రతిభామూర్తి క్రొత్తత్రోవలు త్రొక్కును. మహాకవి శబ్దవాచ్యుఁ డగును. ఎఱ్ఱన్న యాకోవకుఁ జెందినవాఁడే. ఆరణ్యపర్వశేష పూరణము గావించుట కెఱ్ఱన ప్రబల హేతువులచే నన్నయ తిక్కనలబాటలు పట్టెను. తదనంతరసాహితీ సృష్టినాఁటికి నాయన తనబాటను దా నేర్పఱచుకొనెను. ఆ యేర్పఱుచుకొనుటలో నవతరించినదియే యాతని శబ్దవైచిత్రి—సూక్తి వైచిత్రి — చతురోక్తి. ఈ సూక్తి వైచిత్రి లక్ష్మీనరసింహావతార హరివంశములలో సమృద్ధిగాఁ గలదు. తార్కాణములు చిత్తగింపుఁడు.

లక్ష్మీనరసింహావతారమున హిరణ్యకశిపుని వర్ణనము కలదు, అది యిట్లుండును,

కనలు బింకపుఁ గింకఁ గలుగవేడిమి యెల్ల
నెక్కటియై యొడలెత్తె ననఁగఁ
గఱకుఁ బల్లదమునఁ గల్గుపోఁడిమియెల్ల
నచ్చమై తెగఁ బోడవయ్యె ననఁగఁ
గటికయై తనరారు గర్వంబునకుఁ గల
చేగ యెల్లను రూపుచెందె ననఁగ
వెగ్గలంబై పేర్చు వీరంబునకుఁ గల
పసికయెల్లను మేను వడసె ననఁగఁ
బ్రళయ కాలదహనుఁ బాటించు దొర యన
జండ దండధరుని సఖు డనంగఁ
దేజరిల్లె నైజ తీవ్రమానమున హి
రణ్యకశిపుఁ డపశరణ్య రిపుఁడు

(ఆశ్వా 2. పద్య 3.)

ఈ కావ్యముననే యెఱ్ఱన ప్రాతఃకాలవర్ణనము చేసెను. ఇట్టి పట్టులలోఁ బ్రత్యూషపవన సంచారము వర్ణించుట తప్పని విధి. ఎఱ్ఱన వేఁకువగాలి పోయిన పోకడల నిట్లు చూపెను.

వెడవెడ మూతులు విచ్చు తామరలపై
సుడిసి నెత్తావులు సూఱలాడి
యనుఁగుఁదోఁటలు సొచ్చి యలరుతేనియఁజేసి
యెలదోఁటి పదువులఁ జెలఁగి నడచి
రాయంచ కవల నిద్రలు దెల్పి కొలఁకులఁ
దరఁగయుయ్యెలయూటఁ దగులుపఱచి
సోర్ణగండులు సొచ్చి సురతఖేదమునందుఁ
జెలువల చెలువుల సేద దేర్చి
యడరి గృహపతాకికలకు నాట గఱపి
ప్రోదినెమళుల యెఱకల పొదులు విప్పి
మందసంచారముగ సుకుమార మగుచు
మెఱసెఁ బ్రత్యూష సమయ సమీరణంబు.

(ఆశ్వా 3. పద్య 111.)

ఈ పద్యములయందలి పలుకుబడి నన్నయ తిక్కనల వాగ్వైఖరివంటిదిగాదు. ఎఱ్ఱన తిక్కన వలెఁ దెలుఁగుమాటలు వాడుటకు గడుసరి. కాని యా మాటల కూర్పునేర్పు ఎఱ్ఱన సొంతము. ఇట్టి కూర్పు బిగువే శబ్దవైచిత్రి—సూక్తివైచిత్రి. భావములు వెల్లడించుతీరు, దానికిఁ దగిన మాటల కూర్పు నన్నయ తిక్కనల భావ ప్రకటనముకంటె, భాషా ప్రయోగముకంటె భిన్నములు. హిరణ్యకశిపుని వర్ణనములో నాతని తీవ్ర మనస్తత్త్వమును వెల్లడించు విధానము, తదనుగుణమయినరీతి యొకదాని నొకటి మించిపోవుచున్నవి. ప్రత్యూష వాయువర్ణనమున మాటలకూర్పుబిగి యెక్కువ. పై రెండు లక్షణములు హరివంశమునస్సైతము కలవు.

లలిత శృంగార వర్ణనము ఎఱ్ఱాప్రెగ్గడ సొత్తు. రుక్మిణీ శ్రీకృష్ణ శృంగారవర్ణనము దీనికిఁ బ్రథమోదాహరణము. ఇందు శారీరకచేష్టావర్ణనము లేదు. మేరమీఱిన కామవర్ణనములేదు. మఱి యున్నదంతయు ఆ యిరువురయొక్క ఆంతరజగద్విలాసము.

అనురాగంబులు ధన్యతన్ బొరయ,
నెయ్యంబుల్ ప్రియంబంద, నె

మ్మనముల్ కోర్కులు చూఱలాడి తనియన్,
మాధుర్యముల్ ధుర్యతం
గని జృంభింపఁగ,
సోయగంబులు సముత్కర్షంబు వాటింప, న
వ్వనజాక్షుండు విదర్భరాజ సుతయున్
వర్తిల్లి రిచ్ఛాగతిన్

రాగపల్లవముల రమ్యలై యితరేత
రాలోక లతలు పై నలమికొనఁగ
నిష్టార్థ రచనల యిక్కలై యన్యోన్య
సల్లాపములు సుధా స్యందములుగ
రోమాంచలీలల ప్రోవులై యొండొరు
వుల మూర్తు లాశ్లేషకలన సొగియఁ
గామ్య పూరమ్ముల కళికలై సరిఁ బర
స్పర చేష్ట లానంద పదవి గొనఁగఁ

గ్రమ పరిపాక భరమునఁ గలసి మెలసి
మనసు లొండొంటి మమతల మరగి కరఁగ
సతియుఁ బతియును బొలివోని సౌఖ్యలహరిఁ
జిక్కి రనుభావ మాత్మవిచిత్రగతుల

(హరివంశము, ఉత్తరభాగము. అశ్వా 3. పద్య 173, 175.)

ఈ పద్యములలో ఆలంకారికరీతి మిన్నుముట్టి నది. ఇట్టిరీతి నన్నయ తిక్కనల కావ్యకళలోఁ బ్రధానముగాదు. ఎఱ్ఱన తిక్కన మన్నించిన భావకళ ననుసరించినవాఁడైనను భాషాప్రయోగమున సొంతత్రోవ తీసినవాఁడేయని చెప్పక తప్పదు.

ఎఱపోతసూరి చెప్పిన చతురోక్తియే జక్కన శబ్దవైచిత్రి శ్రీనాథుని సూక్తివైచిత్రియని చెప్పితిని. ఇది యాయనకు ఆజానజముగా నబ్బిన కవితా సంస్కారము. ఆరణ్యపర్వములో ఈ చతురోక్తి నన్నయ తిక్కనల కవితారీతులను మేళవింపఁజేయుటలోఁ బర్యవసించినది. తదనంతర రచనలలో ఈ సూక్తివైచిత్రి ప్రబంధకవితామార్గమునకు నాంది పలికినది. నూతన కవితాకళ నావిష్కరింపఁజేసిన భాషాప్రయోగ సౌందర్యమే యీ సూక్తివైచిత్రి. ఎఱ్ఱన కావ్యములలో నాంధ్రకవితాభాష మఱొక మలుపు దిరిగినది. నన్నయది సంస్కృతికరీతి. తిక్కనది తెలుఁగు పలుకుబడి. ఆ రెండింటి లోగుట్టును గనుఁగొని తనదయిన నుడికారమును సృష్టించినవాఁ డెఱ్ఱన. అదియే శ్రీనాథునకు సూక్తివైచిత్రిగాఁ గనఁబడినది.

ఎఱ్ఱపోతసూరి యెఱ్ఱన్నతో 'ప్రబంధ పరమేశుఁడనంగ నరణ్యపర్వశేషోన్నయ మంత్రభాష సుజనోత్సవ మొప్పఁగ నిర్వహించి'తని పలికెనుగదా! లక్ష్మీనరసింహావతార పీఠికలోఁ బ్రబంధశబ్దము నాలుగు చోట్ల నున్నది. తాత మనుమని బుజముతట్టిన పట్టున ప్రబంధశబ్దము కలదు. పై నుదాహరించిన తావుననే కాక 'ప్రబంధరచనా ప్రావీణ్యము నీకు సహజ పరిణతి సిద్ధంబై వెలసినది' యని సూరి యెఱ్ఱనతోఁ జెప్పినచోట సైతము ప్రబంధశబ్దము కలదు. మఱి యెఱ్ఱన్నయు 'అస్మదీయ ప్రబంధ సామగ్రి వలన' ననియు, 'అమ్మహాప్రబంధంబునకు నస్మత్పితామహ హృదయ గుహా విహార మహాసింహం బగు శ్రీసుదహోబల నరసింహదేవుం డధీశ్వరుండు' అనియుఁ జెప్పును. ఈ నాలుగుచోట్లఁ బ్రబంధశబ్దమునకు నొకయర్థమే యున్నదని నికరముగాఁ జెప్పుట దుస్సాధము. ప్రకరణములు వేఱగుటయే దీనికిఁ గారణము.

సంస్కృత సాహిత్యమునఁ బ్రబంధశబ్దము కేవల కావ్యవాచిమాత్రమే. కాళిదాసు మాళవికాగ్నిమిత్రములో 'ప్రథితయశసాం భాససౌమిల్ల కవి పుత్రాదీనాం ప్రబంధాన్ అతిక్రమ్య వర్తమానకవేః కాళిదాసస్య కృతౌ కథం పరిషదో బహుమాన' యని యన్నప్పుడు ప్రబంధశబ్దమునకుఁ గావ్యమనియే యర్థము. ప్రాచీనాంధ్రకవులు ప్రబంధ శబ్దమును గావ్యపర్యాయముగా నెంచిరి. తిక్కన 'ప్రబంధమండలి' యనుట మనము మఱవరాదు. కావ్యాలంకారచూడామణి కర్త 'ముక్తకాది స్ఫుటతరచాటు ప్రబంధముల లక్షణముల్' 'ఉదాహరణ మను ప్రబంధము' అని యన్నపుడుగూడఁ బ్రబంధ శబ్దమునకుఁ గావ్యమనియే యర్థము. కేతన, శ్రీనాథుఁడు ప్రబంధ మనఁగాఁ గావ్యమనియే యనుకొనిరి.

ఇది యిట్లుండఁగా విమర్శకులు 'ప్రబంధము' నొక సాహిత్య ప్రక్రియా విశేషముగా సంభావించి తల్లక్షణములను వివరించిరి. ప్రత్యేక సాహితీ ప్రక్రియయయిన ప్రబంధము లక్షణములేవి? 'కాలక్రమేణా ప్రబంధం ఒక ప్రత్యేక ప్రక్రియగా పరిగణింపబడ్డది. అయినప్పటికీ దీనికి సాకల్యంగా లక్షణంచెప్పిన లాక్షణికుడే లేడు. దానిస్వరూపం సంపూర్ణంగా తెలుసుకోవాలి

అంటే ప్రబంధనామంతో వెలువడ్డ గ్రంథాలన్నిటినీ సమగ్రంగా పరిశీలించి, వాటిలోఉన్న సామాన్యలక్షణా లన్నింటిని సమగ్రంగా క్రోడీకరించాలి: అలా క్రోడీకరిస్తే తేలే లక్షణసారం ఈ విధంగా ఉంటుంది' అన్న పింగళి లక్ష్మీకాంతముగారు 'ప్రబంధములలో శృంగార రసం ప్రధానం. తక్కిన రసాలు గౌణములు. ఏకనాయకాశ్రయత్వంతోపాటు వస్త్వైక్యంకూడా ఒక అపరిహార్యమయిన ధర్మం. మరి ఆ గ్రంథం అష్టాదశ వర్ణనాత్మకమై వుండాలి. ఆలంకారికమయిన శైలి దానికి జీవం. మరి అది భాషాంతరీకరణం కాకూడదు. స్వతంత్రరచనై ఉండాలి.'యని ప్రబంధలక్షణములను వివరించిరి. వారే 'ఈ లక్షణాలు కొన్ని ప్రబంధాలకు పట్టకపోవచ్చు. అయినప్పటికీ స్వతంత్ర రచనయై ఆలంకారికశైలిఉంటే, అది ప్రబంధశాఖలోనే చేర్చబడ్డది'యని యనిరి. సూర్యారాయాంధ్ర నిఘంటువు ప్రబంధశబ్దమునకు ప్రకృష్టబంధము, అవిచ్ఛేదము, గ్రంథరచన, కావ్యమునను నాలుగర్థము లిచ్చినది.

తన మనుమఁడు 'అరణ్యపర్వశేషాన్నయము' గావించి ప్రబంధపరమేశుఁడయ్యెనని యెఱపోతసూరి చెప్పెను. ఎఱ్ఱన్నయుఁ బ్రబంధశబ్దమును వాడెను. తాతగారు చెప్పిన 'ప్రబంధపరమేశుఁ'డనఁగా నర్థమేమి?మనుమఁడు వాడిన ప్రబంధశబ్దమున కర్థమేమి?

ఎఱ్ఱన్న ఆరణ్యపర్వశేషమును ప్రబంధ పరమేశుఁ డనునట్లు పూర్తిచేసెను. ప్రకృష్టమయిన బంధ ముండునట్లుగా దానిని రచించెనని యర్థము. నన్నయ 'ప్రసన్నకథా కలితార్థయుక్తి'కి; తిక్కన 'ఉభయకావ్యప్రౌఢిఁ బాటించు శిల్పము'నకు నడుమ బంధము లెస్సగా నుండున ట్లామహాకవి 'యరణ్యపర్వశేషాన్నయము' నిర్వహించెను. కావ్యము సైతము ప్రకృష్ట కథాబంధము కలిగియుండును గావునఁ బ్రబంధ పరమేశుఁ డనుదానియందలి ప్రబంధశబ్దమునకుఁ గేవలము కావ్యమనియే యర్థము. మఱి ప్రబంధపరమేశుఁ డననేమి? ఎఱ్ఱన కీబిరుదు భారత రచనమునుబట్టి వచ్చినది. పరమేశ పరమేశ్వర శబ్దములు తుల్యార్థములు. పరమేశ్వర శబ్దమునకు పరమబ్రహ్మము, శివుఁడు, విష్ణువు, చక్రవర్తి యను నర్థములు కలవు. శివకేశవార్థములమాట యటుండ నిండు. ప్రబంధపరమేశుఁ డన్నప్పుడు ప్రకృష్ట బంధముగల కావ్య నిర్మాణము గావించుటయందు దక్షుఁడని యర్థము: ఇప్పట్లఁ బ్రబంధపరమేశుఁ డను నది కవిచక్రవర్తి, కవిబ్రహ్మ మున్నగువానివంటిదగును. భారతరచనముచేసి యెఱ్ఱన యిట్టివాఁ డాయెను. 'ప్రబంధరచనా ప్రావీణ్యము నీకు సహజ పరిణతి సిద్ధంబై వెలసినది' యని యెఱ పోతసూరి యనె ననఁగా నెఱ్ఱన ప్రకృష్టబంధ ముండునట్లుగా భారతమును రచించి ఆ బంధమును సాధించునేర్పు పుట్టుకతో నబ్బినదే కాని ప్రయత్నప్రాప్తము కాదయ్యా! యని యనిపించుకొనె నన్నమాట.

ఇఁక నెఱ్ఱాప్రెగ్గడ తానై వాడిన ప్రబంధ శబ్దమునకుఁ బ్రత్యేక సాహితీ ప్రక్రియ యనునదే యర్థము. ఈ ప్రత్యేక సాహితీప్రక్రియకు నే కావ్యావతారికలో నెఱ్ఱన ప్రబంధశబ్దమును వాడెనో యా లక్ష్మీ నరసింహావతారమే ప్రథమోదాహరణము. దీనిలో వస్త్వైక్య మున్నది. ఏకనాయకాశ్రయత్వ మున్నది. అష్టాదశవర్ణనములలోఁ జాలవఱకు నున్నవి. ఎఱ్ఱన 'ప్రహ్లాదునికథను నిమిత్తమాత్రంగా తీసికొని, దానికి వర్ణనా ప్రాగల్భ్యాన్ని, భావనా చమత్కృతిని కలిగించి ఆ గ్రంథాన్ని సర్వాంగసుందరంగా, భావబంధురంగా మలచి పేరునకు పురాణమే యయినా వస్త్వైక్యం గల ప్రబంధంగానే సృష్టించాడు' అని లక్ష్మీకాంతము గారు చెప్పిరి.

ఎఱ్ఱాప్రెగ్గడ సాహితీవ్యాసంగమున స్పష్టముగా ద్వివిధ ఘట్టములు పొడగట్టుచున్నవి. మొదటి ఘట్టము భారతారణ్యపర్వరచనము. అం దాయన నన్నయ తిక్కనలతో తాదాత్మ్యమును భజించెను. ప్రబంధరపమేశుఁ డయ్యెను. ఇఁక ఆ తరువాతిది రెండవ ఘట్టము. ఇది లక్ష్మీనరసింహావతార రచనముతో మొదలయినది. ఇప్పటి నెఱ్ఱన 'వినయోదయ భరితుఁడవు' 'అతులానుభావభవ్యుఁడవు' అని యనిపించుకొనెను. క్రొత్తపుంత త్రొక్కెను. ఆ త్రొక్కిన దానికి గుర్తులే శ్రీనాథుఁడుచెప్పిన 'సూక్తివైచిత్రి', లక్ష్మీనరసింహావతారమువంటి ప్రబంధరచనయు. నన్నయ తిక్కనలకు దీటనిపించుకొని, ఆరణ్య పర్వశేషమును, ఖిలపురాణ మనఁదగిన హరివంశమును రచించి, లక్ష్మీనరసింహావతార ప్రబంధమును గూర్చిన యెఱ్ఱాప్రెగ్గడను దెలుఁగువారు కవిత్రయములోఁ జేర్చుట వింతయా? మహాకవి యనుట వింతయా?

# వేమనకు బౌణ్యము

## శ్రీ పులిచెర్ల సాంబశివరావు

ఆంధ్రదేశమున సి. పి. బ్రౌన్‌దొర పేరు నెఱుగని సాహితీపరు లుండరనుటలో నతిశయోక్తి లేదు. ఆంధ్ర సాహిత్యమున కాతడొనర్చిన సేవ యట్టిది. అతడు 'మూర్ఖాత్ముల లెక్కసేయక పేర్లం దిన విబుధవరుల బిలిపించుచు వే, మా ర్గార్ణమిచ్చు వితరణి' గదా !

ఇత డాంధ్రభాష కొనర్చిన సేవలలో వేమన పద్యముల నాంగ్లీకరించుట యొకటి. ఆంగ్లేయులకు తెలుగు కవనపు కమ్మదనమును చూపుట దీని ప్రధాన లక్ష్యముగా నేటి విమర్శకులు పలువు రెంచుచున్నారు. కాని బ్రౌన్ తన ఆంగ్లానువాద గ్రంథమునకు ముందు వ్రాసికొనిన 'ప్రిఫేస్ టు వేమన'లో తన యభిప్రాయ మును స్పష్టముగ జెప్పికొనినాడు. అది ఇది.

'It now remains to give some account of my author, VEMANA, whose writings are peculiarly useful to those who study the language, the style being simple, and the variety of topics very extensive.'

దీనినిబట్టి తన యనువాదము తెనుగుభాష నేర్వగోరు ఆంగ్లేతరుల కుద్దేశించినటుల స్పష్టము. అంతేకాని, వేమన మహాకవియని, అతని కవనపు సొంపు నితరులకు చూపవలయుననియు బ్రౌన్ అభిప్రాయము కాదు. బ్రౌన్ ఉద్దేశమున వేమన తెనుగు నాట ప్రసిద్ధికెక్కిన కవి. అంతే !

సంఘ సంస్కరణోద్దేశముతో నీతులను బోధించు వేమన పద్యములు, వేమన్నను మహాకవిని జేయలేవు. నీతులును, తత్త్వములును, చమత్కారములును కవిత్వములు గావుకదా ! ఈ విషయమున బ్రౌన్‌దొర అభిప్రాయము సమర్థనీయమే ! అయినను పెక్కురు ప్రసిద్ధ విమర్శకులు బ్రౌన్‌దొర నీ విషయమున దుయ్యబట్టినారు. ఉదాహరణమునకు రాళ్ల పల్లినారు తమ వేమన గ్రంథమున నిట్లు వ్రాసినారు.

'ఇతని పద్యముల నన్నిటిని బహు శ్రమచే సంపాదించి, తిద్దించి, వ్రాయించి, తానే యింగ్లీషున టీక వ్రాసి, ప్రకటించి, శాశ్వతకీర్తి సంపాదించిన బ్రౌన్‌దొరకూడ ఇతనిని కవి యనలేఁడయ్యెను.'

ఈ విషయమున 'నవ్యభావ ధురంధరు'డైన వీరేశలింగముపంతులుగారు కూడ బ్రౌన్‌దొరతో నేకీభవించుట గమనార్హము.

వేమన దేశకాలములగూర్చి బ్రౌన్‌గారి యభిప్రాయము లిట్లున్నవి.

'Of his history, little is known. He was not a Bramin but a Capoo; or farmer; a native of the Cuddapa district and born. I believe, in the neighbourhood of Gandicotta. He lived in the beginning of the eighteenth century. It is said that in verse 707 he has fixed the date of birth which is believed to have been his own. This date coincides with A. D. 1652. The date is given in the cycle of sixty years; but which cycle is intended is unknown. Many verses, however, prove satisfactorily that he wrote in the latter part of the seventeenth century when the Mohamedans were governers of that part of India.'

వేమన పద్యముల సేకరణలో బ్రౌన్‌దొరకు సాయపడినవి తొమ్మిది ప్రతులు. ఇవి బెళ్లారి, కడప, మదరాసు, విశాఖపట్టణము మున్నగు పట్టణముల నుండి సేకరింప బడినవి. ఇందు కొన్ని ప్రతులలో నేడునందలలోపు నంఖ్యగల పద్యములు మాత్రమే

యున్నవి. మొత్తముమీద 2,100 పద్యముల సేకరింప గలిగినాడు. ఆ ప్రతు లప్పటికి మిగుల శిథిలావస్థలో నున్నవి. ఛందస్సున కనుగుణముగ వ్రాయసగాళ్లు కొన్ని పదములను మార్చినారని బ్రౌన్‌దొర అభిప్రాయము. ఇట్లు మార్చుట బ్రౌన్‌దొర కిష్టము లేదని ఆయన స్వయముగా నొక ప్రతిపై వ్రాసికొనిన పద్యమునుబట్టి స్పష్టమగుచున్నదని రాళ్లపల్లివారు తమ వేమన గ్రంథమున నుదహరించినారు.

తప్పు గమనించి వ్రాయుటుత్తమము, లేక
ప్రతి సమానముగా వ్రాయుటతి ముదంబు;
రెండు విడనాడి వ్రాసెడి లేఖకుండు
గలుగు టరయంగఁ గవి యభాగ్యంబు గాదె!'

ఈ పద్యమును 'శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారు చెప్పినది' అని అధస్సూచికలో నిచ్చినారు.

'గృహము గూడుఁజేసి గుణము వత్తిఁగఁజేసి'
'గూబయెక్కినట్టి గృహము పాడుగఁజేసి'

అను నీ రెండు పద్యపాదములలోను యతి తప్పినది. కొందరు లేఖకులు 'గుఱ్ఱము' అని, దిద్దినారు. అప్పు డర్థము చెడుచున్నది. కాన బ్రౌన్‌దొర 'గురము' అని దిద్దినారు! గృహమునకు తద్భవము గురము అని బ్రౌన్ అభిప్రాయము. ఈ విషయమునే తన 'ముందుమాట'లో నిట్లు వక్కాణించినాడు.

'Vemana having written the TAD-BHAVA word GURAMU (for gruhamu) a house, the copyist in difiance of metre and meaning have gurramu, a horse.'

నిజమునకు వికృతి 'గీము'గదా!

దీనిపై రాళ్లపల్లివారిట్లు వ్యాఖ్యానించినారు.

'లేని తద్భవమును గల్పించి యంటఁగట్టుటకంటె యతియే కొంత దారితప్పినదనుకొన్న నష్టమేమి?'

వేమన పద్యముల నాంగ్లీకరించుటలో బ్రౌన్‌దొరకు తిప్పాభొట్ల వెంకటశివశాస్త్రి, అద్వైత బ్రహ్మయ్యలు మిగుల తోడ్పడిరి. వా రిరువురు మంచి పండితులు. తిప్పాభొట్లవారిది మచిలీపట్నము. బ్రహ్మయ్యగారు బ్రౌన్‌దొర అసిస్టెంటు జడ్జిగా మన్న కోర్టునందు పండితుడు. వీ రిరువురు బ్రౌన్ గారు తెనుగు నేర్చుకొనుటకు సాయపడిరి.

వీరు సేకరించిన పెక్కు పద్యములు వేమనవి కావు. ఈ విషయము నా పద్యములను జూచిన వారెవ్వరైనను జెప్పగలరు. ఉదాహరణమునకు—

ఒక్కడు రోగియాయె మరి
యొక్కడు దిక్కుల ద్యాగియాయె వే
రొక్కడు భోగియాయె నటు
యొక్కడు చక్కని యోగియాయె దా
నొక్కడు రాగి యాయె నిను
బోలు మహాత్మునిగాన మెచ్చటన్
నిక్కము ఇన్ని రూపములు
నీకును జెల్లును నన్న వేమనా.

అను పద్యమును జెప్పవచ్చును. ఇది వేమనది కాదని యెవరైనను నిస్సందేహముగ జెప్పవచ్చును.

'వేమన' అని పద్యములోనున్న చాలును, బ్రౌన్‌దొర తన సంకలన గ్రంథమున జేర్చికొనినాడు.

మరియొక పద్యము.

'గట్టిగ వార్గు రేడ్గురిని
కండలు కోసియు తెర్విలేమి నిం
గొట్టియు ముగ్గురిండ్లపుడె
గొల్వక ముక్తియు గల్గునేర్చునా
బొట్టున బోనముం భుజము
పొక్కులు బూడిదె పూత లూరకే
పెట్టుటగాక భూప్రజలకు
జేర్మని వేమనృపాలశేఖరా.'

ఇది వేమభూపాలుని గూర్చి చెప్పిన పద్యమేమో! ఇట్టి పద్యములు కోకొల్లలు.

వేమన పద్యములను మూడుగా బ్రౌన్‌దొర విభజించినాడు. నీతిపద్యములు, విమర్శనాత్మకములు, తత్త్వబోధతో గూడినవి అని విభజన జేసినాడు.

ఇక బ్రౌన్ అనువాద పద్ధతి పరిశీలింతము.

బ్రౌన్‌దొరది 'మక్కికి మక్కి' అనువాదపద్ధతి. ఇంగ్లీషు మడికారము నున్న.

ఇట్లనువాదము జేయుటలో నొక యుపయోగ

మున్నది. ఈ యనువాదము తెలుగు నేర్చుకొనగోరు ఆంగ్లేయులకొరకు వ్రాయబడినదగుటచే తెలుగు పదములకు సరియైన ఆంగ్లశబ్దము లుండుటయే మేలు! కవనపు సొంపులు జూపనెంచినచో వింతకంటె నందముగ దీర్చిదిద్దియుండెడివాడని తలంపవచ్చును.

మొత్తముమీద ఆంగ్లానువాదమేమియు బాగుండ లేదనియే చెప్పవలెను!

పైగా నెన్నియో తప్పులు!!

'రాజసమితికెల్ల రంపముల్ వైశ్యులు
జూదగాండ్ల కావి జూదగాండ్లు
యోచనను దెలియరు యురక నర్థాపేక్ష
విశ్వదాభిరామ వినురవేమ'

అను పద్యమున కిట్లు భాషాంతరీకరణ మొనర్చినాడు.

'The VA SHNAVITES are saws in the assem ly of ki gs (causing dissension). Th se are the chief gamblers of gamb ers. They know not counsel but are swift in their eagerness for wealth'

వైశ్యులకు వైష్ణవైట్స్ అని ఆంగ్లీకరించుట జూడ బ్రౌన్‌దొరపడిన పొరపాటు స్పష్టమగుచున్నది. వైష్ణవులకు వైశ్యులకునున్న భేదము బ్రౌన్‌దొరకు తెలియదని నావంటివారు జెప్పుట తెలుగువాట ప్రమాదకరము.

కోమటియనగా బ్రౌన్‌దొరకు తెలియును.

'తవుటి కరయబోవ తండులంబులగంప
శ్వాన మాక్రమించు సామ్యమునను
కోమటోని సొమ్ము క్రూరులపాలౌను
విశ్వదాభిరామ వినురవేమ'

అను పద్యము నిట్లు అనువదించినాడు.

'Like as a dog while hu ting for bran that falls in with a heap of rice seizes it thus; does the wealth of the merch int fall to the lot of the hard and the cruel.'

ఈ పద్యమునమున్న కోమటి శబ్దమును మర్చంట్‌గా వ్రాసి బ్రౌన్ కృతార్థుడైనాడు. కావున కోమటి, వైశ్య శబ్దములు విభిన్నార్థములుగల పదములని బ్రౌన్ అభిప్రాయ పడినటులున్నది.

పవేశ్యను' బ్రౌన్ 'యంగ్ డేన్సింగ్ గరల్' చేసినాడు.

తెలుగు భాషలోని భావప్రకటనావిధానము, తెనుగు నుడికారము బ్రౌన్‌దొర కవగతమైనట్లుగా గన్పట్టదు.

'విష్ణుభక్తులెల్ల వెలబూది పాలైరి
వాదమేల మత విభేదమేల
తెలియ లింగధరులు తిరుమంటిపాలైరి
విశ్వదాభిరామ వినురవేమ'

'All those who trust in Vishnu fall to the share of white earth; to what end are these disputes and sects (dissensions) in religion. The Lingadharies become the portion of earth.'

వెలబూది యనగా తెల్లని బూడిదయని, తిరుమన్ను అనగా మన్నుఅని బ్రౌన్ గ్రహింప గలిగినాడు. వెలబూది శైవమునకు తిరుమంటిచూర్ణము వైష్ణవమునకు గుర్తులని బ్రౌన్‌దొర తెలిసికొని యుండక పోవచ్చును. 'తిరుమంటి పాలైరి' అనగా వైష్ణవులైరి అని యర్థము. అనగా శైవులందరు వైష్ణవము బుచ్చుకొనిరనుట. ఇది తెలియక దొరగారు 'మట్టిలో భాగమయ్యిరి' అని ఆంగ్లీకరించుట హాస్యాస్పదముగ నున్నది.

'మిట్టిపడును'అను మాటకు ఎగసిపడునుఅని మాత్రమే యర్థమున్నది. బ్రౌన్ 'Puffed up in the earth' అని అనువదించినాడు. 'మట్టిపడుట' అని భ్రమించి యుండియుండును.

కొన్ని వేమన పద్యములను చక్కగా ననువదించినాడు.

కలియుగమును 'Iron age' అని చెప్పినాడు. ముండమోపిని 'షెవెన్ విడో' అని చమత్కరించినాడు.

ఒంటికి అనగా అల్పాచమనమున కని అర్థము. కాని బ్రౌన్ 'One thing' అని యనువదించినాడు. తెలుగు నుడికారము జాతీయములు తెలియకపోవుటచే బెక్కుదోషము లిట్లు చేసినాడు.

ఏది యెట్లున్నను బ్రౌన్‌దొర తెలుగు సాహిత్యమునకు చేసిన సేవను కొనియాడక తప్పదుగదా!

# పండితరాయల బుజ్జగింపులు

డా. మహీధర నళినీమోహన్

తోటనిండా ఆనపపాదులు. పచ్చటి పువ్వులు. వెన్నెల పరిచినట్లు దొడ్డి అంతా అలుముకుని ఉన్నాయి. ఒకవారగా మాలతీలత విరియబూచిఉంది. తెల్లటిపువ్వులు ఆకులనుకూడా మూసేస్తున్నాయి. వాటి గుబాళింపుకి చరాచరవిశ్వమంతా పులకరించి పోతోంది. ఒక గండుతుమ్మెద ఝుమ్మంటూ ఆ తోటఅంతా అలంగం తిరిగేస్తోంది. సొరపువ్వులమీద వాలి తేనె జుర్రుకుంటోంది. ఆ తుమ్మెద తన దగ్గరకి కూడా వస్తుందని ఆశపడింది మాలతి. తేటి దానిదగ్గరకు వచ్చినట్లేవచ్చి, చటుక్కున మలుపుతిరిగి, మాలతిని మూచూడనైనా చూడకుండా మరో అనప పువ్వుమీద వాలింది. దాని తరవాత మరో సొర పువ్వు. తరవాత మరోటి. అంతేకాని మాలతికేసి కన్నెత్తి చూడలేదు. మాలతికి ఉదుకుబోతుతనం వచ్చేసింది. నా పువ్వులు సొరపువ్వులపాటి చెయ్యక పోయాయా అని గుడ్లనీరు కుక్కుకుంది. రాత్రి కురిసిన మంచుబిందువులు మాలతీగుచ్ఛముల మీదినుంచి కన్నీళ్ళలా రాలి నేలని పడ్డాయి.

దాని మూగవేదన గ్రహించాడు, జగన్నాథ పండితరాయలు. దగ్గరగావచ్చి మాలతి శిరస్సున చెయ్యివేసి ప్రేమగా బుజ్జగింపుగా దువ్వేడు. అంత వరకూ ఆపుకుంటున్న దుఃఖం ఒక్కసారిగా పెల్లుబికి వచ్చేసింది. మాలతి బావురుమంది. మంచు జలజలా రాలింది.

'నేను ఆనపపువ్వులకన్న తీసిపోయానా?'

'అని ఎవరు అన్నారు?'

'అదిగో ఆ తుమ్మెద. ఇందాకటినుంచి చూస్తున్నాను. ఎంతసేపూ ఆ పచ్చపువ్వులని పట్టుకుని దేవుళ్లాడుతుందేకాని నావైపు ఒక్కసారి అంటే ఒక్కసారిఅయినా చూసిందా?'

'ఎంత పిచ్చిదానివి మాలతీ! ఈ పాటి దానికి కళ్లనీళ్లు పెట్టుకుంటున్నావా?'

'ఇది తక్కువ అవమానమా?'

'అవునుగానీ ఆ పొగరుతుమ్మెదకి ఎన్నికాళ్ళు?'

'దాని కాళ్లసంగతి ఎందుకు ఇప్పుడూ?'

'ఎందుకో చెప్తాగా.'

'ఆరు కాబోలు. అవును ఆరే. షట్పదిఅని పేరు కూడా పెట్టేరుగా.'

'పశువుకి ఎన్నికాళ్లు?'

'నాలుగు కదా!'

'అవునా మరి. నాలుగుకాళ్లుఉంటే పశువు అంటారు. ఆరుకాళ్లుఉన్న ఈ తుమ్మెద ఆ లెక్కని పశువున్నరకాదూ? దానికి బుద్ధి ఎక్కడఉంటుంది? బుద్ధిలేని పశువున్నర నీదగ్గరకు రావడంకన్న రాక పోతేనే నీకు మర్యాదకాదూ?'

**ఉపజాతి**

కిం మాలతి! మ్లాయసి మాం విహాయ
చుచుంబ తుంబీకుసుమం షడంఘ్రిః
లోకే చతుర్భిశ్చరణైః పశు స్యాత్
సషడ్భి రత్యర్థం పశు ర్నకింస్యాత్?

**ఆ**

మాలతి! ఏటికిన్ వికల
మానసవౌదు షడంఘ్రి నీపయిన్
వ్రాలగరాక చుంబన మొనర్చె నిసీ
సొరపూలనందువా?
నాలుగు పాదముల్ కలిగినన్
పశువందురు లోకులు—ఆరుపా

దాల విచిత్ర జంతువిది తథ్యముగా
పశువున్నరే కదా!

మాలతి పకపకా నవ్వింది.

'మీరు తెలుగువారా?'

పండితరాయలు తెల్లబోయాడు

'ఏమి అల్లా అడిగేవు?'

'పశువున్నర అనేది వెధవన్నరలాగ అచ్చంగా తెనుగు నుడికారం. దానిని తమరు అత్యర్ధ పశువు అని సంస్కృతీకరించారు. తెలుగురాని కేవల సంస్కృత కవి ఇటువంటి ప్రయోగం చెయ్యడు'

'తెలుగు నుడికారాన్ని ప్రయోగిస్తున్నానని నాకు తట్టనే లేదు సుమా! గడుసుదానివి' అని జగన్నాథుడు మాలతివీపు తట్టేడు.

పువ్వులు, నవ్వులు కలయబోసి విరచిమ్మింది మాలతి.

పండితరాయలకి పాతసంఘటన ఒకటి మనస్సులో మెదిలింది.

అది తంజాపుర సంస్థానం.

భరతముని అపరావతారం అనదగ్గ నాట్యశాస్త్ర పారంగతుడు ఒకడు తన ప్రజ్ఞని ప్రదర్శించాలని వచ్చాడు దూరదేశం నుంచి. అక్కడి రాజుకి అతడి పాండిత్యంతో పనిలేదు. అది సుతరామూ ఆ రాజుకి అర్థంకాదు. భోగంపడుచుల కొక్కిరాయి నృత్యాలుచూసి మురిసి వాళ్ళనే తలమీదపెట్టుకుంటున్నాడు. నాట్యాచార్యుడివంక కన్నెత్తి చూడడానికి కూడా దర్పం అడ్డువచ్చింది. ఈ అవమానం భరించలేక కుమిలిపోతూ అతడు తనగోడు జగన్నాథునిదగ్గర వెళ్ళబోశాడు. డోలువెళ్ళి మద్దెలతో చెప్పుకున్నట్లైంది. తనకి అంతకన్న గొప్పమర్యాద జరగలేదు

'ఈ ఊరిసంగతి నీకు తెలియదయ్యా! ఇక్కడి ధనవంతులకి గంజాయి, గర్వాంధ్యమూ తోడునీడలు. ఇక్కడ గుణవంతుడికి గురిగింజఎత్తు బంగారంఉంటే ఒట్టు. ఓ తంజాపురేశ్వరీ! నవకంజాయతాక్షి! కామేశ్వరీ! నువ్వు నిద్రపోతున్నావా? మేలుకుని ఉన్నావా? ఇంక సెలవు.'

**అశ్వధాటీ**

ఖంజాయి తోధిమతి
గంజా పరోపి బత
సంజాయ తేత్ర ధనదః
సంజాఘ టేతి గుణ
పుంజాయిత స్వ నతు
గుంజామితం చ కనకం
కింజాగతీ జయసి
కిం జానతీ స్వపిషి
శింజాననూపురపదే
తంజాపురేశి
నవకంజాక్షి
సాధు తదిదం
జాతు వా కిము శివే.

* * *

అంతలో ఎక్కడినుంచో ఎక్కిళ్ళు వినవచ్చాయి. జగన్నాథభట్టు గిరుక్కునతిరిగి చూశాడు. ఎవరో వెక్కి వెక్కి ఏడుస్తున్నారు. ఆ ధ్వని వినవస్తున్నవైపు వెళ్ళేడు. దూరాన సంపెంగపొద. అపూలవాసన అతడి ముక్కుకి త్రాడువేసి తనవైపు లాగేసింది. ఆ పొదవాలకంచూస్తే అవమాన ఖిన్నమై ఉన్నట్లు తోచింది. పరకాయించి చూశాడు. నిజమే. సంపెంగ ఏడుస్తోంది.

'ఏమైంది సంపెంగా! అల్లా విచారిస్తున్నావు?' సంపెంగ పువ్వులు తడిసిన కళ్ళతో అతడికేసి చూశాయి.

'మీరు ఆర్చేవారా? తీర్చేవారా?'

'సానుభూతితో ఆలకించేవాడిని'

'అయితే అటుచూడండి మీకే తెలుస్తుంది.'

పండితరాయలకి చుట్టుపక్కల ఉమ్మెత్తమొక్కలు కనిపించాయి, బాకాలవంటి నిర్గంధ కుసు

మాలతో. ఇక్కడ ధూర్తమండలితప్ప మరి ఏదీ కని పించడంలేదు సంపగీ!'

'బాగా శ్లేషించారు. వాటికి ఆపేరు అక్షరాలా నప్పుతుంది. ఆ పువ్వులతో సరాగాలాడుతున్నవారిని కూడా గమనించండి!'

తుమ్మెదలు ఉమ్మెత్త పువ్వులచుట్టూ తిరుగుతూ, కమ్మగా కూని దీర్ఘాలుతీస్తూ, వాటి లోపల దూరి తేనెకోసం వెతుకులాడుతున్నాయి.

పండితరాయలకి వ్యవహారం అంతా అర్థం అయిపోయింది. తుమ్మెదలకి సంపెంగ పొడకిట్టదు. 'బంగారంలాంటి నా రంగు, సర్వజనానందదాయక మైన నా వాసన తుమ్మెదముందు గుడ్డిగవ్వకి కొరగాక పోయాయికదా అని ఏడుస్తున్నావా?'

'ఏడవక మరి ఏం చెయ్యమంటారూ? ఈ పాడు ఉమ్మెత్త పువ్వులపాటి కాకపోయానా? ఈ మధుపానికి ఇంతలోకువ అయిపోయానా?'

'ఇంకేం మరీ? తుమ్మెద మధుపాయి అని నీవే ఒప్పుకుంటున్నావుకదా! తాగుబోతుకి మంచీ చెడ్డా ఏం తెలుస్తాయి?'

'ఓహో. మధుపశబ్దానికి తాగుబోతు అనే అర్థం తీస్తున్నారన్నమాట.'

**మాలిని**

సకల గుణనిధానం మాం విహాయ ద్విరేఫాః
పరిమళ పరిహీనం హంత చుంబంతి ధూర్తమ్
ఇతి మనసి విషాదం మాకృధా శ్చంపకోచ్చై
రిహమధుపసమాజే కో వివేకావకాశః

**ఉత్పలమాల**

కమ్మని తావిజిమ్మ నను
గాదని సౌరభ హీనమైన ధూ
ర్తమ్మును చేరగాజని, ప్ర
దక్షిణ పూర్వక చుంబనంబులన్
తుమ్మెద గారవించెనని
దుఃఖము మానుము చంపకంబ! యు
క్తమ్ము నయుక్తమున్ దెలియ
గల్గుదురే మధుపాయు లెయ్యెడన్.

నీ రూపమూ, నీ సౌరభమూ ఈ పాడు తుమ్మెదలకి అవసరం లేకపోతే పోనీ, విచారించకు. లోకంలో గుణాన్నిగ్రహించి మెచ్చుకునేవాళ్లే లేరా ? సంపంగీ !

**స్వాగత**

రూప సౌరభ సమృద్ధి సమేతమ్
చంపకం ప్రతి యయు ర్నమిళిందాః
కామినస్తు జగృహు స్త మశేషా
గ్రాహ కాహి గుణినాం కతి నస్యుః.

**స్వాగత**

వన్నె చిన్నె తులలేని సుగంధం
బున్న సంపగిని చేరమి తేటుల్
చిన్న బుచ్చుకొన నేల? గుణశ్రీ
నెన్నువార లిక నెందును లేరో ?

మలినమనస్కములైన ఈ మిళిందములు నిరాదరం చేస్తేమాత్రం నీకు లోటుఏమిటి సంపంగీ ! మెరుపు తీగెల్లాంటి అందగత్తెల కారుమబ్బులలాంటి తెగబారెడు శిరోజాలు క్షేమంగా ఉన్నంతకాలమూ నీకు భయంలేదు.

**వసంతతిలక**

యన్నాదృత స్త్వమలినా
మలినాశయేన
కింతేన చంపక !
విషాదమురీకరోషి
విశ్వాభిరామ
నవనీరదనీలవేషాః
కేశాః కుశేశయదృశాం
కుశలీ భవంతు.

**ఉత్పలమాల**

చంచల చంచరీక కలుషాత్ములు
నిన్ను నిరాదరమ్ము కా

వించిరటంచు కుందదగునే ?
మధుపాయుల మాట కేమిలే
కాంచనగాత్ర సుందరుల
కాలనవాంబుదమాలలన్ పిసాళించు
వినీలదీర్ఘకబరీభరసంపద లేదె? సంపగీ !

*   *   *

సింపెంగని ఓదార్చి జగన్నాథుడు సాంఖ్యాయనీ నదిఒడ్డుకి వెళ్లేసరికి అక్కడ ఎవరో గొణుక్కుంటున్నట్లు సన్నగా వినిపించింది.

'ఎవరదీ ?'

'మహేశ్వరుడికి అంటరాని దాన్ని'

మొగలి డొంక కదులాడింది. మేలిమి బంగారం లాంటి పువ్వులు ఘ్రాణేంద్రియతర్పణం చేస్తున్నాయి.

'కేతకీ! నువ్వా?'

'అవును స్వామీ! నాకేం తక్కువని అస్పృశ్యత అంటగట్టేరు శివపూజలో?'

'పోనిస్తూ, ఓ విభూతిరాయుడు ఓ దిగంబరుడు నిన్ను ముట్టుగోనని భీష్మించుక్కూచుంటే నీకేం నష్టం? గుణజ్ఞశేఖరులైన నరదేవదేవులు ఎందరు నిన్ను నెత్తిమీద పెట్టుకోవడం లేదూ?'

**వసంతతిలక**

ఏకేన చేత్ పరిహృతో౽సి మహేశ్వరేణ
కిం తేన కేతక విషాద మురీకరోషి
అన్యేన కిం జగతి సంతి మహాగుణజ్ఞా
యే త్వాం వహంతి శిరసా నరదేవదేవాః

**ఇంద్రవజ్ర**

ఓ కేతకీ! నిన్ను విభూతి రాయం
డొకాశకేశుండు త్యజించె నంచున్
శోకింపకే—నిన్ శిరసావహింపన్
లోకాన లేరో నరదేవదేవుల్?

*   *   *

సాంఖ్యాయనీనదిని ఆనుకునే మూలేశ్వరాలయం. ఆ గుడికి కట్టెదుట చెరువు. ఆ చెరువునిండా కలకలలాడుతూ తామర పువ్వులు.

మొగలి డొంకని బుజ్జగించి ఇటు తిరిగేడో లేదో ఆ చెరువులోంచి ఏదో రోదనధ్వని వినవచ్చింది. పండితరాయలు పావంచాలు దిగి రేవులోకి వెళ్లేడు. ఒడ్డుకి బారెడు దూరంలో ఒక తామరపువ్వు గుడ్ల నీరు కుక్కుకుంటూ కనిపించింది.

'ఏం జరిగింది? శతపత్రసుందరీ!!

తామరపువ్వు ఉలిక్కిపడి మొహం ఇంత చేసుకుని జగన్నాథుణ్ణి చూసింది. గిరుక్కున మొహం తిప్పుకుని మరోపక్కకి పులుకూ పులుకూ చూసింది. అక్కడ కొన్ని కొంగలు ఒంటికాలి జపం చేస్తూ కనిపించాయి.

'ఏం జరిగింది? కమలినీ!' అని మళ్లీ అడిగేడు.

'ఏం చెప్పమంటారూ? ఆ కొంగలు నన్ను వేళాకోళం చేశాయి. నేనెందుకూ కొరగానట. నాకన్న నత్తగుల్లలు నయమట'

'ఎంత అమాయకురాలివి! నీ విలువ పనికిమాలిన ఆ కొంగలకి ఏం తెలుస్తుంది? కమ్మని నీ తేనె రుచి నెరిగిన తుమ్మెదలు లోకంలో చిరంజీవులై ఉన్నంతకాలమూ నీకు లోటేమిటి? ఊరుకో.'

**పుష్పితాగ్ర**

కమలిని ! మలినీ కరోషి చేతః
కిమితి బకై రవహేళితానభిజ్ఞైః
పరిణత మకరంద మార్మికా స్తే
జగతి భవంతు చిరాయుషో మిళిందాః.

**తేటగీతి**

పనికిమాలిన కొంగలు పరిహసింప
కుందనేటికి డెందమ్మునందు? తమ్మి!
పరిణతంబైన నీ తేనె నరయు తేంట్లు
కలవు కొల్లలు దీర్ఘాయువులు ధరిత్రి.

*   *   *

అంతలో నాలుగుబారల దూరంలో మరో పద్మం విసుక్కుంటూ కనిపించింది.

! చాలా చిరాగ్గా ఉన్నట్లు కనిపిస్తు న్నావు, ఏం కథ? నిన్ను ఎవరేవా ఏమేనా అన్నారా?' అని పలకరించాడు జగన్నాథభట్టు.

'ఈ మొరటు తుమ్మెదలని చూడండి. వేళా పాళా లేకుండా నా సున్నితమైన రేకుల్ని ఎల్లా తొక్కి తొక్కి పాడుచేస్తున్నాయో! అడగడం పెట్టడం లేదు. ఒకటూరెండా? తండోపతండాలు' అని ముఖం పాడుగ్గా తీసుకుంది పద్మం.

జగన్నాథుడు పకపకా నవ్వేడు.

'ఎందుకు నవ్వుతారు ?' అంది చిడిముడి పాటుతో కమలం.

'ఎందుకు నీకంత విసుగు? ఆ తుమ్మెదలు నీ దగ్గరకు వస్తున్నాయని వాటిమీద కోపగించడం కన్న నీ గుండెల్లోంచి పెల్లుబికివస్తున్న తియ్యని వెచ్చని మరందధారలని తిట్టుకో.'

**ఆర్యా**

కిం కుప్యసి కస్మైవా
సౌరభ సారాయ కుప్య నిజమధు నే
యస్య కృతే శతపత్ర
ప్రతిపత్రం తేఽద్య మృగ్యతే భ్రమరైః

**తేటగీతి**

ఇచ్చవచ్చిన యట్టులీ భృంగపాళి
నీదురేకుల తిరుగాడ నేలయనుచు
ఏల మోమెఱ్ఱవడ కోపగింతు తమ్మి!
తీయనగు నీదు తేనెనే తిట్టుకొనుము.

'ఇదా మీరు నా కిచ్చే సలహా?' అంది తామర.

'పిచ్చిదానా! నీకో సంగతి చెప్తా విను. నా భామినీ విలాసానికి ప్రతులు వ్రాసుకోడానికి రాత్రీ పగలూ అనకుండా విధీ విరామం లేకుండా దగ్గరా దాపూ అనకుండా దేశదేశాలనుంచీ రసికులు మా ఇంటి మీదికి వచ్చిపడిపోతూ ఉండేవారు. నేను విసుక్కునే వాణ్ణి. వాళ్లు బతిమాలే వాళ్లు. ఒక్క పది ఆకులు రాసుకు పోతాం బాబ్బాబు అని. వేళాపాళా లేదా అని విసుక్కుంటున్న నన్ను ఓ సారి మా లవంగి కోప్ప డింది. పాపం వీళ్లమీద కోపగిస్తారేమిటీ? అడ్డూ అపూ లేకుండా నవరసాలనూ వెల్లువలుగా పారిం చేస్తున్న మీ అపూర్వ కవితా శక్తిని నిందించుకోండి— అంది. విన్నావా? గనకనూ నే చెప్పొచ్చేదేమిటంటే...'

'తెలిసింది. తెలిసింది' అని భువన మోహ నంగా సిగ్గుపడింది పద్మం.

* * *

మూలేశ్వరాలయప్రాంగణంలోని సంపెంగ చెట్టు తెగ పూచేసింది ఆ ఏడు. ఆ పూలవాసనతో ఊరు ఊరంతా గుప్పుమనిపోతోంది. ఆ పూలకోసం పిన్నా పెద్దా అనకుండా ప్రతీవాళ్లూ చెట్టెక్కి అందినమటుక్కి కోసుకుపోతున్నారు. ఈ రద్దీ చూసే సరికి సంపెంగకి చిరాకేసింది. 'ఈ ప్రాంతాల ఎన్ని చెట్లు లేవూ ? అందరూ నాదగ్గరకేవచ్చి నన్నే వేపుకుతింటూ రేమిటీ ? వేళాపాళా లేదూ ?' అను కుంది.

సరిగ్గా ఆ సమయంలో ఆ ప్రాంతానికి వస్తున్న జగన్నాథుడు ఆ మాటలువిని తలఎత్తేడు. దానికోసం చూసేసరికి చిన్నపిల్లల బుంగమూతి గుర్తొచ్చి ముచ్చటవేసింది.

'అంత కోపందేనికి చంపా ! యాచకులు విసి గిస్తున్నారనే కదూ ? తెలిసికోగలిగితే అదిమాత్రం తక్కువ గౌరవమా ? అది అందరికీ లభిస్తుందా?'

'ఇదెక్కడి గౌరవం ? మీకు జరిగితే తెలు స్తుంది'

'కాళిదాసు ఏమన్నాడో విన్నానా ?'

ఆసనే విప్ర పీడాస్తు
సుత పీడాస్తు భోజనే
శయనే భార్య పీడాస్తు
త్రి పీడాస్తు దినే దినే.

అల్లా చూడు ఈ చుటుపక్కల ఏ చెట్టు కైనా నీ కున్నంత ప్రశస్తి ఉందా? నీ కింకా కోపం తగ్గినట్టులేదు. తగ్గకపోతే బ్రహ్మదేవుణ్ణి తిట్టు పోనీ.'

'బ్రహ్మదేవుణ్ణా? అతడేంచేశాడు మధ్యనీ ?'

'దేవమనోహరమ్మైన సౌరభ్యము, బంగారం లాంటి రంగూ కలిగిన అపూర్వమ్మైన అద్వితీయ మ్మైన అఖిలజనాహ్లాదకరమ్మైన పువ్వులని నీకు ఇచ్చి నందుకు.'

**శార్దూలవిక్రీడితం**

కోపం చంపక! ముంచ యాచకజనై
రాయాసిత స్త్వం స
మా మ్లాసీః పరితోవిలోకయ తరుః
కస్తేధిరూఢస్తులామ్
కోపశ్చే న్నియత స్తవాస్తి హృదయే
ధాత్రే తదా కుప్యతాం
యేన త్వంహి సువర్ణ వర్ణకుసుమామోదోఒ
ద్వితీయః కృతః

**మత్తేభ విక్రీడితం**

అలుకేలా విసిగింత్రు యాచకులు
నిత్యంబంచు నిన్ సంపగీ !
కలయం జూడుము నీకు సాటియగు
వృక్షంబున్నదేమో యిటన్
అలుకన్ మానవయేని డెందమున
బ్రహ్మన్ దిట్టు దీవ్యత్ సుగం
ధిల సంకీర్ణ సువర్ణ వర్ణ
కుసుమానీకంబు నీ కిచ్చుటన్.

*   *   *

సంపెంగని ఊరడించి అటు తిరిగేసరికి ముంగండ మూలేశ్వరాలయ గోపురాగ్రాన బంగారు కలశం సూర్యకాంతిలో ధగధగా మెరిసిపోతోంది. సూర్యుడు ఆ సమయంలో ఒక ప్రత్యేకమ్మైన కోణంలో ఉండడంచేత కలశం సూర్యకాంతిని అద్దంలా ప్రతిఫలించి మిరుమిట్లు గొలుపుతోంది. ఈ సన్ని వేశాన్ని ఎంతమంది ఎన్నిసార్లు చూడలేదూ ? కాని వారెవ్వరికీ అందులో ప్రత్యేకత ఏమీ కనిపించదు. ఆ ప్రత్యేకత కనబడాలంటే పండితరాజ హృదయం కావాలి.

తదేకంగా ఆ కలశంకేసి చూస్తున్న జగన్నా థుడికి దిగులునిండిన గొంతు వినిపించింది. ఆలయ గోపుర రంధ్రాలలో గూళ్ళు కట్టుకున్న పావురాల రొదవంటి సన్నని ధ్వని, అది సరాసరి కలశందగ్గర నుంచే వస్తోంది.

'ఏం తల్లీ నీబాధ ఏమిటి ?'

'నా కేమిటో భయం భయంగా ఉందండీ' అంది కలశం.

'నీకా ? భయమా ? ఏం జరిగింది ?'

'నన్ను ఇప్పటివరకూ అందరూ బంగారుకలశం అనే అంటున్నారు. అనుకుంటున్నారు. కాని ఏంచెప్ప గలం. నిజానికి నేను రాగికలశాన్ని. బంగారుపూత పైపైన మాత్రమేకదా ఉన్నది. ఈ రహస్యం కని పెట్టేస్తారేమో జనం. తెలిసిపోతే నన్ను గౌరవించ రేమో అని నాకు ఎప్పుడూ ఒకటే దిగులు. దాంతో నిద్రకూడా సరిగ్గా పట్టదు. నాబాధ ఎవరితో చెప్పు కోను. దొంగతల్లికి ఏడవ భయం అంటారే అల్లా ఉంది నా పరిస్థితి.'

'ఎంత అమాయకురాలివి కలశమా! చిరకాలం బంగారుకలశంగానే దేవాలయాగ్రాన విరాజిల్లు. మరేమీ భయంలేదు. నీలోపలి తామ్రత్వాన్ని ఎత్తి చూపేవాళ్ళు ఎవ్వరూలేరు. వస్తువుల అంతర్గత సారాన్ని గ్రహించాలనే జిజ్ఞాస లోకులకు లేదులే. పై పై పూతలను మెరుగులను గౌరవిస్తుంది ఈ లోకం. కనుక నీకువచ్చిన భయంఏమీ లేదు.'

**శార్దూల విక్రీడితం**

భ్రాతః కాంచన లేప గోపిత
బహి స్తామ్రాకృతే సర్వతో
మాభైషీః కలశ! స్థిరోభవ చిరం
దేవాలయ స్యోపరి
తామ్రత్వం గతమేవ కాంచన మయీ
కీర్తిః స్థిరా తేఒధునా
నాంత స్తత్త్వ విచారణప్రవణయినో
లోకా బహి ర్బుద్ధయః

మత్తేభ విక్రీడితం

తరళ స్వర్ణ విలేప గోపిత
బహిస్తామ్రాకృతిన్ బొంది సు
స్థిరకీర్తిన్ విలసిల్లవే కలశమా!
దేవాలయాగ్రమ్మునన్
వెరపేలా? నిను రాగిచెంబువని
సందేహింప రావంతయున్
నరు లంతర్గత వస్తుతత్త్వ మరయన్
వాంఛింపరౌ వేకదా!

అందులోని వ్యంగ్యాన్ని అర్థంచేసుకోగల తెలివి లేదు కలశానికి.

'నిజమే స్మీ' అనుకుంది.

* * *

అంతలో ఒక నిట్టూర్పు వినిపించింది. ఎక్కడినుంచి చెప్మా అని తిరిగిచూశాడు పండితరాయలు. గుడివక్కనేఉన్న మామిడిచెట్టు విచారిస్తున్నట్లు కనిపించింది.

'ఎలమావీ! నువ్వేనా దుఃఖిస్తున్నావు?'

'నా దుఃఖం ఇతరులకి తెలిసిపోయినందుకు సిగ్గుగాఉంది.'

'ఇంతకీ సంగతేమిటో చెప్పేవుకావు.'

'ఋతువులో అడగనివారిది పాపంగా చిగుళ్ళు, పువ్వులు, తేనెలు, వాసనలు, పళ్లు — నాదగ్గర ఉన్న వన్నీ ఇస్తూవచ్చాను. ఆకాలం వెళ్లిపోయింది. ఇప్పుడు యాచకులికి ఇవ్వడానికినాదగ్గర ఏమీలేదు. ఏంచేసేది? నామొహం ఎల్లా చూపించేది?'

పక్కఊరు గన్నవరంలో జరిగిన సంఘటన పండితరాయలికి గుర్తువచ్చింది. ఒక సద్గృహస్థు నిరతాన్నదాత. ఎడా పెడా అతడుచేసిన దానాలికి లెక్కలేదు. ప్రస్తుతం బాగా చితికిపోయాడు. చిరుగుల గావంచాతో పూరిపాకలో కూర్చున్న ఆ విగ్రహాన్ని చూస్తే చూపరులకి గుండె చెరువైపోతుంది తనకీ, తనకుటుంబానికీ ఐదువేళ్లూ నోట్లోకి వెళ్లడంలేదే అనే విచారమేలేదు ఆయనకి. ఆయనకి ఉన్న దిగులు అల్లా ఒక్కటే. అతడి పూర్వార్జిత ప్రశస్తివిని దూరంనుంచి ఇంకా యాచకులు వస్తూనే ఉంటారు అప్పుడూ అప్పుడూనూ. వాళ్లకి మొహం ఎల్లా చూపించేదీ అనేదే ఆయన చింత. జగన్నాథునికి కంఠం గద్గదికమైంది.

'విచారించకు మామిడీ! ఇప్పుడుమాత్రం నువ్వు తక్కువ చేస్తున్నావా? దట్టమైన చల్లని నీడనిచ్చి పాంథులతాపాన్ని హరిస్తున్నావు కావూ? అంతకన్నా ఏం కావాలి?'

స్వాగత

ఆశ్రమ యద్యపి గతా దివసా స్తే
పుష్ప సౌరభ ఫలప్రచురా యే
హంత సంప్రతి తథాపి జనానాం
ఛాయయైవ దల యస్యతి తాపమ్.

స్వాగత

కొమ్మ కొమ్మకును పూవులు పండులున్
కమ్మతావిగల కాలము మాకం
దమ్మ! చెల్లెనని కుందకుమా—తా
పమ్ము మాన్పగల విప్పుడు నీడన్.

చక్రవాకపక్షులకి వెన్నెట్లో కళ్లు కనిపించవని లోకంలో వాడుక. వాటికి రేజీకటి కాబోలు. పొద్దువాలేసరికి ఆడపక్షీ మగపక్షీ ఒకరి నొకరు కానుకోలేక, విరహం భరించలేకా నానాఅగచాట్లూ పడతాయిట. ప్రబంధనాయికలను మించిన నోటి దురుసుతనంతో అవి చంద్రుణ్ణి పట్టుకుని ఛెడా మడా తిడతాయిట, తమ వియోగానికి అతడే కారణం అనుకుని.

'నేనేంచేశాను మధ్యనీ? నాకు రోజూ ఓతట్ట వరస చివాట్లు ఏమిటీ ఈ చక్రవాకాలమంచీ?' అని విచారిస్తున్నాడు చంద్రుడు.

బహు గంభీరమైన వాక్యముద్రాన్ని మధించి తాను రచించిన రసగంగాధరాన్ని అర్థంచేసుకోలేక పామరులు నిరసించిన ఘట్టాలు పండితరాయలకి

కొత్తఏమీకాదు. అది సామాన్యులకోసం వ్రాసినది కాదాయె. అలంకారశాస్త్రంలో అఖరిమెట్టులో ఉన్న వారికోసం వ్రాసినది. అది అందరికీ ఎల్లా అర్థం అవుతుందీ? దాని విలువ గ్రహించి మెచ్చుకునే బుద్ధిశాలులు ఉన్నారు. దేశం గొడ్డుపోలేదు. ఇంక విచారం దేనికి?

జగన్నాథుడు చంద్రుణ్ణి అనునయించాడు. 'తెలిమాలి మదించిఉన్న చక్రవాకాలు తిట్టేయని విచారం దేనికయ్యా చందమామా! నీ వెన్నెలని ఆప్యాయంగా జుర్రుకునే చకోరపతులు ఉండగా నీకు దిగులెందుకయ్యా!'

**అనుష్టుప్**

సందూషితోఒసి పూర్ణేందో!
చక్రవాకైర్మదోత్కటైః
కిం చకోరా స్త్వదాయత్తాః
న సంతి పృథివీతలే?

**ఆటవెలది**

తిట్టిపోయుగాక తెలివిమాలి మదించి
చక్రవాకి నిన్ను చందమామ!
నిన్ను వలచివచ్చు వెన్నెల పులుగులు
లోకమందు పెక్కు లేకపోవు.

* * *

నల్లగాఉన్న కస్తూరిని చూచి పామరు డొకడు బురద అని భ్రాంతిపడి, విదలించి పారేశాడట. 'నా ఖర్మ ఇల్లా కాలిందే'అని విచారిస్తోంది కస్తూరి.

పండితరాయలు దానిని బుజ్జగిస్తున్నాడు. 'బుద్ధిహీనుడెవడో నిన్ను దూషించేడని విచారం దేనికి కస్తూరీ! నిన్ను తలమీద పెట్టుకునే మహారాజులు లోకంలో ఎందరులేరూ?'

**అనుష్టుప్**

అయి! త్యక్తాసి కస్తూరి!
పామరైః పంకశంకయా
అలం ఖేదేన భూపాలాః
కిం నస తి మహీతలే?

**ఆటవెలది**

పామరుండు నిన్ను పంకమంచు భ్రమించి
వైదొలంగె ననుచు వగచె దేల?
అవనిలోన నిన్ను నాదరింపగ జాలు
నృపులు లేకపోరు మృగమదంబ!

* * *

రాజాస్థానాల్లో దుర్మార్గులు, కుత్సితులుచేరి అమాయకులనీ సాధువులనీ నానాగడ్డి కరిపిస్తూ ఉండడం ఆ రోజుల్లో అతిసామాన్యమైన విషయం. రాజుకి బహుసన్నిహితుడైతేతప్ప ఈ దుర్మార్గులనుంచి తప్పించుకుని బయటపడడం కష్టంగా ఉండేది. జగన్నాథుడు స్వయంగా అటునంటి ఇబ్బందులు పడ్డవాడు. ఆ విషయాన్ని మనస్సులో ఉంచుకొని ఒక బోయవాడిని ఓదారుస్తున్నాడు—హాస్య స్ఫోరకంగా.

'ప్రతిరోజూ నోరూ వాయీలేని అమాయిక జీవుల ప్రాణాలను దయాదాక్షిణ్యాలేకుండా తీసేస్తున్నానే, నావంటి పాపి ప్రపంచంలో మరి ఎవ్వడూ ఉండడు అని విచారిస్తున్నావా? బోయవాడా! ఊరుకో, ఊరుకో. చక్కని రాజసభాభవనాలలో సజ్జనులని కాల్చుకుతినేసే దుర్మార్గులు, నిన్నుమించిన పాషాణ హృదయులు బోలెడంతమంది ఉన్నారులే. వారిముందర నువ్వు చాలా మంచివాడివి. దిగులుపడకు'

**శార్దూల విక్రీడితం**

ఏకో విశ్వ సతాం హరామ్యపఘృణః
ప్రాణానహం ప్రాణినా
మిత్యేవం పరిచింత్య మాస్మ మనసి
వ్యాధానుతాపం కృథాః
భూపానాం భవనేషు కించ విమల క్షేత్రేషు
గూఢాశయాః
సాధూనా మరయో వసంతి
కతి న త్వత్తుల్యకక్షాః ఖలాః

జాలిదొరంగి వేనెకద చంపుచు
నుందును నోరులేని జీ
వాలను నిత్యమంచు నెద

బాధపడంబని యేమి? వ్యాధ! ఘూ
పాలమనోహరామల
సభాస్థలు లందున సజ్జనవ్యథా
శీలురు నిన్ను మించగల
జిత్తులమారు లనేకు లుండగన్.

*   *   *

మగపిట్ట కనిపించక ఒక చక్రవాకి ఏడుస్తోంది. ఈ వియోగానికి ఇంక అంతమేలేదు కాబోలు నని బెంబేలు పడిపోతోంది. దానిని పండితరాయలు ఊరడిస్తున్నాడు.

'చక్రవాకీ! ఏడవకు. ధైర్యం చిక్కబట్టు. తూరుపు తెల్లవారవస్తోంది. త్వరలో సూర్యుడు ఉదయిస్తాడు. నీ ఇబ్బంది ఇంక ఎంతోసేపుండదు. నీ కష్టాలు గట్టెక్కబోతున్నాయి. ఇంక ఊరుకో మరి'.

ఆర్యా

త్యజ చక్రవాకి! శోకం
బధాన ధైర్యం సహస్వ సమయ మమువ్
అయమేవ వాసరమణి
ర్హారిష్యతే శోకమూర్చాం తే.

దుఃఖ మికమాని కన్నులు తుడుచుకొనుము
మొక్కవోయిన ధైర్యమ్ము చిక్కబట్టు
నీ విచారమ్ము పోగొట్టునేర్పుకాడు
సవిత యుదయించు వేళాయె చక్రవాకి!

*   *   *

అది రోహిణీకార్తె. మిట్టమధ్యాహ్నం వడగాడుపు గూబ పగలేస్తోంది. తాటాకుగొడుగువేసుకుని నడిచివెడుతున్న జగన్నాథునికి దారిలో ఒక మామిడిచెట్ల గుబురు కనిపించింది. అక్కడే ఒక గిలక నుయ్యి. పక్కనే తాటాకు చేద. జగన్నాథుడికి ప్రాణం లేచివచ్చింది. గబగబా ఓ చేదెడునీళ్లు తోడుకుని ముఖం కడుక్కున్నాడు. చల్లగా మంచులా ఉన్నాయి నీళ్లు. నాలుగు పుడిసెళ్లు గొంతుకలో పోసుకున్నాడు. గంగాబొండంనీళ్లల్లా మధురంగా ఉన్నాయి. అక్కడి మట్టితిన్నెమీద కూర్చుని అలసట తీర్చుకుంటూ 'ఎంతమంచినుయ్యి! ఏపుణ్యాత్ముడు తవ్వించాడో!' అనుకున్నాడు.

అంతలో హఠాత్తుగా ఆ నూతిలోనుంచి 'నేను చాలా నీచమైనదాన్ని' అని దిగులుగా అంటున్నట్లు వినిపించింది. జగన్నాథుడు ఉలిక్కిపడి నూతిలోకి తొంగిచూశాడు. అందులో ఎవరూ లేరు. అంతా తన భ్రమ. అంతలో 'నేను చాలా నీచమైనదాన్ని' అని మళ్లీ స్పష్టంగా వినిపించింది.

ఆ మాట్లాడు తున్నది నుయ్యే అని స్పష్టం అయింది అతడికి.

నీచశబ్దానికి క్రిందుగా ఉండేదీ, క్షుద్రమైనదీ అనే అర్థాలున్నాయి.

'ఓహో! నుయ్యి ఎంత తెలివిగా మాట్లాడుతోంది?' అని మెచ్చుకున్నాడు.

'క్రిందుగా ఉండేదానివి అనడం బాగానేఉంది కానీ అల్పమైనదానివీ క్షుద్రమైనదానివీ మాత్రంకావు బావీ! నీది అత్యంత సరసమైన హృదయం' అన్నాడు.

'ఏమిటీ? నా హృదయం అత్యంత సరసమైనదా? వేళాకోళం చేస్తున్నారా?'

'లేదు లేదు. నీతో వేళాకోళం ఆడతానా? నిజంగా నీది సరస హృదయమే.'

'అదెల్లాగ?'

'రసంఅంటే నీరు. నీ హృదయంనిండా నీళ్లు లేవూ? అందులోనూ ఎల్లాంటినీళ్లు.'

'మీ ద్వ్యర్థి చల్లగుండా. ఇంకా ఏమిటో అనుకున్నాను.'

'పైగా నువ్వు పరగుణ గ్రహీతవు.'

'ఇదోటా? సరసహృదయంతోబాటు పరగుణ గ్రహణ శక్తికూడా అంటగడుతున్నారే. ఇది మరీ బాగుంది.'

'అవును. నేనుఅన్నది అక్షరాలా నిజం'

'నాది అసలే మందబుద్ధి. మరి కాస్త వివరించండి దయచేసి.'

'గుణంఅంటే తాడుకాదుటమ్మా! చేదకి తాడుకట్టి నీలోకి విడవరూ? అంటే ఇతరుల గుణాన్ని అదే చేంతాడుని—నువ్వు గ్రహించడం లేదూ?'

**ఆర్యా**

నితరాం నీచోఽస్మీతి
త్వం ఖేదం కూప! మా కదాపి కృథాః
అత్యంత సరస హృదయో
యతః పరేషాం గుణగ్రహీ తాసి.

**కందం**

అతినీచంబను నేనని
మతిగుందకు మెపుడు కూపమా! నీ హృదయం
బతిసరసము—నీవెప్పుడు
నితరుల గుణముల గ్రహించు నేర్పరివికదా!

'హోహ్హోహ్హో! నాకు నవ్వు ఆగడంలేదు. ఇంతమంది బాటసారులు నాలో నీళ్లు తాగిపోయారు గానీ మీలాగ నన్ను ఆకాశానికి ఎత్తేసినవాళ్లు లేరు. ఇంతకీ మీ పేరు ఏమన్నారూ?'

'ఆత్మనామ గురోర్నామ
నామాతికృపణస్యచ
శ్రేయస్కామీ న గృహ్ణీయాత్
జ్యేష్ఠాపత్య కళత్రయోః'

'నా పేరుకేంగానీ నాలుగుకాలాలపాటు పరగుణ గ్రహీతవుగా వర్ధిల్లు'అని ఆశీర్వదించి ముందుకి సాగిపోయాడు జగన్నాథ పండితరాయలు.

(ఇందులో ఉదాహరించిన తెలుగు పద్యాలు డా. మహీధర నళినీమోహన్ అనువదించిన భామినీ విలాసంలోనివి.)



# పిన్నలూ, పెద్దలూ...

శ్రీమతి ఆర్. వసుంధర

అప్పుడే ఆఫీసునుండివచ్చి, పడక్కుర్చీలో పడుకుని, కొంచెంసేపు విశ్రాంతి తీసుకోవాలనుకున్న పార్థసారధిగారికి ప్రక్కింట్లోంచీ వినవస్తున్న పూజ తాలూకు మంత్రాలు కర్ణకఠోరంగా చెవులు చిల్లులు పొడిచేస్తున్నట్లే వున్నై. గ్రామఫోను ప్లేటులో నుంచీ ఉచ్ఛైస్వరంలో మంత్రాలు వల్లించేస్తున్నాడు బ్రాహ్మణుడు. అది పార్థసారధిగారికి నచ్చక పోవడంవలననే అంతబాధ కలిగిస్తూ ఉండాలి. ఎందుకంటే తెల్లవారినప్పటినుండీ లారీలు, ఊరేగింపులు, కొళాయిదగ్గర తగవులు, కుక్కల కొట్లాటలు, కిటికీల్లోంచీ ఇంటిలోనికి వచ్చిన పిచ్చుకల రొద యిత్యాదులు అనేకం కలసి ఏర్పడిన శబ్దపు హోరు విన్నిస్తున్నా పట్టించుకోని మనిషి అతను. ఈ మంత్రాల శబ్దంమాత్రం అతనికంత కష్టం కలిగిస్తున్నది... వాళ్లు రోజూ ఆ రికార్డును పెద్దగా వేస్తారు, నిజమే. ఒక రోజున ఉదయం ఎనిమిది గంటలకూ, మరో రోజున పదకొండుకూ వేస్తారు. సాయంత్రాలు నాలుగునుండీ ఎనిమిది లోపున ఎప్పుడో వేస్తారు ఒకసారి. అందువలన ఒక వేళాపాళా లేకుండా ఉన్నట్లుండి హోరెత్తిస్తుంది రికార్డు. కాని అంత చికాకుకు కారణం ఇంతమాత్రంలోనిదే అనుకోడానికి వీల్లేదు.

పార్థసారధిగారికి పూజని గురించి ఏవేవో అభిప్రాయాలున్నై. బాగా చదువుకున్నవారూ ఆలోచనాపరులూ అయివుండికూడా పాతకాలపు వాసనలు వదవని మనిషి అతను. చీకటి మూలలో తళతళ మెరిసే దీపపు సెమ్మెలూ, పసుపు కుంకుమలూ, తాజాపూలూ, నేతిదీపం, అగరువత్తులూ, కొబ్బరి నీళ్లూ, కర్పూరం వాసనలన్నీ కలిసిన సువాసనా; ఆ మెత్తని వెలుగులో కనిపించీ కనిపించని దేవుడూ— ఇవన్నీ పూజలో ముఖ్యభాగాలు అతనికి. కాని యీ వూరికి వచ్చిన కొత్తల్లోనే ఆయన భార్య కళ్యాణి యివన్నీ త్రోసిపారేసింది. 'ఇక్కడ అందరూ రంగు రంగుల బల్బులు పెట్టించుకుంటున్నారు దేవుడి దగ్గర. పనుల్లో తీరిక చిక్కకుండా కొట్టుకుంటుండే మా ఆడవాళ్లకి అది ఎంతో సౌకర్యంగా ఉన్నది. క్షణంలో స్విచ్చివేసి వెలిగించెయ్యొచ్చును అన్ని దీపాలూను' అన్నది. ఫలితంగా రంగుల బల్బులూ, ప్లాస్టిక్ పూలహారాలూ దేవుణ్ణి అలంకరించాయి. ఉన్నాడో లేడో తెలియని దేవుణ్ణి ఆరాధించుకుంటూ వుండటం ఒకటే పనికాదు మనుష్యులకు. తప్పకుండా, తొందర తొందరగా చేసుకుంటూ పోవలసిన యితర పనులు చాల వున్నై యిప్పుడు. 'పోనీలే, భక్తితో దేవుణ్ణి స్మరించుకోవడంకదా ముఖ్యం' అనుకున్నారు సారధి. ఈమధ్యన ప్రక్కింటివాళ్లు పూజతాలూకు మంత్రాలూ నామాలూ శ్లోకాలూ కలిపిన రికార్డు ఒకటి తెచ్చారు. పూజ అంతా అనుకోడం తడవుగా ఏమాత్రం శ్రమలేకుండా జరిగిపోతున్నది.

ఆ రికార్డు వినబడినప్పుడల్లా 'వెర్రివాడు వేమారం వెళ్లివచ్చినట్లు' అంటారు సారధి. క్రొత్తగా ఎవరు ఏపనిచేస్తే అది గొప్పదని అనుకరించే కళ్యాణి ఆ రికార్డును కొనకుండావుండాలని ఆయన ఉద్దేశ్యం కావచ్చు. 'చక్కగా మంత్రాలు వినడానికి అంతబాధ పడిపోతారేవిటీ' అంటుంది కళ్యాణి. కాని ఆ రికార్డును కొనాలన్న అభిప్రాయం ఇంతవరకూ వెల్లడించలేదు. దానికి ఒక కారణం ఉన్నది. ఈమధ్యనే ఒక పండుగ

రోజున ఆ ప్రక్కింటివాళ్ల జవాను రెండిళ్ల మధ్యనా వుండే అడ్డుగోడ దూకివచ్చి కళ్యాణమ్మగారి అరిటాకులు రెండు కోసుకెళ్లాడు. ఇరుగూ పొరుగూ అన్నాక ఒకరితో ఒకరికి అవసరంపడకుండా ఉండదు. అవసరంగా అరిటాకు కావలసివస్తే వీధివాకిట్లోంచీ వచ్చి అడిగి కోసుకెళ్లాలిగాని యిలా చెయ్యడం కళ్యాణికి తప్పుగా దొంగతనంలాగా తోచింది. అదేమిటని అడిగిన పనిమనిషితో 'ఫర్వాలేదులే మీ అమ్మగారు లోపలుంటారు. మాకు తొందరగా కావాలి' అన్నాట్ట ఆ జవాను. 'ఎంత నిర్లక్ష్యం! ఇట్లాగైతే ఇహ నీది నాది అనేదేముంటుంది ప్రపంచంలో' అని ఉడికిపోయింది కళ్యాణి గుండె. వెంటనే ఆ జవాన్ను పిల్చుకరమ్మని మనిషిని పంపింది. ప్రక్కింటావిడ 'వాడు లేడు. ఆఫీసుకి వెళ్లిపోయాడు అర్జెంటుగా'అని చెప్పి పంపింది. ఇప్పుడే గోడదూకి అవతలకి వెళ్లినవాడు అయిదు నిముషాలన్నా జరక్కుండానే ఆఫీసుకు వెళ్లిపోయాడంటె నమ్మకం కలుగలేదు కళ్యాణికి. బాగా ఆలోచించుకోగా ఆవిడ మద్దతుతోనే వాడీపని చేశాడనీ అనిపించింది. అప్పట్నుండీ ఆ యింటివాళ్లు కళ్యాణికి గొప్పగా కనిపించడం మానేశారు.

స్వతహాగా కళ్యాణి మంచిమనసుకలది. అసూయ, కసి, ద్వేషంలాంటి గుణాలు లేవు. ఏదీ లోతుగా ఆలోచించకుండా సరదాగా కాలం గడిపేస్తుంది. తనకేది తోస్తే అది చెయ్యడమేగాని భర్తమాట మన్నించాలన్న తత్వంలేదు ఆమెకు. ఆమె సంగతి సారధిగారికి బాగా తెలుసు. తెలిసినందువలన భార్యమీద అతనికి అపేక్ష జాస్తిఅయిందేగాని తగ్గలేదు. ఒక్కోసారిమాత్రం తన పిల్లలిద్దరూ పెరగవలసిన తీరులో పెరగటంలేదేమోఅన్న అనుమానంవస్తుంది. ప్రపంచాన్ని అర్థంచేసుకుని, వ్యక్తిత్వాన్ని ఏర్పరచుకోగల సమర్థత వాళ్లకి అబ్బటంలేదని అనుకుంటారు. అటువంటప్పుడు వాళ్లకేదైనా తెలియజెప్పడానికి ప్రయత్నిస్తారు. 'నాన్నగారి ఉపన్యాసాలు' అంటూ విధిలేక వింటున్నట్లు వింటారు వాళ్లు. అంతకంటే ఎక్కువగా పట్టించుకోరు. ఆవిషయంలో పిల్లలిద్దరూకూడా పూర్తిగా తల్లిపోలిక అయ్యారు. 'ప్రపంచం అతివేగంగా పెరుగుతూ మారుతూ ఉన్నది, అర్థంకాకుండా. ఈ పిల్లలు ఎట్లా బాగుపడతారో, ఏమో' అనుకుంటారు సారథి.

ఇంట్లో రికార్డురుతాలూకు చీకాకులో ఉన్నప్పుడు ఫాక్సీ మొరిగింది, 'బంధువులొచ్చారు మనింటికి. బాగ్ పట్టుకొని'...అంటూ ఫాక్సీని ఎత్తుకొని ఇంట్లోకి వచ్చింది గౌరి. 'ఎవరూ? కూర్చోమని చెప్పావా ?' అంటున్న తండ్రి ప్రశ్నలకు సమాధానమివ్వకుండా 'మై క్లెవర్, క్లెవర్ ఫాక్సీ...'అంటూ దాన్ని ముద్దుపెట్టుకుంటూ వెళ్లిపోయింది.

వరండాలో యాభైఏండ్ల పెద్దమనిషీ, వెనుక బాగ్ పట్టుకున్న యువకుడూ నిలుచుని ఉన్నారు. దూరప్రయాణంచేసి అలసిపోయినట్లు కనిపిస్తున్నారు. కొంచెం స్థూలశరీరుడుగా ఉన్న ఆ పెద్దమనిషి నలిగిపోయిన షర్టును నలిగిపోయిన పాంటులోనికి టక్ చేసుకున్నారు. నలుపూ తెలుపూగాఉన్న పలచనిజుట్టు రేగిపోయి గాలికి ఎగురుతున్నది. మొహంలో దైన్యం స్పష్టంగా కనిపిస్తున్నది. ఆయన్ని చూడగానే 'పాపం, పెద్దమనిషి ఏదో కష్టంలోఉన్నారు' అనిపిస్తున్నది. వాళ్లు బంధుజనంలోని వారుగా గుర్తుకు రాలేదు సారధిగారికి.

కూర్చున్న తరువాత తనపేరు రామారావనీ, తాను తెనాలిలో ఒక లాయర్ననీ, ప్రక్కనున్నయువకుడు తన కొడుకనీ పరిచయం చేసుకున్నారు.

'మీ ఆఫీసుకు క్రొత్తగా ట్రాన్స్‌ఫర్ అయి ఒచ్చాడు...మాణిక్యం...వాడు...' అంటూ విషయం చెప్పాలని ప్రారంభించారు కాని ఆవేశం గొంతులో ఉండచుట్టుకపోయి మాట పెగిలిరావడం కష్టమైపోయింది ఆయనకు. కొంచెం నిలవరించుకున్న తరువాత చెప్పినదాని సారాంశం — ఆ మాణిక్యం గొప్ప రోగ్అనీ, రాస్కెల్అనీ, ఇంతకుమునుపు తెనాలిలో ఉద్యోగంలో ఉండినవాడనీ, మూడురోజుల క్రితం యీయన కుమార్తెను తీసుకుని మాయమయ్యాడనీ; అప్పట్నుండీ వాళ్లకోసం వెతుకుతున్నామనీ, అనంతపురంలో ఎవరో బంధువులయింటికి వెళ్లారని తెలిసి అక్కడికి వెళ్లామనీ, నిన్ననే అతను ఇక్కడ ఉన్నట్లు

తెలిసి యిక్కడికి వచ్చామనీ; అతన్ని బాగాతన్ని, తగిన శాస్తిచేసి, కేసుపెట్టి జైల్లోతోయించి తమకూతుర్ని లాక్కుపోవాలని అనుకుంటున్నామనీ; ఈ విషయంలో ఆ మాణిక్యం పై ఆఫీసరుగారైన సారథిగారు పూర్తి సహకారం యివ్వాలనీ అన్నారాయన.

ఆ మాణిక్యం ఉద్యోగంలోచేరి పదిహేనురోజులు సెలవుపెట్టి వెళ్లిపోయాడు. జాయినింగ్ రిపోర్టు యివ్వడానికి వచ్చినప్పుడు చూశారు సారథి. మనిషి సన్నగా పీలగా చాల బలహీనంగా పదహారేళ్ల కుర్ర వాడిలా ఉన్నాడు. మాట నిదానంతో మంచివాడుగా కనిపించాడు. సారథిగారికి అతనంటే సదభిప్రాయమే కలిగింది. 'ఆహా, కథానాయకుడే...పైకి ఎంతో సాదాగా కనిపిస్తాడు' అనుకున్నారు.

తల చేతబట్టుకొని కూర్చుండివున్న రామారావు గారు ఏదో జ్ఞాపకంవచ్చినట్లు తలెత్తి 'ఇందాక యిటుగా వెళ్లిన అమ్మాయి మీ కొమార్తేనా?' అన్నారు. అవునని సారథి చెప్పాక 'మా స్వరూప యింకా చిన్నది...మొన్ననే పావడా మానేసి చీర కట్టడం మొదలెట్టింది ..పదిహేనేళ్లు నిండినై, అంతే. అయ్యో, పసిబిడ్డండీ...ఎంతనెమ్మదైన పిల్ల! నోరుతెరిచి ఒక్కమాట మాట్లాడదు. అది యింత పని చేసిందంటే నమ్మలేకుండా ఉన్నాము...' అన్నారు. అతని గొంతులో దుఃఖం ఆశ్చర్యం ఒకదాన్నొకటి తరుముకొస్తున్నాయి. తన కూతురు, అంత అమా యకురాలు తమని వ్యతిరేకించిందంటే అతనికింకా నమ్మకం కలగటంలేదు.

'మా గౌరికి యింకా పదిహేను నిండలేదు' అన్నారు సారథి, ఏదో ఒకటి మాట్లాడటానికి, వాళ్ల మీద జాలితో.

'ఆహా...మీ బిడ్డే అనుకోండి. అభం శుభం తెలియని పిల్లకు అన్యాయం జరిగిపోతున్నది...ఏం చేసేది! ఇప్పుడెట్లాగ?...బంధువుల్లో ఎంత అప్రదిష్ఠ!' అంటూ దిగజారిపోయారు.

దుఃఖంలోవున్న ఆయన్ని శాంతింపజేసి జరిగిన విషయం కనుక్కున్నారు సారథి. మామూలు కథే. స్కూలుకి వెళ్లివస్తానని మధ్యాహ్నం పుస్తకాలు పట్టుకు వెళ్లినపిల్ల చీకటిపడినా తిరిగి రాలేదు. అమ్మాయి టేబిల్‌మీద ఉత్తరం కనిపించింది. తాను మాణిక్యంతో వెళ్లిపోతున్నాననీ, వెతికి ప్రయోజనం ఉండదనీ, పెళ్లి చేసుకుంటున్నామనీ, తర్వాత తానూ క్రిస్టియన్‌మతం పుచ్చుకుంటాననీ, అనవసరంగా గొడవచేస్తే మాణిక్యం ఉద్యోగంపోయి తాము చాల కష్టపడవలసివస్తుంది గనుక తనమీద కొంచెమైనా ప్రేమవుంటే అటు వంటిపని చెయ్యొద్దనీ వ్రాసివున్నదిట.

'ఇదంతా వాడే డిక్టేట్‌చేసి వ్రాయించి వుంటాడు' అన్నాడు యింతవరకూ నోరు మెదప కుండా కూర్చున్న యువకుడు కోపంగా.

పార్థసారథిగారికి వాళ్లమీద జాలి కలిగింది.

'మీ అమ్మాయి వెళ్లిపోయి మూడురోజులు గడిచి పోయింది. ఈపాటికి పెళ్లికూడా అయిపోయేవుంటుంది. ఒకవేళ వాళ్లు మీకు యిప్పుడు కన్పించినా మీ అమ్మాయిని ఇంటికి తీసుకెళ్లి ఏం చేసుకుంటారు? వేరేపెళ్లి చెయ్యలేరు...' అన్నారు కర్తవ్యం వెతుకుతూ.

రామారావు ఒకక్షణం తటపటాయించారు.

'ఈ మూడు రోజులు తిరిగాక మాకూ అలానే అనిపించింది. ఏం చెయ్యాలో తోచడం లేదు...మరీ కిరస్తానీ వాడిని చేసుకోడమా!...' అన్నారు దిగులుగా.

'మీ అమ్మాయికి మన మతం అనిపించ లేదు. క్రిస్టియన్ మతం పుచ్చుకుంటానని వ్రాసింది కదా' అన్నారు సారథి.

'వ్రాస్తే! దానిమొహం, దానికేమి తెలుసు? వాడి మాయలోపడి అది గొప్పఅని అనుకుంటున్న దేమోగాని, నిన్న మొన్నటిదాకా ఇంట్లో రాముడికి పూజచేసి దణ్ణాలు పెట్టుకున్నదే గదా. పుట్టిపెరిగిన సొంతమతాన్ని కనుక్కోలేని పిల్లకి పైదాన్నిగురించి ఏం తెలుస్తుంది?' అన్నారు రామారావు.

'ఇందులో పుట్టింది గనుక యిన్నాళ్లూ రాముడికి మ్రొక్కింది. ఇప్పుడతనంటే యిష్టపడింది గనుక అతని దేవుడికి మొక్కుతుంది. ఏ పేరు

పెట్టినా ఆ దేవుడేకదా' అన్నారు సారథి నవ్వుతూ. ప్రక్కింటివాళ్ల రికార్డు మంత్రాల్ని జోరుగా వల్లిం చేస్తున్నది. 'దేవుణ్ణి స్మరించుకోనుగూడా అక్కర్లేదు. మంత్రమో శ్లోకమో కీర్తనో నమాజో ఒకటి కాకపోతే యింకోటి రికార్డు వేసెయ్యొచ్చు' అనుకున్నారు లోపల.

'హు! ఆ పీరు బొమ్మను ఇష్టపడిందా? దొంగవేషాలువేసి...యువకుడు ఉద్రేకంతో గొంతు హెచ్చించి అరవటం ప్రారంభించాడు. తన చెల్లెలు ఆ మాణిక్యాన్ని ప్రేమించడం ఏ మాత్రం సహించ లేకుండా ఉన్నాడతను. మాణిక్యం ఎంత అర్భకంగా ఉంటాడో ఇతను అంత బలిష్ఠుడూ ఆజానుబాహు డూను.

రామారావు కొడుకుని వారించారు. 'ఇది మీ బిడ్డ విషయం అయ్యుంటే అంత తేలిగ్గా మాట్లాడి ఉండరు మీరు. మతం, కులం, బంధువులు, సొంత కుటుంబం అంతటినీ ఒదులుకొని పోవడం మాటలు కాదు అన్నారు.

అసలే దుఃఖంలోవున్న వాళ్లను అనాలోచితంగా బాధపెట్టినందుకు నొచ్చుకున్నారు సారథి. 'మా బిడ్డ అయినా అంతే. ఏం చెయ్యగలం, చెప్పండి. కళ్లు తెరవడం దగ్గర్నుండీ తప్పటడుగుల దగ్గ ర్నుండీ లోకాన్ని పరిశీలించి అర్థం చేసుకోవడం వరకూ మన చాటునవుండి నేర్చుకున్న మనపిల్లలు మన విలువలను హర్షించడం లేదంటే ఆశ్చర్యంగా వుంది' అన్నారు.

సారథి ఆశ్చర్యాన్ని గమనించే స్థితిలోలేని రామారావు తన ధోరణిలో చెప్పుకుపోయారు. 'బంధు వుల్లో తలవంపులు చేసింది...తానూ చెడ్డది. అక్కనూ చెడగొట్టింది. పెద్దది చాలా మెతకపిల్ల. తల పైకెత్తడం అరుదనుకోండి. దాని పెళ్లి చెయ్యాలని నాలుగేళ్లనుండీ చూస్తున్నాం. ఒక్క సమ్మంధం కూడా కుదిరిరాలేదు. బి. ఏ. దాకా చదివి టెంపరరీ గుమాస్తా ఉద్యోగంకూడా లేనివాడు పదివేలు కట్నం తెమ్మంటున్నాడు. ఇప్పుడిహ ఈ పిల్ల యీ పని చేసిం దంటే దానికి పెళ్లి ఎలా చెయ్యగలం!' అన్నారు కన్నీళ్ల తరవాయిగా.

'జరిగిపోయిన దానికి వగచి లాభం ఏమిటి?... మాణిక్యంకూడా నెమ్మదస్తుడిలాగే కనిపిస్తున్నాడు. నాలుగువందల జీతం అంటే తక్కువేమీకాదు. పర్మ నెంటు ఉద్యోగం. ఇంకా అభివృద్ధిలోకి వస్తాడు... కాలం ఇదివరకటి లాగాలేదు లెండి. మారిపోతున్నది. ఇప్పుడెవరూ ఇట్లాంటి విషయాల్ని అంతగా పట్టించు కోడం లేదు. ఊరికే బాధపడకండి' అని ఓదార్చారు సారథి. కళ్లల్లో పెట్టుకు కాపాడిన తల్లిదండ్రుల్ని ఇంత నొప్పిస్తున్న ఆ పిల్లమీద కోపంకూడా వచ్చింది.

'ఇంతచేటు జరిగాక వెధవ ఉద్యోగం, డబ్బూ చూసుకుని పొంగిపోవాలి!' రోషంగా అన్నాడా యువకుడు.

సారథిగారి ఓదార్పు మాటలు రామారావుగారి మీద పనిచేసినై. నాలుగునాళ్లనుండీ బాధపడి అలసి పోయిన మనసు ఏ గడ్డి పరకనో పట్టుకుని విశ్రాంతి తీసుకోవాలని ఆరాటపడుతున్నది. కొడుకు ఉద్రేకం ఆయనకు సరిపడలేదు. 'ఆ వెధవ ఉద్యోగమేదో ఒకటి నీకు దొరకలేదే! పెద్దవాళ్లముందు ఇట్లాగేనా మాట్లాడేది?' అంటూ మందలించారు. ప్రాధేయ పూర్వకంగా సారథితో అన్నారు. 'మీరు చెప్పిందీ నిజమే. ఇప్పుడిహ మేం చేసేది ఏముంది? ఇంకా ఎన్నాళ్లు తిరుగుతాం యిట్లాగ? వాళ్లమ్మ మంచం దిగలేదు. ఎప్పుడూ కూనిరాగాలు తీసుకుంటూ హాయిగా ఆటపాటల్తో గడిపిన పిల్ల. దేనికీ ఎదురుమాటచెప్పి ఎరగనిది. అది ఏమై పోతుందోనని వాళ్లమ్మబెంగ. వాడు దాన్ని నిజంగా పెళ్లి చేసుకున్నాడో లేదో. పిల్ల ఎట్లా వున్నదో అన్ని విషయాలూ మీరే విచా రించి మాకు వ్రాయండి. అది బాగుందని తెలిస్తే మాకు తృప్తి. అంతకంటే ఎక్కువ సంబంధం దానికీ మాకూ ఎలాగూ ఉండదు. ఇహ దాని మొహం మేం ఎందుకు చూస్తాం! అది మీ బిడ్డే అనుకోండి. ఇవి చేతులుకావు. కాళ్లనుకోండి' అంటూ సారథి చేతులు పట్టుకున్నారు లేచి.

సారథిగారూ లేచి ఆయన్ని వారించి తాను స్వయంగా అన్ని విషయాలూ కనుక్కొని వ్రాస్తానని నచ్చచెప్పి పంపారు

వెనక కొడుకు బాగ్‌పట్టుకొని నడుస్తుంటే రేగిన జుట్టుతో నలిగిన బట్టల్తో అలసిన మనస్సుతో ముందు నడుస్తున్న రామారావుగారిఎడల సానుభూతి లాంటిది కలిగింది సారథికి. 'పిల్లలు మరీ అన్యాయం అయిపోతున్నారు. బాధ్యత తెలీడంలేదు' అనుకున్నారు.

ఆ రోజు ఉదయం సారథిగారి పుత్రరత్నం మోహన్ కాలేజీనుండీ పెట్టెపరుపూతోసహా ఇంటి కొచ్చేశాడు. పెద్దల అభిరుచులకు వ్యతిరేకంగా బాగా పెంచేసినజుట్టు నుదురంతా ఆక్రమించి కళ్లకడ్డం పడటం తరవాయిగా వున్నది. ఇంకా మీసాలూ గడ్డాలూ రాలేదుగాని, ఒచ్చినప్పుడు వాటినికూడా ఘోరంగా పెంచేస్తానని సూచించాడు కూడాను. కళ్లల్లోంచి గర్వం ఒలకబోసుకుంటూ నవ్వుకుంటూ 'స్ట్రైక్ చేస్తున్నాం' అన్నాడు. 'ఇంగ్లీషులో చదువుకునే అవకాశం కావాలని' అన్నాడు.

'మీరు ఇంగ్లీషులోనే చదువుతున్నారుకదా' అన్నది ఆశ్చర్యంగా కళ్యాణి.

'ఆయితే మావాళ్లందరికీ కావాలని' అన్నాడు.

రాష్ట్రంలోకెల్లా మంచికాలేజీ, మంచిహాస్టలూ వున్నదని సీటుకోసరం మూడువేలు డొనేషన్‌కట్టి మరీ చేర్పించారు అక్కడ. ఊరికే యిలాంటి అర్థంలేని సమ్మెలుచేసి చదువు పాడుచేసుకుంటూ సోమరిగా తిరగటం సారథిగారికి నచ్చలేదు.

మోహన్ లోపలికివెళ్లి కళ్యాణితో చెబుతున్న మాటలు పెద్దగా వినిపిస్తున్నై. హైస్కూల్లో చదువుతున్నప్పటినుండీ ఎప్పుడు కాలేజీకి పోదామా, ఎప్పుడు స్ట్రైక్‌చేద్దామాఅని కాచుకొనివున్నారట. క్రిందటేడాది ఒక్కస్ట్రైక్‌కూడా రాలేదు. ఇప్పుడైనా చెయ్యకపోతే 'కాలేజిలో చదివాం, స్ట్రైక్ చేశాం'అని ఎట్లా చెప్పుకునేది? అంటూ ఘాటుగా చెప్పుకుపోతున్నాడు. ఈ స్ట్రైక్ సందర్భంలో రైళ్లు ఆపేశారట. పోస్టాఫీసుమీద రాళ్లేశారట. కాలేజిలో బీరువాల గాజుతలుపులూ, కిటికీలూ పగులగొట్టారట. అయ్యవార్లని తిట్టారట. కాలేజిని తగలబెట్టేద్దామా అనుకున్నారటగాని...మోహన్ నవ్వుతూ చెప్తున్న రసవత్తర వీరగాథల్ని ఆనందంతో అమ్మా ఆరాధనతో చెల్లెలూ వింటూ కూర్చున్నారు. ఇంతదాకా విన్న సారథిగారికి తలనొప్పిలాంటిది వచ్చింది.

'నాశనంచెయ్యడం సహజలక్షణంగాగలవాళ్లు కొందరు అన్నికాలాల్లోనూ ఉంటారు. కాని యీ కాలంలో అది సర్వసామాన్యమయిపోతున్నది. మంచి మనసులుకల మంచిపిల్లలు వాళ్ల ఉత్సాహాన్ని నిర్మాణాత్మకంగా మానవ వికాసానికి ఉపయోగించడానికి బదులుగా వినాశానికి ఉపయోగిస్తున్నారు.

మార్పు అన్నది ప్రకృతి సహజమైనదీ, వికాసానికి ఆయువుపట్టూ కావచ్చును. ఇన్ని యుగాలుగా మానవజాతి సంతరించుకుంటూవస్తున్న మూలధనాన్ని పెన్నిధిని మన బుద్ధినైశిత్యంతో పరిశీలించి, విలువైనదాన్ని గ్రహించి మన పరిస్థితుల కనుగుణంగా మలుచుకోవడం మార్పు అవుతుందిగాని దాన్నంతా నాశనంచేస్తే ఏం మిగులుతుంది?

'మనిషికి స్థిరత్వాన్నీ, వ్యక్తిత్వాన్నీ ప్రసాదిస్తున్న ఆ ధర్మం నశించిపోతే మానవజాతికే ముప్పు రాదా?' అనుకున్నారు సారథి విచారంగా.

౨

మాణిక్యం చాల సాధువు. మొదట్లో భయపడి స్వరూపరాణి విషయం తనకేమీ తెలియదన్నాడు. తరువాత తాను స్వరూపను రిజిస్ట్రారు ఆఫీసులో పెళ్లి చేసుకున్నట్లు సర్టిఫికెట్టు తెచ్చి చూపించాడు. వెంటనే తీసుకెళ్లి పెళ్లిచేసుకోకపోతే ఆత్మహత్య చేసుకుంటానని ఆ అమ్మాయి బెదిరించినందువలననే యిలా చేశానన్నాడు. సారథిగారి కోరికమీద ఆ స్వరూపను వారింటికి తీసుకొనివచ్చాడు.

స్వరూపరాణి చూడముచ్చటగా వున్నది. కళ్యాణి దగ్గర సిగ్గుపడుతూ ఒదిగికూర్చుంది. ముక్తసరిగా సిగ్గుపడుతూ మాట్లాడ్డం ఆ అమ్మాయి తరహా.

కాని మాటలు గమనిస్తే చాల ధైర్యంగలపిల్లని తెలుస్తున్నది.

తన అక్క ధర్మవాణికి తన తల్లిదండ్రులు ఇప్పట్లోనూ ఎప్పట్లోనూ పెళ్ళిచెయ్యగలరన్న నమ్మకం ఆ అమ్మాయి కున్నట్లులేదు. మాణిక్యం తల్లిదండ్రులులేని ఒంటరిగాడు గనుకనూ, అతని ఆరోగ్యం మంచిదికాదుగనుకనూ తానే దగ్గరుండి చూసుకోవాలని తొందరలో పెళ్ళిచేసుకున్నదట. తాను చేసిన పనిని తర్వాతనైనా తలిదండ్రులు హర్షిస్తారనే నమ్మకంతో వున్నది. ఆ అమ్మాయి తండ్రిదీ అన్నదీ ధోరణివిన్న కళ్యాణికి ఆ పిల్ల నమ్మకంచూసి చాల జాలి కలిగింది. 'మీవాళ్ళు నీవు చేసిన పనిని క్షమించవచ్చునుకాని మీ యింటికి వస్తారనిమాత్రం ఆశించకు' అని చెప్పింది. అంతా విని స్వరూప నవ్వి వూరుకున్నది.

పెద్దల అండదండలు లేకుండా సొంతంగా యిల్లు ఏర్పరచుకొని, కొత్తసంసారంతాలూకు ఒడిదుడుకుల్ని తట్టుకుంటూ దిద్దుకోవలసిన ఆ చిన్నపిల్లమీద జాలితోపాటు అపేక్షకూడా కలిగింది కళ్యాణికి. ఇంటికి కావలసిన వస్తువులు ఏవి ఎక్కడకొంటే బాగుంటుందో సలహాలిచ్చి ధైర్యంచెప్పి పంపించింది.

వాళ్ళ విషయాలన్నీ వివరంగా రామారావుగారికి వ్రాశారు సారథి. ఇహ తమ బెంగ తీరిందంటూ ఆనందంతో కృతజ్ఞతా పూర్వకంగా ప్రత్యుత్తరం వ్రాశారాయన.

* * *

కాలేజీ పిల్లల సమ్మె సాగుతూనే ఉన్నది. మోహన్‌కి పాతసినిమాహాలులంటే చిరాకు. అటువంటి హాల్సులో సినిమాలు చూస్తూ, ఇంట్లో కూర్చొని వుండటం చురుకూ దుడుకూగల స్వభావానికి కష్టంగా ఉన్నది. అయినా సమ్మె కొనసాగించే విషయంలో మాత్రం కృతనిశ్చయంతోనే ఉన్నాడు.

కొడుక్కి యుక్తాయుక్త వివేచన కలిగించాలనే భావం కలిగింది సారథిగారికి.

'రైలూ పోస్టాఫీసూ మన అవసరాలుకదా. సమ్మె అంటూ వాటిని పాడుచేసుకోడం బాగాలేదు' అన్నారు.

మోహన్‌కి ఈ లోకంలో వుండే ప్రతిప్రశ్నకూ సమాధానం తెలుసు.

'వెంటనే బాగుచేస్తారు వాళ్ళు' అన్నాడు.

'వాళ్ళెవరు?'

'ప్రభుత్వం'

'ప్రభుత్వం అంటే దానికి డబ్బుకట్టేది మనమేకదా. మనకే నష్టం'

'ఇదంతా చెయ్యకపోతే వాళ్ళు వినరే! ఇట్లా చేస్తే పరీక్షలు ఎప్పుడు పెట్టమంటే అప్పుడు పెడతారు. జీతాలు తగ్గించమంటే తగ్గిస్తారు. ఫలానా పుస్తకాలు చదవం అంటే ఎత్తేస్తారు. ఏం చెబితే అట్లా చేస్తారు.'

'అయినా యిట్లాంటి నాశనం చేసేపనులు మంచివికావు. వాళ్ళైనా చిన్నవిషయాల్లో కొన్నిట్లో వెనక్కిపోయి వుండొచ్చు. ఇది అట్లాంటిదికాదే. పెద్దవాళ్ళు దీన్ని క్షుణ్ణంగా పరిశీలించి, మాతృభాషలో విద్యాబోధనవలన మీకూ దేశానికీ మంచిదనే నిర్ణయానికివచ్చిన మీదట చేసిన పని. దీంట్లో వాళ్ళు వెనక్కిపోరు. ఇదంతా పిల్లల ఆటాకాదు. వాళ్ళు పిల్లలూ కారు'.

మాకు మంచిదనితోస్తే ఎందుకు కాదంటాము?...ఈ నిర్ణయాలు చేస్తున్న వాళ్లలో చాలా మంది పిల్లలూ మనమళ్ళూ ఇంగ్లీషులోనే చదువుతున్నారు. చెప్పేదొకటీ చేసేదొకటీ అయితే ఎవరు నమ్ముతారు?' అన్నాడు మోహన్ ఎగతాళిగా.

'ఇంత పెద్ద సమస్యలు పరిష్కరించవలసి వచ్చినప్పుడు నీవూ నేను అంటూ ఆలోచిస్తే కుదరదు. విశాలమైన దృక్పథంతో ఆలోచించాలి.'

'అదంతా మాకు తెలియదు. ఇంగ్లీషువలన ఒచ్చే లాభాలన్నీ కొందరిక్కావాలి. విశాల దృక్పథం వలన కలిగే ఫలితాలు మిగతా వాళ్లకు చెందాలిఅంటే మేం ఒప్పుకోం' అన్నాడు మొండిగా.

సారథిగారు ఈ విషయంలో ఎక్కువ మాట్లాడ లేకపోయారు.

'మీకు స్వార్థంతప్ప యింకోటి అర్థం అయ్యేట్లు లేదు...సరే, మీ కాలేజీ భవనాలు తగలబెట్టెయ్యాలను కున్నానుంటివే. మంచిసదుపాయాలుండే కాలేజిఅని అక్కడచేరి దాన్ని తగలబెట్టుకుంటే ఎవరికి నష్టం?' అని అడిగారు.

'తగలబెట్టలేదుగా. ఊరికే అనుకున్నాం. ఎన్నో అనుకుంటాం.'

'కనీసం మీ మంచి ఏదో తెలుసన్నమాట... ఇప్పుడుమాత్రం ఊరికే చదువు పోగొట్టుకుంటూ సోమరిగా కాలం గడుపుతున్నారు. ఎట్లాగూ యీ స్ట్రైక్‌లో గెలవలేరు. ఇది ఎవరికి మంచి?' అన్నారు సారథి విసుగ్గా.

మోహన్ నవ్వి ఊరుకున్నాడు.

## 3

కాలేజీ విద్యార్థుల సమ్మె విజయవంతంగా ముగిసింది. ఇంగ్లీషులో నూటికి నలభై మార్కుల కంటే హెచ్చుగా తెచ్చుకున్నవాళ్లందరికీ ఇంగ్లీషులో చదువుకునే అవకాశం కల్పిస్తామని ఒప్పుకున్నారు ప్రభుత్వం. వాళ్లు యిలా వెనక్కుపోవడం సారథిగారికి ఆశాభంగం కలిగించింది. నిస్పృహకూడా కలిగింది. ఈ పరిస్థితుల్లో యువతరం బాధ్యత లెరిగిన వ్యక్తులుగా రూపొందడం సాధ్యంకాదు. దానిక్కారణంకూడా పెద్దల్లోనే ఉన్నది. స్వార్థంతప్ప మరో ధర్మంలేని ప్రపంచం కుక్కలు చింపిన విస్తరికాదా? అప్పుడు ప్రపంచాన్ని ఏకంచేసేదీ, రక్షించేదీ అయిన సత్యం ఎక్కడుంటుంది? ఎటు చూచినా నిరాశాజనకమైన నల్లనిచీకటి కనిపించింది సారథికి.

పెద్దజ్యోతిని ఎంబ్రాయిడర్‌చేసిన గురుషర్టు వేసుకొని వెలుగురేకలాగా దూసుకొచ్చాడు మోహన్, 'నేను యివాళే కాలేజికి వెళ్లిపోవాలి. అటెండెన్సు పోతుంది'అని ఆత్రపడిపోతూ.

'సరే, వెళ్దువు. మొత్తానికి మీరే గట్టివాళ్లురా. గెలిచారు' అన్నారు సారథి.

'నాన్నా, మీ స్నేహితులు తెనాలి రామారావుగా రొచ్చారు...'అంటూ లోపలికొచ్చింది గౌరి. 'కూర్చో మని చెప్పావా?' అంటున్న తండ్రి ప్రశ్నను విననట్లు లోపలికి వెళ్లిపోయింది.

సారథి వరండాలోకి వెళ్లేసరికి కుర్చీ లాక్కుని కూర్చునిఉన్నారు రామారావు. 'అబ్బ, ఊరికి మరీ యింతదూరాన తీసుకున్నారు యిల్లు...మీదగ్గరికి ఎవరైనా రావాలంటే కష్టం' అన్నారు నవ్వుతూ, చెమట తుడుచుకుంటూ.

ఆయన ఇదివరకటి దిగారిల్లి పోయిన మనిషి కాదు యిప్పుడు. సంతోషంగా ధైర్యంగా ఉన్నారు. స్నానంచేసి, తలదువ్వుకొని, చలువ బట్టల్లో శుభ్రంగా ఉన్నారు. వెంట బాగ్ లేదు.

'మీ అమ్మాయి ఎలా వుందో స్వయంగా చూచి వెళ్లాలని ఒచ్చారా? వాళ్ల సంసారం సవ్యంగా ఉన్నదా? అమ్మాయికేమీ కష్టంలేదు గద?' అంటూ కుశలప్రశ్నలు వేశారు సారథి.

'మా అమ్మాయి కింకేం ఫరవాలేదండి. మాణిక్యంకూడా మంచివాడు...ఏం కష్టముంటుంది'... అన్నారు రామారావు ఉత్సాహంగా. ఏదొచ్చినా పట్టలేని భోళామనిషి అతను.

'అవుననుకోండి...అయినా, మీరు ఇదివరలో చెప్పినట్లు మతం మార్చుకోడం చిన్నవిషయంకాదు. అందులో హిందూమతానికి చెందినవాళ్లు యితర మతస్థుల్ని పెళ్లాడితే మరింత కష్టం. ఎందువల్లనంటే హిందూమతం అన్నది కేవలం దైవధ్యానానికీ స్థూలంగా నైతిక దృక్పథానికీ మాత్రమే పరిమితమైనదికాదు. దైనందిన కార్యకలాపాలన్నిటిలోకీ చొచ్చుకొనిపోయి, అంతటినీ చైతన్యవంతం చెయ్యడానికి పూనుకొన్న పద్ధతి గలది. అందువలన...'

సారథిగారి మాటల్ని తేలిగ్గా తోసేశారు రామారావు.

'అందరం రక్తమాంసాలతో ఏర్పడిన మనుష్యులమే. ఏ పేరు పెట్టుకున్నా ఆ దేవుడూ ఒకడే.

అయినప్పుడు మధ్యన యీ భేదాలన్నీ ఊరికే తెచ్చి పెట్టుకున్నవే గదా. మనది ఉత్తమమైన సెక్యులర్ రాజ్యాంగపద్ధతి. మహాప్రవక్తల దగ్గర్నుండీ గొప్ప వాళ్ళంతా కులాలూ మతాలూ లేవంటూంటే, కులాంతర మతాంతర వివాహాల్ని ప్రోత్సహిస్తూవుంటే మీవంటి తెలివిగలవారు ఉదార స్వభావులు యింకా పాతకాలపు మాటలు మాట్లాడ్డంలో అర్థంలేదు... మా అమ్మాయి పెళ్ళి గురించి మా బంధువు అందరూ మొహాలు తప్పించి గుసగుసలాడుకున్నారండీ. ఆ, ఎక్కడైనా బంధువులకుండే రోగమే అంత. వాళ్ళకంటే బయటవాళ్లే ఎంతో మేలు. అసూయా, కుత్సితమూ లేకుండా వుంటారు. అక్కడ మా క్లబ్బు వాళ్ళకి చిన్నపార్టీ యిచ్చానులెండి అమ్మాయి పెళ్ళి సందర్భంగా. అప్పుడు వాళ్ళు నన్ను ఆకాశానికెత్తేశారు. సంస్కర్తననీ విశాలభావాలు కలవాణ్ణనీ అన్నారు. అయినా నా గొప్ప ఏముంది లెండి. పిల్లలు ముందడుగు వేశారు. ఇప్పుడిలాంటి వన్నీ పెద్దవాళ్ళిళ్ళలో కొల్లలు.. అంతేకాకుండా అన్నింటి కంటే ముఖ్యవిషయం మా రూప కోరుకున్న వాడిని చేసుకొని చేతినిండా డబ్బుతో సుఖంగా ఉన్నది. అంతకంటే ఏం కావాలి!...ఎల్లైనా ఆది మొదట్నుండీ మంచి తెలివిగల పిల్ల. ఇంకా చెప్పాలంటే మా పెద్దపిల్ల అంత చురుకైనదికాదు...'

ఆయన ధోరణికి సారథి ఆశ్చర్యపోయారు. ఆయన ఇదివరలో మాట్లాడిన తీరుకూ, యిప్పుడు వెలిబుచ్చుతున్న అభిప్రాయాలకూ ఏమీ సంబంధం లేకుండా వున్నది!

కాబట్టి ఆయన్నిగురించి ఆయనకు తెలిసిన దానికంటే ఆయన కూతురు స్వరూపకే ఎక్కువ తెలుసన్నమాట! పెద్దలు తమ మనసు తాము తెలుసుకోకుండా, చెప్పేది చెయ్యలేకుండావున్నప్పుడు వారు నమ్మలేకుండావున్న సూత్రాల్ని పిన్నలు త్రోసిరాజనటంలో ఆశ్చర్యమేమీలేదు. స్వార్థమూ ధైర్యమూ కలిసియిచ్చే ఉత్సాహంతో, ఆలోచనల బరువులేకుండా ముందుకు సాగిపోతున్న పిన్నలు వయసుకు పెద్దలైన వారు పరిష్కరించుకోలేని సమస్యలను విడదీస్తూ వారు త్రెంచుకోలేని శృంఖలాలను ఛేదిస్తూపోతున్నారు.

రామారావుగారిలో స్థిరమైన నమ్మకాలూ లేవు, ఉన్నతమైన వ్యక్తిత్వమూలేదు. కాని ఆయనలో ఉన్న స్థిరత్వం, సత్యం ఆయనకూ కూతురికీ మధ్యన వున్న సంబంధంలో ఉన్నది.

సత్యస్వరూపుడైన భగవంతుడు మనిషిలోనూ లేడు. మనిషి పూజించేమూర్తిలోనూలేడు. మనిషికీ మూర్తికీ మధ్యనఉన్న సంబంధంలోనే ఉన్నాడు.

ఆ సంబంధం జీవించివున్నంతకాలం, దాన్ని మనుష్యులు ఒక గ్రామఫోను రికార్డుగా మార్చనంత కాలం, ఒక మనిషి యింకో మనిషిని ప్రేమించినంత కాలమూ—

తండ్రికీ కొడుక్కీ మధ్యగా వారి తలలపై ఎగురుతూ నిలిచివుండి వారిద్దరినీ ఏకంచేస్తుండే పవిత్రాత్మ ప్రపంచాన్ని రక్షిస్తూనే ఉంటుంది!

రామారావుగారు తమ స్వరూపను కాదనుకోనందుకు సంతోషిస్తూ 'ఇంతట్లో మా మోహన్‌కి వచ్చిన గొప్పలోటేమీ లేదేమో. వాళ్ళనీ సురక్షితంగా వడిపించేది ఏదో ఉన్నది' అనుకొని నిట్టూర్చారు సారథి.

# ముందడుగు వేస్తున్న కథానిక

శ్రీ రామమోహనరాయ్

సాహిత్య ప్రక్రియలలో కథానిక వయస్సులో చిన్నది. ఇప్పుడిప్పుడు యౌవనం ప్రవేశించింది. పడుచుదనపు లావణ్యం ఒలకబోస్తున్నది. ఈ శతాబ్దపు ప్రారంభంనుండీ కథానికలు వెలువడుతున్నప్పటికీ స్వాతంత్ర్యానంతరం వెలువడుతున్న కథానికలను పరిశీలించితే చెప్పుకోదగిన ప్రగతి యిటీవల కన్పిస్తున్నది. జీవితానుభవాలను రంగరించి, జీవిత వాస్తవికత ఉట్టిపడేటట్లుగా శిల్పనైపుణ్యాన్ని ప్రదర్శిస్తూ కల్పనా సాహిత్యంలో విశిష్ట స్థానాన్ని పొందిన కథానికలను శ్రీ గురజాడ మొదలుగా ఎందరో వ్రాశారు. కథావస్తువును గృహసమస్యలకే పరిమితం కాకుండ, ప్రేమా పెళ్లితోనే ముడిపెట్టి సరిపుచ్చుకోక, సంస్కారాన్ని కలిగింపజూచే, సాంఘిక దురాచారాలను ఖండించే కథానికలను ఆ నాటిమేటి రచయితలు వ్రాశారు. ముందుకు నడుస్తున్నట్లుగా కన్పిస్తూనే మళ్లీ 'సెంటిమెంటు'కు అధిక ప్రాధాన్యమిచ్చేవి, ప్రేమా—పెళ్లీ లేకపోతే విఫలప్రేమలుమాత్రమే వర్ణింపబడినవీ, ఏ స్పందనా కలిగించని రోజువారీ సంఘటనలను పూసగుచ్చినట్లు చెప్పేవి తామర తంపరగావచ్చి, ఏ మాత్రం ప్రగతి కనుపించక పోగా మన కథానికాబాల పీలగాకూడా తయారైనది.

చలంగారి కథలు అత్యంత శక్తివంతంగా వెలువడిన విస్ఫులింగాలు. చురుక్కు మనిపించే భాష, మహాకవులకు సాధ్యమైన భావుకత, కాళ్లక్రిందభూమి తొలుచుకు పోయేటట్లుగా చేసిన ఆలోచనలు వారి కథలలోని ప్రత్యేకతలు. చలంగారిని అనుకరింప చూచిన రచయితలందరూ తలకొక విధంగా వారి ఆలోచనలను ప్రక్కత్రోవలు పట్టించారు. వారికథల లక్ష్యాన్నిగాని, శిల్పాన్నిగాని అనుకరింపజూచిన వారెవ్వరూ అందుకోలేకపోయారు.

మధ్యతరగతి జీవితాన్ని చక్కగా అర్థం చేసుకొన్న ఉత్తమ రచయిత శ్రీ త్రిపురనేని గోపీచంద్. ఆర్థిక సమస్య నడిమితరగతి జీవితపు విలువలనెట్లా మార్చివేస్తుందో తన రచనలలో బాగా వివరించారు. రాజకీయాలతో కథలకు సంబంధం యేర్పఱచారు. తానే సమాజానికి కీలకమైన వ్యక్తి ననుకొనే అసమర్థుల ఆలోచనలను చక్కని శిల్పవిన్యాసంతో అందించారు. రాజకీయంగా తనకు నచ్చని రాజకీయవాదుల ఆలోచనలను హేళన చెయ్యటానికి గోపీచంద్ కథానికలలో ప్రదర్శించిన నేర్పరితనం 'హ్యూమనిస్టు' ఆలోచనలుగలవారిని బాగా ఆకట్టుకొన్నది. గోపీచంద్ కథలలోని 'టెక్నిక్'గాని, భాషగాని తర్వాత వారెవ్వరికీ బాగా పట్టుబడినట్లు లేదు.

శ్రీ బుచ్చిబాబు సౌందర్యోపాసకుడు. 'స్త్రీ', 'ప్రకృతి సౌందర్యం'; 'జీవితానికి అర్థమేమిటి?'— ఇలాంటి విషయాలు తన మనస్సును కలతపెట్టగా చిత్రకారుని కౌశలం, కవితాత్మకమైన వచనరచనతో కథలు వ్రాశారు. కృతకమైనభాష, మన వాతావరణానికి భిన్నంగా కనుపించే భావుకవైచిత్రి ఉండటం చేత కొందరికి మాత్రమే బాగా నచ్చుతాయి. సోమర్సెట్ మామ్ రచనాపద్ధతి కొంత బుచ్చిబాబుగారి కథలలో కన్పిస్తుంది.

దశాబ్దాల తరబడి కథానికా రచనలో వెలుగు కంబాలను నాటుకుంటూ ముందుకు నడుస్తున్నవారు శ్రీ కొడవటిగంటి కుటుంబరావు. వర్గపోరాటాన్ని

కథలలో ప్రవేశపెట్టిగూడ శిల్పాన్ని విడిచిపెట్టక, వైవిధ్యాన్ని సాధించిన మేటిరచయిత. కార్మిక సమస్యలైనా, మధ్యతరగతివారు నిత్యమూ అనుభవించే ఆర్థిక సమస్యలైనా, సినిమాఛాన్సులకోసంవెళ్లి అగచాట్లుపడే 'ఎక్స్ట్రా'ల జీవితాలైనా, 'డిప్రెషన్'నాటి ప్రజల దుర్భరజీవితమైనా, అణచిపెట్టబడిన 'సెక్స్'వాంఛలు బహిర్గతం కావటాన్ని రకరకాలుగా చిత్రించటంలో నైనా కుటుంబరావు చాకచక్యం కనబరుస్తారు. వాస్తవికతను పోగొట్టుకొన్న అభూతకల్పన లెప్పుడూ ఆయన కథలలో కన్పించవు. గొప్పవ్యంగ్యంతో వ్రాసిన డిటెక్టివ్‌కాయాస్ కథలైనా, బెదిరిన మనుష్యులు సీతప్పా, రాధమ్మల కథలైనా, ఆయన బహుముఖ ప్రజ్ఞను చాటేవే. 'కొత్తజీవితం'అన్న ఒక కథలో పట్నంచేరిన కార్మికుడు తన తల్లిప్రేమకూ తోడి కార్మికుల ప్రేమకూ వ్యత్యాసాన్ని తెలుసుకొని, స్వార్థ పూరితమైన తల్లిప్రేమకంటె తోడికార్మికుల సఖ్యమే మేలని తలుస్తాడు. ఇటువంటి కథలు, ఇంకా 'కురూపి' లాంటి కథలు వ్రాయగల కుటుంబరావుగారి ధైర్యాన్ని అభినందించకుండా ఉండలేము. తెలుగులో గొప్పకథా రచయిత లెవరంటే సాధారణంగా కుటుంబరావుగారి పేరు, రాచకొండ విశ్వనాథశాస్త్రిగారి పేరూ కలిసి కట్టుగా వినిపిస్తూఉంటాయి.

అభ్యుదయ రచయితలలో పేదవాళ్ల కడగండ్లను కథావస్తువులుగా స్వీకరించి 'మూగజీవాల' గోడును కళాత్మకంగా వెలువరించిన ఖ్యాతి మాధవపెద్ది గోఖలేగారిది. సాహిత్య చిత్రకళారంగాలనుండి సినిమా కళకు గోఖలే అంకితమయ్యారు. కథలు వ్రాసే టప్పుడు గోఖలే కలం కళాఖండా లనదగిన బొమ్మలు గీస్తుంది. రాజకీయ సమస్యలను లోతుగా పరిశీలించి అభ్యుదయ దృక్పథంతో తీర్పరించి అద్భుతమైన కథలు వ్రాశారు శ్రీ అట్లూరి పిచ్చేశ్వరరావు.

కళావిలువల నెఱింగిన రచయితలు తొందరపడి వ్రాసి అచ్చులో పేరుచూసుకొని ఆనందపడే ప్రలోభానికీ, పత్రికలవాళ్లూ ప్రచురణ కర్తలూ యిచ్చే చిల్లరడబ్బులకీ వ్యామోహపడి విరివిగా వ్రాయరు. అందుకే చాలకాలంనుండి వ్రాస్తున్నప్పటికీ ప్రేరణ కలుగనప్పుడు సంవత్సరాల తరబడీ మౌనం వహించిన వారు చాగంటి సోమయాజులు, రాచకొండ విశ్వనాథ శాస్త్రి, కాళీపట్నం రామారావు, పాలగుమ్మి పద్మరాజు మొదలైనవారు. నిరంతరమూ జీవనదిలా ప్రవహించిన కలం కుటుంబరావుగారిదే.

రాచకొండ విశ్వనాథశాస్త్రిగారి రాకతో తెలుగు కథ శక్తిని పుంజుకొన్నది. కథలలో కవిత్వాన్ని వాలికించటం శాస్త్రిగారి ప్రత్యేకత. అది జీవితపు బాధలలో నుండి దూసుకొనివచ్చి గుండెల్ని తాకేది. పతితులూ, బాధాసర్పదష్టులూ, దీనులూ, హీనులూ సమాజంలో అట్టడుగుననున్నవారి జీవితాలనూ నిశితంగా పరిశీలించి, వారి మాటల్ని వారి నుడికారంలోనే పలికిస్తారు. వారి బాధలకు మూలకారణమేమిటో అన్వేషించి, కారుణ్యంతో కదిలిపోయి ఆ బాధలను తొలగించుకోవటానికి తరుణోపాయాలను సూచిస్తారు. 'మంచిచెడ్డల్లో ఏకథ?' 'వర్షం'వంటికథ లెన్నింటి వలననో ప్రసిద్ధి పొందినప్పటికీ ఆరుసారాకథలతో వారి ఖ్యాతి మిన్నుముట్టింది. ఇటీవల వారు వ్రాసిన 'పిపీలికం'; 'తప్పు'; 'వేతనశర్మకథ'; 'షోకుబిల్లి' ఏకథ కాకథే గొప్పకళాఖండమని చెప్పతగినవి. శ్రీ శ్రీ 'ఋక్కులు' అనే గీతంలో కవితావస్తువులుగా పనికొస్తాయని చెప్పిన కుక్కపిల్ల; అగ్గిపుల; సబ్బుబిళ్ల; బల్లచెక్క; అరటితొక్క; రొట్టెముక్క; తలుపుగొళ్లెం; హారతిపళ్లెం—అనేవాటిని స్వీకరించి గొప్పకథలు వ్రాశారు. ఈ కథలు చదివినవారెవరైనా శ్రీ శ్రీ ఊహించిన శబ్దాలకు కళారూపమిచ్చిన రా. వి. శాస్త్రిగారి ప్రజ్ఞను కొనియాడకుండ ఉండలేరు. అంతర్జాతీయ స్థాయిలో ఏ మహారచయితకూ తీసిపోని కథలు వ్రాశారు. వారి కథలను అనుభవించి పలవరిస్తున్న యువతరం కథారచయితలకూ చదువరులకూ యీ సంగతి తెలుసు.

శ్రీ రా. వి. శాస్త్రిగారి పేరు వెంటనే జ్ఞాపకానికొచ్చేవి బీనాదేవిగారి కథలు. రా. వి. శాస్త్రిగారి కథలు కలిగించే అనుభూతినే కలిగిస్తాయిగాని

వాటికి అనుకరణలు మాత్రం కావు. కథావస్తువులలో గొప్ప వైవిధ్యం సామాజిక చైతన్యాన్ని కలిగించే స్ఫూర్తి ఉంటాయి. విషాదసమ్మిళితమైన ఉత్తమ హాస్యమూ, అన్నిరకాల వ్యక్తుల జీవనసరళీ, డబ్బు పేదవాడి గొంతుక నులుముతున్నప్పుడు వాడు చేసే ఆఖరి ఆక్రందనమూ వీరి రచనలో కనిపిస్తుంది. వినిపిస్తుంది. 'ఏమేటర్ ఆఫ్ నో ఇంపార్టెన్స్'; డబ్బు; తొడిమిలేని పువ్వు; రాధమ్మ పెళ్లి ఆగిపోయింది మొదలైన వీరి కథలు తెలుగు కథల విలువను పెంచేవి.

కొంతకాలం రచన ఆపివేసి తిరిగి నూతన నోత్తేజంతో తెలుగు కథ మున్నెన్నడూ ఎరుగనంతగా వాస్తవికత; ప్రగతి భావాలూ; కళావిలువలూ కలగలుపుగా ఉత్తమ కథానికలను వెలువరించిన ఖ్యాతి కాళీపట్నం రామారావుగారిది. వారు వ్రాసిన యజ్ఞం; చావు; భయం; జీవధార; స్నేహం; నోరూమ్— ఇంకా ఎన్నో కథలు విప్లవాన్ని కోరుతున్న నేటి యువ రచయితలను ప్రాణపదంగా ఆకట్టుకొన్నాయి. మేధావులు కదిలిపోయి రామారావుగారి కథలలోని శిల్పసృష్టికి అచ్చెరువొందుతున్నారు. హరిజనుల జీవితాన్ని ఉద్ధరించాలని వ్యాసాలు వ్రాసేవారు, ఉపన్యాసాలు యిచ్చేవారేగాని కీర్తిశేషులు ఉన్నవవారి తర్వాత ఆ దీనుల జీవితాన్ని వర్ణించినవారు తక్కువ. వారి జీవితాలను యింకా సన్నిహితంగా పరిశీలించి, ఆర్థిక సమస్య వాళ్లమధ్య ఎటువంటి భేదాల నేర్పరుస్తున్నదీ—తల్లికీ బిడ్డకూ, భర్తకూ భార్యకూ కాకుండ చేస్తున్నదీ వారు 'ఆర్తి' అనే కథలో వర్ణించారు. యజ్ఞంకథ విమర్శకులనూ, చదువరులనూ బాగా ఆలోచింపజేసింది. ఓ గ్రామంలో పేద హరిజన రైతు చితికిపోయిన మరొక మధ్య తరగతి రైతుదగ్గర ఏనాడో చేసిన అప్పు తీర్చటానికిగాను, తన కొడుకులు కండలు కరగించి పండించుకొంటున్న పొలాన్ని యిచ్చెయ్యటమా మానటమా అన్న తగవు మీద నడుస్తుంది కథ. తగవుల తీర్పు ఆ ఊళ్లోనే జరగాలని ఊరివారంతా కట్టడి చేసుకోవటాన, పెద్దలూ పిన్నలందరి సమక్షాన హరిజన రైతు అప్పలరాముడు, ఆ అప్పెలా పెరిగిందో తన చిన్ననాటినుండి ఆ నాటివరకూ పరిస్థితుల్ని వివరిస్తాడు. అప్పు తీర్చటానికే చివరికి సిద్ధపడతాడు. అతడిచిన్న కొడుకు సీతారావుడు భూమిని అప్పగించి బానిస బ్రతుకు బ్రతకటం యిష్టంలేక తనకొడుకు బానిస బ్రతుకు బ్రతకటానికి వీల్లేదనిచెప్పి, పిల్లవాణ్ణి చంపి గోతంలో ఎత్తుకొచ్చి అందరి ఎదుటా పడవేసి తరువాత లొంగిపోతాడు. శ్రీ కొడవటిగంటి—'యజ్ఞం' మొదటిసారి చదవగానే నాకు చప్పన గురజాడ రాసిన 'మీ పేరేమిటి'? జ్ఞాపకం వచ్చింది. ఈ రెండింటి మధ్యా ఎన్నో పుష్కరాల ఎడం ఉన్నది. కాని ఇలాటి కథ మరొకటి అడ్డం ఉన్నట్టు నాకు తెలీదు. గురజాడ ఒక గ్రామానికి సంబంధించిన మౌఢ్యాన్ని గురించిరాస్తే కాళీపట్నం ఒక గ్రామానికి సంబంధించిన రాక్షసాన్ని గురించి రాశాడు.' అని అన్నారు. ఇంకా 'యజ్ఞం' 'ఆర్తి'లాటి కథలు ప్రపంచ యుద్ధానికి పూర్వం వచ్చి ఉండటం సాధ్యం కాదు. ఈ కథలలో విశేషమేమంటే అట్టడుగు జీవితంలోని అంతస్సంఘర్షణకూడ, దాని వెనుకఉన్న భౌతిక కారణాలతోసహా స్పష్టంగా కనిపిస్తుంది' అని కూడ అన్నారు. శ్రీ రా వి. శాస్త్రి—చెఖోవ్ రాసిన 'ఇన్‌దిగలీ' అనే కథను క్లుప్తంగాచెప్పి ఆ కథలోని బండవాడు చెప్పిన బతుకుమాటలు కాళీపట్నం రామారావుగారినిచూచినప్పుడు జ్ఞాపకాని కొస్తాయని చెప్పారు. ఒక కథా రచయిత గొప్పతనానికి మరి యిద్దరు మేటి రచయితల మెప్పుకంటె చరితార్థత మరేముంది? 'భయం' కథలో నిడపట్టున బ్రతికే తల్లుల స్వార్థమూ, దుర్మార్గపుటాలోచనలనూ వర్ణించారు. భయం మనుష్యుల రక్తాన్ని నీళ్ళుగా మారుస్తుందనిచెప్పి అసమర్థులు మంచి వాళ్లెప్పుడూ కాలేరంటారు. దుర్మార్గాన్ని ఎదుర్కోవటానికి వీల్లేనప్పుడు అసహాయులు ఎట్లా పరివర్తన పొందుతారో చక్కగా వర్ణించి 'జీవితం మనిషిలో మార్పుతెస్తుంది. అందుకు అనుభవం కారణమవుతుంది' అంటారు. జీవధార, నోరూమ్ మొదలైన కథలుకూడ కష్టజీవుల కడగండ్లను వివిధ దృక్కోణాలనుండి వర్ణించి,

చదివే వారిలో గొప్పసంచలనం కలిగించగలవి. నేటి యువతరం కథా రచయితలపైన కాళీపట్నం రామారావుగారి ప్రభావమే అత్యధికంగా కన్పిస్తున్నది.

పెద్దకథలు వ్రాయటంలో నేర్పు కనబరిచే కొద్దిమందిలో కాళీపట్నం తరువాత చెప్పుకొనతగిన వారు శ్రీ బలివాడ కాంతారావు. లేమిలో జీవించే మనుష్యుల జీవితాలను సంపాదనచాలక అగచాట్లుపడే మధ్యతరగతి మనుష్యులతత్వాలను చక్కగా విడమర్చి చెప్పుతారు. వర్గపోరాటమే సమస్యలకన్నింటికీ తరుణోపాయమని అనుకోనక్కరలేదనీ కొన్నిచోట్ల చిత్తశుద్ధితో కృషిచేస్తే పరిస్థితులు మెరుగౌతాయనే అభిప్రాయాలను 'అభ్యుదయం' 'అన్నపూర్ణ' మొదలైన కథలలో వ్యక్తం చేశారు. కాంతారావుగారు విరివిగా కథలువ్రాసి పాఠకుల అభిమానం చూరగొన్నవారు.

చాగంటి సోమయాజులుగారు కథా రచనలో అంతులేని వైవిధ్యమూ, సౌందర్యమూ సాధించారు. మనస్తత్వపరిశీలనతో మనిషికీ మనిషికీ మధ్యగల రాగబంధాలను ఒడుపుగా కథలుగా మలచటంలో చా. సో నేర్పు అనితరసాధ్యం. శ్రీ పురాణం సుబ్రహ్మణ్యశర్మ చెప్పినట్లు చా. సో. కథయు చా. సో. వ్రాయవలసిందే. ఆ కథావస్తువులు మరెవ్వరికీ లభించవు. జీవితం ఎంత గంభీరమైనదో చా. సో. కథలంత గంభీరమైనవి. దశాబ్దాలకిందట వ్రాసిన కథలైనా, ఇటీవల వ్రాసిన కథలైనా చదివేటప్పుడు నిత్యనూతనంగా ఉండటం వారి ప్రత్యేకత. ఎంపు; లేడీకరుణాకరం; ఎందుకు పారేస్తాను నాన్నా?; కర్మఫలితం — యింకా ఎన్నో కథలు చా. సో. కీర్తికి జేగంటలు. పట్టణంలో బడ్డీకొట్టు పెట్టుకొన్నవాడి కొట్టు ఖాళీచేయించి, తనవాడొకడిచేత అదేచోట కొట్టుపెట్టించి లాభం చేసుకొన్న కౌన్సిలర్ మనస్తత్వాన్ని ఒక కథలో రమణీయంగా చిత్రించారు. ఆలోచనాపరులు జ్ఞాపకముంచుకోదగిన కొన్ని మంచికథలను శ్రీ జి. వి. కృష్ణారావు రచించారు.

'సెక్స్' సమస్య లేవిధంగా జీవితంనుండి విడదీయరానివో వివరించే కథలను పెక్కింటిని శ్రీ ధనికొండ హనుమంతరావు, రావూరి భరద్వాజగారలు వ్రాశారు. దగాపడిన తమ్ములూ, వంచింపబడిన స్త్రీలూ, భరద్వాజగారి కథలలో కన్పిస్తారు. సంభాషణలు అతి సహజంగా వ్రాయటం వీరి ప్రత్యేకత.

జీవితం ఎంత విషాదభరితమైనా అనుభవించ గలిగినవారికి దానిలో అంతహాస్యమూ ఉన్నది. విషాదాన్నీ హాస్యాన్నీ మేళవించి గొప్పకథలను వ్రాశారు శ్రీ పురాణం సుబ్రహ్మణ్యశర్మ. 'సీలి'కథకు అంతర్జాతీయ బహుమతిని పొందారు. సాంఘికప్రయోజనాన్ని లక్ష్యంగా పెట్టుకోకుండ కథలు రచించటం వ్యర్థమని తలంచారు. కోతి; సీతజడ; ఉప్పుబస్తాలు; కలకానిది; మొదలైన వీరి కథలెన్నో చిరకాలం జ్ఞాపకముంచుకోదగినవి.

సాంఘికప్రయోజనాన్ని అంతగా గుర్తింపక పోయినా రచనాశిల్పంలోని మెలకువలు బాగా తెలిసి నిగ్రహంతో కథలు వ్రాస్తారు శ్రీ పెద్దిభొట్ల సుబ్బరామయ్య. 'అంగారతల్పం'; 'నీళ్లు'వంటి కథల ద్వారా ఆయన తన ప్రజ్ఞను నిరూపించుకొన్నారు. కొన్నిచోట్ల సాంఘికన్యాయాన్ని మింగేసే 'సెంటిమెంట్'; పేదవాడెందుకని పరిస్థితులమీద తిరుగబడలేకపోతున్నాడో, తిరుగబడుతున్నవాడిని అణచివేయటానికి ఏశక్తులు దోహదం చేస్తున్నాయో సరియైన అవగాహన చేసుకోకపోవటమూ కన్పిస్తుంది. పరిస్థితుల చేతిలో కీలుబొమ్మలనేగాక, ఏప్రయత్నంవలన ప్రజలు బాగుపడగలరో సూచనాప్రాయంగానైనా వర్ణించటం అవసరం. కథకు తగిన వాతావరణాన్ని కల్పించటంలో సుబ్బరామయ్యగారు సిద్ధహస్తులు.

కథకు ఉత్తమలక్ష్యం లేకపోతే శిల్పం ఉండీ ప్రయోజనంలేదు. శ్రీ శ్రీపతి వ్రాసిన 'మంచుపల్లకీ - మరి తొమ్మిది'అనే కథలకూ యిటీవల వ్రాసిన తగువు'; 'చేపకత—చీమకత —కథలకూ బోలెడంత వ్యత్యాసం ఉన్నది. తగువు'కథ యజ్ఞం'కథ చదివిన ప్రభా

వంతో వ్రాసినది. 'యజ్ఞం' పెద్దకథఅయితే గ్రామం లోని మరొక తగువును పరిష్కరించటంలో గ్రామ ప్రజలెంత రాక్షసంగా ప్రవర్తించి హరిజనులనూ, పేదప్రజలనూ ఎట్లా హింసిస్తారో చెప్పిన కథ. శిల్పదృష్ట్యాకూడ 'తగువు' యిటీవల వచ్చిన ఉత్తమ కథానికలలో ఒకటి. శ్రీ రా. వి. శాస్త్రి వ్రాసిన 'పిపీలికం' కథను మరింత చక్కగా ముందుకు తీసుకొనిపోయి, అదే 'టెక్నిక్'తో శ్రీపతిగారు వ్రాసినది 'చేపకత—చీమకత'. ముందుముందు ఉన్నతమైన లక్ష్యంతో స్వంతప్రతిభతోనే గొప్పకథానికలను శ్రీపతి వ్రాయగలరన్న ఆశాభావం కలుగుతున్నది.

విప్లవ రచయితల సంఘం ఏర్పడిన తరువాత 'ఇప్పుడు వీస్తున్న గాలి' ''హోరు'' అనే కథానికా సంకలనాలు వెలువడినాయి వీటిలో ఎస్. ఎస్. ప్రకాశ రావుగారు వ్రాసిన 'పేపర్ టైగర్' చెరబండరాజు వ్రాసిన 'చిరంజీవి' శ్రీ తాడిగిరి పోతరాజు వ్రాసిన 'ఎర్రబుట్ట' శ్రీ మరువాడ రాజేశ్వరరావు 'హక్కు'; శ్రీ డి. వెంకటరామయ్య 'ఒక మరణం—ఒక చావు' మనుష్యుల్ని తినేవాళ్లు మొదలైన కథలు ప్రగతిని కోరే సాహిత్య పిపాసువులందరూ చదువ తగినవి. చెప్ప దలచుకొన్నది శక్తివంతంగా చెప్పటానికి తమ అవగాహనను కథానికాశిల్పంలోనికి మలచటానికి కొందరు ప్రయత్నిస్తున్నారు. శ్రీరంగం రాజేశ్వరరావు; జంపని పెద్దిరాజుగారలు మరణించటం విప్లవ రచయితలకు తీరనిలోటు.వికసించనున్న పువ్వులునేలరాలి నట్లైనది. 'ఫౌల్—ఫౌల్' కథానిక—పెద్దిరాజుగారు వ్రాసినది శిల్పంలో పరిణతిని పొందకపోయినా మరపురాని కథ.

ప్రగతిని కోరేవారైనా తమ కసినీ, ఆవేశాన్నీ మాటలలో పెట్టేస్తే గొప్పకథలు రావుగదా! కథానికా శిల్పాన్ని సాధించటానికి సాధన అవసరం. ఎంత కసిగా చెప్పినా చెప్పేది కళాత్మకంగా లేకపోతే చదువరులు తాత్కాలికంగా మెచ్చినా చిరకాలం జ్ఞాపక ముంచుకోరు. 'ఇప్పుడు వీస్తున్నగాలి' సంకలనానికి ప్రస్తావనవ్రాస్తూ శ్రీ కొడవటిగంటి 'వీటిలో

కోపమూ, శైలికోసమూ చూడవద్దు. పరమానందయ్య శిష్యుడు గురువుగారి ఇల్లు తగలబడుతున్నదని రాగం—తానం—పల్లవి పాడిన మనస్తత్వం విప్లవ కథకులకు లేదు. ఈ కథలు చదివి ఆలోచించకుండా ఉండటమూ, చైతన్యం పొందకుండా ఉండటమూ సాధ్యంకాదు' అని తక్షణ ప్రయోజనాన్ని మాత్రమే ఆశించి వ్రాయటాన్ని ప్రోత్సహిస్తున్నారు. కాని యీ సంకలనంలోనేఉన్న శ్రీకాళీపట్నం వ్రాసిన 'భయం'; రా. వి. శాస్త్రిగారు వ్రాసిన 'వేతనశర్మ కథ'లవలె శిల్పంతక్కువగా కన్పించే మరికొన్ని కథలను జ్ఞాపకముంచుకో గలరనటం కష్టం.

సాంఘిక చైతన్యాన్ని కలిగించగలిగిన ఆలోచనలను ప్రేరేపించే కథలను వ్రాసినవారు పాలగుమ్మి పద్మరాజు; కొనకళ్ల వెంకటరత్నం; వాకాటి పాండురంగారావ్; ఆంగర వెంకటకృష్ణారావు; అరిగే రామారావు; మధురాంతకం రాజారామ్; అవసరాల రామకృష్ణారావు; ఆదివిష్ణు; ముప్పాళ రంగనాయకమ్మ మొదలైన మంచి కథా రచయితలెందరో ఉన్నారు. ఇంకా యీ వ్యాసకర్త చదవని మంచి కథలెన్నో ఉండవచ్చు. పత్రికల సంఖ్య పెరిగిన యీ రోజుల్లో ఏ ఒక్కరైనా మంచి కథలన్నింటిని చదివి ఉండటం కష్టం.

విప్లవాన్ని కోరనంతమాత్రాన మిగిలినవన్నీ 'బూర్జువా' రచన లనటానికి వీల్లేదు. పరిస్థితులు మారాలని, మంచికి మారాలని పై రచయితలందరూ ఏదో ఒక విధంగా కోరుకుంటూనే ఉన్నారు.

కవులుగా ప్రసిద్ధిపొందిన శ్రీశ్రీ, ఆరుద్ర, తిలక్‌లుగూడ మంచికథలు వ్రాశారు. శ్రీశ్రీ, ఆరుద్ర కథానికా శిల్పంపైన ప్రయోగాలుచేసి, తిలక్ మామూలు మంచి కథల పద్ధతిలోనేవ్రాసి పాఠకుల ఆదరాన్ని పొందారు.

సామాజిక ప్రయోజనమే ఏకథానికకయినా లక్ష్యమన్న అభిప్రాయాన్ని విడిచిపెట్టి, కథానిక ఒక కళాఖండం — దానికి ప్రయోజనం ఆశించ నక్కర లేదు అనే భావంతో కొందరు వ్రాశారు. త్యాగరాయ కృతులకూ, అజంతా చిత్తరువులకూ, అమరావతీ శిల్పాలకూ, యింకా వైరూప్య చిత్రాలకూ (abstract paintings) సాంఘిక ప్రయోజనాన్ని సూటిగా ఏమని ఆశించగలం ? మల్లాది రామకృష్ణశాస్త్రి; పద్మరాజు; త్రిపుర; ఇస్మాయిల్; వాకాటి పాండురంగారావ్; మంజుశ్రీ; శీలా వీర్రాజు; ఆర్. వసుంధర; కళ్యాణసుందరీ జగన్నాథ్—మొదలైనవారి కథానికలను కేవల కళా ఖండాలుగా ఎంచవచ్చు. వీటిల్లో ఒక్కొక్కప్పుడు సాంఘిక ప్రయోజనంకూడ ఉంటే ఉండవచ్చు.

కథకు కమ్మదనాన్ని సంతరించిపెట్టి, విలక్షణమైన శైలిలో, ఇతరులు అనుకరించలేనంతటి శిల్పపునిగ్గుతో, శృంగార ప్రబంధాలనదగిన కథలు చెప్పారు మల్లాదివారు. నీతినియమాలను ధిక్కరించే విధంగా ప్రవర్తించే స్త్రీపాత్రలను, ముందుమాపులో కొత్త భావాలను సమర్థించే ఒక 'తాత' గారిని తమ కథలలో నిలిపారు. మల్లాదివారిశైలి కృతకమైనదే గాని అందమైనది.

దశాబ్దాల తరబడి ఉత్తమ కథానికలనందిస్తూ 'గాలివాన' కథకు అంతర్జాతీయ బహుమతినిపొంది, నిగ్రహంతో వ్రాస్తూ, ఏనాడూ కళా విలువలను త్యజించక వ్రాసే పాలగుమ్మి పద్మరాజుగారు యిటీవల కొన్ని పేలవమైనకథలు వ్రాస్తున్నారు. 'గాలివాన'; 'పడవప్రయాణం'; 'కూలిజనం'; 'చిట్టితల్లి' వంటి మంచికథలు వ్రాసినవారు **'రామసుబ్బు లీలలు'** వంటి కాలక్షేప కథలను వ్రాయటం విచారించవలసిన విషయమే. కథలలో కవిత్వం వొలికించటం పద్మరాజుగారికి సునాయాసంగా అబ్బిన విద్య.

'త్రిపుర' వ్రాసిన కథానికను ఒక్కటైనా చదివినవారు ఆ రచయితను విస్మరించటం అసాధ్యం. 'పాము'; 'జర్కన్' యింకా మరికొన్ని ఆలోచనాపరులను బాగా కదల్చినవి యుద్ధ వాతావరణాన్ని,

యుద్ధంలో పాల్గొంటున్న మనుష్యుల చిత్తవృత్తులనూ వర్ణించటంలో వీరికి గొప్ప నైపుణ్యంఉన్నది. అగాధమైన తాత్త్వికచింతన, రచనలో నిశితమైన స్ఫురియలిస్టు ధోరణీ వీరి ప్రత్యేకత. కాలాతీతమైన వ్యక్తుల మనస్సులలోని భావాలను అమోఘంగా 'రికార్డు' చెయ్యగలశక్తి వీరికున్నది. మనదేశపు ఇంగ్లీషు పత్రికలలో వస్తున్న ఏ ఇంగ్లీషు కథానికలకూ వీరికథలు తీసిపోవు—

మానవత్వాన్ని గాఢంగానమ్మి, మనస్సులలోని మారుమూలలకు వెళ్లి ఆలోచనలు రాబట్టి వాటిని కథానికలలో ప్రవేశపెట్టటం శ్రీ ఇస్మాయిల్ ప్రత్యేకత. కరుణరసప్రధానమైన వారి 'ఖాళీసీసాలు' అనే కథ మన కథానికలలో ఒక మైలురాయి. ఖాళీసీసాల అమ్మకంలో చిల్లర డబ్బులకే ఆశించి, ప్రాణం పోగొట్టుకొన్న అతి నికృష్టజీవుల చిత్రణ యీ కథలో గొప్పగా చిత్రించారు. ఆ దీనులస్థితి మారాలనేది రచయిత ఉద్దేశ్యమేమోగాని అటువంటి సత్సంకల్పం రచనలో సూటిగా కాకపోయినా, వ్యంగ్యంగానైనా ద్యోతకం కాలేదు. 'సిగరెట్' అనే వారి కథానిక అతినిశితమైన మనో విశ్లేషణతో, ఎటు మారినప్పటికీ మనిషి మనిషేనని చెప్పే తాత్త్విక చింతనలో నడిచింది. తక్కువకథలు వ్రాసినా వాటివిలువ ఏమాత్రం ఎప్పటికీ తగ్గని రచయిత శ్రీ ఇస్మాయిల్.

'సృష్టిలో తియ్యనిది'; 'మనిషి ÷ రెండు'; 'రైల్వుగ్రహణం' మొదలైన పాండురంగారావ్‌గారి కథానికలను చదివినవా రెవరైనా కన్నీళ్లు తెప్పించే హాస్యాన్ని, కథ చెప్పటంలోని గడుసరితనాన్ని మెచ్చుకుండ ఉండలేరు. వీరు వాడే ఉపమానాలు ఎప్పటి కప్పుడు సరికొత్తగా సమకూర్చుకొనేవి. అవి రాజకీయాలలోనుండి, దైనందిన జీవిత సంఘటనలనుండి తీసుకొన్నవి కావటాన చదువరులు విడిచిపెట్టకుండ చదువుతారు. కాలక్షేపానికి మాత్రమేగాక జీవిత సత్యాలను కాస్త కరుణ, కాస్త హాస్యం మిళాయించి హాయిగాను, మనస్సుకు హత్తుకునేటట్లుగాను చెప్పటం పాండురంగారావుగారి పద్ధతి.

శ్రీ శీలా వీర్రాజు, 'మంజుశ్రీ' గారల కథలు 'సెంటిమెంట్' ప్రధానంగా ఉండేవి. చదివేవారు అంతర్ముఖులై కథాగతమైన పాత్రలతో సానుభూతి పొందకుండ ఉండలేరు. కథలలో చక్కని పదచిత్రాలను అందించటం శ్రీ శీలా వీర్రాజుగారి ప్రత్యేకత.

'భారతి'లో వెలువడిన ఆర్. వసుంధరగారి 'బొద్దింకలూ'; 'మచ్చలు'; 'జాన్‌పాల్‌చేసిన బిరువాకథ'; యింకా పండుగ మొదలైన కథానికలు చదివినవారు ఉన్నతమైన విలువలకై రచయిత అన్వేషణను, మనుష్యుల నందరినీ బంధించే ప్రేమసూత్రం ఏమిటో గమనించమని చెప్పే ఆలోచనారీతిని గమనించవచ్చు. ఆద్యంతాలు రెండూ వీరి కథలలో చక్కగా తీర్చినట్లుండి ప్రతికథా తన ప్రత్యేకతను నిల్పుకొంటుంది.

భాషలోను, ఆలోచనలలోను మల్లాదివారి అనుసరణ కనుపించినా శ్రీమతి కల్యాణ సుందరీ జగన్నాథ్ వ్రాసిన 'అలరాస పుట్టిళ్లు'; 'మాడంత మబ్బు' చెప్పకోదగిన మంచి కథలు. వీటిల్లో సువిశాలమైన అగాధమైన జీవితాన్ని దర్శించవచ్చు. ప్రకృతి వర్ణన చెయ్యటంలోను, కథలోని వ్యక్తుల మనఃప్రవృత్తుల వర్ణనలలోను వీరినైపుణ్యం మెచ్చదగినది.

అసంఖ్యాకంగా వస్తున్న నేటి రచయితలలో యింకా ఎందరో ఎన్నో దీపాలను వెలిగించారు. కొన్ని కథలను చదివినప్పుడు ఆనందానుభూతినిపొంది తర్వాత విస్మరించినా, కొన్ని మంచి కథలను ముందుతరాల కోసం భద్రపరచవలసిన అగత్యం ఉన్నది. కొన్ని కథలను ఇతర భారతీయ భాషలలోనికి, మరి కొన్ని కథలను అంతర్జాతీయ భాషలలోనికి పరివర్తింప జేయవలసిన అవసరం ఉన్నది. అట్లా పరివర్తన పొందగలిగిన అర్హత ఉన్నకథలు మన భాషలో ఎన్నో వెలువడినవి. ముందింకా వెలువడనున్నవి. కథలలోని భాషా, భావం రెండింటి జీవం పోకుండ ఇతర భాషలలోనికి అనువాదం చెయ్యగలిగిన సమర్థులు పూనుకోవాలి. అప్పడే తెలుగు కథకు అంతర్జాతీయ గౌరవం లభిస్తుంది. ఒకటీ అరా కథలు బహుమతి పొందటంతో తృప్తిపడితే సరిపోదు. ఉత్తమ కథానికలను ఎన్నిక

చేయటానికి పత్రికలు నిర్వహించే పోటీలు మాత్రమే చాలవు. మంచి కథలను ఏర్చికూర్చిన సంకలనాలను విరివిగా ప్రచురించాలి. వీలైతే ప్రతియేడాదీ '1968 ఉత్తమ కథానికలు' ఎమెస్కోవారు ప్రచురించిన వంటి వాటిని ప్రచురించాలి. సంపాదక బాధ్యత వహించిన వారు ఉత్తమ కథా సంకలనంలో తమ కథకూడ చేర్చుకోవాలన్న లౌల్యాన్ని విడిచిపెట్టాలి. కరుణ కుమార; వేలూరి శివరామశాస్త్రి; శ్రీనివాస శిరోమణి వంటి పూర్వపు రచయితల కథలలోని ఔన్నత్యం ఏ విధంగా సాధింపబడినదో బాగా 'స్టడీ' చేయాలి.

ఏవో నిర్దిష్టమైన ప్రమాణాల నేర్పరచుకొని మంచి కథలన్నీ ఒకే విధంగా మూసలో పోసినట్లుం డాలనుకోవటం తగదు. వైవిధ్యం ఉండాల్సిందే. కథానికకైనా, కవితకైనా ఏ సాహిత్య ప్రక్రియకైనా ఆనందమేగదా ప్రధానమైన ప్రయోజనం! సమాజంలో సమూలమైన మార్పు అవసరమైనప్పుడు రచయితలు కళావిలువలకు తక్కువ ప్రాధాన్యమిచ్చి, ఆనందం కలిగించటం కంటె మిన్నగా, చదువరుల మనస్సులను కదలించి సాంఘిక చైతన్యాన్ని కలిగించాలని చూస్తారు. తమ రాజకీయాభిప్రాయాలను వెల్లడించ టానికి కథానికను పనిముట్టుగా వాడుకుంటున్నా రని ఎవరూ గుండె బాదుకోవలసిన పనిలేదు.

మన కథావస్తువులలో యింకా వైవిధ్యం ఉండాలి. యుద్ధ వాతావరణాన్ని చిత్రించేకథలు, అంట రాని వారుగానే యింతా జీవిస్తున్నవారి కథలు, సాంకే తిక విద్యా నైపుణ్యంతో ఆయా వాతావరణాలను చక్కగా exploit చేసుకొన్న కథలూ అతి తక్కువగా వస్తున్నాయి. వస్తున్న కొద్ది కథలుగూడ కృతకమైన భాషతోను, ఆయా పరిసరాలను సరిగా పరిశీలించని వారు వ్రాసే అవాస్తవికమైన అంశాలతోను నింప బడుతున్నాయి. ఇక అడవి, వేట మన కథకులకు అస్పృశ్యవస్తువు లవుతున్నాయి. ఇటువంటి లోపా లను సరిదిద్దుకొని పరిపూర్ణ సౌందర్యంతో మన కథానిక సగర్వంగా ముందుకుసాగాలి.



# స్వతంత్ర బాంగ్లాదేశ్ చరిత్ర

### పరిశీలక్

జాతులనేవి కవుల హృదయాలలో ఆవిర్భావం చెందు తాయి. రాజకీయ నాయకులు వాటికిరూపం కల్పి స్తారు.తరువాత అవివారిచేయి జారిపోతాయి. (Nations are born in the hearts of poets. They come into being and pass away under the hands of the politicians) అని ఇస్లాం జాతీయ కవితా పితామహుడు ఇక్బల్ 1910 లో తన డైరీలో వ్రాసుకొన్నాడు. ఆయన కవితా భావనలో జన్మించింది పాకిస్తాన్. అయూబ్ ఖాన్, యాహ్యాఖాన్ వంటి వారివల్ల ఆ పాకిస్తాన్‌నుంచి బంగ్లాదేశ్ ఆవిర్భ వించింది. నిన్నటి తూర్పు పాకిస్తాన్ నేటి బంగ్లా దేశ్‌గా రూపొందింది. విశ్వకవి రవీంద్రనాథటాగూర్ ఈ బంగ్లాదేశ్‌నే 'బంగారు బంగాళము'మని గీతాలాపన చేశాడు.

పాకిస్తాన్‌కు జీవనాడి పంజాబ్ అని చాలా మంది అంటారు. కాని పాకిస్తాన్‌కు గుండెకాయ తూర్పు బెంగాల్. భారత విభజనకు పూర్వం తూర్పు బెంగాల్‌లో ముస్లింలీగుకు వున్నబలం, పాకిస్తాన్‌లో చేరిన మరే రాష్ట్రంలోను లేదు. పాకిస్తాన్ ఏర్పడ డానికిముందు, పంజాబులోగాని, సింధులోగాని, బెలూచిస్తాన్‌లోగాని, సరిహద్దు రాష్ట్రంలోగాని ముస్లింలీగుకుచెందిన ప్రభుత్వాలు లేవు. బెంగాల్‌లో మాత్రమే ముస్లింలీగు ప్రభుత్వం వుంది.

కాని అదే బెంగాలీలు పాతికేళ్ల తర్వాత పాకి స్తాన్‌ను ఎంతగానో ద్వేషిస్తున్నారు. పాకిస్తాన్‌లో భాగస్వాములుగా వుంటూ రాష్ట్రీయ స్వపరిపాలనాధి కారాలను కోరుతూ వచ్చిన బెంగాలీలు మూడునెలల వ్యవధిలో స్వతంత్ర బంగ్లాదేశ్‌ను వాంఛించారు. ఇది చరిత్రలో అపూర్వమైన విషయం. కేవలం తాత్కా లికమైన ఆవేశంతోను, ద్వేషాలవల్లను, పరిస్థితుల ప్రాబల్యంవల్లను స్వతంత్ర బంగ్లాదేశ్ అవతరించ లేదు. దాని వెనక రెండు దశాబ్దాల చరిత్ర వుంది. ఆ చారిత్రక పరిణామాలనుంచే స్వతంత్ర బంగ్లాదేశ్ నేడు ఆవిర్భవించింది.

పాకిస్తాన్ భౌగోళికంగా ఏకదేశంకాదు. అది తూర్పు పశ్చిమ విభాగాలుగావుంది. ఈ రెండిటి మధ్య దూరం 2000 కిలోమీటర్లు. పశ్చిమ పాకిస్తాన్ విస్తీర్ణం 310 వేల చదరపుమైళ్ళుకాగా తూర్పు పాకిస్తాన్ విస్తీర్ణం 55 వేల చదరపు మైళ్ళు. పాకి స్తాన్ మొత్తం జనాభా (12.5 కోట్లు)లో తూర్పు పాకిస్తానీలు 54.6 శాతం (7.5 కోట్లు). అంటే పాకిస్తాన్ మొత్తం జనాభాలో సగానికిపైగా తూర్పు పాకిస్తాన్‌లో వున్నారన్నమాట. విస్తీర్ణం దృష్ట్యా ఏడవవంతు ప్రాంతంవున్నా, జనాభాదృష్ట్యా సగానికి మించి వున్నందున, ప్రజాస్వామ్య సూత్రాల ప్రకారం మొత్తం పాకిస్తాన్‌ను పరిపాలించే అవకాశం తూర్పు పాకిస్తాన్ ప్రజలకు దత్తంకావాలి. కాని అలా జరగ లేదు. దీనినుంచే రాజకీయ ప్రత్యేకతావాదం పుట్టింది.

కేవలం మత ప్రాతిపదికపై 1947 లో భారత ఉపఖండంనుంచి పాకిస్తాన్ విభజన జరిగినా, అది ఒకేజాతికి ఒకేభాషకు చెందిన ఏకభూఖండం కాదు. పాకిస్తాన్ మొత్తంమీద బెంగాలీలు, పంజా బీలు, పఠానులు, సింధీలు, బెలూచీలు అనే విభిన్న జాతులవారు వున్నారు. ఒక్కమతాన్ని మినహాయిస్తే వారిభాషలు వేరు. సంస్కృతులు వేరు. సాంప్ర దాయాలు వేరు.

భాషలరీత్యా పాకిస్తాన్ మొత్తం జనాభాలో బెంగాలీ 54.60 శాతం; పంజాబీ 28.40 శాతం; పుష్తూ 7.10 శాతం; సింధీ 5.80 శాతం; ఉర్దూ 7.20 శాతంగావుంది. వీరిలో బెంగాలీలు ఏక భూఖండంలో వున్నారు. మిగిలిన పంజాబీ, పుష్తూ, సింధీ భాషలవారు ఏక భూఖండంలో నాలుగు రాష్ట్రాలలో (పంజాబ్, సింధు, బెలూచిస్తాన్, వాయువ్య సరిహద్దు రాష్ట్రం) వున్నారు వారిలో అన్ని రంగాలలోను పంజాబీలది పైచేయి.

భౌగోళిక, సాంస్కృతిక సమైక్యతలేని అయిదు జాతులతో ఏర్పడిన పాకిస్తాన్‌లో, గత పాతికేళ్లలోను మానసికంగా ఏకజాతిభావం రూపొందలేదు. సాంస్కృతిక సమైక్యత ఏర్పడలేదు ప్రజాస్వామ్యం ప్రవర్ధమానం కాలేదు. సైనిక నియంతృత్వం నెలకొన్నది. దమననీతి కొనసాగింది. ప్రజాపోరాటాలు ప్రారంభమైనాయి. సాంస్కృతికరంగంలో అవి ప్రారంభమై రాజకీయవిభజనతో ఒకకొనకు వచ్చాయి.

పాకిస్తాన్‌లో తన ప్రత్యేక ప్రతిపత్తిని నిలుపుకొనడానికి తూర్పు పాకిస్తాన్ ఆదినుంచి పోరాడుతూ వచ్చింది. 1948 లో మహమ్మదాలీ జిన్నా పాలనలో, పాకిస్తాన్ జాతియభాషగా ఉర్దూను అందరూ అంగీకరించాలన్నప్పుడు అప్పటితూర్పుపాకిస్తాన్ కాదన్నది. పాకిస్తాన్ జనాభాలో 55 శాతం ప్రజలకు మాతృభాషగా వున్న బెంగాలీని ఉర్దూతోపాటు జాతీయభాషగా పరిగణించాలన్న వాంఛను వ్యక్తంచేసింది. ఇలా కోరేవారంతా పాకిస్తాన్‌కు శత్రువులని మహమ్మదాలీ జిన్నా ప్రకటించాడు. అయినా భాషాఉద్యమం ఆగలేదు. దానికి నాయకుడుగా షేక్ ముజిబుర్‌రహ్మాన్ ముందుకు వచ్చాడు.

పశ్చిమ పాకిస్తాన్ పాలకులు పట్టుదలతో ఉర్దూను ప్రభుత్వంలో ప్రవేశపెట్టడమేకాదు; బెంగాలీ సంస్కృతిని సాహిత్యాన్ని నిరసించడం సాగించారు. ఇది బెంగాలీలు సహించలేకపోయారు. 1952 ఫిబ్రవరిలో బెంగాలీభాషకోసం-సంస్కృతికోసం తిరుగుబాటు జరిగింది. రక్తపాతం జరిగింది. 1954 వరకు బెంగాలీ సంస్కృతి పునరుజ్జీవన ఉద్యమం సాగింది. ఇందులో విద్యార్థులు, ఉపాధ్యాయులు, మేధావివర్గాలు ప్రముఖపాత్ర వహించారు. ప్రజాచైతన్యాన్ని రెచ్చగొట్టారు. [ఈ కక్షతోనే బెంగాలీ విద్యావంతులను పశ్చిమ పాక్ సైనికులు 1971 లో సాగించిన హింసాకాండలో ప్రత్యేకించి చిత్రవధ చేశారు.] దానితో బెంగాలీలకు పాకిస్తాన్‌పట్ల రాజకీయ విశ్వాసం అభిమానం సన్నగిల్లాయి. బంగ్లాదేశ్ ఉద్యమం బలపడుతూ వచ్చింది.

ఆర్థికంగా పాకిస్తాన్ మొత్తానికి తూర్పు బెంగాల్ సర్వవిధాలా కామధేనువు. జనపనార, పత్తి-తేయాకు పంటలకు అది ప్రపంచప్రసిద్ధి చెందింది. నదులతో, సుందరమైన వనాలతో, సారవంతమైన భూములతో, పాడిపంటలకు నిలయమైన తూర్పు బెంగాల్ 'బంగారు బంగాళ'ముగా ప్రసిద్ధిచెందింది. అయినా పాకిస్తాన్ ఏర్పడినతర్వాత అది 'బీద బంగాళము'గా నిలిచిపోయింది.

ముగ్గురు హార్వర్డ్ (అమెరికా) ఆర్థికవేత్తలు పాకిస్తాన్ ఆర్థిక స్థితిగతులను సమగ్రంగా దర్యాప్తు చేసి 1970 తో ఒక నివేదికను పాకిస్తాన్ ప్రభుత్వం తరపున ప్రచురించారు. దీనిలోని అంకెలనుబట్టి పాకిస్తాన్‌లో తూర్పు బెంగాల్ నిజస్థితి తెలుసుకొనడానికి వీలుఅవుతున్నది.

విదేశవాణిజ్యంలో తూర్పు బెంగాల్‌కు వార్షికపు మిగులు 1950—51 నుంచి 1954—55 వరకు రు 42.40 లక్షలు; 1955—56 నుంచి 1959—60 వరకు మిగులు రు 35.50 లక్షలు. 1960—61 నుంచి 1964—65 వరకు మిగులు రు 410 లక్షలు. కాని పశ్చిమపాకిస్తాన్ విదేశీ వాణిజ్యంలో మిగులు ఏనాడూలేదు. తరుగు 40—33—1.6 శాతంగావుంది. దానిని తూర్పు పాకిస్తాన్ మిగులుతో భర్తీచేసి, పశ్చిమ పాకిస్తాన్‌కు అవసరమైన యంత్రాలు, పారిశ్రామిక ముడిపదార్థాలు వగైరాలను దిగుమతిచేస్తూ వచ్చారు.

పాకిస్తాన్ విదేశీ వాణిజ్యంలో తూర్పు

బెంగాల్ మిగులు శాతం 50 70 వరకువున్నా, పాకిస్తాన్ దిగుమతులలో 25—30 శాతం మాత్రమే దానికి దక్కుతూవచ్చాయి. ఫలితంగా దిగుమతిచేసిన సరుకుల ఖరీదు తూర్పు బెంగాల్‌లోకంటె పశ్చిమ పాకిస్తాన్‌లో తక్కువగా వుంటూవచ్చింది. పశ్చిమ పాకిస్తాన్ పారిశ్రామికంగా అభివృద్ధి చెందుతూవచ్చింది. అక్కడి సరుకుల విక్రయానికి (తూర్పు బెంగాల్‌లో పారిశ్రామికమైన అభివృద్ధి లేనందున) ఒక వలస మార్కెట్‌గా వినియోగపడింది. అంతేకాదు. విదేశ ఆర్థిక సహాయంగా వచ్చిన మొత్తాలలో 80 శాతం పశ్చిమ పాకిస్తాన్ అభివృద్ధికి వినియోగమైంది.

ఆర్థికమైన ఈ వ్యత్యాసం ఫలితంగా—తూర్పు బెంగాల్‌లోని పంటలు, ముడివస్తువులు చౌకరేట్లకు పశ్చిమ పాకిస్తాన్‌కు ఎగుమతి అయ్యేవి. పశ్చిమ పాకిస్తాన్‌లో తయారైన పారిశ్రామిక వస్తువులు, సాలీనా నూరుకోట్ల రూపాయలు కిమ్మతుచేసేవి హెచ్చు ధరలకు తూర్పు బెంగాల్‌లో అమ్ముడుపోయేవి. పశ్చిమ పాకిస్తాన్ ఎగుమతులలో 40 శాతం తూర్పు బెంగాల్‌కు చేరేవి. ఈ విధంగా పరిశ్రమలు మాత్రమే కాక, వర్తకవాణిజ్యాభివృద్ధిలోకూడా తూర్పు బెంగాల్ నష్టపడుతూ వచ్చింది.

పాకిస్తాన్ అభివృద్ధి ప్రణాళికకింద తూర్పు బెంగాల్‌లోని జనపనార, జౌళి, పేపరు పరిశ్రమలు బ్యాంకులు, భీమాకంపెనీలలో పశ్చిమ పాకిస్తాన్ పారిశ్రామికులు కొన్ని పెట్టుబడులు పెట్టారు. వానిమీద వార్షిక ప్రతిఫలం రు. 18 కోట్లుగా అంచనావేశారు. ఇది తూర్పుబెంగాల్ వార్షిక రాబడిలో రెండు శాతంగావుంది; దీనిని పశ్చిమ పాకిస్తాన్‌కు తరలించేవారు.

పాకిస్తాన్ ప్రభుత్వం ప్రచురించిన నివేదిక ప్రకారం. దాని పరిశ్రమలలో 66 శాతం, భీమా కంపెనీలలో 79 శాతం, బ్యాంకులలో 80 శాతం దేశంలోని 22 ధనికకుటుంబాల ఆధిపత్యంలో వున్నాయి. ఈ కుటుంబాలవారే తూర్పు బెంగాల్‌లో పరిశ్రమలు నెలకొల్పారు. వాటిలో ఒక్కటికూడా తూర్పు బెంగాల్ ధనికకుటుంబం లేదు. అన్నీ పంజాబీలవే.

పాకిస్తాన్ కేంద్రప్రభుత్వం అనుసరించిన ఆర్థిక, పారిశ్రామిక, వాణిజ్యవిధానాల ఫలితంగా, పదేళ్ల వ్యవధిలో తూర్పు — పశ్చిమ ప్రాంతాల మధ్య రాబడులలో వ్యత్యాసం రెట్టింపు అయింది. 1959—60 లో సగటున పశ్చిమ పాకిస్తానీ రాబడి, తూర్పు ప్రాంతంకంటె 32 శాతం హెచ్చుగావుంది. ఆ తర్వాత పదేళ్లలోను సాలుసరి రాబడి పెరుగుదల రేటు పశ్చిమ పాకిస్తాన్‌లో 6.2 శాతంకాగా తూర్పు బెంగాల్‌లో 4.2 శాతంగావుంది. దాని ఫలితంగా 1969—70 లో పశ్చిమ పాకిస్తాన్‌లో తలసరి రాబడి, తూర్పు బెంగాల్‌లోకంటె 61 శాతం హెచ్చు అయింది. ఈ అంకెలన్నీ అమెరికాలోని హార్వర్డ్ ఆర్థికశాస్త్రజ్ఞులు; పాకిస్తాన్ ప్రణాళికా సంఘానికి సలహాదార్లుగా వచ్చినవారు 1970 లో సమర్పించిన నివేదికలలో ఉదాహరింపబడినవేనని గమనించాలి.

ఇలా ఆర్థికంగా తూర్పు - పశ్చిమపాకిస్తాన్‌ల మధ్య గతపదేళ్లుగా పెరిగిన వ్యత్యాసాలవల్ల— ప్రాంతీయమైన వ్యత్యాసాలు, ప్రాంతీయమైన విచక్షణలకు సంబంధించిన భావాలతోపాటు పశ్చిమ పాకిస్తానీలు తమను ఆర్థికంగా గతంలో బ్రిటిష్‌వారివలె దోపిడీచేస్తున్నారనే భావాలు తూర్పుబెంగాల్ ప్రజలలో బలపడిపోతూవచ్చాయి. దీనినుంచే రాష్ట్రీయ స్వపరిపాలనాధికారాలు కావాలన్న నినాదం బయలుదేరింది. అదే చివరకు 'స్వదేశ్' (బంగ్లాదేశ్) నినాదంగా మార్పు చెందింది.

ఆర్థికంగానేకాదు. రాజకీయంగాకూడా తూర్పు పాకిస్తాన్ పశ్చిమ పాకిస్తానీల దోపిడీకి, అజ్మాయిషీకి గురిఅవుతూవచ్చింది. 1955 లో పాకిస్తాన్ కేంద్ర సర్వీసులలోను, రక్షణబలాలలోను తూర్పు బెంగాలీలు చాలా స్వల్పంగా వుండేవారు. ఆనాటినుంచి నేటివరకు ఈ పరిస్థితి మారలేదు. చివరకు తూర్పుపాకిస్తాన్‌లోని ఉన్నతోద్యోగాలకుకూడా పశ్చిమ పాకిస్తాన్‌వారిని నియమిస్తూవచ్చారు. కేంద్ర సర్వీసులలో తూర్పు

పశ్చిమ పాకిస్తానీల ప్రాతినిధ్యం ఎలా వున్నదీ క్రింది జాబితానుబట్టి తెలుసుకోవచ్చు:—

| ఉద్యోగవర్గం | తూర్పు భాగం | పశ్చిమ భాగం |
|---|---|---|
| **1. సివిల్** | | |
| సెక్రటరీలు | 0 | 19 |
| జాయింట్ సెక్రటరీలు | 3 | 38 |
| డిప్యూటీ సెక్రటరీలు | 10 | 123 |
| అండర్ సెక్రటరీలు | 38 | 510 |
| **2. మిలిటరీ** | | |
| లెఫ్టినెంట్ జనరల్స్ | 0 | 3 |
| మేజర్ జనరల్స్ | 0 | 20 |
| బ్రిగేడియర్స్ | 1 | 34 |
| కల్నల్స్ | 1 | 49 |
| మేజర్లు | 10 | 590 |
| నౌకా దళాధికారులు | 7 | 593 |
| విమాన దళాధికారులు | 40 | 640 |

రాజకీయంగా కేవలం ఉద్యోగాలలోనే కాదు; ప్రజా ప్రతినిధులుగా స్వరాష్ట్రాన్ని పరిపాలించు కొనడంలోకూడా తూర్పు బెంగాలీలు వివక్షణకు గురి అయ్యారు. పాకిస్తాన్ అవతరించిన తొలి పదేళ్లలోను పార్లమెంటరీ వ్యవస్థ అనేది వుండేది. కాని జాతీయమైన ఎన్నికలద్వారా ఏర్పడిన ప్రజా ప్రతినిధుల వ్యవస్థకాదది. కేంద్రప్రభుత్వానికి ప్రజాబలం కలదని నిరూపించే ఎన్నికలకు వాగ్దానాలుమాత్రం జరిగేవి. రాష్ట్రశాసన సభలకు పరిమిత ఓటింగ్‌తో ఎన్నికల తతంగం నడిచింది. 1954 లో తూర్పు బెంగాల్‌లో జరిగిన రాష్ట్ర శాసనసభ ఎన్నికల్లో ముస్లింలీగుపార్టీ నామమాత్రమైంది. యునైటెడ్ ఫ్రంట్ విజయంపొందింది. ప్రజల వాంఛకు ప్రతిబింబంగా అది అధికారానికి వచ్చింది. కాని రెండు నెలలోనే కేంద్రప్రభుత్వం దానిని బర్తరఫ్‌చేసింది. కేంద్ర పాలన నెలకొల్పింది. ఆ విధంగా రాష్ట్రంలోకూడా తమనుతాము పరిపాలించుకునే అధికారాన్ని తూర్పు బెంగాలీలు కోల్పోయారు. దీనితో ఏర్పడిన అసంతృప్తినుంచే తమ రాష్ట్రానికి ప్రజాస్వామ్యం స్వపరిపాలనం కావాలన్నవాదన తూర్పు బెంగాల్‌లో బయలుదేరింది. 1966 జూన్‌లో ఆరుసూత్రాల కార్యక్రమాన్ని షేక్ ముజిబుర్‌రహ్మాన్ రూపొందించాడు. ఈ కార్యక్రమాన్ని అమలు జరపడానికి అవామీలీగు అనే తన పార్టీని తూర్పుపాకిస్తాన్‌లో ఒక రాజకీయ వేదికగా తయారుచేశాడు: ప్రజలందరిని దానికింద సమీకరించి 'బంగ్లాబంధు'గా రూపొందాడు.

పాకిస్తాన్ ఒక ఫెడరేషన్‌గా వుండాలని, కింది ఆరు సూత్రాలు ప్రాతిపదికగా ఫెడరేషన్ భాగాలకు అంటే రాష్ట్రాలకు పూర్తిస్వపరిపాలనాధికారాలు దత్తంచేయాలని షేక్‌ముజిబుర్‌రహ్మాన్ కోరాడు. ఆ ఆరు సూత్రాల సారాంశం ఇది:—

(1) పాకిస్తాన్ ఒక ఫెడరేషన్‌గా పార్లమెంటరీ ప్రభుత్వవ్యవస్థతో వుండాలి. సార్వజనికమైన ఓటుహక్కుతో సరాసరి ఎన్నికైన శాసనసభల సర్వాధికారం చెల్లాలి. (2) కేంద్రం రక్షణ విదేశీ వ్యవహారాలు మాత్రమే చూడాలి; మిగిలిన అధికారాలు రాష్ట్రాలకు వుండాలి. (3) రెండు విభాగాలకు రెండు రకాల కరెన్సీ; వాని మధ్య స్వేచ్ఛగా మారకం ఏర్పాట్లు; రెండు రిజర్వుబ్యాంకులు ఏర్పడాలి. (4) పన్నులు, రెవిన్యూ వసూలు అధికారాలు రాష్ట్రాలకు వుండాలి. వానినుంచి తగిన మొత్తాలు కేంద్రం తన ఖర్చులకు పొందాలి. (5) ఆర్థిక సంస్కరణలు, పన్నుల విధానంద్వారా రెండు విభాగాలమధ్య ఆర్థికంగా ఏర్పడిన వ్యత్యాసాలు తొలగించబడాలి. (6) ప్రత్యేక రక్షణ ఏర్పాట్లు ప్రస్తుతానికిలేని తూర్పుపాకిస్తాన్‌కు విడిగా 'మిలీషియా' లేదా సైనికదళాలు ఏర్పరచాలి.

ఇలా వున్న ఈ ఆరు సూత్రాల కార్యక్రమం బెంగాలీలకేకాదు పశ్చిమ పాకిస్తాన్‌లోని బెలూచీలు, పఠాన్‌లకుకూడా ఆమోదయోగ్యమైంది. ఆ రాష్ట్రాలలో జాతీయ అవామీలీగుపార్టీ ఈ కార్యక్రమాన్ని బలపరచింది. చివరకు పంజాబు—సింధులలో కూడా కొన్నివర్గాలు దానిని బలపరిచాయి. 1970 నాటికి

ఇదొకరకమైన భాషారాష్ట్రాల స్వపరిపాలనోద్యమంగా ప్రజలలో విజృంభించి బలపడింది. ఇదంతా జరిగింది అధ్యక్షుడు యాహ్యాఖాన్ సైనికపాలనలోనే. దేశంలో ప్రజాఉద్యమాలు బలపడడం గమనించిన అ సైనిక నియంత (1) పాకిస్తాన్‌కు జాతీయఅసెంబ్లీ ఏర్పడి రాజ్యాంగాన్ని తయారుచేస్తుందని (2) ఆ అసెంబ్లీకి, రాష్ట్రశాసనసభలకు డిశంబరులో ఎన్నికలు జరగగల వని (3) పరిపాలన ప్రజలకు అప్పగింతపెట్టగలనని ప్రకటించాడు: పాకిస్తాన్ ఏర్పడిన 23 సంవత్సరా లకు తొలిసారిగా వయోజన ఓటింగ్‌హక్కుతో సార్వ త్రిక ఎన్నికలు జరిపించాడు.

ఈ ఎన్నికలవల్ల తూర్పుబెంగాల్‌లో నూటికి 73 ఓట్లు షేక్ ముజిబుర్ రహమాన్‌కు చెందిన అవామీలీగుకు వచ్చాయి. ఆరుసూత్రాల కార్యక్రమం ఆధారంగా ఈ విజయాన్ని ఆయన సాధించాడు. తూర్పు బెంగాల్ స్వపరిపాలనాధికారవాంఛ ఆవిధంగా వ్యక్తమైంది. తూర్పుబెంగాల్ రాష్ట్రశాసనసభకు గల 310 సీట్లలోను 288 సీట్లు ఆయనపార్టీ గెలుచుకున్నది. రాష్ట్రంలో పరిపాలన సాగించే హక్కును సంపాదించుకున్నది.

అంతేకాదు. పాకిస్తాన్ జాతీయ అసెంబ్లీకిగల 313 సీట్లలోను తూర్పు పాకిస్తాన్‌కు 169 సీట్లు వున్నాయి. అందులో 167 సీట్లు అవామీలీగు గెలుచు కున్నది. పశ్చిమ పాకిస్తాన్‌కుగల 144 సీట్లలోను జుల్ఫికర్ అలీ భుట్టో నాయకత్వానవున్న పీపుల్సు పార్టీకి 81 సీట్లు, అవికూడా పంజాబు, సింధు రాష్ట్రాలలో మాత్రమే వచ్చాయి. పాకిస్తాన్ జాతీయ అసెంబ్లీ సీట్లలో అత్యధిక సంఖ్యాబలం అంటే పాకి స్తాన్‌లో జాతీయప్రభుత్వం స్థాపనకు, రాజ్యాంగనిర్మా ణానికి అవసరమైన మెజారిటీ షేక్ ముజిబుర్‌రహ మాన్ సంపాదించాడు. ఆయనను 'భవిష్యత్ ప్రధాన మంత్రి'గా యాహ్యాఖాన్ సంబోధించాడు. కాని ఆయన ఆరుసూత్రాల కార్యక్రమంలో రాష్ట్ర స్వపరిపాలనా పథకంలో మార్పును కోరాడు. రాజీ సమాలోచనలు సాగించాడు. పాకిస్తాన్‌లో అంతర్భా గంగా తూర్పు బెంగాల్‌కు స్వపరిపాలనాధికారాన్ని షేక్ ముజిబుర్‌రహమాన్ కోరాడు. ఈ విషయంలో రాజీకి నిరాకరించాడు. 1971 మార్చి 24 నాటికి అధ్యక్షుడు యాహ్యాఖాన్‌తో ఢాకా చర్చ లలో నాలుగు అంశాలమీద రాజకీయ ఒప్పం దానికి వచ్చాడు. ఆ నాలుగు అంశాలు ఇవి (1) దేశంలో సైనికశాసనం రద్దు. ప్రజా ప్రతినిధు లకు పరిపాలన అప్పగింత (2) రాష్ట్రాలలో మెజా రిటీ పార్టీలకు ప్రభుత్వం అప్పగింత (3) అధ్యక్షు డుగా యాహ్యాఖాన్ వుండడం. కేంద్రప్రభుత్వాన్ని నడపడం (4) జాతీయ అసెంబ్లీసభ్యులు తూర్పు— పశ్చిమ ప్రాంతాలవారు విడి విడిగా సమావేశమై రాజ్యాంగం ముసాయిదాలు తయారుచేసి, చివరకు ఉమ్మడిగా సమావేశమై పాకిస్తాన్ రాజ్యాంగానికి తుదిరూపమివ్వడం; పోతే తూర్పు పాకిస్తాన్‌కు కేంద్ర ప్రభుత్వానికి మధ్య వుండవలసిన సంబంధాలుమాత్రమే నిర్ణయం కావలసివున్న సమయంలో, అధ్యక్షుడు యాహ్యాఖాన్ 1971 మార్చి 25—26 రాత్రి హఠాత్తుగా ఢాకానుంచి వెళ్లిపోయాడు. అప్పటి నుంచే పాకిస్తాన్ చరిత్రగతి మారిపోయింది: బంగ్లా దేశ్ పుట్టుకచరిత్ర ప్రారంభమైంది.

ఇందులో శ్రీ భుట్టో కీలకమైనపాత్ర నిర్వ హించాడు: షేక్‌ముజిబుర్‌రహ్మాన్ పాకిస్తాన్ ప్రధాని కావడం ఆయనకు ఇష్టంలేదు. అవామీలీగుపార్టీ, బెలూచిస్తాన్‌లలోని జాతీయ అవామీలీగుల ఆధ్వ ర్యంలో పాకిస్తాన్ రాజ్యాంగ రచన ఆయనకు ఇష్టం లేదు. ఆరు సూత్రాల కార్యక్రమంకింద పశ్చిమ పాకిస్తాన్‌లో ఇతర రాష్ట్రాలు స్వపరిపాలనాధికారా లను పొందడంవల్ల కేంద్రం బలహీనపడగలదని ఆయన వాదన. ఆ వాదనను పంజాబీ రాజకీయవేత్తలు, సైనిక వర్గాలు బలపరచారు. దానితో అధ్యక్షుడు యాహ్యా ఖాన్ వైఖరిలో మార్పువచ్చింది. ఎన్నికలలో ప్రజల తీర్పును కాదన్నాడు. జాతీయ అసెంబ్లీ సమావేశాన్ని వాయిదా వేశాడు. అసెంబ్లీలో మెజారిటీగావున్న అవామీలీగును మైనారిటీపార్టీ చేయడానికి పూను

కున్నాడు. రెండు దశలుగా ఈ లక్ష్యసాధనకు సిద్ధపడ్డాడు. మొదటిది ప్రజాప్రతినిధుల స్థాయి. అవామీలీగు నిషేధం. దాని ప్రతినిధులుగా ఎన్నికైనవారి సభ్యత్వాలు రద్దు. వారి అరెస్టులు. షేక్‌ముజిబుర్ రహ్మాన్‌పై దేశద్రోహ నేరారోపణ. రెండవది ప్రజల స్థాయి. అవామీలీగును బలపరచిన ప్రజావర్గాల అణచివేత. బెంగాలీ అభిమానంవున్న మేధావివర్గాల నిర్మూలనం. జనాభారీత్యా తూర్పు బెంగాల్ జనసంఖ్యను పశ్చిమ పాకిస్తాన్‌కంటె తక్కువచేయడం. పాకిస్తాన్ పరిపాలనాధికారం ఏనాడూ తూర్పు బెంగాల్ ప్రతినిధుల వశంకాకుండా చూడడం.

ఇందుకుగాను 1971 మార్చి 25 నుంచి డిశంబరు 3 వ తేదీవరకు తూర్పు బెంగాల్‌లో జనహత్య సాగింది. దానినిగురించి అమెరికా, బ్రిటన్, ఐరోపా పత్రికలు పూర్తివివరాలు ప్రకటించాయి. యాహ్యాఖాన్ సాగించిన హత్యాకాండను జంగిస్‌ఖాన్ దారుణాలతోను, హిట్లర్ దురంతాలతోను పోల్చిచూపాయి. కనీసం పదిలక్షలమంది హత్య చేయబడివుంటారని అంచనా వేశాయి. హిందువులు, బౌద్ధులు, క్రైస్తవులు, ముస్లింలు అనే విచక్షణలేకుండా బెంగాలీలు అనేజాతి నిర్మూలనకాండ సాగిందని వర్ణించాయి. ఈ హత్యాకాండకు ఆగలేక దాదాపు కోటిమంది బెంగాలీలు భారతదేశానికి శరణార్థులుగా వలస వచ్చారు. వీరితో బంగ్లాదేశ్ చరిత్రతో భారత్‌కు అనుబంధం ఏర్పడింది.

తొలిదశలో యాహ్యాఖాన్ పాశవిక చర్యలను బెంగాలీలు స్వశక్తితో ఎదుర్కొన్నారు. తూర్పు బెంగాల్‌లోని పోలీసు, సైనికదళాలు యాహ్యాఖాన్ ప్రభుత్వంమీద తిరుగుబాటు చేశాయి. బెంగాలీ యువకులను, విద్యార్థులను సమీకరించి, ముక్తివాహిని ఏర్పాటు చేశాయి. గెరిల్లాయుద్ధం ప్రారంభించాయి. పాకిస్తాన్ సైనికులకు — బెంగాలీలకు మధ్య ప్రజాయుద్ధం ప్రారంభమైంది. 1971 ఏప్రిల్ 17 న పాకిస్తాన్ జాతీయ అసెంబ్లీకి ఎన్నికైన ప్రతినిధులు ముజిబుర్ నగర్‌లోని మామిడితోటలో సమావేశమై బంగ్లాదేశ్ స్వాతంత్ర్యాన్ని ప్రకటించారు. బంగ్లాదేశ్ తాత్కాలిక ప్రభుత్వాన్ని ఏర్పాటు చేశారు. ఆ ప్రభుత్వం ఆధ్వర్యాన ప్రజా ప్రతిఘటన సాగింది. దానిని అణచివేయడానికి యాహ్యాఖాన్ సైనికులను విమానాలను, టాంకులనుకూడా వినియోగించారు. కాని తిరుగుబాటును అణచివేయలేకపోయాడు.

ఈ పోరాటానికి భారత్ ప్రోత్సాహం కలదన్న ఆరోపణలు పాకిస్తాన్ చేస్తూవచ్చింది. బంగ్లాసమస్య తన ఆంతరంగిక వ్యవహారమని, దానిలో భారత్ జోక్యం కలిగించుకుంటున్నదని ప్రచారం చేసింది. భారత్—పాకిస్తాన్‌లమధ్య ఇదొక వివాదాంశం ఆయినట్టు ప్రపంచానికి చిత్రించింది.

తూర్పు బెంగాల్‌లో సైనిక చర్యలకు భయపడిన బెంగాలీలు ఎనిమిది నెలలపాటు వేలు లక్షల సంఖ్యలో భారతదేశానికి శరణార్థులుగా చేరడం ప్రారంభించారు. పాకిస్తాన్ ఏర్పడ్డప్పుడూ తూర్పు బెంగాల్ నుంచి 43 లక్షలమంది శరణార్థులు భారత్‌కు రాగా, ఇప్పుడు దాదాపు కోటిమంది వచ్చారు. వీరిని పోషించవలసిన భారం భారత్‌మీద పడింది. దానికి అంతర్జాతీయ సహాయాన్ని భారత్ అర్థించింది, కాని అవసరమైన మేరకు సహాయం జరగలేదు. ఈ శరణార్థులవల్ల భారత్‌లో ఆర్థిక, సాంఘిక, రాజకీయ సమస్యలు వత్తిడులు ఏర్పడుతున్నవని, తూర్పు బెంగాల్‌లో జనహత్యను నివారింప జేయాలని ప్రపంచ దేశాలకు, పాకిస్తాన్ మిత్రదేశాలకు ఎనిమిది నెలలపాటు ప్రత్యేక ప్రతినిధివర్గాల ద్వారాను, ప్రధాని స్వయంగా విదేశ పర్యటనద్వారా వివరించడం జరిగింది. కాని ఫలితం లేకపోయింది. మొత్తంమీద తూర్పు బెంగాల్‌లో జనహత్య జరుగుతూవుంటే, సమకాలీన ప్రపంచం 'మౌనం' వహించింది.

ప్రపంచరాజ్యాల 'మౌనం' యాహ్యాఖాన్ స్వప్రయోజనాలకు వినియోగపడింది. బంగ్లా సమస్యను భారత్—పాక్ వివాదాంశంగా మార్చడానికి, అదొక అంతర్జాతీయ సమస్యగా చేయడానికి ఉద్దేశించాడు. ఈ లక్ష్యసాధనకు 1970 డిశంబరు 3 వ తేదీన

హఠాత్తుగా భారత నగరాలమీద విమానదాడులు చేసి, పశ్చిమ పాకిస్తాన్ సరిహద్దులనుంచి సైన్యాలను ముందుకు దూకించాడు. ఆ తర్వాత జరిగిన పక్షం రోజుల యుద్ధానికి కారకుడయ్యాడు: బంగ్లాదేశ్ సమస్యను ఆంతరంగిక సమస్యగాను, భారత—పాక్‌లమధ్య అంతర్జాతీయ వివాదాంశంగాను మార్చుచేశాడు.

ఈ మార్పు జాతీయంగాను, అంతర్జాతీయంగాను భారతదేశాన్ని పెక్కు పరీక్షలకు గురిచేసింది : జాతీయంగా భారతదేశం తప్పనిసరిగా పాకిస్తాన్‌తో యుద్ధానికి దిగవలసివచ్చింది. ఈ యుద్ధం కూడా విస్తరణ వాంఛతోకాక దురాక్రమణ నిరోధానికి, ఆత్మ రక్షణకు కొనసాగించవలసి వచ్చింది. పాకిస్తాన్‌నుంచి దురాక్రమణ ప్రమాదం భవిష్యత్తులో కొంతవరకైనా లేకుండా చేయాలన్న లక్ష్యంతో, పాకిస్తాన్ భౌగోళిక విచ్ఛిత్తినికాక, సైనిక యంత్రాంగ విచ్ఛిత్తిని భారత్ లక్షించింది. దానికిగాను తనకుగల సైనిక, వైమానిక నౌకాబలాన్ని సమగ్రంగాను,సమన్వయంతోను భారతదేశం తీవ్రంగా వినియోగించింది. రాజకీయంగా బంగ్లాదేశ్ స్వతంత్ర ప్రతిపత్తిని భారతదేశం గుర్తించింది. బంగ్లాదేశ్ ప్రభుత్వం ఆహ్వానంమీద ముక్తి వాహినితో కలిసి వ్యవహరించడానికి భారత సైన్యాన్ని తూర్పు బెంగాల్‌లోకి దూకించి దానిని విముక్తం చేసింది.

ఢాకాలో పాకిస్తాన్ సైన్యం లొంగిపోయిన వెంటనే పశ్చిమరంగంలోకూడా తనకుతానై ఏక పక్షంగా యుద్ధవిరమణ చేసింది. పాకిస్తాన్ కూడా అందుకు అంగీకరించడంతో భారత్—పాకిస్తాన్‌ల మధ్య యుద్ధం ఆగిపోయింది. బంగ్లాదేశ్ విముక్తి, ఏకపక్షంగా యుద్ధవిరమణ భారతదేశానికి జాతీయంగా కీర్తిప్రతిష్ఠలను తెచ్చాయి.

అయితే అంతర్జాతీయంగా భారతదేశం బల హీనపడింది. సోవియట్‌రష్యాతో చేసుకున్న రక్షణ ఒప్పందం కారణంగా, ఏదోఒక దుడుకుచర్యకు భారత్ సిద్ధం అవుతున్నదనే విమర్శకు గురిఅయింది. భద్రతా

మండలిలో పోరు విరమణకువచ్చిన తీర్మానాలను రష్యా 'వీటో' చేసినందున, రష్యా రాజకీయ రక్షణ ఛాయలో భారత్ వ్యవహరిస్తున్నదనే ఆరోపణలు పొందింది. ఐక్యరాజ్యసమితి సర్వసభ్య సమావేశంలో హెచ్చుమెజారిటీతో జరిగిన పోరు విరమణ—సైన్యాల ఉపసంహరణ తీర్మానాన్ని త్రోసిరాజనడంతో ప్రపంచ ప్రజాభిప్రాయాన్ని ధిక్కరించిందనే నిందను తెచ్చుకున్నది. కనీసం ఇరుగుపొరుగు చిన్నరాజ్యాలుకూడా భారత్ పక్షాన ఓటు చేయకపోవడంతో భారత వైదేశికనీతి విఫలమైనదనే విమర్శ ధ్రువపడిపోయింది.

బంగ్లాదేశ్ వ్యవహారానికి సంబంధించినంతవరకు అమెరికా, చైనాల వైఖరి పాకిస్తాన్‌కు అనుకూలంగా వుండడంలో ఆశ్చర్యంలేదు. అవి పాకిస్తాన్ మిత్ర దేశాలుగా ప్రసిద్ధి చెందాయి. పాకిస్తాన్ భౌగోళిక సమగ్రతను కాపాడడానికి అవి ఐక్యరాజ్యసమితి స్థాయిలో శక్తివంచనలేని కృషి చేశాయి. సైనికంగా కూడా సహాయపడ్డాయి. భారత్ శ్రేయస్సు, ప్రజాస్వామిక ఆదర్శాలు దృష్ట్యా ఇవి గర్హనీయమైన చర్యలు. అంతర్జాతీయ విధానాలదృష్ట్యా ఇవి ప్రపంచశాంతికి భంగంకలిగించే ధోరణులు. అందువల్లనే బ్రిటన్, ఫ్రాన్స్‌లవంటి మిత్రదేశాల విమర్శలకు అమెరికా—చైనాలు గురిఅయినాయి. అమెరికాలోని ప్రముఖ పత్రికలు, ప్రజానాయకులుకూడా తమ ప్రభుత్వ విధానాలను నిరసించడం జరిగింది.

అయితే అంతర్జాతీయంగా బంగ్లాదేశ్‌పట్ల వైఖరి ద్వంద్వంగా వుండడం గమనార్హం. జాతీయ విమోచనోద్యమాలను బలపరచడం కమ్యూనిస్టుల విధానం. అలా కమ్యూనిస్ట్ చైనా బంగ్లాదేశ్ ఉద్యమాన్ని బలపరచడంలేదని సోవియట్ రష్యా విమర్శిస్తున్నది. కాని బంగ్లాదేశ్ ప్రభుత్వాన్ని గుర్తించడంలో రష్యా తాత్సారం చేస్తున్నది. సోవియట్ కమ్యూనిస్ట్‌పార్టీనుంచి 'విప్లవాభినందనలు' బంగ్లాదేశ్ ప్రభుత్వానికి అందలేదు. ఉత్తర వియత్నాం, ఉత్తరకొరియా ప్రభుత్వాలపట్ల అనుసరించినదానికి విభిన్నమైన విధానాలను బంగ్లాదేశ్ ప్రభుత్వంపట్ల సోవియట్ రష్యా అనుసరించడం అనుమానాలకు దారితీసింది. విప్లవ ప్రభుత్వాలకు, విమోచనోద్యమాలకు ఆయుధ సహాయం, ఆర్థిక సహాయం చేయడమనేది రష్యాప్రభుత్వం కమ్యూనిస్టు విధానాలకు మూలసూత్రంకాని బంగ్లాదేశ్ విషయంలో ఇది మినహాయింపు జరగడం విచిత్రంగావుంది. అందువల్లనే బంగ్లాదేశ్‌పట్ల రష్యా—చైనాల విధానాలను భారత్ జాగ్రత్తగా పరిశీలించవలసి వుంటుందని రాజకీయ పరిశీలకులు హెచ్చరిస్తున్నారు.



# తలలేనోడు

'కొలకలూరి'

రాత్రంతా నిద్రపట్టక తలనొప్పితో కళ్ళనొప్పితో చలికి వణుకుతూ నిద్రలేచిన ముసలివాళ్ళా కళ్ళు మూస్తూ తెరుస్తూ కందిచేలోంచి కప్పుకొన్న మంచు దుప్పటి దులుపుకొంటూ కోటి కిరణాలతో వస్తున్నాడు సూర్యుడు. కోటి, సూర్యుళ్ళా దుప్పటి ఎగవేసుకొంటూ డొంకలోకి దిగాడు. తెల్లవారు జాము నుంచి తెరలు తెరలుగా దిగుతున్న పొగమంచు గుండెల్లోంచి చొచ్చుకొనిపోయే కిరణాలు ఎంతోదూరం పోలేక పోతున్నాయి. ఉదయమే డొంకలో నడుస్తున్న కోటి మడమశీల మునిగి కొంకులకు తగులుతున్న తడి దువ్వలో కాళ్ళీడ్చుకొంటూ సూర్యకిరణాల్లా వూళ్ళోకి పోతున్నాడు. ఇసుకమీద, మెరకమీద, కంకరపైన, రాళ్ళపైన, ఎక్కడచూచినా, చెమ్మగావుంది. ఎక్కడ తాకినా చల్లగావుంది.

పొగమంచు చల్లగా పడుతూవుంది. గడ్డిపరకలపైన మంచుబొట్లు మెరుస్తున్నాయి. చిల్ల కంప మీద మంచుబిందువులుపడి, క్షణంసేపు నిలిచి, తక్షణం జారి, పడుతూ మెరిసి, ముళ్ళముఖాన తడితాపడం చేసి, చిట్లిపోతున్నాయి. రాత్రెప్పుడో ముళ్ళకంప కొమ్మలమధ్య పురుగులకోసం వలపన్నిన సాలీడు గూడులో మంచు చెమ్మకు ప్రతిపోగూ తళతళలాడుతూ వుంది. ధ్వజస్తంభం మీదపడ్డ మంచుబొట్లు కొన్ని నిలిచి, కొన్నిజారిపోగా స్ఫోటకం మనిషిముఖం గుర్తుకు తెస్తూవుంది. చెరువుగట్టూ చెరువునీరూ ఏకంచేస్తు మంచు మలామాచేసింది. ఈ ఉదయం ఎంత వెలుతురు కలిగించినా, ఎంత బలహీనంగా ఉదయించినా సూర్యు డవసరమే !

తెల్లవారితే పల్లెఅంతా కదలిక! సూర్యుడుత్సాహమై ప్రతిగుండెలో ఉదయిస్తాడు. పల్లెలో ప్రతి ప్రాణిలో పరమచైతన్యం. కోటిలో కదలికఉంది. చైతన్యంలేదు. శవం, మోస్తున్నప్పుడు కదిలినా ప్రాణంలేనట్లుగా చెరువుగట్టుమీద కదలి వస్తున్నాడు. పశువుల్ని జీతగాళ్ళు పొలం తోలుకుపోతున్నారు. ఆవుపేడ కడికోసం ఇద్దరమ్మాయిలు యుద్ధం ప్రకటించుకొంటున్నారు. కల్లాపిజల్లే చప్పుళ్ళు వినబడుతున్నాయి. ఊరబావిగిలక తోకతెగిన కుక్కపిల్లలాగా కయ్‌కయ్ మంటూవుంది. బళ్ళగాట్లో పావలా దొరికిందని ఎగిరి గంతులేస్తున్నాడు జీతగాడు. డొంకలోదుమ్ము సామాన్యుడి బ్రతుకులా బళ్లచక్రాలక్రింద నలిగి, దువ్వదువ్వ అయిపోయింది.

చెరువుగట్టుదిగి, రావిచెట్టుప్రక్కగా నడిచే పీనుగలా వస్తున్న కోటి కెదురుగా దేవాలయం డొంక మలుపులో నాగలింగం! ఇద్దరూ ఎదురయ్యారు. ఇద్దరూ చూచుకొన్నారు. ఇద్దరూ నిలబడ్డారు. ఒకరి కెదురుగా ఒకరు. ఎవరూ మాట్లాడలేదు. రెండు క్షణాలు నిశ్శబ్దం !

'ఏడకి?'

కోటి అడిగాడు. భుజంమీదవున్న గొర్రెబొచ్చు దుప్పటి, పాతది, చిరిగింది, ముతకది, పైకి ఎగేసుకొన్నాడు. అది తెల్లవారుజామున కురిసిన మంచులో తడిసి, ఉతికి పిండేసిన బట్టలాగావుంది.

'ఈడకే!'

పొది ఎడంచేతిలోది కుడిచేతిలోకి మార్చుకొన్నాడు నాగలింగం. తలెత్తి ముఖంలోకి చూడలేదు. మాటకూడా స్పష్టంగా చెప్పలేదు. మాటలునంగిగా, చేష్టలునంగిగా ఉన్నాయి. ఈడకేఅంటే వాళ్లిద్దరికీ అర్థం కావచ్చు. అందుకే కాబోలు కోటి మళ్ళీ ప్రశ్నించలేదు.

'రాత్రింటో లేవంలేం?'

ఈసారి నాగలింగవ్ ప్రశ్నించాడు.

'ఊఁ!'

'మరేడకిబోయా?'

'పొలం!'

పొలమనేటప్పటికి కోటి గొంతు వణికింది. గొంతులో రాళ్ళు అడ్డంపడ్డట్టు, పంటికింద రాయి పడ్డట్టు, ముఖమూ పళ్ళూ కరకరలాడాయి. కోటి స్థితి చూస్తే నాగలింగం కళ్లలో నీళ్లు తిరిగాయి.

మళ్లీ ఇద్దరూ ఏమీ మాట్లాడుకోలేదు. జనం చెరువునీళ్లు కావిళ్లతో, బిందెలుతో తీసుకుపోతున్నారు. దేవాలయం గోపురంమీద పావురాలు కువకువ లాడుతున్నాయి.

కోటివెనులుపుతిరిగాడు. ఏమీ మాట్లాడకుండా వెళిపోయాడు. కోటి పది బారలు నడిచిందాకా చూస్తూ నిలబడిపోయి పొది మళ్లీ చేయి మార్చుకొని, చెరువు ఉత్తరపుగట్టుమీదగా ముందుకుపోయాడు నాగలింగం.

'ఛీ! యదవనాయాలిబతుకు! ఈ బతుకు బతికే కంటే ఏమయ్యో గొయ్యో జూసుకుంటే నయం పీడి రగడవుద్ది'అంటూ గొణుక్కుంటూపోతున్నాడు నాగలింగం. అప్పటికప్పుడు వంట్లోఉన్న రక్తం మండి పడి, పైకి ఎగదన్నిందో ఏమో ముఖం ఎర్రబడింది. ఏల్నాటిశనిలాంటి పొగమంచు క్రమక్రమంగా విచ్చిపోతూవుంది. చలి తగ్గుతూవుంది. నాగలింగం వంట్లో వేడి పెరుగుతూవుంది.

నాగలింగం కోటికి లేకలేక కలిగిన కొడుకు. ఒక్కడే సంతానం. కొడుకు చదువుకొని గొప్ప ఉద్యోగి కావాలని అందరు తండ్రులులాగే కోటి కలలు కన్నాడు. ఆ కలలు, ఆఅలుచూచి తేళ్ళూ జెర్రులూ కుట్టినట్లు కేర్‌బేర్‌మని, నాలుగేళ్ల అలా అరుస్తూనే ఉన్న కొడుకును చూచేసరికి, కల్లలయ్యాయి. పోనీ అని కులవృత్తి నేర్పాడు. అదీ అంతంతమాత్రమే అయింది వాడితల గాటుపెట్టాడు వీడి తల గంటు పెట్టాడు అని తెఁసి 'నువ్వెందుకు పనికొత్తావురా' అని నెత్తిన్నోరు పెట్టుకొని, కొట్టుకొని 'ఈడు బాగుపళ్ళే'డని నిర్ణయించుకొన్నాడు కోటి. 'నే జత్తే ఈడికేంద్దిక్కు' అని ఆలోచించి, కాలూ చెయ్యీ కూడదీసుకొని, రెండెకరాల గరువు సంపాదించాడు. 'నే బోతే, ఈ రొండెకరరాల్తో 'ఆడిసావాడు జత్తాళ్లే' అని నెమ్మదిపడ్డాడు.

ఆ మధ్య నాగలింగం పేకాడుతున్నాడు, తాగుతున్నాడు, అని విని, 'ఇది గాదుపని' అని ... చేశాడు. అప్పణ్ణుంచి అదేందో 'జివ జచ్చినోడయ్యేడు' నాగలింగం. దేవుడుమాత్రం చల్లనిచూపు చూశాడు. ఇద్దరు పిల్లలు కలిగారు. పెద్దపిల్ల పదేళ్లదయింది. 'నాలుగేళ్లల్లో ఈ నాగ్గాడు నాకు మల్లే తాతగాబోతాడుగందా ఆడికి బుద్దొచ్చేదెప్పటాఁవటంటా?' అని కోటి దిగులు పడుతున్నాడు.

ఏణ్ణర్థం నుంచి పనినేర్చుకొన్న నాగలింగం 'తండ్రికితగ్గ కొడుకు'గా 'తండ్రినిమించిన కొడుకు'గా పెద్దలచేతా, పిన్నలచేతా మన్ననలు పొందాడు. 'ఈ నాగ్గోడు తాగుతాడా, పేకాడతాడా' అంటే ఎవరూ నాగలింగం ముఖం చూస్తూ చూస్తూ నమ్మలేరు. నాగలింగం క్రాపుచేస్తే బస్తీలో సెలూన్లు బలాదూరు! గడ్డంగీస్తే రెండు రోజులు మొటికకూడా తగలదు. తలగుండు చేస్తున్నా, గడ్డం గీస్తున్నా కత్తి తనమీద ఉంది అని అనిపించనే అనిపించదు. అసలు పని చేస్తున్నట్లే తెలియదు. గాటు పెడతాడు, గంటు పెడతాడు అన్న భయం అసలే లేదు. తలమాలిష్ చేస్తే ఎంతో సుఖంగా చేయగల్డు. నిద్రవస్తుంది. తలనిచ్చింతగా అప్పజెప్పి నిద్రపోయి, గంట తర్వాత లేచి చూచుకొంటే పనంతా పూర్తయి వుంటుంది. అంతనేర్పుగా పనిచేయగలుగుతున్నాడు నాగలింగం. మీసం, అంతసన్నగా పెట్టాలంటే ఆ వూళ్లో అతనితో పోటికి వచ్చేవాళ్లు లేరు. తండ్రికూడా దిగదుడుపే! ఆ మధ్య ఉన్నట్టుండి కొడుకు ప్రయోజకుడయ్యాడని విన్న కోటికి దుఃఖమే కలిగింది. ఏడుపే వచ్చింది.

చెరువు ఉత్తరపుగట్టుదిగి, లంకంత ఇంటి

ముందుకు వెళ్లాడు నాగలింగం. నాలుగు వీధులమధ్య ఉన్న ఒకే ఒక్క యిల్లు, లంకంత ఇల్లు, మునసబు వీరన్నఇల్లు. ఇంటిముందుకు వచ్చేసరికి జీతగాడు కట్టుకుపోతున్న ఎడ్లబండి ఎదురయింది. జీతగాడు చూచి, ఎగతాళిగా నవ్వి ఎడ్లు అదిలించుకొంటూ వెళిపోయాడు. ఎడ్లమెళ్లో గంటలు యముడి దున్న పోతు గంటల్లాగా, నాగలింగం గుండెల్లాగా మ్రోగుతూ వున్నాయి. ఆ లంకంత ఇంటి ప్రహరీమెట్లు మనిషెత్తున్నాయి. మెట్లెక్కి ప్రహరీదాటి లోపలికి పోయాడు నాగలింగం. సత్రంలో వీధి బడిపిల్లలు ఆ ఆలు చదువుతూ ఎవరినో వారిస్తున్నారు.

వరండాలో ఈజీచెర్లో వాలి పేపరు చదు వుతూవుంది మునసబు వీరన్నే అనీ, ఎలుగుబంటుకాదనీ, ఆ ఖిల్లా ఆ మనిషి తెలిసినవాళ్లు అనుకొంటారు. వీరన్న ఆరడుగుల మనిషి. భారీశరీరం. ఎర్రటికళ్లు నల్లటివాళ్లు. రెండే బొగ్గులు అంటుకొనివుంటే కుంపటి ఎలావుంటుందో అలాంటివాళ్లు. చూపులు రంపం ముళ్లులాంటి కనురెప్పల్లోంచి వెలుపలికి జైలు కటకటాల్లోంచి వచ్చే హంతకుళ్లా వస్తున్నాయి.

తల పెరిగిపోయింది. కీకారణ్యంలాగా పెరిగి పోయింది. గడ్డం సింహంజూలులా వేలాడబడివుంది. మూతిమీద మీసాలు నోటికి రోజూ పనివుండటంవల్ల పక్కకు పోయాయి. అవి వేలాడబడివుంటే నోరు మూతబడివుండేది. తలవెంట్రుకలు, కనుబొమలు, గడ్డంకలిసి మొత్తం నల్లగా ముద్దలాగా. 'ముక్కు నుదురున్న చీకటి ముద్ద'లాగా వుంది. ఆ ముఖంలో ముక్కు నుదురుతప్ప మరే అవయవమూ ఉన్నట్లు అప్పటికప్పుడు దాఖలా ఏమీలేదు. అంతానలుపు. ఒకే నలుపు. కారునలుపు.

నాగలింగం ఎదుట నిలబడగానే వీరన్నలేచి ముందుకువచ్చాడు. 'యారా నాగ్గా వొచ్చేవే రావను కున్నా' అంటే నాగలింగంవిని మాట్లాడకుండా వూరు కొన్నాడు.

'యగాం? మాట్లాడవేం?'

నాగలింగం ముఖంలోకి చూశాడు వీరన్న.

'యాఁవుంది? యా వుందని మాట్టాడేది? వొత్తిని. ఇంక మాట్టాడేందుంది?' పొది క్రింద బెట్టి కూర్చుంటూ 'కొబ్బెర్నూనె గావాలి' అని కూర్చుని, పొదివిప్పి, కత్తి రాయీ తీసి, 'క్రాప యేంది?' అని అడిగాడు.

'గుండే!'

రాయితీసి సరిచేసుకొన్నాడు. జీతగాడు కొబ్బరి నూనె తెచ్చి రాయిమీద వేశాడు. నాగలింగం కత్తి నూరుకొంటూ 'యేం దాలిస్సెం' అంటే 'వత్తా-ఇప్పుడేవత్తా' అంటూ లోనికిపోయాడు వీరన్న.

వీరన్న ఆరునెలలనుంచి క్రాపు చేయించుకో లేదు. గడ్డం గీయించుకోలేదు. ముఖంమీద కత్తి పెట్టించుకోలేదు. జుట్టు రెల్లుగడ్డి పెరిగినట్లు పెరిగి పోయింది. తలంతా అడ్డమాకలులేని అడవి అయి పోయింది. మొన్న పట్టణంనుంచి వచ్చీరావటంతోనే నాగలింగానికి కబురు చేశాడు. వెంటనేవచ్చి 'నా తల పని చూడవలసిందని'.

నాగలింగం రాలేదు.

వీరన్న మునసబు. అంతేకాదు డబ్బున్నవాడు. ఆర్థికంగా ఉన్నవాడూ, అధికారం ఉన్నవాడూ. పల్లెలో చేయలేనిపనంటూలేదు. తనతో సమానంగా ఎందులోనూ తూగగలవాళ్లు ఆ వూళ్లో నరేసరి, ఆ చుట్టుప్రక్కల ఆమడదూరంలో లేరు. తన మాటంటే వేదవాక్కు! వీరన్న మకుటం లేకపోయినా మహారాజు! అటువంటి తను రమ్మంటే నాగలింగం రాకపోవటమా?

తన తాత ముత్తాతల దగ్గర్నుంచి—ఎన్నితరాలో చెప్పటం కష్టం—కోటి కుటుంబంవాళ్లు వంశపారం పర్యంగా తమ యింటిపనిచేసుకొని బ్రతికారు. నాగ లింగం రాకపోతే తన ఒక్కడిపరువే అయితే దాని మార్గమే వేరు. తరతరాల వంశప్రతిష్ఠ, పరువు గంగలో కలిసినట్లు బాధపడ్డాడు. స్వర్గంలోనో నరకం లోనో ఉన్న తన పూర్వీకులు ఇంత ప్రయోజకుడా మా వంశంలో పుట్టింది, మా ఆస్తి అనుభవిస్తూ వుంది, మా యింట దీపంపెడుతూవుందని, కుమిలి

కుమిలి ఏడ్చినట్లు అనిపించింది. బాధ కలిగింది. అందు వల్ల మోతాదును పిలిచి కబురు చేశాడు.

'వచ్చి పన్జేత్తాడో యింకేవూరన్నా యెతుక్కుంటా బోతాడో తెల్సుకురా! తేల్సుకురా!' అన్న వీరన్న మాటచెప్పి, మోతాదు సలహా యిచ్చాడు. 'ఎట్టా లేదన్నా నువ్వీ వూళ్ళో వుండాల్సినోడివి. ఎంకా వూరొదిలిబోలేవు గందా! ఏసెరువునీ రా సెరువులో యింకాల్సిందే గందా! అందుకని నా మాటిను పెద్దోణ్ణి సెబుతున్నా కాదనమాక. నువ్వీ కళ్ళముందు పుట్టి పెరిగినోడివి. ఆడా కటికోడు! నువ్వా మెత కోడివి? యవ్వారలెట్టా యేడిసినా, ఈ వూళ్ళో ఆణ్ణోడో పీడో పడకుండా ఎవుడుండాడు జెప్పు! అందుకని, నామాటిని, ఎళ్ళి, ఆడిపని—యేంది—ఆడి పని—యేంది యిచ్చావు గందా—పూర్తిగా ముగించి వొచ్చెయ్. నువ్వీ వూళ్ళోనే వుండొచ్చు. ఆయిగా బతకొచ్చు. నీకు బాదగా వుంటదని నేనేంది ఎవుడయినా వొప్పుకుంటాడు. బాద మర్సిపో! నీపన్నువ్ జెయ్'.

మోతాదు ఒక మోతాదులో రంగరించి ధర్మోపదేశం చేశాడు. ఈ ధర్మోపదేశమే కృష్ణుడు చేస్తే అర్జునుడు యుద్ధం చేశాడు. ఈ ధర్మోపదేశమే సమర్థ రామదాసుచేస్తే శివాజీ విజృంభించాడు. ఈ ఉపదేశం వినే 'రేప్పొద్దున్నే వత్తా—అట్టాఁవటాని జెప్పు' అని నాగలింగం కార్యోన్ముఖుడయ్యాడు.

మాట ప్రకారంవచ్చి, క్వారీరాయిమీద కూర్చుని కత్తి నూరుకొంటున్నాడు నాగలింగం. వీరన్న పాత పంచె నాలుది కట్టుకొని, చొక్కాగానీ బన్నీనుగానీ వేసుకోకుండా కండువా కప్పుకొని, వచ్చాడు. జీతగాడు వచ్చి కుర్చీవేశాడు. వీరన్న కూర్చుంటూ 'కత్తిబాగా నూరావా లేదా?మంట పుట్టుద్దా యెట్టా?' అంటూ నాగలింగం వూపే తలచూస్తూ 'వూఁ!' అన్నాడు. ప్రక్కనే ఉన్న దబారాలో నీళ్ళతో వీరన్న తల తడుపుతున్నాడు. 'కోటి గోడికింత పొగురు పనికిరాదు' అంటూ తల తడుంకొన్నాడు వీరన్న. 'ఇంకా తడుపు!' అని ముఖంలోకి చూశాడు. ముక్కుమీద, గడ్డంమీద, మీసాలమీద నీటిబొట్లు తలచుట్టూ జారుతున్నాయి. 'ఇంకజాల్లే' అని తల తడపటం వారించి, 'ఆడి సొమ్మేఁవన్నా దిన్నానా పాఁవ్ మ్యాసినట్టుజూసి పోయేడు' అని దగ్గ నాగలింగం ముఖంలోకిచూచి 'నువ్ జెప్పు—ఆడిత్తప్పా? నాత్తప్పా? అని అడిగాడు.

నాగలింగం బదులు చెప్పాడు. ఆ చెప్పటంలో ఏదో ఒకటి మాట్లాడాలన్న ఆలోచనతప్ప సమాధానం సరీగ్గా చెప్పాలన్న తొందరేం లేదు. 'యే దోటే—యియ్యన్నీ పెట్టుకొంటే అవ్వుద్దా యేంది నాబొంద' అని 'వొంగు—కొంచెం—ఇంకొంచెం' అని తలవంచి కత్తిదీసి ముచ్చికల గుంటమీద ఆనించాడు. చేయి కదిపాడు. అయినా కత్తి మొరాయించింది. కదల్లేదు. మహారణ్యంలా పెరిగిన ఈతలలో పులులుంటాయను కొందో సింహాలే వుంటాయనుకొందో కత్తి వణుకుతూ వుంది. 'యేందిరిది' అనుకొని చేయి చూచు కొన్నాడు చేయి వణుకుతూ వుంది. క్షణంఆగి, చేయి పైకి తీశాడు 'ఏం?' అన్నాడు వీరన్న. 'యేందిరా?' అడిగాడు. 'యాంలే' చెప్పాడు నాగలింగం. 'కత్తి నూరుతా!' రాయి తీశాడు. మళ్ళీ నూరాడు. రాయిపొదిలో పెట్టాడు.

వీరన్న వంచినతల వంచినట్లే వుంది. సాగిన మెడ సాగినట్లే వుంది. ముచ్చికల గుంటమీద కత్తి పెట్టాడు. పదను పెట్టిన కత్తి, ఈ సారి నోరెత్త లేదు. కిక్కురు మనలేదు. పరుగెత్తింది. పరపర లాడింది. ముచ్చికలగుంటనుంచి నుదుటిదాకా పొలం దున్నినట్లు దున్నుకొంటూ పోయింది. అటుపక్కకు జుత్తు! ఇటుపక్కకు జుత్తు! ఎదురయిన జుత్తు ఏటవాలుగా పడుతూ వుంది.

కత్తితో గీసినచోటు చుట్టుప్రక్కల నల్లగా మధ్యలో తెల్లగా కీకారణ్యంలో సిమ్మెంటు రోడ్డు లాగావుంది. మళ్ళీ ముచ్చికల గుంటమీద కత్తి పెట్టాడు. జొన్న నరికినట్లు, వరికోసినట్లు, ధనియాకంప పీకినట్లు, బుల్‌డోజర్ అరణ్యం ఛేదించి నట్లు కత్తి గీస్తూవుంది.

తలముందు జుత్తుఅంతా గీసేసింది కత్తి.

అక్కడక్కడా మిగిలిపోయిన వెంట్రుకమొనలు అద్దం మీదపడ్డ నల్లదుమ్ములాగా ఉన్నాయి. చూపుడువ్రేలూ బొటనవ్రేలూ మధ్య కత్తి రెండెడ్లమధ్య నాగలిలా శిరఃక్షేత్రం దున్నుకు పోతూవుంది. వెనక్కూ ముందుకూ, క్రిందికీ, పైకీ.

ప్రక్కకు పడుతున్న జుత్తుఅంతా పోగుచేసి ఒక పసుపుబట్టలో వేస్తున్నాడు జీతగాడు. వెంట్రుక బీరుపోకుండా చిన్న మొటికఅయినా వేరుగాకుండా జుత్తుఅంతా ఒక్కచోట చేరుస్తున్నాడు.

ఈ జుత్తుమూట తిరుపతి రాత్రివెళ్లే నాంచారయ్యకిచ్చి కొండమీద హుండీలో వేయమని చెప్పాలని వీరన్న అనుకొంటున్నాడు.

ఆరు నెలల్క్రితం పంతం పట్టాడు. ఈ పొలం విషయంలో ఎటూ కోర్టు కెక్కవలసివచ్చింది ఇంతకు ముందెప్పుడూ ఇటువంటి పరిస్థితి తటస్థించలేదు. అనుకొన్నదానికి అపజయమూలేదు. ఇప్పుడేమవుతుందో? కోర్టు ఎలా తీర్పిస్తుందో? అన్యాయం జరుగుతుందా? జరగబోయేది ఎవరు చూశారు? వీరన్న మథన పడ్డాడు. చివరకు వీరన్న నిర్ణయానికి వచ్చాడు. ఈ కోర్టువ్యవహారం, తన ప్రతిష్ఠ, తన వంశప్రతిష్ఠ నిలపగలిగింది కనుక 'నీటముంచినా పాలముంచినా నీదే బారం తండ్రీ—ఏడుకొండలవోడా — ఎంకటేసురుడా వొడ్డీకాసులోడా అంతా నీదేబారం తండ్రీ—నన్నొడ్డునెయ్ నా తలజుత్తు నీకిచ్చుకుంటా తండ్రీ' అని మొక్కుకొన్నాడు. అప్పణ్ణుంచి ఇప్పటిదాకా వీరన్న తలపెంచాడు.

వీరన్న పొడగిట్టనివాళ్లు గడ్డం పెంచవలసిన అవసరంలేదనీ, అది మొక్కులో భాగంకాదనీ, రెండు సార్లు మొక్కుతర్వాత తీయించాడనీ, బస్తీలో సెలూనులో చేయించటం డబ్బు దండగని మానేశాడనీ, అయీ అనేక కారణాలవల్ల గడ్డం పెంచుతున్నాడని లోకులు చెప్పకొంటూ వుంటారు. ఇంతకాలం తన యింటిపని చేయని కోటిమీద ప్రతీకారం తీర్చుకొన్నట్లు నాగలింగంచేత అసలూ వడ్డీ కక్కించినట్లు పనిచేయిస్తున్నాడు వీరన్న.

వీరన్న తిరుపతిపోయి కళ్యాణకట్టదగ్గరే తల నీలాలు సమర్పించి వచ్చివుండేవాడు. రానూ పోనూ ఖర్చులు అవుతాయని భయంకాదు. డబ్బు ఖర్చుచేయటంలో సాధారణంగా చేయిచాచే మనిషి కాకపోయినా, వీరన్న ఈ విషయంలో చూపింది పట్టుదలే! 'కోటిగాడుగానీ ఆడి కొడుకుగానీ ఈ జుత్తు తీయకపోతే, ఈ తల తీసినట్టుగాదా' అనుకొన్నాడు. ఇంతకాలం పెరిగినతల, అసలును దాటిన వడ్డీలాగా నాగలింగం పాపంలాగా అతనికోసమే ఎదురుచూస్తూ వుంది.

నాగలింగం తల జుత్తుఅంతా పూర్తిగా తీసేశాడు. నున్నగా గీకేశాడు. ముచ్చికలగుంటనుంచి మెడమీదకు ప్రాకుతున్న రెండునరాలమధ్య పల్లంలో మిగిలిపోయిన జుత్తుకొడవలు మెడవంచి కత్తి అడ్డంగాతిప్పి తీసేస్తున్నాడు. రెండు నరాలు పొంగివున్నాయి. రెండు నరాలు ఉబ్బిఉన్నాయి. మెడను నిలబెట్టే నరాలు! మనిషిని నిలిపే నరాలు!!

నాగలింగం చేయి వణికింది. వెంట్రుకలులేని తల పీచుతీసిన కొబ్బరికాయలాగావుంది. దూరంగా వేణుగోపాలస్వామి ఆలయంలో గంట మ్రోగింది. చేయీ కత్తీ వణుకుతున్నాయి. క్షణంసేపు వణుకుతున్న చేయీ కత్తీ మెడమీదే వుంచాడు.

సూర్యుడు బారెడెక్కాడు. సూర్యకిరణాలు నెత్తురు చిమ్ముతున్నట్లున్నాయి మంచు క్రమక్రమంగా విడిపోతూవుంది. నాగలింగం మునసబు ఇంటి ముందునుంచి దేవాలయం మలుపుదాకా చూశాడు. ఒక్కమనిషీ లేడు. ఆకాశంలో పావురం డేగ తరుముంటే పరుగెత్తినట్లు, బుల్లెట్‌వేటు తప్పించుకొన్న సైనికుళ్లా చూపు త్వరపడుతూవుంది

నాగలింగం జుత్తు తీయటంలేదు. మిగిలిపోయిన మొటికలు తుడవటంలేదు. కత్తి తలమీదే లేదు. తలమీద చేయీలేదు. ఎడంగా నిలబడ్డాడు. విపరీతంగా చలిగావుంది. పొద్దుటిపూట సూర్యుడి కిరణాలు నులివెచ్చదనం వొళ్లంతా పాకుతూవుంది.

'నాగ్గా?' వీరన్న తలవంచుకొనే పిలిచాడు.

'యేంది?'

'యేంది వూరకనే నిలబడ్డా?'

'యేంజెయ్యాలా?'

'కానీ పా ద్దెకుద్ది!'

'ఉండు!' నాగలింగం చేయి విదిలించాడు. గడ్డంమీసం తడిపాడు. వీరన్న మీసాలు బొద్దుమీసాలు. నిమ్మకాయలమాటేమోగానీ ఉసిరికకాయలుమాత్రం వాటిమీద నిలబెట్టవచ్చు.

'మీసాలుంచాలా తీయాలా?'

'యేందీ?'

'మీసాలు!'

అవి వుంచాలన్న ప్రసక్తి వీరన్నకు కలగలేదు. తన మూతిమీద మీసం తీయటమా? ఎందుకో ఉన్నట్టుండి మగతనం ప్రశ్నింపబడ్డంత దిగులు కలిగింది. మీసంతీసి పౌరుషం తీసుకోవాలా? ఇంతకు ముందెప్పుడూ మీసాలు తీయలేదు! తీయనక్కరలేదేమో అనుకొన్నాడు. దేవుడు గుర్తుకువచ్చాడు. ఇంతకుముందెప్పుడూ తలజుట్టు తీయించుకోని తను, భగవంతుడికోసం తీసేయించుకొన్నట్లే మీసాలు తీయించటం ధర్మం అనిపించింది. 'పోనీ తీసెయ్' అన్నాడు వీరన్న. 'కయ్'మన్నట్లు అయింది. నాగలింగం వీరన్న ముఖంలోకి పరకాయించి చూచి మీసాలు తడిపాడు.

వీరన్న మీసకట్టు లాగా అతని పౌరుషం దట్టమయింది. అతని పౌరుషం కలిగితే ఆరు నూరయినా నూరు ఆరయినా మాట నెగ్గించుకొంటాడు. లాపాయింటుకోసం లక్షతగలేసిన వంశం వీళ్లదే నంటారు. ఆ వంశంలో చిరంజీవి వీరన్న. వీరన్న భుజస్కంధాలమీద తరతరాల వంశప్రతిష్ఠ ఆధారపడివుంది. వాళ్లకంటే ఇతను రెండాకులు ఎక్కువే చదివాడు. వీరన్న పగబట్టితే పాము పగ! పగతీరందే నిద్రపోయే స్వభావం వీరన్నది కాదు. కోటి విషయంలో పగ పన్నెండేళ్లు!

అంతా మాట పట్టింపు. ఆ మాట కోటి మరచి పోయేవుంటాడు. ఆ మాటలో అంతనేరమూ లేదు. అంత తీవ్రతా లేదు. అది అందికూడా వీరన్నను కాదు. కానీ, ఏమయితేనేం, తరతరాల మునసబుగిరి అహంకారానికీ, ఆస్తిపరుడి అధికారానికీ అది చెర్నాకోల దెబ్బ అయింది. వీపు చరుపు అయింది. గుండెలో కత్తిపోటు అయింది. గొంతులో గాలం అయింది. మింగలేక కక్కలేక వీరన్న ఉక్కిరిబిక్కిరి అయిపోయాడు.

కోటి తన రెండెకరాల పొలంలో వేరుసెనగ పీకించి పనలు పెట్టించాడు. వీరన్న చేలో కోయించిన వేరుసెనగకాయల బస్తాలు ఎత్తుకువస్తున్న బళ్లు లాటితోపుమీదగా తిరిగి డొంకలోకి రావటమే రివాజు! అయితే అది దూరం! అంచేత దగ్గరని కోటి చేలో నుంచి తోలాడు ఎడ్లబండి జీతగాడు. దానితో రెండోది బైలుదేరింది.

రెండు బళ్లు చేనుమధ్యకు వచ్చింతర్వాత కోటి చూశాడు. వెనక్కుపోతే ఎంత నష్టమో, ముందుకు పోయినా అంతే! బళ్లు వేరుసెనగకాయకంప తొక్కుతూ వస్తున్నాయి. కాయ రాలిపోతుంది. కందిచెట్లు విరగ దొక్కుతున్నాయి. బళ్లు హడావుడిగావస్తుంటే కోటి చూచి ఓర్చుకోలేకపోయాడు. ఆ దృశ్యం చూళ్లేక పోయాడు.

ఎడ్లబళ్లదగ్గరకుపోయి ఆపమన్నాడు. ఇటెందు కొచ్చారన్నాడు. అటు తిరిగి రాకూడదా అన్నాడు. మునసబుగారి బళ్లయితే భయమా అన్నాడు. ఈ నష్టం ఎవడు కట్టిస్తాడన్నాడు. ఇటొస్తే ఒప్పుకొనేది లేదన్నాడు. ఇప్పుడొస్తే వచ్చారుగాని మరెప్పుడూ రావద్దన్నాడు. పొండి అన్నాడు. బళ్లు వెళ్లిపోయాయి. బళ్లు తిన్నగా ఊళ్లోకి జరిగిన అవమానం మోసుకు పోయి, మొరపెట్టుకొన్నాయి.

'ఆహా కోటిగాడిట్టాగనటాని అన్నాడన్న మాట—బేష్, బాగా అడిగేశాడు. నున్నగా కడిగేశాడు ఆ ణ్నాకు నచ్చేడు. ఆడికి రొండెకరా లాడేడన మట్టేగా ఆడిట్టా కూసింది! మీ బుద్దెట్టా బోయింది. తిట్టుర్లిని వొచ్చేరా? సిగ్గులేక సెబుతున్నారా? ఆడిసేను పాడుజేత్తాగా వచ్చా? తప్పు

గందా? మళ్లీప్పుడన్నా ఆట్టా వొచ్చేరంటే నరికి పోగులేసి పారెత్తాపొండి' అన్నాడు. మాటఅన్న కోటి మర్చిపోయాడుగానీ వీరన్న మర్చిపోలేదు. మాటల బల్లేలతో రోజారోజూ గుండెలో పొడుచుకొంటూ పుండుచేసుకొంటూవున్నాడు. ఆ పుండు పన్నెండేళ్లకు మొన్న మానింది.

నాగలింగం వీరన్న మీసాలమీద కత్తి పెడు తుంటే, వీరన్న ఆహంకారంమీద కత్తి పెడుతున్నట్లు అనిపించింది. ఈ మీసాలు చూచే జనం జడుసుకొనే వాళ్లు. ఈ మీసాలు వీరన్న తాకితేనే ఎదుటివాళ్ల గుండెలు పగిలేవి. తను పెరిగి బుద్దెరిగింతర్వాత కోటి చేయితప్ప మరెవరి చేయి తగలని మీసాలు! మునసబు గిరి ఔన్నత్యం పెంచిన మీసాలు!!

కత్తి నిర్దాక్షిణ్యంగా తరుగుతుంటే, నాగలింగం గొరుగుతుంటే, తెగిన మీసాలు నేలమీద పడుతుంటే జీతగాడు పట్టుకొని, ఒత్తిపట్టి, గుంపిటబట్టి, నలిపి వీరన్న ప్రాణం గిలగిలమనేట్లు బట్టలో పడేస్తున్నాడు. తన స్థానం తప్పిన వస్తువెంత దయనీయం అయి పోతుందో తెలిసినట్లు అయింది.

మీసాలులేని ఓష్ఠం గూడులేని పక్షిలాగా గిల గిల లాడుతూవుంది. దానిస్నేహంతో విలాసంగా వయ్యారాలుపోయే అధరం ఎడారిలో కాలుతెగిన ఒంటె లాగా పడివుంది. మునుపు జంటకవులులాగా బండ బూతులు అధికారాలు ఆశువుగాచెప్పే పెదాలు ఎండిన దబ్బకాయ తొక్కల్లాగా మొరటుగా వికారంగా ఉన్నాయి. మడతలువడి, ఎండిపోయి మూర్ఛిడి హృదయంలాగా వున్నాయి.

ఆ పెదాలు పలికిన అబద్దాలు తలుచుకొం టుంటే నాగలింగానికి ఏడుపొస్తూవుంది. ఆ క్షణంలో వెర్రినవ్వు నాగలింగం పెదాలమీదపుట్టి పెలవుల్లో సాగి, చెక్కిళ్లలోపాకి కళ్లలో ఆరిపోకముందే నీళ్ళు నిండాయి. కన్నీటిచుక్క చెక్కిలిమీదగా పెలవిలోంచి అధరంమీదికి ప్రాకింది.

కరకర పొద్దెక్కింది. ఎండ వీపుమీద మద్దెల వాయిస్తూవుంది. సత్రంలో వీధిబడి పిల్లలు ఆఅలు చదువుతూ ఇంకా ఎవరినో వారిస్తూనే వున్నారు. అఆల వాళ్ల అల్లరి వినిపించినంతదూరం వినులవిందు. జీతగాడు పొలంనుంచి బండితోలుకొని తిరిగివచ్చాడు. ఊరబావి నొప్పి—గొంతునొప్పి — తగ్గిపోయింది. ఏడ వటం మానేసింది. మంచు విచ్చిపోయింది.

గడ్డంమీద వెంట్రుకలు దట్టంగా పడ్డాయి. నీళ్లతో తడిసి మెత్తగావుంది గడ్డం. వెంట్రుకలు తొలిగిస్తుంటే చేతికి తడి అవుతూవుంది. తడిచేతికి తడి వెంట్రుకలు చుట్టుకొని, వదిలించుకొన్నా వదల కుండా అరిచేతిమీద రేఖలులాగా కనబడుతున్నాయి. ఇవి తనజీవితం మారుస్తాయా అని క్షణంసేపు అని పించింది. వెంటనే నిస్పృహ! ఇవాళ క్రొత్తగా తన అదృష్టం మారేదేముంది? సాధించేదేముంది?

ఉదయం పొలంనుంచి ఇంటికి తిరిగివస్తున్న తండ్రిముఖంలో కనిపించిన దీనత్వంలాంటి తన అదృష్టం తలుచుకొని నాగలింగం కుమిలిపోయాడు. తండ్రి కష్టార్జితం ఆ రెండెకరాల గరువు! తమ యావదాస్తి! నిజానికి తన తండ్రికి ఆ పొలం రెండో కొడుకు! ఆ పొలంమీద అంతప్రేమ! కొన్నప్పుడు పాడు బీడుగాఉన్న భూమి పంటపొలంగా చేసుకొన్నాడు. ఏలెడంత పసివాణ్ణి ఏనుగంత మనిషిని చేసుకొన్నతల్లి తత్వం కోటిది. పొలంపంట ఇంటికివస్తే పిల్లాపాప లతో ఇల్లు కలకల లాడినట్లు పొంగిపోయాడు కోటి.

ఇంతకాలం పొలాన్ని ప్రేమించిన కోటిని రాత్రి పొలం ప్రేమించింది. కన్నకొడుకులాగా, కన్నకూతురు లాగా కోటిని చూచుకొంది. ఎత్తుకొంది. లాలించింది. బుజ్జగించింది. రాత్రి కోటి ఒక్కచోట పండుకో లేదు. పొలమంతా దొర్లాడు. నేలతల్లిని గుండెలకు హత్తుకొన్నాడు. ఇసుకలో కూరుకుపోయాడు. తెల్ల వార్లు భూమితల్లి వొళ్లో దాక్కున్న కన్నకొడుకు కోటి చలిలో బాధపడి, తలనొప్పి వొళ్ళునొప్పులతో జలుబు తుమ్ములతో దగ్గుతో ఇంటిముఖం పట్టాడు.

తండ్రి దృష్టిపథంలో మెదలి, తన అదృష్టం ఎంత వంకరగావుందో తెలిసినట్లయింది. మీసం పూర్తిగా తీసివేసినచేయి చూచుకొంటుంటే కడుపులో

చేయిపెట్టి పేగులు దేవినట్టయింది. తల తిరుగుతూ వుంది. నున్నగాఉన్న వీరన్నతల తన బ్రతుకు ఎంతగా గొరిగి వేయబడిందో గుర్తు చేస్తున్నట్లుంది.

'ఉండరేయ్' వీరన్న అదమాయించాడు. పైకి లేచాడు. కాళ్లూ చేతులూ జాడించాడు. తల విదిలించాడు. కప్పుకొన్న కండువాలోంచి చేయి పైకితీసి తల మీద పెట్టుకొని తడిమాడు. వెంటనే మీసాలు తడిమాడు. మళ్లీ తల! మళ్లీ మీసం! తాయిలం జేబులో పెట్టుకొన్న పిల్లాడు అది పడిపోతే చొక్కాజేబు, నిక్కరుజేబు హడావుడిగా తముళ్లాడినట్లు నెత్తి జుత్తు మీసంజుత్తుకోసం వీరన్న తడుంకొన్నాడు. 'తల తీసేసినట్టుంది' ఏదో గొణిగాడు 'కానేరా కానీ తొందరగా కానీ' అన్నాడు. కూర్చున్నాడు.

నాగలింగం తలవూపాడు, అతడి తలనిండా జుత్తు, దరిద్రుడి సంతానంలా దేదీప్యమానంగా పొద్దుటి ఎండకు మెరుస్తూ వుంది. గడ్డంమీద కత్తి పెట్టాడు. బరబరా పరపరా లాగేస్తున్నాడు. 'నెమ్మది రోయ్ నెమ్మది' హెచ్చరించాడు వీరన్న. నాగలింగం తలవూపాడు. అతడి గడ్డంనిండా జుత్తు. తేనె తుట్టెను ఈగలు జుట్టుకొన్నట్లు నాగలింగం గడ్డం నిండా వెంట్రుకలు దట్టంగా బిరుసుగా. వీధి బళ్లోంచి పిల్లలు అ ఆ అంటుంటే వద్దు వద్దు అన్నట్లుగా వినబడుతూవుంది. నాగలింగం ఏం వద్దనుకొన్నాడో అదే జరిగింది.

'నాగ్గాడు నాకుబాకీ' అన్నాడు వీరన్న. అంతే కాదు, 'నాడబ్బు నాగ్గట్టు' పట్టుబట్టాడు.

'ఏందాధారం?'

'నోటు!'

కోటి నోటు చూశాడు. సంతకం చూశాడు నాగలింగం సంతకమే! అంతకాలం టీచరు తన్నులు తిన్నందుకు చదువురాక పోయినా సంతకం వచ్చింది. అది బాగా ఉపయోగపడింది. పిచ్చివాడి కాలినడకలాగా వుంది, సంతకం వైరిముఖంతో చూస్తూవుంది.

అసలుకు రెట్టింపువేసి నోటు వ్రాయించుకొన్నాడు. మొత్తానికి వడ్డీకట్టి తిరగవ్రాయించాడు. ఈ విధంగా పన్నెండేళ్లనుంచి పెరిగిపోయిన వడ్డీ అసలుకు తాతఅయి కూర్చుంది. తీసుకొన్న డబ్బుకూ, కట్టవలసిన డబ్బుకు దోమ ఏనుకున్నంతతేడా! ఇంత మొత్తాని కెందుకునోటు అని అడిగితే ఇచ్చేటప్పుడు సగమే ఇద్దువులెమ్మని మాట ఇచ్చాడు వీరన్న. ఆ నోటులో సగానికే తాను బాకీఅని నాగలింగం అంటే వీరన్న మండిపడ్డాడు. అంతా కట్టవలసిన మొత్తమే అన్నాడు. అంత మొత్తమూ ఇచ్చానన్నాడు. అన్నం తినే నోటితోనే అన్నాడు. బాకీ తీరుస్తావా లేదా అని నిలదీసి అడిగాడు. 'నాదగ్గర్లేదు' అంటే 'బాకీకింద పొలం జమగట్టు' మన్నాడు. నాగలింగానికి తెలిసింది. ఇంతకాలం వీరన్నమైత్రి ఆంతర్యం ఇప్పు డర్థమై పోయింది.

'ఆ పొలం నాది. నా కష్టార్జితం' అన్నట్లుగా ఎదురు తిరిగాడు కోటి.

'నా డబ్బు నాకు ఇవ్వవలసిందే' అన్న వాటంగా పట్టుబట్టాడు వీరన్న.

నాగలింగం రెండు పట్టాలమీదగారైలుపోతుంటే కమ్మీలమధ్య మునగర దీసుకు పడుకొన్న వాడి ప్రాణం కొట్టుకు లాడినట్లు గిలగిల లాడాడు. ఏ విషయం తండ్రికి తెలియకూడదని భయపడుతూ పన్నెండేళ్ల దాచివుంచాడో, ఆ విషయం తెలిసేసరికి నోటివెంట మాట లేకపోయింది. ఇంతలో ఇంత ముంచుకు వస్తుందనుకోలేదు నాగలింగం.

'ఈణ్ణా కొడుగ్గాదు. ఈడికి సిల్లి గవ్వియ్యను. నా కడుపునీడు సెడబుట్టేడు. ఇది నా ఆస్తి. నాయిట్టం. నేన్దగలేసుకుంటా. నా కెవుడు జెబుతాడో ఇటు రమ్మను' అని అడ్డం తిరిగే సరికి వీరన్న రెచ్చిపోయాడు. 'కోర్టు కీడుస్తా'నన్నాడు. మాట నెగ్గించుకొన్నాడు.

వ్యవహారం కోర్టుకెక్కిం దగ్గర్నుంచి వీరన్న యింటి గడప తొక్కలేదు కోటి. కోర్టులో తన కేసు ఏమవుతుందోనన్న భయం కలిగిన మర్నాడే భగవంతుడు గుర్తుకొచ్చి తలనీలాలు మొక్కుకొన్నాడు వీరన్న.

కోర్టులో వీరన్న గెలిచే అవకాశంలేదనీ, డబ్బు రాదనీ, కోర్కె తీరదనీ, కేసు పోతుందనీ, తెలిసి కసిగా దిగులుపడ్డాడు. నాగలింగం డబ్బుకట్టక తప్ప దనీ, డబ్బు కట్టకపోతే జైల్లో పెడతారని విని కుమిలిపోయాడు. చచ్చిపోతే డబ్బుకట్టేపని ఉండదు కదాఅని చావటానికి ధైర్యంలేక బ్రతికివుంటున్నాడు. కొడుకు కష్టం వినలేని, చూడలేని కోటి, కొడుకు జైలుకు వెళ్లకూడదనుకొన్న క్షణంలో కేసు ఓడి పోయాడు. ఆస్తి చేయిదాటిపోయింది.

నాగలింగం గడ్డం, రెండు చెంపలమీదా, నున్నగా చేశాడు. జీతగాడు వెంట్రుక క్రిందపడ కుండా తప్పిపోకుండా భద్రంగా పసుపుబట్టలో చేర్చాడు. ఎడ్లబండిజీతగాడు ఇద్దరు కూలీలతోవచ్చి ఎదుట నిలబడ్డాడు. 'కూలోళ్లొచ్చేరు' అన్నాడు. వీరన్న విన్నాడు. చేయి పైకిఎత్తి 'ఆగరా' అన్నాడు.

'పొండి! పోయి, నా చేనుకూ కోటిగాడి చేనుకూ మద్దెలోఉన్న సిల్లకంప నరకండి! మొటిక లేకుండా నరకండి. పిలక లేకుండా నరకండి! యేళ్లతో కుళ్లబొడవండి. మళ్లీ మొలకపెరక్కుండా పిలకెయ్య కుండా ఇరగబొడవండి. పీకిపారేయండి. తెగనరికి పోగులు బెట్టండి. పొండి.' కసిగా చెప్పాడు వీరన్న. కూలీలు వెళిపోయారు. విన్న ఒక్కొక్కమాటా ఒక్కొక్క గునపపుపోట్లై గుండెలు చితికిపోతున్నాయి.

తన పంతం నెరవేరి జుత్తుతీసి తిరుపతి పంప బోతున్నాడు వీరన్న. పొలానికీ పంతం తీరిందా? పొలం తల్లి జుత్తులాంటి చిల్లకంప తీసేయిస్తున్నాడా? అదేం చేస్తాడు? ఆలోచిస్తుంటే నాగలింగం బుర్ర పగిలిపోతూవుంది.

గడ్డంఅంతా పూర్తిఅయినట్లే! గొంతుకింద మాత్రం జుత్తుంది. నున్నటితల, నున్నటిచెంపలు, నున్నటి మీసకట్టుచోటు—ఇంతకాలం వెంట్రుకలున్న ఈ ప్రదేశాలు, ఇప్పుడు బోసికొట్టి విచిత్రంగా ఉన్నాయి గొంతుకింద వ్రేలబడ్డ జుత్తు మేకగడ్డం గుర్తుకు తెచ్చేటట్లుంది. వీరన్న మానెసిద్దిలాగా చిత్రంగా ఉన్నాడు. మునుపొ మనిషిముఖం చూస్తే భయపడేవాళ్లిప్పుడు భయపడరు. ముఖం ఎగతాళిగా వుంది. సౌమ్యంగావుంది. అమాయికంగావుంది.

ఆ రోజూ, ఆపైన ప్రతిరోజూ, చాలారోజులు వరకు ఈ ముఖం అంత అమాయికంగానేవుంటూ కనిపించింది. అంత సౌమ్యంగానే గోచరించింది. వీరన్న నాగలింగంకంటే నాలుగేళ్లు ముందుపుట్టాడు. నాలు గాకులు ఎక్కువే చదివాడు. అప్పటికి వీరన్న మునసబు అయి రెండేళ్లయింది. పన్నెండేళ్లనాటిమాట. మునసబు, నాగలింగం భుజంమీద చేయివేస్తే పొంగిపోయి, వెంట బోయాడు. వీరన్న ఇంట్లోకి తీసుకుపోతుంటే దేవేంద్ర లోకంలోకి పోతున్నాననుకొన్నాడు నాగలింగం.

ఆ రోజు రకరకాల సీసాల్లోంచి రంగురంగుల అమృతం గుప్పున సుగంధం దిక్కులకు, దిక్కూ దివాణం లేకుండా, అందిస్తూంటే గ్లాసులోపోసి, సోడాకలిపి, ఇస్తే తాగి, గ్లాసువెంట గ్లాసు గడగడా తాగేసి, మరుక్షణంలో మహేంద్రుడయి పోయాడు నాగలింగం. మునుపుకూర్చున్న కుర్చీ అంతలో సింహా సనం అయిపోయింది. వీరన్న పరిచారకుళ్లా కనిపిం చాడు. సర్వప్రకృతీ తనకు దాస్యంచేయటానికి పుట్టిం దనుకొన్నాడు. ఎవణ్ణయినా కాలికొద్దీ తందామని పించింది. ఆరోజు రాత్రంతా దేవేంద్రవైభవం అను భవించి, తెల్లారి ఇల్లూ వాకిలీచూస్తే తగలేద్దా మని పించి కోపంతో ధాం ధూం లాడాడు నాగలింగం.

'నువే నన్ను సారగానికి తీసుకుపోతావా? నే న్నిన్ను దీసుకుపోయేదా?' అని వీరన్న అడిగితే 'నేనే! నేనే దీసుకుబోతా!' అన్నాడు నాగలింగం, అప్పటికే సగం అమృతం ముగించి, చేయీ కాలూ విదిలిస్తూ, రొమ్ము అప్పళిస్తూ, వీరన్నచేయి పట్టుకొని, ఆకాశంలోకి చూస్తూ,

'మరి అమర్తం?' వీరన్న ప్రశ్న.

'మరి డబ్బు?' నాగలింగం తిరుగు ప్రశ్న.

'ఇదో' ఇచ్చాడు వీరన్న.

'తే' తీసుకొన్నాడు.

రోజు రోజుకీ అమృతం మోతాదుపెంచుతూ

వారంరోజుల్లో పాత అమృతం మార్చి కొత్తఅమృతం తీసుకోవటం సాగించి, మరో వారానికి మహామంచి అమృతం తప్ప మరేం ముట్టుకోకుండా నియమనిష్ఠలతో, సదాచారాలతో, ఇద్దరూ, రోజుకొకరు చొప్పున ఖర్చుచేస్తూ రెండునెలలపాటు స్వర్గాన్ని కాళ్లదగ్గర కావలా కుక్కలా వుంచుకొన్నారు.

స్వర్గాన్నేనా, ఇంకా దేన్నన్నా ఉంచుకొందామా అని ఆలోచించి, స్వర్గంలోవుంటూ రంభ లేకపోతే ఏం బాగుంటుందని, రంభ కావాలా దాని అమ్మకావాలా అంటే వీరన్న రంభఅంటే నాగలింగం దాని అమ్మ అనటంతో పేకముక్కలు ప్రాణం పోసుకువచ్చి, నాగలింగంమాట నిలబెట్టాయి. నిద్రాహారాలు లేకుండా, రాత్రీ పగలు లేకుండా, అమృతమూ, రంభ అమ్మా—రెంటిలో దేన్నీ వదలకుండా, దేనికి లోపంకలక్కుండా, రెండునెలలూ అసిధారావ్రతం నిర్విఘ్నంగా సాగించారు.

వీళ్లు ఇద్దరికీ స్నేహమన్న సంగతి అమృతం వాసనలాగా ఊరంతా గుప్పుమంది తాగుతారు. పేకాడతారు. వేశ్యలతో వుంటారు. ఈ విధంగా ప్రఖ్యాతి ఆర్జించారు. ఊళ్లో వాళ్లకి చెవులున్నాయి. అందుకని అవి కొరుక్కున్నారు. నాగలింగానికి ఏదో మూడిందని అందరూ అనుకొన్నారు.

ఈ మాటలు, కొడుకు చేష్టలు, తెలుసుకొన్న కోటి నిప్పుమీద ఉప్పులాగా బటపటలాడాడు. చెడామడా తిట్టాడు. 'ఇంట్లోంచి కదిలితే ఎముక విరగదంతా' నన్నాడు. మూడు రోజులు ఇల్లూ వాకిలీ దాటక, బైటికి పోలేక అమృతంలేక, అన్నముండీ ఉపవాసమున్నాడు నాగలింగం.

నాలుగో రోజు వెట్టిమనిషివచ్చి 'మునుసోబుగోరమ్మంటన్నారు' అంటే లేడికి లేచిందే ప్రయాణమన్నట్లు అఘమేఘాలమీద వెళ్లాడు నాగలింగం. ఆ రాత్రి, మిత్రులిద్దరూ మును పెప్పుడూ తాగనంత అమృతం ఈ మూడు రాత్రులు తాగివుండవలసినంత అమృతం, ఆరగారగా కాఫీ చప్పరించినట్లు చప్పరించారు. తెల్లవారుజామున చప్పరించింది అమృతమో అధరామృతమో తెలియకుండా అయిపోయింది.

'అప్పన్నా డబ్బు మాటేం జేశా నాగీ!' ముద్దుగా అడిగాడు.

'తీసుకో!' నాగలింగం చెప్పాడు.

'యేది డబ్బు?'

'యాడుందో సూసుకో!'

'పత్తరం రాయనా!'

'రాసుకో!'

'సంతకం?'

'ఇద్గో సెయ్యి—ఏసుకో!'

నాగలింగం వీరన్న గొంతుమీద పదునైన కత్తితో గడ్డం గీస్తున్నాడు. కత్తి కరకరలాడుతూ వుంది, సంతకంచేసే పెన్నులాగా. గడ్డం అయిపోయింది, ఇంకా మొటికవుంది. కత్తి ఎదురుతిప్పాడు. ఎదురు గీస్తున్నాడు నాగలింగం.

చాలాకాలంనుంచి గీయని గడ్డం! మంట పుడుతూవుంది. చాలా పొడవు గడ్డం — పూర్తిగా గీసేశాడు. ఇంకా మిగిలిపోయిన కొదవలు సున్నగా గీస్తున్నాడు.

'మంటరా! మంట!' వీరన్న చెప్పాడు.

'పోద్ది! పోద్దిలే! నాగలింగం బదులు చెప్పాడు.

గడ్డం మళ్లీ తడిపి, మొటిక పరిగవంటలాగా ఏరుతున్నాడు.

వీరన్న సాలోచనగా నాగలింగం ముఖంలోకి చూశాడు. వీరన్న కళ్లు మాట్లాడుతున్నాయి ప్రశ్నిస్తున్నాయి. నవ్వుతున్నాయి. ఎగతాళి చేస్తున్నాయి.

నాగలింగం కళ్లు మత్తుగా వాలుతున్నాయి. బాధగా మూలుగుతున్నాయి. నీరసంగా జారుతున్నాయి. కోపంగా మండుతున్నాయి.

రెండుజతల కళ్లమధ్య రెండు ప్రపంచ సంగ్రామాల మధ్యకాలపు తాత్కాలిక శాంతి జండా ఎగురవేస్తూవుంది.

నాగలింగం వీరన్న ముఖంలోకి చూడటం మానేశాడు. గొంతు చూస్తున్నాడు. కత్తితో గీస్తు

న్నాడు. గతుకుల రోడ్డులో ఎగిరిపడే కొత్తకారులా కుదుపుల్లో దూకుతూపోతూవుంది కత్తి. గొంతు కోలు ఎగిరెగిరిపడుతూవుంది.

నాగలింగం వీరన్న గొంతు చూస్తున్నాడు. ఒక నాటి మిత్రుడి గొంతు. నేటి మునసబు గొంతు, అమృతం తాగిన గొంతు, తాగించిన గొంతు. గుటక లేసిన గొంతు, వేయించిన గొంతు. అధరామృతం తాగిన గొంతు. తాగించిన గొంతు. పేకాడించిన గొంతు. పెడ సరంగా మాట్లాడిన గొంతు. డబ్బు అడిగిన గొంతు. అబద్ధం ఆడినగొంతు, మోసంచేసిన గొంతు. కోర్టు కీడ్చిన గొంతు—కత్తిక్రింద మెత్తగా ఒత్తుగా చర్మపు పొరతో, అరతో కదులుతున్న, సాగుతున్న జారుతున్న గొంతు !

కత్తి—నాగలింగంచేతిలో కత్తి — ఏటవాలుగా క్రిందికి మొటికలు తరుగుతూ దిగుతూవుంది. వెంట్రుకలతోపాటు వాటి పాదుల్లో ఆర్నెల్లనుంచి కూరుకు పోయిన మురికి గీరుకొంటూ వస్తూవుంది కత్తి. ఆ చర్మంమీద, ఆ చర్మంలో ఆ రక్తంలో యుగయుగాల మానవుడి అధికారపు చీకటి, మానవుడి కులవృత్తి, మానవుడి దొమ్మపొగరు ముప్పేటన ముడిపడి, త్రిగుణీ కృతమయిపోయి కడిగినా గీరినా కోసినా ముక్కలు చేసినా తరిగిపోని అపరిశుభ్రత; మునసబు రక్తంలో గతంలో వర్తమానంలో భవిష్యత్తులో త్రికాల బాధి తమై, దట్టంగా ఉవ్వెత్తుగా కుప్పగాపడి పొరలు పొర లుగా తెరలు తెరలుగా ఊగుతూ దేగుతూ రంగురంగు లతో వింత వింత ఆకారాలతో వన్నెలతో చిన్నెలతో చిన్మయంగా విశ్వమంత విస్తృతంగా వ్యాపించిన అహం కారపు అపరిశుభ్రత; సృష్టి ఆదినుంచి ఇవాల్టిదాకా ఆది మధ్యాంతాలు లేకుండా నిరంతర నిరాఘాట స్రవంతిలాగా, ద్వంద్వాలులేకుండా, వైవిధ్యంలేకుండా, విభిన్నత లేకుండా, సకల చరాచర జగత్తుఅంత విశా లమై, అంతటానిండి, ఎడంలేకుండా విచ్చలవిడిగా దొరికిన పురుగును మ్రింగే సాలీడులాగా, బలహీనుడి బ్రతుకు తినే బలవంతుళ్ళాగా వ్యాపించి, చిరంజీవిగా, చిద్విలాసంగా మహాస్వేచ్ఛగా విజృంభించి విశృంఖ లంగా వియత్తుఅందాకా వర్తించే 'నాదినాకు అనే తత్త్వపు' అపరిశుభ్రత; తరిగి కుప్పలు 'పెట్టవలసిన మనిషి కత్తి ఏటవాలుగాపెట్టి గడ్డం గీస్తున్నాడు.

'గ్గా'

వీరన్న గొంతు బొంగురుపోయింది.

'యేం?'

గొంతుపోయింది.

గడ్డం నున్నగా అయిపోయింది.

నాగలింగం వీరన్న ముఖంలోకి చూశాడు. ముచ్చి కల గుంటనుంచి అంగిటిగుంటదాకా మధ్యలో ఎక్కడా వెంట్రుకలేదు. అంతా రంగుపూసినట్లు అయి పోయింది. ఈ ముఖం కొత్తగావుంది. ఈ ముఖం వింతగావుంది. ఈ ముఖం పాతదికాదు. ఈ ముఖం మునుపటిదికాదు. ఈ వీరన్న మునుపటి వీరన్నకాడు. ఇంతకుముందు మెడపైన జుత్తురూపంలో సంపద వుంటే ఇప్పుడు వీరన్న దరిద్రుడు. ఇంతవరకు పెరి గింది దారిద్ర్యమయితే ఇప్పుడు వీరన్న లక్ష్మీపతి. శ్రీ మహావిష్ణువు !

నాగలింగానికి తను ఏంపోగొట్టుకొన్నాడో, ఏం సంపాదించాడో ఎక్కణ్ణిలబడ్డాడో, ఎక్కణ్ణిలబళ్లేదో తెలియకుండా అయిపోయింది. తన ఉనికి ఏమిటో, తన అస్తిత్వమేమిటో బొత్తిగా అంతుపట్టలేదు. తన మనుగడ ఏమిటో, తన తోవ ఎటో అంతుచిక్క లేదు. ఒక అవ్యవస్థ పునాదిమీది పూవులాగా అమాయి కంగా వున్నాడు.

ఉన్నట్టుండి సూర్యుడు ఉడికి పోతున్నాడు. ఎండ వీపు చురచుర లాడిస్తూవుంది. చలిలేదు. వెచ్చగావుంది. వేడిగావుంది. మంటగావుంది. సత్రం వీధిబళ్లో పిల్లలు 'అ ఆ' అంటూ 'అహో' అని ఎవరినో ఇంకా వారిస్తున్నట్లే అరుస్తున్నారు. ఆక స్మికంగా వీరన్న గొంతుకోలు క్రింద మెడతోలు మడతక్రింద తెగిపోకుండా దాక్కొని నిక్కి చూస్తూ వుంది వెంట్రుక మొటిక.

నాగలింగం సర్రున కత్తితీశాడు. గడ్డంమీద చేయివేసి వెనక్కునెట్టాడు. కత్తి నిలువునా పెట్టి, అడ్డంగాతిప్పి, ఏటవాలుగాలాగి నిలువుగా ఒత్తి నిట్టూ రుస్తూ లేచి వణుకుతూ వీరన్న ముఖంలోకి చూచి అన్నాడు.

'అయిపొయ్యింది'

# కార్వేటినగర రాజవంశచరిత్ర- కొన్ని ఆధారములు

## శ్రీ అరికట్ల సుబ్రహ్మణ్యము

**ప్రస్తావనము :**

కార్వేటినగరము చిత్తూరుజిల్లాలో చరిత్ర ప్రసిద్ధి గాంచిన నగరము. కాని దీని చరిత్ర సమగ్రముగ లభించడము లేదు. ఏ పుస్తకమునకా పుస్తకము, ఏ వ్యక్తికావ్యక్తి ఇదే కార్వేటినగర చరిత్ర కాధారములని వ్రాయుచున్నారు. ఒక విషయమునకొక విషయము అతుకుట లేదు.

**విప్రనారాయణ చరిత్రము :**

15 వ శతాబ్దమున 'విప్రనారాయణ చరిత్రము' వ్రాసిన చదులవాడ మల్లనకవి తన గ్రంథమునందు ఒక వంశము వృక్షమునిచ్చియున్నాడు. విప్రనారాయణ చరిత్రమునకు ద్వితీయముద్రణ పీఠిక వ్రాయుచు శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు, గ్రంథ ప్రకాశకులు శ్రీ జయంతి రామయ్యగారు, శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు, కవికాలము నిర్ణయించుచు (క్రీ. శ. 1600) కవి వ్రాసిన కృతిపతి వంశములోనివారు కార్వేటినగర పాలకులైనట్లు, వారి వంశవృక్షమును ప్రత్యేకముగ నిచ్చియున్నారు. ఈ వంశవృక్షము ప్రకారము కార్వేటినగర రాజుల మూలపురుషుడు 'పాకము రాచిరాజని'; నగరరాజులు 'పాకము' వారని తెలవిచ్చియున్నారు. విప్రనారాయణ చరిత్రము మాకరాజ కుమారులైన తిరుమలరాజున కంకితము గావించబడినది.

**బ్రహ్మరాజు—పద్మావతీ పరిణయ చమ్పూః**

క్రీ. శ. 1788—1840 ప్రాంతమున కార్వేటినగర సంస్థానమును బ్రహ్మరాజు పరిపాలించెను. ఈతని కాలమున 'శ్రీశైలకవి' 'పద్మావతీ పరిణయ చమ్పూ' కావ్యము రచించి, కార్వేటినగర పాలకుల చరిత్ర సంక్షిప్తముగ, సంపూర్ణముగ నిచ్చియున్నాడు. ఇతడు కార్వేటినగర పాలకులు 'చోళు'లైనట్లు వీరి వంశ మూలపురుషుడు 'కవికాల చోళ' మహారాజైనట్లు రచించియున్నాడు. ఈ పుస్తకము కార్వేటినగర సంస్థాన ముద్రాలయమునందు ముద్రిత మైనది.

కార్వేటినగర సంస్థానమును పరిపాలించిన రాజులు తమ పూర్వీకుల చరిత్రమును ఇంత విభిన్నముగ పేర్కొనుటకు కారణము తెలియకున్నది. ఈ రెండు వంశవృక్షములకు ఎటువంటి పోలిక ఎచ్చటగాని లేదు. ఈ రెండు వంశవృక్షములందు ఏదేని ఒకటి తప్పు గావలెను. లేక రెండు వంశవృక్షములు నిజమైనచో పరిపాలించిన రాజవంశమైనను మారియుండవలెను.

**తిరుమలరాజు—శత్రుఘ్న విజయ ప్రబంధము :**

బ్రహ్మరాజు (1788—1840) కుమారుడు తిరుమలరాజు (క్రీ. శ. 1864) న కంకితము గావించబడిన శత్రుఘ్నవిజయప్రబంధమునందు గ్రంథ రచయిత గరుడాద్రి సుబ్రహ్మణ్యము తిరుమలరాజు వంశవృక్షము కొంత నిచ్చియున్నాడు. అందు తన రాజునకుముందు 'ఐదు' తరములవారిని మాత్రము పేర్కొనియున్నాడు. వారికి మునుపు నామకముగ 'మాకరాజు'యని పేర్కొనియున్నాడు. ఇందువల్ల మాకరాజు తనకు (తిరుమలరాజు) సమీపపూర్వరాజు

లలో గొప్పవాడని సూచితమగుచున్నది. ఈ వంశ వృక్షము, పద్మావతీ పరిణయచమ్పువులోని వంశవృక్షము సరిపోవుచున్నది.

చదులవాడమల్లన వ్రాసినట్లు పాకము రాచిరాజు తమవంశమూలపురుషుడని ఆ రాజ్యమునే పరిపాలించిన బ్రహ్మరాజుకు తెలియకపోదు.

అయినను బ్రహ్మరాజు తమ వంశమునకు గొప్ప కీర్తి భావికాలములో కలిగించుటకై, తన ఆస్థాన కవిచే ఒక వంశవృక్షమును సృష్టించి యుండవలెను?

తిరుమలరాజు తండ్రి బ్రహ్మరాజు ప్రయత్న పూర్వకముగ తమ పూర్వీకుల వంశవృక్షమును గొప్ప దిగ చేయనెంచినచో ఆ పని తన కుమారునిద్వారా ఏదోవిధముగ పూర్తిచేయించెడివాడె ! కాని ఆ విధముగ జరుగలేదు.

బ్రహ్మరాజు వ్రాయించిన (పద్మావతీ పరిణయ చమ్పు.) వంశవృక్షమువారే నగరపాలకులైనచో, విప్ర నారాయణ చరిత్ర రచనాకాలమునాటికి, పద్మావతీ పరి ణయ చమ్పూ రచనాకాలమునాటికి కార్వేటినగర సంస్థా నమును పరిపాలించిన రాజవంశమైనను మారియుండ వలెను. కాని ఆ విధముగ నగరపాలన గావించిన రాజ వంశము మారినట్లు ఆధారములు కన్పించుటలేదు.1 'నిశ్శంకదుర్గశిలాశాసనము' ఇందులకు ప్రబలాధారము.

**మాకిరాజు —నిశ్శంక దుర్గ శిలాశాసనము :**

కార్వేటినగర పాలకులు చోళవంశీయులని, వీరి వంశ మూలపురుషుడు 'కరికాల' చోళ మహారాజని నగర దుర్గమున ఒక శిలాశాసనము గలదు. దుర్గ శాసనము 15, 16 శతాబ్దుల నాటిదని భావన: శాసనము మాకమహారాజు అల్లుడైన మాకరాజు వేయించెను.

నిశ్శంకదుర్గ శిలాశాసనము—విప్రనారాయణ చరిత్ర రచనాకాలము ఇంచుమించు ఒకేకాలము నాటిది. దుర్గశాసనరచనాకాలమునాటి తర్వాతి సంవత్సరములలో విప్రనారాయణ చరిత్రము వెలసి యుండవచ్చునని తెలియుచున్నది.

'విప్రనారాయణచరిత్రము'న మాకరాజు కుమా రుడు తిరుమలరాజని పేర్కొన బడియున్నది. కాని కార్వేటినగర పాలకులైన మాకమహారాజునకు 'తిరు మలరా'జని కుమారుడు లేడు.

విప్రనారాయణ చరిత్రములోని రాజవంశమును గాని, ఆ రాజులనుగాని, తరువాతి కార్వేటినగర సంస్థాన పాలకులు, వారు అంకితముగొన్న కృతులు, వేయించిన శాసనములు పూర్తిగ పేర్కొనడము లేదు. దీనినిబట్టి విప్రనారాయణ చరిత్రములోని రాజవంశము వారు నగరపాలకులు గానట్లు తోచుచున్నది.

దుర్గ శాసనాంతములో పేర్కొనబడియున్న రాజు 'రామభద్రరాజు' మూడు సంవత్సరముల వయస్సువాడు. ఈతని తండ్రి మాకమహారాజు. ఈ మాకమహారాజు అంత్యకాలమున రామభద్రరాజ నామధేయముగల మూడు సంవత్సరముల కుమారుడు మాకరాజనెడి అల్లుడు (మహావీరుడు) నుండిరి. రాజుగారి మరణానంతరము మాకరాజు తన మేనల్లు డైన రామభద్రరాజునకు వెంటనే పట్టాభిషేకము జేసి, తాను రాజ్యపాలన గావించెను. ఈ మాకరాజు (రాజుగారి అల్లుడు) వేయించినదే నిశ్శంక దుర్గ శిలాశాసనము. మాకరాజు తన రాజ్యపరిపాలనా కాలములో అనేక శత్రురాజులను జయించి, రాజ్యము విస్తీర్ణముగావించి రాజబంధువులలో తనకుతానే సాటి యనిపించుకొని ధర్మపాలన జేసియుండవచ్చును.

విప్రనారాయణ చరిత్రము నంకితము గొన్న తిరుమలరాజు ఈ మాకరాజు కుమారుడై యుండ వచ్చును. చదులవాడ మల్లన తన కృతిని రాజుగారి స్థానే పరిపాలన చేయుచున్న మాకరాజు గౌరవార్థము అతని కుమారుడైన తిరుమలరాజున కంకితముగావించి కృతిపతియొక్క వంశవృక్షమును తన గ్రంథమున పేర్కొనినట్లు తోచుచున్నది.

విప్రనారాయణ చరిత్ర గ్రంథప్రకాశకులు పేర్కొనినట్లు 'పాకము రాచిరాజు' వంశీయులు కార్వేటినగర పాలకులుగానట్లు తెలియుచున్నది. ఈవంశీ

1. భారతి - మార్చి 1971.

యులే నగరపాలకులైనచో సుమారు అదే కాలమునకు చెందిన నిశ్శంకదుర్గశిలాశాసనమున్ను ఆ విధము గానే పేర్కొనియుండెడిది.

దుర్గశాసన విషయము, పద్మావతీ పరిణయ చంపువులోని చారిత్రక విషయములు చాలావరకు

(ఇదియంతయు సరిగాదని) నిశ్శంకదుర్గ శిలా శాసనముగూడ బ్రహ్మరాజే క్రీ. శ. 15, 16 శతాబ్దంనాటి లిపితో సంస్కృతము తెలుగు భాషలందు చెక్కించి, విశేష ప్రచారముకొరకు పద్మావతీ పరిణయ గ్రంథమును వ్రాయించియుండిన అంతపరిశ్రమ జేసినవాడు మల్లనకృత విప్రనారాయణ చరిత్ర మూలప్రతిని సులభముగ నిర్మూలించెడివాడె.

కాని ఇది అసందర్భము. దుర్గశాసన ప్రాచీనత్వమే ఇందులకు ప్రమాణము.

కాన విప్రనారాయణ చరిత్రములోని రాజ వంశమువారు సాక్షాత్తు నగర పాలకులుగాదని, నగర పాలకులు, చోళ వంశీయులని ధ్రువపడుచున్నది.

**నగర నిర్మాణము** •

నగర నిర్మాణముపైకూడ ఏకాభిప్రాయము లేదు. కార్వేటి నగరము క్రీ. శ. 1717–32 ప్రాంతమున వెంకటపెరుమాళ్ రాజుగారి కాలములో నిర్మించబడినదని చాలామంది నమ్మిక. కాని నగర నిర్మాణము అదివరకే జరిగియుండెను. కాలము మాత్రము ఇదమిద్ధముగ తెలియరావడము లేదు.2 శా. శ. 1612 వ సంవత్సరమున బ్రహ్మరాజుభార్య రాఘవమ్మదేవులవారు శ్రీ సదాశివేశ్వరమూర్తిస్వామి వారి దేవాలయము కట్టించిరి. శా. శ. 1612 నాటికే దేవాలయ నిర్మాణము పూర్తియైనచో నగరనిర్మాణము అంతకుమునుపే జరిగియుండవలెను.

త్రిభువనచక్రవర్తి రాజరాజచోళుని శాసన మొకటి (క్రీ. శ. 1157) కార్వేటినగర వేణుగోపాలస్వామివారి దేవాలయమున గలదు. శాసనము శివ సంబంధమై కొన్ని శివాలయములకు భూదానము జేసినట్లుగా వున్నది. ఈ వేణుగోపాలస్వామివారి దేవాలయమునందు చాలావరకు శివసంబంధమైన చిహ్నములుండి, భూతకాలములో ఇది శివాలయమని తోచుచున్నది.

క్రీ. శ. 1157 నాటికే ఇచ్చట ఒక దేవాలయముండిన నగరనిర్మాణము అంతకుపూర్వమే జరిగియుండవలెను. నగర వేణుగోపాల దేవాలయము చోళ రాజుల నిర్మాణమని వాస్తువు తెలియజేయు చున్నది.

కార్వేటినగర పాలకులు చోళవంశీయులని, నగర నిర్మాణము జరిగి 1000 సంవత్సరము కావచ్చుచున్నదని తెలియుచున్నది. విశేష పరిశోధనల వలనగాని మిగిలిన విషయములు తెలియరావు.

---

2. శిలాశాసనము — శివాలయము. కార్వేటి నగరము.

3. Indian Epy. 392.



## కలగూరగంప :

# భారతీయ జీవిత తత్త్వం

నవంబరు 1971 భారతి సంచికలో శ్రీ కోవెల సుప్రసన్నాచార్యులుగారి 'సాహిత్యవివేచన'అన్న పుస్తకాన్ని 'శాక్యసింహ'గారు సమీక్షించారు. ఈ సమీక్షలో సందర్భవశాత్తూ భారతీయ సంస్కృతి, జీవితతత్త్వం గురించి కొన్నిఅభిప్రాయాలు వ్యక్తంచేశారు.

'విశ్వనాథ సంప్రదాయము నాశ్రయించిన కవి భారతీయసంస్కృతికి కువ్యాఖ్యానములు చేయును. దానియందలి మానవతావాదమును ఏకసూత్రతమ పరమార్థమును త్రోసిరాజనును. వర్గవర్ణముల కల్పితమైన సామాజిక చైతన్యమును ఖండించును' అని ఒకచోట వ్రాశారు. కాని కొన్నివాక్యాలతర్వాత వారే ఇలా వ్రాశారు.

'భారతజాతి తత్త్వం ఆదినుంచీ అద్వైతనిష్ఠమయింది; సర్వజీవులనూ ఆత్మవత్తుగా భావించేది. అందరు మానవులనూ అమృతపుత్రులనుగా నిరూపించేది...' అనుచు ఈ రచయిత భారతీయ సంస్కృతికి వ్యాఖ్యానము చేసెను. ఈ యభిప్రాయములతో నేకీభవించుట దుస్సాధ్యము. కొన్నికొన్ని ప్రాచీనగ్రంథములలోనున్న ఆదర్శవాదమునకేమిగాని, లౌకిక జగత్తులో భారతజాతి తత్త్వము ఆచార్యులుగారు వర్ణించినట్లుగాలేదు. 'చీకటినుండి వెలుగునకు నన్ను జేర్చుము'అని మహర్షులు గానముచేయగా భారతజాతిలో ముఖ్యులైనవారు సాటివారిని నూటికి తొంబదిమందిని చీకటి గుయ్యారములలో కోలుకొనలేనట్లుగా పడద్రోసిరి. ఏది భారతజాతి తత్త్వమని ఆచార్యులవారనుచున్నారో ఆ తత్త్వమున వ్యక్తికి ప్రాధాన్యము లేదు. కమ్యూనిజమునకు ఆస్తిక్యమును జోడించినచో 'భారతజాతి తత్త్వమగును' అని.

భారతీయ సంస్కృతిలోని మానవతావాదాన్నీ ఏకసూత్రతనీ త్రోసిరాజని కేవల వర్గవర్ణదృష్టితో దానిని చూడడం ఆ సంస్కృతికి కువ్యాఖ్యానం చెయ్యడమని మొదట ఖండించి తర్వాత వారే మళ్లీ అటువంటి వ్యాఖ్యానమే చేశారు. 'ఆత్మవత్సర్వ భూతాని' అన్న మాటలు పుస్తకాలలో మాత్రమే ఉండిపోయాయనీ, వాస్తవంగా కొందరు ముఖ్యులు ప్రజాసామాన్యాన్ని అజ్ఞానాంధకారంలో ముంచిఉంచారనీ శాక్యసింహగారు ఆరోపించారు. భారతజాతితత్త్వంలో వ్యక్తికి ప్రాధాన్యం లేదన్నారు.

వ్యక్తికి పరిపూర్ణమైన ప్రాధాన్యం ఉండడమే ఒకజాతి గొప్పతనమని చెప్పలేం. ఈనాడు అమెరికాలో వ్యక్తికే పరిపూర్ణ ప్రాధాన్యం. తమ కూతురు ఏం చేస్తోందో ఎక్కడికి వెళ్తోందో ఎవరితో తిరుగుతోందో తల్లిదండ్రులే పట్టించుకోనంత వ్యక్తి స్వాతంత్ర్యం ఆ సమాజంలో ఉంది. దీని వలన ఎంతో నైతికమైన అవ్యవస్థ ఆ సమాజంలో ఏర్పడింది. వ్యక్తి ఎంత ప్రధానుడో సమాజ వ్యవస్థ కూడా అంత ప్రధానమే. వ్యక్తికోసం సమాజ వ్యవస్థ, సమాజ వ్యవస్థకోసం వ్యక్తి రెండూ ప్రధానమే. కాబట్టి వ్యక్తికి సమాజంలో అవసరమైనంత ప్రాధాన్యమే ఉండాలి.

ఒకజాతియొక్క మతగ్రంథాలలో కనిపించే ఆదర్శవాదాలు ఆ జాతి నిత్యజీవితంలో సంపూర్ణంగా కనిపించక పోవచ్చును. తరచు ఆ పుస్తకాలలో ప్రవచింపబడిన ఆదర్శాలకి వ్యతిరిక్తమైన నడవడిని ఆ జాతి అలవరచుకోవడంకూడా కనిపిస్తుంది. పొరుగు వాణ్ణి తనవలె ప్రేమించాలన్న క్రైస్తవమతానుయాయులైన వారి దేశాలు అనేక శతాబ్దులుగా పరస్పర యుద్ధాలలో మునిగి ఉన్నాయి. సర్వసౌభ్రాత్రాన్ని ఉపదేశించిన ఇస్లాము మతానుయాయులలో సౌభ్రాత్రం ఎలా ఉందో ప్రస్తుతం చూస్తున్నాం. కారుణ్యమూర్తి బుద్ధుని మతాన్ని అనుసరించిన

జాతులు ప్రపంచంలో క్రూరత్వానికి పేరుపడ్డవారు. అదేవిధంగా సర్వమానవ సమత్వాన్ని ప్రవచించిన భారతీయ సంస్కృతిని అనుసరించిన వారిలో వర్గవిభేదం ఉంటోంది.

కాని ఈ వర్గ విభేదం ఒక్క భారతీయులలోనే లేదు ప్రపంచంలో అనేక దేశాలలో బానిసజాతులు ఉండేవి. ప్రాచీన గ్రీసుదేశంలో చదువుచెప్పే గురువు బానిస అలెగ్జాండరు తన గురువుగారి ఎడల అపార గౌరవంతో 'మిమ్మల్ని నా సరసనుకూర్చొని భోజనం చెయ్యనిస్తాను' అంటాడు. శ్వేతవర్ణులు భారతీయులను ఎంత నికృష్టంగా చూశారో అందరికీ తెలిసినదే. తమజాతి ప్రపంచజాతులన్నిటికన్నా గొప్పదన్న అహంకారపూరితవిశ్వాసంతో జర్మన్‌దేశం ప్రపంచాన్ని రెండుసార్లు భస్మమయం చేసింది.

అమెరికా ఆస్ట్రేలియా దేశాలను జయించిన శ్వేతవర్ణులు అక్కడి ఆదిమవాసులను నిర్మూలించారు. కాని భారతదేశంలో ఆర్యులు ఇక్కడి ఆదిమవాసులందరనీ తమలో కలుపుకొన్నారు. ఆర్యుల మతసంస్కృతులు, ఆదిమవాసుల మతసంస్కృతులు పరిపూర్ణంగా సమ్మేళనంచెంది భారతీయుల మతసంస్కృతులుగా రూపొందాయి.

కమ్యూనిజానికి ఆస్తికత్వం జోడిస్తే భారతీయతత్త్వ మవుతుందనడం పొరపాటు. కమ్యూనిజంలో వ్యక్తి స్వాతంత్ర్యమే లేదు. పురుషులూ స్త్రీలూ అందరూ ప్రభుత్వం సొత్తు. భారతజాతి తత్త్వంలో వ్యక్తి స్వతంత్రుడు. శంతనుడికి దాశరాజు కూతురుపై మోహం కలుగుతే, అతని కఠినమైన షరతులు శంతనుడు సమ్మతించలేకపోతే, తన మోహంతో తానే పరితపించాడుతప్ప అధికారం ఉందని ఆ కన్యను హరించలేదు. రాజుకి ఏ న్యాయమో సాధారణ జనుడికీ అదే న్యాయం జరిగింది భారతీయ తత్త్వంలో.

పూర్వం విద్యకీ ధనార్జనకీ ఏమీ సంబంధం లేదు. ఈ నాడు విద్యకి ఉన్న ప్రాముఖ్యం పూర్వం లేదు. యూరప్ దేశాలలో మధ్యయుగం వరకూ రాజులు చదువనూ వ్రాయనూ తెలియనివారై ఉండేవారు. అది వారిలో ఒక లోపంగా పరిగణించబడేదికాదు. కనుక విద్యకీ ధనార్జనకీ అవినాభావ సంబంధంకల నేటి దృష్టితో ప్రాచీనుల విద్యా వ్యవస్థని చూసి విమర్శించడం పొరపాటు. వీథివీథికి బడులునడిపి అందరికీ విద్యాబోధన చెయ్యవలసిన అవసరం అప్పుడు లేదు. ఇప్పుడైనా, ఒకవేళ ప్రభుత్వం గుమాస్తాఉద్యోగాలకి ఎస్. ఎస్. ఎల్.సి. పేసయినవాళ్లనే తీసుకొంటాం, అంతకన్నా ఎక్కువ పరీక్షలు పేసవడాన్ని అధికంగా పరిగణించంఅని ప్రకటిస్తే చాలా మంది. ఎస్. ఎస్. ఎల్. సి. తోనే చదువు చాలిస్తారు. కనుక మన ప్రాచీనులలో ముఖ్యులైనవారు అధికజనావళిని అజ్ఞానాంధకారంలోకి నెట్టారనడం కేవలం దోషారోపణం. ఆ రోజుల్లో జీవిత నిర్వహణకి కావలసినది వృత్తేతప్ప విద్యకాదు. మొదట్లో వృత్తులనిబట్టి ఏర్పడిన వర్ణవ్యవస్థ కాలక్రమేణ ఘనీభవించింది. ఆయాజాతులకి ఆయావృత్తులు ఆచారాన్ని బట్టి విహితములైపోయాయితప్ప, ఎవరో కొందరు అగ్రవర్ణములవారు తక్కినవారిని అణగద్రొక్కారనడం యుక్తంకాదు. అధికారాన్నీ వ్యాపారాన్నీ కృషినీ వస్తువుల ఉత్పత్తినీ అన్యవర్ణముల అధీనంచేసి ధనార్జనకి ఏమీపనికిరాని పుస్తకాల కట్టలనీ భిక్షాటనాన్నీ తమవంతు చేసుకొనడం ఆనాటి బ్రాహ్మణుల స్వార్థరాహిత్యాన్నీ అమాయికత్వాన్నీ సూచిస్తుందేతప్ప స్వార్థపరత్వాన్ని సూచించదు. భాగవతంలోని విషయాలన్నీ సమస్తప్రజలకీ తెలియడానికి విశాలప్రదేశాలలో సప్తాహాలు జరిపించి కథాపఠనం జరిపించాలని భాగవత మాహాత్మ్యంలో చెప్పబడింది. ('స్త్రియః శూద్రాదయో యేచ తేషాం బోధోయతో భవేత్.' భా. మ. 6, 6.) కనుక ఆనాటి భారతజాతిలో ముఖ్యులైనవారు కొందరు జనసామాన్యాన్ని అజ్ఞానంలో ఉంచారనడం నిష్పాక్షికంగా అన్నదికాదు.

భారతజాతిలోని వర్ణవిభేదాన్ని మనం ఆమోదించం, అది ఆ జాతిలోపమే. కాని వర్ణదృష్టి అన్నది ఏదో ఒకరూపంలో, భారతదేశంలో కనిపించిన దానికన్నా తీవ్రరూపంలోకూడా కొన్ని ఇతరదేశాలలో ఉందని మనం గమనించవచ్చును. కొన్నిజాతుల సమ్మేళనం జరిగినప్పుడు కొన్ని ఎక్కువతక్కువలు జరగవచ్చును, కాలక్రమేణ ఆ ఎక్కువతక్కువలు సర్దుకోవచ్చును. కేవలం ఈ వర్ణవ్యవస్థలోపాన్ని ఒక్క

దాన్నే పట్టుకొని మన ప్రాచీనులందరూ స్వార్థపరులనీ, మన సంస్కృతి కుళ్ళుసంస్కృతిఅనీ తిట్టుకొనడం చారిత్రికావగాహనతో చేసేపనికాదు. మన ప్రాచీనగ్రంథాలలో ప్రవచింపబడిన ఉత్తమ జీవితాదర్మాలు మన జాతి నడవడికను తీర్చిదిద్దడంలో చాలా ప్రభావం చూపాయి. ఐదువందల సంవత్సరాల చరిత్రకూడాలేని అమెరికావారు తమకీ సంప్రదాయలున్నాయనీ తమది ఒక ప్రత్యేక సంస్కృతిఅనీ చెప్పుకొందుకి ప్రయత్నిస్తూ ఉంటారు. అనేకవేల సంవత్సరాల చరిత్రకల మన భారతీయులం మన సంప్రదాయాలన్నీ మూఢాచారాలనీ సంస్కృతిస్వార్థభూయిష్ఠమనీ యథార్థాన్ని గమనించకుండా ఆరోపణలు చేస్తున్నాం. దేశదేశాలలో మేధావులెందరో మన మతంలోనూ సంస్కృతిలోనూ కల మహత్వాన్ని శ్లాఘించారు. మన సంప్రదాయాలలోనూ సంస్కృతిలోనూ మనం గర్వపడవలసినవి చాలా ఉన్నాయి. వేదాలలో అన్నీ ఉన్నాయనడం మూఢత్వం కావచ్చును; కాని వేదాలలో ఏమీ లేదనడం అంతకన్నా ఎక్కువ మూఢత్వం. మన మతగ్రంథాలలోని వైశిష్ట్యాన్ని మనం అర్థం చేసుకోవాలి; అంతమాత్రంచేత ఆ గ్రంథాలలోని ప్రతివాక్యానికీ మనం బద్ధులమై ఉండాలన్న నియమం లేదు. అనేక ఇతర మతాలవలెకాక హిందూమతం ఎవరో ఒక్క ప్రవక్తచేత ప్రారంభింపబడినది కాదు. అనేక మహర్షులచేతా ప్రవక్తలచేతా ప్రభావితమై కాలక్రమేణ అనేక పరిణామాలు చెందుతూ నిష్పన్నమైనట్టిది. అందుచేతనే హిందూమతం విస్తృత దృష్టిని సంపాదించుకొన్నది. విజ్ఞానవంతులైన వారు రాగద్వేషాలను విడిచి మన సంస్కృతిని సరిగా సమీక్షించవలసిన ఆవశ్యకత ఈనాడు ఎంతో వుంది.

శ్రీ కాశూరి హనుమంతరావు.

## 'తెలుగు లిపి'

డిసెంబరు 1971 భారతిలో శ్రీ నిడుదవోలు వేంకటరావుగారి 'తెలుగులిపి'అను వ్యాసములో ఈ క్రింది వాక్యము చర్చనీయాంశము.

'ఏకకాలములో అటు శ్రోత్రేంద్రియమునకు ఇటు నేత్రేంద్రియమునకు అనిర్వచనీయమయిన ఆనందానుభూతిని గలిగించి, బ్రహ్మానందసిద్ధిని చేకూర్చు లోకోత్తర విశిష్టత—యావద్భారతవర్షమున—ఒక్క తెలుగులోతప్ప మఱి యే యితరదేశభాషలలోలేదు. ప్రపంచభాషలలో నేభాషయందున్నదో పరిశీలించుట కర్తవ్యము.'

శ్రీ రావుగారి ఈ నిగమనము నన్నయ చెప్పిన 'స్వస్థాన వేషభాషాభి మతాస్సంతో ప్రలుబ్ధధియః' (ఆంధ్రశబ్దచింతామణి) అను ప్రవచనమున కనువుగ నున్నను, నిష్పక్షపాతముగను, శాస్త్రీయముగనులేదు. కాకిపిల్ల కాకికి ముద్దు. ఎవరి భాషపై వారి కభిమానము. వీరి దృక్పథమే ఇతరభాషలవారికున్న ఎడల, ప్రతిభాషయు ఇతరభాషకంటె గొప్పదై కూర్చొనును. కూర్చున్న మన కేమియు అభ్యంతరము లేకున్నను, అట్టి దృక్పథములవలన భాషాపరిశోధన మేమి బాగుపడును?

అజంతత్వము తెలుగునకేదో రమణీయత చేకూర్చునందురు. బెంగాలీభాష అజంతము కాదు. కర్ణపేయతలో బెంగాలి తెలుగునకు తీసిపోవునా? చండీదాస రవీంద్రుల కవిత్వములను చదివి చూడుఁడు. వ్రజభాష (తులసీ దాసాదులు వ్రాసినది.) చాల మట్టుకు అజంతమేకదా. ఇక తెలుగు ప్రత్యేకత ఏమి? 'అరవము' అని మనము పేరిడిన భాషలోకల 'తిరుప్పావై'యొక్క అనిర్వచనీయమైన శ్రవణ సుభగత్వము తెలుగులో ఏ కావ్యమునకున్నది? ఫ్రెంచి భాష అజంతము కాదు. Baudelaire, Verlaine ల కవిత్వములను చవి చూడుడు. హలంతమగు ఇంగ్లీషు భాషలోని ఆంగ్ల పోతన అగు విలియం బ్లేక్, ఆంగ్ల రామరాజభూషణుడగు స్విన్‌బర్న్ కవిత్వముల మాధుర్యముగూర్చి ప్రత్యేక గ్రంథములనే వ్రాయవచ్చును. తెలుగులో మహాప్రాణాక్షరములు పరుషాక్షరములు లేవనుకొని ఎవరో తెలుగును The Italian of the East అనిరి. ఇది మన అహంను సంతృప్తిపఱచునదైనను, సరికాదు. తెలుగులో ఇవి మస్తుగ కలవు. ఉన్నందువ తెలుగు కమ్మదనమేమియు తగ్గలేదు అది వేఱు సంగతి. మహాప్రాణ, పరుషాక్షరములు కలిగినందువలన సంస్కృత జర్మనీ భాషల మాధుర్యము ఎక్కువైనదేకాని తగ్గలేదనుట. చిత్రముగ కన్పించినను, సత్యమే. Heinrich Heine వ్రాసిన జర్మన్ కవిత్వము చదివిచూడ (విన ?) దగును. కర్ణాటక సంగీతమునకు తెలుగు, హిందూ

స్తానీ సంగీతమునకు వ్రజభాషవలె, అత్యుత్తమ పాశ్చాత్య సంగీతమునకు జర్మన్ భాషయే ఆటపట్టని తజ్ఞులు చెప్పుదురు.

ఇక తెలుగు లిపిలోని విశిష్టత ఏమి? ప్రత్యేకత ఏమి? తెలుగక్షరములు గుండ్రముగా ఉన్నందు వలన అవి సుందరములా? మళయాళ, ఓఢ్ర, సింహళ, బర్మా భాషాక్షరములుకూడ గుండ్రముగనే ఉండును. ఇంక కన్నడ లిపికిని తెలుగులిపికిని భేధమే ఉండదు. ఒక్కొక్క లిపికి ఒక్కొక్క విశిష్టత ఉండును. ఉర్దూ, పర్షియన్, అరబ్బీ లిపులు పుష్పలతి కలవలె అల్లుకొని పోవుచుండును. జపాను చైనా భాషాలిపులు వ్యూహములవలె, బొమ్మలవలె ముద్దుల మూటగట్టుచుండును లాటిన్ లిపి గంభీరముగ ఉండును. హీబ్రూలిపి నిటారుగ, దాని మాట్లాడు జనములవలె గర్వముకల దానిగ కనపడును. గ్రీకులిపి మన నాగరలిపివలె పావిత్ర్యము కలదానివలె, గౌరవ జనకముగ కనపడును. ఆ మాటకు వచ్చిన శ్రీ సునీతి కుమార చటర్జీ (కేంద్ర సాహిత్య అకాడెమీ అధ్యక్షుడు) ప్రకారము, బ్రాహ్మిలిపి (అశోక శాసనముల కుపయోగించినట్టిది) ముందు తెలుగుతోసహా అన్ని భారతీయలిపులును తీసికట్టే చూడుదు.

"The Brahmic letters have the great beauty of simplicity – they stand bold and clear statuesque and columnar like greek and Latin letters or ancient Phoenician letters ..... ..and compared with Brahmi Nagari or Telugu Sarada or Grantha are complicated and cumbersome scripts indeed."

(Indian Systems of Writing)

ఇచట అభిప్రాయభేదమున. కాస్కారము లేదా అవిన ఉన్నది. ఇట్టి విషయముల చర్చలలో కట్టె విరుగునట్లు ఢంకా బజాయించినట్లు చెప్పివేయుట శాస్త్రీయపద్ధతి కాదనియే నా మనవి.

నన్నయ చెప్పికొనిన 'అక్షరరమ్యత' అను కవిత్వగుణము లిపి సంబంధమైనదని శ్రీ వేంకటరావు గారు ప్రతిపాదించిరి. అప్పుడు నన్నయభారతమును వేఱు లిపులలో అచ్చొత్తించినఎడల నన్నయ కవిత్వము లోని 'అక్షరరమ్యత' హరించిపోవలెనుకదా? ఆ కవిత్వమును చదువుచున్నపుడును ఉండకూడదన్నమాట. నన్నయ రూపొందించిన లిపినే వాడు నేటి తెలుగు వార్తాపత్రికలలోను నన్నయ కవిత్వములోని అక్షర రమ్యత దండిగ ఉండవలెను. ఇట్టినశ్వరమైన కవిత్వ గుణమును నన్నయ ఎందుకు గొప్పగ చెప్పికొనెనో? ర్క, ర్మ. ర్త లను నన్నయ వలపల గిలకలో కఁ, మఁ, తఁ అని వ్రాసి అక్షర రమ్యత సాధించినట్లు శ్రీ వేంకటరావుగారి అభిప్రాయము. వలపలగిలకతోడి వ్రాతకంటె సంయుక్తాక్షరములే రమ్యతరములని నా అభిప్రాయము. వలపలగిలక వంటిదే నాగరలిపిలోను కలదు. ఈ పద్ధతి వలపల గిలకతోడి వ్రాతవలె శీఘ్రపఠనమున కవరోధము. ముఖ్యముగ భాషను అభ్యసించువారికి!

నన్నయ 'అక్షరరమ్యత' అనెనుకాని 'లిపి రమ్యత' అనలేదు. 'అక్షరము శబ్దసూచి. శబ్దము భావసూచి. కావున నన్నయ 'అక్షర రమ్యత'లో ఉద్దేశించిన గుణము కర్ణసంబంధమైనదేకాని నేత్ర సంబంధమైనదికాదు. ఒక జాతి అక్షరములు ఒక విశిష్ట రీతిలో పొదిగి, పెనగి పద్యమునకు రమ్యత (ఇది శోతృ సంబంధి) గూర్చుట 'అక్షర రమ్యత' అని నా అభిప్రాయము. నన్నయ భారతమునుండి కొన్ని ఉదాహరణములు.

—'భారతభారతీ శుభగభస్తి,' (ఆది. ప. ఆ 1, ప 22)

—'వివిధోత్తుంగతరంగ,' (ఆది. ప. ఆ 2, ప 30)

—'కమ్మని లతాంతములకుమ్మెనసి,'
(ఆది. ప. ప 5, ప 138)

—'మదమాతంగతురంగ కాంచన
లసన్మాణిక్య గాణిక్య,' (స.భా. ప, ఆ 1, ప 18)

—'నలుగుణములు దమయంతికి
నలునకు దమయంతి గుణగణంబులు,'
(అరణ్య. ప. ఆ 2, ప 10)

—'దమయంతి మనోభవనిభు,
నమరేంద్రప్రతిము, దినకరాభు, సుధారుక్సము,'
(అరణ్య ప ఆ 2, ప 41)

'అక్షరరమ్యత' ఉద్భూతలయ (Sprung rhythm) జనకము. అనుప్రాసలో ఈ శక్తి ఉండదు. కావున 'అక్షరరమ్యత'అనుప్రాసకంటె సున్నితము, సూక్ష్మము, శ్రేష్ఠతరము.

— శ్రీ సర్దేశాయి తిరుమలరావు.

గ్రంథవిమర్శలు :

# ఆంధ్ర భారతము

## (ఏడంకముల నాటకము)

(కర్త : శ్రీ ఆదిపూడి ప్రభాకరామాత్యకవి. ప్రచురణ: శ్రీ ఎ. వి. యస్. సుబ్బారావు, 1—8—155/5 మెండలే లేన్, ప్రెండరుగాస్టు రోడ్డు, సికందరాబాదు-3; డెమీ 1/8 పే.186 లు. వెల రు. 3/—లు)

ఆర్యసమాజ ప్రచారకులుగా అనేక గ్రంథకర్తగా ఉపన్యాసకులుగా ప్రసిద్ధిపొందిన సోమనాథ రావుగారికి ఈ కవి అనుజులు. శ్రీ తిరుపతి వెంకటేశ్వరులకు గద్వాలలో జరిగిన వివాద సందర్భములో 'కనకాభిషేకమ్ము కావింపు మనలేదు—' ఇత్యాది పద్యముతో రాజాగారిని ఉద్బోధించిన సహృదయాగ్రేసరులని నానారాజసందర్శనము వలన జగత్ప్రసిద్ధి పొందినవారు. వీరు కొంతకాలము గద్వాల సంస్థానములో ఆస్థానకవిగానుండి పిఠాపురము, పోలవరము సంస్థానములలోగూడ ఉద్యోగములు నిర్వహించి అనేక గ్రంథములు రచించి 1933 సం. న దివంగతులైరి. వారి శతవార్షికోత్సవ సందర్భముగా వారి కుమారులు సుబ్బారావుగారు ఈ గ్రంథము నిప్పుడు ప్రకటించిరి.

ఇది దృశ్యప్రబంధ రూపముననే ఉన్నను, అతి దీర్ఘ ప్రసంగములతోడను, పద్యబాహుళ్యముతోడను నిండియుండి సంభాషణారూపమునఉన్న శ్రవ్యప్రబంధ మనుటకే ఎక్కువ తగియున్నది. పద్యములు కవికిగల కవితాపాటవమును ప్రదర్శించుచున్నవి. మహాభారత కథ నంతటిని ఒక్క నాటకములో నాటకీయత చెడకుండ ఇముడ్చుట అసాధ్యమైన కార్యము. అట్టిదానిని సాధ్యమైనవరకు హృదయంగమముగా కవి ప్రదర్శింప గలుగుట ప్రశంసార్హము. మహాభారతకథలో కొలది మార్పులు చేయుటయేకాక మాణవుకుడను నూతన పాత్రను—ఏకచక్రపురములో ధర్మరాజుకు అప్పుడైన వయస్యునిగా—సృష్టించి ఆద్యంతము ప్రాధాన్య మొసగుట గణింపదగినది.

తృతీయాంకములో ఏదో సందర్భము కల్పించి రామాయణకథను ప్రస్తావించుట ఆంధ్రకవు లందరికి సర్వసాధారణమైన రామాయణకథాభిమానము ఈ కవికిని కలదని నిరూపించును ...

చతుర్థాంకము ముందున్న విష్కంభములో నేటి గడియారములవంటి గడియారములే వాడును ఉన్నట్టు సూచించి, వానికంటే ఆదిత్యుడు చంద్రుడు నక్షత్రములే గడియారములుగా భావించువారే కాలము సరిగా నిరూపించినట్టు సూచించుట చమత్కార జనకముగానుండి ఉద్దిష్ట ప్రయోజనము సాధించినది.

వీరి కవిత్వమునుగూర్చి తిరుపతి వేంకటేశ్వరులు, 'తిక్కనకుఁ దిక్క విడిపించు ధీరుఁ డితఁడు, అన్నదియు, ప్రవేశకములో డా. దివాకర్ల వెంకటావధానిగారు, 'నాటకోచితత్వమున నవి (ఇందలి పద్యములు) తిరుపతికవుల పద్యముల పజ్జ నిలువదగి యున్నవి' అన్నదియు ప్రేమాభిమానములచే పలికిన అతిశయోక్తు లవుగాక ! సందర్భోచితముగా ఈ కవి సంస్కృతబంధురముగాను తేటతెలుగు నుడులతోను పద్యరచన చేయగల దిట్ట యనుట కెట్టి సందేహమును లేదు.

ఇందలి పద్యములలో చిత్తులో దొరలిన ప్రమాదములు కొన్ని తప్పొప్పుల పట్టికలో సవరింప బడినవి. ఇంకను ఈ క్రిందివానిలో సంభవించిన గణభంగములును సవరింపవలసి యున్నవి.

(1) పే 88 'అన్నలు దొడ్డవారు' ఇత్యాదిపద్యములో 2 వ పాదము.

'పన్నులు ముఖ్యబంధువులు మామయు మత్స్య మహేంద్రుడున్'

(2) పే. 89 మొదటి పంక్తి.

'సంధికి రాయబారమటె చాలును దొడ్డవార్త, క్రోధాంధుఁడు...'

(3) పే. 189 వ 'అతికరుణా నిమగ్న ...' ఇత్యాదిలో మొదటి పాదము.

'అతికరుణా నిమగ్న హృదయాంచితుఁ డప్రతిమాన సా ధితపరమార్థ సంగతుఁడు...'

(4) పే. 171 లో అకుటిలబుద్ధి ఇత్యాది గల పద్యములో రెండవపాదము.

ర, క్షకుల కవశ్యమై తగు ప్రపరిపాలనకే పద్ధతుల్ మహాసుకరముగా...'

కవి బుద్ధిపూర్వకముగా కొన్ని వైరిసమాసములను వ్యావహారిక పదబంధములను ప్రయోగించినారు గనుక వానిజోలికి పోరాదుకాని పే. 94 లో 'కాదితరంబు యుగ్మశ్రీ' అని కవి బుద్ధిపూర్వకముగా ప్రయోగించి యుండరు. అట్టి వింకను అక్కడక్కడ కనబడుచున్నవి. సవరించుట యుక్తము. 'అశ్వత్థామ' గ్రంథమందంతట తరుచుగా అశ్వద్ధామగాను అశ్వద్ధామగాను కనబడుచుండుట కూడ సవరింప దగినదే.

19, 20 శతాబ్దముల మధ్యకాలములోనుండి సహజ పాండిత్యము కలిగిన ఈ కవి రచించిన ఈ నాటకము సహృదయ సంభావ్యమై యున్నది. తన కవిత్వమును తన్ను ఎక్కువగా అభిమానించిన గద్వాల భూపాలురగు శ్రీ సీతారామ భూపాలున కీ కృతిని కవి యంకితముచేయుట యుక్తముగానున్నది. ఆంధ్రప్రదేశ ప్రభుత్వమువారును, ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ వారును దీని ముద్రణమునకు యధోచిత సహాయము చేసి వారి విధి నిర్వర్తించిరి. అముద్రితములైయున్న ఈ కవి ఇతర కృతులును అచిరకాలములో శ్రీ సుబ్బారావుగారు ప్రచురింతురుగాక !

## కన్నడ వ్యాస సంకలనం

(సంపా : శ్రీ గొరూరు రామస్వామి అయ్యంగార్; అనువా: శ్రీ తిరుమలరామచంద్ర: ప్రకాశకులు: సాహిత్య అకాడెమీ, రవీంద్రభవన్, న్యూఢిల్లీ—1. డెమీ 1/8 పే. 188 లు పేపరు బైండు. వెల రు. 7/—లు )

ఇంగ్లీషులో ఎస్సే (Essav) అనే సాహిత్య ప్రక్రియ 200 సం. ల నుంచీ బహువిధాల వ్యాప్తి పొందుతున్నది. అది తెలుగులో తగినంత వ్యాప్తికి రాలేదు. ఈ కన్నడవ్యాససంకలనం చూడగా ఈ ప్రక్రియ కన్నడంలో విస్తారవ్యాప్తి పొందినట్లు స్పష్టమవుతున్నది. కవిత, కథానిక, నవల-ఇత్యాదిప్రక్రియలలో లబ్ధప్రతిష్ఠులు ఎందరో ఇందులో చేయిచేసుకుంటున్నందువల్ల సుసంపన్నమయిన దనడానికి మచ్చుతునకగా ఈ సంపుట మున్నది.

ఇందులో అఖిలభారతప్రసిద్ధిగన్న వృద్ధ కన్నడ సాహిత్యకారుల వ్యాసాలేకాక యువకవులవి కూడా ఉండడము ప్రశంసనీయము. 30 మంది వ్రాసిన 30 వ్యాసాలు ఇందులో ఉన్నవి. ఏ కొద్దివో తప్ప బరువైన వ్యాసాలు ఇందులో లేవు. శ్రీ సి. కె. వెంకటరామయ్య 'ఖెడ్డా' బరువైనవాటిలో ఒకటి. అది బహుశః వారు రచించిన 'నాల్వడి కృష్ణరాజ ఒడెయరు జీవిత చరిత్ర'లో భాగమై ఉంటుంది. అందులో అడవి ఏనుగులను పట్టే విధానము కన్నులకు కట్టినట్లు సోదాహరణంగా వర్ణించారు. అట్లాగే మరికొన్ని వ్యాసాలుకూడా గ్రంథభాగాలనే శంక కలిగిస్తున్నవి కాని ఎక్కువభాగము ప్రత్యేకవ్యాసాలే.

ఈ వ్యాసా లన్నిటిలో మన సోదర కర్ణాటక కవుల ఆత్మీయత స్పష్టమవుతుంది. వారిలోముఖ్యంగా మధ్యతరగతివారి జీవితాలూ,మాటలూ, సామెతలూ— అన్నీ తెలుగువారి వాటికి ఎంతో సన్నిహితంగా ఉన్నట్లు ఈ గ్రంథం విశదపరుస్తున్నది. కర్ణాటకులూ ఆంధ్రులూ ఒకేపట్టుతానులో కత్తిరించిన రెండు వస్త్రాలవలె ఎంత సాజాత్యం కలవారా అనిపిస్తుంది.

వ్యాసాలు అన్నీ మంచివేకాని శ్రీ కువెంపు 'రామరావణయుద్ధం', శ్రీ గోకాక 'కోకిల', శ్రీ గోరూరు రామస్వామిఅయ్యంగార్ 'మా గేదెకు మాటలు

వచ్చా ?, శ్రీ మైసూరు వాసుదేవాచార్యుల 'టైగర్ వరదాచార్యులు', శ్రీ ఎం. వి. సీతారామయ్య 'మొయిళ్ళు', శ్రీ పండె మంగళేశరావు 'పాత సబ్ అసిస్టెంటు కల్లడైరీనుంచి' అనే వ్యాసాలు ప్రత్యేకంగా ఆత్మీయంగానూ సరసమైన హాస్యంతోనూ హృదయంగమంగా ఉన్నవి.

'రామ రావణ యుద్ధం' వీధినాటకం చూచిన మర్నాడు ఇంటి పిల్లలంతా ఆ నాటకం ఆడడానికి చెట్టుకింద చేసిన ప్రయత్నాలూ, దానిలో నూతన వాల్మీకి ప్రవేశపెట్టిన భీమునిపాత్ర, ఆంజనేయుడు కైలాసపర్వతము ఎత్తడమూ, కైలాసానికి తెచ్చిన రాతిమీద పార్వతీ పరమేశ్వరులు ఎక్కితొక్కగా ఆంజనేయుని వేళ్లు నలిగి గీపెట్టడం, అదివిని పినతండ్రి ఇంట్లోనుంచివచ్చి ఆంజనేయుడి వేళ్లు రక్షించి పాత్రధారుల కందరికీ చింతబరిక దెబ్బలతో సన్మానం చేయడం—ఆద్యంతం చక్కగా ఉన్నది.

'కోకిల'ను కవులంతా అంధపరంపరాన్యాయంగా దాని గానానికి ప్రశంసిస్తున్నందుకు అసహ్యించుకొని అడవిలోకిపోయి కొత్తపక్షి గానము, విని ఆనందించి మిత్రునికి చూపడం, 'అయ్యో, పిచ్చి నాన్నా, ఇదే కోకిల' అని మిత్రుడు నిరూపించడం వ్యాస విషయము. వ్యాసకర్త సంప్రదాయాన్ని నిందించినట్లే కనబడుతూ అభిమానిస్తాడు.

'టైగర్ వరదాచార్యులు'ను నవ్వులతోనే ఉదాత్తంగా చిత్రించిన వ్యాసకర్త స్వయంగా ఉత్తమ సంగీత విద్వాంసులై ఉండడము విశేషము.

'మొయిళ్ళు' ఆకాశంలోపొందే చిత్ర చిత్ర రూపాలను బాలబాలికలనేగాక, వయస్సు వచ్చినా బాల్యభావాలు వదలని కవితాత్మగలవారినికూడా ఆకర్షించడం చిత్రిస్తుంది. దీనిలో వ్యాసకర్త అనుభవాలు ఈ సమీక్షకుని అనుభవాలకు ఎంతో సన్నిహితంగా ఉన్నందున అభిమానానికి కారణమైనదేమో ! ఏతత్సదృశమైన అనుభవాలు ఉన్నందుననే కాళిదాసు 'మేఘదూత' వ్రాసినాడేమో !

'పాత సబ్అసిస్టెంటు కల్లడైరీ'లో పాతకాలపు పల్లెటూళ్ల పంతుళ్ల పేదరికమూ, వారి హాస్యమూ, ఓర్పూ, క్రమభంగాలున్నా వారు ప్రాథమికవిద్యకుచేసిన నిస్స్వార్థసేవా, హృదయంగమంగా చిత్రించారు.

శ్రీ తిరుమల రామచంద్ర అనువాదము చక్కగా రాయలసీమలో కన్నడప్రాంతాలకు సమీపస్థుల వ్యావహారికాంధ్రవాసనలతో మనోజ్ఞంగా ఉన్నది.

ఈ వ్యాస సంకలనము ఆంధ్ర రచయితలూ, రచయితలు కాగోరేవారూ, పాఠకులూ అంతా అవశ్యము చదివి ఆనందించదగినది. ఇతర సాహిత్యరంగాలలో కన్నడిగులకు తెలుగువారు వెనకబడలేదుగాని 'ఎస్సే'వ్యాసశాఖలో వెనుకబడ్డట్లు గుర్తించక తప్పదు. ఆ లోటు శీఘ్రకాలంలోనే పూడ్చడానికి ఈ కన్నడ వ్యాస సంకలనం ఆంధ్రులను ప్రేరేచుగాక !

—నోరి నరసింహశాస్త్రి

## ఎదగండి

(నవకవిత; కవి; రంధి సోమరాజు; ప్రతులకు: శశిధర్ పబ్లికేషన్స్: 44—13—38 అన్నపూర్ణపేట; రాజమండ్రి-3; 74 పేజీలు; వెల. రూ. 2)

'ఎదగండి' శ్రీ రంధిసోమరాజు వ్రాసిన నవకవితా సంకలనం. ఇందులో 'ఎదగండి'; 'దినమొలసొగ్గతె'; 'పెద్ద పెద్ద కబుర్లు' అనేవి జానపదుల యాసతో గోదావరిజిల్లామాండలికభాషలో వ్రాసినవి. మిగిలిన తొమ్మిది కావ్య ఖండికలు మామూలు వచన

కవితా పద్ధతిలో వ్రాసినవి. మొత్తంమీద అన్నిగీతాలూ వచన కవిత్వమే. 'ఎదగండి' అనేది దరిదాపు ఇరవై పేజీలు సాగిన గీతం. ఇందులో కావ్యత్వం చాల తక్కువ. దేన్నిగురించి చెప్పదలచు కొన్నదీ కవికే ఒక స్పష్టమైన అవగాహన లేనట్లుగా కన్పిస్తున్నది. దారిద్ర్యంతో బాధలుపడుతున్న సామాన్యుడు దినపత్రిక అందించిన లోకజ్ఞానంతోను, తనకున్న వివేకంతోను, అన్నింటినీ శంకించి ప్రపంచంలో,

'ఇడిడిగా అంతా దొంగలం
మందిమీద మంచోలం'

అని తీర్మానించుకొని

ఆందరంకళ్ళి వొత్తుల్లా
గుత్తులు గుత్తులుగా
కళ్ళెలిగితే కళ్ళెదిగితే
యెం తెలుగు.

అని ఉపదేశాత్మకంగా 'ఎదగండి' అనిచెప్పారు.

'కాడికింద మెడెట్టే వోడు నేడుకాని
బొడ్డూడని బుడ్డోడు కూడసెప్పడమే'

నని అభ్యుదయాన్ని కాంక్షించి విప్లవానికి సిద్ధం కండని చెప్పేవారిని ఎద్దేవా చేశారు. పార్టీలను నమ్మవద్దని ముఖ్యంగా 'ఎఱ్ఱజండా' పార్టీలను నమ్మితే

'ఆలుమాత్తరం పారోనం గుట్టల్లోంచి
సూత్తారు
ఆల కళ్లనిండా ఉత్తశీము
నెత్తు రెప్పుడో జెండాకెక్కి నిల్సిపోనాది
జెండా ముట్టుకుంటే సాలు
గుండా వౌతావ్...'

అని బెదిరిస్తున్నారు. ఈ విషయంలో వీరు శ్రీ దాశరథి చెప్పినట్లుగా 'జెండాలను నమ్మితే వుండాకోరు వౌతావు' అని చెప్పారు. రంధి సోమరాజుగారు పార్టీలను నమ్మవద్దని, ఊరికే మాటలుచెప్పి కాడికింద మెడపెట్టి'ని వారిని, జీతాలు పెంచమని స్ట్రైకులు చేసేవారిని, 'పెద్దమద్దుస్లీ'; సమస్యలను విడదీయటానికి తరుణోపాయంగా హింసను బోధించేవారిని, ఇంకా ఎందరినో నమ్మవద్దనిచెప్పి 'మంచో డెప్పుడూ తెలివి తక్కువోడు' 'తెలివున్నోడైతే ఆల లచ్చనాలు సరిజేయాల' గాబట్టి 'గాడిదరువులు మాని మంచికి తలొగ్గండొరే' అని అమాయికంగా చెప్పినట్లు చెప్పారు.

పైగా 'ఈగలు యీగల్ని సంపుకోడం సూశామా; దోమలు దోమల్ని సంపుకోడం సూశామా' అని చిత్రమైనతర్కంతో ఎదుర్కొనచూచి ఏరకంగా చూచినా వర్గపోరాటం తప్పదనేవారిని 'గుత్తులు గుత్తులుగా వొత్తుల్లా, కళ్ళెలిగి, కళ్ళెదెగ'మంటారు.

కాని 'మనజాతి ఎదగమన్నా ఎదుగుతుందన్న నమ్మకంలేదు'అని అపనమ్మకాన్ని వెలిబుచ్చారు. కవిగా సోమరాజుగారు పలికిన 'ధర్మం ఆచరించని రాజకీయ నాయకులు' అనటంలోను; 'నోకమంటే **యేటి?'** అని ప్రశ్నించి జవాబు చెప్పటానికి చేసిన వర్ణనలోను, కొద్దికొద్దిగా కవిత మెరిసినా మొత్తంమీద సుదీర్ఘమైన యీ వచనగీతంలో అత్యధికభాగం వచనమేనని చెప్పవచ్చు.

'దిసమొలసొగ్గత్తె' నవీననాగరకతలోని ఘోరాన్ని రూపు కట్టించి, ఆ నాగరకత పరువుతీసి, గుండెల్ని కదలించి ఎటువంటి నాగరకత పనికిరాదో చెప్పే మంచి వచనగీతం.

'కాబరే' డాన్సుచేసే
ఆడదాని నాజూకు
కళ్లతో నాకేత్తూ
కసెక్కి తప్పన
పీకేత్తారు
పేదోడి కనుగుడ్లు
వాళ్ళెత్తుత్నట్టు
బుడ్డిమూతల్ని

తెరిచే పెద్దమనుషులూ రసికులూ ఏజాతివారో కళ్లకు కట్టేవిధంగా చెప్పారు. 'తాటాకులకట్టరోడ్డుమీద బర బర నాగేత్తున్నట్టు వాక్కులే పిచ్చసంగీతం'—ఇది ఎంతో చక్కని పదచిత్రం. ఆ నాట్యంచేసే స్త్రీ

సేతులు మాస్సైతుగా ఆటమించినాగి సందమామల్ని సూపుతూ రంకకల్లతో పుల్లగానవ్వి వొంటిమీదిగుడ్డల్ని వోరూలేకుండా సూసివాల్నిపారేత్తున్నట్టు,వాళ్లముందు గెంతుతుంది. ఆ నాట్యం చూసిన 'వాళ్లు ఎవరోకాదు—దేసెంముందు కెల్లడంఅంటే బుద్దులు సెప్పేవోలె నోరు లేనోలి కట్టంమీద ఇట్టా తాగి తందనాలాడ్డమేనని' చెప్పటంతో సోమరాజుగారు ప్రగతిని కోరేకవి అనిపిస్తుంది. కాని రెండవభాగంలోని కవితలు చదివితే వీరుకోరే ప్రగతి ఎటువంటిదో తెలియదు. మంచితనం ఒక్కటే సమస్య లన్నిటికీ పరిష్కార మార్గమంటారు గాని ఆ మంచితనం ఏచర్య ద్వారా వెలికివచ్చి ఫలోన్ముఖం అవుతుందో మాత్రం చెప్పరు.

'ఊహల నాలుగోపాదం' అనేగీతం చదివిన తరువాత 'ఈనా హృదిలో యేభావం సజీవం కాగలదు ?? ఈనా కన్నులలో యే జీవం తొణికిస లాడగలదు ? ? ?' అని ప్రశ్నించినతీరు వీరికి బాగా అన్వయిస్తుంది 'Fourth dimension'లో ఊహించడం వలన సహృదయులకు వీరి ఊహలు గందరగోళంగా ఉంటాయి. 'అనంత దుఃఖం' అనేది పేలవంగా, శుష్కవచనంవలె సాగిన రచన. 'తులసిమొక్క' అనే గీతం గందరగోళంగా ఉండటమేగాక

'సమయంచూసి వెన్నెల్ని మొక్కజొన్నపొత్తులా
కోరికల నిప్పులో కాల్చుకతింటోంది ప్రకృతి'

అనటంలో ముఖ్యంగా 'వెన్నెలను కాల్చుక తినటమనే ఊహ' జుగుప్సను కలిగిస్తున్నది. 'ఎందుకు నేను' అనేగీతం కవి నిస్పృహను వెల్లడించేదిగా ఉన్నదే గాని కవిబాధకు రసజ్ఞుల హృదయం ప్రతిస్పందించేటట్లుగా లేదు. 'ఉత్త చెక్కముక్క' అనే గీతంకూడ అయోమయంగా ఉండి 'పోగానే మూసుకుపోయే పొట్టితలుపు'ను దేనికి సంకేతంగా వాడారో అది పాఠకుల అనుభూతికి అందదు. అందినప్పటికీ ఆనందం కలిగించదు.

'సూర్యుడి మొగంమీద ఉమ్మి
ఊతక్ర వుచ్చుకున్నాడు'

అని 'మిగిలింది బూడిద' గీతంతో పలకటంచూస్తే జుగుప్సను కలిగించటంలో వీరు దిగంబరకవులకు సన్నిహితులౌతున్నారు. దిగంబర కవులు సమాజ పరిస్థితులలో ఉన్న జుగుప్సను వెల్లడించి దానిని పోగొట్టాలంటే విప్లవమార్గమే శరణ్యమని నమ్మి జుగుప్సను కలిగించే కవిత్వం వ్రాయటం తగ్గించుకొన్నారు. 'వేదాంతి ఉపన్యాసంలాగ' మంచితనాన్ని నమ్ముకొన్నాము; 'అదేమార్గం' అంటున్నారు సోమరాజుగారు. మధ్యతరగతి మనస్తత్వంతో ఆలోచించి, జానపదుల యాసలో పలుకజూచిన సోమరాజుగారు పిరికితనానికి అమాయకత్వం తోలు కప్పుకున్న, మంచితనం చిరునవ్వు తగిలించుకున్న మనిషినిగూర్చి పలికితే;—అతడే 'నిండైన' మానవుడని; 'అభ్యుదయానికి మళ్లీ ప్రాణం వచ్చినట్టుగా అనిపిస్తోంది' అని శ్రీ ఆర్. యస్. సుదర్శనం తమ పరామర్శలో మెచ్చుకొంటున్నారు.

ఈ కావ్యసంకలనంలోని 'పెద్దపెద్ద కబుర్లు' అనేది మహాకవి శ్రీ శ్రీ షష్టిపూర్తి సందర్భంలో చదివినది. శ్రీ శ్రీ ని విమర్శించడం ఇందులో కానవస్తున్నది. దూషణలవలన సాహిత్యానికి కలిగే ప్రయోజనమేమీ లేదు. 'దిసమొలసోగ్గత్తె'; 'కవిత్వాన్నిమాత్రం కొనకు'వంటి కావ్యఖండికలను వ్రాయగలిగిన సోమరాజుగారు శ్రీ శ్రీ మార్గాన్ని ఆక్షేపించటానికే కంకణం కట్టుకున్నట్లు 'ఎదగండి'; 'పెద్దపెద్ద కబుర్లు' వ్రాశారనిపిస్తుంది.

'కవిత్వాన్నిమాత్రం కొనకు, తినకు
అది ఉత్తమన్ను
వేలుపెడితే చాలు తగుల్తుంది
ఎవడిదో కన్ను'

అని భావగర్భితంగా ఉత్తమకవిత్వం వ్రాయగలిగిన కవి

'ఇవి చొచ్చుకపోగలిగిన
మొక్కలకే ఆహారంపెట్టే రాళ్లు
ఈ రాళ్ల గుండెల్లోంచి
తలఎత్తిన రావిఆకు
కవి కుమారుని వాక్కు'

అని నాజూకుగా వ్రాయగలిగిన కవి తను ఆలోచనా విధానంలో స్పష్టమైన మార్గాన్ని దర్శించటానికి, దానికి తగినవిధంగా శుష్కవచనరచనాపద్ధతిని వద లించుకొని కవిత్వకళను ప్రదర్శించటానికి ప్రయత్నిస్తే వీరి కలంనుండి ఉత్తమకవిత వెలువడగలదని ఆశించవచ్చు. ఈ పుస్తకానికి శీలా వీర్రాజుగారు చిత్రించిన ముఖపత్రం అందంగా ఉన్నది.

—రామమోహనరాయ్.

## సమర్ పథే బంగ్లా

(సమీకర్త : వే. నరసింహారెడ్డి. పేజీలు: 60; వెల: రు. 1/- లు. ప్రతులకు: సాందీపని ప్రచురణలు; 2/16 బ్రాడీపేట; గుంటూరు—2)

ఇటీవలి కాలంలో తూర్పు బెంగాల్‌లో చెలరేగిన స్వాతంత్ర్యోద్యమం ఈ కవితా సంకలనానికి ఊపిరి. నియంతృత్వ మిలిటరీ ప్రభుత్వంపై ప్రజాస్వామిక శక్తుల పోరాటం వీరి కవిత్వానికి ఇతివృత్తమైంది. తూర్పు బెంగాల్ విషాద రాజకీయ నాటకంలో యాహ్యాఖాన్ విలన్; ముజీబ్ హీరో. నాటకం విషాదచ్ఛాయలను ప్రదర్శిస్తున్నా ముగింపు ధర్మం జయించడమే.

ఈ సంకలనంలో మొత్తం అరవయి కవితలున్నాయి. దీంట్లో కనిపించే కవులలో కొంతమంది లబ్ధప్రతిష్ఠులు; మరికొంతమంది ఇప్పుడిప్పుడే బయటకు వస్తున్నవాళ్లు. వీళ్లంతా ఏకభావాశ్రితులై ఈ సంకలనాన్ని వెలువరించారు. ఈ కవులంతా వచన గేయాల్ని రాస్తున్నవారే. ఎక్కువమంది చైతన్యవాదం అనే పేరుతో వ్యక్తివాదానికి పట్టాభిషేకం చేసినవాళ్లు. ఈ దేశంలో సమకాలీన సమాజ గతమైన సంక్షోభం వీళ్లని కదల్చలేనంతగా బంగ్లాదేశ్‌లోని స్వాతంత్ర్యోద్యమం కదల్చ గలిగింది.

ప్రారంభగేయం 'రావణు డుదయించె' సింబాలిక్‌గా ఉంది. శ్రీ దాశరథి రాసిన ఈ గేయంలో రావణుడు యాహ్యాఖాన్. అతని వ్యాపారాన్ని ఈ విధంగా చెబుతున్నాడు దాశరథి

'చీకటుల నెల్ల తాను రక్షించు నంట,
చిన్న వెలుగు రేఖలను భక్షించు నంట,
పిట్టపైన బ్రహ్మాస్త్రంబు వేయునంట,
తూర్పుమీద దండెత్తగా దొడరునంట.'

మిలిటరీ పైశాచిక నియంతృత్వాన్ని పరిరక్షించడమే చీకట్లను రక్షించడం. తూర్పు బెంగాల్ ముక్తివాహిని చిన్న వెలుగురేకలు. వాటిని హతమార్చడమే—అంటే స్వాతంత్ర్య భావనని అణగద్రొక్కటమే అతని శ్రేయం.

అక్కడ స్వాతంత్ర్యోద్యమాన్నిగూర్చి—

'బానిసత్వపు శిశిరం గడ్డకట్టించే చోట
స్వేచ్ఛా గ్రీష్మం చంద్ర నిప్పులు కురుస్తుంది'

అని చెబుతున్నారు డా. సుప్రసన్న. 'వ్యక్తులు హీనులైనా బలహీనులైనా సమిష్టి చైతన్యం గొప్పది' అని అంటున్నారు ఆయనే. శ్రీ సుప్రసన్న ప్రధానంగా వ్యక్తి వాదకవి. ఇక్కడ సమిష్టిచైతన్యానికి ప్రాధాన్యం ఇచ్చారు.

'దిగుమతి చేసుకున్న విప్లవంకాదు
జనుల జీవనంలోంచి పుట్టింది'

అంటున్నారు శ్రీ సుప్రసన్న. అక్కడ స్వాతంత్ర్య పోరాటాన్నిగూర్చి. దిగుమతి చేసుకున్న విప్లవం అంటే ఆయన దృక్పథంలో సామ్యవాదం అనే అనుకుంటాను.

అరవిచ్చిన స్వాతంత్ర్యం అనే ఖండికలో—
'తిక్క ఎక్కిన రాబందులు
పావురాల కుత్తుకల్ని
పిండిపిండి తాగుతుంటే
గద్దలు గంతులు వేశాయి.
మొసళ్లు ఎసరు పెట్టాయి'

(పరాశరం గోపాలకృష్ణమూర్తి)

అని ప్రపంచ అగ్రదేశాల పరిస్థితిని వివరించారు. తిక్కఎక్కిన రాబందులు పాకిస్తాన్ మిలిటరీ అధికారులు, జవానులు. వాళ్లు తాగుతున్న రక్తం తూర్పు బెంగాల్ శాంతి పావురాలయిన ముక్తివాహినిది. గద్దలు మొసళ్లు అగ్రరాజ్యాధినేతలు. ఈ గేయం ప్రారంభంనుంచి చివరివరకూ ఇలాగే సింబాలిక్‌గా నడుస్తుంది. కవితాపటిమను సంతరించుకున్న గేయమిది.

'అరణ్యవాసం గడువు ముగిసిన పాండవసైన్యంలా
అంతకంతకూ ముక్తివాహిని విజృంభిస్తుంది
శాపఫలం తీరిన శకుంతలలా
బంగ్లా గుర్తింపబడుతుంది.
హిట్లర్, చెంగిజ్ ఖాన్ దారినే
యాహ్యా పోక తప్పదు.
ఇది సత్యం
చరిత్ర పునరావృత్తమవక తప్పదు.

(పిరాట్ల వెంకటేశ్వర్లు) స్వాతంత్ర్యోద్యమ విజయాన్ని కాంక్షిస్తూ రాసిన గేయమిది. ఇక్కడ ముక్తివాహినిని పాండవసైన్యంతోనూ, శకుంతుల తోనూ పోల్చడంలోగల ఔచిత్యం వారి ఉద్యమంలో గల పవిత్రతే.

గూబలరాజ్యం అనేది మరొక మంచిగేయం.

'ప్రజాస్వామ్య రక్షణకై
ప్రతినగొన్న రాబందులు
ఏమీ జరగనట్టు ఎఱుగనట్టు
వేషాలు వేస్తున్నవి
మిగిలే ఎముకలకోసం
గుటకలేస్తూ కూర్చున్నది
గుట్టమీద గుంటనక్క'

(ఉండేల మాలకొండారెడ్డి) ప్రజాస్వామ్య రాబందుల పొరుగుదేశాల నాయకులు. గుంటనక్క భుట్టో.

ముదిగొండ వీరభద్రయ్యగారి స్వర్గనరకాలు అనే గేయం భారతదేశానికీ, పాకిస్థాన్‌కీఉన్న వ్యత్యాసాన్ని వ్యక్తంచేసే మరొక మంచిగేయం.

'కనబడే ఆ ఊరు దాటితేచాలు
ముప్పయిమంది స్వర్గంలోకి వస్తారు
ఈ స్వర్గంలో కలరాఉంది, టైఫాయిడ్‌ఉంది
ఈ స్వర్గంలో నివాసమంటే ఆకులురాలిన
చెట్లక్రింద—
రోడ్డుపక్కన పారవేసిన డ్రైనేజి పంపుల్లో,
అయినా ఈ స్వర్గంకోసం గబగబ వస్తున్నారు
ఈ స్వర్గంలో వాళ్ల కొక్కటే ఉన్నది
అదే స్వాతంత్ర్యం.'

రెండు, మూడు, నాలుగు పాదాల్లో భారత దేశంలో సామాన్యుని, అంతకంటె తక్కువగా బ్రతికే మానవుని జీవనపరిస్థితి వివరింపబడింది. ఇక్కడ—వాళ్లకి ఆశ్రయం లభించిందంటే—అది భారతదేశానికి మానవత్వంమీద, దాని మనుగడమీద ఉన్న ప్రగాఢ విశ్వాసం మాత్రమే.

ఈ గేయసంకలనంలో ఉత్తమంగాఉన్న కావ్య ఖండికలు చాలా తక్కువగా ఉన్నాయి. వాటిలో కొన్నింటిని నా ఉదాహరణలో చూపించాను. అధిక భాగం గేయాలు కవిత్వానికి చాలాదూరంగా ఉన్నాయి.

'విశ్వాసం మోసం చేసినపుడు
పాలిష్‌చేస్తున్న చేతుల్ని బూట్లు
నిర్దాక్షిణ్యంగా నల్పినప్పుడు'

(అగ్నిమిత్ర)లాంటి ధ్వనిప్రాయమైన పాదాలు ఈ సంకలనంలో చాలా తక్కువచోట్ల కనిపిస్తాయి. ఇంత మంది కవులు ఈ ఉద్యమానికి కదలి కవిత్వం రాయడం ఆనందించతగ్గ విషయం.

—టి. ఎల్. కాంతారావు.

# తెలుగు నవలా వికాసం

(తెలుగు నవల చరిత్ర. రచయిత : మొదలి నాగభూషణశర్మ, ప్రతులకు : ఆ. ప్ర. డిస్ట్రిబ్యూటర్స్, రాష్ట్రపతిరోడ్, సికింద్రాబాద్. వెల : పదిహేను రూపాయిలు.)

'నవలను వర్తమానకాలపు మహాకావ్యం అన వచ్చు. ఇంత సంఘర్షణమయమూ, క్లిష్టమూ అయిన యుగంలో కావ్యం అదృశ్యంఅయి, దానిస్థానే గద్యం—అందునా గద్యకావ్యం ప్రచురంకావడం సహజమే, నాటకం, కావ్యం మొదలైన అన్నిప్రక్రియల పద్ధతులు నవలలో మనకు ద్యోతకం అవుతాయి. అందువల్లనే ఈనాడు మిగిలిన అన్నిసాహిత్యప్రక్రియలకన్న 'నవల' అత్యంతసమాదరణీయమైంది.' (2 వ పుట).

గ్రంథ ప్రారంభంలో ఈ వాక్యాల్ని చూచి ఆధునిక సాహిత్య ప్రక్రియగా నవలలోవచ్చిన పరిణామం, నాటకం కావ్యంవంటి ఇతర ప్రక్రియలు అందులో అంతర్నిహితంఅయిన వైనం, సోపపత్తికంగా నిరూపిస్తుందేమో ఈ గ్రంథంఅని ఆశిస్తే ఆశాభంగం తప్పదు. గ్రంథం మొదటనున్న పై వాక్యాలు కేవలం యాదాలాపంగా లోకాభిప్రాయాన్ని వెలిబుచ్చడంతప్ప మరేమీకాదు!

పోతే, నవల లక్షణాలను పేర్కొని, దాని సంక్షిప్తచరిత్రనూ, విషయానుగతమైన విశ్లేషణనూ జతచేసి ఆ ప్రక్రియలోవచ్చిన ఉత్తమరచనలను పరిచయంచేస్తూ, 'పరిచయాత్మకమైన' గ్రంథాన్ని వ్రాయబూనుకున్నట్లు 'ప్రస్తావన'లో చెప్పకున్నాడు రచయిత. రచయిత ఉద్దేశం ఎంతవరకు నెరవేరిందో ఈ పరామర్శలో తెలుసుకుందాం.

గ్రంథం మొదటిభాగంలో నవల లక్షణాలను వింగడించడంలో రచయితపడిన తికమక వర్ణనాతీతం. నవల 'స్వరూపస్వభావాలు'అంటూ 14 సూత్రాలను చెప్పి, తర్వాత 'నవలలోఉండే ముఖ్యమైన అంశాలు' అంటూ ఇతివృత్తనిర్మాణము, పాత్రచిత్రణ, సంభాషణ, కాలస్థలఐక్యతలు, శైలి, ఉద్దేశంఅనే ఆరింటిని పేర్కొనడం జరిగింది. ఏమాత్రం ఆలోచించినా, ఈ ఆరింటిలోనే ఆ మొదటి 14 సూత్రాలు వివరణ ప్రాయంగా యిమిడిపోతాయని తెలుస్తుంది! ఉదాహరణకు పై 14 సూత్రాల్లో 3 వది 'సహజమైన, స్వాభావికమైనశైలి దీనికి ప్రాణం'అనే సూత్రాన్ని 'శైలి'అనే అంశంక్రింద వివరణగా తీసుకోవచ్చును కదా! నిజానికి పైజెప్పిన చతుర్దశ సూత్రాలూ సూత్రాలుకావు! నవలనుగూర్చి ప్రచారంలోఉన్న పది మంది అభిప్రాయాలూ వరుసగా అంకెలువేసి ఒకచోట ఉటంకించడం మాత్రమే! ఒక ప్రక్రియయొక్క లక్షణాల్ని నిర్ణయించే పద్ధతి ఏమిటో ఈ రచయితకు బొత్తిగా అంతుపట్టలేదు! ముఖ్యాంశాలుఅంటూ ఆరింటిని పేర్కొన్నా, వాటినిగూర్చి వివరణ వచ్చేప్పటికి ఇతివృత్తం, పాత్రచిత్రణ, ఉద్దేశం, భావచిత్రాలు, కాలంఅనే 5 శీర్షికలే తేలాయి. అందులో ,భావచిత్రాలు, పై ఆరింటిలో పేర్కొన్నదికాదు! ఇలా జరగటానికి కారణంకూడా బోధపడుతూనే ఉంది. పై ఆరింటిలో సంభాషణ, కాలస్థలఐక్యతలు, శైలి అనే అంశాలు నిజానికి పాత్రచిత్రణలో, ఇతివృత్తనిర్మాణంలో అంతర్భాగాలే తప్ప వేరుగా 'అంశా'లుగా చెప్పవలసినవి కావు. నిజానికి 'కాలం'కూడా అటువంటిదే. అందువల్ల ఇతివృత్త నిర్మాణం (కథా సంవిధానం), పాత్ర చిత్రణ, ఉద్దేశం అనే మూడు ముఖ్యాంశాలనూ ప్రధానంగా తీసుకుని ఆ మూడింటి పరస్పర సంబంధాన్ని వివరించే ప్రయత్నం చేసిఉంటే పై జెప్పినన్ని అంశాలతో సూత్రాలతో తికమక పడవలసిన అవసరం తప్పేది! రచయిత అలా చెయ్యలేక పోయాడనేది స్పష్టం.

ఒక లక్షణాన్ని వివరించినప్పుడు, ఒక అభిప్రాయాన్ని ఉటంకించినప్పుడు వెంటనే ఉదాహరణలు కూడా యివ్వడం, దాన్ని సోపపత్తికంగా నిరూపించే ప్రయత్నం చెయ్యడం అవసరం. ఈ రచయితకు ఆ అలవాటు లేదు! ఎక్కడైనా ఉదాహరణలు యిచ్చినా అవి సంబంధం లేనివిగా ఉంటాయి. తీర్థానికి తీర్థం. ప్రసాదానికి ప్రసాదం! ఇతివృత్తాన్ని సంఘటనాత్మకమైనది (Action Plot), వ్యక్తిశీలం ప్రధానమైనది (Character Plot), భావాత్మకమైనది (Thought Plot) అంటూ మూడురకాలుగా విభజించి మొదటిదానికి—చలం నవలలు, వెయిపడగలు; రెండవదానికి—చంఘిజ్ ఖాన్, రుద్రమదేవి; మూడవదానికి—చివరకు మిగిలేది, అల్పజీవి ఉదాహరణలుగా యిచ్చాడు. నిజానికి చలం, విశ్వనాథ నవలల్లో ఇతివృత్తం 'భావాని'కి (అంటే దృక్పథానికి) సంబంధించినది. సంఘటనలూ పాత్రలూ ఆదృక్పథ నిరూపణకే! వారి నవలలు న్యాయంగా మూడవ విభాగానికి (Thought Plot) చెందుతవి. అలాగే చంఘిజ్ ఖాన్, రుద్రమదేవి నవలలలో చారిత్రక సంఘటనలూ తత్పరిణామాలూ ప్రధానమైనవి కాబట్టి అవి మొదటి విభాగానికి (Action Plot) చెందుతవి.

పోతే దయానిధీ (చివరకు మిగిలేదిది), సుబ్బయ్యా (అల్పజీవి) విశిష్టమైన పాత్రలు కావడంద్వారా ఆయా నవలల్లో సంఘటనలు ఏర్పడ్డాయీ, విలక్షణమైన జీవిత దృక్పథాలు సిద్ధించాయి కాబట్టి ఆ నవలలు రెండవ విభాగానికే (Character Plot) ఉదాహరణలు. ఇలా ఏమాత్రం వివేచనా వివక్షణా లేకుండా పొసగని ఉదాహరణ లిచ్చినచోట్లు ఈ గ్రంథంలో ఎన్నోఉన్నాయి. ఎత్తిచూపుతూపోతే మళ్లీ ఒక గ్రంథం అవుతుంది!

ఇతివృత్త నిర్మాణానికీ (కథాసంవిధానము, సంఘటనలు) పాత్ర చిత్రణకీ శిల్పందృష్ట్యా ఉన్నసంబంధాన్ని సంతృప్తికరంగా వివరించలేక పోయాడు రచయిత:— 'పాఠకుడు ఎప్పుడూ 'ఫలానాపాత్ర అట్లా ప్రవర్తించి ఉండదు' అనుకోకూడదు. పైగా నేనైతే అలానే చేసిఉందును' అనిపించేట్లు వ్రాయాలి. (ఈ వాక్యానికి అర్థమేమిటో సమీక్షకునికి బోధపడటం లేదు!) ఈ విధంగా పాత్రచిత్రణని ఆయాపాత్రలు చేసే కార్యాలద్వారా నిర్ధారించవచ్చు' (పుట 12) ఈ ధోరణిలో ఏమేమిటో వ్రాసుకుపోయాడు.

'మిగిలినఅన్నికళలకంటె సాహిత్యంలో'వాక్కుకు' ఎక్కువ అవకాశం'!! అంటూ ఓ గొప్ప సత్యాన్ని కనిపెట్టిన ధోరణిలో 14 వ పుటలో ఏమిటేమిటో ఆత్మాశ్రయపరాశ్రయ (subjective and objective) రచనల్నిగూర్చి సెలవిచ్చాడు రచయిత. ఇలాంటి చోట్ల రచయిత ఏమి చెబుతున్నాడో ఆయనకే తెలియాలి! బహుశా 'వాచ్యం'గా చెప్పడానికీ 'వ్యంగ్యం'గా చెప్పడానికీగల భేదాన్ని వివరించి, సాహిత్యంలో వ్యంగ్యమే ప్రధానమని చెప్పడానికి పడ్డబాధకాబోలు! 'వాచ్యం' అనడానికి 'ఆత్మాశ్రయ'మనీ, 'వ్యంగ్యం' అనడానికి 'పరాశ్రయ'మనీ వ్యవహరించడం ఎక్కడ నేర్చుకున్నాడీయన? అలాగే 'ప్రతిబింబా'నికీ 'ప్రతీక'కూ భేదం ఏమిటో తెలియకుండా వ్యవహరించడం ఉన్నది. (పుట 27.)

ఈ గ్రంథం మొదటి భాగాన్ని (1) నవల : స్వరూప స్వభావాలు; (2) తెలుగు నవల : కొన్ని లక్షణాలు అనే అధ్యాయాలక్రింద విభజించాడు. మళ్లీ నాలుగో భాగంలో 'తెలుగు నవల : కథా కథన శిల్పం' అనే విషయం ప్రసక్తమౌతుంది. నవల లక్షణాలను చర్చించి, తర్వాత దాని చరిత్ర, కొంత విషయానుగతిక విశ్లేషణా, చివర కొన్ని నవలల పరిచయమూ చేయదలచుకొన్నరచయిత గ్రంథాన్ని మొత్తం నాలుగు భాగాలుచేసి, మొదటి భాగంలోనే 'కథా కథన శిల్పం' అనే విషయాన్నికూడా చర్చించి ఉంటే విభజన సహేతుకంగా సవ్యంగా ఉండేది కదా!

అంతేకాదు. 'తెలుగు నవల : కొన్ని లక్షణాలు' అంటూ I భా. 2 అధ్యాయంలో తెలుగు నవల పుట్టుకనూ, తెలుగు నవలల్ని ప్రథమంగా ప్రోత్సహించిన 'చింతామణి' పత్రికనూ, ఆ పత్రిక పేర్కొన్న తెలుగు నవల లక్షణాలనూ ప్రస్తావించిన రచయిత, ఆ సంగతుల్నే చర్విత చర్వణంగా 'తెలుగు నవల—యుగ విభజన—ప్రాథమిక లక్షణాలు—మొదటిదశ' అంటూ II భా. 1 వ అధ్యాయంలోనూ, 'తొలి తెలుగు నవల' అనే II భా. 2 వ అధ్యాయంలోనూ, 'తెలుగు నవల—సంక్షిప్త చరిత్ర—ప్రారంభయుగం' అనే II భా. 3 వ అధ్యాయంలోనూ, మళ్లీ మళ్లీ ప్రస్తావించాడు. అంటే I భా. 2 వ అధ్యాయం, II భా. 1, 2, 3 అధ్యాయాల్లోని విషయమంతా ఒకటే అయినప్పుడు ఒక్కఅధ్యాయంలోనే వ్రాసి ఉండవలసింది. ఒక విషయాన్నిగూర్చి కొంత ప్రసక్తి తీసుకురావడమూ, ముగించడమూ, మళ్లీ అదే ప్రసక్తి తీసుకురావడమూ చెప్పిందేచెప్పి పూర్తి చెయ్యకుండా పోవడమూ, దాన్ని మళ్లీ మూడోమారు నాలుగోమారు చెప్పడమూ, ఈ పద్ధతి చూస్తే ఈ రచయితకు విషయాన్ని వింగడించడంగాని, పునరుక్తి లేకుండా చెప్పడంగాని, చెప్పదలచుకున్నదాన్ని సంపూర్ణంగా అసందిగ్ధంగా చెప్పడంగాని చేతగాదని తోస్తుంది!

తెలుగునవల పుట్టుకా, దాని ప్రాథమికదశా చర్వితచర్వణంగా చెప్పడం జరిగిందన్నాను. కాని ఈ దోషం ఇంతటితో ఆగలేదు. తెలుగు నవల సంక్షిప్త చరిత్రని 'ఆయాకాలాలలోఉన్న ముఖ్యమైన ప్రవృత్తు లనుబట్టి' 5 భాగాలుగా విభజించాడు రచయిత— (1) ప్రారంభయుగం (2) అనువాదయుగం (3) వికాసయుగం (4) మనోవైజ్ఞానికయుగం (5) సమకాలీన యుగం. ఈ అయిదు శీర్షికలక్రింద గ్రంథం

II భాగంలో ఏసంగతుల్నీ అభిప్రాయాల్నీ చెప్పాడో మళ్లీ III భాగంలో (1) తెలుగు నవల—సాంఘిక జీవితం—1; (2) తెలుగు నవల—సాంఘికజీవితం-2; (3) తెలుగు చారిత్రకనవల (4) తెలుగునవలల్లో హాస్యం (5) అనుకరణలు, అనువాదాలు (6) మనస్తత్త్వ నిరూపక నవలలు (7) తె. నవల—జాతీయోద్యమం (8) డిటెక్టివ్ నవలలుఅనే శీర్షికల క్రిందకూడా ఆ సంగతుల్నే అభిప్రాయాలనే పునశ్చరణ చెయ్యడం జరిగింది. మొదటి విభజన కాలానుగతమూ, రెండవ విభజన విషయానుగతమూ అనుకోవడానికి విషయ ప్రసక్తిలో ఏమైనా క్రొత్తదనం, భేదం ఉంటేకదా! మొదటిదాన్లో కేవలం శిల్పపరిణామాన్నిగూర్చి, రెండో దాన్లో ఇతివృత్తవైవిధ్యాన్నిగూర్చి సామర్థ్యంతో వేరుగా వ్రాయగలిగితే బాగుండేది నిజమే. కాని, ఆ శీర్షికలకు పుష్టితెచ్చి కొత్త 'సరుకు' లేనప్పుడు, ఈ పిష్టపేషణం ఎందుకు? చెప్పదలచుకున్నది కాస్తా ఒక్కచోటే చెబితే, గ్రంథవిస్తరణా, ముద్రణ ఖర్చులూ, పుస్తకం ఖరీదూ, పాఠకునికి చిరాకూ తగ్గేవి!

ఈ రచయితతో వచ్చే మరో చిక్కేమిటంటే యితని అభిప్రాయాలు నిష్కర్షగా ఏమిటో మనకు తెలియజెప్పకపోవడం! ఉదాహరణకి—'శ్రీ రంగరాజ చరిత్ర (1872)...కొంతవైచిత్రి, కథాకల్పనవుండి, నవల అన్నపదానికి అనువైన రచనగా సాగింది' (పుట 46). తర్వాత ఆ నవలలో కథని క్లుప్తంగా వివరించి, రచయిత ప్రక్కపుటలో యిలా తీర్పు యిస్తాడు: ఇదీ కథ. కథలో కల్పన నామమాత్రం...' (పుట 47). అయితే రచయిత అభిప్రాయం ఆ నవలలో 'కథకల్పన' ఉన్నదనా? లేదనా? 46 వ పుట నుంచీ 47 వ పుట కొచ్చేసరికే అభిప్రాయం మారిపోయిందా?

'1872 లో వచ్చిన శ్రీరంగరాజచరిత్రకూ 1880 లో వచ్చిన రాజశేఖర చరిత్రకూ మధ్య నవలలు ఏమీ వ్రాయబడ్డట్టు లేదు' (పు. 47) '1878 లో వివేక చంద్రికలో వరుసగా ప్రకటింపబడి 1880 లో పుస్తకరూపంలో వచ్చింది...రాజశేఖర చరిత్రము' (పు. 48).

'చలం పాశ్చాత్య నాగరకతమీద వ్యామోహం ఉన్నవాడు కాదు' (పు. 77). 'ఇంగ్లీషు చదువుల ప్రభావంవల్ల ఉత్తేజితులై, పాశ్చాత్య సమాజం, దాని పద్ధతులు, దాని ఆచార వ్యవహారాలు కేవలం బాహ్యరూపంలో మాత్రమే చూచిన కొందరు రచయితలు ఆ సమాజం విలువలను, అట్టి జీవితాన్నీ తెలుగునాట సుస్థాపితం చెయ్యాలని ఉద్దేశించారు. అట్టివారిలో అగ్రగణ్యుడు చలం' (పు. 129). చలం గారికి పాశ్చాత్య నాగరకతా వ్యామోహం ఉన్నదనా? లేదనా?

'అయితే వీటిని (చలం నవలలు) ఏ రకంగానూ సాంఘిక నవలలు అనడానికి వీలులేదు. ఈయనవ్రాసిన వన్నీ వ్యక్తుల చరిత్రలు. ఈ వ్యక్తుల్నీ వారి జీవితాల్నీ సార్వజనీనం, సార్వకాలికం చేయడానికి వీలులేదు' (పు. 130). 'స్త్రీ పురుషుల సంబంధాన్ని వాస్తవికంగా, నిత్యజీవితానికి అతిసన్నిహితమైన సామాజిక వ్యవస్థగా చూపిన అతి ముఖ్యుల్లో చలం మొదటివాడు' (పు. 304). చలం నవలలు సాంఘిక నవలలు అయినట్లా? కానట్లా?

'మతాంతర వివాహాలలోని మంచిచెడ్డలను ఎత్తిచూపిన 'బలిపీఠం' శక్తిమంతమైన నవల' (పు. 121). 'వర్ణాంతర వివాహం చేసుకొన్న జీవితాలు ఎలా నడుస్తాయో చూపి 'కులాల అధికృత' అర్థంలేని సిద్ధాంతం అని రచయిత్రి ఈ నవలలో ప్రతిపాదించింది' (పు. 215). 'బలిపీఠంవంటి నవలలోకూడా సాంఘికంగా విభిన్నమైన అలవాట్లున్న ఇద్దరు వ్యక్తుల సాంసారిక జీవితం ఎంత కష్టమయం కాగలదో వివరించబడ్డది' (పు. 141). బలిపీఠం మతాంతర? వర్ణాంతర? వివాహాలని సమర్థిస్తున్నట్లా? లేనట్లా? ఏమిటి ఈ రచయిత అభిప్రాయం ఆ నవలని గురించి?

ప్రసిద్ధులైన రచయితలనుగూర్చి, వారి నవలలనుగూర్చి క్లుప్తంగా కొన్ని వాక్యాలలో చెప్పవలసి వచ్చినప్పుడు ఈ రచయిత వెలిబుచ్చే అభిప్రాయాలు సత్యదూరంగాకాని, విడ్డూరంగాకాని, అర్థశూన్యంగా కాని ఉంటున్నాయి.

'రవీంద్రనాథ్ ఠాకూర్ సాంఘిక దురాచారాల మీద కత్తిగట్టాడు. వర్ణవ్యవస్థమీద ఆయన వ్రాసిన నవలలన్నింటిలోనూ ఆయన తీవ్రమైన విమర్శలు చేశాడు' (పు. 63)

'విశ్వనాథ సత్యనారాయణ. ఈయనమీద జాతీయోద్యమ ప్రభావం ఎక్కువగా కనిపిస్తుంది (పు 130). 'జాతీయోద్యమ'మంటే ఈ రచయిత అవగాహన ఏమిటో ప్రత్యేకంగా రచయితనే అడిగి తెలుసుకోవాల్సిన అవసరం కనిపిస్తోంది!

'ఇందులో (వేయి పడగలు) రచయిత తనకు నచ్చిన ఒక ఉద్దేశంఎడ ఎక్కువ అభినివేశం చూపాడు. ఇందులో 1920—40 ల మధ్యకాలంలో తెలుగు దేశంలో జరిగిన సాంఘిక పరివర్తనం అంతా మనకు ద్యోతకం అవుతుంది' (పు. 130). 'వేయి పడగలు' ఏ సంవత్సరంలో వ్రాయబడిందో ఈ నవలా చరిత్ర కారుడికి తెలీదా ఏమిటి?

'జాతీయోద్యమంవల్ల ప్రభావితుడై చదువులకు స్వస్తిచెప్పిన సుందరం అన్న యువకుని కథ 'చదువు' ' (పు 131).సుందరం చదువు మానెయ్యడం ఆస్తి ఖర్చయిపోయి డబ్బులేకనా? జాతీయోద్యమం కోసమా? రచయిత నవలని మళ్ళీ చదివితే బాగుంటుంది!

'కుటుంబ జీవితానికీ, ఆర్థికసమస్యకూ ఉన్న అవినాభావ సంబంధం గోపీచంద్ 'అసమర్థుని జీవయాత్ర'లోనూ, రాచకొండ 'అల్పజీవి'లోనూ మనకు ద్యోతకం అవుతుంది' (పు 143). ఆ నవలల ఆంతర్యం అదేనా?

'బుచ్చిబాబు 'చివరకు మిగిలేది' ఫ్రాయిడ్ సిద్ధాంతాలను నిశితంగా పరిశీలించి వానిని నేటి మానవజీవితానికి అనుగుణంగా ప్రత్యాఖ్యానం చేయడానికి ఉద్దేశించబడ్డ నవల'. (పు 202). అంటే ఏమిటో అర్థం? 'ఇందులో ('చివరకు మిగిలేది') చూపబడ్డది 'ఎలక్ట్రా కాంప్లెక్స్'. దీనితోపాటు ఈ నవలలోని 'హామ్లెట్' చర్చ కూడా 'ఈడిపస్ కాంప్లెక్స్'లోని మరో ద్రుక్పథాన్ని చూపుతుంది' (పు 203). ఈ 'కాంప్లెక్స్' గొడవ లేమిటో రచయిత, పాపం, చాల తికమకపడిపోయారు!

ఫ్రాయిడ్నుగూర్చి, మనోవైజ్ఞానిక సిద్ధాంతాలనుగూర్చి 'పరిచయాత్మకంగా' రచయిత 'తెలుగు నవల: మనోవైజ్ఞానికత' అనే III భా. 6 అధ్యాయంలో కొంతవివరణకు పూనుకున్నాడు. కాని కీలకమైన 'కాంప్లెక్స్'ల గొడవ సరిగా అవగాహన చేసుకున్నట్లులేదు. 'తల్లిదండ్రులకూ, పిల్లలకూ మధ్య ఉండే ద్వేషానురాగాలను 'ఈడిపస్ కాంప్లెక్స్' అన్నాడు ఫ్రాయిడ్...తండ్రివలన పిల్లలుపొందే భయ, అనురాగ, ద్వేషాలను ఈడిపస్ కాంప్లెక్స్అనీ, తల్లివలనపొందే భావాలను ఎలెక్ట్రా కాంప్లెక్స్ అనీ అంటారు.' (పు 198—199). ఇది శుద్ధతప్పు. తల్లిపట్ల తనయునికిఉండే లైంగిక (రాగ)బంధం మూలంగా అతనిలో అజ్ఞాతంగా తండ్రి ప్రతిద్వంద్వి అనేభావం ఉండడంవల్ల పురుషునిలో ఏర్పడే మనోవైఖరి ఈడిపస్ కాంప్లెక్స్. అలాగే తండ్రిపట్ల కొమార్తెకుఉండే లైంగిక (రాగ)బంధంమూలంగా ఆమె అజ్ఞాతంగా తల్లిని ప్రతిద్వంద్విగా భావించడంవల్ల స్త్రీలో ఏర్పడే మనోవైఖరి ఎలెక్ట్రా కాంప్లెక్స్. హేమ్లెట్లోగాని దయానిధి (చివరకు మిగిలేది)లోగాని వ్యక్తమయ్యేది ఈడిపస్ కాంప్లెక్స్ మాత్రమే! రచయిత ఈ పుస్తకంలో మనోవైజ్ఞానిక సిద్ధాంతాలనుగూర్చి చెప్పినదిగాని, ఆ నవలలనుగూర్చి వ్యాఖ్యానించినదిగాని సందిగ్ధంగానో లేకపోతే తప్పుగానో ఉండటం పాఠకులు గమనించాలి. తస్మాత్ జాగ్రత!

'తెలుగు చారిత్రకనవల'అనే అధ్యాయంలో చారిత్రక నవల విశిష్టలక్షణ మేమిటో వర్ణించబోయి కృతకృత్యుడు కాలేకపోయాడు రచయిత. 'చారిత్రక నవల గతాన్నిగురించిచేసేచిత్రణ చరిత్రకన్నా కూడా సత్యానికి దగ్గరగాకూడా ఉండవచ్చు' (పు 149). ఇక్కడ రచయిత ఏ'సత్యా'న్ని నిర్దేశిస్తున్నాడో ఎక్కడా వివరించకపోవడంవల్ల చరిత్రకూ కల్పనకూ నవలారచనలో ఏర్పడే సంబంధాన్ని గూర్చిన చర్చ అంతా వృథా అయిపోయింది. వస్తునిష్ఠమైన సత్యానికీ (Factual Truth) భావనాత్మకమైన

సత్యానికీ (Poetic Truth) తేడాఉంది; ఒకచో రెండింటికీ వైరుధ్యంకూడా ఉంటుంది. వస్తునిష్ఠమైన సత్యాన్ని భావనాత్మకమైన సత్యంగా మార్చడమే కావ్యసృష్టి; చారిత్రకనవలాసృష్టికూడా. ఇందులో చారిత్రక ఆధారాలు ఎంతమేర? కవి కల్పన ఎంత మేర? అనే మేళవింపునుబట్టి ఒక నవలయొక్క 'చారిత్రక' లక్షణం నిర్ణయమౌతుంది. 148—151 పుటల్లో రచయిత ఈ విషయాన్ని చర్చించి కూడా స్పష్టంచెయ్యలేకపోయాడంటే రచయిత సామర్థ్యాన్నిగూర్చి వేరుగా చెప్పనక్కరలేదు. ఇలా ప్రతి అధ్యాయాన్నీపట్టి చూడనక్కరలేదు. ఎక్కడ ఏ నాలుగుపుటలు చదివినా రచయిత అవగాహన, భావవ్యక్తీకరణ ఏపాటిదో తెలిసిపోతూనే ఉన్నది.

పోనీ ఆయా నవలలు పట్టికలూ, అవి వ్రాయబడిన తేదీలు అయినా నిర్దుష్టంగా, సమగ్రంగా యివ్వబడినాయా? అంటే ఆ ప్రయోజనమూ సిద్ధించలేదు ఈ పుస్తకం ద్వారా.

ఈ పుస్తకంలో ప్రసిద్ధ రచనలుగా ఎన్నుకోబడి అభివర్ణింపబడిన నవలలమీద ఎంతో విమర్శ యిదివరకే ఉన్నది. 'ప్రక్రియలో వచ్చిన ఉత్తమమైన రచనలపై కూడా విమర్శ అంతగా రాలేదు' అని ప్రస్తావనలో రచయిత అన్న వాక్యం సరికాదు. ఈ రచయిత ప్రసిద్ధమైన తెలుగు నవలల్ని గూర్చి క్రొత్తగా, సొంతంగాచేసిన విమర్శకాని, ఏర్పరించిన దృష్టికాని ఈ పుస్తకంలో ఏమీలేదు. ఇదివరకే వచ్చిన విమర్శమీద తను ఏంతవరకు ఆధారపడి ఉన్నాడో రచయిత ఎక్కడా సూచన చెయ్యకపోవడం కూడా సముచితంకాదు. పోతే, ప్రక్రియమీద ఒక సమగ్ర గ్రంథం వ్రాయాలనే సంకల్పంతో పూనుకున్నందుకు రచయిత అభినందనీయుడు.

గ్రంథం, నిర్మాణంలో, అభివ్యక్తిలో, చివరకు ఎన్నోచోట్ల వాక్యనిర్మాణంలో, భాషలో, లోపభూయిష్ఠంగా ఉన్నది. అంటే ఈ పరామర్శ ఉద్దేశం రచయిత తన గ్రంథాన్ని అమూలాగ్రం సవరించుకోవలసిన అవసరం ఎంతైనా ఉన్నది—అని చెప్పడమే!

ఈ గ్రంథముద్రణకు విద్యాశాఖ, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ కొంత ధనసాహాయ్యం చేసినట్లు తెలుస్తున్నది. గ్రంథాన్ని పరిశీలించి, సవరింపజేసి, ఆ సాహాయ్యం చేసిఉన్నట్లయితే మరింత బాగుండేది! యువరచయితలకు ప్రోత్సాహమే కాకుండా శిక్షణను కూడా యివ్వవలసిన బాధ్యత పై సంస్థలు స్వీకరించాలి.

—ఆర్. ఎస్.

Printed and Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7 Thambu chetty Street, Madras-1, Editor : S Sambhu Prasad.

# భారతి

మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్



ఫిబ్రవరి 1972



సంపుటము : 49 సంచిక 2 :

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## ఫిబ్రవరి 1972

# మరచిపోయిన పాట

## శ్రీ పణతుల రామచంద్రయ్య

### 1

చూరుపై వంగి నిల్చున్న మర్రిచెట్టు కొమ్మల్లోంచి
స్రవించే నీరెండ చురుకులా నువ్వు జ్ఞాపకం వచ్చావు
సుఖాల మెత్తందనాలతో గట్టిపడిన అంతరంగపు గోడలకు
అడుగుపొరల లోలోపలి సవ్వడులుచేసిన సందుల్లోంచి
నువ్వు కనబడ్డావు.

అద్వితీయంగా ఆశాశ్రావ్యంగా ఇంద్రధనుస్సులు పుష్పించే
మా తోటతో రేపటికి పరచిన మసకవెలుతురు బాటలో
హఠాత్తుగా నిలువెత్తుగా
పగిలిన కాలజలదఖండంలోని పచ్చని మెరపువత్తిగా
కనబడిన నువ్వు
గళం విప్పిన నువ్వు
మమ్మల్ని చూడగానే దూరంగావెళ్ళి నిల్చున్నావు
మా ప్రపంచం ఇరుకుగా వుందన్నావు
మా ఆహార్యాన్ని తిరస్కరిస్తూ
మా స్వాగతాన్ని అథఃకరిస్తూ
పసందుగా శ్రుతిచేసిన మధురోహలవీణపై
అశాస్త్రీయ సంగీతాలాపన చేశావు.

ఇంతమంది రసికులకై మేమువేసే నాటకంలో
ఇతివృత్తం మంచిదికాదని
అప్పుడు పేచీ పెట్టావు.
ముందు సీటో మేనువాల్చి పి[illegible]లాల్చీల సెభాషులు

మూలకొరిగి దూరంగా నిల్చున్నవాణ్ని మింగేస్తున్నాయని
అందరినీ తిట్టావు.

నాజూకైన మస్తిష్కపు గాజుమేడ మీదికి
ఘాటైనసత్యాలు గురిచేశావు
సుఖాంతమై రక్తి కట్టబోతున్న కథలో
డెడ్‌లాక్ కల్పించావు.

ఆ క్షణంనుంచీ ఎవ్వరికీ నిద్రలేదు
సందేహాల సుడిగాలిలో కూలిన ముత్యాల చలువపందిరి
మళ్లీ నిశ్చలంగా నిల్చుకోదు
నిన్నటి సార్థవాహం ఇకపై మాకోసం
నిరీక్షించదు.

ఈ సన్నివేశంలో గొంతు ముడి విచ్చుకుంటుందా?
కానరాని హేతులవిత్రింకింద తీవసాచిన బ్రదుకులో
ఆనందభైరవి వినబడుతుందా?

సిందూరతిలకందిద్దిన వదనసౌభాగ్యాన్ని చూపించే
అందమైన ఊహాదర్పణంలో
నాణ్యంకోసం ధరించిన నవ్వులకింద నలిగి మరణించే
నాగరకుని చర్విత చర్వణావసానంలో
ఆవహించిన భావాల
భయాల
ఆవర్తాలలో
కోర్కెలమానికలతో జీవితాన్ని కొల్చుకుంటూ
గతాన్ని నటించివేశాను
భవితవ్యాన్ని ఎలా జీవించను?
దుర్బలమైన మానవత్వం
నిజాలజాలంలో చిక్కుకున్న మానవత్వం
దుర్భరంగా కనిపించినప్పుడు

## మ రి చి పో యి న పా ట

నేను నాలోనుంచి పారిపోవాలనుకున్నప్పుడు
ఈ చేతిసంచీ తీసుకువెళ్ళి గుప్పెడుజ్ఞాపకాలతో నింపమని
నా చూట్టూ చేరినవాళ్ళను వేడుకున్నాను
ఇక గాంభీర్యం ఎలా వహించను?

నిరంతర సౌందర్య జ్వరగ్రస్తుణ్ణి
నిట్టూర్పుల సెగకోర్వని స్వప్నాంబరాలు ధరించినవాణ్ణి
గదిముందరి గాఢతమోకాసారం దాటి నీవద్దకు ఎలా రాను?
నీ పాటలోని భయద రహస్యాలకు
ఏమని అర్థం చెప్పుకోను?

నీ పాట
సనాతనమధువు తాగి చివరి అంతస్తులో పవళించిన నాకు
నిద్రాభంగంచేసే పర్జన్యక్ష్వేళ
నమ్మకాల సుందరనందనాన్ని మసిచేసే అగ్నికీల.

నీ పాట
శిశిరవసంతాలమధ్య చేతనాతీరానికి చేరిన
నిశ్శబ్దకాంతివీచికలా మిరుమిట్లు గొలిపింది
ఉదయసూర్యుని రథాశ్వాలకు తగిలిన
కొరడా కొసలా నన్ను మేల్కొలిపింది.

నేను శివుడినై తాండవించాను—
ఎండిన ఆశలు కంటకాలై గుచ్చుకుని
అడుగడుగునా రక్తముద్రలు పడ్డాయి
నా ప్రపంచంలో చీకటిరంగులతో గీచిన రేఖాచిత్రాలు
తెల్లబోతూ నిలబడ్డాయి.
నేను భయపడి పరుగెత్తాను –
అందరూ నన్ను 'రిబెల్' అన్నారు.

ఓయి సఖా ;
పసందుగా శ్రుతిచేసిన మధురోహలవీణపై
అశాస్త్రీయ సంగీతాలాపన చెయ్యకు
నా అజ్ఞానశాంతిని హరిస్తూ ఇక వినిపించకు
ఎన్నడో మరిచిపోయిన పాట.

# ఆదికవి నన్నెచోడుడు

శ్రీ బి. ఎన్. శాస్త్రి

కుమారసంభవము తెనుఁగుభాషలో రచింపఁబడిన మొట్టమొదటి గ్రంథము. తెనుఁగు ప్రబంధములలోను మొదటిది. ప్రప్రథమమున శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు, ఈ గ్రంథమును, క్రీ. శ. 1909 లో వెలుఁగులోనికి దెచ్చిరి. శ్రీ మానవల్లి వారు, మొదటి ఏడాశ్వాసముల గ్రంథమును ముందు ప్రకటించి, తక్కిన ఐదు ఆశ్వాసములను క్రీ. శ. 1914 లో రెండవభాగముగ వెలుగులోనికి దెచ్చి, ఆంధ్రభాషకు మహోపకారము గావించినారు. కుమారసంభవ కావ్యమువలన ద్రావిడభాషలైన తమిళ కర్ణాటాదులతోను, అందలి కవితారీతులతోను, ఆంధ్ర భాషకుఁగల సన్నిహితత్వము, విశేషాంశములు తెలియు చున్నవి.

కుమారసంభవ కావ్యమును మానవల్లి రామకృష్ణకవిగారు ప్రచురించినపిదప, ఆంధ్రదేశమునఁగల పండితులలోను, పరిశోధకులలోను, చారిత్రకులలోను సంచలనము బయలుదేరినది. నన్నెచోడుని కాలమునకు సంబంధించిన వివిధములైన విమర్శనావ్యాసములు ప్రకటింపఁబడినవి. పండిత ప్రకాండు లీ సాహిత్య విమర్శలలో బాల్గొని తమతమ వాదములకు బలమును చేకూర్చు ప్రయత్నములు చేసినారు. కొందరు మానవల్లివారి అభిప్రాయము ననుసరించి నన్నెచోడుఁడు నన్నయకు పూర్వుఁడని సిద్ధాంతము చేసినారు. మరి కొందరు తద్భిన్నముగ భావించినారు.

మద్రాసు విశ్వవిద్యాలయమువారీ గ్రంథమును, పరిష్కరింపజేసి క్రీ. శ. 1948 లో ప్రకటించినారు. క్రీ. శ. 1949 లో వావిళ్ల కంపెనీవారు కుమారసంభవమును ముద్రించి, 1953 వ సంవత్సరమున శ్రీ నిడదవోలు వేంకటరావుగారి విపులమైన పీఠికతో మరియొక ముద్రణము గావించినారు. 1968 లో డా॥ కోరాడ మహాదేవశాస్త్రిగారి సంపాదకత్వమున ఈ గ్రంథమును, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు వెలయించిరి. ఇట్లీ గ్రంథము నాలుగైదు ముద్రణముల నందినది. పలువురు పండితులచే పరిష్కరింపఁ బడినది. నన్నెచోడమహాకవి కాలము, పండితుల, చారిత్రకుల, విమర్శకుల, విమర్శలకు ప్రతి విమర్శలకు విషయమైనది.

నన్నెచోడ మహాకవి నన్నయకు పూర్వుఁడు, అనగా పదియవ శతాబ్దివాఁడు; నన్నయ సమకాలికుడు, అనగా క్రీ. శ. 1023—1063; నన్నయ తరువాతివాడు. అనగా పండ్రెండవ శతాబ్ది ప్రథమార్ధమున జీవించినవాడు; కవిబ్రహ్మ తిక్కనామాత్యుని తరువాతివాడు. అనగా క్రీ. శ. 1275—1350 ప్రాంతీయుఁడు—అను వాదములున్నవి. పండితులు తమ వాదములను బలపరచు వ్యాసముల ప్రకటించిరి. చాలమంది ఈ కవికాలము క్రీ. శ. 1130-1150 యని అంగీకరించినారు. కాని ఈ వాదము లన్నింటికి సరియైన ఆధారములు లేవు.

కాని కొన్ని ఆధారములనుబట్టి కుమారసంభవ కావ్యము నన్నయకు పూర్వమే రచింప బడినదనియు, కావ్యమున నన్నెచోడమహాకవి సూచించిన విషయములను సమగ్రముగా చారిత్రక దృష్టితో పరిశీలించిన నన్నెచోడ మహాకవి పదియవ శతాబ్దిలో జీవించి యుండెననియు, కుమారసంభవము ఆంధ్రమున మొదటి కావ్యమనియు, నన్నెచోడు డాదికవియనియు తెలిసికొనుట కవకాశము లున్నవి.

నన్నెచోడమహాకవికి పూర్వము 350 సంవత్సరముల నాటికే ఆంధ్రకవిత వర్ధిల్లినది. విష్ణుకుండిన వంశీయులలో నాలుగవ మాధవవర్మ 'జనాశ్రయ' బిరుదాంచితుఁడు. అతనితండ్రి రెండవ గోవిందవర్మ. గోవిందవర్మ తండ్రి విక్రమేంద్ర భట్టారకవర్మకు ఉత్తమాశ్రయుడనియు, గోవిందవర్మ

తాత ఇంద్రభట్టారకవర్మకు సత్యాశ్రయుఁడనియు బిరుదములున్నవి. ఆంధ్రదేశమున 'జనాశ్రయచ్ఛందో విచ్ఛిత్తి' యను గ్రంథము వెలిసినట్లు ఆధారము లున్నవి. జనాశ్రయచ్ఛందోవిచ్ఛిత్తి ఆంధ్రఛ్ఛందో గ్రంథము. నాల్గవ మాధవవర్మ కాలమున వెలసినది. నాలుగవ మాధవవర్మ కాలము క్రీ. శ. 573—623; విష్ణుకుండినుల కాలమున వెలసిన శాసనములందు గ్రామనామములు, బిరుదములు తెలుగులోనున్నవి. విష్ణుకుండిను లాంధ్రదేశమును పాలించుచున్న కాల మందే రేనాడును చోళరాజులు పాలించుచుండిరి. వీరిని రేనాటి చోడులనియే వ్యవహరింతురు.

ఆరేడు శతాబ్దములందు రేనాఁడేడువేల దేశ మును, చోడులు పాలించిరి. నేటి కడప కర్నూలు మండలము లానాడు రేనాఁడుగా వ్యవహరింపబడినవి. ఈ ప్రాంతమును చోళవాడియందురు[1] చోళవాడి నల్లగొండ మహబూబునగరమండల ప్రాంతమని ఆచార్య శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనంగారి అభిప్రా యము[2]. కాని యది చోళవాడి యనుటకు దగిన శాసనా ధారములు లేవు. ఈ ప్రాంతమును రేనాటి చోడు లలో నొకతెగవారు కల్యాణీ చాళుక్యులకును[3], కాకతీయు లకును[4] సామంతులుగా కందూరు, వర్ధమానపురము, పానగల్లు రాజధానులుగా కృష్ణానది ఉత్తర ప్రాంత మును పాలించిరి. వీరినే కందూరి చోడు లందురు.

త్రిలోచన పల్లవు నోడించి కరికాలుడు పొత్తపి నగర నిర్మాణము గావించెను. ఆ ప్రాంతమునే పొత్తపి నాఁడందురు. కరికాలచోడుని పుత్రుఁడు దాసవర్మ. పాకనాడు, రేనాడు, పొత్తపినాడును, పొత్తపి నగరము నుండి పాలించెను. ఇతని సంతతివారినే రేనాటి చోడులందురు.[5]

రేనాటి చోళరాజులలో మొదటివారు పల్లవుల కును, తరువాతివారు పశ్చిమ, తూర్పు చాళుక్యుల కును సామంతులుగా వ్యవహరించిరి. నందివర్మ, సింహవిష్ణువు, మహేంద్రవర్మ, విక్రమవర్మ, విక్ర మాదిత్యచోళ, సత్యాదిత్య మొదలగుపేళ్లు పల్లవ, చాళుక్య రాజన్యుల పేళ్లవలె నున్నవి. నందివర్మ పల్లవ నందివర్మ సమకాలికుఁడు. క్రీ. శ. 550 ప్రాంత మున రేనాటిని పాలించెను. ఇతని సంతతి నిడుగల్లు, హైమవతి ప్రాంతములందు రాజ్యముల నెలకొల్పి పాలించిరి. నందివర్మ పౌత్రుఁడు మహేంద్ర విక్రమ వర్మ. పల్లవ మహేంద్రవర్మ, రెండవ పులకేశి పర స్పరము కలహించుచుండ స్వతంత్రించి, చోళమహా రాజను బిరుదము వహించెను. పుణ్యకుమారుని కాల మున వీ రుచ్చస్థితియం దుండిరి. ఇతనికిగల పృథ్వీ వల్లభ బిరుద మీతఁడు చాళుక్యుల సామంతుఁడని తెలుపుచున్నది. ఇతని కుమారుడు విక్రమాదిత్యుడు. పౌత్రుఁడు శక్తివర్మ. ఈ పేళ్లు రేనాటి చోళుల కును, బాదామి చాళుక్యులకును గల సంబంధమును సూచించుచున్నవి. శక్తివర్మ కుమారుఁడు సత్యా దిత్యుడు దేశాఁడు వేయిసిద్ధిరాష్ట్రమును క్రీ. శ. 725—750 వరకు పాలించెను. ఇతనికి చోళమహా రాజాధిరాజను బిరుదమున్నది. చాళుక్యులు బలహీనులై రాష్ట్రకూటులు విజృంభించు కాలమున రేనాటి చోళ రాజ్యము క్షీణించెను. వైదుంబులు నోలంబులు పర స్పరము కలహించుచు, రేనాటిచోళుల నంతఃకలహ ములలోనికి దించిరి. రేనాటి చోళులలో చివరిరాజైన ఎళంచోళ మహారాజు, వైదుంబులతో జరిగిన ఒకా నొక యుద్ధమున మరణించెను. ఈ సమయమున లాంగూలపల్లవు డనంతపురము, కర్నూలు, బళ్లారి ప్రాంతముల నాక్రమించెను. రాష్ట్రకూటులు వైదుం బులను రేనాటిచోళులపై పురికొల్పుచుండిరి.

అటుపిమ్మట చోళసంతతివారు కొణిదెన, కందుకూరు, కందూరు, నెల్లూరు ప్రాంతములందు చిన్నచిన్నరాజ్యముల స్థాపించి పాలింపదొడగిరి. పదియవ శతాబ్ద్యుత్తరభాగమున వైదుంబ గండత్రినేత్రుఁడు నన్నె చోడుని యుద్ధమున సంహరించి, పాకనాడు రేనాడు దేశముల నాక్రమించెను.

రేనాటిచోళులకాలమున ఆంధ్రభాషలో శాసన ములు వేయింపఁబడినవి. ఇవి ఇరువదినాలుగు శాసన

1. Early dynasties of Andhra Desa. By B. V. Krishna Rao P. 119.

2. ఆంధ్రుల చరిత్ర—సంస్కృతి.

3. భారతి—ఫిబ్రవరి 1970.

4. Hyderabad Archaeological series No. 22 No 307.

5. J. A. H. R. S. Vol. VII P. 215

ములు. వచనములో నున్నవి. ఇందు కొన్ని పద్యపాదములు కనిపించుచున్నవి. క్రీ. శ. 575 నాటి ధనంజయుని కలమళ్లశాసన మాంధ్రభాషలో వేయించిన ప్రథమ శాసనము. పుణ్యకుమారుని పొట్లదుర్తి–మాలెపాడుశాసన మాంధ్రభాషకు ముఖ్యమైనది. కందుకూరు పాకనాటికి రాజధాని. నన్నెచోడుడు కందుకూరు చోడవంశీయుడు. పదియవ శతాబ్దిలో వైదుంబులు కందుకూరును జయించినపిదప, చోడులు నెల్లూరుప్రాంతములందు వసించి క్రమముగా నెల్లూరు చోడవంశీయులుగా ప్రసిద్ధిచెంది నెల్లూరుసీమను పాలించిరి.

తెలంగాణప్రాంతము తొలుత బాదామిచాళుక్య సామ్రాజ్యాంతర్భాగమైయుండెను. బాదామిచాళుక్యులు వారి సామంతు శ్రీ ప్రాంతమును వివిధమండలములుగా, విషయములుగా, నాడులుగా భాగించి పాలించుచుండిరి. బాదామిచాళుక్య సామ్రాజ్యము పతనమైనతరువాత రాష్ట్రకూటులు బాదామిచాళుక్యుల రాజ్యభాగము లన్నింటిని తమ ఏలుబడిలోనికి దెచ్చుకొనిరి. సబ్బిమండలము, అనుమకొండ విషయము, వంగూరు విషయము, కొలనుపాకఏడువేలు, ఐజెమండలములను, రాష్ట్రకూటసామంతులు అటుపిమ్మట కల్యాణి చాళుక్యుల సామంతులు పాలించుచుండిరి.

వేంగీ విషయము, నేటి ఆంధ్రదేశమునందధికభాగము తూర్పు చాళుక్యుల పాలనములో నుండెను. ఆంధ్ర కర్ణాట భాషలకొకే లిపి, వాడుకలో నుండెను. కన్నడకవు లాంధ్రమున, ఆంధ్రకవులు కన్నడభాషలోను గ్రంథముల రచించుచుండిరి. ఆంధ్రదేశమును, వివిధ రాజవంశీయులు పాలించుచుండుటవలనను, వివిధభాషలు రాజభాషలుగా నుండుటవలనను, తెలుఁగుభాష వివిధ ప్రాంతములందు వివిధకాలములందు వివిధముగా వివిధమైనకవులచే గ్రంథములు రచించుట కుపయోగింపఁబడినది. రెండవ పులకేశి సోదరుఁడు కుబ్జవిష్ణువర్ధనుడు క్రీ. శ. 624–641 వరకాంధ్రదేశము నేలెను. ఈతని వంశీయులు తూర్పు చాళుక్యు లనఁబడినారు. కుబ్జవిష్ణువర్ధనుని యనంతరమాతని కుమారుఁడు జయసింహవల్లభ మహారాజు 641—673 వరకు పాలించెను. ఇతనికి సర్వలోకాశ్రయ సర్వసిద్ధి బిరుదములున్నవి. ఇతఁడు పల్లవులయు, బాదామి చాళుక్యులయు పరస్పర వైరుధ్యముల నూతగాగొని పెన్నానదివరకు తూర్పుచాళుక్య రాజ్యమును విస్తరింపజేసెను. ఇతని తరువాత ఇంద్రభట్టారకుడు 673, రెండవ విష్ణువర్ధనుడు 673—681, మంగి యువరాజు 681—705, రెండవ జయసింహుడు 705—717 వరకు పాలించిరి. రెండవ జయసింహుని యనంతరము వేంగీ రాజ్యమున కలహములు సంభవించెను. ఇతఁడు నిస్సంతు. కావున మూఁడవ విష్ణువర్ధనుడు రాజు కావలసియుండ కొక్కిలి రాజ్యమాక్రమించి ఆరు నెలల రాజ్యమేలిన పిదప, పదవీభ్రష్టుఁడై ఎలమంచిలి రాజధానిగా కళింగదేశమున స్వతంత్రరాజ్యము స్థాపించెను. వేంగీ మండలమున మూఁడవ విష్ణువర్ధనుడు రాజై 718–752 అనగా సుమారు 34 సంవత్సరములు పాలించెను. ఇతడు కొక్కిలితో యుద్ధములు చేయలేదు. కొక్కిలి సంతతివారు ఎలమంచిలి ప్రాంతమును నాలుగు తరములు పాలించిరి. వారిలో యువరాజు మంగి విజయాదిత్యవర్మ, సర్వలోకాశ్రయ కొక్కిలివర్మ ముఖ్యులు.

ఈ కాలమున రాజకీయ విప్లవము బాదామి చాళుక్య సామ్రాజ్యమున జరిగినది. దంతి దుర్గుఁడను రాష్ట్రకూట వంశీయుఁడు బాదామి చాళుక్యరాజును సంహరించి రాష్ట్రకూటరాజ్యమును స్థాపించెను. ఇందువలన తూర్పుచాళుక్యుల రాజ్యములో కొన్ని మార్పులు కలిగెను. తూర్పు చాళుక్యుల కండగానున్న బాదామిచాళుక్యరాజ్య మంతరించెను. రాష్ట్రకూటులు బలవంతులై వేంగీచాళుక్యరాజ్యాక్రమణకు సిద్ధమైరి. క్రీ. శ. 756 లో దంతిదుర్గుడు మరణింప నాతని పినతండ్రి కృష్ణుడు రాజయ్యెను. తూర్పుచాళుక్య విజయాదిత్యుడు రాహప్పతోజేరి కృష్ణుని పదవీభ్రష్టుని గావింప జూచెను. కాని కృష్ణుడు తన కుమారుఁడగు గోవిందుని వేంగీదేశము పై దండెత్తబంపెను. వాడవల్లిసద్ద జరిగిన యుద్ధమున విజయాదిత్యుడోడి సంధి గావించు కొనెను.

విజయాదిత్యుని తరువాత నాల్గవ విష్ణువర్ధనుడు రాజై 771—806 వరకు పాలించెను. క్రీ. శ. 772 లో రాష్ట్రకూట కృష్ణుడు మర

ణింప గోవిందుడు ధ్రువుడు సింహాసనమునకై కల హింప విష్ణువర్ధనుడు గోవిందుని పక్షము వహించి పోరాడి, రాష్ట్రకూట ధ్రువునిచే ఓడింపబడి సంధి చేసుకొని తన కుమార్తెయగు శీలామహాదేవిని అతని కిచ్చి వివాహమొనర్చెను.[6] విష్ణువర్ధనుని యనంత రము రెండవ విజయాదిత్యుడు రాజయ్యెను. కాని రాష్ట్రకూటుడైన రెండవగోవిందుని సహాయమున భీమ సలుకి అన్నను పారద్రోలి రాజై వేంగిదేశమును పాలిం చెను. విజయాదిత్యుడు బెజవాడ రాజధానిగా 12 సంవత్స రములు పాలించుచు భీమసలుకితో పోరు సల్పు చుండెను. ఇతడు 108 యుద్ధములు చేసెను. క్రీ. శ. 814 లో రెండవ గోవిందుడు మరణింప హైహయవంశసంజాతుఁడగు నృపరుద్రుని సహాయ మున విజయాదిత్యుడు భీమసలుకి నోడించి వేంగి నాక్రమించెను. రాష్ట్రకూట అమోఘవర్షుడు విజయా దిత్యునితో స్నేహమొనర్చి తన సోదరిని విజయాదిత్యుని పుత్రుఁడగు కలివిష్ణువర్ధనున కిచ్చి వివాహమొనర్చెను.[7]

రెండవ విజయాదిత్యునికి నరేంద్రమృగరాజను బిరుదమున్నది. ఇతడు 108 శివాలయముల నిర్మిం చెను. ఇవియన్నియు యుద్ధభూములందు విజయా నంతరము నిర్మించినట్టివి. ఇతని యాస్థానమున గాయకులు, కవులు, నటులు, శిల్పులు చిత్రలేఖకు లుండిరి. విజయవాడ విజయాదిత్యుని పేర వెలసినదని కొందరి యభిప్రాయము. కాని బెజవాడపేరే శాస నములం దున్నది.[8]

కలివిష్ణువర్ధనుని యనంతర మా తని తన యుఁడు గుణకవిజయాదిత్యుడు రాజయ్యెను. ఇతని సేనాపతి పండరంగడు బోయకొట్టముల నాక్రమించి కందుకూరును శత్రుదుర్భేద్య మొనర్చెను. గుణగ విజయాదిత్యుడు రాష్ట్రకూటులపై దండెత్తెను. కాని అమోఘవర్షునిచే ఓడిపోయి, అతని సామంతు డుగానుండ నంగీకరించెను. అమోఘవర్షుని కోరికపై గుణగవిజయాదిత్యుఁడు నోలంబవాడిపై దండెత్తి మంగిని వధించి, గాంగుల నోడించి, శివగంగ నాక్ర మించెను క్రీ. శ. 880 లో అమోఘవర్షుడు మర ణింప, గుణగవిజయాదిత్యుడు రాష్ట్రకూటరాజ్యముపై దండెత్తి రెండవ కృష్ణుని, దాహళరాజగు సంకిలుని ఓడించి కళింగ వేములవాడ దాహళ రాష్ట్రకూట రాజ్యములందు వీరవిహార మొనర్చెను. కిరణ, అచల, చక్రకూట, పురముల దగ్ధమొనర్చి త్రిపురమర్త్య మాహేశ్వరుడను బిరుదమువహించి రాష్ట్రకూటరాజ చిహ్నములగు పాళధ్వజము, గంగాయమునాతోరణమును గ్రహించి రెండవ కృష్ణుని రాజ్యమాతనికే ఇచ్చి వేసెను. ఇతని సైన్యము పల్లవ పాండ్య రాజ్యముల కొల్లగొట్టినట్లు శాసనాధారములున్నవి. ఇతని అధి కారము మహానదిమండి పులికాటుసరస్సువరకు చెల్లు చుండెను. ఇతనికి పరచక్రరామ, వీరమకరధ్వజ, రణరంగశూద్రక ఆది బిరుదములున్నవి. గణక— ఇతని గణితశాస్త్ర పాండిత్య సూచకమందురు. ఇతని కాలపు శాసనములందు తెలుఁగు పద్యములున్నవి. పండరంగని అద్దంకి శాసనము తెలుఁగు కవిత కత్యంత ప్రాధాన్యమైనది.

గుణకుని మరణానంతరము రాష్ట్రకూటులు వేంగిపై దండెత్తి మంచికొండనాడు నాక్రమించిరి. గణకుడు నిస్సంతు. అతని తమ్ముని కుమారుడు చాళుక్య భీముడు, రణమర్దవంశజుడును మంచికొండ నాడు పాలకుడును అగు కుసుమాయుధుని సహాయమున రాష్ట్రకూటుల నోడించి, రాజయ్యెను. కాని రాష్ట్ర కూటులితని దాయాదులతో కలిసి వేంగిపై దండెత్త చాళుక్యభీముని కుమారుడు, షోడశవర్షప్రాయు డైన ఇనుమర్తి గండడు రాష్ట్రకూటులను 'నిరవద్య పురము, పెదవంగూరు యుద్ధములం దోడించి వారి సేనాపతియగు గుండపయను వధించెను. కాని ఇను మర్తిగండడుకూడ మరణించెను.[9] చాళుక్య భీముని కుమారుడు 6 మాసములు మాత్రమే రాజ్య మేలెను. భీముడు 360 యుద్ధము లొనర్చిన వాడు. ఇవి యన్నియు దాయాదులతో జరిగినవే. ఇతని మరణమువలన అంతఃకలహములు ప్రబలినవి. 14 సంవత్సరములలో ఆరుగురు రాజులు పాలించిరి.

---

6. Age of Imperial Kanuj P. 132 D. C. Sircar.

7. Eastern Chalukyas of Vengi — Dr. N. V. Ramanaiah.

8. J. A. H. R. S. Vol Part III P. 153

9. చాళుక్యభీముని మచిలీపట్నం శాసనము—

రాష్ట్రకూటులకు వీరి అంతఃకలహములవలన మంచి అవకాశము లభించినది. అమ్మరాజ విజయాదిత్యుడు రాజై 7 సంవత్సరములు క్రీ. శ. 922—929 వరకు పాలించెను. ఇతనికి రాజమహేంద్రుడను బిరుద మున్నది. ఇతఁడు తన రాజధానిని వేంగి నుండి రాజ మహేంద్రవరమునకు మార్చెను.[10]

అమ్మరాజు తరువాత అతని కుమారుఁడు కంటక విజయాదిత్యుడు 15 దినములు, తాలరాజు 30 దినములు రాజ్యమేలిరి. తాలరాజును తొలగించి రెండవ విక్రమాదిత్యుడు 11 మాసములు పాలించెను. ఇతఁడు 100 యుద్ధము లొనర్చెను. ఇతనిని అమ్మరాజు రెండవ కుమారుడు భీముఁడు చంపి రాజై ఎనిమిది నెలలు పాలించెను. తాలరాజు కుమారుడు రెండవ యుద్ధమల్లుడు రాష్ట్రకూట చతుర్థ గోవిందుని సహాయమున వేంగిపై దండెత్తి భీముని చంపి రాజయ్యెను. రాష్ట్రకూటుల జోక్యమువలన వేంగీదేశమున స్థిరమైన ప్రభుత్వము ఏర్పడలేదు.

యుద్ధమల్లుడు వేంగిని రాష్ట్రకూటుల ఆధిపత్యమునం దుంచెను. ఇతఁడు పేరుకుమాత్రమే రాజు. రాష్ట్రకూట సైనికులు వేంగీదేశమున విచ్చలవిడిగా తిరుగుచుండిరి. యుద్ధమల్లుడు రాష్ట్రకూట సైన్యాధికారుల అండనుండి వారి బాధలు పడలేక వేంగిని, రాజమహేంద్రవరమును వీడి చేబ్రోలు రాజధానిగా చిన్నదేశమును పాలించెను.[11]

యుద్ధమల్లునికాలము క్రీ. శ. 930-934. ఆంధ్రభాషా చరిత్రలో అపూర్వమైన కాలము. బెజవాడ శిలాశాసన మితడు వేయించినట్టిదే. ఈ శాసనమును పండితత్రయములో ప్రథముడగు శ్రీపతి పండితుడు రచించినట్లు తలంపబడుచున్నది. ప్రప్రథమాంధ్ర మహాకవి నన్నెచోడు డితని సామంతరాజు. క్రీ. శ. 934 లో రెండవ చాళుక్య భీముఁడు యుద్ధమల్లుని, అతని రాష్ట్రకూట సేనానులగు రాజమయ్య, దాళగ, తాత, చిక్కి అయ్యప—ఆదులను వధించి ఆంధ్ర దేశమునం దన్యరాజన్యుల అధికారము లేకుండజేసి 12 సంవత్సరములు వేంగీదేశమును పాలించెను.

ఆంధ్రభాషకు చాళుక్యులెనలేని సేవ యొనర్చి నారు. శాతవాహనుల కాలమునుండియు, శాసనములలో తెలుగుపదములు కనిపించుచున్నవి. శాలంకాయన, ఆనందగోత్రిక, విష్ణుకుండిన, పల్లవ, వంశీయుల శాసనములందు తెలుఁగుపదములున్నను రేనాటి చోళుల కాలమున తెలుఁగుభాషలో శాసనములు వేయింపబడినవి. జైనమత మాంధ్రదేశమున వ్యాప్తిలోనున్న కాలమున జైనమత ప్రచారకులు మత ప్రచారము నాయా ప్రాంతములందు ప్రజల వాడుకభాషలోనే గావించు చుండిరి. జైనపండితులు, కవులు, మతప్రచారకు లాంధ్రమున గ్రంథములు రచించుచుండిరి. జైనమత సంబంధమైన గ్రంథము లానాఁడు వెలసినవి. పంప మహాకవి సోదరుఁడైన జినవల్లభుని కుర్క్యాల శాసనమున, సంస్కృత కన్నడ భాషలతోపాటు తెలుఁగు భాష వాడఁబడినది. అందు తెలుఁగులో వ్రాయఁబడిన మూఁడు కందపద్యము లున్నవి. కుబ్జవిష్ణువర్ధనుని చేజెర్ల శాసనమున సగభాగము తెలుఁగు. జయసింహ వల్లభుని విప్పర్ల, మాచర్ల శాసనములు తెలుఁగులో వేయింపఁబడినవి. రేనాటి చోళుల శాసనములు తెలుఁగు వచనములో వేయింపబడినవి. అందుకొన్ని సీస, గీత పద్యభాగములు కనిపించుచున్నవి.

అహదనకర శాసనభాష ఉద్దండ పండితులను చికాకుపరచినది. పశ్చిమచాళుక్యులు తమ ఏలుబడిలో మన్న తెలుఁగుప్రాంతములందు వేయించిన శాసనములు తెలుఁగుభాషలోను, కన్నడభాషలోను ఉన్నవి. ఆరేడు శతాబ్దములలో వెలసిన శాసనము లచ్చతెనుఁగులో వేయింపబడినవి. అటుపిమ్మట తెలుగుభాష సంస్కృత భాషా సంపర్కమున సంస్కరింపబడి నన్నెచోడుని కాలమునాటికి కావ్యభాషగా పరిఢవిల్లినది.

ప్రాచీనాంధ్ర శాసనములందు కొన్నిఅపూర్వ ప్రయోగములున్నవి. వర్ణనలు, దీర్ఘసమాసములు, వక్రోక్తులు కనిపింపవుకాని కొన్నిశాసనములందు వ్రాయబడిన వచనభాగములు, రాజుల బిరుదావళి, నన్నెచోడుని ఆశ్వాసాంతగద్యములవలె నున్నవి. 'ళ' బహువచన ప్రత్యయముగా కనిపించును. 'ఱ' అక్షరము ప్రత్యేకస్థానము కలిగియుండెను. చాళుక్య గుణక విజయాదిత్యుని కాలమునాటికి తెలుఁగుభాషలో క్రీ. శ

10. J. A. H. R. S. Vol. III. P. 160

11. Eastern Chalukyas of Vengi By Dr. N. V. Ramanaiah garu.

849—871; సంస్కృతపదసంఖ్య బహుళముగా కనిపించుటవలన మాత్రాగణబద్ధములైన దేశీయ చ్ఛందస్సులో పద్యరచన సాగినది. పండరంగని అద్దంకి శాసనమున—తరువోజ, గుణకవిజయాదిత్యుని సీసలి శాసనమున సీసము, ధర్మవర శాసనమున సీసగీతములు, నన్నెచోడుని కుమారసంభవ కావ్యమందలి పద్యముల దలపించును. ఈ పద్యముల శైలి, నడక, భాష, నన్నెచోడునికి పూర్వము వాడుకలోనున్న తెలుగు కవితా స్వరూపమును తెలుపుచున్నది. తెలుంగు కవిత 9 వ శతాబ్దినాటికి సంస్కృతీకరింపఁబడి గ్రాంథికమై, కావ్యభాషగా, గ్రంథరచనమున ఉపయోగింపఁబడినది.

తరువోజ, సీసము, మధ్యాక్కరాదులు దేశీయ చ్ఛందస్సునకును, చంపక, శార్దూల, మత్తేభాదులు సంస్కృతచ్ఛందమునకును సంబంధించినవి. ఆంధ్రులు పద్యరచనమునం దారితేరినవారు. ఈ కాలమునం దాంధ్రకవులు కన్నడభాషా కవుల ననుసరించి పద్య రచన గావించినారు. గ్రంథములను వ్రాసినారు. కన్నడమున తొలుత సంస్కృతపదసమ్మిళమైన పద్య రచన సంస్కృతచ్ఛాయలో వ్రాయబడినది. జైనమత ప్రచారకులు, పండితులు, కవులు ప్రాంతీయ భాషలలో గ్రంథములు రచించి, తమ మత ప్రచారమునకు చక్కని రాజమార్గమును వేసినారు. అట్లే తెలుఁగుభాషలోను కొన్ని గ్రంథములు వెలసినవి. జైనులు జైనమునుల జీవితములకు సంబంధించిన గాథలను మత సిద్ధాంత ములను ప్రచార మొనరించుటకై జినేంద్ర పురాణాదుల రచించి, భాషాభివృద్ధికి బాటువడినారు. జైనాచార్యులగు రేచనయు, పద్మకవియు తెలుఁగులో గ్రంథములు రచించినట్లు తెలియుచున్నది. జినేంద్ర పురాణ కర్త పద్మకవి, ఆంధ్రదేశమునుండి, కర్ణాట ప్రాంతమునకు అనగా నేటి తెలంగాణములోని వేములవాడ ప్రాంతమునకు, వలసపోయి, పంపకవిగా ప్రసిద్ధిచెంది రెండవ అరికేసరి మహారాజు ఆస్థానకవిగా నియమింపఁబడి పంపభారత మనఁబడు విక్రమార్జునీయమును కన్నడ భాషలో రచించి కీర్తి గాంచెను. పంపకవి, పద్మకవి ఒక్కరేయని చారిత్రకుల అభిప్రాయము.[12]

పంపమహాకవి వేంగినాటినుండి వేములవాడకు పదియవ శతాబ్ద్యారంభమున వలసపోయి అచట స్థిరపడి కన్నడభాషామతల్లికి శోభనుకూర్చు అపూర్వాలంకారములైన గ్రంథముల రచించి రెండవ అరికేసరి మహారాజువలన శాసనబద్ధముగా ధర్మపురి అగ్రహార మునుబడసి[13] జైనమతప్రచారముతోబాటు కన్నడ సాహిత్యసేవ నొనర్చినాడు.

కుమారసంభవము కావ్యశైలిలో వ్రాయఁబడిన గ్రంథము. క్రీ. శ. 9, 10 శతాబ్దములందు కన్నడ, సంస్కృతభాషలలో కావ్యశైలి ప్రాముఖ్యము వహించినది. పద్మకవి జినేంద్రపురాణము కావ్యశైలిలో వ్రాయఁబడిన గ్రంథము. నేఁడు లభించుచున్న జినేంద్ర పురాణములోని పద్యములనుబట్టి ఆ గ్రంథము కావ్యశైలిలో వ్రాయబడినదని భావింపవచ్చును. ఆ కాలమున జైనమతము వ్యాప్తిలో నుండెను. రాజు లా మతము నాదరించుచుండిరి. ముఖ్యముగా వేములవాడప్రాంతమున జైనమతము రాజమతముగా విలసిల్లినది. ఆంధ్రదేశమున శైవము ప్రబలశక్తిసమన్వితమైన మతముగా వృద్ధిచెందినది. కన్నడదేశమున అనఁగా తెలంగాణ ప్రాంతమున జినేంద్రపురాణము, విక్రమార్జునీయ మాదిగాగల కన్నడగ్రంథములు వెలసిన కాలమున ఆంధ్రమున నన్నెచోడమహాకవి శివునికి సంబంధించిన కుమారసంభవ కావ్యమును రచించి తన భక్తిని ప్రకటించుకొనెను. నన్నెచోడుని కుమారసంభవము కావ్యశైలిలో ముఖ్యముగా ఆనాఁడు వెలసిన కన్నడ కావ్యముల ఫక్కిలో వ్రాయబడినది.

కుమారసంభవ కావ్యమున కాలాముఖశైవ సంప్రదాయములు పొందుపరుపబడినవి. గ్రంథమున కాలాముఖప్రశంస లేకున్నను, కాలాముఖ మతాచార సంబంధమైన శైవసంప్రదాయవర్ణనము అందు కనిపించుచున్నవి. రసవాదశైవము, నవనాథసిద్ధసంప్రదాయములాది కాలాచారములాది అవాంతర శైవభేదములకు సంబంధించిన విషయము లందు వర్ణింపబడినవి. వీని నిందు పొందుపరచుటకు ఆగమశాస్త్రపరిజ్ఞాన మవసరము. నన్నెచోడు డీ శాస్త్రములందు, ఆగమములందు,

12. తెనుఁగు కవుల చరిత్ర. పు. 84.

13. గంగాధర శిలాశాసన మనబడు కుర్క్యాల శాసనం—భారతి.

నిష్ణాతుడు కావున కుమారసంభవమున ఆయాసంప్ర దాయములను గన్నులకు గట్టినట్లు వర్ణింపగలిగినాఁడు. నన్నెచోడుని గురువు కాలాముఖ మల్లికార్జున శివయోగి. ఇతనినే జంగమమల్లికార్జును డందురు. నన్నెచోడుని గ్రంథమున జంగమ మల్లికార్జునుడు,మహాపండితునిగా, సకలాగమశాస్త్రవేత్తగా వర్ణింపబడినాడు. రెండవ అరికేసరి శాసనములం దీతని ప్రశంస కలదు. జంగమ శబ్దము జాతివాచకముకాదు. శివభక్తులను, బ్రాహ్మ ణులను, శివాగమశాస్త్రములందు నిష్ణాతులైనవారిని సంభావించుటకు వాడుపదము. ఆంధ్రదేశమున జైన బౌద్ధముల కాదరము సన్నగిల్లిన పిదప, జైనపండి తులు కవులు జైనాచార్యులు జైనమునులు కన్నడ దేశమునకు వలసపోయి ఆ ప్రాంతమున జైనమత ప్రచారము గావించుచు వైదికమతమునకు ముఖ్యముగా శైవమతమునకు స్థానము లేకుండ చేయుటవలన, నన్నెచోడుని గురువగు మల్లికార్జున శివయోగి శ్రీశైలమునుండి బయలుదేరి శిష్యులు వెంటరాగా, వేములవాడ ప్రాంతముచేరి శైవమత ప్రచార మొనర్చెను.

వేములవాడ చాళుక్యులు సాహిత్య పోషకులు. రెండవ అరికేసరి కన్నడభాషాపోషకుడేకాక, పంపమహా కవిని తన యాస్థానకవిగా నియమించుకొని, ధర్మపురి అగ్రహారమొసంగి కన్నడ భాషాయోషకమూల్యాలంకార ములనదగు గ్రంథములను రచింపజేసినాఁడు.

నన్నెచోడుని కుమారసంభవము కావ్యశైలిలో వ్రాయబడిన గ్రంథము. ఇందు అపూర్వ ప్రయోగము లున్నవి. వివిధములైన పద్యములున్నవి. 2006 పద్య గద్యములతోగూడిన బృహత్కావ్యమిది. జాను తెనుఁ గులో వ్రాయబడినది. ఈ గ్రంథమున 186 సీస పద్యములు, 534 కందములు, 238 చంపక మాలా వృత్తములు, 86 ఉత్పలమాలలు, 110 మత్తేభ విక్రీడితములు, 20 శార్దూలములు, 175 తేట గీతులు, 585 వచనములేకాక, 3 స్రగ్ధరలు, 15 మహాస్రగ్ధరలు, ఒక కవిరాజవిరాజితము, 3 మాలినీవృత్తములు, 2 మానినీ వృత్తములు, 6 తరువోజలు, 2 తరువడలు, ఒక తోటకము, 5 ఉత్సాహములు, 4 మత్తకోకిలలు, 2 వసంత తిలకములు, 2 లలితగతులు, ఒక స్వాగతవృత్తము, ఒక మందానిలము, ఒక మణిగణనికరము, ఒక క్రౌంచ పదము, ఒక భుజంగ ప్రయాతము, ఒక మంగళ మహాశ్రీవృత్తము మొదలగు పద్యములున్నవి.

కుమారసంభవ కావ్యభాష, శైలి, రచనా విధానము 9, 10 శతాబ్దులలో నాంధ్రదేశమున వెలసిన శాసనముల భాషవలె నున్నది. శాసనములందు వాడబడిన పూర్ణబిందు ప్రాసము లీ గ్రంథమున కని పించుచున్నవి. శాసనములలో వాడబడిన దేశీయ చ్ఛందస్సు ఈ గ్రంథమున వాడబడినది. కన్నడ కవుల గ్రంథముల నధ్యయనముచేసి నన్నెచోడ మహాకవి ప్రబంధభక్కిలో నవరసములు, అష్టాదశ వర్ణనములుగల్గి వివిధాలంకారశోభితమైన తొలి కావ్య మును తెనుగుభాషలో రచించెను. షష్ఠ్యంత రచన, మార్గదేశి కవితా పద్ధతులను, జాను తెను గును తన రచనలో నిమిడ్చినాడు. శ్రీకారముతో గ్రంథారంభముచేసి మంగళమహాశ్రీ వృత్తముతో కావ్యమును ముగించినాడు. బంధకవిత, గర్భకవిత, చిత్రకవిత ప్రవేశపెట్టిన ఘనత నన్నెచోడునికే దక్కినది. ఆంధ్రభాషలో తొలికావ్యము సంతరించిన మహాకవి కవిరాజశిఖామణి నన్నెచోడుడే. ఇతని రచన తరువాతి కవులకు, ముఖ్యముగా తిక్కనాదులకు ప్రబంధ కవులకు మార్గదర్శియైనది.

కుమార సంభవ రచనాకాలము వివాదములకు విషయమై ఆంధ్రదేశమున పండిత ప్రకాండుల యొక్కయు, చారిత్రకుల యొక్కయు, విమర్శకుల యొక్కయు, విమర్శలకు గురియైనది. ఒకరి వాదము నొకరు వ్యతిరేకింప, మరికొందరు ఉభయుల వాదము లను వ్యతిరేకించుచు వ్యాసములను ప్రచురించినారు. క్రీ. శ. 1909 లో మానవల్లి రామకృష్ణకవిగారీ గ్రంథమును ప్రకటించిన పిదప, ఉద్దండ పండితులు మానవల్లివారి యభిప్రాయముతో నేకీభవింపలేదు కొందరు కవిగారి వాదన మంగీకరించిరి. రచనావిధానము, శైలి, భాష, గ్రంథమునగల విషయము ననుసరించి, మానవల్లివారు నన్నెచోడుని కుమారసంభవము పది యవ శతాబ్ది పూర్వార్ధమున వ్రాయబడినట్లు భావించి నారు. 'పగణము...టెంకణాదిత్యు డనిన్' అను అర్ధ ర్యణుని పద్యమునను సరించి పశ్చిమచాళుక్యులతో జరిగిన యుద్ధమున నన్నెచోడుడు నిహతుఁడయ్యెనని

వేంకణాదిత్యుఁడే నన్నెచోడుడని అతఁడే కుమార సంభవ కావ్యనిర్మాతయని తెలిపినారు. క్రీ. శ. 9 వ శతాబ్దినుండి పన్నెండవ శతాబ్దివరకు వేయింపబడిన శాసనములలో నన్నెచోడుని పేర్కొను శాసనము లనేకమున్నవి. గ్రంథము ననుసరించి నన్నెచోడుని తండ్రి చోడబల్లి; తల్లి శ్రీసతి.

శ్రీ జయంతి రామయ్యపంతులుగారు పెద్ద చెరుకూరు శాసన మాధారముగ[14] శాసనమున పేర్కొనబడిన చోడబల్లి, నన్నెచోడులే కుమార సంభవ కావ్యమునకు సంబంధించిన వారనియు, క్రీ. శ. 1140 లో వేయింపబడిన ఈ శాసనమున పేర్కొన బడిన తరములను లెక్కించి, నన్నెచోడమహాకవి శక సంవత్సరము 1040 లేక క్రీ. శ. 1118 నాటి వాడని, నన్నయభట్టు తరువాత వందసంవత్సరముల కీ మహాకవి యుండెనని తెలిపినారు.

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, కొప్పరపు శాసనమున[15] పేర్కొనబడిన వాడును, కాలాముఖదీక్ష గైకొనినవాడును నగు మల్లికార్జునయోగి నన్నెచోడ మహాకవి గురువని భావించినారు[16]. కొప్పరపు శాసనము శకసంవత్సరము 1037 లో వేయింప బడినది. అనగా ప్రభాకర శాస్త్రిగారి వాదము ప్రకారము నన్నెచోడుడు క్రీ. శ. 1111 ప్రాంతమున నున్నవాడు.

శ్రీ శ్రీపాద లక్ష్మీపతి శాస్త్రిగారు నన్నెచోడుడు కవిబ్రహ్మ తిక్కన తరువాతివాడని యూహించినారు. శ్రీ వేదం వేంకటరాయ శాస్త్రిగారు శ్రీపాద లక్ష్మీపతి శాస్త్రిగారి వాదమును సమర్థించినారు.

కుమారసంభవ ముద్రణప్రతి కాధారమైన తాళపత్రప్రతి తంజావూరుసరస్వతీమహల్ గ్రంథాలయమున నున్నది. ఈ గ్రంథవిషయమున కవికాలాదుల విషయమున, పాఠభేదముల విషయమున వివిధాభిప్రాయములు వెల్లడింపఁబడినవి. కుమారసంభవ కావ్యమును, కవి కాలమును, రచనా విధానమును, రచనా కాలమును, నిర్ణయించుటకు పరిశోధనలు సలిపి, వ్యాసములనుప్రకటించినవారిలో వేటూరి ప్రభాకర శాస్త్రిగారు, రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారు, డా. నేలటూరి వేంకటరమణయ్యగారు, జయంతి రామయ్యపంతులుగారు, శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు, వేదం వేంకటరాయశాస్త్రిగారు ముఖ్యులు.

నన్నెచోడనామాంకితులు పలువురు శాసనము లందు కనుపించుచున్నారు. పెదచెరుకూరు శాసనమున చోడబల్లి నన్నెచోడుల ప్రశంసకలదు. ఈశ్వర నాయకుని కుమారుడైన మార—చోడరాజైన కన్నర దేవుని మంత్రి. అతని తమ్ముడు చోడబల్లి ప్రశంస గుంటూరు మండలమున తంగేడుమల్లి గ్రామమునగల శాసనమున నున్నది.[17] ఈ శాసనము శకసంవత్సరము 1037 లో వేయింపఁబడినది. అట్లే కొప్పరము శాసనమున[18] కన్నరదేవుని అనుఁజుడుగా చోడబల్లి పేర్కొన బడినాడు. కన్నరదేవుని పేర్కొను శాసనము[19] అధికముగా నున్నవి. ఈ శాసనము లన్నియు గుంటూరు మండలమున నర్సరావుపేట తాలూకాలో లభించినవే. ఈ ప్రాంతమును నాడు కమ్మనాఁడని వ్యవహరించుచుండిరి.

మరియొక శాసనము[20] నన్నెచోడ మహారాజును పేర్కొనుచున్నది. ఇది చాళుక్య చోళులనాటిది ఇందు నన్నెచోడ మహారాజు తమ తండ్రి త్రిభువన మల్ల దేవచోడమహారాజులకు, తమతల్లి మాచల దేవులకు ధర్మముగా త్రిభువన మల్లికార్జునదేవరకు కంమనాటిలోని కొట్యదొన తూర్పున డేంగఱుమూడి అగ్రహారమునిచ్చు సందర్భమున వేయించినది. ఇది శక సంవత్సరము 1002 నాటిది.

శాసవములందు పేర్కొనబడిన నన్నెచోడ మహారాజు తల్లి మాచలదేవి; తండ్రి చోడబల్లి లేక

14. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక. సం. 13. సంచికలు. 3, 4.

15. S. I. I. Vol X. No. 74.

16. ఆం. సా. ప. ప. సం. 14; సంచిక 1.

17. S. I. I. Vol. X. No. 73.

18. S. I. I. Vol X. No. 74.

19 ,, X. No. 75 & 76

20. ,, X. No. 58.

త్రిభువన మల్లదేవచోడ అనుపేళ్లు గలవారు. చోడ బల్లిపేరు కలిసిన, శ్రీ సతిపేరు కలియుట లేదు. హైహయవంశీయుల ఇంటి ఆడబడచు శ్రీసతి. హైహయ వంశీయులు పలనాటిసీమ నత్తవారినుండి అరణముగా గొనినట్టివారు. పలనాటి హైహయ వంశీయుల ఆడబడుచుల నెవ్వరిని చోడవంశీయుల కిచ్చినట్లు పలనాటివీరచరిత్రవలనగాని సమకాలిక గ్రంథములందుగాని, స్థానిక గాథలందుగాని కానరాదు.

చోడబల్లి పూర్వీకులు రేనాడ్డేడువేల రాజ్యము పైన నధికారము గోల్పోయిన పిదప పాకనాటిని పాలించినారు. ఆ కాలమున తూర్పుచాళుక్య రాజులకును, బాదామి చాళుక్యుల యనంతరము అధికారములోనికి వచ్చిన రాష్ట్రకూటులకును తరచు యుద్ధములు జరుగుచుండెను. హైహయ వంశీయులు, రేనాటి చోళులు, వారి సంతతివారు. తూర్పు చాళుక్యుల పక్షమున పోరాడుచు, వారి రాజరికము నంగీకరించి వారికి సామంతులై, మాండలికులుగా వివిధ ప్రాంతముల నేలుచుండిరి. అందు చోడబల్లి పాలించిన ప్రాంతము పెంకణదేశము. అదియే పాకనాడు.

నన్నెచోడ మహాకవి కవిరాజ శిఖామణి. మహా మండలేశ్వరుడు. పాకనాటిపై ఆధిపత్యము వహించిన వాడు. ఇతఁడు రెండవ యుద్ధమల్లుని సామంతుడు. రెండవ యుద్ధమల్లుడు శైవమతావలంబి. కుమార స్వామి పాదానుధ్యాతుఁడు. యుద్ధమల్లుని పరిపాలనా కాలము క్రీ. శ. 930—934. ఆంధ్రభాషా చరిత్రలో నితనికాలము పేర్కొనదగినది. ఇతఁడు రాష్ట్రకూటుడైన నాల్గవ గోవిందుని సహాయమున వేంగి దేశాధీశు డయ్యెను. ఇతడు సమర్థుడైన రాజు కాక పోవుటవలన రాష్ట్రకూట ప్రభువగు నాలుగవ గోవిందుడు వేంగినాటిని యుద్ధమల్లుని యధీనమునకు దెచ్చినపిదప, రాష్ట్రకూట సైన్యమును, ఆంధ్ర దేశమున కొందరి సేనాపతుల నాయకత్వమున నిలిపెను. రాష్ట్రకూట సేనానులు, ఆంధ్రదేశమున విచ్చలవిడిగా సంచరించుచు, సైనికుల నట్లే సంచరింప జేయుచు, దేశమున సుస్థిరమైన ప్రభుత్వము లేకుండ చేసిరి. ప్రజలు సైనికపాలనమున పలువిధములైన వెత లనుభవించిరి. రాష్ట్రకూట సేనానాయకుల ప్రవర్తనకు, తన అసమర్థతకు విచారించి యుద్ధమల్లుడు వేంగీ నగరమును, రాజమహేంద్రవరమును, బెజవాడనువీడి, గుంటూరు మండలములోని చేబ్రోలు రాజధానిగా ఆంధ్రదేశములోని కృష్ణానదికి దక్షిణముననున్న ప్రాంతములను పాలించుచు, నన్నెచోడాది సామంతులను కలిగియుండెను.

తెలుగు చోడవంశీయులలో మొదటివారు రేనాటిని పాలించిరి. రేనాడు వైదుంబుల యధీనములోకి వచ్చిన తరువాత చోడులు ఆంధ్రదేశములోని వివిధప్రాంతములందు చిన్నచిన్న రాజ్యములను స్థాపించి పాలింపదొడగిరి. అందు పేర్కొనదగినవారు పాకనాటి పాలకులైన నన్నెచోడుని పూర్వీకులు. వీరినే పొత్తపి చోడులందురు. వీరుకాక కొణదెన, కందూరి, నెల్లూరి చోడులు తరువాతి కాలమున ప్రసిద్ధిచెందినవారు.

నన్నెచోడుని తండ్రి చోడబల్లి పాకనాటి ప్రభువు. ఇతఁడు హైహయవంశసంజాతయైన శ్రీసతిని పరిణయమాడెను. రాష్ట్రకూట ద్వితీయ గోవిందుని కాలమున తూర్పు చాళుక్యరాజ్యములు రెండవ విజయాదిత్యుడు పాలించుచుండ, గోవిందుడు భీమసలుకికి సహాయపడి విజయాదిత్యుని వేంగినుండి వెడలగొట్టించెను. విజయాదిత్యుడు బెజవాడ రాజధానిగా పాలించుచు అనుజునితో 12 సంవత్సరములు పోరాడుచు, రాష్ట్రకూట గోవిందుని మరణానంతరము, హైహయ వంశీయుఁడగు నృపరుద్రుని సహాయమున భీమసల్కి నోడించి వేంగి నాక్రమించెను. హైహయ వంశీయులలో నృపరుద్రుడు బలశాలి. తూర్పు చాళుక్యుల సామంతుడు. పొత్తపిచోడులును తూర్పు చాళుక్యుల సామంతులే. ఈ సామంత మాండలికులకు చాళుక్యరాజులు ప్రభువులు. సామంతులతో సంబంధ బాంధవ్యము లుండెను. నృపరుద్రుని సంతతివారు పొత్తపిచోడులతో వివాహ బాంధవ్యముల నెఱపినట్లు తెలియుచున్నది. చోడబల్లి నృపరుద్రుని వంశీయురాలైన శ్రీసతిని వివాహమాడి యుండవచ్చును. ఆ కాలమున నృపరుద్రుని వంశీయులు హైహయ వంశీయులనబడువారుమాత్రమే ఆంధ్రదేశమునందుండిరి.

నన్నెచోడుడు పాకనాటిని పాలించుచు,

హైహయ వంశీయులతో సంబంధ బాంధవ్యములు కలిగి, వైదుంబులతో వైరమువహించి, తూర్పు చాళుక్య ప్రభువగు యుద్ధమల్లుని సామంతుడుగా నుండెను. ఈతడు తన ప్రభువగు యుద్ధమల్లుని వలెనే శివభక్తుడు. నన్నెచోడుని దైవము, గురువు, సార్వభౌముడు. ముగ్గురును మల్ల నామాంకితులు. అనగా నన్నెచోడుని దైవము శ్రీశైల మల్లికార్జునుడు. క్రీ. శ. 930 ప్రాంతమున రాష్ట్రకూటులకు సామంతుడుగా తెలంగాణములోని వేములవాడ ప్రాంతమును పాలించుచు పంపమహాకవికి ఆశ్రయమిచ్చిన రెండవ అరికేసరి మహారాజు శాసనములందు పేర్కొనబడిన కాలాచార్య మల్లికార్జున ముఖలింగ యోగి నన్నెచోడ మహాకవి గురువు. మల్లికార్జున పండితుడు శ్రీశైలమునుండి వేములవాడ ప్రాంతము చేరి శైవమత ప్రచారము గావించిన మహాపండితుడు. శైవాగమశాస్త్రవేత్త. నన్నెచోడుని ప్రభువు నాల్గవ గోవిందుని సాయమున రాజై చేబ్రోలు రాజధానిగా ఆంధ్రదేశమును పాలించిన రెండవ యుద్ధమల్లుడు. నన్నెచోడుని పేర్కొను శాసనములు వెలసిన కాలము లందు మల్లనామము ధరించిన రాజులెవ్వరును ఆంధ్ర దేశమును పాలింపలేదు. మల్లనామాంకితులైన ప్రభువులు తూర్పు చాళుక్యులలోకాని మరేవంశపు రాజులలోగాని ఆ కాలమున లేరు. క్రీ. శ 930-935 ప్రాంతమున పొత్తపిని చోడబల్లి యనురాజు పాలించుచుండెను. ఇతడు చాళుక్యుల సామంతుడు నన్నెచోడ మహాకవి తండ్రి.

చోడబల్లి పాకనాటి నేలుచు తూర్పు చాళుక్య రాజన్యుల సామంతుడుగానుండి వారి కనేక యుద్ధము లందు తోడ్పడుచుండెను. చాళుక్యుల అంతఃకలహములలో రాష్ట్రకూటరాజులు జోక్యము కల్గించుకొని తమ అధికారదర్పమును చూపుచుండిరి. హైహయులు, పాకనాటిచోడులు చాళుక్యుల కండగా నిలిచిరి. రాష్ట్రకూటులు, దక్షిణ దేశమునుపాలించు చోళరాజులు, వైదుంబులను పురికొల్పుచు, చాళుక్య సామంతులైన పాకనాటి చోళులపై యుద్ధములు ప్రకటించునట్లు చేయుచుండిరి. తరచు చాళుక్య సామంతులకును వైదుంబులకును యుద్ధములు జరుగుచుండెను

వైదుంబులు రేనాటి చోళులనుండి రాజ్యము పొందిన తరువాత పొత్తపి, కొణిదెన, పెదకల్లెంటు, ఐజె ప్రాంతముల నాక్రమించు ప్రయత్నములు చేయుచుండిరి. వైదుంబులలో పాకనాటిపై అధిపత్యము వహించిన వారిలో శ్రీ చన్ద్రగణ్డత్రినేత్ర వీరమహారాజు[21],గణ్డత్రినేత్ర శ్రీ వైదుంబమహారాజు[22], భువనత్రినేత్రుడు[23],వైదుమ్బ ముత్తరాజు[24], మనుజ త్రినేత్రుడు[25] ముఖ్యులు. వీరు పాలించిన ప్రాంతములు నేటి చిత్తూరుజిల్లా మదనపల్లి తాలూకా; అనంతపురం ప్రాంతములు; నెల్లూరులో కొంత భాగము. ఇదియే టేంకణదేశము [26] టేంకణాదిత్యుడను బిరుదము నన్నెచోడునకు గలదు.

చోడబల్లి వేయించిన మందాడ తామ్రశాసనము చివరి రేకులపై వైదుంబత్రినేత్రుడు తన శాసనమును చెక్కించెను. ఈ వైదుంబరాజు తాను పాకనాటిని జయించిన పిదప, అనగా నన్నెచోడుడు యుద్ధములో మరణించిన తరువాత తన విజయమును పురస్కరించుకొని శాసనమును వేయించుట బట్టి నన్నెచోడుని రాజ్యము వైదుంబుల స్వాధీనమైనదనియు, చోడబల్లి మరణించిన తరువాత నన్నెచోడుని పరిపాలనాకాలమున యుద్ధమల్లుడు మరణించెననియు, యుద్ధమల్లుని పిమ్మట రాజైన చాళుక్యభీముని కాలమున అనగా క్రీ. శ. 940 ప్రాంతమున వైదుంబ మహారాజుతో జరిగినయుద్ధమున, చాళుక్య ప్రభువుల సహాయమందక, టేంకణాదిత్యుడు మరణించి యుండవచ్చునని భావింపవచ్చును. తన యాధిక్యమును చూపుటకే వైదుంబత్రినేత్రుడు, మందాడ తామ్రశాసనపు రేకులపై తన శాసనమును చెక్కించెను. ఇట్టి సంఘటనలు చరిత్రలో మనకు కనిపించుచునే యున్నవి. విష్ణుకుండిన చతుర్థ మాధవవర్మను క్రీ.శ 623లో

21. S. I. I. Vol X. No. 628, 631.
22. S. I. I. Vol X, No. 635.
23. ,, X. N . 636.
24. ,, X No. 638.
25. ,, X. No. 639, 642.
26. నన్నెచోడుని కాలము—భారతి—డా॥ నేలటూరి వేంకట రమణయ్యగారు.

యుద్ధమున సంహరించినపిదప కుబ్జవిష్ణువర్ధనుడు విష్ణుకుండిన నాణెములపై కత్తి, డాలు తన బిరుదము 'సత్యాశ్రయ విషమసిద్ధి' చెక్కించెను.[27] అట్టి నాణెములు నల్లగొండమండలములోని దండపాడు గ్రామమున లభించినవి. అట్లే కుబ్జవిష్ణువర్ధనుడు తాను విష్ణుకుండిన సామ్రాజ్యమును జయించి, నాల్గవ మాధవవర్మను చంపిన యుదంతమును దండయాత్రా వివరములను చూపునట్టి శిల్పములు నల్లగొండ మండలములోని భట్టుగూడెము ప్రాంతమున చెక్కించి శివాలయమును నిర్మించెను. ఆ శిల్పములు నేటికిని కనిపించుచున్నవి. కుబ్జవిష్ణువర్ధనుని కుమారుడు జయసింహ వల్లభ మహారాజు, విష్ణుకుండిన చతుర్థ మాధవవర్మ కుమారుడగు మంచనభట్టారకుని గోదావరి మండలములోని రామచంద్రాపురము తాలూకాలోని పొలమూరువద్ద ఓడించెను. నాల్గవ మాధవ వర్మ వేయించిన పొలమూరుశాసనమును జయసింహ వల్లభ మహారాజు పునరుద్ధరించెను. ఇట్లు రాజులు తాము జయించిన ప్రాంతములందు తమ విజయ చిహ్నములను నెలకొల్పుట సహజముగా కనిపించును.

నన్నెచోడ మహారాజు వైదుంబులతో జరిగిన యుద్ధమున అసువుల బాసియుండును. అథర్వణుని —'మగణంబు... టేంకణాదిత్యు డనిన్' అను పద్యము నిజమనియే నమ్మవలసి వచ్చును. నన్నెచోడునితో యుద్ధ మొనర్చినవాడు శ్రీ చన్ద్రగణ్డత్రినేత్ర వీర మహారాజు. ఇతఁడు గండత్రినేత్రుని తండ్రి. భువన త్రినేత్రునికి తాతయగును. శ్రీ చన్ద్రగణ్డ త్రినేత్ర వీర మహారాజు నన్నెచోడుని క్రీ. శ. 938—940 యుద్ధములం దోడించి పొత్తపిని వశపరచుకొని పాకనాటిపై ప్రభుత్వము నెఱపెను. అతని పిమ్మట గణ్డత్రినేత్రుఁడు, అతని కుమారుడు భువన త్రినేత్రుఁడు శ. స. ౯94 లో అనగా క్రీ. శ. 972 లో పృథ్వీరాజ్యపట్టాభిషిక్తుం డయ్యెను[28].

ఇట్లు ఆంధ్రభాషలో తొలికావ్యమును రచించిన ఆదికవి నన్నెచోడుఁడు, శివకవి యైనందున మరుగుపడి, పదియవ శతాబ్దిలో ఆంధ్రమునం దాదికావ్యము రచింప, ఇరువదియవ శతాబ్దిలో నాగ్రంథము వెలుగులోనికిరాగా, ఆంధ్రపండిత ప్రకాండులు, చారిత్రకులు, నన్నెచోడుని, పండ్రెండవ శతాబ్దివాడుగా నిర్ణయించుట చూడగా, కొన్ని కొన్ని దురభిమానము లెంత శక్తివంతమైనవో ఊహింపవచ్చును.

---

27. Rep. Arch. Dept. H. E. H. Nizam's Dominions 1925-26 Appendix B. P. P. 26 ff.

28. S. I. Vol. X. No. 636,



# "వర్ష"

## శ్రీ యఱ్ఱంశెట్టి శాయి

వర్షం—

వదలకుండా కురుస్తోంది పొద్దుట్నుంచీ! ఎడ తెరిపి లేకుండా—బురద—రొచ్చు—నీళ్లు నిండిపోయిన రోడ్లు—గుంటలు.

తగ్గటంలేదు. తగ్గేట్టుకూడాలేదు. తగ్గక పోయినా ఫర్వాలేదు. కానీ ఇంతకంటె ఎక్కువ కురవ కుండాఉంటేచాలు. కాని ఎక్కువే కురిసేట్టుఉంది. మబ్బులు ఇంకా మూసుకొస్తున్నాయి. గొంగళిలా క్రమ్ముకొస్తున్నాయి. ఇదింతే! ఇవాళంతా ఇహను ఇలాగే ఉంటుంది. రేపుకూడా ఇలాగే ఉంటుంది. ఎల్లుండీ ఆ మర్నాడూకూడా ఇంతే! ఈ వూళ్లో ముసురు పడితే ఇలాగే పడుతుంది. వారం, పదిరోజులు జలగలా పట్టేస్తుంది. ఛస్తే వదలదు. మనుషులను ముంచి తేలుస్తుంది. మొలకలెత్తించేస్తుంది. మట్టిగోడలను పెకలించేస్తుంది. పాతఇళ్లను కూల్చేస్తుంది. క్రొత్త ఇళ్లకు చిల్లులు పెట్టేస్తుంది. అరుణాచలానికంతా తెలుసు. ఇప్పుడు కాదు. డెభ్భైఏళ్లనుంచీ చూస్తు న్నాడు ఈ వర్షాన్ని. ఒక్కసారికూడా ఈ ఊరు వదిలి బయటకుపోలేదు.

వర్షం తగ్గింది. తగ్గిందా? లేదు. తగ్గలేదు. అలానే ఉంది. కాని తగ్గినట్లు నటిస్తోంది. తన నిలా అనేకసార్లు మోసంచేసింది. అరుణాచలానికి తెలుసు. కాని ఇలా ఎంతసేపని? ఇంటికి వెళ్లాలి. నడిచి, తడిసి ఎలాగోలా ఇల్లు చేరుకోవాలి. లేకపోతే — తనిలాగే నుంచుండిపోతే చీకటిపడిపోతుంది. చీకట్లో వర్షానికి మరీ అలుసు. హద్దూ అదుపూ లేనట్లు, ఇష్టంవచ్చి నట్లు కురిసేస్తుంది.

నడువసాగాడు అరుణాచలం. తడుస్తూ — వర్షంలో.

ఈ ఒక్క క్షణమేకాదు. ఒక్క రోజేకాదు. డెభ్భయ్ ఏళ్లనుంచీ—ఊహవచ్చిం దగ్గర్నుంచీ ఇంతే— ఎప్పుడూ ఇంతే!

అప్పుడు, చిన్నప్పుడు బడి వదలగానే వర్షంలో తడుస్తూ ఇంటికి వచ్చేవాడు. అది ఆనందం. తడు స్తూంటే—తడవాలంటే ఇష్టం! అందుక్కారణం లేదు. బహుశా తల్లీ తండ్రీ తడవకూడదని చెప్పబట్టే అయుంటుంది. ఆ రోజుల్లో — వద్దన్న పని చెయ్యా టంలో గల ఆనందం, మరెందులోనూ లేదు. సీత కూడా తనతోపాటే వర్షంలో తడిసేది. సీతక్కూడా వర్షంలో తడవడమంటే ఇష్టం! కాని వాళ్లమ్మ సీతని చావగొట్టేది తడిసినందుకు. అరుణాచలంతల్లి ఏమనేదికాదు. తుండు తీసుకొచ్చి తలతుడిచి, పొడి బట్టలు తొడిగి పొయ్యిదగ్గర వేడిగా కూర్చోబెట్టేది. సీతఏడుపు అక్కడకూర్చుని చాలాసేపు వినేవాడు తను.

వర్షం ఎక్కువయింది. తగ్గినట్లుతగ్గి ఎక్కు వయింది. పూర్తిగా తడిసిపోయాడు అరుణాచలం. కాని ఇదేమీ క్రొత్తకాదు. ఫరవాలేదు. తనకూ వర్షా నికీ చాలా అనుబంధంఉంది. తను లేకపోతే వర్షంలేదు వర్షంలేకపోతే తనులేదు.

హైస్కూల్లో చేరినప్పుడు—అప్పుడూ ఇంతే.

తండ్రి గొడుగు కొనలేదు కనుక కొనలేదు. రెండుమైళ్లు కాలువగట్టు వెంబడేనడిచి హైస్కూ లుకి వెళ్తూండేవాడు అరుణాచలం. పుస్తకాలు ప్లాస్టిక్ సంచిలో—నెత్తిమీద ప్లాస్టిక్‌గుడ్డ – వళ్లంతా వర్షం నీళ్లు – సీత హైస్కూల్లో చేరలేదు. ఆపిల్ల ఎక్కువ చదవటం వాళ్లనాన్నకిష్టంలేదు. చదివిందే ఎక్కు వని మానిపించేశాడు. మానిపించిందే, మంచిదయిం దని ఆ పిల్ల కేరింతాలు కొడుతూ గంతులేసింది.

కిటికీదగ్గర కూర్చొని తను స్కూలుకి పోయేప్పుడూ, వచ్చేప్పుడూ వెక్కిరిస్తూండేది. వెక్కిరిస్తూనే ఎదిగి పోయింది. ఎదిగి, పెళ్లీడుకొచ్చింతరువాత ఎదగటం మానేసింది. ఎదగటం మానేసి తనను వెక్కిరించ డవూ మానేసింది. ఆ పిల్ల ఎదిగినంతగా అరుణాచలం ఎదగలేకపోయాడు. అంచేత సీత ఓ ఉత్తరంవ్రాసి కిటికీలోనుంచి అందించి చదువుకొమ్మని చెప్పినప్పుడు భయంతో వణికిపోయాడు. గుప్పిట్లో ఇరికించుకొని మామిడితోటలమధ్యకు పరిగెత్తి అక్కడ విప్పిచదివాడు

'రాత్రి పదిగంటలకు మా పెరట్లోని బాదం చెట్టు క్రిందకురా ! నీకోసం ఎదురుచూస్తుంటాను. నీతో మాట్లాడాలి—సీత.'

చమటలు పట్టినయి అరుణాచలానికి. ఆ రాత్రంతా తన ప్రక్కమీద నిద్రలేవకుండానే అటూ ఇటూ పొర్లుతూ గడిపాడు. బయట భోరున వర్షం—ఉరుములతో—మెరపులతో—అప్పుడే పదికొట్టింది గడి యారం. సీత ! పాపం—తనకోసం ఎదుర్చూసి—వర్షంలో తడిసింది. మర్నాడు లేవలేదు. జ్వరం ! ఆ మర్నాడూ జ్వరమే !—ఆ తరువాత చాలా రోజులు జ్వరం.

కాలేజిలో చేరాక ఎదిగాడు అరుణాచలం. ఎది గిన రోజున సీత గుర్తుకొచ్చింది. కిటికీలోనుంచి అందించిన త్తరం — మామిడితోటా—ఆ రాత్రి వర్షం—అన్నీ గుర్తుకొచ్చినయి. ఇవన్నీ గుర్తు కొచ్చి నప్పుడు సీతకి ఉత్తరం వ్రాశేడు. అందించడానికి కిటికీ దగ్గరకు వెళ్ళాడు.

'నా పెళ్ళి!' అంది సీత.

'ఎప్పుడూ ?'

'లగ్నానికింకా పదిహేన్రోజు లుంది!'

అరుణాచలం ఉత్తరం ఇవ్వలేదు. ఇవ్వాలని పించలేదు. ఏదో దిగులు అలుముకొంది. సీతకు పెళ్లవు తోంటే దిగులెందుకు ? విచారమెందుకు ?

అర్థంకాలేదు. తిరిగి వచ్చేశాడు.

సీతపెళ్లి అయిపోయింది. పెళ్లికి అరుణాచలం హాజరయ్యేడు. పెళ్లయిం తర్వాత అత్తారింటికి వెళ్లి పోయింది సీత. అరుణాచలం మిగిలిపోయాడు. సీతను మర్చిపోడానికి స్నేహాలకోసం వెతికాడు. రాఘవరావూ, రమణా పండగలాంటి జీవితం చూపించేరు. సిని మాలు—సిగిరెట్లు – పేకాటలూ — కాఫీహోటళ్లు—డబ్బు వృధా చెయ్యొద్దంటూ తండ్రినుంచి ఉత్త రాలూ—డబ్బుకోసం తనిచ్చే టెలిగ్రాం రసీదులూ—అందుకొనే టి. యం. వో.లూ—వెనుకబెంచీల్లో గొడ వలూ — ఫిజిక్స్ లెక్చరర్ తో గొడవ — స్ట్రైకు—ఆయనమీద రాళ్లురువ్వటం — పోలీస్ కేస్ కాలేజ్ నుంచి డిబార్ అవటం —

వర్షం కొంచెం తగ్గింది.

అరుణాచలం జోరుకూడా తగ్గింది. అప్పుడే తండ్రికి పక్షవాతం -హాస్పిటలూ—ఇల్లూ—చెల్లాయ్ పెళ్లి—అప్పు—నిరుద్యోగం—రెండేళ్లు చెప్పుల్లేకుండా ఉద్యోగంకోసం వెదికాడు. ఫ్రెండ్సందరూ పై చదు వులకు వెళ్లారు—అరుణాచలం ఒక్కడే మిగిలిపోయేడు.

రికమండేషన్ కోసం వెతికాడు అరుణాచలం. పువ్వులమ్మేచోట కళ్లేలు—రిక్షాలమీద సినిమాలకీ—సినిమాల్లో మొదటిరోజున — బాల్కనీలో మొదట కూర్చోటానికి, హోటల్స్ లో క్లాస్ మీల్సు తినడానికీ – డ్రింకులు త్రాగడానికీ – రాత్రుళ్లు పెందలాడే నిద్ర పోయి — ఆలస్యంగా నిద్రలేవడానికీ — అలవాటు పడిన ఆ ఊళ్లో — కాళ్లకు చెప్పుల్లేకుండా నడుస్తూ—అతుకుల బట్టలు తొడుగుతూ—సినిమా బొమ్మలుకూడా చూసే తాహతులేక—పంపు నీళ్లతో దాహం తీర్చుకుంటూ—ప్లేట్ భోజనంతో కడుపు నింపుకొని — దిగుళ్లతో ఆలోచనలతో నిద్రలేని రాత్రుళ్ళు గడిపి—భగవాన్—అప్పుడు, ఆ రోజు ల్లోనూ, ఇదే వర్షం—

వర్షం బాగా తగ్గిపోయింది. సన్నగా తుంపర పడుతోంది. మబ్బులు విచ్చుకోడానికి ప్రయత్నిస్తు న్నాయి. వెలుతురు అలుముకోడానికి పోరాడుతోంది. అనుసు.

అప్పడే నులకమంచంమీద పడుకొని ఆరు బయట చంద్రుడ్ని చూస్తోంటే కిటికీలోంచి సీత గొంతు వినిపించింది ఆశ్చర్యపోయేడు.

'బాగున్నావా?' అడిగింది సీత.

'ఓ! నువ్వెప్పుడొచ్చావ్?' ఆనందంగా అడిగాడు అరుణాచలం.

'సాయింత్రం!'

'మీ ఆయన?'

'వాడి పేరు మృగం అనిపెట్టాను! 'ఆయన' అనకు!'

'అదేమిటి?'

'అదో పెద్దకథ. చిన్నప్పుడు నువ్వు నాకు చెప్పేవాడివి చూడు అంతపెద్ద కథ.'' కిలకిల నవ్వుతూ అందామె.

ఆమె అందంచూసి ఉక్కిరి బిక్కిరయ్యాడు అరుణాచలం.

ఆ రాత్రి పది గంటలకు బాదంచెట్టుక్రింద ఆమెను కలుసుకొన్నాడు. అక్కడే కొన్ని రోజుల ఆనందం. జీవితంమీద క్రొత్త ఆశలు—అప్పుడే ఉద్యోగం దొరికింది. ఆ ఊళ్ళోనే ఓ ఆఫీసులో గుమాస్తా—జాయినవ్వమంటూ ఇంటికి నవ్వు కొంటూవచ్చి అడిగిన అపాయింట్‌మెంట్ ఆర్డర్ — దాన్తోపాటు వర్షం—ముసురు—తడుస్తూనే, తడిసిన కోడిలా ఆఫీసుకు వెళ్ళాడు అరుణాచలం.

'పాపం! తడిసిపోయేరే!'

జాలిపడ్డాడు హెడ్‌క్లర్క్ మొదటిరోజున.

రెండోరోజూ వర్షం — మూడూ, నాలుగూ-పదిరోజులు ముసురయింది. అలవాటయిపోయింది. నెల రోజుల తర్వాత జీతం చేతికందినరోజున మామూలు మనిషిలా నవ్వాడు అరుణాచలం. సీతకి పూలుకొన్నాడు. సరిగ్గా ఉద్యోగంలో చేరిన సంవత్సరానికే—

చినుకు ఉన్నట్టుండి పెద్దదయింది.

అరుణాచలం తడుస్తూనే నడుస్తున్నాడు. ఇల్లు ఇంకో రెండుఫర్లాంగు లుంటుంది. పదినిమిషాల్లో చేరుకోవచ్చు. ఎలాగూ తడిసిపోయాడు. వెధవ్వర్షం—తనకి పెళ్ళయినరోజూ ఇంతే.

సీతకీ — తనకూ ఏర్పడిన చనువు మెల్లగా ఊరంతా వ్యాపించి అందరి నోళ్లల్లోనూ నానింది. వెంటనే తండ్రి తనకు తగిన శాస్తి చేశాడు.

'చిరంజీవి అరుణాచలానికి, వెంకటనర్సయ్య బావగారి ద్వితీయపుత్రిక చిరంజీవి సౌభాగ్యవతియగు సరస్వతినిచ్చి...' వివాహం జరిగిపోయింది. పెద్దల సమక్షంలో సరస్వతిమెడలో మంగళసూత్ర ధారణ — కాళ్లకు మ్రొక్కటం — ఆశీర్వాదాలూ— నెత్తిమీద అక్షింతలూ—చిరంజీవ—చిరంజీవ సుఖీభవ — సుఖీభవ — సరస్వతి బదులుగా సీతేకనిపించింది అరుణాచలానికి.

వర్షం—ఉక్కిరి బిక్కిరిచేస్తూ అప్పుడూ ఇదే వర్షం—అరుణాచలం, సరస్వతులమీద పందిట్లోంచి నీటిచుక్కలు పడుతున్నయి. ఆ రాత్రి—చీకటి రాత్రి వర్షం ఎడతెరిపి లేకుండా కురిసిన రాత్రి—కుమారి సరస్వతి—శ్రీమతి సరస్వతి అయింది. వెచ్చగా—అరుణాచలం గుండెల్లో సరస్వతి నిద్రకు, నోచుకోని ఆ రాత్రి—జీవితాన్ని తుదికంటా అనుభవించటానికి నిర్ణయించుకొన్న అరుణాచలానికి నిద్రగురించి గుర్తుకి రాలేదు. గుర్తుకొచ్చేసరికి తెల్లారిపోయింది. తెల్లారిం తర్వాత నిద్రపట్టలేదు. భూమీ—ఆకాశం సరస్వతీ అరుణాచలం, చుక్కలూ చెంద్రుడూ, సరస్వతీ అరుణాచలం—అరుణాచలం, సరస్వతీ రెండు నెలలు గడిచిందాకా గడిచినట్లు తెలీలేదు అరుణాచలానికి తెలిసిం తర్వాత నమ్మలేక పోయాడు. రెండు నెలల జీతం ఒక్కసారే తీసుకొన్న తర్వాతగానీ నమ్మకం కలుగలేదు. సినిమాకు వెళ్ళడానికి అరుణాచలం పెళ్లి సూటు తొడిగేడు. సరస్వతి అందంగా తయారయింది. బయల్దేరుబోతూండగా భోరున వర్షం ప్రక్కింట్లోంచి బిగ్గరగా ఏడుపులు. సీత కిరసనాయిలు వంటి మీద పోసుకొని నిప్పంటించుకొంది. వళ్లు సగం కాలిపోయింది. అరుణాచలం టాక్సీలో తనూ హాస్పిటల్‌కు వెళ్లేడు.

'చాలా కష్టం ఈ పిల్ల బ్రతకటం!' అన్నారు డాక్టర్లు. అరుణాచలానికి ఏడుపు రాలేదు. ఏదో దిగులనిపించింది. సీత పెళ్ళయి వెళ్ళిపోతున్నప్పుడు అనిపించిన దిగులే! ఆ రాత్రంతా సీత దగ్గరే కూర్చున్నాడు జాగారంచేస్తూ. తెల్లవారుజామున స్పృహలోకొచ్చింది సీత.

'నీకు నేనేమీకానుకదూ?' అంది నీరసంగా, అస్పష్టంగా. అరుణాచలాని కేమీ అర్థంకాలేదు అర్థం చేసుకొనేటప్పటికి తెల్లారిపోయింది. ఆలస్యమయిపోయింది.

ఆఖరుసారిగా సీతమొఖంలోకిచూసి ఏదో గొణిగి ఇంటికి వచ్చేశాడు. ఆ రోజునుంచీ అరుణాచలం మారిపోయేడు. అయినా వర్షం అతన్ని వదలలేదు. అతన్ని ఆసరాగా చేసుకొన్న సరస్వతినికూడా వర్షం వదల్లేదు. బయటా—ఇంట్లో—జీవితమంతా — వర్షంలో తడిసింది. మొదట్లో ఇల్లు మారదామంది. తర్వాత తనే మారిపోయి మళ్లీ అలా అనడం మానేసింది.

తరువాత — మరుసటి సంవత్సరం మళ్లీ వర్షాలు—అప్పుడే సరస్వతి నొప్పులు-వర్షంలో రిక్షాలో మిషనాసుపత్రికి—ఓ రోజంతా శెలవుపెట్టి తడుస్తూ తిరిగాడు—సాయంత్రానికి ఆడపిల్ల—అరుణాచలానికి సంతోషం కలిగింది. తనిప్పుడు ఓ బిడ్డతండ్రి. ఆ సంతోషంలో వర్షాన్ని మర్చిపోయేడు — సరస్వతి ఓ రోజు పాపను ఇంటికి తీసుకువచ్చింది. పెంకుటిల్లు ఇష్టంవచ్చినట్లు కారుతోంది. కారని ఓమూల సరస్వతి పాపాయితో వెచ్చగా పడుకొంది — మరోచోట పాములా మెలితిరిగి పడుకొన్నా డరుణాచలం.

ఎక్కడో పిడుగుపడింది.

అరుణాచలం నడుస్తూనే ఉన్నాడు. ఇంకొక్క ఫర్లాంగు దూరముంటుంది ఇల్లు—చలిగాలి విదిలించి కొడుతోంది. వణుకుతున్న డరుణాచలం చలిగాలిలో—తడిసిన బట్టల్తో—మరుసటి సంవత్సరం సరస్వతికి మరో ఆడపిల్ల. సంవత్సరాలు రోజుల్లా గడిచినయి. ఒక్కొక్కరోజు వందేళ్లల్లా గడిపాడు అరుణాచలం. బరువు — సంసారం బరువు — ఆఫీసుబరువు-— తన బరువు—ఇంటిబరువు — వర్షంబరువు— ఎవరయినా నవ్వుతోంటే రెప్పవాల్చకుండా చూడ బుద్ధయేది.

'పెద్దదానికి ఏదో సంబంధంచూడండి! ముడి పెట్టేద్దాం!' అంది సరస్వతి. ఓ కుర్రాడు వచ్చాడు చాముండిని చూడ్డానికి. చాముండిని సరిగ్గా తనూ అప్పుడే చూశేడు అరుణాచలం—చీరకట్టుకొని, సరస్వతంత ఎత్తున సరస్వతిలానే ఉంది. లోపలకువెళ్లి మిగతాపిల్లల్ని ఆతృతగా చూశాడు. రెండోది ఓణీ లేస్తోంది. మూడోది లంగాజాకెట్టూ — నాలుగోవాడు నిక్కరూ చొక్కా.

'కుర్రాడికి పిల్ల నచ్చిందట. రెండువేలయినా ఇస్తేగాని కుదర్దట'. లోన్ తీసుకొన్నాడు అరుణాచలం- మిగిలిన సరస్వతి నగలుకూడా కేరింతాలు కొట్టుకొంటూ ఎగిరిపోయినయి.

చాముండి పెళ్లయింది. కాళ్లుకడిగి కన్యాదానం చేశాడు అరుణాచలం.

ఆరోజుకూడా వర్షం కురిసింది.

'మనపెళ్లికీ వర్షంకురిసింది మీకుగుర్తుందా?' పెళ్లయింతర్వాత పందిట్లో పందిరిగుంజ నానుకొని నుంచుని అడిగింది సరస్వతి.

చాముండి భర్తతో వెళ్లిపోయింది.

మరికొన్ని సంవత్సరాలు వర్షంలో తడిసినయి.

రిటయిరయ్యాడు అరుణాచలం. ఆఖరిరోజు ఆఫీసులో పనిచేసి బయటికొస్తూంటే — బ్రిటిష్ వాళ్లు కట్టించిన ఆ భవనం ఎలావచ్చాడో అలా వెళ్తున్న అరుణాచలాన్నిచూసి నవ్వింది. అతను దాన్ని చూసి ఏడ్చేడు. ఇంటికొచ్చి అద్దంలో చూసుకొన్నాడు. జుట్టంతా నెరసిపోయింది. మొఖమంతా గీతలు — ముడతలు—పరుగుతో వంటింట్లోకెళ్లి సరస్వతిని నుంచోబెట్టి పరీక్షగా చూశేడు.

కళ్లల్లోని అదివరకటి కాంతీ, చెక్కిళ్ల నునుపూ—మొఖంలోని సన్ననిగీతలూ—అప్పటి సరస్వతి కాదు. ఇది మాంసంతో అసహ్యంగా తయారుచేయబడిన మనిషిబొమ్మ.

మార్కెట్‌వేపు వెళ్లేడు అరుణాచలం ఆ సాయంత్రం. కొలిమిదగ్గర వెంకటేశ్వర్లు బండి చక్రాన్ని త్రిప్పుతున్నాడు. గిఱ్ఱున తిరుగుతోం దది.

ఎఱ్ఱగా కాలిన ఇనుపపట్టీ అతుకుపడుతోంది.

తిరిగి ఇంటికొచ్చేసరికి సరస్వతి చనిపోయింది.

'అదృష్టవంతురాలు!' అన్నారెవరో.

బయట వర్షం.

పెంకుల్లోంచి నీటిచుక్కలు అరుణాచలం మీదా—సరస్వతి శవంమీదా పడుతున్నయి.

ఉప్పెనలా వస్తోన్న దుఃఖాన్ని అణుచుకోటం సాధ్యంకాలేదు.

'నన్నుచేసుకొని నువ్వు సుఖపడలేదు సరస్వతీ - నిన్నూ, సీతనీ— ఇద్దరినీ దూరంచేసుకొన్నాను. ఎవ్వ రికీ దగ్గరకాలేకపోయాను. నన్ను క్షమించు...'

శ్మశానానికి వర్షంలో నడిచాడు అరుణాచలం.

మంటలు—పొగ...

పెళ్లిచూపుల్లో ఓరగా చూసినచూపూ—తలం బ్రాలు పోసేప్పుడు చిలిపిదనం—కౌగిట్లో కోరికనిండిన కళ్లూ—చాముండిని కన్నరోజు గర్వం నింపుకొన్న చూపూ—

ఇంటికి తిరిగివచ్చాడు అరుణాచలం.

ఇల్లు శ్మశానంలాఉంది. కష్టాల్ని మాత్రమే సగానికి పంచేసుకొనీ ఏమీతెలీనట్లే—ఏమీతెలీనీకుండా- కలిసిపోయి—మెసిలిన సరస్వతి—వర్షం వదలలేదు—

ఇల్లు చేరుకొన్నా డరుణాచలం.

ఇంట్లో లైట్లు వెలుగుతున్నయి. కోడలు బయట కూర్చుని పిల్లాడికి పాలిస్తోంది. కొడుకు మనవడితో ఎక్కాలు చదివిస్తున్నాడు. అరుణాచలం మెట్లు ఎక్కేడు. మనవడిలో పూర్తిగా అరుణాచలం పోలికలే కనిపిస్తున్నయి. చిన్నప్పుడు తనూ అలానే ఎక్కాలు చదివేడు. చివరిమెట్టు ఎక్కుతోంటే కాలు జారిపోయింది. దబ్బునపడిపోయే డరుణాచలం— గుండెలిమీద గునపం దిగినట్టు నొప్పి—నవ్వు వచ్చిం దరుణాచలానికి, పాతనవ్వుని గుర్తుతెచ్చుకొని నవ్వేడు.

'వద్దంటే వినకుండా బయటకివెళ్తారు...... చూడండి ఎలా పడిపోయారో?' లేవనెత్తుతూ అంటు న్నాడు కొడుకు.

లోపల మంచంమీద పడుకోబెట్టేరు అరుణా చలాన్ని. కళ్లు చీకట్లు క్రమ్మినట్లనిపించింది. ఇక్కడే! ఇదే మంచంమీద సరస్వతి—వెళ్లిపోయింది— తనూ—ఇక్కడే –

అందరూ అరుణాచలంమీదపడి ఘొల్లున ఏడిచేరు.

వర్షం ఆగిపోయింది. ఆకాశంఅంతా లంగా అయిపోయింది.



# రాయలసీమ జానపద సంస్కృతి : చౌడమ్మ పాటలు

## డా. తంగిరాల వేంకటసుబ్బారావు

(గత సంచిక తరువాయి)

ఈ చౌడమ్మ పాటలలో 'గురువుపాట, వీరశేఖరుని పాట, కందనూరిపాట, జయావిష్ణుపాట, పెదరాయభూపతిపాట, ఏలవరాజు పాట, మహిషాసురుని పాట, కంసుని పాట, చౌడమ్మ వేడుకలు, ఎఱుకల పాట, త్రిమూర్తుల జననము పాట, శక్తికా విజయము' అనునవి కథాగేయముల (Ballads) కుదాహరణములు. ఇవి చౌడేశ్వరీశక్తి వీరత్వమును ప్రదర్శించునట్టివి కావున వీరగాథ లగుచున్నవి. ఇవి లఘువీర గాథలే (Balladlings) కాని సుదీర్ఘ వీర గాథలు మాత్రము కాఁజాలవు. ఈ పాటలన్నియును దాళ లయాత్మకములుగా నుండును. ఎక్కువగ నాది తాళములోఁ బాడఁబడుచుండును.

### 1. గురువుపాట :

9 చరణములు; 90 పంక్తులు; గుప్రఅము సర్వయ్య రచన: పునరావృత్తి (Refrain) :

'ఆదికాలము వార్తలన్నియు
ఆలకించి వినరయా
తోయజాపుష్పాండజా ముని
తొగట వారికి గురువయా
సమ్మతిగ మాగురుని దలచితె
సకల భాగ్యము కల్గునూ'

పాట ప్రారంభము :

'ఇలను సూర్యా వంశ మందున
ఇకువాకను రాజుతానై
సలలితంబుగ సకల భూములు
సరసుడై పాలింపుచూ
తనకు తనయులు లేక యిలపై
తపము చేసితె గాకను
అంతలో పురివెడలి కానల కరిగి
జలకము లాడియు
కమల సంభవుగూర్చి తపములు
విమలుడై తా చేయగా
..........................'

ఇది తొగటవీరుల కాదిపురుషుఁడగు పుష్పాండజాముని కథ. తొగటవీరుల జన్మక్రమ మీ పాటలోఁ జెప్పఁబడినది. ఇక్ష్వాకుఁడను రాజు సంతానార్థమై బ్రహ్మనుగూర్చి తపస్సుచేసెను. బ్రహ్మ ప్రత్యక్షమై కమండలోదకము నిచ్చెను. ఆ యుదకమును గొలను తామరలందుఁ బోయఁగాఁ బుష్పాండజుఁడు జన్మించెను. ఇక్ష్వాకుఁ డాతనికి నయోధ్యాపురమును బట్టము కట్టెను. పుష్పాండజుఁడు కొంతకాలము రాజ్యమేలి, తరువాత పుత్రులకొఱకై చౌడేశ్వరిని గూర్చి ఘోరతపస్సు చేసెను. చౌడేశ్వరి ప్రత్యక్షమై యతనికి శేష (సేస) బియ్యము నిచ్చినది. ఆ బియ్యము నతఁడు కొలను తామరలందుఁ బోసెను. (తిరువెంగళప్పయ్య రచించిన 'శక్తికావిజయ'మను పాటలో నీ బియ్యము నగ్నికుండమున వేసినట్లుగాఁ గలదు). అందుండి మున్నూట యఱువదిమంది వీరులుపుట్టిరి. చౌడమ్మ యా వీరులను దీసికొని త్రిపురాసురులపై దండెత్తి వారిని సంహరించెను. దేవి యండజామునికొక ఫలము నిచ్చెను. ఆ ఫలమునుండి కన్య లుద్భ

వించిరి. ఆ కన్యలను వీరులకిచ్చి పెండ్లిచేసి, దీవించి, చౌడమ్మ కాశికాపురమున కేగెను.

## 2. వీరశేఖరుని పాట :

14 చరణములు; 114 పంక్తులు; గుఱ్ఱము సర్వయ్య రచన. పునరావృత్తి:

'చూడబోదమురారె సుఖముతో జనులు
కోరిన వరమిచ్చు కొలిపాక చౌడు'

ప్రారంభము :

'వీర ప్రతాపుండు విజయ చక్రవర్తి
ఇలలోన కొలిపాక పాలింపగా నాడు
పుడమిలో తొగటలును చౌడమను కొలువంగ
కదలితే పయనమై గాంభీర్యముగ నాడు

ఇది తొగటవీరుల శౌర్యమును ప్రశంసించు కథ. వీరశేఖరుఁడనురాజు 'కొలిపాక'ను బాలించుచుండఁగాఁ, దొగటవీరులు చౌడమ్మను గొలుచుటకై యా గ్రామమునకేఁగి, యచట రాజవీధిలో జాతర జరుపుకొను చుండిరి. ఆ రాజవీధిలో జాంద్రవారు కొందఱు గుమిగూడి తొగటవీరులతోఁ గలహింప నుద్యుక్తులైరి. వారి కలహమును మాన్పుటకై, యిరుపక్షములవారి బలాబలములను బరీక్షించుటకై రాజు వీరశేఖరుఁ డొక ఉక్కుగుఱ్ఱమును దయారు చేయించి, దానిని గుండములో నుడికించి, యా తేజి నెక్కినవారికి బిరుదులు చెల్లునని చెప్పెను. జాంద్ర వారందఱును భయపడి పాఱిపోయిరి. తొగటవీరులలో 'సరువయ్య'—(గేయకర్తయే కాఁబోలును), 'భండారు కేశవులు' అను వారిరువురు ముందునకువచ్చి, తమ దైవమగు చౌడమ్మను బ్రార్థించి, 'కలపిల ఉడికేటి కంచుగుఱ్ఱము' నెక్కిరి. రాజు వీరశేఖరుఁడును, రాణి రాజీవరత్నాంగియును తొగటవీరులను మెచ్చి గౌరవించిరి.

ఈ పాటనుబట్టి చౌడమ్మపాటలు రచించిన గుఱ్ఱము సర్వయ్య ప్రాచీనుఁడనియు, రాయలసీమలో 'కొలిపాక' గ్రామప్రాంతమువాడనియుఁ దెలియు చున్నది. ఈ పాటకు 'సరువయ్య-భండారు కేశవులు' అను నిర్వురును గర్తలేమో. గేయాంతమున నిర్వురి నామములును గలవు.

## 3. కందనూలిపాట :

21 చరణములు; 90 పంక్తులు; గుఱ్ఱము సర్వయ్యరచన. ఇందలి పునరావృత్తి యిట్లుండును :

'వినరయ్యా చౌడమ్మా మహిమలు
వివరముతో మీ రెవరయినా
దూషణ చేసిన రాజేంద్రునకు
దుర్గా మమ్మడి గౌనలేదా ?
మల్లయ్య మమ్మడి గౌనలేదా ?'

ప్రారంభము :

'కరమరదున ధర కందనూలి
కరకంఠుని పుత్రి జాతరకు
రమ్మని పిలిచిరి వీరుల నెల్ల
నెమ్మది పున్నమ నాటికిని,
విరివిగ నాలుగు దెనలందుండిన
వీధులు గదలిరి వేడుకతో
పచ్చని నల్లని తెల్లని ఎఱ్ఱని
పసుపు వన్నెలా గొడుగులతో

నేఁటి కర్నూలు పట్టణమునకుఁ బ్రాచీన నామము 'కందనూలు'. ఇట చౌడమ్మగుడి కలదు. ఈ జాతరకు తొగటవీరు లందఱును వచ్చిరి. వారి వేడుకలు తనకు నిద్రాభంగము కల్గించు చున్నవని యా పట్టణమేలు రాజు విసుగుచెంది, సైన్యమును బంపి, వారివేడుకల నాపుజేయించెను. చేయునదిలేక తొగటవీరులు ఖిన్నులై, యన్నాహారములుమాని దేవి యెదుట పరుండిరి. దేవిని పరిపరివిధముల ప్రార్థించిరి. మఱునాఁడు చౌడమ్మ రౌద్రాకారిణియై రాజేంద్రునికోట కూల్ద్రోసి, కరిహయభటాదుల కెల్లఁ గడుపున శూలలు కావించి, రాజునకు వెర్రి కలుగు నట్లు చేసెను. మంత్రులు భయపడి తొగటవీరులను బ్రార్థింపఁగా, నా వీరులు చౌడమ్మను గొని

యాడి, రాజుగారి యున్మాదమును బోఁగొట్టి, బోన ములతో వేటలతో జాతర చేసికొనిరి.

**4. జయావిష్ణువుపాట :**

9 చరణములు, 82 పంక్తులు, గుఱ్ఱము సర్వయ్యరచన.

పునరావృత్తి :

'నాడు మా భూతాల పేటకు
నల్లజాన్పై వెలసెను
భక్తితో గొలుతాము రారే
బాలబ్రహ్మేశ్వాయిని'

ప్రారంభము :

'జయా విష్ణువు నాభియందున
చతుర్ముఖుడై పుట్టెను
అతని నాభిని బ్రహ్మపుట్టెను
బ్రహ్మకును తొమ్మండ్రుడు పుట్టిరి
అందులోనే కశ్యపునకు
అమర నలుగురు భార్యలు
సురలు రక్కసులు మొదలుగ
పాములే పక్షులు పుట్టెను
..............................'

ఇందు రాక్షసుల విజృంభణము, చౌడమ్మ పుట్టుక యామె త్రిపురాసురాది రాక్షసులను జంపుట వర్ణింపఁబడినది. ఈ పాటలకుఁ బేర్లు వాని ప్రారంభ మునుబట్టి పెట్టిరని తోచుచున్నది. చౌడమ్మ రాక్ష సులను జంపుట యిందలి యితివృత్తము కాఁగా, నీపాట ప్రారంభమునుబట్టి దీనికి 'జయావిష్ణువు పాట' యని పేరువచ్చినది. కాఁబట్టి యీ పాటల పేర్లకును వాని యితివృత్తములకును సంబంధము లేదని తెలియుచున్నది.

**5. రాజభూపతిపాట :**

దీనికి 'పెదరాయభూపతి పాట' యనియుఁ బేరు. నూటముప్పది పంక్తులలోఁ బది చరణము లుగానున్న యీ పాట యిట్లు ప్రారంభమగును :

పునరావృత్తి :

'ధర్మనందన చక్రవర్తి దానమిచ్చిన మార్గము
కాశినుండి సాక్షికొఱకై కదలివచ్చెను చౌడమ
కోటి గంగ స్నానఫలములు కోరియున్నావారికి'

ప్రారంభము :

'రాజవంశము రాజాయనగ
రాజనందన చక్రవర్తి
నిజముగా శ్రీరాజుకైవడి
రాజ్యభోగము లందుచూ
వందిజన కవిభట్లు సేనలు
సందడై కొలువంగనూ
నందవర సింహాసనంబున
నాడు కొలువై వేడ్కతో

రాజనందన చక్రవర్తి నందవరమును బాలించు చుండెను. అతఁడు గొప్ప శివభక్తుఁడు. ఒకనాఁడు శివుఁడు మునివేషమునవచ్చి యారాజున కొక మహిమ గల పావుకోళ్లజతను బహూకరించెను. వానిని ధరించి ప్రతిదినమును రాత్రి మూఁడుజాములవేళ రాజు తలం చిన మాత్రమున కాశికిబోయి, విశ్వేశ్వరుని బూజించి, తెల్లవారుసరికి నందవరమునకు వచ్చుచుండెను. ఇది యెవ్వరికిని దెలియదు. ఒకనాఁడు రాణి దీనిని గ్రహించి తానుగూడ కాశికి వచ్చెదనని ప్రయాణ మయ్యెను. ఇరువురును కాశీక్షేత్రమునకుబోయి, విశ్వ నాథుని బూజించి, మఱలివచ్చుటకై ప్రయత్నింపఁగా నా పావుకోళ్లు కదలలేదు. రాణి రజస్వల యగుటచే వానిమహిమ యంతరించెను. రాజు విచారగ్రస్తుఁడై, తన్నింటికిఁ జేర్చినవారికిఁ గోరినదాని నిత్తునని ప్రక టించెను. అట చౌడేశ్వరి భక్తులగు బ్రాహ్మణులు రాజునుజూచి కనికరంచి, యాదేవిమహిమచే రాజదంప తులను నందవరము చేర్చిరి.

కొన్నినాళ్లకుఁ గాశిలోఁ గఱవువచ్చెను. బ్రాహ్మ ణులు రాజునర్థింప నందవరమునకు వచ్చిరి. రాజు తానుజేసిన వాగ్దానమును మఱచిపోయెను. వారిని నమ్మ లేదు. సాక్ష్యముకొఱకై బ్రాహ్మణులు తిరిగి కాశికేగి, చౌడమ్మను గొనితెచ్చిరి. రాజు చౌడమ్మను బూజించి,

యా బ్రాహ్మణులకు నందవరమును దానముచేసి, తాను నంద్యాలయను పట్టణమును గట్టుకొని, యందుండి పాలింపఁ దొడగెను. చౌడమ్మ నందవరమున వెలసి, తొగటవీరులచేఁ బూజింపఁడుచుండెను.

### 6. ఏలవరాజు పాట :

15 చరణములు; 117 పంక్తులు. ఇతివృత్తములనుబట్టి పాటల ...కలు లేకున్నను, నీ చౌడమ్మ పాటలలో నొక విశేషమున్నది. వీని పునరావృత్తులలో నితివృత్తమంతయు గర్భితమై యుండును. ఈ యేలవ రాజు పాటకుఁ బునరావృత్తి యిట్లున్నది :

'ధరణి తొగటప్రజలు చేసిన
ధర్మకథలే వినరయా
సాహసంబున నాఁడు రాజుకు
సాయమైరో వీరులూ'

దీనినిబట్టి తొగటవీరులొక రాజునకు యుద్ధమున సహాయముచేసిరని స్పష్టమగుచున్నది. ఇట్లే ప్రతిపాటలోను పునరావృత్తిలోఁ గథాసారము తెలుపఁ బడియున్నది. ఇది యీ పాటలలోని విశేషము. ఈ యేలవరాజు పాట ప్రారంభమిట్లున్నది :

'అట్టి భూమి ఆకసంబున
విష్ణుమాయలు పుట్టెను
అతని నాభిని బ్రహ్మ పుట్టెను
అఖిలలోకము లాయెను
సకలమైన జీవరాసులు
సమ్మతిగ నిర్మించియు
అట్టి జీవులలోన భూపతి
అధికుఁ జన్మించెను

పాట చివరలో విది గుణిము పర్యాయ్య రచనగాఁ దెలుపఁబడియున్నది.

ఏలవరాయఁ డనురాజు పానుగల్లు పట్టణము నేలుచు, మిక్కిలి గర్వించియుండెను. తనతో యుద్ధము చేయఁగల రాజు లెవ్వరును లేరని యతని గర్వము. అన్య రాజు లందఱును గలసి యతని కోటను ముట్టడించిరి. పంద్రెండేండ్లు యుద్ధము జరిగెను. ఏలవరాయని సైన్యమంతయును నశించిపోయెను. అతఁడు మిక్కిలి చింతించి తొగటవీరుల సహాయ మర్థించెను. వారు చౌడమ్మను బ్రార్థించిరి. ఆమె యెంతకును బ్రసన్నము కాకపోగా, తమ శిరస్సులను బలియిచ్చి వేఁడుకొనిరి. చౌడమ్మవారి భక్తికి సంతసించి, ప్రత్యక్షమై, వారికిఁ దోడుగా నిలచి, శత్రురాజులను దతిమివేసెను. ఏలవరాయఁడు మిక్కిలి సంతసించి, తొగటవీరులను గొనియాడెను. వారి కోరికప్రకారము తన బిరుదు లన్నియును వారి కొసంగెను.

### 7. మహిషాసురుని పాట :

10 చరణములు, 215 పంక్తులు. ఇది మద్దులేటిస్వామి నామాంకితముగా గురుకుంట్ల చౌడమ్మపై చెప్పిన పాట. కర్తపేరిందులేదు. ఈ పాట ప్రారంభములోనే యితివృత్తసారమును గ్రహింప వచ్చును :

పునరావృత్తి :

'ఆది కాలము సూతు డీకథ
అవనిపై వినిపించెను
సాధు జనసుత శౌనకాది
మహా మునీశ్వరు లడుగగా'

ప్రారంభము :

'శ్రీకరంబుగ ఆదిశక్తిని
శివుడు ఏమిటి కొఱకు దలచెను
తలచి నప్పుడు శక్తివచ్చి
తాను కార్యంబేమి చేసెను
మునులలో పుష్పాండజుండను
ఘనుని తపమేరీతి పండెను
మునికి సుతులై తొగటవీరులు
మున్నూటరువై వీర్లు గలిగిరి
క్రమము మాకు తెలుపుమని
శౌనకుడు సంతోషాన బల్కెను
..............................'

మహిషాసురుడను రాక్షసుడు శివునిగూర్చి ఘోర తపస్సుచేసి, యనేకవరములుపొంది, గర్వించి,

ముల్లోకములను జయించి, ఇంద్రాదిదేవతలను బాధఁ ద్రోలెను. మఱల నతఁడు సంతానముకొఱకై తపస్సు చేయఁగా, శివుఁడాదిశక్తిని మహిషాసురునకుఁ బుత్రికగాఁ బుట్టునట్లు చేసెను. తండ్రి గండమునఁ బుట్టుటచే రాక్షసు లామెను ఇనుపమందసమున బంధించి భూస్థాపితము చేసిరి. సురాసురులకు భీషణ సంగ్రామము ప్రారంభమయ్యెను. శివుఁడాదిశక్తిని బిలువఁగా, నా మందసమునుండి చౌడేశ్వరి బయటకు వచ్చెను. (శివుని చెమట యా మందసముపైఁబడగా నామె బయటకు వచ్చినదని వేఱొకపాటలోఁ గలదు). త్రిమూర్తు లామెనుదీవించి రాక్షసులపైకిఁ బంపిరి. వీరచౌడేశ్వరి పుష్పాండజామునికి మున్నూట యఱువదిమంది తొగటవీరులను బ్రసాదించి, వారిని వెంటఁబెట్టుకొని రాక్షసులను మర్దించెను. మహిషాసురాదులను సంహరించి లోకరక్షణము కావించెను.

## 8. కంసునిపాట :

3 చరణములు; 40 పంక్తులు. ఇది నందవర భగళాంబపై సర్వయ్య చెప్పినపాట. ఆదిశక్తి యశోదగర్భమున మహామాయగా జన్మించి, కృష్ణునకు సహాయముచేసి, కంసుని బెదరించి, యాకాశమున కెగసిపోయిన కథ. చిన్న గేయకథ.

పునరావృత్తి :

> 'నీతోడు గావలసె నినువేడు కొనగా
> ఆదివిష్ణుకు సాయమయితివోతల్లీ
> శివావిష్ణుకు సాయమైతివోతల్లీ !'

ప్రారంభము :

> 'మన్నూమిన్నూలేని మాయాంధకారమున
> యెన్నగల దేవతలు ఎవరు లేనినాడు
> పంచమ జ్యోతివై పాలమున్నీటిలో
> ఆనందభరితముగ ఆడుతా యుండంగ

## 9. చౌడమ్మ వేడుకలు

7 చరణములు; 42 పంక్తులు. నందవరము చౌడమ్మపైఁ జెప్పినపాట. కర్తపేరులేదు.

పునరావృత్తి :

> 'వినరయ్య జనులార ఈ పుణ్యకథలు
> సజ్జనులు పాడేరు చౌడమ్మ కథలు'

ప్రారంభము :

> 'పనిబూని దేవతలు పాలసంద్రము దరువ
> పరగవేడుకతోన పయనమయ్యేరు
> మందరాగిరితెచ్చి మరికవ్వముగజేసి
> ఆదిశేషుని తాను వాసిగా సరిత్రాడు

ఈ పాటలో తొగటవీరుల పుట్టుక సంక్షిప్తముగాఁ జెప్పఁబడినది. దేవతలు పాలసముద్రమును దఱువఁగా, నందుండి అండజామునిపుట్టి, చౌడమ్మను గూర్చి తపస్సుచేసి, యామె ప్రసాదించిన శేషబియ్యముతో మున్నూటయఱువది వీరులను సుతులుగాఁ బొందినట్లు చెప్పఁబడినది. చిన్నగేయకథ.

## 10. ఎఱుకలపాట :

7 చరణములు; 150 పాదములు. నందవరము చౌడమ్మపై గుర్రము సర్వయ్య వ్రాసిన పాట. చక్కని కవిత్వముగలపాట. చౌడమ్మ యెఱుకత వేష మత్యద్భుతముగా వర్ణింపఁబడినది :

> 'సంకుపూసల పేర్లు
> ఎఱుకలజాతి సొమ్ములు పెట్టెనూ
> పొంకముగ రత్నాలు చెక్కిన
> బుట్ట శిరసున బెట్టెనూ
> చిన్నె లలరిన యెడమ చంకన
> చిన్నికుర్రను గట్టెనూ
> కొన్నివన్నెల గిలుకయును
> ఒక కుఱుచ బెత్తము పట్టెనూ'

ఇట్టి యెఱుకత వేషమున చౌడమ్మ పార్వతి దగ్గఱకుఁబోయి భృగుమహర్షి శాపమునుగూర్చి, దక్షయజ్ఞమునుగూర్చి, శివుని బ్రహ్మహత్యాపాపమునుగూర్చి ఎఱుకు చెప్పెను. అటనుండి శారదకడకేఁగి భృగుమహర్షి శాపమునుగూర్చి ఎఱుకు చెప్పెను. ఇట్లే లక్ష్మీదేవి కడకేఁగి భృగుమహర్షి విష్ణువును దశావ

తారము లెత్తవలసివదిగా శపించునని చెప్పను. శచీదేవి కడకేఁగి యింద్రునకు గలుగఁబోవు గౌతమ శాపమును, బదవీచ్యుతిని దెల్పును. ఇట్లు చౌడమ్మ దేవతల కెఱుకుచెప్పి తిరిగి కాశికాపురము చేరును. ఈ పాటలోఁ బునరావృత్తి యిట్లున్నది:

'ఏకముగ ముల్లోకముల వారికి
వాకు పలిచెను ఎఱుకతా
సర్వమంగళ నందవరమని
చౌడమాంబా మహిమలు
జగదీశ్వరమ్మా మహిమలు...'

## 11 త్రిమూర్తుల జననముపాట :

14 చరణములు; 107 పాదములు. గుఱ్ఱముసర్వయ్య భంగళాంబపేర వ్రాసిన శకి గీతము. సచ్చిదానందరూపమగు బ్రహ్మమునుండి త్రిమూర్తులు జన్మించి, యాదిశక్తియగు భగళాంబను భజన చేసిరి. ఆదిశక్తి యా బాలను ప్రేమతోఁ జేరఁదీసి, వరములిచ్చి, పట్టముగట్టినది. ఈ పాటలో వేదాంత భాగ మెక్కువగను, కథాఖ్యానము తక్కువగను నున్నది. ఆదిశక్తి వర్ణన రమణీయము :

'కోటిచంద్రుల ముఖముదీప్తి
కోమలాంగై నిలిచెను
పటుతరంబుగ పల్లవారుణ
పాదకమలము లుండెను
పుటముబెట్టిన బంగరందెలు
బోరు కొలుపుచు నుండెను
కటి పరందెలు కాళ్లగజ్జెలు
గల్లుగల్లని మ్రోయగా
నడుము సన్నము డాబు మెఱసెను
నాగరామించాయెనూ
..........................
కనకచీరె జలతారు రవికెయు
కమ్మలే రవిచంద్రులూ
వెనుక ముప్పదిమూడుకోట్లు
వేల్పులుండిరి వరుసతో'

## 12. శక్తికా విజయము :

ఇది యాదితాళమున నడచు పెద్దగేయకథ. ఇరువదినాలుగు చరణములు; నాలుగువందల పాదములు. పైన తెల్పిన పదునొకండు పాటలలో నించుమించు నన్నియును గుఱ్ఱము సర్వయ్య వ్రాయఁగా, నీ పాటను మాత్రము సుగమంచి పాపన్న పుత్రుఁడు 'తిరువెంగళప్పయ్య'యను కవి రచించెను. ఇతఁడు తొగటకులము వాఁడఁట. ప్రారంభమున హరివెంకటగురుని, వీరశరభయ్యను స్తుతించినాడు. వీరీతని గురువులు కావచ్చును. ఈ పాటకు 'త్రిపురసంహారము', 'చౌడమ్మ పండుగ,' 'చౌడమ్మ కథ', అను నామాంతరములున్నవి. ఇందలి కథలో నూతనాంశములు లేవు. పైన తెల్పిన యితివృత్తములే యిందునుగలవు. రాక్షసుల విజృంభణము, ఆదిశక్తి మహిషాసురునకు చౌడమ్మగాఁబుట్టుట, ఆమె పుష్పాండజామునికి మున్నూట యఱువది వీరులను ప్రసాదించుట, వారిని వెంటబెట్టుకొని రాక్షస సంహారము చేయుట—ఈ గేయకథలోని యితివృత్తము. ఇది పైన చర్చించిన పాటలన్నిటికిని సమాహార మన వచ్చును. ఇది 'పాటగాగాక' 'కథ'గా బేర్కొనఁబడినది.

ప్రారంభము :

'కరిముఖుని అర్చించి శారదను కొనియాడి
హరియు వెంకటగురుని ఆత్మలో నెరనమ్మి
చౌడేశ్వరమ్మను సన్నుతించుట చాల
విష్ణు దేవత ప్రార్థన ఇంపొందగా జేసి
వరవీరశరభయను వలనొప్ప కొనియాడి
శక్తికావిజయఁబు చెప్పెదను వినరయ్య

ము

'విన్నవారికినెల్ల విఘ్నకోరిక లిచ్చి
సకల శుభకరమిచ్చు శక్తికావిజయంబు
అష్టభాగ్యము లిచ్చు ఆదిమహాలక్ష్మి
చౌడమ్మకథ విన్న పాయు పాపములు
ఆయురారోగ్యములు అష్టఐశ్వర్యములు
పంచాక్షరం బొసగు పరంజోతి చౌడమ్మ

ధరణిలో తొగటకులదైవంబు చౌడమ్మ
ఎంచగల యీ తొగట కులములో సుగమంచి
పాపన్న పుత్రుండు వంశపావనుడూ
తిరువెంగళప్పయ్య వరకవి చెప్పిన
ఈకథ త్రిపుర సంహారంబు
చౌడమ్మపండువనగాను'

ఆదిశక్తి చౌడమ్మను గొలుచు తొగటవీరులు వీరశైవులు. వీరముష్టివారికిని వీరికిని దగ్గఱ సంబంధమున్నట్లుగాఁ దోచుచున్నది. చెన్నబసప్పయను వీరముష్టివాని కుమార్తెను, భోజుఁడనురాజు వివాహ మాడఁ దలఁచెను. వీరముష్టు లందులకు సమ్మతింప లేదు. తన గుఱ్ఱమునుజంపి, తిరిగి దానిని బ్రతికించి నచో నా బాలికను వివాహమాడెడి తలంపును విర మింతునని భోజుఁడు వారితోఁజెప్పెను. భోజుని గుఱ్ఱ మునుజంపి తిరిగి బ్రతికించుటలో వీరముష్టులకుఁ దొగటవీరులు సహాయపడిరి. అందుచే వీరముష్టులు తొగటవీరులకుఁ గొంతభూమిని దానముచేసిరి. ఈ దానపత్రమును చౌడమ్మజాతరలో నేఁటికిని జదువు చుందురు.[7] ఈ దానపత్రమునుబట్టి యీ సంఘ టన క్రీ. శ. 1081 లో జరిగినట్లుగాఁ దెలియు చున్నది.

మొత్తముపై చౌడమ్మపాటలు కథాకథన ప్రధానములుగ నున్నవేకాని కవితాప్రధానములుగలేవు. వౌఖిక(ప్రసరణమునున్న యీ పాటలను మిడిమిడి జ్ఞానము గలవారు సంస్కరింప యత్నించుటచే, వీని లోని జానపదతత్త్వము (Folk element) ను సన్న గిల్లినది. ఇవి నేఁడు జానపదకవిత్వముగాఁ గాక జాతి దేశి కవిత్వముగాఁ గాన్పించుట కీ సంస్కరణమే కారణము. తాళబద్ధతమాత్ర మీ పాటలలో నెచ్చ టను లోపింపకుండుట ముదావహము. చౌడమ్మపాటలు శక్తికథాచక్రమున నొక ప్రత్యేకశాఖ యనుటలో సందేహము లేదు.

రాయలసీమలో చౌడమ్మపాటల వలెనే, తెలం గాణమున 'బొడ్డెమ్మపాటలు', 'బ్రతుకమ్మ పాటలు' ప్రసిద్ధి కెక్కియున్నవి, కాని 'బొడ్డెమ్మ', 'బ్రతు కమ్మ' అనునవి శక్తిస్వరూపములుగాఁ గానవచ్చుట లేదు. జానపదగేయములనుగూర్చి సమగ్ర పరిశో ధనచేసిన డా. బి. రామరాజుగారు 'బొడ్డెమ్మ'— పిల్లల పండుగయనియు, 'బ్రతుకమ్మ' — స్త్రీల వేడుకయనియుఁ దెలుపుచున్నారు.[8] వీరు వ్రాసిన దానినిబట్టి చూడఁగా శక్తిపాటలవలె వీనిలో రౌద్రము కానరాదు. బొడ్డెమ్మపాటలు పిల్లల పాటలలోను, బ్రతుకమ్మ పాటలు జానపద స్త్రీల పాటలలోను గలసిపోవునే కాని, యవి శక్తికథాచక్రము క్రిందికి వచ్చెడివికావు.

(స శే షం)

---

7. చూ. శ్రీ చౌడేశ్వరీ పూజా విధానము, పుట. 223.

8. చూ. తెలుగు జానపదగేయ సాహిత్యము, పుటలు 429—432.



# అచ్చుతప్పుగాదు

## తెనుఁగులెంక: శ్రీ తుమ్మల సీతారామమూర్తి

చెదరిచెదరియున్న చినచిన్నకబ్బముల్
కొన్ని చేర్చి 'శబల' యన్నపేర
వెలువరించినాఁడ వేంకటనరసయ్య
కీరి వాడవాడఁ గెరలుకొలుకు.

అచ్చుపని ముగిసినంతన
నెచ్చెలులగు కవులకున్ మనీషుల కెలమిన్
బుచ్చితిఁ గృతి నల్లల్లన
వచ్చెన్ గృత మెఱిఁగి సఖులు వ్రాసిన కమ్మల్.

సాహితీనిధి కవితావిశారదుండు
సుజనమౌళి వేంకటపురస్సుబ్బరావు
యార్లగడ్డ సదన్వయాయ వ్రాసిద్దుఁ
డపుడు పంపిన లేఖ నేమని నుతింతు!

ఇఁకఁ డందఱవలె నను నా
కృతి నెన్నుటతోన యాఁగ కే నొక్కయెడన్
గతి దప్పుటయును మృదువా
క్కృతిఁ దెల్పె హితుండు సూరితల్లజుఁ డగుటన్.

అది '[1]యుపదర్శిష్టత్వ' మన్నపరియోగ,
మది కర్ణుతోఁ గృష్ణుఁ డనిన పద్యమున
నిరవుకొన్నపరియోగ, మీఁడితమతులు
నవుపరియోగ; మన్నా! సుబ్బరావు
గఱువతనం బెంతగణనీయ! మాతఁ
డొరుల నొప్పించుట కొప్పఁడు గానఁ

1. ఉపదర్శిష్టత్వ మనవలయు

దత్ప్రయోగం బచ్చుతప్పని వ్రాసె
నింతప్రియంబుగా నెందఱు నిజము
నెఱిఁగింపఁగలరు సాహిత్యలోకమున?

సత్యనిష్ఠ సుంత సడలింప నొల్లని
వాఁడ నగుట, నిక్కువంబు సకల
శుభవిధాత యగుట సుహృదగ్రణికి నపు
డిట్లు వ్రాసినాఁడ నెడఁద విచ్చి.

సుబ్బరాయ ! సుగుణసుందర ! నీవు నా
వాసి వలచి తెలియఁజేసినట్టి
నెరసు నొరులపైకి నెట్టి పాపము మూట
గట్టుకొనెడి కవిని గాను నేను.

నా యజ్ఞత హేతువుగా
నా యపశబ్దంబు వొడమె నట్టిదొసఁగు లె
న్నో యుండవచ్చు మత్కృతి
నాయాసం బనక వెదకు మభినంద్యమతీ !

ఎంతనేర్చినాఁడ నే నపారముగదా
చదువు; నిన్నువంటిచదురు లండ
దండ యగుటకతన బండి దొర్లింపఁగా
సాహసింతు నే నశక్తుఁ గనుచు

దురభిమానముచే సత్యదూరమైన
పలుకు వెడలించువారల బ్రదుకుఁ గందు
నేమిఫల మందె వారికి? శేముషీ వి
భూషితులమోల బన్న మబ్బుటయకాక.

ఎఱుఁగనిది బ్రదికినన్నా
శ్లాఘుఁగవలెన్, దనకు లోకహితబుద్ధి నా లో
నెఱపిన యుపకృతి సఫలన్
మెఱయవలెన్ నరుఁడు బుధులు మేల్ మే లనఁగన్

# యోగసక్తా పరిణయము

శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులు

యోగసక్తా పరిణయము పది రెండాశ్వాసముల ప్రబంధము. అముద్రితము. దీని వ్రాత ప్రతులు రెండు నావద్ద మున్నవి. అందొకటి క్రీ. శ. 1896 సం. డిసంబరు నెల నాటి వ్రాతప్రతి. ఇది శ్రీ గుడివాడ చంద్రకాంతంగారి కోసమై శ్రీ నండూరి బంగారయ్యయగారు 'ప్రతిమంచి' వ్రాసినట్లు గ్రంథాంతమున వ్రాయబడియున్నది. 'ప్రతి నుంచి' అనగా మూలప్రతినుంచి అని అర్థమేమో! పుస్తకము ఫుల్‌స్కేపు ½ సైజున 101 పుటలు కలదై యున్నది. చివర 3 పుటలలో ఆయా ఆశ్వాసములలోని విషయములుకూర్చిన సూచికయున్నది. ఈ ప్రతిలో 12 ఆశ్వాసములు పూర్తిగా నున్నవి. దాదాపు 75 ఏండ్లనాడు వ్రాసిన ప్రతి అయినందున కాగితములు నిస్సారములూ, శిథిలములూ అయి పట్టుకొన్నచో తునిగిపోవు దుఃస్థితిలో నున్నవి. లేకరి, వ్యుత్పన్నుడు కానందున వ్రాతతప్పులు మిక్కుటముగా నున్నవి.

రెండవ వ్రాతప్రతికూడ దాదాపు అంత పురాతనమైనదే. ఇది 1/8 డెమ్మీసైజు పుస్తకము. పేజీలసంఖ్య లేదుగాని నూటికిమించియే పుట లుండవచ్చును. దీనిని ఎప్పుడు ఎవరు వ్రాసినదీ సూచింపబడలేదు. మొదటిప్రతి కాగితములకన్న ఇందలి కాగితములు మరీ శిథిలావస్థలో నున్నవి. ఈ ప్రతిలో పదునొకండాశ్వాసములు మాత్రమే యున్నవి. గ్రంథాంతమున పద్యసంఖ్య 1075 అని యున్నది.

ఈ కావ్యము మొదటి అయిదాశ్వాసములును ద్వాదశాశ్వాసమును మద్దిపట్ల అప్పనశాస్త్రి ప్రణీతమైనట్లును, ఆరునుండి పదునొకండవ ఆశ్వాసము వరకును గల ఆరాశ్వాసములు కొట్ర వెంకటరామకవీంద్ర ప్రణీతమైనట్లును ఆశ్వాసాంత గద్యములనుబట్టి తెలియుచున్నది. అప్పనశాస్త్రిగారి ఆశ్వాసాంత గద్య మిట్లున్నది :—

'ఇది శ్రీ మదుమారమణసేవాసమాసాదిత సంస్కృతాంధ్రభాషాకవితాధురంధర రాశ్వలాయన కుల పవిత్ర భారద్వాజసగోత్ర నృసింహశాస్త్రిపుత్ర సకల నిగమాగమప్రవీణ వినుతగుణగణ మద్దిపట్ల వంశపయఃపారావారరాకాసుధాక రాప్పనశాస్త్రి ప్రణీతంబైన యోగసక్తాపరిణయంబను మహాప్రబంధంబునందు......'

దీనినిబట్టి మద్దిపట్ల నృసింహశాస్త్రి కుమారుడగు అప్పనశాస్త్రి ఈ కావ్యమును రచించినట్లు తెలియుచున్నది. ఆతని దేశకాలాదులిం దెక్కడను సూచితములు కాలేదు.

కొట్ర వేంకటరామకవీంద్రుల గద్యమిది :—

'ఇది శ్రీమదాఖండలాద్యనేకాశాధీశ మస్తక విన్యస్త మకుట వజ్రమణిప్రభా వినూతన మరంద పానామోదాగత (?) మిళిందబృంద విరాజమాన పాదాంభోజ సంవాహనదక్షాలువేలుమంగా మనఃకైరవ పూర్ణచంద్రాయిత ముఖముకుర శ్రీ వేంకటేశ్వర వర ప్రసాద లబ్ధ సంస్కృతభాషామిశ్రాంధ్రకవితాధురంధరాపస్తంబసూత్రపవిత్ర వేంకటశాస్త్రిపుత్ర కొట్రవంశక్షీరపారావార రాకాసుధాకర వేంకటరామకవీంద్ర ప్రణీతంబైన యోగసక్తాపరిణయంబను మహా ప్రబంధంబునందు...'

ఈ గద్యమునుబట్టి కొట్ర వేంకటశాస్త్రి కుమారుడగు వేంకటరామకవీంద్రుడు 6 నుండి 11 వరకుగల ఆశ్వాసములను రచించినాడని తెలియుచున్నది.

ఈ కవియొక్క దేశకాలములును కావ్యమునం దెక్కడను సూచితములు కాలేదు.

## ప్రధానకథ

యోగసక్త అనునామె బృహస్పతి చెలియలు. అంగిరోమహర్షి పుత్రిక. ఈమె చాలకాలము బ్రహ్మ వాదినియై వైరాగ్యముతో తత్త్వప్రచారము సలుపుచు లోకమున సంచారము చేసినది. కడకు వసువులలో ఎనిమిదవ వాడగు ప్రభాసుని పెండ్లియాడినది. ఈ దంపతులకు శిల్పప్రజాపతియగు విశ్వకర్మ జనించి నాడు. ఈ కథ మహాభారత, వాయు, విష్ణు, స్కందాది పురాణములలో ప్రస్తావింప బడియున్నది. యోగసక్తకు యోగసిద్ధయనియు నామాంతర మగ పడుచున్నది. మహాభారతము ఆదిపర్వములోని 66 వ అధ్యాయ మిట్లు చెప్పుచున్నది—

'బృహస్పతే స్తు భగినీ వరస్త్రీ బ్రహ్మవాదినీ
యోగసక్తా జగత్ కృత్స్న మసక్తా విచచార హ
ప్రభాసస్య తు సా భార్యా వసూనా మష్టమస్య హ
విశ్వకర్మా మహాభాగో జజ్ఞే శిల్ప ప్రజాపతిః
కర్తా శిల్పసహస్రాణాం త్రిదశానాం చ వర్ధకిః
భూషణానాం చ సర్వేషాం కర్తా శిల్పవతాం వరః
యో దివ్యాని విమానాని త్రిదశానాం చకార హ
మనుష్యా శ్చోపజీవన్తి యస్య శిల్పం మహాత్మనః
పూజయన్తి చ యం నిత్యం విశ్వకర్మాణ మవ్యయమ్'

ఈ అంశములనే నన్నయగారు ఆంధ్రమహా భారతములో ఇట్లు వ్రాసినారు—

వ. '...ప్రభాసుండను వసువునకు బృహస్పతి చెలియలైన యోగసిద్ధికి విశ్వకర్మ పుట్టె. 67

కll ఆ విశ్వకర్మ నిర్మిత
దేవవిమానుండు నిఖిల దివ్యాభరణ
శ్రీ విరచన పరితోషిత
దేవుఁడు శిల్పప్రజాపతియునై నెగడెన్.
—ఆదిపర్వము. 3. ఆ. 68. పద్యం.

నన్నయగారు యోగసక్తను, యోగసిద్ధి అని పేర్కొనినారు. నన్నయగారు గ్రహించుటకు గైకొన్న మహాభారతప్రతిలో యోగసిద్ధి అనియే యుండ వచ్చును.

వాయుపురాణము ఉత్తరభాగము 22 వ అధ్యాయములోని దిగువ శ్లోకములనుబట్టి యీమె పేరు 'యోగసిద్ధ' అని తెలియుచున్నది. చూడుడు—

'బృహస్పతే స్తు భగినీ
వరస్త్రీ బ్రహ్మచారిణీ,
యోగసిద్ధా జగత్ కృత్స్న
మసక్తా చరతే సదా,
ప్రభాసస్య తు సా భార్యా
వసూనా మష్టమస్య తు,
విశ్వకర్మా సుత స్తస్యాం
జాతః శిల్పి ప్రజాపతిః.'

ఈమె అంగిరసుని పుత్రికయను విషయమును స్కందపురాణాంతర్గత ప్రభాసఖండములోని దిగువ శ్లోకములు స్పష్టము చేయుచున్నవి—

'అథ నామ్నానురూపేతి
మరీచి దుహితా శుభా,
పత్నీ త్వంగిరసః సా తు
జననీ తు బృహస్పతేః
బృహస్పతే స్తు భగినీ
విశ్రుతా బ్రహ్మవాదినీ,
ప్రభాసస్య తు సా పత్నీ
వసూనా మష్టమస్య తు
ప్రసూతా విశ్వకర్మాణం
సర్వ వ్రతాం వరమ్.

'మరీచిమహర్షి కూతును—అనురూప యను నామెను అంగిరసుడు పెండ్లాడెను. వారికి బృహస్పతియు, ఒక కూతురును జన్మించిరి. బృహస్పతి చెలియలు (యోగసక్త, లేక యోగసిద్ధ) బ్రహ్మ వాదినియై అష్టమవసువగు ప్రభాసుని పెండ్లి యాడెను. ఆమె శిల్పవంతులలో శ్రేష్ఠుడైన విశ్వ కర్మను కనెను.' ఈ విషయములనే విష్ణుపురాణ మిట్లు తెలుపుచున్నది—

'బృహస్పతే స్తు భగినీ
వరస్త్రీ బ్రహ్మచారిణీ,
యోగసిద్ధా జగత్ కృత్స్న
మసక్తా విచర త్యుత,
ప్రభాసస్య తు సా భార్యా
వసూనా మష్టమస్య తు,
విశ్వకర్మా మహాభాగ
స్తస్యాం జజ్ఞే ప్రజాపతిః.'

—విష్ణుపురాణం. ప్రథమాంశము. 15 అధ్యాయము.

దీనిని వెన్నెలకంటి సూరనార్యుడు—

వ. ...ప్రభాసునకు బృహస్పతి చెలియలైన యోగసిద్ధకు విశ్వకర్ముండు పుట్టె.'

(2 ఆశ్వాసము. 270 వచనము)

'ఆ విశ్వకర్మ సముదంచిత శిల్పవిద్యా
ప్రావీణ్యతం బ్రిదశపట్టణతక్షకుండై
భావంబునందు బహుభంగుల నేమియైనన్
గావించుచుండుఁ దన కౌశల ముల్లసిల్లన్.

—2 ఆ. 271.

వ. అట్టి విశ్వకర్మ ప్రజాపతికిఁ దృష్టపుట్టె. వానికి మహాతపోధనుండైన విశ్వరూపుండు పుట్టె. వానికి హరుండును.. కపాలియు నన నేకాదశరుద్రులు పుట్టిరి—(272)

అని ఆదిమసర్గప్రకారమును వర్ణించుచు ఆంధ్రీకరించినాడు. మొత్తముమీద యోగసక్తా పరిణయ కావ్యకర్తలు అతిపురాతనములై శ్రుతిపురాణ ప్రసిద్ధములైన కథల నెన్నుకొని యీ కావ్యమును రచించినట్లు కన్పట్టుచున్నది. ఆ యంశమునే దిగువ పద్యములో సూచించినారు అప్పనశాస్త్రిగారు —

క॥ అని యిష్టదేవతా ప్రా
ర్థన గురువందన మొనర్చి తచ్ఛ్రుతుల పురా
తనకథల నరసి యిక్కథఁ
దెనుఁగుం గావింపఁబూనితిని యెట్లన్నన్.

1. ఆశ్వా. 14 పద్యము.

కవి, కథా ప్రారంభమున అంగిరసుని సంతాన మునుగూర్చి యిట్లు వర్ణించుచున్నాడు—

సీ॥ అజున కాత్మజుఁడైన యంగిరసున కిర్వు
రాత్మజు లొకపుత్రి యమరఁ బుట్టి
రందులో నగ్రజుఁ డమరగురుండయ్యె,
రెండవ పుత్రుండు దండితారి
షడ్వర్గుడై యక్షసంతతి గెల్చి, ని
శ్చల యోగవిజ్ఞాన బలము కలిగి,
తాపసోత్తంసుఁడై తనరెను; తత్కన్య
కామణి యోగసక్తాభిధాన

తే॥ యగుచు సౌందర్యసుగుణము లగణితముగ
తల్లిదండ్రుల యుల్లము తెల్లవేళ
నలరఁజేయుచు విలఁగల చెలువ లెల్ల
తులకుఁ దగరని బుధులు సంస్తుతి యొనర్ప.

1. ఆశ్వా. 64 పద్యము.

కథానాయకుని నామమును 'ప్రభాసు'డని కాక, 'ప్రభావసు'డని యీకవి వాడియున్నాడు -

ఉ॥ వచ్చి సురాపగా విమల
వారి పవిత్రతఁ బ్రస్తుతించుచున్,
గ్రచ్చఱ వేదమంత్రము ల
కల్మషశేముషి నుగ్గడింపుచున్,
ముచ్చట దీఱఁ గ్రుంకి మున
మున్న జపం బొనరించి వేడ్క పెం
పచ్చుపడంగ నద్దరి, న
యస్థితినున్న ప్రభావసున్ వసున్. 68.

తే॥ చూచి మదినెంచి తలయూచి చోద్యమంది,
వనౌనిచంద్రుని నైష్ఠికమహిమఁ బొగడి,
కమలదళనేత్ర తన చెలిగమిని జూచి,
పలుకుపలుకున నమృతంబు చిలుకఁ బలికె.69

భారతాదులలో—కొన్ని ప్రతులలో ప్రభావసు డనికూడ అష్టమ వసువునకు నామధేయమున్నట్లు తెలియుచున్నది. కీ. శే. బ్రహ్మశ్రీ వడ్డెపాటి నిరంజన శాస్త్రిగారు తాము సంగ్రహించిన విశ్వకర్మ బ్రాహ్మణ వంశాగమములో భారతములోని దిగువ శ్లోకము నుదాహరించినారు—

'ప్రభావసో స్తు భార్యాయాం
వసూనా మష్టమస్య హ

విశ్వకర్మా మహాభాగో
జజ్ఞే శిల్పి ప్రజాపతిః.'

దీనినిబట్టిచూడ అప్పనశాస్త్రిగారు ప్రభావసు నామమునే గ్రహించినారని స్పష్టమగు చున్నది.

లేఖక ప్రమాదములు మిక్కుటముగా నున్నను సవిమర్శముగా చూచినచో, చేయితిరిగిన కవులవలెనే వీరగపడుచున్నారు. కావ్యము నారంభించిన అప్పన శాస్త్రిగారు కవిస్తుతిలో వాల్మీకిని, వ్యాసుని ఇట్లు స్తుతించినారు—

మ॥ ......................లస
త్కుద్దాలవరౌ రామతా
రకమంత్రంబు జపించి మించి మునివ
ర్గం బెంచ నాచంద్రతా
రకమై ధాత్రి నెసంగ రాఘవు చరి
త్రం బాదికావ్యంబుగాఁ
బ్రకటోత్కంఠ నొనర్చినట్టి యమలున్
బ్రాచేతసున్ వేడెదన్. 10

క॥ నుతిసేతు నీలజలదా
కృతి భాసున్, హరిణకృత్తికృతశుభవాసున్,
శ్రుతిసారతత్త్వవిభజన
వితతప్రతిభావిలాసు వేదవ్యాసున్. 11.

కుకవినింద ఇట్లు చేసినారు—

శా॥ సారం బించుక లేక, యన్వయ సమా
చారంబు తర్కించి యే
మేరం జూచిన లేక, లక్షణసము
న్మేషం బనాలోక్యమై
దూరుం జెంది పరార్థ విప్రకృత దు
ర్దోషాప్తి నవ్రజ్ఞన
త్కారంబౌ కుకవిప్రణీత కృతియన్
కన్యన్ బుధుల్ మెత్తురే! 13.

కావ్య నిర్మాణ శిల్పమున కనువైన వర్ణనాదులు సేయుటలో అప్పనశాస్త్రి కవితా ప్రతిభ గాఢముగా గలవాడనియే తెలియుచున్నది తేజోవతీపురము యొక్క పరిఘను వర్ణించిన దిగువపద్యమును పరికింపుడు—

సీ॥ ప్రస్ఫుట ర్వాగ్ని పటుతరార్చిస్తప్త
జీవన మగుచు ఘోషింపదేని,
ఘటజాత మౌనీశ కరతలాంతరమున
బిందువై దైన్యంబుఁ జెందదేని,
ప్లవగ కరానీత పర్వతోత్కర బద్ధ
సేతురుంద్రార్తిని జెందదేని,
అధిక దోషాకరు నాత్మజుగాఁ గని
గురుభంగ సంగతి గుందదేని,
తే॥ అసమ రభస సురాసుర విసర మథన
జనిత పరిభవ కలుషము నెనయ దేని
సవతు రాఁదగు నాతోడ జలధి యనుచు
పరిఘ యప్పురి ననిశంబుఁ బరిఢ విల్లు. 38.

పురవర్ణనము:—

తే॥ వజ్రమయ సౌధరుచులచే వరలు ప్రోలు
హరు విధంబునఁ దనరారె; హాటకాంబ
రాంచిత సుకేతు సంగతానంతమగుచు
హరివిధంబున నలరె నప్పురవరంబు. 37

చ॥ అగణిత చంద్ర కాంతమణి
హర్మ్యతలంబుల మేలి జాళువా
జగతులలీల నున్న పురి
చానల చొక్కముఁ జూచు వేడుకన్
గగనపథప్రచారసుర
కంజదళాక్షులు వచ్చిరో యనన్
దగె, గురుగోపురగ్రథిత
తప్తసువర్ణ విచిత్ర పుత్రికల్. 41.

ఇట్టి పద్యములు పెక్కులు. ఈ కావ్యమున ప్రధానకథతోబాటు అంగోపాంగములుగా గూర్చిన కథలు సైతము పెక్కులు పొడకట్టుచున్నవి. అయినను వానికి చక్కని సందర్భమును పొసగించుకొని, ఔచిత్యమును కాపాడుకొన్నారీ కవులు. యోగనక్త ప్రభావమునిగాంచి తాన్నై వరించును. కన్నెలు తామై వరులపై తగులమును గొనుట ఉచితమా అను సందియము కలుగగా, ఆ సందర్భమున భృగుమహర్షి

భార్యయగు పులోమకు దేవహూతి వృత్తాంతమును వివరించును. ఇట్లు ప్రతికథకును సందర్భమును పొసగించుకొన్నారు. ఆయా ఆశ్వాసములలో వర్ణితములైన విషయములు దిగువ వివరింపబడు చున్నవి.

1 ఆశ్వాసము : నైమిశారణ్య వర్ణనము, తేజోవతీపుర మాహాత్మ్యము, తేజోవతీపురమున ప్రభావసుండు తపంబున కరుగుట, అంగిరసుని కూతురగు యోగసక్త ప్రభావసునిం జూచివరించుట, అంగిరసుడు భృగుని కటకంబున కరుగుట.

2 ఆశ్వాసము : భృగువు భార్యయగు పులోమకు దేవహూతికర్దములచరిత్రముచెప్పి యోగసక్త ప్రభావసుని వరించుట యుచితమే యనుట.

3 ఆశ్వాసము : భృగువు ప్రభావసుని కడ కేగి యోగసక్తను వివాహమాడమనుట, అందుల కంగీకరింపని ప్రభావసునికి భృగువు ఉద్దాలక చరిత్ర ముపన్యసించి యొడంబఱచుట, భృగుచరిత్రము.

4 ఆశ్వాసము : భృగువు సత్యలోకమునకేగి, శిల్పి ప్రజాపతికి యోగసక్తా ప్రభావసుల పరిణయ నిర్ణయంబు చెప్పుట. యోగసక్తకు పతివ్రతా మహిమంబును, గిరిజాతపోమాహాత్మ్యంబును దెలుపుట. యోగసక్త తపస్సు. ఆమె పరిణయ నిశ్చయము. వివాహ ప్రయత్నములు.

5 ఆశ్వాసము : గౌతమ తపఃప్రభావము. అహల్యా సౌందర్యముంగని సూర్యేంద్రులు మోహించుట. వాలి సుగ్రీవుల జననము. గౌతముండు బ్రహ్మారణ్యమున కేగుట. అంజనాదేవి వాలి సుగ్రీవుల జననంబు నెఱుంగుట. ఆంజనేయ జననమునకు విశ్వ గురుండు కౌపీన కవచ కుండలంబు లిచ్చుట. హనుమచ్చరిత్రము. సుందోప సుందుల తపము. సుందోప సుందు లింద్రాదులను జయించుట. ఇంద్రాదులు బ్రహ్మను ప్రార్థించుట. తిలోత్తమా సృష్టి. ఆమెచే సుందోపసుందుల మృతి.

6 ఆశ్వాసము : పంచముఖబ్రహ్మచరిత్రము

7 ఆశ్వాసము : పంచబ్రహ్మల గోత్రాభి వర్ణనము.

8 ఆశ్వాసము : త్రిపురాసుర చరిత్రము.

9 ఆశ్వాసము : ఇంద్రునిచే నవమానింపబడి బృహస్పతి అదృశ్యుడగుట. విశ్వరూప చరిత్రము.

10 ఆశ్వాసము : పార్వతీ వివాహ వృత్తాంతము.

11 ఆశ్వాసము : లింగోద్భవ కథ. చ్యవనుని చరిత్ర.

12 ఆశ్వాసము : యోగసక్తా ప్రభావసుల పరిణయము.

ఈ కావ్యమును వ్రాసిన మద్దిపట్ల అప్పన శాస్త్రి, కొట్ట వేంకటరామ కవీంద్రుల వంశము వారు ఎవ్వరైన మున్నచో, వారియింట ఈ కావ్యపు వ్రాతప్రతులుండవచ్చునని నా యూహ. దీనిని శుద్ధప్రతిగా సంతరించి ప్రకటించుట మంచిదను నభిప్రాయముతో ఈ వ్యాసము వ్రాయుటయ్యెనది.



# త లు పు లు

శ్రీ కె. శివారెడ్డి

తలుపులు
రెండు బార్లాతీసి
కౌగిలికి చాచిన రెండు చేతుల్లా
నా గది
నా హృది;
బ్దాన్ని
పొడుకుంటూ చలిగాలి
ఆర్తిలా
కన్పించని విషాదమూర్తిలా
నా గదిలోకి
నా మదిలోకి;
తూచి తూచి
విట్ఫార్పును దంచినట్లు
గోడ గడియారం గంటల్ని వాయిస్తూ
నా గది గుండెలో
నా నరాల వాడల్లో;
కాలంలా
జలజలా ప్రవహిస్తున్న
నా రక్తపు సవ్వళ్ళు—
నా రక్తం వేడిని, సవ్వడిని, వాడిని
కొలుస్తున్న నా కలం
నా కలం కడుపులో సిరా ప్రాణం.
తీసిన తలుపులూ
చాచిన చేతులూ
ఆలోచనల్ని మోస్తూ

## త లు పు లు

రాస్తున్న నా కలం — నా గదీ — నా హృదీ;
చలిగాలి—నేను—సర్వస్వం.
పాళీలో ప్రభావిత మౌతున్న ప్రపంచం.
కాంతికీ
స్నేహానికీ తలుపులూ—చేతులూ—
మెట్లకింద ఏడ
మెట్లమీద దొర్లుతున్న 'వెల్తురు' ఏరు
కాంతిలోంచి
వెలుగులోంచి
చెట్లబతుకులోకి స్రైతం చేవ—జవం—జీవం;
కన్ను మూస్తే తమస్సు
కన్ను తెరిస్తే ఉషస్సు
తలుపువేస్తే అజ్ఞానం
తలుపులుతీస్తే విజ్ఞానం.

# వెల్తురు - సంగీతం

నిశ్శబ్దానికి
రెక్కలు లేవు—కాని
విద్యుత్తుల్లా గాలి అణువుల్లోకి
ఒక్కక్షణంలో ప్రాకిపోతుంది సర్వ

నిరాశకు
కళ్ళు లేవు కాని
ధృతరాష్ట్రుని కౌగిలిలా దగ్గరకు పిల్చి
పిండి పిండి చేస్తుంది జీవన వాంఛను
కదన కుతూహలాన్ని—ఉత్సాహాన్ని;

సంగీతానికి
తనువు లేదు—కాని

ప్రాణాల్ని తన్మయతలోముంచే శక్తి ఉంది;
వెలుతురుకి
ఆకారం లేదు—కాని
సాకారాల్ని సజీవంచేసే ప్రాణమది;

'వెల్తురు—సంగీతం'
నిరాశకు కత్తిపోటు
నిశ్శబ్దానికి చెంపపెట్టు
బ్రతుక్కి ఆయువుపట్టు.



# వేదాంత దేశికులు

## శ్రీ ఇరంగంటి రంగాచార్య

వేదాంతదేశికులు సెప్టెంబరు 1268 A. D. లో జన్మించిరి. విభవ సంవత్సరమున భాద్రపద మాస (పురత్తాసై)మున దశమి తిథియందు విష్ణువు అధిదైవతముగా గల పుణ్య నక్షత్రమగు శ్రవణమునందు వీరు అవతరించిరి. వేదాంత దేశికుల తండ్రి అనంతసూరి. తల్లి తోతారంబ. తాత (తండ్రి తండ్రి) పుండరీకాక్షులు. వీరు విశ్వామిత్ర గోత్రీయులు. తోతారంబ కడాంబి అప్పుళ్లార్‌యొక్క సోదరి. కడాంబి అప్పుళ్లార్, కడాంబి అకన్ వంశజులు. వీరు భగవద్రామానుజుల శిష్యులలో నొకరు.

దేశికుల తల్లిదండ్రులు మొదట సంతానము లేక పరితపించుచు, సదా తిరుపతి వేంకటాచలపతిపై ధ్యాన తత్పరులై పుత్రకాములై వుండేవారు. ఒకనాడు అనంతసూరులకు స్వప్నములో వేంకటాచలపతి బాలకుడుగా దర్శనమిచ్చి, ఆలయములోని యొకగంటను చేతికిచ్చి, 'ఈ గంటను నీభార్యచేత మింగించవలెను' యని యాజ్ఞాపించి యంతర్ధానమయ్యెను. అదే స్వప్నములో స్వామి యాజ్ఞానుసారము శీలవతియగు తనభార్య గంటను మింగినట్లు జూచెను. మరునాటి యుదయమున స్వప్న వృత్తాంతము భార్యకు చెప్పగా భార్య తనకుకూడా ఇదే స్వప్నముగల్గినదని తెలుప దంపతు లిద్దరు పరస్పరము విస్మితులైరి. దేవాలయములోని గంట అదృశ్యమగుట అర్చకులు దెలిసికొని అధికారికి దెలుపగా అధికారి అర్చకులను నిర్బంధములో నుంచెను. వేంకటాచలపతి స్వయముగా యతిరాజమఠములోని యతులకుకూడా స్వప్నమునందు ఈ వృత్తాంతమును కీర్తించుటచే, యతులు స్వప్నవృత్తాంతానుభూతి అధికారులకు దెలిపి అర్చకులను విముక్తుల గావించిరి. ఆలయ ప్రధానాధికారికూడా స్వయముగా ఈ పుణ్యదంపతుల నోటనుండి స్వప్న వృత్తాంతమువిని ఆశ్చర్య చకితుడయ్యెను. తోతారంబ గంటను 12 సంవత్సరములు ధరించిన పిమ్మట వేదాంతదేశికులు జన్మించిరి. కావున దేశికులు గంటాంశ సంభూతులని శ్రీవైష్ణవుల ప్రగాఢ విశ్వాసము. భగవద్రామానుజులే తిరిగి అవతరించిరియని కొందరి నమ్మకము. ఎట్లయినను,

'తోతారంబా తదా తేన బాలేనాఽమిత తేజసా
రరాజ దేవకీదేవీ కృష్ణేన శిశునా యథా।
కౌసల్యా రాఘవేణేవ దేవ్యుపేంద్రేణ భాస్వతా
యదాఽ దితిః కాంతమతీ లక్ష్మణార్యేణ ధీమతా।
వేదాంతార్య స్తదా పత్ర లేఖినీ కరపంకజః
జన్మభూమింతదోచ్ఛిష్ట ముచ్ఛిష్ట మితి చ బ్రువన్'

దేవకీదేవి బాలకృష్ణునిచేతను, కౌసల్యాదేవి శ్రీరామచంద్రునిచేతను, అదితి దేవేంద్రునిచేతను, కాంతిమతీదేవి రామానుజులచేతను శోభించినట్లు, అమితతేజస్సుగల వేదాంతదేశికులచేత తోతారంబ శోభించుచుండెను. దేశికులు గంటమును కరపంకజమునం దుంచుకొని జన్మభూమిని ఉచ్ఛిష్ట ముచ్ఛిష్టమని బయలుదేరిరి. దేశికుల జన్మనామము వేంకటాచార్య. పువ్వు పుట్టగానే పరిమళించునట్లు 4 సంవత్సరముల ప్రాయముగల బాలుడుగా నున్నపుడే దేశికులు తమ మేనమామ కడాంబి అప్పుళ్లార్ భాష్య ప్రవచనములో స్ఖాలిత్యమురాగా పునఃస్ఫురణము గావించిరట. 'మహానేష భవిష్యతి న సంశయః' యని అప్పుళ్లార్ ఆనందాశ్చర్యములు పొందిరి. దేశికులు వీరివద్దనే వేదాంతశాస్త్రమును శ్రవణమాత్రముననే గ్రహించి అధ్యయనము జేసిరి. వీరివద్ద గరుడ

మంత్రోపదేశమును, వాదిహంసాంబువాహ మంత్రమును పొందిరి. ఒకసారి తిరువహేంద్రపురములో (కడ్డలూరికి దగ్గర) వీరు ధ్యాననిష్ఠలో నుండగా వైనతేయుడు హయగ్రీవమంత్రోపదేశమును జేసెను. హయగ్రీవ కటాక్షమువలననే దేశికులు అత్యద్భుత జ్ఞానశక్తిగలవారై శతాధిక దివ్యోత్కృష్ట గ్రంథములను రచించిరి. 'వింశత్యబ్దే విశ్రుత నానావిధవిద్య' 'త్రింశద్వారం శ్రావిత శారీరక భాష్య' యనునట్లు 20 సంవత్సరముల ప్రాయములోనే సకలశాస్త్ర కళాకోవిదులైరి. 30 సార్లు శ్రీభాష్యప్రవచనము జేసిరి.

దేశికులు గృహస్థులు. వీరిభార్య తిరుమంగై. వీరి కుమారులు వరదాచార్య. వీరిగురించి పిళ్లయ్ అంతలి అను తమిళగ్రంథమును 20 పద్యములలో వ్రాసిరి. దేశికులు తిరువహేంద్రపురము, శ్రీరంగం, కాంచీపురములలో వేదాంత తత్వాంశ సమాయుక్త భక్తి ప్రపత్తి పురస్సర రచనలను సాయించుచు జీవితమును ప్రబల వైరాగ్యానుష్ఠానచింతనలతో గడపి 100 సంవత్సరములు జీవించిరి. యామునాచార్యులు, భగవద్రామానుజులు కేవలము సంస్కృతములోనే గ్రంథములను రచించిరి. ఆళ్వార్లు కేవలము తమిళములోనే ప్రబంధముల సాయించిరి. కాని వేదాంత దేశికులు సంస్కృతములోను, తమిళములోను, మణిప్రవాళములోను (సంస్కృత, తమిళముల మిశ్రమము) 108 రచనలవరకు జేసిరి. సంస్కృత రచనలో 28 స్తోత్రములు, 4 కావ్యములు, 1 నాటకము, హయగ్రీవ స్తోత్రము, సుదర్శనాష్టకము, అభీతిస్తవము, గరుడ స్తవము, శ్రీస్తుతి (కనకధారాస్తవము) మొదలగునవి మంత్రగర్భితములు. మాలికాఫరు దండయాత్ర కాలములో దేశికులు అభీతిస్తవము రచించి రంగనాధుల ఉత్స విగ్రహములను, సుదర్శన భట్టార్ విరచిత శ్రుతప్రకాశిక యను శ్రీభాష్య ప్రసిద్ధ వ్యాఖ్యానమును కాపాడగల్గిరి. ఒకానొక అకించనునకు శ్రీస్తుతి రచించి కనకవర్షమును గురిపించిరి. కృపాన్వితులైన శ్రీ రంగనాథునిచేతను శ్రీ రంగనాయకి చేతను 'వేదాంతచార్య', 'సర్వతంత్ర స్వతంత్ర'యను బిరుదములుపొంది, కవులలోను, తార్కికులలోను, వేదాంతులలోను మకుటాయమానముగా శోభించుచు 'కవితార్కిక సింహము' యను బిరుదును ఆర్జించి, దేశికులు వైభవముగా నుండుకాలములో మహామాంత్రికుడైన నొక వ్యాలగ్రాహి దేశికులవద్దకువచ్చి తన్ను జయించవలసినదని నిర్బంధము చేసెను. 'వివాహశ్చ వివాదశ్చ సమయోరేవ శోభతె' యను న్యాయమున వరౌనముగా ఆలయమునకు పోగా నచట నొక సర్పఖండమును చూచి ఏడురేఖలనుగీసి ఆలయములోని కృష్ణ సన్నిధికిపోయి ధ్యాననిష్ఠలో నుండిరి. వ్యాలగ్రాహి తనమంత్ర శక్తిచేత వివిధానేక సర్పములను ప్రయోగించగా, ఆ రేఖలను దాటలేక నివర్తితములైనవి. వ్యాలగ్రాహిక్రుద్ధుడై శంకపాలుడను మహాసర్పమును దేశికులను కరచుటకు ప్రయోగించెను. శంకపాలుడు వేగాతిశయముతో రేఖలనుదాటి దేశికులను కరచుట కుద్యుక్తుడైయుండ, దేశికులు గరుత్మంతుని స్మరించెను. తత్క్షణమే గరుత్మంతుడు శంకపాలుని తదితర నివర్తితములైన సర్పములను వాయువేగముతో ఆకాశమార్గమునకు తీసుకొనిపోయెను. వ్యాలగ్రాహి అప్పటికి తన మత్సరమును వీడి రక్షించుమని దేశికుల పాదములపైబడి అర్థించెను. దయార్ద్రహృదయుడగు దేశికులు గరుడ పంచాశత్ దండకమును సాయించగా వ్యాలగ్రాహి తన సర్పములను తిరిగి పొందెను.

వేదాంతదేశికులు విద్యారణ్యులు బాల్య స్నేహితులు. విద్యారణ్యులు విజయనగరరాజ్యమునకు మంత్రిగా నున్న కాలములో నొకసారి దేశికులను విజయనగరమునకు రమ్మనమని, బుక్కరాజుని శిష్యునిగా జేసెదనని లేఖవ్రాసి పంపెను. దానికి సమాధానముగ దేశికులు నొక శ్లోకమువ్రాసి పంపిరి.

క్షోణీ కోణ శతాంశపాలన కలా
దుర్వార గర్వానల
క్షుభ్యత్ క్షుద్ర నరేంద్ర చాటు
రచనా ధన్యాన్ నమన్యామహే।

దేవం సేవితు మేవ నిశ్చిను
మహేయో౽సౌ దయాళుః
పురాధానా ముష్టిముచే కుచేల
మునయే దత్తేస్మ విత్తే శతావ్ ॥

భూభాగములో నొకానొక మూలలోని శతాంశ భాగమును పాలించు గర్వాతిశయులైన రాజులకు స్తోత్ర పద్యములను వ్రాసినవారిని ధన్యులగా భావించము. పిడికెడు అటుకులకు సకలైశ్వర్యములను కుచేలమునికి ప్రసాదించిన దయాసింధువగు కృష్ణపరమాత్మనే సేవించుటకు నిశ్చయము జేసికొంటిమి. ఈ సమాధానముతో విద్యారణ్యులు యతీశ్వరులకుకూడా సాధ్యముగాని వీరి వైరాగ్యమునకు విస్మయము జెంది యే యుపాయముచేతనైనను వీరిని తిరిగి వైరాగ్య నిష్ఠనుండి మరలించవలెనని నిశ్చయించుకొని మరల ఆశచూపుచు లేఖను వ్రాసిపంపెను. దేశికులు ఈ లేఖకుకూడా సమాధానముగ శ్లోకద్వయమును వ్రాసిపంపిరి.

'సిలం కిమనలం భవే దనల
వౌదరం బాధితుం ?
పయః ప్రసృతి పూరకం
కిము న ధారకం సారసవ్ ?
అయత్న మల మల్లకం
పధి పటచ్చరం కచ్చరం
భజంతి విభుధాహ్యాహ్యాహ్యా
కుక్షితః కుక్షితః'॥

జ్వలతు జలధి క్రోడ
క్రీడ త్కృపీటభవప్రభా
ప్రతిభటపటుజ్వాలా
మాలాకులో జఠరానలః
తృణమపి వయం సాయం
సంఫుల్ల మల్లిమతల్లికా
పరిమల ముచా వాచా యాచామహే
నమహీశ్వరాన్॥'

కడుపుమంటను చల్లార్చుటకు సిలావృత్తి జాలదో (సిలావృత్తి యనగా కళ్లాలలోని ధాన్యపు గింజలను ఏరుకొనుట)? సరస్సునందుగల నీటిని త్రాగి దప్పిని తీర్చుకొనలేమా? దారిలో దొరికిన మాసిపోయిన గుడ్డముక్క మానరక్షణార్థము ఆచ్ఛాదనకు (కౌపీనమునకు) చాలదా? పొట్టకొరకు పండితులైనవారు వ్యర్థముగా రాజులను సేవించుచున్నారు.

బడబాగ్నివలె కడుపునందు జఠరాగ్ని మండనీగాక వికసితమల్లిపుష్పముల పరిమళములను వదలిన మా వాక్కుతో రాజులను గడ్డిపరకకైనను యాచించముఅని సమాధానమును వ్రాసిపంపిరి.

విద్యారణ్యులు ఉపాయాంతరముగా, 'రాజసేవ చేయనవసరములేదు. నగరమునకు వెలుపల యోజన దూరములో వేంచేసినయెడల, రాజు స్వయముగావచ్చి మీ పాదములవద్ద ధనమును సమర్పించి సేవించుకొని తిరిగి వెళ్లును' అని మరల లేఖ వ్రాసిపంపెను. దీనికి మరల సమాధానముగా శ్లోకద్వయమును వ్రాసిపంపిరి.

'దురీశ్వరద్వారబహిర్వితర్దికా
దురాసికాయై రచితో౽య మంజలిః
యదంజనాభం నిరపాయమస్తి మే
ధనంజయస్యందనభూషణం ధనవ్॥

దుష్టప్రభువులయొక్క గృహద్వారమునకు వెలుపల అరుగులమీద కూర్చున్నవారల 'కొక నమస్కారము. కాటుకవంటి కాంతిగల్గిన పార్థరథి భూషణమే నాకు నిరపాయమైన ధనము.

'శరీర పతనావధి ప్రభు
నిషేవణాపాదనాత్
అబింధన ధనంజయప్రశమదం
ధనం దం ధనవ్।
ధనంజయ వివర్ధనం
ధనముదూఢ గోవర్ధనం
సుసాధన మబాధనం
సుమనసాం సమారాధనవ్.'

జీవితాంతమువరకు ప్రభువుల పాదసేవచేయుట వలన లభించు ధనము మెరుపువంటి ప్రశాంతినిచ్చు దుర్ధనమగును. అర్జును నుద్ధరించినట్టి, గోవర్ధన పర్వతమును ఎత్తునట్టి ధనము మంచిమనస్సుకల

వారలకు సులభసాధ్యము బాధారహితము సమారాధ్యము యగును. ధనము పై జుగుప్స ధ్వనించునట్లు, 11 సార్లు 'ధనం' శబ్ద ప్రయోగము వైచిత్ర్యముగా ఈ శ్లోకమునందు ఇమడ్చబడియున్నది. ఇది దేశికుల అసాధారణ అద్వితీయ రచనా వైదుష్యము.

'నాస్తి పిత్రార్జితం కించిత్
న మయా కించి దార్జితమ్।
అస్తి మే హస్తిశైలాగ్రే
వస్తు పైతామహం ధనమ్'॥

పిత్రార్జిత ధనములేదు. నేను ఆర్జించనూ లేదు. నాకుఉన్నది పైతామహధనము. కంచి వరద రాజులే—అనుట దేశికుల భక్తి, ఆత్మవిశ్వాసములకు నిదర్శనము. వీరి వైరాగ్యము, ధైర్యము, జ్ఞానము, దయ, క్షమ శమ దమ భక్తి సుదృఢత్వములకు విద్యారణ్యులు అమితాశ్చర్యము నొందిరి.

ఈశ్వరుడు పరవ్యూహవిభవాంతర్యామ్యర్చావతార రూపేణ 5 విధములు. 1. పర యనిన శ్రీ వైకుంఠములోనున్న పరవాసుదేవుడు 2. వ్యూహ మనిన జగత్ సృష్టికొరకు క్షీరసాగరమందు వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్న అనిరుద్ధభేదములచే చతుర్విధ స్వరూపులు. వాసుదేవుడు షడ్గుణపరిపూర్ణుడు. సంకర్షణుడు జ్ఞానబలములుగలవాడు. ప్రద్యుమ్నుడు ఐశ్వర్యవీర్యములుగలవాడు. అనిరుద్ధుడు శక్తితేజములుగలవాడు. 3. విభవ మనగా రామకృష్ణాద్యవతారములు. 4. అంతర్యామి యనగా స్వర్గనరకాద్యనుభవ దశలందైనను యోగద్రష్టలచే చూడబడు హృదయప్రదేశావస్థిత స్వరూపి. జీవునితో కలసియున్నను, తద్గతదోషములు స్పృశించవు. 5. అర్చావతారమనగా ఆలయములందలి మూర్తులు. వేదాంతదేశికులు దేశమందుగల శ్రీ వైష్ణవ దేవాలయములందుగల మూర్తులను సేవించుకొనిరి. వీరు అర్చారూపములోని భగవంతునిపై అత్యంతాధిక భక్తికలవారు. వీరు రచించిన 'వరదరాజపంచాశత్'లో వైకుంఠములోపొందు ఆనందముకంటె అర్చావతార భగవన్మూర్తిని చూచుచుపొందు ఆనందమే వాంఛనీయమని తెల్పిరి.

'తురగవిహగరాజస్యందనాందోళికాది
ష్వధికమధికమన్యా మాత్మశోభాం దధానమ్।
అనవధిక విభూతిం హస్తిశైలేశ్వరం త్వాం
అనుదిన మనిమేషై ర్లోచనై ర్నిర్విశేయమ్॥
నిరంతరం నిర్విశత స్త్వదీయం
అస్పృష్ట చింతాపద మాభిరూప్యమ్।
సత్యం శపే వారణశైలనాథ
వైకుంఠవాసేఽపి నమేఽభిలాషః॥

అశ్వ గరుడ రథ పల్లకీ వాహనములందు అధికాధికముగా శోభించునట్టి, అనవధిక విభూతియగు కంచి వరదరాజులు అగు నిన్ను అనిమిష నేత్రములతో దర్శించుకొందును. (కన్నులారా సేవించుకొందును). వివారాది విపత్తులు తాకలేని నీ వైభవమును నిరంతరము అనుభవించుచున్న నాకు వైకుంఠవాసము నందుకూడ అభిలాష లేదని శపథపూర్వకముగా చెప్పుచున్నాను. 'పరమార్థస్తుతి' యందు

'శ్రీమద్గృధ్ర సరస్తీర
పారిజాత ముపాస్మహే।
యత్ర తుంగై రతుంగైశ్చ
ప్రణతై ర్గృహ్యతే ఫలమ్',

'యత్రతుంగై రతుంగైశ్చ' అనుటవలన పొడుగువానికి పొట్టివానికికూడా ఫలము అందును. ఇది అసత్యాభాసము. కాని దీనికి సమాధానము 'ప్రణతైః', అను పదప్రయోగమునందు రూఢియైనది. వంగి ప్రణామము జేసినవానికి మోక్షఫలము సిద్ధించునని తాత్పర్యము. ఈ విధముగా దేశికులు స్తోత్ర రచనలు, అలంకార శైలి శబ్ద వైచిత్ర్య వైభవోపేతములేగాక భక్తి వేదాంత తత్వామృతములతో నిండియుండును. ఇదియే వీరి విశిష్ట అత్యుత్కృష్ట స్తోత్రరచనా వైదుష్యము.

వేదాంత దేశికుల 'యాదవాభ్యుదయము' కాళిదాసరఘువంశముకంటె విలక్షణతరమైనది. హంస

సందేశము మేఘసందేశముతో సదృశమైనది. 'పాదుసహస్రము' రంగనాథుని పాదుకలపై 1008 శ్లోకముల గలది. ఈ కావ్యము ఒకేఒకరాత్రియందు రచించబడినది. ఇంతకంటె ఆశ్చర్యమైనది ఏమి టంటే, ఈ కావ్యము, ప్రస్తావ, సమాఖ్యాది 32 పద్ధతులలో రచించబడిన శ్లోకములతో గూడి యున్నది. ఇందు 30 వ పద్ధతియగు చిత్ర పద్ధతిలో షట్త్రింశత్ పద్ధతులలో ఏకాక్షరముతోకూడిన శ్లోకము, అనగా ఒకే అక్షరముతో శ్లోకమంతా సాగుట.

ఉ. 'తతా తత్తాఽతి తత్తేతా
తాత తీతేతి తాతి తుత్ ।
తత్తత్తత్తా తతితతా
తతే తాతేత తాతుతా ॥

ద్వి, త్ర్యక్షరములతో కూడిన శ్లోకములు సాగినవి.

ఇవిగాక చిత్రపద్ధతియందు బంధవిన్యాసములు అనగా పాదుకాబంధ శరబంధ అష్టదళపద్మబంధాది శ్లోకములుగూడ నున్నవి. ఒకేఒకరాత్రిలో ఆశుధారగా ఇన్ని విచిత్రపద్ధతులలో శ్లోకములను, ఉదాత్తమైన భావములతో నిబంధించుట, దేశికుల దివ్యరచనా శక్తిని నిరూపించుచున్నది.

ప్రసిద్ధాఒద్వైతసిద్ధాంతవిద్గణియగు కృష్ణమిశ్రుని ప్రబోధచంద్రోదయమునకు సమాధానముగా 'సంకల్పసూర్యోదయము'అను నాటకమును రచించిరి. ఈ గ్రంథమునకు పీఠికయందు,

'న తత్ శాస్త్రం న సా విద్యా
నతత్ శిల్పం నసాకలా ।
నాఽసాయోగో నతత్ జ్ఞానం
నాటకే యేన దృశ్యతే ॥

యనగా ఈ నాటకమునందు సర్వశాస్త్రవిద్యా శిల్ప, కళ, యోగజ్ఞానములు పరిపూర్ణముగా గోచరించును. 'యాదవాభ్యుదయము'యొక్క వ్యాఖ్యాత

యగు అప్పయ్యదీక్షితర్, కవితార్కికసింహముయొక్క కావ్యములు లలితమైనను ప్రతిపదములోను గొప్పభావములు గర్భితములై యున్నవని శ్లాఘించెను.

'ఇద్ధం విచింత్య సర్వత్ర
భావాస్సంతి పదే పదే।
కవితార్కికసింహస్య
కావ్యేషు లలితేష్వపి'॥

దేశికుల వేదాంత గ్రంథములు : తత్త్వముక్తా కలాపము, అధికరణ సారావళి, శతదూషణి, తత్త్వటీక, తాత్పర్యచంద్రిక (రామానుజ గీతాభాష్యమునకు ప్రసిద్ధ వ్యాఖ్య), గద్యత్రయభాష్యము, సర్వార్థసిద్ధి, న్యాయసిద్ధాంజనము, న్యాయపరిశుద్ధి మొదలగునవి. 'సుభాషితనిధి' అనునది నీతిగ్రంథము. ఇందు 144 శ్లోకములు 12 సమూహములుగా జేయబడినవి. ఈ రచనలవలన వేదాంతదేశికుల అద్వితీయమగు వేదాంతవిద్వత్తు, తర్కకౌశలము, కవితాసామర్థ్యము సుస్పష్టమగును. రామానుజసిద్ధాంతమును పరిపూర్ణముగా ఆకలింపు జేసుకొని పరిశుద్ధముగా వ్యక్తము జేయగలవారిలో దేశికులు అగ్రగణ్యు లనవచ్చును. దేశికులు సంస్కృతములోనేగాక గద్యపద్య రచనావైదుష్యము తమిళములోను, మణిప్రవాళములోను (తమిళ సంస్కృత పదముల జూపిరి. తమిళములో 19 ప్రబంధములు, మణిప్రవాళములో 32 రచనలు సాయించిరి. మణిప్రవాళ రచనలు శ్రీ వైష్ణవులకు అత్యావశ్యకములు. వీటిని రహస్యగ్రంథము లందురు. ఇందు చిన్న రహస్య గ్రంథములు 28; పెద్ద రహస్య గ్రంథములు 4. చిన్న రహస్య గ్రంథములు రెండురకములు. 1. అమృతరంజని రహస్యగ్రంథములు. 2. అమృతాస్వాదిని రహస్య గ్రంథములు. పెద్దరహస్యగ్రంథములు 1. పరమపద సోపానులు; 2. పరమతభంగము; 3. హస్తిగిరి మాహాత్మ్యము; 4. రహస్యత్రయసారము.

దేశికులు శ్రీవైష్ణవులలో వడగల సాంప్రదాయముగలవారికి మూలపురుషులు. వీరు భక్తిప్రపత్తులుగల మహాపురుషులు. జ్ఞానవైరాగ్యభూషణులు. భక్తి, గుణాతీత స్థిరప్రజ్ఞత్వ సమ్మిళిత వ్యక్తిత్వము గల మహాపురుషులు.

'తురగవదనతేజోబృంహితాశ్చర్యశక్తి
కవికథకమృగేంద్ర స్సర్వతంత్ర స్వతంత్ర।
జయతిగురురబాధం వేదమాద్యార్య నంజ్ఞవ్
అనితరజనలభ్యం లంభితో రంగభర్త్రా॥'



# ఉడుమిళ్ళ, అమరాబాదు శాసనములు

శ్రీ కూచిభొట్ల
వేంకటసుబ్బారావు

శ్రీ ములుకుట్ల
రామకృష్ణశాస్త్రి

తెలంగాణమునందు ఇదివరకే అనేకశాసనములు బయటకు వచ్చినవి. పుస్తకరూపమున ప్రకటింపబడినవి. ఇంకను కొన్ని శాసనములు మారుమూల గ్రామములందు ఉన్నవని, ఈ శాసనములు బుజావు చేయుచున్నవి. భావిపరిశోధకులకు, పరిశోధనలకు అనువుగ నుండుటకై మాకు లభించిన ఈ శాసనములను ప్రకటించుచున్నాము.

## ఉడుమిళ్ళ శాసనములు

ఈ ఉడుమిళ్ళ గ్రామము తెలంగాణా ప్రాంతమునందలి మహబూబ్‌నగరమండలములోని అచ్చంపేటతాలూకాయందు, అమరాబాదు గ్రామమునకు తూర్పుదిశను 19 మైళ్ళ దూరమునందున్నది. దీనికి ఊర్మిశేశ్వరమనియు నామాంతరము గలదు. ఇందుకు నిదర్శనముగ ఈ గ్రామమున ప్రాచీనమైన ఊర్మిశేశ్వరాలయము కలదు. ఈ గ్రామమునకు నైఋతిదిశయందు సుమారు మైలుదూరమునగల లోయలో నొక ప్రాచీన శివాలయమున్నది. ఈ ఆలయమునకు కుడివైపున నొక పెద్దగుండమున్నది ఎడమవైపున నొక సత్రముకలదు. ఆ సత్రమునకు బయటిభాగమున ఎడమవైపు గోడకు, అనగా శివాలయమునకు కొంచెము ప్రక్కగా నెడమవైపునకల నొక బండయం దీ శాసనము చెక్కబడియున్నది. బండకు ఒక్కప్రక్కమాత్రమే శాసనముకలదు. అక్షరములన్నియు చక్కగానుండి ఊాతిపైననే చదువుట కనువగునంత పొంకముగ మున్నవి.

శ్రీమన్మహామండలేశ్వర మల్లిదేవరాజు కొడుకు అడురరాజు, ఉడుమిళ్ళ విశాలాక్షిజియ్యలకు చేసిన దానమును ఈ శాసనము తెలుపుచున్నది. అచ్చటచ్చట లేఖకదోషములు లేకపోలేదు. కాని భాష సుస్పష్టముగ నున్నది. ఉన్నదున్నట్లుగ శాసన స్వరూపము నిట పొందుపఱచుచున్నాము.

## శాసన స్వరూపము

సూర్యుడు। శివలింగము చంద్రుడు

1 స్వస్తి సమదిగత పంచ మ
2 హా శబ్ద మహా మ(ం)²ద
3 లేస్వర యసోనాగపుర
4 వరేశ్వర హారితగోత్ర అ
5 ద్ద దంతి సహస్ర నీడు కీ
6 డుండు వాజినాం యసోలంపడ
7 సంహతం మత్యతమాద × డు
8 శ్రీరాహత్తర శ్రీమన్మహామండలేశ్వర
9 మల్లిదేవరాజు కొడ్కు అడురరా
10 జులు * * * ³యగు తారణ సంవ

1. ఇచట ఊాతికి కుడివైపున సూర్య చిహ్నము, నడుమ శివలింగ చిహ్నము, ఎడమవైపున చంద్ర చిహ్నమును కలవు.

2. 2 వ, పంక్తియందలి కుండలీ కరణమునగల పూర్ణానుస్వార మూహింపబడినది.

3. అక్షరములు తెలియని స్థలముల ఈ గుర్తుంచబడినది. 10 వ పంక్తియందు సంఖ్యలు అస్పష్టముగనుండి కాలమును తెలియజేయుటలేదు.

11 త్సర మన పౌష్యసుద్ద దసమి సు
12 క్రవారమున నుత్తరాయన సం
13 క్రమణ కాలమ్న శ్రీ ఉడుమిళ్ళ
14 ర దేవరకు దూప దిప నివెద్య
15 కు విసాలాక్షి జియ్యల సమ
16 ర్పించ్చి ఉడుమిడ్ల ఏలు దేవరకు నిచ్చె స
17 దత్తి॥ స్వదత్త(c)[4] పరదత్తంవా యో
18 హరతి వసుందరా షష్టి వర్ష
19 సహస్రాణి విష్టాయాం
20 జాయతే క్రిమిః॥

ఈ శాసనమున ప్రస్తుతుడైన మల్లిదేవరాజు కాని, అతని కొడుకు అదురరాజుకాని, మేము పరిశోధించినంతవరకు తెలంగాణా శాసన సంపుటద్వయము నందలి ఏ శాసనమునందు ప్రస్తుతింపబడలేదు. వీరు వేయించిన ఇతర శాసనములు లభ్యమగునంతవరకు వీరిని గూర్చిన చరిత్ర తేటతెల్లముకాదు.

మఱియు, ఈ ఆలయము ముందు గోడయందు రాళ్లపై బ్రాహ్మీలిపికూడ కొంత చెక్కబడియున్నది. కాని, కాలపు చాలున అక్షరముల రూపముచెడి గుర్తించుటకు వీలుకాకుండుటచే ప్రకటింప వీలుకాకున్నది. ఇట్టి లిపితోడను, ఇట్టి స్థితియందే, ఉడుమిళ్ల గ్రామస్మశానమునందుగూడ ఒక బండకలదు.

ఉడుమిళ్ల గ్రామమునందే గ్రామమునకు సుమారు అరమైలు దూరమున తూర్పు దిశయందు పొలములో వినాయకుని విగ్రహముకలదు. ఆ పొలము వినాయకునికై ఈయబడిన మాన్యముఅని తెలియుచున్నది. ఆలయములేదు. కాని ఆ విగ్రహము ఒక చెట్టుక్రింద కలదు. ఆ విగ్రహము ప్రక్కన ఒక రాతిపై ఒక శాసనము చెక్కబడియున్నది. ఈ శాసనమున 'యాచన అబ్బరాజు ఓడెను' అను విషయము తెలియుచున్నది. శాసనస్వరూపము ఈ క్రింద ఈయబడినది :

### శాసనము

సూర్యుడు శివలింగము చంద్రుడు

1 విక్రమ సంవ
2 త్సర భాద్రప
3 ద శు 2 సో, యి
4 రండు రావు
5 లుంను యాచ
6 న అబరాజు
7 ఓడెను శ్రీ

ఈ శాసనకాలము కాని, యాచన అబ్బ (అని ఊహింపబడు చున్నవాని) కాలముకాని, శాసనము వలన తెలియుటలేదు. ఇతర శాసనముల ఆధారముతో, ఈ వివరముల నఱయుట పరిశోధకులకు వదలుచున్నాము.

ఇంతటితో మాకు లభ్యమైన ఉడుమిళ్ల శాసనముల వివరములు ముగిసినవి.

ఇంక, అమరాబాదు శాసన విషయము.

## అమరాబాదు శాసనములు

ఈ శాసనములు మాకు లభించిన శాసనములలో మూడవది. అమరాబాదు గ్రామము మహబూబునగరము నుండి శ్రీశైలమునకు పోవు బస్ రూటుపైకల మున్ననూరు గ్రామమునకు సుమారు 10 మైళ్లదూరమున కలదు. మహబూబునగరమునుండి అమరాబాదుకు నేరుగా బస్సు సౌకర్యము కలదు.

ఈ శాసనము, అమరాబాదునందున్న శివాలయ ద్వారమునకు ఎడమవైపున, భూమియందు పూడియున్న చతురస్రాకారపీఠముకల స్తూపాకృతినున్న శిలపై, మూడుప్రక్కల చెక్కబడియున్నది. 30 పంక్తులు కలిగిన దీర్ఘశాసనము రెండు ప్రక్కలను; వేఱొక చిన్న 9 పంక్తులుకల శాసనము మూడవ ప్రక్కను కలవు. ఈ రెండు శాసనములును దానశాసనములనియే తేలుచున్నవి. ఇతర శాసనములందువలెనే వీనియందును, కొన్నియక్షరములు స్పష్టముగ నుండక పోవుటయు, లేఖకదోషములును కలవు. ఈ శాసన స్వరూపములను ఈ క్రింద పొందుపఱచుచున్నాము

4. 17 వ పంక్తియందలి కుండలీ కరణమునగల పూర్ణానుస్వార మూహింపబడినది.

## మొదటి ప్రక్కన, రెండవ ప్రక్కను కల శాసన స్వరూపము

1 స్వస్తి శ్రీ శకవర్షంబులు 1196 అగు నేటి ర
2 క్తాక్షి సంవత్సర జేష్ఠ శుద్ధ [5] కు శ్రీ మ
3 హా మండలేశ్వరు ఇంమ్మడి విశ్వనా
4 త దవరకు శ్రీభా ఆయురారోగ్యై
5 శ్వర్యు భద్రి×గా శ్రీ సిద్ధమహేశ్వ
6 ల్రిప్రతిష్ట సేసిరి. శుక దవరకు కొ
7 త్త పెంటవెనుక కొత్త ఇంమ్మడి దేవ
8 ర ఇచినది మతరు 17 కరలప
9 ల్లి వరిమడికుంట దనక ప్రతి క
10 దు ఆయం తూర్పు సగ నొప్ప
11 దేవర తన ఉత్తరాన వరిపొలము
12 ***వద్ద గుర్తించి తూర్పుదెసన కు
13 రవని కుంటలోన మణుదురు 10
14 కాడి కోలన ఏడుమడి కొలు మం
15 డరాజు ఏలిన***దీపాదికము గాను
16 ****కొల్లాపురములకు మా దే
17 వి ఏలిన దీపాదిక *యల మ
18 డ్డి పడమటి నల్లశంకరుడు
19 ఇచినది యడమున***వ
20 ***ం తూర్పున**కుల చేను
21 ** సుకరతరము లక్ష్మిదేవికి త్రికాల
22 ముం పూజ దూప దీప నివేద్యలు న
23 డపుమని నారిజియ కొడుకు అం
24 పజియకు ఇచ్చిరి*****
25 ************* ల
26 క్ష్మిదేవి బూజించేవారు మంగళ మహాశ్రీ
27 స్వదత్తం పుణ్యపరమాం సుశీలినే
28 పరదత్తాపహారినే స్వదత్తం నిష్ఫలంభవేత్
29 స్వదత్తం పరదత్తం వా యోహరతి వసుంధరా
30 షష్టిర్వర్షసహస్రాణి విష్టాయాంజాయతేక్రిమి.

ఈ శాసనము ప్రారంభమున సూర్యచంద్రుల యొక్కగాని, శివలింగము యొక్కగాని చిహ్నములు కానవచ్చుటలేదు.

ఈ శాసనము ఇమ్మడి విశ్వనాథుడు సిద్ధమహేశ్వరుని ప్రతిష్టచేసి అంగరంగనైవేద్యభోగములకు గాను ఇచ్చిన దానమును తెల్పుచున్నది. శాసనస్థ ప్రమాణము చేతనే, ఇది శాలివాహన శక 1196 కు సరియగు రక్తాక్షి సంవత్సర జ్యేష్ఠ శుద్ధ పంచమి నాడు జరిగినదిగా ఊహింపబడుచున్నది. తిథి పంచమి అని శాసనమునందలి అస్పష్టమగు అక్షరమునుబట్టి ఊహ.

అమరాబాదు గ్రామము పరిసరములందు గల పొలములలో శివలింగములు వివిధ పరిమాణములలో నేటికిని కానవచ్చుచున్నవి. చెక్కు చెదరకయున్న పెద్ద పెద్ద లింగములను, పానవట్టములను, పొలములందు, మేము స్వయముగ చూచియున్నాము. ఈ అమరాబాదు గ్రామము పూర్వము ప్రముఖ శైవక్షేత్రమై యుండనోపును. చేరువనకల శ్రీశైలక్షేత్ర ప్రభావమును, శ్రీశైలమున కుత్తర ద్వారమని పేరొందిన ఉమామహేశ్వర క్షేత్ర ప్రభావమును, ఈ గ్రామముపై యుండి యుండవచ్చును. అమరాబాదు, కృష్ణానదికి యుత్తర ప్రాంతమునుండి శ్రీశైలమునకు పోవు కాలిబాటపై కలదు. ప్రతాపరుద్రుని కోటయొకటి ఈ గ్రామమునకు ఐదారుమైళ్ల దూరమున కలదు.

## మూడవప్రక్కనకల శాసనము

చంద్రుడు　　　　　　　　సూర్యుడు

1 డిండిమరాజు పెద్ద బొల్లయ రడి
2 వారికిం బున్యముగాను లక్ష్మి దే
3 వికి చెందిన దివెనివేద్యంకు స
4 గం పాల కొల్వ బడ్డ॥ తి గల దే
5 లిన ఏదుము॥ తి కురవబ
6 డెను పందుము 10 వపు (కొం)
7 దుము॥ తెంని జియ్యకు రం
8 డు పొద్దు పరక ఒకపాలు బ
9 (ని) చి కుడుచువారు.

ఈ శాసనము ప్రారంభమున చిహ్నముల క్రమము మారుట, శివలింగచిహ్నము లేకపోవుట విశేషము.

ఇతర సంకేతనములు శాసనస్వరూప లేఖనమున మాచే, పూర్వమువలెనే వాడబడినవి. ఈ శాసనకాలము శాసనస్థము కాకుండుటచే తెలియుట లేదు. ఇందు కాననచ్చు డిండిమరాజా ఎవరో తెలియుటలేదు. కాని అదే రాతిపై చెక్కబడియుండుటచే శా. శ. 1196 ప్రాంతము నాటిదని యూహించుచున్నాము. అమరాబాదునందుగాని, తత్సమీపము నందు గాని, నేడు ప్రాచీనమగు లక్ష్మీదేవి యాలయము కానవచ్చుటలేదు.

అమరాబాదు శాసనముల వివరము లింతటితో ముగిసినవి.

పై నాలుగు శాసనములు తెలంగాణా శాసన సంపుటములందు లేవు. పరిశోధకులు పరిశోధించి ఇందలి చరిత్ర కుపకరించు విషయములను లోకము ముందుంచగలరని యాశించుచున్నాము.

ఈ శాసనములు సంపాదించుటకు మాకు ఉడుమెళ్ల గ్రామమునందు సాయపడిన తద్గ్రామ నివాసులగు శ్రీ పులుసు నారాయణరెడ్డి B Sc., గారికిని అమరాబాదు గ్రామమునందు సాయపడిన తద్గ్రామ నివాసులగు శ్రీమాన్ రామాచార్యులవారికిని మా హృదయపూర్వక కృతజ్ఞతలు



# ఆచార్య పింగళి లక్ష్మీకాంతము

శ్రీ నాగళ్ల గురుప్రసాదరావు

ప్రణీత సద్రసజ్ఞుఁడగు
పింగళికాంతుని కావ్యశిల్ప ని
ర్మాణధురీణబుద్ధిగరిమంబున
కిర్వురె సాటి లిమ్మహిన్
వాణికి వాణియైన గురువర్యుఁడు
చెళ్ళిళ వేంకటేశుఁడున్
ప్రాణము ప్రాణమైన గుణరమ్యుఁడు
కాటురి వేంకటేశుఁడున్

ఒకానొక సందర్భములో పింగళి లక్ష్మీకాంతము గారు చెప్పికొన్న పద్య మిది. వారు, కాటూరి వేంకటేశ్వరరావుగారు జంటకవులై 'తొలకరి', 'సౌందర నందము' రచించిరి. నాలుగుకాలములపాటు నిలువఁ గల్గిన నవీనయుగకావ్యములలో 'సౌందరనంద' మొకటి. ఇతివృత్తనిర్వహణములో, రసపోషణములో, పాత్ర చిత్రణములో దానికదే సాటి. ఆ కావ్యమునకువచ్చిన కీర్తి యీనాఁటికి నిశ్చలముగనే యున్నది. తిరుపతి వేంకటేశ్వరులను జంట తరువాత తెలుఁగునాఁట రాణించిన జంట పింగళి కాటూరులే. కాని గురువులది పురాణ రీతి, శిష్యులది కావ్యరీతి—ప్రాధాన్యమునుబట్టి.

సౌందరనందము తరువాత పింగళి లక్ష్మీకాంతముగారు, కాటూరి వేంకటేశ్వరరావుగారు కలసి కవిత్వము చెప్పినవారుగారు. లక్ష్మీకాంతముగారు ఆంధ్రవిశ్వకళాపరిషత్తులో ప్రథమాంధ్రాచార్యపీఠము నధిష్ఠించిరి. అక్కడినుండి వారి సారస్వత వ్యవసాయ మెల్ల ఉత్తమాచార్యుఁడు నిర్వహింపఁదగినదిగనే యున్నది. 'మధురపండితరాజము' జగన్నాథ పండితుని ఖండకావ్యములకు ననువాదము. 'సాహిత్యశిల్ప సమీక్ష' 'కుమార వ్యాకరణము' లక్ష్మీకాంతముగారి యాచార్యకమునకు ఫలములు. 'గౌతమ వ్యాసములు' 'నా రేడియో ప్రసంగములు' వారు వ్రాసిన వ్యాసముల, పీఠికల, చేసిన ప్రసంగముల సంకలన గ్రంథములు. వారు కవి, విమర్శకుఁడు ననుమాట నిజమే. అంతటితో వారి కృషి యాగిపోలేదు. లక్ష్మీకాంతముగా రెన్నఁదగిన కావ్యపరిష్కర్తగా రాణించిరి. ఆంధ్రవిశ్వకళాపరిషత్తు పక్షమున వారు 'ద్విపద భారతము' ప్రథమ భాగమును ప్రకటించిరి. అవసరాల సూర్యారావు సహాయుఁడుగా 'పలనాటి వీరచరిత్రము' పరిష్కరించిరి. వారు రచించిన గ్రంథములను బండ్ల కెత్తుటకు సాధ్యముగాకపోవచ్చును. కాని వారి కీర్తిని శాశ్వతముగా నిలుపుటకు వారు సృష్టించిన వాఙ్మయము చాలును. దానికున్న చేవ యటువంటిది.

లక్ష్మీకాంతముగారు తిరుపతి వేంకటేశ్వరకవులకు కొప్పరపుకవులకు నడుమ చెలరేగిన కుమ్ములాటలో ఎలమీదికి వచ్చినవారే. వారికి సహాయుఁడుగా నిలిచినది వడ్లమన్నాటి నృసింహశర్మగారు. ఈ యిద్దరు వేంకటశాస్త్రిగారికిఁ దెలియకుండ కొప్పరపు కవులను డీకొని అభినవసరస్వతీ పత్రికకు పద్యములు పంపిరి. పంపిన తరువాతఁగాని గురువు గారితోఁ జెప్పరైరి. ఇట్లు చేయుట వేంకటశాస్త్రి గారికి నచ్చలేదు. కారణము కొప్పరపు కవులతోడి కలహమునందలి తత్త్వమే. వేంకటశాస్త్రిగారు '...మాతో నే సంబంధమునులేని సుదర్శినీ పత్రికాధిపతులవంటి నియోగిశిఖామణులు మమ్మును బురస్కరించికొని వ్రాసినను నయ్యది మమ్ము ఘటింపదు గాని, మా శిష్యులలోఁజేరిన నియోగిబాలకులు మమ్ముఁ బురస్కరించి వ్రాయు వ్రాత లెంత న్యాయ్యములైనను నయ్యవి మాకుఁ బ్రతిష్ఠాకరము లగుటలోఁ బూర్తిగా సంశయింప వలసిన వగుటట్లుండఁ

బై పెచ్చపకీర్తికిఁ గారకము అగునని మేము బాగుగా నెఱుఁగుదుము...' అని భావించిరి. భావించి శిష్యుల పద్యములను బ్రకటింప వలదని యభినవసరస్వతీ పత్రికాధిపతులకు వ్రాయనెంచిరి. కాని యీ నియోగి బాలకులు సామాన్యులా? వారు వేంకటశాస్త్రిగారితో 'తా మిప్పుడిట్లు వారించిన లాభము లేదనియు, మేమీ పద్యముల ప్రతి నొకదానిని శ్రీ కొప్పరపు సోదరులకుఁ గూడ నంపియుంటిమి' యని చెప్పిరి. ఇఁక వేంకట శాస్త్రిగారేమి చేయఁగలరు? ఆ పద్యములు కొన్ని యెట్లున్నవో చూడుఁడు.

అకటా! కొప్పరపుం గవీశులు!
వృథాయాసంబు మీకేటికి, కా
శుకవిత్వంబునఁ బజ్ఞయే కలుగ
వచ్చున్ గాక, యద్దానికే
సుకవుల్ తిర్పతి వేంకటేశ్వరులు
పూజ్యుల్ పండితుల్; వారి నూ
రక దూషించుట కీర్తిదంబె?
కవులారా! సుంత యోజింపుఁడీ!

ఒకవాచాటపుఁ బత్రిక న్నిలిపి
యేమో నోటికిం దోఁచి న
ట్లకటా! వ్రాయుచునుంద్రు
బూతులను, విద్యాకౌశలం బున్నవా
రికిఁ జేయందగు రీతియే? బుధులు
గర్హింపం బయత్నింపరే?
కుకవుల్ వోయెడి దారిఁబోయినను
మీకున్ దుర్యశం బబ్బదే!

చాలుదురేని మీరలు వెసన్
జనుదెంచి వివాద మంతయున్
దేలుచుకొండు, పెద్దలు
సుధీమణు లెల్లరు మధ్యవర్తులై
గాలఁగ; లేనిచో గెలువరా
దలవారల నంచు నుండుఁ డే
మూలనొ, పైకివచ్చి చెడుపోకలఁ
బోయిన మూప్పమూఁడెడున్.

ఈ బాలకవులు చేసినపని తుదకెట్లు పరిణమించిన దనుకొన్నారు? 'ఈ పద్యములతో సోదరులు వెనుకతగ్గినవారైరి గాని సోదరకవులకుఁ జాల దగ్గఱ బాంధవ్య ముండుటయేకాక యాంతరంగికత్వ స్నేహ సంబంధమున్న యొక యష్టావధానినామధారి మా శిష్యులఁ బడఁ దిట్టుచుఁ గొన్ని పద్యములు 'దర్బారు'లోఁ బ్రకటించెను' అని వేంకటశాస్త్రిగారు వ్రాసిరి

లక్ష్మీకాంతముగారు గాని, నృసింహశర్మగారు గాని యింతమాత్రాన నూరకుండిరా? ఊరకుండ లేదు. ఊరకుండుట కింకవీంద్ర ఘటా పంచాననుల శిష్యుల లక్షణము గాదుగదా! ఈ బాలకవులును 'దర్బారు' పత్రికకు పోతరాజు లక్ష్మీ నృసింహకవి గారిని సవాలుచేయుచుఁ బద్యములు వ్రాసిరి.

మమ్మును గొప్పరంపు కవిమాన్యు
లనున్ బిలిపించి మా వధా
నమ్ముల మా కవిత్వపు గుణ
మ్ములనున్ దిలకించి; తారత
మ్యమ్ముల నిర్ణయింపఁ గల
యట్టి రసజ్ఞుల మ్రోల నున్న స
త్యమ్ముల వెల్లడింపు
మవధాన విధాన కుశీలవాగ్రణీ!
సున్నయె సంస్కృతంబు,
పరిశోధన సేయఁగఁ దెల్గుభాషలో
నున్న ప్రవేశ మయ్యదియు
నొక్క రవంతయె; సత్కవిత్వ మం
దున్న రసప్రసార మదియున్
లవమే, యిటువంటివారు పే
రెన్నికగన్న సత్కవుల నేటికి
నేటికి దూఱుచుందురో

పాండిత్య మ్మది యుండఁగా వలెఁ,
గవిత్వ ప్రాభవోద్దండుఁడై
యుండన్గావలె, నాశుధార
కవితా వ్యూహమ్ము ఛేదింప శ
క్తుండై యుండవలెన్, వధానమున

నెంతో ప్రజ్ఞ చూపన్ వలెన్
లెండీ! యేగతిఁ గొప్రపుంగవుల
గెల్పింపన్ బ్రయత్నింతురో !

'ఈ పద్య ప్రకటనానంతరము సభం గుఱిచి ప్రతిపక్షు లేవిధమైన యుత్తరమును నొసగలేదు' అని వేంకటశాస్త్రిగారు వ్రాసిరి. లక్ష్మీకాంతముగారికి ఆజానజమయిన కవితాశక్తి యున్నదనుట కీపద్యములు చాలును. వారు కవియా ? యని ప్రశ్నించువారు 'సత్యమున్ గానని విజ్ఞులనియే' చెప్పవలయును.

'మధురపండితరాజము'నకు వ్రాసిన 'మనవి'లో లక్ష్మీకాంతముగారు 'ఇందు తేజోలహరిలోని నాలుగు పద్యములకు మయూరుని సూర్యశతక శ్లోకములు మూలము. తక్కిన గ్రంథమంతయు జగన్నాథ పండిత రాయల శ్లోకములకు స్వేచ్ఛానువాదము, మూలవిధే యముకాదు. ఇది పూర్వకవుల పద్ధతి'అని చెప్పిరి.

పూర్వకవుల తెలిఁగింపు తీరుతెన్నులను జక్కగా నాకళించుకొనియే లక్ష్మీకాంతముగారు మాతృకలోని శ్లోకములను బెంచి తెలుఁగునకు దింపిరి. మూలశ్లోక భావము సీసపద్యమునందలి మూఁడు పాదములకే సరి పోయినచో వారు స్వతంత్రించి మిగిలిన పద్యభాగమును పూరించిరి. చూడుఁడు.

సముత్పత్తిః పద్మారమణపదపద్మామలనఖాన్
నివాసః కందర్ప ప్రతిభట జటాజూట భవనే
అథా యం వ్యాసంగః పతితజన నిస్తారణ విధౌ
న కస్మా దుత్కర్షస్తవ జనని జాగర్తి జగతి

ఇది జగన్నాథ పండితుని 'గంగాలహరి'యందలి యిరువదియొకండవ శ్లోకము. దీనికి లక్ష్మీకాంతము గారి తెలిఁగింపు చూడుఁడు.

జననమా ! విశ్వవిశ్వంభరాభరణుఁడౌ
నారాయణుని పాదనలినమందు
ఆవాసమా ! భూధరాత్మజాకాంత వా
మాంగుఁడౌ భవు నుత్తమాంగమందు
వర్తనంబా ! మా దృశార్త మానవ సము
ద్ధరణ దీక్షాపుణ్యతంత్రమందు
మహిమమా ! సంస్పర్శమాత్ర సర్వప్రాణి
జాడ్యాపనోద కౌశలమునందు
శాపపరిదగ్ధ సగరరాజర్షి సుతులఁ
బుణ్యభువనమ్ము సేర్చుట ముఖ్యలీల
గంగయను నక్షరములె యుత్కర్షనిధులు
అన్యవర్ణనలెల్ల నిరర్థకములు.

ఈ పద్యము పెంపునకు 'గంగాలహరి' మాతృ కను జదువఁగా జనించిన భావుకత హేతువై యుండ వచ్చును

'మధుర పండితరాజము'లో సూక్తి వైచిత్రి యెక్కువ. సంస్కృతభాషాసంప్రదాయము వేఱు. తెలుఁగు పలుకుబడి వేఱు. అనువాదము తెలుఁగునోరు పలికినట్లుండ వలయును. అప్పటి పోకడయే వేఱుగా నుండును. లక్ష్మీకాంతముగారి తెలిఁగింపు చిక్కని తెనుఁగుదనముతోఁ గూడియుండును. ఒక్క యుదా హరణము చాలునను కొందును.

నగేభ్యో యాంతీనాం కథయ
తటినీనాం కతమయా
పురాణాం సంహర్తుః సురధుని
కపర్దోఽ ధిరురుహే
కయా వా శ్రీ భర్తుః
పదకమల మక్షాళి సలిలైః
స్తులాలేశో యస్యాం
తవ జనని దీయేత కవిభిః

దీనికి లక్ష్మీకాంతరముగారి యనువాద మెట్లు న్నదో చూడుఁడు.

కనుమలనుండి సాగరముఖమ్ముగఁ
బాఱునదుల్ మహీతలం
బున శతముల్ సహస్రములు పో!
నిమఁబోలెఁ బురారి మూర్ధ సీ
మను నిలువంగ నెర్చెనొ ? రమా
ధవు పాదరజంబు క్షాళనం
బొనరుపఁ గల్గెనో ? త్రిభువ
నోచిత సంచరణంబు సల్పెనో ?

లక్ష్మీకాంతకవి పద్యశిల్పరహస్యము తెలిసిన వారు. గణయతిప్రాసము లున్న మాత్రమున తెలుఁగు పద్యము కాదు. పద్యము నెత్తుకొనుటలో, ముగించుటలో, క్రియాదులను వాడుటలో నెన్నో సొగసు లుండును. ఆ సొగసులు గల పద్యములు 'మధుర పండిత రాజము'లో ననేకములు. ఈ పద్యములలో స్వైతము మూలవిధేయత కానరాదు. పెంపు కొట్ట వచ్చినట్లు కనఁబడును. 'మధుర పండిత రాజము' నందలి 'అన్యాపదేశలహరి'ని జూడుఁడు. మాతృకలో నీక్రింది శ్లోకము కలదు. ఇది కోకిల నుద్దేశించి నట్టిది.

కాకా వృకా ఘూక బకాశ్చ భేకాః
ప్రణమ్య యుష్మా నిదమేవ యాచే
కోలాహలం మా కురుత క్షమధ్వం
పుంస్కోకిలః కూజతి మంజురావమ్

లక్ష్మీకాంతముగారి యనువాదఫక్కి యిట్లున్నది.

కీరచకోరపారవతకేకి
సమూహములార! చాలు మీ
మీ రవముల్ పృథార్భటులు
మెల్లఁ దొలంగుఁడు చాటుచోటికిన్
నోరు మెదల్పఁబోకుఁడు,
వినూత్న వసంతరసాల పల్లవాం
కూరకషాయకంఠమునఁ
గోకిల గానసుధన్ వెలార్చెడిన్

మాతృకయందే మఱియొక శ్లోకము కలదు. అది యిది.

తావచ్చకోర చరణాయుధ చక్రవాక
పారావతాది విహగాః కలమాలపంతు
యావద్ వసంతరజనీ ఘటికావసాన
మాసాద్య కోకిలయువా న కుహూం కరోతి

పై రెండు శ్లోకములకు లక్ష్మీకాంతముగారు తెలుఁగు పద్యమును స్వతంత్రించి వ్రాసిరా? సహృదయులే నిర్ణయింతురుగాక!

లక్ష్మీకాంతముగా రెంతటి కవియో యంతటి విమర్శకుడు. వారి విమర్శకు వారి యొజ్ఞనము వన్నె వెట్టినది. ఆ విమర్శకు రెండు ముఖము లున్నవి. అందొకటి సాహిత్యశాస్త్ర సిద్ధాంతములతోఁ గూడి నట్టిది. రెండవది యాంధ్రసాహిత్యచరిత్ర రూపమున నున్నట్టిది. ఈ రెండు రంగములలో సవ్యసాచిగా విహరించినవారు లక్ష్మీకాంతముగారు. మఱి వారు గావించిన విమర్శయంతయు సర్వతోముఖమయినదా? యని ప్రశ్నించువారుండవచ్చును. ఉండిరిగూడ. అట్లయిన లోకములో నెవ్వరి సృష్టి సంపూర్ణమని చెప్పఁగలము? 'ప్రాయేణ సామగ్ర్యవిధౌ గుణానాం, పరాఙ్ముఖీ విశ్వసృజః ప్రవృత్తిః'అని కాళిదాసు చెప్పనే చెప్పెను. అహంకారవర్జితుఁడై యాత్మ విమర్శ చేసికొనఁగలవాఁడెవ్వఁడును స్వసృష్టి సర్వసంపూర్ణ మని వక్కాణింపఁడు. భరతమహర్షివంటివాఁడే

ఏవమేతే మయాప్రోక్తా
వాగంగాభినయాః క్రమాత్
నోక్తాయేచ మయాత్రత
లోకాత్ గ్రాహ్యాస్తు తే బుధైః

అని చెప్పెను. అనన్యసాధ్యముగా బాలవ్యాకరణ మును రచించిన యపరపాణిని చిన్నయసూరికికూడ

'దిక్ప్రదర్శనముగఁ దెలిపెద నిందు ల
క్షణము, గానఁ బూర్వకవుల లక్ష్య
ములను, లాఁతిలక్ష్యములఁ గాంచి, తక్కు ల
క్షణ మెఱింగి కొనుఁడు చతురమతులు

అని చెప్పక తప్పలేదు. స్వశక్త్యనుసారముగా ముందు తరమువారు చెప్పిన మాటలయందలి మంచి చెడ్డల నెంచి ముందునకుఁబోవుట తరువాతి తరమువారి లక్షణమయి యున్నది. దీనికి భారతీయాలంకారిక శాస్త్రమే చక్కని యుదాహరణము. దీనిని గ్రహింపక క్రంతలు వెదకుటయే పురుషార్థముగా భావించువారు ముందు తమ సృష్టిని దామొకసారి సమీక్షించు కొనుట లగ్గు. లక్ష్మీకాంతముగారే యొకచోట 'ఒకరుచేసిన కార్యమును విమర్శింపవచ్చును గాని చేయనికార్యమును ఏల చేయలేదని తర్కించుట విమర్శ పద్ధతిగాదు' అని చెప్పిరి.

నవీన విమర్శకు దోహదము చేసినవారిలో కట్టమంచి రామలింగారెడ్డి తరువాత చెన్నఁదగిన యిద్దఱు ముగ్గురు సాహిత్యోపజీవులయందు లక్ష్మీకాంతము గారొకరు. వారు సంస్కృతాంగ్లాంధ్రభాషలను జదివినవారు. నేర్చిన దేదో గట్టిగా నేర్చినవారు. అంతే కాని పత్రికారచనమును సాహిత్యముగా సంభావించుట యాతరమువారు నేర్చుకొనలేదు. మఱియు సాహిత్య విమర్శకుఁడుగా రాణించుటకు మహాభారతాది గ్రంథములనే కాక మేరీలిన్ మన్రో జీవిత చరిత్రాదులను గూడఁ జదువవలసి యున్నదని నమ్మినవారును గారు. ఆ తరమువారి చదువులు తెలుఁగు నేర్చుకొనుటతో మొదలయినవి. కావుననే సాహిత్యమునుగూర్చి చెప్పనపుడా తరమువారి పలుకులలో నత్తియుండదు. గాడితప్పుట యుండదు. విమర్శకుని 'బహుముఖ విజ్ఞానము' కనఁబడదు.

సాహిత్యవిమర్శ యన్నపుడు తరతరములనుండి తరలివచ్చిన భారతీయ సాహిత్యశాస్త్రము జ్ఞప్తికి రాక మానదు. అంతేకాదు. ఆంగ్లసాహితీసఖ్యమువలన వినూతన సాహిత్యశాస్త్ర చర్చ లుండుటయుఁ దెలియును. లక్ష్మీకాంతముగారు విశ్వకళా పరిషత్తునందుఁ బ్రథమాచార్యుడు గావున ప్రాచ్య పాశ్చాత్య సాహిత్య శాస్త్రములను బరిశీలించి సమన్వయించి యంతేవాసులకు బోధింపవలసిన యక్కఱ కలిగినది. ఆ రీతిగా వారు గావించిన కృషికి ఫలమే 'సాహిత్యశిల్ప సమీక్ష'. 1966 వ సంవత్సరములో ఆ గ్రంథమునకు ధీరగంభీరముగా వ్రాసిన పీఠికలో లక్ష్మీకాంతముగా రిట్లు చెప్పుకొనిరి.

'ఇది నేను ముప్పదియేండ్ల క్రితము ప్రమరింపవలసిన గ్రంథము. ఇప్పుడైనను, నా అలసతను సహింపని నా విద్యార్థిమిత్రులు కొందరు తరిమి హెచ్చరించుటచే దీనిని వెలువరింపఁగలిగితిని. అయినప్పటికి దీని వ్రాతప్రతులు ఆంధ్రదేశములో సుమారు ఒకవేయిపైగా ఉన్నవి. ఆ ప్రతులుగలవారిలో కొందరు ఇందలి సిద్ధాంతములను, వాక్యములను, ప్రకరణములను, నా పేరుమీద గాకపోయినను, పత్రికలలో, గ్రంథములలో విరివిగా ప్రచారముచేసి, ఈ నూత్న విమర్శ సంప్రదాయమునకు కొంతప్రతిష్ఠ సంపాదించిరి. వారికి నేను కృతజ్ఞుడను. వారివల్లనే నేను కల్పించిన పెక్కువిమర్శ పారిభాషిక పదములకు కూడ భాషలో స్థిరత్వ మేర్పడెను. తెలుగులో ముప్పది యేండ్లకు పూర్వముగల విమర్శభాషతో, నేటి విమర్శ భాషను పోల్చిచూచినపుడు కానవచ్చెడి పారిభాషికపద భిన్నత్వమునకు నేనే కర్తనని చెప్పటలో తప్పలేదు. నా 'ఆంధ్రవాఙ్మయ చరిత్ర'కును ఇట్టి యశమే ప్రాప్తించెను.

పాశ్చాత్యకావ్యవిమర్శ సిద్ధాంతములకును భారతీయాలంకారిక సిద్ధాంతములకును వస్తుతః ఉండెడి భేదసాదృశ్యములను వివరించుచు, ఆ రెండు పద్ధతులును ఎంతవరకు సంవదించునో నిరూపించుటకు కొంతప్రయత్నము చేసితిని. ఆ ప్రయత్నములో కొన్ని శాస్త్రవాక్యములకు నేను చెప్పిన వ్యాఖ్యానము, సాంప్రదాయక వ్యాఖ్యానములకు భిన్నముగా ఉండవచ్చు......'

పాశ్చాత్యసాహిత్య సిద్ధాంతములను జదివి, ముగ్ధులై వానిని ఆంధ్రసాహిత్యమునకు సమన్వయించిన ప్రాజ్ఞులు లక్ష్మీకాంతముగారికంటె ముందు లేకపోలేదు. కాని తూర్పువారి పడమటివారి సిద్ధాంతములను బోల్చి, సాదృశ్యభేదములను గుర్తించి, యందముగాఁ జెప్పటకుఁ బూనుకొన్నవారిలో మొదటివారు లక్ష్మీకాంతముగారని చెప్పక తప్పదు. చెప్పనపుడు ఔఁగాముల నిర్ణయింపవలసివచ్చినచో వెను కంజవేయలేదు. భారతీయాలంకారికులు ప్రవచించిన గుణముల పరామర్శ చేయుచు వారు 'వాటి సంఖ్యయు శాస్త్రపరిగణన ప్రకారము పదియే కానక్కరలేదు. అంతకుమించియు ఉండవచ్చును'అని స్పష్టముగా వక్కాణించిరి. అట్లే రూపకపాత్ర సృష్టినిగూర్చి వ్రాయుచు 'మన నాటకలక్షణముతో పాత్రసృష్టిని గురించి ప్రత్యేక ప్రశంస యేమియులేదు. మహానాటకములో ఉత్తమశీలుడైన నాయకుని కథయే ఉండును గావున, అతని వర్తనమును చిత్రించుటలో మాత్రము ప్రమత్తత యుండరాదని సంప్రదాయ మేర్పడినది. తక్కిన పాత్రలన్నియు నాయకునకు అనుజీవులుగానో, అనుయాయులుగానో ఉండును గావున వాటినిగురించి ప్రత్యేక లక్షణమేమియు చెప్పఁబడలేదు. గ్రీక్ నాటకములలోకూడ ప్రధాన పాత్రలనే పరిగణింతురు గాని చిల్లర పాత్రలను లెక్కచేయరు. లక్షణము లేకపోయినను వివిధ వృత్తులుగల నానావిధములైన పాత్రలు

భారతీయ నాటకములలో చిత్రింపబడక పోలేదు. ముద్రారాక్షస మృచ్ఛకటికములందలి చిల్లరపాత్రలు మిక్కిలి విశిష్టత కలవి' యని చెప్పిరి.

దశరూపకముల లక్షణములను వివరించి లక్ష్మీకాంతముగారు 'ఈ వివరణమునుబట్టి చూచినచో పూర్వకాలమున ఒక్క మహోదార పురుషుల చరితమునేగాక, సంఘమున పతితులు నిరాకృతులు నయిన అల్పుల చరితమునుగూడ వస్తువుగా స్వీకరించి సంస్కృతకవులు రసవంతమైన రూపకములుగా రచించి నాటక వాఙ్మయశాఖను విస్తరిల్ల జేసిరని భావింపదగును. కాని సంస్కృతనాటకముల ప్రదర్శనము లుప్తమగుటవలన సాహిత్య గౌరవముగల నాటకములు మాత్రమే మనకు లభ్యము లయినవి. తక్కినవి నశించిపోయినవి. అవియే జీవించియున్నచో సంస్కృతమున హాస్యరసము లేదనెడి నింద వచ్చెడిది కాదు.' అని పలికిరి. ఈ విధముగా వారు చెప్పకొనుచు పోయిన తావులు పెక్కులు కలవు. సముచిత దృక్పథముకలిగి ప్రాచ్య పాశ్చాత్య సాహిత్య సిద్ధాంతములను సమీక్షించుట వారి వ్రాతలలో నెల్లెడ చూపట్టును. సాహిత్య శాస్త్రమునందలి కొన్ని క్లిష్ట విషయములను సరళముగా వివరించుచు వారు ప్రసంగములు చేసిరి. దీనికి 'నాటక శరీరబంధం' 'కావ్యము—కవిత్వము, 'భావము ధ్వని' 'సన్నిహిత భావములు, 'భక్తి — ప్రేమ' మున్నగువాని నుదాహరణములుగాఁ జెప్పవచ్చును.

సర్వ కాలానుగుణముగా భారతీయ సాహిత్య శాస్త్రము రచింపఁ బడినదని లక్ష్మీకాంతముగారు నమ్మినవారు గారు. ఆ శాస్త్రమునందు మనకుఁ గావలసినదానిని దీసికొని కాలానుగుణములయిన మార్పులు చేసికొనఁ దగునని యాయన గ్రహింపకపోలేదు. రసము, ధ్వని కావ్యాత్మలు కావలెనని నమ్మిన యాయన యుగ ప్రభావమును గుర్తించినవారు. దృశ్య శ్రవ్య కావ్య నిర్మాణమున శాస్త్రసహాయము కలుగుట శ్రేయస్కరమని భావించినవారు. ఒక సన్నివేశమున భరతుని నాట్య శాస్త్రమునుగూర్చి చెప్పచు వారు '...కాన నాట్య శాస్త్రము ప్రస్తుతోపయోగియగునట్లు సంగ్రహముగా పచిత్రముగా వ్రాయించి, యా నిర్దేశములు ప్రస్తుత దేశకాలపాత్రములకు పనికివచ్చునంతవరకు ననుసరించుట మిక్కిలి శ్రేయము. లేనిసందర్భమందుగాని, ఉన్నను ప్రస్తుతోపయోగములు కావన్న సందర్భములగాని, లోకపరిస్థితులనుబట్టి మనము స్వతంత్ర కల్పనలు చేసికొనవచ్చును. అన్నియుగములవారికిని ఆ శాస్త్రమే సర్వదా శరణ్యమని నేననను. ఆ మాట శాస్త్రకర్తయు ననలేదు'అని స్పష్టము చేసిరి. వారికి దృశ్యశ్రవ్యకావ్యములపట్ల సమానప్రీతి కలదని వారి విమర్శలే చాటుచున్నవి. ఉత్తమనాటకము కావ్యగౌరవము, ప్రయోగానుకూల్యము కలిగియుండవలయునని వారి విశ్వాసము. 'మన పూర్వులు పౌరాణిక గాథలకును, సాంఘిక గాథలకును సమానప్రపత్తినే యిచ్చిరి. వారు ఒకదానిని మన్నించి రెండవదానిని క్రిందుపరచలేదు'అని వారు నిర్ణయించుకొనిరి. రూపకములలో యథాభావరసావస్థముగా పద్యము లుండవలయుననియు వారు అభిప్రాయపడిరి. లక్ష్మీకాంతముగారు సాహిత్య శాస్త్రసిద్ధాంతములు పరిణామక్రమసాపేక్షము లయి యుండవలయుననియు, సంప్రదాయవిచ్ఛేదము కూడదనియు నొక్కి వక్కాణించినవారు.

లక్ష్మీకాంతముగారు సంపూర్ణమయిన 'యాంధ్ర వాఙ్మయ చరిత్రమును' తెలుఁగువారి కందీలేకపోయిరి. దానిని వ్రాయుచు వారు కాలధర్మము పొందిరి. కాని వారు విజ్ఞానసర్వస్వములకు వ్రాసిన యాంధ్రవాఙ్మయ చరిత్రను జూచినచో అది వారి చేతిలో సంపూర్ణ స్వరూపము నవధరించి యెట్లుండునోకదాయని తప్పక యనుకొందుము. వాఙ్మయచరిత్ర వ్రాయుచు వారు గావించిన యుగవిభజనము విమర్శకుఁ బాత్రమయినప్పటికి, వారి లక్ష్యసిద్ధి కదియే పరమోపకారి యయినది. కావ్యతత్త్వమును వెలార్చునపుడుగాని, కవి స్థానమును నిర్ణయించునపుడుగాని వారు ఉచితూచి మాటల నుపయోగింతురు. వారి నిర్ణయము లెంతో సముచితములు. 'సంస్కృతమున వ్యాస వాల్మీకి కాళిదాసాది మహాకవులకును, నైషధాదికావ్యకర్తలకును ఏవాసి యుండునో, ఆవాసియే తెలుగులో కవిత్రయము వారికిని ఇతర ప్రబంధకర్తలకును కలదు'అని వారొక చోట వ్రాసిరి. 'అసలు భారత రచనాధికారము ఆంధ్ర కవులలో తిక్కనకువలె ఇంకొక కవికి కలదనుట సందేహాస్పదము'అని యింకొకచోట వ్రాసిరి. 'నవీన వచన గంగావతరణమునకు చిన్నయసూరి భగీరథుని వంటివాఁడు. దాని నానాముఖప్రతిహతప్రవాహ

గతికి హేతుభూతుడు వీరేశలింగము పంతులుగారు' అని మఱియొకచోట వ్రాసిరి. ఆంధ్ర ప్రబంధ పరిణామమును వారివలె వివరించినవారు మఱొకరు నేఁటికిఁ గానరారు. 'కుమారసంభవము — కాళిదాస నన్నెచోడుల కవితా సాదృశ్యము' 'ఆంధ్రసాహిత్యంపై సంస్కృత మహాభారత ప్రభావము' 'తెలుగు సాహిత్యం' మున్నగు ప్రసంగములు వారి తారతమ్య విచార దక్షతకు నిదర్శనములు. 'రంగనాథ రామాయణము' అని వారువ్రాసిన పీఠిక వివాదాంశము లున్నప్పటికిఁ దానునమ్మిన సిద్ధాంతములకు లక్ష్మీకాంతముగారెట్టి యుపపత్తులనయిన సృష్టింపఁగలరని నిరూపించును. 'ప్రభావతీ ప్రద్యుమ్నము—దాని మూలము' వారి స్వతంత్ర విచారధారకుఁ దార్కాణము. రవివర్మ భూపాలుఁడు రచించిన 'ప్రద్యుమ్నాభ్యుదయము' పింగళిసూరన్న రచించిన ప్రభావతీ ప్రద్యుమ్నమునకుఁ తేజస్సు నొసఁగినదని లక్ష్మీకాంతముగారు రుజువు చేసిరి. ఈ వ్యాసమునుగూర్చి కోరాడ రామకృష్ణయ్యగారిట్లు వ్రాసిరి.

'The poet Surana is not only a star of the first magnitude in Telugu Literature, but also a pioneer of novel attempts in the literary field of his age. The author of 'Kavitvatatvavicharam' has already opened the eyes of the Telugu Public to the greatness of this poet, by applying modern principles of literary criticism to his works and by giving a true estimate of his poetic genius. This bulletin dealing critically, as it does, with the sources of the plot of 'Prabhavathi pradyumnam', not only serves to complement the work done by others, but also helps immensely the student of Telugu Literature in appreciating the originality and greatness of the poet.'

లక్ష్మీకాంతముగారికి మార్గకవిత్వమన్న నెంత మమతయో, దేశికవిత్వమన్న నంతకంటె నెక్కువ మక్కువ కలదు. కావుననే వారు 'ద్విపదభారతము' 'పలనాటివీరచరిత్ర' పరిష్కరించి ప్రకటించిరి. ద్విపద కవిత్వమునుగూర్చి వ్రాయుచు లక్ష్మీకాంతముగారు '...పాడదగిన పద్యకవిత్వమునెడ నొకకంటిని పఠనయోగ్య

మైన పద్యకవిత్వమునెడ రెండవకంటిని పెట్టి యుభయ గుణములను ఏకముచేసి యామహానుభావులు (ద్విపద కావ్యకర్తలు) పచనముచేసిన రసాయనమే ద్విపద కవిత్వము. ఇది గేయమును అగును. పాఠ్యమును అగును. ఈ వాఙ్మయము నిసర్గమాధుర్యము తోడి యుదాత్తతకు, నిరాడంబరత్వముతోపాటు విజ్ఞానాదాయకతకు సౌలభ్య సహితమైన శైలీప్రౌఢికి కూడలియై, దేశీయమయిన శుద్ధ పద కవిత్వమునకును, సాంస్కృతికమైన ప్రౌఢ సాహిత్యమునకును సామరస్యము గలిగించి యుభయ తారకమైన కావ్యపథమును తీర్చిదిద్దినది.'

లక్ష్మీకాంతముగా రుత్తమానువాదకులుకూడ. వారు మద్రాసు విశ్వవిద్యాలయము ప్రకటించిన భారతదేశ చరిత్రను తెలిఁగించిరి. ప్రసిద్ధములయిన నవలలను ఆంగ్లమునుండి యనువదించిరి. 'బాపూజి ప్రవచనములు' వారి మఱియొక యనువాదము.

లక్ష్మీకాంతముగారి వచనము ప్రౌఢము గజ గమనము గలది. సమత దానియందు కొట్టవచ్చినట్లు కనఁబడును. ఎక్కడను వులుముడు కనఁబడదు. పద్య కవిత్వమున శిల్పానుకూలమయిన పదసంయోజన ముండునట్లుగా లక్ష్మీకాంతముగారి వచన రచనము కూడ తీర్చిదిద్దిన పలుకుబడి కలిగియుండును. 'లక్ష్మీకాంత రీతి'ని స్పష్టముగా గుర్తింపవచ్చును. దానిలో నెడనెడ హాస్యముండును. పోటీపరీక్షలుపెట్టి రూపకములు వ్రాయించిన ప్రయోజనము శూన్యమనిచెప్పి లక్ష్మీకాంతముగారు పలికిన పలుకులు వారి శుద్ధ వచనరీతికిఁ దార్కాణములని యెంతును. సుదీర్ఘమయినను ఆ భాగము నుల్లేఖింతును.

'పోటీ పరీక్షలవలన అనుకొన్నఫలము లభించునన్న నమ్మకము నాకు లేదు. ఏమన, పోటీకి నిలబడుట పేరు పణముపెట్టి పాచికలాడుట. పెద్దపేరు గలవారెవ్వరును సాధారణముగా ఈ జూదమునకు దిగరు. అపజయము లభించినచో పేరు పోవుటేగాక పరాభవము గూడ వచ్చునని వారి భయము. వారి శంక సహేతుకమే కాని నిష్కారణముగాదు. మొదలు పోదగినపేరు లేదుగదా యనెడి గుండె నిబ్బరముతో కొందరు, పరీక్షాధికారులు దమ్ము ప్రోత్సిపుచ్చగలరా యనెడి యహంభావముతో కొందరు, బహుమతిమాట భగవంతు డెరుగును, మన పేరుగూడ జాబితాలో అచ్చుపడు ననెడి కీర్త్యాశచే కొందరు, లాటరీలోవలె మనకే బహువానము రాకూడదా యనెడి ధనలోభముచే కొందరు నడుములుకట్టి మల్లచరచి పోటీలలో దిగుదురు. వీరి సాములన్నియు చూచి పరీక్షాధికారులు నిరుత్సాహముతో ఒండొరుల మొగములు చూచుకొనుచు గుసగుసలు పోదురు. తుదకు కన్నులు మూసికొని లాటరీ లాగి యెవనిపేరు పండునో వానిచేతిలో గుట్టుచప్పుడు గాకుండ సంభావనపెట్టి పంపెదరు. గుట్టుచప్పుడు గాకుండ తనచేతబెట్టిన యాముల్లెను గుట్టుచప్పుడు కాకుండగనే గ్రహించి యూరకుండక ఆ యదృష్టశాలి తన ప్రయోజకత్వమును తన ప్రజ్ఞను తానే కొండాడుకొనుచు నితరులను అధిక్షేపించును. స్వయంవరమున వధువుచే నిరాకృతులయిన రాజకుమారులవలె, ఆశాభంగముచే మొదలే డిందుపడియున్న తక్కిన పోటీదారులు వాని యధిక్షేపములకు మరింత కనలి, వాని జయగర్వమును అణచవలెనని పత్రికలకును, రచ్చలకును ఎక్కి యుపన్యాసాస్త్రములు, వ్యాస శస్త్రములు ప్రయోగింతురు. అవి సత్కరించిన వానికిని, సత్కారము పొందినవానికిని మాత్రమేకాక పౌరోహిత్యము జరిపినవానికిగూడ తగులును. పోటీపరీక్షలింత ముచ్చటగా ముగియును. ఇట్లు జరిగిన కొన్ని పోటీలు నా యనుభవములో నున్నవి. కనుక వాని యందు నాకు విశ్వాసములేదు...' వారి వ్యాసములలో పీఠికలలో ప్రసంగములలో సారళ్యము ప్రధానము: 'సాహిత్య శిల్పసమీక్ష'లో ప్రౌఢత ప్రధానము.

'రెడ్డికిఁ దోడుగానిలిచి రెడ్డికి దీటనిపించి యాదినాఁ డొడ్డులదాఁక నాంధ్రకవితోదధి పింగళి' యని యన్నారు తుమ్మల సీతారామమూర్తిగారు. కవిగా, విమర్శకుఁడుగా లక్ష్మీకాంతముగారు తన తరమువారిలోఁ బ్రత్యేక స్థానమున నిలిచి యాంధ్ర జాతికి శిష్టసాహిత్యాభిరుచిని కల్పించుటకుఁ బాటుపడిరి. తిరుపతి వేంకటేశ్వరులు 'అద్వైత నాంధ్ర కవి ప్రపంచ నిర్మాత'లు. లక్ష్మీకాంతముగారు నవీనాంధ్రాచార్య ప్రపంచ నిర్మాత.

# బంగ్లాదేశ్ - అగ్రరాజ్యాలు

పరిశీలక

బంగ్లాదేశ్ వ్యవహారంలో అగ్రరాజ్యాల ప్రవర్తన రకరకాల విమర్శలకు గురిఅయింది. వానికి మానవతతోకూడిన నీతి—రాజకీయమైన నిజాయితీ లేదన్న ఆరోపణలు జరిగాయి. వాని చిత్తశుద్ధిని, వాని చరిత్రను దుయ్యబట్టడం సాగింది. కాని అగ్ర రాజ్యాల ప్రవర్తన వెనకవున్న చారిత్రక పరిణామాలను, సమకాలీన రాజకీయ పరిస్థితులను గమనించడం జరగలేదు. ఇలా గమనించినప్పుడు బంగ్లాదేశ్ వ్యవహారంలో అగ్రరాజ్యాల ప్రవర్తన తీరునుంచి మనకు కొన్ని కొత్త చారిత్రక పరిణామాలు కనిపించగలవు.

పరిస్థితుల ప్రభావాన్నిబట్టి చారిత్రక పరిణామాలు రూపొందుతూ వుంటాయి. అవి ప్రత్యక్షంగా కొందరికి సహాయపడతాయి. పరోక్షంగా కొందరిని నష్టపరుస్తాయి. కనక బంగ్లాదేశ్ సంఘటనలు సాగిన తొమ్మిదినెలల (1971 ఏప్రిల్‌నుంచి డిశంబరు వరకు) వ్యవధిలో అంతర్జాతీయ పరిస్థితులలో వచ్చిన గణనీయమైన మార్పులను ముందు పర్యాలోకన చేసుకోవాలి.

అంతర్జాతీయంగా అమెరికా—రష్యాలుమాత్రమే ఇంతవరకు అగ్రరాజ్యాలుగా చెల్లుబాటు అవుతున్నాయి. బ్రిటన్—ఫ్రాంసు వగైరాలకు అగ్రరాజ్యాల స్థాయి తగ్గింది. కాని ఇప్పుడు కమ్యూనిస్ట్‌చైనా మూడవ అగ్రరాజ్యంగా రంగంమీదికి వచ్చింది. దాదాపు రెండు దశాబ్దాలుగా గుర్తించని ఈ రాజకీయసత్యాన్ని ఇప్పుడొక అగ్రరాజ్యం—అమెరికా—గుర్తించడం ఒక చారిత్రక విశేషం. అలా గుర్తించినదానికి అనువుగా కొత్తవిధానాలను అది రూపొందించడం అంతర్జాతీయంగా సరికొత్త పరిస్థితి.

అంతర్జాతీయంగా అగ్రరాజ్యాలు రెండుకూటాలుగా ఇంతవరకు విభజింప బడ్డాయి. సిద్ధాంతాల రీత్యా వీనికి కమ్యూనిస్టు కూటమి సామ్రాజ్యవాద కూటమి అని నామకరణం జరిగింది. దేశాలరీత్యా కమ్యూనిస్ట్‌కూటమి నాయకత్వం సోవియట్ రష్యాది, సామ్రాజ్యవాద కూటమి నాయకత్వం అమెరికాది. కాని ఇప్పుడు వీనిలో చీలికవచ్చింది: కమ్యూనిస్ట్ కూటమిలో సోవియట్‌రష్యా నాయకత్వాన్ని సవాలు చేస్తున్నది కమ్యూనిస్ట్‌చైనా. సామ్రాజ్యవాద కూటమిలో అమెరికా నాయకత్వాన్ని సవాలుచేస్తున్నది ఐరోపా (ఫ్రాంసు—బ్రిటన్‌ల నాయకత్వాన ఏర్పడిన ఐరోపా సమష్టి విపణిద్వారా). అగ్రరాజ్యాల స్థాయికి అంతర్గతంగావచ్చిన ఈ పరిణామాలు అంతర్జాతీయంగా కొత్త రాజకీయ విధానాలకు దారితీశాయి. అమెరికా అధ్యక్షుడు రిచర్డ్ నిక్సన్ కమ్యూనిస్ట్‌చైనాతో రాజీకి సిద్ధపడడం అనేది ఈ కొత్త రాజకియ విధానాలకు సరికొత్త పుంత; అంతర్జాతీయ రాజకీయాలలో వూహించని మలుపు.

అంతర్జాతీయంగా ఇంతవరకు ఐరోపా సమస్యలు, రాజకీయ వివాదాలు ప్రపంచ సమస్యలుగా ముప్పుతెస్తూ వుండేవి: దేశాల — జాతుల భవిష్యత్తును మార్పుచేసేవి. కాని ఇప్పుడు ఆసియా ఆఫ్రికా సమస్యలు వాటి రాజకీయ పరిణామాలు అంతర్జాతీయ రాజకీయాలకు కీలకం అయినాయి. అగ్రరాజ్యాల నాయకత్వ ధోరణులను, వాటి రాజకీయ భవిష్యత్తును

తీర్చిదిద్దే దశను చేరుకున్నాయి: ఐక్యరాజ్య సమితిలో ఆసియా—ఆఫ్రికాదేశాలు అధికసంఖ్యతో సభ్యత్వం కలిగివుండడం; అగ్రరాజ్యాలు కాదన్నా కమ్యూనిస్టు చైనాకు సమితిలో సభ్యత్వం లభించడం—ఇందుకు ఉదాహరణలు. సమకాలీన ప్రపంచంలో సర్వవిధాలా ఇది సరికొత్త పరిణామం.

ఈ పరిణామాల చాటునుంచి 1971 లో గణనీయమైన కొన్ని సంఘటనలు సంభవించాయి. అంతర్జాతీయంగా కొత్త పరిణామాలకు దారిచూపిన ఆ సంఘటనల వరస క్రమం ఇది — ఆసియాఖండం నుంచి తన నౌకాబలాన్ని ఉపసంహరించుకొన గలనని బ్రిటన్ ప్రకటించడం; ఆసియా సమష్టి భద్రతా వ్యవస్థ రూపొందాలని రష్యా కమ్యూనిస్ట్ నాయకుడు బ్రెజ్నేవ్ ప్రకటించడం; (దానినే బ్రెజ్నేవ్ పథకం అంటున్నారు. దీనిప్రకారమే ఈజిప్టు—భారత్‌లతో రష్యా మిత్రత్వ ఒప్పందాలు చేసుకున్నది). అణ్వ స్త్రాల కంట్రోలుకు అయిదు అణ్వస్త్రరాజ్యాలసభకు హాజరు కావడానికి కమ్యూనిస్టుచైనా నిరాకరించడం; తూర్పు—పశ్చిమ జర్మనీలను దగ్గరచేయగల బెర్లిన్ ఒప్పందం జరగడం; ఐరోపా సమష్టి విపణిలో బ్రిటన్‌చేరిక ధృవపడడం; ఐక్యరాజ్యసమితిలో కమ్యూ నిస్ట్‌చైనాకు సభ్యత్వం లభించడమేకాక తైవాన్ బహి ష్కరణ, భద్రతాసంఘంలో తైవాన్‌స్థానే అదిశాశ్వత సభ్యురాలు కావడం; తాను పికింగ్‌ను సందర్శించగల నని అమెరికా అధ్యక్షుడు నిక్సన్ 1971 జులైలో ప్రకటించడం; ఆవెంటనే భారత్—రష్యా మిత్రత్వ సంధిపై సంతకాలు జరగడం; బంగ్లాదేశ్ కారణంగా భారత్—పాక్‌యుద్ధం సాగడం.

ఈ సంఘటనలన్నీ గత తొమ్మిదినెలలలో సంభ వించాయి. ఈ తొమ్మిదినెలలోనే అగ్రరాజ్యాల విధా నాలలో కీలకమైన మార్పులు వచ్చాయి. అంతవరకు అమెరికావిధానం కమ్యూనిజాన్ని నిరోధించడం. కమ్యూ నిజం అంటే రష్యా-చైనాలు అని అర్థం. ఐరోపాలో రష్యా విస్తరణను, ఆసియాలో చైనా విస్తరణను ప్రతిఘటించడం అని దీని తాత్పర్యం. ఇప్పుడీ అర్థం లోను, తాత్పర్యంలోను మార్పువచ్చింది. ఐరోపాలో రష్యా విస్తరణకు ఇక అవకాశాలులేవు. బెర్లిన్‌ఒప్పందం, ఐరోపా సమష్టి విపణిలో బ్రిటన్ చేరికతో అక్కడి పరిణామాలు ఒకకొలిక్కి వచ్చాయి. అక్కడ అమెరికా రాజకీయంగా నిర్వహించవలసిన ప్రధాన భూమికలేదు. కాగా ఐరోపానుంచి అమెరికాసైన్యాల ఉపసంహరణ సమస్యమాత్రం మిగిలివుంది. ఆర్థికంగా అంతర్జా తీయ వర్తక వాణిజ్య వ్యవహారాలు తేల్చుకోవలసి వున్నాయి. ప్రస్తుతానికి ఇవి తక్షణం పరిష్కార మయ్యేవికావు. అయితే అణ్వస్త్రాలతయారీ, సైనిక వ్యయం తగ్గింపు అమెరికా — బ్రిటన్—ఫ్రాంసు — రష్యా—కెనడాలమధ్య ఉమ్మడి సమస్యలుగా వున్నాయి. వీని పరిష్కారానికిగాను అణ్వస్త్రాల కంట్రోలు తయారీపై ఆంక్షలు ప్రధాన అంతర్జాతీయ సమ స్యగా రూపొందింది. ఇందులో రష్యా సహకారం వానికి లభిస్తున్నది. కాని కమ్యూనిస్ట్‌చైనా కలిసి రావడం లేదు. అదికూడా సైనికవ్యయం పెంపుదల లోను అణ్వస్త్రాలు తయారీలోను వుంది. అందువల్ల దానినికూడా తమ ఒప్పందాల పరిధిలోకి తీసుకురా వలసిన అవసరం ఏర్పడింది. ఆ బాధ్యతను రష్యా నిర్వ హించలేక పోయింది. అందువల్ల కమ్యూనిస్ట్ చైనాను కూడా అణ్వస్త్రాల కంట్రోలు పరిధిలో వుంచడానికి వ్యూహాలు పన్నవలసిన బాధ్యత సామ్రాజ్యవాదకూటమి దేశాలమీద పడింది. ఆ తర్వాత అమెరికా—చైనాల మధ్య సమాలోచనల అవసరం ఏర్పడింది. అది సోవి యట్ రష్యా అయిష్టతకు కారణం అయింది. దానితో రష్యా—అమెరికా — చైనాలమధ్య ముక్కోణపు పోటీ ఏర్పడింది.

కమ్యూనిజాన్ని నిరోధించే విధానంకింద అమె రికా గత రెండు దశాబ్దాలలోను రష్యా — చైనాల చుట్టూ కొన్ని సైనిక వలయాలను, సైనిక స్థావ రాలను నిర్మించింది. పెక్కుమంది అమెరికా సైని కులను కాపలావుంచింది. కొరియా—వియత్నాం వంటి చోట్ల తన సైనికులను వేలసంఖ్యలో బలిపెట్టింది. ఈ సైనిక విధానాల ఫలితం అమెరికా ఆర్థిక వ్యవ స్థను కొంతవరకైనా దెబ్బతీసింది. విదేశాలలో అమె

రికా సైనికజోక్యం తగదన్నధోరణి అమెరికా రాజకీయాలలో బలపడుతున్నది. ఆ కారణాన అటు అర్థిక వ్యవస్థను మెరుగుపరచడం; ఇటు తన ప్రజల రాజకీయ వాంఛలను తృప్తిపరచడం అమెరికా అధ్యక్షుని ప్రధాన కర్తవ్యమైంది. ఈ కర్తవ్య నిర్వహణకు కొత్త విధానాలు, వ్యూహాలు అమెరికా అధ్యక్షుడు అనుసరించవలసి వచ్చింది. అందుకు అనువుగా ఐరోపా వ్యవహారాలలో రష్యాను కూడగట్టుకువచ్చిన విధంగానే ఆసియాలో కమ్యూనిస్ట్ చైనానుకూడా జత కలుపుకు రావలసిన బాధ్యత అమెరికా అధ్యక్షునిమీద పడింది. అందుకు ఆయన సిద్ధపడడంతో రష్యా — అమెరికా—చైనాల ముక్కోణపుపోటీ మరింత ఉధృతమైంది. ఈ పోటీ విషమఫలితాలను ఐరోపా ఆసియాలలోని కమ్యూనిస్ట్ మిత్రదేశాలు—శత్రుదేశాలు—తటస్థదేశాలు వాని వాని పరిస్థితులనుబట్టి అనుభవించవలసి వచ్చింది. ఈ చారిత్రిక పరిణామాలను దృష్టిలో వుంచుకొని, పరిశీలించినప్పుడు భారత్—పాకిస్తాన్‌లు తమ గతచరిత్రనుబట్టి, తాము సృష్టించుకున్న రాజకీయ విషవలయాలనుబట్టి — అగ్రరాజ్యాల అంతర్జాతీయ విధానాలలో వినియోగపడ్డాయని స్పష్టంకాక తప్పదు. బంగ్లాదేశ్ సమస్య అనేది అగ్రరాజ్యాల దృష్టిలో ఎలా అప్రధాన సమస్యఅయిందీ బోధపడక తప్పదు.

భౌగోళికంగా భారత్—పాకిస్తాన్‌లు చైనా — రష్యాలకు సరిహద్దులలో వున్నాయి. ఈ ఉనికినిబట్టి చైనా — రష్యాలకు వ్యతిరేకంగా అమెరికా గతంలో నిర్మించిన సైనిక వలయాలకు పాకిస్తాన్ ఉపకరించింది. భారతదేశం ఉపయోగ పడలేదు: భారత విధానాలలో అమెరికా వ్యతిరేక ధోరణికి, పాకిస్తాన్ విధానాలలో అమెరికా అనుకూల విధానాలకు ఇదొక కీలకమైన కారణం : భారత్‌కు రష్యా మిత్రదేశం కావడానికి, పాకిస్తాన్‌కు రష్యా శత్రుదేశంగా మారడానికి కూడా ప్రాతిపదిక ఇందులోనేవుంది. కాని చైనా—రష్యాలమధ్య వచ్చిన విభేదాలతో ఈ ప్రాతిపదికలు మార్పుచెందాయి: రష్యాకు మిత్రదేశమైన కారణాన చైనాకు భారత్ శత్రుదేశం అయింది. రష్యాకు శత్రుదేశమైన కారణాన చైనాకు పాకిస్తాన్ మిత్రదేశమైంది. ఇప్పుడు చైనా – అమెరికాలమధ్య స్నేహ సంబంధాలు బలపడుతున్నందున, పాకిస్తాన్ పరిస్థితిలో మార్పురాలేదు. అటు చైనాతో — ఇటు అమెరికాతో దానికిగల స్నేహ సంబంధాలు మరింతగా బలపడ్డాయి. ఇక భారతదేశం అమెరికాకు మిత్ర రాజ్యంగా కొంతకాలంవరకు రష్యా—చైనాల విమర్శకు గురిఅయింది. రష్యాకు మిత్రదేశంగా అమెరికా — చైనాల విమర్శకు ఇప్పుడు గురిఅవుతున్నది. కాగా పొరుగునవున్న అగ్రరాజ్యాలలో ఒక్క రష్యామాత్రమే భారత్‌కు దగ్గరగావుంది. అది ఎంతవరకు దగ్గరగా వుంది, ఎంతకాలం అలా వుంటుందనేది వేరువిషయం. బంగ్లాదేశ్ సమస్యకు సంబంధించినంతవరకు భారత్‌కు దగ్గరగావుంది. (చైనాతో స్నేహసంబంధాలు; అణ్వస్త్రాల తయారీ — కంట్రోల్ ఒప్పందంపై సంతకాలు; కాశ్మీర్‌లో యుద్ధవిరమణ శ్రేణి రేఖలో మార్పుల సమస్యలపై భారత్—రష్యాల ధోరణులు విభిన్నంగా వుండడం, ఆలస్యంగా బంగ్లాదేశ్‌ను అది గుర్తించడం గమనార్హం). భారత్—పాకిస్తాన్‌ల ఉనికినిబట్టి అమెరికా—రష్యా—చైనాల ముక్కోణపుపోటి పరిస్థితి ఇలావుంది. ఇందులో బంగ్లాదేశ్ సమస్యపై ఈ మూడు అగ్రరాజ్యాలు వాని పరిస్థితులకు అనువుగా వ్యవహరించాయి. దానిపై ఈ మూడు అగ్రరాజ్యాలు పరస్పరం చేసుకున్న విమర్శలు వాని అంతర్జాతీయ రాజకీయ ధోరణులకు ప్రతిబింబాలుగా వున్నాయి.

బంగ్లాదేశ్ సమస్య సందర్భంలో కమ్యూనిస్ట్ చైనా విమర్శలన్నీ సోవియట్ రష్యామీదుగా పోయాయి. కేవలం రష్యా ప్రోద్బలంవల్ల రష్యా ఆయుధ సహాయంతో భారతదేశం పాకిస్తాన్ విచ్ఛిత్తికి పూనుకున్నదనే ఆరోపణలు జరిగాయి: అమెరికా కూడా భారత్‌పై ఇదేరకమైన విమర్శలు చేసింది; రష్యాతో భారత్ మిత్రత్వ ఒప్పందం చేసుకొనడం అటు చైనాకు—ఇటు అమెరికాకు కష్టం కలిగించింది. ఆ విధంగా భారత్‌పై చైనా—అమెరికాలకు కలిగిన

ఆగ్రహం బంగ్లాసమస్యను అప్రధానము, భారత విధానాలలో మార్పును ప్రధానము చేసింది. అయితే పాకిస్తాన్ చేసిన విమర్శలలో రష్యామీద పెద్దగా ఆరోపణలు, విమర్శలు లేకపోవడం గమనార్హం.

బంగ్లాదేశ్ సమస్యపై సోవియట్‌రష్యా చేసిన విమర్శలన్నీ కమ్యూనిస్ట్ చైనామీదుగా పోయాయి. కేవలం చైనా ప్రోద్బలంవల్లనే పాకిస్తాన్ బంగ్లాదేశ్‌లో అంత దారుణంగా వ్యవహరించిందని, భారత్ మీద యుద్ధానికి సిద్ధమైందని ఆరోపణలు జరిగాయి. కాని భారతదేశంమాత్రం అంతగా కమ్యూనిస్ట్ చైనామీద విమర్శలు చేయలేదు. ఆరోపణలు సాగించలేదు. కాగా అమెరికా ప్రోద్బలంవల్లనే పాకిస్తాన్ అంత దారుణంగా బంగ్లాదేశ్‌లో వ్యవహరించగలిగిందని, భారత్‌మీద యుద్ధం సాగించిందని ఆరోపించింది.

ఈ విధంగా రష్యా — అమెరికా — చైనాల ముక్కోణపు పోటీలో బంగ్లాసమస్య స్వరూపం, దాని మూలకారణాలు, మూలపడిపోయాయి. దాని పేరుమీద అంతర్జాతీయ ప్రచ్ఛన్నయుద్ధవాతావరణం దాదాపు తొమ్మిదినెలలు సాగింది. ఈ తొమ్మిది నెలలలోను భారత్‌తో సహా అన్నిదేశాల రాజకీయ బలహీనతలు స్పష్టంగా బయటపడ్డాయి. ఈ బలహీనతలు ఆయా దేశాల అంతర్జాతీయ విధానాల నిజస్వరూపాన్ని బయటపెట్టాయి.

భారత్‌కు బంగ్లాదేశ్ సమస్య కొత్తకావచ్చు. కాని అంతర్జాతీయంగా అనేక దఫాలు బంగ్లాదేశ్ సమస్యలవంటివి ఏర్పడాయి. ఉదాహరణకు—బెంగాలీలను పాకిస్తాన్ హింసించడం. రాజకీయంగా అణచివేయడం వంటిది— టిబెట్‌లో కమ్యూనిస్ట్‌చైనా కొనసాగించింది. అక్కడనుంచి దలైలామా పారిపోయి వచ్చాడు. శరణార్థులుకూడా భారత్‌కు చేరారు. అయినా దానిని అంతర్జాతీయ సమస్య చేయడానికి భారత్ అంగీకరించలేదు. సమితిముందుకు దలైలామా వెళ్లడానికి అనుమతించలేదు. బర్మాలో భారత్ వ్యతిరేక విధానాలు అమలుజరిగాయి. బర్మా భారతీయులు కాందిశీకులుగా స్వదేశానికి వచ్చారు. వారి ఆస్తులను వ్యాపారాలను బర్మాప్రభుత్వం జాతీయం పేరుతో స్వాధీనం చేసుకున్నది. అయినా భారత ప్రభుత్వం దానిని అంతర్జాతీయ సమస్యగాను లేదా తన జాతీయ సమస్యగాను పరిగణించలేదు. పోతే హంగరీలో, చెకొస్లొవాకియాలో పోలెండులో సోవియట్‌రష్యా సాగించిన దారుణ సైనిక దమనీతిని భారత్ ఖండించలేదు. ఇలా ఆయా సందర్భాలలో భారత్ పాక్షికవైఖరిని వెల్లడించుకున్నది. కాని బంగ్లాదేశ్ సమస్యపై ప్రపంచదేశాలుకూడా స్వప్రయోజనాల దృష్ట్యా వ్యవహరించినప్పుడు — వానిని విమర్శించింది.

సోవియట్‌రష్యా పరిస్థితికూడా ఇంతకంటె మెరుగుకాలేదు. బంగ్లాదేశ్ సమస్యలో జాతీయ స్వయంనిర్ణయాధికార సూత్రాన్ని అంగీకరించడం; జనహత్యా జాతినిర్మూలన కాండ—ఒక దేశవాసులను పొరుగు దేశాలకు వలసవెళ్లేట్టు వత్తిడిచేయడం వంటివి అనుబంధ సమస్యలుగా పరిగణించి నప్పుడు—తూర్పు ఐరోపాలో పెక్కుజాతులను సోవియట్‌రష్యా అణచివేసిన ఉదాహరణలు వున్నాయి : బాల్కన్ రాజ్యాలు, బాల్టిక్ రాజ్యాలనేవి విభిన్నజాతులకు నిలయాలు. వాని జాతీయ స్వయంనిర్ణయాధి కారాన్ని కాదని సోవియట్ ఉక్కుచట్రంలో వానిని బిగించడం జరిగింది. రష్యా—యుగొస్లావియాలమధ్య; రష్యా — బల్గేరియాలమధ్య నేటికీవున్న వివాదాలకు ప్రాతిపదిక కూడా ఇదే. అందువల్లనే బంగ్లాదేశ్ సమస్యపై దౌత్యరంగంలో భారత్‌కు కొమ్ము కాచినట్టు కనిపించిన సోవియట్‌రష్యా బంగ్లాదేశ్‌ను గుర్తించే సందర్భంలో తాత్సారం చేయడంద్వారా తన బలహీనతను బయటపెట్టుకున్నది. భౌగోళికంగా స్వదేశంలోవున్న పెక్కుబంగ్లాదేశ్‌లను, వానితో తనకుగల సమస్యలను దృష్టిలో వుంచుకొనవలసిన పరిస్థితులు ఈ బలహీనతనకు కారణమయ్యాయి. అయినా అమెరికా—పాకిస్తాన్—చైనాలపైవున్న వ్యతిరేకతవల్ల సోవియట్

రష్యా బలహీనతలు హెచ్చుగా ప్రచారంలోకి రాలేదు. విమర్శలకు గురికాలేదు.

అయితే బంగ్లాదేశ్ సమస్యతో భారత ఉప ఖండంలో ఏర్పడిన ఉద్రిక్తవాతావరణాన్ని సోవియట్ రష్యా తన స్వప్రయోజనాలకు చక్కగా వినియోగించు కున్నది. భారత్—పాకిస్తాన్‌లమధ్య తాష్కెంట్ ఒప్పందం కుదర్చడంద్వారా సోవియట్ రష్యా ఈ రెండుదేశాలకు మధ్యవర్తిగా నిలిచింది. ఆ తర్వాత తన అంతర్జాతీయ అవసరాలకోసం పాకిస్తాన్‌ను దగ్గర చేసుకొనడానికి ప్రయత్నిస్తూవచ్చింది.

సోవియట్‌రష్యా సరిహద్దులలో వున్నవి టర్కీ, ఇరాన్, ఆఫ్ఘనిస్థాన్, పాకిస్తాన్‌లు : ఇందులో ఆఫ్ఘనీ స్థాన్ మినహా మిగిలిన మూడు దేశాలు అమెరికా ప్రభావంలో వున్నాయి. దాని సైనికకూటాలలో భాగ స్వాములుగా ప్రసిద్ధిచెందాయి. వానిలో ఆఫ్ఘనిస్థాన్‌కు పొరుగున వున్నది పశ్చిమ పాకిస్తాన్. భౌగోళికంగా అరేబియా సముద్రానికి సింహద్వారంగావుంది పశ్చిమ పాకిస్తాన్ : ఆ కారణాన ఆఫ్ఘనిస్తాన్‌కు, సోవియట్ రష్యాకు వర్తకవాణిజ్యాల అభివృద్ధిరీత్యా పశ్చిమ పాకి స్తాన్‌తో స్నేహసంబంధాలు అవసరమైనాయి. భారత్‌కు మిత్రరాజ్యంగా వ్యవహరించినందున (కాశ్మీర్ సమస్యపై) పాకిస్తాన్‌లో తనపైవచ్చిన వ్యతిరేకతను తగ్గించుకొనడానికి సోవియట్‌రష్యా తాష్కెంట్ ఒప్పందంనాటినుంచి ప్రత్యక్షంగా ప్రయత్నిస్తున్నది. పాకిస్తాన్‌కు ఆర్థికంగాను, సైనికసామాగ్రుల రూపం లోను సహాయం చేసింది. తాష్కెంట్ నిబంధనలను పాకిస్తాన్ ఉల్లంఘించినా, భారత్ నిరసన తెలిపినా మౌనం వహించింది. బంగ్లా సమస్యలో మొదటి అయిదారునెలలు కేవలం మానవతాదృష్టితో ప్రకట నలు చేసింది. సానుభూతిని చూపింది. కాని ఆ తర్వాత రెండునెలలలోను చైనా—అమెరికాలు స్నేహసంబం ధాలు పెంచుకుంటున్నట్లు వెల్లడైనవెంటనే రష్యా వైఖరిలో కొత్తమార్పు వచ్చింది.

అమెరికా—చైనాల స్నేహసంబంధాలు మెరుగు పడడానికి పాకిస్తాన్ ఒక మధ్యవర్తిగా తోడ్పడింది. గతంలో కొరియా యుద్ధకాలంలో అమెరికా—చైనాల మధ్య వార్తాహరుడుగా భారతదేశం కూడా వ్యవహ రించింది. ఇప్పుడా అవకాశం పాకిస్తాన్‌కు లభించింది. అంతవరకు చైనా—రష్యాలమధ్య సిద్ధాంతాలరీత్యాను, సరిహద్దులలోను, అంతర్జాతీయవిధానాలలోను వుంటూ వచ్చిన వివాదాలు, అమెరికా—చైనాల సన్నిహిత సంబంధాలతో తారస్థాయిని అందుకున్నాయి. చైనా అణ్వస్త్రాలను తయారుచేయడం; సమితిలోను—భద్రతా సంఘంలోను చైనాకు సభ్యత్వం లభించ డంతో కమ్యూనిస్ట్ చైనాకు అగ్రరాజ్యస్థాయి లభించింది. అమెరికా దానికి దగ్గరకావడం ఆ స్థాయిని బలపరచింది. రష్యా ఆందోళనను పెంచింది.

ఈ పరిణామాలు 1971 జూలైలో ప్రపంచా నికి వెల్లడి అయినాయి. అప్పటికి బంగ్లాదేశ్ సమస్య అంతగా తీవ్రరూపం దాల్చలేదు. ఆ సమస్యపట్ల అగ్రరాజ్యాలు అంతగా శ్రద్ధచూపలేదు. దాని నొక స్థానిక సమస్యగా పరిగణించాయి. కాని అమెరికా అధ్యక్షుడు పెకింగ్ సందర్శించగలనని ప్రకటించిన తర్వాత, భారత్—రష్యాలమధ్య మిత్రత్వ సంధి జరగడంతో బంగ్లాదేశ్ పరిణామాలకు అంతర్జాతీయ రూపం వచ్చింది. అటు చైనా—అమెరికా స్నేహ సంబంధాలకు, ఇటు రష్యా—భారత్‌ల మిత్రత్వసంధికి బంగ్లాదేశ్ సమస్య ఒక గీటురాయి అయింది. అగ్ర రాజ్యాల రాజకీయ వ్యూహాలకు అది ఒక కీలకంగా మారింది. 1971 ఆగస్టునుంచి డిశంబరువరకు నడిచిన బంగ్లాదేశ్ కథలో ఈ అంతర్జాతీయ పరిణా మాల ప్రభావాలు స్పష్టంగా కానవచ్చాయి. ఐక్యరాజ్య సమితి భద్రతాసంఘంద్వారా సంభవించిన అంతర్జా తీయ పరిణామాలలో అగ్రరాజ్యాలు పరస్పరం నిస్సహాయమైపోయాయి. తూర్పు—పశ్చిమ రంగాలలో భారత—పాకిస్తాన్‌లు సైనికంగా తమ బలాబలాలను చూపించుకొనడంతో పాకిస్తాన్ రాజకీయంగా విచ్ఛిన్న మైంది. బంగ్లాదేశ్ అవతరించింది.

బంగ్లాదేశ్ అవతరణ జాతీయస్థాయిలో భారత్‌కు ఘనవిజయమే కావచ్చు. అంతర్జాతీయ స్థాయిలో చైనా—అమెరికాలకు ఘోర పరాజయమే

కావచ్చు. ఆసియాఖండంలో నూతన పరిస్థితులకు నాంది కావచ్చు. కాని కొత్తగా అగ్రరాజ్యస్థాయిని అందుకున్న కమ్యూనిస్టు చైనాను దృష్టిలో వుంచు కొని చూచినప్పుడు, రష్యా—చైనాల పోటా పోటీలో భారత్—పాకిస్తాన్‌ల భవిష్యత్ పరిణామాలనుగురించి పరిశీలించినప్పుడు పరిస్థితుల మొత్తం స్వరూపంలో మార్పుకానవస్తుంది.

ఆసియాలో ఇంతవరకు రష్యా—చైనాల ద్వారా కమ్యూనిజం విస్తరణను నిరోధించడానికి అమెరికా ప్రయత్నించింది. ఇప్పుడు చైనా విస్తరణను నిరోధించడానికి రష్యా ప్రయత్నిస్తున్నది. చైనా — రష్యా సరిహద్దులలోవున్న దేశాలద్వారా నాటో—సెంటో — సీటోవంటి సైనిక రక్షణశ్రేణులను అమెరికా గతంలో నిర్మించింది. ఇప్పుడు చైనా చుట్టూవున్న దేశాలతో మిత్రత్వ సంధులద్వారా రాజకీయ రక్షణ వలయాన్ని సోవియట్ రష్యా నిర్మిస్తున్నది. అంటే వ్యూహాల మూలసూత్రాలలో మార్పులేదుకాని వ్యూహ రచయితలలో మార్పువచ్చింది.

దీనితో రష్యా దీర్ఘకాల ప్రయోజనాలకు, ఆసియాలో కమ్యూనిస్టుచైనాకు ప్రత్యామ్నాయంగా ఒక పెద్దదేశం ఆసరా అవసరమైంది. అలాగే అమెరికా—చైనాల స్నేహసంబంధాలకు ప్రత్యామ్నాయంగా ఒక అగ్రరాజ్యం అండదండలు భారతదేశానికి అవసరమైనాయి. ఈ విధంగా రష్యా — భారతదేశాలకు జాతీయ శ్రేయస్సుల దృష్ట్యా పరస్పరం సహాయ సహకారాలకు అవకాశం ఏర్పడింది. ఆసియాలో సమష్టి రక్షణ ఏర్పాట్లు కావాలని రెండేళ్లనాడు రష్యా కమ్యూనిస్టునాయకుడు బ్రెజ్నేవ్‌చేసిన సూచనలను (దానినే బ్రెజ్నేవ్‌పథకం అంటున్నారు) కాదన్న భారతదేశం బంగ్లాసమస్య సందర్భంలో దానికి అవునని రష్యాతో మిత్రత్వసంధిని చేసుకున్నది. దాని ప్రభావం చైనా — అమెరికాలమీద తీవ్రంగా పని చేసింది. చైనా—అమెరికాలు గట్టిగా పాకిస్తాన్‌ను సమర్థించాయి. ఈ విధంగా ఈనాడు ఆసియాలో రష్యా—భారత్‌లు ఒకవైపున చైనా—అమెరికాలు మరొకవైపున ప్రచ్ఛన్నయుద్ధవాతావరణంలో భాగస్వాములుగా మారాయి. అంతర్జాతీయ పరిణామాలు కారణంగా, బంగ్లాదేశ్ సమస్యవల్ల భారతదేశం ప్రత్యక్షంగా అగ్రరాజ్యాల రాజకీయ వ్యూహాలలో చిక్కుకుంది. అగ్రరాజ్యాల సంబంధాలలో మార్పు వచ్చేవరకు ఈ పరిస్థితులు మారవు. అంటే అమెరికా అధ్యక్షుడు శ్రీ నిక్సన్ పీకింగ్‌యాత్ర ఫలితాలకోసం ప్రపంచరాజ్యాలతోపాటు భారత్‌కూడా ఎదురుచూడక తప్పదు. అంతవరకు రష్యా రాజకీయ వ్యూహంలో భారత్ భాగస్వామ్యం కొనసాగక తప్పదు.



లే ఖ లు :

# కాళూరి హనుమంతరావుగారికి సమాధానము

డాక్టరు కోవెల సుప్రసన్నాచార్యులుగారు 'సాహిత్య వివేచన' యను నొక గ్రంథము వ్రాసిరి. దాని పయి నేను 1971 సం॥ నవంబరు 'భారతి'లో సమీక్ష వ్రాసితిని. ఆచార్యులుగారు విశ్వనాథ సత్యనారాయణగారిని గూర్చి, భారతజాతి తత్త్వమును గూర్చి యొక కొన్నిమాటలు వ్రాసిరి. ఆ మాటలు సత్యములు గావని నేను నా సమీక్షలో విమర్శించితిని. భారతీయసంస్కృతినిగూర్చి నా వ్రాసిన నాలుగు మాటలు 1972 జనవరి 'భారతి'లో కాళూరి హనుమంతరావుగారి విమర్శకు యోగ్యము లయినవి. వారికి సమాధానముగా దీనిని వ్రాయుచున్నాఁడను.

నా సమీక్షను సాంగముగాఁ జదివిన హనుమంతరావుగారికి ముందు నమస్కారము చేయవలయును. వారు దానిలో నా చేసిన 'భారతజాతితత్త్వ' వ్యాఖ్యానమును దడవుట మంచిపనియనియే నేనెంతును. 'హేమ్నః సంలక్ష్యతే హ్యగ్నౌ విశుద్ధిః శ్యామికాఽపివా' యని కాళిదాసు వక్కాణించెను. కాని హనుమంతరావుగా రొకపనిచేసిరి. వారు నే నే ప్రకరణములో ఆవిధముగా వ్రాసితినో బొత్తిగా పట్టించుకొన రయిరి. కావున 'భారతీయ సంస్కృతిలోని మానవతా వాదాన్ని ఏకసూత్రతనీ త్రోసిరాజని కేవల వర్గ వర్ణ దృష్టితో దానినిచూడడం ఆ సంస్కృతికి కువ్యాఖ్యానం చెయ్యడమని మొదట ఖండించి తర్వాత వారే (అనఁగా నేను) మళ్ళీ అటువంటి వ్యాఖ్యానమే చేశారు' అని వ్రాయఁగల్గిరి. ప్రకరణమునుండి వాక్యములను బట్టి యీవలికీడ్చి యేమేమో తోఁచినట్లు వ్రాయుట కువ్యాఖ్యానమో, సందర్భోచితముగా వ్రాయుట కువ్యాఖ్యానమో చదువరులు పరిశీలింపవలయును.

సుప్రసన్నాచార్యులుగారు 'భారతజాతి తత్త్వం ఆదినుంచీ అద్వైత నిష్ఠమయింది. సర్వజీవులనూ ఆత్మవత్తుగా భావించేది. అందరూ మానవులనూ అమృత పుత్రులనుగా నిరూపించేది...' అని వ్రాసిరి. ఇది నిజముగాదని నేను వ్రాసితిని. 'చీకటినుండి వెలుఁగునకు నన్నుఁజేర్పుము అని మహర్షులు గానము చేయఁగా భారతజాతిలో ముఖ్యులయినవారు సాటివారిని నూటికి తొంబదిమందిని చీకటిగుయ్యారములో కోలుకొన లేనట్లుగా పడఁద్రోసిరి' అంటిని. నే నిట్లనుట హనుమంతరావుగారికంటికి వర్గవర్ణ దృష్టితో భారతీయ సంస్కృతిని జూచుటగాఁ గనఁబడినది. కారణము ముఖ్యులయినవారు అని నేనన్నప్పుడు దానికి వారు అగ్రవర్ణములవారని యర్థము చెప్పుకొనిరి. వారా యర్థము చెప్పుకొనుటకు నేను గారణముగాను. ఎట్లందురా? సుప్రసన్నాచార్యులుగారి మాటలు చదివి నేను ముఖ్యులయినవారు అని యంటిని. సుప్రసన్నాచార్యుల మాటలేమి? వారు భారతజాతి తత్త్వము అద్వైతనిష్ఠ మయినదనిరి. అది సర్వజీవులను ఆత్మవత్తుగా భావించునదని యనిరి. సకల మానవులను అమృతపుత్రులనుగా నిరూపించునదని యనిరి.

ప్రాచీన సాంఘికవ్యవస్థనుబట్టి సుప్రసన్నాచార్యుల 'భారతజాతికి' భారతజాతిలో ముఖ్యులయిన వారుఅని నేను అర్థము చెప్పితిని. ఆ యర్థము సరియయినది కాదాయేమి? నా యర్థము తప్పని, నేను వర్గవర్ణదృష్టితో వ్యాఖ్యానము చేసితినని నాకు నేరమి యంటఁగట్టిన హనుమంతరావుగారు ముందు 'భారతజాతి'ని నిర్వచించి, నా యర్థము దోషభూయిష్ఠమని నిరూపించి యప్పుడు నా సమీక్షను విమర్శించియుండవలసినది. కాని వారాపని చేయలేదు.

అసలు సుప్రసన్నాచార్యుల మాటలను నేను విమర్శించితినని హనుమంతరావుగారు మఱచినట్లున్నది.

అనఁగా వారు ప్రకరణమును నెటి వేసిరి. ఆ ప్రకరణ మెట్టిదో వివరింతును. సాహిత్యవివేచనకర్త భారతీయ సంస్కృతిలో ఏకదేశమయిన హిందూసంస్కృతిని భారతీయ సంస్కృతిగా భావించిరి. అది దోషమని నా తలంపు. ఈ విషయమును నా సమీక్షలోనే వెల్ల డించితిని. ఆచార్యులు దేనిని భారతజాతి తత్త్వముగా భావించిరో దానికి వర్ణవ్యవస్థ మూలాధారము. ఆ వ్యవస్థ యందఱను ఆత్మనత్తుగా భావించినదని అమృతపుత్రులనుగా నిరూపించినదని చెప్పుట సాహ సము. ధర్మశాస్త్రములను, బ్రహ్మసూత్ర భాష్యము లను బఠించినవారెవ్వరు ఆచార్యుల మాటల నంగీ కరింపరు. భారతజాతి తత్త్వమునుగూర్చి వివరించు టకుముందు ఆచార్యులుగారెన్నో విషయములను పరిశీ లించి యుండవలసినది. ప్రాచీన సంఘమున అసమా నత్వము కలదు. అది దైవకల్పితమని నేననుకొనుట లేదు. భారతజాతి తత్త్వమును వ్యాఖ్యానించు సుప్ర సన్నాచార్యులు ఆ యసమానతను బరిగణింపలేదు. కావుననే వారావిధముగా వ్రాయఁగల్గిరి. అట్లు వ్రాయు టకుముందు ఆ యసమానత్వమును మఱవరాదని నా యభిప్రాయము.

హనుమంతరావుగారే 'ఒకజాతిమత గ్రంథాలలో కనిపించే ఆదర్శవాదాలు ఆ జాతి నిత్యజీవితంలో సంపూర్ణంగా కనిపించకపోవచ్చును. తరచు ఆ పుస్తకా లలో ప్రవచింపబడిన ఆదర్శాలకి వ్యతిరిక్తమయిన నడవడిని ఆజాతి అలవరచుకోవడంకూడా కనిపిస్తుంది' అని వ్రాసిరి. బౌద్ధ క్రైస్తవ మహమ్మదీయ మత ములను స్వీకరించిన దేశములవారు ఆ మత సిద్ధాంత ములకు వ్యతిరేకముగా నడుచుకొనిరని నిరూపించిరి.

నా సమీక్షనుగూర్చి వ్రాయుట కీవిషయము లను హనుమంతరావుగారు చెప్పనక్కఱలేదు. ఖండాం తర సంస్కృతులతో భారతీయ సంస్కృతిని పోల్చి యది లొచ్చని నేననలేదు. హిందూమతమును నితర మతములతో పోల్చి దానిని క్రిందుచేయుటకు నేను పూనుకొనలేదు. ఇతర జాతులవారినిగూర్చి హనుమంత రావుగారు వ్రాసినదంతయు వారి సర్వతోముఖ విజ్ఞాన మునకు నుదాహరణ మగునేమో కాని ప్రకరణోచితము మాత్రముగాదు. పరిణామము ప్రకారముగా ఒకానొక జాతి విషయములో నేమిజరుగునని హనుమంత రావుగా రనిరో, యదియే భారతజాతి విషయములో ఈ కర్మభూమియందు జరిగినదని నేననుకొనుచున్నాఁ డను. దానినే నా సమీక్షలో వెల్లడించితిని. అట్లు వెల్లడిచేయుట కువ్యాఖ్యానమని వారనిరి. పొరపడిరి.

జాతి మత నిర్మూలనము భారతదేశములో జరుగలేదని నొక్కి చెప్పుటకుఁ దగిన సాక్ష్యములు నా కింకను లభింపలేదు. దేశ దేశములలోని మహా మేధా వులు మన సంస్కృతిని మతమును పొగడుట, మన సంస్కృతిలో మనము గర్వింపఁదగిన దెంతో యున్న దనుట నేనెఱుఁగని విషయములుగావు. వేదములలో నేమియు లేదనుట తప్పే. హిందూమత మొకజీవన విధానమని[?] రాధాకృష్ణనివంటి వారనుట నిజమే. కాదన్నవా రెవరు? హనుమంతరావుగారు నా సమీక్షకు సంబంధింపని విషయము లెన్నో వ్రాసిరి వారి వ్రాఁతలు చూచినవారికి నేనేమేమో వ్రాసినట్లు, దానికి హనుమంతరావుగారు సమాధానము వ్రాసినట్లు భ్రాంతి కలుగును. వారీవిధముగా నేల వ్రాసిరో తెలి యదు. వారు ఎవ్వరో యెక్కడో యన్నప్పుడు వినిన మాటలకు, వ్రాసినప్పుడు చదివినమాటలకు, నా సమీ క్షను బరామర్శించుచు సమాధానములు వ్రాసినట్లు న్నదే కాని సందర్భోచితముగా లేదు. నాకు భారతీయ సంస్కృతినిగూర్చి తెలియని యప్పుడు వారిట్టి వ్రాఁతలువ్రాసిన లెస్సగా నుండెడిది.

'భారతజాతి తత్త్వంలో వ్యక్తి స్వతంత్రుడు' అని చెప్పుటకు హనుమంతరావుగారు శంతను వృత్తాం తమును తార్కాణించిరి. మఱి శంబూకవధ యేల జరిగినది? రాముఁడు శంబూకుని చంపలేదని, తద్గాధ రామాయణములోఁ బ్రక్షిప్తభాగమని యనుకొన వలయునా ?

ప్రాచీన విద్యావిధానమును నేటి చూపుతో విమ ర్శించుట పొరపాటే. సందేహములేదు. హనుమంతరావు గారు ప్రాచీన విద్యావిధానములోగుట్లు అర్థమయిన

వారి మాదిరిగా 'వీధివీధికి బడులు నడిపి అందరికీ విద్యాబోధన చెయ్యవలసిన అవసరం అప్పుడు లేదు'అని వ్రాసిరి. అవసరము లేకపోవుటకుఁ గారణమేమి? అవసరములేదని వారి కెట్లు తెలిసినది? ఈ ప్రశ్నలకు సమాధానముగాఁ గాబోలు హనుమంతరావుగారు 'ఆ రోజుల్లో జీవిత నిర్వహణకి కావలసినది వృత్తే తప్ప విద్య కాదు'అని వ్రాసిరి. ఆనాఁడు జీవనోపాధికిఁ గావలసినది వృత్తియేకాని విద్యకాదని వారెట్లు చెప్ప గలిగిరి. మఱి ప్రాచీనకాలమునఁ గొందఱు విద్య నేర్చుకొనిరేల? విద్య నేర్చుకొనుటయే వారి వృత్తియా? 'వీరి కింత విద్య చాలును, వీరీ వృత్తి పాటింపవలయును, వారే విద్య నేర్వవలయును, వారే జ్ఞానులు కావలయును'అని నిర్ణయములు చేసినవారెవరు? భగవంతుఁడు గాఁడుగదా? మనుష్యుఁడే యా నిర్ణయములు చేసియుండవలయును. వృత్తులనుబట్టి వర్ణము లేర్పడినమాట నిజమే. ఒకానొక కాలములో స్త్రీ పురుషులు సర్వవర్ణములవారు విద్యలు నేర్చుకొనిరి. చర్చలలోఁ బాల్గొనిరి. తరువాత ఈ పద్ధతి మాఱినది. మాఱుటకు ఆనాటి మనుష్యుఁడే కారణము. అతఁడేల మార్చెనో?

నా సమీక్షలో నేను బ్రాహ్మణులపేరే యెత్తలేదు. వారు స్వార్థపరులని, అమాయికులుగారని నేననలేదు. హనుమంతరావుగారు 'అధికారాన్నీ వ్యాపారాన్నీ కృషినీ వస్తువుల ఉత్పత్తినీ అన్యవర్ణముల అధీనంజేసి ధనార్జనకి ఏమీ పనికిరాని పుస్తకాల కట్టలనీ భిక్షాటననీ తను వంతు చేసుకొనటం ఆనాటి బ్రాహ్మణుల స్వార్థరాహిత్యాన్నీ అమాయికత్వాన్నీ సూచిస్తుందేతప్ప స్వార్థపరత్వాన్ని సూచించదు'అని వ్రాసిరి. బ్రాహ్మణులు రాజులు సార్వభౌములు నయిరి. హనుమంతరావుగారీమాట మఱచిపోయిరనుకొందును. దానికేమి? పోనిండు. ప్రాచీనకాలమున పుస్తకాల కట్టలు ధనార్జనకుఁ బనికిరాలేదా? రాజులకుఁ గృతులిచ్చినవారు దేనికిచ్చినట్టో? అగ్రహారములు, మాన్యములు పొందినవారు దేనికి పొందినట్టో? భారతీయ సంస్కృతి పరిణామమును గుర్తింపక హనుమంతరావుగారేమి వ్రాసినను ప్రయోజనములేదు. అన్యవర్ణములవారు జ్ఞానమల్లై విద్యనే జీవనోపాధిగాఁ జేసికొనుగల్గియున్నచో వారు మాత్రము స్వార్థరహితముగాఁ బ్రవర్తింపకయుందురా? అమాయికముగా బ్రదుకకయుందురా? వారి కాయవకాశమే కలుగలేదాయె. కలిగిననాఁడు వారు పురాణేతిహాసములను బ్రచారము చేయలేదా?; ధర్మార్థము పాటువడలేదా? ఎన్నియుదాహరణములు లేవు?

హనుమంతరావుగారికి మఱొకమాట చెప్పవలయును. ఏదేశ సంస్కృతియయినఁ గాలక్రమమునఁ బెక్కుమార్పులు పొందును. ఎన్నో యెక్కువ తక్కువలకుఁ గూడలియగును. వెలుఁగునీడల కాలవాలమగును. భారతీయ సంస్కృతి దీని కపవాదముగాదు. కావున మన సంస్కృతిని మనము పరీక్షించునపుడు ఏన్నో విషయములను పరిశీలించి వెలకట్టవలసియున్నది. సమచిత్తముతో లభించుచున్న సాక్ష్యములను జదువవలసి యున్నది. అంతే కాని విదేశసంస్కృతులతో భారతీయ సంస్కృతిని పోల్చి మంచిచెడ్డల నిర్ణయించుట తగదు. ఎవరి సంస్కృతి వారికే గొప్ప. జాతీయోద్యమకాలములో, స్వదేశాభిమానముతోఁ జాలమంది భారతదేశ సంస్కృతిని యితర సంస్కృతులతోఁ బోల్చి, యెంతో గొప్పదని చాటిరి. ఆనాఁ డాపద్ధతి చెల్లినది. కాని యది యుత్తమ పద్ధతిగాదు. మహాభారతీయచరిత్రకారు లెవ్వరీ పోకడ పోయినవారు గారు. ప్రకంతలు వెదకఁ దలఁచినచో ఏదేశ సంస్కృతి యందయినను జిన్నవో పెద్దవో చాలఁ గనఁబడును.

'విజ్ఞానవంతు లయినవారు రాగద్వేషాలను విడిచి మన సంస్కృతిని సరిగా సమీక్షించవలసిన ఆవశ్యకత ఈ నాడు ఎంతోవుంది' యని హనుమంతరావుగారనిరి. నాకెంతో నచ్చినమాట యిది. సుప్రసన్నాచార్యులుగారు భారతజాతి తత్త్వమునుగూర్చి పలికిన పలుకులను నిష్పక్షపాతముగాఁ బరిశీలించియున్నచో హనుమంతరావుగారికి నా సమీక్షను పునస్సమీక్షింపవలసిన యక్కఱ యుండెడిదిగాదు. వారు 'సాహిత్యవివేచన'ను జదివి యనఁదగిన పయిమాటలను, నా సమీక్ష

చదివి యనిరి. నిజముగా హనుమంతరావుగారితో ఆ మాటలు చెప్పవలసినది నేను.

— 'శాక్య సింహ'

# తె లు గు లి పి

**1971** డిశెంబరు భారతిలో శ్రీ నిడుదవోలు వేంకటరావుగారి 'తెలుగు లిపి' అను వ్యాసము చిత్రమైన విషయములతోనిండి హృదయంగమముగా నున్నది. అందు వారెఱుకపఱచిన సంగతులు ప్రతిపాదించిన విషయాలు పెక్కురు పండితులెఱిదివఱకు తలంపనివి, గుర్తింపనివి. ఎవరో ఒకరు రేయింబవళ్లు శ్రమించి పరిశీలించి ఆరాలుతీసి చెప్పిన విషయాలను చదివినతర్వాత అవన్నీ మనకు క్రొత్తగాదుఅని పలికే పండితులు లేకపోలేదు.

ఈ వ్యాసమును చదివి చెప్పశక్యముగాని ఆనందానుభూతిని బొందితిని. ఇది వ్యాసమేగాని కావ్యగుణము లెన్నగాగలది. ఈ వ్యాసము పండితులందఱును తెలుగుభాషా విద్యార్థులందఱును చదివి మననము చేయవలసినది. నేటి కళాశాలా పండితుల కెందఱికీ వ్యాసములోని గుప్తార్థములు తెలియును? ఎవరికీ తెలియవని నే ననుటలేదు, ఎందఱికి తెలియుననునదే ప్రశ్న.

ఈ వ్యాసములో శ్రీ వేంకటరావుగారు తమ యభిప్రాయములను సహేతుకముగా వివరించి యున్నారు. ఎంత పరిశోధన ఫలితముగా నిట్టి వ్యాసముత్పన్నమగునో పరిశోధకులకే తెలియును.

శ్రీ వేంకటరావుగారి వ్యాసోద్దేశమును వారే చెప్పినారు. 'ప్రాచీన సాహిత్య కావ్యపఠనమునం దభినివేశము క్రమముగా క్షీణించి విస్మృతము కాబోవుచున్న యీ సమయమున వానియం దెట్టి యమూల్యాంశము లున్నవో తెలిపి వానివైపు దృష్టి మఱల్చుటయే యీ వ్యాసోద్దేశము'. వారు చెప్పిన ఆ యమూల్య విషయాలు కొన్నింటిని సూచనగా వ్రాయుచున్నాను.

1. కమనీయ రమణీయమైన తెలుగు.

2. శ్రోత్రనేత్రముల కేకకాలములో అనిర్వచనీయానందానుభూతిని గలిగింపజాలినది తెలుగు.

3. సంస్కృతము మృతభాషగాదు, అమృతభాషయని నిరూపించిన దేశభాష తెలుగు.

4. తద్భాషవలె దివ్యత్వమునందిన లిపి సౌందర్యముగలది తెలుగు.

5. యతిప్రాసలు కేవలము ఛందస్సునకు సంబంధించినవికాక వ్యాకరణమునకు లిపికి సంబంధించినవి.

6. వలపలగిలక, రేఫ సంయుక్తాక్షరములద్వారా బోధపడు భాషాపరిణామతత్వము.

7. శ్రీకార విశిష్టత.

8. సరస్వతి లిపి స్వరూపిణి.

9. నన్నయ కావించిన అక్షర రమ్యత.

'కాకిపిల్ల కాకికిముద్దు, ఎవరిభాషవారికభిమానము'అను మాటలు సత్యములే. 'కాకిపిల్ల కాకికిముద్దు'అను సామెత యెందుకు పుట్టినదో కొంత పరిశీలించిన తెలియగలదు. ఈ సామెతను తమ వాదమున కాధారముగా పలికిన శ్రీ తిరుమలరావుగారు (1972 జనవరి భారతి, కలగూరగంప) దానిలోని సత్యమును తలవనితలంపుగా బైటపెట్టుచున్నారు. కాకికి సౌందర్యములేదని, అయినను కాకికి తన పిల్ల ముద్దుగానే యుండనని దీని భావము.

మహాప్రాణములు, పరుషములు తెలుగులో లేవని ఎవరును చెప్పలేదు. కోయిలకు కాఱు నలుపున్నది. కాని మనము మెచ్చుకొనునది ఆ నలుపునుగాదు, అనిర్వచనీయమైన దాని స్వరమాధుర్యమును.

వలపలగిలకవలన లిపికి సమత యేర్పడునని విద్యారత్న శ్రీ నిడుదవోలు వేంకటరావుగా రన్నారు. వలపలగిలక తోడి వ్రాతవలన నన్నయ 'అక్షర—రమ్యత' సాధించినట్లు శ్రీ వేంకటరావుగారి అభిప్రాయము' అని శ్రీ తిరుమలరావుగా రన్నారు. వీరే రెండవ మాటగా 'వలపలగిలకతోడి వ్రాతకంటె

సంయుక్తాక్షరములే రమ్యతరములని నా యభిప్రాయము' అన్నారు. వలపలగిలక లీనమైన వ్యంజనమున వ్యంజనమే ప్రాధాన్యము నందును. అనగా రకారము అప్రధానమైపోవును. ఏదేని స్వరములో రెండు వర్ణములకు సమాన ప్రాధాన్య మున్నయెడల రమ్యత — మఱీ ముఖ్యముగా పద్యములోని అక్షర రమ్యత—సన్నగిల్లును. దీనిని గుర్తించి నన్నయ రకారము అప్రధానమై, వ్యంజనమే ప్రధానమగు సరణిని తన కావ్యమును రూపొందించెను. 'సంయుక్తాక్షరములే రమ్యతరములని నా యభిప్రాయ' మనిన తిరుమలరావుగారి మతమును గర్హింప నెవరికిని నధికారము లేదు. వ్యక్తుల కభిప్రాయ భేదములుండుట సహజమే కదా! కాని లిపిలోగాని, ఉచ్చారణలోగాని వలపలిగిలక తోడిదే సంయుక్తాక్షరము కంటె ఇంపైనదని నా యభిప్రాయము. ఉదాహరణముగా నీక్రింది అక్షరములను చూడుడు.

మ౯ క౯ ధ౯ భ౯

ర్మ ర్క ర్ధ

వలపలగిలకతో వ్రాయబడిన హల్లులు హల్లే ప్రధానముగా నుచ్చరింపబడును. రేఫ హల్లులో నంత ర్లీన మగును. ఇది నన్నయ రూపొందించిన అక్షర రమ్యత. తిక్కనాదులు దీనిని పాటింపలేదు. అయ్యది వారి మతము. 'భాషా పరిణామ తత్త్వమును విశదము చేయును' అనిన శ్రీ వేంకటరావుగారి వాక్యమును 'సంయుక్తాక్షరములే రమ్యతరము' లన్న శ్రీ తిరుమలరావుగారి వాక్యమే ఋజువు చేయుచున్నది.

ఋకారముతోగూడిన హల్లునకు పూర్వాక్షరము, అది దీర్ఘము కానియెడల లఘువేయని మన కందఱకు తెలియును. 'నిభృతము' 'నికృష్టము'అను పదములలోని మొదటి స్వరమును గురువుగానే అనేకులు పలుకుచున్నారు. హల్లు అచ్చులో లీనమైపోవలసి యుండగా రెంటిని సమానస్థాయిలో పలుకుటచేతను, లేక ఋకారము హల్లునకు తర్వాత వ్రాయుచున్న కారణమున అప్రధానముగా నెంచుటచేతను హల్లును తేలబల్కుట సులభము కాకపోవుటచేతను ఈ సంకటము వచ్చెను. ఇంక కొంతకాలమునకు 'వికృతి' లోని 'వి' గురువుగా లెక్కింపబడుట జరుగునని అనుమానించుచున్నాను.

ఏకకాలములో అటు శ్రోత్రేంద్రియమునకు, ఇటు నేత్రేంద్రియమునకు అనిర్వచనీయమైన ఆనందానుభూతిని గలిగించి బ్రహ్మానందసిద్ధిని చేకూర్చు లోకోత్తర విశిష్టత—యావద్భారత వర్షమున — ఒక్క తెలుగుభాషలోతప్ప మరి యే యితర దేశభాషలలో లేదు' అన్నారు శ్రీ నిడుదవోలుగారు. ఇది చర్చనీయాంశము కాదు, సరిగదా, శిరోధార్యము. 'దేశభాషలందు దెనుగు లెస్స' అన్నది వీరుగాదు, 'Telugu is the Italian of the East' అన్నదియు వీరుగాదు; 'తెనుంగు తేనియ' అన్నదియు వీరుగాదు. ప్రపంచములోని అనేక భాషలలో పాండిత్యముగలవారే యీ మాటలన్నారు. ఇతర భాషలలోను, కావ్యములలోను మాధుర్యములేదని శ్రీ వేంకటరావుగారి అభిభాషణలో నెక్కడున్నది? 'ఎవరిభాషపై వారి కభిమానము. వీరి దృక్పథమే ఇతరభాషలవారికున్నయెడల ప్రతిభాషయు ఇతరభాషకంటె గొప్పదై కూర్చొనును'అని శ్రీ తిరుమలరావుగారు వక్కాణించినారు. కాకిపిల్ల కాకికి ముద్దేఐనను అది ఇతర పక్షులకంటె గొప్పదై కూర్చొనునా? కాకిగూడను సుందరమైనదేఅను కళాభిజ్ఞుల నేమనవలెను? తరతమభేదములు గుర్తించి రసజ్ఞులు దేని స్థానమును దానికిత్తురుగదా. 'అట్టి దృక్పథమువలన భాషాపరిశోధన యేమి బాగుపడును'అని ఇంకొక ప్రశ్న వెలయించినారు శ్రీ తిరుమలరావుగారు. భాషాపరిశోధన వలననే అట్టి దృక్పథము సిద్ధించినది.

'అర్థముక్తి శబ్ద సంబంధమైనది, అక్షర రమ్యత లిపి సంబంధమైనది' అనిన శ్రీ నిడుదవోలు వారి మాటలలోని అక్షరరమ్యతను పట్టుకొని చాల దూరము విచారించినారు శ్రీ తిరుమలరావుగారు. అక్షరరమ్యత లిపి సంబంధమైన దనుటలో అది స్వర

సంబంధమ్మైనది కాదని భావముకాదు. లిపులనుచూచి గదా పఠితలు కావ్యమందలి స్వరముల నుచ్చరింతురు.

చెట్టుముందా విత్తుముందా అన్నట్లి అవినా భావ సంబంధము లిపి స్వరముల కున్నదికావున స్వర మును లిపినుండి వేరుచేయలేము. (డిశెంబరు 1971 భారతి, తెలుగులిపి, నాల్గవపుట చూడుడు.) లిపికి సంబంధములేనిది స్వరమనుకొనువా రనేకులున్నారు. కావున నట్టి పొరబాటును సవరించుటకును, తెలుగు శబ్దము లెంతరమ్యములో లిపులుగూడ నంతరమ్యము లనుటకును శ్రీ నిడుదవోలువారు అక్షర రమ్యత లిపి సంబంధమ్మైన దన్నారు. దానిని పట్టుకొని శ్రీ తిరుమలరావుగారు నన్నయ భారతమును వేఱు లిపు లలో నచ్చొత్తించిన యెడల నన్నయ కవిత్వములోని అక్షర రమ్యత నశించిపోవలెనుగదా' అని సవాలు చేస్తు న్నారు. ఆ 'వేఱులిపులు' స్వర నిర్దేశములు కాని యెడల అట్లే జరుగును. కాని అట్టిలిపులు లిపులు గానేరవు. కోడిగీతలకును వానికిని భేదములేదు. వల పల గిలకతో హల్లులను వ్రాసిన నన్నయార్యు డిట్టి అవినాభావసంబంధమునే రూపించి, మనోహరత్వమును చూపించినాడు. అందమ్మైన ఆకారములుగల అక్షర ములు తదనుగుణమ్మైన అందమ్మైన స్వరములను పలు కుటవలన 'అక్షరరమ్యత' యేర్పడినది.

తాను సత్యమని నమ్మినదానిని గుఱించి శ్రీ తిరుమలరావుగారు వ్రాసినదానినిబట్టి నాకేమీ చింతలేదు. కాని యింత యుత్కృష్టవ్యాసమును రూపొందించిన పరిశోధనాపరమేశ్వరుల కృషి కొక్క ప్రశంసావాక్యము లేకపోయెను గదాయని చింతిల్లు చున్నాను.

—బి. పురుషోత్తం.



# అలంకారశాస్త్రం - ఒక సమీక్ష

ఏ భాషలోనైనా మౌలికసాహిత్యం ముందు. సమీక్షాత్మక సాహిత్యం పిమ్మట. కావ్యలక్షణం తెలిపేది అలంకారశాస్త్రం. భాషాలక్షణం తెలిపేది వ్యాకరణ శాస్త్రం. సంస్కృత అలంకారశాస్త్రగ్రంథాలు విషయ సూచికలవంటివనీ, అవి సాహిత్యవిమర్శలు కావని ఆధునికుల తలంపు. కాని నిశితంగా పరిశీలిస్తే ఈ విమర్శ సహేతుక మనిపించదు. భరతుడు, దండి, ఆనందవర్ధనుడు, అభినవగుప్తుడు, మమ్మటుడు, విశ్వనాథ పండితుడు మున్నగువారు కూలంకషంగా విచారం చేసారు. వారు ఎప్పటికప్పుడు సాహిత్యవిమర్శలో నూతనాంశాలను ప్రతిపాదిస్తూపోయారు.

అలంకారశాస్త్రం క్రీ. శ. 5 వ శతాబ్దివాడైన భరతునితో ఆరంభమయిందని సాహిత్య విమర్శ చరిత్రకారులు. అంతకుముందు లేకపోలేదు. క్రీ. పూ. 5 వ శతాబ్దివాడైన యాస్కాచార్యుని నిరుక్తంలో ఉపమ నిర్వచనం, క్రీ. పూ. 4 వ శతాబ్దివాడైన వరరుచి వార్తికాలలో అఖ్యాయిక ఉల్లేఖించబడిఉండటంవలన వేదోపాంగాలు వెలువడిన కాలమే అలంకార శాస్త్రావిర్భావానికి సరియైనకాలమని నిర్ణయించవచ్చు. కనుక భరతుడు భామహుడు దండి ప్రభృతులు అలంకార శాస్త్రానికి ఆద్యులని చెప్ప తగదు. గతంలో జరిగిన కృషి ఫలితమే వారి రచనలకు ఆధారభూతం. ఆంగ్ల సాహిత్యవిమర్శ చరిత్ర గ్రీక్ రోమన్ కావ్యాలతో ఆరంభమవుతుంది. 18 వ శతాబ్దిలో హొరేస్, అరిస్టాటిల్‌లను అపార్థంచేసుకుని, కువ్యాఖ్యానాలు వెలయించినట్లుగానే, మన ఆలంకారికులకూ అదే గతి పట్టించారు. వామనుడు మమ్మటుడు వంటివారు గొప్పపండితులు. మేధావులు. వారి రచనలు చేవకలవి.

అలంకారశాస్త్రాన్ని ఉన్నతస్థాయికి తెచ్చి దాని కొక విశిష్టతను చేకూర్చినవాడు మమ్మటుడు. కావ్యప్రకాశము అత్యుత్తమమైన విపుల విమర్శ గ్రంథమని విమర్శకులందరూ అంగీకరించారు. ఈ గ్రంథం క్రీ. శ. పన్నెండవ శతాబ్దిలో వెలువడింది. మమ్మటునికి ముందువారైన వామనుడు, ఆనందవర్ధనుడు, అభినవగుప్తుడు గొప్పపండితులూ, విమర్శకులూ అనడానికి సందేహించవలసినపనిలేదు. కవి సృష్టి ప్రకృతికృత నియమరహిత మన్నాడు మమ్మటుడు. ప్రకృతి నియమబద్ధం. కవిత్వం స్వేచ్ఛాసృష్టి. బారైన చూపు. సూక్ష్మపరిశీలన, ఖచ్చితమైన అభిప్రాయ ప్రకటన, విమర్శనాయుక్తి, అంతర్దృష్టి — ఈ గుణాలు మమ్మటునిలో ఉండటంవలన విమర్శకుల పంక్తిలో ఎత్తైన పీఠాన్ని సంపాదించుకోగలిగాడు. పూర్వోక్తసిద్ధాంతాలను క్రమబద్ధం చేయటమేకాక, పిడివాదంగా వున్నవాటిని హేతుబద్ధ మొనర్చాడు. మమ్మటుని హేతువివేచనతో కూడిన ప్రతిపాదనలను త్రోసిపుచ్చలేము. సాహిత్యానికి తత్వాన్ని (Philosophy) జోడీకరించటమే విమర్శ అనుకుంటే మమ్మటుడు ప్రపంచ సాహిత్యవిమర్శకులలో అగ్రగణ్యుడని అభివర్ణించవచ్చు. అంతమాత్రాన మమ్మటునితోనే సాహిత్యవిమర్శ ఆగిపోలేదు. అతనిదే చివరివాక్య మనుకోవడం నిరర్థకం. క్రీ. శ. 8 వ శతాబ్దినుంచి 12 వ శతాబ్దంవరకూ అలంకారశాస్త్రానికి స్వర్ణయుగం.

వేదాలు ప్రభుసమ్మితాలనీ, పురాణేతిహాసాలు మిత్రసమ్మితాలనీ, కావ్యనాటకాలు కాంతాసమ్మితాలని ఆలంకారికులు స్థూలవిభజన చేశారు. కావ్యాలంకార చూడామణికర్త మూడు విధాలైన కావ్యభేదాలను పేర్కొన్నాడు :

ఆరయ వస్తు రసాలం
కార ప్రాధాన్యవృత్తిఁ గబ్బంబులు పెం
పారుఁ దివిధార్థఘటనల
ధీరులు పరికించి వానిఁ దెలియఁగవలయున్.—

వస్తువు, రసము అలంకారము—వీనిలో అన్యతమప్రాధాన్యవృత్తిని బట్టి కావ్యాలు వస్తు, రస, అలంకార ప్రధాన కావ్యాలవుతాయి. భారతం వస్తు ప్రధానకావ్యం. ప్రబంధాలు రసప్రధానం. కాల్పనిక కవిత్వం అలంకార ప్రధానం. ఉత్తమ కవిత్వంలో వస్తువు (thought), రసం (emotion) అలంకారం (imagination) సమ్మిళితమై ఉంటాయి. కావ్యశరీరాన్ని అలంకరించటంవలన వక్రోక్త్యాద్యలంకారాలే ప్రధానమని భామహుడు. కావ్యశరీరాన్ని అలంకరించటం కాదు అలంకారాలే కావ్యశరీరమని రిచర్డ్సు. కావ్యాత్మ రసం. శృంగారహాస్యకరుణరౌద్రవీరభయానకబీభత్స అద్భుతశాంతరసాలు కావ్యరసాలు. బాహ్యరూపం మారుతుందికాని ఆంతరంగికమైన రసస్వరూపం మారదు. అందుకని వాటిని స్థాయీభావాలు (Permanent emotions) అన్నారు. ఇమేజినేషన్‌కు సరియైన సాహిత్యపదం ఆలంకారికత. దాన్నే ఆధునికులు భావన అంటున్నారు. కవికి భావయిత్రీశక్తి లేకపోతే సృజనశీలికాలేడు. మన ఆలంకారికులు ఈ విషయాన్ని విపులంగా చర్చించలేదు. ఆంగ్ల విమర్శకులైన కాలరిడ్జి, వర్డ్స్‌వర్తులు ఆలంకారికత (imagination) ను గూర్చి విపులంగా వ్రాసారు.

భౌతికానందానికి అతీంద్రియానందానికి మధ్యస్థంగా ఉంటుంది రసానందం. రసోత్పత్తికి మూలం జగత్తు. వాస్తవిక జగత్తులో అనుభవించే రత్యాదులకూ, రసజగత్తులో కలిగే అనుభూతికీ భేదం ఉంది. రస జగత్తులో శిల్ప రామణీయకత శోకంలో ముంచివేయటంలేదు. నిజంగా దుఃఖిస్తే కావ్యాన్ని చదవలేము. యుద్ధరంగాన్ని, తుఫానులో సముద్రాన్ని దర్శించినపుడు ఆనందం కలుగుతుంది. అందుకు కారణం బాధను ఇతరు లనుభవిస్తున్నారనికాదు; మనం సురక్షితంగా ఉండటమే. ప్రమాదం మనకు రానంత వరకూ బీభత్సంకూడా ఆనందాన్నే కలిగిస్తుందంటాడు లూక్రెటస్ (Lucretius). కవి భావాలను స్థాయీ భావాలుగా పేర్కొన్న అభినవగుప్తుడూ; Poetry takes its rise from emotion recollected in tranquility అని వర్డ్స్‌వర్తూ. రెండూ ఒకటే. అభినవగుప్తుని మానసిక రసస్థితి విశ్లేషణకు, కాంట్ ప్రభృతి ఆధునికుల సౌందర్యవాదానికీ పోలికలున్నాయి. భౌతికాతీతమైన సౌందర్య పరవశతను కలిగించే వస్తుజ్ఞానమే రామణీయకత. గౌడీ, పాంచాలీ, వైదర్భీ రీతులు మూడు. గ్రీక్ విమర్శకులుకూడా Dorion, Inonian, Attic అని మూడువిధాలుగానే పేర్కొన్నారు. బెనెడెట్టోక్రోస్ ఎక్స్‌ప్రెషనిజాన్నిగూర్చి బృహద్గ్రంథాన్ని వ్రాస్తే, బుద్ధఘోషుడు 'ధమ్మసంగణి' భాష్యంలో కొన్ని వాక్యాల్లోనే చెప్పగలిగాడని మన విమర్శకు లంటారు. క్రోస్ ప్రభావం పాశ్చాత్య సాహిత్య విమర్శకులపై బాగా ప్రసరించింది. రసానుభవాన్ని భారతీయులు మోక్షంతో పోల్చారు. జర్మన్ విమర్శకులు Sublime అన్నారు. ఆకాశంలో ఉరుములు మెరుపులతో కదిలే మేఘాలు, ప్రేలే అగ్నిపర్వతాలు, వీచే పెనుతుఫానుల వికటతాండవం, హోరెత్తే సముద్రం, కొండమీదనుంచి పడే పెద్ద జలపాతం—ప్రకృతిలోని ఈ దృశ్యాలను చూస్తుంటే మనం అల్పులమనిపిస్తుంది. చూడటానికి చాలా ఆకర్షణీయమైన దృశ్యాలు. మనం భద్రంగా వున్నప్పుడే వాటిని దర్శించగలం. అవి ఆత్మశక్తిని ద్విగుణీకృతం చేయగలవు. ప్రకృతి శక్తికి ప్రతిగా అంతఃస్థైర్యాన్ని కలిగిస్తాయి. అధమస్థాయినుంచి ఉచ్చస్థితికి తీసుకుపోయే శక్తిగల వస్తువులు, వాటినే Sublime అంటారని కాంట్.

ఈ విధమైన తులనాత్మక పరిశీలనచేస్తే సాహిత్య విమర్శ మరింత వికసిస్తుంది. సంస్కృతాలంకారశాస్త్ర ఆధారంతో నేటి సాహిత్యవిమర్శను పెంపొందించుకోవాలి. ఆధునిక వచన కవిత్వంపై వస్తునిష్ఠమైన విమర్శలు రావాలి. ఛందస్సులోవున్న రూపసౌందర్యంగాని, నాదగతమైన లయగాని వచన కవిత్వంలో లేవు. వస్తువు లేకపోయినా రసమూ, అలంకారమూ లేకుండా కవిత్వం ఉండదు. అభ్యుదయ

కవిత్వంలో వస్తువు ప్రధానం. అసలు కవిత్వాన్ని రూపొందించేది చెప్పేతీరు. భావాలన్నీ పాతవేకాని చెప్పే తీరునుబట్టి ఎప్పటికప్పుడు కొత్తగా కనిపిస్తాయి. వచనకవిత్వంలో వస్తువు పాతదైనా శిల్పం కొత్తది.

తెలుగులో సాహిత్యవిమర్శచరిత్ర వెలువరించాల్సిన అవసరంఉంది. అందుకు విమర్శకులు పూనుకోవాలి.

— శ్రీ శివకుమార్.

## వాలివధ–ఒక పరిశీలన

రామాయణం ఒక చారిత్రిక కావ్యం. చారిత్రిక వ్యక్తులైన సీతారామాంజనేయులు రామాయణ కావ్యంలో చిత్రితులై వాల్మీకిలేఖినీమహిమచేత దేవతలయ్యారు. యథార్థతః చారిత్రిక దృష్టితోనూ కావ్యదృష్టితోనూ సమీక్షించ వలసిన రామాయణాన్ని విమర్శకులు మతగ్రంథంగా పరిగణించ సాగారు. ఈ విధమైన పరిగణనలో అత్యంత జటిలసమస్యగా తయారైన సన్నివేశం వాలివధ.

'ఇంకొకరితో యుద్ధంచేస్తున్న నన్నుచంపడం అధర్మం' అని వాలి అన్నదానికి 'నువ్వు జంతువువి కనుక వేటాడాను. వేటలో అభిముఖంగానే చంపాలన్న నియమంలేదు; జీవించిఉన్న తమ్ముడిభార్యను హరించావు కనుక వధరూపమైన దండనం విధించాను' అని రాముడు సమాధానం చెబుతాడు. ధర్మాకూతకర్త దీనిలో ధర్మాధర్మాలని చర్చించాడు ఏ పరిస్థితిలోనూ కోతిని చంపకూడదు, పొరపాటునైనా కోతిని చంపుతే ప్రాయశ్చిత్తం చేసుకోవాలి. కనుక వాలి అధర్మప్రవర్తకుడైనందువలన రాముడతనికి మరణరూప దండనం విధించాడన్నదే సముచిత సమాధానమనీ, ఆపద్ధర్మంగా శత్రువుని మాయోపాయంచేత చంపవచ్చుననీ అతడు నిర్ణయించాడు. కాని ఎక్కడనుంచో అయోధ్యరాజువచ్చి కిష్కింధ రాజుని శిక్షించడమన్న సమాధానం మన మనస్సుకి సంతృప్తికరంగా తోచదు. ఆపద్ధర్మంగా పరిస్థితిని బట్టి శత్రువుని ఎలాగైనా తుదముట్టించడమన్న రాజనీతిమాత్రమే రాముడి చర్యని సమర్థిస్తుంది. ఎంతో ధర్మబద్ధంగా ప్రారబ్ధమైన కురుపాండవ యుద్ధం చివరకి ఎలా క్రూరంగా పరిణమించిందో ఆలోచిస్తే యుద్ధధర్మం చాలా చంచలమైనదనీ అల్ప ప్రయోజనం కలదనీ నిశ్చయించవచ్చును. యుద్ధ నియమాలకన్నా రాజనీతి ముఖ్యమైనది.

వాలిని రెండవసారి యుద్ధానికి పిలిచినప్పుడు సుగ్రీవుడి మెడలో గుర్తుగా పుష్పలతని వేసినట్లుగా రామాయణంలో ఉంది. ఐతే ఘోరయుద్ధంలో వృక్ష శిలాదులతో పరస్పరం ప్రహరించుకొన్నప్పుడు ఈ పువ్వులలత తెగిపడిపోలేదాఅని శంక కలుగుతుంది. వాలికి దివ్యప్రభావంకల కాంచనమాల ఉంది; కాని సుగ్రీవుడికికూడా తత్సదృశమైన సువర్ణాభరణం ఉందని—

'అలంకారేణ వేషేణ
ప్రమాణేన గతేనచ
త్వంచ సుగ్రీవ వాలీ చ
సదృశౌస్థః పరస్పరమ్.'

(కిష్కిం. 12,30)

(అలంకారం, వస్త్రధారణ, ఎత్తు, గమనం–వీటన్నిటిలో మీ రిద్దరూ ఒకలాగే ఉన్నారు) అన్న రాముడి మాటలనిబట్టి ఊహించ వచ్చును. కనుక సుగ్రీవుడిమెడలో గుర్తుగా పుష్పలత వెయ్యవలసివచ్చి ఉండవచ్చును. రాముడు చెట్టుచాటునఉండి ఒక్కబాణంతో వాలిని చంపినట్లు రామాయణంలో ఉంది. కాని వాలి పతనానంతరం భయభ్రాంతులై పారిపోతున్న అతని అనుచరులు తారవద్దకువెళ్లి

క్షిప్తాన్ వృక్షాన్ సమావిధ్య
విపులాశ్చ శిలాస్తథా
వాలీ వజ్రసమైర్బాణై
రామేణ వినిపాతితః'

(కిష్కిం. 19, 12)

(వాలి విసరిన వృక్షములనూ శిలలనూ తన బాణములచే నుగ్గుచేసి రాముడు వాలిని వజ్రసమమైన బాణాలతో చంపాడు).

అంటారు. దీన్నిబట్టి రాముడు వాలితో ముఖాముఖిగా యుద్ధంచేసి అనేక బాణాలతో చంపినట్లు తోస్తోంది. కాని భయభ్రాంతులైన అనుచరులమాటలను ప్రమాణంగా తీసుకోలేం. తక్కిన అన్నిచోట్లా రాముడు వాలిని ఒక్కబాణంతో చంపినట్లే ఉంది.

మహాభారతారణ్యపర్వంలోని రామోపాఖ్యానంలో సుగ్రీవుడు వాలిని రెండుసార్లు యుద్ధానికి పిలిచినట్లులేదు. రాముడు చెట్టుచాటునుంచి వాలిని చంపినట్టూలేదు వాలి సుగ్రీవులు ద్వంద్వయుద్ధం చేస్తూ ఉంటారు. రామలక్ష్మణులు, హనుమంతుడు, ఇతరులు చూస్తూఉంటారు. (భీమ దుర్యోధనుల గదాయుద్ధం అందరూ చూసినట్లు). కొంతసేపు యుద్ధం జరిగిన తర్వాత హనుమంతుడు సుగ్రీవుడి మెడలో పుష్పలత వేస్తాడు, రాముడికి గుర్తుతెలియడానికి. వాలి వాళ్ల ఉద్దేశం గ్రహించిఉండడు. పుష్పలత వేసినతర్వాత వాలి సుగ్రీవులు తిరిగి యుద్ధానికి తలపడీతలపడడంతోనే రాముడు వాలిపై బాణం ప్రయోగించివేస్తాడు. తనపై రాముడు బాణం సారించడంచూసి వాలి భయపడ్డాడని చెప్పబడింది. (మహాభా. వన. 280, 35—36) ఈ సన్నివేశం చాలా సహజంగా ఉన్నట్లనిపిస్తోంది. బహుశా వాలివధ నిజంగా ఇలాగే జరిగి ఉండవచ్చుననిపిస్తోంది.

దీనితో పోలుస్తే రామాయణంలో సుగ్రీవుడు వాలిని రెండుసార్లు యుద్ధానికి పిలవడం, లక్ష్మణుడు అతని మెడలోవేసిన పుష్పలత మహాయుద్ధంలో తెగకుండా ఉండడం, రాముడు చెట్టుచాటునుంచి వాలిని చంపడం—ఇదంతా కృతకంగాఉందని తోస్తుంది మహాభారతంలో కథితమైన సంఘటన యథార్థమైనదీ రామాయణంలో వర్ణితమైనది కల్పితం అనీ తోస్తుంది. మరి రామాయణాన్ని సంక్షేపంగా మహాభారతంలో చెప్పినప్పుడు ఇలా మూలవిరుద్ధంగా ఎందుకు చెప్పాడన్న ప్రశ్న ఉత్పన్నమౌతుంది.

దీనినిబట్టి ప్రస్తుతం ప్రచారంలోఉన్న రామాయణం పరిపూర్ణంగా వాల్మీకి రచన కాదనీ, పూర్వం వాల్మీకి రచించిన రామాయణకావ్యాన్ని ఎవరో పెంచి రచించారనీ, ఆ పునారచిత రామాయణం ఇంకా అనేక ప్రక్షిప్తాలలోకూడి ప్రస్తుతం ప్రచారంలో ఉన్న రామాయణమైందనీ తోస్తుంది. ఈ ఊహకి రామాయణంలో ఆధారాలు కనిపిస్తాయి.

'నారదస్య తు తద్వాక్యం
శ్రుత్వా వాక్య విశారదః
పూజయామాస ధర్మాత్మా
సహ శిష్యై మహామునిః'

(బాల. 2, 1)

'తస్యాభ్యాశేతు మిథునం
చరంత మనపాయినం
దదర్శ భగవాం స్తత్ర
క్రౌంచ యో శ్చారు నిస్వనమ్.'

(బాల. 2, 9)

'చింతయన్ స మహాప్రాజ్ఞ
శ్చకార మతిమాన్ మతిమ్
శిష్యం చైవా బ్రవీద్ వాక్య
మిదం స మునిపుంగవః'.

(బాల. 2, 17)

కవి తననుగురించి తాను ప్రథమ పురుషలో చెప్పకోడంలో వింతలేదు. కాని 'భగవాన్, మహామునిః, మహాప్రాజ్ఞః, మునిపుంగవః'అని వాల్మీకి తననుగురించి తాను చెప్పకొనిఉంటాడా?

'తదుపగత సమాస సంధియోగం
సమమధురోపనతార్థవాక్యబద్ధమ్
రఘువరచరితం మునిప్రణీతం
దశశిరసశ్చ వధం నిశామయధ్వమ్.'

(బాల. 2, 43)

'మునివరుడైన వాల్మీకి ప్రణీతమైన రామాయణం వినండి'అని ఇంకొక కవి ఎవరో చెబుతున్నట్లుగా ఈ వాక్యాలు తోస్తున్నాయి. ఇంతేకాక యుద్ధకాండ చివరలో 'ఆదికావ్య మిదంత్వార్షం పురా వాల్మీకినా కృతమ్' (యుద్ధ. 131, 107), 'ఇతిహాసం పురాతనమ్' (యుద్ధ. 131, 116) అన్న

వాక్యాలుకూడా పూర్వం ఎప్పుడో వాల్మీకి రచించిన కావ్యాన్ని పెంచి ఇంకొకరు తిరిగి రచించినట్లే సూచిస్తున్నాయి.

దీనినిబట్టి మొట్టమొదట వాల్మీకి రచించిన అసలు రామాయణకావ్యం ఒకటుందనీ, దానినే సంగ్రహించి వ్యాసుడు ఆరణ్యపర్వంలో రామోపాఖ్యానంలో చెప్పాడనీ, మహాభారతరచనానంతరం తిరిగి ఎవరో రామాయణాన్ని పెంచి రచించారనీ మనం ఊహించవచ్చును. మహాభారత రచనలో అపాణినీయాలు చాలా ఎక్కువగా ఉండడం రామాయణంలో అంత కన్నా తక్కువగా ఉండడం ఈ ఊహకి ఉపబలకంగా ఉంది. ప్రస్తుతం లభ్యమానమైన రామాయణకావ్యం యావత్తూ మహాభారతంకన్నా ప్రాచీనమైన రచనే అయితే దానిలోనిభాష మహాభారతంలోని భాషకన్నా చాలా ప్రాచీనమైనదిగా ఉండవలసిఉంది. కాని అలా కనిపించడంలేదు.

భాసుడు అభిషేకనాటకంలో వాలి సుగ్రీవులకు ఒక్క పర్యాయమే యుద్ధాన్ని చూపించాడు దీనినిబట్టి బహుశా భాసుడికాలం నాటికి ప్రచారంలో ఉన్న రామాయణంలో వాలి సుగ్రీవుల ఏకపర్యాయ యుద్ధమే కథితమై ఉండవచ్చునని ఊహించడానికి అవకాశంఉన్నా భాసుడు తన నాటకాలలో నాటకీయతకొరకు మూలకథలను చిత్రవిచిత్రంగా మార్చివేసిఉన్నందున అతని రచనను ప్రమాణంగా ఎంచలేం. మన ఊహ కంతటికీ రామాయణ మహాభారతాలే ఆధారాలు.

మహాభారతంలో రామోపాఖ్యానంలో కథితమైనదే వాస్తవగాథకి సన్నిహితమైనదని మనం ఊహిస్తే రాముడు వాలిని చంపిన విధానాన్ని సమర్థించడం కష్టంకాదు. రామసుగ్రీవులు అసహాయులు, వాలి సైన్యయుతుడు. కనుక అతనితో యుద్ధం అసాధ్యం. రాముడే వాలిని ద్వంద్వయుద్ధానికి ఆహ్వానించడానికి వారి ఆయుధాలు ఒకటికావు. మల్లయుద్ధంలో వాలిని తాను గెలవడం దుష్కరమని రాముడు తలంచిఉండవచ్చును. కనుక మార్గాంతరంలేక రాముడు వాలిని అలా చంపిఉండవచ్చును. రాముడు వాలిని చంపడంలో వ్యక్తంచేసినది రాజనీతి మాత్రమే.

—శ్రీ కాశూరి హనుమంతరావు.



## గ్రంథవిమర్శలు :

# మంటలూ - మానవుడూ

(వచన కవితా సంపుటి)

(రచన: డా. సి. నారాయణరెడ్డి. పేజీలు: 70; వెల 2—50 లు; ప్రతులకు : ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్; సికింద్రాబాదు—మద్రాసు.)

ఆధునికాంధ్ర కవులలో డా. సి. నారాయణ రెడ్డిగారొకరు. నారాయణరెడ్డిగారి ఆధునికత అంతా మాత్రాఛందస్సులలో ఉంది. మాత్రాఛందస్సులలో ఆయన కవిత్వం—ఒకవైపు భావకవిత్వపు మాధుర్యాన్ని, మరొకవైపు అభ్యుదయ కవిత్వపు సమాజగతమైన వేదనని సమపాళ్లలో పలికించింది. ఆధునిక కవితాప్రక్రియల్లో నవ్యాధునిక ప్రక్రియ వచన కవిత్వం. వచనకవితామార్గంలో నారాయణరెడ్డిగారు వెలువరించిన మరో గేయసంపుటి మంటలూ—మానవుడూ.

ఈ సంపుటిలో ఆయన సమకాలీన రాజకీయాల మీద, సమాజంలో స్తబ్ధంగా జీవిస్తున్న సామాన్యుడి మీద, గతసంప్రదాయంమీద, సాహిత్యంలో ఈనాడున్న విభేదాలమీద తమ అభిప్రాయాలను వచనకవితా రూపంలో వెలువరించారు. ఈ గేయాలన్నీ 1970 లో రాసినవని ఆయన పేర్కొన్నారు. అంచేత కొన్ని గేయాల్లో 1970 సంవత్సర ప్రభావం తీవ్రాతి తీవ్రంగా వ్యక్తమవుతుంది. 'కవి ఏమార్గాన్ని తొక్కినా ఏపద్ధతిని అవలంబించినా—ఆ మార్గం; ఆ పద్ధతి పరిణతిపొందేదాకాపోతే — కవి పోగలిగితే ఆ రచన మనల్ని ఆకర్షిస్తుంది. నారాయణరెడ్డిగారి వచనకవిత మనల్ని ఇందుకే ఆకర్షిస్తుంది' అన్నారు కొత్తపల్లి వీరభద్రరావుగారు ఆమోదంలో. ఈ ఆకర్షణలోఉన్న స్వరూపస్వభావాలను కొన్ని ఉదాహరణల ద్వారా వివరిస్తాను.

'పావురాళ్ల ఈకలు తొడుక్కొని
పంక్తిలో కూచున్న రాబందులు
సంతకాలుపెట్టే పాలకుల వేళ్ల
సందుల్లోని విషమసంధులు;
పొద్దున చూరుకంటుకునే బల్లులై
మధ్యాహ్నం గోడమీద పిల్లులై
సాయంత్రంకాగానే ఊసరవెల్లులై
రంగులు ఫిరాయించే అధికారాంధులు
మీ నోళ్లకు సంకెళ్లు వేస్తుంటే
మీ నొసళ్లకు మసి పూస్తుంటే
మీ నరాల సింహద్వారాలకు
మేకగొంతుకలు తగిలిస్తుంటే
మీరు చూస్తూనే ఉన్నారు
మీనమేషాలు లెక్కిస్తూనే ఉన్నారు.'

(పరమహంసలారా !)

ఈ పాదాలద్వారా కవి సాధించదలుచుకున్న పరమార్థాలు రెండు. ఒకటి ఈనాటి రాజకీయ నాయకుల నిజస్వరూపాన్ని వెల్లడించడం. రెండవది దాని ప్రభావంవలన బాధపడుతున్న సామాన్యజనానీకం యొక్క చైతన్యరాహిత్యాన్ని సూచించడం. ఈనాటి రాజకీయం—దాని ఫలితం సాహిత్యంలో కవితావస్తువుగా చెప్పడం కొత్తసంగతికాదు. ఆధునిక కవిత్వానికి (అభ్యుదయకవిత్వం ప్రారంభమైనప్పటినుంచి) తన కాలంనాటి సమాజమే ఊతం కనుక ఎవరెప్పుడు చెప్పినా ఒకే విషయాన్ని వివిధపద్ధతుల్లో చెబుతారు. అయితే ఒక కవినుంచి మరొక కవిని వేరుచేసి చూపెట్టేది కవితాశిల్పం. కవితాశిల్పం కవి స్తోమత మీద ఆధారపడిఉంటుంది. పై పాదాల్లో చెప్పుకోతగ్గ విశేషమేమీలేదు. ఒక తీవ్రానుభూతియొక్క పరాకాష్ఠస్థితికూడాలేదు. సులభమైనశైలి, చదవంగానే హృదయానికి హత్తుకునే లక్షణం ఆ పాదాల్లోకనబడుతోంది. ఆ గేయంలోనే ముగింపులో—

'పేడితనం కసవులా చిమ్మేసి
క్రీడితనం బుజువు చేసుకోవాలి
ముచ్చెమటలూ రిచ్చపాట్లూ మానేసి
ముచ్చిచ్చులా అల్లుకు పోవాలి.'

అని అంటారు. ఈ పాదాలు ధ్వనిప్రాయంగాఉన్నాయి. ఈ ధ్వని పేడితనం, క్రీడితనం అనటంలోనే ఉంది. క్రీడిలోని పేడితనం శాపవశాత్తూ వచ్చింది. సామాన్యునిలోకూడా సాహసంఉంది; ఒక దుష్టవ్యవస్థని ఎదిరించే ధైర్యంఉంది. అయితే అది నిద్రావస్థలో ఉంది. దాన్ని మేల్కొలపటమే ఈ ముగింపులోగల అంతరార్థం. ముచ్చిచ్చు సంప్రదాయక ప్రయోగం.

'అనగా అనగా ఒకరాజు' అనే ఖండిక పాలక, పాలితవర్గాల మనస్తత్వ నిరూపణగా ఉన్నది.

'అనగా అనగా ఒకరాజు
ఆయన మనస్తత్వమే వేరు
చెట్లంటే అతనికి చీదరింపు
చిగుళ్లంటే కంటగింపు
పచ్చదనమంటే విప్లవానికి
ప్రతీకఅని అతని తలంపు.'

రాజుగారు పాలించేవారు. చెట్లని చైతన్యానికి సంకేతంగా కవి తీసుకున్నారు. చెట్లు, చిగుళ్లు, పచ్చదనం ఇవన్నీ క్రిందివర్గాల 'గతి'కి ప్రతీకలు. వాళ్లు ఉన్నచోటనే ఉండాలి. వీసంకదిలితే—పై వర్గాల పునాదులు కదలటం ప్రారంభమవుతుంది. అంచేత వాళ్లలో చలనం ఉండకూడదు. దానికి రాజుచేసిన ప్రయత్నం—

'చెట్లను నిషేధిస్తున్నానని
చేయించాడు శాసనం
చిగుళ్లను వెలివేయాలని
బిగించాడు చట్టం
పసరాకులను కాల్పించాడు
పందిళ్లను కూల్పించాడు
చిగుళ్లను పెరికించాడు
చెట్లను నరికించాడు.'

అయినా రాజుప్రయత్నం విఫలమయింది. మరురోజు ఉదయానే మళ్లీ చెట్లు, చిగుళ్లు పచ్చదనం అన్నీ వచ్చేశాయి. విలయకాండ విధ్వంసకాండ మొదలెట్టడం; చెట్లు ఎదురుతిరిగి అసురశక్తిని ఆక్రమించాయి. ఇది ముగింపు. ఈ గేయంలో నారాయణ రెడ్డిగారి ఆశావాదం ధ్వనించబడింది. పీడితవర్గాల్ని ధనిక సమాజం ఎంత అణగ ద్రొక్కినా ఏదోనాడు పీడిత సమాజం జయిస్తుందన్ననమ్మకం ఈ గేయంలో వ్యక్తమయింది. 'కొత్తముఖం తొడుక్కో' అనే గేయంలోకూడా ఇదే భావం వెలిబుచ్చబడింది. పాత ముఖం గత సంప్రదాయవ్యవస్థలోని ఒక అన్యాయానికీ, ఒక అక్రమానికీ ఎదురు తిరగలేని సామాన్యునిది. ఈ ముఖం ఆధునిక వ్యవస్థలో దోపిడీ చేయబడటానికిమాత్రమే పనికొస్తుంది. వ్యక్తి దౌర్జన్యాన్ని, సామాజికఅక్రమాన్ని సహించలేని ఒక మానసిక వ్యవస్థ పెంపొందాలి. 'కొత్తముఖం తొడుక్కో' అనే ఖండిక తత్పరమార్థాన్ని ఆశించి రాసింది.

'నువు తొడుక్కునే కొత్తముఖంలో
రవ్వల్లాంటి
నిప్పురవ్వల్లాంటి
నవ్వులుంటాయి.
అవి—
సత్యభామ ముక్కుపోగులో
నిత్యనూతనంగా మెరుస్తాయి.
నరకప్రవృత్తిపై తిరగబడి
చెరచెరా దహించివేస్తాయి.'

సత్యభామ, నరకుడు రెండు రకాల వ్యవస్థలకి ప్రతీకలు. నరకుణ్ణి సత్యభామ జయించింది. రాక్షస ప్రవృత్తిని మానవప్రవృత్తి జయించాలనే సంకల్పమే ఈ గేయంలో ధ్వనించింది.

'చీకటి చదువు' 'నేనూ—నా తమ్ముడూ'అనే ఖండికలు రెండు పరస్పర విరుద్ధభావాలు కలిగినవి. చీకటిచదువు సాయుధపోరాటభావనమీద సెటైరుగా కనబడుతుంది. ఆమోదంలో శ్రీ వీరభద్రరావుగారు దీన్ని విద్యార్థిదశకు అన్వయించారు. ఆ అన్వయం సరిగా అతికినట్లు కనబడదు.

'చిరంజీవి చీకటి చదువుకుంటున్నది

చిట్టడవి బడిలో' అనే పాదాల్లోనే సాయుధ విప్లవంఅనేభావం ధ్వన్యమానమవుతోంది. చీకటిలాంటి చదువుకాదుగదా ఇది. చీకటే చదువుకుంటున్నది; అందులోనూ అడవిలో.

'చదువుకున్న చిరంజీవి చీకటి
అధికారంలోకివస్తే
గుడ్లగూబలే వైతాళికులు
గుంటనక్కలే ఆస్థానకవులు
హత్యలే ప్రభాతకృత్యాలు
అనృతాలే అపూర్వసత్యాలు' అంటారు నారాయణరెడ్డిగారు ముగింపులో.

నేనూ—నా తమ్ముడు అనే ఖండికలో—

'తమ్ముడు పలికే పటికినిజం
ధమ్మిల్లాలకు అమ్ముడువోని నీరజం
వాడిగొంతు చిమ్ముతున్న కటికచేదు
నేడో రేపో తీపినిజంకాకపోదు'.

ఇవి గేయప్రారంభంలోని పాదాలు. ఈ నాలుగు పాదాల్లో మనకు ఒక అభిప్రాయం ఏర్పడదు కాని—

'గిరులు గీసుకోవద్దన్నాను నేను
గిరులు పిలిచాయన్నాడు వాడు
మనుషులమీద నమ్మకం పోయినవాడు
మట్టినీ గుట్టనూ పట్టుక ఏంచేస్తాడు'

అదే పాదాల్లో సాయుధ విప్లవభావన స్పష్టమవుతోంది. ఆ భావన నిజంకాకపోదన్న మొదటి ఉదాహరణలోని చివరిపాదానికిగల అర్థం ఈ పాదాలు చదివింతరువాతగాని మనకు బోధపడదు.

'తమ్ముని గొంతుకతో శ్రుతి కలపలేకున్నా
దమ్మును మాత్రం మెచ్చుకుంటున్నాను
రాజీపడే అవసరం ఇద్దరికీలేదు
రాస్తాలు వేరని చాటుతున్నాను.'

ఈ నాలుగు పాదాల్లో విప్లవభావన ఒకటే కాక అభ్యుదయకవుల, విప్లవకవుల మార్గాలుకూడా వ్యక్తమయ్యాయి. మనుష్యులమీద నమ్మకంఉన్న వాళ్లు మితవాదులు; అది పోయినవాళ్లు తీవ్రవాదులు- ఈ రెండు ఖండికల్లోని అభిప్రాయాలూ ఒకదానికొకటి వ్యతిరిక్తంగా కనబడుతున్నాయి. చీకటిచదువు విద్యార్థిభావనకీ అన్వయిస్తే—'నేనూ—నాతమ్ముడూ' అనే ఖండికలో నారాయణరెడ్డిగారు వారి భావనని ఇంకాస్త స్పష్టంగా చెపలేదనే మనం అర్థం చేసుకోవాలి.

'ఆకాశం ప్రసవించింది', 'అరిచేకుక్కను అరవనీ', 'ఇంకిపోయినబావి' అనే ఖండికలు మూడూ కొందరు వ్యక్తులను దృష్టిలోపెట్టుకుని రాసినవిగా, కన్పిస్తున్నాయి.

'ఆకాశం ప్రసవించింది' అనే ఖండికలో—

'మొదట సూర్యాన్ని కన్నాను
ముల్లోకాల మొక్కులందుకున్నాను.
ఆ పైన చంద్రాన్ని కన్నాను
అమృతాంధసుల జేజేలు కొన్నాను.
అంతటితో ఆగితే బాగుండేది
నా గీత మహోజ్వలంగా ఉండేది
వెలగలేనిగాజు ముక్కల్ని కని
విలువలేని గుడ్డిగవ్వల్ని కని
అయ్యో ఏమి సాధించాను.
వ్యర్థలెక్కల చిక్కానుపెంచాను' అనే పాదాలలోలాగే 'అరిచే కుక్కను అరవనీ'అనే ఖండికలో కూడా ఈ అభిప్రాయమే స్థిరపడుతుంది.

'లోతు ముట్టే ఆలోచన లేనపుడు
లోపలి సరుకు ఖాళీ అయినపుడు
మిగిలే దేమిటి? బూకరింపులు
పళ్ల బిగింపులు; ఊకదంపులు.'

'ఇంకిపోయిన బావి' ఎవరో ఒక వ్యక్తిమీద దృష్టిని కేంద్రీకరించి రాసినదిగా తోస్తుంది.

'ఇంకిపోయిన బావీ!
ఇంక నీకు గుబే.

ఇంతకాలం నీరిచ్చిన ఊత్తకు
టు
ఎల్లకాలం కృతజ్ఞులం'

అనే పాదాల్లో పై భావన కన్పిస్తోంది. ఇట్లా కృతజ్ఞతలు చెప్పుకుంటూనే—

ఎప్పుడో ఈ యింటి చరిత్ర రాసినప్పుడు
తప్పక నీకో పుట కేటాయిస్తాము.
అమ్మమ్మ తద్దినంతోపాటు
అవశ్యం నిన్ను తలుస్తాము.' అంటున్నారు నారాయణరెడ్డిగారు. చరిత్రకి చరిత్ర రాసేవారిలో ఏకొదిమందో, ఏఒక్కడో నియంత కాదుగదా! ఒకడు ఒక పుటే రాయవచ్చు. ఇంకొకడు వంద పుటలు రాయవచ్చు. ఒకడు వాస్తవానికి మసిపూసి మారేడు కాయ చెయ్యవచ్చు; ఇంకొకడు వాస్తవానికి మెరుగులు పెట్టవచ్చు. ఆ కార్యక్రమం భవిష్యత్కాలానికి సంబంధించినది. ఈ గేయాల్లో—అభ్యుదయ కవుల చీలికల అనంతరం నారాయణరెడ్డిగారి మనస్తత్వంలోవచ్చిన మార్పు వ్యక్తమవుతోంది.

చైతన్యప్రగతిఅనే ఖండికలో సమసమాజంమీద ఆయనకుగల నమ్మకాన్ని వ్యక్తం చేస్తున్నారు.

'ఈ రోజున
మొత్తం సొత్తును గుత్తగా దాచుకున్న
ఊడలమర్రికి తావులేదు.
సమతావాదం పరశువుగా
పరిక్రమిస్తున్నది.
వేలాడే ఊడలు కాదు
వేళ్లకువేళ్లు తెగిపోతాయి
మర్రిచెట్టు కోట కట్టినచోట
మామిళ్లు తలలెత్తుతాయి.'

ఆయనలోఉన్న ఆశావాదం 'ఎదురు తిరిగిన ఉదయం' అనే ఖండిక ముగింపులో పరాకాష్ఠస్థితిలో వ్యక్తమయింది.

'రానున్న ప్రభాతం రాకతప్పదు
రక్తి శుక్తి సత్య మౌక్తికాన్ని
ప్రసవించక తప్పదు, నవధర్మం
ప్రభవించక తప్పదు.'

మానవునికీ, మంటలకీ అనాదిగాఉన్న సంబంధాన్ని 'మంటలూ — మానవుడూ—'లో వ్యంజితం చేశారు. ఇప్పుడొస్తున్న ఉత్తమ వచనగేయ సంకలనాల్లో ఇదొకటి. 'తన వేదనని ప్రపంచవేదన చేశాడు. ప్రపంచవేదన తనదిగా జేసుకొన్నాడు' అన్న వీరభద్రరావుగారి మాటలు—'కృష్ణశాస్త్రి బాధ ప్రపంచానికి బాధ; ప్రపంచపుబాధ శ్రీ శ్రీ బాధ. కృష్ణశాస్త్రి తనబాధను అందరిలోనూ పలికిస్తే శ్రీ శ్రీ అందరి బాధను తనలో పలికించాడు' అన్న చలంగారి మాటల్ని గుర్తుకు తెస్తున్నాయి. 'శ్రీ నారాయణరెడ్డి మహాకవి' 'నేటి సామాజిక వ్యవస్థని, దాని దౌర్భాగ్యాన్ని అనితరసాధ్యమయిన ధ్వనితో చిత్రిస్తాడు.' 'ధ్వని ఎక్కువ అదికూడా రసధ్వని' అన్న కొత్తపల్లి వీరభద్రరావుగారి మాటల్లోగల ఔచిత్యాన్ని పాఠకులు గ్రహించగలరు.

## కొత్త గళాలు

(కవితా సంకలనం)

(పేజీలు : 31; వెల రు 1—00 లు. ప్రతులకు : చైతన్య ఆర్గనైజర్స్ 10–2–317/50 విజయనగర్ కాలనీ – హైదరాబాద్—28.)

వచనగేయసంకలనాలు విరివిగా వెలువడుతున్న కాలమిది. ఇంటింటికో రచయిత, వీధివీధికో కవి పుడుతున్నాడని పెద్దవారు బెంగపడుతున్న సమయమిది. ఇట్టి సమయంలో వచనకవితాసంకలనాలు వెలువరించే సాహిత్యప్రియుల బాధ్యత మరింతగా పెరిగిందని చెప్పవలసిన అవసరం ఈనాడు గట్టిగా కనబడుతోంది. ఒక కవితాసంకలనం వెలువడిందంటే దాన్ని చదివిన పాఠకునికి ఆ సంకలనంమీద ఒక సమగ్రమైన అవగాహన కలిగించేటట్లుగా ఉండటం అవసరం. 'కొత్తగళాలు' సంకలనం సంపూర్ణంగా చదివిన ఏపాఠకుణ్ణి తత్సంకలనం ఏమాత్రం కదలించలేదు. దానికి కారణం ఈ యువకవులకి జీవితం పట్ల, సామాజికవ్యవస్థపట్ల స్థిరమైన అభిప్రాయం ఉన్నట్లుగా కనబడకపోవడమే. ఒక గేయం పూర్వవైభవాన్నిగూర్చి, ఒక గేయం సామాన్యుని వేదనను గూర్చి ఒక గేయం సూక్తుల్ని బోధిస్తున్నందువల్ల సమిష్టిగా ఈ సంకలనంయొక్క ప్రభావం పాఠకుని మీద ఉండదు. కవులు వేరుకావచ్చు; వారివారి దృక్పథాలు వేరుకావచ్చు. కాని ఒక సంకలనంలో గేయాలంటే—పూసల్లో దారంలా ఏకసూత్రతను కలిగి ఉండాలి. 'కొత్తగళాలు సంప్రదాయపు మౌఢ్యాన్ని తెంచుకుని స్వేచ్ఛగా పాడుకొనటానికిచేసిన ప్రయత్నమే ఈ చిన్నసంకలనం' అన్నారు శ్రీ. అరిపిరాల విశ్వం. సంప్రదాయపు మూఢత్వాన్ని, బంధనాల్ని తెంచుకొనవలసిన అవసరం ఎంతఉన్నదో సంప్రదాయం నుంచి నేర్చుకొనవలసినదికూడా అంతే ఉంది.

'శూన్యంలో స్నానాలు చెయ్యొద్దు
వాగాడంబర విభూతి పెట్టొద్దు
కీర్తికాంతనుకాదు భజించేది
నా ఆర్తిదేవుణ్ణి దర్శించండి'

అంటున్నారు కె. శివారెడ్డిగారు. ఈ నాలుగు పాదాలు ఇటీవలితరం కవులలో కనిపించే కొన్నిలక్షణాలని దృష్టిలోపెట్టుకుని రాసినవనుకుంటాను. శబ్దఔచిత్యాన్ని వదిలేసి పదాల ఇంద్రజాలాన్ని సృష్టించే వాళ్లకీ, ఆచరణ శూన్యమైన ఉపన్యాసకులకి, జీవితంలోని వేదనామయఘట్టాలని వొదిలేసి షాక్ట్రీట్మెంటుపేరుతో కీర్తికోసం రచనలు చేసేవారికి ఇది ఒక హెచ్చరికా!

మానవుల్లో సమానత్వం వాస్తవికప్రపంచంలో లేదని అది స్మశానంలోమాత్రమే సాధ్యమని చెబుతున్నారు దేవరాజుమహారాజుగారు.

'కూలి, నాలి, మాలి అందరూ
ఎప్పుడోప్పుడు ఈడ వాలి కాలాల్సిందే –
పచ్చపాతగునం నౌదు ఈ, ఓనానికి
కార్లల్ల వచార్లు శేశేవాడికీ,
ఎయిర్ కండిషన్‌రూములు
గుండీలిప్పి యిసురుకునేఓడికీ,
యిస్పెషల్ బనం లేదోస్ లేదు—
ఆడికీ స్మసానమే!'

ఈ గేయంలోఉన్న ప్రత్యేకతల్లా ప్రత్యేకమైన యాసలో రాయడం. వచనగేయం ఈనాడు సాధిస్తున్న మరొక ప్రయోజనమిది.

శిథిలాలయం ఖండికలో నండూరి సూర్యకుమారి రామప్ప దేవాలయంయొక్క పురావైభవాన్ని వర్తమానంలో దాని శైథిల్యస్థితిని వర్ణించారు.

నాడు రాజులు, రారాజులు తిరిగిన ఆలయాన
రేరాజు తొంగిచూస్తున్నాడు నేడు!
నాడు అఖండ ప్రభలతో వెలిగిన ఆలయం
అంధకారాన అలమటిస్తోంది నేడు!.
ఈ నీరవ నిశ్శబ్దంలో ఒంటరిగా
ఆ నాటి వైభవాన్ని నెమరు
వేసుకుంటోంది జగతి
తిరిగిరాను రాజులని రోజులను తలచుకొని
ఆక్రోశిస్తుంది ప్రకృతి!.
ఒకనాడు తడిసి పన్నీటి
సౌరభాలలో తేలియాడిన ఆలయం
ఒంటరిగా తన అనుభవాన్ని,
ఆనాటి వైభవాన్ని
గీతికగా మధుర గీతికగా అలపిస్తోంది.'

ఈ గేయంలో వచనగేయపు నడకద్వారా లయను సాధించారు కవయిత్రి. అయితే గేయంలో కొత్తతనం ఏమీలేదు. విశేషం అంతకంటె లేదు. 'రేరాజు' శబ్దం ఔచిత్యం తెలిసి ప్రయోగించినదికాదు. ఇక్కడ గేయ సందర్భానికీ, ఆ శబ్దానికీ ఏమాత్రం సంబంధం లేదు.

'కవన దుందుభి' అనే గేయంలో—

'నీకలం నిట్టూర్పుల ఝుంఝూనిలపు హోరు
మదించిన కంఠీరవాల హృదయాల్లో
సుడిగాలుల వలయాలను సృష్టించాలి.'

అని ఆధునిక కవితా ప్రయోజనాన్ని చెబుతున్నారు నాగరాజు సురేంద్ర.

'కర్తవ్యాన్ని విస్మరించి కవిత్వం చెప్పడం
అసమర్థుల లక్షణం!
కాలప్రవాహానికి ఎదురీద యత్నించడం
అవివేకగుణం!

ఇలాంటి మాటలు చెప్పడానికి తప్పనిసరిగా కవిత్వం రాయనక్కర లేదు.

మొత్తంమీద ఈ సంకలనంలోని కవులంతా ఇప్పుడిప్పుడే తమ గళాల్ని సవరించుకుంటున్న వాళ్లు. ఇంకా రాగం ఒక క్రమంలో పడలేదు. దానికి సాధన కావాలి. ఆ సాధనద్వారా భవిష్యత్‌లో ఇంకా మంచి సంకలనాలని అందించగలరని ఆశ.

## యువ జ్వాల

(కవితా సంకలనం)

(యస్. వెంకటరంగారెడ్డి; వెల రు. 2/—లు; ప్రతులకు :—రచయిత; ఇ. నెం. 1—4—18; పోస్టు తాలూకా—కొల్లాపూర్; జిల్లా—మహబూబ్ నగర్. ఎ. పి.)

ఇరవైఅయిదు కావ్య ఖండికలున్న కవితా సంకలన మిది. దీనిలోని గేయాలన్నీ అక్కడక్కడా పత్రికలలో అప్పుడప్పుడు ప్రచురింపబడ్డవి. శ్రీ యస్. వెంకటరంగారెడ్డి ఈ సంకలనం ప్రచురిస్తున్న కాలానికి వరంగల్‌పోస్టు గ్రాడ్యుఏటు సెంటర్‌లో ఎమ్. ఎస్‌సి. బాటనీ ఫైనలియర్ చదువుతున్న విద్యార్థి. శాస్త్రవిజ్ఞాన విద్యార్థిఅయి సాహిత్యంలో అభిలాష, కవితా రచనలో ప్రవేశంఉండటం ముదావహమయిన విషయం.

తన కవితాతత్వాన్ని గురించి ఆయన—మువ్వన్వాలి చైతన్యంలో—అనే ఖండికలో ఈ విధంగా చెబుతున్నారు.

'చైతన్యం నా గీతం
ప్రగతి నా ఆత్మ
మమత నా నేత్రం
సమత నా ధ్యేయం'

పై పాదాలనుబట్టి ఈనాటి సమాజంలో ప్రగతివాదచైతన్యంలో మమతద్వారా సమతను సాధించడం ఈ కవిలక్ష్యంగా కనబడుతోంది. సామాజిక వికాసం, లేక సమసమాజం అనేది సాయుధ విప్లవం ద్వారానే సాధ్యమనినమ్మేకవులు ఒక వర్గమైతే భావ విప్లవంద్వారా సమసమాజనిర్మాణం సాధ్యమని నమ్మేకవులు మరొకవర్గం. ఈ కవి రెండోవర్గానికి చెందిన కవి.

మానవ జీవితంలోని వైవిధ్య వైరుధ్యాలను చెబుతూ మంచినిమాత్రమే గ్రహించి చెడును వదలివేయమని 'నవ్వేపూలను అందుకో' అనే ఖండికలో చెబుతున్నారు.

'ఒకే జీవితపు మొక్కలో
నవ్వే పూలు
కసిరే ముళ్లున్నాయని తెలుసుకో
కసిరే ముళ్లను దాటి
నవ్వే పూలను అందుకో.'

ఈ కవి ఆశావాది. చైతన్యం చిత్తశుద్ధితో కూడినదైనపుడు అది సృష్టించుకునే భావిలోకాలు కేవలం స్వప్నాలుగా మిగిలిపోక యధార్థమవుతాయనే విశ్వాసం ఈ కవిలో ఎక్కువగా కనబడుతుంది. ఈ భవిష్యదాశావాదాన్నే 'చైతన్యం' అనే ఖండికలో వ్యక్తం చేశారు.

'నిదురిస్తున్న చైతన్యం
మంటలా పైకిలేస్తున్నప్పుడు
నీవు సృష్టించే ఆశాసౌధాలు
గాలిమేడలు కావు
నిజానికి ప్రతిరూపాలు.'

సామాజికమైనభావం తీవ్రమైనచోటల్లా కవిత్వస్థానాన్ని వచనం ఆక్రమించడం ఈ కవిలోని ప్రధాన లోపం.

'ఎన్నోప్రణాళికలను వేశాం
ఎన్నోపథకాలను వేస్తున్నాం
ప్రణాళికలు, పథకాలు ఏంచేస్తున్నాయో
తెలియదు'
మొదలైన పాదాల్లో—
'కలతలభావాలు కరిగిపోవాలి.
కూరిమిభావాలే నిలిచిపోవాలి.
స్వార్థమనే పిశాచం నిన్ను వీడాలి.
సోదరభావమే నీలో రావాలి.'

ఇత్యాదులైన పాదాల్లో శుద్ధవచనమేగాని కవిత్వం కనబడదు. సంకలనంలో అక్కడక్కడా మంచిమంచి కావ్యఖండిక లున్నప్పటికీ ధ్వనిప్రాయమైన కావ్యఖండికలు అసలు లేవు. ఒకటికి రెండు సార్లు చదించగల శక్తి ఉన్న ఖండికలుకూడా లేవనే చెప్పాలి. విద్యార్థి దశలో సమాజంయొక్క అస్తవ్యస్త స్థితిని చూసి కవిత్వం రాయాలనే హృదయావేదన ఈ సంకలనంలో ఎక్కువగా ద్యోతకమవుతుంది. కవితా పరమైన పరిపూర్ణతను సాధించడంలో ఈ సంకలనం ప్రారంభదశ మాత్రమే.

—టి. ఎల్. కాంతారావు

## నా గ మ ల్లి క

(న వ ల)

(రచన : పిలకా గణపతిశాస్త్రి—వెల 2 రూ. పేజీలు 172; ప్రచురణ—యం. శేషాచలం అండ్ కంపెనీ—మద్రాసు—మచిలీపట్నం— సికింద్రాబాదు.)

ఇది నవలాయుగం. రకరకాల వేషభాషలతో నవలలు అవతరించుచున్న కాలం. మారుతున్న ప్రపంచంతోపాటు సాహిత్యంకూడా మారిపోతున్నది. మానవుల సమస్యలు నవలల్లో కథలకాధారమై పాఠకులచేతుల్లో ఉంటున్నాయి, కథ ఉన్న నవల పదిమందిచే చదవబడి సమాజంలో దాని ప్రభావం సుస్థిరంగా ఉంటున్నది. కథలేనిది పాఠకులకు దూరమై అంధకారంలో మ్రగ్గిపోతున్నది. ఈ నాడు నవలకున్న ప్రాముఖ్యం మరి దేనికి కన్పించటంలేదు. నవలాకారులు నవలలు వ్రాస్తున్నారు. ఈ నవలలు సృజనాత్మకములు — అనువాదములు కల్పనలు మున్నగు ప్రక్రియల్లో వెలువడుతున్నాయి. ఆధునిక కాల ప్రభావంలో తలమున్కలై తనివితీరా వ్రాస్తున్నారు. ఈ నవలారచనకు అంతమనేది లేకుండ రచన సాగుతున్నది. కొంత కాలం జరిగినతరువాత ఎలాంటి నవలలు రానున్నవో అని వేచి చూడవలసిన రోజు ఆసన్నమయింది. నవలాకారుడు ప్రజల ప్రతినిధి. నవల ప్రజాజీవన దర్పణం. రచయిత దృష్టి వ్యక్తి చైతన్యంపై ఎంతవరకు ప్రసరిస్తున్నదో మనం నిర్ణయించుకోవాలి

పిలకా గణపతిశాస్త్రిగారు చేయితిరిగిన రచయిత. కథాకల్పనాదులందు సామర్థ్య మున్నవారు. కల్హణుడు వ్రాసిన 'రాజతరంగిణి' ఆధారంగ తెలుగులో కథలు నవలలు వ్రాసినవారు. ఇంతకు పూర్వం వ్రాసిన రచనలతో యిటీవల వ్రాయబడిన 'నాగమల్లిక'ను పోల్చి చూచినట్లయితే ఈ నవల చాల భిన్నంగా ఉంటుంది. ముందుమాటలో శాస్త్రిగారు రష్యన్ కథకుడు ఆంటన్ చెకోవ్ రచించిన 'లేడీ విత్ ఎ డాగ్' అన్న కథపై ఎక్కిరాల వేదవ్యాసగారితో చర్చ జరిపిన పిదప ఈ నవలవ్రాయుటానికి సంకల్పించినట్లు వివరించారు. గోపీ కృష్ణపరంగా నవలను రచించారు. గోపీ కృష్ణుల ప్రేమను సమర్థించుటకు శుకయోగి చెప్పిన మాటలను, పేర్కొని తమకథను ప్రారంభించారు.

మల్లిక అనే గోపిక నాగమణి అన్న గోపకుణ్ణి వరించింది. అతనిపై ప్రేమానురాగాలు అధికమయాయి. అతని మనసే తన మనసుగా భావించుకొని

తన్మయం చెంది వివాహం చేసికొని సంసారం సాగిస్తూ సంతానప్రాప్తినొంది అన్యోన్యానురాగంతో జీవనంచేసి మంచి యిల్లాలని పదిమందిచేత పొగడబడింది. భర్తకు భార్యగా బిడ్డలకు కరుణామూర్తిగా భోగానురాగాలను అందించింది. 'విశాలబృందావనంలో అల్లిబిల్లిగా అల్లుకుపోయిన లతలు, తరువులు, అల్లంతదూరంలో తళతళలాడుతూ నెమ్మదిగా ప్రవహిస్తున్న యమునా తరంగిణి'నుండి వచ్చే మనోజ్ఞవేణునాదంలో ఇతర గోపికలవలె మల్లికకూడ తన్మయమై తనవారిని మరచి అతని మోహజలధిలో మునిగిపోయింది. మగవాని అయిన మల్లిక చేయని తప్పను చేసినట్లుగా తలంచి మనసు నిగ్రహించుకొనుటకు ప్రయత్నించింది. కాని సాధ్యంకాలేదు. కృష్ణప్రేమకు తట్టుకోలేకపోయింది. భర్త ఆజ్ఞానుసారం ఉంటానని మొదట చెప్పినా తనుతానుగా నిలబడలేకపోయింది. శాంతిలేక వాసుకి మునిని శరణువేడి 'తనకింత ఆత్మనిగ్రహం, మనశ్శాంతి అనుగ్రహించి ఆందోళనను పూర్తిగా తొలగించవల సిందని, అంజలి ఘటించి ప్రాధేయపడింది. అందుకు వాసుకి గౌరీదేవిని ధ్యానించమని సలహా యిచ్చాడు. మల్లిక మనస్సు చల్లబడిందేకాని అంతరాంతరాల్లో అలముకొన్న వాంఛను మల్లిక నిద్రపుచ్చలేకపోయింది. చివరకు మల్లిక భర్తను పిల్లలను వదలి మురళీ మోహనుని సాంగత్యమునకై వెళ్లిపోయింది.

నాగమణి పరిస్థితి గమనించి తన మనసును మల్లికపై లగ్నంచేసాడుకాని పిల్లల దీనావస్థను చూచి నిలవలేకపోయాడు. వాసుకిముని దగ్గరకువెళ్లి మల్లికపైవున్న అనురాగాన్ని వ్యక్తంచేసి, పూర్తి స్వేచ్ఛ మల్లికకు యిస్తానని వాగ్దానంయిచ్చి నాగమణి భార్యను తన యింటికి తీసికొనివచ్చాడు. అప్పటినుంచి వారిరువురూ ఒకటియై ప్రశాంతంగా మనుగడ సాగించారు. సంక్షిప్తంగా కథ ఇది.

పౌరాణికగాథను నవలగా రూపొందించి చెప్పటం మనకు ప్రయోగమేకాని ఆచరణయోగ్యంకాదు. ఆధునిక పరిస్థితులలో తల మున్కలయ్యే ఈ సమాజానికి వాస్తవిక ప్రపంచాన్ని చూపి చైతన్యశక్తిని మేల్కొల్పాలి. గోపీకృష్ణుల ప్రణయధర్మాన్ని శుకమహర్షి సమర్థించి చెప్పినా, ఆ సమర్థనను సమన్వయం చేయుటకు 'నాగమల్లిక' నవల అన్వయింపవీలులేదు. కట్టుకొన్న భర్త ఎవ్వరూ నాగమల్లిక ప్రవర్తనను సహింపలేరు. కాని నాగమణి ఓర్పు వహించి బిడ్డల యోగక్షేమాలపై దృష్టినిల్పి ప్రాధేయపడి మల్లికను యింటికి తెచ్చుకొన్నాడు. మల్లికపై గాఢమైన ప్రేమను నాగమణి పొగొట్టుకోలేక లోలోన మథన పడ్డాడు. తన బాధకంటె తన పిల్లల వ్యథను చూచి భరింపలేకపోయాడు. పరపురుషసాంగత్యంకోరి సమ్మోహితఅయిన నాగమల్లికను అర్థంచేసికొని సమయానుకూలంగా ప్రవర్తించినాడు.

మల్లిక తనను తనవారిని మరచిపోయి ప్రవర్తించింది. గోపాలకృష్ణుని మోహపారవశ్యంలో కలిసిపోయి వెనుతిరిగి చూడలేక పోయింది. ఆ విధంగా చేయటంచేత భర్తకు దూరమయింది. స్వార్థచింతన గూర్చి ఆలోచించిందికాని దానివల్ల రాగల పరిణామాలు ఊహింపకపోయింది. తాను కల్పించుకోవాలను కుంటే సుఖము శాంతి తన ఇంటియందే లభించి ఉండేవి. అసలు తన ఇంటిలో మానసికశాంతి కలుగదని గట్టి నిర్ణయానికివచ్చి ఇల్లువదలి వెళ్ళిపోయింది. న్యాయం, ధర్మం అంటే ఏమిటో తెలిసికొనక కన్న బిడ్డలనుకూడ చూడక పారవశ్యానికి బానిసయై బ్రతుకును గడపడానికి ఆశ్రమానికి వచ్చింది. ఏది శాశ్వతమో, అశాశ్వతమో అని నిర్ణయించుకోలేని అశక్తురాలైపోయి ఆనందానుభూతిపై కాంక్షను పెంచుకొన్నది. ఇల్లువదలి ఆశ్రమంలో జీవితం గడుపుతున్నాను, నూతనంగా సాధించినదేమీ మల్లిక జీవితంలో స్పష్టంగా కాన్పింపలేదు. చివరకు తాను నాగమణితో రాజీపడి యథావిధంగా సంసార నిర్వహణ సాగించింది. అప్పుడప్పుడు నాగమణిని బెదరించింది—వెళ్ళిపోతానని.

గోపికా కృష్ణులపై చేసిన వాఖ్యానములు శాస్త్రిగారు పరిశీలించి తదనుగుణమగుచిత్రణ చేయ

డానికి పూనుకొన్నారు. శుకమహర్షి యిచ్చిన వివరణలు ఇతరులు చెప్పిన వివరణలు తారతమ్య పరిశీలన చేసినప్పుడు సందేహాలు కలుగక మానవు. అంతేగాక తృప్తికరంగా కాన్పింపవు. భక్తిచేతనే ముక్తి కలుగగలదను అభిప్రాయము బలమైనపుడు నాగమల్లిక ఇల్లు వదలవలసిన అవసరముండేదికాదు. తన భక్తిని భర్తపైనను—పిల్లలపై ప్రదర్శించినట్లయినా అధికమగు ముక్తిమోక్షములు కలిగియుండేవికదా! పతియే ప్రత్యక్షదైవమని నమ్మకొన్న స్త్రీలు మన సాహిత్యంలో అచ్చటచ్చట ఉన్నారు. వారిని ఆదర్శంగా నాగమల్లిక గ్రహించి తన జీవితాన్ని మలచుకొని ఉంటే నాగమణి అవస్థపడవలసిన అగత్యమేమీ ఉండేదికాదు. బిడ్డలు చిక్కిశల్యమై పోవలసిన స్థితి కూడ కలిగేది కాదు. శాస్త్రిగారు పూర్వాపరము లాలోచించి కల్పనలు చేసియుంటే నవల రాణించుట కెక్కువ అవకాశము కల్గివుండేది. అయితే శాస్త్రిగారి రచన విసుగు జనింపకుండ పాఠకుని ముందుకు తీసికొనివెళ్ళకలదు.

—రామమోహన్.



Printed and Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7 Thambu chetty Street, Madras-1, Editor : S. Sambhu Prasad.

# భారతి

మాసపత్రిక

సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్



మార్చి 1972

సంపుటము : 49 : సంచిక . 3



వెల ఒక రూపాయి

# వి ష యా ను క్ర మ ణి క

## మార్చి 1972

# నిద్రకన్యకలు

## బెల్లంకొండ చంద్రమౌళి శాస్త్రి

స్నేహమ్మా యిది, ఒంటరైతి నని మీ శృంగారమున్ జూపెదర్!
బాహాటమ్మగు ప్రేమమా, హృదయ కీలాభీల మార్పింతురో!
ఊహల్ పేర్చగ జాలడన్న సడి నేమో వాత్సల్యయంబు! లో
హోహో!! నాపతితత్వమెంచి కవుగిళ్ళాచేరు కారుణ్యమా!!

దీపము చేఁబట్టికొని తెచ్చితి రేలనె చిమ్మచీకటుల్!
మాపులటన్న మీకు నయమా భయమా మరి యీ దినాంత వే
ళా పరగాయనీ పరిమళాలసలాలసలౌచు వత్తు రే
లా! పలుకే పసిండియగు నన్నటు లేటికో మౌనముద్రలున్!

శాటీ ముక్త కుచాభిరామ మసృణ శ్యామచ్ఛవిచ్ఛన్న సూ
చీ టీకాముఖచూచుకల్ కనులగ్రుచ్చెన్ విచ్చులేనే కనుల్!!
మాటామంచియు లేని మీ హొయ లవేలా! సుప్తిగుప్తిక్రియా
కూట స్వప్న చిరాంధ్యలోకములకున్ గొంపోదురే నన్నిటుల్!!

రవరవలాడు మీపయిట లందము లూచినగాలి తాకి నీ
రవముగ దీపికల్ మలిగిమ్రొవ్వడె! గాఢ తమస్విని వినీ
ల వివృత కైశికీ జఘన లాస్యము జేసెడు మీ స్వరూపముల్
తవిలెనులెంకు నాముకుళితాక్షుల! మీరలు నిద్రకన్యలా!?

క్రోధికి కామికిన్ బరమలోభికి జంకెదరేమొ! కావ్య స
ద్బోధను కండ్లు గప్పెదరు! ఉన్ననులేకను తృప్తిగాంచు ధీ
నాథులనున్, బురాణశ్రవణాదృతులన్, దృఢదీక్షితార్థి వి
ద్యాధరులన్, బలే మయికమందునముంతురు లజ్జలేదనో!

పవ లెల్లన్ బనిపాటులన్ బడలి కొంపంజేరి కూలిడు లే
శవికాసంబుగ భార్యతో సుతులతో సల్లాపియౌనంత మీ

రవురా జోలలువాడవోయెదరు! నిర్వ్యాపార సందానితా
ర్థవిధృష్యంతు లికెంతరమ్మనుచు సాగన్‌దీయ పోరేలనో!

మూరింబోవునో మీావిధుంతుదసమభ్రూభంగముల్! నన్ను శ
య్యారీత్యంతరుగా పొనర్చెను, జగద్యాత్రాప్రణీతక్ష్మమా
శారింఛోళిసమంచితార్తిని నిమున్ సాధించనా; భావ సం
ధ్యారామమ్మున నిద్రకన్యకలకేలా దృష్టకందర్పముల్ !!

వికలితభావు జేయకుడు విశ్వజగత్సుసమాగవేష ధీ
సుకృతి కవిన్; భవద్విరహశోచిత హిండన మిశ్రరేఖ లీ
లాకంలాకరే సమర్థముగ ద్రోయగజాలిన గాఢసుందరుల్!
ముకురమునన్ గనంబడనివో కబరీ నిబిరీస భారముల్ !!

మిమ్మొక యందుకెంతయును మెచ్చికొనన్వలె—అంగరంగ భే
దమ్ములునున్, వయోరయవిధానములాచక కొందరన్ సుతా
రమ్ముగ పట్టి ఇట్టి వదలాడుదు, రందర నెప్పుడెప్డు దీ
ర్ఘమ్మగు వృత్తబంధరతలౌదురు స్వైరవృగీదృగీరితల్.!!

ఆకలెరుంగదున్ రుచిని-ఔనటె నిద్రసుఖం బెరుంగదన్
లోకులవాకు మీకె తగునో! పువుపొన్నుల! రాతినేలలా!
పాకమురాని మీ వలపు పట్టులు నెవ్వరు మెచ్చికొందురే
గాక! నిశాప్రశాంతవశకాంతులు మీకు ప్రసన్నమయ్యెడున్ !!—

# సౌందరనందము - కథా సందర్భము

శ్రీ నాగళ్ల గురుప్రసాదరావు

శిష్టసాహిత్యమును వలచినవారు కన్నుల కద్దుకొనఁదగిన కావ్యములలో సౌందరనంద మొకటి. కీర్తి శేషులు, సుగృహీత నామధేయులు నయిన పింగళి లక్ష్మీకాంతము, కాటూరి వేంకటేశ్వరరావు దీనిని రచించిరి. సౌందరనంద సృష్టినిగూర్చి యా జంట కవులు కావ్యప్రారంభమున 'విజ్ఞప్తి'లో నిట్లు చెప్పిరి. 'సంస్కృతమున అశ్వఘోషమహాకవి సౌందరనంద మను కావ్యమొండు రచించెను. మా గ్రంథమునకును దానికిని ఇతివృత్తములో నీషత్తు పోలిక గలదుకాని ఇంకెందును సాదృశ్యములేదు. ఇది దానికి అనువాదము కాని అనుకరణముగాని కాదు. అశ్వఘోషుని శ్లోకములకు ఛాయలని చెప్పదగినవి 5, 6 పద్యములు మాత్రము మొదటి రెండు సర్గలలో నున్నవి. గ్రంథ నామ మింపుగా నుండుటచే నదియే కైకొంటిమి.'

సౌందరనందమను పేరుపెట్టినది యశ్వఘోషుఁడే. ఈ కావ్యనామమునుగూర్చి సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు 'తత్సమ చంద్రిక' తద్ధిత ప్రకరణములో (పారట. 231) నిట్లు వ్రాసిరి. 'సుందరీనందౌ అధికృత్య కృతో గ్రంథః అను నర్థమున ద్వంద్వసమాసమగుటఁ 'గిరాతార్జునీయము' అన్నట్లు 'సుందరనందీయము'అని కావలసియున్నది. అశ్వఘోషుఁడు 'సౌందరనందము'అని ప్రౌఢముగాఁ బ్రయోగించెను. 'సుందర్యాః అయం సౌందరః, సౌందరశ్చ అసౌనందః సౌందరనందః, తమధికృత్య కృతో గ్రంథః' అని విగ్రహమును జెప్పకొందుమేని 'సుందరీనందుల చరిత్రము'అని యర్థమురాక కేవలము సుందరీవశగతుఁడగునందుని చరిత్రముఅని అర్థమగును. అప్పుడును సౌందరనందపదము వృద్ధప్రాతిపదికము కాన నిందలి (చ) సూత్రముచే [ఆఖ్యాయికా వాచకములకు అన్ ప్రత్యయము బహుళముగా లోపించును. ఇవి యట్లు స్త్రీలింగములుగానే యుండును. వాసవదత్తా మధికృత్యకృతా ఆఖ్యాయికా వాసవదత్తా మొదలగునవి, ఈ యర్థమున వృద్ధప్రాతిపదికములకు 'ఈయ' ప్రత్యయము వచ్చును. శారీరకీయము (శారీరకం జీవాత్మాన మధికృత్య కృతో గ్రంథః) శారీరక భాష్యముఅని వ్యవహారము గలదు. అది అభేదోపచార సిద్ధము.] 'సౌందర నందీయము' కావలసియున్నది. అయినను రఘువంశాది శబ్దములవలె అభేదోపచారము వలన సౌందరనందము అనుపదము సిద్ధించును. సుందర నందస్య ఇదం 'సౌందరనందము' అనియును గొందఱు చెప్పదురు. కాని 'నందుఁడు' అను సంజ్ఞయుండును; కానీ 'సుందరనందుఁడు' అని సంజ్ఞయుండదు.' వ్యాకరణము మాట యెట్లున్నను సౌందరనంద మనుపేరు ఆంధ్ర కావ్యకర్త లనినట్లు చెవికింపుగా నున్నదనుటలో సందేహములేదు.

అశ్వఘోషుని కావ్యమున కాంధ్ర సౌందరనంద మనువాదముకాని యనుకరణముగాని కాదని తత్కర్త లనిరిగదా ! సంస్కృత సౌందరనందము పోయినపోకడ యెట్టిది ? ఆంధ్ర సౌందరనందము పట్టినబాట యెట్టిది ? సుందరీనందులకథ పాళీ వాఙ్మయమునం దెట్లున్నది? సంస్కృత వాఙ్మయమం దెట్లున్నది ? ఆంధ్రకవు లాకథలో నెట్టి మార్పులుచేసిరి? ఆ మార్పులకు హేతువులేమి ? ఈ విషయము లీ వ్యాసమునఁ బ్రధానములు. కేవలము కథకు సంబంధించిన విమర్శయే యిందుండును. ఆంధ్రకావ్య శిల్ప పరామర్శ కిందు చోటులేదు. కాని కథా సంవిధాన వైచిత్రి కావ్యకళలో నొకయంగ మనుమాట రసికులు

మఱువరానిది. అట్టిచో నాయీవ్యాసము కావ్యశిల్ప వివరణమునందు నేకదేశ మగును.

సంస్కృత సాహిత్య ప్రపంచమున అశ్వఘోషుని యవతరణ మొక ప్రధాన ఘట్టము. ఆయన వేదాంతవేత్త. మహాకవి. వాల్మీకిని 'ఆదికవి' 'ధీమాన్' అని మన్నించినవాఁడు. కాళీదాసు అశ్వఘోషున కెంతో ఋణపడి యున్నాఁడని విమర్శకులు తేల్చి చెప్పిరి. యువాన్‌చాంగ్ చెప్పిన మాటలనుబట్టి భూమండలమును వెలుఁగువాకలతో ముంచియెత్తిన నలువురు సూర్యులలో అశ్వఘోషుఁ డొకఁడు. ఆయన కుషాణ చక్రవర్తి కనిష్కుని కాలమువాఁడు. ఆనాఁడు జరిగిన చతుర్థ బౌద్ధసంగీతి (సదస్సు) కుపాధ్యక్షుఁడు. ఇట్టి మహామేధావినిగూర్చి పరిశోధకులకుఁ దెలిసిన విషయము స్వల్పమే యగుట దౌర్భాగ్యమనక తప్పదు. అశ్వఘోషుఁడు రచించిన కావ్యములు బుద్ధచరిత్రము, సౌందరనందము. ఆయన రూపకములనుగూడ రచించెను. రాహుల్ సాంకృత్యాయనుని వ్రాఁతలనుబట్టి యశ్వఘోషుఁడు యవనరంగస్థల విధానమును దెలిసికొని భారతీయ రంగస్థలమును దిద్దితీర్చెనని తెలియుచున్నది. 'వోల్గానుంచి గంగాతీరము' అను అసాధారణ గ్రంథములో రాహుల్ సాంకృత్యాయనుఁడు 'ప్రభా' యను కథయందు 'ఊర్వశీ వియోగమనే నాటకమే భారతీయ నాటకములలో మొదటిది. అశ్వఘోషుడే మొదటి భారతనాటక రచయిత. ఇది కవియొక్క ప్రథమ ప్రయత్నమైనా 'రాష్ట్రపాల్' 'సారిపుత్ర' మొదలగు నాటకాలతో సమానమైనది' యని వక్కాణించెను. అశ్వఘోషుఁడు రచించిన రూపక త్రయములో 'సారిపుత్ర ప్రకరణము' ముఖ్యము. దీనిలో తొమ్మిది యంకములు కలవు. బుద్ధచరిత్ర, సౌందరనంద, సారిపుత్రప్రకరణముల యంతమున ఆయన తన్నుగూర్చి 'ఆర్య సువర్ణాక్షీ పుత్రస్య సాకేతకస్య భిక్షో రాచార్య భదంతాశ్వఘోషస్య మహాకవేః మహావాదినః కృతిరియమ్' అని చెప్పికొనెను. అశ్వఘోషుఁడు సువర్ణాక్షీపుత్రుఁడు. సాకేతకుఁడు.

అశ్వఘోషుని సౌందరనందము పదునెనిమిది సర్గల మహాకావ్యము. నేనుజూచిన సంస్కృత సౌందరనందము క్రీ. శ. 1939 లో 'Bibliotheca Indica' గ్రంథమాలవారు ప్రకటించినట్టిది. మహామహోపాధ్యాయ హరప్రసాదశాస్త్రి దానిని బరిష్కరింపఁగా చింతాచరణచక్రవర్తి కొన్ని క్రొత్త పలుకులను జేర్చెను. ఆ గ్రంథమాలలో దానిసంఖ్య 192. పునర్ముద్రణసంఖ్య 1524.

సంస్కృత సౌందరనందమునకు కపిలవస్తు వర్ణనము, రాజవర్ణనము, తథాగతవర్ణనము నను మొదటి మూఁడుసర్గలు రూపకమునకుఁ బ్రస్తావన వంటివి. వానిలో శాక్యులచరిత్ర, కపిలవస్తు నగర నిర్మాణము, గౌతముని నందుని జన్మవృత్తాంతము, మహాభినిష్క్రమణము, మహాధర్మచక్ర ప్రవర్తనము, బుద్ధుని పునరాగమనము, శుద్ధోదన తథాగతుల పునస్సమాగమము వర్ణింపఁబడినవి. నందప్రవాజనమను నాల్గవసర్గనుండి సుందరీనందుల కథకలదు. బుద్ధుఁడు కపిలవస్తునగరములో ధర్మబోధ గావించుచున్నను, ఎండ కన్నెఱుఁగక,యిల్లాలి చెలువపుటురిలోఁ జిక్కిన నందున కేమియుఁ జెవి దూఱలేదు. ఒక నాఁడు సుందరి ప్రియుని హస్తములలో అద్దమును నిలిపి చెక్కిళ్ల నలంకరించుకొనుచుండెను. నందుఁడు కొంటెతనముతో ఉచ్ఛ్వాని యూఁదగా మూర్చుతుంపులకు దర్పణము మాసెను. అలుకవూనిన సుందరి మగని బుజ్జవములకు మురిసిపోయి సింగారించుకొనుట ముగించెను. ఈలోన బుద్ధుఁడు భిక్షకై నందుని యింటికివచ్చి యుత్తచేతులతోఁ దిరిగిపోయెను. ఆయన తిరిగి పోవుట యొక వృద్ధపరిచారిక చూచి నెత్తి నోరుగొట్టుకొని నందునకుఁ జెప్పెను. నందుఁడు సిగ్గువడి బుద్ధుని తోడ్కొనిరాఁగా బయలుదేరెను. సుందరి వలదని వారించినది. మకరికా పత్రముల తడి యాఱులోపల వత్తునని వాగ్దానముచేసి నందుఁడు మఱి వెడలెను.

వెడలిన నందుఁ డొకానొకచోట గుంపుకట్టిన జనుల నడుమ బుద్ధుని జూచెను. ఆయనను సమీపింప వీలుగాక తాళితాళి తుదకెట్లోచేరి భిక్షార్థము రండని ప్రార్థించెను. బుద్ధుఁడు నాఁటికి భిక్ష వల

దని భిక్షాపాత్ర నందునిచేత నుంచెను. విహారమునకు నడువుమని పలికెను. పాపము ! నందుఁ డేమిచేయఁ గలఁడు? పోవకతప్పినదిగాదు. శరీరము విహారమువైపు గదలఁగా మనసు మగువ చెక్కిళ్లపై వ్రాలినది. విహారమునకు వెళ్లిన నందునకు బుద్ధుఁడు ధర్మబోధ గావించెను. ఫలములేదు. ఇంతలో వైదేహముని (ఆనందుఁడు) రాఁగా బుద్ధుఁ డతనిని నందునకుఁ బ్రవ్రజ్య యిమ్మని యాజ్ఞాపించెను. నందుఁ డంగీకరింపలేదు. వైదేహముని భగవానున కీ విషయము చెప్పెను. మరల బుద్ధుఁడు నందుని ప్రబోధించెను. గతిలేక నందుఁడు ప్రవ్రజ్య కంగీకరించెను. బిట్టు విలపించెను.

సుందరి కీ వృత్తాంతము తెలిసినది. ఆఱవ సర్గమున సుందరీ విలాపము వర్ణితమయినది. అసలా సర్గ పేరే భార్యావిలాపము. సప్తమ సర్గలో నందుని శోకము వర్ణింపఁబడినది. సన్న్యాసమున సంతోషము శూన్యమని యనుకొన్న నందుఁడు ఋషులు, రాజులు నెట్లు సన్న్యాసము స్వీకరించియు బరాజయము పొందిరో యోజించెను. మఱునాఁటి ప్రొద్దుట బుద్ధుఁడు భిక్షకు వెళ్లినపుడు విహారమునుండి తప్పించుకొని పోవలయునని నిశ్చయించెను.

అష్టమసర్గము మైత్రేయుఁడు అను భిక్షువు వచ్చి నందుని యోగక్షేమము విచారించుటతో మొదలగును. వారిరువురు నొక యేకాంత ప్రదేశమునకు వెళ్లి చర్చలు గావింతురు. స్త్రీ విఘాతము, మదాపవాదము నను అష్టమ నవమ సర్గములలో వారి చర్చలు కలవు. నందుని మనసు మాఱలేదు. మైత్రేయుఁ డీ విషయము బుద్ధునకుఁ దెలిపెను.

బుద్ధుఁడు నందుని పిలిపించెను. వా రిరువురు హిమాలయముల మీఁదుగా స్వర్గమునకు వెళ్లిరి. వెళ్లుచు బుద్ధుఁడొక యొంటికంటికోతిని జూపి 'సుందరి దీనికంటె అందగతె యా ?' యని నందు నడుగును. నందుఁడు 'వేయిరెట్లు అందగత్తె' యనును. వారు స్వర్గమునకు వెళ్లిరి. నందుఁ డట యప్సరసలను జూచెను. అతనిలో మదనవికారములు పుట్టినవి. వారిని పొందవలయునని యతఁ డనుకొనెను. సుందరి మఱపునఁ బడినది. కఠోర నియమములచే దేవాంగలను పొందగలవని బుద్ధుఁడు చెప్పెను. నందుఁ డంగీకరించెను.

నియమములచే నందుఁ డెండిపోయి వట్టి గయ్యెను. కాని యతని హృదయముమాత్ర మప్సరసల కొఱ కువ్విళు లూరుచుండెను. ఇంతలో బుద్ధ భగవానుని ప్రియశిష్యుఁడు ఆనందుఁడువచ్చి నందుని హృదయ పరివర్తనమున కభినందించెను. 'అప్సరసల కొఱ కీ కఠోర నియమములను బాలించుచున్నావఁట ! నిజమా ?' యని యడిగెను. అవునని నందుఁడు చెప్పెను. ఇఁక ఆనందుఁడు రెచ్చిపోయి యనర్గళముగా నిహలోక సౌఖ్యముల యస్థిరతనుగూర్చి, పరలోక సుఖముల యశాశ్వతత్వమునుగూర్చి యుపన్యసించెను. నందుఁడు లజ్జకు లోపడియెను. మొదట అతఁడు అప్సరసలకొఱకు భార్యను మఱచెను. తుదకు అమృతత్వము కొఱకు అప్సరసలను మఱచెను.

గుండె నిబ్బరముతో నందుఁడు బుద్ధుని సమీపించి తనకు అప్సరసలపట్ల మోహములేదని పలికెను. బుద్ధుఁడు పరమానందభరితుఁడై యతనికి ధర్మబోధ గావించి, శాంతిపథమున ముందునకుఁబొమ్మని కోరెను. ప్రత్యవమర్శ, శీలేంద్రియజయము, ఆదిప్రస్థానము, వితర్కప్రహాణము, ఆర్యసత్య వ్యాఖ్యానము అను సర్గలు బుద్ధబోధతో నిండినవి.

పదునేడవ సర్గము అమృతాధిగమము. ఇందు నందుఁ డరణ్యమున కేగి ధ్యానము నాశ్రయించిన కథ కలదు. అతఁడు నిర్వాణదశను సమీపించెను. అర్హతుఁ డాయెను. కృతజ్ఞతాబుద్ధియై బుద్ధుని పాదముల నాశ్రయించెను. బుద్ధుఁడు ఆత్మవిముక్తినిపొంది తృప్తివహింపక బహుజనవిముక్తికై పాటుపడుమని నందుని ఆజ్ఞాపించెను. ఇట్లు పాటుపడుటయే మహాయాన బౌద్ధలక్షణము. నందుఁడు వెళ్లిపోయి సుందరిని జూచెను. చుట్టాలను జూచెను. కాని యతఁడు వెనుకటి నందుఁడుగాఁడు. దీనితో ఆజ్ఞావ్యాకరణము అను పదునెనిమిదవ సర్గము ముగిసెను. సౌందర నంద కావ్యము సమాప్తమయినది.

ఈ విధముగా సౌందరనందమును రచించిన యశ్వఘోషుఁ డంతమున నిట్లు వక్కాణించెను.

ఇత్యేషా వ్యుపశాంతయే
నరతయే మోక్షార్థగర్భాకృతిః
శ్రోతౄణాం గ్రహణార్థ మన్యమనసాం
కావ్యోపచారాత్ కృతా
యన్మోక్షాత్ కృత మన్యదత్ర హి మయా
తత్కావ్యధర్మాత్కృతమ్
పాతుం తిక్తమివౌషధం
మధుయుతం హృద్యం కథం స్యాదితి

ప్రాయేణాలోక్య లోకం
విషయరతిపరం మోక్షాత్ ప్రతిహతం
కావ్యవ్యాజేన తత్త్వం కథిత మిహ మయా
మోక్షపరమితి
తద్బుద్ధ్వా శామికం యత్
తదవహితమితో గ్రాహ్యం నలలితమ్
పాంశుభ్యో ధాతుజేభ్యో
నియతముపకరం చామికరమితి.

ఈ శ్లోకముల తాత్పర్యము సంగ్రహముగా నిట్లుండును. మోక్షార్థగర్భమయిన యీ కృతి యుపశమముకొఱకేకాని యానందార్థముగాదు. లౌకిక విషయ లంపటత్వముగల శ్రోతలు గ్రహించుటకు వీలుగా కావ్యోపచారమునుబట్టి యీ కృతి వ్రాయఁబడినది. ఇందు మోక్షముకంటె భిన్నమయిన విషయము కావ్యధర్మమును పురస్కరించుకొని వ్రాసితిని. మందు చేదుగా నున్నప్పటికి మధుయుతమయినచోఁ ద్రాగుటకు హృద్యముగా నుండునుగదా! విషయరతి పరము, మోక్షదూరమునయిన లోకమునుజూచి, కావ్యవ్యాజమున మోక్షతత్త్వమును దెలిపితిని. శమకారకమయిన యా తత్త్వమునే దీనినుండి గ్రహింపవలయునుగాని మిగిలిన సొగసులపట్ల మోహము పనికిరాదు. ఖనిజముల ధూళిగాక వానియందలి బంగారము నియతముగా నుపకరించునుగదా!

పాలీ వాఙ్మయ మందును సుందరీనందులకథ కలదు. ధమ్మపథమునందు 'యథాగారమ్ దుచ్ఛన్నమ్' 'యథాగారమ్ సుచ్ఛన్నమ్'అను రెండు శ్లోకములను బుద్ధుఁడు నందునితోఁ జెప్పెనఁట! ఈ రెండు శ్లోకములు ధమ్మపథములో యమకవగ్గమునందుఁ గలవు. వానికి సర్వేపల్లిరాధాకృష్ణ పండితుని యాంగ్లానువాద మిట్లున్నది.

As rain breaks through an ill-thatched house, so passion makes its way into an unreflecting mind. (13)

As rain does not break through a well-thatched house, so passion does not make its way into a reflecting mind. (14)

ప్రథమ శ్లోకమును నందుని ప్రవ్రజ్యకు ముందును, ద్వితీయ శ్లోకమును నందుఁడు సంబోధి పొందినతరువాతను బుద్ధుఁడు చెప్పెనఁట! ఈ శ్లోకవ్యాఖ్యాత నందుని ప్రవ్రజనస్వీకారమును సంపూర్ణకథగాఁ జెప్పెను.

సుందరీ ప్రస్తావనము ధమ్మపథము నందుఁ గలదు. అందలి జరావగ్గమునందు 'అట్ఠీనమ్ నగరమ్ కత్వా (కతమ్అని రాధాకృష్ణ పండితుని ధమ్మపథములోఁ గలదు) మాంసలోహిత లేపనమ్' అను శ్లోకము కలదు. బుద్ధుఁడు సుందరి నుద్దేశించి యీ శ్లోకమును జెప్పెనఁట! దానికి రాధాకృష్ణ పండితుని యాంగ్లానువాద మిట్లున్నది.

Of the bones a citadel is made, plastered over with flesh and blood, and in it dwell old age and death, pride and deceit. (15 )

పాలీభాషలో ఈ శ్లోక వ్యాఖ్యాత సుందరీ వృత్తాంతమును వర్ణించెను. సౌందర్యరాశియయిన సుందరికి రూపనంద, సుందరీనంద, జనపదకల్యాణి యను పేర్లు కలవఁట!

త్రిపిటకములలో సుత్తపిటక మొకటి. నైదుభాగములు కలవు. వానిలో ఖుద్దకనికాయ మొకటి. ఖుద్దకనికాయములో థేరగాథలు, థేరీగాథలు కలవు. అవి బౌద్ధసన్న్యాసులు, సన్న్యాసినులు చెప్పిన

సంకలన గ్రంథములు. ఈ గాథలలో నందుఁడు చెప్పిన వని నమ్ముచున్న యొక కొన్ని శ్లోకములు కలవు.

ఏది యెట్లయిననేమి ? సౌందరనంద కథకు, పాలీ వాఙ్మయమందలి సుందరినందుల కథకు భేదము కలదు. ఆ భేదములనుగూర్చి హరప్రసాదశాస్త్రి యిట్లు వ్రాసెను: సుందరీనందులు 'లలితోప భోగ కలనా పారీణులై ' యున్నపుడు భిక్షార్థము బుద్ధుఁడు వచ్చెనని సౌందరనందము చెప్పుచున్నది. నందుని వివాహమునకు పట్టాభిషేకమునకు సర్వ సన్నాహములు చేసినపిదప బుద్ధుఁడు వచ్చినట్లు పాలీ వాఙ్మయమునఁ గలదు. బుద్ధుఁడు భిక్షాపాత్రను నందునిచేతి కిచ్చుట రెంటను సమానమే. కాని భిక్షాపాత్రను దిరిగి బుద్ధున కిచ్చివేయ వలయునని నందుఁ డారాటపడుచున్నట్లు పాలీవాఙ్మయమున నున్నది. భిక్షాపాత్రతోఁ దిరిగి యింటికి వెళ్లవలయునని నందుఁ డనుకొన్నట్లు సంస్కృతమునఁ గలదు. మకరికా పత్రముల తడియాఱకముందే రావలయునని సుందరి కోరినట్లు సౌందరనందమున నున్నది. వెంటనే తిరిగి రమ్మని యామె విలపించినట్లు పాలీవాఙ్మయమునఁ గలదు. నందున కెవ్వరు ప్రవ్రజ్య యిచ్చిరో పాలీ వాఙ్మయమున లేదు. సౌందరనందములో వైదేహ మునియగు నానందుఁడు ప్రవ్రజనదీక్ష యిచ్చినట్లు కలదు. విహారమునుండి తప్పించుకొని పోవఁగా నందుఁడు పెక్కుసారులు ప్రయత్నించినట్లు సౌందరనందము చెప్పుచున్నది. ఆత్మాభిలాషమునకు వ్యతిరేకముగా నియమపాలనము గావించుచున్నాఁడనని నందుఁడు చెప్పినట్లు పాలీవాఙ్మయమునఁ గలదు. సౌందరనందములోనున్న మర్కటము ఒంటికంటిది. పాలీ వాఙ్మయములో దానికి ముక్కు, చెవులు, తోక లేవని వర్ణింపఁబడినది. అప్సరసల కొఱకు కఠోర తపస్సు చేయుచున్న నందుని ఆనందుఁ డుపాలంభించినట్లు సౌందరనందము చెప్పఁగా, భిక్షువుల కందఱకతఁడు పరిహాసపాత్రుఁ డయినట్లు పాలీ వాఙ్మయము పలుకుచున్నది.

సుందరీనందుల కథ అవదాన వాఙ్మయమునకుఁ గూడ నెక్కినది. అవదానము, అపదానము సమానార్థకములు. 'వృత్తం కర్మ అపదాన మిత్యుచ్యతే'యని యమరసింహుఁడు చెప్పుచున్నాఁడు. పూర్వము జరిగిన పరిశుద్ధ వ్యాపారము అపదానము. దీనిచే నరుఁడు పరిశుద్ధుఁడగును. బుద్ధభగవానుఁ డొనర్చిన యట్టి వ్యాపారములే యవదాన వాఙ్మయమున వర్ణితము లయినవి. అవదాన కథలకు జాతక కథలకు పెక్కుపోలికలు కలవు. అవదాన వాఙ్మయమున క్షేమేంద్రుని బోధిసత్త్వావదాన కల్పలతకు విశిష్టస్థానము కలదు. క్షేమేంద్రుఁడు కాశ్మీరవాసి. పదునొకండవ శతాబ్దము వాఁడు. ఆయన ముప్పదియైదు గ్రంథములు రచించెను. ఔచిత్యము కావ్యమునకు జీవమని నూతనాలంకార ప్రస్థానము కొనసాగించెను. బృహత్కథామంజరి రచించెను. రాజావళి నిర్మించెను. నక్కాచార్యుని మాట మీఁద, ఆచార్య వీరభద్రుని తోడ్పాటుతో క్షేమేంద్రుఁడు బోధిసత్త్వావదాన కల్పలతను రచించెను. అందు నూటయేఁడు అవదానములను క్షేమేంద్రుఁడు రచింపఁగా, నూటయెనిమిదవ అవదానమును, జీమూత వాహనావదానమును అతని కుమారుఁడు సోమదేవుఁడు రచించెను. బోధిసత్త్వావదానకల్పలతలో దశమ పల్లవము సుందరీనందావదానము. దానియందలి కథ యిట్లుండును.

కపిలవస్తుపురములో న్యగ్రోధారామమునందు విడిదిచేసిన బుద్ధభగవానుని దర్శించుటకు నందుఁడు వెళ్లెను. బుద్ధుఁడతనిని ప్రవ్రజనము స్వీకరింపుమని కోరెను. నందు డామాటలు నచ్చక యొప్పుకొనలేదు. ఇంటికిఁ దిరిగివచ్చి సుందరోద్యానవనములో నిల్లాలితో విహరించెను. ఒకనాఁడు బుద్ధుఁడే భిక్షు సంఘముతో నందుని సౌధమునకు వచ్చెను. నందుఁడు సకలోపచారములు చేయఁగా నాయన యెంతో పొంగిపోయి యట నుండి కదలెను. స్వర్ణపాత్రలో నుపచార పదార్థములను దీసికొని నందుఁడు బుద్ధభగవానుననుగమించెను. అవిధేయతాశంకతో భయపడిన సుందరి తల వాల్చినది. 'నీవు పోవలదు'అని మౌనముగనే యామె

చెప్పినట్లనిపించి నందుఁ డామెతో 'వెంటనే తిరిగి వత్తు'ననెను.

నందుఁడు బుద్ధునితోపాటు విహారముచేరి కొంతసేపుండి తిరిగి వెళ్లుట కన్న యనుజ్ఞ వేఁడెను. బుద్ధుఁడు ప్రవ్రజ్యాదీక్షను స్వీకరింపుమని మరల నడిగెను. నందుఁ డంగీకరింపలేదు. కాని భగవానుని వాక్యమువలన ప్రవ్రజనదీక్ష తనంతటతానే నందుని దేహము నలంకరించెను. అతఁడు సన్న్యాసి యాయెను. సుందరి యతని మనసును వీడలేదు. అతఁ డామెకొఱ కెంతో విలపించెను. శిలాతలముమీఁద సుందరీ చిత్రము వ్రాసెను. భిక్షువు లీ విషయము తెలుపఁగా బుద్ధుడు నందుని పిలిపించి యతనికి విరక్తి నుపదేశించెను. నందుఁడు విహారవాటికనుండి దొంగచాటుగా వెళ్లవలయునని పెక్కుసార్లు ప్రయత్నించెను. కాని యతఁడు బుద్ధుని కంటఁబడక తప్పినదిగాదు. కనఁబడినపుడెల్ల నాయన ధర్మబోధ చేసెను.

తర్వాత బుద్ధుఁడు నందుని పిలుచుకొని గంధమాదన పర్వతమున కేగెను. అట కార్చిచ్చుగోపడి కాలి వికృతమయిన గ్రుడ్డికోతినిచూపి, దానికి సుందరికి లావణ్యమున భేదములేదనిచెప్పి సౌందర్యతత్త్వము నుపదేశించెను. నందుఁడు సుందరీ సౌందర్యము లోకోత్తరమని వాదించెను. బుద్ధుఁడతనిని స్వర్గలోకమునకుఁ గొనిపోయెను. సురసుందరులనుజూచిన నందుని మనసు చలించినది. ఇది కనుగొన్న బుద్ధుఁడు ప్రసన్నబుద్ధితో 'బ్రహ్మచర్యము ననుష్ఠించినచో నీకు దేవాంగనలు లోపడునట్లు చేయుదు'నని యనెను. నందుఁడంగీకరించి బ్రహ్మచర్య వ్రతమునకుఁ బూనుకొనెను. దివ్యాంగనాభిలాషమువలన నందునకు సుందరిపట్లఁగల ప్రీతి చచ్చినది. పిదప బుద్ధుఁడతనిని నిజాశ్రమమునకుఁ బిలిపించెను. పూర్వ నిశ్చయముతో నందుఁడు బ్రహ్మచర్యము ననుష్ఠించెను. అతఁడు సుందరీ లావణ్య సంపత్తిని సంపూర్ణముగా మఱచెను.

ఒకనాఁడు వనములోఁ దిరుగుచున్న నందుఁ డొకచోట తుకతుక యుడుకుచున్న కుంభములతోనిండిన భూమిని జూచెను మిథ్యావ్రతులు, లుబ్ధులు, రాగద్వేషరక్తచిత్తులు నయినవారికి నిత్యతప్తములయిన యాకుంభములలోనే శాశ్వత నివాసమని తెలిసికొనెను. నందుఁడు తన దేహము కుంభీపాక నరకములోఁ బడినట్లే భావించి పశ్చాత్తాపతప్తుఁ డయ్యెను. అతనికి మోహము తొలఁగినది. మనస్సు నిర్మల మయినది. ఉత్తమ నిష్ఠ యేర్పడి బుద్ధి ప్రసన్నమయినది. ఒకనాఁ డతఁడు బుద్ధుని సన్నిధికివచ్చి 'మహాత్మా! నాకు సుందరిగాని సురసుందరులుగాని యక్కఱలేదు. ఈ విషయ సంపదలు పతనోన్ముఖములు. అచిరకాలములో అదృశ్యమగునవి. వస్తువు లనిత్యమని భావించిన కొలఁది నిరావరణ వృత్తులు ప్రసన్నమగును.' అని వక్కాణించెను. బుద్ధదేవుఁ డతనిసిద్ధి నిర్వాణబుద్ధమయినదని గ్రహించెను. నందునిగూర్చి యడిగిన భిక్షువులకు బుద్ధుఁడతని పూర్వ జన్మ వృత్తాంతములను దెలిపెను.

ఈ విధముగానున్న సుందరీనందుల కథకు బౌద్ధ శిల్పము వన్నెలు దిద్దినది. క్రీ. శ. 2 వ శతాబ్దమునాఁటి అమరావతీ శిల్పములో సుందరీ నందుల కథను ఆంధ్ర శిల్పులు చెక్కిరి. మద్రాసు మ్యూజియములో అమరావతీ శిల్ప శిలాఫలక మొకటి కలదు: ఆ శిలా ఫలకమున అధోభాగమునకు నెడమ ప్రక్క సౌధములో సింగారము చేసికొనుచున్న సుందరీ నందులు కలరు. కుడిప్రక్క సౌధతోరణముకడ నిలిచిన బుద్ధుఁడు, భిక్షాపాత్ర మోయుచున్న నందుఁడు కలరు. శిలాఫలకము మధ్యభాగమున భార్యా విరహతప్తుఁడయిన నందునకు బుద్ధుఁడుపదేశము చేయుచున్నట్లు కలదు. క్రీ. శ. 3 వ శతాబ్దము నాఁటి నాగార్జునుని కొండ శిల్పమున సుందరీనందుల కథ చిత్రింపఁబడినది. ఒక శిలాఫలకము దక్షిణ భాగమున స్వర్గమునకుఁబోవు బుద్ధుఁడు నందుఁడు కలరు. బుద్ధుని కుడిమోకాలి క్రింద జొత్తిపైఁ గూర్చున్న కోతియున్నది. శిలాఫలకము వామభాగమున దేవాంగనలు కలరు. ఈ శిలాఫలక శిల్పవైభవము చూపఱుల నిట్టే యాకర్షించును.

ఆంధ్ర సౌందరనందమునకు, అశ్వఘోషుని సౌందర నందమునకు నొక కొంచెము పోలికయున్న

దని గ్రంథకర్తలే చెప్పిరి. బోధిసత్త్వావదాన కల్పల తకు తెలుఁగు కబ్బమునకు పొత్తే లేదు. ఆంధ్రసౌందర నందములో తొమ్మిదిసర్గము లున్నవి. సంస్కృత దృశ్య శ్రవ్య కావ్యములందు మాదిరిగా నాంధ్ర సౌందర నందమునందలి గ్రంథభాగములకు —సర్గలకు— పేర్లు న్నవి. ప్రతి సర్గకు మొదటదానిలోని విషయమును సూచించు పద్యముండును. మొదటి చివరి సర్గలకు మొదటనిట్టిపద్యములు లేవు. అష్టమ సర్గమునకు మొదట భవభూతి శ్లోకమున్నది. కవులు తమ్ముఁ గూర్చి తాము వ్రాసికొనిన పద్యములు, కృతిపతి చెప్పిన పద్యములు కావ్యాంతమునఁ గలవు.

ఆంధ్ర సౌందరనందము నందలి కథ యిట్లు న్నది. పునరాగమనమను మొదటి సర్గలో బుద్ధుఁడు కపిలవస్తు నగరమునకు వచ్చుట, ధర్మబోధ చేయుట కలవు. భిక్షాగమనమను రెండవసర్గలో సుందరీ నందులు 'లలితోప భోగకలనా పారీణులై' యున్నప్పుడు భిక్షకువచ్చి బుద్ధుఁడు యుత్తచేతులతోఁ దిరిగిపోవును. ఈ తిరిగిపోవుట పర్యాయ సేవకొఱకు నగరికి వచ్చు చున్న పరిచారక చూచి నందున కెఱింగించును. నందుఁ డన్నను దీసికొనిరాఁగా వెళ్ళును. మకరికాపత్రము తడియాఱకముందే వత్తునని సుందరితోఁ జెప్పను. అశ్వఘోషుని సౌందరనందమునందువలెనే యీ సర్గలో సుందరీనందుల ప్రణయ కలహము కలదు. పరివ్రాజనము తృతీయసర్గము. నందుఁడు జనము గుంపుకట్టినచోట బుద్ధునిజూచి భిక్షార్థము రండని ప్రార్థించును. 'నాఁటి కింక భిక్షాశన మొల్లమి' 'హస్తసంజ్ఞామాత్రన్' బుద్ధుఁడు తెలిపెను. ఇంటికిఁ దిరిగి పోఁదలఁచిన నందుని చూపుతో నిలిపి యతని చేతికి భిక్షాపాత్ర యందిచ్చెను. ఇరువురు విహారము నకు వెళ్లిరి. అట బుద్ధుఁడు ధర్మబోధ చేయును. 'ఉపచార దక్షుఁడును నాత్మసముండును నైన శిష్యు నొక్కనిఁ బిలిపించి' 'తనయ! కుమారనందునకు ధర్మపథమున దీక్షయిమ్ము పొమ్మ' ని యాజ్ఞా పించును. నందునికొఱకు నెదురుతెన్నులు చూచి చూచి సుందరి నిజమెఱిఁగి నందుని బుద్ధుని నుపా లంభించుట 'నిరీక్షణ' మను నాల్గవసర్గ. ప్రవ్రజ్యా దీక్షపొందిన నందుని 'యనుతాప' మయిదవ సర్గలో వర్ణితము. 'ఉపదేశము' 'ధర్మసంవాదము' అను ఆఱేడు సర్గలలో బుద్ధుని నందుని చర్చలు గలవు. సుందరి హృదయము మాఱి ప్రవ్రజన స్వీకారము చేయుట యెనిమిదవ సర్గయగు 'అనుజ్ఞ'. తొమ్మిదవ సర్గయగు 'సహధర్మచర్యము'లో వెలివాడ దగ్గఱనున్న గుడిసెలో మిత్తిమ్రింగుచున్న బిడ్డలతల్లి సెజ్జకడ సుందరీ నందులు కలసికొనుట, బుద్ధుఁడువచ్చి సేవా ప్రబోధము చేయుట, వారు దేశికస్వామికి మంగళము పాడుట వర్ణితములు. పాత్రపోషణమునందు, సన్నివేశ కల్పనమునందు, కావ్యోపసంహారమునందు ఆంధ్ర సౌందరనందము విలక్షణ మార్గముపట్టి స్వతంత్ర సృష్టి యనిపించుకొన్నది. సంస్కృత కావ్యములో లేని ఘట్టము లాంధ్రకావ్యమునఁ గలవు.

ఆంధ్ర సౌందరనందము ప్రకృష్టమయిన బంధము కలది. కథ ప్రసన్నముగా నిందు నడిచినది. డొంకతిరుగుళ్లు కానరావు. కథలో అతిమానుష విష యములు లేవు. బుద్ధుని యుపదేశమంతయు కపిల వస్తుపురవిహారవాటికలో జరిగినది. బుద్ధుఁడు నందుఁడు స్వర్గమున కేగుట యిందు లేదు. తథా గతుఁడు నందునకు గ్రుడ్డికోతిని, అప్సరసలను జూపుట యాంధ్రకావ్యమున లేవు. ఇందు కోఁతుల జంట, అప్సరసల ప్రస్తావన యున్నది. అది మూలము కంటె భిన్నము. ధర్మసంవాదమున పరస్పరము కామసంప్రీతి ఘటింపుచున్న కోఁతులజంటను జూపి భగవానుఁ డిట్లనును.

ఆ కపిచాన తత్కపికి
నందపుఁ బెన్నని, నీ లతాంగియున్
నీకు వరాలమూట,
మఱి నిర్జరకాంతల నిత్యయౌవనా
స్తోకవిలాసవిభ్రమరుచుల్
చవిసూచినఁ దక్కు రూపముల్
చీఁకటి తోడఁబుట్టువు లిపీ!
యనిపించుఁ గదోయి! కంటికిన్

తనయా! తాదృశమైన యచ్చరల
సౌందర్యమ్మునున్ నాశమై

చనుఁ, బ్రేమింతువు నశ్వరమ్మయిన
యా చక్కందన మ్మీవు, ని
త్య నవీనమ్మను నాత్మభోగ్యమును
సత్యంబైన సౌందర్యమున్
గనరాదే? విషయ ప్రపంచమునఁ
గాంక్షల్ పండ వెవ్వారికిన్

ఈ భాషాకావ్యములో సుందరి హృదయపరివర్తనము, ప్రవ్రజ్యాస్వీకారము క్రొత్తగా నెత్తుకొనినట్టివి. నాయికానాయకులు సుందరీనందులు. సంస్కృత కావ్యములో నందునకుఁ బ్రాధాన్యము. ఆంధ్రకావ్యములో సుందరీనందులకుఁ దుల్యప్రాధాన్యము కలదు. చతుర్థాష్టమ సర్గములు సుందరీ పాత్రకు జీవము పోసినవి. క్రమక్రమముగా సుందరి హృదయము మాఱినతీరు తెలుఁగు కవులు చక్కగా వర్ణించిరి. ప్రవ్రజ్యాదీక్షానంతరము సుందరి హృదయ సౌందర్యము పాఠకులను సమ్మోహపఱచును. చూడుఁడు.

తళతళ మను తొంటితనువు కృశించి ప్ర
సన్న సంపతిల్ల
నొయ్యారె మెడలిన యొసపరి నడక కా
ర్త్రాణపరత సంభ్రమముఁ గఱప
నతను సంజీవనమైన జెళుక్కంజూపు
ఁకారత నిండునెనరుఁ జింద
దరిలేని హృదయసౌందర్యసేకమున వి
శ్వమెల్ల రసమయత్వమ్ముఁ దాల్ప
సస్మితానన కాంతి వత్సలతఁ గురియ
సన్నకావి ధరించి యా సౌమ్యభావ
చొచ్చు దుఃఖాంధతమసమ్ము చొచ్చినట్టి
యెషలు పరికించి క్రొంబొద్దు పొడుపువోలె.

ఆంధ్రసౌందరనందము ముగింపుపై దేశకాల ప్రభావము కలదు. సుందరి వెలివాడకు వెళ్లిన త్రోవ గనుఁడు.

దీపి కోజ్జ్వల విపణి వీధిం దరించి
ధనికులు వసించు వాడలు దాఁటి, యంతఁ
గారు చీకట్లఁ దేలు కుటీరపాళి
లోన దుర్గంధిలపు సందులోనఁ జనుచు

చితచితలాడు నీరమునఁ,
జేపలకంపునఁ, బందిముట్టియల్
కతికెడి చప్పరింపులను,
గైకుయి లాడెడి కుక్కకూఁతలన్
బ్రతినినదించు దర్దుర రవమ్ముల,
నీఁదర మోఁతలన్, దరి
ద్రత తలుపేలు గుక్కికొను
తావులలో వెలివాడ చక్కటిన్
ఒక గుడిసె లోనికిన్ బా
లకు వెంటం జొచ్చి, తైలలవపుష్పవమో
మకమకని దివ్వె వెలుఁగున
నొకట సమాసన్నమరణ నువిదన్ గాంచెన్

బుద్ధుఁడు, సుందరీనందు లీతావునఁ గలసికొనుట యొక మధురఘట్టము. గాంధీ మహాత్ముని జాతీయోద్యమప్రభావము స్పష్టముగా నిందుఁ గలదు. మాలలో, మాలలవంటి వారో యున్న వెలివాడ కాఁబోలది.

ఏ పాత్ర నెంతవఱకు వర్ణింప వలయునో, ఏ పాత్రచేత నెంతవఱకు మాటాడింపవలయునో యూహించి, యౌచిత్య మెఱిఁగి తెలుఁగు కవులు అంతవఱకే వర్ణించిరి. మాటాడించిరి. కావున సంక్షేపము తెలుఁగు కావ్య శిల్పమునకు జీవమయినది. యశోధరా దైన్యస్థితి వర్ణనము దీనికొక తార్కాణము. సంస్కృత కావ్యమున నిదిలేదు. బుద్ధుఁడు కపిలవస్తు నగరము చేరిన పిదప రాచవారెల్ల వచ్చిరి. యశోధరయు వచ్చెను. ఆమె భర్త నెట్లు చూచును? ఏమి మాటాడును? రాచవారు వచ్చినట్లు చెప్పినపుడామెయు వచ్చినదని చెప్పక తప్పదు. వచ్చినదని చెప్పినప్పుడామె హృదయస్థితిని వర్ణింపక తప్పదు. ఆమె గౌతము నిల్లాలు. కవులీ గుట్టు నెఱిఁగి యొక పద్యముననే యామె దైన్యమును హృదయ విదారకముగా వర్ణించిరి. ఈపద్యమును జదివినప్పు డెవ్వరయినను బుద్ధుఁడు దగ్గఱనున్నచో 'నీవు నీధర్మము ఏయేటిలోఁ గలిసిన మాకేమి? యశోధర కెంత యన్యాయ్యము చేసితివయ్యా?' యని యందురని యనుకొందును. చదువుఁడు.

కజ్జలహీనమై కాంతిఁబాసిన కనుం
 గొనలందు బాష్పాంబు కణము లురుల
విగత సంస్కారమై వ్రేలు పెన్నెఱికురుల్
 సెదరి వెన్నునఁ జిక్కు జీరు వడఁగ
వసివాళ్లు వాడిన పసిఁడి మైతీవ సం
 భ్రమ యాన వశతఁ గంపము వహింపఁ
బాలిన చెక్కిళ్లఁ బయిపయిన్ జాలువా
 ఱిన కంటినీరు చారికలు కట్ట
 నంతిపురి వీడివచ్చి శూన్యావలోక
 నములఁ గాంతుని గనుచు రూపమువహించు
 శోకమన దొల నిల్చె యశోధరయును
 కొడుకు కూఁకటి నొకకేలఁ బుడికికొనుచు.

ఇంతకంటె నెక్కువగా నేమి చేయఁగలదామె? ఉన్న సొగసంతయు 'శూన్యావలోకనములఁ గాంతుని గనుచు' ననుటలోనే యున్నది. ఆ చూపులు యశోధర యాంతర జగత్స్వరూపమునకు దర్పణములు.

ఆంధ్ర సౌందరనందములో ముఖ్యమయిన బుద్ధుని యుపదేశములు మూఁడుచోటులలోఁ గలవు. కపిలవస్తుపురమున ధర్మబోధ గావించినపుడు నిస్సంగత్వము, జగదనిత్యత్వము, ధర్మచక్రప్రవర్తనము, అస్తేయాదిసద్గుణపుంజము మొదలగువానినిగూర్చి మాటాడును. మొదటిసారిగా నందునికి నుపదేశము చేసినపుడు మృత్యువు, జరారుజానిలయమయిన దేహము, అనువానినిగూర్చి యుపన్యసించును. రెండవ సారి నందునితోఁ జర్చ చేసినప్పుడు బుద్ధుఁడు విశ్వమునందలి హింసాదైన్యములనుగూర్చి చెప్పును. భిక్షువులను గొనియాడును. ఆత్మభోగ్యమయిన, అనిమిత్తమయిన, నిత్యనవీనమయిన సత్యసౌందర్యమును నిరూపించును. బౌద్ధజాతి పరమార్థమును వెల్లడించును. ఈ బోధలలో చక్కని క్రమమున్నది.

అశ్వఘోషుని సౌందరనందములో కవితాకళకు బరువయిన ధర్మోపదేశము కలదు. సంస్కృత కావ్య కర్త లక్ష్యము వేఱని యాయన మాటలనుబట్టియే తెలియుచున్నది. ఆంధ్రకావ్యములో ధర్మోపదేశము సముచితముగానే యున్నది. కాని దానిలో హిందూ ధర్మవాసన యున్నది. కపిలవస్తునగరములో ధర్మబోధ గావించినపుడు బుద్ధుఁడు యమునకు బొమ్మ వెట్టుట, భవాసురునొదలమెట్టుట, మోక్షకాంత మెడను తాలిగట్టుట యనుచు మాటాడును. ఇట్లనుట తగునో తగదో సహృదయు లాలోచింతురుగాక! అది యునుగాక బుద్ధుఁడు మాటిమాటికి క్షత్రియధర్మమును నొక్కి వక్కాణించుచుండును. ఆయన నందునితో 'మనకేమి యన్నటులఁ బ్రౌద్దుల్ పుత్తురా రాసుతుల్' 'రాగిలి భోగముల్ గుడుతురా? నినువంటి నరేంద్రపుత్రకుల్'అని యనును. నందుఁడు రాజ కుమారుఁడే కావచ్చు. ఆతని రాజకుమారత్వమును పురస్కరించుకొని లోకసేవాసక్తిని బెంపొందింపఁ జేయుట యేమంత తగిన పని? గౌతముఁడు రాజ కుమారుఁడే. ఆయన దేని కిల్లు వెడలెను? రాచ బిడ్డఁడు గావున విశ్వదైన్యమును బాపఁగా సర్వసంగ పరిత్యాగము చేసెనా? లేక జరారుజామరణపీడితమగు విశ్వమును వీక్షించి కరుణామయుఁడై లోకత్రాణార్థము మహాభినిష్క్రమణము చేసెనా? భోగవైముఖ్యము వలయునని వక్కాణించుటకు క్షత్రియత్వమును బ్రస్తావింపవలయునా? దానిని బ్రస్తావింపక నందునిలో మార్పు తీసికొనిరాలేని వదతాంవరుఁడా బుద్ధుఁడు? ఈ విధముగా భావించిన పక్షమున నీ క్రింది పద్యమును సమంజసముగాఁ జూపట్టదు.

 ఊబిలోఁ గాళ్లు దిగఁబడి, యొరమెడను
 మలఁచి బయ లాలకించు గోమాతవోలెఁ
 దల్లడిలుచున్న దీ విశ్వధాత్రి; రాచ
 బిడ్డనికి నీకుఁ దగునె యుపేక్షసేయ.

ఈ పద్యమునకు ముందు మఱి మూఁడు పద్యములు గలవు. వానిలో హిందూధర్మవాసనలు ఘెల్లుగా నున్నవి. చూడుఁడు.

 సారథికృత్య మొక్కరుఁడు,
 సైంధవకృత్యము వేఱొకండు శాం
 తారభటిన్ యథావిధి
 నుపాయముమై నెఱవేర్చి లోకయా
 త్రారథమున్ మునీంద్రవిహితమ్మగు

గమ్యము చేర్చుకోసమై
పాఱుని జన్మమున్ బుడమిపాలుని
జన్మముఁ గల్గ నిమ్మహిన్.

బరువు మోయఁగజాలు నశ్వములు లేక
ప్రాప్యము నెఱింగి నడపు సారథియు లేక
దారితప్పెను నేఁటికి నారథమ్ము;
ఎచటఁబడి కూలిపోవునో యెఱుఁగరాదు.

ఆద్యులైనట్టి ఋషులు సత్యం బహింస
ధర్మదేవత రెండునేత్రము లటంచుఁ
గఱపిపోయిరి లోకసంగ్రహము కొఱకు
నంధురాలయి యాపె యల్లాడు నిపుడు.

మొదటి పద్యములో బుద్ధుఁడు వర్ణవ్యవస్థ నంగీకరించె నను విపరీతార్థము కలదు. ఇది యనుచితము. బౌద్ధధర్మ విరుద్ధము. పురాణర్షులు ప్రవచించిన సత్యాహింసల ప్రస్తావము బుద్ధునినోటివెంట వెడలుటయుఁ దగదు. సత్యాహింసలు ప్రాచీనతత్త్వములే కావచ్చు. బౌద్ధధర్మమున నవి కలవు. అంతమాత్రాన ప్రాచీనర్షులు వానిని ప్రతిపాదించినట్లు బుద్ధుఁడు చెప్పవలసిన యక్కఱ యేమున్నది ? ఆంధ్రకవు లిట్లు వ్రాయుటకు నాకొక హేతువు కనఁబడుచున్నది. సర్వేపల్లి రాధాకృష్ణుని వంటివారు బుద్ధుఁడు హిందూధర్మ సంస్కర్త మాత్రమే యనియు, నుపనిషత్సిద్ధాంతానుయాయియనియు నమ్మిరి. ప్రచారముచేసిరి. ఈ తెలుఁగుకవులా త్రోవ త్రొక్కిరి కాఁబోలు. కాని పాలీవాఙ్మయమును గూలంకషముగా మధించిన ప్రాచ్య పాశ్చాత్య పండితులు బౌద్ధము నూతనదర్శనమని సహేతుకముగా నిరూపించిరి.

ఆంధ్ర సౌందరనందము చక్కగా చిక్కగాఁ దిద్దిదీర్చిన కావ్యము. ప్రాచీన నవీన కాలముల కెంత భేదమున్నదో యంతే భేదము ప్రాచీనకావ్యములకు, నవీన కావ్యమగు సౌందరనందమునకు నడుమఁగలదు.



# ఋకకాలు

## శ్రీ మాదిరాజు రంగారావు

కాలం గుర్తిస్తోంది సూర్యచంద్రులున్నా
సమాజం కుంటిది రోజూ పరుగిడినా.
ఎవడు దారి చూపిస్తే వాడే ఆప్తుడు
ఎవడు ఊతనిస్తే వాడే బంధువు.

అహం రగిలి మండి భస్మమై
కన్నీటితో పరిషిక్తమై,
రాని పచ్చని మొక్క మనసులో
అదే అందమైన సృజనసమయం.

నడుస్తూ నావి సంవత్సరాలు
ముట్టించిన వత్తులు.
దప్పికగొన్న చూపులతో
ఆకలిగొన్న ఆశలతో.

నీటి ఉరవడికి కొట్టుకపోతూ
మళ్ళీ ఏటికడుపులోనే నివాసం,
మృత్యుభూమి అంచుల్లో ప్రాకుతూ
జీవనగతిలో సంధికై యత్నం.

నెత్రు ఎరుపే ఏమనిషిని నరకినా
శత్రువు తప్పలే అజాతశత్రువుకూ,
అగ్ని ఒకటే ఏవస్తువు మండినా
మనస్తత్వ మొకటే కాలం వేరైనా

పూవులో గంధం కోరతావు
నవ్వులో పూలు ఊహిస్తావు

పూవులో వేడే ఉంటుంది సుమా!
నవ్వులో విసపూ ఉంటుంది జాగ్రత్త!

స్వీకరించు వేదన కానుకగా
సమర్పించు ఆనందం ప్రీతిగా
వినిపించు సంగీతం మధురంగా
గ్రహించు ప్రళయం హృదయంలో.

నీటి జాలు జ్ఞాపకం తెస్తుంది
బ్రతుకులోని ఆర్ద్రత నెపుడో,
పర్వతపంక్తి మరువనీయదు
బ్రతుకులోని కాఠిన్యత నెపుడూ.

పురాతన శిథిల పంక్తులనుండి
తొంగితొంగి చూస్తోంది గతం.
సందులలో ఉద్గమించిన మొక్కలు
నిదురలో నవ్వువలె ఉన్నవి.

ఎక్కడో ఎగిరింది పక్షి
భయానికో సరదాకో గాని,
సుళ్ళు తిరిగిన రెక్కల చప్పుడుతో
ఎదను లేపుకపోయేను తనతో.

మన నవ్వులోనే ఉంది ఏడుపెంతో
అందుకే ఏడ్వనక్కరలేదు మనం,
నేనెవరిని చూస్తున్నానో తెలీదు
నాకందరూ కన్పించే రద్దంలో.

నీవేమి చేస్తావు నాకు మేలు
హరి భగవంతుడా! చెప్పు.
నేనెంత పనికిమాలినవాడినో తెలుసు
అందుకే నీగురించి మాట్లాడ నసలు.

# జానపదుల గుండెల కొండల్లో పారే సెలయేళ్ళు

### శ్రీ దేవరాజు మహారాజు

ప్రకృతిమాత ఒడిలో మానవుడు చిరకాలం జీవిస్తున్నాడు. అతనికి ప్రకృతే ఎన్నో పాఠాలు నేర్పుతుంది. వాటి నర్థం చేసుకునే సమర్థత పట్టణాలల్లోవుండే నాగరికులకంటె, పల్లెలోని అనాగరికులకే అధికంగా వుంటుంది. పక్షులు, జంతువులు, మబ్బులు, పచ్చనిపైర్లు, నీళ్లు, చల్లని వాతావరణం...ఇవన్నీ చూస్తూవుంటే జీవిత సత్యాలేవో అర్థమైపోయినట్లే అనిపిస్తుంది. అలాంటి అనుభూతి వారు జీవితాంతం అనుభవిస్తూనే వుంటారు. పోగా సూర్యుని వేడిమిని, చంద్రుని వెన్నెలను సమానంగా హృదయపూర్వకంగా అనుభవించగల ఉన్నతులు వారు. అందుకే వారికి అన్ని రకాల అనుభూతులుంటాయి. వారి హృదయస్పందనలోంచి, అనుభూతులు వెలువడుతాయి. అవే వారి గీతాలు, పదాలు, గేయాలు...వాటి కే పేర్లు పెట్టినా పెట్టుకోవచ్చు. కాని అవి కొంత కాలం వారిని వారి బ్రతుకు బంధల్నించి లాగేసి దూరంగా తీసుకెళ్ళి బ్రహ్మానుభూతినిస్తాయి.

వాళ్ళు అనాగరికులు కాబట్టి, వారి అనాగరిక భాషలోనే, వారి కవిత్వం వుంటుంది. 'కవిత్వం లిక్విడ్ లాంటిది. ఏ ఆకారంగల సీసాలోనైనా పోయొచ్చు' అని ఆరుద్ర చెప్పారు కాదూ?

గ్రామాల్లో వ్యవసాయంతో జీవించే గ్రామీణులకు దినచర్యలో మోటగట్టి, పొలానికి నీళ్లు పారించడం ఒకటి. దానినే వాళ్లిక్కడ చెబుతున్నారు. పాట మోట గురించైనా దీనిని కలుపు దీస్తూ స్త్రీలు పాడతారు.

'అడిమిన ఒక బాయి నా రామచిలుక
అగ్గనాల బాయి
అగ్గనాల బాయికి
మొగ్గల్లది మోటో
మొగ్గల్ల మోటకు
మొగిలిపూవు దండెడో ,,
మొగిలిపూవు దండెడకు ,,
గజ్జెల కానో ,,
గజ్జెల కానికి ,,
గంగెద్దు గట్టో ,,
సీరాముడు మోట గొట్టె ,,
సీత నీల్లు గట్టె ,,
దేముడు మోటగొట్టె ,,
రంబ నీల్లు గట్టె ,,
కాముడు మోటగొట్టె ,,
కాంత నీల్లు గట్టె ,,'

సృష్టి మొదలైంది మొదలు ఏపనైనా స్త్రీ పురుషులు కలిసికట్టుగా కష్టపడటం, సుఖాల్ని పంచుకోవడం వుంది. అతడు మోటకొడుతూవుంటాడు. ఆమె పొలంలోకి దిగి వరాలు సరిచేస్తూ నీళ్ళు మలుపుతుంటుంది. పచ్చగానవ్వే భూదేవి శరీరంమీద పసిపాపల్లా ఆడుకొంటూవుంటారు. దేవుళ్ళైనా అలాగే వుంటారని వాళ్ల ఊహ. అందుకే వాళ్ల పాటలో దేవుళ్ల పేర్లు!!

పగలంతా సూర్యుని కిరణాల వేడిమిని పీల్చుకుని మండిపోయిన వారిశరీరాలు, చంద్రుని కిరణాలు సోకగానే, ఉత్తేజమవుతాయి. సాయంత్రం నలుగురు ఒకచోట కూర్చున్నప్పుడు ఒకడు మనసులోని భావాన్ని కూనిరాగంద్వారా శబ్దాల్లోకి మార్చేసరికి అది పాటవుతుంది. అందులోనే లయ—పక్కవాళ్ళు ఉసికొల్పుతారు. ఫలితంగానే లేచిఆడటం. మళ్ళీ, ఆడటంలోనూ వాళ్లకు తెలియకుండానే ఒక క్రమబద్ధమైన తీరు చోటు చేసుకుంటుంది.

"లాహిరె లాహిరె లాహిరే జంబాహిరే వవ్వాహిరె ॥లాహిరె॥
పొద్దు మీకింది ఎన్నెలొచ్చింది
నేటి రేతిరీ వన్నె తెచ్చింది

కీల కిలా నవ్వుకుంటుంది.
మిలమిలా మురుసుకుంటుంది. ||లాహిరె||
గజ్జెకాట్టి ఆడమంటుంది
ఎన్నెలోన ఎగ్రమంటుంది
కూనిరాగం తీయమంటుంది
కొత్తపాటే పాడమంటుంది ||లాహిరె||
సంతోసం నింపుకొచ్చింది
ఆనందం అందుకొచ్చింది
ఎండలోన జబ్బల్వాయె
ఎన్నెల్లోన ఎంత హాయి ||లాహిరె||''

వారి నోళ్లనిండా, వళ్లునిండా. గాలినిండా వెన్నెల ఉక్కిరి బిక్కిరవుతుంది.

వెన్నెలకు వారిరక్తానికి ఏదో దగ్గరి సంబంధం వుండి ఉంటుంది. వెన్నెల సోకగానే వారిలోని రక్తం పొంగులు వారుతుంది—'నా అక్షరాలు వెన్నెలలో ఆడుకునే అందమైన ఆడపిల్లలు'—అన్న తిలక్ మాటలు జ్ఞాపకాని కొస్తాయి నాకు.

జాతులు, కులాలు వేరు వేరైనా కొన్ని ఆచారాలు అంతటా ఒకే రకంగా వుంటాయి. ఉదాహరణకు వివాహం—ప్రపంచమంతా ఉందేకదా. ఆ బంధానికి పవిత్రత వేరే దేశాలలో లేకపోయినా మనకెంతో పూజ్యనీయమైనది—ఈ పాట 'మాల' వారు వారి పెళ్లిళ్లలో పాడతారు.

బిందె తాకి పుస్తె (మంగళసూత్రం) సొట్టుబోయిందట. అదో అపశకునమని ఆందోళన పడుతుం దీ పడతి. పెండ్లికి ఎంత గౌరవ స్థానమిస్తామో ఈ చిన్నవిషయంవల్ల గ్రహించవచ్చు.

'పెండ్లినాటి నా బొందు పుస్తె ||పె||
బిందె దాకె సొట్టు బోయె ||బిం||
నాది రాత ఎట్టులున్నదో ||నా||
ఏటి గట్టుకు ఎవసం బెట్టి ||ఏ||
కలిబెట్టి వొండితయ్యా ||క||
కంకెడన్నం కుడిసి పోవయ్యా ||కం||
బుడ్డివెట్టి వొండి త్తయ్యా ||బు||
బుక్కెడన్నం కుడిసిపోవయ్యా ||బు||
సెము బెట్టు బోసిందె పిల్ల ||సె||
రెకెట్ల జినిగింపె పిల్ల ||రె||
ఆపది రోకలి బుజాన బెస్తె ||ఆ||
సెమ్మకు జినిగిందిరో మొగడ ||సె||

సోలసోల ముత్యాలిత్తు సోమపూల దండలిత్తు
రావయ్య రాములవారు నాగబెల్లికి
హారాలిత్తు సారెలిత్తు, ఆడిబిడ్డ గంపలిత్తు ||రావయ్య||
కుర్మసాని గిన్నెలిత్తు కూసుండ కుర్చిలిత్తు ,,
నిలబడ బెంచీలిత్తు ఉరు తిరుగ బైస్కాల్తి ,,
ఊల్లు తిరుగ మోటరిత్తు అయిదువేల దాసీలిత్తు ,
తూర్పుదేశము నిత్తు తుర్కాలియా నిత్తు ,,
పెండకెమె అవునిత్తు, పాలియ్య బర్రెనిత్తు ,,
రావయ్య రాములవారు నాగబెల్లికి—'

ఇక్కడేమో పెండ్లికొడుక్కి 'రాములు' అని దేవునిపేరు పెట్టుకున్నారు. ఆలిగాడో ఏమో బైస్కాలు, మోటరు, తుర్కామియా ఇన్నిఆశలు చూపిస్తూ పిలుస్తున్నారు.

మరో పాటలో ఒక పడతి కార్యభారంపైన పరదేశంవెళ్లే మరిదికి హితబోధలాంటిది చేస్తుంది. సుందరమైన ప్రకృతి పరిసరాల్లో విషనాగులుకూడా విహరిస్తాయికదా? అలాగే ఇక్కడ ఆకుల్లేకున్నా మేకలున్నాయనడం, గడ్డిలేకున్నా గేదెలుంటాయని హెచ్చరించడం గోడకు చెవులుంటాయనడం లాంటిది. సంఘంలోని చీడపురుగులు అనుకోకుండా తటస్థపడతాయి జాగ్రత్తగా వెళ్లమని ఉద్బోధ.

'కొమ్మ యెవరో కొట్టినారయ్యో ||కొమ్మ||
కోటిమజ్జెనో మరిది
ఆకులేని అడావిలోన, మేకలున్నాయో మరిది ||ఆకు||
మేక కట్లం మరానజోతి
మచలున్నాయో మరిది
గడ్డిలేని అడవి లోన
గేదెలుంటాయో మరిది
గేదె కంట్లం మరానజ్యోతి
గొర్జముంటాదో మరిది.
పుట్టలేని అడవిలోన
పాము లుంటాయో మరిది

పాము కంట్లం మరాన జో
పడిగ లుంటాయో మరిది
నీ బొద్ది సేతుల తోటి
సద్ది గట్టావే వదిన
నీ హంస నడకల తోటి
సాగ నంపవే వదిన
కలికి చిలుక కండ్ల తోటి
పార జూడవే వదిన'

ఒక బాల వుంది, ఎవరంటే—

'ఒడ్డు శెంచలికూర లేరిన బాల
బంగారు కొడువలితో తరిగిన బాల
మొదటి గుల్లల వెదిరిన బాల
గంగ ఒడ్డుకుపోయి కడిగిన బాల
కొత్త కొత్త ఎస్ల ల కుక్కిన బాల
పొయ్యిమీద దొంతులు బెట్టిన బాల'

ఆమెకు పిన్నవయస్కురాలైనపుడే, పెద్ద వాళ్లు పెళ్లి చేసారు. మొదటిసారిగా, ఆమె అత్త అనబడే ఆవిడ వచ్చింది. తీసుకు వెళ్లడానికి. ఆమెకేమో పుట్టిల్లు, చెలులు, వదిలి వెళ్లడం కష్టంగా వుండడం సహజమైనదే. అందుకే అపశకునాలు కావాలని కోరుకుంటోంది. దాంతో ప్రయాణం వాయిదా పడుతుందని ఆశ.

'అత్తగారంట మా యత్తగారు
మమ్ము దోలుక పోనొచ్చినారు
తొ'ిట లున్న ఓ బుడ్డ సెల్లె
తుమ్మనన్న తుమ్మరాదె,
సందులున్న సాకలోల్ల పిలగా
సల వబట్టి లెదురుంగ దేర.
గొంతెలున్న గొల్లోల్ల పిలగా
పచ్చిపాలన్న ఎదురుంగ దేరో
కంపనాటి కాపోల్ల పిల్లగా
గడ్డ పారన్నెదురుంగ దేర
ఊరు దిరిగె ఓ ఊరబిల్లి
అడ్డమన్నా నువ్వన్నరానే'

కాని ఆమె ఆశించినట్లు కాలేదేమో—పెద్ద వాళ్లు చింతపడక వెళ్లిరా!—అంటున్నారు.

'కొండకింద కొత్తసేను, కోయరావె రౌడి పడుస
ఎన్ని గోరికలైన, ఎల్లావె జట్కు
సింత కింద నిలవడి లావు సింత జేసేవు
నీ సింత నా కెరుక పోయె మొగ నెంట
బండి నిండ రాల్లేరి బాయి మూడు సుట్లు దిరిగి
బాయిలోగ రయేస్తే బ్రమలు దీరెైర
శెయి నిండ రాల్లేరి సెరువు మూడు సుట్లు దిరుగ
సెర్లోకి రాయేస్తే, సెమలు (శ్రమలు) దీరెైరా
కను సొగ సెదరందె, పట్టయిక జినుగందె
పోయె మొగన్నాన్కి...'

ఇలా నిత్యజీవిత సత్యాలను చిత్రిస్తూ కనిపిస్తాయి. ఈ జానపద గేయాలు ఇందులో ప్రబంధాల్లోలాగా ప్రకృతి వర్ణనలు, తత్వచింతనలు చాలా తక్కువ. మన తెలుగు పల్లెపాటలే కాకుండా దేశభాషల్లోని ఏ భాషకు సంబంధించినవైనా మధురంగా వుంటాయి. అన్ని భాషల వాళ్ళు వాళ్ళ జాతి, పూర్వపు గీతాలను సేకరించుకున్నారు. కాని ఆ పని మనమే సరిగా చేసుకోలేక పొయ్యామేమో—ఈ విషయాన్ని J. A. Boyle M. C .S గారిలా చెప్పారుట. "It is therefore to be hoped that while the treasures of National Poetry are being gleaned from so many languages, the store of the sweetest dialect of Southern India may not be overlooked, and that the popular songs of the telugu People may be colleted –" అని. అతను రాయలసీమ ప్రాంతంలో ప్రభుత్వోద్యోగిగా వుండేవారు. అప్పట్లో కొన్ని గేయాలు సేకరించి ప్రకటించారటకూడాను. మన జానపద గేయ ప్రథమోద్ధారకుడు ఒక పాశ్చాత్యుడు అని తెలుసుకుంటె ఆశ్చర్యంగా లేదూ?

ఈ క్రింది పాటలో ఎక్కడేవి వాడాలో అలా పదాల్ని, ఎంత చక్కగా వాడారో మాడొచ్చు.

'వెండలేసిన కొలవెండిది కోల ॥గొకుమల్లెసుందరి॥
పదమన్న పాడవే ఓ పడుచుపిల్ల ,,

ఏమంట పాడుదూ వెయ్యిమందిలోన
ఎగ్గుసిగ్గు ఎరుగని ఇగురవంతుడె
ముసలమ్మ ఒడికింది ముత్యాలపత్తి ,,
వొయిసమ్మ ఒడికింది ఒజ్రాలపత్తి ,,
బాలెంత ఒడికింది బంగారుపత్తి ,,
ఈ పత్తి ఆ పత్తి కలరాశి వోశి ,,
శింతకింది శాలోడ శీరె నెయ్యవురా ,,
నేశెనె నెలకొక్క పోగు ,,
నెత్తిమీద కొంగుల్ల నెమిలి పూలెయిరా ,,
మడతమీది కొంగూల పిల్లడుగు లెయిరా ,,
వంచున వైరేని కడవ దించవురా ,,
కొంగున కొటేల శిలకా లెయ్యవురా ,,
నేశెనె శాలోడు నెలకొక్క పోగు ,,
దిగెనె నా శీరె దిటీలమీద ,,
కొనెనె మాయన్న కొటేలు వోశి ,,
కట్టెనే మా వదిన మడిమలు మెరువంగ ,,'

నెత్తిమీది కొంగుల నెమిలిపూలు కొంగు కప్పుకొని వదిన నడుస్తూవుంటే పురిలిప్పిన నెమిలి హొయలు ఆమెలో చిలకాలని మరదళ్ల వాంఛ. ఇంకా కొంగు మడతెక్కడ పడుతుంది?—ఏమో మర దళ్లకు తెలుసు, అక్కడ పిల్లడగులు వెయ్యాలిట, అంచుకేమో కడవలుట. మడిమలు మెరువంగ వదినె చీరె కట్టాలిట—

ఇక జానపదుల నోటినుండి ఆశువుగా వెలు వడే గీతాల్లో అప్రయత్నంగా ఒక క్రమపద్ధతి, లయ వచ్చి చేరతాయి.

'కొర్రాయి పూలు పూసెనా
కొడుకుల్ల బ్రవల్లు దీరెనా
ఆశకు పరదేశము వస్తిర నీకోసము
బీరాయి పువ్వులు పూసెనా
బిడ్డల బ్రవల్లు దీరెనా
ఆశకు పరదేశము మాటలంటె రేషము
అనక్కాయ పువ్వులు పూసెనా
అల్లుండ్ల బ్రవల్లు దీరెనా
ఆశకు పరదేశము, మాటలంటే రేషము
కుంకుమ్మపూవులు పూసెనా
కోడండ్ల బ్రవల్లు దీరెనా
ఆశకు పరదేశము, మాటలంటె రేషము.
మల్లాయి పూవులు పూసెనా
మనమల్ల బ్రవల్లు దీరెనా
ఆశకు పరదేశము వస్తిర నీకోసము.'

నయాగరా జలపాతా న్నాపడ మెంత సుళువో వారి నోటినుండి, ఆ పాటల్నాపడమంత సుళువు. అందుకేనేమో ఆ పాటల్లో మనసుల్లోకి చొచ్చుకు పోయే విద్యుత్తులాంటిదేదో ఉన్నవిస్తుంది.

(ప్రతిపాదం చివర 'దేవయ్య' అని వుంటుంది).

''శిద్దిపేట సీటి సీరె దిద్దిదిద్ది
కట్టలేదురో దేవయ్య
వత్ మాకూరి వద్దాబ్రైక
జబ్బల నడ్మ మెరువలేదురో ,,
ఆలేరు వత్తరునూనె
గుమగుమా గొట్టలేదురో ,,
బోనగిరి బొట్టుసీస బొమ్మలనడ్మ
బెట్ట లేదురో ,,
అత్తగొట్టె, మామగొట్టె
మోటగాడ మోగుడు గొట్టెరో ,,
మోటగాడ మొగుడుగొడ్తె
సాటు మొగడు సీటు గొట్టిరో ,,
సాటు మొగడు సీటిగొడ్తె ,,
శీకటింట్ల తేలుగొట్టిరో ,,
సీకటింట్ల తేలుగొడ్తే
ఇంటి మొగడు బాసలాడెరో ,,

తన గోడు వినేవాడు దేవయ్య. అతనితో చెప్పుకుంటుంది. తను మంచి చీరె కట్టుకోలేదు. బొట్టు పెట్టుకోలేదు. అత్తరు రాసుకోలేదు. ఎవరినో ఆకర్షించాలని ప్రయత్నించలేదు.

అయినా అత్త మొగడు కొట్టారు. కారణం మనకు చెప్పదు. కాని చివర తను, సాటు మొగడు

(ప్రియుడు) చీకటింట్లోకి వెళితే తేలుకుట్టిన తతంగం మగడికి తెలీక మళ్లీ బాసలాడుతాడుట—

'స్త్రీలు పరితపించరు. పరితాపం కలిగిస్తారు' అని బుచ్చిబాబు ఎదో నవలలో వ్రాసారు. ఇక్కడది సరిపోయింది. ఇంతగోడు చెప్పకున్నా ఆమెలో పరితాపం, వేదన లేవు.

అసలు జానపదులకు వేరే ఆలోచనలే లేవు. నిశీధి వేకువగా మారినట్లు, చంద్రుడు వెన్నెల్ని జారవిడిచినట్లు—అంత సహజంగా సాఫీగా జీవితాన్ని గడిపేస్తారు.

వుట్టినూకలు, జొన్నలు తిని అంత దృఢంగా ఎలా వుండగల్గుతారు?—అయినా వాళ్ళు అన్నంమీద బ్రతకరు—కష్టంమీద, ఆనందంమీద బ్రతుకుతారు.

పల్లీయుల గుండె సవ్వడులైన పల్లెగేయాలు పరిశీలిస్తే వారు మనకు అందులోనే సాక్షాత్కార మవుతారు.

వారి గుండెల కొండల్లో పారే ఈ సెలయేళ్ల ప్రవాహంలో సిసలైన కవిత్వం పంక్తులు సహృదయుల హృదయాల్లో నిలిచిపోతాయి.



# తుమ్మలవారి లఘు కావ్యములు

శ్రీ గొల్లపూడి ప్రకాశరావు

తన మానముఁ దన ప్రాణముఁ
దన విత్తముఁ దన బలంబుఁ దన సర్వస్వం
బును విశ్వశ్రేయస
మున కప్పన సేయువాఁడె ముక్తుఁడు సుమతీ!'

ఇది ఆంధ్ర పాఠకులకు సుపరిచితమైన సుమతి శతకములోని పద్యముకాదు. యావన్మనుజాభ్యుదయ మాదర్శముగా భావించి కావ్యములు రచించుచున్న అభినవ తిక్కన ఆత్మార్పణములోనిది. ఆదర్శములను, ధర్మములను అందముగా బోధించువారు లెక్కకు మిక్కిలిగా నున్నారు. నోటిమాటకు, చేయుచేతకు సంబంధము మాత్రము శూన్యమగుచున్నది. కవితా రూపమున తాను బోధించిన ధర్మములను నిజజీవితమున కొంతకుకొంతయైనను నాచరించు కవీశ్వరుడు శ్రీ తుమ్మల సీతారామ మూర్తిగారు. పై పద్యము ఆత్మార్పణము గ్రంథములో ఒక కపోతి తన భర్తయైన కపోతముతో నన్న మాటలు.

ఆత్మార్పణ మొక లఘుకావ్యము. లఘుకావ్యమనగా స్వల్పపరిమాణము గల కావ్యము. ఖండికలలో నేదో యొక యంశమును గైకొని కొన్ని పద్యములలో వ్రాయుదురు. పూర్వగ్రంథములవలె విపులపరిమాణము గల గ్రంథములు మహాకావ్యములు. పూర్వగ్రంథములలోని యొక యంశమును గ్రహించిగాని, స్వతంత్రముగా కల్పించిగాని ఖండికకంటె యెక్కువ పరిమాణముగల గ్రంథముగా రచించినచో లఘుకావ్యమనవచ్చును. ఇది స్థూలనిర్ణయము మాత్రమే. తుమ్మలవారి గ్రంథములలో ఆత్మార్పణము, ధర్మజ్యోతి, సర్వోదయగానము లఘుకావ్యములు.

తుమ్మలవారు ఈ లఘుకావ్యములలో గ్రహించిన కథావిషయము లున్నతమైనవి. ఆదర్శప్రాయమైనట్టివి. అతిథి సేవాపరాయణత్వమును, పాతివ్రత్యమును బోధించుకథ ఆత్మార్పణములోనిది. పరుల సొమ్మును విషప్రాయముగా భావించి ధర్మజ్యోతిని ప్రజ్వలింపజేసిన నారయ్యకథ—తుమ్మలవారి తండ్రి కథ—ధర్మజ్యోతిలోని విషయము. గాంధీజీ యనుచరుడు, ధర్మచక్రప్రవర్తకుడు వినోబాభావే భూదాన యజ్ఞ సంబంధమైనది సర్వోదయగానము. మూడు గ్రంథములును ముక్తిదాయకములే.

ఆత్మార్పణములోని కథ భారతములో సుప్రసిద్ధమైన లుబ్ధక కపోతోపాఖ్యానము. ఒక బోయవాడు వేటకువెళ్లి వేటాడివేటాడి గృహోన్ముఖుడైన సందర్భమునకు కుంభవృష్టిగా వర్షము కురిసినది. దిక్కుతోచని యాబోయ యొక వృక్షముక్రింద చలికి వణకుచు శయనించినాడు. ఆ చెట్టు తొర్రలోని యొక కపోతము మేతకేగి తిరిగిరాని పెంటికొఱకు దుఃఖించుచుండెను. బోయని వలలోనున్న కపోతి కపోతము నూరడించి ఆర్తరక్షణ ధర్మమని బోధించి బోయని దీనత బాపుమని కోరెను. కపోతము బోయని ప్రశ్నించి మంటగావించి చలిబాధను తీర్చెను. బోయడు తదుపరి తన యాకలి నెఱిగించెను. మార్గాంతరము తోచని కపోతము తన శరీరమునే యాహారముగా సమర్పించెను. బోయడు విరక్తుడై వలలోని పులుగులను విడచివెళ్లను. వలనుండి బయటపడిన కపోతి భర్తస్థితికి విచారించి తానును అగ్నిలో దుమికి మరణించి దేవలోకమున కేగెను. కిరాతుడును గాంచి తానును దావానలమున ప్రవేశించి ముక్తినొందెను. ఇది కథ. వ్యాస భారతమునందలి యీ కథను తిక్కన ముప్పదియైదు పద్యగద్యములలో రచించినాడు. అభినవ తిక్కన దానిని సుమారు నూటతొంబది పద్యగద్యములకు పెంచి యొక లఘుకావ్యముగా తీర్చిదిద్దినారు.

కథా సంవిధానములో మార్పులు గావించుట సాహిత్యములో సర్వసామాన్యముగా జరుగు విషయము. భారతమునందలి కథకు, ఆత్మార్పణములోని కథకు

స్వల్పమైన భేదములు కొన్ని గలవు. భారతములో కథా స్థలము చెప్పబడలేదు. రాష్ట్రగానకర్త తుమ్మల కథాస్థల మాంధ్రదేశమని స్పష్టము గావించినాడు. 'అతఁడొక వేకువ గృష్ణాతట కాంతారములకు జని యెను' అని కృష్ణానదీప్రాంతమన్నాడు. కపోతము కపోతి కొఱకు విలపించు సందర్భమునను 'సకియా! మాపటి వేళ నిన్నలసి కృష్ణావీచికాశీకరప్రకరాసేచిత నవ్య దివ్యసికతాభాగంబునన్ జేరి...' యని కృష్ణానదీ ప్రాంతమునే సూచించుట జరిగినది.

తిక్కన భారతములో బోయడు శీతబాధను తొలగించుమని కపోతమును కోరినపుడు కపోతము చిదుగుపుల్లలనేరి నిప్పుతెచ్చి మంటచేసి చలిబాధ తీర్చి నట్లున్నది. తుమ్మలవారు అరణ్యమంతయు జల మయమైనపు డెండుచిదుగు లెక్కడ లభించునని భావించి యొక కల్పన గావించిరి. 'ఎండుపుల్లలకు నల్లాడు నా వెఱ్ఱి నేమనవచ్చు—నార్తరక్షణంబున కంటె నిక్కులాయఁబు నా కెక్కుడే—వలయునే నిట్టి గూడులఁ బెక్కింటి నొక్కదినంబునన నిర్మింపనేర్తు నని తలంచి' గూడును కూల్చినదని వ్రాయుట జరిగి నది. ఆర్తత్రాణపరాయణత్వమున కతిశయమును గల్పింపదలచి తుమ్మలవారు గావించినట్టి యీ మార్పు పాఠకుని హృదయము నార్ద్ర మొనర్చుటకు సహాయపడును.

తుమ్మలవారు కర్షక కుటుంబమున నుద్భ వించినవారు. మడికొక పూటగా, బడికొక పూటగా జీవనమును సాగించినవారు. కర్షకు లెంతటి యతిథి సేవా పరాయణత్వము గలవారో యెఱిగినవారు. కాబట్టి సందర్భము లభింపగనే కర్షకస్తుతి గావించుటలో నాశ్చర్యములేదు. చలిబాధ తొలగిన పిదప కిరాతుడు కపోతము నాహారమును యాచించినాడు. భారతములో పక్షు లెప్పటికప్పుడు ఆహారమును వెతకుకొనటయే గాని నిలువ యుంచుకొనవుగదాయని చెప్పుట గలదు. ఆ సందర్భములో ఆత్మార్పణములో కవిశ్రీ

'ఎండకు వానకు జంకక
పండించిన ధాన్యమెల్లఁ బాతఱ లందున్
నిండించి తినుచుఁ బెట్టుచు
నుండెడి కర్షకుఁడు ధన్యుఁ డూహింపంగన్'

అని కపోతముద్వారా కర్షకస్తుతి గావించినారు.

అగ్ని కాహుతి గాదలచిన కపోతము వలలోనున్న కపోతి కీ విషయము నెఱిగించినట్లు తిక్కన భారత ములో లేదు. కాని తుమ్మల కపోతముచేత అర్ధాంగి యైన కపోతి కీ విషయమును చెప్పించినారు. శరణాగత రక్షణమునుగూర్చి తనకు బోధించిన తన ప్రేయసికి కపోతము తెలుపకుండుట న్యాయము కాదుగదా!

కవిగారీ గ్రంథము రచించునాటికి వారికి భార్యా వియోగము సంభవించినది.. ఈ గ్రంథముగూడ సతీ స్మృతికే అంకితము గావింపబడినది. సతీ వియోగ మును స్వయముగ ననుభవించిన వ్యక్తి గావుననే కపోత విలాపమంత రమణీయముగా సాగినది. భావ కవితా ధోరణిలో సాగినదన్నను దోసగులేదు. కలిమి లేములలో భాగము పంచుకొనుచు, మంచిచెడ్డలలో పాలు పంచుకొనుచు ప్రియుని హృదయము నలరింప జేయునట్టి యర్ధాంగి దూరమైనచో జీవించుట సాధ్యముకాదని కపోతము విచారించినది. గత కాలపు విలాసవిహారములను జ్ఞప్తికి తెచ్చుకున్నది. ప్రేయసిని మఱువలేననుచు కపోతము ప్రియురాలి గుణగణములను

'నీ మందస్మిత సుందరాస్యతలమున్
నీ నిగ్గులన్ జగ్గులన్
నీ మైమఱపు నీ కనుంగవ పసన్
నీ నెన్నడల్ సొంపులన్
నీ మర్యాదల నీ మృదూక్తులను
నీ నెయ్యంబు నీ తియ్యమున్
భామా! నేనెటు విస్మరింతుఁ జెపుమా!
ప్రాణంబుతో నుండగన్'

అని తలచుకొని తలచుకొని కపోతము దుఃఖించినది. నిజముగా ఈ దుఃఖము కపోతపు దుఃఖముతో తాదా త్మ్యముపొందిన కవి దుఃఖము. 'మండీమండని మొండి కేసితి వధర్మంబాని ప్రాణేశ్వరీ!'యని అంకిత పద్య ములలో పొందిన యావేశ మిక్కడను గోచరించు చున్నది. కపోతి విలాపముగూడ వియోగమునకు సంబం ధించినదే. ఈ సందర్భములో భావకవిత్వపు పోకడలు గూడ కన్పించుచున్నవి. కపోతి దుఃఖించి దుఃఖించి మరణముగూడ మనలను వేఱుచేయలేదని భావించి

'రమ్యకుసుమంబవీవు సౌరభమ నేను
నిండునెలవీవు పండువెన్నెలను నేను

పదమువీవు తదర్థసంపదను నేను
కలదె యన్యోన్య విప్రయోగంబు మనకు' అని

భర్త ననుసరించినది. ఈ సందర్భములో కవి తమ దా౹ జ్ఞప్తి తెచ్చుకొని యుండుటగూడ సంభవమే.

తుమ్మలవారి కవితాగుణములలో జీవిత సత్యముల నరటిపండొలిచి చేతబెట్టినట్లు సూటిగా, తేటగా చెప్పగలుగుట యొకటి. తెలుగుజాతి గసనలె యాకులుగా నిలువదగిన నీతిపద్యములు తుమ్మలవారి కవితలో విఱుగబండినవి. ప్రపంచమును సృష్టించి, రక్షించి, భక్షించుట భగవంతునకు విలాసమని వర్ణించిన పద్యమును వినుడు.

'జీవులను సృష్టిగావించు శిల్పి యెవఁడొ
ప్రాణులను గూర్మిఁ గాపాడు భర్త యెవఁడొ
వాఁడ వెండియుఁ గూల్చు విశ్వంబులెల్ల
నతని కిది నిత్యలీలావిహారసరణి'

కపోతి ఆర్తత్రాణ పరాయణత్వము మానవ ధర్మమని, జాతిమతకులగుణాదుల నరయక పాషండునిలోగూడ పరమేశ్వర తేజమున్నదని భావించి పూజింప వలయునని బోధించు సమయమున దీనులను ప్రోవని వాని జన్మము వ్యర్థమని

'దీనుల మొఱ లాలింపని
వాని బలంబును ధనంబు వంశంబు వి
జ్ఞానంబు జీవితంబు ద
యానిధి! వ్యర్థములగుఁగదా పరికింపన్' అని

చెప్పిన పద్యములవంటి పద్యములు పెక్కుఱకు కంఠస్థములైన పద్యములు.

హింసాకార్యముపై 'జనంబులకు నేవగింపు వొడము'టకు వ్రాయబడిన కావ్యమిది. కపోతము త్యాగము 'అక్కటికములేని కలుషాత్ము'ని యాత్మను పవిత్ర మొనర్పగలిగినది. సహృదయుల హృదయములలో మార్పు పొడసూపుటలో నాశ్చర్యమేమున్నది? ప్రాణులను హింసించుట, జంటలను విడదీయుట జీవితలక్ష్యమైన దుష్టకిరాతుడు

'లోక మీ కరణిం బ్రాణి లోకమునకు
మేలు గావించుచుండు గాబోలు సతము
పుట్టువుండొట్టి యుపకృతి పొంతఁబోని
కట్టిఁడిని నాకెట్టి ..గతులు గలవొ'

యని నిశ్చయముగా పశ్చాత్తాపపడినాడు. పశ్చాత్తాపము సకలపాపములను ప్రక్షాళనము గావించును. 'నాకెట్టి గతులు గలవొ'యని విషాదు డనుకొన్నను విషాదరహితమైన మోక్షమునే పొందుట జరిగినది.

ఈ గ్రంథమును పఠించిన పాఠకుడుగూడ నట్టి హృదయపరివర్తనమును పొందవలెనని కవి యాకాంక్ష. ఆ పరివర్తనమున కుపబలకము అగుననియే మార్పులు చేర్పులు చేయుట జరిగినది. గ్రంథమును పెంచుట జరిగినది. చివరకు బోయనిచేతనే

'మంజులముగఁ బెక్కుధర్మములు వల్కి
చేతలం దొకడే ననుష్ఠింపలేని
వదరుబోతుల కిక సిగ్గువచ్చుఁగాత
మేతదల్ప కపోత విఖ్యాత చరిత'యని కుండ

బ్రద్దలుకొట్టినట్లు మొగమోటము లేకుండ పలికించినాడు. ఈ కథ చదివిన మానవులు నిజజీవితములో మారినను మారకపోయినను తను చేష్టలకు తాము మనస్సులోనైన సిగ్గుపడక తప్పదు.

పురాణములు సత్యములేగాని వాస్తవములుగావు. పురాణరచయితనీతులను, ధర్మములను బోధించుటకు కథలను కల్పించెనేగాని యవి యేనాడును, స్వేప్రాంతమునను జరిగినవికావు. వారు బోధించిన ధర్మములీ వర్తమానకాలమున నాచరణలో పెట్టుటకు సాధ్యమగునవిగూడకాదని యధునాతన నాగరకులు నొక్కి వక్కాణింతురు. ఇట్టి వాదములను వోరార గావించు వారికి వాకట్టు సీతారామమూర్తిగారి ధర్మజ్యోతి.

ధర్మజ్యోతికథ ఎప్పుడో, ఎక్కడో జరిగినది కాదు. ఏయక్షుడో, గంధర్వుడో సాధించిన ఘనవిజయముకాదు. ఆశాపాశమునకు లోనుగాని ఆదర్శయువకుని కథ. మిత్రధర్మమును నెరవేర్చి లోకమున ధర్మజ్యోతి వెలిగించిన పేదరైతు కథ. ఆ ఉత్తమ మానవుడు మఱెవరో కాదు. రచయితయైన మూర్తిగారిని కన్నతండ్రి నారయ్యయే.

ధనదవోలులో మట్టిపని చేయుచున్న కార్మికులకు నూఱు బంగారపు టచ్చులు కన్పించినవి.

అమ్ముటకు వచ్చిన యొడ్డెల నూరి వ్యాపారులు మోసపుచ్చి యాపసిడిని సంగ్రహించిరి. సంగతి తెలిసి ప్రభుత్వ సైనికులు తెక్కలు గట్టుకొని వ్రాలిరి. మూడచ్చులను గలిగిన యొక వ్యాపారి తన చెంతకు వచ్చిన మిత్రుని ప్రార్థించి ఆ బంగారమును వాని కిచ్చి పంపెను. ప్రభుత్వాధికారుల యొద్దడి తగ్గినది· వ్యాపారి మిత్రుని చెంతకేగి బంగారము నిమ్మని యర్థించినాడు. మిత్రుడు ఆ బంగారమును తన యొద్దగూడ నుంచుకొనక రహస్య స్థలమున దాచి యుంచినాడు. ఆ రహస్య ప్రదేశమునకు గొంపోయి వాని సొమ్మును వానికి ముద్దరసుద్దిగా నొప్పగించి నాడు. ఆ బేహారి యా బంగారమును తరువాత తన మఱియొక మిత్రుని యింట కొంతకాలము, నల్లుని యింట కొంతకాలము దాచియుంచెను. మొదటి మిత్రుడు తక్క తక్కిన వారందఱు నీతని మోస గించుటకు ప్రయత్నించిన వారే.

ఈ కథలో కథానాయకుడైన నారయ్య సత్య సంధత ప్రధానము. న్యాయమునకు భూగర్భమున లభిం చిన ధనము ప్రభుత్వమునకు చెందవలయును. నారయ్యకీ సంగతి తెలియదని యనుకొనుటకు వీలులేదు. ఒడ్డె వారిని వ్యాపారులు మోసగించిన సంగతి యానోట నానోట బడుటవలన తాను విని యే యుండును. అయినను తాను తన మిత్రునకు సాయమొనర్చినాడు. ఆ వ్యాపారి కా బంగారము వచ్చిన విధానముతో నాతనికి పనిలేదు. మిత్రుడు తన కొసగిన యచ్చుల నతని కిచ్చుటయే వాని లక్ష్యము. అదియే వాని ధర్మము. ఆ బంగారము నవకాశమున్నను, తాను బీదతనములో నున్నను తస్కరింపవలెనను భావమునే మనస్సున ప్రవేశింపనీయని ధర్మవీరు డతడు.

ఇంత ధర్మపరిరక్షణ యొనర్చిన మిత్రునిగని, యాతని యాత్మపావిత్ర్యంబు నరసి వ్యాపారి వేనోళ్ల బొగడినాడు. భూభారమును నీవంటి సత్పురుషులే గాని మఱెవ్వరు మోయుటలేదని చమత్కరించినాడు. శాస్త్రప్రకారము భూమి యెవ్వరిచేత మోయబడుట లేదు. అది విషయాంతరము.

'శ్రుతులును బ్రహ్మవేత్తలును
సూనృతవాదులు గోవులున్ బతి
వ్రతలు నలుబ్బురై నెగడు
వార లుదార వదాన్యతా కథా
రతులనకాక యిమ్మహి భరమ్మున
కెవ్వరు చాలువారు ప
ర్వతములు నేస్గులున్ ఫణియుఁ
బందియు మోయుట నమ్మ నయ్యెదన్'

కులపర్వతములు, అష్టదిగ్గజములు, ఆది శేషుడు, వరాహావతారమున విష్ణువు పుడమి భార మును మోయువారని పురాణములు. కాని సత్పురు షులే భూభారమును భరించువారని వ్యాపారి వాక్కు.

ధర్మకార్యమును దైవకార్యముగా భావించి గావించిన నారయ్య ఈ పొగడ్తలకు సిగ్గుపడి నీ సొమ్ము నీ కిచ్చుటగూడ గొప్పయాయని దానినొక సర్వ సామాన్య కార్యముగా భావించినాడు.

'శిబివలె మేని కండలను
జీల్చితి నెట్లు మరున్నదీకుమా
రుబలె నఖండ రాజ్యరమ
రోసితి నొక్కొ దధీచివొలొని య
ట్ల బెదరులేక వెన్నెముక
లాగితినోటు త్రిశంకు సూతి భం
గిఁ బలుకరాని కష్టములఁ
గీడ్పడి స్రుక్కితినేమి సెప్పమా ?'

యని మహామహుల మహత్కార్యములను స్మరించి తన తక్కువ దనమును చాటిచెప్పిన మహాత్ముడు నారయ.

ఇనుపగజ్జెల దొరసాని కింపునింపు స్థితిలో నున్న నారయ్యకు పేదల కష్టసుఖములు తెలియును. వారి 'సాధక బాధకములు' అనుభవములో నున్నవే. అతనికి పేదల రక్తమును నీతి, పాపభీతిలేక పీల్చు చున్న ధనవంతులన్న నసహ్యము. చెమటలో నోరంత ప్రొద్దులు కష్టించువానికి కమికెడన్నము లభింపక పోవుటకు, ఎండ కన్నెఱుగని శుంఠలు షడ్రసోపేత ముగ భుజించుటకు కారణము ధర్మము నశించుటయే నని యాతని విశ్వాసము.

'యెవని యెముక లీ మేడల కిటికలయ్యె
నెవని రక్తమ్ముచే గోడలిట్లు బిగిసె

నతనికా యిట్టి పరమ హేయంపు బ్రదుకు
వానికా యిట్టి దుర్మరణానుభూతి'

యని పేదల కష్టనష్టములను తలచుకొని యెంతో బాధ నొందినాడు. ఈ అణగారిన ఆర్తులందఱు నేదో యొకనాడు విజృంభింపక మానరని దూర దృష్టితో యోజించినాడు. అందుకే

'బ్రొబలిసి నేడు విఱ్ఱవీగుచు మున్న
సాహుకార్లయాట సాగ దిల్లే
రుద్రమూర్తియై దరిద్రుండు చిచ్చఱ
కన్నువిప్పి గజ్జెగట్టు నెపుడొ'

యని వ్యాపారితో స్పష్టముగా చెప్పుట జరిగినది. ఒడ్డెవారిని ఈ బేహారి చేసిన మోసమును దృష్టిలో నుంచుకొని నారయ యిట్లు గద్దించుట జరిగినదేమో!

నారయ్యలో పరులసొమ్మున కాసపడని సద్గుణము మాత్రమే యున్నది. పేదల కష్టనష్టములు తెలిసికొను శక్తిమాత్రమే యున్నది. సమసమాజమును కలగనునట్టి యూహలు, మతముల లోని లోతుపాతులు తెలియవచ్చును. తెలియక పోవచ్చును. కాని నారయ్యకుమారుడు సీతారామమూర్తి గారికి తెలియును. అందుచే ధనిక స్వాముల దౌర్జన్యాలు పేదల దీనహీనస్థితి వర్ణింపబడుట జరిగినది.

'కోవెలలో గంగానది
రేవులలో రామకోటిరేఖలలో లే
డే వాని బుద్ధి కరుణకు
నావాలం బతని యంద హరివసియించున్'

అని నారయ సర్వమత సారమును క్రోడీకరించుట గూడ సంభవించినది. నారయముఖమున వెల్వడిన ఉత్తమభావములివి. భావుకులు సీతారామమూర్తి గారివే నని మనముమఱువరాదు.

తుమ్మలవారి ధర్మజ్యోతి కావ్యములో ఊహా చమత్కారముల కుబ్బిపోవుటకంటె, రసవద్వర్ణనలలో మునిగి తేలిపోవుటకంటె అసామాన్యమైన శీలసంపద గలిగిన నాయకుని కథావిధానము విని హర్షాశ్రువులు జార్చుటయే యధికము. అయినను—

'ఆలితో బిడ్డలతో నాఱుగాలంబు
మట్టితట్టలు మోసి మనుడంచు బ్రహ్మ
మన మొగమ్మున మూఁడుమార్లు

నని ఒడ్డెవారు తమకు లభించినది యిత్తడియని వ్యాపారులు పలికినపుడు నిలువున నీరై దీనముగా పలుకు సమయమున జాలికలిగి తీరును.

'పోయినదా నా బంగరు
పోయినదా నన్నుమఱచి పోయినదా
నాయొడ లింకేటికి సీ'

యని వ్యాపారి మోసగించిన మిత్రునితో నను నప్పుడును కన్నీరు చిప్పిలును. వ్యాపారి యింట కవి గావించిన భోజనము పాకుల జఠరజ్వాల రెచ్చగొట్టి 'మకర సంక్రాంతి' విందులను తలపుకు దెచ్చునట్లున్నది

ధర్మజ్యో గ్రంథము నాసాంతము చదివిన పాఠకుని హృదయమున నెన్నో నీతివాక్యములతోపాటు

'ఏలా వ్రతములు తీర్థము
లేలా జన్మములు చదువు లేలా యోగం
బేలా తపస్సు నరునికి
శీలంబది యింత చెక్కు చెదరక యున్నన్'

యనుపద్యము మాటిమాటికి స్మృతికి వచ్చుచుండును.

ప్రస్తుత కాలములో నైతికమైన విలువలు నాశనమైనవి. ధర్మములు దిక్కులేనివైనవి. అహింస ఆదరమును కోల్పోయినది. శీలము చితికిపోయినది. సద్గుణముకు స్థానము మృగ్యమైనది. ఇటువంటి యుగములో నుద్భవించి భారతజాతిని సర్వసద్గుణ సంపూర్ణగా తీర్చిదిద్దవలయునని కృషిసల్పిన మానవోత్తముడు మహాత్మాగాంధీ. తుమ్మలవారు మహాత్ముని యాస్థానకవి. మహాత్మ కథ నక్షరబద్ధము గావించి యాంధ్ర సరస్వతి నర్చించి ధన్యుడైన కవీంద్రు డీతడు. మహాత్ముని కథను మహాకావ్యముగా తీర్చిదిద్దుటయేగాక మహాత్ముని యడుగు జాడలలో నడిచి సర్వోదయమునకు కృషిసల్పు మాన్యమూర్తులను గూర్చిగూడ తుమ్మలవారు కవిత్వమును వ్రాసిరి. వారిలో బాపూజీ మరణమునకు క్రుంగి కూలారు

చున్న భారత ప్రజల కాశాజ్యోతిగ నిల్చిన వినోబా ముఖ్యుడు. విప్లవ పథమునగాక విశ్వశాంతి మార్గమున చరించునట్టి భావేమహర్షి భారతభూమిలో పేదలను సంరక్షించుటకొఱకు భూదానయజ్ఞము నారంభించినాడు. తుమ్మలవారు భావేమహర్షిని గూర్చి వ్రాసిన లఘుకావ్యము సర్వోదయగానము. వినోబా, వినోబా యనుయాయులు పుడమికొఱకు యాచించుటయే యిందఱి ప్రధాన వృత్తము.

వినోబా భూదానమునకు సంబంధించిన ఖండికలనేకము లీ గ్రంథమున గలవు. భూదాన యజ్ఞమునకు ప్రారంభోత్సవ మాంధ్రదేశముననే జరుగుట యాంధ్రులకు గర్వకారణము. గుడిసెలలో మూలుగు రోగులను గుస్తరించి, కుండనిండని నూకలకూటి నరసి వినోబా బాధతో పోచంపల్లి గ్రామములో సభ గావించి యాచింపగనే యొక మోతుబరిరైతు నూఱెకరములను దానమిచ్చెను. ఈ సంఘటనకు పొంగిపోయిన కవీంద్రుడు

'వెదిరి వంశజుఁడీ దానవీరుఁ డాది
కారణమ్ముగ భూదాన గంగ పుట్టె
వెల్లియిది పొంగి మిట్టలు పల్లములును
జదును పదునయి శాంతి సస్యము ఫలించు'

నని భావించినాడు. ఈ భూదానమునకు సంబంధించిన పవిత్ర సన్నివేశములిం దనేకములు గలవు. ఒక పర్యాయము సూర్యాపేటలో భూదానము గావింపుమని వినోబా యాచించెను. అవిభక్త కుటుంబములోని యొక సోదరుడు తనకు రావలసిన భాగములో సగభాగమును భూదానమున కొసగెను. ఈ విషయ మన్నకు తెలిసి వినోబాచెంతకు వచ్చినాడు. తమ్ముని దూషించుటకు కా దతడు వచ్చినది. ఇచ్చినదానమును తిరిగి గ్రహించుటకు కాదు. ఉన్న మొత్తము భూమిలో సగమీయక తన భూమిలోని సగమే యిచ్చినందుకు బాధపడి తక్కినసగము నిచ్చుటకు. మఱియొక పేదరాలు తనకున్న రెండెకరాలలో నొక యెకరమునిచ్చి భూదానముతో పాటొక గోవునిచ్చి గోదానముగూడ గావించినది. ఇట్లు వినోబా భూదానయజ్ఞ సందర్భమున యావద్భారతమున నెందఱో వ్యక్తులు భూదానమును సల్పిరి. పగతెగుట, ఆఱవకొడుకు, రాష్ట్రపతి దీవన, మంచి మేల్కొన్నది, నా కొడుకులు సోమరులు కారాదు, అత దంధుడుకాడు, అల్పదాన మెట్లిచ్చెదను ? చావునకు భయపడను, ఇచ్చినది ముట్టను, గ్రామ గౌరవరక్ష, స్త్రీజాతి యిక నిద్రపోదు, పంపకము, హృదయ పరివర్తనము, ఎవరింటికి ?, అవ్యక్తమే గొప్పది, కీర్తి కాంక్షలేదు, గ్రామదానము అను ఖండికలలో నొక్కొక్కదానిలో నొక్కొక్క భూదాన సంబంధమైన పవిత్ర సన్నివేశములు వర్ణింపబడినవి.

ఈ సన్నివేశములేగాక ఇందులో భావే చక్కట్లని భావేచెప్పిన నీతు లనేకములు కలవు. పవిత్ర సన్నివేశములుగాని, చక్కట్లుగాని వినోబాకు సంబంధించినవే గనుక కావ్యమునందలి యేకసూత్రత చెడదు. ప్రేమనుగూర్చి యుపన్యసించుచు దురాశలవలన, స్వర్థలవలన, కలహములవలన ప్రేమ నశించిపోవుచున్నదని వివరించి

'ప్రేమగలచోట నీరస పెరుఁగఁబోదు
ప్రేమగలచోటఁ గత్తి కన్పింపఁబోదు
ప్రేమగలచోట నాఁకటి పీడలేదు
ప్రేమగలచోటఁ బ్రాణికే భీతిలేదు'

అని ప్రేమ మాహాత్మ్యమును స్పష్టీకరించుట జరిగినది. ప్రేమవలన తప్ప ప్రపంచమును చట్టము ద్వారా మార్చలేమని వినోబా విశ్వాసము. బుద్ధుడు బోధించిన కరుణ కగ్రస్థాన మీయకుండ శక్తి కగ్రపీఠ మిచ్చువారిని

'బుద్ధిమంతు లెల్లఁబూని పట్టాభి షే
కము నొనర్పనలయుఁ గరుణ కిపుడు'

అని హెచ్చరించినారు.

అవసర సమయములలో ప్రజాహృదయములను మార్చుటకు శాసనములకంటె కవనములే యుపయోగపడును. సంఘముపై ప్రభావమును జూపగల కవీంద్రులు ధర్మవర్తనులు గాకపోయినచో వినాశనము పుట్టగలదు. అందుచే భావేమహర్షి కవుల నుద్దే

శించి కొన్ని నీతివాక్యములను బోధించెను. సంఘమునకు పుష్టి, సంతుష్టి నొదవించు పలుకులనే కవితలో వాడవలయుననియు; నియమబద్ధము, మధురము, నిపుణమునైన మాటలతో సాహితీ సృష్టి సలుపవలయుననియు, రాగరోషాది దుర్వికారములులేని కవులకే చక్కని వచస్సు చేకూరుననియు వినోబా యుద్దేశము. ఏదో యొక తత్త్వమును నమ్మి గీతి గీచుకొన్నట్లుండు కవిత్వము చిరకాలము నిల్వదని, ప్రపంచ శ్రేయమును కాంక్షించు విప్లవమును బోధించు కృతియే రాణింపుకు రాగలదనిగూడ వీరి యభిప్రాయము.

తెనుగులెంక తుమ్మల రచించిన లఘు కావ్యములలో ప్రజలను ధర్మమార్గమున చరింపుడని బోధించుట విస్పష్టముగా దర్శింపగలము. ప్రస్తుత సమయములో ప్రపంచమునకు నీతులను చెప్పుటయే గాక తామాచరించి చూపునట్టి కవీంద్రు లవసరము. తుమ్మలవారట్టివారు. వారు రచించిన ఆత్మార్పణము, ధర్మజ్యోతి, సర్వోదయ గానములు లఘు కావ్యములే యైనను గురుతరమైన లక్ష్యముతో రచింపబడినవి. అందుచేతనే ఆ గ్రంథము లాంధ్రులకు శిరోధార్యములు కాదగినవి.

'బరువుఁజూచి కృతికిఁ బరువు నీకుఁడు, చిన్న
రచనయైన నేమి? రాముఁడందుఁ
గానిపించెనేని మానవుసది తీర్చి
దిద్దునేని దాని కుద్దిలేదు.



# సువర్ణ మంత్రపుష్పం

## డా. ముదిగొండ శివప్రసాద్

ఈదేశం నాదనటం ఎప్పటిదో పాతమాట
ఈ దేశం నేననటం ఇది నవకవితా సూక్తం.
నా లోపలి సిరాధమనులల్లో పారే రక్తం
గంగా సింధూ యమునలు కావేరీ కృష్ణమ్మలు
హిమమకుటం ఉష్ణీశం, కాశ్మీరం నా కుంకుమ
వింధ్యావళి నా హృదయం సింధువులో నా ఉదయం.

వాఘీరా తీరంలో మోగిగిన త్రిశరణ ధ్వని
స్వచ్ఛమహావీరసత్వ లిచ్ఛవీ సువంశధార
శబరిమలై అయ్యప్పల శరణ చరణ సంగీతం
కలకతా కాళి కాలిగజ్జెల పర్జన్య గర్జ.

బృందావన బృందమంద సుందర వంశీ స్రవంతి
అమృత సరోవరమున విన్పడిన సువర్ణస్వరాళి
యజ్ఞారుణసంధ్యలలో ఉదయదయానందగీతి
నా యెదలో సుప్తసప్త నాదాలివి— వేదాలివి.

ఈ వెలుగులు నావనటం, ఎప్పటిదో పాతపాట
ఈ వెలుగులు నేననటం ఇది నవయుగ సంకేతం
దీపంలో శలభమట్లు దూకు సాహసంకన్నా
దీపంగా నేనెమారి దీపించుట మిన్నకదా!
నా రక్తపు తైలంలో నా ఎముకల వత్తులతో
నిలువుననే మండివెలిగి ఇలకిస్తా సందేశం

లాగములివి దేహములో అమరిన వెన్నైనా
ఆత్మ ఒక్కటే జీవిక కంతరంగ సూత్రం

వేషం భాషా ప్రాంతం మతం మఠం వేరైనా
ఒకేదేశ మొకేఆత్మ ఒకే ఒక్క జెండా—
వేయిస్తంభముల గుడిలో వేంచేసిన స్వయంభువుకు
కాశ్మీరపు కస్తూరీ, కేరళ చందనము, వచ్చె.

గంగా సంగమ మందున గీతికలవి తిరుక్కురళ్
కావేరీ సైకతమున గానం తులసీదాసుది
సహ్యాద్రికి పైన వృషభ సంకేతం బసవని దది
నాగభూమిలో వివేకనాదం శ్రీ నరేంద్రునిది—

దేవతలను మనిషికొల్చు తత్వమ్మది పాతమాట
మనిషికొరకు యెదమలచిన మందిర మిది కొత్తబాట.
ఈ సహస్రశీర్ష దేవుడితడే మన భారతీయు
డజ్ఞుడు ప్రాజ్ఞుడు మహర్షి ధనవంతుడు నిర్ధనుడూ
ఇతడే సాకారముగా ఇలపైనడిచే దైవం
ఇది సువర్ణమంత్ర పుష్ప మాతని దివ్యార్చనకై
ఈ భారత మందిరమున ఇదిగో కల్యాణవీణ
ఈ నవసుమసమారాధనమునకు జయఘంటిక లివి.

ఈ దేశం నాదనటం ఎప్పటిదో పాతమాట
ఈ దేశం నేననటం ఇది నవకవితాసూక్తం.



# పండితరాయల సిఫార్సులు

డా. మహీధర నళినీమోహన్

డబ్బున్నవాడు దరిద్రుడైన యాచకులకి దానం చేస్తూ ఉండడం న్యాయమూ, ధర్మమూనూ అనే విషయం పండితరాయల మనస్సులో గాఢంగా నాటుకు పోయినట్లు కనిపిస్తుంది. దానంచేసినవాడిని ఆకాశానికి ఎత్తెయ్యడమూ, ఇవ్వనివాడిని చివాట్లు పెట్టడమూ భామినీ విలాసంలో తరుచు కనిపించే ఘట్టాలు. ఆ తిట్లలో ఆ దీవెనలలో బహువిధాలు, రకరకాల చమత్కారాలూనూ. యాచకుని దీనత్వాన్ని వర్ణించి, అతడికి సాయం చేయవలసిందని ధనవంతుడైన దాతకి పండితరాయలు చేసే సిఫార్సులు అన్యాపదేశ ప్రక్రియలో మనస్సుని కదలించేసేటట్లు బహు సుందరంగా ఉంటాయి. దాత మేఘం కావచ్చు. చంద్రుడు కావచ్చు. ఏనుగుకావచ్చు. మామిడిచెట్టు కావచ్చు, సరస్సు కావచ్చు. మరి ఏదేనాకావచ్చు. యాచకులు చాతకాలూ, చకోరాలూ, చక్రవాకాలూ, కలువలు, తుమ్మెదలు, కోకిలలు, చేపలు వగైరాలు ఏవైనా అయిఉండవచ్చు.

**మేఘం — చాతకం**

చాతకం అనేపక్షి నిజంగా ఉన్నదోలేదో సందేహమే నా మటుక్కి. మేఘం వర్షిస్తున్న జలబిందువులని భూమిమీద పడకపూర్వమే మార్గమధ్యంలోనే నోరుజాపి అందుకుని తాగుతుందిట చాతకం. దప్పిక చేత నోరు ఎండిపోతున్నా సరే, ప్రాణం కడంటినా సరే భూమిమీదపడిన నీటిని తాగదని కవి సమయం. ఉన్నతుడైన మేఘుణ్ణి తప్ప నీచులని ప్రాణంపోతున్నా సరే వేడని పరువుగల యాచకుడుగా చాతకపక్షి స్తుతిప్తితమైంది భామినీ విలాసంలో. ఆ చాతకానికి జీవనదానం చేయవలసిందని మేఘునికిచేసే సిఫార్సులు కొన్ని చూద్దాం మచ్చుకి.

ఓ పయోదమా! ఈ చాతకం మిగిలిన అన్ని పక్షులవంటిదీ కాదుసుమా! దీని గుణాలు అనన్య సాధారణాలు. అడ్డమైనవాడినీ దేవిరించదు. నిన్ను తప్ప మరొకరిని శరణుకోరాలనే ఆలోచనకూడా దాని మనస్సులో ప్రవేశించదు. గౌరవచ్యుతి సహించదు. తన దుర్దశను సూచనమాత్రంగాకూడా తెలియజెప్పదు. ఇటువంటి ఉదాత్తగుణసంపన్నమైన చాతకపక్షి కేవలం నిన్నే ఆశ్రయించింది. దానినో కంట కని పెట్టి ఉండుసుమా!

ప్రసీదతు పయోద!
తే హృదయ మాశ్రితే చాతకే
యదన్యత ఇమే గుణాః
పున రనన్య సాధారణాః
న నీచజనయాచనం
న శరణాంతరాలోచనమ్
న గౌరవవిమోచనం
న నిజ దుర్దశాసూచనమ్.

**ఉత్పలమాల**

ధీరగుణోన్నతిన్ విడదు,
దేహి యటంచును నీచయాచనా
ధోరణి చూపబోదు,
నిజదుర్దశ సూచననైన సేయబో
దేరికి, గౌరవచ్యుతి
సహింపదు—నీదరిజేరు నీ యసా
ధారణ చాతకంబును సదా
దయజూడగదే పయోదమా!

ఓ ఘనుడా! అదేపనిగా ఉరుముతావే కాని, ఒక్కచుక్క నీరు విదలించవుకదా! అవతల చాతకపక్షి

దాహంతో విలవిల్లాడి పోతోంది. ఈ లోగా పడమటి గాలి తిరిగిందంటే నువ్వు ఏమైపోతావో! ఈ చాతకం ఎక్కడ ఉంటుందో ! వర్షం ఎక్కడపడుతుందో !

పడమటిగాలికి మేఘాలు విచ్చిపోతాయి. చాతకం చచ్చిపోవచ్చు. కలవారు గాదెలు తీసేసరికి పేదవారికి ప్రాణాలు కడంటవచ్చు.

**చతుష్పద**

గర్జసి నో ఘన! మంచసి తోయమ్
చాతకపక్షీవ్యాకులితో౽యమ్
దైవవశాద్యది పశ్చిమవాతః
కస్త్వం? క్వాయం? క్వచ జలపాతః?

**తేటగీతి**

ఉరుముటే గాని మేఘుడా! కురియకుంటె
చావనున్నది నోరెండి చాతకమ్ము
హరి హరీ! పడమటిగాలి తిరిగెనేని
చాతకంబేడ ? నీవేడ ? జల్లులేడ ?

ఓ ఘనుడా ! నీ నిరంతరవారిధారలచేత ధరాతలం అంతా పూరింప బడుతోంది. ఒక చిన్నారి పిట్ట తాలూకు చిరుముక్కును నింపడం నీకు ఏమంత కష్టం చెప్పు.

**అనుష్టుప్**

ధారాధర ! ధరావారి
ధారాభిరభిపూరితా
ఖగ(త్రోటీ పుట(ద్రోణీ
పూరణే కింను తే (శ్రమః ?

**ఆటవెలది**

ధారుణీతలమ్ము వారిధారలచేత
నింపి వేసినావు నీరదుండ !
చిరుత ముక్కునిండ చిన్నారి పిట్టకు
నీరమొసగ నీకు భారమగునె ?

ఓ మేఘుడా ! నిప్పులు చెరిగే వేసంగి యెండలకు మాడి ఒరుగైపోయిన ఈ చాతకపక్షి నిన్నే స్మరిస్తూ ఎల్లాగో ప్రాణాలు నిలువబెట్టుకుని ఎండాకాలం గడిపింది. అంతలో దైవవశాత్తూ నువ్వు ఆకాశంలో కనిపించేసరికి ఉప్పొంగిపోయింది. నిన్నే నమ్ముకుని కళ్లల్లో ప్రాణాలు పెట్టుకునిఉన్న ఈ పిచ్చి పిట్టమీద వడగళ్లవాన కురిపిస్తున్నావా? అయ్యయ్యో! అది ఇంకెవరి దగ్గరకువెళ్లి తనగోడు చెప్పుకుంటుందయ్యా !

**శార్దూల విక్రీడితం**

(గీష్మే భీష్మతరైః కరై-
ర్దినకృతా దగ్ధో౽పి య శ్చాతకః
త్వాం ధ్యాయన్ ఘన !
వాసరాన్ కథమపి (ద్రాఘీయసో నీతవాన్
దైవా ల్లోచన గోచరేణ భవతా
తస్మిన్నిదానీం యది
స్వే చక్రే కరకాని పాతనకృపా
తత్కిం (పతి (బ్రూమహే ?

**చంపకమాల**

అనల సమాతి దుస్సహ
ఖరాంశు కరంబుల దగ్ధమయ్యు నిన్
మనమున నిల్పి యెట్లులో
దినమ్ముల బుచ్చగ దైవికమ్ముగా
కనులకు గోచరించితివి
కాలపయోధర ! నీవు దానిపై
పెను వడగళ్లవాన కురిపింపగ
చాతక మేరికేమనున్ ?

## చంద్రుడు చక్రవాకపక్షులు

చక్రవాకాలు వెన్నెట్లో కళ్లుగానక దుర్భరమైన విరహవేదనను అనుభవిస్తాయని కవిసమయం.

ఓ చందమామా ! నువ్వు లోకరక్షకుడైన మహేశ్వరుని శిరో(గభాగాన నిత్యమూ నివసిస్తున్నావు. కలువపువ్వులకూ, చకోరములకూ నిరంతరానందాన్ని కలుగజేసే చల్లని పండువెన్నెలలు కురిపిస్తున్నావు. లోకతాపాన్ని హరించడంలో నీకు గల వ్యగ్రత్వం జగత్ప్రసిద్ధం. పాపం, ఈ చక్రవాకాలమీద కూడా నీ

చల్లనిచూపు ప్రసరించవలసిందిగా నిన్ను ప్రార్థిస్తు న్నాను. నామాట కాదనవుకదూ !

**మందాక్రాంతా**

త్వం భోః శంభో ర్నివససి శిరో దేశ
మ్మాశ్రిత్య నిత్యం
త త్త్వాం యాచే జగదుపకృతి
వ్యాపృతివ్యగ్ర మిందో !
యః సద్భావ స్తవ పరిణతః
కైరవే వా చకోరే
దృశ్యస్తేన ప్రతినిశ మసౌ
చక్రవాకో వరాకః

**ఉత్పలమాల**

చల్లని లేతవెల్గు వెదజల్లెదు
లోకులపై — జగత్ర యీ
వల్లభు మస్తకాగ్రమున
వాసమొనర్తు—చకోర సంతతిన్
నల్లని కల్వలందు కరు
ణామృతధారల జాలువార్తు—నీ
చల్లని చూపు జక్కవలపై తము
డాయగ నిమ్ము చంద్రమా !

* *

**చందురుడు —కలువలు**

చంద్రాస్తమయం కావస్తోంది. దిక్కులన్నీ నల్లబడుతున్నాయి. చెరువులోని కలువల మొగాలు వెలవెల బోతున్నాయి. వాటి దైన్యాన్ని చూచేసరికి పండితరాయల గుండె గుబగుబ లాడింది. చంద్రుడి నుద్దేశించి చెప్తున్నాడు.

మేరుపర్వతపు అవతలి సానువులను అలంకరిం చాలని తొందరపడుతున్నావా? చందమామా! నిన్ను ఆపగలిగే శక్తి నాకు కించిత్తుకూడా లేదయ్యా ! గద్గదకంఠంతో నిన్ను ఒక్క విషయమై ప్రార్థి స్తున్నాను. ఈ కలువకన్నెల విషాదాన్ని పోగొట్టడానికి రేపు మళ్లీ దయచేస్తావు కదూ !

**మాలిని**

హిమకర ! పరభాగం
భూషయిష్యన్ సుమేరో
ర్వ్రజసి యది తదాహం
నక్షమః సన్నిరోద్ధుమ్
ఇతితు బహు విధాభిః
కాకుభిః ప్రార్థయే త్వామ్
పునరపి కుముదానా
మేత్య హార్యో విషాదః

**చంపకమాల**

అమృతమయూఖ ! మేరువున
కవ్వలిభాగ మలంకరింప నా
త్రముగ ప్రయాణ మైతివికదా !
నిను నాపగ జాలగాని, యీ
కుముద కులాంగనాజన ని
గూఢ విషాదము మాన్ప రేపు కొం
చెము త్వరితమ్ముగా నిటకు
చేరగరమ్మని మ్రొక్కి వేడదన్.

* * *

**పద్మము — తుమ్మెదలు**

ఓ పద్మమా ! అల్లా దిక్కులు చూస్తా వేమిటి ? తుమ్మెదలకి తేనె దానంచేసే సమయం ఇదే. మరి కాస్త సేపటిలో చంద్రుడు ఉదయించేస్తాడు. వెలవెల బోతున్న నిన్నుచూసి కలువలు వెక్కిరింతగా నవ్వుతాయి. అవి నవ్విపోకమునుపే దానం మొదలు పెట్టు. నీ ప్రియుడైన సూర్యుడు సహస్రకర ములతో నిన్ను లాలిస్తున్నాడు ప్రస్తుతం. ఆ కర పరామర్శ ఆగిపోకమునుపే నీ తేనెతిత్తుల మూతులు విప్పు. ఇప్పుడు నువ్వు తరుణవయస్సులో ఉన్నావు. వద్దన్నా ఆగకుండా నీ హృదయాంతరాంతరాల్లోంచి తేనెవాక పెల్లుబికి వస్తోంది. ఆ వాగు ఎండిపోక మునుపే ఈ తుమ్మెదల ఆర్తితీర్చు.

ఓ ధనికుడా నిన్ను ఆశ్రయించిఉన్న యాచకు లను గమనించావా? ప్రస్తుతం ధనమా నీదగ్గర పుష్క

లంగాఉంది. నీ వ్యాపారమా మూడు పువ్వులు ఆరు కాయలుగా ఉంది. రాజు నీ నెత్తి మొత్తకమునుపే, సాటివాళ్ళు నిన్ను అపహాస్యం చేయకమునుపే, నీ అదృష్టం కర్పూరంలా హరించిపోకమునుపే ఇవ్వడంపే ఇప్పుడే ధనపుసంచి మూత విప్పవయ్యా! అని ధ్వని.

పరిహార్షిణి

యావ త్త్వాం నఖలు హసంతి కైరవిణ్యో
యావ త్త్వాం తరణికరాపరామృశంతి
యావ త్తే మధువిభవో నవోఽస్తి తావ
న్మాధ్వీకం వితర సరోజ! షట్పదేభ్యః.

చంపకమాల

కలువలగుంపు నిన్నని
ఫకాలున నవ్వకయుండుదాక—ఈ
వెలుగులరేడు నిన్ను నులివెచ్చని
చేతుల దువ్వదాక—ని
ర్మలమగు నీ యెడంద మకరందము
చిమ్ముచు నుండుదాక—ఓ
నలినమ! షట్పదంబుల కొనర్పుము
తీయని తేనె విందులన్.

ఓ పద్మినీ! ఈ తుమ్మెదను గురించి నువ్వు ఏమైనా ఆలోచిస్తున్నావా? అవతల మాలతీలతని ఒక్క మొగ్గ అయినా లేకుండా రాలిపోయింది. మల్లెపువ్వు లా కలికంలోకి కూడా కానరావడంలేదు. దానికి తోడు నీ వరసమాస్తేనేమో ఇల్లాఉంది. మరి, పాపం ఈ మధువ్రతం ఎక్కడికిపోతుంది చెప్పు.

అనుష్టుప్

మాలతీ ముకుళాయాతా
కుందా మందాయిత స్తదా
పంకజ! త్వమిదం బ్రూమః
కుత్ర యాతు మధువ్రతః?

చతుష్పద

పోయెను మాలతి మొగ్గల నిగ్గులు
పోయెను మల్లియపువ్వుల నవ్వులు
తోయజమా! నీ ధోరణి యిది మరి
యే యెడ బోవునె యిందిందిరములు?

*

ఏనుగు-తుమ్మెదలు

ఏనుగు శరీరంమీదనుంచి కారే దానజలాన్ని తాగడానికి తుమ్మెద ఒకటి వచ్చింది కూనిదీర్చాలు తీసుకుంటూ. ఏనుగు తన చెవి చేటలను విసిరి తేటిని దగ్గరకు రానివ్వడంలేదు. అది గమనించి పండిత రాయలు తుమ్మెద తరఫున వకాల్తా తీసుకుని ఇల్లా అంటున్నాడు.

చక్కని సువాసనా, కావలసినంత తేనె కలిగిన పద్మము లనబడే స్వంతఇళ్లను కూడా వదిలిపెట్టి ఈ తుమ్మెద నీ దగ్గరకు వచ్చిందయ్యా గజపతీ! ఎందుకూ? నీ దానం జగద్విఖ్యాతమైనది కనుక. అయినవాళ్లనందరినీ వదులుకుని నీదగ్గరకు వచ్చిన తుమ్మెదని కసిరి తరిమివేయడం నీకు ధర్మమేనా? దాని రాకను హాస్యాస్పదం చేయడం సబబేనా?

శార్దూల విక్రీడితం

సాంద్రామోదవతీః స్వకీయ
వసతీః పంకేరుహాణాం తతీ
స్త్యక్త్వాయం భ్రమరః కరీంద్ర!
భవతా మభ్యాశమభ్యాగతః
ఏత చ్చేతసి సంప్రధార్య
జగతీ విఖ్యాత దానై స్త్వథా
యుష్మాభిః క్రియతాం యథోపరమతే
హాస్యాయనాస్యాగమః.

మ తేభ ః

అమితామోదవతిన్ స్వకీయ
వసతి న్నంభోరుహశ్రేణి నీ
భ్రమరేంద్రుండు త్యజించి నిన్ను
గొలువన్ వచ్చెంజుమీ నేడు మ
త్తమతంగోత్తమ! విశ్వవిశ్రుత
భవద్దానాభిలాషన్, తదా
గమనమ్మున్ ప్రహసించి మోము
ముడుగన్ గర్జించి పొమ్మందువా?

మరొకసారి ఒక తుమ్మెద ఒక ఏనుగు గున్నను సవిగాపించింది. ఆ పిల్ల ఏనుగు కేం తెలుసు ఈ తుమ్మెద గొప్పతనం ? ఏదో పురుగు దగ్గరకు వస్తోందని తొండం ఆడించింది. చెవులు విదలించింది. తోక ఝూడించింది. ఆ ఏనుగుపిల్లకి తుమ్మెదయొక్క గొప్పతనం వివరిస్తున్నాడు పండితరాయలు.

ఓ కలభమా ! నీ ఇంటికి వచ్చాడుకదాఅని ఈ అళిసార్వభౌముణ్ణి చులకనగా చూస్తున్నావా? నిన్న కాక మొన్న పుట్టిన నీకేం తెలుసును. ఇతడు ఎటువంటివాడో? దానధారాసుందరములైన మహాగజేంద్రములు సైతమూ ఇతడిని శిరసా వహిస్తూఉంటాయి తెలుసా?

**ఆర్యా**

కలభ ! తవాంతికమాగత
మళిమేనం మా కదా వ్యవజ్ఞాసీః
అపి దానసుందరాణాం
ద్విప ధుర్యాణా మయం శిరోధార్యః

**కందం**

అరుదెంచెను నీ కడకని
నిరసింపకు బంభరంబు నేనుగుగున్నా!
శిరసావహించు వీనిని
కరివరములు దానవారికమనీయంబుల్.

* * *

**మామిడి—తుమ్మెదలు**

మామిడిపూల తేనె తుమ్మెదలకి చాలా ప్రీతికరమైనది. వసంతబుతువులో మామిళ్ళు విరగబూచిన తరుణంలో తుమ్మెదలన్నీ ఆ చెట్ల మీదనే కనిపిస్తాయి. న్యాయమే మరి. రసికుడైనదాత కనిపిస్తే యాచకులు మరోచోటికి ఎందుకుపోతారు? వాళ్ళు నీచాశ్రయానికి సిద్ధపడ్డారంటే అది యాచకుల తప్పుకాదు. రసికుడు కనబడక పోవడమే. ఉదారుడైన దాత లేకపోవడంచేతనే. కనుకనూ, ఓవిరియబూచిన తీయమామిడీ ! ఓ సహకారమా! ఓ, రసాలమా ! కోకిలకూతలచేత మనోహరమైన దానా ! జుమ్మ్ మని కలధ్వనులుచేస్తూ భ్రమించే ఈ భ్రమరమును నీయందే ఆసక్తికల దానినిగా చేసుకో. పనికిమాలిన వేప, కరివేరం వంటి చిల్లర చెట్లవైపు దానిని పోనీయకుండా చూచుకో. అది నీ విధిసుమా! అది నీకే శోభ సుమా !

**వసంత తిలక**

ఉత్ఫుల్లరమ్య ! సహకార! రసాల! బంధో !
కూజత్పికావళి నివాస ! తథా విధేహి
గుంజద్రుమ ద్భ్రమరక స్త్వయి బద్ధతృష్ణో
నాన్యాన్ ప్రయాతి పిచుమంద కరీరవృక్షాన్.

**ఉత్పలమాల**

కమ్మని తేనె బిందువులు
కాల్వలు గట్టెడు పూలదాన! గా
నమ్ముల విందుసేయు పిక
నాథులు మెట్టినదాన ! చంచరీ
కమ్ములు మంజుల ధ్వనుల
గాఢరతిన్ నినుగూడి, నీచ వృ
క్షమ్ముల వంకబోవనివిగా
నొనరింపు రసాలసాలమా !

* * *

**కిరాతుడు—మామిడిచెట్టు**

వసంతోదయమైంది. మన్మధుడి గొడుగులా, గుమ్మటంలా ఎర్రని చిగుళ్లతో, తెల్లని పువ్వులతో, ఝుమ్ముమంటున్న తుమ్మెదలతో తియ్యమామిడి చెట్టు ఒకటి కన్నుల పండువుగా ఉంది. గొడ్డలి బుజానవేసుకుని కిరాతుడొకడు ఆ చెట్టుమొదట నిలుచుని ఉన్నాడు. ఆ చెట్టుకర్ర తాను గుడిసె వేసుకోడానికీ, పొయ్యిలో పెట్టుకోడానికీ తగినదేనని తల పంకించాడు. గొడ్డలి చేతిలోకి అందుకున్నాడు.

పండితరాయలు కంపించిపోయాడు.

ఆ చెట్టుని తెగవేసేస్తాడు కాబోలునని హడలిపోయాడు. నాలుక తడబడుతూఉంటే దానిని తెగనరకవద్దురా అని కిరాతుడిని ప్రాథేయపడుతున్నాడు.

ఆ మామిడిచెట్టు ప్రాశస్త్యాన్ని వివరిస్తున్నాడు గద్గదకంఠంతో.

ఏమయ్యోయ్ కిరాతుడా! అతి సామాన్యమైన పిచ్చిచెట్టు అనుకుంటున్నావా? ఆ గొడ్డలితో దాని మొదలు నరికేద్దా మనుకుంటున్నావా? వద్దు. వద్దు. ఇది వృక్షములకి రాజు. తుమ్మెదలికి ఇదే బ్రతుకు తెరువు. మన్మథుడికి సర్వస్వమూ ఇదే. వసంతుడికి ఇది దగ్గిరిచుట్టం. కోకిలలకి ఇదే విజయామాత్యుడూ, గురుదేవుడూనూ. వింటున్నావా? నామాటమీద గురి ఉంచి దానిని వదలిపెట్టు.

**శార్దూల విక్రీడితం**

త్వం సామాన్యతరుభ్రమేణ
సకలక్ష్మోణీరుహక్ష్మాపతౌ
మాకందేఽపి కిరాత! పాతయముధా
మాస్మిన్ కుఠారం హఠాత్
ఏష శ్లాఘ్య జనస్య జీవిత
మలి వ్యూహస్య బంధు ర్మధోః
సర్వస్వం మకరధ్వజస్య
విజయామాత్యః పికానాం గురుః

**మత్తేభ విక్రీడితం**

అది సాధారణ వృక్షమంచు
తెగవేయం జూతువాయేమి? కూ
డదురా ఓరి కిరాత!
భూరుహకులాలంకార మీ చూతమున్
బ్రదుకుం దెర్విది భృంగపాళికి,
రతిప్రాణేశు సర్వస్వమున్
మధు బంధుండు, పికాళికెల్ల
విజయామాత్యుండు, గుర్వర్యుడున్.

*　　　*　　　*

**మామిడిచెట్టు — కోకిల**

ఓ మామిడిచెట్టూ! యోగ్యతాయోగ్యతలు విచారించకుండా ఎద్దునీ దున్నపోతునీ ఒకే కాడికి కట్టడం న్యాయమేనా? ఈ కోకిలలు ఎక్కడ? మిగిలిన పకులెక్కడ? వీరినడుమ భేదమే లేనట్టు ప్రవర్తిస్తున్నావా? ఎన్నివేల పక్షులు నీపళ్లను మెక్కి, రెట్టలువేసి పోవడంలేదూ? వాటిలో ఒక్కటైనా నీ యీవినీ, నీ గొప్పతనాన్నీ, ఏ సౌందర్యాన్నీ, నీ మాధుర్యాన్నీ ఇతరులకి తెలియబరుస్తున్నాయా? నీ యశస్సుని అవి ఎక్కడేనా చాటుతున్నాయా? వాటిముందర ఈ కోయిల ఎటువంటిదో కాస్త పరకాయించు. నీ ఫలాపేక్ష దానికి సుతరామూ లేదు. నీ చిగుళ్లుమాత్రమే కొరికి, అమితానందపడి, పరవశించి, దశదిశలా నీకీర్తిని పంచమస్వరంతో శ్రవణానంద కరంగా గానంచేస్తోంది మామిడీ!

కొండమీద దేవుడున్నాడు. మా వ్యాపారంలో బాగా లాభాలు రప్పించమనీ, మా జబ్బులు కుదర్చమనీ, మాకు ఉద్యోగాలు ఇప్పించమనీ దేవుడిని కోరడానికివచ్చే కుహనాభక్తులూ ఉన్నారు. ప్రతి ఫలాపేక్ష లేకుండా కేవలం దర్శనంకోసం వచ్చేవాళ్లూ ఉన్నారు. వీరందరినీ సరిసమానంగా చూస్తావేమయ్యా భగవాన్! అని ధ్వని.

**పృథ్వీ**

రసాల! తవ మాధురీ ప్రథిత
సత్ఫలం పక్షిణ
శ్చరంతి నహి తే యశః
ప్రకటయంతి కాష్ఠాసు తే
పికస్తు నవపల్లవ గ్రసనమేవ
కుర్వన్ స్వరైః
ప్రకాశయతి దిక్షు తే
మృదుల పంచమాఖ్యై ర్యశః

**మత్తేభ విక్రీడితం**

తులలేకుండిన నీదు స్వాదు
ఫల సందోహంబు వేవేల ప
క్షులు భక్షింపవె? నీ యశస్సు
నవి యెచ్చోనైన చాటించునే?
ఫలముల్ ముట్టక లేజివుళ్ళ
తినుచున్ వర్ణించు నీకీర్తి కో

యిల నల్దిక్కుల పంచమ
స్వరముతో నెల్గెత్తి మాకందమా !

*  •  *

**తోటమాలి - సంపెంగ మొక్క**

అది నడి వేసవికాలం. సూర్యుడు నిప్పులుచెరిగే స్తున్నాడు. తోటలోని సంపెంగమొక్క వడగాలికి వాడి వత్తరై పోయింది. దానిని చూపించి తోట మాలితో పండితరాయలు అంటున్నాడు.

ఏమయ్యోయ్ ! తోటమాలీ ! ఆ సంపెంగని గమనిస్తున్నావా ఎల్లా వదిలిపోయిందో. ఇంకా అల్లా దిక్కులు చూస్తావేమిటీ ? దాని కుదుట్లో ఓ చెంబెడునీళ్లు పొయ్యడానికి ఇదేనయ్యా తగినసమయం. అది ఈ మండుటెండలకు మాడి చచ్చిపోయినా లేక త్వరలో పడబోయే మేఘుని వర్షధారలచేత బ్రతికి సంవర్ధితమైనా నీ శ్రమ వ్యర్థమేకదా ! ఏమంటే, అది మాడి చచ్చిపోతే దానిని పాతి, బోదెకట్టి, దోహదంచేసి, ఇన్నాళ్లూ పెంచిన నీ శ్రమఅంతావ్యర్థమై పోతోంది. వర్షాలుపడి బ్రతికిందా అది నీ ప్రజ్ఞకి ఫలితంకాదు. అవునా ? మరి కలశం అందుకో.

**వసంత తిలక**

ఉద్యానపాల ! కలశాంబు నిషేచనానా
మేతస్య చంపకతరో రయమేవ కాలః
అస్మి న్నిదాఘ నిహతే ఘనవారిణా వా
సంవర్ధితే తవ వృథోభయథోప యోగః.

**మత్తేభ విక్రీడితం**

ఇదియే చెంబెడు నీరు వోయు
సమయం బీ చిన్ని సంపెంగ పూ
బొదకున్—లెమ్మిక తోటమాలి !
సమయమ్మ్ంం జారిపోనీకుమా !
అది యీ రోహిణి మండుటెండలకు
బొగ్గై పోయినన్, లేక తో
యద వర్షంబుల మోసులెత్తిన
త్వదీయాయాసముల్ వ్యర్థముల్.

*  *  *

**పద్మిని—చంద్రుడు**

ఓ కమలినీ ! చంద్రుణ్ణి చూచేసరికి మొగం ముడుచుకుంటూ వేమిటీ ? అతడు సామాన్యు డను కుంటున్నావా ? అతడికాంతి బహు ప్రసన్నమైనది. శుచిత్వమూ చాలా ఉత్కృష్టమైనది. సకల లోకా నందకరుడు అతడు. మహేశ్వరుడు అతడిని స్వయంగా నెత్తికెత్తుకున్నాడు. ఇటువంటి మహారాజు నీకు నచ్చ లేదూ ?

**పుష్పితాగ్ర**

రుచిరతిరుచిరాం శుచిత్వ ముచ్చైః
శిరసి ధృతః స్వయమేవ శంకరేణ
కమలిని ! మలినీ కరోషి కస్మా
న్ముఖ మిద మిందు ముదీక్ష్య లోకకాంతమ్.

**చంపకమాల**

వనజమ ! నెమ్మొగమ్ము
ముదువందగునా శశిగాంచి? చూడ చ
క్కని సరసుండు—లోకులను
గాటపు చల్లని[illegible]పండు వెన్నెలన్
దనుపు నితండు—వీనిది
సుధారస పూర్ణ హృదంతరాళ మీ
తని శిరసావహించెను కదమ్మ
స్వయమ్ముగ విశ్వనాథుడే.

*  *  *

**సరస్సు-పాంథులు**

నలుగురూ నడిచివెళ్లే దారికి దగ్గరలోనే ఒక చెరువు. అందులో నీరు నిండుగానే ఉంది. నిర్మలంగానే ఉంది. కాని చుట్టూ ముళ్లతుప్పలూ, రెల్లు గజిబిజిగా మొలిచి, దగ్గరకు నడిచివెళ్లడానికి వీలుగాలేదు. అటువంటి సరస్సునుచూడగా దాహంతో ఉన్న పండితరాయలికి చిరాకేసింది.

ఓ కాసారమా ! ప్రస్తుతం నీలో నీరు సమృద్ధిగా ఉంది. దూరంనుంచి నిన్నుచూసి, దాహంతో ఉన్న బాటసారులు ఆశవడి నీ దగ్గరకువస్తే వాళ్లి

దప్పికను నీవు ఇప్పుడే పోగొట్టలేకుండా ఉన్నావు. 'నాలోని నీళ్లు కడుపునిండా తాగి వెళ్లండయ్యా' అని ఇప్పుడే మనసారా పాంథులని ఆహ్వానించలేకుండా ఉన్నావు. ఇంక వేసవివస్తే, సూర్యుడు నిప్పులు పుక్కిలిస్తూ ఉంటే, నీ నీరంతా హరించిపోతే, ఇహ అప్పుడు నువ్వు ఏమి ఇవ్వగలవు ?

సంకురాత్రి పండుగ. గాదెలలో ధాన్యం నిండుగా ఉంది. ఏమయ్యోయ్ ఖామందూ ! అన్నీ సమృద్ధిగా ఉన్న ఈ రోజుల్లోనే యాచకులకి నాలుగు గింజలు రాల్చడానికి నీకు మనసు ఒప్పడంలేదే, నీ గాదెలు తరిగిపోయాక, ఎలుకలూ పందికొక్కులూ తవ్వుకుపోయాక అప్పుడు నీకు ఇవ్వాలని ఉంటేమాత్రం ఏమివ్వగలవూ? కనుక, ఇవ్వడానికి ఇంతకన్న మంచిసమయం ఏముందో ఆలోచించుకో.

ఇయత్యాం సంపత్తా వపిచ
సలిలానాం త్వ మధునా
న తృష్ణా మార్తానాం హరసి
యది కాసార ! సహసా
నిదాఘే చండాంశౌ కిరతి
పరితోంగార నికరం
కృశీ భూతః కేషా మహహ
పరిహర్తాసి ఖలు తాన్.

**ఉత్పలమాల**

నీరముతోడ నీ తనువు
నిండిన యీ సమయమ్మునందె కా
సారము ! త్రావనిచ్చి మనసారగ
పాంథుల దప్పితీర్పగా
నేరవయేని, గ్రీష్మమున
నిప్పుల చండకరుండు రాల్చి యీ
నీరు హరించివేయునెడ
నెవ్వరి యార్తి నీ తీరువో యికన్.

**పద్మం - హంస**

పద్మం చాలా అందమైన పువ్వు. హంస చాలా అందమైన పక్షి. హంస అంటే పద్మానికి ఇష్టం లేదు, కారణం ఏదైనా అవుగాక. హంసలాంటి అందగాడిమీద తామరపువ్వుకి అనురాగం కలిగించే ఉద్దేశంతో పండితరాయలు రాయబారం జరుపుతున్నాడు. ముందుగా నువ్వు అంతదానివి ఇంతదానివి అని ఉబ్బవేసి, చల్లగా హంససంగతి తీసుకువస్తాడు.

ఓ తమ్మీ! నువ్వు స్వచ్ఛమైన సరోవరంలో జన్మించావు. విష్ణుమూర్తి అంతవాడు నిన్ను చేతిలోకి తీసుకున్నాడు. లక్ష్మీదేవి నీలోనే నివసిస్తూ ఉంటుంది. నీ పరిమళము దేవతల మనస్సులను సైతమూ హరించ గలిగినది. నీలో అన్నీ మంచి గుణాలే. వీటికితోడు ద్విజోత్తంసుడైన హంసమీద నీకు అనురాగం కనుక ఉన్నట్లైతేనా, ఓహ్ ఇంక చెప్పేదేమిటి ? నీ అంత అదృష్టవంతురాలు మరి యెక్కడా ఉండదు.

(ఇక్కడ ద్విజ శబ్దానికి పక్షిఅనీ బ్రాహ్మణుడనీ రెండు అర్థాలు. అల్లాగే హంసకి పరమాత్మ అనే విశేషార్థంఉంది. బ్రాహ్మణులు తామరపువ్వులతో దేవతలను పూజించడం ప్రసిద్ధమైన విషయం. అదృష్టం బాగున్న తామరపువ్వులు కొన్నిమాత్రమే దేవపూజలో వినియోగ మవుతాయి. మిగిలినవి వడిలి రాలిపోతాయి.)

**శిఖరిణి**

సముత్పత్తిః స్వచ్ఛే సరసి
హరిహస్తే నివసతిః
నివాసః పద్మాయాః
సురహృదయహారీ పరిమళః
గుణైరేతై రన్యై ర్యపిచ
లలితస్యాంబుజ ! తవ
ద్విజోత్తంసే హంసే
యది రతి రతీవోన్నతి రియమ్.

**చంపకమాల**

జననము లేటనీట, జలజాక్షుని
హస్తమునన్ నివాసమున్,
మనికి హరి ప్రియాంగనకు,

నాకనివాసులు మెచ్చు గంధమున్
వనజము ! సద్మకై కవరిభాజివి
కాదన బోనుగాని, హం
సను ద్విజసత్తమున్ వలవ
జాలిన నింకను వన్నె కెక్కవో !

* * *

**గాలి-మాలతి**

గాలి రివ్వున వీస్తోంది. పందిరిమీదికి పాకి, దట్టంగా అల్లుకుని, ఒత్తుగా విరియబూచిన పువ్వులతో, మైమరపించే సువాసనలతోఉన్న మాలతీ లత ఆ గాలి తాకిడికి జవజవ లాడిపోతోంది. ఇంత చక్కని మాలతిజోలికి పోవద్దని ప్రభంజనుడిని బతిమాలు కుంటున్నాడు పండితరాయలు.

వట్టివేళ్లు ఘుమఘుమ లాడుతూఉంటాయి. వేసవిలో సువాసనతోబాటు చల్లదనంకోసం వట్టివేళ్ల తడకలు, విసనకర్రలు ఉపయోగిస్తారు, మంచిదే. కాని, వట్టివేరు మొక్కలో ఒక దుర్లక్షణం ఉంది. అది తన సారమునంతా భూమిలో దాచేసుకుంటుంది. బయటపెట్టదు. అటువంటి మొక్కని వేళ్లతో సహా పెకలించేసినా తప్పులేదు, అంతేకాని, ఓ, ప్రభంజనుడా! దశదిశలా తన పరిమళాన్ని విరజిమ్మేస్తున్న ఈ మాలతీలతనుకూడా పీడించడం ఏం సబబు చెప్పు.

లోభి ఉన్నాడు. తన సొత్తునంతా బిందెలలో పెట్టి లోతుగా భూమిలో పాతిపెట్టేశాడు. అది ఎవ్వరికీ ఉపయోగపడడంలేదు. ఓ రాజా ! ఆ లోభి పాతిపెట్టిన సొత్తును పెల్లగించి తీసుకుపో కావాలంటే, అంతేకాని అడగనివాడిది పాపంగా తన దగ్గర ఉన్న దంతా దానంచేసేస్తున్న ఈ మహాదాతను పీడించడం ఏం ధర్మం చెప్పు.

**ఆర్యా**

ఆమూలాలూ దున్మీలయ
భూగతసారం ప్రభంజనో శిరవ్ం
దిశి దిశి విసర త్పరిమళ
గంధభరాం మాలతీం మా త్వమ్.

Statement about ownership and other particulars about newspaper

**BHARATI**

*FORM IV* (SEE RULE 8)

1. Place of publication: Madras
2. Periodicity of its publication. Monthly
3. Printer's Name: Sri S. Nageswara Rao
   Whether citizen of Indhia Yes
   If foreigner state the country of origin —
   Address 16, Luz Avenue, Mylapore, Madras-4
4. Publisher's Name: Sri S. Nageswara Rao
   Whether citizen of India Yes
   If foreigner, state the country of origin —
   Address (As above)
5. Editor's Name. Sri S. Sambhu Prasad
   Whether citizen of India Yes
   If foreigner state the country of origin —
   Address 16, Luz Avenue, Mylapore Madras-4.
6. Names and addresses of individuals who own the newspaper and partners or share-holders holding more than one percent of the total capital.

| NAMES | ADDRESSES |
|---|---|
| 1. Mr. S. Sambhu Prasad | 16, Luz Avenue, Mylapore, Madras-4. |
| 2. Mrs. S. Kamakshamma | Do |
| 3. Mr. S. Nageswara Rao | Do |
| 4. Mr. S. Radhakrishna | Do |

I, S Nageswara Rao hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

S. NAGESWARA RAO
1-3-72 Signature of Publisher

**ఆటవెలది**

వట్టివేరు దాచె మట్టిలో సారమ్ము
దాని పెల్లగింప దగును గాలి!
దివ్య పరిమళమ్ము దిశలెల్ల విరజిమ్మె
మాలతీ లతాళి జోలి యేల?

## చెరువు—చేపలు

మండు వేసవికాలం. వడగాడుపులకి చెరువులోని నీరు క్రమంగా ఎండిపోతోంది. అంతవరకూ ఆ సరస్సుని ఆశ్రయించుకుని ఉన్న నీటి పక్షులన్నీ, ఇహ ఇక్కడ లాభంలేదని, మరో మంచిచోటు చూచుకుందామని, చెరువుని విడిచిపెట్టి, ఆకాశమార్గం పట్టేయి. చెరువులోని కలువలు, తామరలు నశించిపోగా తుమ్మెదలుకూడా ఆ స్థానంవిడిచి మామిడి చెట్లని ఆశ్రయించాయి. కాని, ఓ తటాకమా! నిన్నే ఆశ్రయించుకుని మరోచోటికి పోలేని ఈ చేపలకి ఇంకేది దిక్కు? అయ్యయ్యో! అవి అన్నీ ఏమై పోతాయి?

ఓ మహానుభావా! నీకు దుర్దశ సంప్రాప్తించగానే నీ యొడమీద బతుకుతున్న స్వలాభాపరులు అంతా నిన్ను విడిచిపెటేసి మరో ఆశ్రయం చూచుకుంటున్నారు కానీ, నీ విపత్తులలోకూడా నిన్ను విడవకుండా ప్రాణత్యాగానికైనా సిద్ధపడే ఈ మహాపురుషులను సామాన్యులనుగా తక్కిన అందరినీ చూచినట్లుగా చూడకు.

**వసంత తిలక**

ఆపేదిరేంబరపథం పరితఃపతంగా
భృంగా రసాల ముకుళాని సమాశ్రయంతి
సంకోచ మంచతి సరస్త్వయి దీనదీనో
మీనోనుహంత కతమాం గతి మభ్యుపైతి.

**ఉత్పలమాల**

అంబరవీధి నాల్గు దెసలంటి
పతంగ కులంబు పారె, భృం
గంబులు చూతకోరక నికాయ
సమాశ్రిత మయ్యె—ఓ తటా
కంబ! నిదాఘవేళ సుడిగాడ్పుల
నీ జలమింకుచుండ మ
త్స్యంబుల కేమిదిక్కు కన
నయ్యెడినో యికమీద నయ్యయో!

* * *

## పద్మిని—సమీరుడు

చల్లని పిల్లగాలి సుతారంగా వీస్తోంది. సరోవరంలోని పద్మముల రేకులు ముడుచుకుంటున్నాయి. ఆ సమీరస్పర్శ తమకి నచ్చనట్లుగా పండితరాయలు పద్మినికి నచ్చ చెబుతున్నాడు.

ఓ కమలినీ! ఈ పవనుడు కూడా మధుపం (తుమ్మెద, తాగుబోతు) వంటివాడే అని భ్రమపడి నీ సౌరభాన్ని లోలోపలే దాచేసుకుంటున్నావా? తుమ్మెదలు తమ స్వలాభంకోసం నీ దగ్గరకు వస్తున్నాయి. మహానుభావుడైన సమీరుడు నీ సౌరభాన్ని ఇతరులకు పంచి వాళ్లని సంతోషపెట్టాలనే ఉద్దేశంతో నిన్ను అర్థిస్తున్నాడే కాని, తన సొంతంకోసం కాదని తెలుసుకో.

అనాధ సంరక్షణంకోసం నీ దగ్గరకు చందా అడగడానికి వచ్చిన ఆ పెద్దమనిషిని కసురుకుని, తలుపు భళ్లున మూసేసుకుంటున్నావా? గంజాయిపీల్చే బైరాగుల్ని అతడినీ సమానంగా చూడకు.

**ఆర్యా**

మధుప ఇవ మారుతేఽస్మిన్
మా సౌరభ లోభ మంబుజిని! మాంస్థాః
లోకానా మేవ ముదే
మహితోఽప్యాత్మాఽమునార్థితాం నితః.

**తేటగీతి**

పవన మున్మత్త మధుపమ్ము వంటిదనుచు
కమ్మతావుల దాచకు తమ్మిపూవ!
తాను ఘనుడయ్యు పరుల సంతసముకొరకు
అనిలు డర్థించు చున్నవాడని యెరుంగు.

ఈ తుమ్మెదలు నీచుట్టూ తిరుగుతూ వందిమాగధుల్లా స్తోత్రాలు చేస్తున్నాయని, అందుచేత అవి నీ శ్రేయోభిలాషులనీ భ్రమపడుతున్నట్లు కనిపిస్తున్నావు పద్మినీ! నీలోఉన్న సారాన్ని జాగ్రుకు

పోవాలని వచ్చినవి అవి. అందుకని అవి నిన్ను ముఖస్తుతులుచేస్తూ నీచుట్టూ ప్రదక్షిణాలు చేయడంలో అబ్బుర మేముందీ ? ప్రతిఫలాపేక్ష ఏమీ లేకుండా నీ సౌరభాన్ని దశదిశలకీ జీతం బత్తెం లేకుండా మోసుకుపోయి, అందరికీ నీ గొప్పతనాన్ని అందరికీ ఎరుకపరచే నిస్స్వార్థ సేవా పరాయణుడు గంధవాహుడు ఉన్నాడు. అతడినీ ఈ పాడు మధుపాలనీ ఒకే తక్కెడలో పెట్టి తూచకు సుమా !

**మా లి నీ**

అయి దళదరవింద! స్యందమానం మరందమ్
తవ కిమపి విహంతో మంజుగుంజంతు భృంగాః
దిశి దిశి నిరపేక్ష స్తావకీనం వివృణ్వన్
పరిమళమయ మన్యో బాంధవో గంధవాహః

**మత్తేభ విక్రీడితం**

అరవిందమ్మ! త్వదంతర స్రుత
మరందాస్వాదనాసక్త బం
భరయూథమ్ములు-నిన్ను జుట్టి
మధురధ్వానమ్ము లన్ సేయుట
బ్బురమా? యెట్టి యపేక్ష లేకయె
త్వదామోదమ్ము నర్దిక్కు లన్
బరపన్ వచ్చెడు మేటి గంధ
వహు బాంధవ్యంబు భావింపుమా!

## సామాన్య పుష్పాలు-తుమ్మెద

కమలినీ వనమునంతా ఏనుగులు తొక్కి తొక్కి పాడు చేశాయి. వాటిని ఆశ్రయించుకుని ఉన్న ఒక తుమ్మెద మనస్సు వికలమై పోయింది. పద్మినీ వియోగాన్ని భరించలేక మూలుగుతూ చెట్టులూ పుట్టలూ పట్టిపోతోంది. పండితరాయలకి జాలి వేసింది దాని అవస్థ చూసేసరికి. 'ఓ మల్లీ! ఓ మాలతీ ! ఓ లవంగీ ! మీరందరూ దయాంతరంగు లని నాకు తెలుసు. మిమ్మల్ని ఒక్కటి అర్థిస్తున్నాను. అదిగో ఆ మధువ్రతాన్ని చూశారూ — పాపం అది అంబుజినీవియోగబాధని మరిచిపోయేటట్టు మీరు కాస్త కనిపెట్టి లాలించుతారుకదూ!' అని సిఫారసు చేస్తున్నాడు.

**ఉపజాతి**

హే మల్లి! హే మాలతి! హే లవంగి!
న తాదృశీక్వాపి భవాదృశీనామ్
క్షణం సమాధాయ మధువ్రతం యా
విస్మారయే దంబుజినీ వియోగమ్.

**ఉపజాతి**

ఓ. మల్లి ! ఓ మాలతి ! ఓ లవంగి !
ఈ మంజుగుంజ ద్భ్రమరావతంసున్
సమాదరింపందగు వానిడెందం
బేమారగా నబ్జవియోగబాధన్.

## తుమ్మెద—చూతవల్లి

మామిడిచెట్టుమీదికి ప్రాకిన లతను 'చూతవల్లి' అంటారు. ఆ తీగ ఏ జాతిదేనా కావచ్చు. ఆశ్రయ మహత్త్వంచేత ఆ తీగకి కూడా గౌరవం లభించింది సాహిత్యంలో. రసికులైన కవులు అంటే రసాలవల్లిని గౌరవించారు కాని తుమ్మెదమాత్రం ఆ తీగను లెక్కచేయకుండా కాళ్లతో తన్నిపోతోంది. దానిని చూచి పండితరాయలు తుమ్మెదతో అంటున్నాడు.

—ఓ తేటీ ! నువ్వు గొప్ప రసికుడవు. లవంగి లతను స్వయంగా ఆలింగనం చేసుకున్నావు. అంబుజినీ లతను చుంబించావు. పాపం, ఆ చూతవల్లినికూడా ఆదరిస్తే నీదేంపోయిందీ ? అల్లా విదలించుకు పోతావెందుకూ ?

**ఇంద్రవజ్ర**

ఆలింగసే చారు లతాం లవంగీ
మా చుంబసే చాంబుజినీం క్రమేణ
తాం చూతవల్లీం మధుప ! ప్రకామం
సంతాడయస్యేవ పదైః కిమేతత్.

**ఇంద్రవజ్ర**

లాలింపవో చారు లవంగ వల్లిన్
సోలింపవో ముద్దుల తమ్మితీవన్
ఈ లీల తాడింతు రసాలవల్లిన్
ఏలా చిరాకో ? మధుపావతంసా !

# అన్వేషణ

## శ్రీ భట్టిప్రోలు కృష్ణమూర్తి

నళినములన్ హసించు నయ
నమ్ములు, వెన్నెల నీలి నీడలన్
చులకన చేయ జాలు తను
సుందర శోభ, వెడంద గుండెల
వెలిగెడు కౌస్తుభమ్ము. శిఖి
పింఛము క్రిందుగ ఊగు చూర్ణకుం
తలములు— ఆతడెందొ ? దయ
నా కెవరైనను తెల్పిపోదురే ?

ఒకనా డాతడె నేను నేనె అతడై
ఉత్ఫుల్లచాంద్రినిశిన్
వికచామంద సుగంధ సూన విలసత్
బృందావనోపాంతపున్
సికతా చారు తలమ్ములందు ప్రణయ
శ్రీమత్తతన్ నృత్య సం
చికలో కాలపు నెత్తిపై అడుగులన్
గిలించు కొన్నారమే !

నా కెంపు మోవిలో పారికు ఉద్వేగమ్ము
ఉరుకు లాడెను వాని ఊష్మములను—
ఆ సోగ కనులలో మోసులెత్తిన కోర్కె
నా లోచనములను నాట్యమాడె—
నా పొంగు హృదయంపు ఏస్పైవ వేడిమి
వాని గుండెను పరవశ్మ్ల తొక్కె—
అతని వేళ్ళలలోని ఆరాటపున్ వేట
ఈ అంగుళులలోను ఎగసి లేచె—

## అ న్వే ష ణ

ఒక్కటే శుభ్రితి మనసు లురూభ్రిత లూగె !
ఎవరి ఉద్వేగ మెవ్వరి నివుడు కోర్కె
వేడి ఎవరిది ఎవరిది వేట అపుడు—
ఇపుడు స్పష్టముగా నాకు ఎరుకలేదు !

పులకలు విద్యుల్లతలును
జలజల జరజర శరీర సర్వాంగములన్
అలముకొన మాటిమాటికి
నిలుచున స్పృహయే రవంత నెమ్మదిలోవన్?

ఇంతమాత్రిమె ఎరుగుదు : అంతమునుపు
రాధ వేరని వేరని మాధవుండు—
కాని ఆ రాత్రి, యమున సాక్ష్యమ్ము, నిజము,
రాధికా మాధవమ్ము అభేద పదము !

అంతగ నింగిపై కెగసి
నట్టిది ఆ అనుబంధ మా సుధా
కాంత విలాస రాగ పరి
కల్పన ఆ ప్రిణయమ్ము ! మోహ వి
భ్రింతిని ఉన్న నన్ విరహ
బాధకు చల్లగ అప్పగించి తా
ఇంత దయా విహీనుడయి
ఎందున దాగెనొ ఏరు చెప్పరా?

నల్లనివాడు పీత వస
నమ్ముల దాగనిమేని సొంపు వా
డల్లరివాడు మోవిని వ
యారపు లేనగ వూగులాడగా
పిల్లన గ్రోవితో పసుల
వెంబడి మెల్లగ పోవువాడు నా
ఉల్లము దొంగిలించిన మ
హామయు డాతని జాడ తెల్పరే ?

# తృణజ్యోతి

శ్రీ అబ్బూరాజు శ్రీనివాసమూర్తి

విజయవాడస్టేషన్‌లో వచ్చేపోయే ట్రైన్లూ వాటి కోసరం వెయిట్‌చేసే ప్రయాణీకులూ, చుట్టా బీడీ సిగరెట్ అమ్మే గొంతులూ, ఇంజన్ కూతలూ—అంతా ఒకటే రద్దీ !

కేకవిని తలెత్తాను. ఎదురుగా కుర్రాడు.

బాబూ పాలెష్ చేయమంటారా !

తొమ్మిది పదేళ్ల వాడి అభ్యర్థన. అసలే బండి రాలేదన్న విసుగూ పోయేపనిఏమౌతుందోనన్నఆదుర్దాతో నలిగే నేను విసురుగాచూచి వద్దు పోరా అన్నాను.

వాడి సర్వీసెస్‌ను నేను సస్పెక్ట్ చేస్తున్నా ననుకొన్నాడేమొ ... 'పాలీష్ చక్కంగా చేస్తాసార్ ... పనయ్యాసిన తర్వాతే డబ్బు లిద్దురుగానీ ...'

నా బూ టందుకో బోయాడు. నే కాళ్లు వెనక్కు లాక్కొంటూ చూచాను.

'ఉదయంనుంచీ బోణీగూడ లేదు సార్ ... ఇయ్యాల గెంజికూడా లేదు ...' కొద్దిగా నసుగుతూ జాలిగా చూచాడు.

'వద్దురా అంటూంటే...' నా బింకం డైల్యూట్ అవటం గమనించాడేమో బూటు నందుకొన్నాడు. ఈ తడవ పరిశీలనగా వాణ్ణి చూచాను.

దుబ్బురేగిన తల, లోతుకు పీక్కుపోయిన కళ్ళు, బాగా మకిలిపట్టిన చొక్కా, అతుకులువేసిన నిక్కరూ, బుజాన సంచి, చేతికి బ్రెష్షూ—ఇది వాడిరూపం.

'అబద్ధా లెందుకురా ఇప్పట్నుంచే!' ఉబుసు పోక అనేశాను వాడితో.

'పెమాణం బాబూ. డబ్బు లెత్తకపోతేనే అమ్మకు గెంజి.' వాడిమాటలు బాధపెట్టాయి.

'అదేమిట్రా. మీ నాన్న లేడేమిటి. వేలెడంత వెధవ్వు నీ సంపాదన్తోనే బ్రతుకుతోన్నట్లు' ... నే నలా వ్యాఖ్యానించేసరికి నావంక అదోలాచూచి—

'అదంతా ఓ కథలే బాబూ ! నెయ్యన్నం తినే వోళ్ళ కెందుకు యీ గొడవ్వినిపించడం.'

ఆ మాటలు కొంత కుతూహలాన్ని కల్గించ డంతో 'ఇంతకూ నీపేరేమిటంటావ్!' అని ప్రశ్నించాను.

'కిట్టిగాణ్ణంటారండీ! మా అమ్మేమో అబ్బిగా అంటది సార్.'

'మరి మీ నాయనో'. వాడి మాటలు ముచ్చట వేసాయి.

'ఏ నాయనగారూ'...దీర్ఘంతీస్తూ కళ్ళు కది లించాడు. అదోలా ఆశ్చర్యపోతూ 'అదేం మాటరా! అన్నాను.

'నిజమేసార్! అదంతా ఓ సినిమా కథలే బాబూ! మాయమ్మ రాముల్మమ్మ నన్ను పెసవించిం తర్వాత మా అయ్యనొగ్గేసి, మరోడితో నా మూడో యేట పోయిందట.'

'అయితే మీ అయ్య రెండోపెళ్లి చేసుకొన్నా డంటావ్, ఆమెకే కదూ గెంజీగట్రా!'

'బలేవోరె...మా అయ్య వో దాన్ని తెచ్చుకొంటె మాత్రం ఆమె నా తల్లైపోద్ది. మా అమ్మ మాయమ్మే.

మరీ చిత్రమైంది వాడి వాదన. పెద సస్పెన్స్!

'మీ అమ్మ అయ్యను వదిలేసి లేచిపోయిందంటివిగా?,

'ఔను బాబూ! కానీ ఆడుమ్మాత్రం మా చిట్మాంను కన్న తర్వాత వదిలేసుండు. మా అమ్మకు రోగమొచ్చె. ఇంక రోగిష్టిది ఆడికెందుకు! గప్పున వొగ్గేసి తెల్లారకట్ట ఉడాయించినాడు పాపిష్టోడు.'

ఝుల్‌మంది నా వొళ్లు!

'అసలు ఆడబతుకంత ముదనష్టపు బతుకింకొటి లేదయ్యగోరూ! మా అయ్యేమో తాగితందనాలాడుతూ మా అమ్మను యిరగ్గొట్టేసేవోడు. కూడుకీ గుడ్డకూ మొగమాచి చచ్చిందంట. ఆయనేమొ మగమడిసోయె! ఓరంటారు తప్పని!'

'మరి మీ అమ్మ తిరిగొచ్చిందన్నమాట' అన్నానేను.

'మా అయ్య రానిస్తాడేమిటి! ఆడు మాంచి పౌరుసమున్నోడు! మా అమ్మ నొగ్గేసిన తర్వాత ఆడమడిసంటే క్రుచ్చుకుంటాడు.' ఇంకా ఆశ్చర్య వేసింది. ఊహకందటంలేదు. కానీ క్రిష్ణమాత్రం యిదేం పట్టనట్టు బూట్ తుడుస్తున్నాడు.

యాదాలాపంగా బస్తాల్లో ఏవో కదుల్తోంటం చూచి 'అవేమిటిరా బస్తాల్లో! అని ప్రశ్నించాను.

వాడు కిసుక్కుననవ్వి 'అయి కప్పలండి. ఒక్కో దానికి పదేనుపైస లిస్తండారుగ. మా రంగడు, రాములుగోడు, గురవడూ వాళ్లబ్బా అంతా యిదేపని! రోజు కైదారు సంపాదిస్తారు సార్.'

కళ్లింత చేసుకొని వింటున్నా.

'ఆ రంగడూ, రాములుగాడూ నన్నూ ధమ న్నారు సార్. కప్పేటకు. కానీ నాకు పేణ మొప్ప లేదునికొండి. అయ్యిగూడ మన్లాంటి పేణాలేగా. కాకుంటే బగవంతుడు నోర్లేకుండా జేసినాడు. ఆ కూడెందుకని బూట్ పాలిషేస్తుండ.'

'ఎప్పుడూ ఇక్కడే ఉంటావేమిట్రా! ఇంటికి పోవేమిటి ''

'అదేటి బాబూ! మా అయ్య పెంచెలు ఈడ పోట్టరు. ఆడి పడకా తిండీ యీడే గంద. ఇంక నన్నోరు అడ్డగిస్తరు. టీ. సీ. అందరూ నా కెరికె. ఓరు చెప్పినా పని రెక్కలట్కుకొని చేస్తావుంటిని.'

'అలాగా...'

'ఔను సార్! ఆ బుర్రమీసాల పోలీసోయ నంటే మాత్రం చానా బయమండీ, పులిమీసాలూ సివంగికళ్లూ ఆయన'. ఒకసారి కానిస్టేబుల్‌వంక చూపుపారేసి మళ్లీ నావంకచూచి చెప్పుకుపోతున్నాడు.

'ఏం ఏందుకూ!' అవ్వ కథచెప్తోంటే ఒకటీ అరా మాట్లాడిన నా బాల్యవయస్సు గుర్తొంచ్చింది నాకు.

'ఎందుకేమిటి సారూ! అసలీడ కుర్రాళ్ల నుండనీయండే. ఆయన సొమ్మేం పోయిందనో కానీ సార్ టీనీళ్లకు పదిపైస లిచ్చినామంటె మన సొయల కసలు తొంగిచూడ డనుకోండి. నవ్వుతూ యీడనేఉండ్రా ఫూల్ అంటడండి!'

'ఈడ కేడీగోళ్లందరూ ఆనకెరికేనండీ! మరే మొ మొగాని ఆళ్ల నే మనడు. రిక్షావోళ్లను సూస్కోండి నాసామిరంగా డబ్బు లియ్యకపోయారో గొంద్రిస్తూ తిట్టిపోస్తూ రిక్షా చక్రాలగాలి తీసేస్తడండీ! మరాయన మంచోడంటూరా ? ' నన్ను ప్రశ్నించాడు క్రిష్ణుడు.

'నీవే చెప్పావ్‌గా! మంచోడు కాదని'—సమా ధానం.

'బలేవోరె! మా అయ్య సెప్తాడుగా ఆన సాలా మంచోడని. ఆయన్కుగూడ గంపెడు పిల్లలంట. ఆయ నుచ్చుకొనేది లంచంకాదంట· అది మామూ లంట. సాన్నాళ్లనుండి వస్తోన్నదేనంట. అసలు మా అయ్యకేం తెలవదండీ!' అంటూ నాచేతిలో పేకట్ వంక కళ్ళింత చేసికొంటూ'అదెం తౌద్దిసార్' అన్నాడు. నాకు నవ్వొచ్చింది. 'ఇది మగాళ్ళకు కాదోయ్.'

'అది తెల్సులే సారూ! మా చిట్టి దాన్కి కొనె డ్దామని అడుగుతూంట. సినిమాలో నాగేశరావులా నా చెల్లెల్ను చక్కా కాలేజీలో సదియించుకొనాలండీ. అక్కడెక్కడో దిక్కులేనోళ్లకు కూడూ గుడ్డాయెట్టి

సదివిస్తన్నారంట...మీా కెరికైతే, సెప్పండి సారూ పున్నెముంటది.'

క్రిష్ణుడు నాతో మాట్లాడుతూనే, రెఫ్రెష్ మెంట్ స్టాల్‌దిశ చూస్తుండటం గమనించి 'ఏరా ఆకలేస్తోందేమిటి! డబ్బుల్లేవంటివి?' అని అడిగాను.

వాడు నన్నదోలా చూచి 'అది కాదులే సారు. ఆడ మా చిట్టామ్మంది. ఈ గౌను దాన్కి నప్పతుందో లేదో సూస్తన్నా. మీారు సూడ్లేదుకానీ మా సిట్టాం లేతమదుసుల్లో బేబీలాగుంటది సారూ'.

'ఏం చేస్తుందేమిటి?' అర్థంకాని ఆశ్చర్యంతో అడిగాను.

ఆడ హోటల్లో కాపీగ్లాసులు, ప్లేట్లు తొలు స్తది. రాత్రేళ గచ్చు కడుగిద్ది. నీళ్ళేమొ నేను పట్టి స్తాను. అది సక్కంగా టేబిల్స్ తుడుస్తది. నేనేమొ పెద్ద డేగిసాలను కొబ్బరిపీచెట్టి రుద్దేస్తాను. అంతా యెంత ఓ గెంటా గెంటన్నరో. ఆయిపొద్ది. ఆపైన గుడిశెకెల్తాం...'

'గుడిశా! అక్కడెవరున్నారు?'

'ఎవరేంటి సార్. మా అమ్మ రాములమ్మ... పచ్చవాతంతో తీస్కుంటుందని సెప్తిగా. అప్పుడే మరి శారూ!'

నవ్వుకొంటూ రెండో బూటుతుడుస్తున్నాడు, చేయి పన్జేస్తుంటే, ఏదో సినిమా పాటపాడు కొంటూ.

'బందిపోటు భీమన్న సిన్మా సూచారుటండీ!'

వాడి మాటలు మరీ ముచ్చటేశాయ్. అడవిలో విరిసిన విరిమల్లెలాంటి మనసు. మాట్లాడుతోంటే నన్ను నేనుగా ఆలోచించుకోవలసివచ్చింది. సమా ధానంగా 'ఆ...ఏం?' అన్నాను.

'సూచినారా అని ... అదికాదు సారూ కన్నోడు దరితోచక దొంగైనాడనుకోండి. అది ఆడితప్పా అను కొండి–కొడుకు ఆ యిధంగా అయ్యను ఆడు బంది పోటు...దొంగ కూనీకోరు ... యీా యింట్లో ఆడో నేనో ఉండాలి అంతేగానీ యిద్దరం ఉండం అంటాడె ఆడు కొడుకేనా అంట...సివరి కేమైంది సెప్పండి... కాదు ఆ అబ్బాయి అమ్మ యిసంతిని సచ్చిపోయినాదా! యీా పెపంచంలో పుట్టింతరువాత ఓరు తప్పాసేయ కుండా ఉండారు? ఆటిని సరిపెట్టుకొని బాగు సేయడంలోనె గొప్పుందికదు సారూ'.

'నిజమే అనుకో!' వాడికెట్లా చెప్పాల్సింది తెలియక.

'భలే వోరే!మీరుగూడ మా అయ్యలాటోళ్లే... ఆడూ అంతే. మా అమ్మ పేరెత్తినానంటె మక్క లిరగ తన్నబోతాడు. అంతేకాదు బాబు మా సెల్లాం యేంచేసింది సెప్పండి? దాన్నిగూడ సూడనీయడు!... అడుగో మా అయ్యొస్తున్నాడు గానీ యీా యవ్వారం కట్టేయండీ' అంటూ బిక్కుబిక్కుగా వచ్చే మనిషి వంక చూడసాగాడు. నే తలత్రిప్పాను.

యాభై సంవత్సరాలకుపైగా వయసు. బుర్ర మీసాలు. నీలంచొక్కా; దండదగ్గర ఎర్రపట్టీ, ఎర్ర తలగుడ్డా. నీరుకావి పంచె. మోకాలిపైకి మడచిన కట్టూ, చేతి మురుగులూ. ఈ వివరాలతో ఆకారం అవుపించాడు.

'ఆ డొట్టి దొంగముండాకొడుకు బాబూ!' మాట నమ్మకండి! ఉన్నవీ లేనివి పది కల్పించి పైస లూడ లాగేస్తాడు. సినిమాల్లో క్రిష్టుడు! ఏరా క్రిష్టుగా...హాయిగా కప్పేటకుపోరాఅంటే యిదేం పనిరా...ఎన్నిబాబుల బూటు తుడిసీ పొట్టనిండతది. కప్పకు రేటు పెదిగిందంట. గోంద్రుకప్పకు యిరవై పైస లిస్తుండంట బుడేసాయిబు. మీరన్నా సెప్పండి బాబూ! ఒక్కొడు పొద్దువాటాలే సరికి పాతికా ముప్ఫయ్ కప్పలడుతుంటే యీాడికిదేం పొయేకాల మండీ లమ్డికొడుకు!'

'పోయే బాబూ! ఆ రకతపు కూడొద్దంటినే, మనిద్దరికే కదంటె ... ఇలాటి నెయ్యన్నంతినే పెబు వులు ఓ అర్ధరూపాయిస్తే పొట్ట గడవదంటె ఎదవ పన్జేయమంటావ్!'

పెంచెలు ముహంలో కొద్ది వెలుగు తొంగి

చూచింది. 'సరేలే' పున్నెకాలం ముండాకొడుకివి. బతకటం తెలిసి చస్తేనా!' అంటూ రెండడుగులు వేసి 'ఇదుగో కిష్టిగా సెప్తన్నా! ఆ ముండకాడికి వెళ్ళినా దానికూతురుముండకు కూడెట్టినా డొక్క చీరేస్తాను. నాయాల్ది తప్పదుముండ.

'ఎంత సంపాదించినావ్. నీ వద్దంటే ఆడికి సావకుండా ఉండవ్. ఏదీ యిటుతె

'పెద్దగా లేవేబాబు! ఓ సార్ ముప్ఫయ్పైస లిచ్చిండు. ఇంకో సారు పావలా కాసిచ్చిండు ... యింతేనే.

పెంచెలు ఆ డబ్బు లూడలాక్కున్నాడు.

'పొద్దనే టీ అయినా తాగావా లేదా! ఎదవా' మొఖమెట్లా ఎండినాదొ...నాయర్ కాడికెళ్ళి నా పేరు సెప్పి ఓ బన్నూ సింగల్టీ తాగు' అంటూ హెచ్చరించి మరీ వెళ్ళాడు.

ఆ తండ్రి దురుసుతనానికి నే విచారపడుతూ క్రిష్టుడి వంక చూచాను. అబ్బ వెళ్ళగానే వచ్చేనవ్వు నాపుకొంటూ సంతోషంతో ఈలవేస్తోన్న క్రిష్టను చూచేసరికి ఆశ్చర్యం వేసింది.

'ఏమిట్రా. ఉన్నదంతా మీ అయ్య ఊడలాక్కొంటె నీవ్ నవ్వుకుంటూ పాడుకొంటున్నావ్?'

'ఆడికేం తెలుసుద్ది సార్ నాకాడ ఎంతుందో! నిన్నరాత్రేల సిన్మాహాల్లో ఏరుశెనక్కాయ లమ్మిన కాడ్నుంచి యిప్పటివరకూ రూపాయి డెభ్భైపైసలు. ఇవుగో సారూ. మా అయ్యకు అగపడకుండా యీడ దాచేసినా.

నిక్కరులోపల బెల్ట్ భాగంలో కన్నంగుండా రూపాయికాగితం యాభైపైసలబిళ్ళాలాగి చూపెట్టి ఆయనకు తెలుస్తే యివ్వికూడ గుంజకెల్తాడు.' అన్నాడు చక్రాల్లా కళ్ళుత్రిప్పుతూ

'మీ నాన్న ఎందుకలా చేయడం?'

'డబ్బులుంటే మాయమ్మకాడికెళ్ళి ఇస్తననే... ఈ అర్ధరూపాయెట్టి మా సెల్లికి పండక్కు లంగా జాకెట్లు కొనాలి. మా రమణయ్య మాష్టారు బార్య గారికాడ దాచిపెట్తండా బాబు. ఈ రూపాయేమొ,మా అమ్మ కూటిగింజలకు నే...సెల్లిందాకా మాయమ్మ ఏడస్తానేఉంటది సారూ...ఇదుగో సారూ యీయిసయం మా అయ్యకు సెప్పబాకండి. నానెళ్ళినాక మా అయ్య అడతాడు. .మీరుమాత్రం సెప్పనేకూడదు'. అమాయకం తొంగిచూచే ముహంలో భయాందోళన తొణికింది.

ఇలాంటి సెంటిమెంట్ నన్ను మరీ ఇంప్రెస్ చేసిందొటంచేత 'మీ చెల్లి వస్తేస్తున్నట్లు మీ అయ్యకు తెలియదా?' అని అడిగాను.

'ఎట్ట తెలుసుద్ది! మా ముసిల్ది అదే మా యవ్వ సెప్పిందాక నాకూ తెల్సిందీ! మా యవ్వ సెప్పినాక మా అమ్మకాడికెళ్ళి సూచినా చిట్టాము నీడ పెట్టినా! ఈ హోటలు కాంట్రాక్టరయ్యోరు యింటికాడ మా యమ్మ శాన్నాళ్ళు పాచి పస్జే దంట.

'మరి మీ నాన్న.

'ఈ మధ్య ఎవరో సెప్పారంట ఎవుడేముందిలే ఆ గురవడిపనే ... ఎదివ సుప్పనాతి మొగమోడు ... అయ్యకు నామీదెక్కులు , సెప్తడు మా యమ్మిసయం మాసిట్టా మిసయం ఎట్ట తెల్సిందో...ఎట్టగేంటిలే బాబూ ఎరక్క ఆ నాయాలు పెద్దోడు గందాని తోడెట్టుకెళ్ళినా. అడనుంచి ఒకటే బయమెద్తున్నాడు...మీ అయ్యకుసెప్తా...మీ అయ్యకు సెప్తానంటూ ... అందుకని వాడికి రోజుకు ఇరవై పైసలెట్టి ఒకబన్నూ, సింగల్ టీ, మరో ఐదెట్టి తాజమాల్ బీడిలు యిప్పిస్తనేఉండా ... ఇశ్వాసం లేనోడు .తిరగమళ్ళి కొడ్దమంటె ఆడు ఎద్దంతగాడ్దె కొడ్కు. అయినా ఆడికెందుక్కు సెప్పండి, మాయమ్మ కాడికి నే నెల్తుంటె యీడికేం కడుపుమంట. అప్పుడప్పుడు సిన్మాగ్గూడ తీసికెల్తుంటినే ... వాడమ్మ మూటలుమోస్తది. వాడయ్య గుడ్డోడు. కాశేశ్వర్రావ్ మార్కెట్కాడ గుడ్డపరచుకొని అడక్కతింటన్నాడు. ఈ గాడిదకొడ్కు వాళ్ళయ్యా అమ్మకు కూడెట్టక పోగా, కొట్టి డబ్బుచుకొంటా డెదవ.'

నా కళ్ళు చెమ్మగిల్లాయి. ఆప సి మనసుపట్ల ఆత్మీయత యే మూలనో మేల్కొంది. నే మనిషి నౌటంచేత ననుకొంటాను.

'మరి ఒక్కోరోజు డబ్బు దొరక్కపోతే యేం చేస్తావురా క్రిష్ణా!' ఆ చిన్నమెదడు ఎలా సాల్వ్ చేస్తుందో చూద్దామని.

'ఏముంది సారు. మా అయ్యకాడ అరువుచ్చు కొంటాను. మా యింటికాడ ప్లేట్‌మీల్స్ దొరుకు తుంది సార్. ఆడకెళ్లి యాభై పైసలెట్టి ఎత్తు కెళ్తే అదే మా చిట్టాము, వాళ్లమ్మా తింటారు. మళ్లీ డబ్బురాగానె మా అయ్యబాకీ తీరుస్తా. లేకుంటే అసలూరుకోడు. ఆయనకూ డబ్బుకూ లంకె.'

'మరి నీకో'

'నాదేముంది సార్. కేరీర్ల అప్పలమ్మకాడి కెల్తే ఆ యవ్వే యింత పెడ్తది. అప్పలమ్మది మాగూడె మేలే బాబూ! కాలేజీ కుర్రాళ్లగదుల్లో పన్జేస్తుం టుంది. ఉదయానె కసపూర్చడం, బాల్చీలనిండా నీళ్లు పట్టేయడం, ఎర్రకూజాల్లో మంచినీళ్లెట్టడం, ఆ మీద కేరీర్లు అయ్యర్ హోటల్నుంచి పట్రావటం. వాళ్లు తినేసిన తరువాత తొలుచుకు రావడం. ఇదండీ ఆయవ్వ సేసేపని. పాపం పెద్ద ముండ కదండీ కేరీర్లు తేలేక నస్తదని నే సాయం చేస్తుంట.ఆరు తినంగా మిగిలింది అదేనండీ సాంబారు, కూర యింత అన్నమూ కలిస్తే నాకూ ఆ యవ్వకూ సరిపోద్ది సార్.'

'ఈ విషయం మీ అయ్యకు తెల్సురా!'

'తెల్సేమిటి సార్ ... అప్పు డప్పుడూ సాంబార్ పట్టుకెళ్లి మాఅయ్య కిస్తుంటే. కానీ సారూ మా అయ్య నడగండి. తన కిదేమీ తెలవనట్టే మాట్లాడు తాడు. అన్నట్టు మీ రేంచేస్తారు బాబూ!'

...చెప్పకూడ దనుకొంటూనె'టీచ రుద్యోగంరా' అనేశాను. 'అరే. మీరూ బడిపంతులే. మా యింటి కాడ రమణయ్యమాష్టారు కథానాయకుడి సిన్మాలో నాగయ్యగోరులా గుంటరు. పాపం ఆరికి జీతాలు నెల నెలా రావంటండీ. అయినా నాకు తెలవక అడుగుతాను అంతజీతా లియ్యలేనోళ్లు యిస్కోల్లెందు పెట్టారి... ఆరి బార్యగారు శానా మంచోరు.మొన్నగాది పండక్కు సారూ, నాకూ సిట్టాముకూ బెల్లబ్బువ్వపెట్టి గారెలు తినిపించినారు.'

'పోయిన దీపాలపండక్కుఏం జరిగిందంటారు?' నే పరధ్యానంగా ఉన్నట్టు తోచిందేమొ వాడికి 'ఊఁ కొట్టండి సార్'అన్నాడు 'రమణయ్య మాష్టారి ఐదో బుడ్డోడు వట్టి గడుగ్గాయండీ. పువ్వొత్తులు కాల్చు కొంటూ నన్నూ సిట్టామునూ ఉడికించి నాడండి. నానైతే పెద్దోణ్ణికనక ఊరుకొంటిని. మాసిట్టి ఆ టపాసు కావాలని గోలెట్టింది...అబ్బాయిగోర్ని అడిగి నాను...సారూ మా చెల్లిక్కూడా కూసింతసేపు పువ్వొత్తి పట్టుకొంటది అని. కాని ఆరివ్వలేదు. మా చిట్టామేమొ ఏడుపు లంకించుకొంది. ఈ యిసయం పంతులమ్మగారు ఏడనుంచి గమనించారో గానీ, కాక రొత్తులపెట్టె రొంటిన దోపుకొని ఆ రబ్బాయ్‌గోరు సూడకుండా తెచ్చియిచ్చినాది. ఎట్ట గన్నా నెయ్యన్నం తినేవోళ్ల బుద్దులు అలాగేలే బాబూ!'

నేను ఆశ్చర్యపోతున్నాను. ఆ చిన్నిమనసులో యెన్ని గమనింపులు! ఎన్ని బాధ్యతలు! మరెన్ని ఆశ యాలు!

'సారూ. మనుషులు మారాలి సిన్మాసూవారు టండీ'. మళ్లీ ప్రశ్న.

'ఆ'...నా సమాధానం.

'నాకు తెల్దుగానీ ఆశమ్మ–అడక్కతింటోంటే పిల్లల్ని ఎందుకండీ కొడద్ది. మరి ఆళ్లకేమొ పాపం ఆకలేస్తుందె. ఆరి యమ్మేమో పెట్టకపోయె. మరి అడక్కతింటుంటే కొడ్తే యెలా సార్.'

'అది తప్పుపనేరా క్రిష్ణా'

'పోన్లెండి, మీరు మరీను. ఆకలిమం టిసయం మీకేం తెలుసుద్ది సారూ. దొంగతనమన్నారూ అది

తప్పు యిసయమే. మరి అడక్కతింటం తప్పే ట్నాద్ది'

ఆ ప్రశ్న క్షణకాలం నిలవేసింది. వాణ్ణి తృప్తి చేసేలా చెప్పలేకపోయాను. చివరకు ఏమీ పాలుపోక 'అది తప్పుపనేరా నీకు తెలియదులే' అంటూ కొద్ది మోతాదుబింకంతో కసరి ఎస్కేప్ ఐనాను.

క్రిష్ణుడుగూడ క్షణం బిత్తరపోయి తేరుకొని 'అలాగటండీ! మీరు సెప్తన్నరుగనక అది తప్పిస యమే అయ్యుంటుంది. మరి సారూ, యీ యిసయం రాములుగాడితో సెప్తా! ఆడితాత అడక్కతింటం టాడు. మనవడ్నితోడురా అని గోలెడ్తాడు గూడా'.

'వాడెందుకూ ?' అయిష్టంగానే అడిగాను.

'అబ్బే యింతపెద్దోరు. ఆ మాత్రం తెలియ కుంటె యెట్టనండీ! మరి ఆడు గుడ్డోడయ్యే. కర్రుచ్చుకోడాన్కి యింకో డవసరం గదటండీ !'

'అలాగా పాపం' సానుభూతి చూపాను.

క్రిష్ణ బ్రష్‌తో నెత్తిన కొట్టుకొంటూ 'మీరూ నమ్మేశారూ. భలే వోరె ! అసలు రాములు గోడితాతకు కళ్లేం పోలేదు సార్. మరి గుడ్డోడనక పోతే ఓరేస్తారేమిటి పైసలు. అందుకని ఆ ముసి లోడు కళ్లదోలాపెట్టి వణక్కుంటూ నడస్తాఉంటే, రాములుగాడేమొ బాబూ! మా తాతకు కళ్లగపడవ్. గుడ్డోడు, మా అమ్మ హాస్పిటాల్లో కనపొద్దులై సచ్చిపోయినాది. మా అయ్యసెయ్ రైలుకిందపడి యిరిగిపోయినాది. దిక్కులేనోళ్ళం బాబులూ అంటూ సిన్మాలో పాట పాడ్తడండి, సాయింత్రానికి మూ్డ్రూపాయిల్ కళ్లసూచాడే అనుకో.'

'ఐతే రాములుకు అమ్మా నాన్నా ఉన్నారంటా వేమిటి ?'

'అమ్మా నాన్నా లేకపోతే ఆడెటా పుట్టా డండీ ! యాడనో ఉండే ఉంటారు.'

ఈ విధంగా నా ఊహలన్నింటనీ కొట్టి పారే శాడు క్రిష్టుడు. నాలో అహం తలెత్తింది. 'ఆ చెప్పే దేమిటో సరిగ్గా ఏడవ్వోయ్. పెద్దపోజా నీవూ !' అన్నాను.

'మీ క్కోపమొచ్చినాది.' మొగం వొంచుక్కొ న్నాడు. నాకు జాలేసి 'రాలేదులే చెప్పూ అసలు విషయం' అన్నాను, తెచ్చుకోలు నవ్వుతో.

వాడూ నవ్వాడు. మంచు తడిసిన మల్లె పువ్వులా.

'మరంటండీ! పాపం రాములుకు అమ్మా నాన్నా ఎవరో తెలవదటండీ. ఓరో కాలోజ్ అమ్మాయ్ కనేసి తెల్లారగట్టసెప్పా పెట్టకుండా సెక్కేసిందంట. ఆ హాస్పిటాల్లో తాతకు పన్లేండి. అమ్మ కక్కుర్లేని పసిగుడ్డును ఆ ముసిలాడు తెచ్చుకొని పెంచుకొన్నా డంట. ఇదంతా మా అయ్య సెప్పాడు...మరి సారూ రాములుగాడికి అమ్మా నాన్నా ఉన్నట్టేనా !'

నాకు నోటమాట రాలేదు. ఒక నిట్టూర్పు విడచి 'లేదురా నిజంగా రాములు దిక్కులేనివాడేరా క్రిష్టా' అన్నాను.

'అది పోనీయండి సార్. బెల్లబ్బువ్వ వండు కోవాలంటే ఎంతొద్ది ? మరేనండి మా సెల్లి పెళ్లికి ఓ పెద్దగుండిగ వొండి గూడేనికంతా బంతె ట్టాలండి.'

'మరి సినిమాలోలాగ నీ చెల్లెల్ని ఓ లక్షాధి కారికిచ్చి చేస్తావుట్రా.'

'పొండి బాబూ ! ఎందుకండీ ఎదవలక్షలు. సక్కంగా నాలా కష్టపడేవోడికిచ్చి చేస్తా. సిలకా గోరెంకలా ఆడుతూ పాడుతూంటారు.'

పైరుమీది పిట్టలా చెంగుచెంగున అన్ని విష యాలను అవలీలగా తీసుకొంటూ, సాల్వుచేసికొని రివ్వున జీవనాకాశంలో విహంగంలా ఎగిరే స్వభావం అలాంటి కృష్ణకే లభ్యమైంది. ఈ నాగరక ప్రపం చంలో కాగడావేసి వెతికినా అలాంటి కృష్ణలు అగు పించరు. ఇంతలో వాల్తేరునుండి ట్రైన్ వచ్చింది. జనం బిలబిలా అటూ యిటూ పరుగెత్త సాగారు.

'అడుగోనండి గురవడు. ఇయ్యాల వాడిపని మహజోరుగా ఉండదిలే. బెర్త్ రిజర్ చేసాడంటె అర్థం రూపా యిచ్చుకొంటాడు. అంటూ' ఒకక్సిచూపాడు.

'ఒరేయ్ మొద్దునాయాల! బెర్త్ ఖాళీగా వుందేహ్! తొందరగా సావ్. ఫిఫీ.' గురవడికేక.

క్రిష్ణ నాముఖం చూచాడు. నే కళ్లతోనే అనుమతించాను.

క్రిష్ణ వెళ్లిన ఐదునిముషాలకు పెంచె లొచ్చాడు. వస్తూనే 'ఆడేడండీ. యాడకెళ్లాడు?' అంటూ అడిగాడు.

ఇంతవరకు క్రిష్ణ విషయంలో యేదో తెలి యని బాధ్యతమీద వేసుకొన్నట్లుగా ఫీలైనానెమొ రాములమ్మ విషయంలో పెంచెలు కొద్ది విశాలబుద్ధి చూపిస్తే క్రిష్ణపట్ల కొంత న్యాయం జరిపించిన వాడి ఔతాననిపించింది నాకు. అందుకే కదిపాను.

నా బిడ్డకు తల్లికాకుండా పోయిందా. ఇంక దానిబిడ్డకు తల్లిమాత్రం ఎందుకుండాలి'... సూటిగా పెంచెలు ప్రశ్నవేసాడు.

నేను జవాబు వెతుక్కోవలసి వచ్చింది. నేనేదో చెప్పబోయాను.

'అదంతా నాకుతెల్సు బాబూ! ఆ ముండ యాడుందో దానికూతురేడ పన్జేస్తుందో అంతా తెలవ దను కొన్నారా! ఎందు కూరకుండా ననుకొన్నారు. నా క్రిష్ణిగాడికోసరం. ఆడికి అమ్మమీదెంత పేమ. దాని కూతురు నంటిదంటే యెంతయిది! ఆడు బాధపడి పోతాడని ఊరకొండాగానీ లేకపోతే ఆపెళ్లాం ముండను నరికేసి పోలీసులకు సిక్కేవోణ్ణి!'

పెంచెలు పై పంచతో కళ్లొత్తుకొని 'నా బిడ్డకు బగమంతుడు తల్లిలేకుండా జేశాడు. నేనీ పని జేస్తే తండ్రికూడా లేకుండాపోతాడే అని నా తపన బాబూ' అంటూ బావురుమన్నాడు.

'అది సరే. ఆ పసిది యేం చేసిందని దాన్ని చూడొద్దంటావ్?'

'మీకు తెలియం దేముంటది. అది కట్టుకొన్నా డని నట్టేట్లో వొగ్గేసి వెళ్లినదాని కూతురు. దాని కడుపున పుట్టినాది. 'దీనిబుద్ధి అదేయ్యైతే నారాతే యింకో మొగాడికి రాస్తదని యిశారం దొరా!'.

నన్నెవ్వరో వీపుపై ఫెళ్లున చరిచినట్లైంది. అయినా కొద్ది తమాయించుకొని 'క్రిష్ణగూడ ఆమె బిడ్డడేగా' అన్నాను.

పెంచెలుకు వల్లమాలిన బాధేసింది. వగర్చు కొంటూ 'ఆడు నాబిడ్డ! సెంద్రుడికైనా మచ్చ ఉందిగానీ నా కొడుకుబుద్ధికి సెరువులేదు' అన్నాడు. చటుకున నా రెండుచేతులు పట్టుకొని 'అన్నింటి కంటె యింకోభయం బాబూ! వాళ్లమ్మమాటిని నన్నీ వయసులో యిడిసిపెట్టేస్తే నాగతేంకాను. ఈ ముసలితనంలో ఆసరాయేది బాబూ' ంటూ వెక్కిళ్ల పెట్టాడు.

అంతరాంతరాల్లో సుళ్లు దిరిగే అనుమాన భయం.

అర్ధంకాని మమతాను బంధం.

'ఏడవకు పెంచెలూ! నీ కొడుకు అందరిలాంటి బిడ్డకాదు. నీవ్ అదృష్టవంతుడివి'.

ముసలిపెంచెలు కళ్లల్లో ఆశ చిప్పిలటం చూచాను.

'ఎలాగైనా క్రిష్ణమనసు అర్థం చేసుకో. క్రిష్ణజీవితం వికసించే పూవు. క్రొత్తగా ఎగర టానికి రెక్కలార్చే పిట్టలాంటిది. వాస్తవంగా బిడ్డకు తల్లీ తండ్రీ రెండురెక్కలు. అందుకోసరం మనం ఇష్టమున్నా లేకపోయినా మనసులో కన్నా జీవితంలో రాజీ పడాలి ఆలోచించు. రాములమ్మను క్షమించగలిగితే... నీ బిడ్డకోసం...చేయి.'

రెండుక్షణా లాలోచించి 'సరేబాబూ—నా బిడ్డ కోసం నేనేమైనా చేయగలను. ఒకవేళ యేదైనా నా బిడ్డకు అంటూ' శంకతో చేయి చాపాడు. అభయ మిస్తోన్నట్లు నాచేతి నుంచాను.

'చాలు బాబూ...చాలు. నాక్కాస్త యవధానం యివ్వండి. మళ్లీ మీరు తిరిగొచ్చేవేళకు అంతా అయి పోద్ది...అడుగో బిడ్డొస్తున్నాడు. ఆడి కివన్నీ సెప్ప బోకండి' అంటూ కొడుకును తప్పించుకొని వెళ్లాడు.

నే తృప్తిగా గాలి పీల్చుకొన్నాను. నిజంగా జీవితంలో ఒక మంచిపని చేశాననుకొన్నాను.

* * *

'మీరు పోయే పని పండాొద్ద సార్. బగమంతుడంటోరు. నే సెప్తన్నాగా...వొచ్చేప్పుడు నాకేటి బగుమతిస్తారో చూస్తా !'

పెట్టెలో కూర్చొన్న నాకు నమస్కరించి చెప్పాడు క్రిష్ణ. ఆమాటలు నా గుండెలో చల్లనిగాలి వీచింది.

'మరైతే నీకేం కావాలో చెప్పరా ?'

'నా కేటి బాబూ ! సర్దా కడిగినా!'

వాడికేమైనా యివ్వాలనిపించింది. అందుకే రెట్టించి అడిగాను. ఇంతలో బండి కదలింది.

'అంత మనుసైతే మా సెల్లాము కొక లంగా జాకెట్టు పట్రండి సార్! నాకేటి'.

క్రిష్ణ చేతులు జోడించాడు. నే పులకించాను.

బండి వేగం పుంజుకొంది. అప్రయత్నంగా మా నాన్న తుదిమజిలీ గుర్తొచ్చింది.

నాన్న ! దేవుడు ! అరవైయేళ్ల జీవితం తాలూకు వడగాలుల్లో వగుడాకై పోయిన పరిపూర్ణ మానవుడు. నిండుమనసుతో 'పెద్దాడా' అని తల నిమిరే చల్లనిచేయి !

తన హయాంలో, పదహారేళ్లలో తండ్రిని పోగొట్టుకొని కుటుంబాన్ని బుజాలపై వేసుకొని, తమ్ముళ్ల చదువులూ, వాళ్ల పెళ్లిళ్లూ, పండగలూ పబ్బాలూ, సర్వమూ వాళ్లేయని తండ్రిలా [illegible]ద్దిన పెద్దబిడ్డ నాన్న !

కానీ వెనక్కుతిరిగి వృద్ధాప్యంలో చూచుకొంటే తండ్రి అప్పగించిన భార నిర్వహణలో,

కట్టుకొన్న పెళ్ళాన్ని, కన్నపిల్లల్ని ఉపేక్షచేశానే, అనే విచారం మిగిలిం దాయనకు.

రెక్కలొచ్చిన పక్షులు ఎవరిగూటిని అవి చూచుకొన్నాయ్. వాళ్ళ పెళ్ళాలూ పిల్లలూ గూళ్ళూ— అంతదాకా నీడయిచ్చిన కొమ్మనే మరచారు.

బతకలేని బడిపంతు లుద్యోగంలో బతుకీడ్చు కొచ్చి రిటైరైన నాన్నకు, పెళ్ళికి సిద్ధమై కూర్చొన్న రెండోకూతురు పెద్ద సమస్యగా ఎదురైంది. గతం తలుచుకొని కళ్ళనీళ్ళు చేసుకొనేవాడు. అదే సమయంలో వారసత్వంలా, బడిపంతులై దిగబడ్డాడు తను. కొండంత ఆశ మళ్ళీ చివురించింది. కానీ గొర్రెతోక జీవితంలో ఏంచేయ గలిగాడు. నాన్న బ్రదికుండగా చెల్లెలుపెళ్ళి చేయలేకపోయాడు తను.

తుది క్షణాల్లో చేరువకు పిలిచి ... 'పెద్దాడా ! అమ్మాయిరా...ఏంచేస్తావో' అంటూ కళ్ళు వాల్చాడు. తుది శ్వాసలోగూడ ఆ కళ్ళు కూతుర్నే చూస్తూ వాలిపోయాయి. ఆ నాటి బాస యింతవరకు నెరవేర లేదు.

ఎన్ని సంవత్సరాలు ! అడిగిన కట్నం ఇచ్చుకోలేక అంతస్తులకుతూగలేక అన్నీ ఎండమావులే ! మళ్ళీ ఇన్నాళ్ళ కొక్క అవకాశం. దూరపుబంధువు ద్వారా సంబంధం వచ్చింది. కొండంతఆశతో బయలుదేరాను...అమాయికపు పసికందు క్రిష్ణ పండౌంతుందంటూ శుభం పలికాడు ... నిజంగా నా తపస్సు ఫలిస్తే ! తిరుగు ప్రయాణంలో వాణ్ణి సంతోషపెట్టాలి. ఎంత పెద్దమనసురా క్రిష్ణా !

'నీవు కోరుకొనేట్లు యీ సమాజం మారి పోవాలిరా క్రిష్ణా ! నా తరంలోని మనుషులు వెన్నెముకలేని జీవాల్రా ! ప్రతి జీవీ స్వార్థంతో యింకో జీవిని తింటోందిరా !.

'ఒరేయ్ తమ్ముడూ ! నే చెప్తున్నా ! మీ తరంరా మీ తరంలో అందరూ నీలాంటి యువకులే పుట్టాల్రా ! గుండె నిబ్బరంతో కండ కరగించి నవ సమజాన్ని సృష్టించు కొంటారురా ! అప్పుడు నాలా ఓ చెల్లి పెళ్ళి చేయడానికి నే పడుతోన్న వేదనలో లక్షాతొంభైవంతైనా నీవ్ పడడానికి వీల్లేదు ! ఇప్పటి తరం తలొంచుకొనేలా మీ తరం నిలవాలిరా ! ఆ నాడు నే బ్రతికుంటే, ఆ ముడతలుబడ్డ వయస్సులో, పండబారిన మనస్సుతో గుండె నిండుగా క్రొత్తరక్తాన్ని పుంజుకొని నీవెంట పరుగెడ్తారా! ఇది నిజంరా ! నీ చెల్లి పెళ్ళికోసరం నాలా బొట్టు బొట్టూ రక్తాన్ని పిండనక్కర్లేదురా తమ్ముడూ !'

ఇంతలో ఎవరిచెయ్యో నా బుజంమీద పడగానే భావలోకంలోనుండి యిటు దొర్లాను. ఫెళఫెళా క్రొత్తనోటులా టిక్కెట్ కలెక్టర్ చేయ్ జాపారు. టిక్కెట్టు అందించాను.

తల త్రిప్పేసరికి గమ్యం చేరింది ట్రైన్.

*

తిరుగు ప్రయాణం రెండ్రోజు లాలస్యమైంది. క్రిష్ణమాట నిజమైంది. నా చెల్లిపెళ్ళి మైంది.

తిరుగు ప్రయాణం ఎంత సంతోషం ! ఇదంతా వాడి చలవే !

విజయవాడ వస్తోండగానే ఎక్కడలేని ఉత్సాహం నాలో ఉరకలేస్తోంది. ఆ పసిమనసులకోసం నే కొన్న ఫ్రాకూ షర్టూ క్రిష్ణ అగవడగానే, బండి దిగుతోండగానే అందీయాలి.

'ఆ కళ్ళల్లో ఎన్ని మతాబాలు వెలుగుతవో చూడాలి'. అనుకొంటుండగానే బండి ఆగింది.

అదే నాబూట్ పోలీష్‌చేసిన స్థలం ... అరే ఏమిటి వాడు క్రిష్ణయేనా ! ఆ నవ్వేది ! ఆ చలాకీ తనమేది !

'ఒరేయ్ క్రిష్ణా ! ఆలస్యమైందని కోప మొచ్చిందిరా ! రారా ఇవిగో ఏంతెచ్చానో చూడు... ఈ గౌను నీ చిట్టిచెల్లాయ్‌కి...ఇది...'

'సారూ' అంటూ గొల్లుమన్నాడు క్రిష్ణ.

అతని ప్రక్కనే చిట్టి బిక్కుబిక్కు మంటూ.

'అరే! ఏమైంది ...' నా సునసు మూల్గింది.

'పాపం పెంచెలు మొన్న బండెక్రిందపడి చని పోయాడు సార్'. మరో పోర్మరు చెప్పాడు.

నాతల తిరిగింది. ఎక్కడుందీ ఏమైందీ తెలియడంలేదు.

'అమ్మగూడా ...'

'ఆ !'

'ఔను సారూ! మా అయ్య శవాన్ని చూస్తూనే పడిపోయింది అంతే.'

'ఇక్కడ తలాకాస్త చందాలేసుకొని రెండు శవాల్ని దహనంచేసాం బాబూ. రారా క్రిష్ణా అంటే 'బాబుగా రొస్తారు. వారెంట తీసకెళ్తారు' అనిఒకటే యిది బాబు. ఆ నాటినుంచి వీడు పచ్చినీళ్లన్నా ముట్టలేదు. 'బాబు' వీళ్ల మునుపే తెలుసా సార్'. మరోవ్యక్తి.

క్రిష్ణ నా కాళ్లను చుట్టేసుకొన్నాడు.

'సార్ మా అయ్యసేతిలో సెయ్యేసి మీ కిష్ణ కొచ్చిన బయం లేదన్నారంట ... అయ్య సచ్చిపోతూ 'వారే క్రిష్ణ బాబుగారు శాన మంచోరు ... తప్ప కుండా వొస్తారు. ఆరు రాగానే మా అయ్య మీరు సెప్పి నట్లే చేశాడంట బాబూ' అని సెప్పమని పాణాలు యిడిసేసాడు'.

క్రిష్ణ చెప్తోన్న మాటలు వింటూంటే నిలవలేకపోతూ అతిబలవంతంమీద నిబ్బరించు కొన్నాను.

'మా కీడ దిక్కెవ్వరూ లేరు సారు. నన్నూ సిట్టామునూ మీయెంట తీస్కెళ్లండి. ఆడ హాస్టల్లో మా సెల్లాయ్‌ని జేర్పించండి...నేనేమో...'

నాకు మాటలు పెగల్లేదు. రాతిబొమ్మనైనాను.

'మీ రూరికే సదియించ క్కర్లేదు సారు. మీ కొక చిట్టి బాబున్నారంటిరిగా ... ఆరిని ఎత్తుకొని మోస్తాను. అబ్బాయ్‌గోర్ని ఏడవకుండా ఆడిస్తా ... మా సిట్టాంకూడా బాబుగోర్ని ఆడిస్తది. ఇంకా యింట్లో పనంతా అదే సారూ కంచాలు చెంబులు మా సెల్లి తోలుస్తది. నేనేమొ నీళ్ల తోడిపోస్తా...'

వాడిమాటలు చెవుల్లో రింగుమంటున్నా నాలో శూన్యం చోటుచేసుకొంది.

చేతిలో క్రొత్తగుడ్డలు జారిపడ్డాయ్.

నా రెండుచేతులూ ఆ యిద్దరి శిరాలను స్పృశించడానికి సాగాయ్...

నా ఎదురు శూన్యంలో కన్నీళ్లతో పెంచెలు ముఖం ...

నాలో !



# సోల్ ఝెనిత్సిన్ అవస్థ

ఆలిస్ సోమర్‌ఫేల్డ్

'ఇవాన్ దేనిసోవిచ్ జీవితంలో ఒక రోజు' అన్న ప్రఖ్యాతమైన కథ ప్రకటింపబడి పది సంవత్సరాలైంది. ఆ కథను సోల్‌ఝెనిత్సిన్ వ్రాశారు. ఆయన ప్రఖ్యాత రష్యన్ రచయిత. ఆ గ్రంథం రష్యాలోనే ప్రకటించబడింది. ఆ రోజులలో కృశ్చేవ్ అధికారంలో వున్నారు. ఆ గ్రంథ ప్రచురణకు ప్రత్యేకం మంజూరు చేశారు. వీరపూజానిరసనఉద్యమంలోభాగంగా ఆప్రచురణ జరిగింది. ఆ సంవత్సరంలోనే, అనగా, 1962 లో, సోల్‌ఝెనెత్సిన్‌ను సోవియట్ రచయితల సంఘంలో చేర్చుకున్నారు. అనగా, రచయితగా ఆయనను గుర్తించారు.

'ఇవాన్ దేనిసోవిచ్ జీవితంలో ఒకరోజు' అన్న ఆ కథాగ్రంథం ప్రచురణతో రష్యాలో స్టాలిన్ శకాన్ని తెగడుతూ ఉవ్వెత్తున రచనలు సాగాయి. విమర్శలు చెలరేగాయి. ఆ స్టాలిన్‌శకంనాటి ఘోరాలు ఆ విమర్శలలో కడిగివేయ బడినాయి. ఒక సందర్భంలో కృశ్చేవ్‌కే, ఆ విమర్శాప్రవాహానికి ఆనకట్టకట్టడం అవసర మనిపించింది.

కృశ్చేవ్ తర్వాత బ్రెజ్నెవ్, కోసిగిన్‌లు అధికారంలోకి వచ్చారు. వారు ఆ నిరోధవిధానాన్ని మరింతగట్టిగా పాటించారు. ఆ విధానంయొక్క తీవ్రత సోల్‌ఝెనిత్సిన్‌కు అధికంగా తగిలింది. ఆయన అప్పుడు ఒకనవల వ్రాశారు. 'కాన్సర్ వార్డ్' అని—. అది 'నోవీమీర్' అన్న సాహిత్యపత్రికలో ప్రచురణ కావలసివుంది. ఆ ప్రచురణ జరగలేదు. చివరి క్షణంలో దానిని ప్రచురణకు వద్దని ఉపసంహరించి వేశారు. ఆ తర్వాత సోల్‌ఝెనిత్సిన్ 'ది ఫస్ట్ సర్కిల్' అన్న గ్రంథం రచించారు. సోవియట్ సాహిత్యాధికారులు దానిని తిరస్కరించారు.

కాని ఆయన ఆ రచనల వ్రాతప్రతులు ప్రచారంలోనికి వచ్చాయి. ఒకరి చేతులనుండి ఒకరి చేతులకు మారుతూ అవి ప్రచారాన్ని పొందాయి. అనతికాలంలో ఆ గ్రంథాలకు ఎంతో పాఠకలోకం ఏర్పడింది. ఎట్టకేలకు ఆ వ్రాతప్రతులు పాశ్చాత్యరాజ్యాలలోనికి వచ్చాయి. అక్కడ ప్రచురణ అయినాయి. ఇది జరగలేదే అనుకోండి; అయినా అప్పటికే రష్యాలో సోల్‌ఝెనిత్సిన్‌పేరు రోళ్లను రోకళ్లను ప్రసక్తం అయిపోయింది. ఆయన అంటే అక్కడ అపారమైన మన్నన పెరిగిపోయింది. అతి ప్రామాణికుడైన వ్యక్తిగా రష్యాలో జనులు ఆయన్నగురించి పరిగణించడం మొలుదపెట్టారు. సత్యము, ధర్మము—ఈ రెంటికి ఆయన రక్షకుడు అన్నట్లు ఆ ప్రజలు భావించడం సాగించారు. అధికారులు ఆయన్ను సరిగ్గా చూడక పోవడంగూడా ఆ ప్రతిష్ఠాపతాకం పతాకస్థాయిని అందుకొనడానికి ఉపోద్బలకమైన కారణం అయి పోయింది.

ఈ పరిస్థితిలో ఎవరిపుస్తకాలను వారు ప్రచురించుకునే పద్ధతిని రష్యన్ అధికారులు ప్రోత్సహించక పోవడంలో ఆశ్చర్యం ఏమీలేదు. అదేవిధంగా దేశంలో నిషిద్ధమైన గ్రంథాలు విదేశాలకు ఎక్కి, అక్కడ ప్రచురణభాగ్యాన్ని నోచుకోవడంగూడా వారికి నచ్చినవిషయం కాకపోవడం సహజం. విదేశాలలో అటువంటి గ్రంథాలు ప్రచురితం అయినప్పుడు, వానిని రష్యాపై వ్యతిరేక ప్రచారం సాగించడంకోసం వినియోగిస్తూ వుండటం పరిపాటి అయిపోయింది. పాశ్చాత్య దేశాలలో తమ గ్రంథాలు ప్రచురణ అయ్యేందుకు వీలు కల్పించినందుకు కొందరు కొందరు రచయితలను సోవియట్ అధికారులు శిక్షలకుగూడా

పంపించారు. అటువంటివారిలో సిన్యావిస్కీ, దానియేల్ వంటి వారిని పేర్కొనవచ్చు. సోల్‌ఝెనిత్సిన్‌మీద రష్యాపత్రికలు పెద్ద ధ్వజం ఎత్తాయి. ఆయన తాను వ్రాసిన నవలల్లో సోవియట్ రష్యాను అప్రతిష్ఠాకరంగా చిత్రిస్తున్నాడన్న విమర్శ అది. విచిత్రం ఏమంటే, ఆ గ్రంథాలలో ఆయన ఏమి వ్రాశాడో, రష్యాలో అధికారికంగా ఎవ్వరికీ ఏమీ తెలియదు; అయినా విమర్శ ఆయన్నుగురించి అట్లా సాగుతోంది.

1970 లో సోల్‌ఝెనిత్సిన్‌కు నోబెల్ బహుమతి ఇచ్చారు. ఆయన గ్రంథాలలో రష్యన్ సాహిత్య సాంప్రదాయాలు బాగా పోషింపబడినాయని, ప్రబలమైన నైతికశక్తి ఆయన గ్రంథాలలో నిబిడమై వున్నదని ఆ నోబెల్ బహుమానప్రదాతలు వర్ణించారు. ఇది రష్యన్ అధికారులకు భరింపరానిదై పోయింది. వారి ఓర్పు విరిగేందుకు చివరి తూకపురాయిగా పరిణమించింది. అయినా వారు సోల్‌ఝెనిత్సిన్‌ను విచారణకు నిలపాలన్నంత సాహసికవృత్తికి దిగలేక పోయినారు. దీనినిబట్టి ఒకటి కన్పిస్తున్నది. సోవియట్ పత్రికలలో సోల్‌ఝెనిత్సిన్‌నుగురించి విరుద్ధ విమర్శలు వెలయింపజేస్తే, అక్కడికి అదే మంచిపద్ధతి కాగలదని ఆ అధికారులు అనుకున్నట్లు కన్పిస్తుంది.

(అప్పటికే సోల్‌ఝెనిత్సిన్‌ను ఈ సోవియట్ రచయితల సంఘంనుంచి గెంటివేశారు.)

## కొత్త విమర్శ

రష్యాలో లిటరరీ గెజెట్—అని ఒక సాహిత్య పత్రికవుంది. అది విశేషమైన ప్రచారంగల పత్రిక. ఇప్పుడు ఆ పత్రికలో సోల్‌ఝెనిత్సిన్‌పై కొత్త విమర్శ వెలయించబడింది. ఈ విమర్శకు, తక్కిన విమర్శలకు ఒక్క తేడా వుంది. ఈ విమర్శ 'స్టెర్న్' అన్న పశ్చిమ జర్మనిలోని పత్రిక ప్రచురించిన ఒక వ్యాసం ప్రాతిపదికగా వెలయించబడింది. ఈ 'స్టెర్న్' పత్రిక రచయితలలో ఒకరు 'ఉత్తరకాకసస్' వెళ్లారు. సోల్‌ఝెనిత్సిన్ పుట్టినప్రాంతం అది. అక్కడ సోల్‌ఝెనిత్సిన్ దగ్గర బంధువు ఒకావిడ వుంది. ఆవిడతో మాట్లాడి రావడానికి ఈ 'స్టెర్న్' రచయిత వెళ్లారు. 'స్టెర్న్' పత్రిక ఈ రకమైన సాహసం చెయ్యడానికి వెనక కొంత కథవుంది. సోల్‌ఝెనిత్సిన్ కొత్తనవల 'ఆగష్టు 1914' ప్రచురణ అయింది. ఆ నవలలో చెప్పబడిన విషయాలకు, సోల్‌ఝెనిత్సిన్ జీవితానికివున్న పోలికలను, వైషమ్యాలను తెలుసుకోవాలన్న ఆకాంక్షే—ఆ వెనక కథ.

ఆ బంధువు స్త్రీ. సోల్‌ఝెనిత్సిన్‌కు మేనత్త అవుతుంది. వృద్ధురాలు. ఆమె సోల్‌ఝెనిత్సిన్ కుటుంబపు చరిత్రయొక్క వివరాలను గురించి చెప్పింది. సోల్‌ఝెనిత్సిన్‌లు అకించనులుకారు. ధనవంతులు. ఆ ధనంగూడా ఎక్కితక్కిగా వున్నవారు. విప్లవానికి పూర్వపు రష్యాలో సోల్‌ఝెనిత్సిన్ పినతండ్రి ఒక రోల్స్‌రాయస్‌లో ప్రయాణంచేసేవాడు. అటువంటి రోల్స్‌రాయస్‌లు రష్యాలో ఆ కాలంలో తొమ్మిదంటే తొమ్మిది వున్నాయి. అందులో ఇది ఒకటి. ఇక్కడ పేర్కొనదగిన అంశం ఒకటే. 'ఆగష్టు 1914'లో ఇటువంటి వివరం కొంతవుంది. 'స్టెర్న్' పాఠకులకు అది తేలిసేట్టు చేయడమే అక్కడి సంగతి. లిటరరీ గెజెట్‌లో ప్రచురింపబడిన ఈ విమర్శలో నవలలోని ఆ వర్ణన వదిలివేయబడింది. సోల్‌ఝెనిత్సిన్‌కు సంబంధించిన వానిఔచిత్యం ఏమిటో నిర్ణయించుకునే విషయం అక్కడ పాఠకులకే వదిలివేయబడింది. తాను న్యాయమైన సామాజిక సాదృశ్యాలను ఎంచడంలేదని లిటరరీ గెజెట్ వ్రాసింది. అయితే అక్కడ ఆ పోలిక ఎంచబడటం లేదన్న భావం కలగదు. సోల్‌ఝెనిత్సిన్ 1918 లో పుట్టారు. అప్పటికి వారి ఆస్తిపని అయిపోయింది. అప్పుడు వారు అంకిచనులే. సోవియట్ పద్ధతి విమర్శలో ఒక రకమైన ధోరణి సుస్థాపితమై వుంది. అది ఇది. తండ్రులు చేసిన పాపాలు ఏమన్నావుంటే, వానికి వారి పిల్లలనుగూడా బాధ్యులను చేస్తారు. ఆ పాపాలను ఆ పిల్లల తలలకుగూడా చుడతారు. వారి మనవళ్లనుగూడా వదిలిపెట్టరు. అట్లాకాదు అంటారు; అయితే కుటుంబచరిత్రలో వారికి ఆసక్తిలేదు అంటారు; అయితే వారు ఒక విదేశీ

పత్రిక ప్రతినిధిని—సంగతులు తెలుసుకునేందుకు ఎందుకు రానిచ్చినట్టు!

ఆ 'స్టైర్న్' వ్యాసం తర్జుమాచేసి వెయ్యడంలో లిటరరీ గెజెట్—ఇంకో విషయాన్నిగూడా వదిలి వేసింది. 1945 లో సోల్‌ఝెనిత్సిన్‌ను ఖైదుకు పంపారు. 'స్టైర్న్' వ్యాసంలో ఎందుకు పంపింది వుంది. లిటరరీ గెజెట్ తర్జుమాలోలేదు. ఆ 1945లో అది అట్లా ఎందుకు జరిగిందనగా — సోల్‌ఝెని త్సిన్—స్టాలిన్‌ను విమర్శించారు. యుద్ధంలో అగ్ర స్థానంలో ఆఫీసరు హోదాలోవుండి, యుద్ధం నడి పింప బడుతున్న తీరునుగురించి విమర్శచేశారు. సెన్సార్ అధికారులు ఆయనఉత్తరాలు పట్టుకున్నారు. ఇప్పుడు లిటరరీ గెజెట్ ఈ విషయాలను సోవియట్ పాఠకులముందు వుంచాలన్న వాంఛ కల్గినవారు కాక పోయినారు. స్టాలిన్‌శకంలో బాధలుపడిన అనేక లక్షలమంది వీరులలో సోల్‌ఝెనిత్సిన్‌కూడా ఒకరు— అన్న విషయాన్ని ఆ ప్రజల ఎరుకకు తీసుకు రారాదను కున్నారు.

ఆ 'స్టైర్న్' వ్యాసంలో ఏరిన కొన్ని భాగాలను వేస్తూ లిటరరీ గెజెట్ సంపాదకులు వానిమీద టిప్పణివంటి దానినిగూడా ప్రకటించారు. అక్కడ వారి విమర్శ రెండు ముఖాలుగా నడిచింది. 'ఆగష్టు 1914' సోవియట్ వ్యతిరేకత గల నవలఅని నిరూ పించాలన్నది ఆ విమర్శలో ఒకభాగం. అక్కడికి అదే ఒక పెద్దకార్యం. అందులోని విషయం 1914 లో రష్యాపొందిన పెద్ద పరాజయానికి సంబంధించింది. ఈ విమర్శ సందర్భంలో ఆ లిటరరీ గెజెట్ సంపాద కులు—ఆ నవల సోవియట్‌లకు వ్యతిరేకంగా వున్నదన్న విమర్శ చేసినట్లు చెప్పబడుతున్న పాశ్చాత్య విమర్శకు లనుగూడా కొందరిని ఉదాహరించారు. అట్లా చేసిన ఒకచోట ఆ పత్రిక సంపాదకులు టిప్పణి వ్రాయ వలసి వచ్చింది. అది ఎట్లా జరిగిందంటే, ఆ గ్రంథంలోవున్న 'రష్యాకు సంభవించిన పెద్దకష్టం' అన్న దానిని 1917 అక్టోబరు విప్లవానికి అను వర్తించే విధంగా ఆ టిప్పణి నడిచింది. సందర్భాన్ని బట్టి ఆ మాటలు 1914 లో రష్యాపొందిన పరా జయానికి చెందినటువంటివని స్పష్టంగా తెలుస్తూనే వుంది.

సోల్‌ఝెనిత్సిన్ అవలంబించిన సోవియట్ వ్యతిరేక ధోరణులపట్ల 'స్టైర్న్' వ్యాసం సానుభూతి కల్గివున్నదని ఆ సంపాదకులు ఒకమాట అన్నారు. నిజా నికి ఆ వ్యాసంమొత్తంమీద సోవియట్‌లకు వ్యతి రేకంగా వున్నమాట ఒక్కటికూడా లేదు.

లిటరరీ గెజెట్ చదివే పాఠకులకు అసలు 'స్టైర్న్' వ్యాసాన్ని చూచే, చదివే భాగ్యంలేదు. అందు వల్ల వారికి సంగతి సందర్భాలు ఏమిటో తెలుసుకోగల స్థితిలేదు. అక్కడ ఆ పత్రిక సంపాదకులు టిప్పణిలో ఉపయోగించిన తర్కం అందరికీ స్పష్టంగా కన్పించే స్థితిలో వున్నది. నోబెల్ బహుమాన గ్రహీత అయిన మహారచయితను విమర్శకు గురిచేయడానికి వారికి అక్కడతగిన ఉపపత్తులు లేవన్నదిగూడా స్పష్టంగా కన్పిస్తూవుంది. ఇటువంటి తగాదాలు తటస్థం అయినప్పుడు, వానిని తేల్చుకోడానికి వున్న పద్ధతి ఒక్కటే. అది సోల్‌ఝెనిత్సిన్ నవలలను రష్యాలో ప్రకటించడం; ఆయన ఏమి వ్రాశాడో చదువు కొని అక్కడి పాఠకులుఏమి అనుకుంటారో చూడటం. ఇటువంటి ఆలోచన అక్కడి అధికారులకు ప్రియ మైనదిగా తోచదు.

## పాత పద్ధతి

లిటరరీ గెజెట్ మామూలు పాతపద్ధతి విమర్శల త్రోవలోనే పోయింది— సోల్‌ఝెనిత్సిన్ సంపన్న కుటుంబంలోంచి వచ్చాడు; ఆ కుటుంబం బీదవాళ్లను అణచివేసింది. సోల్‌ఝెనిత్సిన్‌కు ఒక మేనత్తవుంది, వృద్ధురాలు. అతడు ఆమెను చూడ్డానికిగూడా పోడు; సోల్‌ఝెనిత్సిన్ జైలుశిక్ష అనుభవించాడు; ఒక సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో సోల్‌ఝెనిత్సిన్ దగ్గర బంధువు పనిచేస్తున్నాడు. సోల్‌ఝెనిత్సిన్ అతణ్ణి చూడడు; — ఈ విధమైన పద్ధతిలో లిటరరీ గెజెట్ విమర్శవుంది.

ఈ విమర్శకు సోల్ఝెనిత్సిన్ సమాధానం వ్రాశారు. ఆ సమాధానం ఇంతవరకు ప్రచురణకాలేదు. కాని రష్యాలో అప్పుడే అది విశేష ప్రచారం పొంది కూర్చుంది. మాస్కోలోని పాశ్చాత్యదేశాల పత్రికల విలేఖరులకుకూడా ఆ సమాధానాన్ని అందజేశారు. అందులో సోల్ఝెనిత్సిన్ ఇట్లా వ్రాశారు :

'నా దేశంలో వర్తమాన పరిస్థితులనుగురించి నేను ఇంతవరకు సూటిగానే నా రచనలలో వ్రాస్తూ వస్తున్నాను. పొడుపు కథలకు, కథలు గాథలకు దిగలేదు.'

ఈ మాటల అర్థం ఇది. రష్యాలో ప్రస్తుత ప్రభుత్వాన్ని విమర్శించవలసి వస్తే, ఆ విమర్శను తాను సూటిగా, వంకర్లు తిరక్కుండానే చేసేవాడినని సోల్ఝెనిత్సిన్ అంటున్నారు.

'స్టెర్న్' వ్యాసాన్ని గురించికూడా ఆయన ఆ సమాధానంలో వ్యాఖ్యానించారు. తమ మేనత్తగారు నివసిస్తూవున్న 'ఉత్తర కాకసస్' ప్రాంతం విదేశీయులు ఎవ్వరూ ప్రవేశించరాని ప్రాంతం. అక్కడికి విదేశీయులు ఎవ్వరూ పోరాదని రష్యాప్రభుత్వం నిషేధించివుంది. అటువంటి పరిస్థితిలో 'స్టెర్న్' పత్రిక ప్రతినిధి అక్కడికి వెళ్లారంటే, అది అధికారుల అభ్యనుజ్ఞతోనే వెళ్లినట్లు; అందువల్ల ఇది మొదటి నుంచి చివరిదాకా అనుకొని చేయబడినటువంటి పనా? సోవియట్ ప్రజలు ఏ వ్యక్తిని ఆదర్శపురుషుడుగా గౌరవిస్తున్నారో, ఆ వ్యక్తి పట్ల ప్రాభఅని ఎల్లకాలానికి రుజూ చేసేందుకు చేసిన ప్రయత్నమా ?

—ఫోరమ్ వరల్డ్ ఫీచర్స్.



# మధుగీత

అన్నాప్రగడ శ్రీరామమూర్తి

ఉ॥ మధుమాసవేళ ధరియించిన లేజిగురాకు చీరలో
మామిడి సోయగమ్ము సుషమారమణీ రమణీయ రంజితా
రామ రమావిలాస మభిరామముచేసెను జాగృతిప్రదా
నామితశక్తముల్ శ్రుతము లయ్యెను మా కలకంఠ కంఠముల్.

గ్రాసము బాలపల్లవము—కంఠము పంచమ సుస్వరమ్ము—నా
వాసము సౌరభాత రసవత్ ఫలవత్ సహకారశాఖ—మా
యా సముదాత్తతల్ నిలుచు నిట్టులె వత్సరమెల్ల నన్ను పే
రాస నుగాదిలక్ష్మి కుపహారము లిత్తుము చిద్విలాసముల్—

పదిరెండాకుల కాలచక్ర గతిలో ప్రారంభమౌ క్రొత్త చు
ట్టైని—యీనాటికి నెన్ని చుట్లొ అయిపోయెన్ గాని యాగామిసై
మది నిర్మించిన ధర్మసత్రమునకున్ మార్గమ్ము జూపించు జా
తిమిరాంధత్వముమాపు ప్రొద్దుపొడుపే దివ్యోత్సవారబ్ధితో.

ఈ చైత్రప్రథమ ప్రభాతసమయం బేతెంచి యౌత్సాహిక
ప్రాచుర్యమ్ము ఘటించె భారత హృదబ్జశ్రీ ప్రకాశింప నే
డీ చైతన్యము వెన్కదాగికొనెనా యీనాటి స్వప్నాభముల్
వాచామూర్తులు భావిసత్యములుగా వర్ధిల్ల వాంఛావళుల్

# మహాయోగి అరవిందుడు

శ్రీ "కాకుమాను తారానాథ్"

ఈ శతాబ్దపు ప్రారంభంలో, దేశం నిర్వీర్యత తోనూ ఒకవిధమైన స్తబ్దతతోనూ నిండిఉంది. అఖిల భారత జాతీయ కాంగ్రెస్, దేశాన్ని సక్రమ పంథాలో నడపలేకపోతున్నదని మేధావులంతా భావించ సాగారు. సరియైన నాయకత్వంలోపించింది. బ్రిటిషు ప్రభుత్వపు ధోరణికి ఎదురొడ్డి నిలువగల సామర్థ్యము, ఆకాంక్ష ప్రజలలో కరువయింది. 'భిక్షాం దేహి' సూత్రము రాజకీయాలకు మూలమంత్ర మయింది. ఈ పరిస్థితులలో లార్డ్ కర్జన్ పుణ్యమా అని వంగ విభజన తలపెట్టాడు. దానితో బెంగాల్ ప్రజ మేల్కొంది. ఆ జాగృతబెంగాల్ ప్రజల మేఘ గర్జనలముందు, ఆనాటి మితవాద నాయకులు నిలువ లేకపోయారు. శ్రుతి కలుపలేక పోయారు. సురేంద్ర నాథ బెనర్జీబోటివారు వెనుకబడి పోయారు. ముందు కొచ్చి కార్యభారాన్ని స్వీకరించవలసిన బాధ్యత ఒకే ఒక యువకునిపై పడింది. దానిని భగవదాదేశంగా భావించి,సర్వసమర్పణభావంతో స్వీకరించాడా నూనూగు మీసాల నూత్నయవ్వనుడు. 1906 కలకత్తా కాంగ్రెస్‌నాటికి ఆ యువకుని వయసు కేవలం 23½ సంవత్సరాలు మాత్రమే. ఆ నాటికే "వందే మాతరం" నినాదం బెంగాల్ ఎల్లలనుదాటి, యావ ద్భారత నినాదమయింది. 'వందేమాతరం" పత్రిక నాటికే సంపాదకీయాలలో అగ్నిని విరజిమ్ముతూ ఉంది. ఆ మహాపురుషుడే నాటి బాబు అరవిందఘోష్— తరువాత తరువాత యోగి అరవిందునిగా విశ్వానికే వెలుగును ప్రసాదించిన మహాపురుషుడు.

ఆ మహనీయుని జన్మదిన శతసంవత్సర జయంతి సందర్భంగా, క్లుప్తంగా, ఆయన జీవితాన్ని నా తోచినకొలది వివరించటానికి చేసిన ప్రయత్నమే ఈ వ్యాసము.

* * *

ఆలీపూర్ బాంబు కేసు సందర్భంలో అరవిందుని న్యాయవాది, దేశబంధు చిత్తరంజన్ దాస్, తన వాదనలో అరవిందుని వర్ణించిన తీరు అత్యద్భుతము. అరవిందుని జీవితానికి భగవంతుడే శ్రీ దాస్ ముఖతః వ్యాఖ్యానాన్నిచ్చాడా అనిపిస్తుంది. అరవిందుని శ్రీ దాస్ 'Poet of patriotism, prophet of nationalism, lover of humanity' అని వర్ణించాడు.

భారత రాజకీయ రంగాన్ని శాశ్వతంగా వదిలి వేసి, తన మహత్తర యోగసాధన నిమిత్తము చంద్ర నాగోర్‌కు, అక్కడనుండి పుదుచ్చేరికి పోయి, అక్కడ సాధనలో లీనమైన ఆయన జీవితం— దాదాపుగా పై వ్యాఖ్యలో ఇముడుతుందేమో ననిపిస్తుంది.

ఇందులో ఇంకో విషయం కూడా గర్భితమై ఉందనిపిస్తుంది. ప్రపంచంలోని మిగతా దేశాల సంగతి తెలియదు గాని— ఈ దేశంలో మట్టుకు, దీని ప్రాచీనత, దీని చరిత్ర, దీని పరంపర, దీని సంస్కృతులను అర్థం చేసుకున్నవారెవరూ — ఈ దేశపు దేశభక్తు లెవ్వరూ, జాతీయవాదులు కాకుండా పోలేరు. ఈ దేశపు దేశభక్తు లెవ్వరూ విశ్వప్రేమికులు కాకుండా పోలేరు. ఈ దేశపు జాతీయ వాద మెప్పుడూ— అది ఈ దేశపు చరిత్రలో ప్రతిబింబించినంతవరకు— అంతర్జాతీయతకు వ్యతిరేకం కాదు. 'సర్వధర్మ సమభావమే' ఈ దేశపు ఆదర్శం— నాడూ, నేడూ కూడా. దానిని ఆచరించటంలో ఈ దేశపు ప్రజ బలహీనమైనప్పుడు ఒడుదుడుకు లుండ వచ్చు. కాని ఆదర్శంలో మార్పులేదు, మార్పు రాగూడదు.

భగవానుని ఉపకరణంగా వెలసిన ఈ మహా పురుషునిలో, చిరుతప్రాయంలోనే దేశభక్తి వెల్లి విరిసింది. పూర్ణయవ్వనంలో, కలకత్తా జీవితంలో భారత స్వాతంత్ర్య సమర రథ సారథిగా, స్ఫూర్తి ప్రదాతగా, జాతీయవాదవ్యాఖ్యాతగా వెలుగొందాడు. తదనంతరం పుదుచ్చేరి జీవితంలోని విశ్వప్రేమికు

డుగా, విశ్వవిజ్ఞాన వ్యాఖ్యాతగా, శాశ్వత రచనలను ప్రసాదించాడు. అలాంటి ఋషిపుంగవుడే అరవిందుడు.

*    *    *

హుగ్లీజిల్లాలో కలకత్తాకు సమీపంలోగల కొన్నాగర్, గ్రామమైనా— అనేకమంది ప్రముఖులకు ప్రసిద్ధి. ఆ గ్రామంలో కాళీప్రసాద ఘోష్, కైభాషిణీ దేవుల సంతానము కృష్ణధనఘోష్. వైద్య కళాశాల విద్యార్థిగానే, రాజనారాయణ బోస్ ప్రథమ పుత్రిక స్వర్ణలతాదేవిని వివాహమాడాడు. వివాహం తరువాత డాక్టర్ ఘోష్ ఉన్నత విద్యకోసం ఇంగ్లాండు పోయి తిరిగి వచ్చాడు. ఆయన విదేశీ నివాసము ఆయన దృక్పథంలో తీవ్రమైనమార్పును తెచ్చింది. ఒక్క ముక్కలో చెప్పాలంటే "ఇంగ్లీష్" అన్న ప్రతి దానిపట్లా వ్యామోహం కలిగింది. ఈ విధంగా అరవిందుడు జన్మించేనాటికి ఆ దంపతులు, ఆ నాటి వంగభూమిలోని రెండు ప్రముఖ అంతర్గత ధోరణుల సంగమము, సర్వం ఆంగ్లానుకరణలో ఉందన్న దృక్పథము, ఈ పాశ్చాత్య అనుకరణ వ్యామోహానికి రోసి "స్వ"ను తిరిగి కనుగొందాం అని ప్రయత్నించే ధోరణి—. ఈ దంపతుల పుత్రుడు, ఈ రెండు వ్యతిరేక ధోరణులకు ముందు ముందు సమన్వయాన్ని ప్రసాదించే అరవిందులయినారనటం అతిశయోక్తి కాదు. రాజనారాయణబోస్, ప్రముఖ సంస్కృత పండితుడే కాకుండా, బ్రహ్మసమాజపు అధ్యక్షత వహించి, చివరి రోజులలో హిందూ ధర్మోద్ధరణకు పాటుపడిన వ్యక్తి.

ఈ దంపతుల మూడవ పుత్రుడే అరవిందుడు—1872 సంవత్సరం ఆగస్టు 15 తెల్లవారు జామున 4—30 గంటలకు, కలకత్తాలోని బారిస్టర్ మనమోహనఘోష్ గృహంలో జన్మించాడు. బాల్యం విశేషాలు లేకుండా గడిచింది. డాక్టర్ ఘోష్ పిల్లల పెంపకానికి ఆంగ్లేయ దాదులను ఏర్పాటు చేశాడు. వచ్చీరాని ఆంగ్లము, హిందీలలో ఆ బాలురు కాలక్షేపం చేసేవారు. పూర్తిగా పాశ్చాత్య పెంపకంకోసం— డార్జిలింగ్‌లోని లోరెట్టో కాన్వెంటులో తన పిల్లలను చేర్చాడు, డాక్టర్ ఘోష్. ఇరిష్ స్త్రీచేత నడుపబడే ఆ కాన్వెంట్ కేవలం పాశ్చాత్య బాలబాలికల కోసమే నిర్దేశింపబడింది. అక్కడ రెండు సంవత్సరాలు గడిచిందో లేదో, 1879 లో డాక్టర్ ఘోష్— తన ముగ్గురు కుమారులు, వినయభూషణుడు, మనోమోహనుడు, అరవిందుడు, కుమార్తె సరోజినితో నిండు చూలాలైన భార్యతో, పిల్లల చదువులకోసం ఇంగ్లాండ్ బయలుదేరి పోయాడు. అక్కడే అరవిందుని కనిష్ట సోదరుడు బరీంద్రుడు జన్మించాడు. ఆరుసంవత్సరాలైనా సరిగానిండని అరవిందుడు, క్రైస్తవ మతాచార్యుడైన డ్రూవెట్ దంపతుల అధీనంలో ఉంచబడ్డాడు. మాంచెస్టర్‌లో తన బిడ్డలు ఏ భారతీయునితో కలవకూడదనీ, భారతదేశ ప్రభావానికి ఎంతమాత్రం లోనుకాకూడదని, డాక్టర్ ఘోష్ డ్రూవెట్‌కు ప్రత్యేకంగా ఆదేశమిచ్చాడు.

డ్రూవెట్ లాటిన్ భాషలో చక్కని పండితుడు. తన ఈ చిన్న శిష్యునికి లాటిన్, ఫ్రెంచి, భూగోళము, లెక్కలు వగైరాలు నేర్పసాగాడు. ఇంటి వద్దనే చదువు కాబట్టి, అరవిందునికి తన ఇష్టం వచ్చినట్లు బైబిలు, షెల్లీ, కీట్సు వగైరాలన్నీ చదవటానికి వీలయింది. 1884 లో డ్రూవెట్ దంపతులు ఆస్ట్రేలియా పోవటానికి నిశ్చయించుకోవటంతో, అరవిందుని బాధ్యత డ్రూవెట్ తల్లికి అప్పగింపబడింది. తరువాత లండన్‌లోని సెయింట్ పాల్ స్కూలులో చేరాడు. ఆ ప్రధానోపాధ్యాయుడు డాక్టర్ వాకర్ స్వయంగా ఈ శిష్యునికి గ్రీక్‌భాషా బోధన మొదలు పెట్టాడు. తరువాత కేంబ్రిడ్జిలోని కింగ్స్‌కాలేజీవారు నిర్వహించిన వ్యాస రచన పోటీలో పాల్గొని— షేక్స్పియర్, మిల్టన్‌కవుల తారతమ్యాన్ని గురించి వ్రాసి— ఉపకార వేతనం పొందాడు.

డాక్టర్— కృష్ణధనఘోష్ విశాలహృదయం కలవాడు. ధన సంపాదనలో నిపుణుడు కాడు. ఇంగ్లాండ్‌లోని తన కుమారులకు సకాలంలో ధనం పంపలేక పోయేవాడు. దీనితో వీరి జీవితం దుర్భరం అయింది. అరవిందుడు ఆ చిన్నతనంలోనే, కేవలం రొట్టె, టీలతో కాలం గడుపుతూ, ఆ ఘోరమైన లండన్ చలిలో కాలం గడిపాడు. కాని విద్యార్జనలో లోపం చేయలేదు. కింగ్స్ కాలేజి ట్రైపాస్‌లో ప్రథమ శ్రేణిలో ప్యాసయినాడు. ఐ.సి.ఎస్. పరీక్షకు కూర్చొని ప్రథమ శ్రేణిలో నెగ్గాడు. కాని గుర్రపుస్వారీ పరీక్షలో తప్పటంతో ఆ తతంగము ముగిసింది.

కాని చిట్ట చివరి రోజులలో డాక్టర్ ఘోష్ దృక్పథంలో కొంత మార్పు రాసాగింది. ఆంగ్లేయుల ఆచార వ్యవహారాలు ఆయనను ఎంత సమ్మోహితుని చేసినా, వారి పాలనా పద్ధతులు, వారీ దేశంలో అవలంబించే ధోరణులను ఆయన ఆమోదించలేక పోయాడు. ఆంగ్లేయుల హృదయరాహిత్యాన్ని గురించి, కుమారులకు ఉత్తరాలలో వర్ణించటమే కాకుండా, "బెంగాలీ" పత్రికను ప్రత్యేకపు గుర్తింపులతో కుమారులకు పంపుతుండేవాడు. తన మానసిక ధోరణికి వ్యతిరేకంగా, విరుద్ధ వాతావరణంలో పెరుగుతున్న అరవిందుని హృదయఫలకంపై ఈ స్వల్ప విషయాలే గాఢముద్ర వేయసాగాయి. ఫలితంగా 1891 లో స్థాపింపబడ్డ "ఇండియన్ మజ్లిస్"కు కార్యదర్శి అవటమే కాకుండా, 'కమలము—ఖడ్గము' సంస్థలో కూడా సభ్యుడయ్యాడు. కాని ఈ సంస్థలు విరివిగా ఏ కార్యక్రమాలను ఇంగ్లాండ్‌లో నడపలేదు.

ఇంతలోకే నాటి బరోడామహారాజు శాయాజీరావ్ గైక్వాడ్ ఇంగ్లాండ్ రావటం జరిగింది. శ్రీ జేమ్స్‌కాటన్ ద్వారా అరవిందుని గురించి తెలుసుకుని, బరోడా రాజ్యపాలనా యంత్రాంగంలో అరవిందునికి స్థానమీయ సంకల్పించాడు. ఈ విధంగా 14 సంవత్సరాలదీర్ఘప్రవాసానంతరం, 21 సంవత్సరాల యువకుడుగా, 1893 లో అరవిందుడు ఈ దేశంలో తిరిగి కాలుపెట్టాడు.

కాని విధి ఆడిన నాటకంలో డాక్టర్ ఘోష్ బలియైపోయాడు. అరవిందుడు "కార్తేజి" నౌకలో భారతదేశానికి బయలుదేరితే, ఆయన బ్యాంకర్లు, అరవిందుడు వేరొక నౌకలో బయలుదేరినట్లు పొరపాటు వర్తమానాన్ని, డాక్టర్ ఘోష్‌కు అందజేశారు. ఆ నౌక లిస్బన్ సమీపంలో ప్రమాదానికి లోనై మునిగిపోయింది. తన కుమారుడు అరవిందుడు మరణించాడనే అభిప్రాయంతో ఆ తీవ్ర ఆఘాతనికి తట్టుకోలేక మరణించాడు, డాక్టర్‌ఘోష్. ఈ విధంగా అరవిందునికి పితృవియోగం జరిగింది.

* * *

బరోడాలో మొత్తం అరవిందుడు 1893 నుంచి 1906 దాకా—షుమారు 13 సంవత్సరాలు గడిపాడు. అయితే 1906 లోనే, జీతం నష్టంమీద బరోడా కళాశాలను వదిలి కలకత్తా చేరాడు. ఈ స్వల్పకాలంలోనే, అరవిందుడు తన భావిజీవితానికి కావలసిన పునాదులను ఏర్పరుచుకొని, గట్టిపరుచుకున్నాడు. బెంగాలీ, సంస్కృత భాషలలో ప్రావీణ్యాన్ని సంపాదించాడు. తన స్వభావానుగుణంగా వివిధరంగాలలో కాలూనిన అరవిందుడు, బరోడా వదిలేనాటికి, సమగ్రదృష్టి కలిగి, గతాన్ని వర్తమానాన్నే కాకుండా, భవిష్యత్‌ను కూడా వూహించగలిగే తత్వజ్ఞుడయ్యాడు. అయితే ఈ కాలంలో ప్రత్యక్షంగా రాజకీయాలలో జోక్యం చేసుకోలేదు. కాబట్టి ప్రజలకు రాజకీయనాయకుడుగా పరిచయంకాలేదు.

తను నిరంతర సాధనతో, విపరీతమైన శ్రమతో అపూర్వంగా భారతీయ "జ్ఞానసంచయం" చేశాడు. ఆ రోజులలో ఆయనతో కొంతకాలం గడిపిన శ్రీ దినేంద్ర కుమార రాయ్ దానిని "యజ్ఞం"గా వర్ణించాడు. సాహిత్యరంగంలో, పత్రికారంగంలో, రాజకీయవ్యాఖ్యాతగా, యువశక్తి సంఘటనాకారుడుగా, ప్రచ్ఛన్నంగా ఉన్నా, యావద్భారత దృష్టిని ఆకర్షించాడు. లోకమాన్యతిలక్, సోదరి నివేదిత మొదలైన వారి పరిచయము, విప్లవకారులను సానుభూతితో అర్థంచేసుకొని, వారికి సహాయ సహకారాలను అందజేయటం జరిగింది.

ఆ రోజులలో వారి జీవితం అతి సాధారణము. అహమ్మదాబాద్ మిల్లు ధోవతులతో, సాధారణమైన చెప్పులతో జీవితం గడిపేవాడు. ఉదయం 10 గంటలదాకా కవిత్వ రచనతో గడపటం, 11 గంటలకు స్నానము, భోజనము, భోజన సమయంలోనే పత్రికలు చదవటం ఆయన అలవాట్లు. సామాన్య భోజనము, సౌకర్యములు లేని గృహము, దోమలబాధ తెలియకుండా రాత్రులందు 1 గంట దాకా లాంతరుముందు గ్రంథావలోకనము, వారి నిత్యకృత్యము. ప్రతినెలా పుస్తకాలు కుప్పతిప్పలుగా వస్తుండేవి. నెలాఖరుకు చేతిలో దమ్మిడీ లేకుండా పోయేది. కాని తల్లి పోషణకు, సోదరి చదువుకు ప్రతినెలా డబ్బు పంపేవాడు.

బరోడాలోని మరొకఘటన వివాహం. భూపాల బోస్ కుమార్తె మృణాలినీదేవిని, 14 సంవత్సరాల బాలికను ఏప్రిల్ 1901 లో అరవిందుడు వివాహమాడాడు. వివాహానంతరము భార్య చెల్లెళ్లతో కలిసి

కొద్దినాళ్లు నైనిటాల్ పోయాడు. అరవిందుని వైవాహిక జీవితం మన దృష్టిలో ఏమంత సుఖ ప్రదం కాదేమో! అదయినా కేవలం 9 సంవత్సరాలు మాత్రమే. అరవిందుడు చంద్రనాగోర్‌కు పోయేదాకా మాత్రమే సాగింది. ఈ స్వల్పకాలంలో నయినా మృణాలినీదేవి ఎక్కువభాగం దేవఘర్ లోనే కాలం గడుపుతుండేది.

వీటన్నిటిమధ్యనే ఆంగ్ల భాషలో అపూర్వమైన సాహిత్య సృష్టి జరిగింది. ముఖ్యంగా ఆంగ్ల భాషలో కవిత్వమూ, ఆంగ్లంలోకి అనువాదాలు అత్యద్భుతంగా సాగాయి. నిజాని కాయన కవిత్వము ఇంగ్లండ్‌లో విద్యార్థిదశలోనే ప్రారంభ మయింది. కాని ప్రచురణలు భారతదేశంలో జరిగాయి.

కాని జీవితమంటే ఇదేనా? యూరోపియన్ నాగరికత తాత్కాలిక కాంతులతో భారతీయులు దృష్టి మందగించింది. ప్రతి దానిని మేధతోనే ఆలోచించాలి అనే ధోరణి పెరిగింది. విద్యాధికులలో ఏ ధోరణి ఉందో తెలియటం లేదు. ఇంగ్లాండ్‌లో విద్యాభ్యాసం చేసిన వ్యక్తి అయితే మరీ వికృత మయ్యాడు. డాక్టర్. రాధాకృష్ణ పరిభాషలో, ఆ వ్యక్తి ఎలా తయారయాడంటే his voice became an echo, his life a quotation, his soul a brain and his free spirit a slave to things'. ఈ అకర్మణ్యత నుంచి బయట పడటానికి మార్గ మేమిటి? దేశీయులను జాగృతం చేయాలి. దానికిగాను వారిలోని స్తబ్ధతను పారద్రోలాలి. వారికి ఆనాటి ఏకైక రాజకీయ పక్షం, కాంగ్రెస్ పట్ల గల భావాలలో మార్పు తేవాలి. వీలయితే కాంగ్రెస్ నాయకులలోనే చలనం గలిగించాలి. వారిని నాటి "భిక్షాపాత్ర" రాజకీయ ధోరణినుండి మరల్చగల గాలి. ఈ ఉద్దేశ్యంతో, తన ఒకనాటి కేంబ్రిడ్జి సహాధ్యాయి, దేశపాండే అధ్వర్యాన వెలువడే "ఇందు ప్రకాశ్" పత్రికలో "పాత దీపాలకు కొత్త దీపాలు" అనే నామకరణంతో వ్యాసరచనకు పూనుకున్నాడు. ఆగష్టు 1893 నుంచి మార్చి 1894 దాకా ఈ వ్యాసాలు సాగాయి. "ఒక గ్రుడ్డివాడు ఇంకొక గ్రుడి వానికి దారిచూపితే, ఇరువురూ గోతిలోపడరా" అంటూ ప్రారంభమైన ఈ వ్యాసాలు దేశంలోని మేధావులలో తీవ్రమైన అలజడిని రేపాయి. మహాదేవ గోవిందరానడే వంటి నాయకుడు, "ఇందు ప్రకాశ్" సంపాదకునికి, ఆ ధోరణిలో వ్యాసాలు సాగితే, ప్రమాదం తప్పదని హెచ్చరించాడు. దానితో సంపాదకుని కోరికమీద, వ్యాసాల తీవ్రత తగ్గింపబడింది. కాని నాటిలోని వ్యంగ్యానికి, తీవ్రతకు ఆ వ్యాసాలు కనే సాటి. ఫిరోజు షా మెహతా, దాదాభాయ్ నౌరోజీ వంటి వారి ధోరణులు, వారివారి పేర్లు ఎత్తబడి, విమర్శింపబడి, అపహాస్యం చేయబడ్డాయి.

ఫిరోజు షా మెహతా దేశభక్తి restricted patriotism అని వర్ణింపబడింది. తన తీవ్రతను ఈ వ్యాసాలలో తగ్గించవలసి వచ్చింది కాబట్టి, షుమారు అదే కాలంలో బంకించంద్రుని మీద సాహిత్య వ్యాసాలను రచించ ప్రారంభించాడు. దానితో కాంగ్రెస్‌ను 'Indian unnational Congress' అని పిలిచాడు. ఈ విధమైన వ్యాస పరంపర పశ్చిమ భారతాన్నంతా దిగ్భ్రమ చెందించి, నాటి కాంగ్రెస్ నాయకుల వెన్నుమీద చళ్లన చరిచింది.

ఈ కాలంలోనే ఇంకో రంగంవైపు కూడా దృష్టి సారించాడు. బెంగాల్ నుండి వచ్చిన జతీన్ బెనర్జీని, యు. పి. వాస్తవ్యుడుగా పరిచయం చేసి, బరోడా సైన్యంలో చేర్చాడు. 1900 లో అతనిని విప్లవోద్యమ స్థాపనకు బెంగాల్ పంపాడు. తరువాత అరవిందుని తమ్ముడు బరీంద్రుడు కూడా అన్న దగ్గరకే చేరాడు. అతనిని కూడా కొద్దికాలం తరువాత కలకత్తా పంపాడు. అంతేకాకుండా తాను స్వయంగా 1902 ప్రాంతాలలో బెంగాల్‌లో విస్తృతంగా పర్యటించాడు.అన్ని శాఖలనూ చూడటం, తాను స్వయంగా కొంతమందితో పరిచయాలు ఏర్పరచుకోవటం జరిగింది. తరువాత, ఈ సందర్భం లోనే, భారత పునరుద్ధరణానికి తన సర్వస్వాన్ని సమర్పించిన ఇరిష్ స్త్రీ, సోదరి నివేదిత, బరోడాలో అరవిందుని కలవటానికి వచ్చింది. అరవిందుని ద్వారా బరోడా మహారాజును కలిసి, విప్లవోద్యమానికి ఆయన సహాయసహకారాలను అర్థించడమే ఈ రాక ఉద్దేశ్యము. బరోడా మహారాజు తన నిర్ణయాన్ని వాయిదావేశాడు. కాని అరవిందుడు ఇటువంటి విష

యాలలో ఉత్సాహం చూపుతున్నందుకు ఆశ్చర్య పోయాడు.

ఈ సందర్భంలోనే, బంకించంద్రుని "ఆనంద మఠం" నుంచి గ్రహించిన స్ఫూర్తితో కాబోలు, అరవిందుడు "భవానీ మందిర్" పథకాన్ని రచించటం జరిగింది. ఇది సర్వసంగపరిత్యాగులైన యువ వీరులను నిర్మించే పథకం. దేశసేవ కొరకు వారు సర్వ సమర్పణం చేయాలి. ముఖ్యమైంది, దేశంపట్ల మాతృత్వ భావన. ఇది కార్యరూపం తాల్చకపోయినా, బ్రిటిష్ సి. ఐ. డి. అధికారుల దృష్టిని ఆకర్షించి, రవులట్ నివేదికలలో గూడా స్థానాన్ని పొందింది.

ఈ ప్రబోధాలతో దేశమంతా అట్టుడికిన ట్లుడక సాగింది. ఆనాటి ప్రభావ మెలాంటిదంటే రవీంద్రనాథ టాగూర్ 1904లో "స్వదేశీసమాజ్" అనే గ్రంథాన్ని రచించాడు. 1904—1905 ప్రాంతాలలో జపాన్ రష్యామీద తీసినదెబ్బ, ఈ దేశ ప్రజలకు సంతోషంతో ముంచెత్తింది. ఒక యూరప్‌ఖండ శక్తిని జపాన్‌బోటి ప్రాచ్యందేశం దెబ్బతీయ గలిగింది. అంతేకాక ఇటలీలోని దేశభక్తులు మేజనీ, గారిబాల్డీ, కౌంట్ కీవర్, విక్టర్ ఎమ్మాన్యూయల్‌ల జీవితాలు ఈ దేశస్థులను ఉత్తేజ పరచసాగాయి.

ఈ పరిస్థితులలో బెంగాల్ విభజన రూపొంద సాగింది. జార్జి నాథానియల్ కర్జన్ సమర్థుడైన పరిపాలకుడే. కాని బెంగాల్‌లో ఉవ్వెత్తుగా లేచిన స్వ ఉద్యమాన్ని భరించలేక పోయాడు. బెంగాల్ విభజన దీనికి సరియైన మందు అని భావించాడు. కాని నాటి బెంగాల్ ప్రజ దీనిని పూర్తిగా వ్యతిరేకించింది. వేలకువేల బహిరంగ సభలు జరిగాయి. వినతిపత్రాలు సమర్పించబడ్డాయి. 1951 ఆగష్టు 7 న కలకత్తా టవున్‌హాలులో జరిగిన బ్రహ్మాండమైన బహిరంగసభలో విదేశీవస్తుబహిష్కరణ, స్వదేశీ తీర్మానాలు చేయబడ్డాయి. మొదటిసారిగా "వందేమాతరం" నినాదమయింది. 1885 లో కాంగ్రెసు స్థాపింపబడ్డా, అంతకుముందే 1882 లోనే "ఆనంద మఠము" నవల వ్రాయబడినా, 1905 లో బెంగాల్ విభజనతో బెంగాల్ ఆత్మలో నుంచీ, ఒక్కసారి విస్ఫులింగం లాగా ఈ గీతం బయటికొచ్చి ప్రచారమయింది.

బెంగాల్‌లో వినిపించిన ఈ శంఖనాదం వృధా కాలేదు. మహారాష్ట్రంలో అది ప్రతిధ్వనించింది. లోకమాన్య తిలక్ తన "కేసరి" పత్రికలో ఈ ఉద్యమాన్ని బలపరచాడు. లార్డ్ కర్జన్ బెంగాల్ విభజనకు ఏ దినాన్ని నిర్ణయించాడో, ఆ దినమే బెంగాల్ ప్రజల విభజన నిరసన దినోత్సవంగా జరప దలచుకుంది.

1906 మార్చిలో అరవిందుని తమ్ముడు బరీంద్రుడు "యుగాంతర్" బెంగాలీ వారపత్రికను స్థాపించాడు. 1906 ఏప్రిల్ 14 న బారిసాల్‌లో జరిగిన వంగరాష్ట్ర మహాసభలో అరవిందుడు పాల్గొన్నాడు. అశ్వనీ కుమార దత్ జన్మస్థల మిది. ఆయనే అధ్యక్షత వహించాడు. కాని సమావేశాలు నిషేధించబడ్డాయి. వూరేగింపుమీద లాఠీచార్జి జరుపబడింది. స్వాతంత్ర్య సంగ్రామంలో ప్రప్రథమ లాఠీ చార్జి ఇదేనేమో! ఈ తీవ్రమైనమార్పులతో, తన కార్యక్షేత్రము కలకత్తా అని గుర్తించిన అరవిందుడు, ఇక బరోడాలో ఉండలేకపోయాడు. వద్దన్న మహారాజు కోరికను కూడా మన్నించకుండా కలకత్తా చేరాడు. నాటికి ఆయన జీతం వైస్‌ప్రిన్సిపాల్‌గా రు. 750 లు సుమా!

*

అరవిందుని కలకత్తా జీవితపు రోజులు భారత స్వాతంత్ర్య సమర చరిత్రలో మరపురాని రోజులు. సుబోధ మల్లిక్ విరాళంతో కలకత్తాలో నేషనల్ కాలేజి స్థాపింపబడింది. అదే మాసంలో "వందేమాతరం" పత్రిక స్థాపింపబడింది. రానురాను ఈ పత్రిక బాధ్యతలన్నీ అరవిందునిమీదనే పడ సాగాయి. ఈ పరిస్థితులలో అరవిందుని ఆరోగ్యం చెడింది. అయినా అలాగే అస్వస్థతతో బెంగాల్‌లో జరుగబోయే కాంగ్రెస్ మహాసభలకు ముందు, బెంగాల్ పర్యటన జరిపాడు.

1906 కలకత్తా కాంగ్రెస్ కొన్ని ప్రత్యేకతల కాంగ్రెస్. బెంగాల్ విభజనతో, 'వందేమాతరం' ప్రచారంతో బెంగాల్ కుతకుతలాడు తున్నది. ప్రజా హృదయం భగభగ మండుతున్నది. యువతరం కాంగ్రెసు అధ్యక్షునిగా లజపతిరాయ్‌నో, లోకమాన్యునో కోరుకుంటున్నది. కాని, అధ్యక్షవరణం

చేయవలసిన ఆహ్వాన సంఘం మితవాదుల ప్రాబల్యంతో నిండిఉంది. తిలక్ పేరు విగిపోయింది. చివరకు లండన్ లోని దాదాభాయ్ నౌరోజీ పిలిపించబడ్డాడు. నౌరోజీ బెంగాల్ ప్రజా హృదయారాటాన్ని చూడగలిగాడు. అధ్యక్షోపన్యాసంలో 'స్వరాజ్య' నినాదాన్నిచ్చాడు. దాని అర్థం ఆయన దృష్టిలో ఎంత సంకుచితంగా ఉన్నా, బెంగాల్ ప్రజ ఆ నినాదాన్ని సంతోషంతో ఆహ్వానించింది. అరవిందుడు 'వందేమాతరం' వ్యాసాలలో విమర్శాత్మకంగా, ఆమోదించాడు. బొంబే కార్పొరేషన్ సింహం ఫెరోజోషా మెహతా, తనకన్న పెద్ద సింహం జాగృత బెంగాల్ ప్రజలను చూశాడని వ్యంగ్యం విసిరాడు.

ఇంకొక విప్లవ దినపత్రిక, మతంరీత్యా క్రైస్తవుడైన బ్రహ్మబాంధవ ఉపాధ్యాయ సంపాదకత్వంలో వెలువడ సాగింది. అదే ''సంధ్య''. వివేకానందుని సోదరుడు భూపేంద్రనాథ దత్ ఒక వ్యాస రచనకు శిక్షకు పాత్రుడయ్యాడు. అరవిందుని సలహామీద వాదించ నిరాకరించాడు భూపేంద్రనాథ దత్. తరువాత అరవిందుని మీదనే వారంటు జారీ అయ్యింది. ఈ కేసుతో అనుకోని విషయాలు బయట పడ్డాయి. ఇంతవరకు అరవిందు డెంతవాడైనా, బయటి ప్రపంచానికి ఉద్యమ నాయకుడుగా తెలియదు. కాని దీనితో యావద్భారత దేశానికీ— యువ బెంగాల్, జాగృత బెంగాల్'' ''ఆత్మ స్వరూపి'', ''వందేమాతరం'' వ్యాసకర్త ఎవ్వరో తెలిసింది. అరవిందుని పేరు దేశమంతటా మ్రోగింది.

ఈ స్వాతంత్ర్య సమరంలోని చతురంగ బలాలు— స్వదేశీ ఉద్యమం, విదేశీవస్తు బహిష్కరణ, జాతీయవాదము, జాతీయ విద్య. ఈ సమర వాహినీ సర్వ సైన్యాధ్యక్షుడు అరవిందుడే కాని ఒక బలానికి తాను ప్రత్యక్ష బాధ్యత వహించాడు. అదే జాతీయ విద్య. ఈ అనుదిన రాజకీయాలలో నిమగ్నమయితే తన బాధ్యతను తాను సక్రమంగా నిర్వహించలేననే ఉద్దేశ్యంతో, ఆగష్టు 1907 లో తన ప్రిన్సిపాల్ పదవికి రాజీనామా సమర్పించాడు. ఆనాడు ఆయన విద్యార్థుల కిచ్చిన సందేశము— ఈ దేశపు ప్రసంగాలలో శాశ్వతంగా నిలిచేది, మరపురానిది, సర్వ కులాలకు వర్తించే సందేశము.

'వందేమాతరం' సంపాదకు డెవరు? ఈ విషయాన్ని బుజువు చేసుకునేందుకు ప్రభుత్వం బిపినచంద్రపాల్ ను సాక్షిగా పిలిపించింది. కాని ఆయన సాక్ష్యం చెప్పటానికి నిరాకరించటంతో, కోర్టు ధిక్కారం క్రింద ఆయనకు శిక్ష పడింది. తరువాత అరవిందుడు ఈ కేసులో విడుదల చేయబడ్డాడు.

తరువాతి ఘట్టం సూరత్ కాంగ్రెస్. నిజానికి 1907 కాంగ్రెస్ నాగపూర్ లో జరగాల్సింది. కాని అతివాదులను చూసి, గాభరాతో సర్ ఫిరోజుషా మెహతా బోటివారు దానిని సూరత్ కు మార్చారు. దీనికి నాందీప్రస్తావనగా మిడ్నపూర్ లో బెంగాల్ రాజకీయ మహాసభలు జరిగాయి. మహాసభ దాదాపు రెండుగా చీలింది. అతివాదులంతా అత్యుత్సాహంతో సూరత్ ప్రయాణం కట్టారు.

సూరత్ సంఘటనలు నేడు అత్యంత ప్రసిద్ధాలు. డాక్టర్ ఘోష్ అధ్యక్షోపన్యాసం మొదలు పెట్టడంతోనే, తిలక్ అభ్యంతరం తెలుపుతూ వేదిక మీదికి కొచ్చారు. జరిగిన గందరగోళంలో, ఒక చెప్పు వేదికమీదికి విసరబడింది. దానితో సభ భగ్నమయింది. జాతీయవాదులంతా వేరే సమావేశం జరుపుకుని తీర్మానాలు చేసుకున్నారు. దీనితో అరవిందుడు అఖిలభారత నాయకుడయ్యాడు. బొంబే, పూనా, నాసిక, ధూలియాలలో పర్యటించి కలకత్తా చేరాడు. వెంటనే పాట్నాలో జరిగిన మహాసభలో పాల్గొన్నాడు.

తరువాతి రెండు మాసాలు అరవిందుని లేఖిని అత్యంత నిశితంగా పనిచేసింది. యావద్భారత సమస్యలు— ఆర్థికాలతో సహా— ఆయన దృష్టిని తప్పించుకోలేక పోయాయి. ఏప్రిల్ మాసంలో చంద్రనాగోర్ సమీపంలోగల ప్రాంతాలలో పర్యటన చేశాడు.

ఇంతలోనే దేశాన్ని యావత్తూ మార్చగల సంఘటనలు రూపొందాయి. కింగ్స్ ఫర్డ్ కలకత్తాలో నాలుగు సంవత్సరాలు మేజస్ట్రేటుగా పనిచేసి, రాక్షసుడని ప్రసిద్ధిచెందాడు. తరువాత బీహార్ లోని

ముజఫర్‌పూర్ జిల్లా జడ్జిగా పోయాడు. బెంగాల్ విప్లవకారుల సంఘం ఇతని మీద పగదీర్చుకో నిశ్చయించింది. కాని, దురదృష్టవశాత్తు, కింగ్స్ ఫర్డ్ బండి అనుకొని జరిపిన బాంబు ప్రయోగంలో ఇరువురు ఆంగ్లేయ స్త్రీలు మరణించారు. దేశం దిగ్భ్రమ చెందింది.

ప్రభుత్వం ఏది ఏమైనాసరే ఈ రహస్యాన్ని భేదించతలచుకుంది. అరవిందుని పేరుతోగల మురారిపూర్‌బాగన్ సోదా చేయబడి, అరవిందుని సోదరుడు బరీంద్రుడు, ఉలాస్కర దత్ వగైరాలు అరెష్టు చేయబడ్డారు. అరవిందుడు కూడా అరెష్టు చేయబడ్డాడు.

దీనితో అరవిందుని జీవితంలో మరో ఘట్టము ముగిసింది. తరువాతది అరవిందుని ఆలీపూర్ జీవితము— అదే నిరంతర కార్యక్రమాలతో గూడిన ఆయన ఆనాటి జీవితానికి విశ్రాంతి "ఆశ్రమ వాసము" కూడా.

*    *    *

ఈ తతంగమే ముజఫర్‌పూర్ బాంబే కేసు. ఇందులోని న్యాయాధీశుడు అరవిందుని సహాధ్యాయి బీచ్‌క్రాఫ్ట్ కావటము ఇంకో వింత. అప్రూవర్‌గా మారిన నరేంద్రనాధ గోస్వామిని సత్యేంద్రనాధ బోస్, కన్హయ్యలాల్‌దత్‌లు కాల్చి చంపారు. అరవిందుని విచారణ ముగిసే నాటికి నాలుగు యువ కిశోరాల ఆత్మాహుతి జరిగింది. ఖుదీరాంబోస్, ప్రఫుల్ల చాకీ, కన్హయ్యలాల్‌దత్, సత్యేంద్రనాథ్ బోస్‌లు. ఇరువురు అధికారులు విప్లవకారుల క్రోధానికి గురిఅయ్యారు. పబ్లిక్ ప్రాసిక్యూటర్ ఆశు బిస్వాస్, పోలీసు డిప్యూటీ సూపరింటెండెంట్ శ్యామ్యూల్ ఆలమ్‌లు.

అక్టోబరులో ఆలీపూర్ సెషన్సు జడ్జిముందు ప్రారంభమైన ఈ కేసు షుమారు 3 నెలలు సాగింది. ఇంకొక కర్మయోగి చిత్తరంజన్‌దాస్ న్యాయవాదిగా పనిచేయ ప్రారంభించాడు. తన మన ధనాలను అరవిందునికి ధారపోశాడు. ప్రతిఫలాన్నెంతమాత్రం ఆశించ లేదు. కేసు పూర్తయేనాటికి ఆ మహామహునికి మిగిలింది రు. 50,000ల అప్పు మాత్రమే.

అరవిందుని సోదరి సరోజిని కేసు నిమిత్తం ధన సహాయంకోసం చేసిన ప్రకటన ఫలితంగా దేశంలోని నలుమూలల నుండేకాక విదేశాల నుండి కూడా కొద్ది కొద్దిగా సహాయం లభ్యమయింది. చిత్తరంజనుని వాదం తొమ్మిది రోజులు అనర్గళంగా సాగింది. ఆయన ఆనాటి వాదం నేడూ మన చెవులలోమార్మోగుతుందనటం సత్యదూరం కాదేమో!

బీచ్‌క్రాఫ్ట్ అరవిందుడు నిర్దోషి అని తీర్పు చెప్పాడు. కాని ఉలాస్కర్‌దత్, బరీంద్రులకు ఉరిశిక్ష విధింపబడింది.కలకత్తా హైకోర్టుకు అప్పీలుచేసి, చిత్తరంజనుడు తిరిగి వాదం సాగించి, ఆ తరుణ రత్నాలను ఉరికంబం నుండి తప్పిస్తాడు. దాని బదులు ద్వీపాంతరవాసశిక్ష విధింపబడింది.

తరువాత తరువాత ఈ వీరులు అండమాను దీవులలో పడిన బాధలు, 'స్వాతంత్ర్యవీర్' వినాయక దామోదర సావర్కార్ అధ్వర్యాన వారు సాగించిన వీరోచిత పోరాటము, అరవిందుని జీవిత చిత్రణలో అప్రస్తుతమైనా, భారత స్వాతంత్ర సమర చరిత్ర నాటకంలో, విప్లవాంకంలో స్వర్ణపుటలు .

విడుదల చేయబడిన అనంతరం కొంతకాలం అరవిందుడు తన పినతండ్రి కృష్ణ కుమార మిత్తర్ గృహంలో విశ్రాంతి తీసుకున్నాడు. మిత్తర్ ఎక్కడ ఉన్నాడు? ఆగ్రా జైలులో మగ్గుతున్నాడు.

తరువాత అరవిందుడు ఉత్తరపరాలోని 'సనాతన ధర్మ సంఘం' వారి కోరికమీద అక్కడ ప్రసంగించాడు. 1909 మే 30న జరిగిన ఈ ప్రసంగం అరవిందుడు జెయిలు నుండి బయటపడిన తరువాత చేసిన ప్రథమ ప్రసంగం లాంటిది. మొట్ట మొదటిసారిగా తన ఆలీపూర్ జెయిల్ అనుభవాలను వివరించాడు. ఏవిధంగా జైలులో తాను కృష్ణుని, వాసుదేవుని, నారాయణుని సర్వవ్యాపిగా సర్వ జీవులలో ఇమిడి ఉన్నవానిగా చూడగలిగిందీ ఏవిధంగా ప్రథమంగా తాను గీతలో వర్ణింపబడిన సర్వసమర్పణభావాన్ని అర్థం చేసుకున్నదీ వివరిస్తాడు. తరువాత ఈ దేశపు స్వాతంత్ర్య సమర ఉద్దేశాన్ని, జాతీయవాద నినాదం వెనుకగల మహోత్తమ ఆధ్యాత్మిక భావాన్ని వివరించాడు. ఈనాడు ఆ ఉపన్యాసం చదివిన అధునాతనులకు అది కొరు

కుడు పడదు. ఏవిధంగా సనాతన ధర్మము జీవించ వలసిన ధర్మమో వివరించి తన ఉపన్యాసాన్ని ఈ విధంగా ముగిస్తాడు.

'... I say that. it is the Sanatana Dharma which for us is nationalism This Hindu nation was born with the Sanatana Dharma, with it it moves and with it grows. When the Sanatana Dharma declines than the nation declines, and if the Sanatans Dharma were capable of perishing, with the Sanatana Dharma it would perish The Sanatana Dharma that is nationalism. This is the message I have to speak to you"

ఈ ఉపన్యాసాన్ని గురించి తెలుసుకొన్న కొంత మంది అరవిందునికి, సన్యాసివి కారాదా అని సలహా ఇచ్చారు. ఆజన్మసన్యాసి అయిన ఆ మహాపురుషునికి ఇంకొకరి సలహాలు అనవసరమేమో!

కొద్ది రోజులలో ఆంగ్లంలో 'కర్మయోగిన్' అనే వారపత్రికను స్థాపించాడు. జులై మాసంలో 'కర్మయోగిన్'లో 'నా దేశీయుల కొక బహిరంగ లేఖ'ను ప్రచురిస్తాడు. మోడరేట్ పార్టీ కొంతమంది వృద్ధ నాయకులపట్ల అతి గౌరవంతో బాధపడుతూ, వారేమి చేస్తున్నదీ తెలియకుండానే ఎలా తిరోగమన వాదులను బలపరుస్తున్నదీ వివరిస్తాడు. కాంగ్రెస్ ముందుగల సమస్యలను కూలంకషంగా వివరించి విమర్శించి సలహాల నిస్తాడు. అంతటి తీవ్రతలో కూడా, వీలైనచోటల్లా మోడరేట్ పార్టీతో సహకరించి ఐక్య కాంగ్రెస్ నిర్మాణానికి ప్రయత్నించ మంటాడు.

ఇది కేవలం సలహా మాత్రమే కాదు.

సెప్టెంబరులో హుగ్లీలో జరిగిన 24 పరగణాల రాజకీయ సభలో పాల్గొన్నాడు. ఆహ్వాన సంఘము మితవాదుల చేతుల్లో ఉంది, తమ తీర్మానాలు వోడింపబడటంతోనే కాంగ్రెస్ నుంచే నిష్క్రమిస్తా మంటారు. ఐక్యతకోసం, తీర్మానాలను కొద్దిగా సవరించి, తన అనుయాయులను వోటింగ్ వేళకు బయటకు పంపి, ఐక్యతను కాపాడాడు.

ఈ మాసంలోనే ఇంకొక బెంగాలీ వారపత్రిక "ధర్మ"ను ప్రారంభించాడు.

1909 లో లాహోర్ కాంగ్రెస్‌కు ముందుగా బారిసాల్‌లో జరిగిన బెంగాల్ రాజకీయ మహాసభలకు హాజరైనారు.

ఆ రోజులలో సోదరి నివేదిత బాగ్‌బజారులో నివసిస్తూ అప్పుడప్పుడు అతనిని కలుస్తుండే వాడు. ఒకసారి అలాంటి సమావేశంలో, బ్రిటిష్ ప్రభుత్వం అరవిందుని నిర్బంధించి దూరంగా పంపేందుకు ప్రయత్నిస్తున్నదని, కనుక అజ్ఞాతవాసంలోనికి పొమ్మని సలహా ఇచ్చింది. అలా అవసరం లేదని అరవిందుడు డిసెంబరు 1909 లో తిరిగి "నా దేశీయులకు" అని ఒక ఉత్తరాన్ని ప్రచురించాడు.

దీనితో ప్రభుత్వ ధోరణిలో మార్పు వచ్చిందని సోదరి నివేదితే అరవిందునికి తెలియజేస్తుంది. అయితే తాత్కాలికంగా ధోరణి మారిందిగాని, అరవిందుని మీద దృష్టి తొలగలేదు. ఇంతలో జనవరి 24 న పట్టపగలు కలకత్తా హైకోర్టు ఆవరణలో షంసుల్ ఆలం అనే పోలీసు డిప్యూటీ సూపరింటెండెంటు ఒక బెంగాలీ యువకునిచేత కాల్చివేయబడతాడు. ఒకరోజు సాయంకాలం అరవిందుడు 'కర్మయోగిన్' కార్యాలయంలో ఉండగా, కార్యాలయం సోదాచేయబడి అరవిందుడు అరెస్టు కాబడబోతున్నట్లు సమాచారం అందుతుంది. ఏం చేయాలి అనే ప్రశ్న ఉత్పన్నమవుతుంది. అనుచరులు తర్జనభర్జనలు పడుతుంటే అకస్మాత్తుగా అరవిందుని అంతర్వాణి నిర్దిష్టంగా పద, చంద్రనాగూర్ పో అని ఆదేశిస్తుంది.

సందేహమెంత మాత్రం లేకుండా, పదినిమిషాలలో అరవిందుడు గంగానది ఒడ్డుకు చేరతాడు. పడవమీద చంద్రనాగూర్ చేరతాడు.

దీనికి ఏ విధంగా అర్థం చెప్పుకోవాలి? రాజకీయ రంగంలో మెరుపులా ప్రకాశించి, దేశీయుల భావ పరంపరలో విశేషమైన మార్పును కేవలం 4 సంవత్సరాల కాలంలో తీసుకు రాగలిగిన త్యాగమూర్తి, మహామేధావి బాబూ అరవింద ఘోష్ ఇక భారత రాజకీయ రంగానికిలేడు. అరవిందునికి బలహీనతను, పిరికి పిరికితనాన్ని అంటగట్టటం మన ఆలోచన ఏ నిమ్న

స్థాయికి దిగజారగలదో మాత్రమే సూచిస్తుంది. కీర్తినీ, పేరుప్రతిష్ఠలను ఆశించకుండా, మొదటి నుంచీ తెరవెనుకనే పనిచేసిన వ్యక్తి, కేవలం ఏకాకిగా సురేంద్రనాథబెనర్జీబోటి వృద్ధనాయకులను ఎదు ర్కొనిన ధైర్యశాలి, బరోడాలో చక్కటి జీతాన్ని, జీవితాన్ని ఈ ఉద్యమం కోసం ధారబోసిన త్యాగపురు షుడు అరవిందుడు అనేది మనం విస్మరింపగూడదు.

మరి ఎందుకిలా జరిగింది? అరవిందుని జీవి తంలో యోగసాధనము, రాజకీయాలకూ సమన్వ యం కుదరదని రోజువచ్చింది. పూర్తి జీవితాన్ని యోగసాధనకే వినియోగించమని ఆదేశంవచ్చింది అంతేకాని ఈ నిష్క్రమణ ఎంతమాత్రం నిస్పృహ తోను, ఇక అంతా వ్యర్థము అనే ధోరణిలోనూ జరి గింది కాదు.

అయితే యోగసాధన ఏమిటి? ఆదేశం ఏమిటి అంటామా? అలాంటివారికింక అరవిందుని భావి జీవితం లేనేలేదు సుమా!

* * *

చంద్రనాగోర్‌లో అరవిందుడు కేవలము40—45రోజులు మాత్రమేఉన్నాడు. తరువాత తిరిగి అదే ఆదేశానుసారం పాండిచేరికి పయనమయ్యాడు. మిత్రుల సహాయంతో కలకత్తాలోనే దిగి డూప్లే స్టీమరు మీద పాండిచేరికి పయనమయ్యాడు. నిజానికి సురేష్ చక్రవర్తి(మోని)పాండిచేరి వచ్చిఅక్కడశ్రీనివాసాచారి, ప్రముఖ తమిళకవి సుబ్రహ్మణ్య భారతులను కలిసి ఈ విషయం వివరించినపుడు వారామాటలు నమ్మలేదు.అపనమ్మకంతోనే, 4 ఏప్రిల్ 1901 న పాండిచేరి రేవుకు పోయారు. సరిగ్గా సాయంకాలం 4 గంటలకు డూప్లే స్టీమరునుండి దిగిన అరవిం దుడు పాండిచ్చేరిలో కాలుపెట్టాడు.

ఈ విధంగా అరవిందుని జీవితంలో, భారతీయ సంస్కృతిపరిణామచరిత్రలో నూతన అధ్యాయం ప్రారంభమయింది. (సశేషం)



# ఉదాహరణ వాఙ్మయము — వినూత్న విషయములు

శ్రీ బెల్లంకొండ సూర్యప్రకాశరావు

ఆంధ్ర వాఙ్మయమున ప్రబంధములు, చంపువులు, ఖండ కావ్యములు, శతకములు, నవలలు, నాటకములు మొదలుగాగల శాఖలవలెనే ఉదాహరణమును నది యొక శాఖ. ఇది ప్రత్యయముల భాసింపజేయుచు రాగాంగతాళాంగముల తోడి స్తుతిరూపకమైన యొక లఘు కృతి. ఒక విభక్తి కొక కళిక యొకయుత్కళికగా నెనిమిది విభక్తుల కిరువదినాల్గు పద్యములు సార్వ విభక్తిక మొకటి కవికృతనామాంకితము అనునది యొకటి గలిగి మొత్తము యిరువదియారు పద్యముల కావ్యముదాహరణము. ప్రతి విభక్తికి ఒకే పద్యము ఒకే కళిక ఒకే యుత్కళిక నియతములు. పద్యములు రాగాంగములు, కళికోత్కళికలు తాళాంగములు.

ప్రాచీనములగునవి ప్రసిద్ధములగు త్రిపురాంతకోదాహరణాది కావ్యములు ఏడు మాత్రమే కలవు. ఈ శతాబ్దమున 1938 నుండి 1970 వరకు వ్రాయబడినవి పదునై దుదాహరణములు. ఈ యిరువదిరెండు కావ్యముల నొకచో గూర్చి "ఉదాహర వాఙ్మయము" అనుపేర నొక గ్రంథమును శ్రీ నిడుదవోలు వేంకటరావు ప్రకటించి యున్నారు. వా రీ కావ్యరీతిని పరిశోధించి కొన్ని నియమావళుల నేర్పాటు చేసిరి. వానిలో నైదవ నియమముగా పదమూడవ నియమముగా చంపకోత్పల శార్దూల మత్తేభ విక్రీడితాదులే ప్రయుక్తములగునుగాని తక్కిన పద్యములు ప్రయుక్తములు గావనియు, సార్వ కముగా శార్దూల మత్తేభముల నొకటి యుండవచ్చుననియు వ్రాసియున్నారు.

ఇట్లు రాగాంగ తాళాంగముల గూడి విభక్తుల భాసింపజేయు నీ లఘుకృతి మార్గదేశి కవితల మిశ్రము కనిపించుచున్నది. రాగాంగములుగా మార్గ రీతి వృత్తములు, తాళాంగములుగా రగడలు వాడబడి, అవియే యొరవడిగా నిలిచి లక్షణకారులచే గ్రహింపబడి నిర్దేశింపబడుచున్నవను విషయము గ్రంథమువలన తెలియబడుచున్నది

ఏబది యారక్షరముల పరిమితి గలిగిన భాషలో నేడు కావ్యములు మాత్రమే వ్రాయబడుటకు గల కారణమేమి? ఇది ప్రజలలోని కేల ప్రాకలేదు? ప్రధాన కారణము స్తుతి రూపకమై యుండుట. రెండవది విభక్తులు, కళికోత్కళికల రాగ తాళాంగ నియమము. మూడవది నవీన సాహిత్యమునందు నేడు వచ్చుచున్న "వచనకవితల"పై మోజు పెరిగి కవితారీతుల మారుట. ఇట్లుగా నీరీతి ప్రజలకు దూరమైపోయినది. ఈ సంకలనము వెలువరించి శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు మాతృభాషకు నాంధ్ర భాషకు మహోపకార మొనరించినారు. వారి సదాశయమున కనుబంధముగా ఉదాహరణ వాఙ్మయము ప్రజల భాషలోనికి సరసుల రస హృదయములలోనికి కవుల కలముల లోనికి వర్తింపజేయుటకై నా యీ వ్యాసము. లయను కూడ విస్మరించి కవిత వ్రాయువలయుననుచున్న రచయితలకు నా యీ వ్యాసము పనికి రాకపోవచ్చును. గాని ప్రాచీనతపై గౌరవము వర్తమానముపై నభిమానము భవిష్యత్కవితారీతులపై నమ్మకము గల వారికి నా యీ కృషి యుపకరించునని [illegible]సను.

ప్రధాన కారణముగానున్న కావ్య విషయమగు స్తుతి; స్తుతి చేయు చోటులనెల్ల నింద సేయుట

కవకాశమున్నదిగదా! అట్లే జాలి చూపుటకు నస హ్యము చూపుటకు భయపడుటకు ప్రేమ చూపు టకు కూడ నవకాశము లున్నవి. కావున విభక్తి ప్రత్యయముల భాసింపజేయుటయే ప్రధానముగాని స్తుతియో, నిందయో, హేళనమో, అభినందనమో ఆ యా కవుల యిచ్చానుసారముగా వ్రాయుటకు వీలున్నది. పోగా, డు, ము, వు, లు ప్రథమా విభక్తి కనుక నామవాచకముగా ఏ దేవుని గురించియో మనుజుని గురించియో వ్రాయబడవలయునని యని పించును. సర్వనామములుగా వీనిని స్వీకరించి అతడు వనము, ఆవు అన్న విషయములపై వ్రాయుట కభ్యంతరముండునా? ఇది ఆ యా రచయితల ఇచ్ఛాను సారముగా స్వీకరించదగు కవితా వస్తువు; రసములు నట్లే!

రెండవ కారణము రాగాంగ తాళాంగముల నియమము. తెలుగు వారికి పెద్ద పద్యములపై మమ కార మెక్కువ కాబట్టి రాగాంగములుగా మార్గ వృత్త ములు మాత్రమే నిర్దేశింపబడుట కారణమగుచున్నది. రాగాంగములు గాదగిన గీత, ఆటవెలది, కంద, సీస పద్యములు దేశ కవితా రీతులలో నున్నవి. వానిని తక్కిన ప్రబంధాది శాఖ లన్నిట రాగాంగ పద్యముల కిచ్చిన స్థానమే యిచ్చి మన వారందరూ ఆదరించి నారు. కాబట్టి దేశ పద్యములతో దేశి రగడలతో గూడ నొక యుదాహరణము వ్రాయవచ్చును. ఈ విధముగా నుదాహరణముల నొక క్రొత్తదైన అచ్చ దేశ్యోదాహరణము రాగాంగమూ తాళాంగమూ దేశి కవితగా వ్రాయవచ్చును. సార్వ విభక్తికమునకు చిన్న పద్యములు చాలవనుకొన్నచో అయిదు ఆరు పాద ములు గీతాదుల వ్రాయుట కభ్యంతరముండదు గదా! అయినను నాల్గు పాదముల నెన్మిది విభక్తుల గూర్చుటకును మన సాహిత్య మనువుగనే యుండును.

మార్గదేశి రాగతాళాంగ మిశ్రమోదాహరణ మున నించుక మార్పుతో ప్రబస్తరింపబడి, రాగాంగ ముల దేశి కవితా ప్రదేశమున, నొకనూత్న యుదా హరణము కల్పింపబడినది. రెండవ యంగమగు తాళాంగ మున మార్గకవిత్వము ప్రవేశించినచో నింకొక రెం డుదాహరణములు దేశిమార్గ మిశ్రమము, అచ్చ మార్గోదాహరణము ననునవి సిద్ధించును.

తాళాంగములనగా నొక లయను గలిగి యొక తాళమున కనువుగా కూర్చబడు దేశిరగడలు. ఈ రగడలు తొమ్మిది విధములు. ఈ తొమ్మిదియును, తాళమునుబట్టి నాలుగు రకములుగా భాసించు చున్నది.

| | | |
|---|---|---|
| 1) హయ ప్రచార రగడ | | ఈ మూడును రూపక తాళమును గలిగినవి. |
| 2) తురగవల్గనము | | |
| 3) విజయమంగళము | | |
| 4) మధురగతి | | ఈ రెండును ఏకతాళ మును గలిగినవి. |
| 5) హరిగతి | | |
| 6) ద్విరదగతి | | ఈ రెండును జంపె తాళము గలిగినవి. |
| 7) విజయభద్రము | | |
| 8) హరిణగతి | | ఈ రెండును త్రిపుట తాళమును గలిగినవి. |
| 9) వృషభగతి | | |

కొన్ని రగడల కొన్ని లఘువుల కలిపియు కొన్నిట లఘువుల తగ్గించియు నాయా తాళముల సాధింపదగునని లక్షణ గ్రంథములచే తెలియు చున్నది. తాళాంగమున రెండు విభాగములున్నవి. ఒకటి కళిక రెండవది యుత్కళిక. కళిక యనగా రగడభేదము. పై జెప్పిన తొమ్మిది రగడల దేనినైన కళికగా వ్రాయవచ్చును. ఉత్కళిక యనగా కళి కలో సగము. ఒక విభక్తికి ఒకే కళిక ఒకే యుత్క ళిక నియతములు. ఈ తాళాంగములు దేశికవితలు. వీనిలో వాడబడు గణములు ఛందస్సు వివరించుటకు మున్ను ఈ వ్యాస ధ్యేయమైన మార్గ తాళాంగ ముల ప్రస్తావనచేసి తరువాత దేశి మార్గ తాళాంగ ముల సామ్యము జూపునపుడు ఛందో విషయముల వివరింతుము.

ఒక యక్షరమునుండి ముప్పదియా రక్ష రముల వరకు ప్రస్తరింపబడిన మార్గ చ్ఛందమున నున్న వృత్త రీతుల నేదో యొక వృత్తమేదో యొక రగడకు సంబంధించియుండవలయునుగదా! వృత్త నిర్మాణము నాల్గు పాదముల నొకే రీతిని గురు లఘువుల నిల్పుట. ఇవి దేశ కవితలోని రగడలోని సూర్యేంద్రగణముల నిచ్చ వచ్చినట్లు వాడుకొను సౌలభ్యముతో సమానము కాకపోవచ్చునుగాని అందు నిహితమైయున్న లయను మాత్రము ద్రోసిరాజ

నదు. కావున లయాన్విత వృత్తముల పరిశీలించి నచో నీ క్రింది వృత్తములు కన్పించును.

1. సుగంధి, 2. మానిని, 3. మంగళమహాశ్రీ, 4. మత్తకోకిల (ఇంకనూ లయాన్వితములున్నవి.) వానిని సమయానుకూలముగా చర్చింతుము. ఈ నాలుగు వృత్తములు రగడ భేదములు భాసించ నాలుగు లయలను కలిగి ఉన్నవి. వానిని వరుసగా జూపింతుము.

1. a) హయప్రచార రగడ: "ఋతు విరామ మినుల
నల్వు; రతుక నొక్కయంఘ్రి
చెల్వు"

b) తురగ వల్గనము: ఇరవుల న్హయ ప్రచార
మినుమడించి కృతుల జెప్పు;
మరు విదూరి తాగ్ని వరణ
తురగ వల్గ నాఖ్య నొప్పు.

c) విజయమంగళము : తురగవల్గనంబు రెంటి
తోడ విజయమంగళంబు..

మూడు మాత్రలు గలిగినలయ పై మూడింట తెలియబడుచున్నది. యతిప్రాసలు గలిగి రెండు పాద ములు గలిగినది రగడ.

ఇదే లయను భాసించు సుగంధి వృత్తమును జూడుడు —

"జంట జంట సుస్వరాలు సాగిపోవు రీతిలో
నుంటచే సుగంధి వృత్త ముజ్వలించు నీ యెడన్'

చివరలో నొక లఘువు లోపించిన రెండు తురగవల్గనములయి రెండు సుగంధి వృత్తములు వ్రాసిన నొక కళిక పూర్తియగును. "మరియు" అను శబ్దముతో కళికను మొదలిడుటయును నొక నియ మము. అదే అర్థమునిచ్చు "ఇంక" అను పదములో వ్రాయవచ్చును. కానిచో మొదటి గురువును రెండు లఘువులుగా మార్చి "సౌగంధి" వృత్తము వ్రాయ వచ్చును. సౌగంధి—

"మరియు ధైర్య సాహసాంకమార్గమూను
సైన్యముల్
మర తుపాకి పాతువాండ్ర మట్టి జేయు
సైన్యముల్"

సుగంధి: "నేలమీద నీటిలోన నింగిపైన సైన్యముల్
కాలరాచి పాకునోట గడ్డిపెట్టు సైన్యముల్"

ఇట్లుగా తురగవల్గన రగడలో తుల్యమగు సుగంధి వృత్త కళికలు నిలిపి వ్రాయవచ్చును. ఉత్క ళికలు అర్థవృత్తము ప్రాసయంతో నిలిపిన తాళాం గను పూర్తి యగును.

"లక్షలాది కాందిశీక
సక్షణుమాను శక్తియై
కక్షబూను పాకునుండి
రక్షసేసి బాంగ్లలో
దుష్ట భక్షణమ్ముసేసి
శిక్ష రక్షణమ్మునన్
కష్టపడ్డ సైన్యమిద్ది
తుష్టిపడ్డ సైన్యముల్

కళికలు ఏ పాదమును కాపాదమే యొక వాక్యము. ఉత్కళిక ఎనిమిది పాదము లొక వాక్య ముగా నుండుట నియమము.

(2) నాలుగు మాత్రల నిరూపునకు చెందిన రగ డలు రెండు "నాలుగు మాత్రలు నాటిన గణములు నాలుగు రెంటికి నని నిరూపణములు'

ఇది మధుర గతి రగడ. జగణము నిషేధము.

'నలసభగగ ములం లోనల నేదైనను నెనిమిది నాల్గిటపై నిరసుము; గలసిన హరిగతి చెలునగు కృతులం గనినరుతొనని చెప్పిన నియమము"

దీనితో తుల్యమగు వృత్తము మానినీవృత్తము. ఏడు భగణములపై గురువు. చివర రెండు లఘు వులు లోపించిన హరిగతి రగడ.

మాలిని : 'పాటను టాంకుల శాబరు జెట్టుల
భస్మముజేసిన సైన్యముచే
బాటలు కాల్వలు నంటెన లిండ్లును
బాగొనరించిన సైన్యముచే

**కవిరాజ విరాజితము**

'మరియును సోదర బాంగ్ల జనమ్ముల
మాన్యత దెచ్చిన సేనలచే

చెరపకురా చెడిపోదువు సూక్తిని
చెప్పిన భారత సేనలచే''

ఇందు యతి మైత్రి యొకసారియే పాటింప బడినది. మరిరెండు అప్రసిద్ధములగు వృత్తములు. భాస్కర విలసితము: "చెల్లెలి విజయున కిచ్చిన వానిం
చేరెడు నటుకులు గొని తినువానిం

తన్వీవృత్తము: దూడలతో కాపరులను గుహలో
దొంగిలిదాచి న విధి నది లింపన్
కూడుక తద్రూపములయి పసులుం
గోపవ ధూటులు మురిపెమునందన్''

ఇవి రెండు కూడ నాలుగు మాత్రల నాటిన గణముల నెనిమిది గలిగి హరిగతి రగడగా భాసించు వృత్తములు.

ఇట్లుగా హరిగతి, మధురగతి రగడలతో తుల్యమగు మానినీ, వృత్తకళికలు భాస్కరవిలసితము, తన్వీవృత్తకళికలు మాెోగ్దాహరణముల వ్రాయ వచ్చును.

దీని యుత్కళిక ప్రాసయతి గూడిన నర్ధ వృత్త మిట్లుండును.

పాకు నియంతల పాలిటి మిత్తిగ
దూకిన భారత వాహినిచే
చీకుల చింతల బాంగ్ల జనమ్ముల
శోకము బాపిన సేనలచే
ఆరని ద్వేషము నంతము సేయుచు
దారుణ మాపిన వాహినిచే
గౌరవ భావము నిల్పిన సేనను
పౌరుల తీర్చిన సేనలచే.

(3) అయిదు మాత్రలచే విరుగు రగడలు రెండు.

"కరమొప్పు పంచ లఘు గణ చతుష్టయముచే
విరమంబు రెంటిపై ద్విరదగతి పేరిచే''
ద్విరదగతి రెట్టింప విజయభద్రము చెల్లు
విదురపూజితపార వేద సన్నుత నామ
ధరచక్రకార్ముకగ దాఖడ్గ ధారణా
తాపించ సమగాత్ర దళితదైత్యస్తోమ!''

అని లక్షణము తెలుపుచున్నది. దీనితో తుల్యమగు లయ కలిగిన వృత్తములు లయగ్రాహి మంగళమహాశ్రీ, వనమయూరీ వృత్తములు. వాని లయలో కూర్చబడిన మనీషాశుభాంగ వృత్తములు.

శుభాంగ—చెండుటలు, శత్రువుల చీల్చుటలు
వాహినుల యందున్
కొండలను గుట్టలను గూల్చుటలు
వాహినులయందున్

శోభాఁగ—మరియు గనవనుయ్యెడిని మాన్యతలు
సైన్యముల యందున్
వెరపెరుగుకే యరుల వేయుటలు
సైన్యములయందున్

ఈ వృత్తముల కళికలుగా ద్విరదగతి, జయభద్ర రగడల వోలె కూర్చి వ్రాయనగును.

దీని ఉత్కళిక యిట్లుండును.

ఆకసము కంపిలగ
దూకుచు విమానముల ప్రేల్చన్
పాకులకు బాకులయి
భీకరత శత్రువుల గాల్చన్
చాటి యరి జంపగల
పాట వము సైన్యముల యందున్
పోటరుల సైన్యముల
ధాటి మన సైన్యములయందున్

(4) ఏడు లఘువుల విరుపు గలిగినవి రెండు రగడలు

"నరహరి పదియు నాలుగు లములు
కరియతి హరిణ గతికి నెలవులు''

"ఇరువది ఎనిమిది లఘువులు
పదియేనిట విశ్రాంతిని గూర్చిన;
నిరవగు వృషగతి పద్మాధిప యిది
విను మాదరమున ముదమున''.

ఈ హరిణగతి, వృషభగతి రగడలకు తుల్య లయాత్మక ధ్రువకోకిల వృత్తములు. చివర రెండు లఘువులు లోపించిన మార్గ తాళాంగములు.

ధ్రువకోకిల:

"మరియు కుక్కలు పాడుగోలలు
మాను సైన్యము వల్లనే
విరిసి మోదమునిండ కన్నులు వెల్గ సైన్యము
వల్లనే''

మత్తకోకిల:

"వచ్చె కీర్తులు భారతాంబకు వాయు సైన్యము
వల్లనే
పుచ్చె పాకుల పాపకర్మము భూబలమ్ములవల్లనే"

దీని యుత్కళిక యిది.

"కాలుగాలిన పిల్లులై పరు
షాలు పల్కిన నాయకుల్
మూల మూలల దాగినక్కుచు
జాలి వీడిన భీరులన్
చేతి కందిన శత్రుకోటిని
గోత పూడ్చక ధర్మముల్
నీతి తప్పని మేటి సైన్యము
ఖ్యాతి సైన్యమువల్లనే"

ఈ వృత్త కళికలు తాళాంగముగా మార్గ తాళాంగములు నిలుపవచ్చును. ఇపుడు ఉదాహరణ ముల స్థూల రూపమును విభక్తి ప్రత్యయములు రాగాంగతాళాంగములను మార్గ దేశి కవితలతో ప్రస్తరింపబడిన రూపములు చూచుదు.

1. రాగ తాళాంగ మార్గదేశి మిశ్రమోదాహరణము: దీనియందు రాగాంగములుగా చంపకోత్పల శార్దూల మత్తేభములు తాళాంగములుగా రగడలుంచి వ్రాయబడదగునది. ఇది ప్రాచీనము.

2. రాగ తాళాంగ దేశ్యోదాహరణము: రాగాంగముగా దేశకవితలోని గీత, కంద, ఆటవెలది, సీసములను తాళాంగములుగా రగడలు నిలిపి వ్రాయునది. క్రొత్తరీతి యుదాహరణము.

3. రాగ తాళాంగ మార్గోదాహరణలు: రాగాంగములుగా చంప కోత్పల శార్దూల మత్తేభములు;తాళాంగములుగా సుగంధి, మానిని శుభాంగ మత్తకోకిలాది వృత్తముల నుంచి వ్రాయునది. ఇదియును క్రొత్త రీతి యుదాహరణమే!

4. రాగ తాళాంగ దేశ మార్గ మిశ్రమోదాహరణలు: రాగాంగముగా దేశికవితలోని గీత, కంద, ఆటవెలది, సీసములను; తాళాంగముగా సుగంధి, మానిని, శుభాంగ మత్తకోకిలాది వృత్తములు నిలిపి వ్రాయునది. ఇదియును నూత్నమైనదే!

రాగతాళాంగముల దేశిమార్గములతో ప్రస్తరించుకొనుచు పోయినచో సైనానితోపాటు రాగ తాళాంగములు నాలుగు, తాళరాగాంగములు నాలుగు మొత్తము పదునారు వచ్చును. కాని రాగాంగములు పద్య కావ్యములే యగును. తాళరాగాంగములు సంగీత రీతికి విరుద్ధము, తాళాంగములు పూర్తి లయాన్విత వృత్తములే అయి రాగ తాళ లక్షణము లోపించుట నిప్పై మూడు ప్రస్తారములు వదలివేయబడుచున్నవి.

దీనిలో ప్రస్తరించిన రగడలు, వృత్తముల లక్షణములు అప్పకవీయమునుండి గ్రహింపబడినవి. మార్గకళికల యుదాహరణములు మాచే వ్రాయబడిన ...నామార్గోదహరణమునుండి ఇవ్వబడినవి.



# గ్రంథవిమర్శలు

## పైగంబరకవులు — యుగచైతన్యం—2

(వచనకవితా సంపుటి. పేజీలు 43; వెల రూ. 1—00 ప్రతులకు : కిరణ్‌బాబు; 2/18 బ్రాడీపేట; గుంటూరు—2)

దిగంబరకవుల తరువాత వచన కవిత్వంలో మరొక సాహిత్య సమాజం పైగంబరులది. ఈనాడు తెలుగుసాహిత్యంలో అనేకమంది యువకవుల కవితా సంకలనాలు వెలువడుతున్నాయి. అయితే తదితర కవితా సంకలనాలకి, పైగంబరకవుల కవితా సంకలనాలకి తేడాఉంది. పైగంబరకవులు ఐదుగురు. ఎం. కె. సుగమ్‌బాబు, కమలాకాంత్, కిరణ్‌బాబు, వోల్గా, దేవీప్రియ. ఈ ఐదుగురూకలసి ఒక సమూహంగా ఏర్పడి ఒకే భావనతో కవిత్వాన్ని చెబుతున్నారు. ఇతర సంకలనాల్లో అయితే ఎవరిభావంవారిదేగాని మరొకరితో ఐక్యత ఉండాలన్న నియమం ఉండదు. వారి ధ్యేయాన్నిగురించి సంకలనం మొదట్లో ఇలా అంటారు. 'ఇది మా పైగంబరకవుల రెండవ సంకలనం యుగచైతన్యం. ప్రజా హృదయస్పందన, వారి జీవితం, పోరాటాలే మా కవితకు ఇతివృత్తం, ప్రాణం. పీడితవర్గ మానవుడు యిందు నాయకుడు. అతని ముందడుగే కవితాదేశం! మార్క్సియన్ సోషలిజమే ధ్యేయం'. పై అభిప్రాయాల్నిబట్టి పైగంబరులు కమిటెడ్ కవులనే అనుకోవాలి. ఇహ వీరి కవిత్వం సంగతి. ఈనాటి సాంఘిక వ్యవస్థలో సామాన్యునికి ఉన్న గౌరవాన్ని ప్రశ్నార్థకంగా చెబుతున్నాడు.

'జూలో పెంచే జంతువుకన్నా
మ్యూజియంలో దాచిన శిలకన్నా
బొటానికల్ గార్డెన్సులోని మొక్కకన్నా
మంత్రిగారి యింటి కుక్కకన్నా
మంత్రిగారి కన్నా
మనం హీనులమా ?' (సుగమ్‌బాబు)

చివరి రెండు పాదాల్లోనూ పాలకవర్గంలోఉన్న హీనత్వం, పాలితవర్గంలోఉన్న ఔన్నత్యం విశదమవుతున్నాయి. సామాన్యునికి ఒక హెచ్చరిక చేస్తున్నాడు.

'మళ్లీ చరిత్రగుండెల్లో జిల్లేళ్లను సృష్టించకు
ఇంకా పులులకు, తోడేళ్లకు ప్రాణంపోయకు'

అని అంటూ కర్తవ్యతాబోధచేస్తున్నాడు.

'దుర్మార్గం సింహాసనం క్రింద
విప్లవం డైనమైట్ ప్రేల్చాలి'
(సుగమ్‌బాబు)

అభ్యుదయకవులు ఆశావాదాన్ని బోధించారు. ఇవాళకంటె రేపే ఎంతో బాగుంటుందని చెప్పారు. ఈనాటి వచన గేయకవి ఈ ఉత్తఆశావాదంతో ఏం ప్రయోజనం లేదని చెబుతున్నాడు.

'ఎప్పుడో మనబ్రతుకు టడవిలో
పండువెన్నెల కురుస్తుందని
ఎప్పుడో మనబ్రతుకు ఎడారిలో
నిర్మల గంగా ఝరులు ప్రవహిస్తాయని
ఎప్పుడో మనఇంటి ముంగిట్లోకి
క్రాంతి కాగడాలు నడచివస్తాయని

బ్రతుకుపై ఆశల ఎండమావులు
పెంచుకుంటూ
నాజమ్మల్లా
రోజులు గడిపేస్తే ప్రయోజనంలేదు
వాస్తవాన్ని గ్రహించి
నిజమైన బ్రతుకుకోసం బరితెగించాలి'
(కిరణ్‌బాబు)

పెట్టుబడిదారీ వ్యవస్థని, ఆ వ్యవస్థకు పునాది రాళ్లుగాఉన్న ధనికవర్గ మనస్తత్వాన్ని వీళ్లు తీవ్రంగా ద్వేషిస్తున్నారు. రాబోయే సామాజిక విప్లవానికి ఈ వ్యవస్థ దాని తాలూకు మనస్తత్వమే కారణమని వీళ్లు నొక్కి చెబుతున్నారు.

'మీరు పెడుతున్నది ద్వేషాల విషపుబువలు
మీ జీవితాలకు చరమ గీతాలు
మీరు కొరుక్కుతింటున్న సామాన్యుల జీవితాలు
మీరు నిర్మించిన దుష్ట వ్యవస్థను
కూకటివేళ్లతో పెకలించే చైతన్య భూతాలు
మా నిశ్శబ్ద హృదయాలయంలో
మీరుచేసిన ప్రతి దౌర్జన్య నినాదం
మళ్లీ మీకర్ణపుటాల్లో ప్రణయనాదమై
ధ్వనిస్తుంది
మీ ధ్వంస మనస్తత్వం లోంచే
మిమ్ము సర్వనాశనం చేసే
మహోగ్ర మానవతా విప్లవశక్తి జనిస్తుంది.'
(దేవీప్రియ)

పాత విలువలకీ, నమ్మకాలకీ ప్రాధాన్యంపోయి క్రొత్త విలువలకీ నమ్మకాలకీ స్థానం లభిస్తున్నపుడు సమాజంలో పాతకి క్రొత్తకి సంఘర్షణ తప్పదు. ఈ సంఘర్షణయొక్క స్వరూప స్వభావాలు ఆయా జాతుల మనస్తత్వ వైవిధ్యంమీద ఆధారపడిఉంటాయి. ఈ దేశంలో ఇంతకుపూర్వం అనేక రకాలైన భావవిప్లవాలు వచ్చాయి. వాటిప్రభావం ఈ నాటి తరంపై ఉన్నా లేకపోయినా ఈనాటి భావవిప్లవం వేరు. అది రక్తస్పర్శతో కూడిన విప్లవం; హింసని హింసతోనే ఎదుర్కోవాలనే విప్లవం; ఈ విప్లవ భావాన్ని సమర్థిస్తూ ఈ నాడు కొంతమందికవులు కవిత్వాన్ని రాస్తున్నారు. దానిఛాయ ఈ సంకలనంలో కనబడుతూంది.

పంటచేలో కలుపుమొక్కలు తక్కువగాఉండి ఫలితాన్నిచ్చే మొక్కలు ఎక్కువగా ఉంటాయి. అయితే ఫలితాన్నిచ్చే మొక్కల కందవలసిన ఆహారాన్ని కలుపు మొక్కలు పీల్చి బలపటంవల ఫలితాన్నిచ్చే మొక్కలకి దెబ్బతగులుతుంది. అలాగే సమాజంలోకూడా సమాజ సంపదని సృష్టించేవర్గం ఎక్కువగా ఉండి ఆ సంపదని అనుభవించేవర్గం తక్కువగాఉండి ఈ అత్యల్ప సంఖ్యాకులు అధిక సంఖ్యాకులను బానిసలుగా చేసుకుని జీవించడం జరుగుతోంది. అల్పసంఖ్యాకులైన వర్గాన్ని అధికసంఖ్యాకులు జయిస్తారనే సత్యాన్ని వీళ్లు గొప్పగా చెప్పారు.

'నీ కుటిలనీతి విషవృక్షం,
కూకటి వేళ్లలో కూల్చగించే
ఒక్కొక్కరూ ఒకభీకర కరవాలంలా,
మెరుస్తూ—

నిలువెల్లా విష భరితమైన
నీ కొమ్మలూ— రెమ్మలూ—
విరిచి —విజయభేరి మ్రోగిస్తారు
మా మానవతా సుక్షేత్రంలో
కలుపుమొక్కల్ని నారు ఉండనివ్వరు.'
(కమలాకాంత్)

యుగచైతన్యంలోని వచనగేయా లన్నింటినీ పరిశీలిస్తే వీళ్లందరిలోనూ ఒక ఆర్తి ఉందని తెలుస్తుంది. అయితే ఈ ఆర్తికి కవితాపరంగా వెలువరించే టప్పుడు కవిత్వానికి సంబంధించిన కొన్ని శిల్ప రహస్యాలు వీళ్లు తెలుసుకునుండాలి. విషయాన్ని నగ్నంగా చెబితే తాత్కాలికంగా బాగున్నప్పటికీ శాశ్వత విలువల్నించి అది దూరమవుతుంది. కవిత్వం చదవంగానే 'ఏదో పరవాలేదు' అని అనిపించడం తేలికేగాని 'ఎంత బాగా చెప్పాడు!' అనిపించడం కష్టం. ఆ ప్రయత్నం వీళ్లు యికముందు చేస్తారని భావిస్తాను.

## ఘృ ణి

(కవితా సంపలనం; సంకలన కర్త:— కె యస్. వి. నరసింహం 35 పేజీలు: వెల: రు. 0—75పై. ప్రతులకు :—ప్రత్యూషసాహితి. 124 జి. యస్. మా స్ట్రీట్: తిరుప.)

ఇది వచనకవితా సంకలనం. వచనకవిత్వం ఎవరైనా రాయవచ్చు అదే అభిప్రాయం ఈ నాడు

ఎక్కువ ప్రచారంలోఉంది. దీనికి నియమాలు గట్రా ఏమీలేవు. కాబట్టి ఎవరికితోచింది వారు రాసేస్తే అది కవిత్వం అవుతుందని ఈ ప్రక్రియ నెత్తిమీద అక్షింతలు వేసేవాళ్లు చాలామంది ఉన్నారు. వాళ్ల అభిప్రాయానికి బలం సమకూడాలంటే—ఇలాంటి సంకలనాలు బాగా ఉపకరిస్తాయి.

ఈ సంకలనంలోని కవులందరికీ ఏదో ఒకటి చెప్పాలనే తహ తహ ఉన్నది. దానికి తగిన ప్రతిభగాని, వ్యుత్పన్నతగాని ఉన్నట్లు కనబడదు. వాళ్ల చెప్ప దలచుకున్న అభిప్రాయాన్ని వచనపుముక్కలుగా విరిచి వచనకవిత్వంగా పేర్చారు.

'మానవత్వాన్ని మంచినీ మరచిపోతున్నాడు
అసూయా జుగుప్సలను మరువ నంటున్నాడు
మదమాత్సర్యాలను అదుపులో ఉంచలేక
పోతున్నాడు
కుత్సిత క్రోధాలను జయించలేక పోతున్నాడు
యుద్ధజ్వాలలకు ఆజ్యంపోస్తూనే ఉన్నాడు.
శాంతి తత్వాన్ని కాల రాచేస్తున్నాడు
మానవాళి మనుగడకే ముప్పు తెస్తున్నాడు.'

ఈ పాదాల్లో కవిత్వానికి కావలసిన పదార్థం కాగడా పెట్టి వెతికినా కనబడదు. ఒక వాక్యంక్రింద మరొకవాక్యాన్ని పేర్చడం తప్ప ఇంకొక విశేషమూ ఏంలేదు. అట్లాగే మరొకగేయం—

'గడ్డురోజులు గడ్డురోజా
అనుకుంటూ గల్లీ మొదట్లోకొచ్చి
నిలబడి పోయాడు మధ్యతరగతి
సగటు జీవి—
జీవిత పద్మవ్యూహం సరే
ఇప్పు డిల్లు చేరడమెలా ?
గల్లీ అంతా పంకవ్యూహం
నల్లమబ్బు తొక్కిసలాడే
ఆకాశానికీ నాజూకునగరానికీ
నడుమ ఉక్కుఖడ్గాలు
దిగుతున్నట్లు వాన'

ఈ పైపాదాలు వచనకవితా రూపంలో విరచబడ్డాయి. అయితే ఈ పాదాలు విరుపువల్ల ఏదైనా లయ సాధింపబడినదా ? అంటే శూన్యం. సాధారణమైన వచనానికి ఈ పాదాలకి ఏమాత్రం భేదంలేదు. ఈ పాదాల్నే వచనంలోరాస్తే చదవడం కష్టంకాదు. 'గడ్డురోజులు గడ్డురోజా అనుకుంటూ గల్లీమొదట్లో కొచ్చి నిలబడిపోయాడు మధ్యతరగతి సగటుజీవి. జీవిత పద్మవ్యూహం సరే ఇప్పు డిల్లుచేరడ మెలా ? గల్లీ అంతా పంకవ్యూహం. నల్లమబ్బు తొక్కిసలాడే ఆకాశానికీ, నాజూకు నగరానికీ నడుమ ఉక్కుఖడ్గాలు దిగుతున్నట్లు వాన'. 'ఖడ్గ' ముద్రారాక్షసమో కవి స్వకీయమో తెలియదు.

'గంగాతటిపై చేపలవాడూ
అమెరికాలో బూట్ పాలిషర్
రష్యాలో సర్కస్ మనిషి'

మొదలైప పాదాలు—

'చైనాలో రిక్షావాలా
చెక్‌దేశపు గని పనిమనిషి
ఐర్లండున ఓడకళాసి'

అనే శ్రీ శ్రీ పాదాలకి వికృతిగా కనబడుతున్నాయి.

'ఈ ధరసమస్తం ధనవంతుల హస్తగతం
ఈ వ్యవస్థసమస్తం అన్యాయాక్రమసర్వస్వం'

అనే పాదాలు 'నిజాతి చరిత్ర సమస్తం/ పర పీడన పరాయణత్వం' అనే శ్రీ శ్రీ దేశచరిత్రలులోని పాదాలకి ప్రతిధ్వనులుగా కనిపిస్తున్నాయి.

మొత్తంమీద ఈ సంకలనంలోని కవులందరిలోనూ నేటి వ్యవస్థమీద ద్వేషం, మరో వ్యవస్థమీద నమ్మకం ఉన్నట్లుగా కనబడుతోంది. వారికి నమ్మకం ఉన్న వ్యవస్థ ఎలాంటిదో వాళ్లకి స్పష్టంగా తెలియడంలేదు. అంచేత భావంలో అస్పష్టత ఏర్పడింది. భావంలో అస్పష్టత, చేతపట్టిన ప్రక్రియలో నైపుణ్యం లేకపోవడం—ఈ రెండూ కలిసి ఈకవితా

సంకలనానికి కవిత్వపువిలువల్ని సంతరించలేక పోయాయి. ముందు ముందు ఉత్తమమైన కవితా సంకలనాలని ప్రత్యూష సాహితివారు ప్రచురిస్తారని ఆశ.

## దీ ప శి ఖ

(కవితా సంకలనం)

(రామా చంద్రమౌళి; పేజీలు 72; వెల రు. 1—75 పై. ప్రతులకు: ఆర్. గిరి, ఇంటి నెం. 14/964; గిర్మాజీపేట; వరంగల్లు—2)

వచనగేయం రాయడం చాలా సులువైన పని అని కొందరి నమ్మకం. అలాగే ఒక మంచి వచన గేయం రాయడం చాలా కష్టమైనపనిఅని దానిలోని మెళుకువలు తెలిసినవారి అభిప్రాయం. గొప్ప వచన గేయాలూ వస్తున్నాయి; ఎందుకూ పనికిరాని వచన గేయాలూ వస్తున్నాయి. ఉత్తమం, అధమం ఎప్పుడూ ఉంటాయి. ఈ రెండిటికీ మధ్యస్థస్థితికూడా ఉంటుంది. అది సాధారణకవిత్వం. ఆ కోవకు చెంది నదే ఈ కవితా సంకలనం. ప్రకాశకులు ప్రారంభంలో 'మానవ శ్రేయస్సుకొరకు సమసమాజ నిర్మాణం కొరకు ముందుకు పరుగెత్తి పాలికేక వేయాలనే పవిత్రాశయంతో మేము మా ప్రథమ కానుకగా శ్రీ చంద్రమౌళిగారి వాణిని అఖిలాంధ్ర పాఠక లోకానికి సగర్వంగా వినిపిస్తున్నాం' అని చెప్పుకున్నారు. 'మాన సికంగా కలిగిన భావావేశాన్ని, సందేశాన్ని ఈ మానవాళిలోకి వెదజల్లాలనే తహతహతో చిన్నవయస్సు లోనే నేనీ ధైర్యాన్ని చేసినా. భావప్రకటనానైదుష్యంలో అస్తవ్యస్తత ఎక్కడ ఆవరించిందోనన్న అను మానం అక్కడక్కడ మెదులుతోంది. అయితే జంకడం అనబడేది అసమర్థతకు చిహ్నం. కాబట్టి ముందడుగే వేశాను' అంటున్నారు రచయిత మనవిలో.

ఈ కవికి ఈ వ్యవస్థమీద, ఈ సామాజిక న్యాయంమీద కావాలిసినంత కసి మొదలైనవి ఉన్నాయి. అయితే అతనుకోరే వ్యవస్థ స్వరూపం ఏమిటో ఈ సంకలనంలో వెల్లడికాలేదు. ఈ నాగరికతమీద ఈయ నకు నమ్మకంలేదు.

'ఈ ప్రపంచం నాగరికత
ముసుగు కప్పుకుని మళ్ళీ
పాతరాతియుగంవైపు పరుగిడుతోంది'

అంటున్నారు. ప్రోగ్రెస్ అనే ఖండికలో—

ఇది ప్రగతికాదు...మానవ వికృతి
ఇది అభ్యుదయంకాదు...విషవీచికామయం
ధర్మ ప్రభంజనం జరిగిపోయింది
పాపవిహారం సాగిపోతోంది
పదేండ్ల ప్రపంచపు ప్రోగ్రెస్
మైనస్ మార్కులతో పూర్తిగా మలినమై
పోయింది'

అని అంటూ ఆధునిక సమాజ జీవితంయొక్క వైఫల్యాన్ని, సాంఘికనీతి, నియమాలకు సంబంధిం చిన అన్యాయాన్ని చెబుతున్నారు.

అయిదేండ్లకొకసారివస్తే ప్రజాస్వామిక ఎన్ని కలమీద చక్రగమనం అనే ఖండిక నుంచి సెటైర్. ప్రతి ఎన్నికలోనూ మనం చూస్తున్నది వాస్తవికంగా చిత్రించగలిగా రీయన.

'ఎప్పుడూ పందులు పొర్లాడే
మా చీకటి సందులో
తెల్లనిఖద్దరు లాల్చీలు తిరుగుతున్నాయి
దుర్గంధ భూయిష్టమైన మావీధిలో
సుగంధ మారుతాలు ఒక్క
రోజుకోసం కిరాయి కొచ్చాయి
హృదయాల్లో స్పందన చస్తోన్న క్షణాల్లో
నీరవంలో నిరీక్షించే మావాడ
సారాయి వాసనలో మునిగిన
భజంత్రీలతో భళ్ళునుంటోంది.'

ఈ కవిలో సిద్ధాంత పరమైన అస్తవ్యస్తత ఎక్కువగా కనబడుతుంది. ఈ నాటి అన్యాయానికి ఈయన హృదయం చలిస్తుంటేగాని దాని పరిష్కార మార్గం ఈయనకు తెలియదు. ఒక్కొక్కప్పుడు ఆశావాదం మరొకప్పుడు నిరాశావాదం ఇలా ఈయన మానసిక వ్యవస్థ ద్వైధీభావ సంఘర్షణలో ఉంటుంది.

'మానవజగత్తు నొక మహిమాన్విత
మహత్తుగా మారుద్దామని
భూగోళా న్నొక బంగారుముద్దగా చేద్దామని
అందుకే అందని ఈ పువ్వుచుట్టూ
అఖండ దీక్షతో ఈ అనంత పరిభ్రమణ
మహా సంకల్పంతో ఈ మహాప్రస్థానం'

అంటూ తనలోఉన్న ఆశావాదాన్ని వ్యక్తంచేస్తూనే;

............జ్వాల ఎలా నిలుస్తుంది ?
అందుకే అభాగ్యుడిబతుకు అప్పుష్టదీపశిఖ'

అనే నిరాశావాదంలోకి జారిపోతున్నారు.

'పగిలిన గుండెల ముక్కలలోనుంచి
ఎర్రని రౌద్రబింబాన్ని పుట్టిస్తాను
సువర్ణశకానికి చరిత్ర ప్రారంభిస్తాను
ఆగామియుగానికి 'అ, ఆ'లు రాస్తాను'

అని ధైర్యంగా పలుకుతూ—

'భరించరాని భవిష్యత్తును గాంచి
తిప్పిరెక్కిన కళ్లు మూతపడుతున్నాయి
వికీర్ణభూతాన్ని చూచి నిలబడనా ?
ఆశలను పెంచుకుని అడుగు ముందిడనా...?'

అనే సంశయ వాదంలోకి పలాయనం చిత్తగిస్తున్నారు. జీవితంమీద సమగ్రమైన అవగాహన లేకపోవడమే దీనికి కారణం.

మొత్తంమీద ఈ సంకలనం చాలా మంచి సంకలనం అని చెప్పలేం కాని వచనగేయస్వరూపానికి అపఖ్యాతి కలిగించే సంకలనం మాత్రంకాదు. ఇంకొంచెం సాధన, కృషి, అవగాహనఉంటే ఒక స్థిరదృక్పథంతో ఈ కవి ముందు ముందు గొప్ప వచనగేయాలు రాయ గలడని ఈ సంకలనం ఋజువుచేస్తున్నది. పోతే ఈ కవి వొత్తులమీద తగినంతశ్రద్ధ చూపాల్సిన అవసరం ఉంది. ప్రభలి, రౌధ, బింధువులు, అనాధిగా, ఘర్జిస్తున్నాయి మొదలైనచోట్ల ఈ వొత్తులు దోషాలు. ఒకచోటఅయితే అచ్చుతప్పు అనుకోవచ్చు. ఇకమీద రచనలలో ఈ జాగ్రత్త తీసుకుంటారని ఆశిస్తాను.

## బసవ వచనామృతం

(అనువాదకులు : శ్రీ బాడాలరామయ్య; వెల 0—25 పై. బసవ సమితి; బసవ సదనము; శ్రీ సర్వభూషణమఠం; బెంగుళూరు 9)

వీరశైవ వాఙ్మయమునకు సంబంధించిన కావ్య మిది. వీరశైవ మత ప్రాచుర్యానికి బసవేశ్వరుడు రచించిన వచనములను కన్నడమునుండి తెలుగులోనికి శ్రీ బాడాల రామయ్యగారు అనువదించారు. ఈ అనువాదమునుగూర్చి స్వర్గీయ శ్రీ బండారు తమ్మయ్యగారు మున్నుడిలో ఈ విధంగా చెబుతున్నారు.

'పూర్వానువాదములకన్న నిది యన్నివిధముల మిన్నయై విశిష్టత నందియున్నదనియు, కన్నడమునందలి బసవన్నగారి నుడికారము, లాలిత్యము, ఇంపు సొంపులు నెంతమాత్రమూ చెడకుండా వీరు తమ యనువాదము నతి సమర్థతతో జక్కగ నిర్వహించిరని నిరాఘాటముగా నివేదించుచున్నాను.'

అనువాదమునకు ఒక ఉదాహరణ. మున్నుడిలోనిది.

'నాదప్రియ శివనెంబరు
నాదప్రియ శివ నల్లయ్యా
వేదప్రియ శివనెంబరు
వేదప్రియ శివనల్లయ్యా.'

ఈ మూలమునకు అనువాదము—

'నాదప్రియుడు శివుడౌనే
వేదప్రియుడు శివుడౌనే.'

శ్రీ బాడాలు రామయ్యగారు అనువాదమునందు సులభశైలిని వాడారు. వీరశైవ మతంయొక్క ప్రధానోద్దేశం కులవివక్షతలేని భక్తి జ్ఞానమార్గం కాబట్టి ఆ మతం ప్రజల్లోకి ప్రాకటానికి సులభ శైలి, ప్రజల వాడుకభాష అవసరంఅని ఆనాటి కవులే గుర్తించారు. దానికి అనుగుణంగానే చక్కని శైలిలో ఈ వచనామృతం అనువదించ బడింది.

## త్రివేణి

(కవితా సంకలనం)

(ప్రభంజన్; శాంతమూర్తి; భావశ్రీ; వెల రు. 1–00 లు. ప్రతులకు : అంచల లక్ష్మీనారాయణ; 8—2—22 బి; పంజగుట్ట; హైదరాబాద్ 4.)

స్పందన సాహితీ ప్రచురణలలో ఇప్పటికిది మూడవది. సాహిత్యాన్ని సరసమైన ధరకు అంద జేయాలనే వీరి సంకల్పం అవశ్యం అభినందింప వల సిందే. అయితే, సంకలనాన్ని ప్రచురించేముందు ధర కంటెకూడా నాణ్యత విషయంలో జాగ్రత్త వహించ వలసిన అవసరంఉంది. అలాంటి జాగ్రత్త ఏదీ ఈ ప్రచురణకర్తలు తీసుకున్నట్లు కనబడదు. సర్వశ్రీ ప్రభంజన్, శాంతమూర్తి, భావశ్రీ వీరు ముగ్గురూ సాంకేతికవిద్యలో ఉత్తీర్ణులై, యంత్రకర్మాగారాల్లో పనిచేసేవారైఉండి సాహిత్య రచనాభిలాషు లవటంవలన సమాజానికి ఏదోఒక సందేశం ఇవ్వాలనే ఆకాంక్షతో వచనకవిత్వం పేరున సంకలనాన్ని సమకూర్చారు.

కవులుగా పెద్దకీర్తిని ఆశించక పోయినప్ప టికీ రాబోయే తరాలకి వారసత్వంగా ఒక కవితా సంకలనాన్ని అందించేటప్పుడు దానివెనుక ఉండవల సిన కృషిగాని, ప్రతిభగాని ఈ సంకలనంలో కన బడవు. ఏదో సంకలనాన్ని ఎలాగోలాగ బయటకు తీసుకు రావడమే ప్రధానోద్దేశమైతే అట్టి సంకలనం కావ్యసంకలనాల సంఖ్యను పెంచడానికి పనికొస్తుం మోకాని గుణానికి ఉదాహరణగా నిలవదు.

ప్రభంజన్‌గారి ఈ క్రిందిపాదాలు చూడండి.

'సంఘంఅంటే ఏమిటో తెలుసా ?
సగంచచ్చిన మనుష్యుల కూటమి
పరువంటే ఏమిటో తెలుసా ?
పారేసిన పుల్లిస్తరి కాదా—!'

ఈ పాదాల్లో కవిత్వానికి పనికొచ్చేగుణం ఏమన్నా ఉందేమో అనునకే తెలియాలి. ఇది వచనంగా రాస్తే వచ్చేనష్టం ఏమిటి? అని పాఠకుడు ప్రశ్నిస్తే సమాధానం శూన్యం.

'చెల్లిపోయిన ధర్మాలను
కుళ్ళిపోయిన సమాజాన్ని
సమూలంగా సమాధిచేస్తాను'

అనటం ఆధునికకవిత్వ లక్షణం. ప్రత్యేకత ఏమీ లేదు.

'కావ్యవస్తువును గురించీ, కవిత్వ లక్షణాన్ని గురించీ ఎన్నో వాదోపవాదా లున్నాయి. ఫలానా కవిత్వం రాయాలి అని అనుకోకపోయినా ముందుగా మంచికవిత్వం సాధించడానికి ప్రయత్నిస్తున్నాను' అంటున్నారు శాంతమూర్తిగారు. సంప్రదాయం అమృతమని దాన్ని పొలక పోసుకోవద్దని హితవు చెబు తున్నా రీయన. రెండుదీపాలు అనే ఖండికలో ఉన్న వారికి లేనివారికి మధ్యగల భేదాన్ని వివరిస్తున్నారు.

'ఆ దీపం దీనికేసి చూడదు
ఈ దీపం దానికేసి చూడలేదు
ఆ దీపం నవ్వులలో వెలిగిపోతుంటే
ఈ దీపం చీకట్లో మలిగిపోతోంది.'

'పాత రోతకాదు; కొత్తంతా వింతకాదు; పాత లోని తేట తెల్సుకో; కొత్తలోని చెత్త వదలుకో'. ఇది భావశ్రీగారి సిద్ధాంతం. గురజాడవారి పాత కొత్తల మేలు కలయికమీద ఈయనకు ఆరాధనభావం ఉండి ఉండాలి.

'పూర్ణ సవుంపక ఉత్తర వీర కోటిలో
జీర్ణజరాత్తమై మిగిలినదేశంలో సం
పూర్ణతగల పురుషుడు పుట్టాలోయ్'

అని అంటున్నారు వీరు 'నాయకుడు కావాలి' అనే ఖండికలో. రెండవపాదాన్ని 'సం' అనే అక్షరంతో ముగించి మూడవపాదాన్ని 'పూర్ణత'తో ప్రారంభించడం వలన సాధించిన ప్రయోజనం ఏముంది? వచన కవిత్వంలో పాదాలవిరుపు ప్రధానమైన విధానం. ఇలా పాదాలను విరిచినందువల్ల సాధింపబడేది వికృతేగాని సహజస్వరూపంకాదు.

మేఘాలమీద అనే ఖండికలో సామాజికమైన దురవస్థని చిత్రించారు.

'నీవుపోయే దారిలో మా
నిదురవోయిన నాయకులు కనిపించినపుడు
మూగజీవుల కన్నీటి జల్లులో
మేలుకొలిపి వెతల కథలు
తెలుపుమోయి మేఘమాల'

ఇత్యాదులు చదవడానికి బాగుండే పాదాలు. ఈ సంకలనంలో వచనకవిత్వంయొక్క ఖ్యాతిని ఇనుమడింపజేసే శక్తి ఏమాత్రంలేదు. ఇకమీదట వీరురాసే వచన కవితా ఖండికల్లో కృషి, ప్రతిభ ద్యోతక మవుతాయని ఆశిద్దాం.

## సమతా దీపాలు

(వచనకవితా సంకలనం)

(చొప్పకట్ల చంద్రమౌళి; పేజీలు 80; వెల రు. 2—50 లు; ప్రతులకు: చొప్పకట్ల చంద్రమౌళి; వేములవాడ; కరీంనగర్ జిల్లా)

ఈ సంకలనంలో మొత్తం ఇరవయితొమ్మిది వచనగేయా లున్నాయి. ఈ గేయా లన్నింటిలోనూ ఈ నాటి సమాజస్వరూపం ప్రతిబింబిస్తున్నది. సమకాలీన సమాజాన్ని చిత్రించడంలో శ్రీ చంద్రమౌళి గారికి చాకచక్యం తగినంత పరిణతస్థితిలో లేకపోవడం సంకలనంలో స్పష్టంగా కనబడుతుంది.

సమతాదీపాలు అనే ఖండికలో—
'చచ్చాడనుకొని మనం
చిచ్చుబుడ్లతో వర్ధంతిపండుగ
చేస్తున్న రాక్షసుడు
మానవ కవచాలు ధరించి
శతసహస్ర నరనారీ హృదయాలలో
ఎదనుండి ఎదను విడదీసే
చీకటి చాకులను వహించి
స్కంధావారం చేస్తున్నాడు'

లాంటిపాదాలు ఈ సంకలనంలో ఎక్కువచోట్ల కనబడవు. పై పాదాలుకూడా ఒకసారి చదవడానికి బాగున్నాయేకాని మళ్ళీ మళ్ళీ చదివించే పాదాలుకావు. చెప్పేవిషయం సమకాలీన కవు లందరికీ ఒక్కటే అయినపుడు ప్రతికవీ తనవస్తువుకి క్రొత్తరూపాన్నిచ్చేందుకు ప్రయత్నంచెయ్యాలి.

'ఓటు అప్పచెప్పేదాకా
మోటారులోనే త్రిప్పుతారట
ఆపిమ్మట వారి కారు గీరలచారలలో
మీ ఉజ్వల భవిష్య ద్రేఖలు కనిపిస్తాయట'

'బహుపరాక్' అనే ఖండికలో కనిపించే ఈ పాదాల్లో ఉన్న వ్యక్తీకరణ విధానం గొప్పది.

'త్రిశంకు స్వర్గం' కుటుంబ నియంత్రణను గురించి రాసిన గేయం. 'రాలిన ధ్రువతార నెహ్రూపై ఎలిజీ' 'ఒకే భారత హృదయం' అనే ఖండికలో ఐక్యతాభావం ధ్వనిస్తుంది. 'దొంగను పట్టుకోండి'లో వ్యక్తిస్వార్థం వ్యక్తమయింది. పైచెప్పిన గేయాలు ఈ సంకలనంలో బాగున్నగేయాలు.

శ్రీ చంద్రమౌళిగారికి అంత్య ప్రాసలంటే ఇష్టంలా కనబడుతోంది.

'ఇంటిముందరి మేడలమీద నీళ్లకు కక్ష
జానెడుపొట్టనే తమకు శ్రీరామరక్ష'
'ఉపాధ్యాయుని శుభోదయ కావ్యం
ఇలా తలపోయడమే ఇప్పటికి భావ్యం'

మొదలైన పాదాలు కవిత్వాన్ని వికృతం చెయ్యడానికి బాగా పనికివస్తాయి.

'అడగకుండానే సహాయం చేసేవాడు చవట
నిజాన్ని కుండబ్రద్దలు కొట్టినట్లు
చెప్పేవాడు పెర్రరిపు

మొహమాటం లేకుండా
అవినీతిని బహిరంగంగా
నిలదీసి అడిగేవాడు అసమర్థుడు.'

ఇత్యాదులైన 'తాజా నిర్వచనాలు' కవిత్వంగా రాయకపోయినా ప్రమాదంలేదు.

శ్రీ చంద్రమౌళిగారు ఆధునికులైన గొప్ప కవుల్ని బాగా చదివారన్నది ఈ సంకలనం చదివిన ప్రతి పాఠకునికి అర్థమవుతుంది. వ్యుత్పన్నతరక్తంలో కలసి ప్రతిభగా వికసించాలేగాని ప్రతిధ్వనిగా మార కూడదు.

శరచ్చంద్రికలో — శ్రీ శ్రీ ఇలా వచ్చావేం వెన్నెలా ! ఎలా వర్ణించను నిన్ను ? అంటాడు. చంద్రమౌళిగారు చంద్రుని నివేదికలో 'ఇలా వచ్చావేం మానవుడా ! ఎలా ప్రశ్నించను నిన్ను?' అంటారు. 'గజానివో గాంధారికొడుకు గాంధీగారి దేశంలో' అన్నాడు తిలక్. 'గాంధీజీ ఆశించిన సమతారాజ్యం గాంధారి సంతానంవలన అవుతుంది పూజ్యం' అంటా రీయన. 'దొంగను పట్టుకోండి' అనేగేయం తిలక్ 'పరారీ అయిన వ్యక్తికోసం' అనే గేయం అడుగు జాడలలో నడిచింది.

సమాజపరమైన బాధల్నీ, అక్రమాలని, అన్యాయాలని తీవ్రంగా వ్యక్తం చేయాలనే ఆవేదన చంద్రమౌళిగారి కున్నది. ఈ ఆవేదనతోపాటు కొంత ప్రతిభనికూడా జతచేసి ముందు ముందు ఇంతకంటె మంచి వచనగేయాలు రాస్తారని ఆశిదాం !

## మాదీ మీా ఊరే

(కవితా సంకలనం)

(రచయిత : సి. వి. కృష్ణారావు, పేజీలు: 38; వెల రు, 1-00 లు; ప్రతులకు : సృజన; పోస్టు బాక్సు నెం. 67, వరంగల్-2.)

ఒక కవియొక్క అనేక కావ్యఖండికలు ఒక సంకలనంగా రూపొందినపుడు కావ్యఖండికలు వేటి కవి ప్రత్యేకమె నప్పటికీ చదివేవ్యక్తికి అన్ని కావ్య ఖండికలలోనూ కవియొక్క జీవన సిద్ధాంతభావన ఒకటి స్పష్టంగా కనిపిస్తూ ఉంటుంది. ఇది ఉత్తమ కవితా సంకలనం సంగతి. సి. వి. కృష్ణారావుగారి ఈ సంకలనంలో భావైక్యత, ఒక జీవన సిద్ధాంతం, ఒక కమిట్‌మెంట్ కనబడుతూ ఉంటుంది. పూసల్లో దారంలా ఈ సంకలనంలోని అన్ని కావ్యఖండికల లోనూ ఒక ప్రత్యేకస్థానం వ్యక్తమవుతుంది. ఈ నాడు వచనగేయాలు రాస్తున్న చాలమందికి జీవితం మీదగాని, వ్యవస్థమీదగాని స్పష్టమైన అభిప్రాయా లున్నట్టు కనబడదు. కారణం రచనమీదున్న తీవ్ర కాంక్షేతప్ప తద్వారా లభించే ప్రయోజనంయొక్క స్వరూపం వాళ్లకు తెలియకపోవడమే. సి. వి. కృష్ణ రావుగారు తన సిద్ధాంతాన్ని ఈ విధంగా చెబు తున్నారు. 'ఈ చిత్రమైన ప్రపంచంలో అనామకుడు చక్రవర్తి కావాలనుకుంటున్నాడు. ఎవరూ చూడ కుండా దర్బారు చౌకీదారు రాజుగారి సింహాసనంమీద కూర్చుని మీసాలు మెలేస్తాడు. ఈ మూఢుణ్ణి చీకటి తప్ప ఎవరు చక్రవర్తిగా గుర్తించారు ? అందుకని సింహాసనాన్నే విరగడన్నండి, తరతమ భేదం తెలియ కుండా పోతుంది.' అయితే సంకలనంలోని గేయా లన్నింటిలోనూ సమకాలీన సమాజంయొక్క దౌర్భాగ్య స్థితిమాత్రమే వర్ణించబడింది. దానికి పరిష్కార మార్గం గేయాల్లో ఎక్కడా చెప్పలేదు. సంకలనానికి ముందు రేపటి సమాజాన్ని ఈ కవి ఊహించిన పై ఊహలోమాత్రమే పరిష్కారం సూచింపబడింది.

'రైతుకొడుకు రామయ్యవారు
శెట్టికొడుకు సేఠయ్యవారు
రాజకొడుకు యువరాజుమీరు
ఎవరికొడుకు వీ దేవరోనని
ఎందరో ఎరుగరు నన్ను
మాదీ మీఊరే మహరాజ కుమారా.'

అంటూ సంఘవ్యవస్థలో ఒక సామాన్య వ్యక్తి యొక్క అనామకత్వాన్ని వర్ణిస్తారు. ఆస్తి, అధి కారంఉన్న వ్యక్తి మరణానికీ, అది లేనివ్యక్తి మరణా నికీ ఉన్న భేదాన్ని—

'మీ బాబుగారి తాత
శివరాత్రికి మరణించిన పూజ్యుడు
మా ముత్తాతల మరణాలకు
అసలు తిథులేవో తెలియవు'

అన్నపాదాల్లో గొప్పగా వ్యక్తంచేసారు.

'మా బ్రతుకుల్లో చిత్రాలు
మీ తివాచీలపై కళాకారులు చెక్కిరి'

అనే పాదాలు ధ్వనిప్రధాన మైనవి. తివాచీలు గొప్ప వాళ్ల ఇళ్లలో క్రిందపరుస్తారు. వాటిమీదనుంచి నిలువైన మనుషులు నడుస్తుంటారు. ఆ తివాచీలమీద కొందరి బ్రతుకుల చిత్రాలు చెక్కబడ్డాయి అంటే - వాళ్ల బ్రతుకులు ఆ చిత్రాల్లో లాగే ఒకవర్గం కాళ్ల క్రింద నలిగిపోతున్నాయని అర్థం. వీళ్లకికూడా ఆలోచన ఉంది; ఆవేశంఉంది. ప్రయోజనం మాత్రం శూన్యం.

'మునుపిచ్చిన జాగాలోనే
మురిగిన ఈగల్లాగా
మనుగడ మనకెక్కడ గాదని
నునమూ మానవులమేనా అని
మంచిఅనే మృగతృష్ణలో
మన్నుతున్నవాణ్ణి'

ఇది అనామకుని ఆలోచన. 'మాదీ మీ ఊరే మహరాజ కుమారా' అనే ఖండికలో సామాన్యుని జీవితంలోని దీనస్థితిని ఈ కవి చక్కగా చెప్పారు.

'వంతెనక్రింద బరువుమోసే స్తంభాలు' అనే ఖండికలో ఈ వ్యవస్థ గమనానికి కారకులైన శ్రామిక జనంయొక్క జీవన వైఫల్యాన్ని ధ్వనింపజేశారు.

'వాంతెనక్రింద బరువుమోసే స్తంభాలు
వూడుపుకు సగమరిగిన చీపురుపుల్లలు
మడిమ అరిగి ఉంగటం తెగినచెప్పలు
అంగడిలోవాడి పారేస్తే
నలుగురి మడిమలక్రింద నలిగినపూలు.'

వీళ్లంతా సమాజంలో పీడింప బడుతున్న వాళ్లు. వంతెన సమాజమైతే దానిమీద నడిచిపోయే వారంతా పై వర్గాలవారు. సమాజం తలక్రిందు లవకుండా కాపాడ్డానికి క్రిందివర్గాలవారు శ్రమ పడుతూ ఉంటారు. శ్రమ వీళ్లది; ఫలితం పై వర్గాలవారిది. సగమరిగిన చీపురుపుల్లలు, ఉంగటం తెగిన చెప్పలు, మడిమలక్రింద నలిగే పూలు అన్నవి శ్రామికవర్గ జనాభాకి సంకేతనాలు.

సమాజం తిరగలిగా, దాంట్లో పీడితజనం బియ్యపుగింజలుగా ఏవిధంగా నలిగిపోతున్నారో 'ప్రతి ప్రాణి' అనే ఖండికలో వివరించబడింది.

'ప్రతిదినం తిరగలిలా తిరుగుతోంది
ప్రతి మధ్యాహ్నం సూర్యుడు నిప్పులు
గక్కుతున్నాడు
ప్రతిరాత్రి తమస్సు శపిస్తోంది
ఏ సమస్యాతీరక ఏ ప్రవృత్తులకు
రాజులముకాక
చిక్కుబడ్డదారం చిక్కులు విడదీయలేక
రక్తనాళాలు అనుక్షణం ఆకలి జపిస్తుంటే
తిరగలి బొడ్డుచుట్టూ
ప్రదక్షిణ చేస్తున్నవి గింజలు'

మానవత్వం, అమానుషత్వం రెండూ ఒక చోటనే ఉన్నాయంటారు. సి. వి. కృష్ణారావుగారు. ఉండవలసిన పద్ధతిలో ఉంటే మానవత్వం, అలా కాకపోతే అమానుషత్వం. వ్యక్తినిబట్టి సమాజం నడుస్తుంది. సమాజంలోని వ్యక్తులందరూ కష్టసుఖాల్లో భాగస్వాములైతే అది నిజంగా సమాజం. కష్టం ఒకవర్గానిది సుఖం మరొక వర్గానిదైతే అది సమాజంకాదు. దానిపేరేదో అదే నిర్ణయించుకోవాలి.

'కుళ్ళుకాలవ పగిలినప్పటి లా
లోభీతి వెలికివచ్చి వెక్కివెక్కి ఏడుస్తోంది
సమాజం తనవ్యవస్థ సరిదిద్దుకోలేక
తనకుతానే నామకరణం చేసుకోక తప్పలేదు
జుట్టు దువ్వుకోనప్పుడు దయ్యమని
తనకుతానే పిలుచుకోక తప్పలేదు.'

ఇకరాలదు కన్నీరు అనే ఖండికలో జీవన వైఫల్యంయొక్క పరాకాష్టస్థితిని చెప్పారు.

'ఎన్నిరెక్కలు విరిగి పోయినయి
ఎన్నినాల్కలు ఎండిపోయాయి
ఎన్నిడొక్కలు అంటుకుపోయాయి
ఎన్ని రెప్పలు మూతపడ్డాయి.'

ఇలా ఈ వ్యవస్థయొక్క దౌర్భాగ్యాన్ని ఈ సంకలనంలో ప్రతి ఖండికలోనూ ఈ కవి అత్యంత తీవ్రంగా వ్యక్తంచేశారు. ఈ సమాజానికి వంశపారంపర్యంగా సంక్రమించిన కుష్ఠురోగంయొక్క స్వరూపాన్ని వర్ణించడానికి బూతులే కవిత్వంగా రాయ నవసరంలేదని సి. వి. కృష్ణారావుగారు ప్రతి అక్షరంలోనూ ఋజువుచేశారు. వచనగేయాన్ని ఒక కవితా ప్రక్రియగా అంగీకరించే సహృదయులు, ఈ సమాజాన్ని మార్చాలనే దృఢసంకల్పంగల సాహిత్య పాఠకులు, ఈ సమాజాన్ని మార్చడానికి, దీనిమీద ఏవగింపు కలిగించడానికి కవిత్వంలో బూతులుతప్ప మరో మార్గంలేదని విశ్వసించేవాళ్లు ఈ సంకలనాన్ని శ్రద్ధగా చదవవలసిన అవసరం ఎంతైనాఉంది.

—టి. ఎల్. కాంతారావు

Printed and Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7 Thambu chetty Street, Madras-1. Editor : S Sambhu Prasad.

# భారతి

మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్



ఏప్రిల్ 1972

సంపుటము : 49 : సంచిక : 4 :

విడిపత్రిక వెల ఒక రూపాయి



## 26 - 3 - 72

### శ్రీ దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి 34-వ పుణ్యవర్ధంతి

శివముల్ తత్వముల్ పరవశించిన వేళ, అనర్ఘ ధర్మముల్
శివములు చేతలై పరిమళించిన వేళ, రసాత్త భావముల్
శివములు గీతికల్ మధుర శీధువు లందినవేళ తెల్గునన్
ప్రవరము శైవతేజము శుభాకృతి వెల్గిన వెల్గు వెల్గులై.

# విషయానుక్రమణిక

## ఏప్రిల్ 1972

# దీప్త్యంతర చైతన్యం

## శ్రీ వక్కలంక వెంకట కృష్ణారావు

### 1

పొద్దు తిరుగుడు పువ్వూ ప్రతీక్షిస్తూంటుంది
పుష్కరాలు నవ్వినపుడు
పొడుపు కొండవైపు తిరగాలని
పొగులుతున్న నాకు తోడుగా
సంధ్యకు
స్వాగతం పలకాలని

కాని
నేమా పూలూ ప్రకృతీ
మౌనంగా జాలిపాటలు పాడుకొంటూ

వెలుగుచెండు
వెనకో ముందో
పేరోలగంలోకి ప్రవేశిస్తుంది
అంతర్వ్యదనాలని
కాంతిజలాల ప్రక్షాళించుకొని
అంతరాళ సదనాంగణాన
కలయంపి జల్లి
కలల రంగవల్లికలు దిద్దుకొనవచ్చునని
ఎదలో ఏవో వెఱ్ఱి ఆశలు
ఎఱసంజాలేదు ఎండారాదు
ఎరిసే ఎకివీాడూ రాడు
ఏడుపుతప్ప పిచ్చి కన్నీళ్ళు తప్ప

# భా ర తి

పోనీ
పలుకు లెరుగని చలువతాళ్ళనా
అలల ఆనందపు మున్నీట
దరివిస్తాయనుకొంటాను
గుండె దిటవు పరచుకొంటుగా

అదే అంటాను
ఉదధి తోటి
ఉత్పాతాలతోటి
అదీ వమ్మౌతుంది

మెరుపైనా మెరవదు
మేఘాల గర్భంలోంచి
కడలుకొనే దుఃఖం
కలువల కనుగొలకులలోంచి
నా ఏడ్పు ఎడదలోంచి

వెలుగూలేదు వెన్నెలాలేదు
పెల్లుబికే కడలీలేదు
ఒక్క దుఃఖం తప్ప
సుడులు తిరిగే అంతస్సరస్సులు తప్ప

శోక క్లిన్ననేత్రాల పరికించబోతే
అలమగా పొనలక
పొనుగుపడుతుంది
విద్యుద్దీపాలూ
వెలగటం మానుకొంటాయి
మిగిలిన వాటితో కలిసి
అగ్నిపుల్లలూ చెకిముకిరాళ్ళూ
ముందే మొదగాఊతాయి

# దీప్త్యంతర చైతన్యం

ఒక్కపిడుగైనా పడదు
నా దీన ప్రార్థనలూ వినదు
అందుకే
ఇంతటి కటిక చీకటి
దిక్కులలోంచి
దిగాంతరాళాల్లోంచి
చిక్కగా అంతటా చోటు చేసుకొంటూ

ఆశల నిచ్చెనలెక్కి
వెలిగించ యత్నిస్తే
చుక్కలవత్తులూ లేవు
ఆకాశం ప్రమిదలో

పనీలేదు పాటాలేదు
కోరికాలేదు గోదారీలేదు
ఒకే ఒక్క ఏడుపు మిగిలింది
మౌనశోకం మాత్రం మిగిలింది

ఉరుములూ ఊరుకొంటాయి
ఊర్ధ్వలోక శయన గృహంలో
ఒళ్ళుమరచి నిద్రించి
శబ్దాలన్నీ
శ్మశాన వాటికలో
నిప్పు సమాధి మగ్నమై పోతాయి

ఐనా
'ఏ చీమన్నా చిటుక్కుమనక పోతుందా'
అన్న ఆశ
ఊహాలు నశించిన
ఇసుల విరుల కేసరాలని
ఇసక రేణువు
ఇనుమడించిన నిస్పృహల

భా ర తి

అంచులని
ఆవరించుకొని

గాలి పయనించదు
కక్షపూనినట్లు
ఏ చెట్లూ పిట్టా చలించవు
ఎలుగొన్నట్లు

శరీరమూ తిమ్మిరెక్కి
బరువై పోతుంది
ప్రాణశక్తి నశిస్తుంది
అంతటా
ప్రళయానంతర ఘోర నిశ్శబ్దం
పొంపిరిపోయి
సృష్టి పూర్వ భీకర గాఢతమిస్రం
దట్టంగా ఆక్రమించుకొని
నాలో ఘనీభవించిన
అతిశీతల దుఃఖంలాగ
ఏకాంత నీరవ దీన రోదనం లాగ

అక్కడనుండే ఆరంభమౌతుంది
వ్యస్తాన్వేషణ
అనాంత జ్యోతిర్మయూఖం కోసం
కటిక చీకటిని
అంతర్దుఃఖ ఘనోపలవర్షాన్ని
అంతమొందించటంకోసం

అప్పటికప్పుడే దిగులూ తొలగుతుంది
నిత్య సత్యదీప్తి
అంతటినీ ఆవరించుకొని
అన్నిటిలో ఇరవు చేసికొని

# దీప్త్యంతర చైతన్యం

అగపడుతుంది
అల్లంత దూరం నుంచి

దాని చుట్టూ
చుక్కలూ సూర్యుడూ
చపలలూ చంద్రుడూ
నిప్పులు నిర్ఘాతాలూ
అన్నీ
మనముందు
మహోజ్వలంగా
గర్వంతో ప్రకాశించేవన్నీ
నిస్తేజంగా ఉంటాయి
ఆ కాంతి ప్రతిఫలిస్తూ
పెద్దబోగిమంట చుట్టూ
జుట్టు రేపుకొని
ముంగాళ్ళ మీద కూర్చున్న
అమాయకపు అల్లరి పిల్లల మొహాల్లాగ

అదొక్కటే జ్వలిస్తూంటుంది
అన్నీ అనుసరిస్తూంటాయి
ఆ సర్వోత్కృష్ట చైతన్య ప్రభని
అనంతబాహ్య జగదనుభవంలోకి
అనువదిస్తూ

అది గుర్తించిన నాలోనూ
సుమాళించి విరుస్తుంది
విపురు కప్పిన విప్పమొగ్గ
బహుదళ పుష్పమై ప్రజ్వరిల్లుతూ

# తెలుగు నవల-సమకాలీనత

శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం

వ్యక్తుల జీవితాన్ని ప్రధానంగా తీసుకుని సామాజిక జీవితాన్ని స్ఫురింపజేసే సాహిత్య ప్రక్రియ నవల. నవల చరిత్రకాదు. కాకపోతేనేం, నవలద్వారా సమకాలీనజీవితాన్ని గూర్చి వ్యక్తమయ్యే చారిత్రక సత్యం మరొకవిధంగా లభ్యంకాదు! నవలద్వారాజీవితాన్నిగూర్చి కలిగే ప్రత్యక్షానుభూతికూడా విశిష్టమైనదే.

నవల సమకాలీన జీవితాన్ని ప్రతిబింబిస్తుంది అంటే అద్దంలా ప్రతిబింబిస్తుందని అర్థంకాదు. నిజానికి నవలారచయిత చేసేది ఒక వ్యాఖ్యానమే. రచయిత దృక్పథాన్నిబట్టి ఆ వ్యాఖ్యానం ఉంటుంది. రచయితకూడా సమాజంలోని వాడేగనుక అతని దృష్టి, వ్యాఖ్యానమూ సమకాలీన సామాజిక జీవనంలో ఒకభాగమే అవుతాయి. నవలారచయిత చేసే వ్యాఖ్యానం పాత్రసృష్టి, కథాసంవిధానంవంటి ప్రక్రియలద్వారా జరగటంవల్ల పాఠకుల కది వ్యాఖ్యానంలా తోచదు. యదార్థజీవితంలో ఎవరిమటుకు వారికి మనుష్యుల్నిగూర్చి వ్యాఖ్యానించుకునే అవకాశం ఉన్న రీతిగానే నవలలో కనిపించే వ్యక్తులపట్ల పాఠకులకూ అటువంటి స్వాతంత్ర్యం ఉంటుంది, ఉండాలి! రచయిత ఎంత ఎక్కువగా ఈ అవకాశాన్ని కలిగించితే అతని నవల కళగా అంత సార్థకతని పొందుతుంది.

నవలలో కనిపించే జీవితదృశ్యం నవలాకారుని చేత ఎన్నుకోబడిన ఒకానొక భాగమేతప్ప, యాథార్థ్యం యొక్క పూర్తి స్వరూపంకాదు. ఆ మాటకు వస్తే జీవితానుభవంలోకూడా యాదార్థ్యంయొక్క పూర్తి స్వరూపమేమిటో ఎవరికీ తెలీదు అనే చెప్పాలి. ఎవరు చూచే ముక్క వారికి యదార్థం. అందులో ఏది ముఖ్యం? ఏది ముఖ్యంకాదు? అనుకోవడంలోకూడా దృష్టిభేదం ఉంటుంది. అందువల్లే ఒకరు సమకాలీన జీవితంలో రాజకీయపరిణామాలకు ప్రాముఖ్యం ఇస్తూ నవల వ్రాస్తే, మరొకరు వ్యక్తిత్వంలో జరిగే సంఘర్షణని చిత్రిస్తారు. ఒక కాలంలోనే వచ్చినవైనా ఇలా నవలల్లో ప్రతిబింబించే సమకాలీనత భిన్నత్వంలో ఏకత్వాన్ని, ఏకత్వంలో భిన్నత్వాన్ని ప్రదర్శిస్తూ, జీవితంయొక్క వైవిధ్యాన్నీ, సంశ్లిష్టస్వరూపాన్నీ బయటపెడుతూ ఉంటుంది.

తెలుగు నవలపుట్టి నందేళ్ళవుతున్నది. ఈ వందేళ్లలో రాజకీయంగా సాంస్కృతికంగా తెలుగుదేశం ఎంతో మారిపోయింది. ఆర్థిక వ్యవస్థ భూస్వామ్యంనుంచి ధనికస్వామ్యానికి మారింది. వ్యవసాయమే నేటికీ ప్రధానంగాఉన్నా, సామాజిక సంబంధాలలో వ్యాపారదృష్టి ప్రబలుతూరావడం గమనించదగిన మార్పు. దాన్నిబట్టి మనుష్యుల వ్యవహారాలో స్త్రీ పురుషుల సామాజికప్రతిపత్తిలో ఎన్నో పరిణామాలూ, కొత్త సమస్యలూ వచ్చాయి. వీటిని తెలుగునవల ఎలా ప్రతిబింబిస్తూ వచ్చింది? ఈ పరిశీలనకు అనువుగా ఒక చారిత్రక విభజనని గుర్తుంచుకోవడం అవసరం. 1878 లో వీరేశలింగంగారు 'రాజశేఖర చరిత్రము' వ్రాసేనాటికి బ్రాహ్మసమాజోద్యమంలో ప్రేరణపొందిన సంస్కరణ భావాలు తెలుగునవలలో ప్రధానంగా కనిపిస్తాయి. 1920 లో వ్రాయబడిన 'మాలపల్లి' నాటికి గాంధీగారి జాతీయోద్యమం రాలూకు సంస్కరణభావాలూ, దేశీయతాదృష్టీ నవలలో ప్రాధాన్యం వహించాయి. 1939–46 యుద్ధ సంవత్సరాలలో ఆర్థికమైన ఒత్తిడీ, సమాజానికీ వ్యక్తికీ ఏర్పడే సంఘర్షణ నవలలో ప్రతిఫలించాయి. 1947 లో దేశానికి స్వాతంత్ర్యంవచ్చిన తర్వాతికాలంలో తెలుగునవల బహుముఖాలుగా విస్తరించింది. ఏవో కొన్ని సంస్కరణ భావాలతో, తాత్త్విక వాదాలతో జీవితాన్ని వ్యాఖ్యానించే ప్రయత్నంమాత్రమే చెయ్యక, జీవితాన్ని భిన్న

రంగాల్లో, భిన్నవర్గాల్లో వాస్తవికతాదృష్టితో పరిశీలన చెయ్యడం ప్రారంభించింది. 1960 తర్వాత స్త్రీ ప్రతిపత్తిని గూర్చి స్త్రీలు వ్రాస్తున్న నవలలకు ఎంతో ప్రాచుర్యం వచ్చింది.

1878 నాటి 'రాజశేఖర చరిత్రము'లో రాజకీయాలు కనిపించవు. హేతువాదంమీద ఆధారపడి మూఢవిశ్వాసాలను తొలగించుకోవాలనే ఉత్సాహం, స్త్రీ జనోద్ధరణ, స్త్రీ విద్య, జీవితంపట్ల శాస్త్రీయ దృక్పథం, మనుష్యుల్లో నిజాయితీ ఆనాటి సమాజ క్షేమానికి అవసరమని సూచించటమే ఆ నవల ఉద్దేశం. కాని నాటి జమీందారీవ్యవస్థ స్వరూపం కూడా ఆ నవలద్వారా మనకు అవగత మౌతున్నది. ముఖస్తుతి చేసేవాళ్లకి డబ్బు ముట్టజెప్పడం, అలవిగాని అప్పులుచెయ్యడం రాజశేఖరునికష్టాలకు మూలకారణం. ఇది రాజశేఖరునిలో ఒట్టి భోళాతనమే కాదు. భూస్వామ్యంలో కష్టపడకుండా పొలంమీద అయివేజువస్తుంటే డబ్బువిలువ తెలీక దాన్ని నిర్లక్ష్యంగా ఖర్చుపెట్టే భూస్వామి మనస్తత్త్వమూ అందులో కనిపిస్తుంది. ఈ మనస్తత్త్వం జమీందారుల్లోనూ భూస్వాముల్లోనూ తర్వాత త్వరగా మారుతూవచ్చింది. 1921 నాటి 'మాలపల్లి' నవలలో సామాజికశక్తిగా డబ్బు ప్రాధాన్యం గుర్తించిన భూస్వాములు కూలిరేటును డబ్బురూపేణా హెచ్చించడానికి నిరాకరిస్తారు. ధాన్యంధర పెరిగింది, కూలిగా ధాన్యమే యివ్వమంటే, కాదు డబ్బేయిస్తాంఅంటారు. ఈ ఘర్షణ మూలంగానే సంగదాసు హత్య జరుగుతుంది. ఇక్కడ భూస్వామ్య వ్యవస్థ ధనస్వామ్య వ్యవస్థగా మారుతున్న సంధియుగంలో, తారుమారౌతున్న మానవ సంబంధాల సమస్య మనకు గోచరమౌతుంది. 1934 నాటి 'వేయిపడగ'ల్లో జమీందారు రామేశ్వరశాస్త్రి మాసికానికి డబ్బుదానం యివ్వకపోవడం ధర్మచ్యుతిగా చెప్పబడింది. జమీందారు బ్రాహ్మణ్యాన్ని పోషించడం, వాళ్ల అవసరాలకు దానాలుచెయ్యడం ప్రాత వ్యవస్థ లక్షణం. క్రొత్త జమీందారు మారుతున్న వ్యవస్థలో డబ్బు ప్రాధాన్యాన్నీ, దాని క్రొత్త ప్రయోజనాల్ని గుర్తించాడు. ప్రజలపట్ల అతనికి బాధ్యత ఏమీలేదు. బ్రిటిషు ప్రభుత్వానికి మాత్రమే అతను బాధ్యుడు. పైగా అతను క్రొత్త నాగరకతవైపు ఆకర్షింప బడ్డాడు. ఇదంతా ఆ జమీందారుల్లో నైతికపతనంగా, ధర్మచ్యుతిగా వర్ణింపబడింది 'వేయిపడగ'ల్లో. 1934 నాటిదే 'నారాయణరావు' నవల. అందులో జమీందారు ముందుచూపుగల మనిషి. ఒక సామాన్య రైతు కుటుంబం జమీందార్లకంటే మంచి ఆర్థిక స్థోమత గలిగి ఉండటాన్ని గమనించి, ఆ కుటుంబానికిచెందిన చదువుకున్న నారాయణరావుని అల్లుడిగా వరిస్తాడు. 1946 లో వెలువడిన 'అసమర్థుని జీవయాత్ర' లోని సీతారామారావులో యింకా రాజశేఖరుని మనస్తత్త్వం ఛాయలే మనకి కనిపిస్తాయి. డబ్బుపట్ల నిర్లక్ష్యం, వంశాభిమానం అతన్ని కష్టాల్లోకి తోస్తాయి. అంటే 60 ఏళ్ల తర్వాతకూడా ప్రాత ఆర్థిక వ్యవస్థ వాసనలు అక్కడక్కడ వ్యక్తుల్లో వదల్లేదన్నమాట!

1880 నుంచి 1920 వరకు వచ్చిన నవలల్లో అగ్రవర్ణాలవారి స్థితిగతులు ముఖ్యంగా నాటి బ్రాహ్మణ్యంయొక్క ఆర్థిక దుస్థితి మనకు చక్కగా బోధపడుతుంది. వ్యవస్థ మారుతూ ఉండటంవల బ్రతుకుదెరువు మార్చుకోవలసిన అవసరం వచ్చింది. సంస్కృతాధ్యయనమూ, పౌరోహిత్యము వంటివి చేతగాకపోతే శవవాహకత్వమూ, నల భీమ పాకశాస్త్రమూ తప్పనిసరి అయ్యాయి. చిలకమర్తివారి 'గణపతి' (1920) నవలలో హాస్యంకంటె ఆనాటి విషాదపరిస్థితే మనల్ని ఎక్కువగా ఆకట్టుకొంటుంది. ఇంగ్లీషు చదివి ఉద్యోగంచెయ్యడం క్రొత్తగా ఏర్పడుతున్న మార్గం. కాని దానికికూడా ధనం అవసరమే! 1894 లో వెలువడిన 'రామచంద్ర విజయము' ఒక పేదబ్రాహ్మణ యువకుని కథ. ఇంగ్లీషు చదువుకొని పైకిరావడమే రామచంద్రుడు సాధించిన ఘనవిజయం. 1935 నాటి 'వేయిపడగ'ల్లో సంప్రదాయాన్ని అభిమానించే ధర్మారావు ఇంగ్లీషు చదువుకొన్నా ఉద్యోగం చెయ్యడానికి ఇష్టపడడు. అది అతనికి దాస్యంగా తప్పుగా తోస్తుంది. 'నారాయణరావు' నవలలో రామచంద్రం చదువుకోసం అమెరికా వెళ్తాడు. ఇంగ్లీషు చదువుకీ బ్రతుకుదెరువుకీ గల సంబంధం 1925—35 మధ్యకాలంలో ఎలా మారిపోయిందో

కుటుంబరావు నవల 'చదువు' చక్కగా వివరిస్తుంది. చదువుమీద ఎన్నో ఆశలు పెట్టుకొని మధ్యతరగతి బ్రాహ్మణ కుటుంబానికి చెందిన ఒకతల్లి కొడుక్కి చదువు చెప్పిస్తుంది. ఆస్తిపాస్తులు తెగనమ్ముకుని అతడు చదువుతాడు. రాజకీయోద్యమాలు ఒకవైపూ, ట్రేడ్ డిప్రెషన్ మరోవైపూ ఆ యువకుణ్ణి సంపాదనకు మార్గంలేని అసమర్థుడిగా, నిరుద్యోగిగా చేస్తాయి. జీవనోపాధికి ఇంగ్లీషు చదువును మించిన మార్గంలేదు అనే దృష్టినుంచీ అసలు జీవికకి అది పనికేరాదు అనేదాకా వచ్చినమార్పు పై నవలల్ని పోల్చి చూస్తే తెలుస్తుంది.

'రాజశేఖర చరిత్రము'లో నాటి స్త్రీల దుర్భర పరిస్థితియొక్క యాదార్థ్యం నీలాటిరేవులో వాళ్ల సంభాషణద్వారా చక్కగా వ్యక్తం చెయ్యబడింది. స్త్రీకి చదువురావడమే ఒక గొప్పదోషం అనాడు. బాల్యవివాహాలు సరేసరి! ఇల్లుపట్టిన విధవాడబడుచు అంటే జీతంలేని వంటలక్క! చిలకమర్తివారి 'రాజరత్నము' (1919) నవలకూడా నాటిస్త్రీల అజ్ఞానాన్నీ, కుటుంబ జీవితాన్నీ చక్కగా వర్ణిస్తుంది. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి 'ఆత్మబలి' (1919) నవల యౌవనంలోఉన్న వితంతువు ఎదుర్కొనే విషపరీక్షనీ, గ్రామీణ స్త్రీల జీవితాన్నీ వారి కలల్నీ చిత్రిస్తుంది. వితంతువుకి తీరనికోరికలు ఉంటాయి అనే సత్యాన్ని గుర్తించిన మొదటి తెలుగ నవల ఇది. కాని వితంతువు తన సుఖాన్ని బలియివ్వడమే కర్తవ్యం అనే సూచనతోనే నవల ముగుస్తుంది. వెంకట పార్వతీశ్వరుల 'మాతృమందిరం' (1919) నవలలోకూడా వితంతువు పునర్వివాహానికి అంగీకరించదు. తన నిర్ణయానికి సంస్కరణవాదంతో సంబంధంలేదనే అంటుంది.'మాతృమందిరం'లో వేశ్యాలోలుడైన భర్త నిరాదరణచేసిన స్త్రీపరిస్థితి ఎంతదీనంగా ఉంటుందో వర్ణింపబడింది. భార్యలని విడిచి బలాదూరుగా లేచిపోయిన భర్తలు ఈ నవలల్లో తరచు కనిపిస్తారు. ఆ స్త్రీల పరిస్థితికూడా వితంతువుల పరిస్థితికంటే మెరుగేమీ కాదు. వీరేశలింగంగారి సంస్కరణవాదం సమాజం అంతరాంతరాల్ని కదిల్చినట్లుగానీ, స్త్రీలకు వలసినధైర్యం ఇచ్చినట్లుగానీ తోచదు. అటువంటి స్థితిలో చలంనవలలు 'దైవమిచ్చినభార్య' (1923), శశిరేఖ (1926), 'బ్రాహ్మణీకం', 'అరుణ', 'మైదానం' తీవ్రమైన తిరుగుబాటుని ప్రోత్సహించాయంటే, తత్ఫలితంగా ఒక మానసికవిప్లవం సమాజంలో వచ్చిందంటే, అది తెలుగునవల సాధించిన ఘనవిజయంగా చెప్పుకోవాలి. భర్త లేచిపోతే, వేశ్యాలోలుడైతే మిన్నకుండే సమాజం స్త్రీలో అటువంటి ప్రవర్తనని సహించదు. స్త్రీ తను వలచిన వానితో లేచిపోవడాన్ని ప్రథమంగా చిత్రించిన నవల 'మాలపల్లి' (1921). దాన్ని ఘోర పాపంగా చూపిస్తూ ఆ వ్యక్తికి తగిన శిక్ష కూడా నిర్ణయించింది. కాని చలం నవలల్లో కథల్లో అదే నిష్కృతిగా విమోచన మార్గంగా చూపింపబడింది. చలం వాదాన్ని పరాస్తం చెయ్యాలనుకున్న విశ్వనాథ నవలల్లో కూడా లేచిపోయిన స్త్రీలు పెద్దగా శిక్షననుభవించిన జాడ కనుపించదు. ఇది 1935 నాటికి వచ్చిన మార్పు. 'వేయిపడగ'ల్లో (1934) మంగమ్మ, 'చెలియలికట్ట'లో రత్నావళి వ్యక్తిగతమైన నికాపాన్నీ, ఆత్మసంస్కారాన్నీ పొందటమే మనం చూస్తాము. స్త్రీలో వ్యక్తిత్వం తలూకు స్పృహనూ, సామాజిక దురన్యాయాన్ని ప్రతిఘటించే గుండె దిటవునూ తెలుగు నవల చలం రచనలద్వారా కలిగించిందంటే అతిశయోక్తికాదు. ఈ నాటి నవలా రచయిత్రులు ఆయనకెంతో రుణపడి ఉన్నారు.

తెలుగు నవల పుట్టిన నలభైఏళ్లదాకా దేశంలోని రాజకీయోద్యమాన్ని ప్రతిఫలించిన నవల రాలేదు. వేలూరి శివరామశాస్త్రిగారి 'ఓబయ్య' (1920) గాంధీ ఉద్యమాన్ని ప్రతిబింబించే మొదటి నవల. (1880—1920) మధ్యకాలంలో వచ్చిన చారిత్రక నవలలో జాతీయోద్యమప్రభావం పరోక్షంగా మాత్రమే ప్రతిఫలించింది. 1921 లో వచ్చిన ఉన్నవవారి 'మాలపల్లి' ప్రత్యక్షంగా జాతీయోద్యమానికి నివాళిపట్టింది. 'మాలపల్లి' ధ్యేయం గాంధీ ధ్యేయమే. హరిజనోద్ధరణమూ, తద్వారా మానవధర్మపరిణామమూ. 'మాలపల్లి' నవలలోనే ప్రప్రథమంగా కర్షకులూ, పంచములూ చిత్రించబడ్డారు. గ్రామీణ వ్యవస్థలో బ్రాహ్మణ్యం ఎలా దిగజారిపోయిందో ఆ నవలలో వ్యక్తమౌతుంది. ఆనాటి సెటిల్మెంటులూ, జైళ్లూ, గ్రామాలూ పట్టణాలూ (మద్రాసు), ఆర్థికవ్యవస్థనుంచీ ఆధ్యాత్మిక

మార్గం దాకా పరిపుష్టంగా చిత్రింపబడ్డాయి. ఈ నవలలోని యాదార్థ్యచిత్రణమూ, సామాజిక విప్లవశక్తీ నాటి ప్రభుత్వానికి భయం కలిగించింది. 1930 ప్రాంతాల వచ్చిన 'మాధవాశ్రమం' నవల కూడా రాయలసీమలో గాంధీ ఉద్యమాన్ని వర్ణించింది. అటుపైన 1947 తర్వాతగాని రాజకీయాలను వర్ణించే నవలలు రాలేదు. 1951 లో వచ్చిన కృష్ణారావుగారి 'కీలుబొమ్మలు' ఆ నాటి రాజకీయ పరిస్థితులదృష్ట్యా గ్రామీణ జీవితాన్ని ఆవిష్కరించింది. 1954 లో మహీధర రామమోహనరావు 'రథచక్రాలు'తో ప్రారంభించి వ్రాస్తూవచ్చిన నవలలు కమ్యూనిసుపార్టీ చరిత్రనూ, తత్సంబంధియైన రాజకీయసాంఘిక పరిస్థితులనూ వర్ణిస్తాయి. తెలంగాణాలో రాజకీయ పరిణామాలనుగూర్చి 'ప్రజల మనిషి' 'మృత్యుంజయులు' నవలలు వచ్చాయి. 1947 పూర్వం తెలంగాణా గ్రామీణ జీవితాన్ని యథాతథంగా చిత్రించిన నవల 'చిల్లర దేవుళ్లు' ఇటీవలే వచ్చింది. 1920—46 మధ్యకాలంలో తెలుగువారి మద్రాసు జీవితాన్నీ, రాజకీయ పరిణామాల్లో మారుతూవచ్చిన ఒకానొక బూర్జువామనస్తత్వాన్నీ సుదీర్ఘంగా వర్ణించిన నవల ఉప్పల లక్ష్మణరావుగారి 'అతడు—ఆమె', 1950 లో వచ్చింది. బాపిరాజు నవలలు 'నారాయణరావు' 'కోణంగి' కూడా 1935 ప్రాంతాల మద్రాసులో తెలుగువారి జీవితాన్ని వర్ణించేవే.

1939—46 ప్రపంచయుద్ధం జరిగిన కాలంలో ధనస్వామ్యవ్యవస్థ బలపడడమే కాకుండా ఎన్నోవింతపోకడలు పోయింది. దేశంలో పరిశ్రమలూ, వ్యాపారమూ విస్తరించడమేగాకుండా నల్లబజారు దగాలూ, మోసాలూ నిత్యకృత్యమైపోయాయి. ధనార్జనలో బయలుదేరిన క్రొత్త నైతికపద్ధతులు కుటుంబజీవితంలోకూడా ప్రవేశించి, వ్యక్తులమధ్య సంబంధాల్ని కలుషితంచేస్తూ జీవితాన్ని వక్రగతులు పట్టించిన వైనం కుటుంబరావు నవల 'వారసత్వం' చక్కగా చిత్రించింది. కాని ఇది ఒకవిధంగా ప్రవాసాంధ్రుల కథ. యుద్ధకాలంనాటి అవ్యవస్థ, ఆర్థిక దుస్థితీ తెలుగుదేశంలో సామాన్యకుటుంబాలమీద, యువతీయువకులజీవితాలమీద చూపిన ప్రభావాన్ని వర్ణించిన నవలలు 1947 తర్వాతే వచ్చాం శారద వ్రాసిన 'మంచీ—చెడూ' (1951) అపస్వరాలు (1952); మంజుశ్రీ 'జారుడుమెట్లు'; పోతుకూచి సాంబశివరావు 'ఉదయ కిరణాలు'; 'అన్వేషణ'; కొమ్మూరి వేణుగోపాలరావు 'పెంకుటిల్లు'; శ్రీదేవి 'కాలాతీతవ్యక్తులు'; భాస్కరభట్ల 'యుగసంధి' మొదలైనవి.

అదేకాలంలో వ్యక్తికీ సమాజానికీ ఏర్పడే సంఘర్షణ తాలూకు బహిరంతరస్వరూపాల్ని వ్యక్తి గవేషణద్వారా వ్యక్తంచేసిన నవలలు—'అసమర్థుని జీవయాత్ర (1946) 'అల్పజీవి', 'చివరకు మిగిలేది', (1947). ఈ నవలలు తెలుగు నవలా ప్రక్రియ మనోవైజ్ఞానిక (Psychological), తాత్త్వక (Metaphysical) రంగాల్లో ప్రవేశించటాన్ని సూచిస్తాయి. ఈ ధోరణిలోనే 1955 తర్వాత వచ్చిన నవలలు—గోపీచంద్ 'మెరుపుల మరకలు' 'యమపాశం'; హితశ్రీ 'అంతర్వాహిని'; భాస్కరభట్ల 'వెల్లువలో పూచికపుల్లలు'; ఆర్. ఎస్. సుదర్శనం 'మళ్లీ వసంతం', 'అసురసంధ్య'; వాసమూర్తి 'ఇహపరాలు'; వి. నాగరాజు 'తాగుబోతు'; సి. వి. సుబ్బారావు 'ఆమె చెప్పింది'.

స్త్రీ తన చదువుమీద ఆధారపడి, ఉద్యోగం చేస్తూ, సమాజంలో స్వతంత్రప్రతిపత్తితో బ్రతికే మార్గాన్ని అన్వేషిస్తే ఎదుర్కొనే సమస్యల్ని చిత్రించే నవలలు 1947 తర్వాతే వచ్చినట్లు తోస్తుంది. వాటిలో మొదటిది మాలతీచందూర్ 'చంపకం—చెదపురుగులు'. స్త్రీ అన్వేషించే ప్రతిపత్తికి ఆమెకు దగ్గరివారైన తల్లిదండ్రులూ, తోడబుట్టినవారూ ఆటంకం ఎలా కల్పిస్తారో, వాళ్ల స్వార్థం ఎలా వింతరీతుల్లో పనిచేస్తుందో చక్కగా చిత్రిస్తుందీ నవల. 1960 లో లత వ్రాసిన 'ఎడారిపువ్వులు' నవలలోకూడా తండ్రి స్వార్థం కొమార్తె జీవితానికీ సుఖానికీ అడ్డురావడమనేది ఎలా ధర్మంగా నీతిగా చెలామణీ అవుతుందో చిత్రించబడింది. సమాజంలో వ్యక్తిగా ప్రతిపత్తికోరి, తనచుట్టూ అల్లుకొనిఉన్న ధర్మపన్నాలనీ, స్వార్థపరుల మమకారబంధాలనీ, సంప్రదాయాన్నీ వదిలించుకునేందుకు నేటి స్త్రీ సాగిసను నిరంతర సమరం 1961 తర్వాత వచ్చిన

కొన్నినవలల్లో ప్రధాన వస్తువుగా ఉంటున్నది. ఈ ధోరణిలో ద్వివేదుల విశాలాక్షి, వాసిరెడ్డి సీతాదేవి వంటి రచయిత్రులే కాకుండా వీరాజీ, గొల్లపూడి మారుతీరావు కూడా కొన్నినవలల్లో స్త్రీ ప్రతిపత్తిని గూర్చి, మారవలసిన దృక్పథాన్నిగూర్చి చక్కని విమర్శావ్యాఖ్యానమూ చేసిఉన్నారు. వీరాజీ 'ఇద్దరం ఒకటే', 'విడీవిడని చిక్కులు', 'ప్రేమకు పగ్గాలు' నవలలూ, మారుతీరావు 'పిడికెడు ఆకాశం', 'వెన్నెల కాటేసింది' నవలలూ యిందుకు ఉదాహరణలు. ఈ ధోరణి 1921—46 మధ్యకాలంలో కాల్పనిక వాదం, భావకవిత్వం స్త్రీనిగూర్చి తీర్చిదిద్దిన భావా లకు ప్రతిక్రియ. చలం స్త్రీలకు సమాజంమీదా, వివాహవ్యవస్థమీదా తిరుగుబాటు నేర్పినా, ఆయన చిత్రించిన స్త్రీ సమాజంలో యిమిడే వ్యక్తి కాదు! ఆయన సృష్టించిన 'అరుణ'లాగే ఏ స్వప్నసీమలకో వలస వెళ్లవలసిందే! విశ్వనాథ, బాపిరాజు ప్రభృతులు ప్రేమనుగూర్చి వివాహాన్నిగూర్చి చేసిన చిత్రణల్లో కూడా స్త్రీ కవిత్వానికీ, సౌందర్యానికీ, ధర్మానికీ ప్రతీక అయిందేతప్ప వ్యక్తిగా స్వతంత్రప్రతిపత్తికి నోచుకోలేదు. ఆ విషయం సమాజం దృష్టికి తీసుకు రావాలనే ధ్యేయం నేటి నవలల్లో కనిపిస్తోంది.

విద్యార్థుల మనస్తత్వాన్నీ జీవితాన్నీ చిత్రించే నవలల్లో పేర్కొనదగినవి 1960 తర్వాత వచ్చి నవి—నవీన్ 'అంపశయ్య'; నాగరాజు 'ప్రేమికుడు'; ఇచ్ఛాపురపు రామచంద్రం 'తొలి మజిలీ'. వైద్య వృత్తినిగూర్చివచ్చిన నవల 'హౌస్ సర్జన్'. ఒక పోలీసు కానిస్టేబిల్ జీవితాన్ని యథాతథంగా వర్ణిం చిన నవల—శీలావీర్రాజు 'మైనా'. వర్ణాంతర వివాహా లనుగూర్చి వ్యాఖ్యానించిన నవలలు—రంగనాయకమ్మ 'బలిపీఠం'; ఎన్. ఆర్. నంది 'నైమిశారణ్యం'.

1872 నుంచీ చూస్తే ఈ వంద ఏళ్లలో తెలుగునాట జీవితం ఎంతో వైవిధ్యాన్నిచెంది నాటికీ నేటికీ పోలికేలేని విధంగా పరిణామం చెందింది. ఈ బహుముఖ పరిణామాన్ని మొదట 50 ఏళ్లలో కంటె ఈ చివరి 50 ఏళ్లలో పుష్కలంగా చిత్రిస్తూ వచ్చింది తెలుగు నవల. ఇలా రాశి పెరుగుతోంది. ఇందులో నెల్లూ పొల్లూ కలిసే ఉంటున్నది. నవల సమకాలీనత—అంటే ఎప్పటికప్పుడు స్పందించే గుణం—దాని సాహిత్య వాల్లభ్యానికీ, శిల్పసౌందర్యానికీ ముప్పుతెచ్చిపెట్టకుండా, నవలా రచన కేవలం పత్రికా రచన (Journalism) గా పర్యవసించే ప్రమాదం కలక్కుండా జాగ్రత్త పడటం నేటి రచయితల బాధ్యత.



# అల్పమైన విలువలు

## శ్రీమతి ఆర్. వసుంధర

"ఒకసారి ఆయమ్మ అయ్యతో కొట్లాడి ఒక పూటంతా అన్నంతినకుండా ఏడ్చారమ్మా ...' అన్నది పెరట్లో బియ్యం బాగుచేస్తూ రాజామణి.

అక్కడే కుర్చీలోకూర్చుని పుస్తకం చదువుతూ మరో ప్రక్క రాజామణి బియ్యం ఒళ్లో పోసుకోకుండా అప్రమత్తతతోఉన్న నేను చేతిలోని పుస్తకాన్ని స్టూలు మీద పడేశాను. 'ఏమిటీ ? ఎందుకూ ?' అంటూ నిటారుగా కూర్చున్నాను, లోపల్నుండీ ఉబికివస్తున్న ఆసక్తిని పైకి కనబడనీయకుండా ఉంచాలని ప్రయత్నిస్తూ.

'ఏందో, రవ్వలకమ్మలు చేయించుకుంటా నన్నారు. అయ్య వీల్లేదన్నారు. అమ్మ అలిగి ఏడ్చింది...' అన్నది రాజామణి ఏదో సామాన్యవిషయం చెబుతున్నట్లు.

అది సామాన్య విషయంకాదు. ఆమెను గురించిన నా ఊహను తలక్రిందులు చేస్తున్న విషయం. ఆమె నగలకోసం ఏడ్చేటంతటి తేలికమనిషని నేను అనుకోలేదు. నాకు ఆమెతోగల పరిచయం స్వల్పమే అయినా, ఆమె గొప్ప వ్యక్తిత్వంగల మనిషని తెలిసి నంతలోనే అంచనా వేసుకున్నాను. మావారూ, అతనూ ఒకేరకం ఆఫీసర్లు కావడంవలన ఇద్దరం ఒకఊళ్లో ఉండటం జరగదు. ఈ సారి అతను ఖాళీచేసిన చోటులోనికి మావారిని వేశారు. వాళ్ల యిల్లూ, వాళ్ల పనిమనిషీ, వాళ్ల చాకలీ, వాళ్ల పాలమనిషీ, వాళ్ల కొట్టువాళ్లూ అందరూ అన్నీ మాకు వారసత్వంలాగా దిగుమతీ అయ్యారు. వాళ్లు ఇల్లు ఖాళీచేసేలోగా రెండురోజులపాటు మేము హోటలో ఉన్నాం. అప్పుడు వాళ్లు మమ్మల్ని ఒక పూట భోజనానికి పిలిచారు. అదే ఆమెతో పరిచయం. ఆవిణ్ణి చూడగానే నాకు ఆనందం కలిగింది. తెల్లగా, చక్కగా, లావుగావున్నా నాజూగ్గా, కడిగిన ముత్యంలాగా, ఒంటెడునగలతో లక్ష్మీదేవి లాగా కనిపించింది. ఆమెచేసిన వంటకాలు, వడ్డించిన తీరు, ఇల్లుదిద్దుకునే నైపుణ్యం, పిల్లల విషయంలో క్రమశిక్షణ అన్నీ ఎంతో బాగున్నై. ఆ యింట్లో కనిపించే ఆడంబరం, శుభ్రత, చురుకుదనం, ఆదరణ అన్నీ ఆమెలోపుట్టి యిల్లంతా వ్యాపించి ఇంటినీ, ఇంట్లోని ప్రతి మనిషినీ, ప్రతి పనినీ నడుపుతున్నట్లుగా తోచింది నాకు ఆ కాస్సేపట్లోనే. తర్వాత క్రమంగా ఇరుగు వాళ్లూ, పనివాళ్లూ ఆ అభిప్రాయాన్ని బలపరవారు. ఆమె భలే మనిషి. ఆ భార్యా భర్తలిద్దరూ అనన్యసామాన్యమైన ఒద్దికతో, పరస్పర సహకార సానుభూతులతో లక్ష్మీకేశవుల్లా కనిపించారు.

ఆ లక్ష్మీదేవి గురించి రాజామణి యీ మాట చెప్పగానే నాలో ఏదో సంభ్రమం కలిగింది. మొదట ఒక్క క్షణకాలంపాటు రాజామణిమీద కోపం వచ్చిన మాట నిజమే. ఆమెను గురించి మాట్లాడ్డానికి యీ రాజామణికి తాహతు ఎక్కడిదీ? ఆమెకు అందం, డబ్బు, చదువు, సంస్కారం అన్నీ వున్నాయి. జీవితంలో విలువైనవేవో ఆమెకు తెలిసుండాలి. ఈ రాజామణికి ఏవీ లేవు. ఉత్త అల్పురాలు. నాగలోకాన్ని గురించి నక్కమాట్లాడ్డం ఎంత హాస్యాస్పదం! అనిపించిందిగాని, అంతలోనే వాళ్లను గురించి తెలుసుకోవాలన్న ఆసక్తి పెద్దదై పోయింది. రాజామణిమాటలు నిజం కావేమోనన్న అనుమానం కొంచెం కూడా రాలేదు. 'ఓహో, ఈమెను గురించి గొప్పగా అనుకున్నానుగాని నిజానికి మామూలు మనిషే' అనీ తోచింది. ఆ తలపులో సంతృప్తిలాంటిదీ కలిగింది. తరువాత రాజామణిని గుచ్చిగుచ్చి ప్రశ్నించాను. ఒకరిదగ్గర నాలుగేళ్లు వరసగా పనిచేసిన మనిషికి

ఆంతరంగిక కార్యదర్శి స్థానం లభిస్తుంది గనుక వాళ్ల వివరాలన్నీ తెలిసే వుంటాయి...భార్యా భర్తలకు అడపా దడపా వాదాలూ వివాదాలు వస్తూనే వుండేవి. రాజామణికి ఏడాదిపాటు పనిచేస్తే కొత్తకోక యివ్వొచ్చని అయ్య అంటే, అలాంటి ఒప్పందం ఏమీలేదు గనక పాత చీరె చాలని అమ్మ అన్నప్పుడు ఒకసారి తగూపడ్డారు. 'ఇట్లాంటివే ఎన్నో వుండేయి' అన్నది రాజామణి జల్లెట్లోని బియ్యంలోని పెద్దరాళ్లను చకచకా ఏరిపారేస్తూ, మొహంలోని యోగముద్ర చెరక్కుండా.

రాజామణి మామూలు మనిషికాదు. లక్ష్మీదేవి దాన్ని నాకు పరిచయం చేసిన విధానం యిది: 'రాజీకి నోట్లో నాలుకలేదు. ఒక్కమాట మాట్లాడదు. ఒక్కమాటకు బదులు చెప్పదు. చెప్పిన పని శుభ్రంగా చేస్తుంది. ఇచ్చింది తీసుకుంటుంది. అంతే, దానిరాత బాగాలేక, లేనిపోని తంటాతెచ్చుకొని, కష్టపడుతున్నదిగని అది మంచిది' అన్నదామె నవ్వుతూ, ఆప్యాయంగా దాన్నిచూస్తూ. అక్కడున్న యితర పనివాళ్లూ ఆమె మాటను ఏకగ్రీవంగా ఆమోదించారు. ట్రాన్స్ఫరయి వెళ్లిపోతున్న యజమానురాలు, వెళ్తూవెళ్తూ యింకో రెండు రూపాయిలు అదనంగాయిచ్చే అవకాశం ఉన్నప్పుడు, పరివారంలో యిలాంటి ఏకగ్రీవత దానంతటదే కుప్పతిప్పలుగా పుట్టుకొస్తుంది. రాజామణిమాత్రం సిగ్గుపడిపోతూ కళ్లు వాల్చుకున్నది, మాటాడకుండా.

రాజామణి బాహ్యరూపం చూసేవాళ్లకు వికారం కలిగిస్తుంది. మొదటిసారి చూడగానే నాకు చాలా అయిష్టత కలిగింది. వేరే ఎవర్నైనా పనికి పెట్టుకుందాం అనుకున్నాను. కాని లక్ష్మీదేవి మాటమీదనే దాన్ని పెట్టుకున్నాను. వెడల్పుగావుండే వికారమైన మొహమూ, పసుపురంగులో గారకట్టిన పలువరుసా, పాతికేళ్లకే సగం నెరిసిపోయినజుట్టూ, బూడిదరంగు కంటిపాపలూ, పొగచూరిన కట్టెలాంటి పొట్టిమనిషి— ఇది రాజామణిరూపం స్థూలంగా. అటువంటి కళ్లు నేను ఎక్కడా చూడలేదు మనుషులో. రాజామణి సాధారణంగా కళ్లెత్తి ఎవర్నీ చూడదు. కాని, చూచినప్పుడు ఆ బూడిదరంగు కనుపాపల్లోంచి ఏదో అసహజమైనది బయల్దేరి యివతలివాళ్లను తాకుతుందేమోనన్న గగుర్పాటు కలుగుతుంది. ఆ కళ్లల్లో ఒక వెలుతురుగాని భావంగాని జీవంగాని లేదు. అన్నింటి మీదా ఒక బూడిదరంగు తెర దిగిపోయింది. కాని నిదానంమీద గమనిస్తే, ఎప్పుడో ఒకసారి, బహు అరుదుగా ఆ కళ్ళు మెరవడం, ఆ మొహంలో ఒక వింత భావం వెలగటం కనిపిస్తుంది. తన విశాలమైన మనస్సునీ, దేవుడు తన వంతుకై యిచ్చిన గొప్పబాధల్నీ నోరెత్తకుండా సహించగల తన ఓర్మిని ఏ కించిత్తో మాటల్లో వెలువరించవలసివచ్చినప్పుడూ, నరసిమ్మాయి ప్రసక్తి వచ్చినప్పుడూ ఒక తెల్లటివెలుగు తళుక్కుమంటూ కళ్లల్లో ఆ చివర్నుండీ యీ చివరికీ ప్రసరిస్తుంది. బూడిదలాంటి ఆకాశంలో అకస్మాత్తుగా ఇంద్రధనస్సు కనిపించినట్లుగా, నిర్జీవమైన ఎర్రభూమిలో విరబూసిన తంగేడుమొక్కల గుంపును చూచినట్లుగా చూపరుల్ని విభ్రమంలో ముంచుతుంది. అప్పుడు రాజామణి నవ్వుతో యీ చెవి నుండి ఆ చెవివరకూ విస్తరించిన పలువరుసను పెదాలచాటుకు నెట్ట యత్నిస్తూ, కళ్లల్లోని మెరుపును చాటుచేస్తూ సిగ్గుగా రెప్పలు క్రిందికి జార్చుతుంది. కాని అది అరుదైన విషయం. అది జరిగే సందర్భాలు వేరువేరుగా కనిపించినా విషయం మాత్రం ఒకటే. అది రాజామణి మొగుడు నరసిమ్మాయి. రాజామణి మనసుయొక్క వైశాల్యమూ, బాధా సహిష్ణుతా, నరసిమ్మాయీ— మూడూకూడా ఒకటే నిజానికి. నరసిమ్మాయే రాజామణి ప్రియుడు, మొగుడు, బాధ, బ్రతుకు— అన్నీను. వాడు లేకుంటే రాజామణికి యీ కడగండ్లు ఉండవు. అందరి మాదిరిగా తనచాకిరీతో పొట్టపోసుకుంటూ, ముసలి ముప్పుకు నాలుగురాళ్లు వెనకవేసుకుంటూ హాయిగా ఉండేది, కంటినిండా నిద్రపోయేది అనుకోవచ్చు. మొగుడైనాకాని వాడికోసం ఇన్ని బాధలుపడుతూ ఉండటం సహజంకాదు గనుక అలా అనుకుంటాము. కాని మనిషిని మనిషిని ఆవరించిఉన్న పరిస్థితులనూ విడదీయటం సబబుకాదేమో. జీవితంలో విలువైనవేవో తెలుసుకోలేని పేద బ్రతుకులు అంతకంటే వేరుగా ఉండటానికి వీలుకాదేమో!

నరసిమ్మాయి రాకపూర్వం రాజామణి జీవితం చాల మామూలుగా ఒడుదుడుకులు లేకుండా జరిగిపోతుండేది. దాని మొగుడు పెళ్ళయిన ఏడాదికే

పోయాడు. అప్పట్నుండీ పుట్టింట్లోనే ఉండిపోయింది. రాజామణికి బంధువులు చాలామంది ఉన్నారు. ముసలి తల్లి, పదిమందిపిల్లలతల్లియైన అక్క, పనిలేక డబ్బులేక బాధపడే అన్న, ఇంకా పిన్నమ్మలు, చిన్నాన్నలు, మామలు, అత్తలు, వాళ్లసంతానం అంటూ బీరకాయపీచులాగా పెనవేసుకుపోతూ చాలా బలగం ఉన్నది. కడుపు నింపుకోవడానికి పాచిపనులు చేసుకుంటుంది. ఒంట్లో ఓపికవుండి, రెండిళ్లలో పనిచేసుకోగల ఒంటరిమనిషికి లోటేమీ ఉండదు. అందులోనూ రాజామణికి సినిమాలు చూడాలనిగాని, కొత్తచీరలు కట్టుకోవాలనిగాని కోరికలు లేవు. తనకు దొరికిన అన్నమూ కూరలూ ఇంట్లోవాళ్లకిచ్చేది. 'నీవూ తిన్నావా?' అని కనుక్కోగల అక్కరలేక పోయినా, అదితెచ్చే కూరలూ జీతండబ్బులూ నాకు కావాలంటే నాకు రావాలంటూ పిల్లలతల్లి అక్కా, డబ్బు అవసరంలో ఉండే అన్నా పోటీలు పడేవారు. ఒకసారి వారూ ఒకసారి వీరూ మరోసారి ముసలితల్లీ దాని డబ్బు వాడుకునేవారు. మాకివ్వలేదంటే మాకివ్వలేదని అందరూ దాన్ని తిట్టేవారు. ఈ విధంగా 'సద్దులేని మనిషి' అని పేరు తెచ్చుకుంటూ, బంధువుల మధ్యన కాలం వెళ్లబుచ్చుతుండేది రాజామణి. ఇంకా ఎన్నోఏళ్లు, చిరకాలం, చచ్చేవరకూ అల్లాగే నలుగురి మధ్యనా వేలెత్తి చూపించుకోకుండా దాని బ్రతుకు వెళ్లమారి పోయుండేది, నరసిమ్మాయి తటస్థపడకుండా ఉంటే, దానికి పాడుబుద్ధి పుట్టకుండాఉంటే!

నరసిమ్మాయికి పెళ్లామూ ఇద్దరు పిల్లలూ ఉన్నారు. కనుముక్కు తీరుగా ఉండీ చూపరియైన వాడే. బాధ్యతలను లెక్కచెయ్యని స్వభావంకల కులాసామనిషి. ఏ ఒక్కపనిలోనూ కుదురుగా ఉండకుండా కొన్నాళ్లిక్కడ వంటపనిలోనూ, కొన్నాళ్లిక్కడో కూలిపనిలోనూ ఉంటూ హుషారుగా సరదాగా స్నేహితులతో ప్రొద్దుపుచ్చుతూ తిరిగేవాడు. అటువంటివాడికి రాజీమీద ఇష్టం కలిగింది. కారణం వాడికైనా తెలుసో తెలియదో. స్నేహితుడు సుబ్బరమణియం ప్రోత్సాహప్రోద్బలాలతో రాజీ వెంట పడ్డాడు నరసిమ్మాయి. కాలక్రమేణ వాళ్ల ప్రేమ చలంగారి మైదానంలో రాత్రిపూట విహారాలుగా పరిణతి చెందింది. ఆ మైదానం అక్కడి హైస్కూలు కాంపౌండు. విశాలమైన ఆటస్థలం, ఆ వైపు కొండ, ఈ వైపు చేలు, పైన ఆకాశంలో చంద్రుడు—అటువంటిచోట ఒంటరియైన జంటగా ఆటపాటల్తో విహరించేవారు వాళ్లిద్దరూ. వెన్నెల రాత్రిళ్లల్తో గాలికదలని వేళల్లో రాజీ పాట హైస్కూలుకు దగ్గరగాఉన్న ఇళ్లల్లోకి వినిపించేదట.

కాని నరసిమ్మాయి కోరుకునేది యిటువంటి జీవితంకాదు. 'పనిచేసి ఒళ్లరగ్గొట్టుకొని సంపాదించి వాళ్ల మొగాల వేస్తున్నావు. నీకేం సుఖం? నాతో వొచ్చెయ్యి. నీవు బ్రతికినన్నాళ్లూ నీ భారం నాది' అన్నాడు. అటువంటిమాట నరసిమ్మాయి గనక అనగల్గాడుగాని వేరేవాళ్లు అనుకునే సంగతికాదు. పెండ్లాం, పిల్లలూ, బంధువులూ నరసిమ్మాయిని ఒదలరు. రాజీ బంధుజనం దాన్ని చెడిపోనివ్వరు. అసలటువంటి పనిచేసే సాహసం రాజీకి లేదు. అది నోట్లో నాలుకలేనిది! అయినా నరసిమ్మాయిని ఇలాంటి కారణాలు బంధించలేవు. పట్టుదలగా రాజామణిని ఒప్పించడానికి ప్రయత్నించాడు, సుబ్బరమణిచేత దానికి హితవు చెప్పించాడు. చాలా ప్రయత్నం చేశాడు.

ఆఖరికి వాళ్లిద్దరూ ఆ ఊరిబయట మైదానంలో ఒక గుడిసెలో కాపరం పెట్టారు. వాళ్ల కుటుంబాల కోపతాపాలూ, తిట్లూ, అభ్యర్థనలూ, కొట్లాటలూ వాళ్లను మరింత దగ్గరకు తెచ్చాయే గాని వేరుచెయ్యలేకపోయాయి.

ఏళ్లు గడుస్తున్నా నరసిమ్మాయి వాగ్దానం తప్పలేదు. రాజీని విడవలేదు. కట్టుకున్నదాన్ని చూస్తున్నట్లే చూస్తున్నాడు. అంతకంటే ఎక్కువగానే చూస్తున్నాడనాలి. ఎందుకంటే కట్టుకున్న పెంళ్లాందగ్గరున్నన్నాళ్లూ ఆవిడ నరసిమ్మాయిని ఇంకా ఎక్కువ డబ్బుతేలేదనీ, ఎప్పుడైనా తాగుతాడనీ, సినిమాకు వెళ్తాడనీ నిత్యమూ సాధిస్తూ రాచిరంపాన పెడుతుండేది. ఇప్పుడు శుభ్రంగా పనిమానేసి, రాజామణి తెచ్చింది తింటూ, ఎప్పుడైనా తను సంపాదించింది తాగుతూ, హాయిగా గడిపేస్తున్నాడు. తాగివచ్చి పనినుంచీఆలస్యంగా ఇంటికొచ్చిందనో, బంధువుల్తో మాట్లాడిందనో, వాళ్లకు డబ్బులిచ్చిందనో ఏదో ఒక సాకుతో రాజామణినీ చితక తంతున్నాడు.

తరువాత బోలెడంత పశ్చాత్తాపంతో దానికి క్షమా ర్పణలు తెలుపుకొని, దాన్ని బలవంతాన సినిమాకు తీసుకెళ్లి, రెండురోజులపాటు తాగకుండా ఉంటు న్నాడు దానికోసం. రాజీకోసం, వేరే ఎవరూ, ఎప్పుడూ ఇలా త్యాగాలు చెయ్యలేదు !

రాజామణి ఒళ్లు మంచిదికాదు. అప్పు డప్పుడు పైత్యమూ జ్వరము ముంచుకొస్తాయి. అలాం టప్పుడు ఒకసారి నరసిమ్మాయి దానిచేత పనిమా న్పించి ఇంట్లోనేవుండి తనకు వండిపెడుతూ, తాను తెచ్చింది తింటూవుండే ఏర్పాటుచేశాడు బలవంతాన. కాని పదిరోజుల్లోనే వాడు ఇంటికి డబ్బు తేలేడనీ, అంతా తాగేస్తాడనీ తేలిపోయింది. అందువలన ఇప్పుడు రాజీకి జబ్బుచేస్తే పనిమానెయ్యమని పదిసార్లు చెప్తాడుగాని, బలవంతం చెయ్యడు. దానికి కావల సిన గంజి కాచిపోసి, తొందరగా కోలుకొని పనిలోకి వచ్చేట్లు చూస్తాడు.

ఇన్నేళ్లు గడిచినా నరసిమ్మాయి కుటుంబానికి వాడిమీది ఆశ పోలేదు. ఆర్నెల్లకోసారి పోలీసు బావ మరిదో, పోస్టుజవాను బావమరిదో వచ్చి నరసిమ్మా యితో పేచీ పెట్టుకుంటారు. వాడు సంపాదించింది రాజామణికి దోచిపెట్టడానికి వీల్లేదనీ అదంతా తమ తోబుట్టువుకే చెందాలనీ పంచాయతీ పెడతారు. రాజా మణి సుడిగాలిలో చిక్కుకుపోయిన ఎండుటాకులాగా కొట్టుకులాడిపోతుంది. నరసిమ్మాయి యీ అవ మానం సహించలేక, రాజామణి దగ్గరుండే డబ్బంతా తీసుకుని, చిన్నకత్తి ఒకటి చేతబట్టుకొని, దోవలో కనపడ్డవాళ్లందరికీ ఆ కత్తిని చూపిస్తూ, తన బావమరదుల్ని యివాళ్టితో అంతంచెయ్యబోతున్నానని చెప్పుకుంటూపోతాడు. ఏఅర్ధరాత్రికో సుష్టుగాతాగి, తూలుకుంటూ, బావమరదుల్ని తిట్టుకుంటూ ఇంటి కొస్తాడు.

రాజామణికీ నరసిమ్మాయికీ ఉండే సంబంధం నిజంగా అనిర్వచనీయమైనది; అవినాభావమైనది అనాలి. వాళ్లిద్దరూ ఒకరికొకరు అన్నివిధాలా తగిన మనుష్యులు. దానిదగ్గరలేని లోకజ్ఞానం, ముందుకు పోయే పురుషలక్షణం నరసిమ్మాయి దగ్గరున్నవి. వాడిదగ్గరలేని ఓరిమి రాజీ దగ్గరున్నది. ఇద్దరూ కలిస్తే హాయిగాబ్రతగ్గలతెలివి పుట్టుకొస్తుంది.

'మీకు తోచినంత జీతం ఇవ్వండి......నేను నోట్లో నాలుకలేనిదాన్ని' అన్నది రాజామణి పనిలో చేరబోయేముందు. నెలాఖరున పదిరూపాయ లిచ్చాను. ఆ మధ్యాహ్నం రాజీ పనిలోకి రాలేదు. నరసిమ్మాయి వచ్చి 'పదిహేను రూపాయి లిస్తేనే రాజీ పని చేస్తుంది...'అని నా మొఖంవేపు ఆశగాచూసి 'ఆ మిగతా అయిదు రూపాయిలూ నా చేతికివ్వండి. దాన్ని పంపి స్తాను' అన్నాడు. నేను ఒప్పుకోలేదు. 'మాకు పని తక్కువగనుక పదికంటే ఎక్కువ యివ్వను' అని చెప్పేశాను. మర్నాడు రాజీ పనిలోకొచ్చింది. 'ఆయన మాటలు కేమిలే అమ్మా. చేసేదాన్ని నేను...ఆ యమ్మ నన్ను బిడ్డలాగా చూసుకునేది. మీరూ అట్లాగే చూసుకోండి' అన్నది. 'చేసేది నీవైతే నిన్న మధ్యాహ్నం పనికి రాలేదెందుకూ'అని అడుగుదామనుకొని, మళ్లీ బిడ్డలాంటిదికదా అని సమాధానపడి ఊరుకున్నాను.

నరసిమ్మాయి తాగి కొట్టినప్పుడు, ఎక్కువ దెబ్బలు తగిలినప్పుడు రాజామణి బంధువులు ఏ చాటుగానోవచ్చి 'అయ్యో, పిచ్చిదానా, ఒళ్లు కరి గించుకొని సంపాదించి ఎవడి ఎదానో పోస్తు న్నావే. వాడు నిన్ను చంపుతున్నాడే. ఇటు కులానికీ చెడితివి. అటు బతుకూ చెడెను' అంటూ సాను భూతి చూపిస్తారు. వాళ్లు చెప్పినప్పుడు తిరిగీ మాట్లాడకుండా వింటుంది రాజీ. వాళ్లచేత పావలో పరకో పెడుతుంది. కాని వాళ్లమాటలు దానికి రుచించవు. 'ఏ సంసారంలోనైనా కష్టం సుఖం వుండదా. ఆయనకి నామీద ఎంత అపేక్ష ! నా కర్మ వల్ల యీ తాగుడు పట్టుకుంది' అనుకుంటుంది. వాళ్ల మాటలకి లోపలే బాధపడిపోతుంది.

వారాని కోపూ ఏదైనా చెప్పా పెట్టాకుండా పని మానేస్తుంది రాజీ—వాడు కొట్టినప్పుడు. పని మానేసిన కారణం చెప్పడానికి దానికి చాలకష్టంగా ఉంటుంది. ఏడుపు, అవమానం, ఇది అందరికీ జరి గేదే అన్న ధీమా—అన్నీ కలబోసినట్లుంటుంది దాని భావం. 'ఆయమ్మ నన్ను బిడ్డలాగా చూసుకునేది. ఆయన కొట్టినప్పుడూ, నాకు జబ్బుచేసినప్పుడూ ఎన్నిసార్లు పనిమానేసినా ఏమీ అనలేదు. ఒకసారి నాకు ఎక్కువదెబ్బలు తగిలినప్పుడు ఆయన్ని పిలి పించి కోప్పడి, ఆయమ్మకూడా ఏడ్చేసింది' అన్నది.

లక్ష్మీదేవిగారిలాగా రాజామణిని బిడ్డలాగా చూసుకోవలసిన బాధ్యత నామీదున్నదన్న భావన నాలో నాటుకపోయింది. అందువలన చెప్పకుండా పనిమానెయ్యడం వలన కలిగే కష్టాన్ని నోరెత్తకుండా అనుభవించ వలసిన పరిస్థితి ఏర్పడింది. ఈ విధంగా రాజామణి కష్టం నా కష్టంగా మారిపోయేంత కాలం గడిచాక ఒకసారి అన్నాను : 'నీవు చాకిరీచేసి వాడిని పోషిస్తున్నావు. వాడేమో నీకష్టం గమనించకుండా యిష్టంవచ్చినట్లు తాగుతున్నాడు. వాడు నీకు మొగుడుకూడా కాదు. చీటికీ మాటికీ ఈ తన్నులేమిటి ? నీ బ్రతుకు నీవు వేరుగా బ్రతుక్కోరాదా ?' అని. రాజామణి కనుబొమల మధ్యన అయిష్టతను సూచించే చిన్నగీత కనపడి అంతలోనే మాయమైంది. కొంచెంసేపు మాట్లాడకుండా నిలుచున్నది. 'నేను పోతానంటే పోనివ్వడు. అయన్ని పొమ్మంటేపోడు. నీవు చచ్చేదాకా నా దగ్గ రుండాల్సిందే. నేను లేకుండా నీవుండటానికి వీల్లేదు. నీవు నా చేతులమీదగా దాటిపోయినాకనే నేను బయటకి పోయేది అంటాడు' అన్నది ఎంతో గర్వంగా, ఆనందంగా.

చచ్చేదాక వదల్నంటున్నాడు. లంబాడిదయ్యం లాగా పట్టుకున్నాడు. దాని చావుగురించి మాట్లాడ్డానికి వాడి కెంత ధైర్యం! తాగితాగి వాడే ముందు చావొచ్చునుకదా! సమాజం వాడికేదో హక్కును దత్తంచేసినట్లు మాట్లాడుతున్నాడే. అసలు దానికీ వాడికీ ఏమిసంబంధం గనక! వాడు బుద్ధిలేకుండా అవమానకరంగా మాట్లాడుతుంటే ఆ రాజామణికి ఏడుపు రావలసిందిపోయి ఆనందం కలుగుతున్న దెందుకో? కులం పోగొట్టుకొనకముందు దానికి దెబ్బలుండేవికాదు. రోగం వచ్చినప్పుడు పలకరించి సలహాలిచ్చే బంధుబలగం ఉండేది. చస్తే కొమ్ము పట్టడానికి కులపువాళ్లుంటారని గ్యారంటీ ఉండేది. సమాజంలో మనిషిగా ఎన్నోహక్కులు కలిగిఉండేది. అనవసరంగా తెలివితక్కువగా అన్నీ పోగొట్టుకున్నది రాజామణి ఈ దెబ్బల్తో చస్తూ యిలా బ్రతకడానికి?

ఆనాడు నాకూ మా ఆయనకూ ఆయన భోంచేస్తున్నప్పుడు మాటామాటా వచ్చింది. ఆయనకు తెలిసినవాళ్లెవరో పాతకారు మంచిదొకటి అమ్ముతున్నారట. రోజూ ఆఫీసుకి బస్సుల్లో రిక్షాల్లో వెళ్లడం కష్టంగా ఉన్నది గనుక ఆ కారు కొనుక్కోవాలని ఆయన ఉబలాటం. పెద్దకారుకి బోలెడు ఖర్చు గనుక ఆ డబ్బుపెట్టి నగ చేయించుకుంటే మన డబ్బు మన దగ్గరే వుంటుందని నా ఉద్దేశం. ఇద్దరం ఘాటుగానే మాట్లాడుకున్నాం. భోజనం సగంకాకుండానే ఆయన అన్నంపళ్లెం విసురుగా తోసేసి లేచివెళ్లిపోయారు. ఆ రోజు సాయంత్రం ఇంట్లోఉండబుద్ధికాకనాలుగిళ్లవతలఉన్న నా స్నేహితురాలు సుజాతను చూడాలని వెళ్లాను. వాళ్ల వాకిట్లోకి వెళ్లేసరికి లోపల్నుండి మాటలు వినిపిస్తున్నై. రాజామణి గొంతు. 'ఆ యమ్మమీద అరిచి అన్నం తినకుండా పళ్లెంతోసేసి లేచిపోయారు. ఇట్లాగే ఏదో ఒకటి పడుతూనే వుంటారు...' అంటున్నది.

ఖచ్చితంగా నా సంగతే ! ఉదయం జరిగిన సంగతి! చిన్నవిషయాన్ని కొండంతచేసి చాటిస్తున్నది! ఈ సుజాతకు పనివాళ్లమాటలు వినే దుర్బుద్ధి ఎందుకో అని విసుక్కున్నాను. మా తగాదాలు మరి కొన్ని రాజామణిదృష్టి కి రాకముందే దాన్ని పంపించెయ్యడం మంచిదని నిశ్చయించుకున్నాను. సంసారమన్నాక వారి వారి హక్కుల్నీ కోరికల్నీ సమర్థించుకోవలసి నప్పుడు ఎన్నో మంచిచెడ్డలు, సర్దుకుపోవడాలు ఉంటాయి మరి. సవ్యమైన సంసారం లేని దానికి యిటువంటి విషయాలు ఏంతెలుస్తాయిగనుక!

సాధారణంగా అతి తక్కువగా మాట్లాడే రాజామణి ఎక్కడైనా భార్యాభర్తల మధ్యన కించిత్తు అభిప్రాయభేదం రాగానే అదేదో గొప్పవిషయమైనట్లు చాటింపువెయ్యడం ఎందుకో నాకు అర్థం కాలేదు. దానికెవరో ఏదో అపకారం చేసినట్లు ఈ ఏడ్పుగొట్టుతనం . ఏమిటి ? జీవితంలో విలువైనవేవో కానివేవో తెలుసుకోగల వాళ్లను విమర్శించ

డానికి యీ కులంలేనిదానికి సిగ్గైనాలేదు! అనుకున్నాను. దాని క్షుద్ర జీవితకథను తలచుకుంటే ఒక చిన్నవిషయం నాకు తెలియకుండా మిగిలిఉన్నట్లు తోచింది. ఊరికే ఊసుపోక అడిగాను 'పుట్టినప్పట్నుండీ చచ్చేదాకా అవసరమయ్యే బంధువుల్నీ కులాన్నీ విడిచిపెట్టి ఇటువంటి తెలివితక్కువపని ఎందుకు చేశావూ ?' అని.

రాజామణి కళ్లల్లో సిగ్గులమెరుపులు దాచుకుంటూ నెమ్మదిగా చెప్పింది: 'ఏం చేసేదమ్మ. నా ఖర్మ, నేను పనిచేసే ఇంటిఅమ్మ పెద్ద స్టీలుగిన్నెలో అన్నం ఇచ్చింది. ఆయన ఆ గిన్నెకాస్తా దాచేశాడు. ఎంత బతిమాలినా యివ్వలేదు. తనతో వచ్చేస్తానంటేనే యిస్తాననీ లేకపోతే యివ్వననీ పంతం పట్టాడు. అయమ్మగిన్నె ఏదంటే ఏంచెప్పేది ? నోట్లో నాలుకలేనిదాన్ని, అందుకని...' అన్నది.

ఒక్క స్టీలుగిన్నెకోసం! ఒక జీవితాన్ని నడిపించడానికి, మరో మలుపుకు తిప్పడానికి ఎంత అల్పమైన కారణం! ఎంత అల్పమైన విలువలు!! అని ఆశ్చర్యపోయాను. బ్రతుకు విలువ ఎంతటిదో దాని లాంటివాళ్లకు ఎలా తెలుస్తుందిఅని సమాధానపడ్డాను. ఇంతకూ దాని ఏడ్పుగొట్టుతనానికి కారణంమాత్రం నాకు తెలియడంలేదు !



# కవిబ్రహ్మ - కథన శిల్పము

శ్రీ 'కుమార భారతి'

ఆనుశాసనికపర్వంలో సౌపర్ణోపాఖ్యానమున్నది. దానిలోని శిల్పరామణీయక విచారణ ముద్దిష్టాంశం.

ఆదిపర్వంలోనూ ఈ కథ వుంది.

ఈ కథ పుట్టడాని క్కారణం—

'ఒరులవలనఁ బుట్టు నోటమియును నెగ్గు
బొరయకుండ నరసి పుత్రవరులఁ
దగిలి కాచునట్టి తల్లి సర్పములకు
నేల యలిగి శాప మిచ్చె నయ్య'?

ఇది. శాపహేతువిశదీకరణార్థం కథ చెప్పబడింది. కథను రెండు ఖండాలుగాచేస్తే ప్రథమ ఖండం వినత దాస్యం. పూర్వకథ. ఉత్తరభాగం గరుడుని సుధా నయనం. నన్నయగారిపని పూర్వ కథా ప్రాధాన్య విశదీకరణం. తర్వాతి భాగానికి ప్రాధాన్యం లేదు. ప్రశ్న పూర్వకథకే పరిమితమౌతున్నది కాబట్టి.

తిక్కనగారి ప్రాధాన్య ముత్తర కథా భాగానికి. కథకు వక్త భీష్ముడు. శ్రోత ధర్మరాజు. ఇతని ప్రశ్న?

'గరుత్మంతుడు మహానుభావుండ కా విందు నవ్విహగవిభుని వృత్తాంతము వినవలతు వివరింపవే'

కాబట్టి కథ సుపర్ణుని మహానుభావ వ్యక్తీకరణమే ప్రాధాన్యం దీనికి. కద్రూవినతల కథకు కాదు. ఇందుచేతనే అప్రధానమైన ఈ కథ (వినతాదాస్య వృత్తాంతం) గరుత్మంతుడు పుట్టిన తర్వాత—నడుమ చెప్పబడినది. గరుడి మాహాత్మ్య కీర్తన ప్రధానం కాబట్టి ప్రధానపాత్రను ముందు వర్ణించి, అప్రధానమైన (వినతకు కద్రువ దాసి కావటం) కథను తర్వాత వర్ణించినాడు. ఇందు చేతనే వినతాదాస్యాన్ని ఏకవాక్యంలోనే సూచించి ఊరుకున్నాడు. నన్నయగారివలె దీర్ఘకరించలేదు. తిక్కనగారి ప్రణాళికతో దానికి ప్రాధాన్యం లేదు.

ఈ కథలో రెండురకాల లు.

1. కథ చెప్పడంలోని పద్ధతికి సంబంధించినది. ప్రధానవిషయం, కథన శిల్పం.

2. రచనాశిల్పం. పైదాన్ని పోషిస్తూ — తాత్కాలిక విషయాన్ని భాసింపచేసేది.

## కథనశిల్పం

ఈ కథ లోకవృత్తాంతంగా కవి సంఘటించాడు. లోకంలో ఆ కథ ఎలా జరుగుతుందో అలాగే వ్రాయటం. లోక స్వభావంపై ఆధారపెట్టి వ్రాయటం. పాత్రలు దివ్యులు — కశ్యపబ్రహ్మ భార్యలు సంతానం కాబట్టి.

ఒక కుటుంబముంది. సవతులున్నారు. వాళ్ల మధ్య పొరుపులు — కష్టనష్టాలు, సుఖదుఃఖాలు. ఇలాగా సాగుతుందికదా! ఆ పద్ధతి వుంది. ఇందుకే కవి కథాంతంలో వ్రాశాడు.—

'మానవలోక కలిత బహుళానందకరము' — అని. మనుష్య స్వభావోచితంగా కథాయోజనం జరిగింది. ఆ దృష్టితోడనే చూడాలి. ఈ మానవ స్వభావం కథలో మూడు నాల్గు ఘట్టాల్లో కన్పిస్తుంది.

కద్రువకు ఇంటినిండా సంతానం. పాపం! వినతకు—లేదు. ఆమెకు వగపు; మాత్సర్యంకల్గి ఒక అండాన్ని అవియించింది.

'వగపు నాకులేదని; మాత్సర్యం — దానికున్న దని'—సావత్న్యమంటే ఇంతేకదా! ఆ అవియించిన అండమునుండి పూర్వాంగ దార్ఢ్యంకల ఒక కుమారు డుదయించి అన్నాడు.

'ఇరువుర మేము పుట్టుదు మహీనపు
మేనులతో మహాబల
స్ఫురణ వెలుంగ నప్పెనుపుఁ బొందఁగ
నీ కవియించి తిట్లు మ
త్సరమున జావలంబుననను---'

అని శపించాడు. శాపం రావడానికి కారణం మాత్సర్యం — ఎవరినిగూర్చి?—కద్రువనుగూర్చి. ఆమెకే దాసి కమ్మ న్నాడు కొడుకు. ఆమె మాత్సర్యంచేత తనకు అప రాంగం లేకుండాపోయింది. ఆ కోపంచేత తల్లియని కూడా చూడలేదు!

శపించినవాడు సూర్యరథ సారథ్యానికి తన దారిన తానుపోలేదు. మాతృదేవత అమాయికురాలు— ఉత్తమురాలు—మెత్తనిది.

కోపంతో ఏదో అన్నాడు. శాపభీతయై తల్లి ఏమౌతుందోనని తమ్ముడు పుట్టేవరకుండి వెళ్ళి పోయాడు.

ఆ తమ్ముడు జన్మించినదే తడవుగా తాత గారైన బ్రహ్మదగ్గర పెరుగుతున్నాడు. సిద్ధసాధ్యులు ముద్దు చేస్తున్నారు. మహైశ్వర్యం— అధికారం— ఇంకేముంది?— ఇంటి గొడవ పట్టించుకోకుండా తిరుగుతున్నాడు. పెద్దదిక్కుండి ధనవంతులైన వారి వ్యవహారమింతేకదా! — కాని వారు దుర్మార్గులు కావచ్చు. వీడు కాలేదు. ఐశ్వర్యాదులుండి దుర్మా ర్గులు కాకపోవడం నిజంగా గొప్పతనమే.

ఈ కథ నింతటితో త్రెంపి వినతకు దాస్యం ప్రాపించిన కథ గ్రహించాడు. ఆ కథనుండి ఈ కథ లోనికి దూకిన దూకు సొగసుగా వుంది.

'జననిం బాసి జరించినప్డు తనయిచ్చం బక్షి
నాథుండునున్
—చరించుఁ బరితుష్టస్వాంతుఁడై యెల్లెడన్'
అకాలంబున వినోదంబున కరిగి యొక్కయెడ—
చంచుల జిగురాకు జించి చూడుచు నలి
నెలుగింపు గుండుకోయిలల సొంపు'—

తగిలి కొనియాడుచు— ఎవరు?— గరుత్మంతుడని పాఠకుడనుకోవడం సహజం. కాని కద్రూ వినతలని పద్యం చివరలో అనగానే మనకు విభ్రాంతి కల్గుతుంది. ఇదొక చమత్కారమైన మలుపు.

సవతులు విహరిస్తున్నారు. ఉచ్చైఃశ్రవం కన్పించింది. వినత ఆశ్చర్యంతో 'ఎంత తెల్లగావుందో చూడవే'— అన్నది.

కద్రువ—'అపరాంగమున నీలిమ తోచటం లేదా!'— అన్నది.

వాదు పెరగటం—పందెం వేసుకోవటం జరిగింది. వినతపోయి చూద్దామంటే కద్రువ 'పతి పరిచర్యకు కాలంబయ్యె'— తర్వాత చూద్దామన్నది. కద్రువ గడుసరితనమంతా ఆ మాటలో ఉన్నది.

'వినత కాదిప్పుడే చూద్దామంటుందా?'— నీకు పతిపరిచర్యకంటె గుఱ్ఱంతోక ఎక్కువా'—అని కద్రువ సిగ్గుదీస్తుంది.

తోకనుం దనకేల్. వినత సరే నన్నది. ఇంటికి వెళ్ళారు. కద్రువ నాటిరాత్రి కొడుకుల నడుగుతుంది— గుఱ్ఱం 'తోకను నల్లచేయరయ్యా' అని. పెద్దకొడుకులు వాసుకి మొదలైనవాళ్ళు 'ఇది అధర్మం — మేం చేయం—పో'మ్మన్నారు. తల్లి — పెద్దకొడుకు లిట్లు మాట్లాడుతుండగా—

—'కొందరు జననిఁ బోలఁగి
యొక్కడేనిఁ జనిరాభంగిం
జనిన తనూజుల పేర్కొని—
నెనరువిడిచి యా నెలంత నిష్ఠురమతియై'

శపించింది.

ఎదిరించిన పెద్దకొడుకుల నేమీ అనలేదు. ముఖం తప్పించినవాళ్లను శపించింది—చిత్రం. లోక స్వభావ మంతే. ఎలాగంటే—?

ఒకతల్లి పెద్దవాడికొక పనిచెబుతుంది. నేను 'చేయనుపో' అంటాడు. తనంతవాడైన ఆ కొడుకు నేమంటుంది తల్లి ?— అనలేదు. కాని మాట వినలే దన్న కోపంపోదు. అది ఆవంలోని నిప్పులాగా వుంటుంది. పైకి పొక్కదు. చిన్నకొడుకున్నాడు. ఎప్పుడూ వాడి ఆటపాటలేమో— వాడేమో!—వేళకింత తినటం—పోవటం: ఇంటిపట్టునే ఉండడు. పెద్ద కొడుకుపైనున్న కోపం రాజిరాజి వీడిమీదికి ప్రస రిస్తుంది. 'ఈ చిన్నవెధవ కిల్లేపట్టదు. వాడు చచ్చిన బాగే. ఒక యేడుపేడ్చి వూరుకోవచ్చు. వాడేమైనా నామాటవింటే నాకీ బాధ వుంటుందా ! ఈ దొరగా రేమో నామాట వింటారా, పెడతారా! ఆ చిన్న వెధవ ఎటుచచ్చాడో—'

ఇది లోకస్వభావం. చేయనన్నవాడికి లేదు. వీడికి నింద. మానసిక ప్రవృత్తి లిలాగే వుంటా యనడాని కెవ్వడు ?

ఆ పాముల్లో కొన్ని ఇక్కడుంటే మనకేమి మూడుతుందో అని మొకం తప్పించినవి. లోకంలో కొందరుంటారు. పనికి పాపరాజులు, తిండికి పోతు రాజులు. ఆ మొకం తప్పించిన నాగు లీరకం వాళ్ళు.

ఈ తల్లి ఎలాచస్తే మనకేమని ఎటోవెళ్లారు. వాళ్లచావుకి వచ్చింది.

తల్లికి కోపంరావటం—శపించటం జరిగింది.

వినత దాసి ఔతుంది. ఈ పై కథ ఎప్పుడు జరిగింది ?— ఆ తన నుద్ధరించే కొడు కింట్లోలేని వేళ. ఆయనకీ గొడవ తెలియదు. తాతగారి తొడ మీద ఆడుకోవటం — ఆయన ముద్దుగా ఇ తినిపిస్తే తినటం. క్రొవ్వి తిరగటం — ఇలావుంది సారం.

ఒకనాడు నారదుడుచూచి అన్నాడు :

దాసియై సవతాలికి తల్లిపనులు—
సేసి నలగంగ నద్దైన చింతవంత—లేక
నీ విట్లు తిరుగంగ లెస్సయగునె—
యద్భుతోజ్వలతేజ కశ్యపతనూజ'

ఒక కుటుంబంలో కొడుకొకడు గొప్పవాడు. ఇంటి సాధకబాధకాలు పట్టించుకోడు. పట్టించు కోక పోవటంలో అశ్రద్ధతప్ప వేరేకారణం ఉండదు. ఎక్కడో ఉంటాడు. ఈ తల్లిదండ్రులు 'పోనీ పసి వాడు ! వాడికీ గొడవలుచెప్పి బాధించటం దేని' కని చెప్పరు. ఐనవాడొకడు చూస్తాడు. వాడి దగ్గరకు పోయి : 'ఏరా ! చూడబోతే గొప్పవాడివి. వాళ్లంత బాధపడుతుంటే నీ తిరుగుడేమో నీవేమో. వాళ్లగోడె పట్టించుకో వెలారా?—' అని చీవాట్లు పెడతాడు. వాడు బుద్ధిమంతుడై దిద్దుకుంటాడు. ఈ సంద ర్భాన్ని దృష్టిలో పెట్టుకొని పై పద్యాన్నిచూడాలి ! [నారదుడన్న సంబోధనలో ఎంత గడుసుదనం ఉందో! 'అద్భుతోజ్వల తేజ— కశ్యప తనూజ'—సంయుక్తాక్షర విన్యాసం— గరుత్మంతుని బలపరాక్రమాల నపహసిం చటం—కశ్యప— 'శ్య' (యతిస్థానం) మీద విరిచి నొక్కటం. అంతాకలిసి నారదుని క్రోధభావాన్ని ధ్వనిస్తుంది. వాడొకవేళ ఎదురుతిరిగితే 'నేనే మన్నా నురా ! — కశ్యపుడి కొడుకువుకాదా ! అద్భుతోజ్వల తేజుడవుకావా !'—అని తప్పించుకోవచ్చు. ఇదే రచనా శిల్పం ... వేరే వ్రాయదగింది. సందర్భం కాబట్టి వ్రాయటం.]

విన్న గరుడునికి కోపంవచ్చింది— 'ఆ! నాతల్లి నింతచేసిందా పెద్దమ్మ!' అని. పిదప వగపట. 'నా తల్లి ఇంత పడికూడా నాకు కబురు చేయలేదే. అయ్యో'—అని. తానూ పట్టించుకోలేదు. వందల ఏండ్ల దాస్యము. తనతోచెప్పటానికి తానింట్లో ఉంటేనా !—అదంతా కలిసి వగపు. ఆ మనోభావ క్రమ వికాస విన్యాసంలోఉంది కవి విద్వాతనం.

ఆ వగపు మనస్సులో పెట్టుకొని,

'మేలువే లప్పహితంబుజేసెఁ జెలియల్ మను చున్నది', అన్నాడు తల్లి అమాయకత్వాన్ని పురస్క రించుకొని. కద్రువచేసిన మోసంపై కోపం. అట్టి దుర్మార్గురాల నప్పగారని వెన్నంటితిరిగే తల్లిమీద కోపం. ఆమె నోరిగద్దరితనంమీదా, ఈమె నోరు లేనితనంమీదా కోపం. వెంటనే వాయువేగంతో

వెళ్లి ——ల్లినిచూచి 'విషాదభరార్తమూర్తియై', నమస్కరించినాడే కాని ఏమీ మాటాడ లేదు. ఏమంటాడు? దోషం తనది. ఇంతటి కొడుకుండగా అంతబాధ ననుభవించిన పిచ్చితల్లిని చూచి ఏమంటాడు?—ఆవురుమనాలి. ఆయన గంభీరుఁడు కావున లోలోపలే అవటిల్లిపోయాడు. అందుకని విషాదభరార్తమూర్తియై అని వ్రాయటం.

కద్రువ కడకేగి—'పరమవినీతిమై వెలఁగి బాంధవ మారఁగ—తారితారి అల్లన'నేదో అన్నాడు. మనం పెద్దవాళ్ల దగ్గరకువెళ్లి సమయంకోసం వేచి వుండటం; దానికోసం మనం పడేపాట్లు అ—'తారి తారి'—మాటలో ఉంది. సరే అన్నాడు—'నీ చెల్లెల్ని ఇలా దాసిగా చేయడం నీకే మచ్చగిదమ్మా! విడచి పెట్టు...లోకం నిన్ను స్తుతిస్తుంది'—ఆమె చలించ లేదు. మళ్లా అన్నాడు—'నేను నీకు కుమారుణ్ణికాదా! నా మొగం చూచియైనా వదలిపెట్టు'అని. అంతా లోకమే! ప్రతిమాటలోనూ లోకస్వభావమే. కద్రువ సంగతి ఇతనికి తెలియదు. పుట్టింది దగ్గర్నుంచీ బ్రహ్మదగ్గరేగా నివాసం. 'నేనింత వాణ్ణి—నా మాట వినదా మా పెద్దమ్మ'—ఈయనకు ధీమా!

'ననుఁజూచియైన తల్లీ కృపసేత పెద్దయును లెస్స' అన్నాడు. ఈ మాట సరిగా ఇలాగే వాడటం ఉందికదా! వీడెంత సేపటికి వదలటంలేదని కద్రువ ముఖం 'మురకటించుకొన్నదట.' ఎంత సొగసైన తెనుగుమాట. సొగసెక్కడుంది! శబ్దం అభినీతం కావాలి!—అంటే శబ్దానికి అభినయశక్తి నాధానించాలి—అభినయముఖంగానే రసానుభూతి. అభినయాపేత శబ్దానికి రసానుభూతిని కల్గించేశక్తి ఉండదు. ఇదే శబ్దం చూస్తే—మూతి ఒక ప్రక్కకు త్రిప్పి ఈఁ—అని సాగదీసినట్టు — ఈ లోకంలోని దృశ్యం కన్నుల్లో పొడుస్తున్నది కదా! ఇదే శబ్దాభినయమంటే. (తిక్కనగారిశబ్ద మిలాగే వుంటుంది సర్వత్రా). కద్రువ వినతపై పెత్తనం చెలాయిస్తున్నది. వీడేమోవచ్చి బంధుత్వం త్రవ్వుతున్నాడు. ఈ కోపాన్ని ఆ శబ్దం అభినయిస్తున్నది.

సందర్భోచితంగా శబ్దాన్ని పొదగటం విద్య. ఇందుకనే ఒకచోట విశ్వనాథవారు:

'పదునేను పర్వములు వ్రాసిన ఆ మహానుభావుడు ...తెనుఁగు భాషయొక్క జీవముచేత, నుడికారముచేత, బలుకుబడిచేత—ననంతాచ్ఛాంధ్ర శబ్ద సంయోజనంచేత' అని వ్రాయటం. మురకటించుకొని అనేటటువంటి మాటలన్నీ పట్టి ఎగరాలి. ఎత్తిపొడుపు.

'బలవంతుఁడవు నేర్పు వంపనుముం జెప్పంజాలి
ఏ రిత్త పల్కులం దేర్పం బనిలేదు

'బలవంతుడవు—పెద్ద మొనగాడవు — ఇన్నాళ్లెన్నైనావు? ఇవాళవచ్చి నేర్పుగా బంధుత్వం త్రవ్వుతున్నావ్. ఇన్నాళ్లెక్కడైం దిది? నేర్పుగా మాట్లాడగానే సరా! ఈ నాటికి నీ అవసరంకోసం 'పెద్దమాత్ర' అంటావా! చాల్లే! ఈ రిత్తమాటలతో పనికాదు. నీకు తల్లికావాలంటే — లోకులు నిన్నుం బ్రణుతింప తెమ్మమృతమున్—'

ఈ పద్యరచన సర్వం ఆమె మనస్సులోని కోపం— అసహాయన ప్రీటిని ధ్వనిస్తున్నది, పద్యంలో బిగింపులేదు. అంతా శిథిలబంధం. గాఢబంధంకల తిక్కనగారి వాక్యం ఇక్కడిలా నడ్చిందంటే నిర్మాణ మార్మికతా దృష్టితోనే. సందిగ్ధాయలన్న నిర్మాణ మార్మికతా దృష్టితో చూడాలి. వాడన్న చులకన— 'తేగలవా!' అన్న ధీమా. తెస్తే చూద్దాం! తేలేడు—దాస్యం పోదు. ఒకవేళ తెస్తేదయ్యా — అమృతం దక్కుతుంటే మువ్వు వినతదాస్యం దేనికి? ఈ భావంతో హేళనగా 'తల్లికి నుడింగావ్తెని వేబోయి లోకుల్ ప్రణుతింప దెమ్మమృతమున్' అన్నది. అదేదో చాల తేలికైనట్టు. అలా అనటంలో 'తేనేలేవే!' దని ఆమె నమ్మకం.—'ఎలా?' కశ్యపునితో ఈ మాట చెపితే గరుత్మంతుడు — తండ్రిఅన్నాడు 'అమృతంబు దుర్లభంబ య్యమరులకేని' అని. మరి ఆయన భార్య కీ సంగతి తెలియదా! అందుకని— 'అది తీసుకురా! నీవు చెప్పినట్టే చేద్దామన్నది!' వాడు భయపడి పోవచ్చు—తెస్తేసరి. ఎలాగైనా మంచికే. ఇంకొక

భావముంది. లోకంలో తనమీద తప్పులేకుండా చేసి కోవడానికిది ఒకమార్గం. రేపు లోకమిలా తనను ఆడి పోసుకోవచ్చు — 'తనంత కొడుకువచ్చి పాపం నోరుతెరిచి అడిగాడు. లేదన్నది. ఏమాడువారో— మగవాడు—పిల్లవాడు అడిగినదాన్ని కాదనడానికి నోరెలా వచ్చిందమ్మా !' అని ఇరుగు పొరుగు వాళ్ళు బుగ్గలు నొక్కుకోవచ్చు. అందుకని ఈ అపవాదు నుండి తప్పుకోవడానికి—'అలాగే నాయనా! అమృతం తెచ్చిచ్చి నీ తల్లిని తీసుకుపో !' అన్నట్లుగా. ఆపైన వ్రాసినట్లు—ఇంత భావాన్ని కడుపులో పెట్టుకొన్నదా పద్యం—అంటే కద్రువ. లోకంలో లౌక్యులైన తెలివి గల వాళ్ళలాగే మాట్లాట్టం మనకు తెలిసిందే.

సరే ! గరుడు డంగీకరించి తండ్రిదగ్గరకు వెళ్లటం, ఆయనఉపాయం చెప్పటం—ఈయన స్వర్గ లోకానికిపోవటం జరిగింది.అమృతంచుట్టు అగ్ని ప్రజ్వ రిల్లుతున్నది. చూచిన వీడు– ఎలారా! అని బ్రహ్మ (తాత) దగ్గరికి వెళ్ళాడు. ఆయన వెన్న వేయ మన్నాడు. ఇందులోనూ లోకస్వభావముంది. ఆ నిప్పును చూచి తన రెక్కలు కమరునేమో అను కొన్నాడట గరుడి. వాడంత బలశాలి—గొప్పవాడు ఇలా అనుకోవడం బాలచేష్ట. మన ఇంట్లో పసివాడి కొక విషయం తెలియదు. దాన్ని చూడగానే వీడు తెలియదనుకొని పెద్దవాళ్ల నడిగి సమాధానం పొందటం—తెలిసిందే. పెద్దవాళ్లందుబాటులో వుండరు. వీడే తంటాలుపడతాడు. అలాగే గరుడుడు. నిప్పును చూడగానే! – ఎలా! ప్రశ్న. మనస్సులో తాతయ్య కన్పించాడు. ఇంక ఆలోచించకుండా ఆయన దగ్గరికి పరుగెత్తాడు.

సుధనుతెచ్చి కద్రువకు చూపి తల్లిని గ్రహిం చాడు. అమృతం కద్రువ కియ్యలేదు. ఎందుకని! కద్రువ అన్నమాట 'తెమ్మమృతమున్'— ఎట్లు?— లోకులు నిన్నుం బ్రణుతింప. అలాగే తెచ్చాడు. ఇమ్మనలేదు—తెమ్మన్నదంతే. అరే! తెమ్మంటే ఇమ్మని కాదా! సందర్భవశాత్తూ—అన్న వ్యక్తి ననుసరించి ఉంటుంది—వ్యవహారం. ఆమె తనను తిరస్కారంగా ఎత్తిపొడుస్తూ—కొడుకని చూడకుండా! ఛీ—ఫో! అన్నట్లు మాట్లాడింది. అందుకని ఇవ్వక్కర్లేదు. గరుడు డన్నాడు.

'జననీ ! నీ వమృతమ్ము తెమ్మనిన
ఆ సత్యోక్తి పాటించి యే
జని నానావిధ కర్మకర్మరుడనై
సాధించి వేదెచ్చితిన్;
వినతం దోడ్కొనిపోయెదన్
మనమునన్ విభ్రాంతి లేకుండుమీ'—

సంబోధనలో అవహేళనముంది. 'బలవంతు డవు'– అని తన సన్నట్లే.

ఇలా మాట వెరవుతో ఆమెను జయించి తల్లిని తీసికొని వెళ్ళిపోయినాడు గరుడుడు. 'మాట వెరవు'—కవి వాడినమాట. వెరవేమి? – తెమ్మన్నదే గాని ఇమ్మనలేదు. కాబట్టి అమృత మివ్వక్కరలేదు. ఆమె దుస్స్వభావ. మాయకురాలు. అలాంటివాళ్ల నలాగే శిక్షించాలి.

ఒక ముట్టెపొగరుబోతు అన్నా డొకడితో— 'ఒరే! నా చెయ్యి వంచు. నీ బలం చూద్దాం' అని. వీడు 'సరే'నని—అన్నవాడి చెయ్యి వెనక్కువంచటం మొదలుపెట్టేసరికి, వాడికి చెయ్యి బెణికి—ఇలాగా వంచమంటే ! పైకి వంచాలిగాని—అని ఏడ్చాడు. వీడన్నాడు. 'నువ్వు ఎటువంచాలో చెప్పలేదుగా మరి' అని. ఈ లౌకికసంఘటనలో విషయ మేమిటి? వాడి తలపొగరణచటమే. అలాగే కద్రువ పొగరు తగ్గించటం కోసం, కవి అలాగా కథను వ్రాశాడు. ఇదే లోక స్వభావం.

కథ సిద్ధసాధ్యులతో ప్రారంభమయింది. వాళ్ళు గరుత్మంతుణ్ణి లాలిస్తున్నవాళ్లు. మళ్లీ వాళ్ళు గరుడుని స్తుతించడంతో కథా సమాప్తి జరిగింది. కథ ఎక్కడ, ఏ స్థాయిలో మొదలౌతుందో ఆ స్థాయిలో అక్కడే ముగుస్తుంది. కథ కొక పొందిక వస్తుంది దీనివల్ల. కుదింపు వస్తుంది. శరీర పార్శ్వాలు రెండూ సమానంగా ఉండటం అందం. ఎగుడు దిగుడుంటే

వికారం. కథకు మొదలూ చివరా రెండంచులు. శిల్పానికి పార్శ్వాల్లాగా. కాళిదాసు మాళవిక నన్నాడు 'పార్శ్వే ప్రమృష్టే ఇవ'— అదీ శిల్పసౌందర్యం.

ఇది ప్రధాన కథన శిల్పం

రచనా శిల్పం :

దీన్నిగూర్చి 4, 5 పద్యాలు తీసుకొని విచారించాలి.

I. (1) (అరుణుడు) అనూరుడు పుట్టినప్పుడన్న మాటలు.

(2) గరుడి జన్మ—ఈ రెంటిని చంపకమాలల్లోనే వ్రాశాడు కవి.

II. (1) కద్రువ గరుత్మంతునితో చెప్పినమాటలు.

(2) గరుత్మంతుడు సుధతెచ్చి ఆమెతో అన్న మాటలు—రెంటినీ మత్తేభాలలో వ్రాశాడు

III. కద్రువ శాపం.

ప్రధానంగా వీటిని చూస్తే సుగతా పద్యాలా ఇలాగే చూడవచ్చు. అరుణుని మాటలు: 'ఇరువుర'—మన్న పై పద్యము. అరుణుని మాటలు.

'ఘనతర కంధరుండు దృఢకాయుఁడు
దీప్తముఖుండు వహ్ని లో
చనుఁడు మహోత్తమాంగకుఁడు
చారుసుసంగతపక్షసారమం
డనుఁడు—పరిస్ఫురద్యుతి
విడంబితబాలదివాకరుండు లో
క నయన పర్వ నిర్వహణకారి
సుపర్ణుఁడు పుట్టె భూవరా !

అరుణునికి కోపం రావడాని క్కారణం — కద్రువపై వినతకున్న మాత్సర్యం. దాన్ని నొక్కుతున్నా డరుణుఁడు. మ—తోపాదంతెగి, 'త్వరము'—తో తృతీయచరణారంభం జరగటంతో, రెండవపాదాంతం బరువంతా, 'త్వ' మీదపడి అతని కోపభావాన్ని రమణీయంగా ధ్వనితం చేస్తున్నది— రచన.

రెండవ పద్యంలో అహీన—యతిస్థానం 'హీ'. దీనిమీద ఊనికవుంది. అరుణుడు గరుడుడు అహీన బలోపేతులు. ఎంతబలము !—'హీ'ని సాగదీసి చదివితే తెలుస్తుంది. (తెలుగులో యతిప్రాసలు భావ, రస వ్యంజకాలనటం ఇందుకే. అక్కర్లేదు ! బరువు చేటవడం — ఎలాంటిదంటే, బలమైన ఆహారము తినకూడదు— అరగటం కష్టంకాబట్టి—అనటం లాంటిది.)

ఇద్దరు అన్నదమ్ములూ సమానబలస్ఫురణ గలవారు. బలంలోనే కాదు. సర్వసమానులు. ఆ సాదృశ్య స్ఫురణకై ఇద్దరినీ ఒకే వృత్తంలో వర్ణించాడు కవి. కాని ఘనతర— పద్యం ఘనతమం. విచిత్ర శైలీ రమణీయమైనది. చిన్నవాక్యాలే కావటానికి. కాని ఎంత ఓజోగుణం — అనుసంధించాడు మహాకవి ! పద్య రచనలో — శబ్దసంయోజనంలో నిబిడత్వ ముండాలి. దంతురత్వ ముండాలి. అది పాత్రలో ఉంది. అదే శబ్దంలోకి జారింది. పై పద్యంలో తేజస్సులేదు. (తేజస్సుంది—యతిప్రాసల్లో — మత్సరమును నిలుపటంలోని 'కాంతి' ఎంత తేజస్సుతెచ్చాడు కవి ఈ పద్యంలో.)

అరుణుడన్నాడు 'అన్యసుపుష్టిఁ బొందగ నీ కవియుండి తిట్లు—న'ప్పని. వెనుకపొందనివాని మాట పై పద్యము. వెనుకపొందిన అహీనబలుని మాట క్రింద పద్యం. బలస్ఫురణ ఎక్కువగలిగి పుట్టినవాడు గరుడుడు— ఇందుకని పద్యం—పట్టాశ్వం కదను త్రొక్కినట్లు నడుస్తున్నది.

ఇద్దరి మనస్సులూ—ఆలోచనా పద్ధతులూ ఒకటే కాబట్టి అరుణుడు వినతను చూచి:

'తల్లి వలవ దడల నిది విధాతృ వశమయి వచ్చెన్' అన్నాడు.

సరిగా గరుడుడు కూడా కద్రువతో తన తల్లి దాస్యాన్ని వీడుమంటూ :

'దాస్యకర్త్రి నా జనయిత్రికి నివ్విధంబునన్ రాకయు దైవకృత్యము' అని సమానదైహిక—మాన

సిక—విన్యాస సూచనకై సమానవృత్త స్వీకరణం చేశాడు.

(2) అలాగే కద్రువ ఏమనస్తత్త్వంతో ఎగతాళిగా 'బలవంతుడవు'— అన్నదో!—సరిగా అలాగే గరుత్మంతుడు 'జననీ' అని అదే మనస్తత్త్వంతో ఆక్షేపించాడు. ఇది ఆక్షేపణ. లోకస్వభావ మింతే. అవతలి వాడెలా నిందిస్తాడో మనమూ సరిగా అదే పద్ధతిలో పగ తీర్చుకొంటాం.

(3) కద్రువ శాపపద్యం. ఇది భావవ్యంజ్యకత కుదాహరణ. (పైది మనస్తత్త్వ సామ్యతకు)

ఆతడు (జనమేజయుడు) సర్పయాగ మను
నధ్వరముం గుపితాత్ముడై
ప్రీతిగజేయుః దద్దహన
భీకర భూరి శిఖాప్రవేశ సం
జాత దురంత తాపమునః
జావగలారని శాపమిచ్చెఁ—ద
త్పాతన వృత్తికిన్ వెఱచి
తక్కటినాగము లా భుజంగితోన్'

సమాసజటిలత కోపజటిలతకు వ్యంజ్యకం. గీటుల్లకొట్టిన భాగాలమీద బరువుంచి చదివితే పండ్లు మీటుతూ అన్నట్లుంటుంది. అలాగే అన్నదామె. ఆ కోపమంతా 'చావగలా'రన్నమాటలో గూడు కట్టుకొన్నది—పర్యవసానంలో తేలికపనిచేసి పీడవిరగడైనదని చేతులు దులువుకొన్నట్లుంది ఆ మాట అనటం. వాడిది త్రాచుపాముపగ—అని లోకం. పద్యంలో 'భుజంగి'శబ్దం దీన్ని స్ఫురిస్తుంది. త్రాచు తన గుడ్లను తానే తింటుందని లోకం. ఇది సర్పస్వభావం. ఇందుకే 'భుజంగి'. ఈ రచనాశిల్పం పై శిల్పాని కంగభూతమౌతున్నది.



# ఆనందలీల

## ఇంద్రగంటి భానుమూర్తి

బ్రతుకుల్లో ఏళ్ళమైలురాళ్ళు గడుచుకొంటూ,
వెలుగూ చీకటీ గట్లమధ్య పడవ నడుపుకొంటూ,
ఎర్రని ఎండల్లో ఎండి,
జడివానల్లో తడిసి,
తెలతెల్లని మంచుసొగల్లో కుసుమరుగవుతూ,
ఈ శిశిర వేళదాకా వచ్చేనా!

నేని లోకానికి వస్తూ వస్తూ
పసితనపులేత గుప్పిళ్లల్లో దాచుకు తెచ్చుకున్న దేదో
పోగొట్టుకొని,
పోగొట్టుకొన్న దేదో మర్చిపోయి
తలకొట్టుకొని,
బిక్క మొగం వేసుకొని,
జీవితం పొడుగునా వెదుక్కొంటూ వచ్చేనా!

నన్నంతా వింతగా చూసి పక్కలకి
తప్పుకొన్నారు —
తప్పుకొని, మొగాల్చాటుజేసి
నవ్వుకొన్నారు—
పిచ్చివాణ్ణాను కొన్నారు—

అవునవును,
వస్తూంటే తోవలో
అందంగా, ఆకుపచ్చగా మోగే గాజుల చెయ్యొకటి
సన్నటి అరటినారతో అల్లిన మల్లె మొగ్గలదండ
మతారంగా పుచ్చుకొని నన్నలంకరించవస్తే

ఆ న ం ద ల

ఆ అద్భుత సుగంధ లక్షణాన్ని భరించలేక
కంగారుపడిపోయానూ,
కళవళపడిపోయానూ—
అంతలో అర్జంటుపని, మీాదపడి, బస్సుఎక్కి
వెళ్లిపోయానూ—

అవునవును ఒకసారి
ఎందుకో దిక్కుతోచక ఒక్కక్షణం
బ్రతుకు దిగాలుపడి ఆగిపోయినపుడు,
చప్పగా చదికిలబడిపోయినపుడు,
'నెలవంక' నా కళ్లమీాద జాలిగా
మెత్తని వెన్నెలరెక్క విప్పితే
సంసార వ్యూహంలోపడి గమనించక
వెలుగులోనూ వెదుక్కొంటూ
ముందుకు వెళ్లిపోయానూ.

ఈ అదృష్టాధ్వంలో
చిక్కులూ, బీటముళ్లూ వేసుకొంటూ, విప్పుకొంటూ,
పనులన్నీ మళ్లా మళ్లా సర్దుకొంటూ,
డబ్బులెక్కలు చూసుకొంటూ,
ఏదో పొగొట్టుకొన్న వెర్రితోనే బ్రతుక్కొంటూ,
నిట్టూర్పులతో, నిస్పృహలతో,
అసంతృప్తితో,
జీవితమంతా కిక్కిరిసిపోయి
దారిపొడుగునా కన్నీటి ముత్యాలేరుకొంటూ,
దండగుచ్చి మనః పేటికలో దాచుకొని
రహస్యంగా చూసుగుంటూ,
వస్తూ ఉంటే,
నా వెనక ఎవరిదో నవ్వు మోగినట్టయింది—
మోగి, ఆగినట్టయింది—
'గజ్జెలందియాలు ఘల్లుఘల్లున మోగ్రియకండా',

గాజులున్నా గల్‌గలా మనకుండా,
వెనకాలే నిశ్శబ్దంగా వొచ్చి
నవ్వుమోగి ఆగినట్టయింది—
అపుడు హఠాత్తుగా,
నా పసితనపుటానందమండపంలో
మోగిన వెండిగంట జ్ఞాపకం వచ్చింది—
అడుగడుగునా నేను పోగొట్టుకున్నదేదో
గుర్తుకు తెచ్చింది—
గుండెల్లోంచి కన్నీరు చిమ్ముక వచ్చింది.



# మహాయోగి అరవిందుడు

శ్రీ "కాకుమాను తారానాథ్"

(గత సంచిక తరువాయి)

అరవిందుని యోగసాధన వివరణ కష్టమైనదనే చెప్పాలి.

అంతేకాదు. అరవిందులే స్వయంగా ఒకసారి, ఎవ్వరూ తనజీవితచరిత్రను వ్రాయలేరనీ, ఎందు కంటే అది పైపైన చూడతగిన జీవితంకాదు కాబట్టి, అని అన్నారు. అలాగే మానవునిలో అనేక వ్యక్తిత్వాలున్నాయి. కాని నిజమైన వ్యక్తిత్వమేమిటి? ఒకానొక పనికి భగవానుని ఉపకరణంగా ప్రపంచ నాటకరంగంలోకి విసిరివేయబడిన అంశగానే నిజమైన వ్యక్తిత్వాన్ని అర్థం చేసుకోవాలె. (.. But the true person is also there; it is the Eternal thrown out in time as the Cosmic and the indivi dual for a particular purpose, use or work. This true person is all the time conscious of his identity with the Cosmic). అయితే ఈ నిజమైన వ్యక్తి ఎప్పుడూ తన తాదాత్మ్యతను విస్మరింపడు. (This true person is all the time conscious of his identity with the cosmic.)

అలాగే నిజమైన ఆధ్మాత్మిక పురుషుని జీవిత మంటే ఆయన ఏమిచేశాడు లేదా ఆయన సమకాలికులు, ఆయనను ఏవిధంగా చూశారు అన్నదికాదు కావలసింది అంటారు అరవిందులు. ఒకప్పు డెలా ఉండే వ్యక్తి, తరువాత తరువాత అంతర్గతంగా ఎలా మారాడన్నదే ప్రశ్న. ఆ ఆధ్యాత్మిక పురుషుని బాహ్య జీవితానికి కావలసిన సర్వస్ఫూర్తి, శక్తి అంతర్గత జీవితమే 'సప్లై' చేస్తుంది. ఇదే అరవిందుని దృక్పథము.

తరువాత అరవింద వివరణలో ఇంకొక బాధ ఉంది. ఆయన తన భావాలన్నిటినీ ఆంగ్లభాషలో వెలువరించారు. దానిలోనూ ఆయనభాష ప్రత్యేకంగా ఆయనభాషే. అనేక నూత్నపదప్రయోగాలతో, ఆయన భావావేశాన్ని వెలువరించటానికి, గంగావతరణ వేగంతో, గంభీరమనోజ్ఞంగా ఉంటుంది. దానిని అర్థం చేసుకోవటమంటే మననం చేయవలసిందే. ఆ భావాలను తెలుగులో యధాతథంగా అనువదించటం, అర్థరహితమూ, వ్యర్థమేకాకుండా, ఈ రచయిత దానికి అనర్హుడు. కాబట్టే నాకు తోచిన భాషలో ఆ భావాలను, నా శక్తికొలదీ ఈ చిత్రణలో ప్రదర్శించటానికి ప్రయత్నం చేస్తున్నాను. ఇందులో అనేకదోషా లుండవచ్చు.

పాండిచేరి జీవితంలో అరవిందునికి యౌగిక సహాధ్యాయిని లభ్యమయింది. ఆమెయే నేడు 'మాత' పేరుతో అరవిందాశ్రమపు రూపురేఖలను దిద్దుతూ వుంది. వ్యక్తిగతజీవితంలో ఒకనాటి శ్రీమతి పాల్ రిచర్డ్స్, ఫ్రెంచివనిత. ఆమెకు చిరుతవయస్సులోనే—11, 13 సంవత్సరాల వయస్సులోనే ఆధ్యాత్మిక అనుభవాలు కలుగసాగాయి. భగవంతుని అస్తిత్వంలోనూ, మానవుడు భగవంతునితో ఐక్యత పొందగలడు అన్న విషయంలోనూ నమ్మకంకుదిరిన బాలిక అయింది. 1910 లో తన భర్తతో ప్రథమంగా పాండిచేరి రావటం, అరవిందుని దర్శించటం జరిగింది. అప్పటి నుండి ఆమె భారతదేశం రావటానికి తహతహలాడి, 1920 నుండి ఈ దేశంలో స్థిరనివాస మేర్పరుచుకోవటం జరిగింది.

ఈ దేశము ఎంత అదృష్టానికి నోచుకుందో! ఇరువురు ఐరిష్‌స్త్రీలు సోదరినివేదిత, ఆనిబిసెంట్‌లు ఈ దేశముకోసం తమ సర్వస్వాన్ని ధారపోసి, మన నుంచి వెళ్లిపోతే, నేడింకొక ఫ్రెంచిస్త్రీ 'మాత' రూపంలో ఈ దేశంకోసం, దీని పరిశుద్ధ ఆధ్యాత్మిక, చైతన్యస్రవంతి కోసము అహర్నిశలూ పాటు పడుతున్నది.

*　　*　　*

అరవిందుని పాండిచేరి జీవితాన్ని, మనకు లభ్యమయ్యే వివరాలరీత్యానే అంచనా వేయబూనటం దుస్సాహసమే. అరవిందుడు—కొంతమంది దృష్టిలో చెప్పుకోవాలంటే — చాలా అధునాతనయోగి. మద్య మాంసాదులు, పొగపీల్చటం ఆయన కేవలం ఒకానొక దశలోమాత్రమే మానివేశారు. ప్రారంభదశలో పాండిచేరిలో ఆర్థికమైన అనేక ఇబ్బందులకు గురి అయ్యారు. ఒక్కొక్క రోజున చేతిలో 0–4–0, 0 –8—0 మాత్రమే ఉండటం సంభవించేది. ఉన్న ఒక రిద్దరు అనుచరులూ ఉన్నంతలో ఆయనజీవితం సౌఖ్యంగా గడిచేందుకే ప్రయత్నించారు.

ఈ జీవితంలో రెండు విషయాలను మనం గుర్తుంచుకోవలె.

మొదటిది బ్రిటిష్ప్రభుత్వము ఆయన మీాది నుంచి దృష్టిని మరల్చలేదు. చాలారోజుల వరకు, ఏదోవిధంగా రెచ్చగొట్టయినాసరే ఆయనను బ్రిటిష్ ఇండియాకు రప్పించి, తిరిగి ఆయనను బంధించాలని చూచింది. ఒకప్పుడు ఫ్రెంచిప్రభుత్వమే అరవిందుని, బ్రిటిష్ ప్రభుత్వానికి ఒప్పచెపుతుందేమోటనేటంత అనుమానాలు కలగటం, విప్లవకవి సుబ్రమణ్యభారతి ప్రభృతులు పాండిచేరి వదిలి ఎక్కడికోపోయి తలదాచుకొని భారత స్వాతంత్ర్య సమరాన్ని సాగించాలి అని ఆలోచించేటంతవరకు విషయాలు పోయాయి. ఏది ఏమైనా అరవిందుడు తనకొచ్చిన భయమేమీ లేదనే దృఢవిశ్వాసాన్నే వెల్లడించారు. అదృష్టవశాత్తు అరవిందుని విశ్వాసమే నిజమైనదని ఋజువయింది.

ఇంకొకసారి సాక్షాత్తు ఒక సి. ఐ. డీ. యే అరవిందుని పరివారంలో కలిసిపోవటం జరిగింది. కాని కొన్నిమాసాలతరువాత, అతనంతట అతనే తన నిజరూపాన్ని ప్రకటించుకొని, అరవిందుని వదిలి వెళ్లటం జరిగింది.

రెండవ విషయము యోగసాధన కాలపరిమితి. ఒకటిమట్టుకు ఇప్పుడు తథ్యమైన విషయంగా చెప్పుకోవచ్చు. పాండిచేరికి పోయినప్పుడు అరవిందుల ఊహలో తాను శాశ్వతంగా పాండిచేరిలోనే ఉండిపోతాననే భావన లేదనిపిస్తుంది. తమ ఆశయము 4, 5 సంవత్సరాలలో నెరవేరుతుందనీ, తిరిగి భారత దేశా[illegible] [illegible] రంగంలో ప్రవేశిస్తాననే ఆశను వారు అప్పుడప్పుడు [illegible]ంచారు.

కాని పరిస్థితి [illegible] అరవిందులు భారతదేశంలోని (బ్రిటిష్ ఇండియాలో) [illegible] రాజకీయ స్థితిని గమనిస్తూనే అప్పుడప్పుడు [illegible] అభిప్రాయాలు వెల్లడిస్తున్నారు. క్రిప్స్ [illegible] పథకాన్ని యథాతథంగా [illegible] ఒక ప్రత్యేక దూతను ఢిల్లీ పంపారు. [illegible] సందేశాన్ని ప్రముఖ పత్రికా రచయిత శ్రీ బి. [illegible]రావుకు అందచేయటం, ఆయన దానిని శ్రీ రాజా[illegible] వారికి అందజేయటం జరిగింది.

కాని [illegible] రాజకీయాలలోనికి తిరిగి రమ్మనివచ్చిన అనేక ఆహ్వానాలను ఆయన నిరాకరించారు. [illegible] లోకమాన్య తిలక్ ప్రభృతులు అనేకమంది ఆహ్వానించినా ఎదురొడ్డి [illegible]చారు. తమధోరణిలో వారు నిమగ్నులయ్యారు. వారిని అనాడు కలిసినవారిలో లాలా లజపతిరాయ్, డాక్టర్మూంజీ, తరువాత తరువాత రాష్ట్రీయ స్వయంసేవక సంఘ స్థాపకులు డాక్టర్ హెడ్గేవార్ ప్రభృతులంతా ఉన్నారు. [illegible] సమావేశాల వివరాలు మనకంతగా తెలియవు. ఒకటి తథ్యం. ఏ విజ్ఞప్తి, ఏ విన్నపము ఆయనను పాండిచేరినుంచి కదలించలేకపోయింది. రామకృష్ణ పరమహంస శతజయంతి ఉత్సవాలుకూడా ఆయనను కదలించలేదు

పాండిచేరిలోని మొదటి నాలుగు సంవత్సరాలు, దాదాపుగా ప్రపంచానికి దూరంగా జీవితం గడపటం జరిగింది. తరువాతి సంఘటన 'ఆర్య' మాసపత్రిక ప్రచురణ. పాల్ రిచర్డ్ దంపతుల ప్రోత్సాహంతో 1914 లో అరవిందుని జన్మదినమైన ఆగస్టు 15 న 'ఆర్య' ప్రథమ సంచిక వెలువడింది. అయితే ఇది 7 సంవత్సరాలు మాత్రమే నడిచింది. 1921 జనవరిలో దాని ఆఖరిసంచిక వెలువడింది. బహుశా ఈ అధునాతన పత్రికా ప్రపంచ చరిత్రలో, అంత స్వల్పకాలంలో అంతటి ఉదాత్త సందేశాలను ప్రపంచాని కందజేసిన పత్రికలు వేరేలేవేమో! తరువాత తిరిగి ఒక విధమైన ఏకాంతవాసం సాగింది. కేవలం మాత (శ్రీమతి రిచర్డ్) ద్వారానే బాహ్య ప్రపంచంతో

ప్రవర్తించటం జరిగింది. ఈ కాలంలోని మహత్తర సంఘటన నవంబరు 24, 1926 నాటి విషయము. అతీతమనస్సు ఆనందము అవతరణకు అనువుగా ఉపరిమనోద్దైవతమగు కృష్ణుడు భూతధాతువు లోనికి అవతరించిన దినమది. అది మొదలు ఆ రోజు అరవిందుల సిద్ధికి జ్ఞాపకముగా పరిగణింప బడుచున్నది ఆనాటి సాయంకాలం 6 గంటలకు జరిగిన ఈ కార్యక్రమంలో, ముఖ్యాతిముఖ్యులైన శిష్యులు—24 మంది ఉండటం జరిగింది. 1927 లో 'దర్శన' పద్ధతి ప్రవేశ పెట్టబడింది. సంవత్సరంలో 4 రోజులు మాత్రమే సర్వులూ దర్శనం పొందటానికి వీలుచేయబడింది.

ఈ ఏకాంతత తిరిగి 1930 లో సడలింపబడి, విపరీతంగా బాహ్యప్రపంచంతో సంబంధం పెంపొందించారు. అయితే అది కేవలం లేఖలద్వారా మాత్రమే. 1930 నుంచి 1938 దాకా ఈ పద్ధతిలో పనిచేయటం జరిగింది. ఈ దినాలలో పని ఎంత ఒత్తిడిగా ఉండేదంటే, ఒక్కొక్కసారి ఉత్తరాలకు సమాధానాలు తెల్లవారుఝామున 5 గంటలదాకా వ్రాస్తూ ఉండేవారు. 1938 తరువాత తిరిగి ఏకాంతవాసాన్ని వాంఛించారు. కేవలం మాత ద్వారానే సర్వవ్యవహారాలు జరగటంకాకుండా, సర్వకార్య భారమూ ఆమే వహించటం జరిగింది. వారి జన్మ దినమైన ఆగష్టు 15 న 1947 లో భారత స్వాతంత్ర్యవార్తను విన్నారు. ఆ రోజు వారి దర్శనార్థుల సంఖ్య 2000 లకు పెరిగింది. చిట్టచివరి దర్శనము 24 నవంబరు, 1950 న జరిగితే, డిసెంబరు 5 న అరవిందులు మహాసమాధి పొందటం జరిగింది.

అరవిందుల ప్రముఖ రచనలన్నీ దాదాపుగా 'ఆర్య'లో ధారావాహినిగా వెలువడ్డాయి. వారి ముఖ్య గ్రంథము 'The Life Divine' 'ఆర్య' ద్వారానే ప్రపంచానికి అందజేయబడింది. అలాగే వారి బృహత్తర పద్యకావ్యము 'సావిత్రి' కూడా పాండిచేరిలోనే తుది మెరుగులు దిద్దుకుంది.

క్లుప్తంగా మనమిప్పుడు అరవిందుల దృక్పథాన్ని అర్థం చేసుకునేందుకు ప్రయత్నిద్దాం. అది ఈ దేశంలోని ప్రాచీనసాహిత్యం, వేదాలు, ఉపనిషత్‌లు గీత ఆధారంగా నిర్మించబడ్డదే. ఆధార మవే అయినా నవ్యత ఉంది. ఆయన దృక్పథానికి మూడు ఆధారాలున్నాయి. మొదటిది : పరిణామక్రమం క్రిందనుంచి ఎలా పైకిపోతున్నదో, అలాగే పైనుంచి క్రిందికి దిగటంకూడా ఉంది. ఇవి రెండూ ప్రక్కప్రక్కనే జరుగుతూఉన్నాయి. రెండవది : ఈ ప్రయాణాల్లో ఏదశకాదశలో, ఒక ఐక్య ఒక పూర్ణత కనపడుతుంది. మూడవది : అతీతమనస్సు (Supermind) భావన. ఈ మూటి ఆధారంగానే దాదాపుగా వారి 'The Life Divine' రచన సాగింది.

వీటినింకా అర్థం చేసుకునేందుకు ప్రయత్నిద్దాం.

ఈనాడు మనమంతా పరిణామవాదాన్ని నమ్ముతూ, దానినిగురించి మాట్లాడుతున్నాము. ఈ మాటల్లో, పదార్థము (matter) లోనుంచి జీవం (life) ఎలా కనబడిందీ, అలాగే మనస్సు (mind) ఎలా పదార్థంనుంచి బయటపడిందీ చెప్పుకుంటున్నాం. అయితే 'పరిణామం' (Evolution) అనే మాట కేవలం ఒక ఫలితాన్ని సూచించేమాటగానే మిగిలిపోయింది. దాని అసలు అర్థాన్ని అది సూచించటం లేదు. నిజానికి పదార్థంలోనుంచి ప్రాణం, ప్రాణంలోనుంచి మనస్సు ఎందుకుపుట్టాలి ? మన ప్రాచీన వేదాంతధోరణిని నమ్మకపోతే, దీనికి పరిష్కారం దొరకదు.

ఆ ధోరణి ఏమిటి ? అసలు పదార్థమనేదే ఒక విధమైన ముసుగు కప్పుకున్న ప్రాణం. కాబట్టే పదార్థంలో ప్రాణం, ప్రాణంలో మనస్సు ఇదివరకే గర్భితమై వున్నవి. కాబట్టే మానవుని మనస్సు, భగవంతునివైపు, సచ్చిదానందంవైపు, అమృతత్వం వైపు వేసే గంతులన్నీ అర్థవంతాలే. ఎందువల్లంటే ప్రకృతి–పరిణామక్రమంలో మనస్సుని దాటి ముందుకు పోవాలనిచేసే ప్రయత్నాలే అవి. పదార్థాన్ని దాటి ప్రాణంవైపు, ప్రాణాన్నిదాటి మనస్సువైపు నడిస్తే మనకులేని అభ్యంతరం, మనస్సును అతిక్రమించ దలుచుకుంటే ఎందుకుండాలి ?

ప్రకృతి, జంతువును ఒక ప్రయోగశాలగా వాడుకుని మానవుని తయారుచేసింది అని చెప్పబడుతూంది. అదే ప్రకృతి, ఈ మానవుని సహకారంతో,

అతనినే ప్రయోగశాలగామార్చి, ఒక అతీత మానవుణ్ణి, భగవంతుణ్ణి తయారుచేయటానికి ఎందుకు వాడుకోగూడదు. అసలు పరిణామమంటే ఏమిటి ? ప్రకృతియొక్క క్రమానుగతవికాసమేకదా ! ఒకానొక దశలో మనకు కొన్ని కొన్ని విశేషాలు తెలుస్తూ వచ్చాయి. కాని దానివల్ల మనకు తెలియనిదల్లా లేనిదికాదే ! సృష్ట్యాదినుంచీ ప్రకృతిలో విద్యుత్ శక్తి, పరమాణుశక్తులున్నాయి. కాని వాటిని మనమీమధ్యనే తెలుసుకోవటం జరిగింది. అందువల్ల, అంతకుముందు ఇవి ప్రకృతిలో లేవనటం భావ్యం కాదుకదా. అలాగే పరిణామక్రమంలో, ఈ క్రమానుగత వికాసదశలో, ఒకదశలో, మానవుని దశలో — ఇక చాలు, ఈ పరిణామం ఇంతకుమించి పోగూడదు అని ప్రకృతిని శాసించటానికి మనకేం హక్కుంది ?

నిజంగా పదార్థంలో ప్రాణం వగైరాలు ఇమిడి ఉంటే, కనపడే ప్రకృతి కనపడని భగవంతుడేలయితే, పరిణామక్రమంలో కేవలం ఒక దశలయిన మానవుడు—తనలోపలా బయటా కల భగవంతునిగురించి తెలుసుకోవటానికి చేసే ప్రయత్నమే మానవుని గొప్ప ఆదర్శమంటారు అరవిందులు. తమ 'The life Divine' గ్రంథ ప్రారంభప్రకరణంలో 'If it be true that spirit is involved in Matter and apparent nature is secret God, then the manifestation of the Divine in himself and the realisation of God within and without are the highest and most legitimate aim possible to man upon earth - (The Human aspiration-Chapter 1.) అని వ్రాశారు.

ఇప్పుడు మన పరిణామం సచ్చిదానందంనుంచి మొదలుపెట్టి—పదార్థము, ప్రాణము, మనస్సుదాకా వచ్చి ఆగింది. ఒక్క దూకుదూకి ఈ మనస్సు — అతీతమనస్సు (supermind) ను, అక్కడినుండి సచ్చిదానందమును అందుకుంటే పరిణామక్రమం పూర్తవుతుంది. అయితే ఇది కేవలం సాధకుడైన మానవుని ప్రయత్నంతోనే సాధ్యంకాదు. పైనుంచి ఆ సచ్చిదానందం క్రిందికి దిగుతూ రావాలికూడా: ఈ క్రిందినుంచి పైకి—పైనుంచి క్రిందికీ అనేవి నిజానికి ఒకేఒక చైతన్యముయొక్క రెండుకొనల క్రింద లెక్క: ఈ రెండుకొనల కలయికే పరిణామ చక్రముయొక్క సఫలత్రింద లెక్క. దీనినే అరవిందులు Ascent - Descent అనీ Evolution - Involution-అని వర్ణించారు. ఇది జరుగుతుందా— ఎప్పుడైనా సాధ్యమా — తప్పదంటారు అరవిందులు.

కొంచెం క్లిష్టమైనా, ఒకసారి అరవిందుని మాటలలోనే దీనిని తెలుసుకుందాం. 'The Divine descends from pure existance through the play of Consciousness – Force and Bliss and the creative medium of Supermind into Cosmic being; we ascend from Matter through a developing life, soul and mind and the illuminating medium of supermind towards the Devine being. The knot of the two, the higher and the lower hemisphere (పరార్ధ మరియు అపరార్ధ) is where mind and supermind meet with a veil between them. The rending of the veil is the condition of the divine life in humanity; for by that rending, by the illumining descent of the higher into the nature of the lower being and the forceful ascent of the lower being into the nature of the higher, mind can recover its divine lighet in the all—compre hending—supermind, the soul realise its divine self in the all possessing all bliss-ful Ananda, life repossess its divine power in the play of omnipotent conscious—Force and Matter open to its devine liberty as a form of the Divine Existance.' (The Life Divine—The sevenfold chord of Being - Chapter 27.)

ఈ విధంగా ascent—క్రమం ఇలా ఉంటుంది.

Matter
Life
Psyche
Mind
Supermind
Bliss
Conciousness—Force
Existance.

ఇదే తిరుగు విధంగా descent అవుతుంది.

ఇంకొక విషయాన్నికూడా మనం గమనించాలి. మనస్సు (mind) గెంతువేసి అతీత

మనస్సు (supermind) కు చేరేముందు 4 మజిలీలు చేయాలంటారు అరవిందులు. వాటినే ఆయన ఉన్నతతర మనస్సు (Higher mind), ప్రకాశాన్విత (Illumined Mind), స్వతఃస్ఫురణ మనస్సు (Intuitive Mind) మరియు ఉపరిమనస్సు (OverMind) అని వర్ణించారు.

పదార్థాన్నికూడా అరవిందులు నిరాకరించలేదు. తైత్తిరీయ ఉపనిషత్‌లో వర్ణించినట్లు పదార్థమూ బ్రహ్మమే అంటారు.

స్వర్గీయ గోపీచంద్ ప్రతిభావంతుడైన రచయిత. తాత్వికవిషయాలను సులభగ్రాహ్యంగా చెప్పటంలో ఆయన కాయనేసాటి. రచయితగా వికసించిన కొద్దీ, చిట్టచివరి రోజులలో భౌతికవాదం నుంచిఆధ్యాత్మికవాదంవైపు పయనించాడు. 1955లో 'పోస్టు చెయ్యని ఉత్తరాలు' (ఆధ్యాత్మికవాద—భౌతికవాద సమన్వయము) ప్రకటించాడు. దానిలో అరవిందుని విచారధారను తేటతెల్లంగా వివరించాడు. నాపై వివరణ సాంకేత ప్రాయమైంది మాత్రమే. గోపీచంద్ భాషలో అరవిందుని తెలుసుకొని, తత్వ వివరణ ఆపివేద్దాం.

'శ్రీ అరవిందుల సిద్ధాంతంలోముఖ్య సూత్రాలు రెండు. ఒకటి శ్రీ అరవిందుడు మానవుడు చెందుతున్నాడనీ, ఈ అభివృద్ధి మానవుడు వ్యక్తిగతంగా, సాంఘికంగా పరిపూర్ణత పొందేవరకూ జరగాలనీ చెపుతారు. ఆయన పరిణామవాదాన్ని నమ్ముతారు. చలనంలేని పదార్థంనుంచి ప్రాణం వచ్చిందనీ, ప్రాణంనుంచి తన్నుతాను తెలుసుకునేజ్ఞానం వచ్చిందనీ, ఈ జ్ఞానం మానవునిలో పరిపూర్ణత పొందటానికి ప్రయత్నిస్తూ ఉందనీ చెపుతారు. పరిణామం ఇంతటితో ఆగదనీ పరిణామంలోకి ఇంకో దశ రాబోతుందనీ, అదే అతీత మానసిక శక్తిఅనీ చెపుతారు. ఏదీ శూన్యంనుంచిరాదు. కనక ఈ పరిణామంలో ఒక అంతస్తుకారణంగా, ఒక అంతస్తు వస్తూఉంది అంటారు. ఇంతకుముందు పరిణామం తెలియకుండా జరిగిందనీ, ఇక మానవునికి తన్నుతాను తెలుసుకునే జ్ఞానం ముందుకు చూడగలిగిన శక్తి వచ్చినదిగనుక, మనకు తెలిసిన పరిణామం పొందగలమనీ, ఇందువల్ల ఆనందం, కాలం కలిసిరావటం జరుగుతుందనీ చెపుతున్నారు. దీనికి ఒకమార్గం సూచించారు. ఇంతవరకూ పరిణామం యాదృచ్ఛికంగా జరిగింది. అందువల్ల ప్రకృతికి సహజమైన రీతిని నెమ్మదిగా కదిలింది. పశుదశలోనుంచి మానవుడు వచ్చాడు. పశువుకి ఈ సంగతి తెలియదు. ఇలా జరుగుతుందిఅని తెలియదు. యాదృచ్ఛికంగా జరిగింది. అదేవిధంగా పశువు తనకు తెలియకుండా మొక్కలనుంచీ, మొక్కలు చలనంలేని పదార్థంనుంచీ వచ్చాయి. మానవదశలో ఈ పరిస్థితి మారింది. మానవునికి తన్నుతాను తెలుసుకునేజ్ఞానం ఉండటంవల్ల స్వయంకృషివల్లే ఇకనుంచి అభివృద్ధి జరుగుతుంది. తన్నుతాను మార్చుకోవటంవల్ల జరుగుతుంది. దీనికొక పద్ధతి, ఒక టెక్నిక్, ఒక విధానం ఉంది' అన్నారు అరవిందుల శిష్యులైన నళినీకాంత గుప్త.

రెండు : ఇక శ్రీ అరవిందుల సిద్ధాంతంలోని రెండవ సూత్రాన్నిగురించి ఆలోచిద్దాం. ఈసూత్రం, పరిణామంలో నూతనదశ వచ్చినపుడల్లా దిగువ దశలను ఆ దశకు అనుకూలంగా మార్చుకోవాలని శ్రీ అరవిందులు చెపుతారు. నూతనంగా వచ్చినదశ, దిగువ దశలను తన నియమాలకు అనుగుణంగా మార్చుకుంటుంటుంది. ప్రాణం పదార్థంలోకి వచ్చిన తరువాత, ప్రాణంకలిగినపదార్థం, ప్రాణంలేని పదార్థానికి వలెకాక కొత్తరకంగా ప్రవర్తించటం మొదలు పెట్టింది. ప్రాణంఉన్న పదార్థం, ప్రాణంలేని పదార్థానికివలె మెకానికల్ సూత్రాలను తూచా తప్పకుండా అనుసరించలేదు. ఇదేవిధంగా మనస్సుతో కూడిన ప్రాణం, మనస్సులేని ప్రాణం మాదిరిగాకాక వేరుగా ప్రవర్తించటం మొదలుపెట్టింది. మానవుని తెలివితేటలు, హేతువాదశక్తి, శారీరక నియమాలను, రూపాలనూ, ప్రాణానికి సంబంధించిన ఇన్స్టింక్ట్సునీ, రియాక్షన్సునీ మార్చింది. ఇప్పుడు ఈ అతీతమానసికశక్తివల్ల వచ్చిన దృక్పథంతో మనస్సునీ, ప్రాణాన్నీ, శరీరాన్నీ మార్చుకోవలసి ఉంటుంది. అప్పుడు మానవుడు విరుద్ధశక్తుల కలయికకాక ఒకేప్రవాహాన్ని ప్రతిబింబించే వాడుగా ఉంటాడు. అందువల్ల అతనే పరిణామం అవుతాడు.

ఈ స్థితిలో మానవుడు జ్ఞానాన్ని తాదాత్మ్యం వల్ల పొందుతాడు. జ్ఞానివేరు–జ్ఞానంవేరుకాదు. మనం ఏవిధంగా జ్ఞానాన్ని పొందుతున్నామో ఆలోచించి చూడు. మనం ఒక ఊహని ఊహిస్తాం. దాన్ని ఆచరణలో పెట్టటానికి ప్రయత్నిస్తాం. ఆ స్థితికి వెళ్లటానికి ప్రయత్నిస్తాం. ఇవి ఎందుకు జరుగుతున్నాయి. ఆ ఊహను ప్రతిఘటించేదశలు మనలో ఉన్నాయిగనుక. అలాకాక అతీతమానసికప్రవృత్తిని పొంది దానికి అనుకూలంగా క్రిందిదశలను మలిపినప్పుడు, పరిణామానికి అనుకూలమైనదే ఊహించటం, ఊహించినంత మాత్రానే ఆ స్థితికి మనం వెళ్లటం జరుగుతుంది. అంటే ఊహకూ, ఉనికికి భేదముండదు. ఇప్పుడు మనం ఒకటికావాలని కోరుకుంటున్నాం. దానికోసం ప్రయత్నిస్తున్నాం. కష్టాలు పడుతున్నాం. చివరికి కృతకృత్యుల మవుతున్నాం; ఇందుకు కారణం మన కోర్కెలో తప్పు ఉండవచ్చు. అప్పుడు అలాఉండదు. కోరదగిందే కోరతాం. కోరినంతనే సాధిస్తాం. 'సంకల్ప మాత్రానే పనులౌతై' అంటారే మన పూర్వులు, అదీ ఆదశ. మనకుబాధలు ఎందుకు కలుగుతున్నాయి ? అజ్ఞానంవల్ల కలుగుతున్నాయి. పరిణామాన్ని తెలుసుకోక, దానికి భిన్నమైన ప్రవృత్తుల్ని వృద్ధిచేసుకోవటంవల్లా, మన ప్రవృత్తుల్ని పరిశుద్ధం చేసుకొని పరిణామానికి అనుకూలం చేసుకోలేకపోవటంవల్లా కలుగుతున్నాయి. అటువంటప్పుడు వీటిని సరిచేసుకున్న దశలో నిత్యానందం ఉంటుందని ఎవ్వరైనా చెపితే నేను ఆశ్చర్యపడను. ఇవీ అరవిందుల సిద్ధాంతంలోని మూల సూత్రాలు.

పైకిపోవటం Ascent వ్యక్తిగతంగా ఎంతో మందికి సాధ్యమయింది. అరవిందులూ దానినెప్పుడో సాధించారు. కాని అతీతమనస్సును ఈ భూపదార్థం మీదికి తీసుకురావలె అనే కోరికతోనే వారు చివరి రోజులలో తమ తపస్సును తీవ్రతరం చేశారు. ఈ గంగావతరణమే వారి యోగసాధన లక్ష్యమయింది. 1926 నవంబరు 24 నాటి సిద్ధి అదేనని చెప్పవచ్చు.

ఈ విషయాన్ని అరవిందులే స్పష్టంగా చెప్పారు. అతీతమానసికావతరణము వ్యక్తిగత వాంఛాసిద్ధికోసంకాదని, కృష్ణపరమాత్మ సాధించని దానికోసం ఈ మూర్ఖుడు ప్రయత్నిస్తున్నాడని ఎవరైనా గేలి చేసినాసరే అది తన కనుపురమంటారు:

'It is not for personal greatness that I am seeking to bring down the Supermind. I care nothing for greatness or littleness in the human sense........I believe the descent of this Truth opening the way to a development of divine consciousness here to be the final sense of the earth evoulntion. If greater men than myself have not had this vision and this ideal before them, that is no reason why I should not follow my Truth-sense and Truth–vision. If human reason regards me as a fool for trying to do what Krishna did not try, I do not in the least care. There is no question of X or Y or anybody else in that. It is a question between the Divine and myself-whether it is the Divine will or not; whether I am sent to bring that down or open the way for its descent or at least make it possible or not....I have no intention of achieving the Supermind for myself only-I am not doing anything for myself, as I have no personal need of anything, neither of salvation (Moksha) nor supramentalisation......'

భగవాన్ కృష్ణుడు తలపెట్టని దానిని సాధించబూనుకున్నా ఫరవాలేదు అని చెప్పగల అరవిందుల ఆత్మస్థైర్యం ఎలాంటిదో ఊహించవచ్చు. కాబట్టే భారతీయ ఆధ్యాత్మికతలో అరవిందు లొకమైలు రాయి.

ఇక ఇంతటితో తత్త్వ వివరణ ప్రయత్నాన్ని ఆపి వేస్తున్నాను.

## శ్రీమతి మృణాలినీదేవి

ఆ ఇల్లాలిగాథ మన దృష్టిలో అతికరుణ మయం. 14 సంవత్సరాల చిరుత్రప్రాయంలో, అత్యున్నత అధికార దశలోఉన్న అరవిందుని వివాహమాడింది. ఆమె 19 వ ఏట భర్త సౌఖ్యమయమూ, అధికారయుతమూ, ఐశ్వర్య యుక్తమూ అని తలచబడే ఉద్యోగాన్ని జీవితాన్ని వదిలి కలకత్తా చేరాడు. నిత్యరాజకీయసమరయజ్ఞ కుండంలో సమిధగా తన్ను ఆయన అర్పించుకుంటే, ఈమె గృహిణిగా ఉంది. దానికికూడా ఆమెను నోచు కోనీయకుండా, ఆమె 23 వ ఏట—ఆమెను వదిలి చంద్రనాగోర్‌కు వెళ్ళిపోయాడు. ఆయన అను మతితో, ఆయన దర్శనార్థమై పాండిచేరి బయలు దేరిన మృణాలినీదేవి—1918 డిశంబరులో ఇన్‌ఫ్లు యంజా జ్వరంతో—తన 30 వ ఏట శాశ్వతంగా కన్ను మూసింది. చివరి ఏడెనిమిది సంవత్సరాలు ఆయన దర్శనభాగ్యానికే నోచుకోలేదు.

బహుశా ప్రపంచంలో ఒక్క భారత స్త్రీయే అలాంటి జీవితాన్ని భరించగలదేమో! ఆమెను స్మరింపని, ఆమెకు ప్రణామాంజలి సమర్పించని అరవిందుల జీవితచిత్రణ— ఎంత క్లుప్తమైనా సరే— నా దృష్టిలో అసంపూర్ణమే.

అరవిందులవారి జీవితము డిసెంబరు 5, 1950 తో ముగిసింది. ఈ సంవత్సరము వారి జన్మ దిన శతజయంతి సంవత్సరము. ఏం? ఎందుకు వారి ?

నావరకు నాకు ఆయన భారతదేశానికి తిరిగివచ్చిన నాటి పరిస్థితులకు, నేటి పరిస్థితులకు పెద్దగా తేడా కనపడటంలేదు. ఆ నాటిప్రశ్న—మనకు 'స్వ'రాజ్యం కావాలా, 'సు'రాజ్యం చాలా అన్నదే. దాని కానాటి నాయకులు 'స్వ'రాజ్యం కావాలి అని నిష్కర్షగా సమాధానం చెప్పటానికి తటపటాయించ సాగారు. కేవలం ఇరువురే ఇరువురు, లోకమాన్యతిలక్, అరవిందులు ఆ సమాధానా న్నీయగలిగారు.

ఆనాడే అరవిందుడు లేకపోతే మన స్వాతంత్ర్యో ద్యమం—కనీసం ఒక దశాబ్దం వెనుకబడి ఉండేదేమో ననిపిస్తుంది. ఆయనలేని బెంగాల్ విభజన- బెంగాల్‌ను దేశాన్ని ఎంతమాత్రం కదిలించి ఉండేదికాదు. కేవలం 4 సంవత్సరాల కాలంలో దేశాన్ని యావత్తూ ప్రభా వితం చేయగలిగిన దాయన బోధనా ప్రభావం.

ఆనాటినుండి ఆయన మరణానంతరం వరకు అరవిందుల కృషి, సాధన అంతా ఆ 'స్వ' ను కను గొనటంలో, వివరించటంలో, సాధించటంలోనే గడి చింది. అయితే అది సంకుచితమైనదికాదు. పాండిచేరి నాటి అరవిందులు—Lover of Humanity గా ఆవిర్భవించారు. సమస్యల ప్రతిపాదన, వివరణ అంతా ప్రపంచ దృష్టితో సాగించబడింది.

రాజకీయాలనుండి అరవిందుని నిష్క్రమణం అనేకమందిని నిర్ఘాంతపరిచింది. కాని ఒకటి తథ్యం. స్వాతంత్ర్యంరాకపూర్వం ఆయన ధోరణి మనకెలా అనిపించినా, స్వాతంత్ర్య సంపాదనానంతరం ఆయన రచనలు మనకు నూత్నమైన వెలుగును ప్రసా దిస్తున్నాయి.

ఈ దేశానికిగల గతం ఏమిటి? దాని చరిత్ర ఏమిటి? ప్రపంచ చరిత్రలో దానికిగల స్థానమేమిటి? ఈ దేశంలో సమాజం ఎలా పరిణామం చెందింది? దాని భవిష్యత్ చలనము ఎలా ఉండాలి? స్వతంత్రం ఎందుకు?

మీరు కేవలం రాజకీయవేత్తలమనుకుంటే, రాజకీయాలెలా ఉండాలి? రాజకీయాలకూ సమా జానికిగల సంబంధమేమిటి?

మీరు భగవద్భక్తులమూ, ఆధ్యాత్మికవేత్త లమే అంటారా—సమాజంనుంచి దూరంగా ఉండటం కాదు కావలసింది. వ్యక్తిగతసాఫల్యమే కాదు కోర వలసింది. సమాజాన్ని మొత్తం, మానవాళిని యావ త్తూనే దానికి ఉన్ముఖం చేయండి.

క్లుప్తంగా చెప్పాలంటే అరవిందుని పాండిచేరి జీవితం, రచనలు, 'ఆర్య' లేకుంటే 1947 తరు

ఖాత దాదాపుగా భారతదేశానికి మార్గదర్శకులు లేరు. గతించిన దానికంటె భవిష్యత్‌లో సాధించవలసింది చాలాఉంది అని నొక్కి చెప్పిన వాడాయనే.

అయితే అంధానుకరణ కాదుసుమా! కావలసింది. భారతదేశం సజీవంగా ఉండాలంటే కావలసింది, దాని యువతరం ఆలోచనాధీనులు కావటం. అన్నివిషయాల గురించి, కూలంకషంగా, స్వతంత్రంగా ఆలోచించ గలగటం. ఏవో కొన్ని దురభిప్రాయాలతో, పై పై మెరుగులతో మోసపోవటంకాదు. ఆయన మాటలనే యధాతధంగా ఉంచి ఈ చిత్రణను ముగిద్దాం: 'Our first necessity, of India is to survive and do her appointed work in the world, is that the youth of India should learn to think,-to think on all subjects, to think independently, fruitfully, going to the heart of things, not stopped by their surface, free of prejudgements, shearing sophism and prejudice asunder as with a sharp sword, smiting down obscurantism of all kinds as with the mace of Bhima. Let our brains no longer, like European infants, be swathed with swaddling clothes; let them recover the free and unbound motion of the Gods; let it have not only the minuteness but the wide mastery and sovereignity natural to the intellect of Bharat and easily recoverable by it if it once accustoms itself to feel its own power and be convinced of its own worth.'

క్లుప్తంగా అరవిందుని చిత్రణ ఇది.

ప్రాతఃస్మరణీయుడా యోగిపుంగవుడు.



# మహిమభట్టారకుని సాహిత్య విమర్శలు

## శ్రీ అవ్వారి వాసుదేవ శాస్త్రి

గీర్వాణ భాషలో అలంకారశాస్త్రములో రాజానక వంశము చాల ప్రసిద్ధమైనది. ఆ వంశములోఁ బుట్టినవారు చాలమంది అలంకార గ్రంథములువ్రాసి ఆ వంశమునకు వన్నె తెచ్చిరి. ఇందులో రాజానక కుంతకుఁడు మొదటివాఁడు. అతఁడు వక్రోక్తి జీవిత మను పుస్తకమువ్రాసి 'వక్రోక్తియే కావ్యమునకు జీవిత'మని నిర్ణయించెను.

తరువాత రాజానకానందవర్ధనుఁడు బయలు దేరి 'ధ్వన్యాలోకము' వ్రాసి 'అదికాదు. ధ్వనియే కావ్యమునకు ఆత్మ'అని నిశ్చయించెను. తరువాత రాజానక మహిమభట్టుఁడు బయలుదేరి కము'వ్రాసి ధ్వని అనునది అనుమానముచేత గతార్థము అగుననియు, అన్ని ధ్వనులును అనుమానములో అంత ర్భావమును చెందుననియు తేల్చెను.

తరువాత రాజానక రుయ్యకుఁడు వ్యాఖ్యాతగా వెలసి వ్యక్తివివేకమునకు వ్యాఖ్యాన మనుచుఁ బ్రారం భించి వ్రాయుచు, దానిలో అనుమితివాదమును ఖండించి మఱల ధ్వనివాదమునే నిలువఁబెట్టెను.

ఈ వ్యక్తివివేకములో మహిమభట్టుఁడు ఆనందవర్ధనుని ధ్వనివాదమునేకాక రాజానక కుంత కుని కావ్యలక్షణోదాహరణములనుగూడ ఖండించెను. అదిగాక అనేక కావ్య నాటకాదులను క్రొత్త విమర్శనా సరణితో విమర్శించి, ఆ దోషములు లేకుండునట్లు తాను మఱల ఆ గద్య పద్యములను రచించి చూపెను. ఇంత నిష్పక్షపాతముగను లోతుగాను విమర్శించువారు చాల తక్కువ.

వీరందఱును ఒకే వంశములోని వారైన ఒకరిని ఒకరు సహింపలేకయో మఱియేమో యిట్లు గ్రంథములు వ్రాసికొన్నారు. శిష్యబుద్ధి విస్తృతికై వ్రాసిరన్నను దప్పుకాదు. ఇట్లు వ్రాసికొనుటకు ఈర్ష్యయే కారణమైనచో ఆ యీర్ష్యకు సారస్వత మూలముగా ప్రతిక్రియఁ చేసికొనుటవలన, ఇతరులకు నేవగింపు కలిగింపకుండ, పైగా సారస్వత పథికులకు చాల సంతోషమును ఉపకారమునుగూడ కలిగించిన వారైనారు.

ఇతఁడు (మహిమభట్టారకుడు) 9వ శతాబ్ది ములోనున్న ఆనందవర్ధనాచార్యుల మతమును, 10 వ శతాబ్ది పూర్వభాగములోనున్న అభినవగుప్త పాదా చార్యుల లోచనవ్యాఖ్యానమును ఖండించెను గనుకను, 12 వ శతాబ్దిలో రుయ్యకుఁడు ఈతని పుస్తక మునకు వ్యాఖ్యానమువ్రాసి, ఇతని మతమును కొంత ఖండించి యుండెను గనుకను, ఆ మధ్య కాలములో, అనగాఁ 10 వ శతాబ్ది ఉత్తర భాగములోనో. 11 వ శతాబ్ది (A. D.) లోనో ఉన్నాఁడని తోచు చున్నది.

ఈయన భీముఁడనువాని పౌత్రుఁడనియు, శ్రీధైర్యుఁడను వాని కుమారుఁడనియు, ఇతని గ్రంథాంత శ్లోకములవలననే తెలియుచున్నది.

'ఆధాతుం వ్యుత్పత్తిం
నప్తౄణాం క్షేమయోగభాజానాం।
సత్సుప్రథితనయానాం
భీమస్యాతిగుణస్య తనయానాం।
శ్రీధైర్యసాంగ భువా
మహాకవేశ్శ్యామలస్య శిష్యేణ।
వ్యక్తివివేకో విదధే
రాజానక మహిమకే నాయమ్॥

శ్యామల మహాకవి శిష్యుఁడనికూడ ఈ పద్య ములవలననే తేలుచున్నది. ఇతని గ్రంథములోని యీ క్రిందిభాగము తెనుఁగులోని వ్యావహారికభాషావాదముతో

కొంత పోలునేమో సహృదయులు చూడఁగోరుచున్నాను. 10, 11 శతాబ్ది ప్రాంతములో గీర్వాణ వాఙ్మ్రపంచములోఁగూడ నిటువంటివాద మొకటి లేవఁ దీసిన వ్యక్తి యొకఁడున్నాఁడనియే దీనివలనఁ దేలుచున్నది.

ఇటువంటివే క్రొత్తక్రొత్త యభిప్రాయములు ఈ పుస్తకములో చాల ఉన్నవి. ఇతఁడు చాల చోట్ల ప్రాచీనులకంటె మిక్కిలి విలక్షణమైన క్రొత్తత్రోవలను ద్రొక్కెను. ఈతని పాండిత్యము చూతమా? సాధారణమైనదిగాదు. చాల ఉద్దండమైన పాండిత్యము. తర్కశాస్త్రము సంపూర్ణముగా లోతుపాతులతో అభ్యసించినట్లు తోచుచున్నది. తక్కిన వ్యాకరణాదిశాస్త్రములుగూడ బాగుగఁ జదివినట్లే యున్నది. ఇదిగాక భాషలో చాలగొప్ప, అపారమైనకృషి చేసెననికూడ తోచుచున్నది.

'సాధుశబ్ద'మని లోకమునఁ బ్రసిద్ధమైన శబ్దముండుగాక! అట్లయినను అసాధుశబ్దముకూడ సామగ్రీవశమునఁ బ్రయోగించినవాని కిష్టమగు నర్థమును జెప్పుచునేయున్నదని యనుమాన ప్రమాణముచే నసాధుశబ్దమునకును వాచకత్వము నిశ్చయింపఁబడినది. కావునఁ 'దగిన ప్రకరణాది సామగ్రియున్నచో శబ్దమర్థమును జెప్పఁజాలును. లేనిచోఁ జెప్పఁజాలదు' అని నిశ్చయింతము. అదియే పెద్దలచే

'అసాధు రనుమానేన
వాచక శ్చైశ్చిదిష్యతే ।
వాచకత్వా విశేషే௨పి
నియమ శ్శ పుణ్యపాపయోః॥'

(అసాధుశబ్దమైనను అర్థమును జెప్పునని కొంతమంది అనుమానప్రమాణముచే నొప్పికొనిరి. అర్థమును బోధించుటలో విశేషము లేకున్నను సాధ్వసాధు శబ్దములకుఁ బుణ్యపాపములఁ గలిగించుటలో విశేషము గలదు) అని చెప్పఁబడినది.

అంతమాత్రముతో, అనఁగాఁ బుణ్యపాపముల నియమించుటలో విశేషమున్నంతమాత్రమున 'అసాధు' శబ్దమున కపశబ్దత్వము కల్పించుట యుక్తముగాదు. ఏలయన:

శబ్దమనఁగానేమి? 'శబ్ద్యతే ప్రమృశ్యతే= అభిధీయతే) అనేన అర్థః ఇతిశబ్దః' అనికదా దాని వ్యుత్పత్తి! ఈ వ్యుత్పత్తివలన నేమి తేలుచున్నది? అర్థము చెప్పుటలో నిది (శబ్దము) సాధనమనికదా! ఆ శబ్దము సాధువని, అసాధువని, అపశబ్దమని మూఁడు తెఱఁగులు. ప్రకృతియనియు, ప్రత్యయమనియు విభాగము కల్పించెడి వ్యాకరణాది లక్షణముచే ననుసరింపఁబడినది సాధువు. అట్టి లక్షణముచే ననుసరింపఁబడక 'డిత్థ' మున్నగు శబ్దములవలె వ్యుత్పత్తి యేమియులేనిది అసాధువు. అర్థము చెప్పుటనుండి తొలఁగినది అపశబ్దము. అనఁగా 'అర్థము చెప్పుటకు సరియైన సామగ్రిలేక అర్థమును జెప్పనిది' అని అర్థము.

ఇట్లు విచారింపఁగా సరియైన సామగ్రిలేక పోవుటచే నొకప్పుడర్థము చెప్పనిచో సాధుశబ్దముగూడ నపశబ్దము గావచ్చునని తేలినది. అందువలన అర్థము చెప్పుట, చెప్పకపోవుటలనుబట్టి శబ్దమనియు నపశబ్దమనియు వ్యవహారము నేర్పఱచుటవలన ఇతిహాసములు, పురాణములు మున్నగు వానియందును, ఆగమశాస్త్రములోనగు వానియందును ఒకానొకచోట నసాధువులుగానున్న కొన్ని శబ్దములను అపశబ్దములని తలఁచువారిని నిరసించినట్లయినది. ఈ విషయమును సంగ్రహించి వ్రాసిన కారికలు:

'సామర్థ్యాదేవ శబ్దస్య విషయే௨వగతే సతి।
న ప్రయోగో௨స్యనస్యైష స్వనిష్పత్త్యై ప్రవర్తతే।
అత ఏవ ప్రకృత్యర్థమాత్రం తత్ర ప్రయుంజతే.
సంఖ్యాసాధనకాలాదే రానుగుణ్యా న పేక్షిణః।
ఇయతా చాపశబ్దత్వం న తేషా మపకల్పతే.
అర్థేషు శబ్దనాకర్మ కరణత్వా నపాయతః॥'

నా మతమున మాత్రము తగనిచోటఁ బ్రయోగింపఁబడిన శబ్దమే అపశబ్దము. ఎట్లనఁ—

'మధుకరై రపవాద కరై రివ
స్మృతి భువ శ్శ పథికా హరిణవ్రజాః।
కలతయా వచస శ్శ పరివాదినీ
స్వరజితా రజితా వశ మాయయుః'

(లేళ్లకు నమ్మకము గలిగించుటకై ప్రయోగించు కిరాతుల వాద్యముచేత ః హరిణములు తమ్ముపట్టు

కొనుటకేర్పఱచిన గుంటలకు స్వాధీనమైనట్లు, భార్యావియోగముగల బాటసారులు వీణాగానమును గూడమించు తుమ్మెదల యవ్యక్త మధురగానము చేత నాకర్షింపఁబడి మన్మథునికి స్వాధీనమైరి.)

—మాఘుని శిశుపాలవధ మహాకావ్యమునుండి.

ఇచ్చట లేళ్లు ఉపమానమగుటవలన అప్రధానములు. 'ప్రధానాప్రధానయో ః ప్రధానే కార్య సంప్రత్యయః' అని న్యాయమున్నదిగాన లేళ్లు ఇచ్చట ప్రధానమైననే 'రజితాః' అని ప్రయోగింపవలెను. ఏలయన—

'రంజే ర్ణౌ మృగ రమణే న లోపో వక్తవ్యః' అని కదా వార్తికము! ఈ వార్తికమేమి బోధించుచున్నది? 'లేళ్లను వేటాడుట' అను నర్థము వాక్యమువలనఁ దోఁచుచున్నప్పుడు 'రంజ్' అను ధాతువునకు 'ణిచ్' పరముగా నున్నప్పుడు న లోపము వచ్చును అనికదా! అట్లు న లోపము వచ్చినఁగదా 'రజితాః' అని రూపమగును. ఇచ్చట లేళ్లు ప్రధానముగాక బాటసారులు ప్రధానమైనందున 'రంజ్' ధాతువునకు న లోపము వచ్చుటకు వీలులేదు. కావున నిచట 'రంజితాః'అనియే ఉండవలయును. ఇచ్చట లేళ్లకున్న అప్రాధాన్యమును గణింపకయే మాఘుఁడు తగనిచోటఁ బ్రయోగించిన 'రజితాః' అనునది అపశబ్దము. ఏలయన—ఇచట పాంథులు ఉపమేయము (వర్ణింపఁబడువారు) గాన వారే ప్రధానులు. కావున నా ఉపమేయముయొక్క అర్థము ననుసరించియే శబ్దము ప్రయోగింపవలెను. కాన నిది అపశబ్దమే. ఈ మతమును సంగ్రహించి వ్రాసిన శ్లోకములు:—

'అసాధుశ్చాపశబ్దశ్చ ద్విధా శబ్ద ః ప్రకీర్తితః
తత్రా సాధుర్న సాధ్యోయ ః ప్రకృతి ప్రత్యయాదిభిః॥
శబ్దాదపేతో౽పశబ్దః శబ్దనాకరణాత్మనః।
శబ్దనా హి పరామర్శో వాచ్యార్థ విషయో౽స్యయః॥
ఏవం చాసాధుశబ్దో౽పి నాపశబ్దత్వ మర్హతి।
నసో౽ప్యభ్యేతి సాధుత్వం తయోర్విషయభేదతః॥

'అయ్యా! అట్లుపమేయములగు పాంథుల కనుకూలముగా న లోపము చేయక 'రంజితాః' అని ప్రయోగించినచో లేళ్లకు ఈ విశేషణ మన్వయించు టెట్లు? వాని కన్వయింపవలెనన్న రజితాః అని ప్రయోగింపవలెనుగదా!'అని ప్రశ్నింపవచ్చును. దానికి సమాధాన మేమనః—ప్రధానము ననుసరించి 'రంజితాః' అనియే ప్రయోగించి, అప్రధానమైన లేళ్ల కన్వయించునప్పుడు 'రజితాః'అని మార్చుకొని యర్థము చెప్పికొనునట్లు వ్యాఖ్యానించుకొనుట మంచిది. కాని అట్లు 'రజితాః'అని ప్రయోగించుట మంచిదిగాదు.

'స్మృతిభువో బతపాంథమృగవ్రజాః'—అనఁగా పాంథులే లేళు అని లక్షణతోఁ జెప్పికొన్నఁగాని, 'స్మృతిభువ ః పథికా హరిణవ్రజాః'—అనఁగా బాటసారులనెడి లేళ్లుఅని వ్యస్తరూపకముగాఁ జెప్పికొన్న గాని యీ ప్రయోగము సరిపోవును. ఎందువలన ననః— అప్పుడు లేళ్లకుఁ బ్రాధాన్యము వచ్చును.

అట్లు ప్రయోగింపఁబడక, తగనిచోటఁ బ్రయోగింపఁబడినదిగావున అస్వ, గోణ్యాదిశబ్దముల వలె నిదియు నపశబ్దమే.

ఈ విషయమునకు సంగ్రహ శ్లోకములు:—

శబ్దప్రయోగ ః కర్తవ్య ః ప్రధానార్థవ్యపేక్షయా।
తదన్యాపేక్షయా త్వర్థా దేనం విపరిణామయేత్॥
విపరీతమతోయత్స్యా దపశబ్దస్సమాంప్రతి'

అస్వః, గోణీ మున్నగు శబ్దములుగూడ నట్లే యని పెద్దలు నిశ్చయించినారు. చూడుడు:—

'అస్వ గోణ్యాదయ శ్శబ్దాః
సాధవో విషయాంతరే।
నిమిత్తభేదాత్ సర్వత్ర
సాధుత్వంచ వ్యవస్థితం॥'

అస్వః గోణీ మున్నగు శబ్దములు అసాధువులని లోకములో నొక ప్రథ గలదు. కాని ఆ శబ్దములు విషయాంతరమున సాధువులే యగును. ఎట్లన:—

'అస్వః' అనునది 'గుఱ్ఱము' అను నర్థమున సాధువుగాదుగాని 'నస్వః అస్వః' అను విగ్రహముచే 'తాను కానివాఁడు'అను నర్థమునను, 'నాస్తి స్వం (ధనం) యస్యసః'అను విగ్రహముచే 'ధనము లేని వాఁడు'అని యర్థము చెప్పినప్పుడును అది సాధువే కదా! అట్లే 'గోణీ'అనుశబ్దము 'ఆవు'అను నర్థమున, సాధువుకాదుగాని 'అనేకవస్తువులను ధరించుపాత్ర'

అను వర్థమున నదియు సాధువేకదా! కావున నా శబ్ద ములకుఁగల యితరార్థములలో నవియు సాధువులే. కావున, నిట్లు అన్నిశబ్దములును అర్థభేదముచే సాధువులే యగునని యీ పెద్దలు వ్రాసిన శ్లోకమున కర్థము

కావున శబ్దము అసాధువైనంత మాత్రమున దాని నపశబ్ద మనుటకు వలనుపడదు. ఇఁక నేమన— తగనిచోటఁ బ్రయోగింపఁబడిన శబ్దమే, సాధువైనను అసాధువైనను అపశబ్దమని చెప్పఁదగును.

ఇట్లు శబ్దాపశబ్దవివరణ సందర్భమున వ్యక్తివివేకకర్తయగు మహిమభట్టారకుని క్రొం గ్రొత్త యభిప్రాయములను పరామర్శించితిమి గదా! ఇఁక అనుమితివాదియగు నీ మహిమభట్ట మహాశయుఁడును, ధ్వనిమార్గస్థాపకుఁడగు ఆనంద వర్ధనుఁడును విభిన్నమగు మార్గములలో నడపిన కొన్ని సాహిత్య విమర్శ వినోదములను ప్రస్తావించు కొందము.

ఈ క్రింది పద్యమును ధ్వన్యాలోకకర్త ధ్వన్యుదాహరణముగా నిరూపించెను. ఎట్లన:—

'వాణిజక! హస్తి దంతా స్ కుతో ఽస్మాకం
వ్యాఘ్ర కృత్తయశ్చ।
యావల్లులితాలకముఖీ గృహే
పరిష్వక్కతే స్నుషా॥'

ధ్వన్యాలోకకారుఁడగు ఆనందవర్ధనాచార్యుఁడును తద్వ్యాఖ్యాతల్లును ఈ పద్యమునకు సంధ్బరము నిట్లు వివరించినారు.

ఏనుఁగు దంతములును పులి చర్మములును అమ్మకొను నొక వర్తకుఁడు బోయగూడెములోనికిఁ బోయి యొక ముదుసలి బోయనిఁజూచి 'మీ యింటిలో ఏనుఁగు దంతములును బులిచర్మములును గలవా?' యని ప్రశ్నింపఁగా నా వ్యాధుఁ డిట్లను చున్నాఁడు.

'వర్తకుఁడా! నా కోడలు, కదలింపఁబడిన ముంగురులు కలదై యింటిలో తిరుగుచుండునంత వఱకును మా కేనుఁగుదంతములుగాని పులి చర్మములుగాని ఎక్కడివి నాయనా!'

ఈ పద్యమున లులితాలకముఖీ యను పదము అర్థశక్తివలన బోయవనితకు సురతక్రీడయందుగల ఆసక్తిని సూచించుచు, అవిడ భర్త యెల్లప్పుడు జిక్కియున్నాఁడని తెలియఁజేయుచున్నది.

ఇచ్చట వ్యాఖ్యాత యిట్లు వ్రాయుచున్నాఁడు.

'అలకాలంకృత ముఖత్వేన మనోహర తయా యాః స్నుషాయాః విభ్రమావేక్షణ సురత విలాసాక్షిప్త చేతాః సంతత తదుపభోగక్షామో మృగయార్థం మత్సుతః క్షణమపి బహిర్నయాతీతి కుతో హస్తిదంతాదీనాం మద్గృహే సంభవః' ఇత్యయమర్థః స్వతస్సంభవినా తాదృశస్నుషా సత్త్వాది రూపార్థేన వ్యజ్యమానం లులితాలకముఖీత్యేతత్పదం ప్రకాశయతీతి ధ్వనే స్ పదప్రకాశతా.'

ముంగురులచే నలంకరింపఁబడిన మోముగల దగుటచే మిగుల మనోహారిణిగానున్న తన కోడలి విభ్రమములచేతను, రతివిలాసములచేతను నాకర్షింపఁబడిన మనస్సు గలవాఁడైన తన కుమారుఁడు ఎల్లప్పుడు నామె నుపభోగించుటచేఁ జిక్కిపోయి, వేటకై క్షణకాలమైనను బయటికి వెళ్లుటలేదు. కాన తన యింటిలో ఏనుఁగు దంతములు మున్నగునవి యెట్లు దొరకును? అనునర్థము 'అట్టి కోడలుండుట' అను స్వతస్సంభవియగు నర్థముచే తోఁచఁజేయఁబడుచున్నదై 'లులితాలకముఖీ' అను పదముచే బయల్పడుచున్నది గాన నీ ధ్వని పదప్రకాశ్యమైనది. కావున నిది స్వతస్సంభవి రూపార్థ శక్తిమూలార్థ ధ్వని.

ఇఁక,వ్యక్తివివేకకారుఁడీ ధ్వన్యాలోకమును ఖండించినవాఁడగుటచే 'ఇది ధ్వనికాదు. అనుమానముచే నిదియు గతార్థమగును. ఇచ్చట నిస్పృహత్వము, వ్యాఘ్రాదుల జంపునియం దాసక్తి లేకుండుట అను రెండింటిచే మఱుఁగుపఱచఁబడి హస్తిదంతాద్యభావమను అనుమేయార్థజ్ఞానము గలుగుచున్నదనియు, ఇచ్చట వర్తకునకు హస్తిదంతాద్యభావమును దెల్పుటకొఱకై వృద్ధ వ్యాధుఁడు వ్యాపకవిరుద్ధకార్యోపలబ్ధి నుపయోగించె ననియు, గాన నిదియు ననుమానమేగాని ధ్వనిగాదనియు జెప్పుచున్నాఁడు.

మఱియు నిది యిట్లుండఁగా నొక యౌచిత్య మిచట విచారింపఁబడుచున్నదని యీవిధముగ వ్రాసి యున్నాఁడు.

ఈ పద్యమునఁ జెప్పఁబడినది యెవరిమాటయై యుండును? అత్తమామల మాటయై యుండునా? లేక ఏ సంబంధమునులేని యొకానొక తటస్థునిమాటయై యుండునా?

మామగారి మాటయని తలంచుదమా? యనిన ఆయన, తన కొమార్తె సౌందర్యమును వర్ణించుట యె ట్లనుచితముగాదో అట్లే కోడలిసౌందర్యమును వర్ణించుటయు తగినదిగాదు. కాన నిది మామగారి మాటగా, నిశ్చయింపఁదగదు.

పోనీ అత్తగా రిట్లనినదని తలఁచి దీని నత్త గారి మాటగా నిశ్చయింతమా? అనిన నదియు తగి యుండలేదు. పుత్రప్రేమ విహ్వలురాలైన ఆమె, తమ గృహమునకు ధనసమృద్ధినిగోరుచు నిట్లనిన దన్నను, లేక కోడలి సౌందర్యాతిశయముపై ఈర్ష్య వహించి యనినదన్నను 'ఇచ్చట అమ్మఁదగిన హస్తి దంతాదికము లేదు' అని యింతమాత్రమే చెప్పఁదగి యుండఁగా ఆ కోడలిని వర్ణించుట నిష్ప్రయోజనము అనుచితమును.

కాన వీరి కుటుంబముతో నెట్టి సంబంధమును లేని యెవరిమాటయో యిదియని చెప్పట యుచితముగా నుండును. అట్లు ఉదాసీనునిమాటయైనప్పడే కొద్దిగా రసాస్వాదముగూడ లభించును. అట్లు కానిచో విపరీత సురతసమయే అను పద్యమును గూడ మంచికావ్యమని ముఖ్యవృత్తితోఁ జెప్పవలసివచ్చును.

కావున నిది తటస్థవాక్యమనియెంచి 'అస్మాకం' అనుచోట ఏతేషాం అని పాఠము మార్చవలయును.

ఇచ్చట వ్యక్తివివేకకర్తయగు మహిమ భట్టారకుఁడు చేసిన చర్చానిర్ణయములు బాగుగనే యున్నవనవలెను. ఏలయన:— కోడలిని మామగారు కొమార్తెనువలె సద్భావముతోఁ జూడవలయును. ఇట్లు పుత్రికనువలెఁ జూచుకొనవలెనని మన ఆర్యసాహిత్య ములో నెచ్చటఁ జూచినను నగుపించును. ఇది ఆర్య సంప్రదాయము. పాశ్చాత్యులలోఁ గూడ నిట్టిభావమే యున్నట్లు కోడలికిఁ బర్యాయపదమైన Daughter-in-law అను పదము సూచించుచున్నది. మఱియు నామె మామగారిని తండ్రిగారివలె భక్తిభావముతో సేవింపవలయును. ఇది మనకు అనాదిగా వచ్చుచున్న ఆర్షసంస్కృతికి సంబంధించిన ధర్మము. అంతియేకాని అన్యకాముకునివలెఁ దాను కోడలి సౌందర్యమును వర్ణించుట తగియుండదు. కాన మామగారి వాక్య మనుట తగదు.

ఇఁక అత్తగారన్ననో అందమైనకోడలు తనకు లభింపవలయుననియే యెల్లప్పడును తలంచుచుండును. అట్టికోడలు లభింపనప్పడే 'కులమింటి కోఁతి' నెక్కడనో తెచ్చికట్టుకొనవలయునని చూచును. అందుచే నామె కోడలి సౌందర్యమునుగూర్చి యీసుచెంది యిట్లు పలికినదనుటకు వీలుగాదు. అదిగాక అత్తలు తమ యింటిలోని విషయము గుటుగానే యుండ వలయునని తలంచుచుందురు. కావుననే 'కాపురము గుట్టు, రోగమురట్టు' అను సామెత స్త్రీలలో నెక్కువగ వ్యాపించియున్నది. కనుక తన యింటిలోని యీ గుట్టును పరాయివాఁడై యేనుఁగుదంతములు కొనవచ్చిన వర్తకునితోఁ జెప్పననుటయుఁ దగదుగదా!

కాకున్న నిఁక నొకటి యున్నది. కుటుంబ నిర్వహణము ధనైకసాధ్యముగాన కుమారుఁ డెప్పుడును నింటనుండి, అడవిలోని ఏనుఁగులను పులులను వేటాడుట మానినచో కాపురము జరుగుట కష్టమై యామెకు బాధగలిగి తన యింటిలో పదార్థములు సమృద్ధిగా నుండుటకై కుమారునికి సంపాదనకై హెచ్చరిక చేయవలసిన యవసరము గలిగియుండ వచ్చును.

అట్లయినను ప్రత్యేకముగాఁ గుమారున కేదో విధమున సూచించి కార్యోన్ముఖుఁడగుటకు హెచ్చరిక చేయునుగాని యీ విధముగా పరాయిమగవానితోఁ దమ కాపురపుగుట్టును బయటవేసికొనుచుఁ గోడలి సౌంద ర్యమును వర్ణించుచు నెత్తిపాడుపుమాటలతో సంపాదనకై యెచ్చరించుననుట సమంజసముగాదు. కావున నత్తగారును నీవిధముగాఁ బలికియుండదు.

కనుక నెవఁడో తటస్థుఁ డీవిధముగాఁ బల్కినఁ బలికియుండవచ్చునని యూహించిన మహిమభట్టార కుని యీ యభిప్రాయములు మిక్కిలి బాగుగా నున్న వనవచ్చును.

ఇఁక నిది యుదాసీనుని మాట కాదన్నచో విప రీతసురతసమయే అను పద్యమునుగూడ మంచికావ్యమని చెప్పవలసివచ్చునంటిమి. దాని విషయ మేమననగా:—

'విపరీత సురతసమయే
బ్రహ్మాణం దృష్ట్వా నాభికమలే।
హరేః దక్షిణనయనం చుంబతి
హ్రియాఽఽకులా లక్ష్మీః॥'

(లక్ష్మీనారాయణులకు జరగిన విపరీతసురత సమయమున లక్ష్మీదేవి విష్ణుని నాభికమలమున నున్న బ్రహ్మను జూచి సిగ్గుపడినదై విష్ణుమూర్తి కుడికంటిని ముద్దుపెట్టుకొనెను.)

దీనిని ధ్వనికారాదులు ధ్వని కుదాహరణముగా నొసంగిరి. కాని యిది సరియైనకావ్యము (కవిత్వము) గాదనియు, ఏదో ప్రహేళికవంటిదనియు మహిమ భట్టారకుని యాశయము. ప్రహేళిక అనఁగా తాను సూచించు నభిప్రాయము లోనగూఢముగాఁ గలిగి యుండునది లేక తనలో గూఢముగ నిమిడియున్న యభిప్రాయమును సూచించునది అని యర్థము.

ఇది ప్రహేళికయగు టెట్లనఁగా:—

ఇచ్చట లక్ష్మీదేవి లజ్జానివృత్తి యనునది సాధింపఁదగిన యంశము. దానికి సూర్యస్వరూపము గు విష్ణుమూర్తి కుడికన్ను లక్ష్మీదేవి ముద్దిడుకొనుట హేతువు. 'అది కప్పిపుచ్చుట'యను అస్తమయమును ఊహింపఁజేయుచున్నది. ఆ యస్తమయము సాహచర్య మునుబట్టి నాభికమలముయొక్క సంకోచము నూహింపఁ జేయుచున్నది. ఆ నాభికమల సంకోచము బ్రహ్మ యొక్క చూపునకు వ్యవధానము నూహింపఁజేయు చున్నది. ఇచట బ్రహ్మయొక్క దర్శన వ్యవధాన మనెడి అనుమేయార్థప్రతీతి మూఁడింటితో మఱుఁగుపఱచఁబడియున్నది. కావున ఈ యర్థబోధ ఉపాయ పరంపర నారోహించుటకు బలములేనిదై రసాస్వాదము వఱకును బోవుటకు సమర్థముగాకున్నది. కాన నిది ప్రహేళికా సదృశమైన యొక కవిత్వమే కాని ప్రధానమైనకవిత్వముగా నెన్నఁదగియుండదు.

ఇఁక మఱియొకటి :—

యా నిశా సర్వభూతానాం
తస్యాం జాగర్తి సంయమీ।
యస్యాం జాగ్రతి భూతాని
సా నిశా పశ్యతో మునేః॥

భగవద్గీత 2 అ. 69 శ్లో.

(అది యన్నిభూతములు (జీవు) లకును రాత్రి యంటిదై నిద్రాసమయము నగునో ఆ నిశయందు ముని మేల్కొనియుండును. దేనియందు జీవులంద ఱును మేల్కొందురో అది మునికి రాత్రివంటిది.)

ఈ భగవద్గీతా శ్లోకమును ధ్వనికారులు తిర స్కృత వాచ్యధ్వని కుదాహరణముగా నిచ్చియుండిరి.

ఇచ్చట యథాతథముగా నే యర్థమును జెప్పినచో విశేష మేమియును లేకపోఁగా రచయిత యొక్క అభిప్రాయమునకే భంగము వాటిల్లుచున్నది. ఎట్లన—

అందఱును నిద్రించునప్పుడు యోగి మేల్కొ న్నవాఁడగుని, అందఱును మేల్కొన్నప్పుడు యోగి నిద్రించునవాని ప్రయోజనమేమి? కావున నిచట కవికిఁగల తాత్పర్య మేమియని యాలోచింప వలెను.

మహిమ భట్టారకుఁ డిది ధ్వనిగాదు. ఉప చారమువలన అర్థమును బ్రకటించు నదియని విప రించు చున్నాఁడు.

ఎట్లన :—

ఇచ్చట నిశ యనుపదమునకు రాత్రియని యర్థమును గాదు. జాగరణ మనుదానికి మేల్కొ నుటయని యర్థమును గాదు. ఇది యేమన—సామాన్య జీవు లందఱును ఏ తత్త్వజ్ఞానమునందు శ్రద్ధలేక యున్నారో ఆ తత్త్వజ్ఞానమునందు యోగి అవధా నము గలిగియుండుననియు, జీవులు అతిముఖ్యముగా నెంచు అసత్య పదార్థములగు ప్రపంచమునందు యోగి పరాఙ్ముఖుఁడై యుండుననియు దీని తాత్పర్యము. ఇచ్చట వాక్యము ఉపచారముతో మఱియొక యర్థ మును బ్రకటించు చున్నది.

'వాక్యస్యచ ఉపచారతోఽర్థాంతర ప్రకాశనం యథా:—యా నిశా.. పశ్యతో మునేః, ఇతి అనేన హి వాక్యేన న నిశార్థో నాపి జాగరణార్థః కశ్చి ద్వివక్షితః. కిం తర్హి ? తత్త్వజ్ఞానావహితత్వం అతత్త్వ పరా

ఋ్మ్తత్వంచ మునేః ప్రతిపాద్యత ఇతి తిరస్కృత వాచ్య స్యాస్య గమకత్వం.'

మఱియొకటి :—

'విషమయ ఇవ కేషామపి
కేషామపి ప్రయాత్యమృతమయః।
కేషామపి విషామృతమయః
కేషామప్యవిషామృతః కాలః॥'

(కొందఱికి కాలము విషమయముగా గడచును. కొందఱికి అమృతమయముగా గడచును. కొందఱికి విషామృతమయముగా గడచును. కొందఱి కవిషామృత మయముగా గడచును.)

ఇచట సామాన్యముగా విషమయముగాను అమృతమయముగాను విషామృతమయముగాను అవిషామృత మయముగాను గడచునని యర్థము చెప్పకొన్న నేమియు విషయము తెలియుట లేదుగదా!

ఇచ్చట అర్థాంతర సంక్రమితమైన వాచ్యము ప్రకరణాది వశమున గమకమై యర్థవిశేషమును దెలుపునని మహిమభట్టుని యభిప్రాయము.

'తస్యైవ (వాక్యస్యైవ) ప్రకరణాదితః (ప్రకరణ సామగ్రీ వశతః) అర్థాంతర ప్రకాశనం యథా :—

విషమయ ఇవ......అవిషామృతః కాలః॥

ఇత్యత్ర వాక్యే ప్రకరణాది వశా ద్విషామృత శబ్దాభ్యాం సుఖదుఃఖ స్వరూప సంక్రమితవాచ్యాభ్యాం వ్యవహారఇతి అర్థాంతర సంక్రమిత వాచ్యస్యాస్య గమకత్వమ్.'

ఇచ్చటఁ గల విషము, అమృతము అను శబ్దములు దుఃఖము సుఖము అను ఇతరార్థముల యందు సంక్రమించిన వాచ్యార్థముగలవై యీ క్రింది విషయమును బోధించుచున్నవి.

కొందఱికి అనఁగా అవివేకులకు కాలము దుఃఖ మయముగా గడచును. కొందఱికి అనఁగా వివేకవంతులకు కాలము సుఖమయముగా గడచును. కొందఱికి అనఁగా వివేకమును అవివేకమును గలవారలకు కాలము సుఖదుఃఖ మయముగా గడచును. కొందఱికి అనఁగా మూఢప్రాయులైన వారలకు కాలము సుఖమయమును దుఃఖమయమునుగాక గడచును.

ఇట్లర్థ ప్రతీతి గలుగుటకు ధ్వనితో నిమిత్తములేదని యీయన ఆశయము.

అందుచేత అనేకార్థక శబ్ద ప్రయోగముచే మోసగింపఁబడిన వ్యాఖ్యాతలు గతానుగతికముగ నంధపరంపరగా ప్రవర్తింపఁజేసిన శబ్దమూలక— అనురణనరూపమగు అర్థాంతరప్రతీతి ఉన్నదను వాదములో నుపపత్తి యేమియును లేదు.

సాధారణముగ వ్యాఖ్యాతలుగూడ నిజముగ పండితులమని తలంచుచు తప్పు తమ్మమాత్రమే కాక పూజ్యులగు మహాకవులనుగూడ సిగ్గిలఁ జేయుచున్నవారు కొందఱు కన్పించుచున్నారు.

అట్లు వ్యాఖ్యాతలు వ్యాఖ్యానములలో పొరపడినారని వ్యక్తివివేకకర్త తెలిపిన యొకటి రెండు ఘట్టములను వివరించి యీ వ్యాసమును ముగించెదను.

ప్రాచీనాలంకారికుఁడైన ఉద్భటుఁడు తన కావ్యాలంకారసంగ్రహములో ఉపమాలంకారమునకు

'యచ్చేతోహారి సాదృశ్య
ముపమానోపమేయయోః।
మిథో విభిన్న కాలాది
శబ్దయో రుపమాతు తత్'॥

అని లక్షణము చెప్పి

'యథేవ శబ్దయోగేన సా శ్రుత్యాఽన్వయ మర్హతి' అని విభాగమొనర్చెను.

ఈ విభాగ వాక్యమును వివరించుచు ప్రతీహారేందురాజు 'యథేవశబ్దౌ చాత్ర ఉపలక్షణం. అన్యయాంతరాదపి వాశబ్దాదేః తేన రూపేణ ఉపమానోపమేయ భావస్యావగతేః. యథా—

తాం జానీయాః పరిమితకథాం
జీవితం మే ద్వితీయం
దూరీభూతే మయి సహచరే
చక్రవాకీ మివైకాం।

గాఢోత్కంఠాం గురుషు
దివసే ష్వేషు గచ్ఛత్సు బాలాం
జాతాం మన్యే శిశిరమథితాం
పద్మినీం వాఽన్యరూపాం॥'

అని మేఘసందేశ పద్యము నుదాహరించెను. అనఁగా ఇచట 'పద్మినీంవా=పద్మినీమివ, అన్యరూపాం, జాతాం, మన్యే' అని సమన్వయము. గనుక ఇవార్థమునందు 'వా' శబ్ద ముపయోగింపఁబడినది. కాన నిదియు శ్రౌతోపమాలంకారమున కుదాహరణమే యగునని తన యభిప్రాయమును తేల్చెను.

ఇఁక మేఘసందేశమునకు వ్యాఖ్యాతయగు మల్లినాథసూరి తన వ్యాఖ్యానములో ఇందలి చివఱిపాదము నిట్లు వివరించెను.

'శిశిరేణ = శిశిరకాలేన మథితాం, పద్మినీంవా = పద్మినీమివ, 'ఇవవ ద్వాయథాశబ్దా' ఇతిదండీ. అన్యరూపాం=పూర్వవిపరీతాకారాం జాతాం మన్యే' అని.

మొత్తముమీఁద నీ వ్యాఖ్యాత లిద్దఱును 'జాతాంమన్యే శిశిరమథితాం పద్మినీం వాన్యరూపాం' అని అనుస్వారఘటిత పాఠమునే యాదరించి ఇవార్థమునందు వా శబ్ద ముపయోగపడినట్లు వివరించిరని స్పష్టముగానే తేలుచున్నదిగదా! ఇది యిట్లుంచుదము.

ఇఁక వ్యక్తివివేకకారుఁ డిచట కేసనునది యేమనగా:—ఈ పైఁజెప్పిన పద్యములో

'గాఢోత్కంఠా గురుషు
దివసేష్వేషు గచ్ఛత్సు బాలా
జాతామన్యే శిశిరమథితా
పద్మినీ వాఽన్యరూపా'

అను నీ పాఠము నెఱుఁగకయే వ్యాఖ్యాతలు తమ కవిత్వాటోపమును గూడఁ గొంత నచ్చటఁ జూపుచు, అచ్చట ఈ పాఠమువలనవచ్చు సౌందర్యాతిశయము నెఱుఁగక,

'అవైమి తదవజ్ఞానాద్యత్నాపేక్షో మనోరథః'

ఇత్యాదులయందు సామాన్యముగ వాక్యార్థమును కర్మగాఁ జేయుట చూచుచుండియు, ఇక్కడ 'మన' ధాతువునకున్న వాక్యార్థకర్మత్వమును గమనింపకయే, 'మన' ధాతువునకు 'బాల'అను పదమును కర్మగా తలఁచుచున్నారు.

'పద్మినీ + ఇవ' అనుచోట సవర్ణదీర్ఘసంధిచే వికారమునుపొందిన 'ఇవ'శబ్దమును భ్రమచేత 'వా'శబ్దమునుగాఁ గల్పించి అపవ్యాఖ్యానముల నారంభించుచున్నారు. కాని యిచట

'గాఢోత్కంఠా గురుషు ఏషుదివసేషు గచ్ఛత్సు సత్సు బాలా శిశిరమథితా పద్మినీవ అన్యరూపా జాతా మన్యే'

అనియే అన్వయము.

ఇట్లుగాక వెనుకఁజెప్పిన (బాలాం అను అనుస్వారఘటిత పాఠములోఁడ) అన్వయము చెప్పినచో అర్థమునకు వైచిత్రి యేమియు కన్పడుటలేదు. పైగా కాళిదాసువంటి మహాకవి, రసనిధానమైన కావ్యములో న్యాధివలె ఇవార్థమునందు 'వా' శబ్దము నుపయోగించునా ?

ఏమీ కాళిదాసుని కవిత్వములో స్ఖాలిత్యములే లేవా? అయినచో 'చంద్రం ప్రవృద్ధోర్మిరివోర్మిమాలీ'అని యాయనయే రఘువంశములో నెట్లు ప్రయోగించెను? అచట రెండుచోట్ల ఊర్మి శబ్దమును ప్రయోగించుటవలన కవికి నిర్మాణ విధానములో 'స్ఖలన' ము గుపించుటలేదా? యని ప్రశ్నింపవచ్చును. కాని 'ప్రవృద్ధోర్మిరివోర్మి' అనునప్పుడు 'ఓర్మి'అను రెండక్షరములకు మైత్రి యున్నది. అందువలన ఆ రెండిఁటెని ఉచ్చరించినందువలన శ్లేషసుఖ మనుభవించుచు అర్థభేదము నెఱుఁగని యెవరో కల్పించిన పాఠమేగాని యిది అసలు పాఠము కానేరదు. అసలు అచట పాఠము 'చంద్రం ప్రవృద్ధో జలధిర్నిశీవ'అనియే అని యెఱుంగవలయును.

అదిగాక కాళిదాస మహాకవి యన్వయగతియెచటను నిట్లు గానిపింపదు.

కనుక 'గాఢోత్కంఠా గురుషు' అనునదియే కాళిదాస రచితపాఠము. మఱియొక పాఠము వ్యాఖ్యాతలు భ్రాంతిచేఁ గల్పించినది'అని. ఇట్టిదే మఱియొక ఘట్టము:—

'గ్రామే஽స్మిన్ పథికాయనైవ వసతి
పాంథాధునా దీయతే
రాత్రావత్ర విహారమండపతలే
పాంథః ప్రసుప్తో యువా
తేనోత్థాయ ఖలేన గర్జతి ఘనే
స్మృత్వా ప్రియాం తత్కృతం
యేనాద్యాపి కరంకదండ పతనాశంకీ
జనస్తిష్ఠతి॥'

ఇచ్చట తన యింటికివచ్చి రాత్రిపూట పరుండ వసతి నిమ్మని కోరుచున్న యొక బాటసారి యువకునిఁ జూచి యొక కామిని మన్మథావేశము గలిగినదై అతఁడింకొక స్త్రీయందనురాగము గలిగియున్నాఁడేమో అని శంకించి, అన్యాసక్తజనునియందనురాగ ముంచుట, దారుణతరముగా పరిణమించునని తలఁచి యిట్లు చెప్పుచున్నది.

'ఓ తెరువరీ! ఈ గ్రామములో నిప్పుడు బాటసారులకు పండుకొనుటకు వసతి నిచ్చుటలేదు. ఏలయన నొకరాత్రి యిచట విహారమండపమున నొక బాటసారి పండుకొని యొక రాత్రివేళ మేఘము గర్జింపఁగా తన ప్రియురాలిని స్మరించుకొని యా దుర్మార్గుఁ డొకపని చేసెను. ఆ పని చేయుటచే ఆ యింటివారు 'ఇంటిలో శవమున్నందున విధించు శిక్షపడునేమోయని యిప్పటికిని భయపడుచున్నారు.'

ఇది కావ్యాలంకారసూత్రవృత్తిలో నుదాహరింపఁబడినది. అచ్చటి వ్యాఖ్యాతలు దీని నిట్లు వివరించిరి.

'ఇదివఱలో రాత్రి పూటఁ బండుకొనవచ్చిన యొక బాటసారి ఆ రాత్రి మేఘగర్జనమును విని, ఎక్కడనోయున్న తన ప్రియురాలిని తలంచుకొని తాను మరణించెననియు, ఇంటిలో శవమున్నదని బలవన్మారణప్రయుక్తమగు దండనమును రాజు విధించెననియు, అట్టి దండుగ తమకు పడునేమోయని యిప్పటికిని అచ్చటివారు భయపడుచున్నారనియు, కావున నీకు వసతి నీయఁజాలమనియు నొక వనిత, పండుకొనవచ్చిన బాటసారితోఁ జెప్పుచున్నది.'

అనఁగా నిచట, వెనుక నెప్పుడోవచ్చి పండుకొనిన బాటసారియే మరణించెనని యీ వ్యాఖ్యాతల యభిప్రాయము.

కాని వ్యక్తివివేకకారుఁడగు మహిమభట్టారకుఁడు దీని నంగీకరింపక యిట్లనుచున్నాఁడు.

ఇచట నొక కామిని, పండుకొన వసతిఁ గోరుచున్న యువకుఁడైన బాటసారినిఁ జూచి మన్మథబాధావేశముగలదై అతఁడింకొక స్త్రీయందనురాగము గలిగియున్నాఁడేమో! యని శంకించుచున్నదై, 'అన్యాసక్తజనునియందనురాగము పెట్టుకొనుట భయంకర పరిణామమునకు దారితీయునని, నీవింకొక స్త్రీయందనురక్తుఁడవు గానిచో ఈ యిల్లంతయునేకాక నేను నీ కధీనురాలనే. అట్లుగాక అన్యాసక్తుఁడవై యున్నచో ప్రయోజనములేదు వెళ్లుము.'అని తన యభిప్రాయము నాతనికి దెలియఁజేయఁదలఁచినదై, వెనుక నొకరికిట్లే వసతి నిచ్చుటచేఁ గలిగిన కామినీమరణమను ఫలితమును దెలుపు వృత్తాంతమును వక్కాణించుట కారంభించినది.

కాని యీ యభిప్రాయమును దెలిసికొనజాలనివారై 'ఆమె ఆ బాటసారియే మరణించి' నట్లు తెలుపుచున్నదని కొంద ——వ్యాఖ్యాతలు చేయుచున్నారు. అట్లు వ్యాఖ్యానించుట పూర్తిగ అయుక్తము. అట్లు వ్యాఖ్యానించిన రసభంగము గలుగును. ఇద్దఱికిని అధికానురాగమున్నను పురుష మరణమును వర్ణించుట మిక్కిలి అనుచితము. ఖలుఁ (దుర్మార్గుఁ) డని ప్రయోగించుటయు, కృతం (చేసెను) అని ప్రయోగించుటయు కుదురదు గూడ.

ఎవఁడు తన యధీనతలేకయే అవశుడై మరణించునో వాని మరణ మొకరి కుపకరింపవచ్చును. లేదా అపకారముగాఁ బరిణమింపవచ్చును అంత మాత్రముతో వాఁడు సుజనుఁడనికాని దుర్జనుఁడని కాని చెప్పుటకుఁగాని, సుజనత్వ దుర్జనత్వములు నిశ్చయించుటకుఁగాని వీలగునా? 'నేను నీ కుపకరించుటకు మరణించుచున్నాను. నీ కపకారము జరుగవలెనని మరణించుచున్నాను' అని చెప్పి మరణించినచో వాని సుజనత్వమునో దుర్జనత్వమునో పేర్కొనుటకు వీలగును.

అట్లు గాకున్నచో నది అతిప్రసంగ మగును గాన పురుష మరణపక్షము ననుసరించువారును ఆ వ్యాఖ్యాతలును అంధపరంపరగా నిప్పటికిని, యుక్తి శూన్యమైన మార్గముననే సంచరించు చున్నారు.

ఇది వ్యక్తివివేకకారుని వాదము.

ఇచ్చటఁ గొంచెము మనము పరిశీలింతము:—

మన్మథావస్థలలోఁ జివరిదైన మరణావస్థను వర్ణించుటలో సాధారణముగ మరణప్రయత్నమునే వర్ణించెదరు. మరణమును వర్ణింపరు. ఒకవేళ కొందఱు కవులు మరణమును వర్ణించినను స్త్రీ మరణమును వర్ణింతురు. కాన నిట్లు పురుషవధను వర్ణించుట యుచితముగఁ గాన్పింపదు. కాని ఇచ్చట స్త్రీ మరణించినట్లు వర్ణించుట యుచితముగా నుండును.

పురుషుఁడు మరణించినట్లే పద్యమును వ్యాఖ్యానించుట అంత యుచితముగాలేదు.

కనుక నిచ్చట మహిమ భట్టారకుని విమర్శయు నిర్ణయమును సముచిత మైనవిగానే కన్పించుచున్నవి.

వెనుకఁ జూచిన

'విషమయ ఇవ కేషామపి
కేషామపి ప్రయాత్యమృతమయః।
కేషామపి విషామృతమయః
కేషామప్యవిషామృత స్ కాలః.'

అను పద్యములోఁ జెప్పినట్లు కావ్యరసాస్వాదము చేయువారి కాలమమృతమయముగ గడచిపోవును గాన రచయితల యొక్కయు, వ్యాఖ్యాతల యొక్కయు రచనలలోని వ్యాఖ్యానములలోని యౌచిత్యానౌచిత్యములు బరిశీలించుచు కవి తాత్పర్యమును గ్రహించుచు కావ్యరసాస్వాదముఁజేయుచు కాలమును అమృతమయముగాఁ గడపవలెను. అట్టివారే సహృదయులని తెలుపుకొనుచు నిప్పటికి విరమించు చున్నాను.



# నుఁగులెంక

## శ్రీ తుమ్మల సీతారామమూర్తి

### మంజరి

శతకముల్ హరికథల్ జంగమకథలు
నాటకాదులు వ్రాయు నవయౌవనమునఁ
గన్నాఁడ నే 'బాలకవి' యన్నబిరుదు,
నవధానము లొనర్చునపు 'డవధాన,
పండిత' ఖ్యాతిని బడసితి, 'సరస
కవిశేఖర' ప్రథ గంటిఁ, జేకొంటిఁ
బొన్నూరి భావన్న పొలమేర యందు
గంట కిన్నూరు చక్కని పద్యములను
సకల లక్షణవిధా సంపన్నములను
బల్కి 'యాశుకవీంద్ర' పట్టా, ముదాత్త
సభను 'విద్వత్కవిసమ్రా' ట్టనైతి
వెనుక 'జాతీయ కవిబ్రహ్మ' నైతి
నవల 'రాష్ట్రీయ కవ్యగ్రణి' నైతిఁ
బిదప జయాంకముల్ పెక్కు లందితిని
గాని యస్మద్గాంధికథ నుబ్బినపుడు
విశ్వ విద్వల్లోక వినుతి పాత్రుండు
రామలింగారెడ్డి రమణీయముద్ర
నందిన బిరుదున 'కభినవతిక్క'
నాఖ్యమ్మునకు నాత్మ నలరితి నేను;
అలరుట నిందనీయము కాదు గాని
కవితన్ మదీయను గ్రంథరూపమునఁ
బ్రకటించుతఱి నట్టిపై దీని
పెద్దనేరమిని గావించితి నకట!



కొన్నేండ్ల కీతప్పుగుట్టు గుర్తించి
నాచందమున కెంత నవ్వెనో జగము
నా యహంతకు నెంత నవ్విరో ప్రజలు
బిరుదము ల్గలకవుల్ పెక్కు రీతెల్గు
నాట లేరా నేఁడు ? నా తప్పువంటి
తప్పు గావింపనిధన్యు లుదాత్తు
లీ కవిశ్రేణిలో నెందఱు లేరు ?
వారిపోకడ నేల పాటింపనైతి
వారినిబ్బర మేల వాంఛింపనైతి
నే నేర్పరించిన కృతిని దిక్కన్న
పలుకుసౌ రున్నచోఁ బఠిత లెఱింగి
నను మెచ్చురా? సూరనను బ్రశంసింప
కుండిరా సాహితీయోగ్యతా నిధులు
చెల్లఁబో ! మతిమాలి చెడ్డ చేసితిని
దోస మియ్యది యెట్లు తొలఁగునం చేను
వగచుచుండ వయస్యవర్గమ్ము నరస
రావుపేటం బ్రజారంజకమ్మైన
సభగూర్చి పాటూరి సత్కులోదితుని
వేంకటేశ్వరుని గవిప్రపంచారు
నధ్యక్షుఁ గావించి యస్మదీయమ్ము
పుట్టువండు వొనర్చి భూరిసత్కృతుల (25–12–1960)
నమఁ దన్పి; రపు డభినవ తిక్కనాఖ్య
కర్హుఁ డీకైసరుఁ డని సభాసదులు
తత వాగ్విభూతిమైఁ డన్నుఁ గొండాడ
నే నేఁడ దిక్కన్న యేడఁ దెనుంగు
బాసకు నుసుతైన పరవుర్షి యతఁడు
ప్రజలార ! కవులార ! పండితులార !
'యభినవ తిక్కన్న' యనుపట్టమునకుఁ
జాల నే, నిది నాకు స్వైరింపరాని

వ్రేఁ గాయె విరాముందు విడిచెదన్ దీని
విఁక నన్నుఁ బిలువకుఁ డీ పవాడమున
మన్నింపుఁడీ నాదుమనవి నం చనితిఁ
దెలవాఱుసరికి నా తెల్పినపల్కు
లివి పత్రికల కెక్కె యిల్లిల్లు తట్టె
బాపురే! కడుమంచిపని చేసి తనుచు
నయ్యారే! నీచంద మభినంద్య మనుచు
గఱువలు వ్రాసినకమ్మలు వేన
వేలుగా వచ్చి రావించె నా కెలమి
సత్యంబు నీకొన్నజనుఁ డింతశాంతి
కుడుచునే! యని మేలుకొంటి నానాఁడు
పదపడి నాయగాము పరువులుదీయఁ
దెనుఁగులెంకగ మాఱితిని గ్రన్న నేను
బిరుదమ్ము కా దిది ప్రేమించుసేవ
తెఱఁగు దెల్పు నహంకృతి విదూరచిహ్న;
విగా కథ నొక్కనాఁ డే నొక యొజ్జ
కడఁ జెప్ప నతఁడు 'లంకా'శబ్దమునకు
వికృతి కాదా లెంక, ద్వీపార్థ మిచ్చు
పదము కాదా లెంక? బళిరా! తెనుంగు
దీవి యన్నర్థంబు తెనుఁగు భారతికిఁ
బీఠ మన్నర్థంబు వినుచు నీ తెనుఁగు
లెంక యన్నుడి వెడలింపదా భవద
హంకృతి నిపుడేని యని నన్ను నెదిరె;
నపు డేను వికృతి కా దయ్య! యాలెంక
సేవకార్థంబు నిచ్చెడి దేశ్యపదము
కను నందిమల్లయ్యగారి పద్యమ్ము
చను చేమకూర భాషాపేటి కడకు;
నాగేశ్వరుని కాశినాథుని యల్ల
శంభుప్రసాదు సజ్జను నీ వెఱుంగు

దమ్మేటి శివలెంక యను నింటిపేర
నొప్పటయు నెఱుంగు దుద్దండుఁడైన
శివకవి శివులెంక శివలెంకఁ జేసె
నతఁడు వెర్రి పదమ్ము నంగీకరించె

నిక్క మారయు మన్న నెయ్యుఁ డవ్యాజ
వెల్వెల్లఁబ్రాఁతి నీ వివరింపు నాదు
కను విచ్చినది; తెన్గుఁగడలి నెవ్వాఁడు
తరిచ్చె నీచందాన రారాపు లోర్చి
యిచ్చె నెవ్వఁడు బాస కెనలేనిబల్మి;
ననుడు నన్ బెద్దసేయకు మనా! యంటిఁ
దెనుఁగులెంకగ నన్నె దిద్దుకొంచుంటి
నుడివోని దగుఁగాక యోగమ్ము నాది
చరితార్థ మగుఁగాక జన్మంబు నాది
నాతిమానిత పరిబ్బు నునుఁ దేర్చుఁగాక! (గర్వములేమి)
నా తెన్గుతల్లిమన్నన హెచ్చుఁగాక !



# విశ్వాంతరాళంలో అంతులేని అగాధాలు

శ్రీ పెమ్మరాజు వేణుగోపాలరావు

విశ్వసృష్టినిగురించి విశ్వస్వరూపాన్నిగురించి మనం అనేకమైన ఊహలు చేస్తుంటాం. తన చుట్టూ ఉన్న భౌతికప్రపంచాన్ని అర్థంచేసుకోవడానికి మానవుడు ప్రయత్నించడం ఈనాటి విశేషంకాదు. పౌరాణికులు పురాణగాథలుగాను, కథకులు అభూతకల్పనలుగాను సృష్టివిచిత్రాలని సమీక్షించిన విషయం మనకు తెలిసినదే. ఈ కోవకు చెందకపోయినా శాస్త్రజ్ఞుల భావనలుకూడ విశ్వరహస్య అవగాహనకి సంబంధించినంతవరకూ వింత అయినవే. అయితే వీరి భావనల్లో కొంత ప్రత్యేకత ఉంది. భౌతికప్రపంచంగురించి తమకు నిజమని నమ్మకంగా తెలిసిన కొన్నిప్రాథమిక సూత్రాలను ఆధారంగాచేసుకుని వాటి పరిథులను దాటకుండా విశ్వంగురించి ఊహించారు. ఈ ఊహలు సిద్ధాంతాలు కట్టుకథలను మించిన కల్పనలకు దారితీయడం పరిశీలించదగ్గ విషయం.

## నక్షత్రాల జీవనాధారం

నక్షత్రాల పుట్టుపూర్వోత్తరాలు, పరిణామ దశలనుగురించి శాస్త్రజ్ఞులు తెలుసుకున్న విషయాలు, వాటి నాధారంగాజేసుకుని వీరు ప్రతిపాదించిన సిద్ధాంతాలు ఆధునికవిజ్ఞానసాంప్రదాయంలో చెప్పుకోదగ్గవి. విశ్వాంతరాళంలో హైడ్రొజను పరమాణువులు విహరిస్తూ ఉండేవని అవి గురుత్వాకర్షణ ప్రభావంవల్ల ఒకదానితో ఒకటిచేరి చివరకీ నక్షత్రాలు ఏర్పడ్డాయని నేటి సిద్ధాంతం. వేరువేరు పరిణామ దశలలోగల నక్షత్రాలు విశ్వంలో ఉన్నాయని పరిశోధనలవల్ల తెలిసిన విషయమే. ఈ రచనలో నక్షత్రాల అంతిమదశలలోని కొన్నిఅవస్థలనుగురించి నేటి భావనలను తెలుసుకుందాం. ప్రకాశం తగ్గి చివరకి ఆరిపోయి వెలుగు ప్రసరించలేకపోవటం నక్షత్రానికి మరణంఅని చెప్పవచ్చును. ఈ చివరిదశనుగురించి ముసలితనాన్నిగురించి తెలుసుకునేముందు యౌవనంతో మిణుకుమిణుకుమంటూన్న నక్షత్రాలకి ఎల్లవేళలా శక్తి ఎలా లభిస్తోందిఅన్న ప్రశ్నకి సమాధానం తెలుసుకోవాలి.

హైడ్రొజను ధాతువులను హీలియం ధాతువులుగామార్చే న్యూక్లియరులేక కేంద్రకప్రక్రియలు నక్షత్రాల అంతర్భాగాలలో అస్తమానూ జరుగుతూంటాయి. హైడ్రొజనుకంటె హీలియం షుమారుగా నాలుగురెట్లు బరువు. కాని మొత్తం నాలుగు హైడ్రొజను పరమాణువులలోగల పదార్థంకంటె



హీలియం పరమాణువు పదార్థం కొంచం తక్కువ. అంటే హీలియం తయారవుతున్నపుడు కొంతద్రవ్యం మిగిలిపోయినదనుకోవచ్చు—కాని ఇది ద్రవ్యరూపంలో మిగలదు. శక్తిరూపంలో విడుదల అవుతుంది. ఐన్‌స్టయిన్‌గారి సాపేక్ష సిద్ధాంతప్రకారం పదార్థం శక్తియొక్క రూపాంతరమేగదా (E=MC2). ఈ ప్రక్రియలకు కావలసిన ఉష్ణోగ్రతకూడా నక్షత్రాల కేంద్రాలలో లభిస్తుంది. వీటికి ఇంధనం (Fuel) అయిన హైడ్రొజను పరమాణువులే నక్షత్రాలకి జీవనాధారంఅన్నమాట. ఈ ఇంధనం సప్లయి అవుతున్నంత కాలం నక్షత్రం యౌవనంతో విరాజిల్లుతోందనే చెప్పుకోవాలి. మన సూర్యుడుకూడా ఒక నక్షత్రమే. ఈ సూర్యనక్షత్ర కేంద్రం (షుమారు మిలియను మైళ్ల ఆవరణగల ప్రాంతం)లో రోజుకి $10^{13}$

టన్నుల ఇంధనం ఖర్చవుతోందిగనకనే మనకి రోజూ సూర్యరశ్మి లభిస్తోంది. ఇంకో పది బిలియను ($10^{10}$) సంవత్సరాలుపోతే సూర్యుడికిగల హైడ్రొజను ఆస్తిఅంతా హీలియంగామారి ప్రకాశవంతమైన జీవితం ఆఖరవుతుంది. సూర్యునికంటె 30 రెట్లు బరువున్న నక్షత్రాలు సుమారు అయిదు మిలియను సంవత్సరాలకే ప్రాణం కోల్పోతాయి. ఇలా తన జీవనాధారాన్ని పోగొట్టుకున్న నక్షత్రం అంతిమఘడియల్లో ఎలా ప్రవర్తిస్తుంది? మరణానంతరం మిగిలిన అస్థికలు ఏరూపంలో ఉంటాయి? నక్షత్రపు దురదృష్టాలు దానికిగల మొత్తం పదార్థరాశి (Mass) ని బట్టి ఉంటాయి. చిన్ననక్షత్రం అతిసున్నితంగా ఒడుదుడుకులు లేకుండా క్రమంగా చివరిరోజులు గడిపేస్తుంది. పెద్దది చాల విపరీతమైన విచ్ఛిన్నావస్థలకి పాల్పడుతుంది. మన సూర్యునిలోగల పదార్థంకంటె 1.4 రెట్లకులోపు పదార్థంకల నక్షత్రాలన్నిటినీ చిన్నవి అందాం. ఈ 1.4 × సూర్యుని ద్రవ్యరాశిఅనే పరిమితికి మించిన పదార్థంకల నక్షత్రాలన్నిటినీ పెద్దవి అందాం.

## శ్వేతకుబ్జాలు (White Dwarfs)

ముందు న్యూక్లియరు ఇంధనంఅంతా ఖర్చయిపోయిన చిన్నతారలనుగురించి విచారిద్దాం. అంతవరకు అత్యధికమైన ఉష్ణోగ్రతతో ఉడికిపోతూ విహరిస్తున్న వాయురూపంలోని నక్షత్రపదార్థం ఇక సత్తాయిలేక వేడిమితగ్గి, చలనంతగ్గి, నీరసించి గురుత్వాకర్షణ ప్రభావానికి లోనై నక్షత్రకేంద్రంవైపుమళ్లుతుంది. ఇలా పదార్థం కేంద్రంవైపు నొక్కబడి నక్షత్రపు పరిమాణం తగ్గినకొద్దీ లోపలి ఉష్ణోగ్రత మళ్లీ హెచ్చటం ప్రారంభం అవుతుంది. అంటే గురుత్వాకర్షణశక్తి ఉష్ణశక్తిగా మారిందనుకోవచ్చును. శక్తినిత్యత్వ న్యాయం (Conservation of Energy) పాటించినంతకాలం శక్తి తన రూపాలు మార్చుకోటానికి అభ్యంతరంలేదుకదా. ఈ ఉష్ణశక్తిలో సగభాగం ఉపరితలానికి ప్రవహించి బయటికి అనంతాకాశంలోకి ప్రసారమయిపోతుంది. మిగిలిన సగభాగం లోపల బంధింపబడిపోయి, అంతర్భాగాల ఉష్ణోగ్రత ఇంకా పెరిగి, ఉష్ణ, చలనశక్తులు వృద్ధిచెంది నక్షత్రపు సంకోచాన్ని ఆపుచెయ్యటానికి ప్రయత్నిస్తాయి. కొన్నిలక్షలమైళ్ల సైజులోఉన్న నక్షత్రం కొన్నివేల మైళ్ల సైజుకి కుదించబడేసరికి కేంద్రంలో ఉష్ణోగ్రత బిలియను డిగ్రీలదాకా పెరుగుతుంది. ఈ సంకోచానికి సుమారు మిలియను సంవత్సరాలదాకా పట్టవచ్చును. ఈ అవస్థలో ఇలా ఆగిపోయి ఇంక సంకోచం చెందని తారలనే శ్వేతకుబ్జాలంటారు. ఇంక సైజు తగ్గకుండా ఆ శ్వేతకుబ్జం కొన్నిబిలియనుసంవత్సరాలపాటు నెమ్మదిగా చల్లారి చివరకి 'నల్లటిబొగ్గు' అయిపోయి కాంతివిహీనమయి రోదసిలో విహరిస్తూ ఉంటుంది.

అయితే ఈ నక్షత్రం ఇలా శ్వేతకుబ్జావతారంలో స్థిరపడిపోవటానికి కారణమేమిటి? గురుత్వాకర్షణశక్తుల ప్రభావంతో ఇంకా ఎక్కువ సాంద్రత, ఉష్ణోగ్రతలతో కూడిన స్థితికి ఎందుకుపోలేదని అడగవచ్చును. ఇది గ్రహించటానికి భౌతికశాస్త్రంలో పరమ ప్రాతిపదికగా పరిగణింపబడే ఒక మూల సూత్రాన్ని గమనించాలి. దీన్ని 'అనిర్దిష్టతా సూత్రం' (Uncertainty principle) అంటారు. దీనిప్రభావం ముఖ్యంగా పరమాణులోకంలో కనిపిస్తుంది. ఎలక్ట్రానులు, ప్రోటానులు, న్యూట్రానులు మొదలయిన ఈ రేణువులు ఏవీ కుదించబడటానికి ఇష్టపడవు. బరువైన రేణువులు తక్కువ స్థలం ఆక్రమించుకుంటాయి. తేలికయిన రేణువులు ఎక్కువ స్థలాన్ని ఆక్రమించుకుంటాయి. అంచేత ఎలక్ట్రానులు తాము ఆక్రమించుకోటానికిగల స్థలం తక్కువవుతున్నకొద్దీ మిగతావాటికంటె ముందు అయిష్టతను ఎక్కువగా ప్రకటిస్తాయి. తమని కుదించే బలానికి తట్టుకునే ప్రతిబలం తమకు ఉన్నట్లు వ్యవహరిస్తాయి. శ్వేతకుబ్జాలలో గురుత్వాకర్షణశక్తులని ఎదుర్కొనేటంత బలం వాటిలోని ఎలక్ట్రానుల కుంటుంది. 'ససేమిరా! ఇక మాచోటు తగ్గటానికి వీలులేదని' నిలబడతాయి. మన సూర్యునిలో కూడా ఎలక్ట్రానులకి ఇంత ప్రతిభ ఉంటుంది. కొన్నాళ్లకి కాంతివిహీనుడై

నల్లటి బొగ్గయిపోతాడు. (ఇక ఏవిధముగానూ శక్తిని ప్రసరించలేని వస్తువుని 'నల్లటి బొగ్గు' అని చమత్కారంగా సంబోధిస్తున్నాం ఇచ్చట.)

## సూపర్నోవా (Supernova)

ఇక పెద్దతారల విషయం—అంటే సూర్యుని ద్రవ్యరాశికన్న 1.4 రెట్లు పైగా ద్రవ్యంగల తారలన్నమాట. వీటిలో ఎలక్ట్రానుల అయిష్టతను లెక్కచెయ్యకుండా గురుత్వబలాలు, నక్షత్రాన్ని ఇంకా కుదించేస్తాయి. సైజు తగ్గిన కొద్దీ పదార్థము సాంద్రత పెరుగుతుంది. సాంద్రత పెరిగిన కొద్దీ గురుత్వ బలాలు మరీ విజృంభించి నక్షత్రంలోని ప్రతిభాగం నక్షత్ర కేంద్రం వైపు లాగివేయబడుతుంది. దీన్నే 'గురుత్వనిపాతం' (Gravitational collapse) అంటారు. ఈ నిపాతం వల్ల నక్షత్రంలో బ్రహ్మాండమయిన న్యూక్లియరు ఎక్స్ప్లోజను లేక ప్రేలుడు సంభవించవచ్చును. పగం కాలికాలని నక్షత్రపు పైపొరలు ఒక్కసారిగా భగ్గున మండి పేలిపోయి రోదసిలోకి విసిరివేయబడి కోటి సూర్యుల ప్రకాశంతో ప్రజ్వరిల్లుతాయి. దీన్నే 'సూపర్నోవా' లేక 'బృహన్నవ్యతార' అంటారు.

## న్యూట్రాను తార (Neutran Star)

ఒకోసారి అంతపెద్ద ప్రేలుడుకూడా నక్షత్రపు పై పొరలని కదపలేదు సరిగదా నక్షత్రం మరీ మరీ కుదించుకుపోయి, నక్షత్రకేంద్రంలో సాంద్రత హెచ్చి, పరమాణువులలోని ఎలక్ట్రానులు కేంద్రకాల చుట్టూ తిరుగుతూ కాలక్షేపం చెయ్యటానికి చోటు చాలక కేంద్రకాలలోని ప్రోటానులతో కలసిపోయి న్యూట్రానులు తయారవుతాయి. త్వరలో అంతా న్యూట్రానులమయం అయిపోతుంది. న్యూట్రానులు బృహత్సంకర్షణశక్తి (Strong interaction) వల్ల ఒకదాన్నొకటి ఆకర్షించుకోగలిగినా మరీ దగ్గరికి నొక్కివెయ్యబడటానికి ఎలక్ట్రానులలాగే ఇష్టపడవు. అంతేకాదు. ఒకదాని నొకటి ఆకర్షించుకుంటాయి. నక్షత్రపు బరువు సూర్యుని బరువుకన్న రెండింతలకి మించకుండా ఉంటే ఈ న్యూట్రానులు సంపీడన శక్తులను (compressive forces) ధిక్కరించి కేంద్రంయొక్క కుదింపును ఆపుచేస్తాయి. కాని కేంద్రంవైపు పైపొరలలోనిపదార్థం అత్యధిక గురుత్వాకర్షణ బలానికి లోనై విసురుగా అతివేగంతో వచ్చిపడుతుంది. ఆ ధాకిడికి కేంద్రపు ఉపరితలం ఉష్ణోగ్రత 100 బిలియను డిగ్రీలదాకా పెరుగుతుంది. ఈ ఉష్ణశక్తి 'న్యూట్రినో' అనే చిన్నరేణువుల రూపంలోకి మారి బయటికి పోతుంది. ఈ న్యూట్రినోలు నక్షత్రపు టంచులలో ప్రయాణం చేస్తూ అక్కడి పదార్థాన్ని తాకి వేడెక్కించి మరొక సూపర్నోవాకి దారి తీయవచ్చుకూడా.

న్యూట్రానులతో నిండిన కేంద్రం తయారవటం—పైపొరలు కేంద్రపువైపు లాగివేయబడటం—న్యూట్రినోలు విడుదల కావటం—వేడెక్కినపైపొరలు పేలడం—ఈ దశలను దాటుకుంటూ నక్షత్రం పరిణామం చెందటానికి పట్టేకాలం ఎంతో తెలుసా? కొన్ని సెకనులుమాత్రమే. ఇలా న్యూట్రాను తారగా మారిన కేంద్రాంతర్భాగం కలదే మనం ఆకాశంలో చూసే 'క్రాబ్‌నెబ్యులా' (crab nebula). ఈ న్యూట్రాను తారనుంచి ప్రసరిస్తున్న రేడియో తరంగాలనూ,ఎక్సుకిరణాలనూ ఈ మధ్యనే 1967లో శాస్త్రజ్ఞులు కనుగొన్నారు.

## అగాధాలు (Black Holes)

రెండు సూర్యుల బరువుకన్న ఎక్కువ బరువుగల నక్షత్రాలను గమనిద్దాం. వీటిలో గురుత్వశక్తులు న్యూట్రానుల అయిష్టతను తోసిరాజని విజృంభిస్తాయి. నిపాతం నిరంతరాయంగా సాగిపోయి అంతపెద్ద నక్షత్రంలోని పదార్థం షుమారు నాలుగు మైళ్ల వ్యాసంగల గోళం సైజుకు కుదించుకుపోతుంది. అత్యధికసాంద్రతతో పదార్థభూయిష్టమై ఉన్న ఈ గోళపు గురుత్వాకర్షణ శక్తుల ప్రభావంలో పడినదేదీ—చివరకు కాంతికిరణంకూడా — బయటకు రాలేదు. దీని సమీపంలోఉన్న ఏదయినాసరే తిరిగి బయటపడలేని 'అగాధం'లో ప్రవేశించినట్లే. అంటే

ఈ మన పెద్దనక్షత్రం (రెండు సూర్యులకంటె ఎక్కువ పదార్థం కలది) తన జీవనాధారం హరించుకుపోగానే ఒక 'అంతులేని అగాధం' కల్పించుకుని అందులో అదృశ్యమవుతుందన్నమాట.

1915 లో ఆల్బర్టు ఐన్‌స్టయిన్ ప్రతిపాదించిన సాపేక్షసిద్ధాంతాన్ని ఉపయోగించి, ఓపెన్‌హైమర్, స్నైడర్ అనే అమెరికను శాస్త్రజ్ఞులు 1939 లో గురుత్వనిపాతాన్ని గురించి పరీక్ష జరిపారు. వీరి పరిశోధనకారణంగానే కాంతి కిరణాలనుకూడా బంధించగల మహత్తరశక్తులుగా గురుత్వార్షణ శక్తులు పరిణమించగలవని తెలిసింది. కాని తోటి శాస్త్రజ్ఞులు 'ఇదేదో వింతగా ఉంది. ప్రస్తుత ఖగోళ శాస్త్ర పరిశోధనలకి దీనికి సంబంధం కనిపించటం లేదు'. అని ఆశ్చర్యపడ్డారేగాని ఈ సంగతి కూలంకషంగా చర్చించలేదు. ఇంతలో రెండవ ప్రపంచ యుద్ధపు హడావిడి రావటం ఓపెన్‌హైమర్ ఆటంబాంబు నిర్మాణంలో నిమగ్నులైపోవటం జరిగింది. ఆధునిక కలనయంత్రాల సహాయంతో ఈ మధ్యన



గురుత్వ నిపాతంలో మామూలు పదార్థపు వివిధావస్థలు

తిరిగి గురుత్వనిపాతంమీద పరిశోధనలు ప్రారంభమయ్యాయి. ఈ కంప్యూటర్లు కట్టిన లెక్కలవల్లనే అగాధాలు ఏర్పడే నక్షత్ర దశలున్నాయని తెలిసింది.

## అగాధాలలో 'విచిత్ర ప్రాంతం'

అగాధపు దశలోని వివరాలను గురించి కంప్యూటర్లు చెప్పిన విషయాలు నిజంగా విడ్డూరమైనవే. పదార్థసాంద్రత అనంతమై, ఘనపరిమాణం శూన్యమై పోయేవరకు నక్షత్రాన్ని గురుత్వ శక్తులు కుదించేస్తాయిట. అగాధంలో స్థలము, కాలము అనే వివక్షతలేకుండా స్థలకాలసమన్వయమైన అపరిచిత లక్షణాలతోకూడిన అంతర్భాగం ఏర్పడుతుంది. దీన్ని 'సింగ్యులారిటీ'(Singularity) లేక 'విచిత్రప్రాంతం' అంటారు. ఈ విచిత్రప్రాంతపు పరిధుల్లో ప్రవేశించిన ఏ వస్తువు తిరిగి బయటపడలేదు సరిగదా క్షణమాత్రంలో విచిత్రప్రాంతంలోకి లాగి వెయ్యబడి గురుత్వ శక్తుల ప్రభావంలో నలిగిపోయి అగాధంలో అంతర్ధానమయిపోతుంది.

## అగాధపు అంచులు

రెండు సూర్యుల బరువుగల నక్షత్రపు అగాధం షుమారు నాలుగుమైళ్ల వ్యాసం కలిగి ఉంటుందని గదా అనుకున్నాం. ఇంకా పెద్ద నక్షత్రాలకి పెద్ద అగాధా లేర్పడతాయి. బిలియన్‌సూర్యుల బరువుగల నక్షత్రం అగాధంగా మారితే ఈ 'అగాధపు అంచు' ఆ వైపునుంచి ఈ వైపుకి షుమారు 4 బిలియను మైళ్లు వుంటుందిట. అంటే ఈ విశ్వాంతరాళంలోని అంతులేని అగాధాలు అనేకమైన సైజుల్లో ఉండవచ్చన్నమాట. ఈ 'అగాధపు అంచు' (శాస్త్ర పరిభాషలో దీన్ని 'గురుత్వ త్రిజ్య' (Gravitational radius) అంటారు) దాటిన ఎవరూ — రాకెట్లూ, స్పేసుషిప్పులు వగైరా—తిరిగి రాలేరు. అంటే బయటినుంచి ఎవరూ అగాధానికి ఇంతకంటె సమీపంలోకి వెళ్లలేరు.

కాంతికిరణాలుకూడా బయటకిరావుగనుక నిపాతపు చివరిఘడియలను ఎవరూ బయటనుంచి చూడలేరు. కుదించుకుపోతున్న నక్షత్రపు ఉపరితలాన్నుంచి కాంతికిరణాల ప్రసారం ఈ క్రింది పటంలో వివరించ

బడింది. గురుత్వప్రభావంలో కాంతికిరణాలు వేగం తగ్గడమేకాకుండా వంచబడుతాయి. గురుత్వత్రిజ్య కంటె 1.5 రెట్లు సైజుకి నక్షత్రం సంకోచించగానే నక్షత్రపు ఉపరితలానికి సమాంతరంగా వెలువడే కిరణాలు బంధింపబడతాయి. సైజు తగ్గుతున్న కొదీ ఎక్కువ కాంతిబంధింపబడుతుంది. తిన్నగా బయటికి పోవలసిన కిరణాలు కూడా నీరసపడి పోతాయి. అగాధంలో ప్రవేశించాక ఏ దిక్కులో ప్రసరింపబడ్డా బయటకురాదు ఒక్క కాంతి కిరణం కూడాను. అంటే ఈ దృశ్యం చూదామనుకున బయటి వారికి గురుత్వ నిపాతం ఒక్కసారి గురుత్వ త్రిజ్య దగ్గర ఆగిపోయి నట్లవుతుంది. ఇక సైజులో మార్పులు కనిపించవు. కాంతికిరణాలు క్రమంగా ఎర్రబడి చివరకి అంధకారమవుతుంది. మామూలు నక్షత్రానికి ఈ మార్పులు జరగటానికి కొన్ని సెకనులు మాత్రమే పడుతుంది. బిలియను సూర్యుల బరువుగల నక్షత్రానికి కొన్ని రోజులు పట్టవచ్చును. మరొకవిషయం — అంతిమావస్థలను చూడటానికి ప్రయత్నించడం అనవసరం. నిపాతంవల్ల బయటికి తోసివేయబడి మండుతున్న పదార్థపు జ్యోతిలో ఆఖరి క్షణాల దృశ్యం మరుగుపడి పోతుంది.




## వికృతాకారపు అగాధాలు — వింత భావనలు

ఇంతకీ ఈ జోస్యాలన్నీ వంకరటింకరలేకుండా గుండ్రటి పరిపూర్ణ గోళాకారంలో వున్న నక్షత్రాలను గురించి మాత్రమే. కాని విశ్వంలోని చాలా నక్షత్రాలు అటువంటి సౌష్ఠవానికి నోచుకోలేను. వికృతాకారంతో తమచుటు తాము అనేక రకాలుగా తిరుగుతూంటాయి. జేమ్సు బర్డీన్ అనే అమెరికను శాస్త్రజ్ఞుడు, ఇగార్ నోవికోవ్ అనే రష్యను శాస్త్రజ్ఞుడు వికృతాకారంకలిగి ఆత్మభ్రమణం చేస్తున్న నక్షత్రపు పరిణామదశలను గురించి పరిశోధనలు జరిపారు. నక్షత్రం అగాధంగా మారిపోయినప్పటికి దాని 'కేంద్రం'లో 'విచిత్రప్రాంతం' ఏర్పడక పోవచ్చున్నారు. అంటే పదార్థం అంతర్ధానమవటానికి చోటు లేదన్నమాట. అంతర్ధానం కాలేకపోతే నిపాతమవుతున్న నక్షత్రపు పదార్థమంతా ఏమయిపోతుంది. విశ్వంలో మరొకచోట అవతరిస్తుందా ? లేక మనకు తెలియని మరొక విశ్వంలో జన్మిస్తుందా ? అంటే ఈ 'వికృతాకారపు అగాధం' పదార్థాన్ని రోదసిలో 'ఒకచోట, ఒకవేళ' మాయంచేసి 'మరొకచోట, మరొకవేళ'కి మారుస్తోందన్న మాట. ఒక 'స్థలకాలం' నుంచి మరొకస్థలకాలానికి మరలించే అహో బిలం అన్నమాట. బహుశః ప్రచండశక్తితో మనకి ఎంతో దూరంలో — విశ్వపుటంచుల్లో—ప్రజ్వరిల్లుచున్న 'క్వాజార్లు' (Quasars) అనేవి ఇలా నిపాతం చెందిన బృహన్నక్షత్రాల పునర్జన్మలేనని కొందరు శాస్త్రజ్ఞులు ఊహించలేక పోలేదు.

ఇంతకంటె వింతఅయిన భావన ఒకటి ఉంది. ఈ విశ్వంఅంతా ఒకనాడు బ్రహ్మాణువు ఒకటి పేలి పదార్థం నలుమూలలకి విస్తరిస్తూండటంవల్ల ఏర్పడినవని కొందరి ఊహ. స్థలము, కాలము అనేవి ఈ విస్తరణ లేకపోతే ఉండనే ఉండవుకదా. అయితే

ఈ విస్తరణ అలా నిరంతరంగా సాగిపోవాల నేముంది. కొందరి భావనలో ఈ 'విస్తారమైన' విశ్వం తిరిగి కుదించుకుని ముకుళీకరణం జరిగి ఇంకో 70 బిలియను సంవత్సరాలకి బ్రహ్మాణువు రూపానికి తిరిగి వస్తుందని, ఈ విస్తరణ, ముకుళింపులు నిరంతరంగా జరుగుతూంటాయని, విశ్వం స్పందిస్తూ ఉంటుందని సిద్ధాంతం. బ్రహ్మాణువు తిరిగి ఏర్పడేవరకు మానవుడే ఉంటే మహానిపాతం చెందుతూ ముకుళించుకుంటున్న విశ్వంఅంతా అగాధంలోంచి తిరిగి ఎలా బయటపడుతుందో అనుభవించ గలడేమో !

## అగాధా లున్నాయా ?

వందకిపైగా శ్వేతకుబ్జతారలని శాస్త్రజ్ఞులు కనుగొన్నారు. న్యూట్రాను తారలున్నా యనటానికి నిదర్శనాలు కనిపించాయి. కాని 'అగాథాలు' ఉన్నాయనటానికి ఇంకా ఋజువు దొరకలేదు. అయితే రుజువులేకుండా కంటికి కనపడని అగాధాలుంటాయని ప్రతిపాదించే వింత సిద్ధాంతాలపై శాస్త్రజ్ఞుల కీ విశ్వాసమేమిటి అని నిలదీసి అడగటం తప్పేమికాదు.

విశ్వంలో అనేక తారలు జంటతారలుగా ఉన్నాయి. గత యాభై సంవత్సరాలలో షుమారు 700 నక్షత్రాలు జంటతారలలో ఒకటిగా ప్రవర్తిస్తున్నట్లు శాస్త్రజ్ఞులు కనుగొన్నారు. [ఇవి ఒకదాని చుట్టూ ఒకటి తిరుగుతూ ఉంటాయి. టెలిస్కోపులో వీటిలో ఒకదానినుంచి వచ్చే కాంతిని పరీక్షిస్తే క్రమమైన మార్పులు కనిపిస్తాయి. మనకి దగ్గరలో వున్నపుడు నక్షత్రంనుంచి వచ్చిన కాంతికంటె దూరంగా అవతలివైపు తిరుగుతున్నపుడు ప్రసరించిన కాంతి ఎర్రగా ఉంటుంది]. కాని వీటిలో సగం నక్షత్రాలకి సహచారియైన నక్షత్రం కనిపించలేదు. కనీసం వీటిలో పదినక్షత్రాల సహచరులు—కనిపించే నక్షత్రంకంటె బరువుగా—మన సూర్యునికంటె 1.4 నుండి 25 రెట్లవరకు—ఉంటాయని తేలింది. ఈ కనిపించని సహచరతారలు న్యూట్రానుతార లవవచ్చును, అగాధాలు కావచ్చును. అగాధపు అంచులలోకి ప్రక్కనున్న మామూలు నక్షత్రపు పదార్థం పడితే గురుత్వనిపాతానికిలోనై ఎక్సుకిరణాలు, గామాకిరణాలు ప్రసరించవచ్చును. అంతేకాదు. ఈ ప్రదేశంనుంచి గురుత్వశక్తికూడ తరంగాలుగా వ్యాపించవచ్చును. అందుకనే విశ్వకుహరంనుంచి వచ్చే విద్యుదయస్కాంత, గురుత్వ తరంగాలను కనుగొనటానికి శాస్త్రజ్ఞులు కృషిచేస్తున్నారు.

(ఆధారం : కిప్ థోర్న్ (Kip Thorne) వ్రాసిన 'డెత్ ఆఫ్ ఎ స్టార్' (Death of A Star.)

— తెలుగుభాషా పత్రిక – సంపుటి 1; సంచిక–4; 1971; ఈ పత్రిక అమెరికాలో ప్రచురింపబడుతున్నది.



# అతడికీ తెలియదు

డా. ముదిగొండ శివప్రసాద్

హిమపైఎ ప్రాభాత సంధ్యల్లో మూడు నిద్దర్లు
మేలిమి బంగారపు ఛాయల్లో లోయల్లో
భాస్వరం నీడల్లో ఇంద్రచాపరాక్షసుడు.
దిగిన వర్తులాకారంమీద పైథాగరస్ పైథాన్‌లా ఎక్కినప్పుడు
అజంతా శృంగాంతరాల చంచరీక మరుత్‌గరుత్‌హేలాకేళిలా ప్రవాళాలు
ఒంటరిగా తుంటరిగా ఏకాంతంగా జాలిగా ఏరుకుంటున్నప్పుడు
నేస్తం !!
'ఎవర్నీ నిద్రలేపకు !!
భయపెట్టకు !
తలుపుతీయకు !!
పలకరించకు !!
ప్రశ్నించకు !!

కన్నీళ్లు కుడితినీళ్లుగా మారినప్పుడు
కాలం రసలింగంగా పైకి లేచినప్పుడు
విభక్తుల్ని విరిచి పొయిలో పెట్టి సంధుల్ని సందుల్లో వదిలి
తెలుగును వెలుగును తగలేసి ఆ బూడిదతో కాఫీ కషాయం కాచినప్పుడు
నీలితెరలు నిద్రాణమైన ఓడలపై
కుత్తుకకత్తుల యుద్ధం చేసినప్పుడు
కొండమీద బండ !!
కొండకింద గుండు !!!
రెండింటికీ నడుమ ధనికరాక్షసి బ్లాక్‌మార్కెట్ ! బ్లాక్‌మార్క్ !!!
తమ్ముడూ !!!
నేనే కెప్టెన్నై, కర్ణధారినై, సామ్యవాదినై, అరుణ తారనై
నేనుకాని నేను నిద్రలేచి

ముందుకు ముందుకు మరీ ముందుకు
దూసుకుంటూ తోసుకుంటూ
బూజు దులుపుకుంటూ జూలు విదిల్చుకుంటూ
నింగీనేలా కలియనిచోట లయ వి
న్యాసంలో —
హాసంతో (?)
కదనప్రధనం ఆహవం రణరంగం సమరం యుద్ధం
చేసినప్పుడు, రక్తం క్రక్కుతూ (ప్చ్ !)
క్రూడ్ఆయిల్ యంత్రాల్లా
తంత్రాల్లా
ఇక్ష్వాకుల మంత్రాల్లా
మర మనుషుల్లాగా
జీవచ్ఛవాల్లాగా
డేగల్లా
ఈగల్లా
సిజర్లలాగా
రేజర్లలాగా
సీజర్లలాగా
బ్రిటనుల్లాగా
డేగల్లా
ఈగల్లా (ఈ పాదాలు కవిసమ్మేళనాల్లో ఒక్కోటి రెండుమూడుసార్లు చదవాలి.)
గలగల కలకల రాలినప్పుడు
కాలి
న
ప్ప
డు
వేల ఈనినప్పుడు
ఈ గేయ పావురం పైకెగిరినప్పుడు

తుఫాన్లో గిరికీలు కొట్టినప్పుడు
రెక్కలు కత్తిరించిందెవరన్నా !
ఏ దుష్టుడు? సంతుష్టుడు??
అమ్మమ్మా!! ? ? —— ——,

అరవై ఇంటూ ఐదులో మైనస్ ఒకటీ ప్లస్ ఒకటీ,
లవంగ ప్లవంగ వంగ అంగభంగం చేసినప్పుడు
నిట్టూర్పుల వేన్నీళ్ళ గులాబీలను కోసినప్పుడు కాల్చి
నప్పుడు
గుండెకింద ఘీంకారం
గుండెపైన ఒక ఘూకం
లోలోపల ఢాంఢాం !!!
అన్నా !!
ఓ అణ్
నా !!
ఇకలే !
తూర్పున తెల్లవారింది
కాకులు 'కావు' 'కావు' మంటున్నాయి
పిల్లులు 'మ్యావు'—మ్యావు'—మంటున్నాయి——
ముఖం కడుక్కో !
కాఫీ తాగు—
కారప్పొడితో ఇడ్లీలు తిను—
(కారం విప్లవానికీ తెల్లనిఇడ్లీ శాంతికీ సంకేతాలు- )
సాంబారులా బారుగా, నిలువుగా అడ్డంగా బక్కపలచగా
మన గీత పారావతాలు పారాలి
ఐరావతాలు రాలాలి—
షడ్దర్శనాలు షడంగాలు గోడమీా
ద
శీర్షాసనంవేసి నిల్చున్నాయి చూడు—
అరుణమైన ఆల్కమీా
కరుణలేని టూలమీా

కవిరాజులో బరాజు
జూలో జంతు వితంతువు—
!!!
హిప్ హిప్ హిప్పీ—హుర్రే !
లే లే లే—
రా రా రా !
బ్రహ్మజెముడు చంద్రుని కిక
లైన్ క్లియర్ ఇవ్వాలోయ్
రాకసి కసి సూర్యాని నుసి
రాల్చు—దటీస్—టు—బీ—డన్
లే
లే
లే
రా
రా
రా
హిప్ హిప్ హిప్పీ—హ్హుర్రే !!!

.!!!

[సూచనలు :

1. గ్రంథముద్రణలో ఈ గేయానికి ప్రతిఅక్షరానికీ, ప్రతిఅచ్చుకూ, హల్లుకూ కూడా కింద ఫుట్ నోట్సు ఇవ్వబడుతుంధి.

2. ఈ గేయాన్ని మీరు చదివేటప్పుడు దాని ఊగునూ తూగునూ అనుసరించి మీరూ ఊగుతూ తూగుతూ వుండాలి.

3. దీని భావమేమిటని నన్ను—ఇప్పుడుమాత్రం అడక్కండి. వ్రాస్తున్నప్పుడు ఆ పైవాడికొక్కడికే తెలుసు—ఇప్పుడు—అతడికీ తెలియదు— —సం॥ రచయిత.]

# అచ్చతెనుగు ప్రబంధము - సుపాణినీ పరిణయము

## శ్రీ కపిలవాయి లింగమూర్తి

నన్నయగారు మహాభారతమును తెనుగున వ్రాయుచున్నానని పలికినను రెండువంతుల సంస్కృత పదములు వాడక తప్పలేదు. ఆ పిమ్మట నన్నెచోడ తిక్కనాదులు తెనుగునందభినివేశము గనబరచినను సంస్కృతమును పూర్తిగా పరిహరింపలేదు. సాహితీ ప్రపంచమున సుమారు యిటులైదువందల యేండ్లనుండి యవిచ్ఛిన్నముగా సాగుచువచ్చిన ప్రథ, తమ భాషనే దేశమునంతటను వ్యాపింపజేయవలయునను తలంపు గలిగిన గోలకొండ నవాబుల కాలమున మారి యచ్చతెనుగు కావ్యముల కంకురార్పణ జరుగుట కాలపురుషుని లీలలం దొకటి యనకతప్పదు.

మల్కిభరాముని కాలమున వెలసిన పొన్నగంటి తెలగన్న అచ్చతెనుగుబాసయం దాదికావ్యమగు యయాతిచరిత్రకు శ్రీకారముచుట్టి సార్థకనాముడగుటయేగాక తానొక ప్రక్రియ కాద్యుడైనాడు. అతని యనంతరము పలువురి నా పద్ధతి యాకర్షించి శివకవులవలె, ద్విపదకవులవలె వారిదిగూడ నొక సాంప్రదాయము వెలసినది. దానినే నేటి కందుకూరి వరకు నాయాకాలములం దచట వెలసిన కవులు చేపట్టి గ్రంథరచన గావించుచునే వచ్చినారు. అట్టి వానిలో నీ సుపాణినీపరిణయ మొకటి. ఇది వట్టెము చెన్నకేశవస్వామి కంకితమైన మూడాశ్వాసముల ప్రబంధము. సుపాణినీకార్తవీర్యార్జునుల పరిణయ మిందలి యితివృత్తము.

దీనికర్త సంబరాజు రామచంద్రకవి. ఈతడు వట్టెముగ్రామనివాసియగు కరణము. నేటికి రెండు వందల యేండ్లలోపు వాడని జెప్పుదురు. కవిగారి వంశీయులు నేటికిని యచట కరణాలుగా నున్నారు.

వట్టెము మహబూబ్‌నగర్ జిల్లాలో నాగర్ కర్నూలునకు అనతిదూరముననున్న గ్రామము. పల్లెటూరైనను యచటగల వైదిక—నియోగి—చాత్తాద వైష్ణవులకు సంబంధించిన మూడు కుటుంబములందు పలువురు కవి పండితులు వెలసినారు. ఈ కవి తనను గుఱించి యాశ్వాసాంత గద్యమున—

'ఇది శ్రీ కార్తవీర్యార్జున సార్వభౌమాగణ్య కారుణ్యపాత్ర హరితసగోత్రా పస్తంబసూత్ర యజుశ్శాఖాధ్యయనపవిత్ర వట్టెంపురీ సంబరాడ్వంశనళినవనమిత్ర వేంకటాచలరాయ విద్వత్పౌత్ర నరసింగరాయశిరోమణిసత్కవి పుత్ర సరస కవితాధౌరేయ రామచంద్రనామధేయ మంత్రి ప్రణీతంబైన సుపాణినీ పరిణయంబను అచ్చతెనుగు ప్రబంధంబునందు ప్రథమాశ్వాసము.'

అని చెప్పుకొనియున్నాడు. ఈ గద్యమునుబట్టి కవి తాతగారు వేంకటాచలరాజు పండితుడు; తండ్రి నరసింగరాజు సత్కవి యని దెలియుచున్నది.

ఈ నరసింగరాజుపేర వట్టెము చెన్నకేశవస్వామి కంకితమైన 'లాలిప్రహరి' యను యముద్రిత లఘుకృతి యొకటి ఉన్నది. శ్రీ కృష్ణుడష్ట మహిషులతో క్రీడించి సుఖసుప్తి జెందుట యందలి యితివృత్తము. ఆ లీలా మానుష విగ్రహు డొక్కొక్క భార్యతో క్రీడించి నిద్రజెందినపుడు కవి యొక్కొక్క దిక్పాలకునిఒక్కొక్క శ్లోకము—వృత్తము—చూర్ణిక—ఏల —ద్విపద—దరువు—అష్టకము—హెచ్చరిక—అను నష్టవిధ ఛందఃప్రక్రియల ద్వారా యప్రమత్తతగా నుండి యా దిక్కును రక్షించు చుండుమని హెచ్చరిక పలికినాడు. రచనావిధానమునుబట్టి ఇది

యొక యపూర్వమగు సేవా ప్రబంధమని నేను భావించుచున్నాను. ఈ కవి కృత్యంతమున తనను గు ంచి

'భువి రాగజ్ఞుల కెల్ల సంతసము
నిష్పన్‌జేయు శ్రీ చెన్నకే
శవనామాంకితమై సుధీజనుల
కుత్సాహంబు దీపింప స
త్కవియౌ వల్లెము సంబరాజు
నరసింగం బార్యపాదాంబుజ
స్తవనీయుండు రచించె
నీ ప్రహరి నాచంద్రార్క సంస్థాయిగన్॥

అని చెప్పుకొనియున్నాడు. దీనినిబట్టి యిందు కవిపేరు దప్ప గోత్ర సూత్రాది యితర విశేషములుగాని, అతడు సత్కవియైనందుల కింక నేయే కృతులు రచించెనో వాని వివరములుగాని యెఱుగు నవకాశము లేదు.

రామచంద్రకవి సుపాణినీపరిణయమునే గాక, కార్తవీర్యార్జునశతకమును గూడ రచించెనని వినికిడి గాని, యది నాకు లభింపలేదు. వీనినిబట్టి చూడ నీకవి కార్తవీర్యార్జున భక్తుడై కనిపించును. ఇతడేగాక నీ గ్రామవాసియగు మరియొక కవి పుంగవుడు చింతలపల్లి వీరరాఘవకవి మధురవాణీవిలాసమను పేర వసుచరిత్రకు దీటుగా మరియొక కార్తవీర్యార్జున పరిణయమును రచించెను. దానినిబట్టి యతడుగూడ కార్తవీర్యార్జునభక్తుడే యనవలెను. రామోపాసన యం దాంజనేయునివలె దత్తాత్రేయోపాసనయందు కార్తవీర్యార్జునుని గొలుచుట గలదని మిత్రులు శ్రీ గుండూరు హనుమచ్ఛర్మగారు జెప్పిరి. కనుక నీ కావ్యములనుబట్టిచూడ నీ గ్రామపు కవులకు కార్తవీర్యార్జును డిష్టదైవమైనటుల దోచును.

నే నీ వ్యాసమున పేర్కొను సుపాణినీ పరిణయ,లాలిప్రహరి యను ప్రతులు నాకు శ్రీ వల్లెము రామచంద్రశాస్త్రిగా రాదరమున నిచ్చియున్నారు. వానిలో నీ సుపాణినీపరిణయమునకు వక్త చిల్కతపసి; శ్రోత కవ్వడియనుగుమనుమడు. లభించినంతవరకు గ్రంథమున కథ యిటులున్నది.

అనగాననగా నొక పట్టణము (పేరు దొరకలేదు). దానిని సుకేతు డనురాజు పాలించుచుండెను. వెన్ను డాతని హృత్పద్మమున లేటయై యొప్పుచుండెను. అతని యర్ధాంగికి—(ఆమె పేరుగూడ లభింపలేదు)—పెక్కు మొగలౌదవకున్న పుడమిచేడియ, చెలువుని విసము ద్రావబుచ్చుకున్న గట్టుపట్టి, అందరి నొక తీరుగా జూచిన కడలికూతురు, పదుగురితో వాదాడ కున్న నలువరాణి దీటునత్తురు. ఒకనా డా సుకేతుని సభకు జేజేని రాబారి యేతెంచి, పూజలంది 'ఓ రాజా! నీవు వెన్నుని యనుగ్రహమున నీలుడను సుతుని, సుపాణిని యను కూతురును గాంతువు. కూతురును వేయిబుజాలరేని కిత్తువు. అనంతరమున నీ పట్టణమున నాఁజేనిజాతర సాగును' అనిచెప్పి, యిందులకు నీవు రేగులకానకరిగి యెనిమిదక్కరముల మరుగు జపించుమని దానిని యుపదేశించి వెడలిపోయెను. నారదుడు వెళ్లినపిమ్మట సుకేతు డంతఃపురమునకు వెళ్లి పట్టమహిషిలో నా విషయము జెప్ప నామె 'మీతో గూడ కానకు నేను వత్తును!' అనెను. అంత సుకేతుడామె కడవియందలి భయంకరత్వమును, తపస్సు యొక్క కష్టమునుగుఱించి యుపన్యసించి, సమ్మతింపజేసి తానొక్కడే బదరికాశ్రమమున కేగి తపశ్చర్యకు బూనెను.

అటు లతడు పెక్కేండ్లు తపస్సొనర్పగా దాని కింద్రుడు జడిసి తపోభంగమున కచ్చరలేమలను బంపెను. అపుడు వారికంటె ముం దచట కాముని వెళ్లెను. ఆ వెనుక వలరాజు వెళ్లెను. తరువాత నచ్చరలు వెళ్లిరి. వారు సుకేతునిముందు తమ హావభావ విలాసములెల్ల ప్రదర్శించి వ్యర్థప్రయత్నులై మరలి యింద్రునిజేరి విషయమంతయు విన్నవింప నాతడు దేవతలనుగొని వైకుంఠమునకు వెళ్లి విష్ణువును దర్శించి, నుతించి. సుకేతుని విషయముజెప్పి. 'స్వామీ! మీరు వెళ్లి యాతనికి కోరిన వరములిచ్చి తపము విరమింపజేయుడు. మేము దానిని భరింపలేకున్నా'మని విన్నవించెను. అది విని వెన్నుడు 'ఇంద్రా! నేను సుకేతుని విషయమంతయు నారదు డతనిదగ్గరకు వెళ్లినదిమొదలుకొని యెఱుగుదును కనుక మీరు మీ మీ నెలవులకు వెళ్లుడు. నేను సుకేతుని కోరిక తీరు'పని పంపెను.

విష్ణువు వారిని బంపినపిమ్మట వర్షర్తువు వచ్చెను. అది గడచి శరదృతువు వచ్చెను. ప్రజలు ఋతువుల ననుసరించి చేయవలసినకార్యములందు, సలుపవలసిన పండుగలందు నిమగ్నులైరి. సుకేతు డదియేమియు తనకు బట్టకుండ తపోలీనుడై యుండ విష్ణు వాతని తపమునకుమెచ్చి ప్రత్యక్షమై వరము వేడుకొమ్మనెను. ఇప్పటికి ద్వితీయాశ్వాసము దాదాపు పూర్తిగావచ్చినది. కవి నారదుడు సుకేతునకు జెప్పిన విషయమున తన కథా ప్రణాళిక ప్రదర్శించినాడు గాన దానినిబట్టి యిక తక్కిన యాశ్వాసకథ యూహించుట దుష్కరముగాదు.

ఈతని శైలి యలతియలతి పదములతోగూడి ధారాశుద్ధితో నొప్పచున్నది. మచ్చునకు సుకేతుని రాజ్యమును తిలకింపుడు.

కలుగరు దొంగలెన్నటికి,
కల్గరు రంకులొనర్చు వారలున్
కలుగరు బొంకుమానినులు,
కల్గరు నేరముజేయు వారలున్
కలుగరు పేదసాదలును,
కల్గరొకప్పుడు మందుకైన, న
బ్బలుదొర యేలు నేలపయి
పన్నుగ వాని గొనంబు లేమనన్.

ధారవలెనే యతని వర్ణనలుగూడ తేటతేటమాటలతో సూటిగా నున్నవి. నారదుడు వెన్నునిగుఱించి చెప్పు సందర్భమును జూడుడు.

సిరిబోటియురమున జెలగుచుండెడివాడు
గుడుసుకైదువు సంకు గొనినవాడు
పుల్గుల దొరతేజి పొసగుచుండెడివాడు
కమ్మని విలుకాని గన్నవాడు
గాలిమేతరిపాన్పు గ్రాలుచుండెడివాడు
కొలుచువారికి సిరుల్ గూర్చువాడు
బంగారు దుప్పటి వలెవాటుగలవాడు
తులువ రక్కసిపిండు దునుము వాడు
తొగల చెలి తమ్మి మొగడు కందోయివాడు
వేల్పుగమికెల్ల ప్రాపుగా వెలయువాడు
జగములంతట తానయై నెగడువాడు
వెన్నుడనియును పేరు గైకొన్నవాడు.

వర్ణనలవలెనే భావములుగూడ యలతి యలతి మాటలతో నడచినవి. సుకేతుడున్న వనమున కామని ప్రవేశించినది. అపుడా వనముననున్న తరువులువేసిన చివురులు మదనుడు తెఱవలనఱికి యెత్తగా నెత్తుట బొత్తిల్లిన కత్తులవలె, తొడిగిన మొగ్గలు చిగురు బోడుల గుండెలు తల్లడిలజేయు నీటెలవలె నున్న వట! అరవిరిసిన మొగ్గలు తమను డాసి డాసి తిరుగుతేంట్లనుగని ఆస దోసమెరుగదని పిన్ననవ్వు నవ్వుకొనుచున్నటు న్నవట. అలరులతో నిండిన తరువులు జగములు గెలువబూనిన మరుని వెంటవచ్చిన యమ్ములబండ్లవలె నున్నవట. పూవులనుండి జారు మకరందము వెడవింటితపసి కొమ్మలతో నోమించు సందర్భమున వనలక్ష్మి కర్పించు జలమువలె నున్న దట. మనోహరమగు నిట్టి యచుంబిత భావముల కీ వసంతము తావలమై యున్నది.

అచ్చతెనుగు కావ్యముల రచించునపుడు కవి నెదుర్కొను ప్రధాన సమస్య సంజ్ఞావాచకములు. వాని ననువదించకున్న నియమభంగము. అనువదించిన రసభంగము. అందువలన వానిని తృప్తిగా నిర్వహించుట కష్టముకాని యట్టిపట్టుల నీతని యనువదింపు విశేషముగా నున్నది. చూడుడు సుకేతుని యాశ్రమమున కతని తపమును భగించుటకై యచ్చరలు వచ్చినారు. అపుడు

అనటి పేరందిన యచ్చర దొరసాని
మేలైన తొడగుల్క మ్రోలనాడె
నెలతఖ్కుపేరిటి నెలతుక చిఱునవ్వు
మొగమున చిగురింప వగలు సల్పె

నూమిన్న యనువేల్పులేమ ముక్కునతు
ముత్తెముల్ వెలుగొంద ముచ్చటాడె
పుత్తడి పేరొందు పూవుబోణి మెఱుంగు
మిఱుమిట్లుగొన పాట మెఱుగుజూపె
జింకపేరిటి జేజేల చిగురుబోడి
సోగకన్నుల ద్రిప్పుచు సొగసు నెఱపె
కొదమతెఱగంటి బోటులు కొసరికొసరి
వన్నెచిన్నెలు జూపిరి వలసినటుల

సాధారణముగా కావ్యములందు నాయకులు తపమొనరించు సందర్భమున కవులు తత్త్రదుతు నౌద్ధత్యమును వర్ణించి తన్మూలమున నాయకుని కష్టసహిష్ణుత్వమును వెల్లడింతురు. ఈ కవి యటుల గాక నా పట్టుల ఋతునౌద్ధత్యమునకు బదులు ప్రజల వేడుకలు వర్ణించి సుకేతుని వాని కతీతునిగా జూపినాడు. మానవులు ప్రకృతి వైపరీత్యములకన్న వేడుకలకు వినోదములకు చలింపకుండుటయే కష్టము. మనోధర్మమూలమైన ఈ రహస్యమును కవి చక్కగా నాకళించుకొని యిట తన్మూలమున విషయమున కుత్కర్ష సాధించుట యతని యపూర్వప్రతిభకు నిదర్శనము.

ఇక ఈతడు వర్ణించిన ప్రజాజీవిత మచ్చముగా తెలంగాణ ప్రజాజీవితమే. చూడుడు వర్షర్తువున

కొందరు వరిమొలు కలికిరి
కొందరు కరిగట్లొనర్చికొని రింపలరన్
కొందరు కలుపులు గలిచిరి
కొందరు వెలిచెల్క దున్నగడగిరి కాపుల్.

వర్షము కడబట్టినపిమ్మట సరదాకు మారురూపమగు 'దసరా' వచ్చినది. అప్పుడు

మరునాడుబ్బుచు రాచ...ల్తము
జిగామవ్వంపు పూదండ లొ
ప్పరహిన్దూకు గుఊాలతో
మిగుల తీవిన్మించి రాణించి, చి
త్తరు బంగార రదాలతో బలిసి
చెంతన్ గొల్చు బల్మూకతో
తర చేమంగుల సంపుతో జనిరి
పెద్దల్వెంటరా జమ్మికిన్.

స్వాతంత్ర్యమునకు పూర్వము ప్రతిగ్రామము నందు—అందును దొరలు జాగీర్దారులుగల గ్రామములందు—జమ్మికి వెళ్లెడు వేడుక సరిగా నిటులే జరుగుచుండెను. మా గ్రామము జినుకుంట వెలమ దొరల దగుటవలన నా చిన్నతనమున వారు దసరానాడు గుర్రములకు పూలదండ లలంకరించి వానిపై ఔడుదీయుచు, బండ్ల నలంకరించి వానిపై యూరేగుచు గానుపెద్దలు వెంటరాగా సరిగా నిటులే జమ్మికి వెళ్లుచుండిరి.

దసరా వెళ్ళగనే యన్ని పండుగలకు గొప్పదగు దీపావళి వచ్చెను. అపుడు,

సుంగళారతులంది సంపెంగనూనె
తలకు దోగించి వెంటనే జలకమాడి
మేలికోకలు నెసబూన్చి మిగులతొడవు
లొడల నలరించి నెత్తావు లదరదెసల

కులికెడు పూతలుస్ నిరులు
గ్రొంజిగిబట్టలుదాల్చి తియ్యనన్
బెలగెడు సన్నసెనె లొగి
బెన్నలరస్దిని రేయి ప్రొద్దులుస్
సలుపురుగాడి దుందుసులు
పాల్పడి ద్రిప్పుచు పూలబాణె మ
ల్లెలుగొని కాల్తరెల్లెడల
లేనుగుసుల్ మొగనాంద్రు నత్తరిన్.

బోగి తొలునాడు మరునాడు బోగినాడు
దాని మూడవనాడు నింపైనవేడ్క
తోడ పండుగ లొనరించి తోలుదాల్పు
వేల్పు బలునోము నోచిరి పెంపువెలయ.

తిరువళికెలు నుప్పరమున
మిరుమిట్లు గొనంగ వెదురుమేల్గడలందున్
సిరిమొగనికంచు మానిసు
లరుదుగ వెలిగించిరప్పు డన్నెలదాకన్.

అని దీపావళిపండుగను గొప్పగా వర్ణించినాడు. అదియేగాక యింకను హోళీ వసంతోత్సవములు, నవరాత్రులు వర్ణించి, నాయా ఋతుసందర్భములందు చాతుర్వర్ణములవారు తమతమ యిండ్లయం దాచరించు

వ్రతాదులు, వివాహాదిశుభకర్మములు దెలిపి తన కావ్యమును జాతీయజీవనవిలసితముగా దీర్చినాడు.

ఇటు లీ కావ్యము పరిమాణమున చిన్నదయ్యు ధారాశుద్ధితో, తేటతెల్లమగు వర్ణనలతో, నచుంబిత భావములతో, ఆగిటి—ఏగిలి- కరిగట్లు—దుందుమలు—పూలబాజెలు—మల్లెలు—వంటి తెలంగాణపు మాండలికములలో, తెలుగువారి జీవనవిధానముతో మనోహరముగా నున్నది.

మనయాంధ్ర భాషయం దిట్టి పరిణయ కావ్యములు పెక్కు వెలసినవి. వానిని సమగ్రముగ పరిశీలన జరిపిన, సాహిత్య, సాంఘిక చరిత్రలకేగాక పురాణ వాఙ్మయమునకుగూడ నెంతయో పుష్టి చేకూరగలదు. నేడు మనకు పురాణములందు ప్రసిద్ధులైనవారిని గుఱించియే యెన్నియో వివరములు దెలియవు. ప్రసిద్ధములైన రఘు— యదు వంశములందే యెందరివో భార్యల పేరులు దెలియవనుట కా రఘు యదువులే ప్రథమ నిదర్శనము. అంతేగాక మన పూర్వ గాథాల హరికిని, అలహాబాదునందలి హిందూస్తానీ అకాడమీవారు ప్రచురించిన హిందీ కథా కోశమునకు కథ లందెంతయో భేదము గనిపించును. కనుక మనకుగల కావ్య సంపదపై సమగ్ర పరిశీలన జరిపిన, దేశదేశమునకు భేదములతో ప్రవర్తిల్లిన పురాణకథలిందు ప్రామాణికేతివృత్తములు నిర్ణయించుట కాకృషి యెంతేని తోడగును. ఇది సాహిత్యఅకాడమీ వంటి బృహత్సంస్థ జేయవలసిన పని.

నా కీ సుపాణినీపరిణయ లాలిప్రహరి కృతులు శ్రీ వట్టెము రామచంద్రశాస్త్రి గారిచ్చుటయేగాక యీ వ్యాసరచన కెంతయో తోడ్పడిరి. వారికి నా కృతజ్ఞతలు. నాకు వారొసగిన సుపాణినీ పరిణయ ప్రతి యసమగ్రము. అందు ప్రథమాశ్వాసమున రాజవర్ణన మొదలుకొని ద్వితీయాశ్వాసమున వతనికి విష్ణువు ప్రత్యక్షమగువరకు మాత్రమే యున్నది. అప్పటికి దాదాపా యాశ్వాసము ముగియవచ్చినది. కావ్యప్రియులెవరైన దీని సమగ్ర ప్రతికై యత్నించి సాహిత్య లోకమున కెరిగింతురుగాక! అని నాకు లభించినంతవరకే కావ్యమునగల విశేషములు ముచ్చటించితిని. ఇట్టి కావ్యము లింక నెన్నెన్ని దేశమున నేయే మూలలందు మూలుగుచున్నవో! వానికి ప్రాణముబోసి రక్షించుకొనవలసిన బాధ్యత మనపై నున్నది.



# జుత్తిగ మండపం

## శ్రీ జి. ఆర్. వర్మ

జుత్తిగ ఆలయాలగూర్చిన సచిత్రంగా ప్రథమంగా పాఠకుల దృష్టికి తెచ్చాను. ('భారతి' ఏప్రిల్ 1969). చెదురు మదురు విషయాల సేకరించి అంతకుముందెవరూ వ్రాయని—ప్రకటించని విషయాల నూహించి నాకు తోచినవాటిని జోడించి ప్రకటించాను. గవర్నమెంటు ఎపిగ్రాఫిస్ట్ ఫర్ ఇండియా, తమిళ్నాడు మ్యూజియమ్ డైరక్టర్ డాక్టర్ సత్యమూర్తిగార్ల సౌజన్యంతో అచటి శాసనాలు, గూర్చి వ్రాసాను. కరవాల భైరవమండపం వీరవిజయాదిత్యుడు విజయచిహ్నంగా క్రీ. శ. 1031 - 35 మధ్య నిర్మించాడన్నాను. శ్రీ వాసుకీరవి సోమేశ్వర దేవునిపేరులో తన కుడిభుజంగా వున్న నాగకులభూషణ భీమరాజు, రాజమార్తాండ విజయాదిత్యుడు, హితుడైయున్న ఆహవమల్ల సోమేశ్వరుల పేర్లు సూచించేట్లుగా వీరవిజయాదిత్యుడు ప్రతిష్ఠించి యుండునా అనే ప్రశ్న.

శ్రీ తురగా కృష్ణమూర్తిగారు జత్తిగదేవుని ప్రతిష్ఠాత చక్రకూట సోమేశ్వరుడు తనవంశ(ధ్వజ) నామం (నాగ), హితుడు చంద్రాదిత్యుని పేరు తన పేరు—ఇద్దరు వ్యక్తులు-సూచించేట్లుగా క్రీ. శ. 1065—75 మధ్య ప్రతిష్ఠించెననీ కృష్ణాపుర శాసనంలో కళింగ వేంగీవిజయం, వేంగీ దహనం బిరుదులు ఈతని కున్నందున చక్రకూటేశ్వరుడు ప్రతిష్ఠించెననే నిర్ధారణకు దోహదకరంగా బస్తరుదంతేశ్వరిని ప్రతిష్ఠించెననీ, ఆమెయే జుత్తిగలో దూతికయనీ, మండప నిర్మాణకాలం క్రీ. శ. 1074 అనీ 'భారతి' జూలై 1970 సంచికలో ప్రచురించారు.

నా రెండోవ్యాసం 'జుత్తిగదేవుని ప్రతిష్ఠాత—చక్రకూటేశ్వరుని వేంగీ విజయం ?' శీర్షికను ప్రచురితమైనది (భారతి – మే, 1971).

చక్రకూటేశ్వరుడు, దంతేశ్వరికీ జుత్తిగ సంబంధంలేదనీ, మండప నిర్మాణకాలం క్రీ. శ. 1074 నాటి దనుకోడానికి అవకాశాల్లేకపోలేదనీ వ్రాశాను. కృష్ణాపురశాసనం నేజూడలేదు; చూడనక్కరలేదు. చక్రకూటేశ్వరుని వేంగీవిజయదహనాలు అసంభవంగాబట్టి అతడు ప్రతిష్ఠించుటా అంతేఅనే భానం ప్రకటించాను.

నా రెండో వ్యాసానికి సమాధానంగా శ్రీ మూర్తిగారి 'జత్తిగదేవుని ప్రతిష్ఠాత చక్రకూటేశ్వరుడు కాడా?' (భారతి—జూలై, 1971) ప్రచురించారు. శ్రీ మూర్తిగారి వ్యాసంలో మరొక 'విషయం', ప్రచురించినందున తప్పనిసరిగా మూడోసారి వ్రాయవలసివచ్చినది. ఓపినంతవరకూ నా భావాలు పాఠకుల ముందుంచుచున్నాను.

కృష్ణాపురశాసనం పూర్తిపాఠం శ్రీ మూర్తిగారు ప్రకటించలేదు. అందలి ప్రశస్తి విశ్వసిస్తూ సత్యాన్వేషణ, కనీసం సంభవాసంభవాల తర్కించుకోకుండా చక్రకూటేశ్వరుడు కళింగ వేంగీరాజ్యాల జయించి, దహించి క్రీ. శ. 1065-1075 మధ్య ప్రతిష్ఠించెననుటకు నేతిబీరకాయ—ఆధారం దూతిక—దంతేశ్వరి !

నా రెండవవ్యాసంలోనే కృష్ణాపుర శాసనపాఠం ప్రకటించగోరాను. కనీసం వారి రెండో వ్యాసంలో గూడా శాసనపాఠం ప్రచురించని కారణం వారికే తెలియాలి. వారి కాధారభూతమైన ఆ శాసన సంఘటనలు చక్రకూటేశ్వరుని పరంగా అనూహ్యం, అసంభవాలని పునరాలోచించమంటున్నాను.

గ్రంథాలు కొనడానిగ్గాని, కనీసం రాజమండ్రి వెళ్లి 'ఎపిగ్రాఫియా ఇండికా' చూచుటగ్గాని అశక్తుడుగా నున్నాను. చూడనవసరం లేదనుకొంటున్నాను.

శ్రీ మూర్తిగారికి కొండంత అండగావున్న ఆ శాసనం చూడకుండా, తెలియకుండా ఒక్కకలంపోటుతో శాస నస్థ విషయాలు కాదనే సాహసం—నేను అనుశాసిం చడం నాలో చూచిన శ్రీ మూర్తిగారికి మనవి. ఆ శాసనంలో ఆలయప్రతిష్ఠాపనగూర్చి ఏమీ ఉండదని ఊహించే అలా వ్రాశాను. కాదు అనేందుకు నా కందిన కారణాలు వ్రాశాను.

కాగా దేవుని ప్రతిష్ఠాపనగూర్చి శాసనంలో ఏమీ లభించకపోవడం శ్రీ మూర్తిగారు వారి రెండో వ్యాసంలోనే బైలుపడ్డారు.

పరిశోధకాభిప్రాయంలో సమకాలీన చక్రకూటా ధీశ్వరుడు ఒకానొక నృపభూషణుడు. వేంగీ రాజరాజు చరమకాలపు చక్రకూటేశ్వరుడు జగదేకభూషణ ధారావర్షుడు. ఇద్దరికీ సంబంధం లేదన్నారు పరిశోధ కులు. నాటి రాజకీయ చదరంగంలో ఆహవమల్ల సోమే శ్వరుడు కుమారవిక్రమాదిత్యుని బంపి చక్రకూటే శ్వరుని తన మార్గానికి దెచ్చుకొని వేంగీశ్వరునిపై తిరుగుబాటుగా స్వతంత్రంప్రకటింపజేసె నన్నారు పరిశోధకులు. వేంగీశ్వరుని చరమకాలాన కుమార రాజేంద్రచోడుడు (కులోత్తుంగ చక్రవర్తి) ధారా వర్షుని దర్పమడచి కప్పముగొని వచ్చినట్లు వ్రాశారు. తర్వాత సుమారు ఆరేండ్లకు చోళసింహాసన మాశి స్తున్న కుమార రాజేంద్రచోడునీ, నాటి వేంగీశ్వరుడు వీరవిజయాదిత్యునీ శిక్షింప చోళ వీరరాజేంద్రుడు చేసిన దండయాత్రలో—పోరిన కూమార రాజేంద్రచోడుని సైన్యాల్లో నొకానొక చక్రకూట జననాథ సోదరు డున్నట్లు వ్రాసివున్నారు.

రాజ్యము వీరభోజ్యమనే పద్ధతిలో చక్రకూ టంలోగూడా రాజ్యాధిపత్యానికి రెండువర్గాలు—ఇద్దరు వారసులున్నారన్నారు.(చక్రకోట్య—భ్రమరకొట్యములు)

శ్రీ మూర్తిగారు తొలివ్యాసంలో ఈ రెండు వర్గాల ఉనికి అంగీకరించారు. మధురాంతకుని (చక్రకోట్య)చంద్రాదిత్యునితో కలిసి ఓడించె నన్నారు. శ్రీ మూర్తిగారు చక్రకూట సోమేశ్వరుడు కుమార విక్రమాదిత్యునితో కలసి మధురాంతకుని సైన్యాల నోడించె ననలేదు.

చక్రకూటేశ్వరుల కులదేవత వింధ్యవాసినీదేవి అన్న పరిశోధకులే వేంగీశ్వరుల సామంతులైౖ వారి ననుకరించుటలో 'శ్రీ మాణిక్యదేవీ దివ్యశ్రీపాద పద్మారాధకుల' మన్నారి నాగకుల—నాగధ్వజ — భోగ వతీ పురీశ్వరులు అన్నారు.

నృపభూషణుడూ, జగదేకభూషణుడూ ఒక రైనా, వేర్వేరైనా జగదేకభూషణుని పేరులో రాష్ట్రకూటచ్ఛాయలున్నట్లే బిరుదులో కల చాళుక్య జగదేకమల్ల జయసింహుని ఛాయలూ ఉన్నట్లుంది.

సోమేశ్వరుడు ధారావర్షపుత్రుడైనా పేరులో అధిరాజులైన వేంగీశ్వరులపోలిక కాక కల్యాణి చాళు క్యుల పోలిక ఉంది. అలాగే ఈ సోమేశ్వరు డోడిం చిన మధురాంతకుని పేరు చోళ సాన్నిహితుడనే సూచి స్తుంది. కాంచీపుర చోళుల్లో మధురరాజ్యాన్నిగెల్చిన నాటినుండీ—క్రీ. శ. 10వ శతాబ్దంలోగూడా వారి బిరుదావళిలో మధురాంతక యన్నది ఉన్నది—పరకేసరి వర్మ మధురాంతకదేవ ఉత్తమచోళుడు—కథా కాలా నికి—పేరు చెప్పకపోయినా మధురాంతకదేవుడు పర కేసరివర్మ గంగైకొండ చోళరాజేంద్రుడు.

చక్రకూటరాజ్యాన్ని తమ చెప్పుచేతల్లో ఉంచు కోడానికి ప్రతిస్పర్థులు సామ్రాజ్యస్థాపనాకాంక్షులైన కల్యాణిచాళుక్యులూ, చోళులూ. శ్రీ మూర్తిగారి సోమేశ్వరుడు కల్యాణిచాళుక్యుల కాశ్రితు డనిపించును.

ఒక శాసనంలో ఉన్నంతమాత్రంచేత అదే శిరో ధార్యం అనుకోను. శాసనోక్త సంఘటనలు సంభ వమా అనే జిజ్ఞాసకావాలి. కథాకాలానికి కొలను పాక (కొల్లిపాక) వలె చక్రకూటంగూడా కీలక కేంద్రం. కాని వేంగీ, కళింగాలంత బలమైనదిగాదు. క్రీ. శ. 11వ శతాబ్దంలో కళింగాధిపతులు ముమ్మడి వజ్రహస్తదేవుడూ; తనయుడు అర్మడి దేవేంద్రవర్మరాజరాజు—ఇద్దరూ ఉద్ధతులే. కళింగం జయించి వేంగివచ్చి జయించి దహించె నన్నంత మాత్రంలో అది సంభవమా అనే ఆలోచన శ్రీ మూర్తిగారికి రాలేదు. చక్రకూటేశ్వరుడైన సోమేశ్వరునకు కళింగ, వేంగీరాజ్యాల గెల్చేటంత శక్తి, సైన్యము వున్నవా ?

నా రెండో వ్యాసంలోనే వ్రాసాను. ఆయా యుద్ధాల్లో పాల్గొన్న సామంత, మాండలిక దండ

నాథులు విజయానంతరం — తర్వాత అధిరాజుకున్న బిరుదావళిని వాడుకొన్న ఆచారం. శ్రీ మూర్తిగారు కాదనగలరేమో గాని పరిశోధకులు కాదనలేరు. కల్యాణి చాళుక్యుల వేంగీదండయాత్రల్లో పాల్గొన్నవారిలో చక్రకూట సోమేశ్వరు డొకడుగావచ్చును.

శ్రీ మూర్తిగారు నమ్ముకొన్న సోమేశ్వరుని ప్రశస్తి అతనిదై వుండదు. కల్యాణిచాళుక్యుల ప్రశస్తి అది. చోళ — కళ్యాణీచాళుక్య వైరాల్లో వేంగిలో చక్రకూటంలో రెండుపార్టీల సమర్థించే పార్టీలు రెండూ ప్రతిస్పర్ధులుగా ఉన్నారు.

ఇజీవ బెడంగ సత్యాశ్రయుని దండనాథుడు బయలునంబి దండయాత్రలో — వేంగిలో ఎనమదలను మరోదుర్గాన్నీ దహించినట్లు పరిశోధకులు గుర్తించారు. వేంగీశ్వరుడైన శక్తివర్మ ఓడిపోలేదన్నారు. జగదేకమల్ల ఇమ్మడి జయసింహుని దండయాత్ర విమలాదిత్యుడు త్రిప్పికొట్టాడన్నారు.

కథాకాలానికి వేంగీరాజరాజు చోళులకూ, వీర విజయాదిత్యుడు కళ్యాణిచాళుక్యులకూ హితులు.

క్రీ. శ. 11 వ శతాబ్దంలో వేంగీ దహన— విజయప్రశస్తి ప్రసక్తి ఎక్కువగా కల్యాణి చాళుక్య శాసనాల్లో చూడనగును.

కేవలం వాదానిగ్గాను శ్రీ మూర్తిగారి నిర్ధారణ అంగీకరిస్తే చక్రకూట సోమేశ్వరుడు జయించిన కళింగంలో ఏమైనా ప్రతిష్ఠించెనేమో తెలిస్తే శ్రీ మూర్తిగారే వ్రాయాలి. ప్రతిష్ఠించడానికి కొంత కాలవ్యవధి పడుతుంది. ఈ చక్రకూటేశ్వరుడు ఎంత కాలం వేంగిలో ఉన్నదీ శ్రీ మూర్తిగారే చెప్పాలి. క్రీ. శ. 1065—75 మధ్య వేంగీశ్వరుడు వీర విజయాదిత్యుడు. రాజధాని నేడు తూర్పుగోదావరి జిల్లాగా వున్నచోటగాని పశ్చిమగోదావరిజిల్లాలోగాదు. చక్రకూటేశ్వరుడు వేంగిని జయించి దహించివుంటే, రాజధాని, వేంగీశ్వరుల కులదైవం భీమేశ్వరునీ వదలి పశ్చిమగోదావరిలో విజయచిహ్నంగా శ్రీ వాసుకీరవి సోమేశ్వరుని ప్రతిష్ఠించెనంటే ఆ కారణం గూడా శ్రీ మూర్తిగారే చెప్పాలి.

క్రీ. శ. 11 వ శతాబ్దంలో వేంగిని జయించిన వారు విజయచిహ్నంగాగాన్ని వేంగిలో కొంతకాలమున్న వేంగీచాళుక్యేతరులుగాని ప్రతిష్ఠించిన వైనాలు ఏ పరిశోధకుడూ వ్రాయలేదు. వేంగీశ్వరుల హితులూ, శత్రువులూ దానధర్మాలు చేశారు. సమరైకభైరవ సత్యాశ్రయ ఇమ్మడి శక్తివర్మను జయించిన చేదిరాజు కూడా ఏమీ ప్రతిష్ఠించలేదు. భీమేశ్వరునకు కానుక నిచ్చిపోయినట్లు శాసనమున్నది. కలిదిండి శాసనాలు— సుధురాంతకదేవ రాజేంద్రచోళుడు ఆదేశించెనేగాని తానై వేంగిలో ఏమీ నిర్మించనూలేదు, ప్రతిష్ఠించనూ లేదు. వేంగిరాజరాజు చోళుల కాశ్రితుడన్నారు పరిశోధకులు.

కథాకాలానికి వేంగిలో ప్రతిష్ఠా—నిర్మాణాలు చేసినవారు వేంగీశ్వరులైయుండాలేగాని ఇతరులకు అవకాశంలేదు అనే నా నమ్మకం.

దంతేశ్వరి—దూతేశ్వరి—దూతిక:-శ్రీ మూర్తిగారు కృష్ణాపుర శాసన ప్రశస్తి విశ్వసించి తమ వాదానికి బలకరంగా బస్తరు దంతేశ్వరుని జుత్తిగకు తీసుకు వచ్చారు అని రెండోవ్యాసంలో వ్రాశాను.

వేంగీశ్వరుడైన శక్తివర్మ (క్రీ. శ. 10 వ శతాబ్దం) శాసనాల్లో జుత్తిగ దంతికసీమ. ఆలయ శాసనాల్లోగం దుత్తిక జుత్తిగ అయినది. ప్రజలు క్షేత్రనామాన్నిబట్టి (అంతర్బాదిక, బహిర్బాతిక) చిన్నవిగ్రహాన్ని దూతిక అనుంటారని వ్రాసానేగాని శ్రీ మూర్తిగా రన్నారనలేదు.

శ్రీ మూర్తిగారు రెండోవ్యాసంలో మాణిక్యేశ్వరీ — దంతేశ్వరీ ఒకరేనని నే నంగీకరించినట్లు వ్రాశారు. దక్షారామ మాణిక్యేశ్వరీ, జుత్తిగ దూతిక, శ్రీ మూర్తిగారి దంతేశ్వరీ, బస్తరు దంతేశ్వరీ ఒకరేనని నే వ్రాయనూలేదు, అంగీకరించనూ లేదు. 'మాణిక్యేశ్వరి (దంతేశ్వరి)' అని నే వ్రాయుటలో నాభావం వేరు.

నాటి చక్రకూటేశ్వరుల ఇలవేల్పు మాణిక్యేశ్వరి. కతిపయకాలపు బస్తరుసంస్థానాధీశుల (దక్షిణ బస్తరు; చక్రకూట) ఇలవేల్పు దంతేశ్వరి (దత్తి, దంతి)గా పరిశోధకులు మారె నన్నారేగాని నే నంగీకరించుట కాదు. క్రీ. శ. 11 వ శతాబ్దం— 1065—75 మధ్య చక్రకూటేశ్వరుల ఇలవేల్పు దంతేశ్వరియో కాదో నాకు తెలియదు. నాడు మాణిక్యేశ్వరే కావాలి.

రెండోవ్యాసంలో చక్రకూటేశ్వరుడే ప్రతిష్ఠించియున్న ఇలవేల్పు మాణిక్యేశ్వరికే—శ్రీ మూర్తిగారి 'దంతేశ్వరి'కే ప్రాధాన్యమిచ్చి మూలస్థానదేవరకు రెండోమెట్టు ఇచ్చేవాడని వ్రాసియున్నాను. దక్షారామంలో అమ్మవారు దిగువమెట్టులో లేదా అని శ్రీ మూర్తిగారి ఆక్షేపణ. అక్కడ వేంగీశ్వరుల కులదైవం భీమేశ్వరుడు. చక్రకూటాన్ని సాధించి వారి కులదైవాన్ని మాణిక్యేశ్వరిగా పత్నిగా నిల్పారు వేంగీశ్వరులు అన్నారు పరిశోధకులు. జుత్తిగలో అలాంటివేమీ లేవు సరికదా జుత్తిగ ఆలయశాసనాల్లో దంతేశ్వరి, దూతేశ్వరి, దూతిక, మాణిక్యేశ్వరి ప్రసక్తే లేదు.

కేవలం వాదాని కంగీకరించినా చక్రకూటం—బస్తరులో మాణిక్యేశ్వరి—దంతేశ్వరి అనే పేర్ల వాడుక మధ్యకాలం కొన్ని శతాబ్దాలుంటే కథాకాలానికి దక్షారామంలో మాణిక్యేశ్వరిగా వుంటే జుత్తిగలో దంతేశ్వరి, దూతేశ్వరి, దూతిక ఎందుకవుతుంది ? చక్రకూటేశ్వరుడే ప్రతిష్ఠించివుంటే ఒకేపేరిట రెండు విగ్రహాలు ప్రతిష్ఠించెనా ? జుత్తిగ దూతికలు క్షేత్ర పాలికలు గాకూడదా ? ప్రజలు క్షేత్రనామాన కతిపయ కాలాన జుత్తికబట్టి దూతిక లనియందురే గాని చక్రకూటేశ్వర ప్రతిష్ఠిత 'దంతేశ్వరి' మాత్రంగాదు.

పూర్వం వీరులు ప్రతిష్ఠించిన దేవుళ్లకు అమ్మవారి నమర్చ లేదనీ, రౌద్ర సూచనగ్నాను ఫాలాన నిటలాకు డనేందుకు లింగానికి లొత్త ఏర్పాటు, అందులో ఎర్రనికెంపు అమర్చే ఆచారం వుండేదనీ ఈ వరకే వ్రాశాను. కాగా ఆలయశాసనాల్లో అమ్మవారు ఉమ (దూతిక – దంతేశ్వరి, దూతేశ్వరి గాదు)ను కతిపయ కాలంలో ప్రతిష్ఠించిన వైనం తొలి వ్యాసంలోనే వ్రాసాను.

మహాకాంతారరాజ్యంలో ఒకప్పుడు స్తంభేశ్వరిని పూజించారు. ఆమె, వింధ్యవాసినీదేవి, మాణిక్యేశ్వరీ ఒకరో కాదో నాకు తెలియదు. చక్రకూట నాగ రాజులు అంతరించిన చాలాకాలానికి బస్తరు రాజులు దంతేశ్వరిని పూజించినట్లున్నది. కొందరు పరిశోధకులు ఆ మాణిక్యేశ్వరీ, నేటి బస్తరుదంతేశ్వరీ ఒకరే అని వ్రాశారు—నిర్ధారణ నాదేనకొని శ్రీ మూర్తిగారు దక్షారామమాణిక్యేశ్వరీ 'దంతేశ్వరీ' ఒకరేనని నే నంగీకరించా ననుకొన్నట్లుంది.

జుత్తిగలో ప్రతిష్ఠిత చక్రకూటేశ్వరుడైతే చిన్నవిగ్రహం, రెండుగా అనామకంగా వుండే అవకాశం లేదు. అతడే ప్రతిష్ఠించి ఉండిఉంటే మాణిక్యేశ్వరి గానే ఉండాలి. సోమేశ్వరుని నాటి వారి ఇలవేల్పు దంతేశ్వరిపేరిట పూజింపబడెనా ? పరిశోధకులు పేరు మారిందన్నారేగాని ఏనాటినుండో వ్రాయలేదు.

చక్రకూటేశ్వరుడే అమ్మవారిని ప్రతిష్ఠించి వుంటే మూలస్థానదేవతవద్దనే ఉండాలిగాని వేర్వేరుగా 'దూతిక'లుగా ఉండరు. కాగా కతిపయ కాలాన క్రీ. శ. 13 వ శతాబ్దంలో ఏఱువనాయకులు ప్రతిష్ఠించిన ఉమ వేరుగా 'దూతిక'ల పెద్దగా నిలచి

శాసనాల్లోనే గాదు నేటికీ వేంగి ఆలయాల్లో కౌశికీ కార్తికేయుల సంబంధం చాళుక్యుల కెక్కువగా ఉంది. జుత్తిగ ఆలయంలో 'దూతిక' కన్న, ఉమకన్న పెద్దవిగ్రహం కుమారస్వామిది వున్నది. శారద, అనీశ్వరి, పునీశ్వరి వగైరా పేరిట చిరుబొమ్మలు విడివడిన సప్తమాతృకల్లోని వనిపించును.

వీరుడు విజయచిహ్నంగా అమ్మవారిని నిల్పి వుంటే ఉగ్రరూపం ఉంటుందన్నాను. శ్రీ మూర్తిగారి కది దుర్గ్రాహ్యంగా ఉందంటే నేనేం జెప్పను ? జుత్తిగలో సోమేశ్వరుని 'దూతిక'నూ చక్రకూటేశ్వరు డేకకాలాన్నే ప్రతిష్ఠించె నంటున్నారు శ్రీ మూర్తిగారు. దక్షారామంలో ప్రతిష్ఠితలూ ప్రతిష్ఠాకాలం వేర్వేరని నే చెప్పాలా ?

దూతిక(లు) శ్రీ మూర్తిగారికి ముఖ్యదైవంగా కాన్పించెనేమోగాని శాసనాలంతటా ముఖ్యుడు మూలస్థానేశ్వరుడే.

కరవాలభైరవ మండప నిర్మాణకాలాని కచట అమ్మవారున్న సూచనలేదు. శ్రీ వాసుకీరవిసోమేశ్వరుడు మాత్రమే మండపశాసనంలో పేర్కొనబడినాడు. కతిపయకాలపు కాకతీయులనాటి (విష్ణువు) శాసనంలో వాసుకిని ప్రతిష్ఠించుట—ప్రజలు చెప్పుకునే వాసుకీ సూర్యచంద్రు లన్నట్లుగానే వున్నది. చక్రకూటం కాకతీయులు ఎరుగనిదిగాదు. చక్రకూటేశ్వరుడు,

దంతేశ్వరి వగైరా సంబంధం ఉండిఉంటే వీరభద్రరాజు మంత్రి, విష్ణువు, ఆ విషయం పేర్కొనేవాడేమో!

శ్రీ మూర్తిగారు తెచ్చిపెట్టిన దంతేశ్వరి వగైరా జుత్తిగలో మూలస్థానేశ్వరుని భార్యగాదు సరిగదా ఏనాడూ ముఖ్యదైవతంగాదు. వారి రెండు వ్యాసాలూ చూచాక నాకూ 'ధర్మసందేహం' కల్గింది.

క్రీ. శ. 1065 తర్వాత 'వేంగిని జయించి, దహించిన' చక్రకూటేశ్వరుడు నాటి వేంగిరాజధాని పరిసరాలు వదలివచ్చి జుత్తిగ (దుత్తిక, ఉుత్తిక)లో ప్రతిష్ఠించాడే అనుకొందాం. ఆ పొగలు—సెగలు ఆరక ముందే తన రాజ్యంలో తన శత్రువు (1065—75 మధ్య వేంగీశ్వరుడు విజయాదిత్యుడు) ప్రతిష్ఠించిన దేవుని ఎదుట రాజధానీ పరిసరాలు, (కులదైవం భీమేశ్వరుని) వదలి క్రీ. శ. 1074 ప్రాంతాల్లో వీరవిజయాదిత్యుడు స్మారకచిహ్నంగా కరవాలభైరవ మండప మెత్తించుట సంభవమా?

శ్రీ మూర్తిగారి— ప్రతిష్ఠాత చక్రకూటేశ్వరు డనే సిద్ధాంతం అసహజం, అసంభవం అనిపించినందున రెండోవ్యాసం ప్రచురించాను. శ్రీ మూర్తిగారి 'జుత్తిగ దేవుని ప్రతిష్ఠాత చక్రకూటేశ్వరుడు కాడా ?' రెండోవ్యాసంలో కాడనే సందేహం వారికీ కల్గిన సూచన లేకపోలేదు.

క్రీ. శ. 1065 తర్వాత సమీపకాలంలో వేంగిపై నెత్తివచ్చినవి చోళసైన్యాలు. నాటితో చక్రకూటసోమేశ్వరుడుండుట అసంభవం. కాగా ఆ యుద్ధంలో చోళరాజు జయించలేదనీ, శత్రువైనా వీర విజయాదిత్యునికి బాసటగా కళింగరాజరాజు నిల్చెననీ, ఒకవిధమైన సంధి జరిగెననీ, చోళరాజు పుత్రిక రాజసుందరి కళింగరాజరాజుకు భార్య అయినదనీ పరిశోధకులు వ్రాశారు. నా రెండో వ్యాసంలో కళింగ దండనాయకుడు వనపతిని పేర్కొన్నాను.

కరవాలభైరవమంటప నిర్మాణకాలాని కవుట పేర్కొనబడినది—క్రీ. శ. 11 వ శతాబ్దపు ఆరయు శాసనాల్లో ప్రసక్తికి వచ్చినదీ—ఒక్క సోమేశ్వరుడే. క్రీ. శ. 12—13 శతాబ్దాలనాటి శాసనాల్లో ఉమ, అల్లాడీశ్వర, భృంగీశ్వరుల ప్రసక్తిమాత్రమే ఉన్నది. ఒక్క ఉమాదేవినిగూర్చి దప్ప ఇతరమూర్తుల ప్రతిష్ఠ తల తెల్పే శాసనాలు లభించలేదు. అదంతా తొలి వ్యాసంలోనే వ్రాశాను. జుత్తిగలో ఇతరదైవాల ప్రతిష్ఠాపనగూర్చిన వివరాలు శ్రీ మూర్తిగారికి తెలిసి. వుంటే ప్రకటించగలరు.

ప్రతిష్ఠాపనలు, దేవాలయనిర్మాణాలు తెలిపే శాసనాలు చాలచోట్ల లేవనే సంగతి శ్రీ మూర్తిగా రెరుగరా? కొన్నిసందర్భాల్లో ఆలయం ఒకచోట, శాసనం వేరొకచోట; నిర్మాణ—ప్రతిష్ఠాపనాకాలం ఒకటి, వాటి నిరూపించే శాసనాలు వేరొకచోట, వేరొక కాలానివిగా ఉన్నవి. కొందరు దేవుని ఆకారం, పేరు వగైరాబట్టి 'జాతకాయ' వ్రాశారు. కొన్నిసందర్భాల్లో అంతకుముందున్న పేరుమార్చి మరోపేరు పెట్టడం జరిగింది. ప్రతిష్ఠించిన దొకరైతే గుడి కట్టించినది వేరొకరు. చేర్పులు, మార్పులు, ఆలయాలచరిత్రలో ఉండుట పరిశోధకు లెరుగుదురు.

ముగ్గురు వ్యక్తుల సూచించేదిగా ఉండా అనే నా సందేహానికి సిద్ధాంతంగా తీసుకున్న శ్రీ మూర్తిగారు స్వీయసిద్ధాంతాల్లో ఇద్దరుని సూచించేదిగా చేసిన సిద్ధాంతం ఇంత రావ్వంతాని కారణం — ఇద్దరిని సూచించుటలో మూడుపేర్లు అసహజం అనిపించింది.

వీరవిజయాదిత్యునికి వేంగీశ్వరుడుగా మున్నేరుకు అవలో పశ్చిమగోదావరి—పానార విషయ భాగం బలమైన కేంద్రంలని తోగటే వ్రాశాను. ఆపంటి సంబంధం వ్రాశాను.

జుత్తిగదేవుని ఎదుట మండప మెత్తించుటలో—కులదైవం భీమేశ్వరుని వదలి సోమేశ్వరుని ఎదుట—దేవునికీ వీరవిజయాదిత్యునికీ ప్రాంతీయ బలమేగాక మరో సంబంధమేదో ఉండి వుండు నని పించక పోదు. నా రెండోవ్యాసంలో శక్తివర్మ శాసనంలో పేర్కొనబడిన సకలేశ్వరనామ మహాదేవుని పేర్కొన్నాను. ఆ సకలేశ్వరుడే శ్రీ వాసుకీరవిసోమేశ్వరుడగునో కాదో పెద్దలు నిర్ణయించాలి. అలాగే ప్రతిష్ఠించుటనుగూర్చి పేటినర కే శాసనాధారం లభించకపోయినా ఆ సకలేశ్వరుడు లేక మరొకపేరిటి దేవునిపేరు ముగ్గురుపేర్లు సూచించేదిగా వీర విజయాదిత్యుడే మార్చెనేమో పరిశోధనీయమే.

కళ్యాణి సోమేశ్వరుడు క్రీ. శ. 11 వ శతాబ్దం పూర్వార్థంలో వీరవిజయాదిత్యునికి బహుథా హితుడు. వీరవిజయాదిత్యుని పాములవాక శాసనం నాగకులభీముని గూర్చినది. ఈ సందర్భంగా పేరు మార్చినా ప్రతిష్ఠించినా వీరవిజయాదిత్యుని కున్నంత అవకాశం దాడిచేసి పోయిన వాని కుండదు. కాగా కథాకాలాన వేంగేతరులు వేంగిలోచేసిన నిర్మాణాలు, ప్రతిష్ఠాపనలు నా దృష్టికి రాలేదు—ఒక్క శ్రీ మూర్తిగారి సిద్ధాంతం తప్ప.

చక్రకూటేశ్వరుని ప్రశస్తి సంఘటనలుగా శ్రీ మూర్తిగారిని నమ్మించిన కృష్ణాపుర శాసనస్థ విషయాలు మరే రెండో శాసనంలోనైనా ఆ సోమేశ్వరుని పరంగా ఉన్నవా ?

కరవాలభైరవ మండపం క్రీ. శ. 1031–35 మధ్యకాలపు విజయచిహ్నం అన్నాను. కాదు క్రీ. శ. 1074 దంటారు శ్రీ మూర్తిగారు. వారలా అనుకోడానికీ అవకాశాలున్నాయని నా రెండో వ్యాసంలో వివరించాను. నా తొలివ్యాసం ర్యాలిశాసన విషయాలెరిగి వ్రాసినదనే విషయం ఆ వ్యాసంలోనే సూచితం. శ్రీ మూర్తిగారు రెండో వ్యాసంలో చూపిన 'డిస్కవరీ' కరవాలభైరవ మండపాన్ని స్మారక చిహ్నంగా నిర్ధారణ చేయటం.

ఆలయశాసనాల్లో మండపస్తంభంపై వీర విజయాదిత్యుని అసంపూర్ణ శాసనం కనుమరుగై వుంటే అందరూ క్రీ. శ. 1255 లో ఉమాదేవిని ప్రతిష్ఠించిన ఏఱువనాయకులే కరవాలభైరవ నిర్మాతలనుకునేవారు.

సమకాలిక, సమీపకాలిక, పూర్వకాలీనుల్లో విజయాదిత్యు లనేకులున్నారు. కాని కరవాలభైరవ బిరుదాంకితు డీ మండపనిర్మాత మాత్రమే. లభించిన శాసనాల్లో జుత్తిగ మండపశాసనం, ర్యాలి శాసనాలు వీరవిజయాదిత్యు డన్నవి. పాములవాక శాసనం, దక్షారామ సోమలదేవిశాసనం, ఇమ్మడిశక్తివర్మ శాసనాల్లో 'వీర'వినా విజయాదిత్య, బెజయితదేవగా ఉన్నది.

అలాగే ర్యాలిశాసనాల్లో కరవాలభైరవ బిరుదాంచితుడుగా వున్నాడు. జుత్తిగ శాసనంలో వీర విజయాదిత్యు డెత్తించి నట్లున్నదేగాని ఆ బిరుదు లేదు.

పాములవాక శాసనంలో రాజరాజు 12 సంవత్సరాలు పాలించాక పదచ్యుతుడు గావడం కొంపాలొంగు. వగైరా గ్రామాలు వీరవిజయాదిత్యుడు భీమరాజు కీయటం వుంది. జుత్తిగ మండపశాసనం (13 వ రాజ్యవర్షం) పాములవాక శాసన సమీప కాలానిదిగా దలచాను. వీరవిజయాదిత్యునివిగాని నాటివిగాని మరికొన్ని శాసనాలు లభించనిదే నిర్ధారణ కనువుగాదు— అంతా ఊహగా వ్యవహరించాలి.

శ్రీ మూర్తిగారు పేర్కొన్నవన్నీ కాదనడానికి కంకణం కట్టుకోలేదు; కొన్ని విషయాలు ఆలోచనీయం, పరిశోధనీయం; కాదనను—

క్రీ. శ. 11 వ శతాబ్ది శాసనాలు— ఈ కథాకాలానికి సంబంధించినవి కొన్నిటి పరిగణన శకవర్షాలుగా, కొన్ని విజయరాజ్య వర్షాలుగా, కొన్ని శకవర్షంతోపాటు విజయరాజ్య సంవత్సరాలుగాఉన్నది. క్రీ. శ. 1072 ప్రాంతపు ర్యా 'విజయ రాజ్య సంవత్సరద్వాదశే' రాజరాజు మరణము, వీర విజయాదిత్యుని విజయము, ఇమ్మడి శక్తివర్మ పాలనా కాలం సూచించేదే—

పరిశోధకాభిప్రాయంలో కరవాలభైరవుని విజయం క్రీ. శ. 1031 ప్రాంతం, మరల క్రీ. శ. 1059 ప్రాంతం. అయితే క్రీ. శ. 1035 తర్వాతగూడా పరగండభైరవ—కరవాల భైరవుల మధ్య యుద్ధాలు జరిగినట్లు, మరో రెండుమూడు సార్లు రాజరాజు చోళులరాజ్యంలో తలదాచుకున్నట్లు

కొందరు పరిశోధకులు వ్రాశారు. కాని పరిశోధకు లెవరూ వీరా బిరుదులుదాల్చిన కాలనిర్ణయం చేయ లేదు. దాయాదుల నిర్జించి పరగండభైరవుడై రాజరాజు క్రీ. శ. 1022 ప్రాంతాన పట్టాభి షిక్తుడైనాడన్నారు. పరగండభైరవునిగెల్చి వీర విజయాదిత్యుడు కరవాలభైరవ బిరుదు దాల్చె నన్నారేగాని ఏనాటి గెలుపో నిర్ధారణలేదు. మొదటి విజయానికే ఆ బిరుదు దాల్చియుండరాదా? పరగండ భైరవుని 12 సంవత్సరాల పాలనానంతరం రాజ్యం లాక్కొని కరవాలభైరవుడైనాడనే దలచాను. కరవాల భైరవ బిరుదు ర్యాలిశాసనాల్లో మాత్రమే ఉన్నందున క్రీ. శ. 1059–60 గెల్పుతర్వాతనే ఆ బిరుదు దాల్చాడనేందుకూ అవకాశం లేకపోలేదు. అలాగే క్రీ. శ. 1065–6 ప్రాంతాలనాటి చోళ దండ యాత్ర (కళింగరాజరాజు బాసటకాగా) నరికట్టి ఆ బిరుదు దాల్చెననీ అనుకోవచ్చును. ర్యాలి శాసనాల పూర్వపువాటిలో లేకున్నా పరగండభైరవుడై పట్టా భిషిక్తుడైన రాజరాజుపై తొలిగెలుపులోనే కరవాల భైరవబిరుదు దాల్చాడని నా నమ్మకం.

ర్యాలి శాసనాల్లో కరవాలభైరవుడు 'సంతాన బలాయురారోగ్యైశ్వర్యాభివృద్ధ్యర్థం'గా తూర్పు గోదావరిజిల్లాలో గ్రామాలు దానం చేసినట్లుంది. క్రీ. శ. 1060 తర్వాత వీరవిజయాదిత్యుని మకాం తూర్పుగోదావరి.

మొదటి వ్యాసంలో ప్రసక్తిలేని విషయం శ్రీ మూర్తిగారు బహుశా తమ సిద్ధాంతబలార్థం— కరవాలభైరవ మండపాన్ని స్మారకచిహ్నం జేసిన వృత్తాంతం చెప్పారు.

క్రీ. శ. 1044 ప్రాంతాల్లో నిర్మించాడని నేనంగీకరించినా (అంగీకరించను), చరిత్ర వప్పుకో దంటారు శ్రీ మూర్తిగారు. అందుగ్గాను 'నిస్తేజిత వైరివీరుని' రెండో వ్యాసంలో ప్రవేశపెట్టారు.

రాజరాజును 'నిస్తేజితవైరివీరుని' జేసినది నన్నయ. అదైనా 'ఆంధ్రమహాభారతం'లోఅని జ్ఞాపకం. పరిశోధకాభిప్రాయాలబట్టీ చరిత్రబట్టీ రాజరాజు నిస్తేజితవైరివీరుడుగా వున్నది క్రీ. శ. 1021–31 మధ్య, క్రీ. శ. 1035–42 మధ్య, క్రీ. శ. 1048 తర్వాత, క్రీ. శ. 1058 పూర్వం అను కుంటాను. ఈ ఇద్దరు బిరుదులు దాల్చిన కాల నిర్ణయం సూచించే అదేకాలపు ఆధారాలు లేనంత వరకూ అంతా ఊహే కాని నిజంగా తీసుకోలేము.

కథాకాలపు శాసన కవులు వేర్వేరైనా లేఖకులు ఒక్కరుగానే వున్నట్లుంది. వీరవిజయాదిత్యుని శాసన లేఖరి గోకాచార్యుడు ర్యాలిశాసనాల్లో మాత్రమే కరవాలభైరవునిగా పేర్కొన్నాడు.

వీరవిజయాదిత్యుడు అన్ని శాసనాల్లో వీర విజయాదిత్యుడు, కరవాలభైరవుడుగా పేర్కొన బడలేదు. అలాగే రాజరాజు అన్ని శాసనాల్లోనూ పరగండభైరవుడుగా ప్రస్తుతింపబడలేదు. సమీప కాలికాలైన మూడుశాసనాలుచూస్తే కః శాసనంలో 'పరగండ భైరవు' డున్నాడు. రాజరాజు లేఖరి గండయాచారి.

కాబట్టి వారిర్వురి బిరుద ధారణాకాలం నిర్ణ యింపబడినగాని ప్రస్తుతాంశం ఒక కొలిక్కిరాదు.

పరిశోధకులు రాజరాజు క్రీ. శ. 1035 ప్రాంతాల్లో వీరవిజయాదిత్యుని ఓడించి బందీగా వుంచి భ్రాతృవాత్సల్యంచేత వధించక విడిచి పుచ్చాడని వ్రాశారు. ఎంతకాలం బందీగా వుంచాడు? ఎప్పుడు విముక్తుణ్ణి చేశాడు? తెలీదు.

శక్తివర్మ పాలనాకాలాన విమలాదిత్యుడు యువ రాజు. రాజరాజు భ్రాతృవాత్సల్యం వీరవిజయాదిత్యుని యువరాజు చేయించక రాజేంద్రచోడుని కా అర్హత కల్గించడం అంటే చోళరాజు కహితుడుకాలేక అన వచ్చును. పరిశోధకులనే భ్రాతృవాత్సల్యం సంగతి ఎలా వున్నా రాజరాజు రాజనీతి మెచ్చుకోవాలి— వీరవిజయా దిత్యుని బందీగా వధించి వుండివుంటే అనేకాంతః కలహాలు కల్గేవనే నా ఊహ.

వీరవిజయాదిత్యుడు వేంగిలో వున్నంతకాలం రాజరాజు నిస్తేజితవైరివీరుడు కాడనుకునే వారిలో నేనొకడిని.

రాజరాజు నిజంగా నిస్తేజిత వైరివీరుడుగా నున్నది క్రీ. శ. 1035–44 మధ్యగాదు. కల్యాణీ చాళుక్యులకు హితుడై—కలిదిండి యుద్ధానంతరం— కళ్యాణీచాళుక్యప్రతినిధి నారాయణభట్టు వేంగిలో

వుండగా, వీరవిజయాదిత్యుడు కల్యాణీచాళుక్య రాజ ప్రతినిధిగా నోలంబవాడిని పాలించినప్పుడు, నన్నయ 'మహాభారతం' ఆంధ్రీకరించిన కాలాన క్రీ. శ. 1051—7 మధ్యనే రాజరాజు నిస్తేజిత వైరి వీరుడు అని నా నమ్మకం.

పాములవాక శాసనంబట్టి, జుత్తిగ మండప శాసనం 13 వ విజయరాజ్య సంవత్సరం వీర విజ యాదిత్యుని మొదటి విజయంబట్టి కరవాలభైరవ మండప నిర్మాణకాలం విజయచిహ్నం; క్రీ. శ. 1031—5 మధ్య కాలానిదనే నా నమ్మకం. ఈ విజయరాజ్య సంవత్సరం రాజరాజు సంబంధం. ర్యాలి శాసనాలబట్టి జుత్తిగ మండపశాసనం 13 వ విజయ రాజ్య సంవత్సరం క్రీ. శ. 1073 ప్రాంతానిదగును. కాదనను కాని అది క్రీ. శ. 1031—5 మధ్యదీ, విజయచిహ్నం అనే నా నమ్మకాన్ని నిరూపించ లేక పోతున్నా, స్మారకచిహ్నం గాదనీ, క్రీ. శ. 1074 ప్రాంతానిదిగాదనే నమ్మకము శ్రీ మూర్తిగారు వమ్ము చేయలేరు.

వేంగీశ్వరులందరూ సర్వలోకాశ్రయులూ, విష్ణువర్ధనులే—జుత్తిగ శాసనాల్లో శకవర్ష విజయ రాజ్య సంవత్సరాలు—రెండూ పరిగణించిన శాసనాలు బట్టి (క్రీ. శ. 1069, 1075, 1126) ఏ విష్ణువర్ధన—సర్వలోకాశ్రయుడు జయించినదీ, మర ణించినదీ, పట్టాభిషిక్తుడైనదీ ఒక్క శాసన పరిశోధ కులు మాత్రమే చెప్పగల విషయం.

కలవాలభైరవమండపం త్వరితగతిని నిర్మిం చారనుకొన్న కారణం శిల్ప ప్రాధాన్యత లేకపోవడం— వీరవిజయాదిత్యుని శాసనం అసంపూర్ణం. క్రీ. శ. 1031—35 మధ్య నిర్మితమైవుంటే క్రీ. శ. 1060 తర్వాత వేంగీశ్వరుడైయున్న కరవాల భైర వుడు ఏ కారణాన శాసనం పూర్తి జేయించలేదంటే క్రీ. శ. 1059 వరకతని ఇబ్బందులో, వేంగిలో లేకుండుటో తర్వాత రాజుగా తూర్పు గోదావరిజిల్లాలో నుండుటయో, శ్రీ మూర్తిగారు పేర్కొన్న మనః క్లేశాలు, వృద్ధాప్యం వగైరాలో గావచ్చును.

క్రీ. శ. 1074 లో స్మారకచిహ్నంగా కరవాల భైరవ మండప నిర్మాణం జరిగెనన్న శ్రీ మూర్తి గారు క్లేశాలు, యుద్ధాలు, వృద్ధాప్యం కారణాలుగా శాసనం అసంపూర్తిగా ఉండిపోయెననేందుకూ అదే ఆధారం గావచ్చును.

ర్యాలి శాసనాధారంతో (క్రీ. శ. 1012) సమీపకాలంలో వీరవిజయాదిత్యుడు కరవాలభైరవ బిరుదాంకితుడైనాడు అనేందుకు సాధించిన విజయం లేదుగా? ఏదైనా ఉన్నదా? ఇమ్మడిశక్తివర్మ పట్టాభి షేక కాలానికి బిరుద సంబంధం ఎంతవరకున్నది?

నేను మొదటినుండీ కరవాలభైరవ మండపం వీరవిజయాదిత్యుని విజయచిహ్నం అంటున్నాను. శ్రీ మూర్తిగారు మొదటి వ్యాసంలో నిర్మాణకాలం క్రీ. శ. 1074 ప్రాంతానిదన్నారేగాని స్మారక చిహ్నంఅనే సూచనకూడా ఇవ్వలేదు. కాని రెండో వ్యాసంలో దానికి 'స్మారకచిహ్నం' ముద్రవేశారు. అందుకనువైన విషయాలు జోడించారు.

ర్యాలిశాసనాల్లో వీరవిజయాదిత్యుని ఆందోళన పుత్రవాత్సల్యంవున్నాయి.వేంగిని జయించి పట్టంకట్టిన జ్యేష్ఠపుత్రుడు వీరస్వర్గం వేంచేశాడు. తన అనం తరం పసివాడు రాజు కాగలడన్నది వీరవిజయాదిత్యుని కున్నదా అనేదే సందేహాస్పదం.

రోగనివారణకు, ఆరోగ్యానికి బ్రదికినంత కాలం ఆశతో ఎన్నోచికిత్సలు, మూఢనమ్మకాలు శాంతులు, దానధర్మాలు వగైరాలు—చిరకాలంనుండీ ఉన్న సార్వజనీనాచారం. రోగి మరణిస్తే ఏడ్చి ఊరు కోడం, ఏటా జ్ఞాపకాలు వగైరాలు ఉంటున్నవి.

వీరవిజయాదిత్యునివంటి కార్యశూరుడు, యోధుడు, బహుశా తన అనంతరం వేంగీశ్వరుడు రాజరాజు పుత్రుడని గ్రహించియే వుండును. బాలుని మరణానికి బేలపడిపోయివుండునా?

స్మారక చిహ్నాలుగా అనేక నిర్మాణాలు, తోటలు, పుణ్యకాలాల్లో దానాలు ఉన్నాయి. మరణించిన వానిని ఖననం లేక దహనం చేసిన చోటు గోరీలు, తులసి కోటలు, నందిని నిల్పే ఆచారం నేడూ ఉంది.

అయితే సార్వజనీనాచారంగా, అపకర్మల చేయించే వారి లెఖ్ఖనూ మరణించినవారుపిన్నలైతే అంత పట్టింపు తంతు తతంగా లుండవంటారు.

ర్యాలి శాసనాల్లో దానధర్మ కారణాలున్నవి. ఆ బాలు డెప్పుడు మరణించినదీ, మరణించిన వాసికై స్మారక చిహ్నాల నెలకొల్పటం రికార్డు కాలేదు. మరణించినది రాజధానిలో గావచ్చును. నాయనమ్మ యింట (ఆచంట) గావచ్చునుగాని జుత్తిగలో అయివుండదు. ఏ పరిశోధకుడూ వ్రాయలేదు. అదీగాక తూర్పుగోదావరిలోని వీరవిజయాదిత్యుడు పశ్చిమగోదావరిలో 'స్మారక చిహ్నం' ఎందుకు నిల్పెనో తెలియదు.

మండపా లెత్తించటం నాటి సమకాలిక, సమీపకాలపుటాచారంలో విజయచిహ్నమనీ, స్మారక చిహ్నాలుగా మండప నిర్మాణాలానాడు జరుగలేదనీ నమ్మటకు నాకు మరో ఆధారం; స్మారక చిహ్నం అయివుంటే ఏ మాదిరి సంతాపాది సూచనలు లేక కేవలం ప్రతాప సూచనగల 'కరవాల భైరవ' అనే పేరుండదే.

క్రీ. శ. 11 వ శతాబ్దంలో విమలాదిత్యునికి రాజరాజుగాని వీరవిజయాదిత్యుడుగాని స్మారక చిహ్నాలుగా మండపా లెత్తించలేదు. వీరస్వర్గం పొందిన ఇమ్మడి శక్తివర్మకు స్మారకచిహ్నంగా వీరవిజయాదిత్యుడే మండపం ఎత్తించలేదు. రాజరాజుకుగాని వీరవిజయాదిత్యునికిగాని స్మారకచిహ్నంగా కులోత్తుంగచోళు (రాజేంద్రచోడ) డేవిధమైన మండపము ఎత్తించలేదు.

అతిపురాతనంగా స్మారకచిహ్నా లున్నవి. బౌద్ధులస్థూపాలు చాలా స్మారకచిహ్నాలే—మరణించిన వారి పుణ్యంకోసం, సద్గతీ వగైరాలకోసం దాన ధర్మాలు చేయడం వగైరా బౌద్ధులనుండి నేర్చిన ఆచారం. బౌద్ధులు నాడు ప్రభువుల పుణ్యార్థం, ఆయురారోగ్యైశ్వర్యార్థం దానధర్మాలుచేసే ఆచారం విజయపురి — నాగార్జునకొండ చరిత్రల్లో ఉంది. జుత్తిగ, నత్తారామేశ్వరం ఆలయ శాసనాల్లోగూడా గుడికట్టించటం, పూదోటదానం, దీపదానం వగైరా ఉన్నాయేగాని మండపనిర్మాణమైనం లేదు.

నాటి సమకాలిక — సమీపకాలపు స్మారక చిహ్నాలు అఖండ దీపదానాలు, అగ్రహార దానాలతో పాటు లింగప్రతిష్ఠ — ఆలయ నిర్మాణంగా ఉన్నదేగాని మండపనిర్మాణం లేదు.

ఒకానొక కలిదిండియుద్ధంలో రాజరాజుకు రాజేంద్రచోళమధురాంతకదేవుని సేనాసహాయం అపారం అన్నారు పరిశోధకులు. క్రీ. శ. 1053 నాటిదన్నారా శాసనకాలం. కర్ణాట (కళ్యాణిచాళుక్య) సైన్యాలచే నిహతులైన దండనాయకులు ముగ్గురుకూ స్మారకచిహ్నంగా రాజరాజు కలిదిండి మరో రెండు గ్రామాలు కలిపి మధురాంతక నల్లూరనే పేరు పెట్టి దానంచేస్తూ చేసినది లింగప్రతిష్ఠ; ఆలయ నిర్మాణమూ మండప మెత్తించలేదు.

'ద్రమిల మణ్డలనాథానాం రాజరాజ బ్రహ్మ మహారాజ నామధేయా స్వభ్రాతులస్య మధురాంత! దేవస్యాజ్ఞాదేశం ప్రాప్య కర్ణాటదణ్డనాథైర్యుద్ధ్యే తైరేవహత్వం దినంగతవా నాశ్విన ... కలిదిణ్డిగ్రామే రాజరాజేశ్వర నిమిత్త శివాయతన...'

ఈ కలిదిండి శాసనం — మరణించిన చోళసేనా నాయకులకు స్మారకచిహ్నం వేంగిలో వేంగీశ్వరుడు ఆదేశంపై దేవుని ప్రతిష్ఠించి ఆలయం కట్టించెనన్నారేగాని మండపం గా

జుత్తిగ మండపం విజయచిహ్నం అంటున్నా నేను రెండో వ్యాసంలో ఇప్పు 'బిస్తా'గా బసవతిని పేర్కొన్నాను.

ఆహవమల్ల సోమేశ్వరునికి వీరవిజయాదిత్యుడు అంకకాడు. అంతరంగికుడు. రాజబంధువులు పోరే వీరుడు, అంతరంగికుడు. సమకాలికులు భువనైకమల్ల ఇమ్మడి సోమేశ్వరుని, త్రిభువనమల్ల ఆర్మడి విక్రమాదిత్యుని నాటికి వీరవిజయాదిత్యుడు సర్వస్వతంత్రుడు—రాజరాజు మరణానంతరం పాలించిన వీరవిజయాదిత్యుని కడుపులో చల్ల కదలకుండా ఉంచనివాడు చోళరాజు. వేంగిని రాజరాజు నాటివలె చోళరాజ్యాశ్రితం చేయ నిశ్చయించిన వీరరాజేంద్రచోళుడు అపారసైన్యాలతో వేంగిపై క్రీ. శ. 1066 ప్రాంతాల ఎత్తివచ్చాడు. కీర్తిమాత్రకంగా వీరవిజయాదిత్యుని తిరిగి తానే పదస్థుని చేసినట్లు వీరరాజేంద్రచోళుడు చెప్పు

కున్నను జరిగినది సంధి. ఆ సందర్భంలో వీర విజయాదిత్యునికి బాసటగా నిల్చిన, కళింగరాజరాజు చోళ రాజసుందరి నుద్వహించినట్లున్నది. క్రీ. శ. 12 వ శతాబ్దపు కళింగ శాసనాల్లో (అనంతవర్మ చోడ దేవగంగు — కళింగరాజరాజ రాజసుందరీ పుత్రుడుగూడా) ఆ విషయం ఉన్నది.

కళింగరాజరాజు దండనాయకుడు బణపతి. ఈతని దీర్ఘాసిశాసనం క్రీ. శ. 1075 నాటిది. ఈ బ్రాహ్మణవీరుడు '...ఆజావసౌ చోడనృపస్య సేనా మహావనస్యాశ్వమృగాకులస్య మత్తేభ సార ద్రుమ ......దావానలోభూ చ్చలమర్తిగండ'

ఈ ద్రమిళాహవవిజయచిహ్నంగా వనపతి 'సేనాని చేసినపని' దీర్ఘాసి భగవతీదేవి దేవాలయంబున ముందటం గడు ఘనతరమున మణ్డపం బెత్తించె భణ్డన విజయుణ్డు గణ్డగోపాలు ణ్డఖణ్డవర్తి దీవియబెట్టె నద్దేవికి...'

కరవాలభైరవ మండపం స్మారకచిహ్నంగా దంటున్నాను. విజయచిహ్నం అంటున్నాను.

కృష్ణాపుర శాసనం నమ్మిన శ్రీ మూర్తిగారు చేసిన సిద్ధాంతంతో ఎలా ఏకీభవించగలను? వేంగీ దహనాది బిరుదులు చక్రకూట సోమేశ్వరునివి గావనీ, కల్యాణిచాళుక్యులవనే విషయం ఎరుగవచ్చును. శాసనా లన్నీ శిరోధార్యాలని నేననుకోను. అందలి విషయాలు ఎంతవరకు నమ్మదగినవని ఆలోచించాలి.

జుత్తిగకూ ఆలయాలకూ చక్రకూట సోమే శ్వరునికీ, శ్రీ మూర్తిగారు తెచ్చిపెట్టిన దూతేశ్వరికీ సంబంధంలేదు—కరవాలభైరవ మండపం స్మారక చిహ్నంగాదు- విజయచిహ్నం—క్రీ. శ. 1031–5 మధ్యకాలానిది—అనే నా నమ్మకం. జుత్తిగదేవుని ప్రతి ష్ఠాత వీరవిజయాదిత్యుడేఅనే సందేహమేగాని నా నిర్ధా రణగాదు.

అవన్నీ సిద్ధహస్తులైన పరిశోధకులు నిర్ధా రణ చేయదగినవి.



# గ్రంథవిమర్శలు

## "కేశవసుత్"

[గ్రంథకర్త: ప్రభాకర్ మాచ్వే; ఆంగ్లీకర్త: ఎస్. సదాశివ, ప్రచురణ కర్తలు: కేంద్రసాహిత్య అకాడమీ, న్యూఢిల్లీ, 1970; పేజీలు: 64; వెల: రూ. 2–50.]

భారతీయ సాహిత్యనిర్మాతలు అనే వరసలో వివిధ భారతీయభాషలలో మహాకవులనుగురించి సమర్థులైనవారిచేత ఇంగ్లీషులో పుస్తకాలు రాయించి కేంద్ర సాహిత్యఅకాడమీ ప్రకటిస్తున్నది. ఈ వరసలో నార్ల వెంకటేశ్వరరావుగారు వేమన వీరేశలింగం గార్ల గురించి రాసిన పుస్తకాలు ఇంతకుముందే వచ్చినై. ఇప్పుడు గురజాడ అప్పారావుగార్నిగురించి రాస్తున్నారు. గిడుగు రామమూర్తి పంతులుగారినిగురించి అడపా రామకృష్ణ రావుగారిచేత రాయిస్తున్నారు. ఈ పుస్తకాలను మళ్లీ వివిధభాషల్లోకి అనువదించే ప్రణాళికకూడా ఒకటుంది. అట్లా తెలుగులోకి అనూదితమైన పుస్తకమే ఈ 'కేశవ సుత్'.

కేశవసుత్ (1866–1905) పందొమ్మిదో శతాబ్దపు మరాఠీకవి. వీరేశలింగంగారికి, గురజాడ అప్పారావుగారికి సమకాలికుడు. ఆంగ్ల విద్యాప్రభావం వలన బయలుదేరిన భారత సాంస్కృతిక పునరుజ్జీవన కాలానికి సంబంధించినవాడు. ఆధునికభావాలు, ప్రజాస్వామ్యభావాలు ప్రచారం చేసినవాడు. బ్రహ్మసమాజ మతాభిమానిలా కనిపిస్తాడు. ఈ కవి జీవితం—సాహిత్యం గురించి 35 పేజీల వ్యాసం ఈ పుస్తకంలో ఉంది. అతని 14 కవితలకు తెలుగులో చేసిన అనువాదాలుకూడా ఉన్నై. దీన్నిబట్టి ఈ కవి జీవితవిశేషాల్ని, కవిత్వాన్ని మనం తెలుసుకోవచ్చు.

ఈ పుస్తకంలో కవిని మెచ్చినవారి అభిప్రాయాలనేగాక, మెచ్చనివారివిగూడా ఇయ్యటం ఈ పుస్తకంలో ప్రత్యేకించి చెప్పుకోదగిన విశేషం.

భారతీయ మేధావులు ఇంగ్లీషువారి ప్రజాస్వామ్యాదర్శాలవల్ల ప్రభావితమయి 19 వ నుంచి సంస్కరణభావాలు ప్రచారం చేశారు. సాంఘిక దురాచారాల్ని ఖండించటం అందులో ఒకభాగం. ఈ కాలపు భిన్నభాషారచయితల్లో కొన్నిసామాన్య లక్షణాలున్నై. వాటిని ఈ కిందివిధంగా వేరుచేసి చూపించవచ్చు. 1. సంఘసంస్కరణ, 2. దేశభక్తి, 3. ప్రకృతి ప్రశంస, 4. విశ్వమానవప్రేమ, 5. అశరీరప్రణయం (Platonic love). ఇవన్నీ 'కేశవసుత్' కవిత్వంలో ఉన్నట్టుగా మనం ఈ పుస్తకాన్నిబట్టి గ్రహించవచ్చు. తెలుగులో సంఘసంస్కరణ ప్రధాన లక్ష్యంగా వీరేశలింగంగారు రచన చేశారు. వీరిద్దరిమీదా బ్రహ్మసమాజమతంవారి ప్రభావం ఉంది. గురజాడ అప్పారావుగారి కవిత్వంలో పైన పేర్కొన్న లక్షణాలన్నీ ఉన్నై. అందువల్ల కేశవసుత్, అప్పారావుగారి భావాలకు సామ్యం కనిపిస్తుంది. వాటిలో కొన్ని ఈ సమీక్షలో ప్రస్తావించబడతై.

కేశవసుత్ గురజాడ అప్పారావుగారికన్నా కవితా రచనలో కొంత సీనియర్. అప్పారావుగారి కవితా రచనాకాలం 1910 ప్రాంతం. కేశవసుత్ రచనల్లో కొన్ని 19 వ శతాబ్దం దాటినా, ఎక్కువభాగం 19 వ శతాబ్దపు చివరి సంవత్సరాల్లో రాసినవే. అయితే అప్పారావుగారు కేశవసుత్ కవిత్వాన్ని చదివారనటానికి ఆధారాలు లేవు. వీరి కవిత్వాలమధ్య సామ్యం కాలప్రభావంవల్ల వచ్చిందే.

అప్పారావుగారు వర్ణధర్మాన్ని నిరసించారు. 'మంచి అన్నది మాలఅయితే మాలనే అగుదున్' అని ప్రకటించారు. కేశవసుత్‌కూడా 'హరిజన బాలకుని తొలి ప్రశ్న' (1888) అనే కవితలో 'దారిపక్క ఆడుకుంటున్న హరిజన బాలకుణ్ణి ఒక బ్రాహ్మణుడు తరముగా ఇంటికొచ్చి 'నానీడ అతనిపైపడితే ఏమిటి? ఏమికీడు మూడుతుంది?' అని తల్లిని అమాయకంగా అడుగుతాడు. 'నవసైనికుడు' (1888) అనే కవితలో 'బ్రాహ్మణ్ణీకాను, హిందువునుకాను, ఏ జాతివాణ్ణీ కాను' అని ప్రకటిస్తాడు.

'మనిషిచేసిన రాయిరప్పకి మహిమ కలదని సాగి మొక్కటా'న్ని అప్పారావుగారు ప్రశ్నిస్తే' 'విగ్రహాలు పడగొట్టండి' త్వరపడండి అని 'మూర్తిభంజనం' (1905) అనే కవితలో కేశవసుత్ ప్రబోధించారు. వీరిద్దరూ విగ్రహారాధనని మాత్రమే వ్యతిరేకించారు. కాని సంపూర్ణ నాస్తికులైనట్టు బలమైన ఆధారంలేదు.

గురజాడ అప్పారావుగారు 'దేశభక్తి' గీతంలో రాజకీయ స్వాతంత్ర్యాన్ని గురించి ప్రస్తావించలేదు. రాజకీయ స్వాతంత్ర్యానికి ఆయన వ్యతిరేకిఅని అర్థం చేసుకో గూడదు. 1908 మద్రాసు కాంగ్రెసు సభలను అవహేళనచేస్తూ (Psalm) అని ఇంగ్లీషులో రాసిన లఘుపద్యం కాంగ్రెసు సభలలో జరిగే ఫార్సును చూపించటానికే రాశారు కాని స్వాతంత్రోద్యమాన్ని వ్యతిరేకించటం ఆయన ఉద్దేశంకాదు. స్వాతంత్ర్యాకాంక్షను ఆయన కవితారూపంలో ఎక్కడా వెల్లడించలేదు. కేశవసుత్ మాత్రం తన స్వాతంత్ర్యకాంక్షను స్పష్టంగా వ్యక్తీకరించారు. 'ఒక భారతీయుని పలుకులు' (1886) అనే కవితలో—

'ఓ దేవా! ఈ దాస్యపు చీకటిరాత్రి
ఎప్పు డంతరించును ?
స్వాతంత్ర్య భానూదయము
మరల ఎప్పుడగును ?
ఈ పంజరమునుండి
ఎప్పుడు విడివడుదుము దేవా ?
మా జాతికి మరల
పూర్వవైభవ మెపుడు లభించును ?'

అని ఆవేదన పడతాడు.

గురజాడ అప్పారావుగారు కేవల ప్రకృతిచిత్రణ లక్ష్యంగా నీలగిరిపాటలు రచించారు. కేశవసుత్ రాసిన 'దీవాళీ, దీవాళీ' అనే కవితలో మొదటిభాగం 'పర్జన్యావత్' అనే కవిత ప్రకృతి చిత్రణకు ఉదాహరణలుగా ఇయ్యబడ్డయ్. సమకాలీన సమాజంనుంచి నిర్జనారణ్యంలోకి పోవాలన్న కాంక్షకూడా వ్యక్తం చేస్తారు.

'దూరాన ఎచటనో ఒంటిగా వెళ్లవలె' అన్న కవితలో

ఎన్నో తడవలు మనస్సు విరిగినది
ఎన్నియో ఆశలు చచ్చిపోయినవి
వాని నన్వేషించుచు, 'ఏకతార' పుచ్చుకొని
నిర్జనారణ్యములకు వెళ్లవలె.'

అన్న కాంక్షను వ్యక్తపరిచారు. ఇందులో మొదటి రెండు పాదాలు అప్పారావుగారి

'పెరిగి విరిగితి, విరిగి పెరిగితి
కష్టసుఖముల పారమెరిగితి
పండువన్నవి ఆశలెన్నో
ఎండి రాలగ బొగిలితిన్'

అన్న పాదాలను గుర్తుకు తెస్తున్నై.

''బ్రాహ్మణ్ణికాను హిందువునుకాను, ఏ జాతి వాణ్ణికాను. విశ్వమంతా వ్యాపించివున్న పతితుల్లో నేను''. 'నా ప్రపంచానికి అవధులు లేవు' అని కేశవసుత్ ఎల్ల లెరుగని విశ్వప్రేమను బోధించారు. 'ఎల్ల లోకము ఒక్క ఇల్లయి, వర్ణభేదములెల్ల కల్లయి' అన్నచోట అప్పారావుగారూ ఇదే బోధించారు.

ప్రాచీన సాహిత్యంలో స్త్రీ పురుషుల ప్రణయంలో శరీరసమాగమమే ప్రధానాంశం. అప్పటి రాచరిక వ్యవస్థ అందుకు కారణం కావచ్చు. ధనస్వామ్య వ్యవస్థవల్ల వచ్చిన మార్పుల్లో ఒకటి సాహిత్యంలో ప్రేమకు దివ్యత్వాన్ని కల్పించటం. దీన్నే 'ప్లెటానిక్ లవ్' అంటారు. తెలుగులో రాయప్రోలు సుబ్బారావుగారు ఎక్కువగా ప్రచారంచేసినా దీని ప్రస్తావన గురజాడ అప్పారావుగారి కవిత్వంలోకూడా

'మరులు ప్రేమని మదిదలంచకు
మరులు మరలును వయసుతోడనె
మాయమర్మం లేని నేస్తమె
మగువలకు మగవారి కొక్కటె
బ్రతుకు సుకముకు రాజమార్గము'

అని కాసులు అనే ఖండికలో రాశారు. 'కేశవసుత్' కూడా 'ప్రేమదివ్యము. అలౌకికము' అని అంటారు.

గురజాడ అప్పారావుగారిలాగే కేశవసుత్ కూడా ఎక్కువగా మాత్రాఛందస్సునే స్వీకరించారు. 'అతని కవిత్వమంతయు ఒక చిన్నపాటి సంకలనమున సర్దు

కొనినది'అని కేశవసుత్‌ని గురించిఅన్నమాట అప్పారావుగారికి కూడా వర్తిస్తుంది. వీరిద్దరూ ఆయా సాహిత్యాలకు వైతాళికులుగా పరిగణించబడుతున్నారు. ఒక భేదంమాత్రం కనిపిస్తున్నది. అప్పారావుగారు హాస్య ప్రియుడు. కేశవసుత్ సీరియస్‌కవిలాగా కనిపిస్తాడు.

కేశవసుత్ అప్పారావుగారికన్నా సీనియర్‌కవే అయినా కొన్నివిషయాల్లో, అప్పారావుగారికన్నా ముందున్నారనిపించే కవితలు కొన్ని ఉన్నై. 'తుత్తారీ' (1893) అనే కవితలోని ఈ భాగాన్ని చూడండి.

నియమాలు మనుషులకోసం
మనిషి నియమాలకోసంకాదు.
అభ్యుదయాన్ని అటకాయిస్తే
అలాటి నియమాల్ని ఆవలికి నెట్టండి
మీ నూత్నశక్తిని ప్రదర్శించండి.
ఘాతుక ప్రతిబంధకాలపై
దండెత్తండి, తరలిరండి
వీరుల్లారా 'హరేహర'అంటూ
ఆవేశంతో, ఆగ్రహంతో
అభ్యుదయపతాకాన్ని ఎత్తండి'

ఇది 19 వ శతాబ్దంలోనే రాయబడ్డ గీతం అంటే ఆశ్చర్యంవేస్తుంది. సమాజాన్ని మార్చటానికి ప్రతిఘటన అనుసరించమని ప్రబోధించే కవి తెలుగుదేశానికి ఒక 40 ఏళ్ళతరవాతగాని దొరకలేదు. శ్రీ శ్రీ మహాప్రస్థానం గీతాన్ని పై గీతం గుర్తుచేస్తున్నదంటే కేశవసుత్ తన కాలానికి ఎంతముందున్నాడో మనం గుర్తించవచ్చు. శ్రీశ్రీలాగా కేశవసుత్ అక్కడ కమ్యూనిజాన్ని బోధిస్తున్నాడని మనం భ్రమపడగూడదు. మార్క్సిస్టుభావాలు మనదేశంలోకి అప్పటికి రాలేదు. శ్రీశ్రీ మహాప్రస్థానానికి కేశవసుత్ 'తుత్తారీ'కి ఉన్న పోలికలుచూస్తే శ్రీశ్రీకి కేశవసుత్ కవిత్వంతో పరిచయముండుండా అనిపించేంత సన్నిహితంగా ఉన్నై. అయితే పోలికలున్నచోటల్లా ఆ విధంగా ఊహించటం కుదరదు. కాకపోతే కేశవసుత్ తన కాలానికి ఎంత ముందున్నాడో చూపించటానికే ఈ పోలికలు చూపించబడ్డై.

ఇతర సాహిత్యాలతో మన సాహిత్యాన్ని అంచనా వెయ్యటానికి ఇట్లాంటి పుస్తకాలు చాలా అవసరం. ఈ పుస్తకానికి తెనుగు అనువాదం 'సరళ గ్రాంథికం'లో జరిగింది. కవితానువాదం భావానువాద పద్ధతిలో జరిగింది. నేరుగా మరాఠీనుంచి తెలుగులోకి మాత్రా ఛందస్సుల్లోకి చేయిస్తే కేశవసుత్‌కి ఇంకా న్యాయం జరిగిఉండేదేమో.

—చే. రా.

Printed and Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7 Thambu chetty Street, Madras-1, Editor : S. Sambhu Prasad.

# భారతి

మాసపత్రిక

సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

మే 1972

సంపుటము : 49 సంచిక 5 :

విడిపత్రిక వెల ఒక రూపాయి

# వి ష యా ను క్ర మ ణి క

## మే 1972

# నిరీక్షణ

## శ్రీ గడియారం శేషఫణి శర్మ

నీతో నా అనుబంధం
అంతులేని గేయ ప్రబంధం
ఇప్పటి నా ఉచ్ఛ్వాస నిశ్వాసాలు
నియోగపు విషమాశ్వాసాలు.

నీవు లేవు
మలయ పవనాలు లేవు,
మధుర కవనాలు లేవు
ఇప్పుడు నా చుట్టూ
నిశ్వాస శిశిర సమీరవీచికలు
ఆశల మరీచికలు.

ఏకాంతంలో
నా కందోయి
శోకాశ్రువులు వర్షిస్తుంది,
ప్రణయినీ కేళిదీర్ఘికలో
పన్నీరు పరిమళిస్తుంది.

శక్రధనుశ్శకలంలా కలం
అశ్రువర్షాగమం సూచిస్తుంది,
నిశ్వసన తప్త వర్ణాలతో
నిశాగీతాలు లిఖిస్తుంది.

నిద్రాదరిద్రిణమైన
నిశా సమయంలో
ఎక్కడో ఆశాంచలాల్నుండి

# భా ర తి

నీ పిలుపు నీరవంగా వినిపిస్తుంది
కరిగి నురగలై పారిన
నా హృదయపు పెనుకడలిలోని
మౌన తరంగాలపై
నిశ్శబ్దంగా వినదిస్తుంది.

నాకు తెలుసు
ఎప్పుడో నీవు వస్తావని
తప్పకుండా వచ్చేస్తావని,
గుడ్డిచీకటి పరుచుకున్న
గుండెల తలుపులను
తెల్లగా తెరుస్తావని
నాకు తెలుసు.

అంతదాకా
ఆశల అంతరాగ్ని లందిచ్చే
హవిస్సులు భుజిస్తూ
అనిమేషత భజిస్తూ

నిలిచి నిలిచి
నీకోసం నిరీక్షిస్తాను,
యుగయుగాలు
నీకోసం జీవిస్తాను.



# సాహిత్యంలో సింబాలిజమ్

శ్రీ కొడవంటి లీలామోహనరావు

వస్తువులోను, శిల్పంలోను, శైలిలోను రచయిత క్రొత్తపుంతలు తొక్కుతూనే ఉన్నాడు. నవ్యత కోసం ఆరాటం, సంస్కరణకోసం దీక్ష, ఒరిజినాలిటీ మీద మక్కువ చూపుతూనే ఉన్నాడు. ఒకప్పటి ఉపమానాలూ, వర్ణనలూ అసహ్యించు కుంటున్నాడు. ప్రతీదీ వాచ్యంగా—ఉపాధ్యాయుడు బోధపరచినట్లుగా—చెప్పడం మనస్తత్వపద్ధతికి విరుద్ధం అని భావిస్తున్నాడు. తన మనసులో రేగే భావసంచలనాన్ని పాఠకునికి స్ఫురించేటట్లు చేయాలి. అతని ఆలోచనకి, గ్రహింపుకి స్వాతంత్ర్యం ఇవ్వాలి. ఒక వస్తువును చూసినప్పుడు తనలో ఏవిధంగా ఆలోచనలు రేగాయో అదే పద్ధతిలో పాఠకునిలో ఆలోచనలు రేగాలి. అది స్వభావసిద్ధమైన పని. ఇదే సింబాలిజానికి ప్రాతిపదిక అయింది.

మహాత్మాగాంధీ ప్రతి ఒక్కరూ రాట్నం చేపట్టాలి అన్నారు. చూడ్డానికి రాట్నమే ఐనా అది మనకు స్ఫురింపజేసేది వేరు. ఆత్మాధీనతకు, నిరాడంబరత్వానికి అది చిహ్నం అయింది. ప్రజలందరికీ అది అర్థం అయింది. ఒక్కొక్క వస్తువుచూస్తే మనకు ఒక్కొక్కటి స్ఫురిస్తుంది. ఎడారి చూస్తే ఇంపులేని ఒంటరిబ్రతుకు, ఎండుకొమ్మని చూస్తే మోడుబ్రతుకు స్ఫురణకి వస్తాయి. 'గదిలో జంతువు మెల్లగా ఆవులించుకు లేచింది' అని ఒక రచయిత వ్రాశాడు. ఇక్కడ జంతువును కామానికి ప్రతీకగా తీసుకున్నాడు. ఈ విధంగా స్ఫురణకురావడం ప్రతీకవాదానికి ఆలంబన అయింది.

ఒక వ్యక్తియొక్క స్వభావం తనకు పూర్తిగా తెలుసుననుకోవడం, అతని గుణగణాలను వివరిస్తూ వ్రాసుకుపోవడం చాలా తెలివితక్కువపని అని ఆధునిక రచయిత భావం. ఎందుకంటే, ఒక మనిషి గురించి మనకు ఎంతబాగా తెలుసుననుకుంటున్నా, కొన్ని సందర్భాలలో అతని ప్రవర్తన మన సిద్ధాంతాలను తలక్రిందులు చేయవచ్చు. దానికి కారణం ప్రతి మనిషికి అంతర్వాహిని ఉంటుంది. కొన్ని కోరికలూ, భావాలూ నిద్రాణమై ఉంటాయి. ఒక వ్యక్తిలో అంతర్వాహినిలాగా ఉన్న శక్తులు మనకు తెలుసు ననుకోవడం భ్రమ. నిద్రాణమై ఉన్న ఆ శక్తుల ప్రేరణ వల్లనే మనకు కొన్ని వస్తువులను చూడగానే కొన్ని భావాలు స్ఫురిస్తాయి. అయితే అది ఆయా వస్తువులపైనా, ఆయా వ్యక్తులపైనా ఆధారపడి ఉంటుంది. గులాబీపువ్వు కోమలిసౌకుమార్యానికి సంకేతం కావచ్చు; లేకపోతే ముళ్లని చాటున దాచుకొని అందంగానవ్వే హిపోక్రిట్‌కి సంకేతం కావచ్చు. అంతేకాక నే నూహించలేనిది మరి దేనికైనా సంకేతం కావచ్చు.

పాత్రల మనస్తత్వాలను సజెస్ట్ మాత్రమే చెయ్యాలి. పాఠకుని ఆలోచనకే ఎక్కువగా విడిచిపెట్టాలి. ఇది ఆధునిక రచయిత లక్ష్యం. ఒక గది ఉంది. ఆ గదిలో నగ్నస్త్రీలచిత్రాలు ఫ్రేములలో బిగించబడి గోడకు వ్రేలాడుతున్నాయి. అంటే ఆ గదిలోని మనిషి స్వభావం మనకు అర్థం అవుతుంది. అతని గుణగణాలను తనకు పూర్తిగా తెలిసినట్టుగా వర్ణించుకుంటూ పోనక్కరలేదు. ఒక్కొక్కసారి రచయిత కంటే పాఠకుడే ఎక్కువ విషయాలు గ్రహించవచ్చు. ఈ విధమైన ధోరణివల్ల ఆధునిక సాహిత్యంలో సింబాలిజం ముఖ్యభాగమయింది.

కొన్ని సందర్భాలలో వాడబడిన ప్రతీక తెలియక పోవచ్చు. అయినప్పటికీ ఆ రచనను మనం చదివి ఆనందించ వచ్చు. అది రచయితయొక్క సామర్థ్యంమీద ఆధారపడి ఉంటుంది. బసవరాజు అప్పారావుగారి 'మామిడిచెట్టును అల్లుకొన్నదీ, మాధవీ

లతొకటీ ...' అన్నగేయం తీసుకోండి. ఆ గేయా నికి 'తాజమహల్' అని పేరుపెట్టారు. కాబట్టి రాలిన మామిడిపండు తాజమహల్‌కు ప్రతీకలని అర్థ మవుతుంది. మామిడిచెట్టు షాజహాన్‌కూ, మాధవీ లత ముంతాజ్‌కూ ప్రతీకలని తెలుస్తాయి. అయితే ఆ ప్రతీకలు మనం గ్రహించకపోయినా ఆ గేయం సొగసు తగ్గిపోదు. ప్రతీకలు అర్థమైనప్పుడు కొత్త రంగులు కన్పిస్తాయి.

'గొంగళీ పురుగులు'లో గొంగళీ పురుగును మధ్యతరగతి కుటుంబీకునికి ప్రతీకగా వాడతారు బాల గంగాధర తిలక్. ఆ విషయం అయనే చివరిలో తెలియజేస్తారు :

నిస్తబ్దపు నిస్సారపు పాడిళ్లగోడల మాటున
గుమాస్తాలు టీచర్లు చిన్న చిన్న సంసారులు
కోటేశ్వర్రావులు
వీరేశ్వర్రావులు గొంగళీపురుగులు లక్షలు లక్షలు.

ఆయన ఈ విధంగా తెలియజేయకపోయినా సందర్భాన్ని బట్టి ఈ ప్రతీక సామాన్య పాఠకునికి సులువుగా అర్థమయిపోతుంది.

సింబాలిజంలో శ్రీ శ్రీ అద్భుతమైన ప్రయో గాలు చేసారు. 'అవతారం'లో యముని మహిషం, నరకలోకపు జాగిలాలు, ఉదయ సూర్యుని సప్తహ యాలు, కనకదుర్గా చండసింహం, ఇంద్రదేవుని మదపుటేనుగు, నందికేశుడు, ఆదిశేషు బానిస వర్గానికి ప్రతీకలుగా ఎన్నుకోబడ్డాయి. అవి వాటి వాటి యజమానులపై తిరగబడ్డాయి. బానిసవర్గం యొక్క తిరుగుబాటు రాబోయే కొత్త సృష్టిని స్ఫురింపజేసింది.

పుడమి తల్లికి
పురిటి నొప్పులు
క్రొత్త సృష్టిని స్ఫురింపించాయి.

'జగన్నాథుని రథచక్రాలు'లో రథం ప్రజా విప్లవానికి ప్రతీకగా కవి వాడుకున్నాడు. 'ఈ యెగి రిన ఇనుపడేగ' అని ఇనుపడేగను ప్రజాచైతన్యానికి ప్రతీకగా తీసుకొన్నాడు. 'గంటలు' గేయంలో బాని సత్వ తిమిరాన్ని వెడల గొడుతూ మూలమూలల వ్యాపించే మానసిక సంచలనానికి గంటలు ప్రతీకగా నిలిచాయి. అవి—

ప్రాణము మ్రోగే ప్రతి స్థలములో
నీ హృదయములో నా హృదయములో
గంటలు! గంటలు!
గంటలు! గంటలు!

గా సాక్షాత్కరించాయి.

రమణారెడ్డిగారు వ్రాసిన 'అక్కుపక్షి ఆత్మ కథ'లో అక్కుపక్షి తటస్థవిధానానికి సంకేతంగా వాడబడింది. అది—

నీట్లో ఈదను నింగిలో ఎగరను
నేలమీద నడవను
నేనేదీకాను అన్నీ ఔతాను
అత్యద్భుత సృష్టిని నేను

అంటుంది. కవి దానిని అక్కుపక్షినిచేసి పరిహసిస్తాడు.

నగ్నమునిగారి 'భవిష్యత్తు' గేయంలో
తీవ్రిగా
గర్వంగా
కర్కశంగా
ఎదుర్కొనమనే సవాలుగా
నుంచున్న గోడ

బూర్జువా వ్యవస్థకు ప్రతీకగా నిల్చింది. దానితో

నిశ్శబ్దంగా
అతి నెమ్మదిగా
అమాయకంగా
ఓర్పులా
నిజంలా
ఇటుకల్లోంచి
పెళ్లల్లోంచి తొంగి చూస్తున్న
రావిమొక్క

ప్రజా చైతన్యానికి ప్రతీకగా నిల్చింది. మొక్క పెరుగుతున్నకొద్దీ, గోడ ఓటలువేసి కూలిపోవడం తథ్యంకదా.

కొన్ని సందర్భాలలో ప్రతీకను వాచ్యంగా చెప్పకపోయినా చాలా తేలికగా అర్థం చేసుకుంటాము.

నండూరి సుబ్బారావుగారి 'పిలుపు' గేయం చూడండి—

కొండతిరిగీ, కోనతిరిగీ
చీర చెరగున కూరిచితిరా
గరికెపూల కంఠమాల !

ఇక్కడ కంఠమాల వారి అనుబంధానికి సంకేతం. గరికెపూలు వారి Social Status ని తెలియ చేస్తాయి.

ఆవునడిగీ, అడవి నడిగీ
పూలగిన్నెల పొందు పరిచితి
గుమ్మపాలు, కొమ్మతేనె

గుమ్మపాలు, కొమ్మతేనె— ఆమెకు అతనిపై గల ప్రేమకు సంకేతం. అంతేకాక అవి వారు రైతు కుటుంబానికి చెందినవారని తెలియచేస్తాయి.

చాయ వెన్నెలా, లోయ బయలా
పచ్చిక మెత్తల పానుపు పైనా
'కో'—'కో' యంచు 'కో' యనరా !

అతని పొందును ఆమె కోరుతున్నది. కాని తనంత తాను వెళ్లదు. అతను పిలవాలని కోరు తున్నది. అంతేకాక కోయిలల్లో మగకోయిల మాత్రమే పాడుతుంది— అది స్త్రీ సాంగత్యం అవసరమైనప్పుడు. కోయిలలాగా 'కో' అనమనడం తనని పిలవమని అర్థం.

ఒక్కొక్కసారి కవి గురించిగాని, అప్పటి రాజకీయ పరిస్థితిగాని తెలియందే 'ప్రతీక' అర్థం కాదు. ఆరుద్రగారి 'త్వమేవాహం'లో సంకేత విన్యాసం చాలా విరివిగా ఉంది.

ఈ
కాంతను
చెరపట్టగ
రా
కాసులు
తలపెట్టిరి.

ఇక్కడ 'కాంత' నైజాం పరిపాలన క్రింది తెలంగాణాకు ప్రతీకగా వాడబడింది. 'రాకాసులు' రజాకార్లు.

వారిని
పడగొట్టన్
మ్రోగెన్
నీ
గన్

ఇక్కడ 'గన్' నైజాం పరిపాలనను కూల ద్రోయడానికి లేచిన 'తెలంగాణా ఉద్యమం'. త్వమేవాహమ్ లోని సంకేతాలు అర్థం కావాలంటే తెలంగాణా ఉద్యమంగూర్చి కొంత అవగాహన అవసరం. లేక పోతే అంతా గందరగోళంగా ఉంటుంది.

ఒక్కొక్కసారి ప్రతీక మరీ నిగూఢంగా ఉండి రచయిత ఉద్దేశం అర్థంకాకపోవచ్చు. అటువంటప్పుడు హృదయానికి హత్తుకోడానికి మారుగా అస్పష్టత మిగులుతుంది. సౌదామినిగారు వ్రాసిన 'దురదృష్టము' గేయం చూడండి.

నోచితి మెన్నో నోములు
కాచి బ్రోచునని పార్వతి
కడకు దేవి దయచేతను
కంటిమి రత్నములు రెండు
బ్రతుకు కలంకారములౌ
వాని దాచ చేత గాక
ఎచటనో పోగొట్టుకొంటి
మెంతటి దురదృష్టమునవో? [వైతాళికులు]

ఆ రెండు రత్నములు వేటికి సంకేతాలో స్పష్టముకాలేదు. గేయము సొగసుగానే ఉందికాని భావము స్పష్టము కాలేదు.

డా. సి. నారాయణరెడ్డిగారి 'చైతన్యశిఖ' తీసుకోండి :

తూర్పు ప్రసవించిం దిప్పుడు
ఊర్పు ప్రణవించిం దిప్పుడు

తూర్పు ప్రసవించడం నూతనంగా ఉద్భవించిన చైతన్యానికి సంకేతమై ఉంటుంది. ఊర్పు అంటే ఆశ అనుకుందాము.

ఈ ప్ర—నవధ్వనిలో
ఈ ఎర్రనివెల్గుల ధునిలో
ఇద్దరం క్షతగాత్రులం

ఎవ్వరా ఇద్దరు క్షతగాత్రులు?

నిప్పులు ముడిచిన కొప్పుతో
కల్లోలాలు పొదిగిన కళ్లతో
శక్తిశుక్తిలోంచి వెలువడిన
రక్తముక్తామూర్తి నీది.

చైతన్యంలో కల్లోలాలు, రక్తపాతము భాగమని కాబోలు కవి ఉద్దేశం.

నీలో దూకి రెక్కలు మాడ్చుకొని
చావో బతుకో తేల్చుకొని

ఇక్కడ నిప్పులో దూకే శలభాన్ని స్ఫురింపజేస్తున్నారన్నమాట. శలభంమాదిరి శిఖలో దూకిన తరువాత చావో బతుకో తేల్చుకోడం ఏముంది? ఈ గేయంఅంతా రచయిత ఉద్దేశం తెలియకుండా, ఒక భావం అందించలేకుండా అస్పష్టంగా ఉంది.

కొంతమంది ప్రఖ్యాత అమెరికన్ రచయితలు భావవ్యక్తీకరణకు, ప్రతిభావ్యుత్పత్తులకు చక్కని సాధనంగా సింబాలిజంను ఉపయోగించుకున్నారు. అది ఇక్కడ ప్రస్తావించడం అవసరం. ఎంచేతనంటే వారు చేసిన ప్రయోగాల మాదిరివి మన సాహిత్యంలో ఎంతవరకు ఉన్నాయన్నవి గమనించాలి. దానినిబట్టి మనం ఎంతవరకు ఈ క్రొత్తపంథాను ఉపయోగించుకున్నాం అన్నది తెలుస్తుంది.

ఎడ్గార్ ఎలన్ పో వ్రాసిన గేయం 'The Raven' లో ఒక తుఫాను రాత్రిగదిలో వంటరి ఒక విద్యార్థి చదువుకుంటున్నాడు. తలుపు చప్పుడైతే తలుపు తెరిచిచూస్తాడు. నల్లనిచీకటితప్ప ఏమీ కనబడదు. తిరిగివచ్చి పుస్తకం తెరిచి కూర్చుంటాడు. కొన్నాళ్లక్రితం చనిపోయిన తన ప్రేయసి జ్ఞాపకం వస్తుంది. మళ్లీ తలుపు చప్పుడవుతుంది. ఈసారి తలుపుతీయగానే ఒక మాలకాకి లోపలికి చొచ్చుకు వచ్చి గోడనున్న విగ్రహంమీద కూర్చుంటుంది. దానికి అతను అనేకమైన ప్రశ్నలు వేస్తాడు. అన్నిటికీ అది 'never more' అన్నమాటే అంటుంది. ఎన్నోలోకాలు చూసిఉంటుందికదా, తన ప్రేయసి గూర్చి ఏమైనా చెప్పమని ఆ విద్యార్థి అడుగుతాడు. ఆ మాలకాకి పలకదు. అతనికి కోపంవచ్చి దాన్ని పొమ్మంటాడు. అది కదలదు. ఆ రాత్రి కింక దానితో గడపడం తప్పదని అతను కూలబడిపోతాడు. గేయమంతటా ఒక 'థ్రిల్' ఉంది. ఆ విద్యార్థి యొక్క గడచిన ఎడతెగని జ్ఞాపకాలకు ఆ మాలకాకి సంకేతం. ఆ జ్ఞాపకాలనుండి ఎంతగా బయటపడదామని ప్రయత్నించినా అవి అతణ్ణి వీడవు. బసవరాజు అప్పారావుగారు కూడా ఈ రకమైన ఆలోచన చేశారు. వారి 'కోయిల' చనిపోయిన చిట్టియొక్క జ్ఞాపకాలకు సంకేతం.

కోయిలా కోయిలా
కూయబోకే
గుండెలూ బద్దలూ
చేయబోకే!
చిట్టిని జ్ఞాపకం
చేయబోకే
చింతతో ప్రాణాలు
తీయబోకే!

అని కోయిలను కవి వేడుకున్నాడు.

వాల్ట్ విట్మన్ వ్రాసిన 'O Capatain! My Captain!' గేయం అమెరికన్ ప్రెసిడెంటు అబ్రహాం లింకన్ మరణంపై Elegy. ఆ గేయంలోని ఓడ అమెరికా సంయుక్తరాష్ట్రాలకీ, కాప్టన్ లింకన్‌కీ ప్రతీకలు. ఓడ సముద్రప్రయాణంలో ఎదుర్కొన్న ఇబ్బందులు Civil War కి సంకేతం. ఆ ఓడను క్షేమంగా చేర్చడం, రాష్ట్రాలను సంయుక్తంగా సంఘటితపరచిన లింకన్ ప్రతిభకు సంకేతం. ఈ విధమైన భావన తెలుగులోనూ జరిగింది. కృష్ణశాస్త్రిగారు, గురజాడ అప్పారావుగారి మృతిపై 'ముసాకవి' అని Elegy వ్రాశారు. అందులో

రంగవల్లిక మాయమయ్యెను
చండతేజము మాసిపోయెను
సందెకెంపులు సాగిపోయెను
వెదకుచున్నారా!

అని రంగవల్లిక, చండతేజము, సందెకెంపులు గురజాడవారి సాహిత్యరచనయొక్క మూడు తరగతులకు (phases) సంకేతాలుగా వాడారు. రంగవల్లిక ఉదయాన్ని తెలియజేస్తుందికదా. అది గురజాడవారి

ప్రారంభరచనలకి సంకేతం. చండతేజము మధ్యాహ్నం యొక్క తీవ్రమైన వెలుగు. అది గురజాడవారు తరువాత సంఘంయొక్క దురాచారాలు, మూఢనమ్మకాలపై తిరుగుబాటుచేస్తూ వ్రాసిన రచనలకు సంకేతం. సందెకెంపులు కన్పించేవి సాయంత్రం. అంటే గురజాడవారి చివరి రచనలు. వాటిలో తీవ్రత తగ్గిపోయింది. అయినప్పటికీ ఇంకా వెలుగు ఉంది.

వెదకుచున్నారా!

ఆ తరువాత ఇంక వెదికేది ఏముంది? కారు చీకటి మిగిలింది.

హథార్న్‌కథ 'Birth Mark' లో ఒక శాస్త్రవేత్తయొక్క భార్య బుగ్గపై ఎర్రని పుట్టుమచ్చ ఉంది. అది మృత్యువుకు సంకేతం. ఆ పుట్టుమచ్చను పోగొట్టబోయి భార్యనే పోగొట్టుకున్నాడు. మన కథానికలలో కూడా సింబాలిజం ఉంది. నగ్నమునిగారు వ్రాసిన 'తిమింగలం'లో తిమింగలం పెట్టుబడిదారీవర్గానికి ప్రతీక. వి. రాజారామమోహనరావుగారి 'రాబందుల నీడ'లో రాబందులు దోపిడీ వర్గానికి సంకేతం. కాని ఈ ప్రతీకలు కేవలం కథల పేర్లకే పరిమితం అయిపోయాయి. వస్తువుఅంతా ప్రతీకవాదంలోలేదు.

హెమింగ్వే వ్రాసిన 'The old Man and the Sea' లో ఒక ముసలి జాలరి 84 రోజులపాటు ఒక్కచేపకూడా పట్టలేక పోతాడు. ఒకసారి సముద్రం మీద దూరంగాపోగా ఒక తిమింగళాన్ని పడతాడు. అది అతన్ని ఇంకా దూరం లాక్కుపోతుంది. దానితో రెండు పగళ్లు, రెండు రాత్రులు తంటాలుపడి ఎలాగైతేనేం తిరుగు ప్రయాణం కడతాడు. ఇంతలో అనేకమైన షార్కు చేపలు ఆ తిమింగలాన్ని తిని వేయడం మొదలుపెడతాయి. అతను ఒడ్డును చేరుకునే సరికి దాని అస్థిపంజరం మిగులుతుంది. ఈ కథలో Old man సముద్రంమీద పడిన కష్టాలు జీవితంలోని సమస్యలకు సంకేతాలు. ఆ సమస్యలను ఓర్పుతోనూ, ధైర్యంతోనూ ఎదుర్కొన్నవానికి, తాను ఓడిపోతున్న సమయంలోనే విజయం లభిస్తుంది. ఇక్కడ తిమింగలం విజయానికి చిహ్నం. జీవితంలో దురదృష్టం ఎంత తరుముతున్నా పట్టుదల, ధైర్యం ఉన్నవానికి విజయం రాకమానదు. సింబాలిజంతో కూడుకున్న నవలలు మనకి లేవు.

ఒనెయిల్ వ్రాసిన "Hairy Ape" నాటకం పూర్తిగా సంకేతపరమైనది. అందులో ప్రధానపాత్ర ఫ్రాంక్ గతించిన సాంప్రదాయానికి ప్రతినిధి. అతను ప్రస్తుత అధునాతన ప్రపంచంలో మనగలగడానికి ప్రయత్నిస్తాడు. కాని ప్రపంచం అతణ్ణి దగ్గరకు చేరనివ్వదు. చివరకు విరక్తిచెంది తన పూర్వీకులతోనైనా కలుద్దామని ఒక 'జూలో' ఉన్న గొరిల్లా వద్దకు వెళ్తాడు. అది ఇతడ్ని చంపివేస్తుంది. ఈ మాదిరి నాటకాలు మనకి లేవు.

తెలుగులో సాహిత్య ప్రక్రియ లన్నింటిలో సింబాలిజం ప్రవేశపెట్టవలసి ఉంది. రచనలో అక్కడక్కడ కొన్ని సంకేతాలు వాడినంతమాత్రాన సరిపోదు. వస్తువంతా సంకేతపరంగా ఉండే రచనలు రావాలి. నవీన రీతులన్నిటిలోనూ సాహిత్య రచన కొనసాగినప్పుడే సాహిత్య స్తబ్ధత, అనుకరణ, నిర్జీవత్వం మొదలైన ప్రమాదాలుదాటి నిత్య చైతన్యంతో ముందుకు పోతోంది.

# అరవిందుని సావిత్రి

## శ్రీ కామబుషి సత్యనారాయణ శర్మ

వ్యాసకృత మహాభారతమున వనవాసపర్వములో సావిత్రి ఉపాఖ్యానము ఉన్నది. ఈ కథ అరణ్యవాస క్లేశ మనుభవిస్తున్న ధర్మరాజు మనశ్శాంతి కొరకై మార్కండేయమహర్షిచే చెప్పబడింది. ఇందు సావిత్రి ప్రాతివ్రత్యమహిమ వర్ణింపబడింది. అశ్వపతి మహారాజు సంతతికొరకై పదునెనిమిది సంవత్సరాల పాటు తపశ్చర్యలు వ్రతదీక్షలు సాగించాడు. ప్రతి దినం సావిత్రీదేవికి లక్షమారులు మంత్రయుక్తంగా అగ్నిలో హోమంచేసి తుదకు దేవతానుగ్రహం పొందాడు. పరాశక్తి స్వరూపిణియగు సావిత్రీదేవి అనుగ్రహంతో ఒక కుమార్తె కలిగింది. ఆ బిడ్డకు వరప్రదాయినియైన సావిత్రిపేరే పెట్టుకొన్నారు. అల్లారు ముద్దుగా పెంచుకొన్నారు. యుక్తవయస్సు రాగానే రాజ్యభ్రష్టుడై అరణ్యవాసం చేస్తున్న ద్యుమత్సేనుని కుమారుడు సత్యవంతుని ఆ సావిత్రి వరించింది. విధి విలాసంవల్ల సత్యవంతుని ఆయుస్సు ఒక సంవత్సరం కంటె ఎక్కువలేదని నారదుడు వివరించాడు. ఒకమారు సత్యవంతునిపై లగ్నమైన మనస్సు మాన్చుకొనలేక తన సంకల్పాన్ని సావిత్రి విడువలేదు. సావిత్రి సత్యవంతుల వివాహము జరిగిపోయినది. మృత్యుదినమునకు ముందుగా మూడురాత్రులు ఉపవాసదీక్షతో వ్రతాచరణము గావించింది సావిత్రి. తన పతి ప్రాణములను గొనిపోవవచ్చిన యముని తన ప్రాతివ్రత్యమహిమచే మెప్పించి యమునిలో ధర్మానురక్తి కలిగించి తన పతిప్రాణములను యముని అనుగ్రహంవలన మరల సంపాదించుకొన్నది. యముడిచ్చిన వరప్రభావంవలన అత్తమామలకు రాజ్యప్రాప్తి, ద్యుమత్సేనునకు అంధత్వనివారణము కలిగి సావిత్రి పతితో కలసి సౌఖ్యములను అనుభవించింది. ఇది సావిత్రి ఉపాఖ్యానమందలి సంక్షిప్తగాథ.

ఈ ఉపాఖ్యానము సంస్కృతంలో 700 పాదాలుగల రసవత్కావ్యము. శ్రీ అరవిందుని మర్మ కవితా ప్రపంచంలో 24750 పాదాలుగల సుందర కావ్యంగా విస్తరించినది. ఇందు 12 పర్వాలు, 49 అధ్యాయాలు ఉన్నవి. ప్రాచీన ఉపాఖ్యానము ఈ నవ్య రచనలో 35 రెట్లు పెరిగింది. శ్రీ అరవిందుని రచనలో ఈ ఉపాఖ్యానము ఎట్టి నూత్న కళలతో, రీతులతో రూపులు దిద్దుకొన్నదో ఒకమారు పరిశీలించు కొందాము. ఈ కావ్యము ఉపనిషత్తులలోని అధ్యాత్మికథానములను, కాళిదాసు కవితాశిల్పమును, ఆంగ్లసాహిత్యపరిధిలో మర్మకవితగా ఆవిష్కరించుటకై చేసిన ప్రయత్నమని శ్రీ అరవిందులే వివరించారు. సంతతికొరకై పదునెనిమిది సంవత్సరాలు చేసిన అశ్వపతితపశ్చర్య ఒక అధ్యాత్మికయోగ సాధనగా అగుపించినది. ఇందులో సాధనకు సంబంధించిన అనేక భూమికల అధిరోహణ అందలి జయాపజయాలు తుదకు జగన్మాతసాక్షాత్కారము వరకు విపులముగా వర్ణింప బడినవి. పరాశక్తి స్వరూపిణియైన సావిత్రి సాక్షాత్కరిస్తుంది. తాను భూమిపై అవతరించి కఠినమైన శాసనాలను ధిక్కరించి వాటి శృంఖలలను పగులగొట్టి దైవశక్తిని లోకంలో స్థాపింపగలనని అభయమిస్తుంది. అరవిందుని సావిత్రి జగన్మాత (పరాశక్తి) యొక్క అవతారము. అశ్వపతియింట సావిత్రిగా జన్మించింది. పోతపోసిన బంగారు విగ్రహం—అలౌకిక సౌందర్యరాశిగా భాసించి సావిత్రి పెరిగి పెద్దదై యౌవనవంతురాలైంది. నీకు తగిన పతిని స్వయంవరణం చేసికొమ్మని తండ్రి అనుమతిస్తాడు. రాజ్యభ్రష్టుడై, అంధుడై, అరణ్యవాసం చేస్తున్న ద్యుమత్సేనుని కుమారుడు సత్యవంతుని దర్శించి పరస్పరం ప్రేమించుకొని శాశ్వతప్రణయైకజీవులుగా వరించుకొంటారు.

(ఇది వ్యాసప్రోక్తంలో లేదు). అశ్వపతి, రాణి నారదుడు సమావేశమైన తరుణంలో సావిత్రి తన స్వయంవరం గురించి తండ్రికి నివేదించింది. నారదుడు తన దివ్యదృష్టితో సత్యవంతుడు అల్పాయుర్దాయవంతుడని గ్రహించి ఆమెను హెచ్చరించాడు. రాణి తన నిర్ణయము మార్చుకొమ్మని కుమార్తె సావిత్రిని కోరుతుంది. సావిత్రి తన నిర్ణయమును మార్చుకొనుట కంగీకరించలేదు. సమస్యలోని క్లిష్టత గురించి నారదుడు వివరించి ఆమె విధి వ్రాతకు ఆమెను వదలమని ఆదేశించి తన నిజనివాసమునకు వెళ్లిపోతాడు. వ్యాసప్రోక్తమయిన కథలో ద్యుమత్సేనుని ఆశ్రమంలోనే సావిత్రికి వివాహంచేసి తన కుమార్తె నక్కడ విడిచి అశ్వపతి తనరాజ్యం చేరుకొంటాడు. అరవిందుల సావిత్రి దాంపత్య జీవితం గడపడానికి తనంతట తనే భర్త ఆశ్రమానికి వస్తుంది. తమ వైవాహికానుబంధం వివాహమైన ఒక యేడాదిలో అంతము కాగలదని చెప్పిన నారదవచనాన్ని సావిత్రి మననం చేసికొంటూంటుంది. ఆసన్న మరణం ఎదురు చూస్తోన్న మనస్సులోని సంక్షోభంతో ఆమె ప్రతి దినం పతి ననుసరిస్తూ పన్నెండుమాసములు ఒక్క క్షణంగా గడిపివేస్తుంది. సావిత్రి మనస్సులో యోగ దర్శనం చేస్తుంది. శరీరములకే గాని ఆత్మలకు నాశనంలేదని, మృత్యువునుండే అమృతత్వసిద్ధి కలుగుతుందని దృఢవిశ్వాసంతో తన పతిని నీడలా అనుసరించింది. అంతిమ దివసాన పతితో అరణ్యానికి బయలు దేరుతుంది. సత్యవంతుడు వన్యఫలాలు సేకరించుకొని తండ్రి అగ్నికార్యమునకు సమిథలకై ఒక చెట్టు కొమ్మ నరక నారంభించాడు. హఠాత్తుగా శిరోవేదన ప్రారంభించి గొడ్డలిని విడిచిపెట్టి సావిత్రి అంకతలంపై వాలిపోయాడు. వెంటనే అతడు దీర్ఘ నిద్రలో మునిగిపోయాడు. గాఢ నిశాస్వరూపుడైన మృత్యువు (యముడు) ప్రత్యక్షమై తేజోవంతమైన సత్యవంతుని ప్రాణాలను తీసుకొని నిష్క్రమించ నుద్యుక్తుడైనాడు. సావిత్రి ధైర్యంతో మృత్యువు ననుసరించి బయలుదేరింది.

వ్యాసప్రోక్తమైన కథలో సావిత్రి తన పాతివ్రత్యదీక్షచే యముని అనుసరించి పతి ప్రాణముల నిమ్మని అభ్యర్థిస్తుంది. ఆయన సంతసించి వరాలు అనుగ్రహిస్తాడు. మామగారికి రాజ్యప్రాప్తి, అంధత్వ నివృత్తి, తండ్రి అశ్వపతికి శతపుత్రలాభము, సత్యవంతునకు శతపుత్రప్రాప్తి ఈ వరసిద్ధికి సత్యవంతుని పునరుజ్జీవితుని గావించుట యివన్నీ యముని వరప్రభావమువలన ఫలిస్తాయి. సావిత్రీ సత్యవంతులు సంతోషముతో భువికివచ్చి తల్లిదండ్రులను కలుసు కొంటారు. రాజ్యము, నేత్రదృష్టి సంపాదించుకొన్న ద్యుమత్సేనుడు సాళ్వరాజ్యపట్టాభిషిక్తుడు అవుతాడు. వ్యాసుని సావిత్రి మూర్తీభవించిన పాతివ్రత్యంగా భాసిస్తుంది. అత్తమామలకు అనురక్తురాలు. భర్తృసేవాపరాయణ. యముని హితవాక్కుల మెప్పించి వరములు బడసిన పుణ్యవ్రత. యమునిలో ధర్మానురక్తి, ధర్మప్రతిష్ఠాపనము గోచరించును.

అరవిందుని సావిత్రి ధీర. ఆమె జగన్మాత. పరాశక్తి. గాయత్రీ స్వరూపమైన సావిత్రి అవతారము. ఆమె అబలకాదు. మహాశక్తి. సత్యవంతుని మృతికి, పునరుజ్జీవనమునకు సేతువుగా నిలచిన ఉషస్సు. సంధ్య వెలుగు ఆమె. రాత్రికి, పగటికి మధ్యవర్తి. చీకట్లను పరిహసించిన వెలుగు ఆమె. మృత్యువు నుండి అమృతత్వసిద్ధిని ఉద్భవింపచేసిన దివ్యశక్తి. ఇట్టి సావిత్రి ఎట్టి కష్టపరంపరలనైనను ధైర్యముతో యెదుర్కొనునుగాని తన విచారమును వ్యక్తపరచదు.

సత్యవంతుడు తన తల్లిదండ్రులకొరకు ద్యుమత్సేనుడు కుమారునికొరకు దుఃఖిస్తారు. కాని సావిత్రి చలించదు. నారదుడు తన పతి అల్పాయుర్దాయమును గూర్చి హెచ్చరించినపుడుగాని, తుదకు సత్యవంతుని ప్రాణాలను యముడు పాశబద్ధంగావించి గొనిపోవు సమయంలోగాని ఆమె ధీరోదాత్తురాలై నిలుస్తుంది. దేవ ఋషి నారదుడుగాని, కన్నతల్లిగాని, ప్రభువైనతండ్రి అశ్వపతిగాని ఆమె నిర్ణయమును మార్చజాలక పోయారు. వరములు యముడు తనంతటతాను ఆమె దృఢసంకల్పమునకు, దీక్షకు, సౌజన్యమునకు ముగ్ధుడై ఆమెను సంతృప్తితో వెనుదిరిగి పంపుటకై— ఇచ్చినవేగాని ఆమె అభ్యర్థించినవిగావు. అరవిందుని సావిత్రి యముని లెక్కచేయలేదు. తనలోని శక్తిస్వరూపాన్ని ఆవిర్భావ మొనరించి ఆ తేజస్సు ముందు మృత్యువు యొక్క గాఢతమస్సును పటాపంచలు చేస్తుంది.

మృత్యువు నిస్సహాయుడై తిరోగమిస్తాడు. మృత్యువులో కూడ దైవస్వరూపం భాసిస్తుంది. అదికూడ ఎంతమాత్రము అల్పమైనదికాదు. బలీయమైనదే. కాని పరాశక్తియొక్క నిత్య సత్య స్వరూపమునుండు ఒదొక ఛాయామాత్రంగా భాసిస్తుంది. 'మృత్యువు కంటె దైవంలేదు. మృత్యువే నియంత. తానే సర్వాధికారి. పాంచభౌతికమైన శరీరానికి మృత్యువు తప్పదు. ప్రేమ, ప్రణయం కలవంటివి'అని ఆమెతో యముడు సుదీర్ఘసంవాదం జరుపుతాడు. అందుకు ప్రత్యుత్తరంగా సావిత్రి ఈ పాంచభౌతిక శరీరములకుగాని ఆత్మకు నాశనంలేదు. నేనే అనశ్వరమైన ఆత్మను. మహాలక్ష్మిని. మహా సరస్వతిని. విలయకాలంలో మహాకాళిని కాగలను. నేను మృత్యువుకంటె అధికురాలను. విధికంటె బలవంతురాలను అని సాధికారంగా ప్రతిపాదనం చేసింది. 'మానవాకృతిలో సొంచియున్న నీవెవ్వరు. సర్వాంతర్యామి, సర్వనియంత ఒక దివ్యశక్తియొక్క ధ్వని నీ కంఠంలో గోచరిస్తోంది. నీమాటలలో నిత్యసత్యం ప్రకటితమౌతోంది. మానవాతీతమైన దివ్యకాంతి నీ కన్నులలో ప్రకాశిస్తోంది. కాలమును మృత్యువును జయించే శక్తి నీ కెలా వచ్చింది' అని ప్రశ్నించాడు మృత్యువు. శ్రీ కృష్ణుని విశ్వరూప దర్శనం కోరిన అర్జునునివలె సర్వశక్తిస్వరూపిణియైన జగన్మాత తనలో ఉన్నట్లుగా వ్యక్తం చేయమని మృత్యు వామెను కోరాడు. ఆమెలో పరాశక్తి ఆవేశిస్తుంది. ఆమె శరీరమందలి దివ్యశక్తియొక్క తేజస్సు పరిసర వాయువులను తేజోసముద్రంగా మార్చింది. మహాశక్తియొక్క దివ్యావతారం ఆమె శరీరంనుండి తెరతొలగించుకొని ప్రత్యక్షమైంది. ఆ క్షణమందలి భయంకర నిశ్శబ్దంనుండి అనిర్వచనీయ మాధుర్యంతో ఆమె హృదయకమలంనుండి ఒక దివ్యవాణి ఇలా వినబడింది.

'తన విధివిలాసమునకు, జీవనమునకు ప్రభువై నిలుచునట్లు, నీ అజ్ఞానంనుండి నీ బాధా బంధనాల నుండి, నీ మృత్యుశృంఖలాలనుండి, లోకమనే సత్యవంతుని ఆత్మను విముక్తం చేయుమని గంభీరంగా ఆదేశించింది. భగవన్మందిరంలో అతడొక మానవ ప్రతినిధి. దివ్యజ్ఞానమునకు మిత్రుడు. దివ్య జ్యోతియొక్క అర్ధశరీరం. నిత్య సత్య స్వరూపమైన వధువున కాతడు తగిన వరుడు.' అని తనకు తానై విన్న మాటలను చూచిన దృశ్యాన్ని మృత్యువు నమ్మలేక పోయాడు. సావిత్రి నిశ్శబ్దంగా నిలిచిపోయింది. కాని ఆమె నావేశించిన పరాశక్తి మృత్యువును కబళింప చుట్టుముట్టింది. మృత్యువునకు ప్రతిఘటన అసాధ్యమై పోయింది, వాదన నిరుపయోగమై పోయింది. ఆ దివ్యతేజస్సుముందు తన అంధకారము వెలవెలబోయి నుటునుగాయమై పోయింది. ఆజ్ఞాపూర్వకమైన ఆమె ఆదేశమునకు మృత్యువుయొక్క అవయవాలు స్తబ్దమై పోయినవి. తన పరివారమును రమ్మని పేరనిలవాడు. గాఢమైన చీకట్లను రమ్మన్నాడు. అవి ముందుకి అడుగు పెట్టలేక పోయినవి. సర్వశక్తులతో నరకాన్ని రమ్మని ఆహ్వానించాడు. కాని భీతితో నరకం వెనుదిరిగి పోయింది. తన జన్మకు కారణమైన అంతరాత్మయొక్క సహాయం అర్థించాడు. అది అనంతాకాశంలో అదృశ్యమైపోయింది. గాఢతమోఘాతమైన తన శరీరము దివ్యతేజఃపుంజాలచేత కబళింపబడి అతనిశక్తిని అదృశ్యంచేసింది. అపజయం అనివార్యమై పోయింది. దూరంగా పారిపోయాడు మృ[illegible]

సాంకేతిక ప్రపంచమునందలి ఉషస్స్వప్నంలో సర్వవ్యాపకమైన మృత్యుచ్ఛాయలు అదృశ్యమైపోయాయి. తాను బయలుదేరినప్పటి శూన్యంలోనే మరలిపోయాడు మృత్యువు. సూత్నదైతన్యంతో సావిత్రీ సత్యవంతులు మిగిలిపోయారు. యమ సావిత్రి సంవాదం ఈ విధంగా ముగిసింది. శాశ్వత రాత్రి-ద్విగుణీకృతమైన సంధ్య వెలుగులో—మృత్యుచ్ఛాయ అదృశ్యం కాగానే మరల దినావతరణమునకు ఆ సంధ్యవెలుగు నాందియై ప్రకాశించింది. మృత్యురహితమైన ఆనందలోకంలో ఆశ్చర్యకరమైన పవిత్రమండలము తన కాంతులను ప్రకాశింపచేసింది. యిది పరిపూర్ణతయొక్క నివాస భూమి. ఇచ్చట భగవానుని నిత్యమైన, శాశ్వతమైన పగలు ప్రకాశిస్తుంది. ఆమె ఆత్మ నిత్యము, శాశ్వతము. జీవనధార చేయునగా నిలువబడింది. అచట సంధ్య వెలుగు చీకటిలేకుండా నిత్యప్రకాశమానమైన సౌర తేజస్సుతో ఆమె నవలోకించింది. అసతోమా సద్గమయ! తమసోమా జ్యోతిర్గమయ ! మృత్యోర్మా అమృతం గమయ ! అన్న ఉపనిషదుక్తి యందలి సత్యం అరవిందుల రచనలో వ్యాఖ్యానించబడింది.

# పండితరాయల 'పెసిమిజం'

## డా. మహీధర నళినీమోహన్

అసలు ఈ వ్యాసానికి ఈ పేరు నేను పెట్టింది కాదు. ఇల్లా పేరుపెట్టవచ్చునని నాకు అసలు తట్టనేలేదు. ఈ పేరు సూచించిన వ్యక్తి ఒక స్వీడిష్ వనిత. ఆమెకు సంస్కృతమూ జీలకర్రా ఏమీరాదు. పండితరాయలపేరు కూడా వినలేదు. అంతదాకా ఎందుకూ? భారతీయ సాహిత్యంతో ఆవగింజంత పరిచయంకూడాలేదు. అసలు జరిగినదేమిటో టూకీగా మనవిచేస్తాను.

1970 మార్చిలో స్వీడన్‌లోని ఉప్సాలా నగరంలో ఉంటూన్న భారతీయులు మూడు పుంజీల మంది హోలీపండుగ జరుప నిశ్చయించుకున్నారు. ఆ దేశస్థులని చాలామందిని ఆహ్వానించారు. నేను అప్పట్లో అక్కడ ఉన్నాను. అక్కడే పండితరాయల భామినీవిలాసాన్ని అనువదిస్తూఉన్నాను. ఈ సంగతి మా స్నేహితులు కొందరు పసికట్టేశారు. ఆ హోలీ తాలూకు సభలో పండితరాయల కవిత్వాన్ని చదివి వినిపించమన్నారు నన్ను.

భామినీవిలాసం అంతా కవిసమయాల పుట్ట. ఆ దేశస్థులికి కలువలు, కొడిసెలు, మొగలి, సంపెంగలు, ఉమ్మెత్తలూ, కదంబాలు అంటే ఏమీ యదు. తుమ్మెదలు అనగానే 'ఛీ ఛీ! బీటిల్స్'అని అసహ్యించుకుంటారేగాని వాటిమీద మనకున్న సద్భావం వారికి లేదు. చాతకాలు, చక్రవాకాలూ, చకోరాలూ ఎల్లా ఉంటాయో మనమే చూడలేదు, వాళ్లకేం తెలుస్తాయి? ఏనుగుమీదకారే మదజలాన్ని వర్ణిస్తే వాళ్లకి డోకు వస్తుందేగాని ఆహా అని మెచ్చుకోరు. మామిడి, నేరేడు, పనస, కొబ్బరి, దానిమ్మ వగైరా పళ్లతో వాళ్లకి పరిచయమేలేదు. ఈ వస్తువులమీద చమత్కారాలు ఏమర్థమవుతాయి? ఇవేవీ చెప్పకపోతే ఇంక భామినీవిలాసం ఏమిటి?

వాళ్లకి అర్థం అవుతాయని నాకు అనిపించిన శ్లోకాలు ఓ అరడజను ఏరుకున్నాను. వాటినే అనువదించి చెప్పేను. అఖరున మంచిగంధంమీద ఒక శ్లోకం చదివేను.

లోకంలో సద్గుణాలకి విలువేలేదు. నిర్గుణత్వమే మేలులా కనిపిస్తోంది. ఈ లోకంలో మంచి వాళ్లకే అన్నికష్టాలూనూ; అడవిలో చూడ రాదూ; ఎందుకూ పనికిరాని అడ్డమైన చెట్లూ హాయిగా చీకూచింతాలేకుండా పెరుగుతూఉన్నాయి. అద్వితీయమైన సౌరభాన్ని విరజిమ్మే మంచిగంధపుచెటు మాత్రం ముక్కలుముక్కలుగా నరుకబడుతున్నాయి.

**అనుష్టుప్**

> నైర్గుణ్యమేవ సాధీయో
> ధిగస్తు గుణగౌరవమ్
> శాఖినోఽన్యే విరాజంతే
> ఖండ్యంతే చందనద్రుమాః.

**తేటగీతి**

> గుణవిశేషంబు కలిగిన కొంపమునుగు
> నిర్గుణత్వంబె మేలని నే దలంతు
> ఇతర వృక్షంబులెల్ల వర్ధిల్లుచుండ
> నరుకబడుచుండు మంచిగందంపుచెట్లు.

ఇది నాకు చాలా నచ్చిన శ్లోకాలలో ఒకటి. నాకులాగే స్వీడన్ దేశస్థులికికూడా ఇది నచ్చుతుందని ఆశపడ్డాను. చప్పట్లు కొడతారని ఎదురుచూశాను.

ముందరివరసలో కూర్చున్న ఆ దేశపుపిల్ల ఒకామె 'What a Pessimist!' అంది. ఆ మాట విని నేను ఆశ్చర్యపడ్డాను. కించిత్తు చిరాకున్నూ కలిగింది. ఇంత చక్కనిభావాన్ని, ఇంతమంచి ఉపమానాన్ని, కాచివడబోసిన పరమసత్యాన్ని ఓ—క్క దెబ్బలో

నిరాశావాదంగా చిత్రించినవాళ్ల అరసికత్వాన్ని ఏమను కోవాలో తెలియలేదు నాకు.

ఆ రోజంతా దానిని గురించిన ఆలోచనలే నా మనస్సులో కదులాడుతూవచ్చాయి. లోకంలో సద్గుణాలకి విలువ తగ్గిపోతోందనీ, దుర్గుణాలే పైచేయిగా ఉన్నాయనీ, వెనకటికాలం మళ్లీరాదనీ మన కవు లందరూ ఏదో ఒక సమయంలో అన్నవాళ్లే. దానిని నిరాశావాదం అనాలి అని నాకు ఎన్నడూ తట్టలేదు. మన సారస్వతంతో పూర్వపరిచయం ఏమీలేని పాశ్చాత్యులకి మన కవిత్వం 'పెసిమిజం'లా కని పిస్తోందన్నమాట. ఇది ఆలోచించవలసిన విషయమే.

ఇట్టి నిరాశావాద లక్షణములైన శ్లోకాలు పండితరాయల భామినీ విలాసంలో చాలా ఉన్నాయి. మచ్చుకి కొన్ని చూపిస్తాను.

బయట ఉద్యానవనంలో రకరకాల పక్షులు కేరింతలు కొడుతున్నాయి. ఎగురుతున్నాయి. పండి కాయలని అలవోకగా పొడుస్తున్నాయి. జంటలు జంటలుగా కూడి కొన్ని ఆడుతున్నాయి. వాటి ఆనం దానికి అడ్డూ అదుపూ లేనట్లుగా ఉంది. వాటి ధోరణి అంతా గమనిస్తున్న అంతఃపురంలోని బంగారు పంజరంలోని రామచిలక దీనంగా మొహం పెట్టుకుంది. ఆ పక్షులకున్న స్వేచ్ఛ నాకు లేకుండా చేశా రేమి? నేనేం పాపం చేసుకున్నాను? ఆ అడవి పక్షులకు నాకున్న అందం లేదే! నాకు మల్లే అవి మనుష్యులను అనుకరిస్తూ ముద్దు ముద్దుగా మాట లాడనుకూడా లేవే! మరి నాకీ అవస్థ ఏమిటి? అనుకుంది.

'పిచ్చిదానా! సరిగ్గా అదే నువ్వు చేసుకున్న పాపం' అన్నాడు పండితరాయలు.

చిలక అయోమయంగా దిక్కులు చూసింది, అందమైన మెడ అటూ ఇటూ తిప్పుకుంటూ.

**అనుష్టుప్**

నిఖిలేషు విహంగేషు
హంత! స్వచ్ఛందచారిషు
శుక! పంజర బంధస్తే
మధురాణాం గిరాం ఫలమ్.

**ఆటవెలది**

పక్షులెల్ల ఇచ్చవచ్చినట్లు చరింప
నీకు ఖర్మ మేమి? రామచిలుక!
ప్రాప్తమయ్యె నిట్టి పంజరబంధంబు
ఫలిత మిద్ది ముద్దు పలుకులకును.

పంజరంలోవున్న [illegible] చిలక తప్పించుకు పోలేకపోయినట్లుగా అని విచారంగా ఆలోచిస్తోంది. మనుష్యులు ఎంత గడుసుగా ఉన్నారు. ఊపిరి సలప కుండా 'రామ రామ రామ' అంటూ పెదాల్లో ఒకటే [illegible] పాడతాయి. సరేలే. [illegible] సమాధానపడి కూర్చుం [illegible] ఉంటాయిగా. [illegible] తలోవైపుకీ [illegible] అందరు [illegible] నేను బుద్ధిగా ఉంటాను [illegible] సమయం చూసుకుని ఈ పంజరపు ఊచలను ఒక్కొక్కటే విరిచేస్తాను. [illegible] నా బలమైన ముక్కు ముందర ఈ ఊచలు ఎంత? నేను దూర [illegible], ఇంక నా పరుగు [illegible] ఆకాశంలోకి [illegible] స్వేచ్ఛేకదా! నా ఇష్టమే ఇష్టం..... అని కన్నులు అరమోడ్చ

అంతలో ఏదో! ఏమిటది? లావుగా పొడుగ్గా ఏనుగుతొండంలాంటిదే! నాగుపాము! సరాసరి పంజరం లోకే వెళ్లగా [illegible]. అమ్మయ్యో! ఇంకెక్కడి చిలక? దాన్ని, దాని మధురస్వప్నాలని కలిపి గుట కాయస్వాహా [illegible].

**శార్దూల విక్రీడితం**

స్వస్వవ్యాపృతిమగ్నమానసతయా
మత్తో నివృత్తే జనే
చంచూకోటివిదారితారరపుటో
యాస్యామ్యహం పంజరాత్
ఏవం కీరవరే మనోరథమయం
పీయూషమాస్వాదయ

త్యంతః సంప్రవివేశ వారణకరాకారః
ఫణిగ్రామః

**మత్తేభ విక్రీడితం**

నరులెల్లన్ నిజకార్యమగ్నమతులై
నన్నొంటిగా వీడ—పం
జరవుం జువ్వల వాడిముక్కుకొనచే
సారించి, స్వేచ్ఛాప్తి నం
బరముం దాకెదనంచు రాచిలుక
సంభావించు చున్నంతటన్
జరిగెన్ లోనికి త్రాచుపామొకటి
దిజ్ఞాగేంద్రతుండాభమై.

* * *

చినుగులబట్టలతో శల్యావశిష్టంగాఉన్న దీను డొకడు దారే వెడుతున్నాడు. అతడికి మరొక బాట సారి ఎదురుఅయాడు. వారిద్దరికీ ఈ క్రిందివిధంగా సంభాషణ జరిగింది.

'ఎవరండీ తమరు?'

'నేను కవిని' అని బక్కచిక్కిన వ్యక్తి సమా ధానం.

'ఇల్లా క్షణించి ఉన్నారేమి బాబూ!'

'భోజనం లేక'

'అయ్యయ్యో! ఎటువంటి దుర్గతిపట్టింది! గుణవంతులకు కడుపునిండా భోజనమైనా పెట్టలేని దౌర్భాగ్యస్థితిలో ఉందా ఈ దేశం?'

'అయ్యా! ఈ దౌర్భాగ్యం దేశానిదికాదు. నిజా నికి మా కవులదే దౌర్భాగ్యం. ఏమంటారా? మాకు ఆకలి దహించుకు పోతూ ఉండినా ఏదో ఉడకేసుకుని నాలుగు మెతుకులు నోట్లో వేసుకుందామని తల పెట్టినట్లైతే భూమిమీద ధాన్యం కరువైపోతుంది. వింధ్యారణ్యంలో వంట చెరుకు కరువైపోతుంది. మహా సముద్రాలలో నీటిచుక్క కరువై పోతుంది'

**శార్దూల వి**

కస్త్వం భోః కవిరస్మి తత్కిముసఖే
క్షీణో౽ధి గ్దేశం గుణినో౽పి దుర్గతిరియం
దేశం న మామేవ ధిక్
పాకార్థీ క్షుధితో యదైవ విదధే
పాకాయ బుద్ధిం తదా
వింధ్యేంధన మంబుధౌ నసలిలం
నాన్నం ధరిత్రీతలే.

**మత్తేభ విక్రీడితం**

'ఎవరండీ తమరు?' 'ఏనొకానొక కవిన్'—
'ఏమిట్లు క్షీణించిరి?' 'అన్న
విహీనత్వముచే'—మహాత్ములకు
నన్నంబీని దేశంబ! ఛీ!'—
'కవిదే దోషము, మేము వండుకొన
సంకల్పించినన్ మాయమౌ నవనిన్ ధాన్యము,
వింధ్యలో కలపయున్
అంబోధిలో నీరమున్.'

పూర్వం కవులకూ, పండితులకూ గొప్ప గొప్ప సత్కారాలు జరిగేవనీ, ప్రస్తుతం చెడ్డరోజులు వచ్చా యనీ, ఆ రోజులు తిరిగి రావుకదా అనీ విచారించడం ఎప్పటికప్పుడు పరిపాటి. వెనుకటి రోజులలో కవులు ఏమంత సుఖంగా బ్రతకలేదని ఈ పద్యం ఋజువు చేస్తోంది. అంతేకాదు.

'కవితల్ చెప్పిన పాడనేర్చిన వృధా కష్టంబె
ఈ బోగపుం
జవరాండ్రేకద భాగ్యశాలినులు,
పుంస్త్వం బేల పోగాల్పనా?
సవరంగా సొగసిచ్చి, మేల్ యువతి
వేషం బిచ్చి పుట్టించితే
యెవరే మెచ్చి ధనంబు లిచ్చెదరు కాధే
పాపపుం దైవమా!'

అన్న శ్రీనాధుని చాటువున్నూ ఇదే దుస్థితిని తెలియ జేస్తోంది. అయినాసరే, భోజుడికాలాన్నీ, కృష్ణరాయల కాలాన్నీ మాత్రమే నెమరువేసుకుని, పూర్వ సర్వత్రా అల్లాగే ఉండేదని నమ్మడం చాలామందిలో కని పిస్తుంది.

చలి వెనుకబట్టింది. గాలిలో వెచ్చదనం పెరుగుతోంది. వసంతోదయం కాబోతోంది. మోడులు చిగిరించబోతున్నాయి. ప్రకృతిఅంతా పులకరించిపోతోంది. తొమ్మిదినెలలుగా గొంతుపెగలని గండుకోయిల ఒకటి గున్నమామిడిచెట్టు చిటారికొమ్మల మీద కూర్చుని ప్రకృతిశోభని తిలకిస్తోంది. దాని గొంతులో ఏదో నవచైతన్యం పొంగులెత్తుతోంది. 'ఇన్నాళ్లుగా అణగిపోయిన నా పంచమస్వరాన్ని వసంతుడు త్వరలోనే సరిదిద్దుతాడు. ఇహ ఇటుపైన అడవిఅడవిఅంతా నా పాటలతో ముఖరితం అయిపోవాలి'అని సంబరపడుతున్నది కోయిల. దానికి పదిబారలదూరంలో ఎవడో కిరాతుడు ప్రత్యాలీఢపాదంతో, కోకిలమీద తదేకదృష్టితో నిలబడిఉన్నాడు. వింటికి బాణం సంధించాడు. కోకిలకు గురిచూచి విల్లు ఎక్కుపెడుతున్నాడు.

**ఆర్యా**

ఏత్య కుసుమాకరో మే
సంజీవయతాం గిరం చిరం చిరం నుగ్నామ్
ఇతి చింతయతో హృదయే
పికస్య సమధాయి శౌభికేన శరః.

**తేటగీతి**

చిరమడంగిన నాదు సుస్వరము నిం:
ఈ వసంతుడు చిగిరింపబోపుననుచు
పికము మానసవీధి భావింపుచుండ
గ్లడద్దానిపై నెక్కువెట్టె విల్లు.

* * *

తుమ్మెద ఒకటి సాయంకాలంవేళ పద్మంలో దూరి కమ్మనితేనె జుర్రుకుంటోంది. ఆ పారవశ్యంలో సూర్యాస్తమానం కావడమూ, పద్మం ముడుచుకుపోవడమూ తుమ్మెదకి తెలియనేలేదు. తీరా ఒళ్లు తెలిసి చూచుకునేసరికి పద్మకోశంలో బందీ అయిపోయి ఉంది. బయటికి తప్పించుకుపోవడానికి ప్రయత్నం చేసిందికానీ, సాధ్యంకాలేదు. సాధ్యంకాలేదంటే, వెదురు బొంగులను అవలీలగా దొలిచేసే తుమ్మెదని మృదువైన తామరరేకులను ఛేదించడం చేతకాకనా? అది కాదు. పద్మంమీద దానికున్న అనురాగం అటువంటిది—సరేలే. కాస్సేపు నష్టి వాయిస్తే పాయె. ఈ రా॥ ఎంతసేపుంటుందీ? ఉషోదయం కాకపోదు. తూర్పున సూర్యుడు ఉదయించేస్తాడు. దానితో అతడి ప్రియురాలైన ఈ తమ్మి మొగం విప్పారుతుంది. అప్పుడు నా దారిని నేను పోతాను—అని తుమ్మెద అనుకుంటూ ఉంది. అంతలో జలక్రీడ లాడడానికి ఆ చెరువులో దిగిన ఏనుగు ఒకటి ఆ తామరమొగ్గని తొండంతో లాగి, నిరాసంగా నేలను వేసి కొట్టింది!.

**వసంత తిలక**

రాత్రి ర్గమిష్యతి భవిష్యతి సుప్రభాతమ్
భాస్వా నుదేష్యతి హసిష్యతి పంకజశ్రీః
ఇత్థం విచారయతి కోశగతే ద్విరేఫే
హా హంత! హంత! నళినీం గజ ఉజ్జహార.

**వసంత తిలక**

ఈ రేయి వేగు నుదయించు నుషస్సు మిత్రుం
డేతెంచు గాయు హసియించును పంకజశ్రీ
ఈ రీతి లేటి ముకుళించిన పద్మకారా
గారస్థమై తలంప కంజము నేన్గు పీకెన్.

మంచి గంధపు చెట్టుని వర్ణించినంతగా సంపిత రాయలు మరే చెట్టునీ వర్ణించలేదు. దాని పరిమళం హృదయమైకనేద్యం. మన్మథకేళిలో ప్రేయసి రొమ్ములకి పూయడంకోసమూ, త్రిలోకాధిపతి అయిన మహేశ్వరుని యశఃకథనంకోసమూ, మానవుల నుదుటినొస్సలు సొగొట్టడంకోసమూ మలయపర్వతంమీది చందన వృక్షాలు ముగ్గుముగ్గుచేయబడుతున్నాయి. గుణవంతుల కందరికీ లోకంలో ఇదే అవస్థ కలిగిస్తున్నావు కదయ్యా భగవంతుడా!

**శార్దూల విక్రీడితం**

జాతఃకేళి కథావతీ కుచతటీ
సౌభాగ్య మాసాదితుమ్
త్రైలోక్యాధిపతే ర్యశః కథయితుం
భాలే నివద్యాసితుమ్
కిం వాచ్యం గుణగౌరవస్య
మహిమాఖ్యాతో ఒఖిలే భూతలే

థి గ్ద్వైవం కలయే యదత్ర మలయే
భగ్నః పటీర ద్రుమః.

**తరళ**

మదనకేళి కళావతీ కుచ
మండలమ్ముల పూయగా
మదనవైరియశః ప్రశస్తికి
మంగళమ్ములు పాడగా
నుదుటిసొప్పుల పారద్రోలగ
నుగ్గునుగ్గగు చందనం
బిదికదా సుగుణాల పుట్టల
కిచ్చు గౌరవ మిద్ధరన్.

ఓ చందనవృక్షమా! అడవిలో ఎన్నిచెట్లు లేవు? వాటిలో కొన్నిటికి మాత్రమే సౌరభం అంతంత మాత్రంగానైనాఉంది. ఆ వాసనఅయినా కేవలం పువ్వులయందుమాత్రమే కనిపిస్తోంది. మరి నీకా? దేవమనోహరమైన సౌరభం ప్రతిఅంగమునందూ గుబాళించిపోతోంది. ఇంతటి అపూర్వమైన గుణసంపత్తిని సేకరించుకున్న నీకు ఎటువంటి దురవస్థపడుతోందో చూస్తున్నాముకదూ!

**శార్దూల విక్రీడితం**

శ్రీమచ్చందనవృక్ష !
సంతి బహవ స్తే శాఖినః కాననే
యేషాం సౌరభమాత్రకం నివసతి
ప్రాయేణ పుష్పశ్రియామ్
ప్రత్యంగం సుకృతేన తేన శుచినా
ఖ్యాతః ప్రసిద్ధాత్మనా
యః సౌగంధ్య గుణ స్త్వయా ప్రకటితః
క్వాసావిహ ప్రేక్ష్యతే.

**శార్దూల విక్రీడితం**

శ్రీమచ్చందనవృక్షమా! అడవిలో జీవించు
భూమిరుహ
స్తోమంబుల్ బహుళంబులై—
తరచుగా జూపట్టు పూగుత్తులం
దామోదంబు—పరిమళమ్ములను
ప్రత్యంగమ్మునం చిమ్మ త్వ
త్సామర్థ్యమ్మున కెట్టి దుష్ఫలము
ప్రాప్తంబయ్యెనో చూడుమా!

ఓ కళానిధీ! చంద్రమా! నువ్వు సామాన్యుడివి కావు. మహేశ్వరుని శిరస్సుమీద అలంకారంగా చేయబడిన మణివి. పైగా ఆ మూడుకన్నుల దేవర కళ్లల్లో ఒక కన్నువి. క్షీరసాగరుని గారాబు పట్టివి. బ్రాహ్మణులకి పరమదైవతమవు. అయినప్పటికీ శివుని మూడవకంటి మంటల భుగభుగలలో అనుక్షణమూ వేగిపోవలసిన ఖర్మం నీకేమిటయ్యా? నీ సౌమనస్యానికి చివరికి ఇదా ఫలితం?

**శార్దూల విక్రీడితం**

శ్రీ మాహేశ్వరమౌళిమండనమణి
ర్వైశ్వంభరం లోచనమ్
త్వం రత్నాకర సంభవః కి మపరం
భూదేవ దేవో భవాన్
యద్భాలానల సంగదోష రభసా
ద్దందహ్యసే నోగ్రజా
జ్జాతం తత్కిమిహాస్తి తే
సుమనసశ్చిత్రం కళానాంనిధే!

**శారూల వి॥**

శ్రీ మాహేశ్వరమౌళి లోని మణివై
క్షీరాబ్ధికిన్ పట్టివై
భూమీ దేవకులాగ్ర దైవతమవై
ముక్కంటికిన్ కంటివై

విక్రాంతి కల్గాడ నీ
కేమయ్యా! తవ సౌమనస్య ఫలితం
బింతేకదా? చంద్రమా!

*　　*　　*

కస్తూరి మృగాన్ని కిరాతుడు బాణంవేసి కొట్టేడు. నెత్తుటి మడుగులో ఆ జింక విలవిల్లాడుతోంది కొనఊపిరితో. దానినిచూచి గద్గదకంఠంతో పండితరాయలు ఇల్లా అంటున్నాడు. ఓ కస్తూరీలేడీ!

త్రిభువన మనోహరమైన నీ సౌరభ్యంచేత అడవి అంతనీ గుబాళింప జేశావు. నీవు చేసిన ఈ మంచి పనికి నీకు ప్రతిఫలం ఏమిటి? బోయవాడు నిన్ను చంపేశాడు. నీచులకి సుగుణాలతో పనేమిటి?

**మందాక్రాంతా**

సౌరభ్యేణ త్రిభువన మనోహారిణా
కాననేఒస్మిన్
సత్కస్తూరీ హరిణ! భవతా
వాసితో దిగ్విభాగః
తస్యైతత్తే ఫల ముపగతం
పత్రిభిర్లుబ్ధకానామ్
విద్ధః ప్రాణాం స్త్యజసి న గుణః
శ్రేయసే నిర్గుణేషు.

**మత్తేభ విక్రీడితం**

ఘన విస్తార పరీమళమ్ముల
త్రిలోక ప్రీతిగావించు చ
క్కని కస్తూరి మృగంబ! నింపితివి
యీ కాంతార మెల్లన్ సువా
సనలన్—తత్ఫలమేమి నీకు కలిగెన్?
శాతాస్త్రఘాతమ్ములన్
నిను నిర్జించిరి జాలిలేని శబరుల్
నీచుల్ గుణం బెంతురే?

* * *

ఒక్కొక్కప్పుడు విపత్తులు ఎల్లా రోసుకు వస్తాయో వివరిస్తున్నాడు పండితరాయలు.

ఒక చిరుచేప బేస్తవాడి చేతికి చిక్కింది. అది అటూ ఇటూ గిజాయించుకోవడంలో అతని వేళ్ల సందుల్లోంచి జారి పడిపోయింది. అంతవరకూ అదృష్టమే.

ఏమి అదృష్టం? ఆ పడడం నీళ్లల్లో పడకుండా మళ్లీ వలలో పడింది. అది దాని దురదృష్టం.

కాని, చేప చిన్నది కావడంచేత వల కన్నులలో నుంచి తప్పించుకుని బయటికి వచ్చేసింది. ఎంత అదృష్టం!

కాని ఏం లాభం? వలలోనుంచి తప్పించుకున్న ఆ చిరుచేప ఒక కొంగనోటికిచిక్కి చచ్చిపోయింది. బ్రహ్మదేవుడు రాసిపెట్టిన విపత్తుతప్పించుకోవడం ఎవరికి సాధ్యం?

**వసంతతిలక**

వక్రే విధాతరి కథం విపదాం నివృత్తిః
కైవర్త కర్కశ కరగ్రహణా చ్చ్యుతోఒపి
జాతే పునర్నిపతిత శ్శఫరో వరాకః
ప్రస్తస్తతోఒపి గళలో గళితో బకేన

**ఉత్పలమాల**

జాలరి క్రూర హస్తముల
సందుల జారిన చేప క్రమ్మరన్
జాలము లోపలంబడి
వెసన్ వల కన్నుల యంతరంబులన్
దూలి, బకంబు నోటబడి
దుర్మరణంబును జెందె నక్కటా!
ఏలవిపత్తు తప్పగల దెవ్వరికిన్
విధి వక్రమైనచో.

* * *

లోకంలో అంతా మంచితనమే ఉండడం నాకెక్కడా కనిపించడంలేదు. మంచితనంతోబాటు కొన్ని దుర్గుణాలుకూడా తప్పకుండా ఉంటూనే ఉంటాయి.

అనన్య సాధారణమైన సౌరభ్య సంపద గలిగిన మంచిగంధపు చెట్టుంది. అది తన తొర్రలలో తాచుపాములకి ఆశ్రయం ఇచ్చింది.

అంధకారాన్ని అంతంచేస్తూ కాంతులు విరజిమ్మె దీపముంది. అది నెత్తినీద మసి పులుముకుని కూర్చుంటుంది.

చల్లని పండువెన్నెలలు కురిపించే చందమామ ఉన్నాడు. అతడు తన శరీరంమీద కొట్టవచ్చినట్లు కనిపించే పెద్ద మచ్చను ధరించుకుని ఉన్నాడు.

మంచిమనస్సు కలిగినరాజు ఉన్నాడు. అతని చుట్టూ కొండెగాళ్లు ఉన్నారు.

ఇల్లా దేనినిచూచినా మంచితోబాటు దానిని క్రమ్మివేసే దోషాలు కనిపిస్తూనే ఉంటాయి.

**పుష్పితాగ్రా**

వహతి విషధరాన్ పటీరజన్మా
శిరసి మషీపటలం దధాతి దీపః
విధురపి భజతేతరాం కళంకమ్
పిశునభరంచ బిభర్తియత్ క్షితీంద్రః

**ఆటవెలది**

చందన ద్రుమంబు సర్పంబుల వహించు
మస్తకమున దివ్వె మసిధరించు
చందమామ మేన సవదరించును మచ్చ
కూడియుండురాజు కొండెగాండ్ర.

*　　*　　*

రామచిలక మాట్లాడుతూఉంటే ఎంతో ముద్దుగా మళ్లీ మళ్లీ వినాలనిపించేలా ఉంటుంది: కాని, పిల్లికో? ఆ మాటల సోయగం దానికి అక్కర లేదు. చిలకని ఎల్లా పట్టుకుని కబళించెయ్యాలా అనే చూస్తూ ఉంటుంది.

కస్తూరి లేడిఉంది. దాని పరిమళంతో పోటీ పడ గలిగిన వస్తువు త్రిలోకాల్లోనూ లేదు. కాని, మాటువేసిఉన్న సింహం ఆ సువాసనకి మురిసి పర వశించదు. ఆ వాసన ఆధారంగా దానిజాడ తెలుసు కుని, చంపి తినెయ్యడానికే ఉపాయాలు ఆలోచిస్తూ ఉంటుంది.

నెమలి చాలా అందమైన పక్షి. అది పురివిప్పి నాట్యం చేస్తూఉంటే చూడ ముచ్చటగా ఉంటుంది. కాని బోయవాడి ముందర దానిపప్పులు ఉడకవు.

ఈ లోకంలో గుణగ్రహణ పారీణులు చాలా తక్కువ. దుష్టులే అత్యధికంగా కనిపిస్తున్నారు.

**శార్దూల విక్రీడితం**

మార్జారో లభతేన మంజుల
శుకాలాపేన కౌతూహలమ్
కస్తూరీ హరిణస్య సౌరభభరైః
సింహో నసంతుష్యతి
ప్రీతి ర్నాస్తి మయూర తాండవశతై
ర్వ్యాధస్య దుష్టైః సదా
వ్యాప్తాయాం భువి సంతి కేపి విరళాః
సంతో గుణగ్రాహిణః

**ఉత్పలమాల**

చారుశుకానులాపముల
సంతసమందదు గండుపిల్లి—క
స్తూరి మృగంపువాసనల
చొక్కదు సింగమొకింత—కేకి యొ
య్యారపు నర్తనంబులకు
వ్యాధుడు ప్రీతుడుకాడు—దుష్టు రి
ద్ధారుణి బెక్కురుందురు
సదా విరళంబు గుణజ్ఞ ఖరుల్.

*　　*　　*

దుర్మార్గుడు తప్పుడుపనిచేసి గడుసుగా తప్పించు కుపోతాడు. ఆ తుట్ట అంతా మంచివాడిమీదపడి, అతడు శిక్షింపబడతాడు. లోకంలో ఇది పరిపాటి. అంత దాకా ఎందుకూ? రామాయణంలో చూడరాదూ? సీతాదేవిని ఎత్తుకుపోయినవాడు రావణాసురుడయితే, శ్రీరాముడంతటి ధర్మప్రభువు ఏపాపమూ ఎరగని మహాసముద్రానికి బంధనం (వారధి, ఖైదు) కల్పిం చాడుకదా!

**అనుష్టుప్**

ఖలఃకరోతి దౌరాత్మ్యమ్
మలం పతతి సాధుషు
రావణేన హృతాసీతా
బంధనం తు మహోదధేః

నీచుడొక్కడు దౌరాత్మ్య మాచరింప
సాధువులమీద దాని దుష్ఫలము పడును
అవనిజను రావణాసురు డపహరింప
ప్రాప్తమయ్యెను కడలికి బంధనంబు.

*　　*　　*

ఎంతో గొప్పవంశంలో జన్మిస్తాడు. ఎంద రెందరో మహామహులు దగ్గరిచుట్టాలు అయి ఉంటారు. అతిరథులూ మహారథులూ స్నేహితులై ఉంటారు. ఇన్నీఉన్నాసరే ఒక్కొక్కడికి అష్ట కష్టాలూ తప్పవు. ఖర్మఅంటే అదే మరి.

పద్మమా! సుప్రసిద్ధమైన మానస సరోవరంలో ప్రభవించావు. నీ సౌరభంచేత దిగ్దిగంతాలనూ ప్రభావితం చేస్తున్నావు. సూర్యభగవానుడంతటివాడు నీకు దగ్గరిచుట్టము. నీ గుణాలు అన్నీ బహుప్రశస్తమైనవే. సందేహంలేదు. కాని, ఏం లాభం? కాస్త చలిగాలి వేసిందంటే వాడివత్తలైపోతావు. ఇది నీ కర్మకాకపోతే మరేమిటి చెప్పు.

**శార్దూల విక్రీడితం**

సంభూతి స్తవ మానసే సరసిజ!
త్వత్సౌరభై ర్వాసితాః
సర్వాస్తాః కకుభ స్తవాస్తి
పరమో బంధుర్వివస్వానపి
త్వంచే దద్య గుణావవద్య శిశిరే
శీతానిలైః శీర్యసే
ప్రాయః ప్రాయ ఇదం తదత్ర పరమం
దృష్టాదదృష్టం ఫలమ్

**చంపకమాల**

పొడమితి మానసంబునను,
భూరి పరీమళ శీకరంబులన్
దడిపితి వన్ని దిక్కులను,
దగ్గరి చుట్టము నీకు సూర్యదే
వుడు, సకల ప్రశస్తగుణ
భూషితవయ్యును చల్లగాలికిన్
వడిలితివేని ఖర్మయనవచ్చును
నీ కిది పుండరీకమా!

* *

తుమ్మెదకీ సంపెంగపువ్వుకీ చుక్కెదురు. సువాసనలో సంపెంగని మించిన పువ్వులేదు. అడవిలో ఉన్న అన్నిరకాల పూగుత్తుల మీదా వాలి, పరామర్శించి, లాలించివచ్చే రసికాగ్రణి భ్రమరం. మరి అయితే తుమ్మెద చంపకాన్ని ఎందుకు అనుగ్రహించదు.? సంపెంగ రమణీయమైనది కాదా? భ్రమరంలో రసికత ఏమైనా లోపించిందా? ఇదేమీకాదు. సంపెంగ నుదుటిరాత అల్లా ఉంది. లేదా ద్విరేఫానికి చంపకంతో క్రీడించే అదృష్టం రాసిపెట్టిలేదు. అంతా ఈశ్వరాజ్ఞ!

మహారాజు ఉన్నాడు. అపరభోజుడు. మహారసికుడు గొప్పఉదారుడూన్నూ. ఎవరిలో ఏపాటి విద్వత్తుఉన్నా, ఏ కళలో పాండిత్యంఉన్నా, స్వయంగా వెళ్లి, ఆ విద్వాంసుణ్ణి నెత్తిమీద పెట్టుకుంటున్నాడు. అల్లాంటివాడు ఒకానొక మహాపండితుణ్ణి మాత్రం ఎందుచేతనో కన్నెత్తి చూడడు. ఏం చెప్పగలం? ఈ ఈశ్వరాజ్ఞ బహుబలీయమైనది!

**ఉపజాతి**

చర న్వనాంతే నవమంజరీషు
న షట్పదో గంధఫలీ మజిఘ్రత్
సా కిం నరమ్యా? స చ కిం నరంతా?
బలీయసీ కేవల మీశ్వరాజ్ఞా

శ్లోకంలో ఒక చమత్కారం ఉంది. షట్పదః అనేది పుంలింగశబ్దం. గంధఫలీ (సంపెంగ) అనేది స్త్రీలింగశబ్దం. ఆమె బహురమ్యంగాఉన్న పడుచు. అతడు గొప్ప రసికుడు. రసికునికి ఆ పడుచుమీద అనురాగం కలగడం సహజం, కాని కలగడం లేదు ఇక్కడ. ఈ శ్లోకాన్ని తెలుగులోకి అనువదించడంలో ఒక ఇబ్బందిఉంది. తెలుగులో తుమ్మెద అంటే పుంలింగంకాదు. నపుంసకలింగం. తుమ్మెదకి గల పేర్లలో దేన్ని తీసుకుందామనుకున్నా తెలుగులోకి వచ్చేసరికి అదినపుంసకంఅయి ఊరుకుంటుంది. తుమ్మెదను పురుషునిగానూ, సంపెంగను స్త్రీగానూ చూపించలేకపోతే మూలంలోని సొగసు తెలుగులోకి ఎల్లా వస్తుంది ? నన్ను చాలా ఇబ్బందిపెట్టిన శ్లోకాలలో ఇది ఒకటి. ఆఖరికి భ్రమరానికి రాజశబ్దం తగిలించి, పురుషునిగా అవతారం ఎత్తించవలసి వచ్చింది.

**ఆటవెలది**

అడవి నన్నిపూల నళిరాజు రమియించు
కాని చంపకమ్ము కలయ బోడు
రసికు డతడుకాడె? రమణీయ మదికాదె?
ఈశ్వరాజ్ఞ బహు బలీయ సౌర!

* * *

అది కాకులుదూరని కారడవి. దారితప్పిన అభాగ్యుడొకడు ఆ అడవిలో బిక్కు బిక్కు మంటూ

నడిచి వెడుతున్నాడు. ఎడా పెడా జరజరా పాకిపోయే పాములు భయపెడుతున్నాయి. ముళ్ళపొదలకు తగిలి అతడు కట్టుకున్న బట్టలు తునాతునకలై పోయాయి. ఒళ్ళంతా చీరుకుపోయి నెత్తురు ఓడుతోంది. ఆకలి దహించుకు పోతోంది. తినడానికి ఏదైనా దొరుకు తుందేమోనని చూడగా చూడగా, వెళ్ళగా వెళ్ళగా ఆఖరికి ఒక పళ్ల చెట్టు కనిపించింది. ప్రాణం లేచి వచ్చింది. లేని ఓపిక తెచ్చుకుని, చచ్చిచెడి చాయం గల విన్నపాలై ఆ చెట్టు ఎగబ్రాకేడు. ఒక పండుకోసి ఆబగా నోట కుక్కుకున్నాడు. పాపం, అది విషవృక్షంఅని ఎరగడతడు. యముడు పాశం బయటికి తీశాడు.

**శార్దూల విక్రీడితం**

ఘోంటాకుండలినీప్రకామవిషమం
కాంతార మంతర్వనవ్:
గాహంగాహమరాళకంటకముఖ
చ్ఛిన్నాంగకేశాంబరః
కృచ్ఛా దధ్వగమద్ధ్వవృక్ష మధిక
క్షుత్పేవ్యవృక్షాశయా
హంత! ప్రాదురభూా ద్విషాకుల
కింపాక ఏవాంతకః.

**ఉత్పలమాల**

కాకులు దూరరాని పెనుగానను
పాంథు డొకండు పన్నగ
వ్యాకులుడై నిజాంగవసనాదులు
ముండుల చీలుచుండగా
ఆకలి మాడ్చుచుండగ ఫలాన్విత
వృక్షమునొండు సశ్రమన్
బ్రాకెను—తత్ఫలాళి విష
బంధురమయ్యె యముండు నవ్వగన్.

*  *  *

విధివిలాసం చాలా విచిత్రంగా ఉంటుంది. ఒక్కొక్కడికి ఏమీ ప్రాకులాడకపోయినా సకలసౌఖ్యాలూ అమరిపోతూఉంటాయి. ఒక్కొక్కడికి ఎంతతంటాలు పడ్డా ఏమీ దొరకదు సరికదా ఉన్నవికూడా ఊడ్చుకు పోతూఉంటుంది. విధికి అడ్డూ ఆపూలేదుకదా!

**అనుష్టుప్**

అయాచితః సుఖందత్తే
యాచితశ్చ నయచ్ఛతి
సర్వస్వం చాపిహరతే
విధి రుచ్ఛృంఖలో నృణాప్:

అడుగ కుండగ నఖిలసౌఖ్యంబు లిచ్చు
మొక్కివేడిన చూపించు మొండిచేయి
అంతతోపోక సర్వస్వ మాహరించు
ఇస్సిరో! విధియెంత యుచ్ఛృంఖలంబొ!

(ఇందులో ఉదాహరించిన తెలుగు పద్యాలు డా. మహీధరనళినీమోహన్ అనువదించిన భామినీ విలాసంలోనివి.)



# "అహమ్"

## శ్రీమతి రాఘవదత్త "పరమాత్మని"

పమృణ్మయ శరీరం..............(1)
మత్తైన మస్తిష్కం............(2)
సమయం బుద్బుదం...............(3)
(1) ప్లస్ (2) ప్లస్ (3) ప్లస్ అహం
ఈజ్ ఈక్వల్ టు జీవనం..............(4)

నిన్నటి దినం.........
ఈతను వెక్కడో? ఈ మనసెక్కడో?
నేటి ఊహలు.........
ఉరకలు తీసే పాలపొంగులు
నేటి ఆశలు.........
గగన వీధుల గాలిగోపురాలు.

జీవనం.........
రంగుల హంగుల సుందర వనం
కాని తప్పని వాస్తవాలు.........
ఊహల పాల పొంగులపై నీటి జల్లులు
ఆశల గాలి గోపురాల కూల్చే పరిభంజనం.
నిజం ముందు.........కల నిస్తేజం!
రంగుల వలలో మిగిలింది
ఆశలు, ఊహలు ఇంకిన
జీవనం..............(4)
బరువు బాధల కాననం
కరిగిన కల
నిర్వీర్యమైన అల.

"అహమ్"

రేపటి దినం.........
ఈ మనుగడ ఉందో.........లేదో?
ఉంటే.........మరోదినం

(1) మృణ్మయ పాత్రి పగిలిపోదా?
(2) పాత్రిలోని మత్తైన మధువు నేలచిందిపోదా?
(3) బుద్బుదకాలం నిండిపోదా?
(4) మైనస్ (1) ప్లస్ (2) ప్లస్ (3)
ఈజ్ ఈక్వల్ టు అహం

మిగిలిన ఈ అహం
కాక తప్పదు అనంతంలో ఐక్యం.

అస్థిత్వం కోల్పోయిన ఈ అహం
మళ్ళీ.........
ఎప్పుడో?
ఎక్కడో ?
ఎలాగో ?
ఏమో...........!



# విశ్వవిజేత వ్యక్తిత్వాన్నే వదులుకుంటాడా?

శ్రీ ముద్దసాని రాంరెడ్డి

మానవుడు తనకున్న ధారణాశక్తి కంటె అధిక శక్తినీ, ఇంకా అధిక పరిమాణపు మేధాసంపత్తిని ఆకాంక్షిస్తున్నాడా? వృద్ధాప్యమే రాగూడదని అభిలషిస్తున్నాడా? మృత్యువును తరిమివేయాలని ఉబలాట పడుతున్నాడా? తన బిడ్డలయొక్క రంగు, రూపు, ఆకారం అపురూపంగా అనుపమానంగా ఉండాలని ఉవ్విళ్ళూరుతున్నాడా? శక్తి యుక్తులున్న మనిషి కనాదినుండి కొన్ని ఆశలు ఆశయాలు ఉండబట్టే ప్రపంచ మీనాడు ఇంతగా పురోగమించింది. మానవుని ఉఛ్వాసనిశ్వాసాల్లో ఉబలాటం ఉన్నన్నాళ్ళ ప్రపంచ ప్రగతి కుంటుపడదు.

విశ్వవ్యాప్తంగా వికసిస్తున్న వైజ్ఞానిక పరిశోధనలరీత్యా, సాధింపబడుతున్న నూతనాంశాలు, కనుగొంటున్న క్రొంగ్రొత్త విషయాలను దృష్టిలో ఉంచుకొని పరిశీలిస్తే, మానవుని మనుగడలో అనూహ్యమైన మార్పులు రాగల సూచనలు కనుచూపు మేరలో కానవస్తున్నాయి. విప్లవాత్మకమగు వైజ్ఞానిక ఫలితాల ననుసరించి వంశవారసత్వ లక్షణాల సంక్రమణ పరిణామములకు పరిధులను నిర్ణయించటం సాధ్యమనే అభిప్రాయం శాస్త్రజ్ఞులలో ప్రబలుతున్నది. జీవశాస్త్ర పరిశోధనల ననుసరించి రెండేండ్లక్రితం నోబెల్ బహుమతిగ్రహీత డా॥ హరగోవింద ఖురానా కనిపెట్టిన కృత్రిమ జీవకణోత్పత్తి ఇందుకు ప్రబల నిదర్శనము. వంశపారంపర్య గుణదోష సంక్రమణం భావి సంతతికి సంప్రాప్తించకుండా అరికట్ట గల్గినవాడు, వర్తమాన సమాజపు సాంఘికాచారములలో, నైతిక విలువల్లో, రాజకీయ నీతిలో, ఆధ్యాత్మిక ఆలోచనపు పంథాలో విప్లవాత్మకమైన మార్పులు సంభవించక తప్పదు.

పునరుత్పత్తి రంగంలో సంశోధింపబడిన ఫలితాలిప్పటికే ప్రపంచప్రజాళిని విస్మయ చకితులను చేయుచున్నవేగాక; లోగడ శాస్త్రీయ కల్పనలుగా గోచరించిన అంశాలీనాడు కల్పనలుగా నిలిచిపోలేదు. ఒక దశాబ్దం క్రితం డా॥ ఇ. ఎస్. ఇ. హాఫెజ్. వాషింగ్టన్ విశ్వవిద్యాలయ జీవశాస్త్ర నిపుణుడు, జర్మనీలోగల తన వైజ్ఞానికమిత్రునితో ఒక వంద గొర్రెల జీవకణాలను ఉంచేటి గర్భకోశంలో నిక్షిప్తంచేసి తనకు పంపించవలసిందిగా అభ్యర్థించాడు. ఆ బీజాణువులన్నీ కొన్ని రోజులదాకా ఒకే గర్భకోశంలో తల్లి గర్భంలో పెరిగినట్లే, శాస్త్రీయ పద్ధతిలో పోషింపబడినాయి. ఆ విధంగా పోషింపబడిన గర్భస్థ జీవకణాలను డా॥ హాఫెజ్ తన పరిశోధనాగారంలో విడదీసి ఒక్కొక్క దానిని వేరువేరు గర్భకోశాల్లో జొప్పించి నవమాసాల్లో నవచైతన్యంతో జన్మించునట్లు కృషిచేసి కృతకృత్యుడైయ్యాడు. గొర్రెలపై జయప్రదంగా ప్రయోగింపబడిన యీ పద్ధతి మానవసంతానోత్పత్తికెందుకు వర్తింపచేయకూడదని డా॥ హాఫెజ్‌గారి వాదన. వారి ప్రయోగాన్ననుసరించి ఒక దశాబ్దంలో వైజ్ఞానికాభివృద్ధి పకడ్బందీగా ప్రగతి పథాన పురోగమిస్తే, ఒక శుభోదయాన గృహిణి మానవ బీజాణు భద్రాగారమునకు వెళ్ళి, అక్కడ పుష్ప, ఫల, వృక్ష సంతతి వంగడాలను భద్రపరచిన పంథాన, పాకెట్లలో ఘనీభవదాకృతిలోగల మానవ బీజాణువుల రకాలను పరిశీలించి, ఆవిడ కెలాంటి శిశువుకావాలో నిర్ధారించుటకుగాను, బీజాణువు పాకెట్లపై వ్రాసిపెట్టిన విషయాలను అవలోకించి, ఒక పాకెట్‌ను ఎంపిక చేసుకు వెడుతుంది. పాకెట్లపైన పుట్టనున్న శిశువుయొక్క లింగము, అంగముల తీరు, రంగు, రూపు, జుట్టు పొంకము మొదలయిన వివరాలన్నీ స్పష్టంగా వ్రాయబడి ఉంటవి. మాతృత్వము నాకాంక్షించు మగువ తన కిచ్చవచ్చిన పాకెట్‌ను ఖరీదుచేసుకొని, కుటుంబ డాక్టరు సహాయంతో, ఏతద్బీజాంకురాన్ని తన

గర్భకోశంలో భద్రపరచుకొని మాతృమూర్తియై నవ మాసాల్లో మనోరథవాంఛానుసారం ముద్దులపాపను కంటుంది. శాస్త్రజ్ఞులీ రంగంలో మరో అడుగు ముందుకువేసి, భవిష్య దంబ పురిటివేదన పడకుండానే పిల్లలతల్లి కావచ్చు నన్నారు. శుక్లశోణితములను కొన్ని రసాయనపదార్థాల సంలీనీకరణ సహాయంతో టెస్ట్‌ట్యూబ్‌లోఉంచి, నవమాసాలు పెంచి బిడ్డను బడయవచ్చునని రుజువు చేయనున్నారు. టెస్ట్‌ట్యూబ్ శిశువులే అవతరించే పక్షంలో, పూబోణి ప్రసవవేదన ప్రమాదాల నుండేగాక, శిశుజననప్రమాదాలు, శైశవారిష్టాలు, వంశానుగతరుగ్మతలు బారినుండి మునుముందే బయటపడి, నివారణోపాయముల నన్వేషించడానికి వీలు కలుగుతుంది.

పిండము నావరించియున్న ద్రవపదార్థాన్ని పరీక్షించి, పుట్టనున్న శిశువు ఆరోగ్యంగా పుడుతుందా లేక అంగవైకల్య ప్రాప్తి కలుగుతుందా ! అన్న అంశంపై ఇటీవల ప్రయోగాత్మక పరిశీలనలు చేసిన గ్లాస్కో మెడికల్ ఇన్స్‌టిట్యూట్ డాక్టర్లు ఇదమిద్ధమైన నిర్ణయానికి వచ్చినట్లు ప్రకటించారు. ముప్పది మంది గర్భిణులు గర్భస్రావం కొరకువచ్చిన వాళ్లపై ప్రయోగాలుచేసి వారిలో ఒకరికే అంగవైకల్యం కల పుడుతుందని తెలపడం జరిగింది. పిండము నావరించిన ద్రవంపై మరొక ప్రయోగం జరిపి జన్మించనున్న శిశువు స్త్రీయో, పురుషుడో అన్న విషయాన్ని ఆదిలోనే ప్రకటించవచ్చునని వారు ఉద్ఘాటించారు. పిండము వృద్ధిచెందేటటువంటి జీవరసాయన పదార్థంలో కొన్ని మార్పులు చేర్పులు చేయడంవలన మన ఆశయాల కనుగుణమైన సంతానాన్ని బడయవచ్చునని, సంతానంలో పొడసూపనున్న వారసత్వ లక్షణ గుణ దోషములను నిర్మూలించ వచ్చునని ప్రసిద్ధ జీవాణు శాస్త్రవేత్త, నోబెల్ బహుమతి గ్రహీత డా॥ హర గోవింద్ ఖురానా పరిశోధన ఫలితాలు విశదం చేస్తున్నవి. డా॥ ఖురానా కృత్రిమంగా సృష్టించిన జీవాణువుల ఆధారంగా వారసత్వలక్షణ సంక్రమణం ద్వారా ప్రాప్తించు కొన్నిరకాల శారీరకమైన, మానసికమైన మెదడునకు సంబంధించిన జబ్బులను నిర్మూలించ వచ్చుననీ, క్యాన్సర్‌లాంటి భయానక వ్యాధులను తుడిచి పెట్టవచ్చునని ప్రకటించారు. డా॥ ఖురానా పరిశోధనలు ఆధారంగా బెంగుళూరులోగల 'ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్స్' వారు 'జీన్' ల విధులను కూలంకషంగా తెలిసికొనేందుకు, వాని అంతరంగిక రహస్యాలను భేదించేందుకు ఒక బృహత్తర కార్యక్రమాన్ని రూపొందించారు. ఈ జీన్సు అనబడేవి 'డయాక్సి రిబో న్యూక్లియిక్ ఆమ్లము Deoxy Rebonucleic Acid (DNA) తో కూడియుండి జీవకణం ఎలా రూపొందాలో, అది ఎలాంటి విధులను నిర్వర్తించాలో మొదలుగాగల అతి సంకీర్ణ ప్రజనన సమాచారాన్ని ప్రసారంచేసే ప్రధాన విభాగంగా పని చేస్తూవుంటుందని జీవశాస్త్రజ్ఞులు చెబుతున్నారు. జీవాణు రసాయనిక పదార్థములను పరిమిత పరిధిలో ఉంచి, వారసత్వలక్షణాలను పకడ్బందీగా శిశువులో ప్రవేశ పెట్టేవి యీ 'జీన్సు'అనబడు కణములే ! వీని ప్రత్యేక విధులు, వాటిని నిర్వర్తించే పద్ధతి ఇంకా విస్పష్టంగా శాస్త్రజ్ఞులకు అవగతం కాలేదు. అది తెలిసిననాడు, వాటిపై సంపూర్ణాధికారం పొందిన నాడు, మానవుడు వాటిని తన అభీష్టానుసారం నడిపించి 'వారసత్వ లక్షణ సంక్రమణ పద్ధతికి' పూర్ణానుస్వారం చుట్టవచ్చు. అప్పుడు మానవుడు సంపూర్ణాధికారంతో మాధవునితో ఢీకొనడానికి ఆస్కారం కలుగుతుంది. అప్పుడు భూప్రపంచంలో జరా రుజా పీడన లుండవు. బెంగుళూరు వైజ్ఞానిక సంస తోపాటు, అమెరికాలోని మెసాచుసెట్సు టెక్నాలజీ ఇన్‌స్టిట్యూట్, కెనడాలోని నేషనల్ రీసెర్చి కౌన్‌సిల్ లాబ్స్ యీ 'జీన్ల' సంయోగ కరణ సిద్ధాంతంపై పరిశోధనలు సాగిస్తున్నవి.

జీన్లపై మానవుడు అధికారం పొందిననాడు, భూప్రపంచం నందన వన మవుతుంది. ఇక అందులో నివసించేందుకు అర్హతగల భావిసంతానంలో అన్ని ప్రపంచ జాతుల సద్గుణాలు మూర్తీభవించేట్లు కృషి చేయడానికి ఇదమిద్ధమైన కార్యాచరణ సంవిధానాన్ని రూపొందించలేక ధర్మ సందేహాలకు లోనవుతాడేమో? వర్తమాన సమాజపు నైతికము, ధార్మికము సాంఘికములైన కట్టుబాట్ల ననుసరించి భావితరాల వారికి కొన్ని అనివార్యపు చిక్కులు రాకతప్పవు. ఉదాహరణకు: కృత్రిమ గర్భ ధారణ పద్ధతిని తీసుకుందాము. ఈ పద్ధతి ననుసరించి ప్రతిసంవత్సరం ప్రపంచంలో కొన్ని వందల శిశువుల జననం జరుగుతున్నది. ఇలాంటి పద్ధతిలో జన్మించిన బిడ్డలు 'ధర్మపిండాల'తో

సమానులని అప్పుడే కొన్ని రాజ్యాల న్యాయస్థానాలు తీర్పులిచ్చాయి. కృత్రిమ గర్భధారణ వ్యభిచారంతో సమానమని తమ తీర్పులు ఇచ్చారు. గుప్తంగా ఉంటూ గర్భధారణకు ఇంద్రియదానం చేసిన దాత వ్యభిచారియగునా? క్షుభిత భర్త, కృత్రిమంగా బిడ్డను కన్న తన భార్యను మరియు ఆవిడకు గుప్త శుక్ల దానంచేసిన విటుణ్ణికూడా కోర్టుకీడ్చి, సహధర్మ చారిణితోపాటు తోడుదొంగగా నిలుపేందుకు అస్కారం ఉంటుందా? వర్తమాన న్యాయ చట్టాలకు కృత్రిమ గర్భధారణా పద్ధతి ననుమతించుటకు గాని నిరోధించుటకు గాని శక్తి చాలకుండా వుంది.

ఆయా రంగాలలో ప్రపంచ మేధావులుగా ఖ్యాతి గడించిన మహాపురుషులు చేసే వీర్యదానమును గుప్తంగాఉంచి, అలా స్వీకరించి సేకరింపబడిన శుక్ల మును 'శుక్ల సేకరణ బ్యాంకు'లలో శీతలీకరణచేసి భద్రపరచి, ఒక తరం గడిచినాక, వాళ్ల వీర్య మును అభిలషించిన అధునాతన దంపతులకు అందు బాటులో ఉంచాలని నోబెల్ బహుమతి గ్రహీత డా॥ హెర్మన్ ముల్లర్ అభివ్యక్తీకరించారు. అలాంటి సౌకర్యం కలిగినప్పుడు, నాగరిక లోకం అందు కంగీ కరించినపుడు, మేధావులు కావాలనుకున్న దంపతు లకు తమబిడ్డ హైందవతత్త్వవేత్తగా రూపొం దాలో, జర్మన్ శాస్త్రవేత్తగా రాణించాలో, అమెరికా రాజనీతిజ్ఞుడుగా భాసించాలో, లేక ఫ్రాన్స్ కవి సమ్రా ట్టుగా అవతరించాలో నిర్ణయించు కోనడానికి శుక్ల సేకరణ బ్యాంకులు తోడ్పడతాయని డా॥ ముల్లర్ సలహా ఇచ్చారు.

గర్భధారణావకాశాలు అధికమై, శుక్ల స్వీకరణ మరియు ఎంపిక పద్ధతులందు గల అవరోధాలు సడలింపబడినతర్వాత, దంపతులే గాకుండా, ఒక యువ తికి బదులు మరొక మానవతి గర్భం ధరించడానికి అవకాశాలు సుకరమవుతాయి. అనగా గొడ్రాలుగానే ఉండిపోయే దుస్థితి స్త్రీజాతి కుండబోదు. ఆవిధంగా మన భావిసమాజం ఒక వినూత్నశకమునకు అంకు రార్పణ చేయగలదు. అప్పుడు భారతీయుల సంతానం చైనాలో, చైనీయుల సంతానం—ఆఫ్రికాలో, ఆఫ్రి కనుల సంతును అమెరికా జాతీయులు నవమాసాలు మోసి, పెంచి పోషించడానికి మార్గాలు సుకరమవు తవి. ఎపుడో చచ్చి ఏదేశపు స్వర్గాన్నో అలంకరిం చిన కీర్తిశేషులు భవిష్యత్కాలంలో తండ్రులై పోవచ్చు. కన్యలు కన్యాత్వమును వీడకుండా 'అపర కర్ణుల'ను పొందవచ్చు. ఒకయువతి మరో మగువకు బదులు పురిటిబాధలను భరించి పుత్రోత్సాహం పొంద వచ్చు. ప్రేమకు పెళ్ళికి గల అవినాభావసంబంధం అనాదు అంతం కావచ్చు. కొందరు అదృష్టజాతకులు వేల సంతుకు పితరులు కావచ్చు. ఆశించిన సంతును పొందడానికి అర్రులువాచే దంపతులకు పర్మిట్ల అవసరం కలుగవచ్చు. ఇన్ని మార్పులు రాగల, వచ్చేం దుకు అవకాశం ఉన్న సమాజంలో సనాతన వారసత్వ సిద్ధాంతానికి స్థిరత్వం ఉంటుందా? అప్పుడు భరద్వాజ సగోత్రానికి బదులు బర్ట్రండ్ రసెల్ గోత్రానికి అంకురార్పణ జరిగిపోతుందేమో? అప్పైన వంశ వృక్షాన్నిపట్టుకు ప్రాకులాడే పెద్దలుగాని, పితృదేవత లకు పిండప్రదానంచేసే ప్రకాండులుగాని, ఉండ రేమో!

మరొక ముఖ్యవిషయం ఏమంటే, మానవ శరీరపు బహిరంతర్భాగాలేవి చెడి పనికిరాకుండా పోయినా, వాటిస్థానే కృత్రిమాంగములను అమర్చి మనిషి స్వరూప స్వభావాలనే మార్చివేయగల వెలుగు యుగంలో వ్యక్తియొక్క వ్యక్తిత్వంకుంటుపడి, ఆలోచనా సర ళిలో మార్పురాకుండా ఉంటుందా? ఉదాహరణకు, ప్లాస్టిక్ కనుపాపలతో స్టీలు ఎముకలతో, డ్యాక్రన్ ధమనులతో, ఎరువుతెచ్చుకొని అమర్చుకున్న మూత్ర పిండములతో, కాలేయములతో, గ్రంథులతో, అణుశక్తి చోదితమైనకృతకహృదయకోశంతో,రాగిలీగల నరాలతో, కర్రకాళ్ళతో నడివీధిన నడిచే నరోత్తమునికి పూర్వా ప్రశమనుపోకడలు ఉంటాయంటే నిజ్ఞులు విశ్వసిస్తారా? వీటన్నిటికి తోడు పాడైన పాత మెదడుస్థానంలో సరి కొత్తమెదడును అమర్చే శుభసంతం కనుచూపుమేరలో ఉందని శాస్త్రజ్ఞులు ఉద్ఘోషిస్తూఉంటే, ఇక ఇన్నిటిని మార్చుకున్న మానవుణ్ణి పాతరంగయ్యని ఎలా అంటాము? ఒకవేళ సమాజము అతణ్ణి పాతరంగయ్యగా గుర్తించి మన్నించినా, ఇంట్లో అతని భార్య మన్నించి చేరదీయవద్దా? అతనిలో శారీరకమైన భౌతిక మైన మార్పులకు తోడు, మానసిక పరివర్తనం కలిగి పాత భార్యను తిరస్కరించి, పాత ఉద్యోగానికి రాజీనామా ఇచ్చి, పాతస్నేహితులను దూరంకొట్టి, పాత వాతావరణాన్ని

త్యజించి, కొత్తపుంతల తొక్కవచ్చు. విజ్ఞానశాస్త్రం వికసిస్తున్నకొలదీ, మనిషిలో పనిచేయకుండా చెడిపోయిన అవయవాలస్థానే కృత్రిమాంగాలను రూపొందిస్తూ, ఒక శుభోదయాన అతని ఆయువుకే అమృతంపోసే శుభఘడియ చేజిక్కవచ్చు. అది అద్యతనభావిలో సాధ్యంకాకున్నా, ఆశాజీవి—బ్రతుకుపై గల తీపికొద్దీ తన కళేబరాన్ని ఆ శుభదినంకోసం ఘనీభవింపజేసుకొని భద్రపరుచుకొనవచ్చు. అట్టి ఆశతోనే ఇటీవల అమెరికాలో ఒక డాక్టరు చనిపోయిన తన భార్య కళేబరాన్ని ఘనీభవింపజేయడంలో కృతకృత్యుడైనాడు కాని ప్రభుత్వము, న్యాయశాస్త్రాలు అతని ఆశయాలను ఈడేరనీయలేదు. ఒకవేళ మనిషి కళేబరాన్ని మట్టిపాలు చేయడానికి బదులు ఫ్రిజ్‌లో పెట్టి భద్రపరిస్తే అతని స్థిరచరాస్తుల మాటేమిటి? అతని విధవ, కాదు వధువు - మరియు సంతానము, అతనియొక్క ఆస్తిపాస్తులను అనుభవించడానికి సంఘం సమ్మతిస్తుందా? ఒక వ్యక్తి వీలునామా ననుసరించి అతని కాయాన్ని ఘనీభవింపజేయకపోతే, అట్టి చర్య హత్యానేర సదృశమవుతుందా? ఇన్ని—ఇంకా ఎన్నో సమస్యల తాకిడిని తట్టుకొని, మంచి చెడుల పర్యవసానమును పసిగట్టి, భావిసమాజం పయనించాల్సి ఉంటుంది. ఉదాహరణకు: 'శరీరము—ఆత్మ' సమస్యలను ఇంచుక స్పృశిద్దాము. వ్యక్తికి సహజ మరణం ప్రాప్తిస్తే, అతని కళేబరాన్ని సత్వరం శీతలీకరణంచేసి మళ్ళీ ప్రాణప్రతిష్ఠ చేసిన తర్వాత ఆ వ్యక్తియొక్క పాత ఆత్మే అతని కాయంలో తిరిగి తిష్ఠవేస్తుందా? లేక కొత్తఆత్మ ఆవిర్భవిస్తుందా? ఒక వ్యక్తియొక్క హృదయాన్నీ, మెదడును కారణాంతరాలవల్ల తొలగించి, వాటిస్థానే కొత్తవాటిని పెట్టి, పునరుజ్జీవింప జేసినతర్వాత అతనిలో నివసించేది పాతఆత్మా లేక కొత్తదా ? కొత్త పాతల పితలాటకంలో పడి పాత ఆత్మవాదం పసలేని పిచ్చివాదంక్రింద పరిగణింప బడుతుందా ? లేక ఆత్మానాత్మ విచికిత్సకే కొత్త సిద్ధాంతాన్ని అంట గట్టాల్సిన స్థితి పడుతుందా ?

ఇదిలా ఉండగా, తల్లిగర్భంలోనే శిశువుయొక్క మెదడు పరిమాణాన్ని పెంచి అద్భుత మేధాశక్తిని వైజ్ఞానిక పద్ధతులద్వారా సముద్భవింప జేయవచ్చునని కెనడాకు చెందిన ప్రముఖ మేధశ్శాస్త్ర ప్రవీణుడైన డా॥ వైల్డర్ పెన్‌ఫీల్డ్ కొంతకాలం క్రితం ప్రకటించారు. ఇతని పరిశోధన ననుసరించి, మెదడులో గల ఒక భాగాన్ని విద్యుత్ప్రసరణంద్వారా ఉద్దీపింప జేసినట్లయితే,మానవుడేనాడో విస్మరించిన విషయాలను పునఃఉచ్చరింప జేయవచ్చునని నిర్ధారింప బడింది. మత్తు మందులద్వారా మైకం కలిగించి, అపస్మారక స్థితిలోవున్న వ్యక్తిచేత గత స్మృతులను వల్లింప జేయవచ్చునని నిరూపితమైంది. అన్ని విషయాలను అన్ని కాలాల్లో విస్మరించకుండా స్మృతి పథంలో వుంచుకునే ధారణాశక్తి మానవుడికి చేకూరిన నాడు, అవసర సమయాల్లోవాటిని తు.చ. తప్పకుండా పాటించి అభివ్యక్తంచేసే శక్తి కలిగిననాడు దాని పర్యవసానము ఉపయోగాదులు ఎలాఉన్నా మానవుడి ధీశక్తికి నీరాజన మెత్తకుండా ఉండగలమా ? మెదడులోగల విద్యుత్కణములందు, ఎలెక్ట్రోరసాయనిక పదార్థములకు తోడుగా కొన్ని ధారణాత్మక పరమాణువులు మిళితమై వున్నాయి. అట్టి పరమాణుపదార్థనిర్మాణంలో కృత్రిమ వైరస్‌లను ఇంజక్ట్ చేయడంద్వారా అద్భుతమైన మార్పును సాధించి, మానవుని ఆలోచనా శక్తికే అనుపమస్ఫూర్తిని చేకూర్చ వచ్చునని శాస్త్రజ్ఞుల ప్రవచనము.

మెదడుకి మేతపెట్టే మనోభావాలను ఉల్లేఖించేందుకు కారణమేమనగా; నేటి నవనాగరికసమాజం అవ్యతనభావిలో ఎదుర్కొనే ప్రధానమైన ప్రశ్నలలో మానవుని మనుగడకు ధ్యేయమేమిటి?సంస్కార సమాజం ఏ సదాశయాల నాకాంక్షించి గమ్యానికి పురోగమిస్తున్నది ? అన్నవి చర్చనీయాంశాలు. వీనికి సరియైన, సమంజసమైన, సమర్థనీయమైన, సమాధానాలు సకాలంలో ఇంగితజ్ఞులు, విజ్ఞులు, అన్వేషించకుంటే వైజ్ఞానికవిశ్వమే విశ్వమానవుణ్ణే

వినియోగించు కుంటుంది. పర్యవసానంగా, మానవుని మానవతకు, సంస్కారానికి, నీతికి, తీరనిలోపం కలుగక తప్పదు. వైజ్ఞానిక ప్రపంచం ప్రసాదించే కొన్ని దుష్పరిణామాలపట్ల అడపా తడపా వైజ్ఞానిక వేత్తలు, రాజనీతిజ్ఞులు, మతాచార్యులు, మానవతా వాదులు హెచ్చరికలు చేస్తూనే ఉన్నారు. కాని వారే సమాజంలో తలఎత్తే సర్వ సమస్యా సముద్రాల పూర్వాపరాలను మధించి నిగ్గుతేల్చి మానవాభ్యుదయానికి అమృతభాండాన్ని అర్పించే సర్వజ్ఞులుకారు. సమాజంలో నివసించే సామాజికు లందరిపైనా కొంత కొంత బాధ్యతవున్నది. భవిష్య త్ప్రెనుభూతం వికృత దంష్ట్రాకరాళంగా విశ్వవిజేతను కబళించేందుకు అదను చూస్తున్నది. విశ్వాన్ని జయించిన విశ్వవిజేత, సృష్టికి ప్రతిసృష్టి చేయగల స్రష్ట; మానవ శరీరాలను మస్తిష్కాలను మార్చగల మహిమాన్వితుడు; భావితరాల భావ వాహినులకు నూతనోత్తేజాన్ని కలిగించే ప్రజ్ఞాశాలి; వైజ్ఞానికపు వెలుగును మానవప్రపంచాన్ని పీడిస్తున్న ఆకలి, అజ్ఞానం, అసమానతలు అనబడే తిమిరచ్ఛటలను పారద్రోలడానికి వినియోగించుకుంటె ప్రపంచం మూడుపూలు ఆరు కాయలుగా అలరారగలదు.

(డా హరగోవింద ఖురానా పరిశోధనవ్యాసం ఆధారంగా).



# నేను - వాడు

## డా. ముదిగొండ శివప్రసాద్

ద్వేషాన్ని బీజాన్నిగా నాటి విషాన్ని పండిస్తాడు వాడు
త్యాగాన్ని మేఘాన్నిగా వర్షించి అను
రాగాన్ని చిలికిస్తాను నేను—
మాటల మంటలతో మానవోద్యానాలను
వంటకట్టెలుగా దహిస్తాడు వాడు
జీవన చందనకాండాన్ని అరగదీసి
సుగంధాన్ని లోపలా వెలుపలా నింపి
శరీరాన్ని కాలప్రవాహంపైన వంతెనగా అమర్చి
చైతన్యాన్ని నానుండి స్వేచ్ఛగా వడిపిస్తాను నేను
ఆరడుగుల దేహంతో అనంతవిశ్వాన్ని ఆక్రమిస్తూ
పిడికిలికందని మనసుతో పరమోన్నత రహస్యాలు భేదిస్తూ
ఛేదిస్తూ
జీవితాన్ని లోకంలో పరుసవేదిగా ప్రసరిస్తూ ప్రవహిస్తూ
శబ్దాన్ని నిచ్చెనగా చేసికొని జగత్తు వెనుకముందులు చుంబిస్తూ
సృష్టికందని కాలంనుంచి సాగివస్తున్న నిత్యపథికుణ్ణి నేను.
ఇంద్రచాపంలాంటి చంద్రతాపంలాంటి కర్పూరకరండంలాంటి అనంత
కాల కళికను నేను — దీప లతికను నేను !
పసిత్వాన్ని పశుత్వంపెట్టి హెచ్చవేసి
కసిత్వాన్ని సంకలనంచేసి
అజ్ఞతను తురాయిగా అధికారదాహాన్ని అంగరఖాగా దాల్చి
కొరివి చేతబట్టుకొని కాటికాపరిగా తిరుగుతాడు వాడు
గొంతెమ్మ కోరికలతో పగలే లాంతర్లు పుచ్చుకొని ప్రగతిని నటించే
పుట్టంధువు—క్షణికవాది—వాడు !
తూర్పును ఉపాసిస్తాను నేను

## భా ర తి

తిమిరాన్ని ప్రేమిస్తాడు వాడు
మంచికి మమతకు సమతకు ప్రచారకుణ్ణి పరిచారకుణ్ణి నేను
వంచనకు అవకాశవాదానికి అసత్యజీవనానికి అవతారం వాడు.
శారదపాదమంజీరాన్ని నేను
సాంస్కృతిక జాహ్నవిని గగనధునిని డ్రైనేజిలోకి దింపే
చిత్రగుప్తుడు—శబ్దవర్తకుడు వాడు.
రేపంటే ప్రేమ నాకు
నిన్నంటే భయం వాడికి
బ్రతికిన శవం వాడు
మృత్యుంజయంతో విజేతనైన
మానవాత్మను నేను
భారతీయత నా పేరు.



# ॥ శ్రీ॥ గాడేపల్లి వీరరాఘవ శాస్త్రిగారి ఆశుకవితా ప్రగల్భత

## శ్రీ సి. వి. సుబ్బన్న శతావధాని

"ఆగునె వీరరాఘవుని ఆశువు?
పార్థశర ప్రయోగమే ఆగిన నాగుగాక"

అని గర్జించిన ఆశుకవి కేసరి శ్రీ గాడేపల్లి వీరరాఘవ శాస్త్రి.

ఖర సం॥ చైత్ర బ 7 గురువారము, వృశ్చిక లగ్నమున జన్మించిన శ్రీ శాస్త్రిగారి వాక్స్థానము సప్తమ భాగవతుడైన కుజదృష్టి చే దీప్తమై ప్రతి పక్షులు నిలువ చోటిచ్చినది కాదు. గురుమహాదశ 16 సం॥ పూర్ణముగ భోగించి, శనిమహాదశలో శని భుక్తిలో కాలధర్మము పొందిరి. కాలాకృతియైన శనైశ్చరుడు లగ్నపంచమాధిపతుల దశమసప్తమ దృష్టులతో జూచుచు రాజ్యమున నుండెను.

వీరు — కర్నూలు, నెల్లూరు, గుంటూరు, అనంతపురము, బళ్లారి, ఆనాటి నైజాము రాజ్యమున విశృంఖలముగా సంచరించి 25 శతావధానములు, 64 అష్టావధానములు చేసిరి.

'అల్లసానిపెద్దన తన కవిత్వము గురించి పద్యమాలిక చెప్పెనుగదా! మీ కవిత్వము గురించి మీరేదైన మాలిక ఆశుగా చెప్పగలరా?' అని యెవరో ప్రశ్నింపగా, శాస్త్రిగారు గడగడ 48 చరణములు చెప్పిరట. పెద్దన పద్దెము 29 చరణములే. శాస్త్రి గారి పద్యము ఆశుధారయని చూచినంతనే స్ఫురించును. పెద్దనపద్యము ఆలోచించి, తూచిచూచి, పూర్వార్థము జిలుగుతెలుగుగా ఉత్తరార్థము స్నిగ్ధ సంస్కృతముగా తీర్చిదిద్ది రచింపబడినది. ఈ విషయము శయ్యాపాకములే స్ఫుటీకరించును.

శాస్త్రిగారు నవరసనిర్వహణమునందు తమకు గల వైదగ్ధ్యము నలవోక చెప్పికొనిరి.

'హాస్యరసంబు దెల్పుచో బోరన పొట్టచెక్కలయి పోవలె' నట.

'శృంగారము జూపుచో — విషమగహ్వర వాసము జేసి, నిర్జలాహారులునైన యోగులె, ఒయారు లయారె! పయింబయిన్ రసంబూర నచింతురంచు విరహోదధి లోపలజేరి యౌవన ప్రారభమాణ యోషి దురువర్తుల మాంసల సుస్తనాగ్ర కస్తూరి పరీమళంబులకు చొక్కుచు దాసులుగావలెన్' అట.

సంకుసాల నరసింహకవి 'కవికర్ణ రసాయనము' నందు తన కవిత విన్నచో యతి విటుడగునని, విటుడు యతి యగునని వ్రాసికొన్నాడు. శాస్త్రిగారి ప్రతిజ్ఞ దానిని పోలినదే.

శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారి పద్యమాలి కయు ఈ సందర్భమున పేర్కొనదగినది

'విని, వినినంతమాత్రమున—ఒకానొక డెవ్వడు గాని తన్నుబిల్చిన నికవాని కుత్తరములేదు సరేకద! పల్కెనేని, ఏమనదగు ఆ రసంబు నహహా! మహనీయ గుణాఢ్యుడెవ్వడో వినుతికి నెక్కగల్గిన కవిత్వ మహత్వ పటుత్వ సంపదన్‌గని రచియించె లేకునికి గల్గునె ? యిట్టి రసప్రసార మంచును నదియే వచించుగద సొక్కుచు సోలుచు వెఱ్ఱివానిరీతిని మదిరార సంబు చవిదేలిన పూరుషుభాతి మందుపోల్కెను గనుపట్టి చొప్పడ వలెన్' అట. కావేరీనదీప్రవాహ

మునబడి వివశుడై సుడిగుండమున మునిగినట్లు శ్రవణమాత్రమున కావ్యరసకూలంకషలో బడవలెనని చెళ్లపిళ్లవారి తాత్పర్యము.

రాఘవశాస్త్రిగారు ఆశుప్రబంధాలు మున్నగు కృతులు దాదాపు పాతిక రచించిరి. వారి యూరు ఎఱ్ఱగొండపాలెము. (కర్నూలు జిల్లా). దానినే సంస్కృతీకరించి రక్తనగాఖ్య పట్టణమనిరి. కొంత కాలము గద్వాలలో నుండిరి.

స్వవిషయము నిట్లు చెప్పికొనిరి:—'శా॥ పేరా? రాఘవశాస్త్రి, గాడెపలియన్ పేరింటిపే, రింక మాయూరా? రక్తనగాఖ్యపట్టణము, మా యుద్యోగమా? రాట్యభాస్వాదుల్ మెచ్చ శతావధానకవితాసందర్భముల్ చూపి, సత్కారంబందుట, గద్దువాల్ నృపతి యాస్థానంపు విద్వత్కవిన్.'

శాస్త్రిగారి హాస్యధోరణికి ఉదాహరణముగా నొక చిన్న పద్యము చిత్తగింతురు. కళత్రస్థానగత కుజగ్రహమును శని చూచిన ఫలము వారికి ద్వికళత్ర యోగము పట్టించెను. పెండ్లికూతురును చూచుటకు బోయిరి. ఆ చిన్నది ఉత్తాలవిగ్రహులగు శాస్త్రిగారిని గన్గొని జడిసి, 'చాల పొడవుగ నున్నాడే' అనగా, ఆమె కడకు పద్యములు వ్రాసిపంపిరి.

'పొడవనివ నిజమె, విద్యకు
పొడవే, కీర్తికిని పొడవె, బుద్ధికి పొడవే,
పొడవే విత్తమునకు, ఇక
తొడపులకును పొడవె, మానుదువా! పూనుదువో!'

శాస్త్రిగారు నంద్యాలనుండి మార్కాపురమునకు ప్యాసెంజరు ట్రెయిన్‌లో ప్రయాణముచేయుచు, దాని ఆలస్యమునకు విసిగి వేసరి ఆ బండిపై నొక సీసము చెప్పిరి. అన్ని పద్యములకంటె ఈ పద్యము బాగున్నది. మంచి నుడికారమున్నది: భావమున్నది.

'కనుపడు రాతితో, కదలాడు చెట్టుతో
చేసిన ముచ్చటల్ చేసి చేసి
వచ్చిన గుంటకై హెచ్చిన మిట్టకై
ఆగుచు సందియ మందియంది
యెగుమతి దిగుమతియే లేనిచోటుల
అధముల పనులకై ఆగి యాగి
యెదురైన వ్రలిగూడ్సు కొదిగిన చోటుల
వచ్చువారికి సలామిచ్చి యిచ్చి
ఇంక మమ్మెంతకాల మీ హింసలోన
కూలద్రోయుదు తీవ్రత కొంచెమూని
కూరు చున్నట్టి మమ్ముము కొంపజేర్చి
కుదుట పడనీవె! నంద్యాల కుంటికుక్క!'

సైసీసమున కావ్యోచిత శయ్యకలదు. ఇదే పాకను సాధింపబడినచో కావ్యరచన ముచ్చట గొలువక పోదు. కాని, రాఘవశాస్త్రిగారి ధోరణి నిరంకుశ గీర్వాణశబ్దసర్పిణియై సభారంగమున సద్యస్సుగా నొకానొక అహో పుట్టించు ఇంద్రజాల విస్ఫూర్తికి ప్రాణముపోసెడిది. ఎంత దీర్ఘజటిలసమాసఘటన చేసిన అంత మహాకవి యనుకొను వ్యామోహము తిరుపతి వేంకటకవులు వీరవిహారముచేయు ఆ కాలమున గూడ నాటుకొనియుండెను. 'వీరరాఘవశాస్త్రి—దీర్ఘసమాస కవి' యను ప్రసిద్ధి యేర్పడెను. ఒకసారి గుంటూరులో శ్రీ పిసుపాటి చిదంబర శాస్త్రిగారు, గౌరావఝ్ఝుల రామకృష్ణశాస్త్రిగారు— 'రాఘవశాస్త్రిగూడ అందరివలెనే సుంఘమైన సమాసములే వేయునే' అనిరట. అప్పుడు నిద్రమేల్కొన్న శాస్త్రిగారు—

'సులభంబైన సమాసమా యొసట,
దిక్పుద్ధాంత కాంతా నిరర్గళ లావణ్యమయ ప్రవాహ
విహర త్కల్లోల మాలాతి నిర్మల
డిండీరకణాయమాన సుయశో రామా మనోహారి
వాగ్విలసద్భూషణు
నన్నెరుంగరో కా! దేవీ! యెంత మాటాడెజా!'

అని ప్రారంభించి మూడు మత్తేభములు చెప్పిరట.

ఈ రీతిగా వేళలేదు, పాళలేదు—ఎప్పుడుబడిన అప్పుడు, ఎక్కడబడిన అక్కడ పద్యనిర్మాణము చేయుచునే యుండిరి. అట్టి పద్యరత్నముల ఏర్చి ఒక

వాల కూర్చువాడు లేకపోయెను. శ్రీ మద్దులపల్లి వేంకటసుబ్రహ్మణ్య శాస్త్రిగారు చాటు చమత్కార పద్యము లనిన చెవికోసికొందురు. రాఘవశాస్త్రిగారు ఆ కావ్యతీర్థుని ప్రార్థించిరి. ఆ ప్రార్థనమునే పద్య బంధమున కావింపుడని కావ్యతీర్థు లడిగిరి. శతావ ధానిగారు సెలవిచ్చిన పద్యమిది:—

'అబ్రాశిస్థిత ధారుణీవలయ
భాషాచార్య సంస్తుత్య వా
క్సుబ్రహ్మణ్యులు నబ్బురంపడగ,
నీచుల్ కుంద సౌపర్వరా
జ బ్రహ్మేశముఖామరస్తుతి
కథాంచత్కావ్య నిర్మాణ శిల్పబ్రహ్మన్
ననుగూర్చి సాయము నొనర్పంజెల్లదే మిత్రమా!'

ఇది శార్దూల విక్రీడిత వృత్తము. రేఫఘటిత బకారప్రాసతో నడుపబడినది. ఎందుకు? ప్రాసస్థాన మున కావ్యతీర్థ సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి తావు లేదు. పోగా 'శిల్పబ్రహ్మ' మిగిలినది. ఈ పద మెక్కడనైన యతియొద్దనైన ఇముడగలదు. శ్రీనా థుడు నైషథమున 'బ్రాహ్మీదత్త వరప్రసాద'తో ఆరంభించి, బ్రహ్మాండాది పురాణములు బ్రహ్మజ్ఞాన కళ రెండును కూర్చినాడు. ఇది అట్లుకాదు. కేవల ప్రాస దౌష్కర్యము, బంధజాటిల్యము నుద్దేశించి కూర్చబడెను. రాఘవశాస్త్రిగారు ఓజోగుణమునెంతగా గౌరవింతురో దీనివలన తెల్లమగుచున్నది. అవధానులు రజోగుణ కఠోరులై ఆశురచన కుపక్రమించినచో ఒకొక్కవేళ ఆ ధారావిశేషము జగదాశ్చర్య కరముగ నుండును.

'అన్నది మాటయేని, పురుషాకృతి చిహ్నముగాగ మూతిపైనున్నది మీసమేని—' ఈ ధర శ్రీ కొప్ప రపు సోదరకవులది.

రాఘవశాస్త్రిగారి ప్రస్తుతపు 'టబ్రాశి' పద్య మున 'శిల్పబ్రహ్మ' శబ్దము కొంతవరకు పరిగణింప దగియున్నది. శిల్పమనగా పద్యరచనా సంబంధి యతి గణప్రాస నిర్వహణ నిపుణత. ఆశుసమాపతితమైన యే శబ్దమునైన పద్యమున నిర్పి అన్వయము సాధించు పాండిత్యబలము వీరికున్నది.అంతకుమించిన కావ్యగుణము పద్యమున, పండించు నేర్పు వీరికి లేకపోలేదు. కాని అంత ఓర్పు మాత్రము లేకపోయినదని చెప్పక తప్పదు.

వీరరాఘవశాస్త్రిగారు సభాకవి. వారి పాండిత్య వైదగ్ధ్యములు అనల్పములు. అవధాన విద్యకు వన్నె తెచ్చిన మహామహులలో శాస్త్రిగారును గణనీయులు.



# అప్పకవీయమునందలి యతులసంఖ్య- ఒక పరిశీలన

## శ్రీ వంతరాం రామకృష్ణారావు

అప్పకవీయమున నలువదిఒక్క యతిభేదములు చెప్పబడి ఉన్నవి. వీటిలో కొన్ని యతులు అనావశ్యకములను అభిప్రాయము లోకములో కలదు. ఆ అభిప్రాయము లిట్లుండును. మువిభక్తియతి ముకార యతి అని రెండు యతిభేదము లక్కరలేదు. ముకార యతిలోనే మువిభక్తి యతని అంతర్భవింప జేయ వచ్చును. ఇట్లే అభేదయతిని అభేదవర్గయతితో గతార్థము చేయవచ్చును. అనుస్వార సంబంధయతి, అనునాసికాక్షరయతి, ఋజుయతి, ఊష్మవిశ్రాంతి అనునవి ఒక్క సరస యతితోనే గతార్థములగును. అనునాసికాక్షరయతి, అనుస్వారసంబంధయతిలో చేరును. వికల్ప విరమణములో అంత్యోష్మ సంధి యతిని చేర్చవచ్చును. తద్భవవ్యాజయతిని విశేష వళిని కలిపి జ్ఞావడి అనుపేర నిర్దేశించ వచ్చును. ప్రాణియతిని వ్యంజనస్వరమైత్రికి సామాన్య లక్షణముగా జమకట్టవలెను. ప్లుతయుగ విశ్రామము కాకుస్వర వళిలోభాగమే అగును. ఋత్వసంబంధ వళిలో ఋత్యసామ్యవళిని కలిపి వేయవచ్చును. లుప్త విసర్గక స్వరవళి, వృద్ధివళి, అనునవి స్వరప్రధాన వడిలోనే చేరిపోవును. ప్రాసయతి, యతిభేద మని పించు కొనదు. స్వరప్రధానవళి అక్కరలేదు. స్వర మైత్రివళి ఒక్కటే చాలును. ఏకతరయతి, ప్రత్యేక యతి, భిన్నయతి అనునవి యతిభేదములు కావు. ఈ పక్షమున 41 యతులలో 18 యతులు తగ్గించ వచ్చును. ఇట్లు తోచినట్లెల్ల తగ్గించవచ్చు ననుట యేనా ? ఏవైన నియమములను పాటించవలెనా ? అన్నది ప్రశ్న. ఏ శాస్త్రమునందైనను వర్గీకరణ విషయమున కొన్ని నియమములు పాటింపబడుట సహజము. ఒక్క ఉపమాలంకారములో ఎన్నో అలంకారములు గతార్థము చేయవచ్చుననరాదు—అట్లే యతుల సంఖ్యను తోచినట్లెల్ల కుదించవచ్చు ననుట పాడి కాదు. అప్పకవి యతుల సంఖ్యను పెంచుటలో పెట్టు కొన్న నియమములను నిష్పక్షముగా పరికించినచో అనావశ్యకము లనబడుచున్న యతులలో పెక్కులు అనావశ్యకములు కావని చెప్పవచ్చును. యతుల వర్గీకరణమును క్రింది నియమములను బట్టి పరిశీలించ నగును.

(1) యతులను వర్గీకరించునప్పుడు వాటి పరిణామ క్రమమును దృష్టిలో పెట్టుకోవలెను. ఈ నియమము ప్రకారము, మువిభక్తియతి, ముకార యతి వేరువేరుగా ఉండవలెను. ప్రాచీన కాలములో మువర్ణకము పు-బు, వర్ణములకు అభిన్నమని శాసనములవల్ల తెలియుచున్నది. మువిభక్తియతికి ప్రాచీన కాలమునుండి ధారాళముగా ప్రయోగములు కలవు. పూర్వ లాక్షణికులు చెప్పిన పోలికవడి ఈ మువిభక్తి యతియే అని వారు చూపిన లక్ష్యములనుబటి స్పష్ట పడుచున్నది. 'పోలికనడి శిలముల్లమున కెనయనగా; భూలోకం బమరలోకమున కెనయనగా' అని కవిజనాశ్రయము. 'హరిచరణ సరోరుహములు నా హృత్సరసి లోనఁ బొదలుననంగన్' ఛందోదర్పణము— ముకార యతి కాలక్రమమున ఏర్పడినది. దీనికి ప్రయోగ ములుకూడ విరళములు. ఈ విషయమునే అప్పకవి 'నిలిపిరచ్చట, నచ్చటను ముకారయతు లటంచును గృతులన్' అని స్పష్టపరిచినాడు. కావున మువిభక్తి యతిని ముకారయతిలో అంతర్భూతము చేయవచ్చు ననుట సముచితము కాదు.

(2) తార్కికమైన పొడిగింపు మూలమున, ఒకచోట సమ్మతమైన మైత్రి, వేరొకచోటికి విస్తరించిన పక్షమున, అట్టి విస్తరణ పద్ధతి సూచితమగునట్లు యతిభేదములను వర్గీకరింపవలెను. ఈ నియమమునుబట్టి క్రింది యతిభేదము లవశ్యకములగును.

### (i) అభేదయతి—అభేద వర్గయతి: -

వబలు పరస్పరము యతిచెల్లుట అభేదయతి. 'వబయో రభేదః' అన్నది దీనికాధారము. వర్గయతిచే, బకారమునకు ప ఫ భ లకు యతిచెల్లును కావున బకార మిత్రములగు ప ఫ భ లు, బకారమిత్రమగు వకారముతో యతి చెల్లును. ఇదే అభేద వర్గయతి. మిత్రుని మిత్రులు తనకు మిత్రులన్న లోకన్యాయము ఇందు ఇమిడిఉన్నది. ప ఫ భ లకు మిత్రము బకారము. బకారమునకు మిత్రము వకారము. కనుక ప ఫ భ లకు వకారము మిత్రమన్నమాట. ఈ అభేద వర్గయతికి నన్నయ ప్రయోగములను అప్పకవి చూపెను. పాఠాంతరములను గ్రహించినచో ఈ అభేదవర్గయతి నన్నయ సమ్మతము కాదనవచ్చును. కాని పాఠాంతరములు తృప్తికరముగా కనబడవు. కాన ఇది ప్రాచీన సమ్మత మనుకొన వచ్చును.

### (ii) సరసయతి — అనుస్వారసంబంధయతి —

సరసయతిచే నణలు మిత్రములుగాన అనుస్వార సంబంధయతి అక్కర లేదందురు. కాని యిది సరికాదు. పూర్ణబిందుపూర్వకములగు టఠడఢలకు బిందుయతిచే ణకారముతో యతిచెల్లును. ఇట్లే పూర్ణబిందు పూర్వకములగు త థ ద ధ ల కు, నకారముతో యతిచెల్లును. న ణ లకు సరసయతిచే మైత్రికలదు. కాన నకారమిత్రములు, ణకార మిత్రములు, పరస్పరమిత్రము లగుచున్నవి. ఇదే అనుస్వార సంబంధయతి. టత వర్గాక్షరములు నాల్గింటికి మైత్రిలేదు. వీటికి న ణ ల తోను మైత్రిలేదు. ఇవి అనుస్వారపూర్వకములైనప్పుడే మిత్రము లగుచున్నవి. కాన అనుస్వారసంబంధయతిగా నిర్దేశింపబడెను. మిత్రుల మిత్రులు పరస్పరమిత్రులగుదురను లోకన్యాయ మిట అనుసంధింపనగును. నకారమునకు పూర్ణబిందుపూర్వకములగు త థ ద ధ లు మిత్రములు. ణకారమునకు పూర్ణబిందు పూర్వకములగు ట ఠ డ ఢ లు మిత్రములు. నణలు పరస్పర మిత్రములు. కాన, నకారమిత్రములు, ణకార మిత్రములు, పరస్పరమిత్రములయిన వన్నమాట. ఈ పొడిగింపు కాలక్రమమున జరిగినదే కాని ప్రాచీనము కాదని ప్రయోగములనుబట్టి చెప్పవచ్చును. న ణ ల యతి సరసయతి, అంతమాత్రాన పూర్ణబిందుపూర్వకములగు టత వర్గాక్షరములు నాలుగు తమలో తాము యతి మైత్రినందుట సరసయతి అనిపించుకోదు. 'చం, దాలంబండు నొక్కప్పుడుం దఱుగ దింటం బాడియుం బంటయున్' అనుచో, 'ం ద—ం ట' యతి ప్రయుక్తము. ఇది సరసయతియా ? కాదు— సరసయతిలో 'నణ'ల మైత్రి చెప్పబడినది కాని యిది కాదు. దీనికి వేరే నామకరణములేనిచో వర్గీకరణము అసమగ్రమును కావలసివచ్చును.

### (iii) సరసయతి — అనునాసికాక్షర యతి! -

త—ట, వర్గాక్షరములు మొదటి నాలుగు పూర్ణబిందు పూర్వకములై అనుస్వార సంబంధ యతి మూలమున మిత్రము లగుచున్నవి. ఇవి బిందు యతిచే నణలకు మిత్రము లగుచున్నవి. నణలు సరస యతిచే అన్యోన్యమిత్రము లగుచున్నవి. ఈ అన్నింటిని పురస్కరించుకొని ఏర్పడినది, అనునాసికాక్షర యతి. లోకములో పరస్పర మిత్రములైన రెండు వర్గము లున్నప్పుడు, ఆ వర్గములకు మిత్రులైన వారు పరస్పరమిత్రులైనప్పుడు, ఈ వర్గమువారి మిత్రుడు ఆ వర్గమువారికి, ఆ వర్గమువారిమిత్రుడు ఈ వర్గమువారికి మిత్రులగుట జరుగుచుండును. ఈ లోకన్యాయమే ఇట కలదు. అనుస్వార పూర్వకములగు ట, త వర్గాక్షరములు నాలుగు పరస్పర మిత్రములైన రెండు వర్గములు. వీటిలో, పూర్ణ బిందు పూర్వకములగు ట ఠ డ ఢ లకు మిత్రము, ణకారము. పూర్ణబిందు పూర్వకములగు తథదధలకు

మిత్రము, నకారము. నణలు పరస్పర మిత్రములు. కావున పూర్ణబిందుపూర్వకములైన ట ఠ డ ఢ లకు నకారము మిత్రము. పూర్ణబిందు పూర్వకములైన త థ ద ధ లకు, ణకారము మిత్రము. ఇదే అను నాసికాక్షరయతి. ఈ యతిని అంగీకరించినచో 'మహీ మం డలమెల్లను జూచినాడ నాఁడు నరేంద్రా' అను చోట 'ండ--న' యతి నేమనవలెను ? బిందుయతి అనుటకు డకారము టవర్గ లోనిది. నకారము తవర్గ లోనిది. దీని కేదో ఒక నామకరణ మావశ్యకము గదా! అందుచే అనునాసికాక్షరయతి ఉండవలెను.

## (iv) అనుస్వార సంబంధయతి — అనునాసికాక్షరయతి

అనునాసికాక్షరయతిని అనుస్వార సంబంధ యతిలోనే అంతర్భూతము చేయవచ్చునని కొంద రందురు. పూర్ణబిందు పూర్వకములగు టత వర్గా క్షరములు పరస్పరము చెల్లుట వేరు. అవి వ్యుత్క్రమ ముగా అనునాసికాక్షరములతో చెల్లుటవేరు. అను నాసికములతో చెల్లుట అను విశేషధర్మమును బట్టి వేరుయతి భేదమునుచెప్పుట యుక్తము. అనుస్వార సంబంధయతి, బిందుయతి, సరసయతి, అను మూడింటిలో ఉన్న మిత్రత్వములనుబట్టి చేసిన సాగి గింపు అనునాసికాక్షరయతి. కనుక ఇది వేరుగా ఉండనగును.

కాగా, అభేదయతి, అనుస్వార సంబంధయతి, అనునాసికాక్షరయతి అనునవి అనావశ్యకములు కావని చెప్పవచ్చును.

(3) ప్రతి యతిమైత్రిస్థలమును ఏదో ఒక యతిభేదము క్రిందికి వచ్చునట్లు వర్గీకరించ వలెను. అట్లు వర్గీకరించనిచో వర్గీకరణము అస మగ్రము కావలసి వచ్చును. ఈ నియమమును బట్టి క్రింది యతిభేదములు కావలసివచ్చును.

## (i) ప్రాణియతి :—

వ్యంజన స్వరమైత్రిని తెలుపు సామాన్య లక్ష ణముగా మాత్రమే అప్పకవి దీనిని ఉద్దేశించలేదు. ఒక వ్యంజనము అదే వ్యంజనముతో యతి చెల్లినచో ప్రాణియతి అనవలెనని అప్పకవి అభిప్రాయము. 'మందార మకరంద మాధుర్యమునఁ దేలు' అనుచో, మకారమునకు మకారముతో యతి వేయబడినది. ప్రాణియతి చెప్పనిచో ఇది యేయతి భేదముక్రిందికి వచ్చును ? ఏదో ఒకపేరు నిర్దేశించనిచో వర్గీకరణ సమగ్రతకు భంగముకలుగును. కాన ప్రాణియతి కావలసి ఉండును.

## (ii) ఋజుయతి : —

హయలు సరసయతిచే అ ఆ ఐ ఔ లతో యతి చెల్లును కాన ఇది సరసయతిచేతనే గతార్థ మందురు. కాని హ—యలకు యతి చెల్లినప్పుడు దానికేదో ఒక పేరుండ వలెను. చ ఛ జ ఝ లు శ ష స లతో యతిచెల్లుట సరసయతి కాన, చ ఛ జ ఝ లు యతి చెల్లుటను వర్గయతిలో చేర్ప నక్కరలేదనుట ఎట్టిదో ఇదియు అట్టిదే. హ—య, యతిని ఋజు యతిగా చెప్పనిచో వర్గీకరణము అసమగ్రము కావలసి ఉండును. కాన వేరే చెప్పవలెను.

## (iii) ఊష్మ విశ్రాంతి:—

సరసయతిచే, శ ష స లు చ ఛ జ ఝ లతో మైత్రి పొందుచునుగనుక, శ ష స ల మైత్రిని ఊష్మ విశ్రాంతిగా నిర్దేశింప నక్కరలేదని అందురు. చ ఛ జ ఝ లు తమలో తాము చెల్లినప్పుడు వర్గయతిఅని వేరే నామకరణమున్నట్లే శ ష స లు తమలో తాము యతిమైత్రి నందునప్పుడు ఏదో ఒక నామకరణము అవసరము. లేనిచో అసమగ్రత దుర్వారమగును.

(4) యతులను వర్గీకరించుటలో సూక్ష్మ భేదములను పరిగణనలోనికి తీసికొనవలెను. ఈ నియ మమునుబట్టి క్రింది యతిభేదము లుండవచ్చును.

## (i) అంత్యోష్మసంధియతి — వికల్ప విరమణము:—

ఈ రెంటిని వికల్పవిరమణముగా ఏకము చేయ వచ్చునందురు. కాని ఇవి వేరువేరు సంధికార్యములకు

చెందినవిగాన విడిగా ఉండవచ్చును. వికల్పవిరమణ మనునది అనునాసికసంధికి చెందినది. దీనిని అను నాసికసంధియతి అననగును. కాని అనునాసికసంధిలో వికల్పరూపము లున్నప్పుడే ఈ యతి వర్తించవలెను గనుక వికల్పయతిఅని నామకరణము చేయబడెను. వికల్పయతి అన్న నామకరణము అనునాసిక సంధికి స్ఫోరకముగా లేకుండుటచే దీనిలో అంత్యోష్మసంధి యతిని చేర్చవచ్చునని అనిపించును. అనునాసికసంధి యతి అనియే నామకరణముచేసి, ఈ యతి, వికల్ప రూపము లున్నప్పుడే గ్రాహ్యమని అప్పకవి చెప్పినచో సందేహమున కెడములేకుండ ఉండెడిది. ఇవి వేరువేరు సంధి కార్యములకు చెందినవి గనుక విడిగా ఉండవలె నన్నదే అప్పకవి ఆశయము.

(ii) **తద్భవవ్యాజయతి - విశేషవళి:—**

ఈ రెండిటిని కలిపి జ్ఞావడి అనవలె నందురు. కాని యిది సముచితముకాదు. జ్ఞాకు నకారమునకు యతి చెల్లినచో తద్భవవ్యాజయతి. జ్ఞాకు, క ఖ గ ఘ లకు యతి చెల్లినచో అది విశేషవళి. నకారము, కకారము వేరువేరు వర్గములకు చెందినవిగాన ఇవి వేరువేరుగానే ఉండుట లెస్స. కాని అప్పకవి తద్భవ వ్యాజయతిఅని నామకరణము చేయుటమాత్రము సరి కాదు. జ్ఞా—న, యతి తద్భవవ్యాజమున అయినది కాదు. జ్ఞాను 'జ్న్యా'అని ఉచ్చరించుట కలదు. 'జ్న' అన్న శిష్టోచ్చారణననుబట్టి, జ్ఞాకు నకారముతో యతి మైత్రి చెల్లినది. ఈ ఉచ్చారణమూలమున తద్భవము లలో జ్ఞాకు నకారము నిల్చును. విజ్ఞానము=విన్నా ణము—ఇత్యాది. తద్భవములలో జ్ఞాకు నకారము నిల్చు టకు మూలము, ఉచ్చారణము. అట్లే జ్ఞాకు నకార ముతో యతివేయుటకును మూలము, ఉచ్చారణమే. తద్భవమూలమున ఈ యతి చెల్లలేదు. అప్పకవి పొర పాటును గుర్తింపక శ్రీ ప్రభాకరశాస్త్రిగారు హర విలాస పీఠికలో, 'స్నానముచేసి ధౌతపరిధానము' అనుచో తద్భవవ్యాజయతి ప్రయుక్తమని అభిప్రాయపడినారు. ఇట స్త్నానము, అనునది కవిప్రయుక్తము. దీని నుండియే, స్త్నానము=తానము, అను తద్భవము పుట్టి నది. తద్భవవ్యాజమున యతి నంగీకరించినయెడల, య—జ యతియు తద్భవవ్యాజయతి క్రిందికి రావలసి యుండును. యజ్ఞము=జన్నము, ఇత్యాదులలో యాకు జకారము ప్రచురముగానే కలదు. జ్ఞాకు గకారము తద్భవములలో అరుదుగా ఉండును. ఉదా॥ ప్రజ్ఞ= పగ్గె. అయినను జ్ఞాకు, కవర్గతో యతి వేయు టయు ఉచ్చారణమూలకమే. 'జ్ఞా'ను 'గ్న్యా'అని పలు కుట శిష్టోచ్చారణముగా ఉన్నది. ఈ 'గ్న్యా' అను ఉచ్చారణమునుబట్టి జ్ఞాకు కవర్గతో యతి చెల్లినది. 'అజ్ఞానమనియెడి యంధకారమున, మగ్నుఁడనై' ఇత్యాదులలో ప్రాస నిర్వహణము ఈ ఉచ్చారణచేతనే జరుగుచున్నది. జ్ఞాను 'గ్న్యా'అని పలుకుట ఇతర భాషలలోను కలదు. 'Cnawan' మొదలైన ఆంగ్లో సేగ్జన్ పదములలో కకారము వినవచ్చును, 'Konnen' అను జర్మన్ పదమునకు 'Gna' మూలము. 'జ్ఞా = 'Gna' అయినది. 'Know' అనుదానిలో 'K' అన్నది 'Silent Letter'. ఈ 'K' అన్నది, 'జ్ఞా'తోగల సంబంధమును సూచించుచున్నది. యతి ప్రాస శబ్దాలంకారముల నిర్వహణములో పూర్వకవులు శిష్టోచ్చారణను కొన్నిచోట్ల ప్రమాణీకరించిఉన్నారు. 'జిహ్వ' శబ్దము శిష్టోచ్చారణలో 'జింహ' అని పలుకబడును. దీనిని ఉచ్చారణకు సరిపడునట్లు జింహ—అనియే వ్రాయసకాండ్రు తాటాకు ప్రతు లలో వ్రాయుట లేఖన సంప్రదాయము. భాగవతములో 'ఉదంచ, త్ఖరతర జిహ్వానకు నుగ్రతర, రంహాన కున్' అని కలదు. 'జింహానకు' అన్న ఉచ్చారణను బట్టి శబ్దాలంకారము సరిపెట్టబడినది. ఇది తెలి యక భాగవత పరిశోధకులు 'జింహ'నే గ్రహించినారు. వీరు భారత పరిశోధనలకు సిద్ధపడినచో తిక్కనగారి 'జ్ఞాని' 'గ్నాని'గా మారినను వింతలేదు. ఇంతకు, చెప్పవలసిన దేమనగా అప్పకవి, జ్ఞా—న యతిని తద్భవవ్యాజయతి అనుట సరికాదు. జ్న్యా—అను ఉచ్చా రణను బట్టి నకారముతోను, గ్న్యా—అను ఉచ్చారణను బట్టి క ఖ గ ఘ ల తోను యతులు చేయబడును. ఈ రెంటిని జ్ఞాయతి అనుటకంటె విభిన్నో

చ్చారణముల మూలమున విభిన్నయతు లేర్పడెననుట యుక్తము.

### (iii) కాకుస్వరవళి-ప్లుతయుగ విశ్రామము:

ప్లుతయుగ విశ్రామము వేరుగా చెప్పనేల ? అన్నచో, ఉభయవళు లన్నింటియందును ఇట్టి భేదము లుండవచ్చును. నిత్య సమాసయతి, నిత్యసమాస యుగ యతి, ఇత్యాదిగా రెండేసి యతులు ప్రతిచోట ఉండ వచ్చు నన్నమాట. 'నాస్తియని పల్కఁడెవఁడే పదార్థ మడుగ' (కల్పితము). ఇట నిత్యసమాసయుగ విశ్రాంతి అనవచ్చును. కాని యిట్టి ప్రయోగములు కనబడ లేదు. కనుక ఒక్క కాకుస్వరయతి స్థలమునందే కాకు స్వర యుగమునకు యతి చెల్లు విశేషలక్షణము కన్పట్టుచున్నది. కాన దీని నప్పకవి వేరుగలిగా నిరూపించినట్లు ఊహింపనగును.

### (ii) ఋత్వ సంబంధవళి — ఋత్వ సామ్యవళి: —

ఋత్వసామ్యవళిని ఋత్వసంబంధవళితో కలిపి వేయ వచ్చుననుట సరికాదు. ఋత్వ సంబంధ వళిలో ఇ ఈ ఋ ౠ ఎ ఏ ఱ విడిగాఉండి వట్టు సుడి రూపమున ఉన్న ఋకారములో యతిచెల్లును. ఋత్వ సామ్యవళిలో, ఇ ఈ ఎ ఏ ల ప్రసక్తి లేదు. ఇంతేకాక ఋత్వసంబంధవళిలో వలె ఋత్వ సామ్య వళిలో ఋకారము విడిగా పదాదివర్ణమై ఉండదు. 'ఋభునదీసుతుండు కృష్ణునేసె' అనుచో పదాది ఋకారము 'కృ' లోని ఋకారముతో యతిమైత్రి చెందుచున్నది. ఇది ఋత్వసంబంధవళి. 'పృథివ భవ దసి వనిఁదెగి కృష్ణురాయ' అనుచో, ఋకారమువదాది వర్ణముగా లేదు. పకారముపై వట్టుసుడి రూపమున నిల్చిఉన్నది. ఇట్టి భేదములుండుటచే ఋత్వసామ్య వళి వేరే ఉండవలెను.

### (iii) స్వర ప్రధానవళి — లుప్తవిసర్గక స్వరవళి:—

'అంబుదశ్యామ తవకింక రోహ మనఁగ' అను నది లుప్తవిసర్గక స్వరవళికి లక్ష్యము. ఇట, కింకరః+అహమ్; అని విడదీసి, అకారముతో యతి కూర్చినట్లు చెప్పవచ్చును గాన దీనిని స్వరప్రధానవళి అనవచ్చునని తోచును. ఈ దృష్టితో ఇది అనావశ్యక మనిపించును, కాని స్వరప్రధానవళిలో చేరు సంధుల లక్షణము వేరు. 'పదాంత గతాక్షరములతోఁ బై శబ్ద ములకు మొదలఁ గలుగు నచ్చుల కవ్వలి స్వరముతె నిలుచు' అని అప్పకవి చెప్పినాడు. 'అతుల గుణధామ భాను వంశాబ్ధి సోమ, ఇన తనూభవ మిత్ర లంకేశ జైత్ర, ఉరు గుణ కలాప ఉకరీకృతోగ్ర చాప' అన్నవి ఉదాహరింపబడెను. మొదటిపాదములో, వంశ+అబ్ధి' అని విడదీసి ఒకారముతో యతి కూర్చబడెను. ఇట పూర్వపరస్వరములకు సవర్ణదీర్ఘ మేకాదేశమయినది— పరస్వరమగు అకారముననె, ఏకాదేశమయిన 'ఆ'కు యతిమైత్రి కలదు గనుక సంధి విడదీసి పరస్వర ముతో యతిచేయుట చెల్లెను. రెండవ పదములో, లంకా+ఈశ, అని విడదీసి ఇకారముతో యతి వేయబడెను. ఇట, ఏకాదేశమయిన ఏకారమునకు పర స్వరమగు ఇకారమునకు యతిమైత్రి కలదు. కాన ఇది సరిపడెను. మూడవపాదమున, కృత+ఉగ్ర, అని విడ దీసి ఉకారముతో యతి కలదు. ఏకాదేశమయిన, ఓకు ఉకారమునకు యతికలదు. కాన ఇదియు చెల్లును. తెలుగు సంధులలో పూర్వ పర స్వరములకు పరస్వ రము ఏకాదేశముగును గాన సంధి విడదీసి పరస్వర ముతో కూర్చుట యీ యతిక్రిందికి వచ్చును. ఇట్లు పరస్వరములకు ఆదేశములకు యతిమైత్రి ఉన్న స్థల ములే ఈ స్వరప్రధానవళికి ఉదాహరణములగును. యణాదేశసంధిలో పరస్వరము యథాప్రకారముగానే నిలుచును గనుక ఇది స్వరప్రధానవళికి సంబంధించును. విసర్గసంధిలో ఈ లక్షణములు కనబడవు. కింకరో+ అహమ్, అని ఉండగా అకారము లోపించి, కింకరో హమ్—అగును. లోపించిన అకారమును పురస్క రించుకొని యతివేయుట దీనిలో విశేషము. కావున ఇది వేరే ఉండవలెను.

### (iv) స్వరప్రధానవళి—వృద్ధివళి:—

స్వరప్రధానవళికి చెందిన సంధుల ధర్మములు వృద్ధి సంధిలో కనబడవు. అకారమునకు ఏకారము

పరమగునపుడు ఐకారము, ఓకారము పరమైనప్పుడు, ఔకారము వృద్ధిసంధిలో ఏకాదేశములగును. ఏకి, ఐతోను; ఓకు, ఔతోను యతిమైత్రిలేదు. స్వర ప్రధానవళికి చెందిన సంధులలో ఇట్లు కాదు. ఆదేశ స్వరములకు, పరస్వరములకు యతిమైత్రి ఉండును. వృద్ధివళిలో పరస్వరములగు ఏ ఓ లకు, ఏకాదేశము లైన ఐ ఔ లకు యతిమైత్రి వేయవచ్చును. కావున ఇది వేరుగా చెప్పుట యుక్తమే.

### (V) స్వరప్రధానవళి - స్వరమైత్రివళి

స్వరప్రధానవళి అక్కరలేదనియు, దీనిని స్వర మైత్రివళిలో అంతర్భూతము చేయవచ్చుననియు అందురు. కాని స్వరమైత్రివళి విసంధిస్థలములకు చెందినది. స్వరప్రధానవళి స్వరసంధికి చెందినది. ఇందు స్వరమైత్రి సంధిగతమై ఉండును. కాన స్వరప్రధాన వళి విడిగా ఉండవలెను.

### (VI) ప్రాసయతి:—

ప్రాసయతి అనగా ప్రాసరూపమున వేయుయతి అని భావము. ప్రాసమనగానే పాద ద్వితీయాక్షరములే స్ఫురించును. పాదమధ్యమున, ప్రాస వేయవచ్చుననుట గజిబిజికి కారణమగును. కావున దీనిని ప్రాసయతి అను పేర యతిభేదముగా గణించుట యుక్తమని అప్పకవి అభిప్రాయము.

ఇక ఎట్టి యతిభేదముల ననావశ్యకము లన వలెను? అన్నది ప్రశ్నే. యతిమైత్రి చెల్లని సందర్భ ములను యతిభేదములుగా నిరూపించుట అనావశ్యక మని చెప్పవచ్చును. ఈ పక్షమున, ఏకతరయతి, ప్రత్యేకయతి, భిన్నయతి, అనువానిని యతిభేదములన నక్కరలేదు. రేఫము రేఫముతోను, శకటరేఫము శకట రేఫముతోను, యతి చెల్లుట ఏకతరయతి. నిజమున కిది ప్రాణియతితోనే గతార్థమగును. రేఫ, అకారములకు యతిమైత్రి కాదని నిషేధించవలసిఉండగా, ఈ యతి భేదము చెప్పబడినది. పూర్వలాక్షణికుల ఎక్కటి యతిని దృష్టిలోపెట్టుకొని అప్పకవి దీనిని చెప్పెను. అది అవి శబ్దముల అత్తునకు వృత్తిని లోపము కలిగి నప్పుడు లోపించిన అత్తుతో యతివేయరాదని చెప్పి నచో ప్రత్యేకయతి అక్కరలేదు. ఇంచుక్కునకు విడ దీసి యతి వేయరాదని చెప్పినచో భిన్నయతి అవసరము లేదు. కాని ఈ ఆశయములు మరుగుపడక ప్రస్ఫుట ముగా ఉండుటకు అప్పకవి వీటిని యతిభేదముల రూపమున ఉపదేశించినాడు. ఏకతర యతికిని భిన్న యతికిని విరుద్ధములగు ప్రయోగములును కలవు. కావున అవి ఎట్లును త్యాజ్యము లనక తప్పదు.

పై పరిశీలనమునుబట్టి ఏకతరయతి, ప్రత్యేక యతి, భిన్నయతి, అను మూడును అనావశ్యకము లనియు, తన అభిప్రాయములు ప్రస్ఫుటముగా దీపించ వలెనను తాత్పర్యముతో అప్పకవి వీటిని యతిభేద ములుగా నిరూపించెననియు చెప్పవచ్చును.



# నెల్లూరులో పెన్న ఒడ్డున హరిహర నాథాలయము ఉండినదా?

శ్రీ మరుపూరు కోదండరామరెడ్డి

కవిబ్రహ్మ తిక్కన సోమయాజి కాలంనాటికి, నెల్లూరుఅని పిలువబడే సింహపురమున, పినాకినీ నదీతటాన, హరిహరనాథదేవాలయం ఒకటి ఉండినట్లును, అందు తిక్కన కూర్చుండి, భారతమును తెనిగించినట్లును పుక్కిటిపురాణంగాపుట్టి చరిత్రాంశంగా ప్రబలిపోయిఉన్నది. ఈ గలగలుపువేల్పుగుడి, ఇప్పటి తల్పగిరిరంగనాథస్వామివారి ఆలయమునకు పరమట, పెన్న ఉత్తరవాహినియై పారే దక్షిణపుకునిలో, అంచున ఉండినట్లు, అది వెల్లువకు కొట్టుకొని పోయినట్లు నోటిమాటగా చెప్పుకొనబడుచున్నది. బయటివారివలెనే, నెల్లూరువారిలోగూడ యీ కథను నమ్మేవాళ్లు చాలామంది ఉన్నారు.

కాని, ఇట్టి ఆలయము ఉండలేదని చరిత్ర, భూగోళము చెప్పుచున్నవి—

మొల్ల అన్నదమ్ముడు— గురునాథుడు, వ్యాసునికి గణేశునివలెనే 'స్టెనోగ్రాఫర్'గా తిక్కనకు పని చేసినాడనిగూడ ఒక కథ! గణేశుని సంగతి సంస్కృత భారతంలోవలెనే తెనుగుభారతంలోగూడ గురునాథునికథగూడ యథార్థానికి చాలాదూరం. మొల్లకాలము, జన్మస్థలం— (నేటి ఆత్మకూరు) తిక్కనకు చాలాదూరమైనవే!

## సింహపురం

క్రీస్తుశకం 2–3 శతాబ్దాలలో, పల్లవరాజు త్రిలోచనునికాలంలో సింహపురానికి గడ్డఎత్తబడినది. పల్లవులకు 'సింహ'అనేది బిరుదనామము; దానినిబడి సింహపురమైనది. విక్రమపదం బిరుదంగా చేర్చబడినది. ఈ త్రిలోచనుడు ఆ పెద్ద కరికాలచోళునికి సమకాలీనుడని, ఎదిరిఉద్దిఅనిగూడ చెప్పుతారు. ఈ పల్లవరాజుకు కాడువెట్టుముక్కంటి అనిగూడ పేరు... కాడులంటే అడవి, దానిని వెట్టు—నరికినవాడని అర్థం. ఈయన దండకారణ్యమును నరికించి కంచి దాక జనపదాల నిర్మించినాడట.

## నెల్లూరు

ఈ పట్టణానికి నెల్లూరు అనేది—వడ్లు ఎక్కువగా పండించినందున తమిళులు పెట్టినపేరు. మన హిందూదేశమనేది పారశీకులు చేసిన నామకరణంగదా! సింధు అనువారు హిందువులైనారు. వారి భాషలో 'స'ను 'హ'గా పలుకుతారు. అసురులు అహురులైనారు. నెల్లూరు అనేపేరు కవిసార్వభౌముడు శ్రీనాథుని కాలానికిముందే వాడుకలోకి వచ్చిఉండినది.

## నెల్లూరు ఒక అంతర్వేది

ఇప్పటి సంతపేటలోని హరిహరనాథాలయం ఉండిన చోటని పేరనుకొనేది. కాని, పెన్నానది పూర్వం ఇక్కడనే ఇంకొకపాయగ చీలి, చిత్రకూటం—ఇసుకడొంక—జేమ్సుగార్డన్— ఉదయగిరివారి తోట (ఇప్పటి లక్ష్మీపురం) నవలాకుతోటల (తొమ్మిదిలక్షల ఫల వృక్షాలను యిచట నెల్లూరు, సర్వేపల్లి నబాబులు పెంచినారట) మీదుగా తూర్పుగా పారి, కొత్తూరు, ఇందుకూరుపేట మడుగులై, క్రింద మొత్తలు అనే

కూడలిచోట ఉత్తరముఖమై, ఊటుకూరు దగ్గర మొదటి పినాకినీ శాఖలోగలసి, సముద్రంలో సంగమించి నది. దీనికి భౌగోళి కాధారాలున్నవి. ఈ ఏటిపాయ, పేరుకొనిపోతూవచ్చి ఎప్పుడు పూర్తిగా పూడిపోయిందో చెప్పలేకున్నారు. ఈ పూడిపోయిన శాఖను వృద్ధ పినాకిని అని అంటూ, నేటికి పెద్దకారువారు ఆనవాలు చూపుతూవుంటారు. మొన్న మొన్నటివరకు ఇందు కూరుపేట మడుగులు పిల్లసముద్రాలవలె ఉండేవి.

హరిహరినాథ దేవాలయం నెల్లూరులో ఉండి నట్లు ప్రాచీన శాసనాలలో కాస్త పొలుకువగూడ కన్పించదు.

పూర్వం పెన్న—ఇప్పటి రంగనాయకుల గుడికి పరమట, ఎగుదలలో రెండుగా చీలి యీ ప్రదేశా న్నంతా ఒక అంతర్వేదిగా (Doab—దో ఆబ్=రెండు నీళ్లపాయలు) చేసిఉండినట్లు కనబడుచున్నది. శయన నారాయణస్వాములు వెలసిఉన్న శ్రీరంగం, శ్రీరంగపట్నం మొదలైనవన్నీ ఇట్టి ఏటిపాయల నడిబొడ్డుననే ఉన్నవి. జక్కన విక్రమార్కచరిత్ర, ఒక కథా సందర్భ మున యీ దోఆబును వర్ణించి, వినికిడిగా సాగివచ్చే ఒక భౌగోళికాంశమును స్థిరీకరిస్తున్నది. జక్కన క్రీ. శ. 1410 ప్రాంతంవాడు. ఈయన తాత—పెద్దయావాత్యుని కాలంనుండి (1279) యీ కవి వంశానికి నెల్లూరుతో సంబంధమున్నది. తిక్క భూపతి మనుమసిద్ధికొడుకు. రెండవ తిక్కరాజు జక్కనకవి తాతను ఆదరించి ఉండినాడు. మల్లినాథ సూరి యీ అదనుననే సంస్కృతగ్రంథ వ్యాఖ్యానములు వ్రాయుచుండినాడు. జక్కన, కవిసార్వభౌమ శ్రీనాథుని సమకాలీనుడు.

## విక్రమార్కచరిత్రకథ

విక్రమార్కచరిత్రలో, ఒక నెల్లూరు నెఱ జాణ కథను వ్రాయుచు (ఆశ్వాసం 7; పద్యాలు 132, 133, 134) స్త్రీలు పాపములకు ఆకరములనుటకు ఒక కీరముచెప్పిన కథాఘట్టము:—

'......సముద్ర సౌధాగ్రతల సమగ్ర
శాతకుంభ మహాకుంభ జాతగుంభి
తోరురత్న వినూత్న శృంగారమగు
సిరుల నొప్పారు విక్రమసింహపురము'

దానిని పాలించే ప్రతాపమకుటుడనే

'......రాజేంద్రునినందన, యారూఢ స్మర వికార యౌవనలక్ష్మి గౌరవనిధి, సకలకళాపారీణ, విలాసవతి'.

ఔను! నెఱజాణే!

ఈ తండ్రి, పాటలీపుత్రపురాజైన సుధర్ముని పిలిపించి, తన కూతురునిచ్చి పెండ్లిచేసినాడు. ఆమె ఒకనాడు చెలులతోగూడి, అంగజారాధన చేయుచు, కీలుమొగిచి 'జలపక్షిపక్షపటలీ సంఛన్నకుం బెన్నకున్' జయకార మొనరించెను. అప్పుడు ఏరు పెద్దమడుగు లతో నిండియుండినట్లున్నది· ఇచట—

'అమృతసాగరవిభుని యర్ధాంగలక్ష్మి
ఇందుధరునిల్లు పుట్టిన యిల్లుగాగ
నెగడెడు పినాకినీ తటినీ వధూటి
పటలాంతర సీమ జూపట్టుటయును...'

అని వర్ణించినాడు—జక్కన. నదులు గతులు మార్చుట, అంతర్వాహినులగుట మనం ఎరిగిన సంగతేగదా! ఈ పెన్న దక్షిణపుపాయ క్రమేణా పూడిపోయినది. ఈ పాతపాయనే వృద్ధపినాకిని అంటారు. దీని గతిని పైన చెప్పుకొన్నాముగదా.

## తిక్కన మాట

ఇంతెందుకు? తిక్కన సోమయాజియే—'ఏను విన్నపంబుసేయు తెఱంగుగా నంతఃసన్నిధిని గలిగించు కొని, యిమ్మహాకావ్యంబు నర్థంబు సంగతంబు చేసెద (విరాట—1:37) అని చెప్పుచుండ, గుడిలో కూర్చుండపెట్టవలసినపని మనకెందుకు? రాజభవన సదృశమైన, తన సొంతయింటనే ఆ మహోజ్జ్వల కృతిని నిర్మించినాడు—ఆ కవిబ్రహ్మ. ఇట్లే బమ్మెర పోతనగూడ 'రాముని సన్నిధానమును సంకల్పించుకొని'

భాగవతమును వ్రాసినట్లు చెప్పుకొనిఉన్నాడు. 'హరి హరనాథ సర్వభువనార్చిత నన్ దయజూడు మెప్పుడున్' అని స్థానికసీమలకు అతీతుడుగానే తిక్కన చెప్పు చున్నాడు.

'పెన్నదాటితే పెరుమాళ్లసేవ' అన్న చాటువ ప్రకారంగాగూడ, దేవాలయం చేరాలంటే అన్ని ప్రక్కలా నీళ్లుండినట్లు గుర్తింపజేస్తున్నది.

## పళ్లికొండు పెరుమాళ్లు

అప్పుడు, యీ దివిగడ్డ పరమటి అంచున నేటి తల్పగిరి రంగనాథాలయం, క్రీ. శ. ఆరవ శతాబ్దంలో నిర్మింపబడినది. ఈ స్వామి పరమటి మొగము పెట్టుకొని పవ్వళించిఉన్నాడు. ఆగమశాస్త్ర ప్రకారం ధ్వజస్తంభం అదీ ఉన్నది. పూర్వం కోనెలకు దారి ఆ పరమటితట్టుగానే ఉండిఉండాలి. ఇప్పుడు గాలిగోపురం తూర్పున— స్వామికి పృష్ఠభాగంలోఉన్నది. కులోత్తుంగచోళుడు — రాజేంద్ర నామాంతరుడు— రాజరాజనరేంద్రుని కుమారుడు, 12 వ శతాబ్దంలో ఆలయానికి ప్రాకారాలు కట్టించినాడు. ఆనాడు యీ రంగనాయకులపేట ప్రాంతానికి చిత్తిరిమేల్ విణ్ణగర్ (శ్రీవైకుంఠము) అని, దేవాలయ ప్రాంగణానికి తిరుప్పాలకడలి (శ్రీ క్షీరసాగరము) అని పేర్లుండినవి. స్వామి పళ్లికొండు పెరుమాళ్లు (శయన నారాయణుడు). జటావర్మ సుందరపాండ్యుడు మనుమసిద్ధిని ముత్తుకూరు యుద్ధంలో ఓడించి, యీ ఆలయ మండపంలో వీరాభిషేకం చేయించుకొనినాడు. నెల్లూరు పెరుప్రు, మూలస్థానేశ్వరస్వామి దేవాలయం, కాకతి గణపతి దేవుని నిర్మాణములు.

గోలుకొండ, ఆర్కాటు నవాబుల పాలనలో దేవాలయం పాడుబడింది. పునర్నిర్మాణ ప్రయత్నంలో ప్రాచీనపదం-- పళ్లికొండు— కొండగా మార్చబడి, తల్ప గిరి రంగనాథస్వామి అయినాడు. మూలవిరాట్టు సైకతమూర్తి-- అంటే, ఇసుకలతో నిర్మింపబడినది. శ్రీరంగం, తిరునెల్వేలి వైష్ణవులుగూడ ఇంతే.

## హరిహరనాథ పూజాక్రమము

ఈ జమిలినెల్లు పూజాప్రకారం బాదామిలో మొలకెత్తి, నెల్లూరు మండల ఉదయగిరి సమీపము నందలి ఘైరవునికోనలో తీగలుసాగినది. తిక్కన ఈ స్వామినే అర్చించినాడు పాల నాచన సోమనాథులు గూడ యీ త్రోవనే నడచినాడు.



# బొమ్మ - బొరుసు

## శ్రీ శివల జగన్నాథరావు

బద్ధకంగా దుప్పటిని పక్కకి తప్పించి అప్పారావు నిద్రలేచేసరికి, ఎదురుగా గూట్లోవున్న వాచీ ఆరూ పదినిమిషాలు చూపించింది. హడావిడిగా దుప్పటి మడతబెట్టాడు. సింహాచెలం అంతకుముందే లేచి నట్టున్నాడు. వీధికుళాయి దగ్గర పళ్లుతోముకుని, స్నానంచేశాడు. షాపులోకివచ్చి, బల్లసొరుగులోంచి రెండు వూదొత్తులు తీసి, వెంకటరమణమూర్తి పటం దగ్గిర అగ్గిపుల్లతో అవి వెలిగించి, పటం చుట్టూ తిప్పి, అక్కడ కన్నంలో గుచ్చాడు. ఈ లోపల అప్పారావు గబగబా మొహం కడుక్కువచ్చి, మూలనున్న చీపురు తీసుకుని ఆ గది నాలుగు మూలలూ తుడిచాడు. అప్పారావు ఒకసారి బస్టాండు కేసిచూసి, గోడకాన్చివున్న బల్లమీంచి చిన్నగిన్నె తీసుకుని, కుళాయిదగ్గిర పెద్దకుండతో పట్టితెచ్చిన నీళ్లలోంచి కొంచెంనీళ్లు తీసుకుని, గూట్లోంచి పసుపు పొట్లంతీసి, కాస్త పసుపు నీళ్లల్లో కలిపి షాపులో దేవుళ్ల పటాలమీదా, వస్తువులమీదా, నేల మీదా చిలకరించాడు. సింహాచెలం ద్వారంగుండా బస్టాండువేపు తదేకంగా చూట్టం గమనించి, అటు చూసి, ఈ లోపున ఎవరో రాగా, కూచోమని ఓ కుర్చీ దులిపి చూపాడు. జేబులోంచి దువ్వెన తీసుకుని, నీళ్లతో తడుపుకున్న జుత్తుని నీటుగా దువ్వుకుని, కాస్త పౌడరు మొహానికి రాసుకున్నాడు. వారపత్రికలో సినిమాబొమ్మలు శ్రద్ధగాచూస్తున్న ఆసామీ, అప్పారావు 'రండి, సార్' అనగానే రాచఠీవితోలేచి, సింహాసనాన్ని అధిష్ఠించినంత దర్పంతో (రివాల్వింగ్‌చైర్) తిరుగుడు కుర్చీలో కూచున్నాడు. అప్పారావు ఫ్రెష్‌గా వున్న దుప్పటిగుడ్డ ఆసామీ మెడమీంచి చుట్టూ తిప్పికట్టి, కత్తెరా, దువ్వెనా తీసుకున్నాడు. ఈలోపల మరో ఆసామీ, ఇంకో ఆసామీ వచ్చారు. క్షురకర్మ కోసం కాకుండా కేవలం కబుర్లకోసమేవచ్చిన ఒకాయనతో 'కబుర్లు' మొదలయ్యాయి.

వాళ్లిద్దర్లో సింహాచెలం పెద్దవాడు. ఎనిమిదో క్లాసుచదివి, ఆపైన చదవడానికి విసుగేసి, అప్పుడు తండ్రి చనిపోతూ అప్పగించిన షాపుని తన స్వంతతెలివితో వృద్ధిచేశాడు. బార్‌లైట్లు—రేడియో—మరిరెండు తిరుగుడు కుర్చీలు—కొత్త సామానూ ...అభివృద్ధికి నిదర్శనాలు. అంతఎక్కువగాలేని దేవుళ్ల పటాలు — వాటికి రెండు మాత్రమే గుచ్చిన వూదొత్తులూ మోడ్రన్‌భక్తికి నిదర్శనాలు. బల్ల మీద కొనివుంచే దిన, వార పత్రికలు రెండు కాలక్షేపానికి, వచ్చిన బేరగాళ్లని పట్టినిలపటానికి గల ఆకర్షణీయ సాధనాలు. ఎడతెరిపిలేకుండా సాగే కబుర్లు సందడినీ, చురుకుదనాన్నీ ద్యోతకంచేసే వ్యాపార రహస్యాలు.

ఒకసారి బస్టాండువేపుచూసి, నిన్ననే విడుదలైన తన అభిమాన నటుడి సినిమా ఎలావుందో చెప్పసాగాడు సింహాచెలం.

'రెండోఆట కెళ్లే సెట్టింగులు గొప్పగా వున్నాయి గురూ! డయిలాగులు మోతనుకో! ఇంక... ఆడి యాక్షనంటావా? తినేసేడు పిక్చర్ని...'

'నువ్వేమంటే అను గురూ...మిగతా యెన్ని బాగున్నా పిచ్చరికి కత ముఖ్యం. ఇందులో 'కత' నేదు. పాటల్సరేసరి...' అన్నాడు కబుర్లకొచ్చిన కాకిషర్టు సైదులు.

'అవితే ఎన్ని వోరా లాడుద్దంటావ్?'

'వోరాలా? హెహె......వోరం రోజు లాడితే సూద్దారి'

ఇంతలో గడ్డం గీయించుకుంటున్న ఆసామి ఆ పిక్చర్లో హీరోగురించి కలుగజేసుకున్నాడు. సింహాచెలం ఆయనకేం జవాబు చెప్పలేదు. నవ్వి వూరుకున్నాడు. తన కిష్టమయిన హీరో ఆయనకి ఇష్టం వుండక పోవచ్చు. ఇక్కడవున్న వాళ్లల్లోకూడా ఆ హీరో కిట్టక పోయుంటే—తనిష్టం వూ సలావుంచి—పచ్చే వీళ్ల బేరాలు పోతాయి! అందుకని 'అవునూ' ఒద్దు. 'కాదూ' ఒద్దు!...జవాబుచెప్పని సింహాచెలం నవ్వులో అంత అర్థంవుంది!

అప్పారావు అన్నదగ్గరగా వెళ్లి ఏదో చెప్పాడు. ఇద్దరూ బస్టాండుకేసి రెండుక్షణాలు సాలోచనగా చూశారు, కనుబొమలు ముడివేసి.

కబుర్లు ఎక్కడెక్కడికో మలుపులు తిరిగాయి,

ధరలు—యుద్ధం— ఎన్నికలు—ఓట్లు———

వీధికుళాయి దబదబ నీళ్లచప్పుడు — బిందెల మోత—గోడ కమర్చిన అద్దంలో రోడ్డుమీద ఆయాసంగా ఆగిన బస్సు—బిల బిలా మనుషులు— 'ధబ్! ధబ్!' బస్సుమీద కొట్టిన శబ్దం—'రాయిట్' కండక్టరు అరుపులు! బస్సు వెళ్లింది, గంపెడు దుమ్ము అక్కడవున్నవాళ్ల మొహాన్నకొట్టి.

సింహాచెలం గడ్డంగీసిన మకిలి మోచేతికి రాచుకుని అవతలికి చూశాడు. బస్టాండులో ముసలమ్మింకా చిరుగులపాతలో ముడుచుకు పడుకునేవుంది. దానికి నూరేళ్లు ఎప్పుడో నిండిపోయుంటాయని సింహాచెలం అనుకుంటాడు. ఎముకలూ, వాటికి అంటుకునీ, అంటుకోకా వేలాడుతున్న త్వక్కూ తప్ప దానిఒంట్లో ఇంకేం మిగల్లేదు. నెత్తురూ, మాంసం, వయసూ, పరువం అన్నీ ఎప్పుడో కాలం తీసేసు కుంది. ప్రాణం ఒక్కటే తీసుకుందికి భగంవంతుడు ఎదురు చూస్తున్నాడు. బస్టాండులో ఓ స్తంభందగ్గర పెద్ద గిడుగు (తాటాకు గొడుగు) నేల్న పాతి, దాని నీడలో—తన గూడుని ఏర్పాటు చేసుకుంది, ముసలమ్మ. అది కప్పం కట్టక్కర్లేని సామంతరాజ్యం! అద్దె చెల్లించ నవసరంలేని నివాసం! ఏమో, మరి! ఇంతవరకు ఎవరూ దాన్ని ఆ జాగాకి అద్దె, పన్ను వగయిరాలు అడగలేదు!

ఓ గోనెపట్టా—చిరుగుల దుప్పటి— మూటగా కట్టిన పాతకోక, రెండు — డాల్డాడబ్బా — పింగాణీ ప్లేటు—ధృఢంగావున్న క్ర్రా — చుట్టుపక్కల ఇళ్లకి వెళ్లి గంజి, అన్నం అదీ అడుక్కు తెచ్చుకుంటుంది. గోనెపట్టామీద కూచుని బస్టాండులో చేరినవాళ్లని అడుక్కుంటుంది. సెలూను సింహాచెలం, అప్పారావులకే కాదు; కాకాహోటేలు సర్వరు పాపారావుకీ ముసలమ్మంటే జాలే! అభిమానమే! అది ఎప్పుడేనా ముణిగి పడుకుంటే దాని వేళలు కనిపెట్టి తాగడానికో, తినడానికో 'ఇంత' తెచ్చిచ్చి, అది అడుక్కున్న డబ్బులు పట్టుకుపోతారు. ఒకవేళ పాపారావు పలక్కపోతే సెలూను అన్నదమ్ములు సాయపడతారు.

'రోజూ తెల్లారుతూనే లేస్తుంది. చలి ఎక్కువగావుంటే కొంచెం ఆలస్యంగా లేస్తుంది. అంతేగాని ఇంతసేపు ఎప్పుడూ లేవకండా వుండలేదే!'—అనుకున్నాడు, సింహాచెలం ఆశ్చర్యంగా. 'ముసిలి ముండగదా. ఒంట్లో నలతగా వుందేమో?! నిన్నలా ఇవాళ వాయసులో వున్నోళ్ళే వుండరు. అలాంటిదీ...' అనుకున్నాడు.

అతని నోటివెంట నిట్టూర్పు వెలువడింది.

ఒకేచోట వుంటూ, రోజూ మొహాలు చూసుకునే మనుషులమధ్య ఇష్టం, మమకారం లాంటి అనుబంధాలు చోటు చేసుకోవడానికి, వాళ్లనడుమ రక్తసంబంధాలే వుండక్కర్లేదు. బాంధవ్యం నెలకొనక్కర్లేదు.

సెలూన్ కి ఎవరెవరో వస్తున్నారు. వెళుతున్నారు. కబుర్లుసాగుతూనే వున్నాయి. రోడ్డుమీద బస్సులు ఆగుతున్నాయి. వెళుతున్నాయి. ఎండ ఎక్కుతోంది. కుళాయి కట్టెయ్యటానికి సిద్ధంగా వుంది. ముసలమ్మ ముడుచుకు పడుకునే వుంది.

నిన్న ముసలమ్మ కొడుకు వచ్చాడు. రూపాయో అర్థో ఇవ్వజోతే నద్దంది. తీసుకొమ్మని బతిమిలాడేడు. తీసుకోనని మొరాయించింది. తినడానికి హోటల్నించి ఏవో తెచ్చాడు. ముసలమ్మ తీసుకోలేదు.

ఈ భాగోతం ఎప్పుడూ సాగుతున్నదే. అడుక్కునయినా తింటుందిగాని కొడుకుని మాత్రం అడగదు! అడక్కండా వాడిచ్చినా పుచ్చుకో దేదీని! ఇంటికి

రమ్మంటే ఏదో తిట్టి 'ఆవూసెత్తిక' అంది! కాకా హోటలు ప్రొప్రయిటరూ, హెయిర్ కట్టింగ్ సెలూను సింహాచెలం, కావిళ్లు మోసే గవరయ్యా, ఇంకా మిషనుకుట్టే రాఘవులూ అంతా ముసలమ్మవి కొడుకువెంట వెళ్లిపొమ్మన్నారు.

ముసలమ్మ కొడుకు అప్పల్సారి ఏదో ఆఫీసులో బంట్రోతుగా పనిచేస్తున్నాడు. ముసలమ్మకి అప్పల్సారి ఒక్కడే సంతానం. అంట్లుతోమీ, నీళ్ళు మోసీ ఒంట్లో వోపిక వుడిగేవరకూ, అప్పల్సారికి ఒక వయసు వచ్చేదాకా ముసలమ్మ వాణ్ణి కష్టపడి, అపురూపంగా పెంచింది. చదువు బాగా చెప్పిద్దామనుకుంది గాని వాడికి ఎనిమిదోక్లాసుకిమించి చదువబ్బలేదు. ముసలమ్మ ఒంట్లో జవసత్వాలుడిగిపోయేయి. చదివి గుమాస్తావుద్యోగం గౌరవంగా చేస్తాడనుకుంటే అప్పల్సారి బంట్రోతుపని సంపాదించి అందులో స్థిరపడిపోవడం ముసలమ్మకి ఎలక్ట్రిక్ షాకయింది. ఆ తరవాత అప్పల్సారి పెళ్లి విషయంలోనూ తల్లి అభిప్రాయానికి వ్యతిరేకంగా ప్రవర్తించాడు. తల్లి చెప్పిన పిల్లనికాకండా తమ జాతితప్పిన పిల్లని తనిష్టంమీద కట్టుకున్నాడు. అప్పుడే ముసలమ్మ కొడుకుతో పెద్ద తగాయిదాపడి విడిపోయింది. 'అడుక్కు తింటానుగాని, నీ దగ్గరవుండను. నీచేతి నీళ్లుకూడా తాగను' అంది వచ్చేస్తూ! ఇప్పటికీ ఆమాట మీదేవుంది! ఈకథ చుట్టుపక్క లందరికీ చెప్పి కొడుకునీ, కోడల్నీ వెయ్యి శాపనార్థాలుపెట్టి తిడుతుంది! అప్పల్సారి వచ్చివెళ్లిననాడు మరీ తిడుతుంది!

'ముసిలిముండాకూతురి కెంత పట్టుదల? ఎంతపగ!' అని అంతా ఆశ్చర్యంగా చెప్పుకుంటారు.

అప్పల్సారి ఓరోజువచ్చి ఆత్రంగా తనకి కూతురు పుట్టిందని, చూడ్డానికి రమ్మని చెప్పాడు. ముసలమ్మ—'కూతురుపుడితే నాకుచెప్పడం ఎందుకు? పెళ్లి చేసుకుంటే పిల్లలు పుట్టరా. అదో విడ్డూరవా?' అంది. అప్పల్సారి హతాశుడయ్యాడు. వాడికి చాలాకోపం వచ్చింది. 'ఛస్! నీకు చెప్పడం నాది బుద్ధితక్కువే' అని వెళ్లిపోయాడు. ఆ తరవాత వారం రోజుల్దాకా ముసలమ్మ అక్కడందర్తో 'సూడండి బాబుల్లారా...ఆడే దిక్కుమాలిందానికో పిల్లనికంటే నానెళ్ళి సూడాలంట. నాకేం పట్టింది? నానేం ఎల్లను. సూణ్ణు' అంది.

'చూడకపోతే మానెయ్యిగాని ఇంక వూరుకో! వాడివూసు అక్కర్లేదంటూ అదేపనిగా వల్లిస్తావేం?' అన్నాడు కాకాహోటలు ప్రొప్రయిటరు నవ్వుతూ.

'మామ్మా...నిన్న నేను అటుపక్క వెళ్ళాను. నీ మనవరాల్ని చూసేను. అచ్చం నీపోలికే అనుకో! ఆముక్కూ, చెవులూ అంతా నువ్వే' అని చెప్పి పకపకా నవ్వాడు సెలూను అప్పారావు.

ముసలమ్మ మాట్లాడలేదు. అప్పట్నించి తనలో ఏదో గొణుక్కోడం తప్పించి ఎవరితో కొడుకు వూసెత్తడం మానేసింది. ఇది జరిగి ఆరుమాసాలయింది. రోజులు వెళుతున్నాయి—ఎండ వస్తోంది. చల్లబడుతోంది. వాన కురుస్తోంది. ఆగుతోంది. చలివేస్తోంది. పోతోంది. రోడ్డుపక్కన—బస్టాండులో ఆ తాటాకు గిడుగునీడలో—ముసలమ్మ అడుక్కు తింటూనే వుంది. అడిగినాకూడ ఇప్పుడు తన కథ ఎవరితో చెప్పడంలేదు!

సింహాచెలం తదితరులు ముసలమ్మ మూగతనానికి ఏవేవో కారణాలు వూహించుకుని, చెప్పుకుని, యాతన పడుతున్నారు.

మానవ స్వభావం చిత్రంగా వుంటుంది! ఒక చెడ్డవాడిలో హఠాత్తుగా మంచి చూస్తే ఎలా విపరీతంగా, అసహజంగా అనిపిస్తుందో — రోజూ కనిపించే వ్యక్తి కనిపించకుండా పోతే ఎలావుంటుందో—బడ బడా వాగేమనిషి వున్నట్టుండి మూగబోతే అలాగే అసహజంగా, ఆశ్చర్యంగా అన్పిస్తుంది. కారణం వెదకాలనిపిస్తుంది. కుతూహలం చెలరేగుతుంది. ఈ పరిణామాలికికూడా ఆ మనుషులమధ్య అనుబంధాలు వుండి తీరక్కర్లేదు.

చాలా రోజులికి—నిన్న అప్పల్సారివచ్చి, తల్లి యోగక్షేమాలు విచారించి, ఇంటికిరమ్మని అడిగి, 'రాన'నిపించుకుని, అందరితో ఆప్యైనం చెప్పుకుని వెళ్లాడు. కొడుకు వున్నంతసేపు ముసలమ్మ వాడితో ఆప్యాయంగా మాట్లాడక పోయినా—వాడి మొహంలోకి దేన్నో వెదుకుతున్నట్టు చూస్తూనే వుంది. ఏదో చెప్పాలని, చెప్పలేని అరాటం, బాధ దాని బోసినోటి

కదలికల్లోనూ, చలించే ముడతల్లోనూ ద్యోతక మౌతోనేవున్నాయి.

కొడుకు వెళ్లిపోయేక, ముసలమ్మ ఎక్కడికో అడుగులో అడుగువేసుకుంటూ వెళ్లి, చంకలో ఏదో మూటకట్టుకు రావడం సెలూనులోంచి సింహాచెలం చూశాడు. 'అన్నంమూట కట్టుకురాదే!' అనుకున్నాడు. తర్వాత తనపనిలో పడిపోయాడు.

* * *

వెళ్లిపోయిన ఆసామీఇచ్చిన రూపాయి జేబులో వేసుకుని సింహాచెలం బయటికి వెళ్లాడు. నెమ్మదిగా ముసలమ్మ పడుక్కున్న చోటిని సమీపించేడు. ముఖం మీంచి మాసికలదుప్పటి కప్పుకుంది. దుప్పటి తీశాడు. కళ్లు సగంతెరిచి వున్నాయి. నోరు పూర్తిగా తెరిచేసి వుంది. అంచేత ఆ జీవుడు నోట్లోంచిపోయిందో, కళ్లలోంచి పోయిందో చెప్పడం కష్టం!

సింహాచెలం ఎందుకో తుళ్లిపడినట్లయి, ఒక డుగు వెనక్కివేసి తమ్ముణ్ణి పిలిచాడు. అప్పారావు పాపారావుని లాక్కొచ్చాడు. వాడివెంట హోటలు ప్రొప్రయిటరు, మిషనురాఘవులు ఇలా పదిమంది దాకా వచ్చారు.

ముసలమ్మ మరణం అసహజంకాదు. అది ఎప్పుడో ఓరోజిలా చెప్పా చెయ్యకుండా పైకి వెళ్లిపోతుందని వాళ్లందరికీ తెలుసు. అయినా మళ్లా ఏదో విస్మయం! కాస్సేపు విచారించి—కాస్సేపు దానిపంతం గురించి చెప్పుకుని — అప్పల్స్వామిని పిలిచి చేయించే కర్మ గురించి తర్కించుతుంటే—సింహాచెలం ఏదో జ్ఞాపకం వచ్చినట్టయి—ముసలమ్మ నిన్న ఎక్కడికో వెళ్లి కట్టుకువచ్చిన గుడ్డమూట విప్పాడు. అందులో ఒక లక్కకాయ — రెండు రబ్బరుబొమ్మలు — ఓ ప్లాస్టిక్ బూరా—కొన్ని చిల్లరడబ్బులు వున్నాయి.

సింహాచెలం కళ్లు పెద్దవిచేసి నవ్వుతూ అందరి వేపూ చూశాడు. అందరిలో ఇంచుమించు ఒకేభావం నిండింది. ఆ భావానికి భాష్యం చెప్పడానికిమాత్రం అప్పుడు వాళ్లదగ్గర భాష రెడీగాలేదు.



# కాకతీయ మొదటి బేతరాజుయొక్క శనిగరశాసనము

పి. వి. పరబ్రహ్మశాస్త్రి

గడచిన నవంబరునెల భారతిలో కరీంనగరుజిల్లా యందలి శనిగరగ్రామ పరిసరములలో లభించిన మూడు కాకతీయ శాసనములు ప్రకటించబడినవి. అదే గ్రామప్రాంతములందు పరిశోధనలు జరుపగా మరి రెండు శిలాశాసనములు బయల్పడినవి. ఇవికూడ చాళుక్యసామంతులైన కాకతీయరాజులవే. ఇందొకటి మొదటి బేతరాజునకు చెందినది. రెండవది రెండవ ప్రోలరాజుది. ఈ శనిగరగ్రామ మొకప్పుడు సామంత కాకతీయుల యేలుబడిలోనున్న సబ్బినాటికి ప్రధాన నగర మని తోచును. గ్రామమునకు వెలుపల జైనవిగ్రహ ములు మలచబడియున్న గుట్ట కెదురుగా కొలది దూరములోనున్న మాగానియం దీ శాసనములలో నొకటి పైభాగముమాత్రము కానవచ్చుచు మిగిలిన శిలాస్తంభ మంతయు భూమిలో పూడియున్నది. లోగడ వర్షా కాలమందు పైరుకు నష్టమగునను కారణమున దీని నపుడు వెలువరించక పైరుకోసిన తర్వాత త్రవ్వించి శాసనప్రతిరూపములు తీయవీలైనది.

శాసనమంతయు స్తంభమునకు మూడువైపుల 43 పంక్తులలో నుత్కీర్ణమైయున్నది. అక్షరములు చెడకుండ బాగుగనే యున్నవి. శాసనభాష కన్నడము. శాసనాంతమున నొక సంస్కృతశ్లోకము కలదు. అక్షరములు పదునొకండవ శతాబ్దినాటి కన్నడలిపికి జెందినవి. పది—పదకొండు శతాబ్దులలో గానవచ్చు చాళుక్యశాసనము లందలి లిపివిశేషములే యిందును కలవు.

శాసనము చాళుక్యరాజ ప్రశస్తితో ప్రారంభ మగును. సమస్తభువనాశ్రయ పృథ్వీవల్లభ పరమ భట్టారక సత్యాశ్రయకులతిలకాది బిరుదాంచితుడగు శ్రీమత్త్రైలోక్యమల్లదేవుని విజయరాజ్యకాలములో నతని పాదపద్మోపజీవియు మహాసామంతుడు నగు కాక తీయ బేతరసనియొక్క పెర్గడ వైజరాజు కుమా రుడు నారణయ్య శకవర్షము 973 నాటి వికృతి సంవత్సరమునందలి యుత్తరాయణ సంక్రాన్తి పర్వ కాల నిమిత్తమున సణగరగ్రామ మందున్న యుగ్ధ మల్ల జినాలయమునకు జీర్ణోద్ధారణ మొనర్చి యచటి స్థానిక గావుణ్డలగు ముప్పణయ్య, పున్నెరెడ్డిల యను మతితో (నొక) రాటణము (ఏతము) దానమొనర్చె నని శాసనమునందున్న విషయము. తరువాత సంస్కృత శ్లోకములో (శాసనోక్త)దానమునకు హాని కలిగించు వారి నుద్దేశించి చెప్పబడు దూషణము కలదు. తుదిలో శాసనమును సేనబోవ జెక్కణమయ్య లిఖించె నని కలదు.

ఇందు చెప్పబడిన శకము 973 లో వచ్చు ఉత్తరాయణ సంక్రాన్తి క్రీ. శ. 1051 డిసెంబరు 25 వ తేదికి సరియగుచున్నది. చాళుక్య చక్రవర్తి యగు త్రైలోక్యమల్లుడు కల్యాణనగరము నుండి తెలింగాణముతో గూడిన కర్ణాటదేశమును క్రీస్తుశకము 1042 నుండి 1068 వరకు పాలించిన మొదటి సోమేశ్వరుడు. ఇతనికి 'ఆహవమల్ల' యనెడి బిరు దముకూడ తరచు కానవచ్చును. ఇతని రాజ్యకాలము నకు చెందిన సామంతులలో కాకతీయ మొదటి బేతరా జొకడని చరిత్రకారులకు తెలియును. అతనిదిగా జెప్ప బడు శాసనమెద్దియు నింతకుపూర్వము లభించకపోవు టచే ప్రస్తుత మిది యొక్కటియే యతని శాసనము. కాకతీయ శాసనములలోగూడ మాంగల్లు శాసనము తర్వాత నిదియే. ఇప్పటివరకు నితనినిగూర్చిన విషయ మంతయు నితరుల శాసనముల నుండియే గ్రహించ

బడు చుండెను. అనగా నీ మొదటి బేతరాజు త్రైలోక్య మల్లుని సామంతుడనెడి విషయముకూడ రూఢిగ తెలియదు. ఆ యంశ మీ శాసనమునుబట్టి ధ్రువ పడుచున్నది. రెండవది యితను శకము 973 వరకు జీవించి యుండెనను విషయముకూడ దీనివలన రూఢి యగుచున్నది. ఇతని పుత్రుడగు మొదటి ప్రోల రాజుకు చెందిన శాసనము శకము 975 వ సంవత్సరము నాటిది యీ శనిగర గ్రామమందు దొరకినది.[1] ఈ రెండు శాసనములవలన అధికారము తండ్రి నుండి కొడుకునకు చెందుటలో గల యంతరము క్రీ. శ. 1051–1053 ల మధ్యకాలముమాత్రమే యగుటచే మొదటి బేతరాజుయొక్క తుదికాలమును మొదటిప్రోలుని ప్రారంభకాలమును ఈ రెండు సంవత్సరముల యంతరములో నిముడ్చుట సులువైనది. క్రీ. శ. 1052 వ సంవత్సరాంతమున త్రైలోక్య మల్లుని పక్షమున చాళుక్యసామంతులు చోళదేశముపై దండు వెడలినట్లును, అందు కాకతీయ మొదటి బేతరాజు పాల్గొని యుండుననియు లతనిని గూర్చి కాజీపేట దర్గా శాసనమందు చెప్పబడిన 'చోళక్ష్మాపాల చమూ వార్ధి ప్రమథన' యనెడి విశేణమును వివరించు సందర్భమున చరిత్రకారులు చెప్పియుండిరి.[2] ఈ విశేషణమును బట్టియే మొదటి బేతరాజు క్రీ. శ. 1052 నాటి చోళ దండయాత్ర వరకు జీవించియుండి యుండునని నిర్ణయించిరి. కాని చోళసైన్యమును దునుమాడుట ఆ సైన్యము చాళుక్య రాజ్యముపై దండు వచ్చినపుడు ప్రతిఘటించుట యందైనను పై విశేషణము సార్థకము కాదగును గనుకను, అట్టి చోళసైన్య దండయాత్రలు చాళుక్య రాజ్యముపై ననేకములు జరిగినని కనుకను పై విశేషణము మొదటి బేతరాజుయొక్క చివరికాలమును నిర్ణయించుటలో తోడ్పడ దనువాద మున్నే యున్నది. అయినను ఆ ప్రాంతమువరకు మొదటి బేతరాజు జీవించి యుండెనను విషయమీ శాసనమువలన నిర్వివాదముగ నిర్ణయమగుచున్నది.

ఈ మొదటి బేతరాజును బయ్యారపు శాసనము 'గరుడాంక బేత నృపతి' యనియు[3], గూడూరుశాసనము లోని తెలుగు పద్యములలో 'మేల్గరుడని చేత ఘనిగా గాకతినల్లభు చిన్నవాని'[4] ననియు చెప్పబడు చున్నవి. కనుక నితనిని గరుడబేతరాజని వ్యవహరించుట యునితను. ఇతని తండ్రి బయ్యారపు శాసనములో సిండి గుండనృపతి యనియు, తూర్పు చాళుక్య రాజగు దానార్ణవుని మాంగల్లు శాసనములో కాకర్త్యగుండ్యన యనియు చెప్పబడెను. కాకతీయ వంశపు రాజులలో ఈ పేరుగల వారిలో నితడు నాలుగవ వాడగుటచే నితనిని నాలుగవ గుండరాజని చెప్పచ్చును. దానార్ణవుడు క్రీ. శ. 955 ప్రాంతమున రాష్ట్రకూటుడైన మూడవ కృష్ణుని సహాయముతో తన సవతి సోదరుడగు రెండవ యమ్మరాజను పదభ్రష్టుని గావించి వేంగిరాజ్యమునకు (తాత్కాలికముగ) అధిపతియైనట్లు అతని మాంగల్లుశాసనమును బట్టి తెలియుచున్నది.[5] అతని కిరీటయుత్సవములో కృష్ణరాజు పనుపున తోడ్పడిన రాష్ట్రకూట సామంతుడైన కాకర్త్యగుండ్యనకు కృతజ్ఞతాసూచకముగ దానార్ణవభూపతి యతని విజ్ఞాపనమునుసరించి దొమ్మనయను బ్రాహ్మణునకు మాంగల్లు గ్రామమును దానమొసగెను. ఇది అమ్మరాజ విజయాదిత్యుడు వేంగి సింహాసన మధిష్ఠించి [illegible] సంవత్సరములు రాజ్యమేలిన తదుపరి జరిగిన వృత్తాంతము. అమ్మరాజు క్రీ. శ. 944 లో రాజ్యాభిషిక్తుడైనట్లు తెలియుచున్నదిగనుక కాకర్త్యగుండన కనీసము 25 సంవత్సరముల వయసుదాటిన యోధుడై యుండవలెనుగదా. ఇతని పుత్రుడగు మొదటి బేతన క్రీస్తుశకము 1051 కి యుండెనని ప్రస్తుత శాసనమునుబట్టి తెలియుచున్నది. కనుక తండ్రి కొడుకుల రెండుతరములు క్రీ.శ. 955 నుండి 1051 వరకుగల నూరు సంవత్సరముల కాలము వ్యాపించి యుండెననుట చారిత్రకుల దృష్టిలో సమ్మతింప దగినదిగాదు. కాని యిప్పటి కుపలబ్ధ మగుచున్న శాసనసాక్ష్యమునుబట్టి వారిద్దరి పురుషాంతరములు నూరేండ్లు వ్యాప్తమై యున్నట్లే ధ్రువపడుచున్నది.

---

1. భారతి, నవంబరు 1971.

2. Early History of The Deccan; Vol-II, Page 578.

3. భారతి, ఏప్రిలు 1967, 11 వ పుట.

4. Corpus of Telingana Inscriptions; Part 2; Page 78; lines 22.

5. Eqigraphia Andhrica; Vol I; PP. 57– 70

ఈ సందర్భమున గూడూరు శాసన మొకింత పరిశీలించవలసియున్నది. ఇది చాళుక్య చక్రవర్తియగు త్రిభువనమల్ల (ఆరవ) విక్రమాదిత్యుని 49 వ రాజ్య సంవత్సరములో నతని పుత్రుడును యువరాజును అగు కుమారసోమేశ్వరునిచే నొసగబడిన దానమును గూర్చి చెప్పుచు ప్రాసంగికముగా స్థానిక స్వాములగు విరియాల వంశమువారిని గూర్చిన ప్రశస్తిని కొంత తెలుపును. శాసనము క్రీ. శ. 1149 నాటిదైనను విరియాలవారి పూర్వికులలో నొకడగు ఎఱ్ఱ నృపుని గొప్పతనమును జెప్పు సందర్భమున ఆతడు బొట్టు బేతడను నొకరాజుయొక్క శత్రువును జంపి వానికి కొరవిరాజ్యమిప్పించె ననియు, వాని భార్య కామవసాని యనునామె పిన్నవయస్కుడైన కాకతివల్లభుడగు గరుడబేతనికి చక్రవర్తి యనుగ్రహము లభించునట్లుచేసి కాకతిని నిలబెట్టెననియు తెలుగు పద్యములలో జెప్పబడియున్నది.[6] ఇందు మొదటి పద్యములో జెప్పబడిన బొట్టు బేతడు, రెండవ పద్యములో జెప్పబడిన గరుడబేతడు ఇద్దరు ఒకేవ్యక్తియైయుందురని యిప్పటివరకు తలంచబడుచుండెను. కాని యీ నడుమ భద్రాచలప్రాంతములో నొక తామ్రశాసనము లభించెను.[7] అది ముదిగొండ చాళుక్యులకు చెందినది. అందొక బొట్టు బేతరాజు కొరవి రాజై యున్నట్లు కలదు. కనుక బొట్టు బేతరాజు ముదుగొండశాఖకు చెందిన చాళుక్యరాజనియు, గరుడబేతరాజు కాకతీయుడనియు స్పష్టమైనది. ఇద్దరు భిన్నవ్యక్తులేగాని యొకరుగారు. విరియాల యెఱ్ఱనృపుడు బొట్టుబేతని వైరిని జంపి యతనికి కొరవిరాజ్య మిప్పించెను. కొరవిరాజ్య మసలు ముదుగొండచాలుక్యులదేనని కొరవి శాసనమందలి 'కొరవియన్నది ముదుగొండ సల్కుల కులసన్త.........'అను అసంపూర్తివాక్యమునుబట్టి యూహించదగియున్నది. దాని నెవడో వైరి దురాక్రమణ చేయగా ఆ వైరితో యుద్ధముజేసి వానిని జంపి యా రాజ్యమును తిరిగి బొట్టుబేతని కిప్పించుట జరిగెను. ఇచట జెప్పబడిన వైరినిగూర్చిన వివరములు తెలియవు. కాని తరువాతి పద్యమునందలి విషయము సాపేక్షితమై మొదటి పద్యములోని వైరి వధ వలన కాకతి గరుడబేతడు రాజ్యమును చిన్ననాడే కోల్పోయి లగు ప్రతీకారము జేయజాలని నిస్సహాయ స్థితియందుండుట సంభవించె యూ చున్నది. అట్లగుచో కొరవిరాజ్య మాక్రమించిన బొట్టుబేతని వైరి గరుడబేతనితండ్రియగు కాకర్త్య గుండనయే కాదగును. అతనినే విరియాల యెఱ్ఱనృపతి చంపుటయు తత్కారణముగా నతని పుత్రుడగు గరుడ బేతరాజు తండ్రితోబాటు రాజ్యమునుగూడ కోల్పోయి పిన్నవాడగుటచే నిస్సహాయుడై యితరుల దయకు పాత్రుడయ్యెనని రెండవపద్యము నందున్న విషయమునకు పూర్వము జరిగిన వృత్తాంతముగా తలంచుట సమంజసము.

ఈ స్థితిలో గరుడబేతనికి సహాయము చేసినది తన తండ్రిని జంపిన విరియాలయెఱ్ఱని భార్యయగు కామవసానియట. ఇదియు కొంత విచిత్రముగనే తోచుచున్నది. భార్యా భర్త లిరువురు పరస్పర వైరులగు చెరియొక బేతరాజును అభిమానించుటకు గల హేతు వెట్టిదై యుండునో తెలిసికొనుట కష్టము.

6. అతణ్డని బొట్టుబేత వసుధాధిపు
జేకొని వాని వైరి ను
ద్ధృతమున జంపి యా కొరవి
దేశమునందు ప్రతిష్ఠజేసి త
త్తనెయురు పేరు పొడగలదాయము
బిట్టుఅ గద్యనంబు న
ప్రతిముడు వానిచే మొగడుపల్లియు
పండ్రెడు నేలు నప్పుడే॥

అరుదగునట్టి ఎఱనృపు నంగన
గామవసాని యొక మే
ల్గరుండని బేత భూవిభుని
గాకతివల్లభు బిన్నవాని దా
బరగంగ జేతబట్టి ఘను
బల్లవరాయనియోగిజొచ్చి భా
స్కర [వి]భుచక్రవర్తిగని
కాకతి నిల్పుట గోటిసేయదే॥

(ప్రస్తుత మీ పద్యములు సవరించబడలేదు)

7. ఇది త్వరలో ప్రకటించబడనున్నది.

అందుకొక యూహ సమంజసమని తోచును. విరియాల యెఱ్ఱనృపతి బొట్టుబేతని యొద్ద సేనాపతియో, మంత్రియో యైయుండి తన విధ్యుక్త ధర్మముగా కొరవి రాజ్యమును దురాక్రమణ చేసిన కాకర్త్య గుండనను జంపియుండును. ఇంక నతని భార్యయగు కామసాని కాకతిగుండన కేవిధముగనో బాంధవ్యము గలదై యుండును. ఆ బాంధవ్యమును పురస్కరించుకొని యామె కాకతివంశమును పునరుద్ధరించ బూనెను. ఇంతకుమించి స్త్రీయగు నామె రాజకీయ వ్యవహారములం దానాడు పాల్గొనుటలో తగిన కారణమెద్దియు ప్రస్తుతము కానరాదు. అదియు తన భర్తద్వారానే చేసియుండును. కాకతీయులు మొట్టమొదటిసారిగా అనుమకొండకు చేరుట యీ మొదటిబేతని కాలమందే యని బయ్యారపు శాసనము స్పష్టముగా చెప్పుచున్నది.[8] కాని యిచట ననుమడు, కొండడు అనువారిని చంపి యనుమకొండ పురమును స్థాపించెననియో లేక తన రాజధానిగ జేసుకొనె ననియో యిందు కలదు. ఈ కథయందు కొంతభాగము నమ్మతగినదిగ తోచదు. రాష్ట్రకూటుడైన మొదటి అమోఘవర్షరాజు యొక్క 58 వ రాజ్యవర్షము (క్రీ. శ. 872) నాటి శాసనమందొకదానిలో[9] ఈ నగరమున కప్పటికే 'అర్మకొండ' యనుపేరు వాడబడుట గమనించదగును. కనుక మొదటి బేతరాజు అనుమడను వానినిజంపి యచటి కొండను పురముగ సెననుటగాని, అనుమడు, కొండడు అను నిద్దరినిచంపి అనుమకొండ పురమును తనకు పురముగ నిర్మించుకొనెనని గాని చెప్పుట కల్పితగాథ యనిపించును. అయినను కామసాని సహాయముతో కాకతివంశ ముద్ధరింపబడుట అనుమకొండయం దగునని మాత్రము చెప్పవచ్చును. దీనితో బాటు వారికి తాత తండ్రులనాటి రాష్ట్రకూట రాజాభిమానముకూడ పోయినది. వారు చాళుక్యుల సామంతులుగ స్థిరపడిరి. కనుక మొదటి బేతరాజు అనుమకొండలో కాకతివంశమును పశ్చిమచాళుక్యుల క్రింద సామంత ప్రతిపత్తిలో నిలబెట్టిన వాడగుటచే నితనిని కాకతివంశస్థాపకు డనుట వెల్లును.

ఈ పర్యాలోచన వలన తేలునదేమనగా: కాకతి మొదటి బేతరాజు తన చిన్నతనమందే యధికారమునకు వచ్చెనుగనుక క్రీ. శ. 1051నాటి యీశాన మతిని తుదిదశకు చెందిన దగుటచేతను అతని రాజ్యారంభ మప్పటికి అరువది సంవత్సరములకు పూర్వమే ప్రారంభమై యుండుననుట అసంభావితముకాదు. అనగా గుండన పుత్రుడగు మొదటి బేతరాజు సుమారు క్రీ. శ. 990 ప్రాంతములో అధికారమునకు వచ్చి యుండును. కాని యీ యూహ గుండన—బేతనలమధ్య నేరొక వ్యక్తి, బేతనయొక్క అగ్రసోదరుని వంటివాడు లేనప్పుడే సరియగును. బయ్యారంశాసనములో నట్టి వ్యక్తి వారి సంఖ్యలలో చెప్పబడలేదు. మరెచ్చట నట్టి వ్యక్తి యున్నట్లుకూడ కానవచ్చుటలేదు. కాకతి గణపతి దేవుడు క్రీ. శ. 1198 నుండి 1262 వరకు సుమా రరువది నాలుగేండ్లు పాలించెను గదా. అట్లే ప్రమాణాంతరము లభించువరకు కాకతి మొదటి బేతరాజు క్రీ. శ. 990 ప్రాంతమునుండి 1051 అంతము వరకు అధికారమునం దుండెనని స్వీకరించవచ్చును. క్రీ. శ. 955 లో దానార్ణవునకు సహాయ మొనర్చిన గుండన 990 నాటికి 60 లేక 65 సంవత్సరముల వాడై మృతి నొందియుండును. ఈ విధముగ తండ్రి కొడుకుల ఇద్దరి పురుషాంతరములుకూడి క్రీ. శ. 955 నుండి 1052 వరకుగల దాదాపు నూరు సంవత్సరములు వ్యాపించి యుండెననుటలో దోష మెద్దియు కానరాదు. వీరిలో నే యొక్కరిని డెబ్బది సంవత్సరములకు మించి జీవించిన వారినిగా స్వీకరించ వలసిన నిర్బంధము లేదు.

---

8. హర్యాయో ఽనుమ నామధేయ మహితం
కొండంచ చక్రే పురం
విఖ్యాతా నుమకొండ మూర్జితయశః
కర్పూర భాండోపమమ్॥

(22—24 పంక్తులు 11 వ పుట, భారతి, ఏప్రిలు 1967)

9. H. E, H. The Nizam's Govt. Arch. Dept. Annual Report 1933-34; P. 19.

## కాకతీయ మొదటి బేతరాజుయొక్క శనిగర శాసనము

ఆంధ్ర కర్ణాట దేశ చరిత్రలో వీరిరువురి మధ్యగల సంధికాలము అనగా క్రీ శ. 973—1000 అతిక్లిష్టములగు రాజకీయములకు చెందినది. వేంగి రాజ్యమున క్రీ. శ. 973 లో దానార్ణవుడు నిహతుడై యరాజక మేర్పడెను. అదే సంవత్సరములో రెండవ తైలపుడు రాష్ట్రకూట కక్కలుని త్రోసిరాజని మాలఖేట సింహాసన మాక్రమించి పశ్చిమచాళుక్య రాజవంశమును పునరుద్ధరించెను. ఇట్టి యవ్యవస్థ రాజకీయ పరిస్థితిలో రెండురాజ్యములకు మధ్యనున్న తూర్పు తెలంగాణము ముదుగొండ చాళుక్యులకు, కాకతీయులకు కలహభూమి యయ్యెను. తుదకు రెండవ తైలపుని ప్రాభవమువలనను విరియాల యెఱ్ఱని మధ్యవర్తిత్వము వలనను కొరవిరాజ్యము ముదుగొండచాళుక్యుడగు బొట్టుబేతనికిని అనుమకొండరాజ్యము కాకతి మొదటి బేతనికిని చెందు నట్లొక యేర్పాటు జరిగెను.

ఈ శాసనమువలన కాకతిబేతని యంతిమ కాలము శకము — 973 ప్రాంతమై యుండునని తెలియుచేగాక అతని పిన్ననాటివాడగు బొట్టుబేతని కాలము సుమారు శకము 910—930 నడుమ కా దగునని కూడ తెలియుచున్నది. ఈ యంశము ముదుగొండ చాళుక్యరాజుల కాల నిర్ణయములో తోడ్పడ గలదు.

ఇందు జెప్పబడిన యుద్ధమల్ల జినాలయము లేములవాడ చాలుక్య వంశమునకు చె యుద్ధమల్లుడను పేరుగల రాజులలో నొకరిపేరిట నిర్మింప బడినదై యుండును. ప్రస్తుత మీ శాసనమున్న పొలమునకు సమీపముగనున్న కొండపైగల జైన విగ్రహములున్న చోటుననే పూర్వ మా జినాలయ ముండియుండును.

## శాసన మూలము

### మొదటి వైపు



1. స్వస్తి సమస్త భువ
2. నాశ్రయ శ్రీ ప్రి[1]
3. థ్వీ వల్లభ మహా రా
4. జాధిరాజ పర
5. మేశ్వర పరమ భ
6. ట్టారకం సత్యా శ
7. య కులతిలకం చా
8. ళుక్యాభరణం శ్రీమ
9. త్రై [2]లోక్యమల్ల దే
10. వర విజయ రాజ్య
11. ముత్తరోత్తరా
12. భి వృద్ధి ప్రవర్ధ్ధ
13. మాన మాచంద్రా
14. ర్క్క తారం బరం స
15. లుత్తు మిరె తత్పా
16. దపద్మోప జీవి
17. శ్రీమన్మ హా సా

1. పృథ్వీ
2. శ్రీమత్త్రైలోక్యమల్ల
3. శ్రీ మన్మహా

## కాకతీయ మొదటి బేతరాజుయొక్క శనిగర శాసనము

### రెండవ వైపు



18. మన్త కాకతీయ
19. బేతరసర పెగ్గ్డె
20. డె (వైజరాజన)
21. (మగ) ణారణయ్య
22. (ర్) సకవర్షం ౯౭౩ (973)
23. (డె) నెయ వికృతి
24. సంవత్సర
25. దుత్తరాయ
26. ణ సంక్రాంతిని
27. మిత్త్రదిం సణ
28. గరద దుద్ధమ
29. ల్ల జినాలయ (మం)
30. జీర్ణో (ద)* ద్ధారణం మా
31. డి దొం దల్లియ ప
32. ణెయ గా (ము) ణ్డం

## మూడవ వైపు



33. ముప్పడయ్యను (మం)
34. పున్నె రడ్డియు మ
35. (నా)డం బడిసి బిట్ట
36. రాటాణ॥ స్వదత్త (త్తా)ం
37. పరత్త (త్తాం)ంవా యో
38. హరే తు (త) వసు న్ద (న్ధ) (రాం)ఀ
39. షష్టిర్వర్షః సహ
40. స్రాణి విష్టాయాం
41. జాయతే కృమి (ః)
42. సేనబోవ జెక్క
43. ణ మయ్యం బరహ (॥)*

# "అడ్రసు మారింది"

## శ్రీ రంగధావ్:

ప్రొద్దున్నే ఎనిమిదిన్నర గంటలకు ఆఫీసంతా శుభ్రంచేసి తన స్టూలుమీద కూర్చుని, ఆలోచించసాగాడు దాసు. అతను ఆలోచించినకొద్దీ, తన సమస్యలకు పరిష్కారమార్గం ఒక్కటే అనే అభిప్రాయం బలపడసాగింది. తనింక ఈ ఆఫీసులో ప్యూను పని చెయ్యలేడు. మరో వుద్యోగం దొరికేవరకూ ఓపిక పట్టడం రోజురోజుకూ దుర్భరమైపోతోంది. ఏదో ఒకటి తొందరలోనే తేల్చెయ్యాలి—అనుకున్నాడు.

అతని వయస్సు ఇరవైరెండు; సుమారు మూడేళ్లబట్టీ 'సురేష్ ఏజన్సీస్' అనే పెద్ద వ్యాపార సంస్థ తాలూకు ఆఫీసులో 'బోయ్'గా పనిచేస్తున్నాడు దాసు. ఎక్కువగా చదువుకోకపోయినా, తన లాటి యువకుడికి, ఈ పని తగినదికాదనీ, ఇంకా ఉన్నతమైనపదవి, కనీసం, గుమాస్తా — యో — టైపిస్టో, తనకి తగినదని అతని నమ్మకం.

కాని, ఆ అభిప్రాయం 'సురేష్ ఏజన్సీస్' యజమాని అయిన రామారావుగారికి లేకపోవడమే దాసు దుస్థితికి కారణం. అయినా, దాసు, నమ్మకస్తుడనీ, అబద్ధమాడడనీ ఆయనకు గట్టి నమ్మకం వుండడం వలన అతనిని ఒకవిధమైన అభిమానంతో చూస్తారు. పెద్దబాబు (రామారావు) గారి అభిమానం ఆసరాగా తీసుకుని, దాసు—ఆ ఆఫీసులోని ఇద్దరు గుమాస్తాలనూ, టైపిస్టునూ కొంచెం డబాయిస్తూండడం కద్దు, అప్పుడప్పుడు.

అతని తత్వమే అలాంటిది అని సర్దుకుపోయినా, ఒక్కొక్కప్పుడు వాళ్లకూడా దాసుమీద చిరాకుపడడం, అటువంటప్పుడు, వాళ్లు అతనికి, తను కేవలం ఆఫీసు ప్యూనునని గుర్తుచేయడం, దానితో, అతనికి గుండెల్లో ఎవరో పొడిచినట్లవడం, రెండు మూడు రోజులదాకా అతను కుంగిపోవడం జరుగుతూంటుంది.

తనుకూడా, గుమాస్తాలతో సమానమైన హోదాలోవున్న వ్యక్తిలా ప్రవర్తించాలని అతని ఆరాటం. అతను ఉద్యోగంలోచేరిన మొదట్లో, ఎప్పుడూ నిలబడివుండడం — గుమాస్తాలకూ టైపిస్టుకూ కాఫీలూ, మంచినీళ్లూ అందివ్వడం చేస్తూండేవాడు. పెదబాబుగారితో పరిచయం వృద్ధయిన కొద్దీ, తను ఆఫీసులోని చిన్నతరహా వ్యక్తులైన గుమాస్తాలకు అంతగా భయపడనక్కరలేదనీ, వాళ్లు తనమీద 'రిపోర్టి'వ్వడం అంత తేలికకాదని గ్రహించాడు.

అంతేగాక పెదబాబు, ఆఫీసులో ఎవరూ లేనప్పుడు, తనని ఆయన గదిలోకి పిల్చి, గుమాస్తాలు ఎన్నిగంటలకు ఆఫీసుకువచ్చేదీ, రోజుకు ఎంతసేపు వాళ్లలో వాళ్లు బాతాఖానీకొట్టేదీ, రెండు మూడు సార్లు అడగడంతో తను చాలా ముఖ్యమైన హోదా కల వ్యక్తిననే అహంకూడా అతనిలో పొడసూపింది.

తను ఇంచుమించు 'బాస్'కి 'పర్సనల్ అసిస్టెంటు'లాంటి వాడననే భావం కలిగి, అది క్రమంగా తనుకూడా, (పని లేనప్పుడు) కుర్చీలో కూచోవడం గుమాస్తాలతో, తను ఒక్క పెదబాబుగారికి తప్ప మరెవరికీ, కాఫీలూ, మంచినీళ్లూ, అందించదల్చుకోలేదని చెప్పడంవరకూ వచ్చింది.

తనని ఆఫీసు ప్యూను అనికాక, 'మెస్సెంజరు' అనో 'అటెండర్' అని అనో అనాలని కూడా తరుచూ, ఆఫీసులో గుమాస్తాలతో చెప్పనారంభించాడు.

కొంచెం తనని ఎవరైనా తక్కువగా చూసినట్లు కనిపిస్తే, వాళ్లమీద తన మనసులో కక్ష

గట్టి, వాళ్లని ఖాతరుచెయ్యకపోవటం ద్వారా తన కసిని వెలిబుచ్చేవాడు. 'వీళ్లేంచేస్తార్రోయ్ మనల్ని; అంతగా అయితే పెదబాబుగారితో చెప్పి ఉద్యోగం లోంచి తీయించేస్తారు. అంతేకదా! అసలు మన కీ వుద్యోగమంటే లెక్కేలేదు' అని కొత్తగా వచ్చిన సూర్యం అనే రెండో ఆఫీసుబోయ్‌తో అనేవాడు, వాళ్లు వినేటట్లు.

రెండో ఆఫీసుబాయ్ ప్రవేశించి రెండు నెల లయింది. అతనికి పనంతా కొత్తవడం మూలానా, పెదబాబుగారు తరుచూ దాసునే పిలుస్తూండడం వలనా, దాసుమీాద గౌరవం, దాసుద్వారా పనినేర్చు కోవాలనే ఆసక్తి కలిగింది.

దాసు, గుమస్తాలతో బాతాఖానీకొట్టూ, సూర్యానికి పనులు పురమాయిస్తూండేవాడు.

ఆ ఆఫీసులో, నాగేశ్వరరావు అనే ఇరవై మూడేళ్ల యువకుడు ఆరునెలల క్రింతం గుమస్తాగా చేరాడు. సన్నగా, పొడుగ్గా, ఎర్రగావుండే నాగేశ్వర రావు, ఉద్యోగం పురుషలక్షణం గాబట్టి, కాలక్షేపా నికి వస్తుందనీ, ఈ వుద్యోగంలో చేరాడుగాని, ఇది తన చదువుకు (అతను బి. యస్‌సీ) గాని తెలివికి గాని, తగినవుద్యోగం కాదనే విషయం రోజూ దాసుతో స్పష్టం చేస్తూంటాడు.

ముసలివాడైనా పెద్ద గుమాస్తా. స్వామిగారు, నాగేశ్వరరావుని పనివిషయంలో చివాట్లు పెట్టూంటే అతనికి ఎంతకష్టం కలిగినా, తరువాత స్వామిగారు లేనిప్పుడు, దాసు చూపించే సానుభూతివలన నాగేశ్వర రావు మనసు చాలా ఊరట చెందేది. ముఖ్యంగా స్వామిగారిని పెదబాబుగారు ఎలా చివాట్లు పెడు తూంటారో దాసు చెప్తూంటే నాగేశ్వరరావు ఆనం దంతో వింటూండే వాడు.

ఆ రోజు ప్రొద్దున్న దాసుఒక్కడూ కూర్చొని ఆలోచిస్తూంటే, నాగేశ్వరరావు చేతిలో ఒక పుస్త కంతో ప్రవేశించాడు. అతనిని చూడగానే దాసు 'గుడ్‌మార్నింగ్ సార్ ఏమిటా పుస్తకం?' అని అడి గాడు.

'ఇది రీడర్సు డైజస్ట్రోయ్!' అన్నాడు నాగేశ్వర రావు; తను డబ్బు ఖర్చుపెట్ట నక్కరలేకుండా ఈమధ్య కొన్ని పుస్తకాలు వచ్చి పడుతూండడంతో, అతనికి అలా అవి వచ్చినరోజున ఏదో ఘనవిజయం సాధించి నట్లుంటుంది.

నాగేశ్వరరావు తన సీటులో కూర్చున్నాడు. దాసు, లేచి అతనినద్దకువచ్చి, 'ఇదికూడా అలా వచ్చిం దేనా?...ఏదీ...ఒకసారి ఇవ్వండి... చూసిస్తాను' అని అడిగాడు.

'అవురోయ్. ఈనెలలో ఇది అప్పుడే నాలుగో సారి, ఇంతకు ముందు, ఏవో మాగజైన్లువచ్చాయి. కాని, ఈ పుస్తకం నాటికన్నా విలువైనది' అన్నాడు చిరునవ్వు నవ్వుతూ.

'భలే ఛాన్సుకొట్టున్నారే! పాపం, అతనెవరో గాని, మీా పేరుగలతను, ఎప్పటికి ఉండాకట్టాడో!' అన్నాడు దాసు.

తనసీటుకు సంబంధించిన గిరాలు సర్దు కుంటూ, 'అప్పనప్పను. అసలు ఇన్ని పుస్తకాలెందుకో ఇతనికి!' అని తనలో తను అనుకున్నాడు, నాగే శ్వరరావు,

'పోస్టుమాన్, లేనప్పుడైనా వచ్చి, అసలాయన అడ్రసు దొరికిందనీ, ఇది మీాదికాదనీ అంటే ఏం జేస్తారు?'

'దానిదేముంది. ఇవన్నీ నావని నేను పోస్టు మాన్‌తో చెప్పలేదు. అతనే కిటికీలోంచి పడేసి పోతున్నాడు.'

'తమాషాగా వుంది సార్. ఈ నాగేశ్వరావు ఎవరో గాని, డోర్‌నెంబరు ఇచ్చివుంటే ఇంత తికమక వుండేదికాదు.'

'కాని ఇలా ఎన్నాళ్లు జరిగితే అన్నాళ్లు జర గనీ, మనదేంపోయింది!' అన్నాడు నాగేశ్వరరావు తనలో తను నవ్వుకుంటూ.

దాసు ఆ పుస్తకం తిరగేస్తూ, ఆ అజ్ఞాత వ్యక్తి—నాగేశ్వరరావు అనే పేరుగల మరొకనిని వూహించుకుని అతనిమీాద సానుభూతి చూపించ నారంభించాడు.

కొద్దిరోజుల క్రితం నాగేశ్వరరావుకి కొన్ని

పుస్తకాలు రావడంతో ఈ సంఘటన ప్రారంభ మైంది. అది పోస్టుమన్ చేసినపని. యస్. నాగేశ్వర రావు, అగ్రహారం, గుంటూరు అనే అడ్రసుతో వచ్చిన వాటిని, అగ్రహారంలోవున్న నాగేశ్వరరావు (యస్.) ఇతనొక్కడే అతనికి తెలిసివుండడంవలన, ఇతనికే అయివుంటుందని ఇతని ఇంట్లో పడెయ్య సాగాడు.

తనవికాని వస్తువులు తమవద్దకు వచ్చినప్పుడు కొందరు మర్యాదగా వాటిని అసలు యజమానికి అందచేద్దామను కొంటారు. కాని అటువంటివారి సంఖ్య ప్రజల్లో మైనారిటియే! మెజారిటీ తమవి కాని వస్తువుల్ని తామే ఉంచుకుని అనుభవించటంలో ఎంతో ఆనందం అనుభవిస్తారు. అసలు వస్తువు— అవతల ఒకమనిషికి కాక, ఎంతోమందికి చెందిన దైతే, మరీ ఘనంగా భావిస్తారు. గవర్నమెంటువారి ఇళ్ళనీ, కార్లనీ, తమ సొంతానికి వాడుకుని ఎంత మంది ఆనందిస్తున్నారు!

నాగేశ్వరరావు, తనపేరుగల వ్యక్తి వస్తువులు కాబట్టి వాటిమీద తనకూ హక్కువుందని, పోస్టు మాన్‌కి అసలువిషయం తెలియజెయ్యడం మానేశాడు. మొదట్లో, పోస్టుమాన్, మళ్లీ మర్నాడో, రెండు రోజుల తర్వాతోవచ్చి, వాటిని, అసలు వ్యక్తికివ్వాలని లాక్కుపోతాడేమోనని భయపడుతూండేవాడు.

కానీ అలా జరక్కపోవడంతో క్రమంగా అతనికి ధైర్యంవచ్చింది. మరికొన్నిరోజులు పోయిన తరువాత, ఇలా ఈ పుస్తకాలు ఇంకా ఎంతకాలంవస్తాయో అన్న ఆతృత ప్రారంభమైంది. అతనిలో అసలు ఈ మరో నాగేశ్వరరావు నిజంగా ఎక్కడ వున్నట్టు ? ఈ పుస్తకాలకి చందాకట్టి, అవి వచ్చాయో లేదో ఎందుకు పట్టించుకోవటం లేదు ? అన్న ప్రశ్నలు అతనిని వేధించినా, వాటిని బలవంతాన ప్రక్కకు నెట్టేసి, ఆ పుస్తకాలని సొంతం చేసుకోవడంలో వున్న ఆనందం అనుభవించ సాగాడు.

'ఆయనపేర వచ్చిన వుత్తరాలుకూడా మీకిస్తు న్నాడా పోస్టుమాన్?' అని అడిగాడు దాసు.

'ఎందుచేతనో గాని, ఉత్తరాలేమీ రావటం లేదోయ్,'

'మరి ఒకవేళ మనియార్డర్లు ఏంచేసారు ?'

'పోస్టుమాన్ ఇస్తాడంటావా

'అయితే వాడివ్వాలేగాని, మీరు తీసుకుంటా రన్నమాట. అలాటి పనెప్పుడూ చెయ్యకండి సార్. పాపం, అవతలివాడు ఆ డబ్బుకోసం ఎంత యిబ్బంది పడతాడో !'

'ఆ, ఈ రోజుల్లో పాపపుణ్యాలకు భయపడే వాళ్లెవరోయ్, అంతగా మననిగాది సే, నాపేరూ అదేకాబట్టి, సంతకం పెట్టానంటాను.'

'అది సరేసార్. అసలు ఏకి కి ఆ డబ్బు చాలా ముఖ్యమైనదైతే '

'ఏం, ఎందుకనుకోవాలి. అతను బహుశా బాగా డబ్బున్నవాళ్లబ్బాయేమో. వాళ్లకు ఈ డబ్బంటే ఖాతరులేకపోవచ్చు. అందుకని అది మనం వాడుకోవ టంలో తప్పులేదేమో.'

'ఎంతైనా పరాయివస్తువ...' అని దాసు ఏదో అనబోతూంటే పెదబాబుగారి గదిలో కాలింగ్‌బెల్లు మ్రోగడంవలన దాసు అటువైపు వెళ్లడంతో ఆ చర్చ ఆగింది.

నాగేశ్వరరావుకూడా తను టైపిస్టు కివ్వ వలసిన కాగితాలు తీస్తూ, ఆఫీసు ధ్యాసలోపడ్డాడు.

మరొక పదినిముషాలుపోయాక దాసు మళ్లీ వచ్చి నాగేశ్వరరావుప్రక్కన కూచొని మాట్లాడ నారంభించాడు. 'ఏమండోయ్, ఒకసారి ఏం జరిగిందో తెలుసా, పెదబాబుగారు, తమ గదిలో ఒకసారి పర్సు మరిచిపోయారు. నేను, ఆయన సాయంకాలం క్లబ్బుకు వెళ్లిపోయాక, ఆఫీసు తలుపులువేద్దామని వెడితే, ఆయన కుర్చీదగ్గర కన్పించింది అది. నేను వెంటనే అది జేబులోపెట్టుకుని, ఆయనకు తర్వాత ఇద్దామను కుని మరిచిపోయాను. రెండు రోజులు పోయాక నాకు జ్ఞాపకంవచ్చింది. ఈ లోపల ఆయనా అడగలేదు. తను క్లబ్బులో పోగొట్టుకుని ఉంటాననుకున్నారట. నేను ఆ రెండురోజులూ పనుల హడావుడిలో మరిచి పోయేను. మూడోరోజున నాకేజ్ఞాపకంవచ్చి, 'సార్ మీరు ఆఫీసులో మొన్న మరిచిపోయిన పర్సు ఇదుగో!' అని

తీసిచ్చాను. ఆయన తెల్లబోయి, అది తీసుకుని, లోపల డబ్బు సరిగా వుందో లేదో చూసుకుని, 'ఇందులో ఎంతుందో నీకు తెలుసా?' అని అడిగారు. నాకు తెలియదనీ, నేను చూడలేదనీ చెప్పాను. అప్పుడాయన నలభై వందరూపాయల నోట్లు తీసి చూపించారు.'

'నాలుగు వేలే!' అన్నాడు నాగేశ్వరరావు.

'అవును సార్ !'

'ఎటువంటి ఛాన్సు పోగొట్టుకున్నావ్ ! అది, దాచేసి, ఎలాగా ఆయన అడగలేదు కాబట్టి, మరో వారంరోజులు వూరుకుని, పనిమానేసి, హాయిగా ఆ డబ్బుతో చిన్నవ్యాపారం పెట్టుకుంటే...'

'ఛీ ! ఎందుకు సార్ ! అలాంటి పాడుపని ! నేనంత నిజాయితీగా ఇవ్వబట్టే, ఆయనకి నేనంటే అభిమానం.'

'ఎందుకొచ్చిన అభిమానమోయ్, నీకేమైనా జీతం పెంచారా ? ప్రమోషనిచ్చారా ?' అని నాగేశ్వరరావు అడగ్గా, దాసు మౌనంగా వూరుకున్నాడు. ఇద్దరి మనస్సులలోనూ రెండురకాల ఆలోచనలు మెదిలాయి. ఇద్దరికీ తాము జీవితంలో పైకిరావాలని గాఢమైన కోరికవుంది.

నాగేశ్వరరావుకి ఈ కంపెనీలో నూరు రూపాయలు జీతంఇస్తారు. కనీసం రెండువందలు జీతం వచ్చే ఉద్యోగం కావాలని ఎన్నో ప్రయత్నాలు చేస్తున్నాడు. ఒక పెద్ద పొగాకుకంపెనీ యజమానికి రికమెండేషన్‌కోసం ఎంతో తంటాలు పడుతున్నాడు. రికమెండేషన్ లెటరు వెళ్లింది. తనకు ఇంటర్‌వ్యూ కొద్దిరోజులలో రావచ్చునని తెలిసింది. ఆ కంపెనీలో రెండువందలపైన జీతం దొరుకుతుంది. అలా ఏదో రికమెండేషనో, లంచమో, పారేసి చరా చరా పైకెగ బ్రాకాలిగాని, నీతికి, నిజాయితీకి రోజులా ఇవి ? అని, దాసు తెలివితక్కువతనానికి, నాగేశ్వరరావు విచారించాడు.

దాసుకి నాగేశ్వరరావుఅన్న మాట కూడా నిజమే ననిపించింది. తను ఎంత నిజాయితీగా ప్రవర్తించినా పెదబాబుగారు తనకు సరియైన ఇంక్రిమెంటుగాని, ప్రమోషన్‌గాని ఇవ్వటంలేదని తను బాగా చదువుకోలేదు గాబట్టి, తనకు గుమస్తాపని చేతకాదని ఆయన ఉద్దేశం. ఇప్పుడు తనకి నెలకి ఎనభై ఇస్తున్నారు. కనీసం వందరూపాయలైతే ఎలాగో సర్దుకోవచ్చు. తనజీతం తనకి ఎంతమాత్రం చాలటంలేదు. అయినా తన మనస్సుమాత్రం ఏపాపవు పనికీ ఒప్పుకోదు. చిన్నప్పటినుండీ పరాయి వస్తువును నిప్పుతో సమానంగా చూడడం, తన వస్తువు కోసం దెబ్బలాడైనా తీసుకోవటం అతని కలవాటయింది.

ఇద్దరి ఆలోచనలూ తలోకదారిలో వెడుతూనే వుండేవి. రోజులు క్రమంగా దొర్లసాగాయి.

దాసుకు, రెండు నెలలు గడిచినా తన సమస్యకు పరిష్కారమార్గం కన్పించలేదు. కానీ అతని మనసు నిజాయితీకి ప్రాధాన్యంఇవ్వడం మానలేదు. పెదబాబుగారు, ఏమీ గమనించనట్లు ఉన్నా దాసు మనస్తత్వం పూర్తిగా అర్థం చేసుకున్నారు. ఒకనాడు దాసునిపిలిచి, అతనియింటి పరిస్థితులూ, అతనికి జీతం సరిపోతున్నదీ లేనిదీ అడిగారు. అదేసమయం అని దాసు, ఉన్నవీ లేనివీ కల్పించి చెప్పలేదుగాని, తనకు జీతం చాలటంలేదనీ, మరొక ఇరవైరూపాయలు ప్రతినెలా అప్పు చెయ్యవలసి వస్తోందని చెప్పాడు. ఇంకా చాలా చాలా చెప్పదలచుకున్నాడు గాని అవి నోట్లోంచి పెగల్లేదు.

కాని పెదబాబుగారు దాసు తత్వం అర్థం చేసుకున్నారు. అందుకే మరొక నెలరోజులు పోయిం తరువాత అతనికొక అవకాశం ఇచ్చారు.

ఆ రోజు మధ్యాహ్నం దాసు ఉత్సాహంగా నాగేశ్వరరావు వద్దకువచ్చి 'ఏమండోయ్ నేనీపనికి రాజీనామా ఇస్తున్నాను' అంటూంటే నాగేశ్వరరావు తెల్లపోయాడు.

'ఏమిటోయ్ మరో ఉద్యోగం అయిందా?'

'అవునుసార్. లక్ష్మీరైసుమిల్లులో స్టోరు కీపరుగా చేరుతున్నాను. జీతంకూడా ఎక్కువే' అన్నాడు దాసు.

'లక్ష్మీ రైసుమిల్లు అంటే పెదబాబుగారి బావమరదిదే కదా?' అని నాగేశ్వరరావు ఆశ్చర్య పోయాడు.

'అవును సార్, ఇది పెదబాబుగా రిప్పించిందే. అక్కడ స్టోరులో ఒక నమ్మకమైన వ్యక్తి కావాలంటే, నన్ను రికమెండు చేశారు. ఇకనుంచి మనం ఆఫీసుబోయి కాము, క్లాసు III లో చేరుతున్నాం. చూశారా, మనిషిలో నిజాయితీ వుంటే భగవంతుడెలా సాయం చేస్తాడో, జీతం నూట ముప్ఫై'.

'అబ్బా!' అని అంటూ నాగేశ్వరరావు, దాసు అదృష్టంచూసి మనసులో అసూయ పొందాడు. నిజాయితీ ఏమిటి వీడి మొహం! కేవలం ఇది వాడి అదృష్టమే! కాకపోతే మూడు నెలల క్రితం ఒక గట్టి రికమెండేషన్ చేయించినా, ఆ పొగాకు కంపెనీనుండి తనకింకా ఇంటర్వ్యూ రాలేదు. అది తన దురదృష్టం వలన కదూ!

తన దురదృష్టాన్ని అనేక విధాల తలపోసుకుంటున్న నాగేశ్వరరావుకి, పోస్టుమాన్ ఒక కవరిచ్చి వెళ్లాడు. సాధారణంగా తనకు కంపెనీ అడ్రసుకు ఉత్తరాలు ఎప్పుడోగాని రావు. ఎవరు రాశారా అని చింపి చదివాడు. అందులో ఇలా వుంది.

చిరంజీవి నాగేశ్వరరావుకు మీ మావయ్య ఆశీర్వదించి వ్రాయునది,

నీ వుత్తరం నాకు చాలా అశ్చర్యం కలిగించింది. నేను నీ గురించి రికమెండేషన్ చెయించిన వెంటనే, నీకు ఇంటర్వ్యూకార్డు పంపడం, ఇంటర్వ్యూలో నిన్ను సెలక్టు చెయ్యడం జరిగిందనీ, నువ్వు వెంటనే డ్యూటీలో చేరావనికూడా, అక్కడనుంచి ఇక్కడకు వచ్చిన ఒకతను చెప్పాడు. నీ వుత్తరం చూడగావే నేను వాకబుచేస్తే తేలినదేమంటే, నీకు పంపిన ఇంటర్వ్యూ కార్డు నీ పేరుగల మరొక వ్యక్తికి, పోస్టువాళ్ల పొరపాటు వలన అందడం అతనా సదవకాశం వినియోగించడం జరిగిందని; అంతేకాక అప్పుడు మనం రికమెండేషన్ చేయించిన మానేజరు ఆ వూరు నుంచి మరో వూరు బదిలీ అయివెళ్లిపోయాడని తెలిసింది. అందువల్ల జరిగిన పొరపాటును దిద్దుకునే అవకాశంకూడా లేకపోయింది. రెండువందల ఏభై జీతంవచ్చేపోస్టు, మన కర్మకొద్దీ, మరొకడు తన్నుకు పోయాడు.........

నాగేశ్వరరావుకి భూమి గిర్రున తిరిగినట్లైంది. తూలి, కుర్చిలోంచి క్రిందకు పడినంత పనైంది. తన దురదృష్టాన్ని నిందించుకోవడంతోబాటు, అప్పుడే పోస్టుమాన్ యొక్క తప్పును సరిదిద్దనందుకు విచారించాడు. అతని పుస్తకాలు తనకు వచ్చినట్లే తన వుత్తరాలు అతనికి వెళ్లవచ్చునని ఆలోచించనందుకు విచారం, బాధా, తనమీద తనకి కోపం కలిగాయి. అయినా అవతలివాడు, తనవికాని ఉత్తరాలు తీసుకుని, ఇతరుల ఉద్యోగా లపహరించేటంతటి నీచుడవడం ఆశ్చర్యంగా వుందనుకున్నాడు. మనుషులలో, నీతి నిజాయితీ బొత్తిగా పోతున్నాయి—అని క్రుంగిపోయాడు నాగేశ్వరరావు.

ఇటువంటి ప్రపంచంలో తనలాటి వాడెలా బ్రతకడం? అని ప్రశ్నించుకున్నాడు. అలా ఆలోచిస్తూనే, తన ప్రమోషన్ సందర్భంగా అందరికీ 'టీ' ఇస్తున్న దాసు చేతుల్లోని టీ కప్పు అందుకున్నాడు.

# జ్ఞాపకం

శ్రీ కె. యస్. వి. నరసింహం

అన్నా !

అపుడు తొలిసారి నీవు నన్ను పలుకరించి
అమాయకంగా నవ్వినప్పుడు—
గుర్తుందా పున్నాగ చల్లగా విసిరిన చప్పుడు

ఓరియన్ నటకా కేసి చూస్తూ
పచ్చగడ్డిలో వెల్లకిలా ఇలా ఇప్పుడు పడుకుని
చుక్కల సంతలాంటి ఆకాశంలోకి చూస్తూ
ఆలోచించుకుంటున్నాను.
గడచిన అడావుడీ కాలాన్ని
ఇసుక నేలలో నా అడుగు గుర్తులు పడి
విచిత్రంగా మాసిపోవడాన్ని
ఇరుకుదారి కిరుప్రక్కలా నిలిచిన వేపచెట్ల మధ్యగా
నువ్వు నడుచుకుంటూ నా కెదురునచ్చి
క్షణం—ఒక్క క్షణం ఆగి నన్ను గుర్తించి పలుకరించి
ఉన్నట్లుండి నవ్వి
అ౭
చెమ్మగిల్లిన చూపు చూసి నన్ను కౌగిలించిన దృశ్యాన్ని
మరో లోకంలో ఎక్కడో ఎప్పుడో నువ్వూ నేనూ
ఏదో మహోత్సవానికి చెట్టాపట్టాలు వేసుకు నడిచిన జ్ఞాపకాన్ని
అస్పష్టంగానే అయినా
ఒకటి వెంట ఒకటిగా నెమరువేసుకుంటున్నాను.

ఇది అది అని చెప్పలేని ఒక బాధ
ఎందుకో నన్నావరించి కలవర పెడుతుంది.
అన్నా ! ఒకప్పుడు మనం
అడవుల ముళ్ళదారుల్లో నడుస్తూ కూడా

## జ్ఞాపకం

ఆనందంకోసమే అమాయకంగా వెతికాం.
అప్పుడు విడిపోయే మబ్బుల మధ్య
ఆకాశం తునక మనల్ని చూసే నవ్వింది.
అప్పుడు ఒకటొకటిగా పుట్టుకొచ్చిన చుక్కలు
మనల్నే ఎందుకో మాటలు లేకుండా హెచ్చరించాయి.
ఐనా ఏమైంది—మన సంకల్పానికి?
అనంతమైన చైతన్యంతో
అడుగులు ముందుకే వేశాం
ఆకాశం తునక ముడుచుకు పోయింది.
తారలు మౌనవాచాలతలు మానుకున్నాయి.

ఇప్పుడో—మరి—ఇప్పుడో
ఇలా నిర్లిప్తత నా చుట్టూ గూళ్ళు కట్టి ఆవరించి
వెల్లకిలా పడుకున్న నా గుండెలపై
వేయికోట్ల మిలియన్ల టన్నుల బరువులు హెచ్చిపోయి
అవి ఆకాశం అపహాస్యాలో
మనసొప్పని రిక్కల ఎగతాళి హెచ్చరికలో
నన్ను అసహాయుణ్ణిచేసి నాచేత నన్నే
అంతం చేసెయ్య జూస్తున్నాయి.

నాకు తెలుసు నాకు తెలుసు
ఈ పథకం ఫలించదని.
నీ సాక్షిగా నాకు తెలుసు
నాలో చైతన్యం నాగసారాలూదగలదని.
ఆ క్షణాలు వచ్చి
నీ స్మృతి నన్ను బాధించడానికి బదులు
నాకు అంతులేని ఉత్తేజాన్ని ఇచ్చి
గోడలు నిలువని భూములోకి
నీడలు పడని కాంతిసీమల్లోకి
అందం హసించే చోటికి
ఆనందం నివసించే వీటికి
నన్ను నడిపిస్తుందని
నాకు తెలుసు.

# ప్రచ్ఛన్న నిరుద్యోగ సమస్య- ఆర్థికంగా వెనుకబడిన దేశాలు

శ్రీ ఏ. తిరుపతిరాజు

**1930** వ సంవత్సరందాకా 'నిరుద్యోగం' అనేది తాత్కాలికమైన సమస్యగా భావించబడుతూండేది. అప్పటిదాకా ప్రచురింపబడ్డ అర్థశాస్త్ర సాహిత్యంలో 'నిరుద్యోగం' అనేది శ్రామికుల గిరాకీకి సరఫరాకిమధ్య ఏర్పడిన తాత్కాలికమైన తేడాగా భావించబడుతూండేది. కార్మికుల్లో గమనశీలం లోపించడంవల్ల, గిరాకీలో మార్పులు ఏర్పడుతూండడంవల్ల, ధరలలోనూ కార్మికులవేతనాల్లోనూ సర్దుబాట్లు లేకపోవడంవల్ల ఏర్పడే సమస్యగా నిరుద్యోగం నిర్వచింపబడింది.

1930 వ సంవత్సరంలో ఏర్పడిన ఆర్థిక మాంద్యం; జాన్ మైనార్డ్ కీన్స్ (J. M. Keynes) అనే శాస్త్రవేత్తయొక్క ఆర్థికశాస్త్ర సూక్ష్మీకరణ; ఆర్థికశాస్త్రానికి సంబంధించిన ఆలోచనల్లో విప్లవం; —ఇవన్నీ ప్రపంచాన్నిఈ సమస్యగురించి ఆలోచించేదానినిగా మార్చాయి. అంతవరకూ ఆర్థికశాస్త్రవేత్తలు ఏదేశంలోనైనా నిరుద్యోగం అనేది వుండదని, ఉత్పత్తిచేయబడిన వస్తుజాతపు మొత్తంఅంతా పూర్తిగా గిరాకీ చేయబడుతుందని అనుకొనేవారు. సాధారణంగా ఆర్థికవ్యవస్థలో నిరుద్యోగం ఏర్పడదని, ఒకవేళ ఏకారణంచేతనైనా ఏర్పడినా కొద్దికాలంలోనే సర్దుబాట్లు జరిగి నిరుద్యోగం తొలగిపోతుందని అనుకొనేవారు. కాని నిరుద్యోగంఅనేది తప్పనిసరిఅని, దేశంలోని ప్రజలందరికీ పూర్తిగా ఉద్యోగాలు కల్పింపబడడంఅనేది కొద్దికాలంపాటుఉండే విషయంఅని కీన్స్ అభిప్రాయపడ్డాడు. దేశంలో Effective Demand తక్కువగా ఉండడంఅనేది సాధారణ విషయమని, అందుచేత ఆర్థికవ్యవస్థలో కొరత ఏర్పడి నిరుద్యోగానికి దారితీస్తుందని ఆయన ఒక సిద్ధాంతం చేశాడు. ఈ నిరుద్యోగం ప్రచ్ఛన్నమైనదైనా కావచ్చు (Disguised Unemployment); లేదా ప్రత్యక్షమైనదైనాకావచ్చు (Unemployment). ప్రచ్ఛన్న నిరుద్యోగంఅంటే ఒక పనిని చేయడానికి వినియోగింపబడ్డ కార్మికులలో కొంతమందియొక్క ఉపాంత ఉత్పాదకత (Marginal Productivity) శూన్యంగా ఉంటుంది. అట్టివారిని పనిలోనుంచి తొలగించినా ఉత్పత్తిపరిమాణం తగ్గే ప్రమాదం ఉండదు. ఉదాహరణకి పదిమంది మనుష్యులుచేసేపనిని ఇరవైమంది చేస్తున్నప్పుడు వారిలో పదిమందికి మాత్రమే పూర్తిపని ఉంటుంది. మిగిలిన పదిమంది పనిచేస్తున్నట్లు కనిపించినా వారికి నిజానికి పని ఉండదు. వారి ఉపాంతఉత్పాదకత శూన్యంకాబట్టి వారిని పనిలోనుంచి తొలగించినా ఉత్పత్తి పరిమాణం తగ్గదు. దీనినే ప్రచ్ఛన్న లేదా కనుపించని నిరుద్యోగం అన్నారు. ఇక రెండవరకం నిరుద్యోగం ప్రత్యక్షనిరుద్యోగం లేదా కనుపించే నిరుద్యోగం. ప్రజలలో కొంతమంది ఏవిధమైన పనిపాటలు లేక ఖాళీగా ఉండడం అనేది ప్రత్యక్ష నిరుద్యోగం.

కీన్స్‌గారి ఉద్దేశం ప్రకారం ఈ నిరుద్యోగం అనేది ప్రచ్ఛన్నమైనదైనా, ప్రత్యక్షమైనదైనా— సంపన్నమైన పారిశ్రామికదేశాల్లోనే ఉంటుంది. అభివృద్ధి చెందని దేశాల్లో ఈ సమస్య ఉండదని ఆయన అభిప్రాయం. ఎందుచేతనంటే అటువంటి దేశాల్లో ఇంకా పెట్టుబడి అవకాశాలు చాలాఉంటాయి. సహజ సంపదలు పూర్తిగా వినియోగింపబడవు. ఆ దేశాల్లో ప్రజల పేదరికం అక్కడి పొదుపు శాతాన్ని

తక్కువగా ఉంచుతుంది. ఈ పరిస్థితులు తొలగించినప్పుడు నిరుద్యోగం తొలగింపబడుతుంది.

కాని ఆధునిక ఆర్థిక శాస్త్రవేత్తలు అంటే కీన్స్, ఆయన తరువాతివారు ప్రచ్ఛన్ననిరుద్యోగం అనేది అభివృద్ధి చెందుతూన్న దేశాల్లోకూడా ఉంటుందని, ముఖ్యంగా అది వ్యవసాయరంగంలో ఎక్కువఅని అభిప్రాయ పడ్డారు. కొంతమంది ఆర్థికంగా వెనుకబడిన దేశాల ఆర్థికశాస్త్రవేత్తలు వీరితో ఏకీభవించలేక పోయారు. ఉపాంత ఉత్పాదకత అనేది మిగిలిన రంగాలతో పోల్చి చూచినపుడు వ్యవసాయ రంగంలో తక్కువగా ఉంటుందేకాని అంతమాత్రం చేత వ్యవసాయరంగంలో ప్రచ్ఛన్ననిరుద్యోగం ఉందని చెప్పడం సరియైనది కాదని వారిఉద్దేశం. ఆధునిక రచయితలు మాత్రం ఆర్థికంగా వెనుకబడిన దేశాల్లో వ్యవసాయరంగంలో ఉపాంత ఉత్పాదకత శూన్యమని [ఒకోసారి అది శూన్యంకన్నా తక్కువఅని] కాబట్టి ఆ రంగంలో ప్రచ్ఛన్న నిరుద్యోగం ఉండటం అనేది నిర్వివాదాంశం అని అంటారు.

ప్రచ్ఛన్న నిరుద్యోగ సిద్ధాంతంలో తరచుగా 'మూలధన శ్రామిక నిష్పత్తులు స్థిరంగా ఉండటం' అనే భావంతో అనుసంధింప బడుతూంటుంది. అంటే ఉత్పత్తి ఫలములు (Production functions) దీర్ఘ చతురస్రాకారాన్ని పోలివుంటాయని చెప్పబడుతూంటుంది. ఎక్కువగా యంత్రీకరించబడిన ఆధునిక పరిశ్రమల్లో ఈ విషయాన్ని పోలిన పరిస్థితులు స్వల్పంగా గోచరిస్తాయి. కాని సాంప్రదాయికమై, యంత్రీకరణ లోపించిన వ్యవసాయరంగంలో కూడా అదేవిధమైన పరిస్థితు లుంటాయనుకోవడం నిజంగా శోచనీయం.

సాంప్రదాయకమైన వ్యవసాయరంగం ప్రముఖ పాత్ర వహిస్తూవున్న బడుగుదేశాల్లో నిరుద్యోగం ఏవిధంగా ఉత్పన్న మవుతుందో దిగువున వివరింపబడినది.

'సాంప్రదాయకమైన వ్యవసాయ రంగంపై ఆధారపడిన ప్రజలసంఖ్య పెరుగుతున్నప్పటికీ ఆరంగం పెరిగే జనాభాకి ఉద్యోగావకాశాలు కల్పించలేకపోవడం; ఆధునికమైన పారిశ్రామిక రంగంలో అల్పాభివృద్ధి— ఇవే ప్రస్తుతకాలంలో అభివృద్ధిచెందుతూన్న దేశాలు ఎదుర్కొనే ముఖ్యసమస్యలు. పైగా సాంప్రదాయక రంగంలో తలసరి ఆదాయం అత్యల్పంగాఉండి ఒక్కొక్కప్పుడు తగ్గిపోతూండడంకూడా సంభవిస్తోంది. ఈదేశాలలో ఆధునికరంగపు పరిణామం (Evolution) లో ఈ క్రింద వివరింపబడిన లక్షణాలు మనకు గోచరిస్తాయి.

1. ఆధునిక పారిశ్రామికరంగంలో మూలధన సంచయపురేటు (Rate of Capital Accumulation) కొన్ని దశాబ్దాలుగా తక్కువగా ఉంటోంది—ఇది సాంప్రదాయకరంగంలో, జనాభా పెరుగుదల రేటు కంటే తక్కువ. ఈ రంగంలో ఏర్పడిన మూలధనంలో చాలాభాగం ఎగుమతి చేయడానికి కావలసిన ముడిసరుకులు, వ్యవసాయ వస్తువుల ఉత్పత్తికోసం జరిగిన పెటుబడులవల్ల ఏర్పడింది.

2. ఆధునికరంగపు పెరుగుదల సాంప్రదాయక రంగంలో తయారైన వస్తువుల గిరాకీని పెంచలేదు. ఒకవేళ పెంచినప్పటికీ గిరాకీకి అనుగుణంగా సాంప్రదాయక రంగంలో మార్పులురాకుండా ఉండటానికి సాంఘిక రాజకీయ పరిస్థితులలోఉన్న అడ్డంకులు కారణం అవుతాయి. ఈ విధంగా ఒకదానికి అనుగుణంగా మరొకటిగా, ఈ రెండురంగాలు మారడానికిగాని, ఒకదానిమీద ఒకటి ఆధార పడటానికిగాని వీలులేకపోవటంచేత ఆధునిక రంగంలో పెరుగుదల అరికట్టబడుతున్నది.

3. ఆధునికరంగంలో ముఖ్యంగా పెద్దతరహా పరిశ్రమలలో వాడబడే ఉత్పత్తిపద్ధతులు మూలధన సాంద్రతకలవి (Capitel Intensive) గా వుంటున్నాయి. ఈ రంగంలో కార్యకలాపాలు పెరిగినప్పటికీ అందువల్ల ఉత్పన్నమయ్యే ఉద్యోగావకాశాలు తక్కువ. ఎందుచేతనంటే ఈ దేశాలలోవున్న పారిశ్రామిక ప్రోత్సాహకులు (Entrepeneurs) ఎన్నుకొనేఉత్పత్తిపద్ధతులు చాలావరకు మూలధనపు మార్కెట్లలో లభించే పెట్టుబడి పైన, నిపుణత కల్గిన కార్మికులు లభ్యమవడం పైనా ఆధారపడిఉంటున్నది. ఈ ఆధునిక రంగంలో వ్యక్తులకు మూలధనం చాలా తక్కువ వడ్డీరేటుకే లభ్యమవుతూండడంచేత వారు ఎక్కువగా

మూలధనసాంద్రతకల ఉత్పత్తి సాధనాలను వాడుతారు. పైగా నిపుణతలేని కార్మికులకు శిక్షణ ఇవ్వడం ఖర్చుతో కూడినపని. అందుచేత కార్మికులకు బదులుగా యంత్రాలను వాడడమే లాభదాయకంగా కన్పిస్తుంది. అదీకాక ఇక్కడ వాడుకలోవున్న ఉత్పత్తి పద్ధతులు శ్రామికులు కొరతగావున్న దేశాలలో వాడడానికి ఉద్దేశింపబడినవి.

అదేవిధంగా వ్యవసాయం ప్రధానమైన భాగంగా ఉన్న సాంప్రదాయరంగపు పరిణామంలోకూడా ఈ క్రింది లక్షణాలను మనం చూడగలం :

(1) వ్యవసాయరంగంలో ఉత్పాదకపు పెట్టుబడి (Productive Investment) క్రిందికి వచ్చే పొదుపు నిష్పత్తి కొన్నిప్రదేశాల్లో చాలా తక్కువగా ఉంటుంది. ఒక్కొక్కసారి ఉత్పాదకతను (Productivity) సమాన స్థాయిలో వుంచడానికి కావలసినదానికంటే కూడా తక్కువగా పొదుపు నిష్పత్తి ఉంటూంటుంది. పొదుపు ఎక్కువగా జరుగుతున్నప్పటికీ అది ఉత్పాదకపు పెట్టుబడిలోనికి మళ్లింపబడదు. వ్యవసాయరంగంలోఉన్న ఆదాయసంపదల పంపకంలోని వ్యత్యాసాలవల్ల ఎక్కువగా పొదుపు జరిగినప్పటికీ సారవంతమైనభూమి కొరతవల్ల, శ్రామికశక్తిని ఆదాచేసే ఉత్పత్తి పద్ధతులను (Labour Saving Devices) వాడటానికి తగిన ప్రోత్సాహం లేకపోవడంచేత పెట్టుబడి ఉత్పాదకతను పెంచేదిగా ఉండదు.

(2) కొన్నిప్రాంతాల్లో సాంప్రదాయకరంగం అభివృద్ధిలేనిదిగా ఉండడమేకాకుండా ఈ క్రింది రెండు కారణాల్లో ఏఒక్కకారణంచేతనైనా తగ్గిపోతూంటుంది : (a) చేతిపరిశ్రమలు — భారీపరిశ్రమల్లో తయారై చవకగా లభించే వస్తువుల పోటీని ఎదుర్కొనలేక క్షీణించిపోవడం; (b) వాణిజ్య వ్యవసాయం (Commercial Agriculture) విస్తరించడంచేత, ఎస్టేట్లు తోటలు పెరగడంచేత చిన్నవ్యవసాయదారులను రంగంనుంచి తొలగించడం జరుగుతూంటుంది. అందుచేత ఎక్కువమంది వ్యవసాయదారులు భూమిలేని వ్యవసాయ కార్మికులుగా మారిపోతూంటారు. ఈ పరిస్థితులలో ఆధునికరంగంలోని అభివృద్ధి, సాంప్రదాయికరంగంలో నిరుద్యోగాన్ని సృష్టించి అందులో ఆదాయాలస్థాయిని తగ్గిస్తుంది.

(3) కాలక్రమేణా సాంప్రదాయక రంగాల్లో జనాభా పెరుగుతూంటుంది – ; మొదట్లో మరణాల సంఖ్య ఎక్కువగా ఉండడంచేత జనాభా పెరుగుదల రేటు తక్కువగా ఉంటుంది. రానురాను ఆధునికమైన వైద్యవిధానాలు వాడబడుతూండటంచేత మరణాల సంఖ్య తగ్గి జనాభా పెరుగుదలరేటు చాలా ఎక్కువగా ఉంటుంది. ఆధునికరంగంలో అభివృద్ధి అల్పంగా ఉండడంచేత పెరుగుతూన్న ఈ రైతుజనాన్ని ఆ రంగంలోనికి ఉద్యోగాలకోసం తీసుకోవడం జరగడం లేదు. పైగా ఈ రంగంలో వాడబడే శ్రమని ఆదా చేసే ఉత్పత్తి విధానాలుకూడా ఈ సమస్యని తీవ్రతరం చేస్తున్నాయి. ఉత్పాదకపు పెట్టుబడిలో కొరత వల్ల సాంప్రదాయకరంగంలో ఉత్పాదకతను పెంచడానికి కూడా అవకాశం వుండదు.

పైన వివరించిన సాంప్రదాయక, ఆధునిక రంగాల సమానాభివృద్ధి సాంప్రదాయకరంగంలో ప్రచ్ఛన్న నిరుద్యోగుల సంఖ్యానుక్రమంగా పెంచుతుంది. ఈ సాంప్రదాయకరంగంలో వాడబడే ఉత్పత్తి పద్ధతులు చాలవరకూ మార్పుచేయడానికి అనువుగా ఉండటంచేత నూతనంగా చేర్చబడిన కార్మికులను ఆ రంగంలోనికే తీసుకోవడానికి అవకాశం ఏర్పడుతుంది. భూమి కమతాల పరిమాణాన్ని జనాభాలో పెరుగుదలతోపాటు తగ్గించడం జరుగుతుంది.అందుచేత వ్యవసాయరంగంలో అదనంగా కార్మికులకు పని కల్పించబడుతుంది. కాని ఈ అదనపు కార్మికులవల్ల పెరగడంమాత్రం సంభవించదు.

పారిశ్రామికదేశాల్లోఉన్న ప్రచ్ఛన్న నిరుద్యోగాన్ని తొలగించడానికి ఉపకరించే విధానాలు ఈ అభివృద్ధి చెందుతున్న దేశాల్లో ప్రయోగించడానికి పనికి రావని ఆర్థర్ లూయిస్ (Arthur Lewis), రగ్నార్ నర్క్సే (Rugnar Nurkse) మొదలైన రచయితల అభిప్రాయం. ఎందుచేతనంటే పారిశ్రామికదేశాలలో నిరుద్యోగంఅనేది— ప్రచ్ఛన్నమైనదైనా, ప్రత్యక్షమైనదైనా—Effective Demand లో కొరతవల్ల ఏర్పడుతుంది. సులభద్రవ్య పద్ధతి (Easy Money Policy) కాని, లోటుబడ్జెట్ విధానంకాని (Deficit Financing) Effective Demand ను పెంచగలవు. అందు

చేత నిరుద్యోగసమస్యను తొలగించడానికి అట్టి దేశాలలో ఈ విధానాలు అవలంబించవచ్చు. కాని వీటిని అభివృద్ధిచెందుతూన్నదేశాలలో ప్రయోగించడంనిరుపయోగమైనదేకాకుండా ఒక్కొక్కసారి అపాయకరంకూడా.

వ్యవసాయరంగంలోని ప్రచ్ఛన్న నిరుద్యోగాన్ని తొలగించడంకోసం రగ్నార్ నర్క్స్ పండితుడు ఒక సలహా ఇచ్చాడు. వ్యవసాయరంగంలోవున్న మిగులు శ్రామికులను ఆ రంగంనుండి మార్చి వారిని ఉత్పాదక వస్తువులను తయారుచేయడంకోసం వినియోగించడం లాభదాయకం. అంటే వారికి ఉత్పాదక వస్తుపరిశ్రమలలో ఉద్యోగాలు కల్పించాలి. అదే సమయంలో వినియోగవస్తువుల గిరాకీ పెరగకుండా ఉండేటందుకు ప్రభుత్వం పన్నులు విధించడంగాని, కంట్రోళ్లను అమలుపరచడంగాని చెయ్యాలి. భూమిపై జనసమ్మర్దం పెరగడంవల్ల, లేదా ఎక్కువ పంటలను పండించడంవల్ల వ్యవసాయరంగంలో భూసారం తగ్గి శ్రామికుల ఉపాంతఉత్పాదకత శూన్యమైనపుడు ఈ పద్ధతిని అవలంబించడం సముచితం. కాని ఆ విధంగా శ్రామికులను తొలగించడంచేత మొత్తం ఉత్పత్తి తగ్గిపోయే ప్రమాదంఉంది కాబట్టి లఘుకాలంలో ప్రచ్ఛన్ననిరుద్యోగాన్ని తొలగించడానికి ఈ విధంగా చేయడం ఉపకరించదు.

వ్యవసాయ రంగంలో ఉత్పత్తిని కోల్పోకుండా కొంతమంది శ్రామికులను ఆ రంగంనుంచి మార్చి వారిని పారిశ్రామిక రంగంలో నియమిస్తే పారిశ్రామికోత్పత్తికూడా పెరుగుతుంది. అందుకోసం వ్యవసాయ రంగంలో ఉత్పత్తి పద్ధతులను వుంటుంది.వ్యవసాయశ్రామికుల నైపుణ్యం పెంచడానికి కావలసిన మార్పులుప్రవేశపెట్టి వారికి ప్రత్యేకింపబడిన సంస్థలలో శిక్షణ ఇప్పించాలి. సాంఘికవ్యవస్థలో మార్పులు ప్రవేశపెట్టిప్రజలలో పరిశ్రమలలో పనిచేయడానికి కావలసిన ఉత్సాహాన్ని పెంపొందించడంకూడా అవసరం.పరిశ్రమల్లోవాడబడే ఉత్పత్తిపద్ధతులను నిపుణత లేని వ్యవసాయ కార్మికులనుకూడా పనిలోనికి తీసుకొనగలిగే వానినిగా మార్పు చేయాలి. మేలు రకం మూలధనం మొదలైన సహాయకారి ఉత్పాదకాలను ఎక్కువ పరిమాణంలో లభ్యమయ్యేలా చేయాలి. పై విషయాలన్నీ సాధించగలిగినపుడు వ్యవసాయరంగం తనలోవున్న అదనపు కార్మికులను పారిశ్రామిక రంగానికి లభింప చేయగలుగుతుంది.

పైన చెప్పబడిన మార్పులన్నీ కాలక్రమేణా జరుగుతాయి. ఈ నాటికి అభివృద్ధి చెందిన దేశాలు కూడా ఈ విధానాలన్నింటిని అవలంబించే వున్నాయి. అభివృద్ధి చెందుతున్న దేశాల్లోఈ మార్పులు జరుగుతాయనేదినిస్సందేహం. నిజానికి ఇటువంటి మార్పులు ఈ మధ్యనే జరుగుతున్నాయి. అసలు ఆర్థికాభివృద్ధి అంటేనే ఈ మార్పులు జరిగి వ్యవసాయ పారిశ్రామిక రంగాల్లో ఉత్పత్తి పెరగడం. సరియైన విధానాలను అవలంబించడంద్వారా ఈ మార్పులను త్వరితగతిలో సాధించగలిగితే దేశం ఆర్థికాభివృద్ధి చెందడమే కాకుండా ప్రచ్ఛన్ననిరుద్యోగాన్ని నిర్మూలించుకొనగలుగుతుంది.

[redacted]

కలగూరగంప :

# పందొమ్మిదవ శతాబ్దంనాటి వ్యావహారిక భాషావిశేషాలు

వ్యవహారంలోఉన్నభాష వ్యావహారికభాష. గ్రంథస్థాధారాలు ఉండటంబట్టి ఏశతాబ్దంనాటి గ్రాంథిక భాషనైనా స్థూలంగా విపులీకరింపవచ్చు. కాని వ్యావహారికభాషను వివరించడం అంత సులభమయిన విషయంగాదు. కారణం వ్యావహారికభాషలో మనకు దొరికే గ్రంథాలు క్వాచిత్కాలు. ఇక శాసనాధాలను బట్టి కొంతవరకు ఆయాశతాబ్దాలనాటి వ్యావహారిక భాషాస్వరూపాన్ని నిరూపింప వీలవుతుంది.

పందొమ్మిదవ శతాబ్దం పూర్వార్ధంలో వ్యావహారికభాష (Spoken Dialect) లో రచింపబడిన *కుమారరామునికథ గ్రంథాధారంగా కొన్ని ఆ కాలపు వాడుకభాషా విశేషాలను పొందుపరచే ప్రయత్నమే యీ వ్యాసం.వాడుకభాష, కాలంతోబాటు మార్పులకు లోనవుతూంటుంది. చరిత్ర మారుతూన్నట్లే భాష గూడా మారుతూంటుంది.

ఈ కుమారరామునికథను కొంతవరకు తందనానపాటల జాబితాలో చేర్చ వీలవుతుంది. గేయం, వచనం ఇంచుమించు సమపాళ్లలో నడవటం, వచన రచనలోని క్రొత్తదనం:—కేవలం దీన్ని తందనాన పాటలలో చేరనీయవు. భాషలో డాంబికం లేదు. సామాన్య జనానికి అందుబాటులో ఉండి సులభగ్రాహ్యమయిన భాషలో రచింపబడింది.

ఆ నాటి వ్యవహారంలో పార్శీప్రాబల్యం హెచ్చు. అప్పటి వ్యవహారంలోని పార్శీపదాలు చాలవరకు నేటి మన వ్యవహారంలో లోపించాయి. క్రమేపి తత్స్థానంలో పాశ్చాత్య భాషలకు చెందిన ఎరవుపదాలు వచ్చి చేరాయి. ఈ కుమారరామునికథలోనే మనకు అక్కడక్కడా ఈ 'ఎరవుపదాలు' అగపడతవి. (Loan Words).

కుంఫిణి (కుంపిని : 'కంపెనీ' అనుటకు)

తురుపు (ట్రూప్. [Troop])

రసీదు (Receipt)

కుమారరామునికథలోని భాష ఆనాటి వ్యవహారభాషకు ప్రతిబింబం.

కుమారరామునికథను చదివిన ఆ కాలపు వ్యావహారికభాషలోని విశేషములు మనకు స్థూల దృష్టికే కనబడును.

రచనలో అక్కడక్కడ 'తందన్నతాన' అను పల్లవి, 'మేలు! మేలు!' అను హెచ్చరిక కనబడు తుంటవి. వాక్యం మొత్తంమీద బోధపడినా విలక్షణంగా ఉన్నట్లు గమనిస్తాం. అంటే వాక్యరచన అదోలా కనబడుతుంది. అదోలా కనబడటమే ఆనాటి

* 'The Kumara Ramuni katha is an anonymous ballad written in spoken dialect......its language containing as it does a large admixture of persian administrative terms together with a few English words, seems to indicate the first half of the nineteenth century as the probable period of its composition; when English began to displace persian as the language of the government'—Introduction to 'Kumararamunikatha' (Madras Government Oriental Series. No. XCI) with exhaustive historical reference, by Sri N. Venkataramanayya.

భాషకూ నేటిభాషకూగల భేదం. మచ్చునకు కొన్ని వాక్యాలు పేర్కొంటాను.

1. కూర్చునబెట్టిరి.

2. మగచిన్నవాడు జననమయినాడు.

3: నాటిమట్టీ గుఱ్ఱము ఒకటి గొడ్డువీగి వుండెనే అది యీ వేళనె పూవులతోటలో యీన బడినది.

4. దొంగను యీవేళ పట్టిననే పట్టినారు లేకపోయిన రేపు జాము ప్రొద్దెక్కువఱకు...... (...పట్టారా సరేసరి, లేకపోలే)

5. మెడకు పడవేసి పడలాగిరి.

6, రామునికి మ్రొక్కువేసి నిలబడిరి (నమస్కరించి).

7. నేనేమి! యెదురుత్తరము చేయుదునా.

8 రాజుగారిది యేనుగ, మాది ఒక గుఱ్ఱము ఉన్నది. మంచిది పాలకి బైటనుపెట్టండి.

9. మా యింటికి నీళ్ళు చేరబోయరా.

10. కావున బడగను ద్రోయండి. (పాతర లోకి తోయండి).

11. కుర్చీవేసుక కూర్చుండి (కుర్చీ వేసు కొని కూర్చోని).

12. గెల్వంగను లేము.

13. గంటవేయువఱకు ఆఱువేల ఫౌంజును హాజరు అయిరి.

14. ఆలాగంట చెప్పితే పోవనుగలను (అలా చెపితే పోగలను).

15. కత్తుల ఒరలు దూసిరి.

16. కలపటము అయినాము.

17. అక్కడను నిద్ర భోగించెను (నిద్ర పోయెను).

18. ఇరవైయింటికి చంపి (ఇరవైమందిని).

19. అనుసరణ చేయవలెను (అనుసరింప వలెను).

శబ్దపల్లవాలల్లో ఈ లక్షణత్వం ఉం 'గంగాలా' అనడానికి 'ఏర్చుక' అని అప్పటి వాడుక. కొన్ని కొన్ని ల అర్థాలు తెలుసుకోవటం కష్టతరం. కొన్నింటికి అర్థాలు నాకూ బోధపడలేదు సందర్భాన్ని బట్టిచూచినా.

1. హస్తములు వెల్చుకొని (కడుక్కొని).

2. అనగ ఆవగ వినిపింతు (?)

3. సాలుగు దస్తాలెక్కలు కంతీపట్టించగా (సరిచూడగా).

4. చాలురావులు (చలివేంద్రములు (?) )

'కాశీరామేశ్వరం సందున చాలురావులు వేయిం చెను'—రాజు తనకు సంతానప్రాప్తికోసం చేసే పుణ్యాల సందర్భంలో.

5. చెఱువులు గోపి (త్రవ్వి).

6. వట్టివేళ్ల చవికె (పావడి).

7. కొత్తులావి పంజులు=(?)

8. కుప్పటము (ఒడలు).

9. నిరుకు (నియమం).

'ఒకరిదిఅని నిరుకు ఉన్నదా'.

10. మోయమతి (మోయన).

11. తనగాము (పెద్దతొట్టి)

12. కావు (పాతర).

13. కూతవేటునేల (కూతపెట్టేస్థలం).

14. జోడాలవారు (రాజీ కుదర్పవంపు ఇద భటులకు...).

15. విల్లెవిరాలు (పులిగంతులు).

16. పరంజుకపోవు (వేగంగాపోవు).

నేటి వ్యవహారంలో ఇవి లోపించిపోయిన కారణంగా మనకు పై పదాలు కొరుకుడుపడవు. సందర్భానుసారంగా మాత్రమే చాలవరకు అర్థం కల్పించుకోక తప్పదు.

కొన్నిపదాలకు మౌలికరూపాలుగ ఉండిఉంటవి అని తోచినవి,

(i) హదువు (అదువు).

(ii) తొరక (తొక్క).

(iii) సముజాయించు (సముదాయించు) — అన్యదేశ్యం.

(iv) లెగుచెదరు (లేచెదరు).

(v) పహదుషా (పాదుషా).

'సర్వదుంబాలా'అనే పదం తరచూ వ్యవహారంలో వాడబడింది. సర్వ: సంస్కృతం. దుంబాలా: పార్శీ. రెండూ కలిపి ఏకపదంగా వ్యవహారం. అర్థం 'యావత్తూ' అని. 'తనకు మిక్కిలి సిపాయిలేడు':— 'మించిన' అనే అర్థంలో 'మిక్కిలి' ప్రయోగం వింతగా కనబడుతుంది.

వ్యవహారభాషలో అభాసరూపాలు వైయక్తిక ఉచ్చారణావైవిధ్యం గలిగి సామాన్యంగా వ్యవహరింప బడుతుంటవి. అలాంటివే ఆకాలపు వాడుకలో—

పట్న్ణము ; నిల్వవు ; శత్రుడు ; శక్త్రత ; గాని (గవని) ;

భారియ ; *రాతిరి ; పరియంతం; తీవరము; చలినీళ్లు (మరలా వేన్నీళ్లు—అనే రూపంఉంది. కాని, చలినీళ్లు—అనే వ్యవహారం).

ఏభాష మార్పులో అయినా అర్థవిపరిణామం (Semantic Change) ఒక ముఖ్యమయిన అంశం. కాలక్రమేణా పదాలకున్న అర్థాలు కొన్నికొన్ని మార్పులకు లోనవటం అర్థవిపరిణామం.

1. నిమ్మళించడం ='శయనించడం' — ఆ కాలంలో. ఆ అర్థంపోయి, ఇప్పుడు 'నిదానించడం' అనే; ఉదా. ఏ పనిఅయినా నిమ్మళంగా చేయాలి.

2. పొడవు / పొడుగు.

'పట్నానికి పన్నెండామడ పొడుగున అరణ్యములో చదువులబడి' (పన్నెండామడ దూరంలో...అని అప్పటి అర్థం)

ప్రస్తుతం 'పొడుగు' అర్థం 'Length' అని.

3. నయము : 'మీకే నయముగాని మాకు నయములేదయ్యా' (=మీక్కాబట్టి సరిపోయిందిగాని మాకు సరిపోలేదు) అని అప్పటి వ్యవహారం. ఆ 'నయము'అనే పదానికి ఇప్పుడున్న అర్థం వేరు; ఉదా: 'ఏం? జబ్బు నయమయిందా?

4. కొలు: (=రాజీ). ఇప్పుడు 'కొలు' అంటే 'రాజీ'అనే అర్థాన్ని సూచింపదు. 'గుత్తకు తీసుకోడం'అని మాత్రమే తెల్పుతుంది.

5. అన్నం వండించి అనటానికి 'బియ్యం వండించి' అనటం ఆనాటి వ్యవహారం.

6. 'మదముదిగింది'; అంటే మదం ఎక్కింది అని అర్థం. 'ఏనగకు మదముదిగినది. పాలముమీద పడినది'—ఆనాటి వాడుక.

ఇక ఆ రోజుల్లో భర్తలను భార్యలు 'ఏమంటే' అని సంబోధిచేవారు. (ఏమంటె పలకవు').

'వుక్కిటనిడెము చెదరనవ్వ'.

'దోమవలె వెళ్లి ఈగవలె వచ్చు';

'ఆకల్లాపత్రిగా';

'కుయ్యకోసి వెట్టికోతి'—

ఇలాంటి సామెతలు, జాతీయాలు జనవ్యవహారంలో ఆనాడు లెక్కలేనన్ని.

ఫలానికాలంలో ఫలానిపద్ధతిలో ప్రజలు సాంఘిక జీవితం గడిపేరు అనేవిషయం చరిత్రనుబట్టి మనం ఈ నాడు తెలిసికోగలుగుతున్నాం. నాటి నాగరకత — వేషధారణ — వస్త్రాహారాదులకు ప్రముఖ చరిత్రకారుల నిరంతర పరిశోధనల ఫలితంగా కుతూహలం కొద్దీ రూపకల్పనలు చేయుగలుగుతున్నాం. అలాగే వారు వ్యవహరించిన భాష ఏవిధంగా ఉండేఉంటుంది అనే విషయం తెలిసికోవాలనుకోవటం తెలుగుభాషా చరిత్రలో అనేక పరిశోధనలు జరుగవలసిన అవసరాన్ని సూచిస్తుంది. జన వ్యవహారంలో రచింపబడిన ఏ పుస్తకమయినా సరే, వాడుకభాషలో చెక్కబడిన ఏ శాసనమయినా సరే ఆయాకాలములకు సంబంధిం

* రాత్రి—రాతిరి:—Anaptyxis (స్వరవిభక్తి) అంటారు ఈ విధంగా ఉచ్చరింపడాన్ని. For. Eg. చంద్రుడు—చందురుడు;

చిన వ్యావహారికభాషను సంపూర్ణంగా కాకపోయినా అలాగునే, చాలవరకు చూపెట్టగలవు అనటం సాహసంకాదు.

నవయాంత్రికపు యుగంలో భాషనుగూర్చిన పరిశోధనావశ్యకత విస్తృతమైంది, అత్యవసరమైందికూడాను. ఈ కుమారరామునికథలోని భాషను విమర్శించినట్లయితే తెలుగుభాషా పరిణామ చరిత్రను సమగ్రంగా విశదపఱచే ప్రయత్నంలో మనం సరిఅయిన ఫలితాన్ని, పొందలేం.

—ఉప్పులపాటి శ్రీరామమూర్తి

## తెలుగు—ఇటాలియను

కొంతకాలం క్రిందట భారతిలో శ్రీ యల్. మాలకొండయ్యగారు వ్రాసిన 'తెలుగు—ఇటాలియను'అను వ్యాసము చాలా బాగుంది. తెలుగు 'ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్' ఏవిధంగా అయిందో వివరించి చెప్పారు. కాని వారి వ్యాసములో కొన్ని లోపాలు కనిపించాయి.

C, G లు ఇటాలియన్‌లో లుగా ఉపయోగింపబడతాయి అన్నారు. G, 'జ' గా పలుకుతుంది కాని, C ఎల్లప్పుడు 'స' గా పలుకదు. కొన్నిచోట్ల 'చ' గాను, కొన్నిచోట్ల 'క' గాను పలుకుతుంది. సూక్ష్మంగా చెప్పాలంటే C, G ల తర్వాత a, o, u, h లుగాని, లేదా వేరొక హల్లుగానిఉంటే అవి ఎప్పుడూ, క, గ లుగానే పలుకుతాయి. C, G ల తర్వాత e, i లు ఉంటే అవి ఎప్పుడూ చ, జ లుగానే పలుకుతాయి.

Calamaio (కాలామాయీయో)= సిరాబుడ్డి
Cuore = హృదయము (కూఓరే)
Chiesa (కీఏసా) = చర్చి.

కాని,

Cielo (చీఏలో) = ఆకాశము.
Cibo (చీబో) = ఆహారము.
Cecita (చేచీతా) = గ్రుడ్డితనము.

Gallo (గాల్లో) = కోడిపుంజు.
Gufo (గూఫో) = గుడ్లగూబ.

Genio (జేనీఓ) = తెలివిగలవాడు (జీనియస్)
Ginoccio (జీనోచ్చో) = మోకాలు.
gn : న్య గాను, Gli ల్య గాను పలుకుతాయి.
aglio (ఆల్యో) = వెల్లుల్లి.
figlio (ఫీల్యో) = కుమారుడు.

ష అనుటకు ఇంగ్లీషులో Sh, ఫ్రెంచిలో Ch, జర్మనులో Sch వ్రాస్తారు. ఇటాలియనులో Sce, Sci లు షే, షీలుగా పలుకుతాయి.

Scena (షేనా) = దృశ్యము.
Scienza (షీ ఎన్‌త్సా) = సైన్సు.

కాని Sca, Sco, Scu లు స్కా, స్కో, స్కూ,లు గానే పలుకుతాయి.

Scarpa = జోడు (స్కార్పా)
Scorno (స్కోర్నో) = పథకము.

ఇకార, ఉకార, ఎకార, ఒకారములకు ఇటాలియన్‌లో దీర్ఘములు లేవని వ్రాసినారు. కాని ఇటాలియన్‌లో అన్నీ దీర్ఘాచ్చులుగానే పలుకుతాయి. ఈ దీర్ఘాచ్చులు స్వచ్ఛమైన పలుకుబడిని కల్గివున్నాయి కనుక 'ఇంటర్నేషనల్ ఫొనెటిక్ ఆల్‌ఫెబెట్' లోని అచ్చులకు వీటి ఉచ్చారణను ఆధారముగా తీసుకున్నారు. ఎకారమునకు హ్రస్వముకూడా ఉన్నది, ఓ కారమునకు వేరొక పలుకుబడికూడా ఉన్నది. దీనిని Oliver లోని 'ఆ' గా పలుకుతారు.

Sette (సెత్తే) = ఏడు.
Pecca (పెక్కా) = దోషము.
Povero (పావేరో) = బీద.
Oggi (ఆజ్జీ) = ఈ రోజు.

తెలుగు, ఇటాలియను భాషలకు సారూప్య

మును ఉదాహరణములతో బాగుగా చూపించారు, కాని ఈ క్రింది పోలికలుకూడా చేర్చవలసింది.

1. రెండుభాషలు దీర్ఘములుగా (సాగదీసినట్లు) పలుకుతాయి.

2. రెండు భాషలలోను ద్విత్వాక్షరములు. సంయుక్తాక్షరములు ఒక విధంగానే ఉన్నట్లు కన్పిస్తాయి.

3. భవిష్య ద్వర్తమాన క్రియలు, ఇంకను కొన్ని క్రియారూపములు ఇంగ్లీషు, జర్మను మున్నగు భాషలవలెగాక క్రియలతో కలసి ఒకే పదముగా రూపొందుతాయి.

Io Amo = నేను ప్రేమించు చున్నాను.
Noi Amiamo = మేము ప్రేమించుచున్నాము.
Egli Ama = వాడు ప్రేమించు చున్నాడు.

అలాగే భవిష్యత్తులో,

Io Amero = నేను ప్రేమింతును.
Noi Ameremo = మేము ప్రేమింతుము.
Essi Ameranno = వారు ప్రేమింతురు.

ఇంగ్లీషులో Shall, Will అను సహాయక క్రియలను, జర్మనులో Werden అను దానిని వాడుతారు.

మరొక గుమ్మత్తయిన విషయమేమంటే మన భాషలో చిన్నపిల్లలు మంచినీళ్లకు వాడు 'బొబ్బ'అను పదమును ఇటాలియనులో వారి పిల్లలు Bombo (బాంబో) అంటారు.

—సత్యవోలు వెంకటకృష్ణారావు.



# గ్రంథ విమర్శలు

## "బాపురెడ్డి గేయనాటికలు"

(గ్రంథకర్త: జంకె బాపురెడ్డి, ప్రచురణ కర్తలు: సుఖేలానికేతన్, I C 85, ఇర్రం మంజిల్ కాలనీ, హైదరాబాదు–4, 1970, పేజీలు: 91, వెల: రూ. 3–00.)

ఒక దాశరథి
ఒక నారాయణరెడ్డి
ఒక భీమన్న
ఒక బాపురెడ్డి

ఇదీ వరస. హైదరాబాదుతో జరిగే కవి సమ్మేళనాల్లో సాధారణంగా పాటించే వరస ఇది. భీమన్నగారి కావ్యగానం అయింతరవాత శ్రోతలు బాపురెడ్డిని Expect చేస్తారు. ఇటీవల ఈయన తన కృతుల నన్నిటినీ పద్యకావ్యాలు, గేయకావ్యాలు, గేయనాటికలు, గద్యకావ్యాలు అని నాలుగుభాగాలుగా విభజించి ప్రకటించాడు. ఆ వరసలో ఇది మూడో పుస్తకం. ఈ కవి పూర్వం చైతన్యరేఖలు, రాకెట్టు రాయబారం అని రెండు కవితాసంపుటాలు ప్రకటించాడు. ఇప్పుడు వాటిలోవి వేరువేసి, కొన్ని కొత్తవిచేర్చి పై నాలుగు పుస్తకాల్లో ప్రకటించారు.

బాపురెడ్డి గేయకావ్యాలను జరిగిన మూడేళ్లలో తెలుగులోవచ్చిన ఉత్తమకవితాసంపుటంగా గుర్తించి ఆంధ్రసాహిత్యఎకాడమీవారు 1972 ఫిబ్రవరి 12 న ఈ కవికి బహుమతి ప్రదానం చేశారు.

బాపురెడ్డి దాదాపు రెండు దశాబ్దాలుగా కవిత్వం రాస్తున్నాడు. హైదరాబాదులో జరిగిన ఎన్నో కవిసమ్మేళనాల్లో పాల్గొన్నాడు. ఆలిండియా రేడియోలో తరచుగా ఇతని రచనలు ప్రసారమవుతుంటై. ఇతని గేయనాటికలు కొన్ని ప్రదర్శితమయినై. హైదరాబాదులో బాపురెడ్డిని ఎరగని సాహిత్యాభిమానులు లేరు. నారాయణరెడ్డిఅంతబాగాకాక పద్యంగాని, గేయంకాని శ్రవణపేయంగా చదవగలడు. ప్రభుత్వంలో ఉన్నతోద్యోగంచేస్తూ కూడా కవితారచనను ఎక్కువగా చేస్తున్న సాహితీప్రియుడు బాపురెడ్డి. అందుకే కవి ప్రశంసనీయుడు.

బాపురెడ్డి దాశరథిలాగా పద్యం రాయగలడు. నారాయణరెడ్డిలాగా గేయమూ, వచనగేయమూ రాయగలడు. కావ్యం గానంచేసే అలవాటున్న కవి గనక ఈయన గేయాల్లో సంగీతగుణం ఎక్కువగా ఉంటుంది. ఈయన ప్రణయభావనను వదలలేదు. 'అభ్యుదయ' భావనను కాదనలేదు. పుస్తకం పుట్టుపూర్వోత్తరాలను గురించి చెప్తూ ఈ కవి తన కవితా పద్ధతిని గురించి ఇట్లా అన్నాడు: 'సౌందర్యతా సమతా సమన్వయతా దృష్టితో ప్రతి వస్తువును దర్శించి అనుభూతుల్ని రసాత్మకంగా పాడుకొంటూ అభ్యుదయోన్ముఖంగా సాగిపోవటం నా ధ్యేయం'. దాశరథి ఈ పుస్తకంలోనే చెప్పినట్టుగా 'బాపురెడ్డి ఇజాల బుజాలు తడవడు.' ఈ మాటల్ని, ఈ నాటికల్నీ, పరిశీలిస్తే బాపురెడ్డి కోరే అభ్యుదయం ప్రభుత్వంకోరే అభ్యుదయానికి ఏమంతభిన్నం కాదని మనం సులువుగానే గ్రహించవచ్చు. ఇతనిది 'ప్రణాళికా బద్ధమైన' అభ్యుదయం. ఈ కవిని చాలా మంది 'అభ్యుదయకవి' అనే అంటారు. అభ్యుదయమంటే ఏమిటి ? ఎవరు అభ్యుదయ కవులు అనే విషయంలో చాలామంది ప్రముఖుల్లో అభిప్రాయ భేదాలున్న ఈ తరుణంలో బాపురెడ్డి అభ్యుదయ తత్వ పరిశీలనవల్ల పెద్ద ప్రయోజనంలేదు.

గేయనాటికలు ఇటీవల చాలాకాలంగా చాలా మంది రాస్తున్నారు. శివశంకరశాస్త్రిగారి తరవాత దీన్ని బాగా సాధనచేసింది నారాయణరెడ్డిగారు. ఆయన ఆ ప్రక్రియను చాలాకాలం కిందటే వదిలేసినట్టుంది. దాన్ని మళ్లీ చేపట్టిన గౌరవం బాపు

రెడ్డి దేనని చెప్పవచ్చు. గేయనాటికలు రేడియో ప్రసారానికీ; కాలేజివార్షికోత్సవాల్లోనూ, సాంస్కృతిక కార్యక్రమాల్లోను ప్రదర్శించటానికి బాగుంటై. ఇది జనరంజకమైన ప్రక్రియ. బాపురెడ్డి గేయనాటికలుకూడా ప్రదర్శనానుకూలమైనవి.

శివశంకరశాస్త్రిగారి గేయనాటికల్లో మనుష్యపాత్రలు ఎక్కువ. నారాయణరెడ్డిగారి గేయ నాటికల్లో మనుష్యేతర పాత్రలే ఎక్కువ. ఒకవేళ మనుష్యపాత్రలున్నా అవి abstracted human roles. ఈ విషయంలో బాపురెడ్డి నారాయణరెడ్డిగారి మార్గానుసారి.

నేపథ్యం, బృందగానం లాంటివి ఈ నాటికల్లో ఎక్కువగా ఉన్నై. వీటిలో ఋతువులు, ప్రకృతి, కృష్ణానది, రాకెట్టు వంటివి మనుషుల్లాగే భావించబడినై. ఈ కవి గేయనాటికల్లో Personification తప్పనిసరిగా ఉంటుంది. దేశకాలాలు పాత్రధారు లవుతై. కాలాతీతంగా క్రీస్తుశకపు తొలిరోజుల నాటి నాగార్జునాచార్యులవారు నేటి ప్రజాశక్తితో మాట్లాడతారు. అందువల్ల ఈ నాటిక లన్నిటితోనూ అద్భుతరసానికి అనుకూలమైన విభావపుష్టి పుష్కలంగా ఉంది.

ఈ పుస్తకంలో 'ఋతురాగం' 'సాగరసంగీతం' 'భావిజీవులు' 'విజయ హేల' 'కల్యాణ యాత్ర' 'రాకెట్టు రాయబారం' అనే ఆరు నాటిక లున్నై. ఋతురాగంలో 'ఋతుకన్యలు' నేను గొప్పఅంటే నేను గొప్పఅని పోట్లాడుకుంటై. ఇంతలోనే 'కాల పురుషుడు' రావటంతోనే ఈ 'కన్య'లు ఆ 'పురుషుడి' చుట్టూ మూగుతారు. 'మీరంతా మంచివాళ్లేనర్రా' అని కాలపురుషుడు చెప్పగానే వాళ్లు ఒప్పేసుకుని ఆనందంతో బృందగానం చేస్తారు, సాగర సంగీతం నాగార్జున సాగరాన్ని దృష్టిలో పెట్టుకొని రాసిన నాటిక. ఇందులో నాగార్జునాచార్యులే స్వయంగావచ్చి ప్రాజెక్టు నిర్మాణానికి 'గ్రీన్ సిగ్నల్' ఇస్తారు. 'భావిజీవులు'లో దేశకాలాలు, పుట్టబోయే మానవ ప్రాణులు ప్రధానపాత్రలు. మొదటా, చివరా నేపథ్య కంఠం వినిపిస్తుంది. 'మీరు పుట్టవద్దు' అని దేశకాలాలు (? Space—Time Continuum) పుట్టబోయే ప్రాణుల్ని హెచ్చరిస్తుంది. ఇందులో కొంత హాస్యంకూడా జోడించబడింది. సంతాననిరోధమే ఈ నాటిక సందేశంఅయితే అది సరిగ్గా ప్రతిపాదితం కాలేదనే చెప్పాలి. 'విజయహేల'లో బృందగానంతో పాటు, కొన్నికంఠాలు, విజయదశమి పాత్రలు. విజయదశమి మాత ఆశీస్సులే భారత స్వాతంత్ర్యానికి కారణంగా ఇందులో నిరూపితం. 'కల్యాణయాత్ర'లో ప్రకృతి, ప్రేయసి, మాతృదేవి, కష్టజీవి, భాగ్యలక్ష్మి, దేశమాత, వంటిశక్తులు మానవుణ్ణి తమతమ స్వాధీనంలోకి లాగుతూ పోటీపడతై. చివరికి మానవుడు 'సర్వశక్తి సమన్వయమార్గాన్ని' తెలుసుకోటం ఇందులో ఇతివృత్తం. బహుశా బాపురెడ్డి 'సమన్వయ' దృష్టికి ఈ నాటిక ఉదాహరణం కావచ్చు. రాకెట్టు రాయబారంలో మానవుల తరఫున రాకెట్టు చంద్రకాంతతో రాయబారానికి వెళ్లినట్లుగా చిత్రితం.

ఈ కథావస్తువులనుబట్టి బాపురెడ్డి కవితా మార్గాన్ని గ్రహించవచ్చు. ఈ కవి దృష్టిలో 'అభ్యుదయం'అంటే ఏమిటోకూడా వీటినిబట్టి కొంత తెలుసుకోవచ్చు. బాపురెడ్డి 'డిక్షన' తాను ఎన్నుకున్న వస్తువుకు తగినట్టుగాఉంది. శబ్దాల అందాల మీద బాపురెడ్డికి మోజు ఎక్కువ. శబ్దసంయోజనలో వస్తువుకు అనుకూలమైన మాధుర్యగుణం ఉంది.

బాపురెడ్డి మాత్రాఛందస్సుల్లో అభ్యాసం చేశాడు. చదువుకోటానికి పాడుకోటానికి అందంగా ఉండేట్టు రాస్తాడు. సాధారణంగా 'లయ' తప్పడు. అవసరమైతే లయ తప్పించిఅయినా వచనగేయంలాగా నడిపించటానికీ వెనకాడడు. 'భావిజీవులు'లో 'దేశకాలాలు' అప్పుడప్పుడు వచనగేయంలో మాట్లాట్టం మనం గమనించవచ్చు. శ్రుతిపేయంగా ఉండటంకోసం బాపురెడ్డి యతులతోపాటు, అంత్యప్రాసల్నికూడా ఆశ్రయిస్తాడు. ముఖ్యంగా నాలుగు పాదాల మాత్రా పద్యంలో సరిపాదాల చివరల శబ్దసామ్యం పాటించటం ఈ కవికి ఒక అలవాటు.

మదీయ జీవన రాగంలో, కల
మయూర బాలలు నాట్యము చే
మదీయ క్రీడా జలపాతమ్ముల
యన్మాలలు పూచె

[ఋతురాగం]

ఇట్లాంటి ప్రాసలు తరచుగా వేస్తూపోవటం వల్ల గేయం హాయిగా సాగుతుంది. గేయంలో రెండు రెండు పాదాలమధ్య సమభారతని సాధించటానికి వీలున్న పద్ధతు లన్నిటినీ బాపురెడ్డి వాడుకుంటాడు. అంత్యప్రాస, మాత్రాగణసమత్వం మాత్రమే ఈ సమభారత్వం సాధించలేవు. భిన్నవాక్య, వాక్యాంశ, నిర్మాణంలో సమరూపతకూడా ఇందు కవసరం. పైన పేర్కొన్నచోట సరిపాదాంతాల్లో సమాపక క్రియా ప్రయోగం ఇందుకు దోహదం చేస్తున్నది. ఇవి రెండూ భూతకాలిక క్రియలు. ద్వ్యక్షర ధాతువులు. ధ్వనిసామ్యం (Phonetic Similarity) తో పాటు వ్యాకరణసామ్యం (Grammatical Similarity) కూడా పెంచుతూపోతే గేయానికి సమభారత ఇనుమడిస్తుంది, అందం చేకూరుతుంది.

భాగ్యదేవత శింజినీ శింజితాలలో
నా ఆకలి కేకలు వినబడునా?
కనులలో కదలాడు కలల వెన్నెలలో
నా వంగిన నడుమే కనబడునా ?

[కల్యాణయాత్ర]

ఇందులో బేసి పాదాలలోనూ, సరిపాదాల్లోనూ అంత్యప్రాస పాటించబడింది. సరిపాదాల్లో ఏక కాలికా లయిన సమాపక క్రియలున్నై. రెండు క్రియలూ ప్రశ్నార్థక శబ్దాంతాలు. రెండూ అకర్మక క్రియలు. రెండూ ద్వ్యక్షర ధాతువులమీద నిర్మించబడిన శబ్ద పల్లవ క్రియలు. రెండూ రెండు ప్రధానమైన ఇంద్రియ వ్యాపారాలను సూచిస్తున్నై. ఈ సామ్యాలు అంత్య ప్రాసవల్ల వచ్చే అందాన్ని గుణిస్తున్నై.

పాదాల ప్రారంభంలోకూడా వ్యాకరణ సామ్యం ద్వారా ఈ సమత్వాన్ని ఇంకా స్ఫురింపజేస్తాడీ కవి. ఉదాహరణకు :

నారాకే లోకాని
నవభావన నాకు

దీపావళి పర్వము.

[ఋతురాగం]

ఇందు మొదటి రెండుపాదాలు వాక్యం, చివరి రెండు పాదాలు ఇంకోవాక్యం. పాదాలతో పాటు బేసిపాదాల్లోకూడా అంత్యప్రాస లున్నై. ఇవికాక రెండువాక్యాల ఎత్తుగడలో ఏకత ఉంది. 'నారాకే' 'నాపాటే' అనే మాటలకు మాత్రా సమత్వంతోపాటు అక్షరసమత్వం (Syllabic Similarity) ఉంది. ఈ రెండూకూడా అస్మదర్థక సర్వనామం విశేషణంగాఉన్న నామబంధాలు. రెండూ అవధారణార్థక శబ్దాంతాలు. ఇన్ని విధాల సామ్యం ఉండటంవల్ల గేయంలో రెండు దళాలమధ్య సామ్యం అధికమయింది. ఇట్లా గేయాన్ని ఎన్ని రకాలుగా అందంగా మలచటానికి వీలుంటుందో అన్ని అవకాశా లనూ బాపురెడ్డి ఉపయోగించుకుంటాడు.

వాడుకలో ఉన్న త్రిశ్ర, చతురశ్ర, ఖండ, మిశ్ర గతులతో సంతృప్తిపడక బాపురెడ్డి వీటి మిశ్రమంతో కొత్తగతులను సృష్టించుకొని వాడుకున్నాడు కొన్ని ఉదాహరణలను గమనించండి.

వెన్నతో। నేనాకు। పెట్టిన। విద్యలు
ఎన్నటికి। విడిపోని। ఉన్నత। బుద్ధులు

ఇక్కడ ఖండచతురశ్రగతులు (5, 5, 4, 4 మాత్రలు) (ఋతురాగం) కలిసినై.

నేను| నడచిన| బాటల|లో
నేను| నిలచిన| చోటుల|లో (ఋతురాగం)

ఇక్కడ ముత్యాలసరంలో వాడే మిశ్రగతి, చతురశ్రగతులు (3, 4, 4, 2 మాత్రలు) కలిసిపోయినై.

మత్తిల్లి| పోయె| జగమంత| చూడు
మాయలో| పడ్డ్రవ| కృతికాంత| చూడు.
[ఋతురాగం]

ఇక్కడ ఖండ త్రిశ్రగతి (5, 3, 5, 3) మాత్రాగణాలు మిశ్రమంఅయి కొత్త గతి తయారయింది. దీన్ని 4, 4, 4, 4 పద్ధతిలోగూడ గణ విభజన చెయ్యొచ్చు. కాని ఇది కన్పృద్దిష్టంలాగు కనపడదు: ఇంకోపద్ధతి 2, 3. 3,. 2, 3, 3 మాత్రాగణాల విభజన. ఈ పద్ధతి మొదటి పాదానికి సరిపోతుందిగాని రెండోపాదానికి సరిపోదు. ఈ పద్ధతికి ఆధారం ఉచ్చారణలో ఊనికస్థానం. అంటే ...ుడు ఉచ్చారణ ఇట్లా ఉంటుంది.

మ త్తి'ల్లి పో'యె జగ మం'త చూ'డు.

ఉచ్చారణలో మూడుమాత్రల గణాద్యక్షరం మీద ఊనిక ఉంటుంది. ( ' ఊనిక — Stress —కు గుర్తు.) అప్పుడది త్రిశ్రగతితోనే ఒకభేదం అవుతుంది. ఏరకం నడకకైనా రెండోపాదంలో గతి తప్పింది. ఇక్కడ గణ విభజన సరిపోతుందిగాని గతి స్ఫురణలేదు అందుక్కారణం గణాద్యక్షరంమీద ఊనిక ఉండేట్లు పదాలను ఎన్నుకోక పోవటం.

పై పద్ధతి ప్రయోగం పఠాభి (పట్టాభి రామరెడ్డిగారు) చేశాడు.

'ఆనంద సరసి రాయంచ సరణి
విహరించుచుండి మోహాల బరణి
సంతోషితాత్మ స్వాధీన పతిక
రమణీయదివ్య లావణ్య లతిక'

ఇదీ పైన బాపురెడ్డిచేసిన ప్రయోగంలాంటిదే. ఇక్కడకూడా పైన చర్చించిన పద్ధతుల్లో గణవిభజన చెయ్యొచ్చు.

ఇట్లా ఛందస్సుల్లో బాపురెడ్డి చాలా ప్రయోగాలు బుద్ధి పూర్వకంగా చేసినట్టు కనిపిస్తున్నది. కాని కేవలం మాత్రాగణాలసంఖ్య సరిపోవటంకాక దానికి తగినట్టు పదప్రయోగం గురించికూడా బాపురెడ్డి జాగ్రత్తపడటం అవసరం. అట్లా జాగ్రత్త పడకపోతే లయ తప్పుతుంది. మాత్రాఛందస్సు ప్రయోజనమే దెబ్బతింటుంది.

ఈ పైనన్నీ టెక్నికల్ విషయాలు . కాని బాపురెడ్డి తన నాటికలవల్ల ఆ మాటకొస్తే తన కవిత్వంవల్ల ఆశిస్తున్న ప్రయోజనమేమిటి? కేవలం ప్రదర్శనకూ, రేడియో ప్రసారానికి అనుకూలమైన నాటికలు రాయటమే బాపురెడ్డి ఉద్దేశమయితే అది సాధించాడనటంలో సందేహం లేదు.

బాపురెడ్డి 20 ఏళ్ళనుంచి కవిత్వం రాస్తున్నాడు. ఛందో రహస్యాలు తెలిసిన ...డు. భాష ...నండున్నవాడు. అయితే ...ళ కాలం లోను ఒక ...మైన మార్గాన్ని ఎన్నుకోక పోవటం నివారకరం. ...గాల ...లు తడసక పోవటం అనేది అంతగర్వంగా చెప్పుకోదగిన అంశమేమీ కాదు. మార్గరాహిత్యాన్నే అది సూచిస్తున్నది. 'సౌందర్యతా, సమతా, సమన్వయతా' దృష్టి అని ముందు మాటల్లో చెప్పుకున్న మాటలు అర్థవంతమైనవి కావు. బాపురెడ్డి ఉద్దేశించింది 'ప్రశస్తైక జీవన సౌందర్యం'కాదని అయన నాటికలు సాక్ష్యం ఇస్తున్నై. 'సమన్వయం' దేటి మధ్య? దీటిని గురించి బాపురెడ్డికి స్పష్టమైన అవగాహన ఉన్నట్టు ఈ సమీక్షకుడికి ఆధారం దొరకటం లేదు.

'నేనెందుకు రాస్తున్నాను.' అనే ప్రశ్న ఒక్కసారి వేసుకుని, ఆత్మ విమర్శ చేసుకుని, ఇతరులు సస్నేహంగాచేసే విమర్శలను సహృదయంతో స్వీకరించి, ఒక స్పష్టమైన లక్ష్యాన్ని ఏర్పరుచుకొని రచన

సాగిస్తే బాపురెడ్డి ఇంకా ఎదగటానికి వీలుంది. సరి అయిన స్పష్టమైన ధ్యేయాన్ని మార్గాన్ని ఎన్నుకొని రచన సాగించినప్పుడే కవి మనిషిగా కవిగాకూడా ఉన్నతుడవుతాడు. బాపురెడ్డి అట్లాంటి ఉన్నతుడైన మనిషిగా కవిగా రూపొందాలని ఈ సమీక్షకుడికి గాఢమైన ఆకాంక్ష.

## 'జాతక కథలు'

(చతుర్థ సంపుటి)

[ఆంధ్రీకర్త : తల్లావఝ్ఝుల శివశంకరశాస్త్రి ప్రచురణ కర్తలు: ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, కళాభవనం, హైదరాబాదు—4, 1970, పేజీలు: 352, వెల: రూ. 3—50]

ప్రపంచకథావాఙ్మయంలోనే ప్రసిద్ధి కెక్కినవి జాతక కథలు. ఇవి ప్రాచీన భారతీయుల సంస్కృతిని, బౌద్ధధర్మసూక్ష్మాలను తెలిపే అనర్ఘరత్నాలు. పాళీ భాషనుంచి వీటిని అనువాదం చేసి శివశంకరశాస్త్రిగారు తెలుగు పాఠకులకు కానుకగా అందించారు.

ఈ కథలలో మూడు సంపుటాలు ఇదివరకే కేంద్రప్రభుత్వ సహాయంతో వెలువడినై. ఇది నాలుగోది. మూడు సంపుటాలతోనే ఆ సత్కార్యం ఆగిపోకుండా ఆంధ్రసాహిత్య అకాడమీవారు దీనిని చేపట్టి నాలుగు ఐదు సంపుటాలు ప్రకటించటానికి సంకల్పించటం ప్రశంసనీయమైన సంగతి.

ఈ చతుర్థసంపుటంలో చిన్నవీ పెద్దవీ మొత్తం 67 జాతక కథలున్నై. వర్తమానానికి సంబంధించిన ఒక సంఘటనను తీసుకొని, బుద్ధుడు ఇప్పటి సంఘటనలో ఉన్న వ్యక్తులు పూర్వజన్మలలో సైతం ఎట్లా నడచుకొన్నారో వివరించి, తద్వారా ధర్మోపదేశం చెయ్యటం ఇందులో పాటించిన సంవిధాన చాతురి. ఆ వృత్తాంతాలన్నీ జాతక కథలుగా సంగ్రథనం చేశారు. ఈ విధంగా ప్రతి జాతక కథలోనూ వర్తమానకథ అతీతకథ రెండూ ఉంటై.

నవ్యసాహిత్య పరిణామంలో ఒక ప్రధాన ఉద్యమానికి కులపతులు, బహుభాషా వేత్త ప్రసిద్ధ కవులు, పండితులు అయిన శివశంకర శాస్త్రిగారు దీని ఆంధ్రీకర్త అని తెలిసినతరవాత ఈ పుస్తకంలోని శైలీరమ్యతను గురించి పనిగట్టుకొని చెప్పక్కర్లేదు. శాస్త్రిగారిది చాలా సరళమైన శైలి. మూలంలోఉన్న గాథలను శాస్త్రిగారు గీతాలు, తేటగీతులు, మంజరీద్విపదలుగా తేట తెలుగులో రచించారు.

తెలుగుభాషలో వైవిధ్యం గల రచనలు రావాలనే వారికి ఈ గ్రంథం సంతృప్తినిస్తుంది. ప్రాచీన కథా వాఙ్మయాన్ని నేటి తెలుగువారికి సరళమైన శైలిలో అందించిన శాస్త్రిగారు అభినందనీయులు.

—చే. రా.

## షట్పది

[ఖండకావ్య సందోహము; కవయిత్రి : వసంత కుమారీదేవి; ప్రచురణ : కొండేపూడి హనుమంత రావు, సాహితీసమితి, బ్రాడీపేట, గుంటూరు—2; 96 పేజీలు: వెల రూ. 2]

భావకవిత్వానికి కాలదోషం పట్టి కొంతకాలమైంది. ఈ కాలంలోగూడ పురాణాలు, ప్రబంధాలూ, యితిహాసాలూ వ్రాసేవాళ్లున్నట్లే, ఔన్నత్యాన్ని పోగొట్టుకొని నామమాత్రంగా నిలిచిఉన్న భావకవిత్వాన్ని వెలయించేవాళ్లూవున్నారు. శ్రీ వసంత కుమారీదేవి వ్రాసిన 'షట్పది' అనే ఖండకావ్య సందోహము, భావకవితాశాఖలో ఆలస్యంగా పుట్టిన అపరిపక్వఫలంగా ఫలంగా చెప్పవచ్చు. 'వనమయూరి; చకోరి; కలువకన్నె; మూగకోయిల; చంపకము;నళిని; శంపాలత; మురళి; వాసకసజ్జిక' మొదలైన కవితా వస్తువులన్నీ భావకవులు ఒకప్పుడు గొప్పగాను, తరువాత తరువాత విసుగు పుట్టేలాగున భావుకతలేని మృదుపదాలకూర్పుతో వెలయించటం జరిగింది. కవితావస్తువు పాతదైనంత మాత్రాన స్వీకారయోగ్యం కాకపోదు. కాని దానిని నవ్యమైనదిగా

స్వతంత్రతత, రసాన్ని పుట్టించగల భావుకత లేకపోవటంతో వసంతకుమారీదేవిగారి కావ్యఖండికలు పాత మాటలతో, పాతపద్యాలతో, పాతవేఅయిన కావ్య వస్తువులతో హృదయాన్ని స్పందించేవిగా లేవు. 'ఈ సందోహములోని విషయములు వివిధ విధముల భగవత్పరములు' అని కవయిత్రి అంటున్నారు. కవయిత్రి 'మార్మిక' పద్ధతిలో భగవంతుని ప్రియునిగా ధ్యానించు 'రొమాంటిక్' కవుల ననుసరించారు. ప్రేయసీప్రియుల అనురాగంలో వీరు 'అమలిన శృంగార' ధోరణిని అనుసరించారు. 'వచ్చెదవన్న యాశయె గవాక్షము మూయగనీదు' అనే పద్యం చదువగానే వేదులవారి 'రావనుకొందుగాని అనురాగము ద్వారము మూయనీదు' అనేపద్యం జ్ఞాపకం వస్తుంది.

తెలుగులో మొదటినుండీ కవయిత్రులు తక్కువే. వచనరచనలో విరివిగా తమ రచనలను వెలువరిస్తున్న నేటి స్త్రీలు ఎందువలననో కవిత్వము నాటకరచన, విమర్శ మొదలైన ప్రక్రియలలో తగినంత అభినివేశాన్ని చూపించటంలేదు. నేటి సాహిత్య రంగంలో కవయిత్రులసంఖ్య అతి స్వల్పం. అందులోనూ ఛందోవ్యాకరణ, అలంకారాలు తెలిసి పద్యరచన చేయగలిగినవారు మరింత తక్కువ. ఊహాశక్తి స్వతంత్రముకాని కావ్యఖండికలు 'షట్పది'లో ఎక్కువే అయినా 'ఉపాలంభము; సౌభాగ్యము; సాగరఘోష; ప్రభాసము', మొదలైన కావ్యఖండికలు యింపు గొలిపేవిగా ఉన్నాయి. త్రినేత్రుడు పూవిలుకానిని తన కంటిమంటతో భస్మముచేయుట తగదని కవయిత్రి ఉపాలంభించినారు.

> అమరకల్యాణ కాంక్ష నాత్మార్పణమ్ము
> చేయవచ్చిన రతిపతి చేతులార
> పూలురువ్విన, కంటినిప్పులను జల్ల
> నీకె చెల్లెనుగాదె త్రిలోకనాథ !
> నిలువునన్ భస్మమయిపోయి గెలిచిబుధుల
> సన్నుతుల నందుకొన్నాడు చాల మరుడు
> సంచలనమొంది మన్మథు సంహరించి
> కొలది చేసితివేల నీ గొప్పతనము !'

అని ఉపాలంభించటం రమ్యంగా ఉన్నది. రాధాకృష్ణుల ప్రణయవర్ణనను 'సౌభాగ్యము' లో

> 'ఉపనిషద్గీతి రవములో నొదుగకుండ
> పరుగులిడి పారిపోయి గోపాలబాల
> రాగరంజిత రసమూర్తి రాధబాహు
> బంధముల పట్టుపడితివా! బాగుబాగు!'

అని వర్ణించటంకూడా అర్థవంతంగా ఆనందం కల్గించేదిగా ఉన్నది. 'సాగరఘోష'లోని అర్థాన్ని చంద్రునికి వివరించి

> 'పారమెరుగని యీ మహాప్రణయహృదయ
> భావ దర్పణ తలమున ప్రతిఫలించి
> జిలుగు రత్నాల కాంతుల జేర్చికొనుము
> రమ్యలావణ్య కౌముదీరాశి లోన'

అని ఉద్బోధించటం ఎంతో చక్కగా ఉన్నది. ప్రియవియోగాగ్ని తప్తయైన నాయిక

> 'సతతబాష్ప ప్రవాహ సుస్నాత యగుట
> తట్టుకొనజాల నెట్టులో తనువు, కాని
> తావకీన వియోగాగ్ని తప్తశిఖల
> దగ్ధమొందక నిలువగా దరమె దేవ !'

అని మొరపెట్టుకొనటం చదువరులను కదలించేదిగా ఉన్నది. కావ్యవస్తుస్వీకరణలోగాని, నిర్వహణలోగాని స్వతంత్రత, తగినంత భావుకతా కన్పించక పోయినప్పటికీ పద్యాలనడక కుంటువడక చదివించేదిగాను, శ్రావ్యమైన శబ్దములతో యింపు గొలిపేదిగాను ఉన్నది. సాహితీసమితి, భావకనిత్యమూ జీవించే ఉన్నాయని 'షట్పది' సహృదయుల కొకమాటు జ్ఞాపకం చేస్తున్నది.

## వై తరణి

[వచనగేయకావ్యం; కవి: శ్రీ టి. వి. సత్యనారాయణ; ప్రచురణగాని ప్రతులుదొరికే చోటుగాని తెలుపలేదు; 96 పేజీలు; వెల: రూ. 2-0-0]

అంతర్ముఖుడైన కవి 'జీవితమంటే ఏమిటి? ఎందుకు జీవిస్తున్నాను ? మరణం ఎలాఉంటుంది ? ఎందుకు విశ్వం ? ఎవరు కర్త ?' అనే ప్రశ్నలకు జవాబుగాచేసిన ఆలోచనలు వైతరణి కావ్యరూపం ధరించాయి. 1959—61 సంవత్సరాలలో తన మన సొక వహ్నికాసారంగా ఉన్న తరుణంలో కలిగిన 'ఆశలు, ఆనందాలు, భయాలు, ఆశ్చర్యాలు' యీ కావ్య రూపంలో అందించారు. శ్రీ టి. వి. సత్యనారాయణ సుప్రసిద్ధకవి విట్‌మన్‌పై వ్రాసిన బృహద్వ్యాసానికి పి. హెచ్. డి. పట్టం పొందినవారు. విట్‌మన్ కవి వచనకవితా ప్రభావం తనను ముగ్ధుణిచేయగా తన సొంత గొంతును వెతుక్కోవటానికి ప్రయత్నం చేస్తూ వీ రీ కావ్యఖండికలను వచనకవిత్వరూపంలో వెలయించారు. సత్య సౌందర్యాల రూపమే మనీ, ప్రజలకోసమే కవిత్వమనీ, వీరు నమ్ముతున్నారు. సత్యాన్వేషణకు కవిత్వమే మార్గంగా వీరు ఎంచు కొన్నారు.

'నేను పాపపంకిల కలుషితాత్ముడనై
రుధిరాశ్రుధారల నీశ్వరు పదాబ్జములపై
ప్రవింతు'

'నాకోర్కెలన్ని ఫలించెనేడు నేను విశ్వార్ధిలో
విమల రేణువునౌదు, వింతగీతము నౌదు'

'స్వప్న తంతులుచుట్టి వింత
బొమ్మలు చేయు మనసు—
గళమెత్తి పాడనా నేనీ
శివమెత్తి ఆడనా శివుడనై
శిలలు కరగేలాగు,
తరులు కదిలేలాగు గిరులు తిరిగేలాగు
చుక్కలన్నీ నా చుట్టు కూడి
గెంతేలాగు ఆడనా పాడనా'

'ఈ జీవిత ప్రవాహముననేదో యవ్వన పిపాస
ప్రకృతి నరనరమున కామము, కాంక్ష,
జీవిత జ్వాల'—

ఇటువంటి రచన చదువుతున్నప్పుడు కవి , తనభావాన్ని వెల్లడించటంలో స్వతం త్రతకోసం చేస్తున్న ప్రయత్నమే యీ 'వైతరణి' అని అనిపిస్తుంది. 'కాలవార్ధిలో గమ్యరహిత కాష్ఠ ములవలె కొట్టుకొనిపోవు నిస్సహాయులా మానవులు?' అని ప్రశ్నించటంలో చక్కని వైచిత్రి కన్పిస్తుంది. మానవుల సంబంధాల్ని ప్రవాహంలో తేలివచ్చే కట్టె లతో ఏనాడో వాల్మీకిమహర్షి పోల్చడం జరిగింది. కాని కట్టెలకొక గమ్యంలేనట్లే నేటి నాగరికతలోని మానవులకుకూడ గమ్యంలేదని చిత్రంగా వాపో యారు. 'కావ్య పానముజేసి కైపెక్కినానే' అనే బసవరాజు గీతాన్ని అనుసరించి 'నేను కైతపానము జేసి కైపెక్కినాను, నేను కళామయుడనై విశ్వ మును కలిశాను' అని చక్కని వ్యాఖ్యానాన్ని వెల యించారు.

'నేను దివ్య మహిమాన్విత శోభితుడను—
నేడు శోక ప్రభంజన తాడిత విషాదమూర్తిని'

అనే పాదములు చదువగానే కృష్ణశాస్త్రి గారు జ్ఞాపకంరాకుండ ఉండరు.

'నేడు నా గొంతు బరువయ్యె
విశ్వవ్యథితజీవాశ్రుస్రవంతులతో'

అని అనటంవలన కవి వ్యథితజీవుల పక్షం వహిస్తున్నారని అనిపించినా అది తాత్కాలికమే.

'నా జీవిత మొక స్వప్నం,
నా జీవిత మొక స్వర్గం
నేనొక చైతన్య జ్యోతి
నాలో అద్భుత చైతన్య జ్యోతులు
నేనొక దివ్య వీణానాదం'

అని సౌందర్యాన్వేషణలో పడిపోయి కలలు కన టంలో మునిగిపోతారు. వీరి రచన వచన కవిత్వ రూపంలో సాగినప్పటికీ కవిత్వంకంటె వచనమే ఎక్కువ. శుష్క వచనాన్నుండి కవిత్వాన్ని వేరుపఱచి సంరక్షించు కోవటానికి వీరింకా సాధనచెయ్యక తప్పదు. 'ఏ కవికైనా ప్రజాదరణ పొందటానికి కాలం పడు తుంది. అలాగే కవిత నానందించటానికి ప్రజలకీ కాలం పడుతుంది. రెండు వర్గాలవారు ఒకరినొకరు

ప్రేమతో చూసుకుంటే జాతికేమేలు' అని సత్యనారాయణగారు చెప్పినమాటలు ఆలోచింప దగినవి.

కొద్దిపాటి కవితాభావం కలిగిన పంక్తులతోనే కావ్యమంతా రసమయమై పోదు. మున్ముందు వీరు రసనిర్భరమైన కవిత్వాన్ని వెలువరించ గలరేమో వేచి చూడాలి.

## లా వ ణ్య

[నవలిక—కథలు: రచన: మాలతీ చందూర్! ప్రచురణ: యం. శేషాచలం అండ్ కో; మచిలీపట్నం-సికింద్రాబాద్—మద్రాస్; 160 పేజీలు; వెల. రూ. 2-0--0]

మాలతీచందూర్ 'ప్రమదావనం' శీర్షికద్వారా తెలుగు పాఠకులకు సుపరిచితులు. 'క్షణికం'; 'చంపకం—చెదపురుగులూ', యింకా కొన్ని కథలను రచించటం వలనగూడ రచయిత్రిగా పేరు తెచ్చుకొన్నవారు. నవలా పరిచయాలను వ్రాయటంలో గూడ మాలతీ చందూర్‌గారు ప్రసిద్ధి పొందినవారు. 'లావణ్య' అనే యీ పుస్తకంలో లావణ్య అనే నవలిక,— కోడికూత; బ్యాంకి ఉద్యోగిని; పరీక్షఅనే మరి మూడు కథలూ ఉన్నాయి.

'లావణ్య' అనే నవలిక మాలతీ చందూర్‌గారి వంటి చేయితిరిగిన రచయిత్రినుండి ఆశించ దగినది కాదు. సుందరరామయ్య అనే ధనవంతుడైన వ్యాపారికి 'లావణ్య' ఒక్కగా నొక్క కూతురు. చాల సినిమా కథలలోవలె ఆమె తన తండ్రిదగ్గర పనిచేసే ఉద్యోగి రాఘవేంద్రరావు సత్ప్రవర్తన చూసి ఆకర్షితురాలవుతుంది. అభిజాత్యం ప్రదర్శించబోయి భంగపడుతుంది. సినిమావాళ్లలాగే 'అపార్థం' చేసుకొన్న ఆమె తల్లివలన అతని ఉద్యోగం ఊడిపోతుంది. ఫలితంగా అతనికి కష్టాలు, లావణ్య అతణ్ని వెదుక్కుంటూ వచ్చి, జబ్బుపడి ఓదస్థితిలోఉన్న అతడికి సపర్యలు చేసి, అతడి అక్కను, ఆమె పిల్లలను మంచిచేసుకొని వాళ్ల కుటుంబానికి సన్నిహితురాలౌతుంది. లావణ్యతండ్రిని బ్రతిమలాడి అతనికి మళ్లీ ఉద్యోగమిప్పిస్తుంది. ఐతే అది మరొకచోట మరొకఉద్యోగం. రాఘవేంద్రరావు లావణ్య తనను ప్రేమిస్తున్నదని తెలుసుకొని ఆమెకు దూర దూరంగా మసలుకొంటాడు. ఆమె మరింత చేరువకావటానికి ప్రయత్నిస్తుంది. కాని రాఘవేంద్రరావు తన మేనగోడలు సుశీలను పెళ్లి చేసుకోవటానికి నిశ్చయించుకుంటాడు. మేనగోడలు వారి 'అమరప్రేమ'కోసం అర్థంలేని'ఆత్మత్యాగం' చేసినట్టుగా కుండ చక్కగా అర్థవంతంగా రాఘవేంద్రరావు స్తిమితంగా ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చినట్లుగా'ప్రేమకుమించిన కొన్ని విలువలుంటాయి. మా నాన్న చచ్చిపోతే అక్కా, బావా నన్ను పెంచారు. మా బావపోయాక, మా అక్క ఓ పూట మాడి, నా చేత . ఏ. పూర్తిచేయించింది. మా అక్క కుటుంబంపట్ల, సుశీలపట్ల నా కర్తవ్యం మీరు చెప్పే ప్రేమకంటే బలమైంది. సుందరరామయ్యగారు తలుచుకుంటే మా సుశీలకి చాలా పెద్దసంబంధం—నాకంటే మంచితెలివయినవాడిని, ప్రయోజకుడిని తేగలరు. కాని అటువంటిపనికి నేనెప్పుడూ వొప్పుకోను. సుశీలని నేను పెళ్లిచేసుకుంటాను. ఇక లావణ్య అంటారా—యింకో ఏడాది రెండేళ్లలో తనకి అన్నివిధాలా తగినవాణ్ణి చక్కగా చేసుకుంటుంది. నిజానికి నేను లావణ్యకు తగినవాణ్ణికాను.' అని తన స్థితిని వివరిస్తాడు. లావణ్య భగ్నప్రేమికురాలై తన బావతో కలిసి పై చదువులకని విదేశానికి వెళ్లిపోతుంది. ఇంత సాధారణమైన కథలో రాఘవేంద్రరావు నిర్ణయంలో మలుపుతప్ప విశేషమేమీలేదు. ఇంతచిన్నకథలో విశేషమేమీలేకుండానే 106 పేజీలకు సాగదియ్యటమూ ఏమీబాగులేదు. శైలి చెప్పుకోదగిన విధంగా మాలతీ చందూర్‌గారి విశిష్టతను ప్రదర్శించేదిగాలేదు.

ఉన్నతోద్యోగంచేస్తూ నాగరకతా వ్యామోహంలో త్రాగుడికి అలవాటుపడి సరిపడనివన్నీ తిని వాంతిచేసుకుంటూ మళ్లీ అదే త్రాగుడును, తిండినీ కొనసాగించే భర్తపైన విసిగిన ఇల్లాలు మార్పుకోసం తన బాల్యంలో మధురంగా గడిపిన ఒక పల్లెటూరుకు తన మేనత్తా, మామా వాళ్లున్నచోటికి వెడుతుంది. కాని అక్కడ చిత్రంగా పల్లెటూరు ఎటూగాని ఒక

వెగటునాగరకతకే అలవాటుపడి ఉండటాన్ని గమనించి 'అక్కడ భర్త సిగరెట్లనుంచి ఫారెన్‌లికర్‌కి పెరిగాడు. ఇక్కడ యీ ప్రశాంతమైనపల్లె ట్రాన్సిస్టర్లకీ, షుగర్‌ఫాక్టరీ దోమలకీ పెరిగింది. ఇది మనుషుల పెరుగుదలలో ఒకభాగం కాబోలు. పరిస్థితులతో తననుతాను సమన్వయించుకు బ్రతకడం నేర్చుకోవాలి' అనుకుంటుంది. 'కోడికూత'అనే పేరుగల యీ కథ చక్కగా వ్రాశారు మాలతీచందూర్‌గారు.

పెళ్లిలో కట్నాల పేచీవలన పెద్దల మూర్ఖత్వానికి బలియైపోయిన యిద్దరు యువతీ యువకులు తిరిగితిరిగి స్వయంకృషివలన చదువుకొని— ఒకే బ్యాంకులో ఉద్యోగులైన తరువాత హాయిగా కలుసుకుంటారు. ఈ కథలో యువకుడు తల్లిదండ్రుల్ని విడిచిపెట్టి ఒక క్రైస్తవ మిషనరీ సాహాయ్యం వలన ఎం. కాప్ చదువుకొని ఆయన దయచేతనే బ్యాంకు ఉద్యోగం సంపాదించుకుంటాడు. మిషనరీ ఉదారబుద్ధికి సంతోషించి క్రైస్తవమతం స్వీకరిస్తాడు. కమల అనే ఆ యువతికి మాత్రం అతడి సంగతి తెలియదుగాని అతనికెప్పటి కప్పుడామె సంగతులు తెలుస్తూనే ఉంటాయి. స్వయంశక్తితో ఆమె ఉద్యోగినిగా మారిన తరువాత తనను హృదయపూర్వకంగా స్వీకరించే అవకాశమత డామెకిస్తాడు. ఆమె అతని చిత్త సంస్కారానికి ఎంతో ఆనందించి అతను మతాంతరుడైనా, అతడి ముఖం ప్రమాదవశాత్తూ కాలి మచ్చిపడినా స్వీకరిస్తుంది. ఈ కథ చెప్పటంలో తగిన నేర్పరితనం రచయిత్రి చూపించలేదు. అతడన్నాళ్లువేచి ఉండడం కథకు అసహజ వాతావరణాన్నే కల్పిస్తున్నది.

'పరీక్ష' అనే కథలో దుర్భరమైన పరిస్థితులలో లేమితో బాధలుపడే సంసారంలో ఒక బాల వితంతువు తన నెవ్వరూ అర్థంచేసికొని ఆదరించక పోగా అందరూ తలకొక విధంగా తనను హింసించటానికి పూనుకోగా—తాను చదువుకొని ఉద్యోగం చేసుకోవాలనుకుంటుంది. కాని పరీక్ష తప్పటంతో ఆమె ఆశ అడుగంటిపోతుంది. దారిద్ర్యాన్ని పరిస్థితుల దౌర్భాగ్యాన్ని భరించలేని ఆమెకు ఒక మధ్య వయస్కుడు—ఇద్దరు ...లున్నవాడు ఆశ్రయు జూపితే అతడివెంట వెళ్లిపోతుంది ధైర్యంగా. అతడామెను పెళ్లి చేసుకోవటానికి నిశ్చయించుకుంటాడు. లోకం దృష్టిలో, ఆమె కుటుంబంలో అందరి దృష్టిలోనూ ఆమె లేచిపోయినది. కాని ఆమె జీవితపు పరీక్షలో నెగ్గి సుఖంగా ఒక ఒడ్డుకు చేరిందని రచయిత్రి చక్కగా సమర్థించారు.

'లావణ్య' నవలికకంటె కథలే మెరుగు. ఏమైనప్పటికీ యీ నవలికా, కథలూ అస్నీగూడా కాలక్షేపాన్ని కలిగిస్తాయేగాని చిరకాలం జ్ఞాపకముంచుకో గలిగినవిగా లేవు. మాలతీచందూర్‌గారి పేరు తెలిసి యీ రచనలు చదివిన వారు ఆమెనుండి ఉత్తమ రచనను ఆశించినట్లైతే నిరాశనే పొందుతారు.

— రామమోహన్‌రాయ్.

## Span of Life

(Govindu Srirama Murthy, Director, Bharat Artrology Institute, 7–2–28, New colony, Sreekakulam A. P. price Rs. 9. Postage extra.)

ఏదయినా ఒక ఆధారం అంటూ ఉంటేనే దానిమీద చిత్రరచన చెయ్యడానికి వీలుపడుతుంది. ఇలాగే అయుర్దాయం స్పష్టంగా తెలిసిన తరవాతే జాతకంలో మిగిలిన ఫలితాలు చెప్పడానికి వీలుపడుతుంది. అయితే ఏదయినా ఒక జాతకంలో ఆయురాయ నిర్ణయం చాలా క్లిష్టమయిన సమస్య. జాతకంలో ముందుగా బాలారిష్టాలు పరిశీలించాలి. ఆ పైన అల్ప మధ్య పూర్ణాయుర్యోగాలు నిర్ణయించుకోవాలి.

కనకనే గ్రంథకర్త ఈ ఆంగ్లగ్రంథంలో మొట్టమొదటగా బాలారిష్టయోగాలేకాక, అల్ప మధ్య పూర్ణాయుర్దాయయోగాలు, ఆ యోగభంగాలు వివరించారు. ఆ పైన ఆయుర్దాయ నిర్ణయానికి మన ప్రాచీను లవలంబించిన పద్ధతులన్నిక్రమక్రమంగా చర్చించారు. నక్షత్రాయుర్దాయ పద్ధతి, గ్రహదత్త పిండాయుర్దాయ పద్ధతి, జైమిని పద్ధతి, అష్టక

వర్గపద్ధతి, గోచారపద్ధ దశాంతార్దశా పద్ధతి, ఇలాగే ఇంకా కొన్ని ఇతర ప్రత్యేక యోగపద్ధతులు ప్రాచీన జ్యోతిర్వేత్తలు తమ గ్రంథాలలో విశేషంగా వివరించారు. ఈ పద్ధతు లన్నింటిని అనుసరించి, తారతమ్య నిర్ణయంచేసి పరిశీలించినప్పుడే ఖచ్చితంగా ఆయుర్దాయ నిర్ణయం సాధ్యపడుతుంది.

శ్రీ గోవిందు శ్రీరామమూర్తిగారు ఈ పుస్తకంలో ఈ పద్ధతులన్నీ చక్కగా క్రోడీకరించారు. ఆపైన కొన్నిజాతకాలు ఉదాహరించి తమ సిద్ధాంతాలు ఆయాజాతకాలలో సమన్వయించారు. అయితే నాడీ గ్రంథాలతో కొన్నికొన్ని సూత్రాలు ఆయా గ్రంథకర్తలు సూచించారుకాని, గ్రంథకర్త ఆ నాడీ సూత్రాల ఆ చర్చలవైపు పోలేదు.

అయినా ఈ పుస్తకం జాతకాలలో ఆయుర్దాయ నిర్ణయానికి సంబంధించిన పద్ధతుల కన్నింటికి ఒక చక్కని సంకలనం. ఇది జో విద్యార్థులకేకాక, విద్వాంసులకుకూడా ఉపయోగించే గ్రంథం.

శ్రీ గోవిందు శ్రీరామమూర్తిగారు భారతదేశంలోనేకాక, అమెరికాలో జ్యోతిశ్శాస్త్రవేత్తలలోకూడా సుప్రసిద్ధులు.

వీరి Span of Life చిరకాలానుభవంతో, లోతయిన శాస్త్రపరిశీలనతో రచించిన గ్రంథం.

## Essence of Sidereal Hindu Astrology

(Mrs. Dorothy Robertson; Publishers-Bharat Astrology Institute; New Colony, Sreekakulam P. O. A. P. Price Rs. 12. Post free.)

ఇది జాతకాలలో స్థిరగ్రహాలనుబట్టి ఫలితాలు వివరించే జ్యోతిష గ్రంథము. కనకనే దీనికి Sidereal అని పేరుపెట్టారు గ్రంథకర్త్రి. అంటే భారతీయ జ్యోతిషశాస్త్ర పద్ధతి వివరించే రచన అన్నమాట. ఈమె ఈ పుస్తకంలో ంగా పరాశర పద్ధతే అనుసరించారు. అంతేకాదు. జాతక పరిశీలనకు అత్యవసరమయిన ముఖ్య విషయాలన్నీ దీనిలో చక్కగా క్రోడీకరించారు.

ఇది భారతదేశంలోనే కాక, అమెరికాలోకూడా ప్రచురించారు గ్రంథకర్త్రి. అయితే ఇది అమెరికాలో జ్యోతిర్వేత్తలకు మాత్రమే పరాశరపద్ధతి వివరించే రచన అని భావించరాదు. ఆ పద్ధతి చక్కగా అవగాహన చేసుకోదలిచిన భారతీయ పాఠకులకుకూడా ఇది ఒక మంచి ప్రవేశికగా ఉపకరిస్తుంది.

శ్రీమతి డరోతీ రాబర్ సన్ భారతీయ జ్యోతిష విద్వాంసులు శ్రీ గోవిందు శ్రీ రామమూర్తిగారివద్ద పరాశర జ్యోతిషపద్ధతి అభ్యసించిన అమెరికా మహిళ. దీనిలో స్త్రీజాతకాధ్యాయంకూడా చేర్చారు రచయిత్రి.

ముఖ్య విషయాలెక్కడ ఒక్కటికూడా విడిచిపెట్టకుండా పరాశర జ్యోతిషపద్ధతిని సులభమయిన మార్గంలో ఆంగ్లంలో వివరించిన ఈ రచయిత్రి క్రోడీకరణ ప్రశంసనీయమయినది.

— పి. గణపతిశాస్త్రి.

## పారిజాతాలు

(కవితా సంకలనం)

(నెల్లుట్ల వెంకటేశ్వరరావు; దేవులపల్లి ప్రభాకరరావు; అప్పురుపల్లి మురళీధరరావు; పేజీలు : 72; వెల-రు 3—00 లు. ప్రతులకు: న్యూస్టేట్ ప్రింటర్స్; నారాయణగూడ, హైదరాబాద్.)

భావకవిత్వం ఒకానొకనాడు తెలుగు కవితారంగాన్ని ఉఱ్ఱూత లూగించింది. భావకవిత్వంలో ప్రణయకవిత్వానికి సంబంధించిన కవులంతా ఆత్మాశ్రయ కవితారీతిని ఆశ్రయించినవారె. ప్రణయ కవిత్వంలో విప్రలంభ శృంగారం ప్రథమస్థానం ఆక్రమించింది. విప్రలంభ శృంగారంలో విరహాన్ని, విషాదాన్ని

అత్యున్నతస్థాయిలో పలికించిన కవి కృష్ణశాస్త్రి. భావ కవిత్వంయొక్క ప్రభావం తెలుగు సాహిత్యంలో అంత రించిన పిమ్మట అభ్యుదయ కవితావికాసం జరిగింది. అభ్యుదయకవుల్లో ఒకడైన స్వర్గీయ శ్రీ తిలక్ వచన కవిత్వంలో భావకవిత్వాన్ని రాశాడు. తిలక్ తరువాత దరిదాపుగా ఆ మార్గం అంతరించిందనే చెప్పాలి. వచనకవితారూపంలోవచ్చిన భావకవితాసంకలనం ఇప్పటి ఈ పారిజాతాలు. ఈ ముగ్గురు కవులుకూడా పూర్వ భావకవులవలె విప్రలంభాన్నే ఆధారం చేసుకున్నారు. ముందు, ముచ్చట రాస్తూ ఆరుద్రగారు 'లోకంలో ఆకలి, చీకటి, దరిద్రం, దగా, మోసం, లేనివాళ్ల వెతలు, ఉన్నవాళ్ల దోపిడీ ఇలాంటి సామాజిక సత్యాలను ఉపేక్షించి సామ్యవాద విప్లవానికి కృషి చేయకుండా పలాయనప్రాయమైన ప్రేమగీతాలు పాడటం తప్పుకాదాఅని ఆక్షేపణ రావచ్చు. దానికి జవాబు ఒక్కటే! లోకంలో ప్రేమకూడా ఉందిగా? దాన్ని విస్మరించడం, తిరస్కరించడం, బహిష్కరించడం తప్పున్నరకాదా? గురజాడ వారసత్వంలో ప్రేమకూడా ఉంది'అని అంటున్నారు. గురజాడ వారసత్వంలో 'ప్రేమ'కూడా ఉన్నమాట నిజమేకాని అది 'పారిజాతాలో' కనిపించే ప్రేమమాత్రంకాదు. లోకంలో ప్రేమతోపాటు మతాలు, కులాలు, జాతులు కూడా ఉన్నాయి. వీటిని ఆధారంచేసుకుని ఎవరైనా వచన కవిత్వం రాస్తే—లోకంలో మతాలు, కులాలు, జాతులు ఉన్నాయి కాబట్టి వాటిని విస్మరించడం, తిరస్కరించడం, బహిష్కరించడం తప్పున్నరకాదా? అని మరో అభ్యుదయకవి 'ఆముఖంలో' ప్రశ్నించే అధికారం ఏర్పడుతుంది అరుద్రగారి మాటల్లో.

'ఇక చాలు
ఈ వలపు పూలు
ఈ వెన్నెల రాత్రులు
ఈ మధురమైన భావాలు
మెత్తనైన తీయని ఊహలు'

ఇలా భావకవిత వస్తువుని చక్కగా సూచించారు, నెల్లుట్ల వెంకటేశ్వర రావుగారు. ఉత్తరాలు అనే శీర్షికలో ఆయన కవితా శైలిని వ్యంజితం చేశారు.

మాటలలో నింపాను
మల్లెల మకరందాలను
అక్షరాలలో పొందుపరచాను
పారిజాతాల సౌరభాలను'

భావకవిత్వంలో వియోగ శృంగారం అతిముఖ్యమైనది కనుక ఈ కవికూడా వియోగ బాధనే వ్యక్తం చేశాడు.

'గతమే నాకు ప్రాణం పోస్తున్నది
నీ వలపే నన్నింకా బ్రతకనిస్తోంది
ఈ రాత్రి రాకాసినుండి
ఈ ఉదయం ఉప్పెననుండి'

భావకవు లందరిలాగే ఈయనకూడా 'విషం లాంటి నిజంకన్న అమృతంలాంటి భ్రమే నాకు కావాలంటూ పలాయన వాదాన్ని చిత్రగించారు. నీ కన్నుల కాంతులు—నీ అధరాల మధువులు—నీ కౌగిలి వెచ్చదనం మొదలైన పాతభావాలు కొత్తపద్ధతిలో చెప్పబడ్డాయి.

దేవులపల్లి ప్రభాకరరావుగారు

'ఉత్తరం వ్రాయడం మానకు
ఊరకే నా ప్రాణం తీయకు'

అని ప్రేయసిని హెచ్చరిస్తూ అంత్యప్రాసల్లో కవిత్వాన్ని గారడీవిద్యగా మార్చారు.

'నీ చేలాంచలము నాకు చేయూతగా
నీ జడకుచ్చులు సంజీవనీ స్రవంతులుగా
మంగళ కరమైన నీ గళసీమ
నా ఎడదకు బాసటగా...'

అంటూ తన జీవిత పరమార్థాన్ని ప్రేయసి చీరఅంచులకీ, జడకుచ్చులకీ ముడిపెట్టారు.

అవురుపల్లి మురళీధరరావుగారు మోహన రాగాలలో, శ్రావణ మేఘాలలో, వెన్నెల్లో, చుక్కల్లో, కలువపూలరెక్కల్లో తన ప్రేయసిని అన్వేషించు కుంటున్నారు.

'ఈ వెన్నెల మనల్ని
విడిచిపోవడం ఎందుకు ?
ఈ రేయి వృధాగా
గడిచిపోవడం ఎందుకు ?
కాలం ఎవరికొరకూ ఆగదు దేవి !
ప్రాయం చేజారితే ప్రణయంసాగదు దేవీ!'

మొదలైన పాదాల్లో వయస్సుకి, ప్రణయానికి గల సంబంధాన్ని వ్యక్తంచేశారు. భావకవులు అన్వేషించిన ఆధ్యాత్మిక అంతస్సౌందర్యానికి, భౌతిక వాంఛా పరిపూర్ణతకై పరితపించే ఈ ప్రణయానికి సామ్యం ఎక్కడాలేదు.

భావ కవిత్వాన్ని ఆశ్రయించి దీర్ఘ సమాస రచనా ధోరణిని వీరు వదలిపెట్టారు. సులభమైన శైలి, డొంక తిరుగుడు లేకుండా సూటిగా చెప్పడం వీరి ప్రత్యేకత.

— శ్రీ టి. ఎల్. కాంతారావు.

Printed and Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7 Thambu chetty Street Madras-1. Editor : S Sambhu Prasad

# భారతి

మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్



జూన్ 1972

సంపుటము : 49 : సంచిక · 6 :



వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## జూన్ 1972

# ఆనందవల్లి

## శ్రీ పోచిరాజు శేషగిరిరావు

కమకని వజ్రిమై హృదయ
కందరవాసిత సేవ్యమూర్తియై
అమలిన తారకా నిచయ
మంతట నీదగు వెల్గువెన్నెలల్
కొమరున సోక నా హృదయ
కుంజము మేల్మి పరిమళమ్ములన్
విమలతఁ జల్లు శాంత రమ
ణీయములై సువిలాసవీచులై.

నలిగిన డెందమందు నవనందనసుందర కల్పసూన రా
శులు జిగిదేఱుచుండగ—వచోమధురాలసుప్రసన్నతా
లలితము నౌను—ధర్మపరిలాలస పేశలరాగరంజనన్
మలగ గదే—మదీయ మణిమండప దీపికపై ప్రభాకరా!

పారితరుత్ఫుల్ల కుసుమ నికేతనమ్మ!
అవధి వీడిన కవనసేవధి నిజమ్మ!
పరువు లొలసిన యానంద వర్షధార!
క్రొత్తయనుబంధ మిది సాధకునకు సుమ్మ

వెన్నెలవాక దివ్యపృథివీగళితమ్మయి మర్త్యసీమపై
గ్రన్నన వ్రాలి భావమధురమ్ము మనోహరగంధబంధురా
సన్నత సుప్రసన్న పరిసర్పిత చందన చర్చితమ్మనై
అన్నగసార్వభౌమతనయాదరహాస వికస్వరమ్మనో.

ఒక మించుతళుకు మనమున
వికసించిన, తనువుతనువు పేశలమై, ని

భా ర

ర్వికలత హావణిల్లగ – రా
గ కదంబము వినిన యట్లు కనునీయనౌ్మ.

రాగస్పందన సుందరమ్ము రసధారావేగ సంరూఢమున్
వాగీశప్రీతిభామహత్వ మధుర వ్యాహార సందర్భమున్
జేగియ ప్రీతిమానధీరమును సుశ్రీకాంతి హేవాకమున్
భాగీరథ్యుపబృంహితమ్మనఘ శశ్వత్ ప్రాణకుంజమ్మనౌ.

సురపొన్న పూచినట్లుగ
విరిసిన మందారతరువు వితముగ – నీ సా
గర మెల్ల సుధాసేచన
పరిపూతత నందినట్లు వాసించునహో !

తరళాతితరళసుందరమణీమయ భూష
ణావళు లొసపరి శ్రీ వహింప
మధురాతిమధుర సంపన్మనోమందిర
ద్వారతోరణమాల పరిఢవిల్ల
లలితాతిలలిత మంజులపారిజాత మా
లా సుగంధశ్రీ విలాస మొలయ
కరుణాలవాల నిర్మల ఘనాఘనము పు
ష్కలముగా వర్షించి ప్రక్కకొదుగ

మన్మనోవీధి శాంతి సంపన్నమగుచు
ఒక సముల్లాసకలిక ప్రత్యూషవేళ
పులకలెత్తింప – లౌకికస్ఫూర్తి తలఁగి –
చిత్కళామయమయ్యె విచ్ఛిత్తిలేక.

కరుణ తొలుకాడు కన్నుల శాంతి వర్ష
ధార లురలెను : తన్మయత్వమ్ము నెనసె ;
అద్భుత రసపూరము మనస్సుమము ముంచి
యెత్తినట్లులు శ్రవణిల్లె యెసకమెసఁగ.

ఆ న ం ద వ

ప్రముఖ రమణీయ శిల్పాభిరామముగను
కావ్యరూపాన త్వన్మూర్తి గండరించి
చూపనెంచిన గీర్వాణ సుకవికోటి
కంతుపట్టగలేదు నే నెంతవాఁడ !

అమృత నిభృతమ్మమైన నీ యక్షియుగము
కౌముదీరంజనాంచిత గాత్రవల్లి
మెఱపు దొంతరగమి మిఱుమిట్లు గొలుప
లోవెలుఁగు నెమకుచుందు లోలోన నేను.

నాన్యతోదర్శనీయమై అవతరించి
దిగ్దిగంతరముల వెంట తెజ మెసఁగి
దళదళాంతరమందు సుందరత మెఱసి
కల్పకుంజము నాలోన కానుపించె.

క్రొమ్మెఱుగు ధాళధళ్యమ్ము గుస్తరించి
నవశరజ్జ్యోత్స్న నీరాజనమ్ము లీయ
 గురూత్తము చరణ సంసేవ సలుప
గీలు కొలిపితి భక్తిమై కేలుదోయి.

సరసపేశల రుచిర వచస్సు నిలువ,
లలితరోచిర్వితానముల్ లాస్యమాడ—
కుసుమ సుకుమారతలు గుమిగూడి యొదుగు
ప్రౌఢనిర్భర వాసనల్ రాగమొలుక.

మధుర పీయూషవర్ష సంభావ్య దివ్య
పరిమళోద్గార రుచిరమౌ వానజల్లు
డెందమున విరియించె ఆనందవల్లి :
మెల్పునన్ నిల్పె సుకవితా కల్పవల్లి :

లోని పొరలలో దీపించె హేలగాను
తళతళత్తళ లీను నుద్దామకాంతి :
అందముల దీవి : సుకవితా మందిరమ్ము :
ద్రాక్షపందిరి జీవితోద్యానమునకు.

# సరస్వతీ తత్త్వము

## "కుమార భారతి"

శిల్పమనగా మూర్తి. అంతర దర్శనమున ప్రతిబింబించిన నీ రూపభావమునకు రూపకల్పనయే మూర్తి. అనగా భావప్రతీక.

ఇట్టి శిల్పప్రతీకలు భారతీయ సంప్రదాయమున మూఁడున్నవి. ఒకటి మానవ–జాంతవరూపము. ఉదాహరణము—గణపతి.

రెండు స్త్రీ—లతారూపము, సాలభంజిక.

మూఁడు మిథునరూపము, దంపతులు.

రెండవది ప్రస్తుతాంశము.

ఒక దివ్యసుందరి నాట్యభంగిమలో వెనుకనున్న లత నానుకొని నిలుచుండుట భారతీయ శిల్ప ప్రపంచమున కన్నుపడినచోటనెల్ల కనిపించును. ఇదే సాలభంజికా విగ్రహము. సాలమనఁగా చెట్టు లేక లత. భంజికయనగా స్త్రీ. రెండును కలిపి సాలభంజిక. (Tree –Woman Configuration.)

ఈ శిల్ప సంప్రదాయమునకు అలంకారికార్థమొకటి; తాత్త్వికార్థ మొకటి. మొదటిది సౌందర్య దృష్టి. రెండవది సత్యదృష్టి. సత్యము నాధారముగా చేసికొని సౌందర్యము పుట్టుచున్నది. అనఁగా అలంకారిక శిల్ప సంప్రదాయమునకు, తాత్త్వికసత్య మాధారభూతము.

కేవల సౌందర్యదృష్టితో చూచినచో లతా—స్త్రీ—ఈ రెండు ద్రవ్యములును ఏకత్రసన్నివేశము పొంది, పరస్పరసౌందర్యపోషకములుగా కన్పించును. స్త్రీయొక్క శరీరమే సాల (లతా)కాండము. అందలి వంపులు స్త్రీ నాట్యభంగిమను పోషించును. లతలు బాహువులు; లతాంతము సుందరిముఖము; లతా కాండమునకు, లతలకుగల యతుకులే శరీరకాండమునకు, కరచరణాద్యవయవములకుగల సంధులు. ఇట్లు స్త్రీయే లతగా, లతయే స్త్రీగా రూపింపబడి ఒక మధురమైన భావమును ప్రేక్షకునియందు సృష్టించి; సౌందర్యలోకములలోనికి మనస్సును లాగికొనిపోవును. ఇచ్చట నుపమానోపమేయభావముకాక స్త్రీ తనూగత మధురసౌందర్యమును శిల్పి బహిర్గతముచేసి లతగా చెక్కెను. కావున లత భంజికకంటె అన్యద్రవ్యము కాదు. అది తత్తనూగతమైన నిర్గుణసౌందర్యము. ఇది ఆలంకారికదృష్టి.

ఈ స్త్రీ విశ్వజనీన సామాన్య స్త్రీత్వమూర్తి—దేవి.

ఇచ్చటి లత లోకమందలి లతకాదు. పైన చెప్పినట్లు స్త్రీ తనూగత సుకుమార సౌందర్య మధుర ప్రతీక. కావున ఆ స్త్రీ, ఆ లత, లౌకిక ద్రవ్య విశేషములుకావు. లతా వలయాదికము జన్మ పరంపరా ప్రతీకగా భారతీయశిల్పి గ్రహించినట్లు తత్కళావేత్త లభిప్రాయ పడుచున్నారు. ('బార్హూత్' స్తూపమున బుద్ధుని పూర్వజన్మములకు వ్యంజ్యకములుగ లతలు చెక్కబడినవి.) లత అల్లుకొనిపోవు స్వభావము కలది. దాని ధర్మమది. విశ్వమును చిలువలు పలువలుగా అల్లుకొనిపోవు స్వభావముకలదు. ఈ సమాన ధర్మమును పురస్కరించుకొని లత సంసార స్వరూపముగా దానికి నిదానము (Symbol) గా గ్రహింపఁబడుట—అంతరదర్శనము లేక ప్రతిభ. ఈ స్త్రీయే దేవి యున్నపుడు అది ప్రకృతి. ప్రకృతియే లత. కావున సాలభంజిక విశ్వస్వరూపము. ఇంతేకాక భారతీయ జీవితమం దొక విశేషమేమనగా, జీవుఁడు లేక మానవుఁడు ప్రకృతిలో తద్గత బహువిధ జీవరాసులతో సమరసముగా బ్రతుకుట. ఈ జీవిత సామరస్యము కళలందు ప్రతిబింబితమైన సత్యము. వృక్షజాలములతో మనుష్యజీవితమునకు సంబంధము

విహితమగుటయే సాలభంజికలో కనిపించును. లతా ప్రపంచమునకు మనుష్యప్రపంచమునకు గల సమన్వయమును సాలభంజికావిగ్రహము చెప్పుచున్నది. 'It is the symbolic of the calm of existance in a Paradise, when no Gods, had yet ordained the laws, by which this universe abides and strives, when "Three Ages before the Gods', the plants were created"—(Rigveda-10.97-1) అని 'STELLA KRAMARICH' గారు తమ "Indian Sculpture" అన్న గ్రంథమున వ్రాసిరి. కావున నీ దృష్టితో సాలము సృష్టికి పూర్వమందలి ఒకానొక ప్రశాంత స్థితికి ప్రతీకయగుచున్నది. దానినుండి సర్వము జనించుచున్నది.

సృష్ట్యారంభమున ఏకాకియైన ప్రజాపతికి భయము కలిగినదట. దేనివలన భయము కలిగినదని అతడు విచారింపగా—ఆ భయము పోయినది. కాని అతనికి ఆనందము లేదట. తోడున్నచో బాగుండునన్న వాంఛ కల్గినది. ఆ వాంఛనుండి స్త్రీ జన్మించినదట. ఇది స్థూలసృష్టికి పూర్వమున్న సూక్ష్మసృష్టికి సంబంధించిన విషయము. అనగా ప్రజాపతియొక్క మనస్సునందు పత్నీభావ ముదయించినది. ఇది భావదశ కాని ద్రవ్యదశకాదు.

ఇట్లు పతిపత్నీభావ ముదయించినది. సృష్టి సాగినది. ఇది బృహదారణ్యకమునందలి విషయము [1—4—2, 3.]

భయమునుండి వాంఛ, దానినుండి స్త్రీ జన్మించినది. ఇది ఆనందపారమార్థికదశ — స్త్రీ పుంసమ్మేళనము. కావున విగళితమైన ఆనందము, మరల తిరిగి ఎపుడు సిద్ధించినది?—ప్రకృతి పరమాత్మల సమ్మేళనమువలన; ఈ ప్రత్యభిజ్ఞయే లౌకిక, పారలౌకిక, సమన్వయసూత్రముగా భారతీయ శిల్పియొక్క తాత్త్వికదర్శనము. ఈ దర్శనమునుండియే సాలభంజిక సాక్షాత్కరించినది. సాలమనగా శివుడు. భంజిక దేవి. ('Gauri embracing Siva as the Madhavi creeper, clasps the young amra-tree with her bosom-like a cluster of blossoms.' (యోగవాశిష్ఠము — నిర్వాణ ప్రకరణము 18—3 చూ. INDIAN SCULPTURE). లత ఆ(శమపాలము ఏపుడు. ఈ సమ్మేళనమే ప్రసిద్ధి. అదే అర్ధనారీశ్వర తత్త్వము. విశ్వసమన్వయ నిదానము. నిధానము. కాగా సాలభంజిక అర్ధనారీశ్వరతత్త్వ సూత్రము నాధారముగాగొని, తాత్త్వికదర్శనముగల మహాశిల్పి, ఆలంకారికమూర్తిని కల్పించెను. ఆ రెండును భిన్నములుకావు—ఏకములు. సృష్టియొక్క అవ్యక్తదశయందలి స్త్రీ పుంభావప్రతీక.

ప్రజాపతి వాంఛాస్వరూపముగా స్త్రీభావ ముదయించెనుగదా! అనగా ప్రజాపతి మనోంతర్గతమైన ఆనందోత్తరంగిత వాంఛావధి స్త్రీ భావము. అతని మానసిక సూక్ష్మానందప్రతీక స్త్రీ. ఇందుచేత సాలభంజికాశిల్పమున వృక్షమున కానుకొని సుందరి నిల్చియున్నది. సాలకాండమువలె తనూయష్టి యున్నది. తీగ (వాంఛ)లవలె బాహువు లున్నవి. వాంఛా తరంగము (తీగలవంపు) లట్లు స్త్రీ భంగిమ లున్నవి. స్త్రీ శీర్షమున లత పుష్పించినది. లతాంతము ఆమెకు గొడుగుపట్టినది. ప్రజాపతి వాంఛాశేఖరము లతాంతమై స్త్రీ భావమునకు ఛత్రము పట్టినది. ఇప్పుడాతనికి తన ఏకాకితారూపభయభావము నశించినది. ద్వితీయ మావిర్భవించినది. దానియందాతడు సోలిపోయెను. తన్మయత్వము చెందెను. భయము అసహాయదశావిర్భూతము. ఆనందము తద్భిన్నము. ఇట్లు విగళితానందము ప్రత్యభిజ్ఞాతమై, స్త్రీ పుంభావరూపమున సమన్వయించి మహానందసుందరముగా సాక్షాత్కరించినది. ఇదే మహోత్కృష్ట సౌందర్య సీమాంచలమైన సాలభంజిక.

అది ప్రపంచమున మరియొకచో గన్పింపని భారతీయశిల్పియొక్క ప్రతిభా సమున్మిషితమైన మహోదాత్తశిల్పమూర్తి. తన్మూర్తికల్పన కాధారభూతమైన తాత్త్విక సంప్రదాయ సూత్ర మిట్టిదిగా Stella Kramarich గారు చెప్పినారు.

(ఈ స్త్రీ పుంభావరూపము ప్రజాపతి మనోగతముగ బృహదారణ్యకము చెప్పినదికదా!—అనగా దాంపత్యము అనాది సిద్ధమని యర్థము. మనస్తత్త్వశాస్త్రవేత్తలు ఇట్టివానినే 'Archetype' అందురు. కావున సాలభంజిక Archetype అన్నమాట. ఇందు

చేతనే శృంగార రసమునకు, భారతీయ కళాసంప్రదాయము, ఆలంకారిక సంప్రదాయము ప్రాధాన్య మిచ్చుట. దానియం దున్నంత సార్వజనీనత మరియొక రసమునందు లేకపోవుటకది Archetype అగుటయే.)

ముందువ్రాసిన ఆలంకారిక సంప్రదాయముల కీ తాత్త్వికసత్య మాధారము. లత యుపమానముగ, స్త్రీ యుపమేయముగా మిగిలినది. ఉపమానోపమేయసమ్మేళనమునుండికదా సౌందర్యము పుట్టుట. ఇందుచేతనే 'సౌందర్య మలంకారః' అని వామనాదులన్నారు. కేవలోపమానముగాని, కేవలోపమేయముగాని, దానంతట అది స్వయంసత్త కలది కాదు. కావుననే పద్మముగాని, నేత్రముగాని సౌందర్యస్ఫోరకముగుట లేదు. సమన్వయము సౌందర్య విధానము. అపుడది అలంకారము. సమ్మేళనము మిథున సంబంధము. ఉపమానోపమేయ సమ్మేళనమున జన్మించు మరియొక సూక్ష్మభావన యలంకారము—అనగా సౌందర్యము. మిథునావస్థయం దే మహానందము, అవ్యక్తమనోదశానమనుభూతమో అది సౌందర్యము. దాని కిద్దఱును కారణములు. కావున భిన్నద్రవ్య సమ్మేళనమున జనించు మరొక అవ్యక్త భావాస్వాదన మానందము--సౌందర్యము—అలంకారము—సంపూర్ణత—భయరాహిత్యము. ఇదే ప్రజాపతి కథలో వచ్చినది. ఇదే ఉపమానోపమేయ భావముగ సాహితీ శాస్త్రమునందు ప్రపంచితమైనది. కావున లత యుపమానము. ఇందుచే స్త్రీ పాదతాడన పరిరంభాదులచే లతలు పుష్పించునట్లు కవికులగురువుయొక్క సాహితీ పరమార్థ దర్శనము. ఇదియే దోహదక్రియగా తరువాతి కవిపరంపర యథేచ్ఛగా సొంత సొమ్మువలె వాడుకొన్నది.

సాలము శివుడు లేక పురుషుడుకదా! స్త్రీ భావ మావిష్కరించినంతనే ప్రజాపతి మనస్సు పుష్పించె (నవ్వె)నుగదా! తత్తాడనాదులు పురుషునకు రత్యుద్దీపన సామగ్రియే కావున శృంగార రస విషయమే. (కాళిదాసు శృంగార ప్రాధాన్యవాదియే.) భయమునుండి వాంఛపుట్టి దానినుండి స్త్రీ సమాగమముకల్గి ప్రజాపతి యానందింపగా సృష్టి సాగినట్లు చెప్పిన బృహదారణ్యకశ్రుతి విషయమే, కుమార సంభవకథగా మహాకవి కాళిదాసు వ్రాసినాఁడు. వాంఛ—కామము—భిన్నులుగానున్న శివపార్వతుల నేకముచేసెను. కుమారుఁడు పుట్టెను. బృహదారణ్యకమునం దదే ఘట్టమున ప్రజాపతి మనస్సునుండి పుట్టిన స్త్రీ, తనకు జన్మహేతువైన ఇతఁడు తన్నెక్కడకవయునో అని సకలజంతురూపములు ధరించి పరుగెత్తినట్లు, ప్రజాపతియు తదనుగుణముగా నాయా జంతురూపములు ధరించి యామెతోఁ గవయగా నాయాజంతు సృష్టి జరిగినట్లున్నది. ఇదే విషయము శివపార్వతుల వివాహానంతరము కాళిదాసు వర్ణించిన జంతుమిథున విహారముల కాధారము. కావున కాళిదాసు తాత్త్విక సత్యదర్శనమున్న మహాకవి. ఋషియైన శిల్పి-అనగా తాత్త్విక దర్శనమును సౌందర్యదర్శనమును ఆలంకారిక సంప్రదాయముగా-రూపొందించిన దివ్యప్రతిభావంతుడు. పైనఁ జూచిన సాలభంజిక తత్త్వార్థమే మహాకవి నోటినుండి అపూర్వవాణిగా ఇట్లావిర్భవించినది:

'అధరః కిసలయ రాగః,
కోమల విటపానుకారిణౌ బాహూ
కుసుమ మివ లోభనీయం
యౌవన మంగేషు సన్నద్ధం'

—శాకుంతలము. 1 అంకము.

11 వ శతాబ్దమునకు సంబంధించిన రాజస్థానమునందలి సాలభంజిక శిల్పమొకటి ఫిలిడల్ఫియా వస్తుప్రదర్శనశాలయందున్నది. దాని బొమ్మ 'Indian Sculpture' అన్న గ్రంథమున 38 వ చిత్రముగా ముద్రితమైనది. అందొక సుందరి భంగివామనోజ్ఞయై నిలుచున్నది. దక్షిణబాహువు తలమీదుగ నెడమవైపునకు వ్రాలినది. ఎడమచేయి పైకి ముడుచుకొన్నట్లున్నది (అది విరిగిపోయినది.) వామ భుజశిఖరము మీఁదుగ లత శీర్షముపైనుండి సంపుగానెత్తిన కుడిచేతి దండవరకు వచ్చినది. ఆ లతావలయము చివర పత్రములు కలవు. శీర్షముపై పుష్పము క్రిందికివ్రాలి కిరీటము పెట్టినది. ఆమె నిలిచియున్న తీరు—భంగిమ—లతాభంగిమ. ఎత్తిన చేయి వంపుపై తీగ వంపు వాలియున్నది. శీర్షమున జటామకుటము మున్నది. దానికి పైన పుష్పమకుటము ఛత్ర మట్లున్నది, శిఖరాకారమున జడముడి యుండగా దానిపై విప్పారిన పద్మమును బోర్లించినట్లుగ పద్మమున్నది. ఆకులు, ముదులు, పిందెలు, లత నలంకరింపగా, ఆభరణములు

సుందరి శరీరమును నలంకరించు కున్నవి. ఇట్లు స్త్రీ శరీర సౌందర్యమే లతగా, లతా సౌందర్యమే స్త్రీగా శిల్పింప బడినది. శిల్పి ఉపమానోపమేయ భావమును శిల్పించి స్పర్ధ కల్గించుటయేగాక, స్త్రీ తనూ సౌందర్యమును బయటకులాగి, ఆ నీరూప సౌందర్య గుణమును — భావమును లతగా గూపించినాఁడు. ఇందుచే స్త్రీకి కుడిప్రక్క వీణ నేటవాలుగ పెట్టెను. సౌందర్యము లతగా, శరీర, శారీర మనో మాధుర్యము బహిర్గతమై వీణాకృతిని దాల్చినదన్న మాట. ఇట్లు లత, వీణ, రెండును, స్త్రీ శరీర మందలి కొన్ని దివ్యగుణములకు ప్రతీకలు. ఈ మాధుర్యమే కాళిదాసుపై శ్లోకమందున్నది.

శకుంతల లతలకు చెలిమికత్తెలతో గలిసి నీరు వోయుచున్నది. అన్నియు పూలచెట్లు—తీఁగెలపాదులు. నడుమ లతాంగులు. కేసరవృక్షముచెంత శకుంతల, ఒకచేత కుండపట్టుకొని నిలుచున్నది. చూచిన చెలి అన్నది—'అక్కడే క్షణముండుము — కేసరవృక్షము లతా సనాథ మగున'ని. అప్పుడు చాటున నిల్చిన రాజు పై శ్లోకము నన్నాఁడు. ఈ వాతావరణ మంతయు Kramarisch — సాలభంజికను గూర్చి; "The woman and tree configuration in the consonance and intermingling of shapes, is an assurance of the felt correspondences, and unity of human life, that of vegetation. It is a symbolic of the calm of existence in Paradise —" అన్నట్లుగా నున్నది. ఎంత ఆశ్చర్యము!

అధరము కిసలయరాగము. కోమల లతలను బాహువు లనుకరించుచున్నవి. యౌవనము లతాంత మట్లు అంగములందు సన్నద్ధమైనది. అది స్పృహణీయముగా నున్నది. ఆమె యందము తీఁగె యంద ముతో స్పర్ధపడుచున్నది. రెండందములు పరస్పర ఘర్షణ మొందుచున్నవి. రాజు లతను జూచు చున్నాఁడు—శకుంతలనుఁ జూచుచున్నాఁడు. రెండు ఒకటే ; పరస్పర పోషకములుగ నున్నవి. వంగిన చిగురా కట్లధరమున్నది.రాజుదృష్టి భ్రమరమ ట్లటు నిటు భ్రమించుచున్నది. (శకుంతల మోముపై భ్రమరము వ్రాలినట్లు కవిచేసిన కల్పనవే రాజుదృష్టి కధి — మధుపము నిదానము (Symbol), దృష్టికి మధుపములకు నుపమానోపమేయభావమున్నదికదా!)

'కోమల విటపానుకారిణౌ —'

సాలభంజికా శిల్పమందువలె బాహువులు ఒకటి పైకి ముడువఁబడి, మరియొకటి శీర్షముపైనుండి వంపుతిరిగి యున్నదేమో! ఆమె నీటికుండను బుజముపై మోయుచున్నది కదా! లేక ఒకచేత కుండను ధరించి ; ఆచేయి క్రిందికి వ్రేలాడుచుండగా అవ్రేలుకు లాడుట అన్నధర్మమును విటపానుకారిణీ — అన్నాడేమో! లతా ధర్మమును, చలనమును, రెంటిని బాహువు లనుకరించు చున్నవని సందర్భము. సాల భంజికా శిల్పమునందు శీర్షముపై వంపుతిరిగి లత, పూలు, ఆకులు, చిగురు తొడిగినట్లు ఈమె తలపై కూడ, నట్లే యుండియుండును. అంతయు బొమ్మగా నున్నది. లత తొడిగిన పూవువలె యౌవ నము స్పృహణీయముగ నున్నది—సాలభంజికా శీర్ష ముపై లత పుష్పించినట్లు. ప్రజాపతికథలో స్త్రీ భావోదయము అయినపుడు కలిగిన మధుర భావన వలె యౌవనము స్పృహణీయముగ నున్నది. అనఁగా నెవనికి స్పృహణీయము ?—దుష్యంతునకు. నాటక మును ప్రారంభించుచునే సారధిచేత దుష్యంతు నని పించెను—నీవు యజ మృగమును వెన్నాడుచున్న సాక్షాత్ పినాకివలె నున్నావని. ఆ పినాకపాణి బృహదారణ్యకోప నిషత్తునందలి ప్రజాపతి.

సాలభంజికనుగూర్చి వివరించుచు Kramarisch గారు వ్రాసినమాట లివి—'The shape of the woman and that of the tree remain distinct. Yet they are assimilated to one another, the arms resembling the stem of the tree or creeper, the curves of the stem borrowed from those of the woman's body, both swaying in a co-ordi nated rythem, punctuated by shapes of flowers; garments, and ornaments, joints of the woman's body, and nodules of the plant. The woman leans against, touches, embraces, or climbs, the tree in a visual image frequently given verbal expression."

శకుంతల : (అగ్రతోఽవలోక్య)—'ఏషవాతేరిత పల్లవాంగుళీభిః త్వరయతీఽవ మాం కేసర వృక్షకః. యావ ద్యేనం సంభావయామి.'

అనఁగా,

ప్రియంవద అన్నది:—'సఖీ! శకుంతలే! అత్రైవతావత్ ముహూర్తం తిష్ఠ. యావత్ త్వయా ఉపగతయా లతాసనాథైవ అయం కేసరవృక్షకః ప్రతిభాతి (ఇక్కడ కేసరవృక్షమనఁగా సాలభంజికలోని సాలము—శిల్పుఁడు. ఇక్కడ దుష్యంతుడు.)

తరువాత రాజన్న పై శ్లోకము.

కేసరవృక్షముప్రక్క శకుంతల సాలభంజికవలెనున్నది. బహుశః దానిని స్పృశించుచున్నదేమో! 'సంభావయామి' అన్నదికదా! శకుంతలా తనూసౌందర్యము ముగ్ధమసృణమైన లతగా చెప్పబడినది. కావున మహాశిల్పి, మహాకవి, ఇద్దరు నొకే తాత్త్వికసత్యమును భిన్నమార్గముల ద్వారమున వ్యక్తీకరించుచున్నారు.

కాళిదాసు కావ్యనాటకములందు నాయికలను శిల్పసుందరీ భంగివా మనోజ్ఞలనుగా చిత్రించుట బహుధా చేయును. అనఁగా శిల్పసుందరి మనోజ్ఞ భంగిమలను వాగ్రూపమున వెల్వరించును.

'దీర్ఘాక్షం శరదిందు కాంతివదనం
బాహూనతావంసయోః'

'వామం సంధి స్తిమిత వలయం న్యస్య
హస్తం నితంబే'—మాళవిక, ప్రథమాంకము.

'తంవీక్ష్య వేపథుమతీ సరసాంగయష్టిః' —
కుమార, 5—85.

ఇట్లు నాట్యభంగిమలు వాగ్రూపమున వెలువడుట ఆయన కవిత్వమందే యున్నది.

ఆధునిక చిత్రకళా బ్రహ్మ 'పికాసో' 'La Femme Flewr' అన్న బొమ్మ నొకదానిని చిత్రించెను. అది తన భార్యయైన 'Francoise' అన్నామె చిత్రము. అది వాస్తవిక ప్రతికృతి (Portrait) కాదు. చిత్రకారున కామెయందు ఒకవిచిత్ర సౌందర్యము గోచరించెను. 'అది వాస్తవిక ప్రతిచిత్రమున కతీతమైనది', అని చిత్రకారు డభిప్రాయపడి పై బొమ్మగీసెను. అదియొక విచిత్రమైన బొమ్మ. అందు చంద్రబింబము, దానిని చుట్టుకొన్నట్లుగా ఆకులు, చంద్రబింబమునుండి క్రిందికొక లతాకాంతనువంటి గీత. చంద్రబింబము ముఖము. ఆకులు జుట్టు. లతాకాంతము తనూయష్టి. కాండమున కిరుప్రక్కల వ్యత్యస్తముగా వృత్తములు గీయబడినవి. అవి స్తనములట! దానికి క్రిందుగా రెండు హస్తములు. దక్షిణ వక్షోజముక్రింద అడ్డముగా, కొంచము ఏటవాలుగ, రెండుగీతలు, చివర వృత్తము. అందు సగము తరంగాకారరేఖ. ఇందు వృత్తము భూమి. తరంగాకారరేఖ సంద్రము. వృత్తమున సగము సముద్రముగా సూచన. మిగిలినది మెట్ట—కలిసి భూమండలము. వామస్తనముక్రిందనుండి దానికించుక ఏటవాలుగా ఒకరేఖ, అది వామహస్తము. దానిచివర త్రికోణము. ఆ హస్తమాకాశమును స్పృశించు చున్నదట. ఎగుడు దిగుడుగానున్న స్తనములచేత స్త్రీ యొక్క భంగిమ సూచిత మగుచున్నదట. ఒక భంగిమలో నిలుచున్న స్త్రీ సౌందర్యమిట్లు సూచింప బడినది. సాలభంజికలోవలె ఒకచేయి పైకెత్తి వంపుగా నిలిచినపుడు, ఎత్తిన చేతివైపున్న స్తనము పైకినిక్కుట సహజము. అపుడు స్తనవిన్యాసమున నెగుడు దిగుడులేగాక స్తనాకృతులందు పెద్ద, చిన్న తనములును స్ఫుటములుగిదా! ఒక భంగిమలో నున్నపుడు తనుయష్టిగూడ వంపుగా చిత్రితము కావలయును కదా! కాని లతాకాండము నిటారుగ నున్నది. దానికి సమాధానము చిత్రకారుడు చెప్పినది 'లోకమును కళ అనుసరింప నవసరములేదు' — అని. ఆకారము అనగా కాండము నిటారుగా నున్నను స్తనవ్యస్తత చేత భంగిమ వ్యంగ్యమగుచున్నదని 'పికాసో' సమాధానము. ఇది భారతీయ సంప్రదాయమే. కళ జగత్తు నెంతవర కనుసరించును?—కళ లోకమును కొంతవరకే యనుసరించి పిదప దానిని త్రోసిరాజన్న ఘట్టములు భారతీయ శిల్పసాహిత్యసంప్రదాయమునందు కొల్లలుగ నున్నవి.

'పికాసో' బొమ్మలో రెండు సూత్రము లున్నవి.

ఒకటి లతను స్త్రీగా చిత్రించుట, లేక వ్యతిరేకము.

రెండు—భంగిమయున్నను శరీరయష్టియందు తదనుగుణముగా వంపు సూచింపకుండుట.

(1) స్త్రీనట్లు చిత్రించినచో నేమైనది?—

చిత్రకారుడే చెప్పెను—'The portrait resolved itself in a symbolic floral pattern.'—(Life with Picaso - P. III). ఒకచేయి భూమండలమును, మరొకచేయి ఆకాశమును స్పృశించుచున్నదనియు, నాతని మాటయే. తన భార్యయందు తాను దర్శించిన సౌందర్యము విచిత్రమన్న దృష్టినుండి స్త్రీ సామాన్య సౌందర్యము లతాసౌందర్యమన్న భావసూత్రముగా మారి అక్కడనుండి బొమ్మ పుట్టినది. అప్పుడది విశ్వజనీన స్త్రీత్వధర్మమైన దివ్యసౌందర్యమై, భూనభోంతపరివ్యాప్తమైనదిగా సాక్షాత్కరించినది. 'పికాసో' భార్యతో నన్నాఁడు—

"We are all animals, and about three quarters of the human race look like animals, but yon are like a growing plant, and I 'd been wondering how could l get across the idea that you belong to the vegetable kingdom. rather than the animal. I have never felt impelled to portray any one else this way. It is strange, it it not?"—

—Life with Picaso (111, 112.)

నిజముగా నా భావము వచ్చుట ఎంత వింత? ఆ భావమెట్లు వచ్చినది?—అతనికి తెలియదట—ఆశ్చర్యము!

ఇది సర్వము భారతీయకళా సంప్రదాయమే కదా! సాలభంజికా విగ్రహ రచన కాధారమైన సూత్ర మిదియేకదా! (కాని నానాఁట పరిపాలించు కళాబహిరాకృతీ భేదముల ననుసరించి రూపకల్పనలందు మార్పులు వచ్చినను తదంతర్గత సూత్ర మొక్కటే. సంప్రదాయమనఁగా నదియే.)

(2) భంగిమ స్తనవిన్యాసము ననుసరించి వ్యంగ్యమైనది. కాని తదనుగుణముగ శరీర విన్యాసము మారలేదు. అక్కరలేదని చిత్రకారుని వాదము. ఇట్టిపద్ధతి ప్రకృతిని తలదన్నిన పద్ధతి. సహజతకు వ్యతిరేకత. అనగా 'వైచిత్రి'—భారతీయ కళా సంప్రదాయములందు చాలచోట్ల నున్నదే. ఉదాహరణమునకు 'పత్తడకల్' విరూపాక్షాలయ మందరి నందిమండపమున, నొక స్త్రీ విగ్రహమున్నది. ఆ మూర్తి వామస్తనము చిన్నది—కుడిది పెద్దది. (ఈ భేదము స్వల్పము). విన్యాసమున హెచ్చుతగ్గు లున్నవి. వామము పైకుండఁగా దక్షిణము క్రిందికున్నది. ఈ హెచ్చుతగ్గులచే నొకచేయి పైకి లేచియుండవలెనన్న విషయము సూచిత మగుచున్నది. అప్పుడు స్కంధ భాగమున తదనుగుణముగ మార్పుండవలెను. అట్లు చెక్కబడలేదు. మామూలుగనే యున్నది. దక్షిణ వక్షోజమునకు క్రిందిభాగమున, పార్శ్వమున రెండు ముడుతలున్నవి. కుడిభాగము కొంచము క్రిందికి వంగినట్లు సూచిత మగుచున్నది. కాని స్కంధము ఎడమది పైకి, కుడిది క్రిందికి వంగినట్లు, స్కంధ భాగమున సూచన ఏమియులేదు. అనగా కన్పించుట లేదు. అనఁగా స్తనములే భంగిమావ్యంజ్యకములు. శరీరము దానంతట నదట్లే యుండఁగ ఒకానొక యువయువ విన్యాస మాత్రముననే భంగిమ స్ఫురింపఁ జేయఁబడుచున్నది. ఇదే 'పికాసో' అన్నది—"The form exists at its own right-but it is not the gesture that determines the form".

Life with Picaco (P. 111)

Form ని gesture నియమింప జాలదు. ఇది ఇదే. అది అదే. ఇది అసహజమే కావచ్చు. కాని విచిత్రమైనది. కాక అభినయ విద్యా పరంగతులైన నాట్య విద్యాశీలులు ముఖాద్యంగములం దొకదానిని ఇతరములు కదలకే చలింపజేయుచు భావప్రకటనము చేయుట ఉన్నదికదా ! 'భంగిమ' యనినంతనే అది నాట్య విద్యావిషయము. ఇది భారతీయ సంప్రదాయము కాని పాశ్చాత్య సంప్రదాయము కాదు. ఈ భారతీయ సంప్రదాయమును 'పికాసో—ఎట్లు పుణికి పుచ్చుకొనె నన్నది ప్రశ్న. ("In the western view of art, Nature and Art are considerd opposites."—INDIAN SCULPTURE.) ప్రాచ్యకళా సంప్రదాయము పై రెంటికి సమన్వయము.

ఏసూత్రము భారతీయ శిల్పి—కవులయందు వ్యక్తమైనదో, పరదేశీయుడైన 'పికాసో'లోకూడ నదే సూత్రము విచిత్రముగనట్లు వ్యక్తమైనది. (మానవ జాంతవమూర్తి కేవల మొకే భారతీయకళా సంప్రదాయమునకు చెందినదికాదు. పాశ్చాత్యకళలో అది ఈనాటికిని 'పికాసో'లో కన్పించుచునేయున్నది. అతఁడు చిత్రించిన 'Mino taurs' జాంతవమానవ మూర్తులే యని Kramarisch గారు వ్రాసిరి, కాని సాలభంజిక

సూత్రముగూడ 'పికాసో'లో పై రీతిగా వ్యక్తమైనది వారు చెప్పలేదు.

ఆ సూత్రమేది?—అదే ప్రతిభ—లేక దర్శనము. అది ఆర్షవ -ఋషిధర్మము. విశ్వవ్యాప్తమైన మహాశక్తి తద్వ్యక్తీకరణమున కనుగుణమైన మనస్సునుండి అది దేశకాలాబద్ధమై బహిర్గతమగుచున్నది. వాల్మీకి నోటినుండి అప్రయత్నముగా వెల్వడిన 'మా నిషాద' శ్లోకమున—సరస్వతి—కవికి తెలియకయే తననుండి వ్యక్తమైనది. 'కిమిదం వ్యాహృతం మయా!' (ఇదేమి నేనిట్లన్నాను?). ఇంత అందముగా శ్లోకమెట్లు పుట్టినది—అన్న వాల్మీకియేకదా 'మానిషాద!' అన్నది. మరిదేమి?—కావున అది సరస్వతీ తత్త్వము. దివ్యప్రతిభ. 'కిమిదం వ్యాహృతంమయా!'—I had been wondering, how I could get across the idea!—it is strange; is it not?" అన్న 'పికాసో' మాటలును ఒకటేకదా!

వాల్మీకి తపస్వి కావున సరస్వతియని బ్రహ్మదర్శనమున గ్రహించెను. ఇంతే భేదము. దేశకాలవ్యక్తుల కతీతమైన సరస్వతీరూపమైన ప్రతిభనుండి పుట్టినకళ దేశకాలభేదములు దాటిపోవుచున్నది. ఈ విషయము విశ్వజనీనముకానిచో పై రీతిగా జరుగుటకు వీలులేదు. పౌరాణిక కథలు (mythological stories) అన్నిదేశములం దొకేరీతిగా కన్పట్టుచున్నవి. కారణమేమి?

"We must therefore assume that they (myths) correspond to certain collective (and not personal) structural elements of the human phyche, in general".

—Introduction to a Science of Mythology-C. G. Jung.

ఈ Collctive uncousciousness నుండి జన్మించినది కావున కళలందును సాజాత్యత గోచరించుచున్నది. శిల్పి అనగా కళాకారుఁడు, ద్రష్ట; అనగా ఋషి. అతఁడు దర్శించునేగాని ఆలోచించి సాధించడు. JUNG గారు అదే గ్రంథమున ఒకానొకచో నన్నారు.

"The primitive does not think consciously, but that thoughts appear. The primitive can-not assert that he thinks, it is rather that some thing thinks in him.' ఇందుకే వాల్మీకి పికాసోలు ఆట్లాశ్చర్యపడుట.

ఇందుకే 'సహృదయ చక్రవర్తి' ఆనందవర్ధనుఁడు ఈ మహావిషయమునిట్లు సూత్రించెను.

'సరస్వతీ స్వాదు తదర్థ వస్తు
నిష్యందమానా మహతాం కవీనామ్
అలోక సామాన్య మభివ్యనక్తి
పరిస్ఫురంతం ప్రతిభా విశేషం'

—ధ్వన్యా—1— 6.

లౌకిక, మనోగోచరము కాని వస్తుతత్త్వము లను గోచరింపఁజేయు ప్రతిభ సరస్వతీ ప్రసాద దత్తమై కవి మనస్సున పరిస్ఫురించుచున్నది. దానిచే తత్త్వ ముద్యోతితమై బహిర్గమించుచున్నది.

దీనికి హేతువు ఏకాగ్రత. ధ్యానావస్థ. లౌకిక స్పృహవీడిన లక్షణము. ధ్యేయవస్తువునందు మనస్సు లగ్నమగుట. ఇదీ సమాధ్యవస్థ. అది లేనిదే కళలేదు!

"—One of the most important elements of plastic and pictorial art is the natural intuition, or vision, by which any thing is conceived and intuited in the mind, with the emotive personality of the artist. This intuition is of the nature of 'dhyana' or meditation, in which the artist melts his personality in the emotive vision or intution, of the object of his representation, which may be a spiritual idea or a physical form."

(Fundamentals of Indian Art-Page 18, Surendranath Das Gupta.)

పికాసో చిత్రకారునకును; ఈ సమాధ్యవస్థ చిత్ర రచనా సమయమున నున్న ట్లతని ఈ క్రింది వాక్యములే ధ్రువపరచుచున్నవి.

"While I work, I leave my body out side the door, the way Moslems take of their shoes, before entering the mosque"—

Life with Picaso-P. 110.

ఈ దశయందే విచిత్రార్థ స్ఫోరకమైన కళా సరస్వతి సాక్షాత్కరించుచున్నది.

---

(సాలభంజిక—శిల్పరచన కాధారమైన తాత్త్విక విషయము Kramarisch గారు చెప్పినదే. 'పికాసో' బొమ్మనుగూర్చిన వివరణ మతడు చేసినదే.)

# బెనిఫిట్ ఆఫ్ ది డౌట్

## శ్రీ పణతుల రామచంద్రయ్య

జాలిలేని మేఘంతో పెనగులాడే నక్షత్రపు అంచులపై
చచ్చిపోతున్న స్వప్నాలన్నీ ఆశాసంకేతాలనుకొని,
హేతు కైతల్యాన్ని మరచిపోయి, భ్రమిస్తున్నాడతడు—
ఈ మారు సమీపించే నగరం చైతన్యాన్ని ప్రసవిస్తుందని.

మూడోక్లాసు పెట్టె కిటికీ అంచునజారే మంచుబొట్టులో తనరూపం
మార్తికట్టి మొన్నటి ప్రశ్నల ముడి విప్పుతుందనుకుంటున్నాడు—
వెనక్కి పరుగెత్తే కొండలూ, చెట్లూ నిన్నటి నిశాకాసారంలోనికి
తను విప్పి పారేసిన మలిన వస్త్రాల్లాంటి వనుకుంటున్నాడు.

చీకటి మరకలంటిన హృదయాన్ని
ఏకాంతపు కండువాతో తుడుస్తూ

ఒకమూల శూన్యంలోనికి ముడుచుకుంటున్న అతణ్ని
ఊరిస్తూ ఒక వెచ్చనిగాలి తరంగంవచ్చి స్పృశిస్తే,
టెలిగ్రాఫ్ స్తంభంపక్కన పవళించిన నీటిగుంటమోహంలో
వెలయాలి నవ్వులాంటి తెల్లదనం వలయాల్ని సృష్టిస్తే,
ఆలోచిస్తాడు సగంసగం విరిగిన క్షణాలపై విశ్రమించి
ఆగామి స్నేహసంగీత సిక్త నవనవోషశ్రీలను గురించి.

కనిపించే దేమో ఏమీలేనితనం—
గమ్యానికి అతడద్దిన తీవ్ర తీవ్ర వాంఛా చందనం
కాలంధాటికి నిలవటం సందేహాస్పదం.

ఇప్పటిదాకా అంతు పట్టలేదుకాని
ఈ ప్రయాణం ఓ సొగసైన పోమ్నాంబులిజం
ఇప్పటిదాకా ఆత్మను తోసుకొస్తున్న ఉద్రేకం
హృదయంలో దాగివున్న ఒకానొక జ్వరం.

అయినా ఒక్కొక్కసారి వెనక్కి పరుగెత్తే చెట్లమీద
అందంగా రెక్కలార్చే పక్షులు కువ కువ లాడినప్పుడు,
అవి అతడి గుర్తింపుకోసం తహతహ లాడినప్పుడు,
అంతటా ఆవరించిన జడత్వం పగిలిపోయి
అతడికి కొన్నేళ్లక్రితం ఆశలు కల్పించిన మైదానాలూ, నీలనేత్రాలు,
స్మృత్యగ్ని కణాలై హసిస్తాయి
జీవితంలో మెరుపు లున్నాయని నమ్మిస్తాయి.
ఏమోమరి - ఆ నమ్మకం నిజం కావచ్చు
సహస్రాధిక నక్షత్రాలతో కలిసిపాడని స్నేహసంగీతాన్ని తాకి
జాలిలేని మేఘం పశ్చాత్తాపాన్ని కురిసిన క్షణంలో
ఆ ప్రయాణం శుభాంతమే కావచ్చు —
అతడి జ్వరం నయం కావచ్చు.



# శ్రీ అరవింద విరచిత
# 'సావిత్రి - ఒక గాథ, ఒక ప్రతీక'

## శ్రీ వి. వి. యస్. రామదాసు

ఇంగ్లీషుభాష ఆంగ్లేయులు భారతీయులకిచ్చిన కానుక అనుకుంటే శ్రీ అరవింద విరచిత భాగవత జీవనము 'ది లైఫ్ డివైన్' అనే ఆధ్యాత్మిక గ్రంథమూ, సావిత్రి అనే మహా కావ్యమూ భారతీయులు ఆంగ్లేయులకూ వారి భాషద్వారా ప్రపంచానికి యిచ్చిన గొప్ప బహుమానా లనడంలో సందేహం లేదు.

ఇంగ్లీషుభాష ఖండ ఖండాంతరములలో వ్యాపించినందువల్ల ఆయా దేశాల కవులు ఇంగ్లీషులో రచనలుచేసి దానికి బలాన్నీ వైవిధ్యాన్నీ చేకూర్చారు. కాగా ఇంగ్లీషుకు ఆధ్యాత్మికపుష్టిని సమకూర్చిన ఖ్యాతి శ్రీ అరవిందులకే చెందుతుంది.

ఎ. ఇ. జార్జి రస్సెల్ అనే ఐరిష్‌కవి దిలీప్ కుమార్ రాయ్‌గారికి వ్రాసిన ఉత్తరంలో ఇంగ్లీషు భాషకు ఆధ్యాత్మికభావాలను వ్యక్తపరచడానికి తగిన సరంజామా లేదని వ్రాశారు. కాని శ్రీ అరవిందులు ఆ అభిప్రాయాన్ని వ్యతిరేకించి క్రొత్తభావాలకు అనుగుణంగా ఆంగ్లభాషను మలచవచ్చునని వ్రాశారు. వ్రాయడమే కాక అది ఒక సవాలుగా తీసుకుని ఆధ్యాత్మిక భావాలను ఆంగ్లంలో వ్యక్తంచేసి దివ్యజీవనం అనే గ్రంథంలోనూ సావిత్రి అనే మహావిశ్వకావ్యంలోనూ అద్భుతంగా రుజువు చేశారు.

యోగిగా, తాత్వికునిగా, సాంఘికమేధావిగా, రాజకీయవేత్తగా శ్రీ అరవిందులకున్న ప్రజ్ఞ బృహత్తరమే అయినా కవిగా వారికున్న అసమాన ప్రాభవము మనకు ప్రస్తుతాంశము.

శ్రీ అరవిందులు 1872 వ సంవత్సరం ఆగస్టు 15 వ తేదీన కలకత్తాలో జన్మించారు. వారి తండ్రిపేరు కృష్ణధనఘోషు. తల్లిపేరు స్వర్ణలతాఘోషు.

వారిని అజాతీయం చేసేపని వారి అయిదవ ఏటనే జరిగింది. 'నాటు' భాష, 'నాటు అలవాట్లు' వీలయినంతవరకు వారికి అంటకుండా చేయాలని కేవలం ఇంగ్లీషువాతావరణంలో పెంచాలనే అభిప్రాయంతో వారి అయిదవ ఏట డార్జిలింగులోని ఒక కాన్వెంటుకు పంపారు వారి తండ్రిగారు. ఇంటిదగ్గర కూడా ఇంగ్లీషు నర్సును పెట్టారు. 1879 నుంచి 1892 వరకు శ్రీ అరవిందులు ఇంగ్లండులో విద్యాభ్యాసం చేశారు. ప్రతి అంశంలోనూ ప్రథమశ్రేణిలో కృతార్థులయ్యారు.

ఇంగ్లండులో వారు ఇంగ్లీషు, లాటిన్, గ్రీకు భాషలలో అపారపాండిత్యమును సంపాదించారు. ఫ్రెంచి, జర్మను, ఇటాలియను, స్పానిషు భాషలలో పరిచయం సంపాదించారు. పదమూడవ ఏటనే ఇంగ్లీషులో కవిత్వం వ్రాయడం ప్రారంభించారు.

ఈ విధముగా అజాతీయం చేయాలనే అభిప్రాయం వారి తండ్రిగారి కున్నప్పటికీ వారు 1893వ సంవత్సరంలో అనగా తమ 21 వ సంవత్సరంలో భారతభూమి మీద అడుగు పెట్టగానే దైవ కృప వల్ల పునర్జాతీయం చేసే లీల ప్రారంభం అయింది. ఆ క్షణంలో ఎంతో ప్రశాంతత వారిని ఆవరించి, తరువాత ఎన్నో నెలలు చెదరకుండా నిలిచింది. కాశ్మీరులో నడుస్తూండగా వారికి దివ్యానుభవం కలిగింది. నర్మదా నదీతీరాన వారికి మహాకాళిశక్తి అనుభూతి

కలిగింది. రాజకీయ కారణాలవల్ల వారు అలీపూర్ జైలులో నిర్బంధించబడినప్పుడు అక్కడ వారికి నారాయణ దర్శనం లభించింది. సర్వం నారాయణ మయంగా సాక్షాత్కారం అయింది. రాజకీయాలలో ముమ్మరంగా పాల్గొనిన తరువాత మానవజీవిత సార్థకత ఆధ్యాత్మికపథంలోనే ఇమిడిఉన్నదని గ్రహించి, మౌనయోగసాధనకు అనువుగా పాండిచేరికి వారు చేరుకున్నారు.

ఆధ్యాత్మికరంగములో శ్రీ అరవిందుల తత్వమునకు ఆధారభూతమైనది సనాతన ఆధ్యాత్మిక విజ్ఞానమే అయినప్పటికీ ప్రధానముగా రెండు నూతన సిద్ధాంతములను వారు ద్యోతకం చేశారు. 1. పూర్ణయోగ ప్రతిపాదన, 2. మహామానవ ఆవిర్భావ సిద్ధాంతము—వారి ఆధ్యాత్మిక కృషి ఫలములు.

ప్రపంచ సాహిత్యరంగంలో 1. భవిష్యత్కవితా సిద్ధాంత ప్రతిపాదన, 2. ఆ సిద్ధాంతమును ప్రతిబింబిస్తూ చేసిన ఆధునిక మహావిశ్వకావ్యమైన సావిత్రి రచన వారు చేసిన రెండు ఘనకార్యములు.

హైందవ జాతీయస్మృతిపథం ఎంత ప్రగాఢమైనదంటే భారతీయకవి మతాలు మారినా దేశాలు ద్రిమ్మరివచ్చినా కొన్ని యితివృత్తాలు కవి స్మృతిలో గాఢముద్ర వేసుకుంటాయి. తోరూదత్‌అనే కవయిత్రి తలిదండ్రులు క్రీస్తుమత స్వీకారం చేసినప్పటికీ, ఆమె ఇంగ్లండులో కొన్నిసంవత్సరాలున్నప్పటికీ ఆమె ఇంగ్లీషులో కవిత వ్రాసినప్పుడు హైందవ గాథల్ని ఎన్నుకున్నారు. అందులో ముఖ్యంగా సావిత్రి యితివృత్తాన్ని తీసుకుని చక్కని కవిత్వం వ్రాశారు. రమేష్‌చంద్రదత్‌గారు కూడా ఇంగ్లండులో కొంత కాలం ఉండివచ్చినప్పటికీ ఇంగ్లీషు పరిసరములలో మెలగినప్పటికీ వారుకూడా ఆంగ్లంలో కవిత అల్లినప్పుడు అనేక సనాతన యితివృత్తాలతోపాటు సావిత్రి యితివృత్తంకూడా తీసుకుని వ్రాశారు.

మృత్యువుపై ప్రేమ సాధించిన విజయాలు శ్రీ అరవిందులను బరోడాకాలంనుంచీ ఆకర్షించాయి. పురూరవుడు ఊర్వసికోసం ఊర్ధ్వలోకానికిపోయి సాధించాడు. దానిని యితివృత్తంగా తీసుకుని 'ఊర్వసి' అనే కావ్యం వ్రాశారు. బ్రాహ్మణపుత్రుడు రురుడు ప్రమద్వరకోసం పాతాళలోకానికిపోయి సాధించాడు. దానిని యితివృత్తంగా తీసుకుని లవ్ అండ్ డెత్ వ్రాశారు.

ఊర్వసి, లవ్ అండ్ డెత్ వ్రాసిన బరోడా కాలంలోనే సావిత్రి కావ్యం మొదటి ప్రతిని వ్రాశారు. పురూరవుడు, రురుడు చేసిన త్యాగములలో స్వార్థం ఉన్నందువల్ల ఆ యితివృత్తములతో తృప్తిచెందక మానవాళి అంతటినీ ఉద్ధరించే మహాశక్తి సావిత్రి కథను యితివృత్తంగా తీసుకున్నారు శ్రీ అరవిందులు.

మహావిశ్వకావ్యమైన సావిత్రిని రచించడంలో శ్రీ అరవిందులకు అయిదు ధ్యేయాలున్నవి.

1. వ్యాసమహాభారతంలోని సావిత్రీ ఉపాఖ్యానాన్ని ఒక ఆధునిక మహాకావ్యంగా రూపొందించడం మొదటి లక్ష్యం.

2. ఆధ్యాత్మికసాధన, సిద్ధిని చూపించే పూర్ణయోగ పాఠ్యపుస్తకంగా ధ్వనించే పద్యకావ్యమును రచించడం రెండవ లక్ష్యం.

3. మానవ కార్యకలాపాలలో విశ్వకార్యకలాపాన్ని ప్రతీకగా స్ఫురింపచేసే దివ్యలీలానాటకాన్ని విశ్వకావ్యంగా రచించడం అనగా వారి దివ్యజీవనం అనే గ్రంథంలో చెప్పిన అంశాలనే కవిత్వ పరిభాషలో రసవంతంగా అందించే విశ్వకావ్యాన్ని రచించడం మూడవ లక్ష్యం.

4. కవియొక్క ఆత్మ అనుభవించిన ఆధ్యాత్మికానుభూతిని పాఠకుని ఆత్మకు సూటిగా అందించే గుణంగల భవిష్యత్కవిత అనగా మానసభూమికను దాటి అతిమానస విజ్ఞాన భూమికలకు ప్రయాణింపచేసే కవిత్వానికి మచ్చుతునకగా రచించడం నాలుగవ లక్ష్యం.

5. ఇంగ్లీషు భాషలోని బ్లాంక్‌వెర్స్‌లో ఉపనిషత్తులలోను కాళిదాసకావ్యాలలోను ఉన్న భావచలనాన్ని వీలయినంతవరకు సృష్టించడం; అనగా సంస్కృత భాషలోని స్పష్టత, స్వచ్ఛత వేదాలలోని అర్థబాహుళ్యం ఇంగ్లీషు ఛందస్సులో యిమిడ్చే ప్రయత్నం చేయడం అయిదవ లక్ష్యం.

వారు సావిత్రి మహాకావ్యాన్ని బరోడా కాలంలో వ్రాసినప్పటికీ అది వారు అతిమానస స్థితిని దాటిన

తరువాత కలిగిన ఆధ్యాత్మికానుభవాల దృష్ట్యా చాలా పర్యాయములు మార్చారు. కొన్ని భాగాలు పదిమార్లు సవరించడం కూడా జరిగింది. కవితాగుణంలో దేనికదే రసగుళిక అయినప్పటికీ ఆధ్యాత్మికానుభూతిలో వారికి కలిగిన పరిణామం దృష్ట్యా పూర్ణవిరాట్ దర్శనానికి ప్రస్తుత బృహద్గ్రంథం అవసరమయింది.

చివరకా ఉద్గ్రంథానికి 'సావిత్రి ఒక గాథ, ఒక ప్రతీక' అని నామకరణం చేశారు.

మూడు భాగాలు, 12 పుస్తకాలు, 49 పర్వాలు, సుమారు 24,000 చరణములు ఆ మహా కావ్యములో ఉన్నాయి.

అసంపూర్ణత—కనీసం మొదట సంకల్పించిన పథకంలోనివన్నీ లేకపోవడం — ప్రతిమహాకావ్యానికీ ఒక లక్షణమేమో అనిపిస్తుంది. 1. ఏడవ పుస్తకం 'ది బుక్ ఆఫ్ యోగా' ఆఖరు పర్వంయొక్క మకుటం యివ్వలేదు. 2. మొదట సంకల్పించిన 51 పర్వములలో 49 మాత్రమే వ్రాశారు. ఎనిమిదవ పుస్తకం 'ది బుక్ ఆఫ్ డెత్'లో మొదటి రెండు పర్వాలూ రచించలేదు.

స్వల్పంగా ఈ భాగాలు లోపించినప్పటికి గ్రంథమంతా ఏకబిగిని చదివితే ఒక సంపూర్ణత, నిండుతనం గోచరిస్తాయి. చెప్పవలసినది సందర్భ శుద్ధితో చెప్పడం జరిగింది. ముఖ్యమైనదేదీ విడిచి పెట్టలేదు.

ఈ మహాకావ్య రచనకు శ్రీ అరవిందులు 50 సంవత్సరాలు కృషి చేశారు.

గ్రంథ విశ్లేషణ చేయడానికి ముందు సావిత్రి పాత్రయొక్క ఉత్కృష్టత, విశిష్టత మనవి చేస్తాను.

శ్రీ అరవిందులు తమ మహా విశ్వకావ్యమైన 'సావిత్రి'కి ఇతివృత్తాన్ని వ్యాసమహాభారతంలోని సావిత్రి ఉపాఖ్యానంలోనుండి తీసుకుని వారి అయిదు ధ్యేయాలకూ అనుగుణంగా మార్చి మెరుగుపెట్టారు. వ్యాసుని 'సావిత్రి' విశిష్టమైనది. అందములో, సత్యసంధతలో, సత్ప్రవర్తనములో, శక్తిలో సాటిలేనిది. పదునెనిమిది సంవత్సరముల తపఃఫలముగాసావిత్రీదేవి వరప్రసాదంవల్ల సావిత్రి కల్గింది. సూర్యుని అంతటి తేజస్సుతో కూడిన సౌందర్యము కలిగినందువల్ల ఆమెను వరించుట కెవరికీ సాహసము లేకపోయింది. చిన్న విషయాలలో కూడా ఆమె అసత్యము పలుకలేదు. ఆమె సహజముగానే మంచిది కావడంవల్ల అందరికీ ఉపకారం జరిగింది. చరిత్రలోగాని గాథలలోగాని ఉన్న కథా నాయికలలో ఆమెకు విశిష్టస్థానం ఆమెకున్న 'శక్తి' వల్లనే వచ్చింది. ఆమెకున్న మరొక విశిష్ట లక్షణం ఏమిటంటే అమె అసలు ఏడ్వదు. సత్యవంతుడు తన తలిదండ్రులను గురించి ఏడ్చినాడు. ద్యుమత్సేనుడు కుమారునిగురించి ఏడ్చినాడు. కాని సావిత్రి ఏడ్వదు— నారదుడు అప్రియమైన మాటలను పల్కినప్పుడు గాని, సత్యవంతుడు మరణించినప్పుడుగాని, పునర్జీవము పొందిన తరువాత సత్యవంతుడు తలిదండ్రులను తలచుకొని ఏడ్చినపుడుగాని ఆమె ఏడువలేదు. అది మొండితనంవల్లనూ కాదు. బండతనంవల్లనూ కాదు. ఆమె ధ్యేయాన్ని సాధించగల శక్తి ఆమెకున్నదనే ఒక చైతన్యమూ, ఏ సంఘటననైనా ఎదుర్కొనగలిగే సంసిద్ధతా మాత్రమే ఆమె స్థితప్రజ్ఞత్వమునకు కారణములు. అమె అందమును, సత్యసంధతను, మంచిని, శక్తిని యినుమడింపచేసే ప్రత్యేక గుణం ఆమెకు సత్యవంతునియందుగల మహోజ్వల ప్రేమయే. ఆమె సాధారణంగా స్త్రీగురించి అందరూ అనుకునేటట్లు సుందరి, అబల, మగవాని ప్రక్కటెముకనుండి చేయబడిన నారి మాత్రం కాదు— ఆమె దివ్యధామమునుండి దిగివచ్చిన అనంత స్త్రీమూర్తి.

సావిత్రి ఏడువకపోవడమే కాదు, ఆమె యాచించదు కూడా. నారదుడు హెచ్చరించినమీదట అశ్వపతి ఆమెను మరల వరించుమని చెప్పినప్పుడు ఆమె సత్యవంతుని పెండ్లాడనిమ్మని తండ్రిని బ్రతిమాలలేదు. హృదయార్పణ జీవితంలో ఒకసారి మాత్రమే జరుగుతుందని చెప్పింది. నారదుడు తన మనస్సు మార్చుకుని సత్యవంతునికి సావిత్రి నిచ్చేటట్లు అశ్వపతిని ఒప్పించాడు. ఆమె వజ్రసంకల్పాన్ని దివ్యమునినారదుడూ, మహారాజు అశ్వపతీ యిద్దరూ ఎదిరించలేకపోయారు. త్రిరాత్ర వ్రతం చేసే నిర్ణయం ఆమెదే. ఆమె మామగారు దానిని అనుమతించారు. నాలుగవరోజు రాత్రివరకు నిరాహార దీక్ష పూనడం ఆమె నిర్ణయమే. ఆ గడ్డురోజున

సత్యవంతునితో అడివికి వెళ్ళాలనే నిర్ణయంకూడా ఆమెదే. 'మీతో రావాలనిఉంది. వద్దనకండి' అంటుంది భర్తతో. అత్తమామలతో చూడా లని ఉంది' అని చెబితే వాళ్ళు కాదనలేకపోయారు. సత్యవంతుడు అసువులను బాసిన క్షణంలో అతని ప్రాణాల్ని తీసుకొనిపోవడానికి ఆమె ముందు యముడు నిలచినప్పుడు ఆమె ధృతి సడలలేదు. 'ఎవరు మీరు? ఎందుకు వచ్చారు ?' అని కాస్త కటువుగా అడిగింది సావిత్రి. యముడు సత్యవంతుని ప్రాణాలను తీసుకొని పోతున్నప్పుడు తనభర్త ప్రాణాలవెంబడి వెళ్ళింది సావిత్రి. ప్రతి పర్యాయమూ యముడు మాట్లాడిన తరువాతనే ఆమె మాట్లాడింది. ఆమె వదనంలో గాని కంఠస్వరంలోగాని యాచన అనేది ఎక్కడా కని పించలేదు. ఆమె ధర్మబద్ధంగా మాట్లాడడంతో యమ ధర్మరాజు యిరుకున పడ్డాడు. ఎందుకంటే అతడు మరణానికిమాత్రమేకాక ధర్మానికికూడా దేవతే. ఆమె మాటల సారాంశము అదే. యమధర్మరాజు కోరమన్న తరువాతనే ఆమె వరా లడిగింది. అత్తమామలకోసం, తలిదండ్రులకోసం అడిగిన తరువాత చివరకు సత్యవం తుని గురించి తనగురించి ఆలోచించింది. ఆమె మాట లను వినిన యముడు చైతన్యమునుపొంది ధర్మరాజుగా తన ధర్మమును గ్రహించి సత్యవంతుని ప్రాణమును వాపసుయిచ్చి సావిత్రివద్దనుండి శలవు తీసికొనినాడు.

సావిత్రి కూతురుగా, భార్యగా, కోడలుగా తన ధర్మమును మరువలేదు. ఆయా ధర్మములను పాటిస్తూకూడా వాటిని అధిగమించి ఆమె తలిదండ్రు లకు అత్తమామలకు సంరక్షకురాలిగా వారిని ఉద్ధ రించింది.

సాహిత్యాభిమానులకు సావిత్రి ఉదాత్త కథా నాయకురాలు కావచ్చు. కాని హిందువులకు, ముఖ్యంగా హిందూస్త్రీలకు ఆమె మ్రొక్కిన వరమిచ్చు వేల్పు. ఈ రోజువరకు హైందవ నారీమణులు వారి అయిదవ తనంకోసం సౌభాగ్యంకోసం సావిత్రీవ్రతం ఆచరిస్తు న్నారు. సాహితీ ప్రియులకు రాముడు రామాయణ కావ్యనాయకుడు. కాని కోట్లాది హిందువులకు రాముడు దేవుడు. సాహితీవరులకు కృష్ణుడు మహా భాగవత నాయకుడు, భారతకథలోని పార్థసారధి. కాని అతని కోట్లాది భక్తులకు అతడు కృష్ణభగ వానుడు, గీతా ప్రవక్త. అదే విధముగా సావిత్రి సౌశీల్య మునకు, సౌభాగ్యమునకు, ప్రతివ్రతాశక్తికీ అధిష్ఠాన దేవత. తక్కిన దేవతలను పూజించినట్లు ఏదో మ్రొక్కుబడి చెల్లించుకోడం కాదు ఆమె విషయంలో హిందూ స్త్రీలు చేసేది. వారి హృదయాలయాలలో నిరంతరం నిలచి ఏలే దేవి సావిత్రి.

వ్యాసమహాభారతములోని సావిత్రీఉపాఖ్యానమును శ్రీ అరవిందులు ఎంతవరకు మార్చినారో గమ నిద్దాము.

ప్రధాన ఘట్టములు మార్చలేదు. అశ్వపతి 18 సంవత్సరములు తపస్సు చేయడం, తత్ఫలితంగా సావిత్రి జననం, సావిత్రీ సత్యవంతుల పరిణయానికి విధిపెట్టిన అగ్నిపరీక్ష, సావిత్రి త్రిరాత్ర వ్రతం, సావిత్రి యమునినీ విధినీ జయించి సత్యవంతునికి పునరుజ్జీవనం యిప్పించడం, అత్తయింటి వంశాన్నీ, పుట్టింటి వంశాన్నీ ఉద్ధరించడం—ఇవి ప్రధాన ఘట్టములు, వీటిని మార్చలేదు.

కాని గాథను ప్రతీకగా మలచడంలో కొన్ని మార్పులు అవసరమయ్యాయి.

అశ్వపతి పదునెనిమిది సంవత్సరములు తపస్సు చేసినట్లు ముక్తసరిగా సుమారు పది పాదములలో వ్యాసమహర్షి వ్రాసినారు. అశ్వపతి యోగమును వివ రించుటకు శ్రీ అరవిందులు 15 సర్గలు వ్రాసి నారు. వారి మహాకావ్యంలో దాదాపు సగభాగం అశ్వపతి యోగము ఆక్రమించినది.

సావిత్రి ఆచరించిన త్రిరాత్ర వ్రతము గురించి మూల ఉపాఖ్యానములో రెండు శ్లోకములలో సంక్షిప్త ముగా చెప్పబడినది. కాని ఒక దివ్యశక్తినీ దివ్య చైతన్యాన్నీ పొందడానికి, అవతార లక్ష్యమును తెలుసు కొనడానికి సావిత్రి అంతర్దృష్టి ప్రసరించిన తపస్సును వివరించడానికి శ్రీ అరవిందులకు ఆధ్యాత్మికంగా కలిగిన అనుభవాన్నీ వారి సహసాధకురాలయిన మాతృ శ్రీకి కలిగిన యోగసిద్ధి అనుభవాన్నీ వినియోగించి దాదాపు 4,000 పాదములలో విపులీకరించారు.

సావిత్రీ యముల సంవాదమును, సావిత్రీ విజయ మును శ్రీ అరవిందులు మూడు పుస్తకములుగా 150 పుటలు వ్రాశారు. సావిత్రీదేవి యిచ్చిన వర ముగా వ్యాసమహర్షి చిత్రించిన సావిత్రిని శ్రీ అర

విందులు వారి కావ్యంలో ఆదిశక్తి అవతారముగా రూపొందించారు. సావిత్రియొక్క దివ్యమానవ గుణం వారి కావ్యమునకు పునాదివంటిది. అంతటి దివ్యశక్తి వల్ల సావిత్రి యమునిలో మార్పు తేగలిగినది. జడముగానున్న యమునిలో నిద్రాణమై ఉన్న ధర్మమును మేల్కొలిపి చైతన్యం కలిగించి యమధర్మరాజనెడి పేరును సార్థకము చేసినది.

మరణమును జయించిన తరువాత సావిత్రీ సత్యవంతుల జీవితమును చిత్రించడంలో శ్రీ అరవిందులు ప్రత్యేక ప్రతిభ చూపించారు. గాథలో వారిరువురూ భూమికి దిగివచ్చి, సత్యవంతుడు వాని తండ్రి రాజ్యమును పొంది చాలకాలము సుఖముగా పరిపాలిస్తాడు. కాని శ్రీ అరవిందుల ప్రతీకలో సావిత్రీసత్యవంతులు మరణరాజ్యం నుండి లేచి ఎక్కడ సత్యసూర్యుడు ఎన్నడూ అస్తమించడో ఎక్కడ అజ్ఞానమనేదే తెలియదో ఎక్కడ మరణానికి తావు లేదో అటువంటి అనంతదినప్రదేశంలో ప్రవేశిస్తారు. అటువంటి సత్యప్రదేశంలో కొంతకాలము గడపిన తరువాత నూతన మానవత్వాన్ని సృష్టించడం అనే దివ్యకార్యాన్ని అనుష్ఠించడంకోసం భూమికి దిగివస్తారు. ఆ విధముగా వ్యాసముని వ్రాసిన గాథను సృజనాత్మక దర్శనము గలిగిన శ్రీ అరవిందులు విశ్వప్రతీకగా మార్చారు.

ఇక గ్రంథవిశ్లేషణ చేస్తాను. ఈ మహావిశ్వ కావ్యంపేరు 'సావిత్రి— ఒక గాథ, ఒక ప్రతీక.' ఈ మహాకావ్యంలో గాథకు సంబంధించినదీ, దానిలోని చిహ్నానికి లేక ప్రతీకకు సంబంధించిన నిగూఢత్వాన్ని వీలయినంతవరకు విడమరిచి చెబుతాను.

మొదటి పుస్తకం 'ది బుక్ ఆఫ్ బిగినింగ్స్' లోని మొదటి రెండు పర్వాలూ సంఘటనల మధ్యలో 'సత్యవంతుడు మరణించవలసిన రోజు' నాడు ప్రారంభమవుతాయి. సావిత్రీసత్యవంతుల వివాహం జరిగి పన్నెండు మధురమాసాలు అప్పుడే గతించి సత్యవంతుడు మరణించవలసిన నాటి అరుణోదయ మది. గాథలోనేకాక ప్రతీకగా కూడ అది అరుణోదయమే— అది విశ్వచరిత్రలో ఒక క్రొత్తశకానికి ఉషఃకాలము. ఈ మహాకావ్యం అంతటిలో ద్వికాలము ద్విచర్య కనిపిస్తాయి. ఒకప్రక్క గాథగా అది ఒకరోజు సంఘటనే చెప్పినప్పటికీ ప్రతీకగా ఆధ్యాత్మిక భూమికలో సర్వకాలము అనంతకాలము దానిలో యిమిడిఉన్నాయి. గాథలో భౌతికభూమికలో సత్యవంతుడు మరణించవలసిన రోజున ప్రారంభమై యమునిపై సావిత్రి విజయం సాధించి సత్యవంతుడు పునర్జీవనం పొందడంతో అంతమవుతుంది.

ఇక ప్రతీక చూద్దాం.

ఆధ్యాత్మిక భూమికలోకూడా సంఘటనల మధ్యలో ప్రారంభమయింది. మానవచరిత్రలో అణ్వాస్త్రాల అసురసృష్టితో మానవజాతే నాశనమయ్యే పరిస్థితులు ఎదురయినవి. ఈ గడ్డుసమస్య దాటి మానవాళి బ్రతికి బట్టకడుతుందా లేక నాశనం అవుతుందా ?

ఇదే జీవన్మరణ సమస్య గురించి వారి దివ్యజీవనం అనే గ్రంథంలో శ్రీ అరవిందులు ప్రశ్నించారు. దానికి పరిష్కార మార్గాన్ని కూడా సూచించారు. మళ్లీ అదే సమస్యను సావిత్రి అనే మహాకావ్యంలో కవిత్వపరిభాషలో చర్చించి పరిష్కరించారు. సావిత్రి కావ్యంలోని ఆధ్యాత్మికనాటకం ప్రతిఆత్మలోను జరుగుతున్నది. నిజానికి అసురశక్తిని ఆధ్యాత్మికశక్తితో ఎదుర్కొని, లొంగదీసి మార్చివేయవచ్చును. అందుచేత ఆత్మకు—ప్రకృతికి పట్టిన తాత్కాలిక పాక్షిక అంధకారం తొలగిపోవడంతో కావ్యం ముగుస్తుంది.

ఇంతటి మహాకార్యాన్ని సాధించే శక్తి సావిత్రికి ఎట్లా వచ్చింది? దానికి జవాబు మొదటి పుస్తకంలోని రెండు పర్వాలలోను, రెండవ పుస్తకం 'ది బుక్ ఆఫ్ ది ట్రావెలర్ ఆఫ్ ది వరల్డ్స్'లోను, మూడవ పుస్తకం 'ది బుక్ ఆఫ్ ది డివైన్ మదర్'లోను వివరంగా చెప్పారు.

మహాభారత ఉపాఖ్యానంలో అశ్వపతిరాజు పిల్లలకోసం తపస్సుచేసి పుత్రికా వరం పొందుతాడు. శ్రీ అరవిందుల కథనంలో అశ్వపతి కేవలం పిల్లలకోసం తపస్సుచేసే రాజు మాత్రమేకాడు. యుగ యుగములుగా ఆత్మజ్ఞానంకోసం అన్వేషించే సాధకునికి ప్రతీక.

అరవిందుల అశ్వపతి యోగము మూడు భాగములుగా విభజించవచ్చును. వ్యక్తిగా ఆధ్యాత్మిక సిద్ధిని పొందడం మొదటిది. 'యోగా ఆఫ్ ది కింగ్'లో వర్ణించబడింది. తరువాత మానవుల ప్రతినిధిగా చైతన్యభూమికలను సాధించడం రెండవది. రెండవ పుస్తకంలో వివరించారు. అయితే ఇంతవరకు ఇది వ్యక్తిగత విజయం మాత్రమే. చివరకు విశ్వమంతటికి దివ్యచైతన్యం లభించి నూతనసృష్టి జరిగే విధం మూడవ పుస్తకం 'ది బుక్ ఆఫ్ ది డివైన్ మదర్'లో వర్ణించారు.

అశ్వపతికి తెలిసిన రహస్యజ్ఞానం నాలుగవ పర్వంలో వివరించారు. దేవుని లీలలు అశ్వపతికి తెలిసినవి. సృష్టిలోని నిగూఢత అర్థమయింది.

లోకాన్ని ఆవరించిన చీకటిని తొలగించడానికి ఆదిశక్తి అంశ అశ్వపతికి కుమార్తెగా అవతరిస్తుందని వరం పొందుతాడు ఆ రాజు.

**రెండవ భాగం,** 'నాలుగవ పుస్తకం'తో మనం మళ్లీ మానవ కథకు వస్తాం. రాజుకిచ్చిన వరం ఫలించింది. జ్వాలామతల్లి జననం, శైశవం వర్ణించే పర్వం, తరువాత పర్వాలలో సావిత్రి బాల్యం నుండి స్త్రీమూర్తిగా ఎదిగి ప్రేమించే దశకు చేరడం చూస్తాం. రాజ్యభ్రష్టులైన ద్యుమత్సేనమహారాజు కొడుకు సత్యవంతుని, పర్ణశాలలో గుడ్డివారైన తలిదండ్రులకు సేవచేస్తున్నవానిని సావిత్రి చూసింది. సావిత్రి సత్యవంతులు పరస్పరం ప్రేమించుకున్నారు. ఇంటికివచ్చిన తండ్రితో తన ప్రేమ వృత్తాంతమును తెలిపింది సావిత్రి. ఆ సమయంలో అక్కడఉన్న నారద మహర్షి సత్యవంతుని గొప్పగుణాల్ని యోగ్యతల్ని పొగడి, అతడు అల్పాయుర్దాయం కలవాడనీ, ఒక సంవత్సరంలో అతనికి మరణం తప్పదని చెప్పాడు. సావిత్రి తల్లి సత్యవంతునిమీద ఆశ పెట్టుకొనవద్దని సలహాయివ్వగా సావిత్రి సత్యవంతుని మాత్రమే పెండ్లాడు తానని పట్టుపట్టింది.

సావిత్రి అందరి కన్యలవంటిదికాదని, ఆమె దివ్యసంకల్పశక్తివల్ల అంతా సవ్యంగా జరుగుతుందని నారదుడు ధైర్యం చెబుతాడు.

ఏడవ పుస్తకం 'ది బుక్ ఆఫ్ యోగా'లో సావిత్రి సత్యవంతుల వైవాహికప్రేమ వర్ణించబడినది. సావిత్రికి సత్యవంతుని తల్వాత ముందుగానే తెలుసును కనుక ఆమె వైవాహిక జీవితంలోని మాధుర్యాన్ని పూర్తిగా చవిచూడలేకపోయినది. సావిత్రి ఆదిశక్తి అంశతో జన్మించినదే అయినప్పటికీ మానవాకృతి ధరించడంవల్ల కొంచెం మనఃక్లేశం తప్పదు. అయినా ఆమెలోని దివ్యత్వం జాగృతంగానేఉంది. ఆమె అశ్వపతియోగఫలము కాబట్టి యోగినిగా తన బలాన్ని గ్రహించి విధితో రానున్న పోరాటానికి సన్నద్ధమయినది. సావిత్రి తనలోనికి అంతర్దృష్టిని ప్రసరించి స్థూలనేత్రానికి కనిపించే ఆకారాన్ని నిరాకరించి లోనున్న ఒక్కొక్క తెరనే తొలగించి ఆమె పూర్ణ దివ్యత్వాన్నీ, తన అవతారలక్ష్యాన్నీ గ్రహించింది. అశ్వపతి కేవలం సాధన స్వరూపమయితే సావిత్రి ఆ సాధనయొక్క పరిణామమేకాక ఆ సాధనసిద్ధి కూడా. ప్రకృతి ధర్మాన్ని దివ్యధర్మంగా మార్చే పరాశక్తి అంశ ఆ మహాతల్లి. అశ్వపతి, సావిత్రి ఇద్దరూ కూడా తమ స్వార్థంకోసం మాత్రమే ఆధ్యాత్మిక కృషి చేయలేదు. సర్వమానవ విముక్తికి, విశ్వవిముక్తికి దివ్యపరిణామసృష్టికి వారు సాధనచేసి సిద్ధిపొందారు.

శ్రీ ఆ గడ్డురోజుదగ్గరకు వచ్చాం. సావిత్రి యోగసాధన తరువాత దివ్యదృష్టితోను దివ్యశక్తి తోనూ శక్తిమంతురాలై సత్యవంతునితో అడవికి వెళ్లింది. మృత్యుక్షణం సమీపించడంతో సత్యవంతునికి తలనొప్పి రావడం ఆమెపేరు తలుస్తూ ఆమె ఒడిలో తలపెట్టుకుని దీర్ఘనిద్రలో మునగడం జరిగాయి.

సావిత్రి మహాకావ్యంలోని మూడవభాగంలో సత్యవంతుని ఆత్మకోసం సావిత్రికీ యమధర్మరాజుకీ జరిగిన సుదీర్ఘపోరాటమూ, సావిత్రి విజయమూ వివరించారు. బోధివృక్షంక్రింద సిద్ధార్థుని సాధన సమయంలో మహాజ్ఞానోదయం జరిగేముందు సిద్ధార్థుడు మారునితో పోరాడి జయించి బుద్ధుడయ్యాడు. అదే విధమయిన అగ్నిపరీక్షకు లోనయింది సాధ్వి సావిత్రి. అయితే స్త్రీగా భార్యగా ఆమె యమునితో పోరాడడం యింకా ఆసక్తికరమైనది. ఆమె విజయం—ప్రేమ

మృత్యువుపై సాధించిన విజయం. అమృతజీవనమే ఆ విజయఫలం.

యముని సాక్షాత్కారం చాలా అందముగా వర్ణించారు శ్రీ అరవిందులు. భయంకరంగా ఉంటూనే అందముగా ఉన్నాడు యముడు. చావుని ప్రసాదించే వాడయినా ఆయనొక దేవత.

సావిత్రీ యములకు జరిగిన పోరాటం కురుక్షేత్ర యుద్ధంవాదిరి వర్ణించారు శ్రీ అరవిందులు. పరాశక్తి అవతారమైన ఆ మహాతల్లి యమునికి బోధించిన వాక్యాలలో ఒక దివ్యగీత, ఆ గీత ప్రభావం యమునిపై విస్తృతంగా ఉండడానికి తన ఆదిశక్తి స్వరూపాన్ని యమునికి చూపించడంలో ఒక విశ్వరూప సందర్శనం శ్రీ అరవిందులు వారి కావ్యం చివరి భాగంలో చూపించారు. సావిత్రితోపాటు ప్రతీకస్థితిలో అనంత రాత్రి, ద్విసంధ్యలుగడిచి అనంత ప్రభాతంలో అడుగు పెడతాం.

సావిత్రి యముని జయించి విధిని మార్చింది. యముని పాశంనుంచి సత్యవంతుడు విముక్తుడైనాడు. పాక్షిక తిమిరం ఆవరించిన ఆత్మ సత్యస్వరూపం తేజోమయం అయింది. గాథగా ప్రతీకగా సావిత్రి కావ్యం శుభాంతం అవుతుంది. అయితే ఈ ముగింపు ఈ శుభాంతం మానవచరిత్రలో యింకా వర్తమాన భవిష్యత్తులలో పూర్తికాలేదు. అది యింకా సాధించవలసి ఉంది. మానవుని దివ్యీకరణంవల్లకాని అది సాధ్యంకాదు. అది శ్రీ అరవిందుల పూర్ణయోగ సాధన వల్లనే సాధ్యం అవుతుంది.

శ్రీ అరవిందులు ఇంగ్లీషు ఛందస్సులో అన్ని రకముల పద్య రచనలను చేయగలిగి నప్పటికీ బ్లాంక్ వెర్స్‌లో వారు సిద్ధహస్తులు. వారి మహాకావ్యం సావిత్రి అంతా బ్లాంక్‌వెర్స్‌లోనే వ్రాశారు. వారి బ్లాంక్‌వెర్స్ మిల్టన్‌మహాకవి వ్రాసిన బ్లాంక్ వెర్స్‌తో కొంతవరకును, టెన్నిసన్ మహాకవి వ్రాసిన బ్లాంక్ వెర్సుతో కొంతవరకును పోలి ఉన్నప్పటికిని ఎన్‌జాంబ్‌మెంట్ లేకుండా అనగా ఒక పాదంలోని భావం తరువాత పాదానికి పరుగెత్తకుండా ఏ పాదానికా పాదం స్వయంసమృద్ధముగా ఇటుకలు పేర్చినట్లుండడం వారి కవితా విశేషం.

కాగా మరొక గొప్పగుణంకూడా వారి కవిత్వంలో ఉంది. అనుష్టుప్ ఛందస్సులో వాల్మీకి మహాకవి సాధించినట్లు శ్రీ అరవిందులు బ్లాంక్ వెర్స్‌లో మంత్రప్రభావం యిమిడ్చారు.

దివ్యానుభూతి పొందిన కవికి ఆ అనుభవ ప్రసారానికి భాష ఒక ప్రతిబంధకం కాదని శ్రీ అరవిందులు తమ విశ్వకావ్యం అయిన సావిత్రిద్వారా నిరూపించారు.

ప్రపంచ సాహిత్యంలో శాశ్వతంగా ఏదయినా కావ్యం నిలవడానికి నాలుగు లక్షణాలు కావాలి. ఒకటి అంతర్దర్శనము. రెండు, మానవ సనాతనధర్మంతో సంబంధము. మూడు, సహజంగా, సజీవంగా అమరంగా కదిలే పాత్రపోషణ. నాలుగు, ఆత్మగుణం అనగా కవియొక్క ఆత్మ అనుభవించిన దానిని పాఠకుని ఆత్మకు అందించకలిగే గుణం. ఈ నాలుగు గుణాలూ శ్రీ అరవింద విరచిత సావిత్రిలో పుష్కలంగా కనిపిస్తున్నందువల్ల ఈ మహావిశ్వకావ్యం శాశ్వతంగా ప్రపంచ సాహిత్యంలో నిలుస్తుందనడంలో సందేహం లేదు.



# రెలాగింది

## "శ్రుతకీర్తి"

జామున్‌గావ్ స్టేషన్ మాష్టరు హడావిడిపడు తున్నాడు. దిగువనుంచీ వచ్చే ఎక్స్‌ప్రెస్ ఆలస్యం అయింది. ఎన్నడూ లేనిది ఆ రోజు జనతా రైట్ టైముకి వస్తున్నది. ఎక్స్‌ప్రెస్ బళ్ళ క్రాసింగు వున్నదిఅంటే స్టేషన్‌మాష్టరు మామూలు కంటె హుందాగా అగుపిస్తాడు. పాయింటుకొట్టి టాప్‌లైను మెయిన్‌లైన్‌తో కలిపేశాడు కూలీ. ఆలస్యంగా వచ్చినందుకు శిక్షగా ఎక్స్‌ప్రెస్ టాప్‌లైన్ మీదకు రావడానికి సిగ్నలుపైకి లేచింది. ఆకుపచ్చ జండాచుట్టి ఎడంచేత్తో పట్టుకుని కుడిచేతో, ఎర్ర జండా విదిలించి పట్టుకుని ప్లాటుఫారం అంచున నిలబడ్డాడు స్టేషన్ మాష్టరు.

కూలీ ఎవర్నో కేకేసి పిలుస్తున్నాడు, 'అరే సజ్జా...! నీ పంట పండిందిలే యివ్వాళ. ఎక్స్‌ప్రెస్ క్రాసింగుంది...రా...దబ్బున రా...'

స్టేషన్ బయట చెట్టుకింద తువ్వాలుపరుచుకుని పడుకున్న సజ్జా లేచి తువ్వాలు తలకు చుట్టి పక్కనున్న పెద్దబుట్ట నెత్తుకుని గబగబా అడుగు లేసుకుంటూ ప్లాటుఫారంమీదికి వచ్చాడు. బుట్ట నిండా నేరేడుపళ్లు నలుపూ నీలం కలబోసిన రంగులో మెరుస్తున్నాయి. అప్పటికే ఒక అరడజనుమంది పిల్లలు నేరేడుపళ్ల తట్టలతో అక్కడకు చేరారు.

జామున్‌గావ్ స్టేషను అంటే ఒక చిన్నగది, రెండు వేపులా వరండా. ప్లాటుఫారంమీద రెండు మూడు చెట్లు, ఒక సిమెంట్‌బల్ల, మెయిన్ లైన్, ఒక టాప్ లైను...అంతే. బుకింగ్ క్లర్కు. టిక్కెట్టు కలెక్టరు, స్టేషను మాష్టరూ అన్నీ ఒకడే. పాసింజరు బళ్ళు మాత్రమే అక్కడ ఆగుతాయి. రోజుకి మూడు బళ్లటూ, మూడిటూ వెడుతుంటాయి. ఎక్స్‌ప్రెస్ బళ్లు ప్లాటుఫారం మీద స్టేషనుమాష్టరు వూగించే ఆకుపచ్చజండా చూసీ చూడనట్లు తీవిగా సాగిపోతుంటాయి. ఎప్పుడన్నా అరుదుగా క్రాసింగు జరుగుతేనో లేక లైన్ రిపేరులో వుంటేనోతప్ప ఆగే పనిలేదు వాటికి. వేసంగిలో ఎక్స్‌ప్రెస్ ఆగిందంటే నేరేడు పళ్లమ్మే పిల్లలకు పండగే. ఒక్కొక్కిటికీ దగ్గరే బుట్టఖాళీ అయిపోతుంది. ఆ బళ్లల్లో పెద్దపెద్ద టెక్కెట్లు దొరబాబులుంటారు. వాళ్లకి మసాళామిఠాయించిన నేరేడుపళ్ళరుచిఅన్నా, తిన్న తర్వాత నాలుకజాపి నీలం రంగుచూచి నవ్వుకోవడంఅన్నా చాలా యిష్టంఅని ఆ పిల్లలకు తెలుసు. పావలాకు పదికాయలిచ్చినా తేలిగ్గా కొనేయగలరు. పాసింజరు రైళ్ళట్లాకాదు. అందులో వుండేది కొద్దిపాటి దూరాలు ప్రయాణించే పల్లెటూరి వాళ్లు. వాళ్లకి నేరేడు పళ్ళుకొని తినాల్సిన అవసరం కలగదు. ఆ రుచి వాళ్ళని ప్రత్యేకంగా ఆకర్షించదు. అథవా ఎవరైనా కొనాలనుకుని పిలిచినా పావలాకు పది అంటే నోరు తెరుస్తారు. కొంత మంది కసురుతారు. మరికొందరు గీసిగీసి బేరమాడ కొంటామంటారు.

అందుకని పాసింజరు బళ్ళంటే అమ్ముకునే పిల్లలకు గిట్టదు. కానీ తప్పదుగదా! అందుకే ఎప్పుడో రాక రాక వచ్చే ఎక్స్‌ప్రెస్‌కోసం ఎదురు చూస్తుంటారు.

బండిమోత దగ్గరవుతున్నది. అప్పటికే కుర్రాళ్ళు ప్లాటుఫారం దిగి టాపులైన్ వైపుకుపోయి చుట్టుపక్కల పోటీ లేకుండా అనువైన చోట్లు చూసుకుంటున్నారు. సజ్జా ప్లాటుఫారం మధ్య నిలబడ్డాడు. మిగిలిన కుర్రాళ్ళవంకచూచి తన వయస్సు గుర్తుకువచ్చి కొంచెం సిగ్గుపడ్డాడు. వాళ్ళందరూ తన కొడుకు భోలా యీడువాళ్ళు. భోలా అవిటివాడు కాకుండావుంటే తనబదులు బుట్ట తీసుకుని యిక్కడ నిలబడి వుండేవాడు. అవిటి తనమేకాదు...తన ఖర్మ

కాకపోతే...పదేళ్ల భోలాకు పుట్టుకతోనే మూగతనం కూడా ప్రసాదించాలా భగవంతుడు...సజ్జా మనస్సులో ఒక్కసారి సన్నగా కలుక్కుమన్నది.

ఎక్స్‌ప్రెస్ వస్తున్న చప్పుడు పట్టాలమీద దణదణలాడుతువ్నది. అటుకేసి చూశాడు సజ్జా. ఇంజను పొగ సరిగా కనిపించడం లేదు. ఈ యింజను పొడుగాను సరిగా కనిపించేటట్లు పొగా వదల పాత యింజన్లలాగా చెవు లదిరిపోయేట్టు కూయనూ కూయవు...ఇక చప్పుడుకూడా లేని యింజన్లు వచ్చాయంటే యింకా యేమన్నా వుందా అను కున్నాడు సజ్జా.

బండి స్టేషన్‌లోకి వచ్చింది. మామూలుగా బాణంలా దూసుకుపోయేది అక్కడా యిక్కడాగాక నట్టడివిలో జామున్‌గావ్‌స్టేషన్‌లో పట్టుబడి పోయింది. లావాటి దొరచుట్టకాలుస్తూ ఎత్తైన కిటికీలోనించీ ఆంగ్లో యిండియన్ డ్రైవరు స్టేషన్‌మాష్టర్‌వంక కొంచెం చిరాకుతో చూశాడు. స్టేషనుమాష్టరు చేతులో ఎర్రజండా నెత్తురులా మెరుస్తున్నది. చుమని చప్పుడు చేసుకుంటూ బండి ఆగిపోయింది. బండిలో ప్రయాణీకులు తలలు బయటకుపెట్టి యిక్కడ ఆగామేమిటాఅని వింతగా చూస్తున్నారు.

సజ్జా అటూ యిటూ తచ్చాడుతూ ఒక ఫస్ట్ క్లాస్ డబ్బాదగ్గరకు చేరాడు. కిటికీలోంచి ఒకదొర, దొరసాని నేరేడుపళ్లవంక వింతగా చూడసాగారు. అనుభవంకల సజ్జా వెంటనే బుట్టదింపి తొందరగా రెండాకుల్లో పళ్లుపెట్టి మసాలాపొడిచల్లి గలపరించి చెరొకటీ అందించాడు. దొరసాని ఒకటి తీసుకుని నోట్లో వేసుకుని చప్పరించి గింజవుమిసి దొరతో యేదో నవ్వుతూ అన్నది. దొరకూడా తినడం ప్రారం భించాడు. సజ్జా అక్కడే నిలబడి చూసు న్నా ఇద్దరి చేతుల్లో ఆకులు ఖాళీ అయిపోయాయి. మళ్లీ చెరొక పొట్లం అందించాడు సజ్జా. అవి తీసుకుని అతను పర్సుతీసి రెండురూపాయలకాయితం అందించి చాలా అన్నట్లు చూశాడు. కాని దొరసాని ఏదో గట్టిగా అనడంతో మరొక రూపాయికాయితంకూడా యిచ్చాడు. అవి జేబులో భద్రపరుచుకుని రెండు చేతుల్తో వాళ్లకు దణ్ణంపెట్టి ముందు సాగిపోయాడు మరొక కిటికీ దగ్గరకు సజ్జా.

కాసేపట్లోనే బుట్ట ఖాళీఅయిపోయింది. సందె వేళ పాసింజరు వచ్చేవేళదాకా తారట్లాడాల్సిన అవ సరం తప్పిపోయింది.

జనతా దణదణా దూసుకుపోయింది. నెమ్మ దిగా ఎక్స్‌ప్రెస్‌కూడా బయల్దేరింది.

సజ్జా డబ్బులు తీసుకు లెక్కపెట్టుకున్నాడు. మొత్తం ఆరు రూపాయలపైన చేరింది. మామూ లుగా ఆ బుట్టకు రెండు రూపాయలకంటె ఎక్కువ వచ్చేవికావు. అనుకోకుండా ఎక్స్‌ప్రెస్ రైలాగడం, బంగారంలాంటిబేరం తగలడంతో సజ్జాకు బుట్టలో ఖాళీఅయిన బరువుకంటె మనసులో భారం మరింత తేలికయింది. డబ్బు జాగ్రత్తపెట్టుకుని తలమీది పాగా విదిల్చి బుజానవేసుకుని ఖాళీబుట్టతో యింటి దోవ పట్టాడు సజ్జా. స్టేషన్‌లో కుర్రాళ్లు సన్నగా సర్దుకుంటున్నారు. ఇంకా పూర్తిగా అమ్ముడు పోని వాళ్లు అటూ యిటూ తారట్లాడు తున్నారు.

స్టేషన్ పక్కనేవున్న వాగువెంబడి మైలు నడిస్తేగానీ వూరు తగలదు. సజ్జా బుట్ట నెత్తిమీద తగిలించుకుని వాగువెంబడి ఎగుడుదిగుడు రాళ్ల మీదుగా నడక సాగించాడు. కింద కాళ్లు కాలు తున్నాయి. పైన సూర్యుడుకూడా బుట్ట చిల్లు ల్లోంచి చురుక్కున పొడుస్తున్నాడు. వాగులో యిసుక మేట వేసుకుపోయింది. సజ్జాకు సన్నగా కడుపులో కాలుతున్నది. పొద్దున్నే రెండు చపాతీలు మిరపకాయ వుప్పుతో నంచుకు తిన్నాడు...అంతే. మామూలుగా అయితే యీవేళప్పుడు స్టేషన్లో ఎవరిదగ్గరో బజ్జీలో సాతాళించినసెనగలో కొనుక్కుతిని యిన్ని మంచినీళ్లుతాగి చెట్టుకింద చేరగిల పడేవాడు. కానీ యీ రోజు అలాకాదు. ఇట్లాంటిరోజు ఎప్పుడోగానీ రాదు. జేబులో డబ్బు గుర్తుకువచ్చి సజ్జా ఆకలిని గదిమాడు. వడగాలి సాగింది. వాగులో యిసుక పొరలు పొరలుగా గాలివాటున సాగిపోతున్నది.

ఊరుదగ్గర పడింది. ఊరిచుట్టూ నేరేడు చెట్లు. అందుకే ఆవూరు జామున్‌గావ్ అయింది. చెట్లకింద మంచాలమీదపడి నిద్రపోతున్నారు జనం. ఎత్తైన మట్టి దిబ్బలమీద పెంకులుపరిచిన మిద్దెలు లేకపోతే గోధుమగడ్డితో నేసిన యిళ్లుమాత్రమే ఆ వూళ్లో వున్నాయి. అక్కడ డబ్బున్నవాళ్లెవరూలేరు.

ఉన్న ఒకరో యిద్దరో వందమైళ్లలోవున్న పట్టణానికి తరలిపోయారు. మోతుబరిరైతులు లేకపోవడం వలన ఎవరిపని వాళ్లదే. అదే వాళ్ల కాధారం. నేలంతా ఎగుడు దిగుడుగా వుంటుంది. ఎక్కడచూసినా రాతి తుప్పలే. వాగులోకి నీళ్లు మళ్లితేతప్ప సాగుబడికూడా అంతమాత్రమే. వాళ్ల బతుకుల్లో ఎక్కువభాగం ఆ చెట్లకింది మంచాలమీదే గడిచిపోతుంది.

సజ్జూ మంచాలమీద హుక్కాగొట్టం చుట్టూ కూర్చున్న ఒకరిద్దర్ని పలకరించి కొంచెం ముందుకు సాగి తనయింటియందున్న రావిచెట్టుకింది దేవుడికి దణ్ణంపెట్టి వెనక్కి తిరిగాడు.

పదేళ్ల భోలా అంతయెండలో చూరుకింద పాటి మట్టిగోడ నానుకుని చేరగిలిబడ్డాడు. వాడు నడవ టానికి ఆసరాగావుండే కర్ర ఒకపక్క, ఎప్పుడూ తోడుగా తిరిగేకుక్క రాణి మరొకపక్క ఏదో సానుభూతి చూపిస్తున్నట్లు పడుకున్నాయి. లోపలనుంచి పూనమ్ గొంతు కరుకుగా వినిపిస్తున్నది. క్షణంలో పరిస్థితి అర్థంచేసుకున్న సజ్జూ నీరుకారిపోయాడు. ఆ రోజు నాలుగురాళ్లు ఎక్కువ గిట్టిన విషయంగానీ, మధ్యాన్నం తిండికి యింటికి రాగలగడంగానీ అతనికేమీ ఆనందం గొల్పడంలేదు. మనిషి అలికి రాణి లేచినిలబడి సజ్జూని చూసి తోకాడించడం మొదలుపెట్టింది. అల వాటుగా సాయంకాలం కాకుండా పెందరాడే యింటికి వచ్చిన తండ్రిని చూసి భోలా కళ్లు మిలమిల లాడాయి. వాడు మాట్లాడేదీ, చూసేదీకూడా ఆ కళ్ల తోనే. సజ్జూకి, రాణికీ ఆ కళ్లంటే మిక్కుటమైన ప్రేమ, ఆప్యాయతాను. కానీ సవతితల్లి పూనమ్‌కి వాడంటే అసహ్యం. వాడంటేనేకాదు, ఆ వూరు, మనుషులు, రాణీ, ఆఖరికి సజ్జూఅన్నా కిట్టదంటే అతిశయోక్తి కాదు.

లోపల్నించీ దీవనలు యింకా వినిపిస్తూనే వున్నాయి. సజ్జూ భోలాముందు కూర్చుని చేతుల్తో దగ్గరకుతీసుకుని 'అన్నం తిన్నావా'అని అడిగాడు, తల అడ్డంగా తిప్పబోయి మళ్లీ ఔనని తల వూచాడు భోలా. దొంగతనం పసికట్టేసినట్లు రాణి ఒకసారి అరిచింది.

తాను తొందరగా యింటికెందుకు వచ్చానో చెబుతున్నాడు సజ్జూ. ఇంతలో పూనమ్ బయటికి వచ్చింది. చూడటానికి పున్నమివెన్నెలలాగా మనో హరంగానే వుంటుంది. కానీ గొంతుమాత్రం అమా వాస్యరాత్రి స్మశానాలలో నక్కలుపెట్టే వూలలాగా వుంటుంది.

'ఏం! యింత పెందరాడే వచ్చిపడ్డావేం! ఈ పూటయినా రెండురాళ్లు పట్టుకొచ్చావాలేదా! ఈ కొంపతో వేగలేక చస్తున్నాను. పైగా యీ అవిటి వెధవొకడు...వాడికొక కుక్క...ఈ చీర చూడు... ఎట్లా వెలిసిపోయిందో! వచ్చేవారం సేఠ్‌జీని చీర తెమ్మన్నాను. మరి డబ్బులెల్లా పట్టుకొస్తావో... అంతా చేతకానితనం.. ఇంత నిస్సని ఏలాభంలే! అంతమంచి వూర్నించితెచ్చి యీ అడివిలో పడేశాడు... మాఅయ్య'అంటూ ఏకబిగిని వాట్లాడేసి లోపలికి తిరిగిపోయింది పూనమ్.

మామూలుగా చీకటిపడ్డాక యింటికివచ్చే సజ్జూకి యీ మాటలువినే అవసరం వుండేదికాదు. సత్తు తపేలాతో నీళ్లు కాచుకుని స్నానంచేసి రెండు రొట్టిలో అన్నమోతిని పడుకుని గుర్రుపెట్టేవాడు. ఏ రాత్రివేళనో బుద్ధిమళ్లితే పూనమ్ నిద్ర లేవ గొట్టేది. కానీ పొద్దస్తమానం యింట్లోనే పడుండే భోలా ఆమెవచోవ్యాఘాతాలకు ఎరకాక తప్పదు. అది తెలియకకాదు...తెలిసికూడా తనేమీ చేయలేనందుకు అప్పుడప్పుడు చింతిస్తుండేవాడు సజ్జూ.

నీరసంగా లేచి నిలవబడి కొడుకుకు చలులం దించి తీసుకుని లోపలికివెళ్లాడు. రాణి చేతికర్రను ఒకవేపు కరిచి పట్టుకుని యీడ్చుకుంటూ తీసుకు వెళ్లింది.

ఎండలు ముదిరాయి. వాగుఒడ్డున యిసుక చెలమలలో మంచినీటి వూటలో బిందెను నింపు తున్నాడు సజ్జూ.

ఎవరికోసమూ ఆగాల్సిన పనిలేని ఎక్స్‌ప్రెస్ జామున్‌గాంవ్ స్టేషనుదాటి దర్జాగా యీల వేసు కుంటూ సాగిపోతున్నది.

బిందె నిండింది. చేత్తో బిందెకంటిన యిసక తుడిచి బుజానపెట్టుకుని వూరివైపు నడక సాగిం

చాడు సజ్జా. ఒక్కసారిగా చల్లగాలి సోకింది. చిరుచెమట పట్టిన వంటికి చల్లగాలి సుఖాన్నిగొలిపింది. తల పైకెత్తి చూశాడు — ఆకాశంలో మెరుపు సజ్జా కళ్లల్లో తళుక్కుమంది. ఒక్కసారి ఆనందంనిండింది అతని గుండెల్లో. ఈ యేడు కాస్త తొందరగా వాగు నిండితే పొలంపని మొదలెట్టొచ్చు. నాలుగు గింజలు రాలుబడవుతే ఏడాదల్లా కడుపునిండా తినొచ్చు — ప్రతి యేడూ అలా వుండదు. ఒక్కొక్కప్పుడు సాలు సాలంతా అర్ధాకలితో గడపడమే.

మంచినీళ్లకీ సాగుబడికీ ఆ వాగొక్కటే ఆధారం. అందులోనించీ చిన్నచిన్న మళ్లలోకి నీళ్లెక్కించడానికి పడేశ్రమ పడేవాడికే తెలుస్తుంది. వాగు పూర్తిగా నిండితే మళ్లలోకి నీరెక్కుతుంది. ఎగువన కురిసే వర్షాన్నిబట్టి వాగునిండుతూ వుంటుంది.

సన్నగా సాగినగాలి సెలలువేసుకుంటూ సుళ్లు తిరుగుతూ సాగిపోతున్నది. కొండలమీద చక్కగా నిలువుగా పెరిగిన చెట్లన్నీ గాలివాలుకు లయబద్ధంగా తూగుతున్నాయి.

బిందెలో నీరు కొంచెం పారబోసి దుమ్ము పడకుండా తలగుడ్డ వాసెనగట్టి పరుగులాంటి నడక సాగించాడు సజ్జా. ఇంటిదగ్గర బిందె దించేసరికి మళ్లీ కొంచెం చెమట పట్టినట్లనిపించింది.

ఒకసారి బయటకువచ్చి పారజూచాడు. చిన్నపిల్ల చేతకాక ముఖమంతా పులుముకున్న కాటుకలాగా వున్నాయి ఆకాశంమీది మబ్బులు. నాలుగు వేపులా కొండకొమ్ముల మీదనుంచీ కమ్ముకుంటూ వచ్చిన మబ్బులు లోయలోని వూళ్లమీద చిక్కటి నీడలు పరుస్తూ ఎక్కడ ముంచెత్తుదామాఅని తహతహ లాడుతున్నాయి.

చూస్తుండగానే గులకరాళ్లు దిమ్మరించినట్లు చినుకులు పడసాగాయి.

అంతవరకూ పొలం సాగుబడిని, తిండినిగురించి ఆలోచిస్తున్న సజ్జాకి నేరేడుపళ్లు గుర్తుకువచ్చాయి. హఠాత్తుగా అతనికి కలవరం కలిగింది. వెంటనే దొడ్లోకివెళ్లాడు. నేరేడుచెట్లన్నీ విరగ కాచివున్నాయి. ఆకు ఆకుకీ కాయవంతున చెట్లన్నీ పచ్చగా నీలంగా కనబడుతున్నాయి,

చినుకులజోరు హెచ్చింది. దానికితోడు గాలి... కొంచెం సేపటిలో కాయలు దింపకపోతే రాలి చితికిపోతాయి. లేదా పెచ్చూడిపోతుంది. అంతా నేలపాలవుతుంది. వాగు నిండటం దేవుడెరుగు. ముందీ అవాంతరం తప్పించాలి.

పూనవ్‌ని పిలిచాడు. సమాధానంలేదు. లోపలికి వెళ్లిచూశాడు. భోలా వెదురుబద్దల కిటికీలోంచి చేతులు చాచి చూరునీళ్ల తడుపులో ఆనందిస్తున్నాడు. రాణికూడా అటూ యిటూ గంతులేస్తున్నది. పూనవ్ ఎవరింటికో వెళ్లినట్లుంది. వెంటనే ఒకచీర, పొడుగాటివాసం తీసుకుని భోలాని రమ్మనిపిలిచాడు సజ్జా. నేరేడుకాయలు దింపాలంటే, చెట్టుకింద యిద్దరు మనుషులు వెడల్పాటిగుడ్డ రెండువేపులా పట్టుకుంటే పైనించి వాసంతో కాయ రాల్చాలి. అప్పుడే కిందపడి చితకకుండా, మట్టి అంటకుండా కంటికి నదురుగా కాయ బుట్టలో మెరుస్తూ కొనేవాళ్ల కళ్ల నాకర్షిస్తుంది. కాని రెండోపక్క పట్టడానికి పూనవ్ లేదు.సజ్జా చీరను ఒకపక్కవిశాలమైనచెట్టు కొండానికున్న మేకుకు కట్టాడు. రెండవపక్క భోలా చేతికిచ్చాడు. భోలా వూతకర్రను ఒక చంకకింద మోపుకుని రెండుచేతులు బారజాచి చీరను వెడల్పుగా పట్టుకున్నాడు. సజ్జా చెట్టుకొమ్మలగూడు మధ్యకెక్కి కూర్చుని కాయలు విదల్చడం మొదలు పెట్టాడు.

చినుకులు జల్లయి జల్లు కడవపోతగా మారింది. రాణికి వర్షంఅంటే భయం. ఇంటి వాకిట్లోంచి వర్షంవేపు చూసి అరుస్తోంది. వడిగా వీస్తున్నగాలి తాకిడికి భోలాకు కింద పట్టు నిలవడంలేదు. పైనుంచి కాయలు చీరలో పడుతున్నాయి. గాలికి కొన్ని రాలి చీరకు దూరంగా పడిపోతున్నాయి.

చిక్కటివానతెరలు చుట్టుకుని కొండలు తమ నగ్నత్వాన్ని కప్పిపుచ్చుకుంటున్నాయి. భోలా బట్టలు తడిసి వంటి కంటుకుపోయాయి.

సజ్జా చెట్టుదిగాడు—చీరలో కాయలు ఇంట్లో పోశాడు...తర్వాత యింకొక చెట్టు...మరొక చెట్టు... యిలా మొత్తంమీద అన్నిచెట్ల కాయలు చేతనైనంత వరకూ రాల్చాడు. అవన్నీ యింట్లో ఒకమూల పెద్దకుప్పగా పోగుపడ్డాయి.

బట్టపిండుకుని తల తుడుచుకున్నాడు సజ్జా. భోలాకుకూడా తడిబట్టలు విప్పి పొడితుండుగుడ్డ చుట్టబెట్టాడు.

ముసురుకున్న మబ్బులకి తోడు చీకట్లు కమ్ముకువచ్చాయి. దీపం వెలిగిద్దా మనుకున్నాడు సజ్జా. తీరాచూస్తే దీపంబుడ్డిలో కిరసనాయిలు అడుక్కి చేరుకుంటున్నది. గూట్లో అగ్గిపెట్టెకూడా నెమ్మకుని నిప్పు రాజుకోలేదు.

* * *

వాన నిమ్మదించేసరికి పూనమ్ వచ్చింది. వస్తూనే మరొకవాన వచ్చినట్లయింది.

'ఛీ...ఛీ...పాడుకొంప...పాడువూరు. ఎండలు తగులెట్టేతుంటాయి. వానలు ముంచెత్తుతుంటాయి. ఇక్కడంతా సిరి ఒలికి బోతున్నట్టు ... నూ అయ్య వూరికెల్దాం రమ్మంటే ... ఎక్కడలేని రోషం. ఈ కుంటివాడొక గుదిబండ నా మెడకు. ఎందుకూ పనికి రాడు ... ఇంతకీ నేరేడుపళ్ళు నీళ్లపాలు చేశావా ... ఏదన్నా జాగ్రత్తపడ్డావా' అని అడిగింది—ఒకమూల చింకి చాపమీద భోలాను పడుకోబెట్టి పక్కః కూర్చున్న సజ్జాను. జవాబు చెప్పలేదు సజ్జా.

'ఇంతసేపూ యెక్కడ తగులడ్డావే నువ్వు' లేచి నుంచున్నాడు. మామూలుగా అయితే మాట్లాడే వాడు కాదు. కాని యీ రోజు ఎందుకో అలా లేదు. బతుకంతా తన చేతుల్లోంచి జారిపోయి పగ్గాల్లేని బండిలా పడిపోతున్నట్టున్నది దాని కిష్టంవచ్చి దోవలో. ఏదో రెండురొట్టెలుకాల్చి తన మొహాన పడేస్తుం దన్న వుద్దేశ్యంతో మూడేళ్ల క్రితం పూనమ్‌ని పెళ్లా డాడు. వయస్సులో కొంత తేడావున్నమాట వాస్తవమే కానీ అది అంతబాధాకరమైన విషయంకాదు. ఎటొచ్చీ దానికి మనసులేదు...

సజ్జా ప్రశ్న విని పూనమ్ నిర్ఘాంతపోయింది. ఏదో కొత్తగా అగుపిస్తున్నాడు.

'ఆఁ...ఆఁ...మహారాజులా నిన్ను కూచుండ బెట్టి సేవ చేయడానికేగా నేను...యెక్కడికి వెళ్ల ఢానికి వీల్లేదాయె.'

మాట పూర్తికాకుండానే చెంప చెళ్లుమన్నది. కళ్లల్లో నీళ్లు తిరిగాయి. ఆశ్చర్యంతో, దుఃఖంతో నోట మాట రాలేదు.

'ఛీ...నిన్నుచేసుకున్న పాపం నాది...'అంటూ సజ్జా చూరులో పాతగోతాం దులిపి తలమీద వేసు కుని ఆ వానలో బయటకు వెళ్లిపోయాడు.

'ఇదంతా నీమూలానే ముదరష్టుడా...'

ఎవరిని గురించి అన్నదో భోలాకు తెలుసు. వాడి దురదృష్టం ఏమంటే వాడు వినగలడు. అర్థం చేసుకోగలడు. బాధ పడగలడు. ఆనందించగలడు... అవసరమైతే...;

పడుకున్నవాడు లేచి గుడ్డతో నేరేడుకాయలు తుడువడం మొదలుపెట్టాడు.

రాత్రి ఎప్పుడొచ్చాడో యేమో తెల్లారేసరికి నేరేడుపళ్లు బుట్టలో నింపుకుని స్టేషనుకి ప్రయాణ మవుతున్నాడు సజ్జా పూనమ్ మాటాడలేదు. ఏతెల్లవారుజామునో కునుకుపట్టిన భోలా యింకా లేవలేదు. సజ్జా బయలుదేరాడు. పదడుగులు వెళ్లాక లోపలినుంచీ అరుస్తున్నది పూనమ్.

'అన్నీ అమ్ముకురా. ...ఇంకా యింటినిండా పడున్నాయి.'

మాట్లాడకుండా నడిచాడు సజ్జా.

వర్షంవల్ల సజ్జా దొడ్లో చెట్లేకాదు. ఊళ్లో వాళ్లందరూ కాయలు రాల్చారు. కొన్ని పండినవి... కొన్ని పచ్చివి...స్టేషనులో ఎక్కడచూసినా నేరేడు కాయలమ్మే పిల్లలే. మధ్యాహ్నమైనా యింకా సూర్యుణ్ణి కట్టిపడేసే వుంచాయి మబ్బులు. సన్నగా తుపర పడుతూనే వున్నది.

రాత్రి నిద్రలేక తిండిలేక తలదిమ్ముగా ఒళ్లంతా నీరసంగావున్నది సజ్జాకి. అట్లాగే సాయం కాలందాకా నిలబడ్డాడు. పాసింజర్లు వచ్చాయి... పోయాయి. బుట్టలో సగంకూడా తరగలేదు. ధర కూడా మామూలుకంటె సగమే కిట్టుబాటయింది.

నీరసంగా కొంపకి చేరాడు. మాట్లాడకుండా

డబ్బులుతీసి పూనమ్ చేతికిచ్చాడు. ఏకళ నుందో పూనవ్‌ు వెంటనే రెండు రొొట్టెలు కాల్చియిచ్చింది.

రాత్రి మళ్లా జోరున వాన మొదలయింది. వానలో తడిసిపోతున్న చెట్లఆకులు రొద పెడు తున్నాయి.

భోలా కుక్కని నిమురుతూ ఒకమూల పడు కున్నాడు. కుక్కి మంచంలో నడుం వాలుస్తూ సజ్జా అనుకున్నాడు...'రేపైనా ఒక ఎక్స్‌ప్రెస్‌బండి ఆగితే బాగుణ్ణు'. అనుకోవడంకాదు. పైకే అన్నాడు.

'రేపో ఎల్లుండో యీ కాయ అమ్ముడుకాక పోతే పాడైపోతాయి. ఎలాగోలా ఎక్స్‌ప్రెస్ ఆగేట్లు చూడకూడదూ'అంది పూనవ్‌ు.

'అది మన చేతుల్లోవుందా యేమిటి...'

'స్టేషన్‌మాష్టరుబాబుని బతిమాలకూడదూ కొంచెంసేపు ఆపించమని...పెద్దవాడుగదా!...'

ఒక్కక్షణం సజ్జాకి ఆ సలహా నచ్చింది. కాని వెంటనే తెలిసివచ్చింది స్టేషన్‌మాష్టరేమీ చేయలేడని. ఒకసారి ఎక్స్‌ప్రెస్‌బండి గార్డు ఎడాపెడా దబా యిస్తుంటే మాటాడకుండా తల దించుకున్నాడు. ఈ వూళ్లో వున్నవాడేగదా స్టేషన్‌మాష్టరు. ఆయన్ని వూళ్లోవాళ్లు తప్ప బయటివాళ్లెందుకు గౌర విస్తారు...అది జరిగే పనికాదు. ఏదన్నా క్రాసింగు లాంటిది వుంటే తప్ప ఎక్స్‌ప్రెస్ ఆగదు...'

తన ఆలోచనఅంతా నోటితోకూడా చేశాడు సజ్జా. పూనమ్ యింకేం మాట్లాడలేదు. నెమ్మ దిగా పడుకున్నది.

రాణి నిద్రపోయినా యింకా నిమురుతూనే వున్నాడు భోలా.

మర్నాడు నేరేడుకాయలు గోతంనిండా పోసి మూతిబిగించి తలమీద కెత్తుకుని ఖాళీబుట్ట చేత్తో పట్టుకుని బయలుదేరాడు సజ్జా. ఏదో యింత కడు పులో పడేశాడు. కాస్త సత్తువగానే వున్నది.

బయట యింకా వాన కురుస్తూనే వున్నది. స్టేషనులో ప్రయాణీకు లాట్టేమంది లేరు— ఉన్న నలుగు రయిదుగురూ రేకులకింద కూచున్నారు. సజ్జాకూడా గోతం ఒకమూలపెట్టి బుట్టనిండా పళ్లు తీసుకుని గోతం మళ్లీ కట్టేశాడు. కూలీకి దానిమీద ఒకకన్నేసి వుంచమని చెప్పాడు.

అక్కడక్కడ మబ్బు పలచబడ్డా సూర్యుడు కనిపించడం లేదు. పొద్దున రావాల్సిన పాసింజరు ఆ రోజు నాలుగుగంటలు లేటు. అంటే ఎక్స్‌ప్రెస్ పోయేదాకా రాదు. అటూ యిటూ కొంచెంసేపు తారట్లాడాడు సజ్జా.

ఎక్స్‌ప్రెస్ వచ్చే వేళయింది. సిగ్నలు పైకి లేచింది. స్టేషనుమాష్టరు ఆకుపచ్చజండా పట్టు కుని ప్లాటుఫారంమీదకు వచ్చాడు.

'ఏం...సజ్జా బేరంవున్నట్టు లేదే...'

సజ్జా పైకి చూచాడు 'వాడిదయ...' అన్నట్టు. ఎక్స్‌ప్రెస్ గుండె లదిరేట్టు చప్పుడు చేసుకుంటూ వస్తున్నది. నిర్లిప్తంగా దానివంక చూస్తూ నిల బడ్డాడు సజ్జా. స్టేషనుమాష్టరు ఆకుపచ్చజండా ముందుకు చాచి పట్టుకున్నాడు.

రైలు సిగ్నలుస్తంభందాటింది. ప్లాటు ఫారంమీదకు వచ్చింది. ఇంజను దూకుడికి ప్లాటు ఫారం వణుకుతున్నది. ఇంజన్లో డ్రైవరు తీవిగా స్టేషనుమాష్టరు వంక ఒక చిరునవ్వు విసిరాడు. ఇంజను ప్లాటుఫారం రెండోచివర దాటిపోయింది సిగ్నలు స్తంభం సమీపిస్తున్నది.

సజ్జా దానివంకే కళ్లప్పగించి చూస్తూ నిల బడ్డాడు, తనమీద దాని ఆధిక్యాన్ని మెచ్చుకుంటూ.

అలాగే చూస్తున్న సజ్జా ఒక్కసారి చకితు డైనాడు. కళ్లు నులుముకు చూశాడు ...సందేహం లేదు. ఎక్స్‌ప్రెస్ సిగ్నలు స్తంభందగ్గర ఆగిపోయింది.

సిగ్నలుమాత్రం 'నీయిష్టం నీకు దోవ యిచ్చాను నాదేం తప్పులేదు...' అన్నట్టు పైకిలేచి నిలబడింది.

సజ్జాకి ఎక్కడలేని బలంవచ్చింది. బుట్టలో తరిగిన భాగం నింపుకుని బండివేపు దౌడుతీశాడు. బండి చివరిపెట్టెలో ఎవరో కేకేశారు. అక్కడ దాదాపు సగంబుట్ట అయిపోయింది. ఇంకా ముందుకు పోయాడు. కాయలమ్ముడు పోతున్నాయి. జేబు చిల్లరతో బరు వెక్కుతున్నది. రెండు మూడు నోట్లు కూడా చేరాయి. ఇంజను వెనకాలపెట్టెదాకా వెళ్లేసరికి బుట్టలో కొద్దిగా మిగిలివున్నాయి.

ఇంజనుముందు పెద్దగుంపు పోగయింది. జేబు బరువెక్కిన సంతృప్తితో అదేమిటో చూద్దామని ముందుకు వెళ్లాడు సజ్జా. జనం గుంపుగా వుండటం వలన ఏంజరిగిందోతెలీడంలేదు...ఏమయితేనేం...దేవుడు చల్లగా చూశాడు. లేకపోతే క్రాసింగు లేకుండా ఎక్స్‌ప్రెస్ ఆగిపోవడమేమిటి...

నెమ్మదిగా అక్కడ తన ముందున్న ఎవరినో అడిగాడు, ఏంజరిగిందని.

'ఎవరో కుంటికుర్రాడు, కుక్క రైలుకింద పడ్డారుట......పాపం' ఆ పైమాట వినిపించలేదు సజ్జాకి.

రైలుపట్టాలమీది నెత్తురు స్టేషనుమాష్టరు చేతుల్లో ఎర్రజండాలాగా మెరిసింది.



# వెలుతురు మొక్క

శ్రీ కె. శివారెడ్డి

ఇంకా
హోటళ్ళు కన్ను మూయలేదు—
కప్పల ఆరాటాలు
ఆర్భాటాలౌతూ
చిక్కని పొగల్తో ఊహల్ని గుచ్చుకుంటూ
నిద్రించని గుండెల మెళ్ళో హారాలేస్తున్నాయి—
కిటికీపక్క పలచబడుతున్న చీకటి
దూరంగా చెట్లగర్భంలో సాంద్రమౌతున్నప్పుడు
నరాల్లో సముద్రాలు ఇంకనప్పుడు
ప్రాణాల్ని వెతుక్కుంటూ
చెట్టుని పుట్టని గాలిస్తూ
వేదనని వారబోస్తూ
కిళ్లీ కొట్టుముందో, పుస్తకాలషాపుముందో
ఎక్కడో ఒకచోట
ఇంత వెలుగును చూడాలనే తహతహలో
సర్వాన్ని సమీక్షిస్తూ, సర్వస్వాన్ని పణంగాపెట్టి
ఎంత వెర్రిగా—సాహసంగా—
కాళ్లకి కళ్లుంటయ్అంటే నమ్మరు
కళ్లల్లో నాగజెముడు పొదలుంటాయంటే నమ్మరు
కావాలంటే
ఆత్మని మండించి
అక్షరాలకు ప్రాణాలుపోసే
నా దేహంలో కళ్లులేని చోటెక్కడో చూపండి;
అలికినట్టున్న

లోకం చీకటి వాకిటిముందు
ఎవరో పుణ్యాత్ముత్మరాలు
ఇంత వెలుగు ముగ్గేసినట్లు
ఇక్కడే
ఈ గుండెపక్కో
ఈ గుడిసెపక్కో
ఉదయం పసికందు కేకేసినట్లు
అనుభవంలా—ఆత్మగతానుభూతిలా
కాలచక్రం సందుల్లోగుండా
రెప్పల తలుపుల్ని వత్తిగించి
నా పాదాల్ని పరామర్శించే వెలుగును
మా గుండె కళ్లల్లో పెట్టడానికి
రైలుపట్టాల సునిశిత దృక్పథంలా
ఒక ధ్యేయానికి బలిఅవుతున్న మా ప్రాణాలు
దుమ్మునీ—ధూళినీ—రాళ్లనీ—రప్పా
వంతెనకింద ఊబుల్నీ -ఎన్నో—మరెన్నో
నికృష్టజీవితాల నిస్తేజచిత్రాల్ని
నిరాడంబరంగా చిత్రీకరిస్తూ—
అవును కాంతికోసమే
ప్రాణంకోసమే -
ప్రయాణంలో సర్వస్వాన్ని
పోగొట్టుకున్న మేం
కన్నీటిని అదుక్కొం
కాంతి అణువును బద్దలుచేసేందుకు సిద్ధమే
వ్యక్తిగతసౌఖ్యం సమాధిగూట్లో
చూడు !
సదయ సహృదయుని నేత్రంలా
ధర్మాగ్రహంలా—త్యాగం నెత్తురులా
పెరిగే కాంతిమొక్క
మా సంతానం.

# "యయాతి చరిత్రము"
# మొట్టమొదటి అచ్చతెనుగు కావ్యమా?

శ్రీ శ్రీరంగాచార్య

అచ్చతెనుంగు కబ్బమున కాదిపదంబయి పొల్చు భాగ్యమును హెచ్చుగా కన్నదేశము' తెలంగాణ భూభాగము.

గోలకొండ సామ్రాజ్యమును పాలించిన తురుష్క ప్రభువులలో మల్కిభరాముడుగా పేరుగాంచిన ఇబ్రహీము ఖులీ కుతుబ్షా సుప్రసిద్ధుడు. ఇతని కాలములో తెనుగు సారస్వతము పలువిధములుగా విస్తరిల్లినది. గోలకొండ ప్రభువులు ఉర్దూ, పారసీభాషలతోపాటు తెనుగు సారస్వత నందనోద్యాన వనమును సైతము దివ్యకావ్యకుసుమములచే గుబాళింపజేసి కుతుబ్షాహీ సులాను లు తెనుగుసులానులు అని కీర్తిగాంచిరి.

ఈ యుగములోనే 'తపతీసంవరణోపాఖ్యానము', 'యయాతి చరిత్ర', 'వైజయంతీ విలాసము', 'రాజ నీతి రత్నాకరము', (నేబతి కృష్ణయామాత్యుని రచన) 'సుగ్రీవ విజయ'మను యక్షగానము ఇత్యాది రచనలు బయలుదేరినవి.1

ఇంకొక విశేషమేమనగా ఈ యుగములోనే మన సాహిత్యమునందు సరిక్రొత్తమార్గములు బయలుదేరినవి. వానిలో ముఖ్యమైనవి రెండు. (1) తపతీ సంవరణోపాఖ్యానమును అద్దంకి గంగాధరకవి మల్కిభరామున కంకిత మిచ్చెను. దీనితో తెనుగు కావ్య కన్యకకు మహమ్మదీయుడు కృతి 'భర్త' యగుట ఆరంభమైనది. (2) మచ్చున కెచ్చటనోనున్న అచ్చ తెనుగు పద్యమును చూచి అచ్చతెనుగులోనే కావ్యరచన చేయుట – ఇవి పద్ధతులు. మన సాహితీ సంప్రదాయములకు ఇవి వినూత్నములు. ఇందులో రెండవ పద్ధతియైన అచ్చతెనుగులో కావ్యరచన అనుదానికి ఆద్యులెవరు? ఈ విషయము ముఖ్యము.

మన సాహిత్యములో పూర్వుడైన యొక కవి మచ్చున కొక పద్యమును కొత్తపద్ధతిలో రచింపగా తరువాతి కవులు దానినిచూచి అదేపద్ధతిలో ఒక కావ్యమును వ్రాయుట యనునది పరిపాటి. అట్లే నిరోష్ఠ్య రచన2, అచ్చతెనుగు రచన మొదలైనవి. ఈ ప్రక్రియలు ఒక సాహిత్యముగా పరిణమించినవి.

ఉత్తరహరివంశమునందు నాచన సోముడు (2—171, 172) అచ్చతెనుగు పద్యములు వ్రాసెను. వానిని చూచి తర్వాతి కవులు ప్రత్యేకముగా గ్రంథములనే వ్రాసినారు. (నిరోష్ఠ్యపద్యరచనగూడా సోమునితోనే ఆరంభము కావచ్చును. (1—106.) అంతటితో ఆగక అచ్చతెనుగులో కొన్ని నియమములతో అనగా నిరోష్ఠ్య, నిర్గద్య, నిర్వచనము మొదలైన నియమములతో రచనలు చేసిరి.

ఈ విధమైన అచ్చతెనుగు ప్రభావము మొట్ట మొదటిమారుగా కుతుబ్షాహీ సుల్తానుల కాలములోని కవులైన మరింగంటి సింగరాచార్యులు, పొన్నికంటి

---

1. విశేషములకు, చూ:–'కుతుబ్షాహీ సుల్తానులు—ఆంధ్ర సంస్కృతి'అను గ్రంథము. సంపాదకులు — బి. రామరాజుగారు. (1962 ప్రచురణ—ఇదారఅద్బియాతె — ఉర్దు; పంజగుట్టరోడ్, హైదరాబాదు.)

2. చూ:—'దశరథరాజనందన చరిత్ర' — మరింగంటి సింగరాచార్యులు—పీఠికయందు ఆంధ్ర సాహిత్యములో నిరోష్ఠ్యరచన అను భాగము. (నా పరిష్కరణతో ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడెమీవారు 1970 లో ప్రచురించిన గ్రంథము.)

తెలగన్న అను వారలపై బడినది. వీరిలో సింగరాచార్యులు శతఘంటావధానుడు, వింశతి నిరోష్ఠ్య, ఓష్ఠ్య ప్రబంధ నిర్మాత. అంతేగాక శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతాకళ్యాణమును గూడా వ్రాసినాడు[3]. పొన్నిగంటి తెలగన్న యయాతిచరిత్రమును[4] అచ్చతెనుగు కావ్యముగా వ్రాసి మల్కిభరాము వద్ద మీార్ జుమా (అర్థికశాఖామంత్రి) పదవిలోనున్న అమీానుఖానునకు అంకిత మొసంగిన విషయము సాహితీ లోకమునకు పరిచిత పూర్వము. వీ రుభయులు అనగా సింగరాచార్యుడు, తెలగన్న ప్రప్రథమముగా అచ్చతెనుగులో కావ్యరచన చేసినవారు. కాని—ఈ ఉభయులలో ఎవరి కృతి ముందు? అనునది విచారణీయము.

నేటివరకు మన సాహితీప్రపంచము నందు అందరును తెలగన్న యయాతిచరిత్రయే మొట్ట మొదటి అచ్చతెనుగు కావ్యమని భావించుచున్నారు. నా యభిప్రాయము ప్రకారముగా లభించిన ఆధారముల ననుసరించి (ఉభయుల కృతుల నాధారముగా) మొట్ట మొదటి అచ్చతెనుగుకావ్యము 'యయాతి చరిత్ర' కాదనియు, ఈ ప్రక్రియకుకూడా నిరోష్ఠ్య ప్రక్రియవలెనే మరింగంటి సింగరాచార్యులే శ్రీకారము చుట్టినాడనియును.

తెలగన్నకుముందు సింగరాచార్యుడు శుద్ధాంధ్రములో నిరోష్ఠ్యముగా సీతాకల్యాణమును వ్రాసినాడు. తెలగన్న కృతికన్న ఇదియే మొదటిది. ఈ విషయమును నిరూపించుటకు ముందు యయాతి చరిత్ర, శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతాకల్యాణము—వీని కృత్యాదులలోగల పద్యములను పరిశీలింపవలయును. తెలగన్న తన రచనయే అచ్చతెనుగునకు మొదటి రచనయని ఇట్లు తెల్పినాడు—

క. 'మున్నెవరు నొడువని యీా
తెన్నిడి కడుమీాఱి యచ్చతెనుగుం గబ్బం
బెన్నిక మీాఱగ జెప్పిన
నిన్నుం బొగడంగఁ గలఁడె నెలతాల్పయినన్.
(1—11)'

ఉ. అచ్చ తెనుంగుఁ బద్దె మొకటైనను
గబ్బములోన నుండినన్
హెచ్చని యాడుచుందు రది యెన్నుచు
నేర్పునఁ బొత్తమెల్ల ని
ట్లచ్చతెనుంగున న్నొడువ
నందుల చందమెఱుంగు వా రెదన్
మెచ్చరొ, యుబ్బరంబనరొ,
మేలనరో, కొనియాడరో నినున్—(1. 12.)

ఈ రెండు పద్యాలు తెలగన్నయే అచ్చతెనుగు కావ్యరచన కాద్యుడని నిరూపించుట కాధారములు.

శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతాకల్యాణములోగల పద్యములును ఇట్లే గలవు. ఆ పద్యము లివి.

క. మున్నెవ్వడు నుడువని యీా
తెన్నెడయెడ మీారి యచ్చ తెనుఁగు నిరోష్ఠ్యం
బెన్నికఁ జెప్పిన ప్రోడన్,
నిన్నుం బొగడంగ గలడె నెలతాల్పయినన్—
(1—21.)

ఉ॥ అచ్చతెనుంగు బద్దె మొకటైనను
గబ్బములోన నుండినన్
హెచ్చని యాడుకొందు రొగి
నెన్నుచు (నేర్పున) గ్రంథమెల్ల ని
ట్లచ్చతెనుంగునన్ నుడువ నందలి
చంద మెఱుంగువారు ని

---

3. ఈ గ్రంథము ప్రప్రథమముగా 'ప్రబంధ కల్పవల్లి' అను పత్రికలో ప్రచురింపబడి—అనంతరము అనగా 1910 లో గుంటుపల్లి సామయ్యగారిచే గుంటూరులో గ్రంథముగా ముద్రింపబడినది. ప్రస్తుత మీ గ్రంథ మలభ్యము. మా వద్ద ఒక వ్రాత ప్రతి గలదు. (దశరథ రాజనందన చరిత్ర అనుబంధములో ఇందలి కృత్యాది పద్యము లొసంగినాను.)

4. ఈ గ్రంథమును 1930 లో వావిళ్ల వారును, 1967 లో నారి నరసింహశాస్త్రిగారి పరిష్కరణతో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ వారును ప్రచురించిరి. లోగా రాజమహేంద్రవరములో ముద్రింపబడినట్లు వావిళ్లవారి గ్రంథపీఠిక (పుట 8) తెల్పుచున్నది

న్మెచ్చరా ! యబ్బురంబనరా !
మేలనరో ! కొనియాడరో ! కడున్—
(1—22)

ఇరువురి పద్యములకును భేదములేదు. కాని సింగరాచార్యుల పద్యములందు కందములో క్రీగీత గీసిన భాగములో మాత్రము భేదమున్నది.

ఉభయుల కృతులయందు ఈ పద్యములు సమానముగా గలవుగదా? అయినచో ఎవరి పద్యములను జూచి యెవరు వ్రాసి రనునది యనుమానము — ఇది నిర్ధారణమైనచో మిగతా విషయము సుగమము. కావున మొదలు యయాతి చరిత్రలోని పద్యములను గూర్చి పరిశీలింతము. పై నుదాహరించిన 11, 12 సంఖ్యగల పద్యములు, ముఖ్యములైనవి — వీనికి ముందు రెండు పద్యములు గలవు. మరింగంటి అప్పలాచార్యులవారు తెలగన్నను పిలిచి అమీనుఖానునకు యయాతిచరిత్రము నంకిత మీయవలసినదిగా కోరుచూ అనిన పద్యములు—

మ॥ తనకు న్నిచ్చలు మ్రొక్కువారిని
సిరుల్ దైవారగాఁ జల్లచూ
పున నెల్లప్పుడు చూచి మన్నగల
పెంపొందన్ మఱింగంటి యు
ప్పనగారిన్ మదిలోనివ్మాటదెలియం
బాటించుచుం గాంచినన్
గని యామేటి తలంపెఱింగి పొసగంగా
నన్ను మన్నించుచున్— (1—9)

ఆ॥ పిలిచి పొన్నికంటి తెలగన్న, నీ చేయు
నచ్చతెనుఁగుఁ గబ్బ మన్నియెడల
మించి వెలయఁగా నమీనుఖానున కిచ్చి
పుడమిలోన సిరులుఁ బొగడ గనుము!—
(1—10)

ఇందు పేర్కొనబడిన మఱింగంటి యప్పనగారు సింగరాచార్యుల కగ్రజుడైన అప్పలాచార్యులు. ఈయన ముగురురాజులచేత మొక్కులు గొన్నట్టి భగవత్సమానుడని దశరథరాజనందనచరితలోనేగాక, సీతాకల్యాణములోనూ, 1770 ప్రాంతమువాడైన మరింగంటి వెంకట నరసింహాచార్యుల 'చిలువ పడిగరేని పేరణము'[5] నందును 'గోదావధూటీ పరిణయము'[6] నందును, వారణాసి అచ్యుతరామకవి 'సురతాణీ పరిణయము' నందును పేర్కొనఁ బడినాడు. మల్కిభరాం ఆస్థానములో ఉన్న కవులయందు అప్పలాచార్యు లొకడు. ఈయన రాజపూజితుడు, వేద శాస్త్ర ప్రవీణుడు, సరస సాహిత్య లక్షణ చక్రవర్తి, ఉభయభాషా కవిత్వధుర్యుడు. (దశరథ ..1—8)

ఈయన సింగరాచార్యుల కృతిని చూచి దానిలోని పద్యములను గమనించినవాడు. అయినను రాజాశ్రయములేక ఏదో మారుమూలగ్రామములో ఉన్న సింగరాచార్యులు తన కృతిని నరాంకిత మొనర్చుటకు విముఖుడైనాడు. (ఈయన కృతులన్నియు దైవాంకితములే.) అప్పలాచార్యులు, తెలగన్నయు మిత్రులు. నరాంకిత విముఖుడైన తన తమ్ముని రచనను మహమ్మదీయ అధికారికి అంకిత మిప్పించుటలో కృతకృత్యుడు కాజాలని అప్పలాచార్యులవారు భాషాభిమానముతో తెలగన్న కృతిని అమీనుఖానునకు అంకిత మిప్పించి కృతకృత్యుడైనాడు. ఆ సందర్భములోనే తెలగన్నతో అప్పలాచార్యు లిట్లనెను.

'మున్నెవ్వరు నొడువని.........' అచ్చతెనుంగు బద్దె మొకటైనను.........' (1—11, 12.) ఈ పద్యములు అప్పలాచార్యులవారు స్వంతముగా చెప్పినవే. కాని తెలగన్న పద్యములు మాత్రముగావు. వీనిని తనవానివలెనే తెలగన్న తెల్పినాడు. తెలగన్న తెల్పినాడనుట కన్న ప్రప్రథమముగా ముద్రించినవారు ఈ రెండు పద్యములకు ఆద్యంతములలో అనువాదచిహ్నము (INVER-

---

5. 'యయాతి చరిత్ర' పీఠికలో శ్రీ నోరి నరసింహశాస్త్రిగారు 'చిలువపడిగరేని పేరణము'ను సింగరాచార్యుల కృతిగా తెల్పిరి. అది పొరపాటు. ఆ గ్రంథమునుగూర్చి శ్రీ ఆదిరాజు వీరభద్రరావుగారు 'మన తెలంగాణము' అను గ్రంథములో (1963 ము.) సంక్షిప్త పరిచయ మొనర్చిరి. (పుటలు—24—25).

6. ఈ గ్రంథము 1956 లో నల్లగొండ (రామగిరి) మహిళానవూజమువారు ఆసూరి మరింగంటి శ్రీ రంగాచార్యులవారి సంపాదకత్వమున ప్రచురించిరి.

TED COMMA) '——' ఉంచకపోవుటతో ఏర్ప డిన చిక్కు యిది. (ప్రప్రథమముగా రాజమహేంద్ర వరములో ప్రచురింపబడిన ప్రతిని, సాహిత్యపరిషత్తు వారి వ్రాతప్రతిని పరిశీలించినచో ఈ పద్యముల స్థితి తెలియునేమో!) కొందరు కవులవలె కృతిభర్తయో మరెవ్వరో 'ఇట్లనిరి'—అని కవి వ్రాసిన పద్యములుగా వీనిని భావింపవీలులేదు. సరససాహిత్యలక్షణచక్రవర్తి యైన అప్పలాచార్యులవారు సీతాకల్యాణములోని పద్య ములను చూచినవారు కావున వానినే ఈ సందర్భమున ఉపయోగించిరని భావింపవలయును. ఇది తెలగన్న పద్య ముల తీరు.

ఇక సింగరాచార్యుల శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతాకల్యాణ పద్యముల బరికింతము. 14 నుండి 18 నెంబర్లుగల పద్యములలో సింగరాచార్యులు తానే యే వయస్సు నందు యేగ్రంథమును రచించినది తెల్పి నాడు. వాని ప్రకారముగా 19 వ యేట దశరథరాజ నందన చరిత్రయు, 20 వ ఏట శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతాకల్యాణమును వ్రాసెను. ఈ రెండు పుస్తకములపేర్లను కవి ప్రత్యేకముగా తెల్పక 18 వ పద్యములో 'ఎలమిగావించి తిరువదియేండ్లనాడు ఘన నిరోష్ఠ్యాది వింశతి కావ్యములను'—అని తెల్పెను. దశరథరాజనందన చరిత్ర పేర్కొనబడినది. అనగా సీతాకల్యాణ రచనవరకే దశరథరాజనందనచరిత్రను చేసెను. వీనివలన సింగరా చార్యులు 20—25 ఏండ్ల మధ్యవయస్సులోనే నిరోష్ఠ్య సీతాకల్యాణమును వ్రాసినట్లు నిశ్చయము. ఇదియేగాక నేబతి కృష్ణయామాత్యుడు తన రాజ నీతి రత్నాకరములో—

'ఆంధ్రభాషా నిరోష్ఠ్య మహాప్రబంధ
రాజి రచనా ధురీణు— కర్ణాటరాయ
లబ్ధ కవిసార్వభౌమ కల్యాణ బిరుద
శాలి మరుకంటి శింగరాచార్యుఁ డలతు[7].

(9) ననినాడు. దీనివలన ఆంధ్రభాషయందు నిరోష్ఠ్య ప్రబంధమును సింగరాచార్యులు వ్రాసినట్లేగాక ఆయనకు 'కవిసార్వభౌమ' బిరుదము కలదనిగూడా నాడు.

ఈ ఆధారములేగాక తనదే మొదటి అచ్చ తెనుగు కావ్యమని సింగరాచార్యులు ఇట్లు తెల్పు చున్నాడు—కర్పూరాద్రి నరసింహస్వామి ఈయనకు స్వప్నములో కనబడి—

'వత్స! నీ యెడ మత్కృప దనరు కతన
హెచ్చి భువిలోన నేరికి నెన్నరాని—
యచ్చతెనుఁగైన పదముల నమితకృతుల
నిచ్చ రచియించి యొసఁగితే యెలమివాకు—

(1—12)'—ననియును

'రాఘవ పాండవీయ కృతిరత్నము
పింగళి సూరనార్యుఁడే
శ్లాఘ సముద్ధరించె నది
సర్వబుధ ప్రతతుల్ గణింప నా
హా! ఘనమయ్యె దాని కెన
యంధ్ర నిరోష్ఠ్య మహాప్రబంధ మెం
తే ఘటియింపఁజేయ నలు
దిక్కులయందుఁ ప్రసిద్ధమయ్యెడున్'—
(1—20)

దీని తర్వాతగల 21, 22 నెంబరు పద్యములు లోగా నుదాహరింపబడినవి. 27 నుండి 34 వరకు గల పద్యములలో అచ్చతెనుగు అందులో నిరోష్ఠ్యము వీనితో రచన చేయుట యెంత శ్రమయో వ్యక్త పరచి— తన అచ్చతెనుగు కృతియయిన సీతాకల్యాణము నందలి నియమముల నిట్లు తెల్పెను—

క. 'తరమక ప్రతిపదములు ప
ల్మరు నరయుచు సముచితోక్తమార్గంబులనున్
దెఱగులఁ దెలియుచు నర్థం
బెఱుఁగగ దగునుభయ సంధు లెనయుట కతనన్'
(1—32)

గీ. అరయ కగచజటడతదనాయలసహ
రద్వయమెకాని యొండక్షరములుఁ జొరవు
మఱియు నౌత్వోత్వములు కొమ్ము వామడియును
వలవ దావిాద సురభాష నిలుపరాదు'
—(1—33)

7. కుతుబ్షాహీ సుల్తానులు ఆంధ్ర సంస్కృతి—పుట—99,

క. 'ఇల సురభాషల కొన్నిటి
తిలకింపఁగ వికటమనుచు తిరమగు నామం
బులు కథలుఁ దెలియ కొఱకై
నిలిపితి కవిసమ్మతాన నిల్కడగాగన్'
—(1—34)

ఈ విధముగా సింగరాచార్యులు తెల్పుటను బట్టిచూడగా మొట్టమొదటి వారుగా అచ్చతెనుఁగులో రచన చేయుట ఇతనినుండియే ప్రారంభముకావున నీ పద్ధతు లన్నింటిని దెల్పెను.

ప్రప్రథమముగా ఒక వింతపద్ధతిలో అనగా చిత్రకవితాపథములో కావ్యరచనోద్యుక్తుడైన కవి తన రచనకు చేసికొనిన నియమములను తెల్పుకొనుట సామాన్యముగదా! కావున యయాతిచరిత్రమే మొదటి దైనచో రచనానియమములు ఏవియును లేకపోవుటకు కారణమేమి ?

'తెనుఁగునకు మాఱుపేల్లిడి
పెనచిన వినగూడదనుచు బిరుదులుఁ బేళ్లన్
మునువేల్పుబాసవెంబడి
నునిచెద గాదనకుఁడయ్య యుల్లము లందున్'.
(1—14.)

ఈ ఒక్కపద్యమే తెలగన్న కృతి నియమము తెలిపెనని సమాధానించుకొన వలయునా ? లేక ఈ మధ్య కొన్ని పద్యములు నష్టము లైనవని భావింప వలయునా ? (తెలుగుకవుల గ్రంథములకు ఇదియొక సంప్రదాయము.) ఇదియును కుదురదు. మొట్ట మొదటి కృతియే తనదైనచో తెలగన్న మరికొన్ని విషయములు వ్రాసియుండెడివాడు. కావున సింగరాచార్యుల కృతియే మొదటిదనియు దానినిచూచి తెలగన్న యయాతిచరిత్రమును రసవంతముగా 5 ఆశ్వాసములలో వ్రాసినాడనియు గ్రహింపవలయును. తెనుగులో షష్ఠ్యంత సంప్రదాయము రానురాను ఎట్లు పరిణతిజెందెనో అట్లే యయాతిచరిత్రము గూడా.

తెలగన్న సింగరాచార్యుల [illegible] దాని కన్న మెఱుగుగా నుండునట్లు యయాతి చరిత్ర మును దిద్ది తీర్చినట్లు ఈ క్రింది యాధారములు గలవు. సింగరాచార్యులు కథాభాగమును మాత్రమే అచ్చతెనుగులో వ్రాయఁగా ఆ పద్ధతి తెలగన్నకు బాగనిపింపక కృత్యాద్యంతములు షష్ఠ్యంతములు మొదలైన వానినిగూడా అచ్చతెనుగులోనే వ్రాసెను. మఱియు సీతాకల్యాణము 300 పద్యములతో 3 ఆశ్వాసముల పరిమితితోనుండి రామకథను తెల్పు చుండగా యయాతిచరిత్ర పద్యసంఖ్యలోనే గాక ఆశ్వాససంఖ్యలోమా, సీతాకల్యాణమును మించినది. యయాతిచరిత్రమను పేరున్నను రామకథాభాగమే హెచ్చుగాగలదు. ఈ భాగము కవితారీతిలో బాగున్నను అసందర్భముగా చేరిన దనవచ్చును. దీనికి కారణము తనకు పూర్వము అచ్చతెనుగులో రామకథాపరమైన కావ్యము వెలయుట కావచ్చును. ఈ సమకాలీన స్పర్థ ఎంతవరకు పోయినదనగా తనకృతిని రాజకీయోద్యోగికి అంకితమొనర్చి ప్రచార మొనరించుకొను నంతవరకు అవధి జూచినది. సింగరాచార్యుల రచన [illegible]నరాంకితమైనచో వ్యాప్తిచెందెడి దేమో !

దశరథరాజనందన చరిత్రను వ్రాయుచు సింగరాచార్యులు తనకు పూర్వము సంస్కృతములో నిరోష్ఠ్య రామాయణమున్నట్లు ఈ పద్యములో తెల్పెను—

'మునురామాయణము న్నిరోష్ఠ్యముగ
నింపుల్మీర శాకల్లె మ
ల్లన, తా సంస్కృత భాషఁజేసెనన
నాలాగున్ జెవుల్ నిండఁగా
వినుటేగాని ధరిత్రిలో నిజముగా
వీక్షింప లేదట్టి దేఁ
దెనుఁగున్ జేసెద నెల్లెడన్ గవులకున్
దృష్టాంతమై యేర్పడన్'— (1—32)

అని శాకల్యమల్లన నిరోష్ఠ్య రామాయణ మునుగూర్చి తెలిసినవాడు—తనకు ముందే యయాతి చరిత్ర ఉన్నచో తప్పక తెలిపియుండెడివాడు. దీనివలన గూడా సింగరాచార్యులదే మొదటి [illegible] యూహించుట కవకాశము ఉన్నది.

సింగరాచార్యులు తెలుగు నిరోష్ఠ్యకావ్యరచనకేగాక అచ్చతెనుగు కావ్యరచన కును, ద్వ్యర్థి, చతురర్థి కావ్యరచనలకుగూడా నితడే ఆద్యుడు.[8]

8. చూ : దశరథరాజనందన చరిత్ర—పీఠిక. సీతాకల్యాణము—కృత్యాది పద్యములు.

నేటివరకు అందరు భావించునట్లు అచ్చతెనుగు కృతికి ఆద్యుడు తెలగన్నకాక సింగరాచార్యులేయని నా యభిప్రాయము.

సింగరాచార్యులు ఏయేవయసులలో ఏయే గ్రంథములను వ్రాసినది సీతాకల్యాణ కృత్యాదిలో తెల్పెను. సుమారు ఇరువది పుస్తకములు పేర్లు తెలియుచున్నను వానిలో రెండుమాత్రమే ముద్రణమైనవి. మరింగంటి కవుల రచనలు ఎక్కువగా అముద్రితములు. అవియన్నియును సూర్యాలోకభాగ్యము నందిననాడు మరికొన్ని విశేషములు బయలుపడగలవు.

సంస్కృతాంధ్ర సారస్వతములలో నిరోష్ఠ్య రచనలో9, అచ్చాంధ్ర సాహితీవికాసము మొదలైనవానిని గూర్చి సమగ్రమైన పరిశీలన మొనర్చుట ఆవశ్యకము. తెలుగులోని నిరోష్ఠ్య కృతులను—అచ్చతెనుగు కృతులను పఠించుచుండగా కలిగిన ఒక సంశయము ఈ వ్యాసరచనోద్దేశ్యము. యథార్థకథనము ఎందరకో బాధ కలిగించును. సాహిత్యములో పరిశోధనమునకు ఇట్టి సంశయములు తప్పనిసరి.

చ॥ 'తెనుఁగునఁ గొన్నికావ్యములు
దెల్లముగా రచియింపవచ్చుఁ బే
ర్కొనఁగ నిరోష్ఠ్యకావ్యములుఁ
గొన్ని యొనర్పగ వచ్చుఁగాక చ
క్కన నివి రెండు చందములు
గ్రచ్చుఱ గూటిచి నేర్పుచేత నె
వ్వనికి రచింప శక్యమగు
వాంఛ యొనర్చితి దాని సేయగన్.'

[మరింగంటి సింగరాచార్యులు — శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతాకల్యాణం 1—27.]

———

9. చూ: 'చిత్రకవిత — నిరోష్ఠ్య సాహిత్యము'— అను నా వ్యాసము. 'పరీధావి' సంవత్సరాది సంచిక.



# పండితరాయల ఖండన మండనలు

డా. మహీధర నళినీమోహన్

భర్తృహరి శృంగార వైరాగ్య శతకాలను పరిశీలిస్తే రెండూ ఒక్క కవి వ్రాసినవేనా అనిపిస్తుంది. శ్లేష యమక చక్రవర్తి అయిన వేంకటాధ్వరి వ్రాసిన విశ్వగుణాదర్శంలో ఒకే వస్తువును పొగడడమూ తెగడడమూ కూడా కనిపిస్తుంది. అందులో విశ్వావసువు, కృశానువు అనే ఇద్దరు గంధర్వులు ఆకాశయానం చేస్తూ తమకు కనిపించిన విశేషాల నన్నిటినీ చమత్కారంగా వర్ణిస్తూ పోతారు. విశ్వావసువుకి అంతటా మంచే కనిపిస్తుంది. కృశానువుకి అంతటా చెడుగే కనిపిస్తుంది. ఆ ఇద్దరి అభిభాషణలూ సయుక్తికమే ః ని పఠితలకు తోపింప కేయడంలోనే ఉంది కవి యొక్క గొప్పతనం.

ఈ విధంగా పరస్పర వ్యతిరేక అభాసములైన వర్ణనలు సాహిత్యంలో అక్కడా అక్కడా కనిపిస్తూ ఉంటాయి. ఆలోచిస్తే వాటిని సమర్థించ గలగడం కవియొక్క బుద్ధి నైశిత్యానికి గీటురాయి అనిపిస్తుంది. వస్తువులలోని గుణదోషాలను వేరువేరుగా గ్రహించ గలగడానికి నిశితమైన పరిశీలన కావాలి. పరిశీలించిన దానిని తార్కికంగా విశ్లేషించగల నేర్పు కావాలి. ఆ తరవాత రసము, ధ్వని, చమత్కారము, ధార, శయ్యవంటి అంగోపాంగాలు కవిగారి సామర్థ్యాన్నిబట్టి తగిన పాళ్లల్లో ఉంటాయి. అప్పుడే కదా రసికజనశిరఃకంపం !

భాషమీదనే కాకుండా భావుకతమీాదకూడా ్యం కవికి గలదని తోపింపజేసే ఇటువంటి స్వవచోవ్యాఘాతభ్రాంతిజనకములైన రసవత్తర ఘటాలు పండితరాయల భామినీవిలాసంలో అడుగడుగునా ఎదురు అవుతూఉంటాయి. అతగాడి కత్తికి రెండువైపులా పదును ఉన్నదనిపించే సన్నివేశాలు కొన్ని పరిశీలిద్దాం.

## నెమలి

నెమలికి పాములను చంపగల శక్తిఉంది. గరుత్మంతుని తరవాత ఇటువంటి శక్తిగల పక్షి ఇదే. పైగా గద్దకులేని అందచందాలు నెమలికి ఉన్నాయి. కనుక ఈ పక్షిని మెచ్చుకోవడంలో వింతఏమీా లేదు.

మలయపర్వతంమీాద మంచిగంధపు చెట్లు ఉంటాయి. చెట్లని చుట్టబెట్టుకుని తాచు పాములు ఉంటాయిట. ఆ చెట్లని సేవిద్దామనివచ్చే జనం ఆ పాములకి భయపడి దూర దూరంగా పోతూ ఉంటారు. ఆ మలయపర్వతంమీాద కాకులు, కపోతాలు, కోళ్లు, కొక్కిరాయిలువంటి చిల్లర మల్లర పక్షులు ఎన్నిలేవు ? వాటివల్ల ఆవగింజంత ఉపయోగం అయినా ఉందా ? అవి ఉన్నా ఒకటే, లేకపోయినా ఒకటే. మంచి గంధపుచెట్లని చుట్టబెట్టుకున్న తాచుపాములను తన కేకమాత్రంచేత హడలగొట్టి, తరిమివేసి, సర్వజనానందాన్ని కలిగించగల నెమలి ఒక్కటంటేఒక్కటి ఉంటే చాలదూ?

రాజాస్థానాల్లో మహావిద్వాంసుల్ని దగ్గరకు చేరనీయకుండా తిష్ఠవేసుక్కూర్చున్న దుర్మార్గులను తరిమివేయగల దక్షుడు ఒక్కడుఉన్నా చాలుగానీ, దోమల్లాంటి అల్పులు ఎంతమందిఉన్నా ఏం లాభం ? అని ధ్వని.

## శార్దూల విక్రీడితం

ఏతస్మిన్ మలయాచలే బహువిధైః
కిం తైరకించిత్కరైః
కాకోలూకకపోతకుక్కుటగణై
రేకోపి పార్శ్వ స్థితః
కేకీ కూజతి చే త్తదా విగళిత
వ్యాళావళీ బంధనః

సేవ్యస్స్వ్య దిహసర్వలోకమనసా
మానందనశ్చందనః

**శారూల విక్రీడితం**

కా కోలూక కపోత కుక్కుట
ఖగస్కంధంబు లెన్నెన్నియో
లేకేమీ మలయాద్రి మీద?
ఫలమా? లేశంబు లేదాయెగా
కేకన్ సుందర చందన
... సమాకీర్ణాహిజాలంబులన్
పోకార్పంగల నెమ్మి చాలును
జనామోదంబు సంధింపగన్.

ఈ విధంగా మెచ్చుకున్న నెమలినే మరో చోట నిందిస్తున్నాడు మరో కారణం చూపించి.

నెమలి చాలా అందమైన పక్షి. నెమలికన్నులను సార్వభౌములుకూడా తలమీద తురాయిగా పెట్టుకుంటారు. అందుకని ముచ్చటపడి ఒకడు నెమలి దగ్గరకువెళ్లి అర్థిస్తున్నాడు. 'తలలో పెట్టుగుంటాను. ఒక్కటంటే ఒక్క ఈక ఇవ్వవే నెమలీ! మంచి దానివికదూ!' అని. 'ససేమిరా ఇవ్వనుగాక ఇవ్వను' అని నెమలి పొగరుగా మెడ తిప్పుకుంటూ సాగిపోయింది. అడిగి అడిగి ప్రాణం విసిగిపోయి అతడు నెమలిని నిందిస్తున్నాడు. 'కాళ్లావేళ్లాపడి ఒక్కకన్ను ఇవ్వవే అని బతిమాలుతున్న నాకు ఎందుకు ఇస్తావు నెమలీ! ఏ కిరాతుడో ఉచ్చువేసి నిన్ను పట్టుగుని, నీ రొమ్ముమీద ఎడమకాలువేసి తొక్కిపట్టి, నీ పింఛం అంతా నిర్దాక్షిణ్యంగా ఊడలాక్కుపోతే కిక్కురుమనకుండా వాడికి ఇచ్చేస్తావుగాని నా బోటి వాడికి ఇస్తావా?'

బాబ్బాయి అని బతిమలాడే యాచకుడికి ఒక్కరాగి డబ్బు విదల్చని ధనికుడైన లోభిని మనస్సులో ఉంచుకుని చేసిన కల్పన ఇది. ఏ బందిపోటో నీ కొంపమీదపడి, నీ పెడరెక్కలు విరిచికట్టి, ఉన్నడబ్బు అంతా వూచికపుల్లతోసహా ఊడ్చుకుపోతే కుక్కినపేనులా కిక్కురు మనకుండా వాడికి అప్పచెప్తావుగానీ దీనుడైన యాచకుడికి గుప్పెడు గింజలు వేయడానికి నీకు మనసు ఒప్పుతుందా? అని ధ్వని.

**వసంత తిలక**

రేరే శిఖావళ! శిఖా భరణాయ బర్హ
మేకం దిశే త్యనునయా న్మమ కిం దదాసి?
భిల్లాయ వామచరణం హృదయే నిధాయ
నిర్లుంచతే దిశసి నిర్దయ మథ్యమానః

**శార్దూల విక్రీడితం**

ఈకన్నొక్కటి కొప్పులో తురుమగా
నిమ్మంచు నే వేడినన్
కేకీ! నా కిపుడేల యిచ్చెదవు ?
నీ గ్రీవమ్ము నే భిల్లుడో
డాకాలన్ బిగియంగ నొక్కి
మొదలంటన్ నిర్దయస్వాంతుడై
పీకంబూనిన వేళ నిచ్చెదవులే
పింఛంబు నవ్వానికిన్.

* * *

**మంచిగంధపు చెట్టు**

'అపకారికి నుపకారము, నెపమెన్నక సేయువాడు నేర్పరి' అనే సూక్తికి అమోఘోపమానంగా నిలువబడ గలిగినది చందనవృక్షమని పండితరాయలు దానిని అనేక విధాలుగా శ్లాఘించాడు. ఎంత పొగిడినా అతగాడికి తనివితీరదు.

తనని ముక్కలు ముక్కలుగా నరికిన గొడ్డలికికూడా తన అపురూపసౌరభాన్ని సమర్పిస్తుందిట చందనం. అంతేకాని కించిత్తూ కోపగించదట. మంచితనానికి ఇది పరాకాష్ఠ కాదూ ?

**ఆర్యా**

సుజనో హి యాతి శాంతిమ్
పరహితబుద్ధి ర్వినాశ కాలేఽపి
ఛిన్నోఽపి చందన తరుః
సురభయతి ముఖం కుఠారస్య.

**ఆటవెలది**

ఆత్మనాశకాల మందైన సుజనుండు
పరహితైకబుద్ధి వదలబోడు
పరశు ముఖమునైన సురభిళం బొనరించు
నరుక బడెడు చందనంపు తరువు.

ఇంతగా పొగిడిన మంచిగంధపు చెట్టునుకూడా నిందిస్తున్నాడు దోషం వెతికి పట్టుకుని.

మంచిగంధమా! నీ పరిమళం త్రిలోకముల యందూ ప్రసిద్ధమైనది. నీ శీతలత్వం లోకోత్తర మైనది. నీ కీర్తి దిగంగనల వాకిళ్లదాకా విస్తరించింది. నీవి అన్నీ మంచిగుణాలే. కాని ఏం లాభం? నీ తొర్రలలో భయంకరమైన తాచుపాములకి ఆశ్రయం ఇచ్చావు. నీ గుణగణాలన్నీ ఈ ఒక్క దుశ్చర్యవల్లనూ వ్యర్ధమై పోతున్నాయికదా!

మహాదాత, గొప్ప ధార్మికుడుఅయిన చక్రవర్తి ఉన్నాడు. అతడిని ఆశ్రయిద్దామని ఎందరెందరో విద్వాంసులు వస్తున్నారు. సార్వభౌముడి దగ్గర ఇవ్వడానికా బోలెడు సొమ్ముఉంది. ఇవ్వాలనే అభిలాష పుష్కలంగా ఉంది. కాని ఏం లాభం? అతడిచుట్టూ నల్లతాచుల్లాంటి దుర్మార్గులుజేరి యోగ్యులైనవారి నెవ్వరినీ దగ్గరకు చేరనియ్యకుండా ఉన్నారు అని ధ్వని.

**శార్దూల వి॥**

సౌరభ్యం భువనత్రయేఽపి విదితం
శైత్యంతు లోకోత్తరమ్
కీర్తిః కించ దిగంగనాంగణ గతా
కిం త్వేతదేకం శృణు
సర్వానేవ గుణానియం నిగరతి
ఖండ! తే సుందరా
నుజ్ఝంతీ ఖలు కోటరేషు గరళ

**చంపకమాల**

పరిమళమా? త్రిలోకముల వంద్య
మనందగు—శైత్యమా? మనో
హరము—దిగంగనాంగణవిహారి
యశస్సు—సమస్త సద్గుణో
త్కరపరిభాసివయ్యును వృథా
గద నిత్యము నీదు తొర్రలన్
గరళమహోగ్ని గ్రక్కు భుజగంబుల
నిల్పుట మంచి గంధమా!

**సముద్రం**

మందరపర్వతం నీ గర్భంలోదూరి గిరగిరా తిరుగుతూ నీకు దుర్భరమైన వ్యథ కలిగిస్తున్నప్పటికీ పరోపకారార్థివైన నీవు ఆ బాధను కడుపులోనే దాచుకున్నావు. సుడిగాలులచేతను, తుఫానుల చేతనూ వ్యాకులపడుతూకూడా మర్యాదాతిక్రమణం (చెలియలికట్ట దాటిరావడం) చేయవు. మహాపర్వతాలకు ఆశ్రయం ఇచ్చావు. మూడు లోకములకూ పయస్సుల నిచ్చి పరిపోషిస్తున్నావు. నీ మహత్త్వాన్ని ఎల్లా కీర్తించగలను జలధీ!

**శార్దూల విక్రీడితం**

అన్వార్థం కియతీ రువాహ మహతీ
ర్మంథాన మర్మవ్యథా
మర్యాదా మతివర్తతే న
కతిభి ర్వాత్యాభి రత్యాకులః
కుక్షౌ క్షోణిభృతో బిభర్తి పయసా
పుష్ణాతి లోకత్రయమ్
తేనైవాంబునిధే ర్మహత్త్వ
మధికం వర్వర్తి సర్వోపరి.

**మత్తేభ విక్రీడితం**

మదిలోనన్ భరియించి తన్యులకునై
మంథానమర్మవ్యథన్
వదలంబోవు తుఫానుచే కలగినన్
మర్యాద నింతేని, నీ
యుదరం బున్నత శైలజాల భరితం,
బుర్విన్ పయఃపూర్తిచే
ఉదధీ! ప్రోతువు; నీ మహత్త్వ
మది సర్వోత్కృష్టమై తోచెడిన్.

సముద్రుడిదగ్గర కావలసినంత జలం ఉంది. కాని, ఏంలాభం? అందులోని ఒక్కచుక్కకూడా మానవుల దాహశాంతికి ఉపయోగించకుండా ఉంది. లోభిదగ్గర భోషాణంనిండా డబ్బు మూలుగుతోంది. కాని, అది పరోపకారానికి వినియోగపడదు. ఈ భావాన్ని రకరకాలుగా తిప్పి చాలాచోట్ల సముద్రుణ్ణి నిందించాడు పండితరాయలు.

బ్రహ్మాండమైన జలరాశి ఎదర కనిపిస్తూ ఉంటే, ఎండిపోతున్న గొంతుకలో పోసుకోడానికి గుక్కెడు మంచినీళ్లు ఇచ్చే నుయ్యి ఏదైనా దొరుకు తుందేమోనని నీ తీరంలో బాటసారులు వెయ్యికళ్లతో, కళ్లనిండా ఆశతో వెతుక్కుంటున్నారు చూడు. నీకు సిగ్గులేదుటయ్యా సముద్రుడా! పైగా ఉత్తుంగ తరంగమాలికా ప్రౌఢిమ చూపిస్తూ అరుస్తావెందుకూ? నోరు మూసుకో!

**అనుష్టుప్**

తరంగమాలికాభిల
ధిక్ తే సాగర! గర్జితం
యస్య తీరే తృషాక్రాంతాః
పాంథాః పృచ్ఛంతి వాపికామ్.

**ఆటవెలది**

చాలు నీ తరంగమాలికాదుర్వార
గర్జనమ్ము లింక కడలిరేడ!
నోరులెండి నీదు తీరాన పథికాళి
దేవులాడుచుండు బావికొరకు.

* *

**మామిడిపండు**

పండిత రాయలకి మామిడిపళ్లు చాలా ఇష్టం కాబోలు. ఈ పండును పొగిడినట్లుగా మరేపండునీ పొగడలేదు.

మామిడిపండుకిగల ఫలరాజబిరుదాన్ని విని మిగిలిన పండ్లన్నీ అసూయతో ఎల్లా కుమిలి పోతున్నాయో వర్ణిస్తున్నాడు. (ఇదే ఇతివృత్తంతో 'పండితరాయల హాస్యం' అనే వ్యాసంలో మరో శ్లోకాన్ని లోగడ ఉదాహరించాను. కొద్ది భేదాలతో చెప్పిన వేరే శ్లోకం ఇది. ఇటువంటి పునరుక్తులు భామినీవిలాసంలో దండిగానే ఉన్నాయి. వరసగా ఆలోచించి ఏకబిగిని వ్రాసిన కావ్యం **కాదు** ఇది. అప్పుడూ అప్పుడూ సందర్భానుసారంగా, చాలాభాగం ఆశువుగా చెప్పిన శ్లోకాల సంపుటి ఇది. కనుక, చెప్పిన భావాన్నే మరో మాటల్లో మళ్లీ మళ్లీ చెప్పడం కనిపిస్తుంది )

మామిడిపండుకిగల కీర్తి ప్రతిష్ఠలు వినే సరికి—

కొబ్బరికాయకి గుండె చెరువై పోయిందట.

దోసకాయ రెండు ముక్కలుగా పగిలిందట. బాగా పక్వానికి వచ్చిన దోసపండు తీగను ఉండగానే విచ్చిపోవడం మామూలేకదా!

పనసపండుకి ఒళ్లంతా ముళ్లు అయాయిట.

అరటిపళ్లు సిగ్గుతో ముఖాలు వంచుకున్నాయిట. చెట్టుమీద గెలని వేలాడుతున్న అరటిపళ్ల నల్లని చివరలు క్రిందికి వాలి ఉండడం సహజమే కదా!

ద్రాక్షపండు క్షుద్రతని పొందిందట. క్షుద్రత అనే మాటకి నీచత్వం అనీ తియ్యదనం అనీ రెండు అర్థాలు ఉన్నాయి.

నేరేడుపండు సిగ్గుతో కమిలి నల్లబడిందిట.

**శార్దూల విక్రీడితం**

ఆకర్ణ్యాౖమ్రఫలస్తుతిం జలమభూత్
తన్నారికేళాంతరమ్
ప్రాయఃకంటకితస్తథైవ పనసః
జాతంద్విధోర్వారుకమ్
ఆస్తే ఒధోముఖమేవ కాదలఫలం
ద్రాక్షాఫలం క్షుద్రతామ్
శ్యామత్వం బత జాంబవం
గత మహో మాత్సర్య దోషాదిహ.

**మత్తేభ విక్రీడితం**

చెరువయ్యెన్ హృదయంబు కొబ్బరికి—
విచ్చెన్ దోస రెండింటిగా
శిరసుల్ వంగె ననంటిపండ్లకు—
ముఖశ్రీమాడె నేరేళ్లకున్
ధరియించెన్ పలుముండ్లు మేన పనసల్—
ద్రాక్షల్ బహుక్షుద్రతన్
తరలెన్—నీ ఫలరాజ విశ్రుతికి
మాత్సర్యంబునన్ మామిడీ!

ఇంత గొప్పమామిడిపండులో కూడా పండిత రాయలకి దోషం కనిపించింది.

మామిడిపండూ! నువ్వు ఫలరాజువి. సరే. నేను కాదనడంలేదు. నీ పరిమళం దిఙ్మండలంఅంతనీ సురభిళం చేసేస్తోంది. నీ సౌందర్యం కళ్లు చెదర గొట్టేస్తోంది. అయితేమాత్రం ఏంలాభం? నీ గుండె కరుడు కట్టుకుపోయిందికదూ!

మామిడిపండులోపల గట్టి టెంక ఉంటుందనే విషయాన్ని ఎంత చమత్కారంగా వర్ణించాడో!

**వసంతతిలక**

దిఙ్మండలం పరిమళైః సురభీకరోషి
సౌందర్యమావహసి లోచనలోభనీయమ్
ఆహో రసాల ఫలవర్య! తథాపి దూయే
యద్గ్రంథిలంచ కఠినం హృదయం బిభర్షి

పరిమళంబుల నెల్లెడ బరపుచుందు
కన్నులకు విందుసేయు నీ వన్నెచిన్నె
అయిననేమి? రసాలఫలావతంస!
కఠినమయ్యెను నీ గుండె కరడుకట్టి.

* * *

**పద్మం**

కొలనిలో తామరతీగ అల్లుకునిఉంది. ఎర్రటి చారడేసి పువ్వులు కొలనుఅంతటా వికసించి కలకల లాడుతున్నాయి. హంస ఒకటి ఆ పువ్వులను చూచుకుని మురుసుకుంటున్నది. ఆ చెరువులో పద్మంలాంటి అంద మైన మొహంగల ఓచిన్నది స్నానం చేస్తోంది. ఆ చెరువు పావంచాలమీద ఒక వృద్ధుడైన యోగీశ్వరుడు జపం చేసుకుంటున్నాడు. అప్పుడప్పుడు కళ్లు సగం తెరిచి, ఆ పిల్లకేసి దొంగచూపులు చూస్తున్నాడు. ఈ సన్నివేశాన్ని చూసేసరికి పండితరాయల మన స్సులో కొంటెతనం పొటమరించింది. ఈ రెండు విషయాలనూ శ్లేషచేత గుదిగుచ్చి, చిన్నశ్లోకంలో బహుచమత్కారంగా చెప్పేడు.

తేనెలు ఒలికించే ఓ పద్మినీ! వృద్ధుడు, శుచి అయిన ఈ హంస పుష్పవతివి అయినప్పటికీ నిన్ను విడిచిపెట్టి పోలేకుండా ఉన్నాడు. కనుక శుభగత్వం అంటే నీదేకదా!

పద్మిని అంటే తామరలత అనీ, పద్మినీజాతి స్త్రీ అనీ రెండు అర్థాలు. పుష్పవతి అంటే పుష్పాడి కలది అనీ, ఋతుమతిఅనీ అర్థద్వయం. హంస శబ్దానికి రాయంచ అనే పక్షిఅనీ, యోగిపుంగవుడనీ అర్థాలు. సుభగత్వం అంటే సరేసరికదా. మడి, ఆచారంగల వృద్ధుడే నిన్ను విడిచిపోలేకుండా ఉన్నాడు. కనుక నీ గొప్పతనం చెప్పేదేమిటీ?

**ఆర్యా**

అయి మకరంద స్యందిని!
పద్మిని! మన్యే తవైవ సుభగత్వమ్
పుష్పవతీమపి భవతీం
త్యజతి న వృద్ధః శుచి ర్హంసః

**తేటగీతి**

తేనె లొలికించు పద్మినీ! తెలిసికొంటి
అనుపమంబైన సుభగత్వ మనగ నీదె
వృద్ధహంసమ్ము శుచియని పేరుగనియు
పుష్పవతివైన నినువీడి పోవడయ్యె.

ఇంత చక్కని తామరలలో ఒక లోపంఉంది. హంసలకీ పద్మాలకీ చుక్కెదురు. స్వచ్ఛమైన తెల్లని శరీరంగలవి హంసలు. వాటినిచూస్తే చాలు పద్మం మొగం చిట్లించుకుంటుంది. నల్లని మధుపాలను మాత్రం స్వేచ్ఛగా తనలోపలికిరమ్మని ఆహ్వా నిస్తుంది. శ్రీమంతుల దుర్లక్షణాలన్నీ ఈ తామర పువ్వులకు పట్టుబడ్డాయని ఆక్షేపిస్తున్నాడు పండిత రాయలు.

మధుప శబ్దానికి తుమ్మెదఅనీ, తాగుబోతు అనీ రెండు అర్థాలున్నాయికదా. హంసకి గల అర్థ ద్వయం తెలిసినదే. శ్రీ అనగా లక్ష్మి. పద్మంలో లక్ష్మీ దేవి నివసిస్తుంది. కనుక పద్మం శ్రీమంతురాలు అయింది. తాగుబోతులను లోనికి ఆహ్వానించి, సజ్జ నులనుచూచి కసురుకుని వీధి వాకిట్లోనే నిలువ బెట్టడం వంటి శ్రీమంతుల లక్షణాలన్నీ పద్మం పుణికి పుచ్చుకున్నదని చమత్కారం.

**అనుష్టుప్**

హంసాః సర్వాంగ ధవళాః
పద్మేభ్యో బహిరాసతే

అంత ర్వ్యశంతి మధుపాః
శ్రీమతా మీదృశీ గతిః.

**కందం**

నిలువంతయు తెలుపగు హం
సలు వెలుపల నిలిచియుండు సారసములకున్
నలుపగు మధుపంబులలో
చెలరేగెడు — నైజమిద్ది శ్రీమంతులకున్.

* * *

**చాతకం**

మేఘంనుంచి జారిపడుతున్న వాన చినుకులను మాత్రమే తాగి ప్రాణాలు నిలుపుకునే పరువు గల పక్షి చాతకం. వర్షం పడకపోతే, గొంతుపొడి ఆరిపోతున్నా సరే చావనైనా చస్తుందికాని నీచులని యాచించదు. అటువంటి గొప్పపక్షి చిరంజీవియై ఉండుగాక. చాలా అభిమానంగల యాచకునిగా చాతక పక్షినీ, దాని ఇబ్బందులను తొలగించేదాతగా మేఘుణ్ణి పండితరాయలు రకరకాలుగా వర్ణించాడు.

**అనుష్టుప్**

ఏక ఏవ ఖగో మానీ
చిరం జీవతు చాతకః
పిపాసయా వా మ్రియతే
యాచతేవా పురందరమ్.

**ఆటవెలది**

పరువు గలిగినట్టి పక్షి చాతక మొండె
వసుధనది చిరమ్ము బ్రదుకుగాక
దాహబాధచేత తనువు వీడిన వీడు
వేడబోదు దేవవిభునిదప్ప.

ఈ చాతకాన్ని పొగుడుతూ, దాని ప్రాణాలు కాపాడవలసిందని మేఘునికి నచ్చచెప్తూ సుమారు 50 శ్లోకాలు వ్రాశాడు పండితరాయలు. ఇంతమంచి పక్షిని నిందించే శ్లోకం ఒకే ఒక్కటి కనబడింది. అది అయినా శ్లేషచేత.

ఆషాఢమాసం ప్రవేశించింది. ఆకాశంలో మబ్బులు కనిపిస్తున్నాయి. ఎక్కడో ఓ మేఘం ఉరిమింది. ఆ చప్పుడు విని నెమలి ఒకటి మెడ పైకెత్తి మేఘుడితో మాట్లాడుతోంది.

ఏమయ్యోయ్! పయోధరా! ఆకాశంలో నువ్వు ఉరిమిన శబ్దం నా చెవులబడితే చాలు పరవశించిపోయి, పురివిప్పి మహదానందంతో నృత్యం చేస్తాను. నీ దగ్గరనుంచి అంతకన్న వేరే ఏదీ నేను ఆశించడం లేదు. ఆ పాడు చాతకపక్షిలాగ నీ జీవనాలు (ప్రాణాలు, నీళ్లు) ఇమ్మని వెంటబడి వేపుకు తినే రకం కాదుసుమా నేను.

ఏదో ఒకటి ఇచ్చేదాకా ప్రాణాలు తోడేసే బంకపాషాణాల్లాంటి యాచకుల కోవలోకి చాతక పక్షిని చేర్చి నిందించాడు.

**ఆర్యా**

అహమస్మి నీలకంఠ
స్తవఖలు తుష్యామి శబ్దమాత్రేణ
నాహం జలధర ! భవత
శ్చాతక ఇవ జీవనం యాచే.

**తేటగీతి**

ఆకసమ్మున నీ శబ్ద మాలకించి
పరవశమ్మున నర్తించు బర్హి నేను
వనధరమ ! వానకోయిల పగిదినీదు
జీవనము లిమ్మటంచు యాచింపబోను.

* * *

**మేఘం**

మేఘుడు మహాదాత. అతడివల్లనే భూమిమీద సకలజీవరాశులూ మనగలుగుతున్నాయి. అతడు ఘనుడు. ఆ ఘనతకి తగ్గట్లుగానే అతడి యీవి కూడా బహుఘనంగా ఉంటుంది. దాహబాధ భరించలేక చాతకపక్షి మూడునాలుగునీటిబిందువులు దయచేయించవలసిందని మేఘుణ్ణి అర్థించింది. అంత స్వల్ప దానం ఆ మహామహుడికి సాధ్యంఅవుతుందా? కుంభవృష్టి కురిపించేశాడు విశ్వమంతటా.

'పిడికెడుగింజలు బిచ్చంవెయ్యండిబాబూ! అని యాచకుడొకడు మహాదాతను అర్థించగా, ఆ మహాత్ముడు ఊరందరికీ భూరిసంతర్పణ చేశాడు. దానగుణం చాలా చిత్రమైనది.

**రథోద్ధతా**

చాతక స్త్రి చతురాన్ పయఃకణాన్
య్యాచతే జలధరం పిపాసయా

సోఽపి పూరయతి విశ్వ మంభసా
హంత! హంత! మహతా ముదారతా.

**ఆటవెలది**

మూడునాళ్ళ బిందువుల నీరు దప్పిచే
చాతకమ్ము వేడె జలధరమును
మొగిలు విశ్వమెల్ల పూరించె నీటిచే
ఎవని తరము ఘనుల యీవి నెన్న?

ఇటువంటి ఘనుడుకికూడా చివాట్లు తప్ప లేదు. అడవిలో దావాగ్ని మహాభయంకరంగా ప్రజ్వరిల్లి చుమ్మలుచుట్టేస్తోంది. ఆ మంటలలో సమస్తమైన మహావృక్షాలూ, లతలూ మాడి బొగ్గైపోతున్నాయి. అయ్యయ్యో, అటువంటిచోట వర్షించకుండా ఎక్కడో దూరపు కొండకొమ్ములమీద కుండపోతగా వాన కురిపిస్తున్నా వేమిటయ్యా జలధరుడా! నీ కింతపాటి యుక్తాయుక్తవివేకం లేకుండా పోయిందా? ఐశ్వర్యంతో మదించిపోయావా?

ధనగర్వాంధులు తిండిలేని దీనులకి ఒక్క గింజ విదపరు. తమ సొమ్ము అంతా వ్యసనాలపాలు, రాళ్లపాలు చేస్తారు అని ధ్వని.

**మాలినీ**

దవదహన జటాల జ్వాల జాలా హతానామ్
పరిగళిత లతానాం మ్లాయతాం భూరుహాణామ్
అయి జలధర! శైలశ్రేణి శృంగేషు తోయమ్
వితరసి బహుకోఽయం శ్రీమద స్తావకీనః

**చంపకమాల**

నలుదెసలన్ దవానలము నాల్కలు
సాచి మహీరుహమ్ములన్
లలితలతానికుంజముల నాశము
చేయుచు ప్రజ్వరిల్ల నో
జలధరమా! సుదూరగిరి
సాను తటంబుల కుండపోతగా
సలిలము గుమ్మరించుపని
చాలును— నీకిది శ్రీమదంబొకో!

* * *

**చంద్రుడు**

రాజశబ్దానికి చంద్రుడుఅనీ, నరపాలుడనీ రెండు అర్థాలున్నాయి. లోకంలోఉన్న అల్ప మనస్కులైన నృపాలురకు రాజశబ్దం అతకదనీ, చంద్రుడి కొక్కడికే అది సరిపోతుందనీ పండితరాయలు ఢంకా బజాయించి చెప్తున్నాడు. ఏమంటే, తనకు దగ్గర వాళ్లనీ, ఆశ్రితులనీ, తనని పొగిడేవాళ్లనీ, వస్తాదుల్నీ పోషించే రాజులు లోకంలో చాలామందేఉన్నారు. అందులో ప్రత్యేకతగాని, విచిత్రంగానీ ఏమీలేదు. ఇంక ఆకాశంలోఉన్న ఆ రాజు ఎవరినిపోషిస్తున్నాడూ? మార్తాండ తేజస్సుకి కమిలి, దిక్కుతోచకుండా, దీనంగా, బహుదూరంగా ఉన్న చకోరపక్షులను చల్లని పండువెన్నెలలు తినిపించి పోషిస్తున్నాడు. ఓహోహో! అతడయ్యా అసలైన రాజు. ఈ నృపాలాధములను రాజులనడం ఏం సబబు?

**శార్దూల తం**

రాజానః కతివా నసంతి జగతి
ఖ్యాతా నిజాభ్యాశగాన్
యే పుష్ణంతి బలీయసః
పరిచితా శ్చిత్రం నమన్యామహే
రాజారాజతి కేవలం హిమకరః
పుష్ణాతి దూరస్థితాన్
జ్యోత్స్నాభిర్గ్లపితాన్ దినేశ
మహసాయోఽసౌ చకోరా నిమాన్.

**చంపకమాల**

పరిచితులైన వాండ్ర, బలవంతుల,
దగ్గర వారలన్, చెవుల్
కొరికెడు వాండ్ర మేపుదురు
కొందరురాజులు వారు రాజులా?
ఖరకరభానుతేజపరిఖండిత
దూరచకోరపోషణా[illegible]
దర కరమండలుండగు
సుధానిధి నొక్కని రాజనన్ వలెన్.

ఇంత ఉత్తముడైన చంద్రునిలో పండితరాయలకి సవాలక్ష దోషాలు కనిపించాయి. అన్నింటికన్న ముఖ్యమైనది అతడు దోషాకరుడు కావడం,

దోషశబ్దానికి రాత్రి అనీ దోసగు అనీ రెండు అర్థాలు. రాత్రిని చేయువాడు (దోషాం కరోతి ఇతి దోషాకరః) అని ఒక అర్థంలోనూ, గురు భార్యా సంగమదోషం కలవాడు (దోషాణాం ఆకరః దోషాకరః) అని రెండవ అర్థంలోనూ దోషాకర శబ్దాన్ని ప్రయోగించి నిందించాడు. పైగా చంద్రుడు కుటిలుడట. నిజమే వంకరగా ఉంటాడు కదా! అతడు కలంకితుడట. మచ్చలున్నాయికదా! మిత్రుని అవసాన సమయంలో ఆనందంగా ఉంటాడట. సూర్యాస్తమయం అయాకనే కదా చంద్రునికాంతి బయటపడేది? స్నేహితుని దుర్దశకు ఆనందించే నీచుడని రెండవ అర్థం. ఇన్ని లోపాలు ఉన్నప్పటికీ చంద్రుణ్ణి సర్వజ్ఞుడైన మహేశ్వరుడు నెత్తిమీద పెట్టుకున్నాడు. అవునులే, ఆశ్రితుల గుణదోషాలను విచారించేవాడు ఎవడు ఈ లోకంలో?

**వసంతతిలక**

దోషాకరోఽపి కుటిలోఽపి కలంకితోఽపి
మిత్రావసానసమయే విహితోదయోఽపి
చంద్రస్తథాపి హరవల్లభతా ముపైతి
నైవాశ్రితేషు గుణదోషవిచారణా స్యాత్.

**శార్దూల విక్రీడితం**

మేనన్ పెక్కుకళంకముల్ కలిగినన్,
మిత్రావసానంబునన్
సానందోదయుడైన, చాల
కుటిలుండైయున్న; దోషాకరుం
డైనన్ చంద్రుని నెత్తికెత్తుకొనె
లోకాధీశ్వరుండు — ఔనవున్
కానంజాలుదురే నిజాశ్రిత
గుణ స్థాలిత్య మెందేనియున్ ?

* * *

**కో కి ల**

కోయిలకూత విని పరవశించి పోనివాళ్లు అరుదు. దాని పంచమస్వరమాధుర్యాన్ని కవులు రకరకాలుగా శ్లాఘించారు. భామినీ విలాసంలో కోకిలను ప్రశంసిస్తూ పాతిక శ్లోకాలదాకా చెప్పేడు పండితరాయలు, అందులోనుంచి మచ్చుకి ఒక్కటి చూద్దాం.

కోకిల చిన్నతనంలో అపస్వరాలు పలకకుండా మౌనంగా ఉండిపోతుంది. తన కూత సర్వజనానంద దాయకంగా ఉంటుందని గట్టి నమ్మకంతోచేదాకా నోరు మూసుకుని ఉండి, హఠాత్తుగా ఒకరోజున గొంతువిప్పి, జగత్తుఅంతా పులకరించిపోయేటట్లు అద్భుతంగా పాడడం మొదలు పెడుతుంది. పాడితే అమోఘంగా పాడడం, లేకపోతే మౌనంగా ఉండిపోవడమూ తప్పిస్తే, మధ్యస్థితి దానికిలేదు.

వచ్చీరాని అవకతవక కవిత్వాన్ని సభలో చదివి, నవ్వులపాలు అయిన ఓ అభాజనుణ్ణి వెక్కిరిస్తూ చెప్పిన శ్లోకం ఇది.

**అనుష్టుప్**

తావ న్మౌనేన నీయంతే
కోకిలైశ్చైవ వాసరాః
యావత్సర్వ జనానంద
దాయినీ వాక్ప్రవర్తతే.

**ప్రియంవద**

సరళ కోకిలము సర్వలోక హృ
త్సరసిజాళి తన శ్రావ్య వాక్సుధా
ఝరుల తేల్చగల ఝాముదాక వా
సరములన్ గడుపసాగు మూగగా.

వసంతకాలంలో కూత మొదలుపెట్టిన కోకిల వర్షాలుపడడం మొదలుపెట్టేక హఠాత్తుగా పాడడం మానేస్తుంది. ఈ విషయాన్ని మనస్సులో ఉంచుకుని కోకిలని నిందిస్తున్నాడు.

జీవనప్రదాతఅయిన మేఘుడు ఉన్నత స్థితికి వస్తే (ఆకాశంలో మబ్బులు పట్టేసరికి) మొగం ముడుచుకుని నోరు కుట్టేసుకుంటావా? కోకిలా! ఎంత కుళ్లుబోతువి !

ఆశ్రయదాత ఉచ్చస్థితికి వచ్చినప్పుడు, అతడివల్ల లాభం పొందినవాళ్లు సంతోషించకుండా మొగాన గంటుపెట్టుకోవడం కుళ్లుబోతుల లక్షణం.

**ఆర్యా**

మలినాత్మనా విరాగః
ప్రకటీకృత ఏవ కోకిల ఖలేన

జీవనదానా మున్నతి
సమయే వాచంయమీ భవతా.

**తేటగీతి**

జీవనమ్ముల నిచ్చి పోషించునట్టి
ఘనుడు నేడున్నతస్థితిం గాంచినంత
మొగమునన్ గంటువెట్టుక మూలకొదిగి
కోకిలము మౌనమూనెడు కుళ్లుబోతు.

* * *

## ఏనుగు

మేకలు, దున్నలు, ఎద్దులువంటి అల్పమృగాలు దరిద్రుల పూరిపాకలముందు ఏవో నాలుగు గడ్డిపరకలుమేసి, సంతోషంగా రోజులు వెళ్లబుచ్చేస్తాయి. కాని, మత్తేభములు అల్లా గడుపుకోగలవా? మదజలంచేత బురదఅయిన వింధ్యారణ్యంలోనైనా ఉంటాయి, లేదా రాజమందిరాలలోనైనా ఉంటాయి. అంతేకాని, ఏదో బతికేంఅంటేబతికేంఅని క్షుద్రంగా జీవించడం వాటికి చేతకాదు. గొప్పవాళ్ల అవసరాలు కూడా గొప్పగానే ఉంటాయి.

నిషేవంతా మేతే వృషమహిషమేషాశ్చహరిణా
గృహాణి క్షుద్రాణాం కతిపయతృణై రేవ సుఖినః
గజానామాస్థానం మదసలిలజంబాలితభువాం
తదేకం వింధ్యాద్రేర్విపిన మథవా భూపసదనమ్.

**శార్దూల విక్రీడితం**

సంతోషించునుగాక రంకు వృష
మేషా ద్యల్పజంతువ్రజం
బింతింతల్ తృణశేషముల్
కరచుచున్ హీనవ్రజా శుష్క గే
హాంతర్భాగముల—వారణంబులకు
దానాంభః ప్రసిక్తస్థలుల్
గంతవ్యంబులు రాజమందిరములో
కాకున్న వింధ్యాద్రియో.

ఏనుగుని బహుచమత్కారంగా నిందించాడు మరోచోట. దాహంతో గొంతుఎండిపోయిన చాతక పక్షికి దూరాన నల్లని ఏనుగు ఒకటి కనిపించింది. అది కారుమేఘం అని భ్రమపడి, తాగడానికి నాలుగు చినుకులు రాలుస్తుందని ఆశపడి, ఉబ్బితబ్బిబ్బు అయిపోతోంది. దానినిచూచి జాలిపడి పండితరాయలు ఇల్లా అంటున్నాడు. ఎందుకే వృథాగా గంతులు వేస్తావు ? పిచ్చిచాతకీ ! అది మేఘం అనుకుంటున్నావా ? కాదు కాదు. అది మదాంధమైన ఏనుగు సుమా. అది నీబోటివాళ్లకి ఏమీ ఇవ్వదు. మాతంగ దానం ఎంతసేపూ మధుపకులానికే తెలుసా?

ఏనుగుమీదకారే మదజలానికి దానం అని పేరు. ఆ దానజలాన్ని తుమ్మెదలు లొట్టలువేస్తూ తాగుతాయిట. ఏనుగులు ఎంతసేపూ తాగుబోతులైన మధుపాలకేగాని నీబోటివాళ్లకి దానం ఇవ్వవు అంటున్నాడు. మాతంగ, దాన, మధుప శబ్దాలకు గల శ్లేష వివరించడం ఉచితంకాదు కనుక వదిలేస్తున్నాను.

ఆత్మాభిమానంగల విద్వాంసు డొకడు రాజుని ఆశ్రయిద్దామని బయలుదేరేడు. 'ఆరాజు నీబోటి వాళ్లకి ఏమీ విదల్చడయ్యా, అతగాడి దానం ఎంతసేపూ వేశ్యలకీ, జూదరులకీ, తాగుబోతులకీ మాత్రమే పరిమితం, వృథాగా ఎందుకు శ్రమపడతావు' అని వారిస్తున్నాడు పండితరాయలు.

**ఉ ప జా తి**

వృథా కథం నృత్యసి చాతక ! త్వమ్
నకాలమేఘోఽయ మిభోమదాంధః
స త్వాదృశేభ్యో న దదాతి కించి
న్మాతంగ దానం మధుపేభ్య ఏవ.

ఎందుకే చాతకంలు ! నీ ఎగిరిపాటు?
అద్ది మేఘమ్ముకాదు—మదాంధదంతి
ఇంచుకయునది నీబోంట్ల కీయబోదు
మత్తమాతంగదానంబు మధుపతతికె

## తుమ్మెద

మన సాహిత్యప్రపంచంలో తుమ్మెదలకి చాలా గొప్పస్థానంఉంది. నిగనిగమెరిసే నల్లనినలుపు, శ్రావ్యమైన ఝుంకారము, తేనెతాగడంలో వాటికిగల

మమత, ఇవి అన్నీ రసికులని బాగా ఆకర్షించాయి. సుందరీజనులవ్రకాలకాసమూహానికీ, నల్లనికాటుక కళ్ల చూపులకీ ఉపమలుగా ప్రసిద్ధికెక్కాయి. మన్మథుని వింటికి నారిగా ఏర్పడ్డాయి. పండితరాయలు వీటిని పొగడదలుచుకున్నప్పుడు మధువ్రత, షట్పద, భ్రమర ఇత్యాదిపదాలనూ, తిట్టదలుచుకున్నప్పుడు తాగుబోతులుఅనే అర్థంవచ్చే మధుపశబ్దాన్నీ ప్రయోగిస్తాడు.

తుమ్మెద ఒకటి మాలతీలతని సమీపించింది ఝు—మ్ముమని గానంచేస్తూ. ఆ మాలతి ఏకారణం చేతనో తుమ్మెదమీద అలిగి, మాటాడకుండా పెడమొగం పెట్టుకునిఉంది. (బహుశా వెనుకటి మిళిందౌదాసీన్యం జ్ఞాపకం వచ్చిఉంటుంది.) పండితరాయలు రాయబారం నడుపుతున్నాడు.

ఓ మాలతీ ! ఈ మధుకరుడు బహుశ్రావ్యంగా గానంచేస్తూ ముచ్చటగా నీదగ్గరకువస్తే అతడిని ఆహ్వానించకుండా ఇల్లా మౌనం వహిస్తావా? ఇది నీకు ఉచితమేనా? అతడు ఎటువంటివాడో నీకేమైనా తెలుసా? పరమ దాతలైన కల్పద్రుమాలు సైతమూ ఇతడిని తమ నెత్తిన పెట్టుకుంటాయి. నీదగ్గరకు వచ్చాడని అవజ్ఞ చేయడం తప్పుకదూ?

కల్పవృక్షాల చిటారికొమ్మలమీది పువ్వులమీద తుమ్మెద వాలడాన్ని ఆ మహావృక్షాలు శిరసా వహించడంగా చమత్కరించాడు.

**ఆ ర్యా**

గుంజతి మంజు మిళిందే
మా మాలతి ! మౌన ముపయాశీః
శిరసా వదాన్య గురవః
సాదర మేనం వహంతి సురతరవః.

**ఆట వెల ది**

మధుకరమ్ము లిట్లు మంజుల ధ్వనిసేయ
మాలతీ ! యిదేమి మౌనముద్ర ?
పరమదాతలైన సురభూజములు వీని
నౌదలను ధరించు నాదరమున.

ఇంతగొప్ప తుమ్మెదలని పడతిట్టిన సందర్భాలుకూడా భామినీవిలాసంలో ఎన్నెన్నో ఉన్నాయి. ఆరు కాళ్లున్నాయి కనుక తుమ్మెద పశువున్నర అని ఒకసారీ, దానిది మధుపజాతికనుక తాగుబోతులకి యుక్తాయుక్తవివేకం ఎక్కడ ఏడుస్తుందని మరొకసారీ తుమ్మెదలని ఘాటుగాతిట్టిన సందర్భాలు 'పండితరాయల బుజ్జగింపులు' అనే వ్యాసంలో చూచాం.

ఇక్కడ మరొక రకమైన నిందను చూద్దాం.

ఒకప్పుడు తుమ్మెద చాలా పరువుగా బతికింది. తీయమామిడిచెట్లమీద యథేచ్ఛావిహారం చేసింది. పద్మినీవనంలో దాగుడుమూతలాడింది. కదంబవృక్షాలమీద తూగుటుయ్యాల లూగింది. చెంగలువలతో రకరకాలుగా ఆటలాడింది. అటువంటి మధువ్రతం ఈనాడు వసంతోదయ సమయంలో ఇప్పకల్లు పీకలమొయ్యాతాగి దొర్లుతోంది. ఛీ ఛీ ఏమి పతనం !

ఒకప్పుడు బాగా బతికి, ప్రస్తుతం దుర్వ్యసనాలకు లోనై బొత్తిగా దిగజారిపోయిన వ్యక్తి నెవరినో మనస్సులో ఉంచుకుని చేసినకల్పన ఇది.

**శార్దూల విక్రీడితం**

మాకందే మధుపాన మంబుజకులే క్రీడా
కదంబద్రుమే
దోలాఖేలనకౌతుకం కువలయే
కః కో నవో విభ్రమః
యేనాకారిమధువ్రతేన సహసా
సోఽయం మాధూకే మధౌ
మాధ్వీకం పరిపీయ పీవరతను
ర్జీవత్యహో జీవనమ్.

**శార్దూల విక్రీడితం**

మాకందంబుల తేనె త్రాగి, నళినీ
మధ్యంబులం దాగి, డో
లాకేళీకుతుకంబునన్ కడిమి
చెట్లందూగి, చెంగల్వ పూ
రేకుం బాన్పుల జోగి, మాధవమునన్
భృంగంబిసీ ! ఇప్పకల్
పీకల్మొయ్యగ్రతాగి క్రొవ్వినదయా
వ్రీడావిహీనాత్మయై.

**రాజహంస**

వికసించిన బంగారుతామరపువ్వులలోని పుప్పొడి రాలి గుబాళిస్తున్న మానససరఃపయస్సులలో తన యౌవనమునంతనూ యథేచ్ఛగా గడిపిన ఒకానొక రాజహంస కాలం ఖర్మం కలిసిరాక, అక్కడినుంచి లేచి వచ్చి, ఒక పాడుపడ్డ చెరువును సమీపించింది. అందులోని నీళ్లు మురికిగా ఉన్నాయి. చెవులు చిల్లులు పడేలా బెకబెకమని అరుస్తున్నాయి కప్పలు. అంతటి మహాదశను అనుభవించిన మరాళనాయకుడు ఇటువంటిచోట ఈ కప్పలమధ్య ఎల్లా బతుకుతాడోకదా అని జాలిపడుతున్నాడు పండితరాయలు.

దేవేంద్రసభను పోలిన షాజహాను చక్రవర్తిగారి దర్బారులో అసాధారణ గౌరవాదరాలతో, సకలసంపదలతో జగన్నాథుడు తన యౌవనమునంతా గడిపేడు. 'ఢిల్లీవల్లభపాణిపల్లవతలే నీతం నవీనం వయః' అని గొప్పగా చెప్పుకున్నాడు. పండితరాజపదవీవిరాజితుడయాడు. గానశాస్త్రకోవిదుడుగా కనకాభిషేకాలు చేయించుకున్నాడు. యువరాజు దారాషకోకి ఆంతరంగిక మిత్రుడు, గురువు అయాడు. అంతలో ఔరంగజేబు షాజహానుని బంధించడమూ, దారాషకోను హత్య చేయడమూ హఠాత్తుగా జరిగిపోయాయి. ఇంక ఢిల్లీ దర్బారులో ఉండలేక, ఆచోటు వదిలేసి పండితరాయలు సంచారంచేస్తూ చిల్లరసంస్థానాలు చాలానే చూశాడు. రాజుని చూసినకళ్ల మొగుణ్ణిచూస్తే మొత్తుకోబుద్ధిఅయినట్లు ఆ అపండితులమధ్య అతడికి వెలపరం అనిపించింది. 'అరసికేషు కవిత్వ నివేదనం' అసహ్యమనిపించింది. ఇల్లాంటి బురదగుంటల్లో ఎల్లా బతకనూఅని దిగులుపడిపోయాడు.

**పృథ్వి**

పురా సరసి మానసే వికచసారసాళిస్ఖలత్
పరాగసురభీకృతే పయసి యస్యయాతంవయః
సపల్వలజలే౽ధునా మిళదనేకభేకాకులే
మరాళకులనాయకః కథయ రే కథం వర్తతాం.

**పంచచామరం**

నిరంతర ప్రఫుల్ల దివ్యనీరజవ్రజస్ఖలత్
పరాగసౌరభప్రపూతభవ్యమానసంబునన్
మరాళనాయకుండుయౌవనమ్ము పుచ్చి యేగతిన్
చరింపగల్గునేడు భేకసంచరద్దదంబునన్?

ఇటువంటి రాజహంసకి కృతజ్ఞతా విహీనతను అంటగట్టి నిందిస్తున్నాడు.

ఓ మరాళనాయకా! ఈ సరస్సులో పెరిగిన కమ్మని తామరతూడులు కడుపునిండా మెక్కేవు. తియ్యనిచల్లనినీళ్లు తాగేవు. స్వేచ్ఛావిహారాలు చేసేవు. నీకు ఇన్నిసౌకర్యాలు కలుగజేసిన ఈ సరోవరానికి నీవు చేసిన ప్రత్యుపకారం ఏమిటి? మాటా పలుకూ లేకుండా ఏమీ ఎరగనట్లు అల్లా లేచిపోతావేమిటి?

**వసంతతిలక**

భుక్తా మృణాళపటలీ భవతా నిపీతా
న్యంబూని యత్ర నలినాని నిషేవితాని
రే రాజహంస! వద తస్య సరోవరస్య
కృత్యేన కేన భవితాసి కృతోపకారః

**చంపకమాల**

పరువపు తమ్మితూండ్లు కడుపార
భుజించితి, మూడు ప్రొద్దులన్
సరసిజసేవనమ్ము మనసారగ
జేసితి, తేటనీటిలో
తిరిగి యథేచ్ఛ్రతావితివి,
దీనికి ప్రత్యుపకార మీ సరో
వరమున కేమిచేసితివొ
పల్కవదేమి మరాళనాయకా!

(ఇందులో ఉదాహరించిన తెలుగు పద్యాలు డాక్టర్ మహీధరనళినీమోహన్ అనువదించిన భామినీ విలాసం లోనివి.)

# ఆవాహన

శ్రీ మాదిరాజు రంగారావు

బురాదిచేసి సర్వం
ఆశించకు చూచేవని వసంతం
ఏ దిక్కునుంచి ఐనా
భావించకు వచ్చేనని నభోమణి.

మండేను క్షణాలు మంటలతో
చితికిస్తూ సంస్కృతి దర్పణం
ఎగిరేను క్షణాలు రెక్కలతో
కొలుస్తూ జీవిత గగనం.

కళ్ళలో అంగార శిఖలతో
ఊహలో కంకాళ మాలతో
తలలో విప్పిన పడగలతో
గతిలో తూగే మృత్యువుతో
నాల్కనుండి జారే సూదులతో
వచ్చేవా? వీధిలోబడి శిశిరమై.

చెట్టుపై గుట్టపై నీటిపై
నింగిలో అవనిపై సూర్యతేజం వలె
ఊహలో మాటలో వర్తనలో
రావాలి జడత్వం పోయే నవత్వం.

గాలి వెలుగు నీరు
అయినట్లు శక్తిరూపాలు
మాట ఊహ వర్తన
గుర్తించి శక్తి రూపాలుగా.

# ఆ వా హ న

బ్రతుకులో మరుగునబడి
ఇంతకాలం దాగిన ఆనందం
రావాలి పొంగి ఎదనుండి
మనసులో అట్టడుగునబడి
ఇంతకాలం దాగిన సత్యం
రావాలి చీల్చుకొని తిమిరం

వినేవా? సంగీతం విన్నదే
చూచేవా? దృశ్యం చూచిందే
విను, సంగీతం వినంది
కను, దృశ్యం చూడంది
అంతర్ముఖుడవై, హృదయంలో,
శాంత మనస్కుడవై, ముఖంలో.

వాన జల్లు మంచు రలు
ఆకు రాల్పూ, చివురు తాల్పూ,
ఊహాసృష్టి, కార్యరూపం
ఆగదేదీ స్థితి చలనంలో.

సంసిద్ధుడవుకా ప్రతిబుంతువుకూ
నీలోని గాఢశక్తికి ప్రతీకగా.

ఉంది చలనం ప
ఉంది మరణం అంతటా
జీవితానికి ముందు రూపం
పరివర్తనకు ముందు వికృతి

బూదిచేసి సర్వమూ
ఆశించేవా వసంతం ?

తూరుపు దిశనుండే సూర్యుడు
తక్కిన దిక్కుల్లో ఆతని రాగం
ఆవాహన చేసుకో నీలోకి
నాశన సూర్యతేజం !

# మాండలిక భేదములు - ఒక పరిశీలన

శ్రీ అనంతరావు శాస్త్రి

దక్షిణ ఆసియా భాషల మాండలిక భేదముల యనుశీలనము విషయమై యింతవరకు జరిగిన కృషి తక్కువయే యని చెప్పవచ్చును. భారతదేశము, పాకిస్తాన్, సిలోన్‌లలో అధిక ప్రజానీకము మాట్లాడుకొనుభాషలలో ప్రాంతీయమైనటి యు, సాంఘికస్థితిగతులలో పరస్పరసంబంధము కల్గి నట్టియు మాండలిక భేదములు (Dialects) కలవు. ఆయా భాషలు లోకమున వ్యవహారసిద్ధములైన భాషకంటె తమకుగల విశిష సాహిత్యరూపముల మూలముగా కొలదిగనో గొప్పగనో వేఱై యున్నవి.

భాషాశాస్త్రమున ప్రధాన సమస్యలలో చర్చింప దగినది యొకటి యున్నది. అది యేమనగా భాషను శాస్త్రీయముగా విభజించి, వర్గీకరించి యిది యీ ప్రాంతమునకు చెందినదని నియమించుట (కట్టు బాటు చేయుట) ఎట్లు అనునది: తెలుగునుగాని తమిళమునుగాని ఒక ప్రత్యేక భాషగా గుర్తుపట్టుట ఎట్లు ? తెలంగాణాలోని మాండలికమైన (Dialect) తెలుగును, రాయలసీమమాండలికమైన తెలుగును వేర్వేరు భాషలుగా ఏల పరిగణింపరాదు ? ఈ ప్రశ్నకు సమాధానము చెప్పవలెనన్న భాష యనగా నేమో మనము నిర్వచింపవలసి యున్నది. భాష యనగా—కొన్ని ప్రధాన లక్ష్యముల నాధారముగ జేసి కొని కొన్నికట్టుబాట్లకు లోనైయుండు మనుష్య సమూహము పరస్పరము సహకరించుకొనుట కను వుగా చేసికొను శాబ్దిక సంకేతముల వ్యవస్థ అని యొక నిర్వచనము. పరిశీలించి చూడగా ఇందులో నంత సామంజస్యము కన్పించుట లేదు. ఒక సంఘమునకు చెందిన మానవ సమూహము రెండు భాషలు మాట్లాడరనిగాని, రెండు వేర్వేరు సంఘము లకు చెందిన మానవసమూహము ఒక్కభాషను మాత్రమే మాట్లాడరనిగాని మనము ఖండితముగా చెప్పలేము. దీనినిబట్టి వేర్వేరు గ్రంథకర్తలు దీని విషయమై చేసిన నిర్వచనములను మనము విచారింప వలసియుండును.

ఒక భాషలో అనేక మాండలికములు ఉండ వచ్చును. ఆధునిక వర్ణనాత్మకవిధానము (Modern Descriptive Techniques) ననుబట్టి ఒక భాష నంతను మనము ఇదమిత్థమని నిర్ధారణ చేయలేము. కాబట్టి ఈ సందర్భముననే హారిస్ (Harris) అను నతడు ఇట్లు చెప్పుచున్నాడు. వర్ణనాత్మక మైన భాషాపరిశోధనకు అనువైన రంగములు ఒక భాషగాని, ఒక మాండలికముగాని కావచ్చును. ఈ అభిప్రాయము బ్లాక్ Block) అను నాతనికి అంత సంతృప్తి కల్గింపలేదు. అతడు దీనిని వ్యక్తిగత మాండలికము (Idiolect) అనుపేరుతో వ్యవహ రించెను. ఒక వ్యక్తి ఉచ్చరించుటకు వీలైన సర్వ శబ్దరాశియు భాషయే. ఈ నిర్వచనములన్నియు, వానిని రూపొందించిన గ్రంథకర్తలకుకూడ అవగత మైనట్లుగానే, లోపరహితములైనవి కావు. వైయక్తిక వైలక్షణ్యములను కలియగలుపుకొని భావవ్యక్తీ కరణమునకు సామాజికముగ సహకరించు సాధనము భాషయని చెప్పవచ్చును. ఇద్దరు వ్యక్తుల మాట తీరులలో ఒకే విధముగా నుండవచ్చును. ఒకే వ్యక్తి మాటతీరులు (styles) భిన్నభిన్నకాలములలో వేర్వేరుగా నుండవచ్చును. ఒక వ్యక్తిమాట తీరు గాని, అనేక వ్యక్తుల మాటలతీరులుగాని ఇదే విధముగా ఉండును మఱొక విధముగా ఉండదు అని నిర్ధారణచేసి చెప్పుటకు వీలులేదు.

తెగ లేక ప్రభేదము (Variety) అనగా ప్రస్తుతము ఉపలభ్యమానములగు ఐకకాలిక వర్ణనా విధానములనుబట్టి విషయవిభజనచేయగా సజాతీయమని తేలిన వాగ్రూపముల సంపుటి. మానవుల యీ వాగ్రూపము —అందలి మూలభూతమైన యంశములు (Elements) వాని వ్యవస్థలు లేక ప్రక్రియలు, సామాన్యభావప్రకటనమునకు అనుగుణములగు సందర్భము లన్నింటిలో—వ్యవహరించుటకు తగిన యర్థపరిణామసంపద కల్గియుండవలెను. భాషలోని విభేదముల నంగీకరించునపుడు, ఏదోయొకహద్దు లేక కట్టుబాటు (ఒకదానినుండి మఱియొకటి వేఱుచేయునది) ఉండవలయును. రెండువిధములైన మానవ భాషలు—ఒకవిధమైన భాషను మాట్లాడు వ్యక్తి మఱొకవిధమైన భాషను మాట్లాడు వ్యక్తితో మాట్లాడునపుడు ఒకరిమాట మఱియొకరికి పూర్తిగా అర్థమైనచో ఆ రెండుభాషలు అభిన్నములే (ఒకటే) యని చెప్పవచ్చును. దీనిని ఒక్కసమాసములో పరస్పరావగాహనావకాశము అని చెప్పవచ్చును.

ఈ పరస్పరావగాహనావకాశమును నిర్దేశించుటలో మనకు కొన్ని చిక్కులు వచ్చును. ఒకవంక ఒక భాషకు సంబంధించిన ధ్వని సంబంధమైనట్టియు (Phonological), వ్యాకరణప్రక్రియ లేక భాషా నిర్మాణ వైఖరికి చెందినట్టియు సాదృశ్యమునకు (Similarity), పరస్పరావగాహనావకాశమునకును (Mutual intelligiblity) ప్రత్యక్షముగా (Direct) పరస్పరసంబంధమున్నట్లు కన్పించదు. పరస్పరావగాహనావకాశము లేకున్నను రెండు తెగలకుచెందిన భాషలను ఇతర కారణములను పురస్కరించుకొని వానిని ఒకేభాషగా పరిగణించుటకూడ కలదు. ఇందులకు విపరీతములగు నిదర్శనములుకూడ లభింపకపోవు. జర్మనీలో ఒక కోనలో మాట్లాడు భాషకును, మఱొకమూలకోనలో మాట్లాడు భాషకును పరస్పరావగాహనావకాశము తక్కువ. అయినను ఆ రెండింటిని ఒకే జర్మనుభాషగానే పరిగణన కలదు. అన్ని భేదము లున్నప్పటికిని వానికి ఒకే భాషగా పరిగణన యెట్లు ? —ఇది యిట్లుండగా దీనికి విరుద్ధమైన నిదర్శనముగూడ కన్పించుచున్నది. రెండుభాషలమధ్య పరస్పరావగాహనావకాశము ఎక్కువగా ఉన్నను వానిని వేర్వేరు తెగల క్రింద పరిగణించుట సంభవించుచున్నది. డచ్, జర్మన్ భాషలే యిందుల కనువగు నుదాహరణములు. మఱి వేర్వేరు భాషలను వర్గీకరించుట వేనినిబట్టి చేయవలయును ? ఒకభాష, మఱియొకభాషనుంచి పునర్నిర్మితమైన మూలభాషకు చెందిన కొన్ని ధ్వని సంబంధమైనట్టియు (Phonological), రూపాత్మకమైన (Morphological) లక్షణములను ప్రతిపాదించుటలో విశేషముగ భేదించుచో—చారిత్రిక పరిణతి (Historical Development) లోని విభేదమును బట్టి ఒక భాషను మఱియొక భాషనుంచి వేఱుపఱచి చెప్పవచ్చును. రెండుభాషలమధ్యగల చారిత్రక సంబంధమును పరిశోధించునప్పుడు—ఆ రెండు భాషావర్గముల (Language Communities) నడుమ గల సాంస్కృతికసంబంధమునకు చెందిన కొన్ని యంశములను మనము గ్రహింప గలము.

ఒకభాషలో పెక్కు తెగలు లేక ప్రభేదములు (Varieties) ఇమిడి యుండవచ్చును. అవి ఆరోపితమైన (Superposed) ప్రభేదములుగను, ధ్వనిసంబంధమైన, వ్యాకరణసంబంధమైన లక్షణములతో నమిత సాదృశ్యమును కలిగినవిగను, పరస్పరావగాహనావకాశముతో కూడిన ప్రభేదముగను ఉండవచ్చును. ఈ నిర్వచనమున ఒకభాష అనేకములైన విభేదములను కలిగినటుల గుర్తించుచున్నాము. ఈ ప్రభేదము లేక తెగ (Variety) అనగానేమి? మాండలికములును (Dialects) ఇవియు (varieties) ఒకటేనని యనవచ్చునా? మాండలికము అనుపదమును విస్తృతార్థమున వాడుటకలదు. మాండలికమనగా నిట్లు నిర్వచింపవచ్చును. ఒకభాషకు చెందిన తెగగాని అనేకములైన తెగలుగాని కలసియున్నసంపుటియే (set) మాండలికమని చెప్పవచ్చును. భాషలకు చెందిన సమూహములలోగాని (Linguistic groups) భాషలకు చెందని సమూహ

ములలోగాని (Non-Linguistic groups) ఈ మాండలికమొక భాగమై యుండును. ఈ మాండలిక పదమునకు సంబంధించిన భావన ఒక తీరుగా లేకపోవుటవలన భాషాశాస్త్రవేత్తలు, మాండలికమును ఒక ప్రత్యేకభాష యను దృష్టిలో వ్యవహరించుచు ఆ భాషలో వాని వర్గీకరణము నిమిత్తమై యుపయోగించిన చిహ్నములను విశదీకరించి వర్గీకరించు బాధ్యత కల్గియున్నారు. కాబట్టి భాషలోని ఈ ప్రభేదములన్నింటిని మనము మాండలికములని చెప్పలేము. ఒక ప్రత్యేకమైన భాషాలక్షణమునకు వినియోగించుట కనువగు పరిమితులు గల్గియున్న అవధియే మాండలికవిభాజకరేఖ (Isogloss) అను పేరుతో వ్యవహరింపబడుచున్నది. ఈ మాండలికములు, భాషను మాట్లాడు ప్రదేశమును విభజించునట్టి మాండలిక విభాజకరేఖ (Isogloss) ల సంపుటుల ననుసరించి వర్గీకరింపబడును. ఆయా భాషలు మాట్లాడు దేశముల విభజనకును, భౌగోళిక విభజనకును సంబంధము ఏర్పడినట్లు చెప్పవచ్చును.

**భౌగోళిక పరిస్థితులు :**

(Geographical conditions)

భాషలోని మాండలికభేదముయొక్క విస్తృతి స్వభావమును రెండు ప్రధానములైన యంశములను బట్టి చెప్పవచ్చును 1. భావప్రకటనలోని గాఢత్వము 2. వక్తయొక్క ఆంతరంగిక వైఖరులు. భాషలోని ప్రభేదములకు ఈ రెండే ప్రధాన హేతువులని చెప్పవచ్చును. తక్కిన విషయముల సంగతి యటుంచి భావప్రకటనలోని గాఢత్వమునకు సంబంధించినంత వరకు, ఈ భావప్రకటనలోని గాఢత్వ మెంతహెచ్చుగా నున్న, ఆ భాషలోని ప్రభేదములు అంతతక్కువగా నుండును. ఈ గాఢత్వము తక్కువగాఉన్నప్రదేశమున మాండలిక విభాజికరేఖ (Isogloss) ప్రసరించును. ఉదాహరణకు : 'పంటలు పండనిభూమి'అను నర్థమున వాడబడు 'దుబ్బ'అను శబ్దమునకు మాండలిక విభాజికరేఖను మనము తీసికొందము. ఈ పదము ఆంధ్రప్రదేశ్‌లో తెలంగాణాప్రాంతములో వ్యవహారములో ఉన్నది. తక్కిన దేశభాగములో ఈ పదమునకు 'తువ్వ'అనుపేరుతో మార్పుపొంది వ్యవహారములో నున్నది. 'దుబ్బ'అను పదమునకు మాండలిక విభాజిక రేఖ, మహబూబ్‌నగర్ జిల్లాలో 'కొసిగి'ప్రాంతమునుండి మొదలగును. ఇది తెలంగాణా ప్రాంతములోనిది. నల్గొండజిల్లాలోని 'ముంగొల్లు' ప్రాంతముమీదుగా, ఖమ్మంజిల్లాలోని 'లంకపల్లి'ప్రాంతముమీదుగా పోవును. ఈ గీతకు సంబంధించిన ఉత్తరభాగము 'దుబ్బ'అని మాట్లాడబడు భాగమనియు, ఇంకొక భాగములో పై మాటకు బదులుగా 'తువ్వ'అని ప్రయోగములో నున్నదనియు ఈ మాండలిక విభాజికరేఖ నిరూపించును. ఈ మాండలిక విభాజికరేఖద్వారా మ్యాపులో (పటము) భాషలోని మార్పులు సూచింపబడును. భాషలోని మార్పులు ఒకేతీరున ఉండవు. ప్రతిస్థాయిలోను, సమానముగా యీ మాండలిక విభాజికరేఖ ప్రసరింపదు. దీని ప్రసరణములో కొన్నివంపులు మధ్య మధ్యలో నుండవచ్చును. మహబూబ్‌నగర్‌లోని 'కొసిగి' ప్రాంతమునుంచి వెనుకటి మాండలిక విభాజికరేఖ బయలుదేరినట్లు గమనించితిమి. మరొక ఉదాహరణను గైకొందము. 'ఆవుపేడ' తెలంగాణా ప్రాంతములో వ్యవహారములోనుండి, తక్కిన ఆంధ్రదేశములో 'పేడ' అని వ్యవహరింపబడు మఱొక పదమునకు మాండలిక విభాజికరేఖను గమనింతము. 'పెండ'కు సంబంధించిన మాండలిక విభాజికరేఖ కర్నూలుజిల్లాకు చెందిన 'పుచ్చకాయలమాడ' అను ప్రాంతమునుండి బయలుదేరును. దుబ్బ అను పదమునకు చెందిన మాండలిక విభాజికరేఖ ఎక్కడ ప్రారంభమైనదో ఆ 'కొసిగి' ప్రాంతమునకు దక్షిణమున 100 మైళ్ల దూరమున నీ ప్రదేశము ఉన్నది. అనేక మాండలిక విభాజికరేఖలు కలిసి ప్రసరించు భాషాప్రాంతమును మనము విభజింపవలసి యుండును. ఒక భాషను మాట్లాడు ప్రాంతమునందలి భాషలోని మాండలికములకు చెందిన భౌగోళిక విభాగమును చూపునది మాండలిక పద విస్తృతి ప్రదర్శకపటము (Dialect-Atlas).

ప్రపంచమున నితర భాగములలో మాండలికములను సూచించు అట్లాసులను తయారు చేయుటలో విస్తృతీకరింపబడిన విధానములన్నియు దక్షిణ ఆసియాలోని మాండలిక శాస్త్ర పరిశీలనములో ఉపకరించుటకై లభ్యమగును.

**సాంఘిక మాండలికములు :**

(Social Dialects)

ఒక భాషలోని భౌగోళికభేదము లట్లుండగా మన మింకొక తెగకుచెందిన మాండలికములను చూచుచున్నాము. సాంఘికములైన మానవ సమూహములననుసరించి కొన్నిప్రభేదములు కలవు. ఒక వర్ణమునకు చెందిన ప్రజలు మాట్లాడు తీరునకును, మఱొక వర్ణమునకు చెందినవారు మాట్లాడు తీరునకును భేదము కలదు. ఆధునికమైన భాషాశాస్త్రపరిజ్ఞానము లేని వెనుకటితరములవారుకూడ ఈ మాటల తీరులలోని భేదములను బాగుగా గుర్తించిరి. మన్నారుదాస విలాస మను యక్షగాన నాటకములో 18 వ శతాబ్దమున వేత్వేరు కులములవారు వ్యవహరించిన మాటలలోని భేదములు యీ విధముగ గుర్తింపవచ్చును.

1. బ్రాహ్మణులు మాట్లాడుతీరు : 'హోయి వుండరోయి, యిషుబడి అషుబడి యిటువంటి మాటలు నగర బడె. నాయనా'—(ఆగు, ఆగు— మన నోరుదాటి యీ మాటలు నలుగురి నోళ్లలోపడినవి.) 'ఇషుబడి, అషుబడి'—అనుమాటలలోని తేడాను గమనింపవచ్చును. బ్రాహ్మలకంటె వేఱైన వర్గమువారు ఈ మాటలనే 'ఇటుబడి— అటుబడి'— అని వ్యవహరింతురు. బ్రాహ్మణేతరుల మాండలికములోని 'ట' కారమునకు, బ్రాహ్మణుల మాండలికములోని 'ష' కారమునకునుగల భేదమును మనము గుర్తింపకపోము.

2. గొల్లకాపరి మాట్లాడుతీరు:—'హొరెహొరె ఆ యేల వాకిలి విడిస్తివిరా; ఆ ముచ్చు బాపండురాని కాళ్లె యిరగ్గొట్టిగాని' (ఆ బ్రాహ్మణుని ఎందుకు వాకిలిలోనికి రానిచ్చితివి? ఆ దొంగబ్రాహ్మణుని యీసారి రానిమ్ము. కాళ్లు విరగగొట్టెదను). ఇక్కడ 'ఇరగ్గొట్టె' అన్నది 'విరగగొట్టె' అన్నదానికి బదులుగా వాడబడినది. ఇక్కడ 'వి' అను అక్షరమునకు 'ఇ' అని గొల్లకాపరి వాడిన అక్షరము గుర్తింపవచ్చును.

3. బ్రాహ్మణుల భాషకు మఱొక యుదాహరణము:—'హోరి వృద్ధగార్దభమా, నోపగలదంచున్న నెత్తినోరుబెట్టుక కూయవచ్చినాండవు. కపోలతాడనం శేతువో, త్వమేవగార్ధభః, త్వమేవశునకః; త్వమేవ సూకరః, తాళ రోయి యేల కూశేరు' (ఓరె గాడిదా! నీకొక్కనికే నోరున్నట్లు వాగుచున్నావు. నీ చెంపమీద కొట్టనా, నీవే గాడిదవు, కుక్కవు, పందివి, ఓపిక పట్టు—వదరుబోతుకాబోకు) —. ఒక బ్రాహ్మణుడు మఱొక బ్రాహ్మణుని నిందించు విధానమిందు గోచరించుచున్నది. ఇది సంస్కృతవాక్యరూపములతో నిండి యుండును. ఒక్కొక్కప్పుడు సంస్కృత ఉపసర్గాదులతో కూడియుండును. తెలుగులో లోకవ్యవహారమున నటువంటి మాటలతీరు ఉండదు.

బ్రైట్ (Bright) అను నాతడు కన్నడదేశమునందలి బ్రాహ్మణుల మాటతీరునకును, బ్రాహ్మణేతరుల మాటతీరునకునుగల భేదమును ఎత్తిచూపును. ఆ బ్రాహ్మణుడు, బ్రాహ్మణేతరుడు ఇద్దరూ పాశ్చాత్యవిద్యను కళాశాలలలో చదివినవారే అయినను భాషావిషయకముగా ఆ భేదము తొలగిపోలేదు. బాహ్యవాతావరణ ప్రాభవమునకు కొందఱు లొంగిపోవుట, కొందఱు లొంగకపోవుట అనునది కలదు. బ్రాహ్మణేతరుల ప్రభేదము కన్నడ వ్యాకరణముననేకమైన మార్పులను తెచ్చినది. అట్లుగాక, బ్రాహ్మణుల ప్రభేదము, సాహిత్య భాషా ప్రాభవము వలన కన్నడ ప్రజల భాషాపద్ధతిపై ఎక్కువ మార్పులను తేలేకపోయినది. కన్నడ ప్రజల భాష సంస్కృతము వలన, ఆంగ్లభాషవలన, విశేషముగ మార్పుపొందినది. కన్నడ దేశమున ధార్వార్ జిల్లాలోని మాండలికమును

పరిశీలించుటలో 'మెకార్మెక్' (Mecormack) స్పృశ్య – బ్రాహ్మణేతర—అస్పృశ్య — వర్ణముల మాటల తీరులలోగల మూడు తెగల భేదములను గమనించినాడు. ఈ మాండలిక భేదములను కుల ప్రభేదములని యనవచ్చును.

శబ్దవిన్యాసవైఖరి, ఆరోపిత విభేదములు :

(Style and Superposed varieties)

పై విభేదములు సాంఘిక, భౌగోళిక విభాగములకు చెందినవి. కాని ఒకే వ్యక్తి ఒక పరిస్థితిలో మాట్లాడు తీరునకును, మఱొక స్థి మాట్లాడు తీరునకును భేదము కలదు. తన బంధువులతో మాట్లాడునప్పుడు ఒక తీరున మాట్లాడును, అదే బహిరంగోపన్యాసమున కుపక్రమించునపుడు భాష మఱొక తీరున ఉండును. దక్షిణ ఆసియా భాషలలో నీ భేదములు విశేషముగా కన్పించును. రాజకీయవాది ఉపన్యాసము చెప్పునపుడు తెచ్చిపెట్టుకొన్న గాంభీర్యములో ఆలంకారికముగా మాటాడుటకు ప్రయత్నించును. దక్షిణదేశభాషలలో ఈ తీరు విభేదములు అధికముగా కాన్పించును.



# శాస్త్రీయ విజ్ఞాన ప్రచారం

శ్రీ పెమ్మరాజు వేణుగోపాలరావు

## 1. నిర్వచనం

అనుక్షణము వృద్ధిచెందుతూ పెంపొందుతూన్న శాస్త్రీయ విజ్ఞానాన్ని సామాన్యప్రజలలో ప్రచారం చెయ్యటం నేటి సమస్యలలో ఒకటి. ఇది ప్రపంచంలో అన్నిదేశాలలోను పరిష్కరించవలసిన సమస్య. ఆధునిక విజ్ఞానరంగంలో ముందడుగువేసి అత్యద్భుత రోదసీ విహార యాత్రలతో నూతన విజ్ఞానము చేపట్టుచున్న అమెరికా రష్యాలవంటి దేశాలలోనూ, మొన్న మొన్ననే ఈ విజ్ఞాన వీధుల వెలుగుచూసి ముందడుగు వేయ డానికి ఉవ్విళ్లూరుతూ, అభివృద్ధికయి ఆశయాలను అమర్చుకొని క్రొత్తపంథాలను తొక్కడానికి తహతహ లాడుతున్న ఆశియా, ఆఫ్రికాలలోని అనేక దేశాల లోనూ—ఈ సమస్య వుంది. కాని ఈ సమస్యయొక్క స్వరూపము, పరిష్కారమార్గము—ఆయాదేశాల అభి వృద్ధిదశనుబట్టి, ముఖ్యంగా అక్షరాస్యత, పారిశ్రామి కత, సాంఘికవాతావరణాలనుబట్టి ఉంటాయి. 'శాస్త్రీయ విజ్ఞాన ప్రచారము' అనే పదజాలాన్ని ఏదో ఎలక్షను రోజులలో గోడలమీదవ్రాసే స్లోగను లాగ వాడకుండా, ఒక నిర్దిష్టమయిన అర్థాన్ని ఆపా దించటానికి ముందు ప్రయత్నిద్దాం.

### సాం[illegible], శాస్త్రీయ విద్యలు

తెలియని విషయాలు తెలుసుకోవడం, లేక జిజ్ఞాస, మానవునికి సహజమయినది అని గుర్తిస్తే విజ్ఞానసాధన ప్రతివ్యక్తికిగల అభిలాషలలో ఒకటి అనడం అతిశయోక్తి కాదు. కాని జీవితావసరాలకి అవసరమయిన విజ్ఞానం గణించటం అభిలాషమాత్రమే కాదు, తప్పనిసరి. 'నాలుగురాళ్లు సంపాదించి పొట్ట పోసుకోవటానికి' టైపిష్టుగా ఉద్యోగంచేసే వ్యక్తికి 'టైపుమిషనుల వృత్తాంతము' ఆసక్తితో చూడగానే విద్యకాకపోయినా తప్పనిసరిగా నేర్చుకోవలసిన సాంకేతిక విద్య (Technical Knowledge). మెకానిక్ మెషినుల వివరాలు నేర్చుకుంటాడు. వాస్తుశాస్త్రజ్ఞుడు భవన నిర్మాణ వివరాలను నేర్చుకుంటాడు. ఈ సాంకేతిక విద్యలు వృత్తిసంబంధమయిన విద్యలు. ఆయావృత్తు లలో నిపుణత సాధించదలచినవారు ఆ వృత్తులకు సంబంధించిన సాంకేతిక విద్యలు అభ్యసిస్తారు. నాగరి కత నేర్చిన ప్రతిసంఘంలోనూ సాంకేతిక విజ్ఞానం సరఫరా కావటానికి సంస్థలున్నాయి. సమాజవ్యవస్థను నిలబెట్టి పోషించే వృత్తులలో అనేకమంది పాల్గొనాలి. అందుకనే ఈ అత్యవసర విజ్ఞానాన్ని నేర్పటానికి విద్యావిధాన పద్ధతులు కల్పించి నడిపించటానికి సమాజం చారిత్రకంగా బాధ్యత వహిస్తోంది. కాని చరిత్రలో ఎన్నడూ ఈ సాంకేతికవిద్యలు అందరూ అభ్యసించవలసినవిగా పరిగణింపబడలేదు. నేటి ప్రజా స్వామికయుగంలోకూడా ఈ సాంకేతికవిద్యల సాధన, అభ్యాసము సంఘపు అవసరాలనుబట్టి నిర్ణయింప బడుతున్నాయి.

అయితే మానవునికి ఈ సాంకేతికవిద్యలు సుల భంగా అబ్బలేదు. ప్రకృతిని మలచి తనకు కావలసిన తీరులో పరిసరములను సరిదిద్దుకోటానికి ఉపయోగ పడుతున్న ఈ సాంకేతికవిద్యలు—ప్రకృతి రహస్యాలను క్రోడీకరించి, ప్రకృతి మార్గాలను సూత్రబద్ధంగా వర్ణించడానికి నిత్యం జరుగుతున్న అపారమయిన కృషి ఆధారంగా—పెరిగాయి. ఈ సూత్రీకరించబడిన ప్రకృతి స్థితిగతుల వర్ణనయే శాస్త్రీయ విజ్ఞానము. ఇది సాంకేతికవిద్యల పెంపుకి మూలాధారము.

### శాస్త్రీయత - సాంకేతిక

శాస్త్రీయవిజ్ఞానంయొక్క ప్రధ[illegible] ముఖ్యమయినది మానవునకు అది కలిగించే నూతన మనస్తత్వము. మూఢనమ్మకాలను మరపించి, మానసి జడత్వాన్ని సడలించి, మనోభావపరంపరలకి స్వేచ్ఛను రుచిచూపించి నూతనదృక్పథానికి దారితీస్తుంది. ప్రకృతిపై ఊహలకందిన ప్రతిప్రమేయమును (Hypothesis) ప్రయోగాత్మకమయిన పరిశోధన ఆధారంగా నిరూపిస్తేనేగాని సిద్ధాంతంగా పరిగణింప

రాదన్న ఆంక్షకు బద్ధుడై ప్రవర్తించేవాడే శాస్త్రజ్ఞుడు. అంతేకాదు. కొత్తపరిశోధనల ఫలితంగా సేకరించిన సంగతులు పాతసిద్ధాంతముల ముప్పుకు దారితీసినా అనుమానించక మరొక ప్రమేయమును ప్రతిపాదించి సిద్ధాంతీకరించడానికి శాస్త్రజ్ఞుడు వెనుదీయడు. ఇట్టి శాస్త్రీయదృక్పథము (Scientific Perspective) శాస్త్రీయ విధానము (Scientific Procedure), శాస్త్రీయ వైఖరు (Scientific Attitude) లను ఒక్కమాటలో 'శాస్త్రీయత' అందాం. ఈ శాస్త్రీయత, శాస్త్రీయ విజ్ఞానములు ఒకదానినొకటి పెంపొందించుకుని నూతన విజ్ఞానమునకు దారితీస్తూవున్నవి.

మనము నేర్చిన ఈ శాస్త్రీయ విజ్ఞానమును మన నిత్యజీవితంలో ప్రయోజనకారిగా మార్చుటకు కావలసిన విద్యలు సాంకేతికవిద్యలు. ఉదాహరణకు కార్యసాధకములగు పనిముట్లు తయారుచేయుట, రోగనివారకమగు మంచిమందులు కనిపెట్టుట, ప్రకృతిసిద్ధవస్తువులను పోషకములగు ఆహారపదార్థాలుగా మార్చుట, వినాశనకరమగు యుద్ధసామగ్రిని నిర్మించుట మొదలగునవి. ఇట్టి 'ఉపకరణ విద్యలు' (Applied Sciences) నేర్వనిదే ఏసమాజమునకు 'సాంకేతికత' (Technology) అబ్బదు. కాని సాంకేతికత యొక్క స్థాయి లేక హెచ్చుతగ్గులు సమకాలిక శాస్త్రీయ విజ్ఞానముపై ఆధారపడిఉంటాయి. అంతేకాక పరిశోధనకై చేయుప్రయోగములు మనకు లభ్యమగు పనిముట్లు వస్తుసామగ్రిమీద ఆధారపడిఉంటాయి. కనుక సాంకేతికత పెరిగినకొలది శాస్త్రీయ విజ్ఞానాభివృద్ధికి సులువయిన పద్ధతులు లభిస్తాయి. శాస్త్రీయ, సాంకేతికవిజ్ఞానముల మధ్యగల భేదాలు,1 వాటి పరస్పరసంబంధం గుర్తుంచుకొనవలసిన విషయం. లేనిఎడల అభివృద్ధి కార్యక్రమములు సరియైనదారిని పడకపోవటమేగాక, లేనిపోని నిరాశ నిరుత్సాహాలకు దారితీయవచ్చు.

సమాజపు అవసరాలు, ఆర్థిక స్తోమతలను బట్టి ప్రభుత్వాలు, సంఘాలు సాంకేతిక విద్యలను నేర్పటానికి ఏర్పాటులు చెయ్యటమేకాక, సాంకేతికతను ఎంత తొందరగావీలయితే అంత తొందరగా సాధించడానికి ప్రయత్నిస్తాయి. శాస్త్రీయత ఉన్నా లేకపోయినా, ఆధునికత నిదివరకే సాధించిన దేశాల కృషి ఫలితంగా లభ్యమవుతున్న 'రడీమేడ్' సాంకేతిక పద్ధతులను డాక్టరుగారిచ్చిన మందులాగ వాడటంకూడ జరుగుతుంది. సాంకేతికతముందా, శాస్త్రీయతముందా అన్న ప్రశ్న అనవసరం. సాంకేతికత ఎటువంటి వాతావరణంలోనైనా ప్రబలుతుందన్నది చారిత్రక వాస్తవమే గదా. ఫారోవాల పిరమిడ్లు, రోమనుల రోడ్లు మొగలాయీల తాజ్‌మహలు, సోవియట్లు స్పుత్నికులు—సామాన్యప్రజలకు స్వేచ్ఛావాతావరణం కల్పించనవసరం లేకుండానే నిర్మించబడ్డాయి. నేడు ఆధునికతకై ఆశిస్తున్న దేశాలన్నిటిలోనూ సాంకేతికత సాధించడాని కవసరమయినంతమట్టుకు శాస్త్రీయ విజ్ఞానం సరఫరా చెయ్యటానికి నిర్విరామంగా జరుగుతోంది కృషి. కాని ఈ ప్రయత్నాలు, ఏర్పాటులు కొద్దిమంది చదువు కోరినవారి నుద్దేశించబడినవి. ప్రత్యేకశ్రద్ధతో కృషిచేస్తేనేగాని సామాన్యప్రజలకు ఈ శాస్త్రీయ విజ్ఞానము చేరే మార్గాలు లేవు. ఈ ప్రత్యేక కృషినే మనం 'శాస్త్రీయవిజ్ఞానప్రచారం' (Popularisation of Science) అని నిర్వచిద్దాం.

## 2. సామాన్యుని కెందుకీ శాస్త్రీయ విజ్ఞానం?

శాస్త్రీయవిజ్ఞానం సామాన్యప్రజల కవసరమా అన్న ప్రశ్నకి ముందుగానే నాలుగు మాటల్లో సమాధానం యిచ్చి ఆ సందేహమున్నవారిని సంతృప్తిపరచడం మంచిది.

ప్రజాస్వామిక పద్ధతులను అవలంబించిన ప్రతి సంఘంలోను సామాన్యుల సమ్మతి, ఆసక్తులను చూరగొనలేని ఏఅభివృద్ధి కార్యక్రమము సరిగా నడువదు కదా. అభివృద్ధి కార్యక్రమాలకు పునాదులయిన శాస్త్రీయ, సాంకేతికవిద్యలయందు సామాన్యప్రజలకు మక్కువ, అభిమానము కల్పించుటకు ఒక్కటే మంచిమార్గము.

సంఘపు అవసరాలకు సరిపడ పదిమందికే ఈ విద్యలు నేర్పి ఊరుకున్నఎడల వచ్చేముప్పు తీవ్రమయినది. ఈ కొద్దిమంది శాస్త్రజ్ఞులకు మిగిలిన ప్రజానీకానికిమధ్యగల వైజ్ఞానికము మానసికము అయిన

దూరాలు పెరిగి కుల, మత భేదములకంటె తీవ్రమయిన తారతమ్యాలకు దారి తీయవచ్చును. పైపెచ్చు ఈ శాస్త్రజ్ఞులు సామాన్యులకందని పండితబృందమై, వీరి ఆధిక్యతకు సామాన్యులు తలవొగ్గి భావదాసులవటంకూడ సంభవిస్తుంది. నేటి 'సాంకేతికత'కు మూలకారణమయిన శాస్త్రజ్ఞుడుకూడా అందరిలాంటి మామూలు మనిషే. కొండనించి దిగివచ్చిన దైవాంశ సంభూతుడుకాదు; మాయామాంత్రికుడూకాదు; తెలివితేటలు సూక్ష్మదృష్టిగల ప్రతివానికి శాస్త్రజ్ఞుడు కాగల అవకాశమున్నదని సామాన్యులు గుర్తించిననాడే శాస్త్రీయవిజ్ఞానాభివృద్ధికి కృషి సర్వవ్యాపకమయి అందుకు తగిన వాతావరణం ప్రబలుతుంది.

సామాన్యప్రజల అదరాభిమానాలు శాస్త్రీయ విజ్ఞానాభివృద్ధికి తోడ్పడినవనడానికి చరిత్రక దృష్టాంతాలు చాలా ఉన్నాయి. మధ్యయుగపు యూరపులో పునరుద్ధరణ మార్గాలు వెతకబడుతున్న రోజుల్లో—అంటే రినైజాన్సు యూరపులో— శాస్త్రజ్ఞులు తమ విజ్ఞానాన్ని నాటి పండితభాష అయిన లాటినులోకాక, సామాన్యుల భాషలో పలికి, వ్రాసి, చర్చించడానికి ప్రయత్నించి, సామాన్యులకు వారి విజ్ఞాన పరిశోధనలయందు గౌరవాభిమానాలు కలిగేటట్లు చేశారు. టోలమి, కోపర్నికసుల ప్రపంచ క్రమ, నిర్మాణ పద్ధతులు చర్చిస్తూ గలీలియో వ్రాసిన ముఖ్య గ్రంథము నాటి వ్యవహారికభాషయైన ఇటాలియను భాషలో మామూలు బాతాఖానీతీరులో వ్రాయబడింది.2 సామాన్యుల దోహదంతో, విజ్ఞానుల పరిశ్రమతో మధ్యయుగపు సాంఘిక వాతావరణంనుంచి బయటపడిన యూరపు సాధించిన గొప్ప మార్పును అందుకనే 'శాస్త్రీయవిప్లవం' (Scientific Revolution) అన్నారు. ఈ శతాబ్దంలో అమెరికా, పశ్చిమ యూరపు దేశాలలో శాస్త్రీయ విజ్ఞానము పలువిధాలుగా సామాన్యుల కందజేయుటచేతనే ఆయాదేశాల ప్రభుత్వ యంత్రాంగములయిన కాంగ్రెసులు, అసెంబ్లీలు, పార్లమెంటులలో శాస్త్రీయ సాంకేతిక విజ్ఞానాభివృద్ధికి పెట్టుబడిపెట్టుటకు ముందు అనేకమయిన చర్చలు, అజమాయిషీలు, నిశిత పరిశోధనలు జరుగుతున్నాయి.

అసలు 'శాస్త్రీయత' శాస్త్రజ్ఞునికేకాదు ప్రతి మానవునకు ఉండవలసిన ప్రవృత్తి. స్వేచ్ఛాభావ తరంగాలు నిత్యసమృద్ధిగా ప్రజానీకమున ప్రవహించటం కంటె ప్రజాస్వామ్యానికి కావలసినది వేరొకటేమున్నది ? అంతేకాదు శాస్త్రీయతలేని సాంకేతికాభివృద్ధి మానవత్వపు విలువలపై ఆదరణ నెరుగని సాంకేతికనిపుణులను తయారుచేసి ప్రమాదములకు దారి తీయగలదు.

## 3. ప్రచార మార్గములు

విజ్ఞానప్రచారపు ఆవశ్యకతను అందరు గుర్తించినట్లయితే సమస్యాపరిష్కారమార్గంలో కొంత ముందడుగు వేసినట్లే. కాని, అపారమయిన ఈ శాస్త్రీయ విజ్ఞానాన్నిఅంతా సామాన్యుల కెలా అందజెయ్యటం ? ఒక శాస్త్రజ్ఞుని భాష మరొకనికి అర్థంకాని ఈ రోజులలో మామూలు మనుష్యులకి ఈ లేనిపోని ఆదర్శాలు కల్పించి వారిజీవితం కష్టాలపాలు చెయ్యటం ఎందుకు ?—అని నిరాశావాదులు వేసే ప్రశ్నలు చొప్పదంటు ప్రశ్నలుకావు; పరిశీలించి జవాబులివ్వ వలసిన ముఖ్యప్రశ్నలు.

ముఖ్యమయిన విషయం, సంఘంలోని అక్షరాస్యత విద్యాసంపదలనుబట్టి తగిన ప్రచార పద్ధతులను అవలంబించటం. ఇదివరకే అభివృద్ధిచెందిన దేశాలలో (Developed Countries) విద్యావంతుల సంఖ్య ఎక్కువయేగాక సామాన్యప్రజలలో నూటికి నూరుపాళ్ళు చదువనేర్చిన వారుండటం సత్యదూరము కాదు. కాని అభివృద్ధి చెందుతున్న దేశాలలోను (Developing Countries), అభివృద్ధి నసలు ఎరుగని దేశాలలోను (Undeveloped Countries) విద్యావంతుల సంఖ్య చాల తక్కువయేగాక, నిరక్షరాస్యత ఎక్కువ. గమనించవలసిన తేడా మరొకటి వుంది. అభివృద్ధిచెందిన చాలాదేశాలలో శాస్త్రీయ విజ్ఞానపు సరఫరాకు ఉపయోగించే భాష ఆయా దేశాలలోని వాడుకభాషయే. మిగిలిన దేశాలలో వాడుక భాషలు శాస్త్రీయవిజ్ఞానమునకు ఉపయోగించుటకు ముందు మార్పులు చెందవలసిన అవసరం ఉంది. కనుక అమెరికా, జర్మనీలవంటి దేశాలలోని ప్రచార పద్దతులకు ఇండియా, నైజీరియాలవంటి దేశాలలో అవలంబించవలసిన పద్ధతులకు తేడాలుండటం

సహజం. ముందు అభివృద్ధి చెందుతూన్న దేశాల విషయమై, ముఖ్యంగా మన భారతదేశాన్ని దృష్టిలో వుంచుకుని, చర్చిద్దాం.

శాస్త్రీయ విజ్ఞానము నాలుగు ముక్కలలో పిట్టకథలతో హరికథ బుర్రకథలలాగ టూకీగా చెప్ప టానికి వీలయినట్లయితే యింతసమస్యే కాకపోవును. పదహారవశతాబ్దంలో యూరపులోని శాస్త్రీయ విప్లవంతో ప్రారంభమయి నేటివరకూ సేకరించబడిన ఈ విజ్ఞానం అపారమయినది. శాస్త్రజ్ఞులు తమ తమ ప్రత్యేకనిపుణతలతో నిత్యము సేకరిస్తున్న యీ విజ్ఞానము వివిధశాఖలుగా రూపొంది ప్రతిశాఖ ఒక ప్రత్యేకశాస్త్రంగా పరిణమించి వృద్ధిచెందుతున్నది. ఒక ప్రత్యేక శాస్త్రజ్ఞుడు ఉపయోగించే మాటలు ( ఒకే భాషలో వున్నప్పటికి), కృషిచేసి నేర్చుకొనినగాని మరొకనికి అర్థం కాకపోవుట మామూలు అయిపోయినది. ఒక్క భౌతిక శాస్త్రములోనే నేడు డజనుకుపై బడి ప్రత్యేకభాగము లున్నాయి. ఈ ప్రత్యేక శాస్త్రజ్ఞులు ఒకరు చేస్తూవున్న పని మరొకరికి తెలియజేయడానికి తమలో తాము సంఘములుగా ఏర్పడి సమావేశములు జరుపుకొనటంకూడ ఆచారమయినది. అనేక పరిభాష (Technical Jargon) లతో కూడిన శాస్త్రీయ విజ్ఞానంయొక్క విస్తారత(Extent)యే దీని ప్రచారమునకు మొదటి యిబ్బంది. ఈ విజ్ఞానమంతటిని అందరికి తెలియజెప్పడం కఠినమయిన పనియేకాదు; ఒకతరంలో సాధించలేని పని. ఆదర్శవాదులు దీనిని గుర్తించి కార్యక్రమాలను మొదలుపెట్టటం మంచిది. వీరిలో కార్యవాదులు నిరాశచెందక సాధ్యమయినంతవరకు సాధించడానికి సంసిద్ధులవటం సహజము. అయితే ఎంతవరకు సాధించగలము అన్న ప్రశ్నకు వీరందరు సమాధానం సాధించగలిగిననాడు వీరికృషి కొంత సఫలము కాగలదు. నిర్మాణాత్మకమయిన దృష్టితో ఈ ప్రశ్ననే మరొక రూపంలో అడుగుదాం. ఎవరికి ఏ స్థాయిలో కనీసం ఎంతవిజ్ఞానం సరఫరా చెయ్యగలం ?

చదువనేర్చిన వారందరు ఈ విజ్ఞానమును స్వీకరించుటకు తగిన మేధాసంపత్తి గలవారు కాదు గదా. మన దేశంలో చాలమంది హైస్కూలుతో చదువులు ముగించినవారే. స్త్రీలలో అనేకులు బహుశః ప్రాథమిక పాఠశాలను దాటివుండక పోవచ్చును. సామాన్య ప్రజలల్లో చదువు సంస్కారములు ఒక స్థాయిలోకాక అనేకస్థాయిలలో ఉండటం మనదేశములోనే కాక యితర దేశాలలోకూడ కనిపిస్తూ వుంటుంది. ఈ ప్రజా బాహుళ్యమునందున్న విద్యా సంస్కారముల వివిధదశలను గుర్తించి ప్రచార మార్గము లవలంబించవలసి వుంటుంది.

ఉన్నతవిద్యల నభ్యసించినవారికి వారి కందుబాటులోలేని ప్రత్యేక శాస్త్రములను తెలియజెప్పటకు సులభసరళిలో ఆంగ్లమందు రచనలు వ్రాసిన చాలును. ఆంగ్లభాషను వాడుతున్న పాశ్చాత్యదేశాలలో ఇట్టి రచనలు నిత్యము జరుగుతూన్నవి. కాని మన వాతావరణమునకు, సంస్కారమునకు అనుగుణంగా మనదేశీయులు వ్రాయుటం చాల అవసరం.

అధిక సంఖ్యాకులు ఆంగ్లభాష నెరుగరు కదా. హైస్కూలు చదువులు ముగించిన వారికికూడా ఆంగ్లభాషయందు ప్రవేశ ముండునేమోగాని ప్రావీణ్యత ఉండదు. కనుక ప్రాంతీయభాషలలో సులభమయిన వ్యావహారిక శైలిలో శాస్త్రీయ విజ్ఞానమునుగూర్చి వ్రాయుట ముఖ్య కార్యక్రమంగా పరిగణించవలెను. 'ప్రాంతీయ భాషలలోనే విద్యాబోధన జరుగుట ఉత్తమము, అత్యవసరము'ని అందరు విశ్వసిస్తున్న యీ రోజులలో ఇట్టి కార్యక్రమమునకు అత్యధిక ప్రాధాన్యత గలదు.

చదువ్రానివారికికూడ ఈ విజ్ఞానమును రుచి చూపించుటకు ప్రత్యేక మార్గములు అవలంబించవలెను. చలనచిత్రములు, టెలివిజనులద్వారా ప్రకృతి రహస్య పరిశోధన మార్గములను, ప్రకృతి యందలి వింతలను సామాన్యులకు ముచ్చటగా, మనోల్లాస పూర్వకముగా తెలియచేయుటకు ప్రయత్నములు జరుగవలెను. కార్టూనుచిత్రము ఈ మార్గములో ఎక్కువ ఉపయోగపడు ననుట అతిశయోక్తి కాదు. ఇట్టి పద్ధతులను కనిపెట్టుటకు ప్రభుత్వములు, ప్రత్యేక సంఘములు తోడ్పడి ప్రోత్సాహము నివ్వవలెను.

పాఠశాలలో విద్యార్థులకు చదువు నేర్పునపుడు ఏ తరగతి స్థాయికి వీలుగా ఆ స్థాయిలో ప్రత్యేకముగా నిర్ణయింపబడిన సిలబసును అనుసరించుట మన మెరిగివున్న విషయమే. కాని సిలబసుబద్ధమైన పద్ధతులు సామాన్యప్రజలలో ప్రచారానికి పనికిరావు. సామాన్యుని ఉత్సాహము, ఆసక్తి చూరగొనే విషయాలను ప్రచారము ప్రారంభించాలి. ప్రతిసామాన్యుడు బి. ఏ. పట్టభద్రుడు నేర్చుకునే విషయాలన్నీ తేలుసుకోవాలనుకోవడం ప్రమాదం. సౌరకుటుంబగ్రహముల పరిభ్రమణం గురించి, వాటి పరిధులలోని వ్యత్యాసముల గురించి, ఆ వ్యత్యాసాలకు కారకమయిన సూక్ష్మ రహస్యాల గురించి సవిస్తరంగా వర్ణించడం ఖగోళ శాస్త్రంలో ఉత్సాహంగలవారు శ్రద్ధతో వినగలరు. కాని సామాన్యునికి ఆ సంగతులపై విపులమయిన ఉపన్యాసం విసుగెత్తించవచ్చు. వ్యవసాయదారులందరకి వృక్షసామ్రాజ్య వర్గీకరణం (Classification) అంతనీ కుణ్ణంగా తెలియజెప్పడంకూడ సబబు కాదు.

సమకాలిక సంఘంలో ఉత్పన్నమయిన సమస్యలకు సంబంధించిన విజ్ఞానాన్ని ముందు అందజేయటానికి ప్రయత్నించాలి. చంద్రమండలయాత్ర జరుగుతున్న రోజులలో తత్సంబంధమయిన విషయాలయందు సామాన్యుడు ఆసక్తి చూపవచ్చునుగనుక ఆ విషయాలను ముచ్చటించటం మంచిది. ఫెర్టిలైజరుఫ్యాక్టరీ కడుతున్నప్రాంతంలో దానికి సంబంధించిన బాగోగులు తెలియజేయటానికి ప్రయత్నించడం ఉపయోగం. స్టీలు మిల్లు కట్టడానికి మంచిచెడ్డలు ఆలోచించి రిపోర్టులు వ్రాయటంతోబాటు ఆ పరిశ్రమకి సంబంధించిన విషయాలనుగురించి సామాన్యునికి తెలియజెప్పటం మంచిది. అవసరం వచ్చినప్పుడల్లా వార్తాపత్రికల్లో ఈ విషయాలగురించి వ్యాసాలు పడుతున్నాయిగదండీ అనవచ్చు. కాని ఈ న్యూస్‌పేపర్ల రచనలు సాధారణంగా రాజకీయాలతో ముడిపడిపోతాయి. మనకు కావలసినది ఈ వంకన వీలయినంత ప్రాథమిక విజ్ఞానం అండ చెయ్యటం. ఈ ప్రాథమిక విజ్ఞానంవల్ల సామాన్యుని మనఃప్రవృత్తిలో 'శాస్త్రీయత'కి స్థానం దొరుకుతుందని మన ఆశ. అంతేకాని చిట్టాఆవర్జాలు వేసినట్లు, చరిత్ర పాఠాలలో రాజవంశాల వర్ణన చేసినట్లు బోలెడు సంగతులు సామాన్యుని వళ్లో వలకరించడంకాదు మన ఆదర్శం.

## అపరిచితములైన శాస్త్రీయ భావాలు

ఈ ప్రచారమార్గాలలో మనం ఎదుర్కొనే సమస్య మరొకటుంది. తన వాతావరణానికీ, సంస్కృతికీ అపరిచితమయిన భావాలను అవగాహన చేసుకోవటంలో సామాన్యుడుపడే కష్టసుఖాలను జాగ్రత్తగా పరిశీలించవలసిన అవసరం చాలా ఉంది. ప్రపంచంలో ఎక్కడ ఏమిజరిగినా ప్రతివిషయం వెనువెంటనే అందరికి తెలిసే ఈ రోజుల్లోకూడా తన సంస్కృతికి అపరిచితములు, నిరుద్ధములుఅయిన శాస్త్రీయ భావాలను విడమరిచి సామాన్యుని కందజేయగలమా అన్న ప్రశ్న మేధావులను బాధిస్తున్నది. పాశ్చాత్య సంప్రదాయములో పుట్టిపెరిగిన శాస్త్రీయభావాలు ప్రాచ్యదేశాల సంస్కృతితో సంకర్షించినపుడు కలిగే యిబ్బందులనుగూర్చి సవిమర్శకంగా ఆలోచనలు జరగాలి. నేపాలుదేశంలోని కొన్నిజాతులలో బడిపిల్లల శాస్త్రీయభావాల అవగాహనపై వారి సాంప్రదాయబద్ధమయిన మనస్తత్వాల ప్రభావాన్ని గురించి డాక్టర్లు ఎఫ్. ఇ. డార్టు, పన్నాలాల్ ప్రధాన్ గార్లు పరిశోధనలు జరిపారు.[3] విద్యార్థుల సంప్రదాయము, సంస్కృతులకు వింతయైన కొత్తభావములను వారికి నేర్పేటప్పుడు జాగ్రత్తపడవలసి వుంటుందని వీరిఅభిప్రాయము. అసలు భావసంకల్పన (Concept Formation) చిన్నతనమునుండి ఏఏతీరులలో జరుగుతుందో, ఎటువంటి భావములు (Concepts) ఏఏవయస్సులలో సులువుగా అవగాహన చేసుకోబడతవో—వాటిని గురించి మనస్తత్వశాస్త్రజ్ఞులు పరిశోధనలు జరిపారు. స్విస్ శాస్త్రవేత్త జీన్ పియాజె[4] (Jean Piaget) చిన్నపిల్లలలో భావసేకరణ(Abstraction)పద్ధతులను గురించి పరిశోధించి, తర్కబద్ధమై, గణితసూత్ర పరిమితమై క్రమబద్ధమయిన భావసేకరణ (Aquisition of Logico—Mathematical Concepts), పిల్లలలో మాటలు నేర్వకపూర్వమే ప్రారంభమవుతాయని నిరూపించివున్నారు. రష్యను శాస్త్రజ్ఞుడు వైగోట్‌స్కీ[5] చిన

పిల్లలలో నిత్యజీవితానుభవంతోకూడిన దైనందిన భావాలు (Everyday Concepts) సేకరించుటకు, కృత్రిమమై రెడీమేడ్‌గా సరఫరా చెయ్యబడే శాస్త్రీయభావాల సేకరణకు మధ్యగల పరస్పర సంబంధాన్ని నిర్వచించి విద్యావిధానపద్ధతులలో ఈ విషయాలను గుర్తుంచుకొనవలయునని నిర్ధారణ చేశారు. అయితే శాస్త్రజ్ఞులు వయస్సువచ్చిన పెద్దలలో ఈ భావసేకరణ పద్ధతులను గమనించి పరిశోధనలు సలిపినట్లు కనిపించదు. నూతనమైన భావములను ఆకళింపుచేసుకొనడానికి కావలసిన మానసిక ప్రవృత్తి, ఆశ, ఆతురత, కుతూహలము అందరికీ సమంగా ఉంటాయనుకోవడం సమంజసం కాదు. ఈ విషయమై విద్యావేత్తలు పరిశోధనలు జరుపటం అవసరం.

## 4. పరిచారకులు

ఇంతవరకు శాస్త్రీయవిజ్ఞానంయొక్క స్వభావము, దాని ఆవశ్యకత, దాన్ని ప్రచారము చేయటంలో గమనించవలసిన విషయాలు చర్చించాం. మరొక ముఖ్యవిషయాన్నికూడ చర్చించినగాని పరిష్కారమార్గము సులువుకాదు;—అది యీ విజ్ఞానమును సరఫరాచేయడానికి పూనుకొనే ప్రచారకుల సంగతి. న్యాయంగా ప్రచారానికి తగినవారు శాస్త్రజ్ఞులే. తాము నిపుణతతో పరిశోధనలు చేయుచున్న శాస్త్రవిభాగంగురించి శాస్త్రజ్ఞులుగాక మరెవ్వరు మాట్లాడుటకు సమర్థులు? చాలవరకు ప్రాంతీయ భాషలయందు సరఫరా కావలెనుకాబట్టి—వీరు కనీసము రెండు భాషలలో ప్రావీణ్యత పొందిఉండాలి: ఒక ప్రాంతీయ భాష, మరొకటి ఆధునికభాష ఏదయిన. ఈ శాస్త్రజ్ఞుల మనఃప్రవృత్తి, నడవడిక, ఆశయాలు, ఆదర్శాలు—ఒక మాటలో 'శాస్త్రజ్ఞుల సాంఘిక ప్రవర్తన' (Sociology of Scientists) ను గురించి తెలుసుకోవటం మంచిది. భారతదేశపు శాస్త్రజ్ఞులపై ప్రత్యేకముగా సాంఘికవేత్తలు పరిశోధనలు జరిపినట్లు కనిపించదు. అమెరికా, యూరపులలోని శాస్త్రజ్ఞుల సాంఘికప్రవర్తనగురించి జరిపిన పరిశోధనల ఫలితంగా అందరు శాస్త్రజ్ఞులకు వర్తించే కొన్ని సామాన్యలక్షణాలు మనకు తెలుసు.[6] శాస్త్రజ్ఞులు కూడా మామూలు మనుషులేకదా. అందుచేత సంఘపు సరిహద్దులు, పరిసరవాతావరణం వారి నడతపై కూడా తమ ప్రభావాన్ని చూపిస్తాయి. శాస్త్రీయ విజ్ఞానాన్వేషణలోగల ఒకసాంఘికనీతిని గుర్తించటం ముందు అవసరం. ముక్కుమూసుకుని, ఒంటరిగా తనకు తోచిన ఒక విషయాన్ని పరిశోధిస్తూ జీవితం గడిపే మనిషికాడు శాస్త్రజ్ఞుడు (కల్పిత కథలలో అలాంటి శాస్త్రజ్ఞులు కనిపించినప్పటికీ). ఒంటరితనానికి శాస్త్రప్రపంచానికి పడదు. శాస్త్రజ్ఞులమధ్య సంబంధాలు జాతిమత వర్ణ విభేదాలు లేకుండా ఒక అంతర్జాతీయతతో నిండి ఉంటాయి. మరొకనితో సన్నిహితత్వం, స్నేహబాంధవ్యం, ఉత్తర ప్రత్యుత్తరాలు లేకపోయిన ప్రతి శాస్త్రజ్ఞుడు, యితర శాస్త్రజ్ఞులు చేసే కృషిని నిత్యము గమనించడమే కాకుండా, నిరంతరము తన పనిలో, యీ కనిపించని యితర శాస్త్రజ్ఞుల కుటుంబము'యొక్క మెప్పుదలను పొందటానికి, ఆశిస్తూ ఉంటాడు. మరొక రకంగా చెప్పాలంటే ఈశాస్త్రజ్ఞుల కుటుంబం (Scientific Commuuity) శాస్త్రజ్ఞుల నడవడికపై తన ప్రభావాన్ని చూపిస్తూ ఉంటుంది.

ఈ శాస్త్రజ్ఞుల వర్గాలు అనేక తరహాలకు చెందినవి కావచ్చును. అంతర్జాతీయ సంస్థలు, స్వదేశ శాస్త్రజ్ఞుల సంఘాలు, ప్రత్యేక నిపుణుల సంఘాలు, ప్రభుత్వ యంత్రాంగాలు మొదలగునవి—యిట్టి కుటుంబాలు. ఈ కుటుంబాలలో చందాకట్టి సంపాదించిన సభ్యత్వం లేకపోయినా, యిది తగినది, మంచిది, ప్రోత్సహించదగినది—అని వీరుఒప్పుకున్న పని చెయ్యటానికి శాస్త్రజ్ఞుడు ప్రయత్నిస్తాడు. ఈ కుటుంబాలేగాక ఉద్యోగరీత్యా తనపై ప్రభావముగల సంస్థల ఆదర్శాలుకూడా అతని ప్రవర్తనకి కట్టుబాట్లు ఏర్పరుస్తాయి. శాస్త్రజ్ఞులకి, శాస్త్రజ్ఞుల కుటుంబాలకిగల అన్యోన్య సంబంధం దాని సర్వవసానాల గురించి విపులంగా మరొక చోట చర్చించబడింది.'

'శాస్త్రీయ విజ్ఞాన ప్రచారము' శాస్త్రజ్ఞుని ధర్మాలలో ఒకటి అని గుర్తించి, ఈ కృషిలో పేరెన్నికగన్నవారు ప్రత్యేకాదరణకు పాత్రులు అని శాస్త్రీయ కుటుంబం ఒప్పుకున్ననాడు సమర్థు

లయిన శాస్త్రజ్ఞులు ఈ పనికి సిద్ధులవుతారనటంలో అతిశయోక్తి లేదు. రష్యను యకాడమీ ఇటువంటి ఆదర్శమును అవలంబించటం కారణంగా 19 వ శతాబ్దం ప్రారంభంనుంచి రష్యాలో అనేక మంది శాస్త్రజ్ఞులు విజ్ఞానప్రచారంలో పాల్గొంటూ వున్నారు. నేడు ప్రపంచంలో మరి ఏ యితర దేశం లోను అంత భారీఎత్తున విజ్ఞానప్రచారం జరగటం లేదు. రష్యను ప్రజలలో శాస్త్రజ్ఞులయందు, వారి పరిశోధనలయందు గల గౌరవాభిమానాలకు ఈ ప్రచారమే కారణం. ఈ మధ్య జరిగిన అమెరికను భౌతికశాస్త్ర సంఘం సమావేశంలో ప్రముఖ భౌతిక శాస్త్రవేత్త డాక్టరు వి. వైస్కాఫ్ మాట్లాడుతూ 'తాము చేస్తున్న పరిశోధనలు యితరులకు అర్థం అయ్యేటట్లు చెప్పటం శాస్త్రజ్ఞుల కర్తవ్యం. లేక పోతే రేపు కాంగ్రెసులో మన పరిశోధనలకి కావలసిన డబ్బు ఎలా వస్తుంది'—అని హెచ్చరించారు. మన దేశంలో ఎస్. ఎన్. బోసు బెంగాలీభాషలో శాస్త్ర విజ్ఞానాన్ని ప్రచారం చెయ్యటానికి చేస్తున్న కృషి శ్లాఘనీయమైంది. ఇటువంటి కృషి అత్యవసరమని, దేశాభివృద్ధికి దారితీస్తుందని, గౌరవప్రతిష్టలు తేగల దని, మనదేశంలోని కేంద్రరాష్ట్రప్రభుత్వాలే గాక విశ్వవిద్యాలయాలు మొదలుగాగల విద్యాబోధన సంస్థలు, శాస్త్రజ్ఞులసంఘాలు గుర్తించి తగు కార్యక్రమాలను అమలు జరుపేందుకు ప్రయత్నిం చటం చాలా అవసరము.

ప్రస్తుతం శాస్త్రపరిశోధన, బోధనా వృత్తులయందున్న నిపుణులు ఈ కృషికి నడుము కట్టుకొని తయారుకావడం అవసరము. తోటి ప్రజల విజ్ఞానాభివృద్ధికి తోడ్పడటం గౌరవపూర్వక మయిన పని అని గుర్తించి తమ పరిశోధనలతో బాటు విజ్ఞానప్రచారం చేయుటంకోసం తమ కాల మును వ్యయపరచడానికి సంసిద్ధులు కావడం చాల అవ సరం. సంస్థల ఆదరాభిమానములు ప్రారంభదశలో లభించక పోయినను నిరుత్సాహపడక కార్యదీక్షతో కృషిచేయటం అత్యవసరము. దీనికి ముఖ్యము మన దేశపు శాస్త్రజ్ఞులలో సరియైన నాయకత్వము లభించుట.

మన దేశమందలి శాస్త్రజ్ఞులు చారిత్రక కార ణాలవల్ల సాంఘికంగా ఒక వింతపరిస్థితిలో వుండటం యిచ్చట గమనించతగ్గ విషయం. శాస్త్రజ్ఞులొక్కరే కాదు; మనదేశంలో మేధావులు (Intellectuals) అందరూ ఈ పరిస్థితిలోనే ఉన్నారు. చారిత్రకంగా మన ఉన్నతవిద్యాభ్యాసము, రాజ్యాంగతంత్రము మనను పరిపాలించిన ఆంగ్లదేశీయుల భాషలో నడ వటం జరిగింది. అందుచేత ఈ మేధావులు తమ తమ ఊహలను తోటి సామాన్య ప్రజలకు తెలియజెప్ప టానికి వీలుపొందకపోవటం ఒక్కటేగాక సాంఘికంగా ఈ రెండు తెగలకు మధ్య (సామాన్యులు, మేధావులు) తారతమ్యభేదాలకు దారితీయటం జరిగింది. మేధా వులు సామాన్యులకు చాలా దూరంలో వుండటం ప్రతి సంఘంలోనూ మనం ఏదోరకంగా చూస్తున్న విష యమే. కాని మనదేశపు మేధావులు భాషరీత్యాకూడా సామాన్యులకు చాలాదూరంలో ఉండిపోయారు. ఈ ఇరు వర్గాల మధ్య భేదం ఎంత తొందరగా తగ్గితే ప్రజాస్వామ్యమునకు అంతమంచిది. మన సమస్యను గురించిన చర్చ ముగించేముందు మేధావుల విషయమై క్లుప్తంగా పరిశీలిద్దాం.

బుద్ధికుశలతతో ప్రతివిషయాన్ని పరి శీలించగలిగి తమ వ్రాతలతోను పలుకులతోను తోటి వారిపైన సంఘముపైన ప్రభావాన్ని చూపగలిగిన విద్యావంతులందరిని 'మేధావులు' అందాం. ఈ నిర్వ చనంతో అందరూ ఏకీభవించక పోవచ్చు. అది వేరే సమస్య. మనం ప్రస్తుతం ఎవర్నిగురించి ప్రస్తా విస్తున్నామో స్పష్టపరచడం ముఖ్యం. ఈ నిర్వచనం ప్రకారం శాస్త్రజ్ఞులేకాదు యితరవృత్తులలో వున్న వా రనేకులు ఈ మేధావుల తరగతికి చెందుతారు.

భారతదేశపు మేధావులనుగూర్చి విపులంగా చర్చించడానికి యిది సమయంకాదు—కొన్ని ముఖ్యవిష యాల సమీక్ష తప్ప. పరదేశీయుల పరిపాలన తొల గించటం, స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను గడించటం ముఖ్యాదర్శాలని యావద్భారతమందు చాటించి ప్రజాబలమును కార్యసాధనకై వినియోగించుటంలో వీరు ప్రముఖమైన పాత్రను వహించురనటం 'మరువ రాని చారిత్రక సత్యం.' స్వాతంత్ర సాధనలో వీరు నాయకత్వాన్ని చేపట్టి నాయకత్వంతోపాటు సంక్ర

మించిన అధికారాన్ని బాధ్యతతో నిర్వహించా రన టంలో అతిశయోక్తి లేదు. కాని స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత గడచిన రెండుదశాబ్దములలోను సంఘంలో వీరి స్థానమందు కలిగిన మార్పులు గమనించతగ్గవి. నాయకత్వం, అధికారం వీరి చేతులనుండి సడలినవి. కొద్దిమంది మేధావులుమాత్రము ప్రభుత్వ సంస్థల, ప్రజాసంస్థల యంత్రాంగములలో సలహాదార్లుగా మనగలుగుతున్నారు. అధిక సంఖ్యాకులు, సంఘంలో ఒకవర్గంగా ఏర్పడకపోయినా, అటు సామాన్యులకు యిటు అధికారవర్గాలకు దూరమై, పరిస్థితులపై ప్రభావం చూపలేక విరక్తితోకూడిన మనః స్వభావ మునకు లోనవుతున్నారు. మేధావుల ఈ మానసిక స్థితిని సాంఘిక శాస్త్రవేత్తలు Alienation లేక 'వేరిడితనం' అంటారు. ఇదే మనదేశంలో చాలామంది మేధావుల 'బహుదూరత్వం' 'పోనిమ్మాయిజం', 'పట్టించుకోనితనా'లకి మూలము.

మేధావులు సంఘంలో తమపాత్రని, తమ బాధ్యతలని తమకుతామే నిర్వచించుకోవలసిన రోజు లివి. స్వాతంత్ర సాధనలాంటి మహదాశయాలు నేడు లేవు. —కొంగుపట్టుకు వేలాడడానికి. దేశాభివృద్ధికై తాము చేయగలిగినపని మేధాశక్తి నుపయోగించి తామే గ్రహించి మేధావులమని నిరూపించుకోవలసిన సమయ మిది. ఈ మేధావుల వేరిడితనం తగ్గించటానికి శాస్త్రీయ విజ్ఞాన ప్రచారంవంటి కార్యక్రమాలు మార్గదర్శకాలు కాగలవేమో !

## 5 అభివృద్ధిచెందిన దేశాలు

(Developed Countries)

ఇక అభివృద్ధిచెందిన దేశాలగురించి విచా రిద్దాం. గత రెండుమూడు సంవత్సరాలనుంచి ఈ దేశాలలో ఒక వింతధోరణి బయలుదేరింది. శాస్త్రీయ విజ్ఞానం అంటే మక్కువ తగ్గుతోంది. అమెరికా లోని కళాశాలల్లో సైన్సు సబ్జెక్టులను (రిగ్యులరుగా గాని, ఆప్షనల్‌గాగాని) తీసుకునేవాళ్లసంఖ్య క్రమంగా తగ్గుతూండటం విద్యావేత్తలను కలవర పెడుతోంది. శాస్త్రీయ విజ్ఞానంయొక్క ఉపయోగం ఏమిటి ? అనే ప్రశ్న ప్రజలనూ, కొందరు శాస్త్రజ్ఞులనూ కూడా, బాధించటం ప్రారంభం అయింది. ప్రపంచం లోని చెడుసమస్యలన్నిటికీ శాస్త్రీయ విజ్ఞానమే కారణమన్నట్లు పలురకాల విమర్శలు బయలుదేరాయి. నిజంగా ఈ పరిస్థితి రావటానికి కారణం శాస్త్రీయ విజ్ఞానం ప్రాతిపదికగా వృద్ధిచెందిన సాంకేతిక విద్య లన్నీ మానవాళికి ప్రయోజనకారులు కాకపోవటమే. విజ్ఞానాన్ని ఉపయోగకరంగా హానికలుగకుండా వాడు కొనక పోవటం వల్ల కలిగే నష్టాన్నిచూసి శాస్త్రీయ విజ్ఞానమే వద్దనేవారు శాస్త్రీయ విజ్ఞానానికి, సాంకే తిక విద్యలకి మధ్యగల సంబంధం గ్రహించలేదన్న మాట. దీనికి కారణం బహుశః విజ్ఞానం రాను రాను కొంతమంది శాస్త్రజ్ఞుల ప్రత్యేకవిద్యగా ఉండిపోవటం కావచ్చును. శాస్త్రీయవిజ్ఞానంఅంటే ఏమిటి? దీని లక్ష్యాలేమిటి? దీని విలువ ఎంత? ఇది ఎంతవరకు మన ఆశలు తీర్చగలదు?—అనే ప్రశ్నలకి జవాబు లిచ్చే వారు అరుదయ్యారు. నిత్యం అనేకరకాల సాంకేతిక సాధనాలను ఉపయోగించుకుంటున్న ప్రజల సంస్కృ తిలో శాస్త్రీయవిజ్ఞానపు విలువల పరిచయం సమ పాళ్లలో లేకపోవటానికి శాస్త్రజ్ఞులు, విద్యావేత్తలు కొంతవరకు కారణంఅని గ్రహించాలి! ఈ విషయం గుర్తించిన ప్రభుత్వసంఘాలు, విజ్ఞానసంస్థలు శాస్త్రీయవిజ్ఞాన ప్రచారానికి అనేకపథకాలు తయారు చేసి ఆచరణలో పెడుతున్నాయి.

## 6. సారాంశము

'శాస్త్రీయత' (అనగా శాస్త్రీయ దృక్పథము, శాస్త్రీయ విధానము, శాస్త్రీయ వైఖరి కలిగిన మనఃప్రవృత్తి) శాస్త్రజ్ఞులకే కాదు సామాన్యులంద రికి అవసరమని, శాస్త్రీయతలేని సాంకేతికత ప్రజా స్వామ్యమునకే విరుద్ధమని గమనించాము. దీనిని పెంపొందించుటకు తగుపాళ్లలో శాస్త్రీయ విజ్ఞా నాన్ని సామాన్యునికి రుచి చూపించేందుకై చేయ వలసిన, ప్రత్యేక శ్రద్ధతోకూడిన ప్రచార కార్యక్రమమును 'శాస్త్రీయ విజ్ఞాన ప్రచారము' అని

నిర్వచించాం. ఈ ప్రచార పద్ధతులు సామాన్య ప్రజలయొక్క విద్యా సంస్కారాల వివిధ దశలను దృష్టిలో పెట్టుకొని అవలంబించవలెనని, నిరక్షరాస్యులనుకూడ ఈ విజ్ఞాన వీధుల్లో నడిపించగల నూతనకార్యక్రమములను కనిపెట్టడానికి పరిశోధనలు చేయవలయునని గుర్తించాము. శాస్త్రజ్ఞులు ఈ ప్రచారంలో ప్రముఖపాత్ర వహించడానికి తగిన సమర్థులని, శాస్త్రజ్ఞులకుటుంబము — ఇట్టిపని గౌరవప్రతిష్ఠలలో కూడినది, దేశాభివృద్ధికి అవసరమైనది అని శాస్త్రజ్ఞుల కాదేశించవలెనని నిర్ణయించినాము.

(అమెరికాలో వెలువడుతున్న తెలుగుభాషా పత్రిక నుండి.)

### సంప్రతించబడిన ప్రచురణలు

1. The Social Reality of Scientific Myth". సంపాదకులు : Kalman H. Silvert (ప్రకాశకులు : American Universities field staff Inc, New York, I969.)

2. "Two New Sciences" Galileo Galilei. ఆంగ్లానువాదం H. Chew & A. De Salvio (ప్రకాశకులు : Macmillan, New York 1914)

3. F. D. Dart & P. L Pradhan, "Cross Cultural Teaching of Science". Science Vol. 155, 649 (1967.)

4. "The Psychology of the Child" J. Piaget & B. Inhelder (ప్రకాశకులు: Basic Books INC. N. Y, 1969.)

5. "Thought and Language" L. S. Vygotsky. [ప్రకాశకులు: MIT. Cambridge, Mass. (1962)]

6. Stephen Cotgrove, "The Sociology of Science and Technology"; British Journal of Sociology Vol. 21, 1—I5 (March 1970)

7. Michael Polanyi, "The Republic of Science" Minerva Vol. 1, 54—73, 1962.

---



# చూడటం - చదవటం

## శ్రీ కొండిపర్తి శేషగిరిరావు

సామూలుగా మనం రూపాలను చదవం. చూస్తాం.

సాహిత్యాన్ని చూడం. చదువుతాం.

కానీ ఒకోసారి రూపాలను చదువుతాం. సాహిత్యాన్ని చూస్తాం.

అప్పుడు శబ్దం చూపిస్తుంది కొన్ని కొన్ని రూపాలను. రూపం వినిపిస్తుంది కొన్ని కొన్ని భావాలను.

అలా రూపాలలోని భావాలను చదవాలంటే, ముందు రూపరచనలోని రూపాలను విశ్లేషించుకొంటూ చూడాలి. ఆ తరువాత, ఆ విశ్లేషణ రూపాలు ఇచ్చిన భావాలను సంశ్లేషించుకొంటూ చదవాలి. అప్పుడు రూపరచనలోని రూపాలను చూడటమూ ఔతుంది, చదవటమూ ఔతుంది.

అంటే—

చిత్రంలోఉన్న రూపాలను విడగొట్టుకొని, విడివిడిగా ఒకోదానినీ చూడాలి. ఆ తరువాత ఆ విడి రూపాలు ఇచ్చే భావాలను, ఒకోదానినీ సూత్రబద్ధం చేసుకొంటూ చదవాలి. అప్పుడుగానీ, ఆ రూపగత భావాలు సంయోగమ్మై, రూపరచనలోని పూర్ణభావమును ఆవిష్కరించవు.

చిత్రమును ఇలా బహిర్గతంగా విశ్లేషించుకొంటూ, అంతర్గతంగా సంశ్లేషించుకొంటూ పోయినప్పుడు, ఆ రూపరచనలోని రూపాలు రూపసాహిత్యంలోకి కరిగిపోయి, భావంలోకి రూపాంతరం చెందుతాయి. అప్పుడు చిత్రరచనలోగల రూపసాహిత్యం మనకు హృదయగతవౌతుందీ, మన రసజ్ఞతలో రసం ఆవిష్కరింపబడుతుంది.

ఈ విధంగా రూపకృతులలోని రూపాలను వాని అనుషంగిక రూపాలనూ వియోగించుకొంటూ; అవి అందించే భావాలను సంయోగించుకొంటూ పోయినప్పుడు, రూపాలలోని భావాలూ అనుషంగికభావాలూ వాటిని అంటిపెట్టుకొనిఉన్న విభావ అనుభావ వ్యభిచారీ భావాలూ మనలో స్పందించి రసాన్ని ఆవిష్కరించి గతిని పొందుతాయి. ఇలా రూపజన్యభావాలు గతిని పొందుతున్నప్పుడు మనలో ఎన్నో రససంవేదనలు కలుగుతాయి. అప్పుడు మనముందున్న చిత్రం స్తబ్దశీలీ, జడస్వభావీ ఐనా; అందులోని రూపాలను ఇలా చదువుకొంటూ పోవటంవలన అవి రసచేతనతో స్పందింపబడి గతిని పొందుతాయి.

నిజానికి చిత్రంలోని రూపం గతినిపొందదు. కానీ ఆ రూపరచనలోని రూపాలు ఇచ్చే భావాలు గతిని పొందుతాయి. ఆ భావగతిలో రూపరచనను చదువుకొంటూ పోతున్నప్పుడు రూపాలు గతిని పొందినట్లుంటాయి.

కనుక రూపరచనలోని రూపాలను వియోగించుకోవటంలో గతిపుటుతుంది. ఆ రూపగతిని సంయోగించుకోవటంలో రూపాలు చేతనత్వాన్ని పొందుతాయి.

అందుకనే *సమూహ రూపరచన (Group Composition) లో ఎన్నోభావాలు గర్భితాలై, విభిన్నముఖవ్యంజనాలై, రూపబద్ధమై ఉంటాయి.

---

* సమూహ రూపరచన (Group Composition) అంటే—

ఎక్కువ మానవరూపాలు (చిత్రములో పాత్రలు) కలిగి, ఒక సంఘటనను తెలిపే చిత్రమూ లేక శిల్పమూ అని అర్థం.

బౌద్ధ శిల్పాలలోని 'శిశు బహుఃకరణా'; అజంతాలోని Flaying Apsaras; రూబిన్స్‌యొక్క 'The dead Christ'; దామెర్ల రామారావుయొక్క 'సిద్ధార్థ రాగోదయమూ' మొదలైనవి. ఇవన్నీ సమూహ రూపరచనకి (Group Composition) కోవకు చెందినవే ఔతాయి.

వాటిని అవగతం చేసుకోటానికి ద్రష్టలమైన మనం సమూహరూపరచనను(Group Composition) విశ్లేషించుకొంటూ చూడాలీ, ఆ తరువాత సంశ్లేషించుకొంటూ చదవాలీ.

అందుకనే ఈ రూపవియోగదృష్టీ; ఈ భావ సంయోగదృష్టీ అన్నవి, రూపరచనలోని రసాన్ని ఆస్వాదించటానికి సాధనాలు ఔతున్నాయి.

*　　*

చిత్రాలలోని రూపరచనను ఇలా విడగొట్టుకొనీ, తిరిగి కలుపుకొనీ ఎందుకు చూడాలీ, ఎందుకు చదవాలీ అని అంటే—

రూపకారుడు తాను రూపరచన చేస్తున్నప్పుడు ఒకోభావాన్ని ఒకోరూపంలో పొదుగుతాడు. అలాంటి భావమయ రూపాలను ఎన్నింటినో ఒకోసమూహరూప రచన (Group Composition)లో భావయుక్తంగా రసస్ఫూర్తితో పొందుపరుస్తాడు. అలా పొందుపరచిన ఒకోరూపంలోని భావం, ప్రక్కరూపంలోని భావానికి సూత్రబద్ధం చేయబడుతుంది. అలా సూత్రబద్ధం చేయటంవలన, రూపజగత్తులోని సమూహరూపరచన ఏకత్వాన్నిపొంది అఖండంగా భాసిస్తూ ఉంటుంది.

అలా భాసించే ఆ సమూహరూపరచనను ఆస్వాదించాలంటే కొంచెం కష్టమే మరి.

అది వెతాలగాలంటే—

ఓ సాహితీరచనను ఆస్వాదించేప్పుడు మనకున్న భాషాపరిజ్ఞానంతో ఎలా శబ్దాలను విడగొట్టుకొంటూ వానిని అవగతంచేసుకొంటూ, ఆ శబ్దాలలో గల భావాన్ని సంధానం చేసుకొంటూ ఆస్వాదిస్తామో—అలానే మన కున్న రూపపరిజ్ఞానంతో రూపసంధాన టంకంతో అతకబడి అఖండంగా భాసిస్తున్న సమూహరూపరచనలో గల రూపాల్ని, వియోగదృష్టితో బయటకులాగి, అందులోని భావాన్నీ దానివెనుకవున్న రసాన్నీ గ్రహించి; తిరిగి ఆ రూపాన్ని ఆ రూపరచనలోనే బిగించివేయాలి. అలా ఆ రూపాలనుండి గ్రహించిన ఆ రూపజన్యభావాలను రూపరచనాక్రమంలో సంయోగించుకొంటూ సాహిత్యంవలె చదువుకొంటూ, భావాన్ని సంభావించుకొంటూపోవాలి. అప్పుడుగానీ రూపరచనలోగల రూపాలు పదాలై గతిస్వభావాన్నిపొంది అనేకభావాలనూ రసాలనూ మనలో ఆవిష్కరింపవు

ఇలాంటి రూపరచనల్లో—

రూపకారుడు భావాలను రూపాలలో పొదిగి పొందుపరిస్తే, ద్రష్టలమైన మనం భావాలకొరకు ఆ రూపాలను వియోగపరచుకోవాలి.

తాను ఈ విశాలరూపజగత్తులో చదువుకొన్న భావాలను మనం చూచేలా చూపిస్తే; మనం ఆ రూపాలనుచూచి, ఆ తరువాత చదువుకోవాలి.

అందుకనే రూపజగత్తులో రూపకారుడు ముందు రూపాలను చదువుతాడూ; ఆ తరువాత చూపిస్తాడు. మనం ముందురూపాలను చూస్తాం, ఆ తరువాత చదువుతాం.

*　　*　　*

ఇలాంటి స్వభావంగల సమూహరూపరచనను విశ్లేషించుకొంటూ చూడటంలో, కొంత రూపపరిజ్ఞానం ఉంటుంది. అందుకని రూపరచన దృశ్యం ఔతోంది. ఆ రూపవిశ్లేషణలో అందిన ఒకోరూపగత భావాన్ని సంశ్లేషించుకొంటూ చదువుకోవటంలో, కొంత భావపరిజ్ఞానం ఉంటుంది. కనుక రూపరచన శ్రవ్యస్వభావి కూడా ఔతోంది.

ఇక్కడ రూపం శ్రవ్యస్వభావిఅంటే, రూపం పలుకుతుందిఅనికాదు. రూపం తనలో నిక్షిప్తపరచుకొన్న ఓ భావాన్నీ, దాని వెనుకనున్న మాటనూ, తన బాహ్యస్వరూపంద్వారా మనచేతనకు వినిపిస్తుందీ, లేక అందిస్తుందీ అని మాత్రమే అర్థం.

కనుక సమూహ రూపరచనలో ఇలా శ్రవ్యస్వభావంకూడా దాగిఉంది. కాకపోతే రూపంయొక్క ధాతువునుబట్టి ఆ శ్రవ్యస్వభావం ఇందులో అతి సూక్ష్మరూపంలో పరోక్షంగాఉంది.

అందుకని సమూహరూపరచనలోని ఒకో

రూపం కొన్నికొన్ని భావాలా మాటలా సంక్షిప్త స్వరూపంగా భాసిస్తూ ఉంటుంది.

అలా భాసించే సమూహరూపరచనలోని రూపాలు మనలో ఎన్నో ఎన్నెన్నో భావాలను రేకెత్తిస్తూ రసాలను అందిస్తూ ఉంటాయి. అప్పుడా సమూహ రూపకృతి రూపకవితలా భాసిస్తూ ఉంటుంది.

అందుకనే ఒకోసమూహ రూపరచనను ఆస్వాదించి మరో రూపరచనను ఆస్వాదించటానికి మన దృష్టి మరలినప్పుడు మొదటి రూపరచనలోని అనుభూతులకు యవనిక వేయబడి మరో రూపరచనకు యవనిక లేపబడినట్లుంటుంది. అంతేకాదు. ఓ కమ్మని కవితను చదివి మూసేసి మరో కవితను తెరచి నట్లుకూడా ఉంటుంది.

కనుకనే సమూహరూపరచన (Group Composition) ఓ రూపకవితగా, ఓ రూపకృతిగా భాసిస్తూ ఉంటుంది—

మన రసజ్ఞతలో.



కలగూరగంప :

# అముద్రిత యక్షగాన ప్రబంధము- "చూతపురీ విలాసము"

ఇది యొక యముద్రిత యక్షగాన ప్రబంధము. యక్ష గానము ప్రబంధశాఖయం దొకటియైనను తామర తంపరగా వెలసిన యా శాఖయందు ప్రబంధనామము వటయక్షన్యాయమున నే కొన్నింటికి మాత్రమో సరి పోవును. అట్టివానిలో నిది యొకటి.

ఈ కృతి ప్రేరకుడు తెలకపల్లి నివాసియగు వెలమదొర సురభి నరసరాయడు. కర్త తరణికంటి నివాసి ఎల్లూరి నరసింగకవి. అతడు సింగపట్టణ నరసింహదేవప్రసాదకవితాలబ్ధప్రవీణుడు. కృతిభర్త చూతపురి నృసింహస్వామి. ఇటు లిది సర్వము నృసింహ మయము.

చూతపురికి 'చూతఘోషపురి' యనియు నామాంతర మున్నటుల శ్రీ గంగాపురం హనుమచ్ఛర్మ గారు తమ 'దుందుభి'యందు పేర్కొనినారు. దాని కిపుడు 'మామిళ్లపల్లి'యని వ్యవహారము. అదియొక ప్రాచీన నృసింహక్షేత్రము. మా గ్రామమున కనతి దూరమున నుండును.

ఈ కావ్యమందలి కథ విప్రనారాయణ చరిత్రము. ఆంధ్రమున నాళ్వారుల చరితల కారంభ మొనరించిన పరమయోగి తాళ్లపాక చిన్నన్న. ఆ పిమ్మట సిద్ధరాజు తిమ్మన, చెదలువాడ మల్లన, సారంగు తమ్మయ్య, విజయరాఘవభూపాలుడు మున్నగువా రీ భక్తాంఘ్రిరేణువు చరిత్రమును రచించిరి. అటివారిలో నీ కవి యొకడు.

మానవజీవితమున బాల్యకౌమారాదిదశలవలె, సంఘము మరియు సాహిత్యజీవితములందును వివిధ దశలు గన్పట్టును. సంఘముచే సాహిత్య మితివృత్తములను, సాహిత్యముచే సంఘమాదర్శములను గ్రహించుచు, నవి యొకదానిపై యొకటి యాధార పడి వికాసదోహదము లందుచున్నవి.

సంఘము నిరంతర పరివర్తనశీలమైనదిగనుక దాని నెప్పటికప్పు డుదాత్తీకరించవలసిన బాధ్యత సాహిత్యముపై నున్నది. ఆ కారణమున సాహిత్య మా యాకాలములకు దగినట్లు వేషము మార్చుకొనుచు సంఘమునకు హితోపదేశ మొనరించినది. అందుచే మన వాఙ్మయమున పురాణ, కావ్య, ప్రబంధములవంటి మార్పు లుప్పతిల్లినవి. ప్రబంధయుగమునాటికి ప్రభువుల మరియు ప్రజల యభిరుచులందు పెద్దమార్పు వచ్చినది. వారు శృంగారప్రియులైనారు. అందువలన వ్యవహారవిదుత్వము ప్రధానమైన కావ్యానంద ప్రధానమైనదై యవతరించి, శృంగారరూపము ధరించి సంఘమునకు నీతి బోధింపవలసివచ్చినది.

ఇక దక్షిణాంధ్ర యుగమునాటి కందరు దక్షిణ నాయకులైనారు. ఆ కాలమున విలసిల్లిన యతి నేలమగు శృంగారము వాత్స్యాయన మహర్షి ప్రోక్త మార్గముననే నడచినది. కవులు నల దమయంతి సీతారాముల యితివృత్తములతో నుదాత్తశృంగారమును బోధించినటులే, తారాశశాంకా హల్యాసంక్రందనములను చేపట్టి పారదారిక ప్రకరణమును, వైజయంతీవిలాసాజామీలోపాఖ్యానములను గ్రహించి వైశికప్రకరణమును దెలిపి యందలి కష్ట నష్ట నికృష్టతలు ప్రదర్శించి, శృంగార ప్రణవమైన సమాజము నుత్తమపథము వైపునకు ప్రవృత్తము జేయవలసి వచ్చినది. అందువలన నాడట్టి కథ లవసరమైనవి. అం దేవేని కాలాంతరమున మరల మరల చిగురించిన అధి వానియందునుగల చేవ బల్ల

మనక తప్పదు. అట్టి బలముగల యితివృత్తములం దీ విప్రనారాయణచరిత్ర మొకటి. ఇక దానిని కవి రూపించిన తీరు పరిశీలింపుడు.

'మండగుడి యను కావేరీతీరాగ్రహారమున లక్ష్మీదేవి నారాయణులను బ్రాహ్మణ దంపతు లున్నారు. దొడ్డ యిల్లాలగు నా లక్ష్మీదేవి రంగము నకువచ్చి సభాసదులకు పతివ్రతాధర్మము లుపన్య సించినది. అపుడు వారింటికొక సన్యాసివచ్చి వా రన పత్యులని తెలిసి భిక్ష గ్రహింపకుండ వెళ్లినాడు. ఆమె చింతాక్రాంతురాలై భర్తరాగానే యా విషయము నివే దించినది. అందుల కతడు శ్రీ మహావిష్ణువు కరుణ లేక దేనిని బడయ సాధ్యముగాదని పత్ని నోదార్చినాడు. వారు సంతతికై — చూతపురి — నరసింహుని గొలువ మొదలిడినారు.

ఆ సర్వేశ్వరునకు వారిపై దయగలిగినది. అతడు—
...............ఎఱుకజెప్పగా దలచి
సొంపుగా నుదుట చక్కగ చుక్కబెట్టి
జంపులు బొగిడీలు నవరపుకుప్పె
అందమైనట్టి ముత్యాల కమ్మలును
సందిదండలు బన్నసరము రాకిణియు,
పచ్చలు డాపిన పాపెటబొట్టు

మున్నగు భూషణములు ధరించి సోదకత్తె యైనాడు. అపుడా సౌందర్యమేమి చెప్పటు—

దరహాస యుక్తమౌ తరుణీముఖంబును
దలచగా నొక్క పద్మంబుసేయు,
శుభరేఖలను చాల సొంపొందు భామినీ
కంఠంబునొక్క శంఖంబు సేయు
కనకరత్నప్రభాకలితమై తగు జుట్టు
కొమరెంచగా నొక్క కోటిసేయు

తరుణి యవలగ్నమొక్క ఖర్వంబుసేయు
లలన పలుకుల చందంబు లక్షసేయు.

ఇటుల సౌందర్యరాసియై వచ్చి, నూటెనిమిది తిరుపతులను, అందుగల దేవతలను, అష్టాదశ పీఠ ములం దష్టాదశనామములతో వెలసిన చూతపురీ నరసింహుని సోదరియగు శ్యామలాంబను గొలిచి, లక్ష్మీదేవికి విప్రనారాయణుడు బుట్టుట మొదలు బ్రహ్మరథముపట్టుటవరకు నెఱుకజెప్పి వెళ్లినాడు. అనంతర మా యిల్లాలు చూలాలై శ్రీ మహావిష్ణువు వనమాలికాంశమున నొక బాలుని గనినది. అతడు

'అంబుజాక్షుడెగాని యఖిలలోకములందు
నన్యదైవంబు లే డనెడువాడు
శ్రీ భాగవతసేవ జేసినవారలు
ధన్యులయ్యెదరని దలచువాడు
హరిచింతలేని మర్త్య శ్రేణితోడుత
చెలిమి నెల్లపుడు వర్జించువాడు
అన్యమతంబుల ననుసరించుచునుండు
వారిచెంతకు జేరనీనివాడు
ఇంద్రియంబుల నెల్ల జయించి శాంత
శమదమంబులు గల్గు వైష్ణవు డితండె
యనుచు జనులెన్న విప్రనారాయణుండు—'

అను పేరున బరగి రంగమునకు వచ్చిన పిదప తనతో పాటు వెలసిన యాళ్వారు లందరినిగుఱించి తెలిపి, కావేరీతీరమందలి శ్రీరంగనికి మాలికాకైంకర్యమునకు మనసు వొడమి, సభాపతుల నడిగి యొక పొలము గొని పూదోటను బెంచుచు నిష్ఠగా జీవించసాగినాడు.

ఒకనాడు చోళరాజ దర్శనమునకై మధురవాణి దేవదేవి యను నిరువురు వేశ్యలు వచ్చినారు. అందు మధురవాణి,

సూనౌఘ మకరందపాన తుందిల మత్త
మధుకరనిభవేణి మధురవాణి
కాంచన నవరత్న కంకణముఖదివ్య
మండనశ్రేణి శ్రీ మధురవాణి
జలధిపరీవృత సర్వంసహాచక్ర
మహనీయ శుక్రశోణి మధురవాణి
మధుసమయోదిత మార్తాండకర భాస
మాన పల్లవపాణి మధురవాణి
మానసార్చిత శర్వాణి మధురవాణి
మంజువాగ్జిత గీర్వాణి మధురవాణి
మత్తసామజగామిని మధురవాణి
మౌనిహృద్భేదకకృపాణి మధురవాణి,

వారచ్చరకులమున బుట్టినవారుగనుక తెర వెళ్లగనే తమ పుట్టువునకు కారణమైన సముద్ర మధనకథ లక్ష్మీకల్యాణాంతమువరకుజెప్పి, దారిని వెళ్లుచు, విప్రనారాయణుని వనముగని దాని రామణీయత కచ్చెరువంది, లోనికరిగి, యట ధ్యాననిమగ్నుడైన యా భాగవతునకు నమస్కరింప, నతడు చంద్రునిగనిన తమ్మివలె మోము వాంచి లోనికి వెళ్లి నాడు. అపు డతనిని వలపించుటకా యక్కాచెల్లెండ్రిద్ద రకు పందెము వచ్చినది. అంత మధురవాణి దేవదేవితో—

ఒకతీరుగా నందరుందురే యైనను
తెలిపెద ప్రవరాఖ్య ధీవరుండు
అవని సిద్ధౌషధం బరయుటకై శత
గిరికేగి నచటది గరగిపోవ
తిరిగిపోవగనెంచి తెరువు జూచుచునుండ
నందు వరూధి మోహంబుజెంది
కులుకు గుబ్బలు నెదగ్రుచ్చి కౌగిలిజెర్చ
'హా వాసుదేవ శ్రీహరి' యటంచు
పలికి యంసద్వయంబు చేపట్టి ద్రోచె
గాక; మనసు చలించెనే ప్రాకటముగ
దానికంటెను నీ వెంత జాణ వహహ!
యేల యూపట్టు విడువవే బేలవగుచు

అని మందలించినది. అందులకు—

సరసోక్తుల చేతను మతి
గరగించగలేకయున్న కాంతామణి సుం
దరరూప మేమిటికి, చి
త్తరు బొమ్మకు లేదె చక్కదన మిలలోనన్

అని దేవదేవి బదులు జెప్పినది. దానికి మధురవాణి—

మును రంభ గాధిపుత్రుని
మనమును గరగించబోయి మరియేమాయెన్
విను దానికంటె యిల చ
క్కని దానవె దలచిచూడు కంజదళాక్షీ!

అని నయభయములు జూపినదిగాని యామె వినలేదు. పంతమాడి దాసురాలివేషమున రాగా శుభ శకునములైనవి. ఆమె శకున విషయములు కొన్ని వివరించి విప్రనారాయణునిజేరి నమస్కరించి, తాను వేశ్యనని, ఆ వృత్తిపై నేవగింపు గలిగినదని, వేశ్యా జీవన హైన్యమును దెలిపి, తనను పాదసేవకు దాసురాలిగా నంగీకరింపుమని వేడినది. అతడంగీకరించి నాడు. పిదప తానెన్ని విలాసములు ప్రదర్శించినను నతడు చలించలేదు. అపుడు తా నక్కగారి మాట వినక పందెమున నోడుదునేమోయని బెంగగొని— చూతపురి — నరసింహస్వామిని ప్రార్థింపసాగినది. ఆ స్వామి దాని నంగీకరించి యొకనాటి తెలవారు జామున స్వప్నమున వైష్ణవవటువుగా దర్శనమిచ్చి నీ పంతమీడేరును, తత్తరము వలదని పలికినాడు.

పిమ్మట నాటినుండి యాభాగవతుని హృదయము మెత్తబడి మోహాయత్తమై, గుడి మొగ మైనవాడు నుడి మొగమై—

హల్లకపాణి ధమ్మిల్లంబుగాంచి శ్రీ
కృష్ణనామంబు కీర్తించ మరచె
శుకవాణి నడుము తప్పకజూచి శ్రీహరి
ధ్యానంబు మదిలోన దలచమరచె
వనజాక్షి నెమ్మేను గనుగొని హాటకాం
బర యని నొకసారి బలుకమరచె
చిల్కలకొల్కి పల్కుల సొంపు విని మధు
సూదనా యని పల్కుచుండ మరచె
నాతికన్నులుగని పద్మనాభు మరచె
మగువ నెమ్మోము గని విభు స్మరణమరచె
తరుణిపాలిండ్లు గని చక్రధరుని మరచె
తెరవయానంబు గని కరివరదు మరచె!

ఇటుల మనన ధ్యానములు మరచుటేగాక—

కలకంఠినూగారు గాంచిన జాలదే
శేషాచలంబు వీక్షింపనేల
ఘనవేణి యధరంబు గనుగొన్నజాలదే
అరుణాచలంబున కరుగనేల
జలజాక్షి మధ్యంబు తిలకించ జాలదే
సింహాచలంబు దర్శింపనేల
సుందరీ గమనంబు జూచిన జాలదే
ఇభగిరివరమున కరుగనేల
కంబుకంధర నెమ్మోము గనినచాలు
చంద్రపుష్కరిణీజలస్నాన మేల

కామినీమణి ఘనవేణి గనిన జాలు
నీలగిరులకు జననేల బేలనగుచు !

అని పుణ్యక్షేత్ర దర్శన కుతూహలముగూడ విరమించుకొని—

పువ్వులు గోయుచో పాలితిమోవి దలంచి
పల్లవంబులు చేతబట్టి త్రెంచు
చిగురాకులేల త్రెంచితినని యా చెలి
రదనాలి దలచి కోరకము దునుము
కోరకంబేలకో గోసితినని దాని
పలుకులు దలచి తేనెలను వడపు
పూదేనె వ్యర్థమై పోయె ననుచు దాని
పాలిండ్లు దలచియు పండ్లుగోయు
అవనిసురు డీ విధంబున నవిగాని
మోహవిభ్రాంతి తన మనంబున జనింప
నొకటి సేయంగబోయి తా నొకటి జేయు—

చుండగా వర్షరు వేతెంచి జడిగట్టినది. ఒకనాటి రాత్రి వర్షమున దేవదేవి పంచాదియందుండ నామెను లోపలికి బిలిచి తానిచ్చిన తిరుమంత్రోపదేశమునకు బదులు స్మరతంత్రోపదేశమందినాడు. ప్రతిన జెల్లిన దని దేవదేవి యాతని నింటికి గొనివెళ్లినది.

విప్రనారాయణుడు దేవదేవి యింటికిరాగా నతని వెనుక శరదృతువు వచ్చినది. దానివెనుక లక్ష్మీదేవి పండుగ వచ్చినది. ఆ పండుగవెనుక వేశ్యమాత వచ్చినది. అపుడు విటులందరు తమతమ వేశ్యలకు బహువిధములైన కానుకలు దెచ్చియిచ్చుచుండ, చేత గొంటు పోకైనలేని యా బోడబాపనితో పనియేమని వేశ్యమాత యాతని నిలువెడల నడచినది. అతడు వచ్చినదారిని బట్టి విధిని దూరుకొనుచు తోటజేరి విరహముపాలై

అతివతోడుత మాటలాడగల్గిన శౌరి
కెంచగా చక్కెర బంచిపెడుదు
బాలిక పాలిండ్లకేల నంటినజాలు
విష్ణున కర్పింతు విరుల చెండ్లు
కలికి నాగారును గనగల్గినను జాలు
శేషశాయికి నిత్యసేవ జేతు
కలకంఠనిభవాణి కనులగాంచినజాలు
రాజీవముల హరిపూజ సేతు

జలజదళనేత్రి చెక్కులు సరభసమున
చూడగల్గినచో జాలు సురుచిరముగ
ప్రేమతోడుత శ్రీరంగధాము నెదుట
నిలువుటద్దంబు నిలువుదు నెలమితోడ

అని రంగని దలచుకొన సాగినాడు.

భక్తుని వేదనకు భగవంతుని మనసు గరగి చూడజాలక వటురూపమును ధరించి యాలయము నందలి యొకగిన్నెను గొని దేవదేవి యింటికివెళ్లి, 'నేను విప్రనారాయణుని శిష్యుడను, నాపేరు రంగడు. మా యయ్యవారీగిన్నె మీ కంపినాడని' దానిని వేశ్య మాతకిచ్చి వెళ్లినాడు. ఆమె దానిని సొన్నారికిజూపించుకొని, పదార్వన్నెబంగారమగుట యెఱిగి, యటి వతనికడ నింక నెన్నియుండునో యని తలచి, వానిని రాబట్టు కొనుటకు, కావేరియను దూతిని బంపి యల్లుని మరల బిలిపించుకొనినది.

అర్చకులు నాటి మధ్యాహ్న నివేదనావసరమున నాలయమున గిన్నె లేకుండుటవలన, జియ్యరునకు నివేదింప, నతడు గుడిపనివారిని విచారించి, యేకాంతమున కళాదుని బిలుచుకొని యడిగి, యది వేశ్య యింట నుండుట యెఱిగి, రక్షకభటులతో నేగి యామెయిల్లు శోధించి, గిన్నెను బట్టుకొని ఇది నీకెట్లు జేరినదని యడుగు వేశ్యమాత యింటనున్న విప్రనారాయణుని జూపినది

తలతరు లతని బటు కొనివచ్చి సభాసముఖమున నిలిపినారు. అచట జేరిన ధర్మాధికారు లాగిన్నె యాతడే దొంగిలించి యుండునని యేకగ్రీవముగా నంగీకరించినను, బాలబ్రాహ్మణుడు మీదు మిక్కిలి భక్తుడు నగుట యాతనికి శిక్ష నిర్ణయింపలేక ధర్మ సమ్మోహితులైరి. అంత ధర్మాధికారుల దశజూచి, జియ్యరాతనిని క్షమించి వదలెను. కాని యందులకు విప్రనారాయణునకు మనసొప్పలేదు. అపవాదుతో నచటినుండి వెళ్లలేక దానిని బాపుమని రంగని ప్రార్థించినాడు.

చిత్తశుద్ధితో గూడిన నాతని ప్రార్థనవిని విష్ణువు వెంటనే ప్రత్యక్షమై దేవదేవి విప్రనారాయణుల సమాగమము, స్వర్ణపాత్రాపహరణము తన చేతనే లీలార్థముగా గల్పింపబడినవని చెప్పి, యాతనికి

గలిగిన యపవా దుడిపి, నేటినుండి యీ కథ యాగమ తుల్యమై వెలయునని వరమిచ్చి తానాతని శరీరమున లీనమైనాడు. అదిగని జియ్యరు మున్నగువారు దేవదేవిని, ధన్యురాలవని గొనియాడి సువర్ణపాత్రతోపాటు జాంబూనదాంబరము లిచ్చి పూజించి విప్రనారాయణు నకు బ్రహ్మరథము బట్టినారు.

ఈ కథను మొమ్మొదట కావ్యీకరించినవాడు సారంగుతమ్మయ్య గనుక సారంగమైన యాతని రచన యనంతరీయు లనుకరింపకుండనుండుట కష్టము. అనుకరణ యప్రతిభుడైన మూలము నిర్మూల మగునుగాని లేకున్నదానికి గురుత్వము గలుగును. కథ జెప్పుటయందీకవి తమ్మయ్య యడుగుజాడలందే నడచి నను, నడుమనడుమ కడివెడుపాలకు కొణిదెడు చల్ల తోడుగా స్వకీయమైన లఘుకల్పనలచే కథను చక్కగా చిక్కగా జేసినాడు.

ఇతడు కవితామర్మము లెరిగిన కవి. నేటికి రెండువందల లోపువాడు. శైలి ప్రౌఢమై సరసముగా నున్నది. మచ్చులు స్థాలీపులాక న్యాయముగా కథ యందే జూపితినిగనుక విడిగా జూపుట సాధ్యముగాదు. ఈ కవి కృత్యాదిని సంస్కృత కవులతోపాటు నన్నయ భట్టు, అనంతుడు, శ్రీనాథుడు, పెద్దన, చిన్నన్నను స్మరించినను తనకు మార్గదర్శియైన తమ్మయ్య నేలనో స్మరింపలేరు.

కావ్యారంభమున నీతడు స్తుతులను నన్నయగారి వలె సంస్కృతవృత్తములలో రచించినాడు. వానిని మరల ప్రతిపాత్ర ప్రవేశావసరమున, అనగా—లక్ష్మీ దేవి మరియు ఎఱుకత ప్రవేశించినపుడు, ఆమె చూలింతరాలిగా వచ్చినపుడు, విప్రనారాయణుడు మరియు వేశ్యలు ప్రవేశించినపుడు, దేవదేవి దాసురాలిగా వచ్చినపుడు, రంగడు, శ్రీరంగడు ప్రవేశించినపుడు, పునరావృత్త మొనరించుటద్వారా రూపకమున రంగ విభజన సాధించినాడు.

ఈ కృతికి ప్రేరకుడు సురభి నరసరాయడు. కవి అతని నామ మీ క్రింది పద్యమున పొదిగినాడు.

శ్రీ రమ్యముగ విప్రనారాయణు చరిత్ర
మెవరు జెప్పించిరి యిష్టముగను
తగ దెల్పుమనిన నా ధన్యుని నామంబు
నేర్పుతో వివరింతు నిక్కముగను,
నావ—హలంబు—బాణంబుల పొది—నంటి
చూస్తిమి, కోరిక—జ్యోత్స్న—ఖడ్గ
మ...బును—వనజంబు—పక్షుల
గతియు—ని వెల్లను చతురమతిని
అక్షరముల మూడింట నమర వ్రాసి
నడిమి యక్షరములు దీయ నయముగాను
కర్త వేరగుచుండు నీక్షామ తలమున
సూక్ష్మబుద్ధి గ్రహించుడీ సుజనులార!

—తిమ్మాజిపేట పాపిసెట్టి సీతారామునిచే రచింపబడినవి— ఈ తరగతికి చెందినవి సుమారొక ముప్పది పద్యములు నాకు లభించినవి, అందు పాల మూరు మండలమందలి దేవతలందరు స్తుతింప బడినారు.

ఈ నరసరాయని కోడలిపేరు జానమ్మగారు. వీరు చూతపురి నృసింహస్వామి కనన్య భక్తులు. అందువలన నరసరాయడా స్వామిపై కృతి రచింప జేయగా కోడలగు జానమ్మగారా స్వామికి మండపము గట్టించి, శిల్పశోభితమైన గోపురమెత్తించి, నిత్య దీప నైవేద్యములకు దగు ప్రబంధమొనరించి, వైష్ణ వులను గొనివచ్చి స్వామి కర్చకులనుగా నిలిపి, వారికి మడిమాన్యములనిచ్చి యిటు లాయాలయాభివృద్ధి కనేక విధముల పాటుబడుటేగాక, తమ మామగారి కీర్తి కవశేషముగానున్న ఈ కృతిని తమ సమీపగ్రామ మగు రాకొండయందలి కిళాంబిదరూరు లక్ష్మణా చార్యుడను కవి వరునిచే పరిశీలింపజేసినది. అతడీ గ్రంథమునకు పీఠికాప్రాయమైన సీసార్థములు ముఖ తిలకముగా రచించినాడు.

ఈ గ్రంథము రచన ననుసరించి యుత్తమము గనే యున్నను, యక్షగానమగుటచే కాలదోషముబటిన ప్రక్రియయైనది. సకాలమున ముద్రణా సౌకర్యము లేమినో, మరే కారణముననో, వెలుగునకు రాజాలక, సంఘమునకు, భాషకు, నొకప్పు డుపకరించిన నిట్టి తాళప్రతు లెన్నెన్ని దేశమునందలి యేయే మూల లందు క్రమగ్గుచున్నవో, నెవరెరుగుదురు.

—శ్రీ కపిలవాయి లింగమూర్తి.

# వడి : శబ్దార్థ విచారము

యతి'కిఁ బర్యాయ పదములుగా వ్యవహారమున నున్న 'వడి' 'వళి' యను శబ్దములు దేశ్యములు. విశేష్యములు.

యతి సంస్కృతీయము. పద విచ్ఛేద సంజ్ఞకము. నియమిత స్థానమున పదచ్ఛేదము సంస్కృతమున యతి. కానిచో యతిభంగము కలుగును. అక్షరమైత్రి లేదు.

తెనుఁగున యతిశబ్దము వ్యవహారరూఢమైనను లక్షణము సంస్కృతీయమునకు భిన్నము. ఇందు పదవిచ్ఛేదప్రసక్తి లేదు. పాదాద్యక్షరముతో నియమిత స్థానమున సావర్ణ్యసాజాత్యాది విశేష మైత్రికలవర్ణముల గూర్చుట ప్రధానము. ఇట్టిది తమిళమునుండి స్వీకరింపఁబడినది.

భిన్నలక్షణము, భిన్నార్థకము గలదగుటఁ దెనుఁగువారు యతికిఁ బ్రతిగా నొక సంజ్ఞను దెలుఁగు లక్షణమునకు పరిపడు దానినిఁ గూర్చుకొనిరి. అదియే వడి లేక వళి.

ఆదిని 'యతి' 'వడి' యనునవి భిన్నార్థకములు గనే ప్రయుక్తములైనవి. 'యతి' పర్యాయ పదములలో 'వడి' 'వళి' చేర్పఁబడకఁ బోవుటయుఁ బాల్కురికి సోమనాథాదుల ప్రయోగములును నీ విషయమును సూచించుచున్నవి. అర్వాచీనులైన అనంతామాత్యుడు నప్పకవియు వీనిని సమానార్థకములుగా వాడుకొనినారు.

వడి శబ్దార్థమునుగూర్చి పూర్వలాక్షణికులు పట్టించుకొన్నట్లు లేదు. కాని, ఆధునిక వ్యాఖ్యాతలనేకులు దీని వ్యుత్పత్తిని విమర్శించిరి. ఒక్కటియు నంగీకారయోగ్యము కాకపోవుటచే మఱియును విమర్శింపవలసి వచ్చుచున్నది.

డాక్టరు గిడుగు సీతాపతిగారు తమిళములోని లోని 'వడు' శబ్దమునుండి తెనుఁగు 'వడి' వచ్చిన దనిరి. తమిళమున 'వడు' యత్యర్థకముగాదు. యతిని వారు 'యోనై' యందురు. 'యోనై' 'యతి'కి భిన్నమైన యక్షరమైత్రిగలది. ఈ యక్షరమైత్రినే మనవారు బాటించిరి. కావున, యత్యర్థమున రూఢమైన 'యోనై'శబ్దమునో, సమానార్ధకమునో, తద్వికృతినోకాక యసంబద్ధమైన 'వడు' శబ్దమును గ్రహించిరనుట సమంజసముగా లేదు.

'వడు'యనగా మార్గము. ఆద్యక్షరముతోడి మైత్రి పద్యపాదమునఁ ద్రోవఁజూపుటఁజేత 'వడు'ను 'వడి'గా స్వీకరించియుందురని డాక్టరుగారు భావించిరి. మార్గదర్శకత్వమే ప్రధానమైన మార్గార్థకములైన పదము లనేకములు దెలుఁగులో నుండగాఁ దమిళము నాశ్రయించిరనుటయు నసంగతమే.

శ్రీ వేదుల రామశాస్త్రిగారు తమ యప్పకవీయ వివరణమున నొక క్రొత్తపుంత ద్రొక్కిరి. 'వళి'యను సంస్కృత విశేష్యమున కుదర మందలి ముడుతయని యర్థమున్నది. ఇందుచేతఁ గాంతలకు కడుపుమీది వళి శోభాస్పదమైనట్లు పద్యపాదమున కలంకారమగుట వళి యనబడినదని వారూహించిరి. 'లడ లభేదము' లగుట వళి వడి యయ్యెననియుఁ జెప్పిరి. ఉపరస్థ వళులే ప్రసక్తములైన స్త్రీ పురుష వివక్ష యేల? ఇంతేకాక కాంతల యుదరముల దాగిన వళుల వెలికి దీయుట సరసముగాలేదు. ఇంతకును శ్రీ వేదులవారు 'వళి' శబ్దమును సంస్కృత విశేష్యముగను 'వడి' తద్భవముగను గ్రహించిరి. సంస్కృతమున వళి యత్యర్థమునలేదు. ప్రసక్తమగు వళి సంస్కృతమునుగాదు. వడికి వైకృతము. 'యతి'కి మాఱుగా గ్రహింపఁబడిన దేశ్య విశేష్యము వడి. ఇది సంజ్ఞయగుటను, 'లడయోర్నభేద'మనుటను జింతామణి 'అద్యోసళిః' యని సూత్రీకరించినది.

సంజ్ఞా పదములకు వ్యుత్పత్తుల నరయుట క్లిష్టతరమనుచు శ్రీ వేదులవారు — 'వ్యు లనవసరములే ! కనుక వడి వళి అనువానితో పాటు తక్కిన ఇందలి పదములన్నియు అవ్యుత్పన్నములగు సంజ్ఞాపదములే అయి వాడఁబడినవనియు తెలియుంగు నది', అని వ్రాసిరి. వారు 'అప్పకవీయ వివరణ' కర్తలు. కనుక 'ఇందలి' యనుటచే నప్పకవీయ మందలియని అర్థము చెప్పకొనవలసి యుండును. అప్పకవీయము కేవలము యతిప్రాస వివరణముకాదు.

వ్యాకరణ గ్రంథము. మనకది 'యప్పకవీయమే!' కాని అప్పకవికి నాంధ్రశబ్దచింతామణియను వ్యాకరణ శాస్త్రము. కాగా, 'ఇందలి' సంజ్ఞ 'లన్నియు', ఛందోవ్యాకరణములకుఁ జెందినవి, యవ్యుత్పన్నము లనుట సాహసమూలము.

'వడి—విభాజనే' యను ధాతుపాఠము నను సరించి విద్వాన్ శ్రీ రావూరి దొరస్వామి శర్మగారు విభజనార్థము గలదగుటచే యతికిఁ బర్యాయముగా తొలుత 'వడి' వచ్చి పిదప 'వళి' యయ్యెననిరి. వీరును 'వడి' సంస్కృతమనియే తలంచిరి. సంస్కృతమున యతికిఁ బర్యాయపదములు విరతి, విశ్రాంతి, విరామము లాదిగా మఱియు నెన్మిదియున్నవి. 'వడి' 'వళి' మాత్రము కనరావు. అందున్న తొమ్మిదింటిని వదలి క్రొత్తగా మరియొక శబ్దమును వెదకుటకుఁ గల కారణమును స్పైతము వెదుకవలసి యున్నది. వడి సంస్కృతమునుగాదు. విభజించుట లేక విచ్ఛేద మొన ర్చుట తెలుఁగు 'వడి'కి లక్షణమును గాదు. అది యతి.

ఇది కాదని వారే మఱియు నొక వ్యుత్పత్తిని నిరూపించిరి. 'అనుప్రాస మను సంస్కృత సంజ్ఞకుఁ దమిళభాషలో 'వఱి యెదుగ్గై' అనిపేరు. ఈ వఱి (ళి) యెదుగ్గై శబ్దములోని 'వళి'నే తెనుఁగువారు సంగ్రహించిరేమో ? ఇది యొక యూహమాత్రమే'.

ఇది మరియు నసంగతముగా నున్నది. ఏమన అనుప్రాసమునకుఁ బర్యాయమైనది యతికిఁబర్యాయ మగుట యెట్లు ? మఱియు సంస్కృతానుప్రాస మునకుఁ దమిళులొక సంజ్ఞ నేర్పరచుకొనిరి. అందు కొంత భాగమును దెనుఁగువారు సంగ్రహించిరనుట భావ్యము కాదు. ద్రావిడ ప్రాణాయామ న్యాయమునఁ దమిళ 'వఱి' తొలుత 'వళి'యై ఆపైన 'వడి'యై తెనుఁగున సిద్ధించిన దనుటయు మిక్కిలి ప్రయాసా వహ్యా[illegible].

ఇట్లివి యేమియు సంగతములు కావు. 'వడి' శబ్ద [illegible] యేది ? ఏదోయొకటి యుండి తీరవలెగదా? నిజమే ! శ్రమయనక వేగిరపడక నెమక వలయును.

'వడి' దేశ్య విశేష్యము. దీనికి వేగము, పురి, బిగువు, దారము పురి, శౌర్యము, కాల మను అర్థము లున్నవి. వడివేయుట, వడిఁబెట్టుట వడి త్రిప్పుట మున్నగు ప్రయోగములు రూఢమైయున్నవి.

త్రాడుల వడి వేయుదుము. పద్యముల వడి వేయుదుము. వడివేయుటఁ జేత త్రాడులకుఁ బురి బిగువు కలుగును. ఇట్లే పద్యపాదమున నాద్యక్షర ముతో నియమితాక్షరమునకు వడివేయుటఁజేత నొక పురి బిగువు స్ఫూర్తి కలుగుచున్నవి.

ఇంతేకాదు. త్రాడుల వడివేయుట యనగా సారూప్యసాజాత్యములుగల రెండు భిన్నపదార్థముల కేకత్వాభాసఁ గల్పించుట. ఇట్టి యేకత్వాభాసమును, దత్ఫలితముగా శ్రుతిరమ్యతయు భిన్నస్థానీయములైన రెండక్షరములను వడివేయుటఁజేత సాజాత్య సారూప్య మైత్రీ విశేషమున గలుగుచున్నవి.

కావుననే ఆంధ్ర లాక్షణికులు యతికన్న భిన్న మైన యర్థమున మెలివేయుటయను భావము దోప దేశ్య విశేష్యమైన 'వడి' శబ్దమును గ్రహించిరి. 'వడి' 'వళి'యైనది. 'ఆద్యోవళిః'యని చింతామణి రూపిం చినది 'వడి'కి వైకృతరూపము.

—శ్రీ ముదిగొండ ఈశ్వరచరణ్.

## తెలుగు కావ్యావతారికలు కొన్ని విశేషములు

పై శీర్షికతో కొంతకాలము క్రిందట (నవంబరు 1971)భారతిలో ప్రచురించిన డా. జి. నాగయ్యగారి వ్యాసము ప్రశంసనీయము. ముఖ్యముగ నన్నయ భారతావతారికాభాగరచనలో కన్నడభాషా లక్షణముల ననుసరించినాడని వారు చక్కగా వివరించినారు. కాని వారి వ్యాసములోని కొన్ని విషయములు పరిశీలింపదగి యున్నవి.

బాణునకుముందు 'ప్రాచీన సంస్కృత కావ్యము లందు అవతారికా సంప్రదాయము మృగ్యము' అని నాగయ్యగారి అభిప్రాయము. కాని కాళిదాసుని రఘు వంశములోనే అవతారిక కలదు. దేవతాస్తుతిరూప మయిన 'వాగర్థావివసంపృక్తౌ' ఇత్యాది ప్రథమ

శోకము, కావ్యప్రశస్తి, కవివినయశీలము, పండితాభ్యర్థన ఇత్యాదులుగల తరువాతి తొమ్మిది శ్లోకములును కావ్యావతారికకు సంబంధించినవే. అదియును గాక సముద్రగుప్త చక్రవర్తి (క్రీ. శ. 335–375) విరచితమగు 'కృష్ణచరితము'న విస్తారమగు అవతారిక కలదు. అతడు పూర్వకవులను త్రివిధములుగా విభజించి కీర్తించియున్నాడు. (చూ. భారతి 1967 ఫిబ్రవరి; మార్చి). కనుక కావ్యావతారికా రచనకు బాణు డాద్యుడుకాడు.

డా. నాగయ్యగారు 'తిక్కనకు పిమ్మట కావ్యావతారికలేని కావ్యము తెలుగునందు లేదనిన అతిశయోక్తి కాదు'అని వ్రాసియున్నారు. కాని తిమ్మయ ద్విపద భాగవతమున ఆదిపర్వమును ప్రారంభించుచు కృతి నాయకుడగు శ్రీరాముని అధికముగా కీర్తించి 'నీకు నేఁ జెప్పఁబూనిన కథాక్రమము చేకొని విన్నవించెదఁ జిత్తగింపు'మని సూటిగ కథ ప్రారంభించినాడు. ఇట్లే సభాపర్వము రచియించిన బాలసరస్వతి, కర్ణపర్వము మొదలు తుదివరకు విరచించిన ఆతుకూరి సోమనలుకూడా అవతారిక లేకుండనే రచియించిరి. పద్యకావ్యములలో పిడుపర్తి బసువప్పకవి 'నిరోష్ఠ్య సీతాకళ్యాణము' అవతారికాశూన్యమై కన్పడుచున్నది. (చూ. తంజావూరు సరస్వతీమహలు Descriptive Catalogue.)

ఇక శ్రీ కృష్ణదేవరాయల ఆముక్తమాల్యద కృత్యాదిని వివరిస్తూ నాగయ్యగారు 'ఇట్లు ఇష్టదేవతాస్తుతి పది పద్యములలో విపులముగానున్నను ఇతర కావ్యావతారికలలో తరువాత కానవచ్చెడి గురుస్తుతి, సుకవిప్రశంస, కుకవినింద ఇత్యాదులు ఆముక్తమాల్యదలో కానరాకుండుట ఒక అపూర్వవిశేషము' అని తెల్పియున్నారు. కాని యిది అపూర్వవిశేషమేమీకాదు. శ్రీనాథుని హరవిలాస అవతారికలో సుకవిస్తుతి, కుకవినింద, గురుస్తుతి ఇత్యాదులు లేవు. నందితిమ్మన పారిజాతాపహరణములోను, ధూర్జటి కాళహస్తి మాహాత్మ్యములోను ఇవి కానరావు. ఆముక్తమాల్యద యనంతర రచనలయిన పొన్నగంటి తెలగనార్యుని 'యయాతి చరిత్ర' ఘట్టుప్రభుని 'యాజ్ఞవల్క్య చరిత్ర' ఇత్యాది గ్రంథములలోను ఇవి కన్పట్టవు.

విజయవిలాస మందలి: మొదటి మూడు పద్యములు శ్రీకారముతోనే ప్రారంభ మగుచున్నవని తెల్పుచు డా. నాగయ్యగారు ఇలా వ్రాసియున్నారు. 'కృత్యారంభమునందే గాక ప్రతి ఆశ్వాసాదిపద్యమును శ్రీతో ప్రారంభించు సంప్రదాయము తెలుగు కావ్యములందు నియతముగా కలదు' అని.

తన కావ్యారంభములోని మొదటి మూడు పద్యములను శ్రీకారముతో ప్రారంభించిన విజయవిలాస కర్త హరిశ్చంద్రనలోపాఖ్యానకర్తను అనుసరించినాడు. ఇక, నాగయ్యగారి పై వాక్యమునకు తాళ్లపాక చిన్నన్నగారి కృతులు తీవ్ర ప్రతిబంధకములుగ నున్నవి. అష్టమహిషీకళ్యాణమున ప్రథమ, తృతీయ ఆశ్వాసములు మాత్రమే శ్రీకారముతో ప్రారంభముకాగా పరమయోగివిలాసమున ప్రథమాశ్వాసము మాత్రమే శ్రీకారముతో ప్రారంభమగుచున్నది. ఇవి యిట్లుండ, ఉషాకళ్యాణమున కృత్యాదిని శ్రీకారమే కొరవడినది. ఈ మూడును ద్విపదకావ్యములే. చంపూ కావ్యములలో మొల్లరామాయణమున ప్రథమాశ్వాస ఆదిపద్యము మాత్రమే శ్రీకారముతో ప్రారంభమయినది.

డా. నాగయ్యగారు పేర్కొనినట్లు తెలుగు కావ్యావతారికలలో [illegible]ంచదగిన వి[illegible]షాంశము లెన్నియో కలవు.

—శ్రీ సూర్యదేవర రవికుమార్.

# సాహిత్యంలో ధ్వన్యనుకరణ శబ్దాలు

ఒకానొక ధ్వనిని అనుకరించేవి ధ్వన్యనుకరణాలు. ఉదాహరణకి 'వాడు బుడుంగుమని మునిగాడు'అనే వాక్యాన్ని తీసుకొందాం. ఇక్కడ బుడుంగ[illegible]నేది నీటిలో మునిగేటప్పుడు వచ్చే ధ్వనిని అనుకరిస్తోంది. కాబట్టి బుడుంగుమనేది ధ్వన్యనుకరణశబ్దం. ధ్వన్యనుకరణ శబ్దాల్ని ఉపయోగించి చెప్పాల్సిన విషయాన్ని ఒక్కముక్కలో హృదయానికి హత్తుకొనేలా చెప్పవచ్చు. ధ్వన్యనుకరణశబ్దాలు 'ఇవిగో, ఇన్ని'అని చెప్ప

టానికి వీలుపడదు. అటు సాహిత్యాన్ని, ఇటు వ్యావహారికాన్ని క్షుణ్ణంగా పరిశీలిస్తే ఒక దారీతెన్ను కనబడుతుందేమో! వ్యావహారికంలో ధ్వన్యనుకరణ శబ్దాల వాడుక అందరికీ తెలిసిందే—ఉదా: వాడు దభేలున పడ్డాడు, చెంప ఛెళ్మంది మొదలైనవి. సాహిత్యంలో ఈ ధ్వన్యనుకరణ శబ్దాల్ని వాడని కవులు అరుదనే చెప్పాలి. దాదాపు ప్రతికవీ వాడినవాడే. అందుచేత అందరి కవుల్నీ తీసుకొని వ్రాయటంఅనేది తలకు మించినభారం అవుతుంది. నా యీ వ్యాసంలో కొద్దిమంది కవులు వాడిన ధ్వన్యనుకరణ శబ్దాల్నిమాత్రం వివరిసాను!

## భారతము – ఆదిపర్వము

ఇంతవరకుఉన్న ఆధారాలనిబట్టి ఆదికవిగా పేరొందిన నన్నయగారి ప్రయోగం తీసుకొందాం. ద్వితీయాశ్వాసంలోని గజకచ్ఛప వృత్తాంతంలో ఈ క్రింది పద్యం చూడండి:

'పాదంబులు పెట్టుడుఁ ద
త్పాదపఘనశాఖ విఱిగి బల్లన నుచ్చెన్
ర్నాదమున దిక్కు లద్రువఁగ
భేదిల్లె విహంగతతులు భీతిం బఱవన్'

'రోహిణంబను పాదపోత్తమంబు గరుడనింగని.........గజకచ్ఛపములను భక్షించి పొమ్మనిన' పిదప గరుడుని చేష్టను వర్ణించిన ఈ పద్యంలో 'బల్లు'అనేది ధ్వన్యనుకరణం. 'బల్లున తెల్లవాఱె'అనే ప్రయోగం మనకి సుపరిచితమే. అయితే పై పద్యంలో 'బల్లు'అనేది విఱుగుటలో ధ్వన్యనుకరణం. ఒకేశబ్దం అనేకధ్వనుల్ని అనుకరిస్తుంది. దీని విషయం తరువాత చూద్దాం.

## భారతము—ఆరణ్యపర్వము

'ఆయత కుంత కార్ముక గదాసి
సా
ద్యాయుధ ఘోరహస్తులు

......ఆ వియచ్చరులు శూరతమై
నడతెంచి బల్విడిం
గోయని తాకి రుగ్రరణకోవిదులై
కురురాజసైన్యమున్' (5 వ ఆశ్వాసం.)

ఈ పద్యం దుర్యోధనుడు ఘోషయాత్రకి వెళ్లిన సందర్భంలోనిది. దేవేంద్రుని సైన్యం కౌరవ సైన్యంపై యుద్ధానికి వెళ్లటం ఈ పద్యంలో చిత్రితమైంది. ఇందులో 'కో' అనేది ధ్వన్యనుకరణం. దీర్ఘసమాసాలు వేస్తేనేగాని సామాన్యంగా యుద్ధ సంరంభం పాఠకుడి మనస్సులో కలగదు. కాని ప్రబంధ పరమేశ్వరుడైన ఎఱ్ఱన అని ప్రయోగించి ఆ యుద్ధ సంరభాన్ని పాఠకుడి ఎదుట సాక్షాత్కరించేలా చేయగలిగాడు. యుద్ధసమయాల్లో ఒకరిపైకి ఇంకొకరు అఱచుకుంటూ వెళ్లడం సహజం.

## భారతము ఉద్యోగపర్వము

తృతీయాశ్వాసంలో శ్రీకృష్ణుడు భీమసేనుణ్ణి యుద్ధానికి పురికొల్పుతున్న సమయంలోని ఈ క్రింది పద్యాన్ని పరిశీలించండి—

'వెఱపెట్టిదియో యెన్నఁడు
నెఱుగని నీ యట్టివాని కెవ్వరొకో యీ
పిఱికితన మింత యలవడఁ
గఱపినవా' రనుచు శౌరి కలకల నవ్వెన్.

భీముడు లోగడ తానుజేసిన జ్ఞ
మరిచి సంధికి ఒప్పుకొనేలా చెయ్యమని కృష్ణుడితో అన్నాడు. కృష్ణుడికి ఆశ్చర్యం వేసింది. భీముణ్ణి యుద్ధానికి పురికొల్పాలి. ఇదే అతని ప్రయత్నం. అందుకు భీముణ్ణి పిఱికివాడికింద జమకట్టాడు. అంతటితో ఊరుకోలేదు. నవ్వాడట. ఎట్లా నవ్వాడో చూశారా? 'కలకల' నవ్వాడట. తిక్కనార్యునికి సూక్ష్మపరిశీలన ఎంత ఉందో మన కీ నవ్వుల్ని బట్టి ఇట్టే తెలుస్తుంది. ఈ 'కలకల' నవ్వుతో భీముడు సిగ్గుపడాలి. కోపం రావాలి. ఇదే ఇక్కడ కలకల నవ్వుయొక్క ప్రయోజనం. 'కలకల' అనేది నవ్వటంలో ధ్వన్యనుకరణం. నాటకీయతకి పేర్గాంచిన తిక్కనార్యుని రచనలో ఇటువంటి నవ్వులు మనకి చాలాచోట్ల కన్పిస్తాయ్.

ఇంతవరకు కవిత్రయంవారి ప్రయోగాల్ని

చూచాం. శబ్దాలంకారాల్లో పేర్గాంచిన భాగవతంలో నుంచిగూడా ఒక ప్రయోగం తీసుకుందాం.

### భా గ వ త ము

శ్రీకృష్ణుడు దంతవక్త్రుణ్ణి సంహరించే ఘట్టంలోని పద్యం—

'దంత వక్త్రుండతి భీషణాకారంబుతోనప్పుడు—
పెటపెటఁ బండ్లు గీటుచును
బెట్టుగ మ్రోయుచుఁ గన్నుఁ గ్రేవలం
జిటచిట విస్ఫులింగములు సింద
మహోద్ధత పాదఘట్టనన్
నిటనిటనై ధరిత్రి వడఁకాడ వడిన్
గద కేలఁ ద్రిప్పుచున్
మిటమిటమండు వేసవిని మించు
దివాకరుఁ బోలి యుగ్రతన్'
(దశమస్కంధం—ఉత్తర)

ఈ పద్యంలో నాలుగు ధ్వన్యనుకరణ ప్రయోగాలు ఉన్నాయి.

పెటపెట—పళ్లు కొఱకటంలో ధ్వన్యనుకరణం
చిటచిట— చిందటంలో ధ్వన్యనుకరణం
నిటనిట—వడకుటలో ధ్వన్యనుకరణం
మిటమిట—మండటంలో ధ్వన్యనుకరణం

'అతి భీషణాకారంబుతో' అన్నమాటకి కేవలం వ్యాఖ్యానప్రాయమైంది పద్యం. దంతవక్త్రుడి రూపాన్ని కళ్లకు కట్టేలా చిత్రించడానికి ధ్వన్యనుకరణశబ్దాలు ఉపయోగపడ్డాయి.

ఇక ప్రబంధాల్లోని ధ్వన్యనుకరణ ప్రయోగాల్ని పరిశీలిద్దాం.

### కా శీ ఖ ం డ ము

నాల్గవ ఆశ్వాసంలో శుక్రలోకవర్ణన ఉంది. దానిలో కాలకంధర అంధకాసురులకి యుద్ధం జరుగుతుంది. ఆ యుద్ధంలో చచ్చిన రాక్షసుల్ని భార్గవుడు మృతసంజీవినితో బ్రతికిస్తాడు. అప్పుడు ప్రమథులు దిక్కులేక పరమేశ్వరుణ్ణి వేడతారు. ఆ సందర్భంలోగల సీసపద్యంలోని ఎత్తుగీతి ఇది—

'కరతలమున బదరిపండు కాంతి నతనిఁ
గాల్చి దధితోడి చలిదిముద్దయును బోలె
విషముమ్రింగిన పెన్నుద్ది వేల్పుతేడు
మనసిజారాతి మ్రింగి గుట్టనఁగఁ ద్రేఁపె'

శివుడు శుక్రుణ్ణి మ్రింగడం ఈ పద్యంలో వర్ణితమైంది. శ్రీనాథుడు ఎంతటి దీర్ఘ సమాసాల్ని వేసినాగానీ, అవసరం కలిగితేమాత్రం తెలుగు పలుకుబడిని వేయకుండా ఉండలేదు. పై పద్యంలో పెరుగు కలిపిన చద్దిముద్దలాగా శుక్రుణ్ణి మ్రింగాడని చెప్తున్నాడు. చద్దిముద్ద కడుపునిండా తింటే త్రేపురావటం సహజం. దాన్ని గుర్తులో ఉంచుకొని కవిసార్వభౌముడు శివుడుగూడా త్రేపాడనీ, ఆ త్రేపు గుట్టనేశబ్దంతో అనుకరిస్తోంది అని చెప్పాడు. గుట్టనేది ధ్వన్యనుకరణం. సహజత్వానికి ఇవి ఎంతగా వన్నె చేకూరుస్తాయో తెలుస్తోంది.

### మ ను చ రి త్ర ము

వలపుల సుందరియైన వరూధిని ప్రవరుణ్ణి కౌగలించుకొన్నది. అతగాడు త్రోసి వేశాడు. ఈ సమయంలో వరూధినీ స్థితిని వర్ణిస్తూ చెప్పిన పెద్దనగారి పద్యం చూడండి—

'త్రోపునడి నిలిచి ఘన ల
జ్జా పరవశ యగుచుఁ గొప్పు సవరించి
యొడల్
దీపింప నతనిఁ జుఱచుఱఁ
గోపమునన్ జూచి క్రేఁటు కొనుచున్ బలికెన్.
(2 వ ఆశ్వాసం.)

వరూధినికి సిగ్గువేసింది. ఇంతవరకు తనని కోరినవారేగాని, తానుగా ఇంతగా ఎప్పుడూ కోరలేదు. అటువంటిది ఇప్పుడు తాను స్వయంగా కోరితే అవమానించాడు. పాపం! కోపంవచ్చింది. కొప్పు సవరించింది. అతగాడిని చుఱచుఱ చూసింది. ఈ చుఱచుఱ అనేది కాలుటలో ధ్వన్యనుకరణం. ఆమె చూపులు ప్రవరుణ్ణి కాలుస్తున్నాయా అన్నట్లు ఉన్నాయన్న మాట. ఇక్కడ ఈ ధ్వన్యనుకరణ ప్రయోగంవల్ల పాఠకుడికి వరూధినియొక్క రూపం దర్శన మిస్తుంది.

## పారిజాతాపహరణము

'అనవిని వ్రేటువడ్డ
యురగాంగనయుంబలె నేయివోయ బ
గ్గన దరికొన్న భీషణ
హుతాశనకీల యనంగ లేచి......'

(ప్రథమాశ్వాసం.)

ఇది పారిజాత వృత్తాంతాన్ని విన్న సత్యభామకి ఎంతకోపంవచ్చిందో తెలుపుతున్న పద్యం. ఆమె అప్పటి దాకా శయనించి ఉన్నది. ఈ వృత్తాంతం వినగానే కోపంతో లేచింది. ఆ లేవడం దెబ్బతిన్న ఆడుపాము వలెఉంది. అగ్నిలో నెయ్యిపోస్తే జ్వాలలు ఎట్లా వస్తాయో అట్లా లేచిం దా సత్యభామ. మంటలు లేవ డాన్ని వర్ణించాలంటే ధ్వన్యనుకరణ శబ్దమే యథో చితంగా ఉపకరిస్తుంది. ఇక్కడ 'బగ్గ'అనే ధ్వన్యను కరణం దృశ్య సాక్షాత్కారానికి ఎంతో ఉపయోగ పడింది.

### మరికొన్ని ప్రయోగాలు

'విందు వీడువచ్చినం దలయంటం
గటు కొని జిబ్బునం జీఁదుచు'

(భోజరాజీయం, 4 వ ఆశ్వాసం)

జిబ్బనేది పటంలో ధ్వన్యనుకరణం.

ఒక్కొక్క ధ్వన్యనుకరణం ఉన్నదీ అంటే అది వివిధసందర్భాల్లో వివిధమైన పాత్రల్ని ధరిస్తుంది. ఉదాహరణకి 'జలజల'

'జలజల నలరులు రాలెను' — వసుచరిత్ర, 3 వ ఆశ్వాసం.

'జలజల రక్తంబు చల్లెనో యనంగ' 1—భా
'కన్నుల జలజల కాఱెడునీరు'— 4 భా.
రాఘవార్యుని ద్విపద నళచరిత్రము
(చూ. శబ్దరత్నాకరము.)

పింగళి సూరనార్యుని కళాపూర్ణోదయంలోని ఈ క్రింది ప్రయోగం చూడండి—

'జాఱునం గుక్కిఁడు గుక్కిఁడే మధువు గ్రోలుచు' (6 వ ఆశ్వాసం)

కిటకిటఅనే ధ్వన్యనుకరణ ప్రయోగానికి వైజయంతీ విలాసంలో ప్రయోగం ఉంది—

'శ్రుతులు విజ్జోడైనచోం దంత్రి బిగివిరం
జీడించి కిటకిట బిరడ త్రిప్పు'

(1 వ ఆశ్వాసం)

ఈ ధ్వన్యనుకరణ శబ్దాల ప్రయోగంవల్ల వ్యావహారికత అనే విశిష్టగుణం ఏర్పడుతుంది. కావ్యా నికి అవసరమైన పాత్రచిత్రణకి ఈ ధ్వన్యనుకరణ శబ్దాలు ఎంతగానో ఉపయోగపడుతున్నాయనేది పరి శీలనమీాదట తెలుస్తుంది.

—ద్వా. నా. శా.

## వా లి వ ధ

ఫిబ్రవరి 1972 భారతిలో కలగూరగంపలో శ్రీ కాళూరి హనుమంతరావుగారి వ్యాసము చదివి ప్రేరితుడనై వాలివధ విషయమును కొంత ప్రస్తా వించు చున్నాను. హనుమంతరావుగారు వ్రాసిన దానిని ఖండించుట ధ్యేయముగా పెట్టుకొనక అభిప్రాయభేదమును సూటిగా స్పష్టముచేసి దాని యాధారమున వాలివధగూర్చిన వాస్తవమును కొంత మాత్రమే సంగ్రహముగా ప్రకటింప దలచుకొన్నాను.

కాళూరివారి చివరి వాక్యములో శ్రీరాముని రాజనీతి మాత్రమే వాలివధలో ప్రధానముగా కన్పడు చున్నది అని చెప్పబడినది. పైకి అట్లు కన్పడు నది నిజమేగాని వాస్తవము పరిశీలింపగా నది రాజ ధర్మముగాని రాజనీతి కాదు. స్వతఃప్రమాణమగు ధర్మమును అసిధారావ్రతముగ నాచరించుట ధర్మ నియతుల నీతియగును. పదుగురిలో మంచివాడగు టకు తంటాలుపడుట లోకనీతి. స్వార్థసాధనకై యొకరి పక్షము నాశ్రయించి వైరిపక్షము జయించు టకు అవసరమగుచో కుటిలనీతి నవలంబించుట రాజ నీతి యన బరగును. శ్రీరామచంద్రుని స్వార్థము సీతాప్రాప్తి. సీత రావణుని యింటనున్నది. రావణుడు వాలియు బద్ధస్నేహులు. మఱియు బలశాలియైన

వాలిమాటను రావణుడు కాదనలేడు కావున శ్రీరాముడు స్వార్థపరుడైనచో వాలితోనే చేయికలిపి యుండెడివాడు. అపుడు సునాయాసముగా రాజనీతి సఫలమై శ్రీరాముడు కృతార్థుడై యుండెడివాడు. అనగా వాలి పంపున రావణుడు దోసిలొగ్గి సీతను అప్పగించి యుండెడివాడు. కాని త్రేతాయుగములోని మనుధర్మ మూర్తియైన రాఘవుడు కుటిలమైన రాజనీతిని పాలింపలేదు. రాజధర్మముగా దుష్టశిక్షణమును నిష్పక్షపాతముగా సాక్షి స్వరూపుడుగా చేయదలచియున్నాడు. ఈ రాజనీతి రాజధర్మముల మర్మమును భవభూతి మహాకవి మహావీరచరితములో వింగడించి చూపించి యున్నాడు. దానిలో రావణప్రేరితుడయిన వాలి శ్రీరామునితో ముఖాముఖి తలపడి మరణించినాడు. అన్నను చంపినాడన్న క్రౌర్యముతో సుగ్రీవుడు శ్రీరామునిపై దుముకుచుండగా వాలి తమ్ముని వారించి దుష్టుడయిన రావణునిపక్షము నాశ్రయించుట తన తప్పనియు ఆ తప్పు నీవు చేయవద్దనియుచెప్పి మరణించెను. దీని సారాంశము పర్యాలోచన చేయగా పరదారాసక్తులై మదమత్తులయిన వాలి రావణులు స్వభావతః ఒక పక్షమువారు. పాపము నాచరించినవారి శిక్షించుట రాజధర్మము. రాజధర్మము ప్రకారము శ్రీరాముడు వాలి పాపమును హరించుటకు శిక్షించెను. ఈ విషయము శ్రీరాముని సమాధానమందు స్పష్టమయినది. కాగా వాలికిని శ్రీరామునకును వ్యక్తిగత వైరములేదు. కావుననే వ్యక్తిగతముగా పరస్పరము యుద్ధమునకు కాలుద్రవ్వుట శ్రీరామునకు అసంబద్ధమగును. ఈ విషయమును వాలి మొదట గ్రహియింపక శ్రీరామ సుగ్రీవుల మైత్రి వినియు శ్రీరామునిపై తెలియని పూజ్యభావముతో తన జోలికి రాడుగదా అనుకొన్నాడు. శ్రీరాముడుకూడ వాలి పాపాత్ముడుగావున వధించుటకు పూనుకొనెనే గాని సుగ్రీవునియందు పక్షపాతముతో గాదు. ఈ విషయము సుగ్రీవుని ప్రమత్త సందర్భమున రామాయణము బాగుగా జదివినవారికి అర్థము కాగలదు. కాబట్టియే శ్రీరాముడు కాకాసురుని శిక్షించినట్లు ఏ అస్త్రముతోనో వాలిని వధింపక సుగ్రీవుని రెండు మారులు ప్రేరేపించి వాలితో యుద్ధము చేయించెను. వాలి సుగ్రీవులలో భేదమును పోల్చలేక పోయెను అనగా అర్థకామములకు లోనయిన పశువులలో తారతమ్యము మర్యాదా పురుషోత్తముడయిన శ్రీ రామచంద్రునకు మృగ్యమయ్యెనని తాత్పర్యము. ఒక్కక్షణమాగినచో సుగ్రీవుని ప్రాణములు పోవుననగా శ్రీరాముడు వాలిని సంహరించి వాని తమ్ముని గాపాడెను. సాక్షిగానున్న రాజునకు బలవంతుని బారినుండి బలహీనుని గాపాడుట అను ధర్మము తానై వర్తించును. ఈ సూక్ష్మధర్మములోని సుముహూర్తమునకై శ్రీరాముడు తటి వేచియుండెను.

భారతములోనిదే యుదాహరణముతో జెప్పినచో భీష్మ ద్రోణ కృపులకు శ్రీ కృష్ణునిపై పాండవులపై సద్భావముండెడిది. కాని యుద్ధములో వారు కౌరవపక్షమందుండగా శ్రీ కృష్ణుడు ధర్మపక్షమందుండి వారి నెదుర్కొని శిక్షింపజేసెను. అనగా వ్యక్తిగతవైరమున్నప్పుడు ప్రత్యక్షయుద్ధము, ధర్మాధర్మ కారణమైన వైర మున్నపుడు పరోక్షయుద్ధము సంభవమగునని తెలియదగును. వీడు దుష్టుడు పాపుడు అని నిర్ణీతముకాగా శిక్షించుట ప్రధానముగాని వానికి ముందు తెలియబఱచి వానిని ఒప్పించుటకు వాని హేతువాదమును మన్నింపనలసినపనిలేదు. ఇది త్రేతాయుగమునాటి మనుధర్మము. వాలి కొఱకు జాలిపడవలసినపనిలేదు. ఏలయనగా వాలి శ్రీరాముని సమాధానముతో తృప్తిపడి జ్ఞానోదయముతో తనువు చాలించినాడు. ఈ వాలివధ ముందు వెనుకలలో నెక్కడను ప్రక్షిప్తశ్లోకములు లేవు. ఉన్న శ్లోకములను ఉన్నట్లుగా గ్రహించి సత్యసంధుడయిన శ్రీరాముని సత్యమును నిత్యనిర్మలముగా తెలియుటయే మన కృత్యము.

— వి. ఏ. కుమారస్వామి.

# గ్రంథవిమర్శలు

## జ్ఞానేశ్వరి భగవద్గీత: జ్ఞానేశ్వర విరచితము

(అనువాదకులు : శ్రీ దిగవల్లి శేషగిరిరావు, ప్రకాశకులు : త్రివేణి పబ్లిషర్సు, మచిలీపట్నం, 1, మదరాసు—1. క్రౌను $\frac{1}{8}$ పే. 1097 లు. హాఫ్ కాలికోబైండు, వెల రు. 25/—లు.)

మహారాష్ట్ర భక్తాగ్రేసరులలో నొకరగుటయే కాక ఆ భాషకు స్వరూపమిచ్చినవారిలో ప్రధానుడగు జ్ఞానేశ్వరులు ఈ గ్రంథము క్రీ. 13 వ శతాబ్ది చివరిపాదములో రచించెను. ఆయన జీవించినది 21 సం.లే యైనను అంతచిన్నతనములో రచించిన ఈ మహాగ్రంథము శీఘ్రకాలముననే మహారాష్ట్ర దేశమందంతట వ్యాప్తినొంది సంస్కృతములోనికిని ఈ మధ్య హిందీ మొదలగు భారతీయభాష లెన్నింటి లోనికో అనువాదముపొంది విశేషప్రచారము పొందినది. ఆంగ్లములోనికిగూడ అనువదింపబడినది.

జ్ఞానేశ్వరులు ప్రధానముగా శాంకరమతమునే అవలంబించినను గీతకు శంకర భగవత్పాదులుచేసిన సంక్షేపభాష్యమువలెగాక ఇది అత్యంతవిపులమైనది. మూలశ్లోకములను అచ్చటచ్చట కేవల నిమిత్త మాత్రములుగా నుంచుకొని జ్ఞానేశ్వరులు భక్తిపారవశ్య ముతో ఎన్నోవిశేషవిషయములు విస్తరించుకొనిపోవును. శాస్త్రవాదము లిందు కానరావు. మూలములోని శబ్దా ర్థములకు మాత్రమే కట్టుబడి యుండుటలేదు. కేవలము అద్వైతానుభవమునే ఆనంద పారవశ్య ముతో అందించుచు పాఠకులను భక్తి సుధాసాగరమున నోలలాడింప జేయును. అద్వైతభావన అనుభవము నకు వచ్చునట్లు అసంఖ్యాకములైన ఉపమానములు ప్రపంచింపబడుచు కొన్ని పునఃపునరావృత్తము లగు చుండును.

ఈ గ్రంథములో మరియొక విశేషమున్నది. మూలగ్రంథము కృష్ణార్జున సంవాద రూపముగా నుండి, సంజయునిచే ధృతరాష్ట్రునకు నివేదింప బడినదనుట ప్రసిద్ధమైన విషయము. కాని గ్రంథ ములో అడుగని ప్రశ్నలకు జవాబులుకలవు. సంభా షణలలో మధ్య మధ్య ముఖకవళికలలో మార్పులు కూడ ఉండి యుండవలెను. ఇట్టివెన్నో జ్ఞానేశ్వరులు భావించుకొని పాఠకులకు వివరించుకొని పోవుదురు. ఎదుట శ్రీ కృష్ణార్జునులు సంభాషించు చున్నట్లును జ్ఞానియైన సంజయుడు అంధుడైన ధృతరాష్ట్ర నికి ఈ అద్భుత సంవాదమును పులకాంకిత శరీరుడై కథనముచేయుచున్నట్లును, జ్ఞానేశ్వరులు ప్రత్య క్షము చేసుకొని గ్రంథరచనము కావించినందున మన కును అవి ప్రత్యక్షములగును.

ఇంతేకాక మూలములో ప్రస్తావింపబడిన విష యముల నాధారముచేసుకొని ఎన్నోసాధనల విశేషములు ప్రపంచింపబడినవి. ఆరవ యధ్యాయములో యోగసాధ

భా ర

ఇట్లే అనువాదమంతయు ప్రౌఢపద్య రచనతో ఆంధ్ర పాఠకులకు ఆకర్షకముగా నున్నది. కవికి సంస్కృతాంధ్రములలోగల విద్వత్తు, రచనలో శ్రద్ధ ఈ గ్రంథమునకు సొగసు చేకూర్చినవి.

ఈ గ్రంథమునకు శ్రీ వేదము వెంకటరాయ శాస్త్రి (శాస్త్రి మనుమడు) వ్రాసిన విపులమైన ఉపోద్ఘాతము (28 పేజీలు) కావ్యమునకు సంబంధించినవేకాక ఆ కాలమునకు సంబంధించిన చరిత్రాంశములను, కావ్యకథాసంగ్రహమును దాని స్వరూపమును ప్రదర్శించుచు విజ్ఞానదాయకమై ఈ గ్రంథ ప్రచురణమునకు ప్రయోజనాధిక్యమును చేకూర్చు చున్నది.

ఆంధ్రవనితయైన గంగాదేవి రచించిన ప్రౌఢ సంస్కృత కావ్యమును రమ్యముగా అనువదించిన గ్రంథకర్తను హృదయపూర్వకముగా అభినందించుచున్నాము. గ్రంథముద్రణమునకు ద్రవ్యమిచ్చిన శ్రీ వై. బి. రెడ్డిగారు ప్రశంసాపాత్రులు.

—శ్రీ నోరి నరసింహశాస్త్రి.

Printed and Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7 Thambu chetty Street, Madras-1, Editor : S Sambhu Prasad.

# భారతి

మాసపత్రిక



శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938–1972)



జూలై 1972

సంపుటము : 49 : సంచిక . 7 :

విడిపత్రిక వెల ఒక రూపాయి



శ్రీ శివలెంక శంభుప్రసాద్

జననం 26-1-1911 శివసాయుజ్యం 8-6-1972

# విషయానుక్రమణిక

## జూలై 1972

# స్వర్గీయ శ్రీ శివలెంక శంభుప్రసాద్
# సాహిత్య వికాసానికి చేసిన సేవ

శ్రీ నోరి నరసింహశాస్త్రి

## 1

'సాహిత్యం రాజకీయాలకు ఆయుధం కావాలన్న వాదం ఒకటి ఇటీవల ఇటీవల మరీ ప్రచలితం అవుతూ వస్తున్నది. సాహిత్యానికి మరణం అన్నది ఇంతకంటె వేరే ఉండదు. ఎందుచేత ననగా, ఏ రాజకీయానికి ఏ సాహిత్యం ఆయుధం కావాలి? రాజకీయం ఎప్పుడూ ఏకాకారంగా నిల్చిఉంటుందా? ఎప్పటికి అప్పుడు రాజకీయం మారుతూ ఉంటుంది. అని అంగీకరించేపక్షంలో, సాహిత్యంలో శాశ్వత సత్తాకు స్థానం ఎక్కడినుంచి వస్తుంది? రాజకీయం సాహిత్యాంశమే అవుతుంది కాని సాహిత్య సమస్తంకాదు. ప్రకృతిని ప్రకృతియొక్క వైవిధ్యాన్ని సాహిత్యపరుడు ద్రష్టయై అనుశీలనంచేసి ఆ ప్రకృతిలోని సార్థమైన ఋతాన్ని, ధర్మాన్నిచూచి, ఆవిష్కరించవలసి ఉంటుంది. అట్లాచేసే శక్తిగల్గిన వారే రచయితృనామవాచ్యు లవుతున్నారు. కాని వారు విపరీతపు సిద్ధాంతాలను సాహిత్య ప్రపంచంలో ప్రవేశపెట్టి సాహిత్యాన్ని పర్యాప్తము, పరిమితము చేస్తున్నారు. పరిమిత ధర్మాలకు అపరిమితమైన సాహిత్యభావమును కట్టివేయ చూడడం, కోరి బాని సత్వాన్ని కొనితెచ్చుకోవడం వంటిదే అవుతుంది.'

ఈ పరీధావి సంవత్సరాదిసంచిక ప్రస్తావనలో పై వాక్యాలు చదవగానే నాకు కలిగిన ఆనందము ఇంతంతఅని వర్ణింపలేను. బహుకాలము క్రిందటనే ఒకపత్రిక ప్రత్యేక సంచికకు 'వాఙ్మయంలో అక్రమ ప్రవేశము' అని వ్యాసము వ్రాసిఉంటిని. ఈ మధ్య రచయితలు రాజకీయ వాదులను 'Hands Off!' అని ఎదిరించే నినాదము లేవదీయవలెనని ప్రచారము చేస్తున్న నాకు, పై వాక్యాలు ఎంతైనా ధైర్యము కలిగించినవి. ఆ సంచిక సంవత్సరాదికి ఒకరోజు ముందు గానే నాకు శ్రీ శంభుప్రసాదుగారి నూతనవత్సర శుభాకాంక్షలతో వచ్చినందున, వెంటనే వారికి నా శుభాకాంక్షలు తెలియజేస్తూ ప్రస్తావన కలిగించిన ఆనందముకూడా తెలిపినాను. వా రప్పుడు అస్వస్థులుగా ఉన్నట్లు నాకు తెలియదు. కొద్ది రోజులలో వారి దస్తూరితో నాకు ఉత్తరము రావలసినదానికి బదులు ఆఫీసునుండి వారికా ఉత్తరము చేరినదనీ, అస్వస్థులుగాఉండి జవాబు వ్రాయలేదని తెలుపమన్నారనీ ఉత్తరము వచ్చినది. అప్పుడే నాకు వారి ఆరోగ్యము విషయము ఆదుర్దా కలిగినది. ఐనా వా రెప్పుడూ శూలనొప్పితో బాధపడుతూ ఉండడము ఎరిగినందున, నయముకాక పోతుందా అని ఆశించాను. కాని అదే నాకు వారి చివరి సందేశమూ; రచయితల కందరికీ ఆ ప్రస్తావమే చివరి ఉద్బోధా అవుతవని అనుకోలేదు. రచయిత లందరూ వారి తుదిసందేశము హృదయస్థము చేసుకొంటే, ఇప్పుడు దివంగతులై దివ్యదేహము ధరించిఉన్న శ్రీ శంభుప్రసాదుగారు తాము మనతో పాటు ఈ లోకంలో ఉండిచేసిన సాహిత్యయాత్ర సార్థకమైనదని ఆనందించి ఆంధ్రరచయితల కందరికీ శుభాశీస్సులు అందీయగలరు.

దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారు 1908 లో బొంబాయిలో ఆంధ్రవారపత్రిక ప్రారంభించి, తర్వాత మద్రాసువచ్చి 1914 లో దినపత్రికగాచేసి, వారపత్రిక కూడా మధ్య మధ్య ఉద్ధరిస్తూ, 1924 లో భారతిని ప్రారంచినారు. సంవత్సరాది సంచికలు 1910 నుండి వస్తున్నవి. పంతులుగారు 1938 లో దివంగతులైనారు. వారు స్వయంకృషిచేత పత్రికా సంస్థలయందేకాశ, రాజకీ

యము లందును, వ్యాపారనుందును భారతదేశములో అగ్రస్థాన మలంకరించిన అసాధారణ ప్రతిభాశాలి య్యైన మహోన్నత పురుషుడు. ఆంధ్రపత్రికా సంస్థల నిర్వహణభారము అప్పుడు 27 సం. ల యువకుడైన శ్రీ శంభుప్రసాదుమీద పడినది. ఆ భారమే గురుతర మ్మైనది. దానికితోడు శ్రీ పంతులుగారు విశ్వదాతలై చేసిన దానములకేమి, సంస్థలకు అవసరమ్మైన పెట్టుబడులకేమి, చేసిన అనేకలక్షల ఋణభారము కూడా శ్రీ శంభుప్రసాదుమీద పడినసంగతి జగద్విదితము. ఎంత గట్టిగుండె కలవారుకూడా క్రుంగిపోవలసిన పరిస్థితులవి! వాటి నన్నిటినీ నిబ్బరముతో ఎదుర్కొని, ఆంధ్రపత్రిక నష్టముమీద నడుస్తూ, అమృంతాంజనము లాభముమీద నిలుస్తున్నదనే భావము తొలగునట్లుచేసి, దినపత్రికకు, వారపత్రికకు భారతికి వ్యాప్తి అనేకరెట్లు ఎక్కువచేసి, వాటి మర్యాదలస్థాయి తగ్గకుండా 34 సం. లు నడిపినారంటే శ్రీ శంభుప్రసాదు ప్రతిభా సామర్థ్యములు ఎంతటివో ఊహించుకోవలసినవే!

అదృష్టము కూడా శ్రీ శంభుప్రసాదును వరించినది. శ్రీ పంతులుగారు శ్రమపడి పోరాడిన భారతదేశ స్వాతంత్ర్యమూ, ఆంధ్ర రాష్ట్రావతరణమూ వారు కళ్లార చూడనోచుకోలేదు. వారి కవి సుఖ స్వప్నములుగానే ఉండిపోయినవి. ఆ రెండు శ్రీ శంభుప్రసాదు కాలములో సిద్ధించినవి. పత్రికా పాఠకుల సంఖ్యకూడా విపరీతంగా పెరిగినది. వానితోపాటు బాధ్యతలుకూడా పెరిగినవి.

పంతులుగారి హయాములోనే ఆంధ్రపత్రిక నిష్పక్షపాత వైఖరికి హుందాతనానికి ప్రసిద్ధి పొందినది. ఐనా వారు కాంగ్రెసుపార్టీతో అవినాభావంగా ఉన్నందున, అది కాంగ్రెసు పత్రికగానే ఉండక తప్పలేదు. శ్రీ శంభుప్రసాదుగారికి కూడా కాంగ్రెసుపైన ఎంతో అభిమానమున్నా, అవసరమైనప్పుడు కాంగ్రెసు రాజకీయాలను గూడా నిర్మోహమాటంగా విమర్శించే నిష్పక్షపాత వైఖరిని పత్రికకు చేకూర్చినారు. ఇది శ్రీ శంభుప్రసాదు ఆంధ్రపత్రికకు తీర్చి దిద్దిన గొప్ప కొత్తమెరుగు!

శ్రీ శంభుప్రసాదు గావించిన సాహిత్యసేవ ముఖ్యముగా నాలిగింటిద్వారా జరిగినది. అది 1. ఆంధ్ర పత్రిక సారస్వతానుబంధము 2. వారపత్రిక 3. భారతి 4. సంవత్సరాది సంచికలు. ఈనాలుగింటిలో 'భారతి'కి అగ్రస్థానము సాహిత్యసేవ విషయంలో ఇవ్వడము సర్వసాధారణమూ, కొంత న్యాయముకూడాను. కాని నా దృష్టిలో సంవత్సరాదిసంచికలు చేసిన సేవ అంతకంటే ఎక్కువైనది. తక్కిన రెండూచేసిన సారస్వత సేవకూడా అసాధారణ మ్మైనదే!

సారస్వతానుబంధము ద్వారానే ప్రపంచ కథానికల పోటీలో ఆంధ్ర కథానికల భాగము శ్రీ శంభుప్రసాదు నిర్వహించినారు. ఆ పోటీలో మొదటి నాలుగైదుస్థానాలు పొందిన కథలను, శ్రీ పద్మరాజు 'గాలివాన'తోసహా సారస్వతానుబంధములోనే ప్రచురించినారు. ఆ కథానికల పోటీలు ఆంధ్ర కథానికా రచయితలకు ప్రపంచ సారస్వతంలో గౌరవస్థాన మిచ్చినవి. ఇది శ్రీ శంభుప్రసాదుగారుచేసి సాధించిపెట్టిన ఘనమే.

సారస్వతానుబంధములోనే శ్రీ విశ్వనాథ 'తెరచిరాజు' వంటి సాంఘికనవలలు, శ్రీ తెన్నేటి సూరి 'చెంఘిజ్‌ఖాను' శ్రీ నోరి 'ధూర్జటి' వంటి అపూర్వచారిత్రక నవలలు వచ్చినవి.

తెలుగు ఏకాంకికలను గూర్చి డా. శ్రీపాద వ్యాస పరంపర, యక్షగానాలను గురించినకూడా. యస్వీ జోగా రావు వ్యాసాలు, క్షేత్రయ్య పదాలనుగూర్చి వాద ప్రతివాదాలు, ఆంధ్రదేశంలోని దేవాలయాలను గూర్చిన అనేకవ్యాసాలు సారస్వతానుబంధమే ప్రచురించినది. సారస్వత విజ్ఞాన విషయాలలో ఎంత విజ్ఞానము సారస్వతానుబంధముద్వారా శ్రీ శంభుప్రసాదు ఆంధ్రులకు పంచిపెట్టినారో చెప్పలేము.

సంగీతములో శ్రీ శంభుప్రసాదుగారికిగల రుచి విశిష్టమైనది. ఈమధ్య సంవత్సరంపైకాలను పాటు రేడియో సంగీత సమీక్షలు ప్రమీలాదేవి గారిచే ప్రచురించినారు. మొన్న మొన్నటివరకు శ్రీ రవిశంకర అనుభవాలు పడ్డవి.

దేశంలో ప్రసిద్ధ చిత్రకళా ప్రదర్శనము ఎక్కడ జరిగినా, సమర్థులైనవారిచేత వాటి సమీక్షలు వ్రాయించి ప్రధానచిత్రాల ప్రతికృతులతోపాటు అందులో ప్రచురించేవారు,

అంతరిక్షయానానికి, వైద్యానికి, అనేక భౌతిక మానసిక వైజ్ఞానిక వ్యాసాలు అందులో ప్రచురించే వారు. భారతీయదర్శనాలమీద విద్వాంసులచేత వ్యాసాలు వ్రాయించినారు. ప్రాచీన సాహిత్యాన్ని అంద జేయడానికి శ్రీ శిరోమణి రామాయణం, శ్రీ గణపతి శాస్త్రి మహాభారతము ప్రచురించారు. అవి రెండూ విశేష జనాదరణ పొందినవి.

అందులోని సమీక్షలకుకూడా విశిష్టత ఉండేది. ఈ అన్నిటికీ ఎన్నెన్నివిధాల రచయితలను ఎంతెంతమందిని శ్రీ శంభుప్రసాద్ సమీకరించేవారో ఊహించవలసినదే! సారస్వతానుబంధము సాధించిన సారస్వతసేవ అపారమైనది.

# 4

ఆంధ్రపత్రిక వారపత్రికగానే ఆరంభమైనది. దినపత్రిక వచ్చినతర్వాత అది మధ్యమధ్య కొన్ని సంవత్సరాలపాటు రాకపోవడముకూడా ఉన్నది. 1946 సం. లో వినాయక చవితినాడు పునఃప్రారంభించిన తర్వాత నేటివరకూ నిరాఘాటంగా సాగుతూఉన్నది. సైజుమాత్రము మధ్యలో మార్చుకొన్నది.

వారపత్రిక ప్రధానంగా కథానికలకూ, సాంఘిక నవలలకూ, సినీమా రంగానికీ ప్రాధాన్య మిస్తున్నది. అందులోని కథానికలకు కొంతస్థాయి సర్వసామాన్యంగా ఉంటున్నది. అందులోనే శ్రీ నోరి నారాయణభట్టు, రుద్రమదేవి, కవిసార్వభౌముడువంటి చారిత్రక నవలలు, కర్పూర ద్వీపయాత్రవంటి ఆధ్యాత్మికనవల వంటివికూడా ప్రచురించినారు. టామ్‌సాయరు, డాన్ క్విగ్జోటువంటి జగత్ప్రసిద్ధ రచనలు ఆంధ్రీకరణము చేయించి అందులో ప్రచురించినారు. జగత్ప్రసిద్ధికల నటుల నాట్యకత్తెల వివరాలేకాక, బ్రిటనులో ఒక రాజును ఒక మంత్రినీ గద్దెనుండి దింపిన సింప్సను సతి, కీలరువంటివారి అద్భుతచరిత్రలు అందులో వచ్చినవి. మధ్య మధ్య శ్రీ ఆరుద్రవంటివారు రచించిన గేయఖండికలుకూడా వచ్చినవి. పెద్దసైజులో ఉండగా అన్నమాచార్యులవారి కీర్తనలెన్నో శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారి స్వరకల్పనతో ప్రచురించినారు.

ఇందులో మరొక విశేషముకూడా జరిగినది. 'తెలుగు వెలుగులు' అనే శీర్షికతో వివిధ రంగాలలో ప్రసిద్ధులైన ఆంధ్రులమీద ఒకప్పుడు వ్యాసపరంపర వచ్చి పాఠకులను ఆకట్టినవి. వాటి రచయిత ఎవరో అప్పుడు తెలియదుకాని, అవి స్వర్గీయ శంభుప్రసాదు గారు వ్రాసినవే అని వారు పరమపదించిన పిమ్మట బయటపడినది. ఈ 'తెలుగువెలుగులు' శీర్షికను ఒజ్జబంతిగా పెట్టుకొని ఇతర పత్రికలు నామాంతరాలతో కొన్ని ప్రచురించినవి, కాని అవిఏవీ దీని స్థాయిని అందుకోలేక పోయినవి. ఇందులో స్వరూపావగాహనచేసే చురుకైన భాషఉండేది.

ఈవిధంగా ఆంధ్రపత్రిక సారస్వతానుబంధము వారపత్రిక ద్వారా శ్రీ శంభుప్రసాదు చేసిన సారస్వత సేవ మరువరానిదీ, అపారమైనదీను!

ఇక భారతి సంవత్సరాది సంచికలూ ఉన్నవి. ఈరెండూ శ్రీ పంతులుగారు శ్రీ శంభుప్రసాదుగారికి అప్పగించిపోయిన సారస్వత మహానిధానములు. 'భారతి' శ్రీ పంతులుగారి పరదేవత. ఆ విధంగానే శ్రీ శంభుప్రసాదు గ్రహించి నడిపినారు.

శ్రీ శంభుప్రసాదు పరమశాంతి స్వభావులని ప్రతీతి. వారు స్వర్గస్థులైన తర్వాత వారిని దీర్ఘకాలము సన్నిహితముగా ఎరిగినవారెందరో, వారి గుణగణములలో శాంతగుణమునే విస్తారముగా ప్రశంసించినారు. వారి ఆగ్రహముసంగతి ఎవరూ స్మరించలేదు.

'భారతిస్థాయి పడిపోయినది' అని ఎవరైనా ప్రసిద్ధులు అన్నప్పుడు శ్రీ శంభుప్రసాదుకు నిజంగా ఆగ్రహమే వచ్చేది. అటువంటి సందర్భాలు రెండు మూడైనా నాకు గుర్తున్నవి. మరీ ఒక సందర్భములో వారి ఆగ్రహము మిన్నుముట్టినది. దానికి సందర్భించిన వాదప్రతివాదాలన్నీ సారస్వతానుబంధములో పడ్డవి. దానితో ఉభయపక్షాల స్వరూప స్వభావాలు లోకానికి అవగతమైనవి. చివరకు వాద ప్రతివాదాల ప్రచురణకు స్వస్తిచెప్పి, అవి అన్నీ ప్రత్యేకముగా అనుబంధరూపములో ముద్రించి, భారతి చందాదారులకు పంపినారు. అట్టి ఆగ్రహము సత్యాగ్రహ మనదగినది. బహువిధాలుగా అది సత్యాగ్రహమే! అట్టిది ప్రదర్శించుట

కూడా వారికి అరుదే. ఆ సత్యాగ్రహములోకూడా వారెంతో నిగ్రహము ప్రదర్శించిఉండుట గమనార్హము !

భారతి రజతోత్సవము 1949 లో శ్రీబాగ్‌లో ఎంత వైభవముగా వారు జరిపినారో చూచినవారికే కాని తెలియదు. ఆ గులాబిమహామాలల సౌరభము తలచుకున్నప్పుడల్లా గుబాళిస్తూ ఉంటుంది. ఆ సాయంకాలము జరిగిన పార్టీ, రాత్రి విందూ జ్ఞప్తిలోకి వస్తున్నవి. ఆ సాయంకాలము జరిగిన సభకు శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు అధ్యక్షత వహించారు. ఆ సభలో ఇతరుల ఉపన్యాసాలతోపాటు, అంతకు పూర్వము భారతిలో ప్రచురితములైన వివిధాంశాల మీద వేరువేరుగా ఉపన్యాసకులు ఉపన్యసించినారు. హిందూపత్రికా సంపాదకులు సభలో ప్రశంసచేసి వారి పత్రికలో ఉత్సవ విశేషాలకు ప్రత్యేకస్థాన మిచ్చినారు. తక్కిన పత్రికలుకూడా అట్లే చేసినవి.

అప్పటికి 'భారతి' పంతులుగారి చేతిక్రింద 14 సం.లూ, శ్రీ శంభుప్రసాదుక్రింద 11సం.లూ నడచినది. పంతులుగారి చేతిక్రింద నుండగా నుండిన వృద్ధ నవ వ్యాసకర్తలను ఆకట్టుకొనుచునే నూతన వ్యాసకర్తలను అన్వేషింప సాగినారు. పెద్దలయందు వినయమూ, చిన్నలకు స్వాగతమూ; పూర్వమార్గముల యెడల గౌరవమూ, నూతన పంథాలమీద ఆదరమూ, మొదటినుండీ భారతి ప్రదర్శిస్తున్నది. శ్రీ శంభుప్రసాదు ఆవిధంగా జన్మాంతమువరకు పాటించి నడిపినారు.

ఆ రజతోత్సవ సందర్భములో (1949) ప్రచురించిన రజతోత్సవ సంచిక శ్రీ శంభుప్రసాదు సంస్కార వైవిధ్యానికి ప్రతీక. అందులో వివిధాంశాలకు వారు ఎన్నుకున్న రచయితలను భావనచేస్తే, వారి విజ్ఞత ప్రకటమవుతుంది.

ఒకవిధంగా చూస్తే భారతి రజతోత్సవ సందర్భములో శ్రీ శంభుప్రసాదు ఆత్మపరీక్ష చేసుకుని ఆంధ్ర రచయితల చేతకూడా ఆత్మపరీక్ష చేయించినట్లు తోస్తుంది. ఆ సంచికలో ప్రధానవ్యాసాల అంశాలను, వ్యాసకర్తలను వారే ఆలోచించి ఎన్నుకొని ఒకానొక క్రమపద్ధతిలో సంచికను రూపొందించినారు.

అందులో కవిత్రయమువీద మూడు ప్రత్యేక వ్యాసాలూ, వీరశైవ వాఙ్మయము, దక్షిణదేశ వాఙ్మయము, ఆడవాళ్ల పాటలు, ఆంధ్రదేశమున చరిత్ర పరిశోధన, ఆంధ్రులు — సంస్కృత వాఙ్మయము, బొమ్మలాటలు, అమెచ్యూరు నాటక ప్రదర్శనములు, తెలుగు చిత్రకళ—అందలి సొగసులు, కర్ణాటక సంగీతము, ఆంధ్రులు— భాషాశాస్త్రము — దాని క్రమాభివృద్ధి, ఆంధ్రదేశపు దేవాలయములు— జాతీయ జీవనముపై వాని ప్రభావము, పాతిక సంవత్సరాల తెలుగు కవిత్వము, ఆంధ్ర వాఙ్మయరంగమున కథాప్రపూర్ణని అమృతోదయము—ఇవి ముఖ్యమైన వ్యాసాలు. ఈ వ్యాసాల పేర్లనుబట్టి ఆంధ్రదేశములో అంతకు ముందు గడచిన పాతికేళ్లలోన్ని సాంస్కృతిక రంగాలలో కలిగిన వికాసము, అందులో పంతులుగారి ఆధ్వర్యాన ఆంధ్రపత్రికా సంస్థలు నిర్వహించినపాత్ర, ఆ సంచిక ప్రతిబింబిస్తుందని వ్యక్తమవుతుంది. పై వ్యాసాలుకాక 5 కథానికలు, 1 పద్యనాటిక, 2 ఏకాంకికలు, కొన్ని ఖండకావ్యాలు ఉన్నవి. ఆ సంచికలోని 'స్వవిషయము'లో ఉన్న ఈ క్రిందివాక్యాలు గమనార్హములు.

'ఇరువదియవ శతాబ్దమున సాహిత్యము విప్లవ రూపమైన తరంగము లొకదానివెంట నొకటి శీఘ్ర గమనమున ముంచెత్తుకొని వచ్చినట్లు పరిణామగతిలో నడచినది ... సామాన్యముగ ఈ ప్రక్రియ జరుగుటకు శతాబ్దముల అవధి మధ్య కన్పించుచుండును. కాని ఇరువదియవ శతాబ్దముయొక్క చైతన్యమున ఈ పరిణామక్రమము సర్వవిధముల అతి శీఘ్రముగ నొందినది ... భావకవిత, వాస్తవికకవిత, అతివాస్తవికకవిత, అభ్యుదయపథము మొదలగున వన్నియు ఈ పరిణామములో క్రమములయి నిలిచినవి...

'పాశ్చాత్య కవిత్వమును తెలుగులపై అవగాహన మొనర్చుకొనుటలో 'రసాత్మకం వాక్య'మన్న నిర్వచనరీత్యా ఆంగ్ల 'వాక్య'ముల సంపూర్ణ రసరూపమేదో సర్వసామాన్యముగా అనగాహనము కాలేదు. ఆ వికృతిలోనే తెలుగున, స్వభాషలో వ్యవహరించి కృషి చేయవలసినప్పుడు, స్వేచ్ఛకవితాస్వభావములోని 'భావాశ్రయగుణమును మించిన రసాశ్రయగుణమును' ఆలంబనముగా చేసికొను దృష్టి తగినంతగా ప్రచారము కాలేదు...

'బాహ్యదృష్టిలో నేటి సాహిత్యస్థితి స్తబ్దమై యున్నట్లనిపించవచ్చును. కాని ఇది నిస్పృహతో నీరవమై పతనమైయున్న స్తబ్ధతకాదు.....తెలుగు సాహిత్యక్షేత్రము ప్రతిభాయుతమగు ఫలములను పండించుటకు అత్యంతోన్ముఖమైయున్నది. విశ్వసాహిత్యమున కలంకారప్రాయములగు కృతులను తెలుగు భారతి అందీయగలదు.'

అప్పటికి భారతదేశానికి స్వాతంత్ర్యమువచ్చి రెండేళ్లయినది. ఆనాటి ఉత్సాహము రజతోత్సవానందముతో మేళవించినది. ఆ నూతన స్పందనతో శ్రీ శంభుప్రసాదు రచయితలకు ప్రాచ్యకవితాస్వరూపము భావాశ్రయముకాక రసాశ్రయత్వమని సూత్రప్రాయంగా సూచనచేసి, ఆంధ్రసాహిత్యము విశ్వసాహిత్యములో ఉన్నతస్థానము అధిరోహింపగలదని ఉవ్విళ్లూరినారు.

స్వాతంత్ర్యము లభించిననాటి ఆనందము ఆంధ్రరాష్ట్రము కొంతవరకు సిద్ధించిన 1953 వరకు పెరిగి, మహాంధ్ర మేర్పడినపిమ్మట 1957 జనవరి భారతిలో ఉద్వేలమైనది. 1953 నుండి 1957 వరకు భారతి స్వవిషయము వ్రాయుటలో ఆంధ్ర సారస్వతానికి నూతనాధ్యాయము తేవలెననే ఆకాంక్ష శ్రీ శంభుప్రసాదు వ్యక్తంచేస్తూవచ్చారు.

1953 జనవరి భారతి 'స్వవిషయము'లో, 'భాషారాష్ట్రప్రాతిపదికపై ఏర్పడు తెలుగుదేశమున దేశవ్యవహారములు తెలుగుభాషలో నడవవలసిన కాలమున దేశమున కుత్తమసాహిత్యపత్రికల అవసరము అత్యధికము కాగలదు. ఆ అవసరముల కనుగుణ్యముగా తన్ను సంస్కరించుకొనుటకు 'భారతి' ఉత్సాహపడుతున్నది'అనివ్రాసి వ్యంగ్యవైభవముతో ఆంధ్ర రచయితల కర్తవ్యము ఉపదేశించినారు.

ఆంధ్రరాష్ట్ర మేర్పడినతర్వాతవచ్చిన భారతి 1954 జనవరి సంచికలో 'స్వవిషయము'అను శీర్షికను 'జన్మదివసము'గా మార్చి శ్రీ శంభుప్రసాదు తన ఆనందము వ్యక్తముచేస్తూ, రచయితలకు వారి కర్తవ్యమును మరింత స్పష్టముగా ఉద్ఘోషించినారు.

'సజీవసారస్వతానికీ, ప్రజాస్వామ్యానికీ లక్ష్యం ఒకటే....నేటి సారస్వతము ఏదో ఒక ప్రత్యేక వర్గానికిగాని, సంకుచిత సాహిత్యసిద్ధాంతానికిగాని ప్రతి ఎఛాగా మారిపోకుండా సంరక్షించుకోవాలి....ఒకజాతి సంస్కృతి, ఆత్మవ్యక్తిత్వము, సారస్వతంలో సంపూర్ణంగా ప్రతిఫలిస్తున్నాయి....ఈ విషయాలన్నీ సహజంగా ఆకళించుకొన్నప్పుడే సాహితీపరులు సమాజ ద్రష్టలై మార్గదర్శకు లవుతున్నారు. ఇవి గమనించలేనివారేదో సంకుచిత రాజకీయపక్షానికో, వర్గానికో వాఙ్మయధోరణికో ప్రచారచారణులుగామారి, ఆత్మవిక్రయానికి పాల్పడుతున్నారు. ఈ విషయాలలో ఎంత మాత్రము ఏమరని వాఙ్మయస్రష్టలే ఆర్షగౌరవం పొందుతున్నారు. 'నానృషిః కురుతేకావ్యం'అన్న ప్రాచీన ప్రవచనము సూక్ష్మంగా ఈ అభిప్రాయమే ధ్వనిస్తున్నది.'

1955 జనవరి భారతి 'స్వవిషయము'లో విషయమే మరింత ప్రస్ఫుటంచేస్తూ ఆంధ్రులను జాగ్రత్తపడమన్నారు.

'తెలుగుజాతి స్వతంత్రజాతిగా పరిణతి పొంది పునర్నిర్మాణోద్యోగమున ముందుకు నడచిపోతోంది. ఈ నిర్మాణ కార్యక్రమం విప్లవరూపంలో సాగవలసి వుంది. క్రమబద్ధమూ, నిర్మాణోన్ముఖమూ అయిన పరివర్తననే విప్లవమనాలిగాని అరాచకపంథాను విప్లవమనే పెద్దపేరున పిలువరు...జాతికి కావలసింది ఓజఃస్ఫూర్తిగాని, నిరాశావాదధోరణులూ, వ్యగ్రమనస్తత్వాలూ కాదు. కాని నేటి సాహిత్యవైజ్ఞానిక రంగాలపైన ఇట్టి అవాంఛనీయములైన అరాచక నిరాశావాద ధోరణులు కారుమబ్బుల్లా కమ్మివున్నయ్.'

1956 జనవరి భారతి 'స్వవిషయము'లో మరికొన్ని ముఖ్యవిషయాలు ప్రస్తావించారు.

'ప్రాచీనభారతీయ విజ్ఞానరంగంలో సమాలోచన వృత్తికి ఎన్నడూ అవరోధముండేదికాదు...కాని బానిసత్వం తటస్థించిన అనంతరదశలో...భారతీయవిజ్ఞానం ఆత్మరక్షణార్థం తనచుట్టూ తానే...కంచుకోట నొకదాన్ని నిర్మించుకొని, సమాలోచనవృత్తికి స్వస్తిచెప్పి, తన పురోగమనాన్ని తానే అరికట్టుకుంది. ఇప్పుడు మనం స్వతంత్రులంగావున్నా, బానిసదశలో ఏర్పడిన ఈ మనఃస్థితి ఇంకా మన్ని వదలటంలేదు. ఇది మన

పురోగమనాన్ని యెడనెడా అరికట్టివేస్తున్నది..... సాహిత్యసంస్కృతులకూ శాస్త్రీయ విజ్ఞానానికీ సంబంధ మేమిటనేవారు కొందరున్నారు. శాస్త్రీయ విజ్ఞాన ప్రాతిపదికలపై నిర్మింపబడని సాహిత్య సంస్కృతులు పేకమేడలవలె యే చిన్నగాలివేసినా ఛిన్నాభిన్నమై పోతాయి ... ఈ సత్యాన్ని దృష్టిలో వుంచుకుని, దేశోద్ధారకుడు చూపిన వెలుగుబాటను పరిక్రమించుతూ, సాహిత్య సంస్కృతులకు దోహదంగా శాస్త్రీయ విజ్ఞానాన్నికూడా ప్రజాబాహుళ్యానికి వ్యాపింపజేయడానికీ, నిర్దుష్టమైన సమాలోచన వృత్తిని పెంపొందజేయడానికీ, ప్రయత్నించుచున్నాం. ఈ ఉద్యమానికి వివిధ విజ్ఞాన శాఖలలో సంపన్నులయిన మహాంధ్ర రచయితల సహకారం విస్తృతావధిని లభించగలదని ఆశించుతున్నాము.'

పై వాక్యాలు ఒకవంక ఆంధ్ర రచయితలకు ఆదరపూర్వ కాహ్వానమూ, మరియొకవంక చిత్రమైన సవాలుకూడానూ !

1957 జనవరి భారతి స్వవిషయము నాటికి మహాంధ్ర ఏర్పడిఉన్నది. అప్పుడు శ్రీ శంభుప్రసాదు ఆనందంతోపాటు కించకూడా వ్యక్తంచేశారు.

'నవంబరు ఒకటవతేదీ ఆంధ్రజాతి చరిత్రలో ఉత్కృష్టమైన మహా పర్వదినం. శతాబ్దాల బాని సత్వ కారణంగా, ఛిన్నాభిన్నమై, శిథిల శిథిలమైపోయిన మహాంధ్రసీమ ఆనాడు తిరిగి ఏకైకఖండంగా సమగ్రమూర్తిగా రూపొందింది ... అవకాశాలతోపాటు బాధ్యతలుకూడా సంక్రమించుతూ వుంటాయి... ఈ రానున్న అవకాశాలను ముందుగనే గుర్తించి, భారతి భవిష్యనిర్మాణ కార్యక్రమానికి వలసిన సాధన సంపత్తిని చేకూర్చడానికి గత ఒకటిరెండు సంవత్సరాలుగా ప్రయత్నించుతూనే వుంది. కాని ఆశించిన అవధికి ఫలితాలు సాధించలేక పోయింది. ఇందుకు కించపడుతున్నాం.'

1958 జనవరి భారతి 'స్వవిషయము'లో 1957 లో చెప్పిన విషయాన్నే మరొకరూపంలో చెప్పినారు శ్రీ శంభుప్రసాద్.

'' 'సమ్యక్ దర్శనము', 'సమ్యక్ జ్ఞానము', 'సమ్యక్ చరిత్ర', యివి జైనమత రత్నత్రయంగా చెప్పబడుతున్నా, నిజానికి యివి భారతీయ తాత్త్విక రంగానికీ, తద్వారా భారత జాతీయ పురోగమనానికీ, ప్రధాన ప్రాతిపదికలై వున్నాయి ... ఇవి స్థూలంగా మూడుగా చెప్పబడుతున్నా, నిజానికి యివి ఒకేవ్యవస్థ యొక్క మూడుదశలు...విశ్వవిజ్ఞానము సమైక్యమై, ఏకముఖమై సాగిపోవుచున్న ఈ దశలో, నిజానికి మనం దాని గమ్యాన్ని అందుకోలేకుండా వున్నాము .. నిజానికి యితర పురోగమనజాతులలోకంటె మనలో నేడు సమ్యగ్దర్శనము లోపించివున్నదంటే, ఇది అక్షరాలా అంగీకరించి తీరవలసిన పరమసత్యం ... ఇది సాహిత్యపత్రికగదా, ఇందు శాస్త్రవిజ్ఞాన ప్రసక్తి యేల నని కొందరి ఆశంక. శాస్త్రీయవిజ్ఞాన పరిపుష్టిలేని సాహిత్యరంగం మూఢవిశ్వాసాల మురికికూపమై జాతీయ పురోగమనానికిగాక తద్వినాశనానికి కారణమౌతుంది.'

ఈ పై విధంగా గట్టిగాచెప్పి, గత సంవత్సరం రచనలు పరిశీలించి నాటకరచనలో కొంచెము ముందడుగు ఉన్నా, కథాశిల్పం పతనమైనదనీ, కావ్యనిర్మాణము నిరుత్సాహజనకముగా ఉన్నదనీ, విజ్ఞానప్రచారానికి అత్యంతప్రధానసాధనమైన వ్యాసరచన సన్నగిలిపోయినదనీ, విమర్శనా విధానానికి తగిన సంప్రదాయము సిద్ధించుటలేదనీ, కొంత విచారము వ్యక్తము చేసినారు.

మళ్లీ, 1959 జనవరి 'భారతి జన్మదినసము'లో ఏమన్నారో చూదాము.

'అధునాతన సమస్యలకు సంబంధించిన ఆర్థిక సాంఘిక తాత్త్వికాది విషయాలపై రచనలు ప్రచురిస్తున్నాము. ఇంకా వేర్వేరు శాస్త్రీయ విషయాలపై అందరికే సులభగ్రాహ్యాలైన వ్యాసాలు ప్రచురించాలని సంకల్పించాము.

'భారతిలోని నాటికలకు విరివిగా ప్రజాదరణము లభిస్తున్నది...కథలలో ఆశించినంతగా ఉత్తమ రచనలు రావడంలేదు...ఏ సారస్వతశాఖలోనైనా కేవల సాంప్రదాయిక ధోరణులే అభిమానించడం భారతి కభి

మతంకాదు...పరిణత సాహిత్యదృక్పథమే భారతి ప్రత్యేకత...సారస్వతక్షేత్రంలో ప్రసిద్ధులయిన పెద్దలు కొందరు వృద్ధులయినారు. నూతనమార్గాలవలంబించిన కొందరు యువకులలో అనిశ్చితస్థితి ఏర్పడింది...మహాంధ్రం నేడొక నూతనోత్సాహంతో తొణికిసలాడుతున్నది...ఈ ఉత్సాహంతోనే తిరిగి ఆంధ్రభాషా సారస్వతోపాసనకు, పరిశోధనకు, కళాభివృద్ధికి అవిరళ కృషి చెయ్యవలెనని మా పత్రిక సంకల్పించింది.

ఎంతఉత్సాహంతో శ్రీ శంభుప్రసాద్ మహాంధ్ర రాష్ట్రాన్ని గ్రహించారో పై వాక్యాలు ధ్రువపరుస్తున్నవి.

1960 జనవరి భారతి 'స్వవిషయము'లో, 'పరిశోధనశాఖలో కొంత చైతన్యం కానవస్తున్నా, సృజనశీలమైనశాఖ చిగిరించనందుకు చింతిస్తున్నాము; విమర్శశాఖ కొత్తరెమ్మలు వేయనందుకు చాలా విచారిస్తున్నాము.'అంటూ 'ఈ సంస్కృతికి ఆలవాలము తెలుగుచదువు. అది లేక విదేశ భాషాసంస్కృతులలో వచ్చే రచనలు అసహజాలు, ఆపాతరమణీయాలు'అని ఎంతోవిజ్ఞతతో సంయమనంతో ఉద్బోధించినారు.

1961 జనవరి భారతి 'స్వవిషయము' అంతా సంతృప్తినే వ్యక్తముచేసినది. 'తెనుగు సారస్వతశాఖ సృజనాత్మకశాఖ కొత్తరెమ్మలువేసి కొత్తకావ్య కుసుమాలు పూసింది. కథానికలు నాటికలు సంగీతరూపకాలూ కొంత నూతనత్వంలో చిగిర్చాయి. విమర్శశాఖ ముందుకన్నా కొంత ముందంజవేసింది. భాషాశాస్త్ర విమర్శ చరిత్రపరిశోధన ముందుకు సాగినవి' అని సంతోషించినారు. కాని ఆ ఒక్క సంవత్సరమే వారు కొంత సంతోషించినది!

మళ్లీ 1962 సం. 'స్వవిషయము' అంతా చింతాపూర్వకంగానే ఉన్నది.

'ముఖ్యముగా కవులు, కథకులు, నాటకకర్తలు, వ్యాస రచయితలు, విమర్శకులుకూడ ఎంత చూచినను ప్రాతపుంతలనే బట్టి నడచుచున్నారు. క్రొత్తయేమైన నున్నచో నది తెచ్చిపెట్టుకున్నట్టు లుండి నైసర్గికతను వెలార్చుటలేదు ... ప్రాతలో లోతులకు పోవుటలేదు. క్రొత్త వచ్చినదో, దానికి బాధ్యత లేదు ... రచింపబడు గ్రంథములలో తెలుగు జీవితము యొక్క సమగ్ర స్వరూపముగాని సమాజలక్షణ పరిణామములుగాని ప్రతిబింబించుట లేదు. రచయిత ద్రష్టయై, ప్రతిభను పండించుట శశవిషాణ మగుచున్నది ... భారతీయమైన పురా శాస్త్రములయందుగాని, అధునాతనమైన విజ్ఞానాదిక శాస్త్రముల యందుగాని నికషమగు పరిచయము కలవారు అరుదైపోవుచున్నారు. ఈ రెండు జ్ఞానములును ఒక్కచో తారసిల్లుటయే లేదు. ఏ విషయమును గురించికాని ప్రత్యేకమైన కృషి అధ్యయనము జరుగుచున్న పద్ధతియే గోచరము కావుటలేదు. వీరు ఇందులో పండితులని చెప్పదగినవారు ఇప్పుడు ఎందరున్నారు ? ... మన దేశమననే కాక రాష్ట్రములోకూడ రాజకీయ నాయకులు సాహిత్యవేత్త లయినట్లు మాట్లాడుట, సాహిత్యమును శాసింపబూనుట ఈ స్థితికి కారణమన్నచో దోషముకాదు. అంతియకాక, సాహితీ పరులుకూడ రాజకీయ వేత్తలచుట్టును చక్రభ్రమణముగా తిరుగుచు నదియొక గొప్పయని భావించు చుండుటను గూడ చూచుచున్నాము ... మరి ఈ రాజకీయవేత్తలు రాజకీయముగా తమకు దక్కిన అధికారముచేత ఒక్క సాహిత్య జీవనమునేకాక, సర్వమగు జీవితమును శాసింపగల మను భ్రమలో పడుచున్నారు. ఆ భ్రమవలన జనించిన విపరీతతత్త్వమువలన సాహిత్య జగత్తు స్తబ్ధతను భజించుటగా పరిణమించుచున్నది. ఈ స్థితిని సాహిత్యమునుండి తొలగబెట్టగల్గుచో, భారతికి కావలసినదిలేదు.'

శ్రీ శంభుప్రసాదు స్వయముగా రాజకీయవేత్త ఐఉండియు సాహిత్యకారులకు రాజకీయవేత్తల శృంఖలములనుండి విముక్తికొరకు ఎంత పరితపించిరో పై వాక్యములు కొంత ప్రదర్శిస్తవి. బ్రిటిషు ప్రభుత్వముతో స్వాతంత్ర్యమునకై మనము పోరాడుచున్న రోజులలో, మనకై పోరాడిన కొందరు బ్రిటిషు మేధావులు జ ప్తికి వస్తున్నారు. ఇక్కడ ఒక విశేషమేమిటంటే, అప్పుడు మనము స్వాతంత్ర్యముకోసము పోరాడి

నాము; కాని నేటి సాహిత్యకులు రాజకీయవాదులకు చెక్కభజనలు చేయుటే గొప్ప అనుకొంటున్నారు. ఇంత కంటె రచయితలకు హీనస్థితి ఉండదు

1963 సం.లో స్వవిషయముతో 'విమర్శపట్ల రాజకీయనాయకులు ప్రదర్శించుచున్న అసహనభావ మునే సాహిత్యరంగంలో పెద్దలైనవారుకూడ చూపించు చున్నారు. విమర్శను వ్యక్తిగతమైన విరోధముగా ఎంచు కొనుట జరుగుచున్నది.' అని చింత వ్యక్తము చేసినారు శ్రీ శంభుప్రసాదు.

మరల 1964 సం. జనవరి భారతి స్వవిష యములో వారు కొంత విస్తారముగా తమ ఆశయ ములు ప్రకటించినారు. అదే చివరిసారి!

'ఒకవైపున కల్పనాసాహిత్యము విశృంఖలముగా పెరుగుచున్నది. మరొకవైపున ప్రాచీన సాహిత్య విజృంభణ జరుగుచున్నది. ఇది సాహిత్యవ్యాప్తిదృష్ట్యా శుభసూచన. కాని కల్పనాసాహిత్యములో సమకాలీన సమాజముకాని సమకాలీన సమస్యలుకాని కానరావడము లేదు. ప్రచీనసాహిత్య పర్యాలోకనములో పూర్వము వుంటూవచ్చిన ప్రత్యేక కృషి శ్రద్ధ కనిపించడము లేదు.. .ప్రస్తుత ఆశయములు పూర్వసంప్రదాయముల నుంచి సహజపరిణామమార్గమున రావలసివున్నవి...... దీనినికాదని, పాశ్చాత్యవిధానములను యథాతథముగా స్వీకరించుట, ఆరాధించుట ప్రమాదకరము. ఈ ప్రమాదమును తప్పించుకొనుటకు నూతన సాంస్కృతిక దృక్పథము అవసరము. పురాణయుగధర్మములను, వైదికమతమును ప్రచారము చేయడమువల్ల దీనిని సాధించలేము...కేవల సాహిత్యమునకేకాక ఆర్థికసాంఘిక రాజకీయ సమస్యలపై రచనలనుకూడా భారతి ప్రోత్స హించుచున్నది...విమర్శ సాహిత్యములో అంతర్భాగము... భారతి ఒక సంస్థ. దానికి రాగవిరాగములు, ఈర్ష్యా ద్వేషములు లేవు.'

ఈ విధంగా ఉద్ఘాటించి ఊరుకున్నారు. ఇన్నాళ్లు తాముచేసిన ఉద్బోధలవలన రచయితలలో ఆశించినంత స్పందనము కలుగలేదని నిరుత్సాహపడిరో, కాక తాము రచయితలకు మరల మరల స్వాతంత్ర్యమును విధులను తెలియజెప్పుచుండుట వృథాశ్రమయని భావించిరో తెలియదు. కాని 1965 నుండి 1972 జనవరివరకు భారతి 'స్వవిషయము' ఒకటే మతల బీలో నడచినది. సంవత్సరసంఖ్య మార్పుతప్ప వేరు మార్పు లేదు. శ్రద్ధగా భారతి పఠించుచు వచ్చిన నాబోట్లకే, ఈ వ్యాససందర్భములో వెనుకటిసంచిక లన్నీ పరిశీలించినప్పుడుకాని ఈ విషయము స్ఫురించ లేదు. ఇప్పుడు తలచుకుంటే శ్రీ శంభుప్రసాదు నేటి రచయితల హీనస్థితికి ఎంత పరితపించినాడో గదా అనే ఊహ కలిగి మనస్సు కలక్కుమన్నది.

## 6

'భారతి' పంతులుగారికిని శ్రీ శంభుప్రసాదు గారికిని ఉపాస్యదేవతగా ఉండినదనేది జగత్ప్రసిద్ధవిష యము. వారే ఆ విషయము పలుమారులు ప్రకటించి నారు కూడాను. మరి సంవత్సరాది సంచికలో? వాటినిగూర్చి వారిద్దరూ ప్రత్యేకించి ఎక్కడా చెప్పి నట్లులేదు. పేరుకూడా భారతివలె పరదేవత పేరుగాక లౌకికనామమే. ప్రథమములో సంవత్సరాది సంచిక 1910 లో పంతులుగారు ప్రారంభించి నప్పుడు, తమకు ఆంధ్రదేశములోని ప్రజ్ఞానంతుల సర్వతో ముఖ పరిచయమునకై ఉద్దేశించినట్లు దానినిచూచిన వారికి తోచక మానదు. పంతులుగారు దానికి నెమ్మది నెమ్మదిగా ఆదర్శరూప మిచ్చినారు. పంతులుగారి ప్రస్తావనలు గత సంవత్సరములోని ప్రపంచ సంఘట నలు భారతదేశ సంఘటనలు ఆంధ్రదేశ సంఘట నలు అద్భుతముగా సమీక్షచేసేవి. శ్రీ శంభుప్రసాదు గారి ప్రస్తావనలలో అంత సమగ్రవివరణ లేకపోయినా సూత్రప్రాయంగా పంతులుగారి ప్రస్తావనల దారి లోనే నడిచేవి.

ఒకవిధంగా యోచిస్తే వారిద్దరికీ భారతిమీద కంటెకూడా సంవత్సరాది సంచికలమీదనే ఎక్కువ శ్రద్ధాభక్తు లుండేవేమో అనిపిస్తుంది. ఒక్క సంవ త్సరము మాత్రము, రెండవ ప్రపంచ సంగ్రామకాల

ములో, ఎంత ప్రయత్నించినా కాగితము లభింపక సంవత్సరాది సంచిక ప్రచురింపలేక పోయినందులకు శ్రీ శంభుప్రసాదుగారు పొందిన పరితాపము తర్వాతి సంచికలో ప్రకటించినారు. శ్రీ శంభుప్రసాదు హయాములో రెండుసంచికల విషయములో క్రొత్త ప్రయోగాలుకూడా చేసినారు. విశ్వావసులో (1964–65) దానిని ఆంధ్రపత్రిక స్వర్ణోత్సవ సంచికగా ప్రకటించినారు. అది 55 వ సంచిక. అందులో ప్రస్తావముకూడ లేకుండ 1910 నుండి 1949 వరకు సంవత్సరాది సంచికలలో ప్రచురించిన రాజకీయేతర వ్యాసాలే కొన్ని ఏరి ప్రకటించినారు. చివర చేర్చిన 'స్వవిషయము'లో 'ఈ యాభై సంవత్సరాల చరిత్రను సింహావలోకనము చేస్తున్నట్టిది, ఈ స్వర్ణోత్సవ సంచిక. ఇరవయ్యో శతాబ్దంలో తొలిసగం ... అర్ధ శతాబ్దికి పైగా ధారావాహికంగా వెలువడుతున్న సంవత్సరాది సంచికలు ఆంధ్రజాతి సంస్కృతిరంగంలో చేసిన సేవ ఎలాటిదో, ఆంధ్రావళికి తెలుపుతాయి. దానికి ఉదర్కాలుగా నిలబడుతాయి; మణిదీపాలుగా వెలుగుతాయి. ఆ మణిదీపాల వెలుగును ఎంతో కొంత ప్రతిఫలింపజేసే వెలుగురేక ఈ స్వర్ణోత్సవ సంచిక!' అన్నారు.

రెండవ నూతనప్రయోగము ప్లవంగ సంవత్సరాది సంచిక (1967–68). దానిని శ్రీ నాగేశ్వర జయంతి సంచికగా వెలువరచినారు. అందులో ఒక్క పేజీ 'ప్రస్తావన'. తర్వాత దేశోద్ధారకునిగూర్చి గాంధిజీ ఎంగుఇండియాలో వ్యాసమూ, చిత్రపటావిష్కరణలో వారి ఉపన్యాసమూ, పంతులుగారి నిర్యాణానంతరము శ్రీ మహాదేవదేశాయి హరిజనపత్రికలో వ్రాసిన వ్యాసమూ, తర్వాత అన్నీ శ్రీ పంతులుగారి వివిధరచనలూ. చివరకుమాత్రము 'పూర్ణపురుషుడు, శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు' అని నేనువ్రాసిన 45 పేజీల సుదీర్ఘవ్యాసమూ — ఇంతే ఉన్నవి. దాని 'ప్రస్తావన'లో శ్రీ శంభుప్రసాదు ఇట్లా వ్రాసినారు.

'శ్రీ పంతులుగారు బహుముఖమనీషి; మహోద్యమము. బహుముఖమైన వారి ఉద్యమం తెలిసినంతగా, దేశానికి వారి వైదుష్యము తెలియలేదు. ముఖ్యంగా ఈ తరంవారికి తెలియలేదు...ఆ కాలంలో నాయకులకు వైదుష్యంకూడా ఒక పరికరం. శ్రీ పంతులుగారి రచనలు అనేకం. కాని లక్ష్యం ఒక్కటే. అది మానవాభ్యుదయ సాధనం, ఎడతెగని అన్వేషణ!'

'సంవత్సరాది సంచిక, ఉగాది సంచిక—' అని దాని రెండుపేర్లూ నిరాడంబర మైనవే 'భారతి' అన్నట్లు దేవతానామంకాదు. కాని అది నిజంగా పంతులుగారికీ శంభుప్రసాదుగారికీ హృదయస్థమైన పరదేవతాస్వరూపంగానే ఉండేది. అది వారికి స్థిర ప్రతిష్ఠితమైన ఇష్టదేవతామూర్తి. తర్వాతవచ్చిన 'భారతి' దాని చరప్రతిష్ఠితమైన మూర్త్యంతరము. సంవత్సరాది సంచికను స్థిర ప్రతిష్ఠితమైన పరదేవతామూర్తిగా భావించారనడానికి శ్రీ శంభుప్రసాదు వ్యంగ్యప్రధానంగా వ్రాసిన వాక్యాలే ప్రమాణము. చూడండి, శోభకృతు ఉగాది సంచికలో (1963–64) ప్రస్తావనలోని ఈ క్రింది వాక్యాలు!

'ఇది ఆంధ్రపత్రిక ఏభైనాలుగవ ఉగాది సంచిక. సంవత్సరాది సంచికపేరున ప్రసిద్ధికెక్కినది. ప్రసిద్ధికి తగిన ప్రత్యేకతను సంపాదించుకొనియున్నది. తాత్కాలిక ప్రయోజనముకలదికాక శాశ్వతప్రయోజనముకల సంపుటిగా ప్రసిద్ధిపొందినది. ఆ ప్రతిష్ఠను నిలుపుకొనుటకు సర్వవిధముల ప్రయత్నించితిమి.'

శ్రీ శంభుప్రసాదు సాహిత్యాశయాలు భారతి 'స్వవిషయము'లలో ప్రతిఫలించినట్లుగానే, ఈ సంచిక లందును ప్రతిఫలించినవి. అందువలన వాటినుండి విస్తారంగా ఉదాహరింపదలచలేదు. పరాభవ సంవత్సరాది సంచిక (1966—67) నుండి ఈ క్రింది ఉదాహరణ ఒక్కటి చాలును!

'సాహిత్యరంగంలో అధికారంలో ఉన్నవారి ప్రాపు సంపాదించాలనే వ్యామోహం ఎక్కువైంది. దేశంలో ఇప్పుడు సాహిత్యకలాపంఅంటే అకాడెమీ అవార్డుల సంపాదనకు వ్యూహాలు పన్నడం, అంకితాలకు రాజకీయ నాయకులను 'వరులు'గా ఎంచడం, ఆవిష్కరణోత్సవాలకు ఆహ్వానసంఘాలను నిర్మించుకొనడం పద్ధతిలో

కొనసాగుతున్నది. ఏకొద్దిమందో సాహిత్యసృష్టిచేస్తున్నా, సాంఘికతత్త్వవేత్తలను రాజకీయవేత్తలు దరికి రానీయని నిఘంగానే, ఈ నవసాహితీపరులు నిజమైన సాహితీపరులను తమ దరికి రానీయడంలేదు. రాజకీయవేత్తలు, సాహితీపరుల మనుకొనేవారు, సినిమా'స్టారులు' తారలు వెంటపడుతున్నారు...ఇప్పుడు ఇదిఅంతాకూడా కవిత్వపోషణ కళాపోషణ అనే రాచరికపుభావం మంత్రులలో, నాయకులలో పాతుకుపోతున్నది. ఈ స్థితి తొలిగితేనే కాని మన సాహిత్యం బాగుపడదు. అభివృద్ధిచెందదు. రచయిత స్వతంత్రుడై స్వతంత్రంగా వూహచేయగల స్థితిలోనికి రాడు. స్వాతంత్ర్యానికి పూర్వం దేశంలో నాయకులు ఎట్లా ఉన్నత ప్రవర్తనం కలిగివుండేవారో, అట్లానే రచయితలుకూడా వున్నారు. ఉత్తమ రచనలు చేశారు. స్వాతంత్ర్యం తర్వాత నాయకత్వం ఏతీరులో వున్నదో సాహిత్యంకూడా ఆ తీరులోనే వున్నది. స్వాతంత్ర్యంరానిరోజుల్లో రాజకీయవేత్తలు సాహిత్యం జోలికి పోలేదు. ఇట్లా రాయాలి, అట్లా రాయాలిఅని చెప్పలేదు. అప్పుడు అట్టి అట్టహాసాలతో కూడిన అంకితాలు, ఆవిష్కరణలు లేవు. ఇప్పుడు ఇవన్నీ వచ్చాయి. రాజకీయవేత్త విమర్శకుడు—అలంకారికుడు—సాహిత్యసిద్ధాంత నిర్మాత—పోషకుడూ—బహుమతులు పంచేవాడూ అయిపోయినాడు...ఈ పతనంనుంచి సాహిత్యం తిరిగి బయటపడి ఉద్దీప్తిని పొందాలంటే, రాజకీయవేత్తలకు సాహితీపరులు దూరంగానుండాలి. సాహిత్యంలో అనభిజ్ఞులైన రాజకీయవేత్తలు జోక్యం పెట్టుకోకూడదు. మంత్రి అయినంతమాత్రాన మనిషికాడు. ఆ స్థితిని చేకూర్చుకోగలిగినప్పుడే తిరిగి మన సాహిత్యంలో వసంతోదయము అవుతుంది. కొత్తఉగాది వస్తుంది.'

రచయిత లందరిపక్షాన వారి స్వాతంత్ర్యానికి శ్రీ శంభుప్రసాదు ఎంతపోరాడినారు! ఇంతకంటే ఏమి కావలె సాహిత్యసేవకు !

పంతులుగారు దేశస్వాతంత్ర్యంకోసము పోరాడినారు. స్వతంత్రభారతంలో రచయితలు ఎట్లా ఉండవలెనో దానికి దారులు తీర్చిదిద్ది ఆ దేశస్వాతంత్ర్యం చూడకుండానే స్వర్గస్థులైనారు.

అట్లుకాక శ్రీ శంభుప్రసాదు భారతస్వాతంత్ర్యం చూచినారు. ఆంధ్రరాష్ట్రావతరణం కూడా చూచి ఆనందించారు. కాని భారతదేశమంతటాను ప్రత్యేకించి ఆంధ్రదేశంలోనూ, స్వాతంత్ర్యం వచ్చినతర్వాత రచయితలు విదేశభావాలకూ విదేశ సంస్కృతులకూ కేవలం బానిసలైపోవడము చూచారు. రాజకీయనాయకులకు దాసులై చారణులైపోవడం చూచి పరితపించారు. పంతులుగారు పోరాడినది ప్రత్యక్షస్వాతంత్ర్య శత్రువుతో. వారికి దారిచూపిన మహాత్మునివంటి మహానాయకులున్నారు; తోడుగా పోరాటంలో బుజం కలిపిన ఆంధ్రకేసరివంటి ధీరులున్నారు; వారిని అగ్గించిన నలభైకోట్లమంది భారతీయులున్నారు.

మరి శ్రీ శంభుప్రసాదు పోరాడినది అప్రత్యక్ష శత్రువుతో. ఆ శత్రువు మేఘనాదునివలె మేఘాల మరుగునుండి నాగబాణాలు వేసినవాడన్నా కాదు. ఈ క్రొత్తశత్రువు రచయితల హృదయాంతరాళాల్లో కనబడకుండాచొచ్చి తిష్ఠవేసి దిగలాగడం చూచారు. శ్రీ శంభుప్రసాదు విజ్ఞాననేత్రము ఆ శత్రువును చూచింది. ఆయన కరుణాహృదయం కరిగింది. ఈ క్రొత్తశత్రువుతో పోరాడడానికి వారికి దారిచూపిన మహాత్ములు లేరు. తోడునిల్చిన కేసరులు లేరు. అగ్గించిన ప్రజలు లేరు. అయినా కన్నుమూసేవరకూ ఏకాంగవీరుడై రచయితల అంతశ్శత్రువులతో యుద్ధం సాగిస్తూనేవచ్చారు. పరీధావి ప్రస్తావనే వారు ఈ స్వాతంత్ర్య శత్రువుమీదవేసిన చివరి అస్త్రము.

ఒకవిధంగా చూస్తే దేశస్వాతంత్ర్యం చూడ నోచుకోని శ్రీ పంతులుగారివలెనే, రచయితల స్వాతంత్ర్యం చూడజాలని శ్రీ శంభుప్రసాదు కూడా దురదృష్టవంతులే! కాని సత్యదృష్టితో తత్త్వదృష్టితోచూస్తే ఇద్దరూ ధన్యజీవులే. శ్రీ కృష్ణ భగవానుని గీతోపదేశ మేమిటి?

'కర్మణ్యే వాధికారస్తే
మాఫలేషు కదాచన !'

ఇద్దరూ ధర్మవీరులై జన్మాంతమువరకు దేశ స్వాతంత్ర్యంకొరకు ఒకరూ, రచయితలవ్యక్తిస్వాతం

త్ర్యంకొరకు ఒకరూ బొందిలో ప్రాణమున్నంత వరకూ ధర్మయుద్ధము సాగించిన మహావీరులు! తమ స్వాతంత్ర్యంకోసము పోరాడిన పంతులుగారివంటివారిని దేశము కృతజ్ఞతతో స్మరిస్తున్నది. కాని తమ స్వాతంత్ర్యంకోసము తుదివరకు పోరాడిన శ్రీ శంభుప్రసాదు వీరవిహారమును కృతజ్ఞతతో స్మరించే రచయిత లెంతమంది ఉన్నారు? అట్టివారు లేకపోలేదు. కొద్దిమందిఐనా ఉన్నారు. వారందరితరఫునా నేను శ్రీ శంభుప్రసాదుకు జోహారు లర్పిస్తున్నాను!

శ్రీ శంభుప్రసాదు అమృతస్మరణతో ఈ వ్యాసము సాగినది. నా సొంత మాటలతోకంటె వారి సొంతమాటలతోనే వారి స్వరూప స్వభావాలు ప్రదర్శించడానికి యత్నించాను. అనేక రంగాలలో ప్రసిద్ధులైన ఆంధ్రనాయకులనుగూర్చి ఆంధ్ర వారపత్రికలో 'తెలుగు వెలుగులు' అనే శీర్షికతో 50 దాకా వ్యాసాలు వచ్చినవి. అవి వ్రాసినది శ్రీ శంభుప్రసాదుగారని ఇప్పుడు తెలియవచ్చినది. ఆంగ్లాది భాషలలో 'లిటరరీ ఎస్సే' అనే సాహిత్యప్రక్రియ ఆంధ్రభాషలో ఏదో సకృత్తుగాకాని రాలేదు. ఆ శాఖకు చెందినవి 'తెలుగు వెలుగులు'. వాటిలో నా కిప్పుడు ఉపలభ్యమైన కొన్నిటినుండి భాగాలు ఉదాహరిస్తాను. హృదయంగమమైన చమత్కారంతో ఆయా వ్యక్తుల వెలుగు లవి ప్రదర్శిస్తున్నవి.

తాను జబ్బుగాఉండి మహాత్ముని దర్శనానికి రాలేనని శ్రీ కాశేశ్వరరావు, చీటీ పంపినారు. 'మహాత్ముని కార్యదర్శి ప్యారీలాల్ ఆ చీటీకి సమాధానంగా ఈ విధంగా ఒక కార్డువ్రాసి ... పోస్టుచేశారు: 'మీరు ఎందుచేత తరుచూ జబ్బుపడుతున్నారు? బాపు హుకుం అయింది; ఇకమీద జబ్బుపడకూడదు. భయపడకండి' అంతే; ఆకార్డు ముక్కచేరిన ఉదయం నుంచే జ్వరం ఎటుపోయిందో పోయింది.'

శ్రీ డి. వి. సుబ్బారావునుగూర్చి: 'ఒకసారి ఆయన ఒకపాత్రను, 'చంపుతాను'అని భయపెడుతూ నటించేసరికి, ఆ నటుడు, ఎన్నో రిహార్సల్సు వేసి ఉన్నా ఆ క్షణంలో భయపడి పారిపోయాడు ... ఉత్సాహప్రభుశక్తియుతమైన 'ఉద్యోగం' వారిది.'

శ్రీ దామోదరం సంజీవయ్యను గూర్చి: 'అదృష్టం వెంటపడతారు కొందరు. అదృష్టమే కొందరివెంట పడుతుంది ... అదృష్టం వెంటపడితే పారిపోకుండా ఉన్నవారే నిజానికి అదృష్టవంతు లవుతారు. అలాంటి అదృష్టవంతుడు శ్రీ దామోదరం సంజీవయ్య!'

శ్రీ చంద్రమౌళినిగూర్చి:— 'ఈ రాజకీయ వేత్తల కందరికీ ఒక జబ్బున్నది. అది ఆశ్రిత పక్షపాతం. శ్రీ కల్లూరి చంద్రమౌళిగారికి ఇది కాస్త హెచ్చుపాళంలో ఉన్నది. అంతేకాకుండా, ఆయనకు ఆగ్రహంవచ్చినా అనుగ్రహంవచ్చినా ప్రమాదమే. తనకి తగిలేదీ తెలియదు, ఇతరులకు తగిలేదీ తెలియదు. అయితే చంద్రమౌళిగారు కొంత వేదాంతి.'

శ్రీ మొసలికంటి తిరుమలరావునుగూర్చి:— 'శ్రీ తిరుమలరావు ఏదో గ్రహపాటున గాంధివాయలో పడ్డాడుగాని లేకపోతే ఓ ఛోటా పాదుషా లాగా అనవరతము చిన్నదర్బారు నడుపుతూ ఉండేవాడు...శ్రీ తిరుమలరావుకు ఇంతకాలమూ ఢిల్లీవైపే చూపు. అది ఇంతవరకు రాష్ట్ర రాజకీయాలవైపు మళ్లలేదు.'

శ్రీ అద్దంకి శ్రీరామమూర్తి:— 'నాటకం చూసినతర్వాత కొన్నాళ్లవరకు అద్దంకివారి దశరథుని ఆవేదనాస్వరం వెంటబడి వినబడుతుంది. అద్దంకి మరుగుపడిపోయి దశరథుడే కనబడుతాడు... అద్దంకి శ్రీరామమూర్తి కంఠం శంఖనాదంలాగా ఆరంభమై ఘంటానాదంలాగా నిలిచి మోగుతుంది.'

శ్రీమతి దుర్గాబాయ్‌దేశ్‌ముఖ్: 'కనకదుర్గమ్మ వలె ఈ కాకినాడ దుర్గమ్మ శక్తిమయి...అప్పటికి (ఉప్పుసత్యాగ్రహం) ఆమెకు సిట్టుమని ఇరవయి ఏళ్లు కూడా లేవు. అందుకనే ఆవిడను 'జోన్ ఆఫ్ ఆర్కు'వంటి వీరవనిత అని ప్రస్తుతించారు ... (సోషల్ వెల్ఫేర్ బోర్డు) ఒక చిన్న సామ్రాజ్యం. ఆమె దానికి మహారాజ్ఞి. 'స్త్రోత్రప్రియాయై నమః.'

శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు : 'శిష్య వర్గం ప్రచారంతో కొందరు, అభిమానుల ఆదరంతో కొందరు, అధికార ప్రాభవంతో కొందరు గొప్పవారు అవుతూంటారు. కేవలం తమ పరిశోధనతోనే, దాని ఫలితమైన రచనలతోనే గొప్ప కెక్కినట్టివారు శర్మ గారు ... శర్మగారు చాకలిబండ అనుకున్నవాటినికూడా చదువుబండలుగా చదివిన దిట్ట.'

శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మగారు: 'పండ బారుతున్న పసిడిమై తీగ; పట్టుపీతాంబరం, ఉజ్జ్వల మైన ఊర్ధ్వత్రిపుండ్రాలు; అనుష్ఠాన తత్పరతతో శేషించిన ఆనందచ్ఛాయలు ... సప్తతి సమీపించినా, ఆయనలో మెరుపు తీగవంటి చురుకుదనం ఉంది ... ఆయనది ప్రధానంగా విమర్శాధికారంగల వ్యక్తిత్వం ... వ్యుత్పత్తిమీద గౌరవంకంటె వ్యుత్పన్నతమీద ఆదరం.'

న ఆశయాలతో శ్రీ శంభుప్రసాదు తమ సంస్థలోని అన్ని సాహిత్యవిభాలకూ రూపుదిద్ది, బహుముఖరచనలు చేయుటకు రచయితలను ఆకర్షించి, ప్రతివారికీ యథోచిత స్థానమిచ్చినారు. కవితలో సంప్రదాయకవిత, భావకవిత, అభ్యుదయకవిత, వాస్తవిక కవిత, అధి వాస్తవిక కవిత, వచనకవిత, దిగంబరకవిత—అన్నిటికీ స్థానమిచ్చినారు. వారి వారి సిద్ధాంతాలకు వాద ప్రతివాదాలకూ అవకాశము కలిగించినారు. కవితా శాఖలోవలెనే కథానిక, నాటిక, వ్యాసరచన మొదలైన అన్ని సాహిత్య ప్రక్రియలను ప్రోత్సహించారు. గ్రంథసమీక్షలకు గౌరవస్థానము లభించినది. సంవత్సర సాహిత్య సమీక్షలూ, పది సంవత్సరాల సాహిత్యసమీక్షలు చేయించినారు. విశ్వసాహిత్యములో నూతన సిద్ధాంతకర్తల భావాలు విపులంగా ఆంధ్రులకు పరిచయం చేశారు. నిరాడంబరంగా శ్రీ శంభుప్రసాదు చేసినసేవ దిఙ్మాత్రంగా ప్రదర్శించడానికి ప్రయత్నించాను. స్వానుభవాలు కొన్ని ముచ్చటించి ముగిస్తాను.

నాకు మొదటిసారి భారతిలో సమీక్షకై 1962 లో భాసర్వజ్ఞ రచితమైన న్యాయసారః, ఆనందపూర్ణ మునీంద్ర ప్రణీతమైన న్యాయ చంద్రికా వంటి బరువైన గ్రంథాలు కొన్ని పంపుతూ 'ఈ కాలంలో పెద్దలలోకూడా మోమోటము ఎక్కువవుతున్నది. నిష్పక్షపాతంగా సమీక్ష చేయవలెనని నాకోరిక' అని తాత్పర్యంగల ఉత్తరము వ్రాసినారు. నేనందుకు అంగీకరించి ఇంతవరకు నామాట దక్కించుకొన్నాను. నేనూ మానవమాత్రుడను కనుక పొరపాట్లు చేసి ఉండవచ్చునుగాని బుద్ధిపూర్వముగా పక్షపాతము చూపుటగాని, వృథాదూషణ చేయుటగాని, ఉన్నగుణము విస్తరించక పోవుటగాని చేయలేదని నావిశ్వాసము. నామాటయందు శ్రీ శంభుప్రసాదు గారికి చివరివరకూ విశ్వాసముండిన ఉనడానికి, వారు చివరిజబ్బుతో ఉండికూడా నాకు సమీక్షార్థము పంపుచుండిన గ్రంథాలే నిదర్శనము. ఇతర సమీక్షకులకు కూడా వారు ఇట్లాగే వ్రాసిఉంటారు.

వారెప్పుడూ ఆద్యంతము స్వహస్తంతోనే నాకు ఉత్తరాలు వ్రాసేవారు. నాకేకాదు. మా పట్నములోనే ఉన్న యువరచయిత్రికి కూడా స్వహస్తంతోనే వ్రాసినదాన్నిబట్టి తను వ్యాసకర్తలందరికీ అట్లాగే వ్రాసేవారని అనుకుంటున్నాను. ఆమె 'మీ ఉత్తరాలలో నమస్కారాలువద్దు చిన్నదానను ఆశీర్వదించండి' అని వ్రాస్తే, 'మా వ్యాసకర్తలందరూ నాకు పూజ్యులూ పూజ్యురాండ్రే కనుక నమస్కారాలే చేస్తాను' అని శ్రీ శంభుప్రసాదు [illegible] వ్రాసినారు. ఈ ఉదంతాన్నిబట్టి వారికి తను వ్యాసకర్తలమీద ఎంతగౌరవ భావముండేదో అనుమేయ

ఆంధ్ర వారపత్రికను ఒ [illegible] నాడు ఉద్ధరిస్తూ ప్రారంభించిన ప్రథమ సం[illegible] లోనే, నా 'నారాయణభట్టు' ధారావాహి[illegible] ప్రచురించడ మారంభించినారు. నారాయణభట్టు [illegible] చూచినా నాకు శ్రీ శంభుప్రసాదు స్మృతికివస్తారు. ఆ నవల పునర్ముద్రణము చేయబోతూ వారిని [illegible]

వాడలో కలసికొని 'ఈ మాటు ముద్రణలో మీపేర అంకితముచేసి ప్రచురిస్తాను, ఉత్సవాదులు ఏమీ వద్దు !' అని నేనుకోరగా, వారు మర్యాదగా వద్దన్నారు. నా హృదయములో మాత్రము ఆ నా ప్రథమ నవల వారికే అంకితమైనది.

సాహితీ సమితికి నేను కార్యదర్శిని ఐన తర్వాత ఒక సంవత్సరము వార్షికోత్సవానికి వారిని ప్రారంభోత్సవము చేయమని అర్థించగా, మళ్లీ మర్యాదగా తప్పుకున్నారు. ఆ విషయము నా సమక్షములో తర్వాత ఇతరులతో ప్రస్తావించి 'ఒకసారి నన్ను ప్రారంభోత్సవంలోకి దింపడానికి శ్రీ శాస్త్రిగారు ప్రయత్నించారు గాని తప్పించుకొన్నాను' అంటూ నవ్వుతూ చెప్పినారు. కాబట్టి వారప్పుడు కొంత తటపటాయించి ఉండవలె!

శ్రీ శంభుప్రసాదుగారు రచయితల కందరికీ ఇచ్చిన ప్రధాన సందేశ మొక్కటే! మీ స్వాతంత్ర్యం చేజేతులా వదులుకొని బానిసత్వంలోకి దిగజారిపోకండి! 'నిరంకుశాః కవయః!' అని గుర్తుంచుకోండి! దానితో పాటే మీరు విజ్ఞానం పెంచుకొని మీ బాధ్యత గ్రహించండి. మీరు జగత్తుకు ప్రవక్తలు. నా నృషిః కురుతే కావ్యమ్ ! సర్వేజనాః సుఖినోభవంతు !



# శ్రీ శంభుప్రసాద్‌గారు: శ్రద్ధాంజలి

## ఆర్. ఎస్. సుదర్శనం

శ్రీ శంభుప్రసాద్‌గారు అపూర్వమైన వ్యక్తి. వారు నిర్వహించిన పత్రికా సంపాదకత్వ మొక అనాసక్త కర్మయోగము. 'I do not think I deserve that much of honour, because apart from 'Bharati', I am nobody...' అని వారొక లేఖలో (10-4-1965) నాకు వ్రాశారు. అది ఆ సందర్భంలో అన్నమాట మాత్రమేకాదు. వారి జీవిత ధ్యేయమే అటువంటిది— కీర్తిప్రతిష్ఠలకు పదవులకు దూరంగాఉండే ప్రయత్నం, తన్నుతాను దాచుకునే ప్రయత్నంచేస్తూ, 'భారతి', 'ఆంధ్రపత్రిక' సముజ్జ్వలమైన సంస్థలుగా ప్రకాశించేందుకే వారు పాటుపడ్డారు. ఆ ధ్యేయాన్ని సాధించడంలో మిత్రులతో, అధికారంలో ఉన్నవారితో, గురుతుల్యులతో, ఎవరితో పేచీవచ్చినా ఆయన వెనుకాడలేదు. వారు ఒక రచనను ప్రకటించేందుకు నిరాకరించడమో, ఒక విమర్శను ప్రకటించడమో జరిగినప్పుడు ఆయావ్యక్తులు వ్యక్తిగతమైన సంబంధాన్ని ముందిడుకొని ఆయన్నిగురించి అపోహపడ్డారు; ఆ సంబంధానికీ, స్నేహానికీ స్వస్తి చెప్పారుకూడా. కాని ఆయనమాత్రం చలించలేదు. 'శంభుప్రసాద్ వారికి శిష్యుడేకాని 'భారతికి' ఆ విషయంతో ఏమీ సంబంధంలేదు,'అని నాతో స్వయంగా అన్నారు—అటువంటి సందర్భాన్ని చర్చిస్తూ. ఇలా ఒక సంపాదకుడు తన వ్యక్తిత్వాన్నీ, వ్యక్తిగతసంబంధాల్నీ తను నడుపుతున్న పత్రికనుంచీ వేరుచేసి వ్యవహరిస్తున్న విషయం సులభంగా అవగాహనఅయ్యే విషయం కాదు; పైగా శంభుప్రసాద్‌గారు ఎప్పుడూ అటువంటి వివరణకు పూనుకోలేదు. ఎప్పుడో మిత్రులదగ్గర సంభాషణలో ఆ విషయం బయటపడవలసిందే!

'భారతి' ద్వారానే వారితో నాకు స్నేహం ప్రారంభమైంది. నా రచనలు 1959 నుంచీ 'భారతి'లో ప్రచురించబడుతున్నప్పటికీ 1963 లో వారు నాకు మొదటిసారిగా ఒక లేఖ వ్రాశారు. 'పెద్దన పైని మీ వ్యాసం అనేకమంది మెప్పును పొందినది... ఒక చిన్నసూచన. Men and Ideas అన్న శీర్షికను 'భారతి'లో ప్రవేశపెట్టవలెనని సంకల్పము. కొందరు ఆధునిక తెలుగు రచయితల తత్వాన్నీ, దృక్పథాన్నీ నిష్పాక్షికదృష్టితో చర్చించే వ్యాసాలను ఆ శీర్షికక్రింద ప్రచురించవలెనని సంకల్పము. ఆ విషయంలో మీ సహకారం అర్థిస్తున్నాను...' (3—5—1963) అన్నారు. అప్పుడు నేను మద్రాసువెళ్లే సందర్భం కూడా ఏర్పడింది. ఆ నెలలోనే వారిని పత్రిక ఆఫీసులో కలుసుకున్నాను. అదే ప్రథమ దర్శనం. వారు కోరిన రకం వ్యాసాలు వ్రాయడానికి వ్యవధి కావాలన్నాను. రచయితలను నన్నే ఎన్నుకోమన్నారు. తర్వాత లేఖల ద్వారా తరచు వారు ఆ విషయం జ్ఞాపకంచేస్తూనే ఉన్నారు. ఏడాది గడిచింది. వ్యాసరచనకు నేను పూనుకోలేదు. 'ప్రయత్నిస్తాను'అంటూ మార్చి 1964 లో వ్రాశాను వారికి. 'నవ్యాంధ్ర సాహిత్యంలో దృక్పథాలు అన్నది ప్రయత్నించండి. ప్రయత్నించడమేమిటి, ప్రారంభించండి. ఒకటొరకంగా వస్తాయి' అని వెంటనే అన్నారు (20—3—64). మళ్లీ నెల గడిచింది. 'ఈ నెలలో తప్పక వ్రాస్తారని ఆశిస్తున్నాను. దాని కోసం కనిపెట్టుకుని కూర్చుంటాను' (8-5—64) అని నిగ్గదీశారు. కాని జూలై '64 కిగాని నేను అందుకోలేకపోయాను. ప్రారంభించినతర్వాత వరుసగా విశ్వనాథ, గోపీచంద్, చలంగార్ల దృక్పథాలమీద వ్రాయడం జరిగింది. ఆ విషయంలో సంపాదకుడుగా ఏడాదికిపైగా ఆయన చూపిన పట్టుదల అటువంటిది. "I am very happy to tell you that your articles on Viswanadha are very much appreciated and highly spoken of, for objecti-

vity and balance." (8–9–64) అంటూ వ్యాసాలమీద యితరుల అభిప్రాయాల్ని నాకు తెలియజేశారు. నేను చలంగారిమీద వ్యాసం పంపిస్తూ, ఆ వ్యాసం అచ్చైన 'భారతి' ప్రతిని చలంగారికి కూడా పోస్టుచెయ్యమని శ్రీ శంభుప్రసాద్‌గారికి వ్రాశాను. దానికి వారేమని వ్రాశారంటే: "If Mr. Chalam does not read 'Bharati' regularly, he is poorer for it, and neither you nor I should draw his attention to the article. One of his friends may bring it to his notice..." (8–2–65) వారిలా వ్రాయడం రచయితనైన నాకు కోపం తెప్పించింది. అప్పట్లో నేను తర్వాత వ్యాసం వ్రాయవలసిన 'బాపిరాజు' రచనల్ని పరిశీలిస్తున్నాను. మొదట నేను శంభుప్రసాద్‌గారికి చెప్పిన పథకం బాపిరాజుతో పూర్తవుతుందికూడా. కాని వారి లేఖ చూడగానే నాకు బాపిరాజునుగూర్చి వ్రాయాలనిపించలేదు. ఆ మాటే వారికి వ్రాశాను. అంతే కాకుండా, 'దృక్పథాలు' వ్యాసాలు యిక పూర్తయినట్లేననీ, వాటిని వ్రాయించినందుకు కృతజ్ఞత తెల్పుతూ, వాటిని పుస్తకరూపంలో ప్రచురించేటప్పుడు శ్రీ శంభుప్రసాద్‌గారికే అంకితం యిచ్చేందుకు వారి సమ్మతి తెలుపవలసిందనీ వ్రాశాను. దానికి వారు వ్రాసిన లేఖ యిలా ఉన్నది: "Many thanks for your kind letter....I was away in Hyderabad from 20th March to 4th of this month having undergone a fairly big surgical operation there on 24th of last month. I am still confining myself to my room in the house....I entirely agree with your views about Bapiraju. But I strongly feel you should express those views....Therefore kindly do the article without fail for May Bharati.

"It is really kind of you to think of dedication to me, when these are published in a book f. rm. I do not think I deserve that much of honour, because apart from Bharati, I am nobody. So you may dedicate to Bharati itself, if it looks proper.

"It is a long time since we have met. Please let me know when you are likely to come to Madras....

"You must to crate my shabby hand writing and not get irritated." (10–4–65)

ఈ లేఖ నిలా సుదీర్ఘంగా ఉటంకించడానికి కారణం ఉన్నది. ఈ లేఖను చదువగానే నాకు వారి వ్యక్తిత్వం ఎటువంటిదో మొదటిసారిగా హృదయగతమైంది. ఒక పెద్ద ఆపరేషను జరిగిన 15 రోజులకు యింకా కోలుకోకుండానే ఆయన అది వ్రాశారు. నా లేఖ మార్చినెలలో, బహుశా వారు ఆపరేషన్‌కి వెళ్లబోతున్న సమయంలో కాబోలు చేరింది. ఆయన ఎంతటి అస్వస్థతలో ఉండగా నా లేఖ వారికి ఏమి బాధ కలిగించిందో ఊహించుకున్నాను! నేను వ్యాసాల్ని యిక వ్రాయబోవడంలేదని అనడానికి చలంగారిని గూర్చి నా కోరిక నిరాకరిస్తూ వారు అలా వ్రాయడమే కొంతవరకూ కారణమని వారికి తెలిసేఉండాలి! తన దస్తూరీని గూర్చి మొదటిసారిగా ఆయన అలా చివర Apologetic గా వ్రాయడం నాకు వింతగా తోచింది. ఇదివరకు ఎన్నిలేఖలు ఆ దస్తూరీతోనే వ్రాయలేదు ఆయన! మొదటిసారిగా నాకు ఆయన దస్తూరీనిగూర్చి అసహనమూ, కోపమూ వస్తాయా? "You must tolerate...and not get irritated" అంటున్నారు. దేన్నిగురించి? ఇది దస్తూరీ విషయం కాక, అసలు చలంనిగురించి వారన్నదానికే అన్వయిస్తుందని గ్రహించాను. పైగా "నన్ను కాదు, అంకితమిచ్చి 'భారతి'ని గౌరవించండి" అంటూ వ్రాశారు. అంటే వారు చలంగారిని గూర్చి అన్నది చలంగారిని కించపరచడానికి కాదు; 'భారతి' ఔన్నత్యాన్నీ, గౌరవాన్నీ కాపాడటానికే నన్నమాట!... అంతటితో నా మనస్సులో అపోహలు తొలగిపోయాయి. మేనెల 1965 లో మద్రాసు వెళ్లినప్పుడు వారిని కలుసుకున్నాను. వారు భోజనానికి ఆహ్వానించారు. భోజన సమయంలోనూ తర్వాతా, ఎంతో సరదాగా కబుర్లు చెప్పుకున్నాము. ముఖ్యంగా రాజకీయాలని గూర్చి ప్రముఖ నాయకులను గూర్చి

వారెన్నో Side - lights చెప్పారు. "ప్రత్యక్షంగా యింత పరిచయమూ, అనుభవమూ కలిగిఉన్న మీరు రాజకీయాలలో ప్రవేశించకపోవడం ఆశ్చర్యమే!" అన్నాను. 'అప్పుడు పత్రికా సంస్థలకి తీరని అన్యాయం జరుగుతుంది. నిష్పాక్షికంగా వాటిని నిర్వహించడం సాధ్యంకాదు' అన్నారు. రాజకీయంగా తనకున్న అవకాశాల్ని ఆయన ఎలా త్యాగంచేశారో నాకు అవగాహన అయింది. 'పోనివ్వండి, మీ అనుభవాల్నీ జ్ఞాపకాల్నీ గ్రంథంగా వ్రాయండి. ఎన్నో విషయాలు తెలుస్తాయి' అన్నాను. 'నేను రచయితనుకాను, నాకు తెలిసింది చాలతక్కువ' అన్నారు. ఆయన వ్యక్తిత్వానికి కీలకమేమిటో అప్పుడే గుర్తించాను. వారి ఔన్నత్యము నన్ను ముగ్ధుణ్ణి చేసింది.

'దృక్పథాలు తర్వాత ఏమివ్రాస్తారు?' అని అడిగారు వారు.

'ఒక నవల పూర్తయివుంది' అన్నాను.

'ఇంకా ఎవరికీ పంపకపోతే నాకు పంపండి' అన్నారు.

ఏ రచన అయినా ప్రత్యేకంగా (exclusive) 'భారతి'కే పంపాలని వారి నియమం. ఒకసారి ఆమాటే వ్రాశారు: "It is my ambition that what I give, so far as Telugu writing goes, must be exclusive. Hope you will kindly understand and appreciate my feelings" (9—2—66)

'కాని 'భారతి' లో దీర్ఘమైన నవల ప్రచురించరేమో!' అన్నాను.

'అర్థమైన నవల అని తోస్తే వేస్తాను' అన్నారు.

నేను యింటికివెళ్లి 'అసురసంధ్య' వ్రాతప్రతి పంపించాను. నాలుగైదురోజుల్లోనే సమాధానం వచ్చింది. "I got the Ms. of your అసురసంధ్య. I have decided to publish it in Bharati in instalments....It is nice of you to have spent some time with me, when you were in Madras last time. I consider you as one of the esteemed and valuable contributors of Bharati...I wish there are more writers of your type in the country, That will be good both for the country and for journals like Bharati." (18—5—65). నవల ప్రచురణ అంతా అయిదు సంచికలలో కాబోలు పూర్తిచేశారు. నేను అక్టోబరు 1965 లో మళ్లీ వారిని కలుసుకున్నాను. క్రిందటిసారిలాగే సరదాగా కొన్నిగంటలపాటు ఎన్నోవిషయాలు చర్చించాము. ఇంటికి వచ్చినతర్వాత ఆ విషయమే వారికి వ్రాశాను. దానికి వారి సమాధానం: "It is I that should thank you for spending sometime... Perhaps I bragged a little at that time, which you are good enough to describe, in your good taste, as something worth recalling. After you left I asked myself whether I talked some rubbish, without allowing you to talk. You are one of the few, among our writers, who has a solid base to stand on and say things. I wish you come often to Madras..." (14-10-65). ఆయన వినయ సంపత్తికీ, ఔదార్యానికీ అబ్బురపడ్డాను.

వారెంత సహృదయులో, వినయభూషణులో, స్నేహపాత్రులో లోకం ఎరగదు. వారి గాంభీర్యాన్ని అహంభావంగా, కర్తవ్యపరాయణతను కాఠిన్యంగా, లక్ష్యశుద్ధిని వ్యక్తులపట్ల నిర్దాక్షిణ్యంగా మాత్రమే అపార్థం చేసుకున్నవారున్నారు. పత్రికా నిర్వహణంలో కర్మయోగిలా వ్యవహరించడంవల్లే వారు నా రచనలు ఒకటిరెండు త్రిప్పిపంపడంకూడా జరిగింది. అందులో రహస్యం నాకు తెలుసు. అందువల్లే నాకది భంగపాటుగా అనిపించలేదు. కాని కొంతకాలం 'భారతి'లో రచనలు ప్రచురింపబడినతర్వాత, ఏదైనా రచన తిరిగి వస్తే, కోపంతో, భంగపాటుతో తర్వాత 'భారతి'కి రచనలు పంపడం మానుకున్న రచయితలున్నారు. అలాగే 'భారతి'ద్వారా కీర్తిప్రతిష్ఠలు గడించిన రచయితలు, ఒక్కొక్కసారి తమ రచనల్నిగూర్చి అప్రియమైన విమర్శలు 'భారతి'లో ప్రకటితమైనప్పుడు బాధపడి, శ్రీ శంభుప్రసాద్‌గారి 'కృతఘ్నతను' చాటిన వారూ ఉన్నారు. ఇవేవీ శంభుప్రసాద్‌గారిని చలింప

చేయలేదు. 'భారతి' భవిష్యత్తుమీద ఆయనకు అచంచలమైన విశ్వాసము. "Every month it has become a problem to get every kind of material for Bharati. At times I feel I am not the right person to be the Editor for Bharati. Then in other Journals too I do not find much good stuff..." (19-12-65) అని ఒక లేఖలో వ్రాశారొకసారి. శ్రీ శంభుప్రసాద్‌గారి సాహిత్యాభిరుచి విశిష్టమైనది. ఆయన నిత్యమూ ఎన్నో గ్రంథాలు చదివేవారు. ప్రపంచ సాహిత్యంలో అత్యాధునికమైన పోకడలన్నీ వారికితెలుసు. కాని ఎప్పుడోతప్ప ఆసంగతి బయటపడేది కాదు. ఎదుటివారినే ఎక్కువగా మాట్లాడనిచ్చేవారు. 'భారతి'ని ప్రాత క్రొత్తల మేలుకలయికగా దిద్దుతూ వచ్చారు.

ఆయన హేతువాది. కాని ఆర్షసంస్కృతి మీద అపారమైన గౌరవం ఆయనకు. పూజలూ, పునస్కారాలూ, కర్మకాండ, ritual అంటే, చిత్తశుద్ధి లోపించిన ఆడంబరమంటే ఏవగింపు. కీ॥ శే॥ నాగేశ్వరరావు పంతులుగారి హయాంలో ఎందరో బాహ్యవేషాల ద్వారా, పొగడ్తలద్వారా వారి వదాన్యతను ఉపయోగించుకోవడం ఎరిగిన శ్రీ శంభుప్రసాద్‌గారు, అలాంటివారిని దూరంగా ఉంచేవారు. అందువల్ల కూడా ఆయన విమర్శలకు గురిఅయ్యారు. ఈ విషయం ఒకసారి వారే నాతోచెప్పారు కూడా. సమాజంలో పరిణామాన్నీ మనుష్యుల చిత్తవృత్తినీ, లోకవ్యవహారాన్నీ చక్కగా ఆకళించుకొన్న శ్రీ శంభుప్రసాద్‌గారు శ్రీ నాగేశ్వరరావు పంతులుగారిని కేవలం అనుకరించ దలచుకోలేదు. వారు స్థాపించిన సంస్థలను కాలంవార్పు ననుసరించి ఆదర్శప్రాయంగా, ప్రజాశ్రేయోపయుక్తంగా, సాహిత్యంలో విజ్ఞానంలో ఉన్నత ప్రమాణాలకోసం నడుపుతూ, అభివృద్ధి చేస్తూ పోవడమే లక్ష్యంగా పెట్టుకున్నారు. ఆ లక్ష్యసాధనలో కృతకృత్యులయ్యారు కూడా. తద్వారా శ్రీ నాగేశ్వరరావు పంతులుగారికి అంతేవాసి అయ్యారు.

దేశోద్ధారకుని వారసత్వాన్ని పరిరక్షిస్తూ తెలుగువారి సాహిత్యసంస్కృతుల వికాసమే ధ్యేయంగా పత్రికాసంపాదకత్వం నిర్వహిస్తూ, కర్మయోగియైన వినయశీలి, మనస్వి, నిగర్వి, శ్రీ శంభుప్రసాద్‌గారికివే జోహార్లు.



# మఱచిపోలేని మహామనీషి

## శ్రీ నాగళ్ల గురుప్రసాదరావు

పదునొకండు డేండ నాటి మాట. ఒకతెగ తెలుగువారు అరవిందుడు రచించిన 'సావిత్రి'యను కావ్యముతో సమానమైనదని భావించుచు మురిసిపోవుచున్న యొక యాంధ్రకావ్యమునుగూర్చి 'ఆంధ్రపత్రిక'లో చర్చలు చెలరేగిన రోజులవి. ఆ చర్చలలో నేనును తలదూర్చితిని. ఒక వ్యాసమువ్రాసి ఆంధ్రపత్రికకు పంపితిని. అది అచ్చున కెక్కినది. ఎక్కినవెంటనే విమర్శకు పాత్రమయినది. నేనును వెనుకకు తగ్గినవాడనుగాను. ప్రతి విమర్శను వ్రాసి పంపితిని. ఇంతలో కావ్యవిమర్శ గాడి తప్పుటచేత, అప్పటికే చాలకాలమునుండి చర్చలు సాగుచుండుటచేత 'ఆంధ్రపత్రిక' ఆ వివాదములకు స్వస్తిచెప్పినది. తెలుగు మాగాణమునెల్ల నొక్కయూపూపిన యాచర్చలలో నేను 'శాంతిశ్రీ' యను ప్రచ్ఛన్ననామముతో పాల్గొంటిని. ఈ విధముగా నేను మాననీయులు శంభుప్రసాదుగారి కంటబడితిని. ఆ నాటికి నేను బెజవాడలో నుంటిని.

ఒకనాటి సాయంకాలము నేను కళాశాలయందుండగనే ఆంధ్రపత్రికా విలేఖకు లొకరువచ్చి 'శంభుప్రసాదుగారు మిమ్ము వెంటబెట్టుకొని రమ్మనిరి. కారు పంపిరి' యని నాతో చెప్పిరి. నేను పొందిన యాశ్చర్యమున కవధిలేదు. శంభుప్రసాదుగారు నన్నేల రమ్మనిరి ? కారు పంపుటయేమి ? కారణ మేమైయుండును ? ఇట్టి ప్రశ్నలెన్నో మనస్సులో కదలినవి. కారులోనే 'ఆంధ్రపత్రిక' కార్యాలయమునకు వెళ్లితిని. వెంటవచ్చినవారు నన్ను శంభుప్రసాదుగారికడకు తీసికొని వెళ్లిరి. తెలుగునాటి మోతుబరిరైతు కట్టుబొట్టులతో నున్న వారు కుర్చీలో కూర్చుండిరి. నేను నమస్కరించితిని. వారును నమస్కరించి వెంటనే 'మీ రింత చిన్నవారని నేననుకొనలేదు. మీ వ్యాసము చదివి మీ వయస్సు ఏబదియేండ్లకు తక్కువ యుండదను కొంటిని' యనిరి. నేనేమి మాటాడగలను ? ఎదురు చెప్పగలను ? రెండుగంటలసేపు వారితోడి గోష్ఠి చెల్లినది. ఎన్నో విషయములు చెప్పిరి. మొట్టమొదట నేనువ్రాసిన వ్యాసమునుగూర్చి చెప్పిరి. మాటలనడుమ 'భారతిలో పుస్తక సమీక్ష చేయుదురా?' యని యడిగిరి. బెదురు బెదరుగనే 'ఇంతవఱకు పత్రికలలో పుస్తకసమీక్ష చేయలేదు' అని యంటిని. 'ఇప్పుడు చేయుడు' అని వారనిరి. దానికి ఒప్పుకొంటిని. అక్కడినుండి వారు నేను సాహిత్యమును గూర్చి యెక్కువగా మాటాడికొంటిమి. ఈ గోష్ఠియందే వారొక కొన్నిమాటలు చెప్పిరి. నిజము చెప్పవలయునన్న ఆ మాటలు నా జీవిత గతినే మార్చివేసినవి. ఇప్పటికిని కంగుమను గొంతుతో వారుచెప్పిన యా మాటలు నా చెవులలో మ్రోగుచునే యున్నవి. ఆ మాటలివి.

'విమర్శ వ్రాయుటలో మోమోటము లేల? మీరు వ్రాయునది పొగడ్తకానిండు తెగడ్త కానిండు సహేతుకముగా నుండవలయును. మీకు మీ సాహిత్య సిద్ధాంతములున్నవి. మనము ఇతరులను గౌరవింపవలసినదే. ఇతరులును మనలను గౌరవింపవలసియున్నది. ఇతరులకు నచ్చలేదు గదాయని మన మెంత కాలము రంగులు మార్చుకొనుచు బ్రదుకగలము ? ఎన్ని నాళ్లు నటింపగలము?'

గోష్ఠి ముగిసినది. వారి కారులోనే యిల్లు చేరితిని. ఈ సన్నివేశమునకు ముందు కొన్నియేండ్ల క్రిందట 'ఆంధ్రపత్రిక' తత్త్వమును గూర్చి కొందరు చెప్పుకొనిన మాటలు నా చెవిని బడినవి. ఆంధ్రపత్రిక యొక వర్ణమునకు మాత్రమే సంబంధించిన దన్నదే యా మాటల సారము. వానినిగూర్చి

యానాడు నేనంతగా పట్టించుకొనవలసిన యక్కఱ కలుగలేదు. నేను సాహిత్య ప్రపంచములో కౌమార దశను దాటలేదు.

నాకీవిధముగా శంభుప్రసాదుగారితో పరిచయ మేర్పడినది. వారికడనుండి వెళ్లితినే కాని నాకారాత్రి నిద్రపట్టలేదు. వారినిగూర్చి యాలోచించితిని. ఆయనది యుదారదృష్టి. బహువిషయ పరిజ్ఞానము వారికున్నది. మాటలలో తెచ్చుకోలు పోకడ మందునకయిన కానరాలేదు. ఆయా విషయములను గూర్చి వారు వెల్లడించిన యభిప్రాయములలో నెక్కడను సంకుచిత స్వభావము గోచరింపలేదు. ఇవి యానాడు నాకు గలిగిన తలపులు. ఒక దశాబ్దము పాటు వారిని చూచితిని. వారితో మాటాడితిని. అయినప్పటికి మొట్టమొదట నాకు కల్గిన తలపులు మాఱలేదు. కాలక్రమమున వారి సమగ్ర వ్యక్తిత్వము నందలి విశేషాంశము లెన్నియో బయల్పడినవి. ఆయా సందర్భములలో వారు వ్రాసిన తొంబదియైదు లేఖలు నాకు చేరినవి. మద్రాసు వెళ్లినపుడు వారితో గంటలకొలది మాటాడితిని. పోయిన మే నెలలో 29వ తేదినాఁడు మద్రాసులో వైద్యశాలయందు వారిని చూచితిని. అప్పు డక్కడ వారి కుటుంబసభ్యు లుండిరి. శంభుప్రసాదుగారు చాల బాధపడుచుండిరి. బాధపడు చునే . నా యోగక్షేమము విచారించిరి. శంభు ప్రసాదుగారు సంపాదకులు. నేను పుస్తక సమీక్షకు డను. వ్యాసరచయితను. కాని మా బాంధవ్యము కేవ లము పత్రికాప్రపంచమునకే పరిమితముగాలేదు. అది హృదయములను ఏకముచేసినది. ఒకదశలో నన్ను మద్రాసువచ్చి స్థిరపడు మనిరి. వారు నా కిచ్చిన చనవునకు, నాపట్లచూపిన వాత్సల్యమునకు నిర్వ్యాజ మయిన యనురాగమునకు మేరలులేవు. వారు నన్ను గూర్చి తన ప్రాణమిత్రులకు, . రచయితలకు చెప్పిరి. వారుచెప్పిన మాటలను తరువాత తరువాత నేను ఆయావ్యక్తుల ముఖమున వినుటయు జరిగినది. శంభుప్రసాదుగారి హృదయములో నేనెట్టి స్థానము సంపాదించుకొంటినో తెలిసినవారు మన నడుమనే యున్నారు. విద్వాన్ విశ్వంగారు, చక్రపాణిగారు, 'విజయ' పూర్ణచంద్రరావుగారు, ఆలపాటి రవీంద్ర నాథ్‌గారు, వి. వి. నరసింహరావుగారు మున్నగు పెద్ద లందఱు దీనికి సాక్షులు.

ఒక్క సన్నివేశము నుదాహరింతును. తన మిత్రుల కందఱకు నన్ను చూపవలయునని శంభు ప్రసాదుగారెంతో యారాటపడెడివారు. ఒకసారి మద్రాసులో నేను వారిని చూచుటకు వెళ్లితిని. అప్పుడే చక్రపాణిగారు వచ్చివెళ్లిరి. నేను గడపలో కాలుపెట్టితినో లేదో వెంటనే శంభుప్రసాదుగారు 'ఇప్పుడే చక్రపాణిగారు వెళ్లిరి. మీరు వారున్నప్పుడు వచ్చిన నెంతబాగుగా నుండెడిది? సమయము తప్పి పోయినదే'అని యనిరి. నాకాశ్చర్యము కల్గినది. 'రేపు వారు మీదగ్గఱకు వత్తురుగదా. అప్పుడు చూతును' అని యంటిని. చక్రపాణిగారు 'నేడే హైదరాబాదు వెళ్లుచున్నారు. వారమురోజులదాక రారు'అని మొదట నాతో అనిన మాటలనే మరల ననిరి. వారి హృదయ మిట్టిది.

మఱొకసారి వారు నేను మాటాడుకొను చుండగనే చక్రపాణిగారు వచ్చిరి. శంభుప్రసాదుగారు వారికి నన్నెఱుక పఱచిరి. వారిరువురు మాటాడు చుండగా నడుమ నడుమ నేను నొక్కొక్కమాటను మెల్ల మెల్లగా మాటాడితిని. ఎన్నివిషయములు ప్రస్తావనకు వచ్చినవో చెప్పలేను. ఆంధ్ర సాంస్కృతిక పునరుజ్జీవనము, ఆంధ్ర రాజకీయములు, జాతీ యోద్యమము, నవభారత పరిణామము మున్నగు విషయములనుగూర్చి వారు మాటాడుకొనిరి. నేను వింటిని. నేను శంభుప్రసాదుగారి కడకు వెళ్లినప్పు డెల్ల కార్యవశమున మద్రాసువచ్చిన 'విజయ' పూర్ణ చంద్రరావుగారుకూడ నుండెడివారు. ఇరువురును చిన్ననాటి ముచ్చటలు చెప్పుకొనుటతో పాటు పెక్కు విషయములనుగూర్చి మాటాడి కొనెడివారు. నేనును మాటాడెడివాడను. ఈ విధముగా నాతో ఏకాంతముగా మాటాడిన శంభుప్రసాదుగారిని చూచితిని. తన మిత్రు లతో మాటాడిన శంభుప్రసాదుగారిని చూచితిని.

ఆయన సంభాషణ చతురుడు. ఎడనెడ మాటలలో కడుపుబ్బ నవ్వించు హాస్యము జాలువాఱు చుండెడిది. దేనినిగూర్చి మాటాడినను ఆత్మవిశ్వాసము కొట్టవచ్చినట్లు కనబడెడిది. ఉద్యమములనుగూర్చి గానిండు, వ్యక్తులనుగూర్చి కానిండు, పుస్తకములను గూర్చి గానిండు వారు మాటాడినపుడు హేతువాదము, ప్రామాణికత్వము గోచరించెడివి. మోమోటము మచ్చునకైన నుండెడిదిగాదు. ఈ గోష్ఠుల వలననే శంభుప్రసాదుగారు అనేక విషయములను గూర్చి అనేక పుస్తకములు చదివిరని నేను కనుగొంటిని. జాతీయోద్యమము, ఆంధ్ర రాజకీయములు—వీనికి సంబంధించిన పరిజ్ఞానము వారికి మెండుగా కలదని తెలిసికొంటిని.

సంభాషణ సమయమున నెవ్వరయినను సరే వ్యక్తిగత విమర్శ చేసినచో శంభుప్రసాదుగారికి బొత్తిగా గిట్టెడిదిగాదు. నేనేనాడును మఱచిపోలేని సన్నివేశ మొకసారి మద్రాసులో వారి యింటిలోనే జరిగినది. ఒకనాటి యాంధ్రప్రభుత్వములో విద్యాశాఖామంత్రిత్వమును నిర్వహించిన యొకరు కృష్ణామండలమునకు చెందిన యొక ప్రముఖ వృద్ధనాయకునిగూర్చి యేదో దుడుకుమాట యనుట జరిగినది. శంభుప్రసాదుగారొకనిమిషము వారివైపు చూచిరి. చూచి వెంటనే 'అయ్యా! మీ విమర్శకు పాత్రుడయిన యా నాయకుండు మీరు కన్నుదెఱవక ముందే జాతీయోద్యమకాలమున ఎన్నిత్యాగములు చేసెనో నాకు తెలియును. ఆయనకు త్యాగము మాత్రమే తెలిసినది. మీ రాజకీయ నైపుణ్యము వారికిలేదు' అని ఖరాఖండిగా పలికిరి. ఆవలివారి మొగమున నెత్తురు చుక్కలేదు. శంభుప్రసాదుగారు అక్కఱపడినచోట ఎంత నిర్దాక్షిణ్యముగా మాటాడుదురో నా కానాడు తెలిసినది. ఇట్లు మాటాడినను వారు అపరక్షణములో యథాస్థితికి వచ్చి సరస సల్లాపము చేయగలిగిరి.

'భారతి' సంపాదకు డయిన శంభుప్రసాదుగారికి, వ్యాస రచయితగా పుస్తక సమీక్షకుడుగా నున్న నాకు నేనాడు అభిప్రాయభేదములు కలుగలేదు. ఆయన నా సమీక్షలను సంస్కరించిన ఘట్టము లున్నవి. సంస్కరించి కారణములు తెలుపుచు లేఖ వ్రాసెడివారు. నిజముగా వారి సంస్కరణము తరువాత (సంస్కరణ మనగా విషయమును కుదించుట) నా సమీక్ష పూర్వాపరబంధము కలిగి సమగ్ర సుందరముగా నుండెడిది. 'ఆదర్శ రాజ్యము' మీద నా వ్రాసిన సమీక్షయే దీనికి తార్కాణము. మొట్టమొదట నేను పంపిన సమీక్ష సమీక్షగాలేదు. ప్లేటోనుగూర్చి, ఆదర్శరాజ్యమును గూర్చి, అనువాదకుని గూర్చి నేను వ్రాసితిని. మూడురకముల వ్యాసముల కలయికగా సమీక్ష సిద్ధమయినది. బంధము లేదు. శంభుప్రసాదుగారు దాని నెంతయో చక్కగా రూపొందించిరి.

చక్కగా చదివి సహేతుకముగా గ్రంథసమీక్ష గావించుటయే శంభుప్రసాదుగారికి కావలసినది. దాని మీద ఎంతదుమారము రేగినను వారు నిర్లిప్తులై యుండెడివారు. పక్షపాతము వారిలో మచ్చునకయిన నుండెడిదిగాదు. సమీక్ష దీర్ఘముగా నున్నదని వారేనాడు అనుకొనినవారు గారు. ఈ విషయమును గూర్చి యొక కొంచెము విపులముగా వ్రాయవలయును. 'భారతి' గ్రంథసమీక్షకులలో నామాదిరిగా విమర్శకు పాత్రుడయిన సమీక్షాకారుడు మఱొకడు లేడు. నేను మొట్టమొదట 'వీరరసము' మీద సమీక్ష వ్రాసితిని. అందలి గుణదోషములను పరామర్శించితిని. ఆ పరామర్శ గ్రంథకర్త మెప్పు పొందినది. అన్ని సమీక్షల విషయమున ఇట్లు జరిగినదని చెప్పజాలను. నా చిఱునామా గ్రంథకర్తలకు తెలియకపోవుటచే నన్ను పొగడుచునో తెగడుచునో గ్రంథకర్తలు ముందు శంభుప్రసాదుగారికి లేఖలు వ్రాసెడివారు. వారా లేఖలను నాకు పంపెడివారు. ఒకసారి యొక గ్రంథకర్త 'మీ యాత్మ పునరుద్ధరింపబడదు'అని నాకు లేఖ వ్రాసెను. మఱొకరు 'సమీక్ష వ్రాసినవారి యభిప్రాయములతో నేకీభవింపకపోయినను సమీక్షాకారుని

చిత్తశుద్ధి ప్రశంసాపాత్రముగా నున్న'దని 1966సం॥ ఫిబ్రవరిలో శంభుప్రసాదుగారికి లేఖ వ్రాసిరి. చూడుడు.

"While we do not pretend to agree with what all has been said in the review, we would like to Communicate to you our appreciation, that the book had been treated seriously and dealt with in all sincerity.

A Correspondent, after reading the review wrote us saying that he had for the first time come across serious reviewing, and hoped that a new era of serious and constructive reviewing had begun. That we feel is a compliment to you and your reviewing staff."

ఇంకొక గ్రంథకర్త సమీక్షలు వ్రాయుటకు నా కధికారము లేదనెను. ఇట్టి లేఖలతోపాటు పొగడిన లేఖలు నున్నవి. అంతేకాదు వ్యాసములను, సమీక్షలను జదివిన యితరులు నన్ను మెచ్చుచునో తిట్టుచునో వ్రాసిన లేఖలు నున్నవి.

నా సమీక్ష లీవిధముగా చలామణి యగు చుండగా శంభుప్రసాదుగారి కొక యక్కఱ కల్గినది. సమీక్షార్థము 'భారతి' కార్యాలయమువారు నాకు పంపిన పుస్తకములను వారును చదువవలసివచ్చినది. చదివి నా సమీక్షయందలి మంచిచెబ్బఱలను వారే తేల్చుకొనుచుండిరి. ఒకసారి వారు నేను సమీక్ష వ్రాసిన పుస్తకమునుగూర్చి 10–1–1965 తేది నాఁడు ఈ విధముగా లేఖ వ్రాసిరి.

"...............In reviewing the latter's book you have been very courteous which the book does not deserve. In my opinion that book ought to be banned. He and his kind are a menace to the society. I feel sad to think we are still to live with them. They rare and rare and collapse!......Our Literary field suffers from group politics as much as our congress party......Fortunately we do not belong to any camp or group and hope we shall have the strength to continue to be so..."

నేను వ్రాసిన సమీక్షలలో నొక్కయక్షరము నైన ఎన్నడు వారు తొలగింపలేదు. నా సహజతత్త్వ మునుబట్టి నేను సమీక్ష వ్రాసెడివాఁడను. దానిలో విపులత తీవ్రత యొకపాలు హెచ్చుగా నుండెడివి. అయినప్పటికి తీవ్రతను తగ్గించికొనుడనిగాని సుదీర్ఘ సమీక్షలు వ్రాయవలదనిగాని శంభుప్రసాదుగారు నన్ను శాసింపలేదు. వారు రచయితల కిచ్చిన స్వేచ్ఛ యింతంతగాదు. ఒక గ్రంథకర్త పాశవప్రవృత్తిని పోలిన స్త్రీ పురుష కామమును ఐదువందల పొరటల కావ్యమునకు దింపెను. అది సమీక్షార్థము నాకు వచ్చినది. దానిపై సుదీర్ఘసమీక్ష వ్రాసి 'భారతి'కి పంపితిని. అది అచ్చులో పదునాల్గు పొరట లయి నది. ఇది సమీక్షయా? వ్యాసమా? నా సమీక్ష 'భారతి'లో అచ్చయినతరువాత శంభుప్రసాదుగారు కార్య వశమున బెజవాడ వచ్చిరి. వారిని చూచుటకు వెళ్లి నపుడు 'నా సమీక్ష యచ్చగునని నేననుకొనలే'దంటిని. వెంటనే వారు 'సమీక్ష పెద్దదియా? చిన్నదియా? యనునదిగాదు నాకు కావలసినది. అది పుస్తకము నందలి విషయమును సహేతుకముగా పరామర్శించి నదా? లేదా? యని మాత్రమే నేను చూతును' అని యనిరి.

శంభుప్రసాదుగారు రచయితలలో చిత్తశుద్ధి పరిశ్రమ నియతముగా నుండవలయునని యాకాం క్షించెడివారు. వంచన, నటన యీ రెండును వారికి గిట్టెడివిగావు. 21–1–1966 తేదినాటి లేఖలో వారు—

'మన రాజకీయరంగంలో ఎంత వంచన నటన ఉన్నాయో సాహిత్యరంగంలోకూడా అంతే నటన వంచన ఉన్నాయి. వాటిని ఆవిష్కరించటం పనిగా పెట్టు కున్నాను. కొంతవరకైనా సాధించగలుగుతా నను కుంటాను' అని వ్రాసిరి. రచయితలు బహు గ్రంథములను పఠింపవలయునని మాటిమాటికి మద్రాసు వెళ్లినప్పుడెల్ల నొక్కి వక్కాణించెడివారు. 10—1—1969 తేదినాటి లేఖలో,

'మనకు సాహిత్య సంచలనమే అధికము.

చిత్తశుద్ధి లేదు. అందుకనే మన సాహిత్య సభలన్నా సమావేశములన్నా నాకు రుచింపవు. వారు ఏ విషయమును పూర్తిగా చర్చింపరు. Platitudes నాలుగు మాట్లాడి పోతారు. సుష్టుగా భోజనాలు విందులు వినోదాలు తప్ప మరేమీ ఉండవు. మన వ్యవస్థలలో పనిచేసేవారికి వ్యవస్థమీద అభిమాన ముండదు. తమ పనిమీద అభిమాన ముండదు. ఎంతవఱకు గొప్పవారనే ప్రతిష్ఠ పేరుకోసం తాపత్రయం తప్ప వేరు ఆలోచనలేదు.. ...We should not be parties to cheating of the public' వ్రాసిరి. ఆంధ్రసాహిత్య ప్రపంచములో శాఖాతత్త్వము, కులతత్త్వము ముదిరి పోవుచున్నవని వారు బాధపడెడివారు. 1963 వ సం॥ లోనే సాహిత్యములో ప్రతిబింబించుచున్న యీ ద్వివిధ తత్త్వములను గూర్చి వ్యాసములు వ్రాయింపవలయునని యెంతో ప్రయత్నించిరి. వారి ప్రయత్నములు విఫలము లయినవి. ఆంధ్ర సాహిత్యస్థితిని చూచి వారు పొందిన వేదన యెంతయుని వ్రాయగలను ?

సంపాదకు డయిన శంభుప్రసాదుగారు రచయితలచేత ఉత్తమ వ్యాసములు వ్రాయించి ప్రకటింపవలయునని యారాట పడెడివారు. తన చూపున కందిన ప్రతి రచయితకు లేఖ వ్రాసెడివారు. విషయనిర్ణయము రచయితకే వదలినప్పటికి నొక్కొక్కసారి వారే ఆయావిషయములను గూర్చి వ్యాసములు వ్రాయుడని సూచించెడివారు. 14—12—1962 తేది నాడు పరిహాస పూర్వకముగా లేఖలో—

'ప్రత్యేకత ఏమీలేదు. మీకు ఉత్తరం వ్రాసి చాలా రోజులైనది. నావృత్తి ఒకవిధంగా భిక్షాటనం. అంటే వ్యాసభిక్షాటనం. భిక్షకుడు అపుడపుడూ కనబడుతూ ఉన్నట్లే నేనూ ఉత్తరం వ్రాస్తూ ఉండటం అవసరం. లేకపోతే మరచిపోతారు' అని వ్రాసిరి.

తాననుకొనునట్లుగా ప్రామాణికములైన వ్యాసములు లభించుటలేదని యనెడివారు. గ్రంథసమీక్షల గుణము కొంతలో కొంతయయిన పెరుగుచున్నదనుకొనెడివారు. 'ఆంధ్రపత్రిక ఉగాది సంచిక'ను సమగ్ర సుందరమూర్తిగా రూపొందించుటకు వారు అనేకవిధములుగా పరిశ్రమించెడివారు. ఆ సంవత్సరాది సంచికల సంపాదకీయములు వారి హృదయమునకు దర్పణములు.

శంభుప్రసాదుగారు ఎడతెగని గ్రంథపఠనాభిలాష గలవారు. ప్రాచీనభారతీయ సంస్కృతినిగూర్చి— మతము, శిల్పము, సంగీతము, సాహిత్యము—వారనేక గ్రంథములు చదివిరి. భారతదేశ రాజకీయములు, ప్రపంచరాజకీయములు వీనికి సంబంధించిన నూతన గ్రంథములు చదువుచుండెడివారు. ఈ యేబది యేండ్లలో నవీనాంధ్ర సాహితీరంగమున నిలిచిన రచయితలతో, వారు సృష్టించిన సాహిత్యములో శంభుప్రసాదుగారికి గాఢపరిచయమున్నది. ఇంత చదివినప్పటికి వారిలో గర్వము అణుమాత్రమయిన కనబడెడిది గాదు. సహజముగనే ఆయన నిబ్బరముగల జీవి యనుకొందును. పైకి పొంగువ్యక్తి కాదనుకొందును. నిజస్వరూపమును మఱుగుపఱుచుకొనెడివారు. ఎవరైన క్రొత్తగ్రంథమునుగూర్చి చెప్పినపుడు 'దానిని తప్పక చదువుదు'ననెడివారు. మొత్తముమీద ఆత్మచ్ఛన్నతయాయనలో అధికము. సక్రమమార్గమున తన విద్యావిధానము కొనసాగలేదని బాధపడెడివారు. అయినప్పటికి పెద్ద పెద్దపట్టములు పొందినవారిమాదిరిగాగాక నిరంతరము విజ్ఞానాన్వేషణమున నిమగ్నులైరి. ఆయన విజ్ఞానాసక్తి యాఱది. 16-5-62 తేదినాటి లేఖలో—

'...కాలము గడచినకొద్దీ, పెద్దలను చూచిన కొద్దీ మనకు (అంటే నాకు) తెలిసినది ఎంతకొద్దో తెలిసివస్తున్నది' అని వ్రాసిరి.

శంభుప్రసాదుగారు జాతీయోద్యమమును కనులార చూచినవారుగదా ! సహజముగా ఆంగ్లేయులపట్ల నొకరకమైన వైముఖ్యము వారికి ఏర్పడవలసియున్నది. గాంధేయవాదమువలనగాని, తనలో స్థిరపడిన హేతువాదమువలనగాని వారు ఆంగ్లేయులపట్ల, ఆంగ్లసభ్యత పట్ల అపారమయిన అభిమానమును చూపెడివారు! పాశ్చాత్యవిద్వాంసులు,భారతీయ సంస్కృతికి చేసినసేవను నిత్యము వారు కొనియాడెడివారు. 16-2-72 తేది నాటి లేఖలో, 'మన దేశానికి సంబంధించిన అన్ని విష

యాలపైన పాశ్చాత్యులు చేసినకృషి అమోఘమైనది. Discovery of India వారిదేగాని మనవారిది గాదు' అని వ్రాసిరి. పాశ్చాత్యులలోనున్న పరిశ్రమ,చిత్తశుద్ధి, సేవాదృష్టి భారతీయులలో కానరావని వారి విశ్వాసము. వారి విశ్వాసము నూటికి నూఱుపాళ్ళు నిజము. ఒకసారి శంభుప్రసాదుగారు విమానములో హైదరాబాదునుండి మద్రాసు వచ్చుచుండిరి. ప్రయాణములో వారి కొక పాశ్చాత్య వైద్యునితో పరిచయ మేర్పడినది. ఆ వైద్యుడు ఆఫ్రికాలో దుర్గమారణ్యములందు కుష్ఠవ్యాధి పీడితులకు సేవచేయువాడు. శంభుప్రసాదుగా రీవిషయమును ప్రస్తావించి 'మనవారిలో నిట్టివ్యక్తిని చూడగలమా ?' అనిరి. ఆ ప్రశ్నకు 'చూడగలము' అని సమాధానము చెప్పుటకు సేవా దూరమయిన నేటి మన జీవనవిధానము అనుకూలముగా లేదని చెప్పక తప్పదు.

ఆంగ్లేయు లీ భారతదేశమును పరిపాలింపనిచో ఈ కర్మభూమి అంధకారబంధురమై యుండెడిది యని శంభుప్రసాదుగారు నమ్మిరి. ఉదాహరణముగా నిజాము పరిపాలనముక్రింద నున్న తెలంగాణమును పేర్కొనెడివారు. భారతదేశము గూడ అట్లేయయ్యెడి దనెడివారు. భారతదేశమునకు ప్రాదేశిక సమగ్రత ఆంగ్లరాజ్య వ్యవస్థకు ఫలముగా ప్రాప్తించినదని వారి నమ్మకము. జాతీయవాదము భారతీయ సంస్కృతికి క్రొత్తది యని వారనెడివారు. (జాతీయవాదము భారతీయ సంస్కృతి లక్షణమని రాధా కుముద ముఖర్జీ యొక గ్రంథమునే వ్రాసెను). భారతదేశ చరిత్రను నిష్పక్షపాతముగా హేతువాద పూర్వకముగా శంభుప్రసాదుగారు చదివిరన్నమాట యథార్థము. సంస్కృతుల యందలి మంచిచెడ్డల నెన్నునపుడు వారికి స్వపరభేద ముండెడిదిగాదు. ఒకరకమయిన నవీనాంధ్ర సాహిత్యమును పఠించునపు డీ పద్ధతినే వారు చేపట్టెడివారు. మఱి భారతీయ సంస్కృతిలో మేలిమి లేదా ? దానిమాట యేమి ? ఈ విషయము వారికి తెలియును. ఆ మేలిమిని మనము గ్రహించి ముందునకు పోవలయునని వారి యభిప్రాయము.

శంభుప్రసాదుగారు కాలపరిణామమును లెస్సగా గుర్తించినవారు. భారతదేశము నవయుగ ప్రాంగణమునకు చేరినదని గుర్తించినవారు. భారత దేశమున కొక క్రొత్త సంస్కృతి కావలయునని వారి యభిప్రాయము. వి. ఎస్. నైపాల్ భారతదేశమున తిరుగుచు శంభుప్రసాదుగారియింట యాతిథ్యమును స్వీకరించుచు నున్నరోజులవి. ఆ సన్నివేశమును పురస్కరించికొని వారు నాకొక సుదీర్ఘలేఖ వ్రాసిరి. నైపాల్‌కు వర్తమాన భారతదేశ స్వరూపమునుగూర్చి నిష్పక్షపాతముగా చెప్పినవారెవ్వరులేరు. శంభుప్రసాదుగారీవిధముగా 6–4–1963 తేదీనాడు వ్రాసిరి.

"...... This is not real India అనే మాట వినలేక అతనికి (నైపాల్‌కు) విసుగెత్తిపోయింది. కాని This is the real India అని ఎవరూ చెప్పి చూపింపలేదు. West లో evolve అయినట్లుగా మనము evolve కాలేదు. మన ప్రాచీనకాలానికి ఈ నాటికీ మధ్య సముద్రమంత Gap ఉన్నది. ఈ Gap ని పూడ్చాలని ప్రయత్నించటం వ్యర్థం. నేడు మనం ఆరాధించే వ్యక్తిస్వాతంత్ర్యం, సమానత్వం, ప్రజా ప్రభుత్వం మనకు West నుంచి వచ్చినవేనని నా నమ్మకం. మనవి కావు. మన సంస్కృతికూడా వాటి ననుసరించి పెరుగవలసినదే. అయినా Culture కి Lables వేయడం ఎందుకు?......ముష్టికివెళ్లి నేను గొప్పవాడిని అనే తత్త్వం మనదేశ తత్త్వం...మనకు West సహాయం లేకపోతే—అన్నివిధాల సహాయం—మనుగడలేదు. వారినుంచి ప్రతిదీ కావాలి. కాని వారిని తక్కువ వారంటాము....ఇదొక క్రొత్తదేశం. దీని కొక క్రొత్తసంస్కృతిఅవసరం.ఏసంస్కృతిఅయినాBetween Man and Man, relationship as free and human being గా లేనపుడు దానిని తగలెయ్యాలి సిందే......'

శంభుప్రసాదుగారు నన్నొక రచయితగా తీర్చి దిద్దవలయునని ప్రయత్నించినమాట నిజము. 'భారతి' సంపాదకులుగా వారీపని చేయలేదు. మఱి పితృతుల్యులుగా వారీపని చేసిరి. నా భావపరిణామమునకు వారు

చేసిన దోహదమునుగూర్చి యెంతయయిన వ్రాయవల యును. కాని వ్యాసము నన్నుగూర్చి చెప్పుకొన్నట్లుగా సిద్ధమవును. చివర కొక్కమాట. నా పట్ల వాత్స ల్యము చూపు పెద్దలుగాని, అనురాగమును చూపు సమస్కంధులుగాని లోకములో పెక్కుమంది లేరు. ఉన్న యాకొలదిమంది పెద్దలలో నా జీవిత కాలక్రమ మునుబట్టి శంభుప్రసాదుగారు మొట్టమొదట నిలి చినవారైరి. వారి మరణమువలన నాకు వ్యక్తిగతముగా కలిగిన నష్టమునుగూర్చి యీనాడు నేనేమి వ్రాసి నను అది యతిశయోక్తిగా పరిణమించును. 'సౌందర నందము'లో ఒక ఘట్టమున నందుడు సుందరిని గూర్చి

..రసో
ల్లసన మనోహరంబును,
గళానవతారమణీయమున్, నితాం
త సుఖదమైన నీదు చరితమ్మున
నొక్కొక భావ మిప్డు మా
నసమునఁ బాఱి నీ నెఱతనమ్మునకున్
బ్రణమిల్లఁ జేసెడిన్'

అని యాక్రందించును. ప్రకరణము వేఱయినప్పటికి నేను ఈనాడు శంభుప్రసాదుగారినిగూర్చి యట్లే యనుకొనవలసియున్నది. అంతకంటె నేనేమి చేయ గలను?



# పూర్ణపురుషుడు

## శ్రీ యామిజాల పద్మనాభస్వామి

పేరుతోసహా ఆయన పూర్ణపురుషుడు. ఏ అమృత ఘటికలలో తలిదండ్రులు ఆ పేరు పెట్టారోగాని నిజంగా ఆయన 'శంభుప్రసాదే'. శివలెంక వంశం సార్థకంచేసిన శంభుప్రసాదుడు. ఏ కార్యాలయము లోనూ ఉద్యోగులు యజమానిని 'అయ్యవారు' అని పిలవడం నాకు తెలిసినంతవరకు లేదు. 'పంతులుగారు' అనడం సర్వసామాన్యం. అల్లా ఎవరూగాని అనడం విరళ వ్యవహారం. 'అయ్యవారు' అనడం బహుళ ప్రచార ప్రసిద్ధం. చదువుచెప్పే ఉపాధ్యాయుణ్ణి తెలుగునాట 'పంతులు' అనీ 'అయ్యవారు' అనీ అన డం కద్దు. చెన్నపట్నంలో ఒక పత్రికాసంస్థ యజ మానిని సంపాదకుని 'అయ్యవారు' అనడం విశేషమే: ఆయనను సరిగా అర్థం చేసుకుంటే ఆపేరు సార్థ కమే అని ఒప్పుకోవలసిందే. బాహ్య కారణాలెన్ని వున్నా నాకు తోచినది ఒక్కటే. ఆయన పూర్ణపురుషుడు. పూర్ణపురుషునకు ఉండవలసే లక్షణాలు శ్రీ శంభు ప్రసాదు—పంతులులో నెలవు చేసుకొన్నాయి. ఆ లక్ష ణాలు తెలిసినవారు 'ఔను' అని అంగీకరిస్తారు. ఆయన 'యతాత్ముడు'. 'దృఢనిశ్చయుడు.' ఇది యెవరూ కాదనలేరు. నచ్చడం, నచ్చకపోడంకాదు. గుణాన్ని గుర్తించుకునే పవిత్రస్వభావం ఆయనది.

మహాకవి కాళిదాసు రఘువంశ మహాకావ్యములో దిలీపుని వర్ణిస్తూ అయిదుశ్లోకాలు చెప్పాడు. ఆ అయిదూ శంభుప్రసాదమూర్తికి తు—చ—తప్పక సమన్వితాలవుతాయి. అయితే 'క్షాత్రోధర్మ ఇవా శ్రితః'—రూపొందిన క్షాత్రధర్మం అని అంటావా? అని ఎవరైనా అడగవచ్చు. జన్మనా దిలీపుడు క్షత్రియుడు. అయ్యవారు బ్రాహ్మణుడు. ఈ శంకకి సమాధానం ఆయన జీవితములో దొరకకపోదు. ప్రవృత్యా క్షాత్రధర్మాన్ని అవలంబించడం సర్వులకూ విదితమే. ఇక.

> 'భీమకాంతై ః నృపగుణైః
> స బభూవోపజీవినాం
> అధృష్యశ్చాభిగమ్యశ్చ
> యాదోరత్నై రివార్ణవః'

అనే శ్లోకం సంపూర్ణంగా వర్తిస్తుంది. భయంకరములూ మనోహరములూఅయిన నృపగుణము లతో ఆ దిలీపుడు ఆశ్రితులకు అగాధజలములతో అమూల్యములైనరత్నములతో సముద్రుడులాగా అధృష్యుడు, అభిగమ్యుడూ అయివున్నాడని పైశ్లోకానికి తాత్పర్యం.

నరులను పాలించేవాడు నృపుడు. ఆయనను ఆశ్రయించి జీవిక వెళ్లించేవారు ఉపజీవులు—అంటే ఆశ్రితులు. మనప్రభువేకదా అని చొరవగా దగ్గరకు వెళలేరు, వెళ్లక వుండలేరు. రత్నాలున్నాయి కనక సముద్రములోనికి వెళ్లాలి. వెళ్లడానికి భయంతో వున్నారు—తిమితిమింగిలాలుంటాయి. వెళ్లడం మానే స్తున్నారా? వెళ్లి రత్నాలు తెచ్చుకుంటున్నారు. పరి పాలన విషయములో ధార్ష్ట్యం వుండాలి. లేకపోతే యంత్రాంగం నడవదు. సమయం వచ్చినపుడు అంత చనువూ యివ్వాలి. ఈధర్మం తెలిసిన నయశాలి శ్రీ శంభుప్రసాద్ పంతులుగారు:

కేవలం ఆయన సంస్థలో పనిచేసేవారే కాదు ఆశ్రితులంటే. వారు సంపాదకుడుగావున్న ఆంధ్ర పత్రికలూ, భారతీ—వెరసి మూడింటికీ తమ రచ

నలు పంపి ఆయనవల్ల ప్రతిఫలం పొందినవారుకూడా ఆశ్రితులే అనాలి. అయితే వారికీ ఆయన అధృష్యుడేనా? అంటారేమో? ఆహా!—అధృష్యుడే అంటాను. కారణం?

'నీఒళ్లు తెల్లనా నీకళ్లు నల్లనా
నీపళ్లు పల్చనా నీరజాక్ష!—

వంటి పద్యాలురాసి భారతికియిస్తే కళ్లు మూసుకుని 'కంపోజ్'—అని 'ఆర్డరు' వేసే నామమాత్ర సంపాదకుడు కాదు. కవితతో ఆయనను మెప్పించడం లేదా ఒప్పించడం అంత సుఖసుఖాల అయేపనికాదు. కవిత్రయ భారతాన్ని—అందులో తిక్కమఖి భారత భాగాన్ని ప్రత్యక్షరశోధగా చదివి సమయానికి ఆకలింపు చేసుకునే మనీషి. ఆయన స్వభావమూ అంతే. పొగిడితే ఆ చక్రాల్లాంటి కళ్లు ముడుచుకునేవి. అయన ఒకప్పుడు నన్నడిగాడు 'ఏమండీ! తింటే గారెలే తినాలి. వింటే భారతమే వినాలి; అని అంటారు కదా! ఆ గారెలరుచికి తగిన పద్యం నన్నయగారి భాగంలోది ఒకటి చదవండి! అని. నేను నవ్వుకున్నాను ముందు. వెంటనే—

'నిండుమనంబు నవ్య నవ
నీత సమానము పల్కు దారుణా
ఖండల శస్త్రతుల్యము జ
గన్నుత విప్రులయందు నిక్క మీ
రెండును రాజులందు విప
రీతము గావున విప్రుడోపు నో
పం డతిశాంతుడయ్యు నర
పాలుడు శాపము గ్రమ్మరింపగన్'

అనే పద్యం చదివాను. ఉదంకుడు, పౌష్యుడు ఒకరినొకరు శపించుకొన్నపుడు శాపం మరలించమని ఉదంకుడు కోరగా పౌష్యుడన్నమాటలు గలది. ఆయన విని ఒక్కక్షణం కళ్లుమూసుకొని తెరిచి 'ఆయనవి ఎంతో చక్కనికూర్పుగల పద్యాలెన్నో వుండగా యీ తిట్టు పద్యం చదివారేం?—అన్నారు. నేను నన్నయార్యుని పద్యాలు కొన్నివందలు నిర్విరామంగా అప్పగిస్తాను. కాని యీ పద్యం చదవడంలో నా వుద్దేశం వేరు. ఆయన స్వభావాన్ని ఆయనకి తెలపడం నా వుద్దేశం. నా అభిప్రాయం చెప్పాను. విని 'స్వామిగారూ నేనంత కరకుగా మాటాడుతానా,' అన్నారు చిరునవ్వుతో. ఆ చిరునవ్వులో ఏదో అనిర్వచనీయమైన జాలి, లేక మెత్తదనం, సౌజన్యం, వినయం, వివేకం స్ఫురించాయి. నేనన్నానుకదా! 'అది మంచిదే పంతులుగారూ, మేఘుడు తుళ్లిపడేట్టు గర్జిస్తాడు. వెంటనే అంతశ్శరీరం కూడా శైత్యం, ఆనందం పొందేట్టు వర్షిస్తాడు. మహానుభావుల స్వభావం అది—'అని.—'ఆఁ, అదేం లేదులెండి. మీరు కవులుగనక 'ఏతావానన్య'—చేస్తున్నారు. సరేగాని ఎఱ్ఱప్రగడభాగంలోది ఒక పద్యం'— అన్నారు. వెంటనే

'పాపవర్తనుండు బ్రాహ్మణుడయ్యును
నిజము శూద్రుకంటె నీచతముడు
సత్యశౌచ ధర్మశాలి శూద్రుండయ్యు
నతడు సద్ద్విజుండ యనిరి మునులు—

అనేపద్యం చదివాను. ఇది ధర్మవ్యాధోపాఖ్యానంలోది. ఆయన 'ఏమండీ! బ్రాహ్మణుం డయ్యును' అనే నున్నకి నున్నచుట్టారేం' — అన్నారు. నున్నలేకపోయినా గణభంగం కాదు లెండని సర్దుకున్నాను. ఆయనచేతిలో భారతంలేదని అనుకోవద్దు. జిహ్వాగ్రంపై వుంది భారతం. నేను నిజానికి నున్న మరచిపోయే చదివాను. అంత సూక్ష్మపరిశీలన వుండేది పంతులుగారికి. 'బాగున్నది తిక్కనగారు మిగిలారు'—

'కోరి తోటవాడు కుసుమఫలంబులు
గోయునట్లు రాజు గొనగవలయు
నప్పనములు; నఱికి యంగారములుసేయు
భంగియైన భూమి పాడుగాదె'—

అని చదవగా 'ఈలాటిదే యింకోపద్యం వుంటే—' అన్నారు. 'అవును కొంచెం మార్పుతోవుంది వినండి.'

'మాలకరి పువ్వులను గోయు మాడ్కి తేటి
పువ్వు దేనియ గొనియెడు పోల్కి నెదిరి
కందకుండగ—...

అనేసరికి 'మీరు మార్చి చదువుతున్నారే. వన్ను పరీక్షచేస్తున్నారా?—' అన్నారు. నేను మార్చి చదవాలనే చదివాను. కాని ఆయన జ్ఞాపకశక్తి అసామాన్యం. 'పువ్వులను గోయువాడ్కి' — కాదు 'పుష్పములు'—అని వుండాలి. కవిబ్రహ్మ అక్కడి కక్కడే ఒకేపదం తిరిగి ప్రయోగిస్తాడా?' అన్నాడా మనీషి.

'బొంగు లకుం బోలె మొదలంట

బొడువ దగదు'—అని నాలుగోపాదం.......అని చదివి ఇది....అని ఊరకున్నాడు. 'విదురనీతిలో'దన్నాను. 'ఔన'న్నాడు...

ఇంత స్వాధీనంగా భారత భారతి వున్న కోవిదుని చేతులలో పెరుగుతూన్న భారతిలో అల్లాటప్పాకైత వెలువడుతుందా?

'నిండుకుండ తొణకదు. ఏమిటి కారణం?' ఆ మనీషి ప్రశ్న. 'అవకాశంలేదుకనక—' నా ప్రత్యుత్తరం- భారతంమొదలు వేమనశతకందాకా—ఆయన చదవని ఆంధ్రకావ్యాలు లేవు. చదివినదానిని ఆచరించి చూపా లనే ఆశయం కల కార్యశూరుడు.

ద్వైతం, అద్వైతంఅనే చర్చవస్తే అద్వై తానికే వోటు యిచ్చేశాడాయన. శివదీక్షా దీక్షితు డయినా భారతతత్వానికి అంకితమయిన విద్వాంసుడు.

'ఏకోదేవః
కేశవో వా శివోవా'

అనే మూలసూత్రాన్ని అక్షరాలా అనుసరించి ఆచర ణలో అద్వైతి అనిపించుకున్నాడు. అందుకే అతనిని 'పూర్ణపురుషుడు' అన్నాను. 'వీళ్లెందుకిట్లా కొట్టు కుంటారు?' అన్నాడు 'వీళ్లు'అంటే సంఘం.

ప్రారబ్ధానికి పారిశుద్ధ్యం ఎట్లా కలుగు తుందండీ అన్నాడయన ఒకనాడు. భారతికి రజతోత్స వాలు జరుగుతూన్న శుభదినాలవి. ఆనాడు శివరామ శాస్త్రిగారు అధ్యక్షులు. 'ఈ జన్మలోనైనా మనస్సుని మంచికి కర్చుపెట్టితే ప్రారబ్ధం గొడవ కట్టిపోతుం' దన్నారు శాస్త్రిగారు.పక్కునవన్వి'ఆయనవుంటే మంగలి వాణ్ణే పిల్చును' అనే సామెతలాగే వుంది మీా సమా ధానం' అన్నాడాయన. శివరామశాస్త్రిగారన్నారు వెంటనే;

'మనస్సైవ మనుష్యాణాం
కారణం బంధమోక్షయోః'- -అని.

'నిజమే శాస్త్రిగారూ ! ఆ మనశ్శుద్ధికలిగితే కదా ! మీ అనుశాసనం ఫలిస్తుంది.'

'దానికి సాంఖ్యం చదివి అర్థం చేసుకుని తద్ద్వారా ఆచరిస్తే ప్రారబ్ధశుద్ధి అవుతుంది—'...

అక్కడితో ఆ చర్చ అయిపోయింది.

తరువాత ఎప్పుడేనా తారసపడితే 'స్వామిగారూ! మీ అన్నగారి ఉపదేశం ఎంతవరకూ పాటించారు—' అని అడిగేవారు పంతులుగారు. 'ఇంకా చాలాకాలం వుంది. ఏం తొందరవచ్చింది—' అనేవాణ్ణి. 'అసలు ఒకమారైనా మీరు భగవద్గీత చదివారా ? అన్నా రొకనాడు. దానికీ యింకా చాలాకాలం వుందని అన్నాను—అని నేననగానే 'చదవండి. ఇప్పుడు చదివి అప్పుడు ఆచరణలో పెట్టడానికి ప్రయత్నించండి— వర్షం కురిశాక పొలల దున్నుతాడా ? పొలందున్ని వర్షంకోసం చూస్తాడా రైతు—అలాగే మనం కర్షకులం'—తూచినట్టు మాటాడుతాడు.

ఆయన సామాన్యంగా విద్వద్రచయితలతో మన సిచ్చి మాటాడేతీరు ఇలా వుండేది. కులాసాకబుర్ల దర్బారులో ఆయన దొర్లించే ఛలోక్తులు మల్లెపందిరి వేసినట్టుండేవి.

ఆయన రాజకీయ జీవితం సంపాదకీయాలు చదివినవారికి అవగతమై వుంటుంది. మోమోటం ఏకోశానాలేని విమర్శక సంపాదకుడు. ఇలా రాస్తే ఆ ప్రభుత్వం ఏమనుకుంటుందో, ఈ మంత్రి ఏమను కుంటాడో— అనే నదురూ, బెదురూ లేకుండా. అవక తవకలు కనిపిస్తే విప్పిచెప్పడం, మంచిని ఏపక్షములో వున్నా ప్రోత్సహించడం శంభుప్రసాద్ స్వభావం. ఆ ధైర్యం కొందరికే వుంటుంది. ఆ వున్నవారిలో ఆయన స్థానం విశిష్టం.

పాత్రమెరిగి దానంచెయ్యడం ప్రధానంగా ప్రవరిస్తూ మామయ్యలాగానే గుప్తదానం చేసేవాడు.

కాలం మారుతూ వుంటుంది చక్రనేమిక్రమంగా. అది తెలిసిన ప్రజ్ఞాశాలి. అయినా ప్రాచీన సంప్రదాయానికి స్వస్తిచెప్పలేదు. వార్తాపత్రికలో ప్రపంచప్రసిద్ధములైన రామాయణ భారతాలను శిష్టవ్యావహారికములో వ్రాయించి ప్రచురించిన సనాతన ధర్మపరుడు. సాంఘిక రచనలకు భారతిలో స్థానమిచ్చిన సమయాభిజ్ఞుడు. సమయం అనుసరించి సహాయ సంపాదకుల స్వాతంత్ర్యాన్ని పాలించేవాడు.

ఆంధ్రపత్రిక సారస్వతానుబంధంఅంటే ఏదో అపూర్వవిజ్ఞాన విషయబంధంఅనీ, 'భారతి'అంటే ఏదో విశిష్టవిషయకళాగతి అనీ ఆయన సారథ్యంలో ప్రత్యేక కీర్తిని గడించాయి.

ఆంధ్రపత్రిక ఆదివారం సంచికలో వ్యాసం ప్రచురితం అయిందంటే ఆ రచయితకి ఆనాడొక పండుగ.

వార పత్రికలో కథ వచ్చిందంటే ఆ రాసిన వ్యక్తికి అమితానందం.

భారతిలో తన రచన ముద్రితమయిందంటే ఆ రచయితకి కనకాభిషేక మయినంత ముచ్చట.

అంత ఘనతను తన పత్రికలకూ రచయితలకూ సమానస్థాయిని సమకూర్చిన కోవిదుడు...

హరికథా పితామహుడు, శతవధాని వేంకట శాస్త్రి గురుపాదులు వంటి సారస్వతదిగ్గజాలు మొదలు నావంటి యీ తరం రచయితలకూ, విమర్శకులకూ, విద్వాంసులకూ, విద్యార్థులకూ సముచిత స్థానం యిచ్చి మామయ్య తన భుజాలపై వుంచిన అనిర్వచనీయ నిర్వహణభారాన్ని సర్వజేగీయామానంగా నిర్వహించాడు కనక శ్రీ శంభుప్రసాద్ పంతులు గారిని పూర్ణపురుషుడన్నాను.

ఆంధ్రజాతి దౌర్భాగ్యం !... అకస్మికంగా ఆయననూ కట్టెలవాడు మహారణ్యములో చందన వృక్షాన్ని నరికినట్టు దుర్విధి తీసుకుపోయాడు. కైలాసవాసియైన ఆ సిద్ధపురుషుడు ప్రమథగణ పరివేష్టితుడైన పరమేశ్వరుని కరుణకి పాత్రుడై అక్కడ పండితారాధ్యచరిత్రుడై స్థిరంగా వుండుగాక !, అని సర్వశక్తి సంపన్నుడైన ఈశ్వరుణ్ణి సాంజలిబంధంగా అభ్యర్థిస్తున్నాను.



# మహాస్మృతి

శ్రీ కొలకలూరి ఇనాక్

పుట్టిన ప్రాణి గతిస్తుంది. అందుకు లోకం విచారిస్తుంది. తాత్కాలికంగా బాధ ఉపశమిస్తుంది. ఇది లోకసామాన్యమే! అయితే అది అంతసేవ్యం కానక్కరలేదు. క్రీస్తు పుట్టాడు. గతించాడు. కృష్ణుడు జన్మించాడు, పోయాడు. 'పోయినందుకు విచారం అవసరంకాదు. పుట్టినందుకు సంతోషం. మహాత్ములు అవతరించి ఉండకపోతే, ఈ మానవత ఇంతవిస్తృతంగా ఎదిగివుండేదికాదు.

శంభుప్రసాద్‌గారు పరమపదించారన్న వార్త చదవగానే గుండెలు గుబగుబలాడిన అనేకుల్లో ఈ రచయిత ఒకడు. ఆ విచారం చాలామందికి భరించ శక్యంకానిది కూడా అయింది. ఆయన జయించిన మనుష్యుల గుండెలు చూస్తుంటే ఆ విచారం మచ్చులాగా విడిపోయి, ప్రకృతి స్వచ్ఛంగా, కడిగిన ముత్యంలాగా కనిపిస్తుంది. ఇన్ని హృదయాలను జయించిన వ్యక్తిత్వం ఆయన పుట్టివుండకపోతే ఏమయివుండేది? అందువల్ల అనేకుల హృదయాలలో శాశ్వతస్థానంపొందిన శంభుప్రసాద్‌గారు పుట్టినందుకే ఎంతో ఆనందం!

కొందరు మహాత్ములు గతించి చరిత్ర మరుగున పడతారు. కొందరు మనుష్యులు గతించి మహాత్ములవుతారు. కొందరు మహాత్ములు, జీవించినా గతించినా మహాత్ములు! తన జీవితకాలంలో తన వ్యక్తిత్వం స్మరింపబడి అనంతరం విస్మరింపబడటంకానీ, తన తదనంతరం తన వ్యక్తిత్వం నిర్ణయింపబడటంకానీ ముఖ్యమేఅయితే, అంతకంటే ప్రధానం తన కాలంలోనూ, అనంతరకాలంలోనూ తన వ్యక్తిత్వం గ్రహించే సంఘంలో చిరంజీవి కావటం. శంభుప్రసాద్‌గారు ఈ చివరికోవకుచెందిన వ్యక్తి. ఆయనను ప్రేమించిన వాళ్లు ఎంతగా ఆరాధిస్తుంటారో వ్యక్తిత్వంలోని మహాత్మత స్పష్టమవుతుంది. చేరువయినవాళ్లు జీవితాంతం గుర్తుంచుకొనేంత ఆదరంగా ప్రవర్తించిన వ్యక్తి ఆయన. తన జీవితంలో నలుగురికీ తన మహాత్మతను దర్శింపజేసిన ఆయన స్వర్గస్థులైనా, ఆ మహాత్మతనే దర్శింపజేస్తున్నారు.

ఎందరో గతిస్తారు. వాళ్లంతా గుర్తుండరు. కొందరు కాలధర్మం చెందుతారు, అటువంటివాళ్లను కొంతకాలం జనం గుర్తుంచుకొంటారు. కొంతమంది పరమపదిస్తారు. వాళ్లను జాతి గుర్తుంచుకొంటుంది. ఏరంగంలోనయినా ప్రారంభకులను, ఏదశలోఅయినా ఉత్తముల్ని సమాజం గౌరవించుకొంటుంది. పత్రికా రంగంలో, సారస్వతక్షేత్రంలో ఆంధ్రపత్రికా సంస్థ అక్షరాస్యులైన తెలుగువాళ్లకు ఆదిలోనూ, ఆపైనా, ఆరాధ్యం. కొందరికా పత్రికలు ఆనంద చిహ్నాలు! చాలామంది ఆ పత్రికలవల్ల ఆలోచించారు. రచనాభ్యాసం చేశారు. కవులు రచయితలు విమర్శకులు అయారు. వ్యక్తిత్వం పొందారు. ఆ పత్రికలు అనేకులను తెలుగువాళ్లనుగా జీవింపజేశాయి. అందువల్ల ఆ పత్రికలు ఏ వ్యక్తుల గుండెలు పులకరిస్తే ఆవిర్భవించాయో, ఆ వ్యక్తులు మరుపురారు. మరుగునపడరు. ఆంధ్రపత్రిక (దినపత్రిక వారపత్రికలు) భారతి ఉన్నంతకాలం ఆయన గుర్తుంటారు. ఈ పత్రికల ప్రభావం పొందిన తెలుగుజాతి జీవించి ఉన్నంతకాలం ఆయన చిరంజీవి. నాగేశ్వరరావు పంతులు గారిలాగానే శంభుప్రసాద్‌గారు కూడా చరిత్ర స్మరించే మనీషులు!

రాజకీయరంగంలో లాగా, సారస్వత వేదిక— దానిలాగా అనేక రంగాలలో ఆంధ్రపత్రికా సంస్థ

సాధించిన అభ్యుదయం ప్రసిద్ధమే! భారతిలో ఆంధ్ర వారపత్రికలో తన రచన ప్రచురింపబడటం పరమభాగ్యంగా భావించే ప్రారంభంలో ఉన్న యువ రచయితా, తమ సిద్ధాంతాలకు అనుకూలంగా ఉన్న విషయాలు చూచి పొంగిపోయే యువ రాజకీయవాదీ, ఎంతగా ప్రభావితులయ్యారో గమనింపవచ్చు. ఈ పత్రికలు బహుసమర్థంగా బహువత్సరాలు నిర్వహించిన శంభుప్రసాద్‌గారు గతించటం సారస్వతలోకంలో తీరనిలోటు!

స్వాతంత్ర్యంకోసం, సామాజికాభివృద్ధికోసం జాతి సమస్తం ప్రగాఢంగా వాంఛిస్తున్నప్పుడు, జాతి జీవనాడికి ప్రతిస్పందనంలాగా, ఆంధ్రపత్రిక నాటి నుంచి నేటిదాకా ఆంధ్రుల కోర్కెలకు సంకేతంగా, నిలిచింది. ఆంధ్రపత్రికలో వార్తతప్ప తదన్యం నమ్మని ఆంధ్రులు, అది తప్ప ఏదినపత్రిక చదవని పెద్దలు ఎందరో ఈనాటికీ కనిపిస్తారు. ఇంతగా తెలుగు జాతిని ప్రభావితంచేసిన ఆంధ్రపత్రికను సర్వసమర్థంగా నడిపించిన శంభుప్రసాద్‌గారు కాలధర్మం చెందినా కలకాలం గుర్తుంటారు.

లోకంలో అహరహం అనుక్షణం ఒక మనిషి ప్రసన్నముఖంతో ప్రత్యక్షం కావటం ఒక సుకృతం. ఎక్కడోతప్ప కనిపించని ధర్మం. శంభుప్రసాద్‌గారి ముఖంలో ప్రసన్నతకు విరామంలేదు. అది ఆయన ముఖంలో నిత్యసత్యం.

నవ్వు అందరూ నోచుకొన్న భాగ్యంకాదు. కొందరి నవ్వే గుండెలతో ఆడుకొంటుంది. శంభుప్రసాద్‌గారి నవ్వు ప్రేమపాదులో పుట్టినతీగ. ఆ నవ్వు పువ్వు వికసించినట్లుంటుంది. ఆదరంగా ఆహ్వానిస్తుంది. అది పసిపాపల పాలబుగ్గల అమాయికత ఆరిపోకుండా చిరుదరహాసంగా నిలుపుకొన్న నవ్వు.

మనస్సువిప్పి మాట్లాడటం నిర్మల హృదయ లక్షణం. శంభుప్రసాద్‌గారు మనస్సులో అరలుపొరలు లేకుండా మాట్లాడే కోమలమనస్వి. కల్లాకపటం మాటల్లో ధ్వనించవు. కాఠిన్యం కార్కశ్యం వినిపించవు. ఆయన ఎక్కువగా మాట్లాడక పోయినా, మాట్లాడిన మాటలు మరుపురావు. అనవసర ప్రసంగం డొల్లు పదాలు ఆయన సంభాషణలో దొర్లవు. భాషలోనూ, ప్రవర్తనలోనూ సంక్షిప్తత స్పష్టత ఆయన జీవితధర్మాలు.

శంభుప్రసాద్‌గారి మనస్సు చల్లనిది. మాట చల్లనిది. మనిషి నిండుకుండ. ఆయనమాట వింటుంటే ఎండకాలం కొత్తకుండలో నీళ్లు తాగుతున్నట్లుంటుంది. ఆయన కోపగించుకోవటం, ఆవేశపడటం ఎవరూ చూచివుండరు. ఆయనలో ఇన్హిబిషన్స్ లేవు. కాంప్లెక్సెస్‌లేవు. ఒడిదుడుకులులేవు. అద్దం లాంటి జీవితం. ఆయనతో మాట్లాడుతుంటే పైరు చేలల్లో తిరుగుతున్నట్లుంది. ఆయనతో మాట్లాడటానికి ఎదుటవ్యక్తి జాగ్రత్తపడవలసిన అవసరం వుండదు. అంత ఆత్మీయంగా, ఆదరంగా మాట్లాడే ప్రవర్తించే మనుష్యులు ప్రేమింపబడతారు. ఆయనతో సంభాషణ హృదయదఘ్నంగా వుంటుంది.

ఆరోగ్యం బాగాలేనివాళ్లు సాధారణంగా చిరాకు పడతారు. విసుక్కుంటారు. కొందరు భిన్నప్రదేశాలలో ఒకేవ్యక్తి విభిన్నంగా మాట్లాడటం సహజమే! అయితే శంభుప్రసాద్‌గారు ఇంటిదగ్గరయినా, ఆఫీసులోఅయినా, హాస్పటల్‌లోఅయినా ఏపరిస్థితుల్లో పలకరించినా, ఒకేధోరణిలో హాయిగా నవ్వుతూ కమ్మగా మాట్లాడటం ఆయనకే చెల్లు!

సాహిత్యంలో అల్పజ్ఞులు అధికజ్ఞులుగా నటించటం రివాజు, ఆచారం. ఈ రచయిత శంభుప్రసాద్‌గారితో జరిపిన సంభాషణల్లో గ్రహించిన సత్యం గుర్తుంచుకోవలసింది. సాహిత్యంమీద సమగ్రాభిప్రాయంవుండి, నూత్నధోరణులు సాహిత్యంలో స్వీకరించే మనస్తత్వం కలిగి, ఇంత తెలిసినట్లు కనిపించకుండా నిండుగా తొణుకులేకుండా వుండటం పరమాశ్చర్యంగా గోచరమవుతుంది.

ఆధునికాంధ్ర సారస్వతంలో అభివృద్ధిచెందిన వాస్తవికతా దృక్పథం గమనార్హమైన ప్రభావం సంఘంమీద చూపింది. ఈ దృక్పథం ఇంతగా విస్తరిల్లటానికి శంభుప్రసాద్‌గారి కృషి ప్రశంసాపాత్రం. చారిత్రకఘట్టం. ఈ విధమైన రచనలు చేయించి,

రచయితలకు దోహదం కలిగించి, అవి ప్రచురించి, ఆంధ్రసారస్వతచరిత్రలో ఒక సువర్ణాధ్యాయానికి శంకుస్థాపనచేసిన సాహిత్యద్రష్ట శంభుప్రసాద్‌గారు.

సాహిత్యానికీ, సంఘాని ఉపయోగకరమైన రచనలు వీళ చేస్తారుఅని ఎవరినిగూర్చిఅయినా భావిస్తే, వాళ్లు ఉద్యోగాల వత్తిడులమధ్య విరామం లేనివాళ్లేఅయినా, పట్టుబట్టి వాళ్లచేత రచనలు చేయించి, సారస్వతరంగం పటిష్టం చేయటానికి ఆయన చూపిన దీక్షాతత్పరత ప్రశంసింపదగినదౌతుంది.ఆయన ప్రోత్సాహం కారణంగా తెలుగుదేశంలో రచయితలు అయినవాళ్లు, వెలువడ్డ రచనలు లెక్కకు మిక్కుటంగా ఉండటం గమనింపవచ్చు.

మునుపు ఆంధ్రదేశంలో విమర్శనం వ్రాస్తున్న వాళ్లు పూర్తిగా పండితులు. అందువల్ల విమర్శ పాండిత్యంబరువుతో విషయం సుబోధకంగా లేకుండా పోయే ప్రమాదానికి గురి అవుతూవుండటం ఆయన గుర్తించారు. ఈ ఇబ్బంది తొలగాలంటే విషయ బోధ చేయగలిగేవాళ్లు విమర్శచేస్తే బాగుంటుందని భావించి, దానికి కవులు రచయితలు పనికి వస్తారని తలంచారు. అప్పణ్ణుంచి సృజన సాహిత్య నిర్మాతలు విమర్శకులు రూపొందటానికి దోహదం కావించారు. ఆ ప్రయత్నం సక్రమమయిన ఫలితాలను అందించింది. కవులు రచయితలు విమర్శకులుగా తయారయి, విమర్శన విధానం క్రొత్తమార్గంలో ఆవిర్భవించింది. ఈ పథంలో ఆయనకృషి వైశిష్ట్యం స్పష్టమవుతుంది. అందుకు భారతి, ఆంధ్రపత్రికలు సాక్ష్యం పలుకుతాయి.

కాలం మారింది. అభిప్రాయాలు మారాయి. సామాజికదృక్పథం మారింది. ఈ తరుణంలో పాత భావాలు ప్రయోజనకరం కాకపోగా ప్రమాదకరం. ఈ దృష్టి కలిగివుండే, శంభుప్రసాద్‌గారు యువకుల్ని ప్రోత్సహించారు. నూత్నదృక్పథాలను ప్రోత్సహించారు. సాహిత్యంలో పరిణామానికి కొంతవరకు మార్గం ఏర్పరిచారు. భారతి ఆది పత్రికల నూత్నయౌవనానికి చాలావరకు దోహదం చేశారు.

కీ॥ శే॥ కాశీనాథుని నాగేశ్వరరావుగారిలాగా, సర్గీయ శంభుప్రసాద్‌గారు హరిజనాభ్యుదయం, పీడిత జనసౌఖ్యం, వాంఛించటం, వాళ్లను ప్రోత్సహించటం, వాళ్లకు వీలయినంత సహాయ సహకారాలు అందించటం, అభివృద్ధికి అవకాశం కల్పించటం ఇష్టకృత్యాలుగా చేసేవాళ్లు. అంతేకాదు, ఆర్థికసమానత ఆంధ్ర దేశంలో ఏర్పడ్డప్పుడే ఈ జాతికి భవిష్యత్తు వుంటుం దనీ అది జరుగుతుందనీ విశ్వాసం ప్రకటించారు.

శంభుప్రసాద్‌గారి గుప్తదానం నాగేశ్వరరావు పంతులుగారిని గుర్తుకుతెస్తుంది. ఆయనను ఆర్థికంగా యాచించి వట్టిచేతులుతో తిరిగిపోయినవాళ్లు లేరనుకొంటుంటారు. ఆయన చేసిన ఆర్థికసహాయం గూర్చి చెప్పుకొనే ఇద్దరు ప్రసిద్ధులు ఈ రచయితకు పరిచితులు.

ఎదుటిమనిషిలో చెడ్డనే చూడటం కంటే మంచిచెడ్డలు సమంగా చూడటం ఉచితంగా వుంటుంది, ధర్మం అనుకోవటం సబబే! కాని కొందరు ఎదుటివ్యక్తిలోని మంచినే చూడటానికి ప్రయత్నిస్తారు. వాళ్లలో శంభుప్రసాద్‌గారు ప్రథమ గణ్యులు. మనిషిని ఆయన అసహ్యించుకోవటం ఎవరూ గమనించి వుండరు. మనిషిలో మంచితనం మాత్రమే తెలుసుకోవటానికి చూడటానికి, గుండెనూ, గుండె కళ్లనూ విశాలంగా చేసుకొన్నవ్యక్తి ఆయన. మంచిదిగా కనిపించిన విషయం బాగుందని చెప్పటానికి ఏవిధమయిన సంకోచంలేని పూర్ణవ్యక్తిత్వం ఆయనిది.

వయస్సులో చిన్నవాళ్లను చిరంజీవులుగా చూడటం ఆశీర్వదించటం సంప్రదాయాలే! చిన్న వాళ్లు సమర్థులైనా పిల్లలు పొమ్మని తీసిపారేయటమూ అలవాటే! అయితే శంభుప్రసాద్‌గారి తత్త్వంవేరు. నేను చిన్నవాణ్ణి, ఎంతో నేర్చుకోవలసినవాణ్ణి అంటూ గౌరవంతో, పూజ్యహృదయంతో చూచేవాళ్లను కూడా మిత్రులుగా భావిస్తూ సంబోధిస్తూ సలహాలిచ్చేంత విశాలహృదయం ఆయనిది. ఈ హృదయ పరిచయం ఉన్నవాళ్లు ఆయనను ఎప్పటికీ మరిచిపోలేరు.

లోకంలో జనం సాధారణంగా ఎదుటివాళ్ల దగ్గర్నుంచి ఏదోఒకటి కోరుతూవుండటం సాధా

న్యమే ! ప్రధానమంత్రి అంతటివాళ్ళు అయినా ప్రజాభిమానం కోరుతూ వుండవచ్చు. తనకోసం ఆయన ఎవరిదగ్గర్నుంచి అయినా, ఏమయినా కోరినట్టు అనుకోవటానికి ఈ పదేళ్లలో అవకాశం కలగలేదు. ఈ స్వార్థరహితత్వం పరిచితులైన అందరి హృదయాలు జయించింది. ఆ వ్యక్తిత్వం ఈగుండెల్లో చిరంజీవిగా నిలిచింది.

మనిషిని మహత్తరశక్తిగా గుర్తించి గౌరవించే స్వభావం, మనిషిని మనిషిగా చూచేటట్లు అవకాశం కలిగించింది. మంచిమనిషి సమాజానికి ఎంతోమేలు అని నమ్మే తత్త్వం ఆయనిది. పరిచితుల్లో అపరిచితుల్లో ఉత్తమత్వం, ఔన్నత్యం దర్శించే ఆయన జీవితంలోని ఉదాత్తత అందరిచేత ప్రేమింపబడింది.

ఒక్కసారి దగ్గరగా చూచినా, మాట్లాడినా ఆ మనిషిని ఆయన మరచిపోవటం ఉండదంటారు. ఎన్ని సంవత్సరాల తర్వాత అయినా పలకరిస్తే, అప్పటికి ఎన్నిసార్లు కలుసుకొందీ, ఏమేమి మాట్లాడుకొందీ, స్పష్టంగా గుర్తుకు తెచ్చుకోగలిగేంత నిశితం ఆయన మనస్తత్వం.

పదేళ్లపూర్వం కలుసుకొన్నప్పుడు కలిగిన కమ్మని అనుభూతి కాలంతో పాటు పెరిగి మరీ కమనీయంగా, నిత్యనూతనంగా రూపొందింది. ఈ పదేళ్లలో ఎన్నిసార్లు కలిసినా, అన్నిసార్లూ, ఆ అనుభూతి ఆనంద పర్యవసాయి అవుతూనే వచ్చింది. ఆయనను చూచిన ప్రతిపర్యాయం ఆ అనుభూతి పెరుగుతూ గౌరవం అభివృద్ధి అవుతూనేవుంది. ఆయనను ఎన్నిసార్లు చూస్తే అంతగా ఆయనపట్ల గౌరవం ఎక్కువవుతూ వచ్చింది. ఆయనను చూడటం, చూచేవ్యక్తికి, ఆనందం.

ఈ రచయితకు ఎప్పుడూ స్మృతి పథంలో వుండే కొద్దిమంది మహావ్యక్తులల్లో శంభుప్రసాద్ గారు ఒకరు. ఆయన జీవిత విస్తృతిలాగా, ఉన్నతిలాగా, వైశిష్ట్యంలాగా, ఆయనస్మృతి విస్తృతం, ఉన్నతం, విశిష్టం.

సరసత్వం సహృదయత్వాలవల్ల మిక్కిలి ఆత్మీయులు, పూజ్యులు అయి, ఆదరాన్ని ప్రేమను ప్రసాదించిన శంభుప్రసాద్‌గారి జీవితం కలకాలం నిలిచే, నిరంతరం వెలిగే మధురమైన మహాస్మృతి.



# ఆంధ్ర మహాభారత సంశోధిత ముద్రణము

## శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి

నియా విశ్వవిద్యాలయము (హైదరాబాదు— ఆంధ్రప్రదేశ్)నందలి ఆంధ్రమహాభారత సంపాదకవర్గమువారిచే నిర్వహింపబడిన ప్రథమ ద్వితీయ సంపుటములు (1) ఆదిసభాపర్వములు (2) ఆరణ్యపర్వము.

ఆంధ్ర మహాభారతమునకు చక్కని నిర్దుష్ట సంశోధిత ముద్రణావశ్యకతనుగూర్చి భేదాభిప్రాయము లుండుటకు బొత్తిగా అవకాశములేదు. కారణము ఏముద్రణముగాని, ఎట్టిపండితుడుగాని, ఎట్టిపండిత సంఘముగాని ఎంతపరిశోధించి ముద్రించినను, ఎవరో ఒకరికి అందు ఏదోలోటు, ఏదో అతృప్తి కలుగుటకు అవకాశము ఏర్పడుచునేయుండును. పండితుల యభిప్రాయభేదములకు తగినట్లు పాఠములు మారుచుండును, దొరుకుచును ఉండును. అది తీరనికొరత, అంతులేని పరిశోధన, విడివడని సమస్య. ఎప్పటికిని తీరదేమో. ఎప్పటికప్పుడు ఆయాకాలపరిస్థితుల ననుసరించి వారువారు కొంత తృప్తిపడవలసినదే. నూతన సిద్ధాంత రాద్ధాంతములను లేవదీయవలసినదే. మరల చదువుకొనుకొలదియు జ్ఞానాభివృద్ధితోడ్పాటు, యథాపూర్వము, విక్రమార్కుడు బేతాళుని తెచ్చినట్లు, ఇంకొక ముద్రణమునకు అవకాశము రాకతప్పదు. ఇందులకు కారణములు చరిత్రలోనే ఇమిడియున్నవని తోచుచున్నది. అది దాని జాతకప్రభావము. ఆంధ్ర మహాభారతముయొక్క జననమే అటువంటిది.

'పంచమవేదమై వరగిన' సంస్కృత మహాభారతమునకు ఆంధ్రమహాభారతము అనువాదము. ఆంధ్రభాషకు మూలనిధానము. ఆదికావ్యము. తెలుగులో వ్యాకరణమునకును, ఛందస్సునకును, పదప్రయోగమునకును, కవిత్వ విధానమునకును ఆదర్శముగా అవతరించినది. నన్నయ్యను ఆదికవియని పొగడని కవి కానరాడుగదా. పైగా అనువాదపద్ధతికిని, యథామూలముగానో, మార్పులతోనో, అనువదించుటకును మార్గదర్శకుడు నన్నయ. ఆంధ్ర వ్యాకరణమున కవిత్రయ ప్రయోగములు ప్రామాణికములు. అందులోను నన్నయ ప్రామాణికతరుడు, పొరపాటు చేయనివాడు. అతనిలో పొరపాటుఉండుటకే అవకాశము లేదు. దారి చూపువాడు దారి తప్పడుగదా. దీనినే అప్పకవి చెప్పినాడు.

'ఆదిని శబ్దశాసనమహాకవి
చెప్పిన భారతంబులో
నేది వచింపగాబడియె నెందును
దానినెగాని సూత్ర సం
పాదన లేమిచే తెనుగు పల్కు
మతొక్కటిగూర్చి చెప్పగా
రాదని ద్రాక్షవాటికవిరాక్షసు డీ
నియమంబు సేసినన్.'

'ఆ మూడు పర్వములలో
నామాన్యుడు నుడువు తెలుగు నరసికొని కృతుల్
తాము రచించిరి తిక్క సు
ధీమణి మొదలైన తొంటి తెలుగు కవీంద్రుల్.'

తిక్కనయే నన్నయను చదువుకొని ఆ మార్గమున రచించినాడనగా తరువాతి వారెంతమాత్రము! తిక్కన నన్నయను ప్రశంసింపగా, ఎఱ్ఱనవఱకును అందఱును నన్నయ తిక్కనలను పొగడగా, ఎఱ్ఱన తర్వాతివారు ఈ ముప్పురను స్తుతింపగా నొక పరంపర కుదిరిపోయినది. తిక్కన ఎంతవఱకు నన్నయ్యను చదువుకొనెనోగాని ఎఱ్ఱనమాత్రము నన్నయ శైలిని

అనుకరించుటకు చాల సాధనచేసి ఆతని 'సరస సారస్వతాంశ ప్రశస్తి దన్ను జెందు'నట్లు చేసికొన్నాడు.

నన్నయ ఆదికవి యనుటకు సందేహములేదు. ఎన్నియుగాంతరములు వచ్చినను ఆతని స్థానము కదలింపరానిది. అతనికి ముందరి కావ్యముగాని, కావ్యకర్త గాని కానరాదు, కానరారు. తత్పూర్వమంతయు శాసన వాఙ్మయమే. బృహత్కావ్యనిర్మాణాసక్తి యుండిన యాంధ్రులు కర్ణాటదేశమునకుపోయి కన్నడమున వ్రాయుచుండిరి. ఇందులకు పొన్న, పంప, జినవల్లభులే సాక్షి.

సంపాదకీయ పీఠికాకారులు సంశోధిత ముద్రణావశ్యకతనుగూర్చి ఇట్లు వివరించినారు. 'తమ కాలమునందలి శిష్టుల యభిరుచులకును వ్యవహారమునకును అనుగుణముగా పదప్రయోగమున గొంతది మార్పులు ప్రవేశపెట్టియుండినను తిక్కన పెద్దన సూరన మున్నగు నాంధ్రకవులందఱును నన్నయ యెడ నప్రతిమానమైన గౌరవమును ప్రదర్శించియుండిన వారే. ఆంధ్రభాషకు సంబంధించిన సాంప్రదాయిక వ్యాకరణమును సరిగా నెఱుంగుటకు మహాభారత సంశోధిత ముద్రణ మత్యంతావశ్యకము.

ఒక్క వ్యాకరణమేకాదు, పదప్రయోగమేకాదు, ఛందస్సునకు, రేఫఱకార నిర్ణయమునకు, అర్థానుస్వార చరిత్రకు, అనువాద విధానమునకు, కవితాలంకార కావ్యమార్గమునకు ఆదర్శమైపోయినట్లు విశదపడుచున్నది. వీనిచే పెక్కుసమస్యలు ఏర్పడినవి. అన్నిటికిని పర్యవసానము పాఠనిర్ణయము. ఆ సమస్యలేవన—ప్రధానముగా రెండు వర్గములు—

(1) నన్నయ విపులశబ్దశాసనుడని చెప్పుకొన్నందున ఆతడు ఆంధ్రశబ్దానుశాసనమాత్రమును వట్టిప్రచారముగా గావించి ఆంధ్రమహాభారతమును వ్రాసెనా లేక నిజముగా నాంధ్రశబ్దచింతామణిని వ్రాసియుండెనా? నిజముగా వ్రాసినను వ్రాయకపోయినను అనంతర కవులపైనితని ప్రభావ మెంతవఱకుండెను?

(2) ఈతని యనువాద విధానమెట్టిది? యథామూలమా, పూర్తిగా స్వతంత్రమా, లేక మధ్యే మార్గముగా సందర్భోచితమా?

ఈ రెండు సమస్యలకును సమాధానముగా ఆంధ్రవాఙ్మయచరిత్రయంతయు విమర్శింపవచ్చును. ఇందు మొదటిదానిలో నన్నయ ప్రామాణికత యనగా నేమి, తిక్కనాదులు ఎంతవఱకు నన్నయను అనుసరించిరి? నన్నయను పఠించియే కవిత నేర్చిరా లేక ఒకపాటి కవిత నలవఱచుకొన్నతర్వాత నన్నయను చూచి దిద్దుకొనిరా, యనునవి చర్చనీయాంశములు. నన్నయ తర్వాత మఱుగుపడి, బాలసరస్వత్యాదుల నాటికి తటాలున బయటపడిన ఆంధ్రశబ్దచింతామణి, అంతవఱకు ఎట్లు పండితుల కంటపడక యుండియు ఒక్క అక్షరమైనను పోక, ఎక్కడను లోపింపక అసలు ఆంధ్రమహాభారతముకన్న చక్కగా భద్రపఱుపబడియుండినది! 'నన్నయనే ప్రమాణముగా గ్రహించుటయా, కవిత్రయమును ప్రమాణముగా గ్రహించుటయా'అన్న ఈ మీమాంస ఎప్పటినుండి వచ్చినది? ఎందులకు వచ్చినది? తిక్కన యెజ్జనలమీద ఒకప్పుడు ప్రత్యయ ముండి పోయినదా? లేక పోయి మరల వచ్చినదా? ఇవి ఆంధ్రవాఙ్మయచరిత్రలో గడ్డు సమస్యలు.

ఇక రెండవ ప్రశ్నకు సమాధానము ఒక్క ఆంధ్రదేశమునకేగాక యావద్భారత దేశమునకును సంబంధపడియున్నది. ఇది సంస్కృత మహాభారత పఠనమునకు పాఠనిర్ణయమునకును, శ్లోకసంఖ్యాది గ్రంథ నిర్ణయమునకును, చరిత్రకును ఉపయోగపడునట్టిది. వ్యాసభారతముయొక్క మూలరూపము ఎట్లుండెను— అది కాలక్రమమున భారతదేశమందలి వివిధప్రాంతములలో ఎట్లెట్లు మారినది—అనుదానిని పోల్చి చూపుటకు ఆంధ్రానువాదము పనికివచ్చును. అప్పుడు ఆం. మ. భా. మాతృకానుసారమైనదేయని తలంపవలసియుండునుగాని స్వేచ్ఛానువాదమనుట కుదురదు. భారతమును మరల అనువదించిన శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు ఇట్లు వ్రాసినారు. 'నన్నయ

భట్టారకుండు......మూలము ననుసరించుచువచ్చినను దన యిచ్చవచ్చినట్లు మార్చి మనోహరముగాఁ దెనిగించినాడు...సకలభాషావాగనుశాసనుండు నన్నయభట్టు తానిట్టి కథల నన్నిమారులును తెలిగింపక తగిన తావులందు హృద్యముగా నొక్కమారే తెలిగించినాడు. మూలమున దుష్యంతునికథయొక్క సందర్భమున యయాతికథకన్న మున్ను చెప్పఁబడియున్నది. తెలుఁగున నట్లుగాక యయాతికథ తరువాతనే దుష్యంతునికథ విరాజిల్లుచున్నది...సంస్కృత భారతములో భరతవంశము సవిస్తరముగా జెప్పుమనికోరిన జనమేజయునకు వైశంపాయనుం డట్లు దుష్యంతునికథను ముందు చెప్పియున్నాడు. నన్నయ భట్టారకు డది సమంజసముగా లేదని కాబోలు వంశానుక్రమణిక ననుసరించి యయాతికథనే ముందు చెప్పినాడు...'

ఇది ఎంతవఱకు సమర్థనీయము ? నన్నయ్య మార్చినాడా లేక ఆతనికి దొరకిన ప్రతిలో అట్లే యుండెనా ? ఇదియును సుసంభవమేగదా.

మరల శ్రీపాదవారే తిక్కననుగూర్చి యిట్లు వ్రాసినారు. 'తిక్కన సోమయాజి పెక్కు స్థలము లందు పెంచి పెక్కుకథలుమార్చి, పెక్కుకథలు తీసివేసి తన యిష్టమువచ్చినట్లు గ్రంథము చేసియున్నాడు.' ఇది పండితుల దృక్పథమా చరిత్రకార దృష్టియా ? తిక్కన అనుసరించిన మూలమేదో ? నన్నయను చదివి తెలుగునేర్చెనని తలంపబడు తిక్కన 'కవిరాక్షసుడు చేసిన నియమంబు' మీఱి నన్నయవాడిన తెలుగులుగాక మఱికొన్ని యెక్కువ వాడియున్నాడు. 'జగముల నెల్లెడన్' అను పద్యమునందు నాలవచరణమున 'ఎం/తగుమతులైన' అని పద్యముచేసి, యెంతయును దానిపై కుమతులను సంస్కృత పదము యొక్క కకారమునకు గకారమువేసి ప్రాసము కల్పించినాడు. ఇత్యాదులు పెక్కు లితని కవిత్వమునందు బొడకట్టెడిని.' (ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక...)

ఈ ప్రధాన సమస్యలుగాక చిన్నచిన్న సమస్యలు పెక్కులు. నన్నయ మూడు పర్వములను సమగ్రము చేయలేదా, లేక చేసినది నశించినదా ? ఏల తిక్కన దానిని పూరింపలేదు ? కాబట్టి నాడు అది పూర్తిగా మూడు పర్వములును ఉండి తిక్కన తర్వాతనే ఆ భాగము లుప్తమై పోయియుండవలెనను నభిప్రాయము గొప్ప పండితులకే కలదు. 'ఆదరణీయ' యను పద్యమున తిక్కన 'ఆదిదొడంగి మూడుకృతు లాంధ్ర కవిత్వ విశారదుండు విద్యాదయితుం డొనర్చె మహిాత్ముడు నన్నయభట్టు దక్షతన్' అన్న దానికిని, అట్లే కేతన మారనలు కూడ ఆరణ్యపర్వమున శేషము కలదనక మూడును కలవనుటకును నర్థము. ప్రతాపరుద్రుని కాలము వఱకును నన్నయగ్రంథము సమగ్రమేయని తోచును. చదలువాడ సుందరరామశాస్త్రి గారును దండిగుంట సూర్యనారాయణశాస్త్రిగారును తాము టీకతో ముద్రించిన ఆంధ్ర, మ. భా. ఉపోద్ఘాతములో నిట్లు వ్రాసినారు '...ఇట్లు తిక్కన మారనల కాలములయందు నన్నయభట్ట రచితము లయిన యాదిసభారణ్యపర్వములు సమగ్రములై యుండి పదంపడి కాలక్రమమున నరణ్య పర్వోత్తర భాగ ముత్సన్న మగుటయు నా యుత్సన్న భాగమును ప్రబంధపరమేశ్వరుడునా ప్రసిద్ధిగాంచిన యెఱ్ఱాప్రెగ్గడకవి రచియించి భారతము పూర్తిగావించెను... కొందఱు నన్నయభట్టరణ్యపర్వమును సమగ్రముగా రచియింపక విడిచెననియు నెఱ్ఱాప్రెగ్గడ తదవశిష్టభాగమును బూర్తిగావించెననియు నుడివెదరు. అయ్యది తిక్కన మారనల వాక్యంబులకు విరుద్ధంబగుటచే ననాదరణీయము.' మారన ప్రతాపరుద్రుని నాటి గన్నసేనానికి మార్కండేయ పురాణమును అంకితమిచ్చెను. తిక్కనకు శిష్యుడుగాన ఎంత చిన్నవాడోగాని ప్రతాపరుద్ర చక్రవర్తి క్రీ.శ. 1295 కు తర్వాత రాజ్యమునకు వచ్చినందువలన ఆటు వెనుకనే వ్రాసియుండ వలెనుగదా. క్రీ. శ. 1300 ప్రాంతమున కుండిన నన్నయరచనలో ఆరణ్యపర్వములో కొంత, కాకతీయుల పతనానంతరము విప్లవకాలమున నష్టమై యుండవలయును.

నన్నయ భారతమునే ఏల అనువదించెనుప్రశ్న అంత గొప్పదికాదు. ఏలయన అది ప్రభువునాజ్ఞ. ఇక చిల్లర ప్రశ్నలను కథలను అటుంచి ప్రధాన సమస్యలలో మొదటిదానికి వత్తుము.

## (1) నన్నయ ప్రామాణికత

తిక్కనకు నన్నయయందు గౌరవ మపారమనుటకు సందేహములేదు గాని ప్రామాణిక బుద్ధిఉండెనా యన్నది ఆలోచింప వలసినది. అనగా మూడు పర్వములలో సామాన్యుడు నుడువు తెలుగు లరసికొని' రచియించినది ఎంతవఱకు నిజము, ద్రాక్షవాటి కవిరాక్షసు డెప్పటివాడోగాని ఆతడు నన్నయ భారతమే ప్రమాణమని యేల పల్కెను, సూత్ర సంపాదన లేదని యేల చెప్పెను. నన్నయ సమకాలికుడైనవాడని కథలలో చెప్పబడు భీమకవియైనయెడల ఆంధ్రశబ్దచింతామణిని ఎఱిగియే యుండును. నన్నయకు ద్వేషియైన నన్నయనెట్లు ప్రమాణీకరించును? తిక్కనకు ముందువాడా తర్వాతివాడా ? ఒకటినిజము ఆంధ్రభాష ప్రయోగ శరణ్యమనుట. ఎవడును ఆంధ్రశబ్దచింతామణిని చూచినగాని, విన్నగాని పాపనపోలేదు. కాని వీ రందఱును నన్నయను ఎంతవఱకు 'అరసి' కొనిరి ?

---

తిక్కన భారతములో నన్నయనుగూర్చి 'ఆదరణీయ' పద్యమున ఆతడు భారతములో 'ఆదిదొడంగి మూడుకృతు' లొనర్చెనన్నాడే గాని ఆతని ప్రామాణికతనుగూర్చి యొక మాటకూడ అనలేదు. నిర్వచనోత్తర రామాయణమున నన్నయస్తుతి చేయనేలేదు. సంస్కృత కవులను వ్యాస వాల్మీకులను నన్నయ స్తుతించినాడు. తెనుగువారిలో తానే మొదటివాడు గాన ఎవరినిగాని పేర్కొనియుండలేదు. తిక్కన నన్నయ్యను పేర్కొనియుండ నక్కఱలేదా, గ్రంథాదిని మనుమసిద్ధిని ఆశీర్వదించి వెనువెంటనే 'హరిహర పద్మ గర్భులను నాదికవీంద్రుల నాత్మ సత్కవీశ్వరులను భక్తిగొల్చి తగ వారి కృపం గవితావిలాస విస్తర మహనీయు డైన నను' అని చెప్పకొనుట ఉమ్మడి మాటగా కనబడుచున్నదిగాని నన్నయమీది ప్రత్యేక ప్రామాణ్యబుద్ధి కానరాదు. ప్రత్యేకాంధ్ర కవిస్తుతి చేయలేదు. మఱి తన తాతను 'సార కవితాభిరాము గుంటూరివిభుని మంత్రి భాస్కరు'ని గొప్పగా చెప్పుకొన్నాడు. చూడగా నొక రహస్యము బయటపడుచున్నది—కేతన దశకుమారచరిత్రను చూచిన తర్వాతనే తిక్కన, మొదట నిర్వచనోత్తర రామాయణమున చేయని, నన్నయస్తుతి, భారతమున చేసినాడు. పైగా అది అందు విధిగా చేయవలసినదే. అందులో కూడ ఎక్కువగా ఏమియు చెప్పలేదు. పూర్వాంధ్ర కవుల స్తుతికి కేతన మార్గదర్శకుడు, కేతనచూపిన కృత్యవతారికా సంప్రదాయములను చూచియే తిక్కన, అనుకరించి, కొంతమార్చి, షష్ఠ్యంతాదులను రచించి తన పద్ధతులను మార్చుకొనెను. నిర్వచనమున లేని పద్ధతులు భారతమున కెక్కినవిగదా. తర్వాతివారు తిక్కన భారత మార్గానుయాయులుగాని కేతనపద్ధతివారుగారు. ఇంకనుచూడ—తిక్కన భారతములో—నిర్వచనముగా వ్రాయుటను గొప్పగా చెప్పుకొన్నవాడు ఆ పద్ధతినికూడ మార్చుకొని భారతమున వచనములను 'సమృద్ధిగాను ప్రౌఢముగాను చేర్చినాడు'. కేతన తన్ను తిక్కన మెచ్చుకొనె నన్నాడు గదా—ఒక్క కవితకేగాదు వక్కాణలకుకూడ.

తిక్కన నన్నయనుపఠించి కవిత నేర్చుకొనలేదు గదా, అంతకన్న విచిత్రము కేతనయు నంతే. అది కేతన తన యాంధ్రభాషాభూషణములో నన్నయను ప్రమాణీకరింపక పోవుటయే. తానే తెనుగునకు మొదటి వ్యాకర్తయని చెప్పుకొనుటయేగాక ఆంధ్ర కవులకు వాఙ్మయవిషయమున ఏది ప్రమాణమనుటనుగూర్చి యిట్లన్నాడు.

> 'కంచినెల్లూరు మఱియోరుగల్లుయోధ్య
> యనుపురంబులపై గంగకరుగు మనిన
> పగిది నొక్కత్రోవ జూపెద; బహుపథంబు
> లాంధ్రభాషకు గలవని యరసికొనుడు'

నన్నయ పేరెత్తడు. తిక్కనవంటివాడు నన్నయను ప్రమాణబుద్ధితో పఠించి కవిత నేర్చియుండిన

కేతనకు ఆ మార్గము పనికిరాకపోయినదా ? ద్రాక్ష వాటి కవిరాక్షసుడు అంతగట్టియనుశాసనమును చేసియుండ వీరేల ఇట్లు 'బహు పథంబులుగల' వనుట. అందు నన్నయ్యది ఒక పథముకాబోలు.

మఱి నన్నయ్య ప్రామాణికత ఎప్పటినుండి? ఎఱ్ఱనకు తర్వాతనుండి ఏర్పడియుండునా ? అట్లును కానరాదు. కేతనకు తర్వాత వ్యాకరణము వ్రాసినవాడు కావ్యాలంకార చూడామణికారుడు విన్నకోట పెద్దన. శ్రీనాథునికి సమకాలికుడు. విశాఖపట్టణముజిల్లా ఎల మంచిలి పంచధారల ప్రాంతమువాడు. అచ్చటి చాళుక్య విశ్వేశ్వర చక్రవర్తికి ఆస్థానకవి. తన గ్రంథ ములో ప్రాచీనకవులను — సంస్కృత కవులనుగాని తెనుగు కవులనుగాని — ఎవరిని స్మరింపక, నన్నయ పేరైనను ఎత్తక వదలెను. శ్రీనాథుడును ఒక్క హర విలాసమున వదలెను. పెద్దన వ్యాకరణాధ్యాయమున ఆంధ్రశబ్దచింతామణి యొకటున్నట్లుగాని, ఉండి నట్లుగాని చెప్పడుకదా — నన్నయ్య ఒకడే ప్రామాణి కుడు, అతని భారతమును చదివి నేర్చుకొనుడని భావి కవులకు చెప్పడు. గ్రంథాంతమున,

'ఇది తెనుగున కెల్లను జ
పదవిదితంబైన తెఱుగుప, ట్టించుక యె
ల్లిదముగ జెప్పితి, నంతయు
మదినెఱుగుం డరసి బుద్ధిమంతు లితరముల్'

తనది సమగ్రము కాదనియు లోకమునుండి గ్రహింపుడని కవులను హెచ్చరించినాడు. ఇది కేతన మాటలకు బలము కలిగించుచున్నది. కాని ఇందే, 9 వ ఉల్లాసమున 58 వ పద్యములో,

'అచ్చుపరమైన పట్టున ప్రాణిపదము
కర్మ మగుచోట దక్క నుకారయుక్తి
వాడుకొనరు చకారభావమున దాని
ననుచరింపుదురు కవిత్రయానుమతిని'

అనునది కనబడుచున్నది. పద్యములు 54 నుండి 58 వఱకు ఆంధ్రవిశ్వవిద్యాలయమువారి ప్రతిలో లేవు. సాహిత్య పరిషత్తువారి ప్రతిలో కలవు. గ్రంథాంతమున 'అరసి'యనిచెప్పి మఱి యొచ్చ టను కవిత్రయము పేరెత్తనందువలన ఈ నాలుగు పద్యములును తర్వాతివారెవరో చేర్చి యుండవలెను. ఇందు కేతనపద్యములు కూడ ఎవరో చొప్పించి యున్నారు.

ఈ విధముగా శ్రీనాథుని కాలమునకు కూడ ఏర్పడని ప్రామాణికత నన్నయ్యకు తర్వాతకదా వచ్చి యుండవలెను. నన్నయ ప్రామాణికతను గుఱించి సంపాదకీయోపోద్ఘాత మిట్లనుచున్నది — 'అతనికి బూర్వము శాసనము లందుగల యాంధ్రభాషను బరి కించినచో నది ప్రకృతి ప్రత్యయరూపవైవిధ్యముతో గూడి యవ్యవస్థితమై యుండినట్లు తెలియవచ్చును. దానిని అప్పుడు వ్యవహారమునందుండిన భాషను పరి శీలించి యందు సంస్కృత పదములను వాడుట కను వగు విధానము నేర్పఱిచి, నన్నయ యాంధ్రమునకు స్థిరమును మహాకావ్యోపయోగియు నగు సుందర రూపమును కల్పించుటచే నతనికి శబ్దశాసన బిరుదము కల్గెనని యూహింపవచ్చును. మహాభారత కర్తృత్వ మును బూనుటకుముందే యతడు శబ్ద శాసనత్వ మును నిర్వహింపవలసి వచ్చెను. 'విపుల శబ్దశాస నుడ' నని యాత డవతారికలో దన్నుగూర్చి చెప్పు కొనుట యిందుచేతనే'.

ఇదంతయు యుక్తియుక్తముగానే కనబడు చున్నది గాని మనకవులు బిరుదములుపొంది తర్వాత కావ్యములలో ఆ బిరుదము ప్రయోగించుకొనిరా లేక ఆయాపనులు నిర్వహించుచునే బిరుదములను పెట్టు కొనిరా యనునది సమస్య. కేతన దశకుమార చరి తానువాదమునందు తాను అభినవదండి నని చెప్పు కొన్నాడుగదా అది దేనినిబట్టి? ఇది తనదే (దండిది) గ్రంథానువాదమా ? కవులు గ్రంథములు వ్రాయుచు కొంత ప్రచారముచేయుచు అంకితాది కావ్య భాగములను చివర వ్రాయుట అలవాటు. దశ కుమారచరిత్రానువాదముచేత కేతన అభినవదండి. ఆంధ్రమహాభారత రచనచేతను ఒక ప్రాటి ప్రచారము చేతను నన్నయ విపులశబ్దశాసనుడు. అంతమాత్ర

మునకే ఆత డాంధ్రశబ్దచింతామణి కర్తయని తేలదు. ఇందులకు చేయపడినఊహలు నిరాధారములు.

తఱచిచూడగా ఆంధ్రశబ్దచింతామణిని అసలే ఎఱుగరుగదా నన్నయను ప్రామాణికబుద్ధితో పఠించి, తద్ద్వారా కవితను పదప్రయోగాదికములను తెలుగులో ఆదికవీంద్రులు నేర్చుకొని తర్వాతనే కవిత చెప్పినారనుటకూడ సందేహాస్పదముగా నున్నది. తిక్కన కేతన మారన మంచన ఎఱ్ఱన శ్రీనాథ పోతనాదులు ఈ సంప్రదాయమును ఎఱుగరు. నన్నయను అతిక్రమింప గూడదను శాస్త్రము నాటికి వచ్చినట్లు లేదు. ఎఱ్ఱన మాత్రము అరణ్యపర్వశేషపూరణమునకును 'తద్రచనయకా' చేయుటకును ఆతని 'సరససారస్వతాంశ'ను అలవఱుచుకొనెను. చక్కని అనుకరణము. అట్లుండియు వెనువెంటనే కవిత్రయ ప్రామాణికత ఏర్పడినట్లు కానరాదు. ఏలయన పూర్వ కవిస్తుతిలో కొందఱు ఎఱ్ఱనను, కొందఱు అతనినివదలి అతనిస్థానములో నాచన సోమనాథుని స్తుతించి యున్నారు. ఇంతవఱకును నన్నయకులేని ఏకైక ప్రామాణికత బాలసరస్వత్యాదులకు తర్వాతనే వచ్చియుండవలెను. క్రీ. శ. 11 వ శతాబ్దమున వెలువడిన ఆంధ్రశబ్దచింతామణి తక్షణమే అదృశ్యమై అటుతర్వాత కొన్ని శతాబ్దములకు లభ్యపడెనా! సిద్ధడొకడు తెచ్చి బాలసరస్వతి కిచ్చెనట !

'ఏమి మహాద్భుతం బిది హరీ!
హరి ! యెక్కడి యాంధ్రశబ్ద చిం
తామణి ఫక్కి యెక్కడి
మతంగ నగంబు, యుగాది సంభవుం
డై మని చన్న నన్నయమహాకవి
యెవ్వడు ! సిద్ధుడెవ్వ ! డా
హా, మదగణ్యపుణ్య సముదగ్రత
జేకుఱెగాదె యిన్నియున్'

'ఇలఁబజ్ఞానిధులౌకవుల్ మునువు
లేరే, వారు వ్యాఖ్యాన క
ర్తలుగానోపరె ? పెక్కువత్సరము
లంతర్భూతమై యున్న యీ

తెలుగున్ వ్యాకరణంబు నా కొసగె
బ్రీతిం డీక గావింపు మం
చల సిద్ధుండు మదిష్టదేవత
విరూపాక్షుండు నిక్కంబుగాన్'

ఇట్టి కథలను అసత్య ప్రచారములను ఆ కాలమున జనులు నమ్ముచుండిరి. రాజులకు అంకితమిచ్చు బాధలు తప్పించుకొనుట కనుకూలముగా కవులు స్వప్నములను కల్పించుచుండిరి. దేవుడనగానే ఏరాజు కాదనగలడు. ఈ యసత్యములనుగుఱించి యొక యుద్గ్రంథము వ్రాయవచ్చును. తన వ్యాకరణ జ్ఞానమునకు ప్రామాణికత్వము కలుగుటకు బాలసరస్వతియు, అతనినిమించి తనకు కలుగుటకు అప్పకవియు పోటీలుపడి చేసిన కల్పనగాని ఇది ఇతరము గాదు. ఇంత యెందులకు ఒక్క సారంగధరుని కథ వలననే ఇదంతయు మోసమని స్పష్టము. 'మహిని రాజనరేంద్రుడు మాళవపతి' అని చేమకూర వేంకటరాజు చెప్పినాడు. చౌరంగికథ శైవులవలనవచ్చి చివరకు రాజరాజనరేంద్రునికిని రాజమహేంద్రపురమునకు ముడిపడనది. సంబంధములేని యౌగంధరాయణుని కథ ప్రతాపరుద్రునికి ముడిపడలేదా. కాళిదాసు భోజుడును మల్లినాథసూరియు సమకాలికులని కొందఱు వ్రాయలేదా. రాజరాజనరేంద్రునికి రత్నాంగియు లేదు చిత్రాంగియులేదు. రాణి అమ్మంగాదేవి. గంగైకొండ చోళుడని ప్రసిద్ధినందిన చోళరాజు రాజేంద్రచోళుని కొమార్తె. కుమారుడు రాజేంద్రుడు, తర్వాత ఉభయకులోత్తుంగచోళుడని పేరుపొంది ఆంధ్ర తమిళ రాజ్యములను ఏబదియేండ్లు పాలించినవాడు. సారంగధరుని వాసనయేలేదు. చరిత్ర తెలియనికాలమున 'ఫోర్జరీ'చేసిన బాలసరస్వత్యాదులు తమ అసత్య పరంపరవలన బయటపడినారు.

ఆంధ్రవాఙ్మయమందు పరిశోధన యారంభించిన అప్పకవ్యాదులు తమకు కనబడిన వ్యత్యాసములకు తగిన సమాధానములు వెదకుచు చివరకు ఇట్టి కల్పనలలో పడినారు. బమ్మెర పోతరాజుయొక్క రేఫఱకారజ్ఞానమునే అప్పకవి శంకించినాడుగదా.

పోతరాజు స్వతంత్రించెనా లేక అప్పకవిపాటి పండితుడు కాడా !

> 'బమ్మెర పోతరాజ కృత
> భాగవతంబు జగద్ధితంబుగా
> కిమ్మహి నేమిటం గొదువ !
> ఎంతయునారసి చూడగాను రే
> ఫమ్ములు రాలునుం గదిసి
> ప్రాసములైన కతంబునం గదా
> ఇమ్మహి నాది లాక్షణికు లెల్లను
> మాని రుదాహరింపగన్'

ఈ కథలను విశ్వసించి ఆధునికపండితులు, పూర్తిగ చారిత్రక భావములు సహింపనివారు, ప్రాచీన మార్గమునవే యుండుటలో ఆశ్చర్యములేదు. 'ఆం. శ. చిం. నన్నయ వ్రాసెననువారును లేదనువారును కలరు. అధర్వణుడు చిం. మణిని పూరించినవాడు. చిం. మణివలెనే సంస్కృతమున రచించెను. అహోబల పండితీయము...వ్యాఖ్యనుండి సంగ్రహింపబడినవే గాని ఈ కారికలకు ప్రాచీన తాళపత్ర మాతృకలు లేవు ... వేరుమాతృకలు లభింపకుండుటచే వానిని అహోబలపండితుడే రచించి ప్రసిద్ధికై యధర్వణుని పేరిడెననియు, అట్లే బాలసరస్వతి తెలుగున టీక రచించువఱకు చింతామణి ప్రచారములోనికి రాకుండుటచే బాలసరస్వతియే దానిని రచించి గ్రంథ గౌరవమునకై నన్నయపేర వెలయించెననియు నిటీవల కొందఱు విమర్శకు లొకవాదమును లేవనెత్తిరి ... సమ్మతమ్ములు కావు...చింతామణి దానివలన వాగనుశాసన బిరుదము...పరంపరాగతముగా లోకమున...ఇది సిద్ధాంతిత విషయము ... పై రెండు గ్రంథములును సంస్కృతములో సూత్రప్రాయముగా వ్రాయబడినవి. అందు లక్షణములేగాని లక్ష్యములు లేవు ... ' అని పెద్దపండితుల యభిప్రాయము.

'మున్నుతెనుగునకు లక్షణ...క్రొత్తగ నాంధ్ర భాషకును...' అను పద్యములకు ఇట్లర్థము చెప్పినారు శ్రీ వఝలవారు. 'ఆంధ్రశబ్ద చింతామణి సంస్కృత శబ్దములను దెనుగులోనికి దెచ్చుకొనుటలోని పద్ధతులు మాత్రమే ప్రధానముగా రచించుటచే నది తెనుగునకు లక్షణమనిపించుకొనదని కేతన యిట్లు చెప్పెనన్న యర్థము సైతము పై పద్యములకుఁ జెప్పుటలో విరోధ మగపడదు. కాని యావఱకు జింతామణివంటి వ్యాకరణము లేదను నర్థము సైతము పై పద్యములవలన లభింపకపోలేదు. అట్లయిన నది యావఱకు బుట్టియుండలేదనుట సరికాదుగదా.' (ఆం. శ. చిం. విషయ పరిశోధనము). 'ఇందలి పీఠికలోని పద్యములకు నన్నయాథర్వణులు సంస్కృత ప్రాకృతములకు సంబంధించిన తత్సమభాషకు లక్షణము వివరించిరనియు, అందుకొరవడిన దేశ్యపదములకు తానిపుడు లక్షణములు చూపుచున్నాననియు కేతన యాశయముగా గ్రహించుట సరసమైన పద్ధతి' (దు. వెం. శా. సంస్కృతి సం. 3). ఒకటి స్పష్టము గదా కంఠోక్తముగా వీరెవ్వరును ఆంధ్రశబ్దచింతామణికి సంబంధించిన వాక్యములు చూపలేదు. ప్రాచీన పండితులుగాని కవులుగాని దాని నెఱుగరు. వారి భాష దానిపై నాధారపడలేదు. లోకమునుండియే గ్రహించినారు. నన్నయ భారతమునుండి కూడ కాదు. తనకుముందు వ్యాకరణమే బొత్తుగా లేదను కేతన మాట అసత్యములా! 'నన్నయ భట్టాదికవి జనంబుల కరుణన్' అన్నవానికి చింతామణిని గుఱించి యొక మాట చెప్పుట కష్టమైనదా. 'భాషావేదులు నను విని యా షణ్ముఖ పాణినులకు నగు నెనయని సంతోషింప నాంధ్రభాషాభూషణమను శబ్దశాస్త్రమును రచియింతున్'. ఇవి విన్న తర్వాత కూడా సందేహమా? మన పండితుల మార్గము చారిత్రక దృక్పథమునకు భిన్నముగా నున్నది.

బాలసరస్వతిది 17 వ. శతా. తెలుగుటీక. అప్పకవిది 17 వ శతా. తెనిగింపు పద్యములలో. అహోబల పండితునిది పై రెంటిని సమన్వయించి సంస్కృతములో విపులవ్యాఖ్య. ఇందులో బాలసరస్వతికిని అప్పకవికిని చింతామణి ప్రతులు వేర్వేఱుగా లభించినట్లును అందనేక పాఠభేదములు గోచరించినట్లును ఆ రెంటిలో బాలసరస్వతి పాఠమునే తాను

గ్రహించినట్లును అహోబలపతి చెప్పియున్నాడుగదా. అందు పూర్వ వ్యాఖ్యానములను విమర్శించినాడు.

చూడగా ఇది 17 వ శతాబ్దమునుండి ఏర్పడిన సమస్య. అసలు రహస్యము తెలియకయో, తెలిసి ఎత్తుకు పైయెత్తుగానో అప్పకవి, ఆకాలమున దొరకిన గ్రంథములను ఓపికతో పరిశోధించి గొప్పపని చేసినాడు. తెలుగువారిలో మొదటి డాక్టొరేటుబిరుదు అతనికే చెల్లును. ఆతని సిద్ధాంతము లెట్లుండినను ఆతనియాస్థ కొనియాడదగినది. నన్నయ తిక్కనాదులలోని భేదములును, తర్వాతి కవులలోని భిన్న విషయములును రీతులును ఛందోవ్యాకరణాది వైమత్యమును చూచి ప్రాచీన లాక్షణికులకే 17 వ శతాబ్దమున పరిశోధనావశ్యకత తోచినది. సాధుత్వాసాధుత్వ నిర్ణయముయొక్క ఆవశ్యకత అభిలషణీయమైనది.

నన్నయ తిక్కన ఎఱ్ఱనల పాఠములేవో నిర్ణయించుట సులువైన పనిగాదు. అసలు ప్రతులు ఎన్నడోపోయినవి. మాతృకలకు పుత్రికలును వానికి పుత్రికలునుగా ఎన్నియో తరములు దాటినవి. ఎంతవఱకు తాళపత్రములు శరణ్యములు. వానితో లాక్షణికులయు, వ్యాఖ్యాతలయు, సంకలన గ్రంథకర్తలయు ఉదాహరణములను, మహాకవుల అనుకరణములను—ఇంతెందులకు వాఙ్మయమునంతటిని మథించి సారమును క్రోడీకరించి పోల్చి పరిశోధించినగాని సాధ్యముగాదు. అనువాదవాఙ్మయమునకు మూలము ఎంతో తోడ్పడును, కాని మనవారిది యథామూలమా స్వతంత్రమా, సందర్భోచితమా, యథాసౌకర్యమా, కావ్యమందంతయు ఒక పద్ధతికలదా? కొంత ఒక విధము మఱికొంత మరొకవిధము— ఇట్లుండుటయు కొంత బాధాకరము.

ప్రప్రథమున ముద్రించిన పండితులు అప్పకవ్యాదులను విశ్వసింపక తప్పలేదు. నన్నయ ఆదికవియే గాక ఆంధ్రశబ్దచింతామణి కర్త, అథర్వణుడు ద్వితీయాచార్యుడు, తిక్కనాదులు నన్నయనే అనుసరించిరి అను భావపరంపరలో వచ్చినవారుగాన వింతగా కనబడిన ప్రయోగములు ప్రామాదికములని తలంచి మార్పక తప్పలేదు. వారట్లు సంస్కరింపక పోయియుండిన సమకాలిక పండితులు గర్హించియే యుందురు. ఏ కాలపు పాండిత్యము ఆ కాలమునకు ఒఱపురాయి. ఇట్లుండగా ఎంతో పరిశోధన సామగ్రి దొరకి పరిశోధించి మనమిప్పుడు గ్రహించిన నూతన పాండిత్యము ననుసరించి, ఈ పండితులకు గ్రాంథిక దురభిమానము నారోపించి 'వారు దిద్దివేసినారు' 'చిత్తము వచ్చినట్లు మార్చివేసినారు' 'అట్లు చేయుటకు వీరికేమి అధికారము' అని యాక్షేపించుట వారి భాషాసేవకు విశ్వాసము చూపుట కాదుగదా బొత్తిగా దయారహితముగా నున్నది. ప్రాచీన లేఖకులే 'కరకృత మపరాధం క్షన్తుమర్హన్తి సంతః' అని వ్రాయుట ఆచారము. శ్రీ వీరేశలింగము పంతులవంటి చారిత్రక దృక్పథము గలవారే చరిత్ర తెలియనినాడు 'పీతాబుఖానను' పాఠమును 'చితాబ్జఖాను'డని మార్చలేదా, దానిని కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు దిద్దలేదా!

చూడగా కేతన విన్నకోటపెద్దనలు చెప్పినట్లు తిక్కనాదులు నన్నయను చక్కగా అవగాహన చేసికొని ఆతనిమార్గమును గ్రహించియు స్వతంత్రించినారనుటకు లేదు. ఏలన 'బహుపథంబు లాంధ్ర భాషకు కలవు'. ఇక పాఠ నిర్ణయాదులను గుఱించి చర్చించుటకు అనువాద విధానమునుగురించి చర్చించుట అవసరము.

## 2. అనువాద విధానము

నన్నయాదులు అనువాదము చేయునప్పుడు తమకు తోచినట్లు మార్చిరని మనవారి యాశయము. సంస్కృత మహాభారతము మూలప్రతులు దేశమందు భిన్నప్రాంతములలో భిన్నరీతుల నున్నవి. నేడు మనకు దొరకు సంస్కృత మూలము యొక్క ప్రతుల ననుసరించి నన్నయాదులు మార్చిరని తలంచుటకూడ ఎంతవఱకు సమంజసము? ఇచ్చటకూడ మన పండితుల చారిత్రకదృష్టి వేరు విధముగా నున్నది. నన్నయ ఏప్రతిని అనుసరించెను? ఆయన కాలమున ఇన్నిప్రతులుండినవా? 'మహాభార

తంబునుంబోలె శతపర్వ సమన్వితంబును' అని మన కవులుచెప్ప శతపర్వము లెప్పుడు అష్టాదశ పర్వము లైనవి? దీని మూలరూపమేమి? ఎన్నిశ్లోకములు? ఇత్యాద్యనేక సమస్యలను గుఱించి మన తెలుగు పండితులు ఇటీవల చూపు శ్రద్ధ ఏబదియేండ్లక్రింద చూపలేదు. నన్నయ్య 'మార్చుట, అతిక్రమించుట, తగ్గించుట, తీసివేయుట, ముందువెనుకలు చేయుట' ఎంతవఱకు సాధువులో మూలమునుగుఱించి చేయబడిన పరిశోధన తెలుపగలదు. పూనా పండిత మండలియు శ్రీ సూక్థంకరు మహాశయులును చేసిన పని జగత్ప్రసిద్ధము. దీనినిగుఱించి ఈ పరిశోధిత ముద్రణ వర్గమువారు విస్తారముగా వ్రాసియున్నారు. ఈ పరిశోధనావశ్యకతనుగుఱించి ప్రపంచ సంస్కృత విద్వాంసులకే చైతన్యము కలిగించి, జర్మనీ పండితుడు వింటర్నిట్సు తన సంస్కృతవాఙ్మయ చరిత్రమున పలువార్లు ఉదాహరించి ప్రశంసించునట్టి యుద్గ్రంథమును వ్రాసినవారు ఆంధ్రులే, మనవారే. వారిని గుఱించి మన పండితులకే ఏమియు తెలియకయుండుట ఒక యాశ్చర్యము. వారు మా చినతాతగారు వేదము వేంకటాచలముగారు. Vedam Venkatachalam Iyer అనియు, V. V. Iyer అనియు ప్రసిద్ధులు. నెల్లూరిలో న్యాయవాదులుగానుండియు బహుభాషా కోవిదులై సంస్కృత వైదికవాఙ్మయమును మథించి పౌరాణికచారిత్రక భూగోళాది బహువిషయములపై వ్యాసములు ప్రకటించి తమ సమకాలిక జర్మన్యాదిదేశ పండితులకు పరిచితులై ప్రామాణిక పీఠము వహించి యుండిరి. (1864—1931). వీరు సంస్కృత మహాభారతమునందలి పర్వానుక్రమణికను ప్రధానముగా గ్రహించి, భిన్నదేశప్రతులతోపోల్చి ఏయేభాగములు ప్రక్షిప్తములు అనుటను గూర్చి 1922 లో 'A Study of the Preliminary Chapters of the Mahabharata to separate the original from the spurious' అని యొక గ్రంథమును వ్రాసిరి. దీనిని వింటర్నిట్సు, సూక్థంకర్ పండితులు శిరసా వహించినారు. దీని ప్రతులు ఇప్పుడు దొరకవు. మన లైబ్రరీలలోను ఎక్కడనోగానిలేవు. కాబట్టి అందుండి వారి యభిప్రాయములను పరిశోధకుల అనుకూలము కొఱకు ఇచట ఉద్ధరించుచున్నాను. పు. 97—100.

I have to introduce to the reader, here, a metrical translation of the Maha-bharata into the vernacular dialect of Telugu. The translation was started by a great Telugu poet of the name of Nannaya Bhatta. He was a brahman, a great scholar and accomplished poet. He flourished at the court of the Eastern chalukya king Vishnuvaradhana, who had his capital at Rajahmundry on the northern bank of the Godavary in the east-coast district of the same name and is believed to have ruled from 1022-1066 AD. (ఇప్పుడు పరిశోధకుల యభిప్రాయము 1019—1061.)

The poet completed the rendering of the first two books and passed away after a considerable portion of the third book had been done. The work was completed after long interals of time by two other poets of great eminence. These three poets deservedly rank as the greatest in the field of Telugu literature. The work of the first of them, comprising the first two Books and the unfinished portion of the third, was written, as ascertainable from historical records towards the earlier part of the 11 th century of the christian era. It is thus at least 900 years old. Its value, therefore, for comparative criticicm, is very great. At that period it appears that the text of the Bharata had already been consolidated almost entirely into its present form. While therefore identity of matter conveys no indication as to antecedent period at which an interpolation may have found its way into the text, the existence of any significant variation or omission is full of suggestion.

The translators undertook the task as a religious one. They were Brahmans, eminent as men of letters even in times so prolific of true scholarship. They allowed themselves a certain lattitude, which would bear comparison with similar work of translation elsewhere. They

might abridge a tedious narrative, they might ignore tiresome repetition. In places where the description of a landscape or seasonal scenery, or personal charms of a beautiful woman or other like topics formed the theme, they might give free play to their fancy and develop the sketch in a style of art favoured by them. But there are matters with which they could not and did not tamper. They could not alter the facts or the sequence of historical narration. They might correct an apparent error or accidental slip. They might set right an incorrect reading. They might leave out an unimportant portion but if they chose to embody it they could not mistranlate it. They could not misplace geographical locations or unsettle chronological data or vary arithmetical figures. They might perhaps occasionally take liberties in the arrangement of the matter. Where the context allowed and where the narrative would not suffer but, on the other hand gain by the dislocation. But they could not, as Brahmin poets, suppress passages which were put into the original text with set purpose that every brahman could easely understand and to suppress which would be little short of profanation.

They were orthodox scholars, who believed in the religious merit of a study of the Bharata. They say so in their work. They expected to achieve a higher merit by rendering the text accessible to the general.........That is what heightens the value of this translation for purposes of comparative study. The first portion of the Telugu translations was done at the court of a powerful monarch to whom it was dedicated. His vanity or that of his ancestors suggested the derevation of his lineage from the Pandavas themselves. It is not possible or probable that incorrect renderings should have been offered to or passed unchallenged by the assembly of literary talent at his court,

It is a matter for wonderment that the Telugu Bharata does not speak of the visit of Brahma to vyasa on the copy prepared by Ganesa to the dictation of Vysaa.

Was it possible that the Brahmin translator of the Bharata should have suppressed these incidents if they existed in the text that he followed? What motive could he have had for suppressing them? They were calculated to heighten the sanctity of the original work, and would certainly have to enhance the scriptural value of the translation and the religious merit of the translator, was it for him to suppress the fact that the great Bharata was usherd into existence by the pen of Ganesa under the sponsorship of the creator of the Universe? Telugu poets are generally in the habit of inventing such embellishments and this poet could certainly not have served either himself or his reader by suppressing these recitals. At any rate, this suppression was not calculated to flatter the vanity of the monarch to whom the work was dedicated. On the other hand we find in the Telugu Bharata, language, in profusion, reproducing the praises bestowed on the work of vyasa in the original and expressing, in glowing language, the benifits religious and secular supposed to follow from a study or knowledge of its contents,

There is another fact requiring mention. The Telugu Bharata is clear that it was the identical text recited by Vaisampayana to Janamejaya that was recited also to Gods, the pitries and Daemons, Narada, Suka etc. It is apparent that the Sanskrit text of the Telugu poet, contained, in this respect, something different from what we now possess.

Further Comment superfluous.

పర్వానుక్రమణికా పర్వసంగ్రహములను గురించి ఇట్లు వ్రాసినారు —

The Value of the Telugu Preliminary enumeration for critical purposes cannot be understated (p. 137). The author purports to translate the Sanskrit పర్వానుక్రమణికా and పర్వసంగ్రహ or what is now the 2 nd chapter of the Bharata or what in his time, (the first half of the eleventh century A. D.) corresponded to the same. It should be understood that the cantoes he enumerates are the cantoes of the original Sanskrit Composition and not of his own translated text. It should also be noted that the Telugu translation does not reproduce the Sanskrit post scripts (p. 137)...To sum up, It appears that the Telugu translator dealt with some version of the original, but it is not clear that the enumeration in the text used by him was quite like what we now find in the text in vogue. (143)......It is clear that the Telugu enumeration was written out by the author in view of his undertaking to faithfully reproduce the Sanskrit, though with the knowledge that the arrangement of the Sanskrit text did not agree with the same; and with the knowledge that the enumeration he was giving would not agree with the text of the translation he was preparing. Of course he should also have known, if the Sanskrit Preliminary enumeration stood as it does now, that he was designedly altering it. He did not alter it to suit the arrangement of the text as it stood in Sanskrit. He did not alter it with the idea of rearranging the text in his translation to accord with his own enumeration; for, his text is, Chapter after Chapter, in accordance with the Sanskrit original. It is therefore impossible to conceive why or how he should have made an international departure, involving responsibility in double regard. Knowingly and willingly he prepared a list which did not accord with the Sanskrit Preliminary enumeration or with the Sanskrit post scripts or with his own translation of the text. Was that likely? The writer is of opinion that the Preliminary enumeration in Sanskrit has been revised since the time of the Telugu author, that the latter copied the text of the enumeration as he found it, though he knew it varied from the reality as found in the body of the epic.,. (145)......whatever the contradiction or absurdity was, it was the work of Vyasa. But Vyasa was eternal and an incarnation of Vishnu: Was it for this Brahman poet to question the propriety of Vyasa's composition? Certainly not. He would render into Telugu what he found in the Sanskrit enumeration and the Sanskrit text, and leave it to Vyasa to justify all. This, in brief was probably the attitude of the Telugu poet. The text of the sanskrit Bharata had been radacted, probably, though we cannot say with assurance, finally and almost all of the interpolations admitted into this huge hotch-pot of centoism, before the Telugu author's time. But the first two chapters had probably not been completely revised with a view to making changes, additions and substractions on the principle of mutaties mutandies, having due regard to the interpolations." (146)..,.

"At one time of its history the Bharata was divided into cantoes, of which the traditional number was one hundred. At a later period the Bharata was devided into Books (the number of which reached 18 in a progressive scale of variation)....

That the Puranra now extant under the name of Harivamsa was a later forgery.

That a comparison of the Telugu author's enumeration of the hundred cantoes with the Sanskrit preliminary enumuration, shows that, in the case of 17 or 18 canto titles, the Sanskrit post-cripts are of doubtful authority" (p. 149)...

Whether the Telugu author had a more complete original before him or whether he discovered, from the example of the detail of the first book, that a note about the cantoes in connection with each book was contemplated and had better be supplied, he has in his summary given the number of cantoes in each Book, including the first canto of each book by name, so that, when we know the first canto of each Book and the number of cantoes of that Book, we can find out what they are by reference to his preliminary enumuration in due observance of sequence.

The Telugu gives us correct idea of the relation of the cantoes to the Books, which information has been withheld from us in the Sasnkrit original either by accident or design" (P. 152)

యయాత్యుపాఖ్యాన దుష్యంత చరిత్రములను గుఱించి చర్చించి ఇట్లు వ్రాసినారు.

'The Yayatyupakhyanam found in the Bharata is, word for word and line for line, a copy of what is found in the మాత్స్య పురాణ, where the recital is by the fish avatar to Manu, the first man or King......... It is clear to the writer that both these upakhyanams are interpolations and that Yayatyupakhyanam was probably of a later date in entry into the Bharata than even the redaction of the 2 nd Chapter. As usual we have a brief and also an extended narrative of Yayati's story. It is thoroughly extraneous matter and the double infliction might have been spared '

ద్రౌపదీ వస్త్రాపహరణమును గుఱించి—

సీ॥ ఇది సేయగాదని మది విచారింపక
సద్గర్హితుండు దుశ్శాసనుండు
నెట్టన ద్రౌపది గట్టిన పుట్టంబు
సభలోన నొల్చె నాశంకలేక,
యుడుగక యొలువంగ బడియు మున్నపనీత
మైన యవ్వస్త్రంబునట్టివలున
లలితాంగి జఘనమండలమున బాయక
యొప్పుచునున్న, నయ్యువిద జూచి
గీ॥ సభ్యులెల్ల నుదిత సమ్మదులైరి, దు
శ్శాసనుండు వస్త్రచయము పర్వ
తోపమానమైన, నొలువంగ నోపక
యుడిగె లజ్జబొంది యుక్కుడక్కి.

'It is apparent from the above that the text translated by the Telugu author knew nothing of Draupadi's appeal to Krishna or of his intercession. The inference is clear that the passage referring to the same is an interpolation of a period later even than that of the Telugu poet.' (p. 181) ఇదంతయు చూచినతర్వాత నన్నయ తగ్గించి, తీసివేసి, మార్చి స్వాతంత్ర్యము వహింపలేదనియు చాల జాగ్రత్తతో తెనిగించెనని తెలియనగుచున్నది. సూక్థంకరు, వింటర్నిట్సు పండితులు ప్రమాణముగా గ్రహించిన మా చినతాతగారి రచన మన యాంధ్రుల కింకను తెలియకపోవుటయనగా ఎట్టిది ! పాఠ నిర్ణయమందును అర్థనిర్ణయమందును మూలముతో పోల్చుటకు పై యభిప్రాయము లెంతో తోడ్పడగలవు గదా.

ఈ భారతము ఎంత మార్పులను పొందినదో గాని మార్చినవారి అజాగ్రతకూడ అంతకన్న అధికముగానే కనబడుచున్నది. భారతమును మును మనవారు పంచమవేద మన్నారుగదా. మరివీరే భరతనాట్యశాస్త్రమునుకూడ పంచమవేదమని చెప్పియున్నారు.—

'మహేంద్ర ప్రముఖై ర్దేవైః
ఉక్తః కిల పితామహః
'క్రీడనీయక మిచ్ఛామో
దృశ్యం శ్రవ్యంచ యద్భవేత్
నచవేదవిహారోఽయం
సంశ్రావ్య శ్శూద్రజాతిషు,
తస్మాత్సృజాపరం వేదం
పఞ్చమం సార్వవర్ణికమ్'
ఏవమస్త్వితి తానుక్త్వా
......................
నాట్యాఖ్యం పఞ్చమం వేదం
సేతిహాసం కరోమ్యహమ్.
నాట్యవేదం తతశ్చక్రే
చతుర్వేదాఙ్గ సంభవమ్.'

రెండును వెవ్వేరుగా పంచమవేదములా కలసి పంచమవేదములా అర్థమగుటలేదు. దేశమందంతయు భారతము పఠింపబడుచుండినది. భరతనాట్య ప్రదర్శనములును జరుగుచుండినవి. ఒకదాని ఉనికి ఎఱుంగక ఇంకొకరు కల్పించిరా లేక దేశమందు కొన్ని ప్రాంతములో భారతమును కొన్నిట భరతనాట్యశాస్త్రమును పంచమవేదములా! ఇట్టి గందరగోళమునకు మూలము గుఱియై యుండగా మనమేమనగలము. ఇదంతయు నన్నయనాటికి జరిగిపోయినది. కాన నన్నయ మూలమును చక్కగా పరిశోధించి నిర్ణయించుట దేశోపకారి.

(సశేషం)



# స్కై లాబ్

## (గగనప్రయోగశాల)

శ్రీ వి. ఆర్. వేలూరి

1972 వ సంవత్సరాంతంలో—ఒక శుభముహూర్తాన్న, ముగ్గురు అమెరికను ఆస్ట్రోనాటులు ఆకాశ పరిశోధనలో మానవాళికి 'మరో ఘనవిజయం' సాధించబోతున్నారు. ఈలోగా రష్యను శాస్త్రజ్ఞులు ఇదేరకమయిన ప్రణాళికని అమలుపరచక పోతే, ప్రప్రథమంగా అమెరికన్లు భూమికి 270 మైళ్ల ఎత్తున గుండ్రని కక్ష్యలో (Orbit) గగన ప్రయోగశాల (Sky Lab) లో 28 రోజులుండి జీవ శాస్త్రంలోనూ, భూభౌతికసౌరశాస్త్రాల్లోను రక రకాల పరిశోధనలు చెయ్యటానికి Nasa ఆధ్వర్యంలో ఏర్పాట్లు జరుగుతున్నాయి. ఈ బృహత్పథకానికి పునాదులు 1960 లోనే వెయ్యబడ్డాయి. అపోలో (Apollo) ప్రణాళికలో వాడిన సామగ్రితో— ఆ పరిశోధనల్లో బయటపడ్డ కొన్నివిశేషాలనుగురించి కూలం కషంగా తెలుసుకోటానికి ఈ స్కైలాబ్ పథకం తయారుచేశారు, 'ఆప్' (Aap—Apollo Application Program) అనే పేరుతో. స్కైలాబ్ ఎందుకో, ఏమిటో తెలుసుకోబోయేముందు, కొన్నిముఖ్యవిశేషాలు గుర్తుకు తెచ్చుకుందాం.

జూలై 6, 1969 న 'బానీ'అనేకోతి భార రాహిత్యము (Weight – Lessness) వలన మరణించింది. మూడువారాలపాటు, బయోశాటిలైట్—3 (Bio satellite - 3) లో నివసించటానికి బదులు, షుమారు $8\frac{1}{2}$ రోజులు మాత్రమే 'బానీ' శాటిలైట్‌లో బ్రతికిఉంది. గగనవిహారం తర్వాత బానీ మన వాతావరణంలో కొద్దిగంటలు మాత్రమే జీవించింది. బానీకి చాలారకాల జబ్బులు వచ్చాయి. సర్కాడియన్ రిదము (Circadian Rytham) కోల్పోయింది. నిద్రావస్థల్లో మార్పులు అతిత్వరగా రావటం, గుండె కొట్టుకునేరేటు తగిపోవటం, మెదడు ఉష్ణోగ్రత మామూలుకన్న 5°^ తగ్గటం, శరీరం బరువులో 5 వ వంతు కోల్పోవటం మొదలైన రకరకాల రోగాలకి గురిఅయ్యింది.

ఆండ్రియన్ జి. నికొలయేవ్ (Andrian G. Nikolayev), వైటాలి సెవాస్త్యనోవ్ (Vitali Sevastyanov) లు జూన్ 1970 లో 18 రోజులు గగనవిహారంచేసి, బరువు కోల్పోవటం, భూమ్యాకర్షణ శక్తికి వెంటనే అలవాటుపడలేకపోవటం, కాల్షియం బాలెన్సు (Calcium Balance) లో మార్పులు రావటం, ఎముకలు బలహీనపడటంవంటి బాధలకి గురిఅయ్యారు. భూమిచుట్టూ కక్ష్యలో మనిషి నివసించటంఅనేపని మొట్టమొదటగా రష్యనులు సాధించారనే చెప్పాలి. Salyut (సాల్యూట్)అనే గగననౌకలో కొన్నిశాస్త్రీయ ప్రయోగ పరికరాలుంచి, ఏప్రిలు 1971 లో రష్యను శాస్త్రజ్ఞులు కక్ష్యలోకి పంపించారు. 7 వారాల తర్వాత జూన్ 7, 1971 న సోయూజ్—11 (Soyuz—11) అనే వేరొక నౌకద్వారా ముగ్గురు కాస్మోనాటులు సాల్యూట్‌తో ప్రథమ ప్రయత్నం లోనే విజయవంతంగా 'డాక్'చేసి షుమారు 250 మైళ్ల ఎత్తున కక్ష్యలో విహరించారు. సాల్యూట్ లోని పరికరాలు పరిశీలించడం, భూతలంపై వనరుల ఫోటోలు తీయటం, వాతావరణ వివరాల సేకరణ, మరికొన్ని సాధారణ జీవశాస్త్ర ప్రయోగాలూ—వీరి ముఖ్యోద్దేశాలు. షుమారు 24 రోజులు కక్ష్యలో ఉండి, వీరు భూమికి దురదృష్టవశాత్తు నిర్జీవులై వచ్చారు. వీరు మరణించింది భారరాహిత్యం వలననా లేక భూమికి తిరిగి తీసుకుని వచ్చిన కమాండ్ సర్వీసువాడ్యూలు (CSM—Command service module) లో స్టీరింగు సరిగా లేకపోవటం వలననా అన్నప్రశ్నలకి సంతృప్తికరమైన సమాధానం దొరక లేదు.

జీవశాస్త్రజ్ఞులు భారరాహిత్యంవలన వచ్చే అనర్థాలని గురించి ఎక్కువగా పరిశోధనలు జరగాలని కోరటంలో ఆశ్చర్యం ఏమీ లేదు. సర్కాడియన్ రిదము—సహజ శారీరక వృత్తుల్ని సరైనమార్గంలో పెట్టే మానవుని జైవిక గడియారం (Biological clock)- గురించి శాస్త్రజ్ఞుల్లో తీవ్రమైన అభి

ప్రాయ భేదాలున్నాయి. ఈ రిదములు బహిర్గత శక్తుల ఉత్ప్రేరితాలనీ, అంటే రాత్రి, పగలూలాంటి మార్పులవలన వచ్చేవి అని ఒక వర్గంవారూ; మానవ శరీరంలోనే అంతర్గతమైన మౌనిజమువలన ఈ రిదములు జరుగుతాయని మరొక వర్గంవారు వాదిస్తున్నారు. స్కైలాబ్ పరిశోధనలవల్ల కొంతవరకూ ఈ విషయంలో సత్యాన్వేషణ జరుగుతుంది.

## స్కైలాబ్ —I

కెన్నెడీ స్పేస్ సెంటర్‌నుంచి శాటర్న్—5 రాకెట్‌ద్వారా మొదటి గగన ప్రయోగశాల—స్కైలాబ్ I ఆకాశంలోకి పంపిస్తారు. ఇది షుమారు 13,000 ఘనపుటడుగుల పరిమాణం (మూడు పడకగదుల అమెరికన్ ఇల్లంత); 117 అడుగుల పొడవు, 165000 పౌన్ల బరువు (భూమిమీద) ఉంటుంది. అయితే ఇది కక్ష్యలో కలకాలం ఉండలేదు. దీని పూర్తి జీవితం ఒక సంవత్సరం మాత్రమే. నీరు, ప్రాణవాయువు ఆహార పదార్థాలు మొదటిసారి 'లాంచ్' చేసినప్పుడు పంపబడతాయి. తిరిగి మళ్లీ మళ్లీ ఈ పదార్థాలు పంపటానికి ఏర్పాట్లు లేవు.




స్కైలాబ్‌ని స్థూలంగా వర్ణన నిమిత్తం 5 భాగాలుగా విభజిద్దాము (పటము చూడండి.)

(1) ఆర్బిటల్ వర్క్‌షాపు (Ows - Orbital Workshop): ఇది స్కైలాబ్‌లోని అతి ముఖ్యమయిన భాగం, కక్ష్యలో తిరుగుతున్నంత సేపు ఆస్ట్రోనాటుల నివాసం ఇందులోనే. ఇది అసలు శాటర్న్—5 రాకెట్‌లోని S-IVB భాగం. కొన్ని కొత్త పరికరాలని అమర్చి దీన్ని OWS అన్నారు. ఇదే పరిశోధనాలయంగా ఉపయోగపడుతుంది. ఇందులో 100 చతురపు టడుగుల వార్డురూము (ఆహార పదార్థాలు తయారుచేసుకుని తినేచోటు), తుక్కుతూగరా పడేసే 30 చ. అ. గది, నిద్రకి వేరుగా 70 చ. అ. కంపార్టుమెంటు కేటాయించబడ్డాయి. తినటానికి ఫ్రోజెను ఫుడ్స్ (Frozen Foods), వంటకై అవెను (Oven), నిద్రపోటానికి స్లీపింగు బాగ్‌లు ఉంటాయి. ఉష్ణోగ్రత 60°F నుండి 90°F దాకా ఉంటుంది. కిటికీలూ, కిటికీలకి అందమయిన షేడులూ, 'గోడ' లకి రంగులు ఆకర్షణీయంగా ఉంటాయి. శుభ్రపరచటంకూడా తేలికే. ఒక్కమాటలో చెప్పాలంటే 'స్కైలాబ్‌లో గదులు చూడముచ్చటగా ఉండి ఏ ఆడకూతురుకైనా అసూయ కలిగించేట్టుంటాయి !

(2) ఎయిర్‌లాక్ మాడ్యూలు (Am-Airlock Module): స్కైలాబ్‌కి ఇది నాడీమండలం లాంటిది. 16' 8" ల పొడవుగలిగి చాలభాగం 5' ల వ్యాసంలో ఒకవైపు Ows ని కెమెరా తిత్తుల్లాంటి తిత్తులతో కలుపుతుంది. రెండోపక్క 10' వ్యాసంకలిగి MDA ని కలుపుతుంది. ఈ AM లో చాలా సమాచార యంత్రాలు అమర్చబడి ఉంటాయి. మధ్యభాగంలో రోదసిలోకి పోయిరావటానికి ఒక ఎయిర్ లాక్ (Airlock), దాని కిరుపక్కల ఎయిర్ టైట్ తలుపులు ఉంటాయి. రోదసిలోకి బయటకివెళ్లి చేసే పనులు— Eva లు— (Extra Vehicular Activty) ఈ Am ద్వారానే చెయ్యాలన్నమాట.

(3) మల్టిపుల్ డాకింగ్ యడాప్టరు (MDA-Multiple Docking Apapter): ఇది 17' పొడవు. 10' వ్యాసంకలిగి రెండు కిటికీలతో ఉంటుంది. ఒక కిటికీ సూటిగా ATM ని చూడ్డానికి ఉపయోగిస్తుంది. Csm తో కలవటానికి ఒక డాకింగ్‌పోర్టు, ఒక ఎమర్జెన్సీ డాక్ ఉంటాయి. సూర్యరశ్మినుంచి వేడి గ్రహించటానికి, అనవసరమయిన వేడిని బయటకి ప్రసరించేయటానికి ఒక పెద్ద రేడియేటరు దీనికి వెలుపల అతకబడి ఉంటుంది. దీంటోనే ATM యొక్క కంట్రోళ్లు, మీటలూ, డిస్ప్లేపానల్

ఉంటాయి. అంతేకాక 'గగనంనుండి భూతల పరిశోధ న'కి పనికివచ్చే Earth Resource Experiment Package - EREP—పరికరాలుకూడా ఉంటాయి.

(4) కమాండ్ సర్వీసు మాడ్యూలు (CSM-Command Scrvice Module): అపోలో ప్రోగ్రాంలో వాడిన CSM లాగనే ఉంటుంది. స్కైలాబ్ భాగంగా ఉన్నంతకాలం దీని ఉపయోగం తక్కువ. తిరిగి భూమికి వచ్చేందుకు ఇది కావాలి—అప్పుడు కావలసిన బాటరీలు అమర్చబడి ఉన్నాయి.

(5) అపోలో టెలిస్కోపు మౌంటు—(ATM - Apollo Telescope Mount) : ఇది ఎనిమిదిరకాల టెలిస్కోపులున్న యూనిట్. MDA కి ముందుగా అల్యూమినం ఫ్రేములో బిగించబడి ఈ రేడియో టెలిస్కోపులు ఎల్లవేళలా సూర్యునివైపు తిరిగి ఉంటాయి.

లిఫ్టాఫ్ (Liftoff) తర్వాత శాటర్న్ — 5 రాకెట్ భూమధ్యరేఖకి 50° వంపులో (తూర్పు అమెరికా తీరానికి సమాంతరంగా) ప్రయాణం చేస్తుంది. మొదటి స్టేజి దగ్ధం అయినతర్వాత గంటకి 6 వేల మైళ్ళకి పైగా వేగంతో పోతుంది. రెండవస్టేజి దగ్ధం అయింతర్వాత మూడవస్టేజి 270 మైళ్ల ఎత్తున వృత్తాకారపు కక్ష్యలో స్థిర పడుతుంది. దాన్నే S - IVB అంటారు. శాటర్న్ రాకెట్లుకి ఉండే ఆటోమాటిక్ పైలట్ ఇంకా పని చేస్తూ ఉంటుంది. దాని సహాయంతో కొన్ని ప్రాథ మికమయిన పనులు — అంటే OWS ని నివాసయోగ్యంగాచేసేపనులు–ఆటోమేటిక్‌గాచేస్తారు. స్కైలాబ్ యొక్క హ్రస్వాక్షం (short Axis) ఎల్లప్పుడూ సూర్యునిచుట్టూ ఉండేటట్లు చెయ్యటం, ATM ని దాని కేర్పరచబడ్డ స్థానంలో ఉంచటం, మొత్తం స్కైలాబ్‌ని ఆమ్లజని నత్రజని గల వాతావర ణంతో నింపటం మొదలయినవి కక్ష్యలోకి వెళ్లిన రెండుగంటల్లో జరుగుతాయి. OWS కి కావలసిన విద్యుచ్ఛక్తి సౌరశక్తినుంచి తయారవుతుంది. నాలుగు రెక్కలుగల సౌరఘటమాల (Solar cell Arry) లో అమర్చబడ్డ 164,160 సౌరఘటాలు 10,500 వాట్ల విద్యుచ్ఛక్తి తయారుచేస్తాయి. లాంచ్ సమ యంలో ముడుచుకుని ఉండి, కక్ష్యలోకి వచ్చింతర్వాత ATM పక్కగా ఈ ఘటమాల క్రాసురూపంలోకి తెరుచుకుని పనికి సిద్ధమవుతుంది. ఇది స్కైలాబ్ యాస్ట్రోనాటులరాకకి ఎదురు చూస్తోందన్నమాట.

ఈ మొత్తం సామగ్రి అంతటినీ—పనిచెయ్యటానికి వీలయిన స్థితిలో -- శాటర్న్ వర్క్షాపు (SWS) అంటారు.

## స్కైలాబ్ II, III, IV

షుమారు 24 గంటలతర్వాత మరొక శాటర్న్ రాకెట్ (దీన్ని స్కైలాబ్ — II అందాం) ద్వారా అపోలో స్పేసుక్రాఫ్టులో ముగ్గురు ఆస్ట్రోనాటులు కక్ష్యలోకి వెడతారు. SWS ని కలుసుకుని MDA తో డాక్‌చేస్తారు. CSM లోంచి MDA లో స్పేసు సూటు లేకుండానే వెళ్లవచ్చు. ఇప్పుడు పటములో చూపించినట్లు స్కైలాబ్ గగనంలో పూర్తిగా నిర్మింపబడిందన్నమాట. 28 రోజుల నివాసానికి తయారైఉన్న OWS ని శ్రద్ధగా పరిశీలించి. అంతా సజావుగాఉన్నదని నిర్ధారించుకున్న తదుపరి CSM ని డీయాక్టివేటు (Deactivate) చేస్తారు. నాలుగు వారాలు పరిశోధనలు జరిపాక, SWS ని మనుష్యులు లేకపోయినా కక్ష్యలో భద్రంగా తిరగటానికి ఏర్పాట్లు చేసి, మళ్లీ CSM లోకివచ్చి ఇదివరకు అపోలో ఆస్ట్రోనాటులులాగానే భూమికి చేరతారు. (పశ్చిమ అట్లాంటిక్ సముద్రంలో వాలుతారన్న మాట.) ఏవిధమయిన చిక్కులులేకుండా ఈ మొదటి ఆస్ట్రోనాటుల క్రూ (crew) క్షేమంగా తిరిగివస్తే తర్వాత మూడేసినెలల కొకసారి స్కైలాబ్—III, స్కైలాబ్ — IV లను ముగ్గురేసి ఆస్ట్రోనాటుల క్రూలతో 'లాంచ్'చేస్తారు. ముగ్గురేసి ఉన్న ఈ క్రూలుఅన్నీ ATMతో పరిశోధనలు జరుపుతారు. కాని మొదటి క్రూ ముఖ్యంగా జీవశాస్త్రానికి సంబంధించిన ప్రయోగాలూ, జీరో–జీ (Zero-g) లో, అంటే భారరాహిత్యస్థితిలో, మనిషి జీవనం గురించిన ప్రయోగాలూ చేస్తారు. రెండవక్రూ సౌర, ఖగోళశాస్త్ర పరిశోధనలు జరుపుతారు. మూడవ క్రూ EREP ప్రయోగాలు వివరంగా చేస్తారు. ఆఖరిని వెళే రెండుక్రూలు స్కైలాబ్‌లో 56 రోజులు దాకా ఉండటానికి ఏర్పాటులున్నాయి.

స్కైలాబ్‌లో మొత్తం 14 కమ్యూనికేషను

(Communication) స్టేషను లుంటాయి. వీటి ప్రసార సాధనాలద్వారా ఆస్ట్రోనాటుకీ ఆస్ట్రోనాటుకీ మధ్య, ఆస్ట్రోనాటుకి భూమికీమధ్య, భూమికీ — ఆస్ట్రోనాటుకీమధ్య సంభాషణలకి వీలవుతుంది. ఈ సంభాషణలన్నీ CSM ద్వారా జరగాలి. టెలిప్రింటరు ఒకటి ఉంటుంది—సాంకేతిక సమాచారం అంతా దీని సహాయంతోనే ఇచ్చి పుచ్చుకోవడం జరుగుతుంది. టెలివిజను కెమేరా ఉంటుంది. అంటే మనం ఇక్కడ నుంచి వాళ్లేం చేస్తున్నదీ ప్రత్యక్షంగా చూడవచ్చు. అయితే వాళ్లకి టెలివిజనుసెట్ ఉండదు. భూమి నుంచి ప్రసారమయ్యే టెలివిజను ప్రోగ్రాములు — జీన్‌మార్టిను వగైరా చూడలేరు. రోజుకి షుమారు $10\frac{1}{2}$ గంటల చొప్పున వారంలో $6\frac{1}{2}$ రోజులు కష్టపడి పనిచెయ్యాల్సిన టైమ్‌టేబిల్‌తో వారికి సరదాలకి సమయం చిక్కదు.

సూర్యుడివైపు తిరిగివున్న స్కైలాబ్‌భాగం 250°F రెండోవైపు 0°F ఉష్ణోగ్రతతో ఉంటుంది. అలాగే భూమి నీడలోకి వెళ్లినపుడు ఉష్ణోగ్రత— 125°F కి తగ్గుతుంది. కాని రకరకాల ఫానులద్వారా రేడియేటర్లద్వారా స్కైలాబ్‌లో సమఉష్ణోగ్రత ఉండేటట్లు చేస్తారు.

## జీవశాస్త్ర ప్రయోగాలు - మొదటి కూర్పి

తెల్లవారు ఝామున '6.00 గంటలకి' లేవగానే, కాలకృత్యాల తర్వాత ఒక ఆస్ట్రోనాటు ఒక ప్రత్యేకమయిన కుర్చీలో బంధించ బడుతాడు. రెండవ ఆస్ట్రోనాటు, ఒకవిూట ఆధారంతో, ఆ కుర్చీని కొన్ని డిగ్రీల కోణంలో ముందుకు పడవేస్తాడు. మొదటి ఆస్ట్రోనాటు ం పూర్తిగా ముందుకు పడిపోకుండా ఆపటానికి కావలసిన కి ని కొలుస్తారు. ఇది ప్రతి ఆస్ట్రోనాటూ ప్రతిరోజూ చెయ్యాలి. ఒకడు ఈ పని చేస్తూంటే, రెండవవాడు పరిశీలకుడుగా ఉండి నోట్సు రాస్తాడు. అన్ని విషయాలూ జాగ్రత్తగా రికార్డు చెయ్యబడతాయి. మరో ఆస్ట్రోనాటు మొదటి రెండు గంటలూ 'గృహ పరిశుభ్రత' (S / HK—Systems / House keeping) గురించి జాగ్రత్త పడతాడు. త్రాగిన ప్రతి నీటిచుక్కా, తిన్న ప్రతి రొట్టెముక్కా శ్రద్ధగా పరిశీలింప బడుతుంది. ఎంత తాగిందీ, ఏం తాగిందీ, ఏం వివరంగా రికార్డుచేస్తారు. మలమూత్రాలు, చెమట ప్రతీ శాంపిలూ భద్రంగా దాచి భూమికి తీసుకొని వస్తారు. అనవసరమయిన చెత్త, చెదారం ఒకచోట దాచి (S-IVB స్టేజిలోని అక్సిజనుద్రవటాంకు Liquid oxygen Tank-lox ఇందుకు వాడతారు), ఎయిర్‌లాక్‌ద్వారా భూమి వాతావరణంలోకి వదలిపెడతారు. మన వాతావరణంలో ప్రవేశించగానే వేడికి మండి మసిఅయిపోతాయి. అంతేకాని ఎప్పుడు పడితే అప్పుడు ఎక్కడపడితే అక్కడ చెత్తని న్యూయార్కు వీధుల్లోలా పారెయ్యరు. తర్వాత ఎక్సర్‌సైకిల్ (exercycle) మీద వ్యాయామం చేస్తారు. స్పేసు సూటులేకుండా స్పేస్‌సూటు వేసుకునీ ఈ వ్యాయామం అందరూ క్రమంగా చేస్తారు. ప్రతి విషయం లాగ్ పుస్తకంలో రాస్తారు. ఒకరు ఒకపని చేస్తూంటే మరొకరు ఇంకొకపని చెయగలిగేటట్లు టైము టేబులు తయారుచేస్తారు. కుర్చీప్రయోగం అవగానే మొదటివాడు ఒక ఎయిర్‌టైట్ (Airtight) పరికరంలో కూర్చుని, నడుమువరకు వాయుపీడనంతీసేసి, శరీరంలో చాల భాగాలపై సెన్సరు (Sensor) లను పెట్టి, గుండె కొట్టుకోవడం, రక్తపుపోటు మొదలగు విషయాలని రికార్డుచేస్తారు. జీరో — జీ లో రక్తం—ధమని, సిరల చివళ్లలో తక్కువగానూ, గుండెలో ఎక్కువగానూ ఉంటుందనీ, ఊపిరితిత్తులలో రక్తం ప్రాణవాయువుల నిష్పత్తి ఎక్కువ కావటంమూలంగా, శరీరం నీటిని కోల్పోయి 'బరువుతగ్గటం' జరుగుతుందనీ జీవశాస్త్రజ్ఞుల ఊహ. ఈ సిద్ధాంతం గురించి తెలుసుకోవటానికే ఈ పై ప్రయోగం. భూమిపై తీసుకున్న రికార్డులతో ఈ ప్రయోగ ఫలితాలు పోల్చి ఈ విషయంపై వివరాలను గ్రహించవచ్చు. ఒక ఆస్ట్రోనాటు గాలి శాంపిలుతీసి భద్రపరచటం; మరొక ఆస్ట్రోనాటు ATM తో సూర్యుని పరిక్షచెయ్యటం మొదలగు ఈ ప్రయోగా లన్నిటితోటి 26 రోజులపాటు పనిచేస్తారు. 27 వ రోజున ATM లో ఉంచిన ఫిల్ములని జాగ్రత్తగా లోపలికి తెస్తారు. తర్వాత SWSని డీయాక్టివేట్‌చేసి CSM లోకివచ్చి భూమికి తిరిగి వస్తారు.

## సౌరశాస్త్ర ప్రయోగాలు; రెండవ క్రూ

మొదటి ముగ్గురూ క్షేమంగా భూమికి చేరిన 60 రోజుల తర్వాత — స్కైలాబ్—3 లో

మరో ముగ్గురు ఆస్ట్రోనాటులు—ఇందులో ఒకడు ఖగోళశాస్త్రజ్ఞుడు — కెన్నెడీస్పేసు సెంటరు నుండి SWS కి ప్రయాణం చేస్తారు. వెళ్లగానే SWS ని నివాసయోగ్యంగా చేసుకోవటం — వాతావరణంతో నింపడం, ఫాన్లూ, రేడియేటర్లూ పనిలో పెట్టుకోవటం (కొత్త అపార్టుమెంటు అద్దెకు పుచ్చుకున్నట్లే!) మొదలైన పనులు చక్కబెట్టుకుంటారు. ATM కెమెరాలలో కొత్త ఫిల్ములు పెట్టుకుంటారు. వీళ్లు ఉండే 56 రోజుల్లోను ఎక్కువ కాలం ATM లోనే గడుపుతారు.

సూర్యునిలో అధిక ఉష్ణోగ్రతవలన చాలా మూల పదార్థాలు అయనీకరణం (Ionization) చెంది వివిధ భౌతిక స్థితుల్లోకి మార్పులు చెందుతూ విద్యుదయస్కాంత తరంగాలని ప్రసరిస్తాయి. ఈ తరంగాల్లో చాలాభాగం—ముఖ్యంగా రేడియో, అల్ట్రా వయొలెట్, ఎక్స్— (Radio, Ultraviolet, X) తరంగాలని ఆయనమండలం (Ionosphere) (పటము—) ఆపివేస్తుంది. వాతావరణం మిగిలిన చాలాభాగాన్ని మింగివేస్తుంది. అందుచేత సూర్యుడినుంచివచ్చే విద్యుదయస్కాంతశక్తి గురించి మనకు చాలా తక్కువగా తెలుసు. ATM ప్రయోగాల్లో ఈ X;—UV తరంగాల గురించి ఎక్కువగా తెలుసుకోవచ్చును. దీనిలోని ఎక్స్రే స్పెక్ట్రోగ్రాఫిక్ టెలిస్కోపు (X-Ray Spectrographic Telescope) ఏక్స్ తరంగాలని ఫోటోగ్రాఫు చేస్తుంది. అల్లాగే యు. వి. స్కానింగ్ పాలిక్రొమేటర్ (U. V. Scanning Polychromator)—స్పెక్ట్రోహీలియో మీటరు(Spectrohelio Meter) యు. వి. తరంగాలను గురించి తెలియజేస్తుంది. ఈ పరిశోధనలవలన సూర్యుని ఉష్ణోగ్రతలోని మార్పులు, ప్రాదేశికఉష్ణస్థితుల్లో పరివర్తనలూ మనకు బాగా తెలిసే అవకాశం ఉంది. అంతేకాక సూర్యుని ఉష్ణశక్తికి మూలహేతువుల గురించి, ఇతర సౌరప్రక్రియల గురించి కొత్త సంగతులు తెలుస్తాయి.సూర్యునిలోని మచ్చలు(Sun spots) వీటికి సంబంధించిన అయస్కాంతశక్తి గురించి తెలుసుకోవచ్చు. సూర్యుని మచ్చలు చుట్టూరా డప్పుడువచ్చే కాంతివంతమయిన మంటలు—సౌర జ్వాలలు (Solar flares)—మూలంగా ఎక్సు కిరణాలు ప్రసారమవుతాయి. ఎక్సుకిరణాలకీ ఈ సౌరజ్వాలలకీ గల సంబంధం తెలుసుకోవటానికి ఈ పరిశోధనలుపయోగపడతాయి. ఈ సౌరజ్వాలలు సూర్యుని చుట్టూఉన్న కొరోనా (Corona) ద్వారా ప్రయాణిస్తూ ప్లాస్మా మేఘాలను (Plasma clouds)— అంటే శక్తివంతమయిన ఎలక్ట్రాను ప్రవాహాలు— ఉత్పత్తి చేస్తాయి. అయస్కాంతశక్తితోకూడిన మేఘాలు భూమివైపు ప్రయాణంచేసి భూమి అయస్కాంత శక్తిలోనూ, భూమి చుట్టూఉండే రేడియేషన్ బెల్టు (Rediation belt) లోను తీవ్రమయిన మార్పులు తెస్తాయ్. స్కైలాబ్ కక్ష్యలోఉన్న 56 రోజులలోను కనీసం రెండు మూడు సార్లన్నా ఈ సౌర జ్వాలలు రావచ్చని శాస్త్రజ్ఞుల ప్రస్తుతపు అంచనా. ATM లో ఉన్న కొరోనల్ స్పెక్ట్రోగ్రాఫ్ద్వారా కొరోనాలో జరిగే మార్పులు, సౌరవాయువుల (Solar winds) రూపం ప్రవృత్తి మొదలయిన విషయాల గురించి తెలుసుకోవచ్చు.

సూర్యుని మధ్యభాగంలో ఉష్ణోగ్రత 16 మిలియన్ల సెంటిగ్రేడు డిగ్రీలు. పరిధి భాగాలకు వచ్చేసరికి షుమారు 6000°c కి తగ్గుతుంది. ఈ భాగాన్ని ఫోటోస్ఫియర్ (Photosphere) అంటారు. ఇదిదాటి క్రోమోస్ఫియరు (Chromo sphere) లోకి 300 మైళ్లదూరం రాగానే ఈ ఉష్ణోగ్రత 4700°Cకి



తగ్గి ఒక్కసారిగా కొరోనాలో మిలియను డిగ్రీలకి పెరుగుతుంది. సూర్యోపరితలంలో జరిగే తీవ్ర పరిణామాలు కారణంగా ప్రసారమయ్యేశక్తి (ధ్వని తరంగాలవలె) ఈ కొరోనా వాతావరణంలో శోషణం (Absorption) వల్ల ఈ విధంగా ఉష్ణోగ్రత పెరుగుతుందని ఒక సిద్ధాంతం. ఈ ఉష్ణోగ్రత మార్పులు గురించి ATM ప్రయోగాలద్వారా చాలా తెలుసుకోవచ్చును.

## EREP ప్రయోగాలు—మూడవ క్రూ

స్కైలాబ్ IV లో వెళ్లే మరో ముగ్గురు ఆస్ట్రోనాటులు చేసే ప్రయోగాలు నాలుగింటిని EREP(Earth Resources Experiment Package) అంటారు. ఈ ప్రయోగాలకి కావలసిన పరికరాలన్నీ MDA లో ఉంటాయి—అక్కడనుంచే ఈ ప్రయోగాలు చేస్తారు. ఈ పరికరాలన్నీ ఏదో రకమయిన 'దూరదృశ్య'పరికరాలే. మల్టీ స్పెక్ట్రల్ ఫోటోగ్రాఫిక్ ఫెసిలిటీతో (Multispectral Photographic Facility) భూతలాన్ని 70 మి. మీ. కెమెరా ఉపయోగించి నీలం, ఎరుపు, ఇన్ఫ్రారెడ్ కాంతిలో ఫోటోలు, తీస్తారు. నీటివనరులు, పైరు ప్రదేశాలూ, రోడ్డులూ, జనాభాసాంద్రత వగైరా వగైరా ఎన్నో విషయాలు వెనువెంటనే తెలుస్తాయి—పది సంవత్సరాలు ఆగనవసరం లేకుండా. ఇన్ఫ్రారెడ్ స్పెక్ట్రోమీటరు (Infrared Spectro Meter) ద్వారా తీసిన ఫోటోలుపయోగించి గ్రానైటు, ఎండోస్పైటు మొదలగు ఖనిజముల ఉనికిని తెలుసుకోవచ్చును. టెన్‌బాండ్ మల్టీస్పెక్ట్రల్ స్కానర్ వలన (Ten Band Multi-Spectral Scanner) భూమి ఉపరితలపు ఉపయోగాన్ని—ఎక్కడ నీరు, పంటలు, వృక్షసంపద, ఇసుక భూములు వగైరా ఉన్నవీ—తెలుసుకోవచ్చు. కల్మష ప్రవాహాలు నీటిసరఫరాలో ఏవిధంగా జేరుతున్నదీకూడా తెలుసుకోవచ్చును. మైక్రోవేవ్ స్కాటరోమీటరు, ఆల్టిమీటరు, రేడియోమీటరు (Microwa Scattero Meter, Alti Meter, Radio Meter)అనే ఈ మూడు పరికరాల పాకెట్టువలన నదీముఖద్వారాల్లో ఉప్పదనం, తరంగాల ఎత్తు పొడవులు మొదలగునవి తెలుసుకోవచ్చును. సముద్రాలగురించి మంచుకొండల గురించి పర్వతశ్రేణులగురించీ ఎన్నోకొత్తవిషయాలు తెలుస్తాయని అంచనా. గత 3000 సంవత్సరాలలో మానవాళి సౌరశాస్త్రంలో పరిశోధనలుచేసి ఎంత విజ్ఞాన సముపార్జన చేసిందో అంత శాస్త్రవిజ్ఞానాన్ని స్కైలాబ్‌ద్వారా కొద్దిసంవత్సరాల్లో ఆర్జించవచ్చు.

## స్పేసుస్టేషను (Space Station) :

## స్పేసు షటిల్ (Space Shuttle.)

ఒక్కదశాబ్దం శ్రమించి మానవుడు చంద్రమండలానికి వెళ్లగలిగాడు. భూమిచుట్టూ పరికరాల పాకెట్లతో ఉపగ్రహాలని ఉంచాడు. శాశ్వతంగా అంతరిక్షంలో ఒక స్పేసుస్టేషను ఉంచగలిగితే ఎన్నోఉపయోగాలున్నాయి. భూ, భౌతిక, ఖగోళ, సముద్ర, వాతావరణ శాస్త్రాలకి ఇంత అనువయిన పరిశోధనాగారం మరొకటి వుండదనడం అతిశయోక్తికాదు. 1978 నాటికి శాశ్వతంగా ఒక స్పేసుస్టేషను




భూకక్ష్యలో ఉంచడానికి అమెరికాలో మెక్డనల్‌డగ్లసు కార్పొరేషను, నార్తమెరికన్ రాక్‌వెల్ కార్పొరేషను వారలు పథకాలు తయారుచేశారు. వీటితోపాటు భూమికి స్టేషనుకిమధ్య ప్రయాణంచేస్తూ సామాన్లు అందించటానికి ఒక స్పేసుషటిల్ తయారుచెయ్య

టానికి పూనుకుంటున్నారు. అంతేకాక స్పేసుస్టేషను ప్లాట్‌ఫారములమధ్య బరువయిన సామగ్రి కదప డానికి ఒక స్పేసుటగ్గు (Space Tug) కూడా తయారుచేస్తారు. స్పేసుస్టేషన్లు సులువుగా కట్ట డానికి చిన్నచిన్న భాగాలుగా ముందుకట్టేసి, వాటిని (మాడ్యూల్—Module) స్పేస్‌షటిల్ సహాయంతో పైకి తీసుకువెళ్లే ఆలోచనలుకూడా ఉన్నాయి.

అన్నీ కలిసొస్తే ఈ స్పేసుస్టేషనుని ప్లాట్‌ఫారంగా ఉపయోగించుకుని భవిష్యత్తులో అంతర్గ్రహ యాత్రలుకూడా చెయ్యొచ్చు. అంగారకుడికి (Mars) ముడుపులు చెల్లించుకునేవాళ్లు ఇప్పుడు మొక్కుకోవటం ప్రారంభించవచ్చు. ఇలాంటి 'రోదసీయాత్ర'ల మీద కథలు సినిమాలు ఇదివరకే వచ్చాయి (2001: Space Odyssey). భూకక్ష్యలో హాస్పిటళ్లు, హోటళ్లు, ఫ్యాక్టరీయికూడా అవతరించవచ్చు. బహుశః 2001 లో మానవుడు ఈ మున గగనవిహార పరికరా లని ఓచిన్నమ్యూజియంలో చూచి ఆనందించవచ్చు. మనలో కొంతమందికి ఈ తిలకించేభాగ్యం అబ్బవచ్చు కూడ.

ఆధారాలు: (1) Science News (July, August, October 1970) (2) Science Digest (August 1970) (3) Analog (March, April 1972) (4) Space Flight 13, 1971; 14, 1972.

[అమెరికాలో వెలువడుతున్న 'తెలుగు భాషా పత్రిక' సౌజన్యంతో; ఈ వ్యాసం ఆ పత్రిక 1972 ఏప్రిల్ సంచికలో వచ్చింది. వ్యాసం వ్రాసిన శ్రీ పెమ్మరాజు వేణుగోపాలరావు.]



# ఆధునిక భాషాశాస్త్రం - ప్రయోజనం

శ్రీ టి. జి. కృష్ణారావు

మనిషి మాట్లాడటం ఎప్పుడు నేర్చుకున్నాడోకాని భాష అతని జీవితంతో పెనవేసుకుపోయింది. భాషావ్యవహారం అతడికి మంచినీళ్ల ప్రాయమైపోయింది. అందుచేత పరభాష నేర్చుకునేటప్పుడుమాత్రమే భాష నేర్చుకోవడంలో శ్రమవుందనే విషయం గుర్తిస్తూ వుంటాడు. స్వభాష నేర్చుకునేటప్పుడు ఆ శ్రమ వున్నా, అప్పుడుపడ్డ శ్రమ గుర్తుండనంత చిన్నతనంలోనే భాష నేర్చుకోవడం జరుగుతుంది. ఇకపోతే భాష నేర్చుకోవడంలో పండితులు శ్రద్ధ చూపించే ఉచ్చారణ దోషాలూ, లేఖనదోషాలూ మాత్రమే అతడు గుర్తిస్తాడు. కాని ప్రాయికంగా యీ దోషాలు, దోషాలుకావు. సహజోచ్చారణలో లేనివి లేఖనంలో చూపడంకాని, బహుధా ప్రయోగంలోఉన్న ఉచ్చారణని కాదని శిష్టమైనదనే పేరుతో సహజంకాని ఉచ్చారణలు ప్రవేశపెట్టడంకాని శాస్త్రీయంకాదు. ఈ విధంగా చూస్తే మానవుడికి తను వ్యవహరిస్తున్న భాష పైపై నిర్మాణమే తెలుసుగాని దాని అంతర్నిర్మాణంలోని నియమబద్ధత తెలియదని విదితవౌతున్నది.

'భాష విషయంలో శాస్త్రీయదృష్టి అవసరమా?' అన్నది చిక్కుప్రశ్నే. మనం నిత్యోపయోగంలో అనేకవస్తువులనుగూర్చిన సాంకేతిక పరిజ్ఞానం లేకనే ఉపయోగిస్తున్నాం. ఉదాహరణకి రేడియోలనీ, వాచీలనీ బాగుచేయడం మనకి తెలియనేతెలియదు. వాటి అంతర్నిర్మాణమూ, భాగాలూ సూక్ష్మాతిసూక్ష్మంగా మనకు తెలియవు. కాని కొన్నివిషయాలలో సాంకేతిక పరిజ్ఞానం అవసరమే. శాస్త్రీయవిజ్ఞానం పెరుగుతున్నకొలదీ సాంకేతిక పరిజ్ఞానం సామాన్యుల్లోకి ఇంకుతూ వుంటుంది. దీనికి అవసరం (Necessity) తప్పనిసరి కారణం. ఉదాహరణకి నేడు విద్యుచ్ఛక్తిని గూర్చిన పరిజ్ఞానం సామాన్యుల్లో కొంతకాలంక్రితం ఉన్నదానికంటే ఎక్కువగానే ఉంటోంది. అలాగే సంవత్సరాల తరబడి మనం ఉపయోగిస్తున్న భాషనుగూర్చిన శాస్త్రీయమైన అవగాహన చాలా అవసరం. ఇంతవరకూ చర్చించినది సామాన్యవ్యవహర్తకు భాషాశాస్త్ర పరిచయం ఎంతవరకు అవసరం అన్నదే. ఇక ప్రత్యేక శాఖలలో పనిచేసే విభిన్నవ్యక్తులకీ వారి శాఖలకీ (Branches) ఏవిధంగా భాషాశాస్త్రపరిచయం, ప్రవేశం, పాండిత్యం అవసరాన్నిబట్టి కావలసివుంటుందో పరిశీలించవలసి వుంది.

### మాతృభాషాధ్యయనం

భాషను నేర్చుకునే దశలో భాషను అతి సులభంగానూ తక్కువ వ్యవధిలోనూ నేర్చుకోవాలంటే భాషాశాస్త్రదృష్టితో సమగ్రమైన అధ్యయనవిధానం రూపొందింపబడాలి. 56 గంటల్లో ఏ భాషా వ్యవస్థనైనా సుబోధం చెయ్యగల పద్ధతులను అమెరికా దేశంలో ఉపయోగిస్తున్నారంటే, భాషాశాస్త్రం ఆవశ్యకత సువ్యక్తం కాగలదు. ఆ దేశంలో భాషాశాస్త్ర పరిజ్ఞానం ఉపాధ్యాయులకు చాలా అవసరమని గుర్తింపబడింది. ఈ శాఖలో పాఠ్యపుస్తక రచయితలూ, వ్యాకరణ నిర్మాతలూ, నిఘంటు కర్తలూ మొదలైన పలువురు భాషాశాస్త్రంలో ప్రగాఢ పాండిత్యంగల వ్యక్తుల కృషి అవసర మవుతున్నది. Mrs. Mary June M. Norris కొన్ని భాషాశాస్త్ర విషయాల అవగాహన తరగతి బోధనకు (Class room teaching) అవసరమని వ్రాస్తూ, 1. భాషా స్వభావాన్ని గుర్తించడం. 2. మాతృభాష నిర్మాణం వ్యవస్థ, నేర్చుకొనగోరిన ఇతర భాషా నిర్మాణం, వీటి మధ్య పరస్పరం జోక్యం ఉంటుందని గుర్తించడం

3. భాషని విశ్లేషించడం, వర్ణించడంలో పద్ధతులు 4. కొన్నిభాషల పరిజ్ఞానం 5. రెండు భాషల్ని సరి పోల్చే విధానాలు—అనే విషయాలు పేర్కొన్నారు. భాషాశాస్త్రజ్ఞులందరూ ఈ విధంగా ఎవరిటపిన కొలదీ వారు కొన్నివిషయాల పట్టిక (List)ల నిచ్చి వీటి అవగాహన భాషాబోధకులకు అవసరమని చెప్పారు.

భాషా బోధకులకు ఒక భాషలో ధాతువులు ఏకాచ్కములా, ద్వ్యచ్కములా అనే పరిజ్ఞానం కావాలి భాషలోని ఏ ధ్వనులు పదాదిని ప్రవర్తిస్తాయో ఏవి పదమధ్యంలో అచ్చులమధ్య ప్రవర్తిస్తాయో ఏ ధ్వనుల సంయోగం ఒక భాషకు సహజమో, ఏది అసహజమో తెలియాలి.

ఉదాహరణకు ఏడాది సంయుక్త వర్ణాలైన 'స్ట, స్ప' లాంటి ధ్వనులు ఆంగ్లానికెంత సహజమో తెలుగుభాషకి అంత అసహజం. తెలుగులో 'స్టాండు' వంటి అన్యదేశ్యాల్ని దేశీయాకరణం చేయడంవల్ల ఇల్లాంటి ధ్వనులు ప్రవేశించవచ్చు. చకార, తకార సంయోగం తెలుగుభాషకు సహజంకాదు.

సహజంగా భాషావ్యవహర్తకు ఈ జ్ఞానం కొంత వుంటుంది. కాబట్టే ఎవరైనా కావాలనో, వికారానికో 'వ్రాడు వ్రచ్చాడు' అనిఅన్నా, మనం 'వాడు వచ్చాడు' అని అంటున్నాడని అర్థం చేసుకో గలం. పదాది వకార, రకార సంయుక్తత భాషలో అరుదైనది కావడమే దీనికి కారణం. వ్రాత, వ్రాయు మొదలగుచోట్ల అంతటా వ్యవహారంలో రాత, రాయు అనే వినిపిస్తుంది. 'వ్రేల్చు' మొదలైన గ్రంథస్థ రూపాల్లోకూడా ఇది కృతక ప్రామాణిక రూపమే. వేలుపు, వ్రేల్చు అనే పదాలు ఒకే మూలధాతువు నుండి వచ్చినవే. (తెలుగునందలి కృతక ప్రామాణిక రూపములు— Dr. తూ. దోణప్ప). వ్రేళ్లుఅనే అవ యవ బోధకశబ్దం కూడా వాడుకలో వేళ్లుఅనే విని పిస్తుంది. ఈ చర్చవల్ల తేలిందేమిటంటే భాషకు సహజంకాని ధ్వనుల్ని వేరుచేయగలశక్తి వ్యవహర్తలకు సహజంగానే వస్తుంది. కాని అధ్యయనదశలో ఈ విద్యార్థి గుర్తించేటట్టు చెయ్యాలి.

భాష ప్రధానంగా శ్రావణమైనదనీ అందుచేత భాషా బోధకులు ధ్వనులకే ప్రాధాన్యత నీయాలనీ శాస్త్రవేత్తలంటారు. ఒక శాస్త్రవేత్త 'Every one who is not deaf or idiotic has fully mastered his langauge by the end of his fifth year' అని అన్నారు. అటువంటప్పుడు అధ్యాపకుడు వారికి బోధించవలసిందేమిటని సందేహం వస్తుంది. లేఖనం నేర్చుకోవలసి వుంది. అంతేకాక ఆ శాస్త్రవేత్త అభిప్రాయం ఏమిటంటే అంతవరకూ తనకు వచ్చిన మాటలను, భాషకు స్వభావసిద్ధమైన పద్ధతిలో సంయోజన పరచడం ఆ బాలుడు నేర్చుకున్నాడని. అందుచేత బాలుడికి భాషనుగూర్చి నేర్ప వలసింది లేకపోలేదు. ఉచ్చారణలో దోషాలు లేని వారికి లేఖనం నేర్పడం సులభమే. దోషాలున్నవారి ఉచ్చారణను సరిచేసినతరువాతనే లేఖనం నేర్పవలసి వుంటుంది. ఆంగ్లంవంటిభాషలో 'Spelling' అనేది చిక్కుసమస్య. ఉచ్చారణానుగుణంగా 'Spelling' కూడా వుండే పదాలు ముందు నేర్పినతరువాత ఉచ్చారణకూ లేఖనకూ పొంతన కుదరని వాటినిగురించి నేర్పాలి. అలా నేర్పినప్పుడు వీటిలో ఒక క్రమసూత్రానికి కట్టుబడే వాటినన్నిటినీ ఒక్కొక్కసారి చెప్పుకోవాలి. ఈ ఇబ్బంది తెలుగుకి లేదనుకోవడం భ్రమ. భారతీయ భాషలు సాధారణంగా ఉచ్చారణ విధేయమైన లేఖనం గలవే అయినా అందులోనూ కొన్నిపదాల్లో లేఖన దోషాలు వచ్చే అవకాశం ఉంది. మాహాత్మ్యం, శంఖం, నశించు—మొదలైనవి ఉచ్చారణలో 'మహాత్యం, సెంఖం, నసించు'అనే వుండటం మూలంగా వ్రాతలో వీటిని గూర్చి శ్రద్ధ వహించవలసివుంది.

భాష అభిప్రాయనివేదనకు సాధనంకాబట్టి విద్యార్థి అవసరానికి పరిచయానికి తగిన పదజాలమే అతని పాఠ్యపుస్తకాలలో ఉండవలసివుంటుంది. ప్రాథమికదశలో విద్యార్థిపరిచయానికి దూరమైన పదజాలం అతని పాఠ్యపుస్తకాలలో ఉండరాదు. ఆంధ్రప్రదేశ్‌లోని వివిధ మాండలికాలపై పరిశోధనజరిగి, అన్నిమండలా లలో ఉపయోగంలోఉన్న పదజాలంతోనే Common

Text book తయారుకావాలి. వ్యవహార బాహుళ్య పట్టికలు (Frequency tables) ఏర్పరచ బడాలి. ఇటువంటి కృషి పాశ్చాత్యదేశాల్లో బాగా జరిగింది. ఈ విషయాలన్నింటికీ వెనుక భాషాశాస్త్ర పరిశోధన ఇమిడివున్నది.

ఈ విధంగా ధ్వని భేదాల్ని, పదాల్ని గుర్తించ డమేకాక, పద నిర్మాణంలోని నియమబద్ధతకూడా విద్యార్థి గుర్తించాలి. తెలుగులో 'వచ్చాడు' అనే క్రియలో 'వచ్చ్'—ధాతువు; 'ఆ' — భూతార్థక ప్రత్యయం; 'డు'—పురుషార్థక ప్రత్యయం. అలాగే 'వస్తున్నాడు' అనేదాన్లో—

వస్—ధాతువు

తు—శత్రర్థక ప్రత్యయం

ఉన్న—వర్తమానార్థక ప్రత్యయం

ఆడు—పురుషార్థక ప్రత్యయం

ఈ విధంగా క్రియార్థ బోధకమైన ధాతువు, కాలబోధక ప్రత్యయం, పురుషబోధక ప్రత్యయం అనే నియతి భాషకు సహజం. ఈ నియమబద్ధత గుర్తించి నప్పుడు భాషాధ్యయనం చాలా సులభ మౌతుంది.

భాష సంస్కృతిలో భాగం. ఈ విషయం గుర్తించి భాషాబోధనలో మనం ఉపయోగించే పాఠ్య పుస్తకాలలో విద్యార్థి సంస్కృతికి సన్నిహితమైన భావాలని అందించినప్పుడు అధ్యయనం సులభ మౌతుంది. విదేశభాష నేర్చుకునేటప్పుడు దానివెనుకగల సంస్కృతితో సంబంధం గుర్తించాలి. 'All of them sat round the dining table' అని అన్నా, 'They sat at the fire place' అన్నా దాన్ని అర్థం చేసుకో డానికి దానివెనుకనున్న సంస్కృతితో పరిచయం, అవసరం అన్నది సువిదితమేకదా. తెలుగువారు 'మధ్యాహ్న సమయమయ్యేసరికి విస్తళ్లు వేసేరు'అని గానీ 'ఏటిలో స్నానంచేసి మడిధోవతులు కట్టుకు, విభూతి పెట్టుకువచ్చేరు'అనిగానీ అంటే దాని వెనుక నున్న భారతీయ సంస్కృతి తెలిస్తేనే ఇతరు లర్థం చేసుకోగలుగుతారు. ఆంథ్రొపాలజీలో సంస్కృతిభాగం కాగా, సంస్కృతిలో భాష, భాషాశాస్త్రం భాగాలుగా వున్నాయి. దీన్నిబట్టి సంస్కృతికీ భాషాశాస్త్రానికీ గల సంబంధం స్పష్టం.

అందుచేత భాషాశాస్త్రంయొక్క సమ్యగవ గాహన కలిగి, ఒక భాషను ఉచ్చారణ, లేఖనం, నిర్మాణం మొదలైనవాటన్నిటినీ దృష్టిలో వుంచు కొని సమ్యక్పరిశీలన చేయడం అవసరం. ఈ సమ్యక్పరి శీలన వలన క్రొత్తవిధంగా పాఠ్యపుస్తకాలను రూపొం దించడానికి, ఉపాధ్యాయులకు శిక్షణ నివ్వడానికి వీలు పడుతుంది. ఇలా రూపొందిన పుస్తకాల సహాయంతో ఈ ఉపాధ్యాయులు భాషాశాస్త్రదృష్టిని అలవరచుకొని, అటువంటి శాస్త్రదృష్టిగల విద్యార్థుల్ని తయారు చేయగలరు. చదవడం, వ్రాయడం, వ్యాకరణం మరింత శాస్త్రీయంగా బోధించడం జరుగుతుంది. మాతృ భాష విషయంలో ఇదంతా జరగాలనడం సంప్రదాయ గౌరవం కలవారికి 'పర్వతఖననాఖుగ్రహణం' అనిపించ వచ్చు. కాని ఇది అవసరమన్న విషయం భాషాశాస్త్రజ్ఞు లెవ్వరూ కాదనలేరు. తెలుగు మాతృభాషకానివారు ఈ భాష నేర్చుకోవడానికి వారికోసం ఈ భాషపై పరి శోధనజరిగి అధ్యయన విధానం రూపొందింపబడటం మరీ అవసరం.

## పరభాషను నేర్చుకొనడం

ఆ భాషే వ్యవహర్త భాషకు మన భాషతో ఎక్కడెక్కడ పదనిర్మాణంలోనూ ధ్వని సంయో జనంలోనూ భేదంఉంటుందో అక్కడక్కడ తప్ప టడుగులు పడటం సహజం. (Pit falls). అందు చేతనే నేర్చుకొనవలసినవారి మాతృభాషకూ, మన భాషకూ వున్న వైరుధ్యాలను గుర్తిస్తూ పాఠ్యపుస్త కాలు రచించి వాటిని గుర్తించేటట్లు చేయడం అవ సరం. ఇంతవరకూ మనం అవలంబిస్తున్న పద్ధతి ప్రధానంగా అనువాదపద్ధతి. ఈ పద్ధతి పరభాష యొక్క సమగ్రమైన అవగాహనకు దోహదం చెయ్యదు. ఉదాహరణకు తెలుగువారు ఆంగ్లం నేర్చు

కుంటున్నారు. కాని బాగా చదువుకున్నవారు సయితం 'I am suffering from fever' అని వ్రాయాలో 'I am suffering with fever' అని వ్రాయాలో అని సందేహపడుతూ వుంటారు. దీనికి కారణం తెలుగులో 'జ్వరంతో బాధపడటమే' కాని 'జ్వరంనుండి బాధపడటం' అనే వ్యవహారం లేకపోవడమే. ఇలాంటివి అనేకం ఉదాహరించవచ్చు. సంస్కృతంలో 'వనాయ గంతుం' అంటే 'వనముకొఱకు వెళ్ళనిచ్ఛతో' అనే వ్యవహారం తెలుగుకు క్రొత్త. తెలుగులో 'వనమునకు' అన్నదే వ్యవహార సిద్ధం. అయితే పరభాషాప్రభావంవల్ల భాషకు సహజంకాని ఇలాంటి పలుకుబళ్లు ప్రవేశించవచ్చు. తెలుగులో శ్రీనాథాదులు బహుళంగా ప్రయోగించిన యత్తద్దర్థక ప్రయోగాలు సంస్కృతభాషాప్రభావంవల్ల ప్రవేశించాయి. తెలుగులో 'ఒక కొన్ని' అనే ప్రయోగం ఆంగ్లంలోని 'a few' నుండి ఇటీవల ప్రవేశించింది. ఈ విధంగా ప్రవేశించిన ప్రయోగాలు క్వాచిత్కంగా ఉంటాయి. వాటిని వేరుచేసి చూపొచ్చు. మన భాషకు సహజంకాని ప్రయోగాలని, మనం నేర్చుకోబోయే భాషలో వున్న వాటిని వేరుచేసి చూపడం మన భాష నేర్చుకోవలసిన వారికి,— వారిభాషతో మనభాషకుగల భేదాల్ని మనభాష నేర్చుకోవలసినవారికి వేరుచేసి చూపడం చాలా అవసరం. దీనివలన పరభాషాధ్యయనం సులభతరం కావడమేకాక, ఆ భాషలో నిర్దుష్టమైన పాండిత్యం అలవడుతుంది.

పరభాషని నేర్చుకునేటప్పుడు ఇన్నాళ్లుగా ఆ భాషని గ్రంథస్థవిజ్ఞానంద్వారా నేర్చుకోవడం జరుగుతోంది. ఇది కష్టసాధ్యం. అంతేకాక ఉచ్చారణలోగల భేదాల్నీ, ధ్వని సర్వస్వాన్నీ గుర్తించాలంటే వ్యవహర్తలతో సాన్నిహిత్యమే శరణ్యం. అందుచేత నేడు భాషాధ్యయనంలో భాగంగా ఆ భాషలను విని నేర్చుకోవడం (Learning by Hearing) ముఖ్యంగా పరిగణింపబడుతోంది. ఇది భాషాశాస్త్రదృష్టి విశాలమైనతరువాత మరింత అవసరమైంది. కొంతకాలంక్రితం లిఖిత భాషల్నే శాస్త్రజ్ఞులు గుర్తించి పరిశోధించారు. ఆధునికులు భాషకు లేఖనంకన్నా శ్రవణం ప్రధానమని గుర్తించి దానికి ప్రాముఖ్యం ఇవ్వడంతో లిపి లేనివీ వ్యవహారంలో ఉన్నవీ అయిన అనేకభాషలు పరిశోధన పరిధిలోకి చేరాయి. ఈ భాషలు అధ్యయన విషయాలయ్యాయి. ఆంథ్రపాలజిస్టులకి అనేకభాషలను నేర్చుకోవలసిన అవసరం ఏర్పడింది. వీరికేకాక మిషనరీలలోని ఫాదరీలకు వివిధభాషావ్యవహర్తలతో మాట్లాడటం, మతబోధనలు సందేశాలను వారి భాషలో అందించడం, బైబిలు అనువదించడం అవసరమయాయి. అమెరికాలోని అనేక అమెరికన్ ఇండియన్ భాషలకి లిపిలేదు. భారతదేశంలో లిపిలేని భాషలకు కొరతే లేదు. ద్రావిడభాషలైన తుళు, కోట, కుఇ, గోండి మున్నగు భాషలకు లిపిలేదు. ఉత్తర భారతీయ భాషలపై జరిగినంత పర్యాప్తకృషి దక్షిణ భారత భాషలకు జరుగనే లేదు. ఇటువంటి భాషల్ని నేర్చుకోవాలంటే వినికిడివల్లనే సాధ్యమౌతుంది. అందుచేత భాషాశాస్త్రాధ్యయనంలో Tape recorders వంటి సాధనాలు ప్రాముఖ్యం వహిస్తున్నాయి. ఇకపోతే ఈ భాషల నిర్మాణం విషయంలో భాషాశాస్త్ర పరిశోధన ఇతోధికంగా జరిగితేనేగాని ఆ భాషలు నేర్చుకోవలసినవారి భాషలతోగల విభేదాలు గుర్తింపబడంగాని వాటిని గురించి బోధింపడం జరగదు.

రెండవ భాష నేర్చుకోవడానికి కనీసం ఎనిమిది గంటలకాలం శిక్షణ నివ్వడం మొదటి ఒకటి రెండు సంవత్సరాలలోనైనా అవసరమని బ్రూక్స్ ఫీల్డు తెలుపుతున్నారు. అమెరికాలోని ఆర్మీ స్పెషలైజుడు ట్రెయినింగు ప్రోగ్రాం (A. S. T. P.) వారు ఎక్కువ బోధనకాలం, చిన్నతరగతులూ అవసరమని అన్నారు. మిచిగన్ విశ్వవిద్యాలయంలో భాషా పరిశోధనాలయాలు (Linguistic Laboratories) నిర్మింపబడి టేపురికార్డర్లు, ఫోనోగ్రాఫులు, ఎలక్ట్రానిక్ పరికరాలు విరివిగా ఉపయోగింపబడుతున్నాయి. 'బోధన యంత్రాలు' Teaching Machines బోధనకు సహాయపడ్డంకాక అసలే ఉపాధ్యాయునికి బదులుగా ఉపయోగపడటానికిగల అవకాశాలను గురించి పరిశోధనలు జరుగుతున్నాయి.

'The field itself does not cover all the things that the composition teacher needs to know. There is still no royal road to good writing, no magic method that will turn out skilled writer's

అని ఆంగ్లభాషనుగురించి భావిస్తున్నారంటే, మన భాషలకు రాజబాటకాదుకదా కాలిబాటకూడా లేదని చెప్పక తప్పదు.

ఈ విషయంలో మన సాంప్రదాయిక వ్యాకరణాలు చేయగల సహాయం కొద్దిపాటిదేనని గుర్తించడం కష్టంకాదు. ఆధునిక పరికరాలు లేకుండానే పూర్వపు వ్యాకరణాల సహాయంతో ఇన్నాళ్లూ అనేక భాషలు నేర్చుకోబడటంలేదాఅంటే అది కష్టసాధ్యమైన విషయం. అన్ని భాషలకూ సాంప్రదాయిక వ్యాకరణాలూ లేవు. నేడు సులభమైన మార్గాలు రూపొందించగలిగికూడా ప్రాతపద్ధతులు అవలంబిస్తామంటే ఎంతో కాలాన్నీ, శక్తినీ దుర్వ్యయం చెయ్యడం అవుతుంది. అంటే కాశీ వెళ్లడానికి రైళ్లున్నరోజుల్లోకూడా ఎద్దుబండిమీదనే ప్రయాణం చేద్దామనుకుంటే ఎలావుంటుందో ఆలావుంటుంది. వేగం పుంజుకోవాలంటే భాషాశాస్త్రసహాయం తప్పనిసరవుతుంది.

## భాష – ఏకీకరణ సాధనం

భాషాశాస్త్రం భాషాధ్యయనానికేగాక భాషావ్యవహర్తలమధ్య సంబంధాన్ని దృఢతరం చెయ్యడానికి ఉపయోగపడుతుంది. భాష లేకపోతే మానవసంఘాన్ని కలిపివుంచే మహత్తర సాధనం లోపించిందనవచ్చు. ఆంధ్రభాష ఆంధ్రుల్ని ఏకంచేసి చాలాకాలంనించీ వేరుజాతిగా పరిగణింపజేస్తున్న సంగతి విదితమే. ప్రవాసంలోవున్న ఆంధ్రులమధ్య సాన్నిహిత్యానికి భాషానుబంధమే కారణం. అయితే భాష మనుషుల మధ్య దూరానికికూడా కారణమౌతున్నది.

భారతదేశంలోని వివిధభాషలవారి వైషమ్యాలకు భాషాభేదం కొంతవరకూ కారణమౌతున్నది. శిష్టులైనవారు, పామరులను భాషాభేదాన్నిబట్టి గుర్తించి దూరంచేస్తూంటారు. శిష్టుల్ని పామరులు ప్రమాణంగా స్వీకరించి అనుసరించడానికి ప్రయత్నిస్తూ వుంటారు. భాషనుబట్టి శిష్టులనీ, పామరులనీ వేరుచేయడం సమంజసమైనా కాకపోయినా, యీ విభేదాన్ని భాషాశాస్త్రం గమనిస్తుంది. భాషాశాస్త్ర దృష్టిలో శిష్టుల ఉచ్చారణా, పామరుల ఉచ్చారణా కూడా నిర్దుష్టమైనవే.

పామరులు 'మాయమ్మ', 'మాయయ్య' అన్నప్పుడు వారిని శిష్టులు అవహేళన చేయడం దూరంగాఉంచడం జరుగుతుంది. నిజానికి శిష్టులు తాము దేన్ని ప్రామాణికంగా గ్రహిస్తున్నారో ఆ గ్రంథస్థభాషలో దీన్ని 'యడాగమం'అనే పేరుతో వ్యాకరణబద్ధమైన ప్రయోగంగా స్వీకరిస్తున్నారు. ఈ 'య'కారం వుచ్చారణసౌలభ్యానికి వచ్చిచేరినదే. శాస్త్రీయంగా ఇదే సరైనది. శిష్టుల ఉచ్చారణలో 'ఉప్పగాఉంది', 'ఊళ్లో ఉన్నాడు' మొదలైనచోట్ల 'వ'కారంచేరి 'వుప్పగావుంది', 'వూళ్లో వున్నాడు'అనే వినబడుతుంది. ఇక్కడ 'వ'కారం చేరటం ఎంతశాస్త్రీయమో అక్కడ 'య'కారం చేరడమూ అంతే శాస్త్రీయం. ఐతే ఒకచోట శాస్త్రీయమైనదాన్ని అవహేళనచేసి, మరొకచోట అనుసరించడం శాస్త్రీయదృష్టి లేకపోడంవల్లనే. ఈ విధమైన అవగాహనకి శాస్త్రీయదృష్టి అవసరం.

ఇటువంటి ఉచ్చారణభేదాలు పండిత పామర భేదాన్నిబట్టేగాక యుగభేదాన్నిబట్టికూడా ఉంటాయి. ఒక యుగంలో సరియైనదిగా భావింపబడని పదం మరి కొంతకాలంతర్వాత ప్రమాణీకరింపబడవచ్చును. 'ఇత్తరుశాఖవిడువనేరకున్నవాడు','యుడుగక యరచుచున్నయది' మొదలైన నన్నయ ప్రయోగాల నాటికి 'విడువనేరకున్నాడు', 'అరచుచున్నది' అనే ప్రయోగాలు గ్రామ్యాలుగానే పరిగణింపబడేవి. ఈ ప్రయోగాల్లోని ధ్వనిమార్పును 'దీర్ఘలోపత' అంటారు. 'ఉన్న+వాడు'లో 'వాడు'లోని 'వకారం లోపించి 'న్న' దీర్ఘం కాగా 'ఉన్నాడు' అవుతుంది. క్రమబద్ధంగా వచ్చిన ఈ మార్పు తర్వాత ప్రమాణీకరింపబడి 'తీర్థసంవాసులేతెంచినారని విన్న' (ఏతెంచినవారు> ఏతెంచినారు); 'మహీమండలమెల్ల జూచినాడ నాడు నరేంద్రా' (చూచినవాడ> చూచినాడ) అని ప్రయోగింపబడినాయి. అత్యాధునిక కాలంలో శిష్టవ్యావహారికంలోగల 'వ్రాస్తున్నాడు–చూస్తున్నాడు' అనేవి గ్రాంథికాలుగా పండితులంగీకరించలేదు. శిష్టవ్యావహారికాన్ని గ్రహించి 'వ్రాస్తున్నా నొక గీతాన్ని' అని వీటిని ప్రయోగార్హంచేస్తూ రచనలు వెలిశాయి. నేడు 'ఒత్తున్నాడు' అనేది గ్రామ్యం· 'ఛస్తును' తెస్తును' అనేచోట్ల

సమీకరణాన్ని అంగీకరించి 'వత్తును—తెత్తును' అని వాడుతున్న వాళ్లు 'వస్తున్నాడు' అనే దాంట్లో సమీకరణాన్నంగీకరించడం లేదు. (ఆ జగన్మోహనుని దెత్తునను జనియె'—వసుచరిత్ర; 'గుత్తునాయని జాతి ముత్యాల్)— ఇదికూడా అంగీకృతమయ్యేకాలం వస్తుంది. ఈ పరిశీలనవల్ల తేలిందేమంటే ధ్వని మార్పులు కాలానుగుణంగా కలుగుతూ ప్రమాణీక రింపబడి భాషలో చేరుతూంటాయి. అందుచేత ఒక కాలంలో తాము వాడే భాషమాత్రమే శిష్టమనుకోవడం సరియైన పద్ధతికాదు. భాషాశాస్త్రం ఈ విధమైన అనభిజ్ఞతని తొలగించి వ్యవహర్తలమధ్య సాన్నిహిత్యం కలిగిస్తుంది.

'స్వల్పసంఖ్యాకులు కావచ్చునుగాని, ప్రాత సంప్రదాయములను పునరుజ్జీవింప జేయవలయు ననియు ప్రాచీనప్రమాణములను పునఃప్రతిష్ఠ చేయవలయుననియు ప్రాకులాడు పశ్చిమ బుద్ధులు సర్వదేశకాలములకు సంబంధించినవారు'— (తెలుగు నందలి కృతక ప్రామాణిక రూపములు — శ్రీ తూ. దోణప్ప) అని వ్రాసినట్లుగా భాషను ప్రమాణీకరించడానికి వారు అడ్డుతగుల్తూ వుంటారు. మరికొందరు సంప్రదాయంపట్ల ప్రగాఢాభిమానంతో వ్యావహారికం ప్రమాణీకరింపరాదనడానికి కొన్నివాదాలు చెబుతారు.

'ఈ వాడుకభాష స్థూల విషయములను చెప్పుటకు పనికివచ్చును. సామాన్యమానవుడుకాదు, బుద్ధిమంతుడు, పండితుడు, మానవజాతిసముద్ధర్త, మహారాజకీయవేత్త, మహాశాస్త్రవేత్త వీరిభాష వేరు. అందుచేత వాడుకభాష నవలంబించినచో రెండు పద్ధతులలో నొకటి జరుగును. దేశమునందు బుద్ధిమంతులు పరిహరింప బడుటయో లేక ఆ వాడుక భాషయే మరల నింకొక గ్రాంథికభాష యగుటయో జరుగును', అని విశ్వనాథ వారన్నారు.

'ఒక విషయం కేవలం అర్థమై పోయినంత మాత్రాన చాలదు. అది నాల్గుకాలాలపాటు మనస్సులో నిలువగల్గాలి. తద్భావప్రభావం మనసులో ముద్రవేయాలి. భాష, భావం పటిష్టమైనప్పుడే యిది సాధ్యమౌతుంది' అని శ్రీ జాఫర్ అలీఖాన్‌గారు వ్రాశారు.

వీరి మాటల్నిబట్టి వ్యావహారికం స్థూలమైనవాటిని చెప్పడానికి మాత్రమేనని, అది పటిష్టమైనదికాదనీ వీరి అభిప్రాయమైనట్టు తెలుస్తున్నది. ఏభాషా కూడా అసమగ్రమైనదికాదని, ఏభాషైనా ఎటువంటి భావాన్నైనా చెప్పడానికి సమర్థమని తెలియవలసి వుంది. ఒక భాషలో కొన్ని భావాల్ని చెప్పడానికి పదాలు లేకపోతే మరొక భాషనుండి పదాలు స్వీకరించబడతాయి. మన గ్రాంథికంలో అనాదిగా ఎరువుతెచ్చుకున్న పదాల్నెన్నిటినో అంతా శిరసావహిస్తున్నారు. ఇక వాడుక భాష గ్రాంథికభాషగామారి మళ్లీ వ్యావహారికానికీ గ్రాంథికానికీ అంతరం ఏర్పడుతుందనడమూ సమంజసంకాదు. అవిచ్ఛిన్నంగా వాడుకలోవున్న వ్యావహారికం వాడబడుతున్నప్పుడు ఈ అంతరం వుండదు. ఇక మాండలికాలవల్ల ఏర్పడే అవరోధాన్నిగూర్చిన అనుమానాలూ ఇలాంటివే. వ్యావహారికం అన్నిచోట్లా వాడబడుతున్నప్పుడు మాండలికాలు చాలావరకూ ప్రధానభాషలో అంతర్గతమైపోయి, వాటి మాండలిక స్పర్శను పోగొట్టుకుంటాయన్నది భాషాశాస్త్రజ్ఞులకు విదితమే. నన్నయ, తిక్కనల కాలం నుండీ నేటివరకూ అనేక వ్యవహారంలోవున్న ప్రయోగాలు గ్రంథస్థం కావడం, మాండలికాలు గ్రహింపబడటం తెలియనివికావు. 'బెల్లపుటచ్చులున్ సెనగబేడలు'అనే శ్రీనాథుని ప్రయోగాన్ని అందరూ శిరసావహిస్తూవున్నారు. ఇన్నిదశాబ్దాలుగా గిడుగు వారి వ్యావహారిక భాషావాదం పలువురు ఆమోదించినా, ఆచరణయోగ్యం కాకపోవడానికి శాస్త్రదృష్టి జీర్ణించుకోక పోవటమే కారణం. ముందు తరాలవారికి ఇటువంటి భాషనుగూర్చిన అనుమానాలూ, భయాలూ తొలగడానికి భాషాశాస్త్ర పరిచయం చాలా అవసరం.

## వ్యాకరణ నిర్మాణం—భాషాశాస్త్రం

ఇక వివిధ శాస్త్రాలతో భాషాశాస్త్రానికి గల సంబంధం విశేషించి చూదాం. భాషకు వ్యాకరణాన్ని నిర్మించడంలోనూ, వ్యాకరణాన్ని బోధించడంలోనూ భాషాశాస్త్రజ్ఞులు ప్రధానంగా వర్ణనాత్మక వ్యాకర

ణాలను అవలంబిస్తున్నారు. ప్రాచీనమైన functional grammar కు బదులుగా Stuctural grammar ప్రవేశించడానికి భాషాశాస్త్రం కారణం. Functional grammar లో ప్రాధాన్యత శబ్దాతిదేశానికి (Parsing) ఇవ్వబడేది. భాషలోని పదజాలమంతా భాషాభాగములు (Parts of speech) అనే విభజనకు లోనయ్యేది. అయితే ఈ విభజన శాశ్వతంకాదు. 'man' అనే పదం నామవాచకంగా (noun) భావించబడింది. కాని కొన్నిచోట్ల ఇది క్రియకావచ్చు. (To man the boat). 'run' అనేది ప్రధానంగా క్రియ; కాని ఈ పదం ఒకప్పుడు నామవాచకం కావచ్చు. They made three runs ). ఈ విధంగా భాషాభాగాలుగా విభజించడం శాశ్వతం కాకపోయింది. Structural grammar అశాస్త్రీయమైన ఈ విభజనను పాటించదు. భాష నేర్చుకొనబడడంలోనూ, బడటంలోనూ కూడా పదవాక్యనిర్మాణాలన్నిటా ప్రభావాన్ని చూపే సామ్యము (analogy) దీనిలో ప్రధానస్థానం ఆక్రమిస్తుంది. దీనిలో భాషాభాగాలుగా విభజించడంకాక పద, పదాంశాలుగా విభజించడమే ఉంటుంది. పద పదాంశాల సంయోజనంలోని నియతినిగూర్చి ఇంతకుముందే ముచ్చటించడం జరిగింది. అయితే structural grammar బాహ్యనిర్మాణాన్ని గురించి మాత్రమే చర్చిస్తుంది. అందుచేత భాష అంతర్నిర్మాణాన్ని గురించి చర్చించే Transformational grammar నేడు ప్రాధాన్యం వహిస్తున్నది. దీన్ని వ్యాప్తిలోకి తీసుకురావడానికి Noam Chomsky ప్రయత్నిస్తున్నారు. ఈ విషయాలన్నిటివల్లా వ్యాకరణాల విషయంలో భాషాశాస్త్రప్రమేయం సాధారణమైనది కాదని తెలుస్తోంది. ఈ విషయంలో తెలుగు భాష చాలా వెనుకబడి వుంది.

చారిత్రక, తులనాత్మక వ్యాకరణాల విషయంలో భాషాశాస్త్ర సహాయం అమూల్యమైనది.

### ని ఘం టు వు లు

నిఘంటు నిర్మాణ విషయంలో నిర్మాతకు భాషాశాస్త్ర సహాయం నిరుపమానమైనది. నిఘంటువులోని పదాల ఉచ్చారణను ప్రమాణీకరించి ఇవ్వడం కష్టసాధ్యం. దీనికి పరిశోధన జరగాలి. ఆధునిక నిఘంటువు పదజాలాన్ని ప్రదర్శించడంతో తృప్తిపడదు. ప్రత్యయాలలోనూ పదాంశాలలోనూ మార్పుల్ని సూచించాలి. భాషానిర్మాణం స్పష్టంగా [illegible], వాక్యప్రయోగాలని ఇవ్వవలసి ఉంటుంది. ఏదైనా పదానికి స్పష్టమైనది, సూటియైనది, సందిగ్ధత లేనిదీ అయిన అర్థ నిర్ణయంచేసి, తక్కువ పదాలలో అర్థాన్ని ఇవ్వడం అతిక్లిష్టమైన పని. ఏ పదానికి అర్థం ఇవ్వాలో ఆ పదం అర్థనిర్ణయంలో ఉపయోగింపక పోవడం శాస్త్రీయ పద్ధతి. అత్యాధునికమైన అర విపరిణామాలని పరిశీలించి తీరాలి. మాండలికవృత్తిపదకోశనిర్మాణంలోగల సాధక బాధకాలనుగూర్చి భద్రిరాజు కృష్ణమూర్తిగారు వివరించారు. ప్రతికోశనిర్మాణంలోనూ ఇవి వుంటాయి. వీటన్నిటికీ భాషాశాస్త్ర పరిశోధన అవసరం.

విద్యార్థులకూ, పండితులకూగల నిఘంటువుల అవసరం తెలియజెప్పవలసిన పన్లేదు.

వ్యుత్పత్తిపదకోశ (Etymological Dictionary) నిర్మాణం జరగాలంటే తులనాత్మక, చారిత్రక పరిశోధనలు విరివిగా సాగితేనే సాధ్యం. దీనిలోగల కష్టనిష్ఠూరాలు ఇటీవల రేడియో ప్రసంగంలో Dr. దోణప్పగారు వివరించారు. అనేకభాషలకు వ్యుత్పత్తి పదకోశ నిర్మాణం జరిగింది. మన భాషకు దీని నిర్మాణం సాగుతున్నది. ఇందులో ఎందరో కృషి చేస్తున్నారు. ఒక పదం ఎందులోనుండిపుట్టి ఏవిధంగా మార్పుచెందిందో తెలుసుకోడం అవసరంకదా.

తులనాత్మక పరిశీలనవలన మూలమాతృకలు లేనిభాషలకు మాతృకలు నిర్మించడానికి వీలుపడుతుంది. భాషల సాజాత్యాన్ని నిర్ణయించడానికి వీలౌతుంది.

### సాహిత్యం—భాషాశాస్త్రం

ఒక పరికరంలోని సాంకేతిక నిర్మాణం తెలియకుండానే దాన్ని వాడుకున్నట్లు, ఒక భాషానిర్మాణం తెలియకనే ఆ భాషలోని సాహిత్యాన్ని ఆస్వాదించడం జరుగుతోంది. ఈ రెండింటినీ మేళవించి చూడడం భాషాశాస్త్ర సాహిత్యాలు రెంటితోనూ పరిచయంగల ఏకొద్దిమందో చేస్తున్నారు. ఇది అమెరికాలో స్థితి,

Harold White Hall, Hill, Brooks, Warren మొదలైనవారు ఈ విషయంలో కృషిచేసిన వారు. ఛందోబద్ధసాహిత్యంలో Supra Segmentals యొక్క ఉపయోగాన్ని వీరు చర్చించేరు. Supra Segmentals అంటే ఊనిక, స్వరం, సంహిత మొదలైన వాటి సమాహారంవల్ల ఏర్పడ్డ లక్షణాలు. సాధారణంగా మనం intonation అనేది వీటిలోనే చేరుతుంది. వీరు Morpho Phonemics కీ ఛందస్సుకీ గల సంబంధాల్ని పరిశీలించారు. తెలుగులోకూడా ఊనిక, స్వరం, సంహిత మొదలైనవి రసాస్వాదనలో సహాయ పడతాయి.

'ఏమనఁ బోయెదన్ తగుల మెంచక' అనే విజయవిలాసకారుని పద్యంలో ('కాకువు' వున్నదని వేదంవారు చెప్పింది ఈ విభేదమే) గల చమత్కారం గాని, 'మామకాగమనవార్త'లో విశేషంగానీ ఈ విభేదాల పరిగణనవల్లనే అవగత మవుతాయి. కృష్ణశాస్త్రిగారి గీతంచూడండి.

'నాకుగాదులు లేవు
నా కుషస్సులు లేవు,'

ఇక్కడ 'నాకు' అనేదాన్లో 'కు' మీద ఊనిక లేకుంటే 'గాదులు' మాత్రమే మిగుల్తాయి. నారాయణరెడ్డిగారి

'సన్నాజాజీ పూలామాలా
సాయిబుల కుఱ్ఱాడి గొంతుచించుకుని
సాయంకాలం అరుస్తున్నాది'

అనేది మామూలుగా చదివితే మనకేమీ అనిపించదు. నారాయణరెడ్డిగారినోట విన్నప్పుడు 'సన్నాజాజీ పూలమాలా' అనే మాటలు సాయిబుల కుఱ్ఱాడి ఉచ్చారణ వైశిష్ట్యంతో విన్నప్పుడే మనకు అందులో సొగసు పూర్తిగా అనుభవమవుతుంది. భాషాశాస్త్రం తెలియకపోయినా ఏదో రకంగా సాహిత్యాన్ని చదివి రసాన్ని ఆస్వాదిస్తున్నాం. ఛందోబద్ధసాహిత్యాన్ని సృష్టిస్తూనూ ఉన్నాం. కాని 'The Prosodist who realizes this can still travel on he same road, enjoy the same scenery, reach the same destination-only in a slightly more efficient machine' అని Ronald Sutherland అభిప్రాయం.

'చిత్రలేఖకునికి రంగులు తయారు డానికి కావలసిన వస్తువులు, వివిధ వర్ణాలు, కుంచెలు మొదలగువాటి పరిజ్ఞానం ఎలాగ అవసరమో అలాగే రచయితకి తనకు సాధనమైన భాష, దాని సామర్థ్యం తెలియాలి. ఆ కారణంచేతే సాహిత్య విమర్శకునికి కూడా తెలియాలి' అని Charles. F. Hockett వ్రాశారు.

## చరిత్ర—భాషాశాస్త్రం

భాషాశాస్త్ర చరిత్రగాని, ఒక భాష చరిత్రగాని చరిత్రలో భాగాలే. కానా ఒక భాష చరిత్ర ఆ భాషా వ్యవహార ప్రాంతంయొక్క రాజకీయ, సాంఘిక వైజ్ఞానికాదివిషయాలను వెలికి తీసుకొచ్చేదిగా వుంటుంది. మన శాసనాల పరిశోధనవలన అనేక విషయాలు వెల్లడౌతున్నాయి. 'ఉ ఇ్చ మున్న పన్నాస' అనే పదం భూమి ఒ రోజుల్లో రాజుదేనని తెలుపుతున్నది. తెలుగుయొక్క మాండలిక భాషా విజ్ఞానం ఆంధ్రదేశానికి కలిగిన రాజకీయ సాంఘికాలైన మార్పుల్ని ప్రతిబింబిస్తోంది. కృష్ణా గోదావరీజిల్లాలలో వ్యవహారభేదకరేఖలు (Isoglasses) స్పష్టంగా ఏర్పడక అనేకమాండలికాల కలయికలను సూచిస్తూ ఉండటానికి ఆ ప్రాంతపు రాజకీయ అస్థిమితత్వం కారణంగా భావింపబడుతోంది. బళ్ళారి ప్రాంతంలో శైవమతపరంగా చేరిన కన్నడపదాలు ఆంధ్రదేశమతచరిత్రను ఆవిష్కరిస్తున్నాయి. ఆంధ్రదేశమంతటా వాడుకలోవున్న ఉర్దూపదాలు (ముఖ్యంగా రెవెన్యూశాఖలో) ఆంధ్రదేశపు మహమ్మదీయ పాలనను ప్రతిబింబిస్తున్నాయి. మన వేంగీలిపి తూర్పుదీవులకు పోవడం ఆనాటి వర్తక సాంస్కృతికపరమైన సంబంధాలను సూచిస్తోంది. ఈ విధంగా భాషాశాస్త్ర పరిశోధనలు చరిత్రజ్ఞానాని కుపకరిస్తున్నాయి.

## సైన్సు—భాషాశాస్త్రం

శాస్త్రవిజ్ఞానం అన్నిభాషల్లోనూ బోధించడం ఆవశ్యకమవుతున్నరోజుల్లో, భాష, శాస్త్రవిషయాల్ని వ్యక్తీకరించడంలో ఎంతవరకు సహాయకారి కాగలదో తెలుసుకోడానికి ఆ భాషపై శాస్త్రీయపరిశోధన అవసరం. కొన్నిభాషల్లో ఒక విషయాన్ని చెప్ప

ఒక్కపదమే వుంటుంది. మరికొన్నిభాషల్లో రెండు మూడు పదాలుంటాయి. హోపీభాషలో పక్షి కాక ,ఎగిరే ప్రతిదానికీ తూనీగ్రైనా, విమానమైనా, మనిషైనా 'MA SA'Y TAKA' అనేమాటే ఉప యోగపడుతుంది. ఆంగ్లంలో వీటన్నిటికీ వేర్వేరు పదాలున్నాయి. భాష ఔన్నత్యాన్నిబట్టి వేర్వేరుపదాలు ఏర్పడతాయనుకోవడం పొరబాటు. ఎస్కిమో భాషలో కురుస్తున్న మంచుకీ, మంచుబ్లాక్సుకీ, గాలిలో కొట్టుకుపోతున్న మంచుకీ వేర్వేరు పదాలుండగా, ఆంగ్లంలో అన్నింటినీ 'Snow' అనే అంటున్నారు. ఇది విశేషమైన విషయంకాదు. అంబలికీ, గంజికీ, వరిఅన్నానికీ అన్నిటికీ 'కూడు' అన్నపదం ఒక్కటే తెలుగులో ఉపయోగ పడుతోందికదా. ఈ విధంగా ఆలోచించినప్పుడు 'హోపీ' భాషలో కాలాన్నీ, వేగాన్నీ సూచించేపదాలు లేవు. 'వేగంగా వెళ్ళేను' అనే భావాన్ని 'బాగా వెళ్ళేను' 'మిక్కిలి వెళ్ళేను' అనేరీతిగా తెలియ జేస్తారు. ఈ లాంటి భాషల్లో Velocity, acceleration వంటి పదాలు పరిచయం చెయ్యడం ఎంత కష్టమో Benjamin Lee Whorf చర్చించారు ఈ పరిశీలన ఒక్కొక్కప్పుడు భాషావిజ్ఞానం సైన్సుకి ఎలా అవసరమవుతుందో నిరూపిస్తోంది.

### మనస్తత్వశాస్త్రం - భాషాశాస్త్రం

మనస్తత్వ శాస్త్రజ్ఞులు మానవుల్లోవున్న మనస్తత్వ సమస్యలుగూర్చి పరిశీలించి, పరిష్కార మార్గాలు కనుక్కోవలసి ఉంది. ఇటువంటి వాటిలో నత్తివంటి ఉచ్చారణలోపాలు గలవారు, సంఘానికి దూరంగాపోవడం (Seclusive) ఒక సమస్య. వారిలోని లోపాలను సవరించితేనే వాళ్ళు సంఘంలో మెసల గలుగుతారు. వారికి ఏ ధ్వనులు ఉచ్చరించడం సాధ్యంకావడంలేదో మనస్తత్వవేత్త తెలుసుకోవాలి. ఆ ధ్వనుల స్థానకరణాలు ఏవో తెలుసుకొని, వ్యవహర్తకు ఉచ్చరణావయవలోపం ఉందేమో తెలుసుకోవాలి. అవయవలోపాన్ని సవరించగలగడానికి శస్త్రచికిత్స ఉపయోగాన్ని సంప్రతించాలి. కొన్ని భాషాధ్వనులు వారి మాతృభాషలో లేనివి పలుకవలసి వచ్చినప్పుడు ఉచ్చారణావయవలోపంగాక, వారికి అలవాటు లేనితనంవల్ల బెరుకు కారణం కావచ్చు. కొందరు నిమ్నమైన అంతస్థులోనివారు, తమ ఉచ్చారణ లోపాల్ని సవరించుకోలేక (యాసమాటల్ని యాసవిడిచి సరిగా ఉచ్చరించలేక) సంఘంలో మెలగడానికి సిగ్గుపడతారు. తెలుగులో యాసవస్తుందని ఆంగ్లమే విధిగా ఉప యోగించేవారున్నారు. ఇటువంటి వారిలో Seclusive nature, inferiority complex పోగొట్టాలంటే మనస్తత్వవేత్తకు భాషాశాస్త్ర పరిచయం అవసరం.

### ఆంత్రోపోలజీ

మానవుని స్వరూపస్వభావాలను గూర్చి పరిశీలన చెయ్యడమే ఆంత్రొపోలజీ. దీని అధ్యయన భాగాల్లో సంస్కృతి ఒకటి. సంస్కృతిలో భాష భాగం. ఈ విధంగా ఆంత్రొపోలజీలో భాషాశాస్త్రం భాగం అయింది. Bloomfield వంటి ఆంత్రొపోలజిస్టులు భాషాశాస్త్ర విషయంలో ఇతోధికమైన కృషి చేసారు. వాగ్రూపభాషలకి సంబంధించి వీరికృషి అనన్యసామాన్యం. ఒక ప్రదేశంలోగల మానవజాతి సంస్కృతీవిశేషాలపరిగ్రహణకోసం ఆ జాతిభాషని అధ్యయనంచేసి, ఆ భాషకు వ్యాకరణ, నిఘంటు వాచకాదుల నన్నింటినీ తయారుచేస్తూపోవడంవల్ల వీరివలన అనేకభాషలకు మేలు జరిగింది. అనేక అమెరికన్ ఇండియన్‌భాషలు ఇలాగే లాభం పొందాయి. ఆ భాషలకి లిపికూడా వీరే రూపొందించారు. ఆంత్రొపోలజిస్టులకీ భాషాశాస్త్రానికీ అవినాభావ సంబంధం ఉంది. వారు లేకపోతే నేటి భాషాశాస్త్రంలో ఇంత అభివృద్ధి జరిగివుండేదికాదు.

### తర్కశాస్త్రం (Logic)

తర్కశాస్త్రానికి భాషాశాస్త్రంతోగల సంబంధం భారతదేశంలో అనాది సిద్ధమైంది. వాక్యపదీయంలో చర్చలు తర్కశాస్త్రపాండిత్యానికి నిదర్శనాలు. వాక్యం, పదం—వీటి ఆర్థికస్వభావం సరిగా తెలియక పోతే తర్కశాస్త్రంలో నిపుణంగా భాషని ఉపయోగించలేం. ఈ విధంగా తర్కశాస్త్రానికి భాషాశాస్త్ర పరిచయం అవసరం. Metalinguistics అభివృద్ధితో తార్కికదృష్టి భాషాశాస్త్రంలో మరింత ఎక్కువైంది.

## గణితశాస్త్రం

బ్లూమ్‌ఫీల్డు భాషాశాస్త్రానికి గణితశాస్త్రపరమైన వివరణల నిచ్చారు. ఇవి ప్రశంసించబడ్డాయి.

ఈ పరిశీలనవలన భాషాధ్యయన బోధనలలోనూ, వ్యాకరణ నిఘంటు నిర్మాణాల్లోనూ, చారిత్రిక పరిశోధనలలోనూ, అనేకఇతరశాస్త్రాల విషయంలోను భాషాశాస్త్రావశ్యకత పరిహరింపరానిదని తెలుస్తున్నది. సాహిత్యరచనలోనూ విమర్శలోనూ కూడా ఈ శాస్త్రం చోటు చేసుకుంటోంది. భాషాశాస్త్రం ఆవశ్యకత ఎక్కువై ఈనాడు 'Applied linguistics' అనే ప్రత్యేకశాఖ అభివృద్ధిచెందింది.

### ఈ వ్యాస రచనలో ఉపయోగపడ్డ గ్రంథాలు. వ్యాసాలు.

1. A Course in Modern linguistics—by Charles. F. Hockett.
2. Readings in Applied English linguistics—Edited by Harold B. Allen.
3 Introductory linguistics—By Robert A. Hall Jr.
4. మాండలిక వృత్తి పదకోశము— శ్రీ భద్రిరాజు కృష్ణమూర్తి.
5. తెలుగునందలి కృతకప్రామాణిక రూపములు— డా. తూ. దోణప్ప. ఆంధ్ర విశ్వవిద్యాలయం.
6. వాడుక భాష— శ్రీ విశ్వనాథ సత్యనారాయణ; ఆంధ్రప్రభ 14—9—'71.
7. విశ్వవిద్యాలయాల్లో వ్యావహారిక భాష— ఒక పరిశీలన శ్రీ జాఫర్‌అలీఖాను —ఆంధ్రప్రభ 26—10—'71



# అసహిష్ణుత

శ్రీ గడియారం శేషఫణి శర్మ

కాల కాలాంభోద
గర్జారవము శ్రవః
కులిశమై వెరపింప
కలత చెందనుగాని,

విలయ ఝంఝూహతి
విమలాంబుద శ్రేణి
పిడుగులు కురిసిన
వెర్రినై రోదింతు

సాంద్రమై దశ దిగ్ది
శాంచలమ్ముల తమః
పటలి పర్విన సుంత
భయము నందనుగాని,

ప్రవిమల కౌముదీ
భర్మాంశుతతి తమః
ఛాయ తోచిన సాధ్వ
స వ్యాహృతుడ నౌదు.

వనవీధి నొంటి దు
ర్వార దవానల
జ్వాల జిక్కిన సుంత
చలన మందను గాని,

భా ర తి

నిశ్చలమ్మైన ము
న్నీటి గుండెల బాడ
బ జ్వాల లెగిసిన
భయ విహ్వలుడ నౌదు.

హరురీతి విప్రీతి
హతమహాగరళాంబు
ధారలే జంకక
త్రాగి త్రేన్చెద గాని

చవిచూచు నెడ సుధా
చషకమ్మునన్ విష
బిందువు చిందిన
భీతితో విలపింతు



# వచనపద్యం: లక్షణ నిరూపణం

సంపత్కుమార

'వచనపద్యం' అన్న ప్రక్రియ ప్రయోగంలోకి వచ్చి దాదాపు నలభై ఏళ్లయింది. ఇటీవల మరీ విరివిగా విస్తృతంగా ప్రయోగింపబడుతున్నది. అయితే వచనపద్యాన్ని ప్రయోగించటమే తప్ప, ఒక ఛందోరూపంగా దాని లక్షణాన్ని నిరూపించేప్రయత్నం మాత్రం జరుగలేదు. అందుకని, దానికి లక్షణాన్ని నిరూపిస్తూ నేను కొన్ని వ్యాసాలు వ్రాయటం జరిగింది. నా వ్యాసాలను పురస్కరించుకొని శ్రీ చేకూరి రామారావుగారు 'వచనపద్యం : ఆభాస లక్షణ నిరాకరణం' (ఆంధ్రపత్రిక, పరీధావి ఉగాది సంచిక) అన్న వ్యాసంలో నేనుచెప్పిన లక్షణాలను నిరాకరించినారు. వారుచేసిన ఈ 'నిరాకరణం' పురస్కరించుకొని మళ్లీ వచనపద్యాన్ని గూర్చిన కొన్ని అంశాలను స్పష్టంచేయటం అవసరమవుతున్నది.

రామారావుగారు తమ వ్యాసంలో వచనపద్యాన్ని గూర్చి నేనుమాత్రమే కాక, ఇంకా పలుమందిచెప్పిన పలుఅంశాలను ప్రస్తావించి నిరాకరించినారు. అయితే వాటినిగూర్చి నాయీ వ్యాసంలో ఏమీ చెప్పబోవటం లేదు. నా 'అభిప్రాయాల్నే ప్రధానంగా సవిమర్శకంగా ప్రస్తావించ దలచు'కున్నారు కాబట్టి వాటిని మాత్రమే ప్రస్తావించి వివరిస్తాను.

నా అభిప్రాయాల్నే ప్రధానంగా 'సవిమర్శకంగా' ప్రస్తావించ దలచుకొన్న రామారావుగారు, ఈ ప్రక్రియకు వ్యవహారంలో మరికొన్ని పేర్లు ఉన్నా గూడా, వాటినికాదని, నాకు 'నచ్చినపేరే'—అంటే 'వచనపద్యం' అన్నపేరే — గ్రహించినారు. ఆ పేరే నాకు నచ్చటానికి కారణం, ఆ ప్రక్రియలకు మిగిలిన పేర్లన్నింటికన్నా ఈ 'వచనపద్యం' అన్నపేరు బాగా నప్పటంమాత్రమే. ఈ పేరునుగూర్చి ఇదివరకటి నా వ్యాసాల్లో—ప్రధానంగా 'వచనపద్యం : దానిపేరు' ('జనధర్మ' కీలక ఉగాది సంచిక) అన్న వ్యాసం చర్చించి నిర్ధారించినాను. రామారావుగారు ఈ పేరు విషయంలో అసమ్మతి ఏమీ ప్రకటించలేదు. పేరును విరాకరించనూలేదు. పైగా నాకు నచ్చిన కారణంగా వారూ ఆ పేరే స్వీకరించినారు. అసలు రామారావుగారు ఈ ప్రక్రియపేరునుగూర్చి అంతగా పట్టించుకోలేదు. అందుకని ఆ విషయాన్ని గూర్చి ఇక్కడ ఎక్కువగా వివరించటంలేదు.

రామారావుగారు తమ వ్యాసాంతంలో '—వచనపద్యం పద్యంకాదనీ, గద్యమేననీ సిద్ధాంతం. గద్యానికి ఏ నియమాలూలేవు. వచనపద్యానికీ అంతే. నియమరాహిత్యమే వచనపద్యలక్షణం'అని సిద్ధాంతం చేసినారు. వచనపద్యం గద్యమేతప్ప పద్యంకాదని సిద్ధాంతం చేస్తూ, 'నియమరాహిత్యమే వచనపద్యలక్షణం' అనటం కొంతఅయోమయాన్ని కలిగిస్తున్నది. వచనపద్యం పద్యంకానేకాకపోతే, అందులో—'వచనపద్యం'లో — పద్యంఅన్నమాట ఉండటానికే వీల్లేదు. మరొకటి. 'అనియతత్వం ఒక లక్షణం ఎట్లా అవుతుంది?'అని తమ వ్యాసంలో ఒకచోట (పుట. 30. చివరిపేరా) ప్రశ్నించిన రామారావుగారు 'నియమరాహిత్యమే వచనపద్యలక్షణం' అనటం ఎట్లా కుదిరిందో అర్థం కావటంలేదు. 'అనియతత్వం' లక్షణం కానప్పుడు నియమరాహిత్యంమాత్రం లక్షణమెట్లా అవుతుంది?

వచనపద్యాన్ని 'పద్యం' అనటానికి నేను ప్రతిపాదించిన ప్రధానాంశం దాని పాదబద్ధత. దీన్ని అనుసరించిచేసింది భావగణప్రతిపాదన. రామారావుగారు తమ వ్యాసంలో మొదట భావగణనిరాకరణంచేసి, ఆపైన పాదబద్ధతానిరాకరణం చేసినారు. అయితే, ఈ రెండవ నిరాకరణనుగూర్చి మొదట, ఆ తరువాత మొదటి నిరా

కరణనుగూర్చి ప్రస్తావిస్తాను. కారణం ఛందస్సులో మొదట పాదం, తరువాత గణంఅనే పద్ధతి ఉండటం.

పాదబద్ధతను నిరాకరిస్తూ రామారావుగారు కొన్ని ఆసక్తికరమైన అంశాలను ప్రస్తావించినారు. 'పాదం అక్షరసముదాయంకాదు. గణసముదాయం. అంటే పాదానికి అంతర్నిర్మాణం ఉన్నదన్నమాట' అన్నారు. కాని విచారిస్తే, పాదం అక్షరసముదాయమేతప్ప గణసముదాయం కాదు. కొన్నిపద్యాల్లో అక్షరాలసంఖ్య పాదప్రమాణంకాగా, మరికొన్నిటిలో ఆ అక్షరసంఖ్య మాత్రాసంఖ్యాదృష్టితో హెచ్చుతగ్గు లవుతుంది. నిజానికి ఛందస్సులో గణపద్ధతి మొదట పింగళుడు ప్రవేశపెట్టింది. ఆయన పద్ధతిప్రకారం మూడక్షరాల గుంపు ఒక 'గణం'. (వగణం, హగణం అని రెండక్షరాల గుంపునీ 'గణం' అనటం ఔపచారికంగా మాత్రమే.) పద్యలక్షణం చెప్పటంలో సౌలభ్యంకోసం తనధోరణిలో ఉద్దేశించింది మాత్రమే ఈ గణపద్ధతి. శాస్త్రకర్తలు ఈ విధంగా లక్షణకథనంలో సౌలభ్యంకోసం కొన్ని పద్ధతుల్ని ఏర్పాటుచేసుకొని సంకేతించటం పరిపాటే. అంతకుముందు భరతాదుల్లో ఈ గణపద్ధతి లేదు. ఇన్నిన్నేసి అక్షరాలుగల పాదాల్లో, ఫలానా ఫలానా సంఖ్యగల అక్షరాలు గురువులనీ, లేదా లఘువులనీ చెప్పినారు. పరిశేషన్యాయంగా మిగిలినవి లఘువులో, లేక గురువులో అవుతాయని అనుకోవాలి. మరొకటి. పింగళుని గణపద్ధతికి భిన్నంగా రత్నమంజూషాకర్త, జనాశ్రయుడూ తమ కనుకూలమనుకొన్నపద్ధతిలో గణనిర్మాణం చేసుకున్నారు. పింగళుడు ఎనిమిదిగణాలను చెప్పగా, ర. మం. కర్త పన్నెండు, జనాశ్రయుడు పద్దెనిమిది గణాలను చెప్పినారు. పైగా వారి గణనిర్మాణంలో మూడక్షరాల సంఖ్య పరిమితంకాదు. రెండునుండి ఆరుదాకా ఆ గణాల్లో అక్షరాలుంటాయి. పింగళుడి గణాలు ఎనిమిది కావటానికి కారణం, ఆయన మూడక్షరాల ఛందస్సును ప్రస్తారంచేసి, దానివల్ల ఏర్పడ్డ ఎనిమిదిరకాల మూడోఛందస్సుకు చెందిన పద్యపాదాలను గణాలుగా స్వీకరించటమే. మూడవ ఛందస్సును ప్రస్తారంచేస్తే ఎనిమిదిరకాల పాదాలు మాత్రమే ఏర్పడతాయి. మిగిలినవాళ్లు ఈ ప్రస్తారపద్ధతిని కాక, తమ అనుకూల్యాన్ని అనుసరించే గణనిర్మాణం చేయటంవల్ల, వాటిలో సమత్వంలేకుండా పోయింది. ఆ కారణంగా, వారి గణనిర్మాణానికి ప్రాధాన్యం కలుగక, పింగళుడి పద్ధతికే ప్రాధాన్యం వచ్చింది. ఏదెట్లాలయినా, గణాలనేవి లక్షణకర్తలు లక్షణకథనంలో సౌలభ్యానికి ఏర్పరచుకొన్నవే తప్ప, పాదానికి నిసర్గంకావు. పాదనిర్మాణంలో గణాలే ప్రధానమయితే, గణసంఖ్యతో అయిదు గణాల ఛందస్సూ, ఆరు గణాల ఛందస్సూ...ఇత్యాదిగా చెప్పవలసిఉండేది. కాని అట్లా ఏలాక్షణికుడూ చెప్పలేదు. ఒక అక్షరం నుంచి ఇరవయ్యారక్షరాలదాకా ఒక పాదంలో అక్షరాలుండవచ్చు. (అంతకన్నా ఎక్కువ అక్షరాలుంటే, అవి వేరే వృత్తాలు.) పాదంలో ఎన్నక్షరాలుంటే, ఆ పాదం అన్నవ ఛందస్సులోని వృత్తానికి సంబంధించిందనుకోవాలి. అన్నిఛందస్సుల్లోని పద్యపాదాలూ గణాలతో నిశ్శేషంగా విభక్తంకావు. అందుకనే విభక్తంకాని చోట్ల పాదాంతంలో మిగిలిన ఒకటిరెండక్షరాల ఉనికినిగూర్చి ప్రత్యేకంగా చెప్పటం జరుగుతున్నది. మరొకటి. పద్యపాదాల్లోని గురులఘుక్రమం 'ప్రస్తారం' ద్వారా నిర్ధారితమవుతుంది. ఆ నిర్ధారితమయిన క్రమాన్ని గణపద్ధతిలో చెప్పటం జరుగుతున్నది. కాగా, పద్యపాదస్వరూపాన్ని అక్షరసంఖ్య, దాన్నిబట్టి జరిగే ప్రస్తారపద్ధతి నిరూపిస్తున్నయితప్ప గణాలు కాదు. మాత్రాసంఖ్యాప్రాధాన్యంగల పద్యాల్లోనూ ఇంతే. ఆ పద్యపాదాల్లోనూ గణపద్ధతిని ఉపయోగించటం సౌలభ్యంకోసమూ; ఎన్నిమాత్రలవద్ద పదం, పదాంశం విరిగితే నడక బాగుంటుందో చెప్పటానికీ ఉద్దేశించి మాత్రమే. ఈ నడకకోసమే చతుర్మాత్రాగణా లుంటాయన్న పద్యపాదాల్లో జగణం చతుర్మాత్రాగణమయినా కొన్నిచోట్ల దాన్ని లాక్షణికులు నిరాకరించటం జరిగింది. మరికొన్నిచోట్ల మాత్రాగణాన్ని వదిలి మాత్రాసంఖ్యతో పాదలక్షణం చెప్పటంగూడా ఛందోగ్రంథాల్లో గమనించవచ్చు. అందువల్ల పాదం గణసముదాయంకాదనీ, అక్షరసముదాయమేననీ స్పష్టం. కాగా గణాలదృష్ట్యా పాదానికి అంతర్నిర్మాణమంటూ ఏదీ ఉండదు. నిజానికి పద్యపాదాల్లో గణపరిమితికి

లొంగకుండా పదాలూ, పదాంశాలూ మించిపోవటమే అత్యధికంగా మనం చూస్తూ ఉంటాం. ఈ యీ అంశా లన్నిటినీబట్టి పాదం అక్షరసముదాయమేనని చెప్పక తప్పదు.

'ఇంతవరకూ తెలుగులోవచ్చిన పద్యపాదా లన్ని టినీ రాతతోగానీ, అచ్చుతోగానీ పనిలేకుండా కను క్కునే వీలుంది. ఏ పద్యాన్నయినా పాదవిభజన చేయ కుండా పూర్వులు తాళపత్రగ్రంథాల్లో ఒకే వరు సలో రాసేవాళ్లు. అయినా ఛందస్సు తెలిసినవాళ్లకి వాటిని మళ్లీ పాదబద్ధంగా రాయటం కష్టంకాదు. పాదవిభజనలేకుండా అచ్చువేసిన (లేక రాసిన) వచన పద్యానికి ఈ వచనపద్యలక్షణకర్తలు కవ్యుద్దిష్ట మయిన పాదవిభజన చేయగలరా! కవ్యుద్దిష్టం కాక పోతే పోనీ, ఏ ఇద్దరు లక్షణ కర్తలైనా ఒకేరకపు పాద-విభజన చేయగలరా!' అని రామారావుగారు ప్రశ్నించినారు. ఒకవిధంగా చూస్తే, ఇది నిజమే నని పిస్తుంది. ఒకసారి శ్రీ కుందుర్తిగూడా నన్ను దాదాపు ఇట్లాగే ప్రశ్నించినారు. వచనపద్య లక్షణ సమాకల నంలో ఇట్లాంటి ప్రశ్నల్నిగూర్చి నాతో నేనేకాకుండా, మరికొంతమంది మిత్రులతోనూ చర్చించి ఒక సమా ధానానికి వచ్చినాను. అదేముందు వివరిస్తాను.

అయితే పైన రామారావుగారు అన్నదానిలో రెండంశాలున్నాయి. ఒకటి. పూర్వులు పాదవిభజన లేకుండా వ్రాసినా, ఛందస్సు తెలిసినవాళ్లు పాదవిభ జన చేసుకొనటానికి వీలుంటుందనేది. ఈ వీలుకి కారణం అక్షరసంఖ్యతోనో, మాత్రాసంఖ్యతోనో, గణ పద్ధతిద్వారానో పరిచితమయిన ధోరణిలో ఆ పాదాలు నియతంకావటం. అయితే ఈ కిందిపద్యం ఉదాహర ణకి చూడండి—

> 'మధుర మధురమైన మామిడిపండ్లను
> పంచియిచ్చు జనుడె మంచివాడు'

ఇది ఫలానాపద్యం అని చెప్పకుండా, ఏ పద్యం, లేదా ఏ పద్యపాదం అని అడిగితే రెండురకాలుగా చెప్ప టానికి వీలున్నది. ఆటవెలది రెండుపాదాలూ కావచ్చు. సీసపద్యపు ఒకపాదమూ కావచ్చు. మొదటి పంక్తిని 3 సూర్య + 2 ఇంద్రగణాలుగా, రెండవ పంక్తిని 5 సూర్యగణాలుగా విభజిస్తే ఆటవెలది. అట్లా కాకుండా, రెండుపంక్తుల్నీ కలిపి 6 ఇంద్ర + 2 సూర్యగణాలుగా విభజిస్తే సీసపాదమూ అవు తుంది. ద్వివిధంగా విభజించేందుకు వీలుగా పై పంక్తులున్నాయి. ఇదే పద్ధతిలో మరికొన్ని పంక్తులు వరుసగా ఉండేట్లయితే, ఇది ఫలానాపద్యం అని కవి చెప్పకుండా, కవి ఏపద్యంగా ఉద్దేశించినాడో చెప్పటం కుదురదు. పాదాన్ని పట్టియ్యటంలో ఒక సాధన మయిన ప్రాసనియతి ఈ రెండు పద్యాలకూ లేదు. యతి రెండిటా అమరేట్లుగానే ఉంటుంది. అయితే, ఇట్లాంటిస్థితి చాలా అరుదు. అయినా ఒక ఉదాహర ణగా చెప్పినాను. మరొక అంశం ఏమిటంటే, తాళ పత్రగ్రంథాల్లో ఒకేవరుసలో పద్యాలు వ్రాస్తూ పోవటం జరిగినా, చాలావరకు పాదాంతంలో ఒక నిలువుగీతా పద్యాంతంలో రెండు నిలువుగీతలూ గీసి, పాద, పద్యాంతాలను సూచించటం జరుగుతూనే ఉంటుంది.

ఇదిట్లా ఉండగా, అక్షర లేక గణపద్ధతి నియ తంగా ఉన్నప్పుడు, అనుభూయమానమవుతున్నప్పుడు, పాదవిభజనలేకుండా వ్రాసినా కూడా, పాదవిభజన చేయ వచ్చు. అక్కడ కవ్యుదిష్టంగా పాదవిభజన చేయట మన్న ప్రశ్నేలేదు. ఉదాహరణకు ఉత్పలమాలాపద్యం ఉన్నదంటే, ఒక కవి ఒక విధంగా, మరో కవి మరో విధంగా తమ ఉద్దేశ్యాల ననుసరించి విభజించటం జరుగనేజరుగదు. వారి ఇష్టానిష్టాల ప్రసక్తి లేనే లేదు. ఆ పద్యపుచట్రం నియతం. పాదాక్షర, మాత్రా సంఖ్య నియతం. (కొన్నిచోట్ల మాత్రాసంఖ్యలో వచ్చే తేడాలు గణపద్ధతిద్వారా పరిష్కృతమయితయి.) ఆ నియతి ననుసరించి పదాలను కూర్చుకొనటమే కవి పని. అందువల్ల అక్షర, మాత్రాదుల నియతి ఉన్న చోట పాదవిభజనకు కవి ప్రయత్నించవలసిన అవసరం లేదు. ఇకపోతే, ఈ నియమం లేనిచోట కవి తనంతట తానే పాదాలను విభజించక తప్పదు. అందువల్ల అక్షర, మాత్రాదినియతిలేని వచనపద్యం విషయంలో '...పాదవిభజనలేకుండా రాసిన...' ఇత్యాదిప్రశ్నేఉత్పన్నం కాదు. వచనపద్యాన్ని పాదవిభజనచేస్తూ వ్రాయవల సిందే. తాళపత్రగ్రంథాల్లోనూ, మొదటి నాళ్లలో అచ్చయిన కొన్ని గ్రంథాల్లోనూ పాదవిభజన లేకుం. ఒకే వరసలో పద్యాలుండటం చూస్తాంగాని ఈ నాటి

అచ్చుగ్రంథాల్లో చూడటం లేదు. పాద విభజన విషయంలో పాఠకుడు చికాకు పడగూడదనేగదా, ఈనాడు పాదవిభజన పూర్వకంగా అచ్చువేయటం జరుగుతున్నది! అందువల్ల ఈనాటి వచనపద్యాన్ని పాదవిభజన లేకుండా రాయటంగానీ, అచ్చువేయటం గానీ కుదరదు. పలుచోట్ల వచనపద్యాలను పత్రికల్లోనూ, గ్రంథాల్లోనూ, వ్రాతల్లోనూ ఉదాహరిస్తున్న సందర్భాల్లో నిండు పంక్తులుగా వ్రాస్తూ పాదాంతాన్ని సూచించే విధంగా నిలువుగీతలు గీయటం జరుగుతూనే ఉన్నది. పాదవిభజన, విభజనసూచన కూడా లేకుండా వ్రాస్తే, ఆ వ్రాసిన వ్యక్తి దాన్ని వచనపద్యంగా ఉద్దేశిస్తున్నాడా లేదా అన్నది సందేహించవలసిన విషయమే.

ఇక, ఏ లక్షణకర్త అయినా కవ్యుద్దిష్టంగా పాదవిభజన చేస్తాడా? ఏ ఇద్దరు లక్షణకర్తలయినా ఒకే విధంగా పాదవిభజన చేయగలరా? అన్నది రెండవ అంశం. 'కవ్యుద్దిష్టంగా పాదవిభజన' అంటే, పాద విభజనకు కవి ఉద్దేశించిన రీతి ప్రధానమనీ, ఆయన ఉద్దేశించటంమీద పాదవిభజన ఆధారపడి ఉంటుందని స్పష్టమవుతున్నది. అయినప్పుడు కవ్యుద్దిష్టంగా మరొకరు పాదవిభజన చేయనవసరం లేదు. కవే చేస్తాడు. పేచీయే లేదు. కాకపోతే, తన ఉద్దేశ్యం ప్రకారం పాదవిభజనతో వ్రాసుకొని, దాన్ని ఏడిగా ఉంచుకొని, పాద విభజన లేకుండా నిండు పంక్తులుగా మళ్లీ వ్రాసి లక్షణకర్త ముందుంచి పరీక్ష పెట్టితే, అప్పుడు ఆలోచించవలసి వస్తుంది. పాద విభజనకు లక్షణకర్త ఏదయినా పాదవిభాజక సూత్రాన్ని ఏర్పరచుకొంటే, దాన్నిబట్టి ఆ పంక్తుల్ని పాదాలుగా విభజిస్తాడు. అప్పుడు 'కవ్యుద్దిష్టత'కు ప్రాధాన్యం లేదు. కాగా విభాజక సూత్ర ప్రామాణ్యానికి ప్రాధాన్యం. విభాజక సూత్రం అంగీకృతమయితే, పాదవిభజన దాన్ని అనుసరించే జరుగవలసి ఉంటుంది. 'మ–స–జ–స–త–త–గ' అన్న క్రమాన్ని ఒప్పుకున్నాక, దాన్నిబట్టే పాదవిభజన జరిగినట్టు. కవ్యుద్దిష్టత కక్కడ ప్రాధాన్యం లేనట్టు. ఇకపోతే, ఏఇద్దరు లక్షణకర్తలయినా ఒకేవిధంగా పాదవిభజన చేయటానికి వీలున్నదా? అంటే లేదనే వీలులేదు. ఆ ఇద్దరు లక్షణికులు పాదవిభజకసూత్రాన్ని సమంగా ఉపయోగిస్తే, ఒకేవిధంగా పాదవిభజన జరిగే వీలుంది. ఒకప్పుడు సూత్రోపయోగంలో లేడా రావచ్చు. ఆ రావటం ఎట్లాంటిదంటే, వెనుక 'మధురమధురమ్మైన.....' అన్నచోట ఒక లక్షణకర్త ఆటవెలదిగా విభజిస్తే, మరొకరు సీసపాదంగా విభజించటంలో వచ్చినటువంటిది. సాంప్రదాయికచ్ఛందస్సుల్లోనూ సమాన ప్రమాణాల్ని అనుసరించటంవల్లనే ఆ పాదవిభజనలో సమానత్వం కనిపిస్తుంది. లేనిచోటలేదు. అందువల్ల ఎక్కడయినాసరే, ప్రమాణసమానత్వం అవసరం.

ఇంతకూ వచనపద్యపాదవిభజనకు సూత్రమేమిటి?

కీ. శే. బాలగంగాధరతిలక్ వ్రాసిన ఒకభాగాన్ని ఉదాహరించి పాదవిభజనకు ఆధారాలేవీ లేవన్నట్టుగానే రామారావుగారు వ్రాసినారు. కాని ఇదివరకటి నా వ్యాసాల్లో పాదవిభజనకు ఒక సూత్రాన్ని ప్రతిపాదించటం జరిగింది. అది భావాన్ని పురస్కరించుకొని చేసింది. మొదట్లో ఈ ప్రతిపాదన స్థూలంగా చేయటం జరిగింది. కాని అప్పటికి ఈ ప్రతిపాదనకు ఆధారప్రమాణం లభించలేదు. తరువాత పరిశీలిస్తే బుక్కుల్లో పాదవిభజనకు సంబంధించిన ఒక సూత్రం కనిపించింది.

'తేషాంబుుక్, యత్రార్థవశేన పాదవ్యవస్థా'

అని జైమినీయ మీమాంసాసూత్రం. 2—1—35. (చూ. డా॥ పాటిబండ మాధవశర్మగారి 'ఆంధ్రమహాభారతము: ఛందశ్శిల్పము'. పుట. 14.) బుక్కుల్లో పాదవ్యవస్థ అర్థాన్నిబట్టి ఉంటుందని ఆ సూత్రం స్పష్టం చేస్తున్నది. దాన్ని అనుసరించి, అక్కడ అర్థాన్నిబట్టికాగా, వచనపద్య విషయంలో భావాన్నిబట్టి పాదవ్యవస్థ అన్నాను. అర్థం, భావం, అన్నమాటలే తేడా. కాబట్టి భావాన్ని అనుసరించి వచనపద్యంలో పాదవిభజన జరుగటానికి అభ్యంతరం ఏమీ ఉండనక్కరలేదు.

భావాన్నిబట్టి వచనపద్యపాదవిభజన చేయటమంటే, రెండు రకాలుగా ఉంటుంది. ఒకభావం పూర్తికావటంతో ఒకపాదం పూర్తికావచ్చు. ఒకప్పుడు

భావాంశాలనుబట్టి పూర్తికావచ్చు. అంటే, భావాన్నీ, భావాంశాన్నీబట్టి వచనపద్యంలో పాదవిభజన జరుగుతుంది. ఉదాహరణకు—'అనలతోరణం'అన్న రచనలోనిది—

'ప్రాణాలు బిగపట్టుకొని
సాగేరు ప్రయాణికులు
నాయకుడు తిరిగివస్తాడనీ
తుపాను శమిస్తుందనీ
నది పొంగు తగ్గేననీ
ఆశతో అహరహమూ!
దేనికైనా ఉద్ధృతి ఎంతసేపు?
దానికి వ్యతిరిక్తం తప్పదాపైన.

—శ్రీ మాదిరాజు రంగారావు.

(ఆంధ్రపత్రిక, పరీధావి ఉగాది సంచిక. పు. 84.)

ఇందులో మొదటి ఆరు పాదాలూ భావాంశాలనుబట్టి, చివరి రెండు పాదాలు భావాన్నిబట్టి విభక్తమయినయి. ఇందులో ప్రయాణికులు సాగటం ప్రధానభావం. ఆ సాగటం ప్రాణాల్ని బిగపట్టుకొని. అంతే కాదు. ఆశతో అహరహమూ సాగుతున్నది. అందువల్ల 1, 6 పాదాలు భావాంశాలబట్టి ఏర్పడ్డాయి. కాగా 6 వ పాదంలోని 'ఆశ'కు సంబంధించినయి 3, 4, 5 పాదాలు. చివరి రెండు స్పష్టమే. ఈ విధంగా వచనపద్యాన్ని పరిశీలించుకుంటూపోతే, పాద విభజనను నిర్ధారించటం కష్టమేమీకాదు. రామారావుగారు ఉదాహరించిన శ్రీ కె.వి. రమణారెడ్డిగారి 'బాధాగాథము' అన్న ఈక్రింది భాగంలో—

1. 'పాపికొండల కావల,
నిజాంగజాంకుశం కాలేదూ నీవు?
2. కోనసీమలో, లంకసీమలో,
పాపాల దీపాల నార్పలేదూ
3. నీవు? విచ్చుకత్తుల
బోనురెక్కలు త్రుంచలేదూ
4. రాత్రిని కప్పకొని ధాత్రిని మప్పకుని
చరించలేదూ నీవు?'

పాదాలు భావాంశాలనుబట్టికాక, భావాన్నిబట్టి విభజించబడ్డయి. అయితే ఇక్కడ ఒక అంశం. మూడో పాదం మొదట్లో ఉన్నా 'నీవు', దాని తరువాతి ప్రశ్నచిహ్నం తొలగించటమైనా జరుగాలె, లేదా, వాటిని రెండోపాదం చివర చేర్చటమైనా జరుగాలె. ఇట్లా జరక్కుండా, పైన ఉన్నదే కవ్యుద్దిష్టమైన పాదవిభజన అంటే, మూడోపాదం మొదట 'నీవు'—ప్రశ్న చిహ్నంతోసహా—ఉండటంలోని సామంజస్యం వివరింపబడవలసి ఉంటుంది. వచన పద్య పాదవిభజన సూత్రందృష్ట్యా, నిజానికి ఆ 'నీవు' సప్రశ్నచిహ్నంగా రెండోపాదం చివర ఉండవలసింది. 'వచన పద్యములనుకూడా అతిక్రమించి ఆదేశస్ఫోరకంగా, అంతర్లయాన్వితంగా సాగిన ఈ కావ్యం కావ్యోపన్యాస మన దిగింది' అని శ్రీ రమణారెడ్డి అంటే నా కభ్యంతరం లేదు. ఎందుకంటే, ఇక్కడ కావ్యంగానీ, ఉపన్యాసంగానీ, కావ్యోపన్యాసంగానీ ప్రస్తుతం కాదు. అది వచన పద్యం కాబట్టి, దాని స్వరూపం ప్రధానం. నాలుగు పాదాలతో ఈ రచన కనిపిస్తున్నప్పుడు 'అచ్చులోకూడా పాదబద్ధత పాటించలేద'ని రామారావుగారంటున్నారు. మరిదెట్లా? ఈ అచ్చులో కనిపించే పాదస్వరూపం—కొంచెం లోపం ఉండవచ్చుగాక—చేసిం దెవరు? ఇక, వచనపద్యాన్ని వ్రాస్తూ, ఆ వ్రాసిందాన్ని, మేం వచనపద్యం 'అనదలచుకోలేదు' అని ఎవరైనా అంటే, అనదలచుకోకపోవటం వారి స్వంత విషయం. దాన్నిగూర్చి ఎవరమూ ఏమీ అనలేం. అనదలచుకోనంతమాత్రంలో, అది అయ్యేదయితే, కాకుండా పోదు.

శ్రీ తిలక్ వ్రాసిన 'రాత్రివేళ'అనే ఖండికలో ఒకభాగం రామారావుగారు ఉదాహరించినరీతిలో ఈ కిందివిధంగా ఉన్నది.

1. 'నిర్జనస్థలం, ఎవ్వరూలేరు, చుట్టూ
పరచుకొన్న మైదానపు
2. నగ్నదేహాన్ని స్పృశించబోయే నిచుల
శాఖాగ్రపు వ్యగ్రపు
3. తొందర, నిశ్శబ్దం మెల్లగా అడుగులువేస్తూ
నడుస్తోంది. ఆకాశం
4. మీద ఒకచుక్క మరోనక్షత్రంతో మాట్లాడే
మాట మనసుకి
5. వినిపిస్తోంది.'

'పాదబద్ధతకు లొంగనివికూడా ఆధునిక కవి కొన్ని ఉన్నై' అంటూ పై భాగాన్ని ఉదాహరించి రామారావుగారు 'ఇందులో పాదవిభజనకు ఆధారాలేమిటో నా కర్థం కావటంలేదు. ముఖ్యంగా మూడో పాదం ఆకాశంతో అంతంకావటానికి హేతువు ఎవరయినా చెప్తే సంతోషిస్తాను' అన్నారు. పాదబద్ధతకు లొంగనివికూడా ఆధునిక కవిత్వంలో ఉన్నై అంటే, ఆ లొంగకపోవటం ఎట్లాంటిది? పాదబద్ధతకు లొంగకపోవటమంటే, పాదబద్ధత లేకపోవటమన్నమాట. వచనపద్యమయి పదబద్ధతకు లొంగకపోతే అది దోషమే. ఆధునిక కవిత్వంలోని 'కొన్ని' వచనపద్యాలయితేనే ఇక్కడ మనం ఆలోచించవలసిఉంటుంది. ఆ 'కొన్ని' వచనపద్యం దృష్ట్యా ఛందోదోషజుష్టాలనే అనవలసి ఉంటుంది. ఉదాహృతమైన శ్రీ తిలక్ రచనా భాగాన్ని రామారావుగారు 'వచనపద్యం'గా భావించినారనీ, అందుకే దాన్ని ప్రస్తుతంగా ఉదాహరించినారని అనుకొంటాను. అట్లా భావించినారుకాబట్టే 'ఇందులో పాదవిభజనకు ఆధారాలేమిటో నా కర్థంకావటం లే'దన్నారు. 'మూడో పాదం ఆకాశంతో అంతంకావటానికి హేతువు'ను ప్రశ్నిస్తున్నారంటే, పై భాగంలో పాదవిభజన జరిగిందనీ, కాని మూడోపాదం చివర 'ఆకాశం' అన్న పదం ఉండటం సహేతుకంకాదని వారు భావిస్తున్నట్లు స్పష్టమయితుంది. రామారావుగారు 'ఆకాశం' విషయమే చెప్పినారుకాని, పై భాగం ఉన్న స్థితిలో మూడో పాదం మొదట 'తొందర' ఉండటం, నాల్గో పాదం చివర 'మనసుకి' ఉండటమూ, ఇంకా మరి కొన్ని కొట్టొచ్చినట్టు కనిపించే దోషాలు. వీటన్నిటిని బట్టిచూస్తే, ఉన్నస్థితిలో ఉదాహృతమయిన భాగం పాదవిభజన దృష్ట్యా దోషయుతమయిన వచన పద్యమని చెప్పవలసి ఉన్నది. ఈ దోషాలు రచయితవల్లనే జరిగినవో, అచ్చులో జరిగినవో చెప్పలేము. పాదవిభజన వచనపద్య పాదవిభాజసూత్రాన్ని అనుసరించిచేస్తే, పై భాగం ఈ క్రింది విధంగా ఉండాలె—

'నిర్జన స్థలం
ఎవ్వరూ లేరు.
చుట్టూ పరచుకొన్న మైదానపు నగ్నదేహాన్ని
స్పృశించబోయే నిచుల శాఖాగ్రపు వ్యగ్రపు తొందర
బ్రం మెల్లగా అడుగులువేస్తూ నడుస్తోంది.
ఆకాశంమీద ఒక చుక్క మరో నక్షత్రంతో
మాట్లాడేమాట
మనసుకి వినిపిస్తోంది.'

ఇట్లాకాకుండా మరొకరు ఇంకో విధంగా విభజించటం జరిగితే, దానికి కారణం భావాన్ని బట్టి ఇంకా కొంచెం ఎక్కువ పాదాలుగా అనుకోవటం కావచ్చు. ఉదాహృతమయిన స్థితిలో కొన్ని చోట్ల కామాలున్నాయి. అక్కడికి పాదాలు విరుగాల్నని కవి ఉద్దేశించినట్లు అనిపిస్తుంది. కొన్ని చోట్ల అవి లోపించినయి. అందువల్ల ఆ పాద విభజన అస్తవ్యస్తంగా జరిగింది. ఇది వ్రాతలోనూ, అచ్చులోనూ జరిగే వీలున్నది. ఇదట్లా ఉండగా ఇద్దరు ఒక వచన పద్య పాదాల్ని విభజించటంలో భావాన్నీ, లేదా భావాంశాల్నీ, కొన్ని చోట్ల ఉభయాన్నీ ఆధారించుకోవటంవల్లనే లేదా రావచ్చుకాని, పాదాలుగా విభజించటం ఉభయత్రా సమానమే.

సాంప్రదాయికఛందస్సుల్లో అక్షరాల,మాత్రల నియతికన్నా ఆధిక్యం లేదా లోపంవల్ల, యతి స్థానాల దాటివేతల వల్లా, ఇంకా రకరకాలుగా ఏర్పడ్డ దోషాలను ఛందోదోషాలుగా చెప్పటం ప్రసిద్ధమే. అట్లాగే వచనపద్యవిషయంలోకూడా, పాదవిభజన సరిగ్గా జరుగకపోతే పాదభంగమన్న ఛందోదోషంగా పరిగణించవలసిఉంటుంది.

వచనపద్యానికి లక్షణసమాకలనం చేస్తూ హనుమకొండలో 'మిత్రమండలి' వార్షికోత్సవాల (1965) సందర్భాన ఒక వ్యాసం చదివినాను. అందులోనే పాద విభాజకసూత్రాన్ని ప్రతిపాదించినాను. ఆ సమావేశాలకు వచ్చిఉన్న శ్రీ తిలక్ నా ప్రతిపాదనను హర్షించి, పాదవిభజన విషయంలో వచనపద్య ప్రయోక్తలు నిర్దిష్టమయిన దృక్పథంలో రచన సాగించాలన్న నాతో ఏకీభవించినారు. ఆ సమావేశాలకు వచ్చిన శ్రీ కుందుర్తి కూడా పలుచోట్ల నా ప్రతిపాదనను బలపరుస్తూ వ్రాసినారు.

ఇది చెప్పట మెందుకంటే, నేను వచనపద్య పాదవిభజన విషయికంగా ప్రతిపాదించిన అంశం వచన పద్య ప్రయోక్తలందరిలోనూ స్పష్టంగానో, అస్పష్టం గానో ఉండనేఉన్నదని చెప్పటానికే. కాని తొందరపాటు వల్లనో, అశ్రద్ధానతవల్లనో, అచ్చుకారణంగానో లోపాలు జరుగుతూఉన్నయి. వాటిని లోపాలుగానే భావించి, సరిచేసుకుంటూ—అవసరమయితేనే,—పోవల సిందేతప్ప, పాదవిభజనే లేదనటంమాత్రం కుదురదు.

వచనపద్యపు చారిత్రిక పరిణామాన్నిగూర్చి రామారావుగారు ప్రస్తావించనన్నారుకాబట్టి, నేనూ ప్రస్తావించనక్కరలేదు. కాని ఒక్కఅంశంమాత్రం చెప్ప వలసివస్తున్నది. అదేమిటంటే, వచనపద్య ప్రయోక్త లందరూ, వచనపద్యాన్ని ఒక ఛందోరూపంగానే భావి స్తున్నారుతప్ప కేవలం వచనంగానో, లేక గద్యంగానో భావించటంలేదు. అట్లా కేవలం వచనంగానో, లేక గద్యంగానో భావించిఉంటే, పాదాలుగా విభజించి—ఆ విభ జనలో కొన్నిలోపాలు కొన్నిచోట్ల ఉన్నా ఉండవచ్చుగాక— వ్రాయటమనేదే జరిగిఉండేదికాదు. 'పేరాలు' గానే వ్రాయటం జరిగిఉండేది. పైగా వచనపద్యం ఛందః పరిణామమార్గంగా సాహిత్య రంగంమీదికి అవతరిం చింది తప్ప, వచన, లేదా గద్య పరిణామ క్రమంలో రాలేదు. (ఇక్కడ 'వచన' 'గద్య' పదాలను రెంటినీ పేర్కొనటం స్పష్టతకోసం. ఆ రెంటికి మధ్య అత్యల్పమయిన తేడాను, ఆ రెండుపదాల వ్యవహార రీతినీ పాటించటంకోసం.) ఇది ముఖ్యంగా గమనించ వలసిన అంశం. దీన్నిగమనిస్తే, వచనపద్యంయొక్క పాదవిభజనకూ, అది పద్యం కావటానికీ ఒక చారి త్రిక పరిణామరూపకారణం స్పష్టమయితుంది.

మరి 'పాదబద్ధత పద్యానికీ గద్యానికీ ప్రధాన మైన భేదమనీ, పాదసంఖ్యానియమం అంత ప్రధానం కాదనీ, విషమపాదాలుగూడా అంగీకార్యాలేననీ శ్రీ సంప త్కుమారతో బాటు నేనూ అంగీకరిస్తాను' అన్నారు రామారావుగారు. వచన పద్యానికున్న పాదబద తనూ, పాదవిభాజకసూత్రాన్నీ పైన నిరూపించటం జరి గింది కాబట్టి వచనపద్యాన్ని పద్యంగా స్వీకరించక తప్పదనేది స్పష్టం. మరి, పాదసంఖ్య విషమపాదాల విషయంలో రామారావుగారు నాతో ఏకీభవిస్తూనే ఉన్నారు కాబట్టి ఆ అంశాలనుగూర్చి పేచీయేలేదు.

ఇక నేను ప్రతిపాదించిన భావగణాలనుగూర్చి వివరిస్తాను.

వచనపద్య పాద విభజనకు అక్షర, మాత్రాదుల సంఖ్య కాక, భావాన్నీ, భావాంశాలనూ ఆధారంగా తీసు కున్న విషయం పైన వివరించబడింది. కాగా, వచన పద్య పాదంయొక్క అంతర్విభజనక్కూడా అదే భావ, భావాంశాలు మౌలికంగా స్వీకరించబడ్డయి...సాంప్ర దాయిక ఛందస్సులో 'గణం' అన్నపదం విస్తృతంగా పాదంలో అంతర్విభజన విషయంలో ఉపయుక్తమయి తున్నది. అందువల్ల ఇక్కడకూడా ఆ గణం అన్న పదాన్ని అక్కడి అర్థంలోకాక ఔపచారికంగా స్వీక రించి 'భావగణం' అన్నాను. ఈ 'భావగణ' స్వరూ పాన్ని సులభంగా స్పష్టీకరించటానికి పూర్వపు నా వ్యాసాల్లో—

'ప్రతిమాటకీ శక్తిఉంది పదునుఉంది
ప్రతిమాటకీ అర్థంఉంది ఔచిత్యంఉంది'

అన్న శ్రీ తిలక్ రచనలోని పాదాల్ని ఉదాహ రించటం జరిగింది. వాటినే మళ్లీ ఉదాహరించి రామా రావుగారు 'ఇక్కడ 'కి'— విభక్తిబంధం ఒకగణం, తరు వాత వచ్చిన నామం, క్రియ కలిసి ఒకగణం. 'శక్తి, పదును, అర్థం, ఔచిత్యం' అనేవి ఒకరకపు (నామ) గణాలుగాను, 'ఉంది' అనేది ఒక ((క్రియా) గణం గానూ ఎందుకు విభజించగూడదు? 'శక్తిఉంది' అనేది ఒక భావమా? రెండు భావాలా?' 'ప్రతిమాటకీ శక్తి' అనేది ఒకగణం ఎందుకు కాగూడదు ? భావగణాలను వేరుచేసే నిర్దిష్ట సూత్రాలేమిటి ? వీటికి Objective Criteria ఏమైనా ఉన్నయ్యా? కేవలం Arbitrary గా చేసే విభాగమేనా ? ఈ ప్రశ్నల్లో వేటికీ సమాధానాలు దొరుకవు' అన్నారు. దొరుకుత వేమో చూద్దాం. నేను పై ఉదాహృత వచనపద్య పాదాలను విభజించింది క్రియా, నామగణాలన్న ధోర ణిలో కాదు. భావస్ఫూర్తి ననుసరించి విభజించి నాను. ఈ విభజనలో ఒకప్పుడు ఒక పదసముదాయం

ఉండవచ్చు, పదబంధం ఉండవచ్చు, ఒకేపదంకూడా ఉండవచ్చు. 'కి—విభక్తిబంధం ఒకగణం' అన్నరీతిలో విభజిస్తే, కి—విభక్తిబంధం ఉన్న ప్రతిచోటా అది ఒక గణం కావలసి వస్తుంది.కాని అట్లాకాదు.కాబట్టి ఆ నామ, క్రియా, విభక్తిబంధపద్ధతి కుదురదు. 'ప్రతి మాటకీ' ఒక గణం అనటం, అక్కడి రెండు పదాలనీ కలిపి అవ్యవహితంగా ఉచ్చరించినప్పుడు కలిగే భావస్ఫూర్తినిబట్టి 'శక్తి' మొదలయినవి నామాలే అయినా, 'ఉంది' క్రియే అయినాగూడా, ఆ రెంటి కూర్పుమొత్తాన్ని గణం అనటం, ఆ కూర్పువల్ల అక్కడ భావస్ఫూర్తి ఉందికాబట్టే. ఈ స్ఫూర్తిని కవి ఉద్దేశించి ఉండకపోతే, 'ప్రతిమాటకీ శక్తి, పదును, అర్థం, ఔచిత్యం ఉన్నాయి' అనవచ్చు. అట్లా అనకుండా అన్ని'ఉంది'లను ప్రయోగించినాడు. 'ప్రతి మాటకీ' అన్నదాన్ని రెండుసార్లు ఉపయోగించినాడు. ఎక్కడి 'ఉంది' అక్కడి వెనుకపదంతోటి కలిసిఉండవలసిందేతప్ప విడిపోయే వీలులేదు. కాబట్టి 'శక్తిఉంది' ఇత్యాదులు ప్రత్యేకం ప్రత్యేకంగా భావగణాలని చెప్పటం జరిగింది. 'శక్తిఉంది'అనేది ఒక భావనా? రెండు భావాలా? అంటే, నామటుకు నేను ఒకటే ననుకుంటున్నాను. 'ప్రతిమాటకీ శక్తి' ఒక గణం ఎందుక్కాగూడదని ప్రశ్న. ఏందుక్కాకూడదంటే 'శక్తి' తరువాత 'ఉంది' అనేది ఉన్నదికాబట్టి. ఈ శక్తి ఆ ఉందితోటి కలిసిఉండేదే తప్ప 'ప్రతి మాటకీ' తోటి ఉండేదికాదు. ఇకపోతే, భావగణాలను వేరుచేసే నిర్దిష్టసూత్రం భావమే మరి.

ప్రశ్నలకు సమాధానాలు దొరుకవంటూ, 'అందుకే శ్రీ సంపత్కుమార (1967) 'ఇక్కడ అర్థాన్నిబట్టి గణవిభజన ఆభాసరూపంగా చేయవచ్చు' నన్నారు. వారి భావగణాలు ఆభాసాలేతప్ప నిర్దిష్టమైనవికావని వారే అంగీకరిస్తున్నారు. ఈ ఆభాస గణాలు వచనపద్యాన్ని నిర్వచించలేవుగాబట్టి వాటిని నిరాకరించాల్సివస్తున్నది' అన్నారు రామారావుగారు. ఇక్కడ ఒక విషయం స్పష్టం చేయవలసిఉన్నది. సాంప్రదాయిక ఛందస్సుల్లో 'గణం' ఒక నిశ్చితార్థంలో ప్రహతమైఉన్నది. మరి వచనపద్యంవిషయంలో 'గణం' ఆ నిశ్చితార్థంలోకాక ఔపచారికంగా, కేవలం ఛందోమర్యాదాస్ఫూర్తికోసం వాడబడింది. అందువల్ల ఇక్కడ 'గణం' అనేది ఆభాసమే అయితుంది. అందువల్ల ఆభాసరూపంగా గణవిభజన చేయవచ్చునన్నాను. ఒకభావం, లేదా భావాంశాన్ని (ఇంకా చిన్నవిభాగాన్ని) 'గణం'అనటం కుదురదు. సాంప్రదాయిక ఛందస్సుల పాదవిభజనలో 'గణ'పద్ధతి ఉన్నదికాబట్టి, దాని స్ఫూర్తికోసం వచనపద్య పాదాంతర్విభజనలోనూ—ఆ విభజన కాధారం భావం కాబట్టి—భావ 'గణం' అనటం జరిగింది. మరొకటి. వీలున్నన్ని వచన అక్కడ భావాన్ని స్ఫురింపజేసే పదాలన్నీ భావగణవిభాగపరిధిలో ఉంటుంది. భావగణ స్వరూపంలో భేదం ఉండవచ్చుగాని, భావగణంమాత్రం ఉంటుంది.

'అసలు విభజించ వీలుంటేనే, భావాన్ని గణాలుగా విభజించటం సాధ్యంకాదని, మీరు విభజించింది వ్యాకరణాధారమైన పదసమూహాలు కాబట్టి వీటిని న్యాయంగా వ్యాకరణ గణాలు అనాల్సిఉంటుందని తెలుస్తున్నది. వ్యాకరణ గణాలు వాక్య శబ్ద నిర్మాణానికి సంబంధించినవి. వాటి ఆవృత్తి ఒకేశబ్దంతో అయితే పునరుక్తి, భిన్నశబ్దాలయితే అనుప్రాస అవుతుంది. అని (శ్రీ సంపత్కుమార భావగణాలంటున్న వ్యాకరణగణాలు) భావవాక్యస్వరూపానికి అవసరమైన గణాలుకావని వాక్యనిర్మాణానికి అవసరమైన కూర్పులని తెలుస్తున్నది. పద్యనిర్మాణంవేరు, వాక్య నిర్మాణంవేరు. వేటి సూత్రాలు వాటికున్నై' అన్నారు రామారావుగారు.

సాంప్రదాయిక ఛందస్సుల్లో భావంతోగానీ, అర్థంతోగానీ నిమిత్తంలేకుండా గణవిభజన అక్షర, మాత్రా సంఖ్యలను బట్టి జరుగుతుంది. కాబట్టి వాక్య నిర్మాణరీతికి సంబంధించిన అంశాల ప్రసక్తి అక్కడ ఉండదు. మరి వచనపద్యంలో భావాన్ని ప్రధానాధారంగా స్వీకరిస్తున్నాంకాబట్టి, భావస్ఫూర్తిని కలిగించే పదాలకూర్పు, వాక్యనిర్మాణరీతి—వీటికిందులో ప్రవేశం ఉండకతప్పదు. అంతమాత్రాన ఇక్కడ భావగణ విభజన

నకు కేవలం వ్యాకరణరూపైకతే ప్రధానంఅని చెప్ప టానికి వీలులేదు. ఆ వ్యాకరణరూపైకత ఉండవచ్చు. ఉండకపోవచ్చు. మనం గ్రహించిన ఉదాహరణలోనే 'ప్రతిమాటకీ' అనేదానికీ, 'శక్తి ఉంది' అనేదానికి ఉన్న వ్యాకరణరూపైకత ఏమిటి? 'వ్యాకరణరూపైకతఉన్న పదసమూహాలు'అంటే ప్రతిపదసమూహంలోని పదా లన్నీ, లేదా చివరిపదం వ్యాకరణరూపితపద్ధతిలో సమ ప్రత్యయాంతం కావటమో, లేక, నామక్రియాదులు సమంగా ఉండటమో అయిఉంటుం దనుకుంటాను. 'శక్తి ఉంది' 'పదునుఉంది' అన్న పదసమూహాలు సమ క్రియాంతాలుకావటంవల్ల ఈ సమూహాలమధ్య వ్యాకరణరూపైకత ఉన్నదనటానికి ఆస్కారం ఉంది గాని, 'ప్రతిమాటకీ' అన్నదానితో వీటికున్న వ్యాక రణ రూపైకత ఏమిటో తెలియదు. నిజానికి నేను చెప్పిన భావగణవిభజనకు రామారావుగారు చెప్పిన వ్యాకరణరూపైకత ఆధారసూత్రం కానేకాదు.అందు వల్ల భావగణాలూ, వారు ఉన్నాయంటున్న వ్యాకరణ గణాలూ ఒకటి కావటానికి వీలులేదు.

ఇదిట్లాఉండగా, సాంప్రదాయిక ఛ్ఛందస్సు ల్లోనూ, ఈ నాడు మనం పద్యాల్ని చదువుకొనే ప్పుడు ఛందోగణాల్నిబట్టి విభజించి చదువుకోము. పాదవిభజనగూడా కచ్చితంగా పాటించం. ఉదా హరణకు—

'సిరికింజెప్పడు శంఖచక్ర యుగమున్ జేదోయి సంధింపడే, పరి...' అన్న పద్యపాదాన్ని, ఆ మత్తేభ విక్రీడిత పద్యానికి నిర్ణీతంగాఉన్న స—భ—ర—న—మ—య— లగ అన్న గణాలుగా విభజించి ఎవరూ చదువరు. భావస్ఫూర్తి ననుసరించి 'సిరికింజెప్పడు| శంఖచక్రయుగమున్| జేదోయి సంధింపడు| ఏ...' ఇత్యాదిగా చదువుకుంటాడు. అట్లాగే—

'నెలలునిండిన సతిబాయ నెరిదపింతు
నా, నిలుపులేని రాజ్యాంగ తంత్రము దలంతు
నా, పగలుగొన్న చుట్టాల ననుసరింతు
నా, యొకనిబట్టి దైవ మిట్లాడనేల'
—శివభారతం.

అనే పద్యాన్ని, '.. తపింతునా!...తలంతునా|.. అనుసరింతునా| ...' అనే చదువుతారు తప్ప, '... తపింతు| నా నిలుపు ...| తలంతు| నా పగలు...| అనుసరింతు నా యొకని...'అని చదువరు. ఇక్కడ పద్యంలోని ఛందోగణాలేమిటి, అవి ఎక్కడికి విరుగు తాయి అనేది చదువరికి ముఖ్యంకాదు. ఎక్కడ ఎట్లా విరిచి చదువుకుంటే భావస్ఫూర్తి కలుగుతుందనేది ముఖ్యం. వచనపద్యపాదం విషయంలోనూ చదువరికి సంబంధించిన ఈ ముఖ్యాంశాన్నే స్వీకరించి అటుకవీ, ఇటు లక్షణకర్త సాగవలసి ఉంటుంది. భావగణ విభ జన విషయంలో ఈ అంశమే ప్రధానమయింది. 'సిరికిం జెప్పడు...చేదోయి సంధింపడు' మొదలయిన చోట్ల వ్యాకరణ రూపైకత ఉన్న పదసమూహాలున్నా యని, వాటిని వ్యాకరణగణాలనటానికి వీలుంటుందా? ఆ పద్యాల నిర్మాణంలో ఛందోగణాలు ప్రధానం కాబట్టి అట్లా అనటానికి వీలులేదు. అట్లాగే వచన పద్యంలో భావప్రాధాన్యం కాబట్టి ఇక్కడా అనటా నికి వీలుండగూడదు. అయితే వచనపద్య నిర్మాణంలో భావస్ఫూర్తి విషయికంగా వాక్య నిర్మాణరీతికి ప్రవేశం ఉంది కాబట్టి, వాక్య నిర్మాణానికీ వ్యాకరణానికీ సంబంధం ఉంది కాబట్టి, వ్యాకరణరూపైకత అక్కడక్కడా భావగణవిభజనలో కనిపించటం సహజమే. అంతమాత్రాన వ్యాకరణరూపైకత వల్లనే సర్వత్రా భావగణవిభజన జరుగుతుందనటానికి వీలులేదు.

ఛందశ్శాస్త్రంలో గణాలు పరిమితాలు నిజమే. అయితే 'భావగణాల సంఖ్య ఎంత? భావాలు ఎన్ని ఉంటయ్యో భావగణాల సంఖ్య అంత అన్నమాట! భావాలు ఎన్ని ఉంటయ్యో ఎవరు అంచనా వేయగలరు? అనంతమైన భావగణాలున్నప్పుడు వాటి వ్యవస్థ ఏమిటి?' అంటారు రామారావుగారు. అక్షరమాత్రా సంఖ్యా నియమం ఉన్నచోట ఛందశ్శాస్త్రంలో గణాలు పరిమితాలు కాకతప్పదు. సంఖ్యా నియమం ఉన్నది కాబట్టి అవి పరిగణనీయాలే. కాని వచన పద్య పాదాలకు సంబంధించినంతవరకు అక్షర, మాత్రా, పదాదుల సంఖ్య నియతం కాదు.అందువల్ల ఆ సూత్రం

ఇక్కడ కుదరదు. నిజానికి భావగణం ఒక్కటే. సాంప్రదాయిక చ్ఛందోరీతిలో 'దూరము—దుంపలు—దుఃఖము—దుర్గతి' అన్నది ఆదిలో ఉండవలసిన గురువర్ణస్వరూపంలో నాల్గురకాల మార్పులున్నాగూడా ఆ మూడక్షరాల గుంపులు నాల్గింటినీ 'భగణం' అనే అంటారుతప్ప, నాల్గురకాలకు నాల్గుపేర్లు లేవు. అంటే, గణంలోని వర్ణాలస్వరూపంలో మార్పు ఉన్నాగూడా, దాన్ని ఒకేగణంగా పరిగణించవచ్చు నన్నమాట. అదేవిధంగా, భావాన్ని ఆధారం చేసుకుని పదాలస్వరూపంలో, వాటి కలయికల్లో ఎన్ని తేడాలున్నాగూడా అది భావగణమే. అది ఏకైకం. మరి ఇంతగా భావగణాల్నిగూర్చి చెప్పటం ఎందుకంటే, వచన పద్య పాద విభజనను క్రమబద్ధం చేయటానికే.

'ప్రతిమాటకీ శక్తి
ఉంది పదును ఉంది'

అన్న విధంగా విభజించకుండా ఉండటానికే. 'శక్తిఉంది' 'ఆకాశంమీద' వంటి భావగణాలు పాద ద్వయంలోకి అభివ్యాప్తం కాగూడదనటానికే. భావా భావాంశాలనూబట్టి పాదవిభజన చేసేప్పుడు భావగణం ఒకపదంగాగానీ, పదబంధంగాకానీ, పద సమూహంగాకానీ ఉండేట్లయితే, దాన్ని రెండు పాదాల్లోకి వ్యాపింపచేయకూడదు. సాంప్రదాయిక ఛందస్సుల్లో తెలుగువారు ఒకేపదాన్ని ఒక పాదంనుంచి మరొక పాదంలోకి సాగింపచేయటం ప్రసిద్ధమే. కాని అది వచనపద్యంలో కూడదు. పదమేకూడదన్నప్పుడు భావగణం వ్యాపింపటం అసలు కూడదు

ఈ విధంగా వచనపద్యానికి పాదబద్ధత దనీ, పాదవిభాజకసూత్రమున్నదనీ, పాదాల అంతర్విభజనకు భావగణపద్ధతి కుదురుతుందనీ శ్రీ రామారావుగారి వ్యాసాన్ని పురస్కరించుకొని సాగిన ఈ వివరణలో స్పష్టంచేసినాను. కాగా, వచనపద్యం పద్యమేననీ, గద్యంకాదనీ నిశ్చయం.

నియమరాహిత్యం వచనపద్యలక్షణంకాదు. దానికి నియమసాహిత్యం ఉన్నది.



కలగూరగంప :

# అప్పకవి చెప్పని సౌభాగ్యయతి

క్రిందటి మే 1972 భారతిలో అప్పకవీయమునందలి యతుల సంఖ్యనుగూర్చి శ్రీ వంతరాం రామకృష్ణా రావు రచించిన పరిశీలన వ్యాసమొకటి ప్రకటితము.

అప్పకవీయ యతి ప్రాస భేదములఁగూర్చి అప్ప కవీయ గ్రంథపీఠికయందును (వావిళ్ల ప్రచురణ), నా తెలుఁగుభాషలోనిఛందోరీతు లను గ్రంథము నందును, నా అప్పకవీయ భావప్రకాశికయందును సవి స్తరముగఁ బరామర్శించియున్నాను. వాటి నిందుఁ బునఃస్పృశింపఁ దలంపలేదు. పై పరిశీలనలో నొక విషయమును మాత్రము ప్రస్తావింపఁబూనెద :

మేనెల భారతి—రామకృష్ణారావుగారి వ్యాసము నుండి యుద్ధృత మీ క్రిందిభాగము: (పుట 36)

'కాకుస్వరవళి—ప్లుతయుగ విశ్రామము:— ప్లుతయుగవిశ్రామము వేరుగా చెప్పనేల? అన్నచో, ఉభయవళు లన్నిటియందును ఇట్టి భేదము లుండ వచ్చును. నిత్యసమాసయతి, నిత్యసమాసయుగయతి ఇత్యాదిగా రెండేసి యతులు ప్రతిచోట ఉండవచ్చునన్న మాట. 'నాస్తియని పల్కఁడెవఁడే పదార్థ మడుగ' (కల్పితము). ఇట నిత్యసమాసయుగవిశ్రాంతి యన వచ్చును— కాని యిట్టి ప్రయోగములు కనఁబడలేదు కనుక ఒక్క కాకుస్వరయతి స్థలముననే కాకుస్వరయుగ మునకు యతి చెల్లు విశేషలక్షణము కన్పట్టుచున్నది. కాన దీని నప్పకవి వేరు యతిగా నిరూపించినట్లు ఊహింపనగును.'

కాకుస్వరయుగమునకువలె నిత్యసమాసాది యుగ్మవిశ్రాంతులకుఁ బ్రయోగములు కనఁబడలేదని, యది కారణముగ అప్పకవి యట్టి యతిభేదమును జెప్ప లేదని వ్యాసకర్త భావమైనట్లు స్పష్టమగుచున్నది.

అట్టి ప్రయోగములు అనేకములు గలవు. అట్టి యతి ప్రత్యేకముగా అప్పకవి చెప్పకున్నను ఇతర లాక్షణికులు కొందఱు పేర్కొనిరి. ఈ యంశము నెఱుకపఱుచుటయే యీ రచన యుద్దేశము.

* సులక్షణసారములో సౌభాగ్యయతి లక్షణ లక్ష్యము లిట్లున్నవి :

'ఉభయములు సెల్లు యతులు రెం డొక్కపదము
నందు నెలకొన్న సౌభాగ్యయతి సెలంగు;
ప్రాంచితామర వినుత వే+దండ వరద
నాకరిపుశిక్ష శౌరి య+నంత యనఁగ'.

వివరణము—ఉభయయతి చెల్లునట్టి శబ్దములు రెండొకే పదమున నిలిపి యా సంధ్యక్షరము లొండొంటికి యతి మైత్రి ఘటించుట సౌభాగ్యయతి యనఁబడును. మూఁడవపాదమున 'ప్రాంచిత (ప్ర+అంచిత), వేదండ (వేద+అండ)' అను శబ్దములు ఉభయ యతి చెల్లునవి. అవి రెండేకపాదముననుండి వాని లోని అకారస్వరము యతిమైత్రి నొందెనని యెఱుంగునది. ఇట్లే నాల్గవ పాదమున నాక (న+అక), అనంత (న+అంత) శబ్దములలో అకారస్వరమైత్రి.

(3—వ పాదమున ఉభయ యతిలలోని ప్రాది—పరరూపయతి మైత్రి. 4—వ పాదమున నిత్య సమాస యుగయతి మైత్రి సంఘటితము.)

**లక్ష్యము (భారతము)**

క॥ భండనమున నెదిరిన రిపు
మండలముల నెల్లఁగినిసి మర్దించి మదో
ద్దండుండై కవ్వడి మా
ర్తాండ సుతుం దొడరిపోరె+నాకులుమెచ్చన్.

ఇందు నాల్గవపాదమున 'మార్తాండ—నాక' అను పరరూపసంధి నిత్యసమాసశబ్దముల యుభయ యతి మైత్రిగలదు.

ఈ లక్షణ లక్ష్యము లిట్లే వార్తాకవి రఘు నాథయ్య రచించిన లక్షణదీపికలోఁ గానవచ్చెడు

---

* సులక్షణ సారము—వావిళ్ల ప్రచురణ—నాచే బరిష్కృతము.

(17—వ శతాబ్ది). అందు సౌభాగ్యయతి సులక్షణ సారమందువలె నొక యతిభేదముగాఁ బేర్కొనఁ బడినది.

ఈ సౌభాగ్యయతికి నా పరిశీలించిన ప్రాచీన ప్రయోగములు కొన్ని ప్రదర్శింతెద :

**భారతము - విరాటపర్వము**

వి,క్రమో, ద్ర గుఁడు హస్తలాఘవ
స + మన్వితుఁడేయునెడన్. (5—15)
(ప్రాదియుగయతి)

**నిర్వచనోత్తర రామాయణము**

రా,మాయణ మర్థిఁబాడుఁడు
స + మాహిత మానసవృత్తి. (10-111)
(నిత్యసమాసప్రాదియతి మేళనము)

**ఎఱ్ఱన హరివంశము —**

ప, రాఙ్ముఖపార్య భా + -వాను గతులు—
(పూర్వభాగము 8—54)
(ఇది ఉపసర్గసంధినిత్యసమాసయుగయతి)

వి కా, సాతిశయంబు తోడుత సమస్త
(పూర్వ—9—217)
(ఇది ఉపసర్గసంధి ప్రాదియతి మేళనము)

అ, న్వయ—అ, త్యంత(ఉత్తరభాగము4—85)
(ఇది ప్రాదియుగయతి)

ఉ, దాత్త దివ్యాయుధా + -వాప్తి మహిమ
(ఉత్తర—2—80)
(ఇది ప్రాదియుగయతి)

ప్రేరిత ముష్టి నిర్ఘాత దు + -దీర్ణవిరోధి
(ఉత్తర—7—215)
(ఇతిప్రాదియుగయతి)

ప్రారంభమునపుడుఁ దత్స + -మాప్తినివలయున్
(ఉత్తర—10—335)
(ఇదియు ప్రాదియుగయతియే)

**ఎఱ్ఱన నృసింహపురాణము —**

ప్రక, చ్ఛుఁ బరిమార్పఁ జేసిన యు + పాయము
(4—135)
(ఇది దేశ్య నిత్యసమాస ప్రాదియతి మేళనము

**భోజరాజీయము —**

అ,నంగ వికృతి సూప నర్మ + మూ నా యెదురన్
(4—228)
(ఇది నిత్యసమాస కాకుస్వరయతి మేళనము)

**కాశీఖండము —**

త్ర్యంబక యాత్రఁ దెక్కడి దు + -రాత్మకుఁ డీ
(4—151)
(ఇది నిత్యసమాస ప్రాదియతి మేళనము. ఇంద ఝల్లులకు రెంటికి మైత్రి పొసఁగుచున్నది.)

**శృంగార శాకుంతలము —**

అ,ద్రిజా, ధీశా యా యుపమృత్యువుం
గడపరా + వే (2—154)
(ఇది ప్రాది కాకుస్వర యతి)

**మనుచరిత్ర —**

ఏ, కాంతమునందునున్న జన + రాంద్రడనెపంబిడి
(2-41)
(ఇది నిత్యసమాస రాగమసంధి వడి)

గమనిక — ఈ ప్రయోగమును అప్పకవి రాగమ సంధివడికి లక్ష్యముగా నిచ్చియున్నాఁడు. (చూ—3—216). ఏకాంతశబ్దమును నిత్యసమాస యతిలో సంగ్రహించి, అప్పకవి లక్ష్యమును జూపి యున్నాఁడు. (చూ— ఏకాంతమునందుఁ గొందఱు మృగాయుత నేత్రల — పారిజాతాపహరణములోనిది— అప్పకవీయము 3—166). పై మనుచరిత్ర పద్య పాదములో నుభయయతి నందఁదగిన శబ్దములు రెండు నిలిచి స్వరమైత్రి నందుచున్నవని యరయఁదగును. ఇది సౌభాగ్యయతియేకదా? అప్పకవికి ఉభయవళులందుఁ బ్లుతేతరములకు యుగ్మవిశ్రాంతి గల ప్రయోగములు కనఁబడలేదనుట సరిగాదుగదా?

ఇంకను మఱికొన్ని :

**కళాపూర్ణోదయము—**

పాంచరాత్ర రా,ద్ధాంత విధానమర్మ న స + మర్థ
కృతార్థమతి ప్రదీప్తులన్ (4—32)
(ఇది నిత్యసమాస ప్రాదియతి)

**వాణీవిలాస వనమాలిక**

(తేకుమళ్ల రంగశాయి)
వే, దాంత...దు+రంత
(1 ఆ—14 పుట—5 పద్యము)
(ఇది నిత్యసమాస ప్రాదియతి)

**రసికజన మనోభిరామము**

ఉ, క్కఅ నొనరించె భూవిభును+దగ్రపరా
క్రమలీల (6—33)
(ఇది దేశ్యనిత్యసమాస ప్రాదియతి)

**సర్వలక్షణసార సంగ్రహము –**

స్వాంతవేదండ మార్తాండ+సాంగములు గ
వాక్ష కర్ణాటపదములే+కాంతశబ్ద
(2—258)
(ఇది నిత్యసమాసయతిలక్షణ పద్యము; ఇందు రెండు పాదములలోను నిత్యసమాసయుగయతి గూర్పబడియున్నది.)

**విప్రనారాయణ చరిత–**

(చెదలవాడ మల్లయ)
రం,గప్ప యొక్కడ నున్నవాఁడవు పరా+కా
నన్నుపేక్షింతువా (3—62)
(ఇది ప్రభునామ కాకుస్వర యతి)

**అచలాత్మజాపరిణయము—**

వనో, పాంతంబింతిరో నీవు రా వనరమో+
(దంతంబుచే బొల్చెడిన్.(2 ఆ—137 పుట)
(ఇది ప్రాదియుగయతి)

**శ్రీనాథుని చాటుధార :**

క,ర్ణాటాంధ్రాధిప సాంపరాయని
తెలుం+గా నీకు దీర్ఘాయువౌ.
(ఇది నిత్యసమాసకాకుస్వరయతి)

ఇంకను ఇట్టి ప్రయోగములు అప్పకవికిఁ బూర్వాపర కవుల రచనలలోఁ బెక్కులున్నవి. ఇవి యన్నియు సౌభాగ్యయతులగును. ఈ సౌభాగ్యయతిని గూర్చి 'తెలుగు ఛందోరీతులు' 'అప్పకవీయ భావప్రకాశిక' అను నా గ్రంథద్వయమందుఁ బ్రస్తావించి యున్నాను.

అప్పకవి ప్లుతయుగవిశ్రామమును ప్రత్యేకముగాఁ బ్రదర్శించెనేకాని, సౌభాగ్యయతిని ప్రస్తావింపఁడయ్యెను. సౌభాగ్యయతియొక్కటి పేర్కొనియున్న ప్లుతయుగవిశ్రాంతితోఁబాటు ఉభయయతి జంటలన్నియు నంతర్గతములు గతార్థములునై యుండును.

అప్పకవికి నా చూపిన ప్రయోగములవంటివి కనఁబడలేదనలేము. 'ఇంతలు కన్నులుండ......ఏకాంతము...జవరాండ్ర'అను పద్యమొకచో నొక ప్రయోజనమున కుదాహరించియున్నాఁడుకదా? అతని కట్టి యతిభేదమును బేర్కొనుటయం దభిప్రాయము లేదనవలెను. మఱి యేరెండు రకములైన యుభయయతులు (ప్రాది—పరరూప, ప్రాది—నిత్యసమాస, ప్రాది—రాగమసంధి, నిత్యసమాస—రాగమసంధి, ప్రాది—కాకుస్వర—ఇత్యాది యుగళయతులు) ఒక్కపాదములో మైత్రినందినను, అయ్యది సౌభాగ్యయతి యగును. వ్యాసకర్త సూచించినట్లు నిత్యసమాసయతి, నిత్యసమాసయుగయతి ఇత్యాదిగా రెండేసి యతులు ప్రతిచోట నుండవలసినదిలేదు.

అప్పకవి మఱెందులకు ఇట్టి యతిని (సౌభాగ్యయతిని) బేర్కొనక, ఒక్కప్లుతయుగవిశ్రామమును నిర్వచించెను అను ప్రశ్నకు సమాధానము నాకిట్లు దోఁచుచున్నది :

ప్రాది, పరరూప, ప్రభునామ, నిత్య, నిత్యసమాసాద్యుభయయతు లన్నింట ఆ పదములందు స్వరసంధి తప్పక యున్నది. (ప్ర+అంచిత—వేద+అండ, రామ+అయ్య—సమ్+ఆహిత— మొ). కాని ప్లుతయతిలో స్వరసంధి లేకుండవచ్చు.

అప్పకవి యిచ్చిన ప్లుతయుగవిశ్రాంతి యుదాహరణమును బరికింతము.

'నీ,వే గతి కావవే రఘుప+తీ శరణాగత వజ్రపంజరా' (నీవు+ఏ......రఘుప+తీ)

ఇందుఁ బాదాదిలో స్వరము విఱుగుచున్నది. యతిస్థలప్లుతములోఁ బాదాదియందువలె స్వరము విఱుగదు. ప్లుతములందు మాత్రమిట్టి వైచిత్రి గలదు. స్వరసంధి లేకున్నను (స్వరము విఱుగకున్నను) ప్లుతస్వరమునకు యతి గూర్పనగును. ఇట్టి వైలక్షణ్యము తక్కుంగల యుభయయతిభేదములలోఁ గానరాదు. ఈ వైలక్షణ్యమును బురస్కరించుకొనియే కాఁబోలు అప్పకవి స్వరసంధి సహజముగాఁ గన్పట్టు తక్కిన యుభయయతుల జంట(ల)ను ప్రత్యేకముగాఁ

బేర్కొనక, యొక్క ప్లుతయుగవిశ్రాంతినే ప్రదర్శించిన వాఁడయ్యెనని యూహించుట సమంజసము. ఆతఁడిచ్చిన యుదాహరణము నా యభిప్రాయమును రుజువు చేయుచున్నది.

ఈ పరామర్శవలన—

అప్పకవి తక్కిన యుభయయతిభేదముల జంటలను జెప్పక ఒక్క ప్లుతయుగవిశ్రామమును మాత్రము ప్రత్యేకముగఁ బేర్కొనుటకు ఆ యతి విలక్షణతయే కారణము కానోపుననియు, ఇట్లే తక్కిన యుభయయతిభేదముల జంటలను జెప్పుట యనవసరమని పరిత్యజించెనేకాని తనకుఁ బ్రయోగములు కనఁబడకుండుట కారణము కాదనియు, మఱి యతఁడు సౌభాగ్యయతివంటి దానిని బ్రత్యేకముగఁ జెప్పియుండ వలసిన దనియు, అదియొక్కటి చెప్పియున్నఁ బ్లుత యుగ విశ్రాంతి సైతము వేఱుగాఁజెప్ప నక్కఱలేద నియు విజ్ఞులెఱుగుదురుగాక.

విద్వాన్ శ్రీ రావూరి దొరస్వామిశర్మ

# అప్పకవీయమునందలి యతుల సంఖ్య—ఒక పరిశీలన

పై శీర్షికతో 1972 మే భారతిలో శ్రీ వంతరాం రామకృష్ణారావుగారి వ్యాసం చదివాను. ఎన్నో యేళ్ళుగా అప్పకవిమీదవున్న అపవాదాన్ని తొలగించ టానికి ఈనాటికి కనీసం ఒక్కరైనా యత్నించారన్న సంతృప్తి కలిగింది. అప్పకవీయంలో యతులసంఖ్య పెరిగిందనీ, అన్ని అనవసరమనీ చాలామంది పండితుల అభిప్రాయం. కాని ఈ పని ఒక్కఅప్పకవిమాత్రమే చెయ్యలేదు. ఇంతకంటే యతులసంఖ్యను పెంచినవాళ్ళూ లేకపోలేదు. వారినందర్నీ వదలి ఒక్క అప్పకవిపైనే ధ్వజంయెత్తడం యెంతైనా బాధాకరంగదా! అందువల్ల శ్రీ రామకృష్ణారావుగారు అప్పకవిని సమర్థిస్తూ వ్యాసం వ్రాయడం ముదావహం. అంతేగాక, వారు నిర్దేశించిన యతి నియమాల ననుసరించి, అప్పకవి చెప్పిన యతులసంఖ్య తక్కువఅనికూడా చెప్పవచ్చు.

'(1) యతులను వర్గీకరించునప్పుడు వాటి పరిణామక్రమమును దృష్టిలో పెట్టుకొనవలెను. ఈ నియమము ప్రకారము మువిభక్తికయతి—ముకారయతి వేరువేరుగా నుండవలెను. ప్రాచీనకాలమున 'పు—బు' వర్ణములకు అభిన్నమని శాసనములవల్ల తెలియు చున్నది......ముకారయతి కాలక్రమమున నేర్పడినది' అని వారు వ్రాశారు.

ఇక్కడ యతులను రెండు భాగాలుగానే వర్గీకరించటం జరిగింది. 'పు ఫు బు భు పూ ఫూ బూ భూ పొ ఫొ బొ భొ పో ఫో బో భో'—ఈ వర్ణాలకు విభక్తిముకారంతో మైత్రి పొసగితే, అది మువిభక్తికయతిఅనీ, అవే అక్షరాలకు ప్రకృతిగత ముకారంతో యతి చెల్లితే, అది ముకారయతిఅనీ అప్పకవి అభిప్రాయం. ఇలా రెండుభాగాలే చేయటంవల్ల పరిణామక్రమం సుస్పష్టంగా గోచరించటంలేదని నేనను కుంటాను.

ఆ నియమం ప్రకారం విభాగిస్తే, మొదట యతి చెల్లవలసింది. (1) 'ము పు' లకు (2) 'ము బు' లకు.

పు వర్ణాన్ననుసరించి 'పూ ఫు ఫూ' వర్ణాలకూ, బు వర్ణాన్ననుసరించి 'బూ భు భూ' వర్ణాలకూ మైత్రి కలుగుతుంది. కాబట్టి (3) 'ము—పూ ఫు ఫూ' అను ఒక యతిగా (4) 'ము బూ భు భూ' అను ఒక యతిగా పేర్కొనవలసి వుంది. 'మిత్రుల మిత్రులు పరస్పరము మిత్రులగుదురు' అను లోక న్యాయం ఇక్కడ అనుసంధింప నగును.

అదే లోకన్యాయాన్ననుసరించి, (5) 'పొ ఫొ బొ భొ పో ఫో బో భో' అను వానికి ము ప్రత్యయముతో మైత్రి ఘటించినప్పుడొక యతిభేదంగా పరిగణించవలసి వుంది.

ఈ ఐదు విభాగాలూ ము వర్ణానికి సంబంధించినవి. ఇదే విధంగా ముకారానికికూడా ఐదుభేదాలు చెప్పుకుంటే మొత్తం పదిభేదాలవుతాయి. ఈ విధమైన విభాగం పరిణామక్రమాన్ని చక్కగా నిరూపిస్తుందన్న నా అభిప్రాయంతో శ్రీ రామకృష్ణారావు గారు ఏకీభవిస్తారనుకుంటాను.

'తార్కికమైన పొడిగింపు మూలమున ఒక చోట సమ్మతమైన మైత్రి వేరొకచోటికి విస్తరించిన పక్షమున అట్టి విస్తరణ పద్ధతి సూచితమగునట్లు యతిభేదములను వర్గీకరింపవలెను.' అనే రెండవ నియమంకూడా యిక్కడ సమన్వయిస్తుంది.

ఇట్లే స్వరమైత్రివళిని (1) అ స్వర యతి

(2) ఇ స్వరయతి (3) ఉ స్వరయతి అని మూడు విభాగాలుచేయటం, స్వర ప్రధానవళిని (1) సవర్ణ దీర్ఘ స్వరప్రధాన వళి (2) గుణస్వర ప్రధానవళి (3) ఉకారస్వర ప్రధానవళి ఇత్యాదిగా అనేకానేక విభాగాలు చేయటం, వర్గజయతిని (1) కవర్గ (2) చ వర్గ (3) ట వర్గ (4) త వర్గ (5) ప వర్గ యతులుగా విభాగింపటం మొదలైనవి అవసరం. 'యతులను వర్గీకరించుటలో సూక్ష్మభేదములను పరిగణనలోనికి తీసికొనవలెను' అనే నియమం ఇక్కడ అనుసంధించు కోవాలి.

ఇలా విస్తృత ప్రాతిపదికలో లెక్కించి నట్లైతే, యతులసంఖ్య శతాధిక మౌతుంది. ఈ నాటి సాహిత్య ప్రపంచంలో యతులసంఖ్య ఇంత యెక్కువకావడం అభిల ం కాదేమో! కాబట్టి వీటిని సమగ్రంగా, సాధ్యమైనంత సంక్షిప్తంగా వర్గీకరించటానికి ప్రయత్నిద్దాం!

స్పష్టార్థమని పేర్కొనదగిన వానిని యతి భేదాలుగా గ్రహింపక, ఉచిత స్థలాలలో వివరణలుగా గ్రహిస్తే చాలావఱకు సంగ్రహించ వచ్చు.

(1) ప్రాణి విరామము :—'ఒక వ్యంజనము అదే వ్యంజనముతో యతి చెల్లినచో ప్రాణియతి యన వలెనని అప్పకవి యభిప్రాయము...ప్రాణియతి చెప్ప నిచో నిది యే యతిభేదము క్రిందికివచ్చును ?' అని శ్రీ రామకృష్ణారావుగారి ప్రశ్న. దీనికి సమాధానం అప్పకవే చెప్పాడు. అతడు యతి నీ క్రిందివిధంగా నిర్వచించాడు.

చరణ చరణమున కాద్య
క్షరములు వళులయ్యె నవియె క్రమ్మఱదత్త
చ్చరణముల లోనఁ జెప్పిన
యిరవులఁ బొందింప వలయు నెల్లకృతులలోన్.
(3 ఆ - 5)

మొదటి అక్షరానికి వళి అని పేరు. ఆపాదంలో ఆ అక్షరాన్ని నిర్దిష్ట ప్రదేశంలో పొందుపఱచాలి. కాబట్టి ఒక వ్యంజనంతో అదేవ్యంజనం యతిచెల్లటం యతి సామాన్య లక్షణంలో అంతర్భవిస్తుంది కదా!

కాని యిక్కడొక్క విశేషం గమనించవలసి వుంది. అప్పకవి ప్రాణి విరామాన్ని ఇలా నిర్వచించాడు.

'వ్యంజనంబులు స్వరమైత్రివలనఁ దమకుఁ
దాము ప్రాణి విరామాభిధానములను
జెంది మూఁడు తెలుంగులెౘ్ చెల్లుచుండు'.

హల్లుకు సంబంధించిన యతి వేసేటప్పు అచ్చు మైత్రినికూడ పాటింపవలెనని చెప్పటమే ఈ యతి ఉద్దేశ్యమని స్పష్టమౌతుంది. మఱి ఈ ప్రయోజనంకొఱకు ఈ యతి అవసరమే అవుతుందిగదా! అని సందేహం కలుగుతుంది. కలగవలసిన సందేహమే!

హల్లుల యతిలో అచ్చుమైత్రినికూడ పాటింప వలెననే నియమం ఏఒక్కహల్లుకో సంబంధించింది కాదు. అది హల్లుల యతుల కన్నింటికీ వర్తిస్తుంది. కాబట్టి దీన్ని వ్యంజనాక్షర యతుల కన్నింటికీ ఒక సామాన్యలక్షణంగా గ్రహించవలెనేగాని, ఒక ప్రత్యేక యతిగా గ్రహించటం అసంభావ్యమౌతుంది.

(2) ప్రత్యేకయతి:—చేతిది అన్నప్పుడు సంధి విడదీసి పరపదాద్యచ్చునకే యతి వేయవలెనను సామాన్య నియమాన్ననుసరించి, 'చేతి+అది'అని విడదీసి అకారానికి యతి వేయవలసివున్నది. అలా చేయుటం దోష మని ఈ యతి నియమిస్తుంది. ఇందులో ఏ క్రొత్త మైత్రీ నిరూపించబడటంలేదు. కాబట్టి స్వరయతుల వివరణలో దీన్ని ఉటంకిస్తే సమంజసంగా వుంటుంది.

(3) భిన్నయతి:—పై యతివలె ఇది కూడా వివరణాత్మకమైనది. 'ధరించు' అన్నప్పుడు విడదీసి ఇంచుక్కులోని ఇకారమునకు యతి వేయరాదని యిది నిషేధిస్తుంది. దీన్నికూడ స్వరయతుల వివరణలో చేర్చటం సబబు.

(4) ఏకతరయతి:—రేఫ శకటరేఫలకు యతి చెల్లదని స్పష్టపఱచటానికే యిది ప్రతిపాదింప బడింది. ఏ హల్లుకు ఆ హల్లు యతి చెల్లుతుం దన్నది యతి సామాన్యనియమంలోనే అంతర్భవిస్తుందికాబట్టి యిది కేవలం స్పష్టార్థ ప్రతిపాదనమే!

(5) సంయుక్తయతి:—సంయుక్తాక్షరం యతి స్థానంలో వచ్చినప్పుడు అన్నిహల్లులకూ మైత్రి ఘటింప వలెనా, లేదా? అన్న సందేహాన్ని నివారిస్తున్న దీ యతి.

ఇందులో క్రొత్త అక్షరాలకు వేటికీ మైత్రి ఘటింపఁబడటం లేదు. 'సంయుకాక్షరంలోని ఏ ఒక్క హల్లునైనా గ్రహించి, ఆ పాదంలో యతి వేయ వలె'నని సామాన్య నియమంగా దీన్ని గ్రహించ

వచ్చు. అందువల్ల యిదొక యతిభేదం కానవసరం లేదుగదా !

(6) అంత్యోష్మసంధివడి :— 'కచటతప వర్ణములకుఁ బరమైన హకారమునకుఁ గ్రమముగ ఘ ఝ ఢ ధ భ వర్ణములు వికల్పముగ నగును. అగుచో కచటతపలు గజడదబ లగును.' అనే సూత్రం ప్రకారం 'వాక్ + హరి—వాగ్ఘరి లేక వాగ్హరి అనే రూపాలను పొందుతుంది. 'అది యతిస్థానంలో వచ్చినప్పుడు గకారానికి గానీ, హకారానికి గానీ వేయవచ్చు' అని ఈ యతి నిర్వచిస్తుంది. గకారానికి యతి వెయ్యటానికి ఈ యతి ఆరంభింప బడలేదు. హకారయతి నిమిత్తమే యిది అవసరం. 'వాగ్హరి' అనే వికల్పరూపమున్నదిగనుక దాన్ని వ్రాసుకుంటే, లేక భావించుకుంటే హకారానికి యతివేయటానికి యే అభ్యంతరమూ వుండదు. కాబట్టి ఈవడి ఆవశ్యకం కాదని చెప్పవచ్చు.

(7) వికల్ప విరమణము :— పై యతివలెనే యిందులోనూ 'కచటతప లకు నమలు పరమైనప్పుడు రెండు రూపాలుంటాయి. వాక్ + మాధుర్యము — వాఙ్మాధుర్యము. లేక వాగ్మాధుర్యము. ఇట్టిచోట్ల మామూలుగా నమలకు యతి చెల్లుతుంది. ఇక వికల్పములైన గజడదబలకు యతిచెల్లటం విశేషం. వికల్పరూపా లెలాగూ వున్నాయిగనుక గజడదబలకు యతివేయ దలచినప్పుడు ఆ రూపాల నూహిస్తే (దళిత శిశుపాల గోత్రభిద్మణి వినీల) దీన్ని యతి భేదంగా గ్రహింప నవసరంలేదు.

(8) స్వరప్రధానవళి : — సంధి గతాక్షరాలు యతి స్థానంలో వచ్చినప్పుడు దేనికి యతివేయాలి? అనే సందేహాన్ని యిది తొలగిస్తుంది. అంతేగాని యిది క్రొత్తగా యే అక్షరాలకూ మైత్రిని కల్గించటం లేదు. దీన్ని స్వరయతుల వివరణలో గ్రహింపవచ్చు.

(9) గూఢ (లుప్తవిసర్గక) స్వరవళి:— ఇందులో సంధి గతాక్షరమైన అచ్చు గూఢంగా వుంటుంది. దానికే యతి వేయాలిగాని, హల్లుకు వేయరాదని స్పష్టంచేయటమే దీని పరమావధి. ఇదొక ప్రత్యేక యతిగా యెందుకు చెప్పుకోవలసి వచ్చిందో అర్థంగాదు.

ఇఁక అప్పకవి చెప్పిన లక్షణంలోనే ఒక చిన్న మార్పుచెయ్యటంవల్ల కొన్నియతులను పూర్తిగా తొలగించవచ్చు. ఈ పద్ధతి ప్రకారం సంక్షిప్త చేయటానికి వీలయ్యే యతులను చూద్దాం !

(1) ఋత్వసంబంధవళి— ఋత్వసామ్యవళి: — 'ఇ ఈ ఋ ౠ ఎ ఏ' లు ఋత్వము (వట్రువు) తో యతి పొందితే అది ఋత్వసంబంధవళి. ఋత్వము ఋత్వముతో యతి పొందితే అది ఋత్వసామ్యవళి.

'ఇ-ఈ-ఎ-ఏ-ఋ-ౠ-ఋత్వము' — ఇవి పరస్పరము యతికి మిత్రములు.' అన్నచో ఈ రెండూ ఒకదానియందే అంతర్భవింపగలవుగదా !

(2) తద్భవవ్యాజయతి— విశేషవళి: — జ్ఞకారానికి న ణ లతో యతి చెల్లటం తద్భవవ్యాజయతి. దానికే క ఖ గ ఘ లతో యతి చెల్లటం విశేషవళి. ఈ రెండింటికి హేతువులు వేరు. ఆ రెండు హేతువులను విడివిడిగా పేర్కొంటూ, రెండు యతులను గలిపి—'జ్ఞకారమునకు న ణ ల తోను, క ఖ గ ఘ ల తోను మైత్రి చెల్లు'నన్నచో ఇది ఒకేయతిభేదంగా సిద్ధమౌతుందిగదా !

ఈ సందర్భంలో శ్రీ రామకృష్ణారావుగారు తద్భవవ్యాజయతిని గురించిచేసిన ప్రసంగం పరామర్శింపఁదగినట్లు కనిపిస్తోంది.

'అప్పకవి తద్భవవ్యాజయతియని నామకరణము చేయుటమాత్రము సరికాదు. జ్ఞా—న యతి తద్భవ వ్యాజమున అయినదికాదు. జ్ఞాను జ్ఞా అని యుచ్చరించుట కలదు. జ్ఞ అన్న శిష్టోచ్చారణమబట్టి జ్ఞాకు నకారముతో యతిమైత్రి చెలినది. ఈ ఉచ్చారణమూలమున తద్భవములలో జ్ఞాకు నకారము నిల్చినది'అని వారు వ్రాశారు.

'జ్ఞా—న' యతికి వారు చెప్పేకారణం, 'ఉచ్చారణము'అని. అందువల్ల ఈ యతి తద్భవవ్యాజంవల్ల యేర్పడిందని చెప్పకూడదని వారి అభిప్రాయం. నిజం ఆలోచిస్తే ప్రతి యతిలోనూ అక్షరమైత్రికి కారణం ఉచ్చారణమే. అ ఆ ఐ ఔలకుఁగానీ ఇ ఈ ఎ ఏలకు గానీ. ఉ ఊ ఒ ఓ లకుఁగానీ, క ఖ గ ఘలకుఁగానీ, అన్నింటికీ ఉచ్చారణమే మూలం. దీన్నిబట్టి యతుల కన్నిటికీ ఉచ్చారణమే మూలంఅంటూ ఏకాకారంగా ఒకేహేతువు చెబితే, సన్నిహితకారణాలను మనం గ్రహించలేకపోతాంగద! ఉచ్చారణవల్ల యేర్పడిన మార్పు ఏవిభాగానికి సంబంధించిం దన్నదే లాక్షణికుఁడు చెప్పవలసినది, ఉచ్చారణంవల్లనే తత్సమం తద్భవంగా

మారింది. విజ్ఞానం విన్నాణంగా మారడం ఉచ్చారణ మూలంగానేగదా! కాబట్టి తద్భవం హేతువనటంవల్ల అప్పకవి ఉదాహరణ పురస్సరంగా వివరించినట్లైంది. నిజమిలావుండగా తద్భవం వ్యాజంకాదని వారు పేర్కొనటం సాహసమనక తప్పదు.

'జ్ఞాను జ్ఞా అని శిష్టులు (?) వ్యవహరిస్తున్నా'రని వారన్నారు. దీనికి ఉదాహరణలు వారివ్వ లేదు కాబట్టి మనమే వూహిద్దాం! ఆజ్ఞ—దీన్ని 'ఆజ్న'అని శిష్టులు వ్యవహరిస్తారని వారి వాద మనుకోవచ్చు. ఇది నేనెక్కడా వినలేదు. కాని, ఆజ్ఞను ఆగ్నగా వ్యవహరించే శిష్టులను (?) విన్నాను. చూశాను. ఆగ్నకు తరువాతి రూపమే 'ఆన' కాబట్టి ఉచ్చారణవల్ల తద్భవాలుగా మారిన 'ఆన'వంటిపదాల ననుసరించి, జ్ఞాకు నకారంతో యతి చెల్లిందనటంలో దోషమేమో తోచటంలేదు.

ఇలాగే 'స్నానముచేసి ధౌతపరిధానముగట్టి'అన్న ప్రయోగవిషయం. స్నానశబ్దానికి స్తాన్నన మనే రూపం మృగ్యం. స్తానమనిమాత్రం వ్యవహారంలోవుంరి. అదే తానంగా మారి తద్భవమైంది. మఱి దీన్ని తద్భవ వ్యాజయతి అనక వేటూరివారు ఉచ్చారణవ్యాజయతి అనవలసిందా?

క్రమం తద్భవంగా మారిన ఈ పరిణామ క్రమాన్ని వ్యక్తం చేయటానికి వారు ఆంగ్లోసేగ్జన్ పదజాలాన్ని సహాయంగా తీసుకుని వివరించారు. తద్భవం యేర్పడింది ఉచ్చారణవల్లనే అని చెప్పటానికి అంత శ్రమ అవసరం లేదేమో!

(3) అనుస్వార సంబంధయతి— అనునాసికాక్షరయతి:—బిందుపూర్వక టవర్గం, బిందుపూర్వక తవర్గంతో మైత్రిపొందితే అది అనుస్వార సంబంధ యతి. బిందుపూర్వక టవర్గం నకారంతోనూ, బిందు పూర్వక తవర్గం ణకారంతోనూ యతి పొందితే, అది రెండవదిగానూ పేర్కొనబడ్డాయి. ఈ రెండిటినీ కలిపి 'బిందుపూర్వక టతవర్గములు, న ణ లు పరస్పరము యతి చెల్లు'నని నిర్వచించి, దానిని 'అనుస్వార సంబంధయతి' అని పేర్కొనవచ్చుగదా!

(4) మువిభక్తికయతి—ముకారయతి:—పు ఫు బు భు లకు విభక్తి ముకారంతో యతిచెల్లటం మొదటిది. సాధారణ ముకారంతో యతిచెల్లటం రెండవది. 'పు ఫు బు భు లకు మువర్ణంతో చెల్లు'నని సామాన్యంగా నిర్వచించి తరువాత దానికి హేతువును వివరించ వచ్చుగదా!

(5) ఋజుయతి—ఊష్మవిశ్రాంతి — సరసవళి :—హయలకు మైత్రి ఋజుయతి. శ ష స లకు మైత్రి ఊష్మవిశ్రాంతి. అ—య—హ లకు మైత్రి, చ ఛ జ ఝ శ ష స లకు మైత్రి, నణలకు మైత్రి కలిపి సరసవళి.

'అ య హ లకు పరస్పరం యతిచెల్లును. అట్లే చ ఛ జ ఝ శ ష స లకు పరస్పరం యతిచెల్లు'నని ఈ లక్షణంతో తక్కిన యతులు తొలగిపోయి, ఒక్క 'సరసయతి' మాత్రమే మిగులుతుంది. న ణ ల యతి అనుస్వారసంబంధయతిలోనే గతార్థ మవుతుంది.

(6) కాకుస్వరవళి — ప్లుతయుగ విశ్రామము :—హల్లుతోడి కాకుస్వరానికి, కేవలం అచ్చుతో యతి చెల్లటం కాకుస్వరవళి. రెండూ కాకుస్వరాలకు యతి చెల్లితే అది ప్లుతయుగ విశ్రామం.

'కాకుస్వరానికి మరొక కాకుస్వరంతోగానీ, లేక కేవలం అచ్చుతోగానీ యతిచెల్లటం కాకుస్వరయతి.' అని రెండిటినీ ఒక్కటిగా చెప్పుకోవచ్చు.

ఈ విధంగా పదహారు యతిభేదాలను తొలగించి, మొత్తం 25 యతులను మాత్రం పరిగణనలోకి తీసుకుంటే, అది సంక్షిప్తంగానూ వుంటుంది. తొలగింపువల్ల స్పష్టత తొలగిపోలేదు కాబట్టి, సమగ్రంగానూ వుంటుంది.

అప్పకవి మిక్కిలి పరిశ్రమతో అనేక లక్ష్యాలను పరిశోధించి, వినూత్నంగా కనిపెట్టిన అంశాలను వివరిస్తూ, స్పష్టంగా, విపులంగా లక్షణం వ్రాయడం మన అదృష్టం. ఆ మహామహునికి మన మెంతైనా ఋణపడివున్నాం. యతి భేదాలను అనవసరంగా పెంచాడని అంతటి లాక్షణికుణ్ణి దుయ్యబట్టడం అవివేకమనే వుద్దేశంతో కాబోలు శ్రీ రామకృష్ణారావుగారు ఆ వ్యాసంవ్రాసి, అప్పకవి హృదయాన్ని ఆవిష్కరించారు. అది ముదావహం కాని, అంతమాత్రం చేతనే అప్పకవి నిర్దుష్టంగా లక్షణం చెప్పినాడనుకుంటే, అది సాహిత్యలోకానికే అపచారం చేసినట్లవుతుంది. అందువల్లే వ్యక్తి యెవరైనా, యెంతటి వారైనా, నిజాన్ని నిష్పాక్షికంగా ఆలోచించవలసి వుంది. ఈ దృష్టితో చూచినప్పుడు అప్పకవిచెప్పిన యతులలో కొన్నిమాత్రమే ఆవశ్యకమైనవని చెప్పక తప్పదు.

—శ్రీ వింజమూరి విశ్వం.

# గ్రంథ విమర్శలు

## ఆంధ్ర భాగవతానువాదః

(పే. 152 లు. వెల రూ. 6/—లు,)

## ఆంధ్ర కావ్యకథాః

(పే. 146 లు. వెల రూ 5/—లు గ్రంథ కర్త : శ్రీ సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి; ప్రతులకు : గ్రంథకర్త, 44, జిరా, సికిందరాబాదు.)

ఆంధ్రేతరులకు ఆంధ్రకావ్యాదుల పరిమళమును సంస్కృతరచనలద్వారా అందించుటకు బహుముఖ ప్రయత్నములు చేయుచున్న విద్వత్కవులలో శ్రీ స. సూ. శాస్త్రిగారు అగ్రగణ్యులు.

వ్యాసప్రోక్తమని ప్రసిద్ధికల భాగవతమును పోతన ఆంధ్రీకరింపగా, దానిని ఎవరైనను సంస్కృతీకరింప బూనుకొనుట వ్యర్థసాహసమని ఎవరికైనను ముందు తోచుట సహజము. కాని సంస్కృత మూలమును, పోతన రచనను, శ్రీ శాస్త్రిగారి సంస్కృతానువాదమును పోల్చిచూడగా ముందు కలిగెడి భ్రాంతి పటాపంచలగునని ఉద్ఘాటించుట ఆనందదాయకముగా నున్నది.

శ్రీ శాస్త్రిగారి సాహస ప్రయత్నము ఫలప్రదమగుటకు రెండు ముఖ్యహేతువు లున్నవి. మొదటిది వారు సంస్కృతీకరణమునకు పోతన రచనలో రత్నప్రాయములనదగిన భాగములనే ఎన్నుకొనుట. వారిందులో 1. ప్రహ్లాద చరిత్రము. 2. గజేంద్ర మోక్షము 3. వామనావతారము 4. గోపీకృష్ణ విలాసము 5. కంసవధము 6. ఉద్ధవ సందేశము, భ్రమరగీతలు ఎన్నుకొనిరి. సంస్కృత భాగవతము రచనలో సంయమనము కనబడుచుండగా, పోతన భక్తి రసావేశముతో ఎన్నోభాగములు స్వతంత్రముగా పెంచి క్రొత్తరుచి విస్తరిల్లజేసినాడు.

రెండవ కారణము శ్రీ శాస్త్రిగారి సంస్కృతానువాదము పోతన రచనామాధుర్యమును చక్కగా ప్రదర్శింపజేయగలుగుట. శ్రీ శాస్త్రిగారు ఇతః పూర్వముచేసిన సంస్కృతానువాదములలో ఎక్కడనో గాని భాసింపని కవితామాధురి ఈ యనువాద మంతటిలో గోచరించుచుండుట ప్రమోదావహము. ఆంధ్రులకు ప్రీతిపాత్రములైన పోతన పద్యములెన్నో పోతన కవితారుచితో ఈ అనువాదములో నొప్పారుచున్నవి. అక్కడక్కడ పోతన చెప్పని విశేషములు పద్యపూరణ కవసరమై కల్పించుట జరిగినచోట్ల పోతన రచనకే మెరుగుదిద్దుట జరిగినది. ధర్మజుండు నారదుని ప్రశ్నించుటలో, మూలములోలేని,

'ప్రహ దస్యులసీలతాసురకలంజారణ్య జాతాఽభవత్' అను రూపకముచేర్చి పవిత్రతను ఆపాదించినారు.

కొన్నియెడల పోతన అనుప్రాసలు ఉన్నవున్నట్లుగను, కొన్నియెడల భిన్నశబ్దములతోను శ్రీ శాస్త్రిగారు ఘటించినారు.

'బాలం హరిపదచినాలోలం దూరీకృతాఘ జాలం తం శ్రీలం పితాఽజిఘాంసత్ కథ' మిత్యాహస్మ—

'నూనున్ శాంతగుణప్రధాను' ఇత్యాది పద్యమును 'పుత్రం పాపలతాలవిత్ర మమల జ్ఞానైకపాత్రం మహాఛాత్రం—' ఇత్యాదిగా మనోజ్ఞ స్వతంత్రానుప్రాసతో సంస్కృతీకరించినారు.

ప్రసిద్ధమైన పోతన పద్యాలను ఎంత చక్కగా సంస్కృతీకరించిరో తెలుపుటకు కొన్నిమాత్రము ఉదాహరించు చున్నాము.

'హాలాపాన విజృంభమాణ
మద గర్వోద్రిక్త దేహోల్లసత్
బాలాలోకన శృంఖలానిచయ

'అవిచ్ఛిన్న పరిణాహ కాలం
రెండు చెక్కలుగా వ్రయ్యలైన రూపాలు
ఒకదాని ముఖంచూచి వేరొకటి
ప్రక్కకు తప్పుక ఒదిగిపోయే దివానిశలు.'

కాలంలో రాత్రి, పగలు రెండు భాగాలు. జీవితంలో సుఖం, దుఃఖం రెండు దశలు. కాలంలో రాత్రి జీవింలో దుఃఖానికి, పగలు సుఖానికి సంకేతాలు. మానవుడు సుఖాన్ని, సంతోషాన్ని కాంక్షించడం తత్సాధనకోసం దేవతల్ని సృష్టించుకోవడం ఆరాధించడం ఉదయంతరువాతలో చిత్రించబడింది.

జీవిక మొదలులో — మానవ జీవన విధానంలో వచ్చిన పరిణామ స్వరూపం వివరించబడింది. జీవన మరణాలకీ, సుఖదుఃఖాలకీ గల సంబంధాన్ని మొదట్లోనే సూచించారు రచయిత.

'పూవు రాలుతుంది
మొగ్గ పొటమరిస్తుంది
ఒకదానిలో విషాదం
మరోదానిలో ఆనందం'.

పై పాదాల్లో జననమరణాల ద్వంద్వాలలో గల అనుభూతి భేదాన్ని వివరించారు. అనుభూతుల నెరుగని మానవుడు ప్రకృతికి తొలిసారిగా పులకరించి, ఆనందించి, అనుభూతిని మేల్కొలిపి తదనంతర పరిణామంలో తన 'తనం' పెరిగిపోయి అధికారం కోసం, కీర్తికోసం, మరొక మనిషిని బలిపెట్టే స్థితికి ఎదిగాడు.

'అధికార పిపాస, కీర్తికాంక్ష ప్రబలి
అంతరింపబడిన ఒక రాజ వంశరక్తంతో
తడిసిన వేరొక రాజవంశ మావిష్కృతమై
అణగద్రొక్కబడిన ఒక జాతి మత స్థానంలో
జరిగిపోయెను వేరొక జాతి మతాభ్యుత్థానం'

బ్రతుకు వొంతెనలో—వొంతెన ఒక చివర జననానికి, మరోచివర మరణానికి సంకేతాలు. జననానికి పూర్వం మరణానికి తరువాత ఏమున్నదో ఎవ్వరి తెలియదు. అయితే జీవన్మరణాలకు సంబంధించినంత వరకూ పూర్వాపరాలనుగూర్చి అనేక సిద్ధాంతాలు అనేక మతాల్ని ఆధారంగా చేసుకుని పుట్టాయి. ఇవన్నీ కేవలం ఊహామాత్రమైన ప్రాతిపదికలేనని చెబుతున్నారీయన.

'వొంతెన కివతల మరి అవతల ఏమున్నదో
ఇదమిత్థమని ఎవరికీ తెలియదు.
యుగాలనుండి పరంపరగా ధురాగతివచ్చు.
ఊహాగ్రహారాలు, అనుమానప్రాకారాలుతప్ప.'

మనిషిలో నానాటికి పెరిగిపోతున్న ఆశ, స్వార్థం ఆదిలో లేవు. అంటే జీవిత ప్రారంభంలోలేని స్వార్థం, జీవనపరిణామం సాగుతున్న కొలదీ పెరగటం ప్రారంభమయింది.

'నిల్వడానికి సూదిమొనంత చోటు సంపాదించి
ఆపైన విస్తృతికై పరితపించు బ్రతుకులవలె
ప్రతిఅంగుళంమేరనేలను
మ్రింగివేయడానికి మాటిమాటికి
విజృంభించు తరంగవేగాకులసముద్రం
ఉత్పహించు తరంగ సమాలోల సరసి.'

ఇక్కడ హృదయాన్ని సముద్రంతోను, అందులో ప్రతిక్షణం చెలరేగే ఆలోచనలను సముద్ర తరంగాలతోను పోల్చడం ఔచిత్యవంతంగా ఉన్నది. సముద్రపు కెరటాలు వొడ్డున విరిగి పడిపోయినట్లుగానే మానవుని అక్రమ ఆలోచనలుకూడా అంతంలో నిష్ప్రయోజనమే అవుతున్నాయి.

మానవజాతి మనుగడ సాగించిన నాటినుండి నేటివరకూ వ్యవస్థాగత పరిణామ స్థితులన్నీ అశాంతిలో నుండి పుట్టినవేనని మానవీయం రెండవభాగం అశాంతిలో చెబుతున్నారు రచయిత.

'రాతియుగంనుండి అణుయుగంవరకూ
నియంతృత్వంనుండి సామ్యభావనవరకూ
సాగిన చరిత్ర పరిధులన్నీ
అశాంతిలో రూపొందినవే.'

మానవుడు ఎన్ని ఘనవిజయాలు సాధించినా, ఎన్నియుగాలు గతించినా అతని జీవితంలో అశాంతి,

ఆవేదన తీరలేదని, అజ్ఞాన స్థితిని అధిగమించలేదని రచయిత ధృఢంగా విశ్వసిస్తున్నారు.

'ఎన్నితరాలు గతించినా
అక్కడే ఉన్నాం అజ్ఞాన స్థితిలో
ఎంతదూరం ప్రాకినా
ఎంతకాలమాలోచించినా
గ్రహాలు స్నేహితులైనా
బతుకుభోగభూమి ఐనా
మేరలేని వాంఛాపిపాస
ఇంకా దేనికోసమో ఆవేదన.
తత్సాధనాయత్నంలో అశాంతి.'

ఈ అశాంతిలోనుంచి, ఆవేదనలోనుంచి మానవునికి ముక్తి లభించేది కేవలం వైయక్తిక వికాసం వల్లనేనన్నదికూడా రచయిత నమ్మిన సిద్ధాంతంగా కావ్యం ముగింపులో వెల్లడవుతుంది. వైయక్తిక వికాసంవల్లనే మానవవ్యవస్థలో ఒక నూతనయుగం ఆరంభమవుతోందని రచయిత చెబుతున్నారు.

'ఎత్తుకతప్పదు నేటి మానవుడు
వైజ్ఞానిక యుగ భూమికలో
వైయక్తిక వికాసంతో
విశ్వ సంస్కృతీ రూపం.'

రంగారావుగారు తమనమ్మిన సనాతన సంస్కృతిని కావ్యరూపంగా సిద్ధాంతీకరించారు. వైయక్తిక వికాసంవల్ల సామాజిక వికాసం కలుగుతుందనే నమ్మకం ఈ నాడు చాలామందికి లేదు. కవులందరికీ ఒకే సిద్ధాంతంమీద నమ్మకం ఉండాలని ఆశించడం ప్రజాస్వామిక పద్ధతికి విరుద్ధం. సిద్ధాంతాలు వైయక్తిక మైనవి.

అక్కడక్కడా చిన్నచిన్న లోపాలు కావ్యంలో కనబడతాయి. ఒక్కొక్కచోట కేవలం Thought ప్రధానం అయిపోయి కవిత్వం—కవిత్వంగా కాకుండా ఉపన్యాసంగా మారిపోతుంది.

'మనిషికి మొట్టమొదట కావలసింది
ఉనికి కొన్ని అడుగుల మేరనేల.
ఆహారం తరువాత సంపద అధికారం,
వీని సంపాదనలో రక్షణకై
తలలెత్తిన ఆలోచనా పరంపరలు,
క్రమపద్ధతిలో తాల్చిన ఆకారాలు
ఈ కోటలు, సామ్రాజ్యాలు.'

ఈ పాదాలు పై భావనకు ఉదాహరణలు· వచనగేయానికి శైలి ప్రాణం. ఆ శైలి రంరారావు గారి కవిత్వంలో వేదాంతభావనికి అనుగుణంగా మారింది. వచనగేయానికి అవసరమైన లయకూడా చాలాచోట్ల దెబ్బతిన్నది. మొత్తంమీద కావ్యం గుణప్రధానమైనదే కాని రాశిప్రధానమైనది కాదు.

—శ్రీ టి. ఎల్. కాంతారావు

Printed and Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7 Thambu chetty Street, Madras-1, Editor : S. Radhakrishna.

# భారతి

మాసపత్రిక

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938–1972)

ఆగస్టు 1972

సంపుటము : 49 సంచిక : 8



వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## ఆగస్టు 1972

# శబ్దముద్ర

డా. ముదిగొండ శివప్రసాద్

వేలహంసలు, కలధౌతపక్షాలు విప్పుకొని,
వియత్తలంనుండి జారినప్పుడు
వేయిరేకుల కమలాన్ని చుంబించడంకోసం
వినువీధికి, చలువకలువ క్రిందవున్న చిలువకన్నె లేచినప్పుడు
వేలవాయులీనాలూ వీణలూ, నిశ్శబ్దగాంధర్వాన్ని 'ఆరు' మెట్లపై పలికించినప్పుడు
విశ్వం నామరూపాలు సంతరించుకునే, తొలి
ఉషస్సుషమాసుముహూర్తంలో
అమృతం చిదుప్పలుచిదుప్పలుగా తొణికి
అక్షరాలుగా రాలి
అర్థాలుగా మారి
భావాలుగా తోచినప్పుడు
భాషా తరంగాలుగా లేచినప్పుడు
అమ్మా !
నీ అవతారం ఈ మృణ్మయ ఖండానికి!

*    *

సుహాసినీ!!
నీ చిరునవ్వే లేకుంటే
జీవితం
ఎంత నిర్భరం ఎంత నికృష్టం తల్లీ
పలలాస్థిసమూహంతోకూడిన ఈ
బండెడు మాంసపిండానికి కళేబరానికి
భారవాహుడనై బ్రతికేందుకేనా నేను పుట్టింది ??
నా వేదనలో, వ్యధలో, జీవనకథలో
శ్రీములో సుఖంలో కన్నీటిలో పన్నీటిలో తడిపి

అంకురాన్నిగా నిన్ను నేను నాలో నాటినప్పుడు
రక్తం మాంసం మృత్తికా పిండివడకట్టిన రసాయనంలో
నీవు నిట్టనిలువుగా పెరిగి
నీలా, రుణ, శ్వేత, కాండానికి చివర
'నవ' నవోన్మేష కుసుమాలు ఫలదీకరణాన్ని పొంది
రసం పాయలు పాయలుగా నన్ను ప్లావితం చేస్తున్నప్పుడు
ఓహో !
ఆ స్నానంకోసమే తల్లీ, ఈ తనువును, జన్నిద పెట్టింది !
ఆ భగీరథత్వంకోసమేనమ్మా ఈ జీవన వ్రతం పట్టింది !!

*

గద్దెలనెక్కిన రారాజులు
కాలగర్భంలో కరిగిపోవడం చూచి
పరిమితమైన నా జీవనమూ
బాడబగర్భాని కభిముఖంగా పరుగెత్తడంచూచి
అమరత్వాకాంక్షతో
అపరిమేయజీవనవాంఛతో
నిన్ను డోలికగా, ఆందోళికగా చేసికొని ఊగుతూ
'నేల'నుండి చేత 'నాతి మానసతత్వా'ని కెదుగుతూ
అనాదినీ అనంతత్వాన్నీ స్పృశిస్తూ, బ్రతుకును
అనుక్షణం నీలో ముద్రిస్తూ
దేశకాలఉపాధులను అధిగమించి
త్రివిక్రిమత్వాన్ని ఆవాహనచేస్తూ
నన్ను—నీవుగా మార్చుకొంటున్నప్పుడు
నాకిక మరణ మెక్కడిది తల్లీ !!

*   *   *

శబ్దంనుండి వచ్చిన నా అస్తిత్వాన్ని మరిగించి కరిగించి
తిరిగి
శబ్దపు మూసలో పోతపోయడం నా వృత్తి—
అక్షరాలు - అకార ఆకారాలు – నా ఆకారం
ఘాటులే నా మన్నుగడ

## శబ్దముద్రి

పదాలతో పాదాలతో నా నడక
సమాసకదంబాలు ఉత్పలచంపకాలు నా
సురభిళ శ్వసనాలు—
ప్రతి ధ్వనికీ, ప్రతిధ్వని పలికేది నా హృదయం.
నిశ్శబ్దమైన లిపిని చిటికెవేసి నిద్రలేపి
భావాలు పలికించడం
గాల నొలికించడం నా విద్య-
మృణ్మయమానవాస్థికలను
నీ సంస్పర్శతో
చిన్మయేతిహాసంగా, సాహిత్యంగా, సంస్కృతిగా మా
నా వ్యవసాయం !
క్షణక్షణానికీ చెదిరిపోయే భౌతిక సౌందర్యాలను
శిథిలమయ్యే పారిజాత పరిమళాలను
ఉషస్సులను నిశీథులను ఉభయసంధ్యలను, త్రిభువనైకశృంగారహేలలను,
శబ్దముద్రిలో బంధించి
విశ్లథత్వంనుండి రక్షించి
శాశ్వతత్వం ప్రసాదిస్తున్నాను తల్లీ నీ
సుందర దరహాసరేఖావీక్షణంచేత !

* * * *

అనంతమైన మానవాకాశంలో నేను
అజ్ఞాతకాలంనుండి శిల్పినై నిలబడి
మూర్తి నిర్మాణానికి పరిమిత దర్శనం కల
మానవులనే ధృవతారలుగా మలచాలని, ఏ
రాముణ్ణో కృష్ణుణ్ణో రామకృష్ణుణ్ణో ఎంచుకొని
రసవిద్యతో నీ జరీ చీరె అంచుమీద
హంసల్లా అద్దకపోతే అంబరాన నిలుపకపోత
మిగిలే వారేనా వీరు మృత్యువాహినినాటి నేటివరకు
దేవతలై —??
నునగిలిగేదేనా, యుగయుగాల మానవకథ
ఈ నాటివరకు ???

# శ్రీ అరవిందదర్శనంలోని 'అతిమానస' తత్త్వసమీక్ష

## శ్రీ కమలాకర వేంకటరావు

[స్వాతంత్ర్యదిన రజతోత్సవ సందర్భంలోనే శ్రీ అరవిందుల శతజయంతి గూడా జరుగుచున్నది. ఆ సందర్భములో శ్రీ అరవిందుల దర్శన సమీక్షను ప్రచురించుచున్నాము.]

శ్రీ అరవిందులు ప్రపంచించిన పూర్ణాద్వైత దర్శనమును, దాని ననుసరించిన సాధనకొరకై ఆయన రూపొందించిన పూర్ణయోగదర్శనమును సరిగ అవగాహన చేసుకోవాలంటే, అందాయన ఒక ప్రత్యేకార్థ స్ఫూర్తితో విరివిగా వాడిన 'అతిమానసం' (సూపర్‌మైండ్)—అనే పదభావపు లోలోతులను చక్కగా తరచి చూడడం అత్యంతావశ్యకం. మనస్సున కతీతమై విలసిల్లు నీ అతిమానసతత్త్వావతరణం ద్వారా దివ్యమానవజాతి భూలోకమున ఆవిష్కారం చెందవలసి యున్నదని కదా లోకమున కాయన అందించిన వినూత్న సందేశం? ఏమిటి ఈ అతి మానసమంటే?

అతిమానసమనే పదం కొందరికి విడ్డూరంగా తోచవచ్చును. 'అతి సర్వత్ర వర్జయేత్'లోని 'అతి' ధ్వనిని దీని కాపాదించుకుంటే అట్లా విడ్డూరంగా తోచడం సహజమే. కాని, అతీంద్రియమనే పదాన్ని మనం అర్థం చేసుకుంటున్నట్లే దీనినికూడ అర్థం చేసుకొనేయెడల ఎట్టి విపరీత భావనయు తోచవలసిన పని లేదు. మనస్సున కతీతమైన తత్త్వమని మాత్రమే దాని అభిప్రాయం. కాని, మనస్సున కతీతమైన తత్త్వము లనేకమున్నవి. అవి అన్నియు నీ పదముచే సూచిత మవుతున్నవా? కేవల సచ్చిదానందఘనమైన పరతత్త్వం మనస్సున కతీతమైనదే. అతిమానస పదం ఆ పరతత్త్వానికి సూచకమా? కాదు. ఒకానొక నిష్కృష్టార్థములో మాత్రమే శ్రీ అరవిందు లీ పదమును వాడినారు. అది ఎటులనో పరిశీలిద్దాము.

శ్రీ అరవింద దర్శనం 'ఏకమేవా ద్వితీయం' అను అద్వైత భావనతో రూపొందినదే. సమస్తమూ ఒకే వస్తువుయొక్క విలసనమే. సత్—చిత్—ఆనందమే సకలమునకూ మూలం. ఉనికి గలిగినది సత్. కాని, ఆ ఉనికి ఎరుక కూడా కలిగి యున్నది. అదియే చిత్. అంతేకాక, ఆ ఎరుక గలిగిన ఉనికి ఆనంద లక్షణోపేతముకూడ. సత్—చిత్ – ఆనందములు మూడునూ ఒకే వస్తువుయొక్క మూడుతీరులు—అయితే, ఈ వస్తువులకు స్థితి గతి అనేవికూడ ఉన్నవి. దేశకాలముల కతీతముగ తనలోతాను విలీనమై యుండునది స్థితి. దేశకాలములలో తనను తాను విస్తరించుకొనునది గతి. ఈ విస్తరణకు కారణ మానందము. తనలో తాను విలీనమై యుండునది మాత్రమే ఆనందము కాదు. వెలికి ఉప్పొంగి విస్తరిల్లునదియు ఆనందమే. జగత్సృష్టి ఇట్టి ఆనందములో నుండియే కలిగినది. 'బహుస్యాం ప్రజాయేయేతి'—అనునది ఇట్టి ఆనందోల్బణముకాక మరియేమి?

ఇదియే ఈశ్వర తత్త్వము. తనలో తాను విలీనమైయుండు స్థితియం దిది కేవలానందఘనమై యొప్పారుచున్నది. సృష్టికార్యమున విస్తరిల్లు గతియం దిది ఆనందఖేలనముగా విరాజిల్లుచున్నది. ఈశ్వర చేతనయం దీ ఖేలనానందము నిత్యసిద్ధము. మూల స్వరూపమున మన నిజాత్మకూడ ఈశ్వర చేతనతో ఏకత్వము పొందియున్నదే కావున, అదియును ఈ ఖేలనానందమున నిత్యభాగస్వామినియే. కాని, ప్రస్తుత మీ నిజాత్మ మన మానసికాహంకారముచే ముసుగు

పడియున్నది. ఈ ముసుగును తొలగించుకొని మన నిజాత్మను మనము తిరిగి పొందగలిగిననే తప్ప, ఈ భాగస్వామ్యము ననుభవించుటద్వారా దివ్యజీవనోపలబ్ధిని మనము బడయజాలము.

మనస్సు భేదదృష్టి ప్రధానము. సచ్చిదానందము ఏకత్వలక్షణోపేతము. రెంటినీ విడివిడిగా పరిశీలించినప్పుడు ఇవి పరస్పరవిరుద్ధములుగా గన్పట్టుట సహజము. ఇందొకటి సత్యమని అంగీకరించినచో రెండవ దానిని అసత్యమని త్రోసిపుచ్చక తప్పదు. సచ్చిదానందమును అనుభవించవలెనన్న మనస్సును వర్జించి తీరవలెను. కాని, మనః ప్రాణశరీరములయందే పృథ్విపైన మన మనికి. సచ్చిదానందోపలబ్ధికి మనః ప్రాణశరీరచేతనను త్రోసిపుచ్చులే తప్పనిసరియగుచో పృథ్విపై దివ్యజీవనమనునది అసాధ్యమేయగును. అట్టి సందర్భములో, మన స్వస్వరూపమైన విశ్వాతీతమును చేరగలుగుటకై విశ్వస్థితినెల్ల భ్రమగా, మాయా కల్పనగా పరిగణించి త్రోసిపుచ్చక తప్పదు. అట్లుగాక, ఈ మనః ప్రాణశరీరములయందే సచ్చిదానందోపలబ్ధిని గాంచి, మనము దివ్యజీవనమును నెరప సమర్థులము కావలెనన్న, రెంటికినీగల యీ వైరుధ్యమును పరిహరించి సామరస్యమును ఘటింపచేయగల తత్వమొకటి యీ అనుసంధానమున కుపచరింపవలసియున్నది.

అట్టి తత్వమేదైనకలదా? కలదనియే శ్రీ అరవిందులు వక్కాణించి, దానికి 'అతిమానసం' అని పేరు పెట్టినారు. వేదములలో 'ఋత చిత్' అనియు, 'సత్యం, ఋతం, బృహత్' అనియు పేర్కొనబడినది ఇదియే అని నిర్దేశించి చూపినారు. అంతేకాదు,— సప్తవ్యాహృతులుగా చెప్పబడిన భూః, భువః, సువః, మహః, జనః, తపః, సత్యం— అనువానిలో నడిమిదగు మహస్సు దీని సంజ్ఞయేనన్నారు. ఇందు, భువన సప్తకములోని భూర్భువస్సువర్లోకములు శరీర ప్రాణ మనస్తత్వములకు, సత్య తపోజనుర్లోకములు సచ్చిదానందములకు సంజ్ఞలు కాగా, నడిమిదైన మహస్సు ఈ అపరార్ధ, పరార్ధములకు లంకెయై విలసిల్లుచున్నదన్నారు. తైత్తిరీయమున ప్రస్తావించబడిన అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయకోశములలో విజ్ఞానమయము బుద్ధికాదనీ, ఈ అతిమానసమేనని శ్రీ అరవిందుల అభిప్రాయము.

మనస్సున కతీతమైన తత్వముగుటచే ఇయ్యది అతిమానసం. వస్తుజాతమునకు మూలభూతమగు సత్యమును, ఋతమును, ఏకత్వమును ఆధారముగా గొని ప్రవర్తించునది యగుటచే నిది సత్యచేతన, లేక ఋతుచేతన. మనస్సుయొక్క ప్రవృత్తిలక్షణమిదికాదు. వస్తుజాతపు అంతరాంతర సత్యమును పురస్కరించుకొనిగాక, బాహ్యరూపభేదములను పురస్కరించుకొని అయ్యది ప్రవర్తించుచుండును. అతిమానసతత్వము పైననే పృథ్విపై దివ్యజీవనావిష్కరమాధారపడియున్నది. ఏలయన, కేవల సచ్చిదానందము దేశకాలాతీతపరతత్వము. జగత్తట్లుకాక, దేశకాలములలోపల కొనసాగు విస్తరణమైయున్నది. దేశకాలములలో కార్యకారణ సంబంధము లీ విస్తరణయందు ప్రవర్తింపజేయబడుచుండును. కార్యకారణ సంబంధమున నొక నియతి, ధర్మము అనుస్యూతమైయుండును ఈ ధర్మము వస్తునిష్ఠమగు సత్యముయొక్క ఆవిష్కారము ననుసరించియుండును. ఈ సత్యము సంకల్పరూపము. అనంతములగు సంభావ్యములలో ఏది ఎట్లు రూపొంది ఆవిష్కారం చెందవలసినదియు ముందుగనే నిర్ణీతమగుచున్నది. ఇచ్ఛాజ్ఞానము లేకమైన చిచ్ఛక్తిద్వారమున నయ్యదికొనసాగుచుండును. ఈ ఇచ్ఛాజ్ఞానములు మానసికములు కానేరవు. ఏలయన, మనస్సు ఈ దివ్య నియతికి, దివ్యధర్మమునకు లోబడి వర్తించు వానిలో నొకటియగునుగాని, తనకు తానై ఆ నియతిని, ధర్మమును మూలమునకుబోయి తెలిసికొని దానికి నియామకమై ప్రవర్తింపజాలదు. భేదదర్శనముతో కార్యపరిశీలనము మాత్రమే దాని లక్షణము. అదియునుగాక, వస్తుస్వరూపము నావిష్కరింపజేయు దివ్యజ్ఞానపూర్వకమైన దివ్యేచ్ఛ, సకలవస్త్వైక్యజ్ఞానసంపత్తి కలిగినదై, అట్టి ఏకత్వములోనుండియే నానాత్వము నావిష్కరింపజేయవలసియున్నది. మనస్సున కట్టి ఏకత్వజ్ఞానసంపత్తిలేదు.

అనేకత్వములోని ఒకానొకభాగమును అసమ్యగముగ పొదివికొనజూచుట మాత్రమే దానికి చేతనైన పని.

కనుక, మనస్సుకు చేతకాని పనిని చేయ జాలినదగుచు, మనస్సుకంటె అతీతమై విల సిల్లు తత్వమొకటి అవశ్యము ఉండి తీరవలెను. ఆ తత్వము సచ్చిదానందమే యనుటకు సందే హములేదు. కాని అది తనలో తాను విశ్రాంతమై విలీనమైయుండు సచ్చిదానందముకాదు,—దానికి ఉప కరణముగా విస్తరణకొరకు ప్రవృత్తమగు సచ్చిదా నందము. చిత్—తపస్సు లనునవి అద్దానికిగల శక్తి యుగళము. కావున, దేశకాలములలో కార్యకారణ సంబంధములతో కూడిన జగత్తును సృష్టిచేయుటకు దానియందు జ్ఞానశక్తి, ఇచ్ఛాశక్తి అనునవి అవశ్య ముగా విలసిల్లుచుండును. ఈ జ్ఞానము, ఈ ఇచ్ఛ,— రెండూ విడివిడి శక్తులు కావు. రెండూ కలిసి ఒకే మహాశక్తి—సర్వమునూ తనలో నిముడ్చుకొని అనం తమై విరాజిల్లుచుండు శక్తి. దేనికి తాను రూప కల్పనము చేయనున్నదో అద్దానినెల్ల అది తన యందు నిత్యమూ ధరించియుండును. కావున, అతి మానసమనగా జ్ఞానేచ్ఛలరూపమున వెలికి ప్రసృతమగు సచ్చిదానందమే. తనలో గర్భితమైయున్న సత్యములను కొన్నింటిని దర్శించి, వాని యభివ్యక్తి స్వరూపమును నిర్ణయించుట కీ జ్ఞానశక్తి తోడ్పడగా, అట్లు నిర్ణ యింపబడిన వాటిని తన దేశకాలాతీతస్వరూపపు విస్త రణమేయైన దేశకాలములలో అభివ్యక్త మొనర్చుట కీ ఇచ్ఛాశక్తి పనిచేయును. ఇట్లు సచ్చిదానందమున నంతర్గర్భితమైయున్న దానికి రూపమిచ్చెడి జ్ఞానమే ఋతచిత్. అదియే సంకల్పము. అది తపశ్శక్తి సమన్వితముకూడ కనుక, దేశకాలములయందు దాని అభివ్యక్తిని సాధించు నిచ్ఛయు నదియే.

ఇట్టి దివ్యచేతనతో నొప్పారు తత్వమునే ఈశ్వ రునిగా పేర్కొనుచున్నాము. కావుననే యీతడు సర్వాంతర్యామి, సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడునై విరాజిల్లక తప్పదు. అభివ్యక్తము గావింపబడు సకల రూపములూ చేతనాత్మకమైన అతని నిజసత్తయందు దేశకాలములలోని తన విస్తరణలో తన శక్తి విలస నముచే సృజింపబడుచున్నవే కదా! కావుననే అతడు సర్వాంతర్యామి. సకలరూపములూ అతని చేతనాత్మక సత్తయందు భాసిల్లుచున్నట్టివే. కనుకనే అతడు సర్వజ్ఞుడు. సకలరూపములూ అతని ఇచ్ఛాశక్తి కధీన ములై వర్తిల్లుచున్నట్టివే. కనుక అతడు సర్వశక్తి మంతుడు. అతని ఇచ్ఛాజ్ఞానములు మన యిచ్ఛాజ్ఞాన ములవలె ఒండొంటితో సంఘర్షించుచుండునట్టివి కావు. ఏలయన, అతనియందవిరెండునూ కలిసి ఏక ప్రవృత్తియే కాని వేర్వేరు ప్రవృత్తులు కావు. బాహ్యా భ్యంతరములందు వానితో సంఘర్షించు ఏ ఇతర ఇచ్ఛా జ్ఞానము లుండుటకునూ అవకాశము లేదు. ఏలయన, అద్వయుడగు నాతనికి వెలియైన చేతనగాని శక్తిగాని వేరొకటేదియూ లేదు. సకలమునూ నిర్ణయించు ఒకే ఇచ్ఛాశక్తియొక్కయు, సకలమునూ సమరసింప జేయు నొకే జ్ఞానశక్తియొక్కయు విలసన మాత్రములే సకలశక్తి విశేషములూకూడ. ఖండజ్ఞానమున భేద దృష్టితో నివసించుచు పూర్ణదర్శనములేని మనకు వివిధ శక్తుల సంఘర్షణముమాత్రమే పొడగట్టు చుండును. పూర్ణదర్శనమున నిత్యమూ వెలుగొందు చుండెడి అతిమానసదివ్యచేతనకు అట్లుగాక, పూర్వ నిర్ణీతమైన సామరస్యసాధనలో అంతర్భాగములుగ మాత్రమే అవి అన్నియు కానవచ్చుచుండును.

దివ్యచైతన్య కార్యకలాప మేరూపమున కొనసాగి నను దాని స్వభావ లక్షణము సదా ఈ తీరుననే యుండును. దేశకాలాతీత స్థితియందేకాక, దేశకాల విస్తృతియందుసైతము దాని సత్తావిస్ఫూర్తి అఖం డమై తేజరిల్లునదగుటచే, తన ప్రవృత్తియం దది ఏ ఒక క్రియా విశేషమునకును పరిమితమై యుండదు. మానవులమైన మనకు సృష్టిలో ఒక ప్రత్యేక విధమగు చేతనారూపము మాత్రమే కలదు. దాని మూలమున మనము ఒకే సమయమున అనేక ముతో తాదాత్మ్యము చెందలేము. ఏదో ఒక దానితో మాత్రమే తాదాత్మ్యము చెందగలుగుదుము. దేనితో మనము తాదాత్మ్యము చెందుదుమో అదియే

మనకు సత్యముగా గన్పట్టును. తక్కినవి సత్యములుగా గన్పట్టవు. కాలాంతరమున నీ పరిస్థితి మారవచ్చును. ఈశ్వరుని దివ్యచేతన ఆ రీతిని పరిచ్ఛిన్నమై పరిమితమై యుండదు. ఏకకాలమున అనేక రూపములు ధరించు సామర్థ్యము దానికున్నది. ఎల్లకాలమునకు శాశ్వతముగ నిలువగల రూపవిశేషములను సైతము అయ్యది ధరించగలదు. జగన్నిర్మాణసన్నివేశములో అతిమానస దివ్యచేతన ఇట్టి శాశ్వత రూపవిశేషములను మూడింటిని ధరించినట్లుగా మనకు పొడగట్టుచున్నది. మొదటిది వస్తుజాతపు అఖండైకత్వమున ప్రతిష్ఠితమైన రూపము. రెండవది ఏకమున అనేకము, అనేకమున ఏకము అభివ్యక్తమగుటకాధారమై విలసిల్లునట్లుగా ఆ ఏకత్వమును మలచిన రూపము. మూడవది నానావిధములగు వ్యక్తిత్వావిష్కారమున కాధారభూతమగునట్లుగా ఆ ఏకత్వములో మార్పుచెందించిన రూపము. ఈ బహువిధ వ్యక్తిత్వావిష్కారమే అవిద్యాకార్యఫలితముగ మనలో వేరుభావనతో కూడిన అహంకారమై రూపొందినది.

వస్తుజాతపు అఖండైకత్వమున రూపప్రతిష్ఠితమగు అతిమానసచేతనయొక్క ప్రాథమిక స్థితిలోని ఏకత్వము, కేవలసచ్చిదానందస్థితిలోని ఏకత్వము కాదు. ఆ కేవలసచ్చిదానందస్థితి దేశకాలాతీతము. చిచ్ఛక్తి అచట ఏవిధమైన విస్తరణ ప్రయత్నమునూ చేయదు. అందు జగత్తు ఒకవేళ ఉన్నచో అయ్యది నిత్యవిలీనస్థితిలో, మున్ముందు సంభావ్యముకాగల అదృశ్యస్థితిలోనుండునేకాని వాస్తవికముగా నుండదు. అతిమానస చేతన యందలి స్థితి అట్లుకాదు. ఇది సచ్చిదానందముయొక్క విస్తరణ విశేషము. సచ్చిదానందము సర్వగ్రాహియై ఇందు సమస్తమునూ తనయందు గర్భితమొనర్చుకొని కుంభించుకొనియుండును. అయినను ఇది ఏకమే, అనేకముకాదు. సృష్టిస్వరూపకల్పన మచట ఎంతమాత్రమునూలేదు. ఈ అతిమానస చేతనయొక్క ప్రతిబింబము మన నిశ్చల విశుద్ధాత్మపై పడుట తటస్థించినపుడే వ్యష్టిత్వభావననెల్ల మనము కోల్పోవుచుందుము. ఏలయన, వ్యష్టిత్వభావనను పెంపొందించగల లక్షణమేదియు ఆ చేతనయందులేదు. సర్వమూ ఏకత్వమునందే, ఏకమునందే అచట ప్రతిష్ఠితమైయున్నది. అన్నింటినీ తన రూపములుగానే ఈదివ్యచేతన తనయందు ధరించియుండును. దేనికినీ ఏవిధమైన ప్రత్యేకసత్తాస్ఫూర్తియునుండదు. మన మనస్సునందు తోచెడి ఆలోచనలు, రూపములు ఏవిధముగా మన మానసికచేతన ధరించిన రూపములై మనకంటె వేరుసత్తా కలిగియుండవో అటులే ఈ అతిమానస చేతనయొక్క ప్రాథమిక స్థితియందలి నామరూపములన్నియును దానికంటె వేరై యుండవు. అయ్యది అనంతునియందలి విశుద్ధ దివ్యభావనారూపము. మానసికభావనారూపమున వ్యవస్థితమైన అవాస్తవిక ఖేలనముగాక, చిత్‌సత్తయొక్క వాస్తవిక ఖేలనము. ఈ స్థితియందు చిదాత్మకు, శక్త్యాత్మకు భేదముండదు. జడవస్తు, ఆత్మవస్తు భేద ముదయించదు. సర్వమూ కేవలమాత్మయొక్క రూపవిశేషము.

అతిమానసచేతనయొక్క ద్వితీయరూపస్థితియందు సృష్టి సంకల్పభావనాగతినుండి దివ్యచేతనము వేరై నిలిచి దాని ననుసరించుచు, దాని క్రియాకలాపమున నధివసింపుచు, దాని ననుభూత మొనర్చుకొనుట జరుగుచుండును. ప్రతి నామరూపమునందును అంతటా సమానముగ నెలకొనియున్న ఒకే చిదాత్మగా అయ్యది తనను తాను కనుగొనుచుండును. అంతియే కాదు— సృష్టియందు వ్యష్టిఖేలనమున కాధారభూతమగుచు తదితర ఖేలనమునుండి దానిని వేరుపరచునదై విలసిల్లు కేంద్రీకృత చిదాత్మగా కూడ అయ్యది తనను తాను కనుగొన నేర్చును అనగా, అంతటా నెలకొనియున్నది ఒకే ఆత్మతత్త్వమైనను, దాని రూప విశేషములు మాత్ర మనేకము. ఇట్టి కేంద్రీకృత చిదాత్మయే జీవాత్మ. సర్వాత్మకమై విలసిల్లు పరమాత్మకంటె భిన్నము. అయితే, ఈ భిన్నత్వము సృష్టిక్రీడ కొనసాగుట కవసరమైన వ్యావహారిక ప్రయోజనానుగత భిన్నత్వమేకాని, తత్త్వతః భిన్నత్వముకాదు. ఈ భిన్నత్వ మా తాత్త్వికైకత్వమును భంగపరుపనేరదు. సర్వాత్మకుడైన పరమాత్మ సకల జీవాత్మలును

తానేయని తెలిసికొనియుండును. అయినను ప్రతి జీవాత్మతోనూ ప్రత్యేక సంబంధమును నెలకొల్పు కొనుటతోపాటు, ప్రతిజీవాత్మలోనుండియు ఇతర జీవాత్మలతోకూడ వేర్వేరు సంబంధములను అతడు ప్రతిష్ఠించుకొనును. ఇక జీవాత్మయో, తానా అద్వయుని ఒకానొక రూపవిశేషము నన్న ఎరుక గలిగియుండి ఆ అద్వయునితోడను, ఇతర జీవాత్మలతోడనూ తన ఏకత్వము నుపభోగించ గలుగుటతోపాటు ఆ ఏకత్వములోనే భిన్నత్వమున తన ప్రత్యేక వ్యక్తిత్వమును వెలార్చుకొనుచు ప్రత్యేక సంబంధములను అనుభూత మొనర్చుకోగల స్థితిలో నుండును. అతిమానస దివ్య చేతనయొక్క ఈ రెండవ రూపవిశేషము మన విశుద్ధ మానసమున ప్రతిబింబించుట తటస్థించి నపుడు, వ్యష్టిత్వభావనను కోల్పోకుండగనే మన యాత్మ సర్వాత్మకుడైన పరమాత్మతో ఏకత్వము ననుభవింప గలుగుచు తన ప్రత్యేక వ్యక్తిత్వమున గూడ పరమాత్మతోడను, ఇతరులతోడను ఈ ఏకత్వానుభూతి పొందగలుగుచుండును. అతిమానస స్థితియందు ఇంకే ఇతరమైన మార్పూ ఉండదు. ఏకము అనేకముగా అభివ్యక్తమై, అనేక మింకనూ ఏకమై విలసిల్లుచుండు క్రీడ సుసంపన్నముగా కొనసాగుచుండు టొక్కటే ఇచట కానవచ్చెడిమార్పు.

అతిమానస చేతనయొక్క తృతీయ రూపస్థితి యందు దివ్యచేతనము సృష్టిసంకల్పభావనాగతి నుండి వేరై నిలిచి దాని ననుసరించుచు దాని క్రియా కలాపమున నధివసింపుచు దాని ననుభూత మొనర్చు కొనుటకు మారుగా దానిలోనికి విస్తరిల్లి దానియందు మెలివడుట సంభవించును. సృష్టి క్రీడయొక్క స్వభావమిచట మార్పు చెందుచున్నది. ఇందు జీవాత్మ పరమాత్మతోడనూ ఇతర జీవాత్మల తోడనూ గల సంబంధములకు మాత్రమే విశేష ప్రాధాన్య మొసగుచు, వాటినే తన అనుభవక్షేత్రపరిధి గావించు కొనును. పరమైకత్వానుభూతి పరమమైన చరమానుభవ స్థితియందు మాత్రమే కలుగును. కావున జీవాత్మ పరమాత్మలమధ్య దివ్యానంద సంధాయకమగు నొక విధమైన ద్వైతస్థితి యిచట దానికి కావలసిన సకల పరిణామములతోనూ ఏర్పడుచున్నది.

అనేకమే వాస్తవికమైతోచి, ఏకమును ఆ అనేకముయొక్క సంకలనముగ మాత్రమే పరిగణించు అవిద్యలోనికి దిగజారుటే ఇందు సంప్రాప్తమగు తొలి పరిణామమని తలంచుట కవకాశము లేకపోలేదు. కాని, అట్టిచ్యుతి ఇచట కలుగవలసిన అవసరమేమియు లేదు. ఏలయన, జీవాత్మ ఇచట తాను పరమాత్మ వలెనే ఏర్పడితిననియు, ఆయన శక్తి ఫలితముగనే రూపొందితిననియు ఎరుక గలిగియుండును. దేశకాలము లలో జగల్లీలావినోదము కొరకై పరమాత్ముడు సంకల్పించిన నానాత్వసృష్టియందు తానొక భాగము నన్న సంగతి నది మరువదు. తనకు సర్వస్వతంత్రత నాపాదించుకొనుట దానిలక్షణము కాదు. సర్వాధార మగు ఏకత్వమెటుల సత్యమో నానాత్వముకూడ అటులే సత్యమని అయ్యది తలంచును. ఒకే సత్యమునకు ఒకటి ఉత్తర ధ్రువముకాగా రెండవది దక్షిణ ధ్రువమని భావించును. ఒకే దివ్యలీలకు ఒకటి మూలస్థానముకాగా రెండవది అద్దాని చరమపరిణామ సీమగా తలపోయును. ఐక్యానందమును సంపూర్ణముగా అనుభవించుటకు జీవాత్మ పరమాత్మలు వేరుగనే ఉండవలెననియు, అట్టి వేరుతనమే ఆనందసంధాయక మనియు పరిగణించును.

అతిమానస దివ్యచైతన్యపు ఈ మూడు భంగిమలును ఒకే దివ్యసత్యముతో వ్యవహరించెడి మూడు తీరు లనునది సుస్పష్టమే. అనుభవించెడి సత్యమొక్కటే. కాని, దాని ననుభవించుటలో ఆత్మచైతన్యపు తీరులు, భంగిమలు మాత్రము భిన్నములు. ఆ యనుభవానందపు రీతులు వేర్వేరుగా నుండవచ్చును. కాని, అన్నియు అతిమానస దివ్యచైతన్య పరిధిలోనివే. అన్నృతములోనికి, అవిద్య లోనికి దిగజారుట అనునది అచటలేదు. ఏలయన, అతిమానసపు ప్రాథమిక భంగిమయందు దివ్యైకత్వమున నిశ్చితమై యున్నదానినే ద్వితీయ, తృతీయ భంగిమలందు దివ్యానేకత్వ శోభావైభవమున పెంపొంద

జేయుట జరుగుచున్నది. ఈ మూడు భంగిమలలో ఏ ఒక్కదానికిని అజ్ఞానపు ముసుగు వేయుటకు వీలు లేదు. సృష్ట్యున్ముఖమైన దివ్యచైతన్య స్వరూపమును వర్ణించుచున్న ఈ దివ్యసత్యానుభూతులకు పరమ ప్రమాణములై వెలసియున్న ఉపనిషత్తులలోగల భాషావైఖరిని శ్రద్ధగా పరిశీలించి చూతుమేని, ఈ అనుభూతులన్నియు నిక్కమైనవేయని స్పష్టమగును. అనేకత్వముకంటె ఏకత్వమునకు మనము ప్రాధాన్య మిచ్చుట జరగవచ్చును. కాని ఇది కాలమునుబట్టి గాక అనుభవమునుబట్టి ఇచ్చెడి ప్రాధాన్యము. ఏక త్వమునకుగల ఈ ప్రాధాన్యము—అనగా అనేకము ఏకము పైన నిత్యమూ ఆధారపడియున్నదనెడి సత్యము సకల వేదాంత సమ్మతము. కాలగతిలో అనేకము అశాశ్వతమై కన్పట్టి, తమ అభివ్యక్తికి మూలమైన ఏకములోనికే మరలిపోవుచున్నట్లు గోచరించుచున్నందున, అవి వాస్తవికములు కావని తోసిపుచ్చుట జరుగుచున్నది. కాని, కాలగతిలో ఈ అనేకము నిత్యమూ మరల మరల ద్యోతమానమగుచునే యుండుటనుబట్టి, ఏక త్వమువలెనే అనేకత్వముకూడ కాలాతీతపరవస్తువు లోని యొక వాస్తవికాంశమేయని అంగీకరించక తప్పదు. అట్లది వాస్తవికము కానిచో కాలగతిలో ఈ తీరున నది మరల మరల నిత్యమూ పొడసూపు చుండుట యనునది సంభవింపనేరదు.

ఆధ్యాత్మికానుభూతియందలి ఒకానొక అంత మునకుమాత్రమే మానవబుద్ధి సర్వప్రాధాన్య మొసగి, అది ఒక్కటియే నిత్యసత్యమని విభజనాత్మకమైన మానసిక తర్కముతో వాదింపదొరకనిప్పుడే,పరస్పరము ఖండించుకొనెడి తాత్విక సిద్ధాంతము లుదయించు చున్నవి. ఈవిధముగా, కేవల సచ్చిదానందమే ఏకైక సత్యమని చాటుటలో, అద్దాని దివ్యైకత్వఖేలనను వాస్తవిక భేదముగా మన మానవబుద్ధితో అవగాహన మొనర్చుకొని, బుద్ధిచేయు నీ పొరపాటును ఉచ్చతర సత్యానుభూతిద్వారమున సవరించుటకు సమ్మతించలేక పోవు పరిస్థితియందు, ఈ ఖేలనమంతయూ వట్టి మాయగా, భ్రమగా మనము కొట్టి పారవేయుట సంభవించుచుండును. లేక, అనేకములో ఏకము యొక్క ఖేలవకు సర్వప్రాధాన్య మొసగుచు, ఏకమును విశేషణ విశిష్టముగాభావించి జీవాత్మను పరమాత్మని అంశముగానే పరిగణించు పరిస్థితియందు, ఈ విశిష్టాద్వైతస్థితియే నిత్యసత్యముగ మనముద్ఘాటించుచు శుద్ధాద్వైతస్థితిని పూర్తిగా త్రోసిపుచ్చుట సంభ వించుచుండును. లేక, భేదముతోకూడిన ఖేలనకే సర్వప్రాధాన్య మొసగుచు, పరమాత్మయు జీవా త్మయు సర్వదా వేర్వేరని మనము భావించెడి పరి స్థితియందు, ఈ భేద భావమున కతీతమై అద్దానిని రద్దు పరచునదిగ చూపట్టు అనుభూతి విశేషము నెల్లనూ అసంగతముగ నెంచి ఖండించుటయు సంభ వించు చుండును. అట్లుగాక, పైన వివరించిన అతి మానస దివ్యచైతన్యస్వరూపభావనయందు మనము సుప్రతిష్ఠితుల మగుదుమేని, ఒండొంటిని బహిష్క రించుకొనజూచు నీ పాక్షికదృష్టులతో మనకిక పని లేదు. ఏకత్వమును గురించియు అనేకత్వమును గురించియు మనకుగల పరిచ్ఛిన్నభావముల కతీతమైనది ఆ పరాత్పర తత్వము. ఆ తత్వములో, ఏకత్వానేకత్వముల ఖేల అనంతముగా, అవిచ్ఛిన్నముగా కొనసాగుచున్నది. ఆ ఖేలయందు, ఏకత్వము అనేకత్వాభివ్యక్తికి ఆధార స్థానమై వరలుచుండగా, అనేకత్వము తిరిగి ఏకత్వ మును చేరుకొని పరమాభివ్యక్తియం దద్దాని నుప భోగించుటకు ఆధారస్థానముగా విరాజిల్లు చున్నది. ఏకత్వానేకత్వముల కీ రీతిగా అనుసంధానము కూర్చెడి దివ్యతత్వమే అతిమానసచేతన.

అవిద్య, అజ్ఞానము, అనుదానికీ అతిమానస చేతనలో ఎంతమాత్రమూ తావులే దనునది గమనించ వలసి యున్నది. అచట ఉన్నదెల్ల విద్యాలీల, విజ్ఞాన లీలయే. అవిద్యాక్షేత్రము దీనిక్రింది భూమికల యందు. కాని యీ అవిద్యను కల్పించినదియు అతి మానసమే. ఏ దివ్యలీలను లక్షించి సచ్చిదానం దము అతిమానసమై బుఱచిద్విలాసమై వెలసినదో, దాని విస్తృత సాఫల్యసిద్ధికొరకే ఈ అవిద్యాకల్పనము జరిగినది. స్వరూపమును మరుగుపరుచుట ఈ అవిద్యా లక్షణము. స్వరూపమునట్లు మరుగుపరుచుట ద్వారముననే అవరలోకసృష్టి జరిగినది. మనః ప్రాణ భూమికలు నడిమి అంతస్తులుగా ఏర్పడిన ఈ అవర సృష్టియందు అట్టడుగుభూమిక జడము. స్వరూప మీ జడపదార్థమునందు పూర్తిగా మరుగుపడి పోయినది—

కాని అట్లు మరుగుపడి పోవుటకు కారణమా జడము నాధారముగా చేసికొని తిరిగి స్వస్వరూపోపలబ్ధి దెసగా పునర్వికాసమునందగోరుటయే. అతిమానస చేతన యందు ముందుగనే నిక్షిప్తమైయున్న సంకల్పము ప్రకారము ప్రకృతియే ఈ మహాయోగ సాధన కార్య క్రమమునంతనూ నిర్వర్తించుచున్నది. జడరూప మైన అంధతమస్సులోనికి తొలుత కూరుకుపోయిన ప్రకృతియే ఆ తమస్సును క్రమక్రమముగా సడలించు కొనుచు ప్రాణమయ, మనోమయచేతనల వెలువరించి, ప్రాణసమన్విత జడశరీరమునందే మనోమయుడగు మానవుని వెలయించినది. కాని, మనస్సుకూడ అవిద్యా క్షేత్రములోనిదే యగుటచే, లక్షింపబడిన గమ్యము దెసకింకనూ మరో ప్రస్థానము కొనసాగవలసియే యున్నది.

మనస్సు నతిక్రమించి పరతత్త్వమును చేరుకొను ప్రయత్నములను మానవుడు యుగములుగ చేయుచునే యున్నాడు. పలువిధములైన యోగమార్గములు వీటి ఫలముగనే ఎన్నెన్నో వెలసియున్నవికూడ. ఇంతవర కునూ అతడు సాధించిన విజయములు అల్పములని చెప్పట కెంతమాత్రమునూ వీలులేదు. కాని మనస్సు నతిక్రమించి పరతత్త్వమును చేరుట మాత్రమేకాదు— విశ్వప్రకృతియు, విశ్వప్రకృతి ద్వారమున అతిమానస దివ్యచేతనయు లక్షించిన గమ్యము. విద్యాక్షేత్రములోని అతిమానసచేతన అవిద్యాక్షేత్రములోని కవతరించి అవరప్రకృతిని రూపాంతరము చెందించుటద్వారా మనః ప్రాణ దేహములయందే దివ్యలీలను ప్రతిష్ఠించవలసి యున్నది. అతిమానసచేతనయందు లక్షితమైన బహుత్వలీలావైభవమునకు చరమ సాఫల్య సిద్ధి అప్పటికిగాని కలుగదు. అతిమానసచేతన అవర ప్రకృతిలోని కవతరించి దానిని రూపాంతరము చెందించు మహాకార్యము విధి నిర్దిష్టము. కాని, అతిమానసచేతన క్రిందికి అవతరించివలెనంటే అద్దానికొరకు క్రింద నుండి తీవ్రమైన ఉత్కంఠ, అందుకవసరమైన విశుద్ధి సంపాదన, అనన్యదీక్షతోకూడిన ఆత్మసమ ర్పణము ఒనగూడుట అత్యంతావశ్యకము. శ్రీ అరవిందులు రూపొందించిన పూర్ణయోగము ఇందుకొరకేర్పడిన సాధనప్రణాళికయే.

వేదములయందలి ఋతచిత్ భావన మాదిరి గనే, తంత్రగ్రంథములలోని సదాశివ, ఈశ్వర, శుద్ధ విద్యాతత్త్వములు, భగవద్గీతయందలి పరాప్రకృతి, పురు షోత్తమతత్త్వ భావనలుకూడ శ్రీ అరవిందుల అతి మానస తత్త్వార్థసూచకములే యనుటకు సందేహము లేదు. తన దర్శనమును రూపొందించుకొనుటలో అవి ఆయన కెంతగానో తోడ్పడియుండుటకూడ అసంభా వ్యము కానేరదు. కాని, తార్కికప్రజ్ఞాతిశయముపై ఆధారపడికాక, మహోన్నతములైన ఆధ్యాత్మికానుభవ సంపద్విశేషములపై ఆధారపడి ఆయన తన దర్శనమును వెలయించుకొనియుండుటచే ఒక వినూత్న సందేశమును లోకమునకు అందీయ గలిగి నారు. ఆయన కావించిన అతిమానసదివ్యచేతనా స్వరూప వివరణము ఈ వినూత్న సందేశానుసారముగా కూడ తన రూపురేఖలను దిద్దుకొనినది. అతిమానస చేతన అవరప్రకృతిని రూపాంతరము చెందించి పృథ్విపై దివ్యమానవజాతిని వెలయింపవలసి యున్నదనునదే ఆ వినూత్న దివ్యసందేశము.

అతిమానసచేతనకు మాయాపదమును కూడ శ్రీ అరవిందులు వాడియున్నారు. ఆ మాయ దేవమాయ, పరాశక్తి. గుణాత్మికయైన అవరమాయకాదు— 'యా మా సా మాయా'—'ఏది లేనిదో అది మాయ,'— అనే వ్యుత్పత్త్యర్థము ఆ దేవమాయకు చెల్లదు. 'మాతీతిమాయా,' 'ఏది కొలతవేయుచున్నదో అది మాయ,'—అనే వివరణము చెల్లుతుంది. అనగా, పర తత్త్వాభిన్నమైన ఆ దేవమాయ తన స్వరూపములోని అనంతవైభవసంపత్తిని కొలిచిపోయుచున్నట్టిది. అనగా బహుప్రకారములుగా తనను తాను అభివ్యక్తముగావించు కొనుచున్నట్టిది. కాని, ఎంతగా కొలిచిపోసినను, ఎంతగా అభివ్యక్తమొనర్చుకొనినను ఆ సంపత్తి తరుగు నదికాదు. అది అనంతము. కావుననే ఆ సచ్చిదానంద మెట్లనంతమో, ఈ సృష్టిక్రీడకూడ అట్లే అనం తము. దేవమాయాశక్తిద్వారా ఈ అనంతక్రీడ కొన సాగుచున్నది. ఇది మనఃకల్పితమైన భ్రమకాదు. సృష్టిలోనిదేయైన మనస్సుచేత సృష్టి కల్పించ బడినదనుట అసంగతము. అవరమాయాకల్పితములైన భ్రమలు తొలగి అవిద్యలోనుంచి బయటపడవలసినదే. కాని, అది దేవమాయాకల్పితమైన దివ్యలీలలోనికి మనకు ప్రవేశము కల్పించునదిగా పరిణమించుట అత్యంతావశ్యకము.

# ఆంధ్రకవులు - దేశస్వాతంత్ర్యము

డా. దివాకర్ల వేంకటావధాని

స్వీయములయిన దేశ రాష్ట్ర మతాదులపై నభిమానముండుట మానవు లెల్లరికిని సహజమే. వారి మాటలయందు, వ్రాతలయందు ఆ యభిమానము జ్ఞాతముగనో, యజ్ఞాతముగనో వ్యక్తము చేయబడుచునే యుండును. సాధారణ సమయములందు కంటె నా దేశరాష్ట్రమతాదుల యభ్యుదయమున కంతరాయము కలిగించు పరిస్థితు లేర్పడునప్పుడది ద్విగుణీకృతమై యావేశపూరితముగా వెల్లివిరియు చుండును. ఆంగ్లేయులు మన దేశమును బరిపాలించు నపుడే పలు రాష్ట్రము లేర్పడినవి. ఆంధ్రులెంత యత్నించినను ప్రత్యేకరాష్ట్రమును బడయ జాలకపోయిరి. రాష్ట్రాభిమానమంతకు ముందును ఆంధ్రకవుల హృదయములందు నిండారియుండినను అది బహిర్గతముకాక గూఢముగనే యుండిపోయెను. తమకు ప్రత్యేకరాష్ట్ర మేర్పడలేదను వ్యథ కాలక్రమమున వర్ధిల్లి కావ్యరూపమును బొంద నారంభించెను. రాయప్రోలు, విశ్వనాథ, తుమ్మల మున్నగువారి రచనలలో దాని యుజ్జృంభణము మనకు గానిపించును. రాష్ట్రీయభావమును ప్రజాహృదయము లందు రేకెత్తించి రాష్ట్ర సంపాదనమునకు నాయకు లొనరించిన యత్నములు, త్యాగములు మున్నగు వానితోపాటు కవుల యావేశ పూరితములయిన రచనలును చాలవఱకు దోడ్పడెననుటలో నత్యుక్తి యుండజాలదు. జాతీయభావ మంత విశాలమును ఉదారమును గాక పోయినను రాష్ట్రీయభావముకూడ ప్రశంసింప దగినదే. సమరస భావముతో బరికించినచో జాతీయభావ మంగిమనియు, రాష్ట్రీయభావ మంగ మనియు జెప్ప వచ్చును.

క్రీ. శ. 14 వ శతాబ్దివఱకును భారతదేశమునందలి పలుభాగములను దేశీయరాజులు పాలించిరి. వారి పాలనమున ప్రజలు స్వాతంత్ర్య సంపత్సౌఖ్యముల ననుభవించుచు నానందమున విలసిల్లిరి. తరువాత దేశమునందలి కొంతభాగము మహమ్మదీయరాజుల యేల్బడి క్రిందికి వచ్చెను. అదృష్టవశమున నాంధ్ర దేశము మాత్రము రెడ్డి పద్మనాయకులయు, విజయనగర సార్వభౌములయు పరిపాలనమునమండి స్వాతంత్ర సౌఖ్యము ననుభవించుచునే యుండెను. విజయనగర రాజ్యపతనముతో నాంధ్రుల స్వాతంత్ర్యసౌభాగ్యమును అంతరించెను. తరువాత నాంధ్రదేశము పలువురు రాజులచే పరిపాలితమై తుద కాంగ్లేయ రాజ్యమున నంతర్భవించెను. ఆంగ్లేయులు సుమారు రెండున్నర శతాబ్దులకాలము భారతదేశము నాక్రమించి దానిని నిరంకుశముగా బరిపాలించిరి. ఆ కాలమునం దంతయు దేశము పారతంత్ర్యపంకమగ్నమై, వివిధ రంగములం దభ్యుదయమును గోల్పోయి, యధమ పరిస్థితు లనుభవించెను.

పరరాజపరిపాలనాభారము సోకినకొలది భారతీయులలో స్వాతంత్ర్యపిపాస పెంపొంద సాగెను. వివిధ రాష్ట్రములందు బలువురు నాయకులు ధన మాన ప్రాణములనైన లెక్కసేయక స్వాతంత్ర్య సంపాదన బద్ధకంకణులయి యఖండమైన కృషి కావించిరి. ఆ కృషియే క్రమముగా బెంపొంది, మహాత్ముని నాయకత్వమున ఫలించి, దేశమును మఱల స్వాతంత్ర్య సంపద్శోభిత మొనరింప జాలినది.

పరరాజపరిపాలితమై దేశము దాస్యాంధకారమున నల్లాడు సమయమున వివిధ ప్రాంతములందు కవివర్యుల హృదయములు కుమిలి కవితారూపమున ప్రసరించినవి. ఆ కవితయు నప్పటి రచనలును జాతీయభావ బంధురములయి చదువువారి యొడళ్లు పులకింప జేయును. ఆ రచనలు వివిధ ప్రక్రియలలో నున్నవి.

కొన్ని గేయములు, కొన్ని కావ్యములు, కొన్ని నవలలు, కొన్ని జీవిత చరిత్రలు, కొన్ని నాటకాదులు. మఱియు రాజకీయనేతల చేతలు కవిపుంగవుల కైతలు రెండును రెండు విధముల చైతన్య పునరుజ్జీవనముకు సాధనము లయినవి. దేశభాషలన్నింట నప్పుడు జాతీయతోద్బోధకములు, స్వాతంత్ర్య వాంఛా సముద్దీపకములునగు జీవవంతములయిన రచనలు వెలువడినవి. ప్రత్యక్షముగా గాకపోయినను పరోక్షముగానైనా ఆ రచనలు స్వాతంత్ర్య సంపాదనమునకు సాయపడినవనుటలో సందేహము లేదు.

ఆంధ్ర దేశమున నాబాలగోపాల విదితమై పండిత పామరులందఱికిని ప్రబోధకరమై స్వాతంత్ర్య వాంఛను రేకెత్తించిన తెలుగు గేయములలో శ్రీ గరిమెళ్ల సత్యనారాయణగారి 'మాకొద్దీ తెల్లదొరతనము' అనునది ప్రథమగణ్యమైనది. ఇది పరదేశీయులయిన యాంగ్లేయులు దేశమును బాలించుచు గావించిన యక్రమముల నధర్మములనన్నింటిని సులభసరళమైన భాషలో వెల్లడించి దేశీయు లందరికిని తెల్లవారి దొరతనముపై నసహ్యాభావము కలిగించినది. జనుల హృదయాంతరాళములం దడగి వెలువడ వెఱచుచున్న జాతీయ భావమును నది పొంగి పొరలునట్లు చేసినది. ఆంధ్రజనులందఱిలో జాతీయభావమును రగుల్కొల్పిన యింత శక్తివంతమైన రచన మఱి యొకటి లేదు. తరువాత వెలువడిన జాతీయ రచనలలో శ్రీ బలిజేపల్లి లక్ష్మీకాంతకవిగారి స్వరాజ్య రథము మొదలయినవి పేర్కొనదగినవి.

ఆంధ్రదేశమున జాతీయతా సంధుక్షకములయిన చరిత్రలు జీవిత చరిత్రలు పెక్కున్నను వానిలో రెండు ముఖ్యముగా బేర్కొనదగియున్నవి. ఒకటి డా. భోగరాజు పట్టాభి సీతారామయ్యగారి కాంగ్రెసు చరిత్రకు శ్రీ కొడాలి ఆంజనేయులుగారు చేసిన యాంధ్రానువాదము. రెండవది మహాత్ముని స్వీయ చరిత్రకు విద్వదగ్రణులు, శతావధానులునైన శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారొనరించిన యాంధ్రీకరణము. రెండు రెండే జాతీయోద్యమ చరిత్రను పరపరిపాలనా పీడనమును బహువిధముల వ్యక్తీకరించి తెలుగు వారిలో జాతీయ భావమును నిండారునట్లొనరించినవి. అందును మహాత్ముని యాత్మకథ కథవలెనే సాగుచు కొకవంక నహింసా సత్య ప్రభావమును, వేఱొకవంక స్వాతంత్ర్య సంపాదనాసక్తిని ప్రబోధింప జాలినది. ఇట్లే నెహ్రూ, వినాయక సావర్కార్, బోసు మున్నగువారి జీవిత చరిత్రలుకూడ జాతీయ భావ సంవర్ధకములై సన్నుతికెక్కినవి.

ప్రత్యక్షముగనో, పరోక్షముగనో పఠితలలో జాతీయ భావమును ప్రేరేచిన నవలలును, ఖండ కావ్యములును బెక్కు వెలసినవి. అట్టినవలలలో శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారి మాలపల్లి ముఖ్యమైనది. స్వాతంత్ర్య సంపాదనము దేశభక్తి మున్నగునవి యిందు ప్రత్యక్ష వస్తువులు కాకపోయినను, అస్పృశ్యతా నివారణమును మహాత్ముని యాదర్శ సిద్ధాంతముల కిందు మిక్కిలి ప్రాధాన్యమొసంగ బడినది. ఇట్లు పరోక్షముగా జాతీయ భావమును బెంపొందించిన రచనలింకను ననేకములున్నవి. ఆ కాలపు కవులు పత్రికలలో ప్రకటించిన ఖండకావ్యములు పెక్కింటిలో దేశభక్తియు స్వాతంత్ర్యానురక్తియు ప్రముఖస్థానము నాక్రమించియున్నవి. అవి యప్పటి ప్రజల భావసంచలనమునకు ప్రతినిధులు. భారత మాతృ దాస్య శృంఖలా విచ్ఛేదమునకై వారు పడు నావేదన యందలి ప్రత్యక్షరమందును ప్రత్యక్షమగుచుండును.

మనదేశచరిత్రలో స్వాతంత్ర్య సంపాదనమునకై సర్వస్వమును సమర్పించి, భారతీయ ధర్మ సంస్కృతి ప్రతిష్ఠాపనార్థము యావజ్జీవితము పాటుపడిన మహనీయులనేకులున్నారు. అట్టివారిలో రాణా ప్రతాపుడు, శివాజీ మున్నగువారు అగ్రగణ్యులు. వారి జీవితమంతయు దేశదాస్యనిర్మూలన పరాయణమై భాసిల్లియుండెను. అట్టివారి జీవిత చరిత్రలను వస్తువులుగా గ్రహించి మహాకావ్యములు నిర్మించుట జాతీయతాభావ ప్రచారమున కెంతయైన తోడ్పడుననుటలో సందేహము లేదు. ఈ విషయమును గ్రహించి శ్రీ రాజశేఖర శతావధానిగారును, శ్రీ గడియారము వేంకటశేషశాస్త్రిగారును, రాణా ప్రతాప చరిత్రము, శివభారతము, రచించిరి. అవి భావములచేతనుగూడ జాతీయతా నిధానములని చెప్పదగిన మహనీయకావ్యములు. కవులందు దమ నాయకుల నాదర్శపురుషులనుగా దీర్చిదిద్దుటయేకాక, భారతీయ సంస్కృతి ధర్మవిశేషములను

జాల మెలకువతో నిరూపించి నిరుత్సాహ నిర్విణ్ణ మయిన యాంధ్రజాతికొక యాదర్శమార్గము నందీయ జాలిరి. ప్రతాపుడును శివాజీయు ధైర్యోత్సాహములు ప్రేరేప ప్రబలులైన శత్రువులపై కుతికి విజయము సాధింప యత్నించుట పారతంత్ర్యపరాభూతులయిన పఠితలకు కర్తవ్య నిశ్చయమున పరమోపదేశమై పరిఢవిల్లినది.

'భరతఖండంబు నుద్ధరింపగ జనించు
ధూర్జటివి నీవు రాజమాత్రుడవు కావు'

'భారతమహాఖండంబు దాస్యాంధకార
నిమగ్నంబయియుండ
లోకముల దౌర్భాగ్యమ్మునుం
దీతెనేడని హర్షింప ప్రతాపభాను
డుదయంబైయుండె'

'అతిభీమంబుగ బెల్లురేగి
నిబిడంబై మూగి యీ సర్వ భా
రతదేశంబును ముంచివైచిన
మహోగ్రంబైన దాస్యాంధకా
ర తతిన్ దేవుని దృష్టికూడ
నణుమాత్రంబున్ జొరంబోని దు
స్థితి సంధించెదు పాపికాల
మరుదెంచెంజాచి యెట్లోర్తునో'

మున్నగు పద్యములు చదువునపుడు పఠిత కథా ప్రకరణమును విస్మరించి కార్యరంగమునకు దుముకు ననుటలో సందియము లేదు. పై రెండు కావ్యములును వస్తు సంఘటనమున యందును, రచనా పాటవము నందును, భావగాంభీర్యమునందును అద్వితీయములై యక్షరమక్షరమందును జాతీయతను వెదజిమ్ముచున్నవి.

శ్రీ జంధ్యాల పాపయ్య శాస్త్రిగారి విజయశ్రీ కావ్యము కూడ నిట్టిదే. ఇందలి శరీరము ప్రాతదేకాని చైతన్యముమాత్ర మతినవ్యమైనది. సుపరిచితమైన భారతకథయందే కవిగారాధునిక భావముల నెన్నింటినో యిమిడ్చి పఠితలకుత్తేజము కలిగించి యున్నారు. ఇందు కురుక్షేత్ర సంగ్రామమునకును భారత స్వాతంత్ర్య

సంగ్రామమునకును బోలిక వ్యంగ్యము చేయబడి యున్నది. దేశమునందలి వివిధ పక్షములవారి వివిధ వయస్సులవారి భావములిందు జక్కగా వివరింపబడి యున్నవి. ఇది నిజమునకు బాండవ కౌరవ సంబంధి గాథయేయైనను, నిశితముగా బఠించువారికి మైమఱపు కలిగించి స్వాతంత్ర్య సంగ్రామ భ్రాంతి యొదవించు చున్నది. కావ్యాంతర్గతములయిన స్వతంత్ర భావము లకు మృదుమధురశైలి యెంతయో మెఱుగు దిద్ద జాలినది.

గౌతమ బుద్ధునికిని గాంధీ మహాత్మునికి బెక్కు విషయములలో సాదృశ్యమున్నది. సత్యాహింసలా యిరువురికిని ఆరాధ్య లక్షణములు. అందుచే నా యిరు వురిలో నొకరి చరిత్ర రెండవవారి చరిత్రను స్ఫురింప జేసి యానందావహము కాజాలుచున్నది. ఈ కారణము చేతనే కాబోలు నా కాలమున బుద్ధజీవిత వస్తుకము లయిన కావ్యములు పెక్కు బయలుదేఱినవి. ప్రత్యక్ష ముగా వానికిని, భారత జాతీయతకును నంతగా సంబం ధము లేకపోయినను గాంధీ మహాత్మునకును బుద్ధ దేవునికిగల భావసాదృశ్యము వానినిగూడ జాతీయతా భావ బంధురముల నొనరించినది. శ్రీ తుమ్మల సీతా రామమూర్తి చౌదరిగారు మహాత్ముని జీవితమును వర్ణించుచు రచించిన పద్యకావ్యముకూడ నిట్టిదే.

స్వాతంత్ర్యము లభించినపిమ్మట ధర్మ చక్రమున కును ప్రాధాన్యము కలిగినది. అది అశోక చక్రవర్తికి సంబంధించినదగుటచే కొందరు కవులా మహారాజు చరిత్రమును గ్రహించి కావ్యములు రచించిరి. అట్టి వారిలో శ్రీ కల్లూరి నారాయణగారి అశోక సమ్రాట్టు చరిత్రము పేర్కొనదగినది. స్వాతంత్ర్యలాభమునకు బూర్వము కవులును, రచయితలును తత్సంపాదనము నకు సాధనములయిన రచనలు కావించిరి. స్వాతంత్ర్యము సిద్ధించిన పిమ్మట స్వతంత్ర ప్రభుత్వము కవులను రచయితలను ప్రోత్సహించుచు దేశమునందలి అన్ని భాషల యభ్యుదయమునకును దోడ్పడుచున్నది.

జాతీయతాభావ సంధుక్షణమునకు దోహదమును గూర్చిన ముఖ్యములయిన రచనలను మాత్రమే యిచ్చట స్పృశించి విడిచితిని. కాలపరిస్థితునుబట్టి యిట్టి రచనలెన్నో యప్పుడు బయలుదేరి స్వాతంత్ర్యసిద్ధికి దోడ్పడ జాలినవి. రాష్ట్రీయభావప్రేరకములయిన కావ్యములు మన భాషలో జాలగలవు. అవికూడ నొక విధముగా జాతీయతకు బెంపు చేకూర్చినవే.

> 'నేటితో నస్వతంత్రతా నియతమైన
> యీ బ్రదుకు తెల్గువారు భరింపలేరు'

మొదలయిన భావములతో గూడిన రచనలు రాష్ట్రీయ భావ ప్రధానములయిన గ్రంథములలోనివే యైనను జాతీయతాభావమునకుగూడ నుత్తేజము గల్పించునట్టివే. కవుల కావ్యములు ప్రజలలో జాతీయ భావమును చెలరేచినట్లే దేశమున పొంగిపొరలుచున్న జాతీయభావముకూడ కవుల నావేశపూరితుల గావించి రచ నోన్ముఖుల నొనరించినవి. ఈ విధముగా జాతీయభావ మును, కవిత్వమును పరస్పర పోషకములై వర్ధిల్లినవి.



# కోరిక

## శ్రీ తులసికృష్ణ

ఏ సుదీర్ఘ శుభోదయ భవిష్యమందొ
బృందలో, గోపాలునిగ పుట్టుకొఱకు
వంశగౌరవకీర్తి సంపదలనైన
త్యాగమొనరింతు, నట్టి భాగ్యమ్ముకొనగ

ఆ యమునానదీ పరిమళావృత శీతలవారిలోన, నే
హాయిగ స్నానమాడెద, వనాంతర సీమల మేయు గోవులన్
కాయుచు కూరుచుండెద, నొకానొక నీల తమాలశాఖికా
చ్ఛాయల, బ్రొద్దుపుచ్చెదను చక్కని 'కుంజ' సుమమ్ములల్లుచున్

తెలతెలవాఱుచున్నపుడు దిక్కులుషోదయ రాగరంజిత
మ్ములయిన, గోపికా కర విముక్త వినిర్గత క్షీర ధారలో
లలితమనోజ్ఞ గాన మతిశ్రావ్యతనింపి, బయళ్ళకేగు గో
వుల పదధూళిలో, చెలులు, పొదఱిండ్లు నిద్రలేపెదన్

నీలనీలతమాల నికురంబముల క్రింద
కటిక చీకటి గుంపు కప్పినపుడు,
కడసంజ వెలుగులో కల్లోల వాహినిన్
గడవ గోపికలు భయంపడినవేళ,
ఘననిదాఘాత్యయ కాదంబినులచూచి,
అడవినెమళులు నాట్యమాడువేళ,
తరుణవికసిత పుష్పతారుణ్యవతివోలె,
తొలి వసంతపురాత్రి నిలిచినపుడు

దక్షిణానిల స్నిగ్ధగాంధర్వగీతి
వినుచు గోపాలకుల గూడ వేడ్కలాడుదువు
ఏ అశోక నికుంజ సామీప్యమందొ,
బృందలో నొ, మునుముందు పుట్టుకొఱకు

లేదుమిత్రమ! నాకు లవలేశమేని
మాతృభూమిని గొప్పసన్మానమొంది
కీర్తి గడియింప, జ్ఞానకుధార్తులకును
దానమొసరింపకోర్కె సుంతేనిలేదు.

యేననెడి సర్వమును మొత్తమిచ్చివైతు
ఏ అశోకనికుంజ సామీప్యమందొ
బృందలోనొ, మునుముందు పుట్టుకొఱకు...

(రవీంద్రుని 'లవర్స్‌గిఫ్ట్'కు భావానుకరణ)



# లుగు మాండలికాలు -
# కరీంనగర్ జిల్లా

## శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం

హైదరాబాదు తెలుగు అకాడమీవారు తెలుగు దేశంలోని భిన్నభిన్న ప్రాంతాల మాండలిక వ్యవహారాన్ని పరిశీలించడానికి పూనుకొని దాంట్లో తొలి ప్రయత్నంగా కరీమునగరంజిల్లా మాండలికాన్ని సర్వే చేయించి మొదటి బుల్లెటిన్‌గా ప్రకటించారు. ఈ ప్రయత్నం అభినందించదగినదనీ, ప్రయోజనకరమైనదనీ వేరే చెప్పనక్కరలేదు. ఈ సర్వేవల్ల ఉద్దేశించిన లక్ష్యాలను అకాడమీ డైరెక్టరు డాక్టరు పోణంగి శ్రీరామఅప్పారావుగారున్నూ, బులెటిన్ సంపాదకులు డాక్టరు బూదరాజు రాధాకృష్ణగారున్నూ తమ భూమికల్లో వివరించి ఉన్నారు.

1. తెలుగు మాండలికాలలోని ఏకత్వాన్ని నిరూపించడం.

2. ఈ ఏకత్వాన్ని వర్ణనాత్మక వ్యాకరణంగా రూపొందించడం.

3. కావ్యనాటకాలలో దేశ, పాత్రలకు అనుగుణంగా వ్యవహారభాషా ప్రయోగానికి వీలుకలిగించడం.

డాక్టరు అప్పారావుగారి ప్రకారం మాండలికాల సర్వే ఉద్దేశాలు ఇవి. డాక్టరు రాధాకృష్ణగారు వీటినే భంగ్యంతరంగా వివరించారు.

1. తెలుగు భాషలోని ప్రాంతీయ సాంఘిక భేదాలను సాధ్యమయినంత విపులంగా సేకరించి గ్రంథస్థం చేయటం.

2. స్థానికంగా భిన్నవిధాలుగా ఉన్న భాషా ప్రమాణాలు రాష్ట్రవ్యాప్తమైన ప్రామాణిక భాషగా పొందుతున్న నిరంతర పరిణామక్రమాన్ని నిరూపించటం.

ఇక్కడ కొందరు ఒక శంక చేస్తారు. మన సంఘంలో వర్గభేదాలు, కులభేదాలు, మతభేదాలు కోకొల్లలుగా ఉండనే ఉన్నాయి. వాటిని తుడిచివేయడానికీ, మరిచిపోవడానికీ, సంఘంచే మరపింప చెయ్యడానికీ ప్రయత్నం చెయ్యాలికాని, ప్రాంతీయ భేదాలను సాంఘిక భేదాలను విపులంగా సేకరించి గ్రంథస్థం చేయటం, సంఘానికి అపకారం చెయ్యడం కాదా అంటారు. ఇది మన రాజనీతిజ్ఞుల దృక్పథం. ఇదీ ఉచితంగానే ఉంది. జీవితము ఆర్థిక పోరాటానికి రంగము. వర్గాన్ని, కులాన్ని, మతాన్నిబట్టి ఆర్థికావకాశాల సంకోచ వ్యాకోచాలు నిరోధించి, మాత్సర్యాలు కలహాలు వారించటానికి వర్గ, కులభేదాల్ని తగ్గించాలనీ, మరిపించాలనీ రాజకీయవేత్తలు భావించడం బాగానే ఉంది. అయితే తెలుగు అకాడమీవారు ఇక్కడ అనుసంధిస్తున్నది—సాంఘిక విభేదాలు, ఆర్థిక అసమానతలు కావు. భాషా సంబంధమైన ఐక్యతలూ వైవిధ్యాలు వారు అనుసంధిస్తున్నారు. దీనిలో ఎవరికీ లాభనష్టాల ప్రసక్తి లేదు. పైగా ఇది శాస్త్ర విషయం. ఒక వస్తుతత్వం ఎల్లా ఉండాలో శాస్త్రం విధించదు. అది వాస్తవికంగా ఎట్లా ఉందో విశ్లేషణ చేసి చూపిస్తుంది. శాస్త్రము ఆదర్శవాదికాదు. వాస్తవ ప్రదర్శిని. వైద్యశాస్త్రజ్ఞుడు శరీరాన్ని విశ్లేషణచేసి నరాలు, ఎముకలు, గ్రంథులు, రక్తమాంసాదులు వాటి సంస్థానాన్నిగూర్చి చెప్పతాడుకాని ఒక శరీరాన్ని సౌందర్యవంతంగా చెయ్యడం ఎట్లాగో చెప్పలేడు. ఆ భారము అఘటనఘటనాసామర్థ్యంకల ప్రకృతిశక్తిది.

భాషాశాస్త్రంకూడా వైద్యశాస్త్రం మల్లేనే వికారమైన శాస్త్రము. శరీరాన్ని విశ్లేషణచేసి చూపిస్తే జుగుప్సాకరంగా ఉంటుంది. భాషను వ్యాకరించి చూపిస్తే విసుగ్గా ఉంటుంది. మాండలిక భాషా

విశ్లేషణం ఇంకా వికారంగా కనబడుతుంది. కరీం నగరంజిల్లా మాండలికమని ఉదాహరణ ఖండికలుగా ఇచ్చిన భాగాలను చదివితే కరీంనగరంమీద అక్కడి జనులమీద కృష్ణా గోదావరి జిల్లాల వారికి విరక్తి కలుగుతుంది. ముందు ముందు అకాడమీవారు కృష్ణా గోదావరి జిల్లాల మాండలిక భాషా ఖండికలు ప్రకటిస్తే, అవి చదివిన కరీంనగరం మండలంవారికి కృష్ణా గోదావరిజిల్లాల భాషమీద విరక్తి జనింపక తప్పదు. మాండలిక భాషా పరిశోధనము చివరికి అన్యోన్య విరక్తి కలిగించేదైతే ఈ శ్రమంతా ఎందుకు, ఈ ధనవ్యయం ఎందుకు అని స్థూలంగా సందేహం కలుగుతుంది సాధారణ పౌరునకు.

ఇక్కడ మనము ఆ పౌరునికి ఓపికతో నచ్చ చెప్పాలి. భాష అనేది ఒక విచిత్ర వ్యవస్థ. దానిలో ఏకత్వమూ ఉంది, అనంతమైన వైవిధ్యమూ ఉంది. అసలు భాష అంటేనే వైవిధ్య మూలకము. లోకంలో భాష ఎక్కడ ఉంది? మాట్లాడే జనుల నోళ్ళల్లో ఉంది. వారంతా ఎవరికి ఇష్టం వచ్చినట్లు, ఎవరికి చేతనైనట్లు వాళ్ళు మాట్లాడుతూంటారు. ఫలాని విధంగా మాట్లాడాలని లోకుల్ని ఎవరూ శాసించ లేరు. అట్లా శాసనం చేసినా అది చెల్లదు. దుర్భాషలు, అశ్లీలాలు పదిమందిలో మాట్లాడకూడదని సంఘంలో ఒక అలేఖ్య సంప్రదాయం ఉంది కనుక నలుగురూ దానికి కట్టుబడి ఉంటున్నారు కాని అంతకుమించి భాషణ విషయంలో శాసనాలేవీ లేవు. ప్రతీ వ్యక్తికి ఒక ఉచ్చారణ విశేషం ఉంటుంది. అందుచేత అతని భాష అతనికి ప్రత్యేకం అన్నమాట. దీన్నే మాండ లికము అంటున్నాము. ఇదే నిజమైతే తెలుగు వారెంత మంది ఉన్నారో అన్ని తెలుగు మాండలికాలు ఉన్నా యన్న మాట. వాదంవరకూ ఇది సత్యమే. ఒప్పుకోక తీరదు. అయితే లోకంలో వ్యవహారం జరగడం ఎల్లాగ? ఒకరి మాట ఒకరికి అర్థంకాని అనర్థకం ఏర్పడు తుంది గదా అంటే—శాస్త్రజ్ఞులు దీనికొక పరిష్కారం చెప్పారు. ఆ పరిష్కారం వారు కల్పించింది కాదు. సంఘం తనకుతానే అప్రయత్నంగా, అవిదితంగా కల్పించుకుంది. ఎట్లాగంటే—ప్రతీవ్యక్తీకూడా నిరం తరం ఒక ప్రయత్నం చేస్తూనే ఉంటాడుట. భాషా విషయంలో తన వ్యక్తిత్వం నిలుపుకుంటూనే ఎదుటి వ్యక్తికి అర్థమయేటంత స్పష్టంగాను సావ ధానంగానూ మాట్లాడడానికి ప్రయత్నిస్తాడు. ఇది ప్రకృతి శాసనమన్నమాట. లేకపోతే అతనిమాట ఎదుటి వానికి తెలియకపోవడం, వ్యవహార భంగము అవడం అనే అనర్థాలు ఏర్పడతాయి. ఈ ప్రయ త్నాన్నే శాస్త్రజ్ఞులు Average pronunciation- సగటు ఉచ్చారణరీతి – అని వర్ణిస్తారు. సగటు ఉచ్చా రణ పద్ధతిపై సంఘముయొక్క భాషావ్యవహారం నడుస్తూందన్నమాట.

ఎదుటి వారికి అర్థమయేరీతిలో మాట్లాడా లనేది అపూర్వ విషయమేమీ కాదు. కరీంనగరం మాండలిక ఖండికల్లో దీనికి ఒక చక్కని నిదర్శనం దొరుకుతూంది. ఉన్నత విద్యావంతుడైన ఒక వ్యాపారి సంభాషణ మచ్చుగా మనకు ఇవ్వబడింది. (పుటలు 95—100). వ్యాపారి గనుక సహజంగానే ఉపాయ శాలి అని మనం గ్రహించవచ్చును. ఆయన అంటాడు గదా—'ఇంటిమెంబర్లతోని మాట్లాడ్ టవ్ డౌమె కొదిగ క్లోజ్‌గ మాట్లాడ్‌తవ్—అరెతురె అన్‌కుంట ఏమె ఎట్లగొ జేస్తున్నవే సంగతి అనుకుంట. అంటే మన ఇక్కడి టెంపోలో ఇక్కడి లేంగ్వేజ్‌లో మాటాడ్ తవ్ గద. ఇఆవేరే కొత్తవాళ్లొస్తే మీయట్ వంట్ ఫ్రెండ్సొస్తే కొదిగ్ లేంగ్వేజ్ డిఫరెంట్‌గ చేంజెసి, ఏవండి ఎప్‌డొచ్చిను—ఏ సంగతి అంతమంచిదెన. ఎక్కడ్ జదివ్రిను—ఇట్లగ్ మంచిగ్ మాటాడ్‌తవ్ క్లియర్‌గ.

అడిస్ట్రిట్స్ వాళు క్రిష్ణా డిస్ట్రిక్టు, గోదావరి డిస్ట్రిట్సు ఇవునయ్‌గద ఆ డిస్ట్రిట్స్ వాళు వాట్లాడ్తె అసల్ మనకు మనసునేబట్టది సరిగ లేంగ్వేజ్—ఇకడ కొదిగ్ మొదట్లా డిఫ్‌కల్టి అయింది. దాతర్వాత ఇప్పుడిప్పుడు కొద్దిగ డెవలప్ అయ్‌తందన్‌కొండి—వాల్ల లేంగ్వెజ్ మన దాన్మిద ఇంప్రెసొవ్‌డు దాన్తోని వాలతొని మన వొకటికాంటేట్సు పెర్‌య్‌నా కొద్ది మనవ్ గుడ, ఏవండి ఎక్కడ్ బొత్రాను. ఏం సంగతి ఇట్ల మనవ్ డెవ్‌లప్‌జెస్‌న.'' కొంచెం దీర్ఘ మైన ఖండమే ఇచ్చాము ఈ వ్యాపారస్థుని మాండ లికం తెలియాలని.

మాండలికాంతరంచేస్తేనేకాని కొన్ని జిల్లాలవారికి తెలియదు గనుక నా కర్థమైనట్లు చేస్తాను. ఈ వ్యాపారి అంటాడు. 'ఇంటిమేట్లతో (Intimates) మాట్లాడడమొ కొద్దిగ క్లోజుగా మాట్లాడుతాము. అరేతురే అనుకొంటూ, ఏమే (ఏమోయి అనుట) ఎట్లాగో చేస్తున్నావే. ఏం సంగతి అనుకుంటూ. అంటే మన ఇక్కడి టెంపోలో (Tempo) ఇక్కడి లాంగ్వేజిలో మాట్లాడుతాము గదా. ఇక వేరే క్రొత్తవాళ్ళొస్తే, మీ యటువంటి ఫ్రండ్సు వస్తే కొద్దిగా లేంగ్వేజి డిఫరెంటుగ ఛేంజి చేసి—ఏమండి, ఎప్పుడొచ్చినారు. ఏం సంగతి అంతా మంచిదేన. ఎక్కడ చదివినారు -ఇట్లాగ మంచిగ మాట్లాడుతాము. క్లియరుగ.

ఆ డిస్ట్రిక్టువాళ్లు—క్రిష్ణ డిస్ట్రిక్టు, గోదావరి డిస్ట్రిక్టు—ఇవి ఉన్నాయిగద— ఆ డిస్ట్రిక్టు వాళ్లు మాట్లాడితే అసలు మనకు మనసునేబట్టదు సరిగా లేంగ్వేజి. ఇక్కడ కొద్దిగ మొదట్లో డిఫికల్టీ అయింది. దాని తర్వాత ఇప్పుడిప్పుడు కొద్దిగ డెవలపు అవుతూందనుకోండి. వాళ్ళ లాంగ్వేజి మన దాని మీద ఇంప్రెస్ అవుడు (Impress) దానితో వాళ్లతో మన కాంటాక్ట్సు (Contacts) పెరిగినకొద్దీ మనం గూడా 'ఏమండి, ఎక్కడ పోతున్నారు. ఏంసంగతి? ఇట్లా మనం డెవలపు చేసినాము.'

ఈ వ్యాపారి భాషాశాస్త్రం అధ్యయనం చెయ్యక పోయినా దాని తత్వాన్నిమాత్రం బాగానే ఆకళింపు చేసుకున్నాడు. శ్రోతనుబట్టి వక్తయొక్కభాషణరీతి మారుతూ ఉంటుంది. సంఘంలో ప్రతీవ్యక్తికి అతని స్వాతంత్ర్యాన్నిబట్టి ఒక ప్రత్యేక మాండలికం ఉండడం శాస్త్రసమ్మతమైనా ఆచరణసాధ్యమైతేకాదు. అటు వంటి సజాతీయమైన కొందరి వ్యక్తుల గుంపునే మండలము అంటున్నాము. వీరందరి ఉచ్చారణరీతుల్లో కొన్ని సాధారణ లక్షణాలు ఉండడంచేత వారివారి భాష వారికి అర్థమయి వ్యవహారం నడిచిపోతూ ఉంటుంది. ఈ మండలాలు అనగా సగటు ఉచ్చారణరీతులుగల గుంపులు కులాన్నిబట్టికాని, వృత్తినిబట్టికాని, ఏక ప్రాంతనివాసంచేతకాని ఏర్పడవచ్చును. అవే మాండలిక భాషలు. కరీంనగరంజిల్లావాసుల సమష్టి ఉచ్చారణ రీతులూ, స్వరవైశిష్ట్యాలు, పదబంధాలు, పదాలు, సామెతలు—ఇవన్నీ కలిసి కరీంనగరం మాండలికము అనిపించుకుంటుంది. సర్వేచేసినవారు ఇంతదూరం వెళ్లినట్లు కనబడడంలేదు. కరీంనగరంవారికి ప్రత్యేక మని చెప్పదగ్గ పదబంధాలు, పదాలు, స్వరరీతులు మనముందు ఉంచబడలేదు. సంపాదకులైన డాక్టరు రాధాకృష్ణగారు ఆయాఖండికల చివర కొన్నివ్యాఖ్యా నాంశాలుచేర్చి, సదరు వ్యక్తియొక్కభాషను పాఠకుడు అర్థంచేసుకోడానికి కొన్నిసూచనలు చేశారు. అంత వరకూ బాగానేఉంది. కాని ఇది చాలదనిపిస్తుంది.

ప్రతినిధివక్తల విషయంలో ఒకటి రెండు సూచనలు చెయ్యాల్సిఉంది. వీరిలో రాజకీయ కార్య కర్త, బ్యాంకి ఉద్యోగి, ఉపాధ్యాయుడు, ఉన్నత విద్యా వంతుడైన వ్యాపారి, కాలేజి విద్యార్థి, స్కూలు విద్యార్థి, నేతపనివాడు, రైతు- ఉన్నారు. ఇందులో కొందరి ఉపన్యాసాలు లేక వక్కాణములు చాలా దీర్ఘంగా విసుగుపుట్టించేటట్లు ఉన్నాయి. వీరి వాచా లతను తగ్గించి, సంఘంలో మరికొన్ని వర్గాలకు ప్రాతినిధ్యం కల్పిస్తే బాగుంటుంది. ముఖ్యంగా ప్రతి నిధివక్తల్లో స్త్రీలు లేకపోవడం లోపంగా తోస్తుంది. సంఘంలో నూటికి యాభైమందికి ప్రాతినిధ్యం పోయిందన్నమాట. మహిళాకార్యకర్తలనుంచి **కూడా** వక్కాణాలు సేకరించాలి. గ్రామజీవితానికి నడిబొడ్డైన మునసబు కరణాలు పటేలు పట్వారీలు ఇందులో ప్రత్యక్షం అవలేదు. ఇంకా కొన్ని ప్రముఖ కులాల వ్యక్తులనుంచికూడా వాఙ్మాలాలు సేకరించవచ్చును. ప్రసంగవిషయాల్లో కూడా ఇంకా వైవిధ్యం ఉండవచ్చు ననిపిస్తోంది. ప్రస్తుతం ఆకాంక్షించిన ప్రసంగ విషయాలన్నీ అత్యాధునిక జీవితానికి సంబంధించినవి అవడంచేత అన్యభాషాపదాలు—ఆంగ్లము, ఉర్దూ భాషా పదాలు ఎక్కువగా తలదూర్చాయి. ఆంగ్లపదాల ఉచ్చారణలో కూడా మాండలికత్వం తొంగిచూస్తుంది. ఎవరిగోడు వాళ్లు వెళ్లబోసుకోవడంచేత వక్తకూ— శ్రోతకూ దూరం ఎక్కువైపోయి, వక్తల ప్రసంగాలు కూడబలుక్కోవడమే దుర్లభం అవుతూంది. ఉభయు లకు పరిచితమైన విషయాలు – రామాయణ, మహా

భారత కథలూ, గాంధీజీవంటి మహాపురుషుల జీవితాల్ని గురించి కూడా మాట్లాడిస్తే వక్త్ర-శ్రోతల మధ్య ఉన్న అఘాతం తగ్గవచ్చును.

ఈ ఉన్నవి ఉన్నట్లు చదవబోతే సదరు ప్రసంగాలన్నీ వట్టి కంపతొడుగులా ఉన్నాయి. వ్యవహారభాష అంటే అదొక స్వర్గమనీ, దానిలో రచనలుచేస్తే నందనోద్యానంలో విహరించినట్లు ఉంటుందనీ వ్యవహార భాషావాదులు ఉవ్విళ్లూరిస్తూ ఉంటారు. గుటకలు వేస్తూంటారు. మనకు అందించినమాదిరి ప్రసంగాల భాషవంటి భాషలో సాహిత్యరచనచేస్తే పాఠకుడు 'త్రాహి, త్రాహి' అంటాడు. 'స్వామీ! పాత్రం, అన్నట్లు అవుతుంది. వ్యవహార భాష మాకు వద్దు బాబో' అనే విపరీతపరిణామానికి దారితీస్తుంది. గ్రాంథికభాష మృతభాష అనీ, కృతకభాషఅనీ వ్యవహార భాషావాదులు విసుర్లు విసురుతూంటారు. వ్యవహార భాషాధ్వజాన్ని అచంచలవిశ్వాసంతో మోస్తున్నామనుకొనే కొందరు కందుకూరి వీరేశలింగం పంతులు, కొమర్రాజు లక్ష్మణరావుపంతులు, చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులువంటి సర్వజనామోదం పొందిన మహారచయితల రచనలు కూడా అర్థంకావనే స్థిరనిశ్చయానికి వచ్చారు. వాదంలోని వేడిమి సత్యాన్ని గ్రహించనివ్వదు గదా. ఈ సేకరించిన మాండలికంలోను, సేకరించబోయే మాండలికాల్లోను యథాతథంగా రచనలుచేస్తే అవి ఆ మండలమందలి వ్యక్తుల్నిదాటి అఖిలాంధ్ర ప్రజలను రంజింపచెయ్యలేవనడం తథ్యము. మాండలిక భాషల్ని సర్వేచేయించేవారికి మనము అపచారం చెయ్య కూడదు. ఇటువంటి భాషలో వ్రాయమని వారేమీ చెప్పలేదు. దీనికి పరిమితప్రయోజనం లేకపోలేదు. ఇప్పటి సాహిత్యకులు వ్రాస్తూన్న కావ్యనాటకాల్లోనూ, నాటికల్లోను, కథానికల్లోను పాత్రోచితభాషా సందర్భంలో ఇటువంటి మాండలికాల్ని యథాతథంగా వ్రాసినా బాధలేదు. చమత్కారజనకంగానే ఉంటుంది. కాని శాస్త్రప్రమేయంలోనూ, గ్రంథం మొత్తంమీద ఏవంవిధమైన భాషవ్రాస్తే ఆ గ్రంథవిషయం అచుంబితంగా ఉండిపోతుంది. మాండలికాల్ని సంస్కరించి అన్యమాండలికాలకు దగ్గరగాతెచ్చి రచనచేస్తేకాని అవి ఉద్దిష్టప్రయోజనాల్ని సాధించలేవనియే తోస్తుంది.

కరీంనగరం మాండలికాన్ని విశ్లేషణచేసి డాక్టరు భద్రిరాజు కృష్ణమూర్తిగారు, డాక్టరు బూదరాజు రాధాకృష్ణగారు కొన్ని లక్షణాలను నిర్దేశించి చూపెట్టారు. అవి శాస్త్రసమ్మతంగాను, చాలావరకు అంగీకారయోగ్యంగానూ ఉన్నాయి. ఒకటిరెండు విషయాల్లో మేము శ్రీ కృష్ణమూర్తిగారితో ఏకీభవించలేకుండా ఉన్నాము. సంస్కృతభాష అన్యదేశ్యం అయినట్లు వీరు వ్రాయడం ధర్మంకాదు! 'చాకలి, కంసాలి, గొల్ల' మొదలైన మాటలకుబదులు 'రజక, విశ్వబ్రాహ్మణ, యాదవ'అనే శబ్దాలకు ప్రస్తుతం ఎక్కువ గౌరవం వచ్చింది అని వీరు పేర్కొన్నారు (పుట 21). కావచ్చును. ఆయావర్ణములవారు సంఘపు త్రాసులో తమ బరువును పెంచుకోడానికై దేశ్యశబ్దాల బదులు అభ్యర్హితమని భావింపబడే సంస్కృతశబ్దాల్తో తమ సంఘాన్ని చెప్పుకుంటున్నారు. వీరు అన్యదేశ్యంలోనే చెప్పదలచుకొంటే Washerman, Goldsmith, Shepherd అని చెప్పుకోవాలి. వాళ్ల పుణ్యమా అని సనాతనము, దేశీయము అయిన సంస్కృతంలోనే తమ సంఘాల్ని చెప్పుకోవాలని ఉత్సాహపడుతున్నారు. ఎవరికీ ఏమీ విప్రతిపత్తి ఉండదు. ఉండకూడదు.

మరొక ప్రధానమైన విషయం ఏమి కనబడుతుందంటే—అజంతములైన తెలుగుశబ్దాల్ని ఆధునిక భాషావాదులు హలంతాలుగా విభాగంచేస్తూ ఉంటారు. కరీంనగరం మాండలిక ఖండికల్లో ఇది బాగా కొట్టవచ్చినట్లు కనబడుతుంది. ఇది సహజమో, తెచ్చికోలు వ్యవహారమో అవగతం కావడంలేదు. కరీంనగరం మండలపు మిత్రుల్తో మేమూ సంభాషిస్తూనే ఉంటాముకాని ఈ విధంగా శ్రుతికటువైన హలంత శబ్దప్రయోగం వినరాలేదు. ఇటువంటి తెలుగును స్వర్గీయ సురవరం ప్రతాపరెడ్డిగారివంటి అభిజ్ఞులు 'తౌరుష్కాంధ్రము' అని . ఛలోక్తిగా అంటూ ఉండేవారు. అన్యభాషాప్రభావానికి బాగా లోబడినవారుకాని మృదువైన తెలుగుభాషను అత్యంత పరుషమై హలంత ప్రధానం అయిందిగా చెయ్యలేరు. ఉచ్చారణ త్వరలో పదాలు కలిసిపోయి, అచ్చులు లోపించి సంయుక్తవర్ణాలు ఏర్పడడం భాషాస్వభావమేకాని అసలు పదాలు వ్యస్తంగా ఉన్నప్పుడు , హలంతంగా

ఉండడం తెలుగుభాషా స్వభావం కాదు. 'మాట్లాడుతున్నాను' అనడానికి ఉచ్చారణ త్వరలో 'మాట్లాడ్తున్నాను' అనడం కలదుగాని దానిని విడదీసి చూపేటప్పుడు 'మాట్లాడ్ తున్నాను' అని పదచ్ఛేదం చెయ్యడం తెలుగుభాషాతత్వానికి విరుద్ధం అనక తప్పదు. అతినవ్యభాషాశాస్త్రజ్ఞుల్లో ఒక అభినివేశం గోచరిస్తుంది. తెలుగుభాష ద్రావిడభాషాకుటుంబ జన్యమని ఇప్పుడు అందరూ సామాన్యంగా ఒప్పుకుంటూనే ఉన్నారు కాని, అంతమాత్రంచేత తమిళ భాషవలె తెలుగు భాషకూడా హలంత ప్రధానము కావక్కరలేదు. ఒకవేళ అత్యంత ప్రాచీన దశయందు తెలుగుపదాలు హలంతత్వాన్ని ఎక్కువ ప్రదర్శించి ఉండవచ్చును. కాని ప్రాచీన శాసనాల కాలం నుంచీ కూడా అజంతత్వమే ఈ భాషాలక్షణంగా స్థిరపడి ఉంది. న, ల అనే రెండు ధ్వనులు మాత్రమే హలంతతకు సూచకంగా పదాంతములందు నిలుస్తాయి. అవి దంత్యవర్ణములు మృదుధ్వనులూ అవడంచేత పదాంతమందు పొల్లురూపంతో ఉన్నా బాధాకరంగా ఉండవు. 'ర'కారము కూడా సకృత్తుగా పదాంతమున పొల్లు రూపంతో వినబడుతూంటుంది. 'తత్పాలుర్ భయం బందగన్' అని నన్నయ భట్టుగారున్నూ, 'చనచాళుక్య రాజు మొదలుగ బలువుర్' అని నన్నెచోడుడును ప్రయోగించినప్పటికీ, అవి విరళ ప్రయోగాలు. ఇప్పుడిప్పుడు యువతరంవారు 'య, వ' లనుకూడా పొల్లులుగా పదాంతముల వాడుతున్నారు. య, వలు అంతస్థములూ లఘువర్ణములూ అవడం చేత అవికూడా కొంత శ్రుతిసహంగానే ఉంటాయి. 'వస్తున్నా వంకాయ్—రావోయ్ వెంకాయ్' అని పిల్లల నోట బాగానే అనిపిస్తుంది. మొత్తంమీద తెలుగు భాష అనేక శతాబ్దాల వెనక విడిచిపెట్టిన హలం తత్వాన్ని దానికి తిరిగి అంటగట్టడానికి లింగ్విస్టులు చేసే ప్రయత్నాలు సఫలం అవుతాయని మేము అనుకోము. గ్రాంథికభాషమీద అవజ్ఞచేతనూ, చిన్నయ సూరిమీది చికాకుచేతనూ తెలుగుభాషయొక్క ఉత్తమవారసత్వాన్ని, కోమలధర్మాన్నీ పోగొట్టుకొనలేము. ఈ భాషాభుజంగమపతి విడిచి పెట్టిన కుబుసాన్ని తిరిగి దానిమీద కప్పుతారా?

కరీంనగరంమాండలికం లోని కొన్ని విశేషరూపాలను డాక్టరు రాధాకృష్ణగారు భాషాశాస్త్ర ప్రాంతంమేరకు వివరించడానికి చక్కని ప్రయత్నం చేశారు. తెలంగాణా భాషలో క్రియారూపాల్లో 'ను' 'న్రి' ప్రత్యయాంతాలు తరుచు వినబడుతూంటాయి. చేసిను, చెప్పిను (చేసినారు, చెప్పినారు అనుటకు) చదువున్రి, నడువున్రి (చదువుడు, చదువుండు, నడువుడు, నడువుండు అనుటకు). 'న్ర' అనగా నకార రకార సంయోగం భాషలో చాలా ప్రాచీనదశను సూచిస్తుందనీ, ఈ సంయోగమే 'ణ్డ, ండ, డ.'గా పరిణమించినదనీ, అందుచేత అడుగున్రి అని కరీంనగరం మండలభాషలో కనబడే ప్రార్థనార్థక బహువచన రూపము సర్కారుప్రాంతము మొదలైనచోట్ల కనబడే 'అడగండి' అనే రూపంకన్న ప్రాచీనమైనదనీ రాధాకృష్ణగారు భావించారు. ఇందులో కొంత వ్యత్యాసం కనబడుతూంది. తెలుగులో విధ్యర్థమూ, ప్రార్థనార్థకమూ ఒకే రూపంలో ప్రకటింపబడుతున్నాయి. ఉదా॥ 'అడుగు' (అడుగుము). ఇది విధ్యర్థకము, ప్రార్థనార్థకమూ కూడ అవుతుంది. బహువచనంలో 'డు' ప్రత్యయంవచ్చి అడుగుడు, అడుగుండు, అదాదులను ప్రయుక్తములయితే అడుగుమ, అడుగువూ, అడుగుమి, అడుగువీ అనే రూపాలు ఏకవచనంలో వస్తాయి. బహువచనంలో అడుగుడి, అడుగుడీ అనే రూపాలు వస్తాయి. డు, డి ప్రత్యయాలు అర్వాచీన దశారూపములనీ, ను, న్రి ప్రత్యయాలు ప్రాచీనదశారూపాలని డాక్టరుగారి సమన్వయము. కాని ప్రాచీనభాషలో క్రియారూపాల్లో న్రు, న్రి అంతములు కన్పించలేదు. పన్నస ఇచ్చిరి, ఇచ్చిన పన్నస అన్న రీతిగానే శాసనాల్లో కనబడుతుంది కాని పన్నస ఇచ్చిన్రు అన్న వ్యవహారం కనబడలేదు.

ను అనే ఘటన నామ సర్వనామము లందే ప్రాచీన శాసనభాషలో దొరుకుతూంది. మహేంద్రున్రు, సత్యాదితున్రు, వాన్రు—ఈరీతిగ. ఇవి తరువాతికాలంలో మహేంద్రుండు, సత్యాదిత్యుండు, వాండు అనునట్లు పరిణామం పొందాయి. అనంతరకాలంలో అనునాసికోచ్చారణ ఐచ్ఛికమయి మహేంద్రుఁడువంటి రూపాలును ఏర్పడ్డాయి. ఇక్కడ నకార అకార సంయోగమునకు తగిన హేతువుకూడా ఉండింది. ద్రావిడభాష

లలో మహదర్థక ప్రథమ పురుషైకవచనప్రత్యయం 'అన్' అనిన్నీ, అరవ కన్నడభాషలలో ఇది ఇప్పటికీ ఉందనీ, అది చేర్చడంచేత రామన్, కృష్ణన్ (రాముడు, కృష్ణుడు)వంటి రూపాలు ఏర్పడుతున్నాయని భాషా శాస్త్రజ్ఞులు చెప్పుతున్నారు. ఈ నకారము చతుర్థ వర్గంలోని దంత్య నకారమాత్రంకాదనీ, వేరొక ధ్వని యైన పదాంత నకారంఅనీ అంటున్నారు. దీన్ని కన్న డంలో రన్నగరముఅని వ్యవహరిస్తారట. ఈ ప్రత్యేక నకారధ్వని విశేషం ఏమిటంటే—అది మూర్ధన్య 'అ'కారాన్ని సహాయంచేసుకొని పలకబడుతుంది. ఈ సంప్రదాయాన్నిబట్టి తొలిరూపమైన మహేంద్రన్—మహేంద్రుస్ను—మహేంద్రుండుగా పరిణామంచెందింది. స్టు అంతమందుగల రూపాలు తెలుగుదేశం అన్ని ప్రాంతాల్లోను—తెలంగాణా, రాయలసీమ, సాగరసీమ—నన్నయకాలమునకుముందే అస్తమించాయి. ఇవి నామ పదాలకే సీమితమైయుండినట్లు కనపడుతుంది. క్రియాపదాల్లోకి ప్రాకినట్లు ఉదాహరణలు లేవు.

అయితే తెలంగాణాప్రాంతంలో 'స్రు' ఘటన క్రియారూపాల్లో ఇప్పటికీ ప్రత్యక్షమవడం ఆశ్చర్య కరమే. కాని ఈ ప్రత్యయము ప్రాచీన ప్రత్యయాన్ని పోలిన ఆగంతుక ప్రత్యయంగా తోస్తూంది. ఎట్లాగంటే—ప్రాచీనకాలంలో భూతకాలిక ప్రథమ పురుష బహువచనరూపము ఇచ్చిరి, చేసిరి—వంటివి, నన్నయ కాలమున కివి ఇచ్చినవాడు, చేసినవాడు, ఇచ్చినవారు, చేసినవారు అనే రూపంలో వ్యవహృతమయాయి. భూతకాలిక క్రియాజన్య విశేషణమునకు తచ్ఛబ్దము అనుప్రయోగం చెయ్యగా ఈ రూపాలు వస్తున్నాయి. తిక్కన సోమయాజి కాలానికి ఇచ్చినవారు, చేసిన వారు వంటిరూపాల్లో 'వ'కారలోపం కలిగి ఇచ్చి నారు, చేసినారు—అనురీతిగ మారినవని చెప్పు తున్నారు. ఈ రూపాలు అట్లా స్థిరపడిపోలేదు. వ్యవహార భాషలో అవి ఇంకా పరిణామానికి గురి అవుతూనే ఉన్నాయి. ఈ దశలోనే తెలంగాణా, సాగర సీమల వ్యవహారంలో వేర్పాటు కలిగినట్లు తోస్తుంది. కోస్తావారు ఇచ్చినారులోని నకారధ్వనిని జార్చివేసి ఇచ్చారు అనే రూపాన్ని కల్పించుకోగా, తెలంగాణా వారు దానిలోని దీర్ఘఅకార ధ్వనిని త్యజించి, ఇచ్చి నరు అనియు, వర్ణసంయోగంచేత ఇచ్చిస్రు అనియు రూపం ఆదరించారు. ఈ ఇచ్చిస్రు రూపము ఇచ్చిండుగా మారినదనడానికి వీలులేదు. ఇచ్చిండు అనేది ఇచ్చినాడునుండి ఏకవచన రూపంగావచ్చి, భాషలో ఇప్పటికీ వాడుకలో ఉండనే ఉన్నది.

పై చర్చనుబట్టి 'స్రు' అంతరూపము ప్రాచీన మైన 'స్టు' కాదనిన్నీ, ఇది 12, 13 శతాబ్దుల్లో రూపొందిన ఆగంతుకప్రత్యయమనీ, ఇది క్రియా పదాలమీద ఏర్పడినదనీ చెప్పడం ఉచితమనిపిస్తుంది. భాషాశాస్త్రవిషయాల్లో సారచేపవంటి గమనాగమన పాటవంగల డాక్టరు రాధాకృష్ణగారు దీనినింకా పరి శీలింతురు గాక. మొత్తంమీద తెలంగాణావారికి, ముఖ్యంగా పామరజనులకు 'ఱు' (రు) అంతరూపాల మీద ప్రీతిమెండు. బహువచనప్రత్యయ సంయోగం చేసి, బత్తెలు, గొత్తెలు—అని ఇతర ప్రాంతాలవారు పలుకుతూండగా వీరు బర్లు, గొర్లు అని స్పష్టంగా పలుకుతారు. వర్ణవ్యత్యయం ఇక్కడ ప్రభావం చూపెట్టినా, చేసిస్రు, వచ్చిస్రు మొదలగు క్రియా రూపాల్లోని బహువచన 'రు' వర్ణము అమహద్వాచకములమీద బహువచనప్రత్యయంతో నేస్తం చేస్తూం దేమో. అయితే బత్తె, గొత్తె శబ్దాల్లోని 'అ'కారమే ఈ పరిణామాన్ని ప్రోత్సహించి ఉంటుంది. ఇతర పదాల్లో కుక్క, పిల్లివంటివానిలో ఇది కనబడదు. కుక్కలు, పిల్లులు అనియే వ్యవహారము.

కావ్యభాషలోలేని ఒక విశేషం కరీంనగరం మాండలికంలోను ఆధునిక వ్యవహార భాషలోను కనబడుతూన్నట్లు రాధాకృష్ణగారు వ్రాయుచున్నారు. (పుట 28). కావ్యభాషలో చేదర్థక, అపూర్థక రూపాలు రెండింటికీ ఒకే రూపం 'అడిగినర్' అనేది ఉండేదని, ఇప్పుడు ఈ రెండింటిని స్పష్టం చెయ్యడానికై 'అడిగితే, అడిగినా' అనే రెండు రూపాలు వాడుకలోకి వచ్చాయని వివరించారు. బాగానే ఉంది. పూర్వీకులమాత్రం వీటిని వేరు చేయడం ఎరుగరా, చూడండి. వానలు కురిసిన పంటలు పండును; కురి

సిన అనగా కురిస్తే అన్నమాట. వానలు కురిసినను పంటలు లేవు. కురిసినను అనగా కురిసినప్పటికీ అన్నమాట. కావ్యభాషలో ఇన, ఇనన్ (ను) ప్రత్యయాలచేత ఈ భేదం సూచించేవారని తోస్తుంది. వానలు కురిసినను పంటలు పండును అనురీతి చేదర్థక ప్రయోగం ఉంటుందా? ఇంతమాత్రానికే 'భిన్నార్థాలు సూచించే భిన్నరూపాలులేని కావ్యభాష, ఆధునిక పరిస్థితుల్లో అంత ఉపయోగకరం కాదని గ్రహించాలి' అని వ్రాసిన వాక్యం తొందరపాటును సూచిస్తుందేమో.

ఇటువంటి చర్చలు సాగుతూనే ఉంటాయి. ఆంధ్రదేశం అన్నిజిల్లాలలోను ఈవిధమైన మాండలికభాషాసేకరణ చెయ్యడం, వాటిని విశేషాధ్యయనం చెయ్యడం ఇన్నాళ్లకు ప్రారంభమయింది. అది హర్షింపదగిన విషయం. ఆయా మాండలికాల్లోని ఏకత్వలక్షణాలను చక్కగా నిరూపించి, వాటి ఆధారంగా సర్వామోదకరమైన వ్యావహారికభాషా వ్యాకరణం రూపొందించడం కూడా చాలా అవసరము. సాహిత్య నిర్మాణానికి శాస్త్రగ్రంథరచనకూ ఉపయోగించే విపులమైన ఆధునికభాష ఈ మాండలిక సర్వేల ఫలితంగా రూపు దాలుస్తుంది. దీన్ని ప్రామాణికభాష అనడం కన్న సాధారణీకృతభాష అనడం ఉచితంగా ఉంటుంది. ప్రామాణికము అనేసరికి ఎవరు ప్రమాణము? ఏ ప్రాంతపు మాండలికము ప్రమాణము? ఎందుచేత మున్నగు ప్రశ్నలూ, వివాదాలు తలయెత్తుతాయి. మాండలికరూప పరిచయము ఉపాధ్యాయులకూ, శాసన సభ్యులకూ చాలా అవసరమనిపిస్తుంది. ఉపాధ్యాయుడు తరగతిలో భిన్నప్రాంతాల విద్యార్థులతో వ్యవహరించవలసివస్తుంది. శాసనసభల్లో వివిధజిల్లాల ప్రతినిధులు తమకు అలవాటైనభాషలో మాట్లాడుతూంటారు. అన్యమాండలికంలో జరుగుతూన్న చర్చాసరణిని శాసన సభ్యులు అవగతం చేసుకోవాలి.

---

తెలుగు మాండలికాలు — కరీంనగర్ జిల్లా; సంపాదకుడు: డా. బూదరాజు రాధాకృష్ణ; తెలుగు అకాడమీ, హైదరాబాదు–29; వెల -- రు. 5 లు.



# గణిత సంజ్ఞలు - వాని పుట్టుపూర్వోత్తరాలు

విశ్వనాథ అరుణాచలం

[illegible] ల్పాన్ని, సంగీతాన్ని ఏలా సంతృప్తికరంగా నిర్వచించలేమో అట్లాగే గణితాన్నికూడా నిర్వచించలేము. అయినప్పటికీ గణితశాస్త్రంలో కృషిచేసిన మేధావులు కొందరు గణితాన్ని వారికి తోచినరీతిగా నిర్వచించినారు. కొందరు 'గణితం శాస్త్రభాష' (Language of Sciences) అన్నారు. 'అసంబద్ధములుకాని స్వీకృతాలనుండి ఉత్పన్నమైన ఫలితాల నన్నింటినీ పరిశీలించడమే గణితం' అన్నారు కొందరు. 'అప్రతిహతవాదమా! నీ పేరు గణితం' అన్నాడు W. V. Quine. గణితశాస్త్రపు పునాదుల్ని పరిశోధిస్తూ గణితం తర్కశాస్త్రంలో ఒక భాగమేనని — సంజ్ఞాత్మక తర్కమని, చాటిన Frege, Peano, Bertrand Russel, A. N. Whitehead ప్రభృతుల వాదంవల్ల అభినవగణితంలో ఎంతో పరిణామం ఏర్పడింది. ఈ దృక్పథంవల్ల, గణితంలో వాదాలు సంగతములు కావలెనంటే తార్కికంగా అవి సంగతములైతే చాలునని తేలింది. మామూలు భాషాపరమైన శబ్దరూపంలో భావప్రకటనంచేస్తే విరోధాభాసలకు, సందిగ్ధతలకు దారితీస్తుందని గణితవాదాన్నంతా సంజ్ఞాత్మకంగానే ఉంచవలెనని Bertrand Russel స్థిరీకరించి, A. N. Whitehead (క్రీ. శ. 1861—1947) మాహాశయునితో కలసి Principia Mathematica అనే బృహద్గ్రంథాన్ని, మూడు భాగాలుగా క్రీ. శ. 1910, 1911, 1913 లలో రచించి, ప్రకటించినారు. ఈ గ్రంథావతరణకంటే అర్ధశతాబ్దం ముందే George Boole (క్రీ. శ. 1815—64) అనే తార్కికుడు గణితశాస్త్రజ్ఞుడు గణితతర్కాన్ని ప్రతిపాదనకలన శాస్త్రాన్ని (Propositional Calculus) ప్రవేశపెనాడు. గణితశాస్త్రం పునాదుల పరిశోధనలో ఏర్పడిన Formalist లు కూడా గణితాన్ని 'సంజ్ఞలచే నిర్మితమైన ఆకృతులు'గా పరిగణించడం వల్లనూ గణిత సంజ్ఞలకు ఎక్కువ ప్రాముఖ్యంకలిగింది. [Kronecker (క్రీ. శ. 1823—91), David Hilbert (క్రీ. శ. 1862—1943) ప్రభృతులు ఫార్మలిస్టులు]

సంజ్ఞాత్మక తర్కపద్ధతిద్వారా స్వతస్సిద్ధంగా ఏర్పడే సంక్షిప్తత, సంశయశూన్యతలు గణితశాస్త్రజ్ఞుల్ని ఆకర్షించినాయి. తత్ఫలితంగా ఆధునిక గణిత విభాగాలన్నిట్లో ఈ సంజ్ఞాత్మక తర్కపద్ధతి ప్రవేశించింది. ఏభై ఏళ్లక్రితం వెలువడిన గణిత పత్రికల్ని, ఇప్పుడు వెలువడుతూఉన్న గణిత పత్రికల్ని చూచామంటే ఈ నాడు సంజ్ఞలు ఎంత విరివిగా వాడబడుతూ ఉన్నాయో తెలుస్తుంది.

George Boole (గణిత) సంజ్ఞ అంటే ఏమిటో నిర్వచిస్తాడు. 'ఒక స్థిరమైన అర్థాన్ని సూచించేందుకు యాదృచ్ఛికంగా ఏర్పాటై అట్లాగే ఏర్పడిన మిగతావాటితో నిర్ణీతన్యాయానుసారంగా సంయోగంపొందే గుర్తులు గణితసంజ్ఞలు. Boole, Russel ప్రభృతులకంటే శతాబ్దాల క్రితమే, గణిత సంజ్ఞల్ని నిర్వచించకపోయినప్పటికీ, గణిత శాస్త్రానికి, సంజ్ఞలకుగల సాన్నిహిత్యాన్ని శాస్త్రవేత్తలు గుర్తించినారు. రాసులను వాటిమధ్య నిర్వచిత ప్రక్రియలను, పరస్పర సంబంధాలను అరూప పద్ధతిలో ప్రస్ఫుటంగా, సంక్షిప్తంగా వివరించేందుకు సంజ్ఞల్ని వాడవలెనని, ఈలాంటి సంజ్ఞలతో వికసించే గణితాన్ని ఒకవిధమైన భాషగా ఎంచవచ్చునని

ప్రాచీన శాస్త్రజ్ఞులు బాగా గుర్తించినారు. గణిత శాస్త్రాభివృద్ధికి దోహదమిస్తూ శాస్త్రంతోపాటు కొండంతలుగా పెరిగిపోతూఉన్న ఈ సంజ్ఞాసంచయం పుట్టుపూర్వోత్తరాల్ని స్థూలంగా పరిశీలిద్దాము—

మనం మామూలుగావాడే ప్రతి సంజ్ఞవెనుక కొంత చరిత్ర ఉంది. గణితచరిత్ర పుటల్ని ఒక్కసారి త్రిప్పామంటే విస్తృతము, సంపత్సమేతము, నవనవోన్మేషమూ అయిన గణితజీవితంలో ఎన్ని సంజ్ఞలు అవతరించాయో, అందులో ఎన్ని పురిట్లోనే సంధిదోషం తగిలి కన్ను మూసినాయో అన్న విషయాలు తెలుస్తవి. ప్రవేశపెట్టబడిన సంజ్ఞలు భావ ప్రకటనకు సాయపడే వైఖరిమీదను, ముద్రణా సౌలభ్యం దృష్ట్యాను, సృష్టించినవారి శాస్త్రాధికార యోగ్యతలమీదను ఆధారపడి ప్రచారంలోకి వస్తాయి.

సంజ్ఞల్ని గురించి ప్రస్తావిస్తూ A. De Morgan (క్రీ. శ. 1806—72) అంటాడు: 'అభివృద్ధిచెందే ప్రతిశాస్త్రం తాను సృష్టించుకొన్న సంజ్ఞలను వాడుకొంటూనే వృద్ధిచెందుతుంది' అని. క్రీ. శ. 16, 17 శతాబ్దాలలో గణితసంజ్ఞల విషయమై శాస్త్రపండితులు ఎక్కువ శ్రద్ధ చూపించినారు. Francois Vie'te (క్రీ. శ. 1540—1603), William Oughtred, Rene'Des Cartes (క్రీ. శ. 1596 — 1650), Gottfried Wilhelm Leibniz (క్రీ. శ. 1646—1716) ప్రభృతులు గణితసంజ్ఞల విషయమై ఏకాభిప్రాయాన్ని, సమైక్యతని సాధింపతలచి వ్యాసాలమూలంగా ఉపన్యాసాలమూలంగా ఒక ఉద్యమాన్ని ప్రారంభించినారు. ఈ ఉద్యమం వేగాన్ని పుంజుకొని, 20 వ శతాబ్దంలో పరిణతిని అందుకొన్నది. నిస్తంత్రీతరంగప్రసారాన్ని ఆవిష్కరించిన Heinrich Hertz (క్రీ. శ. 1857—94) అంటాడు: 'ఈ గణితసూత్రాలు (సంజ్ఞలుకూడా) స్వేచ్ఛగా జీవిస్తాయి. స్వతహాగా వాటికి బుద్ధికుశలతలు ఉన్నాయి; మనకంటే అవి తెలివైనవి. వాటిని సృష్టించినవారికంటేకూడా అవి తెలివైనవి—అందువల్లే వాటినుండి మనం ఆశించిన దానికంటే ఎక్కువగానే లాభపడతాము.'

ఇంగ్లండులో క్రీ. శ. 1557 లో Robert Recorde అనే గణితశాస్త్రజ్ఞుడు బీజగణితంమీద Whetstone of Wette అన్న పేరుతో ఒక పుస్తకం వ్రాస్తూ '==' సంజ్ఞను ప్రవేశపెట్టినాడు. 'ప్రతిసారి 'is equal to' అని వ్రాసేందుకు నాకు ఓపిక లేక ఆ పదబంధాన్ని సూచించేందుకు '==' గుర్తును వాడతాను' అన్నాడు. ఒకే పొడవుగల రెండు (సమాంతర) రేఖలు, ఆ రేఖల కిరువైపునగల రెండు రాశులు, సమానాలని అది సూచిస్తుంది. ఈ సంజ్ఞ సార్థకంగా ఉన్నందువల్ల కొన్నాళ్లకు దీన్ని గణితప్రపంచం ఆమోదించింది. దీని రూపం '=='నుండి '=' గా పరిణామం చెందింది. 1557 లో ప్రవేశపెట్టబడిన ఈ సంజ్ఞ 1618 నాటికి అందరి ఆదరణకు పాత్రమయింది. ఒక గణితంలోనే కాకుండా ఇతర శాస్త్రాల్లోకూడా సమానతను సూచించేందుకు దీన్ని విరివిగా వాడుతారు.

Francois Vie'te ఫ్రాన్సుదేశంలో నాల్గవ హెన్రీ రాజ్యం చేసేటప్పుడు ఉండిన న్యాయవాది. తాను న్యాయవాదిగా గొప్పపదవుల్ని అందుకొని రాచ కార్యాల్లో నిమగ్నమై ఉండికూడా గణితశాస్త్ర అధ్యయనాన్ని అలవరచుకొని శాస్త్రాభివృద్ధికి పాటుబడినాడు. ఈయన అవ్యక్తరాశులను ఇంగ్లీషు వర్ణమాలలోని అచ్చులద్వారా, స్థిరరాశుల్ని హల్లులద్వారా సూచించడాన్ని ప్రారంభించినాడు. తద్వారా ఏదైనా సమీకరణాన్ని సార్వత్రికరూపంలో వ్రాయడమనే పద్ధతి రూపొందింది. ఉదా॥ $ax+e=0$ లో a, e లు స్థిరరాశులు, x అవ్యక్తరాశి. Rene Des Cartes ఈ పద్ధతినే కొంత మార్చి అనుసరించినాడు. వర్ణమాలలోని మొదటి అక్షరాలద్వారా స్థిరరాశుల్ని, చివరిఅక్షరాలద్వారా అవ్యక్తరాసుల్ని సూచించినాడు. Willam Oughtred దాదాపు వందా ఏభై సంజ్ఞల్ని ఎంతో ఉత్సాహంతో ప్రవేశపెట్టినాడట.

క్రీ. శ. 17 వ శతాబ్ది చివరలో G. W. Leibniz సంజ్ఞల్ని గురించి కొంత చర్చించి, అవి

సుబోధకంగాను, వ్రాయడానికి సులభంగాను ఉండవలె నని శాసించినాడు. Leibniz యువకుడుగా ఉన్న ప్పుడు గణితశాస్త్ర భావాల నన్నిటినీ సంజ్ఞలలో, ఒక కొత్త భాషద్వారా వివరించి వికసింపచేయాలని కలలు కన్నాడు. కాని అప్పటికి అవి కలలుగానే నిలిచి పోయాయి. ఈ కల George Boole తన Analysis of Logic (1847) ప్రచురించిన నాడు ఫలించింది. సంజ్ఞల ప్రాముఖ్యాన్ని చాలమంది గుర్తించినప్పటికీ వాటిని విపరీతంగా వాడటం నచ్చనివారూ ఉండినారు. Thoms Hobbes అంటాడు, 'సంజ్ఞలు వికార మ్మైనవి; అయినా భావప్రకటనకు వాటిని విధిగా మనం అంగీకరించవలె' అని.

సమానతను సూచించే '=' కంటే 70 సంవ త్సరాలకు ముందే '+,—' (ప్లస్, మైనస్)సంజ్ఞలు ప్రచారంలోకి వచ్చినవి. బ్రిటిష్ గణితశాస్త్రజ్ఞుడు Johann Widman క్రీ. శ. 1489 లోనే అంక గణితంమీద ఒక గ్రంథాన్ని వెలువరిస్తూ, ఆ గ్రంథంలో మొట్టమొదటిసారి సాధారణ సంకలన వ్యవకలన ప్రక్రియల్ని సూచించేందుకు ఈ సంజ్ఞ లను వాడినాడు. బీజగణితపరంగా ఈ +, — లను వాడినవాడు (క్రీ. శ. 1514) Vander Hoccke అనే డచ్ శాస్త్రజ్ఞుడు. ఇంగ్లండులో ఉండిన William Oughtred మొట్టమొదట, గుణకారాన్ని సూచించేందుకు "X" ను క్రీ. శ. 1631 లో తాను రచించిన Clavis Mathematicae అనే గ్రంథంలో వాడినాడు. కాని ఈ గుర్తును ఐరోపాఖండంలో శాస్త్ర జ్ఞులు అంగీకరించలేదు. వారికి జర్మన్ గణితశాస్త్ర జ్ఞుడు, తత్త్వవేత్త Leibniz ప్రవేశపెట్టిన తిలక చిహ్నమే (a.b) నచ్చింది. ఈ చిహ్నం చక్కగా ఉన్నందువల్ల 'X' తోబాటు '.' చిహ్నాన్నీకూడా గుణ కార ప్రక్రియను సూచించేందుకు ఇంగ్లండులో ఉప యోగిస్తూవచ్చారు. '+;—; X,.' అనే సంజ్ఞలు మామూలు సంకలన వ్యవకలన గుణకార ప్రక్రియ లను సూచించేందుకు ఉత్పన్నమై, నేడు సార్వత్రిక తను సంపాదనచేసుకొని, సమితివాదంలో, వెక్టరుకలనంలో ఇంకా అనేకగణితవిభాగాల్లో, విస్తృతమైన అర్థాన్ని, ప్రక్రియల్ని సూచించేందుకు ప్రపంచం మొత్తంమీద వాడబడుతూ ఉన్నాయి.

భాగహారాన్ని సూచించే ÷ గుర్తుకూడా ఇంగ్లం డులో పుట్టి, ప్రచారానికివచ్చి మెల్లగా ఐరోపాఖండా నికి, అమెరికాకు పయనించింది. మొట్టమొదట Johann H. Rahn అనే గణితజ్ఞుడు రచించిన బీజగణిత గ్రంథంలో ఇది వాడబడింది. ఈ గ్రంథాన్ని క్రీ. శ. 1659 లో స్విట్జర్లాండులో ప్రచురించి నారు; 1668 లో దీని ఆంగ్లానువాదము వెలు వడింది. కొందరు (:) గుర్తునుకూడా భాగహార ప్రక్రియను సూచించేందుకు వాడినట్లు మనకు గణిత చరిత్రలో దృష్టాంతాలు కనబడతాయి.

వర్గమూలపు గుర్తు '$\sqrt{\quad}$'

మొట్టమొదట క్రీ. శ. 1525 లో Rudolff అనే గణితవేత్త రచనల్లో కనబడుతుంది. Rudolff రచన లకు సంపాదకుడుగా వ్యవహరించిన Michael Stifel మహాశయుడు '$\sqrt{\quad}$' వర్గమూలాన్ని సూచిస్తే, '$\sqrt{\sqrt{\quad}}$' ఘనమూలాన్ని, '$\sqrt{\sqrt{\sqrt{\quad}}}$' నాల్గవమూలాన్ని సూచించేందుకు వాడవచ్చునని వ్రాశాడు. కాని, ముద్రణదృష్ట్యా సౌలభ్యం చేకూరనందువల్ల ఈ ఘనమూలాన్ని, నాల్గవ మూలాన్ని సూచించే సంజ్ఞలు చిరకాలం మనలేకపోయి నవి. Rudolff, Root అనే పదంలోని మొదటి వర్ణ మును పోలిఉండేటట్లుగా వర్గమూల చిహ్నాన్ని రూపొం దించినాడని ప్రతీతి. మూలప్రక్రియా సూచక చిహ్నమైన '$\sqrt{\quad}$' ను ఫలానామూలం ['$\sqrt[2]{\quad}$' వర్గమూలానికి, $\sqrt[3]{\quad}$ ఘనమూలానికి] అని సూచించే పద్ధతిని మొట్ట మొదట క్రీ. శ. 1484 లో ఫ్రెంచి భౌతికశాస్త్ర

జ్ఞుడు Chuquet తన వ్రాతప్రతుల్లో వాడినట్లు కొందరు వాదిస్తారు.

నిష్పత్తి, అనుపాతభావాన్ని సూచించే : : సంజ్ఞను క్రీ. శ. 1628 లో Oughtred ఉపయోగించినట్లు తెలుస్తోంది. హెచ్చుతగ్గులను, క్రమ సంబంధాన్ని (Order relation) సూచించే '> <' సంజ్ఞలను క్రీ. శ. 1631 లో Harriot ప్రవేశపెట్టినాడు. అనంతరాశిని సూచించేందుకు మనం '$\infty$' ని వాడుతున్నాము. ఈ సంజ్ఞను మొట మొదట క్రీ. శ. 1655 లో John Wallis, తాను రచించిన Arithmetica Infinitorium అనే గ్రంథంలో ఉపయోగించినాడు. ఒకరాశి '$x$' యొక్క వర్గాన్ని, ఘనాన్ని $x^2$, $x^3$ అని వ్రాస్తాము మనం. ఈ విధంగా వ్రాయడం క్రీ. శ. 1634 లో ఫ్రెంచి గణితాచార్యుడు, తాత్త్వికుడు అయిన Rene Des Cartes ప్రారంభించినాడు. అదే సంవత్సరంలో మరో గణిత శాస్త్రజ్ఞుడు Herigone కూడా వర్గాల్ని, ఘనాల్ని ఈ మోస్తరుగా వ్రాయడాన్ని ఊహించినాడు. అయినా ఈ పద్ధతిని మొట్ట మొదట ప్రారంభించింది వీరుకాదు; క్రీ. శ. 1360 నాడే Nicole Oresme అనే గణితజ్ఞుడు ఈ పద్ధతిని వర్గాలు, ఘనాలకే కాదు, ఏదైనా n—వ ఘాతానికి కూడా వాడినట్లు తెలుస్తున్నది. ఈ సందర్భంలో $x^2, x^3, \ldots x^n$ సంజ్ఞల్ని బాగా ప్రచారానికి తెచ్చినవాడు Michael Stifel అన్న సంగతి మరచిపోకూడదు. ఘాతాలు ధనపూర్ణాంకాలే కాక, భిన్నాంకాలు, ఋణాంకాలుగాకూడా ఉండవచ్చునని, తద్వారా x వర్గమూలాన్ని $x^{\frac{1}{2}}$ అని, ఘన మూలాన్ని $x^{\frac{1}{3}}$ అని వ్రాయటం ప్రారంభించినవాడు John Wallis. ఈ పద్ధతి వల్లనే క్రీ. శ. 1655 లో John Wallis మొట్ట మొదట $x^0 = 1$ అన్న నిర్వచనాన్ని ఒక విధంగా సమర్థించ కలిగినాడు. తరువాత సర్ ఐజాక్ న్యూటన్ ఈ పద్ధతిని బాగా ప్రచారంలోకి తెచ్చినాడు. న్యూటన్ చేతిమీదుగా ఈలాంటి గణితసంజ్ఞలెన్నో విశ్వవ్యాప్తము లైనాయి. ప్రసిద్ధములైన కుండలీకరణాల్ని '[ ]' మొదట క్రీ.శ. 1629 లో Albert Girard ప్రవేశ పెట్టినాడు.

క్రీస్తుకు పూర్వంనుండి క్రీ. శ. 19 వ శతాబ్దంవరకు పెంపొందిన గణితం ఒక ఎత్తు; 20 వ శతాబ్దిలో సర్వతోముఖంగా వెల్లివిరిసిన గణితం ఒక ఎత్తు. ఈ శతాబ్ది ప్రారంభంలో గణిత శాఖకు, తార్కికవాదానికి చక్కని సమన్వయం కుదిరింది. సమితి సిద్ధాంతం ప్రవేశించడం వల్లను, 19 వ శతాబ్దిలో ప్రారంభమైన George Boole కృషి ఫలితంవల్లను, Georg Cantor పరిశోధన వల్లను, బెర్ట్రండ్ రస్సెల్, వైట్‌హెడ్ ప్రభృతుల రచనలవల్లను గణితశాస్త్రానికి గట్టిపునాదులు ఏర్పడ్డాయి. తత్ఫలితంగా గణితశాస్త్రాధ్యయనానికి సమితిభావం (Set Concept) అతిప్రాథమికమైనదిగా పరిణమించింది. తద్వారా గణితశాస్త్రపు శాఖలన్నీ సంస్కరించబడ్డాయి; లాక్షణికతను, లాఘవాన్ని పుంజుకొన్నాయి. తర్కశాస్త్రంనుండి పుట్టిన ప్రతిపాదనకలనము (Propositional Calculus) గణితంలో చోటు చేసుకొన్నది.

ఒక సమితి S లో అనేక మూలకా లుంటాయి. అందులో 'A' ఒక మూలకం. ఈ విషయాన్ని సంక్షిప్తంగా '$a \in S$' అని వ్రాస్తున్నాము. B అనే మూలకం S లో లేదు అనడాన్ని '$b \notin S$' అని వ్రాస్తాము. వ్యవస్థిత మౌతున్నది (There exists) అనే భావాన్ని

సూచించేందుకు $\exists$ గుర్తును వ్రాస్తున్నాము. 'There Exists an x'ను '$\exists x$' సూచిస్తుంది. రెండు సమితుల సమ్మేళనము (Union), ఖండనము (Intersection) లను A U B అని, $A \cap B$ అని వ్రాస్తున్నాము. ఈ $\in, \exists, \cup, \cap$ మొదలైన సంజ్ఞల్ని ప్రవేశపెట్టినవారు Whitehead, Russel లు. ఆధునిక బీజగణితంలో అతిముఖ్యమైనవిగా పరిగణింపబడే స్థిత్యంతర (Commutative), విభాగ (Distributive) న్యాయాలకు ఈలా నామకరణం చేసినవాడు క్రీ. శ. 1814 లో Servois అనే ఫ్రెంచి గణిత శాస్త్రజ్ఞుడు. సహచర్యన్యాయము (Associative Law) అనే భావప్రస్తావన, పదప్రయోగం ఐర్లండు మేధావి Sir William Rowan Hamilton రచనల్లో ప్రప్రథమంగా కనబడుతోంది.

$\odot, \triangle, \square$ మొదలైన జ్యామితీయ సంజ్ఞలు అతిప్రాచీనములైనవి. అయితే వీటి నన్నిటినీ క్రోడీకరించి బాగా ప్రచారంలోకి తెచ్చినవారు Herigone, Oughtred లు.

ఒక వృత్తములో వృత్తపరిధికి, వృత్తవ్యాసానికి ఉండే నిష్పత్తిని $\pi$ అనే అక్షరంతో సూచించవచ్చునని ప్రారంభించినవాడు William Jones. క్రీ. శ. 1706 లో $\pi$ గణిత రచనల్లో ప్రవేశించినట్లు తెలుస్తోంది. ఈ $\Pi$ ని వితతగుణకార ప్రక్రియను సూచించేందుకు కూడా నేడు మనం వాడుతూఉన్నాము. ఇట్లాగే $\Sigma$ ను సంకలనానికి సంక్షిప్త సూచికగా వాడుతూ ఉన్నాము. మొట్టమొదట $\Sigma$ ను ఈ విధంగా వాడినవాడు L. Euler (క్రీ. శ. 1707–83).

"కుప్పలు తెప్పలు లెక్కల
చప్పన బడిలోన చేర్చి జాగ్రత తోడన్
ఒప్పించి మెప్పుకొను నీ
గొప్పను కీర్తింతుమెపుడు కూరిమి సిగ్మా
($\Sigma$)"–

Euler, exponentialసంఖ్య e ని, $\sqrt{-1}$ ని తెలిపేందుకు i ని, ప్రమేయాన్ని, ప్రమేయబింబాన్ని సూచించేందుకు $f(x)$ ను సర్వామోదకరంగా ప్రవేశపెట్టినాడు.

ఈ నాడు గణిత శాస్త్రాధ్యయనంలో, విద్యాబోధనలో, రచనల్లో ఒక ప్రశాంత విప్లవం జరుగుతోన్న సంగతి అందరికీ తెలుసూ—ఇది విశ్వవ్యాప్తంగా జరుగుతూ ఉన్నది. 'ఒత్తిగణన కౌశలాన్ని పెంపొందించేది గణితంకాదు, అరూపభావనలనుండి అరూపనిర్మాణములను సృజించి అధ్యయనం చేయడమే గణితం పరమావధి' అని గణితాచార్యులందరూ ఏకకంఠంతో పలుకుతూ ఉన్నారు. ఇదే కొత్త గణితమని చెలామణి అవుతూ ఉన్నది. ఈ కొత్త గణితానికి ఊపిరి పోసినవారు ఎందరో మహానుభావులు. వీరందరి కృషి ఫలితంగా గణిత విశ్లేషణము, అరూప బీజగణితము, టాపాలజి, బీజగణితీయజ్యామితి, అభినవ ప్రక్షేపజ్యామితి, యూక్లిడీయేతర జ్యామితి మొదలైన ఎన్నో గణిత విభాగాలు అవతరించినాయి; అవతరిస్తున్నాయి. ఈ నూతన దృష్టిలో సంజ్ఞలు కోకొల్లలుగా ప్రవేశిస్తున్నాయి. కాబట్టి ఎవరు ఏ సంజ్ఞలు మొదట వాడినారో అన్నవిషయం ఎవరికీ పట్టింపులేదు. ఎక్కువగా కృషిచేస్తే కాని వీని పుట్టుపూర్వోత్తరాలు బయల్పడవు.

# మకుటోత్పల దశరూపిక

శ్రీ గజ్జల జగత్ప

## మాటలు కట్టిపెట్టి,

మాటల కంతులేదు; పదిమాటలలో ఒకమాటకైన నే
లాటి గురుత్వముండదు; శిలల్ తమ నిర్బలతన్ గ్రహించి, ఏ
మాటయు పల్కవెప్పు డసమానశిలాప్రతిమాభిలాషు లీ
నాటక చక్రవర్తుల కనంతవయామయ! బుద్ధిజెప్పుమా!

## అభిమానముతో,

మనుటయె చాలునంచు, నవమానము నెంచక, కట్ట బట్టయున్
తినగను గంజలేక, జగతిన్ తన వాడొకడైన లేక, ఎం
దును తలయెత్తలేదు, గతితోచక, చచ్చియు చావలేదు;—మా
మనిషికె చెల్లు నింతయును—మర్త్యగతుల్ బహుకష్టబోధముల్

## నిజమైన భక్తితో,

దేవస్థానములన్ని ఆశ్రితులతో, దేదీప్యమానప్రభా
వైవిధ్యంబున తాళవాద్యములతో, వైకుంఠముంబోలు; కా
నీ, వైషమ్యమదాది నీచగుణవహ్నిజ్వాలలన్ మండి, ని
ర్దైవంబైన జగత్తు కెందులకు ధర్మం; బేల జ్ఞానప్రభల్?

## ఓటమి నొప్పుకోని యువయూథపు శక్తులతో,

బడబములోని అగ్ని, జలపాతమునందలి నిర్భయత్వమున్,
కడలిబలంబు యౌవనపు కల్మి యగుంగద! కాదిదంతయున్

దుడుకుతనం బటంచు యువదూషణ జేతురు వృద్ధబుద్ధులే
అడవులో చూచుకోక, తమ ఆశ్రమధర్మము మాని ఈశ్వరా !

## గుర్వాత్మకవనౌ బాటలవిహాద,

ఒకనికి స్ఫూర్తి హెచ్చు; మఱియొక్కని కెక్కువ బుద్ధిశక్తి; యిం
కొకనికి ధర్మనిష్ఠ; సుగుణోత్తములౌ ఇటువంటి సజ్జనా
ళికి కలియందు దదేందులకొ లేదసుమంతయు గౌరవంబు; పా
పికులము మాది; మంచి కనుపించదు మాకు; అఘంబె తియ్యనౌ.

## సృష్టిప్రతిభన్ మసిచేయక,

వదనము కాంతిహీనమయి, వంగి, కృశించి, నశించుచుండు నీ
కదలెడు శల్యసంపుటము కాదుగదా భవదీయమంగళ
ప్రద పరిపూర్ణసృష్టి మహిమా మహనీయ ఫలస్వరూప? మా
త్మద ! ఇది చిన్నసందియము; మౌనము బోవుగదా, మహాప్రభూ !

## దేశప్రేమములై ,

దేశంబన్నది వట్టి ఊతపదమై, దేశంబు రక్షింపగన్
మా శక్తుల్ తమవే యటంచు సతమున్ మా ప్రాణముల్ దీయుచున్
దేశోద్ధారకు లిచ్చు భాషణమునందే యుండిపోనీక, స్వా
మీ ! శంభో ! కృపజూచి, భాగ్యపథగామిన్ జేయుమయ్యా ప్రభూ !

## పాటుపడండి!

నిలువదు కాలవాహిని; అనిత్యమయప్రకృతిన్ గ్రహించి, వి
హ్వలత ముగించుదాక, పరివర్తన మొక్కటె శాశ్వతంబు మ
ర్త్యుల కయిగూడ, జ్ఞానముపయోగముజేసి, భయంబువీడి, ని
శ్చలమతి వొళ్ళువంచిన, అసాధ్యమె పొందగ ఐహికార్థముల్ ?

## ప్రాణులయి;

ఇంధనమబ్బదేని అమగెత్తదు ముందుకు యంత్రరాజు; గ
ర్వాంధతవల్లగాదు; తన ప్రాణవిశిష్టత నొప్పుకోని సం

బంధము, ఆత్మగౌరవము బాసి సహింపగలేడు తాను; ని
ర్బంధము తప్పదన్న, తలవంచడు ప్రాణములిచ్చు ప్రౌఢుడై

**భవ్యశుభంబు సతంబు మీ కగున్!**

కలలు నిజంబు గావలెను; కష్టములన్ని నశించిపోవలెన్;
కలకలమంచు జీవన మనంతసుఖప్రదమై మహిస్థలిన్
వెలయవలెన్ మనోజ్ఞమగు నిత్యవసంతము; స్వర్గభూమిగా
యిలవెలుగన్వలెన్; నరమహీజము ధర్మఫలంబు లీవలెన్.



# ఆంధ్ర మహాభారత సంశోధిత ముద్రణము

## శ్రీ వేదము వేంకటరాయ శాస్త్రి

(...క తరువాయి)

### పాఠనిర్ణయము - పూర్వముద్రణములు

సంపాదకులు లెక్కలేని తాళపత్ర ప్రతులను సంపాదించుటయే గాక ముద్రితములను కూడ గాలించి ఒక యక్షరముకూడ తప్పిపోని పద్ధతిలో జాగ్రత్త వహించినారు. ముద్రిత ప్రతులలో లండను ప్రతి (1850-53), హయగ్రీవశాస్త్రిగారిది (పూర్తిగా దొరకలేదు), ఆనంద, వావిళ్ల, ఆమ్నాయ కళానిధి, చదలువాడ దండిగుంట పండితులది మున్నగునవి ప్రధానములు. నాటి సారస్వత పత్రికలలో పండితులు మహాభారత పాఠములమీద చేసిన చర్చల నుగ్గడించినారు. నాటి వ్యాసములకొక యను క్రమణిక తయారుచేయ నుద్దేశించి కొంతపనిచేసి విరమించిరటకూడ. ముఖ్యముగా గత శతాబ్దపు సారస్వత పత్రికయైన అముద్రిత గ్రంథ చింతామణిని తత్సంపాదకులను పూండ్ల రామకృష్ణయ్యగారిని వెలపు లేని విమర్శకులని ప్రశంసించిరి. కాని ఆ యముద్రిత గ్రంథ చింతామణియందే 1894-95 ప్రాంతము నుండి మా తాతగారు శ్రీ వేదము వేంకటరాయ శాస్త్రిగారు భారతముపై ఎంతో చర్చచేసి వ్రాసిన విశేషములను ఈ సంశోధిత ముద్రణ సంపాదకులు చూచినట్లుకూడ తెలుపలేదు. ఒకటి రెండుచోట్ల అధోజ్ఞాపికలలో తాతగారి పేరున్నను అ. గ్ర. చింతామణిలోని వారి పాఠాంతరములను గుఱించికాదు. అ. గ్ర. చిం. లో ఆనందవారి ముద్రణముంగూర్చి ఇట్లు కలదు (1902 సం 1, 2—పు 5):

'ఆంధ్రమహా భారతమును మహారా. వేమూరి వేంకటకృష్ణమసెట్టి అండ్ సన్సుగారు—బ్రహ్మశ్రీ, మహారాజరాజశ్రీ రావుబహద్దరు కందుకూరి వీరేశలింగము పంతులవారిచేతను బ్రహ్మశ్రీ రాయదర్గము నరసయ్యగారి చేతను బరిష్కరింపించి ముద్రించి యున్నారు...

తెలుగు భారతము ప్రప్రథమమున 1867సం॥ ఏప్రిలు నెలలో ప్రకటింపఁబడినది. అపుడు దానిని చెన్నపురి రాజకీయ పాఠశాలాంధ్ర ప్రధాన పండితులగు వింజమూరు కృష్ణమాచార్యులవారు పరిష్కరించిరి. అపుడే దీనియందు గొన్ని శైథిల్యము లుండినవి. ముద్రిత గ్రంథములు చిక్కుచు వచ్చినందున తాళీదళ సంపుటములను జూచువారులేక యని...పోగా నిప్పటికిని కొన్ని గ్రంథములు మిగిలియున్నవి. ముద్రిత గ్రంథములలో సంశయాంశములు సంభవించినపుడు వ్రాతప్రతులు జూచి తీర్మానించుచున్నారు ... మేమిపుడు వ్రాయదలంచిన విషయమంతయు దదనుసారమై యుండును...స్థాలీపులాకన్యాయముల గైకొందుము.

ఇపుడు...బ్రహ్మశ్రీ శతఘంటము వేంకటరంగ శాస్త్రులవారు 88 పుటల పీఠిక వ్రాసి ప్రకటించి యున్నారు. దానియం దనేక విషయములు విమర్శింప దగియున్నవి...

ధృతరాష్ట్రుండును బుత్రులు న్వనము గుం
  తీనందనుల్ సింహముల్
మతినూహింప నసింహమైన వనమున్
  మర్దింతు రెందు న్వనా
వృతవృత్తంబులు గాని సింహములకు
  న్వేగంబు చేటొందుగా
న తగం బొందుట కార్యమీ యుభయమున్
  సంతుష్టిమై నుక్కికిన్.

అని యుద్యోగపర్వ ప్రథమాశ్వాసమున 359వ పద్య. ముద్రింపబడియున్నది. ఇందు నాలవ పాదము నందలి ప్రాసముంగూర్చి 'కానన్' శబ్దము ద్రుతాంతమైనను దీని నిచట దిక్కనగారు కళగానే వ్రాసినారని

వేంకటరంగశాస్త్రిగారు 'కానన్ [ అన్క్రుదుతాంతము కంటె 'తగన్' అను పదము పరమగునపుడు ద్రుత మున కర్ధానుస్వారమును 'త' కారమునకు 'ద' కార మును రావలసియుండగా నట్లులేక తకార ప్రాసమున 'త' కారము గానే ప్రయోగించి యుండుటంజేసి యెక్కడనేని గొన్నిచోట్ల 'కానన్' అనుదాని ద్రుత మునకు లోపమును దానిమీది పరుషవర్ణములకు సరళ వర్ణము లాదేశములుగా రావనియు నీద్రుతము లోపించి పరుషవర్ణమే నిలుచుననియు నందుల కీ నిపాతనము జ్ఞాపకమని కల్పింపవలసి యుండెడు. ఇట్టి ప్రయో గము లింకెక్కడనైన నుండెనేని వాని కీ ప్రయోగ మాధారమగును' అని వ్రాసినారు.

ఈ పద్యముపై 1895 సం॥ ఏప్రెలునెల మా మయూఖములో బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయ శాస్త్రులవారు విమర్శవ్రాసి యిట్లు ప్రకటించి యున్నారు. 'కానతెగన్; కాన=అడవి; తెగన్ = నఱుక బడిపోగా నని యర్థము... ఆ సవరణనుగూర్చి పీఠికా కారులగు నీ వేంకటరంగశాస్త్రులవారు 85 పుటలో వ్రాసిన వ్రాతం గనుడు — 'కానతెగన్ అని పాఠము గల్పించి, కాన=అడవి, తెగన్=తెగగా; నావృత వృత్తం బులుగాని సింహములకున్ వేగంబచేటొందునని మూడవ పాదముతోనైన నన్వయింప వచ్చును' అని వ్రాసి యున్నారు. 'కల్పించి' అని వీరు వ్రాయుటచేతనే వీరికీ యర్థమంత బుజువుగా నుండలేదని స్పష్టపడెగదా. వీరికే గాదు, గ్రంథముం బరిష్కరించిన పండితద్వయమున కును 'కానతెగన్' అను పాఠము రుచింపలేదు. రుచించి యున్నచో 'గానతెగన్' అని ముద్రింపరా. సంస్కృత మూలముం గనుడు.

శ్లో. వనంరాజా ధృతరాష్ట్ర స్సపుత్రో
వ్యాఘ్రాస్తేవై సంజయ పాణ్డు పుత్రాః
మా వనం ఛిన్ది సవ్యాఘ్రమ్
మా వ్యాఘ్రా నీనశు ర్వనాత్ ॥53॥

శ్లో. నిర్వనోవధ్యతే వ్యాఘ్రో
నిర్వ్యాఘ్రం ఛిద్యతేవనమ్
తస్మాద్వ్యాఘ్రో వనంరక్షేత్
వనం వ్యాఘ్రం చ పాలయేత్ ॥54॥

ఇందు రెండవ శ్లోకమునందలి 'నిర్వనో వధ్యతే వ్యాఘ్రో' అను వాక్యమునకు 'వనావృత వృత్తంబులుగాని సింహములకు వేగంబ చేటొందు' అనునది తిక్కనగారి భాషాంతరీకరణమట. నిర్వనః అనగ బోయిన వనముగల, ఛేదింపబడిన వనముగల యని యర్థము. కావున నిర్వనములై యుండుటచేత నావృత్త వృత్తంబులుగాని సింహములకు వేగంబ చేటొందు నని యర్థము. ఏతత్పీఠికాకారుల మతముబడి తిక్కన 'కాన' అను పదము గారణవాచకముగా నుపయోగించి యుండినచో సింహములు వనావృతవృత్తంబులు గాక యుండుటకు గారణమూహ్యము. ఇట్లగుటకు గార ణము వనచ్ఛేదమో, లేక వనము స్వస్థముగానుండియు సింహస్వచ్ఛందవృత్తియో యీ రెంటిలో నొకటి కారణముగా నుండవలయును. 'వనావృతవృత్తంబులు గాని' అను వాక్యములో 'నిర్వనమ్'అను పదార్థము రాదు. 'కాన తెగన్' అను శ్రీ శాస్త్రులవారి పాఠ విూ సందిగ్ధమును దొలగించి మూలము ననుసరించి యుండును. మఱియు 'దగన్' అనగా నొప్పునట్లుగా నని యర్థమని పీఠికలో వ్రాయబడియున్నది. ఒప్పు నట్లుగానని వ్రాసిరిగదా ఒప్పునదియేది? ఈ యొప్పుట లేకయే 'పొందుట కార్య మీ యుభయమున్ సంతు ష్టిమై నుక్కికిన్' అను వాక్య మర్థమగుచున్నది. కావున దిక్కయజ్వ యిట్టి యపుష్టార్థక పదమును ప్రయోగించియుండడని నొక్కి చెప్పనగు. మూలాను గుణపాఠియగు వేంకటరాయశాస్త్రులవారి పాఠము— లక్ష్యలక్షణ విరుద్ధ మిథ్యాకల్పనయగు పీఠికాకారుల సిద్ధాంతమున కవకాశము లేకయే తద్రప్రాసదోషము దొలగించును. ఒకవేళ బీఠికాకారులు మూలశ్లోకములో 'తస్మాత్'అను పదమున్నదిగనుక 'కాన'యను పదము నవ్యయముగా దిక్కన ప్రయోగించియుండునని యిక వాదింతురు గాబోలు. అది సమంజసముగాదు. అట్లైన మూలములోనున్న వ్యాఘ్రశబ్దమునకు దెలుగు పద్యము లోని సింహశబ్దము పర్యాయపదమనియు జెప్పుదు రేమో. శ్లోకద్వయభావమే తిక్కనకు ముఖ్యము. రెండు శ్లోకములకుఁగదా యొకపద్యము వ్రాయబడినది. 'కాన తెగన్'అను పాఠములో గాన నను నవ్యయము నాలవ పాదములోని 'పొందుట'అను పదమునకుముందు నధ్యా హార్యముగ నున్నది. కావున నీ పాఠమే సర్వవిధ సమంజ

సము. ఇట్టి పాఠమును కల్పనయనిచెప్పి యొక యవ లక్షణపు బాఠము నూహించుట పాడిగాదు. ఉభయభాషా పాండిత్యముగలిగిన వేంకటరంగశాస్త్రిగా రిట్టి పట్టును దిట్టముగా విచారించి యిదమిత్థమని న్యాయముగా నిర్ణయింపకుండుట మిగుల లోపమని తలంచెదము. పండితులకు న్యాయము కంటగించుచున్నది. అక్షరాస్యు లసూయాగ్రస్తులైరి.........'

తర్వాత తాతగారి పాఠమును శ్రీ కొక్కొండము వేంకటరత్నము పంతులుగారు అంగీకరించినారని శ్రీ పూండ్లవారు 38 వ పుటలో తెలిపినారు. 'దేవుడు వరమిచ్చినను బూజారి వరమీయడు' అన్న సామెత నందతెఱంగియేయుందురు. దీనికి ప్రస్తావన మన గత సంచికలో 'ధృతరాష్ట్రుండును'అను పద్యముపై వ్రాసిన విమర్శయే. 'కానతెగ' నీ విషయము తెగినదని యంద తెఱంగినదియ. శ్రీ వేంకటరాయశాస్త్రిగారు దీనిని మా మయూఖములో దెగించి త్రెంపినతర్వాత సంజీవన్యధిపతులు మన్మథ మధుమాస సంజీవనిలో 8 వ పుటయందు.........గా/న తెగంబొందుట......అనియే ముద్రింపించినారు. శ్రీ వేంకటరాయశాస్త్రులవారి సవరణను శ్రీ వేంకటరత్నము పంతులవారొప్పి మన్మథను సమ్మతించి ప్రకటించికొనినను శ్రీ వేంకటరంగ శాస్త్రులవారు 'తెగ'నీయక 'తగం' బొందింప యత్నించుట కడు సంతాపకరముగా నున్నది. ఉభయవాదు లొప్పినను వేంకటరంగశాస్త్రిగారు తెగనను పాఠము 'కల్పిత' మనుటయే పై సామెతకు భావము...పత్రికాధిపతి.'

ఈ సవరణగాని దీనింగూర్చి ఎట్టి విమర్శగాని ఈ సంశోధిత ముద్రణమందులేదు.

'ఏనుబిదప — ఏనవిదప' అను దానింగూర్చి సంశో. ముద్ర. సంపాదకులు ప్రస్తావించిరిగాని అ. గ్ర. చిం. తేల్చినట్లు వ్రాయలేదు. ఎందుచేతనో తెలుపరు. ఇట్లు వ్రాసినారు: 'ఈ క్రిందిపద్యమొక మనోజ్ఞమైన వివాదమునకు దారి చూపినది—

'కవదొనలును గాండీవము
నవల నిడంబనుపు ముంద అరదము డిగు మే
న(ను) విదప డిగియెద శుభకర
మవు నివ్విధమట్లు సేయుమనుడు నతండున్.'

అని యీ పద్యము నుదాహరించి ఏను + పిదప, ఏను + బిదప అని మారవలసిన విషయములను ప్రాస దోషాదులను చర్చించి, ఏను కళగాదనియుచెప్పి, మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారి సమర్థనమును నిరసించి 'తిక్కన సోమయాజి కావించిన యీ ప్రయోగము పండితులలో దీవ్రమైన వివాదమున కవకాశ మొసంగినది. అది యిప్పటికిని అపరిష్కృతముగానే యుండి పోయినది'అని వ్రాసినారు.

అముద్రితగ్రంథచింతామణి దీనింగూర్చి యిటు వ్రాసినది: 'ఈ పద్యమందు వ బ ప్రాసమని వేంకటరత్నము పంతులుగారు వాదించిరి. వారి వాదమంతయు వీరొప్పక (వీరనగా శతఘంటమువారు) 'ఏనవిదప'అని ప్రకటించి వ బ ప్రాసమును నిరసించినందులకై సంతసించు చున్నాగము.' ఈ వాక్యములకు కొంతముందు 'వేంకటరాయశాస్త్రులవారు గావించియున్న మార్పులలో వీరు గైకొన్నవానిలో మఱి కొన్నింటివి వివరింతుము' అని వ్రాసి అందు పై వాక్యములను చేర్చినారు. తాతగారివార్చు సంపు 9. సంచిక 1. 1896. పు. 4 లో నున్నది. 'ఏనుశబ్దము ద్రుత ప్రకృతికమా కాదా ? ఏనుశబ్దము ద్రుతప్రకృతిక మని బ్ర. శ్రీ కొక్కొండ వేంకటరత్నము పంతుల వారును, కళయని బ్ర. శ్రీ. మండపాక పార్వతీశ్వర శాస్త్రులవారును పత్రికలో నభిప్రాయములను దెలిపి యున్నారు. ఈ చస్పకు భారతమునందలి' (అని 'కవదొన' పద్యము నుదాహరించి) 'అను పద్యములోని 'ఏనువిదప' అను ప్రయోగము కారణమై యున్నది. ఇచట బార్వతీశ్వర శాస్త్రులవారు 'ఏను' శబ్దము కళయనియు దానిపై 'బిదప' అను పదమునందలి యాద్యపకారమునకు బ్రథమమీాద విహితమైన వాదేశము రాగా 'ఏనువిదప' అనియాయెననియు వివరించి 'ఏనుశబ్దము కళయనుటకు నాంధ్రశబ్ద చింతామణి యందలి—'గసడదవాః స్యుః ప్రథమా మాత్రాదాత్మా స్మదోర్విసైవైతే'అను సూత్రమున 'అస్మత్' శబ్దము నేను శబ్దమును చెప్పనేగాని 'ఏను' శబ్దమును చెప్పదనియు, 'ఆఙ్మధ్యశేష షష్ఠీ' ఇత్యాది సూత్రమందు 'శేష' శబ్దముచే 'ఏను' శబ్దము గ్రహింపబడు చున్నదనియు నందుచేత 'ఏను' శబ్దము

కళయని యేర్పడినదనియు, ఇట్లు 'ఏను' శబ్దము కళయు ప్రథమయు గావున 'ప్రథమా మాత్రాత్' అనుటచేత దానిపై పకారమునకు, వకారము వచ్చిన దనియు, నట్లే ఏనుశబ్దము కళయైనందులకు,

'నీ చెప్పిన పెద్దలు ద్రో
ణాచార్యులు మొదలుగాగ ననికొల్లని వా
రై చన్న వారలంగొని
యే చక్కం బెట్టువాడనే పాండవులన్'

అని భారతోద్యోగ పర్వములో ప్రయోగము కలదనియు నుపపత్తి వ్రాసియున్నారు. ఇచ్చోట వేంకటరత్న పండితులు 'ఏను బిదప' అనియే పాఠ మనియు 'ఏను' శబ్దము ద్రుతప్రకృతికమే గాని కళ గాదనియు ద్రుతప్రకృతిక మైనందున దానిపై పకారమునకు బకారము (సరళాదేశము) రాఁగా 'ఏను బిదప' అని అయినదనియు, ఈ ప్రయోగముచేత వ బ లకు ప్రాసమైత్రి లభించుచున్నదనియు అభిప్రాయ పడి తదనుసారముగా బిల్వేశ్వరీయమందు వ బ లకుఁ బ్రాసము ప్రయోగించినారనియు మీ పత్రికలవలన గనపడుచున్నది. ఇందులో శాస్త్రులవారు 'ఏను'శబ్దము కళయనుటకు జెప్పిన యుపపత్తులు దుర్బలముగా నున్నవి. ఆ యుపపత్తుల నంగీకరించిన ననిష్టము లనేకములు కలుగుచున్నవి.

'ఆత్మా ష్మదోర్విన్నైవ' అనుచోట అస్మ చ్ఛబ్దము 'ఏను' శబ్దమును చెప్పదనియు 'నేను' శబ్దమును మాత్రము చెప్పుననియు వచించుటకు బ్రమాణమేమియు లేదు. 'నేను' 'ఏను' అను నీ రెండు రూపములును నన్నయభట్టీయమందలి 'ప్రథ మాయ మేదస్మదః' అను సూత్రముచే నిష్పన్నమగు చున్నవి ... రెండు రూపములలో నొకటి గృహీతము ఒకటి కాదనుటకు నేమియు న్యాయములేదు.........

మఱియు బ్రయోగాంతర బలముచేనైనను 'ఏను'శబ్దము కళయని యొప్పికొందమనిన శాస్త్రుల వారందులకై యిచ్చిన ప్రయోగాంతరము పూర్వోక్తో ద్యోగపర్వ పద్యములో నాలవ పాదములో (వారలంగొని) 'యేచక్కంబెట్టువాడ' ననునది శాస్త్రులవారి యభి ప్రాయము ప్రకారము 'ఏనుచక్కంబెట్టువాడను' అని యిచట బదవిభాగము. ఈ పద్యమున నీచోట ఏను శబ్దముయొక్క 'ను' వర్ణము లోపించి 'ఏచక్కం బెట్టువాడన్'అను రూప మేర్పడుటకు శాస్త్రమేమి? ఇది కళ యట గదా. కళయొక్క యంతిమ 'ను' వర్ణ మునకు లోపము వచ్చుట గలదా? 'మీనుచావు' అను నది 'మీ చావు'అని అగునా? ప్రయోగప్రభావముచే 'ఏను' శబ్దమునకు మాత్రమే 'ను' వర్ణలోపము గ్రహింతమన్న 'ఏయడిగితిన్'అని చెప్పవచ్చునా? ఏను శబ్దము కళయగుటకయి అస్మచ్ఛబ్దమున కది అర్థము కాదని వ్యవస్థ కావలసినట్లే; అందుకు నుదాహరణాం తరమని 'ఏచక్కంబెట్టువాడన్' అనుదానిని తెచ్చుటచే 'ఏను' శబ్దముయొక్క 'ను' వర్ణలోపమును సాధించుట కయి మఱి యేసూత్రములకయినను క్రొత్తవ్యాఖ్యలు చేయవలసివచ్చినది. తన ను వర్ణలోపమునే సాధించుకో లేని యీ 'ఏచక్కంబెట్టువాడన్'అను ప్రయోగము 'ఏను' శబ్దముయొక్క కళాత్వము నెట్లు సాధించును?

మఱియు నశాస్త్రీయమైన 'ను' వర్ణలోపము నంగీకరించి కళయని వాదించి యనిష్టములు కలి గించుటవలెనే 'చక్కంబెట్టువాడన్' అను దానియందలి 'చ' వర్ణమునకు నశాస్త్రీయమైన సరళసంజ్ఞ నంగీ కరించి యిది ద్రుతప్రకృతికమేయని యీ ప్రయోగ మందు నేల వాదింపగూడదు? సరళ వర్ణమునకు ముందుండు ద్రుతమునకు లోపము రావచ్చును గదా? రెండు వ్యవస్థలు నశాస్త్రీయములైయుండగా నందులో నొకటి గ్రాహ్యమును నొకటి యగ్రాహ్యమును యెట్లగును?

ఏను శబ్దము ద్రుతప్రకృతికమని వాదించువారి మతమునను తిక్కన సోమయాజులవారి యీ ప్రయో గము దుష్టమేగదా యగును. అనిన, అట్లుగాదు, 'ఏ చక్కం బెట్టువాడన్' అను నీచోట 'ఏను' శబ్దమే లేదు. 'ఏను' శబ్దము 'చక్కం బెట్టువాడనే బాండ వులన్' అని 'పెట్టువాడన్' అను పదమునకు బిమ్మట నున్నది- మఱి పాదాదియందున్న యీ 'ఏ' శబ్దము యొక్క తత్వమేమనగా నిది వ్యతిరేకార్థక మయిన 'ఏ' కారము. 'అనికొల్లనివా। రై చన్న వారలంగొని। యే చక్కం బెట్టువాడనే బాండవులన్' [నేను యుద్ధ

మున కంగీకరింపక చన్న ద్రోణాచార్యులు మొదలగు వారిని కొనియే (కొనియా) పాండవులను చక్కం బెట్టుదును. వారిని గొనికాదు, కర్ణుడు దుశ్శాసనుడు సౌబలుడు వీరినిగొని పాండవులను చక్క బెట్టుదును; అని యన్వయము.]... ఈ హేతువుల 'ఏ చక్కం బెట్టువాడన్' అను ప్రయోగము ఏను శబ్దముయొక్క కళాత్వమును సాధింపనేరదు......' (అని దీనింగూర్చి చాల పుటలు వ్రాసియున్నారు.)

ఈ విధముగా కొన్ని సంవత్సరములు మహా పండితులు చర్చలు జరిపియుండిన అముద్రిత గ్రంథ చింతామణిని ఎఱిగికూడ మా తాతగారి మార్పులో సవరణలో దిద్దుబాట్లో— వానిని గుఱించి అవును కాదని ఈ ముద్రణమున ఎందులకు చెప్పకూడదో తెలియరాకున్నది. ఇది పొరపాటనుకొనుటకు లేదు. అ. గ్ర. చింతామణిని పూండ్లవారిని వీరు ప్రశంసించియే యున్నారు. వేమూరు వేంకటకృష్ణమసెట్టి అండ్ సన్స్‌వారి ముద్రణమును, శ్రీ కందుకూరు రాయదుర్గమువారి సంపాదకత్వమున, శతఘంటమువారి యుపోద్ఘాతముతో వెలువడిన దానిని పేర్కొన్నవారు ఈ విమర్శలను చూడలేదనుట విశ్వసనీయముగా కనబడదు. తాతగారిని స్మరింపకపోవుటకు ఏదో బలమైన కారణమే ఉండవలెను.

తాతగారి సవరణ ఒకటిమాత్రము చూపినారు. ఆరంభమందే మొదటి వచనమున 'అని హరి హర హిరణ్య గర్భ పద్మోమా వాణీపతుల' అని దాని క్రింది అధోజ్ఞాపికలో 'అని......వాణీసతుల—అని వేదం వేంకటరాయ శాస్త్రిగారును (మదరాసు విశ్వ విద్యాలయమువారి సెలక్షన్సు) సూచించిన పాఠములు గమనింపదగినవి' అని వ్రాసినారు. అంతే. ఇకవారు సూచించిన పాఠములు సవరణలు కొల్లలుగా నున్నను స్మరింపలేదు. ఒకటి రెండు ఉదాహరణములు—

డ ఢ ప్రాసము. రూఢిగ-రూడిగ. ఆది. ప్రథమాశ్వా. 69 వ పద్యము — 'ఏడకొ్కా హిణులెన్న... రూఢిం గౌరవసైన్య...। యూడం బోవక...నల్లాడెన్...' ఆది. అష్టమాశ్వా. 156 పద్య. 'వేడుక నమ్మని ముందట। బాడితి మాడితిమి పెక్కు పరిహాసంబుల్। రూఢిగఁ బలికితి మెటుం౦। జూడదు మావలను నీరసుండన నుండెన్.' వీనిలో మొదటి పద్యములోని 'రూఢి'కి 28 వ పుటలో 'రూఢిన్' అని పాఠాంతరము చూపినారు. రెండవదానికి అధోజ్ఞాపికలో ఈ పద్యమున డ—ఢ ప్రాసము అనియు రూఢిగ—ద. వీ. భాసం. సూ. దీనినిగుఱించి తాతగారు అ. గ్ర. చిం. లో నిట్లు వ్రాసియుండిరి: 'ఈ పద్యములలో 'రూడి' యని కవి వికృతిపదముం బ్రయోగించినాడు గాని రూఢియని ప్రయోగించి యుండలేదు. గాన నిది డ ఢ ప్రాసము గాదు. ఈ ప్రయోగములనుబట్టి యదృష్టచరమైన డ ఢ ప్రాసము నితరులు వ్రాయుదురనియే శబ్దరత్నాకరములో 'రూడి' యను వికృతి పదమునకు నీ ప్రయోగములం జూపక, 'సీ॥ రూడి నెన్నికగన్న నాగెంపు దెఱగంటె చిగురాకు బోదుల జెఱలు దెచ్చి' అని యచ్చ తెన్గు రామాయణముననుండి యుదాహరణము వ్రాయబడియున్నది... ఎట్టి తుచ్ఛకవిత్వము సందును డఢ—బభ—గఘ—వబ—తద—గక లోనగు ప్రాసము లగపడనందున నింతదూరము విచారించి నా యభిప్రాయమును వ్రాసినాను.'

ఇంబుగ సర్వలోక—ఇమ్ముగ. ఆది. 1—76 వీరు పద్యమును పూర్తిగ 'ఇంబుగ ... బంబున ... ధంబను ... ద్యుంబరము' అనియే ముద్రించినారు. సర్వలక్షణసార సంగ్రహములో (పు.116) ఇమ్ముగ ... బమ్మన ... ధమ్మను ... వం। ద్యుంబర' అని 'ంబ' 'మ' లకు ప్రాస కలదు. నాలవపాదము 'వంద్యుమ్మని' అని ఆనందవ్రతి. అందే అధోజ్ఞాపిక, పాఠాంతరము వంద్యుమ్మని. దీనింగూర్చి అముద్రి. గ్ర. చిం. 'తాళపత్ర ప్రతులయందును ముద్రిత ప్రతులయందును 'ఇమ్ముగ' ననియున్న పాఠమును నీ సంస్కరణకర్తలు కారణము చెప్పక 'ఇంబుగ' నని వ్రాయుట మిగుల శోచనీయముగా నున్నది ...

అప్పకవి—

'రంబుజంబు రంబుజంబు
రంబుఁజెన్ను మీఱఁగాఁ
తొమ్మిదింట విశ్రమంబు
తోరమై సుగంధికిన్
గ్రమ్మగా నుతింప నొప్ప

గానలోలుఁ డచ్యుతుం
డంబుజాతుఁ డాదిదేవుఁ
డక్షరాఖ్యు డెప్పుడున్
'ఇమ్మహిలోఁ। గ్రమ్మ భగల్
బింబమునం। గంబుధరా'

... కావున వీరి భారతములో నున్నట్టి 'ఇంబుగ' నను పద్యము 'ఇమ్మగ' ననియే యుండ వలయునని మా సిద్ధాంతము...మేము 1900 సం॥ మే నెల మయూఖములో వివరించి యున్నాము. ఈ ప్రాసము పనికిరాదని వీరుమాత్ర మభిప్రాయ పడిరే గాని తక్కినవారెవ్వరిటు భిప్రాయ పడలేదు. ప్రక్రియా ఛందస్సున యతిప్రాసమున కుదాహరణము లని (ఇది వేదము వేంకటరాయశాస్త్రులవారిది) యిట్లు వ్రాయబడియున్నది :—

'అంబకు మ్రొక్కి నా కలవడినట్లు
ఇమ్మగా యతి కుదాహృతులు సెప్పెదను'

అని వ్రాసియున్నారు. ఈ ప్రాసమే చెల్లకున్నచో 'ంబ—మ్మ' లకు బ్రాసముగా నేల ముద్రింపఁబడెనో యోచింపుఁడు.' ఇది డెబ్బదియేండ్ల క్రిందిమాట. నన్నయ్యకీ ప్రయోగము లిష్టమేమో ఇట్టి పద్యము లింకను కలవు.

వావిళ్లవారి సం. 1917, ముద్రణమున పుట 15. అధోజ్ఞాపిక. 'ఇంబుగ..., బింబంబున..., రంధ్రంబను..., వంద్యుంబరముం బరాశర...' అను పాఠాంతరము పండిత కల్పితముగానోపు. ఇది ప్రథమ ముద్రిత ప్రతులయందును, పెక్కు వ్రాతప్రతుల యందును లేదు. 'వంద్యుమ్మని' యనుచో 'కమ్మని లతాంతముల కుమ్మెనసి' యనురీతి యొప్పును.' పైన పద్యమును 'ఇమ్మగ—బమ్మన—ధ్రమ్మను — ద్యుమ్మని'యని ముద్రించినారు

**కపిలగడము — కవిలగడము**

దీనింగూర్చి ఈ సంశోధకముద్రణ సంపాద కులు — కవిలగడ్డమనియే గ్రహించి, అ. గ్ర. చిం. ఉదాహరించి ఎట్లును తేల్చని విధమున తమ యభిప్రాయ మిచ్చినారు. పూండ్లవారు మా తాతగారి యభిప్రాయము నుదాహరించి తేల్చినారు. '1895 సం. అక్టోబరు నెలదియగు మా చింతామణీ మయూఖము యొక్క 95 వ పుటలో వేంకటరాయ శాస్త్రుల వారి కపిల కవిల శబ్దములంగూర్చి యిట్లు నిర్ణయించిరి: 'వకార ప్రాసముచేతఁ 'గవిల' అని 'కపిల' శబ్దమునకొక వైకృతము గ్రహింపఁబడి యుండలేదా. సీతారామాచార్యులవారు వ బ ప్రాసమునే యెఱింగి యుండిన 'వేవణములు' అని వాదేశమో, 'వేఁబణములు' అని బాదేశమో యెట్లు నిర్ణయించుకొందురు? రెండు నశాస్త్రీయములే కదా' అని నిర్ణయించియే యుండిరి ... కావున భారతమున గల పై పద్యములో నున్నట్టిది ప వ ప్రాసముగాదు గాన దానిని వ ప్రాసముగా నెఱుంగునది.' (పత్రికాధిపతి.) అప్పకవి దీనిని విశేషవళులక్రింద గణించినాడుగదా. ఈ పరిశోధక ముద్రణమున నిదమిత్థమని గట్టిగా తేల్చవలదా ?

ఇదంతయు చూడగా క్రోడీకరించి పాఠములు సేకరించి ఎంతో సేవ భాషకు చేసినను పాఠనిర్ణయ విషయమున తగినంత స్వాతంత్ర్యమో ధైర్యమో వీరు చూపలేదు. విమర్శకు లేమందురోయన్న భీతి కనబడుచున్నది. వ్యావహారిక గ్రాంథికముల మధ్య నేర్పడిన యొక సందిగ్ధావస్థ.

**'తటస్థ భావము'**

తాము తటస్థభావము వహించితిమని వీరు ప్రకటించుకొన్నారు. మంచిదే కాని పండిత నిర్ణయ మొనరించి, ఉపపత్తులనుకూడ ప్రకటించియుండి, తమ నిర్ణయములు ఎంతవఱకు సకారణములో తెల్పినచో వీరి పరిశ్రమయొక్క ఫలము పఠితలకు అంది సార్థకమై హృదయాహ్లాదకరముగా నుండియుండెడిది. 'నిజమైన సంశోధిత ముద్రణము లభ్యములైన సాక్ష్యములన్నియు విద్వత్సంఘముల ముందుంచి ప్రత్యేకములైన పాఠముల నంగీకరించుటో, తిరస్కరించుటో వారు స్వయముగా నిర్ణయించుకొనుట కవకాశమొసంగ వలయును.' ఉత్తమ పద్ధతియేగాని ఇంతటి పండితులు, దేశమునకు తలమానికము వంటివారే నిర్ణయింపలేక తాటస్థ్యము వహించిన ఇతరుల గతియేమి?

మార్గమ్మైనను చూపవలెను గదా. సంశోధిత ముద్రణ భావోదయమును శ్రీ గిడుగువారు, జయంతివారు, కట్టమంచి చిలుకూరి ప్రభృతుల యాశయములను తెల్పినవారు మూలమును ముద్రించునప్పుడు తమ నిర్ణయములను తెల్పుటలో దోషములేదు. మంచిదే.

అట్లే అధోజ్ఞాపికలో అప్రసక్తము లైనను కొన్నిటిని ధైర్యముగా వ్రాసియున్నారు. ఉపో. 109 పుట తెలుగు (అదే ఇంగ్లీషు 29 పుట)లో రాయ దుర్గం నరసయ్యశాస్త్రులవారిని గుఱించి అధో జ్ఞాపికలో వ్రాయుచు 'నాటకమున నీచపాత్రములకు వ్యావహారిక భాషను వాడినవారిలో నరసయ్యగారే ప్రథ ములని చెప్పవచ్చును. తరువాత వేదం వేంకటరాయ శాస్త్రులవారు తమ ప్రతాపరుద్రీయ నాటకమున నీ ప్రయోగమును జయప్రదముగ నిర్వహించియుండిరి.' ఇట్లే వ్రాతకన్న ఆశ్చర్యము వేఱుండదు. 1891 లోనే మా తాతగారు పాత్రోచిత భాషను తమ నాగా నందమున వాడియుండ, దానినిగుఱించి దేశమున దుమారములేచి పండితులలో యుద్ధములు జరిగి అ. గ్ర. చిం. లో ఎన్నో వ్యాసములు ప్రకటితము లైయుండగా వీరిట్లేల వ్రాయుచున్నారో అర్థమగుట లేదు. పాత్రోచితభాషను గ్రామ్యమని నిందించి, తాత గారిని గ్రామ్యశాస్త్రియని ఆక్షేపించి, వారి యుద్య మమును అడుగంట త్రొక్కివేయించుటకు ప్రయ త్నించిన పండితులతో చేరినవారిలో నరసయ్యశాస్త్రిగా రొకరు గదా. వీరిది ఈ బెస్తవాని పద్యము వ్యావహా రిక భాషావాది రచించునా ?

'ఏదిసాజపుఁ బనియనియెద
రదియేవం బయ్యు విడుననగునె బశువులం
జదుపు పనిఁ గ్రూరుఁడయ్యును
సదయతచే శ్రోత్రియుండు సౌమ్యుండె
యగున్'.

దీనింగూర్చి పూండ్లవారి విమర్శను అ. గ్ర. చిం.లో 1898, సం॥, సంచి. 1-పుట 8 లో చూడనగును.

ఇవిగాక అభిప్రాయభేదముల కెడమిచ్చు పాఠ ముల నొకటి రెంటిని ప్రస్తావించి ఈ సమీక్షను ముగింతును. సభా. 2.49 లో 'పరగఁ బొగడికోలుఁ ప్రబ్బికోలు' అని ముద్రితము. ఇట ప్రబ్బికోలనగా పొగడికోలే గదా.

'అన్యకీర్తనంబు నన్యనిందయుఁ దన్నుఁ
బరగఁ బొగడికోలుఁ ప్రబ్బికోలు
అపగాతనూజ యార్యవృత్తములు గా
వనిరి వీని నాద్యులయిన మునులు'

ఇట ప్రబ్బికోలు అనగానేమి? దానికిని పొగడికోలు అనియేగదా యర్థము (చూ. శర) అధోజ్ఞాపికలో 'ప్రచ్చికోలు' కలదు. నావిళ్లవారి పాఠము ప్రచ్చి కోలు. అనగా నిందపడుట. ప్రచ్ఛ్య ధాతువు. తమి ళము పఴి( ళి ). పరస్తుతి పరనింద, ఆత్మస్తుతి, ఆత్మనింద సద్వృత్తములు కావని యభిప్రాయము. ప్రచ్చికోలు పాఠమే మేలేమో.

ఆది 1—136.

'తనయెఱిఁగిన యర్థంబొరుఁ
డనఘా యిది యెట్లు సెప్పుమని యడిగినఁ జె
ప్పని వాడును సత్యము సె
ప్పనివాడును ఘోరనరక పంకమునఁ బడున్.'

ఇందు చెప్పనివాడును ... నాడును అని వీరి యధోజ్ఞాపిక. అదే వావిళ్లవారి ప్రధానపాఠము.నాడును అనగా ఎడల—చేదర్థమున చెప్పనియెడల అని విశిష ప్రయోగము. నాడు అని కాలవాచిగ గ్రహించుట పొర పాటు. ఈ నాడు పాఠము 8 ప్రతులలో నున్నట్లు సూచింపబడి యున్నదికూడ. నన్నయ్య ఇతరత్ర— ఆర. 264. శత్రుసంహారంబు సేయనినాఁ డత్యంత హానియగు; నీవు దీని కొడంబడనినాడు; రండు, రానినాడు—రండెఱింగి. ప్రయోగించి యున్నాడు గదా.

ఆది 4- 4. త్రసుఁడు—తంసుడు.

'నయ్యురువురకుఁ ద్రసుఁడు ధీరుఁడు పుట్టెన్'
ఇది ఆనందపాఠము. నావిళ్లవారిదికూడ ఇదేగాని వారి అధోజ్ఞాపిక— 'తంసు' అని వ్రాతప్రతులయం దున్నది ... సంస్కృతమున 'ఈలినంతు సుతం తం సుర్జనయామాస, ఈలి నోజనందామాస దుష్య న్తమ్'. కాని వావిళ్లవారు పైన 'తఁసు' అని ఏల ముద్రింపలేదో ! మూలము ఆది. 94-14. 15.

'మతినార ఇతిఖ్యాతో రాజా పరమధార్మికః
మతినార సుతారాజన్ చత్వారోఒమిత విక్రమాః
తంసుర్మహా నతిరథో ద్రుహ్యశ్చాప్రతిమద్యుతిః
తేషాం తంసుర్మహావీర్య పౌరవం వంశముద్వహన్'

వావిళ్లవారి ఫుట్‌నోటు సాధువని శ్రీ దీపాల పిచ్చయ్య శాస్త్రిగారు, నవంబరు 1962 భారతిలో తేల్చి యున్నారు. వారుకూడ ఈ సంపాదక వర్గమున నుండియు ఈ పాఠము ఎట్లు తప్పిపోయినదో!

ఆరణ్య 2—153

దమయంతి నలునెడబాసి విదర్భపురంబున నుండుట. 'భామ విదర్భకేగి ... జీవిత । స్వామి నిజేశుఁజూచు దివసంబుల కోరుచు ...' జీవితస్వామి నిజేశుఁడే గదా· ఇందు అర్థ పునరుక్తి లేదా? 'నవేశు' డని పాఠాంతరమున్నది. ఆనందలో అది ప్రధానము, వావిళ్లలో 'నిజేశు'డు. నవేశుడు మెఱుగు గాదా.

### చిల్లర విషయములు

'కులబ్రాహ్మణుని' గూర్చి చాల చర్చ జరిగినది. 'కులవిప్రః పురోహితః' శాసన కావ్యకర్తలు అనాదిగా నియోగి పరంపరలో కనబడుచుండుట చేతను, అట్లే ఇతనికిముందు భట్టబిరుదధారులు పలువురు శాసన కావ్యకర్తలుండుటచేతను ఇదొక 'రాయసం' (వ్రాయసము) వ్రాతల వక్కణల యుద్యోగము, పురోహితుని వంటివారు చేయదగినదిగా నుండదగును. పురోహితుఁడును రాజసేవక వర్గములోనివాడే. అర్థశాస్త్రములోను, అశోకాదుల శాసనములలోను 'మంత్రి పురోహిత సేనాపతి యువరాజ దౌవారికాంతర్వంశిక...' నియోగులు. అట్లే రాజకార్య నిర్వాహకులలోని పదునెనిమిది తీర్థములలో పురోహితుఁడు రెండవవాడు. పై తెనుగుకవులలో తిక్కన మొదలుకొని మొన్నటి వఱకు రాజమంత్రులును వారి బంధువర్గమువారే కవులుగా నుండిరి. వైదికులు వేదాధ్యయనాదులయందే నిలిచియుండిరి. నియోగి వైదికి భేదము అశోకుని కాలమునుండియు కలదేమో! ఇతని సహాధ్యాయి వాణస నారాయణభట్టు నియోగి యనుటకు సందియములేదు. కర్ణాటక బ్రాహ్మణుఁడు త్రైలోక్యమల్ల ఆహవమల్ల సోమేశ్వరుని అమాత్యుడు. సోమేశ్వరుని ప్రధానామాత్యుడు మధుసూదనయ్యయు వాణసయింటి వాడే. అతడు 'బాణస వెగ్గడె' అనగా రాజుయొక్క బానసము (=మహానసము=) వంటయింటిమీది అధికారి. విషప్రయోగమునుండి రాజును రాజకుటుంబమును కాపాడు నధికారి. అసలా రోజులలో నియోగి వైదిక భేదము లేదని కొందఱు చెప్పినను కర్ణాటక శాసనములలో చాల ప్రాచీనకాలమునుండియు కలదు. బ్రాహ్మణనియోగులు యుద్ధవీరు లెందరో!

నన్నియశబ్దము కన్నడమువలె కానవచ్చు చున్నదని ప్రథమసంపుట పీఠికాకారు లభిప్రాయపడినారు. అది సమంజసము కాదని ద్వితీయ సంపుటమున దివాకర్లవారి యభిప్రాయము. తమిళసంఘం వాఙ్మయములో నొక నన్నన్ అనురాజు కనబడుచున్నాడు. ఇది ఆంధ్ర ద్రావిళ కర్ణాటక మలయాళములకు ఉమ్మడి శబ్దముగా నుండియుండును.

నన్నయ ఆరణ్యపర్వమును పూర్తిచేసెనో లేదో కాని రాజరాజనరేంద్రునికన్న ముందే గతించినాడు. క్రీ. శ. 1059 వఱకు శాసనములలో కనబడుచున్నాడు. రాజరాజు చివరితారీఖు 1061.

'సత్పభాంతర సరసీవనంబుల' నుండి సంశోధిత ముద్రణ పీఠికాకారులు చాల చరిత్రను లాగుటకు యత్నించినారు. 'ఆ రోజులలో గవుల గుణాగుణములను నిర్ణయించుటకును భాషా సారస్వతాభ్యుదయ మార్గమును సూచించుటకును గొన్ని విద్వత్పరిషత్తులు నెలకొల్పబడి యుండును. తమిళవాఙ్మయ మందలి సంఘములు ..' ఇత్యాది. ఇది వట్టి ఊహ. అట్లుండిన తమిళదేశమున తర్వాత ఏమైపోయినవి? రాజుల యాస్థానములలో విద్వాంసు లుండెడివారు, పండిత సమావేశములు జరుగుచుండెడివి. కాని ఒక విధానము ననుసరించి, కాశ్మీర శారదా పీఠమువంటి పరీక్షక సంఘము లుండెడివనుటకు ఆధారము కానరాదు. ఇవి 'నెలకొల్పబడినవి'గా నుండవు.

నన్నయ వైదిక మతోద్ధరణము గావించెననుటయు అంతగా పాటింప దగదు. కుమారిలభట్టు శంకరులాదిగా జైనమతమును ఓడించి ప్రచారమొనర్చి

నను తమిళాంధ్ర కర్ణాటక రాజ్యములు క్రమముగా జైనమును వదలినవేగాని తటాలున మారలేదు. తమిళ దేశమున శైవ మతము విజృంభించి అప్పర్ సుందరర్ సంబంధర్ వీరికాలము జైనమును పెఱ్ఱద్రోలినది. విమలాదిత్యుడు జైనుడు. రాజరాజనరేంద్రుడు తల్లి ప్రభావమునను మాతామహుని ప్రభావము వలనను శైవుడాయెను. అట్లే కర్ణాటకమున జగదేకమల్ల జయసింహుడు క్రీ. శ. 1032 ప్రాంతమున శైవుడైనాడు. ఇతని కుమారుడే సోమేశ్వరుడు. వీరందఱు వీరశైవులుకారు. వీరికి బ్రాహ్మణ వైదిక మతద్వేషము లేదు. పైగా 'నన్నయ భట్టారకుడు వినుతులచే పరమశివుని మాటాడించె'నని ప్రబంధరత్నాకరమున పెదపాటి యెఱ్ఱాప్రెగడ వ్రాసియున్నాడు.

'ఉశుచేగాంచి సాహిత్య విద్య ధరిత్రి
నిల్పినయట్టి పాణిని భజించి,
శ్లోకార్థమున జంద్రదజూటు మెప్పించి యి
ష్టార్థము లొన్న మల్హణు నుతించి,
గద్యంబుచెప్పి శంకరునిచే గరములు
బ్రతిభతో బడసిన బాణుదలచి,
శతకంబు చెప్పి భాస్కరుని మెచ్చగజేసి
యురుదేహుడైన మయూరు గొలిచి,
భవుని మెప్పించి కన్నులు బండిదెచ్చి
వనితకిచ్చిన కాళిదాసునకు మ్రొక్కి
హరుని వినుతులచే మాటలాడజేసి
నట్టి ధట్టుని నన్నయభట్టు పొగడి'

నన్నయ యజ్ఞ మొనరించెనని యొక కథయు నున్నది

'సారమతింగవీంద్రులు' పద్యమునుబట్టి మన పండితులును విమర్శకులును చాలపని చేసినారు. సంశోధిత ముద్రణములో 'ప్రసన్నకథాకవితార్థయుక్తిలో నారసి'అను పాఠము స్వీకరింపబడి పాఠాంతరముగా 'కలితా'అని 8 ప్రతులలోను, 'కవితార్థయుక్తితో' 29 ప్రతులలోను, వివిధార్థయుక్తి కొన్నిట, 'కథాకథితార్థ' కొన్నిట ఇట్లు ఏవేవో చూపినారుగాని ఈ పాఠమేల గ్రాహ్యమాయెనో ప్రథమ సంపుటముననే వివరించియుండిన బాగుండెడిది. ద్వితీయ సంపుటమున దివాకర్లవారు వివరించినారు. చదలువాడ దండిగుంట పండితులు ఈ పాఠమునే గ్రహించి 'నిర్మలములయిన కథలతోను కవిత్వముతోను అర్థముతోను కూడికను, లోఁ=మనస్సునందు, ఆరసి=తెలిసి' అని అర్థము వ్రాసి, 'యుక్తితోఁ—అను తృతీయాంతపాఠము ఆరసి యనుటకు గర్మము లేమింజేసి యసమంజసము. అట్లు అక్షర రమ్యతఁ అనునది ఆదరింపన్ అనుదానికిఁ గర్మముగా నున్నది. ఇటమ్మాత్రము కర్మము నధ్యాహరింపవలయుననుట యుచితముకాదు' అని విశదీకరించినారు. మఱి ఇందలి ఇతరులెవ్వరు? కవీంద్రులు కానివారని అర్థమగుచున్నది. మా తాతగారు తమ తిక్కన సోమయాజి విజయమను నుపన్యాసమున ఇతరులనగా శాబ్దికాదులని వ్రాసినారు. వారు అక్షర రమ్యతను మెచ్చుకొనుటయనగా శబ్దాచితి, వ్యాకరణాంశములుగా నుండవలెనుగదా. ఈ ముద్రణ సంపాదకులు తాము గ్రహించిన పాఠముల యౌచితినిగూర్చి అక్కడి కక్కడనే వ్రాసియుండిన వీరి పరిశ్రమ సార్థకమై యుండెడిది.

తమ తిక్కనసోమయాజి విజయమునులో నన్నయ తిక్కన తారతమ్యమునుగూర్చి మా తాతగారిట్లు వ్రాసినారు: 'ిరిలో తారతమ్య మేర్పఱచుట సుకరము గాదు. నన్నయ పాణినీయముచే సాధ్యముగాక వ్యాకరణాంతరముచే సాధ్యమగు 'ముష్టాముష్టి' ప్రయోగముం గావించినాడు.

'భీమాసురవీరుల ము
ష్టాముష్టిరణచ్ఛటచ్ఛటాశబ్దం బు
ద్దామంబై తద్విపిన మ
హామృగపక్షులకు నతిభయావహమయ్యెఁ'

పాణినీయము ప్రకారము 'ముష్టీముష్టి' అనియే యుండవలయును. 'ముష్టాముష్టి' బోపదేవకృత ముగ్ధబోధసాధ్యము..... ఇట్టి చిక్కులు తిక్కన భాగమునలేవు. ఇట్టివి నన్నయభాగమున ఇంకనుం గలవు. ఇందువలన నన్నయకు 'వాగనుశాసన' 'సకలభాషా వాగనుశాసన' బిరుదములు రూఢి కెక్కుచున్నవి... సీసపద్యములోని 'విపుల'శబ్దము 'సకల'శబ్దమునకు పర్యాయముగా నుండనోవు.' దీనింబట్టిచూడ నన్నయ ఆంధ్రవ్యాకరణమ్మందేగాక సంస్కృతవ్యాకరణమందును

ప్రామాణికుడుగాన 'క్షతరులు' అక్షర రమ్యత నాద రించిరి.

మార్గదేశి కవితలనుగుఱించి మన పండితుల వ్రాత బోధపడకయున్నది. 'మార్గకవితా సంప్రదాయమునే యవలంబించినను ఆతని కవిత్వమున దేశి సంప్రదాయమునకు సంబంధించిన లక్షణములును కన్పించును'అని ఉపోద్ఘాతము. తెలుగు కవితలోనే రెండు పద్ధతులు కలవా? నన్నిచోడుడు మార్గకవులనుగా కాళిదాసాదులను పేర్కొని తదితరులు దేశికవులని స్పష్టీకరించియున్నాడు. ఇది 'సురవరులక్'అను పద్యమున విశదము. బాణునితో మార్గకవిస్తుతి నిలిపి 'ముని మార్గకవిత' పద్యమున దేశికవిత బుట్టించి తెనుంగనిలిపిరి...చాళుక్యరాజు...' అనుటచేత దేశికవిత యనగా తెలుగేయని నిర్వివాదము. సంస్కృతభూయిష్ఠత మార్గము, తెనుగెక్కువయైన దేశి యనుట ఎట్లో! నన్నయ దేశికవియే.

ఉపోద్ఘాతములో వీరెంతో విషయములను సమకూర్చి తమ పరిశ్రమను తెలిపినారు. వానికి ఇక కొంత శ్రమపడియుండిన ఈ క్రింది విషయములు కూడ దొరకి ఇంకను విషయము సమగ్రముగా నుండియుండును. భారతముద్రణమున గత శతాబ్దిలో విశేష శ్రద్ధవహించిన పండితులు శ్రీ పురాణము హయగ్రీవ శాస్త్రులవారు, వావిళ్ల రామస్వామి శాస్త్రులవారు, ఈ శతాబ్దమున టీక రచించిన చదలువాడ సుందర రామ శాస్త్రిగారు, దండిగుంట సూర్యనారాయణ శాస్త్రిగారు మున్నగువారు మాకు బంధువులు— పుదూరు ద్రావిడులు. చదలువాడ దండిగుంటవారి ప్రచురణలను ప్రశంసించిన ముట్నూరి ఆదినారాయణయ్యగారు మధురలో పనిచేసియుండినను మదరాసువారు, వెలనాటి వైదికులు, దండిగుంటవారి యింటి ప్రక్కన తండియార్పేటలోని మూడిండ్లును వారివే. వీరి మనుమడుగారే సుప్రసిద్ధ చరిత్ర పరిశోధకుడు, తెలుగు చోళులమీాద పరిశోధన సల్పిన కీ. శే. ముట్నూరి వెంకటరామయ్యగారు. శ్రీమాన్ నేలటూరి పార్థసారధి అయ్యంగారు నెల్లూరు రంగనాయకుల పేటలో నుండినవారు, వెంకటగిరి రాజాగారి కళాశాలకుచేరిన ఉన్నత పాఠశాలలో ఆంధ్ర పండితులుగా నుండిరి. వీరిది వెంకటగిరికాదు. వీరు గంగవరము వైష్ణవులు. వీరి బంధువు లనేకులు ఆ దినములలో వావిళ్లవారితో కలసి ఆంధ్రగ్రంథములను ముద్రించుచుండిరి. ఒకచోట వీరిది నెల్లూరనియు ఒకచోట వెంకటగిరియనియు దొర్లినది. నెల్లూరివారు శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు సలహా సంఘమందున్నారే, ఇది ఎట్లు ?

ఇట్టి శ్లాఘ్య బృహత్ప్రయత్నములలో చిన్న చిన్న నెరసులు పాటింపదగినవికావుగాని ఇంతింత ధనము వెచ్చించి, ఎందరో పండితులు కలసి చర్చించి ముద్రించునప్పుడు ముద్రణము నిర్దుష్టముగా నుండుటయేగాక సకారణముగ, మరల శంకల కెడమీాయని విధమున నుండగలదని పండితలోక మెదురుచూచుట సహజము. విషయము చక్కగ సమకూర్చు కొన్నారుగాని దానిని సమన్వయపరచు కొనుటలో గలిగిన లోపములను మరల పరిశీలించుట మంచిది. అముద్రిత గ్రంథ చింతామణిని పూర్తిగా ఉపయోగ పరచు కొన్నట్లు కానరాదు. అది చేయదగ్గది. చారిత్రక విషయములనుకూడ మరల పరిశోధింపవలెను. ఆంధ్ర ఛందోవ్యాకరణాది విషయములను తమిళ ఛందాదులతో పోల్చిచూచిన నూతనాంశములు వెలువడగలవు. నన్నయ ప్రామాణికత ఎంతవఱకో తేలగలదు. గ్రాంథిక ప్రయోగముల వాస్తవ స్వరూపము విశదము కాగలదు.

కాలనిర్ణయాదులనుగూర్చి వ్రాసినయెడల ఇది ఇంకను ఎంతో దీర్ఘసమీాక్ష యగునుగాన ఆ చర్చ మఱియొకచోట చేయదగినది.

# పండితరాయల వెటకారాలు

డా. మహీధర నళినీమోహన్

సాయంకాలం పెరటిదొడ్లో బొగడచెట్టుకి వేలాడ గట్టిన ఉయ్యాలమంచంమీద కూర్చుని జగన్నాథభట్టు రసగంగాధరాన్ని మరోసారి తిరగ వేస్తున్నాడు.

'విన్నారా?' అంది లవంగి దగ్గరసా వచ్చి.

తలఎత్తకుండానే 'ఏమిటి?' అన్నాడు జగన్నాథుడు.

'పండితరాజ బిరుదాన్ని చాలామందే తగిలించు కుంటున్నారట ఈ మధ్యని'

పండితరాయలు దస్త్రంమూసి 'నువ్వూ విన్నా వన్నమాట' అన్నాడు.

'ఆ బిరుదు పెట్టుకునే హక్కు వాళ్లకేముందో; ఎవరిచ్చారో?' అంది లవంగి ఆవేశంగా.

'కవిసార్వభౌములు, కవిసమ్రాట్టులు, పండిత రాజులూ ఊరికొకరు బయలుదేరుతున్నారు ఈ మధ్యని. బిరుదు ఒకరు ఇచ్చేదేమిటీ? తానే పెట్టు కుంటాడు. ఏం తప్పా?...అదిగో అల్లా చూడు'.

లవంగి గ్రీవాభంగాభిరామంగా చూసింది.

'ఏమిటీ?'

'ఆ పిచికని చూడు. మెడకింద నల్లగా ఉంది గమనించావా?'

'అయితే ఏమిటీ?' అన్నట్లు చూసింది లవంగి. జగన్నాథుని కళ్లు మిలమిలా మెరిశాయి.

'క్షీరసాగర మథనవేళ సముద్భవించిన హాలా హలం మూడులోకాలనూ దహించివేస్తూఉంటే, దాని దగ్గరకు వెళ్లగల మొనగాడే లేకపోతే, నేనున్నానని చెయ్యిజాపి, ఆ గరళాన్ని గడగడా తాగేసినవాడు మహే శ్వరుడు. అతణ్ణి నీలకంఠుడు అన్నారు.

భయంకరమైన తాచుపాములను అవలీలగా పడగమీద తన్ని ముక్కలు ముక్కలుగా చీల్చి, ఆహ్లా యంగా భోజనం చేయగల పిట్ట నెమలి. దానినికూడా నీలకంఠమనే అన్నారు.

పెరటిదొడ్లో మొలిచిన గడ్డిపరకల మధ్య తిరుగులాడే చిల్లరపురుగుల గర్వాన్ని క్షణంలో హరించి వేయగల ఈ పిచిక కూడా నీలకంఠమే.'

'సెభాష్!' అంది లవంగి.

మాలినీ

గళిత గరళ కంఠః శంకరో నీలకంఠః
ప్రబలతర విషాశీ బర్హిణో నీలకంఠః
అజిర తృణ విసర్పత్కీట దర్పాపహారిన్
కలయసి కలవింక! త్వం చ భో నీలకంఠః.

చంపకమాల

గరళము మింగినట్టి తెగకన్నుల
దేవర నీలకంఠుడే
ఉరగకులమ్ము దున్మెడు మయూరము
సైతము నీలకంఠమే
చెరచెర గడ్డిలో తిరుగు చిల్లర
పుర్వుల గర్వమంతయున్
విరిచి, హతమ్మొనర్పగల పిచ్చుక!
నీవును నీలకంఠివే.

* * *

భట్టోజీ దీక్షితుని 'మనోరమ'ను ఖండిస్తూ 'మనోరమా కుచమర్దనం' వ్రాయడంలో పండిత రాయలు నిమగ్నమై ఉన్నాడు. ఆ నిరంతర పరిశ్రమలో అతడికి ఆకలిదప్పులు తెలియడం లేదు. పండిత సదస్సులకు పోవడం లేదు. సామాన్య పండితుల జోలికి అసలే పోవడం లేదు.

ఏమ్రోయ్! చిల్లరమల్లర పండితులూ! మీరు హాయిగా, స్వేచ్ఛగా, నిరాఘాటంగా వాడానికీ విహరించడానికీ ఇదే సమయం. ఇప్పట్లో మీకు శృంగభంగం అవుతుందనే విచారం అక్కరలేదు. ఆ పని చేయగల ఏకైక సమర్థుడు అవతల మనోరమా కుచమర్దనంలో లీనమై ఉన్నాడు. అది పూర్తి అయ్యే వరకూ మీకు నిశ్చింతే.

ఈ విషయాన్ని మనస్సులో ఉంచుకొని సామాన్యవన్యజంతువులకి పండితరాయలు వెటకారంగా సలహాలు ఇస్తున్నాడు.

ఓ దుప్పీ! కంగారుపడకు.

ఓ గవయమృగమా! భయపడకు

ఓ దున్నపోతా! స్వేచ్ఛగా విహరించు

ఓ పెద్దపులీ! క్షోభ పడకు.

ఓ ఎలుగుబంటీ! కొండకోనలవెంట హాయిగా తిరుగు.

సమస్తవనభూమినీ తన చెప్పుచేతలలో పెట్టుకున్న మృగసార్వభౌముడు అదిగో ఆ అడవిమూల తన పంజాదెబ్బకి పగిలిన మత్తేభకుంభస్థలంలోనుంచి చెల్లాచెదురుగా రాలిపడిన ముత్యాలరాసులను చూచుకుని మురుసుకుంటున్నాడు. ఇప్పట్లో మీకు వచ్చే ప్రమాదం ఏమీలేదు.

స్రగ్ధరా

ఏణాలంసంభ్రమేణ త్యజ గవయ! భయం,
సైరిభ! స్వైర మా స్వ
క్షోభం మాగాస్తరక్షో! విహరగిరి భువి
స్వేచ్ఛయైవాచ్ఛభల్ల!
పారీంద్రః పారదృశ్వా నిఖిల వనభువః
కేవలం మోదతేఽసౌ
మాద్యత్కుంభీంద్రకుంభస్థలవిపుల తటీ
ముక్త ముక్తాకలాపైః.

సగ్ధర

కంగారున్ మాను దుప్పీ! కలగకు గవయ
గ్రామణీ! దున్నపోతా!
శృంగంబుల్ దువ్వ స్వేచ్ఛన్, చెలగవె యెలుగా!
చింత సీకేల వ్యాఘ్రీ!
పొంగారన్ గర్వరేఖల్ మురియ దొడగె నా
పొంత సింగంబు తన్మా
తంగ ప్రోత్తుంగ కుంభస్థల విపుల తటీ
త్యక్త ముక్తాఫలాళిన్.

ఏనుగు గున్న ఒకటి భయం భక్తీ లేకుండా సింహాలు కాపురంఉండే గిరిగుహాప్రాంతభూములలో తిరుగుతోంది. దానిని పండితరాయలు వెటకారంగా మందలిస్తున్నాడు.

ఒరేయ్! ఏనుగుగున్నా! పొగరుగా ఈ కొండ గుహ ప్రాంతాల ఎప్పుడూ తిరగకురా. పాలు కుడుచుకుని సింహప్పిల్ల బబ్బుంది. నీ అలికిడికి అది నిద్ర లేచిందో ఈ భూమిమీద మగ ఏనుగులు మిగలవు సుమా జాగ్రత్త!

పాలుతాగే వయసులోఉన్న చిన్నారి సింహప్పిల్లకి కూడా అంతటి శౌర్యోద్రేకం ఉన్నదనీ, దానికికూడా ఆడ ఏనుగుల జోలికి పోకూడదనే ఉదారభావం ఉన్నదనీ చెప్పడం కవి ఉద్దేశం.

అప్పయ్య దీక్షితుల శిష్యుడొకడు పండితరాయల 'చిత్రమీమాంసా ఖండనా'న్ని ఖండిద్దామని వచ్చాడు ఒకనాడు. ఈ పాటి పనికి తానే స్వయంగా పూనుకుని వాదించవలసిన పనిలేదనీ, ప్రతికక్షుల నోళ్ళు మూయించడానికి తన మనుమడైన మహాదేవభట్టు అయినా చాలుననీ చెప్పడానికి జగన్నాథుడు ఈ కల్పన చేశాడు.

**మంజుభాషిణి**

గిరిగహ్వరేషు గురుగర్వ గుంఫితో
గజరాజపోత! న కదాపి సంచరేః
యది బుధ్యతే హరిశిశు స్తనంధయో
భవితా కరేణుపరిశేషితా మహీ

**మంజుభాషిణి**

గిరి గహ్వరస్థలుల గిరగా ఒరే!
కరిరాజపోత! తిరుగాడ బోకురా!

హరిశాబ ముల్కిపడి ఆవులించెనా
ధర ఆడయేన్గులకె తావగుంజువిూ

* * *

జగన్నాథుడు నూనూగు విూసాల ప్రాయంలో ఉన్నాడు. తండ్రి పేరమభట్టుదగ్గర ఇంకా మహాభాష్యం చదువుతున్నాడు. అప్పటికే ధారాళమైన ఆశువు వశ్యమైంది. అపూర్వమైన వాదనా పటిమ అలవడింది. అప్పటికే ఆ చుట్టుపక్కల ఊళ్లల్లోని ఓపాటి సాహిత్యగాళ్లు అతడిముందర ఏనాడో బలాదూరు అయిపోయారు. అంతవరకూ ఫరవాలేదు అని సరిపెట్టుకోవచ్చుగానీ, ఇటీవల బొత్తిగా పెద్దతలకాయలమీదికికూడా ధూకుడుగా కత్తిదూయడం మొదలు పెట్టేడు. దీనిని ఎల్లా సహించడం? ఎవరితో చెప్పుకోడం?

ఈ విషయాన్ని బొత్తిగా భయం భక్తీలేని కేసరి యువకుని ధౌర్త్యంతో పోలుస్తున్నాడు. ఆడ లేళ్ల గుంపులమీద దూకి సింహకిశోరం ఇష్టం వచ్చినట్లు వీరవిహారం చేసుకోనీ. అందులో తప్పేమీ లేదు. అది అందరూ అవునని అంగీకరించినదే. కాని, ఇటీవల హఠాత్తుగా మత్తేభ వధువుల జోలికి కూడా పోయి, నఖదంతక్షతాదులు చేయడం మొదలుపెట్టేడు కదా, వీడి ఈ అవినయాన్ని గురించి ఎవరికి విజ్ఞప్తి చేసుకోగలరు పాపం!

కురంగీణాం యూథం
నిభృత మిద మంగీకృత మయం
నిరాతంకోయ న్నిర్దయ
హృదయ భావోఽర్దయతు తత్
నివేద్యో వా కస్మి న్నయ మవినయః
కేసరియువా
హఠాన్మత్తేభానాం యువతిషు
విధత్తే నఖపదమ్.

**మత్తేభవిక్రీడితం**

కెరలన్‌వచ్చు విరంకుశమ్ముగ,
కురంగీయూథమున్ హింసకున్
గురిచేయందగు నడ్డువెట్టరెవరున్—
కుంభీంద్రకుంభద్వథూ
గురుగండస్థలులన్ నఖక్షతములన్
క్షోభింపగాజేయు కే
సరి ధూర్తాగ్రణి గూర్చి యెవ్వరికి
విజ్ఞప్తుల్ సమర్పించుటో?

ఇందులో కురంగీణాం యూథం అని ఆడవి లేళ్లనీ, మత్తేభానాం యువతిషు అని ఆడఏనుగులనీ పనిగట్టుకుని సూచించాడు పండితరాయలు. సింహప్పిల్ల పొగరువయస్సులో ఉంది. దానికి దృష్టి ఎంత సేపూ ఆడవాళ్లమీద. కు + రంగీ=చెడునడత గల స్త్రీ. ఆ సింహం తన పరువపు గర్వాన్ని ప్రదర్శించడానికి కురంగశ్రేణులు కావలసినన్ని ఉన్నాయి. వాళ్లని ఏం చేసుకున్నా కాదనే వాళ్లు ఉండరు. కాని పెద్దఇంటి పడుచుల జోలికి పోవడం అక్రమం. 'యువతిషు' అని వ్రాయడంలో ప్రత్యేకత ఉంది. 'యువతీ' అంటే యౌవనంకల స్త్రీ అనీ, 'యువతిః' అంటే యువకుడుకల స్త్రీ (మగనాలి) అనీ అర్థాలు. కేవలం యౌవనవతిని పట్టుకుంటే మరీ అంతగా తప్పుపట్టవలసిన పని లేకపోవును. అతడు నఖప్రయోగం చేసిన ఆడఏనుగులకు మొగుళ్లు ఉన్నారు. అది మరింత ధూర్తలక్షణం. దీనిని 'యువతులు' అని అనువదిస్తే మూలంలోని సొగసు తెలుగులోకి రాదు. ఇక్కడ 'నఖపదం' అనడంలో ఔచిత్యం ఉంది. సింహం గోళ్లని ఆయుధంగా ఉపయోగించడం మామూలే. కాని, నఖక్షతములు శృంగార సూచకాలు.

* * *

జగన్నాథభట్టు తంజాపుర సంస్థానంలో తన పాండిత్య ప్రకర్షనీ, ఆశుకవితా ప్రగల్భతనీ ప్రదర్శించి, రాజునూ సదస్యులనూ మెప్పించాలని వచ్చాడు. అక్కడ తనకి నిలవనీడ దొరుకుతుందనీ, తన సాహిత్య వ్యవసాయానికి అనువైన క్షేత్రం లభించగలదనీ ఆశ పడ్డాడు. కానీ, ఆ సంస్థానంలో ఇటువంటి శషబిషలు ఏవీ పనికిరావని త్వరలోనే తేలిపోయింది.

గురిగింజలు, గాజు పూసలు, పక్షి ఈకలు

తలలో అలంకరించుకొని మురుసుకునే కొండజాతుల వాళ్లు నివసించే గూడెం ఇది. ఇక్కడ మంచి ముత్యాలు అమ్మేవాడూ ఉండడు, ముత్యాల విలువ తెలిసినవాడూ ఉండడు.

**ఆర్యా**

గుంజా రంజిత కబరీ
శబరీ తతిభి ర్గరీయసీ నగరీ
ఇహ నహి ముక్తావణిజః
కోఽపి న ముక్తాగుణజ్ఞోఽపి.

**తేటగీతి**

సిగలగురిగింజపేరులు చేర్చిమురియు
కోయవాండ్రు వసించెడు గూడెమిద్ది
మంచిముత్యాల వర్తకుల్ మసల రిచట
లేరు ముక్తాగుణజ్ఞులు లెక్కకైన

* *

ఏమయ్యోయ్! కంసాలీ! కుండలాలు చేయడంలో నువ్వు మొనగాడివే కావచ్చు—కాని, నీ నేర్పు ఈ ఊళ్లో వ్యర్థం. ఏమంటే ఇక్కడ చెవులు కుట్టించుకున్నవాడేలేడుకదా! ఊరంతా దిగంబరులే అయినప్పుడు చాకలి ఎంతనేర్పరి అయితేమాత్రం ఏం లాభం?

**ఆర్యా**

సాధో! కుండలఘటనా
పరిశ్రమా దల మవిద్ధకర్ణాహ్యాః
వసతి దిగంబరనగరే
రజక శ్చతురోఽపి కిం కురుతే?

వలదు కంసాలి కుండలమ్ముల తయారి
చెవులుకుట్టిన వార లీ సీమలేరు
పట్టణంబెల్ల దిసిమొలవారెయున్న
ఎంతఘనుడైన చాకివాడేమిచేయు?

ఓ కోకిలా! నీ కోమల కుహూకారం కట్టిపెట్టు. ఇక్కడి పామరులు నీ పంచమస్వరం విన్నారంటే 'అబ్బబ్బ! చెవులు పగిలిపోతున్నాయి, ఈపాడు కూతలు కూస్తున్నదెవరూ? పట్టుకోండి, కొట్టండి, చంపండి'అని దుడ్డుకర్రలు పట్టుకువస్తారు. అనవసరంగా ఎందుకు చస్తావుగానీ నా మాటవిని నోరు మూసుక్కూర్చో.

**వసంత తిలక**

కిం కోమలైః కలరవైః పిక! తిష్ఠ తూష్ణీ
మే తేతు పామరనరాః స్వరవాకలయ్య
కో వారయే త్యయ మయే నికటే కటూని
రే వధ్యతా మితి వదంతి గృహీతదండాః.

**మత్తకోకిల**

కోమలాద్భుత మంజులమ్మగు కూత చాలిక మానవే
పామరుల్ విని నీ కుహూకృతి వల్లమాలిన బాధతో
ఏమిరా యిట గోలసేయున దెవ్వ డీతడు చంపివే
తాము రమ్మని దుడ్డుకర్రల దాల్చివత్తురు కోకిలా!

* * *

ఏ దేశంలో చందనవృక్షాలనూ, మామిళ్లనూ, సంపెంగలనూ తెగ నరికించి కరివేరపుమొక్కలనీ, నేపాళపు బడితెలనీ రక్షిస్తూ ఉంటారో; హంసలను, నెమళ్లను, కోకిలలను హింసించి, కాకులను బహు ప్రీతిగా పెంచుతూ ఉంటారో; ఏనుగులని గాడిదలని సమంగా క్రయ విక్రయాలు చేస్తారో; పత్తినీ పచ్చ కర్పూరాన్నీ ఒకే తక్కెడలో పెట్టి సరితూచుతూ ఉంటారో ఆ దేశానికి ఒక్క నమస్కారంఅంటూ ఒక దేశాన్ని పండితరాయలు వెటకారం చేస్తాడు.

**శార్దూల విక్రీడితం**

ఛేదశ్చందన చూత చంపకవనే రక్షా కరీరద్రుమే
హింసా హంస మయూర కోకిలగణే కాకేచ బహ్వాదరః
మాతంగాత్ఖర విక్రయః సమతులా కర్పూర కార్పాసయో
రేషాయత్ర విచారణా గుణగణే దేశాయ తస్మైనమః.

**మత్తేభవిక్రీడితం**

కరివేరంబుల బెంప చందన
వనిన్ గాల్పించి, కాకంబు పం

జరమందుంచి మయూరకీరపిక
హంస శ్రేణి హింసించుచున్
కరులన్ గాడిదకమ్మి,
ఒక్క తులలో కర్పూరమున్ దూదియున్
సరితూపించెడు రాజ్యలక్ష్మికి
నమస్కారంబు గావించెదన్.

కాశ్మీరదేశంనుంచి కాశీవెడుతూ ఒక విద్వత్కవి ఒకనాడు షాజహాన్ చక్రవర్తి దర్బారుకి వచ్చాడు. ఆ సమయంలో దర్బారులోని పండితమ్మన్యుడొకడు తానూ గొప్పవిద్వాంసుడనే అని తెలియబరచే ఉబలాటంతో అవాకులూ చవాకులూ వాగడం మొదలు పెట్టేడు. అతగాడి ప్రేలాపన విని ఆస్థానంలోని మిగిలిన జనాభాకూడా ఇంతింతమాత్రపు పండితులే కాబోలునని కొత్తగావచ్చిన కాశ్మీర పండితుడు అపోహపడి, వారణాసిలో టమటమా వేసేస్తాడేమోనని పండితరాయలు కంగారుపడ్డాడు. అతడిని వారించే ఉద్దేశంతో అన్యాపదేశంగా ఒక కల్పన చేశాడు.

ఓ కాకీ! ఈ రాజహంస మరికాస్త సేపటిలో దేవవాహినీపయస్సులలో క్రీడించడానికి స్వర్గలోకానికి వెళ్లిపోతుంది. అది దూరంగా వెళ్లిపోయేదాకా నువ్వు కాస్త నోరుమూసుకుని కూర్చుందూ, నీకు వెయ్యి న్నొక్కదండాలు. లేకపోతే, నీ కూతవిని భూలోకంలోని పక్షులన్నీ ఇదే మాదిరిగా కర్ణకఠోరంగా కూస్తాయని హంసవెళ్లి దేవలోకం అంతటా చాటేస్తుంది.

**వసంత తిలక**

త్రోటీపుటం కరట! కుడ్మలయాథ తాత !
యావ త్ప్రతివ్రజతి నాక మయం మరాళః
నోచే దమంగళ కఠోర రవా విహంగాః
సర్వే భువీతి నిజసంసది శంసితానః

**వసంత తిలక**

ఆ రాజహంస త్రిదశాలయమేగు దాకన్
నోరెత్తకో కరట ! నూరు సలాములయ్యా!
స్వారాజ్యవీధి నదిచాటును పక్షులెల్లన్
ఘోరాతిఘోరముగ కూయును ధాత్రినంచున్.

* * *

ఓ కాకులారా! కొంగలారా! కప్పలారా! తోడేళ్లారా! మీకందరికీ వంగి నమస్కరిస్తున్నాను. చేతులు జోడించి ఒక ప్రార్థన చేస్తున్నాను. అది ఏమిటంటారా? అదిగో ఆ తియ్యమామిడిచెట్టు తాలూకు ఎర్రనిచిగుళ్లు తిని వగరెక్కిన గొంతుకతో గండు కోయిల పంచమ రాగాలాపన ప్రారంభించింది. జను లందరూ దాని కూతకోసం చెవులు దోరపెట్టుకుని ఎదురుచూస్తున్నారు. తమరు దయచేసి గోలచేయకుండా ఊరుకోండి, అదే పదివేలు.

అల్పులముందర అతివినయం చూపించడంలోనూ, వాళ్ల చేయగల సాయం నోరుమూసుకోవడం మాత్రమే అనడంలోనూ వెటకారంతో కూడిన హాస్యం

ఏమర్రోయ్! ఊరకప్పలూ! పిల్లకాకులూ! మీకో దండం, కాస్త వాగుడు కట్టిపెడతారా? పశువూ, పశుపతీ తప్ప తక్కినవారందరూ శిరవ్యంతో శిరఃకంపంచేసేటట్లు కవిత్వం చెప్తున్నాడు పండితరాయలు. మమ్మల్ని కాస్త వివినిస్తారా? అని ధ్వని.

**ఉపజాతి**

కాకావృకాః కోకబకాశ్చభేకాః!
ప్రణమ్య యుష్మానిదమేవయాచే
కోలాహలం మా కురుత క్షమధ్వం
పుంస్కోకిలః కూజతి మంజురావమ్.

**ఆటవెలది**

వందనమ్ముచేసి ప్రార్థించెదను మిమ్ము
కాక భేక వృక బకంబు లార!
కంఠమెత్తి పికము కర్ణపేయమ్ముగా
కూయసాగె— గోలసేయవలదు.

* * *

'నరసింహంగారి ఇంట్లో గూటిలోఉన్న పుస్తకాలు ఎత్తుకుపోయారట విన్నారా?' అంది కామేశ్వరి తాంబూలం అందిస్తూ.

'ఎవరూ?' అన్నాడు జగన్నాథుడు భార్యకేసి చూసి.

'తిమ్మన అని చెప్పుకుంటున్నారు'

'తిమ్మన్నా? ఆశ్చర్యంగా ఉందే. నమ్మ లేకుండా ఉన్నాను.'

'ఏమీ! వాడివి చిన్నప్పటినుంచీ అటువంటి బుద్ధులేకదా?'

'వాడి హస్తలాఘవాన్ని నేను శంకించడం లేదు. తిమ్మనకీ పుస్తకాలకీ అమడదూరంకదా. వాడు ఈ పని ఎందుకు చేసిఉంటాడు అని. ఏ బిందో తప్పేలాయో ఎత్తుకు పోయాడంటే ఆశ్చర్యం కించిత్తూ ఉండకపోను.'

అంతలో గుడిపక్కపుంతలో గాడిద ఒకటి శ్రవణపేయంగా ఓండ్రపెట్టింది.

'ఇతరుల ద్రాక్షపళ్లు గాడిద కలియబడి తినే సిందని వింటే – అందువల్ల మనకివచ్చే నష్టం ఏమీ లేకపోయినా—గాడిదేమిటీ, ద్రాక్షపళ్లజోలికి పోవడ మేమిటీ—బొత్తిగా అసమంజసంగా ఉందే అని నా మనస్సు కలతబడుతోంది.'

**ఆర్యా**

యద్యపి కానో హానిః
పరకీయాం చరతి రాసభే ద్రాక్షామ్
అసమంజస మితి మత్వా
తథాపి ఖలు ఖిద్యతే చేతః

**ఆటవెలది**

పరుల ద్రాక్షపండ్లు ఖరము మేసినదన్న
హానిలేదు మనకు దానివల్ల
అయినగాని యిద్ది అసమంజసంబంచు
తలచి నా మనంబు కలతబారె.

'భోగయ్య చిత్తుగా తాగి, కనిపించినవాళ్లనల్లా తిడుతున్నాడు. చెరువునుంచి నీళ్లు తెస్తూంటే తల్లినే తిడుతూ కనిపించాడు. నాకు భయంవేసి మరోదారి వెంట వచ్చేశాను గబగబా' అన్నది కొడుకుతో మహాలక్ష్మి బిందె దింపుకుంటూ.

'ఆ బ్రహ్మముండాకొడుకు వాడి నొసట అటు వంటి వంకర టింకర రాత రాశాడు. జోగయ్య కారుకూతలు కూశాడంటే అది వాడి తప్పా? పాపం!' అన్నాడు జగన్నాథుడు.

తియ్యమామిడి చెట్లమీద కోకిలలతో సహ వాసం చేస్తూ ఉండమని బ్రహ్మ నీ నొసట వ్రాయలేదు. కాకీ! నీ చిత్తంవచ్చినట్లు కారుకూతలు కూసుకో. ఆ దోషం బ్రహ్మది అవుతుందేకాని నీదికాదు.

విధిరేవ విశేష గర్హణీయః
కరట! త్వం రట కస్తవాపరాధః
సహకారతరౌ చకార కిం తే
సహవాసం సరణేన కోకిలేన.

**తేటగీతి**

గున్నమామిడి చెట్లపై కోకిలముల
గలసి నివసించు సౌభాగ్య గరిమనీని
ధాతదేకాని యీ తప్పు తమదికాదు
వాయసమ! కారుకూతల గూయవమ్మ!

* * *

పెరటిదొడ్లో మొన్నటి గాలివానకి కూలిపోయిన వెలగ చెట్టుని మహాదేవభట్టు గొడ్డలితో నరుకు తున్నాడు. కట్టెలు మోపుగాకట్టి ఇంట్లోకి మోసుకు రావడానికి బుజానికి ఎత్తుకున్నాడు జగన్నాథుడు.

'తాతయ్యా! అంతబరువు ఎత్తకండి. నే నున్నానుగా, మీ కెందుకా శ్రమ?' అని వారించ బోయాడు మహాదేవుడు.

పండితరాయల మనస్సులో ఏవేవో పాత జ్ఞాప కాలు కదలాడేయి.

'నేను చేసిన పాపాలకి నాకీ శిక్ష పడాల్సిందే లేరా అబ్బీ!' అన్నాడు నవ్వుతూ.

మహాదేవుడు అయోమయంగా చూశాడు.

'నేను చిన్నప్పుడు ఎటువంటి దారుణ పాతకాలు చేశానో తెలుసా? నానా దేశాలూ తిరిగి, అడ్డమైన రాజుల్ని పట్టుకుని, నువ్వు ఇంద్రుడివి, చంద్రుడివి, సాక్షాత్తూ హరివి, హరుడివి, బ్రహ్మవి, సింగినాదానివి, జీలకర్రవి అంటూ తోచినట్లల్లా పొగిడేశాను. అటువంటి అబద్ధాలు చెప్పిన పాపానికి ఈ కట్టెమోపులు మోసేశిక్ష ఏమంత ఎక్కువకాదు లేరా!' అని గొంతు సవరించుకున్నాడు జగన్నాథుడు.

'ఆగు తాతయ్యా! గంటం ఆకులూ తీసుకురానీ' అని గొడ్డలి వదిలి, లోపలకి పరుగెత్తేడు మహాదేవుడు.

**వసంత తిలక**

ఇంద్రోయమేష వరుణోఽసి హుతాశనోఽసి
బ్రహ్మ హరో హరి రసీ త్యసకృద్యదుక్తిః
భూపాల మౌళిమణి రంజిత పాదపీఠ !
తస్యానృతస్యఫల మింధన ముద్వహామి

**మ త్తేభ విక్రీడితం**

స్మరుడంచున్ హరియంచు నింద్రుడనుచున్
చంద్రుండు సాక్షాత్తు త
ద్గిరిశుండంచును బ్రహ్మదేవుడనుచున్ కీర్తించితిన్
మున్ను నిన్
పరరాణ్మస్తక రత్నరంజిత పదాబ్జా! ఆ అబద్ధాల క
బ్బురపున్ సత్ఫలమబ్బె—కట్టియల మోపుల్
మోయుచున్నా నిదే.

మహాదేవభట్టు ధూకుడుగా ఇంట్లో అడుగు పెట్టేడు. శిఖ విడిపోయిఉంది. కళ్లు జేవురించి ఉన్నాయి. పెదవులు ఇంకా అదురుతున్నాయి.

మనవడి అవతారంచూసి జగన్నాథుడు కంగారు పడ్డాడు.

'ఏమైందిరా? ఏమిటా హడావిడి?'

'వాడు మళ్లీ నోరెత్తకుండా చేశానులెండి' అన్నాడు మహాదేవుడు వగరుస్తూ.

'వా డెవడూ?'

'అదే ఆ పరబ్రహ్మ శాస్త్రిగాడు. ఊచిపుచ్చుకుని లెంపకాయ కొట్టేను. అనుష్టుప్పు తప్పుల్లేకుండా రాయలేడు తానో గొప్ప కవినన్నట్లు మాట్లాడుతున్నాడు వెధవ ఏకదేశాన్వయాలూ వీడూనూ.'

'అనుకోనీ నీదేం పోయిందీ?'

'కేవలం అంతే అంటే నేను చెయ్యిచేసుకోవలసిన పనేలేదు. తానట అపరపండితరాయలట.'

జగన్నాథుడికి నవ్వొచ్చింది.

'మూడున్నర గ్రామాలకి ప్రభువు అయిన ఓ అనామకుడి దగ్గర కొలువుచేసి, ఓ చిన్నమాన్యం సంపాదించుకున్న సేవకుడు తాను కూడా భూపతినే అనుకుంటున్నాడు. వాడి కొడుకుకి అహర్నిశలూ రాజపదం మీదనే మక్కువ. ఓసిగ్గా! నీవు నిలవ నీడ లేకుండా పోయావు కాదుటే!'

**వసంత తిలక**

యః కుంతపాణిరిహభూప ఇతిప్రసిద్ధో
భూఖండమాత్ర విభవః పరసేవకశ్చ
తస్యాత్మజః సతతమిచ్ఛతి రాజశబ్దం
వ్రీడే! జగజ్జనని! హంత! నిరాశ్రయాసి.

**వసంత తిలక**

కుంతమ్ము కేలగొని కొల్చెడు తొత్తు మాన్యం
బింతంతయున్న ధరణీంద్రుడనంచు నిక్కున్
స్వాంతాన రాజపదమాతని పుత్రకుం డ
శ్రాంతమ్ము గోరును—నిరాశ్రయవైతి సిగ్గా!

*  *  *

పక్క ఇంటిలోనుంచి ధమ్మూధిమ్మూమని పిడిగుద్దుల చప్పుడు, వాటివెంట అణిచిపెట్టుగుంటున్న ఏడుపూ వినవచ్చాయి. మరి కాస్త సేపటిలో ఆ ఇంట్లోనుంచి ఆడమనిషిని బయటికీడ్చి, తలుపు భళ్లున వేసుకున్నాడు ఇంటియజమాని.

ఆ కొంపలో ఇటువంటి సంఘటన జరగడం ఇదే మొదటిసారికాదు. వారంపదిరోజులకోసారి దేహశుద్ధీ, ఏడుపుల్సూ, తిరిగి కలుసుకోవడాల్సూ మామూలే,

జగన్నాథుడు లోగడ రెండుమూడుసార్లు ఆ పశువుకి చెప్పిచూశాడుకానీ లాభంలేకపోయింది. పాపం! తన్నినా, తిట్టినా, చంపినా ఆ ఇల్లాలికి ఆ మొగుడే దిక్కు. వాడిని ఆశ్రయించవలసిందే.

ఓ మేఘుడా! గొంతుఎండిపోయిన ఈ చాతకిని భయంకరమైన ఉరుములతో కసురుకో నీ ఇష్టం. మహాప్రభంజనం వీయించి గెంటిపారవెయ్యి నీ చిత్తం. వడగళ్లు విసిరి ఒళ్లు హూనంచేసెయ్యి నీ దయ. నువ్వుతప్ప వేరే ఆధారంలేని దిక్కులేనిపక్షి ఇది. నువ్వు దయదలిచి విదల్చే చినుకులతో గొంతు తడుపుకుని ఏదోవిధంగా బతుకువెళ్లబుచ్చుతున్న ఈ నిర్భాగ్యురాలు ఎక్కడికిపోతుందీ? నీ ఇష్టంవచ్చినట్లు కానియ్యి.

**వసంత తిలక**

> వాతైర్విధూనయ విభీషయ భీమనాదైః
> సంచూర్ణ యత్వమథవా కరకాభిఘాతైః
> త్వద్వారిబిందుపరిపోషిత జీవితస్య
> నాన్యాగతి ర్భవతి వారిద! చాతకస్య.

**మత్తేభ వి॥**

> పెనుగాలిన్ పడగెంటుమా!
> ఉరుములన్ భీతిల్లగా జేయుమా!
> వెనువెంటన్ వడగళ్లమోది తనువున్
> విచ్ఛిన్నముం జేయుమా!
> ఘనుడా! నీవు విదల్చు నీరములనే
> కాంక్షించి యేదో విధిన్
> దినముల్ పుచ్చెడు వానకోయిలలకున్
> దిక్కేది వేరే యికన్?

* * *

సహస్రబ్రాహ్మణ్యానికి భూరి సంతర్పణ జరుగుతోంది. వద్దు వద్దు అంటూ విస్తరికి రెండు చేతులూ అడ్డుపెడుతున్నా వినకుండా విస్తట్లో పిండివంటలు గుమ్మరించుకుంటూ పోతున్నారు వడ్డనగాళ్లు. పందిళ్లకి అవతల నడ్డికి అంటుకున్న డొక్కలతో ఎండలో పడిగాపులు పడుతున్న ముష్టివాళ్ల మీద గావుకేకలు వేస్తున్నారు.

భోజనం చేస్తున్న పండితరాయల మనస్సు కలగిపోయింది.

ఏమయ్యా! మేఘుడా! పులగంలోకి మళ్ళీ పప్పుదేనికయ్యా! ఆ సరస్సులు అన్నీ పుష్కలంగా నీటితో నిండి ఉన్నాయికదా, వాటిలోనే మళ్లీ మళ్లీ వర్షిస్తావుకానీ, గొంతుక ఎండిపోయి కళ్లు తిరిగి పడిపోబోతున్న ఆ చాంతకప్పకుల నోళ్లల్లో నాలుగు చినుకులు రాల్చవుకదా! నీ దాతృత్వం మెచ్చదగ్గది సుమా!

**ఆర్యా**

> జలధర! భవతశ్చరితం
> కిమిదం పూర్ణే ఒపి పూరయసి
> చిరయాచక సారంగే ఒ
> పరిమిత తృష్ణే న శీకరం కిరసి.

**కందం**

> నిండినవానినె మరిమరి
> నిండించెద వొక్కచుక్కనీయవుకాదా
> ఎండినగొంతుల చాతక
> తండమ్ముల కెంత గొప్పదాతవు జలదా!

* * *

ఓ మేఘుడా! నీ శబ్దమాధుర్యం అందరికీ తెలిసినదే. (ఉరుములు కఠోరంగా ఉంటాయి.)

నీ మిత్రానుకూల్యత్వం కూడా విదితమే. (మిత్రుడుఅంటే సూర్యుడు, స్నేహితుడు అని రెండు అర్థాలు. మబ్బులుపడితే సూర్యుడు మూసుకు పోతాడు.)

నీ ప్రాబల్యకాలంలో కోయగూడెములకు మంచి రక్షణ ఏర్పడుతుంది. (వర్షాకాలంలో బీదలైన కొండవాళ్ళ చుట్టుగుడిసెలు నీళ్లునిలిచి పాడవుతాయి.)

నీవు ఐశ్వర్యంతో విరాజిల్లే రోజులే మాకు సుదినాలు. (మబ్బులుపట్టిన రోజును దుర్దినం అంటారు.)

తామరతూడులుతినే హంసలు నీ సౌజన్యాన్ని చాటడంలేదా? (హంసలికి మేఘదర్శనం కిట్టదు,

వర్షాకాలం రాగానే హంసలు దూరదేశాలకు తరలి వెళ్లిపోతాయి. హంస అంటే యోగీశ్వరుడని మరో అర్థం. కందమూలములు తినే యోగులు సహితం నీ దయవల్ల దేశాంతరగతులై పోతున్నారని వెటకారం.)

దుర్మార్గుడైన ప్రభువును ఉద్దేశించి చేసిన స్తుతి నింద ఇది.

**శార్దూల వి**

జ్ఞాతా త్వన్మృదుశబ్దతా సువిదితం
మిత్రానుకూల్యంచ తే
సంత్రాతాః శబరాశ్రయాశ్చ
బహవః ప్రాబల్యకాలే తవ
త్వత్సంపత్తిఘనం దినంహి సుదినం
పాథోద! కింబ్రూమహే
సౌజన్యం ప్రకటీకృతం హి
భవతో హంసైర్మృణాళాశనైః

**మత్తేభ విక్రీడితం**

తెలిసెన్ నీ మృదుశబ్దతల్,
తెలిసె త్వన్మిత్రానుకూల్యత్వమున్
బలిసెన్ రక్షణ బీదకొంపలకు
నీ ప్రాబల్యకాలమ్మునన్
జలదా! పండుగ నింగి నీ మహిమచే
సంఛన్నమైనప్పుడే
జలజంబుల్ తిను రాజహంసములు
నీ సౌజన్యముం జాటవో?

* * *

నాలుగుదారులమొగలో ఒక మహావృక్షం పెరిగింది. దాని చల్లని నీడలో విశ్రమించి, అమృతోపమానములైన దానిపళ్లు కడుపునిండా మెక్కి, బుద్ధిహీనులైన బాటసారులు కొందరు ఆ చెట్టు కొమ్మలువంచి, విరిచిపోవడాన్ని చూసిన పండితరాయల గుండె భగ్గుమంది. ఆ దుర్మార్గులమీద కలిగిన తనకోపాన్ని ఆ చెట్టుమీదనే ప్రకటిస్తున్నాడు.

ఓ సద్వృక్షమా! నలుగురూ నడిచివెళ్లే దారిలో ఎందుకు పుట్టేవు? పుడితే పుట్టేవు; ఇంత చల్లని దట్టమైన నీడ ఎందుకు ఇస్తున్నావు? ఇంత మధురమైన పళ్ళు ఎందుకు కాస్తున్నావు? ఇటువంటి బుద్ధితక్కువ పనులు చేసినందుకు దుర్మార్గులైన బాటసారులు నీ శిఖలువంచి, నీ శాఖలు విరిచి, నీ పళ్లు రాలగొటేరంటే కొట్టరుమరీ, ఫలితం అనుభవించు; తప్పదుమరి.

సజ్జనుడివల్ల ఉపకారాలుపొంది, అతడి వెన్నునే పొడిచే దురాత్ములమీద తనకోపం ప్రకటించే అవకాశం లేక ఆ మంచివాడినే తిడుతున్నట్లు కనిపించే నిందాస్తుతి ఇది.

**శార్దూల విక్రీడితం**

కింజాతోఽసి చతుష్పథేఘ
నతరం ఛన్నోఽసి కిం ఛాయయా
ఛన్నశ్చే త్ఫలితోఽసి కిం ఫలభరైః
పూర్ణోఽసి కిం సర్వదా
హే సద్వృక్ష! సహస్వ సంప్రతిశిఖా
శాఖాశతాకర్షణ
క్షోభోత్పాటనభంజనాది జనితం
స్త్వైరేవదుశ్చేష్టితైః

**ఉత్పలమాల**

పుట్టగనేల నల్వురను పోయెడి
త్రోవల? ఏల చల్లగా
దట్టపు నీడనీవలె?
సదా ఫలగుచ్ఛము లీయనేటికో
చెట్ట! సహించు తప్పదిక
చేసిన కర్మకు పండ్లురాలగా
గొట్టి, భవచ్ఛిఖం దునిమి,
కొమ్మలుకూల్చిన మానవాధముల్.

* * *

దేవవాహినిలోనూ, మానస సరస్సులోనూ విహరించవలసిన రాజహంసా! వీధులలోని మురుగు నీటితో నిండిన ఈ పాడు చెరువులో నివసించాలని వచ్చావా? నీకేమైనా మతిపోయిందా? దురదృష్టం తన్నుకు వచ్చిందా? సరేలే, నీకు అంతగా కోరికగా ఉంటే

కాదనడం దేనికీ? అయితే, ఇక్కడికి మకాం మార్చే ముందు నువ్వు నేర్చుకోవలసిన విషయాలు కొన్ని ఉన్నాయి. జాగ్రత్తగా విను. ఇక్కడి కొక్కిరాయిలమీద నమ్మకం పెంచుకోవాలి నువ్వు. గోదురుకప్పలయందు వినయం ప్రకటించడం నేర్చుకోవాలి. జలగలతో సంబంధబాంధవ్యాలు పెట్టుకోవాలి. తీతువులతో సమానత్వం నెరపాలి.

మహారాజుబిడ్డ. యౌవరాజ్యపట్టాభిషిక్తుడు. రేపోమాపో రాజు కావలసినవాడు. తెలివితక్కువచేతనైతేనేం, నెత్తిమీద శని తాండవిస్తూ ఉండడం చేతనైతేనేం, తన అంతస్థు మరిచి, జూదరులతో సహవాసంచేసి, కల్లుపాకలదగ్గర తారట్లాడుతూ ఉంటే, అతగాడిని మందలించే ఉద్దేశంతో పండితరాయలు చేసిన కల్పన ఇది.

**శార్దూల విక్రీడితం**

ఏషా పుష్కరిణీమరాళ!
మలినైశ్ఛన్నా కువీధీజలై
ర్యస్యామజ్ఞతయా విధే రకృపయా చే
ద్వస్తు మాకాంక్షసే
విస్రంభో బకమండలేషు
వినయోభేకేషు సంబంధితా
రక్తాంధస్సువిధీయతాం
సుజనతా కోయష్టికశ్రేణిషు.

**చంపకమాల**

మలినజలమ్ముతోడ కొరమాలిన
యిక్కడి పాడుగుంటలో
తెలివియుతేటలేక వసతిం
గొననెంచితివేని హంసమా!
అలవడుగాక నీకు వినయమ్ము
బకమ్ములయందు; నెయ్యమున్
జలగలతోడ, తీతువుల సంగతి,
కప్పలతోడ వియ్యమున్.

* * *

షాజహాను చక్రవర్తికి, యువరాజు దారాషకోకి అత్యంతగౌరవపాత్రుడైన కారణంచేత జగన్నాథ పండితునిమీద ఢిల్లీ దర్బారులోని చాలామందికి కన్నెర్రగా ఉండేది. అతడికి విషప్రయోగం చేయడానికికూడా ప్రయత్నాలు జరిగేయి. సుడి బాగుండి బతికి బయటపడగలిగేడు. ఆ సమయంలో చెప్పినశ్లోకం ఇది.

ఓ ఖలుడా! మహానుభావా! నీవు సుగుణజన పక్షపాతివి (మంచివాళ్ల పక్కలో పొడిచేవాడివని మరో అర్థం.) నిన్ను ఎల్లా ప్రస్తుతించనూ? సాధుజనులను ఒక్కక్షణంకూడా మరిచిపోవుకదా! నీ మనస్సులో ఎప్పుడూ వాళ్లనిగురించిన ఆలోచనలేకదా!

**ప్రమితాక్షరా**

కిమిహం వదామి ఖల! దివ్యమతే!
గుణపక్షపాత మభితో భవతః
గుణశాలినో నిఖిలసాధుజనాన్
య దహర్నిశం ఖలు విస్మరసి.

**ఆటవెలది**

ఎంతదివ్యమతివి! ఎట్లు నిన్ను నుతింతు?
పరమసుగుణ పక్షపాతి! ఖలుడ!
రేబవళ్లు నీదుహృదయమ్ములో నిల్పి
సాధుజనుల మరువజాలవైతి.

* * *

ఇంతశ్రమపడి సద్గుణాల నన్నింటినీ ఆర్జించడానికి ప్రయత్నిస్తున్నావెందుకయ్యా? మహానుభావా! ఈ సుగుణాలు ఎందుకూ? నెత్తినవేసికొట్టుకోడానికా? నేను ఒకమంచిమాట చెప్తా విను— నీకు బాగా నచ్చిన సరుకు—అదీ ఇదీ అనిలేదు ఏదైనాసరే— నీ ఇష్టం వచ్చినట్టు అనుభవించు. ఆంబోతులా శరీరం పెంచు. ఇంతకన్న ఈ కలికాలంలో శ్రేయస్కరమైనది మరొకటిలేదు.

**శార్దూల విక్రీడితం**

కస్మై హంత! ఫలాయ సజ్జన!
గుణగ్రామార్జనే సజ్జసి
స్వాత్మోపస్కరణాయ చే న్మమవచః
పథ్యం సమాకర్ణయ

యే భావా హృదయం హరంతి
నితరాం శోభాభరైః సంభృతా
స్తైరేవాస్య కలే కలేబరపుషో
దైనందినం వర్తనమ్.

**మత్తేభ విక్రీడితం**

పలుకష్టంబులకోర్చి యిట్టి
సుగుణవ్రాతంబు నార్జింతువే
ఫలముంగోరి మహానుభావ!
వినువా పథ్యంబులైనట్టి మా
పలుకుల్—నీ మది మెచ్చునట్టి
సరుకుల్ పల్మారు సేవించి యీ
కలిలో దేహము పెంచుటొక్కటె
సుమీ కార్యం బవశ్యం బికన్.

* * *

అది క్రీ. శ. 1674 వ సంవత్సరం మధురలో ఒక తాటాకుపాకలో కుక్కిమంచంలో ఉపద్రష్ట జగన్నాథ పండితరాయలు పండుకునిఉన్నాడు. అప్పుడే వారంరోజులుగా మంచం దిగడంలేదు. గంటం పట్టుకునే ఓపికకూడాలేదు. అప్పుడూ అప్పుడూ ఆయన నోటివెంటవచ్చే శ్లోకాలను మనుమడు మహాదేవభట్టు వ్రాసుకుంటున్నాడు. తన జీవితం ఎంతలో ఎల్లా మారిపోయిందో తలుచుకుంటే కళ్ళనీళ్లు వస్తున్నాయి ఆయనకు.

'ఏమైంది? తాతగారూ!' అన్నాడు మహాదేవుడు. ఆ కన్నీళ్లలోనే తెరలుతెరలుగా నవ్వున్నూ వచ్చింది ఆయనకు. తాతగారికి మతి చలించలేదు కదా అనుకున్నాడు మనవడు. 'హకీమ్'ని పిలుచుకు రావడానికి చెప్పుల్లో కాళ్లు పెట్టుకుంటున్న మనవణ్ణి దగ్గరకు పిలిచాడు.

'నాకు కన్నీళ్లు ఎందుకువచ్చాయో తెలుసా?'

మహాదేవుడు తాతగారి కళ్లల్లోకి చూశాడు. ఆయన కళ్లల్లో చిలిపితనం కొట్టవస్తోంది.

'దారిద్ర్యదేవికి కలుగబోయే కష్టాలు తలుచుకుంటే నాకు దుఃఖం ఆగడంలేదురా అబ్బీ!'

'ఏమిటో ఆవిడగారికి రాబోయే కష్టం?'

'అల్లా అడుగు చెప్తాను. ఇన్నేళ్లుగా నన్నే నమ్ముకుని, క్షణం విడిచిపెట్టకుండా మూడు పువ్వులూ ఆరు కాయలుగా దారిద్ర్యదేవత వృద్ధి పొందుతోందికదా! ఈ నా దేహం ఇంకెంతకాలం ఉంటుందీ? రేపోమాపో రాలిపోయేదేకదా! ఆ తరవాత పెద్దమ్మకి నిలవనీడ ఉంటుందో ఉండదో, ఆమె రోజులు ఎల్లా వెళ్లబుచ్చుతుందోకదాఅని తలుచుకుంటే నాకు దుఃఖం పొంగిపొంగివస్తోందిరా. మా ఇద్దరి స్నేహానుబంధం అటువంటిది మరి—ఏదీ గంటం అందుకో.'

**ఉపజాతి**

దారిద్ర్య! శోచామి భవంత మేవ
మస్మచ్ఛరీరే సుహృదిత్యుషిత్వా
విపన్నదేహే మయి మందభాగ్యే
మమేతి చింతా క్వ గమిష్యసి త్వమ్.

స్నేహితునివోలె నా మేను చెట్టవట్టి
వృద్ధిపొందితి వినాళ్లు బీదతనమ!
ప్రాణములు బాయనున్న న్నన్ వదిలిపెట్టి
యెందుబోయెదవనుచు చింతించుచుంటి.

[ఇందులో ఉదాహరించిన తెలుగు పద్యాలు డాక్టర్ మహీధర నళినీమోహన్ అనువదించిన భామినీ విలాసంలోనివి.]

# సంగీత స్వరప్రవాహం

## దేవరాజు మహారాజు

జపానుకు బౌద్ధమతాన్ని ప్రసాదించింది భారత దేశం. అలాగే సంగీతాన్ని కూడా వెనువెంటనే వరంగా ఇచ్చిందేమోననిపిస్తోంది. మనదేశం సంగీతం జపానుకు చైనా, కొరియాలద్వారా ప్రవహించింది.

పూర్వంనుండి మనకు సంగీతశాస్త్రాలు ఎలా వున్నాయో వారికీ అలాగే వున్నాయి. అక్కడి పాపలు మాటలు నేర్చుకోకముందే పాటలు నేర్చుకోడానికి యత్నిస్తారుట!

బ్రహ్మ, సరస్వతి, కృష్ణుడు, శివుడు, హనుమంతుడు మొదలయిన దేవతలతో, నారద, తుంబురులాది మహామునులతో మన సంగీతమెంతో ముడివడి వున్నదని, వారే రాగాలు, రాగిణులు ఏర్పరిచినారని మన పురాణాలవల్ల తెలుస్తూవుంది.

ఇదేవిధంగా జపానువారి సంగీతంకూడా దేవుళ్ల వల్లనే ఉద్భవించిందని సర్ సురేంద్రమోహన్ ఠాగూర్ గారు వ్రాసిన విశ్వసంగీత చరిత్ర (Universal History of Music) అనే గ్రంథంవలన తెలుస్తోంది.

పూర్వం సూర్యదేవుని భార్య 'ఎమాటిరాసు' ఓసారి ప్రత్యేకమైన కొండగుహలో దాక్కుని ఎవరినీ చూడడానికి ఇష్టపడలేదని, మిగిలిన దేవగణమంతా వారి పొరపాట్లను క్షమించమని, ఎంత బ్రతిమిలాడినా, ఆవిడ వినిపించుకోలేదని, అప్పుడు దేవుళ్లంతా ఆమెను సంగీతంతో కరిగించి, కరుణించేట్లు చేసుకోవాలని ఏకగ్రీవంగా తీర్మానించి మధురసంగీతంతో వారామెను జయించారని—ఆ పుస్తకంద్వారా జపానువారి సంగీతపు పుట్టుక విశదమౌతుంది. అంటే ఇక్కడ కూడా సంగీతానికి దేవతలే కారణం కాబట్టి, పవిత్రంగా ఆ సంగీతం చూడబడుతోంది.

శాస్త్రనిపుణులు పరిశీలనద్వారా, పరిశోధనల ద్వారా జపానువారికి సంగీతం భారతదేశం ఇచ్చిన వరమని, అది వారికి చైనా, కొరియాలద్వారా లభించిందని తేల్చారు.

జపాను చక్రవర్తి మరణంపట్ల సంతాపహృదయుడైన శ్రిగి అను కొరియాదేశపురాజు (453 A-D లో) విచారం వ్యక్తంచేస్తూ, జ్ఞాపకార్థం, ఎనభైమంది గొప్పసంగీతవిద్వాంసులను, వెలకట్టలేని ఇతర వస్తువులను జపానుకు బహుమానంగా పంపించాడు. అందువల్లనే, కొరియా, జపానుకు మధ్య సన్నిహిత సత్సంబంధానికి, పునాది—సంగీతం![1]

శ్రీ కర్ఫన్ – పాశ్చాత్య సంగీతప్రవీణుడు—ఇలా అన్నారు. 'జపాను సంగీతం ఐదవ శతాబ్దం (A. D) లో కొరియాదేశంద్వారా ప్రవేశించినప్పుడుద్భవించింది. ఆరవ శతాబ్దంలో బౌద్ధమతము, సంగీతాచారాలు కొన్ని చైనానుండి జపానులో ప్రవేశించి విస్తరించాయి. చైనాకు ఇండియానుండి సంక్రమించాయి.

భారతదేశంనుండి జపాను చేరిన సంగీత నృత్యకళలు వారి ఆచారాల ప్రకారం కొన్నిమార్పులుచెంది స్థిరంగా నిలిచాయి. ఉదాహరణకు, వారి మనోహరమైన 'బుగాకు' స్వరాల్ని పరిశీలించవచ్చు—'

'బుగాకు'—అంటే నృత్యసంగీతం. ఇది 'నరయిన్'కాలంలో _నా సంస్కృతిద్వారా వృద్ధిచెందింది.

1. The Rise of Music in the Ancient World 1944, page 105;

2. బు=ృత్యం; గాకు=పాడటం;

ఎనిమిదవ శతాబ్దంలో 'మన్యూరియా' తరం గాలపై ఇతరదేశాల ప్రభావం పడింది. దానితో జపానులోని సాంప్రదాయ సంగీతం కొంత మరుగున పడింది. అప్పుడు శ్రీ ఓకాకుర అను సంగీత ప్రవీణులు బుగాకు అను జపాను సంగీతంలో హిందూదేశపు సంగీతాన్ని మరియు పురాతన 'హుంగ్' - సంగీతాన్ని కలిపి ప్రతిభావంతంగా తయారుచేశారు.

పురాతనకాలానికిచెందిన ఆరు గీతాలు (Ballads) కొంతమంది విజ్ఞానవంతులద్వారా సేకరించబడినవి. అందు చైనీయుల సువర్ణయుగానికి చెందినవి కొన్ని, సాంప్రదాయికంగా సిద్ధించినవి కొన్ని; వాటిని 'ఖా'— 'ఇన్'—మరియు 'షూ'—అని అన్నారు.

ఆరవ శతాబ్దంలో చైనాద్వారా జపానుకు చేరిన భారత సంగీత పరికరాలు, వాయిద్యాలద్వారా కొన్నిరాగాలుకూడా వెళ్లి జపానువారి హృదయాల్లో ముద్రలు వేసాయని తెలుస్తుంది.

అందుకే వారి 'భరో' అనే రాగం మన భైరబ్ లేక భైరవి రాగాలనుండే వెలువడిందని నమ్మకం కలుగుతోంది.

'ప్రిన్స్‌శాటోకు' తన జపాను సైనికులను తమ సంగీతంలోని 'భరో' ద్వారా ఉత్తేజవంతులను, ఉత్సాహవంతులనుగా చేసి తనపై దండెత్తి వచ్చిన 'మొరిగా నొద్దిడిన్'ను సునాయాసంగా ఓడించినాడన్న అద్భుత సంఘటన వింతగా తోచినా, నిజం!

జపానులో సంగీత వాయిద్యాలను రెండు రకాలుగా విభజించారు.

1. సంపూర్ణమైనవి 2. అసంపూర్ణమైనవి.

సంపూర్ణమైనవానిని కేవలం మతసంబంధమైన పాటలకే ఉపయోగిస్తారు. మిగిలిన ఏరకపు పాటలకైనా అసంపూర్ణమైనవే!

వాయిద్యాలలో కోట్, సామిసెన్, కోకు, మరియు బివా అన్నవి ముఖ్యమైనవి. 'కోట్'లో మళ్లీ సుమన్‌కోట్, లూన్—కోట్, మొదలైన అనేక రకాలు—

'సామిసెన్'—అనునది 'ఫికో' గాయినీమణులకు అత్యంతప్రియమైన వాయిద్యము.

పోతే, వారి 'కోకు' మన వయోలిన్‌లా వుంటుంది. 'షోయీూ'—'ఓకి'—'శకుహచి' —అనేవి మన వేణువుల్లాగా వుంటాయి.

ఇక 'బివా'— వాయిద్యం చైనావారి 'పిపా'వలె వుంటుంది. బివాను సాంప్రదాయబద్ధమైన సంగీతంలోనూ, లలిత సంగీతంలోనూ ఉపయోగిస్తారు.

మనకు డోలు, మద్దెల, తబులా, డప్పు వంటి చర్మవాయిద్యాలవలె జపానువారికి 'క—గూర—కైకొ'— 'ఓ.ట్సూడ్‌జుమి' — 'కో.ట్సుడ్‌జుమి' — వాయిద్యాలు వున్నాయి.

## జపాను సంగీతకారులు

జపానీయులు వారి సంగీతకారుల్ని చాలా విచిత్రంగా నాలుగుభాగాలుగా విభజించుకున్నారు. వారిలో—

1. గెక్కునైన్.
2. గియోనిన్.
3. ఫికి ___ండ్.
4. ఫికోస్.

గెక్కునైన్ గాయకులు కేవలం మతసంబంధమైన, భక్తికి, త్యాగానికి సంబంధించిన గీతాలే గానం చేస్తారు. వీరు జపానులో 'మికాడో ఆర్కెస్ట్రా'ను ప్రవేశపెట్టారు.

రెండవరకం 'గియోనిన్' గాయకులకు గానమే వృత్తి. అందువలన వారు అన్నిరకాల పాటలు పాడుతూ జీవిస్తారు.

ఫికి—బ్లైండ్—సంగీతకారులు కేవలం బృందగానాలు చేస్తారు. వీరు మతసంబంధమైనవి, సాంఘికమైనవి పాడుతారు.

ఫికో—లో అందరూ యువతీమణులే వుంటారు. వీరిని 'గాయనీమణులబృందం' అని అంటారు. వీరు ఆధునిక, లలితగీతాలను మాత్రం ఆలాపిస్తారు. ప్రార్థనలు, దేశభక్తిగేయాలు వీరికి వచ్చవు—పాడరు—అంతే!

జపాను సంగీతం నేర్చుకోవడమైనా, అర్థం చేసుకోవడమైనా చాలా సులువు. అందుకే, పాశ్చాత్య సంగీతకారుడు కర్జన్ అంటాడు—'తూర్పుదేశాల పూర్వపు సంగీతాన్ని చైనాలోకంటే, జపానులో పరిశీలించడం సులభం'—అని.

అసలు సంగీతస్వరాల్ని తెలిపే సంకేతాలు వ్రాయడం జపానులో 1511 నుండి ఆరంభమయింది. వారు సంకేతాలను చైనీయుల్లాగే కుడినుండి, ఎడమకు వ్రాస్తారు.

1878 లో జపాను ప్రభుత్వం 'సంగీత పరిశోధక సంఘాన్ని' నియమించింది. ఆ సంఘం ప్రప్రథమ కర్తవ్యం ఏమిటంటే,—'పశ్చిమదేశీయుల సంగీతానికి, జపానీయుల సంగీతానికివున్న సంబంధాలు, విభేదాలు తెలుసుకోవడం.'

మళ్లీ 1880 లో జపాను ప్రభుత్వం 'జాతీయ సంగీత మండలం పరిధి' (National Music Circle) అన్నదాన్ని స్థాపించింది. సంగీతంలో పరిశోధనలు జరిపి, ఫలితాలను, ప్రజల కందివ్వడానికి, కృషి సల్పడానికి ప్రభుత్వం ఆ సంగీత మండలానికి ఎంతో సహాయపడింది.

భారతదేశంనుండి గ్రహించిన సంగీతంలో పరిశోధనలు జరిపి, పాశ్చాత్యసంగీతాన్నికూడా కలుపుకుని, ఉన్నత ప్రమాణాలను పెంచుకుని, హృద్యంగా వుండే సంగీతం వారు ఏర్పరుచుకున్నారు.

ఈ విధంగా పరిశీలిస్తే, 'పురాతన భారతదేశ సంగీతం'—ఆసియా యూరప్‌లలో దాదాపు అన్ని ప్రాంతాలకు తన రెక్కల్ని చాపుకున్నదని తెలుస్తుంది.



# ద్వైధీభావము

శ్రీ సి. ఆర్. స్వామి

ఈ బాటవెంబడి ఎక్కడికో నడుస్తున్నా
ఎక్కడికి నడుస్తున్నానో తెలియదు
ఏ ఆశా వున్నట్లు స్ఫురించదు.

అస్పష్టముగా ఎవరివో అడుగుజాడలు
అయిష్టముగా ఎవరో అన్న రెండేరెండు మాటలు
ఈ అడుగుజాడలు తిరిగి చూచేసరికి చెదరిపోయాయి
అయిష్టముగా అన్న ఆ రెండేరెండుమాటలు
జీవితంలో వేధింపసాగేయి.

ఏ చెలియ చూపో గునపమై గుండెలో దిగ
ఎపుడో పాడుకున్న యుగళగీతములే ప్రేమ ప్రలకోసె
ఎంత దవ్వరిగినా వెదకేది కానరావడంలేదు
కాని ఎడారిలా శూన్యం కాలేదు
ఆశ, జీవించమని ప్రోత్సహిస్తుంది
బాధ, నిస్సారమైన జీవిత మెందుకని పొమ్మంటుంది.

ఏది కోరను—ఏది వదలను ?



# మరో అసమర్థుని సాకు-
# బతికేందుకు...

## శ్రీ గోరంట్ల ఫణికుమార్

సాయంత్రం ఐదున్నరకి కాగితాలన్నీ డ్రాయర్లో తోసి లేచి నిలబడ్డాడు శ్రీధర్. ఆఫీసంతా అప్పటికే ఖాళీ అయిపోయింది. పగలంతా యుద్ధ భూమిలా నానా హాహాకారాలతో నిండివుండే హాలు నిశ్శబ్దంగా వుంది. గోడకి వేలాడుతున్న గడియారం టిక్కుటిక్కుమంటూ నిశ్శబ్దం భంగపరుస్తోంది. అంతే! మరే చప్పుడూ లేదు.

పగలంతా చూసిన కాగితాల తాలూకు విశేషాలు శ్రీధర్ మనసును యింకా విడవలేదు.

'మా యింట్లో కరెంటు వారం రోజులుగా రోజుకి రెండు గంటలపాటు రావడంలేదు. ఎందువలన?'

'మా షాపుకి ముందున్న వీధి దీపం వెలగడం లేదు కారణం?'

'మేం పార్లవీధిలో కట్టుకున్న యింటికి కరెంటు సప్లై ఇంతకాలంగా ఎందుకు చెయ్యడం లేదు?'

'ఈ నెల కరెంటు బిల్లు లేటుగా కట్టేందుకు అనుమతియిస్తారా?'—అనే అర్జీలు మొదలుకుని, 'నాకు ఫలానా విధమైన కష్టాలున్నాయ్—ఇన్ని బాధ్యతలున్నాయ్. అందుచేత వుద్యోగం యిప్పించరా' అనే అసందర్భమైన దరఖాస్తులవరకూ అనేకం చూశాడు ప్రొద్దుట్నుంచీ.

యూనిట్లూ రూపాయలూ లెక్కవేసి బిల్లులు రాశాడు. బాకీలుపడ్డ వాళ్లకి నోటీసులు రాశాడు. విసుగెత్తి సాయంత్రం ఐదున్నరకి మిగిలిన కాగితాలన్నీ డ్రాయర్లో తోశాడు.

డ్రాయర్లో కాగితాలెంత చిందర వందరగా వున్నాయో అంతకు రెట్టింపు చిందరవందరగా వుంది మనసు. ఎన్నడూ లేనంత అశాంతిగా వుంది. పగలంతా పనిచేశాను—విధి నిర్వర్తించాను అనే సంతృప్తి కలగడం లేదు. నిన్న చేసినట్టే నేడు, నేడు చేసినట్టే రేపు అనే భావం విసుగు నిరాశ కలిగిస్తున్నాయి.

ఒకసారిగా తన జీవితం అంతా బూడిదగా అనిపించింది శ్రీధర్‌కి.

'కోటయ్యా, తలుపువేసుకో'అని చిరాగ్గా అరిచి విసురుగా బయటికి నడిచాడు.

కోటయ్య ఏదో అన్నాడు: మెయిల్ రెండు గంటలు లేటనో, ప్రతాప్‌లో ఏదో హిందీబొమ్మ వేస్తున్నారనో—వినిపించుకోలేదు. 'అర్థంలేని విజ్ఞానం—అవసరంలేని పనికిరానిమాటలు' అనుకున్నాడు మనసులో కసిగా.

పుట్టి ఇరవైతొమ్మిదేళ్లు దాటాయి. కానీ తను ఎదగడం మానేసి అప్పుడే డజను సంవత్సరాలయిపోయింది. డజను సంవత్సరాలక్రితంకాదూ తను యీ ఆఫీసులో చేరింది. చీకటినిండిన మనసుతో నడుస్తున్నాడు శ్రీధర్.

జేబు తడుముకుంటే ముప్పైతొమ్మిదిపైసలు దొరికాయి. ఒకటవ తారీఖు రావడానికి యింకా పది రోజులుండగానే జేబులు ఖాళీ, ఆ ముప్పైతొమ్మిది

పైసలుకూడా రెండురోజుల(క్రితం చేసిన అప్పు తాలూకు; కడుపులో మంటగా వుంది. ఆకలి కాబోలు—హోటలుకెళ్తే యీ ముప్పైతొమ్మిదిపైసలతో ఏమీ రాదు. వచ్చినా దానితో కడుపు నిండదు.

వళ్లు మండింది శ్రీధర్‌కి.

ఒకటో తారీఖు తలుచుకోవద్దన్నా జ్ఞాపకం వస్తోంది. జ్ఞాపకంతోపాటు భయం నిరాశ పొడుచు కొస్తున్నాయి.

వచ్చేది రెండొందల యిరవైతొమ్మిది రూపా యలు. అందులో ముప్పై రూపాయలు అద్దెకుపోతే, పాతిక పాలకుపోతే, తిండికి వంద వెళ్లిపోగా మిగిలిన దాంట్లో చాకలికి, మంగలికి, పనిమనిషికీ...ఇలా రెండవ తారీఖు వచ్చేసరికి సున్నకు సున్నా, హళ్లికి హళ్లి. ఒకటో తారీకున క్రితంనెలలో తీసుకున్న పదో పరకో అప్పు తీరుస్తాడు. పదో తారీకున మళ్లీ ఎవర్నో అప్పు అడగాలి.

రెండు పూట్లా ఫరవాలేదన్నట్లుగానే తిండి తింటున్నారు. అయితే ఏం కలిసొచ్చిందని మనసుకి సంతృప్తి? నలుగురూ కలిసి ఓ సినిమాకు వెళ్దామంటే కుదరదు. నాణ్యమైన ఓ బట్ట కొనుక్కుందామంటే నాకోలుండవ్.

అంతచిరాకులోనూ శ్రీధర్‌కు నవ్వొచ్చింది—తన ఆలోచనలో ప్రాసలు కలుస్తున్నాయేమిటా—అని.

బజార్లో జనం యీగల్లా రొదపెడుతున్నారు. గొర్రెల మందల్లాగా తీరూ తెన్నూ లేకుండా ఏదో పడిపోతున్నారు. కొందరు కోణ్గాళ్లు యీ మూలా ఆ మూలా నిలబడి సిగరెట్లు పీలుస్తూ హస్కు దంచుతున్నారు. దారేపోయే ఆడపిల్లలవంక వెకిలిగా చూసి ఇకిలిస్తున్నారు. ఒక్కొకడ్నీ నేలమీదవేసి నల్లిని రాచినట్లు రాయాలనిపించింది శ్రీధర్‌కి.

'ఆడదాని జీవితంకంటే అధ్వాన్నం లేదుకదా ఈ దరిద్రపు ప్రపంచంలో. అసలే దాని బ్రతుకొక గడ్డు సమస్య. కష్టాల పుట్ట. దాన్ని యింకా కష్టతరం చేస్తున్నారెందుకో యీ వెధవజనం' అని విసుక్కు న్నాడు.

'వీళ్లందరూ యిలా తగలడకపోతే యిక్కడ యీ పిల్లలు యింత బెరుగ్గా బెదురుగ్గా తిరగాల్సిన అవసరం వుంటుందా' అని జాలిపడ్డాడు ఆడపిల్లల మీద.

పదిగజాల కొక్కోచోట ఓ చిన్నగుంపు నిలబడి ఏమిటేమిటో చర్చిస్తున్నారు.

అమెరికావాళ్లు చంద్రమండలం చేరారట. అక్కడ నడిచారట. కిందపడ్డారట. మీదపడ్డారట. వాళ్లకి డబ్బుంది. అలా తగలబెడుతున్నారు. వీళ్లెందు కింత కిందామీదా పడిచానడం?

అమెరికావాడు చంద్రుడిమీదకి వెళ్తాడు. రేపు సూర్యుడిమధ్యకే వెళ్లివస్తాడు. మనంమాత్రం యిలా యీ రోడ్డుమీద కుళ్లిపోతున్న అరటితొక్కల్లాగే వుండిపోతాం.

వాడు వెళ్లాడని ఇప్పుడిక్కడున్నాడని ఇలా చేశా డని వీళ్లెందుకింతవేడితో వుద్రేకంతో ఊగిచావడం? ఈ టైము మరెందుకైనా వాడుకు ఏడవకూడదూ!

శ్రీధర్‌కి అలా రోడ్డుమీద నిలబడి చంద్రుణ్ణీ అమెరికావాణ్ణీ గురించి మాట్లాడుతున్న జనాన్ని చూస్తే వళ్లు మండింది.

'ఇంక మనకు మీసాలెందుకు? రేపు క్యూలో నిలబడితీయించుకుంటేసరి' అంటున్నాడో పెద్దమనిషి.

ఆ చుట్టూవున్నవాళ్లంతా గొల్లున నవ్వడం.

'ఏం? ఎందుకని?'అని అడుగుదామనుకున్నాడు శ్రీధర్.

'ఆడదైనా ఎంతయిదో చూడండి. అన్న మాటల్నా నెగ్గించుకొస్తోంది. పెద్దపెద్ద మొగా ళ్లందరూ తలలు వంచుకునేలా చేసింది. బాంగ్లాదేశ్ యుద్ధంలో ఆమె రాజనీతి.....,'

ఏమాట విన్నా ఏదృశ్యం చూసినా చిరాకు, కోపం, చిరచిర.

శ్రీధర్ బజార్లో రెండుగంటలసేపు తిరిగాడు. తిరిగితిరిగి రైలుపట్టాలమీద కూర్చున్నాడు. 'రేణిగుంట తగలడేబండి రెండుగంటలకిగానీరాదు' అ మనసులో విసుక్కుని జేబులో మిగిలిన ఒక సిగరెట్టు తీసి అంటించుకున్నాడు.

'ఎందుకోసం నేను బతకడం?'అని ప్రశ్న వేసుకున్నాడు.

తరతరాలుగా భూమి దున్నుకు బతికిన తండ్రి బిడ్డ శ్రీధర్.

చిన్నప్పుడు పల్లెటూళ్లో వుండ బుద్ధికాలేదు. పన్నెండో ఏటనే దగ్గర్లోవున్న పట్నం కదాని తిరుపతి బయల్దేరాడు. తిరుపతిలో చదువుకుంటానన్నది వుద్దేశం.

'పీలేరులో ఎనిమిది క్లాసులు చదవావ్ కదా, చాల్లే' అని తండ్రి.

'చాలదు. పై చదువులు చదువుతున్నాను. మీకు మల్లేనే యిలా నేలకి ఆతుక్కు నేనుండలేను' అని కొడుకు.

కొడుకుపక్షమే తల్లి...తల్లి అన్నగారు— మేనమామ, యింకా చిల్లరజనం చేరారు.

ఇద్దర్నీ కాదనలేక పంపించాడు తండ్రి.

ఆ విధంగా తిరుపతి చేరాడు శ్రీధర్ మొదటిసారి. దేవస్థానం హైస్కూల్లో చేరాడు.

పట్నం బాగుంది.

సినిమాలు అవి చాలా జోరుగా వస్తాయ్. బోలెడన్ని హోటళ్లు. మంచి స్నేహితులు చుట్టూరా వుండేవారు. సరదాగా కాలక్షేపం అయిపోయే రోజులు.

నెలకోసారి పల్లెనుండి లెఖ్ఖ తీసుకుని, తెచ్చి యిచ్చే వాడు తండ్రి. నూరు నూట యాభైకి తక్కువగాకుండా ఖర్చు చూపించే వాడు తాను.

కొడుకుమీద కొండంత ఆశలు పెట్టుకుంది తల్లి. అల్లుడిమీద ఆకాశంమేర ఆశ పెట్టుకున్నాడు మేనమామ.

నాటకాలు అలవాటు చేసుకున్నాడు శ్రీధర్.

సినిమా హీరో కావాలని ఆశ పెట్టుకున్నాడు. రాత్రిపూట నిద్రమాని కళాసరస్వతి కాళ్లు కడిగాడు. రెండుమూడుసార్లు మద్రాసు వెళ్లాడు.

'తాగలేనని అనుకోకండి. సిగరెట్టు కాల్చలేననీ అనుకోకండి. ఈ కళకోసం నేనేమన్నా చేస్తాను. కన్నవారినీ, కనిపెంచినవారినీ—అందర్నీ ఎదిరిస్తాను' అన్నాడు శ్రీధర్. వీలైనపుడల్లా చేసిచూపించాడు కూడా.

సినిమా స్వర్గంలోకి సిగరెట్టు మేఘాలమీద గాలిగుర్రం ఎక్కితేగాని వెళ్లలేవన్న స్నేహితుల దృఢమైన విశ్వాసాల కనుగుణంగా అలవాట్లు చేసుకున్నాడు. స్వర్గందారి కనుపించలేదుగానీ, గుర్రపు స్వారిమాత్రం వదల్లేదు శ్రీధర్ కి విక్రమారుడికి మల్లే.

ఇన్నీ అయ్యేసరికి పదహారేళ్లు నిండలేదు శ్రీధర్ కి. ఎస్సెల్సీ రెండోసారి ఫెయిలయ్యేడు. చదువులంటే సామాన్యంకాదన్నది తల్లి. 'పెద్దచదువులంటే మరోటా'అని వెనకేసుకొచ్చాడు మేనమామ. 'కర్మ' అనుకున్నాడు తండ్రి.

శ్రీధర్ అందంగా ఉండేవాడు.

ఆరాధన అనే నాటకానికి ఒకసారి ఓ అమ్మాయి కావాల్సొచ్చింది. ఎవరువేస్తారా అని తెగ ఆలోచించారు. స్కూల్లోవున్న అమ్మాయిలెవరూ ధైర్యంచేసి ముందు కొచ్చే రోజులు కావవి. ఎవరైనా బైటవాళ్లని తీసుకురాక తప్పదని నిర్ణయం చేసుకున్నారు.

'ఈవిడే రాధ! మంచినటి'అని ఓ అమ్మాయిని ఓ రోజున పరిచయం చేశాడు శివరాం—అంటే శ్రీధర్ కి కుడిభుజం.

రాధ అద్భుతంగా వుంది.

చామనచాయఐనా ఆల్చిప్పల్లాంటి అందమైన కళ్లు. చెక్కినట్టున్న ముక్కు, నవరత్నాలు రాల్చే నవ్వులు.

'ఆరాధన' నాటకంతోపాటే శ్రీధర్ ఆ రాధను ఆరాధించడం ప్రారంభించాడు.

'క్రిష్ణా, నన్ను పెళ్లి చేసుకుంటావా, లేకపోతే ఏ రైలు కిందైనా తలపెట్టమంటావా!' అని రాధ అడిగినప్పుడల్లా—నాటకంలో—

'నీ యిష్టం వచ్చిన చోట పెట్టు' అనే నాటకం డైలాగుకు బదులు 'అంతకన్నా నాకు కావాల్సిందేమిటి రాధా!' అని కౌగిలించుకుందామనుకునేవాడు.

ఆరాధన తర్వాత శ్రీధర్ ఎక్కువ నాటకాలు వెయ్యలేదు. 'స్కూలుఫైనలు పాసయింతర్వాత డాక్టరీ చదువుదామనుకుంటున్నాను. అందుకని పియ్యూసీలో చేర్తాను' అని యింట్లో అననూ లేదు.

పట్నంలో ప్రింటింగ్ వ్యాపారం చేస్తానని రెండు మూడెకరాల పొలం అమ్మించాడు. వచ్చిన పాతికవేలతో ఓ సెకండ్ హాండ్ ప్రెస్ కొన్నాడు. పుస్తకాలు అచ్చువెయ్యడం మొదలుపెట్టాడు. మొదట్లో లాభం వచ్చినట్లే కనబడ్డా శ్రీధర్‌కు వ్యాపారదక్షత లోపించడంవల్ల ప్రెస్సు చెయ్యిజారిపోయింది.

రాధతో పరిచయం పెరిగిందికూడా ఆ సమయంలోనే. ఇంచుమించు సమయం అంతా రాధతో గడిపేవాడు ప్రెస్సు బాధ్యతలను శివరాంకు అప్పచెప్పి.

శివరాం దక్షుడు. సమర్థుడు. వ్యాపారం బాగానే జరిపించాడు. కాని బ్రతుకు తెరువు తెలిసినవాడు. దీపం వున్నప్పుడే యిల్లు చక్కబెట్టుకోవాలనే మనిషి.

అందుకనే బాగా జరిగిన వ్యాపారంలో నష్టం కనబడింది.

మరిపెట్టుబడి తేలేక ప్రెస్సు అమ్ముకున్నాడు.

స్నేహితుడికి మంచిబేరం రావాలన్న ఉద్దేశంతో శివరామే ప్రెస్సు కొనుక్కున్నాడు.

'నువ్వు చితికి పోకూడదు శ్రీధర్! అప్పో సొప్పోచేసి ఈ కొండచిలవని నేనే కొనక తప్పదు. దీన్లోంచి లేస్తానో, మస్పైపోతానో—ఏమైనా ఓ స్నేహితుడిని ఆదుకున్నామన్న తృప్తివుండకపోదు—' అన్నాడు శివరాం.

శ్రీధర్ చేతికి పదివేలు వచ్చాయి. అప్పులు అయిదువేలు పోయాయని శివరాం చెప్పాడు. అంటే పదిహేనువేలకి అమ్ముకున్నాడన్నమాట ప్రెస్సు.

పాపం! శివరాం చితికిపోలేదు. నిలదొక్కుకో గలిగానని అతనే చెప్పాడు. దేవుడిమీద భారంవేశాననీ, 'నువ్‌కూడా దేవుడిమీదే భారంవెయ్'అనీ సలహా యిచ్చాడు శ్రీధర్‌కు.

ఒకే బేరానికి వెళ్లిన యిద్దరు పెద్దమనుషులు ఒకే దేవుడిని ప్రార్థనచేస్తే యిద్దర్నీ ఎలా ఆదుకుంటాడు, దేవుడుమాత్రం? శ్రీధర్ వేలిమీదే తొడుక్కున్నాడు తిరపతిదేవుడిని ఆనాటికీ యీనాటికీ కూడా.

చేతికొచ్చిన పదివేలతో రాధని తీసుకుని మద్రాసు రైలెక్కాడు శ్రీధర్.

మద్రాసులో రాధా ఎంటర్‌ప్రైజెస్సు, సినీ డిస్ట్రిబ్యూషన్ ఎక్స్పిబిషన్, ఫైనాన్సింగ్, ఎట్సెటరా అని బోర్డు కట్టాడు.

రాధని ఖరీదైన బజార్లలో అంతకంటె ఖరీదైన కార్లలో షికార్లు తిప్పాడు.

మోతుబరి ప్రొడ్యూసర్లకు పరిచయం చేశాడు. ఊపిరితిరగని డైరెక్టర్లకు పరిచయం చేశాడు. చిన్న చిన్న వేషాలతో ప్రారంభించింది రాధ.

కళామతల్లిసేవలో డైరెక్టర్లు ఏంఅడిగితే అది చెయ్యడానికి సిద్ధంఅయింది రాధ. గొప్పనర్తకిగా స్థిరపడింది. రాధ నృత్యంచెయ్యని సినిమా లేకుండా పోయింది.

రాధ తెరమీద కనుపించిన మూణ్ణిమిషాలూ ప్రేక్షకులు కుప్పిగంతులు వేశారు. నానాబిరుదులూ యిచ్చారు. అన్నీ సంతోషంగా స్వీకరించింది రాధ.

ఒకే బంగాళాలో వుండేవారు రాధా, శ్రీధర్.

రాధ నర్తకి నటి అయింతర్వాత పెద్దయిల్లు కొంది. విమానంలాంటి కారుకొంది. శ్రీధర్‌మ పర్సనల్

సెక్రటరీ చేసింది. కొంతకాలం తర్వాత శ్రీధరే ఆ ఉద్యోగానికి నీళ్లు వదులుతున్నాడు.

రాధకీ, డైరెక్టర్ రాజేష్‌కీ పెళ్లని పేపర్లో చూసిన మర్నాడే ఆ పని చేశాడు.

'నిన్ను చూస్తూంటే నాకు జాలిగా వుంది శ్రీధర్! నామీద ఎన్నోఆశలు పెట్టుకున్నావ్ నువ్వు. అలాగే నామీద ఎన్నోకలలు కంటున్నాడు రాజేష్. నువ్వే చెప్పు. రాజేష్ పెద్దదర్శకుడు. ఫిలిం ఛేంబర్సుకి అధి పతిలాంటివాడు. అతణ్ణి చేసుకుంటే నాకింకా పెద్ద అవకాశాలు రావచ్చు. ఈ పరిస్థితిలో నువ్వంటే ఏంచేసేవాడివి?'

శ్రీధర్ మూగగా చూశాడు. జీవితంలో మొదటి సారిగా బాగా హృదయం గాయపడిందప్పుడే!

'సినిమా బ్రతుకయిపోయింది నాది' అన్నాడు శ్రీధర్.

'బాధపడకు శ్రీధర్! నీకు డబ్బు కావాలంటే తీసికెళ్లు. మీ మామయ్య కూతుర్ని చేసుకుని సుఖ పడు. నాలాగా క్షణం ఊపిరి సలపని దాంతో నీకేం సుఖం?' అంది రాధ.

'నీలో యింకా ఓ పిసరు ప్రేమ మిగిలివున్న ట్టుంది రాధా! ఈ సమయంలోనే మనం విడిపోవడం మంచిదికదూ' అన్నాడు శ్రీధర్.

'నువ్వు గొడవచెయ్యవని నాకు తెలుసు శ్రీధర్! నీ హృదయం వెన్నలాంటిది. ఈ రోజంతా నీతోనే గడపాలని నిశ్చయించుకున్నాను' అంది రాధ.

'రాధా! నువ్వు మరబొమ్మవైపోకు. ఎవరితోనో ఒకరితో స్థిరపడ్డానికే ప్రయత్నించు. ఆకాశం అందు కుందామనే ప్రయాణంలోవుంటే ఎక్కడున్నావో ఏమయ్యావో తెలీకముందే మరింక ఉండకుండా పోతావు' అనిచెప్పి రాధతో సంబంధం తెంచుకుని వచ్చేశాడు శ్రీధర్.

చేతిలో చిల్లిగవ్వకూడా లేదు. రాధ యిచ్చిన డబ్బు ఆమెకే ఇచ్చేశాడు—ఎక్కడో యింకా ఆత్మ గౌరవం మిగిలి వుండడంవల్ల.

సంవత్సరంపాటు బికారిగా తిరిగాడు.

నానారకాల ఉద్యోగాలు చేశాడు.

హోటల్లో, రైల్వేప్లాటు ఫారంమీదా, బస్టాండ్ల దగ్గరా......

ఓ రోజు రైల్వేప్లాట్‌ఫాం మీద వుండగానే మావయ్య కనబడ్డాడు.

'ఏరా, మేం చచ్చిపోయామనుకున్నావ్‌రా నువ్వు?' అని బాధపడ్డాడు.

ఆశ్చర్యపడ్డాడు శ్రీధర్.

తను జీవితంతో ఆటలాడాడు.

జీవితాన్ని బేరం పెట్టాడు.

పూర్తిగా ఓడిపోయాడు.

కుటుంబాన్ని మట్టిపాలు చేశాడు.

కన్నతల్లికీ తండ్రికీ కడుపులో మంటలు పెట్టాడు. అయినా తన గురించి బాధపడుతున్నాడు తన మేనమామ!

'శ్రీధర్! మీ అమ్మా నాన్నా సంవత్సరంక్రితమే ఒకళ్ల తర్వాత ఒకళ్లు పోయార్రా! నీ ఆస్తి తెగ నమ్మితేకాని నీ చెల్లెలి పెళ్లికాలేదు. నువ్విలా గాలికి ధూళికి పట్టిపోయావనే బెంగతోనే కదురా మీఅమ్మా నాన్నా అర్ధాంతరపు చావుపాలైంది!' అని వాపోయా డాయన.

శ్రీధర్ మనసు కదలిపోయింది.

'ఎందుకిలా తగలడ్డావ్? వంశప్రతిష్ఠ ఎందుకు మట్టిలో కలపావ్? నీలాంటివాడు బ్రతికివుండడం కంటే చావడం మంచిది'అని మేనమామ మందలించి వుంటే హాయిగా వుండేది.

కాని ఆ ఆత్మీయత, ఆప్యాయత శ్రీధర్‌ను సిగ్గులోనూ బాధలోనూ ముంచివేశాయి.

'సరోజ బాగావుందా మావయ్యా?'అని అడి గాడు మరేం అడగాలో తెలీక.

'బాగుంది, బాలవితంతువులా' అన్నాడాయన కళ్లనీళ్లు పెట్టుకుని.

'ఏం మావయ్యా, అంతఘోరం ఎలా జరిగింది? ఏదైనా ప్రమాదమా?' అలాంటివేమీ కాదన్నట్టు తలవూపి శ్రీధర్ భుజంమీద చెయ్‌వేసి రహస్యం చెబుతున్నట్లు చెప్పాడు—

'నామాట విను శ్రీధర్! నీకోసం అమ్మాయి తపించిపోతూందిరా. నిన్నుతప్ప మరెవర్నీ చేసుకోనని మొండిపట్టు పట్టింది...కన్నవాళ్లకడుపు తీపి నీకు తెలీదురా. దాని జీవితమలా అయిందని మీ అత్తయ్యా నేనూ ఎంత కుళ్లిపోతున్నామో తెలుసా?...'

'సరోజను పెళ్లి చేసుకోమంటున్నావా మావయ్యా? అన్నీ తెలిసి? నేను బికారివాడ్ని. చదువు లేదు, డబ్బులేదు...'

'అన్నీ వస్తాయ్‌రా. వాటితోనే పుట్టామా పుట్టేప్పుడు. ప్రాణంపోసినవాడు బతికే దారి చూపిస్తాడు'అని ధైర్యంచెప్పి ఇంటికి తీసుకువెళ్లాడు.

సరోజని చేసుకుని స్థిరపడదామనుకున్నాడు శ్రీధర్. వ్యవసాయం చేసుకోమని మావయ్య పొలం అప్పచెప్పాడు. కాని శ్రీధర్ పల్లెటూళ్లో వ్యవసాయం చేస్తూఉండలేకపోయాడు. ఊహకైనా సరిగా అందని ఎత్తులు సాధించాలనే తపన యింకా పీకుతూనేవుంది.

మేనమామ రాజధాని వెళ్లాడు. డబ్బు ధార పోశాడు. అల్లుడికి ఎలక్ట్రిసిటీ ఆఫీసులో వుద్యోగం వేయించాడు.

పల్లెటూర్లో పేడవాసనా, గడ్డివాసనా తప్పించుకోవడానికి ఏ వుద్యోగం ఐనా వకటేలే అని సంబరపడ్డాడు శ్రీధర్.

అతనే సర్వస్వంగా చూసుకునే సరోజ, అడపా దడపా డబ్బు సాయంచేసే మావయ్య.

శ్రీధర్ జీవితం అయిదు సంవత్సరాలపాటు సాఫీగా సాగిపోయింది.

ఈ అయిదు సంవత్సరాల్లోగా పుట్టిన రాముడు (తండ్రిపేరే పెట్టాడు వాడికి) యిప్పుడెనిమిదేళ్ల వాడయాడు. వాడి తర్వాత పుట్టిన సుధ యిప్పుడు ఆరేళ్లదయింది. రాముడు మూడో క్లాసులోనూ, సుధ ఒకట్లోనూ వున్నారు.

అయిదు సంవత్సరాల తర్వాత మావయ్య హఠాత్తుగా గుండె జబ్బుతో పోయాడు.

ఆయన పోయిన తర్వాత సంవత్సరంకంటె ఎక్కువ బతకలేదు అత్తయ్య.

ఆ యిద్దరూ పోవడంతో పల్లెటూళ్లోవున్న ఆధారం తెగిపోయింది శ్రీధర్ జీవితంలో.

నిన్నటి వుదయంలాగానే నేటి వుదయం, నిన్నటి సాయంత్రంలాగానే నేటి సాయంత్రం— జీవితం చప్పగా తయారయింది.

చుట్టు ప్రక్కలంతా చీకటి ముసురుకుంది. తల ఎత్తి పైకి చూశాడు శ్రీధర్. ఆకాశంలో నక్షత్రాలు మినుకు మినుకు మంటున్నాయి.

'ఎనిమిది గంటలయ్యింటుందేమో!' అనుకున్నాడు.

ఏడున్నరకే రావలిసిన ఎక్స్‌ప్రెస్ యింకారాలేదు.

ఎందుకోసం బతకడం తను?

ఇప్పుడు యిటొచ్చే బండిక్రింద తలపెడ్తే ఏంపోయింది? తను పోయినంతలో ఎవరికి నష్టం?

తను ఎందుకు చచ్చిపోవాలి? అనేందుకు వరసగా కారణాలు లెక్కపెట్టుకున్నాడు శ్రీధర్.

చదువులో పైకిరాలేదు తను.
నాటకాలలోనూ అడుగులో వుండిపోయాడు.
ప్రేమించి భంగపడ్డాడు.
స్నేహితు లనుకునేవాళ్లచేతనే మోసగింపబడ్డాడు.

తన మూలాన అంతులేని క్షోభకు గురై, కాని వయసులో కన్నుమూసారు తల్లి తండ్రి.

ముందు జీవితంలోనన్నా తను సుఖపడతాడనే నమ్మకంలేదు.

చిన్ననాడు తను ఊహించుకున్న బంగళా కట్టించలేదు. దాంట్లో పెద్దతోటవేసి ఆ తోటలో పూలమధ్య విశ్రాంతి తీసుకోలేదు.

కార్లమీద హాయిగా తిరగలేదు.

మనసుకు నచ్చింది తినలేదు!

మనసుపోయిన బట్ట కట్టలేదు.

తనకున్నదేమిటి?

ఓ గుమాస్తా ఉద్యోగం!

తనుపోతే ఎన్నాళ్ళుగానో ప్రమోషన్ లేకుండా పడున్న గౌరీపతికన్నా వొస్తుంది ఆ ఉద్యోగం.

నాలుగు సాధారణమైన నూలు చొక్కాలు, పంట్లాములు— వీటికోసం బ్రతకాల్సినంత పనిలేదు. ఎప్పుడూ కాళీగావుండే ట్రంకుపెట్టె. దాన్ని పాత యిత్తడి సామాన్లు కొనేవాడి కమ్మిపారేస్తుంది సరోజ. అలాపారేస్తే ఓ అయిదు రూపాయలన్నావస్తాయ్.

తన పాత పడిపోయిన అశోకాపెన్ను. రాముడికి చిన్నప్పట్నుంచి దానిమీద మనసే. వాడన్నా తీసు కుంటాడు దాన్ని.

తనకో పెళ్ళాం వుంది. అయితే పెళ్ళాం చచ్చి పోతున్న వాళ్ళలో చాలామందికి వుంది. పెళ్ళాం ఎవరికి పడితే వాళ్ళకు వుంటుంది. బ్రతకమనేందుకు పెళ్ళాం వుండడం ఓ పెద్దకారణం కాదు.

చచ్చిపోయేందుకు—చచ్చిపోకుండా వుండేందుకు గల కారణాలు తేల్చగా, చచ్చిపోయేందుకుగల కారణాలే ఎక్కువగా వున్నయ్.

తను బ్రతకడానికి—

తన ఆఫీసులో సూపర్నెంటు కావాలి. అప్పుడు తనకి పదొందలు జీతం వస్తుంది. ఉండడానికి బంగళా వస్తుంది. దానిముందు చిన్నతోట తప్పకుండా వుంటుంది. గవర్నమెంటు యిచ్చే జీపు స్వంతాని క్కూడా వాడుకోవచ్చు. కాదనరు ఎవ్వరూ!

టెర్లిన్, ట్వీడు, డెకరాన్, ఫ్లలెన్ సూట్లు కుట్టించుకోవచ్చు.

దర్జాగా పైపు కాల్చవచ్చు.

కాని యివేవీ తనకు లేవు—రావు. అందు వలన తను చచ్చిపోవాలి—చచ్చిపోవాలి ప్పుడు. ఈ ఆలోచనలు, యిలాంటివి మరికొన్ని అస్తవ్యస్తంగా పరి గెట్టాయ్ శ్రీధర్ మనసులో.

రైలుపట్టాలమీదే కూర్చుని వున్నాడు. ఏ క్షణంలోనైనా రైలు రావచ్చు. అది వెళ్లడంతో తనూ వెళ్లిపోతాడు.

పట్టాలు దడదడలాడుతున్నాయి. తేలుకుట్టినట్టు చురుక్కుమని లేచినిలబడ్డాడు. ఇంజన్ యాభై గజాలదూరంలో వుంది దడదడలాడుతూ, బొయ్యిమని అరుస్తూ.

బొమ్మలా నిలబడ్డాడు శ్రీధర్. ఆక్కుండా వెళ్లిపోయింది మెయిలు.

;త నిద్రనుండి రెండు సెకన్లదూరంలో తప్పిపోయాడు.

ఆ చక్రాల క్రిందపడి గుర్తుతెలీకుండా యాభై గజాలదూరంలో తల పడి, మొండెం వికృతంగా ఎర్రగా కారిన రక్తంతో తడిసి, మాంసం ముద్దలు భయంకరంగా వెదజల్లబడివుండే దృశ్యం తలుచుకుని శ్రీధర్ శరీరం చల్లబడిపోయింది. పరుగులాంటి నడకతో యింటిదారిపట్టాడు.

సరోజ యింటి దగ్గరముందు గుమ్మంలో నిలబడి ఎదురు చూస్తోంది.

రాముడు, సుధ చాపమీద పడుకుని నిద్రపోతున్నారు. రాముడి కాళ్లు సుధ మెడమీద వేసి వున్నాయి. సుధ జుట్టు చెదరిపోయి అందంగా చాపంతా పరుచుకువుంది. ఇద్దరి మొహాలూ ప్రశాంతంగా చల్లగా వున్నాయి. వాళ్లిద్దరిమధ్య ఒక చిన్న తాటాకు బుట్టవుంది. అందులో సుధ తన సంసారానికి కావలిసిన లక్కపిడతలు వేసుకుని వుంది. అందులో సగం బొమ్మలు విరిగి వికారంగా వున్నాయి.

'ఇంత లేటెందుకయిందండీ' అని వంటింట్లోకి వెళ్లింది సరోజ.

పిల్లలిద్దరి పక్కనా చాపమీద కూర్చున్నాడు శ్రీధర్. సంసారపు బుట్టమీదవున్న సుధ చెయ్యి మెల్లగా తొలిగించి మూతతీసి చాపమీద వుంచాడు.

అందులో పిల్లలిద్దరి ఆస్తివుంది. వాళ్ల సంతోషానికి గర్వానికి కారణం—ఆ ఆస్తి. వాళ్లని సంతృప్తిగా బ్రతికిస్తున్న ఆస్తి.

అందులో వున్నవి ఒక్కొక్కటే బయటికి తీశాడు శ్రీధర్.

పదిపైసలబిళ్ల ఒకటి—నయాపైస ఒకటి—ఒక ప్లాస్టిక్‌బాతు—ఏడాదిక్రితం కొన్న బినాకాటూత్‌పేస్టుతోపాటు వచ్చింది. పార్కు డేవిస్‌కంపెనీ ప్లాస్టిక్ చెంచా ఒకటి—రెండు పెన్సిళ్లు.

అసలు విలువలేని ఆ వస్తువులు, తన పిల్లలకు విలువలేనివి. వాళ నెంతో సుఖంగా బ్రతకనిస్తున్నాయి. హాయిగా నిర్మలంగా నిద్రపోనిస్తున్నాయి.

నాలుగు డజన్ల బంగారు ఉంగరాలు యిచ్చినా వీళ్లకి యింత సంతోషం కలుగుతుందా అని?

తనవో!, గొంతెమ్మకోరికలు. అవన్నీ తీరితే మాత్రం తను సుఖంగా వుంటాడా. చిన్నప్పట్నుంచీ బయట సంతృప్తికోసం వెతికాడేగాని అది మనసులోనే పుట్టాలని తెలుసుకోలేకపోయాడు.

తన ఎదుట నిద్రిస్తున్న పిల్లలిద్దరూ రెండు బంగారుబొమ్మల్లా కనిపించారు శ్రీధర్‌కు.

'సరోజా...సరోజా...'అంటూ అరిచాడు.

'వస్తున్నానండీ'అని వచ్చింది సరోజ.

'పిల్లిద్దరూ నా ఆస్తి సరోజా, నాకు దరిద్రం లేదు, నిరాశలేదు, చావాలనిలేదు సరోజా...'

'బాగుంది వరస'అని మూతి తిప్పుకుంటూ లోపలికి వెళ్లిపోయింది ఆమె.

శ్రీధర్‌కు కళ్లు చెమర్చినసంగతి ఆమె చూడనే లేదు.

'ఆకలేస్తోందా...ఆనందంతో కడుపు నిండిపోయిందా'అని అరిచింది లోపల్నుంచి.

ఆశకీ, నిరాశకీ, సుఖానికీ, దుఃఖానికీ మధ్య వున్న పలుచనిపొరని శ్రీధర్ చీల్చిబయటపడ్డసంగతి ఆమెకెలా తెలుస్తుంది?

చచ్చిపోవాలనుకునే ప్రతిమనిషీ బ్రతికేందుకు కారణాలకోసం నీట్లోంచి బయటపడ్డ చేపలా కొట్టుకుంటాడనే సంగతి శ్రీధర్‌కి తెలీదు.

కొందరికి దొరికేవి గడ్డిపరకల్లాంటి కారణాలు. మరికొందరికి దొరికేవి నిజమైన కారణాలు.

వీటిలో ఏదో దొరికింది శ్రీధర్‌కు. అది ఏదో అతనిక్కూడా తెలీదేమో......

# జానపద భాష

## శ్రీమతి నాయని కృష్ణకుమారి

'మే' భారతిలో ప్రచురితమైన 'పందొమ్మిదవ శతాబ్దంనాటి వ్యావహారిక భాషావిశేషాలు' అన్న వ్యాసం నన్నీ రచనకు పురికొలుపుతున్నది.

అందులో వ్యాసకర్త, జానపద రచనయైన కుమార రాముని కథను, 19వ శతాబ్దపు పూర్వార్థంలో రచింపబడ్డ వ్యావహారిక కావ్యంగా పేర్కొన్నారు—ఆ అభిప్రాయం వ్యాసకర్తదేకాక, కుమార రాముని కథకు పీఠిక రచించిన శ్రీ నేలటూరి వెంకటరమణయ్యగారిదైనట్లు అథస్సూచికలో సూచించారు.

శ్రీ వెంకటరమణయ్యగారైనా ఈ కథలోని భాష 19వ శతాబ్దానికి చెందిందని నిర్ణయించడానికి బలమైన కారణాలు చెప్పలేదు—ఆయన చెప్పిన కారణాలివీ !—(1) ఇందులో పార్శీమాటలు బహుళంగా ఉండడం. అంతేకాక ఇంగ్లీషుపదాలూ ఉండడం; కాబట్టి ఆంధ్రభాషలో పార్శీప్రబల్యం సన్నగిల్లి ఆంగ్ల సంపర్కం ఎక్కువవుతున్న కాలంలో ఇది రచింపబడి ఉండవచ్చు. (2) ఇందులో భాషా, మెకంజీ కైఫీయతుల్లో భాషా ఇంచు మించు ఒకటే పోలికలు కలిగివున్నాయి—దీన్నిబటి ఈ కథారచనాకాలం, పై విషయాలతో సమన్వయించే 19వ శతాబానికి చెంది ఉండవచ్చు.

శ్రీ వెంకటరమణయ్యగారే ప్రసంగాంతరాన చెప్పినట్లుగా, జానపదగాథలకు ఒక రచనాకాలమంటూ నిర్ణయించడం కష్టం. ఏదో ఒక ఉద్రిక్తమైన వాతావరణంలో ఒక సంఘటన జరిగి, అది జనసామాన్యాన్ని కక్కదలించినపుడు, అదే జానపదులనోట పాటగా, కథగా వెలువడుతోంది—దానిని ఎవడో ఒక కవి, కాగితాలమీదనో, ఆకులమీదనో వ్రాయడు. ఒక్కడు వ్రాసిన దాన్ని పదిమంది చదివి కంఠస్థం చేసి వెలయించడమనేది లేనేలేదు—ఆప్తి కలవాళ్ళూ కవితాత్మకలవాళ్ళూ, జానపదగేయ గాథావిష్కారాన్ని వృత్తిగా కలవాళ్ళూ, ఎవరికి తోచినట్లు వాళ్ళు, ఆ సంఘటనకు రూపుకట్టించగా, అటువంటి రూపాలు దేశవ్యాప్తంగా ఎన్నో ఉండడానికి అవకాశం ఉంది.

నేను, జానపదగేయ గాథలమీద, పరిశోధన చేస్తూ కుమార రాముడి కథను సేకరించడం జరిగింది. నాలుగైదుపాఠాలు వేరువేరు గాయకుల ముఖతా విని వ్రాసుకున్నాను. ఈ నాలుగైదు రూపాలకూ, ఒకదానితో ఒకటికి పోలికలు లేవు, మద్రాసు ప్రభుత్వం వారు అచ్చువేయించిన ప్రతితోనూ పోలికలు లేవు. దేని దారి దానిదే. కొన్నిటిలో, అప్రధానపాత్రల పేర్లు కూడా మారడం సంభవించింది. సంఘటనల మార్పు ఎంతో ఉంది. కాకపోతే ప్రధాన కథాబీజం మాత్రం మారలేదు—వీటిల్లో భాషకూడా పాడే మనిషినిబట్టి ప్రాంతాన్నిబట్టి మార్పుచెందుతూ ఉంటుంది. అందుకని 14వ శతాబ్దప్రాంతంలో జరిగి ఉంటుందనుకున్న ఈ కథకు, మద్రాసువారు అచ్చువేయించిన కథ ఎన్నో రూపాంతరమో ఎలా చెప్పడం?— మెకంజీ కైఫీయతుల వచనాన్నిబట్టి దీనికాలాన్ని నిర్ణయించడం బాగానే ఉంది కాని, ఆ కైఫీయతుల్లో ఉన్న వచనానికి ఆ రూపం రావడానికి ప్రారంభం ఏకాలాన జరిగింది? మెకంజీకి ముందున్న వచన స్వరూప స్వభావాలేమిటి? ఇవన్నీ నిర్ణయంగా ఒక రూపాన్ని పొందగలిగినప్పుడే, అప్పటిభాషలాగే ఉందనుకున్న 'కుమార రాముని' భాషకూడా ఒక కాలానికి చెందిందిగా నిర్ణయించడానికి వీలుపడుతుంది. అయినా అవిదిత కర్తృకాలూ, అజ్ఞాతకాలికాలూ అయిన జానపదగాథల కాల

నిర్ణయమూ, రచయితృనిర్ణయమూ చెయ్యబూను కోవడం, ఫలరహితమైన పని—

ఇక జానపదభాషలోని మారుమూలపదాలకు అర్థ నిర్ణయం చెయ్యడం అంత సులువైన పనికాదు. దానికి కొంత ఓపికా, కుతూహలమూ, పట్టుదలా, ఎక్కువ మోతాదులో ఉండాల్సిన అవసరం ఉంది.

ఈ వ్యాసకర్త అర్థం సరిగా తెలీడంలేదని యిచ్చిన పదాలు కొన్ని నేను పరిశోధనావశాన సేకరించి పెట్టుకున్న కోశంలో ఉన్నయ్. అందువల్ల ఆ వివరణలు ఇక్కడ యిస్తున్నాను.

**1**. హస్తములు వెల్చుకుని—'వెలుచు' అన్న క్రియకు 'కడుగు' అనే అర్థంకూడా ఉంది. వెల్, వెణ్ అనే రెండు ద్రావిడ ధాతురూపాలకూ, తెల్లని, శుభ్రమైన, ప్రకాశమానమైన, మిరుమిట్లుగొలిపే అనే అర్థచ్ఛాయలున్నయ్. వాటినుండే,

తమిళంలో—వెళిక్కవ్ —దీపను
వెళిప్పు —నిర్మలమైన
వెళ్ళి —వెండి
విళక్కు —పరిశుభ్రముచేయు, కడుగు, తరిమెణ పట్టు

వంటి అనేక పదా లుద్భవించాయి.

మళయాళంలో—వెళి, వెళివు— శుభ్రత, దీపముకాంతి,
వెళుప్పిక్క—తెల్లగాచేయు, ఉతుకు, కడుగు --

కన్నడంలో — బెళుపు — ప్రకాశము, కాంతి, తెల్లదనము.
బెళ, బిళ, బెళె, బెళగు —కాంతి, తెల్లదనము—

ఈ క్రియ ఈ భాషలో మాత్రం, శుభ్రత, నైర్మల్యము, కడుగు, సానపట్టు, వంటి అర్థాల లోనికి రాలేదు.

కోలామీలో—వెళ్క — నీళ్ళతో కడుగు; శుభ్రముచేయు
వెళ్ళ — తెల్లదనం

తెలుగులో—వెలుగు, వెల్ల, వెల్లన, వెలవెల, వెండి, బెళుకు, వంటి తెల్లదనాన్నీ కాంతినీ తెలియజేసే పదాలేకాక;

వెలుచు, వెలచు —శుభ్రంచేయు, కడుగు, అనే అర్థంకల పదాలూ ఉద్భవించాయి—

ఇక్కడ, 'వెలుచు' అన్న పదానికి, శుభ్రం చేయడమనే సామాన్యార్థంకాక, నీళ్ళతో కడిగి శుభ్రం చేయడమనే ప్రత్యేకార్థం ఉన్నది.

'వాన వెలిసింది'; 'గుడ్డ వెలిసింది'—అన్న ప్రయోగాల్లో ఉన్న రూపంకూడా ఇదే. ఇక్కడ ఆకాశానికి పట్టిన మబ్బులు విచ్చి, నిర్మలం కావడం; గుడ్డకు పట్టిన రంగు కరిగిపోయి తెల్లగా కావడం, పర్యవసానం.

**2**. చాలు రావులు — ఇవి చలివేంద్రలేమోనని వ్యాసకర్త అభిప్రాయపడ్డారు; కాని, కాదు. ఈ పదానికి సాలురావులు, సోలురావులు అనే రూపాంతరాలున్నయ్. ఈ సమాసానికి వరసగా తీర్చిన రావిచెట్లు అనే అర్థం చెప్పుకోవడానికి అవకాశముంది—కాని, యిక్కడ 'చాలు' అన్నపదానికి 'వరుస' కాక మరో ప్రత్యేకార్థం ఉన్నది—ద్రావిడ భాషల్లో దీనికున్న అర్థచ్ఛాయలు గమనింపతగ్గవి.

కన్నడంలో — సాల్, సాలు — కట్టుబడి ఉండు, to be bound to, to be obliged.

కోలామీలో—చాల్వ్—సలహా, A piece of advise.

'తోడా'లో — సాల్మ — Assets and liabilities.

తెలుగులో — చాలు — తీరు, మర్యాద, Back ground వీలూ చాలూ — Assets and liabilities -

ఇటువంటి ఈ పదచరిత్రనుబట్టి, 'చాలు రావుల'లోని 'చాలు'లో ఈ అర్థచ్ఛాయ నశించి పోకుండా ఉన్నదనుకోవచ్చును. అప్పుడు, చాలు రావులు, సాలు రావులు, అనగా ఊరిపెద్దలు, గ్రామస్థులలో పొట్లాటలు జరిగినప్పుడు, సలహాల నివ్వడానికి

ఆశ్రయించే రావి చెట్లు అని అర్థం. ఇక్కడ 'చెట్టు' తొలుత తొలుత ప్రధానమైనదైనా, తదుపరి అది గౌణమై, ఆ చెట్టుక్రింది, 'రచ్చబండ'కా అర్థం సంక్రమించింది. కాబట్టి సాలురావులు అనగా, తగవు తీర్చే రచ్చబండలు అని అర్థం.

**3.** చెఱువులు గోపి—(క్రో) గోపి—అనగా త్రవ్వి అన్న అర్థం కనపడుతున్నదిక్కడ. ఈ క్రియా రూపం జానపదసాహిత్యంలో కనిపించి మనకు విలువైన సమాచారాన్నే అందిస్తున్నదనవచ్చు. ద్రావిడ ధాతువుల్లో దీనికి సంబంధించిన ధాతురూపం ఇలా ఉంది—

తమిళంలో—కుఴి—గొయ్యి, భూవివరము.

మళయాళంలో...కుయ్, కుప్— గొయ్యి—

కొప్పం—ఏనుగుల్నిపట్టే పెద్దగొయ్యి.

తెలుగులో—గొప్ప—పాదు; ఆలవాలము.

ఈ 'గొప్పే' 'గోపు'అన్న క్రియకు నామ రూపంగా కనిపిస్తున్నది. కాబట్టి గోపు, క్రోపు అనే రూపాలు ఒకప్పుడు బాగా వాడుకలో ఉండి ఉండవచ్చును. ద్రావిడ ధాతువు—

కుఴ్—'క్రో'గా మారి క్రోపు— కోపు— గోపు—అనే రూప పరిణామాన్ని చెందడానికి వీలున్నది—

ఈ 'గోపు',

అనే క్రియకు 'త్రవ్వు'అనే అర్థం ఉండడం, అది జానపద సాహిత్యంలో కనిపించడం, చాలా విలువైన సమాచారమే.

**4.** కొత్తులావి పంజులు — ఈ పదబంధం విచిత్రమైనదే. ఇందులో 'పంజులు'అన్న పదానికి రూఢమైన అర్థం ఉన్నది.

పంజు—ఒక దినుసు దివిటీ—శ. ర.

—A Torch, a sort of fire work—బ్రౌన్.

కన్నడంలో—మండుతున్న కొరివి, కాగడా—

కుమార రాముని కథలోని సందర్భాన్నిబట్టి దీనికి 'కాగడా'అన్న అర్థమే సరిపోతున్నది.

శ్రీరాముల పర్వతమ్మ
భామ తాను కదిలింది
కొమ్మకొమ్మ దివిటీలు
కొత్తులావి పంజూలు
రంభ నాటక స్త్రీలేమి
సకలవిధాల సంబ్రాల
భామ తాను గదిలేను॥ తం॥

పైవి కొమ్మదివిటీలు, క్రిందివి 'కొత్తుల పంజులు' 'కొత్తుల'అన్న పదానికి నిర్ణయించి అర్థం చెప్పడానికి కొంత జంకుతున్నాను. ఒక్క ఊహమాత్రం ఉంది. దాని యుక్తాయుక్తాలు విజ్ఞులకు విడిచిపెడుతున్నాను.

తెలుగులో—కొఱు—ఇనపచువ్వ, శూలం—లేదా సూదిగా చెక్కిన కమ్మీ—

'కొఱతవేయడం' ఈ మాటవల్లనే ఉద్భవించింది. ఇతర ద్రావిడభాషల్లో దీని ధాతురూపం ఇలా ఉంది—

| | |
|---|---|
| తమిళంలో | కొఱు—A Bar of Metal. |
| మళయాళంలో | కొఱు—నాగలిమొన Metal Bar. |
| తుళులో | కొఱు—A Bar of Metal. |
| తెలుగులో | కొఱులు— |
| | కొర్తుల—(Genative) కొత్తు |

కొత్తుల పంజులు — ఇనుపచువ్వల కొసల కీలించిన పంజులు అనే అర్థంలో ఈ పదబంధం ఏర్పడడానికి వీలుంది. పైన పేర్కొన్న కొమ్మ దివిటీలనుండి భిన్నంగా, ఈ 'కొత్తుల పంజులు' పేర్కొనడం జరిగి ఉండవచ్చును.

**5.** కావు— దీని సరియైన అర్థం పాతరకాదు. కావు—A well or pit అని బ్రౌను. సాధారణంగా, పలకబారిన కాయల్ని పండ్లుగా మార్చడంకోసం గోతుల్లోఉంచి, గాలితగలకుండా ఉంచడం కద్దు. అలా వెయ్యడాన్ని 'కావు వెయ్యడం' అంటారు. అలాగే 'ధాన్యపు కావులూ' ఉన్నయ్. అవే పాతరలు—ఇక్కడ కథలో, కుమార రాముడు,

'నేలను బోను గావించి
పోలిక రాముని

కొవులో వేయించి

పైన తలుపు వేయించెను' అన్న సందర్భాన్ని బట్టి చూడగా, ఇది కేవలం 'గొయ్యి'గా మాత్రమే సాక్షాత్కరిస్తున్నది.

**6. కూతవేటు నేల:**— అనగా కూతపెట్టే స్థలం కాదు. ఎవరైనా గట్టిగా కేకవేస్తే విన పడేంత దూరం అని అర్థం. నేల అన్నదానికి 'దూరం' అనే అర్థంలో కావ్యప్రయోగాలుకూడా ఉన్నయ్.

**7. కుప్పటము:** — దీనికి 'ఒడలు' అన్న అర్థం లేదు. ఇతర ద్రావిడ భాషల్లో దీనికి సంబంధించిన ధాతువుల్ని పరిశీలించగా ఇట్లా ఉంది—

తమిళంలో కుప్పుల్—to leap or spring across.

కన్నడంలో కుప్—to leap over.

కోలామీలో కుప్—Broad jumping.

తోడాలో కుప్—to leap.

తెలుగులో కుప్పించు—ఎగిరిదూకు; కుప్పిగంతులు—etc.

పై అర్థచ్ఛాయల్నిబట్టి చూడగా, ఎగురు గెంతు, రెట్టింపు వేగంతో దూకు, ఒక్కసారిగా దూకు, అనే అర్థం కనబడుతున్నది. అందుకని ఇక్కడ 'కుప్పటము ఎగసెను' అనగా, 'శరీరము ఎగిరెను' అని కాక 'కుప్పించి దూకెను' అనే అర్థం సరిపోవడానికి వీలుంది.

**8. జోడాలవారు:**—వార్తాహరులు. ఈ వార్తాహరులలో ఒక విశిష్టత ఉన్నది. ఒకడు ఒక చోట నుండి ప్రయాణం చివరివరకూ చేసి, తనకిచ్చిన వార్తాహరణోద్యోగాన్ని ముగించడం కాదు–వీళ్ళు ఒక స్థలాన్నుండి, ఉద్దిష్ట స్థలంవరకూ అంచె లంచెలుగా ఉండే వార్తాహరులు. ఒకరందించిన వార్త మరొకరందుకుని గమ్యంవరకూ, దాన్ని అదే పద్ధతిలో ప్రయాణింపచేసే విధి వారిది. అనగా వారిలో ఒకరి పని మరొకరిలో జోడించడం జరుగుతున్నది. జోడించు—అనగా 'జతచేయు'అనీ, అందుండి, 'కలుపు'అనీ అర్థం తీయడానికి వీలుంది. 'చేతులు జోడించడం', 'రెండు దుప్పట్లు జోడించడం', అటువంటిదే. అలాగే ఇక్కడ జోడాలవారు అన్న పదానికి అదే అర్థం అన్వయించడానికి వీలుందనుకుంటాను. అంతేకాని, ఈ వార్తాహరులు ఒకేచోటునుండి జంటలు జంటలుగా కదిలేవాళ్లని అర్థంకాదు. వీళ్లు జతలు జతలుగా తిరిగేవాళ్లుకారు.

**9. తనగాము** —అనగా పెద్దతొట్టి అనికాక, తోలుతో కుట్టి, నీళ్లు మోయడానికి ఉపయోగించే పెద్దతిత్తి అని అర్థం—

విల్లెనిరాలు, నిరుకు, మోయమలి—ఈ పదాల పదప్రత్యయ విభాగమేమిటో అంతుపట్టడంలేదు. ఇవి అన్యదేశ్యాలు కావచ్చును.

జానపదభాష అర్థం చేసుకోవడం కష్టమే. అక్కడి మాటలకు సందర్భానుసారంగా ఏదో ఒక అర్థం చెప్పుకోవాలనే తొందర తగ్గించుకుని, కొంత ఆలోచనకు తావివ్వడం, పూర్వాపరాలను ఓపిగ్గా పరిశీలించడం, అలవాటు చేసుకుంటే ఫలితాలు తృప్తికరంగా ఉంటాయి.

**కలగూరగంప :**

# వ్యాకరణములు - వాని భేదములు

వ్యాకరించునది వ్యాకరణము. అనగా విభజించునది. వాక్యరూపముననున్న యఖండభాషను పదములుగను, పదములను ప్రకృతి ప్రత్యయములుగను, వానిని వర్ణములుగను అనేకరీతుల విభజించు నిర్దుష్టపద రూపకశాస్త్రము వ్యాకరణము. అఖండముగానున్న విషయమును ఖండఖండములుగానే గ్రహించుట మానవునకు సులభము, ఆచరణయోగ్యము. 'We live in parts and we live in division' అన్న Emerson భావ మిదియే.

భారతదేశమునకు చాల ప్రాచీన కాలము నుండియు అసంఖ్యాకకములగు వ్యాకరణములు వెలసినవి. సంహితా రూపముననున్న వేదములను సుస్వరయుక్తముగా జదువుటకు పదపాఠములు తయారు చేయవలసి వచ్చెను. ఆ సందర్భమున వ్యాకరణము లవతరించెను. పదముల సుస్పష్టోచ్చారణమునకు వర్ణనిర్ణయము కావలసి వచ్చెను. ఇట్టి ప్రాచీన వ్యాకరణములే ప్రాతిశాఖ్యలు. ఒక్కొక్కవేదమున కొక్కొక్క ప్రాతిశాఖ్య వెలసెను. ఇట్టిస్థితిలో మానవమేధకు చెరగని శాశ్వతపు నిదర్శనమా యనునట్లు అపారమేధాసంపన్నుడగు పాణిని లౌకికాలౌకికసంస్కృతములకు రెంటికి సరిపడునట్లు నిశిత పారిభాషానైపుణ్యముతో పాణినీయము (అష్టాధ్యాయిని) వెలయించెను. ఇదియేగాక కాతంత్ర సారస్వతాది చిన్న వ్యాకరణములు లౌకిక సంస్కృతమునకు వెలసినవి. వీనిలో 'అష్టాధ్యాయి' యందుగల పారిభాషిక క్లిష్టత యుండదు. ఇట్లు భాషాస్థితిని వర్ణించు వ్యాకరణములకు వర్ణనాత్మక వ్యాకరణము లనిపేరు. (Descriptive Grammars). ఇందు సంస్కృత భాషాక్రమపరిణామముకాక నప్పటికి పరిణతమగు సిద్ధరూపములే గ్రాహ్యములు. ఇట్టి వ్యాకరణముల యొరవడినే తెలుగు వ్యాకరణములును వెలసినవి. వ్యాకరణ సంక్షిప్తత విషయములో తెలుగు వ్యాకరణములు కొంతవరకు ప్రాకృత వ్యాకరణములనుగూడ ననుసరించెను. మొత్తముమీద భాషా, చారిత్రక రూప పరిణామప్రదర్శనముకాక నప్పటికి రూపొందిన భాషా స్వరూప వర్ణనా ప్రదర్శనమే లక్ష్యముగా తెలుగున వెలసిన వ్యాకరణములను వర్ణనాత్మక వ్యాకరణము లనదగును. వ్యాకరణమెప్పుడును మూలభాషలలో వెలసిన పిమ్మటనే తచ్ఛాయలలో దేశభాషలకు వెలయుట సాంప్రదాయము. 'అష్టాధ్యాయీ జగన్మాతా, అమరకోశః జగత్పితా' యన్న ప్రశస్తినందుకొన్న సంస్కృతలాక్షణిక సృష్టి జరిగిన పిమ్మటనే తెలుగున వెలయుట నిప్పట్లు గమనార్హము.

ఆంధ్ర శబ్దచింతామణి, వికృతి వివేకము, అహోబల పండితీయము, బాల, ప్రౌఢ వ్యాకరణములు (త్రిలింగలక్షణశేషము) మున్నగునవి సాంప్రదాయిక పద్ధతిలో దెనుగున వెలసిన వర్ణనాత్మక వ్యాకరణములు. కేతన యాంధ్రభాషాభూషణము, కావ్యాలంకార చూడామణి, కవిలోక చింతామణి, ఇత్యాదులు స్వతంత్ర పద్ధతిలో వెలసిన లాక్షణిక గ్రంథములు. ఇవి యన్నియు వర్ణనాత్మకములే. కారణము వ్యాకరణము కూడ జంతు, వృక్షశాస్త్రములవలె నొక శాస్త్రము. (Descriptive Science). వర్ణనాత్మకమైనది.

కాలక్రమమున ఆంగ్లాది పాశ్చాత్య భాషా ప్రభావమువలన మన తెలుగు వైయాకరణులలోను పదములకొక మూలచరిత్ర యుండుననియు, వని శాబ్దిక, ఆర్థికమునైన మార్పుల నొందునని, వాని పరిణామములను వర్ణించుచు, శాబ్దికపరిణామరీతుల వర్ణించునది చారిత్రక వ్యాకరణమనియు, అర్థవివరి

ణామములను వర్ణించునది ఆర్థిక శబ్ద విపరిణామ వ్యాకరణమనియు (Semantics) భావింపజేసిరి. స్థూలముగా నీ రెంటిని చారిత్రక వ్యాకరణములే యనవచ్చును ఇందులకను గుణముగా వెలసిన గ్రంథములు గంటివారి ఆంధ్రభాషా వికాసము, కోరాడవారి సంధి, దివాకర్లవారి నన్నయ భారతము మొదలగునవి. ఆంధ్ర భాషావికాసమున 11 వ శతాబ్దపు దెనుగు అను నధ్యాయము, సంధి గ్రంథమున చారిత్రకముగా సంధి పుట్టు పూర్వోత్తరములు, నన్నయ భారతమున నన్నయనాటి భాషా విశేషములు అను ప్రకరణ మీా చారిత్రక వ్యాకరణ స్పర్శగల భాగములు. 'శాసనస్థ భాషా స్వరూపము' అను గ్రంథమును శ్రీ బూదరాజు రాధా కృష్ణగారు వెలయింప జేయుటయు చారిత్రక వ్యాకర ణమునకు మఱియొక లక్ష్యమే. (A Historical Grammar of Pre-Nannaya inscriptions, Dr. B. Ratha Krishna). నన్నయనాటి భాషకు గిడుగు సీతాపతిగారు, కోరాడవారు ఇంకను అనేక మంది పండితులు వివరణాత్మక రచనలు గావించిరి. ఇవియన్నియు నొక విధముగా చారిత్రక వ్యాకరణములే.

పదములకు చరిత్రయున్నట్లు, పదములకు మరికొన్ని భాషా పదములతో సంబంధ బాంధవ్యము లుండును. ఒక వ్యక్తి ఒక కుటుంబమునకు చెందు నట్లే, భాషలును యేదోయొక కుటుంబమునకు చెందునుగాని ఒంటరిగ మనజాలవు. ఆ భాషకు తన కుటుంబములోని సోదరభాషలతో సారూప్య సాన్నిహిత్యములుండును. ఇట్టివానిని సూక్ష్మపరిశీలన మీాదనే భాషా శాస్త్రజ్ఞులు దెలిసికొనగలరు. సోదర భాషల తోడి తో(తు)లనాత్మక పరిశీలనమును Indo-European languages పట్ల పాశ్చాత్య భాషా శాస్త్రజ్ఞులు గావించిరి. వారే భారతీయ భాషలను కూడ వర్గీకరణము గావించిరి. 'ఉదార చరితానామ్తు వసుధైక కుటుంబమ్'. శాస్త్రజ్ఞులకు భాషా విషయిక మగు నద్దుగోడలుండవు గనుకనే కాల్డ్వెల్ ద్రావిడ భాషలకు తోలనాత్మక పరిశీలనా గ్రంథమును వెల యింపజేసెను. ద్రావిడ భాషలగు తమిళము, కన్న డము, తెలుగు, మళయాళము ఇత్యాది భాషా సామ్య వైషమ్యములను నిరూపించుచు వ్రాయబడిన "A comparative grammar of Dravidian languages" అను గ్రంథము నాటికిని, నేటికిని ప్రామాణికమై సర్వపండితశిరోధార్యమై తనరారు చున్నది. ఇది మొదటితో(తు)లనాత్మక వ్యాకరణము. దీని యాధారముగనే ఆంధ్రభాషా వికాసము మున్నగు గ్రంథములు వెలసినవి.

భాషా స్వరూపమును వర్ణనాత్మక వ్యాకరణములు యథోచితముగా వర్ణించి చెప్పును. కాని కొన్ని వ్యాకరణములు ఇవి అసాధు శబ్దములని, పరిహరణీయములని, శిష్టజనవ్యవహారమునందున్న వానినే ఖండించుటయు గలదు. ఇట్లు దోషముల నెత్తి చూపుచు ప్రయోగములందున్న శబ్దములనే పరి హరించు వ్యాకరణములు కొన్ని కలవు. నన్నయ యంత వానినే లెక్కచేయని బాలవ్యాకరణ మిట్టిదే. 'ఇచ్చు నకు సర్వంబీయగు' అని ఆదేశించుచు, 'బలిమినీయని భూమివలయపతుల' అను ప్రయోగమును కష్టముపై నంగీకరించును. 'ఎల్లన్ శిష్యుల' అను శ్రీనాథుని ప్రయోగమునే త్రోసిపుచ్చును. తిక్కనగారి చేతురు, కోతురు — ఇత్యాదు లసాధువులనును. ఇట్టి వ్యాకరణములను నిర్ణాయక వ్యాకరణము లనవచ్చును. (Prescriptive grammars). 'ప్రయోగ శరణాః వైయాకరణాః' గదా! శిష్టజన ప్రయోగములను ద్రోసి పుచ్చరాదు. వికృతి వివేకకారుడే యిట్లు సెలవిచ్చినాడు.

'శాస్త్ర ప్రయోగ వచసో శాస్త్రమ్ బలవదుచ్యతే
అనిష్పన్నే పదే తేన ప్రయోగాశ్రయణమ్ హితమ్'

ఇట్టి నిర్ణాయక వ్యాకరణములవలన భాషా నిరూపణము సంకుచితమగును. వర్ణనాత్మక వ్యాకర ణములు నిర్ణాయక వ్యాకరణములుగాగాక భాషా స్వభావోన్మీలకముగా నుండవలెను.

ఇక ఆధునిక వ్యాకరణములు కొన్ని వాక్య నిరూపకములుగా, కొన్ని పదనిరూపకములుగా నున్నవి. ఆంగ్ల వ్యాకరణ ప్రభావము దీనికి కారణము. సమగ్ర భాషాస్వరూప నిరూపణమునకు తరతమ భేద ములతో ననేకములగు వ్యాకరణములు వెలయవలెను. దీనినే ఆధునికులు Degrees of Gramaticalness అందురు.

చారిత్రక వ్యాకరణములలో మఱియొక విభాగము 'ఏకకాలిక వ్యాకరణము' అనగా ఒక కవి కాలమున వెలసిన భాషాపరిణామమును వర్ణించునది. విజ్ఞులు కవితాపరిశోధనలో ఆ కవి కవిత్వపరిణామములే గాక, ఆ కవి కాలములోని భాషాపరిణామము లుటంకించుచు 'ఏకకాలిక వ్యాకరణము'ల వెలయింపజేసిననే ఆ పరిశోధన సమగ్ర సుందరమగును. ఒక్కొక్క మహాకవి కొక్కొక్క వ్యాకరణము వెలసినచో సమగ్ర భాషా చారిత్రక పరిణామము తేటతెల్లమగును. ఏకకాలిక వ్యాకరణము లపుడు సంపుటీకరింపబడి 'బహుకాలిక వ్యాకరణము' (Diocronic Grammar) అగును. అప్పుడుగాని చారిత్రక వ్యాకరణరచన పరిణమింపదు. ఆంగ్లభాష కిట్టి వ్యాకరణములు వెలయుట వారి మేధాశక్తికి, దూరజ్ఞతకు నిదర్శనము. తెలుఁగు భాష కిట్టి యదృష్ట మెన్నడోగదా! ఆంగ్లభాషలో ఛాసర్ భాష కొకటి Shakespeare కొకటి, Milton కొకటి, ఇట్లనేక వ్యాకృతులు ఆంగ్లభాషాచారిత్రక పరిణామ ప్రదర్శన గావించినవి.

తెలుఁగు మున్నగు భాషలలో రచింపబడిన వర్ణనాత్మక వ్యాకరణములలో చారిత్రక దృష్టి మృగ్యము. లోగడ చెప్పి నట్లవి నిర్ణాయక వ్యాకరణములై, ఏదోరీతిని యిష్టశబ్దార్థ సాధనమే తత్కర్తల ప్రధాన విధిగా కనిపించును. ఖండబిందువు పూర్ణబిందువగుననుట, మేనునకు బోడినాదేశముజేయుట, రామునికి మున్నగు రూపములకు ఆరేడు సూత్రముల జెప్పుట. కొన్ని వ్యాకరణ నిబంధనలకు లొంగి కృతకమగు ఆగమాదేశ విభాగముల నేర్పరచుట మున్నగు అనేకాంశములనుబట్టి వ్యాకర్తలపై ఆధునిక భాషా పరిశోధకులకు గౌరవముతగ్గి వారికి చారిత్రకదృష్టి లేదను యపప్రథ నందించుచున్నారు. ఇట్టి రచనలు కాక చారిత్రక, సహజ వ్యవస్థతోకూడిన భాషోన్మీలనము, వాక్యోన్మీలనము, ఆధునికుల కెక్కువ ప్రీతిదాయకము. అట్టిరచనలకు మనమందర మెదురు చూడవలెను. ఈ క్రింది వ్యాకరణ సూత్రమున కనువగు వ్యాకరణ గ్రంథములు చక్కని, చక్కని రీతిలో వెలువడి 'శబ్దజాలమ్ మహారణ్యమ్ చిత్తవిభ్రమ కారణమ్' అన్నట్టి వ్యాకరణ పఠనము శిరోవేదనమను భావము తొలగిపోవలెను. అప్పుడే భాషకు సర్వదా, సర్వథా సుస్థితిగలుగును.

> 'అల్పాక్షర మసందిగ్ధమ్ సారవద్విశ్వతోముఖ
> మస్తోభ మనవద్యమ్చ సూత్రమ్ సూత్రవిదోవిదుః.
>
> —శ్రీ 'సుచంద్రి'.

## నేటి కావ్య పరిష్కరణము—శబ్దరత్నాకరము

ఆంధ్రమున మొదటిసారిగ వెలువడిన బృహన్నిఘంటువు శబ్దరత్నాకరము. అది ఆనాడు చెన్నపట్టణమున గల బోధనాభ్యసన పాఠశాలయందు ఆంధ్ర పండితులగు శ్రీ బహుజనపల్లి సీతారామాచార్యుల గారిచే వ్రాయబడినది. వారు నూటనాలుగు తెనుగు గ్రంథములను (ప్రబంధములను) లక్ష్యములుగా స్వీకరించి వాటినుండియే పదములను ఏర్చికూర్చిరి. దీనికి ఇరువదియైదేండ్లు పట్టినదిగా వారా గ్రంథమునగల పీఠికలో వాకొనిరి.

ఆనాడు వారు తాళప్రతులనుండి ఎత్తి వ్రాసికొని తన వ్రాతప్రతులను సిద్ధము జేసికొనిరి. ముద్రిత గ్రంథములు ఆనాడు అతి విరళములుగా లభ్యమగుచుండెడివి. ఈనాడు మన ప్రాచీన కావ్యపరిష్కరణలో వావిళ్ళవారి ముద్రిత ప్రతులపై నాధారపడుచున్నారేగాని, ఇతర ముద్రిత ప్రతులనుగాని, మూలతాళ ప్రతులనుగాని, చివరకు శబ్ద రత్నాకరమునుగాని చూచుట పాప మనుకొనుచున్నారు.

అకాడెమీవారి ఆంధ్ర మహాభాగవతము శబ్ద రత్నాకరముతో సంవదించబడలేదు. శ్రీ బహుజనపల్లి సీతారామాచార్యులగారు ప్రాచీన తాళపత్రముల నుండియే పాఠముల నెత్తుకొనిరి గావున వారి శబ్దరత్నాకరమున చక్కని పాఠములు గలవు.

శబ్ద రత్నాకరములోని చక్కని పాఠములు కొన్ని దిఙ్మాత్రంగా సూచిస్తాను.

అకాడెమీ 'యయాతి చరిత్ర' వావిళ్ళవారి ప్రతికి నకలు. శబ్ద రత్నాకరమున యయాతి చరిత్ర లక్ష్యముగా స్వీకరించబడినది. ముద్రిత ప్రతులకు, శ. ర. పాఠములకు చాల ప్రదేశముల భేదములు గలవు.

ఎడలవెన్నెల చక్కెరిడి జొక్కు వెన్నెలఁ
బానిక నాళీలుగాని గూర్చి 2–84.

పై సీసపాదము వెన్నెల పులుగుల బువ్వంపుబంతి వెన్నెలలోనిది. నంది తిమ్మన చకోరపు బువ్వంపు బంతిని ఒరవడిగా చేసికొని వ్రాయబడిన చొక్కపుఁ బద్యము. ఇట్టి వర్ణన ఇతరత్రా అపూర్వము. అపు రూపము. కాని అర్థము క్లిష్టముగా నున్నది. శబ్ద రత్నాకరమున.

అడలవెన్నెల చక్కెరిడి బొక్కువెన్నెలఁ
బానిక నాళీలుగాను మార్చి

ఇచట అడ అనగా 'ముద్ద' అని భావము.

మఱియొక యుదాహరణ.—

నెమ్మదిలోపల నీకునింత
మనికిత మ్మున్నఁ 4–63.

పై వాక్యము దేవయాని యయాతితోనను సందర్భములోనిది. ఇచట, యయాతి మనమున నున్నది సందేహముకాని దుఃఖముకాదు. శోకము అను అర్థమువచ్చు 'మనికితము' రసహీనమైన పాఠము. శబ్దరత్నాకరమున 'మలికితము' అను సుపాఠమే కలదు.

శశాంక విజయములోని నాల్గవ ఆశ్వాసము నందలి నూటతొంబది ఒకటవ చంపకమాల నాల్గవ పంక్తి ముద్రిత పాఠము—

ఘనముగ వీణెమీాటు లయ కాఁ
డవు నీయొఱవే నెఱుంగనే!

శ. ర. పాఠము 'బయకాడవు' సరసమును, సందర్భోచితము నైనది.

అకాడెమీ 'కళాపూర్ణోదయము' రెండవ ఆశ్వాసములోని ఎనుబది యైదవ సీసములోని రెండవ చరణములో 'తానొక నెఱజాణయై విద్య నెఱపు టెట్లు?' అని యున్నది. నెఱజాణతనము సంగీత విద్య నేర్పుటకు పనికివచ్చునా? నెఱజాణగా యుండు టలో విద్య నేర్పుటకు లాభమేమి? శబ్ద రత్నాకర మున 'నెఱగాణ' అని పాఠమున్నది. నెఱగాణ అనగా పాటగాడు అని అర్థమివ్వబడినది. ఇంకొక విచిత్రము. అకాడెమీ ప్రతిలో నాల్గవ సీసపాదము లోపించినది. ఎందుచేతనో?

పైవిధంగా ప్రతి కావ్యంలోను సందిగ్ధమైనవి, అసందర్భమైన, అన్వయక్లిష్టమైన పాఠములు కన బడుచున్నవి. కాబట్టి కావ్య పరిష్కరణ సందర్భమున శబ్దరత్నాకరముతో తలస్పర్శిగా చూడనియెడల కావ్యము సంవర్ధితముగా పరిష్కరణము చేయ సాధ్యము గాదు. ఇక ముందైనను పరిష్కర్తలు శ.ర.ను చూడ మని సవినయముగా విన్నపము చేయుచున్నాను.

— శ్రీ 'సత్యమిత్ర'.

# గ్రంథవిమర్శలు

## ధూర్జటి

[నవల; రచయిత: శ్రీ నోరి నరసింహశాస్త్రి; ప్రచురణ: త్రివేణి పబ్లిషర్సు, మచిలీపట్నం—1, మద్రాసు—1 మూల్యం: రూ. 10/—పుటలు: 503 ]

చారిత్రక నవలలు వ్రాయడంలో చేయితిరిగిన శ్రీ నోరి నరసింహ శాస్త్రిగారి సరిక్రొత్త నవల 'ధూర్జటి'. శ్రీ కాళహస్తీశ్వర శతకం చదువుతూ ఉండగా శాస్త్రిగారి భావనాపథంలో పొడగట్టిన కవి ధూర్జటి వ్యక్తిత్వం ఈ రచనకు ప్రేరణ అయినట్లు పీఠికలో ఆయన చెప్పుకున్నారు. కవి ధూర్జటి అన గానే అష్టదిగ్గజకవులూ, సంస్కృత కర్ణాట ద్రావిడ కవి పండితులూ, శ్రీకృష్ణదేవరాయలూ, ఆయన రాణులూ, తిమ్మరుసూ ప్రవేశిస్తారు. తప్పదు. ధూర్జటి పాత్ర పోషణకంటె శ్రీ కృష్ణదేవ రాయల పాత్రపోషణే ప్రాధాన్యం వహింపకతప్పదు. సహజమే. ఆ యిద్దరితోబాటు తిమ్మరుసు పాత్రని శాస్త్రిగారు తీర్చిదిద్దిన విధానం, ముఖ్యంగా రాయల చివరిరోజుల్లో సంభవించిన విపరీత పరిణామాల్లో రాయలూ తిమ్మరుసూ ఎదుర్కోవలసిన క్లిష్ట పరి స్థితుల దృష్ట్యా వారి ప్రవర్తనకూ వ్యక్తిత్వాలకూ చేస్తూవచ్చిన వ్యాఖ్యానం, రచయిత ప్రతిభకు గీటు రాయి అయి, వన్నెతెచ్చేలా అమరి ఉన్నది. రాయలు, తిమ్మరుసు కన్నులు తీయించలేదనీ, కారాగారంలో తోయించగా, దుఃఖమూ వృద్ధాప్యమూ కారణంగా తిమ్మరుసు దృష్టి కోల్పోయాడనీ శాస్త్రిగారు సున్ని తంగా చరిత్రని సవరించి రాయలమీద మన అభిమా నాన్నీ గౌరవాన్నీ దక్కించాలనే గట్టిప్రయత్నమే చేశారు. ఎవరు కాదనగలరు?

కథాసంవిధానరచనలో శాస్త్రిగారి కౌశలం మెచ్చుకోదగ్గది. కథను నాలుగు పాయలుచేసి, ఆ నాలు గింటినీ కార్యకారణసంబంధంతో చక్కగా పేన వేస్తూ అల్లుకుంటూ పోయారు. ఒకటి ధూర్జటి కథ, రెండు మోహిని మదనికల కథ, మూడు శిల్పి సిరిలూత కథ, నాలుగు శ్రీ కృష్ణదేవరాయల కథ. చారిత్రకనవల కావడంవల్ల, సంఘటనలదృష్ట్యా రాయలపాత్ర ప్రాధాన్యం వహింపక తప్పలేదు. కాని అది కావ్యశరీరం మాత్రమే. కావ్యాత్మఅయిన దైవ భక్తి, దైవమహిమ, దైవానుగ్రహము (శివభక్తి, శివమహిమ, శివానుగ్రహము) ధూర్జటి ద్వారానే ప్రకాశవౌతున్నవి. అతని ప్రక్కన, అతనికి శిష్య మాత్రులుగా మోహినీ సిరిలూతల వ్యక్తిత్వాలూ వారి ఉదంతాలూ ఆ భక్తికే ఉద్దీపనం కలిగిస్తూ ఉన్నాయి. శ్రీ కృష్ణదేవరాయల మనోవైకల్యంలో దైవసంకల్పాన్ని గూర్చిన విచికిత్స ప్రాముఖ్యం వహించడం, రాయల వ్యక్తిత్వంలో అహంకారానికీ ప్రపత్తికీ జరిగే చిత్ర మైన సంఘర్షణలద్వారా ఆయనచేసే నిర్ణయాలకీ కార్యాలకీ అర్థం ఏర్పడడం, నవలయొక్క కావ్యా త్మతో చక్కగా సమన్వయిస్తున్నది. అలా కావ్యాత్మ అయిన 'శివభక్తి' పరంగా చూస్తే నవలలో నాయ కుడు ధూర్జటియేగాని, శ్రీకృష్ణదేవరాయలు కాడు! రాయలద్వారా జరిగినది శివాపచారము. అందుకు ఆయన ఫలితము అనుభవించినాడు అన్న రసధ్వని రాయలకథలోనేగాక కావ్యం మొత్తంమీదా ఉన్నది. 'రాజ్య సంస్థాపన సమయములో శ్రీ విద్యారణ్య భారతీ స్వామిపాదులవారు ఈ రాజ్యమంతా పంపా విరూపాక్ష స్వామివారికి ధారాదత్తము చేయించినారట గదా!... అందువలననే శ్రీ విద్యానగరచక్రవర్తులందరు నియత ముగా శ్రీ విరూపాక్షస్వామి పాదపద్మారాధకులు!' అని 68 వ పుటలో ఒక సంభాషణ. రాయలు, తన పుత్రుడు తిరుమల దేవరాయలు సాక్షాత్తూ తిరుమల

నాథుడే అను భ్రమలోపడి అతనికి పట్టాభిషేకంచేసి తను శిరః ప్రధాని అవుతాడు. ఇది శివాపచారమని ధ్వని. ఇక్కడ రాయల మనస్తత్త్వ చిత్రణం ఎంతో మనోజ్ఞంగా ఉన్నది. రాయల అహంకారమూ, (రాజ్యము తను విస్తరించి సంపాదించినదని), రాయల మమకారమూ (వృద్ధాప్యంలో పుత్రోదయము) తిరుమల నాథునిమీద భక్తి ప్రపత్తుల వేషంలో రాయలకు భ్రమకల్పించి ఆట ఆడించినవి. కాని పుత్రుని అకాలమరణంతో రాయలలో చిత్తమథనం ప్రారంభమౌతుంది. ఇది శిక్ష. ఆ భావపరంపరలో రాయలకు యిలా తోస్తుంది: 'ఈ రాజ్యము పూర్వము స్థాపించు సమయముననే శ్రీ విద్యారణ్య స్వాములవారి ఆదేశముచే శ్రీ హరిరాయ బుక్కరాయ సోదరులు దీనిని శ్రీ విరూపాక్షస్వామికి సమర్పించిరి...ఈ సామ్రాజ్య మా స్వామి సొత్తు. దాని నింకొకస్వామికి ధారపోయుటకు మాకేమి అధికారమున్నది? ఒకవేళ ధారపోసినను పరద్రవ్యాపహరణమునకు తిరుమలనాథు డంగీకరించునా?' (317 వ పుట). ఇది రాయల జ్ఞానోదయానికి నాంది. రాజ్యానికి ఆపద వస్తుంది. రాయల చిట్టచివరి యుద్ధయాత్రతో అది నివారింపబడుతుంది. తర్వాత ఆయన మనస్సు శ్రీ కాళహస్తీశ్వరుని మీదికి మరలినదట. 'స్వామీ, తిరుమలనాథా!... మోహినీ రూపముధరించి జ్ఞానమూర్తియైన సదాశివునే కామమోహితుని జేసిన నీకు మాబోంట్లు ఒక లెక్కటయ్యా స్వామీ! ... మాయామోహితులకు నీవు సద్గతులే కల్పిస్తావు. నాకిప్పుడు శ్రీ కాళహస్తీశ్వరస్వామిని చూపించు.' రాయలకు చివర మనశ్శాంతి, భగవదనుగ్రహమూ లభించినట్లే శాస్త్రిగారు చిత్రించి ముగించినారు. చాల హృద్యముగా నున్నది. శివుడే సూత్రధారి అయినాడు!

శివాపచారము, శిక్ష, జ్ఞానోదయము, భగవదనుగ్రహము—ఈ వరుస నవలలోని ప్రధాన వ్యక్తులందరి చిత్రణములో రచయిత పాటించడము నవలకు విశిష్టమైన కావ్య సౌష్ఠవాన్ని తెచ్చిపెట్టింది. ధూర్జటి తన జన్మవాసరమునాడు శివపూజ చేయవలసిన వేళలో వేశ్యఅయిన మోహినితో ఏకశయ్యాగతుడైనాడు. శివుణ్ణి మోహిని దక్షిణహస్తంలో ఆవాహనచేసి ఆరాధించాడు. ఇది అపచారమని గట్టిగా చెప్పలేని ఒక అపచారము. కాని ఆ కొరత ఏదో మనస్సులో బాధించడం వల్లనే ధూర్జటి మరుసటిరోజు మహారుద్ర జపానికి కూర్చుని రాజసభకు వెళ్లలేకపోయాడు. అందువల్ల రాజుకు కోపం వస్తుంది. ధూర్జటిని మునుమ్మారు ద్వారపాలకులచేత అవమానింప చేస్తాడు. ఇదీ శిక్ష. తర్వాత ధూర్జటికి రాజసన్మానము లభిస్తుంది. —ని ధూర్జటిలో క్రమంగా పరిపక్వమైన శివభక్తి అతణ్ణి శ్రీ కాళహస్తి వైపుకే లాగుతుంది. అక్కడ అతనికి భగవంతుడే సన్మానం జరుపుతాడు. శ్రీకాళహస్తి మాహాత్మ్య కావ్యరచన చేస్తాడు.

మోహినికి అయాచితంగా, పూర్వజన్మసుకృతి కారణంగా శివానుగ్రహం లభిస్తుంది. ధూర్జటి ద్వారా ఆమెజీవితం మారిపోతుంది. బాలరాజు సమక్షంలో ఆమె కొరడాదెబ్బలు తినడం ఆమెలో పాపశేషానికి ఒక శిక్ష, ఒక క్షాళనక్రియ. అంతటితో ఆమె సర్వాంగాలూ పునీతమై. ఆమె శివానుగ్రహం పొందుతుంది; శ్రీకాళహస్తి చేరుకుంటుంది. తిమ్మరుసు రాజసభలో విద్వద్గోష్ఠి ప్రారంభిస్తూ నత్కీరుని కథను చర్చకు తీసుకువస్తాడు. మేధావియైన తిమ్మరుసు భగవంతుని లీలలనుగూర్చి తర్కము లేవదీసి ఆయన లీలల్లో ఔచిత్య విచారణకు పూనుకోవడం, ఒకవిధమైన శివాపచారము. 'ధూర్జటి ఆవేశపూరిత శివవాక్కులు ఆలకింపగా...తిమ్మరుసు...తల వంచుకొనెను. శివలీలారహస్యములు గ్రహింపక, హేలగా తాను శివకృత్యములను పరోక్షముగా తూలనాడి శివాపరాధము కావించితినా యను భావ మాతనికి భయాందోళనములు కలిగించెను' (164 వ పుట). తిమ్మరుసు బాలరాజునకు విషప్రయోగము చేసినాడన్న అపవాదులో బంధింపబడి, దృష్టి కోల్పోవుట, అది తిమ్మరుసుకు లభించినశిక్ష. దానితో అతనిదృష్టి పూర్తిగా అంతర్ముఖమైనది!; అదియే భగవదనుగ్రహము కూడ!

బాలరాజైన తిరుమలరాయలు శివదీక్షాపరురాలైన మోహినిని, తనకు నమస్కరించలేదని కోపంతో, కొరడాతో కొట్టిస్తాడు. విరూపాక్షస్వామికే ఆ దెబ్బలు తగిలినవి. ఉత్తరక్షణమే బాలరాజు మృత్యువువాత బడినాడు. అందులో శిక్షా, దైవానుగ్రహమూ రెండూ ఏకమైనవి. ఇదీ శివలీలా వైవిధ్యమూ, వైచిత్ర్యమూ నవలలో ఏకవస్తువుగా రూపొందింపబడిన తీరు.

నత్కీరుని ఉదంతముపై సుదీర్ఘముగా నడచిన గోష్ఠి, శ్రీకృష్ణదేవరాయల సభావైభవాన్ని, సభాసదుల భిన్నవ్యక్తిత్వాలనూ చక్కగా వ్యక్తం చెయ్యడమే కాకుండా, కావ్యనాయకుడైన ధూర్జటిలోని భక్తి వైశిష్ట్యాన్ని, తద్ద్వారా అతని ప్రముఖ్యాన్ని ఎత్తిచూపిన ఘట్టం అయింది. అంతకంటెకూడా శివానుగ్రహము ఎంత విచిత్రంగా, శిక్షారూపంలో కూడా ఉండగలదో వివరించేందుకు కల్పించుకొన్న అవకాశమై రచయిత నవలలోని మూలవస్తువును వ్యాఖ్యానించడం జరిగింది. ఇలాంటి ప్రయోజనమే సిరిలాత ఉగ్ర నరసింహమూర్తిని గండరించేందుకు సంకల్పించి పూనుకోవడంలోనూ రచయిత సాధించారు. బాలరాజు మృతితో మనోవైకల్యం కలిగిన శ్రీకృష్ణదేవరాయలు గతాన్ని నెమరువేసుకుంటూ, తండ్రి నరసానాయకుల రూపం స్ఫురించేటట్లు నృసింహస్వామి మూర్తిని గండరించమని శిల్పికి ఆజ్ఞ యిస్తాడు. శిల్పి సిరిలాత ధూర్జటిని సంప్రదించి తనకుతోచిన ఉగ్రమూర్తినే తయారుచేస్తాడు. ఆ సమయంలోనే రాజు కోపోగ్రత అందరిమీద ప్రసరిస్తూ ఉంటుంది, అది రాజ్యానికే చేటుగా భయం గొల్పుతూ ఉంటుంది. ముఖ్యంగా రాజు ధూర్జటిమీద ఆగ్రహావేశుడై ఉన్న సమయంలో ధూర్జటి శిల్పితో నృసింహమూర్తి కన్నులలోని రౌద్రాన్నిగూర్చి ప్రసంగిస్తూ ఉంటాడు. 'నృసింహస్వామిని రుద్రమూర్తిగా భావించుట కూడ కాదనను. అది తాంత్రికభావన. హిరణ్యకశిపునికి ప్రత్యక్షమైనది నృసింహమూర్తి. ఆ మంత్రరాజములోనే నృసింహతాపినిలో రుద్ర శబ్దమునకు బదులు భద్ర శబ్దమున్నది. అది ప్రహ్లాదాది భక్తులకు ప్రత్యక్షమైన స్వామి మూర్తి. ఒక్క అక్షరమే కదా భేదము?' ఇది చెప్పి ధూర్జటి రాజు దగ్గరకు వెళ్తాడు. రాజతణ్ణి విద్యానగరం నుంచీ బహిష్కృతుణ్ణి చేస్తాడు. ఇక్కడ రాజులో ప్రత్యక్షమైన రుద్రమూర్తి, శ్రీ కాళహస్తీశ్వరుని భద్రమూర్తికి పర్యాయమే తప్ప భిన్నము కాదు! ఇది శ్రీకాళహస్తిస్వామియే అనుగ్రహించి విద్యానగరము నుండి ధూర్జటిని చేరబిలుచుట! సిరిలాతకు కూడా అలానే నగర నిర్గమనము తప్పలేదు. అతను కూడా శ్రీకాళహస్తినే చేరుకుంటాడు. ఇలా భక్తులైన ధూర్జటి, మోహిని, సిరిలాత విద్యానగరంనుండి రాజాగ్రహం కారణంగా శ్రీ కాళహస్తికి తరలి వెళ్ళడమే నవలలోని కథా పరిణామం. అంటే విరూపాక్షస్వామి (రుద్రమూర్తి) సన్నిధినుండి శ్రీ కాళహస్తీశ్వర స్వామి (భద్రమూర్తి) సన్నిధి చేరుకోవడాన్ని— అపచారము, శిక్ష, అనుగ్రహము అనే క్రమ పరిణామ రూపంలో భక్త చరిత్రగా, ఈ చారిత్రక నవలని తీర్చిదిద్దారు శ్రీ నరసింహ శాస్త్రిగారు. చక్కని ఆకృతి, సౌష్ఠవం కలిగిన రచన.

నవలయొక్క కావ్యాత్మ శివభక్తి, శివమహిమ, శివానుగ్రహము కావడంతో కొంత వైష్ణవాన్ని కించపరచే ధోరణి ఉన్నదేమోననే సందేహానికి ఆస్కారం లేకుండా, ఎక్కడికక్కడే జాగ్రత్తపడుతూ, వివరిస్తూ, మూర్తులు వేరేతప్ప మూలతత్త్వం ఒక్కటే అనే భావాన్ని ప్రస్ఫుటం చేస్తూ రచన చేశారు శాస్త్రిగారు. దీనికి వారిని అభినందించక తప్పదు.

శ్రీ కృష్ణదేవరాయలు వట్టి ఉత్సవ విగ్రహమే, రాజ్యానికి మూలవిరాట్టు తిమ్మరుసుమంత్రి ఒక్కడే అనే అపోహ ఎవరికైనా ఉంటే దాన్ని పోగొట్టడానికి వాచ్యాప్రయత్నం చేశారు శాస్త్రిగారు. (252–253 పుటలు).

రాయలు తిమ్మరుసును బంధవిముక్తుణ్ణి చేస్తూ పశ్చాత్తాపాన్ని ప్రకటించే సందర్భంలో ఆ పాత్ర నోట శాస్త్రిగారిలా పలికించారు: 'అప్పాజీని, ఆయన తమ్ముని, కుమారుని, చెరనుండి విడిపించి వారి క్షమాభిక్ష వేడి...గౌరవించుట మా విధి. ఇందుకు వెనుకాడినచో...భవిష్యత్కాలమున నృసింహమూర్తులు మాకు కృతఘ్నతా దోష మారోపించి వర్ణింతురు...' రాయలు 'నరసింహశాస్త్రివంటి' చారిత్రక నవలా రచయితల్ని ఊహించి తిమ్మరుసుకు న్యాయం చెయ్యబూనుకోవడం కూడా ఔచిత్యాన్ని పోషించే ఒక చమత్కారమే అయింది!

నవలలో ఉల్లేఖింపబడిన శ్రీ కాళహస్తీశ్వర శతక పద్యాలకు, ఆయా సందర్భాల మూలంగా కొత్త స్ఫూర్తి, ప్రశస్తి వచ్చాయనడంలో సందేహంలేదు. ఇది ధూర్జటికి శ్రీ శాస్త్రి చేసిన మేలు!

'ఈనవలా రచనలో తరచుగా స్వామి నన్ను ఆవేశించి ఉండెననియే నా విశ్వాసము' అని చెప్పకున్నారు పీఠిక చివర శాస్త్రిగారు. వారి దృక్పథంతో మనం ఏకీభవించినా ఏకీభవించకపోయినా వారి మనస్స్నిగ్ధత, సంస్కారము నవలలో ప్రతిబింబించి మనల్ని రంజింప జేస్తున్నాయి.

— ఆర్. ఎస్.

## చైత్రపూర్ణిమ

(కాశ్మీర చరిత్ర కథలు; రచయిత : పిలకా గణపతిశాస్త్రి; ప్రచురణ : యం. శేషాచలం అండ్ కో, మచిలీపట్టణం — మద్రాసు — సికింద్రాబాదు; 191 పేజీలు; వెల రూ. 2)

కల్హణుని రాజతరంగిణి చారిత్రక గ్రంథమే కాక సాహిత్య రత్నాకరం కూడ. అందులో అమూల్యమైన అనేక కథలు నేటికీ నిత్యనూతనంగా ఉండి చదువరులను ఆనందింపజేస్తున్నాయి. 'తాత తాతల నాటి కథలు తవ్విపోయటం'లో శ్రీ పిలకా గణపతి శాస్త్రిగారు సిద్ధహస్తులు. 'ప్రాచీన గాథాలహరి' అనే పేరుతో శ్రీ గణపతిశాస్త్రిగారు ఆంధ్రీకరించిన ఎన్నెన్నో ప్రాచీన గాథలు సంప్రదాయ ప్రియులైన వారందరూ భద్రపరచుకోదగినవి. తెలుగు భాషలో తగినన్ని ప్రాచీన గ్రంథాలు అందుబాటులో లేవని, సంస్కృత భాషలోనే 'రాజతరంగిణి'వంటి అద్భుతమైన గ్రంథాలు ఉండిపోతే తెలుగువారికా సంపద కొరవడుతుందని భావించి కీ. శే. శివలెంక శంభుప్రసాద్‌గారు గణపతిశాస్త్రిగారివంటి సంస్కృత విద్వాంసులచేత తెనుగున రచింపజేశారు. అందులోని పదికథల సంకలనమే 'చైత్రపూర్ణిమ' కథాసంపుటి. గణపతిశాస్త్రిగారు పేర్కొన్నట్లు ఒక్క రాజతరంగిణి కోసమే ప్రత్యేకించి సంస్కృతం నేర్చుకోవచ్చునన్నా అతిశయోక్తి కాదేమో!

రాజతరంగిణీగాథలకు యీ కథలు కేవలం అనువాదాలుగాని అనుసరణలుగాని కావు. ఆ గ్రంథంలోని సంఘటనలు, పేర్లు, తేదీలు, తిథులు ఆధారంగా తీసుకొని మళ్లీ స్వతంత్ర కల్పన లనిపించే విధంగా రచించినది. సులభశైలిలో యింపుగొలిపే గణపతిశాస్త్రిగారి రచన యీ గాథలకు మెరుగు పెట్టిందనటం అన్యాయం కాదేమో! 'అప్పటి రాజులను, రాణులను, వారి వారి అంతరంగాలను, అంతఃపుర విశేషాలను, ఆచార వ్యవహారాలను, సాంఘిక పరిస్థితులను, సంస్కృతి విశేషాలను' యీ కథలలో వర్ణించారు. ఈ వర్ణించటంలో గణపతి శాస్త్రిగారితో ప్రగతి కాముకులైన చదువరులు పెక్కుమంది ఏకీభవించరు. ఆ నాటి రాజుల స్త్రీ చాపల్యాన్ని, కొన్నిచోట్ల స్త్రీల దుర్నీతిని, చాతబడులు, జ్యోతిష్యాలు, పూర్వజన్మలు వీటికి సంబంధించిన మూఢనమ్మకాలను గణపతిశాస్త్రిగా రతి మక్కువతో వర్ణించటం సబబుగా కన్పించదు.

'కశ్మీరాః పార్వతీ తత్ర
రాజాజ్ఞేయః శివాంశజః

నావజ్ఞేయః సదుష్టోపి
విదుషా భూతి మిచ తా'.

'కాశ్మీరభూమి సాక్షాత్తు ఆ పరమేశ్వరుని అర్ధాంగి పార్వతీదేవి స్వరూపమే. రాజు పరమశివుని అంశను పుట్టిన మహనీయుడు. అటువంటి రాజు దుష్టుడైనా అతనిని అవమానించరాదు'— ఇటువంటి భావం ఉన్న పూర్వకాలంలో కల్హణమహాకవి రసవత్తరంగా రాజతరంగిణిని రచించినా, వాటిలోని గాథలను చదివి, మైమరచి 'లేతబుల్లిలు కొక్కిరించినా' సరేనని, ఆ గాథలలో కల్హణమహాకవి చెప్పిన దాని కంటె ఎక్కువ వివరాలను చెప్తూ, మరింత బట్టబయలుగా గణపతిశాస్త్రిగారు రచించటం విచారకరం.

'చైత్రపూర్ణిమ' అనే పేరు గలిగిన మొదటి కథ చదవగానే భాష, వర్ణనలు, చారిత్రక వివరాలు ముచ్చట గొలిపినా శ్రీలేఖ, జయాకరుల అక్రమమైన సమాగమాన్ని రచయిత సానుభూతితో వర్ణించటం దుస్సహంగా కన్పిస్తున్నది.

'సంపూర్ణాహుతి' యీ సంపుటిలో కంతటికీ మంచికథ. యశస్కర మహారాజు మరణించిన తరువాత ఆయన భార్య సర్వమంగళ కాలానుగుణంగా ఆచారాలను పాటించి విధవగా మారి తదనుగుణంగా జీవించ లేదు. పైగా నానాటికి నూతన వధువువలె అలంకరించుకుంటూ లోకాపవాదానికి గురి అవుతుంది. పర్వగుప్తుడనే రాజు సర్వమంగళాదేవిని మోహించి, ఆమె అంగీకారం లభించదని తెలిసి, ఆమె స్వయంగా కట్టించే దేవాలయనిర్మాణానికి విఘ్నాలు కల్పించి, ఆమెనెలాగైనా తన సహాయాన్ని కోరేటట్లుగా చేస్తాడు. సర్వమంగళ గొప్పపన్నాగంతో, పర్వగుప్తుని కోర్కె కంగీకరించినట్లే నటించి, దేవాలయ నిర్మాణం పూర్తయేవరకు గడువుపెట్టి, ఆలయం పూర్తయి, సంప్రోక్షణ మహోత్సవంలో బాగా అలంకరించుకుని భుగభుగ వెలిగే హోమజ్వాలల్లో తనను ఆహుతి చేసుకొంటుంది. ఒక సతీమతల్లి చారిత్రక గాథను గణపతి శాస్త్రిగారు రసవంతంగా చెప్పారు.

'భవిష్యద్వాణి' కథ జ్యోతిశ్శాస్త్రంపట్ల నమ్మకముండున్న వారికెంతగా వచ్చుతుందో దానిని నమ్మనివారికి అంత పరిహాసాస్పదంగా ఉంటుంది. తన నమ్మకాలకు, ఆశలకు భిన్నంగా జ్యోతిశ్శాస్త్ర ఫలితాలు వెల్లడైనప్పుడుగూడ ఆ శాస్త్రవేత్తను ఘనంగా సత్కరించటం ఆ నాటి బాలాదిత్య సార్వభౌముని ప్రత్యేకత. నాగేశ్వర భట్టారకుడు, మేధావి భట్టు అనే జ్యోతిషవేత్తల పట్టుదలతో కూడిన వాగ్వాదాలు యీ కథను ఉత్కంఠతో చదివిస్తాయి.

అనంగలేఖ అనే రాణి తమదేశపుమంత్రి అయిన ఖంఖమంత్రిని కామించి, ఒకనాటి విషమ పరిస్థితిలో తనకోర్కెను నెరవేర్చుకొంటుంది. ఆమె భర్త దుర్లభవర్ధనుడు మంత్రి తప్పేమీలేదని భావించి 'మానాభిమానాలుజ్జగించిన ఒక చపలవనితకోసం మీవంటి సౌహార్దమూర్తిని బలిపెట్టటం సముచితమనిపించ లేదు' అని వర్తమానం పంపి, క్షమించి వదిలేస్తాడు. తరువాత యుద్ధభూమిలో మంత్రి ప్రాణాలకు తెగించి పోరాడి రాజుకు తోడ్పడతాడు. ఇటువంటి కథలను నేటి చదువరు లెంతవర కాదరిస్తారన్నది సందేహాస్పదమే.

'కవితాగౌరవ' మన్నది భర్తృమేంఠకవి తాను వ్రాసిన హయగ్రీవవధ మహాకావ్యాన్ని కాశ్మీరరాజు మాతృగుప్తుని కొలువుకూటంలో వినిపించి ఘన సత్కారాలను పొందిన ఘట్టాన్ని వివరించేది.

పౌరులందరినీ సమాన దృష్టితో చూడని రాజోద్యోగులందరికీ గుణపాఠంచెప్పి ఒక పేదకుటుంబీకుడు మంకణుడు త్రిభువనస్వామి ఆలయ నిర్మాణానికి పూనుకొన్న రాజుకు దేవుని దృష్టిలో అందరూ సమానులేనని హెచ్చరిక చేస్తాడు. ఇది త్రిభువనస్వామి అనే పేరుగల కథ.

'చాతబడు'లంటే నమ్మకాన్ని కలిగిన కాశ్మీర ప్రజలు 'మంత్రమహిమ' అనేకథలోని సంఘటనలను నమ్మిఉంటే ఉండవచ్చుగాక. కల్హణకవి వ్రాసినా గణపతి శాస్త్రిగారి వంటి విజ్ఞులు వాటికి విలువయిచ్చి ప్రచారాన్ని కల్పించటం విచారకరం. దీని వంటిదే పూర్వజన్మలపైన నమ్మకాన్నికల్గించే కథ 'మహనీయ నర్తకి!'

రోమ్ నగరాన్ని తగులబెట్టిన నీరో చక్రవర్తి వంటివాడే మన చరిత్రలోమ ఒక ప్రబుద్ధుడున్నాడు. కాశ్మీరాధిపతి లలితాదిత్య చక్రవర్తి మద్యపానపు

మత్తులో ప్రవరపురాన్ని స్త్రీబాల వృద్ధు లందరి తోను తగులబెట్టవలసిందిగా ఆజ్ఞాపిస్తాడు. కాని ప్రధానమంత్రి రాజాజ్ఞను ధిక్కరించి రాజును మాత్రం ప్రవరపురం తగులబడిపోతున్న భ్రమ కలగ టానికి పెద్ద పెద్ద గడ్డిమేటుల్ని తగలబెట్టిస్తాడు. తరువాత నిజం తెలుసుకొన్న రాజు పశ్చాత్తప్తు డైనా మంత్రి మాత్రం తానటువంటి రాజు కొలువులో ఉండలేనని చెప్తాడు. రాజెంతో బతిమి లాడిన పిమ్మట మళ్లీ మంత్రిపదవిని స్వీకరించటానికి అంగీకరిస్తాడు. ఇది ఆజ్ఞాధిక్కారమనే కథ.

కాశ్మీరరాజ్యం పరిపాలించిన యశోవతీదేవికి రాజ్య వారసత్వం ఏ పరిస్థితులలో సంక్రమించినదో చెప్పేకథ కాశ్మీరదేవత.

'కశ్మీరాః పార్వతీతత్ర
రాజాజ్ఞేయఃశివాంశజః'

అని తలంచిన కాశ్మీరప్రజలు ఆమెను పర్వత రాజ తనూజ ప్రభావరాశి అంశతో అవతరించినట్లు తలంచి గౌరవించారట.

ఈ పది కథలలోను భాష చారిత్రక గాథలను ఆస్వాదించటానికి అనువుగా, హృద్యంగా ఉన్నది. ప్రాచీనగాథాలహరితో యీావరకు ప్రసిద్ధులైన గణ పతి శాస్త్రిగారు 'రాజతరంగిణి' నంతటిని ఆంధ్రు లకు అందిస్తే మరింత బాగుంటుంది.

## కవిత

(ఖండకావ్య సందోహము; కవి: గుఱ్ఱము వేంకట సుబ్రహ్మణ్యము; ప్రచురణ: సాహితీ సమితి, వేదంవారి అగ్రహారము, నెల్లూరు; మూల్యము. రూ. 3–00.)

నేడు నామమాత్రావశిష్టంగా ఉన్నప్పటికీ సాహితీ సమితి సభ్యుణ్ణని చెప్పుకోవటం గర్వకార ణంగా ఉండేది ఒకప్పుడు. నవ్యకవిత్వపు ఆరంభదినా లలో సాహితీసమితి సేవ గణనీయమైనది. చెట్టు ఎంత ముసలిదైనా కాయల రుచిలో మార్పేముంటుంది? కాకపోతే కొందరు చెట్టుపేరుచెప్పి కాయలమ్ము కోవచ్చు. శ్రీ గుఱ్ఱము వేంకట సుబ్రహ్మణ్యముగారు సాహితీ సమితి తొలి రోజులనుండి ఆ నాటి గొప్ప కవులతో మిత్రత్వం నెరపిన వారు. వీ రప్పుడప్పుడూ వ్రాసిన కావ్యఖండికల నొకచోట చేర్చి 'కవిత' పేరుతో వెలువరించారు. ఇందులో స్వేచ్ఛాగానము, హృదయామోదము; గాథావళి; వకుళావళి; ఆర్యావళి; బాష్పావళి; దుఃఖోత్తరణము అనే భాగాలున్నాయి.

'భిదుర సంపాతము' అనే కావ్యఖండికలో
'హృదయ గవాక్షము తెఱచితి
మృదులపవన మాశించితి'నని చెప్తూ

'అకట! తిమిర కాలుష్యము
వికృత మేఘ సంఛన్నము
భీకర రవ నిర్ఘోషము
తాకె భిదుర సంపాతము'

అని వాపోయారు. అనందోద్వేగాలను అక్షరబద్ధం చేస్తూనే 'హృదయ వనమున నొక్క భావదళమైన గదలకున్నది' అని స్తబ్ధతను సైతం ఎంతో చక్కగా కవితగా మలచారు.

'హంపీక్షేత్రము'వంటి రసవత్కావ్యం వెలు వడిన తరువాత గూడ హంపీ శిథిలాలు కవుల హృద యాలను స్పందింపజేసి, నిత్యనూతనమైన కవితా ప్రేరణ కల్గిస్తూనే ఉన్నాయి. 'హంపి' అనే ఖండ కావ్యములో

'అరుణాస్పదము దీని నొరవడిగా నుంచు
కొనియె పెద్దన్న వర్ణనముసేసె
గిరినదీప్రణయమ్ము గీల్కొల్పెభట్టుమూ
ర్తియు పంపయోరగిల్తీరు సూచి
సిద్ధయక్షాదుల జిత్రించె నిచ్చటి
తీర్థాధ్వగులజూచి తిమ్మనకవి
ఋష్యమూక మతంగ హేమకూట సమీక్ష
రామాభ్యుదయకర్త వ్రాసెగ్రుతిని
రామలింగన నిగమశర్మను దదీయ
సోదరిని చుట్టుపట్లన చూడబోలు

కావ్యలోకమునకు దానకటక మనగ
పరిఢవిల్లిన పురమిది పాడువడియె'

నని అలనాటి వైభవాన్ని తలచుకొని వాపో యారు. ఇంకా యిదేవిధంగా

'ద్వారపాలికల సుందరమూర్తి చెడిపోయె
పాలిండ్లు ఛేదింప వాడిమొనలు'

'పూచినకాన చిచ్చేచి కాల్చినయట్లు
తులకలు పురలక్ష్మి చెలఁచివైవ'

మొదలైన సీసపద్యాలలోని భావాలు రసవం తంగా ఉన్నాయి.

దేశభక్తి, మహాపురుషభక్తి, ఆర్యధర్మభక్తి కలిగిన సుబ్రహ్మణ్యముగారు తమ భక్తి ప్రపత్తులను ఛందోరూపములో నిర్దుష్టంగా వెలువరించారు. 'బాష్పావళి' అనే భాగంలో వ్రాసిన ఎలిజీలు రెండూ చదువరుల నంతగా కదిలించేవికావు. తమ దుఃఖాన్ని ఛందస్సులో వెల్లడించినంత మాత్రాన అవి మంచి ఎలిజీలైపోవు.

'రామబాణమునకు రాక్షసులెల్లరు
ప్రమందినారుగాని ప్రమందడొకడు
కాలరాక్షసుండు ఘటనాఘటన దక్షు
డేలుజగతి దురితజాలనిరతి!

వంటి పద్యంలోని తీవ్రతైనా మిగిలిన పద్యా లలో లేదు. మొత్తంమీద కవితలో ఛందో వ్యాకరణ అలంకారాలన్నీఉన్నా కవితమాత్రం తక్కువే.

—శ్రీ రామమోహనరాయ్.

## ఆంధ్ర పరాశరస్మృతి

(పద్యకావ్యము)

(రచయిత : కీ. శే. ఆదిపూడి ప్రభాకరా మాత్యులు; పేజీలు 95; వెల—సాదాప్రతి రు. 2.00లు. ప్రతులకు—ఎ. వి. ఎస్. సుబ్బారావు, (ప్రచురణ కర్త.) 1—8—155 5; మెండలే లేన్; ప్రెండరు గాస్టురోడ్డు; సికింద్రాబాదు—3.)

ఇది శాస్త్రకావ్యం; శాస్త్ర విషయము పద్య రూపంగా రాయబడినది. కావ్యారంభమునకు పూర్వం కవిరాజ సందర్శనమనుపేర ఇరవయి ఏడు పద్యములు చేర్చబడినవి. ఆ పద్యములు కీ. శే. మంత్రి ప్రగడ భుజంగరావు జమీందారును కవిగారు దర్శించినపుడు రాసినవి.

'ఆంధ్ర పరాశర స్మృతి' అనబడే ఈ కావ్యం మూడు బింబములుగా విభజింపబడినది. మొదటి బింబమునందు నాలుగు అధ్యాయములు, రెండవ బింబమునందు అయిదు అధ్యాయములు, మూడవ బింబమునందు మూడు అధ్యాయములు—మొత్తము పన్రెండు అధ్యాయములు గలవు. కావ్యం 'కలికాల యోగ్యమగు శౌచాచారముల'నుగూర్చిన చర్చతో నిండి ఉంది.

చతుర్వర్ణము లాచరించవలసిన ధర్మస్వరూపం ఈ కావ్యంలో వివరింపబడినది. కలియుగమునకు సంబం ధించిన అనేక పాపకార్యములు వాటికి తగిన ప్రాయశ్చిత్త విధములు ఈ కావ్యములో వివరముగా తెలుపబడినవి.

మునులు వ్యాసమహర్షిని కలికాలమునకు తగిన ఆచారములను తెలుపమని అడిగినపుడు వ్యాసుడు మునులకిచ్చిన సమాధానము—

'సర్వతత్త్వజ్ఞుఁడనుకాను సదయులార!
ధర్మములు బోధఁజేయ నా తరముకాదు
కలఁడు మా తాత సర్వమ్ముఁ దెలియువాఁడు
ప్రజ్ఞ నీ సమాను డతఁడు సర్వమ్ముఁ దెలియు
వాఁడు.'

ఇది సంస్కృతమునుండి తెనుగునకు అనువ దింపబడిన కావ్యము. వ్యాసుడు పరాశరునికి కొడుకు అని, మనుమడని రెండు వాదాలున్నవి. అయితే కొడుకు అనే వాదమే అనేకమందిచేత ఆమోదింప బడింది. 'తాత' అనే పదానికి సంస్కృతంలో తండ్రి

అనే అర్థం ఉంది. అయితే తెలుగులో 'తాత' అంటే తండ్రి తండ్రిగాని, తల్లి తండ్రిగాని అవుతాడు. పై పద్యంలో 'తాత' అనే శబ్దానికి బదులు తండ్రి అనే శబ్దాన్ని ఉపయోగించవచ్చు.

విషయం ప్రధానంగా ఆచార ధర్మాలకు సంబంధించినది కాబట్టి పద్యప్రక్రియలోకంటే వచనంలోనే బాగుంటుంది. ఈ కాలంయొక్క చైతన్య స్వరూపానికి, ఇలాంటి శాస్త్ర కావ్యాలకి ఏవిూ సంబంధం లేదు.

కావ్యగత శిల్పానికి దాని వివరణకు ఇలాంటి కావ్యాల్లో స్థానం లేదు. ఈ జాతి కావ్యాలకు శైలి ప్రాణభూతమైన లక్షణం. ఆ శైలి ఈ కవిగారిలో పరిపూర్ణస్థితిలో ఉంది. చెప్పదల్చుకున్న విషయం కాబట్టి శైలి నలుగురికీ అర్థమయ్యేలా చక్కగా సరళంగా ఉంది. చాతుర్వర్ణ వర్గసమాజంమీద దానితాలూకు ఆచారాలమీద ఇంకా విశ్వాసంఉన్న వాళ్లు ఈ కావ్యాన్ని చదవవచ్చు; తెలియని విషయాల్ని తెలుసుకోవచ్చు.

– శ్రీ టి. ఎల్. కాంతారావు.

Printed and Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7 Thambu chetty Street, Madras-1. Editor : S. Radhakrishna.

# భారతి

మాసపత్రిక


శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938–1972)



సెప్టెంబరు 1972

సంపుటము : 49 ః సంచిక : 9 ః

వెల ఒక రూపాయి

# వి ష యా ను క్ర మ ణి క

## సెప్టెంబరు 1972



గమనిక—23 వ పేజీ శీర్షికలో—"బాపూజీ ఆత్మకథ" అని వుండుటకు బదులు "బాబాజీ ఆత్మకథ" అని పడినది. సవరించుకొన ప్రార్థన.

# "ఉభయాభిసారిక"

## భాణం

**సంస్కృతమూలం :** వరరుచి

**తెలుగుసేత :** శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు

### చిన్నిమున్నుడి

శూద్రక మహాకవి సంస్కృతంలో రచించిన పద్మ ప్రాభృతకం అనే భాణానికి ఈ రచయిత తెలుగు అనువాదం 1969 ఏప్రిలు సంచిక భారతి ద్వారా పాఠకులకు పరిచితం అయింది. ఆది తరువాత 'తామరపువ్వుకానుక' అనే పేర రేడియోలో ప్రసారం ద్వారా కూడా శ్రోతలకు పరిచయం అయింది. శూద్రకునిలాగే ప్రాచీన భాణకర్తలలో ప్రసిద్ధి పొందిన మరొక కవి వరరుచి. కీ. శే. శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు పరిష్కరించి, ఉపోద్ఘాతంతో సహ పాట్నాలో ప్రచురించిన 'చతుర్భాణి' అనే నాలుగు భాణాల సంకలనంలోనివే—ఈ శూద్రకుని పద్మ ప్రాభృతకమూ, వరరుచి రచించిన ఉభయాభిసారికా అనే రెండు భాణాలూను. వరరుచి—ఇప్పటికి తెలిసిన భాణకర్త లందరిలోనూ ప్రాచీనతముడు. విక్రమార్కుని ఆస్థానంలోని నవరత్నాలు అని ప్రసిద్ధి పొందిన తొమ్మిదిమంది కవులను గూర్చిన శ్లోకంలో చివరిపేరు వరరుచిదే అయినా, ఆ తొమ్మండుగురి సమకాలికతగాని, వారికి ఏ విక్రమార్కుడు పోష కుడో అనే విషయంగాని ఇదమిత్థం అని చెప్పడానికి పరిశోధకులలో సమాధానం కుదరలేదు. కథా సరిత్సాగ రాన్నిబట్టి వరరుచి పాణినికి సహాధ్యాయి అనీ, మగధ నేలిన నందరాజులలో చివరి రాజుకు సమకాలికుడనీ, బాల్యంలోనే తండ్రిని కోల్పోయిన వరరుచితో వ్యాడి అనే యువకుడు స్నేహంచేసి, అతనిని ఉపవర్షోపా ధ్యాయులకు పరిచయం చేశాడనీ తెలుస్తుంది. దండి రచించిన అవంతిసుందరికథాసారంలోకూడా వరరుచి కథ కనబడుతుంది. అతని జన్మస్థానం గోదావరీ తీరం. అతనితల్లి కాత్యాయనుడి కొమార్తె అయిన సాత్రాయణి. అతడు వ్యాకరణ గ్రంథాలూ, జ్యోతిష శాస్త్రమూ, ధర్మశాస్త్రమూ, కంఠాభరణం అనే కావ్యమూ రచించాడని రాజశేఖరుని కావ్యమీమాంస చెపుతోంది. చారుమతి అనే ఇంకొక కావ్యంకూడా వరరుచిదే అని, అందులోని శ్లోకం ఒకటి సుభాషితా వళిలోను, భోజదేవుని శృంగార ప్రకాశికలోను కనబడ డాన్నిబట్టి చెపుతారు.

ఈ భాణం కూడా శృంగారరసప్రధానమే. రంగంపైని ప్రవేశించే ఒకేఒకపాత్ర విటుడే. ప్రణయ కలహం మూలాన ఎడబాటు చెందిన తన మిత్రుణ్ణీ అతని నెచ్చెలినీ రాయబారం జరిపి కలుపుదామని రాజవీథిలో బైలుదేరి వేశ్యావీథివైపు వెడుతూఉంటే నాయికానాయకులిద్దరూ ఒకరికోసం ఒకరు బైలు దేరి, ఇద్దరికీ నమ్మకస్తుడైన మరొక మిత్రుని ఇంట్లో కలుసుకోడం, విటమిత్రుడు వారిని ఆశీర్వ దించడమూ ఇందులోని ఇతివృత్తం. స్థలం—ఆనాటి కుసుమపురపు రాజవీథీ, వేశ్యావాటికకు దగ్గరగాఉన్న మిత్రగృహమూ—ఈలోపల మరికొందరు స్త్రీ పురుషులు విటుని కంటపడగా అతడు వారి వారి చరిత్రలనూ శీలములనూ నర్మోక్తులతో విమర్శిస్తాడు,

సుమారు క్రీ. పూ. నాలుగవ శతాబ్దినాటి కుసుమపురం (పాటలీపుత్రం) నాగరకతా, అక్కడి సాంఘిక జీవనంలోని కొన్ని దృశ్యాలూ, కొందరు వ్యక్తులూ, వారి ఆచార వ్యవహారాలూ ఈ భాణంలో మనకు కళ్లముందు దృశ్యం కడతాయి. ఆనాటి సంస్కృత సాహిత్యం అంతటా ఉన్నట్లే, శృంగారం ఇందులో అక్కడక్కడ—ఈనాటి హద్దులను కొంత వరకు మీరిఉంటే, సహృదయులైన పాఠకులు సరసంగా స్వీకరింప ప్రార్థన.

—రజనీకాంతరావు.

(నాంద్యంతమున సూత్రధారుడు ప్రవేశిస్తాడు.)

'నాకేమవుతావు నువ్వు
నీకేమవుతాను నేను
దయచేయవోయ్ దగాకోరు;
ముద్దంటె మోహం నాపై?
దిగులుపడను తెలిశాయోయ్
పెదవులపై పలునొక్కులు
ప్రేయసియిచ్చిన కాన్కలు—
నీపయి కోపగించినది?
నేనుకాను వేరెవ్వతో
కుదురులేనివాడా, పో,
కోరిన జవరాలి కడకు'
అంటూ భాషింతురుగాక
మరులుగొన్న పరస్త్రీలు,
ప్రణయకోపమున పలుకుల
ములుకుల తమ ప్రియుల గూర్చి.

నేను పెద్దలకు విన్నవించుకొనే దేమనంటే—అరే, శ్రద్ధగా నేనేదో విన్నవించుకోబోతుంటే వేరే ఏదో గొంతు వినిపిస్తోంది.

(తెరలో)

పేరుపడిన ఈ ఆమని కారులోన
మెరుగు తరిగిన లొద్దుగ తరువు మిత్ర
విషయమున మైమరచియున్న విటునివోలె
దీనముగ నిల్చియున్నట్టి తెరగుతోచు.

(ఇది స్థాపన)

(సూత్రధారుడు నిష్క్రమిస్తాడు.)

(అంతట విటుడు ప్రవేశిస్తాడు.)

విటు : ఓహోహో! వసంతం ఎంత సమృద్ధిగా ఉంది, ఎందుకంటే—

'పూయు మామిడి, అశోకము, ఊయెల,
కూయు కోకిలయు, వారుణి, జాబిలి,
తీయదనమ్ముల పెరిగెడు శోభ
చేయు మరునికూడ వగల మారిగ.'

ఓహో—ఈ కాముకులు ఒకరితో ఒకరు ఇచ్చకపు మాటలు ఎంత నచ్చేటట్లు చెప్పుకుంటారో. అబ్బ! ఈ దూతికలు తమ శాసనానికి అడ్డు లేదన్నట్లు తిరుగుతున్నారు. ఎంత జోరుగా ఉందో ఋతువు ప్రభావం. పగడాలూ, ముత్యాలూ, రత్నాలూ గుచ్చిన దండలతో, మొలనూలుతో, దుకూలాలు, అంశుకాలు, చందనం మొదలైన సరంజామతో సౌభాగ్యం వర్ధిల్లుతోంది. జనులందరిలో కోరికలు రేపుతూ లోకం అంతటినీ ఆకర్షిస్తూ వసంతం ఇలా విజృంభిస్తుంటే సాగరదత్తశ్రేష్ఠికొడుకు కుబేరదత్తుడికీ అతని ప్రియురాలు నారాయణదత్తకీ నడుమ ప్రణయకలహం సంభవించింది. అందుకని కుబేరదత్తుడు తన పరిచారకుడు సహకారకుడిచేత నాకు ఇలాగని సందేశం పంపాడు: 'విష్ణుదేవుని ఆలయంలో మదనదేవుని ఆరాధనకై ఏర్పాటయిన సంగీత నాటకంలో రసానుగుణంగా అభినయిస్తున్న మదనసేనను మోహించానని అనుమానించిన నారాయణదత్త తనకంటె మదనసేన నటనే నాకు ఎక్కువయిష్టం అని అపోహపడి, కాదని, కాళ్లమీద పడబోయిన నావైపు చూడనైనా చూడకుండా కోపంతో ఇంటికి చక్కాపోయింది. ఆమె అంటే అనురాగంతో నా హృదయం తపించిపోయి, నాకు ఈ రాత్రి వెయ్యి రాత్రుళ్లలా తోచి ఎంతకీ గడవకుండా ఉంది.

అందుకని ఈ నగరంలో నిత్యమూ వసంతు డిలా తిరుగాడే మా బావగారు వైశికాచలుణ్ణి కలుసుకోగోరుతున్నాను' – అని.

అది విని, పాపం వాడి మదనబాధ భరించ రానిదని తెలిసినవాణ్ణిగనక పొద్దుటే బైలుదేర బోయానుకాని, తన యౌవనం సంగతేగాని నా వయస్సింత అని పట్టించుకోని మా ఆవిడ అనుమానంవల్ల ఆగిపోవలసి వచ్చింది. ఇప్పుడు ఆమె కోపం పోగొడతానని ప్రతిజ్ఞచేసి వెడు తున్నాను. లేకపోతే నాకు ఇప్పుడు ప్రతిజ్ఞ చేయడానికి ఏముంది గనక. ఏమంటే,

'తియ్యని కోకిల కువకువతో
మామిడి చివుళ్ల మెలకువతో
కయ్యమునకు దిగు తొయ్యలి అలుకను
వసంతుడే తీర్చగలడులే'—

ఇంకా ఏమంటే,

ఇంపు, సొంపును, ఎలప్రాయు, మీావి, మంచి
నడత, దాక్షిణ్యమును, అనునయపు పల్కు
అనెడు సద్గుణములు లోకమందు కలుగు
వాడె వనితల వలగొనువాడుగాడె!

ఓహోహో. కుసుమపురపు రాచబాట ఎంత గొప్పగా ఉందో. ఇదిగో—ఇక్కడ నీళ్లు బాగా చల్లి, కడిగి ఇళ్లల్లోంచి అన్ని వైపులనుంచి విసిరిన కుసుమోపహారాలు రాచబాటలపైని నివాసం ఏర్పరచుకున్నాయి. పెద్దబజారు దేవిడీ వేరువేరు దినుసుల క్రయవిక్రయాలలో మునిగి పోయిన జనంతో కిటకిటలాడుతోంది. బ్రహ్మో దాహరణ సంగీత నాటక ప్రదర్శనలో వాద్య ఘోషకు అనుగుణంగా పరస్పరం వాచకాభి నయం చేస్తున్న రావణుడితలల్లా ఉన్నాయి వరుసగా లేచిన మేడలు. చిరు సవ్వడులుచేసే కిటికీలద్వారా మేడ మబ్బులలోనుంచి రాజ మార్గాన్ని చూడగోరే ప్రమదావిద్యుల్లతలు కైలాసగిరిపై అప్సరసల్లా మెరిసిపోతున్నాయి. మరిన్ని మేలిమైన గుర్రాలపైనీ, ఏనుగుల పైనీ, రథాలపైనీ రాజోద్యోగులు అటూ ఇటూ ఠీవిగా తిరుగాడుతున్నారు. వయసుగాళ్ల కళ్లనీ మనసుల్నీ ఆకట్టుకలిగే మంచి నడవడి కతో, తగిన అలంకారాలతో చూపరుల కన్ను తుమ్మెదలు అస్వాదించే మోముదామరల అందంతో, రాజమార్గాన్ని అనుగ్రహించడానికా అన్నట్లు కుర్రకారు వేశ్యలు నడక షికార్లు సాగిస్తున్నారు. ఇన్నెందుకు—

అందరు భయహీను లందరు కామ సం
 తుష్టాత్ములచట నిత్యోత్సవముల
గడపువారును దండిగా వెలలేని రాల్
 పొదిగిన సొమ్ముల పూలసరుల
వలపులగందాల, వసనాల ధరియించి
 ఆటపాటల సౌఖ్యమందు వారు,
విరచిత ప్రఖ్యాత వివిధ గుణాలతో
 వరలెడు వార లప్పురి గలారు,
అట్టి నాగరకుల పుట్టినిల్లగు పురి
పుడమితల్లి నుదుటిబొట్టు చుక్క
ఇప్పు డెదుట వెలయు నీ పాటలీపుత్ర
మపర దివిజ నగరి యనుట యసదె?

(ముందుకు సాగి) ఇదుగో, చరణదాసి కూతురు అనంగదత్త ప్రణయ కలాప పరిశ్రమవల్ల కొంచెం అలసినప్పటికీ నేర్పుగా మెత్తని అడు గులు వేస్తూ తన అందం చూచేవాళ్ల కళ్లల్లో అమృతం కురిసేలాగ ఇలాగే వస్తోంది. తన ప్రియుడి మోటుసరసానికి నలిగిపోయి నట్లుంది. అందుకనే మరి—

పంటి గంటంపు లిపి చెక్కబడిన పెదవి
నిదురబడలిక కన్నులు కదలు మొగము
వలపు చెలగాటమున బెట్టు తొలగి సడలు
నారి గల పట్టు మొలదట్టి జారునడుము.

బలే, ఈమె దర్శనమే నా కార్యసిద్ధిని సూచించే శుభశకునంలా ఉంది. అరే నన్ను చూడకుండానే వెళ్లిపోతోందే. అందుకని పలక

రిస్తా నీమెను. బలే, తనకుతానే ఇటు తిరిగింది.
ఏ పిల్లా, దణ్ణం పెట్టవేం ?

అనం : అబ్బో, శాన్నాళ్లకి గుర్తు వొచ్చాను. అయ్య వారికి దణ్ణాలు.

వైశిక : విను, ఇదిగో ఆశీర్వచనం.

'కలికీ, దాత, స్వతంత్రుని
చెలువము జవ్వనము కల్గు చెలువుని, సిరితో
తులతూగు కళాకుశలుని
వలపున నిను వలగొనేటి వల్లభు గొనుమా.'

పిల్లా, అన్నీ అలాగే ఉండనీ.

వేశలక్ష్మివౌ నీతోడ వెలది, యిట్టి
రాత్రి సార్థమై, యెవనికి రమ్యమగునొ
అతని కింకరుడే కాడొ రతిధవుండు,
సఫలమే కాదొ ఆతని జన్మమపుడు?

అనం : మహామాత్యులవారి కొడుకు నాగదత్తుల బస నుంచి వస్తున్నాను.

వైశిక : అమ్మాయి, అదంతా జరిగిపోయిన వైభవం కదా. మీ అమ్మకి ఇష్టంకానిపని చేస్తున్నా వని నాకు తెలుసు. (నవ్వుతూ) సిగ్గుతో తలవంచుకు నవ్వుతోంది. అరే, నా మాట బాగా పనిచేసింది. అమ్మాయి, అలా ఎన్నడూ చెయ్యకు. ఎందుకంటే—

'తల్లి ధన తృష్ణకాదని, తరలిపోయి—
ప్రియుని బసకెట్టి రతి సుఖాపేక్షతోనా,
గణిక జవదాటరానిదౌ కట్టుబాటు
విడిచి, కామోత్సవపు విందు కుడిచినావు
కాలదన్నరే నిను వారకాంత లెల్ల ?'

తగ్గట్లుగానే ఉందిలే నీ సిగ్గు. ఒట్లు వెయ్యడం ఎందుకులే. మన యింటికివచ్చి మీ అమ్మతో సర్ది చెపుతాను. వేశ్యాసంప్రదాయా నికి విరుద్ధమైనపని చేశావు. పోయిరా.

అనం : దణ్ణాలు.

వైశి : సౌభాగ్యవతికి ఆశీస్సిదిగో.

'కొదవేమి సద్గుణాలకు, ఎదురుగ
నిలుచున్నదాని నేమని పొగడన్
ఇదిగో నీ యెలప్రాయము
పదిలమగుత, లోకనేత్రపర్వముగాగన్.'

వెళిఁది తాను. మేమూ వెడతాము.

ఆఁ. ఇదిగో విష్ణుదత్త కూతురు మాధవ సేన— తనకూడా పరిచారకుల నెవరినీ రమ్మ నకపోడం మూలాన్ని కాబోలు పులి తరుముతూ వుంటే బెదిరిపోయే లేడిపిల్లలా తొరతొరగా అడుగులు వేస్తూ ఇటే వస్తోంది. ప్రస్తుతం తల్లి పేరాసవల్ల ఇష ంలేని ప్రియుడి కలయి కలో ఈమె ఇబ్బందిపడిఉండాలని తోస్తుంది. అందుకే —

'వదనము వాడిపోదు, ప్రసవద్యుతి
క్రొమ్ముడి వీడలేదు, కెం
బెదవుల వెల్గు దంత పరిపీడన
కోడిన జాడలేదు, ఏ
కొదయునులేని నిండుసిరిగుబ్బలు
కౌగిలిఁగందలేదు, జా
రదు మొలనూలు శ్రోణితటి
రాగరతిప్రతిబంధముక్తికై.'

అరే, ఈమె తన కిష్టంలేనివాడితో పోవడం వల్ల కలిగిన చికాకుమూలాన్ని నన్ను చూడ కుండానే దాటిపోతోంది. సరే, తనని వెంటాడి, చికాకుకి కారణం ఏమిటో తెలుసుకుంటాను. పాపం, తనే ఇటు తిరిగిందే. ఆఁ. ఏవిటంటావు?

మాధవసేన: క్షమించాలి— బావగారిని గుర్తు పట్ట లేదు.

వైశిక: తప్పలేదమ్మాయి. ఏదో చికాకులో కుములు తున్నవాళ్లకి మైమరపు మామూలే.

సేన : దణ్ణాలు.

వైశిక: సరే— ఇదిగో ఆశీర్వచనం-

ధనవంతులె ప్రియులై, ని
ర్ధను లప్రియులగుత, తల్లి ధనలోభముచే
నొనగూడదుగాకెన్నం
దును నప్రియసంగమం బుడుగు చింత చేలీ!

ఇంతకీ, ఎక్కడినుంచి వస్తున్నావ్ అమ్మాయ్?

సేన: వసదత్త శ్రేష్టిగారబ్బాయి సముద్రదత్తుడు గారి బసనుంచి వస్తున్నాను.

వైశిక: ఓహో, చేసిందేవిటో తెలిసింది. ఈ కాలపు కుబేరుడీ సముద్రదత్తుడు. ఏఁవలా నిట్టూర్పులతో పెదవి చివురు అదిరిపోతూ కనుబొమల వంపుల్లో కళ్లు పైకీ కిందికీ ఆడుతుంటే తామర పువ్వులాంటి తన ముఖాన్ని ఈమె అటువైపు తిప్పుకుంది? సరిసరి—నా ప్రసంగం ఊరికే పోలేదు.

ఎదనొచ్చుకొంచు తా పెదవులందిచ్చుట,
కొసరని పావురా గుసగుసలును
వెలయని నవ్వుల కిలకిల, లావు లింత
లును, నిట్టూర్పు దొంతరల తెరలు,
కైదోయి బిగియని కౌగిలింతయు, కాన
రాని ప్రేమయు, శయ్యపైని దిగులు,
తెచ్చి పెట్టుకొన్న తెరగు రతిక్రీడ,
చేష్టలందు భావపుష్టి లేమి,
చూడ, రాతిరెల్ల సూర్యునికై యింతి
యెదురుచూచు రీతి యిట్టెతోచె.

అమ్మాయి, చాలు చాలు. విచారించకు. రూపహీనుడైనా ధనవంతుడైతే పొందతగిన వాడుగా పేర్కొన్నారు పెద్దలు—విను.

ప్రియునకు అప్రియునకు ప్ర
ణయ మనయము గొలుపుచున్ ధనార్జనమొకటే
నయమ్మైన కార్యమని, ని
శ్చయముగ ఘోషింపబడియె శాస్త్రములందున్.

సేన: బావగారి తీర్పూ మా అమ్మ తీర్మానంలాగే ఉంది.

: అలాకాదు. దానికొక కారణం ఉంది. నువ్వు వెళ్లు. నేను సరాసరి మా యింటికేవచ్చి, ఈ శాస్త్రపు అంతరార్థం తెలిసేటట్లు చెపుతానులే. అరె, ఉపదేశం చేసినందుకా దణ్ణం పెట్టకుండానే చక్కాపోయింది. ఈ నిస్సహాయురాలు ఎంత దిగులుగా ఉందో పాపం. ఇక. మేమూ వెడతాం.

సరే, ఇదుగో, విలాస కౌండిని అనే పరివ్రాజిక మెత్తని అడుగుల వొయ్యారంతో, కనువిందైన అందంతో ఇటే వస్తోంది. ఆమె కొంగు ఘుమఘుమకి మత్తెక్కిన తుమ్మెదగుంపులు మామిడి కొమ్మలను వదిలిపెట్టి ఆమెనే ఆశ్రయిస్తున్నాయి. ఇప్పుడామెతో మాటాడి నా కళ్లకూ చెవులకూ ఆరాటం వదిలించుకోవాలి. భగవతి, నేను వైశికాచలుడను నమస్కరిస్తున్నాను.

విలా వైశికాచలుడితో పనిలేదు మాకు, వైశేషికాచలుడైతే కావాలి.

వైశిక: ఓ, దానికి కారణం ఉందిలే. ఎలాగో తెలుసా?

ఏయెడ నిలకడలేదే యింతలేసి నీ కనులకు
మోమలసియు రతిశ్రమను ముద్దులొలుకు
నుబుకు మోవి;
ప్రణయగాథలెన్నొ బయల్పడు నీఖేదాలసగతి
వైశేషిక రత్యర్థము ప్రియుడె వెల్లడించె గదే.

విలా ఓహో, దాసుడు స్వానుభవాలను ఎదటివారివిగా నచ్చ జెపుతున్నాడు.

వైశిక: నీ యడుగుదామరల కొల్చు నిత్యదాసు
లెంతకును ధన్యులేగారె యిగురుబోడి.
పుణ్యహీనుడనగు నన్నుబోంట్లు కట్టి
వరతనువు లభ్యమగుటెట్లు వలనుపడును?

విలా: షట్పదార్థాలు విడిచిపెట్టినవారితో సంభాషణ పనికిరాదని మా గురువుగారు ఆంక్ష వేశారు.

వైశిక: భగవతి, నువ్వు చెప్పింది నబువే—ఏఁవంటే,

'ద్రవ్యమగును నీ తను వాయతాక్షి,
దయితారూపాదులు గుణములు!

సామాన్యమ్మగు నీ యౌవనము,
స్తవింత్రు యువకులు నీ కర్మల,
జనము కోరుదురు నీ సమవాయము,
తద్వారా నీ కొదవు విశేషము,
తరుణ మనోవాంఛ నీకు యోగ;
మనిష్మజనమునుండి మోక్షము!'

(ఆమె నవ్వుతుంది)

ఏంవిటీ—యీ నవ్వే నా మాటకు జవాబన్న మాట. బలే,—నే ననుకున్నట్లే అయింది.

విలా : మాకు సాంఖ్యం తెలుసు. ఆ శాస్త్రం ప్రకారం తాను వర్ణమూ గుణమూ లేనివాడైనప్పటికీ పురుషుడు క్షేత్రజ్ఞుడే—అంటే — స్త్రీలోని వివిధ లీలల ప్రకృతిని ఎరిగున్నవాడు.

వైశిక: బలే. దీనికి తిరుగుమాట లేదు. నా ధోరణి ఈమెలోని కుతుకాన్ని రేపినట్లు తోస్తుంది. తరుణజనుల కోర్కుల పంటకు విఘ్నం కలిగించడం తప్పు. భగవతీ వెళ్లిరా. వెళ్లింది. ఇక మేమూ వెడతాం.

(ముందుకు సాగి)

ఇదిగో—చారణదాసి తల్లి రామసేన కాదు గదా, వయస్సు పైబడుతున్నా, వొయ్యారపు చూపులతో నడకతో నవ్వులతో తిప్పకుంటూ ఇటే వస్తోంది. ఓహో, మా అబ్బురానికి తగినదే—యీామె—ఎలాగంటే:—

కోరికలు భోగములు కామకోటి తీర్ప,
తన వగలవారలను ప్రీతి తనియజేసి,
వయసుగాండ్ర వైరములకు వలతియగుచు,
కూతుప్రియుబట్టి పిడువంగ నాతియేగు

కామిజనులపాలిటికి ప్రాణాంతకమైన ఆమె ఒడలి ఒయ్యారాలను ఇప్పుడు చూసి ఆనందిద్దాం. కాముకులపాలి ఇంద్రాయుధానికి నమోవాకాలు. అమ్మో, రామసేనా, కూతురి జవ్వనపుసిరి ఆధారంగా ఏ కాముకుడి కొంప కూల్చడానికని బయల్దేరా విలాగ?— బాబో. ఈమె ఎదురయినప్పుడల్లా నాకు ముట్టేవి శాపనార్థాలే.

రా. సే: ఛీ. ఆడిపోసుకోడమే నీ స్వభావం.

వైశిక: అధికప్రసంగం ఆపు. ఇప్పుడు నువ్వు బయల్దేరిందెక్కడికో చెప్పు.

రా. సే: మా అమ్మాయి చారణదాసి నిన్న ధనికుడుగారింటికి వెళ్లింది. సంగీత నాటకం మిషమీద దాన్ని, అక్కడినుంచి తిరిగి రప్పించాలని బయలుదేరాను.

వైశిక: పాపం, చారణదాసికి ఎలాటి ప్రవవాదం వచ్చి పడింది. విటరాయళ్ల సర్వస్వమూ సంగ్రహించే నేర్పుతో సారం అంతా తాగేసి పిప్పిని పారవేసే సమర్థతగల నీయంతటిదాని కూతురయీ కూడా, శాస్త్రోపదేశాలను పాటించకపోవడం చేత ఎంత జాలిపడవలసిన అవస్థో చూడు. ఎలాగంటే—

పొందదగు వాని, తగు సొమ్ము, పొంది కూడ,
అన్నివిధముల నిర్ధనుడగుట తెలిసి,
ఎరుగదు త్యజింప దన్ను ప్రేమించువాని,
తరుణి నేర్చిన శాస్త్రతత్త్వమ్ము నమ్మె.

రా. సే. సంగీతనాటకం పనిమీద దానిని ఇంటికి రప్పిస్తాను. తిరిగి వచ్చేటప్పుడు నువ్వుకూడా అక్కడకువచ్చి నీ శాస్త్రం బోధిద్దువుగాని.

వైశిక : అలాగేమరి. అయితే త్వరగా చెయ్యవలసిన మిత్రకార్యం ఒకటుంది. దాన్ని చక్కపెట్టి నీ పనికూడా చూసిపెడతాను. వెళ్లిరా నువ్వు. ఇక మేమూ వెడతాం.

ఓరిబాబో. గణికల హృదయాలు నమ్మడానికి వీలులేదు. ఏమంటే—

'చెలిమి, నిచ్చకాల, కులుకుల, జోకొట్టి,
కరుణమాలి విటుని కలిమి దోచి,
అన్యరంజనార్థ మాదేహమును త్యజిం
పదె విరక్తదేహి పగిది వేశ్య.'

ఈ వేశ్యమాతలున్నారే— బాబోయ్—సీళ్లూ కాముకుల పాలిటికి రక్షణలేని ఈతిబాధలు. కాముకులకు నిత్యమూ శుభమగుగాక! కాముక

జనుల సర్వస్వాన్ని కొల్లగొట్టే నేర్పరులూ, మొక్కవోని టక్కుల బాణాలను సృష్టించే కళాశిల్పులూ అయిన వేశ్యమాతలకు వినాశమవుగాక!

బాబోయ్—ఈ రాజమార్గం పాలిటికి కలిలాగ దాపురించిన తృతీయా ప్రకృతి సుకుమారిక పేరింటిది ఇలాగే వస్తోంది. అబ్బా, ఎంత అశుభదర్శనం ఇది? కానీ. ఇప్పుడు దీనిని పలకరించకుండా బట్టచాటు చేసుకుని దాటిపోవాలి. ఏవిటీ, నావైపే తరుముక వస్తోంది. ఇప్పుడు నాకేవిటి మార్గం? అబ్బా, యమధర్మరాజు గట్టివాడు; అంచేత, ఈమెతో మంచి మాటలాడి పులినోటినుంచి తప్పించుకున్నట్లు బయటపడాలి.

సుకు : అభివాదాలు.

వైశిక : అవిధవాభవ. బహుపుత్రాభవ. మరిన్నీ—

'కనుబొమ్మల విసుళ్ళ, కనుల పర్వుల నోష్ఠ
విచలనమ్ముల కర ప్రచలనముల,
నడకల సొంపుల, నవ్వుల నింపుల,
వెలది యొయ్యారముల్ విలసిలంగ,
దిగజారి వ్రేలాడు దీర్ఘవౌ మొలనూలు
వెడదయై యురువైన పిరుదుకప్ప
ఇంతలా కనులతో యెవని గృహమునుండి
తిరిగి వతువో గనక?

సుకు : రాజుగారి బావమరిది రామసేనుడి గారింటి నుంచి వస్తున్నా.

: ఓహో, వాడి జీవితం ధన్యం. అమ్మాయి, ఇప్పుడు చక్రవాక దంపతులలాటి మీకీ వియోగం ప్రాప్తించిందేవిటి?

సుకు : రాజుగారి కోటకి వెడుతూండే వేశ్యదాసి రతితిలక చమక్కులతో తియ్యని నవ్వులతో శృంగార చేష్టలతో స్నేహపూర్వకమైన కోమల కటాక్ష వీక్షణాలతో కన్నీళ్లతో హృదయం నిత్యమూ అభిషిక్తం అవుతూవుంటే తన పులకరింతల ద్వారా కలిగిన మదనానురాగం బయటపడగా అతను ఆమెకు తలవంచి దణ్ణంపెట్టి ఆ మదనానురాగాన్ని స్వీకరించాడు. కంటియెదుట జరిగిపోయే దగాను సహించలేక నేను మందలిస్తే నా కాళ్లమీద పడ్డాడు. అప్పటికీ ఈర్ష్యతో కుంగిపోయిన నేను అతనంటే ఆదరం చూపలేదు. అప్పుడు అతనే నను బలవంతంగా ఇంటికి తీసుకొచ్చి పక్కను చేర్చుకున్నాడు. రాత్రివేళ మదనావేశపు అలసటలో నిద్రలో మునిగిన నన్ను విడిచిపెట్టి తిరిగి దానింటికి వెళ్లి, ఇప్పటికి కొన్ని రోజులయినాకూడా ఇంటికి తిరిగిరాడు. మళ్లీ తన ఆదరాన్ని కోల్పోయి, పశ్చాత్తాపంతో కుమిలిపోతూన్న నాకు అనుకోకుండా బావగారి దర్శనం దొరికింది. అంచేత నా ప్రాణ సముడైన తాను నన్ను తిరిగి కలిసేటట్లు చేయగలవారు బావగారే.

వైశిక : క్చు. క్చు. రామసేనుడెంతటి ప్రమాదంలో పడ్డాడో తెలుసా?

'వలపు బిగికౌగిలికి అడ్డుపడవు చనులు,
నెలనెలకు పొత్తు చెడగొట్టు 'నెలయు' రాదు.
సొగసు జవ్వనముల చేటు చూలు లేదు,
విడుచు రత్యుత్సవమె నిన్ను విడుచువాడు.'

ఇప్పుడిలా కానియ్యి. అతనికిలాగే నన్ను సొంతయింట్లో గౌరవించు. నాకు త్వరగా చక్కబెట్టు కొనవలసిన మిత్రకార్యం ఒకటుంది. అది పూర్తిచేసుకుని, నీవంటి సుకుమారి మనస్సు కష్టపెట్టినవాడిని, కన్నెసిరితో కళ్లు తలకెక్కిన నీ ప్రియుడిని తీసుకొచ్చి నీ కాళ్లమీద పడేటట్లు చేస్తాను. వెళ్లిరా నువ్వు. వెళ్ళింది. వెడతాన్నేను. అమ్మయ్య. కష్టంమీద ఈ తృతీయాప్రకృతినుంచి నా ఆత్మకి మోక్షం లభించింది.

ఏంవిటీ, ఎవరు నాకు నమస్కారం చేస్తూ ఇలా వస్తున్నారు? నీకు శుభమవుగాక! చాలా

కాలానికి కనబడ్డావు నాకు. సార్థక శ్రేష్ఠిగారి కొడుకు ధనమిత్రుడవు కాదూ నువ్వు? తన కొలువులోని పనివాండ్లకు, యాచకులకు, బంధువులకు, స్నేహితులకు పేదతనపు చీకట్లను చెదరగొట్టేవాడూ, జవరాండ్ర హృదయ కుముదాలను వికసింప చేసేవాడూ అయిన కుసుమపుర గగనపూర్ణచంద్రుడికి ఈ దుర్దశా గ్రహణం ఎలా పట్టిందయ్యా? కుటుంబ సర్వస్వాన్ని కుండలో పోగుచేసుకుని ఎక్కువ ఆదా చేద్దామనే ఆశతో దేశాంతరం వెడుతూంటే దారిదోపిడి దారుల పాలబడ్డావా? లేదా, రాజద్రోహకార్యాలలో పాల్గొన్నందుకు రాజు నీ ఆస్తంతా జప్తు చేయించాడా? పోనీ, ఒక్క పాచిక తిరగబడ్డంతో కుబేరుడికైనా వైభవం అంతా తుడిచిపెట్టి వెయ్యగల జూదంలో దెబ్బతిన్నావా? ఇన్నిమాట లెందుకు?

'పెరుగు నఖ రోమ మలముల గురుతు లెసగి,
ధ్యానమున తెల్లవడి పుష్టి తరిగి మొగము,
ముదుకయ్యె చిన్గి, దుమ్ముతో చెదరిబట్ట,
ప్రతిభచెడనేల మునిశాపహతుని వోలె.'

ధన రామసేన కూతురు రతిసేన అంటే నాకూ, అలాగే నేనంటే తనకూ వొల్లమాలిన వల వన్న సంగతంతా బావగారికి బాగా తెలిసిన విషయమే. అంచేత—తల్లి పిసినారి అని తెలిసినా తనుమాత్రం వదలకుండా నన్ను అంటిపెట్టుకొనుందని, స్నేహితులు వద్దు వద్దని అడ్డు పెడుతున్నా లెక్కపెట్టక, నాకున్న సంపదంతా తనకు అప్పజెప్పాను. అది తీసుకుని, కొన్నాళ్లు గడిచాక ఒకనాడు స్నానం వంకని నన్ను తుండుగుడ్డ చుట్టబెట్టి అశోకవనిలోని కొలనుకు పంపి, ద్వారం మూసివేసి, ముందుగా చెప్పి అశోకవనం కాపలావాళ్లచేత నన్ను దిడ్డిగుమ్మంగుండా బైటికి వెళగొట్టింది. ఉన్న ఊళ్ళోనే ఉడిగిన సంపదతో ఇన్ని దినాలు దీనంగా గడపడం ఎలాగా, అని చూసి చూసి, అడవులు పట్టిపోదామని బైలుదేరిన నాకు యాదృచ్ఛికంగా బావగారి దర్శనం ప్రాప్తించింది. బావగారికి నే చెప్పిందంతా అతిరహస్యం సుమా! ఇప్పుడు బావగారు సెల విచ్చేదాన్నిబట్టి నా భావి శ్రేయస్సును గురించి ఆలోచించుకోవాలి.

వైశిక : అబ్బా. వేశ్యల డబ్బాశ ఇంతా అంతా కాదు. వేశ్యాంగన వక్రబుద్ధి గురించి ఏం చెప్పను? రా. నిన్ను కౌగిలించుకోనీ. ఇలాగైనా బతికి బైటపడ్డావు సంతోషం. ఏవంటే—

'శాంతి చెందును మహౌషధిచేత మెల్లగా—
క్రూరవౌ పెనుత్రాచు కోర విషము,
పడయవచ్చును ముక్తి నడవిలో మత్తెక్కి
పరువులెత్తెడు నేన్గు బారినుండి,
మోక్షమ్ము కొండొకప్పుడు కల్గు మకర వ
క్త్రమునుండియైన-యర్ణవ జలాల,
వారాంగనా బడబానలమ్మున పడ్డ
వాడు మాత్రము లేవలేడు, లేడు.'

మరి, బాబూ, నీ నిర్వేదానికి కారణం—రతిసేనా, కాక, దాని తల్లా?

ధన : ఏమాట కామాటే చెప్పుకోవాలి. రతిసేనకి నేనంటే ఇష్టమే. జరిగినదానికంతా తల్లి తప్పే కారణం. బావగారుగాని తల్లికి తెలియకుండా తనతో నాకు కాస్తంత సమాగమానికి ప్రయత్నించారంటే నా ప్రాణాలు తిరిగి కుదుటపడతాయి.

వైశిక : పైవాళ్లకంటె దానికి నీమీదే ప్రేమని విన్నానులే. అరే—ఏడుస్తున్నాడితను. చాలు చాలు విచారం. నాకిప్పుడు త్వరగా చక్కబెట్టవలసిన మిత్రకార్యం ఒకటుంది. దాన్ని పూర్తిచేసి, తిరిగి వచ్చాక నీ పనికూడా చేసిపెడతానులే. వెళ్లిరా నువ్వు— అబ్బా, ఏం నేర్పు వేశ్యలది? ఏఁవంటే—

'కుటిలబుద్ధులౌ రాజులు గొంకకుండ
తమదు దోషాల మంత్రుల తలల మోపు
నట్లు శఠవర్తనలు వేశ్య లాత్మదుష్కృ
తులకు బాధ్యత వేశ్యమాతలది యండ్రు.'

పాపం, దిగాలుపడిన ధూర్తోపాధ్యాయుడు వెళ్లాడు. ఇక మేమూ వెడతాం.

(ముందుకుసాగి)

అరె, వసంత వనకోకిల కంఠాన్ని అనుకరిస్తూ స్నిగ్ధ మధురస్వరంతో ఎవరు చెపువూ నన్ను పేరు పెట్టి పిలుస్తున్నారు!

(చూసి)

ఓహో—ప్రియంగుసేన—ఏవోయ్ ప్రియంగు సేనా! ఇదిగో, ఇదే వస్తున్నాను.

ప్రి : నమస్కరిస్తున్నాను.

వైశిక : అమ్మాయి—తీసుకో—ఆశీస్సిదిగో.

'కోమలముగ తన్ని, గ్రుద్దుచు శయ్యపై
ప్రియుని కోర్కి కడ్డుపెట్టుదాన,
వలపు తొందరెక్కి వాడు మర్దించెడు
వెడద పిరుదు సుఖము లిడుత నీకు.'

అమ్మాయి, అలిసిపోయిన పిరుదులకు ఆహ్లాదనకరమై బహువిధపరిమళభరితమైన గంధతైలానికి ఆత్మాంగస్పర్శప్రదానంచేసి అనుగ్రహిస్తున్నావా? ఇంత అందమైనముఖం కలిగి, మువ్వల పటకా తీసివేసిన బోసిమెడగల రాజుగారి పట్టపేనుగులాగ ఏ సింగారింపూ లేకుండానే శృంగారమొలికే నీ ఒళ్లు కళ్లారా చూడనివాడు జీవితంలో దగాపడినవాడనుకో. ఏవంటే—

'ఒలిచిన తొడవుల నెలవుల పొగను, న
ఖక్షతమ్ములు, తైలగంధరక్తి
కొసలుకందిన కనుల్, హసిత వదనమును,
ఉష్ణత, యెలప్రాయ,ౖ ముబుకుచనులు,
ఉరువైన పిరుదుల నొరగెడు మొలనూలు,
అరచాటు వలిపాన మెరయు తొడలు,
ఇంతటి యందమ్ము నీక్షించి, ధృతివీలి,
మన్మథుడైనను మథనపడడె?

ప్రి : బావగారి మాటలు తేనెమూటలు.

వైశిక : ఓహోయ్. ఎందుకీ పొగడ్త. నాకు సిగ్గు తెప్పించడం చాలు. అసలు ఏంపనిమీద బయలుదేరావో చెప్పు.

ప్రి : వినండి మరి.

వైశిక : అమ్మాయి, సిద్ధంగా ఉన్నాను.

ప్రి : చండశాసనుడైన మహారాజు కుసుమపుర పురందరుని భవనంలో పురందరవిజయం అనే సంగీత నాటకాన్ని రసానుగుణ్యంగా ప్రదర్శించాలని దేవదత్తతో నాకు పందెం పడింది. అందులో నా అదృష్టం పండడానికి బావగారే కారణం గదా.

వైశిక: వద్దువద్దు—అలా అనకు. పదహారు కళలతో చంద్రుడు ప్రకాశించే పండువెన్నెల్లో దంపతుల్ని కలపడానికి ఒకరు ప్రయత్నించేదేవిటి? మరిన్నీ స్వయంశక్తిమంతులకు ఒకరి సహాయంతో అవసరం ఏం ఉంటుంది? నీ అదృష్టానికి నువ్వే కారణం. ఆ ప్రయోజనాన్నికోరే, నీయందు ప్రేమాసక్తుడైన రామసేనుడు నన్ను ప్రత్యేకంగా ప్రార్థించాడు! హాయి హాయి. కన్నుబొమ్మలు విలాసంగా ఎగరవేసి, కొంచెం కదిలించిన కనుచెంపలద్వారా బయలుపడేలోపల పొంగే ఆనందంతో, పెదవి చివురు కంపించే మోముతామరను అటుతిప్పి, తన పరిజనాన్ని చూస్తూ ఎంత బాగా నవ్విందో—బలే—రామసేనుడి ఆరాధనకు మంచిఫలితం లభించింది. దేవదత్త ఎంతతెలివితక్కువది? ఏవిటి ఆమెకు నీతోనా పోటీ? మొదట అన్నీ నీ సొమ్ముగదా—ఏవి—రూపసంపద, జవ్వనపు మెరుగు, గుణగణాలు, నాలుగువిధాల అభినయసిద్ధి, ముప్ఫయిరెండుభికాల హస్తప్రచ్ఛా

రాలు, పద్దెనిమిదిరకాల నేత్రాభినయం, షట్ స్థానాలు, గతిద్వయం, ఎనిమిది రసాలు, గీత వాద్యతలయాత్మకత్రయం, నృత్తాంగాలైన ఇన్నీ నీకు పట్టుబడినందువల్ల చరితార్థా లయాయి. కాక అసలు, నీ యీ వేషంతోటే చాలు దేవాసురమహర్షిశ్రేష్ఠుల మనస్సులను హరింపగల అప్సరసలను సైతం తలదన్నగల దానివిగా కనబడతావు నాకు—మరిన్నీ—

'నెలతరో, నిత్యమును నీదు లలితచేష్ట
తముల మూలాన జనుల నేత్రములు నెదలు
నర్తనము సేయునో, నర్తనమున నీకు
సరసగతి ప్రాప్తమయ్యెనో చారుశీల?'

అరే, సిగ్గుపడుతోంది! అమ్మయ్య — ఈ వ్రీడాలంకారం నన్ను విడిచిపెట్టివెళ్లింది. ఇక మేము వెడతాం.

ఓహో, గంధచూర్ణం మెత్తిమెత్తి కర్కశమైన స్తనయుగళంతో రకరకాల విరు లమర్చిన కురులపాయతో ఎందుకో ఉప్పొంగే మొగముతో మత్తిల్లిన ఒయ్యారంలో తడబడే అడుగులతో ఇటే ఆ వస్తున్నది— మా నారాయణదత్త చేటిక కనకలతే. ఇప్పుడీమెతో మాటాడాలి. చేతులు జోడించుకు ఇటే ఎలా వస్తోందో. ఏం అమ్మాయి బాగున్నావా?

కన : నమస్కారాలు.

వైశిక : అమ్మాయి, ప్రియప్రేయసి వగుదువుగాక నీ అడుగుదామర మోపి ఈ వేళ ఈ దారిని అనుగ్రహిస్తున్నావేం?

కన : బావగారెప్పుడూ మంచిమాటలు చెపుతారు.

వైశిక : ఇదేం పొగడ్త కాదమ్మాయి.

కన : అనుగ్రహీతురాలిని.

వైశిక : అదంతా అలా ఉంచుగాని,చక్రవాక దంపతుల కిప్పుడు వియోగం కలిగిందేం?

కన : మా యజమానురాలికి ఆయన మీదెందుకో ఈర్ష్యపుట్టి స్నానం, పానం, భోజనం, శయ్య, అలంకారం అన్నింటినీ వదిలిపెట్టి, అశోకవనంలోని అశోకపు మొక్కకింది వేదికపైని విడిది చేసుకుంది. అక్కడ కొంతసేపు ఆమె చంద్రబింబాన్ని చూసీ, క్రమ్ముకొని వచ్చే తుమ్మెదల రొద వినీ, ఆమని పూల కమ్మని పరిమళాలతో బాధించే కోడెగాలి తాకిడి సోకీ లోపలితాపం మరింతగా పెరుగుతూంటే లోటి పరిచారికలు చల్లని మాటలతో ఊరడిస్తూంటే అశోకవనాంతరంలో నుంచే— ఎవరో మదనబాధ పొందుతున్న పురుషుడు కాకలీస్వరమూర్ఛనలో వీణానాదంలాగ మా యజమానురాలికి వినిపించేలాగ—ఈ పద్యాలను— తిరిగి తిరిగి పాడుతూ వెళ్లిపోయాడు.

కుబే : 'ఆ మనుజ రూపయౌవన
ధానాదిక విభవముల్ వృథాయౌను కదా
ఆమని ప్రేయసిఁ గూడక
కాముని పండుగను వేడ్క గడపకయున్నన్;'

మరిన్నీ—

'మచ్చలేని చందమామను చూచియు
పరభృతంపు తీయపాట వినియు,
ఎనడు సకియ ననునయింపడో అవ్వాని
బ్రతుకు బ్రతుకె రాతిబండ గాక.'

కన : ఆ పద్యాలు విన్నాక కోపం కాస్త తగ్గిపోయి, మా యజమానురాలు ఆయనగారు వస్తాడనైనా ఎదురు చూడకుండా, నన్ను మాత్రం తోడుగారమ్మని, కాలినడకని మా యజమాని ఇంటికి బైలుదేరి వెళ్లింది. అదలాకాగా, మా యజమానికూడా వసంతపు రాకతో గుండె దిటవు చెడి, మా యజమానురాలిని శాంతి పరుద్దామని ఎవరిలోనోకలిసి బైలుదేరి, వీణాచార్య విశ్వావసుదత్తుగారి ఇంటి దేవిడీలో అనుకోకుండా మా యజమానురాలిని కలుసుకున్నారు. అక్కడ నిశ్శబ్దంగా వాళ్లిద్దరినీ యాదృచ్ఛికంగా ఇంటిలోంచి వస్తున్న విశ్వావసువుగారు చూసి, తమ ఇంటిలోకి తీసుకు

వెళారు. ఆ తరువాత, తెల్లవారుతూంటే; మా యజమానురాలు నన్ను పిలిచి ఇలాగంది:

నారాయణదత్త: చూడు కనకలతా, బావ వైశికాచలుడు ఎక్కడున్నాసరే, కనుక్కొని ఇక్కడున్నట్లు తీసుకురా.

కన : అని చెపితే నేనిలా వచ్చాను.

వైశిక : హోయి హోయి. వినదగ్గ మంచిమాట వినిపించావు. నీ కింతకంటే ప్రీతి పాత్రమైన దేమివ్వను? ఈ ఆశీస్సు తీసుకో.

'ఎల్లప్రాయపు సిరితో ప్రియు
వలపించెడు సఖుల భాగ్యవతి వీవై, నీ
వలచిన యుపభోగమ్ముల
కలిమి ననవరతము సుఖముగాంచవె చెలియా.'

రా, నువ్వు ముందు పద కనకలతా.

కన : ఇదిగో విశ్వావసుదత్తు గారిల్లు. మనం లోపలికి వెడదాం.

వైశిక : సరే పద. ఆఁ ఆఁ. మీ తొట్రుపాటు చాలించండి. కానియ్యండి కానియ్యండి—ప్రేమికుల జంట.

'తనగుణము మేర ఋతు వసంతమ్ము నేడు
వలపు జంటయౌ మిమ్ముల కలిపినటులె
ఋతువులన్నియు కలహాంతరితుల మిమ్ము
వలపు జంటగా మరి మరి కలుపుగాత.'

తన గుణానికి గర్వించిన వసంత ఋతువు మూలాన్ని నేనుకూడా దగా పడ్డాను. ఎలాగంటే మీ రిద్దరూ కలిస్తే నాకు బహిష్కరణేకదా. మరిప్పుడేం చెప్పను? పోనీ ఇందులో వసంతుడి తప్పేంలేదనా? ఎలాగంటే—

'శశి వెలుగు తోటలా కావు, నిశలు కావు,
రంజకములగు వీణాస్వరములు కావు,
కావు దూతికాగోష్ఠులు, కావు వివిధ
ఋతువులు, విచిత్రభాష, లివేవికూడ
కావు ప్రేమిక జన సంగకారణములు,
తమ గుణము లొండొరుల రేపు మమతపొంగు
మాత్రమే కూర్చు ప్రణయ సమాగమముల'.

ఒకరి మంచి గుణాలొకరికి వలపువాగులవుతూ తమ తమ మంచి గుణాలద్వారా తగులు మిగులుతూ మదనతంత్రసారమై కుసుమపురానికి వెలుగై ఇతర జన దుర్లభమైన మీ యిద్దరి ప్రేమమూలాన్నీ నష్టపోయినవాడిని నేను.

నారాయణదత్త
కుబేరదత్తుడు : బావగారి ప్రయత్న ఫలితంగానే మా అనురాగం అంకురించింది. అందుచేత మా పునస్సమాగమానికి కారణంకూడా బావగారే. ఈ పాటలీపుత్రంలో బావగారి వచనలీలా మృతాన్ని అనుభవించిన వారికి ప్రేమికజన సల్లాపాలు ఏంవంత రుచిస్తాయి.

వైశిక: ఒకరికోసం ఒకరు ఆవురావురుమంటున్న ప్రణయ మిధున సమాగమానికి ఆలస్యం కలిగించే కథా ప్రసంగాలను కట్టిపెట్టాలి. ఇక సెలవిప్పిస్తే వెడదామనుకుంటున్నాను మరి.

(భరత వాక్యము)

'పుల్లాంభోజమువలె నీ యుల్లము కొల్లగొను నేది,
మత్తెక్కించే మృదువగు మాటలు పలికెడు నేది,
అందము లొలుకుచు వెడదై అరుదుగ వెలిగెడు నేది,
అట్టి సఖీ ముఖమును నీ వరసెడు నటులే ప్రీతి,
సస్యము లెల్లెడ పెరుగగ సమృద్ధి వెలసెడు నేది
సాగరమే మేఖలగా జఘనము చుట్టెడు నేది,
ఉన్నత వింధ్య మేరువుల నురమ్ము బలిసెడు నేది,
అట్టి ధరిత్రి గుణాధిక నరయుత నరపతి ప్రీతి.

(ఆ విధముగా విటుడు నిష్క్రమిస్తాడు.)

ఇది శ్రీ వరరుచి మునికృతమయిన ఉభయాభిసారికా అను పేరింటి సంస్కృత భాణమునకు బాలాంత్రపు రజనీకాంతరావు ఆంధ్రానువాదము.

# విష్ణువర్ధనుని పెదచెఱుకూరు శాసనము

శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం

శ్రీ కొమాండూరి వెంకటాచార్యులు

ఆంధ్రదేశ చరిత్ర — భూగోళ సర్వస్వమునందు ఇనుగుర్తి గ్రామ చరిత్ర వ్రాయబోవగా విష్ణువర్ధనుని పెదచెఱుకూరు శాసనము చూచుట తటస్థించినది. ఇది దక్షిణహిందూదేశ శాసనములు ఆరవ సంపుటములో నెం. 202 శాసనముగా ప్రకటింపబడి ఉన్నది. గుంటూరుజిల్లా పెదచెఱుకూరు గ్రామమునందలి త్రివిక్రమస్వామి ఆలయ గరుడ స్తంభముమీద ఈ శాసనము చెక్కియున్నది. శాసన పాఠము సంస్కృతభాషయందు ఉన్నది. దానమీయబడిన గ్రామముల సరిహద్దులు తెలుగుభాషలో వ్రాసినారు. శాసనగ్రంథము వ్రాసిన కవి శ్రీపతియని ఉన్నది. ఇతడు విష్ణువర్ధనుని విద్యాధికారి. ఇచ్చటి శ్లోక మిట్లున్నది. 'విద్యాధికారీ శ్రీపతి ర్వీర శ్రీ విష్ణువర్ధనః। అకరోద్దాన కరోవాచా నిర్మలం ధర్మశాసనం.' శ్లోకాన్వయం చక్కగాలేదు. విష్ణువర్ధనస్య విద్యాధికారీ అని ఉండవలసియుండగా విష్ణువర్ధనః అని ప్రథమావిభక్తి పడినది. మధ్యయుగమువాడైన శ్రీనాథ మహాకవి ఈ ప్రాచీన శ్లోకమునకు మెరుగుపెట్టి వాడుకొన్నట్లు కాన్పించును. పెదకోమటి వేమారెడ్డి శాసనములు వ్రాయించిన శ్రీనాథుడు ఇట్లు ప్రకటించెను. 'విద్యాధికారీ శ్రీనాథః। వీర శ్రీవేమభూపతేః। అకరోదాకరోవాచాం। నిర్మలం ధర్మశాసనమ్'. అది యట్లుంతము. విష్ణువర్ధనుని శాసనకవియైన ఈ శ్రీపతియను పండితుడు చక్కని సంస్కృత కవిత్వము చెప్పగలడు. ఉద్దేశపూర్వకముగనో, లేక యాదృచ్ఛికముగనో ఈతడీ శాసనమునందు కొన్నిచిక్కులు కల్పించినాడు. కావున ఈ శాసనవిషయము అపోహలకు కారణమయి ఉపేక్షింపబడినట్లు కానవచ్చుచున్నది.

శాసనము 176 పంక్తుల దీర్ఘపాఠముతో ఉన్నది. గరుడ స్తంభమునకు నాలుగు ప్రక్కలను చెక్కియున్నది. దీనిలోని ముఖ్యాంశములను మాత్రమే ఇచ్చట పొందుపరుప గలుగుచున్నాము. 'స్వస్తి శ్రీ మాండవ్య (మానవ్యస) గోత్రోద్భవులును హారీతి పుత్రులును, కౌశికీవరప్రసాదలబ్ధ రాజ్యులును అగు చాళుక్యుల వంశమును అలంకరించువాడును, నిజభుజ నిస్త్రింశ ధారావనత ప్రతిపక్షప ముకుట మణి కిరణారుణిత చరణయుగళుడును శ్రీ విష్ణువర్ధన మహారాజు ప్రియపౌత్రుడును, పురందరునివలె గుర్వమాత్యానుగతుడును, వజ్రభృత్తును, విషమసిద్ధియు (విషమసిద్ధి దిననాథుడును అని రెండవవారు చెప్పబడినది) మకరధ్వజుడును, ప్రలయాదిత్యుడును, దేవద్విజగురుశుశ్రూషానిరతుడును అగు విష్ణువర్ధన మహారాజు విరాజమానుడగుచున్నాడు. అతనికి కుముదవర్ధనుడను మానవ నామము కలదు. అయన రాజమహేంద్రవరమున ఉండి ప్రకాశించు చున్నాడు. ఇచ్చట త్రివిక్రమదేవుని వర్ణనము ఉన్నది. శంఖచక్ర గదా ఖడ్గ మండితుడైన ఆ దేవుని ఆకాశమునకు ఎత్తబడిన దివ్యపదపద్మమును బ్రహ్మదేవుడు ప్రక్షాళనము చేయుచున్నాడు. ఆయన అష్టభుజుడు. పంచాశత్కోటి విస్తీర్ణమైన భూమండలము నంతను ఆక్రమించి దానిని మించి పదియంగుళములు వ్యాపించినాడు. 'సభూమిం విశ్వతోవృత్వా అత్యతిష్ఠ ద్దశాంగుళమ్' అను వేదమంత్రము ఇక్కడ స్మరింపదగినది. ప్రహ్లాదాది భక్తులు ఆయనను పరివేష్టించియున్నారు. ఆ దేవదేవుడు వైరోచనుని (బలిచక్రవర్తి)

భార్యలకు అభయహస్తము చూపుచున్నాడు. దర్భ పుల్లతో శుక్రాచార్యుని కన్ను పొడిచినాడు. బలి చక్రవర్తిని నిర్బంధించిన కాలమునుండియు త్రివిక్రమ దేవుడు 'చెరయూరు' అను పేరుగల ఈ గ్రామమునందు వేంచేసియున్నాడు. చెరయూరు అనునది చమత్కార మనియు, వాస్తవముగా ఈ గ్రామనామము చెఱుకూరు అనియు ముందుముందు తెలియగలదు.

ఇట్లుండ విష్ణువర్ధన మహారాజు దిగ్విజయ క్రీడాడంబరము ఉల్లసిల్ల విజయయాత్రనుండి ప్రత్యాగతుడగుచు, సామంతపరివేష్టితుడై చెఱుకూరు గ్రామమునకు విచ్చేసి భగవంతుడు త్రివిక్రమస్వామిని సేవించెను. ఇచ్చట శాసనకాలమును సూచించు శ్లోకము వ్రాయబడినది.

'కల్యాద్యబ్ద గణేష్ట నేత్రరసదోస్సంఖ్యే గతే వత్సరే। ప్రాప్తే థ ప్రభవే తపస్యపి సితే పక్షే ద్వితీయా గురౌ। వారే చేకు పురంధ్రనామ చెరయూరి గ్రామకే శ్రీపతిం। నత్వానేన పురా త్రివిక్రమరమానాథాయ దత్తాంస్థితిమ్' దీనిని ముందు చర్చింతుము. విష్ణువర్ధన మహారాజు త్రివిక్రమదేవునకు ఇచ్చిన స్థితి— ఉంద్రాలపాలెము, ఓబలసానిపాలెము, చెరుకూరు గ్రామములందు కేసరిపాటి కొలతతో ముప్పదియైదు, డెబ్బది (పుట్లు కావచ్చును) విత్తనములు చల్లగల భూఖండములు. మరియు ఆ మహారాజు కసుకుర్తి, ఇనుగుర్తి, కొండపాంటూరు అను గ్రామములను త్రివిక్రమపురము అనే వ్యవహారము కల్పించి త్రివిక్రమ స్వామికి సమర్పించెను. దానమును రక్షించుటకై ప్రరోచనముచేయు శ్లోకములును దానవిఘాతకులకు శాపోక్తులును గలవు. తరువాత త్రివిక్రమపురత్రయ మను వ్యవహారముగల కసుకుర్తి, ఇనుగుర్తి, కొండపాంటూరు గ్రామముల సీమాచిహ్నలు సవిస్తరముగా పేర్కొనుట జరిగినది.

ఈ శాసనమునందలి మరియొక ముఖ్యశ్లోకమును పాఠకులముందు ఉంచవలసియున్నది. అది విష్ణువర్ధనుని ప్రకృతజైత్రయాత్రకు సంబంధించినది మన చర్చకంతకును మూలాధారము కాదగినది.

'సోపి దిగ్విజయ క్రీడాండంబరేణ క్షితీశ్వరాన్ సకలానపి నిర్జిత్య ప్రత్యాగంతుం సముద్యతః. పూర్వ వైరమనుస్మృత్య జిత్వా కల్యాణభూపతిమ్। తస్యరాజ్య శ్రియంహృత్వా। యుద్ధేలబ్ధ పరాక్రమః'.

ఒక చిన్న విషయమును ముందు వివరించి గహనమైన శాసనస్థ విషయములను తెలివిడి చేయుటకు ప్రయత్నింతుము. త్రివిక్రమస్వామివారు వేంచేసిఉన్న గ్రామము పేరేమిటి? 'ఇక్షుపుర్యాం' అనియు 'పుంఢ్రేకునామనగరి' యనియు కవి వ్యవహరించుటచే ఈ గ్రామనామము ప్రాచీన కాలము నుండియు చెఱుకూరు అనుట వాస్తవము. చెఱుకు పంట విస్తారంగా ఉండుటచేత ఆపేరు వచ్చియుండవచ్చును. ఈ గ్రామానికి చుట్టుపట్ల జలాధారాలు బాగానే ఉండినట్లు ఊహింపదగియున్నది. శాసనములో తుంగభద్ర, వాడికవాంగు, నక్కలవాంగు, వాంగేరు, దుర్గిదేవిపడియ, నక్కలపడియ మొదలగు జలాధారములు ఉదాహృతములయినవి. వీటి ఆధారముతో త్రివిక్రమపురత్రయమునకు ఇక్షునగరము (చెఱుకూరు) మున్నగువానికి జలసమృద్ధి ఏర్పడినట్లు కనబడును.

అయితే శాసనమునందు చెఱుకూరికి 'చెరయూరు'అను వింతనామముకూడ పెట్టబడి యున్నది. ఇది పండితులు గ్రామవృద్ధులు కల్పించిన చమత్కారము. త్రివిక్రమస్వామి బలిచక్రవర్తిని చెరబట్టిన యూరుకావున ఇది చెఱుకూరు కాదు చెరయూరు అని ఆనాటి పెద్దలు గాథలు కల్పించుకొని వినోదించి యుందురు. తమ తమ గ్రామములకు గౌరవ ప్రతిపత్తులు కలుగుటకై పూర్వులు ఆ గ్రామములకు పౌరాణికవృత్తాంతములతో బలవంతముగానైనను సంబంధము కల్పించుకొని సంతోషపడెడివారు. ఇట్టి యుదాహరణములు చాలకలవు. కడపజిల్లాయందు చెయ్యేరు అను చిన్న నది కలదు. కల్పనాపాటవముకల పండితులెవరో దానిని 'బాహుద' అనునట్లు తీర్చిదిద్దిరి. మహాభారతములో శంఖలిఖితులను మహర్షుల థ ప్రసిద్ధము. లిఖితుడు ఒక నేరమునకై బాహు

వులు ఖండింపబడి భూసంచారము చేయుచువచ్చి బాహుదా నదిలో స్నానముచేయగా ఆతనికి చేతులు తిరిగి మొలిచినవి. బాహువులు ఇచ్చినది కనుక బాహుదానది అయినది. ఆంధ్రదేశమునందలి చెయ్యేరు వాగు బాహుదానదిలయి మహాభారత గాథకు ఆలవాల మైనది. ఇట్లే కడపజిల్లాలోనే అత్తిరాల గ్రామము కలదు. దీనికొక చమత్కారమైన వ్యుత్పత్తి కల్పించినారు. పరశురాముడు తండ్రియాజ్ఞచే తల్లిని వధించి, మాతృవధ పాతకమును మాపుకొనుటకై పుణ్యతీర్థములు సేవించుచురాగా అత్తిరాల గ్రామమువద్ద అతనికి పాపవిమోచన మయ్యెను. 'హత్యరాలె' అని పలుకుటచే ఆ స్థానము అత్తిరాల అయినదని ఆ ప్రాంతీయులు కథలు చెప్పుకొని మురియుచుందురట. ఈ సంప్రదాయమునుబట్టి చెఱుకూరు చెరయూరు అగుటలో ఆశ్చర్యములేదు.

ఇంతకును ఈ శాసన సందర్భమున మనలను ఎదుర్కొను గడ్డుసమస్యలు వేరుగా ఉన్నవి. ఈ శాసనముపై చారిత్రక విద్వాంసు లెవరైనను విమర్శాత్మకమైన వ్యాఖ్యానము లేవైనా చేసిరేమో మాకు తెలియరాలేదు. ప్రామాణికులైన మన చారిత్రకులు దీనిని ఉపేక్షించినట్లే కనిపించును. విజ్ఞానసర్వస్వము మూడవ సంపుటమునందు పూర్వచాళుక్యుల చరిత్రయందు పెదచెఱుకూరు శాసన సాక్ష్యము పరిగణింపబడినట్లు తోచదు. Eastern Chalukyas అను గ్రంథమునందును విష్ణువర్ధనుని (రెండవ) రాజ్యవృత్తాంతమునకు ఆధారములుగాతీసుకొనబడినవి మూడు శాసనములు (1) పమిడిముక్కల (2) రేయూరు (3) మట్టెవాడ శాసనములు. ఇచ్చటకూడ చెఱుకూరు శాసనము ఉపేక్షింపబడినది. ఇట్లిది యుపేక్షింపబడుటకు ప్రబలమైన కారణములు ఉండియుండును. ఆ శాసనసాక్ష్యమును తిరిగి పరిశీలించి, విష్ణువర్ధనుని చరిత్రమ, సమకాలిక దక్షిణహిందూ రాజ్యముల అన్యోన్యసంబంధములను అవగాహన చేసికొనుటయందు ఇది యేమైన తోడ్పడునేమో చూచుటయే ఇప్పటి మా ప్రయత్నముయొక్క ఉద్దేశము.

సమకాలీన చరిత్రయందు కొన్నియంశములు అనిర్ధారితముగా ఉండిపోయినవని చారిత్రకులు భావించుచున్నారు. కుబ్జవిష్ణువర్ధనుని అగ్రనందనుడును, తూర్పుచాళుక్యరాజులలో రెండవవాడును అగు మొదటి జయసింహవల్లభుడు క్రీ. శ. 641 నుండి 673 వరకు వేంగీరాజ్యము నేలెను. ఇతనికి సంతానము లేక పోవుటచే తమ్ముడగు ఇంద్రభట్టారకుడు సింహాసనము నధిష్ఠించి కొన్నిమాసములు మాత్రము రాజ్యము చేసెను. తరువాత ఇంద్రభట్టారకుని కుమారుడగు రెండవ విష్ణువర్ధనుడు పట్టాభిషిక్తుడయి క్రీ. శ. 673 నుండి 681 వరకు రమారమి తొమ్మిది సంవత్సరములు భూపరిపాలనను చేసెను. పెదచెఱుకూరు శాసనము ఇతని కాలమునకు సంబంధించినదిగా మేము భావించుచున్నాము.

ఈ కాలపు దక్షిణహిందూదేశ ఒకీయ సన్నిమిట్లుండెను. ఆంధ్రదేశమున తూర్పుచాళుక్యులును, కన్నడమహారాష్ట్రప్రాంతములయందు బాదామి చాళుక్యులును, తమిళపాండ్యమండలములందు పల్లవులును ఆధిపత్యము వహించియుండిరి. వారిలో వాతాపి చాళుక్యులును పల్లవులును మహాబలసమన్వితులు. పరస్పర విజిగీషాకాంక్షులు. తూర్పుచాళుక్యులు అంత బలవంతులును కారు, వారి రాజ్యమంత విస్తృతమైనదియు కాదు. ఇదికాక వారు బాదామి చాళుక్యవంశమునుండి అనతికాలమునకుముందే ఏర్పడినవారగుటచే వారికి బాదామి చాళుక్యులలో బాంధవ్యము, వారియెడ అభిమానము ఉండుట సహజము. పల్లవులును వాతాపి చాళుక్యులును ఒకరినొకరు భంజింపజూచుట నిత్యవృత్తాంతమయ్యెను. పల్లవ చక్రవర్తి మొదటి మహేంద్రవర్మ (క్రీ. శ. 600—630) మరణించగనే బాదామి చాళుక్య ప్రభువు రెండవ పులకేశి వల్లభుడు ఇదియే మంచితరుణమని కాంచీపుర పల్లవ రాజ్యముపై దైత్రయాత్ర కావించి వారిని చీకాకు పరిచెను. మహేంద్రవర్మ కుమారుడు మొదటి నరసింహవర్మ (క్రీ. శ. 630— 668) గొప్పపరాక్రమవంతుడయ్యెను క్రొత్తగా రాజ్యమునకు

వచ్చిన వాడగుటచే మహావిజేతయగు రెండవ పులకేశిని ఎదుర్కొనజాలక అణగియుండెను. కొంతకాలమునకు బలములు చేకూర్చుకొని ఈతడు తన స్థానమును నిలబెట్టుకొని చాళుక్యుల మిత్రరాజ్యమగు వేంగీ రాజ్యపు దక్షిణ భాగములను కబళించుటకు యత్నించెను. ఈ యాగడమును శిక్షించుటకే కాబోలు పులకేశి మరల ఖడ్గమును ధరించి పల్లవ రాజ్యముపై నడచెను. కాని విజయలక్ష్మి ఈ పర్యాయము ఈ వృద్ధ వీరుని వరించలేదు. యువకుడైన నరసింహవర్మ పులకేశిని ఒకటి రెండు రణరంగములందు ఓడించి వాతాపి వరకును ఆతనిని తరుముకొనివెళ్లి ఆ పట్టణమును ముట్టడించి పట్టుకొని ధ్వంసముచేసెను. అనేక సంగ్రామ విజేతయగు పులకేశి చక్రవర్తి ఈ ముట్టడి యందు అసువులు కోల్పోయెనని భావించుచున్నారు. పులకేశి తమ్ముడును తూర్పు చాళుక్యరాజ్య స్థాపకుడును అగు కుబ్జవిష్ణువర్ధనుడు ఈ మహావిపత్తునందు అగ్రజునకు బాసటగా వెళ్లి వాతాపి యుద్ధమునందు తానును వీరమరణ మొందియుండునని చారిత్రకులు నుడువుచున్నారు. ఇట్లే మహావీరులైన అన్నదమ్ము లిరువురును క్రీ. శ. 642 ప్రాంతమున దివంగతులైరి. తూర్పు చాళుక్యరాజ్యమునందు కుబ్జ విష్ణువర్ధనుని కుమారుడు మొదటి జయసింహ వల్లభుడు తండ్రి పరోక్షమున సింహాసనము నెక్కెను. ఆ రాజ్యము ఒడిదుడుకులు అంతగా లేకుండ ఎట్లో ప్రశాంతముగా సాగిపోవుచుండెను

వాతాపి సామ్రాజ్యమునందు మాత్రము మామూలు పరిస్థితులు ఏర్పడలేదు. విజేతలైన పల్లవుల ఆగ్రహమునకు అది గురియగుటయే ముఖ్య కారణము కావచ్చును. ఇట్లు పదమూడు సంవత్సరములు అనగా క్రీ. శ. 655 వరకును చాళుక్య సామ్రాజ్యమునందు అరాచక పరిస్థితి నడచెను. ఇంతలో పులకేశి కుమారుడైన మొదటి విక్రమాదిత్యుడు పరాక్రమము నెరపి, పల్లవులను వెడల నడిచి రాజ్యమునందు ప్రతిష్ఠితుడాయెను. ఛిన్నాభిన్నమైన చాళుక్య సామ్రాజ్యమును పునఃప్రతిష్ఠించుటలో విక్రమాదిత్యునకు వారి బంధువులైన తూర్పుచాళుక్యులేమైన తోడ్పడిరా? లేక తమ యిల్లు తాము చక్కబెట్టుకొనుచు వాతాపి చాళుక్యులను వారి పెనకువలకు వారిని విడిచిపెట్టిరా యనునది ఒక సమస్యగానే ఉండిపోయినది. ప్రముఖ చారిత్రకులగు డాక్టరు నేలటూరు వెంకటరమణయ్యగారు 'తూర్పు చాళుక్యులు' అను తమ ఆంగ్ల గ్రంథమునందు (పుట 67) ఈ యంశము నిట్లు వివరించిరి: 'The relations of Jayasimha I with the chalukyas of Badami are not known. For thirteen years after the destruction of Badami by Narasimha varman I confusion and anarchy prevailed in the western chalukya Dominions. Jayasimha I probably declared his independence during the interval and raised the status of Vengi from a dependency to a fully autonomous state, His attitude towards Vikramaditya, son of Pulakesin II, who ascended his father's throne in A. D. 665 cannot be ascertained.''

పశ్చిమ చాళుక్యరాజ్యము అల్లకల్లోలములకు గురియై అస్తవ్యస్తముగా ఉన్న దీర్ఘకాలములో జయసింహవల్లభుడు తన రాజ్యమును చక్కబెట్టుకొనుచు సామంత స్థితినుండి సర్వస్వతంత్ర స్థితికి వచ్చుటకు యత్నించుటలో తప్పేమియు లేదు. ఏ రాజ్యమున కారాజ్యము తన ప్రజల యోగక్షేమమును, తన స్వాతంత్ర్యమును కాపాడుకొనుటకు పూనుకొనుట దాని విధియై యున్నది. ఇంతవరకును మొదటి జయసింహ వల్లభుని రాజనీతి యుక్తముగనే ఉన్నది. కాని తమ బంధువులగు పశ్చిమ చాళుక్యులు తిరిగి తల యెత్తి అభ్యుదయము పొందుటకు శత్రువులతో పెనగుచున్నప్పుడు తూర్పు చాళుక్యులు తమ్ముకానట్లుండి తాటస్థ్యమును వహించినచో అది బంధు విరుద్ధమై గర్హ్యము కాగలదు. జయసింహ మహారాజు ఇట్లు బంధు వ్యతిరిక్తముగా వర్తించెనా అని నిర్ణయించుటకు ఆధారములు లభించలేదు. కాని ప్రకృతము మనము పరిశీలించుచున్న పెదచెఱుకూర్లు

శాసనము ఈ సందిగ్ధ విషయముపై కొంత ఆలోకమును ప్రసరింపజేయుచు ఉపకారకముగ ఉన్నది. అది యిచ్చు సమాచారము మనము కోరుకొనునంత ప్రత్యక్షముగా లేకున్నను పరోక్షముగ తోడ్పడుచున్నది.

కాని ఈ శాసనము దానియందలి చిక్కులచేత చారిత్రకులనంతగా ఆకర్షించినట్లు కనబడదు. అవి యెట్టివి అనగా—

1. పెదచెఱుకూరుశాసనమునందు ప్రస్తూయమానుడైన విష్ణువర్ధన మహారాజు ఎవరు? తూర్పు చాళుక్య రాజ్యమును ఏలిన వారిలో విష్ణువర్ధన నామధేయులు ఏడెనమండుగురు కాన్పించుచున్నారు. ఈతడు ఎన్నవ విష్ణువర్ధనుడు? ఇతని రాజ్యకాలమేది?

2. 'పూర్వవైర మనుస్మృత్య'అను చెఱుకూరు శాసన శ్లోకములో విష్ణువర్ధనుడు తాను జయించినట్లు చెప్పిన కల్యాణవల్లభుడెవరు? ఆతనికిని ఈతనికిని పూర్వవైరమెట్లు కలిగినది?

3. చెఱుకూరు శాసనకాలమేది? ఇత్యాది చిక్కుప్రశ్నలకు మనము సమాధానములు అరయవలసి యున్నది.

(1) విష్ణువర్ధనుని గుర్తించుటకు శాసనమునందు ఒకటిరెండు సూచనలు కలవు. ఈతడు మరొక విష్ణువర్ధన మహారాజు ప్రియపౌత్రుడు. ఇతనికి విషమసిద్ధి బిరుదు కలదు. ఈ విషమసిద్ధి బిరుదు ఇతనిదియో, తాతగారికిని వర్తించునో విస్పష్టముగాలేదు. అయినను శాసనమునందు ఈ బిరుదము రెండుమార్లు ఉదాహరింపబడుటచే అది ఒక పర్యాయము తాతయైన విష్ణువర్ధనునకును రెండవ పర్యాయము పౌత్రుడైన విష్ణువర్ధనునకును ఉద్దేశింపబడినదని భావించుట సత్యమునకు దూరము కాకపోవచ్చును. విషమసిద్ధి బిరుదాంచితులైన తాత మనుమలు తూర్పుచాళుక్యులలో ఇద్దరు కలరు. ఈ వంశస్థాపకుడైన కుబ్జ విష్ణువర్ధనుడు విషమసిద్ధి బిరుదాలంకృతుడు. ఆతని మనుమడును పెదచెఱుకూరు శాసనదాతయు అయిన రెండవ విష్ణువర్ధనుడుకూడ ఈ బిరుదముచే భూషితుడయ్యెను. ఇతడును తాతగారివలె పరాక్రమశాలియనియు శత్రువిజేతయనియు స్ఫురించుచున్నది. ఈ రెండవ విష్ణువర్ధనునకు ప్రలయాదిత్యుడు, మకరధ్వజుడు అను విశేషణములుకూడ ఈ శాసనమునందు కనబడుచున్నవి. రెండవ విష్ణువర్ధనుని రాజ్యకాలము క్రీ. శ. 673—681 అని చారిత్రకులు నిర్ణయించియున్నారు.

(2) ఈతని పరాక్రమచర్యలెట్టివి? ఈతడు జయించిన రాజులెవరు? అనునది తెలిసికొనవలసియున్నది. 'ప్రసకటప్రభా(ట)ధిభ క్షుభిత కోలాహల సన్నద్ధయుద్ధేషు విషమసిద్ధి దిననాథః' అనుటచే మదగజేంద్రములచే సంక్షుభితమైన రణరంగములం దీతడు విజయము సాధించుట సూచితమైనది. ఈ కాలపు వీరరాజన్యులు పలువురు చతుర్దంతగజసంగ్రామమునందు నిష్ణాతులమని చెప్పకొనుట ఆచారము. రెండవ విష్ణువర్ధనుని విక్రమాతిశయముకూడ సాంప్రదాయిక వర్ణనయైన కావచ్చును. లేదా ఇతడు వాస్తవముగనే గజబలయుద్ధములందు ఘనుడై యుండవచ్చును. అయినచో తూర్పు చాళుక్యులకు ఉత్తరమునుండి ప్రతిస్పర్ధులైన కాళింగులు గజబలసంపదగలవారగుటచే విష్ణువర్ధనుడు ఏవేని రణరంగములలో వారిని ఎదుర్కొని ఓడించియుండునని ఊహించవలసియున్నది. రెండవ విష్ణువర్ధనుడు యౌవనమునందే విక్రమశాలియై పెదతండ్రియగు మొదటి జయసింహుని యాదేశముచే ఆయా శత్రువర్గములతో తలపడి విజయములు సాధించి యుండును. అయినను ఈ విజయముల స్వరూపము మనకు ఇంకను విస్పష్టమగుటలేదు.

అతడు స్వయముగ పేరెత్తి ఉద్ఘాటించిన విజయమునుగూర్చి లోతుగ పరిశీలింతము. ఈ యంశము 'పూర్వవైర మనుస్మృత్య'యను శ్లోకములో సూచితమైనది. ఈ సందర్భమిట్లున్నది: 'విష్ణువర్ధన మహారాజు దిగ్విజయక్రీడాడంబరముతో రాజుల నందరను పరాజితులనుజేసి తిరిగి వచ్చుచుండెను. అతడును పూర్వవైరమును స్మరించి కల్యాణ భూపతిని జయించి

వాని రాజ్యలక్ష్మిని హరించి యుద్ధమునందు లబ్ధ పరాక్రముడయ్యెను.' ఈ శ్లోకమునందలి రెండు దళములు ప్రత్యేక వ్యాఖ్యను కోరుచున్నవి. పూర్వ వైరము, కల్యాణభూపతి అనునవి. కల్యాణభూపతి ఎవ్వరో తెలిసినచో ఆతనితో విష్ణువర్ధన మహారాజునకుగల పూర్వవైరమున్నూ తదియచంద్రునివలె స్వయముగా కనబడును. కావున కల్యాణభూపతి అను దళమే ముమ్మందు వ్యాఖ్యానింపదగియున్నది. ఎవరీ కల్యాణభూపతి? అటువంటిపేరుగల రాజెవ్వడును ఆ కాలమున తెలియవచ్చుటలేదు. అందుచేత కల్యాణము లేక కల్యాణియను నగరమునకు అధిపతియైన వాడు అను నర్థము స్ఫురించుచున్నది. కల్యాణ నగరాధిపతి అని గ్రహించుసరికి బండి పూర్తిగా తలక్రిందైనది. రెండవ విష్ణువర్ధనుని కాలమునకు అనగా క్రి. శ. 673—81 కాలమునకుగాని తత్సమీప కాలమునకుగాని కల్యాణినగరము లేనేలేదు. ఒకవేళ ఉండినను అదియొక క్షుద్రగామముగా ఉండియుండును.

ఇచ్చట మనము కల్యాణి నగరాధిపులైన పశ్చిమ చాళుక్యుల చరిత్రను కొంత అనుసంధింపవలసి యున్నది. తూర్పు చాళుక్యుల బంధువులును వాతాపి నగరము సామ్రాజ్యకేంద్రముగా కలవారును అగు చాళుక్యులు క్రీ. శ. 6 వ శతాబ్ది మధ్యభాగము మొదలుకొని క్రీ. శ. 755 వరకును రమారమి ఇన్నూరు సంవత్సరములు ప్రవర్ధమానులై యుండిరి. ఈ వంశీయుడగు రెండవ కీర్తివర్మ కాలమున రాష్ట్రకూటులు దంతిదుర్గుడను వీరుని నాయకత్వమున విజృంభించి, బాదామి చాళుక్య సామ్రాజ్యమును అంతమొందించి రాష్ట్రకూటుల బావుటాను ఎత్తిరి. ఈ రాష్ట్రకూటులు మరల ఇన్నూరు సంవత్సరములపైని నిరాఘాటముగా పరిపాలన చేసిన మీదట దుర్బలులైపోయిరి. ఈ సమయమున ప్రాచీన చాళుక్యవంశీయులు మరల పుంజుకొని మహాబల సమన్వితులై రాష్ట్రకూటసామ్రాజ్య వటవృక్షమును ఉన్మూలించి క్రీ. శ. 973 సంవత్సర ప్రాంతమున రెండవ పశ్చిమ చాళుక్యసామ్రాజ్యమును స్థాపించిరి. వీరిని కుంతల చాళుక్యులు అనికూడ అందురు. ఈ పర్యాయము వీరు కల్యాణీ నగరమును సామ్రాజ్య ముఖ్యపట్టణముగా చేసుకొనిరి. అందుచే కల్యాణభూపతులనగా పశ్చిమచాళుక్య చక్రవర్తులగు చున్నారు. రెండవ విష్ణువర్ధనునకు మున్నూరు సంవత్సరముల తరువాతగాని వీరు చరిత్ర రంగమునకు అవతరించలేదు. ఇట్టి వీరిని మూడు శతాబ్దములు వెనుకఉండిన వేంగీ చాళుక్య విష్ణువర్ధనుడు జయించుట అసంగతము. పెట్టగల బచ్చలిపాదును కొనగల గేదె మేసినట్లైనది.

పోనిండు. వేంగీచాళుక్యులు నాలుగు శతాబ్దములపైని ఆంధ్రదేశము నేలిన సుప్రతిష్ఠిత రాజవంశమువారు కనుక వీరిలో కడపటి మహారాజు లెవరైన కల్యాణి చాళుక్యులను జయించిరేమోయను సంశయము ఉత్పన్నము కావచ్చును. తూర్పుచాళుక్య రాజ్యము క్రీ. శ. 1077 వరకును కొనసాగినది. అనగా కల్యాణిచాళుక్యులును వీరును క్రీ. శ. 973 మొదలుకొని క్రీ. శ. 1077 వరకును సమకాలీన పృథ్వీపతులు అగుచున్నారు. ఈ మధ్యకాలమున పాలించిన తూర్పుచాళుక్యు లెవరైన కల్యాణభూపతులను జయించియుండవచ్చును అన్నచో అది మృగ్యముగా ఉన్నది. క్రీ. శ. 973—1077 నడుమ పరిపాలనచేసిన వేంగీచాళుక్యు లెవరునూ కల్యాణిచాళుక్యులను జయించగల సమర్థులుకారు. క్రీ. శ. 975 నుండి 1000 సంవత్సరమువరకును రాజమహేంద్రవరరాజ్యము అరాజకమునకు లోనయిఉండెను. తరువాత కాంచీపుర చోళుల సహాయముతో శక్తివర్మ, విమలాదిత్యుడు, రాజరాజనరేంద్రుడు, ఆతని సవతితమ్ముడు ఏడవ విజయాదిత్యుడును క్రమముగా తూర్పుచాళుక్య రాజ్యము నేలిరి. వీరెవ్వరును కుంతలచాళుక్యులను జయించగల అధికారులు కాకుండిరి. ఆంధ్రమహాభారత కృతిభర్తయునూ మన కత్యంతపరిచితుడును, విష్ణువర్ధన బిరుదాంచితుడును అగు రాజరాజనరేంద్రుడు కూడ కల్యాణిచాళుక్యులను నిర్జింపగలవాడు కాకుండెను. ఆయన పరాక్రమశాలియైనను విజయలక్ష్మి ఆయనను

వరించకుండెను. ఆంధ్రభారతకృతిభర్త తన యవ సౌన దశయందు కుంతలచాళుక్యుల యాధిపత్యమును అంగీకరింపవలసిన వాడయ్యెనని చారిత్రకులు వ్రాయుచున్నారు. అందుచే అర్వాచీన వేంగీచాళుక్యులెవరును 'జిత్వాకల్యాణ భూపతిమ్' అని ప్రకటించుకొనుటకు ఆస్కారములేదు. ఈప్రతిభ రెండవ విష్ణువర్ధన మహారాజునకే చెల్లినది. కాని ఆతని కాలమునకు కల్యాణనగరమే లేకుండెను. అదియెట్లు ?

ఈ చిక్కు సమస్యను మనమిట్లు విడదీయవలెను. ఇక్కడ కల్యాణ శబ్దమునకు కాంచియని అర్థము చెప్పవలెను. కళ్యాణభూపతిని అనగా కాంచీ భూపతిని అని సమన్వయింపవలెను. ఇదియేమి నారికేళవృక్షమనగా మామిడిచెట్టు అని యర్థము చెప్పినట్లున్నదే అని ఎవరైనను ఆక్షేపింతురు. కాని దీనిని ఓపికతో పరిశీలింపవలెను. కల్యాణశబ్దమునకు ఆప్టే, మోనియరు విలియమ్సు మున్నగు గొప్ప నిఘంటువులయందు శుభప్రదమైనది మొదలగు పెక్కు అర్థములతోపాటు బంగారము అను నర్థముకూడ ఈయబడియున్నది. కాంచి అనగా స్త్రీలు నడుమునకు ధరించు ఒడ్డాణము, మొలనూలు అను నర్థమును ఈ నిఘంటువులు పేర్కొనలేదు. ఒడ్డాణము, మొలనూలు బంగారు వికారములే గనుకను, స్త్రీల ముఖ్యాభరణములలో చేరుటచేతను, కల్యాణప్రదములని భావింపబడుటచేతను కల్యాణశబ్దము కాంచీ పర్యాయముగా వాడుచుండినట్లు తెలియుచున్నది. దేవీస్తోత్రము లందు కల్యాణశబ్దము కాంచీపరముగా ప్రయోగింపబడినట్లు వినవచ్చినది. ఈ శాసనము వ్రాసిన శ్రీపతి కవీంద్రుడు విష్ణువర్ధన మహారాజు విద్యాధికారియు ప్రౌఢకవీశ్వరుడుగను కన్పించుచున్నాడు.ఇతనికి వక్రోక్తియందు ప్రీతి మెండు. గ్రంథగ్రంథులు కూర్చుటయందును ఇతనికి ప్రీతి. శాసనమునందలి ఒక శ్లోకమును చూడుడు. విష్ణువర్ధనుని పరాక్రమమును వక్రోక్తి ప్రధానముగా ఇట్లు వర్ణించినాడు: 'చాళుక్యాన్వయుడవైన ఓ విష్ణువర్ధన మహారాజా ! నీ శత్రురాజుల ప్రౌఢలైన అంతఃపురకాంతలు తమ భర్తల హ్రీముద్రను (సిగ్గరితనమును) రహస్యమునందిట్లు తొలగింపుచున్నారు. ఎట్లనగా, మృగపతి ఛత్రముల చేతనే శోభిల్లుచున్నాడా! భైరవునకు అంబరమెక్కడ ! నందీశ్వరుడు గడ్డిపరకలను నోటపెట్టుట లేదా ! వాయుదేవుడు పరుగెత్తుటలేదా' అందురట. అనగా 'మీరు పరాజితులై ఛత్రచామరములు వీడి, వస్త్రములు చినిగి, పూరికరచి, పారిపోయివచ్చినను మీ ఘనత కేమి లోపము ! మీకన్న గొప్పవారే ఇట్టి యవస్థలకు లోనయిరి' అనిచెప్పి ఆ ప్రౌఢకాంతలు తమ భర్తలను ఓదార్తురట.

ఈ కవికి ప్రౌఢముగా చెప్పుట, చమత్కారము కల్పించుట ఆసక్తిదాయకములు. ఇట్లు చెప్పదలచియో, లేక ఛందోనిర్బంధముచేతనో లోకమందలి సంప్రదాయమును స్పృశించుకొని కాంచీభూపతియనుటకు కల్యాణ భూపతియని చమత్కరించినాడు. కల్యాణ, కాంచీ శబ్దము అంతరూారములునుకావు. ఈ వివరణము విద్వాంసులకు సమ్మతమైనచో, కల్యాణశబ్దమును కాంచీ పర్యాయముగా గ్రహించినచో శాసన విషయమంతయు దట్టమైనమంచు విడిపోయినట్లు విడిపోయి, అరటిపండు ఒలిచిపెట్టినట్లు తేటతెల్లమగుచున్నది. 'పూర్వవైర మనుస్మృత్య—జిత్వాకల్యాణ భూపతిమ్' అన్నది అక్షరాల నిజమగుచున్నది. ఇప్పటి కాంచీనగరభూపతి అనగా పల్లవరాజన్యుడు మొదటి నరసింహవర్మ. ఈతనికి తూర్పుచాళుక్యవంశీయులకును ఒకటిరెండు తరములుగ వైరములు సాగుచునేయున్నవి. పల్లవ చక్రవర్తులు బలవంతులై ఆంధ్రదేశ భాగమైన పాకనాటిని ఆక్రమించుకొనుచు తూర్పు చాళుక్యులకు కష్టనష్టములు కలిగించుచుండిరి. కృష్ణా—మన్నేరు నదుల నడిమి ప్రదేశము కాంచీపుర పల్లవులకును వేంగి చాళుక్యులకును వివాద కారణముగా ఉండెడిది. (చూ. విజ్ఞా.తె. పుట. 135). మొదటి నరసింహవర్మ రెండవ పులకేసి వల్లభుని, కుబ్జవిష్ణువర్ధనునికూడ క్రీ. శ. 642 ప్రాంతమున వాతాపి ముట్టడియందు ఓడించి సంహరించి యుండుటచే 'వేంగీ చాళుక్యులకును పల్లవులకును నడుమ వైరానలము చెలరేగెను. వాతాపి విజయా

ద్ధత్యమునందు నరసింహవర్మ పాకనాటిని కొంతవరకు కర్మరాష్ట్రమును గూడ తూర్పు చాళుక్యులనుండి అపహరించి యుండును. వారును తాత్కాలికముగ ఏమియు చేయలేకుండిరి. మొదటి జయసింహవల్లభు డప్పుడప్పుడే మహారాజుగుటచే పల్లవ నరసింహ వర్మను చెనకునంతటి బలమాతనికి లేకుండెను. కావున తూర్పు చాళుక్యులు కొంత కాలము అణగి మణగి యుండవలసిన వారైరి. వాతాపి చాళుక్యులు నామరూపములు లేకుండ పోయిరి.

చాళుక్యుల ఈ దైన్యస్థితి చిరకాలమిట్లు సాగ లేదు. పదమూడు సంవత్సరములు గడచినవి. రెండవ పులకేశి కుమారుడు మొదటి విక్రమాదిత్యుడు ప్రాజ్ఞుడయి, పరాక్రమముచూపి బాదామిచాళుక్య సింహాసనమున క్రీ. శ. 655 సంవత్సరమున ప్రతిష్ఠితుడయ్యెను. పల్లవులపై పగతీర్చుకొనుట కాతడు నడుము కట్టెను. వారి సన్నిహిత బంధువులైన తూర్పు చాళుక్యులు కూడ ధైర్యము వహించి యువకుడగు విష్ణువర్ధనుని నాయకత్వమున తమ సైన్యములను పల్లవ సామ్రాజ్యముపై పంపిరి. ఇట్లు ఉభయ చాళుక్యబలములును కలిసి, విజృంభించగా పల్లవ నరసింహవర్మ వారి ఢాకకు నిలువలేక తాను మున్ను ఆక్రమించిన బాదామి సామ్రాజ్య భాగములను తూర్పు చాళుక్యరాజ్య భాగములను విడనాడి కాంచి సరిహద్దులలోనికి ఒదిగియుండ వలసినవాడయ్యెననుట తథ్యము. ఈ విజయసూచకము గనే విష్ణువర్ధనుడు కర్మరాష్ట్రమందలి పెదచెఱుకూరు గ్రామమున త్రివిక్రమస్వామిని దర్శించి శాసనము వేయించుట జరిగినది. పల్లవవిజయమునుండి మరలి వచ్చునప్పుడే త్రివిక్రమ సందర్శనము జరిగి యుండును. కావున 'సోపి దిగ్విజయ క్రీడాడంబరేణ క్షితీశ్వరాన్ సర్వానపి నిర్జిత్య ప్రత్యాగంతుమ్ సముద్యతః' అను శాసనవాక్యము అతిశయోక్తికాక వాస్తవ విషయమే అగుచున్నది. ఉభయ చాళుక్యబలములును కలిసి పనిచేసినగాని పల్లవ విజయము సాధ్యముకాదు కావున వారట్లు కలిసియే పోరాడిరని మన మూహింప వచ్చును. బాదామి చాళుక్యుల కష్టకాలములో తూర్పు చాళుక్య లెట్టినీతిని పాటించిరను సందిగ్ధాంశముకూడ దీనివలన పరిష్కృతమైనది. జయసింహవల్లభుడు అదను చూచుకొని బంధుభావము ప్రదర్శించి అపకీర్తి నుండి తొలగినాడు.

శాసనమునందలి మరియొక చిన్నవాక్యమునకు సమాధానము చెప్పవలసియున్నది. 'విష్ణువర్ధన మహారాజః జయతి రాజమహేంద్రవరేస్థితః' అను మాటను సమన్వయించుటెట్లు? రాజమహేంద్రవర మప్పటికి తూర్పుచాళుక్యుల ముఖ్యపట్టణము కాదుగదా అను శంక జనించును. రాజమహేంద్రవరము మొదటి అమ్మరాజ విజయాదిత్యుని కాలమున (క్రీ. శ. 922—29) తూర్పుచాళుక్య రాజధాని అయ్యెనని చెప్పుదురు. కొందరు దీనిని కాదనుచున్నారు. ఏమైనను రాజమహేంద్రవర నగరము తత్పూర్వకాలమున లేదనుట నమ్మదగినదికాదు. అది ముఖ్యపట్టణము కాకపోవచ్చును. ప్రస్తుత శాసనమునందు విష్ణువర్ధనుడు రాజమహేంద్రవరస్థితుడై శాసనమిచ్చెనని చెప్పినదేకాని ముఖ్యపట్టణమని చెప్పలేదు. అది యిట్లును కావచ్చును. తూర్పు చాళుక్యులు పల్లవులతో యుద్ధమునందు నిమగ్నులగుటచూచి ఉత్తరమునుండి కళింగభూపతు లెవరైన అలజడి కలిగించ యత్నించియుండగా జయసింహవల్లభుడు పల్లవ విజేతయగు తన తమ్ముని కుమారుని రాజమహేంద్రవరమువంకకు సైన్యములతో పంపి యుండును. అది యువరాజ స్థానముగా ఉండిన నుండవచ్చును. అందుచేత రాజమహేంద్రవర స్థితః అనునది పైన చెప్పిన యంశములకు విరుద్ధము కాబోదు.

ఇంక పెదచెఱుకూరు శాసన కాలమును సమన్వయింపవలసి యున్నది. దీనియందు శక సంవత్సరములు పేర్కొనబడలేదు. విష్ణువర్ధనుని పరిపాలనా సంవత్సరములును చెప్పలేదు. వెళ్ళివెళ్ళి కలి శతాబ్దములలో శాసనకాలము చెప్పనైనది. కవిదృష్టిలో ఇది ఉచితమే కావచ్చును. భగవంతుడు త్రివిక్రమస్వామినిగూర్చి చెప్పునప్పుడు హాస్యాస్పదమైన లౌకిక సంవత్సరముల

ప్రసక్తి ఏమని ఆతడు భావించియుండవచ్చును. యుగములలోను మన్వంతరములలోను చెప్పవలెను. ఎట్లైనను త్రివిక్రమ పుర త్రయదానము కలియుగము నందు 'అష్టనేత్రరసదోస్సంఖ్యగల సంవత్సరమున ప్రభవ, తపస్యమాస సిత పక్షమున విదియా గురు వారము' జరిగినది. అష్టనేత్ర ఇత్యాది సంవత్సరములు అనగా కలియుగము 2628. ఇప్పటి పంచాంగముల ప్రకారము క్రీ. శ. 1972 అనగా కలి సంవత్సరములు 5073. అనగా విష్ణువర్ధనుని కాలము క్రీ. పూ. 2445 అగును. ఇది మరియు అసందర్భముగా ఉన్నది. డాకరు మారేమండ రామారావుగారు తమ 'Inscriptions of Andhra Desa. Vol II Part I' అను గ్రంథమందు పుట 238 లో పెద్ద చెఱు కూరు శాసనమును ఉదాహరించినారు. శాసనకాలము కలి 4928 సంవత్సరములని తీసుకొన్నారు. నా రే పాఠ మును గ్రహించిరో తెలియదు. రామారావుగారి పరిగణన మున్నూ ఉపయుక్తముగా లేదు.

శాసనమునందు ప్రభవ సంవత్సరము చెప్పబడి నది. తపస్యమాసము అనగా ఫాల్గునము. స్యాత్తపస్యః ఫాల్గునికః—అమరకోశము. ప్రభవ సంవత్సర ఫాల్గున శుద్ధవిదియ గురువారం క్రీ. శ. 788, ఫిబ్రవరి 14 తేదీ అగుచున్నది. ఇదియును కుదురుట లేదు. రెండు ప్రభవ సంవత్సరములు అనగా 120 సంవత్స రములు వెనుకకు వెళ్ళినగాని మనము రెండవ విష్ణు వర్ధనుని కాలమునకు సమీపముగా రాలేము. ప్రస్తుత మున్న Indian Ephemaris గ్రంథము క్రీ. శ. 700 తో ఆరంభించుచున్నది. మేము మరొక విధ ముగా గుణితము చేయగా క్రీ. శ. 656 సంవత్సరము వచ్చినది. దీనిని రుజువుచేయు మెట్లు అసందిగ్ధముగా లేవు. అయినను మరొక విస్పష్ట పరిగణన మార్గము దొరుకువరకును శాసనమునందలి దానకాలము క్రీ. శ. 656 అని గ్రహింపవచ్చును. ఇది తక్కిన చారిత్ర కాంశములతో చక్కగా కుదురుచున్నది. క్రీ. శ. 655 ప్రాంతమున పులకేశి కుమారుడు మొదటి విక్రమా దిత్యుడు బాదామి సింహాసనము నధిష్ఠించెను. ఆ మరుసటి సంవత్సరమే ఉభయ చాళుక్యబలములును జైత్రయాత్రా దుందుభులు మ్రోగించుచు రెండు పక్షములనుండి పల్లవ సామ్రాజ్యముపై పడినవి. బలవంతుడైనను పల్లవ నరసింహవర్మ పరాజితుడై తన రాజ్యపు సరిహద్దులలోనికి ఉపసంహరించుకొన వలసిన వాడయ్యెను. 'తస్యరాజ్యశ్రియంహృత్వా' అని విష్ణువర్ధనుని శాసనము చెప్పినంత మాత్రమున చాళుక్యులు పల్లవ సామ్రాజ్యము నాక్రమించిరని భావింప వీలులేదు. తూర్పుచాళుక్యుల వరకును వారు పల్లవులను కమ్మనాడు పాకనాడు రాష్ట్రములనుండి వెడలనడచి తమ దక్షిణ సరిహద్దును ఖాయము చేసుకొనిరని చెప్పిన జాలును.

పెదచెఱుకూరు గ్రామము ఇప్పటికిని వర్ధ మానమై ఉన్నదని తెలియుచున్నది. ఇది గుంటూరుజిల్లా బాపట్ల తాలూకాలో ఉన్నది. దీని ప్రస్తుతజనాభా 4,763. విష్ణువర్ధనుని రాజ్యకాలములో పల్లవ విజ యము జరిగియుండక పోవచ్చును. అది జయసింహ వల్లభుని కాలముననే జరిగియుండును. అప్పటికి విష్ణు వర్ధనుడు యువరాజో లేక యువకుడైన సేనానిగనో ఉండియుండును. తాను సింహాసనమును అధిష్ఠించిన తరువాత ఆస్థాన కవియగు శ్రీపతి మహోదయు నిచే శాసనకావ్యము వ్రాయించి శిలాస్తంభ ఘటితము చేయించి యుండవచ్చును. 'నత్వానేన పుర త్రివిక్రమ రమానాథాయ' అను దళను ఈ యంశమును సూచించు నదివలె ఉన్నది.

# పద్మవ్యూహంలో జీవనవాదం

## శ్రీ సాలగ్రామ్

యుగాంతపు ప్రళయంలో
పచ్చని వట పత్రంపై
విలాసంగా అవతరించిన కృష్ణుణ్ణికాదు నేను !
కాలుతున్న అమ్మ కడుపులోనే
కష్టాల కథలు వింటూ
అరిష్టాల మంత్రసాని సేవలో
భూమిమీదపడి భయంతో 'కెవ్వు'మన్న నికృష్టుణ్ణి నేను.
పసితనపు అమాయకత్వం నీడలో
ఈ లోకాన్ని ఆలోకించకుండా,
ఏవేవో పాటలు పాడుకుంటూ—
పనికిరాని పాఠాలెన్నో నేర్చుకుంటూ—
పిల్లకాలువగుండా యవ్వన తీరాన్ని
చేరుకొన్నవాణ్ణి—నన్ను—
ఆనంద సైకతాల్లో
హాయిగా పవ్వళించనీయలేదీ కాలప్రవాహం.
హఠాత్తుగా మలుపు తిరిగి
ఈ పద్మవ్యూహంలోకి తోసేసింది......

*    *    *    *

ఈ పద్మవ్యూహం —
ఊహాలోకాల్లో తేల్చేదికాదు.
కనికరించి కలల్లో ముంచేదీ కాదు
కఠినంగా కత్తి ఝుళిపించి
కదనానికి కాలు దువ్వుతుంది!
ఏమరితే చాలు
అదేపనిగా శస్త్రాస్త్రాలు రువ్వుతుంది!
అభిమానం గలవాణ్ణి—

ఓటమి నెలా ఒప్పుకోను?
తలా, వొళ్ళూ విదలించి
యుద్ధానికి సన్నద్ధుణ్ణయ్యాను
అలనాటి అభిమన్యుణ్ణయ్యాను!
అనుక్షణం అతి జాగ్రతతో
ముందూ వెనుకలు కాచుకుంటూ
పోరాటం సాగిస్తున్నాను
ఈ పోరాటంలో అలుపు ఉండకూడదని తెలుసు.
ఆప్యాయతలో సేదదీరాలన్న
ఆశ అసలు కలుగకూడదనీ తెలుసు
పద్మవ్యూహాన్ని ఛేదించాలన్నదే దీక్ష!
ముందుకు సాగిపోవటమొక్కటే లక్ష్యం!! అయితే,
వ్యూహంలోని దుష్టశక్తులతో పోరాటానికి–
సహజ కవచ కుండలాలతో పుట్టిన
కర్ణుణ్ణి కాకపోవచ్చు నేను...
కాని, వొలిచి ఇవ్వలేని ఆత్మవిశ్వాసం
నాకు కవచంగా ఉంది!
మొక్కవోని 'నిజాయితీ' నా ఆయుధమైంది!!
అయితే, నా నిజాయితీ
ఈ కుటిల వ్యూహంలో అతి తేలిగ్గ ఓడిపోతోంది...
అందుకే నాకు గాయాలు తప్పటం లేదు!
ఈ గాయాలకు తప్పనిసరిగా
నేను పూసుకుంటున్న మందు
'జీవనవాదం' (Existentialism)

* * * *

ఇంతకూ నేను ...
పద్మవ్యూహాన్ని ఛేదించగలనో లేదో
నాకు తెలియదు.
ఒక్కటిమాత్రం తెలుసు
అంతకంటే గత్యంతరం లేక, ఆ ప్రయత్నంలోనే
వీరస్వర్గ మలంకరిస్తాను!

# బాపూజీ ఆత్మకథ

శ్రీ నాగళ్ల గురుప్రసాదరావు

నవీనాంధ్ర విమర్శకు పితామహులయిన కట్టమంచి రామలింగారెడ్డిగారు 'తుమ్మల సీతారామమూర్తి మహాత్ముని యొక్క ఆస్థానకవి. ఈ స్థానము శాశ్వతము' అని యభిభాషించిరి. సీతారామమూర్తిగారికీ పొగడ్తను సంపాదించిపెట్టినది వారు రచించిన 'బాపూజీ ఆత్మకథ.' అది యీ శతాబ్దమున వెలువడిన వీరకావ్యములలో నితివృత్తమునుబట్టి, రచనా రీతినిబట్టి ప్రథమ గణ్యము. ఇట్లనుట యతిశయోక్తికి వన్నెవెట్టుటగాదు. గాంధిమహాత్ముఁడు పురాణపురుషుఁడుగాఁడు. మొన్న మొన్నటివాఁడు. ఆయన బ్రదుకొక యుద్ధము. ఆ యుద్ధము రెండు రకములు. వానిలో నొకటి బాహ్యము. రెండవది యాభ్యంతరము. బాహ్యము భారత జాతీయోద్యమము. ఆభ్యంతరము ఆధ్యాత్మిక తేజస్సంపన్నము. మహాత్ముని యాంతరసంగ్రామమునకు సంవాదమే ఆయన సారధిగానున్న జాతీయోద్యమము. దానికిముందు నడచిన దక్షిణాఫ్రికా భారతీయోద్యమమును బాపూజి లోచూపు లీలయే. సత్యాహింసలు సనాతనములు. మహాత్మునకు ముందెందఱో మహర్షులు, మేధావులు వాని మహిమ నుగ్గడింపకపోలేదు. వారి మాటలు వాక్శూరత్వమునకు నుదాహరణములు. తర్కశాస్త్రపాండితికి తార్కాణములు. మహాత్మునివలె సత్యాహింసలను సువిశాల కార్యరంగమునకు సమన్వయించిన క్రియాశీలు లెందఱున్నారో చెప్పవలసినవారు చరిత్రకారులు. ఐన్‌స్టయిన్ చెప్పినట్లు 'ఇటువంటి మానవుఁ డీ భూమిమీఁద నడయాడెనా?' యని రాఁబోవు తరములవా రాశ్చర్యపడు పురుషోత్తముఁడు మహాత్ముఁడు. అట్టి మహాత్ముని జీవితమును కావ్యవస్తువుగా స్వీకరించుట మానవజాతి చరిత్రలోని యొకప్రధాన ఘట్టమునకు రసరూపమును కల్పించి స్థిరత్వ మాపాదించుటగాక మఱేమి? ఈ చూపుతోఁ జూచినపుడు 'బాపూజీ ఆత్మకథ' మున్మొదట లెక్కింపఁదగినదనుట యతిశయోక్తి కాదు.

బాపూజి 1921 సం॥వఱకు నడచిన తన బ్రదుకును స్వీయచరిత్రగా వ్రాసెను. గుజరాతు భాషలోనున్న యా చరిత్రను మహాదేవదేశాయి—గాంధిజీకి కననికొడుకు—ఆంగ్లభాష కనువదించెను. ఆంగ్లభాషలో ఆ స్వీయచరిత్రపేరు 'సత్యప్రయోగ చరితము' (The story of my experiments with truth). దానిని 'ఆత్మకథ' యనుపేర శతావధాని వేలూరి శివరామశాస్త్రిగారు తెలిఁగించిరి. ఆ యాంధ్రానువాదమును కాశీనాథుని నాగేశ్వరరావుగారు 'ఆంధ్రగ్రంథమాల' క్రింద వెల్లడించిరి. తుమ్మల సీతారామమూర్తిగారు వేలూరి శివరామశాస్త్రిగారి గద్యగ్రంథమును బద్యకావ్యముగా రూపొందించిరి. కవిగారే 'మనవి'లో నిట్లు వ్రాసిరి. 'ఈ నా రచనకు నాదరువైన కృతి పూజనీయులు వేలూరి శివరామశాస్త్రిగా రనువదించిన యాత్మకథ. ఇతర భాషానువాదములు కొంతవట్టు నా కుపకరించినను శ్రీ శాస్త్రిగారికే మిగుల ఋణపడితిని. వారికి వినయపూర్వక ధన్యవాదము లర్పించుకొనుట నా కనిష్ఠకర్తవ్యము.'

పద్యకావ్యమయిన 'బాపూజీ ఆత్మకథ'లో సీతారామమూర్తిగారు ప్రాచీన సంప్రదాయమును పాటించుచునే నవయుగకావ్యనిర్మాణరీతిని స్వైతము పాదుకొల్పిరి. 'అర్చన' యనుపేర కృతిపతియగు ఎర్నేని సుబ్రహ్మణ్యముముగూర్చి వ్రాసిరి. పితృవ

'కృత్యాది' మొదలగును. దీనిలో 'ఇష్టదేవతా నమస్కృతియు, గురుస్తుతియుఁ, బురాతనాద్యతన కవి పుంగవ బహూకృతియుఁ, గుకవి నిరాకృతియుం జలిపి'రి. తరువాత స్వవంశానువర్ణనము చేసిరి. కావ్యనిర్మాణమునకుఁగల పూర్వరంగమును దెలిపిరి. బాపూజీ ఆత్మకథను అందును శివరామశాస్త్రిగారు గద్యగ్రంథముగా ననువదించిన దానిని పద్యకావ్యముగా వ్రాయుటకు హేతువులను దడవిరి. చివరకు స్వకీయ కవితా సిద్ధాంతములను జెప్పిరి. ఇక ఆ తరువాత బాపూజీ రచించిన 'ప్రస్తావన'తో 'ఆత్మకథ' మొదలగును. ఇదియెల్ల పద్యకావ్యముయొక్క భౌతిక స్వరూపము.

ఇక్కడ చెప్పఁదగిన విశేషములు రెండు మూఁడు కలవు. సీతారామమూర్తిగారు కృత్యాదిని ఇష్టదేవతా నమస్కృతిని జేసితి ననిరి. ప్రాచీన సంప్రదాయమును బట్టి యది శివస్తుతియో విష్ణుస్తుతియో య్యైయుండవలయును. 'బాపూజీ ఆత్మకథ'యందలి దేవతాస్తుతి శివకేశవులకుఁగాని, వారి యిల్లాండ్రకుఁగాని, బిడ్డలకుఁగాని, యితరమయిన వేల్పుమూకకుఁగాని చెందినట్టిదిగాదు చూడుడు.

ఎవ్వనికొల్వు భద్రములకెల్ల
నిదాన, ముదారతామయుం
డెవ్వఁడు, సర్వలోకముల నేలు
మహాఃపరిపూర్ణమూర్తియై
నెవ్వఁడు వాఙ్మనః క్రియల
కేర్పడరాని మహాత్ముఁ, డాద్యుఁడై
యెవ్వఁడెసంగు, సత్యమన నెవ్వఁడు,
వాని భజింతు నిచ్చలున్.

ఈ పద్యమున జగత్స్వరూపుని స్తుతి మాత్ర మున్నది. ఏ దేవతా మూర్తులయినను ఆ యేకైక లోకనియంత యొక్క యంశలే. ఆ ప్రభువే సత్యము. సీతారామమూర్తిగా రీపద్య రచనమునుబట్టి ప్రౌఢ కవిగా గోచరించుచున్నారు. సర్గబంధమను మహాకావ్యలక్షణములను జెప్పుచు దండి 'ఆశీర్నమస్క్రియా వస్తునిర్దేశో వాపి తన్ముఖ' మ్మని యనెను. సీతారామమూర్తిగారు రచించిన కృత్యాది పద్యమున నమస్క్రియారూపమయిన కావ్యవస్తు నిర్దేశము కలదు. వస్తు నిర్దేశము చేయుట పురాతన కవిపద్ధతి. కవిగారు లోకేశ్వరుని 'సత్యమని' వర్ణించిరి. గాంధి మహాత్ముఁడును 'కాని సత్యంబ నాకు సర్వోత్కృష్ట సిద్ధాంతము - దాన నితర సిద్ధాంతము లెన్నేని యిమిడియుండు— సత్యంబన వాక్సత్యమ గాదు—మఱి భావ సత్యమును—నది యూహ కందెడి సాలంబ సత్యమకాదు—పరిపూర సత్యము - సనాతన తత్త్వము— సాక్షాత్పరబ్రహ్మ—నీశ్వరున కసంఖ్యాక నిర్వచనము లుండె—నని నన్ను భయవిస్మయంబులఁ దోఁగించు— నొక్కొక్కయెడ ముగ్ధుం బొనరించుఁ—గాని యే నతఁడు సత్యస్వరూపుఁడనియ యారాధింతు— వాని నింతదనుకఁ గననైతిఁ— గాని

శోధించుచుంటి నేని
శోధనమున నిడుతు నెల్లసుఖముల, మఱి స
మ్మోదమున నేల్తు నేత
స్సాధన యజ్ఞమున నాదు సంహననంబున్'

అని స్పష్టముగా వక్కాణించెను.

మహాత్మునకు భగవంతుఁడు సత్యస్వరూపుఁడగుటయ కాదు తుదకు సత్యమే దేవుఁడయ్యెను. ఆ సత్య సాక్షాత్కారార్థమే యాయన పడరానిపాట్లు పడెను. బ్రదుకంతయు నొక సత్యపరిశోధనాగారమగునట్లు నడుచుకొనెను. ఫలములను 'సత్య ప్రయోగచరిత' మనుపేర వెల్లడించెను. దానినే సీతారామమూర్తిగారు పద్యకావ్యముగా వ్రాయఁబోవుచు కృత్యాది పద్యమున సత్యస్వరూపుడయిన లోకేశ్వరుని స్తుతించిరి. కాన కావ్యవస్తు నిర్దేశము కృత్యాది పద్యమున కెక్కినది. అంతేకాదు 'భద్రముల కెల్ల నిదానము' 'ఉదారతామయుండు' అను విశేషణములు లోకేశ్వరునకేకాక, కావ్యనాయకుఁడయిన గాంధి మహాత్మునకును జెల్లును.

సత్యస్వరూపుఁడయిన జగదీశ్వరుని స్తుతి తరువాత భారతమాతృస్తుతి, ఆంధ్రజనని ప్రశంస కలవు. భారతమాత, ఆంధ్రమాత సీతారామమూర్తిగారి

యిష్టదేవత లనుకొనవలయును. వారి ప్రశంస లోరు వాతనే సరస్వతీస్తుతి యున్నది. ఇష్టదేవతాస్తుతిపేరఁ జాగిన రచనమంతయు నింతే. సీతారామమూర్తిగారికి భారతమాత వీరులను, త్యాగులను, దేశభక్తులను; మహామేధావులను గన్నతల్లిగా సాక్షాత్కరించినది. వారు ఆంధ్రమాతను ప్రశంసించిన తీరు బహుచమత్కార ముగా నున్నది. చదువుఁడు.

భారతంబును బల్కు పనిఁబూని తిక్కన్న
పసిఁడిగంటముకేలఁ బట్టునాఁడు
వేదభాష్యముఁ జెప్ప వేడ్క విద్యారణ్యుఁ
డోంకారమును వ్రాయుచున్ననాఁడు
దిగ్జయాపేక్ష సంధిల్ల రాయలు విజృం
భించి దుందుభి మొరయించునాఁడు
సంఘసంస్కరణ దీక్షాకంకణంబును
రెడ్డి వేమన్న ధరించునాఁడు.
వారల కొసంగినట్టి దీవనల నిచ్చి
వారలం గన్న కంట నింపారఁ గాంచి
యాదరింపఁగదమ్మ, నిన్నాశ్రయించి
యంజలి ఘటించుచున్నాఁడ నాంధ్ర జననీ!

ఈ పద్యమున వ్యంగ్యము వేయిరేకులతో విచ్చి యున్నది. తిక్కన 'ఆంధ్రావళి మోదముం బొరయు నట్లుగ' 'మహాకవిత్వ దీక్షావిధినొంది' చంపూకావ్య ముగా భారతమును దెలిఁగించెను. విద్యారణ్యులు, శ్రీకృష్ణదేవరాయలు హిందూధర్మధ్వజమును నిలిపిరి. హాసోపహాసములతో వేమన యాంధ్రసంఘమును కడిగి కడిగి కంచెలోఁ బోసెను. ఆ నలువుర కృషి యెట్టిదో తన కావ్యసృష్టియు నట్టిదేయని సీతారామమూర్తి గారు వ్యంగ్యముగా వక్కాణించిరి. వారు తన కావ్యము 'విశ్వప్రజాపాపచ్ఛేదకమ్మైనపంట' యనిరి. 'పావనకథా వాసద్వచోవైభవం బీ సత్కావ్యము' అనియు తన సృష్టిని వర్ణించిరి. 'విశ్వశ్రేయోనిదానమగు నొక్క కబ్బము విరచింపఁ గృతనిశ్చయుండనై 'తినని చెప్పి కొనిరి. అట్టి 'బాపూజీ ఆత్మకథ' యాంధ్రావళికి మోదమును గలిగించుననియు, దానిలో స్వసంస్కృతి రక్షాదీక్ష, సంఘసంస్కరణము పొదుకొనియున్నవనియు కృతికర్తయే తెలిపిరి. ఇది మఱియొక వ్యంగ్యము. ఈ వ్యంగ్యము బాపూజీ బ్రదుకునకు భాష్యము.

'గురుశుశ్రూషాదులఁ బరిలబ్ధంబైన విజ్ఞా నము నూతగాఁగొని బాల్యముందొట్టి కబ్బంబులు పెక్కులు నిర్మించియు, నంతం దనివోక వెండియు నెద్దియే నొక్కమహాకావ్యంబు రచియింప వేడ్కపడి' యున్న సీతారామమూర్తిగారికి 'గాంధిమహాత్మ చరిత' తలఁపునకు వచ్చినది. 'పుణ్యంబు విరిసె'నని కవిగారు పొంగిపోయిరి. ఎన్నో ప్రఖ్యాత కథలు చిన్నవి పెద్దవి మన పురాతన వాఙ్మయమునందంతటఁ గిక్కి ఱిసియున్నవిగదా! సమకాలికుఁడయినవాని కథను వ్రాయుటకే సీతారామమూర్తిగారు పూనుకొనిరేల? దీనికి వారే సమాధానము చెప్పిరి.

ఏ సూరినో పేరినో సుబ్బినో నిల్పి
పచ్చిసింగారంబు పల్కుకంటె
హేతువాదమ్మన కింత నిల్వఁగలేక
బూతుల బుంగలై, జాతివైర
ములకు, మతద్వేషముల కుపాధ్యాయులై
యౌదార్యమునకు దవ్వగుచు నీతి
రతుల కెంతయు రోఁత రాఁజేయునట్టి పు
రాణమ్ములన్ బూని వ్రాయుకంటెఁ
గానులకు దాసుఁడగుచు ముక్కడిని బొగడి
కల్లకైతల నల్లుటకంటె నిట్టి
గుణగరిష్ఠుల, దేశభక్తుల చరిత్ర
చెప్పుట జగద్ధితంబైన చేఁతగాదె.

నవయుగధర్మమును గుర్తించిన సీతారామ మూర్తిగారెట్టి యితివృత్తము తన కిష్టమో చెప్పిన వారైరి. అంతేకాదు—బాపూజీ స్వీయచరిత్ర యెట్టిదో మఱొకసారి వ్యంగ్యముగా వెల్లడించినవారు నైరి. ఈ యాత్మకథలో పచ్చిసింగారములేదు. ఇది హేతువాద ముతోఁ గూడినట్టిది. బూతుల బుంగగాదు. జాతి వైరమును, మతద్వేషమును నిర్మూలించు రచనము. ఔదార్యమునకు నిలయము. నీతిబద్ధము. కల్లకైతలు లేనిది. అనఁగా సత్యసంపూర్ణము. దేశభక్తుని గాథ,

ఆ దేశభక్తుఁడు గుణగరిష్ఠుఁడు. ఇట్టి యితివృత్త స్వీకారము కవి హృదయమును బట్టి చూపును. తదితర గాథలు వారికి గిట్టవని తాత్పర్యము. అతిమానుషాంశ ములులేని, వాస్తవికగాథలు స్వీకరించి, మానవసమాజ మును దిద్దితీర్చుట ప్రజాకవియయిన యుత్తమ నవీన కవి లక్షణమయినచో, సీతారామమూర్తిగారు వర్త మాన సమాజమును వదలని యుత్తమప్రజాకవియని నిస్సందేహముగాఁ జాటవచ్చును.

సీతారామమూర్తిగారు స్వకీయకవితా సిద్ధాంత ములనుగూడ 'కృత్యాది'లోఁ జెప్పికొనిరి.

పండితశ్రేణి వేలుపుబాసమీఁది
తగులమునఁజేసి తెల్గును దెగడునాఁడు
మాతృభాషను మన్నించి మనిపినట్టి
వారి కర్పింతు మ న్నమోవాకశతము

అని యనుటయే వారి తెలుఁగుబాసమీఁది వలపునకుఁ దార్కాణము.

తెలుఁగునకు స్వస్తిచెప్పిన
తెలుఁగు కవిత్వంబు వల్కఁ దియ్యము నాకున్
గలుగద; మా తిక్కన య
జ్వలు ద్రొక్కిన త్రోవకేను సమ్మతిపడెదన్

అని భాషాప్రయోగ విషయమున కవిబ్రహ్మను హృద యమున నిలుపుకొని పలికిరి. 'చిన్నయసూరి నర్చిం' చుటయు సీతారామమూర్తిగారి భాషాప్రయోగమునకు మఱొక తార్కాణము. బాలవ్యాకరణబద్ధులై తిక్కన త్రోవపట్టినవారు సీతారామమూర్తిగారు.

శివరామశాస్త్రిగారి గద్యగ్రంథమునకు నీకావ్యము పద్యరూపము. గద్యగ్రంథము సర్వజనవేద్యము కలదు గదా? ఇంక నీ పద్యకావ్యమెందులకు? దీనికిని సీతా రామమూర్తిగారే సమాధానము చెప్పిరి. పద్యమన్నచో వేడుకపడువారు కొందఱుందురు. అదియునుగాక పద్యకావ్యములు ప్రాచీనకాలమునుండియుఁ బ్రజలను దనియించుచున్నవి. పద్యము సామాన్యమా?

పద్యంబు సర్వకవితల
కాద్యంబై, గానబద్ధమై, శ్రుతిహితమై
హృద్యంబై నియతం బన
వద్యంబై లెస్స తోడుపడు ధారణకున్.

అని సీతారామమూర్తిగారనిరి. తాను రచింపఁబోవు పద్యకావ్యము శ్రుతిహితమయిన, ధారాళమైన శయ్యతో, నియమబద్ధమయిన యనవద్యమయిన భాషతోఁగూడి ధారణకు యోగ్యముగా నుండఁగలదని వారి ప్రతిజ్ఞా శయమయిన యభిప్రాయము. పద్యమునఁ బల్కుట యెంత దుస్సాధమో బుధుఁడెఱుఁగుననియు వారు పల్కిరి. 'సరసులెల్ల మెచ్చ మెఱయింతుఁ గవితలోఁ గమ్మఁదనము మతుకుఁ గమ్మన వలె'ననియుఁ జాటిరి.

మఱి యీ 'బాపూజీ ఆత్మకథ'లో విజ్ఞ లరిన కవితా కథ యెట్టిది? శివరామశాస్త్రిగారి గద్య గ్రంథమే స్వకీయ రచనమున కధికముగాఁ దోడ్పడిన దని సీతారామమూర్తిగారు చెప్పుకొనిరి. ఆ గద్య గ్రంథముతో ఈ పద్యకావ్యమును బోల్చిచూచినఁగాని యిందలి జిగ్గునిగ్గులు తేలవు. అట్లు తేల్చుటకు ముందొకమాట చెప్పవలయును. గద్యము విషయ ప్రధానము. పద్యము రసప్రధానము. కావ్యములో రసము బహువిధములుగా పోషితమగును. వర్ణనము, సంభాష ణము, లోకోత్తరభావన, మనస్తత్త్వ నిరూపణము మున్నగుననన్నియు కథాకావ్యములో రసపోషణమునకు సహకారులగును. ఈ సహకారులను 'బాపూజీ ఆత్మ కథ'లో వెదకినచో ప్రయాసమే ఫలము. ఈ పద్య కావ్యమును రచించుటలో వాస్తవికదృష్టిని వలచిన కవికి స్వాతంత్ర్యము లేదు. అందుకు ఇది 'సత్యప్రయోగ చరితము.' సత్యమిందు ముఖ్యము. కవితా కళయంతయు ఆ సత్యమును బరిరక్షించి యుండవలసినదే. సత్య మును విడిచి కవితా కళపేర సాముసేసినచో అది కావ్యా ర్థమునకే ముప్పుతెచ్చును. కావున చదువరియైనవాఁడు ప్రత్యేకమయిన చూపుతో 'బాపూజీ ఆత్మకథ'ను బఠింపవలసియున్నది.

'బాపూజీ ఆత్మకథ'యందు సంగ్రహగుణము మెండు. గాంధిమహాత్ముని రచనమే యల్పాక్షరముల ననల్పార్థము కలది. సీతారామమూర్తిగారా లక్షణ మున కెక్కడను గొఱఁత రానీయరైరి. తెనుఁగుఁ

దనము పింపిళ్ళగూసిన యీ చంపూకావ్యములో ధారాళమయిన శయ్యా యల్పాక్షర రచనారీతికి వన్నె వెట్టినది. ముఖ్యార్థమునకు ముప్పగలుగనిరీతిగా, నుత్ప్రేక్షాతిశయోక్త్యాదులను వదలి, తనదగు కవితా కళానైపుణ్యమును సీతారామమూర్తిగారు వెల్లడించిరి. వర్ణనములందేమి, పాత్రల సంభాషణములయందేమి కవిగారు వాస్తవికదృష్టిని, కావ్యతాత్పర్యమును ద్రోసిరాజనక విచిత్రమయిన కవితాపద్ధతిని ప్రదర్శించిరి. అయీలక్షణములచేత 'బాపూజీ ఆత్మకథ' భావకళా ప్రధానమయిన వీరకావ్యమై యాంధ్రమహాభారతము ననుసరించినట్లున్నది. రీతిసంప్రదాయము గాని, వక్రోక్తిసంప్రదాయముగాని దదితర రచనా కళా సంప్రదాయములుగాని యీ పద్యకావ్యమునఁ గొనరావు.

వర్ణ్యవస్తువును గన్నులకుఁ గట్టునట్లు వర్ణించుట యుత్తమకవితాపద్ధతిగదా! ఆ పద్ధతి 'బాపూజీ ఆత్మకథ'లో నున్నది. దుస్సాంగత్యఫలమును బాపూజీ పిన్ననాఁడే యనుభవించెను. ఒకనాఁడు సావాసగాఁడు గాంధిని వేశ్యావాసమునకుఁ జేర్చెను. ఆ సందర్భము శివరామశాస్త్రిగారి యనువాదమున నిట్లు గలదు: ''అతని సంగడము నన్ను వ్యభిచారమునఁగూడ దింపి యుండునుగాని వెంట్రుకవాసిలో తప్పిపోయెను. ఒక నాఁడు అతఁడు నన్ను భోగముదానియింటికి తీసికొని పోయెను. చెప్పవలసినవిచెప్పి అతఁడు నన్ను లోనికి పంపెను. చేయవలసినదంతయు లోఁగడనే ఏర్పాటు చేసెను. రొక్కము లోఁగడనే ఇచ్చివేసెను. నేను పాపపుకోఱలలో పడితిని. కాని భగవంతుఁడు అనంత కృపతో నా ప్రయత్నమును ప్రతిఘటించి నన్ను కాపాడెను. ఈ పాపగుహలో నాకు కనులు కనఁబడ లేదు. నోట మాటరాలేదు. నేను పఱుపుమీఁద ఆమె ప్రక్కను కూర్చుంటినిగాని నా నోరు బిగిసిపోయెను. ఆమె ఎంతోసేపు ఓపికపట్టలేక తిట్టుచు తిమ్ముచు ద్వారము చూపెను. దానితో నా మగతనమునకు కళంకము కలిగినటులు సిగ్గుపడి 'భూమి తనలోనికి దారి యీరాదా?' యనుకొంటిని. అయితే నా కీ యాపద తొలఁగించినందులకు పరమేశ్వరునకు మ్రొక్కుచునే యుంటిని.''

విషయ ప్రధానమయిన యీ ఘట్టము సీతారామమూర్తి చేతిలో నే రూపము ధరించినదో చూడుఁడు.

దైవవశతఁజేసి యావంతలోపలఁ
దొలఁగెఁగాని, వాని చెలిమి నన్నుఁ
ద్రోసియుండు నకట దుర్వ్యభిచార కూ
పంబునందుఁ బాపభవనమందు.

అతఁడొకనాఁడు నన్ను
వెలయాలిగృహమ్మును జేర్చి,
యెల్లపద్ధతులను మప్పి,
లోపలికిఁ దాఁబనిచెన్;
దురితోగ్రదేవతాశితతరదంష్ట్రికల్ నడుమఁ
జిక్కితిఁగాని
మదీయదుష్కృతి ప్రతిఘటనం బొనర్చి
భగవానుఁడు నన్ మనిపెన్ గృపామతిన్.

ఆ పాపకందరమం దేమి సెప్పుదుఁ
గన్నులఁ జీఁకటుల్ గ్రమ్ముకొనియె
మందునకే నొక్కమాట వెల్వడదయ్యెఁ
జెమరుచే నొడలెల్లఁ జెమ్మగిల్లెఁ
గంపమ్ము హెచ్చె, నగ్గలమయ్యె గగ్గోలు,
సెజ్జపై బోగపుంజెలువకెలన
నధివసించితిఁగాని యంకిళ్లు బిగువయ్యె
నా కొమ్మ తడ వోర్వలేక తిట్టి
నెట్టి వాకిలి సూపె; నప్పట్టునందు
వచ్చె నా పుంస్త్వమున కయో మచ్చ యనుచు
సిగ్గువడి తల్లి! వసుమతీ! శీఘ్రముగను
దారి నొసఁగుము నాకంచుఁ దల్ల

అటులయ్యును న స్నీయు
త్కటు దుర్దశనుండి తొలఁచి కాచిన ఘటనా
ఘటనా విశారదునకున్
బటు భక్తిన్ మ్రొక్కుచుంటిఁ బరమేశునకున్.

"But I was saved by the skin of my teeth'' అని మహాదేవదేశాయిగారి యాంగ్లానువాదము. 'వెంట్రుకవాసిలో' అని శివరామశాస్త్రిగారి

తెలిఁగింపు. 'ఆవంతలోపల' అని సీతారామమూర్తి గారి బిగింపు. గద్యమున కేవలము 'వ్యభిచారమున'నని మాత్రమే యున్నది. పద్యములలో 'దుర్వ్యభిచార కూపమందుఁ బాపభవనమందు' అని పెంపు. బోగము దానికడనున్న గాంధి బొమ్మ పద్యములోఁ గన్నులకుఁ గట్టుచున్నది. 'ఘటనాఘటనావిశారదునకున్' అని పరమేశ్వరునకు మూలమునలేని విశేషణము. ఇది బాపూ భగద్విశ్వాసమునకుఁ బ్రతిబింబము. గద్యమునలేని యిట్టి మెఱుఁగులు పద్యానువాదమున ననేక స్థలము లలోఁ గలవు.

గాంధి యింగ్లండులో విద్యార్థిగా నున్నపుడు పోర్ట్సుమత్తులో శాకాహార సభ జరిగెను. దానికి గాంధికూడ వెళ్లెను. ఆయనతోపాటు నేస్తకాఁడొకఁడు చనెను. పోర్ట్సుమత్తులో వెలయాండ్రు పెక్కురు గలరు. గాంధి, యాయన మిత్రుఁడు నొకయింట విడిది చేసిరి. బసచేసిన వారితో పేకాటయాడుట యిల్లాండ్ర యాచారము. పేకాట మొదలయినది. ముచ్చటలు ముదిరినవి. పచ్చిసింగారము పెచ్చుపెరిగి నది. పేకముక్కల నవలఁబెట్టు నవస్థయు సిద్ధమయి నది. ఇంతలో గాంధిమిత్రుఁడు భగవత్ప్రబోధమునఁ గాబోలు తనని హెచ్చరించెను. ఆ హెచ్చరికను జదువుఁడు.

బళిరె! యీ ఘోరకలికి నీపాపమునకు
నకట! నీవును బానిస వగుదువోటు
వలదు వలదిందు నీ వుండ వలదు వలదు
లెమ్మ లేలెమ్మ పొమ్మ పోపొమ్మ వెలికి
అనవుడు లజ్జాంబుధిలో
మునిఁగితి, నప్పనువు మస్తమునఁ దాల్చితి, నా
తని మది మెచ్చితిఁ, బదపడి
జననికడన్ నొడువుబాస జ్ఞప్తి కి వచ్చెన్.

పదంపడి

ఊడనిఁ బాడితి, గడగడ
లాడితి, నా నిల్చుసజ్జ కరిగితి, మృగయా
పీడకుఁ దప్పిన హరిణము
జాడన్ నా గుండె లదరె, జడిగొనెఁ జెమటల్

నాఁటిరేయి నిదుర నను డాయదాయె, నా
యాత్మఁ బెక్కుచింత లలముకొనియె,
నిదియె నాకు లాఁతియింతులపట్ల వి
కారమొదవ మొదటిసారియాయె.

అంత నెంతచెట్టయయ్యె దైవంబ! యి
ప్డేమరిల్లియున్న నెట్లగునొ
యని తలంచి యింకనైనఁ బరాకును
దలఁగవలయునంచుఁ దలఁచినాఁడ

అవల నిది నాసయోగ్యమైనట్టి తావు
కాదు కాదనియెంచి సంగాతిఁ దొఱఁగి
నాఁటి మఱునాఁత లేచి పైనంబుగట్టి
వీడనాడినవాఁడ నప్పొడువీడు.

భావవేగమువెంట పరువెత్తిన భాషాప్రయోగము నకు నుదాహరణమయిన కూర్పిపద్యములలోఁ గలదు. గాంధిని హెచ్చరించు నారాటము తద్వాక్యములలో స్పష్టముగాఁ గలదు. గాంధి పొందిన సంతాపము, పోర్ట్సుమత్తుపై నాయనకుఁ గలిగిన యేవగింపు, దానిని వదలివెళ్లవలయునను తొందఱపాటు సర్వమును బాతకుఁడు చూచుచున్నట్లే యిందు వర్ణింపఁబడినవి. నీని సొగసునకు శబ్దాలంకారము తోడయినది. గాంధి మఱునాతనే లేచి పోర్ట్సుమత్తును వీడెనని సీతారామ మూర్తిగారు వ్రాసిన, మహాదేవదేశాయి యాంగ్లాను వాదములో ".........I remember I left portsmouth the next evening, my companion staying there sometime longer" అని యున్నది. శివరామశాస్త్రిగారును 'ఆ మఱునాటి సాయంకాలమే' యని తెలిఁగించిరి. తానెప్పుడు బయలుదేరినది గాంధి మహాత్మునకే గుర్తులేదు. ఎంతో వేదన పొందిన గాంధి మఱునాఁటి సాయంకాలముదాఁక నచ్చట నుండుట కావ్యన్యాయమునకేకాక లోకవృత్తమునకు విరుద్ధము. సీతారామమూర్తిగారు 'మఱునాత'యని మార్పుచేసిరి. ఈ మార్పు వెళ్లిపోవలయునను గాంధి యారాటమును బహుధా సూచించుచున్నది.

గాంధి మొదటిరోజులలో నందఱవంటివాఁడే. పెండ్లియయిన మొదటిరోజులలో ఆయనకు కస్తూరి

బాయి శీలమునుగూర్చి శంకలు కలిగినవి. 'నే నేకపత్నీ వ్రతస్థుఁడనయిన, కస్తూరిబాయి పాతివ్రత్య మవధరింపవలదా?'యను నూహ మట్టె పెరిగి శంకలకు నిలయమయినది. ఇంకేమున్నది? గాంధి కట్టుపెత్తనము సేయ మొదలిడెను. ఆయన యిల్లాలిని శాసించిన విధానము గనుఁడు.

నాకన్నంతయు నచ్చెలి
పోకడపై నుండునెల్లపుడు; సందేహ
వ్యాకులిత చిత్తులకు నే
లా కావలెఁ గార్యకారణాన్వయ మిస్సీ!

ఇరుగిండ్లకుఁ బొరుగిండ్లకు
నరుగందగ దస్మదాజ్ఞ నందక నీ, వం
చర లేకయ శాసించితి
గరిత; నిదియ మూలమయ్యెఁ గలహంబునకున్

ఇది యొకబందియై వెలసె నింతికి;
నిట్టి కడింది కర్జముల్
ముదిత సహింపదయ్యె;
దన ముచ్చట హెచ్చినచోటికేగ
నా ముదలఁ దొలంగె;
నట్లగుట ముమ్మరమయ్యె మదీయకోప,
మా సుదతి స్వతంత్రతాగరిమ
సుస్థిరమయ్యె; నిఁకేమి చెప్పుదున్

అనుమానములు కలుగరాదు. కలిగినవెంటనే లోకానుభవము చాలనివాఁడు ముందు వెనుక లాలోచింపక శరవేగముతోఁ దాను జేయఁదలఁచుకొన్నది చేసి తీఱును. ఫలము సైత మా వేగముతోనే ప్రాప్తించును. గాంధి కుఱ్ఱవాఁడు. అతనిలో ననుమానములు పుట్టుట, పుట్టినవెంటనే కస్తూరిబాయిని శాసించుట, యామె బిఱ్ఱబిగిసిపోయి యెడ్డెమన్న తెడ్డెమనుట వేగముగా జరిగిన లీలలు. ఈ లీలావిలాసమును జిన్నచిన్న వాక్యముల కూర్పుగల చంపకమాలావృత్తము సూచించుచున్నది. ఇది యొక రకమయిన కవితాశిల్పము. మొదటి పద్యమున నర్థాంతరన్యాసాలంకారము కలదు. మూలమున నిది లేదు. శివరామశాస్త్రిగారి తెలిఁగింపులో 'కాని అనుమానమునకు కారణములతో ఏమిపని?' యని మాత్రమే యున్నది.

శివరామశాస్త్రిగారి గద్యమునకు, సీతారామమూర్తిగారి పద్యమునకుఁ గలవాసి చూపుటకు, పద్యకవి ప్రకరణోచితముగా నెట్టికూర్పు చేసెనో తార్కాణించుటకు నొక చిన్నఘట్టము చాలును. పెండ్లి యయిన క్రొత్తలో గాంధి కాముకుఁడు. గద్యగ్రంథమున ఆ ఘట్ట మిట్లున్నది.

'నేను మిగుల భార్యాసక్తుఁడను. పాఠశాలయందును అదే తలపోఁత. ఎపుడు చీఁకటిపడునా, ఎపుడుపోయి వ్రాలుదునా అనియే బెంగ. ఎడఁబాటు దుస్సహమయ్యెడిది. కల్లబొల్లి మాటలతో నడిరేయి వఱకు నిదురఁబోనిచ్చువాఁడఁగాను.'

దీనికి సీతారామమూర్తిగారు వ్రాసిన పద్యమును జూడుఁడు.

భార్యానురాగం బపారమై నెలకొంట
బడినైన నాకదే గొడవరేఁగి
దినకరుం డపరాంబుధిని గ్రుంగు టెప్పుడో
కానంతచీకటి గ్రమ్ము టెపుడొ
యడరి లేజవరాలికడ వ్రాలు టెప్పుడో
మించుఁ బోడిని గుస్తరించు టెపుడొ
చెలువ చిన్నారిచూపులఁ గాంచు టెప్పుడో
జిలిబిలి సరసముల్ చిమ్ము టెపుడొ
అని నలంగితి, దుర్భర మా వియోగ,
మవసరం బున్న లేకున్న నవియు నివియుఁ
గల్లబొల్లులు వల్కి వాల్గంటి కేను
జెప్పవడనీయ నద్దమరేయివఱకు.

గాంధి చేయఁదలఁచిన చేష్ట లొకక్రమమున నున్నవి పద్యములో.

'బాపూజీ ఆత్మకథ' యందలి రీతి ప్రసన్నము. సాధుసుందరము. పద్యముల నడక యెక్కడను గుంటువడదు. అన్వయక్లిష్టత యెందును గానరాదు. ఏ చిన్న విషయమును జెప్పినను రీతి గజగమనముతోఁ గొనసాగి

పోవుచుండును. సీతారామమూర్తిగారి పద్యరీతి కొక యుదాహరణ మిచ్చినఁ జాలును. పోలక్ పెండ్లి బాజా బాజాలు లేకుండ జరిగినది. కానుగూడ కర్చు గాలేదు. అప్పుడు కవిగారు వ్రాసిన పద్యమిది.

వాద్యములు లేవు, క్రొత్తవల్వలును లేవు
రవణములు లేవు, మంత్రతంత్రములు లేవు
పందిళులు లేవు, విందుల పసలు లేవు
నడిచె దుగ్గానియును వెచ్చపడక పెండ్లి.

వక్తృహృదయమునుబట్టి రీతి మాఱుట కవితా కళలో నొక ముఖ్యాంగము. తిక్కనవలె నీ గుట్టు నెఱిఁగిన కవు లెందఱో లేరు. తిక్కన బాటపట్టిన సీతారామమూర్తిగా రా ధర్మమును బాటించి ప్రసన్న రీతితోఁ బద్యములు వ్రాసిరి. గాంధి సీమకేగ నిశ్చ యించి బొంబాయి చేరెను. ఆనాఁడు ఖండాంతర ప్రయాణము నిషిద్ధము. గాంధికులము వారొక సభ చేసి యాయనను బిలిపించిరి. 'కులపెద్ద' యగువాఁ డొకఁడు 'సీమకేగుట మానుము. అది కాని పని. సీమలో కులాచారములు నడపుట దుస్సాధము. అట దుర్భోజనములు చేయుట తప్పదు' అని గాంధికి హితబోధ చేసెను. ఆయన యిట్లు సమాధానము చెప్పెను:

అనవుడు సీమకేగుట రవంతయు
దూష్యము గాదు, విద్దియన్
బనివడి యభ్యసించుటక
పైనముఁ గట్టితి, నేను మాంసమున్
దిననని కల్లుద్రావనని
దీక్షమెయిన్ సమయం బొనర్చితిన్
జనని సమక్షమం; దదియ
సాఁకు నను బరభూమి నెంతయున్

అని నేఁబల్కిన సెట్టి యిట్లు లనెఁ;
గుట్టా! సీమకుం జేరినం
తన నీ దీక్షలు నీ ప్రమాణములు
నీ ధర్మంబులున్ జాఱు; నా
కును నీ తండ్రికి నున్న తియ్యమది
నీకుం దెల్లమే; కానఁ గై
కొనుమా మద్వచనంబు, మేలుకొనువా,
కొంచెమ్ము తర్కింపుమా

ఇది 'బాపూజీ ఆత్మకథ' పరామర్శ. సీతారామ మూర్తిగారు గాంధిమహాత్ముని లోవెలుఁగును దెలుఁగు పలుకుబడిలోఁ జూపి, దానిని రసస్థితికిఁ గొనిపోయిరి. గాంధేయ ధర్మముపట్ల మక్కువలేని కవికి నిట్టి సృష్టి సాధ్యముగాదు. తిక్కన 'సాత్యవతేయ సంస్మృతి శ్రీ విభవాస్పదంబయిన చిత్తములోడ' భారతాంధ్రీకర ణమునకుఁ బూనుకొనెను. సీతారామమూర్తిగారు గాంధేయపథమునఁ బ్రయాణము చేయుచు బ్రదుకును దిద్దుకొనుచున్నారు. గాంధికి ఋణపడితినని వా రనుకొని యీ కవితాసృష్టి కుద్యమించిరి. వారి పల్కు లను వినుఁడు. ఈ పల్కులు 1951 సం॥ నాఁటివి.

ముప్పదియేండ్లనుండి తృణమో
కణమో తినుచున్నవాఁడ నో
యప్ప! భవద్వచోవిభవ;
మన్యుఁ డెఱుంగకపోవుఁగాక, యీ
యప్పు భరింపరానిబరువై
నిను నచ్చుపుఁ దెలు బాస నీ
చొప్పున దీర్చుకొందు;
ఋణశుద్ధి కిదే సరిపుచ్చుకొందువా?

గాంధి విశ్వరూపమును దెనుఁగునకు దింపిన యేకైక నవీనాంధ్రకవి తుమ్మల సీతారామమూర్తి గారు. కావుననే వారు 'గాంధికవిని నేను' అని నిశ్శంకనుగా ఱొమ్ము విఱుచుకొని చెప్పఁగలిగిరి. అది నిజముగూడ.

# అమృత లిప్తలు

శ్రీ మాదిరాజు రంగారావు

నాపైనుండి దూకిన రాత్రి
నిలచింది ఆవలిగట్టున
వాలిపోయింది చంద్రబింబం
ఎదురుగా సవితృరూపం.

నిశ్శబ్దంగా నిర్వ్యాపారంగా
ఉన్నట్లు కన్పిస్తుం దీ క్షణం !
నేను నడుస్తున్నా
ఉదయ శిఖరమ్మైె.

ఎరుపునుండి తెలుపులోకి
మారుతోంది ఉదయ సంధ్య.
కన్పిస్తూ వికస్వర రేఖలు
విన్పిస్తూ ఆనందలహరులు.

ముంగిట తారాడుతోంది గాలి
లోలోన ఆలాపిస్తూ రాగం.
ఎదురుగా నిలచిన వెలుగు
లోలోన పొంగుతోంది అనురాగం.

దిక్కుల్లో వెలుగువలె
నరాల్లో నెత్తురు.
నదిలో ఆర్ద్రితవలె
ఊహలో అనుభూతి.
సూర్యుని తేజం వలె

చింతనలో ఔజ్వల్యం !
నేను—నేను కరగుతున్నా
మండి—కర్పూరంవలె.

ఎవరికీ తెలీకుండా
ఎపుడో విరిసింది గగనపద్మం
వేల రేకులతో
పూర్ణ బింబమై.

కన్పిస్తూనే ఉన్నాడు సాలీడు
తిరుగుతూ కొమ్మనుండి కొమ్మకు
ఎంతో శ్రమతో అల్లుతూ
వెండి దారాలగూడు.

ఒక్క గాలితెర వీచి
ఒక్కమంచు పొర సోకి
ఏ దార మెక్కడ తెగేనో ?
ఈ సాలీ డెక్కడ దాగేనో ?

కనులు ముకుళిస్తే
రాత్రి కన్న కలలే
పొందేనా సాక్షాత్కృతి ?
కాంతివర్ణ చిత్రింతో.

ఈ సృష్టి చిత్రం
భ్రమోదిత స్వప్నమా ?
కాదు, కాదు ఇప్పటికి
పరమ యథార్థ రూపం.

నా చూపు ప్రసరిస్తోంది
పొదిగికొని వర్ణాలెన్నో
ప్రయాణిస్తున్నాను నేను
కాంతి మనోభూమికలో.

## అ వ్య క్త చి త్రా లు

నా కళ్ళు వదలాయి కలలు.
నా చూపు చిమ్ముతోంది వెలుగు.
నా చిత్తం సరిస్తోంది చైతన్యం.
నా హృది స్పందిస్తోంది సంగీతం.

ఇక్కడినుండి చూస్తే
చూపు మేరలో
నే చూడవలసిన వస్తు
ప్రతిబింబ రూపం.
ప్రతిబింబంలో నేను,
అన్నివర్ణాలూ ఎక్కడివక్కడ విడి
మిగిలింది ఒకే వర్ణం 'తెలుపు'.
చిత్రమ్మో సంగీతమ్మో కవితయ్యో



# అంతర్నాటిక - భవభూతి ప్రతిభ

"కుమార భారతి"

త్తర రామచరిత్ర మొదటి యాఅంకముల కథ యొకయెత్తు, సప్తమాంక నిర్మాణ మొక్కటే యొకయెత్తు. ఇందే యంతర్నాటిక విషయమున్నది. తన్నిర్మాణగత మహాకవి ప్రతిభ ప్రస్తుతాంశము.

దీనిలో నాల్గంశములున్నవి.

1. గర్భాంక స్వరూపము — పూర్వచరిత్ర. 2. ఉ. రా. చరిత్ర గర్భాంకస్వరూపము. 3. ప్రధాన నాటకముతోడి తత్సమన్వయము. 4: కుందమాల చివరి యంకమునకు దీనికినికల భేదసాదృశ్యములు.

అంతర్నాటకమునకు గర్భాంకము, గర్భనాటిక యని నామాంతరములు. గర్భాంకమనగా 'నంకోదర మందుండు'న దన్న నిర్వచనము విశ్వనాథకవిరాజుది. ఇది నాందీప్రస్తావనలతోకూడి బీజఫలసమన్వితమై యుండు నని పై యాలంకారికుడు బాలరామాయణమందలి సీతా స్వయంవరము నుదాహరించెను.

భాస కాళిదాసులం దీ గర్భాంకప్రస్తావన కన్పింపదు. కాని మాళవికాగ్నిమిత్ర మందలి మాళవికా నాట్యఘట్టము — విక్రమోర్వశీయమునందలి లక్ష్మీ స్వయంవరము కొంతవరకు గర్భాంకచ్ఛాయలు కల్గియున్నవి.

మాళవిక నాట్యము చేయుచుండగా నామెను గురించి, యామె నాట్యమును గురించి విదూషకునితో రాజు ముచ్చటించును. ఇది పరస్పర రతిభావ వృద్ధిహేతువైన ఘట్టము. రంగమం దన్యరంగ నిర్మాణము—అంతరరంగనాట్యమును ప్రధాన నాటకరంగ మందలి వ్యక్తులు ప్రేక్షకులై యాంతర రంగ నాట్య విమర్శన చేయుట గర్భాంక లక్షణము. మాళవిక నాట్యము—అంతరరంగము—ప్రధానరంగపాత్రలు రాజు విదూషకాదులు ప్రేక్షకులు. రెంటికి ప్రేక్షకులమైన మనము. ఇదే గర్భాంక ప్రధాన స్వరూపము. కావున గర్భాంకబీజమిదే యనవచ్చు. లక్ష్మీ స్వయంవర ప్రదర్శనమున ఊర్వశి లక్ష్మీ పాత్రధారిణి. పురుషోత్తమా యనుటకు పురూరవాయని, భరతశప్తయై భూలోకవాసినియై పురూరవునితో నివసించును. ఇది నాయికా నాయక సమన్వయరూపమైన శృంగారరసనిష్పత్తికి హేతువగుచున్నది. కాని యీ స్వయంవరము రంగ ప్రదర్శితముకాక సూచింపబడినది. గర్భాంక బీజావస్థయిది.

శ్రీ హర్షుని ప్రియదర్శికలో నీ గర్భాంక పల్లవ దశ కన్పించును. ఉదయనుడు ప్రియదర్శికా సమాగమోపాయము నన్వేషించుచుండును. ఇంతలో నంతఃపురమున వాసవదత్త—ఉదయనుల పూర్వప్రణయోదంతము నాటకముగా ప్రదర్శింపబడునని తెలియగా నుదయనుడు విదూషకుని సాయమున తానే యంతర్నాటికోదయనుడై ప్రియదర్శిక—(వాసవదత్త పాత్రధారిణి)ప్రక్క నటించును. ప్రేక్షకులు వాసవదత్త, అంతర్నాటికా రచయిత్రి.

ఇందలి శృంగారము ప్రధాన నాటక శృంగారమును పోషించుచున్నది. ఇదొక చక్కని కల్పన. (This act is beyond a shadow of doubt high-wright of this play, where our play wright exhibits his shrewd craftsman-ship. The risky intrigue calculated to effect a union between the two lovers and the play with.in the play are the manifestation of his dramatic skill of which he is proud'— Sri Harsha's plays—P. 40.)

కాని యిందు ప్రస్తావనాదులు లేవు. ఇందుచే నిది పల్లవావస్థ యనవచ్చు. ఇదే భవభూతి కల్పన కాధారము.

ఇతని తర్వాతివాడగు రవివర్మభూపాలుడు తన ప్రద్యుమ్నాభ్యుదయ నాటకమున చక్కని యంతర్నాటికను నిర్మించెను. అదే రంభాభిసరణము. ఇదియు ప్రధానేతివృత్తమునకు దోహదముచేయుచు శృంగార ప్రాధాన్యమును పోషించుచున్నది.

ఇట్లంతర్నాటిక ప్రధాన నాటకమందలి యంగిరసపోషకమై కన్పించుచున్నది.

భవభూతికల్పన కుందమాలకు పైన వెలసినది. కుందమాలకు ఉ. రా. చరిత్రకు చాల సాదృశ్యము లున్నవి. అందలి చివరి యంకమే యిందలి సప్తమాంకము. అందు సీత తన పాతివ్రత్యమును నిరూపించుకొనుటకై ప్రతిజ్ఞచేసి భూదేవిని ప్రార్థింపగా నామె సాక్షాత్కరించి యామె పారిశుద్ధ్యమును లోకమునకు చాటి చెప్పను. వాల్మీకి సీతను రాముని కప్పగించును. ఇందు వాల్మీకి రామునకు సీత నప్పగించుటలో కొంత మొఱటుదనమున్నది. అది యట చూడవచ్చు. దానిని పరిహరించుటకై భవభూతి విచిత్ర కల్పన గావించెను. అదే యీ యంతర్నాటిక.

ప్రధాన రసదృష్టితో కవి కొన్ని యయథార్థములైన కల్పనలు చేయును. అవి కేవల మాలంకారిక దృష్టితో చూడదగినవేకాని సత్యమా– యసత్యమా యన్న దృష్టితో చూడరాదు. రసస్ఫూర్తికై కవి చేయు కల్పనలో వాస్తవికదృష్టికాని—లోకానుకారియైన కథాదృష్టికాని పనికిరాదు. ఇందుచే భవభూతి యంతర్నాటకమును రసదృష్టితో చూడవలయునేకాని యది సమూలకమా, యమూలకమాయన్న వివేచన వ్యర్థము. ఇందుకే యంతర్నాటికాప్రారంభ మందే రామునిచే 'ఈ కావ్యార్థము సత్యమా, యసత్యమాయని శంకింపదగినదికాదు'అని కవి యన్పించుట జరిగెను. అంతర్నాటికాంతమున మఱల రాముడే యన్నాడు 'ఇదంతయుఁ ప్రత్యక్షముగా ననుభవించుచున్నను నాకు నమ్మకము కలుగకున్నది'యని. ఈ రెండు మాటల నడుమ అంతర్నాటిక యున్నది. ఆ మాటలును నాయకునివి. కావున నవి సార్థకములు.

ఈ యంతర్నాటకము రెండు రంగాలుగా విభజింపబడెను. దీనికి కర్త భగవంతుడైన వాల్మీకి. నాటకము నభినయించు వా రప్సరసలు. ప్రేక్షకులు పౌరజానపదులు, రామలక్ష్మణులు, సకలదేవతలును. ప్రదర్శన స్థలము పావన గంగాతీరము.

ఆసన్న ప్రసవయైన జానకి గంగలో బడును. గంగా వసుంధరలామెను కాపాడి కవలలను రక్షింతురు. జృంభకాస్త్రములు వారి నాశ్రయించును. సీత తనలో తన్ను లీనము గావించుకొమ్మని తల్లిని ప్రార్థింప నామె పిల్లలకు బాల్యము తీరువందాక నిలువుమనుట; సీత యంగీకరించుట, ఇది ప్రథమరంగము. ఈ కథ ప్రథమ—ద్వితీయాంకములకు నడుమ జరిగినది. ఇది ప్రధాన నాటకములో రంగ ప్రదర్శితము కాలేదు. అట సూచింపబడి యిచట ప్రదర్శింపబడినది. కథా కల్పనలో—ఇతివృత్త విభాగమున నిదొక మహా విషయము. ఈ ప్రథమరంగమం దప్సరసలు నటించిరి. గంగా వసుంధరా సీతాది పాత్రలు వారే ధరించిరను కొనవలెను—సూత్రధారుడు చెప్పిన మాటలనుబట్టి.

ద్వితీయ రంగ మద్వితీయ కల్పన. అది 12 ఏండ్ల తర్వాతి కథ. ఇదే నాటకాంతము. ప్రథమ రంగము ప్రధాన నాటకమున కలిసిపోవుట యిందున్నది.

ఘూర్ణితజాహ్నవీపాథస్సులనుండి గంగా వసుంధరలు సీతను పైకితెచ్చి యరుంధతి కప్పగించుటతో నిది మొదలు. సీతాదేవి లోకాంతరమునందున్న సంగతి తెలిసి మూర్ఛిల్లిన రాముని యరుంధతి యానతి చొప్పున సీత స్పృశించి ప్రబోధితుని చేయును. అరుంధతి సీతను రాముని కప్పగించును. అప్పగించుచు 'ఈమెను మీరు పట్టపు. రాణిగా పరిగ్రహింపదగు'నని పౌరజానపదులను ప్రశ్నింపగా వారంగీకరింతురు. సీతారామ కుశలవ సమాగమమున నాటకము ముగి

యును. ద్వితీయరంగమందలి సీత సత్యసీత, అప్సరస కాదు.

ఈ నిర్మాణమందలి ప్రతిభ యేమి?

ప్రథమరంగమందలి వృత్తాంతము ద్వితీయాంక ప్రారంభమందలి మిశ్ర విష్కంభమున సూచితమైనది. దీనికిచట స్పష్టత యేర్పడినది మఱియు సీత లోకాంతరగతయైనదని పౌరజానపదులకు తెలుపబడినది. సీతా పాతివ్రత్యమును గంగా వసుంధరలంతవారు స్తుతించిరి. కాగా దేవి సచ్ఛీలమయోధ్యా పురవాసు లెఱిగి కొన్నారు. సీతను పరిత్యజించుటలో రాముని దోషము లేదనియు నది 'పరిపక్వ పూర్వకర్మానుభూతి'యనియు గంగచెప్పినది. ఈ దృశ్యమును చూచిన యయోధ్యావాసుల మనస్సులందు 'సీతారామ పునస్సంయోగము కలిగిన బాగుండు'నన్న భావమంకురించును. ప్రథమరంగ ఫలితము—ప్రయోజనమిది. దీనినే కుందమాలా కర్త నాటకాంతమున—

భూదేవి—వైదేహి పతివ్రతయేకదా—
పౌరులు—(అంజలించి)
సహజ పరిశుద్ధ శీలయౌ సతి, జనాప
వాదజీమూత పిహితయై వాడువారి
శరదృతు విధూత వారిద చంద్రు పగిది
దేవి! నీ దయ వైదేహి తేజరిల్లె!

ఆలు మగలు తిరిగి యేకమగుట యేమి విడ్డూరము—అని వ్రాసెను. (అనువాదము నాది)

ఈ భావము గవ్యమానమగునటు ప్రథమ రంగ నిర్మాణము చేయుటచే భవభూతి కల్పన కుందమాల కుపరి యనుట.

ఈ భావముతో ప్రథమరంగము ముగిసినది. అందే సీత లోకాంతరగతయైనట్లు చెప్పబడెను. ఆ భావము కల్గినవారి కిట్లు నాటకము ముగియుటతో వారి హృదయములు బ్రద్దలుకావో? ఇదేమి ముగింపు! అట్టి పుణ్యదంపతు లేమి? ఇట్టి ముగింపేమి? ఇది ప్రేక్షకుని భావన. ఇందుకే ప్రథమ రంగాంతమున లక్ష్మణు డన్నాడు వాల్మీకి నుద్దేశించి—ఏష కిల తే కావ్య పరమార్థః—అని. 'ఇదేనా నీ కావ్యపరమార్థము.' ఈ ప్రశ్న యెవరిది ? రామాయణ కథాశ్రోతది. లోకానిది. యుగయుగాలలోవచ్చు మనుష్యజాతిది. లక్ష్మణునినోట నన్పించినాడు మహాకవి. ఐనచో భవభూతికి రామాయణపు ముగింపు నచ్చలేదా? మఱి ద్వితీయాంకమున రామాయణము నంతగా స్తుతించెనే? (ఆత్రేయి వాల్మీకి రామాయణమువ్రాసె ననగా విన్న వనదేవత 'మండితస్సంసారః' యన్నది. లోకము ధన్యమైనదట!) మఱి యిచట ముగింపు నాక్షేపించుచున్నాడు. సమన్వయ మేమి ?

వాల్మీకి మహర్షిచే చిరకాలము లోకాంతరమున నుంచబడిన సీత భవభూతి ప్రజ్ఞానమున నత్యద్భుతముగా పైకి గొనిరాబడినది. ఈ ముగింపు భవభూతిది. (పాద్మ, కుందమాలాదులం దున్నను నిచటి కల్పన వేఱు). అతని ప్రతిభ గంగా స్రోతస్విని. అది ఘూర్ణిల్లినది. ఆ యత్యద్భుత ప్రతిభాధునీ కల్లోలము నుండి పునరావిర్భూత సీత. ఇదే విషయ మీ పద్యము చెప్పుచున్నది.

కలఁగుచునుండెఁ గవ్వమున
  గట్టిగఁ ద్రిప్పినయట్లు జాహ్నవీ
సలిలము, దేవతల్, మునులు
  సంతస మొప్పఁగఁ జూచుచుండ, న
జ్జలముననుండి లేచి యల
  సాగర కన్యకఁ బోలినట్టి భూ
తల సుత సీత జాహ్నవియు
  ధాత్రియుఁ దోడుగ వచ్చుచుండెడిన్.

(మల్లాదివారి యనువాదము)

దీనితో ద్వితీయరంగ ప్రారంభము జరిగి యదే నాటకాంతమైనది. (సీత వచ్చి రాముని స్పృశించుట యిత్యాదులు).

ఈ రంగవిషయము సీతా పునరావిర్భావము వాస్తవమా? కాదా? యన్న ప్రశ్న యసమంజసమని

మున్నే కవి రామునిచే సూచించెను. మఱి సత్యము కాక యసత్యముకాక యేమగును? ఆలంకారిక విషయ మగును. రసోచిత కల్పనమగును. ఇచట వాస్తవిక కథా దృష్టిలేదు. అనగా సీతారాముల పునస్సమాగమ మబద్ధమా? నిజమా? దీనికి తావులేదు. ఎట్లు? సీతారాములనగా నెవ్వరు? దాంపత్య ప్రతీకలు. వారి కెడబాటు లేదు. వా రర్ధనారీశ్వర తత్త్వము. లక్ష్మీనారాయణ తత్త్వము. ఈ తాత్త్విక దృష్టి భవభూతికి పుష్కలముగా నున్నది. లోకాంతర గతయైన సీత మఱల నెట్లు వచ్చును? ఆ వచ్చినది మానవ సీతకాదు. పతివ్రతా భావము. అది వచ్చి రామునితో కూడుకొన్నది. ఇది విదానదృష్టి (Symbolic aspect). ఇది ప్రాచీనాలంకారికమార్గమే. నాగానంద నాటక రసవిషయమున శ్రీమదభినవులు నాటకమున నాయకునకు నాయికా, రాజ్యప్రాప్తియున్నను దయావీరమునకు తావులేదనియు, నందు శాంతమే రస మనియు, నట్లు ముగించుటకు కారణము నాటకము బుద్ధి విలాసాదులతో నంతము చేయవలెనన్న మహర్షి యనుశాసనమే హేతువన్నారు. అనగా సామాన్య ప్రేక్షకులకు నాటకము లోకానురక్తిని బోధించవలెనే కాని విరక్తిని బోధించరాదు. సాహితీ ప్రయోజన మిదే. ఇందుకే నాయకుడు చావకపోయినను ట్రాజెడీ ట్రాజెడీయే—యన్నాడు అరిస్టాటిల్. (ఇతడు ట్రాజెడీ దుఃఖాంతము కావలెనన్న పట్టుదల గలిగిన వాడైనను సుఖాంతతను సమ్మతించినాడు. ఎందుకనగా, నిది—'more satisfying to our human sympathies-' అని యతని యభిప్రాయముగా F. L. Lucas తన Tragedy అన్న గ్రంథమున పు. 24 అథస్సూచికలో వ్రాసినాడు.)

కాగా లౌకిక దృష్టితో సామాన్య ప్రేక్షకులు సీతారామ వియోగమున విరసీకృతభావులై పోదురు. ఇందుచే నాటకము విలాసాంతము. అనగా నాయికా నాయక సమాగమముతో ముగిసెను. అనగా వారు నిజముగా నేకమైనారని కాదు. సీతారామ దాంపత్య భావమునకు క్షతిలేదని వ్యంగ్య పరమార్థము. ఇందుకే మహాకవి, రామునిచే ప్రారంభాంతములందు రెండు మాట లన్పించుట. ఈ భావమునే కవి యంతర్నాటకముద్వారా చెప్పినాడు. సీతారాములన్న నాయికా నాయకులేకమైనారన్నమాట సామాన్యదృష్టి. వాచ్యార్థము. కథా విషయము. వాల్మీకము. సీత, పాతివ్రత్య భావముగా కవి కల్పించినాడు. ఇది విశేషదృష్టి. వ్యంగ్యార్థము. పైన వ్రాయబడిన దిదే. ఇది భావుక ద

ఈ ప్రతీకార్థము ప్రధాన నాటక రస నిర్ణాయకము.

ఈ నాటకమందలి రసమునుగూర్చి వాదోప వాదములున్నవి గదా! కవి వివక్ష ననుసరించి నిర్ణీతము కావలెను. పైన చెప్పిన విషయము ననుసరించి నాయికా నాయక భావ సమ్మేళనము—దాంపత్యభావ నిత్యత చెప్పబడినది. సీతారామ సమ్మేళనముకాదు. ఐనచో రసము కరుణ విప్రలంభముకాదు. తిరిగి కలిసిన గదా యది. ధర్మవీరమునుగాదు. కాక యొకవేళ నాయికా నాయకులు కలిసికొన్నా రన్నను విప్రలంభ ధర్మవీరములకు తావులేదు. ఎట్లు? నాటకము విలాసాంతము కావలెనని మహర్షి యను శాసనము గదా. అరిస్టాటిలు నట్లే చెప్పెను గదా. అది సామాన్యుల నుద్దేశించి. కథాదృష్టికలవారి నుద్దేశించి. భావుకుల దృష్టివేఱు. చివరకు నాయికా నాయకులు కలిసికొన్నను కరుణ రసమునకు క్షతి లేదు.

అంతర్నాటిక ప్రధాన నాటక క్లుప్తికంఠము. దీని విస్తృతియే ప్రధాన నాటకము. అంతర్నాటికా ప్రారంభమున సూత్రధారుడువచ్చి సభాసదులతో వాల్మీకి మాటలుగా నిట్లు చెప్పెను: 'మేము యోగదృష్టితోఁ జక్కగా జూచి కరుణాద్భుతరసమిశ్రమమును బరమ పావనము నగు వచనామృతమును సమకూర్చినాము. ఇది చిన్నరూపకమైనను గౌరవార్హము గావున దీనియెడ సావధానముగా నుండవలెను' అని. ఇది కరుణాద్భుత రస మిశ్రమమట. చిన్నరూపకమే పెద్దరూపకము. ఇందలి పాత్రలే యందలి పాత్రలు. గంగ—అరుంధతి—సీతాదులు. విషయమునదే. కావున రసవిషయము రెంటికి నన్వయించును. కావున ఉ. రా. చరిత్రలో

రసము కరుణాద్భుతము. ఇది కవి చేసిన సూచన. ఇచటి యీ మాట నాటకము మొత్తమున కన్వయించ వలెనని కవి వివక్ష. ఈ చిన్ననాటకమును సావధాన తతో చూడవలెనన్నమాట వ్యంగ్యపరవార్థమైన రస దృష్టిని కవి తానై పాఠకునకు సూచించుట.

ఈ చిన్నరూపక ప్రధాన ప్రేక్షకుడు రాముడు. ఆతని యనుభవమే ప్రేక్షకునిది. ఆతనికి దుఃఖము. ఈతనికి శోకము. ఇందుచే నంతర్నాటక దర్శనవేళ ప్రేక్షకులు దుఃఖపడిరని కవి చాలసార్లు సూచించెను. కావున రసము కరుణము. ఇది యద్భుతరసముచే స్వనః పునరుత్తరళీకృతమైనది. అద్భుతము నేపథ్యమునం దుండి కరుణకు వన్నె పెట్టుచున్నది. దాని కాంతిచే నిది ధగద్ధగాయమానమైనది. ఎట్లు?

నాటకమందలి పాత్రలన్నియు దివ్యములు. నదులు, దేవతలు, వనదేవతలు, మునులు. స్థలము గంగాతీరము. ఋష్యాశ్రమవాటికలు. ఇదొక యద్భుతా లంబనము. రెండు కవి కల్పనకు సంబంధించినది. అంతర్నాటికా కల్పన చూచితిమి కదా. అందలి ప్రతీ కార్థము వినూత్నసుందరము. బహుప్రౌఢము. (దీని నంగీకరింపకున్నచో కర్మార్కర్, మల్లాదివారు ఇట్టి పండితులు చివరియంకమును వట్టి యతుకనుట నంగీ కరించుట. ఒక మహాకవి నిర్మాణమును వాచ్యార్థ దృష్టితో చూచి వారట్లభిప్రాయపడిరి.)

గంగావసుంధరలు సీతను రక్షించుట—జృంభ కాస్త్ర విషయము—స్పర్శవిషయము—కవి వర్ణనలు— పదఘటన—శైలి—సర్వము నద్భుతరసవిషయమే.

అంతర్నాటకమున సీత లోకాంతరమేగెనన్న బాధలోనున్న ప్రేక్షకులకు సుడివడుగంగనుండి సీత యావిర్భవించుట చూచిన వారి కెంత యద్భుత విష యము. కల్పన మన కద్భుతావహము. రామలక్ష్మణు లాశ్చర్యపడిన విషయము చెప్పనక్కఱలేదు.

క్రీస్తు శిశువును చేతులలో నుంచుకొన్న మేరీ చుట్టు దేవతాశిశువులు మండలభ్రమణ చేసినట్లున్న పాశ్చాత్యచిత్రములు చూచినచో దేవతాశిశువు లద్భుత రసాలంబనములని తెలియును. ఇది వచ్చి ముందున్న మేరీ చేతిలోని శిశువు దివ్యశిశువన్నభావమును పోషించు చున్నది. అట్లే The immaculate Conception వంటి బొమ్మలు చూచినచో నేపథ్యము నంతరించు నద్భుత విషయము స్పష్టపడును. Background నందద్భుతముండి fore ground లోనున్న ప్రధాన వస్తువును పోషించుట యందలి పరమార్థము. ఈ దృష్టితోడనే భవభూతి కరుణాద్భుతమన్నాడు. అనగా అద్భుతమైన కరుణ యిందలి రసమని మహాకవి తానై చెప్పినాడు. కరుణకు నద్భుతమునకు స్పర్థ— సంఘర్షణమున్నది. భిన్నరసస్పర్థ విచిత్రశైలీ లక్ష ణము. భవభూతి దిదే. (ఈ రసవిషయమును శ్రీ వేంక టేశ్వర విశ్వవిద్యాలయముయొక్క Oriental insti-tute Journal Vol. XV లో విపరముగా వ్రాసితిని. కావున నిట సంగ్రహింపబడినది.)

ఈ యంక మిట్లు ప్రధానము. కావుననే దీనికి సమ్మేళనాంకమని పేరు పెట్టెను. నాయికా నాయక సమ్మేళనము. స్త్రీ పుంభావ రూపమైన దాంపత్య సమ న్వయము. భవభూతి వాల్మీకి సమ్మేళనము. (తాను కల్పించిన అంతర్నాటకమును వాల్మీకి కృతమన్నాడు. తాను పైకితెచ్చిన సీతను వాల్మీకి యానతిబడి పాతా ళమునుండి యట్లు వచ్చెనన్నాడు. తన యంతర్నాటక మునుదెచ్చి వాల్మీకి కథగా భాసింపజేసి యదేయిది, యిదేయదన్నట్లు చూపి, తుదకు భరతవాక్యమున తమ యిద్దఱను కలిపికట్టుగా సొగడినాడు.) నాటక— నాటికాసమ్మేళనము. రెండు నొకటే. ఈ సమ్మేళ నము కావ్యరస నిర్ణాయకము కావున ప్రధానమైనది. నాటకము అద్భుతాంతము కావలెను గదా! అద్భుత మైన యంతర్నాటక ప్రభావముతో ప్రధాన నాటక రస మద్భుతముగా ధ్వనించునట్లు నాటకమును ముగించుట భవభూతి కవితాసరస్వతీ విలాసము. ఆతని వాక్కు తానే యన్నట్లు జగన్మాత సీత వంటిది. గంగ వంటిది. అంతటి పవిత్రమైదికశబ్దము నాస్యతో దర్శనీయము, ఒక్క వ్యాసమహర్షిని వదలి.

# నిరంతర త్రిభుజం

శ్రీ కె. ఎస్. వి. నరసింహమ్

చీకట్లు
పేరుకుని వస్తూన్న మునిమాపున
చింతచెట్టు చిటారుకొమ్మ కొసను
చిరునవ్వును వ్రేలాడదీస్తూ
చిరుచుక్క
మినుకుమన్న సాయంత్రాన —

నిలిచిపోడుకున్నావు నీవు
ఆలోచనల కాసారం
గట్టుమీద
ఆవేదనను సితారుగా
మోగిస్తూ
పలుకలేక పలుకలేక
పలుకుతూన్న గొంతులో
ఏ పూర్వ జన్మల
ఏ పురిటింట్ల
ఏ మూగదైన అస్పష్టమైన
అంధకారాంతర్గతమైన
ఆక్రోశాన్నో పలికిస్తూ!!

చేతివ్రేళ్ళ కొసనుంచి
ఒకానొక మౌన విద్యుత్తు
పారింది
(ఒకానొక చైతన్య సరిత్తు)

అపుడే కదా
అన్నా !
విన్నాను నేను
నీ పాట
ముళ్ళడొంకల నడుమ బోరగిల పడిపోయి
'నుదుటి వ్రాత'
నెత్తుటి గీరలలోకి
అనులిఖింపబడి
లేవాలనుకుంటూ లేవలేక
పోతూ
విన్నాను
నీ పాట
తుమ్మడొంకల
మధ్య బోరగిల పడిపోయి
విన్నాను
మట్టిరేణువుల లోంచి
ఇంకా ఇంకా ఆ క్రిందగా
బలి
చేసుకున్న లోకం నుంచి
అన్నా ! విన్నాను
నిన్ను చూడలేదు, కాని నీ
పాటను
ఆనవాలు కట్టాను !

చీకట్లో
వెలుతురు నాటకానికి
అంతాన్ని సూచిస్తూ
వాలినప్పుడు—

## ని రం త ర త్రి భు జం

అప్పుడే—
ఏదో అతీంద్రియ దృష్టి
అబ్బింది నాకు—లేకుంటే
ఎలా కనుగొన్నాను ఆ
దృశ్యాన్ని - అదే
నీ నిరుపేద విగ్రహం
అయోమయం అంచున నిల్చొని
అంతర్ముఖుని వలె
నిశ్వాసం గడ్డకట్టి
మానవాకృతి తెచ్చుకుని
నిలిచినట్లు—
కొంతసేపటికి నొప్పినొప్పిగా కురిసిన వెన్నెలలో
తలదించుకుని
షరాయి జేబుల్లో
చేతులు పూడ్చి
నడిచి పోయావు.
నాకు బాగా గుర్తు అపుడు పొడిచిన
నాలుగు నక్షత్రాల నీలి ఆవరణ నడుమ
సన్నటి చల్లటి రాగాలు రెండు
దండలు మార్చుకున్నాయి.

ఓహో! అవును నిజం!
నా కబ్బింది
అతీంద్రియ దృష్టి.
అన్నా—అప్పుడు నువ్వు
ఆకుపచ్చని కొండ చరియను
సర్రున ఎక్కేశావు కొండకొన కొమ్మన
ఆగి నిలబడి చక్కగా
చెయ్యి షరాయి జేబునుండి తీసి
పైకెత్తి

గాలిలో ఊపావు
నాకేసి —
నేనంటూ ఉన్నాననుకున్న
నీ విశ్వాసం కేసి !
నేనూ నీ విశ్వాసమూ
శాశ్వతంగా నిలబడవలసిన
అనంతం కేసి !!

చీకట్లు
కేరింతలాడుతూ అల్లుకున్న
ఈ మునిమాపున
ఓడిపోయిన వెలుతురు
కార్చిన కన్నీటి
బిందువుల వలె
చుక్కలు మెరుస్తున్న సాయంకాలాన

ఆనందం అంచున నిలబడి
ఆత్మీయతను సితారుచేసి
అనురాగపు అపరంజి వేళ్ళతో విరాగాలు
పాడుతున్నాను
అన్నా—
నువ్వు పాడిన పాటను
నువ్వు అసంపూర్ణంగా
వదిలి వెళ్ళిన గీతాన్ని
పూరిస్తున్నాను.
ఈ గాలికి
ఈ మట్టికి
ఆకాశానికి
వినిపిస్తున్నాను—
పాట—నువ్వుపాడిన పాటే!

# నిరంతర త్రిభుజం

అదే పల్లవి –
అచ్చంగా చిగురాకు వంటి
చిన్న పల్లవి !!
కాని, నేను కూర్చే చరణాలు
వెలుగు చరణాలు !
జిలుగు చరణాలు !!
నేను నిన్ను కలుసుకునే లోపల
నీ భుజంపై చెయ్యివేసి
నీ నుండి ఒక్క
గుర్తింపు మాట వినే లోపల
నిష్క్రమించావు నువ్వు.
అందుకే ఈ పాట—
ఇది నీ పాటే
—కాని నేనూ పాడుతున్నపాట –
నీకు అంకితం !
అన్నా నీకు తెలుసు
దీని అర్థం
ఈ పాట నాకూ
నువ్వు అంకిత మిచ్చావని !
అందుకే మరి ఇది
నిరంతర త్రిభుజం !!



# ఓరుగంటి అజ్ఞాత విద్వత్కవి నరసింహర్షి —
# ఆతని శాసన కావ్యము - సిద్ధోద్వాహము

శ్రీ పి. వి. పరబ్రహ్మశాస్త్రి

కాకతీయ రాజాదరణమునకు పాత్రులైన విద్వత్కవి పుంగవులలో విద్యానాథుడు, శివదేవయ్య మున్నగు వారు తమ గ్రంథములవలనను; అచింతేంద్రుడు, బాలసరస్వతి, మయూరభట్టు మున్నగువారు తమ శాసనములవలనను పండితలోకమున ప్రసిద్ధినొందిరి. అంతియేగాక ప్రతాపరుద్రనృపతి స్వయముగ సంస్కృతమున యయాతిచరిత్ర, ఉషారాగోదయము అను రెండు నాటకములను రచించి భారతభారతికి ఆంధ్రావనియందు రాజమర్యాదలు సైతము గావించిన విద్వన్నృపతి. అట్టి మహనీయుని (క్రీ. శ. 1290—1323) రాజాస్థానము నలంకరించి యిప్పటివరకు మరుగుపడియున్న మరొక గొప్పవిద్వత్కవి యిటీవల జరిగిన శాసనపరిశోధనల ఫలితముగా తెలియవచ్చుచున్నాడు. ఇతనికి చెందిన కృతులెవ్వియు తాళపత్ర గ్రంథరూపమునగాని, ముద్రితగ్రంథరూపమునగాని యిప్పటివరకు తెలియవచ్చుటలేదు. ఇతడు తన కృతులనుగూర్చి ఓరుగంటి శిథిలదుర్గమునందు ప్రస్తుతము శంభునిగుడికి ప్రక్కనున్న ఉన్నతములగు శిలాతోరణములమీద మలిపించుకొనెను. ఇతనిపేరు నరసింహర్షి లేక నృసింహకృతి. రుద్రమదేవికి ప్రతాపరుద్రునికి రాజగురువని ప్రసిద్ధిగాంచిన విశ్వేశ్వర శివాచార్యుడితని తండ్రి. కనుక విద్యానాథుని మేనల్లుడగు గంగాధరకవియొక్క పుత్రుడగు నరసింహకవి యీతడే ననుకొనరాదు. విద్యానాథునికి సమకాలికుడై రాజద్వారములపైననే తన గొప్పతనమును చాటు నగలిగిన ప్రతిభాశాలి యీ నరసింహఋషి.

ఈ నరసింహుడు ప్రతాపరుద్రుని సమకాలికుడని యీ క్రింది శ్లోకమువలన తెలియగలదు. ఇది కోటలో 'ఏకశిల'యనబడు శిలాతలమున చెక్కబడియున్న శాసనము.

> అవ్యాదుర్వీ ముదధిరశనా మ్రగ్రీశః కాకతీనాం
> విద్యాశాలీ విదితవినయో వీరరుద్రాభిధానః।
> యాత్రాకాలే విజయహరిణో యస్యసేనా గజానాం
> మధ్యే కశ్చిన్మలయ శిఖరీ మాల్యవాన్మందరోవా॥
>
> నరసింహర్షిః

ఇందు కాకతీయులలో నగ్రగణ్యుడగు వీరరుద్రుడు దిగ్విజయ మొనర్చువేళ యతని సేనాగజములు మలయాది పర్వతములను పోలియున్నవని చెప్పుటచే నతడు 'భూభృత్' పదవాచ్యుడగుట సార్థకము గలదని వర్ణింపబడెను. శ్లోకాంతమున 'నరసింహర్షిః'అని కవి తన పేరునుగూడ చేర్చుటను బట్టి వారి సమకాలీనత స్పష్టమగుచున్నది. ఇంతేగాక ముందు చెప్పబోవు 'విశ్వేశ్వరసూనోః నరసింహర్షేః కృతిః' ఇత్యాది కృతికర్తయొక్క నామనిర్దేశములు రాజగురువగు విశ్వేశ్వరపండితుని పుత్రుడైన నరసింహర్షియని యుండుటచేగూడ నీ విద్వత్కవి ప్రతాపరుద్రుని యాస్థానము నలంకరించియుండెననుట నిర్వివాదము. విశ్వేశ్వర శివాచార్యుడు రుద్రమదేవి కాలమున రాజగురువైయున్న సంగితి మల్కాపుర శాసనము కొన్నివాఙ్మయగ్రంథములు తెలుపుచున్నవిగదా. ఆచార్యసరంపరలోనివాడగుటచే అతని నామాంతమున 'ఋషి'యని చేర్చబడియున్నది.

ముద్రితములుగాని అముద్రితములుగాని యీ విద్వత్కవిశేఖరుని రచన లెవ్వియు ప్రసిద్ధములై తెలియవచ్చుటలేదు. తన రచనలను గూర్చి తానే

తోరణస్తంభములపై నచ్చటచట శిలాలేఖనములుగా వ్రాయించుకొనెను. అందొకటి—

అప్రాప్త సభాస్తంభోఽప్య
విపన్న హిరణ్యకశిపు రపి।
అవికృత ముఖోఽపి దశసు
రూపకేషు ప్రగల్భతే నరసింహః

ఇందు విష్ణువు నరసింహరూపమున సభా స్తంభమునం దావిర్భవించి హిరణ్యకశిపుని వధించి వికృతరూపియై మత్స్య, కూర్మ, వరాహాది పది రూపములలో ప్రసిద్ధినొందగా ఈ నరసింహుడు రాజ సభలందు స్తంభమువలె జడుడుకాక, (లేక సభయందు మూలస్తంభములువలె రాజాదరణము నొందగల యదృష్టము లేనివాడయ్యును), ఎన్నడు క్షీణించని సువర్ణము వస్త్రములు గలవాడై (అతని ఐశ్వర్యమును సూచించును), వికృతముఖము లేనివాడై (సభల యందు పరాజయము లేనివాడై) దశవిధములగు రూప కములు రచించి ప్రగల్భుడయ్యెనని తాత్పర్యము.

మరియొక తోరణస్తంభముపై గ్రంథాక్షరము లలో నీ శ్లోకము చెక్కబడియున్నది.

ఋక్ఛాయా రచితా నిరర్గళగిరా
యే నాధిక స్థేయసీ
శాస్త్రగ్రన్థకృతా నృసింహకృతినా
హ్యాద్గని గన్దచ్ఛిధా।
అ ప్యేకేన హి కాకతీయ చరితే
తే నాష్ట శిష్టాదృతాః
కాష్ఠాఘాట నిసర్గ నిర్గతయశః
సర్గేణ సర్గాః కృతాః॥[1]

ఈ నృసింహకృతి ఋగ్వేదమున కొక ఛాయను రచించె నట. ఇతర శాస్త్రగ్రన్థములను గూడ తాను రచించి నట్లు చెప్పుకొనెను. శిష్టులచే నాదరింపబడుచు తనకు దిగంతవ్యాప్తముగ కీర్తి నార్జించగలిగిన కాక తీయ చరితమునం దెనిమిది సర్గము లొకేదినమున రచించగలిగిన ప్రతిభాశాలి యితడు. సంస్కృత కవులు కొందరు హర్షచరితము, విక్రమాంక చరితము, ప్రతాపరుద్రయశోభూషణము మున్నగు గ్రంథములను వ్యక్తిగతముగ నొకానొక రాజు నుద్దే శించి కథావస్తువును స్వీకరించి గ్రంథములను రచించియుండిరి. కాని యొక రాజవంశమునుగూర్చి ప్రత్యేకించి చెప్పబడిన చారిత్రకగ్రంథము లరుదు. అట్టి యమూల్యమగు కాకతీయ చరిత్రమును సమ కాలికుడగు నీ విద్వత్కవి రచించుటయు అది విద్వ దాదరణము నొంది యానాడు ప్రసిద్ధినొందియుండి నేడు నామమాత్రముగనైన తెలియకుండుట నత్యంతము శోచనీయము. అట్టి చారిత్రకకావ్యమే నేడు లభ్యమగుచో భారతీయకవులు చారిత్రకదృష్టి లేని కేవల రసికులు మాత్రమేననెడి యపప్రథ కొంత తొలగియుండుటయేగాక ఆనాటి మహమ్మదీయ చరిత్ర కారుల రచనలవలె యీ నరసింహుని కాకతీయ చరి తముగూడ నప్పటి చరిత్ర రచన కమూల్యమగు నాధారగ్రంథమయ్యెడిది. కాని యిదియంతయు నిష్ప్ర యోజనమగు మన మధురవాంఛయే. ఆ విద్వత్పుంగ వుని దశరూపకములుగాని, ఋక్ఛాయగాని, ఇతర శాస్త్రరచనలుగాని, కాకతీయచరితముగాని, ముందు చెప్పనున్న యితరములుగాని యేవియు నేడు లభ్య మగుటలేదని చెప్పుకొని విచారించు టొక్కటియే మనకు మిగిలినది. ఆ తోరణస్తంభములపైననే యితని కృతులుగా జెప్పబడిన 'మలయవతి'యను గద్యకావ్య మొకటి, ఛందోనిబన్ధనగ్రంథ మొకటి తెలియవచ్చు చున్నవి. ఇట్లు నామమాత్రావశిష్టములైపోయిన గ్రంథ ములుగాక మరి రెండు కృతు లీ లోకోత్తరపండితునివి గానవచ్చుచున్నవి. అందొకటి యసంపూర్తిగ విడువ బడుటయేగాక లభ్యమగుచున్న కొలదిభాగముకూడ

1. ఇది గ్రంథాక్షరములలో నుండుటనుబట్టి యీ కవికి కంచితో నెద్దియైన సంబంధముండి యుండునని తోచును. ఆ లిపియొక్క వాడుక అప్పటికి చోళదేశమున గానవచ్చును. కంచియందు అతడు విద్యా భ్యాస మొనరించిగాని లేక ప్రతాపరుద్రుని దక్షిణ దండయాత్రలలో తానుకూడ వెళ్లియుండుటగాని దీనికి కారణమై యుండునని తోచును.

నిరంతరము నీరుకారు శిలాతలముపై నున్నదగుటచే పాకుడుపట్టి యక్షరములు గుర్తింపవీలుకాకున్నవి. వరంగల్లు రైలుస్టేషనుకు సుమారు మూడు కిలో మీటర్ల దూరమున 'ఉరుసు'అనబడు పరిసరగ్రామము దాని వెలుపల ఉరుసుగుట్టయనెడు కొండ కలవు. దాని యెగువభాగమున నొక చిన్నగుహాలయమున కొన్ని విగ్రహముల నుంచి ప్రస్తుతము జాతర చేయుచుందురు. దాని నానుకొని రెండు పెద్దనిలువుశిలలమధ్య సన్నని గొందు కలదు. అందొక శిలయొక్క నిలువుతలముపై సుమారు 6 లేక 7 మీటర్ల పొడవు $1\frac{1}{2}$ మీటర్ల వెడల్పున రాతిని శాసనమును వ్రాయుటకై నునుపు చేసి సిద్ధము చేసిరి. దానిలో $1\frac{1}{2}$ మీటర్ల భాగమున మాత్రము నాగరిలిపిలో నొక కావ్యమువంటి కొంత రచన లిఖింపబడెను. అందు ప్రథమ సర్గాంతమున—

'ఇతి రాజగురు విశ్వేశ్వర
పండిత సూనో ర్నరసింహార్యే:
కృతౌ యోగ [............]
ప్రథమ స్సర్గః॥'

అనెడు భాగము తెలియుచున్నది. ఈ కొద్దిభాగముతప్ప మిగిలినదంతయు కొండపైన వర్షాకాలమందు ఇంకిన నీరు జాలుగట్టి యించుమించు సంవత్సరములో నధిక భాగము కొద్దికొద్దిగా నిరంతరము కారుచుండుటచే గట్టిగ రాతివలెపేరుకొన్న పాకుడుతో కప్పబడి నిరుప యోగముగా నున్నది. కనుక నృసింహార్యుయొక్క యీ కృతికూడ పైవాటివలె నామమాత్రమైనది. చదును చేసి సిద్ధమొనర్చిన మిగిలినభాగమునంతను అట్లే యేల విడిచిరో తెలియదు. నామమాత్రములైపోయిన యితర కృతులు బలాత్కారముచేసి యీ కృతిని గూడ తమలో చేర్చుకొన్నవనెడి సమాధానమే మనకు మిగిలినది. అదే కొండపైన వేరొక వాలుపుటంచు పైన శిలాక్షరములలో దిగువ వివరించబడుచున్న చిన్న కావ్యము కొలదిలోపములున్నను చక్కగ లభించుచున్నది.

కావ్యాంతమున 'విశ్వేశ్వర సూనో ర్నరసింహార్యే: కృతిః॥'అని యుండుటచే గ్రంథకర్తముగూర్చిన సంశ యమునకు తావులేదు. సుమారు మూడున్నర మీటర్ల పొడవు ఒకటిన్నర మీటర్ల వెడల్పుగల శిలాతలమును నునుపుచేసి దానిని మూడు నిలువుభాగములుగ విభ జించి సుమారు 5 సెంటిమీటర్ల పరిమాణముగల చక్కని తెలుగక్షరములలో నీ కావ్యము చెక్కబడి యున్నది. వ్రాతకట్టు కాకతీయులనాటి సామాన్యవిధ ముగనేయుండును. ఉత్తమశ్రేణికి చెందిన వ్రాతకాదు. అప్పటచట లేఖకుని అశ్రద్ధమూలముగ నేర్పడిన దోషములుకూడ కలవు. మొదట నాగరిలిపితో ప్రారం భముచేయబడి కొన్నియక్షరములతర్వాత మరల తెలు గక్షరములతో చివరనుండి ముగింపువరకు వ్రాయ బడెను. కవి దీనిపేరెచటను తెలుపలేదు.

ఇదియొక చిన్న ఖండకావ్యము. 60 శార్దూల విక్రీడితములతోను తుదియందు రెండు స్రగ్ధరలతోను చక్కని సంస్కృతమున రచింపబడెను. కల్పితగాథ. ఒకానొక సిద్ధయువతీయువకులప్రేమ వివాహ వర్ణన మిందలి కథావస్తువు.[2] అందుచే నీ కావ్యము 'సిద్ధో ద్వాహ'మని పేర్కొనబడెను. మేఘసందేశమునందువలె

'...ద్ధయువా సమం దయితయా
త్రైస్రోతసే సైకతే
రాగాంధో రమమాణ ఏవ
లిఖితే కారండవానాం పదైః।
ద్రష్ట్వాం దుర్విషహాం
మనోభవకృతాం తాం తా మవస్థాంతరా
సశ్లేషం గమితః కుతూహలవశా
యక్షేణ మాయావినా॥'

(సిద్ధోద్వాహము. శ్లో. 1)

అని ఆ సిద్ధదంపతుల వియోగముతో తన కథను ప్రవేశపెట్టును నరసింహార్యు. అచట కాళిదాసు సీతా రాముల పాదస్పర్శచే పునీతమైన రామగిరిని తన నాయకుని విరహవేదన కాలంబనము మొనర్చినట్లు నరసింహుడు పవిత్రగంగాపులినస్థలిని తన సిద్ధయువ

2. 'సిద్ధోద్వాహః'అను శీర్షికతో ప్రస్తుత రచయితచే (ఆం. ప్ర. ప్రభుత్వ ఎపిగ్రఫీ సీరీస్ నెం. 2) ప్రకటింపబడెను.

కుని విరహమున కాలంబన మొనర్చును. అచట రాగాంధుడై తన ప్రేయసితో రమించుచున్న సిద్ధయువకు నకు ఆమెతో వియోగము కల్పించి వాని వికారచేష్టలను చూచి ఆనందించుటకై యక్షుడొకడు ఆమెను అదృశ్యమొనర్చును. కాళిదాసు తన కావ్యములో విరహ కారణమును యక్షునియొక్క ప్రమత్తతవల్లనైన విధి నిర్వహణ లోపముగా జెప్పెను. ఈ నరసింహకవి ఇటువంటి లఘుకావ్యములలో విరహమున కంత ప్రబల కారణ మక్కరలేదనుకొన్నాడు. తన కావ్యమువలె దానిని కూడ నొక పరిహాసవిషయముగా తీసుకొని సిద్ధుని శయ్యమీదనుండి యతని ప్రేయసి యున్నదున్నట్లే మాయమైనదన్నాడు

శయ్యాయా మవిలోక్య
  స్వప్రియతమాం దంభోళినేవాహతో
బిభ్రాణః పతదశ్రుణీ
  కిసలయా తామ్రోదరే లోచనే
అంసన్యస్తశిరాః శనై
  రుపచిత శ్వాసో వివర్ణానన
స్తూష్ణీమేవ కమప్యనేహ స
  మవిజ్ఞాయైవ తస్థౌ జడః॥

(సిద్ధో. శ్లో. 2)

ఈ విపరీత సంఘటన అతనికి అశనిపాతము వంటిదైనది. దుఃఖాతిరేకమువల్ల కొంతసేపు జడుని వలె నిలిచియుండును. ఇంక చేయవలసినదేమో తోచలేదా సిద్ధయువకునకు పాపము. ఆ గంగాతీర మందలి మధుర సన్నివేశములను చూచుచుండగా తాను పూర్వము ప్రేయసితో గడిపిన సుఖానుభూతులు స్మరణకువచ్చి వానిని గురించి వాపోవును.

'త్రిస్రోతో జలమచ్ఛ
  మాత్తరజసో రోధోలతా మంజరీ
ర్హంసా న్మంజురుతాన్
  స్థలాంబుజవనం స్పర్శాసహాంతర్దలమ్
పుష్పాసాద కషాయికంఠ
  ఘలినాం బృందంచ బాష్పోత్సుకో
క్యాన్యేవ మువాచ లక్ష్యరహితం
  పూర్వానుభూతీః స్మరన్॥'

(సిద్ధో. శ్లో. 4)

ఇచట సిద్ధుడుముందు చెప్పబోవున దంతయు లక్ష్యరహితమైనదేనని చెప్పుచు కవి రచనాసామగ్రి లభించినపుడు లాక్షణికులు చెప్పు కావ్యోద్దేశ్యములలో ప్రధానమగు 'ఉపదేశయుజే'అను పరమలక్ష్యము లేక పోయినా కవనము చేయుచున్నట్లు తన కావ్యమైలక్ష్యమును సూచించును. ఇట్టి ఖండకావ్యముల విషయములో రసానుభూతియే పరమలక్ష్యము. మిగిలినవి లేకున్నను కావ్యమునకు లోపముండబోదని గట్టిగా తలంచినవారిలోనివాడు నరసింహకవి.

ఇట్లు మొదటి నాలుగు శ్లోకములలో తాను చెప్పబోవు కావ్యమునకు ప్రారంభముచేసి సిద్ధుడు మొట్టమొదటిసారిగా ఆ సిద్ధకన్యను చూచినది మొదలుకొని తమ యన్యోన్యప్రేమగాథను వర్ణించును. ఒకనాడు మేరుపర్వతముపై కల్పవృక్షము క్రింద కిన్నరస్త్రీలు సంగీత సమావేశము జరుపుచుండగా ఆమె తన చెలికత్తెయలతో వచ్చును. అచట సిద్ధయువకుడు అనురాగపూరిత దృక్కులతో నామె మనసు నాకర్షించును. వీరి పరస్పరదృష్టి ప్రసారిత ప్రేమసందేశములను చెలికత్తెలు గ్రహించి యామెను పరిహసింతురు. ఇంతలో నొక బాలకుడు వచ్చి ఆమెను ఇంటికి పిలుచుకొనిపోవును. ఆ బాలకుని వర్ణించు శోకమిది.

'కాలే తావతి కాకపక్షక
  ముఖే నోన్నద్ధ చూడామణి
ర్బిభ్ర న్మౌక్తిక కుండలే
  శ్రవణయోః కోఽప్యాగతోబాలకః
నక్షత్రద్వయ మధ్యపాతి
  శశినోబింబం పురోంగారకం
వ్యాకుర్వ న్వదనశ్రి యేన్మువదనే
  త్వామాహ్వయ త్సంభ్రమాత్॥'

(సిద్ధో. శ్లో. 10)

కావ్యమంతట సిద్ధుడు ఆమెను సంబోధించుచు చెప్పుచుండును కనుక 'త్వామాహ్వాయ త్సంభ్రమాత్' (ఆ పిల్లవాడు నిన్ను సంభ్రమముతో పిలిచెను) అని మధ్యమ పురుష ప్రయోగము. ఈ శ్లోకమునందు కవి ఆ యర్భకుని వర్ణించుట శ్లేషగర్భితము. అతని ముఖము మౌక్తిక కుండలము లనెడి రెండు నక్షత్రముల నడుమ, చూడామణి యనెడి (యెఱ్ఱని) అంగారక నక్షత్రము ఎదుట పైగా కలగిన చంద్రబింబమును పోలియున్నదని ఉపమాలంకారము. ఇందు రెండు శ్లేషలు; నక్షత్రములను పోలినవారు నాయికా నాయకులు. బాలకుడే చంద్రునివంటివాడు. అతని తెలిసీ తెలియని చేష్టలు వీరి ప్రేమకలాపమునకు అంతరాయము గుట అంగారక దర్శనము ('చుక్కెదురు' అయినదన్నట్లు). ఇంక రెండవ శ్లేష; నాయికా నాయకుల వివాహమునకు వాని రాక కుజదోషము వలె నున్నదని అంగారక పద ప్రయోగమువల్ల గ్రహింపవచ్చును. ఆ బాలకు డామెను ఇంటికి లాగుకొని పోవును. పాప మీ సిద్ధుడు కూడ వారి వెనుక వెళ్ళుచు ఆమె గమనాదులను పరిశీలించుచు పొగడు చుండును. ఇంతలో ఆమె భవనముయొక్క ఒక్కొక ద్వారము దాటి లోపలికి పోవును. ఈ సిద్ధుడు తన నెవరు అడ్డగించనంతమటుకు ఒకటి రెండు ద్వారములు దాటి భవనాంగణ ప్రదేశమునకు మాత్రము చేర గలుగును. అక్కడ మరి ఉండవలెనో, వెనుకకు తిరిగిపోవలెనో లేక మరేదైనా చేయవలెనో తోచక అలాగుననే ఉండిపోవును.

'న స్థాతుం, నచ గన్తు మన్య దపి
వా నో కర్తు మీశోఽభవమ్.'
(సిద్ధ. శ్లో. 16)

ఆ సిద్ధ భవనాంగణములలోనున్న చిత్రవర్ణముల రత్నములు నేత్రముల కానందమునుగాని, చల్లనిగాలి స్పర్శ సుఖమునుగాని, హేమవర్ణ సరసిజములందు తుమ్మెద లాస్వాదించుచున్న మద్యము నాలుకకు రుచినిగాని, కిన్నర స్త్రీల పాటలు శ్రోత్రానందమునుగాని, వికసించిన కల్పవృక్ష సుమములు ఘ్రాణమునకు సువాసననుగాని యిచ్చి యతనికి మామూలుగా వెనుకటివలె తృప్తి నీయలేకున్నవట. అనగా యింద్రియములను విడిచి మనసు ప్రియురాలిని గూర్చియే చింతించుచున్నదన్న మాట. అక్కడి శ్లోక మిది—

'తద్దేశో నవరత్న చిత్రిత తలః
స్పర్శానుకూలోఽనిలో
హేలాసేను సరోరుహోదర
దళేష్వాసితశేషగిరిః
గీతం కిన్నరయోషితాం సులలితం
కల్పద్రుమాః పుష్పితాః
యాతాః పంచభి రింద్రియై ర్మనసు
యథాపూర్వం నభోగ్యాం దశామ్॥'
(సిద్ధ. శ్లో. 17)

ఇంతలో సూర్యాస్తమయము, చంద్రోదయము వర్ణనలు ప్రసక్తములగును.

'కాలేఽస్మిన్ పుటపాకతప్త
కనకాకారేణ లోలాకృతిః
సంధ్యామేఘ నవప్రవాళ
శయనం రాగీ సమాసేవివాన్ ।
సంతాపా దవతాద్రికందర
ఝరీపాథః కణై రాహతో
నేత్రై ర్మీలయతిస్మ వాసరమణిః
పద్మాకరచ్ఛద్మనా ॥'
(సిద్ధ. శ్లో. 18)

పగలంతయు యెండలో తిరుగుటచే సంతాపము నొందుటచే పుటపాకతప్తమైన బంగారుముద్దవలె కందిపోయి యెఱ్ఱనైన సూర్యుడు సంధ్యామేఘము లనెడి ప్రవాళ (చిగురుటాకుల) శయ్యపై విశ్ర మించి అస్తాద్రికందరములలో ప్రవహించు సెలయేళ్ల నీటితుంపరలతో సేద దీర్చుకొనుచు పద్మాకరముల మిషతో నేత్రములు మూసుకొన్నాడు. ఇచట 'రాగీ', 'సంతాప', 'నవప్రవాళశయనం' మున్నగు పదములు నాయకుని పరముగాకూడ నన్వయించుట గమనింపదగి యున్నది.

చంద్రోదయ వర్ణన :

'ఆదౌ యావకపంకపాటల
మథో బింబీఫలాభం తతః
సద్యోలూన బహిష్పలాశ
వికచ స్వర్ణారవిందోపమమ్ ।
పశ్చాదాసవమత్త మాళవవధూ
గండస్థల ప్రక్రియం
బింబం చాంద్రమసం క్రమా
ద్విరహిణీ వక్త్రోపమానం దధౌ॥'
(సిద్ధో. శ్లో. 20)

చంద్రబింబ ముదయించగనే యవపిండిముద్ద వలె అవ్యక్తరక్తవర్ణము కలిగి తర్వాత దొండపండువలె యెఱ్ఱనియెఱుపుగా మారినది. ఆ తర్వాత మోదుగపూల నడుమ వికసించిన స్వర్ణారవిందమువలె మారినది. కొంచెము పైకెక్కినకొలది ఆసవపానమువల్ల మత్తత నొందిన మాళవయువతియొక్క కపోలస్థలమువలె మారినదట. క్రమముగా విరహిణియొక్క ముఖమువలె వెలవెలబారుచు నభోమండలమున ప్రకాశించుచున్నది. పై శ్లోకములో నాయకుని సూర్యునితో పోల్చినట్లు ఇచట నాయికను చంద్రునితో పోల్చును. కవికి మాళవస్త్రీతోటి వివాహమైనదేమో తెలియదు.

తర్వాత కథ. కింకర్తవ్యతా మూఢుడైయున్న ఆ సిద్ధ యువకునియొద్దకు నాయిక తన చెలికత్తెను దూతిగా పంపును. అది వచ్చి నాయిక అతనిని గాఢముగా ప్రేమించి విరహవేదన భరించలేకుండ నున్నదని వర్ణించును.

'ప్రాసాదే క్షణ మంకణే క్షణమతో
లీలా సరస్యాం క్షణం
క్రీడా పర్వతకే క్షణం ప్రియసఖీ
సంలాప గోష్ఠ్యాం క్షణమ్।
శయ్యాయాం క్షణ మంతరే క్షణ
మథ ద్వార్వేదికాయాం క్షణం
సా త్వా మేవ విచిన్వతీవ
బహుధా జాతారతి ర్వర్తతే॥'
(సిద్ధో. శ్లో. 27)

ఎక్కడ కూర్చున్నా, యేమి చేసినా సంతృప్తి లేక పోవట మనే అరతి వర్ణించబడుతున్నది. కవి కూడ 'క్షణం' అనే పదాన్ని పలుమార్లు వాడి తన అసంతృప్తి ద్వారా ఆమె యసంతృప్తిని చెప్పను. అటులనే చపలతను వర్ణించును.

'తిష్ఠ త్యుచ్చలతి ప్రయాతి
పునర ప్యాయాతి సంభాషతే
తూష్ణీంభావ ముపైతి పశ్యతి
దిశః సంమీల యత్యక్షిణీ ।
ఉద్భ్రామ్య త్యధికం దధాతి చ ధృతిం
నిశ్చేష్టతే చేష్టతే
హా! కష్టం! మదనేన దారుణ
తరం కింకిం న సా కార్యతే॥'
(సిద్ధో. శ్లో. 28)

ఇతని యంగీకారమును తీసుకొని వెళ్లి తన ప్రియ సఖికి తెలిపి మరల యామె సందేశాన్ని యితనికి తెలుపుతుంది. అర్ధరాత్రివేళ నల్లనిదుస్తులు ధరించి రహస్యంగా భవనప్రాకారము దగ్గర నిలిచియుండమనిన్నీ, అచట పైకెక్కుటకు తా డొకటి వ్రేలాడకట్టబడి యుండుననియు దానితో నాయికాంతఃపురంలోనికి ప్రవేశింపవచ్చునని చెప్పను. పాపం, అట్లాగే అర్ధ రాత్రివేళ దొంగవలె భవన ప్రాకారం దగ్గరకు వెళ్లి, ఆ దూతిక యేర్పాటుచేసిన తాడు పట్టుకొని పైకి ప్రాకి అంతఃపుర సమీపానికి చేరుకొనును. దురదృష్టవశాన అచటి కాపలావాళ్లు ఇతనిని పట్టు కొని దొంగ—భవనంలో ప్రవేశించెననే పిర్యాదుతో నాయిక తండ్రియగు కనకాంగదుని యెదుటకు తీసు కొనిపోదురు. అత డీ సిద్ధయువకుని బంధించి యతనిని గూర్చిన విచారణ చేయును. అతని కులగోత్రములు మున్నగునవన్నీ విచారించి ప్రేమించుకొన్నారు గనుక వివాహమేచేస్తే బాగుండుననుకొని శాస్త్రోక్తముగా అగ్నిసాక్షికముగా ఆ సిద్ధయువతీయువకుల యుద్వా హము జరుపును.

'వేదీ మధ్యనివేశితం
హుతవహం కృత్వా విధే స్సాక్షిణం

స్వేదాంభః కణికాభి రంగులిముఖా
ద్వాంతాభి రార్ద్రస్త్వవ।
ఉద్భిన్నై రరవిందనాళ సదృశీ
మాభాం గతః కంటకై
రూర్ణైః కంకణవాన్ ప్రవాళ
మృదుల స్పర్శో గృహీతః కరః॥'
(సిద్ధో. శ్లో. 41)

ఆ పాణిగ్రహణవేళయందు నూతన వధువు యొక్క చేయి స్వేదాంభస్సుతో తడియై పులకాంకురములతోబాటు ఊర్ణ (కంబళి రోమములు) కంకణముగల ప్రవాళమృదుల స్పర్శగల యామె కరము వానిచే పట్టుకొనబడెను.

తర్వాత వీరి సంభోగశృంగారము వర్ణించబడినది. తన ప్రియునితో ప్రథమ సమాగమము నొందు ముగ్ధనాయికాచేష్ట లిందు చెప్పబడినవి. ఒక ధాత్రి యామెను శయ్యాగృహములో ప్రవేశపెట్టి ధాత్రి వెనుకకు వచ్చుచుండగా తానుకూడ బయటికి వచ్చుచుండగా కొంచెము శ్రమతో నెట్లో ధాత్రి వధువు నక్కడ పట్టుకొని ఆపును. నాయకుడు తన ప్రగల్భతను తెలుపుచు ఆ ధాత్రితో హాస్యప్రసంగను ప్రారంభించును. ఇంతలో నాయిక శయ్యపై నిద్ర పోవుచున్నట్లు నటించుచు నిశ్శబ్దముగా పరుండును. ధాత్రి వెడలిపోవును. ఈ సందర్భములోని కొన్ని శ్లోకములు.

'ఈష త్సాంత్వన భంగిబోధిత
మనా స్త్వం కంచుకీ కర్షణే
ప్రక్రాన్తేఽథ నఖక్షతాదపి
భయా దత్యన్త ముద్వేజితా।
కాంతే కేవల మంగకైః
పులకిభిః కంఠాక్తభావస్థితి
బాష్పోత్పీడవశాన్నిమీలితవతీ
లజ్జాకులే లోచనే॥'
(సిద్ధో. శ్లో. 50)

'నీవీబన్ధ నివేశితే కరతలే
శ తంద్రావశా

దీషన్మీలనజాత శారదనదీ
కార్శ్యానుకారే దృశౌ।
ఆసీత్తే ముఖపారవశ్య శిథిలం
తద్ధారణే వ్యాపృతో
హస్తో ఘర్మనయాంబువారి కిరణ
స్పృష్ట ప్రవాలోపమః॥'
(సిద్ధో. శ్లో 52)

క్రీడానంతర మాత్తసాధ్వసతయా
నిశ్చేష్టితై రంగకైః
క్లిశ్యన్తీవ కుచాంశుకాన్వృత ముఖీ
వాక్యాసహన్తీవ మే।
మందోద్ధూత పటాంచలేన
సిచయేనావీజ్యమానా మయా
లజ్జామీలితలోచనే న
శనకై ర్నిద్రాంత్వమాసాదయః॥
(సిద్ధో. శ్లో. 53)

ముగ్ధనాయిక విషయమున సమాగమమునకు పూర్వమామె స్థితిని వర్ణించుట యెంతముఖ్యమో ప్రియుఖర్త్య ప్రథమ సమాగమానంతరస్థితికూడ నట్లే ముఖ్యమని భావించి యీ క్రింది శ్లోకములలో ఆ వర్ణన చేయును.

'మ్లానం చాపి వికాసి చాపి
వదనం వేణీచ నేష్టశ్లథా
భాలశ్చ శ్రమనారినృష్టతిలకో
హాసశ్చ సంజాయతే।
మాయాకాసిచ లక్ష్యతే నయనయో
స్సమ్మోద సంసూచినీ
భుక్తాసీతి సఖీభి రీరిత
రహః కృత్వా భృశం లజ్జితా॥'
(సిద్ధో. శ్లో. 56)

ముఖం వాడినట్లుంటునే వికాసమును వ్యక్తము చేయుచున్నది. జడ ఊడిపోయినది. ముఖమువిూది తిలకము చమటకు చెరిగిపోయినది. పెటికితోడు నవ్వు. కళ్లు చూచినచో యేదో మోసముతోకూడిన సమ్మోద

మును తెలుపుచున్నవి. బయటికిరాగానే చెలికత్తె లడిగే రహస్యవిషయిక ప్రశ్నలకు సమాధానమెట్లుల చెప్పవలెనా యని సిగ్గు.

'ప్రత్యంగం నవచంపకే ష్వివ రజో
వ్యాసర్ణ్య మున్మీలితం
కాంతిర్జ్యోత్స్న కౌముదీ
కువలయాపీతేవ జాతాదృశోః ।
హాసశ్రీర్ముఖపంకజే మధుమదా
దుత్కీలి తేవాధికం
వైదగ్ధ్యం స్ఫటికా దివేందుముఖి తే
స్వాంతాదహో బింబితమ్॥'

(సిద్ధో. శ్లో 58)

వికసించిన చంపకపుష్పములందు పుప్పొడివలె నన్నియవయవములందు రజోలక్షణ మభివ్యక్తమగు చున్నది. నేత్రశోభ (పిండి యారబోసినట్లున్న) వెన్నెలను పోలియున్నది. పైన నవ్వు వచ్చుచున్నదని చెప్పి యిప్పుడా నవ్వు మధుపానముచేతనైన మత్తత వల్ల ముఖపంకజముపై గట్టిగా తాపటము చేసినట్లున్న దంటున్నాడు. వైదగ్ధ్యమనగా నిచట శృంగారవిషయిక చతురత. హృదయమునుండి యా వైదగ్ధ్యము స్ఫటికమునుండివలె స్పష్టముగ నభివ్యక్తమగుచున్నది. బహిర్గతమూర్తవిషయము కానట్టి యా ముగ్ధురాలి శృంగార వైదగ్ధ్యము నామె హృదయకోశమునుండి బయటికిలాగి సాకారద్రవ్యమును స్ఫటికములోవలె నామె ముఖముపై సహృదయులకు కవి చూపు చున్నాడు.

తుది నాలుగు శ్లోకములలోను నవదంపతుల ఉపభోగార్థము మణిమయకుట్టిమములు, సన్నని నైలానువంటి దుస్తులు, మెత్తనిపరుపులు, చందన తాంబూలాది రసద్రవ్యములు, వట్టివేళ్లు, సుగంధ ద్రవ్యములు, క్రీడాగృహములు అందు ధారాజలస్నానములు, మలహరిరాగయుక్తగీతము, స్వేచ్ఛోపభోగము నకు తగిన ఆ ప్రియురాలు వర్షాకాల మందుండ వలసిన సుఖోపభోగములుగా చెప్పబడెను. అందులో నొక శ్లోకము—

'ధారోద్గారి ప్రనాళీ ముఖరకరిముఖం
భూమికావచ్చ హర్మ్యం
రమ్యైకాంతాచ గోష్ఠీ ప్రచుర
మలహరీరాగ మిష్టంచ గీతమ్ ।
సూక్ష్మం శ్లక్ష్ణంచ వాస్తస్తరుణిమ
భిదురోద్వృత్త వక్షోజకుంభౌ
స్వేచ్ఛా భోగక్షమాచ త్వ మతిసుముఖి మే
కాపి వర్షాసు

తుదకా యక్షుడే మరల యామెను ఇట్లు తలపోయుచున్న సిద్ధునికడ విడుచుటతో కావ్యము ముగియును. ఈ చిన్నకావ్యముయొక్క స్వరూప మీ విధముగా ఉన్నది. ఏదో యొకభావమును గ్రహించి యిట్టి ఖండకావ్యములను రచించుట సంస్కృత వాఙ్మయములో తక్కువ. ఈ విషయములోకూడ కాళిదాస మహాకవియే గురువు. అచట—

'ఇత్యౌత్సుక్యా దపరిగణయన్
గుహ్యక స్తం యయాచే
కామార్తాహి ప్రకృతి కృపణా
శ్చేతనా చేతనేషు' మేఘ. సం. ప్రథ.

తన యౌత్సుక్యాతిరేకమువలన యక్షునికి యుక్తాయుక్తములు తెలియనిస్థితిని ముందుగాచెప్పి తాను చెప్పనున్న కావ్యమిట్లే యుండునని దాని వైలక్షణ్యమును సూచించెను. ఈ నరసింహకవికూడ తన సిద్ధయువకుడు లక్ష్యరహితముగ నేదో చెప్పుచున్నట్లు ముందుగా చెప్పును.

'వాక్యాన్యేవ మువాచ లక్ష్యరహితం
పూర్వానుభూతీః స్మరన్॥' (శ్లో. 4)

ఇదికూడ నొక విలక్షణ కావ్యమని స్పష్ట ము చేయును. రెంటియందు ఉపక్రమోపసంహారములు సమానమే. మేఘసందేశము సత్కావ్యములలో జేరినది. ఇది కావ్యవర్ణనములయందు నిషిద్ధములైన వాటిలోనిదగు సంభోగ శృంగార వర్ణన ముండుటనుబట్టి యసత్కావ్యముగ నప్పటి విద్వాంసులచే నామోదింపబడలేదా యను శంక కలుగుచున్నది. అట్లే యితడు చెప్పకొన్న బుక్ఛాయాది గ్రంథములు కూడ బహుళ ప్రచారము నొందినట్లు కానరాదు. ప్రచారమొంది యున్నచో కొన్నిటికైనను తాళపత్ర ప్రతులు లభించియుండెడివికదా! కావ్యముయొక్క పేరుకూడ నిందులేదు. భావకవిత్వమునకు శీర్షిక లేకుండుట, భావచిత్తరువునకువలె నొక యాదర్శ లక్షణముగ నరసింహకవి తలచి యుండును. ఈ చిన్న కావ్యమునకు (సిద్ధోద్గారాః) అని కథాంశమును బట్టి ప్రచురణార్థము పెట్టినపేరు.

అనుమకొండ దగ్గర సిద్ధేశ్వరగుట్టపై నొక శాసనము కావ్యశైలిలో ప్రారంభింపబడి మొదటి 37 శ్లోకములు పూర్తిగాను చెక్కబడియున్నవి.[3] దాని రచయిత యెవరో తెలియదు. అది యే కావ్య భాగమోకూడ తెలియదు. కాని కావ్యములను శాసనరూపముగా రాళ్లపై చెక్కించుట ఈ నరసింహునికే యప్పటిలో కానవచ్చుచున్నది గనుక అదికూడ నితనిదే యై యుండునని తలంచబడుచున్నది. అది నిరోష్ఠ్య కావ్యము. ఆయన వ్రాసిన కాకతీయ చరిత్రకిది ప్రారంభమాయని కూడ తోచుచున్నది. ఆంధ్ర దేశము నచటి వరిచేల శోభతో వర్ణించెను. అందు కొన్ని శ్లోకములు:—

'ఆంధ్రా స్సన్తి గరీయాంసః
కాంచన చ్ఛాయ శాలయః।
యథా హాటక శైలస్య
కటకా రత్నశాలినః॥
కేదారా యత్ర శాలీనాం
తరంగిత జలాంతరాః।
కృష్ణాంగ చ్ఛాయ హారీతా
యథా జలనిధే స్తటాః॥
శాలి సంరక్షిణీ హస్త
తాళైః కంకణ నాదితైః।
త్రాసితాః కిల గచ్ఛన్తి
యత్కీరా స్తద్గిరా జితాః॥'

3. Ep. Indica Vol. XXXVI (పుటలు 209—215.)

వరిపంట కాంధ్రదేశమప్పటికే ప్రసిద్ధి నొంది నట్లున్నది.

'రసాల సాల హింతాల
తాల కేతక కేతనే।
కాంతారే యత్ర కాంతానాం
జాతః శృంగార సంగరః॥
రసాల హాలా గంధేన
ఘనే నాంధీకృతా దృశః।
అలీనాం యత్ర హా! హంత!
లక్షయంతి న గేహినీః॥
శంఖ కంకణ జాలస్య
లలనాకర సంగినః।
కళేన యత్ర నాదేనా
కలహంసాః శతంజితాః॥
లక్ష్యంతే యత్ర నిచితా
లక్షశః శాలిరాశయః।
గేహాంకణే యథాకాశే
తటిత్కాంతిధరాఘనాః॥
ఏకా స్త్యేకశిలా ఖ్యాత్ర
నగరీ యా గరీయసీ।
సాగరాంతాం ధరాం కృత్స్నాం
శ్రితాకాంత్యా నిరీక్ష్యతే॥
కాంతయా ఘ్నంతి యత్కాంతాః
కాంతానాం హృదయం దృశా।
కాంతయా ఘ్నంతి యత్కాంతాః
కాంతానాం హృదయం దృశా॥'

ఈ విధంగా 37 శ్లోకములు మాత్రమే కలవు.

నరసింహఋషినిగూర్చిన సమాచార మింత వరకు శాసనములవలననే తెలియుచున్నది. తాళపత్ర గ్రంథము లితనివేవైనను భావిపరిశోధనలలో వెలువడు నేమో నిరీక్షించెదము.[4]

4. ఈ వ్యాసమును ప్రకటించుట కనుమ తించినందులకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారికి కృతజ్ఞతలు.



# సాహిత్యంలో ఆదర్శం - అవసరం

శ్రీ ఉపాధ్యాయుల ఉప్పల నరసింహమూర్తి

కవిత్వం చాలామందికి కావాలి. కాని కవి జీవితం పట్ల సాంఘిక బాధ్యతలేమీ లేవు. మన దేశంలో కవి ఆదర్శం — కవి జీవితం సన్నిహితంగా వుండే అవ కాశం తక్కువయింది. కేవలం ఆదర్శంకోసం కవిత్వం వ్రాయడమే తప్ప మరొక వృత్తిలేని కవికి మన సంఘం ఇచ్చేహోదా స్వల్పం. అందువేత కవి అయిన వాడు తప్పనిసరిగా వేరొక జీవనాధారం చూసుకోక తప్పదు. జీవనంకోసం ఏదో ఒక యితర వృత్తి నవలం బిస్తూ, ఆదర్శంకోసం రచన చేసేవాళ్లు మనకు దొరుకుతున్నారు. ఈ విధంగా ఇతర వృత్తుల నవలం బిస్తూ కవిత్వం వ్రాసేవారిని కొన్ని రకాలుగా వర్గీక రింపవచ్చును. (1) ఆదర్శంకోసం కవిత్వం వ్రాసే వారు, (2) కాలక్షేపానికి లేదా సరదాకొద్దీ వ్రాసే వారు, (3) డబ్బుకోసం వ్రాసేవారు. ఈ మూడు స్థాయిలలోను విజ్ఞాన, వినోదాలు కళాత్మకమైన విలువలు కవుల మానసిక పరిపక్వత, భావనాశక్తి, ప్రాపంచిక జ్ఞానాలకు తగ్గట్లుగా వుండాలని మనం ఆశించడం న్యాయం. నేటి కవులలో ఇందులో ఒక రకానికీ, రెండు రకాలకూ, మూడు రకాలకు చెందిన వారున్నారు. తాము నమ్మిన ఆదర్శంకోసం కవిత్వాన్ని చేబట్టి ఉన్నతస్థాయికి చెందిన కవులుగా సంఘంలో పరిగణింపబడి, ఇంతోఅంతో జీవనాధారంవుండే డబ్బు కోసం కవిత్వం వ్రాసేవారున్నారు. వారు ఆదర్శ కవి త్వాన్ని—అవసర కవిత్వాన్ని తమ మేధస్సులోని వేర్వేరు అరల్లోంచి తీసి అందించేస్తున్నారు. ఈ రకంగా వ్రాసే వారి కవిత్వంలో ఆదర్శానికి అవసరానికి మధ్యనుండే విలువలు చూపించాలని ఈ వ్యాసకర్త ప్రయత్నం.

కవుల విషయంలో కవిత్వ విషయంలో ప్రాచీను లకూ, ఆధునికులకూ చాలా తేడా వుంది. నేటి కవులు పూర్వకవులకంటె ఎన్నోరెట్లు స్వేచ్ఛగా జీవించ గలుగుతున్నారు. పూర్వకవులు కవిత్వాన్ని జీవికగా గ్రహించి, రాజుల నాశ్రయించి, వారి కోరిక మేరకు కవిత్వాన్ని రచించేవారు. కాని ఈనాడు ఒక వృత్తిలో వున్న కవి మరొకరి ఇష్టానికి లోబడి కవిత్వం వ్రాయ వలసిన అవసరం లేదు. ఒకవేళ అలా లోబడితే అది అతని బలహీనతకు గుర్తుగా మనం పరిగణించ వచ్చును. నేటి కవి తాను వ్రాస్తున్న కవిత్వం కు అతనికి కోరిన ఫలాన్ని లభింపచేయగలుగుతోంది. పూర్వం అలాంటి పరిస్థితి లేదు. పూర్వకవులకంటె నేటి కవులకు ప్రోత్సాహం చాలా విస్తృతమయింది. జీవితాన్ని వినాశనంగా మార్చిన ప్రపంచంలో కవి త్వాన్ని అందుకు ఉపయోగించిన కవిపుంగవులు నాడూ వున్నారు, నేడూ వున్నారు. ఆదర్శంకోసం నిలబడి 'మనుజేశ్వరాధముల కిమ్మ పురంబులు, వాహనంబులు' కొనుటకు ఇష్టపడని స్వాతంత్ర్యప్రియుల సంఖ్యలో నాటికీ నేటికీ తేడా స్వల్పం. కలిమి- బలిమిగల కవులకు గజారోహణాలు- గండపెండేరాలు నాడూ వున్నాయి. నేడూ వున్నాయి. తిరుపతి వెంకటకవులు తమ కవితాకన్యను ఏరికోరి తెచ్చి కనిపించిన వాడి కల్లా కట్టేరని ఒక విమర్శ. దానికి ఒకటే సమా ధానం. వారు కవిత్వం చెప్పి, మెప్పించి డబ్బు పుచ్చు కున్నారు. డబ్బు పుచ్చుకొని కవిత్వం చెప్పలేదు. ఒక వ్యక్తిని పొగడి అతనివల్ల పారితోషికం పుచ్చుకున్నా, ఒక వ్యక్తి కోరిన విధంగా కవిత్వంవ్రాసి పారితోషికం పుచ్చుకున్నా నైతికంగా ఒకటే అవుతుంది.

ఆధునిక యుగారంభంలో తెలుగు సాహిత్యాన్ని ప్రభావితం చేసిన ముగ్గురు విశిష్ట వ్యక్తులు కందు కూరి— గురజాడ—రాయప్రోలు. ఈ ముగ్గురూ

కవులే. ఆదర్శంకోసం రచనలు చేసినవారే. వారి రచన లన్నిటిలోనూ వారి వ్యక్తిత్వమే కనిపిస్తుంది. కాని ఇతరుల అధికారం కనబడదు. కవులుగా రెండు మూడు రకాల అంతస్థులు వారికి లేవు. అందుకే వారిని గురించి ఒకే రకమైన అవగాహన కలుగుతుంది. అందుకు కారణం వారికి వేరే జీవిక ఏర్పడ డమే. వీరిలో ఎవరికీ రాజుల దగ్గర, జమీందారుల దగ్గర ఆశ్రయం పొందవలసి రాలేదు. గురజాడకు విజయనగర సంస్థానానికీ ఉన్న సంబంధం కేవలం సాహితీపరమైనదికాదు. ఈ తరగతి కవులలో నిర్మల మైన ఆవేశం—స్వంతమైన అనుభూతీ లభిస్తాయి.

ఆధునిక యుగంలో తెలుగు సాహిత్యం అనేక ప్రభావాలకు లోనయింది. ప్రపంచంలోని వివిధ సాహిత్య ఉద్యమాల వెలుగులు తెలుగులో ప్రతిఫలించాయి ఈ తరంలో భావ కవులు, అభ్యుదయ కవులు ఆవిర్భవించేరు. భావ కవుల్లో చాలామంది సౌందర్యాన్వేషకులే. ఆ తృష్ణతీర్చుకోడానికి వీరు కవిత్వం వ్రాసేవారు. వీరి కవిత్వంలో సాంఘికప్రయోజనంకోసం చూడవలసిన పనిలేదు. కాకతాళీయంగా అది తటస్థపడవచ్చును. సాహితీ విలువలు తగ్గకుండా కళాత్మకంగా వ్రాయ డమే వీరి ఆదర్శం. కృష్ణశాస్త్రి—వేదుల—నాయని—నండూరి—బసవరాజు మొదలైనవారి భావకవిత్వం ఈ విషయం బుజువు పరుస్తుంది. భావకవిగా ప్రవేశించి ఆదర్శంకోసం రచనలుచేసే కవిగా మారిన వ్యక్తి కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ. సనాతన సంప్రదాయ పునరుద్ధరణ ఈ కవి ఆదర్శం. తన ఆలోచనా వాహినుల నన్నింటిని ఆ సాగరంవైపు నడపించిన వ్యక్తి విశ్వనాథ. ఈ కవి విషయంలో ఆదర్శం అవసరం సన్నిహిత మయ్యాయి. విశ్వనాథ ఆదర్శం కోసం స్వేచ్ఛగా చేసిన బహుళ రచనలు ఆర్థికంగా కూడా ఉపయోగపడ్డాయి. ఈ విషయంలో ఈ కోవకు చెందిన రచయితలు తెలుగునాట లేరు.

భావకవిగా తననీడలో అనేకమందిని చేర్చుకున్న వటవృక్షం కృష్ణశాస్త్రి. కృష్ణశాస్త్రి భావకవి మాత్రమేగాక అభ్యుదయవాది. కవిగా కృష్ణశాస్త్రిలో రెండు రూపాలు కనిపిస్తాయి. ఒకటి 'గగనపథవిహార విహంగమ' సదృశమైన స్వేచ్ఛామూర్తి. రెండవది ఇతరులు కోరేవిధంగా కవిత్వంవ్రాసే ప్రకృతి. ఇది స్థూలపరిశీలనకు లొంగే విభజనమాత్రమే. సూక్ష్మంగా చూస్తే రెండుచోట్లా కృష్ణశాస్త్రి ఒకేవిధంగా కనిపిస్తాడు. దానికి కారణం ఒక నిర్దిష్టమైన ఆదర్శానికి కట్టుబడకుండా, కళాత్మకమైన విలువ లను విడచి పెట్టకుండా వ్రాయడమే ననిపిస్తుంది.

'మ్రోయలేనింక లోకాల తీయదనము' అన్నా
'తోట పొలిమేర కాలువ నిదుర తొణకె' అన్నా
'కొండలకోనల కురిసే బంగారునీరు' అన్నా
'సడిసేయకే గాలి సడిసేయబోకే' అన్నా—

కృష్ణశాస్త్రి కవితామూర్తి ఒకేవిధంగా సాక్షాత్కరిస్తుంది. అంటే — తనలో నిగూఢంగా అంతర్వాహినియై వుండి, నిర్మలమైన ఆవేశం పొంగి పొరలినపుడు వెల్లువలా తరలివచ్చే కవితాశక్తి ఏవిధంగా వుంటుందో, తన అవసరంకోసం లేక ఇతరులకోర్కె తీర్చడంకోసం ప్రయత్నపూర్వకంగా వ్రాసేకవిత్వం కూడా ఇంచుమించుగా, ఆ స్థాయికి దగ్గరగా వుండేటట్లు చూసుకునే సాహితీ వ్యక్తిత్వం కృష్ణశాస్త్రికి వుందన్నమాట. కళాతృష్ణతో, సామాజిక అభ్యుదయాన్ని వాంఛిస్తూ రచనలు చేసే కవుల రచనలలో ఆదర్శం—అవసరం ఈ విధంగా ముడివడ్డాయనుకోవచ్చును.

అభ్యుదయకవులంతా సిద్ధాంతరీత్యా ఒక ఆదర్శానికి కట్టుబడ్డవారు. సామ్యవాద సమాజస్థాపన ఈ కవుల ధ్యేయం. వీరు ఏమి వ్రాసినా సమసమాజ నిర్మాణాన్ని మలచే తీరుగా వుండడం న్యాయం. కాని వీరుకూడా బ్రతకాలి. తమ ఆశయం నెరవేరేదాకా తమ కిష్టంలేని పెటుబడిదారీవర్గంతో చేయికలపక తప్పదు. ఉద్యోగం చేసినా, పెట్టుబడిదారీ పత్రికలకు వ్రాసినా, సినిమాలకు వ్రాసినా ఈ రకమైన భిన్నమనస్కత కనిపించక తప్పదు. కాని స్వచ్ఛమైన ఆదర్శవాదిగా ఇందులో ఏ ఒక్కదానికీ తలవంచవలసిన

అవసరం లేకుండా బ్రతకగలను అనుకుంటే మరొక దారి లేకపోలేదు. అలాంటివారు లేకపోలేదు. జీవనంకోసం కవిత్వాన్నే ఉపయోగించ నక్కర లేదు. ఈ దృష్టితో ఆలోచిస్తే ఈ తరగతికి చెందిన కొందరు కవుల ఆదర్శానికి అవసరానికి అంతరం కనిపిస్తుంది.

కవిగా శ్రీశ్రీ మనసులో నాలుగు అరలున్నా యని అనిపిస్తుంది. అభ్యుదయకవి, విప్లవకవి, సరదా కవి, అవసర కవి—వీరందరూ ఒక్క శ్రీశ్రీలోనే కన బడి నన్ను అందుకోండి చూదాం అంటూంటారు. అతనితో ఈ నాలుగు రకాల అవసరాలు తీర్చుకునే వారున్నారు.

మీ కోసం కలంపట్టి ఆకాశపుదారులంట
అడావుడిగ వెళిపోయే
జగన్నాథ జగన్నాథ జగన్నాథ రథచక్రాల్
భూమార్గం పట్టిస్తాను భూకంపం
పుట్టిస్తాను —

అన్న అభ్యుదయకవి శ్రీశ్రీలో అచంచల విశ్వాసం కనిపిస్తుంది.

మంటలచేత మాట్లాడించి
రక్తంచేత రాగాలాపన చేయిస్తాను-

అనే విప్లవ కవి శ్రీశ్రీ నినాదంలో దృఢదీక్ష కనిపిస్తుంది. అత్యున్నత కవితాశక్తితో బిగిసిపోయిన ఈ నినాదాలు అతనిని ఉద్యమనాయకుని చేసేయి. ఆదర్శం కోసం రాసిన కవిత్వం శ్రీశ్రీని మహాకవిగా నిలబెట్టింది. శ్రీశ్రీ కవితా వ్యక్తిత్వం పరిశీలిస్తూవుంటే 'డాక్టర్ జకీల్ అండ్ మిస్టర్ హైడ్' నవల చదువుతున్న ట్లుగా వుంటుంది. పరస్పర విరుద్ధమైన రెండు విభిన్న వ్యక్తిత్వాలు సాక్షాత్కరిస్తాయి. సరదాకోసం వ్రాసిన కవిత్వంలో శబ్దబ్రహ్మ శ్రీశ్రీ అనేకమైన ప్రయోగాలుచేసేడు. అది వాస్తవిక కవిత్వం వ్రాసినా, ప్రతీక కవిత్వం వ్రాసినా, ప్రాసక్రీడలు వ్రాసినా, లిమరుక్కులు వ్రాసినా— ఆకర్షణ అనేది కవితా గుణం. అయితే అభ్యుదయం అనే ఆదర్శంతో ఇవేవీ ముడిపడవు. అభ్యుదయానికి ఈ చిత్రకవిత్వాలకు చుక్కెదురు.

జీబ్రాకి అల్జీబ్రా చిహ్నాల
లాంకోటు సెంకోళ్ళు తొడిగి
సాహిత్యం సౌరోహిత్యంచేస్తే
నెజికాదు సర్రియలిజంరా సోదరా!'—

అంటే నిజమేనేమో ననుకోవాలి. అదేమిటని అడిగే వీలులేదు. అతను చెప్పినా దానివలన ప్రయో జనం లేదు. ఇది అభ్యుదయంలో చేయికలపదు. కేవలం సరదాకవిత్వం అవుతుంది. 'సర్రియలిస్టు కవితను నేను కాషువల్‌గా మాత్రమే రాశాను. సీరియస్‌గా రాయలేదు' అని శ్రీశ్రీ అన్నట్లుగా ప్రాచీన కవు లందరూ కూడా 'మేం సీరియస్‌గా రాయలేదు'— అంటే వారినట్లు మన నిర్ధారణ చేసుకోవాలి? గురజాడ కాషువల్ కవిత్వం కొంత, సీరియస్ కవిత్వం కొంత రాసేడా? గురజాడ అడుగుజాడ ఇదేనా!

అవసరం శ్రీశ్రీ కవిత్వాన్ని, అనేక రకాలుగా వినియోగించుకుంది. ప్రబోధగీతాలు, విషాద గీతాలు, ప్రార్థనగీతాలు, హరికథలు, ప్రణయ గీతాలు, జావళీలు, హాస్యగీతాలు - అన్నిరకాల పాటలు రాసేడతను. అందరి తోనూ పోటీపడి అందరిచేతా అభినందించుకున్నాడు. పెదవుల కదలిక ననుసరించి వ్రాయడంకూడా శ్రీశ్రీ కి బాగా అలవాటే. కొందరు అతన్ని అందుకే 'డబ్బింగు మహాకవి' అనడం కూడా కద్దు.

'పాడవోయి! భారతీయుడా! ఆడిపాడవోయి
విజయగీతిక!'

'గానుగమరలో చెరకుప్ప సిప్ప'

'కృష్ణా! రాధామనోవిహారీ! శౌరీ!'

'రఘురాముడు! రమణీయ వినీల ఘనశ్యాముడు!'

'హాయి హాయిగా జాబిల్లి వెండిదారాలల్లె'

'నినుచేర మనసాయెరా! నా స్వామి చనువార
దయసేయరా!'

'చుక్క పొడిచెను కుక్క అరిచెను భౌభౌభౌ'

ఈ విధంగా వైవిధ్యంగల గీతాలెన్నో రాసాడతను. తన ముద్ర ఎక్కడా పడకుండా, పట్టుకు దొరకకుండా శ్రీశ్రీ వ్రాసిన గీతాలు అతనివిగా తెలుసుకున్న వారిని మళ్లీ వినమంటాయి. అప్పుడు శ్రీశ్రీలోని రెండవ వ్యక్తి కనిపించడం జరుగుతుంది. 'కళ కళకోసంకూడా' అని అంగీకరింపకపోతే సిద్ధాంతరీత్యా ఈ గీతాల ద్వారా శ్రీశ్రీ ఆత్మవంచనకు గురికాకతప్పదు. 'కళ డబ్బుకోసం కూడా' అనుకుంటే శ్రీశ్రీ కత్తికి రెండువైపులా వాడే అనక తప్పదు. 'ఈ పాట ఎంత వేగిరం పూరి అయిపోతుందా. వాళిచ్చే డబ్బులు ఎప్పుడు చేతుల్లో పడుతాయా అనుకుంటాను' అనేటంత నిర్లిప్తంగా, చైతన్య రహితంగా కవిత్వం రాయగలిగితే అదీ మెచ్చుకోదగినదే కాబోలు! శ్రీశ్రీ ఆలోచింపక రాగముపాడే బేలకాడు. 'కలకానిది— విలువైనది' అయిన శ్రీశ్రీ జీవితంనుండి తెలుగుదేశం ఆశించింది కాలక్షేపం బఠానీలు కావు—వెలుగుల రవ్వల జడులు.

ఆరుద్ర అవతారమూర్తి. ఒకవర్గం వారితనిని ఆధునిక ఛాందసు డన్నారు. ఆయన మాత్రం మనస్ఫూర్తిగా నేను అభ్యుదయవాదిని అంటారు. ఎవరేమన్నా ప్రతిభావ్యుత్పత్తులుగల కవిగా తెలుగుదేశం ఇతనిని తలదాలుస్తుంది. 'గణనుడికట్టు' నుండి 'సమగ్ర ఆంధ్రసాహిత్యం' వఱకు అనేక విధాల తన శక్తి సామర్థ్యాలు నిరూపించుకున్న కవి ఆరుద్ర. ప్రాచీన—ఆధునిక సారస్వత సేవకు—ఈయన కలం నడుం కట్టుకుంది. ఈ అభ్యుదయకవి చమత్కారం లేనిదే కవిత్వం వ్రాయడు. తెలుగులో అభినవమణి ప్రవాళశైలి ప్రవేశపెట్టిన కీర్తి ఇతనికి దక్కుతుంది. అభ్యుదయ రచనల ద్వారా ఆరుద్ర ఉన్నత స్థాయి కవుల పంక్తిలో నిలవడం జరిగింది. అయితే ఈ కవి అభ్యుదయం విడచి అనేక ప్రయోగాలు చేయడంకూడా జరిగింది. ఇతనిలోని సారస్వతాంశ బహుముఖమైనది.

'స్వాతంత్ర్యం ఒక మేడిపండు
దరిద్రం మన రాచపుండు'

అన్న అభ్యుదయకవీ, ఇంటింటి పజ్యాలు, కూనలమ్మ పదాలు వ్రాసిన సరదాకవీ ఇతనిలో చోటు చేసుకున్నారు. అవసరం ఇతనిని ప్రజాబాహుళ్యానికి సన్నిహితంగా తీసుకుపోయింది. ప్రజల అభిరుచిని ప్రమాణంగా గ్రహించి, పాత్రల గుణశీలాలకు తగినట్లుగా ఏమి వ్రాయడానికైనా వెనుకాడని చిత్తశుద్ధిగల ప్రకృతి ఒకటి ఇతని కవితా వ్యక్తిత్వంలో బాగా పెరుగుతూంది. కదిలిపోతున్న రైలులో అందిన పెట్టె ఏదైతే దానిలోనే ఎక్కి అందులో శుభ్రమైన చోటు చూసుకునే గడుసు ప్రయాణీకుడిలా కనిపిస్తాడు ఆరుద్ర. ఎక్స్‌ప్రెస్ అయిన ఆదర్శాల లగేజీని నిర్వికారంగా ప్లాట్‌ఫారమ్‌పైన వదలి, ఇతరులచే నియతమైన కర్మను ఫలాపేక్షతో నిర్వహించే వేదాంతి ఆరుద్ర. అందుకే ఆయన—

'మగవాడు చేసేది ఏమిటి—ఆడపిల్ల ఇచ్చేది ఏమిటి' అని కూడా నిశ్చింతగా రాయగలడు.

తొలి తెలుగు కవులు సంస్కృతాన్ననుసరించో, తమ బుద్ధిపూర్వకంగానో శృంగారంలో అభినివేశం చూపించేరు. పురాణ ప్రబంధ యుగాలలో శృంగారం మేరమీరింది. అనవసరమైన కచకుచాది వర్ణనల మోజులోపడి ప్రతిభావ్యుత్పత్తులు గల కవు లనేకులు తమ శక్తిని వృథాగా వినియోగించేరు. తమకు గల సాంఘిక బాధ్యతను విస్మరించేరు. దక్షిణాంధ్రయుగం మరో మెట్టెక్కి క్షీణప్రబంధాలను కుమ్మరించింది—ఇది కదా శృంగారపరంగా పూర్వాంధ్ర సాహిత్యాన్ని గూర్చిన విమర్శ! ఈ మెట్టు తర్వాత మెట్టెక్కడం ఎందుకు జరిగింది? ఒకరికంటె ఇంకొకరు తమ ఆధిక్యతను నిరూపించుకోవడానికే గదా! పాతను దాటి కొత్తను చూపించడానికే గదా! ఈ లక్షణం ఏ యుగానికైనా సామాన్యమే. క్షీణప్రబంధాలపై ఆధునికుల విమర్శ ముఖ్యంగా రెండు అంశాలపై ఆధారపడివుంది. 1. అవినీతిని ప్రోత్సహించడం. 2. సాంఘిక బాధ్యతలను విస్మరించడం. అయితే ఈ క్షీణయుగప్రబంధాలన్నీ పాలకుల కోరికపై వ్రాసినవే. పాత్ర గుణశీలాలనుబట్టి వ్రాసినవే. సాహిత్యాన్నిబట్టి

జాతి చరిత్రను వ్రాయబూనుకునేవారు ఆ రసికత ఆ నాటి ప్రజాసామాన్యానికికూడా వుండన్నారు. అంటే క్షీణయుగ ప్రబంధాలను వ్రాసిన కవులు తమను పోషించిన రాజుల కోరిక తీర్చడంతోబాటు, ప్రజాభిరుచి కనుగుణంగా వుండే రచనలు చేసేరన్న మాట. ఆ విధంగా తమ వ్యక్తిగతాదర్శాలకు విరుద్ధంగా, ఉద్యోగధర్మాన్ననుసరించి రాసిన కవులు దోషులెలా అవుతారు? అని ప్రశ్న. కాని నేడెవరూ క్షీణయుగంలో నీచశృంగార కావ్యాలను— రచించిన కవులను ఉత్తమజాతి కవులుగా అంగీకరించడం లేదు. ఆ కావ్యాలను ఆదరించడం లేదు. తెలుగునాట అవసర కవిత్వం ఆ స్థాయికి చేరుకుంది. ఆబాల గోపాలం—బుద్ధి జీవులు సామాన్యులు అనే భేదం లేకుండా విని ఆనందిస్తూనే ఈ కవిత్వం ఉత్తమ స్థాయిని కోల్పోయిందంటున్నారు. అంటే ఆదరణ వేరు — గౌరవంవేరు — అన్నమాట. కాని ఒక బలహీనతతో ఈరకమైన కవిత్వం రాస్తూవుంటే, జనం మరొక బలహీనతతో ఆదరించడం జరుగుతూంది. బలహీనతకు అతీతంగా బలవంతమైన జాతిని తీర్చిదిద్దడమనే విశిష్టబాధ్యత ఈ కవులను ఒకచోట కాకపోతే మరొకచోట తలవంచుకొనేటట్లు చేస్తుంది. ఈ తరహాకు చెందిన ఆధునిక క్షీణప్రబంధ నిర్మాతలలో ఆరుద్ర అందె వేసినచేయి అనిపించు కున్నారు.

'కన్నుకొట్టిరమ్మన్నా—వెన్నుతట్టిలెమ్మన్నా
మనసులేద మగరాయ!—నామనసు తీర్చరావేర!'
'జలసా నీదే ఓ!—సరదా నాదే'
'తీస్కో కోకోకోలా వేస్కో రమ్మసారా!'
'ఐ లవ్‌యూ యూ అండ్‌యూ
నిషావాలా! కుషీకావాలా!'—

ఇవి అశ్లీలాలుకావు కాని బహిరంగ శృంగార ప్రదర్శకాలు. పాత్రల గుణశీలాలనుబట్టి కథాంశాలను బట్టి ఆలోచిస్తే ఇందులో ఏ ఒక్కటి మేరమీరిన రచనకాదు. ఇంకా ఆ పాత్రల గుణశీలాల కనుగుణంగా వ్రాయాలంటే ఈ పదజాలం చాలదు. వాస్తవికత కావాలంటే మరి కొంచెం ముందుకు పోవాల్సిందే. సామాన్యుని మానసికోల్లాసానికి ఈ వినోదం అవసరమే. కాని పదాలను వ్యాపారీకరిస్తూ (ఎలెక్ట్రిఫయి చేస్తూ) ఈ రకపు కవిత్వాన్ని అందించడానికి 'కమిట్' అయిన పెద్దలు కొందరున్నారు. ఈ బాధ్యత వారికి అందజేయవచ్చును. అభ్యుదయం అనే ఆదర్శానికి కట్టుబడి దానితో పొత్తులేని సంసారం చేయడంతో మొదలుపెట్టి కోరికలు అవసరం హద్దులు చెరుపుతూ పోతూ ..... ఎక్కడ కొంచెం సంయమనం చూపిస్తే అవసరాల పరిధి నిర్ణయించడం కావచ్చును. 'పల్లని చెట్టు [illegible]వ్యం కొంచేరాదు.'

అంగారాన్ని శృంగారాన్ని సమానంగా అందించగల కవిగా పేరుపొందినవాడు దాశరథి. తెలంగాణా ఉద్యమం ద్వారా ఈ కవి తెలుగు సాహిత్యంలో ఒక స్థానం స్థిరపరుచుకోవడం జరిగింది. 'మహాంధ్రోదయం' 'అగ్నిధార' 'అమృతాభిషేకం' లాంటి కావ్యాలలో ప్రాచీన ఆధునిక సంప్రదాయాలను జంటచేసి అనుసరించి అభిగమించిన సవ్యసాచి దాశరథి. ఇతని పైగల ఉర్దూ ప్రభావం 'గాలిబ్ గీతాలు' వంటి రచనలలో గమనించవచ్చు. దాశరథి అభ్యుదయవాది. అ. ర. సం.లో సభ్యుడు. ఇతని ఆదర్శం మార్క్సిస్టు సమాజంకాదు. ఇతని కవిత్వంలోని కొన్ని లక్ష్యాలలో సమసమాజ సాధన ఒక ఆదర్శంగా మనం అంగీకరించవచ్చును. మానవత సహానుభూతి - అభ్యుదయవాదిగా ఈవిధంగా ఆధునిక—సాహిత్యాన్ని విభజించి పరిశీలిస్తే దాశరథి కవిత్వం ఎక్కువగా కనిపిస్తుంది. అందుచేత కవితాకళను విజ్ఞాన విషయాలను జంటచేసి అందించే సాధనంగా దాశరథి ఉపయోగించుకున్నట్లు భావించవచ్చును. అవసరం దాశరథిని కూడా ఆకట్టుకుంది. స్వకీయమైన నియమాలను నిలబెట్టుకోవాలి అనే ప్రయత్నం ఇతని రచనలలో కనిపిస్తుంది. కాని నిర్మలమైన అనుభూతితోగాని, తీవ్రమైన ఉద్వేగంతోగాని సంబంధం లేక, ఇతరులు సృష్టించిన కృతకసన్నివేశాలకు, భావాలకు అనుగుణంగా వ్రాయడానికి సిద్ధపడ్డప్పుడు తన స్థాయికి తక్కువగా రాయకతప్పదు.

'మాట్లాడని మల్లెమొగ్గమాదిరిగా నడచిరా
నిశ్శబ్దం ఎరుగనట్టి నిమ్నగవలె విడిచిపో'—

లాంటి గేయాలను చదువుతున్నప్పుడు, లేదా వింటు నప్పుడు సాహిత్యాభిమానులకు కలిగే అనుభూతి—

'మల్లెపువ్వులు పిల్లనవ్వులు నీ కోసమే
ఇటు రావోయి! రావోయి! రాజా!'—వంటి

రచనలు చదివినప్పుడుగాని విన్నప్పుడుగాని కలుగదు. ఈ రెండుగేయాలే ప్రమాణంకాదు. ఇటువంటి అంతరంతో కూడిన రచనలను ఇంకా చూపించవచ్చును. అసలు ఈనాడు దాశరథికి అభ్యుదయాన్నిగూర్చి, ఆధునికతను గూర్చి ఏరకమైన భావాలున్నాయో నిష్కర్షగా చెప్పడం కష్టం. భాషావిషయికంగా బండిరాలు, అరసున్నల యుగాలకు వెళ్దామనే అభిలాష ఆయన ప్రసంగాల్లో అక్కడక్కడా కనిపిస్తోంది.

ఇంకొకరు డా. సి. నారాయణరెడ్డి. ఈయన అభ్యుదయ మధుర శృంగారకవి. కవిగా, రచయితగా, ఆచార్యునిగా సంఘంలో విశిష్టమైన స్థానాన్ని అలంకరించిన మనీషి. ఈ కవికూడా అభ్యుదయ రచయితే. ఇతని అభ్యుదయం సమన్వయం, శాంతి స్థాపన. ఇతని ఆదర్శం 'మధ్యతరగతి మందహాసం'లో కనిపిస్తుంది. సంస్కృత—ఆంధ్ర—ఆంగ్ల వాఙ్మయాలలో గల పాండిత్యంతోబాటు ఉర్దూ సాహచర్యం కూడా ఈతని సాహిత్య జీవితానికి వన్నె తెచ్చింది. ఎక్కువే అయినా ఇతని అభ్యుదయ రచనలు మధుర శృంగార కావ్యాల మరుగునపడక తప్పలేదు. ఈయన అభ్యుదయ కవుల యుగంలో అందివచ్చినా ఇతనిపై ప్రబంధిక, భావకవిత్వ ధోరణుల ప్రభావం హెచ్చు. అందుచేతనే 'నాగార్జున సాగరం' 'కర్పూర వసంత రాయలు' 'రామప్పగుడి'—వంటి మధుర శృంగార కళాఖండాలను సృష్టించగలిగాడు. 'సమదర్శనం', 'మధ్యతరగతి మందహాసం' మొదలైన ఆదర్శవాద రచనలకన్న పై గ్రంథాలు ఎక్కువ ప్రచారం పొందాయి. అందుచేతనే ఈ కవిలోని అంతశ్చేతన కేవలం కళా

సంబంధి అని మనం భావించవచ్చును. రచయిత—విమర్శకునిగా నారాయణరెడ్డి 'ఆధునికాంధ్ర కవిత్వము—సంప్రదాయము: ప్రయోగములు' వంటి రచనలతో సాహిత్యలోకంలో చిరస్థాయిగా నిలిచేరు. ఇన్ని జరిగి ఇంతటి ఉన్నత వ్యక్తిత్వాన్ని సాధించిన తర్వాత అవసరం నారాయణరెడ్డిని వరించింది. అవసర లోకంలో ఈ కవి సర్వాంతర్యామి. అందునా ఈ రోజుల్లో ఇందుగల డందులేడని సందేహం లేదు. కవిత్వంతో ముమ్మరంగా వ్యాపారంచేసే ఈ ధోరణిలో నారాయణ రెడ్డి సాహిత్య వ్యక్తిత్వం చాలా చోట్ల మసక మసకగా కనిపించడం జరుగుతుంది.

'పాడనా ప్రభూ! పాడనా!
పాటతో నీ మనసు కరగునా!'—అనే గేయాన్నీ
'ఓహోహో చేమంతీ! ఒయ్యారి పూబంతీ!
మురిపాల ముద్దబంతీ! నువ్వే నా రబ్బరుబంతీ!'

అనే గేయాన్నీ ఒక్క కవే రాస్తున్నాడంటే సాహిత్యలోకం విచారిస్తుంది. నేటి సినిమాలలో తక్కువరకం రచనలు చేస్తున్న వారిలో ఈ కవి అగ్రగామి.

ఇంతవరకు ఈ వ్యాసంలో కొందరు ప్రముఖ కవులు ఆదర్శంకోసం వ్రాసిన రచనలను—అవసరం కొద్దీ వ్రాసిన రచనలను పరిశీలించడం జరిగింది. సినిమా రచనలు పరిశీలింపదగినవా? వాటికి సాహిత్య స్థాయి ఉండాలని తర్కించడం సమంజసమేనా? అని చాలామంది అనుకోవచ్చును. సినిమా రచనలను పరిశీలనచేస్తూ గ్రంథం వ్రాయాలనే ప్రయత్నం ఆరుద్ర—ఆత్రేయ చేయదలచినట్లు వారి ప్రసంగాలవలన తెలుస్తూంది. యువభారతి వారి 'మహతి' వ్యాస సంకలనంలో సినిమా రచనలకు సంబంధించిన నాలుగు వ్యాసాలున్నట్లు ప్రకటించారు. ఈ ప్రయత్నాలవలన సినిమా రచనలను సాహిత్యదృష్టితో పరిశీలించడం జరుగుతోందని భావించవచ్చును. ఈ వ్యాసంలో సినిమాలకు వ్రాస్తున్న వారిలో కొంతమందినిగూర్చి మాత్రమే ప్రస్తావించడం జరిగింది. ఒక విశిష్టమైన ఆదర్శం చేత ప్రభావితులై కలంపట్టి, తెలుగు సాహిత్య లోకాన్ని కదలించి ఉన్నతస్థాయి కవులుగా పేరుపొంది, తరువాత సినిమా కవులుగా మారినవారిని గూర్చి మాత్రమే ఈ పరిశీలన సాగింది. అయితే ఈ కవులందరూ సినిమాలలో తక్కువస్థాయి రచనలే చేస్తున్నారా? వారి ఆదర్శాన్ని—స్థాయిని పూర్తిగా విడచిపెట్టారా? లేదు. ఆ విషయం ఈ వ్యాసంలో ప్రస్తావింపబడలేదు. ఈ వ్యాసం సినిమా రచనలకోసం ఉద్దేశింపబడినది కాదు.

సమ సమాజ స్థాపన ఏ విధంగా ఒక ఆదర్శమవుతుందో, సాహిత్యస్థాయిని నిలుపుకోవడం కూడా అదే విధంగా ఒక ఆదర్శమవుతుంది. అందుచేత ఈ కవులందరూ ఆదర్శానికి కట్టుబడ్డవారే. సాహిత్యం బుద్ధిజీవులకు పరిమితమైనది. సినిమా జనసామాన్యానికి అందుబాటులో వున్నది. కాబట్టి తమ ఆదర్శాన్ని జనసామాన్యానికి చేరువగా తీసుకుపోవాలనే ఉద్దేశంతో ఈ కవులు సినిమాలోకంలో ప్రవేశింపవచ్చును. సినిమా వ్యాపారసంస్థ కాబట్టి—దాని పరిధులకు లోబడి—కొంచెం కొంచెంగా ప్రజలకు ఆదర్శ కవిత్వాన్ని అందిస్తూ—క్రమక్రమంగా ప్రజల అభిరుచిని తమ ఆదర్శంవైపు మరలిస్తూ—సినిమా రచనను పూర్తిగా సాహిత్య స్థాయికి తీసుకొనిరావడం ఈ కవుల ఉద్దేశ్యం అని ఎవరైనా అనవచ్చును. కాని ఆ ప్రయత్నంలో వీరు సాధించిన ప్రగతికంటె—వీరు సంస్థకు లోబడినవైనం ఎక్కువగా కనిపిస్తూంది. ఆదర్శపూరితములైన వీరి రచనలు తక్కువమంది చదువుతున్నారు. అవసరంకొద్దీ రాసినవి రేడియోలలో, మైకుసెట్లలో, సినిమాహాళ్లలో ప్రతిరోజూ అనేకసార్లు ప్రజ అందరి చెవులలో మ్రోగుతున్నాయి. ఇందువలన రెండు ముఖ్యమైన ప్రమాదాలున్నాయి. (1) యువతరానికి ఈ కవుల ఉన్నతస్థాయి సాహిత్య వ్యక్తిత్వం కాక సామాన్యమైన సినిమా రచయిత మాత్రమే గాఢంగా పరిచయమయ్యే అవకాశం వుంది. యువతరానికి ఈ కవులపట్ల కలిగే మొదటి అనుభూతి చౌకబారుగా వుంటుంది. ఆ విధంగా సంఘంలో, నమోదవుతూన

నూతన శక్తులను ప్రభావితం చేయడం అనే మహత్తర అవకాశాన్ని ఈ కవులు జారవిడుచుకుంటున్నారు. (2) ఇతరులు కోరిన కృతక సన్నివేశాల కన్నిటికీ అతుక్కునేటట్లు చితుకులబొంతలు వ్రాసే మనస్తత్వానికి అలవాటు పడిపోతే, భ్రమరకీట న్యాయంగా, ఈ కవులలోని ఉత్తమమైన కవితాశక్తి క్షీణించే ప్రమాదం లేకపోలేదు. అందుకే ఈ కవులు మొదట్లోలాగ బలమైన ఆదర్శంతో కూడిన రచనలు చేయలేక పోతున్నారు. ఎంతటి ప్రతిభావంతుడైనా స్వభావ విరుద్ధమైన పనికి ఇష్టంగానో, అయిష్టంగానో అలవాటుపడితే స్వభావంలో మార్పు కలిగే పరిస్థితి ఏర్పడుతుంది. ఆదర్శం—అవసరం పరస్పర విరుద్ధమైనవి. ఈ రెంటిలో ఒకదాని ఉన్నతికోసం రెండవదానిని వదులుకోక తప్పదు. చలం—కొడవటిగంటి—రా. వి. శాస్త్రిలాంటి చిక్కని ఆదర్శంగల రచయితలలో ఈ రకమైన ద్విపాత్రాభినయం కనబడదు. వారు తమ ఆదర్శాన్ని ప్రజలకు సన్నిహితంగా తీసుకుపోవడానికి విడవకుండా రచనలు చేసేరు— చేస్తున్నారు. ఒకటి రెండు రచనలద్వారా ఎంత తీవ్రమైన ఆదర్శాన్ని అందించినా అది చాలదు. ఆదర్శ భావన ప్రజాహృదయంలో అవిచ్ఛిన్నంగా సంచరించేటట్లు బలీయమైన రచనలు చెయ్యాలి.



# పండితరాయల కారణ కల్పనలు

డా. మహీధర నళినీమోహన్

నిజానికి 'కారణ కల్పన' అనే అలంకారం ఏదీలేదు. అసలు కారణం ఒకటి అయితే, దానిని వదిలిపెట్టి సరికొత్త కారణాన్ని కల్పించి చమత్కరించడాన్ని సూచించడానికి 'కారణకల్పనాలంకారం' అని పేరు పెట్టాలని నా సూచన.

ఉదాహరణకి విజయవిలాసంలో ప్రథమాశ్వాసంలో 73 వ పద్యం తీసుకుందాం.

ఉ॥ వేడుకనప్పురీహరుల
వేగము గన్గొని లేళ్ళు గాడ్పుతో
గూడిచనన్వలె న్మనము
కూడగనోపక యోడినట్టి వా
రోడని వారిమోచుటని
యొద్దిక బందెము నైచికూడ లే
కోడెనుగాక, మోయగ—
ప్రయోజనమేమనిలుం గురంగముల్

ఇంద్రప్రస్థపురంలోని గుర్రములు వాయువేగం గలవి అనీ, లేళకన్న చాలావేగంగా పరుగెత్తగలవి అనీ సూచించడానికి కవిచేసిన బహుచమత్కారమైన కల్పన ఇది.

వాయుదేవునికి లేడి వాహనం. ఇది పురాణ సమ్మతమైన విషయం. లేడి వాయువును మోస్తూ ఉండడానికి సరికొత్త కారణాన్ని కల్పించాడు చేమకూర.

వేగానికి ప్రసిద్ధములైన గాలి, లేడి పందెం వేసుకున్నాయట. ఏమని? ఇంద్రప్రస్థపురంలోని గుర్రములతో సమానంగా మన ఇద్దరిలో ఎవరు పరుగెత్తగలరో చూద్దాం. ఓడినవారు నెగ్గినవారిని ఆజన్మాంతమూ మోస్తూ ఉండాలి అని పందెమట. పరుగెత్తి చూశాయి. లేడి ఓడిపోయింది. గాలి సమంగా పరుగెత్తగలిగింది. అందుచేతనే వాయుదేవుణ్ణి లేడి మోస్తూ ఉంటుందిట!

ప్రాచీన అలంకారికులు దీనిని ఉత్ప్రేక్షాలంకారంగా భావించారు. దీనిని కేవలం ఉత్ప్రేక్ష అనడం నాకు నచ్చలేదు. [illegible] చేసి దీనికి 'కారణ కల్పనాలంకారం' అని గానీ, 'కారణ కల్పనోత్ప్రేక్ష' అని గాని పేరుపెట్టాలని నా సూచన.

'అలంకార శాస్త్రాన్ని మార్చడానికి నువ్వెవడివయ్యా! దానిని ముట్టుకోడానికి వల్లా?' అంటారేమో.

అవునయితే జయదేవుని చంద్రాలోకాన్ని మార్చడానికి అప్పయ్యదీక్షితులు ఎవరటా?

అప్పయ్యదీక్షితుని కువలయానందాన్ని మార్చడానికి పండితరాయ లెవరటా?

ఉపద్రష్ట జగన్నాథ పండితరాయలు ఎవరు అంటారా?

మా గోదావరి తీరంవాడు.

మా కోనసీమవాడు.

మా ముంగండ అగ్రహారీకుడు.

మా వేగినాటి వాడు.

చాలా?

ఇంతకీ చెప్పొచ్చేదేమిటంటే పండితరాయల భామినీ విలాసంలో బహురమ్యమైన కారణ కల్పనలు కావలసినన్ని ఉన్నాయి.

**చూతలతిక**

ముంగండ పెద్దచెరువు గట్టుని ఆనుకుని, సంపెంగ డొంకల పక్కగా ఉపద్రష్ట పేరమభట్టు గారి మామిడితోపు కన్నుల పండువుగా ఉంది. మిసిమి

వయస్సులోఉన్న జగన్నాథుడు గన్నవరంనుంచి తిరిగి వస్తూ అలిసిపోయి తమ తోటలో అడుగుపెట్టేడు. చల్లటి మామిడిచెట్ల నీడ క్షణంలో శ్రమని పోగొడుతోంది.

దాహంకోసం కోతిపిర్ర మామిడి చెట్టు కిందఉన్న పాక దగ్గరకు వెళ్లేడు. తలుపు తట్టేడు.

ముద్దబంతి పువ్వులాంటి పాలికాపు కూతురు తలుపు తీసింది.

జగన్నాథభట్టుని చూచి విరబూచిన రేలచెట్టులా సిగ్గుపడింది.

'ఈ పిల్ల ఇంత పెద్ద దెప్పుడైందీ?' అని రెప్పవేయకుండా చూశాడు జగన్నాథుడు.

'ఎన్నడు నేరిచెన్ బెళుకు లీ చెలి కన్నులు
కారు మబ్బులన్నన్న కురుల్
పిరుందు బటువై పటువైఖరి గైకొనెంగదే
మొన్నగదమ్మ పిన్న మొన మొల్కలు......'

అనుకుని, అప్రయత్నంగా లోపలికి అడుగువేయబోయాడు.

'అయ్య ఇంటో లేడండి' అంది ఆ పిల్ల బెదురుతూ. తియ్య మామిడిచెట్టు పలవలలో కోయిల పంచమరాగాలాపన మొదలుపెట్టింది. జగన్నాథుడు తలపైకెత్తి చూశాడు. ఏదో సన్నటి నాజూకైన లత ఆ చెట్టుని అల్లుకుని ఉంది. తెల్లటి పువ్వులు విరబూచి ఉన్నాయి. చల్లగాలికి ఆ తీగ కొసలు సుతారంగా కదులుతున్నాయి. లతని విడిచి పిల్లనీ, పిల్లని విడిచి లతనీ చూశాడు అతడు.

ఈ పిల్ల చూత లతికా?

అయితే తానెవరూ?

సమీరుడా?

లత తన శిరస్సును అడ్డంగా ఆడిస్తోంది ఎందుకూ?

సమీరసమాగమనం ఆమెకి నచ్చలేదో?

ఇతరులు చూస్తారని సిగ్గుపడిందో?

మధురమైన కల్పన మనస్సులో మెదిలింది.

సమీరుడు ఆమ్రలతికను సమీపించాడు.

'పిల్లా! నేను చాలా దూరంనుంచి—మలయ పర్వతంనుంచి—వస్తున్నాను' అన్నాడు.

మంచి గంధపువాసన గుప్పుమంది.

'రసికుడే సుమా' అనుకుంది లత.

'అలిసిపోయాను' అన్నాడు సమీరుడు.

'అయితే నన్నేం చెయ్యమంటావు?' అంది లత.

'ఈ పూటకి ఇక్కడ— నీ దగ్గర—విశ్రమించనిస్తావా?'

'అమ్మో!' అని రెప్ప లప్పళించింది లత.

'వద్దు—వద్దు—వద్దు' అని ముద్దు ముద్దుగా తల అడ్డంగా ఆడించింది.

చిరశ్రాంతోదూరా దహ
ముపగతో హంత మలయాత్
తదేకం త్వద్గేహే తరుణి!
పరిణేష్యామి దివసమ్
సమీరేణోక్తైత్వం
నవకుసుమితా చూతలతికా
ధునానా మూర్ధానం
నహినహినహీత్యేవ వదతి.

మత్తేభవిక్రీడితం

మలయక్ష్మాధరమ్మునుండి
పయనమ్మై మ్మెంతయుం డస్సి నీ
నెలవుంజేరితి నొక్కరాత్రి
యిచటన్ నిద్రింపనీవే చెలీ!
అలివేణీ! యని పుష్పితామ్రలతికన్
అర్థించె, మందానిలుం
డలనోక న్నది వద్దు వద్దని
శిరస్సడ్డమ్ముగా నూచెడిన్.

* * *

చాతకం

చాతక పక్షులు ఎంత దాహంగా ఉన్నాసరే మేఘంనుంచి జారిపడుతున్న నీటి బిందువులను తప్ప

నేలమీదఉన్న నీటిని తాగవని కవి సమయం. చాత కానికి ఈ విచిత్రమైన నియమం ఏమిటి? దానికి కారణం వివరిస్తున్నాడు పండితరాయలు.

నూతులలో బహు స్వల్పంగా ఉంటుంది నీరు. కనుక దానిని ముట్టుకోవడం పరువుతక్కువపని.

సరస్సులు చూడటానికి బిలములవలె ఉంటాయి. కనుక వాటికేసి చూడదు.

కోనేరులలో నీచులు కూడా స్నానం చేస్తారు. కనుక వాటిని తాకదు.

స్వచ్ఛంగా చల్లగా మధురంగా ఉండే ఆకాశ గంగానదీ జలములనుకూడా మూచూడదు. ఏమంటే, ఆ నది విష్ణుమూర్తి కాలిలోనుంచి కదా పుట్టినది? కాళ్లు కడుగు నీళ్లు తాగుతుందా?

మహాసముద్రాలలోని నీరు త్రాగకూడదా అంటే, అవి అగస్త్యమహాముని ఆపోశనపట్టి ఉమిసిన ఎంగిలినీళ్లు అయిపోయె.

కనుక, అభిమానవతి అయిన చాతకపక్షి ఈ భూమిమీది జలములను వదిలిపెట్టి, ఉన్నతుడైన ఘనుని పయస్సులనే వాంఛిస్తుందిట ఎల్లప్పుడూనూ.

**శార్దూల విక్రీ**

వాపీ స్వల్పజలా సరోబిలసమం
నీచావగాహో హ్రదః
స్వచ్ఛస్వాదు సుశీతలా
త్రిపథగా వైకుంఠ పాదాగ్రజా
నీచక్షారతరో మహాన్
జలనిధిర్గండూషమాత్రం మునే
స్తన్మానీ ఖలు చాతకో
జలముచా ముచ్చైః పయో వాంఛతి

**మత్తేభ విక్రీడితం**

జలమత్యల్ప మటంచు కూపముల,
నీచంబంచు కోనేరులన్
బిలసామ్యం బనుచున్ సరోవరములన్,
శ్రీనాథపాదాగ్ర సం
స్ఖలితం బంచును గంగ,
వార్ధిమునిచే గండూషితంబంచు త
త్పరిలంబానక చాతకంబు కొను
నుచ్చాంభోద ముక్తాంబువుల్.

* *

**పద్మము**

చంద్రుని చూడగానే తామర పువ్వులు ముడుచుకు పోతాయని కవి సమయం. దానికి కారణం వివరిస్తున్నాడు.

పద్మం లక్ష్మికి నివాసమని మూడులోకాల లోనూ ప్రసిద్ధికెక్కి పోయింది. అది నిజమా కాదా అని తరచి చూచేవాడు లేడు. ఈ ప్రశస్తి విని రాజు (చంద్రుడు, నృపతి) కర ప్రసారంచేస్తే (వెన్నెల కురిపిస్తే దేహి- అని చెయ్యి జాచితే) ఆయన కివ్వడానికి నా దగ్గర ఏమీ లేదే, మొగం ఎల్లా చూపించేదీ అనే సిగ్గుతో పద్మం మొగం ముడుచు కుంటుందిట.

**వసంత తిలక**

లక్ష్మ్యనివాస ఇతివారిరుహం ప్రసిద్ధి
రన్వేషితాం కతిపయా విరళాస్తు సంతి
రాజ్ఞి ప్రసారిత కరే కి మహందదామి
సంకోచితం వదన మంబురుహై రితీవ.

**చంపక మాల**

కలుముల ముద్దుగుమ్మకిది
కాపురమంచు ప్రసిద్ధి కెక్కనీ
జలజము—నిక్కమాయని విచారణ
చేసెడు వారులేరు— త
మ్ముల దెసగాంచి రాజు కరముల్
ప్రసరింపగ నే మొసంగగా
గలమను సిగ్గుచేత ననగా
వదనమ్ము ముడింగె తమ్మికిన్.

* * *

**కాకులు**

పట్టాలమీద రైలు పరుగెడుతున్నప్పుడు అయే చప్పుడు ఒక్కొక్కళ్లకి ఒక్కొక్క అర్థం

ఇచ్చే మాటలు స్ఫురించినట్లు కాకి అరుపు ఒక్కొక్క భాషవారికి ఒక్కొక్కలా వినిపిస్తుంది. పండితరాయలకి 'వయం కాకాః—వయం కాకాః' అని వినిపించింది. అంటే 'మేము కాకులం—మేము కాకులం' అని అర్థం. తాము కాకులమన్న సంగతి గొంతు చీరుకుని చెప్పవలసిన పని ఏమిటి? దానికో చక్కని కారణం కల్పించాడు కవి.

సూర్యుడు నిర్దాక్షిణ్యంగా చీకట్లని నాశనం చేస్తాడు. కాకులు నల్లగా ఉండడంచేత అవికూడా చీకట్లు అనుకుని సూర్యుడు చంపేస్తాడేమో అనే శంకతో 'మేము చీకట్లము కాము మహాప్రభో! వట్టి కాకులము సుమా!' అని గట్టిగా సూర్యుడికి విని పించేలా అరుస్తున్నాయట!

సంస్కృతపు కాకులు 'వయం కాకాః' అని అంటే అన్నాయేమోగాని తెలుగుకాకులుమాత్రం 'కావు కావు'మనే అంటాయి.

**అనుష్టుప్**

వయంకాకా వయంకాకాః
కిం రుదంతీతి వాయసాః?
తిమిరారి స్తమో హంతి
శంకయా తంక మానసాః

**ఆటవెలది**

కాకులెల్లవేళ కావు కావు మటంచు
నేడ్చుచుండు దానికేమి కతము?
తిమిరవైరి తమ్ము తిమిరమంచు భ్రమించి
చంపివేయునన్న శంకవలన

* * *

**వంగ వేశ్యలు**

బెంగాలీ భోగంపడుచులతో పండితరాయలకి ఎప్పుడు పరిచయ భాగ్యం కలిగిందో తెలియదుగాని, వాళ్లమీద ఒక చక్కని శ్లోకం వ్రాశాడు. వాళ్ల కన్నుల సొగసుముందర లేళ్లు నిలువలేక దేశత్యాగం చేశాయట. అందుకనే లేళ్లు అడవులలో తలదాచు కుంటాయి.

వాళ్ల రొమ్ముల పొంకం ముందర తమ కుంభములు ఎందుకూ పనికిరాక ఓడిపోయినప్పటికీ ఏనుగులు సిగ్గూ బిడియం లేకుండా, మదించి తిరుగుతున్నాయట. మూర్ఖుడు ఓడిపోయినా గర్వం విడువడు కదా!

**మందాక్రాంతా**

యాసాంద్రుష్ట్యా నయన సుభగం
వంగవారాంగనానాం
దేశ త్యాగః పరమ కృతిభిః
కృష్ణసారై రకారి
తాసామేవస్తనయుగజితాః
కుంభినః సంతి మత్తాః
ప్రాయోమూర్ఖః పరిభవ
విధౌ నాభిమానం విధత్తే.

**ఉత్పలమాల**

వంగవిలాసినీ మణుల
వాలు కనుంగవ సొంపుగాంచి సా
రంగము దేశమున్ విడచె—
రమ్యతరమ్మగు వారి గబ్బి చ
న్నుంగవ కోడియున్ విడువ
నొల్లదు గర్వమొకింత మత్తమా
తంగము—మూర్ఖుడోడియు
మదమ్ము రవంతయు వీడడెన్నడున్.

* *

**ఏనుగులు**

మహారాజుల మొగసాలలలో మత్తేభములు ఎన్నెన్నో అవమానములకు గురి అవుతున్నాయట. కాలి గొలుసులతో బంధింపబడుతున్నాయి. అంకుశంతో తీవ్రంగా పొడువబడుతున్నాయి. మావటి వాని కాలి తాపులు తింటున్నాయి. అదలింపులు ఓర్చుకుంటు న్నాయి. ఇన్నివిధాల అవమానాలకు గురి అవుతున్న ప్పటికీ ఏనుగులు రాజభవనాలలో ఎందుకు ఉంటు న్నాయి? సింహపు భయం చేతనట! సింహములు సహ్యములు అయితే ఇక్కడ ఒక్క క్షణంకూడా నిలువవట.

**వసంత తిలక**

ఆలాన బంధన మథాంకుశ తీవ్రఘాత
మాధోరణస్య చరణాహతి తర్జనేచ

కంఠీరవో యది సహేత మదావళానాం
పూగః కుతః క్షితిభుజాం సదనాంతరేషు.

## మత్తేభ విక్రీడితం

పదబంధంబులు, కర్కశాంకుశపు
తీవ్రాఘాత సందర్భముల్,
కదుముల్ కట్టెడు మావటీని
చరణాఘాతంబులన్, సర్వదా
అదలింపుల్ సహియించి,
సింగపుభయం బావంత లేకుండినన్
మదదంతావళయూథమేల నిలచున్
ధాత్రీశు మోసాలలన్?

*    *    *

## తుమ్మెద

జగన్నాథుడు ఎల్లప్రాయంలో ఎన్నెన్నో సంస్థానాలను సందర్శించాడు. అక్కడి రాజుల అరసికత్వము, పండితుల మాత్సర్యమూ వగైరాలు అతడికి నచ్చలేదు. వాటి నన్నింటినీ విడిచిపెట్టి కల్పశాఖివంటి ఢిల్లీ దర్బారును వెతుక్కుంటూ వెళ్లేడు. ఈ విషయాన్ని సూచిస్తూ భ్రమర భ్రమణాన్ని వర్ణిస్తున్నాడు.

తుమ్మెదకి ప్రసిద్ధమైన పువ్వులేవీ నచ్చడం లేదట. అందుకు చిత్రమైన కారణాలు చూపిస్తున్నాడు.

మొగలి పువ్వులో సౌరభ్య సంపత్తి అపారంగా ఉన్నప్పటికీ ఒంటినిండా ముళ్లు ఉన్న కారణంచేత, దాని దగ్గరకు వెళ్లడం లేదట.

దోషోదయమునందు ఆనందించే దుర్లక్షణం కలిగి ఉన్న కారణంచేత కలువ పువ్వుల దగ్గరకు వెళ్లడం లేదట. దోష శబ్దానికి రాత్రిఅనీ, దోసగు అనీ రెండు అర్థాలు. కలువలు రాత్రి పూటనేకదా వికసించడం. కలువలకు 'కుముదిని' అనే శబ్దాన్ని వాడడంలోకూడా ఔచిత్యం ఉంది. కు+ముదిని అని విడదీస్తే చెడువిషయములయందు సంతోషము కలది అని ధ్వని.

కలాత్ముని చూచి వికలం అవుతాయనే కారణంచేత తామర పువ్వులను విడిచిపెట్టిందిట తుమ్మెద. చంద్రుని చూడగానే తామరలు ముడుచుకుంటాయి కదా. చంద్రునికి కళానాథుడనీ, పద్మములకు పంకేరుహములనీ, ముడుచుకు పోవడానికి వికలం అవడం అనీ ప్రయోగించడం సాభిప్రాయం. కళానాథుణ్ణి చూచి కళలేనివి (వి+కల) అవుతాయట. అవి బురదలో పుట్టినవి కనుక అవి మరలా ఎందుకు ప్రవర్తిస్తాయి?

మిగిలిన పువ్వులమీద అంతకుముందే ఏవేవో పురుగులు అడుగుపెట్టిన జాడలు కనిపిస్తూ ఉండడం చేత వాటి దగ్గరకు వెళ్లడానికి ఆత్మాభిమానం అడ్డు వస్తోందిట.

ఓ కల్పవృక్షమా! నీవు కనబడక పోవడంచేత భృంగం కాలు గాలినట్లు తిరుగుతోంది.

## శార్దూల విక్రీడితం

కేతక్యః కటుకంటకాః
కుముదినీ దోషోదయాన్ మోదతే
జాయంతే వికలాః కలాపతి పునః
పంకేరుహాం పంక్తయః
అన్యాని ప్రసవాని షట్పద
పదన్యాసై రవాంచి క్వచిత్
భృంగో భ్రామ్యతి కల్పవృక్ష!
విపదా మంతం భవంతం వినా.

## మత్తేభ విక్రీడితం

మొగలిన్ కంటక భీతిచే,
కుముదినిన్ పొల్పొందు దోషోదయం
బగుచోనంచు, కలాత్ముగాంచి
వికలం బౌనంచు పంకేజముస్
అగుపించుస్ పరపాద చిహ్నము లటం
చన్యప్రసూనంబులన్
తగులంబోనక షట్పదంబు
తిరుగున్ కల్పంబు కాన్పింపమిన్

*    *

## చంద్రుడు

మన్మథుణ్ణి దహించివేసిన మహేశ్వరుని మూడవకన్ను క్రిందనుంచి సెగపెడుతూఉంటే శీతకరుడు ఎల్లా సహించుకోగలుగుతున్నాడు? శివ జటాజూటంలో పరిభ్రమించే వియద్వాహిని చల్లని తుంపు

రులు చిమ్మి, చల్లబరుస్తూ ఉండడమే దీనికి కారణ మట!

**ఆర్యా**

స కిము సహేత సుధాంశుః
స్మరహర భాలానల జ్వాలాః
శిశిరైః శీకర నివహైః
సించతి సురనిమ్నగా నోచేత్.

**కందము**

స్మరహరుని కంటిమంటల
నెరసులలో శీతకరుడు నిలువంగలడా?
సురకల్లోలిని చల్లని
చిరుతుంపురు లుమిసి తడియజేయకయున్నన్.

* * *

**గుణప్రశంస**

గుణం అనే మాటకుగల అర్థద్వయాన్ని ఉపయోగించుకుని వీణమీద చక్కని కల్పన చేశాడు పండితరాయలు.

ఎండిన వెదురుకఱ్ఱ, సారవిహీనమైన ఆనప బుర్ర మాత్రమే కలిగి, అలంకార రహితమైన వీణ ఒకే ఒక్క గుణం (తీగ) కలిగిఉన్నప్పటికీ రాజరమణుల నీరంధ్రపీనస్తనద్వంద్వమును ఒరుసుకుని సుఖిస్తోందిట.

పున్నమి వెన్నెలలాగ మెరుస్తూన్న ముత్యాల రాశులు పొదిగినదైనప్పటికి నిర్గుణమైన (తీగలు లేని) వీణకి ఆ యోగ్యత లేదు కదా!

**శార్దూలవిక్రీడితం**

వీణాప్యేకగుణేన రాజరమణీ
నీరంధ్ర పీనస్తన
ద్వంద్వే ఖేలతి శుష్కదారు
నిచయా నిస్సారతుంబీఫలా
చంచత్పార్వికశర్వరీ
పరివృఢప్రౌఢప్రభాభాసురం
ముక్తాజాత మహీహ నిర్గుణతయా
యోగ్యం న సంభావ్యతే

**ఉత్పలమాల**

ఎండిన డొల్లకఱ్ఱ, రసహీనపు
టానపబుర్ర మాత్రమే
యుండిన వీణకొక్క గుణముండిన
చాలును రాకుమారి చ
న్గ్గొండల తాండవించు—నవకోమల
మౌక్తికమండల ప్రభా
మండితమయ్యు పొంద దరమా గుణ
హీనపువీణ కారుచుల్?

* * *

**చలికాలం**

జగన్నాథుడు ఢిల్లీ దర్బారులో తన అపూర్వ పాండిత్యకవిత్వ సంపదతో వీరవిహారం చేస్తున్నాడు. షాజహాన్ చక్రవర్తి పరవశుడై వింటూ, పుష్యమాసపు చలిగాలికి తెలివివచ్చి, చెయ్యిజాచేడు. హాజరుగాఉన్న విలాసవతి బంగారు హుక్కాగొట్టం అందించింది. వెచ్చనిపొగ పీలుస్తూ, మందహాసంచేసి 'ఈవేళ చలి ముమ్మరంగా ఉందికదూ?' అన్నాడు క్రీగంట ఆ పిల్లని అపేక్షగా చూస్తూ.

జగన్నాథుడికి ఒంటిమీద పలుచని నూలు బట్టలేగాని వెచ్చని ఉన్నిశాలువలు లేవు. చలి వణికిస్తూ ఉంటే 'నీకేమయ్యా పెట్టిపుట్టేవు' అని మనస్సులోనే అనుకుని, ఢిల్లీచలిని వర్ణించడం మొదలుపెట్టేడు.

చలిబాధ వల్లనేమో అన్నట్లు పగళ్లు పొట్టివి అయాయిట! వస్తువులు (చాలాభాగం) వేడికి పెద్దవి కావడమూ, చలికి చిన్నవి కావడమూ సహజమే. ఈ లక్షణం పగళ్లకికూడా సంక్రమించిందిట.

తెలుగుదేశంలోకన్న బాగా ఉత్తరానఉన్న కారణంచేత ఢిల్లీలో దివారాత్రభేదం చాలా ఎక్కువగా ఉంటుంది. కొత్తగా ఢిల్లీ వచ్చినవారికి ఈ భేదం మరింత కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది.

పగళ్లు పొట్టివి కావడానికి శీతబాధ కారణంగా చూపించాడు సరే, మరి రాత్రిళ్లు పొడుగు అవడానికి ఏం కారణం చూపిస్తాడో? శర్వరి అంబరాన్ని శీఘ్రంగా విడిచిపెట్టడం లేదట. శర్వరి అంటే రాత్రి అనీ, ఆడది అనీ రెండు అర్థాలు. అంబరం అంటే ఆకాశం అనీ, బట్టఅనీ అర్థాలు. చలి రాత్రులలో దుప్పటీ ముసుగుపెట్టుకుని పడుక్కుంటే ఓ పట్టాన

దుష్పటీని విడువబుద్ధికాదు. రెండవ అర్థంలో రాత్రి ఆకాశాన్ని శీఘ్రంగా విడవడంలేదు అని. అంటే రాత్రిళ్లు పొడుగులయాయి అనేకదా!

తీక్ష్ణకిరణుడైన సూర్యభగవానుడంతటివాడు చలికి తట్టుకోలేక ఆగ్నేయదిశకు వెళ్లేడట, చలి కాగడానికి! శీతకాలంలో సూర్యోదయం ఆగ్నేయమూలకి దగ్గరలో అవుతుంది.

ఓ రాజా! నీవు ఈ చలికాలంలో మన్మథాగ్ని హృదయంలో రగులుతూ ఉంటే అందగత్తెల సాన్నిధ్యాన్ని పొందుతున్నావు.

మాబోటి దరిద్రులకి మంచిబట్టలూ లేవు. అందగత్తెలూ లేరు. మేము ఎక్కడికి పోగలమో చెప్పు.

శార్దూల విక్రీడితం

శీతార్తా ఇవసంకుచంతి దివసా
నైవాంబరం శర్వరీ
శీఘ్రం ముంచతి కించ సోఽపిహుత
భుక్కోణంగతో భాస్కరః
త్వంచానంగహుతాశభాజి హృదయే
సీమంతినీనాం గతో
నాస్మాకం వసనం నవాయువతయః
కుత్ర వ్రజామోవయమ్.

మత్తేభ విక్రీడితం

చలిబాధన్‌బలె పొట్టివయ్యె పగళుల్,
చండాంశుడాగ్నేయమున్
వలచెన్, శర్వరిఅంబరమ్ము
త్వరగా వర్జింపదిప్పట్టునన్
లలనామండలి యండగొంటె
స్మరకీలాజాలతప్తుండవై
మెలతల్ మాకడలేరు, లేవు వలువల్
మేమెందు బోవందగున్?

* * *

వినయం

ఊరి నడిబొడ్డున రచ్చబండదగ్గర, అనుయాయులు చేతులు నలుపుకుంటూ సాగుడుతూ ఉండగా, మోతుబరి రైతు మీసాలు మెలేస్తూ దర్పంగా బోరవిరిచి, చుట్టకాలుస్తున్నాడు.

అక్కడికి దగ్గరలోనే ఫలవృక్షం ఒకటి నేలమీదికి బాగా వంగిఉంది. నెత్తిమీద తుమ్మెదలు ఝుమ్మ మంటున్నాయి.

మోతుబరి రైతుకీ, చెట్టుకీ గల తారతమ్యం కొట వచ్చినట్లు కనిపిస్తూ ఉండగా, ఆ చెట్టు వంగి ఉండడానికి కారణం వివరిస్తున్నాడు పండితరాయలు.

తుమ్మెదలు స్తోత్రాలు చేస్తున్నాయి. ఆ పొగడ్తలకు మరొకడూ మరొకడూ అయితే ఉబ్బి తబ్బిబ్బు అయిపోయేవాడే. కాని ఫలవంతమైన ఈ మహావృక్షం ఆ స్తోత్ర పాఠాలకు సిగ్గుపడి తల వంచుకుందిట!

ప్రహర్షిణి

వ్యాగుంజన్మధుకరపుంజమంజుగీతా
న్యాకర్ణ్యస్తుతి ముదయన్నయాతిరేకాత్
ఆభూమీతలనతకంధరాణి మన్యే
రణ్యేఽస్మి న్నవనిరుహాం కుటుంబాని.

తేటగీతి

తుమ్మెదలు మంజులముగ ఝంఝుమ్మ మనుచు
వినుతిసేయగ విని చాల బిడియపడుచు
అడవిలోని మహీజముల్ పుడమినంట
ఔదలల వంచుకొనుచున్నవని తలంతు

* * *

ముత్యం

మంచిముత్యం చాలా అందంగా ఉంటుంది. సందేహంలేదు. సువృత్తమైనది (మంచి నడవడికగలది అనీ, గుండ్రనిది అనీ అర్థాలు), అతి ఉజ్జ్వలమైనది, అవిరుద్ధమైనది. (ఏ వస్తువుదగ్గర పెడితే ఆ వస్తువు రంగును వహించేది). ఇన్ని మంచి లక్షణాలున్నప్పటికీ ముత్యం బంధితం అవుతోంది (దండగా గుచ్చబడుతోంది అని మరో అర్థం). దీనికి కారణం ఏమిటంటే ముత్యానికి అంతర్భిన్నత్వం ఉండడమేనట! ముత్యానికి హృదయంలోనుంచి సన్నని బెజ్జంచేసి దండగా గుచ్చుతారనే విషయాన్ని ఎంత చమత్కారంగా చెప్పేడో!

**అనుష్టుప్**

అత్యుచ్చేనావిరుద్ధేన
సువృత్తేనాతిచారుణా
అంతర్భిన్నేన సంప్రాప్తం
మౌక్తికేన నిబంధనమ్

**చతుష్పద**

అవిరుద్ధంబై అత్యుచ్చంబై
సువృత్తమై కడు సుందరమయ్యును
వివరము హృదిలో వెలసిన ముత్యం
బపురా! బంధితమగుచున్నదిరా.

* *

ముత్యం ఎన్నెన్నో ఇబ్బందులకు గురిచేయబడు తోందిట. ఏమిటా ఇబ్బందులు? జన్మభూమి అయిన రత్నాకరంనుంచి దూరం చేయబడుతోంది. ఆ విచారాన్ని ఎల్లాగో దిగమింగుకుంది. తరువాత గుండెలోంచి రంధ్రం పొడిచేశారు. ఆ బాధను కూడా కిక్కురుమనకుండా సహించుకుంది. ఎందుకూ? అందగత్తెల రొమ్ములను కౌగలించుకుందామనే ఆశతో ఎన్నిబాధలు పెట్టినా ముత్యం భరిస్తోందిట!

**వసంత తిలక**

రత్నాకరే పరిహృతా వసతిః కిమన్య
దంగీకృతః కఠిన వేదన దుఃఖభారః
వక్షోజ కుంభ పరిరంభణ లోలుపేన
కింకిం నతేన విహితం బత మౌక్తికేన.

**మత్తేభ విక్రీడితం**

తన రత్నాకర జన్మభూమిని
  పరిత్యాగంబు గావించు, గుం
డెను ఛేదించుచు రంధ్రముం బొడిచి
  పీడింపన్ భయంబంద దా
వనజాక్షీ కుచకుంభి కుంభ పరి రంభ
  ప్రాప్తికిన్ మోము వా
చిన ముక్తాఫల మోర్చుచున్నది కదా
  చీకాకు లెన్నింటినో.

* *

**పిల్లనగ్రోవి**

మామిడితోపులో చల్లగాలికి విశ్రమించిన జగన్నాథునికి కట్టువతలనుంచి ఎవరో పిల్లంగోరు ఊదుతూ ఉన్నట్లు వినిపించింది. ఆ వాయించేవాడెవడోగాని బొత్తిగా చేతకానివాడిలా ఉన్నాడు. అన్నీ అపస్వరాలే. మురళి ఏడుస్తోందా అన్నట్లుంది. ఎందుకు ఏడుస్తోందో చమత్కారంగా కల్పించి చెబుతున్నాడు పండితరాయలు.

మురళి ఒక చక్కనిపిల్ల. మహనీయవంశ సంజాత. వంశంఅంటే వెదురుఅని మరోఅర్థం. పిల్లనగ్రోవిని వెదురు గొట్టంతో చేస్తారుకదా!

మురళి గొప్పఇంటి పిల్ల అయితే ఏడవడం ఎందుకూ? పరపురుషుడు తన శరీరాన్ని రెండు చేతులతోనూ గట్టిగా పట్టుకుని నోరు ఆనించి బలవంతంగా ముద్దుపెట్టుకుంటూ ఉంటే ఆ పిల్లకి అవమానంచేత దుఃఖం పొంగి పొంగి వస్తోందిట. అవునుమరి, మరో మరో పోకిరీపిల్ల అయితే ఏడవక పోను.

**కాలభారిణి**

పరపీడ్యకరద్వయేన గాఢం
పరపుంసా పరిచుంబితాననాపి
మురళీ మహనీయ వంశజాతా
ముహురాక్రంద మమంద మాతనోతి

**కందము**

కరముల పీడించుచు పర
పురుషుడు తన వదనసీమ ముద్దిడెననుచున్
ఉరు వంశసముద్భవ యగు
మురళికి రోదనముపొంగి పొరలుచు వచ్చెన్.

* * *

వీధివాకిట్లో 'భం భం భం' అంటూ గంభీరమైన శంఖధ్వని వినవచ్చింది. ఎవడో బిచ్చగాడు బుగ్గలు పూరించి శంఖం ఊదుతున్నాడు. బూడిద కొట్టుకునిఉన్న అతడి నల్లనిచేతిలో తెల్లని శంఖం మెరుస్తూ కనిపించేసరికి పండితరాయల బుద్ధి చమత్కృతమైంది. నోటివెంట అప్రయత్నంగా అద్భుతమైన కల్పన వెలువడింది.

శంఖం ఎక్కడపుట్టింది? రత్నాకరంలో.

దానిశరీరం ఎటువంటిది? స్వచ్ఛమైన మల్లెపువ్వులవంటి తెల్లనిది.

దాని నివాసం ఎక్కడ? సాక్షాత్తూ శ్రీ మహా విష్ణువు కరతలంలో.

అటువంటి మహాదశను అనుభవించిన శంఖం ఈనాడు దౌర్భాగ్యవశాన నీచుని మలినాధరములచేత చుంబించబడుతోంది. ఈ పతనం తలుచుకుని శంఖం పెద్దపెట్టున గుండె పగిలేలా ఏడుస్తోందిట!

**శి ఖ రి ణి**

క్వ వాంభోధౌ జన్మ క్వ చ వపురిదం కుందధవలం
క్వచావాసస్థానం కృత మహావిష్ణోః కరతలమ్
క్వ నీచానా మాస్యే పరిణతి రియం చుంబనవిధా
వితీవాయం శంఖః కరుణకరుణం రోదితిముహుః

**చంపకమాల**

ఉదధిని జన్మమేడ? ధవళోజ్వలమైన
శరీర మేడ? దు
ర్మద మధుకైటభాంతకు
కరమ్ముల నిత్యనివాసమేడ? నే
డధములచేతజిక్కి మలినాధర
చుంబనయోగ్యనైతి నం
చెదపగిలించునట్లు విలపించెను
శంఖము మాటిమాటికిన్

*　　*　　*

**విల్లు - అంబు**

జగన్నాథుని కొడుకు మాధవదీక్షితులు— ఎనిమిదేళ్లవాడు—దసరాపండుగకి కొన్న విల్లు అంబుల చేతబట్టి లక్ష్యశుద్ధికోసం పెరటిదొడ్లోఉన్న సపోటా కాయలకి గురిచూసి బాణాలు వేస్తున్నాడు. అంతలో ఏదో సందేహం వచ్చి తండ్రిని అడిగేడు.

'నాన్నా! వింటినుంచి బాణం ఎదరకి ఎల్లా వెడుతుంది?'

'విల్లువంగి ఉందికదా! అందుకని' అని జగన్నాథుడు సమాధానం ఇచ్చాడు పరాగ్గాఉండి.

'విల్లు ఎందుకు వంగిఉంది?'

నిజమే. విల్లు ఎందుకు వంగి ఉంది? బాణం వంగదేమి? ఏమిటో చెప్పదంటు ప్రశ్నలు! అని విసుక్కున్నాడు. అంతలో జగన్నాథునికి చక్కని కల్పన తోచింది. అంతా శ్లేషమయం. ధనుస్సుదగ్గర రెండు కోట్లు ఉన్నాయి. అయినప్పటికీ సద్వంశ సంజాతం అవడంచేత గర్వంలేకుండా వినయంగా వంగిఉంది. అన్నట్లు విల్లుకి రెండుకోట్లు ఎక్కడివి? వింటి కొనకి కోటి అనిపేరు. విల్లుకి రెండుకొనలు ఉన్నాయి కదా! విల్లును మంచిబలమైన వెదురుబద్దతో చేస్తారు. కనుక అది సద్వంశజం. మంచివంశంలో పుట్టిన కారణంచేత కోటికి పడగలెత్తినా గర్వం లేకుండా వంగి ఉన్నదని అర్థం.

మరి బాణమో? అది అసద్వంశజమట. కనుకనే లక్షలాభంకోసం ఆశపడుతూ గర్వంగా వంగకుండా ఉన్నదట.

వెదురుగడయొక్క సన్నని చివరి భాగాన్ని తీసుకుని, నడిమికి చీల్చకుండా బాణాన్ని తయారు చేస్తారు, బలంగా ఉండడంకోసం. 'సత్' అంటే చీల్చబడినది, 'అసత్' అంటే చీల్చబడనిది అనీ అర్థం (షద్ల్ విశరణ గత్యవసాదనేషు). కనుక బాణం అసద్వంశ్యముకదా! నీచ కుటుంబముతో పుట్టినది అని రెండవ అర్థం. లక్ష అంటె నూరువేలు అనీ, గురి అనీ, లక్క అనీ అర్థాలున్నాయి. బాణం లక్ష్యమును చేరుకోవాలని ప్రయత్నిస్తుంది కదా! పురుగులు పట్టకుండా, చీకకుండా ఉండడానికి బాణానికి లక్కపూత వేయడంకూడా ఉంది.

ధనమూ, విద్వత్తూ చాలా ఎక్కువగా ఉన్నవాడు వినయంగానే ఉంటాడు. ఏదో ఓపాటి ధనము, నిడిమిడి జ్ఞానమూ కలవాడు మాత్రమే పొగరుగా ఉంటాడని ధ్వని.

**అనుష్టుప్**

కోటిద్వయస్యలాభేఽపి
నతం సద్వంశజం ధనుః
అసద్వంశ్యః శరస్తబ్ధో
లక్షలాభాభికాంక్షయా

**తే ట గీ తి**

తనకు కోటిద్వయము మున్నెదక్కియున్న
వంగియుండును ధనువు సద్వంశజంబు

లక్షలాభము కాంక్షించి లజ్జలేక
వంగకుందును శర మసద్వంశ్య మగుట

*            *            *

**మోదుగుచెట్టు**

మోదుగుపువ్వులు ఎర్రగా అందంగానే ఉంటాయి కానీ వాసనగాని, తేనెగాని లేకపోవడంచేత తుమ్మెదలు వాటిమీద వాలవని ప్రతీతి. కాని ఎందుచేతనో ఒకనాడు ఒక తుమ్మెదవచ్చి మోదుగు పూలమీద వాలింది. దానిని చూచి మోదుగుచెట్టు గర్వపడిందిట, నన్నుకూడా తుమ్మెదలు సేవిస్తున్నాయి కదా అని. ఓసి పిచ్చిమొద్దా! తుమ్మెదవచ్చి నీమీద వాలడానికి కారణం నీ సరసత్వంకాదే, అవతల మల్లికా వనం అంతా నాశనం అయిపోయింది. వాటిని ఆశ్రయించుకునిఉన్న ఈ తుమ్మెద వాటి వియోగాన్ని భరించలేక పిచ్చిగా తిరుగుతూ, నీ ఎర్రని పూలని చూచి మంటలు అనుకుని, అగ్నిప్రవేశంచేసి తనువు చాలిద్దామని నీమీద వాలింది. ఇంక నీమిడిసిపాటు కట్టిపెట్టు అంటున్నాడు పండితరాయలు.

పరమలుబ్ధుడు, అరసికుడు అయిన గురవయ్య దగ్గరకి అతడిసంగతి తెలిసిన విద్వాంసులు ఎవరూ వెళ్లరు. ఒకనాడు ఒక పరదేశపు పండితుడు ఇతని సంగతి ఎరగక, మేడ అట్టహాసంఅంతా చూచి దగ్గరకు వచ్చాడు. 'చూశారా! నాదగ్గరకు కూడా విద్వాంసులు వస్తూఉంటారు' అని అతడు సంబర పడుతున్నాడు. 'ఆ విద్వాంసుడు నీ దగ్గరకు రావడానికి కారణం నీ ఈవి, నీ సరసత్వంచూచి కాదయ్యా గురవయ్యా! అతడికి ఆశ్రయదాత అయిన సార్వభౌముడు మరణించడంతో, ఆ వియోగం భరించలేక చావడానికి నీదగ్గర కాస్తంత నాభిఅయినా దొరకక పోతుందా అని వచ్చాడు సుమా!' అని వెక్కిరిస్తున్నాడు పండితరాయలు.

**కా ల భా రి**

త్యజకింశుక! పుష్పితాభిమానమ్
నిజశీర్షే భ్రమరోపసేవనేన
వికసన్నవమల్లికావియోగాత్
కురుతే వహ్నిధియా త్వయి ప్రవేశమ్

**తేటగీతి**

నీదు కుసుమాల తుమ్మెద నిలిచెననుచు
మిడిసిపాటును మోదుగా! విడిచిపెట్టు
బొండుమల్లెల విరహాన గుండె పగిలి
వహ్నియనుకొని నీ మీద వ్రాలె తేటి.

*            *            *

**హిమాద్రి**

ప్రసిద్ధములైన వింధ్య, మందర, మేరువు వగైరా పర్వతాలెన్నెన్నో ఉండగా, వాటికి అన్నింటికీ ఈ మంచుకొండ రాజు ఎల్లా అయింది?

ఏముందీ? ఈశ్వరునికి మామగారు అవడం చేతనే.

హేమా హేమీ లెందరెందరో ఉండగా వాళ్లందరినీ విడిచి ఈ యంత్రబ్రహ్మకి ఇంతమంచి ఉద్యోగం ఎలా ఇచ్చారో? ఏముందీ? మంత్రిగారికి బావమరది కావడమే అతడి యోగ్యత.

**రథోద్ధతా**

వింధ్య మందర సుమేరు భూభృతామ్
యత్పతి స్తుహిన పర్వతో భవత్
ఈశ్వర శ్వశురతా ప్రభావత
స్త ద్ధ్రువం జగతి జృంభతేయశః

**తేటగీతి**

మేరు మందర వింధ్యాది మేదినీధ్ర
మాలికల కెట్లు రాజయ్యె మంచుకొండ?

సర్వలోకాధినాథుడౌ శంకరునకు
కూతునిచ్చిన హేతువుచేత గాదె ?

* * *

ఏకాంతం

పండితరాయలు తన చివరి రోజులు మధురలో హరిని సేవించుకుంటూ గడపినట్లు 'మధుపురీ మధ్యే హరిః సేవ్యతే' అన్న శ్లోక భాగంవల్ల తెలుస్తోంది.

'మీరు శివకేశవులకు అభేదాన్ని పాటించే స్మార్తులు అయిఉండికూడా మీకు ఈ విష్ణు పక్షపాతం ఏమిటి?' అని హాస్యమాడింది లవంగి.

'నిజమే నువ్వుఅన్నది. కాని శివుడితో నా గోడు చెప్పుకుందామంటే ఆయనగారు నాకు ఏకాంతంగా దొరకడు కదా!' అన్నాడు జగన్నాథుడు.

'అదేమిటి?' అని ఆశ్చర్యం అభినయించింది లవంగి.

'శిరస్సుమీద చందమామ, లలాటంమీద అగ్ని, రొమ్ముమీద నాగిరాజు, జటాజూటంలో గంగాభవాని, హమేషా హాజరుగాఉండి, శివుడితో ఎవరుఏమి మాట్లాడేదీ వింటూ ఉంటారుకదా, నా రహస్యాలు మహేశ్వరుడికి ఎల్లా విన్నవించుకోను చెలీ! అతగాడికి ఏకాంతంలో కూడా కొలువేకదా!'

పుష్పితాగ్రా

శిరసి ఫణిపతిః శిఖీ లలాటే
శిరసి విధుః సురవాహినీ జటాయామ్
ప్రియసఖి! కథయామి కిం రహస్యమ్?
పురమథనస్య రహోఽపి సంసదేవ.

చంపకమాల

శిరసున చందమామ, పెనుచిచ్చు
లలాటమునమీద, రొమ్ముపై
నురగకులాధినాథుడు, సమున్నత
భూరిజటాటవీస్థలిన్
సురధుని--ఇంతమంది ననుజూచుచు
నుండగ నే రహస్యమున్
హరునకు విన్నవింతు? కొలువాతని
కేకతనుండు పైతమున్

* * *

[ఇందులో ఉదాహరించిన తెలుగు పద్యాలు డా. సుహీధర నళిని మోహన్ అనువదించిన భామినీ విలాసంలోనివి]



## కలగూరగంప :

# పండితరాయల వెటకారాలు

1972 ఆగస్టు 'భారతి' (సం. 49. సంచిక 8)లో శ్రీ డా. మహీధర నళినీమోహన్‌గారి 'పండితరాయల వెటకారాలు' అను వ్యాసమును

దానిలో చివఱ వారిచ్చిన ఉదాహరణ:—
'దారిద్ర్య! శోచామి భవంతమేవ
మస్మచ్ఛరీరే సుహృదిత్యుషిత్వా,
విపన్న దేహేమయి మందభాగ్యే
మమేతి చింతాం క్వ గమిష్యసి త్వం'

ఈ పద్యము పండిత రాయలదని వారు వ్రాసి యున్నారు. కాని యీ పద్యము శూద్రక మహారాజుచే రచింపఁబడిన 'మృచ్ఛకటిక'లో చారుదత్తుని వాక్యముగా నున్నది. మఱి యిది శూద్రకుని పద్యమా? లేక పండితరాయలదా? శ్రీ నళినీ మోహన్‌గారే యాధారముతో ఇది పండితరాయల పద్యముగా నుదాహరించిరో తెలియఁగోరెదను.

—శ్రీ అవ్వారి వాసుదేవశాస్త్రి.

## రెండు రత్నములు
## వాని వివరణము

భారతి (మే నెల, 72) సంచికలో శ్రీ కొడవంటి లీలా మోహనరావుగారు 'సాహిత్యంలో సింబాలిజమ్' అనెడి వ్యాసమును చక్కగ అర్థస్ఫూర్తి యొదువ రచించినారు. భావకవుల రచనలలో, ఎవ్వరెవ్వరేవిధముగ ఆంధ్ర సాహిత్యములో సింబాలిజమును పోషించినారో నిరూపించారు.

కాని సౌదామినిగారి 'దురదృష్టము' అనెడి గేయము నుదాహరించుతూ, అందలి సింబాలిజం అర్థగోచరముకాక, అస్పష్టముగ నున్నదని తెలిపినారు. ఉదాహృత గేయపంక్తులు:

నోచితిమెన్నో నోములు
కాచిబ్రోచునని పార్వతి
కడకు దేవి దయచేతను
కంటిమి రత్నములు రెండు
బ్రతుకు కలంకారముల్‌
వాని దాచ చేతగాక
ఎచటనో పోగొట్టుకొంటి
మెంతటి దురదృష్టముననో

'ఆ రెండు రత్నములు వేటికి సంకేతాలో స్పష్టము కాలేదు. గేయము సొగసుగానే ఉంది కాని భావము స్పష్టము కాలేదు' అని వ్యాసకర్తగారు తమ సందేహమును వెలిబుచ్చినారు.

సౌదామినిగారి గేయము హృదయ విదారకమగు విషమ పరిస్థితులలో రచింపబడినది. ఆ సందర్భ సన్నివేశములు తెలిసికొనిన, ఆ యమ పోగొట్టుకొనిన రెండు రత్నములు ఏవియో తెలిసికొన జాలుదుము. లీలా మోహనరావుగారు అదే వ్యాసములో ఆరుద్రగారి 'త్వమేవాహం' గేయమునుంచి ఉదాహృత గేయపంక్తుల ఉద్ధరించినారు.

ఈ
కాంతను
చెరపట్టగ
రా
కాసులు
తలపెట్టిరి.

'ఇక్కడ కాంత నైజాం పరిపాలనక్రింద తెలంగాణాకు ప్రతీకగా వాడబడింది. రాకాసులు రజాకార్లు' అనుచు గేయమందలి సింబాలిజమును విడదీసి వివరించిరి. ఆరుద్రగారు రచించిన గేయకథావస్తువు ఆనాటి రజాకార్ల దౌర్జన్యచర్యలని వ్యాసకర్తగారికి తెలియును. అందులకే కాంత తెలంగాణ్య

మనియు, రాకాసులు రజాకార్లనియు తేల్చి చెప్పగల్గి నారు.

ఇక సౌదామినిగారు పోగొట్టుకొనిన రెండు రత్నముల విషయమై సంక్షిప్తముగ వివరించెదను.

సౌదామినిగారు ఎవరోకాదు—ఆమె కీర్తిశేషులు, భావకవిచంద్రులును నగు బసవరాజు అప్పారావుగారి అర్ధాంగలక్ష్మి రాజ్యలక్ష్మమ్మగారు. అప్పారావుగారి నిర్యాణానంతరము ఆవిడ 'అప్పారావుగారు - - నేను' అను గ్రంథములో తమ దాంపత్య జీవితమును, ముఖ్యముగ అప్పారావుగారి మధుర స్మృతులను ఏర్చికూర్చి యున్నారు. ఆ స్వీయ చరితమున తమకు పెండ్లియైన నకు ఒక కూతురు (మంగళప్రద) జన్మించినదని తెలిపినారు. ఆనాటి అప్పారావుగారి ఆనందమునకు మేరయే లేదట. ఆనందము వెల్లివిరియ మంగళప్రద జన్మకథ, స్వాగతం మున్నగు నెన్నియో గేయములు రచించినారు అప్పారావుగారు. కాని భగవంతునకు కన్ను కుట్టినది కాబోలు, సంవత్సరము తిరుగకముందే చిన్నారి మంగళప్రద కాలగర్భమున మాయమైనది. కడుపు తీపి, దోపిడీ, శాస్త్రి మున్నగు గేయములు అప్పారావు గారి విషాదసాగరమునుండి పొరలిన నీచికా మాలికలే.

కత్తిబెట్టిపొడిచినావోయ్ దేవా

వెలలేని మణిని కాజేశావ్ దేవా

అను గేయపంక్తులు వారి నయనములనుండి రాలిన అశ్రుకణములు. ఆ చంటిబిడ్డ వెంలేని మణి యట.

ఆ దంపతుల రెండవ కాన్పుపంట వేదాద్రి నృసింహమూర్తి. దీపావళి పండుగునకు కొద్ది దివసములకు ముందుగనే ఆ పాపడు జన్మించినాడు. దంపతుల సంబరము సర్వసాక్షితము. దీపావళి, బేలేలు, కిరియి రింబు మున్నగు గేయములు ఆనం దాబ్ధి సొంపాడు బసవరాజుగారి కలమునుండి జాలు వారిన కవితామృత ధారలే.

దురదృష్ట జాతకులా దంపతులు. అల్లారు ముద్దుగ ఆ దంపతులు మురిపించి, మురిపించి బాల నృసింహుడు వేదాద్రి క్షేత్రనాథునియం దైక్యమంది నాడు. ఆ తరి కడుపుకోత వర్ణింపనగునా? ఉపశాంతి, జీర్ణం జీర్ణం అను గేయములను అప్పారావుగారు రచించి తమ హృదయావేదన గ్రుమ్మరించినారు. చేతి నర్తల మురిపించెడి బుజ్జి గిత్తయిని పోగొట్టు కొని ఆ మాతృమూర్తి శోకము తీరరానిది. ఒక వైపు ప్రేమ స్వరూపుడగు భర్తగారి సేవన, వేఱొక వైపు తన దురదృష్ట జాతకమును తలకించుచు, చింతించుచు, తల్లులు పడరాని వ్యధయముతో బసవరాజు శ్రీమతి బసవరాజుగారు ఆనాడు దుఃఖోప శమనమునకై రచించిన గేయమే 'మురళీస్వనము.'

గేయసంపుటలో నిక్షేపింపబడిన ఆ రెండు రత్నాలే మంగళప్రద, వేదాద్రి నృసింహుడు. ఆ సోదర రత్నములు ఆ దంపతులకు అమూల్యాభర ణములు. ఆత్తలు రెండు వారి రత్నములు. ఆ రత్న ములు పరరోగింపు కొనబడినవి. చేయి జారిపోయి నవి. అయితే ఆ మాతృమూర్తి సౌదామినిగారు 'నాటిని రత్నముల రెండు, బరువు నలంకారములతో, ... పోగొట్టుకొంటి నెంతటి దురదృష్టవంతురా' లనుచు నాటినుండి నేటికిని దుర పిల్లుచున్నది.

ఆ రెండు రత్నముల వియోగబాధ మాటున గుండె నిశ్శబ్దగాథ దాగియున్నది.

—శ్రీ పేహారి చెన్నకృష్ణయ్య.

# గ్రంథవిమర్శలు



## మిత్రపంచశతి

(రచన : శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులు. ప్రచురణ : కె. ఆనందవర్ధన. ప్రతులకు : గ్రంథకర్త, గాంధీనగర్, తెనాలి. ముద్రణ : 1971. దాస్ ఆర్ట్ప్రెస్, తెనాలి. మూల్యము : రు. 3—50. పుటలు : క్రౌను 144.)

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, శ్రీ దివాకర్ల వెంకటావధాని, శ్రీ సి. నారాయణరెడ్డి, శ్రీ జి. యన్. రెడ్డి, శ్రీమాన్ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ, శ్రీ ఆరుద్ర—ఈ ఆర్గురును ఆమోదించి అభినందించుచు వ్రాసి యిచ్చిన అభిప్రాయములు కలిగి, నలుబదియైదు శీర్షికలతో అయిదువందల ఇరువది యొక్క ఆటవెలది పద్యములు. 'విశ్వహిత చరిత్ర వినర మిత్ర' అను మకుటము కలిగియున్న గ్రంథమిది. శ్రీ వెంపటి సూర్యనారాయణ, కీ. శే. వసుంధరాదేవి, శ్రీ చిఱ్ఱావూరు నాగభూషణాచార్యులు, శ్రీ సంజీవదేవు, శ్రీ పులివర్తి శరభాచార్యులు — వరుసగా ఈ యైదుగురకు అయిదు శతకములును అంకితములు. వసుంధరాదేవి కవిగారి కూతురు.

ఇందు 350 పద్యములు వ్యావహారిక విషయముల తోను, 171 పద్యములు పారమార్థిక విషయముల తోను ఉన్నవి. ఈ విభజనము రచయితయే చేసెను. ఈ మొత్తమును అయిదు శతకములనుట కేవలము పద సంఖ్యను బట్టియే. ఆ వంద పద్యములలో కేంద్రముగా వస్తువొకటి యుండవలెయునని లేదు. సుమతి శతకము, వేమన శతకము ఇట్లేయుండును. భక్తి శతకములలో ఇష్టదైవము కేంద్రము. ఇక్కడకూడ సుమతిని, వేమనను కేంద్రముగా చెప్పరాదా? అట్లే ఈ వీరరాఘవాచార్యులకృతికి మిత్రుడు కేంద్రమనవచ్చునా యనిపించును. అదియంత ప్రధానము కాదు.

కవియైనవాడు లోకజ్ఞుడు, తత్వజ్ఞుడును కావలయును. వాని కవిత్వముయొక్క లోతులకు ఎత్తులకు అవి కొలమానములు. జీవితానుభవమిట్లుభయాత్మకముగా నుండును. దీనిని పండించుకొనుట వల్ల కవిత్వమును, నిర్వహించుటవల్ల కావ్యమును రచింపవచ్చును. కావ్యమర్యాదలు లక్షయున్నవి. ఇట్టి శతకములందు వట్టి కవిత్వమును చూడవలయును. అనగా కవియొక్క లోకజ్ఞత్వమును, తత్వజ్ఞత్వమును. వీరరాఘవాచార్యులుగారు జీవితమును తరచిచూచిన లక్షణమున కీకృతి లక్ష్యముగా నున్నది. 'జీవితానుభవము చెప్పెడి తలపును నా ప్రయత్నమునకు నాంది యయ్యె' (1—6). 'బతుకుపండి సిద్ధి ప్రాపించునని బుద్ధి దలచి తలపులిట్లు పలుకుచుంటి' (1—7). తానే లక్ష్యముతో ఈ పద్యములను రచించుట కుపక్రమించెనో, ఆ లక్ష్యమును కవి తూ చా తప్పక సాధించుకొనెను. పూర్వ కృతులలో సుమతీ వేమన శతకములవంటివి ఆధునిక కృతులలో మొదటిది 'వాస్తవమ్ము నార్లవారి మాట'. రెండవది యిది 'విశ్వహిత చరిత్ర వినర మిత్ర.'

సమాజము శ్రేయస్సు నభిలషించి కవిగారు ఉన్న చెడును వెక్కిరించినారేగాని, నూత్నసమాజముయొక్క ఆవిర్భావమును ఇదమిత్థమని నిరూపించలేదు. చెడు లేనిదే నూత్న సమాజమను స్ఫురణము తాత్పర్యముగా ఉన్న ఈ కృతి సుకృతి. నీతులు, సూక్తులు, ఉపమానములు, దృష్టాంతములు, లోకోక్తులు, చమత్కారములు, హెళనలు, వేదనలు, వెక్కిరింపులు, వేదాంత రహస్యములు, శాస్త్ర విషయములు — ఇన్నింటితో ఈ కృతి చిత్రమహనీయముగా నున్నది.

## మూర్తిత్రిశతి

(రచన: శ్రీ వావిలాల రామమూర్తి. ప్రచురణ: సాహితీసమితి, ఒంగోలు. ప్రతులకు: రచయిత, పి. వి.

ఆర్. యం. హెచ్. స్కూలు, ఒంగోలు. ముద్రణ: 1971. వెంకట్రామ్ పవర్ ప్రెస్, ఏలూరు. మూల్యము: రు 1—00. పుటలు డెమ్మీ 48.)

దీని ముద్రణ భారధూర్వహుడు డాక్టరు వంగల సత్యనారాయణ, యం. డి. ఇందు మూడు శతకములు కలవు. 'శివాదయజాడు మాయామహేశ్వరా' అను మకుటముతో 'శివస్తవము'గా 110 ఉత్పల ములు, 'మారుతీ' మకుటముతో 'స్తుతి'గా శార్దూల మత్తేభములతో కలసి చంపకోత్పలములు 108. 'శ్రీ వెంకటేశ తిరుపతివాసా' అను మకుటముతో 'స్మరణము'గానున్న కందపద్యములు 111. ఈ మూడు శతకములు వరుసగా శ్రీశైల భ్రమరాంబా మల్లికార్జు నులకు, సింగరకొండ ఆంజనేయస్వామికి, అలమేలు మంగాసహిత వేంకటేశ్వరునకు అంకితములు.

శివస్తవములో మకుటములోని రెండవ యక్ష రము యతిస్థానము. అందువల్ల నాల్గవపాదము మొదటి యక్షరము తప్పనిసరిగా ల, పా, షా, జా, భా, వాలలో ఒకటి కావలసిన నియమ మేర్పడినది. శ్రీ వేంకటేశ్వర స్మరణమునందు మకుటములోని తిరుపతివాసా అన్న సంబుద్ధి యతి స్థానమునుండి అందుకొనుచున్నది. అందువల్ల కందపద్యము నాల్గవపాదము మొదటి యక్షరము తీ—తే లలో ఒకటి కావలయునన్న నియతి ఏర్పడినది. శ్రీరామమూర్తిగారు ఈ రెండు శతకము లందలి నియతులను ప్లోద్దైకమయములుగా నిర్వ హించినారు. అది ఆయన పద్యరచనాపాటవమునకు నిదర్శనము. మారుతీస్తుతిలో మకుటము తెచ్చిపెట్టిన నియతిలేదు.

శ్రీరామమూర్తియందు భక్తి పుష్కలముగా నున్నది. అద్వైతమునందు అర్చావతారములకు హద్దు లు లేవు. అనగా నా దైవమునకిదే నామమనిగాని, యిదే రూపమనిగాని లేదు. అందువల్లనే ఇక్కడ శివుడు, మారుతి, వేంకటేశ్వరుడు ముమ్మూర్తుల పరమేశ్వరులు కనుకనే భక్తి గరీయసి యనుట. శివు డన్నచో శివలీలాగాథలు, మారుతియన్నచో రామా యణము, వేంకటేశ్వరుడన్నచో కలిలో ప్రత్యక్ష దైవము—ఈ విధముగా తత్తద్భావనాభావితాంతరంగ చైతన్యధారా సముత్పన్నవైఖరీ మాధురీ రీతీ సుసం పన్నము ఈ మూర్తిత్రితలి. మూర్తిభేదము భేదము కాదు. సచ్చిదానంద ఘన మదియొక్కటియే కలదు. కాళహస్తి వేరు శ్రీశైలము వేరుకాదు. సింగరకొండయు శేషశైలమును కూడకావు.

చతుర్థీ విభక్త్యంతములైన సంస్కృతసంబుద్ధి నామములను తెలుగు ఛందస్సులలో నిముడించి వ్రాయుట శతకములలో క్రొత్తయు దానినొక సొగ సుగా భావించిరి. శ్రీరామమూర్తిగారా సొగసును మారుతిస్తుతిలోను, వేంకటేశ్వర స్మరణమునందును పరమరమణీయముగా ప్రదర్శించినారు. మరియు లోకో క్తులచేతను, నుడికారములచేతను శబ్దాలంకారముల చేతను ఇందలి ప్రతిపద్యమును ఉద్దీప్తమంతముగా రచయిత తీర్చిదిద్దెను. వైదయుండిన వేగము, ప్రౌఢి కలిగిన చక్కనిశైలి నలవరచుకొన్న ఇక కావ్య రచనాకౌశలమును ప్రదర్శింపవలయును.

## మణిమంజూష

(రచన: శ్రీ ఉండెల వేంకటరాజము, ప్రచురణ: కావ్యముద్రణ సమితి, కోరుట్ల. ప్రతులకు: రచయిత, తెలుగు లెక్చరర్, ప్రభుత్వ జూనియరు కాలేజి, కోరుట్ల, కరీంనగరం జిల్లా.)

ఇది ముప్పదినాల్గు ఖండకావ్యముల సంపుటి. గణబద్ధములైన పద్యములు మాత్రాబద్ధములైన వచన పద్యములు రచించుటయందు సవ్యసాచివలె కవి కృషి చేసినాడు. ఈయన శ్రీమాన్ వానమామలై వరదా చార్యులవారి శిష్యుడు. ఖండకావ్యమున ఎన్నిరకము లైనయియు కావ్యవస్తువులు కావచ్చును గనుక ప్రకృతి, నీతి, ధర్మము, వేదాంతము, భక్తి, దేశభక్తి, ఋతు వులు, పండుగలు, రసాలయములు, నాయకులు, మానవత— ఈ విధముగా మధ్యతరగతి మానవుని కందుబాటులో నుండెడి భావనములు రెండును కవిగారికి కావ్యవస్తువు లయినవి.

శ్రీ వేంకటరాజముగారు మంచి చక్కగా చేయి తిరిగిన కవులు. స్వతంత్రముగా ఊహింపగల దీశకి

యున్నందున ఇందలి ఖండకావ్యములందు చమత్కార వైవిధ్యమున్నది. ఇందు కింద దర్పణము కలదు. ఈ కవితాకళ ఆత్మవికాసమునకు కావలయునని ఒక విధముగా దీక్షవహించి కృషి యొనర్చుచున్న లక్షణము కవియందున్నదానిని ఈ కృతులు వెలార్చుచున్నవి. ఆత్మవికాసమనగా సమాజ వికాసమని యర్థము. సాధారణముగా ఇప్పుడు కవులై వ్రాయుచున్న యువతరమునందు ఈ జరుగుచున్న వ్యవస్థపట్ల తీవ్రమైన అసంతృప్తి యున్నది. అది ఒక్కొక్కరు ఒక్కొక్క విధముగా వ్యక్తము చేయుచుందురు. ఈ ఖండకావ్యమునం దిదికూడ కలదు. కాలముయొక్క భగవత్స్వరూపము నీ కవి కోణములు మార్చి ప్రదర్శించుట చక్కగా నమరియున్నది. ముడుచుకొని యొకమూలను పడియుండుట ముసలి లక్షణము. యువతర మెప్పుడును క్రియాశీలమై యుండవలయును. శ్రమించుటకు ముందుకు రావలయును. అన్ని ద్వంద్వములకును వారు అతీతులుగా నుండవలయును. సమాజ కార్యమునకై శ్రమించుటయే కర్తవ్యము. కర్తవ్యమునుండి వైదొలగని వారికి 'చలియొ చలించి వెచ్చయిడి సౌఖ్యములన్ సవరించును.' ప్రకృతి తన వైఖరిని మార్చుకొని వారిని అనుకూలముగా సంభావించును. ఈ విధముగా సమాజశ్రేయము నభిలషించి ప్రబోధాత్మకముగా కవితలు వ్రాయుచున్న శ్రీ వెంకటరాజముగా రభినందింప దగియున్నారనవలయును. 'నాఁటి విభవమ్ము స్మరియించి నాణెమైన, నేటి తీరుల గ్రహియించి నేర్పుమీఱ, ప్రాత క్రొత్తల కలయికన్ భవ్యగతిని, నెగడి దేశప్రతిష్ఠను నిల్పవలయు.'

## అక్షరాభిషేకము

(రచన : శ్రీ సురగాలి తిమోతి జ్ఞానానందము. ప్రతులకు : జ్ఞానానంద కవి, తెలుగుపండితుడు, మెక్లారిన్ హైస్కూలు, కాకినాడ. ముద్రణ : జూలై 1971. శ్రీపతి ప్రెస్, మూల్యము : మూడు రూపాయలు. పుటలు క్రౌను 105.)

ఇది కావ్యము. ఆంధ్రప్రదేశ విద్యాశాఖ డైరెక్టరు శ్రీ బి. ప్రతాపరెడ్డిగారికి అంకితము. ఇందు 27 శీర్షికలు 255 పద్యములు కలవు. తెలుగు పదములు వ్రాయుటలో ఒడుపుగల అయిదార్గురు వర్తమానాంధ్ర కవులలో ఈ జ్ఞానానంద కవియొకడు. తెలుగుదనము, భారత జాతీయత రెండును కవికి అభీష్టములు. కవితా వస్తువు దేనినో ఒక దానిని చుట్టుకొని యుండును. ఈ ఖండకావ్యమునం దధికముగా సమైక్య లక్షణము ప్రబోధింపబడినది. ఈయనకు కవిత్వమొక సామాజిక ప్రయోజనమును సాధించు దృష్టితోనుండుట యిష్టము. ఆయా సందర్భములను పురస్కరించుకొని వ్యక్తుల నుద్దేశించి, సన్నివేశములను సంఘటనలను ఉద్దేశించి, పండుగలనుబట్టి, ఆకాశవాణి ప్రత్యేక కార్యక్రమములను బట్టి వ్రాసిన ఖండికలతోడి కావ్యమిది. పద్యరచనలో సొగసులుండుటచేత కవిత్వము గడుసుగా నున్నట్లుండి చమత్కారకారిగా నున్నది. ఈ కవితాశక్తి కావ్య నిర్మాణమునందింకను దీప్తిమంతయు కాగలదు.

## సుందరకాండము

(రచయిత: శ్రీ దుగ్గిశెట్టి వెంకటరమణయ్య. ప్రతులకు: రచయిత, చార్టర్డ్ అకౌంటెంట్, నెల్లూర్. వెల: 3-00)

శ్రీమద్రామాయణము నందలి సుందర కాండ కథను ఆధారముగా గ్రహించి శ్రీ రమణయ్యగారు మొత్తము 320 గద్య పద్యములలో కొంతవరకు సంగ్రహముగాను స్వతంత్ర కావ్యమువలెను ఈ గ్రంథమును రచించిరి. శ్రీ రమణయ్యగారు పద్యరచనయందు నైపుణ్యమును సంపాదించిరి. మరియు సుందరకాండమునందు భక్తిభావమును ఈయన కధికముగా కలదు. సుందరకాండము పారాయణ యోగ్యత కలది. వాని అంతస్సారమును శ్రీ రమణయ్యగారు చక్కగా తెనుగునకు తెచ్చిరి. ఈ లఘు కావ్యమున చంద్రోదయాది ప్రకృతివర్ణనములు సహజ సుందరములై కవిగారి స్వతంత్రమైన కల్పనాశక్తికి నిదర్శనములుగా ఉన్నవి.

క్కందు మామూలు ఛందస్సులతోపాటు లంబు రుహము, కవిరాజవిరాజితము మొదలైన విశేష ఛందస్సు లును సందర్భాను సహితముగా వాడబడినవి. కవిరాజ విరాజితము నన్నయగారి భారతమున దమయంతిలో కిరాతుడు పలికిన దానివలె [illegible], భవిష్యదర్థమును చమత్కారముగా స్ఫురింప చేయుచున్నది. అక్కడ కిరాతునకు పట్టినగతియే ఇక్కడ [illegible] పట్టబోవుటను రమణయ్యగారు ఈ ఛందస్సును స్వీక రించుటచేతను పద్యమును ఎత్తుగడ చేయుటచేతను స్ఫురింపచేయ గలిగినారు. ఇందలి పద్యమును భారత పద్యముతో పోల్చిచూచినచో ఆ విషయము తెలియ గలదు.

> 'భజనికరానన ఏలనె నన్నిటు
> రాయిడి పెట్టుచునుంటివి వం
> కజదళలోచన న్యాయమె నన్నిటు
> కాల్చగ తీక్ష్ణపు దృక్కులచే
> గజగమనా నను కాయజుకేళిని
> కౌతుకమొప్పగ దేల్చుము నీ
> భజన మొనర్చెడివాడను రాణిగ
> భాసిలి పాలన సేయగదే.'

ఇది రమణయ్యగారి పద్యము.

## దక్షారామము

(రచయిత : శ్రీ ఇంద్రగంటిహనుమచ్ఛాస్త్రి. ప్రతులకు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, ఏలూర్ రోడ్, విజయవాడ వెల : 4.50.)

ఇది ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారి దక్షా రామ కృతితోపాటు మరికొన్ని వారి ఇదివరలటి కృతులు కలిసిన కావ్యసంపుటి. శ్రీ శాస్త్రిగారి షష్టిపూర్త్యుత్సవ సందర్భమున వేడుగ ప్రచురింప బడినది.

దక్షారామము శ్రీ శాస్త్రిగారి ప్రసిద్ధమైన కృతి దక్షారామ భీమేశ్వరుని చుట్టుకొని భీమేశ్వర పురాణము వెలసినది. అందు వ్యాసుడు కాశిని వదలి దక్షిణ కాశికి వచ్చిన కథ కలదు. శ్రీనాథుడు భీమేశ్వర పురాణమునందు ఆ ఘట్టమును చక్కగా రచించి ఉన్నాడు. దానిని ఆధారముగా చేసుకొని శ్రీ శాస్త్రి గారు ఈ కావ్యమును రచించిరి. మరియు దక్షారామ మునుగూర్చిన పౌరాణికమైన గాథయు, చారిత్రకము లైన సత్యములు [illegible] పడునట్లు [illegible] శ్రీ శాస్త్రిగారు ఈ [illegible] కావ్యమును [illegible]. [illegible] భాగమునకు [illegible] ఈ దక్షారామము [illegible] బడినవి. శ్రీ శాస్త్రిగారికి [illegible], దక్షపురి [illegible] శ్రీనాథ [illegible] [illegible] కావ్యము [illegible] చేసినవి.' మరియు [illegible] శ్రీ శాస్త్రిగారికి అధిక మైన [illegible] [illegible] చేసు కొన్నది.

ఇందలి కృతులలో [illegible], భావ [illegible], [illegible], [illegible], [illegible] మొదలైన [illegible] లైనవి. శ్రీ శాస్త్రిగారు [illegible] ప్రసిద్ధులు. [illegible] పద్యమును [illegible] ఆ పద్యము [illegible]. [illegible] ధారా [illegible], [illegible], [illegible] రీతి [illegible], [illegible] కావ్యము [illegible] శ్రీ శాస్త్రిగారి కావ్యములలో [illegible] [illegible] [illegible].

> తొలకరి [illegible]
> [illegible]
> [illegible]
> [illegible]
> [illegible]
> [illegible]
> [illegible]
> జనకోటి మనమ్ముల [illegible]'

శ్రీ శాస్త్రిగారి ఈ అభిలాషము ఇప్పటికే సఫలమయినది. ఇది ఎప్పుడును ఇట్లే అగును. శ్రీ శాస్త్రిగారు మహాకావ్యము రచించి ఆంధ్ర శారదాదేవిని అలంకరించినచో అది మరియూ బాగుండును.

## 1. గద్వాల ప్రభాకరము
## 2. ఖండకావ్యములు, ఉపన్యాసములు, చాటువులు

(రచన: శ్రీ ఆదిపూడి ప్రభాకరామాత్యకవి. ప్రతులకు ఎ. వి. యస్. సుబ్బారావు, 1–8–155/5 మెండలే లేన్, ప్రెండరుగాస్టు రోడ్డు, సికింద్రాబాదు 3. వెల : సాదాప్రతి 2. 50. గ్రంథాలయ ప్రతి 3–50)

కీర్తిశేషులైన ఆదిపూడి ప్రభాకరామాత్యుల వారి కృతులను వారి కుమారులు సుబ్బారావుగారు సంపుటములుగా ప్రచురించిన వాటిలో ఇది రెండవది. ఇందు మొదటిది కందరామాయణము. ఈ తెలుగు రామాయణము కందపద్యములతో నున్నది. బాలకాండ మున శివధనుర్భంగమువరకు మాత్రమే ఇప్పుడు మిగిలియున్నది. ఇంతవరకు ఇవి రెండువందల ఏబది ఆరుపద్యములు. బాలకాండము మొదటిభాగము కూడా కొంత నష్టమైపోయినది. రెండవది గద్వాల ప్రభాకరము అను చిన్నకృతి. ఇందు 'సాంద్రకీర్తి సీతారామ చంద్రమూర్తి' అను మకుటముతోను, 'రమ్యగుణధామ లోకాభి రామరామ' అను మకుటముతోను ఇరువదిఆరు సీసపద్యములు కలది. శ్రీరామపట్టాభిషేక సమయ మున రామకథాసారముగా కాండకు ఒక పద్యముగా రచింపబడిన రెండవ మకుటము తోడిపద్యములు. వస్తు తత్త్వమునకు అనువైన శబ్దవిన్యాసశయ్యాసౌభాగ్యము కలిగి, శ్రవణపేయములై పరమరమణీయములుగా నున్నవి. మూడవది శ్రీమంతులవారికి విజ్ఞప్తి. 1920 వ సంవత్సరమున కవిగారు తమకు సంభవించిన భార్యావియోగ దుఃఖమును ఇందు ప్రభువు వారికి విన్నవించుట ఇందలి విషయము. ఈ తరువాత గల పద్యములు ఆయా సందర్భములయందు ప్రభువులతోను, ప్రభువుల పక్షమున ఇతరులకును చెప్పినవి. ఇందు ముఖ్యముగా కొప్పరపు కవులు గద్వాలకు వచ్చినపుడు వారిని ప్రభువులకు పరిచయము చేయుచూ చెప్పిన చంపకమాలలు. వేదము వెంకటరాయ శాస్త్రిగారు గద్వాలకు వచ్చి వెళ్ళునపుడు ప్రభువుల పక్షమున చెప్పిన ఉత్పలమాలలు పేర్కొనదగి ఉన్నవి.

ఆ తరువాతగల మరియొక కృతి పౌండరీకము. ఇది చమత్కారమైన పేరు. పుండరీకమునకు సంబంధించినది పౌండరీకము. పుండరీకమనగా పులి. గద్వాల మహారాజావారి పులివేటను ప్రత్యక్షముగాచూచి కవిగారు ఇందు దానిని చమత్కారముగా వర్ణించిరి. ఇది 162 పద్యముల కృతి. చిట్టచివరిది స్వర్గలేఖ. ఇది పూర్తిగా లభించలేదు. రెండవ అశ్వాసమున ఏడు పద్యముల వరకు ఉన్నది. మొత్తము 93 పద్యములు. శ్రీ సీతారామ భూపాలుడు స్వర్గస్థుడైనపుడు కవిగారు పొందిన శోకము ఇందు వర్ణితము. ఇది కరుణ రస భరితము. ఒక విధముగా ఈ అన్నికృతులలో ఇదే మకుటాయమానమని చెప్పవలయును.

ఇంత ధారాశుద్ధికల, ఇంత వైవిధ్యముకల, ఇంత ప్రభుభక్తికల ప్రభాకరామాత్యుల కృతులు ఆంధ్ర సరస్వతికి అలంకారములు. అందరకును ఆస్వాద్యములు.

2. ప్రభాకరామాత్యులవారి కృతి సంపుటములులో ఇది నాల్గవది. ఇందు 'భక్తజన కల్పవృక్ష సర్వజనరక్ష' అను మకుటముతో సీసపద్యములు 40. ఆంధ్ర భాషోదంతము అను ఉపన్యాస పద్యములు 46. దైనందిన తిరునాళ్ల అను శీర్షికను పద్యములు 19. మాతృభాషా దైన్యమును వర్ణించునవి 9. నన్నయ భట్టారక వర్ధంతి నాడు చెప్పినవి రెండు సీసపద్యములు. ఆంధ్ర భాషాస్థితిని వర్ణించునవి 5. ఉప్పు సత్యాగ్రహమును గూర్చిన సీసములలోని

ఉపన్యాసము 10 పద్యములు. మతము, రాజకీయము లను గూర్చినవి సీసములు 28. శుకోపదేశము 62 పద్యాలు. శ్రీహరి శతకము 58 పద్యాలు. జగదీశ శతకము 69 కందాలు. తిరుపతికవీంద్రుని నిర్యాణము 8 సీసములు. కుమారైె అస్తమయము 8 సీసములు. భాగ్యనగరమున వకీళ్లు 7 ఉత్పలముల మాలిక. అదృష్టము $9\frac{1}{2}$ ఉత్పలముల మాలిక. ఇతర చాటువులు 61. గృహలక్ష్మి అను శీర్షికను వచన రచన 6 పుటలు. సరస్వతీ స్తోత్ర పద్యములతో గ్రంథము ముగింపైనది. శ్రీ ప్రభాకరామాత్యులు రచించిన పై కృతులలో శుకోపదేశమునందొక కొంత ఉపదేశమున్నది. మానవుల కష్టనష్టములనుగూర్చిన విచారణయున్నది. మధ్యతరగతి మనుజులలో ఆడ పిల్లల పెండ్లిసమస్య ఎత్తిచూపబడినది. పరిష్కారము దైవమును నమ్ముకొనుటయేగాని మరొకటికాదని కవి గారు పరిష్కరించినారు. శతకములయందు కవిగారు స్వానుభవములను మిక్కిలి చక్కని ధోరణిలో వ్యక్తీక రించినారు. కవి పండితుల పక్షము వహించి కవిగారు చెప్పినమాటలు మంచి కావ్యదీప్తి కలిగియున్నవి. ఆచార్య శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు చెప్పినట్లుగా 'శ్రీ ప్రభాకరామాత్యుల శైలి సహజసుందరమైనది. వారు రసవసర సమాసాడంబరమునకుగాని, మారుమూల పదముల ప్రయోగమునకుగాని యత్నింపని కతమున నారి పద్యము లన్నియును సరళములును సరసములును సర్వసుబోధములునై యలరారుచుండును.'

—'క్షేమేంద్ర'

Printed and Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7 Thambu chetty Street, Madras-1, Editor : S. Radhakrishna.

# భారతి

మాసపత్రిక

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938–1972)

అక్టోబరు 1972

సంపుటము : 49 : సంచిక : 10

వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## అక్టోబరు 1972

# మాంత్రికుడు జిత్తో

శ్రీ వి. ఆర్. వేలూరి

మహారాజ రాజ రాజపరమేశ్వర రాజమార్తాండ వగైరా
మహారాజులంగారిని
ఖుషీ చెయ్యటంకోసం
మంచినీళ్ళు మధువుగా మారుస్తాడు.
వదరుకప్పల్ని వందిమాగధులుగా
బొద్దింకల్ని పోలీసువాళ్ళుగా
మారుస్తాడు.
పందికొక్కుని పాలగూడెం బాబా చేస్తాడు.
వంగి సలాంచేసి
వేళ్ళ చివళ్ళ మల్లెపూలు పూయిస్తాడు.
ఛూ మంతర్ !
మాట్లాడే మైనా వాడి బుజంమీద కూర్చుంటుంది.
అక్కడ.

'ఇంకో కొత్తమాయ ఆలోచించు,
నల్లటి నక్షత్రాం
పాడిపాడి నీళ్ళా...!'—అని ఆజ్ఞాపిస్తారు
మహారాజరా.......................జులంగారు.
నల్లటి నక్షత్రాం
పాడిపాడి నీళ్ళా చేసాడు.

'గడ్డిపోచలతో బంధించబడ్డ గంగానది ఊహించు'
అని గర్జిస్తే
అదీ చేసాడు.

అక్కడ.

వినయంగా ఓ విద్యార్థి వచ్చి
'ఒకటికన్న యెక్కువైన SINE తీటా ఊహించు !'

వెలవెలబోయిన
మాంత్రికుడు జితో
'సారీ ! సైన్ విలువ
మైనస్ ఒకటినుంచి ప్లస్ ఒకటిదాకా మాత్రమే
అరిచి గింజుకున్నా
ఏంచెయ్యలేం దాన్ని'.

మహారాజదర్బారునుంచి
వందిమాగధుల మూకనుంచీ
నిశ్శబ్దంగా నిష్క్రమిస్తాడు
మాంత్రికుడు జితో
తన గూటికి.

-[మిరాస్లావ్ హోలూచ్ అనే చెకోస్లావేకియన్ వైద్యుడు-కవి వ్రాసిన Zito the magician అన్న వచన పద్యానికి స్వేచ్ఛానువాదం—]



# సేద్యవృత్తి - కొన్ని ముఖ్య పరిణామాలు

బి. విద్యాధరరావు

ఆదిమవాసులు అరణ్యంలో కొంత భాగాన్ని రుప్పలూ, తుప్పలూ లేకుండా బాగుచేసి సేద్యానికి ఉపక్రమించిన కాలమేదో సందేహ రహితంగా నిర్దేశించి చెప్పడానికి వలనుపడదు. ప్రపంచంలో అనేక స్థలాల్లో సేద్యం ఆరంభమైంది. బైబిలు గ్రంథంలో పలు తావుల్లో ప్రస్తావించబడ్డ జరిచో నగరం ప్రపంచమంతటికి అతిప్రాచీన సేద్యకేంద్రమని విశ్వసించబడుతోంది.[1] క్రీస్తు పూర్వం 7000 సంవత్సరాలనాడు యిక్కడ తొలిసారిగా మానవులు రాళ్లతో నివాసాలు యేర్పరచుకుని సామూహిక జీవనంతోబాటు మొదటి గ్రామానికి శంకుస్థాపన చేశారు. సేద్యంవలన యిది సాధ్యమైంది. పాలస్తీనానుంచి పర్షియన్ జలసంధి వరకు ఎడారిని ఆనుకునిఉన్న అర్ధచంద్రాకృతిగల అపారమైన భూభాగం 'సుక్షేత్ర చంద్రిక' (Fertile Crecent) అని పిలువబడుతున్నది. సేద్యం ఆరంభం కావడానికి అనుకూలమైన పరిస్థితులు అనాదిగా యిక్కడ నెలకొని ఉన్నవి. ఇందులోనే పాలస్తీనాలోని కారమెల్ శిఖరం, ఇరాక్ దేశపు ఈశాన్య ప్రాంతమైన కుర్దిస్తాన్ శైలసానువుల్లో జార్మో గ్రామంకూడ జరిచోతోబాటు తొలిసేద్య కేంద్రాలుగా ఇప్పటివరకు గుర్తింపబడుతున్నవి.

ఇట్టి సేద్యకేంద్రాలకోసం ప్రపంచమంతటా అన్వేషణ జరిగిననాడు, అతిచిత్రమైన విశేషాలు బయల్పడే అవకాశం ఉన్నది. హిందూదేశంలో తొలిసేద్య కేంద్రమని పేర్కొనదగిన ప్రదేశం లేదు. అయితే సేద్యం మానవ జీవితంతో పెనవేసుకుపోయిన కొత్తరాతి యుగక్షేత్రాలకు కొదవలేదు. ఇవన్నీ రమారమి క్రీ. పూ. 2500 సంవత్సరముల నాటివి. సేద్యానికి అంతకు 2000—2500 యేండ్లకు పూర్వమే అంకురార్పణ జరిగి ఉండాలి.

సేద్యం ఆరంభం కాకముందు మానవులకు స్వగ్రామమూ, స్వస్థలమూ లేవు. ఆహారాన్వేషణలో నిలకడ లేకుండా మానవులు చరించారు. ప్రకృతి సిద్ధంగా లభించే కందమూలాలూ, వేట మానవులని పోషించాయి. ఇటువంటి పరిస్థితులలో నివసించడానికి ప్రతిమానవునకూ సుమారు 5000 యకరాలకు తక్కువగాని వన్యప్రదేశం అవసరమౌతుంది.[2] దీనిని బట్టి జనసంఖ్య ఎంత స్వల్పంగా ఉండేదో ఊహించుకోవచ్చు.

అసలు సేద్యం ఎలా ఆరంభమైంది? మానవులకు ఈ కౌశలాన్ని స్ఫురింపజేసిన సందర్భాలెటువంటివి? ఈ ప్రశ్నలకు సమాధానాలు అనేక విధాలుగా ప్రతిపాదించబడుతున్నాయి. పురుషులు వేటకి వెళ్లిన సమయాల్లో స్త్రీలు తమ తాత్కాలిక నివాసాల చుట్టుపట్ల కందమూలాలు సేకరించేవారు.

పక్షులు, ఉడతలు మొదలైన ప్రాణులు అడవిలో పెరిగిన ధాన్యపుగింజలను తినడం చూసిన స్త్రీలు, ఆ గింజలను సంపాదించి వాటిని ఆహారంగా ఉపయోగింపవచ్చునని గ్రహించగలిగారు. తాము నాటని చెట్లనుంచి గింజలను సేకరించి వాటిని తమ నివాసాలకు చేరుస్తున్నప్పుడు, దారిలో రాలినగింజలు మొలకలెత్తడం వీరు గుర్తించి, తమకి అనువైన

---

1. Ashly Montegu; Man his first MilIi on years, 1960, pp. 99-100.

2. Rt. Hon. Lord Arcbury; pre-historic times, 1913, ch. VIII, P. 273.

చోట్లలో గింజలను వెదజల్లి మొక్కలు మొలి పించారు. వానలు కురిసినప్పుడు కొన్నిరోజులవరకు అరణ్యమంతా పచ్చగా ఆకుల గుబురులతో నిండి పోడమూ, ఎండలు కాస్తున్న రోజుల్లో ఆకులు పండి, చిన్నమొక్కలు ఎండిపోడమూ గమనించి, తాము జల్లిన విత్తుల మొలకలు ఎండిపోకుండా వాటిని వాగులనీళ్లతో తడుపుతూ ఉండేవారు.

ఈ విధంగా స్త్రీలు సేద్యానికి అంకురార్పణ చేశారు.[3] దీని ప్రయోజనం మొదట్లో పురుషులకి అర్థంకాలేదు. అందువలన సేద్యం స్త్రీలకే విడిచి పెట్టబడింది. మానవులసంఖ్యపెరిగి, వేటవలన ఆహారం సంపాదించుకోడం కష్టతరమౌతున్నకొద్దీ సేద్యపు ప్రాముఖ్యత అర్థంకాసాగింది. క్రమంగా అది పురుషుల వృత్తిగా మారవలసివచ్చింది.[4]

పశుపోషణ మానవజీవిత పరిణామంలో మరొక ముఖ్యఘట్టం. ఇంతవరకు మానవులు ప్రప్రథమంగా మచ్చిక చేసుకోగలిగిన జంతువు శునకమని అనుకోడానికి ఆధారాలు లభిస్తున్నవి.[5] తమ గుహలకి తెచ్చుకున్న మాంసశేషం, తమకి పనికిరానప్పుడు మానవులు గుహల వెలుపల పరిహరిస్తూ ఉండవచ్చు. అది వన్య శ్వానాలకి ఆహారంగా ఉపయోగపడేది. అందువల్ల అవి మానవ నివాసాల పరిసరాల్లో మెసలడం ఆరంభించాయి. ఈ పరిణామం క్రమంగా మానవులకు కుక్కలు మచ్చిక కావడానికి కారణమైంది. తాము వధించిన జంతువుల పసికూనలని తెచ్చి పెంచుకోడంకూడ మరొకవిధంగా జంతువులు మచ్చిక కావడానికి తోడ్పడింది.[6]

ఈ విధంగా జంతువులని మచ్చిక చేసుకోగలిగిన పురుషులు, సేద్యంనేర్చుకున్న స్త్రీలు మానవ పరిణామచరిత్ర స్వరూపాన్నే మార్చివేయగలిగారు. తన పరిసరాలను కొంతవరకు మానవుడు దిద్దుకోగలిగాడు. ఒకచోట స్థిరంగా కొంతకాలం గడపగల అవకాశం అతనికి లభించింది. అతడి సంతానం అతడు నివసించిన ప్రాంతాలపై వారసత్వాన్ని పొందింది. మానవుల పురోగమనానికి యిదే తొలి స్వర్ణ సోపానం.

మానవుడు స్థిరనివాసాలు యేర్పరచుకున్నాక క్రమంగా జనసంఖ్య పెరుగుతూ, జనసంఖ్య పెరిగిన కొలదీ అరణ్యభాగాలు సేద్యక్షేత్రాలుగా రూపొందుతూ వచ్చాయి. స్థిరనివాసాలలో ప్రభుత్వవ్యవస్థల యేర్పాటు అవసరమైంది. పరిసరాల ప్రభావానుగుణ్యంగా ఈ వ్యవస్థలలో వైవిధ్యాలు కనబడతాయి. హైందవ నాగరికతలో స్థూలంగా కనిపించే కొన్ని ముఖ్యభేదాలకి సేద్యవృత్తి యేవిధంగా ప్రాతిపదిక అయినదో పరిశీలించడంవల్ల ఈ సంస్కృతియొక్క సమగ్రరూపం కొంతవరకు అవగాహన కాగలదు.

* * *

ప్రాచీన యుగాల్లో ఆర్యప్రభుత్వాలు అరణ్యాలను రాజ్యభాగాలుగా పరిగణించలేదు. రాజ్యనామం జనపదాలకే పరిమితమైనది. ఎక్కడెక్కడ యేలిక యొక్క అధికారం అమలులో ఉంటుందో అది రాజ్యంగా పరిగణిస్తూ వచ్చారు. అరణ్యాలలో రాజశాసనం అమలుపరిచే వ్యవస్థలు ఉండవుకనుక, వాటిని రాజ్యభాగా లనుకోడానికి వీలులేదు. రాజశాసనాలకి కట్టుబడిఉండటం యిష్టంలేనివాళ్లు జనపదాలను వదలిపెట్టి అరణ్యాలలో ఉండవచ్చు. హితోపదేశంలో 'వరం వాసోరణ్యే నపునరవివేకాధిప పురే'అన్న సూక్తి ఈ సందర్భాన్ని వివరిస్తున్నది.[7]

వ్యవసాయం మానవులకి తెలియని అతిప్రాచీన కాలంలో భూమికి ప్రత్యేకత లేదు. దానిమీద స్వామ్య మనే ప్రశ్నే ఉదయించదు. సేద్యం సామాన్య వ్యవహారంలోకి వచ్చినతర్వాత జనపదాలు యేర్పడ్డాయి. జనపదాల వ్యాప్తితో సేద్యయోగ్యమైన భూమి ఎవరికి చెందుతుందని జిజ్ఞాస ఆరంభమైంది. జనపదాలు పరి

---

3. Will Durant, The story of Civilisation, 1954, ch. II. p. 8.

4. Op. Cit. Ch III. P. 34.

5. Op. Cit. Ch. VI. PP. 99 100.

6. Op. Cit. Ch. P. 8.

7. మిత్రలాభం, 148.

మితమై, అరణ్యభాగం విస్తృతంగా ఉన్నకాలంలో భూమికి ప్రాముఖ్యంలేదు.

మనుధర్మశాస్త్రం భూమిపై వ్యక్తుల హక్కులను గుర్తించింది. అరణ్యాన్ని నిర్మూలించి ఎవడు క్షేత్రాన్ని సేద్యయోగ్యంగా బాగుచేసుకున్నాడో వానికి ఆ క్షేత్రం చెందుతుంది.[8] మిళిందపన్హ అన్న బౌద్ధగ్రంథంలో సహితము క్షేత్రంపైనుండి అరణ్యాన్ని నిర్మూలించినవాడే క్షేత్రస్వామి అని వివరింపబడింది.[9] ఎవడు అరణ్యభాగంపై శారీరక శ్రమను వ్యయపరచి సేద్యయోగ్యం చేస్తున్నాడో, అతడా భాగాన్ని తన శ్రమకు ఫలితంగా పొందగలుగుతున్నాడు. రాజస్వామ్యం అరణ్యాలపై లేకపోవడంవల్లనే ఇది సాధ్యమౌతున్నది. సేద్యం జరుగుతున్న క్షేత్రానికి రక్షణ అవసరం. ఈ రక్షణ కల్పించిన ప్రభువు పన్ను విధించి సస్య భాగం పుచ్చుకోవచ్చు. రాజ్యవిస్తీర్ణమూ, కోశసమృద్ధి కలుగుతున్నవి కనుక ఈ విధానం ప్రాచీన రాజ్య వ్యవస్థలకి అనుసరణీయమైంది. అరణ్య నిర్మూలనం వల్ల భూమిని నిరాక్షేపణగా ప్రతివ్యక్తీ పొందడానికి వీలున్న రోజుల్లో వ్యక్తుల హక్కు గుర్తించడం జరిగింది. అయితే వ్యవసాయాన్ని గౌరవప్రదమైన వృత్తిగా మనువు భావించలేదు. బ్రహ్మ క్షత్రియులు వైశ్యవృత్తులవలన జీవించవలసివస్తే సేద్యాన్ని పరిహరించవలసినదని నిర్దేశించాడు. దారు శకలానికి ఇనుపమొన బిగించి దున్నడంవలన భూమితోబాటు భూమిలో బ్రతికే ప్రాణులు హింసించబడతాయన్నాడు.[10]

రాజ్యంలోని సస్యక్షేత్రాలన్నీ రాజ్యభాగ మైనప్పటికి క్షేత్రస్వామ్యం మాత్రం పౌరులదే. జైమిని— విశ్వజిత్ యజ్ఞాన్ని గురించిన సందర్భంలో రారాజు తన సర్వస్వాన్ని దానం చెయ్యవలసినప్పటికీ, రాజ్యాన్ని దానం చేసినట్లు భావించరాదన్నాడు. శబరుడు మరింత విపులంగా 'రక్షణభారం వహించిన రాజు పన్ను మాత్రం విధించగలడు; కాని అతనికి క్షేత్రస్వామ్యం లేదు. పౌరులు సహితము క్షేత్రాలపై ప్రభువుతో సమానమైన హక్కులు కలవారే'నని స్పష్టపరిచాడు.[11]

రాజ్యభాగంకాని అడవులలో నివసించే సాంప్రదాయము ఆర్యులలో ఉండేది. రాజ్యంలో నివసించే పౌరులపై రాజశాసనాలను అనుసరించవలసిన బాధ్యత ఉంటుంది. ఈ బాధ్యతలను ఉల్లంఘించినవారు దండనార్హులు. వార్ధక్యంలో రాజశాసనాల ప్రసక్తి లేని నట్టడవుల్లో ఆశ్రమాలు యేర్పరుచుకుని జీవిత శేషాన్ని అక్కడ గడిపివెయ్యడం ఆర్యుల సాంప్రదాయమే.

ఋషివాటికలుకూడ అరణ్యాలలో ఉండేవి. ఏ రాజశాసనాలకీ తలవంచవలసిన బాధ్యత ఆశ్రమవాసులకి లేదు. విద్యాభ్యాసంకోసం జనపదాల నుంచి తాత్కాలికంగా వచ్చిచేరిన విద్యార్థులు ఆశ్రమ నిబంధనలకు లోబడి మెలిగేవారు. ప్రభువులైనవారు ఆశ్రమాలకు కొంతవరకు రక్షణ యేర్పాట్లు చేసినప్పటికీ, అందుకుగాను ఆశ్రమాలపై పన్నులు వేయలేదు. పరిరక్షితాలైన ఆశ్రమాలు విద్యావ్యాప్తికి దోహదకారులయ్యాయి.

ఆశ్రమవాసులైన ఋషులు, వారి శిష్యులు నిర్భయంగా రాజుల ప్రవర్తనను విమర్శించి పలుకగలిగేవారు. కాళిదాసుని అభిజ్ఞాన శాకుంతలంలో, కణ్వుని శిష్యులు శకుంతలని పరిగ్రహించ నిరాకరించిన దుష్యంతుణ్ణి దుయ్యబట్టడం ఈ సందర్భంలో గమనించవచ్చు. పౌరులు తమ ప్రభువుల నడవడిని అంత తీక్ష్ణంగా ఖండించడం జరగదు. విద్యావ్యాసంగం రాజశాసనాలకి లోబడకుండా స్వతంత్ర ప్రతిపత్తితో ఉండాలనే సాంప్రదాయం ఇందులో వ్యక్తమౌతున్నది.

రామాయణ మహాకావ్యంలో కైకేయి భరతుడికి పట్టాభిషేకమూ, శ్రీరామ వనవాసమూ కోరు

8. Laws of Manu, Ch. IX. V. 44.

9. R. S, Sarma; A Survey of Land Systems in India From C, 200 B. C. To 650 A. D., J. B. B, S. Vol. XI-IV, p, 225.

10. Ibid, ch. X, P. V. 84—85.

11. Kane P. V. —History of Dharma Sastra, 1941, ch. XXV, P-866.

కోడం గమనార్హమైన విశేషం. వాల్మీకి కాలానికి అరణ్యం రాజ్యభాగం కానేకాదనుకోదగ్గ సన్నివేశాలు రామాయణంలో కనిపిస్తాయి. అయోధ్యకాండలో రాముడు వనవాసానికిపోయేముందు చేసిన దానాలు విపులీకరించబడ్డాయి.[12] వీటిలో భూదాన ప్రసక్తి లేక పోడంవల్ల నాటికి భూమి దానయోగ్యమైన ఆస్తి కాదని గ్రహించవచ్చు.

రామాయణగాథ చారిత్రికమైనదా కాదా అనే చర్చతో ప్రమేయం అక్కరలేదు. ఆ గాథను వర్ణించిన కవి తన కాలంనాటికి అమలులోఉన్న సాంప్రదాయాలను పై వివరాలలో తెలియజేస్తున్నాడు. ఆనాటి సామాజికవ్యవస్థలోగల వాస్తవికతలు కావ్యంలో చోటు చేసుకున్నాయి.

పండితులనూ పామరులనూ ఆకర్షించింది రామాయణ గాథ. రాముడు కావ్యనాయకత్వాన్నధిగమించి జనరంజకుడైన దైవంగా రూపొందాడు. దీని ఫలితంగా ప్రతికాలంలోనూ పండితులు తమ సాంఘిక వ్యవస్థలకి సంబంధించిన నీతిన్యాయాలను రామాయణంలో ప్రక్షిప్తాలుగా చేర్చారని అనుకోక తప్పదు. రామాయణాన్నే తిరిగి కొత్త సన్నివేశాలతో, చమత్కృతులతో కవులు రచించడం ఈ నాటికీ జరుగుతున్నదే. అర్వాచీనులు తాము వ్రాసిన శ్లోకాల కర్తృత్వం వాల్మీకికి అంటగట్టడంకంటె ఈ విధానం శతవిధాల నయమని చెప్పుకోవాలి. ఇందువలన చారిత్రికాంశాల ముందు వెనుకలు కలగాపులగం అయే ప్రమాదం లేదు. కిష్కింధకాండలో లక్ష్మణుని 'నాహం జానామి కేయూరే...'[13] అన్న శ్లోకాన్ని విమర్శనా దృష్టితో చూస్తే, ఈ విషయం అర్థమౌతుంది. అన్న భార్యను తల్లిగా భావిస్తే, తల్లిని తలెత్తి చూడ్డం తప్పెలా ఔతుంది? తల్లులనూ, తోబుట్టువులనూకూడ తలెత్తి చూడరాదన్న సాంప్రదాయం హైందవ భారత దేశంలో ఏనాడూ లేదు. ఈ అలవాటు పశ్చిమాసియా నుంచి దిగుమతైనదనుకోవలసినదే

ఆర్తనాదం వినిపించిన తరువాత లక్ష్మణుని తక్షణంవెళ్ళి అన్నకు సహాయపడవలసిందిగా సీత ఆదేశించింది.[14] లక్ష్మణుడు నిరాకరించినప్పుడు ఆమె పలికిన మాటలు, కొన్ని పంజాబ్ తెగలలో ఈ నాటి వరకు ఉంటూవచ్చిన ఆచారాలని స్ఫురింపజేస్తాయి. సెమెటిక్ జాతులలో మృతుడైన అన్నభార్యను తమ్ముడు విధిగా పరిగ్రహించవలసిన నియమం ఉండేది[15].

సీత పలికిన మాటలే ప్రక్షిప్తాలెందుకు కారాదని ప్రశ్నించవచ్చు. కాని యివి ప్రాచీన గ్రంథంలోనివి కనుకనే వీటిని తొలగించడానికి వెనుకాడడం జరిగింది. ప్రాచీన గ్రంథాలపట్ల హైందవ పండితులకుగల ఆదరాభిమానాలు వివరించవలసిన అగత్యం లేదు. వ్యాఖ్యానకారులీ మాటలను సమర్థించడానికి పడిన శ్రమనుబట్టికూడా ఇవి మూలంలోనివని నమ్మవలసి వస్తుంది.

మహాభారతంలోకూడా పాండవులు రాజ్యాన్ని దుర్యోధనాదులకు ఒప్పి అరణ్యవాసం చేశారు. బుద్ధ జాతక కథలలో దేశబహిష్కృతులుగా శిక్షించబడ్డవారు అరణ్యాలకు పోయారు. వెస్సంతర దశరథ జాతక కథలు ఈ విషయాన్ని స్పష్టం చేస్తాయి. మరి కొన్ని కథలలో జనసాంద్రత కలిగిన చోట్లలో గ్రామాల ప్రజలు అడవులలో కొత్త వలసలు యేర్పరచుకోడమూ, వన్యుల బాధలకు ఓర్చుకోలేని గ్రామాలజనం అడవులలోనికి సంపూర్ణంగా నిష్క్రమించడమూ వర్ణించబడ్డాయి.[16]

అనార్యరాజ్యవ్యవస్థలలో అరణ్యాలకీ, రాజ్యసీమలకూ ప్రస్ఫుటమైన వ్యత్యాసం గ్రామాలను విడిచిపెట్టి, మధ్యలో వ్యాపించిన అడవిని త్యంగా భావించినట్లు తోస్తుంది.

12. అయోధ్యకాండ, XXXII.

13. కిష్కింధకాండ, VI

14. అరణ్యకాండ XLV

15. The Book of Ruth; I.

16. A. L. Basham: The wonder that was India, P. 110.

ఇందువలన అనార్యులు పాలకులైన దక్షిణావనిలో గ్రామాలు పట్టణాలుగా రూపొందడంలో విలంబన జరిగినదనుకోవాలి.

అర్థశాస్త్రంలో నిరుపయోగంగా కనిపించే క్షేత్రాలను గ్రామాలుగా రూపొందించడానికీ, గ్రామాల చుట్టుపట్ల క్షేత్రవ్యాప్తికి ప్రోత్సాహం కనిపిస్తుంది. ఈ విధానం నగరాభివృద్ధికి దోహదం కలిగించి నాగరికతకు దారితీసింది.

అడవులలోఉంటూ గ్రామాల అభివృద్ధికి ప్రయత్నించనివారు ఆటవికులూ, అనాగరికులూ అయ్యారు. ప్రభుత్వం నిర్వహిస్తున్న వ్యక్తులు అరణ్యాలపై కూడ సంపూర్ణమైన అధికారాన్ని హస్తగతం చేసుకుని, అరణ్యాలను నిర్మూలించి సేద్యక్షేత్రాలుగా మార్చగల ప్రజలను ప్రోత్సహించకపోవడం ఇందుకు గల ప్రబల కారణాలలో ఒకటిగా భావించవచ్చు.

సేద్యం అభివృద్ధి చెందినకొద్దీ నగరాలు యేర్పడే అవకాశం జరిగింది. నాగరికతవల్లనే ప్రపంచంలో పలుతావుల్లో వ్యవసాయమూ సర్వతోముఖంగా వికసించింది. నాగరికతకీ, సేద్యానికీ ఈ విధంగా పరస్పరమైన సంబంధమూ, ఒకదానికి మరియొకటి ప్రాతిపదికగా నిలవడమూ జరిగింది. ఈనాటికీ ఇదే ప్రతిపత్తి సేద్యానికీ నాగరికతకూ మూలసూత్రంగా కనుపిస్తుంది. యాంత్రిక పరికరాలూ, రసాయనికపు ఎరువులూ, అధిక ఫలదాయకములైన బీజములూ, పట్టణాలలో ఉద్భవించవలసినదే.

సర్వతోముఖమైన సేద్యంవలన మానవులకు తీరిక లభిస్తున్నది. ఈ విరామ సమయం సద్వినియోగమైనప్పుడు, ఇతర కళలతోబాటు పరిశ్రమలు నెలకొల్పుకోగల అవకాశం యేర్పడగలదు. పరిశ్రమల వలన సేద్యానికి యితోధిక ప్రోత్సాహం లభిస్తుంది. పట్టణాలవలన సేద్యానికి అపకారం జరుగుతున్నదనీ, పట్టణవాసులు నిరుపయోగమైన డాంబికాలకి అలవాటుపడి బ్రతుకుతారనీ చిత్రమైన అపోహలు ప్రపంచమంతటా వ్యాపించిఉన్నాయి. భూమి దున్ని బ్రతికినవాడే దేశానికి వెన్నెముక అనీ, అతనిదే అత్యున్నత సాంఘిక స్థానమనీ, ఆహారపు కొరత యేర్పడిన దేశాలలో ప్రచారమూ జరుగుతున్నది. ఇది సంపూర్ణమైన నిజమైతే, ఉదాహరణకు, ఇంగ్లాండ్ దేశానికి వెన్నెముక లేదని చెప్పవలసిఉంటుంది. ఆ దేశపు ఈనాటి ప్రగతి పూర్తిగా పరిశ్రమలమీదనే ఆధారపడింది. ఇది జాతీయ ఆర్థిక సూత్రాలకు సంబంధించిన విషయం గనక యింతకంటే ఈ సందర్భానికి దీనిని గురించిన వివరణ అప్రస్తుతం.

ఆర్య వ్యవస్థలకీ అనార్య వ్యవస్థలకీ అరణ్యాలకు సంబంధించిన వ్యవహారభేదం నాగరికతలలో వ్యత్యాసానికి చాలవరకు కారణభూతమైంది. మొదట్లో ఆర్య సంస్కృతి కేవలమూ తీసిపోని అనార్య సంస్కృతి క్రమంగా వెనుకంజ వెయ్యసాగింది. సేద్యపు పద్ధతులలో దీని ప్రభావం వ్యక్తమయ్యేవరకు ఈ స్తబ్ధతని గుర్తించడం జరగలేదు.

ఆర్య వ్యవస్థలన్నీ సంపూర్ణంగా సేద్యాభివృద్ధికి దోహదం చేశాయనీ, అనార్య వ్యవస్థలు ప్రగతి నిరోధక శక్తులుగా వ్యవహరించాయనీ సమర్థించ బూనడం సాహసమే కాగలదు. పైన వివరించిన తారతమ్యం స్థూలమైనది. చెదురుమదురుగా యిందుకు విపర్యయ ప్రాయాలైన సందర్భాలు ఉంటాయి. అసలు ఆర్య అనార్య జాతి వ్యత్యాసాలకే మూలమైన ప్రాతిపదికలేవీ లేవనీ, మనకి స్థూలంగా గోచరించే భేదాలన్నీ సంస్కృతి, భౌగోళిక వైవిధ్యాలేననీ జాత్యభిజ్ఞులు అభిప్రాయపడుతున్నారు.[17] జాతుల ఎక్కువ తక్కువలన్నీ మానవ చరిత్రకు పరిమితమైనవేకాని జీవశాస్త్రానికి సంబంధించినవి కావు.

దక్షిణావనిలో ఆటవికులు నివసిస్తూండేవారనే భావం రామాయణంలో సూచించబడింది. రామునికి సహాయం చేసిన వానరు లెవరు? వీ రందరి పుట్టుపూర్వోత్తరాలు ఆర్యదేవతలకీ, ఋషులకీ ముడిపడిఉండటం ప్రత్యేకంగా గమనార్హం. అనార్య జాతులతో

17. Anthony Barnet, The human species, 1957, Ch. 7, P. 148.

సస్యసంరక్షణలో వ్యయమై పోవడంతో యితరులతో ప్రమేయానికి తీరిక లభించదు. సేద్యఫలాన్ని నమ్ముకోగలిగినవాడు గనక యితరులపై దాడిచేసి దాచుకోవలసినది కృషీవలునికి లేదు. కేవలం ఆత్మరక్షణకూ సస్యరక్షణకూ కృషీవలుడు ఆయుధపాణి కావలసి వచ్చింది. సేద్యకేంద్రమైన భారతావని అతిప్రాచీన యుగాలనుంచి పశ్చిమాసియావాసుల దండయాత్రలకు గురిఐంది. ఈ దేశంనుంచి యితరదేశాలపైకి చెప్పుకోదగ్గ దాడులేవీ జరగలేదన్న సత్యం ఈ సందర్భంలో ప్రత్యేకంగా గమనార్హం. మెసపొటేమియా, పర్షియన్ నాగరికతల పోలికలు ఇక్కడి పురాతనవస్తు సముదాయంలో ద్యోతకం కావడానికి ఈ దాడులు కొంతవరకు కారణం కావచ్చును.

దక్షిణాపథంలో క్రీ. పూ. 500 నుంచి సేద్యం వృత్తిగాకల బృహత్శిలా సమాధుల నిర్మాతలు ఒక ప్రత్యేకమైన వర్గానికి చెందినవారు. ఈ సమాధులు దక్కన్‌లోను, దక్షిణదేశంలోను బహుళంగా వ్యాపించడాన్నిబట్టి వీళ్లు ముఖ్యంగా అనార్యవర్గీయులనుకోడానికి అవకాశం ఉంది. ఐతే, కదాచిత్‌గా యివి ఉత్తరభారతంలోనూ కనిపిస్తాయి. పశ్చిమయూరప్‌లో తామ్రయుత శిలాయుగకాలంనాటికీ ఈ రకపు సమాధులు నిర్మింపబడ్డాయి. వీరు యేజాతివారో, వీరి చరిత్ర యొక్క ఆద్యంతాలేవో సమగ్రంగా తెలుసుకోవలసిన అవసరం ఉన్నది. వీరి కాలంలో సేద్యం ప్రత్యేకమైన నైపుణ్యం అవసరమైన వృత్తిగా రూపొందినది. వీరు తరతరాలుగా సేద్యాభివృద్ధికి ప్రయత్నించి ఆ వృత్తికి కావలసిన పరిజ్ఞానాన్ని సమకూర్చుకోగలిగారు. వీరే తరువాత వృత్తుల ననుసరించిన సాంఘిక వర్గీకరణకు మూలపురుషులని తోస్తుంది. జనసంఖ్య పెరుగుతున్నకొద్దీ సేద్యప్రాముఖ్యం ఎక్కువ కావడంతోబాటు, ఆ వృత్తికి కావలసిన పరిజ్ఞానమూ, అనుభవమూ లేనివారు, దానిని చేబట్టడానికి వెనుకాడవలసినంతగా సేద్యం అభివృద్ధి చెందినది. బృహత్శిలా సమాధుల నిర్మాతలు పంటలను పూర్తిగా వర్షాధారాఫలంగా విడిచిపెట్టక, వాగులకు కట్టలు పోసి, నీటిని నిలువచేసి పంటలకు నీటివనరులు సమకూర్చేవారు. సేద్యానికి ముడిపడిన తాంత్రిక ప్రక్రియలుకూడ వీరి కాలంలో నిర్దుష్టంగా రూపొందాయి. విత్తులు చల్లాక అవి మొలకెత్తేవరకు, మొలకలుపెరిగి కంకులు వేసి ఫలాదాయకాలయేవరకు కర్షకుడు వేచిఉండవలసి వస్తుంది. ఇలా వేచిఉండేకాలంలో మానవమేధ పరిపరి విధాలుగా తలపోసి, యే ఆటంకములూ లేకుండా తన ప్రయత్నం ఫలవంతం కావాలనే కాంక్షకు తాంత్రిక ప్రక్రియలలో రూపు కల్పిస్తుంది. స్థూలంగా మొదటి తాంత్రిక ప్రక్రియలన్నీ సేద్యంమూలంగా ఆరంభమైనవే.

వ్యవసాయ పరిజ్ఞానంకల బృహత్శిలా వర్గీయులకు ఆహారపు కొరతలు ఉండేవికావు. పంటను నిలువచేసుకోడమూ, శత్రువులదాడులనుండి తమను, తమ ధాన్యసంపదను కాపాడుకోడం వీరికి అవసరమైంది. ధాన్యాన్ని భూమిలో నిక్షేపించి నిలువచెయ్యడం పెద్ద ఎత్తున ఈ యుగంలో ఆరంభమై ఉండాలి. ఈ దాపరికపు పాతరలను గుర్తించుకోడంకోసం మొదట్లో వీటిచుట్టూ రాళ్లతో వలయాలు యేర్పరచేవారని ఊహించవచ్చు. తాంత్రిక ప్రక్రియలతో ముడిపడిన యీ దాపరికం, క్రమంగా తమ మృతుల శారీరక శేషాలను నిక్షిప్తపరచడానికి సహితము ఉపయోగపడిందనుకోవాలి. భూమిలో దాచుకోడం బహుశా బృహత్శిలా యుగకర్తలతో ఆరంభమై వుంటుంది. గోతులు త్రవ్వడమూ, పూడ్చడమూ అంతకుముందు, కొత్తరాతియుగాల నాటినుంచీ మానవుల సహజ స్వభావంగా ఉండేది. ఈ గోతు లీ కాలంలో నివాసాలకీ, ప్రయోజన రహితమైన వస్తు విసర్జనకూ ఉపయోగపడ్డాయి.

అకస్మాత్‌గా దొమ్మీ జరిగినప్పుడు, పటిష్ఠంగా ప్రతిఘటించే అవకాశము లభించక ప్రాణరక్షణకోసం కొందరు పారిపోడమూ, మరికొందరు వధింపబడడమూ జరుగుతుంది. ఈ విధ్వంసం తరువాత తమకి స్వస్థలం యేర్పడిన బృహత్శిలా యుగకర్తలు తిరిగి తమ తావులకి వచ్చేవారు. అప్పుడు తమ బంధుజనంయొక్క మృతదేహావశేషాలను లభ్యమైనంతవరకు బృహత్శిలా వలయ సమాధులలో తాంత్రిక ప్రక్రియలతో సహా

భద్రపరచేవారని నమ్మవచ్చు. ఇందుకు తార్కాణంగా ఈ సమాధుల్లో అస్థులు చిందరవందరగా గోచరిస్తాయి. మృతదేహాలను కొన్నాళ్లవరకు పార్శీ సాంప్రదాయానుసారం, పక్షులకు తిర్యగ్జంతువులకు ఆహారంగా వదలిపెట్టడంవలన, ఎముకలు క్రమరహితంగా ఉంటున్నాయనే అభిప్రాయాన్ని కొందరు వ్యక్తపరుస్తున్నారు. మృతుల సంబంధీకులను ఖననం చెయ్యవలసి వచ్చినప్పుడు ఈ సమాధులను తిరిగి తవ్విపోసేవారనే వాదమూ ఉన్నది. ఐతే కొన్ని ప్రత్యేక సందర్భాలలో తప్ప మృతియొక్క అర్థాన్ని గ్రహించగలిగిన మానవులు, తమ బంధువుల సమాధులను తరచుగా తవ్విపోసేవారనడం హేతుబద్ధంకాదు. అందువలన హఠాత్తుగా జరిగిన దాడులలో మృతిజెందిన తమ ఆప్తులను ఖననం చెయ్యడంకోసం బృహత్శిలావలయాల నిర్మాణం జరుగుతూ వచ్చిందనుకోడానికి ప్రతిబంధకం లేదు. వీటిలో లభిస్తున్న ఇనుప ఆయుధాలు వీరిపై జరిగిన దాడులను సూచిస్తాయి. ఈ దాడులలో స్త్రీ, శిశు, వృద్ధ వివక్షలేక నిర్దాక్షిణ్యంగా ప్రవర్తించడం జరిగేది. బైబిల్‌లో ఇటువంటి దాడులు వర్ణింపబడ్డాయి. పశుపాలకులకీ, కర్షకులకీ గల నిరంతర స్పర్థలకి బృహత్శిలావలయాలు ఒక రకమైన చిహ్నాలు కావచ్చును.

దక్షిణ భారతంలో 4 వ శతాబ్దం మొదలయ్యే వరకు భూమిని ఆస్తిగా పరిగణించినట్లు తోచదు. ప్రభుత్వ వ్యవస్థ శాంతి భద్రతలకోసమే ముఖ్యంగా శ్రద్ధవహించడం జరిగేది. ఇక్ష్వాకు శాసనాల్లో 'హలశతసహస పదాయిస'లాంటి వాక్యాలను పురస్కరించుకుని హలదానం భూదానమేనని అభిప్రాయపడడం సబబుకాదు.[20] రాజు దానంగా యిస్తూవచ్చింది నాగళ్లను మాత్రమే. వాటిని పరిగ్రహించినవాడు తన కనువైన స్థలాన్ని ఎన్నుకొని సేద్యం చేసుకోవచ్చు. అతని క్షేత్రంపై శుల్కం విధించే రాజ్యవ్యవస్థ దానికి రక్షణ యేర్పాట్లు చేస్తుంది. రక్షణకోసం యిట్టి రాజ్యవ్యవస్థలు యేర్పడని ప్రాంతాలలో తమకు తాము రక్షణ యేర్పాట్లు చేసుకున్నవారు బృహత్శిలాయుగ కృషీవలులు. సమగ్రమైన రాజ్యవ్యవస్థలు యేర్పడిన తరువాత బృహత్శిలా యుగకారులు తమ ప్రత్యేకతని కోలుపోయి, ఆ వ్యవస్థలలో కృషీవలులుగా కలసిపోయారని అనుకోవలసి ఉంటుంది. జనసంఖ్య పెరుగుతున్న కొద్దీ భూమిని స్థిరాస్తిగా పరిగణించవలసి వచ్చింది. ఈ స్థిరాస్తి హక్కును పరిరక్షించుకోడానికి కృషీవల వర్గాలు కూటములుగా యేర్పడి, సాముదాయికమైన రక్షణయేర్పాట్లు చేసుకున్నారు. ఈ రకమైన అన్యోన్య సహకారం మానవుల సామాజిక వ్యవస్థలకు కారణమైంది.[21]

---

శ్రీ ఐ. కె. శర్మగారు యిటీవల కాంబోడియాలో 'స్పిరిట్' గుహలో కనుగొనబడ్డ బటానీలు, చిక్కుళ్లు మొదలైన విత్తులు క్రీ. పూ. 9500 నాటివని నిర్ణయించబడిన విషయాన్ని నా దృష్టికి తెచ్చారు. వీటిని గురించిన వివరాలు ఆయన A Study on the beginnings of the 'Food—Producing Stage', Archaeological Congress and Seminar papers లో ప్రచురించారు.

ఈ వ్యాసం వ్రాయడానికి Archaeological Survey, S. E. Circle, Librarian, కుమారి M. M. S. Sheila చాల సహకరించారు. వారికి, శ్రీ ఐ. కె. శర్మగారికి నా కృతజ్ఞతలు. —రచయిత.

---

20. M. S. Sarma, ఆంధ్రదేశ చరిత్ర సంగ్రహము, 1948. P. 17.

21. Robert Brittain; Rivers and Man, 1959, Ch. III. pp. 74—75.

# కల్లుడి శిలాశాసనం

శ్రీ కె. సుబ్బరామప్ప



విజయనగర సమ్రాట్ బుక్కరాయలు వేయించిన కల్లుడి శిలాశాసనం

# కల్లడీ లాశాసనం

కోలారుజిల్లా గౌరిబిదనూరు పట్టణానికి మూడు మైళ్లదూరంలోవుండే కల్లుడిగ్రామందగ్గర దొరికిన శిలాశాసనంవల్ల విజయనగర రాజులకాలపు చరిత్రపైనా, ఆనాటి తెలుగు—కన్నడభాషలకు వుండిన ఏకలిపిపైనా ప్రబలమైన సాక్ష్యాధారాలు దొరకగలవు.

గౌరిబిదనూరు ఆచార్య జ్యూనియర్ కాలేజిలోని హిస్టరీ లెక్చరర్ శ్రీ ఆర్. వి. రామరావుగార్లు, మరియొక అధ్యాపకుడు శ్రీ బి. కె. మాధవమూర్తిగారూ యీ శిలాశాసనాన్ని శ్రీ జయరామేగౌడగారి పొలంలో వుండగా పత్తా చేసినారు. వీరికి లోగడ కేంద్ర పురావస్తుశాఖలో పనిచేసిన 'విశ్వకర్ణాటక' దినపత్రిక సంపాదకులైన శ్రీ టి. టి. శర్మగారు ఆచోకీలను తెల్పి ప్రోత్సహించినారట.

శిలాశాసనంలో యిలా వుంది: 1338 లో విజయనగర చక్రవర్తిఅయిన బుక్కరాయలు సింగయ్యభట్టు అనే హైడ్రాలిక్ (నీటిపారుదల) ఇంజనీయర్‌ను పిలిపించి కల్లుడినుండి రాతికాలువమూలాన పెనుకొండదగ్గరి సిరివెర చెరువునకు పెన్నానదినుండి నీటిని మళ్లించే యేర్పాటు చేయించినాడట. పెనుకొండ యిచ్చటికి సుమారు 45 మైళ్లుండును. పెనుకొండను విజయనగరరాజులు పాలించేకాలం అది. పెనుకొండ ఆనాటికీ నీటిఎద్దడితో బాధపడుతూనే వుండిందని తెలుస్తుంది. ఆ యింజనీయరునకు దశవిద్యాచక్రవర్తి అని బిరుదు ఉండేదని శాసనంద్వారా తెలుస్తుంది.

శాసనంలోగల ఆనాటి లిపిని పరీక్షిస్తే అది తెలుగు—కన్నడ భాషలకు ఉమ్మడిగా ఒకే లిపి వుండినట్టు కనబడుతుంది. ఈనాడు ఆంధ్ర—మైసూరు రాష్ట్రాలలో యీ రెండు భాషలకూ ఏకలిపి అవసరమని చేసే ప్రయత్నాలకు 1338 నాటి యీ శాసనలిపి ఎంతో దోహదం చేయగలదని శాసనాన్ని చూచినవారికి అనుపించకపోదు.

ఈ శాసనం దొరికిన తావులోనే కొన్ని వీరగల్లులు (వీరులను గురించిన శిలా శాసనాలు) ఉన్నాయట. వీనిద్వారా కూడా ఆనాటి తెలుగు—కన్నడిగుల చరిత్ర మనకు లభించగలదనీ, వీటిలోకూడా వుండే లిపి తెలుగు—కన్నడ ఏకలిపిగా వుండడం గమనించతగినదని అంటున్నారు. ఆచార్య జ్యూనియర్ కాలేజీ అధ్యాపకులు వీనినిగూడ పైకి తీయించి వాటి పాఠాలను త్వరలోనే ప్రకటిస్తామన్నారు.

# భాషకి ఆధునికత సమకూర్చుట ఎట్లు?

శ్రీ పెమ్మరాజు వేణుగోపాలరావు

## 1. ఆధునికత

నిత్యం నూతనత్వం పొందుతూ, నవ్యరీతులలో పెంపొందడం ఆధునికత్వం. అంటే నవ్యత, సమకాలికతలు విందుగా పొందియుండడం 'ఆధునికత' అని నిర్వచించవచ్చు. ఈ లక్షణాలు కలిగివున్న సమాజాన్ని ఆధునిక సమాజం అంటాం— యివి లేని వాటిని 'బూజుపట్టిన పాత సంఘాలు' అంటాం. ఇదే నిర్వచనం భాషయొక్క ఆధునికతకి గూడా సరిపడుతుంది. నేటి సమాజాన్ని అన్ని వ్యవస్థలలోను సంపూర్ణముగా వర్ణించగల స్తోమతగల భాష ఆదర్శ ప్రాయమైన ఆధునిక భాష. పరిపూర్ణత లేకపోయినా కనీసం యితర ఆధునిక భాషలతో సరితూగ గలిగిన నాడు ఏ భాషనయినా ఆధునిక భాష అనవచ్చు. ప్రస్తుత ప్రశ్నకి సమాధానం వెతకటానికి యింకా వీలుగా నిర్వచించాలి అంటే యితర ఆధునిక భాషల లోని విజ్ఞానాన్ని సునాయాసంగా తర్జుమా చేసుకో గలిగియుండుట అని చెప్పుకోవచ్చు. ఇట్టి ఆధునికతను పొందిన భాషలనే సజీవమయిన భాషలు అంటాం. ఒక భాషని కొందరు ఎందుకో ఒకందుకు నిత్యం వాడుతున్నంత కాలం అది సజీవ భాషే అని సరిపెట్టుకోవచ్చు. కాని కొన్ని ముఖ్యమైన అవసరాలకి ఉపయోగపడక పరాయి భాష లుపయోగించవలసిన పరిస్థితి ఉన్నంతకాలం ఆ భాషని ఏదో బతుకుతున్న భాష అని మాత్రమే అనగలం.

## 2. 'ఆధునికీకరణం'

భాషను ఉపయోగించేవారి సంస్కృతి, విజ్ఞానముల నవ్యత సహజంగా భాషయొక్క ఆధునికత్వానికి దోహదం యిస్తుంది. అయితే ఈ ఆధునికత సహజమయిన మార్పులతో కలిసి రావలసిన లక్షణమేనా? లేక నిర్మాణ కార్యక్రమములతోగూడిన ప్రత్యేక కృషి ఫలితంగా భాషకు ఆధునికత సమకూర్చుట వీలు పడుతుందా? ఈరెండవ ప్రశ్నకి 'వీలుపడుతుంది' అని సమాధానం చెప్పుకోటానికి చరిత్రలో మనకి ఉదాహరణలున్నాయి. పందొమ్మిదవ శతాబ్దంలో హంగరీ భాష ఈ శతాబ్దంలో జపాను భాష యిట్టి కార్యక్రమాలని తలపెట్టి విజయాన్ని సాధించాయి.[1] ఈ 'ఆధునికీకరణం' అన్ని భాషలకి సులభ సాధ్యం కాకపోయినా అత్యవసరమయిన పని. సత్వరాభివృద్ధికి కలలుగంటున్న ఆశియా, ఆఫ్రికా ఖండాలలోని దేశాలన్నిటిలోను అనుసరించవలసిన పని. తెలుగుభాష విషయమై యిది ముఖ్యంగా కంకణం కట్టుకుని చెయ్యవలసిన పని. ఒక్క తెలుగుభాషకేకాదు—భారతీయ భాషలన్నిటికీ ఈ అభివృద్ధి అవసరం.

ముందుగానే ఒక సందేహం నివారించుకోవటం మంచిది. యీ కావలసిన మార్పులు పొందటానికి వీలుకలిగించే లక్షణములు భాషకు స్వతస్సిద్ధముగా ఉండవలెనా? భాషయొక్క నిర్మాణంలో, ఒక భాష కంటె మరొక భాష మంచిది అనే తారతమ్యాల చర్చకు వీలయిన, లక్షణము లేమయినా గలవా? భాషా నిర్మాణం (Linguistic structure) అంటే శబ్దోచ్చారణ (Phonetics), వ్యాకరణము, శబ్దార్థ విశేషము (Semantics) ల పద్ధతి అని ప్రస్తుతం అర్థం చెప్పుకోవాలి. యిట్టి తారతమ్యములకొరకు వెతుకుతూ, కొన్ని భాషలకు ఆధిక్యతను, కొన్నింటికి హీనత్వమును ఆపాదించుటకు ఉవ్విళ్లూరు వారున్నప్పటికీ, భాషాశాస్త్రజ్ఞుల (Linguists) అభిప్రాయములో అట్టి అవకాశములు ఏమాత్రమును లేవు. భాషా నిర్మాణము ఆధునికీకరణ మార్గాలకు అడ్డువచ్చునది కాదు. ఈ ఆధునికీకరణ మార్గాలలో ముఖ్యమయినది— పద సంపదను వృద్ధిచేయుట—కొత్త శైలి, వ్యాకరణము, రచనారూపముల కల్పన—కొన్నిటివి విడివిడిగా చర్చిద్దాం.

# 3. పద సంపద

కొత్తసంగతిగాని, కొత్తభావంకాని, కొత్త వస్తువుకాని వర్ణించవలసినప్పుడు కొత్తమాటలు అవసరమవుతాయి గదా? నూత్నవిజ్ఞానమును వీలయినంత త్వరలో తెలుసుకొనుట ఆధునికతలోని ముఖ్యాదర్శం కనుక మాటల సేకరణకై కృషిచేయుట ఈ కార్యక్రమములో ఒక పని. అయితే పనిగట్టుకుని పీఠం వేసుకుని ఈ పదాల సేకరణకై కష్టపడవలసిన అవసరములేదు, కావలసినవారు మాటలను వారే సృష్టించుకుంటారు అనవచ్చును. నిజానికి సాంఘిక వ్యవస్థలో మార్పులు నెమ్మదిగా జరుగుతున్నపుడు కొత్తపదముల సృష్టి మనకు తెలియకుండానే సునాయాసంగా జరుగుతుంది. కావలసినవారే కొత్తమాటలు కల్పించి, తోటివారితో సంభాషణలలో వాడుకుంటారు. పలువురచే ఉపయోగింపబడిన తర్వాత ఆ మాటలు స్థిరమైన అర్థమును పొంది వాడుకలో పడి పాత మాటలవుతాయి. కాని మార్పులు అతివేగంగా జరుగుతున్న రోజులివి. నిత్యం నూతన విజ్ఞానాభివృద్ధి అన్నిరంగాలలోను జరుగుతోంది. ఇంగ్లీషు, రష్యను, జర్మను మొదలగు ఆధునిక భాషల్లోనే సాంకేతిక పదజాలము ప్రతిరోజూ వృద్ధిఅవుతోంది. ఈ మధ్యన రోదసీ పరిశోధన కార్యక్రమాల ఫలితంగా ఎన్నో కొత్తమాటలు యింగ్లీషులో చేరాయి. అంతేకాదు—ఈ కార్యక్రమాలను నిర్వహించే సంస్థలు, పరిశోధకులు తమలోతాము వాడుకునే భాషని యితరులకు అర్థంఅయేటట్లు తిరిగి వ్రాయటానికి ప్రత్యేక నిపుణులను నియమించుకుంటున్నాయి.[2] అంచేత పదసంపద వృద్ధిచేయటానికి ప్రత్యేక కృషి లేకుండా వెనుకబడిన భాషలు ఆధునికత సాధించటం చాల కష్టం.

ఈ ప్రత్యేక కృషి ఎవరు చేస్తారు? ప్రస్తుతం అమలులోఉన్న పద్ధతులు కొన్ని చూద్దాం. హిందీ భాషోద్ధరణకై భారతప్రభుత్వం చాల కృషి చేసింది. అనేకమయిన ప్రత్యేక సంఘాలని ఏర్పాటు చేసింది. 1950 లో 'Board of Scientific Terminology' (సాంకేతిక పదసేకరణ సంఘము) ఒకటి ఏర్పాటు చేయబడింది—కనీసం 350000 కొత్తహిందీ పదములు సృష్టించవలెననే ఆంక్షతో. హిందీ సాహిత్య సమ్మేళనవారుకూడా ఈ ఆదర్శానికి కృషి చేశారు. ఈ మాటలన్నీ అందరికీ అర్థం అవటానికి వీలువుగా ఉండాలి అని తలంపు. కాని చివరకి సంస్కృత భూయిష్టమైన పదకోశాలు, నిఘంటువులు తయారయాయి. ఈ కష్ట పడి కల్పించిన పదాలతోగూడిన 'అఫీషియల్' హిందీ సామాన్యప్రజకి అర్థంకాకుండా దూరంగా ఉండిపోయింది. ఒకసారి నెహ్రూ పండితుడు రేడియోలో ప్రసారం చెయ్యబడుతున్న తన ఉపన్యాసాల సారాంశమే తనకి అర్థంకావటం లేదన్నాడుట లోక సభలో మాట్లాడుతూ. అరబ్బుభాషలో (ముఖ్యంగా ఉత్తర ఆఫ్రికాలో)కూడా యిట్టి ప్రయత్నాలకి విజయం కలుగలేదు. యీ విఫలతకి కారణాలు వెతికి పరిశోధించవలసిన అవసరము ఎంతయిన ఉంది. బహుశః ముఖ్యకారణము ఈ పని చాలవరకు భాషాపాండిత్యము మాత్రమేగలవారికి అప్పచెప్పటం అయిఉంటుంది. ఈ భాషాకోవిదులు పదగాంభీర్యత, ప్రాచీనత, పవిత్రతల మీాద ఎక్కువ ఆసక్తి చూపారుగాని భావవిశదీకరణ, వాడుకలో సౌలభ్యత మొదలగు ఆశయాలను మన్నించ లేదు. కొత్తమాటలు కావలసినవారే కల్పించుకుంటారన్న దాంట్లో సత్యాన్ని గ్రహించినట్లయితే ఏ విజ్ఞాన రంగంలోనయినా దానిలోని మేధావులు, నిపుణులు ఈ పద సేకరణలో ప్రముఖపాత్ర వహించవలెననుట సమంజసము. న్యాయంగా వీరికి తమ మాతృభాషలోకూడ ప్రవేశము అభిలాష ఉండాలి. లేకపోతే తాము అలవాటు పడిన పరాయిభాషలోనే తమ జీవితాన్ని గడిపేస్తారు. మిగత ప్రజానీకం అంధకారంలో ఉండిపోతుంది. అంటే తన భాషాభివృద్ధికి కృషి చెయ్యాలి అన్న మనస్తత్వం కలిగి తన భాషలో ప్రవేశం కలిగి సమకాలిక విజ్ఞాన రంగంలో నిపుణత కలిగిన మేధావులు ఈ పనికి తగిన వారు. ఆంధ్రదేశంలో ప్రస్తుత విద్యావిధాన పద్ధతుల ప్రకారం జూనియర్ కళాశాలలోకూడా తెలుగులో విద్యాబోధనకై ఏర్పాటులుచేయు సందర్భంలో తెలుగు సాహిత్యఅకాడమీవారు తెలుగులో సాంకేతిక పదముల

కూర్పుకై కృషి చేయుచున్నారు. హిందీ, అరబ్బు భాషలవలెకాక ఈ ప్రయత్నము ఫలించగలదని ఆశిద్దాం.

పదసేకరణలో పద్ధతులను గురించి విచారించుటకు పూర్వము మాటలని రెండు తరగతులుగా విభజిద్దాం. మొదటి రకం : వస్తువులను సూచించటానికి ఉపయోగపడే మాటలు—కలము, బల్ల, నిచ్చెన, విమానము, స్పుట్నిక్, డి. డి. టి మొదలగునవి—వీటిని వస్తుసూచకములు అందాం. రెండవ రకం : భావములు వెల్లడి చెయ్యటానికి ఉపయోగపడే మాటలు—వేగము, ఆకలి, సంయోగము, వాక్స్వేచ్ఛను, కమ్యూనిజం మొదలగునవి—వీటిని భావ సూచకములు అందాం.

## 3.1 వస్తుసూచకములు

కొత్తవస్తువు ఒకటి మన కంటబడింది అనుకుందాం. (మన భాషలో యిదివరకు ఆ వస్తువుకి మాటలేదు) వెంటనే మనకు తోచేది 'అదేమిటి?' అన్న ప్రశ్న. ఈ ప్రశ్న చిన్నపిల్లలు అస్తమానూ వేస్తున్నదే. వారికి మనమిచ్చే సమాధానాల పద్ధతే కొత్తవస్తువులకు కొత్తమాటలు కల్పించే విధానం. ముందు మనం ఆ కొత్తవస్తువు గురించి తెలిసినవారి నడుగుతాం. ఆయన తన భాషలో తానువాడే మాటను చెపుతాడు. మనంకూడా ఆ మాటనే వాడితే పారిభాషిక పదాన్ని (Foreign language word) సంగ్రహించామన్నమాట. ఇది సులువు. నిజానికి పారిభాషిక పదాలు దొరికినంతకాలం ఈ తరగతిమాటలు యితర భాషలనుంచి సంగ్రహించటం ఉత్తమం. ఈ పారిభాషిక పదాలని కాస్త చివళ్లు మలచాలి, మన తెలుగుమాటల మధ్యపడి నలిగి తెలుగయిపోవటానికి వీలుగా. ఇది మనకి కొత్తకాదు. ఎన్నో ఇంగ్లీషు, పారశీక పదాలని అప్పతీసుకుని స్వంతం చేసుకున్నాం.

అసలు పారిశ్రామిక విప్లవంలో పాల్గొననివి, లేక దాని ఫలితాలను సరిగా అనుభవించనివి సమాజాలు చాలా ఉన్నాయి ఆసియా, ఆఫ్రికాఖండాలలో. ఈ సమాజాల భాషలలో మాటల కొరత పారిభాషిక పదాలను సంగ్రహించకుండా తీర్చటం చాల కష్టమయిన పని. ఉదాహరణకి కిందనుంచిపైకి నడచి ఎక్కడానికి మనం నిత్యం వాడేది 'నిచ్చెన'. బహుశః 'నిచ్చెన' చాల పాతమాట అయిఉంటుంది. పారిశ్రామిక విప్లవంవచ్చి సమాజవ్యవస్థని మార్చినా 'నిచ్చెన' ఉపయోగంలోకాని, ఆ మాట అర్థంలోకాని ఏవిధమయిన మార్పు రాలేదు. కాని ఆరోహణపద్ధతుల్లో మార్పులు జరిగాయి పారిశ్రామిక, సాంకేతిక విప్లవాల కారణంగా. ఈ రెండు విప్లవాలలోను భారతదేశం వెనుకబడ్డ దేశమే. క్రేను, లిఫ్టు, ఎలివేటరు, ఎస్కలేటరు— మొదలయినవి భారత నాగరికతాజన్యములు కావు. అంచేత తెలుగులో వీటికి మాటలు సృష్టింపబడలేదు. పైపెచ్చు యివి మన సమాజంలో నిన్న మొన్నటి వరకు చాల అరుదయిన వస్తువులు కాబట్టి అవసరమయిన కొద్దిమంది తెలుగువారు ఆ యింగ్లీషుమాటలనే వాడి సంతృప్తిపడ్డారు. ఇది సహజమయిన పద్ధతి. నొచ్చుకోవలసినది ఏమీలేదు. క్రేను, లిఫ్టు, ఎలివేటరు, ఎస్కలేటరు విరివిగా వాడుకునేటంత పారిశ్రామికత్వం పొందలేదని ఒప్పుకోవటంలో అర్థం ఉందికాని, ఆ వస్తువులకి తెలుగుమాటలు లేవని కించపడటం చేతగానితనాన్ని మరింత ఎక్కువగా ప్రకటిస్తుంది. పారిభాషికపదాల సంగ్రహణలో ఇంగ్లభాష ఆరితేరినది. బహుశః ప్రపంచంలోని భాషలన్నిటికంటె ఇంగ్లభాషలో యితరభాషలమాటలు ఎక్కువ కనిపిస్తాయి—ఒకపక్క కొత్తమాటల సృష్టి నిత్యం జరుగుతున్నప్పటికీ.

## 3.2 భావ సూచకములు

ఇక రెండవ తరగతి మాటలు— అంటే భావములను, సంగతులను, మనస్సంకల్పములను, విశదీకరించుటకు ఉపయోగపడే మాటలు. సరికొత్తభావాన్ని వెల్లడి చెయ్యవలసినప్పుడు వాడుకలోగల మాటలలో ఒకటి తీసి దానికి కొత్తఅర్థం తొడిగి వాడటంవల్ల చిక్కులున్నాయి. ఇదివరకే ఆ మాటలతో జతపడి ఉన్న పాతభావాలన్ని గుర్తుకు వస్తాయి, దాన్ని వాడినప్పుడల్లా. కాని మనం చెప్పదలచుకున్న భావానికి

సంబంధించిన ఊహలు రేకెత్తించే మాటలు గనక వాడితే ఆ భావాన్ని వెల్లడిచేయటం సులువు.[3] అంటే పాత భావాలతో ఎక్కువ ఆశ్రయములేకుండా, కొత్త భావాలకు సంబంధించిన ఊహలు కలిగించే మాటలు గాని, మాటల భాగాలతో కూర్చిన మాటలుగాని ఉపయోగించాలి. ఈ 'పరిచయ పూర్వకమయిన భావనలు కలిగించే మాటలు లేక మాటల ముక్కలు' ఎక్కడ దొరుకుతాయి? మన భాషలోనే ఉండవచ్చు—లేక మన భాషకిదివరకే జీవముపోసిన సంస్కృతంలో దొరకవచ్చు—కాక మనకి పరిచయమయిన యితర భారతీయ భాషలలో, ఆధునిక భాషల్లో ఉండవచ్చును. ఉదాహరణకి కాలముతో జరిగే మార్పులను సూచించే కొన్నిమాటలను పరిశీలిద్దాం. ఒక వస్తువు ఒకచోట నుండి మరొకచోటకి పోయినపుడు ఎంత కైములో ఎంతదూరము వెళ్లిందో తెలియజెయ్యటానికి 'వేగము' అనే పదం వాడతాం. దీన్ని ఇంగ్లీషులో స్పీడు (Speed) అంటాం. స్పీడు అనేమాట తెలుగులోకూడ విరివిగా వాడుతూంటాం. కాని వస్తువు ఎటువైపు కదులుతోందో దిక్కునుసూచించే విధానంలేదు ఈ మాటలో. అటువైపు, యిటువైపు, వెనక్కి, ముందుకు, తిన్నగా, పైకి, కిందకి—అనేమాటలు జతపరిస్తేగాని దిక్కును సూచించలేం. నిత్యజీవితావసరానికి కాకపోయినా శాస్త్రీయ విజ్ఞానంలో దిక్కునుకూడ పొదుపుగా ఒక మాటలో సూచించగలగడం అవసరం, యింగ్లీషులో వెలాసిటీ (Velocity) అనే పదంలాగ. ఒక పని చెయ్యవచ్చు. స్పీడు అనే పదం ఎలాగ అలవాటులో ఉంది కాబట్టి 'వేగము' అనే పదాన్ని వెలాసిటీకి బదులుగా వాడవచ్చును. దీనికి ఒప్పుకుంటే మనం రెండు రకాల పనులు చేశాం. ఒకటి 'స్పీడు' అనే పారిభాషిక పదాన్ని కాస్త చివళ్లునలిపి స్వంతం చేసుకున్నాం. రెండు 'వేగము' అనే మాటకు అర్థాన్ని విశాలపరచాం. మరొక అడుగు ముందుకు వేద్దాం. వేగం స్థిరంగా ఉండకపోవచ్చును. మారవచ్చును. నెమ్మదిగా వస్తున్నవారిని మనం 'గబగబా రా' 'త్వరగా రా' అని హెచ్చరించటం అలవాటు. అందుచేత వేగము మారుతున్న పరిస్థితిని శాస్త్రీయంగా క్లుప్తంగా వర్ణించటానికి ఒక మాట ఉంటే మంచిది. దీన్ని యింగ్లీషులో యాక్సిలరేషన్ (Acceleration) అంటాం. మనవాళ్లు కొందరు[4] వాడుకలోగల 'త్వర' అనే మాటని కాస్త మార్చి 'త్వరణం' అని వాడేరు యీ యాక్సిలరేషనుకి బదులు. యీ ఉదాహరణలో మూడవరకం పద్ధతి వాడాం—వాడుకలోగల పాత మాటను కాస్త మార్చి నిర్దిష్టమయిన ఒక భావమునకు ఆశ్రయమిచ్చాం. యింకొక్క అడుగు ముందుకు వేద్దాం. 'కారు' యిప్పుడు మనందరకీ పరిచయమైన వాహనం, కాని కారు నడపడం అందరికి తెలియదు. అదేకాక కారులో భాగాలు తెలుసున్నవారు తక్కువ కూడాను. కారు నడపటం మొదలుపెట్టగానే 'యాక్సిలరేటరు' అనే యింగ్లీషుమాట వస్తుంది. కారు నడపగలిగే తెలుగువాళ్లు దీనికి విడిగా తెలుగు పదాన్ని సృష్టించలేదు. కాని మన కారుడ్రైవర్లు 'యాక్సిలేటరు' అనడం చాలసార్లు విన్నాం. 'యాక్సిలరేటరు' అనే ఆంగ్లపదాన్ని భ్రష్టంచేసి 'యాక్సిలేటరు' అనే మాటని సాధించారు. పోనీ 'త్వరణం' అనే పదంతోంచి 'త్వరణకం' అని యింకోమాట తయారు చేద్దామా? యాక్సిలేటరే అందరికి అలవాటయితే త్వరణకం అనే మాట ఎగతాళికి తప్ప పనికి రాకపోవచ్చును. న్యాయానికి వాడుకలోగల మాటని తొలగించటానికి కొత్త తెలుగుపదం సృష్టించటం శుద్ధ దండుగ.

## 3.3 నిర్దిష్టత లేక ఖచ్చితత్వము

పై ఉదాహరణలో మరొక ముఖ్య విషయం గమనించవచ్చు. అది ఒక మాటకి ఖచ్చితమైన (Precise) అర్థం యివ్వటం. ఖచ్చితములేక నిర్దిష్టత (Definiteness) అనే లక్షణం శాస్త్రీయ విషయాలలో మాటలకి చాల అవసరం. వేలకువేలు కొత్త పదాలు భాషలో ప్రవేశిస్తూంటే ఈ ఆదర్శం చాల ముఖ్యమయినది. రెండేసి మూడేసి అర్థాలుగల మాటలు యిదివరకే ఎన్నో ఉన్నాయి భాషలో. మనం చిన్నప్పుడు నానార్థములు గల పదాలని కంఠతా పడుతుండేవాళ్లం. తెలుగు నిఘంటువు నేదయినా నాలుగు పేజీలు తిరగేస్తే బోలెడు కనిపిస్తాయి. అంతేకాదు—తెలుగు ప్రబంధ రచనాకాలంలో ద్వ్యర్థి కావ్యములు

(రాఘవ పాండవీయము) వంటిది వ్రాయటం చాల ఘనత. కాని నేడు అట్టి పద్ధతులు ఉపయోగకరము కావు — పైపెచ్చు విజ్ఞాన ప్రచారమునకు అడ్డు రాగలవు. అంచేత నానార్థములు గల పదాల్ని కొత్తగా కొనితెచ్చిపెట్టుకో నవసరములేదు.

పైన చర్చించిన విషయములతో ఏకీభవించినట్లయితే, పారిభాషిక పదములు వాడుట మంచిదా లేక స్వభాషాధాతు నిర్మితమయిన పదములను కూర్చుట మంచిదాయను ప్రశ్న మనలను బాధించ నవసరంలేదు. కాని దేశపరిస్థితులనుబట్టి, పరాయిభాషలవారియందు గల గౌరవాగౌరవములనుబట్టి మన అభిప్రాయములు కూడ ఏకరీతిని ఉండకపోవచ్చును. స్వాతంత్ర్యసమరం జరుగుతున్న రోజులలో ఆంగ్లభాష మనకి పరాయి భాషే కాదు, శత్రుభాషగా పరిగణింపబడింది అనేకమందిచేత. అందుచే ఆంగ్లభాషాప్రభావమును సమూలకంగా తొలగించవలెననెడి భావములుకలవారుకూడ దేశమందు లేకపోలేదు. ఆంగ్లపదములు వాడిన భాష యొక్క పవిత్రత పోవుననెడి దురభిప్రాయముకూడ కద్దు. భాష నిత్యం మార్పులు చెందుతూ ఉంటుంది. అకలుషితమైన భాష అనేదిలేదు. ఒకనాడు మనము సంస్కృతపదములను వ్యాకరణమును విరివిగా స్వీకరించి తెలుగును వృద్ధిచేసుకున్నాం. నాటి సాంఘిక ధార్మిక పరిస్థితులలో సంస్కృతమునకుగల ప్రశస్తియే దీనికి కారణం. పర్షియను నాగరికతా ప్రభావము పాకిన రోజులలో పర్షియను పదములు, నేడు పాశ్చాత్య భాషాపదములు అదేవాదిరిగా మన భాషలో ప్రవేశించాయి. మవ భాషపై సంస్కృతమునకుగల ప్రత్యేక ప్రభావమును గుర్తించి చారిత్రకమయిన మన సంస్కృతిని, నాగరికతను పూర్తిగా వర్ణించుటకు సంస్కృతమేకాదు, యితర భారతీయ భాషలనుంచి కూడ పదములు మరికొన్ని స్వీకరించవలసిన అవసరం ఉంది. కాని సమకాలిక శాస్త్రీయవిజ్ఞాన ప్రచారమునకు మాత్రము నిస్సంకోచముగా ఆధునిక భాషలనుండి మాటలు సేకరించుట ఉపయోగము. అది మన ఆశయసాధనకు సుశుభమార్గము.

## 4. [illegible]

అసలు ప్రతిభాషలోను మాట్లాడు పద్ధతులకి, వ్రాసపద్ధతులకి భేదం ఉంటుంది. తెలుగు భాషలో ఒకనాడు గ్రాంథికభాషకి వ్యవహారికభాషకీగల వ్యత్యాసం చాల పెద్దది. సంస్కర్తల కృషి ఫలితంగా వ్యవహారికభాషకి తగిన స్థానము లభించినదని చెప్పవచ్చును—కనీసం నేటి కథలు, నవలలు, నాటకాలు చూచినట్లయితే.

ఒకసారి ఆలోచించి చూడండి— ఛందోబద్ధమైన పద్యాలలోనూ, సూత్రప్రాయంగాను మాత్రమే మనవాళ్లు మొన్నమొన్నటిదాకా వ్రాయటంవల్ల జరిగిన అపారమయిన హాని. ఆ కాలపు సాంఘిక జీవితాన్ని అసలు [illegible] వర్ణించగల అవకాశం పోయింది. నాటి మనవారు మాట్లాడిన తీరు, వారి హృదయాల నానందింపచేసిన ఛలోక్తులు, వారి వాగ్వాదముల తరహా— యివన్నీ మనకింక తెలియవు. అసలులోఉన్న భాషలో కూడా రచనలు జరిగిఉన్నట్లయితే ఈ హాని జరగకపోయేది. అందుకనే శబ్దస్వరూపాన్ని టేపులపై స్థిరపరచి దాచుకోగల శక్తి ఉన్న యీ రోజులలో కూడా సాలింజరు వ్రాసిన 'కేచరు యిన్ ది రై' (Catcher in the Rye) అనే నవల అమెరికన్ భాషాచరిత్రలో ఒక ముఖ్య ఘట్టంగా పరిగణింపబడుతోంది.[5] సాలింజరు తన పుస్తకంలో టీనేజి వయస్సు వారి మధ్య వాడుకలోఉన్న అమెరికను భాషను యథాతథంగా వాడి, ఆ భాషాశైలికి ఒక శాశ్వతత్వాన్ని చేకూర్చాడు. గురజాడ అప్పారావుగారు కన్యాశుల్కం నాటకంలో సాధించిన ఫలితం యిటువంటిదే.

సాంఘిక వ్యవస్థలోగల తారతమ్యాల ప్రభావం భాషాశైలిలో కనిపించటం మనం ఎరుగున్నదే. ఈ శైలిలోగల వివిధ విధాలు రచనల్లో కనిపించేటట్లు చెయ్యడం సమకాలికతను రచనల్లో ప్రతిబింబింపచెయ్యటానికి సులువయిన మార్గం.

## 5. వ్యాకరణం

నాడుక భాష తీరు మారుతూ ఉండటం సహజం. ఈ తీరులు ఆకళింపు చేసుకోవాలంటే మన వ్యాకరణ

గ్రంథాలలో కూడా ఈ మార్పులు కనిపించాలి. అసలు వ్యాకరణం అంటే ఏమిటి? భాషలోగల వాడుక తీరు లన్నీ ఓపికగా చక్కని పద్ధతిలో వ్రాయబడిన సూత్రాల సంపుటి. దీని ముఖ్య ఉపయోగం వాడుకలోగల భాషని నేర్చుకోవటం సులభం చెయ్యటం. కాని మార్పులు భాషకి సహజమంటిమి గదా! ఈ మార్పులు వేగంగా జరిగితే మన నిర్వచనం ప్రకారం వ్యాకరణం వ్రాసిన మర్నాడే పాతబడిపోతుంది. అంత ఘోరం జరక్క పోయినా ప్రతి తరంలోనూ వ్యాకరణం సరిదిద్దబడడం అవసరం.

సాంప్రదాయకంగా వ్యాకరణాన్ని ఈ విధంగా పరిగణించలేదేమో మనవారు. పాణిని వ్యాకరణం వ్రాసి నప్పుడు (క్రీ. పూ. 4 వ శతాబ్దం) తన పూర్వులు వాడి, తన సమకాలికులు ఆదరించిన సంస్కృతమే దృష్టిలో వుంచుకున్నప్పటికి, తర్వాత తరలవారిచే పాణినీయమగు 'అష్టాధ్యాయి' వేదవాక్కుగా పరిగణింప బడినది. సంస్కృత భాషను పాణిని గీసిన హద్దులను దాటి పోనిచ్చుటకు ఎవ్వరూ సాహసించలేదు.

కాని ఒకసారి వ్రాసిపెట్టినంత మాత్రంలో శాశ్వతంగా భాష ఆ వ్యాకరణ సూత్రములలో బంధింప బడుననుకోవడం ఆధునికతకి దోహదం యివ్వదు. పాత కాలపు వ్యాకరణ గ్రంథాన్ని ముందుపెట్టుకుని మనం ఎప్పుడూ దీనిప్రకారమే వ్రాయాలి అని పీఠంవేసుకుని మార్పులను వ్యతిరేకించే స్వభావం సమంజసం కాదు. పరవస్తు చిన్నయసూరిగారు బాలవ్యాకరణము ఆయన సమకాలికులు ఆదరించిన ఆంధ్రమునకు అద్దము వంటిది. కాని నేటి తెలుగును సలక్షణముగా నిర్వ చింపుటకు నూత్న వ్యాకరణ మవసరమనుట సత్య దూరము కాదు.

## 6. రచనల రూపం

విద్యార్థిదశలో వున్నవారికి విజ్ఞానం అంద జెయ్యటం సులువు—భాషని, భాషలోని మార్పులతో సహా ఒకే సమయంలో నేర్చుకుంటారు కాబట్టి. పాఠ్య పుస్తకాలద్వారా ఈ విజ్ఞానం వారికి అందుతుంది. పాఠ్యపుస్తకములలోని రచనలు సులభమైన శైలిలో

అర్థమయేటట్లుంటే చాలు. కాని విద్యార్థిదశ దాటి వయస్సు ముదిరి, జీవితావసరాలకు కష్టపడుతున్న వారికి పాఠ్యపుస్తకాలు చదివే ఓపిక ఉండదు. స్కూళ్లకి వెళ్లి చిన్నకుర్రాళ్లవలె చదువుకోటానికి సమయం దొరకదు. వారికి ఆధునిక విజ్ఞానము (కనీసం దాని సారాంశము) వయోవిద్యావిధానపు పద్ధతులలో (Adult Education Methods) జరగాలి. పాఠకుని ఆసక్తిని చూరగొనే రూపాలని అవలంబించాలి— కథ, పద్యం, నాటకం, సంభాషణ, ఛలోక్తి మొదలయిన రూపాలు. ఇవి మన తెలుగు భాషకి కొత్తవయిన రూపాలుకావు. కాని ఈ రూపాలని మన ఆదర్శానికి—అంటే ఆధునిక విజ్ఞాన ప్రచారానికి— వీలుగా వాడుకోవాలి.

తెలుగుభాషలో 'సైన్సు ఫిక్షను' చాల అరుదు. దీనికి కారణం తెలుసుకొనటం మంచిది. బహుశః శాస్త్రీయవిద్యల నభ్యసించినవారు తెలుగు భాషను వాడుటయందు ఆసక్తి చూపించకపోవడం దీనికి కారణమయి ఉంటుంది. పల్లెజీవితం, గుమస్తా బాధలు, ప్రేమగాథలు, వంటలు మొదలయిన విషయాలతోటే కాలం గడిపేస్తున్నారు మన రచయితలు. సైన్సుఫిక్షను తరగతికిచెందిన రచనలను ప్రోత్సహించడం చాల అవసరంగా కనిపిస్తుంది. సత్యానికి దూరమై కల్పితప్రపంచంలోఉన్నా శాస్త్రీయభావాలని పదాలని ప్రచారంలోకి తీసుకురావటానికి చాల సులువయినది విలువయినది ఈ రకపు రచన. చంద్రమండలయాత్ర జరిగినతర్వాత 'ఎప్పుడో సైన్సుఫిక్షనులో చదువుకున్నవన్నీ ఈనాడు నిజం అవుతున్నాయి' అని ఆశ్చర్యపడ్డాం మనం అంతా. కాని ఆ సైన్సు ఫిక్షను అసలు చదివిన అవకాశం కలగనివాళ్లకి ఆ ఆశ్చర్యసంభ్రమాల అనుభూతి ఎలా కలుగుతుంది?

## 7. ఆఖరిమాట

ఆధునికత సాధించుటలోగల యితర ముఖ్య విషయాలు కొన్ని—ముఖ్యంగా 'లిపి సంస్కారము' స్థాయీకరణ'—యిచట చర్చించబడలేదు. భాష యొక్క వాడుక పెరిగినకొద్దీ యీ సమస్యలను ఎదుర్కొనే స్తోమత ధైర్యం మనకి గలవని ఆశిద్దాం.

కాని ముఖ్యమయిన విషయం మరొకటి ఉంది. కొత్తపదములు, నవ్యవ్యాకరణము, నూత్నసరళులతో రచింపబడే ఈ భాష వాడుకలో పడేందుకు మనము ఏమి చెయ్యగలం? పదములసేకరణమే పరమావధి అనుకొనటం ప్రమాదము. భారతదేశంలోనే కాదు, యితర చోట్లకూడా భాషోద్ధరణకై పూనుకున్న వ్యక్తులు, సంస్థలు—నూత్నపదసృష్టి, నిఘంటువుల కూర్పు, భాషాంతరీకరణం మొదలగువానిలో నిమగ్నులౌతున్నారే గాని—వీటి వాడుకకై అవసరమయిన అవకాశాలు కల్పించుటకు కృషిచేయుటలేదు. ఈ కొత్తమాటలు, భావాలు పొందుపరచిన భాషని పాఠ్యగ్రంథాలు మొదలుకొని నిపుణుల ప్రైవేటు సంభాషణలలోదాకా వాడాలి. వాడుకయే భాషకి జీవం. మనం మన భాషని మన అవసరాలన్నిటికీ వాడితే, ఆధునికత అవలీలగా అందుతుంది.

(అమెరికాలో ప్రచురింపబడుతున్న తెలుగు భాషా పత్రికనుండి.)

---

ఈ రచనలో యీ క్రింది ప్రచురణలు వరుసగా సంప్రతించబడినవి.


1. 'Language Problems of Developing Nations'-J. A. Fishman, C. A. Ferguson & J. D. Gupta.

2. 'A Linguistic Look at Aerospace Research'-D. A. Sears & H. A. Smith [WORD STUDY, April 1969]

3. 'The Formation of Prose' Punya Sloka Ray [WORD, 18, 313, 1962]

4. ప్రస్తుతం ఆంధ్రదేశంలోని కొన్ని పాఠ్యగ్రంథాలలో చూడబడినమాట.

5. 'A Linguistics Reader'-Graham Wilson (1967)

# పండితరాయల చివాట్లు

డా. మహీధర నళినీమోహన్

మోడేకుర్రు అగ్రహారంలో పండిత సభ చేసి, అక్కడి పండిత మండలిని చిటికెన వేలితో ఓడించి, పాదాక్రాంతులనూ శిష్యులనూ చేసుకుని, గండపెండేరం వేయించుకుని, పల్లకీలో ముంగండ అగ్రహారానికి తిరిగి వస్తూన్న జగన్నాథునికి కొడుకు మాధవ దీక్షితులు కనిపించాడు పొలెం ప్రాంతాల. అక్కడి పిల్లలతో పరాచికాలాడుతూ, గోలీకాయలాడు తున్నాడు.

కొడుకు అవతారం చూసేసరికి జగన్నాథుడికి ఉత్సాహం అంతా చచ్చిపోయింది. మాధవుడికి పన్నెం డేళ్లు వస్తున్నాయి. తెలివైనవాడేకాని చదువుమీద ధ్యాసలేదు.

"హరి దౌర్భాగ్యుడా! ఇదిట్రా నువ్వు చెయ్య వలసిన పని? దిగ్గజాల్లాంటి మహాపండితులను గడగడలాడించేసిన విద్వత్తురా మన కుటుంబానిది. పేరమభట్టుగారి మనవడు ఇలాంటి జూలాయి వెధవ లతో గోలీకాయలూ, గుంటే బిళ్లానా ఆడవలసినది? ఛీ ఛీ ఛీ—నీ మొహం నాకు చూపించకురా అప్రాచ్యుడా" అని రెచ్చిపోయాడు జగన్నాథుడు.

వెంటవస్తున్న శిష్యులు మాధవ దీక్షితుల్ని పక్కకి తీసుకుపోయారు, 'ఏదో ఇంకా కుర్రతనం. మరో నాలుగు రోజులుపోతే వాడే తెలుసుకుంటాడు. సింహం కడుపున మేకపిల్ల పుడుతుందా?' అంటూనూ.

జగన్నాథుడి కళ్లు ఇంకా జేవురించే ఉన్నాయి. అడుగు పెదవి ఇంకా అదురుతూనే ఉంది.

ఓ సింహ కిశోరమా! కుక్కపిల్లలతోటీ, నక్కపిల్లలతోటీ కలిసి, ఆటలూ పాటలూనా నీకు? ఇల్లాంటి వెర్రి వేషాలు కట్టిపెట్టు. మత్తేభ కుంభ స్థలాలను పగులగొట్టే మీ కులవిద్యమీద నీ మనస్సు పారడంలేదేమిరా? సిగ్గులేదూ?

**వసంత తిలక**

హరీంద్రశావక! నతావకరీతిరేషా
వేషాంతరైర్విహరసి శ్వ శృగాలశాబైః
కుంభీంద్ర కుంభదళనోత్పతనక్రమేచ్ఛాం
వంకోచితాం న ఖలు రీతి మురీకరోషి.

**ఉత్పలమాల**

మానుము వెర్రివేషములు,
మంచిదికాదు శునీశృగాల సం
తానము తోడగూడి
గహనాంతరసీమల నాటలాడుటల్
ఏనుగు మస్తకమ్ము బగిలించెడు
మీ కులవృత్తియందు నీ
మానస ముంచవైతివి—
అభిమాన మెరుంగవొ? సింహబాలకా!

*　　*　　*

అది విజయనగర సంస్థానం. తనకు అక్కడ ప్రవేశం దొరుకుతుందేమోనని ప్రయత్నిస్తున్నాడు జగన్నాథుడు. రాజు తిమ్మజగపతి ఉదారుడే. సందేహం లేదు. కాని రాజసభా ప్రవేశం అంత సులభంగా జరిగే పనా? ఎన్నెన్ని అడ్డంకులూ, ఎంతలేసి ఇబ్బందులు. దివాను ఆదివరాహమూర్తి బతికిఉండగా అక్కడ పండితుడు ప్రవేశించడం సాధ్యమా? రాజ దర్శనం సుఖసుఖాల జరిగే మాటా?

ఆఖరి ప్రయత్నం చేద్దామని — స్నానాదికం ముగించుకుని, పరాగ్గా ఆలోచించుకుంటూ, కోటకి వస్తూన్న జగన్నాథుడు చటుక్కున 'అబ్బా!' అని కాలు పైకిఎత్తుకున్నాడు. అరిపాదంలో తుమ్మముల్లు

గుచ్చుకుంది. పక్కనేఉన్న బండమీద చతికిలబడి, ముల్లు తీసేశాడు. నెత్తురు బొట్లుబొట్లుగా చిమ్మింది. ఎదురుగాఉన్న జీబూతంలాంటి తుమ్మ చెట్టుని కొరకొరా చూశాడు. ఒళు మండి దానిని తిట్టడం మొదలుపెట్టేడు.

ఓసి తుమ్మచెట్టూ! ఏం చూసుకునే నీకీ పొగరు? నీ ఒళ్లంతా ముళ్లు. నీవి నిర్గంధ కుసుమాలు. నీ పళ్లు నోట పెట్టడానికి కూడా వీలులేదు. ఎండనిపడిఅలిసివచ్చినవాడికి నీడైనా ఇస్తావేమో అంటే చూస్తున్నాంగా నీ నీడ ఎంత దట్టంగా ఉందో. నీమీద కాకులు, గద్దలు, రాంబొందులూ తప్ప మంచి మంచి పక్షులు పొరబాటున అయినా వాలవు కదా! పైగా దారి అంతా ఆక్రమించుకుని, ఇతర ఫల వృక్షాలకి కంచెలా ఏర్పడి ఎవ్వరినీ దగ్గరకు రానీకుండా ఉన్నావు. ఎందుకొచ్చిన బతుకే నీదీ ?

**శార్దూల విక్రీడితం**

ఆమూలాగ్ర నిబద్ధకంటకతను
ర్నిర్గంధ పుష్పోద్గమః
ఛాయా న శ్రమహారిణీ
నచ ఫలం క్షుత్ క్షామ సంతర్పణమ్
బబ్బూలద్రుమ! సాధుసంగ రహితః
పంథాన మాక్రామసి
త్వన్యేషాం ఫలశాఖానాం
ఫలవతాం గుర్వీ వృతిర్జాయసే.

**ఉత్పలమాల**

వాసనలేని పూలు,
నిలువంతయు ముండులు,
నీడ జూడ నాయాసము మాన్పజాలనిది,
ఆకలి తీర్పనిపండ్లు, సజ్జనా
వాసము కాని మేను,
ఫల పాదపకోటికి ముండ్ల కంచెవై
నీ సరి లేరటంచు తెగనీల్గెద వేటికి?
తుమ్మ వృక్షమా!

*　　　*　　　*

'పేరమభట్లు అనే ఆయన ఇల్లు ఇదేనా?'

అని వినపడింది ప్రభాత సమయంలో దంత ధావనార్థం ఇంటిముందున్న వేపచెట్టు ఎక్కిన జగన్నాథుడికి.

వీథివాకిట్లో ఎవరో కుండనాల ఆసామీ నిలుచుని ఉన్నాడు. చేతులకి సింహతలాటం మురుగులు ఉన్నాయి. ఎర్రని కాశ్మీరపు శాలువా వల్లెవాటుగా వేసుకున్నాడు. ఒక చేతిలో ఏదో తాటాకు దస్త్రం. అంతా పండితవేషం.

పేరమభట్లుగారి ఇల్లు ఇదేనా అని అనకుండా, పేరమభట్లు అనే ఆయన అనడం జగన్నాథుడికి నచ్చలేదు. చెట్టుమీదనుంచే 'తమరెవరూ?' అన్నాడు.

అంతవరకూ చెట్టుమీద మనిషి ఉండడం గమనించని ఆ పండితుడు ఉలిక్కిపడి పైకిచూశాడు. మొలక మీసాల జగన్నాథుడు కనిపించాడు. మాసి నలిగిపోయిన ముతకపంచెతో, చెదిరిపోయిన శిఖతో ఉన్న అతడినిచూస్తే గొప్ప అభిప్రాయం ఏమీ కలగ లేదు.

'మాది కొండవీటి సీమ. మహామహోపాధ్యాయ, ఉభయ విద్యాధురంధర హరిదీక్షితులు అంటారు మమ్మల్ని' అని కుండనాలు ఊగిసలాడేటట్లు తల విదలించాడు.

'ఆ ఉభయ విద్యలు ఏమిటో?' అన్నాడు జగన్నాథుడు వెటకారం మిళాయించి.

'మీమాంసా వ్యాకరణాలు. సరేగాని, ఆయన ఉంటే పిలిపించు.'

'ఏంపనో సెలవిచ్చారు కారు?'

'పాండిత్య ప్రకర్షకి వాదించవలసిన్న మరో ప్రయోజనం ఏముంటుందీ?'

జగన్నాథుడికి ఒళ్లు మండిపోయింది ఆ 'గీర్వాణం' చూసేసరికి.

'మహామహోపాధ్యాయులు, పదవాక్య ప్రమాణ పారీణులు, షట్శాస్త్రపండితులు, పుంభావ భారతీ

మూర్తులు, కింకవీంద్ర మత్తేభ పంచాననులు, బ్రహ్మశ్రీ ఉపద్రష్ట పేరమ భట్టుగారు ప్రస్తుతం ఇంట్లో లేరు. రాజమహేంద్రవరంనుంచి వచ్చేవేళ అయింది. తమరు అదృష్టవంతులు.'

'ఏం అల్లా అన్నావు?' అన్నాడు పరదేశ పండితుడు మిర్రి మిర్రి చూస్తూ.

జగన్నాథుడు చెట్టు దిగలేదు. ఆయనకి సమాధానం ఇవ్వలేదు. కాని, చెంపపెట్టుగా ఏనుగు గున్నని ఉద్దేశించి అన్యాపదేశంగా ఆశువు అందుకున్నాడు.

ఒరేయ్ ఏనుగు గున్నా! పొగరుగా ఈ కాంతార ప్రాంతాల విహరించకు. గొంతు అసలే ఎత్తకు. మృగ సార్వభౌముడు తిరిగి వచ్చేవేళ అయింది. ఆయన నిన్నీ ప్రాంతాలలో చూశాడంటే, కనుబొమ్మలు ముడివేసి, సటలు విదలించాడంటే ఈ వన భూములన్నీ అనవసరంగా మత్తేభ విహీనము లయిపోతాయి. కనుక నోరు మూసుకుని, చడీచప్పుడూకాకుండా దూరంగా పో.

నకుర్యాః ప్రాఖర్యం
కిమపి కరిపోత! ప్రతిభయం
హరీణాం వేలేయం
యది హఖలుబహువేలం విహరసి
అకస్మాదే తేషాం
కుటిలదృశిరోషస్పృశి మనా
జ్నిరర్థం భావిన్యో
మదకరి దర్ద్రిదా వనభువః

**మత్తేభ విక్రీడితం**

కరిపిల్లా! పొగరెక్కి ద్రిమ్మరకు మీ
కాంతార మధ్యమ్మునన్
హరి విచ్చేసెడువేళయ్యె నది—
ఇట నిన్నాతండు వీక్షించినన్
కురులల్లాడగ, కన్బొమల్ ముడివడన్,
రోషంబు పెల్లుబ్బ, స
త్వరమీ కాననభూమి
వారణ దర్ద్రిదంబౌను వ్యర్థంబుగన్.

హరి దీక్షితులుకి పెద్దపెట్టున కోపం వచ్చింది. 'ఏమన్నావ్? నేను ఏనుగు పిల్లనీ, ఆయనగారు సింహమూనా? గోదావరినీళ్లు వంటపట్టినట్లున్నాయే నీకు.'

జగన్నాథుడు లోలోపలే నవ్వుకున్నాడు. 'ఏనుగు గున్నఅంటే అంతకోపం ఎందుకండీ? లావుగా పొట్టిగా ఉన్నారని నా ఉద్దేశం కానేకాదు సుమండీ. సరే, మీకు నచ్చకపోతే మరో శ్లోకం చెప్తాను. ఎంత సేపూ, నోట్లో ఉన్నపని.'

ఒరేయ్ దుప్పీ! ఆడలేళ్లతో క్రీడించే సందడిలో ఒళ్లూపై తెలియకుండా పొగరెక్కి ఇక్కడికి వచ్చావా? కళ్లు మూసుకుపోయ్యాయా నీకు? ఇది ఎటువంటి చోటో తెలుస్తోందా? విచ్చిపోయిన మత్తేభ కుంభ స్థలాలలో నుంచి ముత్యాలు రాసులు రాసులుగా విరియజిమ్మబడ్డ చోటు. ఇది సింహం వీర విహారం చేసేచోటు వెం—కనే ఇక్కడినుంచి వైదొలగి పోరా పో.

**వసంత తిలక**

ఏణీగణేషు గురుగర్వ నిమీలితాక్షః
కిం కృష్ణసార! ఖలు ఖేలసి కాననేఽస్మిన్
సీమామిమాం కలయ భిన్నకరీంద్ర కుంభ
ముక్తామయీం హరి విహారవసుంధరాయాః

**మత్తేభ విక్రీడితం**

హరిణీశ్రేణులగూడి
యీ యడవి గ్రీడాసక్తి నున్నావురా
గురుగర్వమ్మున కండ్లు మూతవడెనా?
కుంభీంద్ర కుంభస్థలాం
తర ముక్తానివహమ్ము దొర్లునిచటన్
సారంగమా! చూడుమా
హరికిన్ వీరవిహార భూమి యిది
పోరాపొమ్ము శీఘ్రమ్ముగన్

హరి దీక్షితులు ఉగ్రుడైపోయాడు. ఊడిపోయిన పిలక ముడి వేసుకుంటూ, కళ్లల్లోనుంచి

నిప్పులు రాలుస్తూ, పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ రాజేశ్వరాలయం వైపు వెళ్లిపోయాడు.

అంతలో వీధివాకిలి తుడవడానికి క్రొత్తగా కాపరానికివచ్చిన జగన్నాథుని భార్య కామేశ్వరి చీపురుకట్ట పుచ్చుకుని వచ్చింది. గడపమీద మినుకు మినుకుమంటూన్న ఆముదపు దీపానికి అమెచీర చెంగు తగులుతుందా అన్నంత దగ్గరగా రావడం చూసి జగన్నాథుడు కంగారుపడి 'భద్రం! భద్రం!' అని అరిచాడు. కామేశ్వరి భయపడి చటుక్కున పక్కకి గంతువేసింది· ఆ అదురుకి ఆ అముదపు దీపం ఆరి పోయింది.

'ఇంకా నయంకదూ! మరి కొంచెం ఉంటే కొంగు అంటుకునేది' అని ఆమెదగ్గరగా వెళ్లబోయి, తల్లివస్తూన్న అలికిడి విని, అక్కడే ఆగిపోయాడు.

'అసలు ఈ ప్రమిదని గడపమీద పెట్టడం మానెయ్యాలి' అని అంతలో ఏదో జ్ఞాపకం వచ్చి, కోపంగా వెళ్లిపోతున్న హరిదీక్షితులు వైపూ ఆరిపోయిన దీపంవైపూ మార్చిమార్చి చూశాడు. అతడి కళ్లు మిలమిలలాడేయి.

ఓసి ఆముదపు దీపమా! ఎందుకే నీకింత మిడిసిపాటూ? ప్రళయకాల ఝంఝామారుతంచేత మరింత ప్రజ్వరిల్లి తెల్లనికాంతులతో కళ్లు మిరుమిట్లు కొలిపే భయంకరమైన దావాగ్నితో పోటీపడతానంటావేమిటే? పిచ్చిదానా! పమిటకొంగు కదులాడిన పిల్లగాలికి కొండఎక్కేసే నీకూ, ఆ దావాగ్నికీ సాపత్యమా? సిగ్గులేకపోతేసరి.

పృథ్వీ

ప్రదీప! కిము కుప్యసి ప్రళయమారుత ప్రజ్వలత్
ప్రభాపటల పాటల ప్రకట పావక వ్యక్తయే
త్వమంగ కిము కామినీ కుచతటీపటే పల్లవ
ప్రకంపన పరిస్ఫుర త్పవనలేశ పారంగతః.

మత్తేభ విక్రీడితం

ప్రళయోజ్జృంభిత మారుత
ద్విగుణీత్ప్రహౌఢచ్ఛటా కోటి పా
టలమై పుష్పములు చుట్టు
పావకుని లోఁజిస్ స్పర్శ నీకేలనే?
లలనాపీన పయోధరద్వయతటీ
లగ్నాంశుకాగ్రస్థితి
చలనోద్భూత సమీరలేశమున
నాశంబందు దీపాధమా!

*　　　　*　　　　*

రాజమహేంద్రవర సంస్థానంలో పండిత పదవి లభిస్తుందేమోనని ప్రయత్నాలు చేశాడు ఇరవైఏళ్ల ప్రాయంలోఉన్న జగన్నాథ భట్టు. అక్కడ విద్యాధికారిగా ఉంటున్న ప్రభాకర సూరిని చాలాసార్లు దర్శనం చేసుకున్నాడు. ఆ సూరి తనకన్న వయస్సులో మాత్రమే పెద్దలని మొదటి దర్శనంలోనే అవగతమై పోయింది. ఆ సంగతి కుశాగ్రబుద్ధి కావడంచేత సూరికీ తెలిసిపోయింది. అందుకనే రాజదర్శనం ఇప్పించకుండా దాటవేస్తున్నాడు. ఏవేవో పరీక్షలు పెడుతున్నాడు. నెల్లాళ్లు గడిచాయి. జగన్నాథుడిలో ఓర్పు నశించిపోయింది. ఏయెండకాగొడుగుపట్టి, ఎవరినీ నొప్పించకుండా, లౌక్యంగా, గడుసుగా తన పని జరిపించుకునే తత్వం వంటబట్టలేదు అతడికి. స్వపక్ష పరపక్ష నిర్యాసుధాసక్తమనస్కుడైన నేగినా ఊరుకునా! ఎదర పడి తిట్టడం మొదలుపెట్టేడు. తాను బంగారమట, ప్రభాకర సూరి కంసాలిట.

ఏమయ్యోయ్! కంసాలీ! ఇతరులను బాధపెట్టడంలో మొనగాడా! (చెవులు ముక్కులు కుట్టడం ద్వారానూ, వెండిబంగారాలను అపహరించడంద్వారానూ దుఃఖం కలిగిస్తాడు.) నన్ను ఇన్నివందలసార్లు నిప్పులలోవేసి కాలుస్తావేమిటయ్యా! సరేలే, దానివల్ల నాకు నష్టం ఏమీలేదులే, నా సుగుణమే బయటపడుతుంది. నీ నోట్లో బూడిద, నీ మొగాన పొగ తప్ప మరేమీ నీకు దక్కదులే.

వసంత తిలక

హే హేమకార! పరదుఃఖ విహారదక్ష!
కిం మాం ప్రతాపయసి వారశతాని వహ్నౌ?

ఆతాపితేన మమయాతి గుణాతిరేకో
ధూమస్తవైనవదనే కిలభస్మపాతః.

శార్దూల విక్రీడితం

ఏలా నన్నిటు మంటబెట్టెదవు
వేయిన్నొక్క పర్యాయముల్?
మేలేయౌజుమి నాకు దీనివలనం
బెంపొందు నా కాంతి కం
సాలీ! అన్యుల బాధపెట్టగల
ప్రజ్ఞాశాలి! నీ నోటిలో
రాలున్ బూడిద, ధూమరేఖ కనులన్
ప్రాకించు రక్తచ్ఛవిన్.

*　　　*　　　*

వెంకటశాస్త్రి, జగన్నాథుడు బాల్యమిత్రులు. పంచకావ్యాలవరకూ చదివి, చదువు భర్జించక, పొలం పనులలో పడ్డాడు వెంకటశాస్త్రి. కావ్య వ్యవసాయంలో లేనిచొరవ కామినీ వ్యవసాయంలో అతడికి బాగా పట్టు బడింది. తన రహస్యాలేవీ జగన్నాథుడిదగ్గర దాచడు.

'నిన్నరాత్రి మా మామిడితోటలో పడుక్కోడానికి రాలేదేమిరా?' అన్నాడు జగన్నాథుడు మిత్రునితో.

'పడుక్కోడానికి అంతకన్న మంచిచోటు దొరికిందిలేరా' అన్నాడు వెంకన్న కళ్లు చిగిలిస్తూ.

'నీ రొట్టె విరిగి నేతిలో పడ్డట్టుందే! ఏమిటి సంగతి?'

'అంబాజీపేటలో—ఏనుగుతొండాల ఇంట్లో.'

'ఏదీ, సత్రం పక్కవీథిలోనా?'

'నీకూ తెలుసునా ఏమిట్రా కొంపతీసి?'

'ఆ ఇంట్లో ఇద్దరు ముగ్గురు ఉంటున్నట్లున్నారు. అందులో ఎవరూ?'

'కేతకి.'

'హోరి దౌర్భాగ్యుడా! దొరక్క దొరక్క నీకు కేతకిట్రా దొరికింది?'

వెంకన్న వెలవెల బోయాడు.

'దానికేంలోటూ? తెల్లగా పొడుగ్గా నాజూగ్గా బాగానే ఉంటుందే!'

'ఏడిశావ్. ఆ పాండువర్ణ నీకు నచ్చిందా?'

'మంచి సువాసన ద్రవ్యాలు పూసుకుంటుందే.'

'నీ మొహం. అది రజోవతిరా.'

'దానికి ఎన్నెన్ని నగలో. ఎంతెంత ముస్తాబో!'

'దానిచుట్టూ కంటకాలురా. ఇటువంటి దాన్ని సేవించుకున్నావా? సిగ్గుబిడియాలు కాశీలో విడిచేశావుట్రా?'

అనుష్టుప్

సరజస్కాం పాండువర్ణాం
కంటక ప్రకరాన్వితాం
కేతకీం సేవసే హంత!
కథం రోలంబ! నిస్త్రపః

ఆటవెలది

పాండువర్ణయైన, బహు రజోవతియైన
కంటకములు పెక్కు కలిగియున్న
మొగలితో రమింప పూనుకొన్నావిసీ!
ఇంత సిగ్గుమాలితేమి? తేటి!

ఇక్కడ మొగలిపువ్వుకీ, ఆ కామినికీ శ్లేషచేత పోలిక కల్పించాడు. సరజస్క అంటే పుప్పొడికలది అనీ, ఋతుమతి అనీ అర్థాలు. మొగలి పువ్వునిండా పుప్పొడి ఉంటుంది కదా! పాండువర్ణఅంటే తెల్లని రంగుగలది అనీ, పాలిపోయిన శరీరంగలది (లేదా పాండురోగి) అనీ అర్థాలు. అప్పుడే వికసించిన మొగలి పువ్వు తెల్లగా ఉంటుంది కదా! కంటకములు అంటే ముళ్లు అనీ, విటులు అనీ (లేదా ఆటంకములు అనీ) అర్థాలు. మొగలిపువ్వునిండా ముళ్లేకదా!

*　　　*　　　*

బ　　సంస్థానాన్ని దర్శించబోయి, అక్కడ కూడా తనకు ప్రవేశం లభించే ఆశలేక, సత్రానికి తిరిగివచ్చి, దిగాలుగా కూర్చున్నాడు. అక్కడ ఆస్థాన విద్వాంసులుగా ఉంటూన్న మహీధర లక్ష్మీధర, శేషాద్రి సోదర కవిద్వయంమీాదతప్ప రాజావారి కటాక్ష వీక్షణాలు మరెవరిమీాదా ప్రసరించడంలేదు.

ఎండ విపరీతంగా ఉంది. అసలే పని జరగక చికాకుగా ఉన్నాడేమో, వర్షం అయినా పడితే బాగుండు

ననిపించింది. అవడానికి ఆషాఢమాసమేకాని, ఆకాశంలో మబ్బుతునక అయినాలేదు. రాజుగారిమీది కోపం మబ్బులమీదికి మళ్లింది.

ఏమయ్యోయ్! జలధరా! ఓవంక పైరుచేలు ఎండిపోయి రైతులు గోల పెట్టేస్తూఉంటే వాటి మీద ఒక్కచినుకు అయినా రాల్చకుండా, మహీధరములమీద కుండపోతగా వాన కురిపించేస్తున్నావా? ఇదా నీ వివేకం? నీ ఔన్నత్యం ఎందుకయ్యా తగలెయ్యనా?

**ప్రహర్షిణి**

దీనానా మిహ పరిహాయ శుష్కసస్యా
న్యౌదార్యం ప్రకటయతో మహీధరేషు
ఔన్నత్యం పరమ మవాప్య దుర్మదస్య
జ్ఞాతోఽయం జలధర! తావకోవివేకః

**ఉత్పలమాల**

ఎండినపైరుచేలపయి నించుక
యేనియు చిన్కు రాల్పవు—ఉ
ద్దండ మహీధరమ్ముల ను
దారముగా జల మేకధారగా
కుండల గుమ్మరించెదవు—
క్రూరపయోధర! నీ ఘనోన్నతుల్
దండుగ— తెల్లమయ్యెగద తావక
యోగ్యవివేక శూన్యతల్.

*　　*　　*

మిత్రుడు వెంకటశాస్త్రితో కలిసి గ్రామాంతరం వెడుతూ, మిట్టమధ్యాహ్నం అయేసరికి రాజవోలు చేరుకున్నాడు జగన్నాథ భట్టు. ఆ ఊరు పెద్దదే. బ్రాహ్మణ్యం దండిగానే ఉంది. కాని, ఆ రోజున ఏ ఇంటికి వెళ్లినా భోజనానికి ఉండమన్నవారు లేక పోయారు. చేసేదేమీలేక శివాలయం ముందున్న కోనేటిలో దిగి, నాలుగు పుడిసెళ్ల నీళ్లుతాగి, కడుపు మంట చల్లార్చుకున్నారే గాని, హృదయం ఇంకా భగభగ మంటూనే ఉంది.

దగ్గరలో కనిపించిన బొగ్గుముక్క తీసుకుని, గుడిగోడమీద—

'దొరకదు పట్టెడన్నమును దోసిలి యొగ్గిన రాజవోలులో' అని వ్రాశాడు వెంకటశాస్త్రి.

అన్యాపదేశంలో అప్పటికే అందెవేసిన చెయ్యి అయిన జగన్నాథునికి సూటిగాచెప్పే అలవాటు లేదు.

ఓ సముద్రుడా! నీకు ఆకాశంఅంత శరీరం ఉంది. ఎందుకూ? నీలో రత్నాలు రాసులు రాసులుగా పడిఉన్నాయి. ఏం లాభం? గొంతుక పొడి ఆరిపోయిన బాటసారి నాలుక తడుపుకుందామనుకున్నా నీవి గుక్కెడు నీళ్లుఅయినా పనికిరావు కదా!

**ఆర్యా**

కింఖలు రత్నై రేతైః?
కింపునర్భ్రాయి తే వపుషా?
సలిలమపి యన్న తావక
మర్ణవ! వదనంప్రయాతి తృషితానామ్

**ఆటవెలది**

మిన్నువోలెనీకు మేనున్న ఫలమేమి?
ఎన్ని రత్నరాశులున్న నేమి?
కడలి! నీ జలమ్ము సిడవకట్టిన నాల్క
తడపి కొనగనైన తగకపోయె!

'ఉండు. ఉండు. ఈ శ్లోకం గుడిగోడమీద రాస్తాను' అని మళ్లీ చెప్పించుకున్నాడు వెంకన్న.

ఇక్కడి పెద్ద పెద్ద భవంతులు చూసి, అధమపక్షం పొట్టనిండా తిండి అయినా దొరుకుతుందేమోనని ఆశపడి ఎందరెందరు బాటసారులు ఇక్కడికి వచ్చి నిరాశతో తిరుగుమొహం పట్టేరే రాజోలా!

మరు భూమిలో దూరానఉన్న బావిని చూసి, ఎందరెందరు దాహార్తులైన పాంథులు ఆశతో దగ్గరకు పరుగెత్తుకువచ్చి, నూతిలోకి తొంగిచూసి, నీళ్లు ఒక్క చుక్కకూడా లేవని తెలుసుకుని, హతాశులై కూలబడి పోయారో కదా! ఎందరి కన్నీళ్లచేత ఈ మరుభూమి తడిసిపోయిందో కదా!

**అనుష్టుప్**

అమునామరు కూపేన
కేకే నామ నవంచితాః

రుదత్పథిక నేత్రాంబు
పిచ్ఛిల ప్రాంతభూమినా.

**ఆటవెలది**

నీళ్లులేనిబావి! నీవద్ద కరుదెంచి
ఎంతమంది మోసగింపబడిరో!
పాంథజనులవేడి బాష్పధారలచేత
తడిసి మెత్తబడిన పుడమియందు

'ఈఊళ్లో ధనికులకి కొరత ఏమీలేదు. కాని, నాలిక పెరుక్కున్నా గొంతులో నీళ్లు పోసేవాడుకూడా లేడిక్కడ' అన్నాడు వెంకన్న.

'రాజభటులో, బందిపోట్లోవచ్చి, రెక్కగూళ్ల సందున గుద్ది, ఘోషణాలు పగలగొడితే తప్ప వీళ్లు దారికి రారు' అన్నాడు జగ్గన్న. అంతలో అతనికళ్లు గుడివార పెరిగిన కొబ్బరి చెట్టుమీదికి మళ్లేయి. పెద్ద పెద్ద గెలలతో చాలా అందంగా ఉంది. ఒక రామచిలుక ఆ చెట్టు మొవ్వులో వాలి, కొబ్బరి కాయలని తన ముక్కుతో పొడవడం మొదలుపెట్టింది. ఆ కాయలని పగలగొట్టగలననే కాబోలు దాని నమ్మకం! దానికేసి జాలిగా చూశాడు జగన్నాథుడు.

ఓ కొబ్బరికాయా! నువ్వెంత కఠిన స్వరూపవే! నీ బుర్ర పగలగొట్టినవాళ్లకి తప్ప నీలోని నీరు లభించదు కదా! చిన్నారి చిలకపిల్లని నేను. నాకు అంతశక్తి ఏదీ? నీ నీళ్లు ఎల్లా చేరుకోనూ?

**వసంత తిలక**

భో నారికేళ! తవ మస్తక భేదకానాం
సాధ్యంభవేత్ తవజలం కఠినస్వరూప!
నాహం త్వదీయ సలిల గ్రహణే సమర్థ
స్త్వత్యంత ఖేదవిముఖః శుకరాజ బాలః

**తేటగీతి**

పాడు టెంకాయ! నీ బుర్ర పగులగొట్టు
వారికేగాని నీలోని నీరమీవు
కఠినరూపవు—దప్పిచే కలతజెందు
చిలుకపిల్లను —నీ నీరు చేరజాల.

*　　*　　*

తెల్లారకుండానే గుండెలు గముక్కుంటూ పరు గెత్తుకువచ్చి, తోటలో పడుక్కున్న జగన్నాథుణ్ణి కదిపి, లేపేడు వెంకటశాస్త్రి.

'ఏమిట్రా హడావిడి?' అని కళ్లు నులుము కుంటూ లేచాడు జగన్నాథుడు.

'కొంప మునిగి పోయిందిరా, జగ్గన్నా!'

'పడవ కావాలా ఏమిటి?'

'నీ హాస్యం కట్టిపెట్టరా కాస్సేపు.'

'కొంప ఎల్లా మునిగిందో చెప్పేవుకావు.'

'కమలని జోగయ్య లేవదీసుకుపోయాడు. ఊరంతా గుప్పుమంది అప్పుడే.'

జగన్నాథుడికి నిద్రమత్తు వదిలిపోయింది.

'ఏ కమలా? మన సూరన్న వరించిన పిల్లేనా?'

'ఊ. అదే. ఈ సంగతి తెలిసి సూరన్న వెర్రి మొహం మొహం వేసేశాడు.'

'దొరక్క దొరక్క నిక్షేపంలాంటి కమలకి ఆ తాగుబోతు జోగన్నే దొరికేడా? జీడిగింజలా మొహం వాడూనూ!'

'అదే అంతుబట్టకుండా ఉంది.'

ఓ కమలమా! సిగ్గు బిడియాలు గాలికి వదిలేసి, ఈ మధుపాలతో (తుమ్మెదలతో, తాగు బోతులతో) రమిస్తున్నావా? నీవు సాక్షాత్తూ సూర్యభగవానుడి ప్రేయసివి కావూ? హరహరా! యుక్తాయుక్త వివేచన అయినా లేదా?

పద్మిని! కిమితి క్రీడసి
మధుపైర్నిర్లజ్జాలవో౽పి నహికింతే?
హరహర! విస్మృత్యోక్తం
క్వనులజ్జా సవితృరక్తాయాః

**చతుష్పద**

సరసిజమా! నీ చరిత్ర మెట్టిది?
ఖరకరుప్రేయసి గావా? చివరకు

మరగితివా యీ మధుపకులమ్ము‌ను?
హరహర! లజ్జను ంచినావా?
* * *

నందంపూడి అగ్రహారానికి బందెపోటు దొంగల గుంపు వచ్చినట్లుగా వార్త వచ్చింది. ముంగండనుంచి జగన్నాథుని ఆధ్వర్యాన కుర్రకారు పాతికమంది బాణా కర్రలు, బరిసెలు తీసుకుని, పొలాలకి అడ్డంపడి, అక్కడికి చేరేరు. వీళ్లు అక్కడికి చేరేసరికే నాలుగు మూలలా కొంపలకి నిప్పెట్టి, అంకినంతమటుక్కి దోచుకుని, బందెపోట్లు పారిపోయారు. ఊరుఅంతా నానాబీభత్సంగానూఉంది. గుడ్డిలో మెల్లగా ప్రాణాపాయం ఎవ్వరికీ కలగలేదు.

బందెపోట్లు ఇల్లా రావడం ఇదే మొదటిసారి కాదు. ఏడాదికోసారి, పంటలు ఇళ్లకివచ్చే రోజుల్లో, ఆ చుట్టుపక్కల గ్రామాలమీద ఎక్కడో ఒకచోట ఈ రకమైన దాడులు జరుగుతూనే ఉన్నాయి. రెండు మూడు గంటలసేపు వీరవిహారంచేసి సాధ్యమైనంత నాశనంచేసి పారిపోతూనేఉన్నారు బందెపోట్లు.

మిత్రులతో ముంగండకి తిరిగివస్తూ పరాగ్గా ఆలోచిస్తున్నాడు జగన్నాథుడు. ఏమిటీ దాడి? కొండ ఏరులా ఒక్కసారి ఉన్నట్లుండి ఉవ్వెత్తుగా విజృంభించడమూ; మళ్లీ నాలుగు ఘడియల తరవాత చూస్తే ఏమీలేకపోవడమూనూ. అంతా చిత్రంగా ఉందే!

ఓ కొండవాగూ! వానలు వెనకబట్టేస్తాయి. నువ్వు బక్కచిక్కిపోతావు. నీ విజృంభణ క్షణికమే. ఈ కాస్త సేపట్లోనే నీ గట్లవెంట పెరిగిన మహా వృక్షాలను కూకటివేళ్లతో పెల్లగించుకు పోయావు. ఈ హఠాద్విజృంభణవల్ల నీకు దక్కినదేమిటి? ఈ చెట్లను కూల్చిన పాపం ఒక్కటే కదా నీకు చిర స్థాయిగా మిగిలినది?

**ఆర్యా**

యాస్యతి జలధరసమయ
స్తవాప్సమృద్ధి ర్లఘీయసీ భవితా
తటిని! తటద్రుమపాతన
పాతకమేకం చిరస్థాయి

**ఆటవెలది**

వానకాలమేగు, పరవళ్లు గతియించు
బక్కచిక్కగలవు వానవాక!
గట్లవెంటపెరుగు చెట్లగూలిచినట్టి
పాపపంకమొకటె పాయకుండు.

ఉత్తర హిందూ దేశంలో ఢిల్లీ ప్రాంతాల వేసవిలో ఒకటిరెండు నెలలపాటు దుమ్ము తుపానులు వస్తూ ఉంటాయి అప్పుడూ అప్పుడూనూ. ఉన్నట్లుండి హఠాత్తుగా ఝంఝా మారుతం వీయడం మొదలు పెడుతుంది. అపరిమితంగా దుమ్ము పైకి ఎగురుతుంది. ఇళ్లు వాకిళ్లు, చెట్లుచేమలు, ఊళ్లూ వాడలు, ముక్కులు, చెవులు అంతా దుమ్ముమయం అయిపోతాయి. వనములు నాశనం అవుతాయి. అంతలో చినుకులు పడి, దుమ్ము అణిగిపోతుంది. ఈ దుమ్ము తుఫానులను 'ఆంధీ' అంటారు. అవి జ్ఞాపకంవచ్చి ఝంఝామారుతాన్ని బందెపోట్లతో పోల్చి ఓ తట్టు వరస చివాట్లు వేస్తున్నాడు.

ఒరేయ్! ఝంఝా మారుతుడా! నీ ప్రాభవం ఈ క్షణంలోనేరా. నువ్వు మహాఅయితే నెలరోజులు ఉంటావు, లేకపోతే రెండునెలలు ఉంటావు. ఈ భాగ్యానికే వాపీకూప తటాకాదులను వ్యర్థంగా ఎండించేస్తున్నావు. మహావనాలను నాశనం చేసేస్తున్నావు. మన్నూ మిన్నూ దుమ్ముమయం చేసేస్తున్నావు. ఇదేమి పొగరురా నీకు?

**శార్దూల విక్రీడితం**

జాతం ప్రాభవ మద్యతే విధివశాత్
కించిత్త దవ్యంతతో
ఝంఝామారుత! మాసమాత్ర
మథవామాసద్వయం స్థాస్యసి
ఏతస్మిన్ వనవాటికా కతికతి
వ్యర్థం త్వయోత్పాటితాః
హావాప్యః కతి శోషితాః
కతిదిశో ధూళీభిరుద్ధూళితాః

**శార్దూల విక్రీడితం**

చాలుం జాలును నీ ప్రతాపమిక
ఝుంఝూమారుతా! నీ విటన్
ఏలం గల్గెద వౌండొ రౌండొ నెలలే,
ఈ లోపుగా నప్పుడే
కూలం ద్రోసితి వెన్నియో వనములన్
కూపంబు లెండించి పెన్
ధూళిన్నల్దెస గప్పివేసితివి
మన్నున్ మిన్ను నేకంబుగాన్.

*    *    *

'అన్నట్లు భట్టోజీ దీక్షితులు ఏం చేశాడో విన్నావురా? జగ్గన్నా!' అన్నాడు పేరమభట్టు.

'ఎవరూ? మీ సతీర్థ్యుడి మాటేనాండీ?'

'ఆ వాడే. గురుపాదులు శేషశ్రీకృష్ణుల వారు దిక్కూ దివాణమూలేని వీణ్ణి ఇంట్లో పెట్టుకుని, తిండిపెట్టి కొడుకులా చూసుకుని, వ్యాకరణం ఆభాష్య పర్యంతమూ నూరిపోశారు. కాస్త రెక్కలు వచ్చాయిగా, ఇప్పుడు వాడు గురువులకే పంగనామాలు పెడుతున్నాడుట!'

'ఎంతమాటా!'

'గురువుల ప్రక్రియా కౌముదిని ఖండిస్తూ మనోరమ అనే గ్రంథం వ్రాశాడట!'

'ఎంత దారుణం! ఈ గురు ద్రోహాన్ని సహించి ఊరుకోవడమే?'

'నా శరీర స్థితి చూస్తున్నావుగా. ఈ వ్యాధి నుంచి నాకు విముక్తి ఎప్పటికో. వాడి పనిపట్టగల వాడివి నువ్వొక్కడివేరా అబ్బీ!'

'లక్ష్మీకాంత పదాంభోజ
మానమ్య శ్రేయసాం పరం
పండితేంద్రో జగన్నాథః
శృతి గర్వం గురుద్రుహాం'

అంతలో పెరటిదొడ్లోని తియ్యమామిడిచెట్టు మీదనుంచి లేలేత మామిడిచిగుళ్లుతిని వగరెక్కిన గండుకోయిల కంఠం పొగరుగా వినిపించింది.

ఓయి పుంస్కోకిలా! మీ అమ్మ నిన్ను కనీ పారేస్తే, తన గూట్లో నీకు ఆశ్రయం ఇచ్చి, నిన్ను పొదిగి పిల్లని చేసి, నెత్తురుగుడ్డువైన నీకు రెక్కలు పడిపోయేటట్లు మేతతెచ్చి, కుడువబెట్టి పోషించిందిరా ఆ కాకి. ఆ సంగతి అప్పుడే మరిచిపోయావా? వసంతోదయం కాగానే, నీ రెక్కలు దారుఢ్యాన్ని పుంజుకోగానే, మామిడిచెట్టెక్కి, నిన్ను పోషించిన వాయసాన్నే నిందిస్తూ పొగరుగా కూస్తున్నావుట్రా! విశ్వాస ఘాతకుడా!

**ఆర్యా**

తత్కింసస్మరసి న భుక్తం
యత్పికరే! కాకమందిరే పూర్వమ్?
సహకార కుసుమకాలే
హాతేన కురుషే ఒధునారావమ్.

**ఆటవెలది**

మున్ను కాకిగూట బొక్కినవిధమెల్ల
మరచిపోయినావొ? పరభృతమ్మ!
మావిగున్నలెక్కి మధుమాసమున నేడు
పొగరుబోతుకూత పూనినావు.

*    *    *

కొడుకు ఇంటినుంచి మొహాలు వేలాడేసుకుని తమ ఇంటికి వచ్చిన అమ్మమ్మనీ, మాతామహుణ్ణీ జబ్బ పట్టుకుని ఇంట్లోకి తీసుకువెళ్లేడు జగన్నాథుడు. మేనమామ చెరుకూరి లక్ష్మీపతిగారి ఇల్లు పక్కవీధి లోనే ఉంది. ఆయన బాగా స్థితిపరుడే. కాని, భార్య చేతిలో కీలుబొమ్మ. ఆవిడ గీసిన గిరి దాటే నిబ్బరం అతడికి లేదు. ఆమెకి అత్తమామల పొడ గిట్టదు.

'మేము దానికేం విషం పెట్టేమే లచ్చీ! మమ్మల్ని చూస్తేచాలు రుసరుసలాడిపోతుంది' అంది వెంకమ్మ, కూతురు మహాలక్ష్మితో.

'పోనీ, మామయ్య అయినా ఆవిణ్ణి కూకలెయ్య వచ్చునే' అన్నాడు జగన్నాథుడు.

'వాడికి ఆశక్తే ఉంటే ఇంక లేనిదేమిట్రా? జగ్గన్నా! పెళ్లాం మెప్పుకోసం ఇంటికి వచ్చిన

మమ్మల్ని చూసికూడా చూడనట్లు మొహం తిప్పు కున్నాడురా' అన్నాడు తాత విశ్వేశ్వరావధానులు.

'ఆవిడగారి పుట్టింటివైపు బలగమంతా వచ్చి తిని పోతూనే ఉంటారు. మనమే వాడికి బరువై పోయాం' అంది వెంకమ్మ గద్గద కంఠంతో.

'వాడిదేముందే. వాడి బావమరదులకి మనవాడి లెక్కాజమాలేదు. తమ స్వంతఇల్లు అన్నంత ధీమాగా వచ్చి తిష్ఠవేసేస్తారు' అన్నాడు తాత.

'అయిన వాళ్లకి ఆకుల్లోనూ, కాని వాళ్లకి కంచాల్లోనూ' అంది మహాలక్ష్మి మరకత్తి పీటతో మామిడికాయ తరుగుతూ. టెంక తెగేసరికి లోపల కొలకొలలాడుతూ పురుగులు.

'ఇవేం పురుగులే మామ్మా!' అని వెలపరించు కుంది మహాలక్ష్మి.

జగన్నాథుడి కళ్లు పెరట్లోఉన్న మామిడి చెట్టుమీదికి మళ్లాయి.

ఓ మామిడిచెట్టూ! నువ్వు మొగ్గ తొడిగింది లగాయతు ఈ తుమ్మెదలు నిన్నే కనిపెట్టుకుని ఉంటున్నాయి. వాటికి ఫలాపేక్ష సుతరామూ లేదు. అయినాసరే నువ్వు వాటిని లక్ష్యపెట్టకుండా ఉన్నావు చూసికూడా చూడనట్లు మొహం తిప్పుకుని మాట్లాడకుండా ఉన్నావు. మరి ఈ పురుగులో? ఇవి నిన్ను లెక్కచేయకుండా నీ పళ్లల్లో దూరి స్వేచ్ఛగా సంచరిస్తున్నాయి. కిక్కురు మనకుండా వాటికి ఆశ్రయం ఇచ్చావు. తన, పర భేదంకూడా నీకు తెలియకుండా పోయిందా? సహకారమా! నీ తెలివి ఇలా తెల్లారిందా?

**శార్దూల విక్రీడితం**

> యేఒమీ అముకులోద్గమాత్ర్పభృతి
> దినం త్వామాశ్రితాః షట్పదా
> స్తే భ్రామ్యంతి ఫలాద్భృహిః
> కథమహో దృష్ట్వా న సంభాషసే
> యేకీటాస్తవ దృక్పథం నచగతాస్తే
> త్వత్ఫలాభ్యంతరే
> ధిక్త్వాం చూతతరో! పరాపర
> పరిజ్ఞానానభిజ్ఞో భవాన్.

**శార్దూల విక్రీడితం**

> తేటుల్ పూచినదాది నిన్
> గొలిచి వర్తించున్, ఫలాపేక్ష నే
> పాటిం జూపవు—చూతమా!
> పలుకరింపంబోవు వీక్షించియున్
> కీటశ్రేణులు లెక్కసేయక
> నినున్ నీ పండ్ల దూరున్ నిరా
> ఘాటప్రక్రియ—ఛీ! పరాపర
> పరిజ్ఞానానభిజ్ఞుండవో!

*    *

జగన్నాథుని తమ్ముడు రామచంద్ర భట్టు వ్రాసిన గంగావతరణ కావ్యాన్ని తనకు అంకితం ఇవ్వవలసిందని గురవయ్య సెట్టి కబురుపెట్టేడు. గురవయ్యలో రసికత ఏ కోశానాలేదుగానీ తానుకూడా కృతి భర్తననిపించుకోవాలని అతగాడికి ఎందుచేతనో కోరిక కలిగింది. డబ్బులేక చిక్కులు పడుతున రామచంద్రుడికి ఆశ పుట్టింది. అంకితం ఇద్దామా అని తటపటాయిస్తున్నాడు. ఈ సంగతి జగన్నాథుడికి తెలిసింది. తమ్ముణ్ణి ముక్కచివాట్లు వేశాడు.

'ముష్టి మూడు పుట్ల భూమికి ఆశపడి గురవయ్య సెట్టి కాళ్లు కడిగి కన్యాదానం చేస్తావా?'

'నా పరిస్థితి చూస్తున్నావుగ!' అన్నాడు తమ్ముడు, తలవంచుకుని బొటకన వేలితో నేలమీద సున్నలు చుడుతూ.

'భోజనంలేక మాడినా పరువుగానే ఉంటుంది గానీ, ఇటువంటి దురన్న దుర్దాన గ్రహణాలు మన ఇంటావంటా లేవురా!'

ఓ వాగూ! వింధ్య పర్వత శిఖరాగ్రాలమీద పుట్టేవు. అటువంటి నువ్వు ఈ నాడు వీథులలో పారే కుళ్లు నీళ్లు గ్రహించడానికి సిద్ధపడుతున్నావా? ఛీ ఛీ. ఇంతకన్న ఎండిపోయినా పరువుగానే ఉంటుంది.

**ఆర్యా**

> తటిని! చిరాయ విచారయ
> వింధ్య భువస్తవ పవిత్రాయాః
> శుష్యంత్యా అపి యుక్తం
> కింఖలు రథ్యోదకా దానమ్?

ఆటవెలది

పావనమగు వింధ్యపర్వతాగ్రములపై
ఉద్భవించినావహో నదమ్మ!
నేడు వీధి కుళ్లునీళ్ల కాసింతువా?
జీవనమ్ము లెండిపోవుగాక.

*　　*　　*

ఢిల్లీ దర్బారులో పండితరాయలని చూసి అసూయ పడేవారిలో కనక్‌లాల్ ఒకడు. పాండిత్యంలోగాని, కావ్య నిర్మాణశక్తిలోగానీ జగన్నాథుడికి ఆమడదూరంలో నిలువవలసినవాడు. కాని అతడి హాస్యవాగ్ధోరణి షాజహాన్‌కి ఇష్టం. కనుక, పండితరాయల సరసన అతడికి ఉన్నతాసనం లభించింది. దానితో తాను జగన్నాథునికి సమఉజ్జీ అయినట్లుగా భావించి, వేళా కోళానికి కూడా దిగేడు. జగన్నాథుని హృదయం భగ్గు మంది. అన్యాపదేశంగా ఉమ్మెత్తని పట్టుకు చివాట్లు వేస్తున్నాడు.

ఉమ్మెత్తకి కనకం అని మరోపేరు. కనక శబ్దానికి బంగారం అనే అర్థం ప్రసిద్ధం. కనుక తాను బంగారంతో సమానం అనుకుంటోందిట ఉమ్మెత్త. పైగా ఉమ్మెత్త శివుడికి ఇష్టమైన పువ్వు. శివపూజకి ఉమ్మెత్తపువ్వులు ప్రశస్తం. పూజ చేసినప్పుడు ఒక ఉమ్మెత్త పువ్వు శివజటాజూటంలో చిక్కుకుంది. దానితో ఉమ్మెత్తకి ఎక్కడలేని అహంకారమూ పుటు కొచ్చింది. పక్కనేఉన్న చంద్రుణ్ణిచూసి వెకిలినవ్వు నవ్వింది.

ఓరి ధుత్తూరమా! ఓరి ధూర్తా! ఏదో పాడు గోడమీద ఒకమూల పుట్టేవు. కనకం అనే పేరు తగిలించుకుని బంగారం అన్నట్లు మురుస్తున్నావు. మెల్లిమెల్లిగా మహేశ్వరుని శిరస్సుమీద కాలు ఊను కున్నావు. అక్కడఉన్న కలానాథుణ్ణి చులకనగా చూస్తున్నావా? నీ పూర్వవృత్తాంతం అంతా అప్పుడే మరిచిపోయావా?

(ధూర్తశబ్దానికి ఉమ్మెత్త అనీ, మోసగాడు అనీ అర్థాలు ఉన్నాయి.)

స్రగ్ధరా

రేరేధుత్తూర! భిత్తేః పరిమృదిత
మృదః క్వాపికోణేజనిత్వా



ప్రాప్యాభిఖ్యాంత దాఖ్యాం కనకమితి
పునః కాంచనస్యాపిలోకే
మందం మందంస్మరారేర్మణి మకుట
తటే తత్రలబ్ధావకాశమ్
నోజానీషేకలేశం స్మరసిచనపునః
పూర్వవృత్తాంతలేశమ్

మత్తేభవిక్రీడితం

జననంబందితి పాదుగోడపయి,
భాషాదేవికన్గప్పి యీ
కనకాఖ్యం గొనినావు బంగరువలెన్—
కాలూని మెల్లంగ నీ
శుని శీర్షమ్మున ధూర్తవృత్తి నుదు
రాజుంగాంచి గర్వించు చు
ల్కన గావించెదు-పూర్వదుస్థితి
నెరుంగంబోవు ధుత్తూరమా!

ఏమయ్యోయ్! పండితమ్మన్యుడా! కుండ నాలూ, గండపెండేరాలూ, శాలువా వల్లెవాటూ, చుట్టు చెంగావి పంచె ధరించినంత మాత్రాన నాతో సమానం అనుకుంటున్నావు కాబోలు. కణిన సూను కణాద బాదరాయణసూత్రఫక్కి ఉపన్యసించవలసి వచ్చి నప్పుడు నా దరిదాపుల్లోకూడా ఉండలేవోయ్ నువ్వు.

ఓహో ఇత్తడీ! నువ్వు బంగారం రంగులో ఉన్నాననీ, కనుక దానితో సమానం అనీ ఊహించుకుని మహాగర్విస్తున్నావు కానీ, గీటురాయిమీదికి వచ్చి నప్పుడు నీ పస అనుభజ్ఞులకు తెల్లమేకదా!

కాలభారిణీ

అయిడంబర మారకూట! ధత్సే
కనకస్యాపి యదంతతో నికామమ్
నికషాని కషంహి తత్తదాచే
దనుమన్యే సదృశామలం క్రియాత్వమ్

తేటగీతి

ఇత్తడీ! నీవు పుత్తడి నివ్విధమున
అనుకరించితి బాగుగా—అవునుగాని
గీటురాతిని చేపట్టి గీతవెట్టు
అనుభవజ్ఞులముందు నీ ఆటకట్టు

'మహారాజు తనని నెత్తిమీద పెట్టుకుంటున్నాడట. కనకలాల్ అందరితోటే గొప్పగా చెప్పుకుంటున్నాడటండీ!' అన్నాడు శిష్యుడు నాగేశ భట్టు.

'ఏడిశాడు. ఇది మూణ్ణాళ్లముచ్చటేలే. సమయం వస్తే నేలని రాసేస్తాడు మహారాజు. ఆ సంగతి ఎరగకుండా ఉన్నాడు.'

ఒరేయ్! చంద్రుడా! శంకరుని శిరస్సుమీద కాలు మోపగలిగేనని గర్వపడకురా! దానికి ఫలం నీకు త్వరలోనే ముడుతుందిలే. చండి ఉగ్రరూపం దాల్చి నిన్ను ఈడ్చితన్ని సుట్టి కరిపిస్తుందిలే.

కాళికాదేవి ప్రచండస్వరూపిణిఅయి, ఒళ్ళు పైతెలియక, శివుణ్ణి కిందపడదోసి, చంద్రుణ్ణి కాలితో తన్నినట్టుగా దేవీభాగవతంలో ఒక కథ ఉంది. దానిని మనస్సులో ఉంచుకునిచేసిన కల్పన కాబోలు ఇది.

ఆర్యా

శంకర శిరసి నివేశిత
పదే ఒతి మాగర్వముద్వహేఒందుకలే!
ఫలమేతస్య భవిష్యతి
తవచండీ చరణరేణుమృజా.

ఆటవెలది

భవుని శిరసుమీద పాదముంచితినంచు
గర్వపడకురోరి కంబనైరి!
దాని ఫలము నీకు త్వరలోన కనిపించు
చండికాలితాపు చండమునను.

* *

'అంతేకాదు సుమండీ! తాను పండితాఖండలుడట. కనక్‌లాల్ తన శిష్యులచేత ఆ విధంగా ప్రచారం చేయిస్తున్నాడండీ!' అన్నాడు జగన్నాథుని శిష్యులలో మరొకడైన శంకరశాస్త్రి.

అంతలో ఒక కుక్క గబగబా ఇంట్లో జొరబడింది, వీధితలుపు ఓరగా తెరిచి ఉండడం చూసి. శంకరశాస్త్రి దానిని బయటికి తరిమివేశాడు.

'ఛీ ఛీ కుక్కా! నీకు రెండు చెవులూ కోసేసినా సిగ్గులేదేమే!' అన్నాడు పండితరాయలు.

అంతలో అతడికి ఏదో జ్ఞాపకం వచ్చింది.

ఓహో! నిన్ను కుక్క అనకూడదు కాబోలు. గ్రామ సింహం అనాలి కాబోలు. ఈ సింహపదం ధరించి మహా మురుసుకుంటున్నావులే. నిజంగానే సింహంతో సమానురాలిననుకుంటున్నావా? పిచ్చిదానా! హర్యక్షం తాలూకు బలం, శౌర్యం, పరాక్రమం, ఠీవి, సార్వభౌమత్వం నీ కెల్లా వస్తాయే? నీ నైచ్యం ఎక్కడ దాచగలవే?

**వసంత తిలక**

శ్వన్! గ్రామసింహ ఇతి సింహపదం దధాసి
లజ్జాం విహాయ మహతాం పరిహాస పాత్రమ్
నైచ్యం క్వయాతి తవ సా గురుతాకథంను
కంఠీరవస్య ధృతి రీశ్వరతా చలభ్యా?

**చంపక మాల**

శునకమ! గ్రామసింహ మనుచున్
అల సింహ పదమ్ము నిట్లు ల
జ్జను విడనాడి దాల్చితివి
సాహసివై జనులెల్ల నవ్వగా
ఘనమృగరాజ శౌర్య బలగర్వ
పరాక్రమ సార్వభౌమతల్
నిను వరియించునే? విడువ
నేర్తువె నీ సహజాత నైచ్యమున్?

*　　　*　　　*

'వారాణసిలో శశిభూషణ పండితుణ్ణి మన గురువులు ఓడించిన సందర్భంలో మరకతమణిఖచితమైన తన గండపెండేరాన్ని శశిభూషణుడు స్వయంగా గురువుల కాలికి తొడిగేరు కదా! సరిగ్గా అటువంటి గండపెండేరాన్నే కంసాలిబత్తుడికి మజూరీ ఇచ్చి చేయించుకుని స్వయంగా తానే తొడుక్కున్నాడట కనక్‌లాల్' అన్నాడు నాగేశభట్టు తక్కిన సహాధ్యాయులతో.

'అన్నిటిలోనూ మన గురువులను అనుకరించాలనే అతగాడి తాపత్రయం చూస్తే జాలేస్తోంది' అన్నాడు శంకరశాస్త్రి.

'వాడి మొహం. గండపెండేరం వేసుకుంటేనే పండితరాయలు అయిపోయేటట్లయితే నాలుగు డబ్బులు ప్రతీవాడూ ఆ పని చేసును'.

వీరి సంభాషణ వింటూ పక్కగదిలో గడ మంచంమీద నడుము వాల్చిన జగన్నాథుడు పకపకా నవ్వేడు.

హోసి ఖడ్గమృగమా! నుదుటిమీద కొమ్ము ఉన్నంతమాత్రాన నువ్వు ఋష్యశృంగ మహర్షితో సమానం అనుకుంటున్నావా? దున్నపోతులాగే నాలుగు కాళ్ల జంతువవి నువ్వు. అతి పరుషమైన నీ చర్మం నీ జాతినైచ్యాన్ని ఎరుక పరుస్తోందిరా మూర్ఖుడా!

**మాలినీ**

అయి! వహసి లలాటే ఖడ్గ! శృంగం యదేకం
ననుకథమపి తస్మాదృష్య శృంగేణతుల్యః
మహిష ఇవచతుష్పాజ్జంతురేవాసి జాత్యా
పరుష తమ తనుస్త్వం నీచతాత్వేయంతి?

కొమ్ము లలాటపట్టి నొనగూడిన
మాత్రన ఋష్యశృంగ సా
మ్యమ్మును దెచ్చికొందువటరా!
మహిషమ్మువోలె నాల్గు పా
దమ్ముల క్రూర జంతువవు,
దట్టపు చర్మము నీ స్వభావ నై
చ్యమ్మును జాటుచున్న దికనైనను
గర్వము మాను ఖడ్గమా!

[ఇందులో ఉదాహరించిన తెలుగు పద్యాలు డాక్టర్ మహీధర నళినీమోహన్ అనువదించిన భామినీ విలాసంలోనివి.]

# భళ్ళాణ రాజచరిత్రము-అముద్రిత యక్షగానము

శ్రీ 'గిరీంద్ర

ఆంధ్రనాటక కళాసరస్వతి తొలుదొల్త గజ్జె కదలించినది యక్షగాన రంగస్థలమున ననునది బుధజన విదితము. 'కురవంజి' రూపముననున్న యీ రూపక ప్రక్రియ క్రమముగా వృద్ధినంది తంజావూరు, మధుర రాజుల కొలువులో నిండురూపమును సంతరించుకొన్నది. కందుకూరి రుద్రకవి రచితమగు 'సుగ్రీవ విజయము' తెలుగున తొలి యక్షగానముగ ప్రసిద్ధి నందినది. విదుషీమణి రంగాజమ్మ వ్రాసిన మన్నారుదాస విలాసము, భక్తాగ్రేసరులు శ్రీ త్యాగరాజస్వామివారి ప్రహ్లాదభక్తవిజయము, నౌకాచరిత్రములును, ధేనువకొండవారి విరాటపర్వనాటకము, వట్టెము పాపకవి హరిశ్చంద్రమహారాజు చరిత్రమును, కృష్ణకవి రచితము సారంగధర చరిత్రము మున్నగునవి పదునేడు, పదునెనిమిదవ శతాబ్దములలో వెడలిన యక్షగాన సాహిత్యమున ప్రసిద్ధములు గదా!

పందొమ్మిదవ శతాబ్దపు ఉత్తరార్ధమున దాదాపు క్రీ. శ. 1875 ప్రాంతమున రచితమై, అముద్రితముగనున్న 'భళ్ళాణరాజ చరిత్రమ'ను యక్షగానము తాలూకు ఒక వ్రాతప్రతి యిటీవల నాకు లభించినది. ఇది 'శివకృతి'. 'ఇందుధరసేవాధురంధరు'డగు మున్నేపల్లి కోటేశ్వర కవి విరచితము. ఇందు రెండు భాగములు గలవు. మొదటిది శివదేవరాజు చరిత్రము. రెండవది భళ్ళాణరాజు చరిత్రము. బిడ్డలులేని శివదేవరాజు కుమారునికొఱకై తపమొనర్చి శివకృపా విశేషమున భళ్ళాణుని పుత్రునిగా పొందినాడు. భళ్ళాణ కళ్యాణము, రాజ్యపట్టాభిషేకముల నిర్వహించిన శివదేవరాజు వానప్రస్థుడై తపోవనమున కేగినాడు. ఇది పూర్వభాగమగు శివదేవరాజు చరిత్రము. భళ్ళాణుని శివభక్తి, శివుని భక్తపరీక్ష, జంగముగ వచ్చి వేశ్యఁ గదుగుట, వేశ్యలెవ్వరును పట్టణమున లభింపమి రాజు చింతాక్రాంతుడై చివరకు వ్రత దీక్షా నిర్వహణార్థము తన భార్యయగు చల్లమాంబను జంగముని యభీష్టము దీర్ప నియోగించుట, శివుడా తని వ్రత నిశ్చయమునకు మెచ్చి చల్లమాంబాసతి చేతిలో శిశువుగా మారి యా భక్త దంపతుల ననుగ్రహించి ఆశీర్వదించుట—యీ సన్నివేశములతో రెండవ భాగమగు భళ్ళాణరాజ చరిత్రమును నిర్మించినాడు కవి. రెంటినికలిపి భళ్ళాణ చరిత్రమని యనక యిట్లు విభజించుటకుగల కారణము యీ కథ కేవలము ఒక్కరాత్రి నాటకమున కెక్కువయగునను తలంపు కానోవును. రెండు భాగములుగా రచితమైన యీ యక్షగానము రెండు రాత్రుల ప్రదర్శనమునకు చక్కగా సరిపోవునట్లు వ్రాయబడినది. కవి 'లలిత సాండిత్య అభినయ నాటకాలంకార నిర్వహణా ప్రావీణ్యుడ'గుటచేత నిది నాటి రంగస్థలమున రమ్యముగ ప్రయోగింపబడి యుండవచ్చును.

ఇందు యక్షగాన లక్షణములన్నియు గలవు. మంత్రసాని, ఎఱుకలసాని, పురోహితుడువంటి పాత్రలను ప్రవేశపెట్టి హాస్యరసమును పోషించినాడు. దరువులు, కందార్థములు, ద్విపదలు, సీసములు, తేటగీతలు వాడబడినవి. సమాన జటిలముగాని సరళభాషలో నీకవి రచనము పామరజన రంజకముగ నున్నది. శివుని వరదాన మిట్లు నడచినది.

ద్విపద॥ 'వినవోయి భళ్ళాణ — వివరంబుగాను
గొనగొని శివ పదవి—గోరితి వీపుడు
సంతసమలర నా సాయుజ్య పదవి
ఇంతులతోడ నీ కిచ్చుట నిజము.
నీ వంటి శివభక్తి నియతుండు నృపుడు
ఈ వసుమతి లేక ఎట్లు మనగలదు.
విను కొంతకాలంబు నిష్టభోగముల
ననుభవింపుచు నీవు నవని పాలించు—

అటుమీద నిరువురు అతివలు సఖులు
అటు పరివారంబు అప్పులు గొలువ
కరమొప్ప మీ ఘనకాయమ్ముతోడ
పరమైన కైలాస పదవి చేరుటకు
వరమిచ్చినాను నీ వనుమానపడకు
ధరను పాలింపుమీ తపనకులేంద్ర!'

అని భళ్ళాణు నాశీర్వదించి అంతర్హితుడైనాడు పరమేశ్వరుడు.

ఈ కథ కూచిమంచి తిమ్మకవి వ్రాసిన రాజశేఖర విలాసమందలి భళ్ళాణుని కథవలెనే నడచినది. తిమ్మకవి పదునెనిమిదవ శతాబ్ది పూర్వార్థమున నున్నవాడగుటచే నీ కవి రాజశేఖరవిలాస కావ్యగాథను పరిశీలించి యుండకపోడు. ఈ శివకృతి కావింపుమని తన గురువును, 'పరతత్త్వవేది'యునగు ఇలపావులూరి కోటేశ్వర దేశికేంద్రులు తన్ను కోరినట్లును, తాను గురుభక్తిభావమున గురునిర్మితమూ, ప్రతిష్ఠితమూ నగు శివాలయమున వేంచేసియున్న శ్రీ శేషగిరీశ్వరాంకితముగ—

'రహినొప్పు భళ్ళాణరాయుని మహిమ
మహిని ప్రఖ్యాతిగా మనుజులు పొగడ
పరగ పూర్వోత్తర భాగముల్ గాను
పరమేశునకు సమర్పణ చేయగోరి
ఘనముగ రచియించు కవి......'
యీ మన్నేపల్లి కోటేశ్వర సుకవి.

ఇలపావులూరు వెలుగోటి ప్రభువులేలిన వేంకటగిరి జమీందారీలోని పెళ్లూరు తాలూకాలోనిది. కుండికానదీ సమీపంలోగల ధేనువగిరికి సమీపము. ప్రస్తుతము ఒంగోలుజిల్లాలోనిది. ఈయన గురువు శ్రీ కోటేశ్వరదేశికులు స్వయముగా కవి. తత్త్వవేత్త. కొన్ని తత్త్వములను, భక్తిరసప్రాధాన్యములగు కొన్ని కీర్తనలను రచించి, శ్రావ్యముగా సంకీర్తనము చేయుచుండెడివారని తెలియుచున్నది. ఆంధ్రదేశమున భక్తజనులకు పరిచితులైన శ్రీ కూర్మదాసుగారు తమ పూర్వులగు యీ కోటేశ్వరదాసుగారి భక్తిసాంప్రదాయముల జీర్ణించుకొన్నవారే.

'గురునీ ఋణము దీర్ప—తరమా ఎవ్వరికైన
పరమబోధార్థ దివ్యపరతత్త్వమును బోధించే
గురునీ ఋణము దీర్ప తరమా......'

అని ముఖారి రాగములో ఆది తాళముతో దేశికుల తత్త్వమును ఒక తొంబదేండ్ల యవ్వ పాడగా బాల్యమున నేను శ్రద్ధతో వినెడివాడను. శహన రాగములో నీయన వ్రాసిన మఱియొక కీర్తన—

'రామా—నీ సేవ చేయ కోరిన వాడమరా—
ప్రేమ మీఱగ ముద్దుమోము జూపవేమిరా—
॥రామా॥

అని పాడుచూ చివరి అంకిత ముద్రగల—

'ధరను ఇలపావులూరి పురమున వెలసిన
శ్రీధర — కోటేశ్వర దాసుని— కరుణింపరా
వేమిరా ॥రామా॥

అన్న చరణమును విన్నప్పుడు ఆయన భక్తి తాత్పర్యములు కన్నులకు కట్టినట్లు అలరించుట నాకు అనుభవ వేద్యము. ఇట్టి భక్తిరసపూరితములగు శివ కీర్తనలు, రామ కీర్తనలు మరికొన్నియు నావద్ద కలవు. నాకు లభించిన యీ వ్రాత ప్రతిగాక మరెక్కడనైనా ప్రతులున్నవేమో తెలియదు.

గురుశిష్యులగు యీ కోటేశ్వర కవిద్వయము చేసిన సాహిత్యకృషిలో ఉత్తర ప్రబంధ యుగమందలి ఉత్తర భాగపు లక్షణాలైన శృంగార హాస్యరస పోషణములతో బాటు వీరి అద్వైత నిష్ఠయు, భక్తి తత్త్వమును వెల్లడియగుచున్నది. వీరికృతులు ఆ జమీందారీ యుగమున ఏ కారణముననోగాని ప్రకటింపబడలేదు. వీరి యనంతరము కొందరు శిష్యులు యీ యక్షగానాదికృతులను ముద్రింప ప్రయత్నించిరట. కాని కారణాంతరములచే వారు సఫలీకృతులు కాలేదు. కోటేశ్వర దాసుగారి శివకీర్తనలు, రామకీర్తనలు నేటి ఆకాశవాణి 'భక్తిరంజని' కార్యక్రమమున ప్రసారము చేయదగిన రసస్థాయిని నిలుపుకొని యున్నవి. తగిన ప్రాచుర్యములేక మఱుగున బడియున్న యీ కీర్తనలను గూర్చి మరియొకపరి యథావకాశముగ విన్నవింతును. యక్షగాన వాఙ్మయమున నీ భళ్ళాణ రాజచరిత్రమును చోటు చేసికొనదగినదిగా నాకు దోచుట చేత నీ విషయము నింతవరకు ప్రస్తావింప సాహసించినందులకు సహృదయులు మన్నింపగలరని నా వేడికోలు!

# వాలివధ-వాల్మీకి తీర్పు

## శ్రీ చన్నాప్రగడ తిరుపతిరావు

'వాలి వధ—ఒక పరిశీలన'అనే శీర్షికతో భారతి 72 ఫిబ్రవరి సంచికలో శ్రీ కాళూరి హనుమంతరావుగారు కొంత మీమాంస చేశారు. 'వాలి వధ సందర్భంలో రాముడు అనుసరించింది రాజనీతినేగాని ధర్మమును కాదని' వారు అభిప్రాయపడినారు. భారతి 72 జూన్ సంచికలో శ్రీ వి. ఏ. కుమారస్వామిగారు కాళూరివారి వాదాన్ని ఖండిస్తూ, రాముడు రాజధర్మాన్నే పాటించాడని సమర్థించారు.

రాముడి ఈ చర్యలోని ధర్మాధర్మములను గురించిన మీమాంస రామాయణంలోనే ప్రారంభమైంది. రాముడిని సాధారణ మానవ వ్యక్తిగాకాక భగవదవతారంగా భావించటంతో నిష్పక్షపాతమైన విమర్శా దృష్టి మందగించి అసంబద్ధములైన వాదములతో ఎలాగో రాముడి చర్యను సమర్థించటమే తమ ధర్మంగా పండితులు భావిస్తూ వచ్చారు. కుమారస్వామిగారి వాదంకూడా దాదాపు అదే ధోరణిలో సాగింది. ఈ ఇరువురు వ్యాసకర్తలు గమనింపకుండా వదలిన మరికొన్ని అంశాల్ని వ్యక్తం చేయటం ఈ వ్యాసపు ఉద్దేశం.

రామాయణంలో చెప్పబడిన వాలి వధ కథ ప్రక్షిప్తమైయుంటుందనీ, భారతంలోని రామోపాఖ్యానంలో చెప్పబడిన కథయే వాస్తవమైయుంటుందనీ కాళూరివారు అభిప్రాయపడినారు. 'ఉన్న శ్లోకములను ఉన్నట్లుగా తీసుకొని శ్రీరాముని సత్యమును తెలియుటయే మన కర్తవ్య'మని కుమారస్వామిగారంటున్నారు. నేను కూడా ఈ విషయంలో కుమారస్వామిగారి వాదాన్నే స్వీకరించి—ప్రస్తుతానికి ప్రక్షేప సమస్య నలాఉంచి—వాల్మీకి రామాయణంలో ప్రస్తుతం మనకు కనిపిస్తూన్న కథనాన్ననుసరించే ఈ సమస్యను పరిశీలించ దలచుకొన్నాను.

కుమారస్వామిగారు వారు రాముడి చర్యను సమర్థించటానికి భవభూతి రచితమైన మహావీరచరిత్రలోని కథనాన్ని ఉదాహరించారు. నాయకుడి చరిత్రలోని అనుచితాన్ని తొలగించేందుకు నాటక కర్తలు అన్యథాప్రకల్పనలు చేస్తుంటారు. ఆ యా కల్పనలు ఆ నాటక కర్త కల్పనాశక్తికి ద్యోతకము లవుతవేకాని మూలగ్రంథమందలి నాయకుడి చరిత్రలోఉన్న దోషాన్ని పోగొట్టలేవు. పైగా నాటక కర్త ఈ విధమైన మార్పుచెయ్యటం అవసరమని భావించటంలోనే మూలంలోని కథలో నాయకుడి చరిత్ర దోషభూయిష్ఠంగా ఉన్నదని అంగీకరించినట్లవుతున్నది. కనుకనే కాళూరివారుదాహరించిన అభిషేకనాటకంలాగే కుమారస్వామిగారుదాహరించిన మహావీరచరిత్రకూడా ఈ మన మీమాంసకు ఉపయోగించదు. వాల్మీకి రామాయణ మొక్కటే ప్రమాణం.

వాల్మీకి రామాయణాన్నిబట్టే స్వయంగా వాలియే రాముడిచర్యను ఆక్షేపించాడు. దానికి రాముడు ఏదో సమాధానం చెప్పాడు. 'వాలి శ్రీరాముడి సమాధానంతో తృప్తిపడి తనువు చాలించాడు.' కనుక 'వాలికొరకు జాలిపడవలసిన అవసరం లేద'ని కుమారస్వామి గారంటున్నారు. ఏ పరిస్థితిలో వాలి తన సంతృప్తిని వెల్లడించాడో గమనిస్తే, అతడు వెల్లడించిన సంతృప్తి హృదయపూర్వకమైనది కాదని గుర్తింపగలము.

ధర్మంగానో, అధర్మంగానో తాను బాణవిద్ధుడైనాడు. తనకు మృత్యువు ఆసన్నమై ఉన్నది. తన వెనుక బాలుడైన అంగదుడిని రక్షింపగల దిక్కు లెవరూ లేరు. అంగదుడు సుగ్రీవ శ్రీరాముల దయాదాక్షిణ్యములపై ఆధారపడి జీవింపవలసిన వాడైనాడు. తాను రామ సుగ్రీవులయెడల విరోధ బుద్ధితోనే మరణిస్తే,

తన అనంతరం తన కుమారుడికి కూడా తనకు పట్టిన గతే పడుతుంది. రాజ్యంకొరకు అన్ననే చంపిన (లేక చంపించిన) సుగ్రీవుడికి అంగదుడిని చంపటం విషయంలో ఎలాంటి సంకోచాలూ ఉండవు. అందుచేత నిస్సహాయుడైన తన ప్రియపుత్రుడి భవిష్యత్తును ఆలోచించి, అతడి క్షేమాన్ని కోరి, తన అపరాధాన్ని అంగీకరించటం ద్వారా శ్రీరామ సుగ్రీవుల కరుణను సంపాదించేందుకే వాలి తన నేరాన్ని అంగీకరించాడు. వాలికి అంగదుడంటే ఎంతటి ప్రాణాధికమైన ప్రేమయో అతడి మాటల్లోనే చూడండి:

నచాత్మానమహం శోచే న తారాం నాపి బాంధవాన్
యథాపుత్రం గుణజ్యేష్ఠ మంగదం కనకాంగదమ్.
సమదర్శనాద్దీనో బాల్యాత్ప్రభృతి లాలితః
తటాక ఇవపీతాంబు రుపశోషం గమిష్యతి.
బాలశ్చాకృతిబుద్ధిశ్చ ఏకపుత్రశ్చమేప్రియః
తారేయోరామ భవతా రక్షణీయో మహాబలః.

(కిష్కింధ—18 వ సర్గ—50-52 శ్లో)

(నన్ను గురించి నాకు దుఃఖం లేదు; తారను గురించీ లేదు; బంధువులను గురించీ లేదు. నా దుఃఖమంతా నా కుమారుడైన అంగదుడిని గురించే. చిన్నతనంనుండి ఎంతో గారాబంగా పెరిగినవాడు. నేను కనిపించక పోవటంతో నీళ్ళులేని చెరువులాగ శుష్కించిపోతాడు. వాడు చిన్నవాడు; అమాయకుడు; నాకు ఒక్కగాని ఒక్క కొడుకు; నాకు ప్రాణమైనవాడు. బలవంతుడే, ఐనా, రామా, వాడిని నీవే రక్షించాలి.)

అంగదుడికి వాలిచేసిన కడపటి హితోపదేశం వల్ల అతడి హృదయంలోని భావం వ్యక్తమవుతున్నది.

దేశకాలౌ భజస్వాద్య క్షమమాణః ప్రియాప్రియే
సుఖదుఃఖసహఃకాలే సుగ్రీవ వశగోభవ.

(కిష్కింధ—సర్గ 22. శ్లో. 20)

(దేశకాలాలను గుర్తించి జీవించు. ప్రియాప్రియాలను ఓర్చుకో. సుఖదుఃఖాలను సహించుకో. సుగ్రీవుడికి లోబడి బతుకు.)

సుగ్రీవుడికి అంగదుడంటే ఎటువంటి ప్రేమ ఉండేదో కూడా అంగదుడి మాటలవల్ల తెలుస్తున్నది.

న చాహం యౌవరాజ్యేన సుగ్రీవేణాభి షేచితః
నరేంద్రేణాభిషిక్తోస్మి రామేణాక్లిష్టకర్మణా.
సపూర్వం బద్ధవైరోమాం రాజాదృష్ట్వా వ్యతిక్రమమ్
ఘాతయిష్యతిదండేన తీక్ష్ణేన కృతనిశ్చయః

(కిష్కింధ—53 సర్గ 17—18 శ్లో)

(నన్ను యువరాజుగా అభిషేకించినవాడు సుగ్రీవుడు కాడు, శ్రీరాముడు. సుగ్రీవుడికి నామీద మొదటినుంచీ బద్ధవైరమే. ఇప్పుడు నావల్ల ఒక చిన్న అపరాధం జరిగినా సరే క్రూరమైన శిక్ష విధించి చంపి తీరుతాడు.)

కథం శత్రుకులీనం మాం సుగ్రీవో జీవయిష్యతి.
ఉపాంశుదండేన హిమాం బంధనేనోపపాదయేత్
శఠః క్రూరో నృశంసశ్చ సుగ్రీవో రాజ్యకారణాత్.

(కిష్కింధ—55 సర్గ. 8—10 శ్లో.)

(పగవాడినైన నన్ను సుగ్రీవుడు ఎలా బతకనిస్తాడు? ఒంటరివాడినిచేసి నన్ను హింసిస్తాడు, బంధిస్తాడు. సుగ్రీవుడు కుచ్చితుడు, క్రూరుడు, దుర్మార్గుడు; రాజ్యంకొరకు ఏమైనా చెయ్యగలడు.)

అంగదుడి ఈ మాటలు సుగ్రీవుడి మనస్తత్వం తెలిసి అన్నవేగాని, ఊరికే అన్నవికావు. తన తమ్ముడి మనస్తత్వం ఎలాంటిదో వాలికికూడా బాగానే తెలుసును. కనుకనే వేటుతిన్న వెంటనే తాత్కాలికమైన క్రోధంకొద్దీ రాముడిని దూషించినా, అంతలోనే తెలివి తెచ్చుకొని, తన తప్పును ఒప్పుకొని, రాముడిని పొగడి—సుగ్రీవుడి మాట ఎలాఉన్నా—రాముడికి అంగదుడిపై దయకలిగేలాగున జాగ్రత్త పడ్డాడు. వాలిచేత తప్పిదాన్ని అంగీకరింపచేసింది అతడి పితృహృదయమేగాని రాముడి సమాధానంకాదు. వాలి తాను నిజంగా దోషిని, వధ్యుడను అని హృదయపూర్వకంగానే అంగీకరించాడని మనం నమ్మితే అతడు అదే గుక్కలో పలికిన ఈ మాటనుకూడా నిజమని నమ్మవలసివస్తుంది.

త్వత్తోహంవధమాకాంక్షన్ వార్యమాణోపి తారయా
సుగ్రీవేణ సహభ్రాత్రా ద్వంద్వయుద్ధముపాగతః

(కిష్కింధ–18 సర్గ. 57 శ్లో)

(రామా, నాకు నీ చేతిలో చచ్చిపోవాలని కోరిక ఉన్నది. గనుకనే తార వద్దంటున్నా వినకుండా సుగ్రీవుడితో యుద్ధానికి వచ్చాను.)

ఈ మాటలో నిజం ఎంత ఉన్నదో, రాముడి సమాధానంతో వాలి సంతృప్తిపడటంలోకూడా అంతే నిజమున్నది.

కనుక వాలి సంతృప్తితో నిమిత్తంలేకుండా శ్రీరాముడి చర్యను స్వతంత్రంగా విమర్శింపవలసి ఉన్నది.

వాలి చేసిన ఆక్షేపణలలో ఒక్కదానికైనా రాముడు సంతృప్తికరమైన సమాధానం ఇవ్వలేక పోయాడు.

(1) వాలి చేసిన మొదటి ఆక్షేపణ :

'నీకు నేనేమీ అపకారం చెయ్యలేదే—నన్నెందుకు నిష్కారణంగా వధించావు?'

దీనికి రాముడి సమాధానం ఇది :

'నీకూ నాకూ వ్యక్తిగతమైన వైరం లేక పోయినా, నిన్ను చంపుతానని నేను సుగ్రీవుడికి మాట ఇచ్చిఉన్నాను. మిత్రుడికి ఇచ్చిన ఆ మాటను నేనెలా తప్పగలను?'

మొదటికి వధ్యత్వావధ్యత్వ మీమాంస చెయ్యకుండా తొందరపడి వాలిని చంపుతానని సుగ్రీవుడికి రాముడు వాగ్దానం చెయ్యటమే తప్పు. ఒక తప్పును సమర్థించుకోవటానికి చేసిన తప్పుడుపని ఎలా సమర్థనీయమవుతుంది?

(2) వాలి వేసిన రెండో ప్రశ్న :

'నేనేమీ పాపం చెయ్యలేదే— నిరపరాధినైన నన్నెందుకు శిక్షించావు?'

దీనికి రాముడి సమాధానం ఇలా ఉన్నది:

'కూతురుతో సమానమైన మరదలితో నీవు కామప్రవృత్తుడవైనావు. కనుక నీవు పాపివి, వధ్యుడవే.'

రాముడు చెప్పింది ధర్మంలాగే కనుపిస్తున్నది పైచూపులకు. లోతుగా విచారిస్తే అందులో ధర్మం లేదు.

మరదలు కూతురుతో సమానమనేది నరజాతి ధర్మం. (నరుల్లోకూడా కొన్ని తెగల్లో మాత్రమే.) వానరులకు నర ధర్మాన్ని వర్తింపజేయటం ధర్మం కాదు. అవునంటే—తల్లితో సమానమైన వదినను భార్యగా స్వీకరించిన సుగ్రీవుడికికూడా ఇదే శిక్షను రాముడు విధింపవలసిఉండెను. మరి రాముడు సుగ్రీవుడి నెందుకు శిక్షించలేదు? 'అన్న చనిపోయినతర్వాత గాని, లేక చనిపోయినాడని నమ్మినపుడుగాని వదినను భార్యగా స్వీకరింపవచ్చు. ఇది వానర జాతి ధర్మం!' అనవచ్చు. అయితే యుద్ధవిజితుడి భార్యను కూడా రాజ్యసంపదలతోపాటు స్వాయత్తం చేసుకోవటం కూడా వానరజాతి ధర్మమే కావచ్చు.

పతివ్రతాశిరోమణి, తన భార్య అయిన సీతను బలాత్కారంగా ఎత్తుకొనిపోయిన రావణుడిని కూడా తనకు సీతను తిరిగి అప్పగిస్తే క్షమించటానికి రాముడు సిద్ధపడిఉన్నాడు. ఆ విధంగా రాయబారాలు జరిపించాడు. 'రుమ' సీతలాగ పతివ్రత కాదు. సుగ్రీవుడు యువరాజుగా ఉన్నంతకాలం అతడి భార్యగా ఉన్నది. అతడు కిష్కింధను వదలి పారిపోయినతర్వాత వాలితో సుఖంగా కాపురం చేసింది. మరల సుగ్రీవుడు రాజయి వచ్చినతర్వాత అతడితో సంసారం సాగించింది. అంటే 'రుమ' వాలికి స్వబుద్ధితోనే వశమైనదిగాని, వాలి ఆమెను బలాత్కరించినవాడు కాదన్నమాట. అట్టి సందర్భంలో వాలికి ఒక హెచ్చరికనైనా ఈయకుండా ఒకేసారి అతడికి మరణశిక్షను విధించి అమలు జరపటం అన్యాయం, అధర్మం.

(3) వాలి మూడవ ప్రశ్న :

'నేను సుగ్రీవుడితో ద్వంద్వయుద్ధం చేస్తూ, నిన్ను గమనించక ప్రమత్తుడనై ఉండగా, నామీద నీవు బాణప్రయోగం ఎలా చేశావు?'

దీనికి రాముడు చెప్పిన సమాధానం ఏమంటే:

'నీవు ఒక మృగానివి. వేటాడే రాజులు మృగాలను ఎదుటనుంచిగాని, చాటునుంచిగాని, వలలొడ్డిగాని, ఎలాగైనా చంపవచ్చు. కనుక ప్రమత్తస్థితిలో ఉన్న నిన్ను వేటాడటం రాజధర్మమే.'

ఇంతవరకు రాముడు వాలిని మనుష్యుడివలె గుర్తిస్తూ ధర్మాధర్మ మీమాంస చేశాడు. ఎప్పుడైతే వాలిని రాముడు మృగంగా పరిగణించాడో, అప్పుడే ఇంతవరకూ అతడు చేసిన అగవ్యాగమవ దోషారోపణ నిస్సారమని తేలిపోయింది. తాను వాలిని

చంపినది దోషమునకు శిక్షగనో, వేటగనో రాముడికి నిశ్చయబుద్ధిలేదు.

(4) వాలి వేసిన నాల్గవ ప్రశ్న చాల ధర్మ సూక్ష్మముతో కూడినది.

'నేను మృగమును. అందులో పంచనఖమును. ఐదు గోళ్ళుగల జంతువులలో ఏదుపంది (ఆళువ), ముళ్ళపంది, ఉడుము, కుందేలు, తాబేలు—అనే ఐదింటి మాంసము మాత్రమే క్షత్రియులకు భక్షణీయం. నీవు నా మాంసాన్ని తినవు. నా చర్మంగాని, నా వెంట్రుకలుగాని, నా ఎముకలుగాని నీ కెందుకూ పనికిరావు. నన్ను నీవు ఏమికోరి చంపినట్లు? నిష్కారణమైన జంతు వధ చేయటం సత్కులీనుడైన క్షత్రియుడికి తగునా?'

వాలి అడిగిన ఈ ప్రశ్నకు రాముడు సమాధానం చెప్పలేకపోయినాడు. 'శేషం కోపేన పూరయేత్' అన్నట్లు 'నీవు కోతివి. నీవు వృద్ధోపసేవనం చెయ్యలేదు. నీకు ధర్మసూక్ష్మం తెలియదు' అని బుకాయించాడు. ఇది వట్టి బుకాయింపేనని— కాళూరివారు ఉదాహరించిన—ధర్మాకూతకర్తకూడా అంగీకరించక తప్పిందికాదు. కోతిని పొరపాటువలన చంపిన వాడు కూడ ప్రాయశ్చిత్తం చేసికోవలెనన్నప్పుడు, బుద్ధిపూర్వకంగా చంపటం ఎంతటి దోషమో చెప్పనక్కరలేదు. ధర్మాకూతకర్త రాముడి చర్యను ఆపద్ధర్మమని మాత్రమే సమర్థింపగలిగాడు. రాజనీతిలో నీతి ఎంత ఉన్నదో, ఆపద్ధర్మంలో ధర్మం అంత ఉన్నది. ధర్మానికి తిలాంజలి ఇచ్చి, స్వార్థసిద్ధికి వక్రమార్గలను అనుసరించటం పేరే ఆపద్ధర్మం.

'శ్రీరాముడు వాలిని వెనుకనుండి వధింపలేదు. అతడి ఎదుటనుండే బాణ ప్రయోగం చేశాడు. కనుక అందులో దోషం లేదు' అనేవాదం ఒకటున్నది. నిజమే.

'రాఘవేణ మహాబాణో వాలివక్షసి పాతితః'

(కిష్కింధ—సర్గ 16—శ్లో. 35)

(రాముడు వేసిన బాణం వాలి రొమ్మున గుచ్చుకున్నది) అనటంవల్ల రాముడు వాలి ఎదుట నుండే బాణ ప్రయోగం చేశాడన్నది నిజమే. అయినా వాలి అడిగిన నాలుగు ప్రశ్నలవల్ల రాముడు బాణ ప్రయోగం ఏ దిక్కునుండి చేశాడు అనే ప్రశ్నయే ఉదయించదు. ఏ దిక్కునుండి బాణం వేసినా అది సమానమైన దోషమే అవుతున్నది.

శ్రీ కుమారస్వామిగారు చేసిన మరికొన్ని సమర్థనలు :

(1) 'సాక్షిగానున్న రాజునకు బలవంతుని బారినుండి బలహీనుని కాపాడుట అను ధర్మము వర్తించును.'

అధర్మమునుండి ధర్మాన్ని కాపాడటమే రాజ ధర్మము. బలహీనుడే అధర్మపరుడై, బలవంతుడు ధర్మపరుడై యున్నపుడుకూడ బలహీనుడనే కారణంతో అధర్మపరుడికి అండగా నిలబడి ధర్మపరుడిని బలవంతుడైనమాత్రాన శిక్షించటం రాజధర్మమా?

(2) 'దోషికి దోషమును తెలిపి శిక్షింపవలసిన పనిలేదు. ఇది త్రేతాయుగ మను ధర్మము.'

నిందితుడికి అతడి నేరాన్ని తెలిపి, అతడి ప్రతివాదం విని, నేరాన్ని నిర్ణయించి, శిక్షను ప్రకటించి, ఆ శిక్షను నిందితుడికి తెలిపి, దానిమీద అతడు పునర్విమర్శకోరే అవకాశమిచ్చి, అమీదట శిక్షను అమలుజరిపే నేటి న్యాయశాసన విధానం రామరాజ్యంలో లేకపోవచ్చు. కాని ఒక్క నేరారోపకుడి మాటలు మాత్రమే విని, నిందితుడి మాట వినకుండానే నేర నిర్ధారణ చేసి శిక్ష విధించేటంతటి అన్యాయ విధానం త్రేతాయుగంలోకూడా లేదు. శూద్రుడైఉండి తపస్సు అనే నేరాన్ని చేసిన శంబుకుడికీ, సారమేయాన్ని హింసించిన బ్రాహ్మణభిక్షువైన సిద్ధార్థకుడికీ శిక్షలు విధించేముందు రాముడు నిందితులను విచారించి వాళ్ల నోటిమీదుగానే వాళ్ల నేరాన్ని చెప్పించి మరీ శిక్ష విధించాడని రామాయణమే చెబుతున్నది.

(3) వ్యక్తిగతవైరము లేనపుడు వ్యక్తిగత యుద్ధమునకు కాలుదువ్వుట అసంబద్ధము. కనుకనే రాముడు స్వయంగా వాలితో యుద్ధంచేయక సుగ్రీవుడి చేత పోరించాడంటూ, ఈ వాదానికి సమర్థకంగా భారత యుద్ధంలో శ్రీ కృష్ణుడి పాత్రను కుమారస్వామిగారు ఉదాహరించారు. 'భారతోదాహరణంవల్ల వ్యక్తిగత వైరమున్నపుడు ప్రత్యక్ష యుద్ధము, ధర్మాధర్మ కారణమైన వైరమున్నపుడు పరోక్ష యుద్ధము

సంభవమగునని తెలియును' అని కుమారస్వామిగారు ఒక వినూతన సిద్ధాంతం చేశారు. నరసింహుడు హిరణ్యకశిపుడిని చంపటంగాని, శ్రీకృష్ణుడు నరకుడిపైకి దాడివెడలి యుద్ధంచేసి వధించటంగాని, ఇంకా శివకేశవులు అనేక పర్యాయాలు అనేకమంది రాక్షసులను సంహరించటంగాని వ్యక్తిగత వైరంవల్లకాదు. ధర్మాధర్మ కారణమైన వైరంవల్లనే; తమ ఆశ్రితులైన దేవతల, ఇతర భక్తుల రక్షణార్థమే. ఇక భారత యుద్ధంలో శ్రీకృష్ణుడి ధర్మనిరతి ఎంతటిదనే ప్రశ్న అలా ఉంచినా, వాలి వధలో రాముడి చర్య కృష్ణుడి చర్యవంటిదైనా కాదు. కృష్ణుడు భీమార్జునులను ప్రోత్సహించి, వారిచేతనే కౌరవ వధ చేయించాడుగాని, తాను దొంగచాటుగా దెబ్బతీయలేదు. రాముడు సుగ్రీవుడిచేతనే వాలిని చంపించిఉంటే అక్షేపణకు అవకాశమే లేదు. స్వయంగా ఎదటబడి యుద్ధంచేసి చంపినా అక్షేపణ లేదు. యుద్ధ ధర్మాలంటూ ఏవో కొన్ని ఉన్నవనుకుంటేమాత్రం రాముడి చర్య నింద్యమే. ఏదో విధంగా శత్రు సంహారం చెయ్యటమే ధర్మం అనుకుంటే అసలు వాదమే లేదు. అప్పుడు లోకంలో జరుగుతున్న ఏ హత్యకూడా నింద్యం కానేకాదు.

4) శ్రీరాముడు స్వార్థపరుడయినచో వాలితోనే చేయికలిపి యుండెడివాడు.'

సుగ్రీవుడితో మైత్రిచేసే సమయానికి వాలి బలమెట్టిదో రాముడికి వివరంగా తెలియదు. వాలికీ రావణుడికీ ఉన్న స్నేహసంగతి అసలే తెలియదు. రామపట్టాభిషేకానంతరం అగస్త్యుడు రావణుడి పూర్వచరిత్ర చెప్పేవరకు (ఉత్తరకాండ 34 సర్గ) రాముడికీ సంగతి తెలిసిఉన్న సాక్ష్యం లేదు. ఇంతకూ రాముడు సుగ్రీవుడితో స్నేహం చేసింది కబంధుడి సలహా ననుసరించి. అతడు సుగ్రీవుడి పేరెత్తక వాలి సహాయం తీసుకోమని సలహా ఇచ్చిఉన్నట్లయితే రాముడు వాలినే ఆశ్రయించి ఉండేవాడు. రాముడు స్వీయప్రయోజనంకోరి, సుగ్రీవుడు తనకు సాయపడతాడనే ఆశతోనే అతడిని వెదుకుకొంటూ వచ్చాడేగాని, సుగ్రీవుడిని ఉద్ధరించాలని వచ్చినవాడు కాడు. సుగ్రీవుడిని దర్శించగానే లక్ష్మణుడు చేసిన ప్రసంగం (కిష్కింధ—4 సర్గ; 6—24 శ్లో.) చూస్తే ఈ సంగతి స్పష్టమవుతుంది. సుగ్రీవుడి సాయం తాను పొందగలిగేందుకై అతడికి తానూ సాయం చేసేందుకు రాముడు అంగీకరించాడు. వాలిని చంపుతానని మాట ఇచ్చిన (5 వ సర్గ) తర్వాతనే రాముడు సుగ్రీవుడిని వాలితో వైర కారణమేమిటని అడిగి (8 వ సర్గ) తెలుసుకున్నాడు. సుగ్రీవుడితో చేయి కలపటానికి రాముడిని ప్రేరేపించింది స్వార్థసాధనదృష్టి మాత్రమేగాని ధర్మదృష్టి కాదు.

భరతుడి ప్రతినిధిగా తాను దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేస్తున్నట్లు రాముడు చెప్పుకొన్నది కూడా బుకాయింపే. అంగ వంగ కళింగాది షట్పంచాశ (56) రాజ్యాలలో కోసలమొకటి. దక్షిణ కోసల రాముడుగాని, రాజప్రతినిధిగాని కిష్కింధ రాజ్యంలో దుష్టశిక్షణాధికారం ఎలా ఉంటుందో రాముడికే తెలియాలి. నిజానికైనా, నిక్కమైనా దుష్టశిక్షణాధికారం ఉంటుందంటే అది నేటి సంగతి. అప్పుడు భరతుడి ప్రతినిధిత్వం అనవసరం.

శ్రీరామావతారంలో వాలిని దొంగచాటుగా చంపిన పాప ఫలితంగానే శ్రీకృష్ణుడు బోయవాడి చేతిలో హతుడైనాడనే ఐతిహ్యంకూడా రాముడి చేతలోని పాతకాన్ని నిరూపిస్తున్నది.

ఈ నాడు మనం ధర్మాధర్మ నిర్ణయం చేయబూనేకంటే, అసలు రామాయణ కర్తయైన వాల్మీకి చేసిన ధర్మనిర్ణయం తెలుసుకోవటం మేలు.

రాముడి చర్యను గర్హిస్తూ వాలి పలికిన పలుకులకు ముందువెనుకల వాల్మీకి వాక్యాలు ఇలా ఉన్నవి:

తం దృష్ట్వా రాఘవం వాలీ లక్ష్మణం చ మహాబలం
అబ్రవీత్ పరుషం వాక్యం ప్రశ్రితం ధర్మసంహితం,
సభూమావల్పతేజో౽సుర్నిహతో నష్టచేతనః
అర్థసంహితయా వాచా గర్వితం రణగర్వితం.

(కిష్కింధ – 17 సర్గ. 14 - 15 శ్లో.)

(దెబ్బతిని, నేలపైబడి, కొనప్రాణంతోఉన్న వాలి గర్వితుడూ, రణగర్వితుడూ ఐన "రాముడినీ,

బలశాలియైన లక్ష్మణుడినీ చూచి నీతియుక్తము (ప్రశితము), ధర్మార్థసహితము, పరుషమునైన వాక్యం పలికాడు.)

> ఇత్యుక్తః ప్రశ్రితం వాక్యంధర్మార్థసహితం హితం
> పరుషం వాలినా రామో నిహతేన విచేతసా.
> తం నిష్ప్రభమివాదిత్యం ముక్తతోయ మివాంబుదం
> ఉక్తవాక్యం హరిశ్రేష్ఠ ముపశాంత మివానలం.
> ధర్మార్థగుణసంపన్నం హరీశ్వర మనుత్తమం
> అధిక్షిప్తస్తదారామః పశ్చాద్వాలిన మబ్రవీత్.
>
> (కిష్కింధ. 18 సర్గ. 1—3 శ్లో.)

(దెబ్బతిని, ప్రాణాలు కడబట్టి, కాంతి హీనుడై అస్తమిస్తున్న సూర్యుడిలాగ, రక్తస్రావం వల్ల వర్షించి వట్టిదైన మేఘంలాగ చల్లారిన అగ్ని లాగ ఉన్నాడు వాలి. అతడు ధర్మార్థగుణసంపన్నుడు; కపిశ్రేష్ఠుడు; అతడికంటె మంచివాడంటూ లేడు. అట్టి వాలి నీతియుక్తము, ధర్మార్థసహితము, హితము; పరుషము అయిన మాటలతో రాముడిని అధిక్షేపించాడు. అప్పుడు రాముడు వాలితో ఇలా పలికాడు.)

ఈ సందర్భంలో వాల్మీకి వాలిని మహాత్ముడు, అనుత్తముడు, ధర్మార్థగుణసంపన్నుడు అని ప్రశంసించటమూ, రాముడిని గర్వితుడు, రణ గర్వితుడు అని మాత్రమే చెప్పియుండటమూ గమనించదగి ఉన్నది. అలాగే వాలి వాక్యమును గురించి ఒకటికి రెండుసార్లు ప్రశితము, ధర్మార్థసంహితము, హితము అని ప్రశంసించటమూ, రామవాక్యాన్ని గురించి అలాంటి పొగడ్త మాటలేమీ ప్రయోగించకపోవటమూకూడా గమనించవలసిఉన్నది.

వాలి వాదమే ధర్మార్థసహితమని వాల్మీకి తీర్పు. రాముడి వాదం ధర్మసమ్మతమని వాల్మీకికే నమ్మకం లేదు.

త్రేతాయుగధర్మం వాల్మీకికంటె మన కెక్కువ తెలియదు.



# "తెలుగు మాండలికాలు: కరీంనగర్ జిల్లా" సమీక్షకొక సమాధానం

డా. బూదరాజు రాధాకృష్ణ

ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంగారు ఆగస్టు 1972 నాటి 'భారతి'లో 'తెలుగు మాండలికాలు - కరీంనగర్‌జిల్లా' అనే సమీక్షా వ్యాసాన్ని ప్రచురించారు. పై పరిశోధన పత్రికకు సంపాదకుడుగా అందులోని కొన్ని ప్రసంగాలకు సమాధానం చెప్పవలసిన బాధ్యత నాకుంది. వారు పెద్దలు. బహుశాస్త్రజ్ఞులు. వారి విమర్శలోని విశేషాలు కొన్ని ఆశ్చర్యం, కొన్ని బాధ, కొన్ని 'విరక్తి' కలిగించాయి. ఆ విమర్శలు మూడు విధాలు: 1. లోప నిరూపకాలు, 2. దోష నిరూపక శాస్త్ర చర్చలు, 3. అన్యవిషయాలు. చివరి వాటికి అంత ప్రాముఖ్యం ఇవ్వదలచలేదు. క్రమంగా ఆయా ముఖ్య విషయాలను పరిశీలిద్దాం.

మొదట లోపాల విషయం. మా పరిశోధన పత్రికలో కరీంనగర్ మాండలికంలోని 'పదబంధ, పద, స్వరరీతి ప్రత్యేకతలు' చూపలేదన్నారు. నిజానికి 35–37 పేజీల్లో పేర్కొన్నవి ఆవిశేషాలే. 1. ద్విరుక్తా ద్విరుక్త హల్లులు పర్యాయోపయోగంతో ఉండటం, 2. హ్రస్వ దీర్ఘభేదమేగాక అచ్చులో అర్ధదీర్ఘత కూడా ఉండటం, 3. ఒక పదంలోని ఉకారానికి ముందున్న వివృతాచ్చు సంవృతం కావటం, 4. పద మధ్యాచ్చులు లోపించి అనేక సంయుక్త వర్ణాలు ఏర్పడటం—ఈ నాలుగూ పై మాండలిక ప్రధాన లక్షణాలని చెప్పేవున్నాం.

ఆచార్యులు లోపంగా పేర్కొన్న మరో విశేషం స్త్రీల, అనేక వర్గాలకూ కులాలకూ చెందిన వ్యవహర్తల, వ్యవహార ఖండికలను ప్రచురించలేదని. ప్రయోజన దృష్టితో ప్రచురించిన ఖండికల్లో అన్ని కులాల, వృత్తుల, ఉద్యోగాల వ్యక్తులందరి ప్రసంగాలనూ ప్రకటించటం సాధ్యంకాదు — ప్రయోజనమూలేదు. ఒక్కొక్క కేంద్రంలో నాలుగురోజులుమాత్రం పర్యటించిన పరిశోధకులు ప్రతినిధి వ్యవహర్తలను మాత్రమే ఎన్నుకోగలరు. మన దేశకాలపరిస్థితులనూ పరిశోధనశ్రమనూ గుర్తించినప్పుడు 68 మంది ప్రధాన వ్యవహర్తలనుంచి విషయసేకరణ చేయటం ఎంతకష్టసాధ్యమో తెలుస్తుంది. ఈ ప్రయత్నంలోని కష్టసుఖాలు అనుభవైకవేద్యాలు. వ్యాకరణ రచనకు వాడినన్ని ఖండికలను మాత్రమే ఈ సందర్భంలో 13–ప్రచురించాం. ఈ ఎన్నిక జగద్వ్యాప్తంగా భాషాశాస్త్రజ్ఞులందరూ చేసేదేగాని కొత్తదికాదు. వ్యవహర్తలు తమకు తోచిన, నచ్చిన విషయాలనుగురించి ప్రసంగిస్తారు. వాటిని సేకరిస్తాం. అంతేకాని ఈ పదాన్ని ఈ విధంగానే ఉచ్చరించమని సూచించేటట్లే ఈ విషయంమీదనే మాట్లాడమనటం శాస్త్రపద్ధతి కాదు.

వ్యవహారఖండికలను మేం ప్రచురించిన పద్ధతి లోపభూయిష్ఠంగా ఉందనీ, తెలుగుభాషకులేని హలంతత్వాన్ని మేమే కల్పిస్తున్నామనీ ఆరోపించారు. ఇది నిజంకాదు. ఆయా వ్యవహర్తల ప్రసంగాలను టేప్ రికార్డ్ చేసి మొదట ధ్వనివిధేయంగా రాసుకొని, తరవాత వారి ఉచ్చారణరీతుల్లోని ప్రముఖ లక్షణాలను మాత్రమే ప్రదర్శిస్తూ తక్కిన భాగాలను వర్ణవిధేయంగా ప్రచురించాం. ఒక తీరు లిపికీ ఒకరకమైన

భాషారూపానికీ అలవాటుపడినవారి దృష్టికి ఏపాటి చిన్నమార్పయినా కొట్టవచ్చినట్లు కనిపించి ఇటువంటి అపవాదులు వేయిస్తుంది. ఇందుకు 'మాట్లాడుతున్నాను' అనటంకద్దుగాని 'మాట్లాడ్ తున్నాను' (='పదచ్ఛేదం' చేయటం) అనటం భాషాతత్త్వవిరుద్ధమన్న సమీక్ష కుల వాక్యమే నిదర్శనం (చూ. భారతి, పేజీ 21, మొదటికాలం). డకారంమీద అచ్చులేదని రెండు రకాల లేఖనంలోనూ కనిపిస్తునే వుంది. ఇక అభిప్రాయభేద మెక్కడో తెలియటంలేదు! అజ్లోపాన్ని ప్రముఖంగా ప్రదర్శిద్దామని మేము ఒక రకంగా రాశాం. దాన్ని అంగీకరిస్తూనే తాము మరో రకంగా రాసి చూపిన ఆచార్యులవారు లేఖన సంప్రదాయ ప్రభావంవల్ల అజ్లోపాన్ని గమనించక తెలుగు భాషకు మేము హలంతత్వం తెచ్చిపెడుతున్నామని కోపించారు! ఇటువంటి ప్రమాదాలను పరిహరించేందుకే లేఖనంలో మేము వేరుదారి తొక్కవలసి వచ్చింది. అన్నట్లు పెద్ద సందేహం. తెలుగు అజంత భాష అని ఇటీవలి వారు కొంతమంది అనటం మేమూ విన్నాంగాని, ఏ తెలుగు వ్యాకరణమూ అన్నట్లు లేదు! అంటే శాస్త్రజ్ఞు లెవరూ ఆ మాట అనలేదు. శాస్త్ర విషయాల్లో అభిరుచులకూ ఊహలకూ ప్రామాణ్యం లేదు గదా!

ఇక్కడ రెండు మూడు విషయాలు చెప్పవలసి వుంది. 'మాట్లాడు', 'మాట్లాడుతున్నాను' అనేవి ప్రత్యేక పదాలేగాని 'తున్నాను'కాదు. అందువల్ల మేం 'పదచ్ఛేదం' చేయలేదు. తెలుగు అజంతత్వం మేం తొలగిస్తున్నా మన్నవారే 'న, ల, ర, య' లు పదాంతంలో అజహితంగా వ్యవహృత మవుతున్నా యన్నారు. మరి అది హలంతతా చిహ్నం కాదా? ఇక వర్ణమాలవల్ల (లేదా వర్ణక్రమంవల్ల) పఠన క్లేశం కలగటం ఈ తీరు ప్రచురణల్లోనూ సాంకేతిక చర్చల్లోనూ మాండలిక రూపాలను సాహిత్యక లిపిలో రాశేటప్పుడూ తప్పదు. ఈ పరిస్థితిని గురించి వివరంగా తెలుసుకోదలచినవారు ఆర్. ఇ. కెల్లర్ తన జర్మన్ డయలెక్ట్స్ అనే ఉద్గ్రంథానికి రాసిన పీఠిక చదివితే (పేజీలు 14—15, 18) తెలుస్తుంది. మాండలికాలను ప్రచురించటంలో ధ్వనివిధేయ, వర్ణ విధేయ లేఖనాల్లో ఏది ఎంతవరకు ఉపయోగకరమో ఆ పీఠికలోనే చర్చిస్తాడు. వ్యవహార ఖండికలను ప్రచురించేటప్పుడు ముఖ్యధ్వని విశేషసూచనకోసం ధ్వనివిధేయతను, ఇతర సందర్భాల్లో వర్ణవిధేయతను పాటించి మేము మధ్యేమార్గం అవలంబించాం. మాండలిక వ్యాకరణాల్లోమాత్రం ఆయాఖండికలను వర్ణవిధేయంగా మాత్రమే ప్రచురిస్తాం. అయినప్పటికీ పఠనక్లేశం ఇంతోఅంతో ఉండకపోదు. అభ్యాసంవల్ల ఈ క్లేశం పోతుంది.

ఆచార్యులవారు చేసిన శాస్త్రచర్చల్లో ముఖ్యమైనవాటిని పరీక్షిద్దాం. చేదర్థకాప్యర్థకాల విషయంలో నా 'తొందరపాటు'ను కంటకించుకున్నారు. గ్రాంథికంలోకూడా 'కురిసిన, కురిసినను' అనే రెండు భిన్నరూపాలు పై అర్థాలను విశ్లేషిస్తున్నాయని, ఆధునిక వ్యావహారికంలోని 'కురిసినా, కురిస్తే' అనే భిన్నరూపాలు తెచ్చిపెట్టిన ప్రత్యేక రూపభేదంగాని అర్థభేదంగాని లేదన్నారు. 'కురిసినను' అనేది నుజ్యంత మేమో! నుజ్యంత చేదాద్యర్థకాలు ఒకటేనా? తెలియటంలేదు. వారు రేఫనుగురించి ప్రస్తావించినప్పుడల్లా 'రకార' మంటున్నారు. వ్యాకరణాలేమో రకారం అంటే శకటరేఫ అంటున్నాయి. ఏది సబబు?

ఇటువంటిదే 'వచ్చ్రను' మొదలైన పదాల్లోని నకారరేఫల సంయుక్తధ్వని ప్రాచీనతరంకాదని వారు చేసిన శాస్త్రచర్చకూడాను. ప్రాచీనరూపనిర్ణయం చేసేందుకు ఇంటర్నల్ రికన్‌స్ట్రక్షన్ అనే విధాన ముందనీ, ఆ పద్ధతిలో చేసిన పునర్నిర్మాణాలకు శాసన ప్రయోగా లుండనవసరంలేదనీ భాషాశాస్త్రపరిచాయక గ్రంథాల్లో దేన్ని చూసినా తెలుస్తుంది. క్రియారూపాల బహువచనాన్నీ నామవాచకాల మహదేకవచన రూపాన్నీ (వాడు—అనేది) పోల్చి ప్రాచీనతా నిరూపణం చేయటం ఎంతశాస్త్రీయమో తెలియదు.

వర్ణవ్యత్యయ విషయంలో ఆచార్యోక్తి ఆశ్చర్య కరం. 'బ్రలు, గ్రొలు' మొదలైనచోట్ల భిన్న వర్ణాలు వ్యత్యస్తమైనా 'పిల్లులు, కుక్కలు'లో కాలేదని వారు గుర్తించారు! పిల్లుల విషయంలో భిన్న వర్ణాలే లేవు; కుక్కలు మారకపోవటానికి కారణం ఆ శబ్దంలో రేఫలకారాలు లేకపోవటం. ఇటువంటిదే 'ఇచ్చిరి'అనేగాని 'ఇచ్చ్రను' అనే రూపం శాసనాల్లో లేదనేది. అంతమాత్రాన వ్యవహారబలం తగ్గదు; పూర్వరూప పునర్నిర్మాణానికి ఇబ్బందిరాదు. వ్యవహారం లోని రూపాలన్నీ శాసనాల్లోనో కావ్యాల్లోనో దొరక్క పోవచ్చు.

అన్యవిషయాల్లో ఒకటిరెండుమాత్రం రేఖా మాత్రంగా ప్రస్తావించి వారు చేసిన వ్యక్తిగతప్రసంగా లను పూర్తిగా విస్మరిస్తాను.

వ్యవహారఖండికలకు లఘువ్యాఖ్యలు రాసింది సంపాదకుడుకాదు— శ్రీ పి. సి. నరసింహా రెడ్డి. విషయ సూచికలోనే ఈ విషయం తెలుస్తుంది.

ప్రామాణికతా విషయంలో చర్చకు 'మహతి' లోని 'భాష—ప్రామాణికత'అనే వ్యాసాన్నిగాని, ఈ వ్యాసకర్త రాసిన 'వ్యావహారికభాషా వికాసం'లోని 106—124 పేజీలనుగాని చూడవచ్చు.

ఆచార్యులవారు రాజకీయవేత్తల ఏకతాదృష్టిని నిష్కారణంగా ప్రస్తావించి శాస్త్రదృష్టికీ దానికీ భేద ముందని తామే అన్నారు. అసలీ ప్రసంగం రాకుంటే బాగుండేది.

మొత్తం భారతదేశంలోనే ప్రప్రథమంగా పెద్ద ఎత్తున తలపెట్టి మేం చేస్తున్న సామాజిక భాషా పరి శీలనలో మా ప్రథమ ప్రచురణ మొదటిమెట్టు. సాను భూతితో శాస్త్రదృష్టితో మా కార్యక్రమాన్ని పరిశీ లించి ప్రోత్సహిస్తారని ఆశిస్తున్నాం.



# మెకంజీ కైఫీయతులో శతృ సంహార శతకకారుని ప్రస్తావన

డా. కాళిదాసు పురుషోత్తం

పలువురు పరిశోధకుల దృష్టిని ఆకర్షించి ఉత్తమ శతకంగా పేరుపొందిన 'శతృ సంహార శతకం' అంతా బయటపడకపోవడం శోచనీయం. దీనితోపాటు ఈ శతకకర్తృత్వమూ ఈ కవికాలమూ ఇంకా ఇదమిద్ధంగానే ఉన్నాయి. 'తిరుపతివాడు కనుకా, వెంకటాచలశతకం వ్రాశాడు కాబట్టే తిరుపతి వెంకటాచలం' అని అసలుపేరు తెలిసేదాకా వాడుకొనేందుకు వీలుగా ఈ శతకకారునికి నామకరణం చేశారు శ్రీ ఆరుద్ర తన 'సమగ్రాంధ్ర సాహిత్యం' 12 వ సంపుటంలో. 'శతృ సంహార వెంకటాచల విహార' అనే మకుటం కలిగిన ఈ శతకంలో తానుచూచిన వ్రాతప్రతుల్లో కొనామొదలూ లేకుండా 99 పద్యాలు కన్పించినట్లు శ్రీ వంగూరు సుబ్బారావుగారు తమ 'శతక కవుల చరిత్ర'లో పేర్కొన్నారు. వంగూరు సుబ్బారావుగారు చూచినట్లు పేర్కొన్న వ్రాతప్రతు లెక్కడివో కాని మదరాసు ప్రాచ్యలిఖితగ్రంథాలయం (G. O. M. L.) లోని ప్రతికూడా అసమగ్రంగానే ఉంది.

ఈ శతకంగూర్చి మదరాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయంలో ఈ క్రింది వివరణ కనపడుతున్నది. 'వి. వి. అసమగ్రము. 29 పద్యము లున్నవి. వ్రాత తిన్నదేకానీ తప్పులు హెచ్చు. శైథిల్యము గ్రంథ పాతములు గలవు. 'శతృసంహార వెంకటాచలవిహార' అను మకుటముగల ఈ ప్రశస్త సీసపద్య శతకము ఔరంగజేబు పాదుషా యాంధ్రదేశమువిూద దండెత్తి వచ్చి తిరుపతి ముట్టడి జరుపనున్న సందర్భమున నెవరోకవి తిరుపతి వెంకటేశ్వరస్వామి నా యాపద బాపవలసినదిగా నిందాస్తుతి రూపమున జేసిన ప్రార్థన మిందలి విషయము. ఇది చరిత్రోపయుక్తమగు గ్రంథము.' (చూ: తెలుగు వ్రాతప్రతులకు వివరణ పూర్వకమైన క్యాటలాగు, వాల్యూము 7, శతకాలు– నెం, 1467—1883, పేజీ 1964 నెం. 1710. వెంకటాచల విహారశతకం.)

శ్రీ ఆరుద్ర ఏ ఆధారాలతో శతృసంహారశతక కర్త తిరుపతివాడని అన్నారో తెలియదు. అంతేగాక ఈ క్రిందిమాటలుకూడా వ్రాశారు: 'గోగులపాటి కూర్మనాథం వ్రాసిన సింహాద్రినారసింహశతకానికీ, దీనికీ చాలా పోలికలు ఉన్నాయి. ఈ ఇద్దరిలో ఎవరో ఒకరు గ్రంథచౌర్యం చేశారని వంగూరు సుబ్బారావు గారు ఆరోపిస్తున్నారు.'

ప్రస్తుతానికి ఈ గొడవలు అట్లాఉంచి, ఈ క్రింది మెకంజీ కైఫీయత్ చదివితే అసలు విషయం విస్పష్టంగా బట్టబయలవుతుంది.

'నల్లకాల్వ వరకవి వెంకటరామన్న—భీమవరం అగ్రహారీకుడు వ్రాయించియిచ్చిన కైఫీయతు.

'శ్రీముఖనామ సంవత్సర చైత్రనెల 6 తేది వెంకటగిరిశీమలో చేరిన భీమవరం అగ్రహారీకులైన నల్లకాల్వ వరకవి వెంకటరామన్న వ్రాసియిచ్చిన వైనం. మీ గ్రామాన్కువుండే దానపత్రం తెమ్మని చెప్పితిరి గనుక ఆ గ్రామానకువుండే దానపత్రం బహదరు అవాంతరంలో పోయింది. పూర్వం మా కూటస్తుడైన నల్లగాల్వ వరకవి అయ్యప్ప వంటిమిట్ట రఘునాథ స్వామివారిదగ్గర వరం సంపాదించుకొని గొబ్బూరి జగ్గరాజు, వోబరాజుగారిమీద కృతులు చెప్పి పాలికి మొదలయిన బహుమతులు తీసుకొని వెంకట్రాయల

వారి కచ్చేరీలో విద్యాప్రకటనంచేసి దుష్కవుల గర్వ భంగ మొనరించి సంగీత సాహిత్యములచేత మెప్పించి, యీ అగ్రహారం దానపత్రంతోకూడా వారిచాత సంపాదించుకొని అనుభవిస్తూ వచ్చెను. వారి కొమారుడు శత్రుసంహారశతకంచెప్పి, శేషాచలస్వామిచేతను,వరం తీసుకున్న సీతాపతి. ఆయన కొమారుడు గోలకొండరాజును మెప్పించి, గోలకొండలో జయస్తంభం వేశిన కొండప్ప. ఆయన కొమారుడు కువలయానందం తెనుగించిన లింగప్ప. ఆయన కొమారుడు పార్వతీ పరిణయం చెప్పిన సీతారామప్ప. ఆయన కొమారుడు వెంకట్రామన్న. సదరు వ్రాశిన పురుషులు పారంపర్యంగా అనుభవిస్తూ వున్నాము. యిది వైనం.'

(చూ: లోకల్ రికార్ట్స్, వాల్యూము 36, పేజీ 16.)

ఈ కైఫీయతు పుణ్యంగా పండితుల సందేహ నివృత్తి కావలసిఉన్నది. ఈ శతకకర్త నెల్లూరు మండలీయుడూ, వెంకటగిరి సంస్థానాశ్రితుడూ, భీమవరం (వెంకటగిరి తాలూకా) అగ్రహారీకుడూ అయిన నల్లకాల్వ వరకవి సీతాపతి. ఇతడు క్రీ. శ. 1620–1670 ప్రాంతంవాడు. ఇతడి తండ్రి నల్లకాల్వ వరకవి అయ్యప్ప ఆరవేటి రెండవ వెంకటపతి రాయలను (ఇతడు క్రీ. శ. 1614 లో మరణించాడు) సంగీత సాహిత్యాలలో మెప్పించి, భీమవరం అగ్రహారాన్ని సంపాదించుకొన్నాడు. ఆ తర్వాత కాలంలో భీమవరం అగ్రహారం వెంకటగిరి సంస్థానం పాలనక్రిందకు రావడంవల్ల నల్లకాల్వ వరకవి కుటుంబంవారు వెంకటగిరి సంస్థానాశ్రితులయ్యారు. ఇదీ కథ.

ఇక, ఈ కైఫీయతుప్రకారం సీతాపతిముందు వెనుకతరాల వారంతా అంతో ఇంతో కవిత్వంచెప్పడం నేర్చినవాళ్లే. ఇందులో కన్పించే 'కువలయానందం' గానీ 'పార్వతీపరిణయం'గానీ ఎక్కడా కనుతగుల లేదు. సీతాపతితండ్రి అయ్యప్ప రెండవ వెంకటపతి కడ మాత్రమేగాక గొబ్బూరు జగ్గరాజు, వోబరాజుల పైకూడా కవిత చెప్పినట్లు స్పష్టమవుతున్నది. గొబ్బూరు జగ్గరాజు విజయనగర సామ్రాజ్య చరిత్రలో ఒక ప్రసిద్ధవ్యక్తి. వెలుగోటి యాచమూరుడు ఈయనను చంపి విజయనగరరాజ్యానికి రామదేవ రాయలను అధిపతిగా చేశాడు.

ఈ కైఫీయతును శంకించాల్సిన అవసరం ఏమీ కనపడడంలేదు. మెకంజీ సేకరించిన వెంకటగిరి శాసనాలూ, కైఫీయతులలోని మతలబులూ వెంకటగిరి వారు వ్రాయించుకున్న వంశచరిత్రలతో సంపూర్ణంగా ఏకీభవిస్తున్నాయి. క్రీ. శ. 1813 ప్రాంతాల్లో సుమారు ఏడాదిపాటు కల్నల్ మెకంజీదొర గుమాస్తా నారాయణరావు తదితరులు వెంకటగిరి సంస్థానానికి సంబంధించిన కైఫీయతలూ, శాసనాలూ, తాళపత్రాలూ సేకరించుకొన్నారు. అనాటి సంస్థానాధీశుడు బంగారు యాచమనాయని (26 తరంవాడు) ఆజ్ఞప్రకారం మెకంజీదొర వ్రాయసగాళ్లు నకళ్లు తీసుకొనేందుగ్గా తమ తమ అనుభవంలో ఉండిన గ్రామాలకు సంబంధించిన దానపత్రాలను, శాసనాలను, ఇతర వివరాలనూ అమరందార్లూ అగ్రహారీకులూ మొదలైనవారంతా సమర్పించుకొన్నారు. దానపత్రాలు పోగొట్టుకొన్నవాళ్లు తమ అనుభవంలోకి ఆయా భూములు ఎట్లావచ్చాయో చరిత్రసంతా వివరంగా వ్రాసి ఇచ్చారు. ఇట్లా ఆనాడు మెకంజీదొర సేకరించిన శాసనాలు దానపత్రాలూ 'మెకంజీ సంచయం' పేర మద్రాసు జి. ఓ. ఎం. ఎల్. లో భద్రంగా ఉన్నాయి.

ఈ కైఫీయతులు ఎంత కచ్చితంగా ఉంటాయో ఒక చిన్న ఉదాహరణ. వెంకటగిరి సంస్థానాధీశులలో 23 వ వాడైన విద్వత్కుమార యాచమనాయుడు జన్మించిన కాలాన్ని వెంకటగిరివారు వ్రాయించిన పుస్తకాలన్నిట్లో గ్రంథస్థం చేయబడి ఉందికానీ ఆయన మరణకాలాన్ని అంతే కచ్చితంగా పై గ్రంథాలేవీ పేర్కొనలేదు. అయితే ఈతని మరణాన్ని ఆనందరంగ పిళ్లై దినచర్యల గ్రంథమూ, వెంకటగిరి కైఫీయతూ ఒకే విధంగా రికార్డుచేశాయి.

పోతే, ఈ కైఫీయతును మరికొన్ని కోణాల నుండి పరిశీలిద్దాం. దీనిప్రకారం నల్లకాల్వ వరకవి అయ్యప్ప, గొబ్బూరిజగ్గరాజుకూ విజయనగర రాజ్యాధిపతి రెండవ వెంకటపతిరాయలకూ సమకాలికుడని తెలుస్తున్నది. దీన్నిబట్టి ఈ అయ్యప్ప కుమారుడు, మన శత్రుసంహారశతకకర్త అయిన సీతాపతి సుమారు 1620–1670 ప్రాంతాలలో జీవించి ఉంటాడని ఊహించవచ్చు. ఇంతకంటే, ఈ శతకంలోని కొన్ని పద్యాలనుబట్టి ఇంకొన్ని నూటిగా

ఈ శతకరచనకాలాన్ని గుర్తించడానికి వీలవుతుందో లేదో చూడాలి.

'ఈ శతకము తుఱక ఔరంగజేబు కాలము నందు క్రీ. శ. 17 వ శతాబ్ద మధ్యమున 1670 ప్రాంతముల చిత్తూరు, నెల్లూరు మండలముల దోపిడిచేసిన కాలమునందుఁ బుట్టినది', అని వంగూరు సుబ్బారావుగారూ, 'ఔరంగజేబు సైన్యాలు దక్షిణాన పూనమల్లిదాకా వచ్చాయి. ఆ దండయాత్రలో దిగువతిరుపతినికూడా కొల్లగొట్టారు. అప్పుడు ఎవరో కవి 'శత్రుసంహార వెంకటాచల విహార'అనే మకుటంతో శతకం వ్రాశాడు',అని సంప్రదాయాన్నీ గ్రంథస్థ విషయాలనూ ఆధారంచేసుకొని శ్రీ ఆరుద్రా వ్రాశారు.

కాని ఈ శతకంలో పేర్కొనబడిన తురుష్క దండయాత్రలు ఔరంగజేబువిగాక గోల్కొండవారివిగా కనిపిస్తున్నాయి. ఈ క్రింది పద్యాన్ని ఒకమాటు పరిశీలించుదాం :

'సీ. అవిగో నిరంతరోద్యదాన ధారాళ
ధారాళ గోద్దండ దంతి ఘటలు
అవిగో అసంఖ్యాక పవమాన జవమాన
ధాటికా ఘోటికోద్ధత రజంబు
అవిగో నిరాఘాట హాటకధ్వజపట్ట
పటపటత్కార ఝంపామరుత్తు
లవిగో భటోదటాద్యంత భీకర కరా
ళి కృపాణ కర్ష స్ఫులింగ పంక్తు
లనుచు సురతాని యబ్దుల గననె మోవి
గుంట, కావలి, జలదంకి, కొడవలూరు
గండవరములు మునుమున్నె కలవరించె
శత్రుసంహార వెంకటాచల విహార!'

'సురతాని యబ్దుల గననె......మున్నె కలవరించె'అనే పాదాలనుబట్టి దండయాత్ర చేసింది 'సుల్తాన్ అబ్దుల్'అని తెలుస్తున్నది. ఎవరీ సుల్తాన్? ఔరంగజేబుమాత్రంకాదు, గోలకొండ సుల్తానా? ఇక ఈ పద్యంలో పేర్కొనబడిన మోవిగుంట, కావలి, జలదంకి, కొడవలూరు, గండవరము మొదలైన గ్రామాలు నెల్లూరుకు దగ్గర దగ్గర్లో ఉత్తరంగా ఉన్న ఊళ్లు, ఇట్లా గ్రామాలతో పరిచయంగల కవే ఈ శతకకర్త అయిఉండాలి.

అంతేగాక మరొకచోట—

'సీకాయపొదలు క్రొంజెమట మాగుడు బొంద
ళాలంటి వ్రేలిన వ్రేలుఁగాని
గందంపుఁదరుల గల్గదుర నెత్తురు పచ్చి
తోళ్లంటి తూలినఁ దూలుగాని
పావనతీర్థము ల్పలలఖండంపు జిడ్డు
చమురంటి దుమికిన దుముకుగాని
మణిశిలామార్గము ల్మస్తిష్క జంబాల
ఝురులంటి జాఱిన జాఱుఁగాని
జీర్ణ కర్ణాటలక్ష్మి రక్షింపలేవె!
చెండి రౌతుల దిర్మలకొండనెత్త
మెంత గొల్లైన మది నసహ్యించుకొనక
శత్రుసంహార వెంకటాచల విహార!'

తురుష్కుల దండయాత్రలనుండి 'జీర్ణకర్ణాట లక్ష్మిని' రక్షింపమని వెంకటేశ్వరుణ్ణి వేడుకుంటాడు. కర్ణాటక సామ్రాజ్యం నామమాత్రంగానైనా అప్పటికి ఉందనే అనుకోవాలి. విజయనగర సామ్రాజ్యం 3 వ రంగరాయనితో అంతం అయింది. ఇతని కాలంలోనే గొల్కొండ, బహమనీ సుల్తానులు పలుపర్యాయాలు దండయాత్రలుచేసి కర్ణాటక సామ్రాజ్యాన్ని నామరూపాలు లేకుండా చేశారు.

ఇ దట్లాఉంచి 'సురతాని యబ్దులగననె మోవిగుంట, కావలి, జలదంకి, కొడవలూరు, గండవరములు మునుమున్నె కలవరించె...' అనే పాదాలనుబట్టి సుల్తాను సైన్యాలు కావలి, జల్దంకి మొదలైన ప్రదేశాలను కలవరపెట్టినట్లు స్పష్టమవుతున్నది. దీన్ని క్రీ. శ. 1642 లో మూడవ శ్రీరంగరాయలు సింహాసన మధిష్టించిన వెనువెంటనే జరిగిన గొల్కొండవారి దండయాత్రగా పరిగణించవచ్చు. ఈ సందర్భంలో క్రీ. శ. 1642 — 1645 నడుమకాలంనాటి ఇంగ్లీషు ఫ్యాక్టరీల వివరాలను ప్రాచీన పత్రాలనుండి విలియమ్ ఫాస్టర్ అనే ఆయన 'The English Factories in India 1642—1645: A Calender of documents in the India office, West Minister' అనే గ్రంథంగా ఏర్చికూర్చారు. ఇందులో క్రీ. శ. 1642 లో కర్ణాటక సామ్రాజ్యంపై గోల్కొండ

వారు దండు నడుపుతూ నెల్లూరు మండలంలో జల్దంకి, కావలి అనే రెండుచోట్ల సైన్యాన్ని నిలిపినట్లు ఒక పత్రం వివరిస్తున్నది:

'The Naique of Armogan is absolutely beaten out of all his Country, it being possest part by the King of GOLQUONDAH(S) people and the major part by Raylawar. The Moores have encamped themselves, or rather seated themselves for the War, at a place called COWLE [KAVALI—కావలి] Galdancke [జల్దంకి] the chiefest place in all that Country; and Raylwar hath a strong garison in VINQUATAGERY and Armagan. Indeed we are of opinion that the moors will have all this Country ere many years; for what with the Kinge/of VIZAPORE (Bijapur) on one side and the Kinge of GOLQUONDAH on the other, the gentus themselves being divided among themselves, it is even impossible their Country cann continue...'

ఈ విలియం ఫాస్టర్ (సి. ఐ. ఇ.) వ్రాసిన ఈ గ్రంథాన్ని ఆక్స్‌ఫర్డ్ క్లారెండన్ ప్రెస్ 1913 లో ముద్రించినది. దీనినిబట్టి ఆర్మోగాన్ ప్రభువు తన దేశంనుండి పారద్రోలబడినట్లు, ఆ దేశాన్ని కొంత గోల్కొండవారు, అధికభాగం రాయలవారు ఆక్రమించుకొన్నట్లు అర్థమవుతున్నది. అట్లనే రాయలవారి దేశాన్ని ఒకవైపునుండి బిజాపురంవారు, మరో దిక్కునుండి గోల్కొండవారు ఆక్రమించుకొన్నట్లు, ఈ ఆక్రమణలో గోల్కొండ సైన్యాలు కావలి, జల్దంకి అనే ముఖ్య ప్రదేశంలో విడిసి యుద్ధానికి సన్నద్ధమై ఉన్నట్లు తెలుస్తున్నది. రాయలవారు వెంకటగిరిలో సైన్యం నిలిపినట్లుకూడా పై వ్రాత చెబుతున్నది. క్రీ. శ. 1643 కల్లా గోల్కొండసేనలు వెంకటగిరిని వశపరుచుకొని ముందుకు నడిచినట్లు పై గ్రంథంలోనే వేరొక చోట పేర్కొనబడినది. వెంకటగిరిని ఆక్రమించిన గోల్కొండసేనలు దిగువ తిరుపతిదాకా సాగిఉన్నా ఆశ్చర్యపడ నక్కర్లేదు. సీతాపతి ఈ కాలంలో గోల్కొండ తురుష్క సేనలు చేసిన అత్యాచారాలను మనసులో ఉంచుకొని ఈ 'శత్రుసంహార వెంకటాచల విహార' శతకాన్ని రచించాడు. కనుక ఈ రచనా కాలం క్రీ. శ. 1640—45 ప్రాంతమని స్థూలంగా తేల్చవచ్చు.

ఇకపోతే ఆఖరుగా అంతగా సందర్భం గాక పోయినా పైన ఉదహరించిన మెకంజీ కైఫీయతులో 'బహదరు అవాంతరం' ప్రసక్తి వచ్చిందిగనుక దీనికి సంబంధించిన విశేషాలు వివరించవలసిఉంది. క్రీ. శ. 1782 లో హైదరాలీకి అర్కాటునవాబుకు మధ్య యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో తనకు సహాయంగా రావలసిందని వెంకటగిరి, కాళహస్తి, కార్వేటినగరం వాళ్లను హైదరాలీ కోరాడు. కానీ వెంకటగిరి, కాళహస్తి వారు సైన్యాలతో మద్రాసు ప్రాంతాలకువెళ్లి కంపెనీ సైన్యంతో కలిశారు. అయితే కాళహస్తివారు మాత్రం హైదరాలీకి బాసటగా నిలిచారు. తనమాట లెక్క పెట్టలేదన్న కడుపుమంటతో హైదరాలీ వెంకటగిరి, కార్వేటినగరాలను, ఆ సంస్థానం గ్రామాలను కొల్లగొట్టి తగులబెట్టించాడు. రాణివాసం, ఖజానా, ముఖ్యమైన పత్రాలు కొండమీది దుర్గంలో ఉండబట్టి రక్షింపబడ్డాయి. వెంకటగిరిపట్నం బాడిదైంది. ఆ తర్వాత వేంకటగిరిరాజా కుమార యాచమనాయుడు (25 వ తరం) వెంకటగిరిని మొత్తం పునర్నిర్మించాడు. ఆ నాటి హైదరాలీ 'దాడుగుర్రాలు' చేసిన భీభత్సాన్ని ఈ మెకంజీ కైఫీయతులు కొన్ని 'ప్రెస్ రిపోర్ట్సు' లాగా వివరిస్తాయి.

కీ॥ శే॥ పరవస్తు రంగాచార్యులవారి పూర్వీకులు మొదట్లో వెంకటగిరి సంస్థానాశ్రితులై, అగ్రహారా న్ననుభవిస్తూఉండి 'బహదరు అవాంతరంలో' ప్రాణాలు కాపాడుకోడానికై సంస్థానం విడిచి, ఎక్కడో విశాఖ ప్రాంతాల్లో చివరకు స్థిరపడ్డట్లు 'లఘుశబ్దార్థ సర్వస్వము' (ఆర్ష ప్రెస్, విశాఖపట్నం, 1877) గ్రంథావతారికలో పరవస్తు రంగాచార్యులుగారు వ్రాశారు.

'శత్రుసంహార శతకం' తాలూకు సాహిత్యపు సొబగులు గూర్చి చెప్పవలసింది చాలానేఉన్నా దాని రచనతో పెనవేసుకున్న అనేకానేక విషయాల శాఖా చంక్రమణం చేయవలసివచ్చింది. తప్పదుమరి సాహిత్యంలోనుండి చరిత్ర అరణ్యంలోకి జారబడవలసివస్తే,

# వళి వ్యుత్పత్తి విచారము

## శ్రీ బండి నాగరాజు

భారతి (జూన్'72)—కలగూరగంప—లోని 'వడి : శబ్దార్థ విచారము'పై నేనీ యభిప్రాయము ప్రకటించుటకు మనసుపడితిని.

తమిళభాషలో 'వళి (వழி)' అంటే మార్గము, దారి అని యర్థము. తమిళములోని ఈ ళ (ழ)కారము తరువాత తెలుగులో ల—ళ—డ—అ లు గా మారినది. (తమిళమునందలి ళ కారమునకు సన్నిహితోచ్చారణము గలదిగా నుండిన కారణమున శకటరేఫము, చాల కాలము దాక రకారముతో వళిమైత్రి పొందియుండ లేదు. ఒకప్పుడు వీటికి ఉచ్చారణలో చాలభేదముండిన దనవలెను.) మన ప్రాచీన శాసనాలలో ఈ యక్షరము శకటరేఫమువంటి రూపముతోనే (నడుమనుండు అడ్డుగీత లేకుండ—ఱ) వాడబడినది. వళి, వడి తమిళమునుండి వచ్చిన మాటలు. వళి సంస్కృతము కాదు, వడి దానికి వైకృతమును గాదు; ఇవి రెండును తమిళమునుండి వాడుకపడిన దేశ్యములు మాత్రమే.

పద్యముయొక్క నడక (మట్టు)ను చూపు మార్గము వళి, వడి. గణబంధమునుబట్టి పద్యగతి యున్నను, వళినిబట్టి పద్యగమన మార్గము నిర్ధారిత మగుచున్నది. ఈ విషయమును క్లుప్తముగా పరిశీలింతము—

కొందరు కవులు కొన్ని పద్యములకు వళిస్థానములనుమార్చి యున్నారు. అట్టి మార్పులను గమనించి నప్పుడు పద్యగమనములో భేదమేర్పడుటను గ్రహింపగలము.ఇట్టి గమన భేదమును చూపు మార్గము, వళి.

వనజ వైరియుఁగూడి+వైభవ మొనర్ప.

ఇది అంతరాక్కర పద్యపాదము. మూడవ గణము చివరి యక్షరమున వళి నిలుచును. ఇప్పుడు దీని నడక కర్ణాట చతుష్పద (లేక ద్విపద)వలె నున్నది. దీనికే విన్నకోట పెద్దన నియమము ప్రకారము నాల్గవ గణారంభమున వళి గ్రహించినచో ఇదే పద్యము తేటగీతి నడక నడచును. చూడుడు—

వనజ వైరియుఁగూడి వై+భవ మొనర్ప.

కాబట్టి వళి యన్నది పద్యపు నడకకు మార్గమగుచున్నది.

నన్నయ విశ్వనాథ తుమ్మల మొదలగువారు మధ్యాక్కరకు ఐదవ గణారంభమున వళి నిల్పిరి. శాసనాలలోను ఇట్లే యున్నది. అందువలన వాటి నడక వేరుగా నున్నది. తుమ్మలవారి మధ్యాక్కర చూడుడు—

అఖిల ధర్మంబుల మిక్కిలి యనుట
　　కర్థమ్ము నిజము
నిఖిలపాపములఁ బెద్దయవఁదగిన ద
　　నృత వచనంబు
సుఖమిందు నందును గుడుచువారలు
　　సూనృత వ్రతులె
మఖములెన్నే నొక్క నిక్కమునకు స
　　మానమ్ము కావు.

మరి యెఱ్ఱాప్రెగ్గడ శ్రీ ఆరుద్ర మొదలగువారు నాల్గవ గణారంభమున వళి విల్పినందున వీటి నడక మరియొక తీరుగా నున్నది. ఉదాహరణకు మదీయము కటాక్షింపగోరెదను—

క్యూలోన నిలఁబడి వచ్చి
　　యొప్పుగా నిసుఁ జూత మన్న

కాల ధర్మము ముంద యగునొ?
కడకు నీ దర్శనమె యగునొ!
ఆలోచన మొనర్ప వలవ
దడ్డ దారినిబట్టిపోయి
లీలఁగా దర్శింప వచ్చు
లే! వేంకటేశ్వరా, స్వామి!

కాబట్టి వళి (వడి) యన్నది పద్యగమనమును చూపెట్టు మార్గమగుచున్నది. ఈ విధముగా నిది సార్థకమై వ్యుత్పత్తి సహమగుచున్నది.

మార్గము అనుటకు తెలుగున నున్న దారి, తెన్ను వదలి వళినే యేల గ్రహింపవలసి వచ్చినదని వితర్కించుట సరికాదు. దేశ్యపదము లెన్నో—మాట్లాడితే అన్నియును—మూల ద్రావిడము, తమిళము, కన్నడములనుండి రూపాంతరము పొంది వచ్చినవే. ఒక వేళ 'తెన్ను' అను మాటను (వళికి బదులు) లాక్షణికులు స్వీకరించి యుండిన, 'దారి' నెందుకు గ్రహింప గూడదని ప్రశ్నింతురు గద! మనకు స్థితగతి చింత నమే ముఖ్యము. కవిజనాశ్రయకారుని కాలము నాటికే వళి యనుమాట వాడుకలోనికి వచ్చియుండినది. ఆనాడుండిన 'మార్గము' అను నర్థము ఆ పదమున కిప్పుడు మనము లక్షింపక పోవచ్చును. అక్షరమైత్రినే గ్రహింపవచ్చును. కాని దాని వ్యుత్పత్త్యర్థము మాత్రము మార్గ మనియే.

చారిత్రకముగా వళి మొదటి రూపము; దీని రూపాంతరము వడి. తమిళమందలి వళి, తెలుగున వళిగా సిద్ధించి వడిగా మారినదే చరిత్ర సమ్మతము. వేగము ఇత్యాదిగా అర్థమిచ్చువడి, వళిగా రూపాంతరము పెందినదనుట సహజ పరిణామ సన్నిహితము కాదు.

అళుత్తు—అద్దు; తాళవన్—ఈడిగ; ఊళియవ్—ఊడిగము; ఏళు—ఏడు; కోళి—కోడి ఇత్యాదిగా తమిళ పదములు తెలుగున రూపాంతరము పొందినవి. ళకారరూపము ప్రాచీనము; డకారరూపము అర్వాచీనము.

ఈ సందర్భముగా మరియొక సంగతి ప్రస్తావింతును. కవి జనాశ్రయకారుడు, తెలుగు పద్యము లందు వళినేకాక విశ్రమమును (సంస్కృత మర్యాదానుసారమైన యతిని, విచ్ఛేదమును) గూడ నియమించినాడు. కాని యిది యెవరికిని—అసలు చెప్పిన కవి జనాశ్రయ కారునకేగూడ—కాబట్టక పోయినది. (సుమతి శతకము, వేమన పద్యములు చాలవరకు నిందుకు అపవాదము.) రేచన నియమము చూడుడు—

అనుపమ మగు నిగ్గణముల
వినుత శ్రుతి సుభగ లలిత వృత్తంబులు ము
న్నొనరింతు వానిపై వ
ళ్లను ప్రాలును విశ్రమంబులుం దెలియంగన్.
(సంజ్ఞ—25.)

వెలయ నిటఁ బట్టి వళు లిడ
వలయును విశ్రమము నిలుప వలయును గబ్బం
బులఁ గావున నే నెయ్యెడ
నిలిపితి నయ్యెడ నెఱింగి నిలుపుఁడు వానిన్.
(యతిప్రకరణము—2)

ప్రాలు అనగా ప్రాసములు. (ఏక వచనము లేదు. నిత్య బహు వచనము.) ఇటే ప్రావళ్లు అనగా ప్రాస యతులు.

# ముంతాజ్ మహల్‌లోని 'పిచ్చివాని కథ'

## శ్రీ బి. భాస్కర చౌదరి

షాజహాను పాదుషా అపారసంపదను వెచ్చించి శ్మశానాన్నే స్వర్గంగా మార్చివేయగా కవిపాదుషా జాషువా భావసంపదను వెచ్చించి, ముంతాజు మహలును కవితామహలుగా తీర్చిదిద్దాడు. సామ్యవాద సిద్ధాంతమే పునాదిగా కల ఆధునిక సాహిత్య భవన నిర్మాతలు కొందరు షహన్‌షాను ఒక పిచ్చివాని క్రింద జమకట్టవచ్చు. భావుకులైన మరికొందరు షాజహానును ఒక రసోన్మాదిగా భావించి తాజ్‌మహలును ఒక పాలరాతి రసవత్ప్రబంధంగా అభివర్ణింపవచ్చు. వస్తువు ఒకటే అయినా దానిని అనేక దృక్కోణాలతో పరిశీలించి తమ అభిప్రాయాల్ని ప్రకటించే హక్కు నిరంకుశులైన కవులకు జన్మసిద్ధమైనదే. ఈ విషయంలో పేచీ లేదు. ముంతాజు మహలును కట్టించిన జహపనా పిచ్చివాడా? కాడా? అన్న అంశంకూడ ప్రకృతం చర్చనీయం కాదు. కాని ముంతాజు మహలులో కవి ప్రవేశపెట్టిన పిచ్చివాడెవడు? అన్నదే పరిశీలనార్హమైన విషయం. 'రసపోషణమున కిందొక పిచ్చివాని కథను ప్రవేశపెట్టక తప్పినదికాదు. దాని యుచితానుచితములను రసజ్ఞులు తేల్తురుగాక' అని రసజ్ఞులైన విమర్శకులకే ఈ విషయాన్ని వదలిపెట్టినట్లు కవి భూమికలో స్పష్టం చేశాడు. ఆ పిచ్చివాని కథలోని ఉచితానుచితాల్ని పరిశీలించడమే ఈ వ్యాసోద్దేశం. అందులోని ఔచితిని విమర్శించడానికి పూర్వం ఆ కథను క్లుప్తంగా పరామర్శించడం అవసరం.

షహన్‌షా షాజహాన్ బేగం సాహేబాకు నిర్మింప దలచిన సమాధికై పోటీకి సమాధి నమూనా బొమ్మలు చేయడానికి శిల్పకళా విఖ్యాత వాటికలలో చాటింపించినాడు. ఢిల్లీ రాజ్యంలో ఒక పిల్ల జమీదారుగిరి, పెక్కురతనాలు, వెల్లగజారోహణము, పల్లకి మొదలైన ధనకనక వస్తువాహనాల్ని ఇనాముగా ప్రకటింప చేశాడు. ఈ 'కనకపు పోటీకి', 'మనుజేశుని మెచ్చుకోలికి' తాపత్రయపడ్డ శిల్పులు ఎందరో దారుశిలా లోహ నిర్మితాలైన నమూనాలను వెలయింపజేశారు. ఆ మచ్చుబొమ్మల్లో షాజహాన్ 'మాటకందగరాని భావాన్ని' పుణికి పుచ్చుకున్నదే లేకపోయింది. పాదుషా మోము వెలవెలపోయింది.

సులతాను ఏలుబడిలోనే భార్యను పోగొట్టుకున్న దుఃఖంతో బ్రతుకే వల్లకాడుకాగా వల్లకాటిలోనే బ్రతికే హతాశుడు ఒకడు ఉండేవాడు. ఏ పూర్వజన్మ సుకృతం వల్లనో ఆ మందభాగ్యుని శిల్పకళాలక్ష్మి వరించింది. ఆ దీనుడు శ్మశానక్షోణిలోని బూదిని ముద్దలుచేసి అందమైన బొమ్మలను చేసేవాడు. గతించిన తన జీవితేశ్వరికి ప్రేమ చిహ్నంగా పసిడిరేకుల సమాధిని కటించాలను కొన్నాడు. దానికి తగ్గట్టుగా చితికినగుండెతో అతడు సృష్టించిన సమాధి మచ్చుబొమ్మల్లో ఒకటి 'శిల్పరమకు సిగమీది నగ'వలె అవతరించింది. ప్రేమ పొంగుతో లోకరీతిని తెలుసుకోలేని అతడు తిరిపానికి బయలుదేరాడు. ఇది చూసిన లోకులు మనస్సులలోనే నవ్వుకొన్నారు. అతడి నొక పిచ్చివాని క్రింద జమ కట్టారు.

షాజహాన్ చాటింపు విన్న ఒక శిల్పి పిచ్చివాడు సృజించిన సమాధి మచ్చుబొమ్మను చూసి చకితుడై దానిని చక్రవర్తి కొలువులోనికి తీసుకొనిపోయాడు. ఆ బొమ్మను చూసి తన మదిలోని ఊహే ఆ కృతి తాల్చినట్లుగా భావించిన జహాపనా పిచ్చివానిని దర్బారు లోనికి రప్పించాడు. తనతోబాటు సమావపాయిదాతో

గౌరవించి క్రొంబసిడి చేలాలలో పదివేల నిష్కాల్ని మూటకట్టి నజరానగా ఇచ్చాడు. ఇది కొందరికి కన్నెఱ్ఱచేసింది. పోటీలో పాల్గొన్న సాటికళాకారులు మచ్చరకించారు. సామాజికులు గుసగుసలు పోయారు. అప్పుడా నిఱుపేద రసజ్ఞుడైన పాదుషాకు తన కృతజ్ఞతలను ప్రకటించి, ఆసలు సంహరించుకొన్న తన వంటి అభాగ్యునకు పసిడినాణెములు అక్కరలేదని, ఆశ్రయహీనులైన కళాదాసులకే వాటిని పంచిపెట్టమని షహన్‌షాకే నజరానపెట్టి వెళ్లిపోయాడు. ప్రతిమవలె సభ నిశ్చేష్టితమైపోయింది. ఆ పిచ్చివాడు తన కోర్కెను ఈడేర్చడానికి రూపుతాల్చివచ్చిన హుదాయో లేక పయిగంబరో అని మొగలురాజు తన మనస్సులోనే అంజలి ఘటించి ఆ పసిడిరతనాల్ని పేదఫకీరులకు పంచిపెట్టాడు.

పాత్రోన్మీలనానికి కాని, రసపోషణకుకాని, కథాగతికికాని ఉపకరించే కల్పనలను ఉచితమైనవిగాను వానికి భంజకమైనవానిని అనుచితమైనవిగాను వర్గీకరింపవచ్చు. అనుచితకల్పనలు కావ్యశోభను మడియింపచేస్తాయి. ఉచితకల్పనలు దానిని ఇనుమడింపచేస్తాయి. చారిత్రకేతివృత్తాన్ని చిత్రించేటప్పుడు కూడ చారిత్రకసత్యం తల్లక్రిందులు కానంతవరకు ఈ కల్పనలకు చోటు ఉంటుంది. ఈ దృష్టితో పరిశీలించినట్లయితే తాజ్‌మహల్ నిర్మాణ సందర్భంలో మచ్చు సమాధిబొమ్మను వెలయింపచేసిన పిచ్చివానికథ చారిత్రక సత్యానికి విరోధమా? సన్నిహితమా? అన్న చర్చ అప్రస్తుతం. కారణం అది కావ్యంలో ప్రధాన కథతో మిళితం చేయబడిన ఒక ఉపకథ మాత్రమే. ప్రధాన కథలో చారిత్రకసత్యానికి వ్యాఘాతంలేదు. ఆ మాటకొస్తే ఏ కళాకారుని హృదయంలో తళుక్కుమన్న ఊహ తాజ్‌గా అవతరించిందో ఏ చరిత్రకారుడూ సర్వపండిత సమ్మతంగా విస్పష్టంగా తేల్చి చెప్పలేదు. ఈ విషయంలో ఎంతో అభిప్రాయభేదం ఉంది. దీనికితోడు అరబ్బీ పారశీక ఉర్దూ వ్రాతల్లో ఎన్నో కట్టుకథలు అల్లుకొనిపోయి ఉన్నాయి. జాషువా కల్పించిన కథకూడ ఆ కోవకు చెందినదే. ఐతే ఆ కట్టుకథల సృష్టికి, ఈ పిచ్చివాని కథాకల్పనకు హేతుభూతమైన భావదృక్పథంలో ఒక ప్రధాన భేదం ఉంది. ఈ సందర్భంలో Gordon Stowell గారు సంకలనంచేసిన The Book of Knowledge Vol. VII లో తాజ్‌మహల్ నిర్మాణానికి సంబంధించి ఒక పారశీక వ్రాతప్రతిని ఆధారంగా చేసుకొని ఉదాహరింపబడిన ఒక కట్టుకథను పేర్కొనడం సమంజసమౌతుంది.

A Story from a Persian manuscript tells how the plans were drawn from a dream which the empress had. She described the dream to her husband. He searched India for an architect who could draw plans from her description, but in vain. One day an old man came to the emperor and said "I can help you to obtain what you seek." To one of the architects at the court the old man offered a drug, saying "Drink!" Before the architect's bewildered eyes the monument was revealed in all its glory: feverishly he worked under the spell of the drug, until the plan was finished to its last detail. Then the architect fell back exhausted.

పైన పేర్కొన్నదా నివంటి పారశీక కట్టుకథలు తాజ్ నమూనాను వెలయింపచేసిన శిల్పి హృదయంలో జగచ్ఛిల్పి ఐన హుదా ప్రేరణ ఉన్నట్లు ఆ కథల కొక దివ్యతాస్పర్శ (Divine Touch) ను ఆపాదిస్తున్నవి. కాని మానవతావాది ఐన జాషువా కల్పించిన కథలో మానవతాదృష్టి (Humanitarian outlook) ఉంది. అగాథమైన మానవజీవితంలో మనం గుర్తింపవలసిన ఎన్నోవిలువల్ని లోతుల్ని అతడీ కథలో నిగూఢం చేశాడు. ఇదే పిచ్చివాని కథకు సంబంధించిన 'ఆత్మ'. బేగం సాహేబా వియోగంవల్ల పిచ్చివాడైపోయిన షాజహాన్ మానసికవ్యథను జ్వలింపచేయడానికి ప్రధాన కథతో పిచ్చివాని కథను నిపుణంగా సంయోజితం చేయడం, కావ్యంలో ప్రధానమైన కరుణరసం ఉద్దీపింప బడేటట్లు పిచ్చివాని కథను చిత్రించడం మొదలైన శారీరకవిశేషాలు ఈ కథలో లేకపోలేదు. కాని అవి అంత ప్రధానమైనవికావు. ఈ కథలోని 'ఆత్మ'మ

ఆవిష్కరించడమే ఈ వ్యాసంలోని ముఖ్యోద్దేశం. దానిని పరిశీలిద్దాం.

అనంతమైన సృష్టిలో ఒకభాగమైన మానవ జీవితంలోని ఒక లోతును, ఒక వైచిత్రిని ఈ కథ ప్రదర్శిస్తున్నది. దానిని దర్శించాలంటే కవి ఆంతర ప్రకృతిలోని ఒక విశేషాంశాన్ని మనం గుర్తించవలసి ఉంటుంది. లోకంలో అందరికీ చచ్చిన తర్వాతే వల్లకాటితో అనుబంధం ఏర్పడుతుంది. కాని జాషువాకు చిన్నప్పటినుంచే సమాధులతో పొత్తు కుదిరింది. ఈ గమ్మత్తును మనం 'నా కథ'లో చూడవచ్చు. శ్రీమతి హేమలతా లవణం వెలువరించిన 'మా నాన్నగారి మధుర స్మృతుల'నుబట్టి తెలుసుకోవచ్చు. అందుకేనేమో ఆయన కవితా పేటికలో శ్మశానవాటిక ఇమిడి పోయింది. ఆ సమాధుల సృష్టిలో తాను చూసిన వైచిత్రిని ఈ కథలో ఇమిడ్చాడు. పరేత భూమిలో స్వపర తర తమ భేదాలకు తావులేదంటారు. కాని ఇది నిజంకాదని కవి చాల చోట్ల చెప్పాడు. అతడు 'నా కథ'లో ఒక చోట వినుకొండలో 'పాలరా గచ్చు నిగ్గులతో' నేటికీ నిల్చియున్న తెల్లదొరలు శయనించిన సమాధులు 'నలుపుం దెల్పును రంగు భేదపు ఘరానా చచ్చియున్ జాక పేదల గోరీలను వెక్కిరించు గతి' ఉన్నాయని తెలిపాడు. 'శ్మశాన వాటి'లో 'ధనవంతుని నిద్దపు పాలఱాతి గోరీకడ పారవేయబడిన ఆకటి చిచ్చునన్ కుమిలి, ఆర్చి గతించిన పేదవానికై ఒక్కడు వగవడు. కాటినేలయు దాచదు' అని వాపోయాడు. ఆ భేదాలు చచ్చినా సమసి పోయేవి కావన్న నిజాన్ని పిచ్చివాని కథలోకూడ నిగూఢం చేశాడు. యమున గట్టునఉన్న ప్రేమ మహలుని ఇప్పటికీ పాదుషా ప్రేమరస వాహినులు ముంచెత్తుతూనే ఉన్నవి. కాని పిచ్చివానివంటి ఎంతమంది హతభాగ్యుల విశుద్ధ ప్రేమలు ఆ యమునానదీ తరంగాల్లో కొట్టుకొని పోయినవో ఆ నదీమ తల్లికే తెలియాలి. ఆ మందభాగ్యుల ప్రేమలకు ఆత్మ ఉంది. కాని శరీరం లేదు. ఇదే సృష్టిలోని వైవిధ్యం. మానవ జీవితంలోని లోతు. లేనివాళ్లు డబ్బులేకాని ప్రేమలకులేని వాళ్లుకారు. వారి ప్రేమలు, ఆశలు, ఆశయాలు కాలప్రవాహంలో కలిసిపోతాయి. ఈ సత్యాన్నే కవి ఈ కథలో నిపుణంగా నిబిడీకృతం చేశాడు.

సంకుచితమైన పరిధినుండి అనంతమైన పరిధిలోనికి తీసుకొని పోయేదే కళ. ఆ కళాజగత్తులో ఉచ్చనీచాలకు తావులేదు. కళాకారులందరిదీ ఒకేజాతి, ఒకే కులం, ఒకే మతం. పిచ్చివాని కథ మహత్తరమైన ఈ నిజాన్ని ఎలుగెత్తి చాటుతున్నది.

కులమత విద్వేషంబుల్
తల సూపని తావులే కళారాజ్యంబుల్
కళ లాయుష్మంతములై
యలరారెడు నెలవు స్వర్గమగు చెలికాడా

అని జాషువా ఒక చోట ఈ సత్యాన్నే మనల్ని భుజం తట్టి చెప్పాడు. కాని ఎందుకో 'అక్షర జ్ఞాన మల వడ్డ యంతమాత్ర విజ్ఞాన దీపకళిక తేజరిల్లని' సంకుచిత దృష్టి కలిగిన కొందరు కళాసౌధంలో కూడ అడ్డుగోడల్ని నిర్మిస్తున్నారు. ఎన్నో సందర్భాలలో తానా అడ్డుగోడలమధ్య ఉక్కిరి బిక్కిరైనట్లు మథనపడ్డాడు. అందుకేనేమో స్వేచ్ఛాగానం చేయలేని పరిస్థితులు ఎదురైనప్పుడు కవికోకిల 'నవనీతనిభమైన కవుల కమ్మనివాక్కు వెఱపు లేకావిర్భవించుచోటు' ఎక్కడయినాఉంటే తనకు చూపి పుణ్యం కట్టుకొమ్మని గబ్బిలంతో మొరపెట్టుకొన్నాడు. కాబట్టే తన స్వీయానుభవాన్ని మిళితంచేసి తన జీవితంలో ఎదురైన సన్నివేశాన్నే ఈ కథలో కల్పించాడు. పిచ్చివాడు కల్పించిన కళాఖండాన్ని చూసి సంకుచితదృష్టి కల్గిన మొగలు దర్బారులోని కొందరు కళాకారులు రాజు 'శ్వపచుని గౌరవించి అనల్పకల్పనా నిపుణులకు తలవంపులు తెచ్చినాడ'ని పరోక్షంలో ఈసడించారు. ఆ తిరస్కారానికి గురియైన పిచ్చివాని ఆత్మక్షోభ జాషువాదే అన్న నిజాన్ని మనం ఇక్కడ గుర్తించాలి. ఆ సందర్భంలో అతడు చెప్పిన ఈ పంక్తులు కళకు ఒక అర్థాన్నేకాదు పరమార్థాన్నే బోధిస్తున్నవి.

కళలు మోహించుటొక కులీనుల న కాదు
కులము లేదన్నవానినిగూడ వలచు
సత్కళా దేవతా కటాక్షంబు కతన
సమయు గావుత ముచ్చనీచతల బెడద.

ఆత్మానుభూతముకాని కళాకారుని సృష్టి దిష్టిబొమ్మవంటిది. ఈ కళామర్మాన్ని పిచ్చివానికథ విశదీకరిస్తున్నది. ఈ అంశాన్ని పరిశీలించడానికి పూర్వం కవి జీవితంలోని ఒక ఘటనను ఇక్కడ ప్రస్తావించడం అప్రస్తుతం కాబోదు. ఒకప్పుడొక పిల్లకవి జాషువా వ్రాసిన పద్యంలో 'వ్యాకరణ శాస్త్రసూత్రాను మతి' ననుసరించి లోపాలున్నవని ఎత్తిచూపాడట. అప్పుడు కవి నిందుకుండవలె తొణకక జల్లెడ పట్టినట్లయితే ప్రాచీన సాహిత్యంలోనే నిలువజాలిన కావ్యాల్ని వేళ్లమీద లెక్కించవలసిఉంటుందని, కావ్యశరీరం కంటె కావ్యాత్మే ముఖ్యమైనదని వర్ధిష్ణువైన పిల్లకవికి ఉపదేశం చేశాడు. ఆ సందర్భంలోనిదే ఈ క్రింది పద్యం

వర్ణిత పదార్థ మాత్మన్
జీర్ణము గావలయు వేయిచెప్పగనేలా
వర్ణిత వస్తువు తామై
పూర్ణంబుగ గరిగి మారిపోవలయు కవుల్

వర్ణ్యవస్తువుతో కవి తాదాత్మ్యాన్ని చెందాలి. అంటే కవిత్వం గొంతులోనుంచి కాక హృదయాంతరాళాల్లోనుంచి పుట్టుకొని రావాలి. అప్పుడే అది మనల్ని ఆ కట్టుకొంటుంది. ఈ విషయాన్నే పై పద్యంలో జాషువా పేర్కొన్నాడు. పోతన కవిత్వం మనల్ని పూర్తిగా వశపరచుకోవడంలో గల రహస్యం ఇదే. కవితాకళకే కాక శిల్పకళకు కూడ ఇదేసూత్రం అన్వయిస్తుంది. సులతాను ఎరగా చూపిన రతనముల మీది ఆసచే 'యతనముమీద' వెలయింపచేసిన శిల్ప ఖండాల్లో 'జీవకళకు' చోటు లేకపోయింది. తద్భిన్నంగా పిచ్చివాడి 'శిరస్సులోపల విహారము చేయు కళాధిదేవత యప్రతిహతమైన వాని విరహాగ్ని కరంగి సముజ్వలింపగా' సృష్టింపబడిన బొమ్మ 'శిల్పరమకు సిగమీది నగవోలె' అవతరించింది. ఈ విధంగా కవి ఈ కథలో సూక్ష్మతరమైన కళామర్మాన్ని తన కవిత్వంలో నెరసు లేరినవారికి సమాధానంగా నిగూఢం చేశాడు.

ఈ వ్యాసంలో ఇంతవరకు చర్చింపబడిన విశేషాంశాల్ని సమీక్షించడానికి పూర్వం 'ముంతాజ్ మహల్' కావ్యంలో కృతి సమర్పణానికి సంబంధించిన ఒక వైచిత్రిని పేర్కొనడం సంభావ్య మౌతుంది.

మొగలు పాదుషా తన జీవిత భాగస్వామిని బ్రతికి ఉన్నంత వరకు ఎండకన్నెరుగనీయక, కాలునేల మోపనీయక, కన్నుల్లో దాచుకొని, పువ్వుల్లో పెట్టి పూజించాడు. ఒక్కమాటలో చెప్పాలంటే అతడు భౌతిక సంపదలో ఆమె చనిపోయినా చావనీయకుండా చేశాడు. కవిపాదుషా 'నాడెమైన ప్రేముడి నవనాడులం దొణికి పొంగులు వార స్వకీయ రక్తమున్ పిడిచి' తనను కనిపెంచిన మాతృమూర్తికి 'బ్రతికి యుండ వాంఛితార్థముల్ తీర్చు శక్తిలేక దిగులు పడినాడు.' కాని ఆమె గతించిన తర్వాత తన భావసంపదను వెచ్చించి 'వేయునగలకన్న వెలగల్గు ఈ కృతిభూష'ను నిర్మించి ఎక్కడోఉన్న ఆమెకు పంపి కన్నతల్లి ఋణాన్ని తీర్చుకున్నాడు.

పై చర్చవలన తేలిన సారాంశం—ముంతాజ్ మహల్‌లోని పిచ్చివానికథకు ఒక అర్థం ఉన్నది. అదొక పరమార్థాన్ని బోధిస్తున్నది. ఒక కళామర్మాన్ని విశదీకరిస్తున్నది. కవి ఆత్మీయతను ఆవిష్కరిస్తున్నది. సృష్టి వైచిత్రిని నిరూపిస్తున్నది.

క్షమించాలి! ఇంతకూ ఆ పిచ్చివాడెవరో మనవి చేయనేలేదు. ఆ 'పిచ్చివాడే' జాషువా!

# 'ఆదేశ' శబ్దార్థ వివేచనము

శ్రీ ముదిగొండ ఈశ్వర చరణ్

చిన్నయ సూరీంద్రుడు బాలవ్యాకరణము రచియించెను. అది గోరంతదీపము. కాని దాని వెలుఁగు కొండంతది. పలువురు పండితులు పలురీతుల దానిని వ్యాఖ్యానించుట దాని ప్రాశస్త్యమునకుఁ బ్రతీక. అయినను అది యింకను వ్యాఖ్యానాపేక్షితమగుటకు దాని శైలీ గాంభీర్యము రచనాప్రౌఢి కారణములు. తద్రచనావసరమున నా మహనీయుఁడు దన యతులిత పాండితీవైభవమును, బహుముఖ ధీవైశద్యమును, పఠన పాఠనాదులందలి విశేషానుభవమును మిళిత మొనర్చి నాఁడు. అది యాతని యా జన్మ తపఃఫలము. ఆంధ్రావళి మోదముం బొరయవెలసిన మహనీయ కృతి. కావుననే యందలి ప్రత్యక్షరమును బరమ ప్రమాణమై విశేషార్థ ప్రతిపాదకమై యున్నది. ఆతఁడు నిగూఢముగా నిక్షేపించిన నిధి రహస్యముల మరలమరల వివేచించి వెలువరించవలసిన యగత్య మెంతయో కలదు.

ఇట్టివానిలో 'ఆదేశ' శబ్దార్థ మొక్కటి. 'ఆదేశ' శబ్దార్థ మెవ్వరెఱుంగరు? ఇంతటి స్వల్పవిషయమునుగూడ వివేచన మొనర్పవలయునా? యని యొప్పరికింపఁజనదు. 'ఇది వ్యాకరణము. పొల్లంత ఏమఱుపాటు చూపితిమా పొలిమేరలు దాఁటిపోవును. నలుసంత దాని కింతయేల యనుకొనరాదు. ఆ నలుసే వ్యాకరణమున కంటిలోని నలుసగునన్న 'రమణీయ' (పుట 80.) మిటు సమాదరణీయము. ఇట్లనియు 'రమణీయా'ది వ్యాఖ్యానము లిట్టి పలువిషయముల నేమఱినవి. ఇది యా పండితప్రవరుల నవజ్ఞ సేయుట కాదు. శాస్త్రార్థ వివేచనావసరమునఁ గలిగిన యొక నూత్నభావమును బ్రతిపాదించుట మాత్రమే! ఇందలి యౌగాములు విజ్ఞులు విమర్శింపవలసియే యుండును.

'శత్రువ దాగమన మాదేశః.' శత్రువు వలె యంతకుఁ బూర్వమున్న వర్ణమును దొలఁగించి మఱి యొకటి వచ్చి చేరుట యాదేశము. ఇది సామాన్యార్థము. చిన్నయసూరిగారు 'ఆగమంబనఁగా వర్ణాధిక్యంబు' (సంధి—3) 'సంశ్లేషంబనఁగా మీఁది హల్లుతోఁ గూడికొనుట' (సంధి—17) మున్నగు రీతిని పారిభాషిక పదముల యర్థముల రూపించియు పెక్కు తావుల మౌనము వహించినాఁడు. 'ఆదేశ' శబ్దార్థ విషయమున గూడ నింతియే జరిగినది. ఇట్టిపట్టుల నాయా శబ్దార్థముల గ్రహించుటకు, నాతని హృదయమును గుర్తించుటకు రచనా సంవిధానము, బ్రయోగ సరళి మున్నగువాని నాశ్రయించవలె.

బాలవ్యాకరణమున 465 సూత్రములు గలవు. వీనిలో కేవలము పదింట మాత్రము 'ఆదేశ' శబ్దము గ్రహింపఁబడినది. ఇట్లే ఆయా సూత్రముల కడ వ్రాయఁబడిన వివరణ వాక్యములందు, వార్త్తికములయందుఁ బదునాలుఁగు తావుల 'ఆదేశ' శబ్దము బ్రయుక్తమైనది.

[సూత్రములు:— సంధి—17; తత్సమ—35; 74; ఆచ్ఛిక—31; 38; కారక—35; క్రియ—57;77; 102; 105. వార్త్తికములు:— సంజ్ఞ—18; సంధి—1;30; తత్సమ—41; ఆచ్ఛిక: 15; 24; 28; సమాస—16; 21; క్రియ—8; 16; 71; 72; 90]

ఈయన్ని తావులయందుఁ బైని జెప్పుకొనిన సామాన్యార్థమునఁగాక శబ్దము విశేషార్థ ప్రతిపాదకముగా బ్రయోగింపఁబడినది,

తత్సమ పరిచ్ఛేదమున 'భగవంతుఁడు' 'భగవాను' డగుటను 'ఒకానొకచో మహత్త్వంబు నందు మతుప్ప్రకారంబున కానాదేశంబు విభాషనగు' (74) ననియు క్రియా పరిచ్ఛేదమున, 'ఉండినను' 'ఉన్నను' అగుట 'చేదాద్యర్థనాంతంబయిన యుండున కున్నా దేశంబు విభాషనగు' ననియు సూత్రీ కరింపఁబడినవి. ఇట 'భగవంతుఁడు' 'భగవానుఁడు' 'ఉండినను' 'ఉన్నను' అను రూపద్వయములకు నర్థ మొక్కటియే యగుట గమనార్హము.

ఇట్లే వార్త్తికముల యెడను.

సంజ్ఞా పరిచ్ఛేదమునఁ బదునెనిమిదవ సూత్రము కడ 'ఏళులు, పాళులు, త్రాళులని బహూత్వమందు రలడల కాదేశమయిన ళకార మలఘువు...అతఁడువలికె నిత్యాదులందున్న పాదేశ వకారము లఘు'వని వివరింపఁబడినది. మఱియు క్రియా పరిచ్ఛేదమున తొంబదియవ సూత్రము కడ 'పత్వంబు రానిపక్షంబున వక్ష్యమాణతాదేశం బనియు చెప్పఁబడినవి. 'ఏరులు—ఏళులు; త్రాడులు త్రాళులు; పలికె—వలికె; ఆకర్ణింపుదురు -- ఆ కర్ణింతు' రిత్యాదిగా 'ళ—వ- త' లాదేశంబగుట చేతఁగలుగు రూపభేదముల కర్థభేదము కలుగకుండుట గమనార్హము. ఈ రీతినే పైన సూచింపఁబడిన సూత్రముల కడను వార్త్తికముల యెడను 'ఆదేశ' శబ్ద గ్రహణముచేత నర్థభేదము గలుగకుండుట విజ్ఞులు పరిశీలింపవలసియున్నది.

ఇక సూత్రాల దృష్టికి నాదేశములుగాఁగాను పించు కార్యములు పెక్కులు గలవు. మచ్చునకు కృదంత పరిచ్ఛేదమున 'ఇమి వర్ణకంబు కలుగ్వాదుల కగు' (4) 'తజ్వర్ణకంబు చేయ్వాదులకగు' (5) నని సూత్రీకరింపఁ బడుటచేత 'కలుగు— కలిమి; ఓరుచు—ఓరిమి; చేయు—చేత; కూయు— కూత' మున్నగు రూపములు సిద్ధించుచున్నవి. ఇట్టి యెడ రూపభేదము మాత్రమేగాక యర్థభేదమును గలుగుచుండుట యరయనగును. ఇట్లు అర్థభేదమును గూర్చునది యాదేశమనుట సూరికి సమ్మతముకాదు. కావుననే ఒట్టుపెట్టిన యట్లు చిన్నయసూరి యొక్క మార్గైన నిట్టి స్థలములం దాదేశ శబ్దముఁ గూర్చ లేదు. ఇంతయుఁ జూడగా శత్రువువలె యున్నదానిని దొలఁగించి మఱియొకటి వచ్చుటమాత్రమేగాక యట్టి దానిచేత యర్థభేదము సైతము గలుగరాదనుట సూరి యాశయముగా స్పష్టమగుచున్నది. కావున బాలవ్యాకరణ పఠనపాఠములం దాదేశ శబ్దమునకు సామాన్యార్థమును జెప్పుకొనుట పొసగదు. చిన్నయ సూరి హృదయగతమ్మైన యీ విశేషార్థమునే గ్రహింప వలయును.

ఇది యిట్లుండ బాలవ్యాకరణ వ్యాఖ్యాత లాదేశ శబ్దమునకు సామాన్యార్థమునే గ్రహియించినారు. ఈ విషయమున గుప్తార్థప్రకాశిక, సర్వస్వపేటిక, రమ ణీయము, లఘుటీక, బాలప్రౌఢ వ్యాకరణ సర్వస్వము (ద్వితీయ భాగము)లు సంప్రతింపఁబడినవి. ఇవి యెల్ల యర్థవివక్ష యొనర్పకయే పలుతావుల 'ఆదేశ' శబ్ద మును విరివిగాఁ బ్రయోగించినవి. ఇట్లు చెప్పుట యా పండితప్రకాండుల పరిశీలనా పాటవము నను మానించికాదు. స్వల్పవిషయముగా భాసించి యిది వారలకన్ను బ్రామినదని జెప్పుట మాత్రమే. ఈ వ్యాఖ్యానములు 'ఆదేశ' శబ్దమును బ్రయోగించిన తీరు తెన్నుల నుదాహరణ ప్రాయముగా నైన జూపుటకు వ్యాస విస్తర భీతి యడ్డుకొనుచున్నది. విజ్ఞులాయా స్థలముల విమర్శించి నిగ్గుదీర్పఁ బ్రార్థితులు.

'సత్యము సర్వశ్రేయము.'

ఇట్లే యాదేశ శబ్దార్థమేగాక పలు సూత్ర ములు వార్త్తికములు సమ్యగ్విమర్శనాపేక్షితములై యున్నవి. వానిని గూర్చి మరియొక మారు మనవి చేసుకొనబడును.

# మహాభాగ్యం

## శ్రీ గోరంట్ల ఫణికుమార్

రెండు యిళ్లకి మధ్యనున్న బంతి మొక్కల పక్కన రాతిమీద కూర్చుని మొక్కలవేపు మొక్కల్లోకి చూస్తూంది రేవతి. మేడయింటిమీద మేడఅంచుకివచ్చి చందమామ చిరునవ్వు—చిన్నది—పారేశాడు.

ఊరవతల తోట 'ది గార్డెను' అది. తోట మధ్య మేడ. అది మెయిన్ హవుసు. మేడకి కొంచెం పడమటగా చిన్న పెంకుటిల్లు. అది గెస్ట్ హవుసు.

మేడగల పెద్దమనిషి మదరాసులో వ్యాపారం గల మనిషి. అతగాడు ప్రతియేటా వేసంగికిమాత్రం చల్లగాలికోసం పీలేరుకి సకుటుంబంగా వచ్చి నెల్లాళ్లుండి వెళ్లే అలవాటుగల పెద్దమనిషి. ఆయన మదరాసులో వున్నప్పుడు ఇక్కడ మేడను అద్దెకివ్వచ్చు. కాని, ఊరవతలవుండే అంతపెద్ద మేడలో అంత అద్దె యిచ్చుకుని ఎవ్వడూ దిగడు. తక్కువ అద్దెకి యింటివారు యివ్వరు. ఇచ్చినా, దిగిన వాళ్లని ప్రతియేటా వేసంగికి కాళీ చెయ్యమనడం బావుండదు. అందుచేత మేడ యింటికి తలుపులు మూసి తాళాలు బిగించి వుంచారు. గెస్ట్ హవుసుని మాత్రం అద్దెకి యిచ్చారు.

ఇల్లు చిన్నది కాబట్టి, ఊరవతల వుంది కాబట్టి ఇంటి వారాగెస్ట్ హవుసుని తక్కువ అద్దెకు యిచ్చారు. ఇల్లు చిన్నదైనప్పటికీ ఊరికి దూరంగా ఉన్నప్పటికీ అద్దె తక్కువ గాబట్టి ప్రవేశించారు సుబ్బయ్యగారు.

సుబ్బయ్యగారి గురించి 'మీ నాన్నగారికి ఎక్కడవమ్మా పనీ' అని ఎవరైనా అడిగితే బ్యాంకీలో అని చెప్పే రేవతి 'బ్యాంకులో ఏం పని' ఎన్నాళ్ల సర్వీసు, జీతం ఎంతిస్తారు' ఇటువంటి ప్రశ్నలు వేస్తే మాత్రం సమాధానం సరిగ్గా చెప్పలేదు. సుబ్బయ్యగారి ఆర్జన యింటికి ఎంతమటుకు ఆధారంగా ఉందో, ఆ ఆర్జన యింటికి చాల్తుందో చాలదో అనే విషయాల గురించి రేవతి ఎప్పుడూ ఆలోచించలేదు. తన స్కూలేమిటో, తన చదువేమిటో అంతే. క్రిందటేడు ఏప్రిల్లో రేవతి మూడోఫారం పరీక్షరాసి పాసయిన రోజుల్లో ఆమెకి పన్నెండో ఏడు దాటింది. ఆమె ఆ వెంటనే యీ యింట్లోకి వచ్చిపడింది. అంతటితో—

'స్కూలు చాలా దూరం యిక్కడికి, అవునా? మరి ఒక్కర్తెవే అంతదూరం ఎలా నడిచి వెళ్తావో చెప్పు. వెళ్లలేవు. ఒప్పుకుంటావా? ఒప్పుకోవూ... అలా అంటావు...అంతే...మరి థర్డ్‌ఫారం పాస్ చేశావు. అలా యిలా కాకుండ ఫస్టుగా పాసయేవు. ఏం? చాల్దా?? అల్లవాళ్ల సుబ్బలక్ష్మిని చూడు ఎం. ఎస్. సి పాసయిందా!? పాసయింది? పాసయితేమాత్రం పెళ్లిచేసుకోకతప్పిందా?...అంచేత... ఆడపిల్లకి పెళ్లి...పెళ్లి ముఖ్యం. తెలిసిందా? అంటూ కొన్నికారణాలు చెప్పి రేవతిని స్కూలుకు పంపడం మాన్పించివేశాడు ఆమె తండ్రి.

అవి అసలు కారణాలు కావనీ వట్టిసాకులు మాత్రమేననీ అసలు కారణం వేరే వుందనీ ఆ రోజే తెలిసింది రేవతికి. తండ్రిని ఆఫీసుకి వెళ్లనిచ్చి తల్లి దగ్గర మారాం చేసిచేసి ఏడవగా విసిగిపోయి కేకలు వేసింది శేషమ్మగారు.

'మీ అన్నదమ్ములు, అప్పచెల్లెళ్లూ పదిమందికీ ఎమ్మేలు, బియ్యేలు చెప్పించడానికి మీ నాన్న లక్షాధికారనుకున్నావా? లేక దులిపితే రాల్డానికి పెట్లో రూపాయల చెట్లున్నాయనుకున్నావా? దయచేసి ఏడుపు కట్టిపెట్టు, మహాతల్లీ. ఎండెక్కింది ఆ మిరపకాయలు కాస్తా ఎండలో పడేసిపెట్టు'అని కేకలేసి విసవిస వెళ్లింది శేషమ్మగారు వంటదగ్గరికి.

అందుమీదట కళ్లు తుడిచేసుకుంది రేవతి.

అప్పట్నుంచీ ఎవరూ చూడకుండా కళ్లు తుడిచేసుకోవడం అలవాటుచేసుకుంది రేవతి.

ఆ రోజున కోపంగా ఉండటంచేత సుబ్బయ్యగారి భార్య తన సంతానం సంఖ్య ఎక్కువ చేసుకుందే గాని, నిజంగా లేరావిడకి పదిమంది పిల్లలు.

రేవతి పుట్టిన పదేళ్లనాటికి సుబ్బయ్యగారికి కడసారిది విమల కలిగింది. ఈ మధ్యకాలంలో ఉద్భవించినవాళ్లు వరుసగా నలుగురు. మొదటివాడు సీతారాముడు. రెండవ్వాడు రాధాకృష్ణుడు. మూడో వాడు వేణుగోపాలుడు. నాలుగోవాడు గంగాధరుడు. నలుగురూ రావులే. పైన చెప్పిన రూపాలు వారిని యింట్లో పిలిచే పిలుపులు. ఒక్కోసారి యింకా తమాషాగా వుంటాయి యీ పిలుపులు.

'ఒరేయ్ సీతా, ఒరేయ్ రాధా, ఏమ్రా గంగా, పార్వతీ, ఎంతసేపయింది వడ్డించేసి. ఇంకా ఎక్కడే కూర్చున్నారూ? ఎక్కడ దాపరించారో? ఏమిటో ఆ మొక్కలు. మీ అక్కకి మతులుపోతే మీకూ మతులు పోతున్నాయ్రా! రండి, వేగిరంరండి' అదీ సాధారణంగా శేషమ్మగారువేసే కేక.

కొత్తయింటికి రాగానే ఆవిడ పెరట్లో ధనియాలు చల్లింది. కాకర పాదు పెట్టింది. దొండ బద్దు నాటింది. తరువాత తోటలో ఓ రోజున రేవతి అటు యిటు తిరిగి చప్పున తల్లి దగ్గరకు పరుగెత్తుకొచ్చి !!

'అమ్మా అమ్మా అక్కడ కొత్తిమిరి మొక్కలు ఎన్నున్నాయనుకున్నావు! ఎన్నో వున్నాయే!' అంది.

'ఎక్కడే ?'

'అక్కడా, ఎరువు కుప్ప దగ్గర.'

'ఎరువు కుప్ప దగ్గర—అవా!, అవి బంతి మొక్కలే బహుశా మానవా.'

'బంతి మొక్కలా ??'

'అవునే.'

'బంతి పువ్వులు పూస్తాయా?'

'బంతి మొక్కకు బంతి పువ్వులు పుయ్యకపోతే పొట్లకాయలు కాస్తాయనుకున్నావుటే. బావుంది. చదువ్వేస్తే వున్న మతికూడ పోయిందట' అంది శేషయమ్మగారు.

ఆ రోజునుంచే రేవతికి మతి మారడం జరిగింది. ఆ రోజే, ఆ వెంటనే పువ్వులతోట వేసేదామనుకుంది రేవతి. కాని, మసిబొగ్గుల్లో మాణిక్యం కనిపిస్తే దానికి తగ్గ ఏర్పాట్లు దానికి చేసినట్లుగా ఎరువు కుప్పనుంచి బంతి మొక్కలను వేరుచేయాలని రేవతికి కలిగిన ఆలోచన 'పూలతోట'కి దారి తీసింది. తరువాత ఆ ఎరువునే మోసుకొచ్చి ఆ మొక్కలకు వేయడం జరిగిందనుకోండి. అది వేరే సంగతి.

ఆ మొక్కల్ని అక్కణ్నించి తీసుకురావడానికి గాని, నాటిని పెరట్లో పాతడానిగ్గాని యింత చిన్న పనికైనా సాయంచేయని పెద తమ్ముడు—సీతగాడు—'అక్కయ్యా అవన్నీ పెరట్లో వేస్తున్నావా? ముందు నేను వేస్తే బాగా వుండదుటే పువ్వులు పూసినప్పుడు అంతా గుమ్మెత్తిపోతారూ' అని సలహా యిచ్చాడు. ఆ సలహా పాటించింది రేవతి. 'అక్కయ్యా లైనుగా వేస్తే బావుంటుంది కదే' అన్నాడు రాధ. ఆలాగే చేసింది రేవతి. 'అక్కా, అక్కా అంత దగ్గిరగా పాతేత్తే మన గదిలో సామాన్లాగా అసయ్యంగా వుంటుందే. కొంచెం దూరంగా పాద్దూ' అన్నాడు వేణు. 'నువ్వేం సలహాలు చెప్పనక్కరలేదు. చాతనైతే సాయం చెయ్యి. లేకపోతే నోరుమూసుక్కూచో' అనేసినప్పటికీ మొక్కల్ని వాడి సలహా ప్రకారం దూర దూరంగా నాటింది.

గంగగాడు సలహాలేమి యివ్వకుండా చిన్న చెంబుతో నీళ్లు పట్టుకొచ్చి యిచ్చాడు. విమల సలహాలు యివ్వ లేదు. ఊరికేనూ కూర్చోలేదు. అటూ యిటూ తిరిగి మొక్కల్ని నాటబోయి కొన్ని తొక్కేసి, అందరి కాళ్లకూ అడ్డంపడి, రేవతిచేత చివాట్లుతిని సీతగాడి చేత ఓదార్చబడి, అమ్మదగ్గరికి తీసుకుపోబడింది.

ఆఖరికి, ఆ సాయంత్రానికి, అంతా కలిసి ఆరు వరసల్లో ముప్ఫై బంతిమొక్కలు నాటారు. నాటిన నాటి సాయంత్రం ముప్ఫయి మొక్కలు కూడా సొమ్మసిలిపోయి తలలు వేళ్లాడవేసేయి.

ఆ రాత్రి ఆకాశంలో చంద్రుడు లేడు. ఎక్కడా మేఘాలు లేవు. చుక్కలు వున్నాయికాని వావు చూడ్డంలేదు రేవతి. బుడ్డిదీపం చేతపట్టుకొని, మడి దగ్గర కూర్చుని, బుడ్డిదీపపు గుడ్డివెలుగుతో చుక్కల్లాటి కళతో మొక్కల్ని బిక్కూబిక్కూ చూసింది.

మొక్కలు బతకవేమోనన్న బెంగచేత ఆ రాత్రి సుబ్బయ్యగార్నీ, శేషమ్మగార్నీ బతకనిచ్చిందికాదు రేవతి.

'బతుకుతాయా, బతకవా' అదే ప్రశ్న.

'బతుకుతే బతుకుతాయి, లేకపోతే పోతాయి. మధ్య నన్నుమాత్రం చంపక కళ్లు మూసుకొని పడుక్కో నిద్రవస్తుంది'అని అటుతిరిగి పడుకుంది శేషమ్మగారు.

ఆ రాత్రి తనకి ఎప్పుడు నిద్రపట్టిందో రేవతికి తెలీదు. ఆ రాత్రి ఎక్కణ్ణుంచోవచ్చి మేఘాలు ఎంత గానో వర్షించి వెళ్లిపోయాయన్న సంగతి రేవతికి తెలీదు.

మర్నాడు సూర్యుడితోపాటే లేచి రేవతి కళ్లు నులుముకుంటూనే యింటిముందుకి వెళ్లిచూసి కెవ్వున కేకవేసి మడిదగ్గరికి పరిగెట్టింది.

తల్లికి తెలుస్తుంది. తండ్రికి తెలుస్తుంది. ఉంటే భగవంతుడికీ తెలిసే వుంటుంది; ప్రాణాన్నీ జీవితాన్నీపెంచి పోషించే వారందరికీ తెలిసి తీరాలి. ఆ ఉదయం తలలెత్తి నిల్చున్న చిన్నబంతి మొక్కలు ఓ పదమూడేళ్ల ఆడపిల్లకి కలిగించిన సంతోష, సంభ్రమ, ఆనంద, ఉద్వేగాలు ఎటువంటివో, ఏమిటో. ఇటు యీ మొక్క దగ్గిర నిల్చుంది రేవతి. అటు ఆ మొక్క దగ్గిరకి పరుగెట్టింది రేవతి. ఇదే రేవతి యీ మొక్క అయింది. ఇదే రేవతి ఆ మొక్క అయింది. నిన్నటి రాత్రి మబ్బూ యీ రేవతే, వాన జల్లూ రేవతే, ఇవాల్టి ఉదయం సూర్యరశ్మీ రేవతే. అదే రేవతి యిప్పుడు చల్లగాలిగా వీస్తోంది.

అది అంతటిది. ఆ ఉత్సాహమే రేవతిని మరో రేవతిగా చేసింది.

మొక్కల్ని పెంచడమే ముఖ్యమైన పనయి కూర్చుంది రేవతికి. ఆ పెంచే అధికారం, అవకాశం రేవ తొక్కర్తే గుత్తకి పుచ్చుకోలేదు. అందులో షేర్లు మిగతా వాళ్లకి కూడా వున్నాయి. గంగవాడు చిన్నచెంబుతో పట్టుకెళ్లి ఆ మొక్కలకి అదేపనిగా నీళ్లు పోస్తూండడమే వాడి పని. ఇంటివారి తోట మాలీ దగ్గరికిపోయి బొరిగా తొల్లికా తెచ్చియిచ్చేపని వేణుగాడిది. ఎరువు మోసుకొచ్చి మొక్కలకి పొయ్యడం అనేది రాధగాడి పనుల్లో ఒకటి. రెండు పూటల్లా వచ్చి మొక్కల్ని తనిఖీచేసే అధికారి సీతగాడు. అప్పుడప్పుడు అవసరం వెంబడివచ్చి సైంటిస్టు సలహాలిచ్చే డ్యూటీ యింటివారి తోటమాలీది. తెలిసీ తెలియని సలహాలిచ్చే పని మొక్కల్ని పెంచడంలో పెద్ద బాలశిక్ష చదువుకున్న సుబ్బయ్యగారిది. సుబ్బయ్యగారు సాయంకాలం ఆఫీసునుంచి వచ్చేక మొక్కల దగ్గర వాలు కుర్చీ వేసుకుని న్యూస్‌పేపర్ చదువుకునేటప్పుడు పక్కన రాతిమీద కూర్చొని ఏదో కుడుతూ, కుట్టకపోతే కబుర్లు చెబుతూ మధ్య మధ్య పిల్లల్నీ మొక్కల్నీ మెచ్చుకు గొప్పపడ్డం శేషమ్మగారి పని.

ఓ రోజు పొద్దున్నే.

'అక్కయ్యా! మొగ్గ మొగ్గ!!' అని కేకేశాడు వేణు.

ఆ దినం ఓ గంటసేపు వెర్రెత్తినట్టుగా తిరిగింది రేవతి.

ఆ రోజున గంగగాడు మొక్కలకి కుమ్మరించిన నీళ్లు అన్నీ యిన్నీ కావు.

దాదాపు అన్నీ మొక్కలూ మొగ్గ తొడిగాయి. అందుమీదట ఏ మొక్క ముందు పూస్తుందనే ప్రశ్న వచ్చింది. మొదటి వరుస లోదా, మూడో వరుసలోదా అదా యిదా అని తర్జన భర్జన జరుగుతూండగానే అన్నిటిలోకి పొట్టి మొక్కకి

ఒక పువ్వు కొంత విడింది.

బంగారమే అంతగా పండింది.

అప్పట్లో రేవతికే కాదు, పిల్లలందరికీ వెర్రులెత్తేయి. సుబ్బయ్యగారుగూడా సంతోషం ప్రకటించకుండా వుండలేకపోయారు. శేషమ్మగారుకూడ వయసులో కొంత చిన్నదయింది. విమల పెద్దగా కేకలేసి గెంతింది. పువ్వు బాగా విడ్డాక 'విమలా పువ్వు ముట్టుకుంటే నాన్నగారితోచెప్పి తన్నిస్తా ముట్టుకోకేం' అని విమలని హెచ్చరించడంతో పువ్వులెవరూ తాకరాదనే రూలుకి పునాది ఏర్పడిందని చెప్పొచ్చు.

పూసిన ఒక్క పువ్వూకోసేడమేనా? మరోటి కూడ బాగా విడ్డాక కొయ్యొచ్చు అని ఆదిలో అనుకున్నారు. తరువాత ప్రతిమొక్క అధమం ఒక మొగ్గయినా విడితేకాని ఏపువ్వూ తెంపరాదని అనుకున్నారు. అన్నీ బాగా పూసేయికాని మధ్య మొక్క మాత్రం మంకుపట్టు పట్టినట్టుగా ఎంతకీ మొగ్గయినా తొడిగింది కాదు. చివరికి దానంతట దానికే తిక్కతిరిగి మొగ్గతొడిగింది. నాలుగు పువ్వులు విడ్డాయి.

అప్పుడు విమలని పొట్టిమొక్కదో పువ్వు తెంపుకోనిచ్చింది రేవతి. తెంపుకోనివ్వడం ఏమిటి? తనే తెంపి యిచ్చింది. తెంపిందేకాని తెగ విచారించింది.

ఆవేళ రాత్రి గంగాధరుడు మొక్కల పక్కన గొంతు కూర్చున్నాడు. నడుంమీద చేతులు వేసుకొని పక్కనే రేవతి నిల్చొని మొక్కలవేపు చూస్తోంది. అప్పుడు గంగగాడు 'అక్కయ్యా! మేకతినేస్తే మొక్కలేదుస్తాయని చెప్పేవులేదా ఆవేళా. మరివాళ నువ్వెందుకే పువ్వు తెంపేసేవూ?' అని అక్కని అడిగేడు.

అక్కజవాబు చెప్పలేదు. పొట్టిమొక్కవేపు నిదానంగా చూసోంది.

పైన చంద్రుడు ఆకాశంలో విచ్చలవిడిగా తిరుగుతూన్నట్లుగా ఉన్నాడు. చంద్రకాంతులు బంతి పువ్వుల్లోకి యింకిపోతున్నాయి. బంతి పువ్వుల మీంచి జారిపోతున్నాయి. ఇంట్లోంచి రాధగాడి నవ్వువినిపిస్తోంది. పొట్టిమొక్కది పువ్వుపోయిన మొండిరెమ్మ మాత్రం చందమామవైపు దీనంగా చూసింది. ఆ కొమ్మవైపు జాలిగా చూసింది రేవతి.

'ఒరే గంగా మరింకెప్పుడూ తెంపొద్దురా' అంది రేవతి. ఉన్నట్టుండి పెద్ద నిశ్చయానికి పూర్తిగా వచ్చేసి.

అది కిందటేడు జరిగిన విషయం.

నెలలు గడిచేయి. సంవత్సరం మారింది. కిందటేడుతీసి దాచిన విత్తనాలు మొలకెత్తేయి. ఈసారి స్వయం సుబ్బయ్యగారే నడుంకట్టి రెండు యిళ్లకీ, మధ్యగా పెద్దమడి తయారుచేసేరు. అందులోకి బంతి మొక్కల్ని మార్చినాటేరు. విధీ విరామం లేకుండా నీళ్లు పోయడానికి గంగా వేణు వుండనే వున్నారు. ఎరువు మొయ్యడంలో సీతగాడు కూడ చిన్నసాయం చేసేడు. మొక్కలు ఎదిగేయి. మొగ్గ తొడిగేయి. ముచ్చటగా పూసేయి..

'పువ్వులెవరూ తెంపరాదు'

అది నిరుటిరూలే. కొత్తదేంకాదు. రూల్ని ఖచ్చితంగానే ఎన్‌ఫోర్స్ చేస్తూవచ్చింది రేవతి. పువ్వులు తెంపితే విమల తెంపాలి. కాకపోతే శేషమ్మగారు తెంపాలి. విమలని అదుపులో వుంచడం అట్టే కష్టంకాదు. శేషమ్మగారి పూజకి తోట్లో ఎర్రగన్నేరు పూలు వుండనే వున్నాయి.

మొక్కలకి సంరక్షణ ఘన్టుగావుంది. మొక్కలన్నీ బాగాలేచేయి. బలంగాలేచేయి. కొల్లగా పూసిన పువ్వుల్లో ఒక్కరేకైనా ఎవ్వర్నీ తెంపనివ్వదు రేవతి. ఇంటిముందు ఆరవ్వంత మేర పచ్చగావుంది. నందన వనంలో ఓ చెక్కలావుంది. తను ఏర్పరచుకున్న ఆ అందాన్ని చూస్తూ అక్కడ ఆ రాతిమీద కూర్చున్నప్పుడు ఎన్నో విషయాలు మరిచేది రేవతి. ఆ విషయాలు మరవడానికే అక్కడ కూర్చొనేది రేవతి. దూరంగావున్న స్కూలూ. బడిమీద ఎండలో మెరిసే కంచుగంటా, పదిగంటలకి కొన్ని వందల కంఠాలు పాడే ప్రార్థనపాటా; క్లాసురూంలో నల్లబోర్డుపై నుంచి వెల్లవేసిన గోడమీంచి మోహన్‌దాసు కరం చంద్‌గాంధి అనే ఆయన చూపూ, తనతో తెలుగు, సాంఘిక శాస్త్రాల్లో ఘన్టుమార్కులకు పోటీపడే శ్యామల; ప్రస్తుతం యింట్లో కర్రపెట్టెలో ఏడ్చే సబ్బుపెట్టెలో ఆ రోజుల్లో కలకళ్లాడుతూ కులికే బలపాలు, చాక్‌పీసులూ, రంగుపెన్సిళ్లూ. రిబ్బన్ ముక్కలూ, మూడోఫారానికి క్లాసుటీచరు, నాలుగో ఫారానికి సైన్సుచెప్పే జయప్రదమ్మగారు, క్లాసులో అడుగుపెట్టీ పెట్టడంతో వేసే కమ్మని వాసన. కబుర్లుచెప్పే సోషల్ టీచర్ కమ్మని కంఠం. తెలుగు పద్యాలు, యింగ్లీషు స్పెల్లింగ్సూ, లెక్కల స్టెప్పూ అన్నీ మరచిపోయేది రేవతి. చిక్కని ఆకుపచ్చటి ఆకులచాటునా, చక్కని బంగారు రేకుల పువ్వుల మాటునా ఎక్కడోవుండి పోతాయి ఆస్కూలు, ఆ రోజులూ అన్నీ కూడా.

ఆలా ఓరోజున ఆ మొక్కలదగ్గర ఉదయం హాయిగా కూర్చున్నప్పుడే వచ్చేడు బక్క భగవాన్లు.

ప్రతినెలా జీతం అందిన నాటిరాత్రి పడుకునే ముందు తలకింద తలగడా సరిచేసుకుంటూ 'తెల్లారే సరికల్లా తయారవుతాడ్రా బక్కముండా కొడుకూ' అని ఓసారి అనుకోకుండా పడుకోరు సుబ్బయ్యగారు. సరిగ్గా ఆలాగే మర్నాడు పొద్దుటే ఏడో గంట కొట్టే సరికల్లా 'అయ్యా సుబ్బయ్యగారూ, అని కేకస్తూ అద్దె వసూలు చెయ్యడానికి వస్తాడు బక్క భగవాన్లు. ఆ కంఠానికి పది జీరలు.

ఇంటివారి ఇల్లు, యింటివారితోట, యింటి వారి యిక్కడి వ్యవహారాలను చూసే ఉద్యోగం బక్క భగవాన్లుది. ఆ రోజున అద్దె పుచ్చుకొన్నాక 'ఇంటి వాళ్లు క్రిస్‌మస్‌కి వస్తున్నారండోయ్' అని చెప్పేసి నవ్వుకుంటూ చక్కాపోయాడు.

వేసంగికి మాత్రం రావటం యింటివారి అలవాటు. ఇప్పుడెందుకొస్తున్నారో అనుకున్నారంతా. భగవాన్లుకికూడ ఏ మాట తెలీదుట.

ఇంటివారంటే అంత యిష్టంలేదు రేవతికి. ఇంటాయన ఎటువంటివాడో తెలీదు. అతనెప్పుడూ చిన్నింటి వైపుకి రాడు. ఇంటావిడ మంచిమనిషిలాగే కనిపిస్తుంది. ఇంటివారి పెద్దకూతురు పట్నంలో వుంది, అత్తవారింట్లో. ఆమెని ఎరుగదు రేవతి. రెండోకూతురు పదహారేళ్ల వయసుదే అయినప్పటికీ పాతికేళ్ల మనిషిలా వుంటుంది. పదేళ్ల పిల్లలా ప్రవర్తిస్తుంది. మూడో అమ్మాయి నెమ్మదిగానే వుంటుంది. ఆ పిల్లని 'దొరపిల్ల'.అంటారు సుబ్బయ్యగారింట్లో వారంతా.

నిన్న మధ్యాహ్నం పన్నెండు గంటలకి కారు దిగేరు—యింటివారు. అందరికంటే ముందు ఆఖరమ్మాయి కార్లోంచి బయటికి బంతిలాగెంతి యింట్లోకి వెళ్లింది. ఆ పిల్లవెనక యింటాయన దిగేరు. ఆయనది బట్టతల. మనిషి నున్నగా ఎర్రగా ఉన్నాడు. ఫ్లానల్స్‌లో వున్నాడు. ఆయన భార్య కార్లోంచి నెమ్మదిగా దిగింది. నిండుగా ఎత్తుగా వుంది. చాయ మేలిమిబంగారు చాయ. దుస్తులు బ్లడ్ రెడ్ శారీ. వారి రెండో అమ్మాయి కార్లోంచి దిగలేదు. ఆమెను నెమ్మదిగా దింపేరు. ఆమె కట్టుకున్న శారీమీద ఓవర్‌కోటు తొడుక్కుంది. పెద్దగా మూలుగుతోంది.

'అమ్మాయిగారికే మొచ్చిందమ్మా' భగవాన్లు మిక్కిలి ఆందోళనతోను, అంతకంటే మిక్కిలి అతి వినయంతోనూ ప్రశ్నించేడు.

అమ్మాయిగారికి 'ఫీవరట'.

ఆ దినం ఓ గంటసేపు వెఱ్రెత్తినట్టుగా తిరిగింది రేవతి.

ఆ రోజున గంగగాడు మొక్కలకి కుమ్మరించిన నీళ్ళు అన్నీ యిన్నీ కావు

దాదాపు అన్నీ మొక్కలూ మొగ్గ తొడిగాయి. అందుమీదట ఏ మొక్క ముందు పూస్తుందనే ప్రశ్న వచ్చింది. మొదటి వరుస లోదా, మూడో వరుసలోదా అదా యిదా అని తర్జన భర్జన జరుగుతూండగానే అన్నిటిలోకి పొట్టి మొక్కకి

ఒక పువ్వు కొంత విడింది.

బంగారమే అంతగా పండింది.

అప్పట్లో రేవతికే కాదు, పిల్లలందరికీ వెఱ్రులెత్తేయి. సుబ్బయ్యగారుగూడా సంతోషం ప్రకటించకుండా వుండలేకపోయారు. శేషమ్మగారుకూడ వయసులో కొంత చిన్నదయింది. విమల పెద్దగా కేకలేసి గెంతింది. పువ్వు బాగా విడ్డాక 'విమలా పువ్వు ముట్టుకుంటే నాన్నగారితోచెప్పి తన్నిస్తా, ముట్టుకోకేం' అని విమలని హెచ్చరించడంతో పువ్వులెవరూ తాకరాదనే రూలుకి పునాది ఏర్పడిందని చెప్పొచ్చు.

పూసిన ఒక్క పువ్వూకోసేడమేనా? మరోటి కూడ బాగా విడ్డాక కొయ్యొచ్చు అని ఆదిలో అనుకున్నారు. తరువాత ప్రతిమొక్క అధమం ఒక మొగ్గయినా విడితేకాని ఏపువ్వూ తెంపరాదని అనుకున్నారు. అన్నీ బాగా పూసేయికాని మధ్య మొక్క మాత్రం మంకుపట్టు పట్టినట్టుగా ఎంతకీ మొగ్గయినా తొడిగింది కాదు. చివరికి దానంతట దానికే తిక్కతిరిగి మొగ్గతొడిగింది. నాలుగు పువ్వులు విడ్డాయి.

అప్పుడు విమలని పొట్టిమొక్కదో పువ్వు తెంపుకోనిచ్చింది రేవతి. తెంపుకోనివ్వడం ఏమిటి? తనే తెంపి యిచ్చింది. తెంపిందేకాని తెగ విచారించింది.

ఆవేళ రాత్రి గంగాధరుడు మొక్కల పక్కన గొంతు కూర్చున్నాడు. నడుంమీద చేతులు వేసుకొని పక్కనే రేవతి నిల్చొని మొక్కలవేపు చూస్తోంది. అప్పుడు గంగగాడు 'అక్కయ్యా! మేకతినేస్తే మొక్క లేదుస్తాయని చెప్పేవులేదా ఆవేళా. మరివాళ నువ్వెందుకే పువ్వు తెంపేసేవూ?' అని అక్కని అడిగేడు.

అక్కజవాబు చెప్పలేదు. పొట్టిమొక్కవేపు నిదానంగా చూస్తోంది.

పైన చంద్రుడు ఆకాశంలో విచ్చలవిడిగా తిరుగుతూన్నట్లుగా ఉన్నాడు. చంద్రకాంతులు బంతి పువ్వుల్లోకి యింకిపోతున్నాయి. బంతి పువ్వుల మీంచి జారిపోతున్నాయి. ఇంట్లోంచి రాధగాడి నవ్వువినిపిస్తోంది. పొట్టిమొక్కది పువ్వుపోయిన మొండిరెమ్మ మాత్రం చందమామవైపు దీనంగా చూసింది. ఆ కొమ్మవైపు జాలిగా చూసింది రేవతి.

'ఒరే గంగా మరింకెప్పుడూ తెంపొద్దురా' అంది రేవతి. ఉన్నట్టుండి పెద్ద నిశ్చయానికి పూర్తిగా వచ్చేసి.

అది కిందటేడు జరిగిన విషయం.

నెలలు గడిచేయి. సంవత్సరం మారింది. కిందటేడుతీసి దాచిన విత్తనాలు మొలకేత్తేయి. ఈసారి స్వయం సుబ్బయ్యగారే నడుంకట్టి రెండు యిళ్ళకీ, మధ్యగా పెద్దమడి తయారుచేసేరు. అందులోకి బంతి మొక్కల్ని మార్చినాటేరు. విధీ విరామం లేకుండా నీళ్ళు పోయడానికి గంగా వేణు వుండనే వున్నారు. ఎరువు మొయ్యడంలో సీతగాడు కూడ చిన్నసాయం చేసేడు. మొక్కలు ఎదిగేయి. మొగ్గ తొడిగేయి. ముచ్చటగా పూసేయి..

'పువ్వులెవరూ తెంపరాదు'

అది నిరుటిరూలే. కొత్తదేంకాదు. రూల్‌ని ఖచ్చితంగానే ఎన్‌ఫోర్స్ చేస్తూవచ్చింది రేవతి. పువ్వులు తెంపితే విమల తెంపాలి. కాకపోతే శేషమ్మగారు తెంపాలి. విమలని అదుపులో వుంచడం అట్టే కష్టంకాదు శేషమ్మగారి పూజకి తోట్లో ఎఱ్రగన్నేరు పూలు వుండనే వున్నాయి.

మొక్కలకి సంరక్షణ ఘన్నుగావుంది. మొక్కలన్నీ బాగాలేచేయి. బలంగాలేచేయి. కొల్లగా పూసిన పువ్వుల్లో ఒక్కరేకైనా ఎవ్వర్నీ తెంపనివ్వదు రేవతి. ఇంటిముందు ఆరవ్వంత మేర పచ్చగావుంది. నందన వనంలో ఓ చెక్కలావుంది. తను ఏర్పరచుకున్న ఆ అందాన్ని చూస్తూ అక్కడ ఆ రాతిమీద కూర్చున్నప్పుడు ఎన్నో విషయాలు మరిచేది రేవతి. ఆ విషయాలు మరవడానికే అక్కడ కూర్చొనేది రేవతి. దూరంగావున్న స్కూలూ. బడిమీద ఎండలో మెరిసే కంచుగంటా, పదిగంటలకి కొన్ని వందల కంఠాలు పాడే ప్రార్థనపాటా; క్లాసురూంలో నల్లబోర్డుపై నుంచి వెల్లవేసిన గోడమీంచి మోహన్‌దాసు కరం చంద్‌గాంధి అనే ఆయన చూపూ, తనతో తెలుగు, సాంఘిక శాస్త్రాల్లో ఘన్నుమార్కుకు పోటీపడే శ్యామల; ప్రస్తుతం యింట్లో కర్రపెట్టెలో ఏడ్చే సబ్బుపెట్టెలో ఆ రోజుల్లో కలకళ్లాడుతూ కులికే బలపాలు, చాక్‌పీసులూ, రంగుపెన్సిళ్లూ. రిబ్బన్ ముక్కలూ, మూడోఫారానికి క్లాసుటీచరు, నాలుగో ఫారానికి సైన్సుచెప్పే జయప్రదమ్మగారు, క్లాసులో అడుగుపెట్టీ పెట్టడంతో వేసే కమ్మని వాసన. కబుర్లుచెప్పే సోషల్ టీచర్ కమ్మని కంఠం. తెలుగు పద్యాలు, యింగ్లీషు స్పెల్లింగ్స్యూ, లెక్కల స్టెప్పూ అన్నీ మరచిపోయేది రేవతి. చిక్కని ఆకుపచ్చటి ఆకులచాటునా, చక్కని బంగారు రేకుల పువ్వుల మాటునా ఎక్కడోవుండి పోతాయి ఆస్కూలు, ఆ రోజులూ అన్నీ కూడా.

ఆలా ఓరోజున ఆ మొక్కలదగ్గర ఉదయం హాయిగా కూర్చున్నప్పుడే వచ్చేడు బక్క భగవాన్లు.

ప్రతినెలా జీతం అందిన నాటిరాత్రి పడుకునే ముందు తలకింద తలగడా సరిచేసుకుంటూ 'తెల్లారే సరికల్లా తయారవుతాడ్రా బక్కముండా కొడుకూ' అని ఓసారి అనుకోకుండా పడుకోరు సుబ్బయ్యగారు. సరిగ్గా ఆలాగే మర్నాడు పొద్దుటే ఏడో గంట కొట్టే సరికల్లా 'అయ్యా సుబ్బయ్యగారూ, అని కేకస్తూ అద్దె వసూలు చెయ్యడానికి వస్తాడు బక్క భగవాన్లు. ఆ కంఠానికి పది జీరలు.

ఇంటివారి ఇల్లు, యింటివారితోట, యింటి వారి యిక్కడి వ్యవహారాలను చూసే ఉద్యోగం బక్క భగవాన్లుది. ఆ రోజున అద్దె పుచ్చుకొన్నాక 'ఇంటి వాళ్లు క్రిస్‌మస్‌కి వస్తున్నారండోయ్' అని చెప్పేసి నవ్వుకుంటూ చక్కాపోయాడు.

వేసంగికి మాత్రం రావటం యింటివారి అల వాటు. ఇప్పుడెందుకొస్తున్నారో అనుకున్నారంతా. భగవాన్లుకికూడ ఏ మాట తెలీదుట.

ఇంటివారంటే అంత యిష్టంలేదు రేవతికి. ఇంటాయన ఎటువంటివాడో తెలీదు. అతనెప్పుడూ చిన్నింటి వైపుకి రాడు. ఇంటావిడ మంచిమనిషిలాగే కనిపిస్తుంది. ఇంటివారి పెద్దకూతురు పట్నంలో వుంది, అత్తవారింట్లో. ఆమెని ఎరుగదు రేవతి. రెండోకూతురు పదహారేళ్ల వయసుదే అయినప్పటికీ పాతికేళ్ల మనిషిలా వుంటుంది. పదేళ్ల పిల్లలా ప్రవర్తిస్తుంది. మూడో అమ్మాయి నెమ్మదిగానే వుంటుంది. ఆ పిల్లని 'దొరపిల్ల'.అంటారు సుబ్బయ్య గారింట్లో వారంతా.

నిన్న మధ్యాహ్నం పన్నెండు గంటలకి కారు దిగేరు—యింటివారు. అందరికంటే ముందు ఆఖ రమ్మాయి కార్లోంచి బయటికి బంతిలాగెంతి యింట్లోకి వెళ్లింది. ఆ పిల్లవెనక యింటాయన దిగేరు. ఆయనది బట్టతల. మనిషి సున్నగా ఎర్రగా ఉన్నాడు. ఫ్లానల్స్‌లో వున్నాడు. ఆయన భార్య కార్లోంచి నెమ్మదిగా దిగింది. నిండుగా ఎత్తుగా వుంది. చాయ మేలిమిబంగారు చాయ. దుస్తులు బ్లడ్ రెడ్ శారీ. వారి రెండో అమ్మాయి కార్లోంచి దిగలేదు. ఆమెను నెమ్మదిగా దింపేరు. ఆమె కట్టు కున్న శారీమీద ఓవర్‌కోటు తొడుక్కుంది. పెద్దగా మూలుగుతోంది.

'అమ్మాయిగారికే మొచ్చిందమ్మా' భగవాన్లు మిక్కిలి ఆందోళనతోను, అంతకంటే మిక్కిలి అతి వినయంతోనూ ప్రశ్నించేడు.

అమ్మాయిగారికి 'ఫీవరట'.

అందు గురించి ఒక్క భగవాన్లు ఇసుమంతైనా చింతించనక్లే, రేవతి కూడా పిసరంతైనా విచారించ లేదు.

కాని—

ఇంటివాళ్లు ఎందుకొచ్చేరు? ఎన్నాళ్లుంటారు? వాళ్లిక్కడ వున్నన్నాళ్లు ఆ అమ్మాయికి ఉష్ణం ఉంటుందా ఉండదా? అని రాత్రి ఆలోచిస్తూ పడు కుంది రేవతి.

ఉదయాన్నే లేచింది రేవతి.

ఉదయం నెమ్మదిగా వెళ్లింది. ఇంటివారి రెండో అమ్మాయికోసం నర్సెవరో వచ్చింది. మధ్యాహ్నం యింటివారి నౌకరు శేషమ్మగార్ని బిందె ఒకటి అడిగి పట్టుకువెళ్లేడు. అంతే. మరేం విశేషాల్లేవు.

మధ్యాహ్నం మూడుగంటలకి మాత్రం—చిన్న బిందెలో నీళ్లుపట్టుకుని గుమ్మం దగ్గరికు వచ్చిన రేవతి వచ్చీ రావడంతో, ఒక్క కేకవేసి బిందెను అలానే విడిచేసి పరిగెట్టింది మొక్కల దగ్గరకి.

మేడ యింటిడ్రాయింగ్ రూంవేపు వరండాలోకి యింటావిడ, చిన్నయింటి గుమ్మంలోకి శేషమ్మగారూ ఒక్కసారే వచ్చేరు.

ఇంటివారి ఆఖరమ్మాయి—రెండు జడలు వేసు కొన్నది, బ్లూగౌను తొడుక్కున్నది. గాలికొట్టిన బంతిలా వున్నది—

'నే కోసుకుంటా, నాయిష్టం. నాక్కావాలి' అని గట్టిగా అరుస్తోంది. ఆమెచేతులు గట్టిగా పట్టుకొని 'వీల్లేదు కొయ్యద్దు, మావి!' అని రేవతి కేకలేస్తోంది. ఇద్దరూ పెనగులాడుతున్నారు. మూడుబంతి పువ్వులు నలిగి నేలని పడ్డాయి.

'ఏంపిల్లా! ఏవిటా అల్లరీ' అని,

ఇంటావిడ సాఫుగానూ గట్టిగానూ ఆ పిల్లని మాత్రం ఉద్దేశించి అడిగింది. ఇద్దరమ్మాయిలూ పెనుగులాట ఆపేసి అలానే నిల్చుండి—పోయారు.

అంతలోనే శేషమ్మగారొచ్చి రేవతి పట్టినపట్టు విడిపించి కూతురి చెయ్యి పట్టుకు నిల్చుంది.

'లుక్ హియర్ మమ్మీ—' అని ప్రారంభించి చెప్పింది రెండు జడలమ్మాయి.

'నెవర్ మైన్డ్ హర్. యూ టేక్ యాజ్ మెనీ యాజ్ యూ వాంట్' అని అమ్మాయితో చెప్పి

'ఆ పువ్వులే అంత మహాభాగ్యంటమ్మా? ! మా అమ్మాయలా సిల్లీగా అల్లరి చేస్తోందేమిటీ?! కోసుకుంటుంది మా బేబి, దాన్నేమి అనకండి.'

అని శేషమ్మగారితో చెప్పి లోనికి వెళ్లిపోయింది యింటావిడ. 'ఇంత స్వల్ప విషయానికెందుకంత అల్లరి? క్వైట్ అన్నెససరీ' అని ఆవిడ చిరాకు పడ్డట్టు స్పష్టంగా తెలుస్తోంది. ఏదో చెబుదామను కొంది శేషమ్మగారు. ఏం చెప్తామనుకున్నా యింటా విడ లోనికి వెళ్లనే వెళ్లింది.

తల్లి ముఖంలోకి చూసింది రేవతి. బేబిని వారించడానికి శేషమ్మగారికి ధైర్యంలేదని ఆమె ముఖం చెప్పక చెప్తోంది.

'ఈ తుపాకి పేలదు'

అని చెప్పడానికి తుపాకీలాంటి మనిషి కానే కాదు శేషమ్మగారు. ఈ లోపున తెంపేసుకొంటోంది బేబి బంతి పువ్వుల్ని కావలసినన్ని.

నెమ్మదిగా వెనక్కి తిరిగి చూడకుండా యింటి వైపుకి నడిచేరు తల్లీ కూతుళ్లు. గుమ్మంలో గంగ చెయ్యి పట్టుకు నిల్చున్న విమల రాగాలు పెట్టింది. గంగగాడు రాగాలు పెట లేదు కాని వాడి కళ్లు తడిగా వున్నాయి.

బంతి పువ్వులే భాగ్యమా?

మహాభాగ్యమా?

కళ్లు తుడుచుకుంది రేవతి.

మేడ యింటిమీద మేడ అంచు ఎగువకి వచ్చిన చందమామ తను రోజూ సరసాలాడే బంతి పువ్వులు కనబడక పొయ్యే సరికి ప్రశ్నార్థకంగా రేవతి వేపు చూసేడు.

జవాబు చెప్పలేక కళ్లు తుడుచుకుంది రేవతి.

# విజయ విలాస వ్యాఖ్య - హృదయోల్లాసం

"ఆంగీరస"

తెలుగునాట బహుళప్రచారంలో ఉన్న రసవత్ప్రబంధాలలో చేమకూర వేంకటకవి రచించిన 'విజయ విలాసం' ఒకటి. ఇందులోని పద్యాలు కొన్నయినా కంఠస్థంగా వుండే సాహిత్యాభిమానులు నేటికీ చాలామంది ఉన్నారు. కవితలోని శబ్ద చమత్కృతీ, దానివల్ల తోచే అనేకాలయిన అర్థాలూ, విశేషార్థాలూ ప్రాచీన పద్ధతిలో విద్య నేర్చుకున్న గ్రామ ప్రాంతాలవారికీ బాగా తెలుసును. చదువుకున్న కొత్తవారు ఎవరైనా తమ గ్రామానికి వస్తే, వారి లోతుపాతులు తెలుసుకోడానికి విజయవిలాసంలోని ఒకపద్యం చదివి, అందలి చమత్కారాలేమిటో చెప్పవలెనని అడగడం పరిపాటిగా ఉండేది.

అట్టి ఉత్తమ ప్రబంధానికి చాలా కాలం వరకూ టీకలు లేకపోయాయి; అవసరమున్నప్పటికిన్నీ. కాని, యీ శతాబ్దం ప్రారంభంలో నోరి గురులింగ శాస్త్రిగారు దీనికి టీకా తాత్పర్యాలు వ్రాసి ప్రకటించారు. కాని, కవి హృదయాన్ని గ్రహించడానికి అంతగా ఉపయోగించదు. తర్వాత సుప్రసిద్ధ విద్వాంసులు వేదము వేంకటరాయ శాస్త్రిగారు అవసరమైన పదార్థాలకు మాత్రం అర్థం యిస్తూ విశేషార్థాలతో ఒక లఘుటీకను రచించి ప్రచురించారు. వావిళ్లవారు 1952 లో బులుసు వేంకటరమణయ్యగారి ముకుర వ్యాఖ్యానంతోకూడా ఈ ప్రబంధాన్ని ప్రకటించారు. సుప్రసిద్ధ విద్వద్విమర్శకులు శ్రీ తాపీ ధర్మారావుగారు 1968 లో 'హృదయోల్లాసం' అనే బ [illegible] వెలువరించారు. ఉన్న [illegible] ట్లోనూ పెద్దది.

శ్రీ ధర్మారావుగారు ఆరు దశాబ్దులకుపైగా ఆంధ్రభాషా వాఙ్మయాలకు అపారమైన సేవ చేస్తున్నారు. ప్రత్యేకంగా విజయవిలాసాన్ని పరిశీలించి, చక్కని వ్యాఖ్యను ప్రకటించడానికి చాలా ఏళ్ల క్రిందటనే సంకల్పించారు. వారి కృషికి ఫలితంగానే యిప్పుడీ వ్యాఖ్య వెలువడింది. ఇందులో విశేషార్థాలు విరివిగా చూపబడి ఉన్నవి. తరచుగా ఇదివరకు వెలువడిన ప్రతులలో గ్రహించబడిన పాఠాలూ, వ్యాఖ్యలూ విమర్శించబడినవి. వ్యాఖ్యాత తాము గ్రహించిన పాఠాల ఔచిత్యాన్నీ అర్థాల విశిష్టతనూ సమర్థించారు. కాని, వారు ఇతరులను ఆక్షేపించి చూపిన అర్థాలూ, గ్రహించిన పాఠాలు కొన్ని చోట్ల సముచితంగా ఉన్నట్లు కనబడలేదు. అట్టివానిలో కొన్నిమాత్రం యీ వ్యాసంలో తెలుపబడుతున్నవి.

విజయవిలాసం కృత్యాదిలో అచ్యుతరాయలను వర్ణించే పద్యం ఉన్నది

'గెలిచిన గెల్పు లర్థితతి
కిన్ దినమిచ్చిన యీవులున్ మహిన్
తలఁచిన విక్రమార్కు లోక
లక్షయుగర్ణులు కోటియుం గదా
కలిగిన నీడువత్తు రనఁ
గాఁదగు సాహస దాన సద్గుణం
బులు ధరయందుఁ బుట్టఁగనె
పుట్టిన వచ్యుత భూమిభర్తకున్.'

[ఆశ్వా. 1, పద్య. 14.]

అచ్యుతరాయలు సాహసంలో విక్రమార్కునీ, దానంలో కర్ణునీ ఎంతగానో మించి వుంటాడని యీ పద్యం సారాంశం.

ఇందులోని 'ఈవులున్' అనే దానికి బదులుగా 'ఈవులన్' అని వెనుకటి ప్రతులు గ్రహించిన పాఠం. 'ఈవులన్ వహుల్=దానములందరి విధములు' అని శ్రీ వేంకటరాయ శాస్త్రిగారు అర్థం వ్రాశారు. ఆ పాఠమూ, అర్థమూ అసందర్భమైన వంటూ శ్రీ ధర్మారావుగారు ఆక్షేపించి 'ఈవులున్=దానములును, వహుల్=వారి లెక్కల పుస్తకములను (బట్టి), తలఁచిన=ఆలోచించినట్లయితే' అని అర్థం యిచ్చారు. 'వహుల్' అనేదానికి లెక్కల పుస్తకములు (చిఠాలు) అనే అర్థం ఉంటే ఉండవచ్చు. కాని 'వహుల్ తలచిన=లెక్కల పుస్తకాలనుబట్టి ఆలోచించగా' అనే అర్థం సందర్భంగా ఉన్నట్లు కానరాదు. 'వహుల్' 'అనే ప్రథమాంతానికి ద్వితీయా విభక్తికి వుండే అర్థం చెప్పుకోవచ్చునుగాని, 'వహులనుబట్టి'అనే పంచమ్యర్థం గ్రహించడం సముచితంకాదు. ద్వితీయను గ్రహిస్తే 'లెక్కల పుస్తకాలను ఆలోచించగా' అనే అర్థమే వస్తుంది. లెక్కల పుస్తకాలను చూడడం సబబుగాని ఆలోచించడం సరికాదు. భాషా సంప్రదాయానికీ, వినడానికీ అది విపరీతంగా తోస్తుంది. 'ఈవులన్ వహుల్' అనే పాఠానికీ, అర్థానికీ ఇక్కడ సందర్భ శుద్ధి లేదనుకోవడం పొరపాటు.

శ్రీ ధర్మారావుగారు

'క. ఏణాక్షి నపుడు వెడ సిం
గాణిం గొని యలరుఁదూపుగమిఁజక్కెఅయే
ఖాణముగాఁ గలిగిన కం
ఖాణపుదొర పింజపింజగాడఁగ నేసెన్'

[ఆశ్వా. 1. పద్య. 127]

అనే పద్యాన్ని వ్యాఖ్యానిస్తూ 'ఆహారాన్నిబట్టే స్వభావముంటుందని ఒక సిద్ధాంతము' అని తెలుపుతూ, దానికి ప్రమాపకంగా శ్రీనాథుని

'జన్య జనకంబులకు భేద శంకలేదు,
దేహ మన్నజ; మిందు సందేహమేది?'

అనే పద్యభాగాన్ని ఉదాహరించారు. శ్రీనాథుని శృంగార నైషధంలోని యీ పద్యానికి మూలం శ్రీహర్ష మహాకవిరచించిన శ్లోకం! అది యిది—

'నాస్తి జన్యజనక వ్యతిభేదః
సత్య మన్న జనితో జనదేహః
వీక్షవః ఖలు తనూ మమృతాదాం
దృఙ్ని మజ్జన ముపైతి సుధాయామ్'

నలమహారాజు ఇంద్రాది దేవతలను స్తుతిస్తూ దీన్ని చెప్పాడు. 'జన్య, జనకాలకు భేదం లేదు; జనకమైన అన్నంవల్ల మానవుల దేహం జన్యమవుతుంది. అంటే తయారవుతుంది. కాగా అన్నానికీ, మానవుని దేహానికీ భేదం లేదు. అందువల్లనే అమృత జన్యులైన మిమ్ము చూస్తూవున్న చూపు అమృతంలో స్నానం చేస్తూ (మునుగుతూ) ఉన్నది.' అని దీని భావం. దీన్ని సమంగా అర్థం చేసుకోకపోవడంవల్ల 'ఆహారాన్ని బట్టి స్వభావం వుంటుందని హృదయోల్లాసకర్త వ్రాయవలసి వచ్చింది. ఆహారాన్నిబట్టి శరీరం వుంటుందిగాని స్వభావం వుండదు. రూపాన్నిబట్టి స్వభావం వుంటుందనేదే ప్రసిద్ధి. దీన్ని కాళిదాస మహాకవి కుమార సంభవం పంచమసర్గలో

'యదుచ్యతే పార్వతి! పాపవృత్తయే
న రూప మిత్య వ్యభిచారి తద్వచః'

అని, 'చక్కని రూపం ఉన్నచోట మంచి గుణాలే ఉంటాయిగాని చెడ్డగుణాలు ఉండవు' అని చెప్పి యున్నాడు. శ్రీనాథుడున్నూ దీనినే హరవిలాసంలో

'రూపము కలచోఁ బాప
వ్యాపారం బుండదనెడి వాక్కు నిజంబో'

అని అనువదించియున్నాడు. అందువల్ల ఆహారాన్నిబట్టి స్వభావం వుంటుందని అనుకోవడం పొరపాటు.

ప్రథమాశ్వాసంలోని 128 వ పద్యం

'పైపయి కౌతుకంబు దయి
వాటి యిటుండఁగ నంత మజ్జనం
బై పువుఁ జప్పరమ్మున నా
యారముగాఁ గయిసేసి దాన శ్రీ
లా పరతంత్రుఁడై కల క
ల న్నగుచుండెడి సవ్యసాచి నిం

క్రొవలరోచిఁ జూచి తల
యూఁచి యులాచి రసోచితంబుగన్'

అనేది. ఇందులో దానలీలా పరతంత్రుడైన అర్జునుడు కలకల నవ్వుతున్నాడని యిదివరలో వ్యాఖ్యాతలు అర్థం చెప్పారు. దానం చేస్తున్నప్పుడు కలిగే ఆనందంలో మందహాసం కలగడం అసహజంకాదు. కాని 'దానాలు ఆసక్తితో చేస్తూ ఉన్నప్పుడు ఈ నవ్వు ఎందుకు? సమంజసముకాదు'అని ధర్మారావుగారు విమర్శించారు. ఇలా విమర్శించి తాము 'కలకలన్ నగుచుండెడి=ముఖము కళకళలాడుతూ (మిక్కలి ఆనందముతో) ప్రకాశిస్తూవున్న—అనగా చాల శోభాయమానముగా ఉన్న' అని అర్థం వ్రాశారు. కాని 'కలకలన్నగుచుండెడి' అనేది యీ పద్యాన్నిబట్టి 'సవ్యసాచి'కి విశేషణం. పద్యంలో లేని ముఖానికి దాన్ని అంటగట్టడం, ఆ ముఖపదాన్ని అర్థంలో చొప్పించడం సమన్వయ సరళికాదని స్పష్టంగా తెలుస్తూనే ఉన్నది.

ఇక్కడి కలకలపదం అవ్యక్తత్వాన్ని తెలుపుతుంది. అవ్యక్తమైన నవ్వు, మందహాసమే అవుతుంది. అది దాతలకు దానం చేసే సమయంలో సహజమైనదే!

అర్జుని చక్కదనాన్ని వర్ణించే సందర్భంలో చేమకూరకవి

'కమ్మని జాళువా నొరయఁ
గల్గిన చెక్కుల టెక్కువాఁడు చొ
క్కమ్మగు జాతికెంపు వెల
గాఁగొను మోవిమెఱుంగు వాఁడు—'

[ఆశ్వా. 1. పద్య 135.]

అని చెప్పియున్నాడు. ఇందులోని విశేషార్థాలను వివరిస్తూ శ్రీ ధర్మారావుగారు 'పెదవి జాతికెంపును 'వెలగా' తెల్లదానిగా, కొనున్ = భావించును—ఆ రూపంగా తన ఆధిక్యమును స్థిరపరుచుకొనును' అని వ్రాస్తూ, దానికి సమర్థకంగా క్రింది విషయాన్ని చేర్చారు—

'వెల అన్నది వెల్ల అన్నమాటకు సూక్ష్మరూపము. తెల్లని అని అర్థము. 'వెల వెల'లోనూ, 'వెల్వెల'లోనూ తెల్లని అన్న అర్థములోనే 'వెల' రూపము కనబడుతూ ఉంది......చూడండి. '...రతిశాతాంగనా నేత్రకో, ణ నికాయంబుల డాచి తద్ధవళిమన్ తాఁ బూనెనో చొప్పు మ్రా, ర్పననన్ వెల్వెలఁబాఱ దీపకళికా వ్రాతంబు శాతోదరీ' అల్లసాని మనుచరిత్ర'

కాని వెల్లశబ్దానికి ద్విత్వలోపం ఆమ్రేడితంతోనే కానవస్తున్నది. వెలవెల పోవడం అంటే తెల్లదనాన్ని పొందడమనే అర్థం వస్తే రావచ్చును. కాని వైవర్ణ్యాన్ని తెలిపినప్పుడే వెలవెల పోవడమనేది కవి ప్రయుక్తమై ఉంటున్నది. 'వెలగాన్' అంటే 'తెల్లగా' అనే అర్థంలో కవులు ప్రయోగించినట్లు కానరాదు. ఆమ్రేడితంగా ఉన్నప్పుడయితే తెల్లదనం అనే అర్థాన్ని చెప్పుకోవచ్చును. ఇక్కడ ఆమ్రేడితం లేదు. ఆయన చెప్పిన విశేషార్థం ఇక్కడ వచ్చేటట్లు తోచదు.

మొదటి ఆశ్వాసంలోని 141 వ పద్యమైన సీసపద్యపు యెత్తుగీతిలో

'కంటసరి నంటుకస్తురి కమ్మవలపు' అనే చరణం ఉన్నది, దీన్ని వ్యాఖ్యానిస్తూ శ్రీ తాపీవారు 'కంటసరి (కుతిగంటు—కుత్తిగంటు) అను కంఠాభరణమును అవివాహితలగు స్త్రీలు మాత్రమే ఉపయోగిస్తారనీ, అది ధరించిన కాంత కన్యక అనీ గ్రహించాలి' అని వ్రాశారు.

కంటసరికే కంట సరమన్నది రూపాంతరం. అది స్త్రీలు, ధరించే కంఠాభరణ మన్నట్లు కవి ప్రయోగాలవల్ల తెలుస్తూ ఉన్నది. కంటసరి అంటే కుతిగంటు అవునోకాదో వివరంగా తెలియదు. (నిఘంటువులలోనూ, కవిప్రయోగాలలోనూ కుతికంటు అనే కానవస్తున్నది.) ఒకవేళ కుతిగంటే అని అనుకున్నా—అది కన్య, వివాహిత అనే భేదంలేకుండా స్త్రీలందరూ ధరించే కంఠాభరణమైనట్లు ప్రబంధాలవల్ల తెలుస్తున్నది. ప్రస్తుత కాలంలో పెండ్లితంతులో మంగళసూత్ర ధారణానంతరం నాగవల్లి జరిగే సమయంలో వధువు ధరించే నల్లపూసల పేరు 'కుత్తిగంటు'గా ప్రసిద్ధమై ఉన్నది. శ్రీ తాపీవారి వ్యాఖ్య పయి విషయానికి విరుద్ధంగా కానవస్తున్నది.

ప్రథమాశ్వాసంలోనే 161 వ పద్యంలో

'అన విని పాఁపపూప జవ
రా లెదలో వలపాపలేక యా
తని తెలిముద్దు నెమ్మొగము
తప్పక తేటమిటారి కల్కి చూ
పునఁ దనివారఁ జూచి......'

అని ప్రతులన్నిట్లోనూ 'ఎదలో వలపాపలేక' అనే వున్నది. 'మనస్సులోని ప్రేమను అణచుకోలేక'అని దీని అర్థం. అనుప్రాసప్రియుడైన చేమకూరకవి అనియే చెప్పినాడనుకోవడం సముచితంగా ఉంటుంది. శ్రీ తాపీ వారుమాత్రం 'వల పోపలేక' అనే పాఠాన్ని గ్రహించి 'హృదయములోని మోహమును ఓర్చుకోలేక'అని అర్థం వ్రాసి ఉన్నారు. ఈ అర్థం 'వలపు అణచుకోలేక' అనే దానికంటె రసవంతమని తోచదు. అనుప్రాసానికి అనుగుణమైన పాఠాన్ని విడిచిపెట్టి వేరే పాఠాన్ని గ్రహించడం అనవసరం. వెనుకటిపాఠం సరియైనది కాకపోతే -- ఆ విషయాన్ని సకారణంగా తెలపవలసి వున్నది. అది జరగలేదు.

ప్రథమాశ్వాసంలోని 165 వ దైన 'అనిన ఫణి జాతివీవు'అనే గీతపద్యం నాలుగవ పాదం

'చిలువ చెలువంపుఁ బల్కుల చిలువ చెలువ'

అని ఉపలబ్ధములైన ప్రతులన్నింటిలోనూ కాన వస్తున్నది. ఇందులో మొదటి 'చిలువ' పదానికి అర్థం చెప్పడం కొంత చిక్కే. వెనుకటి వ్యాఖ్యాతలు 'స్థితస్య గతి శ్చింతనీయా' అనే అభిప్రాయంతోనో యేమో' 'చిలువలు, పలవలు గల విలాసముతోఁ గూడుకొన్న పల్కులచేత' అనిన్నీ, 'చిలువలు, పలువలు గలిగి చమత్కారమగు మాటలతో' అనిన్నీ అర్థాలువ్రాశారు. చిత్ర విచిత్రంగా — చమత్కారంగా మాట్లాడుతున్న ప్పుడు ఈ నానుడిని వాడడం పరిపాటి.

ఈ అర్థం సరికాదంటూ విమర్శిస్తూ హృదయోల్లాసకారులు 'ఈ చిలువలూ, పలువలూ ఏమిటో, అవి ఉలూచి పలుకులలో ఎక్కడ కని పించాయో, చిలువలూ, పలువలూ అన్న అర్థము ఏ మాటనుబట్టి చెప్పారో—బులుసువారుగాని, వేదము వారుగాని చెప్పలేదు' అని వ్రాశారు. కాని, శ్రీ తాపీ వారున్నూ ఆ పాఠాన్నే గ్రహించి 'చిలువ' శబ్దానికి పాము అనే అర్థాన్నే (నిఘంటువులలో ఆ అర్థమే ఉన్నది కాబట్టి) గ్రహించి 'నాగుపామువంటి అందము కల మాటలతో' అని అర్థం చెప్పారు. 'మాటలకూ, నాగుపామునకూ పోలిక యేమిటి?' అని అందరికీ సందేహం కలగక తప్పదు. అందుకోసమే ఆయన 'చిలువ=నాగుపాము చాల అందమయిన జంతువు. ఆపడగా, ఆ కదలికా, శరీరమూ ఎంత చూచినా చూడాలనే ఉంటుంది. కాని, భయము. దీనిని బట్టి చిలువచెలువము అంటే భయముకలిగించే అందము అవుతుంది. అటువంటి పలుకులు అంటే—అందముగా వినడాని కింపుగా ఉండి, భయము కలిగించే భావము గల మాటలన్నమాట' అంటూ వివరణం వ్రాశారు. కాని 'చిలువలూ, పలువలూగల విలాసంతోడి మాటలు' అనే అర్థం ఎలా అసంతృప్తికరమో, ఇదీ అంతకంటే అసంతృప్తికరంగానే ఉన్నది. మాటలకు నాగుపాముతో పోలికను సమర్థించడం కుదరదు. శ్రీ తాపీవారు చూపినభావం ఎంతో అస్వాభావికంగా ఉన్నది. వెనకటి వ్యాఖ్యాతల అర్థాలే కొంత సబబుగా కనిపిస్తాయి.

ఈ నడుమ ఎమెస్కోవారు (ఎం. శేషాచలం కంపెనీవారు) ప్రకటించిన విజయ విలాసంలో, తత్సం పాదకులు ఇక్కడ ఇలా వ్రాశారు—

ఇందు 'చిలువ చెలువంపుఁబల్కులన్' అను పదములకు హృదయోల్లాస వ్యాఖ్య 'నాగుపాము వంటి యందముగల మాటలతో'నని యర్థమువ్రాసి 'భయము కలిగించే అందము' అను విశేషార్థమును దెల్పినది. నాగుపామునకు భయము కలిగించు నందమున్న మాట యథార్థము కావచ్చును. కాని యులూచి పల్కులు భయము గలిగించు నందమైన పల్కులా? ఆ పలుకులను విని యర్జునుఁడు భయపడెనా? భయ పడి యులూచిని జేపట్టెనా? 'వలచి వలపింపదే యెంత వారినైన' (1—110). ఉలూచి యర్జునుని వలచి నది. అతఁడు తన్ను వలచునట్లు చేసికొన్నది. అర్జునుఁ డామె సౌందర్యమునకు ముగ్ధుఁడై పరిగ్రహించినవాఁడే కాని, భయపడికాదుగద! (చూ. 1—104). చిలువ చెలువము వేఱు. నివ్వెర గొలుపు చుఱుకుఁదనము, వక్రగతి— యందలి విశేషములు. ఉలూచి సోయగములో

నామె యొయ్యారములోని నీ చక్కందనములు. ఆమె పలుకులలోని వక్రోక్తిసౌందర్యము విజయుని లోఁగొన్న వనుట సరసము. దీనికి వ్రాత ప్రతిపాఠ మిట్లున్నది—

‘చెలువు చెలువంపుఁ బల్కులఁ జిలువ చెలువ’ చెలువు చెలువంపుఁ బల్కులన్=అత్యంతవిలాసయుక్తమైన పలుకులచేతనని.’

(ఎమెస్కో. విజయవిలాసము—పరిష్కరణము—పాఠనిర్ణయము. పుటలు 41, 42.)

పయి సంపాదకుల పాఠం కొంత సరసంగా ఉన్నది. హృదయోల్లాసంలో గ్రహించబడిన అర్థం మాత్రం సరసమైనది కాదని స్పష్టంగా తెలుస్తున్నది.

మొదటి ఆశ్వాసంలో 193—వ సంఖ్య గల గద్య అర్జునుడు చూచిన వివిధక్షేత్రాలను వివరిస్తూ ఉన్నది అచ్చటి కాశీవర్ణనలో ‘అన్నపూర్ణ విశాలాక్షీ సనాథుం గాశీవిశ్వనాథుం దర్శించి’ అని వున్నది. శ్రీ తాపీవారు దానికి ‘అన్నపూర్ణ అయిన విశాలాక్షిపేరు గల దేవితో కూడియున్న కాశీ విశ్వనాథుని పూజించి’ అని అర్థం వ్రాశారు.

ఈ అర్థం ఉచితమైనదికాదు. మూలంలో ‘అన్నపూర్ణా’ అని దీర్ఘం ఉండాలి. వెనుకటి ప్రతులలో ఆ విధంగానే ఉన్నది. వీరెందుకు హ్రస్వంగా మార్చారో, అలా మార్చుడంవల్ల వచ్చిన ప్రయోజనం ఏమిటో తెలియదు. అన్నపూర్ణవేరు; విశాలాక్షివేరు. ఇద్దరూ అభిన్నలని అనుకోవడం పెద్ద పొరపాటు. ‘అన్న పూర్ణాదేవితోనూ, విశాలాక్షీదేవితోనూ కూడియున్న కాశీవిశ్వనాథుని—’ అని అర్థం చెప్పవలసి ఉన్నది. కాశిలో అన్నపూర్ణగుడి విశ్వేశ్వరాలయానికి సమీపంలో ఉన్నది. విశాలాక్షిగుడి కొంతదూరంగా ఉన్నది. కాశీనిగురించి తెలిసినవారికి ఇది కొత్తకాదు. ‘అన్నపూర్ణ అయిన విశాలాక్షి పేరుగలదేవి’ అంటే ఏమిటో అర్థం కావడం లేదు. మరిన్నీ యిక్కడ ‘దర్శించి=పూజించి’ అని అర్థం చెప్పడంకూడా ఉచితమైనట్లు తోచదు.

ద్వితీయాశ్వాసంలోని పన్నెండవ పద్యం

‘సుత్రామని భుఁడు పాండ్య ధ
రిత్రీవిభుఁ డానతీయ శృంగార కళా
చిత్రాంగదయుత యగు నా
చిత్రాంగదఁ బెండ్లికూఁతుఁజేసిరి కాంతల్’

అనేది చిత్రాంగదా వివాహాలంకరణాన్ని వర్ణిస్తూ ఉన్నది. ఇక్కడ హృదయోల్లాసంలో ‘శృంగారకళా చిత్రాంగదయుత’ అనే దానికి ‘శృంగార=అందమైన కళా=పనితనమువల్ల, చిత్ర=అద్భుతంగా ఉన్న, అంగదయుత=అందెలతో ఉన్న’ అని అర్థం ఇవ్వబడి ఉన్నది. పూర్వ వ్యాఖ్యాతలు ఇక్కడ అంగద శబ్దానికి భుజకీర్తులనే అర్థం వ్రాశారనిన్నీ, అంగద పదానికి ఆ అర్థం వున్నప్పటికీ దాని నిక్కడ చెప్పడం సముచితం కాదనిన్నీ ధర్మారావుగా రాక్షేపించారు. 2 వ ఆశ్వాసం 15—వ పద్యంలో ఈ కవియే ‘అల పెండ్లికూతురును వచ్చె రణచ్చరణాంగదంబులన్’ అని కాలి అందె లనే చెప్పెడనీ, అక్కడ అందెలనుచెప్పి, యిక్కడ భుజకీర్తులను చెప్పడం ధర్మం కాదనీ ధర్మారావు గారన్నారు.

15—వ పద్యంలో ‘రణచ్చరణాంగదంబులన్’ అని వుండడంవల్ల తప్పకుండా అందెలనే అర్థాన్నే చెప్పవలసి ఉన్నది. 12—వ పద్యంలోని అంగదశబ్దానికి చరణసంబంధం చెప్పబడలేదు. ఆ అర్థమే చెప్పితీరాలని నిర్బంధంలేదు. ‘భుజకీర్తు’లనే అర్థం ‘శృంగార కళాచిత్ర విశేషణానికి అనుకూలమేకాని ప్రతికూలం కాదు, విరుద్ధమని అనుకొనుటకు అవకాశంలేదు. పెళ్లికుమార్తెను అలంకరించాలని పాండ్యరాజాజ్ఞ యివ్వగా, కాంతలు ఆమెకు ఒక్క అందెలే పెట్టారనీ. భుజకీర్తులను పెట్టలేదనీ చెప్పడం సబబుగా లేదు. తమ యిష్టాన్ననుసరించి శ్రీ తాపివారిక్కడ అంగద పదానికి అందె అనే అర్థాన్నే గ్రహిస్తే గ్రహించవచ్చును. రెండో అర్థం ఉచితం కాదనడంమాత్రం పూర్వవ్యాఖ్యాతలను ఆక్షేపించడంకోసమే అని అనుకోవలసి వస్తున్నది.

చిత్రాంగదా సౌందర్యాన్ని వర్ణించే సందర్భంలో

'హరిపతి నడుమున కోడెన్
గరునపు నడకలకు నోడె గజపతి, యిఁక నీ
నరపతి లోనగు టరుదే
వరవర్ణిని మెఱుఁగువాఁడి వాల్చూపులకున్.'

అని రెండవ ఆశ్వాసంలో (పద్య. 17) ఉన్నది. చిత్రాంగద నడుము సింహం నడుముకన్నా సన్నమనీ, ఆమెనడక ఏనుగు నడకకంటెనూ ఠీవి కలదనీ, అట్టియామె వాలుచూపులకు అర్జునుడు లొంగి పోవడంతో ఆశ్చర్యం లేదనీ దీని అభిప్రాయం.

ఇక్కడ ఒక విశేషం ఉన్నదంటూ శ్రీ ధర్మా రావుగారు 'హరి అనగా—ఇక్కడ అశ్వము అని రెండో అర్థము చెప్పుకుంటే—హరిపతులు = అశ్వపతులు అవుతారు. ఈ అశ్వపతులన్నపేరు బహమనీ రాజులకు బిరుదనామము. ఉత్కళ దేశరాజులకు గజపతులన్న బిరుదు సుప్రసిద్ధము. విజయనగర రాజులను నరపతు లనేవారు. రాయలవారి శత్రువులు బహమనీ కళింగ రాజులు. యుద్ధములో వారు పారిపోవడం కద్దు. తంజావూరు ప్రజలకు ఈ పద్యము ఆ ముచ్చటను స్మరణకు తేకపోద' అని చెప్పియున్నారు.

కాని, యీ విశేషార్థాన్ని చెప్పితే ఇక్కడ పెద్ద చిక్కువస్తుంది. 'అశ్వపతులైన బహమనీ సుల్తానులూ గజపతులైన ఉత్కళరాజులూ ఓడిపోయారంటే— నరపతులైన విజయనగర ప్రభువులు ఓడిపోవడంలో ఆశ్చర్యంలేదు' అని అర్థం వస్తూ ఉండడంవల్ల విజయనగర రాజులు అశ్వపతి, గజపతులకంటె చాలా తక్కువవారని అర్థం వస్తుంది. నాయకరాజులు విజయనగర ప్రభువులకు సామంతరాజులుగదా! ఆ నాయకరాజుల ఆస్థానంలోని చేమకూరకవి విజయనగర ప్రభువుల నిలా తక్కువచేసి చెప్పివుంటాడని అను కోవడం సరిగాలేదు. ఇక్కడ యిలాటి చిక్కులు కల్గించే విపరీతపు విశేషార్థాలను తియ్యడంకంటె సాధారణంగా హరిపతి, గజపతి, నరపతులని అనుకోవడమే ఉత్తమం. సింహంకంటెనూ, ఏనుగుకంటెనూ నరుడు బలహీనుడగుట స్వాభావికమేకదా!

ద్వితీయాశ్వాసంలోని 108 వ పద్యంలో
'ఈ, బిత్తరిముద్దు నెమ్మొగము
పిన్నమ పున్నమ చందమామకున్'

అని సుభద్ర ముఖము పున్నమచందమామకు పిన్నమ్మ— పోలికగల పద్మం—అంటే ఆమె ముఖం పద్మంవలె ఉన్నదనేభావం తెల్పబడిఉన్నది.

ఇక్కడ శ్రీ వేంకటరాయశాస్త్రిగారు 'పిన్నమ్మ అనగా మహాలక్ష్మి కావున—ఈ ముఖము పూర్ణిమా చంద్రునియొక్క సిరి'అని చమత్కారాన్ని చూపించారు. శ్రీ తాపీవారు శాస్త్రిగారు చెప్పినది సరికాదంటూ 'వ్యవహారములో పెద్దమ్మ అంటే దరిద్రదేవత అనే ఉందికాని, పిన్నమ్మ అనగా లక్ష్మీదేవి అని ప్రసిద్ధంగా లేదు' అని వ్రాశారు. పిన్నమ్మ అంటే లక్ష్మీదేవి అని సామాన్యంగా అందరూ ఎరిగినదే! ధర్మారావుగారి వంటి విజ్ఞులు దీన్ని గమనించక పోవడం చాలా వింతగా ఉన్నది. శాస్త్రిగారు 'అవు'నన్నది 'కా'దని చెప్పడానికే యీ విధంగా వ్రాశారా? అని అనుకోవలసి వస్తున్నది.

ద్వితీయాశ్వాసంలోని 117 వ పద్యం—
'సీరియు నిటులా సౌనా
సీరియు నన్యోన్య సూక్తి జితమానసులై
పోరాని కూర్మి నుండఁగ
నా రామునికడకు నంత హరి సనుదెంచెన్'.

అనేది. ఇక్కడ రెండోపాదంలో 'జితమానసులై' అనే దానికి బదులుగా 'సితమానసులై' అనే పాఠాంతరం ఉన్నది. పయి రెండు పాఠాలూ సరికావంటూ శ్రీ .తాపీవారు 'హితమానసులై' అని గ్రహించి 'అన్యోన్యసూక్తి=ఒకరికొకరు మంచి మాటలచేత, హిత=స్నేహభావముతో కలిసిన, మానసులై=మన స్సులు కలవారై' అని అర్థం తెలిపారు.

శ్రీ ధర్మారావుగారు పాఠాన్ని మార్చారేకాని, అలామార్చడం సరియైనదేనా? మార్చితే యతికుదురు తుందా? అని ఆలోచించినట్లులేదు. 'హిత' అని దిద్దడంవల్ల యతి భగ్నమైపోతుందని అందరూ గ్రహించగలరు.

సుభద్రా వివాహ సందర్భంలో ముత్తయిదువులు పెళ్లికూతుర్ని తీసుకు వచ్చేరని చెప్పినప్పుడు

'.......... .........అవ్వేళఁ గ
న్యారత్నంబును దోడితెచ్చిరి జనా
నందంబుగాఁ బాడుచున్
బేరంటాండ్రురు మంత్రవర్ణపఠనా
ప్తిన్ గర్గుఁడున్ దేవతా
పౌరోహిత్య ధురంధరుండు శుభ మొ
ప్పన్ ద్రోల నేతేరుగన్.'

[ఆశ్వా, 3. పద్య. 106]

ఇక్కడ వెనుకటి వ్యాఖ్యాతలు 'పేరంటాండ్రురు=ముత్తయిదువలు' అని వ్రాశారు. శ్రీ తాపీవారు 'పేరంటాండ్రు' అని మాత్రం గ్రహించి 'రు'ను ఉత్వసంధి ననుసరించి 'ఉరు' అని విభజించి, దాన్ని మంత్రాలకు విశేషణంగా చేసి 'ఉరు మంత్రవర్ణ పఠనాప్తిన్=గొప్ప వేదమంత్రముల పఠనముతో కూడినవారై—అనగా వేదమంత్రములను పఠించుతూ' అని అర్థం ఇచ్చారు. వారు అంతటితో ఊరుకోలేదు. ''కొందరు 'పేరం టాండ్రురు' అని బహువచనముమీద బహువచనము ఉంచి వ్యాఖ్యానించారు. ఈ బహువచనముమీద బహువచన ప్రయోగము చేమకూర కవికి అలవాటులేని క్లిష్టప్రక్రియకాబట్టి 'ఉరుమంత్రవర్ణ పఠనాప్తిన్' అనుట సమంజసము'' అని వివరించారు.

వ్యాకరణ సమ్మతంకాని ఎన్నోప్రయోగాలు వాడిన చేమకూరకవి లాక్షణికు లంగీకరిస్తూఉన్న యీ 'పేరంటాండ్రురు'ను వాడలేదనడంలో ఔచిత్యం లేదు. 'ఉరు' విశేషణం మంత్రాలకు అనవసరం. మంత్రాలలో గొప్పవీ, కొద్దివీ అనే భేదంలేదు. విజయ విలాసకర్త వ్యర్థపదప్రయోగాలకు అలవాటు పడ లేదు.

తృతీయాశ్వాసంలోని 189వ పద్యం 'చందురు రాతి బాగడపు...'అనే పద్యాన్ని హృదయోల్లాసకారులు వ్యాఖ్యానరహితంగానే విడిచిపెటారు. 'ఈ పద్యములో దంపతుల కేళీగృహవర్ణన కవి చేస్తున్నాడు. ఆనాడు తంజావూరు మందిర నిర్మాణములలో ఉపయోగించే పారిభాషికపదాలు చాలా వాడుక చేశాడు. ఈనాటి మన కవి చక్కగా అర్థం కావు' అని తెలియ జేశారు. ఆ తర్వాత వేదము వేంకటరాయశాస్త్రి గారి వ్యాఖ్యానం ఉద్ధరణ చిహ్నాలలో ఇయ్యబడింది. ఆ పైని 'ఏమయినా వ్యర్థ ప్రయాస అని ఇంత కంటే ఎక్కువ వ్రాయలేదని మనవి చేస్తున్నాను' అనికూడా ఉన్నది. శ్రీ శాస్త్రిగారి వ్యాఖ్య సరియైనది అవునో, కాదో తెలుపబడలేదు. ఎంతో కాలం నుంచీ ఈ ప్రబంధం గురించే ఎక్కువ పరిశ్రమ చేసిన శ్రీ తాపీవారు ఇట్టి పెద్దవ్యాఖ్యలో ఈ పద్యాన్ని వ్యాఖ్యానించకుండా విడిచిపెట్టడం లోపమే!

మూడవ ఆశ్వాసం 236 వ పద్యం యిది—

'మనుమార్గమున భూమి మను మార్గమంతయు
స్థిరబుద్ధియగు యుధిష్ఠిరుఁడు దెలుపఁ,
బాటవవద్వైరి పాటన క్రమమెల్ల
దరవర్జితుఁడు వృకోదరుఁడు దెలుప
రంగదుత్తుంగ తురంగాధిరోహ ము
ద్దండబాహుఁడు నకులుండు దెలుప
సురభి రక్షణకీర్తి సురభిళ దిఙ్మండ
లుండగు తదనుజన్ముండు దెలుప

వివిధ కోదండ పాండిత్య విలసనంబు
దానె తెలుపంగ నేర్చిన తనయుఁ డెపుడు
సేవఁ జేయంగ సంతతశ్రీ వెలుంగ
విజయుఁ డలరారె శాశ్వత విజయుఁ డగుచు.'

ఈ పద్యంలో అభిమన్యుడికి ఎవ్వరెవ్వరు ఏమేమి నేర్పారో చెప్పబడి ఉన్నది. మనువు పద్ధతి ననుసరించి నడుచుకొనే పద్ధతిని ధర్మరాజున్నూ, శత్రువులను నశింపజేసే పద్ధతిని భీమసేనుడున్నూ, అశ్వారోహణ పద్ధతిని నకులుడున్నూ, గోవులను కాపాడే విధమును సహదేవుడున్నూ చెప్పారనీ, ధనుర్విద్యను స్వయంగా అర్జునుడే అభ్యసింపజేశాడనీ ఇందులో ఉన్నది.

ఈ పద్యంలోని నాలుగవ పాదానికి అర్థం వ్రాస్తూ శ్రీ ధర్మారావుగారు 'సురభిరక్షణ కీర్తి సురభిళ దిజ్మండ లుండు' అని ఏకపదంగా తీసుకుని 'సురభి=గోవులను, రక్షణ=పోషించుట అనే, కీర్తి= కీర్తిచేత, సురభిళ=పరిమళించుచున్నట్లు చేయబడిన, దిక్మండలుండు=దిక్కుల సమూహము కలవాడు' అని వ్యాఖ్యానించారు. ఇక్కడ 'సురభిరక్షణ' వేరే పదం. 'గోవులను రక్షించుట'అని దాని అర్థం. దాన్ని 'కీర్తిసురభిళ దిజ్మండలుండు' అనేదానితో కలపడం సరికాదు. అలా కలిపితే 'తెలుపన్' అనేదానికి అన్వయం కుదరదు. 'సురభిరక్షణ'ను వేరుచెయ్యకపోతే సహ దేవుడు దేనిని తెలిపినట్లు? అందువల్ల దాన్ని ఎంత మాత్రమూ ఏకపదంగా గ్రహించకూడదు.

శ్రీ ధర్మారావుగారు తమ బహుకాల కృషి ఫలితంగా విజయవిలాసానికి పెక్కు విశేషార్థాలతో బృహద్వ్యాఖ్యాన్ని రచించి ప్రకటించడం హర్షదాయ కమే! అట్టి వ్యాఖ్యలో ఇటువంటివీ, అనవసరంగా ఇతర వ్యాఖ్యాతలను గురించిన ఆక్షేపణలూ లేకుండా వుంటే ఎంతో బాగుండేది.



లగూరగంప :

# రచయితలు - రష్యా

పోయిన్నెల భారతిలో ప్రఖ్యాత రష్యన్ రచయిత సోల్ఝెనిత్సిన్ అవస్థ వ్యాసం చదివిన తరువాత కొన్నిమాటలు వ్రాయాలనిపించింది.

రష్యాలో ఉత్తమ రచయితలందరూ ప్రభుత్వ ఆగ్రహానికి గురికాక తప్పడం లేదు. డాస్టోవిస్కీని ఖైదీగా సైబీరియా పంపినప్పుడు అక్కడి అనుభవాలను 'మృతగృహం' అనే గ్రంథంగా వెలువరించాడు. స్టాలిన్ రష్యాలో కార్మిక శిబిరాలకు పంపినప్పుడు అక్కడి అనుభవాలను సోల్ఝెనిత్సిన్ 'ఇవాన్‌దేనిసోవిచ్ జీవితంలో ఒక రోజు' అన్న గ్రంథం వ్రాశాడు. ఈ రెండు నవలలూ స్వీయానుభవాల ఆధారంగా వ్రాసినవి. డాస్టోవిస్కీ నవల 1862 లో ప్రచురితం. సోల్ఝెనిత్సిన్ నవల 1962 లో ప్రచురింపబడింది. రెంటికీమధ్య వంద సంవత్సరాల వ్యవధి. డాస్టోవిస్కీ నవల జార్‌ల జమీందారీ వ్యవస్థకూ, సోల్ఝెనిత్సిన్ నవల స్టాలిన్ విధానాలకూ వ్యతిరేకంగా వ్రాయబడినాయి. 1917 లో విప్లవం వచ్చింది. ఈ విప్లవం కేవలం రష్యాలోనేకాదు. ప్రపంచంలోనే గొప్పమార్పును తీసుకు రాగలిగింది. సమాజ సిద్ధాంతాలూ, భావాలూ ఎట్లా వున్నప్పటికీ నిరంకుశత్వం రచయితలను మేధావులనుపట్టి పీడిస్తూనే వుంది. రష్యా ఎంతో అభివృద్ధి పొందింది అని అనుకుంటున్నాం. కాని పై నవలల దృష్ట్యా ఎంత మాత్రం మార్పు రాలేదనిపిస్తుంది. ఇద్దరు రచయితలూ భిన్నకాలాలలో భిన్నవ్యవస్థలలో జీవించినవారు. పరిస్థితులను వర్ణించటంలో భేదంలేదు. ఆనాటి పరిస్థితులు క్రూరంగా, నిరంకుశంగా ఉన్నట్లే వర్ణించారు. చెకోవ్ వ్రాసిన 'సఖాలిన్‌దీవి' (1894) అనే గ్రంథంకూడా కారాగారసాహిత్యానికి సంబంధించిందే, అయితే అవి నవలలు. ఇది రిపోర్టేజ్.

డాస్టోవిస్కీ మృతగృహాన్ని వర్ణిస్తాడు చూడండి. 'చిన్నచిన్న కిటికీలు. దట్టంగా మంచు. కిటికీ గాజుపలకలపై అంగుళం మందాన మంచు. ఏ సమయంలోనూ చదువుకోడానికి సాధ్యపడదు. సీలింగుల్లోంచి బొట్లు కారుతుంటాయి. కింద నీళ్ల మరకలు. పీపాలో చేపల్ని బంధించినట్లుగా మమ్మల్ని బంధించారు. పొద్దున్నుంచి సాయంత్రంవరకూ బయటికి వెళ్లటానికి వీల్లేదు. తలుపులు ఎప్పుడూ బంధించే వుంటాయి. ఒక తొట్టె పెట్టారు. ఆధార మేమీలేదు. నేరస్థులందరూ పందులవలె కాలకృత్యాలు తీర్చుకోవాలి. ఒకొక్కరికి రొట్టె, కాబేజి పులుసు, పావు పౌను ఆవు మాంసం యిస్తారు...'

సోల్ఝెనిత్సిన్ రోస్టోవ్ యూనివర్శిటీ గణితశాస్త్ర పట్టభద్రుడు. ద్వితీయ సంగ్రామకాలంలో రెండుసార్లు సన్మానింపబడ్డాడు. కెప్టెన్ హోదా వచ్చింది. 1945 లో అరెస్టుచేసి ఆర్కిటిక్ ప్రాంతానికి పంపారు. ఎనిమిదేళ్లు శిక్ష విధించారు. గ్రంథంలో కార్మిక శిబిరాలలో పనిచేసిన ప్రాంతం ఉత్తర కాక్సస్ అని పేర్కొన్నాడు. బెలిన్‌స్కీ గోగోల్‌కు వ్రాసిన క్రిమినల్ లెటరు ఒక సమావేశంలో డాస్టోవిస్కీ చదవటమే పెద్ద నేరంగా పరిగణించారు.

1970 లో నోబుల్ బహుమతి సోల్ఝెనిత్సిన్‌కు వచ్చింది. కాని స్వీకరించలేకపోయాడు. స్వీడిష్ అకాడమీ కార్యదర్శికి వీసా యివ్వటానికి రష్యా అంగీకరించలేదు. తత్ఫలితంగా సోల్ఝెనిత్సిన్ తన లాంఛనాలను చిన్నకుమారునికి దత్తంచేసినట్టు మాస్కోలో స్వీడన్ ప్రతినిధులముందు ప్రకటించాడు. స్నేహితుడు పాస్టర్‌నాక్ మరణించినప్పుడు సోల్ఝెనిత్సిన్ ప్రజలకు కనిపించాడు, అదే చివరి దర్శనం, ఇటీవల

అంతర్జాతీయ హెరాల్డ్ ట్రిబ్యూన్ పత్రిక ప్రతినిధి హెడ్రిక్‌స్మిత్, వాషింగ్టన్‌పోస్టు పత్రిక ప్రతినిధి రాబర్టు కైయిజరులు సోల్‌ఝెనిత్సిన్‌తో ఇంటర్వ్యూ జరిపారు. ప్రజలు తనతో మాట్లాడటానికే భయపడుతున్నారు. తనను చూచేవారిని ఒక్కరినికూడా చూడలేకపోయాడు. నివసించే యిల్లు లేదు. ఫోను లేదు. మిత్రులు లేరు. భార్యను పనిలోంచి తొలగించారు. తనచుట్టూ అసహ్యకరమైన వాతావరణాన్ని సృష్టించారు. మీరు పాశ్చాత్యులు. నా పరిస్థితి మీ రూహించలేరు. నేను నా దేశంలోనే బ్రతుకుతాను. రష్యాను గురించి నవల రాస్తానన్నాడు. రష్యా దేశపు చర్చికి ఒక బహిరంగ లేఖ వ్రాస్తూ రెండు వేల సంవత్సరాలనుంచి కనపడని కళ్ళద్దాలతో నాస్తికులు నియంతృత్వంతో పరిపాలిస్తున్నారనీ, దూరంగా వున్న ఆసియా, ఆఫ్రికాలలో జరిగే ... తీవ్రంగా చర్చి ఖండిస్తుందికాని మనదేశంలోని కుళ్ళును ఎన్నడూ పట్టించుకోదని ధైర్యంగా ప్రకటించాడు. ప్రజల ఇష్టానుసారంగా ఎన్నుకోబడ్డారా లేక నియమించబడ్డారా అని జార్ చక్రవర్తుల్ని ప్రశ్నించటానికి సమాధులలోంచి శవాలు పైకి లేస్తున్నాయని అలెగ్జాండర్ పుష్కిన్ ఒక కవితలో వర్ణిస్తాడు. కవి వ్యక్తీకరించిన ఈ భయం ఎలా తొలగిపోతుందనేది నేటి రష్యా రచయితకూ సమస్యగానే వుంది.డాస్టోవిస్కీ వ్రాసిన చివరిమాటలు స్మరణీయాలు.

Tyranny is a habit. It can and does eventually develop into a disease. I believe that the best of men may grow couarse degrade to the level of a beast by sheer force of habit. Blood and power intoxicate one they develop callousness and lust. The greatest perversion grows finally acceptable and even delicious to mind and heart.

— శ్రీ శివకుమార్

## ఆ క ర ము

కొంతకాలము క్రిందట 'భారతి'లో శ్రీ ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులుగారు 'వ్యాకరణశాస్త్ర కావ్యములు' అను వ్యాసము వ్రాయుచు మూఁడవ పేరాలో నీ క్రింది శ్లోకము నుదాహరించి విద్వల్లోకము నిట్లు కోరిరి.

శృంగార రసప్లుతమగు నీ క్రింది శ్లోకమే గ్రంథమునందలిదో, ఏ కవిదో గుర్తులేదు. విద్వత్ప్రాశ్నిక మండలి దీని యాకరమును ప్రకటింతురు గాక.

శ్లో. 'రతాంత ఆసేచనకం నిపీయ
కాంతాధరం కాంత ఉవాచ కాంతాం,
కృతేఽఙ్గ కార్యే పున రఙ్గ కార్యం
న దృశ్యతే సుందరి పాణినీయే,'

(సురతావ సానమున ప్రియురాలి అధరోష్ఠ బింబమును ఆసేచనకముగా అపర్యాప్తముగా, ఉద్వేగములేక కుతూగ బంటిగా ఆస్వాదించి, వ్యాకరణ వేత్తయగు ప్రియుఁడు తన శబ్దశాస్త్ర వైదుష్యము నెమఱునకు రాగా, కొన్ని మాటలకు పునరుక్తి దోషములేనట్లే కొన్ని శారీరక చేష్టలకు పునరాచరణ దోషము (ఆమ్రేడిత దోషము) చుంబనాలింగ నాదులందువలె (అంగకార్యే కృతే పునర్నాఙ్గ కార్యమ్' అను పాణిని సూత్రమునుబట్టి) లేదనుచు తనచేష్టను సమర్థించు కొనెనఁట)'

వీరిట్లు వ్రాసిన దానిఁ జూచి, దీని 'ఆకరము' మున్నగు వానిని గూర్చి ఎవరైన వ్రాయఁదురేమోచూచి, యెవరును వ్రాయకుండుటచే తెలిసినంతలో నేను వ్రాయఁబూనుకొంటిని.

ఈ శ్లోకము రాధాకృష్ణ విలాసమను నామాంతరము గల 'నక్షత్రమాల' అను కావ్యములోనిది. ఈ 'నక్షత్రమాల'ను సవ్యాఖ్యానముగ నిర్ణయసాగర ముద్రాలయమువారు తమ కావ్యమాలా పంచమ గుచ్ఛమున ముద్రించి యున్నారని తెలియుచున్నది. ఇది కీ. శే. శివరామ త్రిపాఠి అను ఔత్తరాహ కవి రచించినది. ఇతఁడు 18 వ శతాబ్ది తరువాతి కాలమున నున్నవాఁడని తెలియుచున్నది.

ఈయన వ్యాకరణ పరిభాషలను సాహిత్య పరముగ రాధాకృష్ణుల యొక్కయు, నితర గోపికల యొక్కయు ఆలాపములుగ సమన్వయించి యీ కావ్య

మును వ్రాసియున్నాఁడు. ఇది అద్భుతమైన వ్యాకరణ శాస్త్రకావ్యము. కావున శ్రీ ఆచార్యులవారు తెలిపిన విధముగా భట్టి కావ్యాదులవలె దీనిని గూడ వ్యాకరణ శాస్త్ర కావ్యముగాఁ బరిగణింపవచ్చునని నా మనవి.

దీనిని ఈ నడుమనే 'అభినవ నన్నపార్య' శ్రీ పిశుపాటి విశ్వేశ్వరశాస్త్రిగారు (అస్మత్సతీర్థ్యులు) తెనిఁగించి, ప్రభాఖ్య స్వోపజ్ఞవ్యాఖ్యతోఁ జేర్చి యీ ఆంధ్రీకరణ గ్రంథమును ఈ నడుమనే 1964 సం. మున జరిగిన గురుపూజా మహోత్సవ సందర్భమున మా గురువరేణ్యులు బ్ర. శ్రీ కుప్పా శ్రీ ఆంజనేయ శాస్త్రి విద్వన్మణిగారికి కృతిగా నొసంగిరి.

దీనిలో, శివరామ త్రిపాఠిగారు రచించిన శ్లోకముల నన్నిటినిగూడఁ జివఱిభాగమునఁ జేర్చియున్నారు. ఈ పుస్తకము అనువాదకులగు శ్రీ పిశుపాటి విశ్వేశ్వర శాస్త్రిగారు ఉపన్యాసకులు, యన్. బి. కె. ఆర్. కళాశాల, విద్యానగరు, కోటపోస్టు, నెల్లూరుజిల్లా అను వారియొద్ద లభించును. విశేషములను, అందలి వివిధ చమత్కారములను అందు వివరముగ గ్రహింపవచ్చును.

ఇఁక శ్రీ వీరరాఘవాచార్యులుగా రుదాహరించిన శ్లోకము ఒక శ్లోకములోని ఉత్తరార్ధమును మఱొక శ్లోకములోని పూర్వార్ధమునునై యున్నది. అట్లు రెండు శ్లోకములలోని కొంతకొంత మాత్రమే గ్రహించుటచేతనో మూలమును జూడకపోవుటచేతనో వారు వ్రాసిన విషయము కొంత వ్యత్యస్తముగ నున్నదనుటకు నొచ్చుకొనుచున్నాను.

అసలు విషయమిది:—

'అంగకార్యే కృతే పునర్నాంగకార్యం' అను పరిభాషను రాధనుగూర్చి మాధవుఁడు పలుకు సరస వచనముగా శివరామత్రిపాఠికవి చమత్కరించి యిట్లు వ్రాసెను. ఈ పరిభాషను రెండు శ్లోకములు గలిసిన యుగ్మకములో నిమిడ్చెను. అందుచే నీ రెండు శ్లోకములకుఁ గలిసి యొకటే అన్వయము కాన వీనిని విడఁదీయఁజనదు.

శ్లో. 'మృష్టాధరా లక్త మనం జనాక్షం
పత్రావశేష విశేష శోభం ।
రతాంత ఆసేచనకం నిపీయ
కాంతాననం కాంత ఉవాచ కాంతాం॥
కృతేఽంగకార్యే పునరంగ కార్యం
న జాయతే సుందరి! దర్శనేఽపి ।
తతో వృథైషోఽస్తి పరిశ్రమస్తే
ప్రసాధనార్థం కరభోపమోరు!॥'

ఈ రెండు శ్లోకములును సంస్కృత వక్షత్ర మాలలో 7, 8 శ్లోకములుగా విలసిల్లుచున్నవి.

ఇచట 'కాంతాననం' అని నాలుగవ పాదములో నుండవలెనుగాని 'కాంతాధరం' అనునది సరియైన పాఠముగాదు. మఱియు 'నిపీయ' అను లాక్షణిక పదమునకు 'దృశా అత్యంతం దృష్ట్వా' అని యర్థము. ఇచట నీ పరిభాష రాధయొక్క పునరలంకరణ నిషేధమును సమర్థించుట కుపయోగింపఁబడినది. 'అంగ కార్యే కృతే పునర్నాంగ కార్యం' అనునది పాణిని సూత్రముగాదు. పరిభాష. ఈ పరిభాషలు పతంజలి ప్రభృతులచే ఆయా సూత్రములఁ బఠింపఁబడినవి. అందును విశేషించి యిది మహాభాష్య కారుఁడగు పతంజలిదే. దీనినే 'అంగవృత్తే పునర్వృత్తావవిధిః' అనియును బఠించియున్నారు. ఇయ్యది 'జ్ఞాజనోర్జా :' అను సూత్రమహాభాష్యములలో జ్ఞాపితమై యున్నది.

మదనకదనమున లాక్షాదికము తుడిగిపోఁగా రతాంతమున మఱల నలంకరించుకొనుచున్న రాధతో మాధవుఁడనుమాట యిది.

అధరామృతాస్వాదనమున తుడిగిపోయిన లత్తుక గల క్రిందిపెదవితోఁ గూడినదియు, నేత్రచుంబనము వలన లోపించిన కాటుకతోఁగూడిన కన్నులుగలదియు, పురుషాయితాదులచేతనైన స్వేదముచేఁ గొలఁదిగా మాత్రమే మిగిలియున్న మకరికాపత్త్ర రచనచే మిక్కిలి సుందరమైనదియునగు రాధమోమును మాధవుఁడు మిక్కిలి ఆసక్తితోఁజూచి, మఱల ప్రసాధనము (అలంకరణము) చేసికొనుటకు సిద్ధపడుచున్న యామెను వలదని నిషేధించుచు నిట్లు పలికెను. 'సుందరీ! అవయవములకుఁ గావించు నలంకార

రూపమగు కార్యము మొదటఁ జేసినయెడల దాని మీఁద మఱలఁ జేయుట వ్యాకరణశాస్త్రమునఁగూడ లేదు. ఆ విషయమును 'అంగకార్యే కృతే పునర్నాంగ కార్యం' అను పరిభాష తెలుపుచున్నది. అందుచే మఱల ప్రసాధనమునకై నీవు చేయు పరిశ్రమ వ్యర్థము సుమా! కావున మనోహారిణీ! ఈ ప్రయత్నము మానుము అని యీ యుగ్మకమునకు భావము.

దీనికి శ్రీ విశ్వేశ్వరశాస్త్రిగారి తెలుఁగుసేత యిట్లున్నది.

'మ. పరిమృష్టాధర బింబలాక్ష,
మనభివ్యక్తాంజనాక్షం, బన
క్షర, మీషత్స్థితపత్ర రమ్యమగు
తత్కాంతా ముఖాంభోజమున్
హరి వీక్షించి రతాంతవేళననె;
రాధా! యంగకార్యంబుపై
మరలన్ రాదగదంగకార్య
మిఁక రమ్మా! యేల కై సేయఁగన్॥'

ఇఁక పరిభాషా విషయమేమనఁగా:—

వారిట్లు వివరించిరి. పాణినీయమున అంగ కార్యే కృతే పునర్నాంగ కార్యమ్' అను నొక పరిభాష గలదు. దీనినే 'అంగవృత్తే పునర్వృత్తా వవిధిః' అని యును బఠించియున్నారు. 'ఏ ప్రకృతికంటె నే ప్రత్య యము విధింపఁబడునో ఆ ప్రత్యయము పరముగా నుండఁగా ఆ ప్రకృతి యాదియందుఁగల శబ్దస్వరూప మునకు అంగము' అని పేరు. అష్టాధ్యాయిలో 'సూ. అఙ్గస్య'అను సూత్రము ఆఱవ యధ్యాయము నాల్గవ పాదము మొదటి సూత్రము. ఇది యేడవ యధ్యాయము కొనవఱకును నధికృతమగును. కావున నీ సూత్ర మధి కారముగాఁ బోవునంతవఱకును విధింపఁబడు కార్యము లంగాధికారీయకార్యము లనఁబడును. ఇఁక 'అంగాధి కారీయమగు కార్యము ప్రవర్తించినపిమ్మట మఱల నంగాధికారీయమగు కార్యమురాదు' అని పై పరిభాష కర్థము.

దీనికి 'జ్ఞా జనోర్జా'అను సూత్రమున దీర్ఘాంత మగు జాదేశమును విధించుట జ్ఞాపకము. హ్రస్వాంత మగు జకారమున్న విధించినను 'అతోదీర్ఘోయఞి' అను సూత్రముచే దీర్ఘమురాఁగా 'జానాతి' అను రూపము సిద్ధించును. కావున దీర్ఘవిధానము వ్యర్థమై యీ పరిభాషను జ్ఞాపన చేసినది. ఇప్పుడు 'జ్ఞా' ధాతువు నకు అంగాధికారీయమగు హ్రస్వాంతజకారము వచ్చి నచో మఱల నంగాధికారీయమగు 'అతోదీర్ఘోయఞి' అను దానిచే దీర్ఘమురాదు. 'జానాతి' అను రూపము సిద్ధింపదు. కావున దీర్ఘాంత జకార విధానము చరి తార్థము. హే గౌరి ఇత్యాది స్థలములలో అంగాధికారీయ మగు 'సూ. అంబార్థనద్యోర్హ్రస్వః' అనుదానిచే హ్రస్వము వచ్చినపిదప, మఱల నంగాధికారీయమగు 'సూ. హ్రస్వస్యగుణః' అనుదానిచే గుణము రాకుం డుట యీ పరిభాష కన్యత్రఫలము.'

ఇట్లు దాదాపు ముప్పదిరెండు పరిభాషలను కథతో నన్వయించి రాధామాధవులను ప్రకృతి ప్రత్య యములవలె కూర్చి 'పాణినీయమును కావ్యభావమును భజించు'నట్లుచేసి లోకమున కందంజేసిన శివరామ త్రిపాఠి గారి యీ నక్షత్రమాలను శ్రీ ఆచార్యులవారు తెల్పిన భట్టికావ్య, సుభద్రాహరణాదులనువలె వ్యాకరణ శాస్త్ర కావ్యములందు జేర్చుటలో నౌచిత్యము కలదని విన్నవించుకొనుచున్నాను.

— అవ్వారి వాసుదేవ శాస్త్రి.

## 'దారిద్ర్య శోచామి...'

'పండిత రాయల వెటకారాలు' అనే వ్యాసంలో నేను ఉదాహరించిన 'దారిద్ర్య శోచామి' అనే శ్లోకం పండితరాయలది కాదనీ, శూద్రకుని మృచ్ఛకటికం లోనిదనీ శ్రీ అవ్వారి వాసుదేవశాస్త్రిగారు 1972 సెప్టెంబరు భారతిలో వ్రాసిన ఉత్తరం చూశాను.

ఉస్మానియా యూనివర్సిటీ సంస్కృతశాఖ వారు 1958 లో ప్రచురించిన 'పండిత రాజకావ్య సంగ్రహః'అనే గ్రంథంలో 157 వ పేజీలో 297 వ శ్లోకంగా దీనిని పండిత రాయల రచనగానే భావించి ప్రచురించారు. భామినీవిలాసపు వ్రాతప్రతులు మరి కొన్ని నాదగ్గర ఉన్నాయి. వాటిలో కూడా ఈ శ్లోకం ఉంది. శ్రీ శాస్త్రిగారు అన్నట్టు, ఇది పొరబాటే కావచ్చు.

పనిలోపని మరో రహస్యం. భోజచరిత్రంలోని శ్లోకాలు కొన్ని, కువలయానందంలోని శ్లోకాలు కొన్ని భామినీవిలాస ప్రకులలో కనిపిస్తున్నాయి! వేమన పద్యాలలాగే పండితరాయల చాటువులుకూడా సరిగ్గా ఇన్ని ఉన్నాయని చెప్పడానికి లేకుండా ఉంది. ఎన్నెన్నో ప్రక్షిప్త శ్లోకాలున్నూ కనిపిస్తున్నాయి. ఆయన చెప్పిన మరిఎన్ని వందల శ్లోకాలు శిలమై పోయాయో తెలియదు. చాలామంచి పండితులకు కూడా తమనోటికి వచ్చిన శ్లోకాలు కొన్ని పండిత రాయల వని తెలియదు. ఈ విషయంలో పరిశోధన అవసరం. పాఠాంతరాలు బోలెడు ఉన్నాయి. ఉత్తమ పాఠాలు నిర్ణయించాలి.

పండితరాజ కావ్య సంగ్రహంలో చూపినవి కాక అదనంగా నేను సేకరించినవి మరో ఐదువందల శ్లోకాలదాకా ఉన్నాయి. నాకు తెలిసినంతవరకూ ఇవి 1865 శ్లోకాలు. ఇందులో ఎన్ని ఇతరులవో చూడాలి. ప్రస్తుతం నేను ఈ విషయంమీదా, పండితరాయల జీవిత చరిత్రమీదా పరిశోధన చేస్తున్నాను. దొరికిన అన్ని శ్లోకాలకీ నా సవ్యాఖ్యాన ఆంధ్రీకరణం పూర్తి కావస్తోంది. దానిని గ్రంథ రూపంలో ప్రచురించేటప్పుడు ఆ ఇంకా విషయాల నన్నిటినీ గుర్తుంచుకుంటానని మనవి చేస్తున్నాను.

—మహీధర నళినీమోహన్.

## పండిత రాయల కారణ కల్పనలు

డా॥ మహీధర నళినీమోహన్‌గారు రచించిన 'పండిత రాయల కారణ కల్పనలు' అంతకుముందు ప్రచురించిన వ్యాసాలను చదువుతున్నాను. 'పండితి రాయలు మావాడోయ్' అన్న సగర్వసూక్తి నళినీ మోహన్‌గారి దయవలన తెలుగులపాలిట నిజమైనది. సెప్టెంబరు భారతిలో ప్రచురింపబడిన 'కారణ కల్పనల'లో చూతలతిక అను శీర్షికలో రాయల 'చిరక్షాంతో' అను శ్లోక ముదహరింపబడినది. ఇందులో రమ్యము నర్మగర్భితము అయిన అర్థం మరి యొకటుందని అనిపించి ఈ ఉత్తరం వ్రాస్తున్నాను.

మలయ పర్వతంనుండి వస్తున్నాను. చాలా అలసిపోయాను. ఈ ఒక్కరాత్రి నీవద్ద చోటిమ్మ అని నవకుసుమిత అయిన చూతలతిక నడిగెనట ఆ పురుషుడు. అందుకే ఆ నాయిక నహి నహి నహి అని తలను అడ్డముగా త్రిప్పినదట. ఇందులో 'నేను నవ కుసుమితను అందువలన ఈ రోజు మొదలు మూడు రోజులవరకు వీలుండదు. కనుక ఓ సమీరుడా! ఈ మూడురోజులు పోయిన తరువాత నాలుగవనాడు తప్పని సరిగ కనబడు అనెడి అర్థం ఉంది. అందుకే కవి నహి నహి నహి అని మూడుసార్లు ఉపయోగించి నవ కుసుమిత అనెడి మాట కెంతో అందాన్ని తెచ్చాడు. కాని నళినీమోహన్‌గారు అనువాదంలో 'అలపోకన్నది వద్దు వద్దని శిరస్సడ్డమ్ముగా నూచెడిన్' అనెడి మాటలో వద్దు వద్దు అని రెండుసారు లనుటలో ఆ అర్థం గ్రహించి ఉండరేమో అని నేను అనుకుంటాను. కనుక నళినీమోహన్‌గారు మూడవసారి కూడ వద్దంటే అందులో అనువాదౌచిత్యం భాసిస్తుందని తలుస్తాను.

—కాశీభొట్ల సత్యనారాయణ.

# గ్రంథవిమర్శలు

## శ్రీ వేంకటేశ్వర వచన శతకమ్

(రచన: శ్రీ సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రి: ప్రతులకు: రచయిత, 44 జీరా, సికింద్రాబాదు. వెల: రెండు రూపాయలు.)

తాళ్లపాక వెంకటేశ్వర వచనములలో నొక మారిఅటిని శ్రీ సూర్యనారాయణ శాస్త్రిగారు సంస్కృత వచనమున కనువదించిన గ్రంథమిది. తిరుపతిని చుట్టుకొని పదునైదవ శతాబ్ద మంతయు తాళ్లపాక వంశమువారు వైష్ణవభక్తిని ప్రవహింపజేసినారు. వచనములని ఇట్లు వ్రాయుట తెలుగులోనే విశిష్టముగా గలదు. వేంకటేశ్వర వచనములకు వలెనే సింహగిరి వచనములు. సంస్కృత భాషయందిట్టి రచనలు లేవనియే యందురు. అందుకే శ్రీ సూర్యనారాయణ శాస్త్రిగారు తెలుగు వచనములను సంస్కృతీకరించినారు. శ్రీ శాస్త్రిగారు సంస్కృతాంధ్రముల యందందె వేసిన చేయి. ఇప్పటికే ఆయన కళా పూర్ణోదయాది తెనుగు కృతులను సంస్కృతము చేసిన మహానుభావుడు. తెనుగు నుడికారముల సొగసులు సంస్కృత నుడికారము ద్వారా గుబాళించునట్లు చేసి చేసిన ఈ సంస్కృతీ కరణము తెలుగు చదువని సంస్కృత విద్వాంసులకు కనువిప్పు కాగలదు.

## వెన్నెల పెండ్లి

(రచన: శ్రీ నారు నాగ నార్య, ప్రతులకు: రచయిత, నాగవరము, కోడూరు పోస్టు, కడపజిల్లా. వెల: 1-50.)

ఇది అచ్చతెనుగుకావ్యము. 23—8—71 వ తేదీన మొదలుపెట్టి 5-9-71 నాటికి పన్నెండు రోజులలో శ్రీ నాగనార్య గారు దీనిని రచించినారు. మొత్తము 214 గద్యపద్యములు. శ్రీ నాగనార్య గారు వయోవృద్ధులు. కావ్యవ్యవసాయ మింకను నేర్పుగా చేయుచున్నారు. ఇప్పటికే ఇది ఆయన డెబ్బదవ కబ్బమని చెప్పబడుచున్నది. సాధారణముగా నేదే నొక ప్రత్యేకత తెచ్చిపెట్టకుండ ఆయన వ్రాయరు. తెలగనార్యుడు మొదలుపెట్టిన అచ్చతెనుగు కావ్యరచన నాగనార్యునివరకు అవిచ్ఛిన్నముగా సాగివచ్చుట విశేషము.

వలమురియను ప్రాంతమునకు చందురుడను వాడు రాజు. ఆయన ఒకనాడు వినోదార్థము అడవి తిరుగుటకు పోయి ఒకచో విడిదిచేసెను. నుడిగట్టు అను మరొక ప్రాంతము కలదు. దాని నేలురా కొమరుడా యడవికే వేటకువచ్చి తిరిగిపోవుచు చందురుని కలుసుకొనెను. ఆ తరువాత కొంతకాలమున కొకనాడొక బ్రాహ్మణుడు నుడివాలుదొరవద్దనుండి వచ్చినవాడు ఆ తమ ప్రభువు కూతును వెన్నెలనుగురించి చంద్రునకు చెప్పెను. చంద్రున కామెయందు మరులు పుట్టినది. ఆ బ్రాహ్మణుడు తిరిగిపోయి చంద్రునిగూర్చి వెన్నెలకు చెప్పి ఆమెకును మరులు పుట్టించినాడు. ఆమెవద్దనుండి తిరిగి మరలవచ్చి చంద్రుని ప్రేరేపించి నుడివాలు జేనివద్ద కొక మనిషిని పంపునట్లు చేసెను. నుడివాలురాజీ పెండ్లికి ఒప్పుకొనలేదు. వియ్యము కయ్యముదాక వచ్చినది. తాను పంపిన యాతడింకను రాలేదని చంద్రుడు విచారించుచుండెను. ఆ మనిషి వచ్చెను. చంద్రుడు నుడివాలు రాజువీడాదికి యుద్ధమునకు బయలుదేరెను. రెండవ రోజు యుద్ధమున నుడివాలురాజు దెబ్బతినినాడు: వెన్నెల ఆందోళన చెందుచున్నది. దెబ్బతిన్నవాడు సంధి కొప్పుకొనినాడు. కయ్యము వియ్యముగా మారినది. ఇది కథ.

కథలో నేమియునులేదు. ఉన్నదంతయు రచనలో నున్నది. వలమురి వర్ణనము అభ్యుదయ కవిత్వమును మించియున్నది. చంద్రునకు వెన్నెలకు నడుమ నడచిన బ్రాహ్మణ రాయబారము ప్రబంధ ఫక్కిక ననుసరించినది. పెండ్లికి సుడివాలురా జొప్పు కొనకపోవుట తెనుగు సినిమాలలోవలె నున్నది. యుద్ధ వర్ణనము భారత కుమారసంభవోత్తర హరి వంశములను స్ఫురింపజేయుచున్నది. భాష కృత్రిమ ముగా లేక వాడుక నుడికారమునకు మిక్కిలి సన్ని హితముగా నున్నది. తద్భవములుగా చేయబడిన పద స్వరూపములు తెలుగుల నోట నూడిపడినట్లుగా చేయబడినవి.

తూ చా తప్పక చెప్పుట—ఇది నిజముగా అచ్చతెనుగు నుడికారముగానే యున్నది. సంస్కృత మున పాదపూరణార్థములయిన తు. చ. లు ఒక పర మార్థమును బోధించుటకు తెలుగులో కలిసిపోయినవి. అందువల్ల తూచా తప్పక తెలుగే. రొట్టెవిరిగి నేతను బడుట, పాతరలాడుట, చుట్టతీకము, చూరులో పెట్టుట, ఊపిరి పీల్చరానిపనులు, గొంతుమీదికి వచ్చుట—ఈ మొదలైన పలుకుబళ్లు సమయోచిత ముగా ప్రయోగింపబడినందున కవిత్వము దీప్తిమంత ముగా నున్నది. ఇరువదినాల్గుగంట లొకటేపని—ఇది ఈ నడుమ గడియారములు వచ్చినతరువాత పుట్టిన పలుకుబడి. శ్రీ నాగనార్యులు లోకజ్ఞత్వమువల చెప్పిన చక్కని పలుకులు గలవు యుద్ధమున విజృంభించి గపతురను నరకివేయుట కుపమానము — రెత్తులు జొన్నను గోయుట, ఆకాశమున చుక్కలు మొలుచుట కుపమానము, తడిజొన్న లార్ప వెలిబోసిన వడువు, వెన్నెలలు విసినవనుట కుపమానము, జగమెల్ల వెల్ల వేసిన పగిది - ఈ విధముగా ఈ అచ్చతెనుగుకావ్యము సరళసుందరముగాను, చమత్కారకారిగను, ధారాళము గను, ఒకవిధముగా ప్రౌఢముగాను, మొత్తముమీద ప్రసన్నముగను పూర్వకావ్యప్రబంధముల రీతుల నంటీ ముట్టని శైలిగలదిగనుఉండి ఆదరణీయముగానున్నది. ఆహ్లాదకారిగా నున్నది.

—క్షేమేంద్ర.

# నా స్వామి

[కావ్యము; కవి : చింతలపాటి నరసింహ దీక్షిత శర్మ; ప్రతులకు : చింతలపాటి నరసింహదీక్షిత శర్మ; తెలుగు పండితుడు; జిల్లాపరిషత్ హైస్కూలు—అచ్చమ్మపేట—గుంటూరు జిల్లా (A. P.); 32 పేజీలు; వెల: రూ 1–00]

నూటయెనిమిది పద్యాలతో శతక రూపంగా వెలువడిన కావ్యమిది. మకుటం లేదు. కవి తన యిష్ట దైవానికి తన మనస్సులోని భావాలను, లోకనైజాన్ని నివేదించుకొన్నారు. పూర్వకవుల పద్యాల ఎత్తుగడలను పద బంధాలను వీరు పెక్కుచోట్ల అనుకరించారు. ఐనప్పటికీ, తాము గ్రహించిన పదబంధాలను, శక్తి మంతంగా ఉపయోగించటంలో, తగినంత ప్రతిభ చూపించలేకపోయారు. 'లలితా లాప కలా కలాప శుషమా లావణ్య, లీలా సమాకలితోల్లాస దరస్మిత ప్రథిత శృంగార ప్రభావ ప్రసాద లతాంగీమృదు గండ చుంబన రసార్ద్ర శ్రీ పరీరంభణమ్ముల' మొదలైన పద్యాలలో సమాసాడంబరము కన్పించినంత భావుకత కానరాదు.

'మెజారిటీ'; 'స్ట్రైజీ'; బేబాకీ మొదలైన అన్య దేశాల నుపయోగించి కొంత చమత్కారాన్ని సాధించ టానికి ప్రయత్నించారు. కవితకు గౌరవం తగ్గి 'నవ్య దశ' లభించటంలేదని వాపోతూ—

'ఇదుగో యొండు పుగాకు తుంపు
 పెడతా యీ బుఱ్ఱ మీసాలపై.
పది పద్దేలను సెప్పు సూత్తను
 మజా భాగుం బెనే' యంచు వ్యం
ర్థ దురాలాపములాడు మోటకులు
 . మీఱఁ - గైతకింకెట్లు న
వ్యదశల్? విజ్ఞులకెట్లు గౌరవము
 నా స్వామీ! కళావీథులన్'

అని చమత్కారంగా అరసికులకు కవిత్వనివేదన చెయ్య వలసి వస్తున్నదని బాధపడ్డారు. కాని మదిలో మెదలిన రకరకాల భావాలకు పద్యరూప మిచ్చినంత మాత్రాన కిది కవితకు నవ్యదశకాదు. రసవంతం కాని పద్యం కవిత్వమెప్పటికీ కాదు. 'నా స్వామి' కావ్యం చదివి రసానందం పొందటం దరిదాపు అసాధ్యం.

## నిర్దోషి

[ఏకాంక నాటిక; రచయిత:రెండుచింతల లక్ష్మీ నరసింహశాస్త్రి ఎం. ఏ., ప్రచురణ : రాజ్యలక్ష్మీ పబ్లిషర్సు; ముస్తాబాద్—కృష్ణాజిల్లా; 44 పేజీలు వెల. రూ 0-75 పై]

ఇతివృత్తంలోగాని, నిర్వహణలోగాని కొత్తదనమేమీలేని నాటికలు, నాటకాలు కుప్పతెప్పలుగా వచ్చిపడుతున్నాయి. కొద్దిరోజుల వ్యవధిలో ఏదోఒక వార్షికోత్సవం వంటి ఉత్సవం ఉన్నదనగా అప్పటి కప్పుడు పూనుకొని, హడావిడిగా ప్రదర్శన నిమిత్తం ఏదోకొంత ప్రోగుచేసి ప్రదర్శించటం జరుగుతున్నది. దురదృష్టమేమంటే—అవి ప్రదర్శనలో బాగులేక పోయినా, శక్తి అవకాశం ఉన్న రచయితలు వాటిని అచ్చువేసి వదిలేస్తున్నారు. తాము వ్రాసిన ప్రతి అక్షరమూ అది ఎందుకోసం వ్రాసినా అచ్చులో చూచుకోవాలనుకోవడం రచయితలకున్న కీర్తి కండూతి తప్ప మరేమీకాదు. అటువంటి నాటకాలు చదవటానికి గాని, ప్రదర్శనకుగాని ఎంతమాత్రము బాగుండవు. శ్రీ రెండుచింతల లక్ష్మీ నరసింహశాస్త్రిగారు వ్రాసిన 'నిర్దోషి' అనే ఏకాంకిక నాటిక యీ కోవలోనిదే.

ఒక గృహస్థు యింటిలో రూ. 600 పోయినవనుకుని ఆ యింటి యిల్లాలు, కాంతారావనే తంపులమారి కోర్టువారికి ఫిర్యాదుచేసి, ఆ యింటి యజమానికి తమ్ముడైన విశ్వాసరావుపై నేరం మోపుతారు. ఆ డబ్బు యజమానివద్దనే ఉండటంచేత విశ్వాసరావు నిర్దోషియని ఋజువవుతుంది. చాల నాటికలలో వలె యీ నాటికలో ఒక చెవిటివాని పాత్రను సృష్టించి, తద్వారా హాస్యరస పోషణకొక వ్యర్థప్రయత్నం చేశారు రచయిత. పాత్రలపేర్లు కొన్ని అనుకూలరావు, విశ్వాసరావు వంటివి వారి స్వభావానుగుణంగా ఉన్నా ఎబ్బెట్టుగా ఉన్నాయి. సంభాషణలు పేలవంగా ఉండటంచేత నాటకీయత మరీ తక్కువగా ఉన్నది.

— రామ మోహనరాయ్.

## అపరితోషా ద్విదుషాం నసాధు మన్యే

మాభూమి (అయిదో ముద్రణ)

(రచన: వాసిరెడ్డి భాస్కరరావు, సుంకర సత్యనారాయణ. వెల: రెండు రూపాయలు. విశాలాంధ్ర ప్రచురణాలయం, ఏలూరురోడ్డు, విజయవాడ—2.)

ఆపరితోషాత్ విదుషాం నసాధు మన్యే ప్రయోగ విజ్ఞానం—అన్నాడు మహాకవి కాళిదాసు, శాకుంతలంలో.

మాభూమి నాటకం 1947—48 లలో పండితుల్నేకాదు. అశేష ఆంధ్రప్రజానీకాన్నీ ఉర్రూతలూగించి, సెభాష్ అనిపించుకొంది. ఆంధ్రదేశం నాలుగుమూలలా ఈ నాటక ప్రదర్శనకోసం రమారమి 125 ఔత్సాహిక నాటకదళాలు ఏర్పడి ప్రదర్శించాయంటే ఈ నాటకం పొందిన ప్రజాదరణ అర్థం అవుతుంది.

25 ఏళ్ల అనంతరం ఈ ప్రశస్తికి కారణం ఏమిటని ఆలోచిస్తే, దానిలోని కథావస్తువేనని అర్థం చేసుకోవచ్చు. శాకుంతలంలోలాగా, కన్యాశుల్కంలోలాగా మనస్సును పట్టిపోయి, ప్రాస్తావికంగా వుపయో

గించుకోగల మాటలూ, చమత్కారాలూ అందులో లేవు. కాని, అంతమంది ప్రజానీకాన్ని ఉద్రేకాత లూగించిందంటే ఏమిటనాలి కారణం? అది ఎత్తు కొన్న సమస్య. దానిని ప్రస్తరించిన తీరూనే.

ఈ భూమి నీదేరా,
ఈ గనులు నీవెరా
ఎవడు ఈ నైజాము?
ఎవరు ఈ దొరలంత
మాడిచచ్చేవారి
మతములన్నీ ఒకటె
కొంపలార్చేవారి
కుట్రలో పడబోకు॥

అనే హెచ్చరికతో 1945–46 లో నైజాము సంస్థానంలోని తెలంగాణా భూమిలో ప్రజాసామాన్యంవెట్టి వ్యతిరేక వుద్యమానికి "సంగం కట్టేరు."

'నీకాల్మొక్తా' 'బాంచను'—అనే మాటను ప్రజానీకంనోట వూతదంచేసిన ఫ్యూడల్‌వ్యవస్థ—దేశముఖ్‌లు, పటేళ్లు, పట్వారీలు, అమీన్‌లు, పోలీసులు, నైజామూ, ఆయన ప్రభుత్వమూ— తమ అధికారాల్నీ, పెద్దరికాన్నీ నిలుపుకొనేందుకు సర్వ విధాలా ప్రయత్నించేరు. ప్రజల స్వాతంత్ర్యేచ్ఛకు సంకేతంగా నిలబడ్డ 'సంగా'న్ని (ఆంధ్ర మహాసభ) రూపుమాపడానికై వూహించలేనన్ని ఘాతుకాలు జరిపేరు.

కాని, ప్రజలొంగలేదు. సంస్థానం వెలుపల వున్న ఆంధ్రప్రజలు వారికి సాయం నిలిచేరు. ఆ సానుభూతి సహాయాల అండతో తెలంగాణా ప్రజ ప్రారంభించిన శాంతియుతవెట్టి వ్యతిరేకోద్యమం వ్యాపించింది. శత్రువులు దానిని శాంతియుతంగానే వుండనివ్వలేదు. వారు సాగించిన ఘాతుకాలనుంచి ఆత్మరక్షణకై తెలంగాణాప్రజ తిరగబడింది.

బానిసలంతా ఏకమైన ఈ
ప్రభువులెంతరా ఒక క్షణమే,

అన్న ఆత్మస్థైర్యంతో జనం కదిలి ఇది 'మాభూమి'—అని గర్జించింది. ఈ ఇతివృత్తానికి కథనిచ్చి, నాటకరూపం కల్పించబడింది. కాళిదాసు పండితుల ప్రశంస నాటక విజయానికి సాక్ష్యం అన్నాడు. కాలం మారింది. శత్రువు గుండెలదిరి బేజారెత్తిపోవడం నాటక విజయానికి సాక్ష్యం అని నిరూపించింది 'మాభూమి'. దానిని ప్రజ ఆదరిస్తే ప్రభుత్వాలు నిషేధించాయి.

## పొద్దు

### (నవకవిత)

(రచన: రంధి సోమరాజు వెల: మూడు రూపాయలు. శశీధర పబ్లికేషన్సు, అన్నపూర్ణపేట, రాజమండ్రి—3.)

పల్లెటి ప్రజల పలుకుబడితో కథలు వ్రాయడం మాధవపెద్ది గోఖలే ప్రారంభించేరు. ఆ పద్ధతిని నవలలకు పాకించేరు పోరంకి దక్షిణామూర్తి. విశాఖ, శ్రీకాకుళంజిల్లాల మాటతో, యాసతో రంధి సోమరాజు కవితలు వ్రాస్తున్నారు, ఇప్పుడు.

పల్లెటూరి ప్రజల దృష్టిలో సంవత్సరం విభజన మూడు కాలాలుగానే. అందుచేత కవులందరిలా ఆరు రుతువుల్నిగాక శ్రీ సోమరాజు తమ ఈ నవకవితా సంపుటి 'పొద్దు'లో మూడే కాలాల్ని—వానా కాలం, శీతగట్టు, ఏసంగి పొద్దులు—తీసుకోడం సముచితంగానేవుంది. ఆ మూడు కాలాల అందాలు, అనుభూతులు, సుఖదుఃఖాలకు పదచిత్రరూపం ఇచ్చేరు, దీనిలో.

అయితే వారు తీసుకొన్నది విశాఖ, శ్రీకాకుళం జిల్లాల వాతావరణమూకాదు. పల్లెటూరి వాతావరణం అంతకన్నాకాదు. ఆ పదచిత్రాలు చదువుతూంటే ఇరుకురోడ్లూ, మురికిపేటలూతో గోదావరి వొడ్డునేవున్న రాజమండ్రీ మన కళ్లముందు మెదులుతుంది.

పట్నాల్లోని బజారుల్లో
మద్దుల నెత్తిమీన గొడుగులు

ఎగుడు దిగుడు త్రోడ్డునా వున్నాయి.
మేడమీదున్న కుర్రోల్లు
దానిమీద వో సిన్నికారు
తోలాలను కుంటారు.

వర్షంపూట కోటగుమ్మం, కూరలమార్కెటు మధ్య రాజమండ్రి మైన్‌బజారును మన కళ్ల ముందుంచేరు, కుర్రవాళ్ళకి మాత్రమే తోచగల కొంటె ఆలోచనను జతచేసి, అల్లాగే—

తెల్లారగట్ల
గోదాట్లో
అరిటిదొప్పల్లో ఆడాళ్లొదిలిన దివ్వెలు
సుక్కలికితల్లి సుక్కపెట్టిన బువ్వలోరే.

చక్కనిదృశ్యం. కార్తికమాసం, అరుణోదయానికి ముందు రైలు బ్రిడ్జి క్రింద గోదావరి రేవులో నిల్చుంటే కనబడేదృశ్యం. చాలమంచి చూసేదే. కాని, ఈకమ్మని కల్పన మనకితోచదు.

రోజూ మనం చూసే దృశ్యాలలోనే సోమరాజు మనకు తోచని అర్థాలు ఎన్నో వూహిస్తారు.

వోనలో నాన్నాని
బాతురెక్క లార్చుకుంటూ
'వోనవొగ్గేసి మేం రాం' అన్నట్టు
తోకలడ్డంగ ఆడిత్తాయి.

ఇటువంటిదే మరొకటి.

సన్నీలలో ఏలెడ్తే
అయ్యి జివ్వున కర్సేసినాయి.
కొత్తగా వల్లొచ్చిన సిటిపాపాయినా.

చాలచక్కనివూహ, చన్నీళ్లు కరుస్తున్నాయని మనమందరం వుపయోగించేదే. కాని 'కొత్తగా వల్లొచ్చినా సిటిపాపాయినా' వుందనే కల్పన ఎందరికి తోస్తుంది?

ఇల్లాగ పొద్దు ఏభయినాలుగు పుటలలోని ప్రతి పదచిత్రం కొత్తకొత్త రుచులు కనబరుస్తూంది.

కొన్నిదృశ్యాలు గురించి వర్ణించడం నిరర్థకం. కళ్లు విప్పిచూస్తూ మనస్సుతో ఆకళించుకోవలసిందే.

మాటాడకొరే
కల్లిప్పినాడు
సెందురుడు పలిసంద్రాన కూకొని
తపస్సేత్తూ
ఎన్నెల్నెలా
దారోత్తున్నాడో.

కార్తీకమాసపు వెన్నెట్లో గోదావరిలో పడవ మీద కూర్చున్నమిత్రద్వయం దూరాన మనక్కనపడ్డం లేదూ!

ఆధునిక కవితాసంపుటులలో పొద్దువొదిరి మనస్సును హత్తుకుపోతున్న కవితలు చాల కొద్ది.

శ్రీ రామమోహనరావు.

Printed and Published For Nageswara Rao Estates (Private) Ltd., by
S. Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7 Thambu chetty Street,
**Madras-1, Editor : S. Radhakrishna,**

# భారతి

మాసపత్రిక

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938–1972)

నవంబరు 1972

సంపుటము : 49 సంచిక : 11

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## నవంబరు 1972

# కన్యాకుమారి

## శ్రీ నోరి నరసింహ శాస్త్రి

గంగానదీజలము కావేరీ జలములతో కలుపుటకు ఉద్దేశించినట్లు పత్రికలలో చదివిన 1957 లో దీనిని ప్రారంభించి, అది సాధ్యమని నిపుణులు నిర్ధారణ చేసినట్లు ప్రకటించిన 1972 లో ఈ రచన పూర్తిచేయబడినది.

### పాంథుడు

ఏకమ్మై మున్నీరు
ఎగిరిపడు నీచోట
రంగురంగుల నీను
రత్నాల గట్టుపై
ఒంటరిగ గూర్చుండి
ఊర్పులు నిగిడ్చెదవు
ఎవరు నీ హృదయంబు
నెరియించు కన్యకా?
ఎవరి రాకకు నిరీ
క్షింతువె కుమారికా?

### కుమారి

ఇంత వాత్సల్య మేపారు నిట్టియమృత
కంఠమున బల్కరించెదు కాయమెల్ల
జల్లు జల్లుజల్లురని సుధ జాలువారు
చున్న దెవరయ్య పరమపూజ్యుడవు నీవు?

### పాంథుడు

చీమ చిటుకన్నచో
చెవులొగ్గి యాలింతు,
గాలి మలసిన మాత్ర
కనులెత్తి తిలకింతు
చలపత్ర మటు లురక
చల్లియింతు నడు నడుమ,
పలుకవె కుమారికా
తలిదండ్రు లెవ్వరో,
పేరేమి ఊరేది?
కోరికేమే కన్య?

### కుమారి

కర్ణగోచరమ్మైన నీకమ్రవాణి
పొంగి నాయెద తనువెల్ల పులకవారు
పుణ్యభాగీరథీపయః పూతతనుడ,
కేశవుడవొ హరుడవొ భగీరథుడవొ?

### పాంథుడు

ఎంత బేలవు కన్య
ఇటు లాడగా నీవు,
శివుడ నైతే గంగ
శిరమందు పొంగదా,
గళసీమ మెరయదా
గరళ నీలాంకంబు,
వామార్ధభాగమున
భామ వెలుగొందదా?
హరినైన పాదమున
పరువెత్తదా గంగ,
హృదయమున శ్రీదేవి
పదపీఠ ముండదా,

సిగయందు బహువర్ణ
శిఖిపింఛ మాడదా,
నీలరత్నచ్ఛాయ
నింపదా దిశలెల్ల?
ఇక భగీరథుడనే
ఏ నైన నావెంట
గంగ వాకలు గట్టి
కదలి రాకుండునా
బహుకాల దీక్షతో
బడలియుండద ఒడలు,
ముడులువడి శిరసుపై
జడలు కట్టవ నెరులు
కరములను పాదముల
పెరిగియుండవ గోళ్లు?
ఎంత బేలవు కన్య
ఇటు పల్కగా నీవు?

### కు మా రి

సౌమ్యమయి నీదు మూర్తి హర్షమ్ము గూర్చు
శ్రవణపర్వము నీవాణి సత్యమట్లు
ఆప్తహితుడట్లు ప్రశ్నింతు వాదరమున
జలదరించెడి తనువు నీ పలకరింత!

### పాం థు డు

నెమ్మి కటు తనువెల్ల
నిండినవి నీ కనులు
మిలమిలని మెరసెడిని
మీలవలె నీ కనులు
నిర్నిమేషంబు లై
నిలిచినవి నీ కనులు
మృగి యకు లటు ముఖము
మీరినవి నీ కనులు
గిరి కన్యవో—నీవు—జల కన్యవో,
సుర కన్యవో—కాక—వన కన్యవో?

### కు మా రి

హరుడు కాదంద్రు, కాదందు హరివి గాని
అల భగీరథు డేని కాదంద్రు వైన
పలుకు జల జలమని గాంగజలము భంగి
చలువగూర్చు జనుఃకల్మషంబు దొలచి

నీవు కన్పించినది మొదల్ నిఖిల దిశల
గుబులుకొని జాహ్నవీ పద్మకోశ విమల
సౌరభంబులు హృదయంబు దూరి మెల్ల
వివశతం గూర్చె వెన్నెల విరుల యట్ల!

నీదు రూపు భాగీరథీ నిర్మలంబు
స్వచ్ఛహిమవన్నగేంద్ర నిష్పన్న సుషమ
గాంగ ధవళ తేజస్సు నీకనుల వెలుగు
ఏర్పరుపరాక యుంటి నీ వెవరవయ్య?

### పాం థు డు

ఏలనే కన్యకా
ఇటుల నను ప్రశ్నింతు,
పలుకు సంగీతమై
పర్వె నా శ్రవణముల,
పెదవులు మెదల్పగా
బింబ రోచులు చెలగు,
రదన కాంతులు దిశల
వెదజల్లు వెన్నెలలు,
ఎవరవె కుమారికా
ఏల చెప్పవె కన్య,
పలుకవె కుమారికా
తలిదండ్రు లెవ్వరే
ఊరేమి పేరేమి
కోరికేమే కన్య?

### కు మా రి

ఎవరు నీవు, పేరేమి పనేమి యిచట
ఏల ననుగూర్చి ప్రశ్నింతు విన్నిగతుల?
చిరునగవు వెన్నెలలు పయి జిమ్మకొనగ
పలుకరింతు వుత్తర మీవు పలుకవేమి?

### పాం థు డు

తలచితిని బేల వని
పలుకరించిన మొదట
సందేహమగు నిపుడు
చాల ప్రౌఢ వటంచు

మొదలు ప్రశ్నించినది
ముగుద నీవా నేన?
నీ కథలు విప్పకయె
నా కథల నడిగెదవు!

* * *

అయ్యో, కన్యా, యిట్టు
లైతివే క్షణములో
చిత్తరువు పోలికిని
రిత్తవడి నిలిచితివి
నిడుద యూర్పు నిగుడ్చి
నెరి తూలితివి కన్య,
నే నన్న దానిలో
నిష్ఠురం బున్నదా
తెలుపుమా కన్యకా
తెలిసికొని సవరింతు,
మన్నించి కన్యకా
మాటాడి కరుణింపు!

కు మా రి

అయ్యయో సఖ నీ వట్టులాడవలదు,
కలుగునే తప్పు నీయెడ కలుషరహిత!
ఏమి చెప్పగవలయునో ఎరుగ రాక
ఇట్టులైతిని లేదు నీయెడల దొసగు!

ఎరిగినది యెల్ల చెప్పెద నిదిగొ వినుము
ఎవరు తలిదండ్రులో నాకు నెరుకలేదు
నే నెరింగిన దాది ఈ నిలిచియున్న
గట్టుపై నీవు చూచుచున్నట్టులుంటి.

ఇచట నన్నెవరుంచిరో ఏ నెరుంగ
ఇంతవర కీవుగాక నన్నెవ్వరైన
పల్కరించియు నెరుగరు పరమమిత్ర!

పవలు రేయును మున్నీట పడుచులేచు
అలల సవ్వడి యొక్కటే యాలకింతు!

ఎదురుగా సూర్యభగవాను డిరులు చీల్చి
శిరముపై నెక్కి వేడిమి నెరియజేసి
వెనుకవైపున మెలమెల్ల మునిగి చనును

చిమ్మచీకట్లు నాచుటు జీబుకొనగ!
ఇంతకంటెను తేటగా నెదియు గనను!

ఇరులు క్రమ్మెడిచో నంతరిక్ష వీథి
చుక్క లొక టొక్కటే వచ్చి చూచి పోవు,
తనకు తోచినవేళ సుధాకరుండు
చలువవెన్నెల పండువు సలుపవచ్చు!

మరియునొక చిత్ర మున్నది మధ్య మధ్య
మలయ పవమాను డెడమగా మలసి మలసి
గుసగుసలు పల్కు చెవులలో మూసరు కొనగ
పూత భాగీరథీ గాంగ పుణ్యకథలు!

ఇప్పు డెరిగింతువా సఖా, ఎవరు నీవు,
ఏలవచ్చితి విచ్చటి, కెటులురాక,
ఏమి నీపేరు, తలిదండ్రు లెవరు నీకు,
ఏల చిరునవ్వు వొలికింతు వెల్లయెడల?

పాం థు డు

ఏమందు నీవలెనె
ఎరుగనే నాపేరు
తలిదండ్రు లెవ్వరో
తెలియనే నేగూడ
ఏల వచ్చితి నెట్టు
లెరుగ నన నను నమ్ము!

ఎరగియుండిన దాది
తిరుగులే ఎరుగుదును
నిలిచి యుండుట యన్న
నిముష మెరుగను కన్య
నిన్ను జూచిన క్షణమ
నిలిచి పోయితి నిచట!

చల చల చ్చంచలా
సంతానమను నేను,
అచల పుత్రిక నీవ
టంచు తోచెడి, కన్య,
హరు వేడి తెత్తునా
కరము పీడింపంగ?

కు మా రి

అంత సౌభాగ్య పదవి కే నర్హగాను
పార్వతీదేవి పరశివ పత్నిగాదె!

### పాంథుడు

మున్నీరు నీ చుట్టు
మొనసి యున్నది కన్య,
అచల పుత్రిక వంచు
నమకొనుట పొరపాటు
జలధి కన్యవు నీవు
సందియం బికలేదు
హరివేడి కొని తెత్తు
కరము పీడింతువా ?

### కుమారి

అట్టి సౌభాగ్య పదవి కే నర్హగాను
శ్రీ రమాదేవి శ్రీ హరి చెలువ గాదె !

### పాంథుడు

అట్లందు వేమొకో
అసదు కాదిది కన్య
కన్య ఎప్పటికైన
కాంతు సొత్తే కదా !
నీ కెవ రభీష్టువో
నీవె చెప్పుము తెత్తు,—
ఏమి యోచన నిన్ను
నే కాగ్ర నొనరించె?

### కుమారి

అన్న, వినుమోయి ఎన్నాళ్ల చన్న కథయొ
పూర్వమొకమారు పెండ్లికి పూనుకొనియె
నెవ్వరో సాగరుడొ పర్వతేశ్వరుండొ
వరు డెవరు సమకూడె నే నెరుగ నయ్య !

అర్ధరాత్రము లగ్నమై యమరె నంట
ఇచట నా పెండ్లి యత్నంబు లెల్ల జరిగె
అచట వరుడును నాయితం బయ్యెనంట
నన్నును నలంకరింప యత్నములు సాగె.

ఎవరు పంపిరో ఇంతలో నెక్కడిదియొ
కోడికూసెను లగ్నంబు పొడరె నని
వరు డుపేక్షించె, పెండ్లికౌ వస్తుజాత
మంతయును వార్థిపాల్సేసె నలిగి పెద్ద!

చూడుమిప్పుడు నీగుట్టచుట్టు బలసి
పప్పులును బియ్యము సమస్తవస్తుచయము
నబ్ధి జలముల వేల తేలాడి మెరయు
నిత్య కన్యాకుమారిక నే తదాది!

### పాంథుడు

ఎట్లు తెలిసినది నీ
కీ వృత్త మంతయును
కదల కున్నావుగా
గట్టుపై కన్యకా?

### కుమారి

మలయపవనుండు నామయి మలయుచుండు
ఆలకించితి నీకథ అతని రొదల!

## 2

### పాంథుడు

పాణిగ్రహము నీకు
వల దనుచు నున్నావు,
ఒరు కోరికే మున్న
మరి తీర్తు తెలుపువా!

### కుమారి

అచలముగ నిట్లు నిల్చు నా యంతరమున
ఏమి కోర్కులు గలుగునో ఈవె తెలుపు!
అప్పుడవు గాన చెప్పెద నైన గాని
అంత రాంతముల నొక్క టడగి యుండు!

మలయ పవమాను డెపుడు పై మలయుచున్న
మరి మరి నిరంతరము పల్కు మధుర ఫణితి
హరి పదమునుండి శంభుని శిరము నుండి
భువి వియద్గంగ వెలసిన పుణ్యకథలె!

గంగ యెట్టుల నుండునో గద యటంచు
గంగ జలమెంత చల్లనో గద యటంచు
గంగ రూపెంత స్వచ్ఛమో గద యటంచు
గంగ తాకెంత పూతమో గద యటంచు

కలలు గనుచుందు బహుభంగి గంగ గూర్చి
గంగ కౌగిట నొదిగిన గన్నతల్లి
యొడిని తలదూర్చు నానంద ముప్పతిల్లు!
గంగ నిటువైపు తోడిరాగలవె, సఖుడ!

**పాం థు డు**

ఎంత బేలవు కన్య,
వింత కోరిక గంటి,
గంగ నిటు తెచ్చుచో
కష్టంబు కనకుంటి!

**కు మా రి**

వింత లై నీదు నుడువులే వినగ నయ్యె
హరిని దెచ్చెద నిటకు నే హరుని దెత్తు
వరు నెవరినైన దెచ్చెద మరియు నంటి
గంగ గొనితెచ్చుటే మించు కష్టమవునె?

**పాం థు డు**

ఎంత బేలవు కన్య
ఇటు పల్కగా నీవు!
మూ డడుగు లిడుచు హరి
భువనత్రయము మించె,
హరుడు శర మొకటి గొని
హరియించె త్రిపురములు,
అంత మహిమలు గలవె
ఆకాశ గంగకును!
హరి హరులు భక్తులకు
నతిసులభు లన వినవె
గంగ యంటే మిగుల
కఠినాత్మురాలు సుమి,
దివి నుండి భువి లోకి
దిగుటకు భగీరథుని
ఎన్ని త్రిప్పులు పెట్టె
నెరుగవె కుమారికా!

**కు మా రి**

అన్నియు నెరుంగుదును గాని యడుగు మంటి
వందుచే నంటి నీ కసాధ్యంబె యైన,
ఏమిచేయుదు, నిట్టులే ఎల్లవేళ
కలలు కనుచుందు వినుచుందు గంగకథలె!

ఐన నొకమాటచెప్పెద నార్య, వినుము
మహిమలో గాని కారుణ్యమతిని గాని
గంగ హరి హరులకు తీసి కట్టటన్న
ఇంచు కే నొప్ప నీ వెంత హితుడవైన!

హరుని శిరమున నడయాడు నంబయెట్టు
లలతి యన జెల్లు మహిమలో హరి హరులకు!
విష్ణుపదజాత గద గంగ, విష్ణుపదము
కంటె నత్యూర్ధ్వ పదములు గలవె యెందు?

శ్రవణ గోచరమగు గంగ జల జల జల
తల్లి యమృతంబు కనవచ్చు తాక వచ్చు
సురభి రుచులు పంచేంద్రియ సులభగతుల!
అట్లు ప్రత్యక్ష గమ్యులే హరి హరులును?

వలదు కఠినాత్మురాలని పలుక గంగ,
ఆమె రూపము పరమ దివ్యామృతంబు,
స్వచ్ఛ రసవాహినీ ధుని యామె యాత్మ,
ఆమె దేలేకపో గాని, యామె నవకు!

**పాం థు డు**

అట్లు నిష్ఠురము నీ
వాడిన భరింప లే
నైన జెప్పెద చిక్క
లామె రావించుటను
ఆ పైన నీ యిచ్చ
నడుగు మింకొక కోర్కె!
గంగ పారును రెండు
గట్లమధ్యను, కన్య
ఇటు సాగుచో వింధ్య
నెగిరి రావలె ముందు!
తపతియును నర్మదయు
తప్పుకొని వచ్చినను
మరియొక్క మలుపులో
మలగిన మహానదిని
గోదావరీ దేవి
కూర్చుండు నడ్డమై
గోదావరి గంగ
కాదె గంగమ కక్క,
అక్క బిగికౌగిటను
అడగి పోవదె చెల్లి!

అదియెట్లో దాటినను
అల చెల్లి కృష్ణమ్మ
ఆతిథ్య మొసగుచో
నదియెట్లు తప్పుకొను?
గంగా మహాదేవి
కడ గొట్టు చెల్లెండ్రు
పెన్నయును కావేరి
పిన తామ్రపర్ణియును
వారి బిగి కౌగిళుల
వారింప దర మౌనె ?

అన్ని దాటిన నెట్లొ
అల యగస్త్యాశ్రమము
నాన దాటగ నలవి
యౌనె ఎవ్వరికైన ?
జహ్ను మునివలె కాదు
సరస వాత్సల్యుండు
ముని పేరు తలచిననె
తనువు వడవడ వణకె !

ఈ చిక్కులను దాటి
ఎటు రాగలుగు గంగ !
ఈ విఘ్నములు గడచి
ఎటు తే గలను గంగ !

న న్నసత్యమునుండి
కన్నె, రక్షింపుమా,
ఇంకొకటి కోరుకొని
ఏను చేయంగలది !

కు మా రి

నను బరీక్షింప నెంతువా, యమగు సఖుడ,
కాక గంగా మహత్త్వమే కాన లేవొ!
పేరు హిమవంతు లెదురొడ్డ వి్రారివచ్చె,
అడగి పడియున్న వింధ్యంబు గడవ లేదొ!

అక్క సెల్లెండ్రు రందువా, యాప్తమిత్ర,
వారు కరుణా రస తరంగ వాహినులని
కనవొ, వారల యడ్డు తాత్కాలికమని!

సాగరులు దెచ్చి త్రవ్విన సాగరంబు
తన జలము తోడ నింపిన తల్లిమహిమ

ఎరుగవో, వినియుండవో, మరచినావొ?
వాహినులు చేయు విఘ్నముల్ పాటిగావు!

ఒకటి మనవి యొనర్చెద నో వయస్య,
ఆ యగస్త్యుని ననబోకు మట్టిమాట
అట్టి కరుణా మహాంభోధి యన్యు డేడి,
పాపహరు డాతడీ దక్షిణా పథముకె!

అతడు కాశిని విడనాడి నాది గాగ
కలలు కనుచుండు నావలె గంగ గూర్చి
కాశియే యగు, నిజమిది గంగ రాక,
మన కగస్తి శుభంయుండు మాన్యతముడు!

పాం థు డు

ఎంత చెప్పిన వినవ
ఏ మనందును నిన్ను,
ఒకమాట చెప్ప నిం
కొకమాట నడ్డెదవు,
ఏమి చేయగ లాడ
నిక తప్పదే నాకు
ఆపు్తరాలవు, కన్య,
ఆజ్ఞగా పాలింతు !

నిశ్చంచలం బైన
నీ కోర్కి వినినంత
హరిహరులు నన్నిప్పు
డావహించిరి కన్య,
ఆపాదమస్తకం
బాడుచున్నది గంగ !
జీవవాడి గదమ్మ
జీవకోటికి గంగ !
నీ బోంట్ల తపము లివి
నిఖిల క్షేమం కృతులు !
కాశికిం జని కృతులు
గంగ చెంబులు తేర
విని మేళ తాళముల
చని తోడి తెత్తురే,
గంగ చెంబుల గొల్తు
రంగనా మణు లిండ్ల

ప్రత్యక్షముగ గంగ
ప్రవహించుటం గాంచి
ఆ బాల గోపాల
మానంద మందెదరు
ఆ సేతు శీతాచ
లావర్తి జన మంద
రానంద నాట్యంబు
లాడంగ నేకమ్మై,
ధన్యవాదంబులను
దనియింప కవి బుధులు
దారిలో వనగిరులు
దరి నదీ నదములును
జనపదంబులు పురులు
జయ జయ ధ్వను లీన
అడు గడుగునను మౌను
లగ్గింపగా మనల
గంగమ్మ తోడుకొని
కదలి వచ్చెద నిటకు!
హరినామము లసించె
నాకాశమున గరుడి!
హం భా రవ మొనర్చె
హర వృషభ మదె ప్రీతి!
సాగరుడు ఘోషించు
సఫల మౌ నని యాత్ర
తల యూచు నీ నిల్చు
శిల తథాస్తన్నట్లు
జయఘోష నిన దించు
సకలాశలను నిండి!
శుభవాక్కు పలుకవే
శుభమను కుమారికా!
అనతి కాలంబుననె
అనుగమింపగ గంగ
వత్తునే మరల నీ
పదపీఠముమ జేర!
సెలవీయవే కన్య
సెలవీ కుమారికా!

కు మా రి

ఎవరో అప్పుడ వని ముందె ఎరుక కలిగె,
కాని నాహృదివే యని కానన్నైతి
కదల కిచ్చుట గూర్చున్న కన్య నేను,
ఎపుడు కదలాడి తిరుగు నాహృదయ మీవు!

పాం థు డు

కన్యా కుమారికవు
కాదు కాదే తల్లి
గడ్డ కట్టిన పుణ్య
గంగమూర్తివి గాని,
నమో దేవి గంగే
నమో మాతృ గంగే!

కు మా రి

ఈవు కర్తవ్య మెరుగుదు వేను నైన
చెప్పెదను సముత్కంఠమ్మై, చెలువుడ, విను,
ముందు కదలుము కాశికా పుణ్యపురికి
నర్చసేయు డుంఠీశ్వరు నాది నచట!

అన్నపూర్ణేశు విశ్వేశు నంత గొలుము,
బిందు మాధవు సేవింపు పిదప భక్తి,
కాశికను కాశి వసియించు కాలభైర
వాదు లగు వేల్పు లందర నర్చ సేయు!

జాహ్నవిని జేరి యంతట జహ్నుతనయ
కాళ్ల కడ్డంబుగా బడి కదల నీకు!
నీ కుమారిక యార్త కన్యాకుమారి
నిన్ను రమ్మన్న దని వార్త విన్నవింపు!

నిన్ను జూడ పలవరించు చున్న దనుము,
నిన్ను నిత్యంబు ధ్యానించు చున్న దనుము,
మిన్ను పడుచోట తిన్నపై కన్నకూతు
విడిచి యుంట భరంబని విన్నవింపు!

పాం థు డు

గంగమ్మ మనతల్లి
కరుణా తరంగిణి యె
మన మడిగిన నంతనే
కనికరించును సువిశా
తాపత్రయమ్ము తీరి

తనియంగ ప్రజలెల్ల
కదలి వచ్చును సుమీ
గంగ వాకలు గట్టి
సంకల్పమాత్రమున
జల జలని జల లడరు
కదలంగ దలచుచో
గంగ కడ్డులు గలవె?
గంగమ్మ దోడుకుని
కదలి వచ్చెద నిటకు
సెలవిమ్ము శుభవాక్కు
సెలవిచ్చి కన్యకా!

### కు మా రి

గంగ యెడద నొదుగ కాచి యుండెదనయా
గంగ గూడి మరల కదలిరమ్మ
ఎంతయాప్తుడ వగు హృదయమిత్రుడవనా
శుభము నిర్మలాత్మ, శుభము, శుభము!

'పాపహారి దురితారి తరంగధారి
శైలప్రచారి గిరిరాజ మహావిహారి
ఝుంకార కారి హరిపాద సరోజవారి
గాంగం పునాతు భువనం శుభకారి వారి!'

### పాం థు డు

కన్యా కుమారికా యిక
నన్యధ్యానంబు మాని యనవరతంబున్
ధన్యాత్మ జేయు గంగా
పుణ్యధునీ స్వాగతమున భువనత్రయామున్!

'గాంగం వారి మనోహారి
మురారి చరణ చ్యుతమ్
త్రిపురారి శిరశ్చారి
పాపహారి పునాతుమామ్!'

'మాత శ్శైలసుతాసపత్ని వసుధా
శృంగార హారావళి
స్వర్గారోహణ వైజయంతి భవతీం
భాగీరథీం ప్రార్థయే
త్వత్తీరే వసతః త్వదంబు పిబతః
త్వద్వీచిషు ప్రేంఖతః
త్వన్నామ స్మరతః త్వదర్పిత ధియః
స్యాన్మే శరీరస్థితిః'



# సంశోధిత మహాభారత ముద్రణము

శ్రీ నిడుదవోలు వేంకటరావు

ఉస్మానియా విశ్వవిద్యాలయము వారిచే ప్రకటితమైన మహాభారత సంశోధిత ముద్రణము ఆది సభా ఆరణ్య పర్వములు రెండు సంపుటములు గత జూలై, ఆగస్టు భారతి సంచికలలో సమీక్షింపబడినవి. సమీక్షాకర్తలు శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి గారు.

ఈ గ్రంథసమీక్షలో అవతారిక గాక —

1. నన్నయ ప్రామాణికత.
2. అనువాద విధానము.
3. పాఠ నిర్ణయము—పూర్వ ముద్రణములు.
4. చిల్లర విషయములు—

అను శీర్షికలున్నవి. 32 పుటలలో నున్న యీ సమీక్ష సావధానముగా చదువగా, నిందు మహాభారత సంశోధిత ముద్రణమునకు నేమాత్రము సంబంధము లేని విషయములే యున్నవని పొడగట్టక మానదు.

గ్రంథ సమీక్షయందు మొదట తెలుపవలసినది గ్రంథ స్వరూపము. మహాభారత విషయమున నిది చాలా అవసరము. మహాభారత మీవఱకే ముద్రితమై యందఱకు పరిచితమైనదే—అయినను మహాభారత సంశోధిత ముద్రణము అనగా నేమో పాఠకలోకమునకు తెలియవలెను, ఇదివఱకు ప్రచారములో నున్న భారతమునకన్న దీని విశిష్టత యేమో లోకమునకు వ్యక్తపఱుపవలెను. అందునకు వివరణ మావశ్యకము. ఆ వివరణ మీ సమీక్షలో లేదు—కావున తెలుపుచున్నాను.

## గ్రంథ వివరణము

ఈ రెండు సంపుటములును నితఃపూర్వము ప్రకటింపబడిన భారతము రీతిగానే ముద్రితమైనది—అయినను నిందు ప్రతిపుటయందు పై భాగమున మూల గద్యపద్యములు—క్రింద—ఆయా తాళపత్ర గ్రంథములనుండి సేకరింపబడిన పాఠభేదములు, ఆ తాళపత్ర సంకేతాక్షరములతో నీయబడినవి. తాళపత్ర గ్రంథపాఠములేగాక, తెలుగున వ్యాకరణ చ్ఛందోలక్షణ గ్రంథములలో నుదాహరింపబడిన పాఠభేదములు సూచితములైనవి. వలసినచోట్ల, ఆ పాఠములనుగూర్చిన విమర్శ గలదు. పాఠనిర్ణయమునకు కొన్నిచోట్ల సంస్కృత మూలశ్లోకము లీయబడినవి. ఇట్టివి ప్రతిపుటయందు దించుమించుగా సగముభాగము నాక్రమించియుండును.

ఇట్లు పాఠభేదములతో మూలము ముద్రితమగుటయేగాక, ఈ రెండు సంపుటములలో ప్రథమ సంపుటమున ఆంగ్లభాషలో తాళపత్ర గ్రంథసేకరణాది వివరములు ముప్పది పుటలలోను, తెలుగున 128 పుటలలోను గలవు. రెండవ సంపుటమున—నన్నయనుగూర్చి 59 పుటలు, ఎఱ్ఱననుగూర్చి 19 పుటలుగల కవితా విమర్శ పూర్వకమగు ఉపోద్ఘాతము కలదు. ఈ రెండు సంపుటములకు, ప్రతిపర్వమునకు గద్యపద్య ప్రథమ పాద సూచిక యీయబడినది. మొదటి సంపుటమున 883, రెండవ సంపుటమున 813 పుటలుగల బృహత్సంపుటములు—

ఇంతవఱకు ఆంధ్రసాహిత్య ప్రపంచమున మహాభారతమున కిట్టి సంశోధిత ముద్రణము వెలువడలేదు.

## సంశోధిత ముద్రణ ప్రత్యేక విశిష్టత

మహాభారతము ముద్రితమై ప్రచారములో నున్నను అందలి పాఠములు, బహువిధములుగానుండి వాదోపవాదములకు, చర్చలకు గుఱియైనవి. ముద్రణ పాఠములను పండితులు, పరిష్కర్తలు,

తమ యిచ్చవచ్చినట్లు దిద్దిరి. ప్రాచీనకావ్యముల పాఠ నిర్ణయమునకు, తాళపత్ర గ్రంథములే ప్రామాణికములు, పరమాధారములుకాని, ముద్రితప్రతులు కావని, మొదట సాహిత్యలోకముదృష్టిని, తాళపత్ర పాఠముల వైపు మఱల్చినవారు—గిడుగు రామమూర్తిపంతులుగారు. వారు భారతమును ముఖ్యముగా తెలుగుభాషలో తొలి కావ్యమైన నన్నయభారతమును నామూలాగ్రముగా, ప్రత్యక్షర పరిశీలనచేసి, తాళపత్ర పాఠముల మూలమున నెట్లు నన్నయకాలమునాటి భాషాస్వరూపము నిర్ణయింపగలమో దానిని తమ వ్యాసముల మూలమున వివరించినారు. నన్నయనాటి భాషా లక్షణముల నేర్పఱిచినారు. గిడుగువారి అడుగుజాడలలో చిలుకూరి నారాయణరావుగారు, నన్నయ కాలమునాటి భాష (11 వ శతాబ్ది తెలుగు భాష)ను గూర్చి విశేష పరిశ్రమచేసి ఒక గ్రంథముగా రూపొందించి మదరాసు విశ్వవిద్యాలయమున పట్టము బడసినారు[1]. అంతేగాక గిడుగువారి యాదేశమున నన్నయ భారతమున 'సుపర్ణోపాఖ్యానము' 97 తాళపత్ర ప్రతులతో పాఠభేదములు సంప్రతించి ప్రకటించినారు[2]. నన్నయ భారతమునే కాక, కవిత్రయ భారతమున పాఠభేదములను గూర్చి కడచిన ఏబదేండ్లుగా, ఎంతో వ్యాసంగము జరిగినది. ఆ కాలమున సంవత్సరాది సంచికలలో నన్నయ ఛందస్సునుగూర్చి వ్యాసములు గలవు. అందుపాఠభేద ప్రసక్తియున్నది.[3]

కైలాసవాసి కాశీనాథుని నాగేశ్వరరావుగారి వలన, ఇటీవలనే శివసాయుజ్యమునందిన శ్రీ శివలెంక శంభుప్రసాదుగారివలన—భారతమునుగూర్చిన సాహిత్య విమర్శలు పాఠభేదములనుగూర్చిన వ్యాసములన్నింటిని నేకైకముగా ప్రకటించుచున్నది. 'భారతి' 'ఆంధ్ర భారత భారతి' స్వరూపము చాలవఱకు వ్యక్తము చేసినది, భారతి పత్రికయే యనుటలో అతిశయోక్తి లేదు. ప్రస్తుత సంపాదకులును, భారత వ్యాసంగమునకు ప్రోత్సాహము నిచ్చుచున్నందువలన, సాహిత్య ప్రపంచము వారి యెడల నెంతగానో కృతజ్ఞత చూపదగియున్నది.

1924, 1925 భారతి సంపుటములలో ఎఱ్ఱన అరణ్య పర్వశేషమునుగూర్చి, 1936 భారతిలో 'నన్నయ యతులు కొన్ని గతులు'[4] అన్నవిషయమును గూర్చి వ్యాసములు గలవు. ఆ కాలమున పరిశ్రమ చేసిన విద్వాంసులందఱు, ముద్రిత ప్రతిగాక, తాళపత్ర ప్రతిపాఠములనే ఆధారము చేసికొని, పరిశ్రమ చేసి, వాని ప్రాముఖ్యమును లోకమునకు వెల్లడించిరి.

ఇంతవఱకు జరిగిన భారత పాఠ పరిశోధనలను పురస్కరించుకొనియే, నేటి సంశోధిత మహాభారత ముద్రణము వెలువడినది. తాళపత్ర ప్రతులనుండి పాఠభేదము లెట్లుదాహృతములైనవో ఇంతకుముందే వివరించియున్నాను. మూలపాఠము ముద్రితమై పుట యడుగున, తాళపత్ర ప్రతిపాఠములు ప్రదర్శితము లగుట వలన—దేశమునగల పండితులు, పరిశోధకులు, భాషావేత్తలు — ఈ పాఠములు పరిశీలించి — 'ఈ పాఠమిట్లుండవలెను' ఈ పాఠమే మూలములో నుండవలెను'అని పాఠనిర్ణయము చేయుట కవకాశము గలుగుచున్నది.

శతాబ్దులుగా భారతములో పాఠము లెంతగా మాఱినవో ప్రదర్శించి పాఠనిర్ణయమునకు దోహదము గల్పించుటయే—సంశోధిత ముద్రణము ముఖ్యాశయము— దీనినిబట్టి సంశోధిత ముద్రణ సమీక్ష—అనగా 'భారత పాఠ సమీక్ష'—అని గ్రహింపవలెను.

---

1. చిలుకూరివారే తెలుగు భాషలో మొదట 'పి. హెచ్. డి.' పట్టము పొందినవారు. ఇప్పుడున్న, కాబోవు 'పి. హెచ్. డి' లందఱకు పితామహులు (1929).

2. చూడుడు. వారి ఆంధ్రభాషా చరిత్ర ద్వితీయ సంపుటము—(1933) ఆంధ్ర విశ్వవిద్యాలయ ప్రకటితము.

3. విస్తర భీతిచే—వివరము లీయలేదు.

4. ఈ ప్రశస్త వ్యాసము కీ. శే. నడకుదిటి వీరరాజు గారిది. ఇంకను ఇట్టివి చాల వ్యాసములు గలవు. విస్తరభీతిని విరమించితిని.

ప్రస్తుత సమీక్షకులకు, ప్రాచీన కావ్యపరిష్కరణమన నేమో, పాఠభేదములన నేమో, అవి యెట్లేర్పడినవో, ముద్రిత పాఠమువలన నేర్పడిన అవ్యవస్థ యెట్టిదో తాళపత్రపాఠముల విలువ యెట్టిదో ఈ షన్మాత్రము నవగాహన చేసికొనలేకపోవుటవలన—ఈ రెండు సంపుటములలో, పదునాల్గువందల పుటలలో, ప్రతిపుట యందున్న పాఠభేదములను గూర్చి యొక్క మాటయైనను వ్రాయలేదు.[5] ఇందువలన — ఈ సమీ

సంశోధిత మహాభారత ముద్రణ

సమీక్ష—

ఎంతమాత్రమును కాదు — మఱి యేమి? సమీక్షాకర్తలకు మూలగ్రంథ పాఠభేద పరిజ్ఞానము బొత్తిగా చాలమి, దానిని పూర్తిగా విడిచి, సమీక్షా వ్యాస పూరణార్థము, రెండవ సంపుటమున నున్న ఉపోద్ఘాతమునందలి విషయములను గ్రహించిరి. అవి సంశోధిత గ్రంథముద్రణకు నెంతమాత్రము సంబంధించినవి కావు—అవి నన్నయ, ఎఱ్ఱన కవితా విశేషములనుగూర్చిన విమర్శలు — సాహిత్య విమర్శకు సంబంధించినవి. ఇందువలన నీ సమీక్ష—

సంశోధిత మహాభారత ముద్రణ సమీక్షగాక,

సంశోధిత మహాభారత ముద్రణోపోద్ఘాత సమీక్ష

మాత్రమే యగుచున్నది. దీనిచే భారతి పాఠకులకు సంశోధిత మహాభారత ముద్రణ ప్రత్యేకత విశిష్టత యెట్టిదో, తెలుసుకొను నవకాశము లేకపోయినది. భారతి సమీక్షా విధానమునకు ప్రత్యక్షరము విరుద్ధమైనది.

ఇది యింతటితో నాగలేదు. ఈ 32 పుటల వ్యాసమున ప్రతివిషయము ఖండనీయమే. అయినను భారతి పత్రికా గౌరవమును, సంప్రదాయమును పురస్కరించుకొని, పై శీర్షికలలో నొక్కొక్క దానిని విమర్శించుచున్నాను.

**అ వ తా రి క**

సమీక్ష ప్రారంభమున అప్పకవి చెప్పిన యీ క్రింది పద్యము లుదాహరింపబడినవి[6].

'ఉ॥ ఆదిని శబ్ద శాసన మహాకవి చెప్పిన భారతంబులో
నేది వచింపగా బడియె నెందును దానినె గాని సూత్ర సం
పాదన లేమిచే తెనుగు పల్కు మఱొక్కటిగూర్చి చెప్పగా
రాదని ద్రాక్షవాటి కవిరాక్షసుఁ డీ నియమంబు చేసినన్.

క. ఆ మూఁడు పర్వముల
నామాన్యుఁడు నుడువు తెనుగు నరసి కొని కృతుల్
తాము రచించిరి తిక్క సు
ధీ మణి మొదలైన తొంటి తెలుగు కవీంద్రుల్'

నన్నయ మూడు పర్వములలో వాడిన తెలుగు మాటలనే తప్ప తక్కినవి వాడరాదని ద్రాక్షవాటి కవిరాక్షసుడు నియమము చేసినాడని అప్పకవి చెప్పినాడు. కాని, ఈ కవిరాక్షసుని గ్రంథమేదో పై పద్యములెందున్నవో, అప్పకవి చెప్పలేదు. తక్కిన గ్రంథము లుదాహరించి, వానినుండి పద్యముల నుద్ధరించిన యప్పకవి కవిరాక్షసుని గ్రంథము పేరైన నుదాహరింపక—ఆతడట్లు చెప్పినాడని వ్రాయుటవలన—నిది కేవలము కల్పితము—అప్పకవి కాక మఱి యేలాక్షణికుడైన యీ విషయము తెల్పినాడా? అదియునులేదు—కాబట్టియే యిది అప్పకవి కల్పన—ఇది యట్లుండ నిందు—

అప్పకవి క్రీ. శ. 1656 ప్రాంతమువాడు. నన్నయ క్రీ. శ. 1050 ప్రాంతమువాడు—క్రీ. శ. 1050 ప్రాంతముననున్న నన్నయకు, మఱి 600 యేండ్లకు తరువాతనున్న అప్పకవి ప్రమాణమా? ఈ

---

5. సమీక్షలో పాఠనిర్ణయము పూర్వముద్రణములు—అనియున్నవి గదా, అని పాఠకులకు సందేహము గలుగ వచ్చును. కాని యా శీర్షికయం దిచ్చిన పాఠములు సమీక్షాకర్తల స్వంతముగాదు—అది వారి తాతగారైన వేంకటరాయశాస్త్రులుగారివి. వీనినిగూర్చి ఆ శీర్షికపో చూడుడు.

6. అప్పకవీయమున నెచ్చట నున్నవో, ఆ ఆకరములు తెలుప బడలేదు.

ఆఱు శతాబ్దులలో నన్నయనుగూర్చి — కవులుగాని లాక్షణికులుగాని చెప్పనే లేదా? నన్నయకాలము నుండి అప్పకవికాలమువఱకు, నన్నయను ప్రమాణీకరింపని, కవికాని లాక్షణికుడు గాని లేడు — సమీక్షాకర్తల కీ విషయ మగమ్యము— ఇంతేకాదు. ముందు నేను వివరించిన వారందఱును— నన్నయభారతమును గూర్చి పరిశ్రమ చేసినపుడు అప్పకవిని గ్రహింపనే లేదే? విశ్వవిద్యాలయములలో జరిగిన పరిశ్రమవాట యటుంచి— భారతి పత్రికలో ప్రకటితమైన వ్యాసములనైన సమీక్షాకర్తలు చూచినట్లులేదు. ఇందువలన సాహిత్య ప్రపంచమున భారతమునుగూర్చి యెట్టి కృషి జరిగినదో, వీరికి తెలియలేదు. కావుననే, యీ సమీక్ష ఎట్టి యవ్యవస్థకు పాల్పడినదో, ఎట్టి అపమార్గమున నడచినదో వివరించుచున్నాను.

## (1) నన్నయ ప్రామాణికత

సమీక్షాకర్త లీ విషయమై చర్చించి, తుదకిట్లు వ్రాసినారు. 'ఈ విధముగా శ్రీనాథుని కాలమునకుకూడ ఏర్పడని ప్రామాణికత నన్నయకు తర్వాత కదా వచ్చియుండవలెను'. (పుట 29)

దీనినిబట్టి తెలుగు వాఙ్మయమున నన్నయకు— శ్రీనాథునికాలమువఱకు ననగా క్రీ. శ. 1450 ప్రాంతమువఱకు ప్రామాణికత లేదనియే గదా! ఇది యెంత యప్రామాణికమైన వ్రాతయో చూడుడు. ఆంధ్రమహాభారత సంశోధిత ముద్రణ సమీక్షలో పై శీర్షిక యుండుటవలన—సమీక్షాకర్తలకు నన్నయ నుండి శ్రీనాథునివఱకుగల సాహిత్యపరిణామముగాని, కావ్యములుగాని తెలియవనియు, నాంధ్రవాఙ్మయ చారిత్రక పరిజ్ఞానము పూజ్యమనియు మన మనుకొనవలెను. ఈ సందర్భమున - కవి కాలక్రమముకూడ పాటింపబడకపోవుటచే, వీరి నా విషయమైకూడ నంశయింపవలసివచ్చుచున్నది. మొదట తిక్కన, తరువాత కేతన, ఆవెనుక విన్నకోటపెద్దన——చివఱ ఎఱ్ఱన[7]— వీరినిగూర్చిన వ్రాసినతరువాత— 'ఇంతవఱకు నన్నయకు లేని ఏకైకప్రామాణికత బాలసరస్వత్యాదులకు తర్వాతనే వచ్చియుండవలెను' (పుట 30) అని వ్రాసిరి. బాలసరస్వతి 17 వ శతాబ్దివాడు కాబట్టి— 17 వ శతాబ్దివఱకు, నాంధ్రసాహిత్య ప్రపంచమున నన్నయకు ఏకైకప్రామాణికత లేదన్నమాట! అట్లయిన—నన్నయ ప్రామాణికత, 18, 19, 20 శతాబ్దములలోనే వచ్చినదిగదా, అది యెవరిమూలమున వచ్చినది? ఆ విషయము తెలుపనేలేదు.

ప్రస్తుతము పైని చెప్పిన—తిక్కన, కేతన, పెద్దన (విన్నకోట) ఎఱ్ఱనలను గుఱించి వీరు వ్రాసిన వ్రాతలను ఖండించుటకుముందు క్రీ. శ. 11 వ శతాబ్దినుండి నన్నయ ప్రామాణికత యెట్టిదో నిరూపించుచున్నాను.

## నన్నయ - శివకవులు

నన్నయ యుగము వెనువెంటనే అవతరించినది శివకవియుగము — శివకవిత్రయమగు, మల్లికార్జున పండితారాధ్యులు, నన్నెచోడడు, పాల్కురికి సోమనాథుడు నన్నయ ననుసరించినవారే.

మల్లికార్జున పండితారాధ్యుడు శివతత్త్వ సారమున కందపద్యరచనలో నన్నయనే యనుసరించినాడు. నన్నయవలె, నాల్గవ పాదమున జగణముతో కందములు రచించినాడు. అంతేకాదు— పదజాలము నన్నయనుండి గ్రహించినాడు. 'ఆదికర్త—అలరి—ఉల్ల—ఎఱగు— ఏడుగడ—తదర్థము - బోరన - మొల్లమి—వరవుడు- వాచఅచు—నడిసేను మొదలగునవి[8] అట్టివి.

## నన్నెచోడకవి

నన్నయను, పదములలో, పదబంధములలో, సమాసములలో పద్యముల యెత్తుగడలలో తూచా తప్పక యనుసరించిన కవి, నన్నయకు నన్నెచోడ కవి

---

7. సమీక్షాకర్తల ననుసరించి, ఎఱ్ఱన— విన్నకోటపెద్దన తరువాతివాడు—వాఙ్మయ చరిత్రకారులు గమనింపుడు.

8. చూడుడు. శివతత్త్వసారము. నా ద్వితీయ ముద్రణ పీఠిక—పరిష్కరణము, కృష్ణాపత్రికా ప్రచురణము 1968.

రాజనకు—వ్యాకరణము, ఛందస్సు, జాతీయములు—భావములు—వీని యన్నింటియందును పోలికలు గలవు. పద్యముల యెత్తుగడ లిరువురిలో 30 పద్యములలో నొక్కరీతిగా నున్నవనినచో—నన్నెచోడుడు నన్నయ నెంతగా ననుకరించెనో తెలియగలదు. విస్తరభీతి నుదాహరణ లీయలేదు.9

## పాల్కురికి సోమనాథుడు

పాల్కురికి సోమనాథుని ప్రథమ రచనయగు అనుభవసారము. నన్నయకవిత ననుసరించిన పద్యకృతి—చతుర్వేదసారమున, పండితారాధ్య చరిత్రమున నన్నయ పద్యముల కనుకరణములు గలవు.10 శివకవులు శివేతర కవుల నుతింపరుగావున నన్నయ ప్రశంసలేదు.

నన్నయ ననుసరించియు, కావ్యరచనా పథకమున స్వతంత్రమార్గమును ప్రవర్తింపజేయుటయే శివకవుల యందలి విశేషము—నన్నయ కవితాలక్షణములనేగాక, భాషాలక్షణములను గ్రహించుటకు - శివకవుల కృతులు హెచ్చుగా తోడ్పడును.

శివకవి యుగము తరువాతిది తిక్కన యుగము.

## తిక్కన

'తిక్కన భారతములో నన్నయనుగూర్చి 'ఆదరణీయ' పద్యమున అతడు భారతములో 'ఆదిదొడంగి మూడు కృతు 'లొనర్చెదనన్నాడేగాని అతని ప్రామాణికతనుగూర్చి యొకమాటకూడ అనలేదు' (పుట 28) దీనినిబట్టి సమీక్షాకర్తలా పద్యమున నేమున్నదో యెఱుగరనుట నిశ్చితము—తిక్కన నన్నయ ప్రామాణికతను గూర్చి—ఒకమాటయైన యనలేదనిగదా, పైని వివరింపబడినది. ఆ పుటలోనే—'నన్నయ స్తుతిభారతమున చేసినాడు...అందులోకూడా ఎక్కువగా ఏమియు చెప్పలేదు'అని కలదు. కాని పద్యము చూడుడు.

'ఆదరణీయసార వివి
ధార్థ రసస్ఫురణంబుగల్గి య
ష్టాదశపర్వ నిర్వహణ
సంభృతమై పెనుపొందియుండ నం
దాది దొడంగి మూడు కృతు
లాంధ్రకవిత్వ విశారదుండు వి
ద్యా దయితుం డొనర్చె, మహి
తాత్ముడు నన్నయభట్టు దక్షతన్.'

ఈ పద్యమున (1) ఆంధ్రకవిత్వ విశారదుండు. (2) విద్యాదయితుండు, (3) మహితాత్ముడు, (4) దక్షతన్—అను నీ నాలుగు విశేషణముల కర్థమేమి? ఇవియన్నియు వ్యర్థములేనా? తిక్కన పాదపూరణమునకైన వ్యర్థపదము లుపయోగింపడని కదా ప్రతీతి—ఇంతేకాదు—'అతని పల్కు లాగములు'—(ఏముఖంబునఁ దాఁ బల్కిన బల్కు లాగములై పొల్పొందు—ఎఱ్ఱన హరివంశము పూ. భా. 1—9) తిక్కనయే తన భారత ప్రారంభమున—'ఆంధ్రకవిత్వ విశారదుండు'అని బాహాటముగా ప్రశంసించినప్పుడతడు—నన్నయ ప్రామాణికత నంగీకరించి నట్లేగదా- తిక్కనకు నన్నయయందు ప్రామాణిక బుద్ధియే లేనియెడల--నాలుగు విశేషణము లాతని గూర్చి వ్రాసియేయుండడు. భారతమున తొలి మూడు పర్వము లింతకుముందే నన్నయ రచించియున్నాడు అని ముక్తసరిగా చెప్పియుండెడివాడు. ఇది 'ఆదరణీయ' అన్న పద్యము నవగాహన చేసికోలేనందువలన వచ్చిన యవ్యవస్థ. ఇది యింతటితో నాగలేదు.

నన్నయ భారతమును తిక్కన చదువలేదనియే సమీక్షాకర్తల యభిప్రాయము చూడండి.

'తిక్కన ఎంతవఱకు నన్నయ్యను చదువుకొనెనోగాని' (పుట 25). తిక్కన నన్నయను పఠించి కవిత నేర్చుకొనలేదుగదా. (పుట 28).

పై వాక్యద్వయమువలన వీరు తిక్కన భారతము నెన్నడును చదివియుండలేదని నిర్వివాదముగా నేర్పడుచున్నది. తిక్కన భారతము చదివినవారి కందఱకు నన్నయ నాతడు పఠించియే, తాను రచించినాడని యిూపాటికే వ్యక్తపఱచియున్నారు. ఈ విషయము

---

9. నన్నియ నన్నిచోడ కవులు — భారతి— సం. 40–సం. 5 మే. 1963 పుటలు 58–63.

10. బసవపురాణ పీఠిక—1952. ద్వి ముద్రణము—ఆంధ్రగ్రంథమాల.

వీరెఱిగియుండిన నిట్లు వ్రాసియుండరు. ఉదాహరణకు నన్నయను, తిక్కన యెట్లనుసరించినాడో చూపుచున్నాను.

### నన్నయ

శా. విద్వన్ముఖ్యుఁడు ధర్మమూర్తి త్రిజగ
ద్విఖ్యాతతేజుండు కృ
ష్ణ ద్వైపాయనుఁ డేగుదెంచె సుత శి
ష్య బ్రహ్మ సంఘంబుతో
సద్వంద్యుండు సదస్యుఁ డయ్యె ననినన్
శక్యంబె వర్ణింప సా
క్షాద్విష్ణుండవు నీవు భూపతులలోఁ
గౌరవ్య వంశోత్తమా.
(ఆది 2 -227.)

### తిక్కన

శా. విద్వత్సంస్తవనీయ భవ్యకవితా
వేశుండు, విజ్ఞాన సం
పద్విఖ్యాతుఁడు సంయమిప్రకర సం
భావ్యాను భావుండు కృ
ష్ణ ద్వైపాయనుఁ డర్థిలోక హిత ని
ష్ఠంబూని కావించె ధ
ర్మద్వైతస్థితి భారతాఖ్యమగు లే
ఖ్యంబైన యామ్నాయమున్.
(విరాట. 1—3.)

విరాటపర్వ ప్రారంభములోనే, అనగా, 'ఆదరణీయ' పద్యమునకుముందే నన్నయ, ఎత్తుగడతో, అదే ప్రాసతో తిక్కన పద్యము రచించినప్పుడు, నన్నయ భారతమునే వరవడిగా పెట్టుకొని, తాను విరాటపర్వాదిగా భారత రచనము మొదలిడినాడని విశదమగుచున్నదిగదా! ఇంకను మఱి రెండు.

### నన్నయ

చ. చదివితి నెల్ల వేదములు
సత్క్రియఁ జేసితి నూఱు యజ్ఞముల్
(అరణ్య 4—120)

### తిక్కన

చదివితి నెల్లవేదములు
జన్నము లొప్పుఁగ జేసితిన్
(శల్య. 2—230.)

### నన్నయ

మానుగవచ్చితి నీకును
భానునిభా శిష్యవృత్తిఁ బనిసేయంగన్
(ఆది 3—108)

### తిక్కన

క.
మానిత గతి నీకును నగు
భానునిభా! నీ యశంబు బరగును నీకున్
(అనుశాసనిక 3-82)

ఇంకను గలవు గ్రంథవిస్తరభీతి నీయలేదు.

పై యుదాహృతులనుబట్టి—నన్నయను పఠించి కవిత నేర్చుకొనలేదన్న వాక్యము పూర్తిగా పరాస్తమగుచున్నది.

### కేతన

కేతనను గుఱించి వ్రాసిన వాక్యములన్నియు కేతన కృతులను సరిగా చూడక వ్రాసినవే. చూడండి.

'కేతన దశకుమార చరిత్రను చూచిన తర్వాతనే తిక్కన మొదట నిర్వచనోత్తర రామాయణమున చేయని నన్నయస్తుతి భారతమున చేసినాడు'.........
'పూర్వాంధ్ర కవుల స్తుతికి కేతన మార్గదర్శకుడు'
(పుట 28.)

అసలు దశకుమార చరిత్రమున—
'పూర్వాంధ్ర కవిస్తుతియే లేదు'

క. వాక్ప్రౌ (ప్రమర్లి) కవితా
మౌకిక (మణితార) హార మండనులగు త
త్ప్రాక్తన సుకవుల నియమా
త్యక్తుల వాల్మీకి కాళిదాసులఁ గొల్తున్
(1—9)

'అని యిష్టదేవతా ప్రార్థనంబును సుకవి చరణాభివందనంబునుంజేసి' అని మాత్రమే యున్నది. ఆంధ్రకవిస్తుతియే దశకుమార చరిత్రమున మృగ్యమైనపుడు 'కేతన పూర్వాంధ్ర కవిస్తుతికి మార్గదర్శకుడు' అనుట 'వంధ్యాపుత్ర న్యాయమునకు లక్ష్యముగా'నున్నది.

'కేతన చూపిన కృత్యవతారికా సంప్రదాయము లను చూచియే తిక్కన అనుకరించి, కొంతమార్చి, షష్ఠ్యంతాదులను రచించి తన పద్ధతులను మార్చుకొనెను. నిర్వచనమున లేని పద్ధతులు భారతమున కెక్కినవి గదా.' (పుట 28)

నిర్వచనోత్తర రామాయణమునలేని పద్ధతులు భారతమున కెక్కినప్పుడు, తిక్కన నన్నయ ఫక్కినే అనుసరించినట్లు స్పష్టముగా తెలియుచుండగా, కేతన చూపిన సంప్రదాయమునే తిక్కన యనుసరించినాడని యెట్లు వ్రాసిరో దురూహ్యము. తెలుగున, కావ్యము లలో, ఆశ్వాసాద్యంతములు సంబోధనతోడను, విభక్త్యంతములతోడను,[11] రెండు విధములుగా నుండును. తిక్కన, తొలికృతియగు ఉత్తరరామాయణమున—విభక్త్యంత పద్ధతిని పాటించి, ఆవెనుక—నన్నయ భారతము సంబోధనలతో నుండుటచే నా పద్ధతి ననుసరించినాడు. ఈ యనుసరణము నన్నయనుండి గ్రహించినదేగాని కేతననుండి గాదు.

షష్ఠ్యంతములు కేతనను చూచి గ్రహించెనను మాట యసంగతము. షష్ఠ్యంతములు కేతనకు ముందు మల్లికార్జున పండితుని శివతత్త్వసారమున[12]—నన్నెచోడని కుమారసంభవమున గలవు. నన్నయలో షష్ఠ్యంతము లెందుకు లేవో, కుమారసంభవమున నుండుటకు హేతువులేవో వాని నివఱకు చర్చించియే యున్నాను.[13]

తిక్కన భారతములో—నిర్వచనముగా వ్రాయుటను గొప్పగా చెప్పుకొన్నవాడు ఆ పద్ధతిని కూడ మార్చుకొని భారతమున వచనములను 'సమృద్ధిగాను ప్రౌఢముగాను చేర్చినాడు.' (పుట 28.)

ఈ వాక్యముల కర్థమేమి? తిక్కన రచించిన భారతము, విరాటపర్వమునుండి ప్రారంభమైనది. అంతకుముందే నన్నయ, ఆది, సభా, ఆరణ్యపర్వరచన చంపూ పద్ధతిలో నవగా గద్యపద్య మిశ్రితమైనదిగా నున్నది. ఇట్టి సందర్భమున—తిక్కన భారత రచన ప్రారంభించి నిర్వచనముగా రచించిన, అది చంపూ పద్ధతిలోనున్న పూర్వపర్వములతో నెట్లుతుకుకొనునో వీరూహింప లేకపోవుట చిత్రముగా నున్నది! ఏ కావ్యములోనైన కొంత భాగము, గద్యపద్య మిశ్రితమైన చంపూ పద్ధతిలోను, కొంత భాగము, నిర్వచనముగాను నుండునా? ఒకే రీతిలో నుండవలెను.[14] దీనినిబట్టి సమీక్షాకర్తలకు, తెలుగున కావ్యరచనా నిర్మాణము గాని, తత్సంప్రదాయములుగాని యవగాహన కాలేదనుట స్పష్టము.

నన్నయ ప్రారంభించిన భారతముతో సమాన స్థాయిలో నుండుటకు, నాతని పద్ధతి ననుసరించి తిక్కన తానును విరాటాది స్వర్గారోహణము వఱకు భారతమునంతను చంపువుగా రచించియున్నాడు. తిక్కన ఉత్తర రామాయణము నెందుకు నిర్వచనముగా రచియించెనో, నన్నయ భారతమును నెందుకు చంపూ పద్ధతిలో ప్రారంభించెనో వీరికి తెలియదు. రామాయణము మూలముగాని, భారతము మూలము గాని

---

11. విభక్త్యంత రచన, చిన్నయసూరి కాలము వఱకు నున్నదని నా ఉదాహరణ వాఙ్మయమున చూపియున్నాను.

12. శివతత్త్వసారము — ద్వితీయ ముద్రణము—నా విపులపీఠికా పరిష్కరణములతో కృష్ణాపత్రికాధిపతులు ముద్రించినారు.

13. షష్ఠ్యంతముల పుట్టుపూర్వోత్తరము లనుగూర్చి పై నా ఉదాహరణ వాఙ్మయచరిత్ర చూడ నగును.

14. తెలుగున నిర్వచన కావ్యములు వ్రేళ్లపై లెక్కపెట్టదగినవిగా నున్నవి. ఆధునిక యుగమున కొక్కొండ వేంకటరత్నము పంతులుగారి బిల్వేశ్వరీయము నిర్వచన కావ్యములో మకుటాయమానమైనది.

వీరెన్నడూచూచి యుండరు. రామాయణమంతయు, ననుష్టుప్పులో నున్నది. భారతము నందట్లుగాదు. వృత్త వైవిధ్యము, ఉపజాతి వృత్తములు మొదలైనవి కలవు. కావుననే లోకజ్ఞుడును, ఉభయభాషా కావ్య రచనాభిశోభితుడు నగు నన్నయ చంపూపద్ధతిలో భారత రచన ప్రారంభించినాడు. నన్నయకుముందు కన్నడమున పంపభారతము చంపూ పద్ధతినే యున్నది. తెలుగున చంపూ పద్ధతిని ప్రవేశపెట్టుటకై భారతము నన్నయ యీ పద్ధతిలో ప్రారంభించెను. తిక్కనకేకాదు, తరువాత తెలుగు కవులందఱికి, నన్నయ మార్గమే అనుసరణీయమైనది.

తిక్కన నన్నయను పఠించి కవిత నేర్చుకొన లేదుగదా—అంతకన్న విచిత్రము కేతనయు నంతే. అది కేతన తన యాంధ్రభాషా భూషణములో నన్నయను ప్రమాణీకరింపకపోవుటయే.........నన్నయ పేరెత్తడు. (పుట. 28)

ఆంధ్రభాషాభూషణములో 'నన్నయ పేరెత్తడు' అనిగదా యీ పుటలో వ్రాసిరి. కాని వీరే 31 వ పుటలో నేమి వ్రాసినారో చూడుడు.

'తనకుముందు వ్యాకరణమే లేదను కేతన మాట అసత్యములా? 'నన్నయభట్టాది కవిజనంబుల కరుణన్' అన్నవానికి చింతామణిని గుఱించి యొక మాట చెప్పుట కష్టమైనదా.'

'నన్నయభట్టాది కవిజనంబుల కరుణన్' అనునది కేతనది యని వీరే వ్రాసినప్పుడు ముందు 'కేతన నన్నయ పేరెత్తడు'అని వ్రాసినది పరస్పరము విరుద్ధము. పై వాక్యము కేతనదే—పాఠకులకొఱకు పూర్తి పద్యము నిచ్చుచున్నాను.

క. మున్ను తెనుఁగునకు లక్షణ
మెన్నఁడు నెవ్వరును జెప్పరేఁ జెప్పెద వి
ద్వన్నికరము మది మెచ్చఁగ
నన్నయ భట్టాది కవిజనంబుల కరుణన్.'

'అది కేతన తన యాంధ్రభాషా భూషణములో నన్నయను ప్రమాణీకరింపకపోవుటయే'అన్న వాక్యము విచారింతము. దీనినిబట్టి ఆంధ్రభాషాభూషణ మెందులకు రచితమైనదో వీరికి తెలియలేదు. ఆంధ్రభాషా భూషణము వ్యాకరణము—లక్షణగ్రంథము. లక్ష్యమున్నగాని లక్షణ మేర్పడదు. నన్నయభారతభాగము వెలసినతరువాతనే, అది లక్ష్యముగా కేతన వ్యాకరణము రచించినాడు. కేతన వ్యాకరణ లక్షణమునకు నన్నయది లక్ష్యమైనప్పుడు, కేతన నన్నయభట్టును ప్రమాణీకరింపక, వేఱెవరిని ప్రమాణీకరించును? ఇది ఆంధ్ర భాషాభూషణమును చదవకుండగానో లేక చదివిన నవగాహనము కాకపోవుటచేతనో వ్రాసిన వ్రాత. ఆంధ్ర భాషా భూషణములో సమాసములను గుఱించి చెప్పునపుడు— కేతన

క. 'వాఁడి మయూఖము లనఁగా
వేఁడి పయోధారలనఁగ వింజామర నా
మూఁడక్షరంబు లనంగాఁ
బోఁడిమి కలికంఠ నామమున్ బోలి తగున్।

అని లక్ష్యము నిచ్చినాడు. వీనిలో, వాఁడిమయూఖములు, కలికంఠుడు—ఎక్కడివి? నన్నయ భట్టారకుని భారతములోనివి—

వాఁడిమయూఖములనునది కచునికథలోనిది.

'వాఁడి మయూఖముల్ గలుగు
వాఁడపరాంబుధిఁ జొచ్చె.'
(ఆది—3—112)

కలికంఠుఁడు — అనునది. కిరాతార్జునీయ ఘట్టములోనిది.

'క. కలికంఠా! క్షమియింపుము
నెఱి నెవ్వరి కెఱుఁగ నగునె నీ చరితంబుల్'
(అరణ్య 1—327)

ఈ యుదాహరణముల వలన పై వ్రాత నిర్మూలమైనది.

ఈ సందర్భమున మఱియొక వాక్యము నుపలక్షింతము.

'తిక్కనవంటివాడు నన్నయను ప్రమాణ బుద్ధితో పఠించి కవిత నేర్చియుండిన కేతన

కా మార్గము పనికి రాకపోయినదా?' (పుట 28) అనగా, తిక్కన భారతము రచించిన తరువాత కేతన దానినిచూచి, అది సరి కాదని వేఱుమార్గమును త్రొక్కినాడని గదా అర్థము. అప్పుడు తిక్కన భారత రచనానంతరమే కేతన ఆంధ్ర భాషా భూషణము రచించినాడన్న మాట. అప్పుడాంధ్ర భాషా భూషణమున తిక్కన భారతమునుండి లక్ష్యముల నేల గ్రహింపలేదు? తిక్కన భారత రచనానంతరమున కేతన యున్నాడని వీరు నిరూపింపగలరా? ఇదియంతయు వీరికి లక్ష్యలక్షణ పరిజ్ఞానము లేదనుటకు ప్రబల ప్రమాణము.

### విన్నకోట పెద్దన

కావ్యాలంకార చూడామణి కర్త విన్నకోటపెద్దన స్మరింపలేదట—అయిననేమి. పెద్దన కాలమునాటికి—(క్రీ. శ. 1400 ప్రాంతము) మహాభారతము పూర్తియైన సంగతి సమీక్షాకర్తలకు తెలియక, కవిత్రయములో నొకడైన ఎఱ్ఱనకుముందు విన్నకోటపెద్దనను గురించి వ్రాసినారు. పెద్దనకాలమునకే, ఆంధ్రమహాభారతము పూర్తియై నన్నయ ప్రామాణికత స్థిరపడగా, నీ సందర్భమున పెద్దన ప్రసక్తి అప్రస్తుతము—పెద న కేతన వంటి ప్రామాణికుడా?

### ఎఱ్ఱన

మహాభారతము — నన్నయ, తిక్కన ఎఱ్ఱనలనెడి కవిత్రయ సంప్రదాయ మెట్లేర్పడినదో ఎఱుగని వీరు, ఎఱ్ఱననుగూర్చి వ్రాసినది చూడుడు.

'ఎఱ్ఱన మాత్రము అరణ్యపర్వశేషపూరణమున 'తద్రచనయకా' చేయుటకును అతని సరస సారస్వతాంశను అలవఱచుకొనెను. చక్కని అనుకరణము.'

ఎఱ్ఱనకు నన్నయ యందే ప్రమాణబుద్ధి లేనిచో నాతనినే యెందుల కనుకరింపవలెను అన్న ప్రశ్న వీరికి కలుగనే లేదు. ఎఱ్ఱన నన్నయ ననుసరింపక కవిత చెప్ప లేని యసమర్థుడా? జయంతి రామభట్టు నిర్వచనోత్తర రామాయణమును పూరించినట్లు తాను స్వతంత్రముగ నరణ్యపర్వశేషము రచించి, తన గద్యతోడనే వెలయించెడి వాడు:—అట్లుగాక, ప్రత్యక్షరము నన్నయ ననుసరించి రచించి తుదకు గద్యకూడ నాతని పేరనే వ్రాయుటచేత—నన్నయ ప్రామాణికతను గూర్చి ఎఱ్ఱన కెంత ప్రత్యయమున్నదో మనకు తెలియగలదు. అంతే కాదు నన్నయ తిక్కనల నతడెట్లు స్తుతించినాడో చూడుడు.

ఉ. భాసుర భారతార్థ బహు
భంగుల నిక్క మెఱుంగ నేరమిన్
గాసట బీసటే చదివి
గాథలు ద్రవ్వ తెలుంగువారికిన్
వ్యాసముని ప్రణీత పర
మార్థము తెలఁగఁ జేసినట్టి య
భ్యాసన కల్పులం దలఁతు
నాద్యుల నన్నయ తిక్కనార్యులన్
(నృసిం. 1—10.)

నన్నయ తిక్కనల నభ్యాసన కల్పులని చాటినాడు. నృసింహపురాణమునందే, 'నన్నయ భట్టు తిక్క కవినాథుల కెక్కిన భక్తిపెంపునన్' అని తాత చెప్పినట్లుగా వ్రాసి యున్నాడు.

(1—15)

నృసింహ పురాణమునఁగాక— హరివంశమున నన్నయ తిక్కనల ప్రశంసలు చూచిన — నన్నయ తిక్కనల భారతమున కెఱ్ఱన నాటి కెట్టి ప్రామాణ్యత వహించినదో తెలియగలదు.

'నన్నయభట్టు తిక్కకవినాథులు చూపిన
త్రోవ పావనం బెన్న'

అని, నన్నయ తిక్కన కవితా పథకమును పేర్కొని వారిని ప్రత్యేకముగా పద్యములతో నిట్లు స్తుతించినాడు. కవిస్తుతిలో, నన్నయనుగూర్చి, తిక్కనను గూర్చి వేర్వేఱుగా పద్యములు వ్రాసిన వారిలో ఎఱ్ఱనయే ప్రథముడు.

### నన్నయ

ఉ. ఉన్నత గోత్ర సంభవము
నూర్జిత సత్త్వము భద్రజాతి నం

పన్నము నుద్ధతారి పరి
భావి మదోత్కట మున్నరేంద్ర పూ
జోన్నయ నోచితంబు నయి
యొప్పెడు నన్నయ భట కుంజరం
బెన్న నిరంకుశోక్తి గతి
నెందును గ్రాలుట ప్రస్తుతించెదన్.
(పూ. భా. 1—8)

ఈ పద్యమున నేనుగుతో నన్నయను పోల్చుటచే, నన్నయయే, ఆంధ్రకావ్యరచనకు ప్రారంభకుడనుమాట నిర్వివాదమైనది. నన్నయ కవిత మత్తేభగమనము కలదని కొందఱు విమర్శకులు తలచిరి. అది యెంతమాత్రము సరికాదు. ఏనుగు నడచిన దారిని మఱి యే యితర జంతువు నడచినను ఆ మార్గములో నంతర్భూత మగుచుండును.

'జంతు పదము లెల్ల దంతి పదంబులో
నడఁగు క్రియ' (భార. శాంతి. 5—135)

అనగా నన్నయ కవితామార్గము ననుసరించి తరువాతి కవులందఱును పయనించిరి. అతడే మార్గదర్శకుడు అని యర్థము.

## తి క్క న

మ. తను కావించిన సృష్టితక్కు
రులచేతం గాదు నా, నే ముఖం
బునఁ దాఁబల్కిన బల్కు లాగ
మములై పొల్పొందు నావాణి న
త్తను నీతఁడొకరుండు నాఁజ
ను మహత్త్వఖ్యాతిన్ గవి బ్రహ్మనా
వినుతింతుఁ దగ తిక్కయజ్వ
నిఖిలోర్వీ దేవతాభ్యర్చితున్—
(హరి. పూ. 1-9)

తిక్కనను కవిబ్రహ్మగా నుతించిన ప్రథమకవి యెఱ్ఱనయే. ఎఱ్ఱనచేసిన పై నన్నయ తిక్కనల కవిస్తుతులను బట్టి ఎఱ్ఱన కాలము నాటికి నన్నయ ప్రామాణికత సుప్రతిష్ఠిత మగుటయేగాక, తిక్కన భారత రచనతో, భారతము తరువాతి వాఙ్మయమునకు కవులకు నుపజీవ్యమై భాసించినది. దీనినిబట్టి శ్రీనాథుని కాలమువఱకు నన్నయ ప్రామాణికత సిద్ధింప లేదను మాట నీళ్లమూటయై నది—

## కవిత్రయ సంప్రదాయము

ఎఱ్ఱనతో కవిత్రయ సంప్రదాయ మాంధ్ర వాఙ్మయమున నవతరించినది—ఆరణ్యపర్వశేష రచన చేతనే గాక, భారత ఖిలపర్వమగు హరివంశ రచనము చేనతనికి కవిత్రయమున స్థానము లభించినది.[15] దానితో కవిత్రయ సంప్రదాయ మేర్పడినది.

ఈ సందర్భమున వీరు వ్రాసిన వ్రాతచూడుడు - 'ఎఱ్ఱన మాత్రము ఆరణ్యపర్వశేష పూరణమున...... బలపఱచుకొనెను. చక్కని యనుకరణ అట్లుండియు వెను వెంటనే కవిత్రయ ప్రామాణికత యేర్పడినట్లు కాన రాదు' (పుట 30) ఎఱ్ఱన వెను వెంటనే కవిత్రయ ప్రామాణికత యేర్పడలేదనుట నిరాధారము.

ఎఱ్ఱనకు వెనుక, ముప్పది నలుబదేండ్లకే కవిత్రయ ప్రామాణ్య మేర్పడినది. క్రీ. శ. 1370 ప్రాంతమున నున్న జక్కన, తన విక్రమార్క చరిత్రమున, నన్నయ, తిక్కన, ఎఱ్ఱనలనుమాత్రమే స్తుతించి, కవిత్రయ స్తుతికి నాందీ ప్రస్తావన గావించినాడు.

## న న్న య

ఉ. వేయి విధంబులందుఁ బది
వేవురు పెద్దలు సత్ప్రబంధముల్
పాయక చెప్పిరిట్లు రస
బంధుర వాగ్విభవాభి రామ ధౌ
రేయులు శబ్దశాసన వ
రేణ్యులు నాఁగ ప్రశస్తి కెక్కిరే

15. కవిత్రయమున నెఱ్ఱనకు నెట్లు స్థానమేర్పడినదో, ఆవిషయ మంతయు—'తెలుగుకవుల చరిత్ర 'తిక్కన—ఎఱ్ఱనల యుగము' అను నా గ్రంథమున పూర్తిగా వివరించినాను. అది అముద్రితము. చూ. పరిశోధన సంచిక—జూన్—జులై 1956. కవిత్రయం—ఎఱ్ఱనపెట్టిన పద్ధతి—38—46 పుటలు.

నే యెడ నన్న పార్యుగతి
నిద్దర? నట్టి మహాత్ముఁ గొల్చెదన్
(1–12)

తిక్కన

చ. పరువడి భారతాఖ్య గల
పంచమ వేదము నాంధ్రభాష సు
స్థిరత రచించుచోఁ గృతి ప
తిత్వముఁ గోరి ప్రసన్నుఁడై న యా
హరి హరనాథుచేఁ బడసె
నవ్యయ సౌఖ్యపదంబు నెవ్వఁ డా
పురుషవరేణ్యుఁ దిక్కకవిఁ
బూని నుతింతుఁ గృతాధ్వరోత్సవున్
(1–13)

ఎఱ్ఱన

ఉ. ఈ త్రయిఁదాఁ బ్రబంధ పర
మేశ్వరుఁడై విరచించె శబ్దవై
చిత్ర నరణ్యపర్వమున
శేషము. శ్రీ నరసింహ రామ చా
రిత్రములున్ బుధవ్రత గ
రిష్ఠత నెఱ్ఱయశంభుదాసుఁడా
చిత్రకవిత్వ వాగ్విభవ
జృంభితుఁ గొల్చెద భక్తియుక్తితోన్.
(1–14)

నాటినుండి కవులందఱును కవిత్రయమును స్తుతించియే యున్నారు. శ్రీనాథుడు, అనంతుడు, కొఱవి గోపరాజు, నిశ్శంక కొమ్మన, పిల్లలమఱ్ఱి పిన వీరభద్రుడు, నందిమల్లయ ఘంట సింగయకవులు—కవిత్రయమును స్తుతించిన వారే—వీరందఱు శ్రీనాథ యుగమువారు. శ్రీనాథయుగము వెనుక కృష్ణరాయ యుగమున, అల్లసాని పెద్దన, చింతలపూడి ఎల్లన, మాదయ్యగారి మల్లన, శంకరకవి, పింగళి సూరన మొదలగు కవులు కవిత్రయమును పేర్కొన్నారు.

ఆ స్తుతు లిచ్చట పేర్కొనినచో గ్రంథ విస్తరభీతియగునని విరమించితిని.

అనగా క్రీ. శ. 1600 ప్రాంతమునకే—భారత కవిత్రయ ప్రామాణ్యము స్థిరపడినది.

ఇట్లుండ వ్యాసకర్తలు—'అట్లుండియు వెను వెంటనే కవిత్రయ ప్రామాణికత ఏర్పడినట్లు కాన రాదు. ఏలయన పూర్వకవిస్తుతిలో కొందఱు ఎఱ్ఱనను, కొందఱు అతనివదలి నాచన సోమనాథుని స్తుతించియున్నారు' (పుట 30) అట్లు స్తుతించిన కవు లెవ్వరు? ఒక్క కవిపేరుకూడ చెప్పలేదే? అప్పుడు పై వాక్యమే అప్రమాణికము; అసంగతము.

తరువాత—'ఇంతవఱకు నన్నయకు లేని ఏకైక ప్రామాణికత బాలసరస్వత్యాదులకు తర్వాతనే వచ్చి యుండవలెను—' (పుట 30) అని మఱియొక ప్రతి పాదన—బాలసరస్వత్యాదులు 17 వ శతాబ్దివారు. నేను పైన క్రీ. శ. 1600 వఱకు నంతకుముందు రెండు శతాబ్దులకుపైగా కవిత్రయ సంప్రదాయము నన్నయ ప్రామాణికత—యవిచ్ఛిన్నముగా వచ్చుచున్నదని నిరూపించియే యున్నాను—అప్పుడు పైవాక్య మే మైనట్లు? అసలు నన్నయ ఆంధ్రశబ్ద చింతామణి కర్తృత్వమే వివాదగ్రస్తమైనప్పుడు[16] నన్నయప్రామాణికత దానివలన ఏర్పడనుటకంటె హాస్యాస్పదమైన విషయము వేఱొకటిలేదు—

నన్నయ శబ్దశాసన బిరుదము

సంశోధితముద్రణ సంపాదకీ యోపోద్ఘాతములో—'అతనికి శబ్దశాసన బిరుదము కల్గెనని యూహింపవచ్చును' అన్నవాక్యము పురస్కరించుకొని

16. ఆంధ్రశబ్ద చింతామణి నన్నయకృతము గాదని—ఆంతరంగిక, బహిరంగ పరీక్షచేసి సోపపత్తికముగా నిర్ధారణ చేసితిని. చూడుడు 'నన్నయవాగను శాసనుడా' అన్న నా వ్యాసములు—

1. భారతి సం. 40. సం. 6. జూన్ 1963. 40–45 పుటలు.

2. భారతి సం. 40. సం. 8. ఆగస్టు 1963 10–14 పుటలు.

వీరును దానిని బిరుదముగానే భావించిరి. కాని శబ్దశాసనుడు అన్నది బిరుదమే కాదు. దీని నిది వరకే నా తెలుగుకవుల చరిత్రమున ప్రామాణిక ముగా నిరూపించినాను.[17] అది విద్వదామోదము బడసి నది. సంగ్రహముగా దెలుపుదును.

(1) నన్నయ, తననుగూర్చి కులబ్రాహ్మ ణుడు. అనురక్తుడు, అవిరళ జపహోమతత్పరుడు మొదలగు విశేషణములు చెప్పికొన్నట్లే శబ్దశాసనుడు, అనునది యొక విశేషణముగా చెప్పకొన్నాడుగాని బిరుద ముగా చెప్పకొనలేదు.

(2) శబ్దశాసనుడనునది బిరుదమే అయిన యెడల, అది ఆశ్వాసాంతగద్యయం దుండవలెను. అది అపవాదములేని సూత్రము—నన్నయలో నట్లులేదు గాన బిరుదము కాదు.

(3) నన్నయకు శబ్దశాసన బిరుదమున్నట్లు, తరువాతి కవులెవ్వరును పేర్కొనలేదు. కేతన, తిక్కన, ఎఱ్ఱన, మారన, మంచన, శ్రీనాథుడు మొదలగు ప్రాచీనులేగాక తరువాతివారెవ్వరును బిరుదముగా చెప్ప లేదు. తర్వాతి ప్రబంధయుగకవు లంతకంటె చెప్ప లేదు.

(4) బిరుదమునకు పర్యాయపదములుండవు. శబ్దశాసనుడనుదానికి, 'వాగనుశాసనుడు' అనునది పర్యాయపదము. కాని నన్నయను వాగనుశాసనుడని క్రీ. శ. 1570 లో రామరాజభూషణునికి ముందే కవియు చెప్పలేదు. వాగనుశాసనుడను పదమే లేనప్పు డది శబ్దశాసన బిరుదమునకు పర్యాయపదమగుట యెట్లును సంభవింపదు.

కావున శబ్దశాసనుడు అన్నది బిరుదుకాదు. అని సిద్ధాంతము.

ఈ సందర్భమున వీరింకొక వాక్యము వ్రాసినారు.

'కవులు గ్రంథములు వ్రాయుచు కొంత ప్రచా రము చేయుచు అంకితాంక కావ్యభాగములను చివర వ్రాయుట యలవాటు......ఆంధ్రమహాభారత రచన చేతను, ఒకపాటి ప్రచారముచేతను నన్నయ విపుల శబ్దశాసనుడు.' (పుట 29.)

దీనినిబట్టి మహాభారతము మొదట నన్నయ కృత్యావతారిక లేకుండా, భారతమును రచించి, అది కొంత ప్రచారములోనికి వచ్చినతరువాత కృత్యావతారిక వ్రాసెనని గదా వీరి యభిప్రాయము.

'శబ్దశాసనుడు' అనునది నన్నయకు బిరుదమే కాదు. అదియొక విశేషణము మాత్రమే—ఇది బిరుదమే యైనయెడల నన్నయ, 'అనురక్తు, నవిరళ జపహోమ తత్పరు' మొదలైన విశేషణములతో, విపులశబ్దశాస నుడు—అను విశేషణమును చేర్చినాడు. ఇచట 'విపుల' అను పదము, విస్తృతిని సూచించును.

ఇంతకన్న నజ్ఞాన విలసితమగు విషయము మఱి యొకటి యుండబోదు. మొదటనే భారతరచనకు పూను కొన్న నన్నయ కృత్యాది నెంతకాలమునకు రచించెను? దానికైన గ్రంథ మారంభించిన తరువాత కొంత భాగము పూర్తియైన వెనుక, కృత్యవతరణిక రచించె ననుకొంద మన్న నది నన్నయ విషయములో నంతకంటె పొసగదు—నన్నయభారతము, హఠాత్తుగా ఆరణ్యపర్వము 4–132 పద్యముతో నాగినది— అట్టిసందర్భములో నన్నయకృత్యాది నెప్పుడురచించెను? అట్లయిన భారతము కృత్యాదిన నన్నయ—

'దుర్గమార్థజల గౌరవ భారత భారతీ సముద్రము
దరియంగ నీదను విధాతృనకైననుఁ బోల నేర్చునే'

భారత సముద్రము నీది దరిజేరుటకు— అనగా భారతము తెనుగున రచించి, దానిని పూర్తి చేయు టకు బ్రహ్మకైన తరముకాదు—ఇక నావంటి వాని కెట్లు సాధ్యము— అని చెప్పట యెట్లు తటస్థించి నది? నన్నయయే, మొదట భారతము రచించి, తరు వాత అవతారిక రచించెనేని, అప్పుడు, ప్రస్తుతము మనకు లభ్యమగుచున్న—అవతారిక నన్నయదికాదని

17. నన్నయభట్టు —(1950) పుటలు— 136—143.

చెప్ప వలెను—అది మఱి యెవరిచేత రచింపబడి మూల మునకు చేర్చబడినది?

గ్రంథముగ్రాయుచు, కొంత ప్రచారమైన వెనుక చివర అవతారిక వ్రాయు నలవాటట! అట్లు యిన, మహాభారతమున పదిహేను పర్వములు మొదట రచించి, అది ప్రచారములోనికి వచ్చినతరువాత విరాట పర్వ కృత్యావతారిక వ్రాసి, హరిహరనాథునకు కృతి నిచ్చెనన్నమాట–గ్రంథము పూర్తియైనవెనుక హర హర నాథుడు స్వప్నమున తిక్కనకు దర్శనమిచ్చి, కృతి పతిత్వము నర్థించెను గాబోలు! తెలుగున కావ్యము లన్నియు నీరీతిగానే రచింపబడినవా? పై విషయ మొక్కటియే సమీక్షాకర్తకు, కావ్యావతారికా సంప్ర దాయము, గహనమైనదని వెల్లడించు చున్నది—ఈపుట లైదును వ్యర్థములు.

పై వ్రాతను గూర్చిన విమర్శ పాఠకలోకమునకే వదలుచున్నాను—

### అనువాద విధానము

సంశోధిత ముద్రణమున--భండార్కరు సంస్థ వారు శ్రీ సూక్థంకరు సంపాదకత్వము క్రింద ప్రక టించిన సంస్కృత భారతము నే గ్రహించినట్లు, ఆది పర్వ పీఠికలో వివరింపబడినది. మూలమును గ్రహించు టయేగాక, తెలుగున భారతానువాద మెట్లున్నదో నిర్ణ యించుటకు, విషయసూచిక యందే గాక గ్రంథ మధ్య మున నాయాశీర్షికలయందు పర్వ, ఆధ్యాయ, శ్లోక సంఖ్య లీయబడినవి. ఉదా. విషయ సూచిక.

ఆదిపర్వము—ప్రథమాశ్వాసము.

| | |
|---|---|
| అవతారిక | |
| భారత కథా ప్రస్తావన | 1–1– 8 |
| పర్వాను క్రమణిక | 1–2–34 |
| పర్వ సంగ్రహము | 1–2–71 |
| గ్రంథమధ్యము —ద్రౌపదీ | |
| వస్త్రాప హరణము | 1–190– 5 |
| ఆది | |
| సభా—శిశుపాల వధ | 2– 42–21 |
| ఆరణ్య 3 ఆ. నలోపాఖ్యానము | 3– 49–29 |
| ఆరణ్య 7 ఆ. యక్షప్రశ్నలు | 3–287–20 |

ప్రస్తుతము ప్రకటితములైన మూడు పర్వ ములను, పై రీతిగా మూలమును సూచించుటయేగాక, యీ సంశోధిత ముద్రణమున–శ్రీ పి. పి. యస్. శాస్త్రి గారి - దాక్షిణాత్య భారత సంహిత (The southern Recension of Mahabharata) అను సంస్కృత భారత ప్రతిని ప్రామాణికముగా గ్రహింపబడినది. నన్నయ అనువాద విధానము గ్రహించుట కిది యెంతయు నుపయుక్తము. ఇదియును, పాఠభేదముల సందర్భ మున చూపబడియేయున్నది. ఇంకను చిత్రశాలా నీల కంఠీయవ్యాఖ్యా ముద్రణములు సూచితములైనవి.

ఇట్లు మూలప్రతులు మూడు విశదీకరింప బడగా, సమీక్షాకర్తలు, పై వానినిగూర్చి యొక్క మాటయైన వ్రాయలేదు. దీనినిబట్టి వీరు, గ్రంథ మునగల పాఠభేదములను గూడ పరిశీలింపనట్లు స్పష్టము. తక్కినవానిమాట యటుండనిచ్చి, మదరాసు లోనే వావిళ్లవారు ప్రకటించిన, 19 సంపుటముల పి. పి. యస్. శాస్త్రిగారి దాక్షిణాత్య భారత సంహితను కూడ చూడకుండుట శోచనీయమైన సంగతి—

సంస్కృత మూలప్రతులను గూర్చి సంశోధిత ముద్రణమున నున్న పై విషయముల నేమాత్రము స్పృశింపక—1922 లో శ్రీ వేదము వేంకటాచలయ్య గారు ప్రటించిన 'A study of the preliminary Chapters of the Mahabharata to separate the original from the spurious' అను గ్రంథము నుండి 4 పుటలాంగ్ల భాషలోని భాగముల నుదాహ రించి, యీ శీర్షికను పూర్తిచేసిరి. ఈ నాలుగు పుట లలో నుదాహరించిన విషయములన్నియు, భండార్కరు సంస్థ ప్రామాణిక ముద్రణముతో నేనాడో గతార్థము లైనవి—అదియునుగాక, పై ఆంగ్లగ్రంథము సమ కాలికముగా 'మహాభారతచరిత్ర'—'మహాభారత మీ మాంస—' మొదలగువ్యాసము లాంధ్రసాహిత్య పరి పరిషత్పత్రికలో ప్రకటితమైనవని వీరెఱుగరు— వానియందీ యాంగ్లగ్రంథ మునగల విషయములన్నియు

గలవు—భారత పరిశోధకులకు పరిచితమైనవే-- అట్టి సందర్భమున—నీ నా డా గ్రంథము నుదాహరించుట వలన ప్రయోజనము శూన్యము— ఇంతకు నీవిషయము ప్రస్తుత సమీక్షకు సంబంధించినది గాదు—ఏలననగా, సమీక్షకు సంబంధించినదైన మూల సంస్కృత వివరణము గాని, పాఠభేదములను, మూలముతోనెట్లు సమన్వయించి నిర్ణయించుట అను విషయముగాని ఇందుండ వలెను. కాని ఆవివరము లేవి యిందులేవు. అందువలన నాలుగుపుటలు వ్యర్థములు—

**పాఠనిర్ణయము-పూర్వముద్రిణములు**

సంశోధిత ముద్రణమున పాఠనిర్ణయములను గూర్చి వ్రాయుచు పూర్వ మముద్రితగ్రంథ చింతామణిలో కీ. శే. వేదము వేంకటరాయ శాస్త్రిగారు చర్చించిన యీక్రింది రెండు పాఠములను గూర్చి వివరము లిచ్చినారు.

1. 'మ. ధృతరాష్ట్రుండును బుత్రులు న్వ
నము గుంతీ నందనుల్ సింహముల్
మతి నూహింప న సింహమైన
వనమున్ మర్దింతు రెండు న్వనా
వృత వృత్తంబులు గాని సింహ
ములకు న్వేగంబు చేటొందు గా
న తగం బొందుట కార్యమీ యు
భయమున్ సంతుష్టిమై మన్కికిన్.

ఇందు నాల్గవ పాదమున 'కాన తగం బొందుట' అనుచోట ప్రాసలో కాన, కళయా, ద్రుతమా అని వివాదము.

2. క. కవ దొనలును గాండీవము
నవల నిడంబనుపు ముందఱ రదముడిగు మే
న(ను) విదపడిగి యొద శుభకర
మవు నివ్విధమట్లు సేయు మనుడు నతండున్.

ఇందు మూడవపాదమున — ప్రాసలో ఏన విదప యా ఏను బిదప యా అని వివాదము—

సమీక్షాకర్తలు వీనికొఱకు నాలుగుపుటలు (32-36) వెచ్చించి, అముద్రితగ్రంథ చింతామణి నుండి యథావాతృకముగా నుద్ధరించినారు. కాని పై రెండు ప్రాసలును ప్రస్తుతము తాము సమీక్షించు చున్న భారత భాగమునకు సంబంధించినవా, కావా, అను నంశము చూచుకొనలేదు. పైవివాద ప్రాసలు గల పద్యములలో నొకటి.

'ధృత రాష్ట్రుండు...
...............కా
న తగన్'

అనునది ఉద్యోగపర్వము1 ఆ—359 పద్యము.

రెండవది—కవ దొనలును...
...............ఏ
నువిదప...అనునది శల్యపర్వము.
2 ఆ–333 పద్యము.

సమీక్షాగ్రంథమున ఆది,సభా, ఆరణ్యపర్వములు మాత్రమే గలవు. పై పద్యము లుద్యోగ శల్యపర్వములకు సంబంధించినవి — సంశోధిత ముద్రణమున తాము ప్రకటించిన పద్యములకు సంబంధించిన పాఠములనే సంపాదకవర్గము చర్చింతురుగాని ఇతర పర్వములలో నున్న పాఠముల నెప్పుడును చర్చింపరు. ఇంతకు, 'కాన తగన్, ఏనువిదప'అను నిట్టి సంధిగత ప్రాసలు నన్నయ భారత భాగమున గాని, ఎఱ్ఱనలోగాని లేవు. అట్టివి యుండిన గదా, ఇతర పర్వములలో పాఠములు చర్చించుట? అట్టివి లేనప్పుడు వాని ప్రసక్తి ప్రస్తుత ముద్రణమున రానే రాదు. ఉద్యోగపర్వ సంశోధిత ముద్రణము గాని శల్యపర్వ సంశోధిత ముద్రణముగాని వెలువడినపుడు, చూపవలసిన పాఠభేదచర్చలను, నీ సమీక్ష యందు వివరించుటచే నీ నాలుగు పుటలు వ్యర్థములైనవి.

ఈ శీర్షిక యందే మఱియొక విషయము.

'ఇక వారు (వేదము వేంకటరాయశాస్త్రిగారు) సూచించిన పాఠములు సవరణలు కొల్లలుగానున్నను స్మరింప లేదు. ఒకటి రెండు ఉదాహరణములు—అని

(1) రూఢి—రూడి, (2) ఇంబుగ సర్వ లోక—ఇమ్ముగ సర్వలోక అను రెండు పాఠములను

వివరించినారు. ఈ రెండింటిలో ఇంబుగ—ఇమ్మగ అన్నది వేంకటరాయశాస్త్రిగారు సూచించిన పాఠమా? వా రుదాహరించిన అ. గ్ర. చింతామణిలోనే — అది పత్రికాధిపతి సూచించినట్లుగా నున్నది. చూ. అ. గ్ర. చింతామణి.[18] పుట 10—అందే యిట్లున్నది.(1902)

'ప్రక్రియాఛందస్సున యతిప్రాసముల కుదాహరణములని యిట్లు వ్రాయబడి యున్నది.

'అంబకు మ్రొక్కి నా కలవడినట్లు
ఇమ్మగా యతి కుదాహృతులు సెప్పెదను

అని వ్రాసియున్నారు' అ. గ్ర. చింతామణిలో పై రీతిగా 10 వ పుటలో స్పష్టముగా నుండగా, సమీక్షా కర్తలు—ఉదాహరణములని (ఇది వేదము వేంకటరాయ శాస్త్రిగారిది అని వేంకటరాయశాస్త్రిగారిపేరు చేర్చి వారు.) ఇట్లు ప్రాతపత్రికలలోని యంశము లుదాహరించునప్పుడు యథామాతృకముగా నుద్ధరింపవలెనే కాని, క్రొత్తగా విషయములు చేర్చిన లోకవంచన యగును.

అ. గ్ర. చింతామణిలో 5 నుండి 8 పుటల వఱకు గల భాగమంతయు నిందుద్ధరింపబడినది. అచ్చు టచ్చుట కొన్ని పంక్తులు విడువ బడినవి.

ఈ భాగమైన తరువాత 34 పుటలో నిట్లున్నది.

'తర్వాత తాతగారి పాఠమును శ్రీ కొక్కొండము వేంకటరత్నము పంతులుగారు అంగీకరించి నారని శ్రీ పూండ్లవారు 38 వ పుటలో తెలిపినారు' ఈ 38 వ పుట 1, 2 సంచికలలోదేనా? అందు 28 పుటలే గలవు. ఇది 3–4–5 సంచికలలో నున్నది—

ఈశీర్షిక ప్రయోజనము సమీక్షాకారులు తమ తాతగారిని గూర్చి ప్రశంసించుటకుగాక. వేఱేమియు లేదు—కేవలము వ్యక్తిగతములైన నిట్టి యప్రస్తుత ప్రశంసలు సమీక్షలలో నుండుట యసంగతము—

అ. గ్ర. చింతామణి మయూఖములలో తప్పు—వేంకటరాయ శాస్త్రిగారు వేఱుగా వ్రాసిన భారత పాఠములనుగూర్చి వీరిచ్చుటను తెలుపలేదు—అట్లు తెలుపక పోవుటచే నీ శీర్షిక పుటలపెంపకము కొఱకని యెఱుంగునది—

## అప్రసక్త విషయములు

ఆగస్టు సంచికలో 39 వ పుట—చిల్లర విషయములు అన్న శీర్షికనుండి 41 పుట వ్యాసము చివఱవఱకు వ్రాయబడిన విషయములన్నియు గ్రంథ సమీక్షకు సంబంధించినవికావు. అవి రెండవ సంపుట మునగల పీఠికకు సంబంధించినవి—సమీక్షించవలసి నది గ్రంథము గాని గ్రంథపీఠికలు గావు — పీఠికలో మూలగ్రంథములో నిచ్చిన పాఠభేదములను గూర్చి ప్రసక్తియున్నచో పీఠికకూడ విమర్శింపవలసినదే—అందా ప్రసక్తియే లేనపుడీ పుటలును నిష్ప్రయోజనములైనవి—

## యతి ప్రాసలు

సమీక్షాకర్తలకు యతిప్రాసలనుగూర్చి పరిజ్ఞాన మెట్టిదో వ్యక్తపఱచుటకు నీ క్రింది యంశము నుదాహరించి, వ్యాసము ముగించు చున్నాను.

## కపిలగడ్డము - కవిలగడ్డము

ఈ శబ్దములలో, ప, వ ప్రాసనుగూర్చి చర్చించు సందర్భమున నిట్లు వ్రాసిరి.

'............సీతారామాచార్యుల వారు వబప్రాస మునే యెఱింగియుండిన 'వేవణములు'అని వాదేశమో, వేఁబణములు అని బాదేశమో యెట్లు నిర్ణయించు కొందురు? రెండు నశాస్త్రీయములే గదా'అని నిర్ణయించియేయుండిరి...కావున భారతమున గల పైపద్య ములో నున్నట్టిది వప్రాసము గాదు గాన దానిని వప్రాసముగా నెఱుంగునది (పత్రికాధిపతి.)

---

18. అ. గ్ర. చింతామణి అనునది 'అముద్రిత గ్రంథచింతామణి'అను నామమునకు సంగ్రహరూపము,

అప్పకవి దీనిని విశేషవళుల క్రింద పరిగణించి నాడుగదా (పుట 37. ఆగస్టు భారతి.)

'వళి' యనగా యతి— పై వ, వ విషయము ప్రాసకు సంబంధించినది. అప్పకవి యిట్టి ప్రాసను వళిగా పరిగణించినాడా? అప్పకవీయము చూడుడు. పుట 135.

వి శే ష వ ళు లు

గీ. ప్రౌఢకవులు కొందఱు జ్ఞకారంబునకును
ప్రథమ వర్గంబు తొలి యక్కరములు నాల్గు
నిడుదురు ప్రబంధముల నొక్కయెడ విశేష
వళులనుచు సోమయాజులు వాడు కతన—

శాంతిపర్వమునందు.

క. జ్ఞానము కేవల కృప న
జ్ఞానికి నుపదేశవిధిః బ్రకాశము సేయం
గా నది సకల ధరిత్రీ
దానంబున కంటె నధికతర ఫలద మగున్.
(4—255) అప్ప. 3—57.

పై జ్ఞ—క అప్పకవి స్పష్టముగా, యతిభేదములలో విశేషవళి క్రింద వర్గీకరించి లక్ష్య లక్షణముల నిచ్చినాడు - ఇది యర్థముగాక, సమీక్షా కర్తలు 'అప్పకవిదీనిని (వ వ ప్రాసమును) విశేషవళి క్రింద పరిగణించినాడుగదా' అని వ్రాయుటయెట్టిదో పాఠకలోకమే నిర్ణయింప గలదు.

యతి యనగానేమో ప్రాసయనగా నేవో తెలియని సమీక్షా కర్తలు—సంశోధిత మహాభారత ముద్రణ మునకు పూనుకొనిన విజ్ఞత కూడ యెట్టిదో ప్రాజ్ఞులు తెలుపుదురుగాక—



# శివోదయం!

శ్రీ కళాధర్

విమలైశ్వర్య విముగ్ధ శుద్ధ హృదిలో
వెల్గొందు చైతన్య దీ
ప మవై, తూగు నిషా ఉషోదయములో
భాసించు లావణ్య జీ
వ మవై, నిష్కమదీయమౌ కవితలో
స్పందించు నాంతర్య గా
న మవై, భావ మనల్ప కల్పనము వై
నర్తించు విశ్వేశ్వరీ.

శిల లౌ గుండెల దిద్దితీర్చు యులివై,
శీతాంశు రేఖావళిన్
అలలౌ కన్నుల దోచునట్టి కళవై,
అందాల భావాలకున్
నెల వౌ నాయెద పిండునట్టి కలవై,
నీ యొక్కలే నవ్వు సం
జల, నౌరా! విర బూసె దీవు చెలివై
సమ్మోహనత్వమ్మునన్.

ఇలలో నింగి వినీల నీలిమములో
నిచ్చోట నేనున్న లో
గిలిలో దూరపుకొండ సానువులలో
గిరిగంటి నాజూకులో
యలలో వీచెడి మత్తు తెమ్మెరలలో
నాత్మీయ బంధాల తీ
వెలలో బూచెడి రాగమంజరులలో
వీక్షింతు నిన్నే సఖీ.

విధిగా జీవనమందు బారు నదిగా,
ప్రేమార్ద్ర లా వారి సా
రథిగా, మానవ మానవత్వ నిధిగా,
ప్రారబ్ధ దుఃఖాబ్ధివా
రథిగా, భావము నిత్య నూతనముగా
ప్రాప్తింపగా జేయు నో
షధిగా, నీవు వెలుంగు హృత్ప్రమిదగా,
సాహిత్యమున్ మల్చెదన్.

కలుగుల్ సొచ్చిన గుండెలున్ వెలికిరా
కావ్యమ్ములో తీపిగా,
పులుగుల్ మానవ నైజముల్ యెగసిరా
పూవాలలో వెల్గగా,
అలుగుల్ నాటెడు ద్వేషముల్ యణగి రా
నాంతర్యమున్ ప్రేమగా,
నలుగుల్ బెట్టెడి ప్రేయసీ, కదలిరా
నాలోని భావమ్ముగా.

మరులన్ బాయుచు, క్రమ్ము చీకటులలో
మార్గమ్మువై—వెల్గ మి
న్గురులన్ గీయుచు, జీవ మంఝరుల లో
క్రొన్నావికవై—క్రాంతి తె
మ్మెరలన్ సాగుచు, భాస్కరోదయము లో
మేల్కొల్పువై—ప్రేమ తా
మరలన్ విచ్చుచు, మా యెదన్ యెపుడు లో
మాధుర్యమై నిల్తువో.

నిలిచీ, రమ్మని సైగజేసి పిలిచీ,
నీ యొక్క చూపున్ ననున్
గెలిచీ, లో విరహమ్ము జిమ్మ తొలిచీ,
కేళీవిలాసిన్ హృదిన్

## శివోదయం!

మరిచీ, అందు స్వరాల మాల మెరిచీ,
మాధుర్యమే నీవ య్యె
వెలసీ, 'ఎవ్వరో చెప్పకో' అనెదవే!
వేయేల నా దానవే.

హృదయం బెప్పుడు నిల్చి యభ్యుదయమున్
ప్రేమించునో, యప్పు డా
హృదయం బందు నవోదయంబగు–మమున్
హేలాగతిన్ జేర్చు నా
యుదయం బెప్పుడు నిల్చి స్వార్థత మమున్
యోడించునో, యప్పు డా
యుదయం బందు శివోదయం బగు సఖీ,
యుతే జమే నీవయె !



# బాలవ్యాకరణ ఘంటాపథ
# వ్యాఖ్యా పరిశీలనము

## శ్రీ శలాక రఘునాథ శర్మ

ఆంధ్రభాషా వ్యాకరణములలో బాలవ్యాకరణము నకుఁ గల స్థాన మద్వితీయమైనది. సూత్ర నిర్మాణము, ఉదాహరణ ప్రదర్శనము, విషయ సంగ్రహ ణము, తన లక్ష్యము మేరకు సమగ్రత మున్నగు విషయములలో చిన్నయసూరి అసమాన ప్రతిభా పాటవ మును బ్రదర్శించెను. కావుననే పుట్టిన స్వల్పకాలము లోనే యీ గ్రంథము తెలుగు భాషా బోధన రంగమున అపరిహార్యమైన స్థానము నాక్రమించు కొనినది. అంతియకాక ఇప్పటికి ఈ గ్రంథముపై సంస్కృ తాంధ్ర భాషా సాహిత్య తత్త్వనిపుణులగు పండితు లైదారుగురు చక్కని వ్యాఖ్యానముల సంతరించిరి. దీనిని బట్టియు ఈ గ్రంథప్రాశస్త్యము సువిదిత మగు చున్నది. ప్రస్తుతము ముద్రితములై లభ్యము లగు చున్న వ్యాఖ్యానములలో కడపటిది శ్రీ వంతరాం రామకృష్ణారావు గారు వ్రాసిన ఘంటాపథ వ్యాఖ్య. వారు వ్యాకరణశాస్త్రమున అభినివేశముగల కొలఁది మంది పండితులలో ఎన్నిక గన్నవారు. వారి ప్రయోగ పరిశీలనాదక్షత వారందందు ప్రకటించిన వ్యాసము లలో గోచరించును. వ్యాకరణమున కీలక ఘట్టము లలో పరిష్కారముల నొనర్చుటకు ప్రయోగ పరిశీల నము అతి ముఖ్యమైనది. వీరందు కృతకృత్యులయిన పండితులు.

వీరి ఘంటాపథ వ్యాఖ్యానము చిన్నయసూరి హృదయము నావిష్కరించుటలో, అధ్యేతలకు నిరా ఘాటముగా విషయప్రవేశమును గలిగించుటలో, సందిగ్ధాంశము లందు నిర్ణయములను సూటిగా ప్రతి పాదించుటలో సార్థకనామమైనది.

వ్యాకరణమున రూపనిష్పత్తి క్రమము చాల ముఖ్యమైనది. ఇదియొక శాస్త్రము కనుక, ఎట్లో సరిపుచ్చుకొంద మనుటకు వీలు లేదు. పూర్వాపర వైరుధ్యము, పరిభాషా వ్యతిరేకత మున్నగు దోషములు సర్వథా పరిహరణీయములు. ఈ విషయమున నీ వ్యాఖ్యా నము మిక్కిలి మెలఁకువతో వ్యవహరించినది. ద్రుత ప్రక్రియ, సమాస ప్రక్రియ, తద్ధితరూప నిరూప ణము మున్నగు విషయములలో పై విషయము మనకు చక్కఁగా గోచరించును. అట్లే క్రియా పరిచ్ఛేదము నందలి రూపసాధనములో పాఠకులకు కలుగు క్లేశము నీ వ్యాఖ్య దూరీకరించును.

మఱియు నీ వ్యాఖ్య కేవల విషయప్రతిపాదనము నందు మాత్రమే తృప్తిఁగొనక పూర్వవ్యాఖ్యల పొర పాటులను నిశితముగా విమర్శించి పాఠకులను భ్రమ ప్రమాదములనుండి మరలించుటలో కృషిచేసినది. ఈ విషయమున దీనికి పూర్వవ్యాఖ్యలలో సన్నిహితమగు రమణీయము మార్గదర్శక మన వచ్చును. విషయ వివరణము దిఙ్మాత్రముగాఁ గాక అవసరమైనంత విస్తృతముగా చేయఁబడినది. సంస్కృత పరిభాషా సమన్వయము అవసరమైనంతవఱకుఁ గావింపఁబడినది. సందేహములున్న తావులందు చాలవరకు కార్యకారణ నిరూపణ మార్గమున యోగ్యములైన పరిష్కారము లొనర్పఁబడినవి. వర్ణనాత్మక వ్యాకరణములలో ఎట్లో రూపమేర్పడిన చాలదు. సరియగు సూత్రము, క్రమము అనునంశములు ముఖ్యములు. తన్నిరూపణమున నీవ్యాఖ్య ప్రశస్తపథము నవలంబించినది. ఇట్టిది వ్యాకరణ

లక్ష్య సాధనమున పాఠకునకు రాజమార్గముగా నున్న దనుటలో సందియములేదు.

అయినను ఇందు విమర్శనీయములగు నంశములు కొన్నిగలవు. ఇది శాస్త్ర విషయమగుటచే విషయ నిరూపణములో పాఠకునకు సత్యము ప్రతిపాదింపఁబడనియెడల నాతఁడందు భ్రమప్రమాదములకు లోనగుట తటస్థించును గావున ఈ వ్యాఖ్యాత యందు నాకున్న వైయక్తికమైన గౌరవమున కే మాత్రము భంగము కలుగని పద్ధతిలో నిందలి యంశములు కొన్ని యిట పరిశీలింపఁ బడుచున్నవి. ఒక విధముగా, దీనిని పరిశీలించుట యన్న, తక్కిన వ్యాఖ్యలను పరిశీలించినట్లే యగును. ప్రస్తుత మా యంశములను ప్రకరణ క్రమము ననుసరించి పరిశీలింతును.

1. 'య ర ల వలు లఘువులని యలఘులని ద్వి విధంబులు' (సంజ్ఞ 18. సూ) అనుసూత్ర వ్యాఖ్యలో విశేషాంశములలో నిట్లుగలదు. 'అలఘుళకారమునకు, వర్ణసమామ్నాయమందలి ళకారమునకు భేదమేమి? అని కొందఱు శకింతురు. అలఘుళకారము దంత్యము. ఇది లకారము నలఘువుగాఁ బలుకుటచే నేర్పడును. శబ్ద సిద్ధ ళకారము మూర్ధన్యము' (పు. 19) సూరిచెప్పిన అలఘు లకారము దంత్యముగా ఉచ్చారణ దకులచేతను ఉచ్చరింపఁబడుచున్నట్లు తోఁపదు. సహజ ళకార, అలఘు లకారములకు లిపిభేదములేనట్లే, ఉచ్చారణ భేదము కూడ వినికిడిలో లేదు. ఏళులు, పాళులు మున్నగు వానియందు దానిని మూర్ధన్యముగనే ఉచ్చారణాభినివేశము గలవారు సయితము పలుకుదురు. కేవల సూత్రసమర్థనమునకై నేఁడు ఉచ్చారణములో భేదమును తేఁజాలము. కనుక 'ళ' మూర్ధన్యము, అలఘువు, ల—దంత్యము లఘువు. లకారమున కే మాత్ర మల ఘుత్వము కలిగినను నది మూర్ధన్యముగ నుచ్చరింపఁబడుటయే అనుభవసిద్ధ విషయము—అని సామాన్యాకారముగ చెప్పుటకు వీలుగలదు. అయినచో దీనిని వర్ణాంతరముగ పరిగణింపఁ బనిలేదు కదా! యన్నచో తక్కిన వర్ణములకంటె దీనికొక విశేషము గలదు. తక్కిన య, వ, ర అను వాని లఘ్వలఘు భేదములకు స్థాన భేదములేదు. ఈ వర్ణమునకుమాత్రము కన్పట్టుచున్నది. దానిని సూచించుటకై యిది వర్ణ సమామ్నాయమున వర్ణాంతరముగ పరిగణింపఁబడినది. సూరి యీ యభిప్రాయమును సమ్మతింపక స్థాన భేదమును బట్టి శబ్ద సహజ ళకారము లఘ్వలఘు లకారములకంటె భిన్నమైన వర్ణాంతరముగా పరిగణించి, యాదేశరూపమైన దానికి అలఘుత్వమును సంభావించెను. ఆ తాత్పర్యముతోడనే ఉచ్చారణమునందును, లిపి యందును నే మాత్రము భేదము లేని అలఘు లకార సహజ ళకారములను భిన్నవర్ణములుగా భావించి యుండు ననుట సముచితము. మఱియు ళకార మాదేశమగు మూడు వర్ణములలో రెండు మూర్ధన్యములు. దానిని బట్టికూడ నాదేశ ళకారము మూర్ధన్యమే యనుట యుక్తము. మఱియు ద్రావిడ భాషా బహువచన ప్రత్యయమగు కళు, గళు, ళు, ళ్ అను వాని యందలిది మూర్ధన్యమే యనుట గుర్తించినచో తెలుగుఁన డల రల కాదేశమైన ళకారము కూడ మూర్ధన్యమే యగు ననుట స్పష్టమగును. ఒకవేళ దానిని దంత్యము గనే భావింప వలయు నన్నచో కొన్ని ప్రాంతములం దనాగరకులలో గల 'ఊల్లు'వంటి యుచ్చారణ శైథిల్యమును వ్యాకరణ మంగీకరించినట్లు చెప్పవలసి వచ్చును. ఈ కారణములను బట్టి, ఈ వ్యాఖ్య నిర్దేశించినట్లు అలఘు లకారము దంత్యమనుకొనుట పొసఁగదు.

(2) బాల. వ్యా. సంధి. 39 వ సూత్రము 'అన్యంబులకు సహిత మిక్కార్యంబులు కొండొకచోఁ గానంబడియెడి' అనువాని వ్యాఖ్యలో విశేషము లందు 'కెంపు పూవు శబ్దముల కన్యముల ధర్మములు లేవు. ఇవి ప్రాంతాదులలోఁ జేర్పఁబడియుండుటచేతను, నన్యములలోఁ జేరవు. కొందఱు వీని నన్యములలోఁ జేర్పనగు నని సెలవిచ్చుట సరికాదు.' (పు. 71) అని కలదు. కేవలములగు కెంపు, పూవు శబ్దముల కన్యముల ధర్మములు లేనిమాట నిజమే. ఒకానొక శబ్దము పరమగు నపుడు మాత్రము వీనికా ధర్మము లన్నట్లు నిర్ణయింపక తప్పదు. రమణీయ వ్యాఖ్యలో 'కెమ్మోవి, పుప్పొడి

మున్నగు రూపముల కీ సూత్రమే సాధకముగాఁ గన్ప ట్టును' (పు. 233) అను వాక్యము కన్పట్టును· ప్రస్తుత వ్యాఖ్యా వాక్య మీా రమణీయ వాక్యమునే సరి దిద్దునదియైన యెడల ఆ రూపముల సాధనమార్గము నీ వ్యాఖ్య చూపి యుండవలసినది. ప్రాఁతాది శబ్దము లలో దేనికైన పరుషములు పరములగునపుడు నుగా గమము వచ్చును. కొన్ని యెడల నుగాగమము, కొన్ని యెడల వీాఁది హల్లునకు ద్విత్వమును వచ్చుట క్రొత్తశబ్దమునకు మాత్రమే విహితమైనది. కెమ్మోవి యను దానియందు స్థిరాక్షరము పరమైనది. పుప్పొడి అనుచోట పరుషము పరమైనది. మొదటిదానియందు నుగాగమమునకు ప్రసక్తిలేదు. రెండవదానియందు నుగా గమము క్రొక్కారు మొదలగువానియందువలె నుగా గమము రాలేదు. రెంటికిని ద్విత్వమే వచ్చినది. ఇట్లు ద్విత్వము వచ్చుట క్రొత్త శబ్ద విషయముననే కాఁగా, ద్విత్వము కెమ్మోవి, పుప్పొడియను వానికిఁ గన్పట్టు చుండఁగా కెంపు, మోవి యనువానికి అన్యముల ధర్మ ములు లేవనుట యెట్లు పొసఁగును? ఈ సూత్ర మిచట వర్తింపదనుకొనుటకు ఈ వ్యాఖ్యలో వ్రాయఁ బడిన యీా వాక్యములు కారణములై యుండనోపు. 'నిండు, నెఱ శబ్దములకేదో యొకటే శబ్దము పరమయి నపుడు కాక యెక్కువ శబ్దములు పరమయినప్పుడు లోప ద్విత్వములు కలుగుచున్నవి. కావున నొక శబ్దమున కొకటికంటె నెక్కువ శబ్దములు పరమగునప్పుడు లోప ద్విత్వములగునని' గ్రహింపవలెను. (పు. 70, 71) సూరి చూపిన యుదాహరణములనుబట్టి ఈ వ్యాఖ్యాత లీ యభిప్రాయమునకు వచ్చి యుండవచ్చును. కాని కెమ్మోవి, పుప్పొడియను నీ రెండుదాహరణ ములనుబట్టియే యీా వాక్యములను వ్రాత్యాఖ్యాత ములగు చున్నవి. ఉదాహరణము చూపని మాత్రమున పై నిర్ణయము చేయుట సరికాదు. ఇవి కెందమ్మి కెంజడల వంటివికావు. పరుషేతరము పరమగునపుడు నుగాగమము వచ్చుట విశేషము. పరుషముగాని పరు షేతరముగాని పరమగునపుడు ద్విత్వము వచ్చుట సామాన్య విషయమే. కావున నీ రెండుదాహరణములకై కెంపు, పూవు శబ్దములను ప్రాఁతాదులయందున్నను, అన్యములయందును జేర్పక తప్పదు.

(3) తత్సమ పరిచ్ఛేద ప్రథమ సూత్ర వ్యాఖ్యా విశేషములో నిట్లు వ్రాయఁబడినది. 'డు ప్రత్యయము 22 వ సూత్రమునను, ము ప్రత్యయము 39 వ సూత్రమునను, వు ప్రత్యయము 48, 50 సూత్రములలోను ప్రత్యేకముగా విధింపఁబడును. లు ప్రత్యయము 12 వ సూత్రమునఁ జెప్పఁబడును. కావున నిది విధి సూత్రమని కొందఱు చెప్పుట సరికాదు' (పు. 83)

రమణీయమున తత్సమ పరిచ్ఛేదము నందలి మొదటి యేడు సూత్రముల తర్వాత వివరణములో 'ఈ సూత్రము లేడింటిని సంజ్ఞా సూత్రములు గనే కాక విధి సూత్రములుగఁ గూడ గ్రహింపవలయును' అని కలదు. (పు. 237) ఆ వాక్యము నీ వాక్య మాక్షేపించుచున్నది. ఇది కాక తక్కిన ఆఱు సూత్ర ములను సంజ్ఞా సూత్రములుగా మాత్రమే కాక విధి సూత్రములుగ నీ వ్యాఖ్యయు నంగీకరించియున్నది. ఉదాహరణమునకు 'ద్వితీయా విభక్త్యంతములను సాధింపవలసివచ్చినపు డీ సూత్రముచేతనే ము వర్ణ కము ప్రాతిపదికలపై నిలుచును' (పు. 83) మొ॥వి. కావున 'డు ము వు లు ప్రథమ' అను సూత్ర విష యముననే విధి సూత్రమనుకొనుట పొసఁగదని యీా వ్యాఖ్యయొక్క తాత్పర్యము. కాని అది సత్యముకాదు. డు ము వు ల విధానమునకు 22, 39, 48, 50 సూత్రములున్నను లు ప్రత్యయమునకు విధి సూత్రము బాలవ్యాకరణమున లేదు. ఉన్నదని యీా వ్యాఖ్య వచించిన 12 వ సూత్రము 'లు' అనుదానికి బహువచన సంజ్ఞను గలిగించునదియేకాని లు విధాన సూత్రము మాత్రము కాఁజాలదు. పూర్వాపర సూత్రములనుబట్టి యీా యంశ మును నిర్ణయింపవచ్చును. 'డు ము వు న లేక వచ నంబులు. త. 11'. 'లు వర్ణంబు బహువచనంబు' త. 12. 'తక్కినవి యుభయంబులు' త. 13. వీనిని పరిశీలించినచో నివి ప్రత్యయముల ఏకవచనత్వ బహు వచనత్వములను నిర్ణయించునవియే కాని ప్రత్యయ

విధాయక సూత్రములు కావనుట స్పష్టము. కావున లువర్ణక విధానమునకు వేఱొక సూత్రము లేని కారణము నను, తక్కిన యాఱు సూత్రములును విధి సూత్రములుగఁగూడ పరిగణింపక తప్పదు కనుకను ఈ సూత్రముకూడ విధి సూత్రమే యని యంగీకరింప వలయును. అట్లు చెప్పుటచేఁ గలుగు ప్రయోజనము లు వర్ణమునకు మాత్రమే అయినను, తక్కినవాని కిది వర్తింపకున్నను నదియొక సమస్య కాదు. 'అణాది త్స వర్ణస్య చా ప్రత్యయః' అను సంస్కృత పరిభాషా సూత్రము నందలి అణ్ ప్రత్యాహారస్థములైన హ, ర వర్ణములందు ప్రయోజనము లేనివే యయ్యును, ఎట్లు పరిహరణీయములు కావో, అట్లే విధి విషయమున 'డు, ము, వు' అనునవి ప్రయోజనము లేనివైనను సంజ్ఞావిషయమునఁ బరిహరింపఁబడఁజాలవు. బా. వ్యా. క్రియా పరిచ్ఛేదమునందలి 50, 59 సూత్రములలోని వక్రపద మొక్క ఎకారమునే గ్రహించి తక్కినవాని నుజ్జగించుచున్నది. కావున నిది విధి సూత్రమనుట సరికాదనుట సరికాదు.

(4) తత్సమ పరిచ్ఛేదమునందలి 'ఇకారంబు మీఁది కునువు క్రియావిభక్తుల యుత్వంబున కిత్వం బగు' (26) అను సూత్రమున కీఁబడిన మూఁడవ యుదాహరణ విషయమునఁ గొంత సందిగ్ధత కలదు. కొందఱది జలపర్యాయ వాచకమైన సంస్కృత వారి శబ్దమనిరి. ఈ వ్యాఖ్య దానిని తచ్ఛబ్దార్థకము యొక్క మహద్బహువచన రూపమే యని కొన్ని యుపపత్తులను జూపినది. సర్వనామ ప్రక్రియ సూరి చెప్పనే చెప్పఁడనుట పొసఁగని మాటయేయైనను ప్రకృతోదాహరణ ముభయ సామాన్యముగ నిచ్చినాఁడని తలంప వచ్చును. సంస్కృత శబ్దమనుకొనుటలో విశేషమేమి? యను ప్రశ్న పొడమ వచ్చును. ఒక పులింగ శబ్దమును (హరిని) ఒక స్త్రీలింగ శబ్దమును (శ్రీని) చూపిన సూరి యొక నపుంసక లింగశబ్దమునుగూడ నుదాహరించె ననుటలో సామంజస్యము లేకపోలేదు. దాని నాచ్ఛిక సర్వనామముగఁగూడ భావించుటలో విప్రతిపత్తి లేదు. సర్వనామ మగుటయే యిట సూరి హృదయమని ఖండితముగాఁ జెప్పఁజాలమని నా యుద్దేశ్యము.

(5) తత్సమ పరిచ్ఛేదమునందలి 27 వ సూత్రము వ్యాఖ్యలో ఈ క్రింది వాక్యములు గలవు. '(iv) 'ఈకు' అనునది యుష్మదర్థక మని కొందఱు వ్యాఖ్యానించినారు, క్రియయు యుష్మదర్థము వగునని కొందఱు సెలవిచ్చినారు. కాని యీ రెండు పక్షములు సరికావు. ఏలన ఆచ్ఛిక 24 సూత్రోదాహరణములను బట్టి నీకు—అను యుష్మదర్థ మొక్కటి మాత్రమే సూరి మతమునఁ గలదు. ఈకు అనునది లేనేలేదు. కావున ఈకు—అనునది క్రియా రూపము మాత్రమే యన్నది సూరి హృదయమనుట స్పష్టము. చూ. ఆచ్ఛిక 24 వ్యాఖ్య' పు 98.

ఈ యభిప్రాయమును పరిశీలింతము. సూరి ఆచ్ఛిక. 24 వ సూత్రోదాహరణములలో యుష్మదర్థమునకుఁ బ్రథమైక వచన బహువచనములఁలో నీవు—ఈవు, మీరు-మీరలు, ఈరు-ఈరలు అను రూపములను జూపియున్నాఁడు. తృతీయా విభక్తి వఱకే రూపములను బ్రదర్శించి యున్నాఁడు. విభక్తి నిమిత్తకమైన మార్పులున్నంతవఱకుఁ జూపుటయే యాతని ఉద్దేశ్యము కాని యున్నరూపముల నన్నింటికి నన్ని విభక్తులలో రూపములను బ్రదర్శించుట తన లక్ష్యముకాదు. కావున ప్రథమా విభక్తిలో నకార విరహితముగనున్న ఈవు—ఈరు అను రూపములనుబట్టి షష్ఠీ విభక్తిలో 'ఈకు' అను రూపమును బ్రయోగానుసారముగ నంగీకరించుటలో దోష మేమియు లేదు. తక్కిన విభక్తులలో నకారములేని రూపము ప్రయోగ దృష్టము కాదు గాని షష్ఠిలో దీనికి ప్రయోగము గలదు.

'ఎంత చెప్పిన విన రేమి 'యీకు' వాకు
హరుని యాజ్ఞయ బల వంత మల్ల మెట్టు'

(శివ. మా. 4.63) ఇది రమణీయమునఁ జూపఁబడినది. కవి ప్రయోగమునకు గతి కల్పించుట కేదేని మార్గమున్నచో నది యుపాదేయమే కాని పరిత్యాజ్యము

కాదు. కావున నీ సూత్రమునందలి 'ఈకు' అను నుదాహరణము క్రియారూపముతోపాటు యుష్మదర్థమునగు ననుకొనుట సమంజసమే యగును.

(6) తత్సమ పరిచ్ఛేదమునందలి నలువదవ సూత్రమగు 'వానికి ము వర్ణకేతరంబయిన విభక్తి పరమగునపుడు ముగాగమంబగు' అనుదాని వ్యాఖ్యలో వానికి—అను సర్వనామముచే కొందఱు ప్రథమైక వచనమున ము వర్ణకము వినఁబడువానికి అను సొంత వాక్య ముపాత్త మగునను కృతకమని యీ వ్యాఖ్యలోఁ జెప్పఁబడినది. (పు. 108). కాని యిది కృతక మేమాత్రమును గాఁజాలదు. ఈ యర్థమును జెప్పక తప్పదు. ము వర్ణకేతర విభక్తి యనుదానిచే నీ యర్థమును సాధింపఁజాలము. ము వర్ణకేతర విభక్తి యనఁగా లు మొదలగువానితోపాటు డు వు లు, వాని లోపమును గూడ గ్రహింపఁబడవచ్చును. అప్పుడు లత+లు అనుచోట 'ప్రథమా విభక్త్యేక వచనమున ము ప్రత్యయము వినఁబడు నమహన్నపుంసకములకు' అను నర్థమును జెప్పనియెడల ముగాగమ మనివార్య మగును. ఇట్టి యర్థమును జెప్పుట యీ వ్యాఖ్యకును సమ్మతమే. కాని యా యర్థమును సిద్ధింపఁజేయు మార్గము మాత్రము భిన్నము. పరిశీలింపుఁడు—'ము వర్ణకేతరంబయిన—అనుటచేఁ ప్రథమైక వచనమున ము వర్ణకముతోఁ గూడికొనియుండు అదంతములగు నమహన్నపుంసకములకే ముగాగమ మగునని వ్యాఖ్యానింపనగును.' (పు. 108) ఈ యర్థమును 'వానికి'—అను పదముచే సాధించుటయే సహజము, 'ము వర్ణకేతరంబయిన' అనుదానిచే సాధించుటయే కృతకమని పైని నిరూపింపఁబడినది.

(7) భగవానుఁడు, హనుమానుఁడు అను రూపముల సాధన విషయమున నీ వ్యాఖ్య 'మతుప్తకారమున కనుటచే ఆనాదేశ పక్షమున సంస్కృత ప్రాతిపదికమును గ్రహింపవలెనని సూచన' అని వ్రాసినది. (పు. 133) ద్వితీయైక వచనాంత తుల్య రూపమును ప్రాతిపదికముగా గ్రహించినచో 'హనుమంత' అనుచోటనున్న 'త' అను దానిని తకారముగా (త్) గ్రహించుట బాలవ్యాకరణ సమ్మతముకాదని నిరూపింపఁబడినది. అయినను ద్వితీయైక వచనాంత తుల్యరూపముతో దీనిని సాధింపవచ్చును. 'హనుమంత' అనుదానిలో తకార హల్మాత్రమునకే ఆనాదేశము చేసినను వైరూప్యము సంభవింపదు. హనుమంత్+అ హనుమం+ఆన+అ—అపదాది స్వరసంధి. హనుమం+ఆన. స్వరపూర్వక బిందువు తెలుఁగున నుండదు కావున లోపించును. హనుమ+ఆన. పిదప నపదాది స్వరసంధియు నుత్త్వడుఙ్నులు రాఁగా హనుమానుఁడు సిద్ధించును. ఇట్లే భగవానుఁడును. ఇట్టి ప్రక్రియతో ద్వితీయైక వచన రూపముతోఁగూడ నిష్టరూప సిద్ధియగును. కాని యిది ప్రక్రియా గౌరవము మాత్రమేకాక చాలకృతకమైన ప్రక్రియయు నగును. కావున నీ వ్యాఖ్యలో చెప్పఁబడిన మార్గమే సుకరము. (సంస్కృత ప్రాతిపదిక తుల్య రూపమే తెలుఁగునఁ బ్రాతిపదికమగుననుట). కాని యిట్టి వాక్య విన్యాసమేగల 80, 81, 82, 83 సూత్రములలో నీ వ్యాఖ్య ఈ పద్ధతిని—సంస్కృత ప్రాతిపదికము తెలుఁగున ప్రాతిపదికమగు ననుదానిని అంగీకరింప లేదు. 'సాంతంబుల తుది సకారంబునకు లోపంబు బహుళంబుగా నగు' అను తత్సమ, 80 వ సూత్రము వ్యాఖ్యానమున 'తుది సకారంబున కనుటచేఁ బ్రథమైక వచనమునందలి తుది విసర్గమును సకారముగ మార్చి ప్రాతిపదికము చేయవలెను' (పు. 139) అని వ్రాయబడినది. దాని విశేషాంశములలో 'కొందఱు 'తుది సకారంబునకు' అను దానినిబట్టి సంస్కృత ప్రాతిపదికమును గ్రహింపవలె నందురు. కాని 'తుది సకారంబునకు' అనునది విసర్గమును సకారముగ మార్పవలెనని సూచించు నన్నదే సంప్రదాయ సిద్ధమగు నర్థము. 'అత్ర ప్రథమైక వచన తుల్యత్వేపి విసర్గస్య ద్విత్వా సంభ వాత్తత్ స్థానినః సకారస్యైవ గ్రహణమ్. అప యః ప్రభృతే రితి సూత్ర ప్రయోగశ్చ శబ్దశాసన స్యాత్ర మానమ్' అని యహోబల పండితుఁడు స్పష్ట పఱిచి యున్నాఁడు. అసలు 67 చే ప్రథమైక వచనాంతములు ప్రాతిపదికము అగును.

68 చే—ఆ ప్రథమైక వచనాంత తుల్యముల తుది హల్లునకే, ఉగాగమము ద్విత్వము నగును. సంస్కృత ప్రాతిపదికముల తుది హల్లునకుఁగాదు, కావున సంస్కృత ప్రాతిపదికమును గ్రహింపవలె ననుట సరి కాదని చెప్పదగును. ఇట్లే 81, 82, 83 సూత్ర ములయందును గ్రహింపఁదగును'—(పు. 139, 140.) అను వాక్యములు గలవు.

మతుప్త్కారమున కనుటచే లాఘవమును అపే క్షించి సంస్కృత ప్రాతిపదిక తుల్యరూపమును గ్రహించినపుడు తుది సకారంబున కనుటచే సాంత ముల విషయమున ప్రాతిపదిక తుల్యరూపము నేల గ్రహింపరాదు? ముందది ప్రథమాంత మనుకొని దాని తుది విసర్గమును సకారముగ మార్చి పిదప దానికి ద్విత్వము చేయనేల? 67 వ సూత్రము సాంతముల విషయమునఁ బ్రవర్తింపదమకొనుట సంప్రదాయ విరుద్ధమైనచో 70 వ సూత్రము భగవానుఁడు, హనుమానుఁడు అనువాని విషయమునఁ బ్రవర్తింప దనుకొనుటయు సంప్రదాయ విరుద్ధమే యగును. అది సార్వత్రికము నిది క్వాచిత్కము గదా యన్నచో నొక సులువైనమార్గ మొకచో నవలంబించినపుడు తక్కిన సందర్భములందును నవలంబించుటలో సార్వ త్రికము, క్వాచిత్కము నను భేదములతో పనిలేదు. కావున సాంతముల విషయమున ప్రథమాంత రూపము లనే గ్రహింపవలయునన్న ఆగ్రహమున్నపుడు హను మానుఁడు మున్నగు రూపములలో ద్వితీయైక వచ నాంత తుల్యరూపమునే గ్రహింపవలయును. అచట సంస్కృత ప్రాతిపదిక తుల్యరూపమును గ్రహింతమన్న నిచటను నదియే పరిగ్రాహ్యము. ఒకే విధముగా నున్న రెండు తావులలో రెండు భిన్నమార్గముల నవలం బించుటకంటె కుదిరినప్పు డొకేమార్గము నవలం బించుట యుక్తతరము. అహోబల పండితీయమున నున్న విధానములన్నియు సూరికి సమ్మతములు కానక్కరలేదు. అహోబల పతి యభిప్రాయములను సూరి ఖండించిన తావులును గలవు. అవి యీ వ్యాఖ్యలోఁగూడ ప్రదర్శింపఁబడినవి. దానినిబట్టి యిది సంప్రదాయము కాఁబనిలేదు. ఇంతకు నీ రెండు తావు లలో నొకే మార్గము నవలంబింపవలయుననియే నా తాత్పర్యము కాని విసర్గమును సకారముగా మార్చు కొనుట తప్పనికాదు. ఈ రెండు తావులయందును విశేషాంశముగా సంస్కృత ప్రాతిపదిక తుల్యరూపము లను దెలుగునఁ బ్రాతిపదికములుగా గ్రహించుటయే ప్రక్రియా లాఘవమున కనువైన మార్గము.

(8) 'రాజన్' శబ్దవిషయమున నీ వ్యాఖ్య త్రొక్కిన మార్గ మపూర్వము. ప్రథమైక వచన రూపసాధనమునకు ప్రాతిపదిక స్వరూప నిర్ణయము చేయఁబడలేదు. 'రాజు' అనునది ప్రథమా విభక్త్యేక వచన స్వరూపముగా నిపతింపఁ బడినదిగా నిం ' జెప్పఁబడినది. ప్రథమా బహువచనాది ప్రత్యయము లకు ప్రాతిపదికము 'రాజా' అనునది గ్రహింపఁబడి నది. కాని 'రాజు' అనునది సూరిచే ప్రాతిపదికముగనే నిపతింపఁబడెననుట లెస్స. కాని యీ వ్యాఖ్యాత కీ యభిప్రాయము సమ్మతముకాదు. చూడుఁడు. 'విశే. (i) రాజు—అను ప్రథమాంత రూప మిట నిపతింపఁబడినది. కొందఱు రాజు—అనునది ప్రాతి పదికముగ నిపతింపఁబడెనని సెలవిచ్చిరి. కాని యది సరికాదు. రాజు+డుఙ్—అనుచో డుజ్జులోపించుటకు దారి యేమియులేదు.........' (పు. 138). తత్సమ పరిచ్ఛేదమునందలి నిపాత విధానమును పరిశీలించినచో నీ యభిప్రాయము సరికాదని స్పష్టమగును. 51 వ సూ. చే విధింపఁబడిన క్రుదువ, 62 చే నిపతింపఁ బడిన భువి, 63 చేనగు నావ, 82 చే సిద్ధించు వేధ, పురోధ—84 చే నేర్పడు దివి, హృది—ఇవి యన్నియు ప్రాతిపదికములుగనే నిపతింపఁ బడినవి. ప్రథమాంత నిపాత మొక్కటియును లేదు. అట్టి యెడ 'రాజు' అనుదానిని కూడ ప్రాతిపదిక నిపాతముగా భావించుటయే యుక్తము. అయినచో ప్రథమైక వచనమున 'రాజుఁడు' అను ననిష్టరూప నివారణ మునకు మార్గము లేదుగదా! యని శంకింపఁబనిలేదు. ఈ నిపాత సామర్థ్యముననే 'డు' ప్రత్యయమునకు లోపమువచ్చును. 'రాజుఁడు' అనునది యిష్టరూప

మైనచో నీసూత్రమే యక్కరలేదు. 'రాజా' అను ప్రథమైక వచన తుల్యరూపమును సామాన్యాకారముగ ప్రాతిపదికముగ గ్రహించినచో నీ రూప మేర్పడును. అటు కాకుండుటకే నిపాత విధానము. ఈ సందర్భ మున రమణీయములో నుట్టంకింపఁబడిన యభిప్రాయ మునుగూడ నిటఁ బరిశీలింపఁదగును. 'నిపతించుట ప్రయోజన శూన్యమగును గావున దీనిపైని వు, డు జ్వర్ణకములు గలుగవని యొకకల్పన పేటికా టీకలోఁ గానవచ్చును. ఆ కల్పన యీ తావున సరిపడునది కాదు. ఈ నిపాతము వారన్నట్లు ప్రయోజనశూన్యము కాదు. ప్రాతిపదిక స్వరూపము 'రాజ' అని కాకుండ 'రాజు' అని యగునని తెలుపుచు ఈ నిపాత విధానము సప్రయోజనమే యగుచున్నది. ఏ ప్రయోజనమును లేక సూత్రము వ్యర్థము కావలసిన పరిస్థితిలో మాత్రమే వారు సూచించిన సామర్థ్య కల్పన చెల్లును. విధానమునకుఁ బ్రయోజనము గల యిట్టి చోటులందు ఆ కల్పన సుకరముగాదు'—(రమ. 292 వ పుట). ఈ యభిప్రాయము ప్రామా దికము. రాజులు మున్నగు ప్రథమా బహువచనాది రూపముల సిద్ధిలో నీ సూత్రమున్నను లేకున్నను ఒక్కటియే. 'రాజు' ఎట్లేర్పడు నన్నదియే యిందు సమస్య. 'రాజాఁడు'అను ననిష్టరూపమును నివారించు టలో ప్రయోజనము లేనంతవఱకు (అనఁగా రాజు శబ్దము డు మంతముగా నివారింపఁబడనంతవఱకు) ప్రాతిపదిక స్వరూపము 'రాజ' అనునదియా? 'రాజు' అనునదియా? యను విచారణము ప్రయోజన శూన్యమే యగును. ప్రాతిపదిక స్వరూప నిర్ణయమే ప్రయో జనశూన్య మనుకొన్నచో దానిని సాధించు సూత్ర మెట్లు ప్రయోజనవంతమగును? కావున నీనిపాత విధానము వ్యర్థమగుచు ప్రథమైక వచన ప్రత్యయ లోపమును సాధించుచున్నదని చెప్పనేవలయును. కావున సూరి నిపతించిన 'రాజు' అనునది ప్రాతిపదిక స్వరూ పమే యగును. ఆ పద్ధతిలో రూపములన్నియు కుదు రును. ప్రక్రియా లాఘవమను ప్రయోజనముకూడ సిద్ధించును.

(9) 'కా ప్రత్యయము మీఁది బహువచన లకారంబునకు లఘ్వలఘు రేఫంబులును, లఘు రేఫం బునకుముందు బిందుపూర్వక డకారంబు నగు' (ఆ. ప. 7 వ సూ) ననుదాని వ్యాఖ్యలో నిట్లు గలదు. 'బిందు పూర్వక—అని యీ సూత్రమునఁ గలదు. 6 వ సూత్రమునుండి పూర్ణశబ్దము ననువర్తింపఁ జేయ నగును. లడాగమ లకారము తత్సమ 31—చే విభక్తి లకార మగును, కావున విలుకా + లను=విలు కాండ్ + ర్ + అను=విలుకాండ్రను ఇత్యాదులు సాధ్యము లగును.' (పు. 153). నిజమున కిందుఁ బూర్వ సూత్రమునుండి పూర్ణశబ్దము ననువర్తింపఁబనిలేదు. 6 వ సూత్రమునఁగూడ పూర్ణశబ్ద మనవసరము. ఖండబిందువు వచ్చినను 'సమాసపదంబునందు సంయో గంబు పరంబగు నపుడెల్లచో ఖండబిందువునకుం బూర్ణంబగు' (అచ్చి—15) ననుసూత్రముచే పూర్ణబిందువు సిద్ధించును. కాని తనంత తాను విధిం చెడిదిముందు ఖండబిందువు కానేల? దానికి మఱల నింకొక సూత్రమునుదెచ్చి పూర్ణత్వము నాదేశింపనేల? యను తాత్పర్యముతో 6 వ సూత్రమున సూరి 'పూర్ణ'శబ్దము నుంచెను. ప్రక్రియా నిర్వహణ వినో దులకు మఱియొక సూత్రముకూడ కలదు సుమా! యని సూచించుట కన్నట్లు ఈ సూత్రమున (7 వ) పూర్ణశబ్దము పరిహరింపఁబడినది. అట్లే 11 వ సూత్ర మందును. మఱల దూరముననున్న 33 వ సూత్ర మునను పూర్ణశబ్దము గ్రహింపఁబడినది. ఈ పద్ధతిని పరిశీలించినచో 7, 11 సూత్రములలో సూరి బుద్ధి పూర్వకముగనే 'పూర్ణ' శబ్దమును పరిహరించెనని చెప్పనగును. ఈ రెండు తావులందును పూర్ణబిందువు దీర్ఘము మీఁదను నిలువవలయును. 'దీర్ఘము మీఁద సాధ్యపూర్ణము లేదు' (సంజ్ఞా. 15) అను సూత్ర మును సరిచేయుటకు 15 వ సూత్రమున నిలుపఁ బడిన 'ఎల్లచో' అనుపదమున కచట చూపిన 'తేంట్లు' మున్నగునవియే కాక విలుకాండ్రు, అండ్రు మున్నగు నవి కూడ కలవని చూపుటకే యిచట సూరి పూర్ణ శబ్దమును విడిచి యుండెనని తలంప వచ్చును. ఈ విష యమునుబట్టి 7 వ సూత్రములోనికి పూర్ణశబ్దము

ననువర్తింపఁజేయుటగాని, 11 వ సూత్రములో ప్రక్రియా సౌలభ్య దృష్టితో పూర్ణబిందువును మాత్రమే చేసికొని రూపములను సాధింపవలయు ననుటగాని సూరి హృదయము కానోపదని గ్రహింప నగును.

(10) 'ఇయకు మాఱుగా నామాంతంబున కెత్వంబు బహుళంబు గానగు' (ఆ. 23) అను సూత్రమున 'నామాంతంబు' అనుదాని కవసరమును బట్టి 'నామమధ్యము' అనునర్థమును గూడ వివక్షించి నచో చెల్లియలు—చెల్లెలు మున్నగు రూపములు సిద్ధించు నని కొందఱు చెప్పిరి. ఈ వ్యాఖ్య అది సరి కాదను చున్నది. 'నామాంత మనఁగా నామ మధ్యమును గావచ్చునని కొందఱు సెలవిచ్చుట సరిగాదు' (పు. 167) ఏల సరికాదో. కానిచో చెల్లెలు రూపమును సాధించుట యెట్లో యీ వ్యాఖ్య నిరూపింప వలయును. ఉపపత్తి చూపక యే పూర్వ వ్యాఖ్యాతల వాక్యములను ఖండించుట సంప్రదాయము కాదు. ఈ రూపము నీ వ్యాకరణము సాధింపదని కాని, ఆ రూప మీ వ్యాకర్తకు సమ్మతముకాదని గాని సమాధానము చెప్పకొని తృప్తిపడుటకంటె సూత్రమున నే కొంచెము వీలున్నను సాధించుటయే సంప్రదాయము. నామ మధ్యమున కన్నచో నేవేని శబ్దముల విషయమున ననిష్టరూపము లేర్పడు ప్రమాద మున్నచో బహుళ గ్రహణము శరణము కానగును. అయినను ఈ విషయమున ఈ వ్యాఖ్యాత యభిప్రాయము స్పష్టము కాలేదు.

(11) 'ప్రథమాంతంబులగు యుష్మ దస్మ ద్విశేషణంబుల కేకత్వంబున వు ను లు ను బహుత్వంబున రు ము లు నంతాగమంబులు ప్రాయికంబుగా నగు' 'ఈ యాగమంబులు పరంబులగునపు డుత్వంబున కత్వంబగు' అనుకారక. 33, 34, సూత్రముల యుదాహరణములలో 'ఆర్తిహరుఁడవౌ నినుఁ గొల్తు నంబుజాక్ష' అనునది వివాదాస్పదమైనది. రమణీయము దీనిని కృతక ప్రథమాంతమునకు 'అవు' వచ్చుట కుదాహరణముగాఁ బరిగణించినది. ఘంటా పథము దీని నంగీకరింపక యిట్లు చెప్పచున్నది. చూడుఁడు. 'ఆర్తిహరుఁడవౌ నిను—అని ప్రథమ ముద్రణము. ఆర్తిహరుఁడవు + ఔ నిను అని గ్రహించి, నీవు ధన్యుఁడవు అనుదానితో దీనిని ముడిపెట్టుటలో సందర్భశుద్ధిలేదు. కావున ఆర్తిహరుఁడవు నిను—అసలు పాఠమయి యుండునను పక్షమే యుక్తముగఁ గన్పట్టును'—(పు. 223) అనిచెప్పి దీనిని ప్రాయిక గ్రహణముచే రక్షితములు కావలసిన వానిలో మొదటి దిగా నీ వ్యాఖ్య పరిగణించినది. దీని తత్త్వ మరయుదము. ఈ రెండు వ్యాఖ్యల యందును నిది కవి ప్రయోగమని చెప్పఁబడలేదు. ప్రాయికగ్రహణ రక్షితముల గన్పఱచుటకు నన్ను, మీరలు పెద్దలు అనున వరుసగా నిర్వచనోత్తర రామాయణ కళాపూర్ణోదయముల లోనివిగా రెండు వ్యాఖ్యలు వ్రాసినవి. తాఁ ప్రత్యేక మొక యుదాహరణమును దన సూత్రమునకు విరుద్ధముగాఁ గల్పించి దానిని ప్రాయికగ్రహణముచే రక్షింపఁజేయునంతటి క్లేశము సూరికేల కలుగవలయును? ఆ ఉదాహరణము లేకుంట లోపమా? కావున నొక విశేషార్థమును సూచించుటకే దీని నుదాహరించె ననుట సమంజసము. సూరి చెప్పకయే యుదాహరణములను ప్రత్యేక దృష్టితో నొసఁగుట అందఱికిని తెలిసినదియే. ఉదాహరణమునకు అవ్యుత్పన్నము, కృదంతము, తద్ధితాంతము, సమాసము—అని ప్రాతిపదికములు నాల్గు విధములుగా నున్నవని సూచించుటకు తత్సమ 21 వ సూత్రమున సిద్ధ, రామ, భార్గవ, రాజపురుష అను నాలుగు ప్రాతిపదికముల నుదాహరించెను. అట్లే 'సర్వంబునకుం బ్రేరణంబు నందిం చుక్కగు' (క్రియా. 70) నను సూత్రమున కిచ్చిన యుదాహరణములలో సంస్కృత ధాతువులు రెండు, అంగళాది యొకటి, సహజములగు ఆచ్ఛిక ధాతువులు రెండుగా నుదాహరించి యా యా ధాతువుల సంఖ్యాబలమును సూరి సూచనగా వివరించెను. ఈ యంశము నీ వ్యాఖ్యచే అంగీకృతములే. ఇట్టియెడ ప్రకృతోదాహరణము కృతకములైన ప్రథమాంత విశేషణములకును ఈ కార్యమగునని సూచించుట కనుటలో సందర్భ

శుద్ధి యేల లేదు? దానిని ప్రాయిక గ్రహణముచే రక్షింపఁబడు వానిలో చేర్చుట యందే సందర్భ శుద్ధి లేదు. ఎట్లన సూరి తనచే కల్పితమైన యుదాహరణము నందు ముద్రణ ప్రమాదమునకుఁగాని, స్పష్టతా దారిద్ర్యమునకుఁగాని వీలుండునట్లు వకారమును బ్రయోగించునా? 'ఆర్తిహరుఁడగు నిను గొల్తు నంబుజాక్ష' అని అగుధాతు రూపమును గకారముతో నిరేశించిన ఏ చిక్కును గలుగదు గదా! ఇచట మఱి యొక శంకను, ఈ యుదాహరణముయొక్క స్థానము పుట్టింపవచ్చును. సూరి దానిని కృతక ప్రథమాంత మగు యుష్మద్విశేషణముగా భావించినచో 'నీవు ధన్యుఁడవు' అనుదాని ప్రక్కనే దీనిని నిలుపఁడా? యనునది యా శంక. కాని యిది నిలువదు. సామాన్యాకారమున నీ యాగమములు వచ్చు నుదాహరణములను పరిపాటి తప్పక యుదాహరించెను. ఉకారాంత యుష్మద్విశేషణము—ఏకవచనము—నీవు ధన్యుఁడవు, ఉకారాంత—అస్మద్విశేషణము — ఏకవచనము—నేను ధన్యుఁడను. ఉకారాంత యుష్మద్విశేషణము—బహువచనము—మీరు ధన్యులరు—ఉకారాంత అస్మద్విశేషణము — బహువచనము—మేము ధన్యులము—ఇకారాంత యుష్మద్విశేషణము—నీవు సుకృతివి. ఇకారాంత—అస్మద్విశేషణము—నేను సుకృతిని, ఇందు ఉకారాంతములముందు చూపుటలో విధింపఁబడిన రెండు సూత్రములకు లక్ష్యము చూపినటులైనది. ఇకారాంతములలో నేకవచనమున రెండవ సూత్రమునకు ప్రసక్తిలేదు. ఈ క్రమమిట సూరిచే సంభావింపఁబడినది. ఇప్పటికి సామాన్యోదాహరణములఁ జూపుట పూర్తియైనది. విశేషోదాహరణ మొకటి చూపుట కిదియే సరియైన తావు. కావున నిచట సందర్భశుద్ధి లేదనుకొనుట పొరపాటు. అన్నిటి కంటె సూరి పర్యవేక్షణలో జరిగిన ప్రథమ ముద్రణమునం దిది ఆర్తిహరుఁడవౌ అనురూపమున నున్నదను నంశము మరువ రానిది. ప్రాయిక గ్రహణము నక్కై, చెప్పకపోయినను తప్పని దీని విషయమున ముద్రణ స్ఖాలిత్యమును సంభావించుట యుచితము గాదు. కాఁబట్టి 'ఆర్తిహరుఁడవు నిను—అసలు పాఠమయియుండుననను పక్షమే యుక్తముగఁ గన్పట్టును'—అను నీ వ్యాఖ్యావాక్యము అయుక్తము.

(12) 'బహుబ్రీహిని సమాసాంత కార్యంబులుం గానం బడియెడి' (సమాస. 22) అను సూత్రమున కొసఁగఁబడిన లక్ష్యములలో 'కడలి రా చూలు' అను దానికి ఈ వ్యాఖ్యలో 'కడలి రాచ యొక్క చూలు' అను విగ్రహము చూపఁబడినది. అప్పు డిది షష్ఠీ తత్పురుష మగును. అట్టిచో బహుబ్రీహికి మాత్రమే విధింపఁబడిన సమాసాంత కార్య యోగ్యత దీని కెట్లు కలుగును? 'ఇది ప్రాయికముగా నుత్తరాన్యోభయ పదార్థ ప్రధానములయి యుండు' (బా. వ్యా. 3 సూత్రవివరణము) ననువాక్యమునందలి ప్రాయిక గ్రహణముచే దీనిని రక్షింతమన్నచో తత్పురుషమును బహుబ్రీహి యనుకొననేల? దానిని ప్రాయిక పదముచే రక్షింపనేల? మఱి సమాసాంతకార్య మెట్లగు నని ప్రశ్న కలుగును. రాచ శబ్దములోని చకార లోపమున కెటు ను నిక్కలాది సూత్రము నుపయోగించి నపుడు చివరి ఇకారాదేశమునకును నదియే గతి యగును. లేదా 'చూలి' అను శబ్దమును బిడ్డ అను నర్థమున నిఘంటువులు చూపినవి. అప్పుడు 'కడలి రాచయొక్క చూలి' అని షష్ఠీసమాసము ఏ సమాసాంత కార్యము జరుగకయే సిద్ధించును. కాని సూరి దృష్టి లో నిది బహుబ్రీహి. దానికి సమాసాంతకార్యము జరుగవలయును. కావున కడలి రాచ(వాఁడు) చూలుగా (గర్భముగా) గలది యను నర్థము చెప్పకొనుట సముచితము. గర్భమనఁగా ఉత్పత్తి స్థానమను నర్థమిచట గ్రహింపనగును. అప్పుడు బహుబ్రీహి యగును. ప్రస్తుత సూత్రముచే ఇకారము సమాసాంతముగా నాదేశమగును. కావున 'కడలి రాచయొక్క చూలు'అను విగ్రహము ప్రామాదికము.

(13) తద్ధిత. 14 వ సూత్రమగు 'కా వర్ణకంబు తిర్యక్కులకుం గానంబడియెడి' అనుదానిచే విధింపఁబడిన 'కా' వర్ణకమును కయిరాదులలోఁగూడ చేర్పవలెనని కొందఱు చెప్పిరి. కాని 'ఒక శబ్దమునే వేర్వేఱు గణములలోఁ జేర్చుట సరికాదు.'(పు. 262) అని యీ వ్యాఖ్య దానిని ఖండించినది. అయినచో

ఇబ్బందిగాఁడు మున్నగునవి మహత్తులు కావు గదా! అట్టియెడ దానికి డుజు వచ్చు టెట్లు? అను శంకకు 'మహత్తులగు మగాదులకు—అనుటచేఁ దిర్యక్కులకును మహత్త్వ మారోపింపఁబడెనని గ్రహింపనగును.' అను సమాధానము చెప్పఁబడినది. మహత్తులగు మగాదులకు అనుటచే తిర్యక్కులకు మహత్త్వ మారోపింపఁబడెనని యేల గ్రహింపవలయును? ఒకవేళ నా విధముగా గ్రహించినచో కయిరాదిగణమును వేఱుగా చెప్పుటయేల? పనివడిన యెల్లలావులందును (కయిరాదుల యందును) మహత్త్వము నారోపించుకొని రూపసాధన చేసికొనవచ్చునే కదా! మఱియు 'కయిరఁడు మున్నగునవి అశ్వవిశేషములు. ఇవి యమహత్తులు గాన వీనికి తత్సమ 22 చే డుజ్జురాదు. కనుక నీ సూత్రము చేతనే డుజ్జగును'అని ఆచ్ఛిక 4 వ సూత్ర వ్యాఖ్యానములో వ్రాయఁబడినది (పు. 151). అచట కయిరాదులు అమహత్తులని చెప్పుచు నిచట 'ఇబ్బందిగా' మున్నగువానికి మహత్త్వ మారోపింపఁబడెనని చెప్పుట పరస్పరవిరుద్ధము గదా! కావున కయిరాదిగణ గ్రహణము చేతను బ్రకృత సూత్రము తిర్యగ్విషయక మగుట చేతను మహత్త్వారోపణమనునది సూరి యభిప్రాయము కానోపదు. కావున తిర్యగ్విషయకమైన 'కా' ప్రత్యయాంతమును కయిరాదులలో చేర్పక తప్పదు. రూపనిష్పత్తికై యొకే శబ్దమును రెండు గణములలో పఠించుట సూరికి ఇష్టము కాకపోలేదు. క్రియా. 76 వ సూత్రమున 'ఆఁగు' ప్రభృతు లుభయగణములగు నని యాతఁడు కంఠోక్తిగా చెప్పెను. తిర్యగ్విషయక కా ప్రత్యయమును కయిరాదులలో చేర్చుటవలన తిర్యక్కులకును మహత్త్వ మారోపింపఁబడె నను వాక్యముకూడ ప్రత్యాఖ్యాతమగును.

(14) "'వండెను' అనుచోట 17 చే ఇగాగమ మగునని కొండఱు చెప్పకపోవుట సరికాదు." అని క్రియా. 18 వ సూత్రము వ్యాఖ్యలో వ్రాయఁబడెను. (పు. 277) కాని ఇగాగమము ప్రథమ పురుషైక వచనమున వచ్చుట ప్రక్రియా గౌరవమని సూరి సంభావించి నట్లూహించుట కవకాశము కలదు. ఇగాగమము చేయనిచో వైరూప్య మేచటను సంభవింపదు. అట్లని సూత్రమున్నచో చేయకుండుట సముచితమా? యను ప్రశ్న పొడమును. ఇచట సముచితమే

యని తలంపనగును. ఇచట ఇగాగమము వచ్చి తీఱ వలయునన్న యాశయము సూరి కున్నయెడల 'భూతంబు నందిగాగమ మగు'నను సూత్రము తఱువాతనే 'లిఙ్లోట్టుల డుఙ్నున కెనఁను వర్ణంబులగు' నను సూత్రమును బఠించియుండెడివాఁడు. అట్లు చెప్ప కుండుటవలననే ప్రథమ పురుషైక వచనమున ఇగాగమము చేయుట యాతనికి సమ్మతము కాదేమో యను నూహ కలుగుచున్నది.

(15) 'లూట్లుడుఙ్నున కెదుత వర్ణంబులు ద్రుతాంతంబులగు' (క్రియా. 26) అనుసూత్రము వ్యాఖ్యలో 'ఉదాహరణ స్వారస్యమునుబట్టి ప్రథమ పురుషమున మాత్రమే ఎదు, త వర్ణకములగునని వ్యాఖ్య చేయనగును' (పు. 285) అని కలదు. అట్లు వ్యాఖ్య చేయుటకంటె తనకుఁదాను ఆశీశ్శాప సంప్రార్థనములఁ జేసికొనుట సాధారణముగా నుండదు కనుకను, ఎదుటివానికిఁ జేయుట జరిగినను దానిని చెప్పుటకు ముదుఙ్నుల ప్రయోగము ప్రత్యేకముగా విధింపఁబడినది కనుకను, కాక అది యను తచ్ఛబ్దాను ప్రయోగమును గలదు కనుకను ఉత్తమ మధ్యమ పురుషములందీ ఎదు, త వర్ణంబులు సాధారణముగాఁ గన్పట్టవని వ్యాఖ్యానించుట సముచితము.

(16) క్రియాపరిచ్ఛేదమునందలి ఏబదవ సూత్రవ్యాఖ్యలో 'భుజియించు' రూపమును సాధించు పట్టున 'భుజ్—ధాతువు ఇది గురువిరహితము. ఏలన హల్లుతోఁగూడిన వర్ణము సంస్కృత ఛ్ఛందస్సు ననుసరించి గురువు కాదు. లఘువే యగును. భుజ్ సంస్కృత ధాతువు గనుక సంస్కృతము ననుసరించి యిది గురువు లేనిదిగానే భావింపవలెను'అని వ్రాయఁబడినది. (పు. 299) ఇది ప్రామాదికము. భుజ్ ధాతువు గురు విరహితమనుటకు సంస్కృత ఛ్ఛందస్సు కారణము కాదు. 'నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమమ్' అను దానిలో 'మమ్' గురు సహితము కాదని చెప్పఁజాలము గదా! కావున సంస్కృత ఛ్ఛందస్సులో సయితము హల్లుతోఁగూడిన వర్ణము గురువే యగును. అపుడు 'భుజ్' అనునది గురు విరహిత మగుట యెట్లు? అను ప్రశ్నకు సంస్కృత వ్యాకరణము ననుసరించి గురువిరహితమగునని సమాధానము. పాణినీయమున హ్రస్వం లఘు, సంయోగే గురు, దీర్ఘంచ అను సూత్రములచే హ్రస్వదీర్ఘము లెపు డెపుడు లఘుత్వ గురుత్వములను భజించునో చెప్పఁబడెను. సంయోగము పరమైనపుడు హ్రస్వాక్షరము గురువగును. దీర్ఘమైన వర్ణము గురు వగును. అచ్చులతో వ్యవధానములేని హల్లులకు (ఒకటికంటె నెక్కువైనవానికి) సంయోగమని పేరు. హలోఽనన్తరా స్సంయోగః అని పాణినీయ సూత్రము. 'భుజ్' అనుచోట ఉకారము దీర్ఘము కాకపోవుటచేతను, సంయోగము దానికి పరము కాకుండుటచేతను గురువు కాదు. కావున భుజ్ధాతువు గురు విరహితమగును. అంతేకాని సంస్కృత ఛ్ఛందమున కిచట నేమాత్రము ప్రసంగములేదు. సూరి సంస్కృత వ్యాకరణముల నుండి సంజ్ఞలను పరిభాషలను చాల విరివిగా వాడుకొనెననుట సువిదితము. గురువనునది యిచట వ్యాకరణమైన సంజ్ఞ.

ఇట్లు నా శక్తి ననుసరించి యీ వ్యాపాఠకులకు భ్రాంతిజనకములగు పొరపాటులను సవరించి చూపితిని. ఇది రంధ్రాన్వేషణ దృష్టితో చేసిన విమర్శ కాదు. శాస్త్రవిషయమున పొరపాటులు వ్యాపింప రాదను తాత్పర్యమే యీ వ్యాస రచనలో ముఖ్యోద్దేశ్యము. మంచి రచనా పాటవముగల సూరి సూత్రములకు వ్యాఖ్యానము చేయుటలో నెంతవారికిని పొరపాటులు రాక మానవు. ప్రస్తుత మీ వ్యాఖ్య పెఠశాలలలో కళాశాలలలో విద్యార్థులచేతను అధ్యాపకులచేతను మిక్కిలిగా సమాదరింపఁ బడుచున్నది కావున వారికి ఆయావిషయములందు యథార్థజ్ఞానము కలుగవలయు నను దృష్టి మాత్రమే యీ వ్రాతకు ఉద్బోధకము. శ్రీ వంతరాం రామకృష్ణారావుగారు తమ గ్రంథము యొక్క భవిష్యన్ముద్రణములలో నా విమర్శయందు తమకు సమ్మతిగల యభిప్రాయములను జేర్చుదురు గాక యని మనవి చేయుచున్నాను. వీరు పీఠికలో నుడివినట్లు వారి బాలవ్యాకరణ సర్వంకషలో నీ యంశము లన్నియు కూలంకషముగ చర్చింపఁబడి యుండవచ్చును. ఆ గ్రంథము ముద్రితమైనదో లేదో తెలియదు. నే నది చూచుట తటస్థింపలేదు. అయినను ఈ గ్రంథము మాత్రమే యవలంబముగాఁ గొనువారికి నా పరిశీలనమువలన ప్రయోజనము కలుగునని విశ్వసించుచున్నాను. ఇందేవేని పునఃపరిశీలనార్హము లున్నచో, అవసరమయినచో నా యభిప్రాయములను దప్పక సవరించుకొనఁగలనని మనవి.

# కిరణావళి

శ్రీ కె. శివారెడ్డి

మంచంమీద పడుకున్న
బద్ధకం
కదలటానికే బద్ధకంపడి
'అబ్బ! అంతదూరం ఏం పోతాం—
ఇక్కడ శిథిలమైతే మాత్రమేం
ఆనందం కాదూ' అంటుంది.

గమనం
స్తబ్దత స్థాయికి దిగజారి
నప్పుడు బద్ధకం జననం.
చలనం
లోని విద్యుత్తు పోయి నప్పుడు
నరాలు పాము కుబుసాలయి
మృత్యువు నుంచి మాత్రమే
విముక్తి సూత్రాన్ని నేర్చుకుంటాయి.

కనుపాపలమీదకి
రెప్పల తెరల్ని లాగి
చేతనాత్మ చచ్చేంత వరకు
'రేప్' చేసి ముఖంమీదకాన
దుప్పటిలాగి పడు కున్నప్పుడే
బద్ధకం పునర్జన్మ ఎత్తుతుంది.

నిజానికి
నిరంతర చలన ప్రవాహంలో

భా ర

'చావు'కూడా—అంత్య దశ కాదు
ఒక ఫుల్‌స్టాప్ మాత్రిమే —

చలనాంతరంగ తరంగితమై
ఉరకలు పెడుతుంటే
నడుస్తున్నా మనిషి
నిశ్చలనంలో ఎండిపోవటం
తిరోగమనం—కొరమాలిన తనం

పరుగెడు తున్న
నదీ హృదయంతో
ప్రాణాల్ని మోసుకెడుతున్న
కరెంటు తీగల నరాల్తో
వికసిస్తున్న చేతులు—కాళ్ళతో
భవిష్యత్తులో మనిషి—కిరణమాలి.



# 'వచన పద్యం' ఛందో విభాగం కాదు

## శ్రీ చేకూరి రామా రావు

ఆంధ్రపత్రిక 1972 ఉగాది సంచికలో అచ్చయిన 'వచనపద్యం—ఆభాసలక్షణ నిరాకరణం' అనే వ్యాసంలో వచన పద్యం లేక వచన కవిత అనే పేర్లతో ప్రచారంలో ఉన్న కవితా రూపానికి ప్రతిపాదితమైన లక్షణాలను విపులంగా చర్చించి హేతుబద్ధంగా లేవని నిరాకరించాను. ఆ చర్చలో శ్రీ సంపత్కుమార తమ వివిధ వ్యాసాల్లో (రిఫరెన్సులు పూర్వవ్యాసంలో ఇచ్చాను.) ప్రతిపాదించిన సిద్ధాంతాలను విశేషంగా విమర్శించి అవి కూడా శాస్త్ర చర్చకు నిలవ్వని నిరూపించే ప్రయత్నం చేశాను. మళ్లీ సంపత్కుమార తమ పూర్వప్రతిపాదనలలో కొన్నిటిని సమర్థించుకుంటూ 'వచనపద్యం—లక్షణ నిరూపణ' (భారతి, జులై 1972, పేజీలు: 55–66) అనే వ్యాసం ప్రకటించారు. వారు తమ సమాధానంలో ప్రస్తావించని నా విమర్శల నన్నిటినీ వారు ఒప్పుకుంటున్నట్టు కాదు. వాటిల్లో కొన్నిటిని కాని, అన్నిటినీ కాని ఎప్పటికైనా ఖండించే హక్కు వారికున్నదని గుర్తిస్తూ, ప్రస్తుతం వారు చర్చించిన విషయాలకే ఈ వ్యాసం పరిమితం చేస్తాను.

శ్రీ సంపత్కుమార తమ వ్యాసంలో, నా పూర్వ వ్యాసంలోని కొన్నివాక్యాలను మరీ సాగదీసి వైరుధ్యాలను చూపించటానికి ప్రయత్నించారు. ఉదాహరణకు 57 వ పేజీ 4 వ పేరాలో 'అనియ తత్వం లక్షణం కానప్పుడు నియమ రాహిత్యం మాత్రం లక్షణ మెట్లా అవుతుంది?' అనే ప్రశ్న అట్లాంటిది. అట్లాంటి ప్రశ్నలకు ఈ వ్యాసంలో సమాధానా లుండవు. ఇటువంటి వైరుధ్యాలు శ్రీ సంపత్కుమార వ్యాసంలోనుంచి కూడా చూపించటానికి వీలులేక పోలేదు. అయినా ఇక్కడ ఆ పని జరగదు.

పైన పేర్కొన్న సంపత్కుమార వ్యాసంలో ఆయన చెప్పిన అభిప్రాయాలను సాధ్యమైనంతవరకు సానుభూతితో అర్థం చేసుకుంటూ ఆయన వాదాలు చర్చకు నిలుస్తయ్యా నిలవ్వా? అనేదే ప్రధాన ధ్యేయంగా పెట్టుకొని చేతనైనంత హేతుబద్ధంగా పరిశీలించే ప్రయత్నం ఈ వ్యాసంలో చేస్తాను.

నేను 'వచన పద్యం' అనే పేరును గురించి అంతగా పట్టించుకో లేదన్న విషయం సంపత్కుమార సరిగ్గా గ్రహించారు. నా చర్చకు ఈ పేరు అంత ప్రధానం కాకపోవటమే అందుక్కారణం. సంపత్కుమార ఈ పేరునే ఎన్నుకోటానికి గల కారణాలను పరిశీలించాను. ఆయన ఈ కవితా పద్ధతిని పరిశీలించిన దృక్కోణంనుంచి చూస్తే ఈ పేరు అందుకు సరిపోతుంది.

నేను నిరాకరించిన అంశాల్లో వచన పద్యానికి ప్రతిపాదించిన పాద బద్ధత అనేది కేవలం ఒక అంశం మాత్రమేకాక చాలా కీలకమైనది కూడా. అందువల్ల సంపత్కుమార గాని, నేను గాని దాన్నిగురించి విశేషంగా చర్చించాం. పద్య పాదానికి అంతర్నిర్మాణమూ (Internal structure), బాహ్యపరిమితి (External limit) ఉండాలని నా వాదన. ఆ సందర్భంలో పాదం కేవలం అక్షర సముదాయం కాదని, అవి గణాలుగా ఏర్పడాలని అన్నాను. పద్యపాదాలకు అంతర్నిర్మాణం ఉన్నదనటానికి గణ విభజనను ఆధారంగా చూపించాను. గణ విభజన కేవలం సౌలభ్యంకోసం ఏర్పడిందేనవి, పద్య పాదాని కిది అవసరమైన లక్షణం కాదని సంపత్కుమార వాదించారు. గణ విభజనను గురించి మా ఇద్దరి వాదాల్లోనూ కొంత కొంత నిజం ఉంది.

వృత్తాల్లో అక్షరాల పరిమాణం, పద్యపాదంలో వాటి స్థానం (The quantity and the place of occurrence of syllables) నిర్దిష్టం. అందువల్ల గణ విభజన వృత్తాల అంతర్నిర్మాణాన్ని గుర్తుపెట్టుకోవటానికి ఏర్పరచుకున్న Mnemonic device గా మనం అర్థం చేసుకోవచ్చు. గణంలో అక్షర పరిమాణ స్థానాలు నియతం గనక ఒక గణం ఒక అక్షర క్రమాన్ని మాత్రమే సూచిస్తుంది. ఈ క్రమాన్ని గుర్తుపెట్టుకోగలిగినప్పుడు మనకు గణాలతో పని ఉండదు. అంటే వృత్తాల పాదలక్షణ నిరూపణ గణవిభజన లేకుండానే చెయ్యవచ్చు నన్నమాట. ఈ గణాలకు మూడక్షరాలనే ప్రమాణంగా పెట్టుకోటానికి కారణం సంప్రదాయం తప్ప వేరే 'లాజిక్' ఏమీ ఉన్నట్టులేదు. ఎన్ని అక్షరాలు పరిమితిగా పెట్టుకున్నా ాటి ప్రయోజనం పాదంలో గురు లఘు క్రమాన్ని ంకేతం చెయ్యటమే.

జాతుల్లో (గీత, సీసాది పద్యాలు) అక్షరాల సంఖ్యా, క్రమమూ నిర్దిష్టంకాదు. ఉదాహరణకు గీత పద్యపాదంలో అక్షరాల సంఖ్య 12 నుంచి 17 వరకూ ఉంటుంది. ఒక పాదంలో 288 రకాల అక్షరక్రమా లుంటై. అంటే గీత పద్య పాదంలో అంతర్నిర్మాణాన్నిగాని, బాహ్యపరిమితిని గాని గణ సహాయం లేకుండా ఏకైక పద్ధతి (Unique way) లో చెప్పలేం. ఈ పద్యాల్లో గణక్రమమూ, గణసంఖ్యా నిర్దిష్టం. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే జాతుల్లో పాదాల అంతర్నిర్మాణాన్ని, బాహ్యపరిమితిని అక్షరాల సహాయంతో ఏకైకపద్ధతిలో చెప్పలేం; గణాల సహాయంతో చెప్పగలం.

ఇక మాత్రా ఛందస్సుల విషయం. మాత్రా ఛందస్సుల్లో లయ ప్రధానం. ఈలయ మాత్రాగణానుసారి. లయ ననుసరించి మాత్రా పద్యాల అంతర్నిర్మాణాన్ని చెప్పాలంటే మాత్రా గణాలను గుర్తించక తప్పదు. అక్షరక్రమం నిర్దిష్టం కాదు గనక అక్షర పద్ధతి ఇక్కడ సాయపడదు. బాహ్యపరిమితినైనా అక్షర సంఖ్యలో చెప్పలేం, ప్రాచీనులు కొందరు మాత్రా పద్యాలకు లయ విరహితంగా లక్షణం చెప్పారు. అంటే మాత్రా పద్యాల్లో అంతర్నిర్మాణాన్ని గురించి వాళ్ళు పట్టించుకో లేదన్నమాట. ఆ మేరకు వాళ్ల లక్షణం అసమగ్రం. మాత్రా గణాల్లో కొన్ని చోట్ల 'జ' గణాన్ని నిషేధించటానికి కారణాన్ని ఊహించటం కష్టంకాదు. మూడు మాత్రల గణాల్లో 'లగం', నాలుగు మాత్రల గణాల్లో 'జ' గణం, ఐదు మాత్రల గణాల్లో 'య' గణం, విలోమ గతి ఉన్న గణాలు. ఈ గణాల్లో ఊనిక గురువైన రెండో అక్షరం మీద ఉంటుంది. అవే మాత్రా సంఖ్య ఉన్న ఇతర గణాలు అనులోమ గతి ఉన్న గణాలు. వాటిల్లో మొదటి అక్షరం మీద ఊనిక ఉంటుంది. అయిదు మాత్రల గణాల్లో 'తగణం'లో రెండో అక్షరం మీదా, 'సలం'లో మూడో అక్షరం మీద, కూడా ఊనిక ఉండటానికి అవకాశం ఉంది. అయితే వాటిల్లో మొదటి అక్షరం మీద కూడా ఊనిక ఉంటుంది. అనులోమ గణాలుండాల్సిన చోట విలోమ గణాలుంటే లయ భంగ మవుతుంది. అందువల నే ముత్యాలసరంలో 'లగం' 'జగణం' వాడరు. ఖండగతి పద్యాల్లో 'యగణం' అయిదుమాత్రల గణమైనా వాడరు. లయను పట్టించుకోనివాళ్ళు, లయను గ్రహించని వాళ్ళు కొందరు వాడితే వాడవచ్చు. అవి అపవాదాలుగానే నిలుస్తై. నేటి కవుల్లో శ్రీ శ్రీ పద్యాల్లో అట్లాంటి వ్యతిక్రమణలు కొన్ని కనిపిస్తై. శ్రీ శ్రీ అయినా ముత్యాల సరంలో 'లగం' వాడిన ('జగద్గురు శంకరుం డేడీ') చోట్లున్నైగాని 'జగణం' వాడిన చోట్లు కనపడ లేదు. ఖండగతిలో యగణాన్ని మిగతా గణాలతో పాటు ప్రసిద్ధులైన తెలుగు కవులెవరూ వాడిన ఉదాహరణలు లేవు.

అసలు పద్యాలన్నిటికీ లయ ననుసరించే లక్షణం చెప్పాలని కీ. శే. గిడుగు సీతాపతి గారి వాదం. అంటే ఛందో విభాగమంతా మాత్రాబద్ధంగా ఉండాలని వారి వాదం సారాంశం. అయితే ఉన్న పద్యాలన్నిటికీ మాత్రా పద్ధతిలో లక్షణం చెప్పటం కుదరదు. లయ నిర్దేశించని పద్యాల్లో గతి వైవిధ్యానికి

అవకాశం ఉంది. మాత్రాఛందస్సుల్లో గతిని మార్చటమంటే పద్యాన్ని మార్చటమే అవుతుంది. అయితే ఆధునిక కవులు ఒకే గతి ఉండాల్సిన పద్యాల్లో భిన్నపాదాల్లో భిన్నగతులు పాటించిన ఘట్టాలున్నై. ఉదాహరణకు 10 మాత్రల బాహ్య పరిమితిగల పద్యాల్లో కొన్ని చోట్ల ఖండగతిని, కొన్ని చోట్ల మిశ్రగతిని (3+4+3) పాటించారు. 12 మాత్రల బాహ్యపరిమితి గల పద్యాల్లో కొన్ని చోట్ల త్రిశగతి (3+3+3+3)ని, కొన్నిచోట్ల చతురస్ర (4+4+4) గతిని పాటించారు. 16 మాత్రల బాహ్య పరిమితిగల పద్యాల్లో కొన్నిచోట్ల చతురస్రగతిని కొన్నిచోట్ల మిశ్రగతి (5+3 లేక 3+5)ని పాటించారు. ముత్యాల సరాన్ని మాత్రం 3+4+3+4 క్రమంలోనే నడిపారు. వీటన్నిట్లోనూ పాటించిన ఒక సాధారణ సూత్రం ఉంది. సరి మాత్రా సంఖ్య బాహ్య పరిమితిగా గల మాత్రా పద్యాలు రెండర్థ భాగాలుగా విరుగుతై. 14 మాత్రలను 6+8 మాత్రల గణాలుగా విభక్తమయ్యేట్టు శ్రీ శ్రీ రాసిన పద్యాలు కొన్ని ఉన్నై. ఇవన్నీ చాలా మందికి తెలిసినవే కావటంవల్ల ప్రత్యేకంగా ఉదాహరణలు చూపించటం లేదు. ఒకే పద్యంలో భిన్నగతులతో పద్యపాదాలున్నప్పుడు వాటిని విషమచ్ఛందో భేదాలుగా పరిగణించాల్సి ఉంటుందనుకుంటాను.

మాత్రా పద్యాలకు మాత్రం లయ నిర్దేశం ఎందుకు చెయ్యాలి? అని అడగవచ్చు. లయ నిర్దేశించకపోతే మాత్రా పద్యంలో అంతర్నిర్మాణం ఉండదు. అక్షర క్రమాన్ని నిర్దేశిస్తే ఇవి వృత్తాలతో సమానమవుతై. ఇంద్ర, చంద్ర గణాలను నిర్దేశిస్తే అవి జాతుల్లో భాగమవుతై. మాత్రా పద్యాలు ప్రత్యేక ఛందస్సుగా నిలబడాలంటే వాటి నిర్వచనం మాత్రా గణాల్లోనే జరగాలి. ఒక్కో పాదానికి అంతర్నిర్మాణం భేదించినా గుర్తించదగిన పద్ధతుల్లోనే (Predictable ways) భేదిస్తుంది. అంతేకాని అసలు అంతర్నిర్మాణమే లేని మాత్రా పద్యం ఉండదు.

పై చర్చ సారాంశం ఏకైక పద్ధతి (Unique way) లో అంతర్నిర్మాణాన్ని, బాహ్య పరిమితిని సూచించాలంటే వృత్తాలకు గణనిర్మాణం అవసరంలేదని; జాతులకు, మాత్రా పద్యాలకు ఇది అవసరమని తేలుతుంది. 'గణాల దృష్ట్యా పాదానికి అంతర్నిర్మాణమంటూ ఏదీ ఉండదు.' అన్న సంపత్కుమార వాక్యం వృత్తాలకు మాత్రమే అన్వయిస్తుంది.

పైన పేర్కొన్న ఛందో భేదాల్ని ఈ కింది విధంగా అంతస్తుల బొమ్మలో చూపించవచ్చు.

1. వృత్తాలు




2. జాతులు




3. మాత్రాఛందస్సులు




ఈ బొమ్మల్లో పైనుంచి కిందికిగాని కింది నుంచి పైకిగాని పోవటానికి దార్లున్నై. అంతస్తులకు కుడిపక్కన అంతర్నిర్మాణ రేఖ, ఎడంపక్కన బాహ్యపరిమితి రేఖ ఉన్నై. వృత్తాల్లో అంతర్నిర్మాణ, బాహ్యపరిమితులను అక్షరక్రమం సాయంతో చెప్పవచ్చు కాబట్టి; గణ క్రమానికి, అక్షర క్రమానికి ఒకే దారి ఉంది కాబట్టి ఇక్కడ గణాల అంతస్తుని

తొలగించినా వచ్చే ఇబ్బందిలేదు. అందువల్ల ఈ అంతస్తుకి వచ్చే అంతర్నిర్మాణ రేఖ, ఈ అంతస్తు నుంచి పోయే బాహ్యపరిమితిరేఖ విరిగిన బాణపు గుర్తుతో సూచించబడింది.

రెండో బొమ్మలో గణాల అంతస్తునుంచి అక్షరాల అంతస్తుకి దారులు మూడు చూపించబడ్డై. ఇక్కడ మూడు బహుత్వానికి సంకేతం మాత్రమే. ఒక్కొక్క గణాన్ని ఏకైక పద్ధతిలో అక్షర క్రమంగా మార్చలేము. సూర్యగణాన్ని అక్షర క్రమంగా మార్చటానికి రెండు పద్ధతులు, ఇంద్ర గణాన్ని అక్షర క్రమంగా మార్చటానికి 6 పద్ధతులూ ఉన్నై. ఇట్లా కాకుండా నగణం, గలం, నగ, నల, సల భ, ర, త, వంటి గణాల సాయంతో గణక్రమం చెప్తే గణక్రమం నుంచి అక్షర క్రమానికి ఒకే దారి చాలు. అప్పుడు పాదంనుంచి గణాల అంతస్తుకి దారులెక్కువ చూపించాల్సి వస్తుంది. అంటే ఈ వైవిధ్యాన్ని ఎక్కడో చోట చూపించక తప్పదు. ఏ పద్ధతిలో అయినా గణాల అంతస్తుని తప్పించుకోలేదు. భిన్న అక్షర క్రమాల్ని అక్షరాల అంతస్తులో నిర్మిస్తే గణాల అంతస్తుని తప్పించుకోవచ్చు. అప్పుడు పాదానికి అంతర్నిర్మాణాన్ని ఏకైక పద్ధతిలో చెప్పలేము. పైన పేర్కొన్నట్టుగా గీత పద్య పాదానికి 288 రకాల అక్షర క్రమాలను చెప్పాల్సి ఉంటుంది. అందువల్ల జాతుల అంతర్నిర్మాణ బాహ్యపరిమితుల నిర్వచనానికి గణాల సహాయం అవసరమవుతున్నది.

మూడో బొమ్మ కూడా రెండో బొమ్మలాంటిదే. ఇందులో కూడా గణక్రమంనుంచి అక్షర క్రమానికి దారు లెక్కువున్నై. ఇక్కడ కూడా మాత్రాగణాలకు బదులు అక్షర క్రమాన్నిబట్టి ఏర్పర్చిన గణాల (నిసర్గ గణాలు మొ॥) సాయంతో గణక్రమాన్ని సూచిస్తే అక్షర క్రమానికి ఒకే దారి సరిపోతుంది. అప్పుడు ఇక్కడ కూడా పాదంనుంచి గణ క్రమానికి దారు లెక్కువ చూపించాల్సివస్తుంది. ఇక్కడైనా గణాల అంతస్తుని తొలగించలేం. మాత్రా పద్యాల్లో అక్షర క్రమానికి ప్రాధాన్యం లేకపోయినా ప్రయోజనం ఉండటంవల్ల అక్షరాల అంతస్తు కూడా ఇక్కడ నిర్మించబడింది. అనులోమ విలోమ గతి భేదం గురు లఘు క్రమాన్నిబట్టే చెప్పాల్సిఉంటుంది గనక మాత్రా ఛందస్సులో అక్షరాల అంతస్తు అవసరమవుతున్నది. మాత్రలు ఒకే పరిమాణం గలిగినవి గనుక వాటిల్లో క్రమం అంటూ ఉండదు. మాత్రా పద్యంలో బాహ్య పరిమితి మాత్రా సంఖ్యను బట్టి ఉంటుంది గనక అడుగు అంతస్తునుంచి కూడా బాహ్యపరిమితి రేఖ మొదలు కావచ్చు. అంతర్నిర్మాణానికి మాత్రం గణక్రమమే ఆధారం. ఈ బొమ్మల్లో కొన్ని వివరాల్లో మార్పులు అవసరం కావచ్చు. కాని తెలుగులో ప్రచురంగా ఉన్న ఛందో భేదాల్ని అర్థం చేసుకోవటానికి ఇవి సాయపడతయ్యను కుంటాను.

పద్య పాదాల సామాన్య లక్షణాలుగా నేను ప్రతిపాదించిన అంతర్నిర్మాణ, బాహ్య పరిమితులను శ్రీ సంపత్కుమార ఎక్కడా స్పష్టంగా నిరాకరించలేదు. అంతర్నిర్మాణం గణాల దృష్ట్యా మాత్రమే లేదన్నారు. పైగా ఆయన 'అంతర్విభజన' అనే మాట నేనుపయోగించిన అంతర్నిర్మాణం అనే మాటకు సమానార్థకంగానే కనిపిస్తున్నది. ఆయన ప్రతిపాదించిన భావ గణాలకు ఇంతకన్నా వేరే ప్రయోజనంలేదు. 'ఒక భావం పూర్తిగావటంతో ఒక పాదం పూర్తి కావచ్చు. ఒకప్పుడు భావాంశంతో పూర్తికావచ్చు' అని అనటంవల్ల భావంతో పూర్తిఅయిన పాదంలో భావాంశాలుంటే అంతర్విభజన సాధ్యం కావచ్చు. ఒకే ఒక్క భావాంశమే పాదంలోఉంటే అంతర్విభజన కవకాశం ఉండదు. ఒక పాదంలో ఒకటి మొదలు ఎన్నైనా భావాంశా లుండవచ్చనుకుంటాను. 'ఒక భావం పూర్తి కావటంతో ఒక పాదం పూర్తికావచ్చు' అనటంవల్ల వచన పద్యపాదం గరిష్ఠ పరిమితి ఒక భావమని సంపత్కుమార ఉద్దేశంగా గ్రహించవచ్చు, వచన పద్య పాద కనిష్ఠ పరిమితి ఒక భావాంశమని కూడా అనుకోవచ్చు. కనిష్ఠ పరిమితి భావాంశంతోనూ, గరిష్ఠ పరిమితిని భావంతోనూ సూచించారు. అంటే నిర్దిష్టమైన 'అంతర్విభజన'ని కాని, బాహ్యపరిమితిని కాని ఆయన సూచించలేదు. ఒకవేళ మాటవరసకి

భావ, భావాంశాలనే వాటిని గణాలుగా గాని, గణతుల్యాలుగా గాని అంగీకరించినా, వీటి సహాయంతోనైనా అంతర్నిర్మాణ బాహ్యపరిమితులను నిర్దిష్టంగా చెప్ప లేదు కాబట్టి వచన పద్య పాదాల కివి నిర్దిష్టంగా లేవని అనుకోవాల్సివస్తున్నది. అసలు భావ, భావాంశ విభజన, తద్వారా పాద పాదాంతర్విభజన సాధ్యమవుతుందా? లేదా? అని చర్చించేముందు సంపత్కుమార గారు నేను వేసిన కొన్ని ప్రశ్నలకు ఇచ్చిన సమాధానాలను పరిశీలించాల్సి ఉంది.

వచన పద్యానికి పాద బద్ధత ఉందా? లేదా? అని తెలుసుకోటానికి నేను రెండు ప్రయోగాల (heuristic methods) ను సూచించాను. 1. పాద విభజన లేకుండా రాసిన లేక అచ్చువేసిన వచన పద్యానికి కవ్యుద్దిష్టమైన పాదవిభజన చెయ్యటానికి ప్రయత్నించటం, 2. ఇద్దరు లక్షణకర్తలు ః రకమైన పాదవిభజన చెయ్య గలగటం. ఈ రెండూ సాధ్యంకావు కాబట్టే వచన పద్యపాద విభజనకు ఏకైక పద్ధతిలేదని నా వాదం. ఈ సందర్భంలో ఆయన ఒకేసారి రెండు పద్య పాదాలుగా గణవిభజన చెయ్యటానికి వీలున్న ఈ పద్య భాగాన్ని ఉదాహరించారు.

మధుర మధురమైన మామిడి పండ్లను
పంచి యిచ్చు జనుడె మంచి వాడు

ఇది ఆటవెలది పద్యంలో అర్ధ భాగమూ కావచ్చు, సీసపద్యంలో ఒక పాదమూ కావచ్చు. ఈ భాగాన్ని మాత్రమే ఉదాహరిస్తే కవి ఏ పద్యాన్ని ఉద్దేశించాడో చెప్పలేం. కాని పూర్తి పద్యాన్ని ఉదాహరిస్తే చెప్పటం తేలిక. పద్యమంతా ఇట్లాగే విభక్తమయితే కవి రెండూ ఉద్దేశించాడని చెప్పవచ్చు. యాదృచ్ఛికంగా పద్యమంతా ఇట్లాగే ఉండటం జరగదు. ఇక్కడ శ్రీ సంపత్కుమార ఉద్దేశం ఏమిటంటే కనీసం కొన్ని చోట్లనైనా, కొన్ని పాదాల్లోనైనా ఇట్లాంటివి సాధ్యం కాబట్టి ఆ భాగాల్నే ఉదాహరించి నప్పుడు కవి దేన్ని ఉద్దేశించాడో చెప్పలేము కాబట్టి, వచన పద్యాల్లో మాత్రం కవి ఉద్దేశించినట్టే వేరొకరు ఎందుకు గణ విభజన చెయ్యాలి? అని. కవి ఉద్దేశించిన పాద విభజన మనకు ఎందుకు ప్రమాణం కావాలి. నిజమే, అక్కర్లేదు. ప్రాచీన పద్యాల్లో కవి ఉద్దేశించిన పాద విభజన, లాక్షణికుడు చేసిన పాదవిభజన ఒకటే ఎందుకవుతున్నై? ఇద్దరూ ఒక సూత్రాన్నే అనుసరించటంవల్ల. అనుసరించటానికి ఒక సూత్రమంటూ ఉండటంవల్ల. అచ్చులో పాదవిభజనం చెయ్యటం, చెయ్యక పోవటం అనేది అప్రధానం. శార్దూలం వంటి పద్యాల్ని చిన్న సైజు పుస్తకంలో అచ్చువేసేటప్పుడు ఒక్కోపాదాన్ని రెండుగా విరిచి ముద్రించటం మనం చూస్తున్నాం. అయినా అక్కడ సందిగ్ధత కవకాశం లేదు. వచన పద్యంలో అట్లాంటి సందిగ్ధత కవకాశం ఉంది. పైన పేర్కొన్న 'మధుర మధురమైన' చోట్ల ఉన్న సందిగ్ధత వేరు. పైన ఉదాహరించిన భాగానికి రెండు విధాలైన విభజనే సాధ్యం. ఆ రెండూ రెండు సూత్రాలు ఒక చోట converge కావటం వల్ల ఏర్పడినై. ఇది systematic convergence. అట్లాంటిది వచన పద్యంలో ఉండటానికి వీల్లేదు. system ఉన్నప్పుడు గదా systematic convergence ఉండేది. దీన్ని Metrical ambiguity అనవచ్చు. వాక్య నిర్మాణంలో కనిపించే Syntactic ambiguity (దీన్ని తెలుగులో వ్యాకరణశ్లేషఅని వ్యవహరిస్తున్నాను) లాంటిదే ఇది. ఒక వాక్యానికి కేవలం భిన్న వ్యాకరణ సంబంధాలవల్ల భిన్నార్థాలు వస్తే వ్యాకరణశ్లేష అవుతుంది. ఈ భిన్నవ్యాకరణ సంబంధాలు ఒక వాక్యంలో ఏ పరిస్థితుల్లో Converge అవుతయ్యో Predict చెయ్యవచ్చు. ఈ పని వ్యాకర్తలది. ఆధునికులు చేస్తున్న వాక్యనిర్మాణ చర్చలో ఈ పరిశీలన కొంత కనిపిస్తున్నది. అట్లాగే Metrical ambiguity ని కూడా Predict చెయ్యవచ్చు. దీన్ని వివరించాల్సిన బాధ్యత ఛందః పరిశోధకులది. శ్రీ సంపత్కుమార చూపించినవే కాక ఇట్లాంటివి ఇంకా చాలా ఉంటై. ఉదాహరణకు యతి నియమాలను పాటిస్తూ 17 లఘువులతో పద్య పాదం రచిస్తే అది గీతమూ కావచ్చు, ఆటవెలది బేసిపాదమూ కావచ్చు. ఇందు క్కారణం సర్వలఘువులున్న గణం సూర్యగణంలోనూ

ఉంది. ఇంద్రగణాల్లోనూ ఉంది. ఆటవెలది బేసి పాదంలోను గీత పద్య పాదంలోను ఇంద్ర సూర్యగణాల సంఖ్య ఒకటే, క్రమంలోనే భేదం. సర్వలఘువులున్న పాదంలో ఈ రెండు రకాలయిన విభజన అందువల్ల సాధ్యమయింది. 'సూర్య—ఇంద్ర— సూర్య—ఇంద్ర— సూర్య' అనే క్రమంలో ఏదన్నా పద్యం ఉంటే అట్లాగూ విభజించవచ్చు. ఇట్లాంటివే మరికొన్నిటిని గమనించండి.

(1) U | U | U | | | | | | | U
U | U | U | | | | U | | |

(2) U | | | | | U | | U | | | |
U | | | | | U | | U | U

(3) U | | | | | | | | | | | | | U |

ఈ పై కూర్పుతో మొదటి రెండు (1) గీత పద్య పాదమూ ఆటవెలది బేసిపాదమూ కావచ్చు. తరవాతి రెండు (2) గీత. ద్విపద పాదాల్లో ఏదైనా కావచ్చు. చివరిది (3) ఆటవెలది బేసిపాదమూ, ద్విపద పాదమూ కావచ్చు. ప్రయత్నించి చూస్తే ఒకే కూర్పు ఈ మూడు రకాలు అయ్యేట్టుకూడా చెయ్యవచ్చు. పై కూర్పుల్లో మొదటి గురువు స్థానంలో రెండు లఘువులున్నా మార్పేమీ ఉండదు. ఇట్లాంటి అవకాశాల్ని పరిశీలించి పరిశోధకులు వివరిస్తే ఛందస్సును గురించిన మన అవగాహన పెరుగుతుంది.

ఇంతకీ నా ప్రధానమైన ప్రశ్న ఇది. వచన పద్యానికి కవి ఉద్దేశించినా, లక్షణకర్త ఉద్దేశించినా పాద విభజనకు పద్ధతి ఏమిటి? 'భావాన్నిబట్టి' అని సంపత్కుమార సమాధానం. పాదాంతర్విభజనకీ ఇదే సూత్రాన్ని ఆయన ప్రతిపాదిస్తున్నారు. ఒక వచన పద్యాన్ని భిన్నలాక్షణికులు భిన్న విధాలుగా విభజించటం సంపత్కుమార గారు అనుకుంటున్నట్టు పైన పేర్కొన్న 'మధుర మధురమైన మామిడి పండ్లను... అన్నదాన్ని సీసపద్యపాదంగా. ఆటవెలది అర్ధభాగంగా విభజించటం లాంటిదికాదు. ఒకే లక్షణ కర్తగాని, భిన్నలక్షణకర్తలు దాన్ని రెండు విధాలుగా—రెండు విధాలుగా మాత్రమే — విభజించటానికి అవకాశం ఉంది. ఈ లక్షణ భిన్నత్వంకూడా క్రమ బద్ధమే. వచన పద్య పాద విభజనలో భిన్నత్వానికి కారణం లక్షణ భిన్నత్వం కాదు, లక్షణా భావం. ఎందువల్లనంటే భావ, భావాంశాలను గుర్తుపట్టటానికి గాని, పరిగణించటానికి గాని, ప్రమాణీకరించటానికి పద్ధతు లేవీ లేకపోవటంవల్ల. భావానికి గాని, భావాంశానికి గాని భాషలో అస్తిత్వం వ్యాకరణ సంబంధాలవల్లనే సాధ్యం. అంటే భాషలో ఇవి వ్యస్త పదాల వల్ల గాక పద బంధాల (Phrases) వల్ల, ఉపవాక్యాల (Clauses)వల్ల, వాక్యాలవల్ల వ్యక్తమవుతై. వీటి నిర్మాణాన్ని(Syntactic Structure) అంటారు. భాషా వ్యవహారంలో—అది సంభాషణైనా, కథా కథనమైనా, పద్యమైనా, గద్యమైనా, భావ వ్యక్తీకరణ (Syntactic structure) వల్లనే సాధ్యం. వ్యాకరణంతో నిమిత్తం లేకుండా భావ, భావాంశాలను ఎట్లా పరిగణిస్తారో నా ఊహకు అందటం లేదు. వ్యాకరణ సంబంధాల కతీతంగా భావం ఉంటుందంటే అందుకు నా అభ్యంతరం లేదు. కాని అది భాషలో ఎట్లా వ్యక్తమవుతున్నదనే నా క్కావల్సింది. అది వ్యాకరణ సంబంధాలవల్లనే (పదాలకు, పదాంశాలకూ అర్థాలుంటయ్యని, భావ వ్యక్తీకరణలో వాటికి ప్రాధాన్యం ఉంటుందన్న విషయం నేను కాదనటం లేదు. వీటి సంపుటీకరణాన్ని గురించి నే నుద్దేశిస్తున్నది.) సాధ్యమవుతుందని నా అభిప్రాయం. వ్యాకరణా తీతంగా భావ భావాంశాలను పరిగణించే సూత్ర మేమిటి? అని సూటిగా అడుగుతున్నాను. 'భావాన్ని, భావాంశాన్ని బట్టి వచన పద్యంలో పాద విభజన జరుగుతుంది' అంటే చాలదు. వీటిని గుర్తుబట్టే సాధనాలు ఇయ్యనంతవరకు ఎన్ని ఉదాహరణలు ఇచ్చినా ప్రయోజనంలేదు. పాద విభజనలో పద్ధతి ఉందనటానికి శ్రీ సంపత్కుమార ఈ కింది మాటల కూర్పుని ఉదాహరించారు.

'ప్రాణాలు బిగపట్టు కొని
సాగేరు ప్రయాణీకులు

నాయకుడు తిరిగి వస్తాడనీ,
తుఫాను శమిస్తుందనీ
నది పొంగు తగ్గేననీ
ఆశతో అహరహమూ
దేనికైనా ఉద్ధృతి ఎంతసేపు?
దానికి వ్యతిరిక్తం తప్పదాపైన'

-మాదిరాజు రంగారావు.

చివరి రెండు పాదాలు భావాన్నిబట్టి, మొదటి ఆరు పాదాలు భావాంశాలను బట్టి విభక్తమయినయ్యని శ్రీ సంపత్కుమార వివరణ. కాని ఈ భావ భావాంశాల వ్యక్తీకరణ వ్యాకరణ మూలంగా జరిగిందని, ఇక్కడ పాద విభజనకు సూత్రమేదన్నా ఉంటే అది వ్యాకరణ సంబంధి అని నా వివరణ. చివరి రెండు పాదాలూ రెండు వాక్యాలు. వాటినే సంపత్కుమార భావాలన్నారు. మొదటి రెండు పాదాలు కలిపి ఒక వాక్యం. మొదటి పాదం క్త్వార్థక క్రియాంతమైన ఉపవాక్యం. ప్రధాన వాక్యాంశమైన రెండో పాదాని కిది Manner ని సూచించే విశేషణ వాక్యాంశం లేక ఉపవాక్యం (Attributive clause). క్త్వార్థక క్రియ వాక్యంలో ప్రవర్తించే తీరుల్లో ఇదొకటి. అంటే ఒక వాక్యంలో రెండు క్లాజుల్ని రెండు పాదాలుగా విడదీశారన్నమాట. 3—6 పాదాలన్నీ కలిపి ఒక వాక్యం. కాని ఇక్కడ క్రియ లేదు. ఉంటే ఆరో పాదంలో ఉండాలి. కాని ఇక్కడ లోపించింది. బహుశా ఇది కవి శైలీ విశేషం కావచ్చు. ఆరోపించిన క్రియకు ఆరో పాదం విశేషణం అవుతుంది. 3, 4, 5 పాదాలు ఒక గర్భి వాక్యం (Matrix sentence) లో ఇమిడిన మూడు గర్భ వాక్యాలు (Constituent sentences). ఈ వాక్యాలకు 'అని' అనే అనుకరణాద్యర్థబోధక శబ్దం చేర్చటంవల్ల ఉపవాక్యా లయినై. అంటే పైన ఉదాహరించిన భాగంలో పాద విభజన వాక్య నిర్మాణంలో వాక్య, ఉపవాక్య విభజన జరిగే పద్ధతి ననుసరించి జరిగిందని స్పష్టం.

ఈ సందర్భంలోనే కె. వి. రమణారెడ్డిగారి 'బాధా గాథము' అనే ఖండికలో నుంచి నేను ఉదాహరించిన భాగాన్ని శ్రీ సంపత్కుమార మళ్లీ ఉదాహరించి 'కొంచెం లోపం ఉండవచ్చుగాక' అందులో పాద విభజన జరిగిందని నిరూపించటానికి ప్రయత్నించారు. శ్రీ రమణారెడ్డిగారి అంగార వల్లరి అనే పుస్తకంలో నుంచి కొంత భాగాన్ని నేను గ్రహించి అచ్చులో అది ఎట్లా ఉందో అట్లాగే నా వ్యాసంలో ఉదాహరించాను. అచ్చులో అక్షరాల వరస కాయితం మీద అక్షరాలు పట్టే చోటు ననుసరించి కూర్పబడింది. రమణారెడ్డిగారు 'బాధా గాథము'లో పాద విభజన ఉద్దేశించలేదు. (అట్లా అని నాకు రాశారు కూడా) నే నుదాహరించిన భాగంలో అవి నాలుగు పాదలుగా కనిపించటం కేవలం యాదృచ్ఛికం. రమణారెడ్డిగారి 'అంగార వల్లరి' అనే అచ్చు పుస్తకాన్ని శ్రీ సంపత్కుమార చూసి ఉండ లేదనుకుంటాను. చూస్తే 'బాధా గాథము'లో పాద విభజన జరిగిందని పొరపాటు బడే అవకాశం ఉండేదికాదు. అట్లాగే తిలక్ రాసిన 'రాత్రివేళ' అనే ఖండికలో పాద విభజన జరిగినటు నాకు నమ్మకం లేదు' 'అమృతం కురిసిన రాత్రి' తిలక్ మరణించిన తరువాత అచ్చయిన పుస్తకం. అందువల్ల కవి ఏ ఖండికలో పాద విభజన ఉద్దేశించాడో, ఎక్కడ ఉద్దేశించలేదో తెలుసుకోటానికి అచ్చయిన పుస్తకమే ఆధారం. ఈ ఆధారంతో చూస్తే ఇక్కడ కవి పాద విభజనను ఉద్దేశించినట్టు తోచదు. ఇప్పుడు కనిపించే పాద విభజన తిలక్ పద్యాల్ని కాపీ చేసినవారో, అచ్చువేసిన వారో చేసి ఉండవచ్చు. అసలు కవి పాద విభజనను ఉద్దేశించాడో లేదో పూర్తిగా తెలుసుకోకుండా అస్పష్టమైన ప్రతిపాదనల ఆధారంగా ఏ అప్రకవినో జ్ఞాపకం తెచ్చేట్టుగా 'ఛందోదోషాల్ని' ప్రస్తావించటంలో శ్రీ సంపత్కుమార కొంచెం తొందర పడ్డారనుకుంటాను.

పాదాల అంతర్విభజనకు సంపత్కుమార భావ గణాలను ప్రతిపాదించారు. ఈ భావగణం భావమూ కావచ్చు, భావాంశమూ కావచ్చు. పాద విభజనకు కూడా వీటినే ప్రతిపాదించారు గనక ఒక్కో పాదంతో ఒక్కొక్కసారి ఒకే గణం ఉండవచ్చు. ఆ గణం భావాంశ గణమయితే అంతర్విభజన సాధ్యం కాదన్న

మాట. భావాంశాలుగా విభక్తం కాని భావగణమున్నా అంతర్విభజన వీలుపడదు. అయినా అభ్యంతరం లేదు. గణితశాస్త్రంలో Set theory ప్రకారం, దీన్ని సమర్థించ వచ్చు. ఒక పాదం గణాల Set అయితే అందులో ఒక వస్తువు (ఒక గణం) ఉన్నా Set అవుతుంది. ఒక Set తనలో తాను అంతర్భాగం కూడా అవుతుంది. అక్షర ఛ్ఛందస్సులో ఏకాక్షర వృత్తాంతర్నిర్మాణాన్ని సమర్థించే మార్గం ఇదే అను కుంటాను. కాని భావ గణాలైన ఈ భావం, భావాం శాల స్వరూపాల్ని శ్రీ సంపత్కుమార ఇప్పటి వ్యాసంలో నయినా వివరించకపోవటం విచారకరం. 'భిన్నభిన్న వచన పద్య పాదాల్లో అక్కడ భావాన్ని స్ఫురింపజేసే పదాల స్థితిని బట్టి భావ గణ విభాజక రీతి ఉంటుంది' అన్న సంపత్కుమార వివరణ చాలా అసంతృప్తి కరంగా ఉంది. ఆ 'స్థితి' ఏమిటో నిరూపించే వరకూ భావగణాలస్థితి (Exestence) ని అంగీకరించలేను. వీరు ఆధారపడ్డ భావ స్ఫూర్తి వ్యాకరణ సంబంధాల వల్ల కలుగుతున్నదని నా వాదం. ఇంతకుముందే చెప్పి నట్లుగా వ్యాకరణాంశాలు వదిలేస్తే భావాలు దొరకవు. అందుకనే వారి భావగణాలను (వాటిని గణాలు అనాల్సి వస్తే) నేను వ్యాకరణ గణాలు అన్నాను. వ్యాకరణ రూపైకత అనటంతో ప్రతిగణమూ, ఇంకో గణంతో సమంగా ఉండటం కాదు నేను ఉద్దేశించింది. కొన్ని పద సమూహాలకు వ్యాకరణ సమత్వం ఉంటుంది. అట్లాంటివి ఒక గణం కావచ్చు. సమత్వ భేదాల్నిబట్టి బహువిధ గణా లుండవచ్చు. ఇంతకీ వ్యాకరణ గణాలను వచన పద్యానికి లక్షణంగా ప్రతిపాదించటం నా ఉద్దేశం కాదు. ఛందస్సులో వాడుకోదగిన వ్యాకరణ గణా లున్నయ్యని నేను నమ్మటంలేదు. కాని సంపత్కుమార ప్రతిపాదిస్తున్న భావగణాలు వ్యాకరణాంశాలను బట్టి విభక్తమవుతయ్యని, వ్యాకరణ గణాలనటంవల్ల వాటిని వ్యాకరణం సహాయంతో గుర్తుపట్టవచ్చునని నా ఉద్దేశం. శ్రీ సంపత్కుమార 'భావస్ఫూర్తి' అన్నా, భావ స్ఫూర్తి వ్యాకరణ పరిజ్ఞానం లేకుండా జరుగదు గనక, భావగణ విభజనలో వారికి తోడ్పడింది (వ్యక్తంగా కాక పోవచ్చు) ఈ వ్యాకరణ సంబంధాల పరిజ్ఞానమే. వ్యాకరణ విరహితంగా భావస్ఫూర్తి కలిగే పద్ధతి ఒక టుంటే, అది చూపించే వరకూ వారి భావ గణాలను వ్యాకరణ గణాలు అనే అనాల్సిఉంటుంది.

సాంప్రదాయిక ఛందస్సులో రచించిన పద్యా లను చదివే పద్ధతిని గురించి సంపత్కుమార కొంత ప్రస్తావించారు. పద్యాన్ని శబ్దం మధ్యలో విరిచి చదవం—అది గణాంతమైనా సరే, పాదాంతమైనా సరే. ప్రకృతి ప్రత్యయాలను గాని, విశేషణ విశేష్యాలను గాని, కలిపి చదవటానికి చదువరికి తన భాషను గురించి వ్యాకరణ పరిజ్ఞానం ఉండటమే. చదవటంలో భావస్ఫూర్తిని కలిగించేది ఈ వ్యాకరణ పరిజ్ఞానమే. అయితే ఆ పద్యాల్లో భావగణాల ప్రసక్తిగాని, వ్యాకరణ గణాల ప్రసక్తిగాని రాదు. ప్రసిద్ధంగా వాటికి గణ విభజన ఉంది. గణాల్నిబట్టి చదవాల్సిన అవసరం లేదు. నిజానికి ఈ వ్యాకరణాంశాల పాత్రను సంపత్కుమార పూర్తిగా తిరస్కరించటంలేదని ఆయన వ్యాసంలోని ఈ వాక్యాలవల్ల మనం చెప్పవచ్చు. 'వచన పద్య నిర్మాణంలో భావ స్ఫూర్తి విషయికంగా వాక్య నిర్మాణ రీతికి ప్రవేశం ఉంది కాబట్టి, వాక్య నిర్మాణానికి, వ్యాకరణానికి సంబంధం ఉంది కాబటి వ్యాకరణ రూపైకత అక్కడక్కడా భావగణ విభజనలో కని పించటం సహజమే. అంత మాత్రాన వ్యాకరణరూపై కత వల్లనే సర్వత్రా భావగణ విభజన జరుగుతుందన టానికి వీల్లేదు.' వ్యాకరణాంశాలకి, వీరున్నయ్యంటున్న భావాంశాలకి ఏకైక సంబంధం (One to one correspondence) ఉంది కాబట్టి వ్యాకరణ విరహి తంగా భావగణ విభజన సాధ్యంకాదని నా నమ్మకం. సాధ్యమని నిరూపించాల్సిన బాధ్యత శ్రీ సంపత్కు మార మీదే ఉంది. కేవలం భావస్ఫూర్తిని బట్టి అంటే చాలదు. వ్యాకరణ విరహితంగా భావస్ఫూర్తి ఎట్లా కలుగుతుందో కూడా ఆయన నిరూపించాలి.

సంపత్కుమార భావగణాల సంఖ్యను గురించిన నా సందేహానికి సమాధానం ఇవ్వటానికి ప్రయ త్నించారు. 'దూరము—దుంపలు—దుఃఖము—దుర్గతి' అన్నమాటలను ఉదాహరించి వాటిల్లో

మొదటి గుర్వక్షర స్వరూపంలో మార్పున్నా 'భగణం' అనే ఒకే పేరుతో పిలుస్తున్నాం కాబట్టి 'భావాన్ని ఆధారం చేసుకొని పదాల స్వరూపంలో వాటి కలయి కల్లో ఎన్ని తేడాలున్నా గూడా అది భావ గణమే. అది ఏకైకం' అని వివరించారు. పైన ఇచ్చిన మాటల్లో మొదటి అక్షర స్వరూపంలో భేదం ఉన్నా, సామ్యం కూడా ఉందని మరిచి పోగూ డదు. అంతేకాదు ఆ సామ్యాన్ని హేతుబద్ధంగా నిరూపించవచ్చు. గురు లఘు నిర్ణయం అక్షర (Syllable) పరిమాణాన్నిబట్టి జరిగింది. వ్యంజ నాన్ని C అనే గుర్తుద్వారాను, హ్రస్వాచ్చు V అనే గుర్తుద్వారానూ, దీర్ఘాచ్చును $\bar{V}$ అనే గుర్తుద్వారానూ సంకేతిస్తే గురు స్వరూపాన్ని ఈ కింది విధంగానూ చూపించవచ్చు.

$$C\ \bar{V}$$

$$C\ V\ C$$

పూర్వపర వ్యంజనాలతో సంబంధం లేకుండా దీర్ఘాచ్చుకాని, పర వ్యంజనంతో మూతబడిన హ్రస్వాచ్చు గాని గురువు అవుతుంది. ఇంగ్లీషులో Long Syllable అని వ్యవహరిస్తారు. తక్కినవి లఘువులు. అక్షర పరిమాణాన్ని (Syllabic quantity) ని ఏర్ప డింది గురు లఘు విభేదం. ఇట్లాంటి నిశ్చితమైన సూత్రాలమీద ఏర్పడ్డ గురు లఘు క్రమాన్ని అనుస రించి తయారయిన గణాలకూ, భావగణాలకూ పోలికే లేదు. భావగణాలను పరిగణించటానికి వీల్లేదంటే అది వేరే మాట. కాని భావగణాల అపరిగణనకు ప్రాచీన ఛందస్సామ్యం ఇక్కడ అతకదు.

శ్రీ సంపత్కుమార ఇప్పటి వ్యాసంలోనయినా వచన పద్యాన్ని అంతర్నిర్మాణమూ బాహ్య పరిమితి ఉన్న పాదాలుగా విభజించటానికి స్పష్టమైన ప్రతిపాదన ఏదీ చెయ్యలేదు. ఆయన ఉన్నయ్యంటున్న భావ గణాలు వ్యాకరణాంశాలమీదనే ఆధారపడ్డై గనక అవి వ్యాక రణ గణాలే అవుతై. ఆయన భావ గణ పద్ధతికి వచన పద్యాన్ని గద్యం నుంచి వేరుచేసే శక్తి. 'భావస్ఫూర్తి' ఆధారంగా విభక్త మవుతయ్యని సంపత్కుమార అంటున్న భావ గణాలు అన్నిరకాల భాషా వ్యవహారా ల్లోనూ ఉంటై. అయినప్పుడు ఆయన పద్ధతి ననుస రించి ఒక వ్యాసంలోని వాక్యాలను గూడ భావ భావాం శాల పద్ధతిలో పాద విభజనచేసి వచన పద్యంగా నిరూ పించవచ్చు. అచ్చులోగాని, రాతలోగాని కవి పాద విభ జనని సూచించటం ప్రమాణంగా తీసుకుంటే ఆ పని వ్యాసకర్తకూడా చెయ్యవచ్చు. ఈ నాటి కొన్ని ప్రకట నల్లో కూడా పాదవిభజన కనిపిస్తున్నది. భావ భావాంశ నిరూపణ అక్కడా చెయ్యవచ్చు. ఇకపోతే వచన పద్యంలో ఉండే కవితా పదార్థం దాన్ని వ్యాసాల నుంచి ప్రకటనలనుంచి వేరుచేస్తుంది కదా అంటే కవిత్వానికి గద్యంలో స్థానంలేదని అనాల్సి ఉంటుంది. రసహీనమైన పద్యాలు, రసవంతమైన గద్యం ఉంటయ్యని అందరూ ఒప్పుకుంటారు. కవిత్వం ఉన్నదల్లా ఛందో విభాగం అని, ఛందస్సులో ఉన్న దల్లా కవిత్వం అవుతుందని శ్రీ సంపత్కుమార అంటారనుకోను.

ఈ చిక్కులన్నిటికీ కారణం మనకు ప్రసిద్ధంగా ఉన్న ఛందస్సంప్రదాయంలో ఎక్కడోచోట ఈ వచన పద్యానికి చోటు కల్పించటంకోసం ప్రయ త్నించటం. ఏదోరకమైన ఛందస్సూ గణవిభజనా ఉన్నయ్యంటే వచన పద్యానికి అదనంగా ఏదో గౌరవం వస్తుందనుకోటం.

ఏవిధంగా చూసినా సంపత్కుమార చెప్పిన లక్షణాలు వచన పద్యాన్ని ఛందోవిభాగంగా నిలబెట్టు లేవు. అందువల్ల 'వచన పద్యం' పద్యంకాదని గద్యమే నని నేను పూర్వంచేసిన నిర్ణయాన్ని మార్చుకో వలసిన అవసరం శ్రీ సంపత్కుమార వ్యాసం కలి గించలేదు.

# మారుతున్న కాలం - 'మాలపల్లి'

## శ్రీ రామమోహన రాయ్

వాడుకభాషలో పుస్తకాలే కఱవుగా ఉన్నరోజుల్లో మాలపల్లి నవల రచించటమంటే అసాధారణ మైన ప్రతిభతో కూడుకొన్న పని. దేశం బాని సత్వంలో మగ్గుతున్నప్పుడు రాజకీయ స్వాతంత్ర్యాన్ని మాత్రమేగాక సంఘంలో అణగారిన అర్తుల దీనాలాపా లను వివిపించుకొని వారి విముక్తికి ముందుగా ప్రయత్నం చేయాలని ఆలోచించిన మహారచయిత, మహామనీషి కీ. శే. ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులు. గాంధీజీ దక్షిణాఫ్రికానుండి భారతదేశం తిరిగివచ్చి సంఘ సంస్కరణకు పూనుకోక మునుపే అంటరాని వారుగా అవమానాలకు గుఱి అవుతున్న మనుష్యుల కన్నీళ్లను తుడిచి, వారికోసం కలం పట్టారు. అటు బ్రిటీషు ప్రభుత్వానికిగాని, యిటు అగ్రవర్ణాల వారమనుకొనే వారికిగాని భయపడక ఆంధ్రజాతిని కదలించిన నవలను వ్రాశారు. ఉన్నవ వారు ఎం. ఏ. బార్—ఎట్‌లా చదివారు. బ్రిటీషు కొలువులో చేరి ఉంటే ఎంతో ఉన్నతోద్యోగి అయ్యే వారు. తనకు తానుగా ఎన్నుకొన్న దీనజన సేవలోనే కాలం గడిపారు. గుంటూరు జిల్లాలో పన్నుల నిరాకరణోద్యమాన్ని నడపటంలో వారిపాత్ర మరువరానిది. తెలుగు నవలకు నూరేళ్లు నిండిన తరుణంలో మంచి నవలలను లెక్కించాలను కుంటే మున్ముందుగా జ్ఞాపకానికొచ్చేది మాలపల్లి నవలే.

కీ. శే. వీరేశలింగం పంతులుగారు రాజశేఖర చరిత్రము రచించి తెలుగు నవలకు ఒరవడి పెట్టారు గాని ఆయన భావ విప్లవాన్ని ప్రోత్సహించినంతగా భాషా విప్లవాన్ని ప్రోత్సహించ లేదు. ఇక ఉన్నవ వారు సవ్యసాచిగా భావ, భాషా విప్లవాలను ఏక కాలంలో నడిపించి దేశానికి, సారస్వతానికి గణనీయమైన సేవ జేశారు. దేశస్వాతంత్ర్యాన్ని కళ్లారా చూసిన తరువాత గూడ నిష్కామకర్మ చేసినట్లుగా పదవుల కెగ బడలేదు. భాషా విప్లవాన్ని ఒక సుస్పష్టమైన రూపంలో దర్శించక ముందే తాము తలపెట్టిన 'తిక్కన' రచనను పూర్తిచేయకుండానే తనువు చాలించారు.

మాలపల్లి వ్రాసే నాటికి వాడుక భాషలో నవలలు లేనే లేవు. తనకష్టాన్ని వివరిస్తూ ఉన్నవ వారు 'మాదిరికి తగిన గ్రంథములు కూడా లేవు. సంస్కృతభాషా పాండిత్యం గాని, తెలుగు ప్రబంధముల పరిచయంగాని వాడుక భాషలో గ్రంథములు వ్రాయ టానికి విశేషం తోడ్పడవు. శుద్ధమయిన తెలుగు భాష రావడానికి సంస్కృతభాషతో సంబంధంలేని పల్లెటూరివారితో పరిచయ ముండాలె. మొదట సంస్కృత పండితులూ, ఇప్పుడాంగ్ల భాషా పండితులూ తెలుగుభాషయొక్క స్వభావాన్ని మార్చారు. అనేక భావాలను తెలియజేసే అచ్చతెలుగు మాటలున్నా సంస్కృతము నుంచో, యింగ్లీషు నుంచో మాట లరువు దీసుకోవటం మామూలయింది. అందువల్ల చక్కని తెలుగు మాటలన్నీ మూలబడి భాషలో సాంకర్య మెక్కువయింది. వీలయినంతవరకు తెలుగుభాషయొక్క నడక కనుకూలంగా యీ గ్రంథం వ్రాయటానికి ప్రయత్నం చేశాను' అని వ్రాశారు. 'భాషయొక్క ప్రస్తుత స్థితిలో వాడుక భాషలో వ్రాయటం కంటె గ్రాంథిక భాషలో వ్రాయడం సులభముగా' కనపడ్డదని కూడ అన్నారు. మనస్సు నాకట్టుకొనే తేటమాటల తీరుతియ్యము లోకవైపునా, సంస్కృత పదాలతో కూడిన వేదాంతార్థాలను వివరించే పదా లోకవైపునా చదువరులకు చిత్రమనిపిస్తాయి. ఇప్పుడీ నవల చదివే వారికి కొన్నిచోట్ల 'యిదేమి వాడుకభాష?' అనే ప్రశ్న ఎదురౌతుంది. ఐతే నేం ఏ మాత్రమూ ఇంగ్లీషుగాని

సంస్కృత నుడికారంగాని లేని తెలుగును ఎంత సహజంగా ఎంత తియ్యగా పలికించవచ్చునో తెలుస్తుంది. జాతీయాలు, సామెతలు, తెలుగు పలుకుబళ్లు మాలపల్లిలో సార్థకతను పొందాయనటం అతిశయోక్తి కాదు. దేశోద్ధారకులు నాగేశ్వర రావు పంతులు గారు తమ 'తొలి పలుకు'లో 'శ్రీయుత ఉన్నవ లక్ష్మీనారాయణ గారు సుప్రసిద్ధాంధ్ర నాయకులు, సంస్కర్తలు, సాహిత్య విశారదులు, కార్య శూరులు. శారదా నికేతనము, మాలపల్లి —క్ష్మీనారాయణగారి మానవధర్మ పరాయణత్వమునకు నిదర్శనములు. ప్రభుత్వము చేసిన నిషేధమే మాలపల్లికి ప్రఖ్యాతిని కలుగజేసినది......మాలపల్లి నవరసభరితమై రసానందముతో తాండవమాడుచున్నది' అని నవలకు యోగ్యమైన ప్రశంసల నందజేస్తూ దీనిని ఆంధ్రగ్రంథమాలలో నొక కుసుమముగా జేర్చుకొని ఆనందించారు.

మన నవలల్లో పల్లెటూరును 'బాక్ — గ్రవుండ్'గా చేసుకొని వ్రాసినవి చాల తక్కువ. ఉత్తమ నవలల్లో మాలపల్లి, కీలుబొమ్మలవంటివి కొద్దిగానే వచ్చాయి. దానికి కారణం మన రచయితలకు పట్నవాసాలతో ఉన్న పరిచయం ఆ వాతావరణాన్ని వ్రాయటంలోని సులువూ, పల్లెటూళ్ల వర్ణనల్లో కన్పించక పోవటం. కార్మికుల కష్టాలకు సానుభూతి చూపిస్తూ రచనలు చేసినంతగా పల్లెటూళ్లలోని వ్యవసాయ కూలీలు, పేదరైతుల జీవితాలను పరిశీలించక పోవటము. రైతుకూలీల సంబంధాలను నవలలో వ్రాసేటప్పుడు గూడ కూలీలపక్షం వహిస్తున్నామని వాస్తవాలను మసిబూసి మారేడుకాయ చెయ్యటం రచయితలు చేసే సామాన్యమైన పొరపాటు. కాని ఉన్నవ వారు చౌదరయ్యవంటి భూస్వాముల తత్త్వం ఎంత కుళ్లితంగా, స్వార్థపూరితంగా, పగ సాధించేదిగా అనూనుషంగా ఉన్నదో చెప్తూనే కూలీల కష్టాలను తెలుసుకొని వాళ్ల మంచిచెడ్డల లోపాలు పంచుకోవాలనుకొనే రామానాయడివంటి తర్వాతి తరానికిగల భేదాన్ని సూక్ష్మంగా గమనించగలిగారు. చౌదరయ్యకు లక్ష్మమ్మవంటి దయగల యిల్లా లుండటంకూడ సంభవమేనని యెంచారు.

నవలకు బరువనిపించే వేదాంత చర్చలకూ, ఉపన్యాసాలకూ ఎక్కువ చోటిచ్చి కొన్నిచోట్ల శిల్పానికి భంగకరమైన రచన చేశారు. దీనివలన సామాజిక ప్రయోజనం వెనుకబడి రచయిత అంతర్ముఖులై మరో మంచిలోకాన్ని అన్వేషిస్తున్నట్లు కనిపిస్తుంది. ముందు వ్రాయదలచుకొన్న మాలపల్లి నవల పోనుపోను ధర్మం జయించి, మంచి మనిషికి ముక్తిమార్గం చూపించిన 'సంగ విజయ'మని పిలవాలనిపించింది వారికే.

పల్లెటూళ్లలో ఆ నాటికి దుర్భరంగా ఉన్నాయని వర్ణించిన పరిస్థితులు నేటికీ మారలేదు. మాల మాదిగలను హీనంగా చూడటమూ, భూస్వాములు అయినదానికీ కానిదానికీ వాళ్లమీద చేయి చేసుకోవటమూ చిట్టచివరకు దుర్మార్గంగా వాళ్లను కొట్టి చంపినా కోర్టుల్లో ఏ శిక్షా పడకుండ తప్పించుకు పోవటమూ యీనాటికీ సాగుతూనే ఉన్నాయి. స్వాతంత్ర్యానికి పాతికేళ్లకు పూర్వమే వ్రాసిన మన సంఘంలోని ఘోరమైన స్థితిగతులు పాతికేళ్ల స్వాతంత్ర్యం తరువాత గూడ అట్లాగే సాగుతున్నాయి. ఈనవలలో ప్రధాన పాత్ర రామదాసుకు చెల్లెలైన సుబ్బలక్ష్మిని మునసబు గారి బసివి రెడ్డి కట్టి తీసుకొని కొడ్తే ఆమె ఆ తరువాత ఆస్పత్రిలో చేరుతుంది—ఆ తరువాత చచ్చిపోతోంది. ఆ దౌర్జన్యాన్ని ఎదుర్కోవాలనే సంగతి ఆ గూడెంలో ఎవరికీ తోచదు. ఆ పరిస్థితులు మారాలన్నకోరిక మాత్రం సంగదాసుకు కలుగుతుంది. కాని ఏం లాభం?

మంగళాపురంలో భూస్వామి చౌదరయ్య మరి కొందరు 'పెద్ద'లతో కలిసి ధాన్యపు కూలిని మార్చి డబ్బు కూలి యియ్యటానికి ఆలోచిస్తాడు. ధాన్యం ధర పెరగటంచేత డబ్బుయిచ్చి కూలీల కడుపు కొట్టడానికి ఆలోచిస్తాడు. దీనిని ఎదుర్కొన్నది సంగదాసే. 'మనదేశంలో భూమిలో స్వామ్యం వ్యవసాయదారులకు లేదు. అది ప్రభుత్వానికిగాని మందికిగాని చెంది వున్నది...ఆసామీల కున్నది జిరాయితే హక్కే...పూర్వం మందివల్ల హక్కు బొందిన దేశముఖులు లేక జమీందార్లు కొన్ని భూములు స్వంత కమతం కింద వుంచు

కొని మిగిలినవి రయితులకు కౌలుకిచ్చే వారు. ఆ కాలంలో కమతగాళ్లుగావున్న వాండ్లు చాలమంది యిప్పటి భూస్వాములైనారు. పూర్వం కమతగాండ్లకు కొంత పాలి హక్కుండేది. ఆ పాలేరు మారి యిప్పుడు జీతగాడైనాడు. అందువల్ల భూమితో అతనికుండే సంబంధం పోయింది ...... వ్యవసాయ విషయంలో జీతగాండ్లూ కూలీలు ముఖ్యులు. చెమటోడ్చి జనానికి భోజన పదార్థాలు సృష్టిజేసే వాండ్లు వాండ్లు. స్వంతగా దున్నే కౌలుదార్లు సైతం వీండ్ల లోనే చేరుతారు. వందల కొలది యెకరాలకు మంది వల్ల కౌళ్లు పొందిన పట్టాదార్లు వట్టి తనిఖీవార్లు... వ్యవసాయంవలన వచ్చేలాభం విశేషంగా యీ తనిఖీ దార్ల జేబుల్లోకే పోతూ వున్నది. వ్యవసాయానికి కూలీ ముఖ్యుడు గాని మీరుచెప్పే భూస్వామికాడు'— ఇంత ఖండితంగా చెప్పగలిగిన సంగదాసు సంఘాన్ని మార్చ జూడటమేగాదు—కూలీలను సంస్కరించ టానికి, మాలగూడాల అపరిశుభ్రతను తొలగించ టానికీ, పుగాకు నమలడం, త్రాగుడు, పశువు లను కోయటంవంటి అలవాట్లను మాన్పి వాళ్లకు సంఘా లేర్పాటు చెయ్యటానికి పూను కొంటాడు. అతడికీ ఉద్యమంలో తన సాటి మనుష్యులు కలిసి రాకముందే వివేకవంతుడైన వాడు, చదువుకొన్నవాడు అయిన రామానాయడు తోడ్పడతాడు. దేశంలో వచ్చే ప్రగతికి ఎవరెవరు తోడ్పడతారో క్రాంతదర్శియై ఉన్నవ వారు చెప్పగలి గారు. ఫలితాన్ని గూడ ఆయన సరిగానే చిత్రించారు. ఏమిటా ఫలితం? తనకున్న ఆస్తిహక్కును, దోపిడీ శక్తినీ ప్రశ్నించిన, కూలీలను సంఘటితపరుస్తున్న సంగదాసును చౌదరయ్యా రాగోల దీసుకొని చావ గొట్టాడు. కేసు రాకుండ డబ్బు సంచులతో తన తాబేదారైన పంతులుతో సంగదాసు 'ఆత్మరోగం'వలన చనిపోయినట్లుగా పంచాయితీ జరిపించి 'మాఫ్' చేస్తాడు. ఈ భూస్వామి కూలీల వ్యవహారంలో ఉన్నవ వారెవరి పక్షం? ఎవరి పక్షమో చెప్పాలంటే నేల కొరిగిన సంగదాసు 'తల దానిమ్మపండువలె బద్ద లయింది. లోకంలోని అక్రమాలను జూచి ఆక్రోశించిన రక్తం, ఉన్నత భావాలను ఉద్రేకించిన రక్తం, పరుల సేవలో పారిపోయిన రక్తం, పవిత్రభావాలచేత పావన మైన రక్తం గొట్టాన జిమ్మినట్లు ప్రవహిస్తున్నది. భూమి పావనమైంది' అని చెప్పిన వర్ణనను తలచు కొంటే చాలు. ఎవరు గెలుస్తారన్నది ఆయన నిర్ణయం? సంగదాసు చివరగా చెప్పిన 'మనం గెలుస్తాం'అన్న మాటలు ప్రశాంత విప్లవవాదులైన ఉన్నవ వారి హృదయంలో నుండి వెలువడినవే.

సంగదాసు తిరుగుబాటు అహింసాత్మకంగాను, కూలీలను విజ్ఞానవంతులనుచేసి వారికి న్యాయం జరిగేవిధంగా వారిని మేల్కొల్పాలనేదిగా ఉండగా సంగని అన్న వెంకటదాసు తత్త్వం విరుద్ధమైనది. అతడూ కాయకష్టం చెయ్యటంలో ఒళ్లు దాచుకోవటం ఎరగని వాడే. ఎంత కష్టపడ్డా కూలీల పొట్టలు ఎందుకు నిండటం లేదో గుర్తించాక అతడు భూస్వామ్య వ్యవస్థను ఎదుర్కోవటానికి దోపిడీ ఒక్కటే మార్గమని తలచి యిల్లు విడిచి వెళ్లిపోతాడు. దోపిడీ తన మార్గమని ప్రకటించే ముందు వెంకటదాసు తన తండ్రితోను, చుట్టపక్కాలతోను తనది ధర్మమార్గమని వాది స్తాడు. 'గరిమెళ్ల గంగరాజు మా గురువు. మాది తిరు మంగయ్య గోత్రం. రుషులు తిరుమంగయ్య, కంచర్ల గోపన్న, సర్వాపాపడు' అని చెప్తాడు. చదువుకోని వెంకటదాసు యింత తెలివిగా వాదించటమేగాక తన నాయకత్వంలో గొప్పసైన్యాన్ని నమ్మిన ధర్మాన్ని విడిచి పెట్టకుండ నిలబడ గలిగిన వేలాదిమందిని తయారు చేస్తాడు. తన సిద్ధాంతాన్ని వివరిస్తూ వెంకటదాసు 'లోకాన్ని పీల్చి పిప్పిచేస్తున్న ధన పిశా చాలను సంహరింపవలె నంటే ధర్మశాస్త్రాలు చాలా తిరిగి వ్రాయవలసి వస్తవి. ఈ ధర్మశాస్త్రాల ఫలితమే యీ ధన పిశాచాలు...యీ పోరు రోజులలో నెలలలో,సంవత్సరాలలోగూడ తెమిలేది కాదు.శతాబ్దాలు పట్ట వచ్చు' అని చెప్తాడు. అతని స్నేహితుడొకడు 'మీ నాయనది సత్యవాక్యం. పితృవాక్య పరిపాలన చేస్తే అందరికీ క్షేమం' అని సలహా చెప్తాడు. వెంకటదాసు 'పితృవాక్య పరిపాలనం శ్రీరాములు వారు

చేసారు. దశరథుఁడు ధర్మమేమీ వదలుకో మనలేదు. అధర్మమేవీ చేయమనలేదు. రాములు స్వార్థ త్యాగం చేయవలసి వచ్చింది. చేశాడు. ధన్యుడైనాడు. ప్రహ్లాదు డెందుకు పితృవాక్య పరిపాలనం చేయలేదు? చేయ టానికి వీలులేకపోయింది. తండ్రి కోరింది కేవల స్వార్థత్యాగం కాదు. ధర్మత్యాగం. ప్రహ్లాదుడు తన ధర్మం విడువలేకపోయినాడు. అందువల్ల బాధలు వచ్చినవి. సహించాడు. వీరందరు ఆయనను ప్రశం సించారు.' అని మిత్రుని సలహాను తృణీకరిస్తాడు. తర్వాత తన వాదనలో దైవాన్ని నిరాదరించి 'నేను వీ రాజుమీదా, దేవుడిమీదా సవాలే. ఉభయుల చట్టాలకూ అతీతుణ్ణి' అని ఆ విధంగావే జీవితం చాలిస్తాడు.

వెంకటదాసు తక్కెళ్ల జగ్గడుగా మారిన తరు వాత జగ్గని ధర్మతత్త్వాలనే పేరుతో ఉన్నవ వారు వ్రాసిన తత్త్వాలు మరపు రానివి. అహింసామూర్తి గాంధేయ సిద్ధాంతాల తోను, ఆచరణలోను నమ్మకం ఉన్నవవారు జగ్గని దోపిడీ విధానాన్ని ధర్మాభిరతినీ ప్రశంసిస్తూ

'కూలికి విలువ గలదని మీరు—గుట్టు తెలుసుకొండి
కూలికి దగిన విలువ పుచ్చుకునె-కూలికి మరి పొండి
నీళ్లకూలికి వొప్పుకుంటిరా—నెనరు చెరుపుకొండ్రు
పనివాండ్లందరు యేకమైతిరా ప్రపంచమే మీది'-

—అని వ్రాయటం ఆయన విశాలహృదయంతో సమసమా జాన్ని కోరే సామ్యవాద వ్యవస్థను సమర్థించ టానికి నిదర్శనం. అంతలోనే ఆచరణకు మాత్రం గాంధీజీ పద్ధతులే శ్రేష్ఠమని తలంచటంచేత గాబోలు

'అసహాయయోగము తరుణము చూచి అవలం బించండి.'

'సమతాధర్మం ప్రపంచమందున స్థాపింతురు గాని కృతయుగధర్మం లోకమంతటా కుదుటపెట్ట గలరు' అని వ్రాశారు.

తక్కెళ్లజగ్గడు ఉరఫ్ వెంకటదాస్సైతే కృత యుగ ధర్మాన్ని కోరడు. ఉన్నవవారిలోని గాంధేయవాది యీ మాటల్ని వ్రాసినట్లనుకోవాలేగాని వెంకటదాసు అనుచరు లీ మాటలను పలికినట్లనుకోలేం.

జగ్గడు ప్రభుత్వానికి దొరికి పోయిన తరువాత కోర్టులో యిచ్చిన వాఙ్మూలం మాక్సిమ్‌గోర్కీ రచించిన 'అమ్మ' నవలలో పావెల్ వాఙ్మూలంవలె చిరస్మర ణీయమైనది. వెంకటదాసును ధీరునిగా చిత్రించి ఉన్నవ వారు తెలుగు సాహిత్యానికి మరపురాని పాత్రను సృష్టించి యిచ్చారు. చారిత్రకంగా జరిగిన అల్లూరి సీతారామరాజు పితూరీ, పలనాటి వీరహనుమంతు తిరుగుబాటు వారికీ పాత్రను తీర్చిదిద్దటానికి, వెంకట దాసు పోరాటాలను కళ్లకు కట్టినట్లుగా వర్ణించ టానికి తోడ్పడివుంటాయి. మరణశయ్యపైన వెంకట దాసు తండ్రితో భగవంతుడు దయామయుడు కాడంటాడు. లోకమంతటినీ పంచమహాపాతక పట్నం చేసిన దేవుడంటూ ఒకడుంటే జనమంతా ఆయన మీద తిరుగబడి సన్మార్గవర్తిని చేయట మవసరం. 'మీ దేవుడు ఆలనాపాలనా లేని పరరాజువలె వున్నాడు గాని జనుల కష్టనిష్ఠురాలు యోచించే స్వదేశీ ప్రభువుగా లేడు. ఎక్కడో స్వర్గంలో వున్నా డంటారు. చేతగాని వాడు అక్కడవుండి యీ ప్రపంచ పాలన యెందుకు నెత్తినబెట్టుకోవాలె? దేశంలో దుర్మార్గ మింత యెందుకు ప్రబలాలె?' నంటాడు. ఈ మాట లనే ఆనాటి బ్రిటీషు ప్రభుత్వానికి, బ్రిటీషు చక్ర వర్తికీ అన్వయించుకొంటే ఉన్నవ వారి కలం ఎంత వాడియైనదో వ్యంగ్య రచనలో ఆయన గొప్పతన మేమిటో తెలుస్తుంది.

రామదాసు వెంకటదాసుకు నచ్చజెప్పబోతూ 'ఆస్తిక్య విషయంలో నీ కభిప్రాయభేద మున్నదనుకో. ఆ పవిత్రనామం స్మరించినందువల్ల నీకు నష్ట మేమున్నది' అని ప్రశ్నిస్తాడు.

'నష్టమా? అది ఆత్మవంచన అవుతుంది. 'బహుధా విభజ్య మప్యేవం ననమేయంతు కస్యచిత్' చేయి విరిగింది—కాలు తెగింది. మిగిలిన మొండాన్ని వేయిగా విభజించినా యెప్పుడూ నా శిరస్సు వంచను. చీలికలు గూడ వంగవు' అని దేహాన్ని త్యజిస్తాడు.

వెంకటదాసు నోటివెంట హిరణ్యకశిపుని మాటలను ఉదహరించటం సమయోచితంగానే గాక ఉన్నవవారు హిరణ్యకశిపుని పాత్ర నే విధంగా అర్థంచేసుకొన్నదీ తెలుస్తుంది. ఉన్నవవారి శిష్యులు ఆమంచర్ల గోపాల రావు గారు 'హిరణ్యకశిపుడు' నాటకం వ్రాయటానికి గురువుగారు చూపిన త్రోవ బాగా ఉపయోగపడింది.

సెటిల్మెంటు ఖయిదీల తోపాటు రామదాసుకు అతని కుటుంబాన్ని జయిలులో పెట్టినప్పుడు ఆనాటి జైళ్లలోని దుర్భర పరిస్థితులను సుదీర్ఘంగా వివరించారు. ఇది నవలా శిల్పాన్ని కొంతవరకు పాడుచేసినప్పటికీ ఆనాడు మన జాతి కెంతో మేలుచేసింది. బానిసత్వంతో బాధలు పడుతున్న ప్రజలకు జైళ్లలో దేశభక్తులు అనుభవిస్తున్న బాధ లేమిటో తెలిసి సానుభూతితో వాళ్ళూ కదిలారు. ఉన్నవ వారు స్వయంగా అనుభవించిన కష్టాలే చాల భాగం వా రీ నవలలో వర్ణించినవి. దేశం స్వాతంత్ర్యం పొందిన తరువాత గూడ జైళ్ల స్థితి గతులు మారవలసినంత మంచికి మారలేదు. జైళ్లు నేరస్థులను మంచి మార్గానికి మార్చలేకపోగా జైళ్లలో జరుగుతున్న దురాగతాలు పత్రికలలో మనం తఱచుగా చదువుతూనే ఉన్నాం. ఉన్నవ వారు జీవించి ఉంటే మళ్లీ కార్యాచరణకు పూనుకొని రచనల ద్వారాను, సత్యాగ్రహాల ద్వారాను కదలి ఉండేవా రనిపిస్తుంది. జైళ్లను గుఱించిన విపులమైన వర్ణన నవలా శిల్పానికి భంగమని తలచేటప్పుడు దేశోద్ధారకులు 'మాలపల్లియందు వర్ణించిన సెటిల్మెంట్లు, జైళ్లు, కోర్టులు, బడులు, పోలీసు, ...రు, సహాయ నిరాకరణము, ధర్మదోపిడులు, స్వరాజ్యము, పని పాటలు, అహింసా ధర్మము మొదలగు విషయములకు సంబంధించిన ఆఖ్యానోపాఖ్యానముల మూలమున మాలపల్లి ఒక మహా భారత మయినది. ఈ విషయముల పరిశీలనము జ్ఞానదాయకము. మాలపల్లి యందలి ప్రతి పుటయందును, భాషయందును, భావముల యందును, రచన యందును నవజీవనోద్యమములు గోచర మగుచున్నవి. చదివిన కొలదియును పాఠకులు నవజీవన సాహిత్య ప్రభావమును గ్రహింపగలరు.' అని చెప్పిన మాటలను మననం చేసుకోవటం మంచిది. ఒక్కొక్కప్పుడు రచయిత బాధ్యతను గుర్తిస్తే సామాన్య లక్షణాలను తృణీకరించే గొప్ప కళాఖండం వెలువడుతుంది—మాలపల్లి అటువంటి కళాఖండం.

హింసాహింసలు విప్లవానికి రెండూ రెండు త్రోవలు. ఉన్నవ వారు అహింసామార్గాన్ని అవలంబించినా నవలలో మాత్రం సంగదాసు, రామదాసులు నడిచిన అహింసామార్గమూ, వెంకటదాసు నడిచిన హింసామార్గమూ రెండూ కూడ మంచివేనని నిపుణంగా చిత్రించారు. ఆయన ఆస్తికులైనప్పటికీ, నాస్తికులు పవిత్రులూ ధర్మమార్గగాములు అయినప్పుడు మెచ్చేవారు. కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరిగారి గ్రంథాలను, సిద్ధాంతాలను ఆయన అభిమానించటమే గాక వారి వాదనలలోని సామంజస్యాన్ని గుర్తించి గౌరవించే వారు.

జ్యోతి అప్పాదాసుల ప్రణయం ఉదాత్తమైనది. పౌలు అనే దుర్మార్గుడు బలాత్కరింప బోగా జోతి కృష్ణలో పడి ఆత్మహత్య చేసుకొంటుంది. అప్పాదాసు 'సహగమనం' చేస్తాడు. జోతిని పూలతో అలంకరించి

'నీకూ నీవారు లేరు నాకూ నావారు లేరు
యేటి వొడ్డున యిల్లు గడదాం పదరా'

అని పాడుతూ కృష్ణలోకి నడిచి వెళ్లిపోతాడు. అప్పుడు కృష్ణ గుసగుసలాడుతూ సంగీతం పాడిందట. ఇంకా పాడుతూనే వున్నదట. ఈ నవల కీ ప్రణయగాథ నిండుదనాన్నిస్తున్నది.

మాలపల్లి నవలలో చెప్పుకోవలసింది ఉన్నవ వారి కృషీవల జీవిత పరిశీలనమూ, తేటతెలుగు మాటలతో జాతీయాలతో నుడికారపు సొంపులతో పల్లీయుల మాటలను సహజంగా రచించటమూ. నిఘంటువులలో సామాన్యంగా కానరానివీ, దేశీయుల సొత్తైనవీ వ్యవసాయదారుల నోళ్లలో నిత్యమూ నలిగేవీ వీరి కలంలో జీవం పోసుకొని నవలలో నాట్యం చేశాయి.

ఆ మాటల అందచందాలను గుర్తించి భద్రపరచుకోవలసిన అవసరం ఎంతైనా ఉన్నది. రేగడి చేలో దుక్కి దున్నుతున్న రామదాసు తలపులతో నవల ప్రారంభమై చేను, దొడ్డి, ఇల్లు, కుటుంబము, బర్రె, గొడ్లకాపరులు—ఇట్లా వరుసగా సుదీర్ఘంగా సాగిన యీ నవల రామదాసు యతియై విజయ కళాశాల కులపతియై పరబ్రహ్మముతో ఐక్యం కావటంతో ముగుస్తుంది. 'ఎద్దుల కెండ తగులుతున్నది. ఇంకా ఒకటి రెండేండ్లకు గాని తుమ్మపీకె యెక్కిరాదనే' రైతు తలపు, బంగారపు రాగిరేకల గుత్తులవలె సొంపు గులుకుతూ కంకులు పచ్చనిసుంకు పోసుకోవటమూ; ఊచ బియ్యమూ, తియ్య దోసకాయల రుచి, మజ్జిగన్నం దాగి చేతులూ, దుత్త కడిగి గుడ్డవుసిమి దుత్తలో వెయ్యటమూ, ఉప్పనీళ్లలో కలిపి తాగిస్తే గేదెలు కట్టటమూ ఒకటేమిటి రచయితకు వ్యవసాయదారుల జీవితంలో అనుభవానికి రాని విషయం లేదు.

వేదాంత విషయాలను లోతుగా చర్చించగలిగిన పరిజ్ఞానం ఉన్నవారు—ఉన్నవవారు. 'ప్రేమ రహితమైన జ్ఞానం చవిటిసేల వంటిది.' అని ఆయనే ఒకచోట చెప్పినట్లు ఆయన జ్ఞానులను, అజ్ఞానులనూ కూడ ప్రేమించారు. పామరులలోనుండి వెలసిన తత్త్వవేత్తలైనవారు వ్రాసిన గ్రంథాలను—వెంకమ్మగారి రాజయోగసారమూ, శేషాచల నాయుడుగారి గురు కీర్తనలూ, శివరామ భాగవతులవారి తత్త్వ కందార్థాలూ, పీరయ్యగారి యేలలూ, సీతారామాంజనేయమూ, బుచ్చయ్యగారి సాధన చతుష్టయమూ, శ్రీరామ శాస్త్రులవారి భక్తియోగము—ఇంకా పోతులూరి వీరబ్రహ్మము, ఎడ్ల రామదాసు మొదలైనవారి తాత్త్విక రచనలను ఉపనిషత్తులూ, పురాణాలూ, భాష్యాలూ, ఇతిహాసాలతో సమానంగా గౌరవించి ఆదరించారు. జానపద గేయాలలో ఉన్న మాధుర్యాన్ని చక్కగా అనుభవించి నవలలో తగిన విధంగా ఉపయోగించారు. 'భారత కృష్ణుడు—భాగవత కృష్ణుడు' అనే విషయాన్ని గూర్చి చర్చించగలిగిన ఐతిహాసిక విజ్ఞానం

వారి కున్నది. ఇంత విపులంగా చర్చలను నడిపించటం పతితలను విజ్ఞానులను చేస్తుందేగాని విసిగింపదు. అక్కరలేనివారు ఆ భాగాలను విడిచిపెట్టి చదివినా నవల గొప్పదనమేమీ తరిగిపోదు. ఉన్నవ వారు శుష్క వేదాంతి కారు. కారు గనుకనే కూలీల కడుపులోని ఆకలిని, ఆ ఆకలిని తీర్చుకోలేక పొద్దుగూకులూ పని చేసి గూడ వాళ్లు రాత్రికి కడుపులో కాళ్లెట్టుకొని పడుకొని, అట్లా పడుకోవటాన్ని మడత కుడుములని పిలుచుకుంటారని తెలిసి, నిలువెల్లా కరిగిపోయి మనలను కదలించిన కరుణామూర్తి ఆయన.

మాల మాదిగలను సంఘంలో తమతో సమానంగా చూడలేక హరిజనులని మహాత్ముడిచ్చిన ముద్దుపేరును ముద్దు ముద్దుగా పిల్చుకుంటూ, తమ అత్యాచారాలను మునుపటిలాగే కొనసాగిస్తున్న ప్రబుద్ధులను చూచినప్పుడు 'మాలపల్లి' నవల నాటి పరిస్థితులేవీ మారలేదనిపిస్తుంది. పరిస్థితులను బాగు చెయ్య జూస్తున్న ప్రభుత్వం గాయాన్ని మాన్పడానికి మందు వెయ్యకుండ, గాయం కనిపించకుండ ఉండాలని రంగు పులుముతున్నట్లున్నది. 'భక్తిమీది వలపు బ్రాహ్మంబుతో పొత్తు బాయలేను నేను బసవ లింగ' అని యీ శతాబ్దంలో గూడ వర్ణభేదాలను పాటించే కుహనా గాంధేయవాదుల్ని చూసినప్పుడు నిజమైన సంస్కర్త, త్యాగమూర్తి, ప్రజాసేవకుడూ లక్ష్మీనారాయణ పంతులుగారు తమ సమకాలికులలో హృదయ పరివర్తనం కొంత కలిగించినా, బ్రిటీషు ప్రభుత్వాన్ని బెదిరించగలిగినా, సంఘం ఎప్పటి మోస్తరుగానే ఉన్నది. బ్రిటీషు ప్రభుత్వం ఉన్నవ వారిని చెఱసాలలో బంధించి, మాలపల్లిని నిషేధిస్తే తరువాత మన ప్రభుత్వం ఆయనను ఉపేక్షించటం ద్వారా మరింత తప్పుచేసింది. 'జాత్యాధిక్యత అహంకారమునకు హేతువగుటచే సవర్ణులు భగవంతునకు దూరమగుచున్నారు. కడజాతివారికి మే మెక్కువను అభిమానముండదు గనుక వారికి ముక్తి సమీపము. సవర్ణులకు అహంకారము ఆ జన్మసిద్ధము. కడజాతికి అనహంకారము జన్మసిద్ధము.' అని ఉన్నవ వారు చెప్పిన మాటలను జ్ఞాపకానికి తెచ్చుకొంటే సవర్ణుల అహం కొంతైనా తగ్గుతుంది. ప్రగతిని కోరేవారూ, సాహిత్యంలో వెలుగును కోరేవారూ లక్షలాది కడజాతివారి గుండె వెతలను విన్పించే 'మాలపల్లి' మన జాతి గర్వించదగిన నవల అని గుర్తింప గలరు.



# భయం

శ్రీ కె. యస్. వి. నరసింహం

చిట్టిబాబుకు పుట్టు మతిమరుపు.

ఆ సంగతి తెలీనివాళ్లు ఆ వూళ్లోనేకాదు, ఆ చుట్టుపక్కల వూళ్లలో కూడా లేరు.

కాశేశ్వరరావుగారి నెరిగిన వాళ్లందరికీ చిట్టిబాబు సంగతి తెలుసు. చిట్టిబాబు మతిమరుపు సంగతీ తెలుసు.

'ఇంతకీ ఈ కాశేశ్వరరావుగా రెవరయ్యా?' అనడుగుతారా?

చంపేశారు.

మీకు కాశేశ్వరరావుగారే తెలీదా? — అయితే మీకు కృష్ణాపురమే తెలీదన్నమాట. కృష్ణాపురం పంచాయితీ సమితిలో కొచ్చే ఆ చుట్టుపక్కల వూళ్ల గురించి కూడా మీకు తెలీదన్నమాట! ఆ వూళ్ల లోంచి ఎప్పుడో ఆర్నెల్లకో సంవత్సరానికో ఒకసారైనా మీవద్దకు వచ్చిపోగల పరిచయస్థులుగాని, బంధువర్గంగాని, ఎవ్వరూ లేరన్నమాట! అయితేనేం?— మీకు కాశేశ్వరరావుగారే తెలీదా? చంపేసి పోయారే! బాబ్బాబూ—ఆ సంగతి ఎక్కడా గట్టిగా అనకండి. నన్ను కాబట్టి ఏదో గుట్టుగా అడిగారు గాని, మరెక్కడా ఈ సంగతి గురించి వాకబు చెయ్యకండి.

కాశేశ్వరరావుగా రెవరంటే ఏమని చెప్పను? ఆయన్ని వర్ణించి చెప్పాలంటే నేను నేర్చిన మాటలు చాలవు. ఆయన వంశవృక్షం ఏకరువుపెడితే, వినే ఓపిక మీకు తప్పకుండా ఉంటుందనే చెప్పగలను— కాని, అసలే శక్తిచాలని నా కలం మధ్యలో అలసటతో ఆగిపోకుండా ఉండదని హామీ ఇవ్వలేను. అందుచేత, అలవిగాని పనుల్లో తలదూర్చకుండా, నా ఓపి నంతమట్టుకు కాశేశ్వరరావుగారిని మీకు పరిచయం చేస్తాను (—అదీ, ఇలా నేను వారిని 'పరిచయం' చెయ్యడానికి సాహసించానని మీరెక్కడా అనకుండా ఉంటారని బాస చేస్తేనే సుమండీ—)

దగ్గరకెళ్లి కొలిచే తెంపరితనం ఎవ్వరికీ లేదు గాని, ఉంటే— కొలిచి, ఆయన ఛాతీ గజమున్నరని చెప్పవచ్చు. ఆరడుగులో— అంతకుపైన మరో అర డుగో—ఎత్తు. పంచాస్యం అనే మాటకి వ్యుత్పత్తితో అర్థం చెప్పేట్టుండే ముఖం. ఆ ముఖం అంతటి లోకీ, ఆ మాటకొస్తే మనిషి మనిషంతటిలోకీ, కొట్టొచ్చినట్టు కనిపించే బొద్దుమీసాలు. నిప్పు కణికల్లాంటి కళ్లు. నడిపావటతో పక్కలకి ఎగదువ్విన తలవెంట్రుకలు. గోచీపోసికట్టిన ఎర్రంచు తెల్లపంచె. పులిచారల పసుపులాంటి రంగులో సిల్కు జుబ్బా. దానిపైన—మడత నలగని సరిగ ఖండువా.— అలా ఉంటారు కాశేశ్వరరావుగారు. ఉంటారు, ఏం చేస్తుంటారు?

తల్లి కడుపులోంచి కాకుండా మరోలా ఎలాగైనా మీరు భూమ్మీదికి రాగలరేమోగాని, కాశేశ్వరరావుగారి భూములు తొక్కకుండా మాత్రం కృష్ణాపురంలోకి రాలేరు. వారి వంశపు వృత్తే వ్యవసాయం. వంశాచారాలను కాశేశ్వరరావుగారు ఎన్నటికీ అతిక్రమించరు. అలాగని ఆయన వ్యవసాయంతో ఆగిపోనూ ఆగిపోలేదు.

కాశేశ్వరరావుగారికి రాజకీయాల పిచ్చి ఉంది. కాని, ఆయన పిచ్చికో పద్ధతి ఉంది. ఆయనకు చదరంగం ఆడడం బాగా వచ్చు; జీవితంలో కూడా. ఆయనకు మంచిపలుకుబడి ఉంది. పలుకుబడిని ఉపయోగించుకునే చాకచక్యం కూడా ఉంది. ఆ సంగతి; ఆయన మొట్టమొదటిసారిగా రాజకీయాల్లో ప్రవే

శించి, రెండు నెలలకల్లా సమితి ప్రెసిడెంట్ పై కూర్చునే సరికే బుజానికి నైంది.

అన్నింటినీమించి, కాశేశ్వరరావుగారిలో ఒక రాజ ఠీవి ఉంది. ఒక దర్పం ఉంది. ఒక కరుకుదనం ఉంది. ఆయన మాటకు వేటకత్తికున్నంత పదును ఉంది; కమాండర్ జనరల్‌గారి తుపాకీ తూటాకున్న పవరూ ఉంది. ఆయనకు అగ్నిహోత్రంలా ధగధగలాడే పెర్సనాలిటీ ఉంది. ముందుకాలంలో చక్రవర్తులన్నా, రాజులన్నా జనం ఎలా భయపడేవారో—ఇప్పుడూ కాశేశ్వరరావుగారంటే అలాగే భయపడతారు, ఆ చుట్టుపక్కల చాలామంది. ఆయన అకారణంగా ఎవ్వరికీ అపకారం చెయ్యరు—అని అందరికీ తెలుసు. అయినా భయం.

ఆయన పేరు చెబితే చాలు, ఎంతగా మారాం చేసే పిల్లలైనాసరే, టక్కున అల్లరి మానుకుంటారు. ఆయన పేరు వినబడితే, పిట్టలు నీళ్లు తాగవు—తాగబోయేవి ఆ ప్రయత్నం మానుకుంటాయి-తాగిన పిట్టలైనా నీళ్లు కక్కేస్తాయి.

—అయ్యా! — వారు, కాశేశ్వరరావుగారు—ఆయన్నిగురించి, ఇహ, ఇక్కడితో ఆపుదాం.

పులుల్ని చూసిన వాళ్లుండొచ్చు. పులి పిల్లల్ని చూసిన వాళ్లుండొచ్చు. కాని, పులి కడుపున పుట్టిన మేకపిల్లని, దానిగురించి వినడమేగాని, ఎవరైనా నిజంగా చూశారా? కాశేశ్వరరావుగారు పులిఅయితే, చిట్టిబాబు మేక.

పుట్టినప్పుడు—మామూలుగా ఉండవలసిన పరిమాణం కన్నా కొంచెం చిన్నగా ఉన్నాడు చిట్టిబాబు. అప్పుడతణ్ణి చూసినవాళ్లందరూ అతణ్ణి చిట్టిబాబు చిట్టిబాబని పిలిచారు. తమ తండ్రిగారైన భుజంగరావు బహద్దరు వారి పేరే కొడుక్కి కూడా పెడదామనుకున్నారు కాశేశ్వరరావు గారు. అనుకోవడమేమిటి?—ఆ నామధేయమే పెట్టారు కూడా. కాని, ఎందుచేతనో ఏమో—చిట్టిబాబుని ఆ పేరుతో ఎవ్వరూ పిలవలేదు. రోజులు గడిచినకొద్దీ అతనికి చిట్టిబాబనే పేరే స్థిరపడిపోయింది. ఈ పద్ధతి నచ్చని కాశేశ్వరరావు గారు, ఇందుకు అడ్డుతగలబోయ్యారుగాని—తరువాత్తరువాత, 'జనవాక్యంతు కర్తవ్యం'—అను కున్నారో ఏమో, తాముకూడా చిట్టిబాబుని చిట్టిబాబనే పిలవడం ఆరంభించారు.

ఇంతకీ మనం ఎక్కడ ఆరంభించాం?—ఓ—మరిచే పోయాను—

'చిటి బాబుకు పుట్టుమతిమరుపు' దగ్గర—అవును —అక్కడ ఆరంభించాం.

అవునౌను, చిట్టిబాబుకు పుట్టుమతిమరుపు!

పుట్టుగుడ్డి వాళ్ళనీ, పుట్టు చెవిటివాళ్ళనీ, పుట్టు అవిటి వాళ్ళనీ—ఎలాంటి వాళ్ళనైనాసరే—మనం కొంచెం ప్రయత్నంమీద వెంటనే తెలుసుకోగలం. కాని, పుట్టు మతిమరుపువాళ్ళని తెలుసుకోవడం ఎలా? అసలు, పుట్టు మతిమరుపు వాళ్ళంటూ ఎవరైనా ఉంటారా?

ఉంటారనడానికి ప్రస్తుతానికి చిట్టిబాబుని మినహాయించి వేరే ఉదాహరణ అవసరం లేదు.

మతిమరుపూ పరధ్యానమూ ఒకటి కావు.

చంటి బిడ్డలందరూ అసలు, పరధ్యానంలో ఉండే వాళ్ళే! కాని, వాళ్ళది మామూలు పరధ్యానం కాదు. 'బొటనవేల ముల్లోకములు చూచి లోలోన—ఆనందపడు నోరులేని యోగి' అని వర్ణించారే—అలా—అది ఒక యౌగికమైన ధ్యానమేకాని, పరధ్యానం ఎంత మాత్రమూ కాదు. నోట్లో బొటనవ్రేలు పెట్టుకుని, ఇంటి పైకప్పుకేసి చూస్తూ, బోసినవ్వులు చిందిస్తూ ఉన్న చిట్టిబాబును చూసిన వాళ్ళందరూ, అందరి బిడ్డల్లాగే అతడూ పరమాత్మ స్వరూపమే అనుకున్నారు గాని; దేవ దేవుడు చిట్టిబాబు రూపంలోఉన్న తన స్వరూపానికి కొంచెం బలహీనమైన జ్ఞాపకశక్తిని పెట్టాడని ఎవ్వరూ అనుమానించలేదు. ఇంకా మాటలైనా తిరగని ఆ పిల్లణ్ణి గూర్చి అలా అనుకోవలసిన అవసరమూ, అవకాశమూ కూడా అప్పట్లో కలగలేదు.

అయితే-అసలు సంగతి ఎన్నాళ్ళని దాగుతుంది? బుడిబుడి నడకల ప్రాయం దాటుతూ దాటుతూ ఉండగానే చిట్టిబాబు మతిమరుపుతనం మెల్లమెల్లగా బయటపడిపోయింది. ఆడుకునే బొమ్మల్లో ఏదో ఒక దాన్ని ఎక్కడో ఒకచోట వదిలి మరిచిపోయే వాడు. మళ్ళీ దానికోసం ఇల్లంతా తిరుగుతూ దుకుతూ ఉండేవాడు. పెద్దలెవరైనా వెతికి అందిస్తే పుచ్చుకుని, వాళ్ళకేసి చూసి కిలకిలా నవ్వేవాడు. అయితే ఆ ధోరణిని చూసి, పిల్లడికి ఇంకా జ్ఞానం పూర్తిగా రాలేదని అనుకున్నారేగాని, దాన్ని మతిమరుపని ఎవ్వరూ అనుమానించలేదు. కాని, ఆ పూళ్ళో స్కూల్లో చేరిన కొద్దిరోజులకే ఆ సంగతి తేట తెల్లమై పోయింది. చదువుల్లోనూ, ఆటపాటల్లోనూ చాలా చురుగ్గా ఉండేవాడేగాని, హఠాత్తుగా ఎప్పుడో ఒకప్పుడు—మతిమరుపుగా ప్రవర్తిస్తుండేవాడు చిట్టిబాబు. టైంటేబిలు చూసికూడా, ఒకరోజు తీసుకు పోవలసిన పుస్తకాలు మరో రోజు తీసుకు పోయేవాడు. ఆటల్లో పడి పుస్తకాల సంగతి మరిచి పోయే వాడు. స్కూలునుంచి ఇంటికి వస్తూ—పెన్సిలో, కలమో, పుస్తకాలో, చెప్పులో—రోజుకు కనీసం ఒకటైనా—స్కూల్లోనే మరిచిపోయి వచ్చేవాడు. కాశేశ్వరరావుగారి యెడల గల భయంవల్ల—మేష్టార్లో, పిల్లలో, బంట్రోతులో—ఆ వస్తువుని మళ్ళీ ఇంటికి తెచ్చి అప్పగించే వారు—'చిన్నయ గారికి మరీ ఇంత మతిమరుపేంటండీ బాబుగారూ!—', అని సాశ్చర్యంగా విన్నవించుకునేవారు.

కాశేశ్వరరావుగారు కూడా చిట్టిబాబుయొక్క ఈ ధోరణిని గమనించక పోలేదు. కాని, విషయాన్ని ఆయన అంతగా పట్టించుకోలేదు. మతిమరుపులేని దెవరికి? మనుషులన్న తరువాత అందరూ అప్పుడు కాకున్నా ఇప్పుడు—. ఒకప్పుడు — పప్పులో కాలేసే వాళే కదా!

అంతే అయితే చిక్కులేదు. కాని,

అందరు మానవుల్లోనూ అంతో ఇంతో ఉండ గల మతిమరుపు చిట్టిబాబులో కొంచెం ఎక్కువగా ఉణ్ణింది. అబ్బాయి గారు పెరిగి పెద్దవారౌతూ వచ్చే సరికి, రోజు రోజుకూ తగ్గడానికి బదులుగా—అది దినదిన ప్రవర్ధమానమౌతూ వచ్చింది.

ఒకసారి కొడుకును కూడా తనతో పొలం తీసుకెళ్ళి, ఏదో పనిబడి ఏదో విషయం—ఇంట్లో చెప్పి రారా—అని పంపిస్తే, ఇంటికైతే వచ్చాడుగాని చిట్టిబాబు—తండ్రి చెప్పమన్న విషయ మేమిటో పూర్తిగా మరిచిపోయాడు. ఇంకొన్ని దినాలకు, దగ్గరి మిత్రులు కొందరితో కలిసి పొరుగూరి సంతకు వెళుతూ, ఇంట్లోంచి పాతిక రూపాయలు తీసుకెళ్ళి, సంతలో డబ్బెవరో కొట్టేశారంటూ ఏడుస్తూ తీరా చూసుకుంటే—ఆ డబ్బు అసలతను తీసుకునే వెళ్ళలేదు—ఇంట్లోనే ఉంది! ఇంకా కొన్నిరోజులకు—టౌన్ హైస్కూల్‌నుంచి శెలవులకు ఇంటికొస్తూ, రైలు దిగి సంచీతో చక్కా ఇంటికొచ్చి, కొంతసేపటికి కెవ్వున కేక వేశాడు—

హోల్డాలు రైల్లోనే మరిచిపోయాడు! అర్జెంటు పనిమీద వెళుతూ, కవర్లలోపెట్టి పోస్టు చెయ్యమని ఒకసారి తండ్రి రెండుత్తరాలు ఇచ్చివెళ్ళగా వాటిని అర్జెంటుగానే పోస్టుచేశాడు చిట్టిబాబు. ఒకరికి వెళ్ళాల్సిన ఉత్తరం మరొకరికి వెళ్ళిందని పదిహేనురోజుల తర్వాతగానీ తెలిసిరాలేదు!

నిన్న సాయంత్రం చేసినపని, ఇవాళ ప్రొద్దునయేసరికి మరిచిపోయి ఉండేవాడు. ఒకరికి ఏదైనా ఒకవస్తువు ఇస్తే, అంతే, ఇంక ఆ సంగతి మరిచిపోయేవాడు, అవసరం వచ్చినప్పుడు ఆ వస్తువుకోసం ఇల్లంతా వెదికి, ఎక్కడో పోగొట్టుకున్నానని అంగలార్చేవాడు. రెండు మూడు పనులేవైనా చెబితే, తప్పనిసరిగ్గా ఏదో ఒకటి మరిచిపోయేవాడు—ఎలా మరిచిపోయావని అడిగితే—'అప్పటికీ నాకు అనుమానంగానే ఉంది—ఇంకా ఏమిటో చెప్పేరు గదా అని, కాని, ఎంతబుర్ర బద్దలు కొట్టుకున్నా ఏమీ జ్ఞాపకం రాలేదు' అనేవాడు.

ఇన్ని సంగతులు మరిచిపోయినా, చదువు విషయంలో మాత్రం మతిమరుపులేదు చిట్టిబాబుకు, క్లాసువెంట క్లాసు ఫస్టున ప్యాసౌతూ కాలేజీ చదువు

పూర్తిచేశాడు. యూనివర్శిటీ మెట్లుకూడా ఎక్కాడు. ఎమ్మేపట్టా పుచ్చుకున్నాడు. 'చదివేదేమో సరదాకి చదివావు—ఇంకేం చేస్తావు? వ్యవసాయం చేస్తావా? ఉద్యోగం చేస్తావా??' అనడిగారు కాశేశ్వరరావు గారు.

కిక్కురుమనలేదు చిట్టిబాబు. తండ్రిముఖం చూస్తేనే గుండెల్లో అదురువస్తుంది. ఆయనమాట వింటే, పిడుగులమోత వింటున్నట్టుంటుంది. అసలే భయస్థుడు చిట్టిబాబు. ఇంక అలాంటి తండ్రి ముందు నిలబడి, నోరువిప్పి మాట్లాడ్డం కూడానా?

కొడుకును వ్యవసాయంలో పెట్టాలను కున్నారు కాశేశ్వర్రావుగారు. 'కాని, చిట్టిబాబు తల్లి అందుకు ఒప్పుకోలేదు. 'ఇంతచదువూ చదివి వృధా చెయ్యడమెందుకు? ఇప్పు డిప్పుడే వ్యవసాయంలో దిగితే సుఖపడ్డం ఏముంది? బస్తీ చదువులు చదివినవాడు—వాడు వ్యవసాయం మాత్రం ఏం చేస్తాడు?—ఎక్కడైనా ఉద్యోగం దొడుకుతుందేమో చూడండి—' అందావిడ.

కాశేశ్వర్రావు గారిక్కూడా లోపల్లోపల అలాంటి ఉద్దేశ్యమే ఉన్నట్టుంది—వెంటనే ఒప్పు కున్నారు. కొడుక్కి ఉద్యోగం దొరుకుతుందేమోనని ప్రయత్నించారు. కాశేశ్వర్రావుగారు ప్రయత్నించడమూ—దొరక్కపోవడమూనా? దొరికింది. కాని, ఎక్కడ?—హైదరాబాదులో. జీతం కూడా చిట్టిబాబు చదివిన చదువు తాహతుకు తగ్గట్లుగానే వస్తుంది.

'హైదరాబాదులో దొరికింది ఉద్యోగం—వెళతావా?', అనడిగారు కాశేశ్వర్రావుగారు.

చిట్టిబాబు ఏమీ మాట్లాడలేదు. తండ్రి పంపిస్తూంటే హైదరాబాదేమిటి—అండమాన్సయినా సరే...ఎదురుచెప్పే దేముంది?

ఆ రకంగా హైదరాబాదు వెళ్లాడు చిట్టిబాబు.

కాని, అతడటు వెళ్లిన వారం రోజులకల్లా చిట్టిబాబు తల్లి కొక అనుమానం పట్టుకుంది. అసలే అది మహానగరం, పైగా కొడుకు మతిమరుపు వాడు. ఏ క్షణాన ఏ ఆపదకు గురి అవుతాడో ఏమో—తల్లి మనసు ఆకులా వణికిపోయింది. మరేం ఫర్వాలేదు- అలాంటి భయమేం లేదు—అన్నారు కాశేశ్వర్రావు గారు. తన భయం తనదంది చిట్టిబాబు తల్లి. కొడుకు క్షేమ సమాచారాలు ఎప్పటికప్పుడు తెలుస్తూ ఉండక పోతే, తను ఒప్పుకోనంది. సరే నన్నారు కాశేశ్వర్రావు గారు. కొడుక్కొక ఉత్తరం రాశారు. పక్షం రోజుల కొకసారి తన క్షేమ సమాచారాలు తెలుపుతూ చిట్టిబాబొక ఉత్తరం రాయాలి. ఏమాత్రం ఆలస్యమైనా, కాశేశ్వర్రావుగారే హైదరాబాదు వచ్చేస్తారు!

తండ్రి మాట జవదాటడు చిట్టిబాబు. అలాగే రాస్తానన్నాడు. అలాగే రాస్తూ ఉన్నాడు. పక్షం రోజులకు కాదు—పదమూడో రోజుకల్లా చిట్టిబాబు దగ్గర్నుంచి ఉత్తరం అందుతోంది.

అంతా ఇలా ఉండగా ఒకనాడేమైందయ్యా అంటే......

*    *

'నమస్కారాలండయ్యగారూ!'..., అన్నాడు ఆ వూరి పోస్టుమాస్టరూ పోస్టుమ్యానూ అయిన వెంకట సుబ్బయ్య.

చదువుతూన్న పేపర్లోంచి తల తిప్పకుండా, తలను అలాగే ఊగించి నమస్కారాన్ని అందుకున్నారు కాశేశ్వర్రావుగారు. చదువుతూన్న 'కాలం' పూర్తిగా పూర్తిచేసి, అప్పుడు తల తిప్పారు.

'ఓ—నువ్వా—ఏమొచ్చాయి ఉత్తరాలు?'—

'చి—చిత్తం. చిత్తూరు ఎమ్మెల్యేగారు కాబోలు—జాబు రాశారండీ...అనంతపురంనుంచి ధనంజయరావు గారు కాబోలు—క్షమించాలి...ఈ గ్రంథం అడ్రస్‌లో అక్షరాలు కొంచెం చెదిరిపోయున్నాయి—వారు రాశారండీ—మదరాసు ఎరువుల కంపెనీనుంచి కూడా ఉత్తరం వచ్చిందండీ...పోతే......కార్డొకటి వచ్చిందండీ...అయ్యొ నా మతిమండా...మరిచేపోయ్యాను...హైదరాబాదునుంచి జాబొచ్చిందండీ...చిన్నబాబుగారు రాశారు—',

వినయంగా వంగి ఉత్తరాలు స్టూలుమీద పెట్టాడు వెంకటసుబ్బయ్య.

'ఎలా ఉంది నీ ఉద్యోగం', అన్నారు కాశేశ్వరరావుగారు.

'బాగుందండీ.. తమ దయ—'

'సరే—మంచిది—'

'చి—చిత్తం—మరి నే నెళ్ళొస్తానండీ—నమస్తే.

వెంకటసుబ్బయ్య వెళ్ళిపోయాడు.

వాలు కుర్చీలోంచి చేయి సాచి ఉత్తరాలు అందుకున్నారు కాశేశ్వరరావుగారు. కొడుకు రాసిన జాబుకాక మిగతా జాబులన్నీ ముందు చదివారు. అలా కొడుకు రాసిన ఉత్తరాన్ని మాత్రం చివ్వరికి కేటా యించడానికి కారణం ఏమిటి? కొడుకు ఉత్తరం కాబటి —తీరిగ్గా చదువుకో వచ్చుననా? పదిహేను రోజులకోసారి వచ్చే మామూలు ఉత్తరమేగా—అందులో కొత్త ఏముంటుందిలే—అనా? కారణం ఏదైనా కావచ్చు; కాశేశ్వరరావుగారు కొడుకు ఉత్తరాన్ని మాత్రం అన్నింటికన్నా ఆఖరుగా చేతుల్లోకి తీసుకున్నారు.

అది కవరు, దానిమీద ముత్యాల్లాంటి అక్షరాలలో కాశేశ్వరరావుగారి పేరూ, చిరునామా వ్రాసి ఉన్నాయి. ఎడమవేపు దిగువన, కొంచెం చిన్న అక్షరాలలో—చిట్టిబాబు పేరూ విలాసమూ ఉన్నాయి. 'ఫ్రం' అడ్రెస్‌ను మిగతా అడ్రస్‌నుంచి విడదీస్తూ చక్కటి వంపులతో బ్రాకెట్టు ఒకటి వేసి ఉంది. కవరువేపు నిమిషకాలం అలాగే చూశారు కాశేశ్వరరావుగారు. కొడుకు దగ్గర్నుంచి జాబువస్తూనే దానికేసి అలా చూడ్డం ఆయనకు అలవాటు, అందమైన ఆ చేతివ్రాత చూస్తే ఆయన కళ్లలో సన్నని గర్వరేఖ కదలాడుతుంది. గుబురు మీసాల వారగా పదునైన చిరునవ్వు మెరుస్తుంది.

కవరును వెల్తురు కడ్డంగా ఎట్టిచూసి, చించారు కాశేశ్వరరావుగారు. కాగితాన్ని చేతుల్లోకి తీసుకుని మడతలు విప్పారు. కళ్ళను అక్షరాలవెంట నడిపించారు.

ఉలిక్కిపడ్డారు.

నుదుటిమీద ప్రశ్నార్థకంగా ముడతలు పడ్డాయి.

మరోమారు కాగితంకేసి చూశారు. కవరుకేసి చూశారు. రెంటినీ రెండు రెండుసార్లు మార్చి మార్చి చూశారు.

ఆయన కళ్లు కుంచించుకు పోయాయి.

కవరుకేసీ, కాగితంకేసీ ఇంకోసారి చూశారు. మెల్ల—మెల్ల—మెల్ల—మెల్ల—గా ఆయన కుడి కను బొమ పైకి లేచింది.

ఏదో అర్థమౌతూన్నట్టు ఆయన తల అప్రయత్నంగా చిన్నగా ఊగింది.

ఆయన పెదవులు అనుకోకుండానే అతికఠినమైన వంపు తిరిగాయి.

తొందర తొందరగా కాగితాన్ని చదివారు కాశేశ్వరరావు గారు—

'డియర్ గిరిజా!—

నీ ఉత్తరం నిన్ననే అందింది. జవాబు రాయడానికి ఇప్పటిదాకా తీరిక దొరకలేదు—Excuse me.

నే నిక్కడ ఒంటరిగా ఉన్నాను. ఎప్పుడూ నువ్వే జ్ఞాపకం వస్తున్నావు. కాలేజీ దినాల్లోనే నయం—మనం రోజూ ఒకర్నొకరు చూసుకుంటూ అయినా ఉండేవాళ్లం. మాటలతో వీల్లేనప్పుడు కనీసం చూపులతోనైనా పలకరించుకుంటూ ఉండేవాళ్లం. ఇప్పుడదీ లేదు.

ఎంత మహానగరంలో ఉన్నా అడివిలో ఉన ట్టుగా ఉంది. ఈ ఉద్యోగం నా పాలిట శాపంలా దాపురించింది. ఏం చెయ్యమంటావు చెప్పు? 'మేఘ సందేశం'లో యక్షుడు అనుభవించిన విరహం ఎంత విషాదంగా ఉంటుందో నా కిప్పుడే అర్థమౌతోంది.

మీ వాళ్లు నీకు సమ్మంధాలు చూస్తున్నారని

రాశావు. ఆ సమ్మంధాల నన్నింటినీ కొట్టిపారెయ్యడానికి నువ్వెన్ని అవస్థలు పడుతున్నావో తలుచుకుంటే నాకు చాలా బాధ కలుగుతోంది. మన విషయం మీ అమ్మా నాన్నలతో నువ్వింకా చెప్పలేదా? వీలు చూసుకుని చెప్పగలవేమో ప్రయత్నించు—

నీ విషయం ఇంత చెప్పినా, నా సంగతి కొచ్చే సరికి కథ మొదటికి వస్తుంది. మా నాన్నగారి విషయం నీకు చెప్పానుగా—ఆయన ముక్కోపి. ఆయనతో ఏం మాట్లాడాలన్నా నాకు భయంగా ఉంటుంది—

వెంటనే ఉత్తరం రాయగలవు. నేను జాబు రాయలేదని నువ్వు లేటు చెయ్యకు. నీ దగ్గర్నుంచి జాబు రాకపోతే నాకు పిచ్చెత్తినట్టుగా ఉంటుంది.

నీ,

చిట్టిబాబు.

ఒకసారి, రెండుసార్లు, మూడుసార్లు—ఆ ఉత్తరాన్ని అలా ఎన్నిసార్లు చదివారో తెలీదు—కాశేశ్వరరావు గారి ముఖం ఎర్రగా ఎర్రబడి పోయింది. కళ్లు మరీ పెద్దవై భీకరంగా తయారయ్యాయి. ముఖంలో ఆవేశంతో కూడిన వణుకు ప్రారంభమైంది.

వాలు కుర్చీలోంచి దిగ్గుమని లేచారు కాశేశ్వరరావుగారు. కాగితాన్ని పట్టుకున్న చెయ్యి అప్రయత్నంగా బిగిసింది.

బోనులో పులిలా, నడవలో అటూ ఇటూ తిరుగుతున్నారు కాశేశ్వరరావుగారు.

ఆయనవేసే అడుగు అడుగుకూ నేల బెదిరి అదురుతోంది.

సూర్యుడు నడినెత్తి కొస్తున్నాడు.

కాశేశ్వరరావుగారిలో క్రోధం సలసలమని కాగుతోంది.

ప్రక్కగదిలోకి వెళ్లబోతూ ఇటు వచ్చింది చిట్టిబాబు తల్లి. భర్తవైఖరిచూసి ఆశ్చర్యపోయింది. ఎంతో ప్రమాదకరమైన విషయమైతే తప్ప, అలా పచార్లు చెయ్యడం ఆయనకు అలవాటు లేదు. ఆ సంగతి ఆమెకు బాగా తెలుసు.

ఇప్పుడేం ప్రమాదం జరిగింది?

—ఆమె ఊహకు అందలేదు.

భర్తను అడగడానికి ఆమెకు ధైర్యం చాల్లేదు. నిశ్శబ్దంగా ప్రక్కగదిలోకి వెళ్లబోయింది.

'ఇదిగో—'

ఆయన గొంతువిని ఆమె ఆగిపోయింది.

'చూశావా సుపుత్రుడు చేసిన ఘనకార్యం?- ఉద్యోగం ఎంత చక్కగా వెలగబెడుతున్నాడో—చూడు—' ఉత్తరం భార్య చేతుల్లో పెట్టారు కాశేశ్వరరావుగారు.

ఆశ్చర్యపోతూ ఉత్తరం అందుకుని, మొదటి నుంచి చివరిదాకా చదివింది చిట్టిబాబు తల్లి.

ఆమె ముఖం తెల్లగా పాలిపోయింది. నమ్మకం లేని తనాన్ని సూచిస్తూ ఆమె కళ్లు పెద్దవై పోయాయి. ఆమె కంఠం రుద్ధమైపోయింది—'బాబు—మనబాబు—మనబాబు— ఇది రాశాడా?—ఇంతకీ—ఈ పిల్ల ఎవరు?—అసలీ ఉత్తరం—మీ కెలా వచ్చింది?'

'రావాల్సి ఉండే వచ్చింది—ఆ వెధవ మతి మరుపే ఈ ఉత్తరాన్ని మనకు పంపించింది...వాడికిది అలవాటేగా—మనకు రావాల్సిన ఉత్తరం ఆ పిల్లకు వెళ్ళుంటుంది...ఆ పిల్లకు వెళ్ళాల్సిన ఉత్తరం మన కొచ్చింది. వెధవ—వెధవ—చూశావా, ఏం రాశాడో ఆ పిల్లకు? నేనట—ముక్కోపినట...', కాశేశ్వరరావు గారి ముఖం రౌద్రంగా తయారైంది.

చిట్టిబాబుతల్లి భయపడింది—'అయితే ఇప్పుడు-ఇప్పుడేం చేద్దామంటారు?'—

ఊపిరి బిగించారు కాశేశ్వరరావు గారు. అప్రయత్నంగా ఆయన పళ్లు పటపట లాడాయి.

'ఏం చెయ్యాలా? చేస్తాను—ఆ వెధవని ఇక్కడికి పిలిపించి, ఇదుగో—ఇదే దూలానికి కోదండం వేయిస్తాను—నా కడుపున చెడబుట్టాడు — ఉద్యోగం చెయ్యరా అని పంపుతే ప్రేమకలాపాలు చేస్తాడూ—రానీ చెపాను—'

'ఏమండీ...'

ఏదో అనుమానం వచ్చినట్టు ఆగారు కాశేశ్వర్రావుగారు. భార్యకేసి హెచ్చరికగా చూసి అన్నారు—'ఇదుగో—ఇప్పుడే చెబుతున్నాను—వాడిక్కడికి రాగానే—ఈ ఉత్తరం సంగతీ, నే నసలు వాణ్ణిక్కడికి ఎందుకు పిలిపించానో ఆ సంగతీ—ఏమీ చెప్పకు — వాడంతకు వా అడిగినాసరే—నాకు తెలీదను—అంతే—'

భర్త మాటంటే రాజాజ్ఞకన్నా ఎక్కువని చిట్టిబాబు తల్లికి తెలుసు, భర్తకేసి బేలగా చూసి, 'అలాగే—', అని, అక్కణ్ణుంచి వెళ్ళిపోయింది ఆమె.

ఆ మధ్యాహ్నమే చిట్టిబాబు పేర ఒక అర్జంట్ టెలిగ్రాం వెళ్లింది.

*　　　*　　　*

బండీ ఆగిన చప్పుడు వినిపించగానే వాకిట్లోకి ఎదురువెళ్లింది చిట్టిబాబు తల్లి. బండి దిగి వస్తూన్న కొడుకును చూడగానే, 'వచ్చావా నాయనా!—', అంది విప్పారిన ముఖంతో?

'ఏమిటమ్మా—అర్జెంటుగా రమ్మని టెలిగ్రాం ఇచ్చారు?—'

ఆ మాటతో, మౌనంగా లోపలికి నడిచింది తల్లి.

చిట్టిబాబు ఆమె వెంటే నడిచాడు. ఏమిటమ్మా మాట్లాడవు ఇంతకీ, ఏమైందమ్మా ఇక్కడ?...'

నేరుగా వంటింట్లోకి నడిచింది తల్లి. 'అవన్నీ తరువాత మాట్లాడుదాం—ముందు నువ్వెళ్లి స్నానం చేసిరా—'

'అదేమిటమ్మా—అర్జెంటుగా రమ్మని టెలిగ్రాం ఇచ్చి—'

'ఆ సంగతులన్నీ నన్నడుక్కు — కాస్సేపట్లో మీ నాన్నగారొస్తారు – వారినే అడుగు.

చిట్టిబాబు వంటింటి గుమ్మంలోంచి కదల్లేదు.

తల్లి అతడి ముఖంలోకి చూసింది.

అమాయకమైన ముఖం చిట్టిబాబుది. అమాయకమైన కళ్ళు. ప్రయాణపు అలసట తెరవెనుకనుంచి దోబూచు లాడుతూన్న ముఖంలోని కాంతి—అంత ఆశ్చర్యకరమైన పరిస్థితిలో అతనున్నా కూడా, అతని పెదవులమీద, చిన్నపిల్లలు నిద్రలో నవ్వే నవ్వు లాంటి నవ్వు—

'ఏమిటమ్మా—అలా చూస్తావు'...?

'ఏమీ లేదు నాయనా—వెళ్ళు–వెళ్లి గిరం స్నానం చేసిరా—వేడివేడిగా అన్నం తిందువు గాని—'

అన్నం తిని, మేడమీది తనగదిలోకి వెళ్లిపోయాడు చిట్టిబాబు.

ఎండ కరకరలాడి పోతూండగా ఇంటి కొచ్చారు కాశేశ్వర్రావుగారు—'వాడొచ్చాడా?'

అడుగుతున్నది చిట్టిబాబు గురించేనని తల్లికి తెలుసు. వచ్చాడని చెప్పింది.

భోం చేశాడా?

చేశాడంది.

మౌనంగా భోజనం ముగించి లేచారు కాశేశ్వర్రావుగారు. నడవలో, విక్రమార్క సింహాసనంలా గంభీరంగా ఉన్న వాలుకుర్చీలో కూచున్నారు—'పిలు వాణ్ణిలా—'

వెళ్లి పిలిచొచ్చింది తల్లి.

'నువ్వెళ్లవతలికి—'

ఆమె అక్కణ్ణుంచి వెళ్లిపోయింది.

గుమ్మం దగ్గర నిలుచుని ఉన్నాడు చిట్టిబాబు.

'రారా లోపలికి—'

'వచ్చాడు చిట్టిబాబు.

'ఇక్కడ మేమంతా ఉన్నామనుకున్నావా—చచ్చామనుకున్నావా?'

'నాన్నా!!!'—

'నోర్ముయ్! — ఎవరా గిరిజ?' గద్దించారు కాశేశ్వర్రావు గారు.

ఉలిక్కిపడ్డాడు చిట్టిబాబు. ఎర్రటి అతని ముఖం తెల్లగా పాలిపోయింది. భయంతో కళ్లు బెదిరాయి. 'ఏ—ఏమిటి నాన్నా?' అన్నాడు తడబడుతూ.

'గిరిజ ఎవరూ అనడుగుతున్నాను—'

'గిరిజ— గిరిజ ఎవరు నాన్నా?'

'నన్నా అడుగుతావు? గిరి జెవరో తెలీకుండానే గిరిజకు ఈ ఉత్తరం రాశావు(టాఫూల్!' రౌద్రంగా అరిచి, కాగితాన్ని చిట్టిబాబుకేసి విసిరారు కాశేశ్వర్రావుగారు.

ఉత్తరంచూసి నిర్ఘాంతపోయాడు చిట్టిబాబు.

'మాట్లాడ వేంరా ఇడియట్'—

'నాన్నా—ఇది—ః

'నా చేతికెలా వచ్చిందా? రావాల్సిండే వచ్చిందిరా రాస్కెల్! కనిపెంచిన వాళ్ల కంట్లో కారం కొట్టి పోదామనుకున్నావు కదూ?—భగవంతుడు లేడూ పైన?—వాడే చేయించాడు నీచేత ఈ పని— మతి మరుపు వెధవా—నీ ఘనతను నీ చేతులారా నువ్వే నాకు తెలియజేశావు—చెప్పు-ఎవరా గిరిజ?'—

తల వంచుకున్నాడు చిట్టిబాబు—'ఎం. ఏ చదివేప్పుడు—'

'నీతో కూడా చదివి అఘోరించిందా?'

'అ—అవును...'

'ఎన్నాళ్లుగా సాగుతోందీ వ్యవహారం?—'

'నాన్నా!...'

'అడిగిందానికి బదులు చెప్పు—'

'అంతకుముందు, కాలేజీలో కూడా—'

'పూసుకుతిరిగేవాళ్లన్న మాట—ఇద్దరూ కూడబలుక్కునే ఎమ్మేలో చేరారన్న మాట — ఏ ఊరు వాళ్లది?'

'విజయవాడ—దగ్గర—'

'వాళ్ల నాన్నెవడు?-

'తెలీదు—'

'పోనీ—ఏం చేస్తుంటాడు?

'తెలీదు—'

ఆస్తిపాసు లున్నాయయా?'

'తెలీదు—'

'వాళ్ల కుల మేమిటి?'

'తెలీదు—'

'ఆ పిల్ల చెప్పలేదా?'

'అవన్నీ నేను—అడుగలేదు—'

'ఇంకేం అడిగావు?—'నన్ను ప్రేమిస్తావా?', అనడిగావా? అది ప్రేమిస్తానందా? ఇద్దరూ ఇలా బరితెగించి ప్రేమలేఖలు రాసుకుంటున్నారా? స్కాండల్—స్కాండల్—నిన్నూ ఆ పిల్లనూ నిలబెట్టి గుండెట్టి పేల్చేస్తాను — అసలిదంతా ఆ పిల్లవల్ల జరిగింది. ఎర్రగా బుర్రగా ఉన్నాడూ, తండ్రికి ఒక్కగా నొక్క కొడుకూ, వెనకాల కొండంత ఆస్తీ—అని తెలివిగా నీ చుట్టూ వలవేసింది—'

'ఆమె—అట్లాంటిది—కాదు నాన్నా—'

'షటప్—నిన్నగాక మొన్న కళ్లు తెరిచిన గుడ్డువి—ఆడపిల్లలెల్లాంటివాళ్లో నువ్వు నాకు చెబుతావు(టా— అదేం కుదరదు—ఒరే — నేనిదే చెబుతున్నాను—ఆ పిల్ల సావాసం ఇంతటితో మానెయ్యి—ఆ పిల్ల సంగతే మరిచిపో—'

'క్షమించండి—నాన్నా — నాకది చేతగాదు—', తలవంచుకునే చెప్పాడు చిట్టిబాబు.

'ఏమిటీ!—', గుడ్లురిమారు కాశేశ్వర్రావుగారు.

'అవున్నాన్నా—నేను— ఆమెను— మరిచిపోలేను'

'ఏమిటా నువ్వనేది? — బుద్ధున్నమాటే మాట్లాడుతున్నావా?— బాగా ఆలోచించే మాట్లాడుతున్నావా? నువ్విప్పుడు మాట్లాడుతున్నది ఎవరితోనో తెలిసే మాట్లాడుతున్నావా?—నేనే గనక ఒకసారి ఒకమాట అన్నానంటే—అంతే—హరిహర బ్రహ్మాదులైనా మార్చలేరు—నువ్వాపిల్లను మరిచిపోవాలి—

మరిచి పోయి తీరాలి — లేకుంటే — లేకుంటే నేనేం చేస్తానో తెలుసా?'—

తలవంచి నేలచూపులు చూస్తూనే ఉన్నాడు చిట్టిబాబు—'ఇంట్లోంచి వెళగొడతారు. మీ ఆస్తిలోంచి చిల్లిగవ్వకూడా నాకు రాకుండా చేస్తారు— అంతే గా?'—

నడవనడవంతా నవ్వుతో దద్దరిల్లిపోయింది.

హఠాత్తుగా నవ్విన నవ్వు, ఇంకా నవ్వుతూనే ఉన్నారు కాశేశ్వర్రావుగారు—

నివ్వెరపోయి తలెత్తాడు చిట్టిబాబు.

చిట్టిబాబు కళ్లలోకి చూశారు కాశేశ్వర్రావుగారు—

తికమక పడిపోయాడు చిట్టిబాబు.

నవ్వు ఆపి అన్నారు కాశేశ్వర్రావుగారు—

'అలా చెయ్యరా ఫూల్ – మర్యాదగా నువ్వు ఆ పిల్లను మరిచిపోకపోతే—ఏం చేస్తానో తెలుసా?— ఏం చేస్తానంటే—వెర్రి నాగన్నా—నువ్వాపిల్లను మరిచిపోకపోతే– ఆ పిల్లతోనే నీ పెళ్లి జరిపిస్తాను!!'–

'నాన్నా!' అన్నాడు చిట్టిబాబు తన చెవులను తానే నమ్మలేనట్లు.

ఇంకా నవ్వుతూన్నారు కాశేశ్వర్రావుగారు. నవ్వు ఆపి అన్నారు—'కాశేశ్వర్రావు మాటంటేమాటే— మాకు తెలీకుండా ఆ పిల్లను ప్రేమించిన నేరానికి, ఆ పిల్లనే ఇచ్చి నీకు పెళ్లి చెయ్యడమే సరైన శిక్ష— ఏమే—విన్నావా?'

భార్య ఇంతసేపూ తలుపు చాటున ఉందని కాశేశ్వర్రావుగారికి తెలుసు. ఆమె ఇవతలికి వచ్చింది. వచ్చి, కొడుకు తలమీద చెయ్యివేస్తూ, నవ్వింది.

'అమ్మా—నేను 'మరి—విజయవాడవెళ్లి—', అన్నాడు చిట్టిబాబు మెల్లిగా—

ఆ మాట కాశేశ్వర్రావుగారికి వినపడింది – 'ఏమన్నాడే వీడు—చేసిన ఘనకార్యం చాలదూ— సిగ్గులేక ఇంకా ఆడపిల్ల వాళ్లింటిమీద పడతాడా?— అట్టే మాట్లాడితే గుండెట్టి పేల్చేస్తాను—ఆ పిల్ల తండ్రిగారి అడ్రసిలా ఇవ్వమను—'

*  *

అయ్యో! ఆ తరువాత జరిగిన కథ చెప్పవలసిన అవసరం కూడా అట్టే లేదు.

కాశేశ్వర్రావుగా రిచ్చిన తీగటపా చూసుకుని రెక్కలు గట్టుకునొచ్చి వాలాడు విజయవాడనుంచి గిరిజ తండ్రి. మూడే ముక్కల్లో వ్యవహారం ఫైనల్ అయిపోయింది. పెళ్లి ఖర్చులు యావత్తూ కాశేశ్వర్రావుగారే భరించి వారి స్వగ్రామంలోనే స్వగృహంలోనే పెళ్లి జరిపించ నిశ్చయించినారు. పెళ్లికి సుముహూర్తం కూడా నిశ్చయించడం జరిగిపోయింది.

కాశేశ్వర్రావుగారింటి పెళ్లంటే మాటలా?

దేశం నలుమూలలకీ—మీగడతో చేసినట్టున్న కాగితంమీద, బంగారపు అక్షరాలతో, పసుపురాసిన కొసలతో, పెళ్లి పిలుపులు వయ్యారంగా వెళ్లాయి. పెళ్లి ఏర్పాట్లకోసం ఎలా లేదన్నా ఎంత కాదన్నా నూరు—నూటయాభైమంది నెలరోజులపాటు అహోరాత్రాలూ శ్రమించారు. కృష్ణాపురం అంతా పందిళ్ల ఊరైపోయింది. ఊళ్లో చిన్నా పెద్దా అంతా కలిసి తలో చెయ్యీ వేశారు. కాశేశ్వర్రావుగారింటి పెళ్లంటే— ఊరంతటి శుభకార్యమే — ఊరంతటికీ వేడుకే అయింది.

పట్నంనుంచి నాటకాలవాళ్లు వచ్చారు. మ్యాజిక్ షోలవాళ్లు వచ్చారు.

కూచిపూడినుంచి, నాజూకుల దొరసానుల్లైన నట్టువకత్తెలూ వచ్చారు.

విపులమైన నెన్నుదుటిమీద విభూతికట్లు దాల్చి తంజావూరునుంచి మహానాదస్వర విద్వాంసులు వచ్చారు.

వైణికులు, వైణవికులు — అహో ఒక్కరేమిటి- సకలసంగీతసాగరం సమ్మోహనకరంగా తర్లి వచ్చింది.

పెళ్లి మూడురోజులైతే, పెళ్లివేడుకలు పదిహేను రోజులు జరిగాయి.

ఆ అన్నిదినాలూ కృష్ణాపురంలో వేరే పొయ్యి రాజుకోనవసరం లేకపోయింది — భోజనాలు, అల్పాహారాలు, మృష్టాన్నాలు, పిండివంటలు, పాయసాలు, చిత్రాన్నాలు, మైసూరీ వంటకాలు— ఓహో — ఒక టేమిటి—మహావైభవంగా వడ్డించారు. పెళ్ళిభోజనం ఆరగించనివాడు దురదృష్టవంతుడు, ఆరగించి గ్రురున త్రేన్చనివాడు పాపాత్ముడు.

ఇక పెళ్ళిపందిళ్లు, మంటపాలు, ఊరేగింపులు - ఆ మాట చెప్పేదేముంది?

ఏ వంక జూచినా పువ్వులు—ఏ చాయ జూచినా సుగంధాలు—

పందిరి గుంజలకు కట్టిన పచ్చికొబ్బరి మట్టల వింత వాసనలతో గాలిగాలంతా పరిమళించి పోయింది.

ఇంక ఆ పెళ్ళికూతురూ—ఆ పెళ్ళికొడుకూ—

మధుపర్కాలతో వాళ్లను చూసేందుకు రెండు కళు కావుకదా—రెండు రెండువందల కన్నులైనా చాలవు......

ఆహా—వధూవరులంటే వాళు —ఈడూ జోడూ అంటే అదీ—

పెళ్లి వేడుకలు జరిగినన్ని దినాలూ కృష్ణాపురం స్వర్గంలో ఒక భాగంగా వెలిగిపోయింది.

ఏ నోటవిన్నా ఆ పెళ్ళి ముచ్చటే!—ఏ మాట విన్నా ఆ పెళ్లి గురించి అచ్చటే!!—

ఇటువంటి పెళ్లి అటు మూడు తరాల దాకా ఎన్నడూ ఈ గడ్డమీద జరగలేదన్నారు.

ఇలాంటి పెళ్లి ఇటుమూడు తరాల దాకా ఇక జరగదు కాక జరగదన్నారు.

పెళ్లి వైభవాన్నంతా సగర్వంగా చూస్తూ, తీవిగా మీసం మీద చేయివేసి దువ్వుకున్నారు కాశేశ్వరావుగారు.

పెళ్లి తర్వాత మూడు నిద్రలూ అయాక. భార్యతో హైద్రాబాదుపెళ్లి కొత్త కాపురంపెట్టాడు చిట్టిబాబు. అటు తర్వాత మూడు రోజులకే కొడుకు దగ్గర్నుంచి ఒక ఉత్తరం అందుకున్నారు కాశేశ్వర్రావు గారు.

'పూజనీయులైన తండ్రిగారికి—

తమ ప్రియపుత్రుడు అనేకానేక నమస్కారములుచేసి చాయంగల విన్నపములు—

నేమున్నూ మీ కోడలు చి॥ సౌ॥ గిరిజయున్నూ క్షేమముగా హైదరాబాదు చేరినాము. క్రొత్తఇంటిలో మాకు ఏ ఇబ్బందులున్నూ లేవు. అంతా సౌకర్యంగా ఉన్నది.......................................................

.........................................................

నా మతిమరుపే మీకు నా ప్రేమ రహస్యాన్ని వెల్లడి చేసింది. కాని, మీరు క్షమిస్తారంటే, ఒక్క సంగతి మనవి చెయ్యడానికి సాహసిస్తాను—ఆ వేళ చి॥ సౌ॥ గిరిజకు నేను వ్రాసిన జాబు—మీకు చేరడంలో... నా మతిమరుపు ఏమీలేదు...అప్పుడు దాన్ని నేను కావాలనే మరిచిపోయినాను...'



# తెలుగులో ఉన్నత విద్యాభ్యాసం

డా. గవరసాన సత్యనారాయణ

ఇటీవల ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము డిగ్రీ తరగతులలో తెలుగును బోధనభాషగా ప్రవేశపెట్టింది. పలువురు విద్యార్థులు, విద్యాధికులు, అధ్యాపకులు ఈ చర్యను నిరసించారు. ఆలోచనా పద్ధతుల్లో సులువులు, భావప్రకటనలో మెలకువలు, మాటలు పలకటం మొదలుపెట్టిన దగ్గరనుండి ప్రారంభమవుతాయి. మాతృభాషలో తీర్చిదిద్దబడిన ఆలోచనా రీతులు విద్యాభ్యాసంతో మరింత బలపడతాయి. ప్రైమరి, సెకండరి విద్యాదశలలో మాతృభాషలో విద్యాభ్యాసం చేసిన వారికి యూనివర్సిటి స్థాయిలో పరభాషలో బోధన సాగిస్తే, వెనుక నేర్చుకొన్నదంతా మూలపెట్టి, కొత్తభాషలో ప్రావీణ్యం సంపాదించి, పాఠ్య విషయాలను తిరిగి నేర్చుకోవాలి. పరభాషను నేర్వటంలో కొన్ని సంవత్సరాలు ధారపోయాలి. ఈ పరభాషా భారం క్రింద ఎన్ని సున్నితమైన మేధలు క్రుంగిపోయాయో ఎవరికి ఎరుక?

## ప్రపంచపు పోకడ

సాంకేతికంగా అభివృద్ధిచెందిన దేశాల్లో అన్ని స్థాయిలలోను మాతృభాషలో విద్యాబోధన చేస్తారు. మనదేశంలో వలెనే సోవియటు రష్యాలోకూడా చాల భాషలున్నాయి. రష్యను భాష అందరు నేర్చుకొన్నా, కొన్ని భాషల్లో (యుక్రేనియను, బైలోరష్యను) ఈనాటికి సైన్సు, సాంకేతిక విషయాలను యూనివర్సిటి స్థాయిలోను బోధిస్తారు. రెండవ ప్రపంచయుద్ధంలో ఓడిన తర్వాత బలాన్ని పుంజుకుని ముందంజవేసిన జపాను, జర్మనీలలో విద్యార్థులు మాతృభాషలోనే విద్యాభ్యాసం గరుపుతారు. ఆంగ్లం, రష్యను, జర్మనుభాషలలో ఉన్నతస్థాయిలో సాంకేతిక, విజ్ఞాన సాహిత్యాలున్నాయి. అందువల్ల ఆ భాషలను బోధనాభాషలగా పరిగ్రహించి మాతృభాషను మూలపెట్టవలసిన అవసరంలేదు. అలా అని పరభాషలను విడువరాదు. గత యాభై సంవత్సరాలలో సోవియటురష్యా సాధించిన సాంకేతిక విజయాలను చూస్తే నేడు సైన్సు విద్యార్థులు రష్యను భాషను నేర్వవలసిన అవసరం ఎంతైనా ఉంది. ప్రపంచంలో గ్రంథస్థమయిన విజ్ఞానం చాలవరకు ఆంగ్లంలో లభిస్తుంది. అంతర్జాతీయ వాణిజ్యానికి, దౌత్యకార్యకలాపాలకు, శాస్త్రపరిశోధకులకు ఆంగ్లభాషతోపాటు ఫ్రెంచి, జర్మను, స్పానిషు, అరబిక్ భాషలు వచ్చితీరాలి. సర్వతోముఖముగా భారతీయులు విజయాన్ని సాధించాలంటే పరభాషలన్నిటిని నేర్పుటకు అవకాశాలు కల్పించాలి. పరభాషలతో సంపర్కము లేనిదే ఏ భాష ఆధునిక విజ్ఞానావసరాల దృష్ట్యా అభివృద్ధి చెందదు.

## కంఠస్థం-అర్థగ్రహణ లోపం

చెప్పిన పాఠం అర్థం చేసుకొనుటకు మాతృభాష ఉపయోగపడినంత పరభాష ఉపయోగపడదు. పరభాషలో చెప్పిన పాఠాలు అర్థంకాక కంఠస్థం చేయుట జరుగుతున్నది. వెనుకటికి ప్రొఫెసరు జె. బి. యస్. హాల్డేను కలకత్తాలో నివసిస్తున్న రోజుల్లో వేదపన్నాలు వల్లించినట్లు రసాయన సూత్రాలను, రసాయన క్రియలను విద్యార్థులు వల్లించి కంఠస్థం చేస్తున్నారని చెప్పారు. సృష్టి రహస్యాలను అర్థం చేసుకుని ఆనందించే బదులు, పరభాషలో సూత్రీకరించిన సిద్ధాంతాలను కంఠస్థం చేయుటలో ఆపసోపాలు పడుతున్నారు.

## పరభాష ఎవరికోసం?

శ్రామికులు, వ్యవసాయదారులు, వృత్తివ్యాపారాలు చేసుకునే వారికి కావలసింది వృత్తి విద్యలో నైపుణ్యం కాని పరభాషలో ప్రావీణ్యంకాదు. వీరికి కావలసినదల్లా పరభాషల్లో ఉన్నవిజ్ఞానం. ఈ

విజ్ఞానాన్ని ప్రజలకు అందచేసే బాధ్యత విశ్వవిద్యాలయాలు వహించాలి. పరభాషను నేర్చుకొనుటకు వెచ్చించే శ్రమను, కాలాన్ని, వృత్తివిద్యాభ్యాసంలో ఉపయోగిస్తే డిగ్రీ పుచ్చుకున్న యువతీ యువకులు నిరుద్యోగులు కానక్కరలేదు.

## తెలుగు డిగ్రీలు–ఉద్యోగాలు

తెలుగులో డిగ్రీ తీసుకున్న విద్యార్థులకు పరరాష్ట్రాల్లోనూ, పరదేశాల్లోనూ ఉద్యోగాలు దొరుకుతాయా అన్నది చిక్కు ప్రశ్న. ఇంగ్లీషు మీడియంతో డిగ్రీలు పుచ్చుకున్న ఆంధ్రులు పరరాష్ట్రాల్లో ఎంత మంది పనిచేస్తున్నారు? ప్రాంతీయ భాషరానిదే ఆయా రాష్ట్రాల ప్రభుత్వాలు ఆంగ్లభాషలో పట్టభద్రులయిన ఆంధ్రులకు ఉద్యోగాలు ఇస్తున్నాయా? నిరుద్యోగ సమస్య తీవ్రంగాఉన్న ఈ రోజుల్లో ఏ భాష నేర్చినా ఉద్యోగం రాదు. ప్రాంతీయ భాషలను రాష్ట్ర ప్రభుత్వ కార్యకలాపాలకు వాడుతున్న ఆంధ్రేతర రాష్ట్రాలలో ఆంధ్రుల ఉద్యోగావకాశాలను పెంపొందించదలచుకొన్నవారు హిందీ, తమిళం, కన్నడం, బెంగాలీ మొదలగు దేశభాషలను బోధించే ఏర్పాటు చేయాలి. ఈ భాషలను ఉన్నత పాఠశాలల్లో ఆప్షనలు సబ్జక్టుగా బోధించవచ్చును. లేదా యావద్భారతంలోను ఉద్యోగులకు ఆయా ప్రాంతీయ భాషలను నేర్పే అవకాశం కల్పించాలి. అధునాతన పరికరాలతో భాషలను నేర్వ వీలున్నరోజులివి.

## గాంధీ ఉవాచ

గాంధి మహాత్ముడు ఫిబ్రవరి ఒకటి 1942 'హరిజన్' సంచికలో ఇలా వ్రాసాడు. 'జపానులో ఏమి జరిగిందో మీ కందరకు తెలుసు. జపాను దేశం గొప్ప దేశమని నేను అనుకోకపోయినా, పశ్చిమ రాజ్యాల బలాధిక్యాన్ని ఎదుర్కో గలిగింది. జపాను పాఠశాలల్లో బోధన భాష ఆంగ్లభాష కాదు—జపానీసు మాత్రమే. జపానీసు అక్షరమాల క్లిష్టమయినా, తేలికయిన రోమను అక్షరాలను గ్రహించలేదు. అలాగని ఇంగ్లీషును కాని, యూరోపియను భాషలను వెలివేయలేదు. పరభాషలను నేర్చుకొనుటలో వారు వృధాగా శక్తిని ధారపోయరు. జపానీయుల ఆలోచన సామర్థ్యాన్ని, విజ్ఞానాన్ని పెంచుటకు వీలుగా తగినంతమంది పరభాషలను నేర్చుకొంటారు. ఉపయోగపడే విషయాలన్నిటిని పరభాషనుండి గ్రహించి జపానీసులో పొందుపరుస్తారు. జపాను యువతీ యువకులు అప్రమత్తులు కావటం వల్లనే ఇది సాధ్యపడింది. ఈ విధంగా ఆర్జించిన జ్ఞానము ప్రజల సొత్తు అయింది. గవర్నమెంటు ఆఫీసుల్లో గుమస్తాలుగాను, న్యాయవాదులుగా, జడ్జీలుగా కావాలని కోరుకుంటాము. అయినప్పటికి ఆంగ్లభాషలో ప్రావీణ్యము సంపాదించలేకపోయాము. ఇంగ్లీషు చదువుకున్నవారి దగ్గరనుండి నాకు చాల ఉత్తరాలు వస్తాయి. వీరిలో కొంతమందికి పెద్ద డిగ్రీ లున్నాయి. కాని వీరి భాషా జ్ఞానాన్ని పరిశీలిస్తే నాసి కట్టుగా కన్పిస్తుంది. మాలవీయులు, రాధాకృష్ణన్‌లు అరుదు. వారికున్న భాషాజ్ఞానము వేలాది ప్రజలకు ఉండదు.

ఈ విషయాన్నే రవీంద్రనాథఠాకూరు కలకత్తా విశ్వవిద్యాలయ స్నాతకోత్సవంలో ముప్పై అయిదు సంవత్సరాల క్రితం నొక్కి వక్కాణించాడు.

## ఎడ్యుకేషను కమిషనువారి సిఫార్సులు

డి. యస్. కొఠారిగారి అధ్వర్యాన పనిచేసిన ఎడ్యుకేషను కమిషను (1964-66) వారు దిగువ సూచనలు చేశారు. 'భారతీయులు ముందంజవేయాలంటే, పండితుల పామరులమధ్య ఉన్న దూరం తగ్గాలంటే భారతీయ భాషలను అత్యవసరంగా, అర్జంటుగా అభివృద్ధి చేయాలి. వైజ్ఞానిక, సాంకేతిక విషయాలు మాతృభాషలో చెప్పటకు వీలయినప్పుడు పారిశ్రామికంగా అభివృద్ధి పొందుటయేకాక, ప్రజల్లో వైజ్ఞానిక దృక్పథమును పెంచి, వైజ్ఞానిక విషయాలను ప్రజలకు అందుబాటులో ఉంచుటకు వీలవుతుంది. విద్యారంగంలో దేశభాషలకు తగినచోటు ఎల్లప్పుడు ఉంటుంది కాబట్టి వాటిని అభివృద్ధి పరచాలి. ఏ భాషలో విద్యాబోధన జరుగుతుందో ఆ భాషలో విద్యార్థి చక్కగా విషయాలను విడమర్చి చెప్ప గలగాలి. అలాగే సూక్ష్మంగా ఆలోచించే శక్తిని కలిగి ఉండాలి. ఈ రెండు సాధ్యమవాలంటే మాతృభాషలోనే పాఠాలను బోధించాలి.

## ప్రజలు, భాష, ప్రభుత్వము

తెల్లదొర తనాన్ని తలదన్ని ప్రజాస్వామ్యాన్ని జీవితపథంగా స్వీకరించినప్పుడు పరిపాలకుల, పరిపాలితులమధ్య భాషలతో గోడలు కట్టకూడదు. ప్రజలు తమ వ్యవహారాలన్నిటిని మాతృభాషలో సాగించినంత కాలం అధికారులుకూడా ప్రజల భాషలోనే రాజ్యవ్యవహారాలు సాగించాలి. ప్రజాస్వామ్యమే ధ్యేయము అని చెప్పి పరిపాలికులు కాగోరేవార్కి ఒక భాష, పరిపాలితులకు మరో భాష ఉండాలని ప్రబోధించే వారు ఆత్మవంచనకు లోనవుతున్నారు.

## రిఫరెన్సు సాహిత్యం

తెలుగులో రిఫరెన్సు సాహిత్యం లేదు కాబట్టి ఉన్నత విద్యాబోధన తెలుగులో జరపరాదని మరో వాదం ఉంది. తెలుగులో విద్యాబోధన చేయనిదే రిఫరెన్సు సాహిత్యం జనించే అవకాశం లేదు. రిఫరెన్సు సాహిత్యం లేనిదే తెలుగులో విద్యాబోధన చేయుటకు వీలులేదు. ఈ వాదం పెండ్లి కుదిరితేగాని పిచ్చికుదరదు, పిచ్చికుదిరితేనేగాని పెండ్లి కుదరదు అన్నట్లు ఉంది. ఈ విషవలయంనుండి బయటపడాలంటే మన ఆలోచనారీతులలో మార్పు అవసరం. రిఫరెన్సు సాహిత్య సృష్టి కష్టసాధ్యమేకాని దుర్లభముకాదు. ఆంధ్రప్రదేశ్‌లో ఉన్నమూడు విశ్వవిద్యాలయాలలో, పలుపరిశోధనా సంస్థలలో పనిచేసే శాస్త్రజ్ఞులు, పండితులు కృషిచేస్తే కావలసినంత రిఫరెన్సు ం జనిస్తుంది.

## మన కర్తవ్యం

రోగి తన బాధను తెలుగులో చెప్పితే ఎల్లోపతి వైద్యుడు ఆంగ్లములో ఆలోచించి వైద్యము చేస్తున్నాడు. కార్మికునికి యంత్రము ఎలా పనిచేస్తుందో తెలుగులో చెప్పుటకు ఇంజనీరు ప్రయత్నించి విఫలుడవుతున్నాడు. వాది, ప్రతివాది చెప్పినదంతావిని జడ్జి ఇంగ్లీషులో తీర్పు ఇస్తున్నాడు. ఈ ఉదాహరణలకు అంతులేదు. మాతృభాషలో విద్యాబోధన జరిగితే, పై విద్యాద్వారాలకు తావులేదు. పారిశ్రామికంగా వంద సంవత్సరాలు వెనుకపడ్డ మనకు, మన సమస్యలకు పరభాషా సాహిత్యంలో, సాంకేతిక విజ్ఞానంలో సమాధానాలు లేవు. ఉదాహరణకు మన సమస్య నొకదానిని పరిశీలిద్దాం. విశాఖపట్నపు సముద్ర తీరంలో కెరటాల ప్రభావానికి సముద్రపు టొడ్డున ఉన్నభవనాలు,రహదారి కూలిపోతున్నాయి. తెల్లదొరని ఒకాయనను పిలిచి దీని సంగతి ఏమిటని ప్రభుత్వం అడిగిందని వినికిడి. ఈ సముద్ర తీరానికి మూడుమైళ్ల దూరంలో ఆంధ్ర విశ్వవిద్యాలయము ఉన్నది. ఆంధ్ర విశ్వవిద్యాలయంలోని శాస్త్రజ్ఞులు పరిశోధించవలసిన విషయమిది. ఈ సమస్యకు అమెరికానుండి, ఇంగ్లండు నుండి వచ్చే సాంకేతిక, వైజ్ఞానిక పత్రికల్లో సమాధానాలు దొరకవు. అందువల్ల మన బుద్ధి నుపయోగించి, మన కృషితో, మన సమస్యలను పరిష్కరించి అభివృద్ధిని సాధించాలి.



# గ్రంథవిమర్శలు



## అష్టదిగ్గజ కవి సమాజములో రాయల నాశ్రయించిన తొలి కవి యెవరు ?

(గ్రంథకర్త : శ్రీ కె. ఎస్. కోదండరామయ్య, ఎం. ఏ; బి. ఓ. ఎల్; బి. టి., ఎం. ఎల్. ఏ. హోసూరు — క్రౌనుసైజు 32+80 పేజీలు. వెల రూ. 3. ప్రకాశకులు—శివదేవయాంధ్ర గ్రంథ మాల, హోసూరు, ధర్మపురిజిల్లా.)

శ్రీ కృష్ణదేవరాయల ఆస్థానంలో ఉండే అష్టదిగ్గజాల్లో అల్లసాని పెద్దనామాత్యుడే ప్రాధాన్యం వహించాడనీ, అతడే తొలికవి అనీ ఇప్పటివరకూ చాలామంది అభిప్రాయం. ఆ అభిప్రాయం సరికాదనీ అష్టదిగ్గజాలలోని ప్రథమకవి పారిజాతాపహరణకర్త అయిన నంది తిమ్మనకవియే అని శ్రీ కోదండ రామయ్యగారు ఈ చిన్న విమర్శగ్రంథంలో సప్రమాణంగా వివరించడమే కాకుండా, విజయనగర చరిత్రకు సంబంధించిన పెక్కువిషయాలను వెల్లడించారు.

తిమ్మనకవి మైసూరు రాష్ట్రమునకు చెందిన కోలారు ప్రాంతంలోని నందిగ్రామ నివాసి. వరాహ పురాణాన్ని రచించిన జంటకవులలో ఒకడైన మలయ మారుతకవి ఘంట సింగయ్యకు మేనల్లుడు. అందువల్ల రాయలతండ్రి నరసనాయకుని కాలంలోనూ ఉండిన వాడే! నరసనాయకుడు తన దండనాయకుడైన కుమార వీరయ్య తోడ్పాటుతో హొయిసలేంద్రుణ్ణి జయించి, అతని శ్రీరంగపట్టణాన్ని స్వాధీనం చేసుకుని, దానికి వీరయ్యనే పాలకునిగా నియమించాడు. అంతే కాకుండా అతని కుమార్తె తిరుమల దేవిని తన పుత్రుడు కృష్ణరాయలకు వివాహం చేశాడు. వీరయ్య దండనాయకుడు కృష్ణరాయల కాలంలో కూడా రాయల తొలి దండయాత్రల్లో సహాయపడుతూ ఉండేవాడు. తిమ్మకవి కృష్ణరాయల వివాహం నాటికే శ్రీరంగ పట్టణాధిపతి వీరయ్య దండనాయకుని ఆ స్థానంలోనే కాకుండా అంతఃపురంలో కూడా చాలా చనువుగా మెలగుతూ ఉండేవాడు. అందువల్లనే కుమారవీరయ్య తన పుత్రిక తిరుమల దేవికి తిమ్మకవిని 'అరణపు కవి'గా పంపే అవకాశం ఏర్పడింది. కృష్ణదేవరాయల పట్టాభిషేకం నాటికే ఆయన ఆ స్థానంలో ఈ కవి ఉండడంవల్ల అష్టదిగ్గజాలలో తిమ్మకవి ప్రథముడని నిర్ణయించడంలో ఆక్షేపం ఉండదు.

పై అంశాలను శ్రీ కోదండరామయ్యగారు గ్రంథ ప్రామాణ్యాన్నీ, శాసనప్రామాణ్యాన్నీ అనుసరించిన్నీ, స్థానిక వృత్తాంతాలను సంగ్రహించిన్నీ వివరించారు. ఇట్టి నిర్ణయాలకు గ్రంథాదులతో పాటు ఆయా ప్రాంతాలు తిరిగి వృత్తాంతాలను సేకరించడం ఎంతో అవసరం. రచయిత రాజకీయ వేత్త; తమిళనాడు శాసనసభ్యులు. దక్షిణ భారతంలోని మైసూరు, తమిళనాడు ప్రాంతాల్లో ఉన్న 75 లక్షల ఆంధ్రుల అభ్యుదయ మార్గాలను ఆలోచించి, తగిన చర్యలను తీసుకొనుటకు పూనుకున్న దేశసేవా పరాయణులు. విద్వద్విమర్శకులు. ఆయన ఆయా ప్రాంతాలలో పర్యటించి, పరిశ్రమించి గ్రహించిన విషయాలకు ఫలరూపంగా ఈ ఉత్తమగ్రంథాన్ని వెలయించి క్రొత్తవిషయాలని సాహిత్యలోకానికి అందజేశారు. రాయల ఉమ్మత్తూరు, శివసముద్రాల విజయాలను, ప్రతిసంవత్సరం జరిపే వసంతోత్సవాలను పురస్కరించుకొని తమ సిద్ధాంతాన్ని నిర్ణయించారు. తిమ్మకవి పారిజాతాపహరణంలోని—

'చోళవల్లభునకు సుర వధూమధురా ధ
రము లిచ్చె: మధురాపురంబు గొనియె'
[ఆశ్వా 1. ప. 13]

అనే సీసపద్యపాదంలోని 'మధురాధరము లిచ్చె' అనేది 'మధురాధరము లిచ్చి' అని మార్పు చెందడం వల్లనూ, ఆ పద్యంలోనే

'శ్రీరంగపట్టణ సీమ ఖడ్గన టీవి
నోదంబు హొయిసలేంద్రునకుఁ జూపె'

అనే చోట 'హొయిసలేంద్రునకు' అనే దానికి మారుగా 'యావనేంద్రునకు' అని మార్చి ముద్రించడం వల్ల చరిత్రాంశా లెంత తల క్రిందులైనదీ, యథార్థ విషయాలెలా మరుగుపడినదీ వివరించారు.

రచయిత శ్రీ కృష్ణదేవరాయల చరిత్రను తెలుగులో సమగ్రంగా వ్రాయాలనే సంకల్పంతో విషయాలను సేకరిస్తూ, పారిజాతాపహరణ ప్రబంధాన్ని పరిశీలింపగా కొన్ని కొత్త విషయాలు తోచాయి. కృష్ణరాయల నంది దుర్గాలయ శాసనం ఆయన అభిప్రాయాలను బలపరిచింది. పెక్కు ఆంధ్రగ్రంథాలనూ, ప్రత్యేక సంచికలనూ, ఆంగ్ల గ్రంథాలనూ, సంపుటాలనూ, శాసనాలనూ పరిశీలించి యీ గ్రంథాన్ని వీరు రచించారు. రాజకీయాలతోపాటు భాషా వాఙ్మయాల్లో అధికంగా ఆదరాభిమానాలూ, ఆసక్తి ఉన్నందువల్లనే దీని రచన ఈయనకు సాధ్యపడింది.

దీనికి విద్యారత్న నిడుదవోలు వేంకటరావుగారు ఆంగ్లంలోనూ, ఆంధ్రంలోనూ విపులంగా వ్రాసిన పీఠికలు మెరుగుపెడుతున్నవి. అందులో—రచయిత సల్పిన అపారమైన కృషి, వెలుగునకు తెచ్చిన చరిత్రాంశాలు, తెలుగు జాతికి దక్షిణ భారతంలో ఉన్న స్థానం ఇంకా ఆ ప్రాంతాలలో జరుగవలసిన కృషి, తాము తమ కవి చరిత్రలలో తెలిపిన విషయాలు, మున్నగు పెక్కు అంశాలను ఉటంకించి రచయిత కృషిని ప్రశంసించారు శ్రీ వెంకటరావుగారు.

ఈ గ్రంథం స్వరూపంలో చిన్నదయినా విలువలో పెద్దది. బహుముఖ ప్రజ్ఞాధురంధరులైన శ్రీ కోదండరామయ్య గారు దీని మూలంగా చరిత్రకు, భాషకు గొప్పసేవ చేశారని చెప్పవలసి ఉన్నది. వారు తలపెట్టిన శ్రీ కృష్ణదేవరాయల చరిత్ర కూడా శీఘ్రంగా వెలువడితే భాషా వాఙ్మయాలకూ, చరిత్రకూ ఎంతో మేలు సమకూరగలదని నా విశ్వాసం.

శ్రీ బులుసు వేంకటరమణయ్య.

# అథ ప్రశ్నోపనిషత్

(మాండూక్యము)

వ్యాఖ్యాత: శ్రీ పండిత అన్నే కేశవార్య శాస్త్రి. ప్రకాశకులు: వ్యాఖ్యాత, 3-5-1003 నారాయణ గూడ, హైదరాబాదు—29. క్రౌను $\frac{1}{8}$ పేజీలు 160 వెల అమూల్యము.

ఈ గ్రంథము చిన్నదైనను ముఖ్యముగా తొమ్మిది భాగములుగా విభజింప వచ్చును.

(1) పే. 1–3 మాండ్యూకోపనిషత్తు—మూలము.

(2) పే. 4–8 ఈశావాశ్యోపనిషత్తు—మూలము.

(3) పే. 9–26. స్వామి దయానందుల సత్యార్థ ప్రకాశములోని సప్తమ, అష్టమ, నవమ ఉల్లాసములలోని కొన్ని భాగములకు అనువాదము.

(4) పే. 27–59. సత్యార్థ ప్రకాశము ఏకాదశ సముల్లాసమునుండి నవీన వేదాంతుల మత ఖండనమను పేర శంకరమత ఖండనమునకు అనువాదము.

(5) పే. 60-84 పండిత భీమసేన శర్మ గారి మాండూక్యోపనిషత్ప్రస్తావః అను గ్రంథము లోని సంస్కృత మూలము, హిందీ వ్యాఖ్యకు అనువాదము.

(6) పే. 85–104 ఓంకార ప్రణుతి అనుపేర సత్యార్థ ప్రకాశికా మతానుసారము—మాండూక్యమునకు పీఠిక.

(7) పే. 105–'భద్రం కర్ణేభిః' ఇత్యాది శాంతిపాఠము.

(8) పే. 106–155 మాండూక్యమునకు ప్రతిపదార్థమును వివరణము శ్రీ దయానందులయు వారి శిష్యులగు శ్రీ గురుదత్త ఎం. ఏ., పండిత భీమసేన శర్మగారల వ్యాఖ్యానముల ననుసరించినది.

(9) పే. 156–160 రెండు శాంతి పాఠములు, రెండు పరిశిష్టములలో వాని అర్థ వివరణములు.

ఈ ఉపనిషత్తుకు పూర్వాచార్యులెందరో వ్యాఖ్యానములు వ్రాసిరి కాని ఇందులో ఆచార్య శంకరుల మతమే మాటి మాటికి ఖండింప బడినది. అందులకు రెండు కారణము లూహింపవచ్చును. (1) ఈ వ్యాఖ్యాత శ్రీ దయానందులు స్థాపించిన ఆర్యసమాజ మతస్థులు. వారి మతములో ఈశ్వరుడు, జీవుడు, ప్రకృతి—ఈ మూడును అనాదులు, నిత్యములు నవుటచేత వారి కద్వైతము సమ్మతము కాదు. ద్వైతమును, త్రిక మూలకములైన విశిష్టాద్వైతములును అంతటి శత్రువులు కావు. (2) ప్రధానమల్ల నిబర్హణ న్యాయము.

ఇందులో అవలంభించిన ఆర్య సమాజ మతము యొక్క ఖండనమును, శంకరుల మత సమర్థనమును ఈ సందర్భములో ప్రస్తుతములు కావు. ఎందరో పండితు లావని చేసియే యున్నారు.

గత శతాబ్దములో క్రైస్తవ మహమ్మదీయ మతముల తాకిడిని ఎదిరించుటకు మన దేశములో ఎన్నియో మతములు పుట్టి ప్రతిపక్ష సిద్ధాంతము లను తమవిగా గ్రహించినది. అట్టివానిలో నెల్ల బలవత్తరమైనదీ, ఎక్కువమందిని ఆకర్షించినదీ ఆర్య సమాజము. అది తక్కిన మతములవలె గాక వేద ప్రామాణ్యమును కంఠోక్తిగా అంగీకరించుటయు, దానిని మొదట ప్రచారము చేసినది సన్యాసి యగుటయు ముఖ్య కారణములు. వారి సిద్ధాంతములలో కొన్నిటిని ఉదాహరించినచో మహమ్మదీయ క్రైస్తవముల ప్రభావ మెంత యున్నదో బోధపడును.

1. ప్రతీకారాధనము పనికిరాదు— అనగా భరత భూమిలో ఆ సేతుశీతాచలము వ్యాపించియున్న సమస్త దేవాలయములను, కోట్లమంది ఇండ్లలో నున్న గృహదేవతార్చనములను వదలివేయవలెను.

2. పుణ్యతీర్థములను క్షేత్రములను సేవించుట నిరర్థకము. కన్యాకుమారినుండి మానస సరోవరము వరకును, ద్వారకనుండి పురి జగన్నాథము వరకును వ్యాపించి భరత భూమిని పుణ్య భూమినిగా చేసిన సమస్త తీర్థక్షేత్రములును గంగాది నదులును త్యాజ్యములు.

3. దేహి చనిపోయిన తర్వాత దేహము దహనము చేయవలెను గాని ఆ పిమ్మట నెట్టి శ్రాద్ధ కర్మాదికమును చేయరాదు.

4. పశు యజ్ఞములు పనికిరావు. షరా: పై మూడు నాలుగు నిషేధములును సత్యార్థ ప్రకాశిక మొదటి కూర్పులో లేకుండు టేకాక, ప్రేతకర్మములును పశుయజ్ఞములును సమర్థింపబడినట్లు తెలియవచ్చుచున్నది. రెండవకూర్పులో అవి అచ్చుపొరపాట్లని ఉద్ఘాటింప బడినవి.

5. ఊర్ధ్వపుండ్ర ధారణముగాని తిర్యక్పుండ్ర ధారణము గాని నిషిద్ధములు.

6. మంగలాచరణముతో గ్రంథములు ప్రారంభించుటయు ముగించుటయు నిషిద్ధములు. 'హరిః ఓమ్' అని వేదపాఠ మారంభించుట గాని, శ్రీ మహాగణాధిపతయే నమః' ఇత్యాదిగా ఇష్టదేవతా స్మరణము చేయుటగాని నిషిద్ధములు.

7. ప్రసిద్ధమైన స్మార్తకర్మలు నిరసింపబడి నూతన షోడశకర్మలు విధింప బడినవి.

8. వర్ణాశ్రమము అంగీకరింపబడినవి కాని జన్మతః వర్ణము సిద్ధించుట నిరసింపబడినది.

(9) సిద్ధాంత కౌముది, రఘువంశము, కిరాతార్జునీయము, శిశుపాలవధము తుచ్ఛ గ్రంథములు.

అందువల్లనే ఈ మతము మహమ్మదీయ మతము విజృంభించిన దేశభాగములలో నెక్కువగా వ్యాపించినది. వేదోక్త కర్మలు ధర్మములు బలీయముగా లేని జాతుల నెక్కువగా ఆకర్షించినది. ఆంధ్ర దేశములో ఒకానొకప్పుడు నైజాము పరిపాలనములో నున్న భాగమందే ఈ మతము వేరు తన్నుకొని యుండుటయు, ఈ గ్రంథ ప్రకటనము కూడ అక్కడి నుండియే వెలువడుటయు విశేషము.

ఈ గ్రంథము తెలుగు భాషలోనే యున్నను సంస్కృతాంధ్రములు వచ్చినవారికి గూడ సుబోధకము కాని భాషలో నున్నది.

మాండూక్యోపనిషత్తుకు దాని పేరు 'ప్రణవోపనిషత్తు' అని మార్చుట సమంజసమని గ్రంథకర్త సూచన చేసినారు. వారు చూపిన ఉపపత్తి ఎట్లున్నను, పేరు మార్చి వ్యవహరించ మొదలిడినచో 'ప్రణవోపనిషత్తు ఉరఫ్ మాండూక్యోపనిషత్తు' అని వ్యవహరించవలసి వచ్చునేగాని పాతపేరు పోదు.

ఈ గ్రంథములో 4–8 పేజీలలో ఈశావాస్యోపనిషత్తు మూలము ఎందుకు ప్రచురింపబడినదో బోధపడకున్నది. కారణ మెక్కడను గ్రంథకర్త సూచింపలేదు. ప్రమాద పతితమని తోచుచున్నది.

శ్రీ నోరి నరసింహశాస్త్రి.

## బూర్జువా పెళ్లికూతురు

(రచన: రంధి సోమరాజు, వెల: రెండు రూపాయలు. శశిధర పబ్లికేషన్సు, అన్నపూర్ణపేట, రాజమండ్రి—3.)

శ్రీ రంధి సోమరాజుగారు వ్రాసినదే ఈ కథాకావ్యం బూర్జువా పెళ్లికూతురు. అభ్యుదయ కర సామాజిక దృక్పథం, సర్వశూన్యం అయినా కవి హృదయం వుండొచ్చు ననడానికి ఈ కథాకావ్యం చదివేక పొద్దు రచయితను గుర్తుచేసుకోవచ్చు. వస్తువు దృష్ట్యా చూసినా, కథనం దృష్ట్యా చూసినా సోమరాజుగారి ఈ రచన పూర్తిగా అసంతృప్తి కలిగిస్తూంది. అసంతృప్తి అనడం మృదువుగా చెప్పడం.

ఉన్నత విద్యావంతుడైన హరిజన యువకుడు ప్రసాదు, పైకులం అమ్మాయి బుల్లిని పెళ్లిచేసుకోడానికి నిర్ణయం తీసుకొన్నాడు. తరవాత అతనికే ఆ పెళ్లి ఒప్పందం నుంచి బయటపడాలనిపించింది. తనకు వధువు కావలసి నామెను బెదరగొట్టడానికి తానుద్యోగం వదిలేసి, తనకులం వాళ్ళసేవకు జీవితం ధారపోయదలచేనని ప్రకటించేడు. బుల్లి బెదిరిపోయి 'వుద్యోగంలేకుంటే నువ్వు నాకొద్దు' అంది. ప్రసాదు ఎత్తుపారి, ఆతడు తన కులపుదుచు పైడమ్మను పెళ్లాడుతాడు. ఇదీకథ.

స్థూలంగాచూస్తే 'ధనమూల మిదం జగత్' అనే భావాన్ని నిరూపిస్తూంది కథ—అనిపిస్తుంది. కాని, నిలబడి ఆలోచిస్తే కథలోనూ, దానిని చెప్పిన పద్ధతిలోనూ కూడ కవి సామాజిక దృక్పథం అనభ్యుదయ కరమని వ్యక్తమవుతుంది.

కులవ్యవస్థ నిర్మూలం కావడం, హరిజన గిరిజనాదులు సమాజంలో అంతర్భాగంగా లీనం అయిపోవడమూ నేడు దేశక్షేమం, ప్రజాభ్యుదయం కోరేవారూ, మానవతా దృక్పథాన్ని కనబరిచేవారూ కోరుతున్నారు. మనదేశ ప్రభుత్వం ఆ లక్ష్యంతో కొన్ని చర్యలు తీసుకొంటూంది. ఫలితాలెల్లా వున్నా యనేది తరవాత చూద్దాం.

ఆచర్యల ఫలితంగా హరిజనులు వగైరాలకు విద్యలో, వుద్యోగాలలో ప్రత్యేక సౌకర్యాలు ఏర్పడ్డాయి. ఆకులాల యువకులలో కొందరు పైకి వచ్చేరు.

అయితే వారిని 'పైకులాలవారు కలిపేసుకొంటున్నారు. వారు తమ పల్లెల వేపు చూడడంలేదు. హరిజన ప్రజా సామాన్యం ఎప్పటి స్థితిలోనేవుంది. ఇంక విద్యాదిసౌకర్యాలు కలిగించి లాభం ఏమిటని 1969 లో పార్లమెంటులో చర్చలు సాగేయి.

నిజానికి జరుగుతున్న దాంట్లో తప్పులేదు. ప్రసాదుకు పైకులంపిల్లను ఇవ్వడానికి అంగీకరించడం సమర్థనీయమే. హరిజనులు ఆర్థికంగా వెనకబడివున్న దశలో ఈవూదిరి సంఘటనలు పై పరిస్థితులు సందర్భపడినప్పుడే జరుగుతాయి.

'ఆ పిల్లను గున్నమ్మనా కూసో బెట్టి
పోసిత్తాడు'—అని ఆశపెట్టి,

'సత్తిగాడ్ని సేసుకోమను సూత్తాను' అని సవాలుచేస్తే సర్దుబాటుకావు, సామాజిక సంబంధాలు.

'కులాలమధ్య హెచ్చుతగ్గులు లేవు. అందరూ సమానమే'– అన్నభావం బూర్జువా సమాజానిది. ఈ అంతరం తెలుసుకోవాలి, రచయిత అన్న వాడు, ఈవేళ, సోమరాజుగారు ఆ ప్రయత్నమేనా చేసినట్లులేదు.

తాను చేసుకోదలచిన పిల్లను కనీసం చూడనన్నా చూడాలని లేని నవయువకుణ్ని మనకి కలక్టరుగా వూహించడం, అసలు తెలుగుదేశంలో వచ్చిన పరిణామాల్ని ఎరగకపోవడమేనా కావాలి. హరిజన యువకుల తెలివిని వెక్కిరించడమేనా కావాలి.

దీనిని కప్పిపుచ్చుకొనేందుకు కమ్యూనిస్టు నారాయణ వచోనైపుణ్యం ప్రసాదుని బోల్తా కొట్టించిందంటారు, కవి.

'నువ్వు కుర్రోడివి, మాటిచ్చేత్తే పెమాదం
మళ్లీమళ్లీ ఇశారించు
యిప్పుడేమొచ్చిందని యింత తొందర?'

—అనే నారాయణ హెచ్చరిక రెచ్చగొట్టి, వేగిరించడానికేనన్నట్లు వ్యాఖ్య చేసేరు.

1969 లో పార్లమెంటులో పైన చెప్పిన చర్చ వచ్చినప్పుడు కొందరు కాంగ్రెసు సభ్యులూ, కమ్యూనిస్టు సభ్యులూ హరిజనాది కులాలు అభివృద్ధి పొందాలంటే వారి ఆర్థికస్థితి మారా లన్నారు. దానికి సమగ్ర భూసంస్కరణలతో ప్రారంభం జరగా లన్నారు.

మూడేళ్ల కీనాడు భూసంస్కరణలకై దేశం ష్టింది. హరిజనుల ఇళ్లస్థలాల గురించి గట్టి ప్రయత్నం జరుగుతూంది. గరిష్ఠ పరిమితులు నిర్ణయించి, అదనపు భూములు పంచాలని ఉద్యమమే నడుస్తూంది. దీనియెడ కవి అభిప్రాయం ఏమిటి?

ఈడ వొంద లెకరాలు
ఆడి మొగానేసుకొని
ఆడ వో పంచేత్తున్నట్టు
దొంగ పంపకాల రౌడీ
దేముడై పోతాడు.

అంటూ కమ్యూనిస్టుగా, నక్సలైటుగా పేరెట్టిన నారాయణను తిట్టిస్తారు.

ఆల తాత కాంగి రేసు
బాబు కమ్మీ నిట్టు
మనవడు నక్సలేటు.

—అంటూ సమాజంలో, ప్రజలలో కొద్దిపాటి పురోగతినేనా వాంఛించే వారంతా అవాంఛనీయ వ్యక్తులుగా వర్ణిస్తారు.

భూముల్ని పంచడం అనేది జాతీయ సమస్య. అది వైయక్తిక స్థాయిలో చేస్తే సమస్యని పరిష్కరించదు. జాతి మొత్తంగా దానిని ఎత్తుకున్నప్పుడు వ్యక్తుల అంగీకారా నంగీకారాలతో నిమిత్తం వుండదు. అందుచేత వేలఎకరాల భూస్వామి తనభూమి మిగుల్చుకోడానికి గరిష్ఠ పరిమితుల శాసనం తెమ్మనడు. ఆ శాసనం వస్తే ఆతడూ దాని హద్దులోకే వస్తాడు. ఇంత సాధారణమైన విషయం కవికి అర్థంకాలే దనగలమా?

ఆమధ్య సోమరాజుగారి 'పొద్దు' మీద ఆలిండియా రేడియోలో సమీక్షిస్తూ సమీక్షకులు—

నల్లనిగాలి తాకిడికి
సుకంగ కరిగి పోతాది మబ్బు
గొప్పోలు అలా పేదల గుండెల్ని
కరిగిత్తే
నోకమంతా జౌద్దారే

దొకటే సేమంతిపువ్వు (పొద్దు)—అనే పద్యం చదివి ఈవర్గ సామరస్య భావం ఎల్లా వచ్చిందో అన్నారు. ఆయన ఈ బూర్జువా పెళ్ళికూతురు

చదివి వుంటే ఆ అనుమానానికి తావుండేది కాదు. అంత చక్కని కవితచెప్పిన కవికి సాధారణమైన పాటి సామాజిక అభ్యుదయ దృక్పథం లేదనుకో గలిగేవారు.

## జీ వ నా డి

(జీవనాడి మాసపత్రిక. నవోదయ, సాహిత్య సాంస్కృతిక సంస్థ, హైదరాబాదు. సంవత్సర చందా—5 రూ.లు. విడిప్రతి—50 పైసలు.)

హైదరాబాదు, సాహితీ, సాంస్కృతిక సంస్థ, నవోదయ 'కళల్నీ, సాహిత్యాన్నీ ఏ ప్రజలగూర్చి సృష్టిస్తున్నామో ఆ ప్రజల దగ్గరకు తీసుకు వెళ్లడం అవసరం'అనే లక్ష్యంతో ప్రారంభించిన మాసపత్రిక—జీవనాడి.

ఈ నాడు దేశంలోవున్న ఆర్థిక, సామాజిక, రాజకీయ పరిణామాల్ని విశ్లేషణాత్మకంగా చిత్రించే వ్యాసాలు, కథలతో పత్రిక తన లక్ష్యానికి దగ్గరగానే వుంది.

పిక్‌పాకెటర్ కథలో రచయితకు ఇంగ్లీషుమీద వున్న మోజు కేవలం అనవసరంగా (తప్పుగా కూడా) వుంది.

'ఆకలితో చావడం కాదు స్వేచ్ఛ, హక్కులు సాధించుకోడమే స్వేచ్ఛ'—అన్న వసంతగీతం నేటి తెలుగుదేశపు యువక మనస్స్థితికి ప్రతీక.

## న గా రా

నగారా—వెల— 2. 50 రూ. లు రచన—అరుణోదయం. అరుణోదయ ప్రచురణలు, వేటపాలెం, ప్రకాశంజిల్లా, ఆం. ప్రదేశ్.

కవి ప్రారంభంలోనే నామాటగా చెప్పకొన్నట్లు వుత్సాహమేగాని ఉపకరణాలేవీ లేకుండా వ్రాసిన 112 పుటల, 23 కవితల సంపుటి.

దేవుడున్నాడనే భ్రమా, మతం మానవుని ఎన్నివిధాల నష్టపరుస్తున్నాయో తెలపడం, గ్రహాంతర గమనం సాధించగలిగిన స్వశక్తిమీద ఆతనికి విశ్వాసం కలిగించడం, సంఘంలో మనిషి మనిషిపై సాగించే దోపిడినీ, పీడననూ నిరసిస్తూ—

చీకటిలో నివశించే
ఖర్మెందుకు?
కళ్లుతెరు
...............
శపించు

సంపదల సంతానాన్ని అంటూ 'దీన జనావళిని ముందుకు నడవమని' పురిగొల్పడం కవి అరుణోదయం లక్ష్యం.

అయితే ఇదే విషయాన్ని వచనంలో, క్లుప్తంగా చెప్పగలుగుతే ఇంతకన్న అందంగా వుండేది. ఏవో కొన్ని పదాల్ని గుంపులుగా పోగుపెట్టి వానిని వాక్యాలలో దూర్చే ప్రయత్నంలో వచన కవితా సంపుటి తయారయిందని పిస్తుంది.

బిడ్డ పుట్టడానికి
దుడ్డు రావడానికి
గద్దె నెక్కడానికి
మిద్దె కట్టడానికి

దణ్ణం పెట్టుకో
ముడుపు కట్టుకో
మనసున తలుచుకో

ఇల్లాగే నడుస్తాయి చాలపుటలు.

## ర క్త గా న ం

(కవితా సంకలనం)

ప్రతులకు—మడూర్ వేణుగోపాల్ 14–400 కమలానగర్, అనంతపురం. (వెల ఒకరూపాయి)

శ్రీ శ్రీ రచన 'పేదవాళ్ళ ఆగ్రహం'తో ప్రారంభమై

'మాజిల్లా, మారాముడినే
గోళ్లలోకి సూదులు గుచ్చి
కళ్లలోకి కారం చల్లి
చిత్ర హింసల పాల్జేసి
చచ్చిన శవాన్ని కాల్చి
దేవీకుంట అడవుల్లో

ఆత్మరక్షణ కోసం చంపామంటే
ఎలా నమ్మను?'—అని ప్రశ్నిస్తూ నర

సప్పగారు తెలిపిన—

—'క్రాంతి రాక పోతుందా'

అనే ఆశతో ముగుస్తున్న ఈ కవితా సంపుటిలో 14 మంది కవుల 24 కవిత లున్నాయి.

ప్రజలు గురి అవుతున్న బాధలు చూస్తూ, ఓపలేని సహృదయోద్వేగం ఈ సంపుటిలోని ప్రతి కవితలో కనిపిస్తుంది.

రాళ్లకు స్వర్ణ కవచాల్ని
వజ్రా భరణాల్ని కూరుస్తూ
చలికి బిగుసుకు పోతున్న
మనిషిని గమనించని ఈబద్మాష్ వ్యవస్థలో
రుధిర గీతం గాక
మధుర గీతం ఏలా ఆలపించను—

—అని వ్యథ చూపుతారు, ముడార్ వేణు.

జాలి, దయ
నదులుగా ప్రవహించే
ఈ దేశం లో
సామాన్యులకు
మనుగడ లేదు—అని నిరుత్సాహ పడతారు, ప్రేమ్‌సాగర్.

శాంతి, అహింస అంటూ కూచుంటే ఆత్మరక్షణే లేదు నీకు—అని తెగేసి చెప్తారు నాగేశ్వరావు.

'ఆకలి మరణం దారుణం
తరుణం మించందే
రణ రంగంలో దూకు—' మని

పిష్పు తడుతున్నారు సారంగ మూర్తి.

'నీచూపు వాలవలసింది
నూనినీ కాను కేంద్రాలపై కాదు
అసమ సమాజంలోని
అవినీతి పైన'—అని చెవి మెలి

పెడుతున్నారు అరుణకుమారి.

ఎన్నాళ్ళీ దోపిడి విధానాన్ని
సహిస్తావు?లే, తిరగబడు...

—అని జాలిచూపుతారు డేనియల్.

మానవున్ని మానవుడు దోచుకునే
మనిషినిమనిషి ఈసడించుకొనే

ఈ బూర్జువా సమాజాన్ని భూస్థాపితం చేసారు.

'సమసమాజాన్ని నవసమాజాన్ని స్థాపిస్తార'ని సం కనబరుస్తారు జి. ఎస్. కృష్ణమూర్తి.

'రక్తంపాడే సమయం వస్తే అది ఎల్లా నిన దిస్తుందో ఈ రక్త గానంలో వింటాం' అన్న శ్రీ శ్రీ వాక్యం ఉత్సాహంతో పలికిన అతిశయోక్తిగా తీసుకొన్నా పూర్తిగా అసత్యం మాత్రం కాదు.

అయితే ఆ వుత్సాహాతిశయంలో శ్రీ శ్రీ ఈ కవిత్వంలో 'గణయతి ప్రాసల సర్కస్‌మొగ్గ లూ, రసాలంకారాల విస్కీ పెగ్గులూ' వెతికేవారిని 'పోలీసులకు రిపోర్టులు దాఖలు చేసుకోవచ్చు'ని అనుమతించడం, 'ఆచోకీ అందించే పురుగుల'ని నిందించడం చూస్తే దేవతావస్త్రాల కథ జ్ఞాపకం వస్తూంది. ఈకవితలలో శిల్పం పూర్తిగా లోపించిందని ఆ మాటల్లో తానే వొప్పుకొన్నారు.

సాహిత్యంలో వస్తువుకున్నంత ప్రాముఖ్యం శిల్పానికి వుంది. ఒక్కొక్కదశలో పరిస్థితుల ప్రాబల్యంలో మానవుడు ఏదో ఒక దానికి ప్రాముఖ్యం ఇవ్వడం, త్వరలోనే మోహంమొత్తి రెండోదానికి వెంపరలాడడం జరుగుతూ 'వస్తువా, శిల్పమా' అనే తగువు చావకుండా నిత్యనూతనం అవుతూంది. ఇప్పుడు తెలుగుదేశంలోవున్న పరిస్థితులు వస్తు ప్రాధాన్యతకి పట్టం కట్టేయి. శ్రీ శ్రీ గారి సమర్థన అందుకే. కాని శిల్పం పూర్తిగా లోపించినప్పుడు ఆ సాహిత్యాన్ని జనం ఆట్టేకాలం హర్షించరు. ఇదే పద్ధతి కొనసాగితే పూర్తిగా వైముఖ్యం కలుగుతుంది. అసాధారణ శిల్ప ప్రతిభగల శ్రీ శ్రీ కి ఈ విషయం వేరే చెప్పనక్కర్లేదు.

ఎంతో ఉత్తమమయిన ఆశయాలతో కవితా రంగంలోకి వచ్చిన యువకవుల్ని ఉత్తమ తరగతి

కవుల్నిగా పరిణతి పొందించవలసిన బాధ్యత ఉద్యమ నాయకత్వం వహిస్తున్న శ్రీ శ్రీ మీద వుంది. యువ కవులుచేసే పొరపాట్లకు విమర్శరాకుండా తిట్ల గొడుగు అడ్డుపెట్టడం వలన ఆయన తన బాధ్యతను నెరవేర్చినట్లు కాదు. అలా చేయడంవలన ఆయన పెద్దరికం నిలబడుతుంది. కాని యువకవులు ఎదగరు. విమర్శ రావాలి. అప్పుడే దిద్దుకొంటారు. సమర్ధవంతంగా వ్రాస్తారు. అతి ప్రాథమికమయిన ఈ అవకాశాన్ని వారికి లేకుండా చేస్తున్నా రనాలి, శ్రీ శ్రీ; తమ వుత్సాహాతి రేకంలో.

**'అవంతి'**

# గోపీచంద్ ఆర్ట్స్

(నాలుగవ వార్షిక ప్రత్యేక సంచిక)

(ప్రచురణ: గోపీచంద్ ఆర్ట్స్, హైదరాబాద్ 500029.)

సర్వశ్రీ అక్కినేని నాగేశ్వరరావు, బి. నాగిరెడ్డి, చక్రపాణి, ఠాకూర్ హరిప్రసాద్ పోషకులుగా, జస్టిస్ ఆవుల సాంబశివరావు, శ్రీ గుమ్మడి వెంకటేశ్వరరావు, శ్రీ దేవులపల్లి రామానుజ రావు, శ్రీ వెంకట రమణారెడ్డి సలహాదార్లుగా గోపీచంద్ ఆర్ట్స్ పనిచేస్తున్నది హైదరాబాదులో. నాలుగవ వార్షికోత్సవం సందర్భంలో యీ (సువనీర్) ప్రత్యేక సంచికను ప్రచురించారు.

స్వర్గీయ గోపీచంద్ బొమ్మలను ప్రముఖంగా ప్రచురించారు. 200 పుటలతో ఇంత అందంగా, ప్రయోజన లక్ష్యంతో యీ ప్రత్యేక సంచికను ప్రచురించ గలిగినందుకు గోపీచంద్ ఆర్ట్స్‌ను ప్రశంసించుతున్నాను. గోపీచంద్ అభిరుచులకూ ఆసక్తులకూ అనుగుణంగా ఉన్నది ఈ సంచిక. అంతే కాదు. మొదటి పేజీనుంచి ఆఖరి కవరు పేజీ వరకూ గోపీచంద్‌ను గురించిన వ్యాసాలను కాక సరికొత్త పద్ధతిలో పలువ్యాసాలను ప్రచురించడం ద్వారా యీ సంచిక కొక ప్రత్యేకత కలదని స్ఫురింపజేశారు.

'మా జీవితయాత్ర' అనే శీర్షికన శకుంతలా గోపీచంద్ వ్రాసిన వ్యాసంలో వ్యాసావళిని ప్రారంభించడం సమంజసంగా ఉన్నది. గోపీచంద్ జీవితంలో ఎన్నో తుఫానులు వచ్చినయ్. మరెన్ని సమస్యలనో ఎదుర్కొన్నారు గోపీచంద్, 'మా ఆవిడ నాకు పెద్ద ఓదార్పు' అన్నా రొకప్పుడు గోపీచంద్.

'తను జీవిత సమాప్తివరకూ పుంఖాను పుంఖమైన రచనలను గోపీచంద్‌గారు వెలుగు రేకలుగా వెదజల్లినారు' అన్నారు (18 వ పుట) శ్రీ దేవులపల్లి రామానుజరావు 'సహృదయుడు' అనే వ్యాసంలో.

దేబె మొగాలతో నిండిన
'దేశం ఏ మయ్యేట్టు'
'అసమర్థుని జీవితయాత్ర'
కాత్మహత్యేన గట్టు
మాసిపోని రాత కాడ
మా రాతేమై నట్టు

అన్నారు (20 పుట) కాళోజీ నారాయణరావు. అవును గోపీచంద్ కూడా ఇదే సమస్య గురించి చాలా సంవత్సరాలు ఆలోచించారు. ఆ ఆలోచనలనే కథలుగా, నవలలుగా చిత్రించారు.

రంగభూమి అనే విభాగంలో కావ్యేషు నాటకం రమ్యమ్, నాటక కళ, నాటకం, నటనా తన్మయత్వం ఆంధ్ర నాటక రంగం, తెలుగులో నాటక కళ, నాటక రచయితలలో చైతన్యం రావాలి. పోటీ నాటకాలు— నాటక రంగాభివృద్ధి, నాటక సమాజ సమిష్టి, నటులకు రాజమార్గం ఏకపాత్రాభినయం—చదివి ఆలోచించదగిన వ్యాసాలు.

వీటన్నింటితో సరితూగ గల వ్యాసం నాటక రంగంలో మార్కెటింగ్ సమస్యలు. 'హేతువాదానికి ప్రోదిచేసిన రెండు నాటకాలు' అనే వ్యాసంలో 'ఏమైనా 'ఖూనీ' నాటకం మూఢాచారాలలో మునిగి కాలంతోపాటు మారలేనివారికీ కనువిప్పు' (68 వ పుట) అన్నారు రచయిత్రి. నిజమే ఇంతకు ముందు చాలాసార్లు చాలామంది యీ నాటకం గురించి ఇటువంటి అభిప్రాయాన్నే ప్రకటించారు. కానీ 'ఆ కనువిప్పు' అనేది ఇంతవరకూ కూడా జరగ లేదంటే దానికి కూడా బలీయమయిన కారణమేదో ఉంటుంది. ఆ కారణాన్ని చిత్రించి, ఛేదించగల నాట

కాలను వ్రాయగలవా? వ్రాస్తే ప్రేక్షకులు ఆద రించుతారా? ఆదరించక పోయినా ఫరవాలేదను కుందావా?

'నాటకాలుకన్నా సినిమాలకు మరింత విస్తృత మయిన ప్రజాదరణ ఉన్నా నాటకరంగాన్ని నాశనం చేయటం సినిమా రంగానికి సాధ్యంకాదని నా నమ్మకం' అంటారు మన నాటకరంగంఅనే వ్యాసంలో (73 వ పుట) రచయిత. 'నాటకాలకుగల ప్రత్యక్ష మానవు లతో స్వభావం ఇందుకు కారణాలు' (73 వ పుట). ఇది చర్చనీయాంశం కాదా?

'ఏ నాటకానికైనా నాటకీయ భ్రమ అత్యవసరం. దాని నిర్వహణానికి ప్రేక్షకులలో ఒకవిధమైన అపోహా వేశమే జీవగఱ్ఱ' (75 వ పుట) అంటారు నాటకము నిర్వహణము అనే వ్యాసంలో రచయిత. ఈ కొలత బద్దతో కొలిస్తే యీ రోజులలో వస్తున్న నాటకా లలో ఎన్ని నాటకాలు—నాటకాలనిపించుకుంటాయ్? నాటక రచయితకు నిర్మాత న్యాయం చెయ్యాలంటే— నిర్మాత సాధించవలసిన అయిదు ఆశయాలను పేర్కొ న్నారు ఈ రచయిత.

ఈ విధంగా పరిశీలించుతూ పోతే యీ సంచిక లోని వ్యాసాలలో — చర్చించదగిన అంశాలు చాలా ఉన్నాయ్.

'తెలుగు నాటక రచయితలు కళను ప్రజా యత్తం చేయుటం విషయంలో సందేహించినట్లయితే తెలుగు నవలకు భవిష్యత్తు మూసుకుపోయినట్లుగానే నాటకానికి కూడా గతమే కాని భావి అనేది ఉండదు' (115 వ పుట) సాహిత్య కళారంగాలలో కుడి ఎడమల దగా దగా 'అనే వ్యాసంలో అంటారు రచ యిత. ఇటువంటి అభిప్రాయాలు ఈ రచయితకు ఎలా కలిగినవో? తెలుగు నవలకు భవిష్యత్తు మూసుకు పోయిందా? అయితే యీనాడు వస్తున్న నవలలన్నీ గతానికి సంబంధించినవేనా? కళను ప్రజాయత్తం చెయ్యడం అనేది కొత్త ఆదర్శమా? ఇప్పటికే యీ ఆదర్శం చాలా రచనలలో—నవలల్లో కూడా కనిపించడం లేదా? ఉండవలసిన తీరున లేదంటే అది వేరే సంగతి. తెలుగు నవలకు భవిష్యత్తు మూసుకుపోయిందనడానికి ఆధారాలేమిటి?

'పశ్చిమోదయ నాటకం,' 'ఆర్ ఎక్టర్స్ టుడే ఆక్టింగ్' 'సంగీత కళా విశిష్టత' 'తెలుగు నాటక రంగం ప్రోత్సాహకరంగా లేకపోవడానికి ప్రజలే కారణం' అనే వ్యాసాలు బాగున్నాయ్. అంత మాత్రాన ఆ వ్యాసాలలోని అభిప్రాయాలన్నింటితో అందరమూ ఏకీభవించాలనేమీ లేదుగదా!

మొత్తంమీద ఈ సంచిక చక్కగా ఉన్నది. ఉత్సాహ పరులూ, అభిమానులూ మాత్రమే కాక, ఆలోచించగలవారందరూ కూడా చదివి, ఆలోచించ దగినదిగా ఉన్నది. ఇంత చక్కటి సంచికను ప్రచురించి నందుకు గోపీచంద్ ఆర్ట్స్‌కు అభినందనలు.

— శ్రీ వి. ఎస్. అవధాని.

## ప్రకృతి ప్రబంధము

(తెలుగు కావ్యాలలో ప్రకృతి వర్ణన)

(రచయిత : చేకూరి చెన్నకృష్ణయ్య. పేజీలు : 33+296; వెల రూ 10 లు. ప్రతులకు: చేకూరి చెన్నకృష్ణయ్య; లక్ష్మీకేశవ నిలయం; 12 బారాగలీ కాలనీ; హైదరాబాద్—2.)

'ప్రకృతి ప్రబంధము' అనే పేరు వినం గానే పద్య కావ్యం అని భ్రాంతిపడే అవకాశం ఉంది. 1969—70 సంవత్సరములో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారి రెండువేల రూపాయల బహుమతి నందు కున్న 'కావ్యాలలో ప్రకృతి వర్ణన' అనే సమీక్షా గ్రంథ మిది. ప్రాచీనకాలంలోగాని, ఇప్పుడుగాని ప్రకృతిని ఏదోవిధంగా తన కవిత్వంలో వర్ణించని కవి లేడనడం నిర్వివాదమైన విషయం.

మహాకావ్యానికి అష్టాదశ వర్ణనలు ప్రధాన మన్నారు ఆలంకారికులు. శ్రీనాథుడి తరువాత పెద్ద నతో ప్రారంభమయిన ప్రబంధయుగానికి అష్టాదశ వర్ణనలు ప్రాణభూతమైన లక్షణాలుగా పేర్కొన బడ్డాయి. పుర, సముద్ర, శైల, ఋతు, సూర్యో దయ, చంద్రోదయ, సరః క్రీడా, వనక్రీడా, వసంత, రతి ప్రసంగ, విరహ, పరిణయ, పుత్రోదయ, నయ

విరచన, దండయాత్ర, యుద్ధ, దౌత్య, ప్రభు వర్ణన— అష్టాదశ వర్ణనలు. ఈ సంఖ్యను పెంచినవాళ్లూ ఉన్నారు. ఉదాహరణకు అప్పకవి—

'పురమును, ఋతుషట్కమును ప్రయాణంబును
శైలంబు, వేటయు, సాగరంబు
మౌనీంద్ర పుణ్యాశ్రమంబును, మంత్రంబు
ద్యూతంబు పిదప నద్భుత రణంబు
విజయంబు, మధ్యపానజ వికారంబును
వనవిహారంబును, వారి కేళి
కన్యాంగ సౌందర్య కథనంబు, హిమకరా
భ్యుదయంబు విప్రలంభోచితంబు
పద్మమిత్రోదయంబును, బరిణయంబు
సురతమును, దౌహృదంబును, సుత జననము
ననగ నిరువదిరెండు వర్ణనలు గూర్చి
చెప్పవలయుఁ బ్రబంధంబు శ్రీనివాస!'

అంటూ ఇరవై రెండు చేశాడు.

సంస్కృత లాక్షణికులు ఈ సంఖ్యను ఇంకా పెంచారు.

'వర్ణ్యశ్చ రాజా దేవీచ
దేశో గ్రామః పురీ సరత్!
సరోఽబ్ధ్యరణ్యో ద్యానాద్రి
ప్రయాణ రణ రాగినః!
హస్త్యర్క చంద్రా వృతవో
వివాహోఽథ స్వయం వరహః!
సురా పుష్పాంబు సంభోగః
విశ్లేష మృగ యాశ్రమాః!
కలా ఋతు వయస్సంధీ
ధాతు వృక్షాభి సారికాః!'

ఇలా అలంకార శాస్త్రజ్ఞులు మహాకావ్యవర్ణనల విషయంలో ఎవరికి తోచిన విధంగా వారు సంఖ్యలను పెంచుకుంటూ పోయారు. ప్రస్తుత సమీక్షా గ్రంథము ప్రకృతి వర్ణన కాబట్టి తత్ గ్రంథ రచయిత తన వ్యాసాల్లో ప్రకృతికి సంబంధించినంత వరకూ ఏ ఏ కావ్యాల్లో ఏ ఏ విధంగా ప్రకృతి దర్శన మిచ్చిందో వివరించారు. చెన్నకృష్ణయ్యగారు ఈ గ్రంథాన్ని రాయడానికి సుమారు 500 కావ్యాలు పరిశీలన చేసినట్లుగా చెప్పుకున్నారు. వృత్తిరీత్యా చెన్నకృష్ణయ్యగారికి తెలుగు సాహిత్యానికి ఏమీ సంబంధంలేదు. అయితే ఆయన సాహిత్యాన్ని అమితంగా అధ్యయనం చేసిన వారు కావడం వలన ఈ గ్రంథాన్ని రాయమని మిత్రులు ప్రోత్సహించడంతో ఈ గ్రంథరచన సాగింది. రచయిత అభినందనీయులు.

ఒక్కొక్క కావ్యంలో ఒక్కొక్క కవి ప్రకృతిని వర్ణించిన పద్యాలు ఉదహరిస్తూ వాటి తాత్పర్యాలు రాసి ఉన్నట్లయితే చెన్నకృష్ణయ్యగారిపేరు ఎక్కువగా చెప్పవలసిన అవసరం ఉండేదికాదు. ప్రకృతిని వర్ణించడంలో కవియొక్క ప్రధాన ఉద్దేశం, తత్‌వర్ణనవల్ల కథాపరంగా కావ్యానికి చేకూరే పరమార్థం ఈ రెండిటినీ ఎక్కడికక్కడ ఆయన వ్యాఖ్యానం చెయ్యడంవల్ల గ్రంథం పొడుగునా ఆయన వ్యక్తిత్వం కనబడుతుంది. ప్రకృతి వర్ణనలను గురించి చెబుతూ ఆయన అభిప్రాయాన్ని కూడా వివరించారు. 'ప్రకృతి వర్ణనలను గూర్చి ముచ్చటించునపుడు తాత్విక వివేచనతో మనకు నిమిత్తము లేదు. దృశ్యమాన జగత్తునందలి చెట్లు చేమలు, లతాగుల్మములు, కొండలు, గుట్టలు, వాగులు, వంకలు, పూలు, కోకిలలు, గోరువంకలు, తుమ్మెదలు, చిలుకలు, సూర్య చంద్రాదులు, నక్షత్రములు, ఆకసము, సముద్రము, సరస్సులు, నదీనదములు మున్నగునవియే ప్రకృతి పరిధిలో చేరునవి. వావి వర్ణన విషయమే ప్రస్తుత చర్చనీయాంశము.'

కావ్యయుగము, ప్రబంధయుగము, ఆధునిక యుగము, పల్లీయప్రకృతి, గో గోప జీవనము, ప్రకృతి జానపద సాహిత్యము, ప్రభాత సూర్యోదయ వర్ణన, చంద్రోదయ చంద్రికా వర్ణన, ఆశ్రమ వర్ణన, ఋతువర్ణన ఇత్యాదిగా గ్రంథాన్ని కొన్నిభాగాలుగా విభజించి రాయడం జరిగింది. ఆ యా భాగాల్లో ప్రాచీన, ఆధునిక కవుల కావ్యాలలో కనిపించే ప్రకృతి వర్ణనలను సమీక్షించడం జరిగింది. 'ఆరూఢ స్థితి జంద్రికా ధవళితా జాండంబులో చంద్రుడొప్పెన్' అనే ప్రబంధ కవిత్వంలో

చంద్రోదయ వర్ణనకి 'నవీన విశ్వవిద్యాలయాల్లో పురాణకవిత్వంలా, శ్రవణ యంత్రశాలల్లో శాస్త్రీయ సంగీతంలా, ఇలా వచ్చావేం వెన్నెలా?. ఎలా వర్ణించను నిన్ను?' అంటున్న శ్రీ శ్రీ శరశంద్రికలోని చంద్ర వర్ణనకి కవి భావనలోఉన్న భేదాన్ని రచయిత వివరించి ఉన్నట్లయితే బాగుండేది. అసలు 'శరశ్చంద్రిక'నే తలవలేదు రచయిత.

పూర్వకావ్యాల్లో ప్రకృతి వర్ణన కావ్యనియమాను గుణంగా తప్పని సరైంది. అంచేత కావ్యాల్లో అవసరం ఉన్నా లేకపోయినా .ప్రకృతి వర్ణనలు తప్ప లేదు. కథాగమనానికి, ప్రకృతి వర్ణనకి సంబంధం ఉన్నా లేకపోయినా ప్రాచీన కవిత్వంలో పద్యానికి ఛందస్సు ఎంతముఖ్యమో ఒక కావ్యంలో ప్రకృతి వర నకూడా అంతే ముఖ్యమైంది. ప్రాచీన కావ్యాల్లో కావ్యగతమైన శిల్పంలో ఒక భాగంగా కనిపించే ప్రకృతివర్ణనలకు, కథలో అతికించినట్లుగా కనిపించే ప్రకృతి వర్ణనలకు, ప్రాచీన ఆధునిక కవుల దృక్ప థాల్లో ప్రకృతి వర్ణన పరంగా ప్రదర్శితమయ్యే భావ వైవిధ్యానికి ప్రత్యేక భాగాలు కేటాయించి ఉదాహరణ సహితంగా వివరించి ఉన్నట్లయితే గ్రంథం ఇంకా బాగుండేది. రచయిత నన్నయనుండి, నారాయణ రెడ్డివరకు అని ఒక నియమం పెట్టుకున్నట్లున్నారు. నారాయణరెడ్డిగారినిమించి ఆధునిక కవిత్వం ముందుకు వచ్చేసి చాలా కాలమయింది. శ్రీ వాదిరాజు రంగా రావు, శ్రీ వేగుంట మోహన ప్రసాద్ మొదలైన వ్యక్తివాద కవులు ప్రకృతిని చాలా కొత్తగా చిత్రించారు. వాటిని రచయిత గమనించలేదు. అభ్యుదయ కవిత్వకాలంలో ఒక శాఖగా ఉద్భవించిన స్రియలిస్టు కవిత్వంలో ప్రకృతి వికృతంగా దర్శనమిచ్చింది. రచయిత ఆ అంశాన్నికూడా విస్మరించినట్లున్నారు. అయితే గ్రంథ విషయంయొక్క విస్తీర్ణత విశాలమైంది కనుక అందర్నీ పరిశీలించే అవకాశం ఉండక పోవచ్చు. తెలుగు కవిత్వంలో ప్రకృతి ఏ విధంగా వర్ణితమైందో తెలుసుకునే ఆసక్తి గలవారు తత్కావిత్వాన్ని అంతటిని చదివే అవకాశం ఎటూ ఉండదు కనుక ఈ గ్రంథం ఆలాంటివారి ఆసక్తిని సంతృప్తి పరుస్తుందనడంలో సందేహం లేదు.

—శ్రీ టి. ఎల్. కాంతారావు.

Printed and Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7 Thambu chetty Street, Madras-1, Editor : S. Radhakrishna,

# భారతి

మాసపత్రిక

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938–1972)

డిసెంబరు 1972

సంపుటము : 49 సంచిక : 12

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## డిసెంబరు 1972

# రాళ్లపల్లివారి బాలక శతకము

## శ్రీ కుంటిమద్ది శేషశర్మ

బాగ మెరిగినవారు శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ గారు. అసదృశమైన పాండిత్యము, పాండిత్యమునకు దగిన కవిత, కవిత కనుగుణమగు విమర్శనా నైపుణి, విమర్శకు వన్నెవెట్టు సరసత, అన్నింటిని మించిన గానకళా వైదగ్ధ్యమును వారి ధనములు. వారి సారస్వత కృషి లోకప్రసిద్ధము. జగన్మానితము. తెనుగు నందే కాక సంస్కృతమునందును వారి కవిత వెల్లి విరిసినది. ముద్రితమైన వాని గూర్చి చెప్పబనిలేదు. అముద్రితము ఉపక్రాంత పరిత్యక్తము ఈ బాలక శతకము.

తెనుగున శతక వాఙ్మయము శాఖోపశాఖల బెరిగినను సంస్కృతమున అంగుళీ గణనీయము. అందునను శృంగార నీత్యన్యాపదేశ ప్రధానకములే మెండు. శృంగారమువలె హృదయమును ద్రవింపజేయునది వాత్సల్య భావము. తత్ప్రాదిలమైన బాలక శతకమును రచింప సంకల్పించినారు శర్మగారు. కాని యెందువల్లనో దానిని కొనసాగించినారు కారు.

నేను విద్యార్థిగా నున్నతరి రెండు శ్లోకములు పుట్టపర్తి నారాయణాచార్యులు చెప్పగా వింటిని. వానిలో నొక్కటి 'వదనముకుళై—' అన్న పద్యము. 35 ఏండ్లయినను స్మృతిపథమునుండి తొలగినది గాదు. ఒకప్పుడు వారు ధర్మవరమునకు వచ్చిన తరి ప్రస్తావవశమున నా పద్యము చదివి, మరొక పద్యమును చెప్ప గోరితిని. అప్పుడు వారు, దానిని చెప్పి,

'బాలక శతకమును వ్రాయదలచి మొదలిడి ఆరింటిని మాత్రము వ్రాసితిని. అది నాటికి నేటికి అంతకే ఉన్నది.' అని ఆరింటిని చెప్పిరి.

వాని భావ సౌకుమార్యము సర్వజనాకర్షకము. శతకము పూర్తియైయుండిన ఎంత హృద్యముగా నుండెడిదో! ఆ యదృష్టము మనకు ఇంతవరకు సమకూరలేదు. ఇప్పుడైనను వారు సంకల్పించిన అదెంత పని! అందుకు భగవంతుడు వారిని ప్రోత్సహించుగాత— అని ప్రార్థింతము.

తద్భావాకృష్ట మనస్కుడనై వానిని తెనిగించితిని. ఎంతైనను అనువాద మనువాదమే. అందునను యతిప్రాస లడ్డు దగిలి అనవసర పదములకు చోటిచ్చుచుండును. సంస్కృతమందలి కుదింపు తెనుగున దుర్లభము. సమర్థుల కీ ప్రతిబంధకములు లెక్కలోనివి గాక పోవచ్చును. చేతనయినంతవరకు నా భావములు తెనుగున తే బ్రయత్నించితిని. అంతకంటెను రమ్యముగా ననువదింపగల దిట్టలుండక పోరు. అందుకై మూలముతోబాటు అనువాదమును ప్రకటించుచున్నాను.

ఎందునను ప్రకటితముగాని ఈ సంస్కృత శ్లోక షట్కమును చవిచూచి రసికు లానందింతురు గాక.

ప్రాత స్సంత్యజ మందిరం, శ్రయ
ధనోన్మత్తా, నవజ్ఞా శతం
మానేనాపి సహస్వ, శోషయ తనుం
సేవా సువా, మాశుచః;
ఉద్బాహు ద్వయ ముచ్చకైరుప హసన్
లంబాలకః కేవలం
సాయం త్వా మభి గచ్ఛతు ప్రియ తమా
కక్షా ఉవలంబీ శిశుః॥.

వేకువ నిల్లు వీడి చని, విత్తమదాంధుల
నాశ్రయించి, శ్రే

వా కృశ దేహుడ్వై శత మవజ్ఞల నోర్చియుఁ,
జెందఁబోకు విూ
శోకము; సంజ నీదు ప్రియసుందరి చంకఁ
జలాల కుందున్నై
నీ కెదురౌత నీ సుతుడు, నిన్ గని నవ్వుచుఁ
జేతు లెత్తుచున్.

డోలా మధ్యే శిశు మభినవై
ర్హాస లే శైర్విలాసా
నభ్యస్యన్తీ మని మిష దృశా
పశ్యతో స్వాతి గేహే
పిత్రోర్మోదం గ్రసతి సహసా
భ్యుద్గత ప్రాక్పరా సు
జ్యేష్ఠాఽపత్య స్మృతి జనిత శుక్
న్నిష్పతీకార తీవ్రా॥

బాలు నరిష్టమందు మురిపెంబుల
ముద్దుల ముచ్చటించి, యు
య్యాలఁ గదల్చు బిడ్డఁ గనులార్పక
చూచెడి తల్లిదండ్రి మో
దాళను, ద్రుంచి వైచును తదాత్మజ
ప్రాజ్మృత పూర్వజాత పు
త్రీ లలిత స్మృతి ప్రభవ తీవ్ర
నిరర్గళ దుఃఖ వాహినుల్.

రదన ముకుళైః ద్విత్రైర్హ్నాత్సోద్గమా
త్ప్రియ దంశనైః
సపది శిశునా మాతా దష్టస్తనీ
కృత శీత్కృతిః;
'కి'? మితి సహసా పత్యాపృష్టా,
'నకించి' ది తీక్షణే
నమయతి మనా గోష్ఠప్రాంత
స్థల న్మధుర స్మితా.

మొలకలు దేరుచున్న పలుమొగ్గల
రెంటనుమూట, దంశనో
త్కలికను, బాలదష్టకుచ తల్లి
'ఇషీ'యన్న, నట్టులంటి వెం
దుల?' కని పృచ్ఛసేయు పతితో
'మరి యేమియులే' దటంచు, చూ
పులఁ—దెలినవ్వు కెంబెదవి
మోసలఁజిందులు వార—వాల్చెడిన్.

స్నిహ్య ద్బంధు వియోగ శూన్య మనసో
ర్బాష్ప స్థల త్కంఠయో
ర్దంపత్యో ర్యత మానయోర్భృత
ము ద్దైవాన్యోన్య మాశ్వాసనే,
హస్తాభ్యా మవలంబ్య జానుయుగత్
మాస్ఫాలయన్ పుత్రకః
చక్రే సస్మిత కౌతుకైర్జగ దిదం
నైకాంత దుఃఖాకులం.

శోకవ్యాకుల చిత్తమాప్తమృతి.
న శుష్కిన్న కంఠంబు న
స్తోకా శ్వాస మిథః కృతాఽఫల
సముద్యోగమ్మునన్ గల్గు జా
యా కాంతుల్, మదిలోఁ దలంత్రు
జగతిన్ నైకాంత దుఃఖంబుగా,
వ్యాకో చన్ముఖు నాత్త జానువుల
నాస్ఫాలించు బాలున్ గనన్.

నిషిద్ధాన్యే వాసౌ పరిమృశతి
వస్తూని నచత్తై
రభగ్నై స్సంతుష్య త్యథ హసతి
తర్జాసు బహుళం
కథం నిర్వ్యో ఢవ్యో గృహ విధి
రనే నేతి వివశాం
శిశౌ, పత్నీం పశ్యన్ వికసిత
ముఖో నందతి యువా.

'వలదను వానికే పెనగు; వక్కలు
సేయక వాని, వీనికిన్
గలుగదు తృప్తి; తర్జనల నవ్వును పో;
యెటు లేగుదాన నీ

యలవికి రాని వాని గొని' యంచు నలంగెడి
యింతిఁ బుత్రునిన్
గలయఁగఁ జూచి, గేస్తుడు వికావిక నవ్వెడి
సంతసించెడిన్.

అంతః పంజర వర్తిన శ్శుక శిశో
రాలాప నైర్మోహి తో
వేగా త్క్రీడనకాని గేహపురతో
విక్రేతు కామో వణిక్,
అ క్లిష్టాం గృహరంగవల్లి, మవి పర్య
స్తాంచ వస్తు క్రమం
ప్ర, వహ న్నళింద నిహితాం
పేటీం, పునః ప్రస్థితః.

పొరబడి పంజరస్థ శుక పోతము
పల్కులచేత, వచ్చి స
త్వరముగ నాట బొమ్మలను వర్తకు
డమ్మను, చూచి ముంగిటన్
సరకుల రంగవల్లికల సక్రమ పద్ధతి
నున్నవానిఁ జె
చ్చెర దన బుట్ట నెత్తికొని, చెప్పకయే
పయనంబు గట్టెడిన్.



# పండితరాయల నిట్టూర్పులు

డా. మహీధర నళినీమోహన్

హంస

ఒక మహాపండితుడు తన విద్వత్తు ప్రదర్శించి భుక్తికోసం ఏ మాన్యమో సంపాదించుకుందా మని రాజదర్శనంకోసం రాజధానీ నగరానికి బయలు దేరేడు. ఇంటి దగ్గర అతడి ఇల్లాలు తన భర్తకి జరుగ బోయే గౌరవాదరాలను పదే పదే తలుచు కుంటోంది.

'ఈ పాటికి మా వారిని రాజుగారు ఏనుగు ఎక్కించి ఊరేగిస్తూ ఉంటారు. ఏ అగ్రహారం కావాలో కోరుకోమని అంటారు. ఈయనకి బొత్తిగా మొగ మోటం. నసిగేస్తారో ఏమో. నా కోసం ఓ కట్ల కాసులపేరు బేరం చేస్తూ ఉండి ఉంటారు, వెళ్లే ముందు మరోసారి జ్ఞాపకం చేశానుకూడానూ......' ఇల్లా పగటి కలలు కంటూన్న ఆ తపస్వినికి ఏం తెలుసూ, అవతల తన భర్తకి రాజదర్శనమే కాలేదనీ, చికిలీ తీసిన కత్తుల్లాంటి దివాణపు బంట్రోతులు ఆయన మెడపట్టి వీధిలోకి గెంటేశారనీ, మోకాటి చిప్పలు డొక్కుపోయాయనీ, చిరిగిన బట్టలతో, కటిక ఉపవాసంతో సత్రపు అరుగుమీద కూలబడి పోయా డనీనూ?

ఒక ఆడ హంస దూరాన ఉన్న తన భర్తని తలుచుకుంటోందిట. 'సువిశాలమైన ఏదో మంచి తామరకొలనులో ఈతలాడుతూ, కమ్మని తమ్మి తూడులు కడుపునిండాతిని, తామర పుప్పొళ్లతో పచ్చబడిన రెక్కలతో, పెళ్లికొడుకులా ఉండి ఉంటాడు నా ప్రియుడు' అని. కాని, పాపం దానికేం తెలుసూ అసలు సంగతి? ముక్కుతో బురద కుళ్లగిస్తూ, తినడానికి నాచుపిసరైనా దొరకక, ఎగరడానికి రెక్క లలో సత్తువ చాలక, ఉపవాసాలుచేస్తూ అక్కుపక్షిలా ఉన్నాడని.

శార్దూల విక్రీడితం

హంసీవేత్తి పరాగ పింజర తనుః
కుత్రాపి పద్మాకరే
ప్రేయాన్ మే బిస కందళీ కిసలయం
భుంక్తే హ్యయం నిర్వృతః
నో జానాతి తపస్వినీ యదనిశం
జంబాల మాలోడయన్
శైవాలాంకుర మప్యసౌ న లభతే
హంసో విశీర్ణ చ్ఛదః.

శార్దూల విక్రీడితం

నా నాథుండు పరాగ మంటిన మెయిన్
పద్మాకరమ్మందు నెం
దేనిన్ సుష్టుగ నబ్జముల్ మెసవుచున్
హేలన్ ప్రవర్తించు నం
చా నందించెడు హంసి యే మెరుగు
పంకా లోడన ప్రక్రియన్
దీనుండై న మగండు నాచు పిసరేనిన్
లేక పస్తుండుటల్.

* * [*]

షాజహాను సార్వభౌముని దర్బారులో తనకు జరి గిన కనకాభిషేకాలలో తలమీదనుంచి జారిపడిన బంగారు కాసులను 'తల కడుగు నీళ్లు తాగుతానా?' అని తృణీకరించి, నలుగురికీ పంచిపెట్టేసిన పండిత రాయలు ఔరంగజేబు పాలనలో దేశాలు పట్టిపోయి, స్వయంపాకం దొరికితే చాలు, మేరువు దొరికినటు సంతోషించే దుస్థితి వచ్చింది.

దేవేంద్రుడి పట్టణంలో నాట్య సంరంభంలో రంభ చెవిలో పెట్టుకున్న మందారప్పువ్వు జారిపడగా.

సువాసనలతో గుబాళిస్తున్న వియద్వాహినీ జలాలను పూర్వం అలవోకగా పుక్కిలించిన రాజహంస ఈనాడు దిక్కుమాలినదై పామర స్త్రీలు కాళ్ళు కడుక్కునే పడియలలో కప్పలతో, బురదతో కంపు కొడుతున్న నీళ్లను మహాప్రసాదంగా భావించి తాగుతున్నదే—అయ్యో ఏమి దుర్గతీ!

శార్దూల విక్రీడితం

పీతం యేన పురా పురందర పురే
రంభోరు కేళి స్థల
న్మందారాం కుర కర్ణపూర సురభి
స్వర్గాపగాయాః పయః
సోఽయం మారవవారి పామర వధూ
పాదార్పణ ప్రోచ్చల
త్పంకా తంకిత భేక భిన్న మఘృణో
హంసః సమాశంసతే.

శార్దూల విక్రీడితం

ఏ రాయంచ సురేంద్రు పట్టణమునన్
హేలాప్సరః కేళిలో
జారీజారని కర్ణ పద్మ సురభి
స్వర్గాపగా నీరముల్
నోరారన్ మున్రుతాగెనో యతడు
గ్రోలున్నేడు మండూక పం
కా రూఢమ్ములు పామరీ పదరజో
వ్యాప్తాంబువుల్ తృప్తిగన్.

* * *

సింహం

భట్టోజీ దీక్షితులు, అప్పయ్య దీక్షితులువంటి దిగ్దంతులను ఖండించి, తన పేరుచెప్తే చాలు విపక్ష పండితమండలికి కాళ్లు జవజవలాడి పోయేటట్లు సాహిత్యరణ రంగంలో దుర్నిరీకుడై అర్ధశతాబ్దం పాటు విశృంఖలంగా వీరవిహారం చేసిన పండితరాయలు ప్రస్తుతం ముసలివాడైపోయాడు. గట్టిగా మాట్లాడే ఓపిక లేదు. ప్రతికకుల నోళ్లు మూయించాలనే ఇచ్ఛకూడా లేదు. ఎవరేమి కూసుకుంటే నాకేమీ అనే నిర్లిప్తత వచ్చింది. తన ప్రస్తుత స్థితిని జవసత్వాలు ఉడిగి చివికిపోతున్న సింహపు అధోగతితో పోల్చి దయనీయంగా వర్ణించాడు అనేక శ్లోకాలలో. మచ్చుకి ఒకటి.

పదుచు దనంలో కొండ కొమ్ముల మీదనుంచి అవలీలగా దూకేసి, మత్తేభ కుంభస్థలాలను అలవోకగా పగులగొట్టి, వందలకొద్దీ కొండలోయల మీదుగా కుప్పించి దూక గలిగిన సింహం ప్రస్తుతం ముసలిదై, మూలుగుతూ ఉంటే గాడిదలు దాని గుహా ద్వారం దగ్గర చెవులు పగిలేటట్లు ఓండ్ర పెడుతున్నాయి.

వసంతతిలక

ఉత్ప్లుత్యయః శిఖరిణం మదకుంభి కుంభ
ముద్భిద్య సానుశత మాయత ముల్లలంఘే
పంచాననో నియతయా జరయాభి భూతః
సోఽయం ఖరే విలతి బృంహతి లోహితాక్షః

శారూల విక్రీడితం

శైలాగ్రంబుల పేలగా దుమికి, పంజా
దెబ్బ నుద్దండ శుం
డాల శ్రేణుల కుంభముల్ చెవికి,
ఉల్లంఘించెనో సానువుల్
లీలన్—తన్మృగ సార్వభౌముడు జరా
క్లేశంబునన్ మూల్గ నీ
వేళన్ గాడిదలోండ్ర పెట్టెను గుహల్
వేమార్లు మ్రార్మోయగన్.

* * *

యువరాజు దారాషకో (దారాహ్ శికో అని రశికపు ఉచ్చారణ)తో కలిసి, కుమావు కొండలలోకి వేటకి వెళ్లిన పండితరాయలకి అడవులలో ఉండే కొండ జాతి పిల్లలు కొందరు కనిపించారు. వాళ్ల మొలల చుట్టూ నిగనిగా మెరిసే అందమైన మొలతాళ్ళు ఉన్నాయి. వాటి సంగతి వాకబు చేయగా అవి సింహం తాలూకు జూలుతో పేనిన మొలతాళ్లు అని తెలియ

వచ్చింది. జగన్నాథుడు నిట్టూరుస్తూ దారా కళ్లల్లోకి చూచాడు.

తాను బ్రతికినంతకాలమూ వన భూములన్నీ మహా గజేంద్రములకు సైతమూ దుర్గమములు అయే టట్లు స్వైరవిహారంచేసిన మృగాధినాథునికి ఎటు వంటి దురవస్థ పట్టింది! వేలేసి ముట్టుకోడానికి సాధ్యంకాని ఆ జూలు ఈనాడు ఈ శబర శిశువుల మొలతాళ్లుగా మారిందా? అయ్యో!

**ఆర్యా**

యస్మిన్ జీవతి సింహే
వన మిద మాసీత్ దురాసదం ద్విరదైః
ఘట యంతే కటి సూత్రం
తస్య సటాభిః శబర శిశవః

**తేటగీతి**

బ్రతికి నన్నాళ్లు వారణ ప్రతతి కెల్ల
ప్రక్కలో బల్లెమైన హర్యక్ష విభుని
సటల కెటువంటి దురవస్థ సంక్రమించె
కోయపిల్లల మొలత్రాళ్ల కొరకు నయ్యె.

* *

**తుమ్మెద**

ఒక గండు తుమ్మెద బంగారు వన్నెలో ఉన్న అర విచ్చిన మొగలిపువ్వును చూచింది. జగద్విఖ్యాతమైన దాని సౌగంధ్యానికి మురిసిపోయింది. పద్మం అని భ్రాంతి పడింది. ఇంక వెనుకముందులు ఆలోచించుకో కుండా పరుగు పరుగున వెళ్లి మొగలిపువ్వులో పడింది. అక్కడ తాగడానికి తేనె పిసరంత కూడా దొరకలేదు సరికదా, దాని పుప్పొడి కళ్లల్లో పడి గుడ్డిదై పోయింది. ఆ బాధ భరించలేక బయటికి పోదామని ప్రయత్నిస్తూ ఉండగా ముళ్లు గుచ్చుకుని దాని చిన్నారి రెక్కలు తూట్లు పడిపోయాయి. ఎగిరి పోవ డానికిగానీ, నిలువబడడానికిగానీ శక్తి లేనిదై, దేవుడా అని కూల బడిపోయింది.

దీనుడైన యాచకు డొకడు జమీందారుగారి దేవిడీ, గుర్రపుబగ్గీ వగైరా అట్టహాసమంతా చూచి, ఏమైనా దొరుకుతుందేమోనని ఆశపడి దివాణంలోకి వెళ్లేడు. అక్కడ ఏమీ రాలలేదు సరికదా కావలి కుక్కలు అతడి మీదపడి బట్టలు చింపి, ఒళ్లంతా పీకి పీకి వదిలిపెట్టేయి.

**మందాక్రాంతా**

గంధా ఢ్యాసౌ జగతి విదితా
కేతకీ స్వర్ణవర్ణా
పద్మ భ్రాంత్యా రసిక మధుపః
పుష్పమధ్యే పపాత
అంధీ భూతః కుసుమ రజసా
కంటకై ర్ఛిన్న పక్షః
స్థాతుం గంతుం క్షణ మపి సఖే
నైవ శక్తో ద్విరేఫః

**చంపకమాల**

పసిడి మెరుంగుతో దెసల వాసనలన్
విరజిమ్ము కేతకీ
ప్రసవము గాంచి పద్మమను భ్రాంతి
ద్విరేఫము లోన దూరి, త
త్కుసుమ మధూళి కాంధమయి,
దుర్భర కంటక భిన్న పక్షమై
ఉసు రుసు రంచు మూల్గె కొనయూపిరితో
నెటు బోవలేనిదై.

* * *

ఆకలిగా ఉన్న గండుతుమ్మెద ఒకటి మేత ఏమైనా దొరుకుతుందేమోనని తెగ తిరిగింది. శోష వచ్చి కళ్లు తిరుగుతున్నాయి. అంతలో ఓ ఎత్తైన చెట్టుమీద ఎర్రని అరవిచ్చిన పువ్వు ఏదో కనిపించింది. అది మోదుగు పువ్వు అనుకుని, చటుక్కున ఎగిరి అందులో వెళ్లిపడింది. తీరాచూస్తే అది మోదుగు పువ్వుకాదు. తెరచి ఉన్న చిలక ముక్కు! చిలక ఊరు కుంటుందా? కటుక్కున నొక్కింది. తుమ్మెద గిల గిల లాడి పోయింది. తేనె దొరకక పోతే పీడా పోయింది గానీ, కాళ్లు విరగకుండా బతికి బయట పడితే చాలు నని గిజాయించు కుంటోంది.

**వసంతతిలక**

భృంగః క్షుధాతురసి కింశుక విభ్రమేణ
వ్యా జృంభమాణ శుక చంచుపుటం ప్రవిష్టః
ఆశాం విహాయ మధునోఽ వయమైః సమగ్రై
ర్నిర్గంతు మిచ్ఛతి పరం పరితప్యమానః

**మత్తేభ విక్రీడితం**

భ్రమరం బొక్కటి ఆకటన్ దిరుగుచున్
రక్తచ్ఛటన్ కింశుక
భ్రమచే వచ్చిన చిల్క ముక్కునను
దూరంబోయె నొక్కుమ్మడిన్
సుమనః ప్రీతియు తేనె మీది మనసున్
పోనాడి వెన్వెంటనే
యమబాధన్ బయఒన్ బడన్ వలయు
నంచా శించె ప్రాణాలతో.

* * *

పండితరాయలకి ఎక్కడికి వెళ్లినా ఇబ్బందులు (?) తప్పడం లేదట. ఏమిటా ఇబ్బందులు? దర్బారుకి వెడితే 'మరొక్క శ్లోకం—మరొక్కటంటే ఒక్కటి—వినిపించండి' అని షాజహాను చక్రవర్తి విసిగిస్తాడు.

యువరాజా వారి భవనానికి వెడితే 'అల్లోపనిషత్తు ఎంతవరకూ వ్రాశార'ని వేపుకు తింటాడు దారా షకో.

సాయంకాలం వాహ్యాళికి వెళ్లబోతే శిష్య ప్రశిష్యులూ, యవన విలాసినులు పాదం నేలమీద మోప నివ్వరు.

లవంగిని చూసి పోదామని ముచ్చటపడి వెడితే ఆమె బాహుబంధంలో రాత్రి అంతా చెరసాలే.

తుమ్మెదకి కూడా ఇటువంటి కష్టాలే ఉన్నట్లున్నాయి. తేనె తాగుదామని తామరపువ్వులలో వాలితే రాత్రి అంతా ముకుళించిన పద్మములలో బందీ అయిపోతుంది.

ఏనుగుల దగ్గరకు వెళ్లి వాటిమీద కారే మదజలాన్ని తాగుదామని ముచ్చట పడితే వాటి పుట్టి అంతా మునిగినట్లు చెవి చేటలు ఊపుతున్నాయి మత్తేభములు. అవి తగిలితే ఇంకేమైనా ఉందా?

పోనీ సంపెంగ పువ్వుల దగ్గరకు వెడదామా అంటే వాటి చిక్కని పరిమళాల మత్తుకి ప్రాణాలే పోతాయో ఏమో.

పాపం తుమ్మెదకి ఎక్కడికి వెళ్లినా దుఃఖమే రాసిపెట్టి ఉందికదా!

**ఉపజాతి**

ప్రబంధనం పద్మవనే నిశాయాం
మాతంగ దానే మదకర్ణతాళః
స్వప్రాణ భంగః ఖలు చంప కేస్మిన్
సర్వత్ర దుఃఖం భ్రమరస్య లోకే.

**ఉపేంద్ర వజ్ర**

సరోజ పంక్తిన్ చెరసాల రేలన్
కరిశ్రవ స్తాడన దాన మందున్
తొరంగు ప్రాణంబులు చంపకాళిన్
ద్విరేఫ మెందేగిన దుఃఖ మయ్యెన్

* * *

**రామచిలుక**

దారాషకో ఎంతటి పండితుడు! ఉపనిషత్తులను పారశీక భాషలోకి ఎంత అందంగా అనువదించాడు! అతడిది ఏమి సౌందర్యం! ఏమి సౌశీల్యం! ఏమి ఔదార్యం! ఏమి సౌమనస్యం! అపురూపమైన ఈ మహాలక్షణాలలో ఏ ఒక్కటీ కూడా ఔరంగజేబు కత్తినుండి అతడిని కాపాడలేక పోయిందికదా! అయ్యయ్యో!

ముద్దుముద్దుగా పెంచుకుంటున్న రామచిలుకను గండుపిల్లి పొట్టను పెట్టుకుంది. అది ఎంత అందమైన పిట్ట! ఎంత ముద్దుగా మాట్లాడుతుంది! ఏమి సోయగాలు పోతుంది! ఏమి సౌశీల్యం దానిది!

ఇన్నిమంచి లక్షణాలూ ఆ పాడు పిల్లి ముందు గుడ్డి గవ్వకి కొరగాక పోయాయి కదా!

**అనుష్టుప్**

సుభాషిత్వం సురూపత్వం
వాచాలత్వం సుశీలతా
ఏత త్కీర కిశోరస్య
వ్యర్థమాఖు భుజః పురః

**ఆటవెలది**

చక్కనైన రూపు, సౌశీల్య గరిమంబు
మాటకారితనము, మంచివాక్కు
ఎన్నియున్ననేమి యీ రామచిలుకకు
గండుపిల్లిముందు దండుగయ్యె.

* * *

ఒక బిచ్చగాడికి దూరాన పెళ్లిపందిరి కనిపించింది. తింటూ తింటూఉన్న జోలె లోని మధూకరపు పాడితడి అన్నపుకరుళ్లమీద అసహ్యంపుట్టి, వాటిని మురుగు కాలువలో విసిరికొట్టి, పరుగు పరుగున ఆ పందిట్లోకి వెళ్లేడు. అక్కడ పందిరి వేసినది ఇళ్లాంటి బిచ్చగాళ్ల కడుపులు నింపడానికి కాదు. బయటికి గెంటే తోపిడీలో కిందపడ్డాడు. చెయ్యి బెణికింది. మురుగు కాలవలో తేలుతున్న అన్నపు కరుళ్లు అతడిని వెక్కిరించాయి.

చిలుక ఒకటిదూరాన ఎత్తైన కొబ్బరిచెట్టును చూచింది. గాలికి ఊగిసలాడుతున్న దాని మొవ్వులో పెద్దపెద్ద గెలలు కన్నులపండువుగా ఉన్నాయి. అంతలేసి కాయలని చూచిన కళ్ల తాను తింటూన్న ధాన్యపుగింజలను చూడగా రోతపుట్టి, ఎన్నులు జార విడిచి, రివ్వున ఆ కొబ్బరిచెట్టుమీదికి ఎగిరివెళ్ళి, కాయలను ముక్కుతో పొడవ సాగింది. ఒక్కకాయ పగులలేదు సరికదా, దాని ముక్కు పచ్చడైపోయింది!

**శార్దూల విక్రీడితం**

ఉచ్చైరేష తరుః ఫలంచ విపులం
దృష్ట్వైః శుకః
శాలే రాస్య గతం విరస్య కణిశం
తన్నారికేళం గతః
తత్రా రుహ్య బుభుక్షి తేన మనసా
యత్నే కృతే భేదనే
ప్యాశాతస్య న కేవలం విఫలితా
చంచూర్గతా చూర్ణతామ్

**చంపకమాల**

తరువది యున్నతం బనుచు తత్ఫలముల్
విపులంబు లంచు సం
బరమున నెన్నులం దినుట మాని శుకం
బొక నారికేళమున్
దరిసి, ఫలంబు విచ్చ బహుధా
శ్రమియించెను ముక్కు పోటులన్
హరిహరి! తత్ప్రయత్నమంబు వృధయ్యె
శుకతుండము చూర్ణమై చనెన్.

* * *

తంజాపురాధీశుని ఆడంబరాదికం చూచి, అతడి ఈవి కూడా దానికి తగ్గట్టుగానే ఉంటుంది కాబోలునని ఆశపడి ఒక పండితుడు ఆ సంస్థానంలో ప్రవేశం కోసం చాలాకాలం పడిగాపులు పడ్డాడు. ప్రవేశం అయితే దొరికింది కానీ, ఫలితం మాత్రం శూన్యం. పైగా తనవెంట తెచ్చుకున్న నాలుగు మాడలనూ దివాణపు నౌకర్లూ చాకరూ ఒడుక్కుపోయారు.

బూరుగుచెట్టు ఒకటి సువిశాలంగా పెరిగి ఉంది. ఎర్రని దాని పువ్వులు కళ్లు చెదరగొట్టేస్తున్నాయి. అది కాయబోయే పళ్లు కూడా వాటికి తగ్గట్టే బహుమధురంగా ఉంటాయి కాబోలునని ఒక రామచిలుక చాలాకాలం ఎదురుచూచింది. ఆఖరికి కాయలు కాచాయి, పండనూ పండేయి. ఆత్రంగా కాయలు పగులగొట్టి చూచింది. దాని నోటిలోకి నిస్సారమైన పత్తి తప్ప మరేదీ రాలేదు. అంతలో పెద్దగాలి వీచి ఆ దూది కూడా దక్కకుండా దూరంగా కొట్టుకు పోయింది.

విశాలం శాల్మల్యా నయన
సుభగం వీక్ష్య కుసుమం
శుక స్యాసీ ద్బుద్ధిః ఫలమపి
భవే దస్య సదృశమ్
ఇతిధ్యాయన్నాస్తే ఫలమపిచ
దైవా త్పరిణతం
విపాకే తూలోంత స్సపది మరుతా
సోఽప్యప హృతః

**ఉత్పలమాల**

బూరుగు చెటు పెద్దదని, పూవులు
కన్నుల పండువయ్యె, ఈ
తీరుననే ఫలంబులును దీనికి
కల్గునటంచు నాసతో
కీరము వేచి చూడ దొడగెన్—
పసిపిండెలు పండి తూల సం
పూరితమయ్యె—కొట్టుకొని పోయెను
దూదియు గాలి వీవగన్.

* * *

**లేడి**

చంద్రునిలో కనబడేమచ్చ లేడి పోలికలో ఉంటుంది కనుక అతడికి మృగాంకుడనే పేరు రావడం అందరకూ తెలిసినదే. కాని భూలోకంలో నివసించే లేడివెళ్లి చంద్రునిలో ఎందుకు మకాం పెట్టవలసివచ్చిందో చాలామందికి తెలియదు. ఆ కారణాన్ని పండితరాయలు వివరిస్తున్నాడు.

భూలోకంలో అయితే బోయవాళ్లు బాణాలు వేసి చంపుతారు. చంద్రునిలో బాణాల భయం లేదు. అక్కడ దావానలం లేదు. భయంకరమైన ధ్వనులు లేవు. ఉచ్చులూ, వలలూ లేవు. కనుక భూలోకం కన్న చంద్రలోకమే నిరపాయకరమైనదని ఊహించి, జింక చంద్రునిలో కాపరం పెట్టిందట. కాని అక్కడ దానికి బ్రహ్మగారు రాహువు వాడి కోరల గాట్లు విధించాడని ఎరగదు గదా! గ్రహణ సమయంలో రాహువు చంద్రుణ్ణి మింగడానికి ప్రయత్నిస్తున్నది ప్రసిద్ధమైన విషయం.

**శార్దూల విక్రీడితం**

నాత్ర వ్యాధ శరాః పతంతి పరితో
నైవాత్ర దావానలో
నైవోచ్చా వచ భీతి రత్ర చపలా
నైవాస్తృతా వాగురా
ఇత్యా లోచ్య కురంగ కేణ విహితో
నక్షత్ర నాథాశ్రయః
కోజానాతి విధిర్వి ధాస్యతి పునః
స్వర్భాను దంత వ్రణమ్.

**మత్తేభ విక్రీడితం**

ఇచటన్ లేవు కిరాత బాణములు,
లే దిచ్చోట దావానలం
బిచటన్ లేవు భయంకర ధ్వనులు,
లేవిచ్చోట నుచ్చుల్ వలల్
ఉచిత స్థానమిదే యటంచు హరిణం
బూహించి చేరెన్ శశిన్
అచటన్ బ్రహ్మ విధించె నంచెరుగదా హా
రాహు దంత క్షతుల్

*

ఒక లేడియొక్క దురవస్థని వర్ణిస్తున్నాడు.

బోయవాడు పన్నిన ఉచ్చు తగిలి కాలి గిట్టలు విరిగేయి. బాణాలు తగిలి ఒళ్లంతా రక్తధారలతో తడిసిపోయింది. ఒకమూల దావాగ్ని సెగకి పిచ్చి ఎక్కిపోతోంది. అటువంటి లేడి చచ్చి చెడి ఒక ముని ఆశ్రమాన్ని చేరుకుంది. ఇంక భయం లేదనీ, ఋషీశ్వరుడు తనకి అభయం ఇస్తాడనీ ఆశ పడింది. కాని, 'భయ పడకు' అని బుజ్జగించడానికి కూడా లేకుండా ఆ రోజున ఆయనకి మౌనవ్రతం అడ్డువచ్చింది!

**శార్దూల విక్రీడితం**

పాశ క్షుణ్ణ ఖురస్య బాణ పతన
ప్రవ్యక్త రక్త చ్ఛటా

ఛ్నాంగస్య దవాగ్ని దాహ వికల
స్యా సేదుషోఽప్యా శ్రమమ్
ధిగ్దైవం విషమా మృగస్య దివసాః
సర్వాను కంపా మయో
మాభై షీరితి భాషణేఽపి యద భూ
ద్వాచం యమోఽయం మునిః.

**మత్తేభ విక్రీడితం**

వలచే గిట్టలు సొట్టలై, శరహత
ప్రవ్యక్త రక్తాపగన్
నిలువెల్లన్ తడి ముద్దయ్యె దవ
మహాగ్నిన్ పిచ్చిదై ఆశ్రమ
స్థలి కేతెంచిన జింక కింకను నవస్థల్
తప్ప వయ్యెన్—దయా
మయు డయ్యున్ ఋషి బుజ్జగింప డకటా!
మౌనవ్రతం బూనుటన్.

*　　*　　*

ఒక లేళ్ళజంట అడవిలో ఆనందంగా ఆడు కుంటోంది. బోయ వాడు గురిచూచి వదిలిన బాణం తగిలి, ఆడ లేడి నేలకి ఒరిగి పోయింది. కిరాతుని భయంకరమైన కోరచూపులు మగలేడి హృదయంలోంచి దూసుకు పోయాయి. బాణం దెబ్బతగిలిన లేడి ప్రాణాలు వదిలేసి, నొప్పిలేనిది అయింది. అది అదృష్ట వంతురాలే. కాని, విషపుచూపులు గుండెలో గుచ్చు కున్న దుప్పి మాత్రం ఆ జన్మాంతమూ మనోవ్యాధితో కృశిస్తానే ఉంది!

**ఉపజాతి**

విద్ధామృగీ శాత శిలీ ముఖేన
మృగస్తు తత్కాతర వీక్షితేన
విహాయ దేహం విగత వ్యథైకా
పరస్య జీవా వధి రాధి రాసీత్.

**పంచచామరం**

కురంగి బోయ వాని వాడికోల
దెబ్బచే బడెన్
కిరాత కాత రేక్షణోగ్ర కీల
సోకె దుప్పికిన్
తొరంగి దేహమున్ కురంగి
నొప్పి లేని దయ్యె, దు
స్తరాధి బాధ తప్పదయ్యె
జన్మమెల్ల దుప్పికిన్.

*　　*　　*

**చందురుడు**

త్రిలోకాధీశ్వరుడైన శంకరుని శిరస్సుమీద చంద్రుడు మహబాగా బైఠాయించాడు, అదృష్టం అంటే అతనిదీ, అని లోకులు అనుకుంటూ ఉంటారు. కాని, శివుని మూడోకంటి చిచ్చుకింద నుండి సెగపెడుతూ ఉంటే ఆ శీతకరుడు పడే బాధ ఇతరులకి ఏం తెలుస్తుందీ?

'హమేషా పాదుషా వారి సన్నిధిని ఉంటూ ఉంటాడు, అతడికేమీ, అదృష్టవంతుడు' అని ప్రజలు అనుకుంటే అనుకో వచ్చు గానీ, 'అత్యాసన్నాశ్చ రాజానః' అనే ఈతి బాధ పడే వాళ్ళకి తప్ప తెలియదంటు న్నాడు పండితరాయలు.

**వసంతతిలక**

ఆస్తే విధుః పరమ నిర్వృత ఏవ మౌళౌ
శంభో రితి త్రిజగతీ జనచిత్త వృత్తిః
అంతర్నిగూఢ నయనానల దాహదుఃఖం
జానాతి కః పరమృతే బత శీత రశ్మేః

**ఉత్పలమాల**

శంకరుమస్తకాగ్రమున చాల
సుఖమ్ముగ తిష్ఠ వేసె నీ
పంకజవైరి యంచు జనవాక్యము
కద్దు ప్రపంచమందు—మీ
నాంక విరోధి ఫాల నయనా నల
దాహ భయంక రార్తి నే
ణాంకు డొకండు తక్క పరు లారయ
నేర్తురె? బాప నేర్తురే?

*　　*　　*

దైవోపహతుడు ఎక్కడికి వెడితే అక్కడికి ఆపదలు తరుముకు వస్తాయని భర్తృహరి చెప్పిన 'ఖల్వాటో దివసేశ్వరస్య కిరణైః' అన్న శ్లోకాన్ని తలదన్నే కల్పన చేశాడు పండితరాయలు.

బడబాగ్నికి భయపడి తన జన్మభూమి అయిన సముద్రాన్ని విడిచిపెట్టి చంద్రుడు మహేశ్వరుని శిరోగ్ర భాగాన్ని స్వీకరించాడు. అక్కడ శివునికి అలంకారములుగా ఉంటూన్న పాముల బుసబుసలలో వెలువడే విషాగ్ని జ్వాలలకు భయపడి, ఆ చోటు వదిలి పెట్టి ఆకాశాన్ని చేరుకున్నాడు. అక్కడమాత్రం ఏం ఒరిగిందీ? రాహువు నోట్లోపడ్డాడు. భాగ్యహీనులను ఎప్పుడూ ఆపదలు వెన్నాడుతూనే ఉంటాయి కదా!

**శార్దూల విక్రీ**

భీతో బాడవ వాసతో జలనిధౌ
శంభోఃశిరః స్వీకృతం
తత్రత్ర్యంబక మౌళి వాసుకి విష
జ్వాలా వలీ త్రాసితః
తస్మాల్లోక మగాదిమం నిపతిత
స్తత్రైవ రాహోర్ముఖే
ప్రాయో గచ్ఛతి యత్ర భాగ్య రహిత
స్తత్రైవ యాంత్యా పదః

మత్తేభ విక్రీడితం

జలధిన్ బాడబ భీతిచే విడచి,
తచ్ఛంభూత్త మాంగోపరి
స్థలి జేరన్—అట భీషణోరగ విష
జ్వాలావళీ త్రస్తుడై
నెలరాజంబర వీధి జేర నతనిన్
వేధింపగా సాగె పే
రలుకన్ రాహువు—భాగ్యహీనులను
వెన్నాడుం గదా యాపదల్.

(సశేషం)



# క్రాస్ రోడ్సు

శ్రీ జి. వి. సుబ్బారావు

జీవితరథం, జవసత్త్వ, ఊహాసత్త్వ
పవనాశ్వాలతోవచ్చి ఆగింది
క్షణకాలం——
రహదారుల కూడలిలో
క్రాస్ రోడ్డులో!!—

ఉన్న నాలుగు మార్గాంతరాలు
ఊహా పథాని కందని విహంగాలు,
కను చూపు మేరలో ఆశా లతాంతాలు
కల్పించి, ఊరించే ఒయాసిస్సులు!—

తొలి చూపులో తెలి రేకలు,
ఎదిగే కొలది ఎఱ్ఱని మంటలు,
క్షణ క్షణాన విసిరే వేడి నిట్టూర్పులు,
ఇది తూరుపుపొద్దు విరిసిన వడగాడ్పులు!

మలి చూపులో అరుణారుణ రేఖలు,
ఒదిగే కొలది కాళ రాత్రి నీలిమలు,
క్షణ క్షణాన ముసిరే శీతల వాయు వాహినులు,
అది—మలిసంజ వెలసిన గాఢ తమాల ఛాయలు!
హిమగిరిశృంగాలు నిమ్నభావ శిఖరాలై,
భాగీరథీ పయస్సులు భగ్న జీవన సుధలై,
వింధ్యాద్రి కుహరాలు క్షుద్రాగస్త్య విహారాలై,
ఉత్తరాపథం ఉద్రిక్తభావ మథనం!

కన్యాకుమారీ నయనాంచలాలు కవోష్ణజల బాష్పాలై,
కావేరి వినీల తరంగాలు కల్లోల భావ తరంగాలై,

## క్రాస్    డ్స్

నీలాద్రి సిత శిఖరాలు నిరంతర విప్లవ శృంగాలై
దక్షిణాపథం రక్తాశ్రు గాథా నిధానం!

సమభావం, నవశక్తి, శ్రమజీవుల పథాలను,
చైతన్య లహరులై, మానవతా వికాసులై,
విహరింపగా పొగడాను నేను!

గతంలోమంచినీ, సంప్రదాయంలో సత్వాన్ని
గతులు దప్పగా ముంచే, విచిత్ర భావోద్వేగ వాహినుల—
ఉప్పెనల కూడలిని కుప్పగాకూలాను నేను!
పాతపాఠాలునెమరేసే కాపిటలిస్టులు
సంక్షేమ రాజ్యాలు స్వప్నాలుగనే సోషలిస్టులు,
కర్కశంగా సంఘాన్ని కుదిపే మార్కిస్టులు,
నెక్‌లు చెక్కడంలో సక్సెస్ గడించే నక్సలైట్లు—

భిన్న నినాదాల హోరన్న హోరులో,
చతుష్పథంలో చతుష్పాదాలలా,
సంఘం ప్రగతికి ఆటోమేటిక్ బ్రేకులా,
అంతా నడుస్తున్నారు వడిగా ఈకూడలిలో!

గొంతెత్తి కూస్తున్నారు జాతికి గుణపాఠాలు,
వంతలు పాడుతున్నారు వందిమాగధులు, ఉపనాయకులు,
వేదిక లెక్కి మాలలతో వర్షిస్తున్నారు వాగ్దానాలు,
పరిభ్రమిస్తున్నారు నాయకమ్మన్యులీ క్రాస్‌రోడ్సులో!

అయినా —
కుళ్ళు కుళ్ళుగానే మిగిలింది
సంఘం డస్టుబిన్‌లో,
అవినీతి మట్టి ఊడలా
లోతుగా పాతుకుంది లోకంలో—!
కుట్రలూ, ఖూనీలూ,
రాజకీయాలూ, దోపిడలూ,

అవిచ్ఛిన్నంగా, దినకృత్యంగా,
జరుగుతున్నాయి ఈదేశంలో—!

పేదవాడు మరీ బీదవాడుగా,
ఇజాలే నిజాలుగా,
బ్రతుకు బరువుగా,
మృత్యుముఖంగా,
నడుస్తూంది, సామాన్యుడికి,
ఏవీ లేనివాడికి!

ఈ చతుష్పథంలో —
చతురాస్యుని సృష్టికి మిన్నగా,
విశ్వామిత్రి సృష్టికి విభిన్నంగా,
విభేదాలు, ద్వేషాలు, విలయాలు
విశృంఖలంగా సృష్టింప బడుతున్నాయి—
అందుకే అంధునిలా, జాత్యంధునిలా,
నిరాశతో, నిస్పృహతో
దిగాలుపడి, దిక్కు తెలియక,
కుప్పగా, కూలబడ్డా, నీ
క్రాస్ రోడ్సులో!

సంగీత సాహిత్య మేళనంతో,
భక్తిపారవశ్యంతో,
త్రివేణీ సంగమంలా పొంగిన
త్యాగయ్య దొక దారి!

ఆత్మాశ్రియంగా
సంగీతామృతం కురిపించిన
మీరా భజన లహ
లోక తెరువు!
బహువిధ వాద్య సమ్మేళనం
వినూత్న భావ సంభరితం
పాశ్చాత్య గీతా
సంప్రదాయ మొక రీతి!

## శ్రీ స్ రో డ్సు

పరం పరాగతమొ
జన బాహుళ్యమొ
ఆపాత మధురమొ
యక్షగాన మింకొక రీతి!
కానీ, ఈ చతుష్పథంలో—
బ్యాండుమేళంలా
హిప్పీ సంగీతంలా
రాక్ అండ్ రోల్ మ్యూజిక్కులా,

వినిపిస్తుందో
అపశ్రుతి,
హార్మోనియం శ్రుతి,
అదే నా మనసులో
ఏదీ వినలేని
బధిరు దుర్గతి!—

*　　*　　*

కవిబ్రహ్మ తిక్కన్న కావ్యాద్వైత వాహినిలో,
బమ్మెర పోతన్న భక్తిభావ లహరిలో,
అల్లసాని కవనాల అల్లిక జిగిబిగిలో,
కవిసార్వభౌము గంభీర కవితా తరంగాలలో—
పయనించాను, ప్రాగ్దిశాభిముఖంగా కొన్నాళ్ళు!—

శ్లేషార్థ నిధి, రామరాజ భూషణ కంకణ నిక్వాణంలో,
ప్రౌఢార్థ మరీచి, రామలింగ కవితాంగణంలో,
ద్రావిడాన్వయమణి, రాయల సాహితీ సమరాంగణంలో,
తంజాపురీధుని, నాయకరాజ శృంగార రస ప్రాంగణంలో—
విహరించాను, పశ్చిమాభిముఖంగా కొన్నాళ్ళు—
కవనాన్ని, అవధానాన్ని కమ్మగా మలచిన కవికుల గురువులతో,
ప్రాతక్రొత్తల మేలు కలయిక గురజాడ నూత్న కలకంఠ మధురిమతో,
స్వాతంత్ర్య సమరాన సరిక్రొత్త గొంతులౌ జాతీయ వైతాళికులతో,
ఆంధ్రాభిమానమే ఆకాశమంటగా వినుతించు చారిత్రికులతో—
ఉరకలే వేసాను ఉత్తరాభిముఖంగా కొన్నాళ్ళ—

ప్రాచీన ప్రతిభా సమారోట్టు, విశ్వనాథ కవిసమ్రాట్ విశ్వవిపంచిలో,
భావ విప్లవశ్రీ, కవితా ఉషశ్రీ, శ్రీ శ్రీ మహోరఝరీ గర్జనలలో,
కృష్ణపక్షపురాత్రి నర్తించు భావకవితామూర్తి, శాస్త్రి క్రీనీడలో,
జానపదగేయాలు, భావకవి గీతాలు, దిగంబర కవితా క్రోశాలతో—
పరుగులెత్తాను దక్షిణాభిముఖంగా కొన్నాళ్ళు!—

నలుదిక్కులా నడచి
వెనుదిరిగి వచ్చాను,
రస రమ్య భావనా
లోకాల వదలి!

సెంటరులో కలలతో
ఒంటరిగ నిలిచాను,
తీరు తెన్నులు లేని
తెలుఁగు వాగుల మెదలి!!

జీవనరథం, జవసత్త్వ, ఊహాసత్త్వ
పవనాశ్వాలతో వచ్చి ఆగింది
క్షణకాలం—
రహదారుల కూడలిలో,
క్రాస్ రోడ్సులో!!!—



# సాతవాహన వెండి రూపాకృతి నాణెములు - తెలుగు లేఖనం*

శ్రీ పురాణం రాధాకృష్ణప్రసాదు

భారతదేశాన్ని పరిపాలించిన స్వదేశీ రాజులలో ప్రప్రథమంగా వెండిలో నాణెములను ముద్రించిన ఘనత ఆంధ్ర సాతవాహనులకు చెందుతుంది. గౌతమీ పుత్ర సాతకర్ణి తన పదునెనిమిదవ రాజ్య సంవత్సరంలో ఈ పని ప్రారంభించినట్లు కనపడుతుంది. ఇతడు తన ప్రత్యర్థి క్షహరాత క్షాత్రప నహపానను జయించి అతని వెండి నాణెములను తన రాజచిహ్నములతో మరల ముద్రింపించి మొదట చలామణిలోనికి ప్రవేశపెట్టాడు. ఇటువంటి పునర్ముద్రణ నాణెములు అధిక సంఖ్యలో నాసిక్ జిల్లాలోని జోగల్‌తంచి గ్రామం వద్ద, మరికొన్ని ఇతర ప్రాంతాల లోను బయటపడ్డవి. వీనిలో ఒక నాణెం నహపాన రాజ చిహ్నాలు లేకుండా కేవలం సాతకర్ణి ముద్రలతో మాత్రమే కాన వస్తున్నది. దీనినిబట్టి గౌతమీపుత్ర సాతకర్ణి ఈ పునర్ముద్రణ నాణెములతో బాటు తన ముద్రలతో క్రొత్త నాణాలను గూడా చలామణిలోనికి ప్రవేశపెట్టినట్లు విదితం అవుతుంది.[1]

## రూపాకృతి నాణెములు

ఇవిగాక సుమారు పన్నెండుకు పైగా వీరివే వెండి నాణాలు ఒకవైపు రాజ రూపాకృతి (Portrait) ఉన్నవి కూడా లభించినవి. గౌతమీపుత్ర సాతకర్ణి వెండి నాణాలను ముద్రించటం ప్రారంభించగా అతని తర్వాత వాడైన వాసిష్ఠీపుత్ర పుళుమావి తన నాణెముల మీద రాజచిత్రాన్ని గూడా ముద్రించే ఆచారాన్ని ప్రవేశపెట్టినట్లు,దీన్ని అతని తర్వాత వారైన వాసిష్ఠీపుత్ర సాతకర్ణి, గౌతమీ పుత్ర యజ్ఞశ్రీ సాతకర్ణి కొనసాగించినట్లు ఇప్పటిదాకా పండితులు ఊహిస్తున్నారు. వారి వారి చిత్రాలు, పేర్ల మార్పుతో ఈ నాణేలన్నీ ఒకే తరగతికి చెందుతవి. స్థూలంగా వాటి పోలికలు ఇట్లా ఉంటవి.

ముందువైపు : కుడిప్రక్కకు తిరిగిన ముఖముతో రాజు తల. నుదుటిమీద శిరోమణి, దీర్ఘనాసిక, ఘనమైన కుండలములతో అలంకృతమైన కర్ణము, ముఖ్యలక్షణాలు.బొమ్మచుట్టూ అంచు వెంట బ్రాహ్మీలిపిలో ప్రాకృత భాషలో రాజుబిరుదు, మాతృపూర్వక నామము. (metronymic)

వెనుక వైపు : చంద్రవంకతో కూడి ఆరు ఆర్చీలతో నున్న కొండ గుర్తు ఎడమప్రక్కగాను, చంద్ర వంకతో కూడిన 'ఉజ్జయినీ' చిహ్నము కుడి ప్రక్కగాను, రెండు చంద్రవంకల నడుమ సూర్య చిహ్నము, కొండ క్రింద అడ్డంగా మెలికల గీత. (చిత్రము:6). చుట్టూ అంచు వెంబడి దక్షిణాదిన వాడుకలోనున్న బ్రాహ్మీ అక్షరములతో ద్రావిడభాషలో రాజు బిరుదు, మాతృపూర్వక నామము.

ఈ నాణేలను ముద్రించటంలో సాతవాహనులు తమ సమకాలీనులైన క్షహరాటులు, కర్దమక క్షాత్రపుల మార్గాన్ని అనుసరించారు. తదనుగుణం గానే రాజ చిత్రాన్ని ప్రవేశపెట్టారు. ఇది ఒక విధంగా విదేశీ ప్రభావంవల్లనే అయినప్పటికి కొంతవరకు భావానుకరణం మాత్రమే అయి తన స్వలక్షణాలతో ప్రత్యేకతను నిలుపుకున్నది.




సాతవాహన రాజుల రూపాకృతులు—నాణెములు. 1, 2—గౌతమీ పుత్ర సాతకర్ణి, 3, 3a వాసిష్ఠీ పుత్ర పుళుమావి, 4—7 వాసిష్ఠీ పుత్ర సాతకర్ణి, 8—10 గౌతమీ పుత్ర శ్రీ యజ్ఞ సాతకర్ణి.

సాతవాహనులు క్షాత్రపులవలెనే (1) ఒకే మాదిరి నాణేలు (2) ఒకే లోహం వెండిలో (3) రాజ రూపాకృతితో (4) రెండు భాషలతో ముద్రించే ఆచారాన్ని పాటించారు. బరువు, పరిమాణం, ముద్రలు మొదలగువాని విషయంలో గూడ స్థూలంగా ఇవి ఎక్కువ భాగం క్షాత్రపుల నాణేలతో పోలి ఉంటవి. ఈ పోలికలతోబాటు కొన్ని ప్రత్యేకతలుగూడ కనపడతవి. రాజ చిత్రాలు పూర్తిగా భారతీయ సంప్రదాయ పద్ధతిలో ఉండటం, క్షాత్రపుల వలె భుజంవరకు కాకుండా రోమను నాణెములమీది చక్రవర్తుల చిత్రాలలో వలె మెడవరకే రాజ చిత్రాన్ని పొందుపరచటం, క్షాత్రపులవలె పితృపూర్వక (Patronymic) నామములుకాక తమ ఆచార పద్ధతిలో మాతృపూర్వక (Metronymic) నామములు వ్రాయించటం గమనించదగ్గ విషయాలు. శక క్షాత్రపులు తమ మూల స్థానాన్ని, రాజరిక ప్రదేశాన్ని సూచిస్తూ తమ నామాదులు ఖరోష్ఠి, ప్రాకృతభాషల్లో ఖరోష్ఠి, బ్రాహ్మీ లిపులలో వ్రాయించినట్లుగా సాతవాహనులు కూడా తమ రాజరిక ప్రదేశాన్ని, మూలస్థానాన్ని సూచిస్తూ వరుసగా రాజభాష ప్రాకృతంలోనూ మాతృభాష తెలుగులోనూ తదనుగుణమైన బ్రాహ్మీ లిపులలో తమ నామాదులు వానిమీద వ్రాయించటం ప్రత్యేకంగా గమనార్హం.

ఇక పోతే, రాజ చిత్రాలు ప్రత్యేక ప్రాముఖ్యతను సంతరించుకున్నవి. ఆ రాజుల ఆకార లక్షణాదులకు సంబంధించి ఇవే ఇప్పటివరకు మనకు తెలిసిన నమ్మకమైన ప్రతి చిత్రాలు. వారు చాలా బలంగాను, దృఢంగాను ఉండి ఒక విధంగా సునిశితమైన నిశ్చిత బుద్ధితో కూడిన దృష్టితో కనిపిస్తారు. విశేషంగా పుళుమావి తన వంపు తిరిగిన దీర్ఘనాసికతో తీక్షణ దృష్టితో అచంచలుడుగా, గంభీరుడుగా కన్పిస్తాడు. (చిత్రం : 3) వారు విశాలకర్ణములతోనూ, కర్ణ రంధ్రములలో పొడుగుపాటివి, బరువైనవి అయి భుజాలను తాకుతూ వ్రేలాడుతూ ఉండే కర్ణ కుండలాలతో కొట్టవచ్చినట్లుగా కన్పిస్తారు. ముఖ్యంగా యజ్ఞ సాతకర్ణి కుండలాలు దీర్ఘంగా భుజాలను తాకుతూ తెలుగుదేశంలో సంప్రదాయకంగా ఇప్పుడు కూడా మనం చూచే సోమయాజుల కుండలాలవలె ఉండటం విశేషమైన విషయం. సాధారణంగా వారు శిరోవేష్టనాలు లేకుండా విరియబోసిన కేశములతో ఉంటారు. తన మూడు నాణెములమీద యజ్ఞ సాతకర్ణి మున్నుని తలతో కణతలపైనుంచి చెవులదాకా ఒక విశేషమైన ఆభరణంతో కన్పిస్తాడు. ఇంకో విశేషం ఏమిటంటే తన అన్ని చిత్రాలలోనూ వెనుక ప్రక్క శిఖతో ప్రముఖ బ్రాహ్మణుని వలె, వైదిక క్రతుకర్త (సోమయాజి)వలె కన్పిస్తాడు. (చిత్రం : 8, 9.)పూవు వలె గుండ్రంగా ఉండి మధ్యలో ప్రధాన రత్నంతో చుట్టూ ఎనిమిది చిన్నరత్నాలతో కూర్చబడిన శిరోరత్నం బహుశా రాజ లాంఛనం లేక కిరీటం వంటిది అందరు రాజులకు ఫాలభాగంలో కన్పిస్తుంది.

డా॥ పరమేశ్వరీ లాల్ గుప్తాగారు సాతవాహన నాణేలలో లెక్కించదగిన నాణేన్ని ఒకటి ప్రకటించారు.[2] ఇది కొంతవరకు అరిగిపోయి ఉంది. దీనికి వెనుక వైపు చంద్రవంకతో కూడిన ఆరు ఆర్చిల కొండ గుర్తు, 'ఉజ్జయినీ' చిహ్నము ఉన్నవి. వాటి ఆర్చిలలోను, భుజములలోను చిన్న బిందువులుకూడ కనపడుతవి. ముందువైపు కుడిప్రక్కకు తిరిగిన ముఖముతో రాజు తల వెనుకకు విరియబోసిన కేశములతో ఉంటుంది. దీర్ఘనాసిక, రంధ్రముతో ఉన్న కర్ణము స్ఫుటంగా ఉన్నవి. కర్ణ రంధ్రం దగ్గర అస్ఫుటంగా ఉన్న ఆభరణం బహుశ కర్ణకుండలం వంటిది ఉన్నది. రాజుకు మీసకట్టు స్ఫుటంగా కన్పిస్తుంది. (చిత్రం : 1—2) అసంపూర్ణంగా, అస్పష్టంగా పైవైపు '...తసమ...'; వెనుకవైపు '...రహణష...'అనే అక్షరాలు కన్పిస్తవి. ఇవి దీని లక్షణాలు. వీటినిబట్టి ఇది గూడ సాతవాహనులకు చెందిన నాణెం గానే తోస్తుంది. దీని మీది చిహ్నాల క్రమాభివృద్ధిని ఆధారంగా దీనిని ఎవరు ముద్రించింది తెలుసుకో ప్రయత్నిద్దాం.

పుళుమావి నాణేల నుంచి యజ్ఞశ్రీ నాణేల వరకు రాజ రూపాలను ముద్రించటంలో నాణ్యత

వైపుకు క్రమాభి వృద్ధిని చూస్తాం. పనితనం స్పష్ట మైన, ముచ్చటైన పద్ధతిలో రాజ రూపంలోని అన్నిభాగాలను, రూపావరణను (Outline) చక్కగా ప్రకటిస్తుంది. వెనుకప్రక్క గూడా చిహ్నాలు, అక్ష రాలు, బిందువులతో చుట్టూ ఉండే అంచు పనితనంతో అందంగా చేయ బడ్డవి. ఈ లక్షణాలు ఏవీ మన ప్రస్తుత నాణెం మీద చూడం. రాజరూపం అవాస్త విక పద్ధతిలో ఉంది. కేశాలంకరణ సరిగా చేయబడ లేదు. ముఖలక్షణాలు, కన్ను, గడ్డం కూడా సరిగా చేయబడ్డ రూపాలలో ఉండవు. వెనుకప్రక్క గూడా చిహ్నాలలో స్పష్టత, సునిశిత నైపుణ్యం పనితనంలో లోపించినవి. చిత్రకారుడు రాజ రూపాన్ని మిగతా రాజ రూపాలవలె స్ఫుటంగా ప్రకటించ లేక పోయినాడు. ఇవన్నీ గూడా సాతవాహన నాణేల వరుసలో ఈ నాణెం యొక్క మొదటి స్థానాన్ని సూచిస్తవి.

వీనికి తోడు, రాజు ముఖంమీది మీసకట్టు సాతవాహన రాజుల విషయంలో క్రొత్తది. పుళుమావి గాని, వాసిష్ఠీ పుత్ర సాతకర్ణిగాని, యజ్ఞసాతకర్ణిగాని వారి వారి నాణేలమీద మీసకట్టుతో చూపించ బడలేదు. ఇది క్షాత్రవుల నాణెముల ద్వారా మనకు లభించిన విదేశీ ఆచారంగా తోస్తుంది. ఎందుకంటె వారి నాణెములన్నింటి మీద తప్పని సరిగా రాజు లందరూ మీసకట్టుతోనే చూపించ బడ్డారు. ఇది మనకు ఎట్లా సంక్రమించి ఉంటుందంటే, మన టంకసాల అధికారులు మొదటిసారిగా రూపాకృతితో నాణేల మూసలు తయారు చెసేటప్పుడు క్షాత్రవుల రూపాకృతి నాణేన్ని ఒకటి నమూనాగా ఊహించి దాని ననుసరించి రాజుగారి దీర్ఘనాసిక, కర్ణములు, కర్ణ కుండలములు, విరియబోసిన కేశపాశము, మొద లయిన లక్షణాలను పొందుపరుస్తూ వానితోపాటు రాజుగారి మీసకట్టుకూడా చిత్రంలో ఇమిడ్చి ఉంటారు. కాని ఈలక్షణం భారతీయ కళలో అసామాన్య విషయం. భారత కళాకారుడు ఆకాలం లోనూ, అంతకుపూర్వము, తర్వాత గూడా ఈ మీస కటు చూపించటం అనేది సంప్రదాయ విరుద్ధం గానో అశుభకరమైనది గానో తలచి దాన్ని రాజులకూ మీసకట్టు ఉండి ఉంటుందను కోటానికి అవకాశం ఉన్న యోధులకు గూడా చూపించటం మానివేశాడు. ఏమైనప్పటికి, ఈ పద్ధతికి తరువాత వారైన పుళు మావి, సాతకర్ణి, యజ్ఞశ్రీ స్వస్తిచెప్పి మీసకట్టు చూపించటం మానివేశారు.

నాణేనికి వెనుకప్రక్క చిహ్నాలలోని ఆర్చీలలో భుజాలలో చిన్న చిన్న బిందువులు కానవస్తవి. ఈ లక్షణం గౌతమీపుత్ర సాతకర్ణి ముద్రించిన జోగల్ తంచి సమూహంలోని కొన్ని నాణేలమీదనే కనపడు తుంది. దీన్నిగూడా అతని తరువాత రాజులు వెండి నాణేల మీదినుంచి ఉపసంహరించి వేశారు.

కాబట్టి ఈ యదార్థాలన్నీ గమనించినట్లయితే ఈ నాణెం సాతవాహన వెండినాణేల వరుసలో ముందు స్థానాన్ని ఆక్రమించి బహుశ వెండినాణేలను చలా మణి లోనికి ప్రవేశపెట్టిన గౌతమీపుత్ర సాతకర్ణికే చెంది ఉంటుంది. అట్టి సందర్భంలో గౌతమీపుత్ర సాతకర్ణి తన ప్రత్యర్థి నాణేలను పునర్ముద్రించి, అదేవిధంగా తన క్రొత్త నాణేలను గూడా ప్రకటించి, ఇవి ఏవీ గూడా తను క్రొత్తగా ఆక్రమించిన ప్రత్యర్థి రాజ్యప్రజలు వాడకానికి అలవాటుపడ్డ రూపాకృతి నాణేలతో సరితూగక పోవటం గమనించి తన రూపా కృతి నాణేలను గూడా ప్రవేశపెట్టినట్లు తోస్తుంది.

ఈ విధంగా సాతవాహన చరిత్రలో, స్వతం త్రంగా మొట మొదటిసారిగా వెండిలో నాణేలను, రూపాకృతి నాణేలను గూడా ముద్రించిన ఘనత ప్రతిభాశాలి, పరాక్రమశాలియైన గౌతమీపుత్ర సాతకర్ణికే చెందుతుంది.

## 2

## తెలుగు లేఖనం

పశ్చిమ క్షాత్రవుల నాణెముల మీది వలెనే సాత వాహన నాణేలమీద గూడా రెండు భాషల్లో లేఖనం (Legend) ఉంటుంది. ప్రతి నాణేనికి రెండువైపులా ఉంటుంది ఈలేఖనం. కాని ముఖ్యంగా వెనుకవైపుది

అస్పష్టంగానూ, అసంపూర్ణంగాను కన్పించటంచేత భండార్కరు, అల్తేకరు మొదలయిన పండితులు దీన్ని వివరించటానికి చేసిన ప్రయత్నాలన్నీ సంతృప్తికరంగా ఫూర్తిఫలితాన్ని సాధించలేక పోయినవి. కాని డాక్టరు దినేశచంద్ర సర్కారు గారు వాసిష్ఠిపుత్ర సాతకర్ణికి చెందిన స్పష్టమైన ఒక నాణేన్ని ఆధారంగా తీసికొని తృప్తికరంగా చదివి దాన్ని వివరించటమే కాకుండా యజ్ఞశ్రీ సాతకర్ణి తాలూకూ, రాప్సన్ ప్రకటించిన నాణేలమీద లోపించిన భాగాలను గూడా పూరించారు[3].

ముందువైపు, అలాగే వెనుకవైపు ఉన్న లేఖనాలు అందరు రాజుల నాణేలమీద, వారి మాతృపూర్వక నామములు మినహాయించినచో ఒకే మాదిరిగా ఉంటవి. ఇంకా రాప్సన్ చెప్పినట్లు ప్రతిఒక్క రాజు నాణేలమీది రెండు వైపుల లేఖనాలలో లిపి, ఉచ్చారణ భేదాలే కాని భావం మాత్రం రెండింటిలోనూ ఒక్కటే. ముందువైపు లేఖనం బ్రాహ్మీ లిపిలో సంస్కృత ప్రభావంతో ఉన్న ప్రాకృతంలో ఉంది. ఇది వెనక వైపున ఒక ద్రావిడ భాషలోకి అనువదించబడి దక్షిణదేశంలో వాడ బడే అక్షరాలతో ఉండే బ్రాహ్మీ లిపిలో వ్రాయబడిఉంది. ఈ లిపిని గూర్చి రాప్సన్ ఇలా అంటారు.[4] 'వెనుక వైపు లేఖనం ఒక రకమైన బ్రాహ్మీ అక్షరములలో వ్రాయబడ్డది. ఈ రకమైన అక్షరాలు మనకు ఎక్కడా లభ్యం కాక పోయినప్పటికి భట్టిప్రోలు లేఖనం లోని అక్షరాలకు చాలా దగ్గరి పోలికతో కన్పిస్తున్నవి. బహుశ ఇవి అక్షరాల క్రమ పరిణామంలో ఒక తరువాత దశను సూచిస్తున్నవి. దీన్ని బుల్హార్ పండితుడు ద్రావిడ రూపాంతరమైన బ్రాహ్మీ అన్నారు.'

వాసిష్ఠిపుత్ర సాతకర్ణి నాణేలమీద ముందు వైపున ఉన్న లేఖనం ప్రాకృతంలో ఇట్లా ఉంటుంది. 'రాఞోవాసిఠీ పుతస సిరి సాత కణిస' (సంస్కృతంలో: రాజ్ఞః వాసిష్ఠీ పుత్రస్య శ్రీ సాత కర్ణేః). తెలుగులో రాజునకు వాసిష్ఠి పుత్రునకు శ్రీ సాత కర్ణికి' (చెందిన నాణెము) అని అర్థం వస్తుంది. డాక్టరు సర్కారుగారి అభిప్రాయంలో భాష ద్రావిడ ప్రాకృతం లోకి, దాక్షిణాత్య రూపాంతరాలైన బ్రాహ్మీ అక్షరాలతో, వెనుక వైపున ఇట్లా అనువదించబడ్డది. 'అరహణష వాహిట్టి మాకనష తిరు హాత కణిష' దీనిలో షష్ఠి విభక్తి ప్రత్యయాన్ని సూచిస్తూ 'స' కు మారుగా 'ష' వాడబడ్డది. 'అరహణ, మాకన' వరుసగా రాజు, కుమారుడు అనే అర్థం కలిగిన ద్రావిడ పదాలనుంచి వచ్చిఉంటవి. ఇంకా సాతకర్ణి హాతకణి గాను, సంస్కృతంలోని వాసిష్ఠి ప్రాకృతంలో 'వాహిట్టి'గాను మార్పు చెందినట్లు, అరహణలోని 'హ' కూడా మార్పుచెందిన 'స' లేక 'శ' ను సూచిస్తుంది. ప్రస్తుతం తమిళంలో వాడబడుతున్నట్లుగా 'తిరు' పదం సంస్కృతంలో 'శ్రీ', ప్రాకృతంలో 'సిరి' పదాలకు రూపాంతరమై ఉంటుంది—అంటారు డా॥ సర్కారు గారు. యజ్ఞ సాతకర్ణి నాణేలమీద హిరు (సిరి=శ్రీ) అనే పదాన్నిగూర్చి చెప్తూ సాత వాహన సాహిత్యంలోనూ, శాసనాలలోనూ కూడా శక్తి, సాత అనే పదాలకు వరుసగా హకు, హాల అనే రూపాలు వాడబడి ఉండటం గుర్తుకు తెస్తారు రాప్సన్‌గారు.

ఈ వివరణం మన్నించ దగింది గానూ, తృప్తికరం గానూ ఉన్నదనటంలో సందేహంలేదు. అయినప్పటికీ, నా ఉద్దేశ్యంలో, 'ష' గా చదివిన అక్షరం 'కు' అయి ఉంటుంది. ఈ—కు—రూపం సమకాలీన సాతవాహన శాసనాలలోనూ, తరువాతవి అయిన ఇక్ష్వాకుల, బృహత్ఫలాయనుల శాసనాలలోనూ కూడా కన్పిస్తుంది.[5] తెలుగులో 'కు' షష్ఠి విభక్తి ప్రత్యయం. నా ఉద్దేశ్యంలో ప్రస్తుత లేఖనం ఆ రోజుల్లో ఆంధ్ర దేశంలో వాడుకలో ఉన్న బ్రాహ్మీ లిపిలో వ్రాసిన తెలుగు లేఖనం అయి ఉంటుంది.

ఇంకా డా॥ సర్కారుగారు గమనించిన అరహన్ మాకన్ పదాలు అకారాంతంగా (అరహన, మాకన అని) వ్రాయబడ్డవి అనేది తెలుగుభాషకు ముఖ్య లక్షణం. ఎందువల్లనంటే తెలుగు అజంతభాష కావటంవల్ల అన్ని మాటలు, వాక్యాలు కూడా తెలుగులో అచ్చు శబ్దంతో ముగుస్తవి. కు—విభక్తి ప్రత్యయం పదానికి

పరమైనప్పుడు సుగాగమం జరుగుతుంది. అందువల్ల ఈ రెండు పదాలకు అరసనకు, మాకనకు అనే రూపాలు ఏర్పడ్డవి.

తెలుగుమీద కలిగిన సంస్కృత ప్రభావం మూలాన చాలా ద్రావిడ పదాలు వాడకంలో నుంచి జారి పోయినప్పటికి అదృష్టవశాత్తూ ఈ రెండు పదాలు సాహిత్యంలో మధ్య శతాబ్దాల వరకు ఇంకా ప్రస్తుతం కూడా వాడుకలో దొరుకుతవి. కన్నడ, తులు భాషల్లో వలె తెలుగులో కూడా తమిళంలో కన్పిస్తున్న అరసన్ పదానికి సమపదం అరసు, అరసుడు లేక అరుసు అనేది. దీనికి అర్థం రాజు. దీని వాడుక పదునాల్గవ శతాబ్దందాకా తెలుగులో కన్పిస్తుంది.6 అలాగే మగన్ పదానికి సమమైనది మగణ్డు లేక మగఁడు.7 డు — అనేది ప్రథమ పురుష ఏకవచన ప్రథమా విభక్తి ప్రత్యయం. ప్రాచీన శతాబ్దాలలో ఈ పదం 'కొడుకు' అనే అర్థంలో వాడుకలో ఉన్నట్లు కన్పిస్తున్నా తరువాత తరువాత ఆ అర్థాన్ని పోగొట్టుకొని ధైర్యవంతుడు, నాయకుడు, మగటిమి కలవాడు అనే అర్థాలతో ప్రయోగింప బడుతూ భర్త, పెనిమిటి అనే అర్థంతో గూడా వాడుకలోని వచ్చింది. దీనికి కారణం—తెలుగుమీద సంస్కృత ప్రభావం అధికం అవుతూ వచ్చినకొద్దీ సుతుడు, పుత్రుడు, తనయుడు కుమారుడు, నందనుడు మొదలయినఅనేక సంస్కృత పదాలు కొడుకు—అర్థంలో వాడుక లోకి రావటమే. డా॥ సర్కారు గారు తలచినట్లు మాకన్ పదంలో 'ఆ—'కారం బహుశ ఆ పదానికి ఉన్న సహజ ఉచ్చారణే కావచ్చు. మాకన్ అనేది తెలుగు లోని మగడు పదానికి మూలద్రావిడ రూపమై ఉండవచ్చు.

తిరు అనేపదంగూడ తెలుగులో అధికంగా వాడుకలోఉన్న పదమేకాని ఇప్పటివలె వ్యక్తులపేర్లకు ముందు గౌరవ వాచకం శ్రీ వలె కాదు. దైవ సంబంధమైన విశేషణంగా ఉంది.

ఉదా: తిరునాళ్లు: దేవుని ఉత్సవపు రోజులు.
తిరుపతి: శ్రీపతి.
తిరునీరు: నొసట ధరించే విభూతి. మొద॥ ప్రాచీనకాలంలో దీని వాడుకను గూర్చిన ఉదాహరణలు గూడ సాహిత్యంలో అనేకం లభ్యమవుతవి.

కాబట్టి పైమూడు పదాలు సంబంధ షష్ఠీ విభక్తి—కు— ప్రత్యయంతో పూర్తివాక్యాన్ని ఇస్తవి. 'అరహణకు వాహిట్టి మాకనకు తిరు హాత కణకు' ఇది ఇప్పటి తెలుగులో రాజునకు వాసిష్ఠి పుత్రునకు శ్రీ సాత కర్ణికి (సంబంధించిన నాణెము) అనే అర్థాన్ని సూచిస్తుంది. ఇక్కడ ఇంకో విషయం కూడ ఉంది. షష్ఠీ ప్రత్యయం అరహణ, మాకన, హాత కణే అనే మూడు పదాలకు చేర్చటం జరిగింది. (విశేషణ విశేష్యలకు అన్నింటికి) ఇది ప్రస్తుతం తెలుగులో ఆచారం కాదు. అయినప్పటికి ఇదిగూడా సంస్కృత సంప్రదాయ ప్రభావమే. ఒకప్పుడు వాడుకలో ఉండి క్రమేణా అంతరించినా, ఇప్పటికి కావ్యాలలో 'షష్ఠ్యంతములు' అనే పద్యాలలో ఇంకా మిగిలి ఉంది.

ఈ విధంగా ఈ లేఖనం పూర్తిగా తెలుగులో ఉంది. అంతే కాదు.ఇది క్రీస్తు శకారంభంలో తెలుగులో ప్రచారలోంఉన్న ఒకానొక దేశిచందస్సులో కూర్పబడ్డట్లుగా కూడా కన్పిస్తుంది. ప్రాచీన శిలా లేఖనాలు చూచినట్లయితే వానిలో చాలాభాగం 'ద్విపద గతిరగడ, మహాక్కర, తరువోజ, సీసం, ఆటవెలది మొదలయిన దేశీ చందస్సుల లోనూ, చంపకమాల, ఉత్పలమాల, మత్తేభం, మొదలయిన సంస్కృత వృత్తాలలోనూ కూర్పబడినట్లు చూస్తాం.8 తెలుగు రాజులు తమ శాసనాలు ఛందో బద్ధంగా రకరకాలైన పద్యాలలో వ్రాయించటానికి ఉత్సాహం కనపరచినట్లు తెలుస్తుంది. వాసిష్ఠిపుత్ర సాతకర్ణి నాణెంమీది లేఖనం ఇరువది మూడు మాత్రలతో రెండు, పదునైదవ అక్షరాలలోని హల్లులమీద ప్రాస యతితో కూర్చబడిఉంది. యజ్ఞ సాతకర్ణి నాణెంమీది వెనుకవైపు లేఖనంలో 'మాకనకు తిరు' అనే పదాలు 'పుతకు హిరు' అనే పదాలుగా అర్థంలో మార్పులేకుండా మార్చి వ్రాయటం జరిగింది. బహుశ ఈ మార్పు ఎందుకు జరిపి ఉంటారంటే రాజు పేరులో 'య ఞ' అనే రెండు మాత్రలు

ఎక్కువగా ఉండటం చేత ఈ రెండు మాత్రలు ఇముడ్చు కోవటాని కోసం—మాకనకు—అనే అయిదు మాత్రల పదానికి మారుగా— పుతకు—అనే మూడు మాత్రల పదాన్ని వాడుకొని చందస్సులు సరిపుచ్చు కోవటానికై ఉంటుంది. ఇలా చేసి ఇక్కడ కూడా ఇరువదిమూడు మాత్రలతోనే ఛందస్సు వ్రాశారు. ఇక్కడ యతిని మొదటి, పదునాలుగు అక్కరాల మీద చూపించారు. రెండు సందర్భాలలోనూ గూడా యతిని పదునైదవ మాత్ర మీదనే చూపించారు. ఒకేవిధమయిన ఛంద స్సును వాడారు. ఇది మాత్రా ఛందస్సు మీద ఆధార పడి ఉండే రగడలలో ఒకదానికి సంబంధించిన దేశి ఛందస్సు అయిఉంటుంది.

| 5 | 5 | 5 | 5 | 3 |
|---|---|---|---|---|
| అర హణకు | వాహిట్ఠి | మాకనకు | తిరు హాత | కణకు॥ |
| అ రహణకు | గోతమి | పుత కుహిరు | యఞ హాత | కణకు॥ |

ఈ లేఖనాలను గూర్చి సర్వశ్రీ ఆర్. నాగస్వామి, యస్. రామయ్యగారల వాదం[9] అంత సమంజసంగా కన్పించదు. ఈ లేఖనం తమిళం అయి ఉంటుందని వారిద్దరూ అభిప్రాయ పడ్డారు. నాగస్వామి గారు ఈ లేఖనంలోని 'హ' దాక్షిణాత్య 'దామిలి' శిలా లేఖనాల లోని 'చ'ను పోలిఉందని తలచి అందువలన మాట లను అరచన, వాచిట్ఠి, చాతకణె అని చదవాలని ఇది పూర్తిగా తమిళ లేఖనమని అభిప్రాయపడ్డారు. కాని వారి 'చ' సూత్రాన్ని యజ్ఞసాతకర్ణి నాణెం మీది ఇటువంటి లేఖనానికే అమలు పరచినట్లయితే అందులోని హిరు యఞ హాతకణ అనేపదాలను చిరు యఞ చాతకణగా చదువ వలసి ఉంటుంది. ఇది అంత సబబు అయిన అర్థాన్ని ఇవ్వదని నా తలంపు. ఈలేఖ నాలలో వాడిన 'హ' క్రింది వంపు కుడివైపుకు తిరిగి ఉండేట్లు వ్రాసిన ఒకవిధమైన బ్రాహ్మీ అక్షరమే అయి ఉంటుంది.ఇంకా ఈ లేఖనంలో కు—అనే అక్షరాన్ని ష—గా చదివి ఇది సంస్కృతంలో స్య—కు, తమిళంలో అ—కు మధ్యస్థంగా ధ్వనిస్తుందని షష్ఠీప్రత్యయం కావచ్చునని అన్నారు. కాని శ్రీ రామయ్య గారు ఈ ష— అనే అక్షరం తమిళానికి క్రొత్తది అన్నారు.

గౌతమీ పుత్ర సాతకర్ణి, పుళుమావి నాణేల మీద గూడా రెండువైపుల లేఖనాలు ఉన్నవి. వానిలో వెనుకవైపు వానిని డా॥ గుప్త, డా॥ అల్తేకరు గారలు వరుసగా '...రహణష...' అని, 'రఞో (వాసి)ష్ఠి (పుత్రష (హి) రు పుళు (మావిష)' అని చదివారు. నాగార్జునకొండ త్రవ్వకాలలో పుళు మావి వెండినాణేల వెనుక ప్రక్కభాగం ముద్రణకు ఉపయోగపడే మట్టిమూస ఒకటి దొరికింది. దాని మీది అక్షరాలు ఇలా చదువగలం:'అర...కు తిరు పుళు మావికు' చుక్కలుపెట్టిన భాగం మూస అంచు దాటి బయటకు పోవటం చేత కనపడదు—(చిత్రం: 3 A) ఈమూడు లేఖనాలు గూడ తెలుగు అనే సంగతి విదితం అవుతుంది. అంటే ఇలా తమ నాణేల మీద తెలుగు లేఖనాలు ముద్రించే ఆచారం గౌతమీపుత్ర సాతకర్ణి కాలంనుంచే ప్రారంభమయిందన్న విషయం తెలుస్తున్నది.

సాతవాహన నాణేలమీది ఈ తెలుగు లేఖ నాలు రెండు కారణాలచేత ప్రాముఖ్యం పొందినవి. మొదటిది: తెలుగు సాహిత్య చరిత్రలో ఈవాక్యమే మనకు ఇప్పటివరకు తెలిసిన మొదటి ప్రాచీన లేఖనం. లోగడ స్వర్గీయ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు క్రీస్తుపూర్వం రెండవ శతాబ్దానికి చెందిన అక్షరా లలో 'నాగబు' అనే ఒక పదాన్ని అమరావతి శిల్పాల మీద కనుగొన్నారు. మిగతా లేఖనాలు ఇప్పటి దాకా మనకు లభ్యమయిన వన్నీ క్రీ. శ. అయిదవ శతాబ్దం, తర్వాత కాలానికి చెందినవే. అందువల్ల ఇప్పటివాక్యం క్రీస్తు శకారంభంలోని సాతవాహనుల కాలం నాటి తెలుగు స్వరూపాన్ని గూర్చి పరిశీలించటానికి చక్కని అవకాశాన్ని ఇస్తుంది.

రెండవది: సాతవాహన రాజులు దీన్ని తమ నాణేలమీద వాడవలసిన అవుసరం. పురాణాల్లో సాతవాహనులు ఆంధ్రులని పేర్కొన బడింది. అందు వల్ల వారి మాతృభాష తెలుగు అనేది స్పష్టం. గౌతమీ పుత్ర సాతకర్ణి పశ్చిమాన క్షాత్రపులతో విరో ధించి వారి భూ భాగాన్ని ఆక్రమించు కొన్నప్పుడు అక్కడ క్షాత్రపుల వెండి నాణేలు చలామణిలో ఉండటం మూలాన తాను గూడా వెండి నాణేలను ముద్రించ వలసిన అవుసరాన్ని గమనించాడు. మొదట వెండిలో సాధారణ నమూనాలో తన నాణేలను ముద్రించి నప్పటికి స్థానిక ప్రజలు క్షాత్రపుల రూపా కృతి నాణేల వాడుకకు అలవాటుపడి ఉండటం చేత తాను గూడా వాని ఉరవడినే అనుసరించి ఈ

రూపాకృతి నాణేలను ద్విభాషా లేఖనాలతో ముద్రింపించాడు. అలా చేసేటప్పుడు, క్షాత్రపులు తమ స్వభాష ఖరోష్ఠిలోగూడా లేఖనాలు వ్రాయించినట్లే, ఇతడున్నూ తమ మాతృభాష తెలుగులో కూడా, అప్పుడు దక్షిణాదిన తెలుగు దేశంలో వాడుకలో ఉన్న బ్రాహ్మీ లిపిలో, లేఖనాలు వ్రాయించాడు. నాణేల ముందువైపు లేఖనాలు రాజభాష ప్రాకృతంలో వేయించటం జరిగింది—గనుక అవి రాజ్యపు ఉత్తర ప్రాంత ప్రజల వాడకాని కైనప్పటికి ఇబ్బంది కలుగటానికి అవకాశంలేదు. ఈనాణేలు దొరకిన ప్రదేశాలను బట్టి చూచినట్లయితే సామ్రాజ్యపు ఉత్తర రాష్ట్రాలలోనే అవి వాడుకలో ఉన్నట్లు కన్పిస్తుంది. అయినప్పటికి వానిని, ఈ తెలుగు లేఖనాలతో, ముద్రింపించటం మాత్రం విజయపురి (నాగార్జునకొండ) వంటి తెలుగుదేశపు టంకసాలలో జరిగి ఉంటుంది.

ఈవిధంగా సాతవాహన రాజులు తమ తెలుగుతనాన్ని సూచిస్తూ తెలుగులోనూ, బహు భాష ప్రాంతాలమీది అధికారాన్ని ప్రకటిస్తూ రాజభాష ప్రాకృతంలోనూ పొందుపరచిన లేఖనాలతో తమ రూపాకృతి నాణేలను ప్రకటించారు. రెండు భాషలకు లిపి బ్రాహ్మీ ఒకటే అయినప్పటికి అప్పుడు తెలుగు దేశంలో వాడుకలోఉన్న బ్రాహ్మీ అక్షరాలలోనే తెలుగు లేఖనాన్ని వ్రాయించారు. మధ్య భారతంలో సాతవాహన రాజ్యారంభ కాలంనుంచి ఇప్పటి ఆంధ్ర ప్రాంతం వారి అధీనంలో ఉన్నదీ లేనిది సందిగ్ధం అయినప్పటికీ, పుళుమావి, తదనంతరపు రాజులు ఈ ప్రాంతంమీద అధికారం నెరపినారనటంలో ఎట్టి అనుమానం లేదు. బహుశ బలవంతుడైన గౌతమీపుత్ర సాతకర్ణియే ఈ ప్రాంతాన్ని తన అధికారం క్రిందకు తెచ్చుకొని ఉండవచ్చు.

వీరే ప్రప్రథమంగా తమ లేఖనాలను దేశి ఛందస్సులో ముద్రించి తరువాత వచ్చిన గుప్త చక్రవర్తులు తమ బంగారు నాణేలమీద సంస్కృత వృత్తాలలో మనోహరంగా లేఖనాలు వ్రాయించటానికి పురోగాము లైనారు.

* * *

* వీని ఆంగ్ల మాతృక: Silver portrait coins of the Satavahanas భారతీయ ముద్రాపరిషత్ (N. S. I) వారి 59 వ వార్షిక సమావేశ సందర్భంలో నాగపూరు విశ్వవిద్యాలయంలో సాతవాహన నాణెములపై జరిగిన సదస్సులో చదువబడి విశ్వవిద్యాలయం వారిచే ప్రకటింపబడినది. (Vide: Coinage of the Satavahanas & coins from Excavations. (Ed. A. M Shastri: Nagpur University—1971)-1:6-pp. 68-74 Fig. 1.)

Notes:

1. Chinmulgund, P. J., J N S I IX, pp. 93-96 pl. VII-2. Shastri, A. M, 'Silver Coinage of the Satavahanas' Early Indian Indigenons Coins (Calcutta, 197I) pp. 113-19.

2. Gupta, P. L., J N S I-XXI pp 107 1(9 Pl VI-1 & 1 a.

3. Sircar, D. C., Studies in Indian Coins. pp. 107-115.

4. Rapson, F. J., Catalogue of the Andhra Coins etc., in British Museum (B M C) pp. x c – x c i.

5. Sivaramamurti, C., Indian Epigraphy and South Indian Incriptions. pp. 73-74, pp. 163, 165 & 167. and Pushpabhadra Swamy Pillar incription from Nagarjunakonda.

6. అప్పకవీయము: ఆశ్వా. 3 పద్య. 230.

7. వేటూరి ప్రభాకరశాస్త్రి: తెలుగు మెఱుగులు. (III Edn) p. 159 H.

ఆరుద్ర: సమగ్రాంధ్ర సాహిత్యం. Vol I, p 68.

South Indian Inscriptions Vol. X. No. 622, 632 etc.,

8. ఆరుద్ర: సమగ్రాంధ్ర సాహిత్యం. Vol. I. p. 73, 92 & 95.

9. Nagaswamy, R., Sunday Standard-Madras. D. 26-3-67.

Ramayya, S., Sunday Standard, Madras. D. 10-12-67,

# ఇదీ హత్యే!

శ్రీ కె. శివారెడ్డి

ఇదీ
ఒక రకంగా హత్యే
శక్తిని మూట గట్టి
వ్యసనం బురద గుంటలో తొక్కటం;
జనం
కొలను మధ్య
వికసించ వలసిన జీనియస్
తాబేటి తలకాయలా
అలవాటు డిప్పలోకి ముడుచుకోవటం;

దేశం
నవ నాడుల్లో
        చవలసిన యోచనా రక్తం
పిల్ల కాల్వల్లో
చేపలు పట్టటానికే వినియోగపడటం;
మట్టిని
నవ్వించాల్సిన స్పందనని
ఇరుకు జీవితం గోడ మూలల్లోకి విసరడం

ఇదీ హత్యే!
విశ్చలనం
చావులో
నిర్వీర్యత
మగతలో
ఆనందాన్ని ఆర్జించే
శవాలు
బ్రతుకును
దేశాన్ని హత్య చేస్తాయి!

# మణిప్రవాళ భాష

డా. తిరుమల నల్లాన్ చక్రవర్తుల కోదండరామయ్య

దక్షిణ దేశ భాషలలో మలయాళమునందు మణి ప్రవాళ భాష ఒక కావ్యశైలిగా రూపొంది అందు ఉద్గ్రంథములు అనేకములు రచింపబడినవి. మలయాళ సాహిత్య చరిత్రమునందు మణిప్రవాళయుగము ఒక స్వర్ణయుగముగా భావింపబడుచున్నది. మణిప్రవాళము మలయాళమునకు విలక్షణమయిన ఒక కావ్యభాషా భేదము. అట్టి భాష యొకటి రూపొంది మలయాళమున నిలువద్రొక్కుకొనుటకు కొన్ని చారిత్రక సాంఘిక పరిస్థితులు కారణము.

1.1 కేరళ దేశమున ప్రాచీన కాలమునందు చేర రాజులు 'శెన్ దమిళ్' అనబడు అచ్చమయిన తమిళమును ప్రోత్సహించు చుండిరి. ఉత్తర హిందూదేశము నుండి కేరళమునకు వలసవచ్చిన నంబూద్రి బ్రాహ్మణులు సంస్కృతమును అభిమానించిరి. తత్ఫలితముగా అందరి పామరజనులయొక్కయు, సామాన్య ప్రజానీకము యొక్కయు వ్యవహారములో నుండిన మలయాళమునకు చాలకాలము వఱకు ఆదర ప్రోత్సాహములు లేకపోయెను. దానికి నాటి సంఘము నందలి ఉన్నత వర్గములవారి చిన్నచూపే కారణము. కాని తగిన యవకాశము, ఆదరము లభించినచో కావ్యభాషగా రూపొందుటకు తగినంతగా మలయాళము స్వయముగనే శక్తివంతమై యుండెను. స్థానికులయిన మలయాళీలకు నంబూద్రి బ్రాహ్మణులతో వివాహముల మూలమున సంబంధ బాంధవ్యము లేర్పడినప్పుడు అట్టి యవకాశ మొకటి మలయాళమునకు లభించెను. నంబూద్రి బ్రాహ్మణులు ఆర్యజాతికి చెందినవా రయినను వారు క్రమముగా తమ జాత్యహంకారమును విడనాడి స్థానికులతో కలసిపోయి కేరళ దేశీయులుగనే తమ్ము తాము భావింప దొడగిరి. స్థానికులయిన నాగ జాతివారును ఆర్యసంస్కృతిని, సంప్రదాయమును చాలవఱకు అనుసరించుటకు క్రమముగా సిద్ధపడిరి. అందుచే ఉభయులకును వ్యవహారభాష అయిన మలయాళము క్రమముగా కొన్ని మార్పులకు లోనగుట తప్పని సరి యయ్యెను. దైనందిన జీవితమునకు సంబంధించిన వ్యవహారాదులలో సహజముగా ఏర్పడు ఆదాన ప్రదానాదుల మూలమున ఉభయ భాషల పదజాలమును సమ్మిశ్రణము పొంది తత్ఫలితముగా కొన్ని మార్పులు ఆ యా భాషలలో ఏర్పడుటకు ప్రారంభ మయ్యెను. ఇట్టి వ్యవహారమువలన మిశ్రభాష యొకటి ఒక క్రమ పద్ధతిలో వికాసము పొంది, అది మత విషయకము లయిన, వైదిక కర్మ కలాపములకు సంబంధించిన, శాస్త్ర సంబంధములయిన విషయములను వివరించుటకు ఉపయోగింపబడ దొడగెను. క్రమముగా నది విద్యావంతుల వ్యవహార భాషగా కూడ పరిణామము పొందెను.

1.2 పెరుమాళ్ వంశీయులయిన రాజుల యనంతరము కేరళమున తమిళముయొక్క ప్రాభవము నశింప నారంభించెను. కూత్తు, కూడియాట్టం అను నాటక కళాభేదములు కేరళములోని అన్ని తరగతులవారికిని ప్రీతి పాత్రములయిన వినోద సాధనములుగా వ్యాప్తిలోనికి వచ్చినప్పుడు అం దుపయోగింప బడుచుండిన ఈ మిశ్రభాష (Hybrid Language) జనాదర పాత్రముకా దొడగెను. పురాణ ప్రవచనములయందు, వేదాంత ప్రసంగములయందు, వ్యాఖ్యానములయందు, విద్వద్గోష్ఠులలో పండితుల వాగ్వివాదముల యందు, కవి పండిత సమ్మేళనముల యందు విశేషముగా నుపయుక్త

మగుచుండిన యీ మిశ్రభాష సహజముగనే కవిత్వ మునకును ఉపయుక్తము కాదగునను ఆశయమే అది కావ్యభాషగా స్వీకరింపబడుటకు కారణమని చెప్ప దగును. ఇట్లు కొన్ని శతాబ్దముల పాటు క్రమ పరి పాకము చెందుచు వచ్చిన యీ భాషను కాలక్రమమున కొన్ని రకములయిన రచనములకు కూడ ఉపయోగింప దొడగిరి. ఈ నూతన భాష తొలుత సంస్కృత గ్రంథముల వ్యాఖ్యానములందు ప్రయోగ దశలోనుండి తరువాతి కాలమున క్రమముగా మౌలికము లయిన కావ్యాదుల రచనమునకును ఉపయోగింప బడెను. ఈ ఘట్టమే మలయాళమున మణిప్రవాళ యుగమునకు ప్రారంభకాలము ఉభయభాషలయందును నిష్ణాతు లయిన విద్వాంసులు సంస్కృత మలయాళములు రెంటినుండియు యథేచ్ఛముగా పదజాలమును స్వీక రించి వాని మధుర సమ్మేళనముతో తమ కావ్యాదులను రచింప దొడగిరి. తాము తమ కావ్యాదులలో నూతన ముగా నిబంధించిన యీ భాషా రూపమునకు వారే 'మణిప్రవాళము' అని దాని స్వభావమునకు సూచక ముగా నామకరణము కావించిరి. సంస్కృత మలయాళ శబ్దముల సమ్మేళనమును వారు మణిప్రవాళ సంజ్ఞచే సూచించిరి. వారు దానికి ప్రసాదించిన యీ నూతన సంజ్ఞ యాదృచ్ఛిక మయినది కాక విశేషముగా అర్థ వంతమనుట సత్యము. మణిప్రవాళము అనగా మణులు, ప్రవాళములు కూర్చిన హారమని అర్థము. ఇందు మణులు మలయాళ శబ్దములు. ప్రవాళములు సంస్కృత శబ్దములు. మణులును, ప్రవాళములును భిన్న ద్రవ్యము లయ్యును కాంతియందవి చాలవఱకు పోలికను కలిగి యుండునట్లు—మలయాళ సంస్కృత శబ్దములు భిన్న భాషలకు చెందిన వయినను వానిని కూర్చుటలోని నేర్పునుబట్టి ఒకవిధమయిన సారూ ప్యము, సమానత్వము స్ఫురించునట్లుగా రచితమయిన యిట్టి భాషకు మణిప్రవాళ మనుసంజ్ఞ సార్థక మగుచున్నది.

1.3 మణిప్రవాళ సారస్వతశాఖలో విశేషకృషి యొనర్చిన పి. శంకరన్ నంబియార్ అను విద్వాంసుడు మణిప్రవాళముయొక్క ఆవిర్భావ వికాసములనుగూర్చి యిట్లు తెలిపెను. 'సంస్కృత కావ్యములను పండి తులు కానివారు కూడ చవి చూడవలెనని నంబూద్రి బ్రాహ్మణులు కొందఱు అభిలషించి యుందురు. అట్టి వారికి సంస్కృత శబ్దజాలమును, వ్యాకరణమును చిన్నచిన్న మోతాదులతో, చతురతతో అందించినచో వారు అనాయాసముగా వానిని స్వీకరింప గలుగుదురు. తత్ఫలితముగా తమకు తెలియకుండగనే వారు కావ్య రసాస్వాదన మొనర్చుచు సంస్కృత వ్యాకరణ రహస్య ములను కూడ గ్రహింపగలుగుదురు.'—

1.4 మణిప్రవాళ రచనా విధానము ఎప్పుడు ప్రారంభమయ్యెనో ఖచ్చితముగా చెప్ప జాలము. కాని కులశేఖర పెరుమాళ్ అను ప్రభువుయొక్క యాస్థాన కవీశ్వరుడగు తోలన్ అను కవి రచించిన హాస్య రస స్ఫోరకమగు రచనతో ఇట్టి రచనా విధానము ప్రారం భమై యుండవచ్చునని కొందఱు నుడువుదురు. అతడు క్రీ. శ. తొమ్మిదవ శతాబ్దమున వర్ధిల్లి యుండె ననియు తెలియు చున్నది.

2.1 భారతీయ భాష లన్నియు సంస్కృతము నుండి యెన్నో శబ్దములను స్వీకరించినవి. కాని అట్లు స్వీకరించుటలో ఆయాభాషలవారు వానిలో కొన్నిటిని తత్సమములుగా రూపొందించుకొనియు, కొన్నిటిని తద్భవములుగా మార్చుకొనియు వానిని గ్రహించిరి. కాని మలయాళమున మాత్రము అట్లు జరుగలేదు. సంస్కృత మలయాళ శబ్దములు రెండును అందు క్షీర నీర న్యాయమున కలిసిపోయినవి. తత్ఫలితముగా మణిప్రవాళ మను నొక క్రొత్తశైలి మలయాళ మునం దేర్పడెను. మణిప్రవాళ మనగా సంస్కృత దేశ భాషా శబ సమ్మేళన మని, అది యొక మిశ్రభాష యని యితర ద్రావిడ భాషల వారు భావింప వచ్చును. కాని అది అంతమాత్రమే కాదు. దానికి మలయాళము నందు ఒక విశిష్టమయిన అర్థము కలదు. మధు రములగు మలయాళ సంస్కృత శబ్దముల సమ్మేళన ముచే సురభిళ మగునది మణిప్రవాళము—మధుర మధుర భాషా సంస్కృతా న్యోన్య సమ్మేళన సురభిళా—

అని లీలా తిలకము అను మలయాళ లక్షణ గ్రంథము నందు అది నిర్వచింప బడినది.

2.2 మణిప్రవాళమున రచితము అయిన కావ్య పరంపర వెలసిన పిదప తద్రచనా విధానమునకు సంబంధించిన నియమములు కొన్నిటిని రూపొందింప వలసిన యావశ్యక మేర్పడెను. అట్టి నియమములు లేకపోయినచో అది రచయిత యిచ్ఛనుబట్టి వెఱ్ఱితలలు వేయు ప్రమాదము కూడ నుండెను. దానికి సంబంధించిన నియమములను తెలుపుటకు ఏర్పడిన లక్షణ గ్రంథమే లీలా తిలకము అది క్రీస్తుశకము పదునాలుగవ శతాబ్దమునందు రచింపబడిన దని అంతస్సాక్ష్యమును బట్టి నిర్ణయింపబడినది. అది సంస్కృతభాష యందు రచింపబడిన మలయాళ లక్షణ గ్రంథము. అం దుదాహరింపబడిన మణిప్రవాళ రచనోదాహరణములను బట్టి అది రచింపబడుటకు నాలుగైదు శతాబ్దులకు పూర్వము నుండియే మణిప్రవాళము పెక్కురు కవులను ఆకర్షించినదనియు, వారు అందు పెక్కు తెఱగులయిన రచనములు—దేవతాస్తుతులు, రాజప్రశంసా కృతులు, స్థల మాహాత్మ్యములు, ప్రకృతి చిత్రణములు, సందేశ కావ్యములు, పర్వదినముల అభివర్ణనము, శృంగార వర్ణనము—కావించి రనియు తెలియుచున్నది. లీలా తిలకము నందు మణిప్రవాళము ఉత్తమ, మధ్యమ, అధమ—యిత్యాదిగా తొమ్మిది విధముల విభజింపబడినది. అందు ఉపయోగింపదగిన సంస్కృత మలయాళ శబ్దముల నిష్పత్తి పరిమాణమునుబట్టి యీ భేదములు రూపొందింపబడినవి. లీలా తిలకమునందు ఆయా భేదముల లక్షణమును, వాని కొసగబడిన లక్ష్యము లను చూడుడు :

1. తదుత్తమం భాషా రస ప్రాధాన్యే

పుల్లి క్కొండాళ్ ఉరక్క పునరపి మణినా
 ముల్గినాళ్ మెల్ల మెల్ల
కామ క్కాత్తిన్ నణిళాళ్ మదన పరవశ
 కాంత కైమై మరన్నాళ్
వీర్త్తాళ్ బట్టే వియుర్త్తాళ్ వివశ మురుడడా
 యన్నె పీయ స్సిరన్నా

శెన్ మాక్కిన్ పొన్ను వీణ్ణా పవ్రంగుళల గమే
 మాళ్గినాళ్ ఉణ్ణి నజ్ఞా.

ప్రథమ శిల్ప—12

2, భాషా ప్రాధాన్యే రస సామాన్యే ఉత్తమ కల్పం.

రస ప్రాధాన్యే భాషా సామ్యే చ.

భాషా ప్రాధాన్యం రస సామాన్యం—

అమ్బల్ ప్రియాభరణ ముజ్కిన కాలకూటం
కూమ్మ్బం కురాల్ మొళ్ళి తుళంబిన కెజ్ఞ వెళ్లం
చామ్బోళు మెన్నమనసి చామ్బ అణిఞ కోలం
కామ్బోడు కూడ నుడు వీడుగ మన్మథారేః.

(1—14)

రస ప్రాధాన్యం భాషా సామ్యం—

అత్యా త్యామ్రమై మలన్ విదురర
 క్కామ్మ్బల్ మేలన్ని నేరం
మందం మందం మరువిన నిలా
 వెన్ఱు తోమ్రనుం ప్రకారం
కాంతం దంతచ్ఛద రుచికల
 ర్న్నోమల్ మందస్మితార్ద్రం
నాళ క్కాణాం తవ నయనమే
 నజ్ఞ వక్త్రార విందం. (1—15)

3. సామ్యే మధ్యం.

సాన్నోలెయుం వళయు మారము మెన్ఱ్ణి వెల్లా
మల్లాగ యిల్ల కలభాషిణి భూష దాని
ఎల్లోర్కుమే రసకరం సతతం నిబద్ధం
సౌజన్య మెణిదు విభూషణ మంగనానాం.

(1—16)

4. భాషా సామ్యే రస న్యూనత్వే మధ్యమ కల్పం.

రస సామ్యే భాషా న్యూనత్వే చ
భాషా ప్రాధాన్యే రస న్యూనత్వే చ
రస ప్రాధాన్యే భాషా న్యూనత్వే చ.

భాషా సామ్యం రస న్యూనత్వం—

నట్టుచ్చ నేరత్తు దివాకరో ఒయ
మత్యంత మాహంత కరోతి తాపం

మధ్యస్థరాయ్ నిర్కిలు మున్నతానాం
మట్ప్రిణు కాలం వినయాద కోలం'
(1—17)

రస సామ్యం—భాషా న్యూనత్వం—

అంగం తుంగస్తన భరయుతం
పుల్కునాన్ ననావిల్
పోరా పుణ్య ప్రసర మొరునా
కెన్నుడయ వల్లభాయ
నిన్నె క్కొణ్ణ నృభిమత మెనె
కెయ్ దెలాం ఎ్ర రోణి తిన్నే
నిద్రే భద్రే త్వ మపి విధినా
దుర్లభా వల్లభేవ. (1- 18)

భాషా ప్రాధాన్యం రస న్యూనత్వం.

మురణేన్ కళల్ కాంతియుం ముగత్తిన్
పరిజుం పాటనముం పరన్న మాదుం
మరు వినదు మంద మంద మల్లే
చరణం చారు చకోర లోచనాయ. (1—19)

రస ప్రాధాన్యం భాషా న్యూనత్వం.

ఆ తామ్రైై ర్రసపూర్ణైః రయుగళరనుడే
బాణపూత్తై రపాంగె
రవ్యాజ ప్రేమ గర్భై రముద రస మషీ
రూషితై రార్ద్ర పాద్యైః
ప్రాప్తానుజ్ఞం ప్రయాంతం జన మి
మనురాగోళ్ సుఖం నోక్కి నోక్కి
తిష్ఠంతీం నారణీదన్ దుహితర
మితనాన్ నష్టధైర్యం స్మరామి.
(1—20)

5. న్యూనత్వే అధమం.

ఆశీ జన్మై రరఅనం నిశి నీయమానా
మావిర్భవ త్పులక భూషణ భూషి తాంగీం
అంకే నివేశ్య సుదృఢం తరసా నవోఢా
మార్చోల్ అధీర నయనాం తఘగిన్ధ ధన్యః.
(1—21)

ఇట్లు ఉత్తమము, ఉత్తమ కల్పమున రెండు, మధ్యమము, మధ్యమ కల్పమున నాలుగు, అధమము అని మణిప్రవాళమున తొమ్మిది తెఱగులు లీలా తిలకమున తెలుపబడినవి. మలయాళమును సుసంపన్నము చేయునంతవఱకే పరిమితముగా సంస్కృత శబ్దములను ఉపయోగింపవలెను కాని ఆ స్వీకారము మలయాళ భాషా స్వరూపమునే మార్చునదిగా నుండరాదని అందు స్పష్టముగా నిర్దేశింపబడినది. సంస్కృత వ్యాకరణ మర్యాదలు—ముఖ్యముగా విభక్త్యంతము అయిన సంస్కృత శబ్దములు అట్లేప్లే శబ్ద సౌందర్యమునకై, మాధుర్యమునకై గ్రహింపబడినను అవి మూలమయిన మలయాళ భాషా సౌందర్యమునకును, వాక్య నిర్మాణ సూత్రములకును భంజకములు కారాదు. మణిప్రవాళ రచనమునకు సంబంధించి లీలాతిలకము నందు ప్రధానముగా రెండు నియమములు తెలుపబడినవి. అందు మొదటిది—అందు ఉపయోగింపబడు మలయాళ శబ్దములు త్రైవర్ణికులయిన అగ్రజాతి వారిలో అధికవ్యాప్తి కలదై యుండవలెను. అందు గ్రహింపబడు సంస్కృత పదములు సుపరిచితములును, సరళములును అయి యుండవలెను. అట్లు సమ్మేళనము పొందు శబ్దములు ఒక విధమయిన సాజాత్యము కలవై యుండవలయు ననుటయే—ఒకే హారములో కూర్పబడిన మణులునూ ప్రవాళములును వలె — అట్లు నిర్దేశించుటలోని యాశయమని మనము గుర్తింపవలసి యున్నది. రసవంతమై, మలయాళ శబ ములు అధికముగానున్న రచనము ఉత్తమ మని, మలయాళ సంస్కృత శబ్దములు సమానముగా కలది మధ్యమమని, మలయాళ శబ్దజాలముకంటెను సంస్కృత శబ్దజాలము అధికముగా నున్న రచనము అధమము అని అందు మలయాళ శబ్దములకు ఒసగబడిన ప్రాధాన్యా ప్రాధాన్యము లనుబట్టి దాని యుత్తమాది పరిగణనము కావింపబడినది. సంస్కృత శబ్దములు సుపరిచితములును, సరళములును అయియుండవలెను. అను నియమముచే—ఆవ్యాజముతో విశేషముగా సంస్కృత పదజాలమే యందు ప్రవేశించుటకు అవకాశము ఎక్కువగా నున్నను—నిజమునకు ప్రథమ దశలో అట్టిపరిస్థితి మాత్రము ఏర్పడలేదు. తరువాతి కాలమున అనగా

క్రీ. శ. 15, 16, 17 శతాబ్దులలో రచితము లయిన చంపూ కావ్యములందును, సందేశ కావ్యముల యందును దీర్ఘ సమాస భూయిష్ఠమయిన రచనము చాలవఱకు కాన వచ్చుచున్నను పూర్వదశలో రచితము లయిన కావ్యములందు మాత్రము అది యుత్తమ జాతికే చెంది యుండినదని చెప్పదగును. లీలాతిలక ములో తెలుపబడిన యీ క్రింది లక్షణము మిక్కిలి ప్రధానమయినది. 'మలయాళ సంస్కృత శబ్దముల సమ్మేళనముతో మణి ప్రవాళమున రచింపబడిన యీ కావ్యము మలయాళ కావ్యమే అనుస్ఫూర్తి పాఠకులకు కలుగజేయున దై యుండ వలయును. అది సంస్కృత కావ్యమను అభిప్రాయమునకు ఎట్టి పరిస్థితులలోను అవకాశము కలిగింపరాదు. ఇదియే మణి ప్రవాళ రచనము నందు ముఖ్యముగా గమనింపవలసిన యంశము. ఇదియే సరియయిన పద్ధతి గూడ'—

2.3.1. మణి ప్రవాళమున రచితములయిన కావ్యము లన్నియు సంస్కృత వృత్తములందే వ్రాయ బడెను. వానియందు రసము, అలంకారము, రచనా విధానము మున్నగువానికి నొసగబడిన ప్రాధాన్యమును పరికించినచో మణి ప్రవాళమున సంస్కృత భాషా ప్రభావము ఎంతగా కలదో మనకు అవగతము కాగలదు. ప్రశస్తమగు మణి ప్రవాళశైలిని చవి చూచుటకు చంద్రోత్సవ కావ్యము నందలి శ్లోకములను ఉదాహరణములుగా పేర్కొన వచ్చును. అందు ఈక్రింది శ్లోకములో కేరళదేశపు సౌభాగ్యము అభివర్ణింప బడినది.

పరభృత మొళి చుట్టుం మట్టు ఖండంగ లెట్టుం
డదిలుం అధికహృద్యం దక్షిణ భారతాఖ్యం
విరళి నిల మలర్ మాదిన్నె అంగజెన్నుం త్రిలోకీ
చరు తొడు కురిపోలె చేరమా న్నాడు యస్మిన్.

2.3.2 మలయాళమునందలి చంపూ కావ్యములం దన్నింటను సంస్కృత వృత్తములును, మణి ప్రవాళ శైలియు కాన వచ్చును. అందలి వచనము కూడ లయాన్వితమై సాధారణముగా తరంగిణి యను ఛందో విశేషమునకు సన్నిహితము నుండును. వానిలో పునం నంబూద్రి రచితమయిన రామాయణ చంపువు ప్రసిద్ధ మయినది. అందలి మణిప్రవాళశైలిని ఈ క్రింది శ్లోకమున కాంచవచ్చును.

మందీభూతే జనౌఘే పరిమళ బహులం
కైయి లాదాయ మాలాం
మందారాభోగ మందస్మిత మధుర ముఖీ
మంగళ స్త్రీ సమేతా
మందం మందం నయంతీ ఘన జఘన
ప్రాభృత ప్రాజ్ఞు మగ్గే
మందాక్షాలంకృతాక్షీ మనసిజ కళికా—
మె సా నడన్నాళ్

సీతాకల్యాణ ఘట్టమునందు కల్యాణ మండపమునకు వెడలుచున్న సీతా దేవి యీ శ్లోకము నందు అభివర్ణింప బడినది. ఇందు కైయిల్ నడన్నాళ్ అను రెండు మలయాళ శబ్దములు తప్ప తక్కిన వన్నియు సంస్కృత శబ్దములే. చంపూ కావ్యములయందలి మణి ప్రవాళమునందు కానవచ్చు సంస్కృత శబ్దాధిక్యమునకు ఇదియొక మచ్చు తునక!

3. 1 మలయాళమునందలి లీలా తిలకము అను లక్షణగ్రంథము మణిప్రవాళము ఒక్క కేరళ భాషయందే కలదని తెలుపుచున్నది. కాని అది యదార్థము కాదు. తమిళము, కన్నడము, తెలుగు అను ఇతర దక్షిణదేశ భాషలయందుకూడ ఇట్టి శైలి యొకటి యొక కాలమున ప్రచలితమై యుండినట్లు తెలియుచున్నది. అసలు మణప్రవాళము అను నీపదము తొలిసారిగా జినసేను డను జైనకవి షట్ ఖండాగమమునకు రచించిన జయధవళమను వ్యాఖ్యానము చివర కాన వచ్చుచున్నది. జినసేనుడు క్రీ. శ. 837 లో దానిని పూర్తికావించెను. అందిట్లు కలదు.

'మణిప్రవాళ న్యాయేన
ప్రోక్తోఽయం గ్రంథ విస్తరః'

అందలి పూర్వభాగమునకు 'ధవళ' అనిపేరు. అతని గురువయిన వీరసేనుడు దానికి కర్త. అతడును తన రచనము మణిప్రవాళ శైలియందే సాగించెను.

కాని అందు వారు సంస్కృత ప్రాకృత భాషా మిశ్రమయిన మణి ప్రవాళమును అవలంబించిరి. ఆ మిశ్రణము మలయాళమును పోలినట్టిది కాదు. సంస్కృతభాషా రచితములును, ప్రాకృతభాషా రచితములును అగు స్వతంత్రములు, ప్రత్యేకములు అగు వచన భాగములతో ఆ రచనము సాగినది. అదియే క్రమముగా ఒకే వాక్యమునందును లేక ఒకే పద్యమునందును సంస్కృత విభక్త్యంతము లగు శబ్దములను యథా తథముగా దేశభాషా పదములతో కలిపి రచించు పద్ధతికి దారితోడి మలయాళమునందలి మణిప్రవాళమును పోలిన శైలిగా పరిణామము పొంది యుండుట సంభావ్యము.

3. 2. 1. దక్షిణ దేశములో మధ్యయుగము నందు వెలసిన వివిధ భాషలను చెందిన విద్వాంసులకు దీని యునికిని గూర్చి తెలియు ననుటకు ఆధారములు లభించుచున్నవి. కాశ్మీరదేశమునకు చెందిన అభినవగుప్తుడను విద్వాంసునకు కూడ దీనిని గూర్చిన యెఱుక కల దనుట మనకు ఆశ్చర్యము కలిగించును. అతడు క్రీ. శ. 11 వ శతాబ్దమునకు చెందిన వాడు. భరతుని నాట్యశాస్త్రమునకు అతడు రచించిన వ్యాఖ్యానములో దక్షిణ హిందూదేశమునందు ప్రచురమై యుండిన యీ మణిప్రవాళ శైలిని గూర్చి ప్రస్తావించుట మాత్రమే కాక కాశ్మీరదేశమునందును భిన్న నామముతో ఇట్టి శైలి యొకటి తన కాలమునం దుండె నని పేర్కొనెను.

3.2.2. భరతుని నాట్యశాస్త్రమునందలి ముప్పది రెండవ యధ్యాయమున ధ్రువాగానమునం దుపయోగింప దగిన భాషనుగూర్చి యిట్లు కలదు.

> దివ్యానాం సంస్కృతం గానం
> ప్రమాదైస్తు విధీయతే
> అర్థ సంస్కృత మేవం తు
> మానుషాణాం ప్రయోజయేత్.

నాట్య. 32–389

ఇందలి మూడవ చరణమునం దున్న 'అర్ధ సంస్కృత' మనుపదము మన కిక్కడ ప్రధానము. ఈ శ్లోకమునకు అభినవగుప్తుడు ఈ క్రింది విధమున వ్యాఖ్యానము కావించెను.

'దివ్యానాం తు దేవ నృపాణాం ప్రమాణైః వ్యాకరణాది లక్షణైః ఉపేతం సంస్కృతం గానం శుద్ధం (అన్యత్) త్రివర్గ ప్రసిద్ధం పదమధ్యే సంస్కృతం మధ్యే దేశభాషాదియుక్తం తదేవ కార్యం. దక్షిణాపథే మణిప్రవాళం ఇతి ప్రసిద్ధం. కాశ్మీరే శాట కులం ఇతి. అన్యేతు సకల లోకప్రసిద్ధం వ్యాఖ్యానాపేక్షిభిః సంస్కృతైః కృతం అర్ధసంస్కృతం ఆహుః. అపరే వరరుచి ప్రణీత లక్షణాన్వితం శౌర సేన్యాది దేశభాషా వ్యతిరిక్తం ప్రాకృతం ఏవ అర్ధసంస్కృతం ఇతి మన్యంతే. యస్య యస్య యా పాఠే భాషా తయైవ తస్య గీతం ఇతి ముని మతం ఇత్యుపేక్ష్య'—

అభినవ భారతి. 4 సం. పు 379 (గైక్వాడ్ ఓరియంటల్ సిరీస్ — సంపాదకులు—మానవల్లి రామకృష్ణకవి)

'దేవపాత్రముల, రాజపాత్రముల గానము వ్యాకరణాది లక్షణ సముపేతమయిన, శుద్ధమయిన సంస్కృతములో నుండవలయును. బ్రాహ్మణులు మొదలగు తక్కిన త్రివర్గములవారి గానమునకు దేశ భాషా మిశ్రితమయిన సంస్కృతమును ఉపయోగింపవలయును. (మూలశ్లోకములోని అర్ధసంస్కృతము అనుమాటకు ఇది వివరణము.) దక్షిణాపథమునందు ఇది మణిప్రవాళము అని ప్రసిద్ధమైయున్నది. కాశ్మీరమునందు శాటకుల మని. కొందఱు అర్ధ సంస్కృతమను మాటకు సకలలోక ప్రసిద్ధమును, వ్యాఖ్యానము నపేక్షింపనివియు నగు సంస్కృత పదములతో గూడినది అని వివరింతురు. మఱి కొందఱు అది సౌరసేనాదులకు భిన్న మయినదియు, వరరుచి ప్రణీతమగు లక్షణములతో కూడినదియు నగు ఒక ప్రాకృతభాషయని తలతురు. కాని పాఠము (వచనము) ఏ భాషలో నున్నదో గీతము కూడ అదే భాషలో ఉండవలయును అన్న మునిమతమును అనుసరించి యిది యుపేక్ష్యము'—

3. 2. 3. అభినవగుప్తుని యీ వివరణమును అనుసరించి భరతుడు పేర్కొనిన అర్ధ సంస్కృత మనుపదమునకు మణిప్రవాళమును పోలిన యొకభాష అని యర్థముగా స్పష్టమగుచున్నది. కాశ్మీరదేశము నందు ప్రచలితమై యుండినట్లుగా అతడు పేర్కొనిన 'శాటకుల' మనుభాష యెట్టిదో తెలియవచ్చుట లేదు. అసలు ఆ పదమే సాధువో, అసాధువో మనకు తెలియదు. దీనినిబట్టి మణిప్రవాళభాష ప్రాచీన కాలమునందును ప్రయుక్తమగుచుండెనని నిరూపిత మగుచున్నది.

### మణిప్రవాళము — భాషామిశ్రము

[illegible] ప్ర[illegible] భాషా మిశ్రమునకును భేదముకలదు. ఆ భేదము నెఱుగుటకు వాని స్వరూప స్వభావములను గూర్చి కొంత తెలిసికొనవలసి యున్నది. లీలా తిలకమునందలి మొదటి రెండు శిల్పములయందును మణిప్రవాళముయొక్క లక్షణము వివరముగా చర్చింపబడినది. దాని ననుసరించి మణిప్రవాళము భాషా సంస్కృతముల సమ్మేళనముచే సిద్ధించు చున్నది. ఇందు భాష అనగా కేరళభాష— మలయాళము. మలయాళశబ్దములను రెండు విధములుగా వర్గీకరింప వచ్చును. అవి ద్రావిడము, సంస్కృతము. ద్రావిడశబ్దములలో 1. శుద్ధమలయాళము 2. భాషాంతరభవము (ఇతరద్రావిడ భాషాజన్యములు) 3. భాషాంతర సమము (ఇతర ద్రావిడభాషలకు సమములుగా రూపొందినవి) అనునవి చేరును—అట్లే సంస్కృత మూలకములలో సంస్కృతభవములు (తద్భవములు) సంస్కృతరూపములు (తత్సమములు) కలవు. ఇవి యన్నియు భాషా (కేరళభాష—మలయాళము) శబ్దములుగా పరిగణింపబడును. మలయాళము మరియొక విధముగా కూడ వింగడింప బడినది— ఉత్కృష్టము) అపకృష్టము అని. వానిలో ఉత్కృష్టమనునది త్రైవర్ణికుల (అగ్రవర్ణములవారు)వ్యవహారమునందుండునది. అపకృష్టము పామరజనులు వ్యవహరించునది. వానిలో ఉత్కృష్టజాతికి చెందినభాష మణిప్రవాళమున గ్రహింపబడును. అందు చేర్పబడు మలొక అంగము సంస్కృతము. ఆ సంస్కృత శబ్దములు ఆ భాషా వ్యాకరణముచే సిద్ధించు సంస్కృత విభక్త్యంతము లయి యుండవలెను. అట్టి శబ్దములు ప్రచురములును, స్థానికులకు సుపరిచితములును అయి యుండవలయును. అప్పుడే జనరంకమును వాని సమ్మేళనము సిద్ధించును. సంస్కృతీకరింపబడిన మలయాళ శబ్దములనుకూడ మణిప్రవాళమున ఉపయోగింప దగును. ఇచట సంస్కృతీకరణము అనగా మలయాళ శబ్దములకు సంస్కృత విభక్తి ప్రత్యయములను చేర్చియు, సంస్కృత సంధి కార్యములు ప్రవర్తిల్లచేసియు ప్రయోగించుట. పామరజన వ్యవహారమునందు సహజముగా నట్టి ప్రయోగములు ఉండుటకు అవకాశము లేదు. మణిప్రవాళమునందు మలయాళ సంస్కృతములకు తప్ప తక్కిన భాషలకు ప్రవేశము లేదు. మలయాళముతో సంస్కృతేతర భాషాపదముల సమ్మేళనము సమ్మతము కాదు. మలయాళ సంస్కృత పదముల మనోరంజకమయిన సమ్మేళనమే సహృదయులకు ఆనందము కూర్చును. ఈ సమ్మేళనమునకు లీలా తిలకమునందు 'యోగము' అను అర్థవంతమయిన పదము ప్రయోగింపబడినది.

4.2 మణిప్రవాళ మనునది ఒక విశిష్ట కావ్యశైలి యను నర్థములో రూఢమయినది. లీలా తిలకము ననుసరించి మణిప్రవాళమున ఇతర భాషా పదము లుండుటకు అవకాశము లేదు. అట్లు చేర్పబడినచో అది సంప్రదాయ విరుద్ధ మగును. అప్పుడది భాషామిశ్ర మగును కాని మణిప్రవాళము మాత్రము కాదు. ఇది ద్రావిడభాషా పదములను మణిప్రవాళమున చేర్పదగు నను వాదమును ప్రతిపక్షముచేయు సందర్భమున లీలా తిలకకర్త 'అప్పం తుప్పం' అను విధముగా ఇతర ద్రావిడభాషా పదముల సమ్మిశ్రణము చేయుబడినచో అది 'భాషా మిశ్రము' అనబడునని తెలిపెను. మిశ్రమున దేనిని దేనితో నయినను కలుపవచ్చును. దానికి ఒక నియమము అక్కఱ లేదు.

4.3.1 యోగము, మిశ్రము అనుపదములు ఈ సందర్భమున విశిష్టార్థద్యోతకములుగా ప్రయోగింపబడి యుండుటను మనము గుర్తింపవలసి యున్నది. రెండు విభిన్న ద్రవ్యములు రసాయనిక మిశ్రణమునందువలె సంయోగము చెందుట యోగము. మిశ్రము అనగా రెండు ద్రవ్యముల కలయిక మాత్రమే. అందు రసాయనిక మిశ్రణము నందువలె సంయోగము ఉండదు. రసాయనిక మిశ్రణము సిద్ధించుటకు ఉభయ ద్రవ్యములకును కొలమానము మొదలగు పరిమితు లుండునట్లుగానే మణిప్రవాళమున భాషా సంస్కృతయోగము సిద్ధించుటకును కొన్ని నియమములు, కొన్ని పద్ధతులు కలవు. మణిప్రవాళమును 'భాషా సంస్కృతయోగం మణిప్రవాళం' అని నిర్వచించుటలో లీలా తిలక కారుడు యోగము, మిశ్రము అనుపదములకు కలభేదమును గుర్తించియే యుండెననవలసి యున్నది. కాని కొందఱు విద్వాంసులు ఆ రెంటిని (మణిప్రవాళము, భాషామిశ్రము) పర్యాయములుగా గ్రహించుట విచారకరము.

4.3.2 భరతుని నాట్య శాస్త్రమునందు ఈ క్రింది శ్లోకము కలదు.

భాషా విమిశ్రిత పదం ప్రమదాభి రామం
రామా వనాశ్రయ వరీ ఖలు పుష్ప గంధీ—

ఇందు భాషా విమిశ్రితపదము—అనగా సంస్కృత దేశభాషలతో కూడిన మిశ్రభాష. నాట్యప్రదర్శనమున 'పాఠ్యము' సంస్కృత దేశ భాషామిళితమయిన మిశ్రభాషగా ఉండవలయునని తాత్పర్యము.

సరస్వతీ కంఠాభరణమునందు ఇట్లు కలదు.

'నాత్యంతం సంస్కృతే నైవ
నాత్యంతం దేశభాషయా
కథాం గోష్ఠీషు కథయన్
లోకో బహుమతో భవేత్'—

పురాణ కథనమునందు మిశ్రభాష ఉపయోగింపదగునని పయి శ్లోకము తెలుపుచున్నది.

శుక సందేశమునకు ధర్మగుప్తుడు రచించిన వ్యాఖ్యానములో ఇట్లు కలదు. 'యత్కిల జగాద గోద భట్ట మహాకవి మానుషభాషా మిశ్రం మారపూజేతి మహాప్రబంధే' — ఇచట మిశ్ర పదము సంస్కృత మానుషభాషా సమ్మేళనమును తెలుపును. ఇందలి మానుషభాష జనుల వాడుక భాష.

క్రియాదీపికలోని ఈ క్రింది శ్లోకభాగము కూడ ఇచట ప్రసక్తము కాదగును.

'శ్లోక రూపేణ బంధిచ్చు
భాషా మిశ్రిత సంస్కృతైః—

వీర చోళియం అను తమిళ లక్షణ గ్రంథమునందు అలంకార పటలములో 'విరవియల్' అను కావ్య భేదముయొక్క లక్షణము ఇట్లు తెలుపబడినది. 'పడవెయుత్తు విరవువదు విరవియ లాయ్.'

4.4 పయిని ఉద్ధరింపబడిన ఉదాహృతులను బట్టి భాషా మిశ్రమున మణిప్రవాళమునందువలెనే సంస్కృతము ప్రధానమయిన ఒక అంగమని తెలియుచున్నది. అపుడు అందు చేరదగిన మఱొక భాష యేది? మణిప్రవాళమునందు అది త్రైవర్ణికులు మాత్రమే వ్యవహరించు ఉత్కృష్టజాతికి చెందిన మలయాళము. భాషా మిశ్రమున అది పామరజనభాష అనవలసియున్నది. లీలా తిలకమునకు ముందుకూడ భాషామిశ్రము ప్రచురమైయుండెను. భాషామిశ్రము మణిప్రవాళమువలె కేరళ దేశమునకు మాత్రమే సంబంధించినది కాదు. ఇతర భాషలయందును అట్టిభాషా మిశ్రము ఉండుటకు అవకాశము కలదు. భాషా మిశ్రము అనుపదమునకు 'భాషయా మిశ్రం సంస్కృతం భాషామిశ్రం' అని విగ్రహము చెప్పదగును. ఇచట భాష అనగా పామరజనుల భాష. మణిప్రవాళమున గ్రహింపదగిన మలయాళ శబ్దములు త్రైవర్ణికులు మాత్రమే వ్యవహరించునవి.

## మణిప్రవాళము — పాట్టు

5.1 లీలా తిలకమునందు మణిప్రవాళముతోబాటు పాట్టు అనబడు మఱొక కావ్యశైలీ భేదము కూడ నిర్వచింపబడినది. అదే ఆ రెంటికిని కలభేదము కూడ స్పష్టముగా వివరింపబడినది. మణిప్రవాళమునందువలెనే పాట్టునందును భాషా సంస్కృత సమ్మేళనము ఉండును. కాని పాట్టును మణిప్రవాళమునుండి వేఱు చేయు మఱికొన్ని అంశములు కలవు. పాట్టుఅనునది గానకావ్యము. అందు ఎదుగై

(ప్రాసము), మోనై (యతి) అను నియమములు అనుసరింపబడును. మఱియు పాట్టునందు సంస్కృతము నందలి సామాన్య వృత్తములు కాక విశేష వృత్తములును, తమిళమునందు గాన యోగ్యములయిన ఛందస్సులును రచింపబడవలయును. ఇవి మాత్రమే కాక పాట్టునందు గ్రహింపబడు సంస్కృతపదములు తమిళమునందలి ధ్వనులకు ఒదుగునట్లుగా మాఱుపాటు కూడ చెందవలసి యుండును. సంస్కృతమునకును, తమిళమునకును సమానముగానున్న ధ్వనులను మాత్రము ఎట్టి మాఱుపాటును లేకయే గ్రహింపదగును. ఇట్లు పాటు సంస్కృత శబ్దములను యథా తథము స్వీకరింపక తమిళ వర్ణసమామ్నాయమునకు ఒదుగురీతిని చేయబడిన మాఱుపాటులతో స్వీకరించునది యగుటచే నది మణిప్రవాళముతో భేదించుచున్నది. మఱియు పాట్టు గాన కావ్యమగుటచేత అది కవిత్వమునకు మాత్రమే పరిమితమయిన భాషాశైలి యగుచున్నది. మణిప్రవాళము అట్లు కాక వచనమునందును, ఇతర రచనములందును కూడ గ్రహింపబడును. పాట్టునందు శబ్దాలంకార సాధనములను ఎదుగై (ప్రాసము), మోనై (యతి), ప్రాస పూర్వాక్షర నియమము, అంతాది (ముక్తాక్షర గ్రహణము) అనునవి నియతముగా పాటింపవలసిన నియమములు. పాట్టులు గాన కావ్యము లగుటచే—ప్రాయికముగా ప్రాచీన కాలమున ధారణమునకై అవి పాట్టులందు ప్రవేశపెట్టబడి యుండవచ్చును. మణిప్రవాళమునందు ఇట్టి నియమములు లేవు. మణిప్రవాళము ప్రాయికముగా సంస్కృతమునందలి సామాన్య వృత్తములలో రచింప బడును. సకృత్తుగా అందు దేశియ వృత్తములు కూడ ఉండవచ్చును. కాని లీలాతిలకము మణిప్రవాళము సంస్కృత వృత్తములందే నియతముగా ఉండవలయునని నిర్దేశింప లేదు. మణిప్రవాళమునందలి ఛందస్సు విషయమున ఎట్టి నిర్దేశమును కాని చేయని లీలా తిలకకారుడు పాట్టునందు మాత్రము పాటింపదగిన ఛందో విశేషములను గుఱించి వివరించి యుండుటనుబట్టి ఆ రెండు కావ్యశైలులకునుగల భేదమును స్పష్టము చేయుట అతని యాశయముగా గ్రహింప దగును. తన కాలమునందలి 'పాట్టు' కావ్యములలో గ్రహింపబడిన ఛందో భేదములే ఆతనిని ఆ విధమున ఛందో నిర్దేశము చేయుటకు ప్రోత్సహించి యుండ దగును. సంస్కృత వృత్తములకంటెను ద్రావిడ ఛందస్సులు గేయ ధర్మము విశేషముగా కలవనుట యధార్థము. అందుచేతనే పాట్టు కావ్యములందు దేశియ ఛందస్సులు గ్రహింపబడినవి.

5.2 మణిప్రవాళమునకును, పాట్టునకును కల ప్రధానమైన భేదము యోగము. మణిప్రవాళమునందు యోగము ప్రధానముగా నుండ వలసిన ధర్మము. పాట్టునందు ఇట్టి యోగము అవసరము లేదు. మఱియు పాట్టునందు పాండ్యభాష (తమిళము) యందలి పదములకు సమానములయిన పదములు ప్రయోగింప బడ వలెను. దీనిని బట్టి పాట్టునందలి భాష తమిళమునకు సన్నిహితమయినది కాగా మణిప్రవాళమునందలి భాష సంస్కృతమునకు సన్నిహితమై యుండును.

5.3 ఇట్లు మణిప్రవాళమునందును, పాట్టునందును సంస్కృత మలయాళ శబ్దముల సమ్మేళనము కానవచ్చినను పయిని చూపిన కారణములచే అవి రెండును ఈషద్భేదము మాత్రమే కల కావ్యశైలులు కావు. అవి పూర్తిగా భిన్నములయిన రెండు కావ్యశైలీ భేదములు.

### మణిప్రవాళము – తమిళము

6.1 మణిప్రవాళ రచనా విధానము ఒక్క మలయాళమునందు మాత్రమే కాక తమిళము, కన్నడము, తెలుగు అనుభాషలయందుకూడ ప్రవర్తిల్లి యుండినట్లు తెలియుచున్నది. తమిళమునందు జైనులును, వైష్ణవులును రచించిన వ్యాఖ్యానములలో మణిప్రవాళభాష విస్తారముగా ఉపయోగింపబడినది. ఉత్తర సంగయుగమునందు జైనులు రచించిన వచన కావ్యములందుకూడ ఇట్టిభాష కానవచ్చును. ఈ వాక్యములు చూడుడు :

'The works of this period (Post Sangam A. D. 150 to A. D. 500.) are the Jain Prose works of the 'mongrel sort of Diction' known as Manipravalam Style, which is pleasing neither to the purely Tamil nor the purely Sanskrit ear; of these prose works

Sripuranam and Gadya Chintamani deserve mention 1—

వైష్ణవ మతమునకు సంబంధించిన వ్యాఖ్యానములలో కానవచ్చు మణిప్రవాళ శైలిని ఈ క్రింది యుద్ధరణమునందు చూడదగును.

'మూణ్ణాం తిరువాయ్ మొయియిల్ ప్రాప్య భూమియిల్ యోగ్యత్తైయయుం అంగు ప్పోనాల్ అడిమై శెయ్యుం పడియైయుం అనుసంధిత్తు ప్రీతరాయ్ అప్పోదే ప్రాప్య భూమియిల్ శెల్లప్పెరామెయాలుం పణ్ణ పల్కాల్ పిఱింద వాసనైయాలుం ప్రకృతి యిలే యిరిక్కిరమైయై అనుసంధిత్తుం తాన్ నిణైత్తదే శెయ్యక్కడవ దాన ఈశ్వర నుడయ స్వాతంతర్యత్తై అను సంధిత్తుం అవనుక్కు త్తమ్మై విషయీ కరి త్తల్లదు నిర్కవొణ్ణాద పరమభక్తి తమక్కిల్లై యాగవుం పార్త్తుం 'ఇప్రకృతి యిలే ఇన్నముం తమ్మై వైత్తరుళిల్ శెయ్ వదిన్' ఎన్నుం భయత్తాలే మిగవుం అవసరన్నరాన ఆళ్వార్ తమ్ముడయ దయయై అన్యాపదేశత్తాలే పేశిగిరార్'—

—మూడవ తిరువాయ్ మొయి.

6.2 క్రీ. శ. 11 వ శతాబ్దమునకుచెందిన 'వీరచోళియం' అనబడు తమిళ లక్షణ గ్రంథమునందు విరవియల్, కిళవిక్కవి, తుఱైక్కవి, పిరళికై (ప్రహేళిక) మొదలగు కావ్యభేదములను వివరించు సందర్భమున మణిప్రవాళము అను కావ్యభేదము కూడ పేర్కొనబడినది.

ఇడైయే పదవెళుత్తైయిడిల్
విరవియ లినెడుగ్గై
నడైయేదు మిల్లా మణిప్పిరవాళ
నత్తైవచ్చొల్లిన్
ఇడైయే ముడియుం పదముడై తా
జ్కిళవి క్కవియిన్
తొడ్డైయే తుఱైనట్ పిరళికై యాది
తుణిన్దజియే.

అలంకార పటలము. 40.

1. Tamil–The Language and its Literature. P 56.
Introduction to Kamba Ramayanam – A Study.

సంస్కృత ధ్వనులతో కూడిన రచన విర వియల్. ప్రాసనియమము కలిగి సంస్కృత పదములతో కూడిన తమిళ రచనము మణిప్రవాళము. కిళవిక్కవి యందు పెక్కుభేదములు కలవు. పిరళికై (ప్రహేళిక) మొదలగు వినావికవి రచనములు (వినావికవి అనునది తమిళమున ప్రాశ్నికరూపము కల రచనము) అని పయి తమిళ పద్యమున కర్థము. వీరచోళియమునందలి అలంకార పటలమున సొల్లణి, తంత్రవృత్తి, తంత్ర గుణము, తంత్ర ఉరై, న్యాయశాస్త్రమునందలి అను మానాదులు అనువానిని వివరించి చిత్రకవిత్వమును గుఱించి తెలిపి, చిత్రకావ్య భేదములను వివరించిన పిదప విరవియల్, మణిప్రవాళము, కిళవిక్కవి, పిర ళికై అను ఈ కావ్యభేదములు తెలుపబడినవి. కాని అందలి గ్రంథభాగమునందుకాని, దానికి రచింపబడిన వ్యాఖ్యానమునందు కాని వానికి లక్ష్యములు ఉదాహరింప బడలేదు. దీనినిబట్టి తమిళమున మణిప్రవాళము నందు కొందఱు రచనలు సాగించిరనియు, లాక్షణికులు కూడ దాని యునికిని గుర్తించి కావ్యభేదములలో దానిని కూడ ఒక ప్రభేదముగా గుర్తించిరనియు తెలియు చున్నది. కాని యీ రచనా విధాన మా భాషలో వేరూన లేదు. 'శెందమిళు'నందు అత్యంతాభిమానము కలిగిన తమిళ కవులు ఈ మార్గమును గర్హించి అచ్చ మయిన తమిళమునందే కావ్య రచనము సాగించిరి.

6.3 తన కాలమునందు జైనకవుల, విద్వాం సుల మూలమున తమిళభాషకు కలుగుచుండిన ప్రమా దమును గుర్తించి తిరుజ్ఞాన సంబంధర్ (పంబందర్) అను శైవ భక్తుడు వా రుపయోగించిన మణిప్రవా ళమును 'సంకద పంగము' (సంస్కృత భంగము) అని గర్హించెను. అది అటు సంస్కృతమును కాదు. ఇటు తమిళమును కాదు—అని అతడు దానిని విమర్శించెను. అతడు చేసిన మణిప్రవాళ గర్హణమును ఈ క్రింది రచనములో చూడదగును.

'ఆగమత్తొడు మందిరంగ ళమైన్ద సంకద పంగమాం పాదగం

—తేవారము, తిరువాలవాయ్ పదిగం.

దీనినిబట్టి తమిళులకు మణి ప్రవాళమును గూర్చి యెట్టి యభిప్రాయము కలదో వ్యక్తము కాగలదు.*

6.4 తమిళ కవి చక్రవర్తులలో ఒకడగు ఒట్టక్కూత్తర్ తన కావ్యములయందు సంస్కృత భూయిష్ఠమయిన, గంభీరమయిన శైలిని నిక్షే పించెను. అదియు తమిళులకు సహింపరానిదయ్యెను. క్రీ. శ. 12 వ శతాబ్దమున శేక్కిలార్ అను కవి తన 'పెరియ పురాణము' అను గ్రంథమున అట్టి సంస్కృత భూయిష్ఠ శైలికి స్వస్తి చెప్పి 'శెందమిళు'ను తిరిగి పునరుద్ధరించి భ్రష్టము కాకుండ దానిని సంరక్షించె నని వారు విశ్వాసముతో స్మరింతురు.

6.5 వైష్ణవ వ్యాఖ్యానములనుండి మణి ప్రవాళ భాషకు ఉదాహరింపబడిన ఉద్ధరణమునుబట్టి తమిళులు ఉపయోగించిన మణి ప్రవాళమునకును, మలయాళమునందలి మణిప్రవాళమునకును విస్పష్ట మయిన భేదము కలదు. సంస్కృత శబ్దములను తమిళ విభక్తులతో చేర్చి తమిళ శబ్దములతోబాటు రచనమునం దుపయోగించుటను మణి ప్రవాళముగా తమిళులు పరిగణించి దానినే వారు పరిహరించిరి. సంస్కృత విభక్త్యంతములయిన సంస్కృత శబ్దము లను తమిళ శబ్దములతో చేర్చి ప్రయోగించు పద్ధతి తమిళమున వెలయలేదు. కనుక తత్సమ పదభూయిష్ఠ మయిన భాషయే తమిళమున మణి ప్రవాళముగా పరి గణిత మయ్యెననియు, అదియు వారికి గర్హ్య మయ్యె ననియు మనము గమనింపవలసియున్నది.

(సశేషం)

---

*Tamil has always been trying to be true to its genius. There was a danger to this in the age of St. Tirugnana – Sambandar and he Condemned the hybrid language of the Jains which was neither good Sanskrit nor good Tamil. He also very much criticised the corruption of Sanskrit words (Sankata Pankam.)

– Tamil and other cultures. P. 35.

by Dr. T. P. Meenakshi Sundaram.

# "ధర్మోపన్యాస కేసరి, ఆర్షవిద్యాభూషణ" (శ్రీ) జటావల్లభుల పురుషోత్తము గారు

శ్రీ రాపాక ఏకాంబరాచార్యులు

సంస్కృత భాషను, హిందూ ధర్మమును, భారతీయ సంస్కృతిని ఉద్ధరించుట యను మహోద్యమమును 40 సంవత్సరములనుండి యవిచ్ఛిన్నముగా సాగించుచు తన యావదాంధ్ర దేశ విపుల పర్యటనలచేతను గ్రంథరచనచేతను సాంస్కృతిక నవ చైతన్యము నాంధ్రావని యందుద్భవింప చేసిన మహనీయుడు శ్రీ జటావల్లభుల పురుషోత్తము గారు.

పురుషోత్తము గారు 17-2-1906 (విశ్వావసు సంవత్సర మాఘ బహుళ సప్తమీ శనివారము నాడు)వ తేదీని వారి మాతా మహస్థలమైన తూర్పు గోదావరిజిల్లా నడవపల్లి గ్రామమున జన్మించిరి. వీరికి 13 సంవత్సరముల ప్రాయము వచ్చు వరకు స్వగ్రామమున ఆత్రేయపురమున నుండిరి. వీరి పూర్వులు అనేక తరములు వేదపాఠ విశేషములైన జటలోను, ఘనలోను ప్రశస్తిగనుటచే వీరి వంశమునకు జటావల్లభ నామము కలిగినది. పురుషోత్తముని జనకులు కృష్ణసోమయాజులు గారు, వేద శ్రౌతములలో నిధి, సంస్కృతములో కావ్యపాఠములనుకూడ చెప్పగల్గియుండిరి. తల్లి మహాలక్ష్మమ్మ గారు పరమ దయార్ద్ర హృదయ. తండ్రిగారి మేధా సంపత్తియు, వైదిక సంస్కారమును, తల్లిగారి దయాగుణమును పురుషోత్తము గారికి సంక్రమించినవి. పురుషోత్తము గారికి అయిదుగురు సోదరులు, ఇద్దరు చెల్లెండ్రు కలరు. కాకినాడలో సుప్రసిద్ధ వైద్యులు శ్రీ మర్లవరసింహశాస్త్రిగారి యేకైక పుత్రిక బాలాత్రిపుర సుందరమ్మ గారు పురుషోత్తముని ధర్మపత్ని. పురుషోత్తముగారికి నల్గురు కుమార్తెలు, ముగ్గురు కుమారులు కలరు.

పురుషోత్తముడు బాల్యమున ప్రాథమిక పాఠశాలలో చదువుకాలముననే యింటివద్ద పితృపాదుల సన్నిధిని సంస్కృత కావ్యములను పఠించిరి. పిమ్మట నంద్యాలలో నుద్యోగమున నున్న జ్యేష్ఠ సోదరుని వద్దనుండి అచ్చటి ఎస్. పి. జి. హైస్కూలులో రెండు సంవత్సరములు చదివి తర్వాత నర్సాపురం టైలరు హైస్కూలులో హైస్కూలు చదువు ముగించిరి. ఇంటరు, బి. ఏ తరగతులు విజయనగరము మహారాజా కాలేజీలో చదివిరి.

ఇంటరులో వీరు సైన్సు గ్రూపు తీసికొనిరి. బయాలజీ ప్రాక్టికల్ క్లాసులో కప్పను కోయుట కంగీకరింపక వీరా గ్రూపును విడిచిపెట్టిరి. సైన్సు తీసికొనువారికి ఉద్యోగావకాశములు బాగుగా నుండునని ఉపన్యాసకులు, ప్రిన్సిపల్ చెప్పినను పురుషోత్తముడు భూతదయ యన్నిటికంటె ప్రధానమని సమాధానము చెప్పెను.

కళాశాలలో విద్యార్థిగా నుండిన కాలములో వీరు సారస్వత చర్చలలో విశేషముగా పాల్గొనెడివారు. విద్యార్థి యూనియన్ కార్యదర్శి పదవి యొక సంవత్సరమును, అధ్యక్షపదవి యొక సంవత్సరము వీరిని వరించెను. బందరులో జరిగిన ఆంధ్రరాష్ట్రీయ విద్యార్థి మహాసభలో నీయన తన కళాశాల ప్రతినిధిగా పాల్గొని యందు కొన్ని తీర్మానములను కూడ ప్రతిపాదించిరి.

ఆంగ్ల విద్యాలయములలో చదువుకొనుచున్నంత కాలము పురుషోత్తము గారు ఇంటివద్ద ప్రత్యేకముగా సంస్కృత విద్యాభ్యాసమును సాగించుచునే యుండెను. నడుమ కొంతకాలము ఆంగ్లవిద్యను మాని నరేంద్రపురములో గురుకుల పద్ధతిని సంస్కృత విద్యాభ్యాసము గావించెను. పండిత దిగ్గజములగు శ్రీ పుల్య ఉమామహేశ్వర శాస్త్రిగారును, శ్రీ వేమూరి రామగోవింద శాస్త్రిగారును వీరికి ప్రధాన గురువులు. బి. ఏ పూర్తి చేయు నప్పటికే యీయన యొక సంస్కృత పండితుడుగా రూపొందెను. స్పెషల్ ఇంగ్లీషు నభిమాన విషయముగా తీసికొని యీయన బి. ఏ పరీక్షలో నుత్తీర్ణుడాయెను.

కళాశాల వీడునప్పటికి పురుషోత్తమునకు సాంఘిక ధార్మికాధ్యాత్మిక రాజకీయ విషయములలో సుదృఢములైన భావములు కొన్ని యేర్పడియుండెను. సంస్కృతభాష యుద్ధరింప బడనిచో భారతీయత క్రమముగా నడుగంటుననియు, ఆంగ్లేయ పరిపాలనము మరి కొంతకాలము సాగుచో భారతదేశ ధర్మ సంస్కృతులు నశించుననియు, ఆధునిక భౌతిక వాదమునకు విరుగుడుగా పనిచేయగలది శ్రుతి స్మృతి ప్రతిపాదిత ధర్మప్రచారమే యనియు వీరికి నిశ్చితాభిప్రాయము లేర్పడెను.

40 సంవత్సరముల క్రిందట కాకినాడలో బ్రహ్మసమాజికులకును, ప్రాచీన సంప్రదాయికులకును విగ్రహారాధనమును గురించి చాల దినములు చర్చలు జరిగెను. డాక్టరు వేమూరి రామకృష్ణారావు గారు, శ్రీ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు మున్నగు పెద్దలు ఉభయపక్షములనుండియు మాట్లాడిరి. ఆరవనాడు పురుషోత్తముగారు చర్చలో పాల్గొనిరి. వీరి యుపన్యాసము నూతనాంశములతో గంగాఝరీ సదృశ ప్రవాహముతోనుండి యెల్లర నాకర్షించినది. అదివరకు మాట్లాడిన ప్రతిపక్షులందరు తమ్ము వ్యక్తిగతముగా దూషించిరనియు, ఈ యువకుని ఉపన్యాస మొక్కటి ఉదాత్తముగా నున్నదనియు బ్రహ్మసమాజికులు మరునాడు సభలో ప్రకటించిరి. 'The only refreshing speech came from the last speaker of yesterday' అని కూడ వారి పక్షమున సభలో చదువబడిన లేఖలో నుండెను. ఆ చర్చలు జరిగిన కొలది మాసములకే ప్రిన్సిపల్ రామకృష్ణారావుగారు తమ పి. ఆర్. కాలేజీలో పురుషోత్తముగారికి ఉద్యోగమిచ్చిరి.

1932 మార్చి, ఏప్రిల్ మాసములలో కొవ్వూరు ఆంధ్ర గీర్వాణ విద్యాపీఠ కార్యదర్శి శ్రీ వల్లూరి సూర్యనారాయణరావు గారికిని పురుషోత్తమునకును ఆంధ్రపత్రికలో నొక చర్చ జరిగెను. శ్రీ రావుగారు 'గౌతమధర్మ సూత్రములు' అను వ్యాసములో సనాతన ధర్మము నధిక్షేపించిరి. పురుషోత్తము గారందలి ప్రతియంశమునకును సమాధాన మొసగిరి. పంతులుగారు 'వీరు మృదు విమర్శకు సంతసించితిని. నా కింకను సందేహములున్నవి. వానిని కూడ తీర్చవలయునని పురుషోత్తముగారిని కోరుచున్నాను' అని వ్రాసిరి. ఆ వ్యాసమునకును పురుషోత్తము గారు సరస సమాధాన మిచ్చిరి.

ఇది జరిగినయొక నెలకే తమ విద్యాపీఠమునకు ప్రిన్సిపాల్ కావలయుననియు, న్యాయమైన విమర్శన, పరిశోధన గావింపగల పట్టభద్రులు అప్లికేషన్ పంపుకొన వచ్చుననియు సూర్యనారాయణ రావు గారు ఆంధ్రపత్రికలో ప్రకటించిరి. పురుషోత్తము గారు ధరఖాస్తు పంపిరి. ధరఖాస్తుతో తాను బి. ఏ చదువుచున్న దినములలో రచించి తరువాత త్రిలింగ పత్రికలో ప్రకటించిన 'భారతదేశౌత్కృష్ట్యము' అను గ్రంథమును కూడ పంపిరి. పంతులుగారిట్లు సమాధాన మిచ్చిరి. 'ఎందరో పెద్దలా యుద్యోగమునకు దరఖాస్తు పెట్టినారు, అయినను మీకు తప్ప మరొకరికీ యుద్యోగము నీయను.'

తనచే ఖండనమునకు గురి కావింప బడిన వారి మన్ననను కూడ పురుషోత్తము డెట్లు పొందెనో యనుటకు రెం డుదాహరణములను చూచి యున్నాము. ప్రతిపక్ష ఖండనలో పురుషోత్తముడు పాటించు మర్యాద చివరివరకు నివిధముగనే సాగినది.

1—7—1932 తేదీని పురుషోత్తముగారు ఆంధ్ర గీర్వాణ విద్యాపీఠమునకును తదనుబంధియైన శ్రీ వాఙ్దేవు జోగాయమ్మ సంస్కృత కళాశాలకును ప్రిన్సిపల్‌గా ప్రవేశించిరి. నాటినుండి వీరు ఆ సంస్థలకు చేసిన సేవ, వానికి కూర్చిన ప్రతిష్ఠ, విద్యార్థులయందు వారు చూపిన పుత్ర వాత్సల్యము సువిదితములు. సంస్కృత కళాశాలా వాతావరణముపై మక్కువ వలననే వీరు కాకినాడ కళాశాలలో తమకు ఎం. ఏ ప్యాసయిన వెంటనే ప్రాచ్యభాషా ప్రధానాచార్యత్వము నిచ్చెదనని రామకృష్ణ రావుగారు ఎన్నివిధములు చెప్పినను వినక తక్కువ జీతముతో కొవ్వూరులో నుండుటకే యిష్టపడిరి.

అన్నిటికంటె ముఖ్యమైనది అచ్చట చేరినప్పటి నుండియు వీరు పరిశోధనలో నిమగ్నులయిరి. ఏ విద్యార్థికంటె ఎక్కువగా చదువుచుండెడివారు. విద్యాపీఠ గ్రంథాలయము వీరి కృషి కెంతో దోహదము చేసినది. పురుషోత్తముగారు వేదశాస్త్రోభయ విద్వాంసులయిన శ్రీ కొంపెల్ల సత్యనారాయణ శాస్త్రిగారి సాహాయ్యముతో చతుర్వేద సాయణ భాష్యములను చదివిరి. వేదమును గూర్చి ప్రామాణికమైన విజ్ఞానము సంపాదించిరి. 'వేదకాలపు స్త్రీలు' అను గ్రంథము రచించిరి. దానిని చదివినవారెల్లరు ఏ భాషలోనైనను నిష్పక్షపాతముగా కేవల సత్యాన్వేషణ దృష్టితో రచింపబడిన గ్రంథములలో నిది యొకటి యని అంగీకరింపగలరు. ఈ గ్రంథము సనాతన ధర్మవాదులకును సంస్కర్తలకును సమానముగనే యుపకరించును.

పిమ్మట పురుషోత్తము గారు స్వయముగా సమగ్రముగా మన్వాది సమస్త స్మృతులను పరిశీలించి 'స్మృతి కాలపు స్త్రీలు' అను గ్రంథము రచించిరి. ఇదియు పై గ్రంథమువలెనే పరిశోధన చేయు వారికెంతో యుపయోగించు గ్రంథము. మూల గ్రంథముల నిట్లు పరిశీలించుటతోపాటు మాక్సుముల్లరు, మాక్డొనెల్ మున్నగు పాశ్చాత్యుల వ్రాతలను పరిశీలించుచు వారిని సమర్థించుచు కొన్ని వ్యాసములను, ఖండించుచు కొన్ని వ్యాసములను పురుషోత్తముగారు పత్రికలలో రచించిరి. మానవ ధర్మ సూత్రమను నొక గ్రంథ మొకప్పుడుండెనని మాక్సుముల్లరు సిద్ధాంతము సమగ్రముగా చర్చించుచు పురుషోత్తముగారు 'మానవధర్మ సూత్రమను గ్రంథముండెనా?' అను వ్యాసమును ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికలో వ్రాసిరి. 'ఆర్యుల యాది నివాసము భారతదేశమే' 'విదేశములలో భారతీయ సంస్కృతి' 'భారతీయ విజ్ఞాన ప్రభావితులయిన పాశ్చాత్యులు' ఇత్యాది పరిశోధనాత్మక వ్యాసములను కూడ వీరు సంవత్సరాది సంచికలలో ప్రకటించిరి.

శ్రీ కున్హన్ రాజా, శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రిగారల స్కందస్వామి వేదభాష్యమును గురించిన పరిశోధనా వ్యాస మొకటి 30 సంవత్సరముల క్రితము భారతిలో ప్రకటింపబడగా పురుషోత్తముగారు వారి వ్యాసములోని విద్యారణ్య భాష్యముకంటె స్కందస్వామి భాష్యము మిన్నయను నభిప్రాయమును ఖండించుచు భారతిలోనే యొక వ్యాసమును ప్రకటించిరి. ఈ మూడు ప్రముఖ పత్రికలలోను మరియు ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక, గ్రంథాలయ సర్వస్వము, గృహలక్ష్మి, ఆంధ్రప్రభ, జాగృతి, కృష్ణాపత్రిక మున్నగు పత్రికలలోను పురుషోత్తముగారిచే రచింపబడిన సుమారు 600 వ్యాసములను పేర్కొనుటకైనను ఇటతావులేదు.

సాహిత్యము, మతము, రాజకీయము మున్నగు బహువిషయములకు చెందినవిగా నీ వ్యాసములున్నవి. ఆంగ్ల దినపత్రికలలో వీరు ప్రకటించిన రచనలను ఆంగ్లభాషా కోవిదులెంతయో ప్రశంసించిరి. ఈ రచనలలో వీరికి సమకాలిక సమస్యలపైగల అవగాహనము, వాని పరిష్కారమునకై వారి మానసికాన్వేషణము ఎంత ప్రగాఢమైనవో తెలియగలదు. వీరొసగిన రేడియో ప్రసంగములు సుమారు 40 కలవు. అందు కొన్ని ఆంగ్లములోను, కొన్ని సంస్కృతములో నున్నవి.

నేటి కాలమున సరళసుందరమైన సంస్కృత కవిత్వ రచన గావించు వారిలో పురుషోత్తముగా రొకరు. 'చిత్ర శతకము'ను వీరి గ్రంథమును శ్రీ విశ్వనాథ వారు 'ఈ గ్రంథమంతయు బంగారమే' యని వర్ణించిరి. ఈ రచన 'సంస్కృత వాణీ విలాసమ'ని ఆంధ్రపత్రిక

శ్లాఘించెను. శ్రీమత్తిరుమల గుదిమెళ్ల వరదాచార్యులు గారు 'అత్ర త్యా భాషా అత్యంతం రమణీయా అర్థశ్చ అత్యంతం గభీరః' అని ప్రశంసించిరి.

వీరి చిత్రశతకమునుండి యొక శ్లోకమును జగద్గురు ప్రశస్తినుండి యొక శ్లోకమును ఉదాహరించు చున్నాను :

'రమ్యం కవిత్వం భువి ధర్మ దూరం
ధర్మ్యం కవిత్వం నహి రమ్య మేవ
స్వర్ణం సుగంధి ద్విగుణం కవిత్వం
గీర్వాణ వాణ్యా ఇతరత్ర కుత్ర'
(చిత్ర శతకము)

(లోకములో ఇతర భాషలలో కవిత్వము సుందరముగా నున్నచో నందు ధర్మబోధ వ్యగ్యము; ధర్మ బోధకముగా నున్నచో నందు సౌందర్యము కన్పట్టదు; సౌందర్యము, ధర్మబోధ యను రెండు లక్షణములను కలిగి పరిమళించు బంగారమువలెనున్న కవిత్వము సంస్కృత భాషలో తప్ప మరెట నున్నది?)

'రాజాధి కారా దధిక ప్రభావః
శ్రీ మాతృ హృత్ప్రేమ సమాన భావః
మాధుర్య భావోప్య మృతైక నిష్ఠ
స్తద్దీక్షణే సమ్మిళితా భవన్తి'
(జగద్గురు ప్రశస్తి)

(ఆ జగద్గురువుల నేత్రములలో రాజాధికారము మించిన అధికారమును, మాతృప్రేమను మించిన ప్రేమయు, అమృతరసమును మించిన మాధుర్యము మిళితములై యున్నవి.)

హిందూధర్మమును ప్రచారము చేయుటకు ముఖ్యసాధనముగా వీరు 1940 లో 'హిందూమతము' అను గ్రంథమును రచించిరి. శ్రీ తాతా సుబ్బరాయ శాస్త్రిగారు, శ్రీ ఉప్పులూరి గణపతి శాస్త్రిగారు మున్నగు పండిత ప్రకాండు లీ గ్రంథముయొక్క ప్రామాణికతను బహువిధముల శ్లాఘించిరి. ఈ గ్రంథము 12 పర్యాయములు ముద్రితమై యాంధ్ర దేశమున నలుమూలలకు వ్యాపించినది. హిందూ మత మన నేమియో తెలుసుకొన గోరు వారికీ గ్రంథమత్యంతోపయోగకరమగుటచే మత విజ్ఞాన పరీక్షలు నడుపు వారీ గ్రంథమును పాఠ్యగ్రంథముగా నిర్ణయించు చున్నారు. ఇది తమిళములోనికిని, కన్నడములోనికిని అనువదింప బడినది.

పురుషోత్తముగారి 'భారతీయ విజ్ఞానము'ను గ్రంథము మన ప్రాచీన భౌతిక ధార్మికాధ్యాత్మిక విజ్ఞానమును నేటి సైన్సుతో పోల్చునట్టి గ్రంథము. 'భారతీయవైభవము' సంస్కృతభాషా మహత్వాది విషయములను నిరూపించు గ్రంథము. 'ధర్మమంజరి' యను గ్రంథము మనుస్మృతి సారమును సామాన్య పాఠకున కందించు కృతి. భగవద్గీతా ప్రవేశము' గీతను ఏకధారగా నర్థము చేసికొనుటకు తోడ్పడు గ్రంథము. 'ఆధ్యాత్మిక వ్యాసములు' అనునది షడ్దర్శన స్వరూపము తెలుపునట్టియు 'శాంకరదర్శనము'ను, శంకరాచార్య ప్రతిభను వ్యాఖ్యానించు నట్టియు, కర్మ, పునర్జన్మము, పుణ్యపురుషులు—పుణ్యభూములు ఇత్యాదుల తత్త్వమును ఆధునికులకు గ్రాహ్యమగురీతిని బోధించునట్టియు వ్యాసములతో కూడిన గ్రంథము. 'మహాకవి సందేశము' అను గ్రంథములో వీరు సంస్కృత మహాకవులలో కళాసౌందర్యము, ధర్మ బోధ యెట్లు మిళితమైయున్నవో యను నంశమును 400 శ్లోకముల నుదాహరించుచు నిరూపించిరి.

ప్రధానముగా లోకములో ప్రసిద్ధమైనవి వారి వక్తృత్వము, బహుముఖ విజ్ఞానము. సభ్యులపై సమ్మోహ నాస్త్రము వేసినట్లు పన్యసింపగల శక్తిని భగవంతుడు వారికి ప్రసాదించి నాడు. పురుషోత్తము గారు మాతృ భాషలోను, సంస్కృతము నందును ఆంగ్లమునందును పటిష్ఠమైన వక్తృత్వము, రచనా శక్తికలవారు. ఇట్టిశక్తుల సమ్మేళనము కలవారు ఏ దేశములోనైనను కొద్దిమంది మాత్రమే యుందురు. ధర్మము, సాహిత్యము, జాతీయత, వేదాంతము మున్నగు విభిన్న విషయములపై సుమారు 2500 మహాసభలలో ఉపన్యసించిన పురుషోత్తముగారి బహుముఖ విజ్ఞానమును పఠిత లూహించు కొన వచ్చును. వేదము, ధర్మశాస్త్రములు, వారి ప్రధానవిహార రంగములు. సాహిత్యము వృత్తిచేతనేకాక అభిరుచిచే కూడ వీరిచే సేవింపబడినది. వేదాంతముపై పురుషోత్తముగారు

ప్రసంగించుటను విన్నవారెల్లరు ప్రస్థాన త్రయముపై వీరు గావించిన కృషి కాశ్చర్య పడుదురు. జాతీయ సమస్యలు, అంతర్జాతీయ సమస్యలు వారికి కరతలా మలకములు.

అదివరకు హిందూ మత సంస్కృతులను నిరసించువా రెందరో వీరి యుపన్యాసములను విన్న తర్వాత తద్భక్తులైనారు. వీరు సంస్కృత భాషా ప్రాశస్త్యమును గూర్చియో, కాళిదాసాది మహాకవులను గూర్చియో యుపన్యసింపగా విని సంస్కృతము నేర్చుకొన్నవారు, తమ పిల్లలకు సంస్కృతము నేర్పించినవారు వందలకొలది కలరు. వీరి ప్రబోధములకు ఫలితముగా వేద సంస్కృత పాఠశాలలు, వేదశాస్త్ర ప్రవర్ధక సభలు ఎన్నియో బయలుదేరినవి. వీరి యుపన్యాసముల ప్రభావమునకు లోనైనవారు ఒక వర్గమునకు చెందిన వారు కారు, అన్ని యంతరములు లోని వారున్నారని చెప్పవచ్చును.

వేదశాస్త్ర విద్వత్సభలు మొదలు ఆంగ్ల కళాశాలా విద్యార్థి సమావేశము వరకు మరియు రోటరీ—లయన్సు మున్నగు సంస్థల సమావేశములు, గ్రంథాలయ వార్షికోత్సవములు, సప్తాహములు, భక్తసమాజ సభలు, వేదాంత గోష్ఠులు, సాహిత్య సభలు, ఇత్యాది పరస్పర విదూరము లయిన సందర్భములో వారి రాక ఉత్కంఠతతో నాకాంక్షింప బడుచుండును. వారున్న సభకు తేజస్సు వచ్చునను భావ మేర్పడి యున్నది. అట్లే నగరములలోను, పట్టణముల లోను, గ్రామములలోను, కుగ్రామముల లోను కూడ వీరి ప్రబోధములను సమాదరముతో విందురు. ఢిల్లీ, కాశీ, నాగపూరు, జెంషెడ్‌పూరు, మద్రాసు, పూరి, మున్నగు మహానగరములలో వీరి—వాగ్ఝరి ప్రవహించినది. ఇతర భాషా ప్రాంతములలో వీరు ఇంగ్లీషులో కాని, సంస్కృతములో కాని ఉపన్యసించు చుందురు. భాష యేదైనను ప్రవాహమొకే తీరులో నుండును. పురుషోత్తముగారి భారతీయ సంస్కృతీ సేవనము ఉపన్యాస రచనా సాధనములకే పరిమితములు కాలేదు. ఆయన గావించిన ప్రత్యక్ష క్రియాత్మక సేవ ముఖ్యముగా పేర్కొన దగినది.

కొన్ని శతాబ్దములనుండి ఆంధ్రదేశములో అదృశ్యమై పోయిన అథర్వవేదము నాయన తిరిగి తెప్పించినారు. యావద్భారతములోనే ఇద్దరో, ముగ్గురో అథర్వవేద విదులున్నారనియు, వారైనను వృద్ధులగుటచే త్వరలో నీ వేదము ప్రపంచము లోనే అంతరించి పోవు ప్రమాదమున్నదని గ్రహించి వీరు శ్రీ తంగిరాల బాలగంగాధర శర్మగారను యువక విద్వాంసుని ప్రేరేపించి ఆర్థికముగా కావలసిన సాహాయ్యమును చేసి యాయనను కాశికి పంపిరి. రెండున్నర సంవత్సరములాయన అథర్వవేదమును పూర్తిగా నధ్యయనము చేసి భగీరథుడు గంగను భూమికి తెచ్చినట్లు గంగాధర శర్మగారు అథర్వవేదము నాంధ్రదేశమునకు తెచ్చిరి. ఈ సంఘటన పురుషోత్తముగారి చరిత్రలోనే కాక ఆంధ్రదేశచరిత్రలో సువర్ణాక్షరములతో లిఖింప దగియున్నది. శర్మగారి ద్వారా అథర్వవేదము కొంత విస్తృతిని ఈ ప్రాంతమున పొందినది. అందులకు కూడ పురుషోత్తముగారు దోహదము చేసిరి.

మరియు ధర్మశాస్త్రాధ్యయనము దేశములో సన్నగిల్లుచున్నదని తెలిసికొని వీరు 14 సంవత్సరములు వరుసగా 'వేసవి ధర్మపాఠశాల'లను నడపిరి. అందు సుమారు 150 మంది ధర్మశాస్త్రాధ్యయనము చేసిరి. విద్యార్థులకు భోజనము నేర్పాటు చేయుటయే గాక ధర్మశాస్త్ర పాఠ్యగ్రంథములను ఉచితముగా వీరొసగుచుండిరి. ఇద్దరు ధర్మశాస్త్ర పండితుల నధ్యాపకులుగా నేర్పాటు చేయుచుండిరి. వీరైనన్ని దినములు తాముకూడ పాఠశాలలో నుండి విద్యార్థులకుపన్యసించు చుండిరి. 1948 నుండి 1961 వరకు ఈ పాఠశాలలు వరుసగా ఈ క్రింది గ్రామములలో జరిగెను. ముంగండ, కాకరపర్రు, ఏలూరు, (ఇరగవరం కూడ) నెల్లూరు, మోడేకుర్రు (రెండేండ్లు) ఇరగవరం, విజయవాడ, సిద్ధాంతం, పొడగట్లపల్లి, ముక్కామల, రాజమండ్రి, బాపట్ల.

మరియు పురుషోత్తము గారు కాకినాడలో స్థిరపడినప్పటి నుండియు ఈ యెనిమిది సంవత్సరములలోను అచ్చట మూడు సంస్కృత రాత్రి పాఠశాలలను

స్థాపించిరి. అందు నూర్గురు విద్యార్థులును నల్గురు ఉపాధ్యాయులును కలరు. ఒక వేదపాఠశాలను కూడ నడుపుచున్నారు. మరియు ప్రతి స్థిర భానువారములు సాంస్కృతికోపన్యాసములను పండితులచే గావింప జేయు చున్నారు. ఇప్పటికి 300 ఉపన్యాసము లట్టివి జరిగినవి. అందు సంస్కృత సాహిత్యము, వేదాంతము, ధర్మము, ఇత్యాది విషయములపై ప్రసంగములు జరుగు చుండును. ఉపన్యసించువారు 5 నిమిషములైనను ముందుగా సంస్కృతములో మాట్లాడవలయు నను నియమము వారు చేసినారు. ఈ కార్యక్రమమునంతను వారు తాము స్థాపించిన శ్రీ వేణుగోపాల సంస్కృత ప్రచారసభద్వారా గావించుచున్నారు, దానికి వీరు శాశ్వతా ధ్యక్షులు. ఇంతేకాక మరొక పాఠశాల, ఒక ఓరి యంటల్ కాలేజి ఏర్పడుటకు వీరు కృషి చేసి సఫలు రైరి.

ఇట్లు బహువిషయ పరిజ్ఞాతగా, బహుభాషా కోవిదుడుగా, రచయితగా, మహావక్తగా, కవిగా, కార్య నిర్వహణా దక్షుడుగా భారతీయ సంస్కృతి నింతకాల ముగా ఉద్ధరించుచున్న పురుషోత్తముని కాంధ్రదేశ ములో స్థిర ప్రతిష్ఠ యేర్పడిన దనుటలో నాశ్చర్యము లేదు. వీరి ప్రతిష్ఠ యాంధ్రదేశమునకే పరిమిత మనుటయు నంత సరికాదు. 'ఆర్ష విద్యాభూషణ', 'ధర్మస్థాపక' 'ఉపన్యాస కేసరి' 'ధర్మోపన్యాస కేసరి' ఇత్యాది బిరుదములను విద్వత్సభలు వీరి కొసగినవి. ఆంధ్రప్రదేశ ప్రభుత్వము సంస్కృతాభివృద్ధికి మార్గ ములు సూచించుటకు నియమించిన బూర్గుల కృష్ణారావు కమిటీలో వీరిని సభ్యులుగా వేసినది.

ప్రయాగ విశ్వహిందూ పరిషత్సమ్మేళనానంత రము ఆంధ్రప్రదేశ్ శాఖ ఏర్పడవలసివచ్చినపుడు దానికి అధ్యక్షుడుగా నుండదగిన వ్యక్తి పురుషోత్తములేయని భావింపబడెను. ఈ యైదు సంవత్సరములనుండి వీరే యా యధ్యక్షతను వహించుచున్నారు. మరియు నిటీ వల తిరుపతి—తిరుమల దేవస్థానము నెలకొల్పిన హిందూధర్మ ప్రతిష్ఠాపనమునకు కార్యనిర్వాహక వర్గ సభ్యులలో నొకరుగా వీరెన్నుకొనబడిరి.

భారతీయ సంస్కృతికి, హిందూమతమునకును, సంస్కృతభాషా ప్రచారమునకును పురుషోత్తమ మహో దయులు గావించిన అపారమగుసేవకు మహదానంద మును పొంది తెలుగువారు యావదాంధ్రదేశ పక్షమున వారికి అక్టోబరు 8, 9 తారీఖులలో కాకినాడ యందు కవిసమ్రాట్, ఆస్థానకవి, డాక్టరు విశ్వనాధ సత్యనారాయణగారి యధ్యక్షతను ఘనమగు సన్మా నము గావించిరి. సన్మానము జరిగి నెలదినములైనను కాలేదు. ఇంతలోనే మృత్యుదేవత వారిని కబళించినది. పురుషోత్తముగారు 28–10–1972 వ తేదీ (శనివారం) ఉదయం 4 గంటల 10 నిమిషములకు కాకినాడయందు వారి స్వగృహమున పరమపదించిరి. వారు మృతజీవులు. వారు వెలిగించిన విజ్ఞానచైతన్య జ్యోతి దీప్తిమంతమై ఆంధ్రదేశము నందెల్లపుడును ప్రకాశించుచునే యుండును. వారి పవిత్రాత్మకు జగత్కళ్యాణ మూర్తియగు సర్వేశ్వరుడు శాంతిని చేకూర్చుగాత!

# తెరవెనుక దీపం

## శ్రీ రాధా ప్రియ

అప్పటికి గంటనుంచి అటూ యిటూ మసలుతూన్నా రవణమ్మకు, కంటిమీాదకు కునుకు రావటంలేదు. పగలంతా రెక్కలు ముక్కలు చేసికొన్న ఒళ్లు విశ్రాంతి తీసికోవటానిగ్గూడా ఆ రోజు మొరాయించింది. ఒళ్లయితే అలిసిందిగాని, తలకాయలో ఉసిళ్లపుట్టలా ఆలోచనలు రేగి, వాటి ఫలితంగా గుండెల్లో బాధా, పర్యవసానంగా కంటివెంట నీరూ, రావటంచేత, వాటన్నింటిని కొంతవరకైనా కట్టేసే నిద్దర భయపడి పారిపోయింది. తలకింద ఎత్తుకోసం పెట్టుకొన్న పాత చీరె దాదాపూ తడిసిపోయింది.

లేచి బయటకెళ్లి, ముక్కు చీదుకొని, పమిట చెంగుకు తుడుచుకొని కూర్చుంది. గదిలో గుడ్డిదీపం చావలేకా, బతకలేకా అల్లల్లాడుతూంది. ఆ రవంత వెలుగులో రవణమ్మ నీడదెయ్యంలా గోడమీాద కదలటం ఆవిడక్కనిపిస్తూనేవుంది. గుడిశెలో ఓమూల చిన్న ట్రంకుపెట్టె మరీ పాతది వుంది. కొడుకు పుస్తకాలు పెట్టుకోవటానికి ఆ స్కూలు హెడ్మాస్టరు భార్య యిచ్చిందది. ఓ మూల కట్టిన దండెంమీాది నుంచి రవణమ్మవి రెండు పాతచీరెలూ, ఓ చింకి దుప్పటీ, సత్యానివి రెండు పాతచొక్కాలు, రెండు లాగూలు వేలాడుతున్నయి. కూడొండుకునే చోట రెండు చిన్నకుండలూ, పిడతలూ, ఒకటో రెండో సత్తు గిన్నెలూ, గ్లాసులూ వున్నయ్. గుడిశె మధ్యలో ఓ చింకి చాపమీాద పాత దుప్పటీ పరచివుంది. ఎదురుగ్గా సత్యం పుస్తకాలు, పాతవి వున్నయ్.

ఇందులో యేవీ రవణమ్మకు ఆశ్చర్యం కలిగించేవికాదు గనుక, ఆవిడ వీటిని గురించి పట్టించుకోలేదు, కథకుడు పట్టించుకొన్నంతగా. ఆమె తల్లో రేగుతున్న ఆలోచనలూ, గుండెల్లో మండుతూన్న సెగలూ వేరు. ఆవిడకివ్వేళ్ల నాలుగునెల్లనాడుపోయిన ఇరవయ్యేళ్ల కూతురూ, చిన్ననాటి బావ, మొగుడూ గుర్తొస్తున్నారు.

ఆ సాయంకాలం, తను పనిచేసే ప్లీడరుగారింట్లో ఆయన పెద్దకూతురు ప్రసవించి పండంటి కొడుకును కన్నది. వారింటినుంచీ వొచ్చిందగ్గర్నుంచీ రవణమ్మకు మనసు మనసులో లేదు. రంగి కూడా యిట్లాగే పండంటి బిడ్డను కని పదికాలాలపాటు చల్లగా వుండ వలసింది. కాని దేవుడు తన నన్యాయం చేశేడు. సరిగ్గా నాలుగు నెల్లనాడు రంగికి నొప్పులొస్తున్నాయని కబురొస్తే పరుగు పరుగున వెళ్లింది. తొలి చూలు. తన యింటికి కూతుర్ని తీసికు రావటమే రివాజు. కాని ఈ దరిద్రంలో కూతుర్ని తీసికొచ్చి తనేం చేయగల్దు? వియ్యంకుడు పెద్దమనిషి. కష్టసుఖాలు తెలిసినవాడు. అతగా డన్నాడు—

'నువుమాత్రం ఒంటరిదానివి పిల్లనీ్తసికెళ్లి ఏం తిప్పలు పడతావ్? ఇక్కడ జనానికి లోపం లేదు. ఇట్టాంటివి మీా వొదిన క్కొట్టినపిండి. పది మందిని కన్నదిగా, దక్కింది నలుగురే అయినా. అందుకని నువు లేనిపోని హైరాన పడమాక. నొప్పులు వొచ్చే వేళక్కబురు చేస్తారు. వొచ్చేద్దువుగాని.'

తను మాత్రం యేమన గల్దు?

సరే, వెళ్లింది. నిండా యిరవైలేని రంగి, మరో ప్రాణాన్ని భూమిాదకు నెట్టే ప్రయత్నంలో విపరీతమైన బాధ పడుతోంది. మెలికలు తిరిగిపోయే దాని వొళ్ళూ, చెమటలుపట్టే ముఖమూ, గొంతు చినిగి పోతుందేమో అనేంత కేకలూ, రవణమ్మకు భయం పుట్టించేయి.

కాన్పు సులు వవలేదు. చుట్టు పక్కలవాళ్లు ఆసుపత్రికి తీసికెళ్ళమన్నారు. తీసికెళ్ళేరు.

అయినా కూతురు దక్కలేదు. పిల్లాడు మాత్రం తుండు ముక్కలా వున్నాడు. ప్లీడరుగారి మనవడేం చాల్తాడు వాడిముందు? ఇంకో నిమిషానికి ప్రాణం పోతుందనగా, తనవేపుచూసి, పక్కలోవున్న పసికందును చూసి కళ్ళతో అంది—

'అవ్మా! నాకొడుకును కడుపులో పెట్టు కోవే!' అని.

తను భోరుమని యేడుస్తూ, 'నీకొడుకున్నేను కళ్ళల్లో పెట్టుకొని పెంచుతాను. నువు మాత్రం నన్నన్యాయంచేయకే' అంది.

రంగి అన్యాయమే చేసింది.

ఆ చంటి వెధవను కడుపులోనూ, కళ్లల్లోనూ పెట్టుకొని పెంచాల్సిన అవసరమే కలగలేదు తనకు. ఆ గుంటడికి తల్లిమీద అంత మక్కువేమిటో! తల్లివెంటే ఓ గంట ఆలశ్యంగా వెళ్లిపోయేడు.

రవణమ్మకు దుఃఖం తెరవొచ్చింది వుధృతంగా. రెండు నిమిషాలు వెక్కివెక్కి యేడ్చింది. 'అసలు తన బతుకే పాపిష్టిది. లేకపోతే తనబతుకులో సుఖపడ్డ దేముంది? చిన్నప్పుడు పధ్నాలుగేళ్లు వొచ్చిందాకా కాస్త సంతోషంగా బతికింది. ఆ తరవాతనుంచి అన్నీ కష్టాలే.'

బ్రతుకులో తానెరిగిన మొదటిదెబ్బ బావ పోవటం.

బావ మంచి వాడు. వాడికి తనంటే వల్లమాలిన యిష్టం. తనకు వాడంటే బయటకు చెప్పలేనంత ప్రేమ. వాడు తనకు మేనత్తకొడుకు. బావకు పదేళ్ళప్పుడు అత్తపోయింది. పోతూ వాణ్ణి నాన్న కప్పగించి, 'ఒరేయి అన్నా, బంగారంలాంటి కొడుకును నీ చేతుల్లో పెడుతున్నాను. పెంచి, కూతుర్నివ్వరా!' అంది. అయ్య అట్లాగే నని వొట్టు వేేడు.

మాఘ మాసంలో పెళ్ళి నిశ్చయం చేశేరు. రమణమ్మ కప్పుడు పదిహేను. వెంకటేశ్వర్లుకు పద్దెనిమిది. పెళ్ళి నిర్ణయం జరిగేక బావముఖంలోకి చూడాలంటే రవణమ్మకు వల్లమాలిన సిగ్గు పుట్టు కొచ్చేది. వాడుమాత్రం కళ్ళునిండా వెలుగు నింపుకొని రవణమ్మకేసి పోకిరి చూపులు చూసేవాడు.

ఇంకో నెలరోజుల్లో పెళ్లనగా ఒకరోజు పొలం నుంచి వొచ్చి వొళ్లు నొప్పులుగా వుందని పడు కొన్నాడు వెంకటేశ్వర్లు. ఆర్రాత్రికి జ్వరం కాసింది.

అంతే, వాడు మళ్లీ తేరుకోలేదు. అదేదో విషజ్వరమట. ఇరవయ్యొక్క రోజులు మనిషి మరునాడు పోయేడు.

ఆవేళ రవణమ్మగుండెలు పగిలేలా యేడ్చింది. ఏమైనా చేయగలగిందే ముంది గనుక?

పుణ్యంచేసికొన్నవాళ్ళు కష్టాల్లేకండా తొంద రగా వెళ్ళిపోతారు.

తనలాంటి పాపిష్టి వాళ్ళు బతుకుతారు, వొందేళ్లు, యిన్నియాతనలూ పట్టానికి.

ఆ వైశాఖంగాక తరవాత వైశాఖంలో తనకు పెళ్లయింది వీరయ్యతో. తనూ అడ్డు చెప్పలేదు.

అతనూ మంచివాడే. నెమ్మదస్తుడు. తనను బాగానే చూసుకొనేవాడు. తనూ అతగాణ్ణెప్పుడూ కష్టపెట్టలేదు.

అయితే మనస్సునిండుగా అతన్ని ప్రేమించ లేక పోయింది. అదెట్లా కుదురుతుంది? బావనుయిష్ట పడ్డంతగా తానుమరొకర్ని యెలా యిష్టపడగలదు? బావ యెదురుగ్గా ుంటె తాము యిద్దరు విడి మనుషులమని అనిపించేదే కాదు. వాడంటే తనకూ వొళ్ళూ, మనసూ అంతా ప్రేమే. తన శరీరమే కొంత వాడిదగ్గర వున్నట్లుగా వుండేది.

నిజం చెప్పమంటే తాను మొగుణ్ణలా ప్రేమించలేదు. ప్రేమించలేదు అంటే అది తన చేతుల్లో లేదు. అయితే యేం? తనకు చాతయినంత వరకూ వీరయ్యను సుఖపెట్టింది. అతన్ని కంటికి

రేప్పలా చూచుకుంటూ, ఆయనో్త ఎనిమిదేళ్లు కాపురం చేసింది.

పొరుగూరు వెళ్లి పాము కరచి వీరయ్య చని పోయినప్పుడు రవణమ్మకు పాతిక నిండలేదు. అప్పుడు రంగికి ఐదేళ్లు. సత్యానికి యేడాది వెళ్లింది.

ఆ తరవాతనుంచీ ఆవిడకష్టాలు మొద లయ్యాయి.

అప్పట్నుంచీ వారింట్లో వీరింట్లో చాకిరీచేసి పిల్లల్ని పైకి తీసుకొచ్చింది.

ఈడు రాగానే చాతయినంతలో అనువైన సంబంధం చూసి కూతురికి పెళ్లి చేసింది. ఏం లాభం? దాని బతుకట్లా తెల్లారింది.

సత్యం బళ్లో చదువుతున్నాడు పదో తరగతి.

ముందేవి కానుందో!

*          *          *

'ఇంకా పడుకోలేదా అమ్మా!' అంటూ వొచ్చేడు సత్యం చలపతి మేస్టారింటినుంచి. రవణమ్మ ఆలోచన ల్నుంచీ తేరుకొంది.

'లేదయ్యా! ఎందుకనో యివ్వేళ్ల నిద్దర పట్ట లేదు. చదువయ్యిందా?' అని అడిగింది.

'ఇవ్వేల్టికయింది. రేపు బడి కెళ్లేపాటికి పది లెక్కలు చెయ్యాలి. బుడ్లో కిరసనాయిలు లేనట్టుందే!' అన్నాడు.

'అయిపోవొచ్చిందిరా. పొద్దున్నే రాసుకోవొచ్చులే. బాగా పొద్దుపోయినట్టుంది, పడుకోలే! అంది రవణమ్మ.

'నీకేం, అట్టాగే చెబుతావ్. ఒక్క లెక్క చెయ్యకపోయినా ఆ మేస్టారు చావగొడతాడు.' అని గునిసి, ఆ వేళప్పుడు చేసే వోపికలేక, కిరసనాయిల్లేని బుడ్డిని కాసేపు తిట్టి నిద్రకుపడ్డాడు, సత్యం.

మరో అయిదు నిమిషాల్లో అదమరచి నిద్ర పోయేడు.

రవణమ్మ కొడుకుదగ్గర చేరి వొంటిమీద చెయ్యేసింది.

'ఏవిటో, వీడి బతుకెట్టా తెల్లవారాలో! భగ వంతుడి దయవల్ల వీడికి నాలుగు ముక్కలబ్బు తున్నాయి. ఈ పదో తరగతయ్యేక యేం చెయ్యాలో! పెద్దచదువులు చెప్పించే తాహత్తు తన కెక్కడది? జీతాల్లేక పోబట్టి ఎట్లాగో ఈ ఐదేళ్లబట్టి నెట్టు కొస్తూంది. పాత పుస్తకాలు ఎవరో పుణ్యాత్ములు యిస్తూనే వున్నారు. మరి దీం తరవాత?'

కోరికయితే కొడుకును బాగా చదివించుకోవా లనేవుంది. తను బతికేది వాడికోసం గాదూ? మరి ఆధరువో!

రవణమ్మ బాగా అలిసిపోయింది. చాకిరీచేసి వొళ్లూ, బాధపడిన మనసూ రెండూ బరువెక్కినయ్. అంతవరకూ ఏడవటంవల్ల మనస్సు కడిగేసినట్లు, శాంతంగా వుంది. అట్లాగే కొడుకు సరసన నడుం వాల్చి కళ్లు మూసికొంది రవణమ్మ.

*          *          *

రవణమ్మ ఓ అందమైనగదిలో ఎత్తుగావున్న కుర్చీలో కూర్చుని వుంది. గది నాల్గుగోడలూ కొత్తగా వెల్లవేయించబడి తెల్లగా మెరుస్తున్నాయి. లోప వెలిగే ట్యూబులైటు కాంతి పాలకంటే తెల్లగా పరచు కొంది గదంతా. ఆవిడ కెదురుగ్గా బల్లమీద వొలచిన బత్తాయిలూ, ద్రాక్షలూ వున్నాయి. ఒక్కటొక్కటే ద్రాక్షపళ్లు నోట్లో వేసికొంటూ కూర్చొంది. తను ఖరీదైన పట్టుచీర కట్టుకొనివుంది. చేతులకు బంగారు గాజులున్నాయి. ఇంతలో గదితలుపు తీసికొని సత్యం లోనికొచ్చేడు. అతడు చాలా దర్జాగా, ఠీవిగా వున్నాడు. నల్లటి సూటూ, బూటూ నిగనిగ మెరు స్తున్నాయి. నొక్కుల జుత్తు వొత్తుగా, నల్లగా, షోగ్గావుంది. ముఖంలో రాజకుండే దర్పముంది. చేతికి బంగారపు చైనువాచీ, రెండువేళ్ళకు రెండు వజ్రాలు తాపటంచేసిన ఉంగరాలు లైటు వెలుగులో మెరుస్తున్నాయి. మెళ్ళో డాక్టర్లు వేసికొనే రబ్బరు తాడుంది. దగ్గరగావొచ్చి జేబులోంచి నోట్లకట్ట నిర్లక్ష్యంగా తీసి తల్లికిచ్చేడు. అన్నీపదులు పెళపెళ లాడుతున్నాయి. రవణమ్మకళ్లు మెరిసేయి.

కొడుకు వొచ్చినవాడు వొచ్చినట్లే వెళ్ళి పోయేడు.

ఎదురుగ్గావున్న బల్ల కాలితో గోకుతోంది రవణమ్మ పాదాన్ని. రవణమ్మకాలు లాక్కుంది. దాని వెంటే మెలకువా వొచ్చింది.

కళ్ళు తెరిస్తే అలవాటయిన గుడిసే, బెదురు చూపులు చూసే ఎలకా కనిపించేయి.

లేచి కూర్చుంది. సత్యం వొళ్ళుమరచి నిద్రపోతున్నాడు. బయటకొస్తే చీకట్లు విచ్చుకొంటున్నాయి.

'ఏవి టిట్లాంటి కలొచ్చింది? తన కంతటి అదృష్టమా? ఏవిటో దిక్కుమాలిన కలలు. ఇంకా వయం. పెందరాళే మెలకువొచ్చింది. కాస్త ఆలస్యమయితే డాక్టరుగారి పెళ్ళాం నానా మాటలూ అంటుంది; అనుకొంటూ రవణమ్మపనికి బయల్దేరింది.

* * *

రవణమ్మ డాక్టరు గారింట్లోనూ, రాఘవయ్యగారింట్లోనూ పని ముగించుకొని చలపతి మేస్టారింటికి వొచ్చేవేళకు, ప్రక్కవారి రేడియోలో భక్తిరంజని వొస్తోంది. చలపతి గారి భార్య రవణమ్మను చూస్తూనే, 'కాస్త పెందరాళే రా రవణమ్మా' అని గునిసి, గిన్నెలు బయట వేయటానికి లోపలికెళ్ళింది.

చలపతి గారు ఆవూరి హైస్కూలులో సెకండరీ గ్రేడు మాస్టరు. ఆయన వూరి కొచ్చి పదిహేనేళ్ళవుతోంది. ఇక్కడే స్థిరపడిపోయేరు. ఆయనకు నలభయ్యోయిదోయేట భార్యపోయింది, నలుగు రాడపిల్లల్ను ఈన కప్పగించి. ఆయన కొన్నాళ్ళు భార్యను గురించి బెంగెట్టుకున్నాడు. ఆ తరవాత నాలుగేళ్ళకు ఓ పాతికేళ్ళ అమ్మాయిని వివాహం చేసికొన్నాడు. లోకులాయన చేసిన పనిని కొంత చాటుగానూ, కొంత పబ్లిగ్గానూ గర్హించేరు. అయినా యిలాంటి విషయాల్లో ఒకరి సలహాలతో పనేవుంది గనక! చలపతి గారికి భార్య అవసరం యింకావుంది. ఆయన పెళ్ళి చేసికొన్నాడు. లోకులగోల యేవిటంటే, 'పదహారేళ్ళొచ్చి పెండ్లికెదిగిన పిల్లయింట్లో రొమ్ములమీది కుంపటిలా వుంటే, దాదాపు యాభయ్ పీటకిందికొచ్చిన యితగాడు సిగ్గులేక మళ్ళీ వివాహం చేసికోవటం యేవిటీ?' అని.

లోకు లేవనుకొనేది తెలిసి, కనీసం వూహించలేని నాపేం కాదు చలపతిగారు. ద్వితీయం చేసికొన్నదాకా ఆయనకు నిద్రపట్టని మాట వాస్తవమేగాని, ఇటీవల అంటే వివాహమయిన నాలుగేళ్ల తరవాత, ఆయనకూ తాను చేసినపని దోషమేమో ననిపిస్తోంది. ఎందుకంటే యింక ఆయనకు రెండేళ్ళ మాత్రమే సర్వీసుంది. ఈ సంబంధాని కిద్దరు పిల్లలు. ఒక అబ్బాయీ, అమ్మాయీను. తొలి సంబంధం పిల్లల్లో పెద్దవాళ్లిద్దరూ యీడేరి కూర్చున్నారు. వాళ్లను చెరో యింటికి పంపి బాధ్యత వొదిలించుకోవాలిగదా! మిగతా వాళ్లను పెద్దవాళ్లను చెయ్యాలిగదా! ఇప్పుడివన్నీ ఆలోచించుకొంటే ఆయనకీ సాగరాన్నెలా యీదటమా? అని భయంగానే వుంది. లోకులు కబుర్లయితే చెబుతారుగాని, బాధ్యతలు నెత్తినేసికోరు గదా!

మరి తెలిసి, తెలిసీ ఈ వయస్సులో ఈ తప్పేదు పని యెందుకుచేసేవంటే, ఆయన సమాధానం ఆయన కుంది. 'ఎన్నిమాటలు చెప్పినా, నేపోయిం తరవాత, నెత్తిన కొరివిపెట్టి, యిన్నినీళ్లు చల్లేవాడొకడుండాలి గదా! కొడుకు పుట్టకపోతే అదేం బ్రతుకు?' అంటారాయన.

ఆయన ఆశించినట్లు కొడుకయితే కలిగేడు గాని, ఆయనకు బాధ లెక్కువే అయ్యేయి. భార్యకు తానంటే గౌరవం లేదన్న విషయం, ఆయన కొత్తమోజులో గమనించటానికి యిష్టపడకపోయినా రోజులు గడిచే కొద్దీ ఆయనకు విషయం స్పష్టంగానే తెలిసింది. తాము లేనివాళ్లైన కారణంచేత, తమ నిస్సహాయత్వాన్ని నీచంగా వుపయోగించుకొని, తన వయస్సులో సగం మాత్రమేవున్న ఆడదాని గొంతు కోయటానికి సిద్ధపడ్డ చలపతిగారి సహృదయత మీాద కామాక్షికి రవంతకూడా సదభిప్రాయం లేదు. కనీసం ఆయన బాధేవిటోనని ఆవిడ సానుభూతితో ఆలోచించిం

లేదు. తాను చేయని తప్పుకు భగవంతుడు ఈ రకంగా శిక్షించేడనుకొని, ఆ శిక్షను తప్పనిసరిగా అనుభవిస్తూ, అందుకు కనిపించే కారకుడైన చలపతిగారి పట్ల కామాక్షి అయిష్టాన్నే పెంచుకొంది. ఇవన్నీ గ్రహించే నాటికి చలపతిగారికి దిద్దుకోవటాని కేమీ కనిపించలేదు. ఇప్పుడు బాధపడి ప్రయోజనం యేవుంది గనుక? ఒక పని, మంచికానీ, చెడుగానీ జరగవలసి నప్పుడు, అది అల్లా జరిగే తీరుతుంది. నువు చెయ్యడ్డంపెట్టి ఆ పనిని కాకండా ఆపలేవు. పశ్చాత్తాపం అనవసరమూ, అవివేకమూను. సృష్టిలోని శక్తులన్నీ నీవు తాగబోయే పాలను వొలకపొయ్యాలని కూర్చుంటే, అయ్యో! పాలు వొలికి పొయ్యేయే అని బాధపట్టం వెర్రితనం కాదూ! చెయ్యగలిగిం దేవీ లేనప్పుడు, కాలాన్ని దాని మానాన దాన్ని పోనివ్వటమే! చలపతిగా రిటీవల యీ రకమైన వేదాంతం వొంట బట్టించుకొని రోజులు గడుపుతున్నారు.

రవణమ్మ పని ముగించుకొని వొచ్చేవేళకు, సత్యం మేసా రింటికి చదువుకుందుకు వొచ్చేడు. వాణ్ణి చూడగానే రవణమ్మకు తెల్లవారుజామున వొచ్చిన కల గుర్తొచ్చింది. 'నిజంగానే సత్యం అంత గొప్పవాడవుతాడా? అట్లా నోట్లకట్టలు తీసికొచ్చి తన కిస్తాడా? ఏ వీలేదు. బీదవాళ్లంటే కలలకూ లోకువే!' సత్యం బుజంమీది, రూపాయి కాసంత చినుగును చూస్తూ రవణమ్మ అనుకొంది.

'ఈ యేడు పరీచ్చ గట్టెక్కుతాడా అయ్యగారూ!' అని అడిగింది చలపతిగార్ని, తడిచేతులు చిరుగుల పమిటకు తుడుచుకొంటూ.

సత్యం తెలివైన కుర్రవాడి కిందే లెక్క. వాడికి చదువుపట్ల శ్రద్ధ కూడా వుంది. పైగా వాళ్ల పరిస్థితులు వాడికి బాగానే తెలుసు. అందుకని కష్టపడి చదువుతాడు. ఆ విషయం అందరకూ తెలుసు. అయినా ఎదురుగ్గా విద్యార్థినుంచు కొని, వాణ్ణి పొగట్టం మంచనిపించలేదు పంతులుగారికి. పైగా ఈ ప్రశ్న వారానికో మార్లైనా రవణమ్మ అడుగుతూనే వుంటుంది ఆయన్ను. ఆయన్ననేవిటి? ఏ మేస్టరు కనపడ్డా ఆమె అడిగే ప్రశ్న అదే. ఆమె తాపత్రయం తెలిసిన మేస్టారన్నారు, అవుతాళ్లే. అయినా శ్రద్ధతీసుకొని కష్టపడి చదివాలి. గవర్నమెంటు పరీక్షలుకదా!

రవణమ్మ వెంటనే అందుకొంది, 'నాదేవీ లేదయ్యగారూ. వాణ్ణి మీరు కొట్టినా, తిట్టినా నాకిష్టమే వాణ్ణి మీచేతుల్లో పెట్టేను. మీ ధర్మమా అని నాలుగు ముక్కలబ్బితే అంతే చాలును!'

'అల్లాగేలే!' అన్నారు చలపతిగారు సంభాషణ త్రుంచుతూ.

* * *

వారం రోజుల తరవాత వో సాయంకాలం రవణమ్మ మేస్టారింటికి బయల్దేరింది. ఆవిడ తలలో యిప్పుడు ఒకేవొక్క ఆలోచన విపరీతంగా కదులుతోంది. అక్రితం రోజు సాయంత్రం వాళ్ల యిళ్ల పక్కల వాళ్ళు యేదో పిచ్చాపాటి మాట్లాడుకొంటూండగా, సంభాషణ లాటరీలమీదకు మళ్లింది.

తాగుబోతు గంగడన్నాడు, 'అదేదో పూర్లో వొటేల్లో పన్చేసే కాఫీ లిచ్చే ఆయన రూపాయి గడితే లక్షొచ్చేయట. ఇక చూడు నారంగా, ఆ వోటలు పాపరయిటరు, యీడికాళ్ళు గడిగి నీళ్ళు నెత్తిన్నల్లుకొని కూతుర్నిచ్చి పెళ్ళిచేసి, వోటలువాడికే వొప్పచెప్పేట్ట!'

'ఆడి దాకాబోతావేం? వాడిపేరు నాకు గుర్తు రావటంలేదు. బస్తీ పోయినప్పుడోసారి నేను ఆడి రిచ్చా కూడా యెక్కేను. వాడికదేదో లాటరీలో రెండు లచ్చలొచ్చేయట. నీకెట్టా తెలుసని అడగవేం? మొన్న ఊరెళితే, ముందేదో యెనకేదో తెలీని కారుపక్కన నుంచోని కోటూబూటూయేసి, దొరల్లాగే జానెడు పొడుగుచుట్ట నోట్లోపెట్టుకు నిలుచుంటే ముందు బిత్తరపోయే నంటే నమ్ము. ఇదేందబ్బా! పోయి నేడాది నన్నెక్కించుకొని రిచ్చాతొక్కి సందు మలుపులో వున్న యింటికాడికి రోడ్డంతా చుట్టూతిప్పి, నాలు గంగల్లో వెళ్లేచోటికి అర్ధరూపాయి పుచ్చుకొన్నాడు. గందా అని ఆచ్చెర్య పోయేను. ఏమైనా యేమంటావు? ఆ డిప్పుడు లచ్చాధికారి! గంగడి భావమరది అందుకొన్నాడు.

'అందరి కొస్తాదంటరా? అదురుష్టముండాల. దానికీ పెట్టిపుట్టాల'. అన్నాడు వెంకడి తండ్రి ముసలయ్య.

'అదురుట్టం వుందోలేదో తెలిసే దెట్లాగే? నువు గట్టరాదు మామా! నీది మంచి జాతకమేలే. పిల్ల నిచ్చిన మావను మూణ్ణెల్లద్దర్లలోనే గుటుక్కు మని పిస్తివిగా!' గంగడు ముసలయ్యకు పరిహాసం చేసేడు.

'చీ! యదవనాయాల. తాగుబోతూ కబుర్లూ నువ్వూనూ. విసుక్కొన్నాడు ముసలయ్య.

ఓ మూల కూర్చొని యిదంతా వింటూన్న రవణమ్మను చూస్తూ గంగడి బావమరది అన్నాడు.

'నువ్వొక టికెట్టు కొనరాదే అత్తా. దేవుడు చల్లంగ జూస్తే సత్తేన్ని కలకటేరును జేద్దువుగాని!'

రవణమ్మ నవ్వుతూ అంది, 'ఇకజాల్లేరా పోకిరి యెదవ. నా కంతటి రా తెక్కడిది'?

ఆ తరవాత రవణమ్మ అక్కణ్ణుంచి లేచొచ్చింది. కాని మనసు మాత్రం లాటరీ టిక్కెట్టును గురించే ఆలోచించటం మొదలుపెట్టింది.

'ఏమో, ఏ పుట్టలో ఏముందో ఎవరు చూశేరు? రోజులు బాగుండి అట్టాంటి అదురుష్టమే కలిగితే సత్తేనికి పెద్దచదువులు చెప్పించొచ్చు. రంగనాదంగారి కొడుకులాగే పెద్దడాకటరును చేయొచ్చు. అప్పుడు తన బతుకు మూడు పువ్వులూ ఆరు కాయలూ అవుతుంది.'

రవణమ్మ కెందుకో వారం రోజులనాడు తెల్లవారు జామున వొచ్చిన కల నిజం అవుతుందని అనిపించ సాగింది. ఆ కల్లోలాగే తాను గొప్పయింట్లో కూర్చొని కొడుకు అంత ఠీవిగా సూటూ బూటూ వేసికొని నోట్లకట్టలు తెచ్చి తన చేతుల్లో వుంచటం యెంత గొప్పగా వుంటుంది! సాటివాళ్లలో ఎంతపేరు! లోకులంతా సత్యాన్ని చూపి, 'ఆ వెళ్లే ఆయన రవణమ్మగారి కొడుకు. పెద్దడాక్టరు. రెండు చేతులా సంపాదిస్తున్నాడు. తల్లిని నెత్తిన పెట్టుకొంటాడు. కులం, గోత్రాలతో పనిలేదు. బోలెడంత కట్నం మిస్తామని సంబంధాలు తెగవొస్తున్నాయి' అని అంటూంటే తన కెంత ఆనందంగా వుంటుంది?'

ఈ వూహలతో రవణమ్మ కా రాత్రి కంటి మీద కునుకు పట్టలేదు. కన్ను మూసినా, తెరచినా సత్యం సూటూ బూటూ వేసికొని కనబడసాగేడు. తెల్లవారే పాటికి రవణమ్మ ఒక నిర్ణయాని కొచ్చింది. 'ఏమైనా కానివ్! ఓ రూపాయి ఖర్చుపెట్టి టిక్కెట్టొకటి కొంటుంది. వొస్తే అదురుష్టమే. పోతే రూపాయి గంగలో కలిపాననుకొని ఒకేడు పేడిచి వూరు కొంటుంది.'

ఆ నిర్ణయం తీసికొన్నాక రవణమ్మ క్కాస్త ప్రశాంతత చిక్కింది. సాయంకాలం పనవగానే రవణమ్మ యిందుకే చలపతిగారింటికి బయల్దేరింది. ఆమెకు చలపతిగారంటే నమ్మకం. సత్యం చిన్నప్పటి నుంచీ ఆయనద్గ్గిరే చదివేడు. ఆయన పుణ్యమా అని నాలుగు ముక్కలు వొంటబట్టేయి. పైగా యిట్లాంటివి తన కస్సలు తెలీదు. ఏ టిక్కట్టు కొనాలో, ఏది సజావయిందో తనకేం తెలుసు? ఏదో కాయితం చేతిలోపెట్టి తనను ముంచినా ముంచగలరు. సత్తేనికి చెప్పొచ్చును గాని వాడికి మాత్రం యేం తెలుసు యిట్లాంటి పనులు? చిన్నయెదవ. తనయినా పిల్లాడి బాగుకోసమని ఒక ప్రయత్నం చెయ్యబోతూవుంది. ఇదే మొదటిదీ, చివరదీను. ఈ పని గుట్టుగా చేయించాలంటే పంతులుగారికే తగును. ఆయనకు తను పడే పాట్లూ, సత్యం కోసం తను పడుతూన్న యిబ్బందులూ తెలుసును.

రవణమ్మ వెళ్లేసరికి చలపతి గారు పంచలో కొడుకుతో ఆడుకొంటున్నారు. భార్యా, పిల్లలూ కరణం గారింటికి పేరంటం వెళ్లేరు, కూతురు రజస్వల అయితే.

'ఏవిటొచ్చేవు? ఆమె యింట్లో లేదు.' అన్నారు మేస్టారు.

'మీతో పనుండే వొచ్చేనయ్యా!' అంది.

ఏవిటన్నట్లు చూశేరాయన.

కొంగున కట్టుకొన్న రూపాయి కాయితం ఆయన ముందుంచి అంది, 'ఒక లాటరీ టిక్కట్టు కొనండయ్యా!'

ఓ అరనిమిషం అర్థం కానట్లుచూసి, తర వాత వెంటనే నవ్వి అన్నారు చలపతిగారు—

'నీకూ వుంది ఈ పిచ్చి?'

రవణమ్మ ఏదో తప్పు చేసినట్లు జంకింది; 'ఈ వొక్కసారే చూద్దామనుకొన్నా, నయ్యా! రోజులు బాగుంటే సత్యం పైకొస్తాడు. లేకపోతే ఈ రూపాయి తోనే చెల్లు!'

'అటాగేలే'! అన్నారు మేష్టారు. పిల్లవాడి చేతిలోంచి మెల్లిగా రూపాయి విడిపించు కుంటూ.

'ఎవరితోనూ అనకండయ్యా!' అంది వెళ్ళ బోతూ.

'ఓసీ నీ యిల్లు బంగారంగాను. ఇదేం పాపం కాదులే!' అన్నారాయన నవ్వుతూ.

'అయినా వొద్దులేయ్యా!' అంది రవణమ్మ.

'సరేలే! నాలుగు రోజుల్లో వూరెళతాను. తీసి కొస్తాలే!' అన్నారు మాస్టారు.

సగం బరువు తీరినట్లు వెళ్ళిపోయింది రవణమ్మ.

*

నెల రోజుల తరవాత ఓ సాయంత్రం చలపతి గారు టీచర్స్ రూంలో కూర్చొని పేపరులో లాటరీ ఫలితాలు ప్రకటించబడ్డ పేజీని చూస్తు న్నారు. గదిలో మరెవ్వరూ ఉపాధ్యాయుల్లేరు. చాలా మంది క్లాసులకూ, ఒకరూ, అరా బయటకూ వెళ్ళిన సమయం అది. రెండు నిమిషాల తరవాత ఆయన ముఖంలో హఠాత్తుగా మార్పు వొచ్చింది. కళ్ళు ఒక రకమైన ఆశ్చర్యంతో వెలిగేయి. జేబులోంచి టిక్కెట్టుకాయితం తీసి చూశేరు. ఓ నిమిషంపాటు అలాగే పేపరువైపూ, టిక్కట్టువేపూ చూశేరు. ఆ తరవాత వెంటనే లేచి బయటకెళ్ళేరు.

ఆ తరవాత ఆయన క్లాసుల్లో చాలా పర ధ్యానంగా వున్నారు. ఇండియాకు ప్రెసిడెంటు ఇందిరా గాంధి అని చెప్పిన అబ్బాయిని ఆయన కోప్పడ లేదు. మేష్టారి యేమరుపాటు చూచిన పిల్లలు సుభ్భ రంగా చుక్కలాట ప్రారంభించేరు. అయినా చలపతి గారి కాపూట క్లాసు పట్టలేదు.

ఆ రాత్రి ఆయనకు నిద్దర పట్టలేదు. భార్యతో గానీ పిల్లలోగానీ ఎక్కువ మాట్లాళ్ళేదు. తనలో తానే ఆలోచించు కొంటూ, నొసలు చిట్లిస్తూ, 'ప్చ్! తప్పు!' అనుకొంటూ, మధ్యమధ్య 'సింగినాదం' అంటూ గడిపేరు.

ఎప్పుడో తెల్లవారు జాముకు పట్టిన కునుకులో కూడా కలలు. ఓ కలలో తానూ, కామాక్షీ పట్టు బట్టలు కట్టుకొని, పీటలమీద కూర్చుని పెద్ద కూతురి పెళ్ళి చేస్తున్నాడు. కామాక్షి మెడనిండా నగలు. పెద్దకూతురు పద్మావతి కళ్ళనిండా వెలుగు. అల్లుడు సినిమాల్లో కథానాయకుడల్లే వున్నాడు. చలపతిగారి కెదురుగ్గావున్న ఇనప్పెట్టెలో నోట్ల కట్టలు నవ్వుతున్నాయి. మరో నిమిషంలో దృశ్యం మారిపోయింది. ఓ నల్లటి దున్నపోతు నెక్కి, చిన్నప్పుడు ఆయనకు చదువు చెప్పిన ఎలిమెంటరీ స్కూలు హెడ్మాస్టరుగారు, చేతో బెత్తం పుచ్చుకొని, 'వెధవ కానా, రంగడి బెల్లమ్ముక్క నువు తీసికొంటావ్రటా? వెయ్ గోడ కుర్చీ' అంటున్నారు.

రాత్రంతా అట్టా కలత నిద్రతో గడిచి పోయింది. నిద్రలేచేప్పటికి ఆయన వాలకంచూసి భార్యకూడా ఆశ్చర్యపోయింది.

'ఏవిటండీ, ముఖం అల్లా పీక్కుపోయింది? రాత్రంతా కలవరిస్తూనే వున్నారేమిటి?' అంది.

'ఆయన బలవంతాన నవ్వి' నీ ముఖం కాదూ! నేను కలవరించటం యేవిటి?' అన్నారు.

ముఖం కడుక్కొని కాఫీతాగి బయటకు రాగానే పంచలో రవణమ్మ కనిపించింది. కడుపులో తిప్పి నట్టయి, కళ్ళు తిరిగేయి మాస్టారికి.

'ఏవిటీ లాటరీ టిక్కెట్టుకోసమా? మొన్న పనుల తొందరలో మర్చిపోయానమ్మా! ఈ సాయం కాలం వెళుతున్నాను. తెస్తాలే!' అన్నారు త్వర త్వరగా.

రవణమ్మ వెంటనే అంది, 'దాని సంగతి కాదండీ! ఎప్పుడు కొంటేనేం! బాగుపడే గీతవుంటే వొస్తుంది, లేకపోతే లేదు. నే నొచ్చిందందుక్కాదు. రాత్రినుంచీ అబ్బాయికి జరం. రంగనాదంగారికి చూపిస్తే రెండు మాత్తర్లు రాసిచ్చేరు. రెండు రూపాయలుంటే యిప్పిస్తారా, ఒకటి కిస్తాను!'

చలపతిగారు మల్లగుల్లాలు పడిపోయేరు. గొంతులో కొట్టుకొంటూన్న దేదో బయటకు రాబోయింది. అయినా ఆయన నిబ్బరం గలవాడు. చిన్నపిల్లవాడు కఫాన్ని మింగినట్లుగా, గొంతులోవున్న దాన్ని అక్కడి కక్కడేమింగి, కంగారుగా అన్నారు—

'నీమనిషి దొంగలు దోల! వాడికి రాత్రినుంచీ జ్వరం కాస్తే నాకు చెప్ప లేదేం? చిన్నవెధవ ఆచీటీ యిటివ్వు. నేను బజారువేపు వెళుతున్నాను. మాత్రలు తెచ్చిపెడతాను!'

మాస్టారి మంచితనానికి వెంటనే ఏం చెప్పాలో తోచని రవణమ్మ చీటీ ఆయన కిచ్చి వెళుతూ అంది; తమరట్టాగున్నా రేందయ్యా? ఒంట్లో బాగోలేదా?

'ఏం లేదమ్మా! రాత్రి తలనొప్పితో సరిగ్గా నిద్రపట్టలేదు' అన్నారు.

రవణమ్మ వెళ్లిపోయింది.

తాను బడికి వెళ్లేపాటికి చలపతి గారు సత్యానికి మాత్రలూ, రొట్టె, నాలుగు బత్తాయిలూ తెచ్చి పంపిచేరు. వంటగదిలో భార్య గునుస్తున్నా ఆయన లెక్కపెట్టలేదు.

* * *

ఆరోజు చలపతిగారింట్లో కోలాహలంగా వుంది. బెజవాడనుంచి ఆయన తమ్ముడూ పిల్లలూ, ఏలూరు నుంచి కామాక్షి అక్కా, బావా, వాళ్లపిల్లలూ వొచ్చేరు. ఊర్లోని సాటివారందరూ, చలపతిగారింటి పంచలో చాపల మీద కూర్చొని వున్నారు. హాల్లో సత్యనారాయణ స్వామి పటంముందు కూర్చుని, పురోహితుని సాయంతో వ్రతం చేస్తున్నారు, చలపతి దంపతులు. భక్తి పారవశ్యంవల్లనో, వంటింట్లోనుంచి వొచ్చే పొగలవల్లనో ఇరువురి కళ్ల వెంటా నీళ్ళొస్తున్నాయి.

పంచలోకూర్చున్న చిన్నా పెద్దా అంతా లోకాభిరామాయణం మాట్లాడుకొంటున్నారు. మధ్య మధ్య వీలుచూసికొని లాటరీలో లక్షరూపాయలొచ్చిన చలపతి గారి అదృష్టాన్ని పొగుడుతున్నారు. ఆ అదృష్టం కొందరు చలపతిగారిదనీ, మరికొందరు కామాక్షిదనీ అంటున్నారు. ఆయన పెద్దకూతురంటే వల్లమాలిన అభిమానం గల పక్కవారబ్బాయి, 'పద్మావతి అదృష్టం వల్లనే చలపతిగారికి లాటరీ తగిలింది' అన్నాడు ప్రక్కన స్నేహితుడితో. ఎవరో తుంటరి వినీ వినపడకుండా 'మొదటిభార్య పోయిన వేళా విశేషం. ఇవ్వేళ దానిప్రభావం చూపింది' అన్నాడు కూడాను.

వ్రతం అయింది. చలపతిగారు అందరకూ తీర్థ ప్రసాదాలు పంచేరు. ఆయన ప్రతి వొక్కరితోనూ అతి విధేయతగా ప్రవర్తించేరు. కొంతమంది మరీ తెలివైన వాళ్లు ఆయనకు వినబడేంత చిన్నగా, 'చూశేరా, ఆయన పెద్దమనిషి తరహా! డబ్బొచ్చినా మనిషికి ఎంత వినయమో!' అన్నప్పుడు చలపతిగారు తాత్కాలికంగా కొంత సంతోషపడ్డారు. చలపతిగారి దగ్గర చదువు కొని ఆ స్కూల్లోనే తెలుగు మాస్టారిగా పనిచేస్తున్న సత్యనారాయణ అనే చాకులాంటి కుర్రాడు ఈ తంతంతా చూసి ప్రక్కనే వున్న మిత్రుడితో అన్నాడు—

'బోడిలక్ష రూపాయలు, అందునా లాటరీలో వొస్తే, ఈ మనుషు లింత నాటకా లాడుతున్నారే! మరో లక్ష యిస్తామంటే వీళ్లంతా బట్టలిప్పుకొని ఎగురుతారు గామాల! డబ్బు ఎంత పనిచేయిస్తుంది? ఈన విధేయతకూ, వీళ్లందరి నటనకూ కారణం డబ్బే గదా!' అని.

ఆపైని భోజనాలు. అంతా సుష్టుగా తిని యితోధికంగా త్రేన్చేరు, పొద్దుపోవటంచేతనో, అజీర్తి వల్లనో, మనసు బాగా లేకనో, చలపతిగారు మాత్రం తృప్తిగా తినలేకపోయేరు. నాలుగు మెతుకులు నంజి లేచేరు.

అంతా వెళ్లింతరవాత, రవణమ్మా, సత్యం వొచ్చేరు భోజనానికి. లక్ష రూపాయ లొచ్చేక మాస్టారిని పలకరించటానికే భయంగా వుంది సత్యానికి,

రవణమ్మకు మాత్రం ఈ విషయం చాలా ఆవందాన్నే కలిగించింది.

'పోనీలే పిల్లలు గలాయన! దేవుడు కనిపెట్టి నాడు' అనుకొంది.

రవణమ్మ, సత్యం భోజనం చేస్తుండగా, చలపతిగారు పంచలో కొచ్చి అన్నారు, 'సిగ్గుపడకండా తినరా సత్యం. ఇంక రెండు పూర్ణపుండలు వేయించుకో! నీ లాటరీ టిక్కట్టు సంగతి రెండు రోజుల్లో తెలుస్తుంది రవణమ్మా!' అని.

'నా బొంద! అందరికీ వొస్తాయా అయ్యా? పెట్టి పుట్టాలి. ఏమైనా ఇది మా అమ్మగారి అదృష్టమే నయ్యా!' అంది రవణమ్మ.

చలపతి గారు లోపలి కెళ్లగానే సత్యం అడిగేడు తల్లిని, 'నువ్వా లాటరీ టిక్కట్టు కొన్నావా అమ్మా'? అని.

రవణమ్మ సిగ్గుపడుతూ అంది, 'అప్పుడెప్పుడో అయ్యగారి చేతికి రూపాయిచ్చి కొనమన్నాను.'

లోపలి కెళ్లిన చలపతిగారు టిక్కట్టు తెచ్చి సత్యానికి యిచ్చి అన్నారు, 'నీ దగ్గరుంచరా సత్యం, పేపర్లో పడ్డప్పుడు చూద్దువుగాని.'

'వాడిదగ్గ రెందుకులెండి? ఎక్కడన్నా పారేస్తాడు, మీ దగ్గరే వుంచండి.' అంది రవణమ్మ.

'అట్లా కాదులే! వాడి దగ్గరే వుండనివ్. డబ్బు చెడ్డది. మనుషులను గడ్డి తినిపిస్తుంది.' అన్నా రాయన.

డబ్బు గడ్డి తినిపిస్తుందన్న సంగతి రవణమ్మకు తెలుసునుగాని, ఈ సందర్భంలో దాన్ని ఎలా అన్వయించుకోవాలో ఆమెకు తెలీలేదు.

భోజనం చేసి వెళ్లిపోయేరు తల్లీ కొడుకులూ.

* * *

చలపతిగారన్నట్టు, మూడు రోజుల తరవాత, రవణమ్మకు తెచ్చిన లాటరీ టిక్కట్టు ఫలితాలు తెలిసేయి. సత్యం పక్కాసావుగంట వెతికినా నంబరు కనిపించలేదు. సత్యానికి బోలెడు విచారం పట్టుకొంది గాని,

రవణమ్మ దాన్నంతా బాధపడవలసిన విషయంగా తీసి కోలేదు.

'ఒంటినిండా ఆముదం రాసుకొని పుల్ల్టెడు గింజలో పొర్లినా అంటేంత వరకు అంటు తాయి గాని, పుట్టెడు రావు గదా! ప్రాప్తం లేకపోతే ఏదీరాదు. పోనివ్! రూపాయి తో టే చెల్లు!' అనుకొంది.

రోజులు గడుస్తున్నాయి. చలపతిగారు చెరువు కింద నాలుగెకరాలు మాగిలి కొన్నారు. ఇల్లొకటి చిన్నది కొన్నారు. పద్మావతికి పొరుగింటబ్బాయితో సంబంధం కుదిర్చేరు, వాళ్ల బాబడిగిన కట్నం యిచ్చేందు కొప్పుకొని. ఈ డబ్బొచ్చిం దగ్గర్నుంచి చలపతిగారికి లోకుల్లో గౌరవం పెరిగింది. హెడ్మాస్టరు గూడా వెనుకటిలాగే, 'మూడో గంటకొట్టినా క్లాసుకెళ్లటం లేదేమయ్యా చలపతీ!' అనటం లేదు. 'చలపతి గారూ!' అంటున్నారు. ఇలా హఠాత్తుగా సిరెత్తుకొన్నందువల్ల కామాక్షికి భర్తమీద ప్రేమయితే కలగలేదు గాని, తనవరకు తృప్తిగానే వుంది. డబ్బుతెచ్చిన మరునాడే ఆయనతో శతపోరి, తనపేరిట ఓ పదివేలు బాంకిలో పడేయించింది కూడాను.

ఎటొచ్చీ డబ్బుతెచ్చిన సుఖమూ, తృప్తీ కన పడనిది ఒక్క చలపతి గారిలోనే. ఆయన వేషంలో మార్పేమీ రాలేదు. ఎప్పట్లాగే నీరుకావి ధోవతీ, అరచేతుల చొక్కా తొడుక్కుని తిరుగుతున్నారు. చెప్పులుమాత్రం, ఓ పదిపారేసి కొత్తవి కొన్నారు. బట్టలమాట అలావుంచి, మనిషిలో కూడా హుషారు, ఆనందం యేవీ కనపట్టం లేదు. అదేం ఖర్మో రోజు రోజుకూ ఆయన తీసిపోతున్నట్లు కనిపిస్తున్నారు పరి చయస్తులకు. ఈ డబ్బు లొచ్చిం తరవాత రవణమ్మకు ఆయన ఓ చీరెకొని పెట్టేరు. సత్యానికో జత బట్టలు కుట్టించేరు. పరీక్షలు దగ్గరౌట్టంచేత వాడికి చాలా శ్రద్ధగా చదువు చెబుతున్నా రాయన

ఇటీవల కాలంలో చలపతిగారు తమపట్ల చూపేదయకూ, సానుభూతికీ రవణమ్మ ఆయనకు మనస్సులోనే నమస్కారాలు చెప్పుకొంటోంది. 'పుణ్యా త్ముడు! డబ్బులెంతమందికి రావటం లేదు. దిక్కు లేనివాళ్ళ నెంతమంది కనిపెట్టి వుంటున్నారు? ఆయన కడుపు చల్లగాను. పిల్లవాడికి శానాకష్టపడి చదువు చెబుతున్నాడు' అనుకొంటూ, ఆయను చల్లగా చూడమని తిరుపతి వెంకన్నకు మొక్కుకొంది

*　　　　*　　　　*

సత్యం పరీక్షల మధ్యలోవుండగా రవణమ్మ మంచ మెక్కింది. మామూలుగా మొదలయిన జ్వరం, వదలకండా కాసి, రవణమ్మ బాగా ి— అయి పోయింది. అట్లాగే పలపతిగారింట్లో తింటూ, పరీ క్షలు జాగ్రత్తగానే రాస్తున్నాడు సత్యం. అయినా, ఏ పని చేస్తున్నా వాడికి తల్లి అనారోగ్యమే మనసులో కదుల్తూ, బాధపడుతున్నాడు. చివరి పరీక్షకూడా తృప్తిగా రాసిన రోజున వాడూ, అంతకంటే ఎక్కు వగా ఆ నీరసంలోనే రవణమ్మా సంతోషపడ్డారు.

ఆ రాత్రే రవణమ్మకు జ్వరం విపరీతమయి, సంధి లక్షణాలు కనిపించేయి. చలపతిగారు దగ్గరుండి డాక్టర్ను తీసికొచ్చేరు. డాక్టరు చలపతిగారి నిదివర కెరక్కపోయినా ఆయనకు పట్టిన జాతకం చూశేడు గనక పిలవగానే వొచ్చి రవణమ్మకు చాతయినంత వైద్యం చేశేడు.

మరోవారం గడచింది. రవణమ్మ రోగం డాక్టరుకు లొంగలేదు. ఆయన పెదవి విరిచేడు. సత్యానికి లోకమంతా భయంకరంగా కనపడసాగింది. వాడు కళ్ళనీళ్ల కుక్కుకుంటూ యేడుపు సాగించేడు. రవణమ్మకు మాట రావటంలేదు. కళ్ళు గాజుబుడ్లకు మల్లే మెరుస్తున్నాయి ఆ కళ్ళవెంట ధారాపాతంగా నీళ్ళు.

'పోనీ బెజవాడ తీసికెళదామా!' అన్నారు మాస్టారు.

కేవలం ఉదారబుద్ధితో, పనిమనిషికోసం చల పతిగారు చూపుతూన్న ఔదార్యం డాక్టరుగారిని కదిల్చింది. ఆ క్షణాన, ఆయన ఇకనుంచీ బీదలకు ఉచితంగా వైద్యం చేయాలన్న నిర్ణయాన్ని తాత్కా లికంగా తీసుకొన్నారు కూడాను. చలపతి గారి వంక చూస్తూ అన్నారాయన, 'ప్రయోజనం లేదండీ మీరు తీసికెళ్ళాలనే అనుకొంటే నా కభ్యంతరం లేదు.'

చలపతిగారు మాట్లాడకండా నిలుచుండి పోయేరు. ఐదునిమిషాలలా గడచిపోయేయి.

లాంతరు వెలుగులో, రవణమ్మ చలపతిగారిని

దగ్గరకు రమ్మని సైగచేసి, కొడుకుచేతిని ఆయన చేతిలోవుంచి, కళ్ళు నీళ్ళెట్టుకొంది.

చలపతిగారికి గుండెల్లో సన్నని మంటరేగి అంతలోనే రాజి పెద్దదై, శరీరమంతా వ్యాపిస్తున్న ట్లనిపించింది. బాధతో కళ్ళవెంట నీళ్ళొచ్చేయి. కొడుకు కోసం ఆ తల్లి పడేబాధ ఆయనకు భరించలేని విచారం కలిగించింది. ఆయనకేదో పూనకం వొచ్చి నట్లయి అన్నాడు.

'నువు పిల్లవాణ్ణి గురించి యేవిధమైన విచారమూ పెట్టుకోకు. వాడికి వోపిక వున్నంత వరకు చదువు చెప్పించి పైకి తీసికొచ్చే పూచీనాది. నీకింకా నామాటమీద నమ్మకం లేకపోతే భగవంతుడిమీద వొట్టేసి, వీళ్ళందరియెదటా చెబుతున్నాను. రేపే వాడిపేర ఓ అయిదువేలు బాంకిలోవేసి వాడిచదువు ఖర్చు పెడతాను, సరేనా?'

రవణమ్మ బిత్తరపోయినట్లుగా చూసింది. ఆవిడకు మాస్టారి మాటలు తెలిశేయో, లేదో మరి. సత్యానికి నోట మాట రాలేదు. అంతటి విచారంలోనూ వాడికి మాస్టారి మాటలు బోలెడంత ఆనందాన్నీ, తృప్తినీ కలిగించేయి. చుట్టూచేరిన ఇరుగు పొరుగూ, డాక్టరూ కూడా ఆశ్చర్యంగా చలపతిగారివంక చూశేరు.

ఆయన వీళ్ళ చూపులను గమనింపకుండా, రవణమ్మకేసే చూస్తున్నారు.

రవణమ్మ లేని వోపికను తెచ్చుకొని రెండు చేతులెత్తి దణ్ణంపెట్టింది చలపతిగారికి.

ఆ మరునాడు మధ్యాహ్నం రవణమ్మ పోయింది. చలపతిగారు దగ్గరుండి అన్నీ జరిపేరు. దిక్కులేకండా యేడుస్తూన్న సత్యాన్ని అక్కున చేర్చుకుని వోదార్చేరు.

చూస్తున్న వాళ్ళంతా చలపతిగారి దొడ్డ హృదయానికి సంతోషించేరు.

ఆయనచేస్తున్న ఈ మహోపకారానికి ఊరి వారంతా ఆయన్ను మనస్ఫూర్తిగా అభినందించేరు.

గిట్టనివాళ్లు, 'కాసిన్ని డబ్బులు రాగానే కిందా మీదా కనపట్టంలేదు. మిడిమేలపు సిరి. ఎట్లా వొచ్చిందో అట్లానే పోతుంది' అన్నారు.

చలపతిగారు వేటినీ పట్టించుకో లేదు.

రవణమ్మను దహనంచేసిన వారం రోజుల తర వాత వొకనాడు, చలపతిగారు సత్యాన్ని తీసికెళ్లి, బాంకిలో వాడి పేరు ఐదువేల రూపాయలు వేసేరు. అప్పటిగ్గాని ఆయన మనస్సుకు రవంత ప్రశాంతత చిక్కలేదు.

ఆ రాత్రి భోజనం పెడుతూ కామాక్షి గంటున లేచింది.

'మేమేం బతకా లనుకొన్నారా? అడుక్కుతిని పోవా లనుకొన్నారా? వీడి మరీ అంత జాలిగుండె అయితే, ఏదో పాతికో యిస్తారుగాని యిలా వేలకు వేలు తగలేస్తారా? మీరు వొళ్లు తెలిసి చేస్తున్న పనేనా యిది?' అని లక్షపెట్టింది.

చలపతిగారేం మాట్లాళ్లేదు.

'ఓసి వెర్రి ముఖమా! డబ్బు ఎంతటివారికైనా గడ్డి తినిపిస్తుంది. తిన్నవాణ్ణి నా కా విషయం స్పష్టంగా తెలుసును. గడ్డి పశువుల కాహారం. మను షుల క్కాదు. అయినా స్వార్థం బలిసిన మనిషి గడ్డి మేస్తాడు. అలా మేసినప్పుడు బయటకు చెప్పే చేవ లేక, అలా వెధవపని చేసేమన్న స్పృహ మనసును బాధిస్తే, లోకుల కళ్లు కప్పటానికి, తనను తాను రవంత తృప్తిపరచుకోవటానికీ నాలుగు మంచిపనులు చేస్తాడు. ఇందులో ఆత్మవంచనా, పరవంచనా కూడా వుంది. నేనూ అదే చేసేను. సత్యానికి నేను ఐదువే లివ్వట మేమిటి? వాడే మనకు తొంభయ్యయిదు వేలిచ్చేడు.' అని చెబుదామనుకొన్నాడు. కాని గొంతు పెగల్లేదు. రెండు నిమిషా లాగి యిలా అన్నాడు.

'ఈ శరీరాలయంలో ఒక దీపం వుంది. అది స్వచ్ఛంగా వెలిగి మనసును కాంతితో నింపుతూం టుంది. మనిషి పొట్టకోసం, అలవిమాలిన కోర్కెల కోసం, వెధవపనులు చేస్తూ ఆ దీపంచుట్టూ దళసరి తెరలు కడతాడు. ఎంతటి దళసరి తెరలు కప్పినా దీపం పూర్తిగా ఆరిపోయేంతవరకూ వెలుగుతూనే వుంటుంది. ఆ మసక వెలుగులో మనిషికి మనసు లోని కుళ్ళు కనిపిస్తూనే వుంటుంది. నా దీపం ఇంకా ఆరలేదు. అదీ సంగతి.'

ఈనకు పిచ్చెక్కిందనుకొంది కామాక్షి.

చలపతిగారు కళ్ళు మూసికొని గోడకు ఆను కొన్నారు.

ఆయన కనుకొలకుల్లో మెరుస్తూన్న ముత్యాలు కామాక్షికి కనిపించలేదు.

# కవిత్వము - ఉద్యమము

శ్రీ ఉపాధ్యాయుల అప్పల నరసింహమూర్తి

ఒక లక్ష్యము—దానిని సాధించడానికి అవలబించవలసిన నియమావళి - లక్ష్యస్థాపన చేసిన నాయకుడు—అతని అనుయాయులు—వారి సమిష్టికృషి—తత్ఫలితాలు, స్థూలంగా ఇది ఉద్యమ స్వరూపం.

కవి సమాజమును వస్తువుగా గ్రహించి తన అంతరంగస్పందన కనుగుణమైన నూత్నసృష్టి చేస్తాడు. ప్రతిభావంతుడైన కవి కావ్యము సాహిత్యాన్ని క్రొత్తమలుపు త్రిప్పుతుంది. లేదా సమాజానికి క్రొత్తతీర్పు నిస్తుంది. ఆ సుముహూర్తంలో కవి ఉద్యమకారుడుగా అవతరిస్తాడు. సామాన్యంగా కవి సామాజిక ప్రగతికి పరోక్షంగానే మార్గదర్శి కాగలడు. అంటే—

నా గదిలోపల చీకటిలో!
చీకటి లోపల నాగదిలో!
నా గదిలో...
చీకటిలో...—

అన్నట్లుగా ఒంటరిగానే, సమాజంలో అడుగు పెట్టకుండానే కవి ఉద్యమకారుడు కావచ్చును. అటువంటప్పుడు సామాజిక న్యాయానికి తీర్పరియైన కవి ఆదర్శసమాజ రూపకల్పనకు ప్రేరకుడు మాత్రమే కాగలడు. ఇందుకు అపవాదం కూడా వుంది. సమాజంతో ముఖాముఖి తలపడిన కవి సాంఘికరంగంలోను, సాహిత్య రంగంలోను ఉద్యమకర్తగా నిలిచే అవకాశముంది.

ఉద్యమాలను స్థూలంగా రెండు రకాలుగా విభజింప వచ్చును. అవి (1)సాంఘికోద్యమాలు (2) కళా — శాస్త్రీయోద్యమాలు. వీనిలో సాంఘికోద్యమాలను మత—రాజకీయ— సంస్కరణోద్యమాలుగా వేరు పరచవచ్చును—సాంఘికోద్యమాలు ప్రజాసామాన్యానికి చెందినవి. వీనిలో కార్యాచరణ మాత్రమే సమాజంతో ప్రత్యక్షసంబంధాన్ని కలిగివుంటుంది. కళా— శాస్త్రీయోద్యమాలు మేధావివర్గానికి చెందినవి. ఈ ఉద్యమాలను నడపేవారికి సమాజంతో ప్రత్యక్ష సంబంధ ముండ నక్కరలేదు. స్వభావాన్నిబట్టి సాహిత్యోద్యమాలు వీనిలో రెండవ వర్గానికి చెందినవి. అయినా సాహిత్యోద్యమాలను (1) కేవల సాహిత్యోద్యమాలు (2) సాంఘికోద్యమాలతో ముడిపడిన సాహిత్యోద్యమాలనుగా వేరుచేసి చూడవచ్చును. కేవల సాహిత్యోద్యమాలు కళా జగత్తునకు సంబంధించినవి. సాంఘికోద్యమాలతో ముడివడిన సాహిత్యోద్యమాలు వాస్తవిక జగత్తునకు సంబంధించినవి. కాని కేవల సాహిత్యోద్యమాలు సామాజిక ప్రయోజనాన్ని విస్మరిస్తాయనిగాని, సాంఘికోద్యమాలతో ముడిపడిన సాహిత్యోద్యమాలు కళాధర్మాలను పాటించవనిగాని అనడానికి వీలులేదు. రామాయణాన్ని రచించిన కవులు 'రామాది వద్వర్తిత్వ్యం న రావణాదివత్' అనే అంశాన్ని సాంఘిక ప్రయోజనంగా గుర్తించేరు.

'రాజుగారి కోటలో
రాణిగారి తోటలో
జిల్లేడు పాకిందిటే
పల్లేరు మొలిచిందిటే' --

అని వ్రాసిన కవులు ప్రజాస్వామ్య వ్యవస్థ యొక్క మౌలికాశయాన్ని అద్దంలో పట్టినట్టు కళాత్మకంగా చూపించేరు. అందుచేత కళాదృష్టి— సాంఘికదృష్టి రెండూగల కవిత్వం మాత్రమే నిలుస్తుంది. కొద్దీ— గొప్పా తేడా ననుసరించి వాని మధ్య వర్గీకరణ ఏర్పడుతున్నది.

ఒక ఉద్యమం ప్రజావ్యాప్తం కావడం—కాక పోవడం అనేది ఉద్యమ కర్త సమర్థత—కాలమాన పరిస్థితుల పరిపక్వతలపై ఆధారపడి వుంటుంది. నన్నయ భారతాంధ్రీకరణాన్ని ప్రారంభించాడు. అది సాహిత్యోద్యమం అయింది. భారతాంధ్రీకరణంలో నన్నయ ఉద్దేశ్యం వైదిక మతోద్ధరణ. వైదిక మతోద్ధరణ అనేది సాంఘికోద్యమము. నన్నయ లౌకిక దృష్టి విడచి కేవల పారమార్థిక దృష్టితో భారతాంధ్రీకరణ కొనసాగించడంచేత నన్నయ నాడు భారతాంధ్రీకరణ సాహిత్యోద్యమంగానే మిగిలింది. గతానుగతికమైన ధర్మాన్ని పునః ప్రబోధించిన నన్నయ ఉద్యమకర్త కాలేక పోయాడు. అందుచేతనే భారతాంధ్రీకరణం ఆగిపోయింది. ఆదే వైదికధర్మాన్ని లక్ష్యంగా గ్రహించిన తిక్కన హరిహరనాథ తత్త్వాన్ని ఆవిష్కరించి సరిక్రొత్త ఉద్యమ నిర్మాతగా అవతరించడం జరిగింది. తాను ఉద్యమకర్తగా రూపొందడానికి తగిన పూర్వరంగాన్ని తిక్కన సిద్ధపరుచుకున్నాడు.

'జనన మరణాదులైన సంసార దురిత
ములకు నగపడకుండంగఁ దొలగు తెరువు
గను వెలుంగు'—ముందు సంపాదించు కున్నాడు.

కవిత్వాన్ని ఒక ఆవేశంగా భావించాడు. మహాకవిత్వ దీక్షావిధిని పొందాడు. ఆంధ్రావలి మోదము పొందుటకై, 'తెనుఁగుబాస వినిర్మింప', పూనుకున్నాడు. కనక సదృశమైన భారతేతివృత్తానికి నూత్న రత్న సదృశమైన స్వకీయ మహాకవిత్వ విభూతిని పొదిగి, 'నా నేర్చిన భంగి చెప్పి వరణీయుడ నయ్యెద'నని, తన మార్గాన్ని ఏర్పరుచుకున్నాడు. తన హరిహరనాథునితో బాటు మహాభారతాన్ని కూడా ప్రజల్లోకి తీసుకుని పోయాడు. నెల్లూరిలో హరిహరనాథాలయాన్ని నిర్మింపఁజేసి, ఓరుగల్లులో భారత పఠనాన్ని కొనసాగించాడు. కేతన, మారన, నాచన సోమన, అనంతుడు మొదలైనవారు తిక్కన అనుయాయులు కాగా, మత పరమైన సమన్వయ ధోరణి వారి ఉద్యమ ఫలితంగా నిలిచింది. ఉద్యమ వ్యాప్తికి—ఉద్యమకారుని సమర్థతకు సంబంధం ఈ విధంగా వుంటుంది. ఈ శతాబ్దిలో సూర్యుడు ఉదయించిన సమయంలోనే తెలుగు సాహిత్యంలో ఒక వెలుగురేఖ విరిసింది. భావము—భాష—ఛందస్సు అన్నిటా మార్పు తెచ్చి సాహిత్యాన్ని సరాసరి ప్రజలతో కలిపిన సరిక్రొత్త ఉద్యమం గురజాడతో ప్రారంభమయింది. అయినా ఆంధ్రదేశంలో సామ్యవాద చింతన పరిపక్వమయేదాకా ఆ ఉద్యమం రూపుకట్టలేక పోయింది. కాలమాన పరిస్థితుల ప్రభావంచేత, గురజాడ మరణించిన తరువాత సాహిత్య లోకంలో పునరుజ్జీవన ఉద్యమకర్తగా, యుగకర్తగా కీర్తింపఁబడ్డాడు.

తెలుఁగునాట తొలి కవులు తమ తమ ఉద్యమాల వ్యాప్తికై రెండు విభిన్నమార్గాల ననుసరించారు. సమాజంలో కీలక స్థానాల నాక్రమించిన మేధావి వర్గాన్ని ప్రభావితం చేసి వారి ద్వారా తమ ఆశయాన్ని సాధించడ మొక మార్గము. సూటిగా ప్రజాసామాన్యాన్ని చేరుకుని వారిని ఉద్రేకపరచడం ద్వారా తమ లక్ష్యాన్ని చేరుకోవడ మొక మార్గము. తత్ఫలితంగా ఆంధ్ర సాహిత్యంలో రెండు ప్రధానమైన సాహిత్యోద్యమా లేర్పడ్డాయి. అవి (1) మార్గకవిత. (2) దేశికవిత.

మును మార్గకవిత లోకం
బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం
గున నిలిపి రంధ్ర విషయం
బునఁ జనఁ జాళుక్యరాజు మొదలుగఁ బలువుర్.

అనే నన్నెచోడుని పద్యం ఈ విషయాని కాధారంగా కనిపిస్తోంది. విమర్శకు లీ పద్యాన్ని గ్రహించి నన్నయాదులను మార్గకవులుగా, నన్నెచోడాదులను దేశి కవులుగా తీర్పు చెప్పేరు. కాని నన్నెచోడుడు ప్రజాసామాన్యాన్ని చేరినవాడు కాడు. అతనికి ఆ రకమైన అభిప్రాయమున్నట్లు కూడా కనబడదు. తెనుగు కవులలో ప్రజాసామాన్యాన్ని స్మరించిన మొదటి కవి పాల్కురికి సోమన మాత్రమే.

'ఉరుతర గద్య పద్యోక్తుల కంటె
సరసమై పరగిన జానుఁదెనుఁగు
చర్చింపఁగా సర్వసామాన్య మగుటఁ
గూర్చెద ద్విపదలు గోర్కి దైవారఁ;
దెలుఁగుమాట లనంగ వలదు; వేదముల
కొలదియ కాఁజూడుఁడు.'

సోమనాథుఁడు శైవమత ప్రచారానికై దేశి కవితను చేపట్టాడు. 'సర్వసామాన్యంబుఁగామి' అనే ప్రయోగంలో సోమన ప్రజాసామాన్యాన్ని ఉద్దేశించాడు. ప్రజలకు చెప్పదలచిన విషయాన్ని ప్రజల ఛంద స్సులో చెప్పడానికి అతడు వెనుకాడ లేదు. అందుకే తన తెలుగు మాటలను వేదవచనములుగా గ్రహించాలని శాసించాడు. సమాసభూయిష్ఠమైన రచనను విడచి జానుతెనుగులో వ్రాయాలని దీక్ష పూనాడు. కథా వస్తువు కూడా సమకాలీన మైనదే గ్రహించి దానిని పురాణంగా తీర్చి దిద్దాడు. వాదనలు—చర్చలు—మహి మల ద్వారా సమాజంతో ప్రత్యక్షంగా తలపడ్డాడు. అందుచేత శివకవిత ఒక ఉద్యమంగా, ద్విపద రచన ఒక ప్రత్యేక సాహిత్య ప్రక్రియగా తెలుగు సాహిత్యంలో తమ విశిష్టతను సంతరించు కున్నాయి. సోమనాథునకు వీరశైవ మతవ్యాప్తియే పరమాదర్శము. ఆ లక్ష్య సాధన కాతఁడు పండిత, పామరవర్గాలను రెండింటిని రెండు మార్గాలలోను లోబరచుకున్నాడు. ఇటువంటి లక్ష్యశుద్ధిలేని కారణంచేత నన్నెచోడుడు గొప్పకవి— గొప్ప శివభక్తుడు అయాడే కాని ఉద్యమకారుడు కాలేక పోయాడు. ఒక ఉద్యమంలో వ్యాప్తి చెందక పోవడ మనే కారణంచేత, మరొక ఉద్యమానికి వ్యతిరేకమైన కారణంచేత అతని కావ్యం మరుగున పడిపోయింది. కాగా మరొక విధంగా నన్నెచోడుని ఉద్యమకర్తగా విమర్శకులు భావిస్తున్నారు.

'నన్నయ నన్నిచోడు లిద్దరూ ఆంధ్రసాహిత్య చరిత్రలో రెండు భిన్నమార్గములకు దారితీసిన వారై నారు. ఒకరిది పురాణ కవిత. మరొకరిది వస్తు కవిత—ప్రబంధ కవితా మార్గము. ఇట్లు ఆంధ్ర సాహిత్యమున కాదిలోనే రెండు విధములగు భిన్నశాఖల కంకురార్పణము జరిగినది.'

డా॥ కోరాడ మహాదేవ శాస్త్రి.
(కుమార సంభవ పీఠిక—ఏకాడమీ ప్రతి)

పురాణ కవిత—ప్రబంధ కవిత అనేవి కేవల సాహిత్యోద్యమాలు. అవి తెలుగు సాహిత్యంలో మొదటి నుండి చోటు చేసుకున్నమాట నిజమే. నన్నయ— నన్నెచోడులే వానికి ప్రతినిధులు. కాని వస్తుకవిత అనగా ప్రబంధ కవిత అవునా? కాదా?—అనేది పరి శీలనమీద తేలవలసిన విషయము.

సామాజిక సంఘటనలకు దూరంగా వృద్ధి పొందే సాహిత్యోద్యమాలకు ప్రచారంతో పనిలేదు. ఇవి అనుభూతి ప్రధానమైనవి. ఒక కవినుండి వేరొకకవి పొందే ప్రేరణ మాత్రమే ఈ ఉద్యమాల వ్యాప్తికి కారణమవుతుంది. కవి ఊహా బలంతో నిర్మింపబడే రసజగత్తు ఇక్కడ కనిపిస్తుంది. కవి లోకజ్ఞు డైనట్లయితే సమకాలీన వాతావరణ స్పర్శ కావ్యజగత్తులో కనిపించ వచ్చును. కాని నాడు ఆ అవ కాశం కూడా లేకపోవచ్చును. తెలుగులో ఈవిధమైన సాహిత్యోద్యమాలు ప్రధానంగా రెండు కనిపిస్తున్నాయి. అవి (1) ప్రబంధకవిత్వము. (2) భావ కవిత్వము. ఒకటి పూర్వకాలానికి సంబంధించినది. రెండవది ఆధునిక కాలానికి చెందినది. తెలుగులో ప్రసిద్ధులైన కవులనేకులు ఈ ఉద్యమాలకు చెందిన వారు. కాలాన్నిబట్టి ఆలోచిస్తే ఈ రెండు ఉద్యమాలు చాలా క్లిష్టమైన సాంఘిక పరిస్థితులలో పుట్టి పెరిగినవి. ప్రబంధకవిత కొనసాగినంతకాలం దేశం మహమ్మదీయుల పరిపాలనలో మగ్గింది. మహమ్మ దీయుల ఒత్తిడికి వ్యతిరేకంగా అనేక సాంఘిక సంఘటనలు జరిగాయి. మహమ్మదీయ పాలనలో ప్రజలు అనేక కష్టసుఖాలకు లోనయ్యారు. కాని ప్రబంధ కవులెవ్వరూ ఆ సంఘటనలను కావ్యంగా మలచలేక పోయారు. సింహాద్రి నారసింహ శతకం లాంటి స్వల్పరచనలు ఇందుకు అపవాదాలు. మను, వసు చరిత్రాదుల అవతారికలలో కృతిపతి ప్రశంసార్థం కొన్ని చారిత్రక సంఘటనలు పొందుపరుప బడ్డాయి. అక్కడ కూడా కవి లక్ష్యం కృతిపతి ప్రశంసయే గాని చారిత్రకాంశ నిరూపణం కాదు. వర్ణనలనే పేరున సమకాలీన వాతావరణ నిరూపణ కొంతవరకు చేయడం ద్వారా ప్రబంధకవులు భావకవులకన్న మెరుగని పించారు. ప్రపంచమంతటా జాతీయ చైతన్యం వెల్లివిరిసిన కాలంలో ఆవిర్భవించిన భావ కవిత్వం దివినుండి భువికి దిగిరా నన్నది. ఆంగ్లేయ పరిపాలనకు వ్యతిరేకంగా దేశవ్యాప్తంగా నడచిన జాతీయోద్యమాన్ని—సమకాలీన సంఘటనలను కాదని విజృంభించి ఒక తరం కవుల నందరను ప్రభావితం చేసిన ఖ్యాతి భావకవిత్వానికి మాత్రమే దక్కుతుంది.

ఇందుకు కారణం భావకవిత్వం మానసికానుభూతి ప్రధానమైనది కావడం మాత్రమే. ఈ ఉద్యమం యొక్క వ్యాప్తిని శంకించడం, శపించడం భ్రమ జనితమే అవుతుంది. కవిత్వానికి ఒకే ప్రయోజనాన్ని సాధించడం ఇంతవఱకు జరుగలేదు. కాని ప్రయోజనా రాహిత్యం కవిత్వాశయం కాదు. కవిత్వానికిగల అనేక ప్రయోజనాలలో ఆనందసిద్ధి ఒకటి. 'ఆనందా దేవ ఖల్విమాని భూతాని జాయంతే' అంటాడు ఆనంద వర్ధనుడు. పెద్దనను కవిత్వం ఎలాగుండాలయ్యా? అని అడిగితే 'సొగసు కోర్కులు రావలె నాలకించినన్' అంటాడు. ఆ ఆనందాన్ని కలిగించే శక్తి ప్రబంధ కవితకు, భావకవితకు అధికంగా వుండబట్టే ఆ ఉద్యమాలు బహుళ ప్రచారంలోకి వచ్చాయి. ఈ సత్యాన్ని కాదనలేము. సహృదయుడైన పాఠకునకు ఆ మానసికానందాన్ని కలిగించేశక్తి అవి ఎన్నటికీ కోల్పోవు. అందుకే కవిత్వానికి సాంఘిక ప్రయోజనం ఉండి తీరాలనే ఈ రోజులలోకూడా కేవల సాహిత్యోద్యమాల ప్రభావం అవిచ్ఛిన్నంగా కొనసాగుతూనే వుంది. ఈ నాడుకూడా కవితా సంబంధమైన ఊహలు చాంపేయ మాలలుగా, ఊళలు కేదార గౌళలుగా, ప్రయోజనాలు రసరాజ్య డోలలుగా రూపుదిద్దుకుంటున్నాయి. 'కవిత్వం ఒక ఆల్కెమీ—అందం ఆనందం దాని పరమావధి' అనే చింతన, తదావర్తన ఆధునిక తెలుగు సాహిత్యకాసారంలో నిశ్శబ్దవర్తుల సంగీతాన్ని ఆలపిస్తున్నాయి. ప్రబంధ కవినుండి, భావకవినుండి పొందిన ప్రేరణ ఫలితంగా ఏర్పడిన వాతావరణ మిది.

ఈ వాతావరణాన్ని ఛేదించుకొని కవిత్వాన్ని నికరమైన సాంఘికోద్యమ చ్ఛాయగా, ప్రజల వస్తువుగా తయారు చేయాలనే తపనతో ఆవిర్భవించినది అభ్యుదయ కవిత్వోద్యమము. కాని సమసమాజ నిర్మాణ మనే ధ్యేయం అభ్యుదయ కవుల కవిత్వాంశలో ఒక భాగంగా మిగిలింది. అభ్యుదయ కవితకు వస్తువు ప్రజలయ్యారేగాని, అభ్యుదయ కవిత ప్రజల వస్తువు కాలేకపోయింది. అంటే వ్యాప్తినిబట్టి భావకవిత్వానికి—అభ్యుదయ కవిత్వానికి పరిధి ఒకటే అయింది.

'చావలేదు! చావలేదు! ఆంధ్రుల మహోజ్జ్వల చరిత్ర
హృదయములు చీల్చి చదువుడో సదయులార!'

అనే పద్యం ఎవరిదాకా చేరిందో

'స్వాతంత్ర్యం సమభావం
సౌభ్రాతం సౌహార్దం
పునాదులై యిళ్లులేచి
జనావళికి శుభంవూచి
శాంతి కాంతి కాంతి శాంతి
జగమంతా జయిస్తుందది'—

అనే అభ్యుదయ కవితకూడా వారిదాకానే చేరింది. పరోక్షంగా ఉన్నంతకాలం కవి కవిత్వాంశ గల పాఠక వ్యక్తిని ఉద్రేక పరచడం మాత్రమే జరుగుతుంది: ఈరకమైన ఉద్రేకం కేవలం కవిత్వపరంగానే నిలుస్తుందిగాని ఉద్యమ సాఫల్యానికి దోహదకారి కాలేదు. అభ్యుదయ కవిత్వోద్యమం ఈస్థాయిలో ఆగిపోయింది. ఇందుకుగల కారణాలను అన్వేషిద్దాం.

ఒక ఉద్యమంయొక్క పుట్టుకకు, వ్యాప్తికి ఇతరేతర ఉద్యమాల ప్రభావం కారణమవుతుంది.

'పరస్పరం సంఘర్షించిన
శక్తులలో చరిత్రపుట్టెను'—

అని శ్రీ శ్రీ చెప్పినట్లుగా అభ్యుదయకవిత్వా విర్భావం అనే చారిత్రక సత్యంకూడా ఆకస్మిక సంఘటన కాదు. సిద్ధాంతపరంగా కారల్‌మార్క్సు సామ్యవాద ఉద్యమం, సాంఘికంగా కందుకూరి సంస్కరణోద్యమం, భాషా విషయికంగా గిడుగుపంతులుని వ్యావహారిక భాషోద్యమం, ప్రక్రియాపరంగా గురజాడ అడుగుజాడ—అభ్యుదయకవితా సౌధానికి చలనం లేని పునాదులుగా నిలిచాయి. మార్క్సు, కందుకూరి, గిడుగు, గురజాడ—సంఘంతో ప్రత్యక్షసంబంధం కలవారు. వీరు ఎన్నుకొన్న లక్ష్యాలకు, ప్రయత్నించిన మార్గాలకు సామరస్యం కుదిరింది. అందుచేతనే వారు ఉద్యమ నిర్మాత లయ్యారు. అభ్యుదయకవుల లక్ష్యాలకు ప్రయత్నించిన మార్గాలకు ఈ విధమైన సామరస్యం కుదరని కారణంగా ఆ ఉద్యమం ఒక మేరకే సఫల మయింది. అభ్యుదయకవులలో కొంతమంది ముఖ్యులు భావకవిత్వం నుండి దిగుమతి అయినవారు కావడంచేత, సంప్రదాయ ముద్ర కలవారవడంచేత 'సాంఘిక ప్రయోజనం' అనే అంశాన్ని విడచిపెట్టికూడా వారు రచనలు చేయడం జరిగింది. ఉదాహరణకు—

'ఆనందం అర్ణవమైతే
అనురాగం అంబరమైతే

ఆనందపు లోతులు తీదాం
అనురాగపు టంచులు చూదాం'

అనే గేయానికి సాంఘిక ప్రయోజనాన్ని చూప లేము. ఐనా ఇది ఉత్తమకవితగా పరిగణింపబడుతూంది. కాని వస్తుపరంగా ఈవిధమైన ఎన్నిక సమసమాజ నిర్మాణోద్యమము యొక్క నిర్విరామ చైతన్యానికి ప్రతీఘాత చర్యగా నిలుస్తుంది. భాషా విషయికంగా తిక్కన—వేమన—గురజాడలకు వారసుల మనుకున్న అభ్యుదయ కవులు ప్రజలకు భావకవులు ఎంతదూరంలో నిలబడ్డారో అంతే దూరంలో నిలబడ్డారు. గిడుగు వారి వ్యావహారిక భాషోద్యమం ఫలవంతమైన తరువాత, దాని ప్రభావంతో నిలబడిన అభ్యుదయ కవితలో ప్రజలభాష తక్కువ.

'ప్రదీప్తకీలా ప్రవాళమాలా
ప్రపంచవేలా పరిభ్రమణలో
మిహిర వాజి తతి మఖవ ధనుర్ద్యుతి
పుడమికి నేడే పుట్టిన రోజట'—

ఈ తరగతికి చెందిన రచనను వ్యావహారిక రచనగా అంగీకరించడం హాస్యాస్పదం. ఈవిధమైన భాష నుపయోగించిన కవులు మురారి, కృష్ణరాయలువంటి కవులకు వారసులు కావచ్చునుగాని వేమన, గురజాడల కోవకు చేరవలసిన వారు కారు. ఏ తరగతికవులు ఆ తరగతి ప్రజలనుండే ఆవిర్భవించా లేమో! జానపద కవిత్వాన్ని జానపదులు కూర్చితేనే సాగసున్నట్లుగా తెలుగు కవిత్వాన్ని ఇతరభాషలు రానివాడు వ్రాస్తేనే ప్రజాకవిత్వ మవుతుంది. కాని నాడు అది సాహితీపరులలోనే నిలుస్తుంది. సంస్కృతంలో పుటి పెరిగిన కవులు సంస్కృత ప్రభావానికి లోనుగాక తప్పదు. ప్రజాకవుల మనుకునేవారి సంకలనాలపేర్లు 'మహాప్రస్థానం— త్వమేవాఽహమ్ — భువన ఘోష — వజ్రాయుధం—రుధిర జ్యోతి—రుద్రవీణ' మొదలుగా వుంటే కవితా ఖండికలపేర్లు 'భిక్షువర్షీయసి—వేదనా శకలమ్— ప్రస్థానభేరి—మౌనఘోష' మొదలైనవిగా వుంటాయి. కేవలం గ్రంథనామాలనే తీసుకుంటే ప్రబంధ— భావకవిత్వాలు, నండూరి—కొనకళ్లవంటి వారి రచనలు ఇంతకంటె ప్రజలకు చేరువగా వుంటాయి. లక్ష్యశుద్ధిలేని కారణంచేత అభ్యుదయ కవులు ఈ విధమైన ప్రమాదానికి లోనయ్యారు. తెలుగంతా గ్రామాలలో వుంది. సామాన్య ప్రజలందరూ నిరక్షరాస్యులుగా, సాహితీ గంధంలేని వారుగా వున్నారు. ఈ రెండు సమస్యలు తీరకుండా అభ్యుదయ కవులుగాని, మరొకరుగాని ఏమివ్రాసినా అది ప్రజలకు చెందని శుష్క వినాదంగా మిగులుతుంది. ఆ కవులు ప్రజాకవులు కాలేరు. గురజాడ మనకొద్దుబాబూ అని నెత్తిమొత్తుకున్న 'artificial literary dialect,' 'alliterative versification' కూడా అభ్యుదయ కవులను విడచి పోలేదు.

'కావ్యం ఏదైనా సరే కనీసం ఒక రిక్వైరుమెంటు
కావాలి కవిత హృదయానికి నరిష్మెంటు
కారాదు ఏనాడు మెదడుకి పనిష్మెంటు'

అని ఆరుద్ర అంటే—

'ఎక్సలెంటు ఆరుద్రా నీ స్టేట్‌మెంట్'

అంటారు శ్రీ శ్రీ. వారు పేర్కొన్నట్లుగా అభ్యుదయ కవిత హృదయ సంబంధిగానే మిగిలింది. అంటే అనుభూతి సంబంధమైన దయింది. సాహిత్యాభి రుచిగల అభ్యుదయ వాదుల హృదయ స్పందనలో అభ్యుదయ కవిత సాఫల్యాన్ని పొందింది. ఇంతవఱకు కేవల సాహిత్యోద్యమాలు—సాంఘికోద్యమాలతో ముడిపడిన సాహిత్యోద్యమాలనుగూర్చి సూత్రప్రాయంగా ప్రస్తావించడం జరిగింది.

ఉద్యమం కవిత్వాన్ని ప్రభావితం చేస్తుందా? కవిత్వం ఉద్యమాన్ని ప్రభావితం చేస్తుందా? ఇవి పరస్పర ప్రభావితాలా? అని ఆలోచిస్తే వేర్వేరు స్థాయిలో పై మూడు విధాలుగా కూడా జరిగే అవకాశముందని గ్రహించ వచ్చును. ఉదాహరణకు తెలంగాణా ఉద్యమాన్ని తీసుకుందాం. ఆ ఉద్యమం ద్వారా ప్రభావితులైన కవులున్నారు. ఆరుద్ర 'త్వమేవాహం' అలాంటి కావ్యమే.

'బ్రెయిన్‌లో బ్రెన్ గన్
రెయిన్‌లా ఆలోచనల బ్రెయిన్
స్ప్రయినల్ కార్డులో స్ప్రెయిన్
గ్లూమీ తిమిరాలు చెరిషించి
సైతాన్ మనల్ని పెరిషించు నపుడు

నిర్వేదనా పవనాలు వర్షించు
సింతటిక్ చింతను ధరించు కవి'—

ఇలాంటి చరణాలన్నీ నాటి తెలంగాణా పరిస్థితులను దృష్టిలో నుంచుకొని వ్రాసినవే. ఆ ఉద్యమంచేత ప్రభావితుడై కవి ఈరచన చేయడం జరిగింది. కాని కవి అంతర్ముఖుడై వెల్లడించిన ఈవేదనాశకలం సాహితీపరంగా కొందరి ఆనందానికి కారణభూత మయిందే గాని — దీనివల్ల తెలంగాణా ఉద్యమానికి పిసరంత లాభం కూడా చేకూర లేదు. అందుచేతనే 'త్వమే వాహం' ఉద్యమంచేత ప్రభావితమయిన కవిత మాత్రమే అయింది.

'నైజాం సర్కారోడ! నాకొడకా!' అనే పాటను తీసుకుందాం. ఉద్యమకాలంలో తెలంగాణా గ్రామా లలో ఈపాట మారు మ్రోగింది. ప్రజలందరి నోటా ఆపాట వినపడిందంటే ఆపాట ఉద్యమాన్ని ప్రభావితం చేసిందని అంగీకరించాలి. కాని ఉద్యమం నుండి వేరు చేసిననాడు ఆపాటకు సాహిత్యగౌరవం లేదు.

ఆంధ్రోద్యమాన్ని తీసుకుందాం. ఈ ఉద్యమం చేత ప్రభావితుడై శ్రీ శ్రీ 'తెలుగుతల్లి' అనేపాట రచించడం జరిగింది.

'అదే వో తెలుగు తల్లి
అందాల నిండు జాబిల్లి
ఆనందాల కల్పవల్లి
అదే నీ తెలుగు తల్లి'—

ఇక్కడ కవికి తెలుగుదేశం పట్లగల ప్రగాఢాభిమానం వెల్లడవుతున్నది. అంతకుమించి ఈపాట ఆంధ్రోద్య మాన్ని ఉధ్రూత లూగించిన దేమీ లేదు.

'చెయ్యెత్తి జైకొట్టు తెలుగోడా!
గత మెంతొ ఘనకీర్తి గల వోడా!'

అనే శ్రీకృష్ణ గేయం ఆంధ్రదేశాన్ని ఒక ఊపు ఊపిందనడంలో అతిశయోక్తి లేదు. ఆ బాలగోపాలం ఆ పాటను పాడుకోవడమే ఆంధ్రోద్యమంలో దాని పాత్రను తెలియజేస్తుంది. ఇదే విధంగా జాతీయోద్య మం చేత ప్రభావితులైన కావ్యాలకన్న గరిమెళ్లవారి 'మా కొద్దీ తెల్లదొర తనము'—అనే పాట ప్రజల నోళ్లలో నలిగి, వారిలో జాతీయ చైతన్యాన్ని రేకెత్తిం చిందని చెప్పవచ్చును. ఇక్కడ ఒక విషయం కని పిస్తుంది. ఉద్యమాన్ని ప్రభావితం చేసే రచనలన్నీ గీతగుణాన్ని కలిగినవే. సభలలో, సమావేశాలలో, ఊరేగింపులలో పాడటం వలన వానికి వ్యాప్తి చేకూ రింది. ఉద్యమం నుండి వేరుచేసి చూసినపుడు రచ నల్కావ్యాల కున్న స్థాయి వాని కుండదు. కొన్ని రచనలు ఉద్యమంతోపాటే అంతరించిపోతాయి. అప్పుడు గీతి గుణం మాత్రమే వాని వ్యాప్తికి కారణంగా కనిపి స్తుంది. అందుకే పూర్వులు కావ్యాన్నిగూర్చి 'పాఠ్యే గేయేచ మధురం' అన్నారు. పైన ఉద్యమాన్ని ప్రభావితం చేసే రచనలుగా పేర్కొన్నవన్నీ ఉద్యమ ప్రభావంతో రూపొందినవే కాబట్టి కవిత్వము— ఉద్యమము పరస్పర ప్రభావితాలని అంగీకరించ వచ్చును.

ఒక ఉద్యమం యొక్క ఆవిర్భావానికి అంతకు ముందున్న ఉద్యమాలు ఏవిధంగా దోహదం చేస్తాయో అభ్యుదయ కవిత్వోద్యమం విషయంలో తెలుసుకున్నాం. మరొక విశేష మేమంటే ఒక నూతన ఉద్యమం యొక్క ఆవిర్భావం అంతకు ముందున్న ఉద్యమం అంతరించడానికి కూడా కారణం కాగలదు. ఈ అంశాన్ని దిగంబర కవిత్వోద్యమం ఋజువు పరచింది. అభ్యుదయ కవిత్వోద్యమ వైఫల్యం నుండి పుట్టిన నిరాశ—అశాంతి— అలజడి ద్వారా దిగంబర కవులు దిగ బడ్డారు. వీరికి ప్రపంచ వ్యాప్తంగా వున్న కొన్ని అతి నవ్యకవితా ధోరణుల ఆసరా వుంది. తిట్టడానికి తిట్లు తినడానికి తగిన గుండె ధైర్యముంది. అన్నిటికీ మించి ఏదో చెయ్యాలనే తపన వీరిలో కనిపిస్తుంది. కాని ఏమిచెయ్యాలి? అనే విషయంలో ప్రణాళికాబద్ధమైన నిశ్చితాభిప్రాయం వీరికి లేదు. ఈ లోటుతోనే, ఒక స్తబ్ధప్రకృతిలో ఆవిర్భవించిన దిగంబర కవుల సంఘ టిత శక్తి వారి ఉద్యమంయొక్క శీఘ్ర వ్యాప్తికి బలీయ మైన కారణంగా రూపొందింది. దిగంబర కవుల లోటు ఎక్కడున్నదో తెలుసుకుని విప్లవ కవిత్వో ద్యమం పుట్టింది. సాయుధ విప్లవమే సాంఘిక విము క్తికి మార్గదర్శకమనే లక్ష్యంతో కూడిన వి. ర. సం.లో దిగంబర కవిత్వోద్యమం కలిసిపోయింది. ఈనాడు దిగంబర కవిత్వోద్యమంయొక్క రూపురేఖలు లేనే లేవు.

సాంఘికోద్యమాల ప్రభావంతో పుట్టిన సాహిత్యోద్యమాల వృద్ధిక్షయాలు ఆ సాంఘికోద్యమాల నిలకడమీద ఆధారపడి వుండటం కూడా జరుగుతుంది. ఈ అభిప్రాయానికి విప్లవ కవిత్వోద్యమం ఆధారంగా నిలుస్తుంది. సాయుధ పోరాటాన్ని ప్రోత్సహించడమే విప్లవ కవుల లక్ష్యం. ఈ విధమైన అభిప్రాయం అభ్యుదయ కవులలో రెండవ తరం కవులలోను, తెలంగాణా ఉద్యమం నాటి కవులలోను అక్కడక్కడా కనిపిస్తుంది. దిగంబర కవుల రచనలలో కొన్ని సాయుధ పోరాటాన్ని ప్రోత్సహించేవిగా కనిపిస్తాయి.

'ప్రజల కోటికోట్ల ఆవేదన గొంతుల చీకటి చీల్చి పుట్టిన, సాయుధ విప్లవజ్వాలా కెరటాల కనుపాప' దిగంబర కవితలో ప్రజ్వరిల్లింది. ఆ తర్వాత 'మార్చ్,' 'తిరుగబడు', 'లే' మొదలైన కవితా సంకలనాలలో నూటికి నూరుపాళ్ల విప్లవాత్మ వెలుగులు చిమ్మింది. అయినా ఇవేవీ విప్లవ కవిత్వోద్యమంగా రూపు దాల్చలేదు. శ్రీకాకుళ గిరి జనోద్యమం తీవ్ర రూపం దాల్చిన తరువాత, విప్లవకారుల కార్యకలాపాల చేత ప్రభావితులైన కవులందరూ ఏకమై విప్లవ కవిత్వోద్యమాన్ని స్థాపించేరు. వి. ర. సం. ఏర్పడిన తరువాత ఆ కవులు తమ లక్ష్యసాధనను కొంచెం సేపు దూరంగావుంచి అభ్యుదయ రచయితలను పరామర్శించడంలో వృథా కాలయాపన చేసిన తీరు సాహితీ ప్రియులకు తెలిసినదే. దేశంలో, ముఖ్యంగా తెలుగునాట సృష్టింప బడిన విప్లవ వాతావరణానికి విప్లవ రచయితలకన్న విప్లవకారులే అధికంగా బాధ్యులయ్యారు. చాణక్యులు గ్రీన్ రూములోనుండి నివాదాలిచ్చినంతకాలం వి. ర. సానికి అ. ర. సానికి తేడా స్వల్పమే. అందుచేతనే వి. ర. సం. ఇంకా ప్రయోగ దశలోనే మిగిలింది. గిరిజనోద్యమం అంతరిస్తూన్న కొద్దీ వి. ర. సం. లో స్తంభన ఏర్పడడం ప్రారంభించింది. విప్లవ కవులను అరెస్టు చేసిన తరువాత మళ్లీ కొంత సంచలనం కలిగింది. ఆ సంచలనం ఒక్క విప్లవవాదులలోనే గాక ఆరుద్ర, పురాణం సుబ్రహ్మణ్య శర్మ వంటి అభ్యుదయవాదులలో కూడా కలిగింది. వి. ర. సానికి ఇంకా తమ ఉద్యమాన్ని సమీకరించుకోవడానికే కాలమంతా సరిపోతూంది. కవిత కాదు కథ అన్నారు. కథలు కాదు న్యాసా లన్నారు. సభలు—సమావేశా లన్నారు. కాని ఏ ప్రక్రియను అందుకొన్నా వి. ర. సం. వారు ఇంకా ప్రజలను చేరుకోలేక పోతున్నారు. సంస్కృత భాష—ఆలంకారిక సంప్రదాయావశేషాలు వీరిమీద కూడా తమ అధికారాన్ని నిరాఘాటంగా చెలాయిస్తున్నాయి. అంటే వీరు కూడా సాహిత్య ప్రయోజనాన్ని ఏకముఖంగా కేంద్రీకృతం చేయలేక అవస్థ పడుతున్నారన్న మాట.

కవిత్వానికి ఉద్యమానికి ఉండే సంబంధాన్ని పరిశీలించడం ద్వారా అభ్యుదయ కవిత్వం—దిగంబర కవిత్వం— విప్లవ కవిత్వం క్రమంగా ఒకదాని స్థానాన్ని ఒకటి ఏ విధంగా ఆక్రమించుకున్నాయో తెలుసుకోవడం జరిగింది. ఈ స్వభావం కేవల సాహిత్యోద్యమాలలో కూడా వుంటుంది. పురాణ కవిత్వం కావ్య కవిత్వం—ప్రబంధ కవిత్వం—భావ కవిత్వం క్రమంగా ఒకదాని స్థానాన్ని మరొకటి ఆక్రమించుకున్న తీరు సాహితీ పరులకు విశదమే. అన్ని రంగాలలోను కాలంతో బాటు అభిరుచులు — అభిరుచులతోపాటు సాహితీ ప్రక్రియలు మారుతున్నాయి. మార్పు అనివార్యమైనది. ఉద్యమాలు తాత్కాలిక మైనవి. వాటి నాశ్రయించుకున్న కవిత్వాలు వాటితోపాటు మారుతూంటాయి. మానవ స్వభావం వైవిధ్యం గలది. దాని నాశ్రయించుకున్న కేవల సాహిత్యోద్యమాలు కూడా స్వభావంలో వైవిధ్యం గలది. అందుచేత సాహిత్యోద్యమాల స్వభావంలో బాహిరంగా—అంటే ప్రక్రియా పరంగా ఎంత మార్పు కలిగినా వాని జీవలక్షణం మారదు.

# 'విజయ విలాస వ్యాఖ్య-హృదయోల్లాసం' -సమీక్షా పరిశీలన

డా. ఎస్. గంగప్ప

'విజయ విలాసవ్యాఖ్య — హృదయోల్లాసం' — అన్న శ్రీ 'ఆంగీరస'గారి సమీక్షా వ్యాసం 1972 అక్టోబరునెల 'భారతి'లో చదివాక ఈ పరిశీలన వ్రాయాలనిపించింది.

'ఇందులో విశేషార్థాలు విరివిగా చూపబడి ఉన్నవి' అని మెచ్చుకొంటూనే శ్రీ 'ఆంగీరస'గారు 'తరచుగా ఇదివరకు వెలువడిన ప్రతులలో గ్రహించబడిన పాఠాలూ, వ్యాఖ్యలూ విమర్శించబడినవి. వ్యాఖ్యాత తాము గ్రహించిన పాఠాల ఔచిత్యాన్నీ, అర్థాల విశిష్టతనూ సమర్థించారు. కాని వారు ఇతరులను ఆక్షేపించి చూపిన అర్థాలూ, గ్రహించిన పాఠాలు కొన్ని చోట్ల సముచితంగా ఉన్నట్లు కనబడలే'దని కొన్నింటిని ఉదాహరించి, చివరిగా మరొక్కసారి శ్రీ తాపీ ధర్మారావు గారిని ప్రశంసిస్తూనే 'అట్టి వ్యాఖ్యలో ఇటువంటివీ, అనవసరంగా ఇతర వ్యాఖ్యాతలను గురించిన ఆక్షేపణలూ లేకుండా ఉంటే ఎంతో బాగుండేది'—అని ముగించారు.

ఇందులో 'అనవసరంగా ఇతర వ్యాఖ్యాతలను గురించిన ఆక్షేపణలూ' అంటూనే కేవలం వేదము వేంకటరాయశాస్త్రిగారిని ఆక్షేపించడానికే శ్రీ తాపీ వారు ఇలాంటి వ్యాఖ్యలు చేశారని శ్రీ 'ఆంగీరస'గారు అభిప్రాయపడడం భావ్యం కాదు. వేదంవారిని తాపీ వారు అంగీకరించిన పట్టులు, మెచ్చుకొన్న సందర్భాలు లేకపోలేదు. మచ్చుకు ఒకటి రెం డుదాహరణలు. ప్రథమాశ్వాసంలో చిత్రాంగదా సౌందర్య వర్ణనగల— 'బంగరు బొంగరాల పరిపాటి చనుంగవ.........' (215) పద్యానికి అర్థ తాత్పర్య విశేషాల్ని వివరించి, శ్రీ తాపీవారు 'అయినా వేదము వారు ఈ పద్యమున సొగసు ని ట్లుగ్గడించారు: 'బొంగరముప్రక్క బొంగరము అభిప్రాయము గాన 'పరిపాటి', మీఁదు సూటిగా చూపులవలె దూటును గాన 'సూటి', చంద్రుని కోటి యనగా శృంగము కలదు గాన 'ప్రతి కోటి', దాటు చున్న దశలోని తేంట్లు అభిప్రేతములు గాన 'ధాటి', పులిన గుణములలో ఏకదేశ మాత్రముగాని, తదీయ దశా విశేష మాత్రముగాని గాక, పులినమంతయు నభిప్రేతమైనందున 'సాటి', యనియుం గల ప్రయోగంపు సొంపుం బరికింప నింపగు ' అని, దీని సారస్యమును సహృదయులు చూడవచ్చును.''—అని తమ మెచ్చుకోలును దెలిపిన తాపీవారి సహృదయతను కాదవగలమా? ఇంక ద్వితీయాశ్వాసంలో నందశాపవిముక్తి నందిన సందర్భంలోని—

'ఈ బాల మోమునకు నా
జాబిల్లికి నెంత దవ్వు; సరివచ్చు నొకో,
యీబిడ చనుఁగవ కొక మె
ట్టా బంగరు గట్టు తక్కువౌ నెంచంగన్.' (48)

అనే పద్యానికి అర్థ తాత్పర్యాలు, విశేషాలు తెలిపి— ''(3) లేదా వేదమువారు చెప్పినట్టు చంద్రు డున్నది చాల 'దూరము గావున వచ్చి ప్రక్కను సరిగా విలువ నేరడని' చమత్కారము గ్రహింపవచ్చును అని వేదంవారిని అంగీకరించిన తాపీవారు వేదంవారిని ఆక్షేపించడమే లక్ష్యంగా ఉంచుకొన్నారని తలంచడం సముచితం కాదని వేరే చెప్పనవసరం లేదు. కాబట్టి తాపీవారు పూర్వ వ్యాఖ్యలను పరిశీలించి సముచితమైన వాటిని స్వీకరిస్తూ, తమ ప్రతిభా వ్యుత్పన్నతలలో ఇంకా ఎన్నో విశేషాల్ని వివరిస్తూ, చేమకూర వేంకటకవి హృదయావిష్కరణ గావించ ప్రయత్నించా

రంటే తాపీవారి సహృదయతను సైతం మనం గమనించవచ్చు.

ఇంక "వారు (తాపీ వారు) ఇతరులను ఆక్షేపించి చూపిన అర్థాలూ, గ్రహించిన పాఠాలూ కొన్నిచోట్ల సముచితంగా ఉన్నట్లు కనబడలే' ని 'ఆంగీరస'గారు చూపిన వాటిని పరిశీలిదాం.

1. శ్రీ తాపీ వారు 'ఆహారాన్ని బట్టే స్వభావ ముంటుందని ఒక సిద్ధాంతము' అన్నారనీ, అది పొరపాటనీ 'ఆంగీరస' గారు ప్రతి సిద్ధాంతీకరించ ప్రయత్నించారు, కానీ శ్రీ తాపీ ధర్మారావుగారు 'ఆహారాన్ని బట్టే స్వభావ ముంటుందని ఒక సిద్ధాంతము.' అనడం పరమ సిద్ధాంతం. ఇందులో సందేహ పడవలసిన అవసరం లేదు. ప్రకృతి సంభవాలైన సత్త్వ రజస్తమో గుణాలు మానవుల ఆహార విహారాదుల ననుసరించి ఉంటాయి. శ్రీకృష్ణ పరమాత్ముడు భగవద్గీత 17 వ అధ్యాయంలో సత్త్వ రజస్తమో గుణాలు గల వ్యక్తులు గ్రహించే ఆహారాల్ని గూర్చి వివరించాడు.

'ఆయు స్సత్త్వ బలారోగ్య సుఖప్రీతి వివర్ధనాః।
రస్యాః స్నిగ్ధాః స్థిరా హృద్యా ఆహారాః సాత్త్వికప్రియాః॥
'కట్వామ్ల లవణా త్యుష్ణ తీక్ష్ణ రూక్ష విదాహినః।
ఆహారా రాజ సస్యేష్టా దుఃఖ శోకా మయ ప్రదాః॥
'యాత యామం గత రసం పూతి పర్యుషితం చయత్।
ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామస ప్రియమ్॥'
(శ్లో. 8, 9, 10.)

[ఆయుస్సును, దేహ మనోబలాల్ని, ఆరోగ్య ౖ, ప్రీతిని బాగుగా వృద్ధినొందించేవీ, రసమూ చమురూ గలవీ, దేహమందు చాలకాలముండునవీ, మనోహరమైనవీ—అయిన ఆహారాలు సత్త్వగుణం గలవారి కిష్టం. చేదుగాను, పులుపుగాను, ఉప్పగాను, మిక్కిలి వేడిగాను, కారంగాను, చమురు లేనివి గాను, మిగుల దాహం గలుగజేసేవి గాను ఉండేవీ, దుఃఖం, వ్యాకులత్వాన్ని గలుగజేసేవి అయిన ఆహారపదార్థాలు రజోగుణంగలవారి కిష ం.

వండిన పిమ్మట ఒక జాము దాటినదీ, సారం నశించినదీ, ఒకరు తినగా మిగిలినదీ, అశుద్ధమైనదీ అయిన ఆహారం తమోగుణం గలవారి కిష్టం.] ఇట్లు ఆయా ఆహారాల్ని బట్టి సత్త్వరజస్తమో గుణాలుంటాయని శ్రీకృష్ణ పరమాత్మ ప్రబోధం, దీని కుప బలకంగా 'ఆహార శుద్ధౌ సత్త్వ శుద్ధిః'—అని మనుస్మృతి ఘోషిస్తూంది. పై సిద్ధాంతాన్ని బట్టే శ్రీ కృష్ణదేవరాయలు సైతం 'ఆముక్తమాల్యద' షష్ఠాశ్వాసం—మాలదాసరి కథలో కుంభజానువను రాక్షసునకు మాలదాసరిచే ఆహారాన్ని బట్టే తమస్సత్త్వ గుణా లుంటాయనీ, అవి రాక్షసుల్లోను, దేవతల్లోను గలవనీ—'మీరు నా సౌరిముఖ బర్హిర్ముఖులు జాతిం దలపోయ భ్రాత లట్లయ్యుం బరంబున మీరు వారు బాధ్య బాధకతల నొందుచున్నారీ తైజసం బగు తారతమ్యంబునకుం దమస్సత్త్వంబులు హేతువులు, వానికా హృతులు హేతువులు.' అని చెప్పించాడు. కనుకనే ఆహారాన్నిబట్టి స్వభావం ఉంటుందనడమే సముచితమూ, శాస్త్ర సమ్మతమూను. దీన్ని ఆధునిక విజ్ఞానశాస్త్రం సైతం నిరూపిస్తుందనడం లోను అసామంజస్యం లేదు. అందుచేతనే—'జన్యజనకంబులకు భేద శంకలేదు । దేహమన్నజ మిందు సందేహ మేది?' అనే శ్రీనాథుని పద్యాన్ని తాపీవారు సమంగానే అర్థం చేసుకొన్నారనీ, శ్రీ 'ఆంగీరస'గారు 'ఆహారాన్నిబట్టి శరీరం వుంటుందిగాని స్వభావం ఉండదు' అను కొన్నట్లుగాక ఆహారాన్నిబట్టే స్వభావం ఉంటుందని అనడమే సత్యం!

ఇంక 'ఆంగీరస'గారు 'రూపాన్ని బట్టి స్వభావం ఉంటుందనేదే ప్రసిద్ధి'—అనీ, అందుకు కాళిదాస మహాకవి 'యదుచ్యతే పార్వతి! పాప వృత్తయే। నరూప మిత్య వ్యభిచారి తద్వచః॥' అన్న శ్లోకాన్నీ, దాని అనువాదమైన శ్రీనాథుని—'రూపము కలచోట బాప। వ్యాపారం బుండదనెడి వాక్కు నిజంబౌ'—నీ ఉదాహరించారు. నిజమే! రూపం ఉన్నచోట గుణం కూడ ఉండ వచ్చు. కానీ ఇవి కవి వాక్కులు! కవి వాక్కునకు, శాస్త్రకారుని శాస్త్రానికీ భేదం ఉంటుంది. శాస్త్రకారుని విషయమే సత్యంగాని కవివాక్కు గాదు. కనుక 'ఆంగీరస'గారు సిద్ధాంతీకరించినట్లు రూపం ఉన్న చోటల్లా ఉత్తమ గుణాలుంటాయనిగానీ, కురూపతగల చోటల్లా దురు ణా

లుంటాయని గానీ అనడంలో సత్యంలేదు. 'రూపాన్ని బట్టి స్వభావం వుంటుందనేదే ప్రసిద్ధి' అన్న 'ఆంగీరస'గారి వాదం నిలువదు. 'ఆహారాన్నిబట్టే స్వభావముంటుందని ఒక సిద్ధాంతము' అన్న తాపీ వారిది పొరపాటని నిరూపించడానికి 'రూపాన్నిబట్టి స్వభావం వుంటుందనేదే ప్రసిద్ధి'—అని ప్రతి సిద్ధాంతం చేయబోయి 'ఆంగీరస'గారే అనవసరంగా పొరపాటు పడ్డారు. కనుక ఆహార స్వభావాలకు అవినా భావ సంబంధముంటుం దనడమే సిద్ధాంతం.

2. అచ్యుతరాయల వర్ణన పద్యం—'గెలిచిన గెల్పు లర్థితతికిన్ దినమిచ్చిన యీవులున్, వహుల్ తలంచిన......' (1—14) అన్న దానిలో శ్రీ తాపీ వారు గ్రహించిన పాఠం, వారుచేసిన వ్యాఖ్య పొర పాటని శ్రీ 'ఆంగీరస'గారి భావన. 'వహుల్ అనే ప్రథమాంతానికి ద్వితీయా విభక్తికి వుండే అర్థం చెప్పకోవచ్చునుగాని, 'వహులనుబట్టి' అనే పంచ మ్యర్థం గ్రహించడం సముచితంకాదు. ద్వితీయను గ్రహిస్తే 'లెక్కల పుస్తకాలను ఆలోచించగా' అనే అర్థమే వస్తుంది. లెక్కల పుస్తకాలను చూడడం సబబుగాని ఆలోచించడం సరికాదు. భాషా సంప్ర దాయానికీ, వినడానికీ అది విపరీతంగా తోస్తుంది. 'ఈవులన్ వహుల్' అనే పాఠానికీ, అర్థానికీ ఇక్కడ సందర్భశుద్ధి లేదనుకోవడం పొరపాట'ని వారు నిర్ణ యించారు. కాని సామాన్యార్థ గ్రహణంలో వేదం వారు గ్రహించిన 'ఈవులన్ వహుల్ తలంచిన' అన్న పాఠమే మనకు నచ్చుతుంది. సందేహం లేదు. అయినా శ్రీ తాపీవారు మరొక్క అడుగుముందుకు వేసి తమ వ్యుత్పన్నతను ప్రకటిస్తూ 'ఈవులున్, వహుల్ తలంచిన' అన్నపాఠాన్ని గ్రహించి దానికి తగిన వ్యాఖ్యానం గావించారు. 'ఈవులున్, వహుల్ తలంచిన'—అన్నదానికి 'దానములును, వహుల్—వారి లెక్కల పుస్తకములను, తలంచిన—ఆలోచించినట్ల యితే'—అనే తాపీవారి వ్యాఖ్య సబబే! దీనికి 'దాన ములను, పుస్తకాలను (చూచి) ఆలోచించినట్లయితే' అనే అర్థం. అంటే 'చూచి' అన్న దిక్కడ అధ్యా హార్యంగా గ్రహిస్తే తప్పేమీ లేదు; పైగా అది సంప్రదాయ విరుద్ధమూ కానేరదు. కాబట్టి విశేషా ర్థాన్ని వెలికిదీసిన తాపీ వారు పొరపాటు పడ్డారను కోవడం సముచితం కాదేమో!

3. 'పైపయి కౌతుకంబు దయివాటి యిటుం డఁగ......' (1—128) అన్న పద్యంలోని 'కల కలన్ నగుచుండెడి—' అన్నదానికి తాపీవారి వ్యాఖ్య ఉచితం కాదనీ, 'అన్వయ సరళి కాదనీ' ఇక్కడి కలకల పదం అవ్యక్తత్వాన్ని తెలుపుతుంది. అవ్యక్తమైన నవ్వు, మందహాసమే అవుతుంది. అది దాతలకు దానంచేసే సమయంలో సహజమైనదే!' అని తెలిపారు. 'ఆంగీ రస'గారన్నట్లు దాతకు మందహాసం సహజమే! ఆ విష యమే తాపీవారు—మందహాస మనకపోయినా—స్పష్టం చేశారు. ఇంక 'ఆంగీరస'గారు తలచినట్లు 'కలకల' పదం అవ్యక్తత్వాన్ని తెలుపుతుందనుకోవడం ఉచితం కాదు. కలకల శబ్దం ధ్వన్యనుకరణ పదం. ఇది నన్నెచోడుని కుమారసంభవంలోని 'కలకల నవ్వు నట్లు......' (5—119); పింగళి సూరన ప్రభావతీ ప్రద్యుమ్నంలోని 'కలకల నవ్వినట్టు...' (1—138) అన్న పద్యాలలో ఉన్నట్లుగానే. అదేవిధంగా గలగల, కిలకిల—వీటన్నింటికీ వ్యక్తమైన శబ్దమే అర్థం. దానం చేసే సమయంలో ఇలాంటి వ్యక్తమైన శబ్దాన్ని తొలగించడానికే శ్రీ తాపీవారు 'కలకల' పదానికి 'కళకళ లాడుతూ'అన్న అర్థం సూచించారు. ఏతావతా 'కళకళ లాడుతూ మందహాసంతో కూడిన' అన్నది సవ్యసాచికి విశేషణం అవుతుంది. ఇందులో దోషం లేదు!

4. ప్రథమాశ్వాసం 161 వ పద్యం 'అన విని పాపపూప జవరాలెదలో వలపోపలేక...'అన్న తాపీవారి పాఠమే సముచితం. కారణం—'వలపోపలేక' — అన్న దానిలో 'ఆపలేక—అణచిపెట్టుకోలేక' అనే అర్థం మాత్రమే వస్తుంది. కాని తాపీ వారు విశేషార్థ స్ఫుర ణార్థం 'వలపోప లేక' అంటే 'వలపును సహించలేక' అనే అర్థం వచ్చేందుకే ఈ పాఠం గ్రహించారు. 'వల పాపలేక' — అను ప్రాసానుగుణమై ఉందనడంలో సందేహంలేదు; ఇది సరైనదే. కాని దానికంటె మరి కొంత విశేషార్థం చెప్పడమే ఈ పాఠం గ్రహించడం లోని పరమార్థమని తలంచాలి.

15. ద్వితీయాశ్వాసంలోని

'సీరియు నిటులా సౌనా
సీరియు నన్యోన్య సూక్తి హిత మానసులై
పోరాని కూర్మి నుండఁగ
నారాముని కడకు నంతహరి సనుదెంచెన్'
(—117)

—అనే పద్యంలో పూర్వవ్యాఖ్యాతలు 'జితమానసులై', 'సితమానసులై'—అన్న పాఠాల్ని గ్రహించి ఉండగా వాటిని త్రోసిపుచ్చి విశేషార్థ స్ఫురణార్థం శ్రీ తాపీ వారు 'హితమానసులై'—అనే పాఠం గ్రహించారు. ఇదెంతో సొగసుగా ఉందనడంలో సందేహంలేదు. కానీ ఇక్కడ 'ఆంగీరస'గారన్నట్లు యతికి గతి తప్పింది. ఇది ప్రామాదికమే. సందేహం లేదు. 'ప్రమాదో ధీమతా మపి'-అని ఉన్నది గదా? కానీ ఇలాంటి స్ఖాలిత్యాన్ని ఎత్తిచూపితే సహృదయతతో స్వీకరించగల విశాల హృదయులు తాపీవారు. ఇందుకు వారి 'విన్నపము' లోని—'ఇంకా నా వ్యాఖ్యానములో అసంతృప్తిగాని, సందేహముగాని, దోషముగాని కనబడినప్పుడు, నాకు వ్రాస్తే నేను చెప్పుకోవలసినది మనవి చేస్తాను. దిద్దుకోవలసినది దిద్దుకొంటాను. ఏవిధంగానైనా, చేమకూరకవి చమత్కారాలను ఆంధ్ర సాహిత్యపరులు సంపూర్ణంగా తెలుసుకోగలగడమే మన కందరకు వాంఛనీయము కదా?'— అన్నవారి చివరి వాక్యాలే పరమ నిదర్శనం!

ఈ విధంగా వినయం, విశాలదృక్పథం, సహృదయత గల శ్రీ తాపీవారు—శ్రీ 'ఆంగీరస'గారు భావించినట్లు—కేవలం ఇతర వ్యాఖ్యాతలను ఆక్షేపించడానికే విశేషార్థాలు చూపి, పాఠాంతరాలు గ్రహించారనుకోవడం ఏమాత్రం భావ్యం కాదన్న విషయం సహృదయ హృదయైక వేద్యం! పై పరిశీలన వలన ఇది స్పష్టం! పది దశాబ్దాలుగా బహుధా పరిశ్రమించి తాపీవారు కావించిన 'హృదయోల్లాస వ్యాఖ్య'లో తాము సముచితమైనదని భావించి ప్రతిపాదించదలచినప్పుడు తత్పూర్వ వ్యాఖ్యాతల అభిప్రాయాల్ని—ముఖ్యంగా సమంజసం కాదని తలంచినప్పుడు—అనగా కవి హృదయావిష్కరణ కుపకరించనప్పుడు—కాదనడంలో దోషం లేదు. అది అధిక్షేపణా కాదు. ఉన్నవాటికి మరికొన్ని విశేషార్థాలను—ఉపజ్ఞతతో చెప్పినప్పుడు వాటిని మనం సహృదయతతో స్వీకరించడం సముచితమేమో! మరి సహృదయత సాహిత్యపరులకు అపరిహార్యగుణం కదా?



## కలగూరగంప :

# "నవకుసుమితా......."

**1972** అక్టోబరు భారతిలో కలగూరగంపలో శ్రీ కాశీభొట్ల సత్యనారాయణగారు 'చిర శ్రాంతో దూరాత్...' అనే శ్లోకంలో 'నవకుసుమితా' అనీ, 'నహి నహి నహి' అని మూడుసార్లు అనడానికీ నర్మగర్భితమని వారు అనుకున్న వివరణను చూచాను.

కుసుమ శబ్దానికి స్త్రీ రజస్సు అనే అర్థం అమరకోశంలో కనబడలేదు. విశ్వమేదినీత్యాది కోశాలలో ఉన్నదేమో పరిశీలించాలి. పుష్పశబ్దానికి స్త్రీ రజస్సు అనే అర్థం ప్రసిద్ధమే కాని, పుష్పశబ్ద పర్యాయ పదములన్నింటికీ ఈ విభిన్నార్థాలు ఉండవు కదా! పుష్పవతి, పుష్పావతి అనే పేరులు, విశేషణాలూ ప్రసిద్ధములు కాని, కుసుమవతి అని ఈ అర్థంలో వినలేదు. కనుకనే 'పుష్పితాగ్ర లతిక' అని ఈ నర్మాన్ని సూచించాలనే ఉద్దేశంతోనే కావాలనే ప్రయోగించాను నా అనువాదంలో.

అమరకోశంలో లేకపోయినా శబ్దరత్నాకరం లోనూ, దానికి మక్కీకి మక్కీ అయిన వావిళ్లవారి సంస్కృతాంధ్ర నిఘంటువు లోనూ కుసుమశబ్దానికి స్త్రీ రజస్సు అనే అర్థంకూడా వ్రాసి ఉన్నది కానీ, అవి ఎంతవరకూ ప్రమాణములో నిర్ణయించాలి.

ఆధునిక నిఘంటు ప్రమాణాన్ని అంగీకరించి, కుసుమశబ్దానికి రెండో అర్థాన్ని మాట వరసకి ఒప్పుకుందాం. అయితే 'నవ కుసుమిత' అంటే ఏమి అర్థం? కొత్తగా, మొదటిసారిగా, పెద్దమనిషి అయినది అనికదా! ఆమె ముగ్ధ అయి ఉండాలి. మూడు రోజుల తరవాత ప్రియా సమాగమానికి తాను పనికి వస్తాననే టంత పరిజ్ఞానం ఆమెకి ఉంటుందా? కొందరు కుశాగ్రబుద్ధులకి ఉంటుందేమో మరి!

'అసలు ఈ మూడు రోజుల లెక్క ఎవరు వేసినది?' అన్నాడు నా మిత్రుడొకాయన ఆ ఉత్తరాన్ని, దానికి నేను ఇంతవరకూ వ్రాసిన సమాధానాన్నీ చూచి. అతడి కళ్లల్లో కొంటెతనం దాగడం లేదు.

'తిస్రో రాత్రీర్వ్రతం చరేత్' అని కృష్ణ యజుర్వేదంలో 'విశ్వ రూపో వై త్వాష్ట్రః' అనే అనువాకంలో ఉంది లేవోయ్—అన్నాను నేను.

అంతేకాదు

ప్రథమేఽ హని చండాలీ
ద్వితీయే బ్రహ్మ ఘాతిని
తృతీయే రజకే ప్రోక్తా
చతుర్థేఽ హని శుద్ధ్యతి
చతుర్థేఽ హని శుద్ధాస్యాత్
భర్తుః సంభోగ కర్మణి

అని ఋషి పంచమీ వ్రతకల్పంలో ఉంది అన్నాను.

'ఈ ఛాందసపు లెక్కలూ డొక్కలూ నేను నమ్మను. పండిత రాయలు అసలే నమ్మడు' అన్నాడు నా మిత్రుడు ఒక్కమాటలో అంతా కొట్టిపారేసి.

నేను చటుక్కున కాశీభొట్లవారి పక్షం అయిపోయి నా మిత్రుడిని ఎదుర్కొన్నాను.

అయితే నహి నహి నహి అని మూడుసార్లు ఎందుకు ప్రయోగించాడు అంటావు?' అన్నాను.

'ఛందస్సు కోసం.'

'అబ్బే. పండిత రాజుకి ఛందస్సు అడ్డు వస్తుందా?'

'అల్లా అయితే శివతాండవ స్తోత్రంలో ధగద్ధగ ద్ధగ జ్జ్వ లల్లాట పట పావకే అని మూడుసారు

ధగధగ మనిపించాడు కదా, దాని అర్థం ఫాలాక్షుని మూడో కన్ను ముచ్చటగా మూడుసార్లు మాత్రమే మెరిసి ఆరిపోయిందనా? దానిని తెలుగులో వ్రాసి నప్పుడు ధగధగమని రెండుసార్లు వ్రాయడమే మర్యాద.'

'అంతే నంటావా?'

'అంతేకాదు, వద్దువద్దు అని రెండు రోజుల తర్వాత రమ్మనే వ్యగ్రత్వమే బాగుంది సుమా!' అన్నాడు నా మిత్రుడు.

శ్రీ మహీధర నళినీమోహన్.

## పండితరాయల కారణ కల్పనలు

'భారతి' సెప్టెంబరు 1972 సంచికలో పండిత రాయల కారణ కల్పనలు అనుశీర్షిక క్రింద డా. మహీధర నళినీమోహన్ గారిచ్చిన కారణ కల్పనలు మనోహరముగా నున్నవి.

ఈ క్రింది పరామర్శను ప్రకటింపగలరు.

'వీణాప్యేక గుణేన...సంభావ్యతే' అను శ్లోకమునకు తెనిగింపులోను డా॥ మహీధర నళినీమోహన్ గారి వివరణములోను, ముత్యాల రాశులు వీణకు పొదుగుతారు అని చెప్పబడినది. వీణకు ఎక్కడయినను ముత్యాలతో నలంకరణ జరుగునా? మూలశ్లోకములో ఆ అర్థము లేదు. గుణము (తీగ, దారము) లేనియెడల ముత్యాలరాశి కూడ (ముత్యాల హారముగా నుండదు గావున) యువతి కుచ కుండల పరిరంభమునకు చాలదు. గుణము గలది గావున వీణ ఆ పని చేయగల్గినది. గుణములేని నాడు ముత్యాలరాశి కూడ ఆ పనిచేయ జాలదు అని యే మూలమందు కలదు.

శ్రీ వి. ఏ. కుమారస్వామి

## పండిత రాయల చివాట్లు

1972 అక్టోబరు భారతిలో డా॥ మహీధర నళినీమోహన్‌గారు రచించిన 'పండిత రాయల చివాట్లు' అన్న వ్యాసం చూసి సందేహ నివారణార్థం ఈ లేఖ వ్రాస్తున్నాను.

పండిత రాయలు హరిదీక్షితుల వారిమీద చెప్పిన అన్యాపదేశ చాటువులో కరిపోత! అన్న సంబోధన ఉంది. దీనిని నళినీమోహన్‌గారు కరిపిల్లా అని అనువదించారు. భాషపై వ్యాకరణ ప్రభావం మాట అటుంచి, శ్రవణపేయం అనే గుణం శబ్దానికి ఉండాలి కదా! ఈ మాట వింటే గూబకి గొడ్డలి దెబ్బలా లేదా! వ్యాకరణ విషయంగా ఆలోచించి దీనిని మిశ్రమ సమాసం అంటే అనవచ్చు. కాని మిశ్రమ సమాసంలో తెలుగు తత్సమ శబ్దాలలో ఏదో ఒకటి ముందుండ వచ్చు. ఇక్కడ కరిశబ్దం తత్సమమన్నైన సంస్కృతమైనా ఒకలాగే ఉంటుంది. అందుకే అచ్చపు తత్సమ శబ్దమైన రాజు ముదల ఇత్యాదుల లోని శబ్దసారళ్యం ఇందు లేదు. కనుక కేవల వ్యాకరణ రీతినే కాక శ్రవణపేయం అనే గుణాన్నికూడ మనం చూడాలేమో అనిపిసుంది.

అలాగే వెంకటశాస్త్రి ఎవతె దగ్గరకో వెడితే రాయలు దానిమీద చెప్పిన చాటువులో 'సరజస్కాం' అని కేతకీద్వయానికి అనువదించేలా ఒక విశేషణాన్ని వాడేడు. అనువాదంలో ఆ మాటకు 'బహు రజోవతి' అని ఉంది. ఇది కేతకీ పుష్పార్థంలో విశేష ఔచిత్యంతో ప్రకాశించింది. కాని, కేతకీ వనితార్థంలో అందగింపలేదు. ఒక వనిత ఆ క్షణంలో బహు రజస్వల కాదు గదా! ఇక్కడ సమర్థనకి అందంలేదు కదా. ఇలాటి వాటినే క్షేమేంద్రుడు విశేషణ అనౌచిత్యం అంటాడు. ఇక్కడ అనువాదకుని దృష్టి పువ్వు మీదేగాని పూబోడిమీద లేకపోవటంవలన ఈ ప్రమాదం జరిగి ఉండవచ్చు.

అలాగే కనకలాక్ మీద చెప్పిన ఒక చాటువులో ఖడ్గమృగాన్ని నిందుస్తూ 'మహిష ఇవ చతుష్పాజ్జంతు రేవాసి' అని అంటాడు. దీనికి అనువాదంలో 'మహిషమ్మును బోలె నాల్గు పాదమ్ముల క్రూర జంతువవు' అని ఉంది. ఇక్కడ వాక్య నిర్మాణక్రమం ఉండంగా లేదు. ఈ వాక్యమునుబట్టి నాల్గుపాదములు గల మహిషముకూడ క్రూరజంతువే అని తోస్తుంది. మూలంలో క్రూర అనే విశేషణమే లేదు. పైగా చతుష్పాజ్జంతు రేవా అన్న తరువాత అవ్యవధానంగా

అసీ అనే క్రియ ఉండుటచేత ఇటువంటి ప్రమాదం సంభవింప లేదు. బహుశా ఇది క్షేమేంద్రుని వాక్య నౌచిత్యం వంటిదేమో. కనుక, సరళభాషతో చక్కని అనువాదం చేస్తున్న నళినీమోహన్‌గారిని ఈ ప్రమాదాలనుకూడ నిర్మూలించి నిర్దుష్టం చేయమని కోరుతున్నాను.

శ్రీ శిఖోట సత్యనారాయణ.

## పొరపాటు

**1972** అక్టోబరు 'భారతి' సంచికలో 'పండిత రాయల చివాట్లు' అనే వ్యాసంలో శ్రీ మహీధర నళినీమోహన్ చాలా విషయాలను గురించి తెలియ పరచారు. ఆ వ్యాసంలో శ్రీ వత్సవాయ తిమ్మ జగపతి రాజు గారికి సంబంధించిన 'ఆమూలాగ్ర నిబద్ధ కంటక తనుః' అనే శ్లోకం ఇచ్చారు. తిమ్మకీ—తుమ్మకీ సంబంధం సముచితమే! కాని తిమ్మ జగపతిరాజుగారు విజయనగర సంస్థాన ప్రభువు కారు. పెద్దాపుర ప్రభువు. అప్పటి విజయనగర ప్రభువు విజయరామ గజపతి. జగపతు లెప్పుడూ విజయనగరాన్ని పాలించ లేదు.

శ్రీ బు. వేం. రమణయ్య.

## ఆదేశ శబ్దార్థ వివేచనము

శ్రీ ముదిగొండ ఈశ్వర చరణ్‌గారు పై శీర్షికతో 1972 అక్టోబరు భారతిలోఁ బ్రకటించిన వ్యాసము చూచిన తర్వాత నాకుఁ గలిగిన యభిప్రాయము నిట నుల్లేఖించు చున్నాఁడను.

వ్యాసకర్తగారా వ్యాసములో 'ఆదేశ' శబ్దమును బాలవ్యాకరణ కర్త సూత్రములలో నేమి, వార్తికములలో నేమి, వివరణ వాక్యములలో నేమి యెన్నిమాఱులు ప్రయోగించినాఁడో వివరించుట సముచితమే కాని, 'ఆదేశ' శబ్దమునకు వారు పేర్కొనిన విశేషార్థము సమంజసముగ లేదు. 'ఆదేశో నామ శబ్దాన్తరస్య స్థానే విధీయమానం శబ్దాన్తర మభి ధీయతే' అని మల్లినాథ సూరిచే రఘువంశమునందలి 12 వ సర్గము 58 వ శ్లోకముయొక్క వ్యాఖ్యాన సందర్భమున 'ఆదేశ' శబ్దార్థము పేర్కొనఁబడినది. 'శత్రువ దాదేశః' అను దాని తాత్పర్యము నిదియే. చిన్నయ సూరి యభిప్రాయము గూడ నిందులకు భిన్నముగ లేదు.

'అర్థభేదమును గూర్చునది యాదేశ మనుట సూరికి సమ్మతము కాదు.' అని వ్యాసకర్తగారు నుడివినారు. ఆదేశ మర్థభేదమును గూర్చుట వ్యాకరణ శాస్త్రమునఁ గానరాదు.

వ్యాసకర్తగారు తమ వ్యాసములో 'ఇఁక స్థూల దృష్టికి నా దేశములుగాఁ గానుపించు కార్యములు పెక్కులు గలవు.' అని 'ఇమి వర్ణకంబు కలుగ్వాదుల కగు.' 'తజ్ వర్ణకంబు చేయ్యాదులకగు' అను సూత్రముల నుదాహరించి 'కలుగు—కలిమి; చేయు—చేఁత'— ఇట్లుదాహరణముల నిచ్చి యున్నారు. కాని యిచ్చట ఇమి, తజ్ వర్ణకంబు లాదేశములే కావు. గ స డ దవలు, గ జ డ ద బ లు మున్నగువానివలె నివి స్థూలదృష్టికిఁ గూడ ఆదేశములుగఁ గానుపింపవలసిన యావశ్యకత లేదు. కృదంత పరిచ్ఛేదమునందలి ఇమి, తజ్ మున్నగు వర్ణకంబులు కృత్తులు.

'ధాతువునకు' అను క్రియా పరిచ్ఛేదమునందలి యధికార సూత్రము కృదంత పరిచ్ఛేదమునందును అనువర్తించును. కాఁగా, కృదంత పరిచ్ఛేదమునందు విధింపఁబడు కృత్ప్రత్యయములు ధాతువు కంటెఁ బరముగ భావకర్తృకర్మాద్యర్థ విశేషములలో వచ్చును.'ఇమి వర్ణకంబు కలుగ్వాదులకగు.' 'కలుగు + ఇమి' అని యుండఁగా 'ఇట గృత్కగతప వేములు పరంబులగునపుడు క గ చ య వలకు లోపంబగు'— అను సూత్రముచే 'కలిమి' అను రూపము సాధ్యమగును. ఇట్లే చేయు—చేఁత; ఆఁగు - ఆఁక; ఆడు—ఆట మున్నగువవి యా యా సూత్రములచేఁ బ్రక్రియానుసారము సాధ్యములు. పేరు + ఇమి=పేరిమి,—ఇచ్చట 'క గ చ య వ' లలో నేదియు లేదు గావున నట్టిది జరుగ లేదు. కావున 'ఇమి, తజ్' మొదలైన కృత్ప్రత్యయములు వీనికిని ఆదేశములుగ విధింపబడునవి కావని స్పష్టమగుచున్నది.

పర్యాలోచింపఁగా బాల వ్యాకరణమునందలి 'ఆదేశ' శబ్దమునకుఁ బూర్వ వ్యాకరణములలో నిర్వ చింపఁబడిన దానికంటెఁ బ్రత్యేకార్థ మేమియుఁ గాన వచ్చుట లేదని మనవి. విజ్ఞులు పరిశీలింపఁ బ్రార్థన.

శ్రీ గిద్దలూరు చెంచుబసవరాజు.

## 'ఆదేశ' శబ్దార్థ విచారణ

1972 అక్టోబరు 'భారతి' సంచికలో 'ఆదేశ' శబ్దార్థ వివేచనము'ను జదివిన తర్వాత విది వ్రాయవలసి వచ్చినది. శ్రీ పరవస్తు చిన్నయ సూరి పద్యాంధ్ర వ్యాకరణము, సూత్రాంధ్ర వ్యాకరణము, శబ్దశాసనము, శబ్దలక్షణ సంగ్రహము వను నాలుగు లక్షణ గ్రంథములను రచించి సిద్ధ హస్తుఁడయిన పిదప; 'బాలవ్యాకరణము'ను రచించి 1858 లోఁ దొలుతగాఁ బ్రచురించెను. చిన్నయ సూరి శబ్దచింతామణి వికృతి వివేకకారులు తీర్చిదిద్దిన సాంప్రదాయిక మార్గమునఁ దన పరిశ్రమకు సార భూతముగా బాలవ్యాకరణమును రచించి యుండుటచే, వెలువడిన దాది యది యవిచ్ఛిన్నముగఁ బఠన పాఠన ములలో నిలిచి యాంధ్ర భాషాధ్యేతలకుఁ గరదీపిక య్యైనది.

బాలవ్యాకరణమునకు శేషగ్రంథముగ 'ప్రౌఢ వ్యాకరణము'ను, సంస్కృతానువాదముగ శిష్టుకృష్ణ మూర్తిశాస్త్రిగారి 'హరికారికలు'ను వెడలి యొక విధ ముగ దానికీర్తిమూర్తి నుద్దీపింపఁ జేసినవి. తదుపరి 'గుప్తార్థ ప్రకాశిక' మొదలు 'ఘంటాపథము' వఱకుఁ బెక్కు వ్యాఖ్యానములు రచింపఁబడి బాలవ్యాకరణము ప్రామాణికతను బెంపొందించినవి. బాలవ్యాకరణమున గ్రహింపఁబడిన సంజ్ఞలలోఁ బెక్కులు పాణినీయములు, కొన్ని శబ్దచింతామణీయములు, మఱికొన్ని యాథర్వ ణీయములును గలవు. అవికాక సూరి స్వోపజ్ఞము లైన సంజ్ఞలు ద్రుమంతము, త్రికము, ముజ్ఞు, ముత్తునని నాలుగు మాత్రమే. లాట్టు, లూట్టు, లజి వంటివియు మఱికొన్ని కలవు.

సూరికిఁగల పాణినీయ సంస్కార బలము వలన— 'అతివారము, అతిదేశము, నిపాతము, ప్రత్యాహారము; ఉత్తమము, ఉపోత్తమము, బహుళము' మున్నగు సంజ్ఞలు, పరిభాషలు, నియమములు పెక్కులు బాల వ్యాకరణమునఁ జొచ్చినవి. వాని నన్నింటిని సమన్వ యించు కొననిదే బాలవ్యాకరణమంత 'సుఖ సుఖాల' బోధ పడునది గాదు. 'అపనుక్తస్య కార్యస్య వక్తా... ...' అని కవి యథర్వణాచార్యులు వక్కాణించిరి!

'ఆదేశ' మనునది యొక పాణినీయ సంజ్ఞ. ఆఙ్ పూర్వకమైన 'దిశ్' ధాతువునకు ఘఞ్ ప్రత్యయము చేరి 'ఆదేశ' మయినది. 'స్థానివ దాదేశోఽనల్విధౌ' అని పాణినీయము దీనిని నిరూపించినది. ఒకదాని స్థాన మున వచ్చిన మఱియొక వర్ణాదికమునకు 'ఆదేశ'మని వ్యాకరణమున సంజ్ఞ. (సూర్యారాయ నిఘంటువు.)

'ధాతోః స్థాన ఇవా దేశం
సుగ్రీవం సన్న్యవేశయత్' (రఘు–12–58)

అని కాళిదాసు తన రఘువంశ కావ్యమున సహృదయ రంజకమైన యొక యుపమలో నాదేశ సంజ్ఞ నుప యోగించినాఁడు. అథర్వణాచార్యులు 'ఆదేశః కేవలా శ్చైషాం...' 'ఆదేశస్యవి దున్మిత్...' ఇత్యాదిగాఁ దన వికృతి వివేకమునఁ బెక్కు కారికలలో 'నాదేశ' కార్యమును బ్రయోగించి నాఁడు. బాల సరస్వతీయమున 'శత్రువ దాదేశః. మిత్త్రవదాగమః' అను వ్యాకరణ న్యాయ ముద్ధ రింపఁబడియున్నది. 'ఆదేశ' శబ్దము పుంలింగమే. కావున 'శత్రువదాగమునం ఆదేశమ్' అనుట దాకరము లేదు. అప్పకవియు నాదేశసంజ్ఞను (అప్ప. 5 వ ఆ.19) స్పష్టముగా వివరించియున్నాఁడు. శత్రువు వలెఁ ద్రోసి వచ్చియాస్థానమునఁ జేరునది యాదేశము అనియు, పాలమున నూర్ద్ధ్వపుండ్రము వలె నదనముగాఁ జేరునది యాగమములనియు 'స్థానే శత్రువ దాదేశా, ఫాలే పుండ్రవ దాగమాః' అని ప్రాచీనులవివరణ.

ఇష్టరూప సిద్ధికయి, ప్రకృతి ప్రత్యయాదుల విభజనము చేసి, లోపాగమాదేశ వికారాది కార్యములను వైయాకరణులు సాధించు చుందురు. రూపసాధనకయి యాదేశములను విధించుటలోఁ బ్రకృతికి విధించు టయు, ప్రత్యయమునకు విధించుటయునని

రెండుతెఱఁగులు కలవు. 'తే, తేరులు లెచ్చున కగు' (క్రియా—93) అని 'తెచ్చు' అను ప్రకృతికి, తే, తేరు — అనునవి పర్యాయమున నాదేశింపఁబడినవి. 'లకారంబునకు డుఁ ఙు వురును ముఙ్గు'(క్రియా—8) అని ప్రత్యయ లకారము స్థానమున డుఁ జాదు లాదేశింపఁ బడినవి. ఒకొకప్పు డాదేశము లేక దేశమునకు విధింపఁ బడుట గాని, సర్వాదేశమగుట గాని జరుగు చుండును. సంధి కార్యాదులు జరుగు నపుడు పూర్వ పరములలో నెద్దాని కైన నాదేశ విధానము జరుగ వచ్చును! 'గ స డ ద వా దేశము' పర పదమునను; 'పుంప్వా దేశము' పూర్వ పదమునను జరిగినవి.

బాలవ్యాకరణమున 'ఆదేశ' శబ్దము సూత్ర ములలోఁ బదితావు లందును; వివరణ వాక్యములలోఁ బదునాఱు తావులందును (క్రిందటి వ్యాసకర్త పేర్కొనిన పదునాలుగు తావులలోనేకాక— తత్సమ—63 వృత్తిలోను, ఆచ్ఛిక—31 వివరణము నందును) ప్రయుక్తమై నది.

చిన్నయ సూరి ఫక్కి గంభీరమయినది. రవంత యేమఱుపాటు చూపినఁ గొండంత విషయము దాఁటి పోవును. 'ఐకారం బీ తుల్యంబు' (తత్స—65) 'బల్లి దాదులు సంస్కృత తుల్యంబులు' (ఆచ్ఛి3.) మున్నగు పెక్కు నతి దేశ సూత్రములు వ్రాయఁ బడినవి. ఆ సూత్రము లందతి దేశమని నిర్దేశము లేకున్నను, ఇతర స్థలములందుఁ జూపిన 'అతి దేశ' వివరణమును బట్టి పూర్వోక్తసూత్రముల యొద్దఁగూడ 'అతి దేశ' కార్య ములు చేసికొనఁ బడుచున్నవి. 'ప్రథమమీఁది పరుష ములకు గసడదవ లగు' (సంధి—13) నను సూత్ర మున 'ఆదేశ'మని లేకున్నను; 'అతఁడు వలికె' నిత్యాదు లందున్న పాదేశ వకారమని (సంజ్ఞా—18 వృత్తి) పేర్కొని పరుషముల స్థానమున గసడదవ లు వచ్చుట యా దేశమే యని బోధించినాఁడు. 'ద్రుతప్రకృతికము మీఁది పరుషములకు సరళములగు' (సంధి—16) నని విధించి, వెన్వెంటనే 'ఆదేశ సరళములకు ముందున్న...'(సంధి—17) అని సూత్రారంభము చేసి పై సూత్రమున విధించినది 'గజడదబాదేశము' సుఁడీ యని చెప్పుచున్నాఁడు. వీనిని బట్టి [illegible] పేర్కొని నను జేర్కొన కున్నను, 'ఆదేశ' కార్యము జరుగు తావులను సాంప్రదాయికముగా గ్రహించునది యని సూరి తాత్పర్యము. వాస్తవ మిట్లుండ, 'ఝణ్ణా' మైన సామాన్యార్థమునఁ గాక విశేషార్థమున సూరి దీనిని వాడి యుండెననుటకు హేతువు కాన రాదు.

'స్థూలదృష్టికి నాదేశములయిగాఁ గనిపించు కార్యములు పెక్కులుగలవు' అని కృదంత పరిచ్ఛేదము నందలి—కలుగు—కలిమి, చేయు—చేత—మున్నగు స్వరూపాసిద్ధముల నుదాహరించి, '...అర్థభేదమును గూర్చినది యాదేశమనుట సూరికి సమ్మతముకాదు' అని వ్యాసకర్త నిర్ణయముచేయుట సోపపత్తికముగా లేదు. 'ఇమి' వర్ణకంబు, 'తజ్వర్ణకంబును నా యా ధాతువులకుఁ జేరిన వనుచుండఁగా; 'కలుగు— కలిమి' 'చేయు చేత' అర్థ భేదము నరయ నగునని హెచ్చరిం చుట;–'రాము— రాముచేత' ఇట్టియెడ రూపభేదము మాత్రమే కాక యర్థ భేదమునుగలదు కావుననే యిట్టి యెడ సూరి యాదేశ శబ్దమును గూర్పలేదనుటవంటిది. ప్రకృతికిని, ప్రత్యయ సహితమైన సిద్ధరూపము నకును నర్థభేద మెచ్చటనైన గోచరించును. 'ఇమి' 'తజ్' మున్నగు ప్రత్యయముల నా దేశములని యెవ్వ రనిరో తెలియదు. 'ఆ దేశము'లగుచో నేని స్థానమున వచ్చినవి? ఆ దేశములు కానిచో వానిని బట్టి 'ఆదేశ' శబ్దమునకు విశేషార్థమును రాఁబట్ట యత్నించుట యేల?

'స్థాన్యర్థాభి ధాన సమర్థస్యైవా దేశతా' అని సిద్ధాంతము. ఒకానొక యాదేశ విధానమున వలయుచో నర్థవిశేష ద్యోతనమును వ్యాకర్త యుద్దేశింప వచ్చును. ఆ దేశ శబ్దార్థము దానికి బాధకము కాదు. వ్యాస విస్తరభీతిచే గొన్ని యుదాహరణములు మాత్రమే యియ్యఁబడు చున్నవి. 'అమహదర్థంబు నందు డుఁ ఙు లకు దువులగు నున్నాను బంధంబు మీఁద దివి యగు' (క్రియా—12) అని దుజ్ — రు ల స్థానమున దు—వు ల యాదేశము జరిగినది. 'వండఁడు—వండదు' అనువానికిఁగల యర్థభేదమును గమనించు నది. ఈ

'దు' ఆ దేశము కాదందువా? 'లిడ్లాట్టుల డుజ్జున కెను ను వర్ణంబు లగు' (క్రియా 19) అని 'లిడాదేశంబగు డుజ్జునకు—ఎను—అనునదియు, లాడా దేశంబగు డుజొనకు—ను—అనునదియు నా దేశంబులగు' నని 'డుజు' స్థానమున వచ్చిన ప్రత్యయాంతరమును 'ఆ దేశమని సూరి కంఠోక్తిగా నాదేశించుటను గుర్తించు నది. 'అమహదర్థంబునందు' — అని సూత్రకర్త యెలుఁగెత్తి చెప్పుచుండ, 'దు—వు లాదేశములే గాని యర్థభేదము లేదనుట యెట్లు?

కలుగు ధాతు వునకు—అస్త్యర్థము, ప్రాప్త్యర్థము రెండును గలవు. 'కలుగు' న కస్త్యర్థంబునందు లట్టు పరంబగునపుడు కలయగు. (క్రియా—104). ఇది యాదేశము కాదందువా? ప్రక్కసూత్రము ననే 'కలా దేశం' బని పేర్కొనఁ బడినది. కావున— కలుగునకు లట్టు పరంబగునపుడు 'అస్త్యర్థంబు నందు మాత్రమే 'కల' యాదేశమగుచున్నది. 'నిందయం ద్రామ్రేడి తంబు నాద్యక్షరంబులకు హ్రస్వ దీర్ఘంబులకు గిగీల గు' (ప్రకీ—22) ఈ గి, గీల యా దేశము నిందార్థము నందే యగు నని 'కుంభకర్ణుఁడు—గింభ కర్ణుఁడు; రావణుడు—గీవణుఁడు' అని సూరి క్రోడ పడుచుండఁగా—'.. అట్టిదానిచేత నర్థభేధము సైతము గలుగ రాదనుటయే సూరి యాశయమనుటకు 'అస్కా రము' లేదు.

కావున— 'ఆదేశ' శబ్దార్థమర్థభేద వివక్షా నిరపేక్షమనియు; ఆదేశమను సంజ్ఞను వ్యాకరణ శాస్త్ర ప్రహతమగు నర్థముననే సూరి ప్రయోగించె ననియు; ఆదేశము వచ్చునపుడు వలయుచోఁ గ్వాచిత్క ముగాఁ గొంత యర్థభేదము సైతము గలుగుట సూరి కభిమతమే యనియు స్పష్టమగుచున్నది.

శ్రీ పరాశరం గోపాలకృష్ణమూర్తి.



# గ్రంథవిమర్శలు

## ఆంధ్రదేశ చరిత్ర— భూగోళ సర్వస్వం

(సంపాదకులు — ఖండవిల్లి లక్ష్మీరంజనం ఎం. ఏ., వెల: 25 రూపాయలు, ప్రచురణ—ఆంధ్ర రచయితల సంఘం, హైదరాబాదు)

ఆంధ్ర రచయితల సంఘం, హైదరాబాదు వారు—'ఆంధ్రదేశచరిత్ర—భూగోళ సర్వస్వం' సంకలనంచేసి, ప్రచురించ సమకట్టడం చాల ప్రశంసనీయం. ఇప్పుడు మొదటిసంపుటం వెలువడింది.

రమారమి నూరేళ్లుగా ఆంధ్రదేశ చరిత్రాంశాల్ని వెతికి వెలికి దీసే ప్రయత్నం సాగుతూంది. తెలుగు వాడికి తెలుగుమీదకన్న సంస్కృతం మీద మోజు ఎక్కువగా వుండడం, ఆమోజు మూర్ఖంగా తయారయి వూళ్లపేర్లూ, ఇంటిపేర్లూ వ్యవహారంలో వున్న వాటిని వదలి, సంస్కృతీకరించే దురలవాటు ఏర్పడడంతో అసలే అంతంతగావున్న మనదేశచరిత్రాధారాలు మరింత గంద్రగోళం అయాయి. దానికి ప్రాంతీయ దురభిమానాలు తోడయి పోతన ఒంటిమిట్టవాడా, వరంగలు వాడా, శ్రీనాధుడు నెల్లూరు వాడా, గుంటూరువాడా అన్న కుస్తీలు బయలు దేరి మరింత గాడిద గత్తర చేశాం. అయినా ఎందరో పాశ్చాత్య చరిత్రకారులూ, ఆంధ్రదేశ చరిత్రకారులూ కూడ విశేషశ్రమకోర్చి అనేకానేక అంశాలు బయటకు లాగేరు. వానిని ఎప్పటి కప్పుడు ఏవేవో పత్రికలలో వ్యాసాలుగా ప్రచురించేరు. కాదాచిత్కంగా పుస్తకాలు గానూ వెలువడ్డాయి. అయితే ఏవిషయం తేలింది? ఇంకా తేలవలసిం దేమిటి? మొదలైనవి కొత్తవాళ్లు తెలుసుకోడం అసాధ్యమయిపోయింది. దేశచరిత్రమీద ఇతోధిక పరిశోధన జరగాలన్నా ఇంతవరకు జరిగిన కృషి ఫలితాన్ని ఏకత్రచూపే సంకలన గ్రంథం—సర్వస్వం—లేకపోవడం పెద్దలోటుగానే వుంది. చేసిన పనేచేస్తూ కాలం, ధనం దుర్వ్యయం కాకుండా చెయ్యాలంటే ఇటువంటి సర్వస్వం కావలసి వుంది. ఆ లోటును భర్తీచేయబూనుకొన్నది ఆంధ్రరచయితల సంఘం. వారికి నా ధన్యవాదాలు.

ఈ మాదిరి ప్రయత్నం ప్రారంభంలోనే సమగ్రంగా వుండడం సాధ్యమయ్యే పనికాదు. దాని పరిమితులు దానికుంటాయి. సాధన లోపం. మనుష్య లోపం. ఎన్నో. వానిని క్రమేణా దిద్దుకోవలసిందే. దిద్దుకొనేందుకు నిర్మాణాత్మకము అయిన సూచనలివ్వడం మన కర్తవ్యం.

ఈ గ్రంథంలో చరిత్ర—భూగోళ ప్రాధాన్యత గల ప్రదేశాలను గురించి చెప్పడంలో ప్రతిచోటా అనవసరమైన పునరుక్తి ఏర్పడి స్థలాన్ని మింగేసింది. ఉదాహరణకి అద్దంకి, అనంతపురంవంటివాని భౌగోళికాంశాలకూ, చారిత్రకాంశాలకూ వేర్వేరు వ్యాసాలు వ్రాయడంవలన కొన్ని అంశాలు పునరుక్తం అవుతున్నాయి. రెండు భాగాలుగా పుస్తకం విభజితం అయి వుంటే ఇది తప్పదు. కాని ఒకే చోట వరసలో వ్రాస్తున్నప్పుడు ఈ పునరుక్తినుంచి బయటపడడం కష్టం కాదు. పుటలు చాలా కలిసి వస్తాయి.

కొన్ని ప్రదేశాలకు ఇవ్వవలసిన ప్రాముఖ్యం, వివరణ, విశేషాలు ఇవ్వబడలేదు. ఉదాహరణకి—అంబాజీపేట. అమలాపురం తాలూకా వివరణలో ఈ వూరును పేర్కొనడం, అయిదారు పంక్తులు వ్రాయడం జరిగింది.కాని, వానిలో దీనికిగల ప్రాముఖ్యం ద్యోతకం కావడం లేదు.

అంబాజీపేట గోదావరి సెంట్రల్ డెల్టాలో కీలకమైన రహదారుల కేంద్రం. 15–20 వూళ్లకి అతిముఖ్యమైన సంత ప్రతి బుధవారం జరుగుతుంది. అదే రోజున పెద్ద పశువుల సంత వుంటుంది. తూర్పు, పశ్చిమ గోదావరులలో జరిగే ప్రధానమైన పశువుల సంతలలో అదొకటి. ప్రతి వారం కొబ్బరి సంత ఒకటి జరుగుతుంది. డెల్టాలో ప్రధానమైన వాణిజ్య పంటలలో కొబ్బరి ముఖ్యం. దాని ధరల నిర్ణయం ఈ సంతలో తేలుతూంటుంది.

ఈ దృష్ట్యా దీనికి గల ప్రాధాన్యాన్ని సర్వస్వంలో చూడం.

ఇక్కడనే మరొక విషయం చెప్పాలి. అరుణాచల క్షేత్రం గురించి ఈ సర్వస్వంలో పేర్కొనడం అనుచిత మనాలి. అది తమిళదేశంలోనిది. వ్యాస ప్రథమ వాక్యంలోనే ఆ సంగతి వుదాహరించేరు. మరెందు కిది ఈ సర్వస్వంలోకి వచ్చినట్లు? సరిహద్దులోని భారత భూభాగాలను పాకిస్తాన్, చైనాలు తమ దేశ వర్ణాలలో చిత్రించి నందుకు మనం అభ్యంతరం చెప్పేం. అరుణాచల క్షేత్రం మీద భక్తీ, రమణ మహర్షిమీద తాత్పర్యం వుండడంలో తప్పు లేదు. కాని 'ఆంధ్రదేశ చరిత్ర—భూగోళ సర్వస్వం'లో దానికి స్థానం లేదు. ఇటువంటివి అశ్రద్ధ చేయవలసిన విషయాలు కావు. ఇరుగు పొరుగుల మధ్య తంపులు తెచ్చే కొరవులు ఇల్లాంటివే.

ఇంతకన్న చాల అభ్యంతరకరమైనది—కేవలం రచయిత భయం, ప్రాతికూల్యంతో ఇటీవలి తెలుగు దేశ చరిత్రకు సంబంధించిన వాస్తవాన్ని కప్పిపుచ్చిన ఘట్టం సంపాదకుల దృష్టికి తీసుకురాదలచేను. ఇది 'అంజుమనె ఇత్తెహాద్ ముసల్మీన్' వ్యాసంలో విషయం. ఈ సంఘం 1947 లో రజాకారు సంస్థను నిర్మించింది. దానిలోకి నైజాం సంస్థానంలోని ముసల్మాను యువకుల్నే గాక, పైనుంచి కూడా రిక్రూట్‌చేసి తెచ్చింది. అరబ్బులూ, రోహిల్లాలు కూడ చేరారు. ఒక దశలో వీరి సంఖ్య 4 లక్షలుంది. నైజాం ప్రభుత్వం ఆయుధాలు ఇచ్చింది. వత్తాసు ఇచ్చింది. ఈ మూకలు తెలంగాణా జిల్లాలలో నానా బీభత్సం సృష్టించేరు. ఈ వివరాల నిస్తూ రచయిత ఆ జిల్లాల నుంచి కొందరు తలదాచుకొనేందుకు సరిహద్దులు దాటి పారిపోయారనీ, మిగిలిన వారు జీవన్మృతుల వలె స్వస్థానము లందే పడివుండిరనీ, 1948 సెప్టెంబరు 18 న భారత సైన్యాలు నిజాము సంస్థానంలో ప్రవేశించి ప్రజలను విముక్తి చేశాయనీ వ్రాసేరు.

ఇది జరిగిన చరిత్రను వక్రంగా చిత్రించడమూ, తెలుగు జాతినే అవమానపరచడమూను.

ఆ నాడు రజాకారు మూకల అల్లర్లకు పడి పారిపోయిన వారు కొందరున్నా చరిత్రలో ప్రధానంగా పేర్కొవలసిన ఘట్టం అదికాదు. తెలంగాణా ప్రజ ఆ దురంతరాల్ని ప్రతిఘటించింది. వారంతా జిల్లాలోనే వున్నారు, జీవచ్ఛవాలలా మాత్రంకాదు. పెద్దపులు లల్లేనే వున్నారు. కష్టాలూ, బాధలూ పడ్డారు. కాని తుపాకీ తీసుకు నిలబడ్డారు.

వెట్టి వ్యతిరేక వుద్యమంలో నాయకత్వం వహించిన ఆంధ్ర మహాసభ ఆ ప్రజల ప్రతిఘటనకు నాయకత్వం వహించింది. అదే ప్రజల నోట 'సంగం' అయింది. సంగం ప్రజాప్రతిఘటనకు సంకేతంగా విస్తరించింది. అభ్యుదయవాదులైన కొందరు కాంగ్రెసు వాదులూ, మొత్తం కమ్యూనిస్టుపార్టీ ఆ ప్రతిఘటనను నడిపేయి.

నైజాం, రజాకారు మూకలకు వ్యతిరేకంగా సాగిన ఈ ప్రజా పోరాటం రమారమి '45 నుంచీ సాగుతున్న ఫ్యూడల్ వ్యతిరేక పోరాటపు తరవాయిగానే సాగింది.

నల్లగొండజిల్లా, వరంగలు జిల్లాలో అధిక భాగం (నేడది ఖమ్మంజిల్లాలో వుంది), ఆ నాడు నిజాం స్వంత జాగీరయిన ప్రస్తుత హైదరాబాదు జిల్లా, కరీంనగర్, మెదక్, ఆదిలాబాద్ జిల్లాలో కొన్ని ప్రాంతాలలో ప్రజాప్రతిఘటన విజయాలు పొందింది. పోరాటాలు హైదరాబాద్ నగరం పొలి

మేరలకు పాకింది. మొత్తం నాలుగువేల గ్రామాలలో నిజాం ఫర్మాన్ చెల్లని స్థితి ఏర్పడింది. ఈ గ్రామాలలోని 10 లక్షల ఎకరాలు పంపిణీ అయ్యాయి. 4–5 వందల మంది పెట్టున గాని రజాకార్లు వూళ్ల మీదికి రాలేని ఘట్టం వచ్చింది. వాళ్ల శిబిరాల మీదనే ప్రజాబలాలు దాడిచేసి ధ్వంసం చేయడం ప్రారంభం అయింది.

ఈ ప్రతిఘటన పెరిగి వుద్యమం ఇతర ప్రాంతాలకు కూడా పాక నారంభించింది.

'జీవన్మృతు'ల మాదిరిగా కాలం గడిపినవారు ఆ రోజులలో లేరనను. కాని అది ప్రజల విషయంలో చెల్లదు. అటువంటి జీవన్మృతులు కొద్దో గొప్పో ఎక్కడా, ఎప్పుడూ వుంటారు. వారి సంగతి పుస్తకాల కెక్కదు. ఆ అవసరమూ లేదు.

సంస్థగా కాంగ్రెసు పాత్ర పై పోరాటాలలో స్వల్పం. వ్యక్తులుగా కాంగ్రెసు వాదులు సానుభూతి, సహాయా లిచ్చేరు. అది వేరు మాట.

నిజాం స్వాతంత్ర్య ప్రకటనను కాంగ్రెసు సంస్థ వ్యతిరేకించింది. సంస్థానం యూనియనులో చేరాలని కోరుతూ సత్యాగ్రహం చేసింది. మిగిలిన ఆశయాలూ, వాగ్దానాలూ ఏమున్నా వున్నా దాని పోరాటం కేవలం రాజకీయ రంగానికి మాత్రమే పరిమితం. సత్యాగ్రహ పోరాటం నడపడానికై కాంగ్రెసు వాదులు సంస్థానం వెలుపల శిబిరాలు ఏర్పరచుకొన్నారు. దానిని కూడా పారిపోవడంగా చెప్పడానికి వీలులేదు. నిజాము సంస్థాన ప్రజల ప్రతిఘటన పోరాట రూపాలలో సత్యాగ్రహం ఒకటి. పోరాటం స్వభావాన్ని పట్టి దానిని నిర్వహించే ఏర్పాట్లు చేసుకుంటారు.

అయితే ఇక్కడ ఒక విషయం స్పష్టంగా వుంచుకోవాలి. దానిని పట్టే మన అభిమానాలూ, స్నేహాలు అనుకోని సందర్భాలలో బట్టబయలవుతూంటాయి.

కాంగ్రెసు నడిపినది కేవల రాజకీయమైన పోరాటం అని పైన చెప్పేను.

తెలంగాణా ప్రజలు తుపాకీ తీసినది నిజాముకూ, రజాకారు మూకలకూ వ్యతిరేకంగానే కాదు. వారికి సంఘంలో పునాదిగా వున్న ఫ్యూడల్ వ్యవస్థను, సాంఘిక నిర్మాణాన్నికూడా నిర్మూలిస్తే తప్ప లాభం లేదని అశేష ప్రజానీకంచేత 'నీ బాంచను. కాల్మొక్తా' ననిపిస్తున్న వ్యవస్థను నిర్మూలం అయి నిజంగా స్వతంత్రులు కావాలనీ,

దేశమంటే మట్టి కాదోయ్
దేశమంటే మనుజు లోయ్

అన్న మహాకవి హెచ్చరిక యదార్థం కావాలనీ కమ్యూనిస్టులు ఆ వుద్యమ సారథ్యం వహించేరు.

'అంజు మనె ఇత్తహాద్ ముసల్మీన్' గురించీ దాని ఉత్థాన పతనాల్ని గురించీ వ్రాస్తున్నప్పుడు చెప్పవలసింది ఇది. యూనియన్ సైన్యాలు రజాకారు దురంతాల నణచడానికి రాలేదు. ఆ క్రియ ప్రాసంగికం. కేంద్రప్రభుత్వం నైజాం సంస్థానం స్వాతంత్ర్య ప్రకటనను అంగీకరించి గుండెలమీద కుంపటి వుంచుకో దలచలేదు. వారి లక్ష్యం అంతవరకే ననీ, సామాజిక వ్యవస్థను మార్చడం వారి వుద్దేశం కాదనీ, ఆనాటినుంచి నేటివరకు నడిచిన చరిత్ర చెప్తూంది. అందుచేత ఈ వ్యాసంలో ప్రసక్తం కావలసింది ప్రధానంగా ప్రజల పోరాటాలు. అవే లేవు. దిఙ్మాత్రంగా మానె, సూచనగా నైనా ఇవ్వలేదు. ఇది మరుపు అనలేము. చరిత్రకారులకు వుండదగని భయమూ, ప్రిజిడిసూ తప్ప వేరు కాదు.

సంకలన కర్తలు ఇంత ముఖ్యమైన దానిని గమనించక పోవడం ఆంధ్రజాతిని అవమానిస్తున్నా నిర్లక్ష్యం చేయడమే అవుతుంది.

ఆంధ్రత్వ మాంధ్ర భాషా చ

నాల్పస్య తపసః ఫలం|| — అంటూ తాము చేసిన ప్రతిజ్ఞ కది గౌరవప్రదం కాదు.

పుస్తకంలో చిత్రపటాలు చేర్చి వస్తు పుష్టి కలిగించాలని సంపాదకులు చేసిన ప్రయత్నాన్ని ముద్రాపకులు చాలవరకు వ్యర్థం చేసేరనే చెప్పాలి. చాల భాగం చిత్రాలు గుర్తించడానికి లేకుండా ఛాయా మాత్రంగా వున్నాయి. ఆ చిత్రాలను ఆర్ట్ పేపరు మీదనో, చిత్ర వివరాలు తెలిసేలా ముద్రించడానికి అనువయ్యే మరో కాగితంమీదనో, సమర్థవంతంగా పనిచెయ్యగల ప్రెస్సులో ముద్రింపించి చేరుస్తే శ్రమ సఫలం అవుతుంది.

ఆంధ్రదేశ పటము, తాలూకాల (ఆయా సందర్భం కలిగిన చోట) పటాలు చేర్చడం చాల వుచితం.

ఇది 'అ' మొదలు అల్లా వరకూ వున్న ప్రథమ సంపుటం.

డబుల్ డెమ్మీ సైజులో, చక్కని కాగితం కాలికోబైండుతో, రమారమి 700 పుటలు (10+29+646) పుటలుగల ఈ కోశ గ్రంథాన్ని 25 రూ.ల కివ్వడం ప్రస్తుత పుస్తక వ్యాపారుల రేట్లదృష్ట్యా చూసినా చాలా చవక.

మరొకమారు ఈ బృహత్కార్యాన్ని భుజాన వేసుకొని, మనకున్న ఒక పెద్దలోటును తీర్చబూను కున్న సంపాదకులకూ, ఆంధ్రరచయితల సంఘానికీ ధన్య వాదాలు అర్పిస్తున్నా.

'అవంతి'.

## లక్షణసార సంగ్రహము

(కూచిమంచి తిమ్మకవి ప్రణీతము. పరిష్కరణ : శ్రీ కోవెల—సంపత్కుమారాచార్య, తెలుగుశాఖ, ఆర్ట్సు అండ్ సైన్సు కళాశాల, జగిత్యాల, కరీంనగరము. డెమ్మీ 81+241+71 పుటలు. వెల రూ. 6 లు. ప్రకాశకులు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, కళాభవనము, సైఫాబాదు, హైదరాబాదు—4.)

బహుళ గ్రంథకర్త, గొప్ప లక్షణవేత్త అయిన కూచిమంచి తిమ్మకవి ఒక ప్రామాణిక లక్షణగ్రంథాన్ని రచించాడు. అది 'సర్వలక్షణసార సంగ్రహం'గా ఇంతవరకూ వాడుకలో ఉన్నది. దాన్ని 1914 లో శ్రీ నందిరాజు-- చలపతిరావుగారు తమ మంజువాణీ ముద్రాశాలలో ఆ పేరుతోనే ముద్రించి ప్రకటించారు. తర్వాత మరోముద్రణం వెలువడ లేదు. ఆ తొలి ముద్రణపు ప్రతి అయినా ఇప్పుడు లభించదు. ఆం. ప్ర. సాహిత్య అకాడమి వారు దానిని చక్కగా పరిష్కరింప జేసి, ఎంతో అందంగా ముద్రించి అందరికీ అందుబాటులో ఉండేటట్లు చాలా తక్కువ వెలను నిర్ణయించారు. ఇది ఎంతో ప్రశంసనీయమైన విషయం.

దీనిని పరిష్కరించిన శ్రీ సంపత్కుమారాచార్యగారు అనుభవజ్ఞులైన గట్టిపండితులు. ఉత్తమ విమర్శకులు. ఛందో వ్యాకరణాలలో చక్కనికృషి చేసి, అనేక విషయాలను ఆంధ్ర సాహిత్య లోకానికి అందించారు. ఆయనకు ఈ లక్షణగ్రంథాన్ని పరిష్కరించి ప్రకటింపజేయాలనే పట్టుదల కలిగింది. తత్ఫలితంగా సుపరిష్కృతమైన ఈ గ్రంథాన్ని అకాడమీ వారిచేత ప్రకటింపజేశారు. దీన్ని పరిష్కరించేటప్పుడు పెక్కుతాళపత్ర ప్రతులలోని పాఠాలను పరిశీలించారు. తిమ్మకవి గ్రంథానికి పెట్టిన పేరు 'లక్షణసార సంగ్రహం' కాని, 'సర్వలక్షణసార సంగ్రహం' కాదని ఆయనే నిరూపించారు.

మన లక్షణ గ్రంథాలు పూర్వం పద్య రూపంగానే ఉండేవి. గ్రంథకర్తలు లక్షణాలను వివరిస్తూ, ఉదాహరణలను కూడా సొంతంగా చూపడం పరిపాటి. ముద్దరాజు రామన్న, అప్పకవి వంటి ఒకరిద్దరు తప్ప తక్కిన వారు తమకు ప్రాచీనులైన కవుల గ్రంథాల

నుండి లక్ష్యాలను చూపలేదు. వీటిలో కవిసంజీవని చాలా చిన్న పుస్తకం. అప్పకవీయంలో ఛందస్సుకే ప్రాధాన్యం ఇయ్య బడింది. వ్యాకరణాంశాలు స్వల్పంగా ఉన్నవి. వ్యాకరణాంశాలను విపులంగా తెల్పి, ఉదాహరించిన గ్రంథం ఈ తిమ్మకవి కృతి మాత్రమే కానవస్తున్నది. 181 పుటల గ్రంథభాగంలో ఛందస్సును గురించిన పుటలు 35 మాత్రమే. తక్కిన గ్రంథ భాగం వ్యాకరణానికి సంబంధించినది.

మూడాశ్వాసాల యీ గ్రంథంలో ప్రథమాశ్వాసంలో తత్సమ, తద్భవాలూ, అచ్చతెలుగూ, గ్రామ్యమూ, కళాద్రుత ప్రకృతికాలూ, సంధులూ, విభక్తులూ వివరింప బడినవి. ద్వితీయాశ్వాసంలో సమాస, క్రియావిశేషణాలూ, యతిప్రాసలూ, శబ్దాల సాధుత్వాసాధుత్వాలూ చర్చించ బడినవి. తృతీయాశ్వాసంలో రేఫ, శకటరేఫల వివరణం ఉన్నది. అప్పకవి వలెనే రేఫ, శకటరేఫల పదాలను తిమ్మకవియే విపులంగా తెల్పినట్లు కానవస్తున్నది.

పరిష్కర్త తమ 'సమీక్షణం'లో తిమ్మకవి కృతులు, లక్షణసార సంగ్రహ ప్రతులు, నామ విచారణ, గ్రంథ రచనావశ్యకత, ఆంధ్రభాషా విభాగములు, తిమ్మన చేసిన అన్యలాక్షణిక ప్రస్తావన, కొన్ని సంశయాస్పద శబ్దాల సాధుత్వ విచారణ, శకట రేఫలు, పూర్ణార్ధ బిందువులు మొదలైన వాటిని గురించి చర్చించి పండితులు కూడా గ్రహించదగిన విషయాలను వివరించారు. గ్రంథం చివరి అనుబంధాలలో హ్రస్వాలపైని, దీర్ఘాలపైని రేఫలుండే పదాలకూ, శకటరేఫలున్న పదాలకూ, రేఫాంత పదాలకూ తిమ్మకవి ననుసరించి పట్టిక లిచ్చారు. తిమ్మన చూపిన కొన్ని పద రూపాలను తెలిపారు. ఉదాహృత గ్రంథాల లోని పద్యాలకు సూచిక ఇచ్చారు. దేశ్య, అచ్చతెలుగు పదాలకు వివిధలాక్షణికులకు వుండే అభిప్రాయభేదాన్ని పెద్ద పట్టిక ద్వారా తెలిపారు. ఈ పట్టిక లెంతో ముఖ్యమైనవి. ఈ విషయాలన్నీ పరిష్కర్త చేసిన నిశితపరిశీలనాన్ని వ్యక్తపరుస్తున్నవి.

సహృదయులైన శ్రీ సంపత్కుమారాచార్య తమకు ప్రోత్సాహ, సహకారాల్ని అందజేసిన శ్రీ నిడుదవోలు సుందరేశ్వర రావు, శ్రీ తీర్థం శ్రీధరమూర్తి, డాక్టరు రామరాజు, శ్రీ నోరి—నరసింహశాస్త్రిగారు మున్నగువారినీ, మొదట్నుంచీ అన్నివిధాలా తోడ్పడిన తమ సోదరుడు డా. సుప్రసన్నాచార్యులనూ అభినందించడం ఆయన సహృదయతకు నిదర్శనం.

ఇట్టి ఉపాధ్యమైన ఉత్తమగ్రంథాన్ని ప్రకటించిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారిని మనం అభినందించవలసి ఉన్నది.

శ్రీ ములుగు వేంకటరమణయ్య.

## రెండు సీరియల్ నవలలు

(గృహిణి—రచన : శ్రీ పి. గణపతి శాస్త్రి; ప్రచురణ : యం. శేషాచలం అండ్ కో— మచిలీపట్నం : మద్రాసు : సికింద్రాబాదు : ఎమెస్కో పాకెట్ బుక్స్ : 152 పేజీలు : వెల రూ. 2—50. మొదటిభాగం.

రామరాజ్యానికి రహదారి : రచన : శ్రీ పాలగుమ్మి పద్మరాజు; ప్రచురణ : యం. శేషాచలం అండ్‌కో. మచిలీపట్నం : మద్రాసు : సికింద్రాబాదు: ఎమెస్కో పాకెట్ బుక్స్ : 152 పేజీలు : వెల. రూ. 2—50. మొదటి భాగం)

ఈ సీరియల్ నవలలు రచయిత లిద్దరూ ప్రసిద్ధులే. నవలా రచయితలుగా గాక కవులుగా, కథా రచయితలుగా ప్రసిద్ధి పొందినవారు. నవలా రచనలో కూడ వీరికివి ప్రథమ ప్రయత్నాలు కావు. శ్రీ గణపతిశాస్త్రి విశాల నేత్రాలు; కాశ్మీర పట్టమహిషి అన్న నవలలను ఇదివరకే రచించారు. సాంఘిక నవలా రచనలోమాత్రం వీరికిది ప్రథమ ప్రయత్నమే నవి చదువుతున్నప్పుడే ఎవరికైనా తెలుస్తుంది. రచయితలందరూ అన్నిప్రక్రియలలోను విశిష్టమైన రచనలు చేయలేక పోవచ్చు. అందుకని ఒక ప్రక్రియలో చేయి తిరిగిన రచయిత మరొక ప్రక్రియలో చేయి చేసుకో కూడ దనటం న్యాయంకాదు. కొందరు మొదట్లో

తమ నే ప్రక్రియలో భావాలను వెల్లడించగలిగే శక్తి ఉన్నదో తెలుసుకోలేక పోవచ్చు. తరువాత తరువాత తమ భావాలను శక్తిమంతంగా చెప్పగలిగిన నాడు ఆ ప్రక్రియలోనే తమ సాధనను కొన సాగిస్తారు. కాని ఆ రచయితలను వారి మొదటి కీర్తితో గౌరవిస్తూ యీ పద్దతి కూడ వారికి నలిగిన బాటే అని నమ్మిన వారికి ఆశాభంగం కలుగుతుంది. గణపతిశాస్త్రిగారు మంచి భాషాజ్ఞానం ఉన్న పండితులు. విద్వత్కవి. మహాభారత వచనమేగాక రాజతరంగిణి గాథలను తెలుగులో వెలువరించిన సారస్వత వేత్తలు. చారిత్రక నవలా రచనలో విశాల నేత్రాలు విశిష్టమైన రచన. కాశ్మీర పట్టమహిషి నవలలోని యితివృత్తం వెగటు కలిగించేదే అయినా చరిత్రను మార్చటం ఎవరి తరం? సంస్కృత సాహిత్యంలో ఎన్నో కథలుండగా కాశ్మీర పట్టమహిషి కథనే ఎన్నుకొని నవలా రచనలో నేటి సమాజం అంగీకరించలేని న్యాయాన్ని ఆకర్షవంతంగా చిత్రించడం మాత్రం చోద్య మనిపిస్తుంది. 'గృహిణి' నవలలో యీ ప్రథమ భాగంలో ఉన్న కథలో ఏమీ కొత్తదనం లేదు. పార్థసారథి అనే గృహస్తు నాటకాల వ్యామోహంలో తనతోపాటు నటించే సరస అనే నటి మోజులో పడి ఆస్తి పాడు చేసుకుంటాడు. అతడి యిల్లాలు విజయలక్ష్మి ఎన్ని కష్టనష్టాలు పడినా భర్తను మాత్రం విడిచిపెట్టి వెళ్లలేక పోతుంది. అప్పుడప్పుడూ అన్యాయాన్ని, బాధ లను భరించలేక ఎదురుతిరిగినా, ఆమె 'అదే పనిగా రెచ్చగొట్టానంటే మరింతగా తాడుబారిపోతాడు. అయిన దేదో అయి పోయింది. అనవసరంగా సంసారం గొడవ చేసుకుంటే మాత్రం పోయిన ఆస్తి తిరిగి వస్తుంది కనకనా? నా మాట విను తల్లీ! అతని నింక ఏమీ అనను. చూసీ చూడనట్టు మాట్లాడ కూరుకో! పోనీ యీ వేళకి కాకపోతే రేపటికయినా దారికి రాకపోతాడా?' అన్న అమ్మమ్మ మాటలను నమ్ముకొని అట్లాగే మసలుకుంటూ ఉంటుంది. పార్థసారథి సరసతో కలిసి భార్యకు చెప్పకుండ మద్రాసు వెళ్లటంతో యీ భాగం ముగిసింది.

కథలో కొత్తదనం లేకపోగా గణపతిశాస్త్రి గారి రచన కూడ ఉత్సుకత కలిగించేదిగా లేదు. సంభా షణలు చప్పగా ఉన్నాయి. నవలంతా ఒకే మోస్తరు రచనతో వైవిధ్యం ఏమీలేక ఎత్తుగడ, నిర్వహణ అంతా ఒకేవిధంగా విసుగు పుట్టించేదిగా ఉన్నది. పండితులు కాబట్టి శబ్ద దోషాలు లేకపోవచ్చుగాని పాత్రోచితంగా ఉండవలసిన సంభాషణలు పేలవంగా మూసపోసినట్లుగా ఉండి నిరుత్సాహం కల్గిస్తున్నాయి. గణపతిశాస్త్రిగారి వంటి విద్వాంసులు సాంఘిక నవలను కూడ సమర్థవంతంగా వ్రాయగల రనుకొన్నవారికి యీ నవల ఎంతో నిరాశ కలిగిస్తుంది.

శ్రీ పాలగుమ్మి పద్మరాజు గొప్ప భావుకులు. 'ప్రతిభ' సంపుటాలలో వచ్చినవారి కవితాఖండికలు మరపు రానివి. తెలుగు కథల ఖ్యాతిని పెంచి 'గాలి వాన' కథకు అంతర్జాతీయ బహుమతి అందుకున్న వారు. వ్రాసిన కథలన్నీ నిపుణమైన కథన శిల్పంతో మిరుమిట్లు గొలుపుతూ ఆ కథలు పద్మరాజుగారు మాత్రమే వ్రాయగలరనిపించేవి వ్రాశారు. పెక్కు రేడియో నాటకాలు, నాటికలు రచించి శ్రోత లకు సంతృప్తిని, ఆనందాన్ని కల్గించారు. శ్రవ్య నాటక శిల్పాన్ని బాగా ఆకళించుకొన్న కొద్ది మంది రచయితలలో వీరొకరు. సంభాషణలు రచించ టంలో దిట్ట. లోకపరిశీలనం పద్మరాజుగారి ప్రతిభకు బాగా తోడునిల్చి కలకాలం నిలువదగ్గ రచనలు చేయించింది. సన్నివేశాలను రూపుకట్టించి ఆయా వ్యక్తులను కళ్లముందు నిలిపేటప్పుడు పద్మరాజు గారు మనుష్యుల కదలికలను నేర్పుతో రచిస్తారు. రేఖా చిత్రాలు గీసేవారు కొద్ది రేఖలతోనే మనిషిరూపాన్ని రచించ గలిగినట్లు కొద్దివర్ణనతోనే, ఆ మనుష్యులను మనస్సులలో చిరస్మరణీయంగా నిలపటం పద్మరాజు గారి ప్రత్యేకత. పాత్రల మనస్సులలో లోతులకు వెళ్లివారి మంచి చెడ్డలతో నిమిత్తం పెట్టుకోకుండ నిర్లిప్తంగా వారిని స్వీకరిస్తారు. అందుకే పద్మరాజు గారి పాత్రలు characters గాని caricatures కావు. వాస్తవికతకు పట్టంకట్టి కరుణను కలిగించి

మనస్సులను కదిలించటం వీరి రచనలలో ప్రధానంగా కన్పిస్తుంది. ఏ వర్గానికీ, ఏ సిద్ధాంతానికీ కట్టుబడకుండా వ్రాయటంలో వాస్తవికతకే అత్యంత ప్రాధాన్య మియ్యటం వలన ఒక్కొక్కసారి వారి రచనలు లక్ష్యశుద్ధి లేనివిగా తయారవుతున్నవి.

తమ మీద పడ్డ కీర్తిని మొయ్యలేనట్లు, ప్రతిభను హరాయించుకో లేనట్లు పద్మరాజుగారు 'జాజా గాబర్ సలహాలు'వంటి రచనలను చేయబూనటం విచారకరం. నవలా రచనకు ఆలస్యంగా పూనుకొన్నప్పటికీ వచన రచనలో చేయితిరిగినవారు గనుక నవలా శిల్పాన్ని ఒడుపుగానే సాధించగలిగారు. బ్రతికిన కాలేజీ, రెండవ అశోకుడి మూణ్ణాళ్ల పాలనలలో హాస్య వ్యంగ్యాలు కొంత విదేశీ సరుకనిపించినా వైవిధ్యాన్నీ కోరేవారు వాటినీ ఆదరిస్తారు. ఇక నల్లరేగడి కమ్మని తెనుగు నుడికారాన్ని, పొందికైన కవితా భావనను సంతరించుకుని పల్లెపట్టునుండే జీవన దృశ్య సంపుటిని ప్రదర్శిస్తున్నది. కాని సినిమాటిక్‌గా ఆయన పాత్రలను, ముగింపునూ మలిచేసరికి ఉత్తమ నవల కావలసిన ఆ రచన విలువ తగ్గిపోయింది.

స్వాతంత్ర్యోద్యమం నాటి మధ్య తరగతి సంసారాన్ని ఆలంబనంగా చేసుకొని ఆనాటి సంఘ జీవితాన్ని వర్ణించే పెద్ద నవల 'రామరాజ్యానికి రహదారి'. వీరుల త్యాగఫలం, ప్రతిఫలాన్ని ఆశించకుండ ఉద్యమంలోని కురికిన ఎన్నో చల్లారిన సంసారాలు, స్వాతంత్ర్యం సిద్ధించగానే మారిపోయిన ఎన్నో ఊసరవెల్లుల అసలు తత్త్వాలూ, యీనగాచి నక్కలపాలు చేస్తామని ఊహించని ఆనాటి అమాయక వీరుల నిష్కల్మషమైన దేశభక్తీ, వారిలో వారికి ఉన్న సంఘీభావమూ, 'మనందరికీ ఒక్కడే శత్రువు వాడు బ్రిటీషువాడు' అనే ఆవేశమూ యీ నవలలో చదువరులను ఉక్కిరిబిక్కిరి చేస్తాయి. ఎన్నో పాత్ర లున్నప్పటికీ వేటి కవే స్ఫుటమైన వ్యక్తిత్వంతో తీర్చిన ఆకారంతో చదువరుల కళ్లముందు నిలుస్తాయి. నవలలో వచ్చిన ఏచిన్న పాత్రనూ మరచిపోలేం. విశాలమైన పెద్ద Canvass లో గొప్ప చిత్రకారు డెవరైనా, ఏ ...నికి తరలివెళ్లే సైన్య సమూహాన్ని చిత్రించినప్పుడు ప్రతి రేఖను రచించటంలోను ప్రత్యేక శ్రద్ధ తీసుకున్నట్లే ప్రతి పాత్రను, ప్రతి సన్నివేశాన్ని చిత్రించటంలోను తమ శక్తిని కనబరచారు.

ప్రముఖ కాంగ్రెస్ నాయకులు పంతులుగారు, జాతీయవాదియైన డాక్టర్ డాకూ, మాలదాసు, సాయెబు శాస్త్రి; సుబ్బన్నశాస్త్రి; సుబ్బరాజు, డాక్టర్ సాంబశివుడు గారూ ఆయన కుటుంబమూ, ముఖ్యంగా విచిత్ర దంపతులైన లక్ష్మి నూరీ—వీరందరి కథను ఆనాటి సంఘటనలను వివరించే ప్రధాన పాత్ర గోపాలం, అతడి భార్య సీత, కొడుకు రంగడు-- అందరూ మనుష్యులే. ఎవ్వరూ లోకోత్తరులు కారు. అందరిలోను బలహీనత లున్నాయి. వాళ్లందరికీ దేశభక్తి ఉన్నది. యథాశక్తి త్యాగం చెయ్యటానికి ముందుకు వచ్చినవారే.

అందరినీ కూడగట్టుకొని రావటంలోనూ, లౌక్య ప్రజ్ఞను ప్రదర్శించి ఉద్యమాన్ని నడిపించటంలోను పంతులుగారు ప్రజ్ఞావంతులు. ఆయుర్వేద వైద్యంలోనే స్టెతస్కోపు వాడుతాడు డాకూ. ఇంగ్లీషు వాళ్ల యంత్రసామగ్రికీ, అలవాట్లకు ప్రతిగా జాతీయతను చూపిస్తాడు. ఆయుర్వేదపు మందులను ఇంగ్లీషుమందు బిళ్లల్లాగ, కాఫీకి బదులుగా 'మధురసాయనం'—యిట్లాగే యింగ్లీషు వాళ్ల పద్ధతులన్నీ నేర్చుకొని వాళ్లను వెళ్లగొట్టాలంటాడు. బ్రతక నేర్చినవాడు. జైలుకు వెళ్లటంలోను లౌక్యాన్ని చూపిస్తాడు. 'మన జిల్లాలో ఇనస్పెక్టర్ సుబ్బిగాడు ఎముకలు విరగ్గొడుతున్నాడురా...అనుమానం ఉన్నవాళ్లందర్నీ ఇళ్లమీదపడి దంచుతున్నాడు. రాజమండ్రి కొచ్చేశా. మా దూరపు బంధువు—సబ్ ఇనస్పెక్టరు. మంచికుర్రాడు. ఒరే చంద్రం ఓ కుంపటీ కాసిని ఉప్పునీళ్లు తగలేయించు. మీ ఇంటి ముందే ఉప్పు చేసేస్తాను. నన్ను అరెస్టు చెయ్యి అన్నాను. చేశాడు. సుఖంగా జరిగిపోయింది. ఆరునెల్లు విడిఖైదు వేయించు కున్నాను' అని గోపా

లంతో చెప్తాడు. ఆ రోజుల్లో యిల్లాంటి వాళ్లెందరో! అల్లాగని డాకూ ద్రోహికాడు. దేశభక్తుడే. ఆపదలో దిక్కులేకుండ ఉన్న పసిపిల్లలను తన బిడ్డలుగా పెంచిన ఉదారుడే. ఇట్లాగే అందరూ. ఉప్పు సత్యాగ్రహంలో సుబ్బరాజు ప్రదర్శించిన సాహసాన్ని చదువుతున్నప్పుడు ఒళ్లు పులకిస్తుంది. నలుగురు పోలీసులుపట్టి బలవంతాన గుప్పిళ్లు తెరవటానికి ప్రయత్నించినా విడువకుండ ముడుసులు పగిలినా, చర్మం చిట్లినా, రక్తం కారినా అకుంఠిత దీక్షతో నిలబడిన సుబ్బరాజు పెద్దగా చదువుకోలేదు. బలవంతుడు. పోలీసుల్ని చీపురు పుల్లలుగా విరిచెయ్యగలనంటాడు. కాని గాంధీజీ అనుచరుడిగా అహింసను పాటిస్తానంటాడు.

తెలుగులో స్వాతంత్ర్యోద్యమాన్ని వర్ణించే నవలలు కొడవటిగంటి వారు వ్రాసిన చదువు; మహీధర రామమోహనరావుగారి కొన్ని రచనలలోను వచ్చినా మొత్తం మీద తక్కువే. మూడు దశాబ్దాల క్రిందటి చరిత్రను నవలగా మలచటంలో పద్మరాజుగారు వాస్తవికతను నిలబెట్టటానికి యత్నించారు. కాని నవలలో ఆ నాటి జస్టిస్‌పార్టీపై రచయిత చూపించిన సానుభూతిని కమ్యూనిస్టుపార్టీపైన చూపించలేదు. పేదవాళ్లు ఉపన్యాసాలు చెయ్యకపోవచ్చుగాని త్యాగాలు చెయ్యటంలో వెనుకబడి ఉండరు. మధ్యతరగతి లాగ సంపన్నులలాగ జైళ్లకు పోకపోయినా ఏ ఉద్యమపు తీవ్రతనైనా నిజంగా అనుభవించేది వాళ్లే. పెంకుటిల్లు తిరుగవేయించపోతే శిథిలమై కూలిపోతుందనీ ఛిన్నా భిన్నమైన మధ్యతరగతి సంసారం త్యాగఫలితంగా నాశనమౌతుందని జాలిపడిన రచయిత ఆనాటి పేదల కడగండ్ల నంతగా పట్టించుకోలేదు. బహుశా తాము ఎన్నుకొన్న పరిధికి అది దూరంగా ఉన్నదేమో!

స్వాతంత్రోద్యమపు చరిత్రను వాస్తవికతతో నవలగా రచించటమైతే వారి ప్రయత్నం సఫలమైనట్లే. కాని మనం సంపాదించింది 'రామరాజ్యం' కాలేదని వారు వ్యగ్యంగా చెప్పదలచుకున్నారు గదా! ఆ ప్రయత్నంలో మాత్రం వీరు తగినంతగా కృతకృత్యులు కాలేదు. అధిక సంఖ్యాకులైన శ్రామికులకు కూడు దొరకని రాజ్యం ఎప్పుడూ రామరాజ్యంకాదు. ఒకవేళ ఎవరైనా దానిని ఆ పేరుతో పిలిచినా 'అన్నమో రామచంద్రా' అని అల్లాడుతున్న ప్రజలెందరో స్వాతంత్రపు రథ చక్రాలకింద పడి నలిగిపోయినవారే. నలిగిపోతున్నవారే. ఈ శతాబ్దపు చారిత్రక నవలలు కొద్ది. శిల్పదృష్టితో చూచినప్పుడు పద్మరాజుగారి నవల ఉత్తమ నవల అని చెప్పవచ్చు. వాస్తవికతను కొన్ని కోణాలనుండి మాత్రమే వీరు చూచారని చెప్పవలసి ఉంటుంది. అన్నికోణాలనుండి సరిగా గమనించి చారిత్రక నవల వ్రాయటం ఎంత అసాధ్యమో వేరే చెప్పనక్కరలేదు. ఇది సమర్థుడైన రచయిత చేసిన ఒక మంచి ప్రయత్నం. ఇంకా మంచి ప్రయత్నం ఎవరైనా చెయ్యవచ్చు.

శ్రీ రామమోహన రాయ్,

Printed and Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7 Thambu chetty Street, Madras-1. Editor : S. Radhakrishna.